


సంపాదకుడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] మార్చి 1934 [సంచిక ౧

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# స్త్రీలకొక సందేశము



# A Message for Women

స్త్రీలకు యౌవనమునుండి వార్ధక్యమువరకు దేహములో సంభవించుమార్పులే వారి బుత్వాంగములయందు గొప్ప ఉపద్రవము కలిగించును. ప్రసవసమయమున నింకను బాధ కలిగించుచున్నవి. ఇట్టియెడ రక్తహీనత, గుండెదడ, నరముల దౌర్బల్యత మొదలగు వ్యాధులకు వారు గురియగుటలో నాశ్చర్యము లేదు.

ఏకైక రసాయనమును లోధ్రయే యిట్టి ఆపత్కాలములయందు వారి పాలిటి పరప్రసాదమని యాతురతగల స్త్రీలు తెలిసికొనవలెను. ప్రపంచములోని కృతజ్ఞులగు రోగులందరు మనఃపూర్వకముగా శ్లాఘించియున్నారు.

కేసరి కుటీరం

ఆయుర్వేద ఔషధాలయం,

ఎగ్మూరు, మదరాసు.



# గృహలక్ష్మి



# GRIHALAKSHMI

TELUGU ILLUSTRATED LADIES' MAGAZINE


*Editor*: DR. K. N. KESARI

MARCH 1934.





Vol. VII No. 1

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువ కాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులను గూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనుకూలమైనది. ఉంచబడినరేట్లు ఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొరకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుట లెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవలకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులు వ్రాయజాలము. రిప్లయికార్డు వ్రాసిననే జవాబు ఈయబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగ కాపీలు పంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పు ఉండుచో 1-వ తేదికి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులను ప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనవిన్నపము

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# విషయసూచిక

త్రివర్ణచిత్రము:—



ఛాయాచిత్రములు:—

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాధంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మిబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటుగోషు,(మన ప్రాంతపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0అగును)
నిడదవోలు: తాటిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ,
బరంపురం: నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్ పేపరు ఏజంటు.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
అనకాపల్లి: గ్రంధి కన్నయ్యపంతులుగారు, గాంధిమార్కెటు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు మర్చంటు.
పిఠాపురం: న్యూస్ ఏజెన్సీసి ఎం. నూకరాజు, ఆంధ్ర
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.
తణుకు: పడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.
నరసాపురము: కటికల సూర్యారావుగారు, కుమ్మరివీధి.
భీమవరము: అమిరపు శేషాచలశర్మగారు.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్‌వీధి.
కర్నూలు: చెట్టి గోశయ్య చెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
ఖరగ్‌పూర్: ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు, 63 B 1 Unit 10, న్యూ సెటిల్మెంటు.
సెకండ్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పొగాకుబజారు.
ఏలూరు: బి. విశ్వనాధంగారు.
బాపట్ల: ఎ. జగన్నాధరావుగారు.

హిగిన్‌బాథమ్స్ స్టాలువద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.



ఓమ్

సర్వమంగళమాంగల్యే

శివే

సర్వార్థసాధకే

శరణ్యే త్ర్యంబకే

దేవి

నా రా య ణి

నమోస్తుతే.

— :o: —

నమోస్తు

అనంతాయ సహస్రమూర్తయే ।

సహస్రపాదాక్షిశిరోరుబాహవే

సహస్రనామ్నే పురుషాయ

శాశ్వతే

సహస్రకోటియుగధారిణే

నమః

# విజయహృదయము

(పనుమర్తి కృష్ణమూర్తి)

శా॥ మారామాహృదయేశ, దివ్యమగు నీ మాహాత్మ్యసంకీర్తనన్
బోరాముల్ దొలఁగెన్; జగంబులకు సంపూర్ణానురాగప్రమో
దారంభంబులుగల్గెఁ; బారునదె హాహాయుంమఁ బెన్ భీతితో
నారక్షస్తతి. వందనక్రియల నిన్నర్చించు సిద్ధావళుల్॥

మ॥ అదిరా! యెవ్వఁడు నీకు మ్రొక్కఁడు మహాత్మా, బ్రహ్మశక్యంబె నీ
కెదురై యాడఁగ? నాదికర్తవట దేవేశా, యనంతా, జగ
త్సదనా, యక్షరమై చెలంగు సదసత్తాత్పర్య మీవేకదా!!
యిది చింతింపనివారె రాక్షసులు;వారే త్రోవలం బోమరో॥

శా॥ నీనేచూడఁగ నాదిదేవుఁడవయా, నీవే పురాణుండవున్
నీవేసృష్టికిఁ బెన్నిధానమవుగా నెక్కొంటి వోవిశ్వవే
త్తా, వేద్యంబగు వైష్ణవంబను పరంధామంబు నీవే! యనం
తా, విశ్వంబున నంతయుం దతముకాదా నీప్రభావంబునన్॥

ఉ॥ వాయువు, కాలుఁడున్ వరుణవహ్నిశశాంకపితామహాదు,లా
మ్నాయములెల్ల నీవెయయినావుకదా! యిఁక—నీవుకానిదే
దో, యెటనున్నదో తెలుపుమోయి మహాత్మక, యుండునే నిదో
వేయియు వేయివేలు మరివేలకువేలగు మన్నమస్కృతుల్॥

మ॥ అమితానంతములైన విక్రమము వీర్యంబున్ బ్రకాశింప స
ర్వము నీవై మరి సర్వమందమరి దేవా, తోఁచుచున్నట్టి నీ
సముఖంబందుఁ బిరుంద సర్వదిశలన్ సాష్టాంగదండప్రణా
మములం జేయుచునుంటి భద్రగుణసీమా, భక్తకల్పద్రుమా॥

శా॥ నాకీవింతటివాఁడవంచుఁ గలనైనం దోచదే పూర్వః మా
హా! కృష్ణాయని, యాదవాయని వయస్యాయంచు నేనాడితిన్
స్తోకోక్తుల్ భ్రమనో ప్రమాదముననో తుల్యంబుగా మైత్రినో
లోకేశా, యెటులైననేమి మరి యా లోపంబు మన్నింపుమా॥

ఉ॥ హారివిహారహారశయనాసనవేళల, నొంటినుండినన్
గూరిమిచుట్టముల్ సఖులుగూడిన పట్టునఁగాని నేఁదిర
స్కారముఁ జేసినా నలఁతిగాఁ బరియాచకమాడినాఁడ; నా
నేరములన్ క్షమింపుమని నిన్ బ్రతిమాలుచునుంటి నీశ్వరా॥

మ॥ సముఁడే లేఁడఁట నీకు లోకవితతిన్ ! సాధ్యంబె నిన్మించు నాఁ
డు మరెందుండుట లింక !! నూరకఁ బటాటోపంబెగా కో త్రివి
క్రమ, పూజ్యుండవు: తండ్రివై గురుఁడవై కన్ రెప్పయల్లెప్పుడున్
మముఁగాపాడుచునున్న వాఁడవు: మహామంత్రంబు నీనామమే॥

మ॥ అదిగానన్ జగదీశ్వరుండవును స్తోత్రార్హుండవై యొప్పునీ
కిదె సాష్టాంగనమస్క్రియాతతి హరీ, యీశా, ప్రసన్నుండవ
య్యెదు గా కాత్మజునిన్ గురుండు, మరియట్లే మిత్రునిన్ మిత్రుఁడున్
హృదయేశుండు నిజప్రియంబలెనె నన్నీవింక సైరింపుమా॥

శా॥ భావాతీత మదృష్టపూర్వ విభవ ప్రౌఢాఢ్య మీరూప మో
దేవా, మోదముఁ గూర్చెఁ; గాని భయవిస్తీర్ణంబుచేఁ జిత్తమెం
తో వైకల్యము నొందె దీనజనబంధో, చాలు! నీ తొంటిల
క్ష్మీవిభ్రాజితసుందరాపఘనమే శీఘ్రంబుగాఁ జూపుమా॥

శా॥ శ్రీమద్రత్నకిరీట మూదలను భాసిల్లన్ గదా చక్రివై
యా మందస్మితసుందరాననముతో నా శాంతభావంబుతో
స్వామీ, దర్శనమిచ్చి చూపు మిఁక నాసౌభాగ్యధామంబులౌ
నామే నాయుర మాచతుర్భుజము లొయ్యారంబులౌ నానడల్॥

[పైపద్యములు గీతయందలి నా తెనిఁగించిన విశ్వరూపసందర్శనయోగములోనివి.]

ఉ॥ నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుగదమ్మ, మేటిపె
ద్దమ్మ, దయాంబురాశివిగదమ్మ! హరింబతిసేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నటికి నాశములేదుగదమ్మ యీశ్వరీ!

—శ్రీమద్భాగవతము.




# స్వవిషయము

"మ॥ హరికిం బట్టపుదేవి, పున్నెములప్రో, వర్థంపుఁ బెన్నిక్క, చం
దురుతోఁబుట్టువు, భారతీగిరిసుతల్ తో నాడు పూఁబోఁడి, తా
మరలందుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించునిల్లాలు, భా
సురతన్ లేములువాపుతల్లి, సిరి, యిచ్చున్ నిత్యకల్యాణముల్॥"

—భాగవతము.

శ్రీహరికటాక్షమువలన లక్ష్మీ సమానురాండ్రగు నిల్లాండ్ర ప్రేమాశీర్వాదముల బలముకలిమిని, చెలిమిఁ గొలిపి ఫలము నాశింపక వెలలేని వ్యాసాలంకారములఁ దులకింపం జేసిన యపరగురులగు కవియువకుల సహాయమున నీ గృహలక్ష్మి, యారేండ్లు గడపినది. నేడు సప్తమ వర్షారంభ దినమని మా పాఠక మహాశయులకుఁ దెలుపుట కెంతయు సంతసమొందుచున్నాము.

ఈ గడచిన యారేండ్లు నిదియొనర్చిన పనియందుఁగల మంచిచెడ్డలను గురించి యవ్యాజహృదయయగు జ్యేష్ఠసహోదరి, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు, లోకమునకుఁ దెలిపినయంశములను దరువాతఁ జూతురుగాక. అంతమాత్రమున 'ధన్యోస్మి' యని ఇది తలద్రిప్పఁ గలదా? ఇది చేసినపని 'యావగింజలో సరపాలు.' ఇంకఁ జేయవలసియున్నది బ్రహ్మాండమంత! ఈయథార్థమును మేమెరుఁగుదుము.

చూడుఁడు. సాంఘికవిషయమున శారదాశస్త్రమును, శక్తిధ్వజమును బూని లక్ష్మీప్రభాకలితయై నాగరికసోదరీజనమండల

ములయందే యీగృహలక్ష్మి తాండవముఁ జేయుచున్నది కాని పల్లెటూరి 'పార్వతమ్మల' కడకుఁ బోఁజాలకున్నది. ఏలయన నాసోదరీ జనములవలనఁ దానాశించిన వెనుకదన్ను చాలక. పోనీ వీరి నిట్లుండనిచ్చి యింక వీరి కంటె విశిష్టలగు నాగరక భగినీజనముల కడకుఁ బోవుదమన్న, వారు దీని మోమైనఁ గనరు. వారిభాషలు విజాతీయములు. వారి భావములు మేరలు మీఱియున్నవి. ఇఁక నేమిదారి? ఎత్తుచున్నతల ద్రింపఁజాలదుకదా! బాలికయేయయ్యు మానాభిమానము మెండుగాఁగలది. కాఁబట్టి వెళ్లినదారినే తిరిగి రాక సామవాదములతో నిట్టివిశిష్టనాగరక యువతులఁ దనవారిగాఁ జేసికొని యావలఁ గ్రమక్రమముగఁ దొంటి 'పల్లెటూరి పార్వతమ్మల'తో బంధుసఖ్యము నెఱపవలసియున్నది. తమ కిది యిష్టములేకున్నను లోకసంగ్రహమునైనఁ బాటించి యీ విశిష్టసహోదరీ మణులు ఈ గృహలక్ష్మిం బలుకరించి భాషింత్రుగాక!

తమ సువిశాల సరస్వతీభవనములయందీ తెనుఁగు బిడ్డ కొకింత చోటిత్తురుగాక! అటులైనవో నీ బాలిక కొకలోపము పోవునని మాయభిప్రాయము.

ఇఁక నైతికముగా, నిది పల్కుచున్నవి జిలిబిలి ముద్దుమాటలే యైనను "పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుగదా" యను యథార్థమును బాటించి హృదయపూర్వకముగ వినుచున్నవారలు పలువురున్నారు కాని యంత మాత్రము చాలదు.

"ఎఱుకగలవారి చరితలఁ
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ గదలకధర్మం।
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱువ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్॥"

అనున ట్లాచరణయే నీతిశ్రవణమునకు ఫలము. అది పెక్కుచోట్ల ననుకొన్నంత లేదు. మన యీ "గృహలక్ష్మి" వయసు మీఱినకొలఁది తన సహోదర సహోదరీ లోకమును దనవశముచేసికోఁ గలదేమో యింకను జూడవలసియే యున్నది. ఇంతతోఁ దీరలేదనియే మాయాశయము. భ్రూణహత్యాది మహాపాతకవాసన లింకను దఱచుగానే కొట్టుచున్నవి. శివశివాయని 'ముక్కుచెవులూ' మూసికొనవలయునేకాని నోరెత్తి గట్టిగా నేమియు ననరాదుగదా! "ముక్కుగోసికొన్న నెత్తురు నోటిలోనికి వచ్చుట" నిజముకదా! కాఁబట్టి "కాలమన్నియుంజేయుచునుండుఁ; గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్" యని కాలమునే యనుసరింపవలెను గాని వేగిరింపరాదు.

ఆస్థితి తా మధ్యమునఁనే పుట్టి యల్లారు ముద్దుగాఁ బెరుగుచున్న "గృహలక్ష్మి" యిఁక "మతవిషయమున నేమి యొనరిచినది?" యని యోచింతమా, అది సర్వజన సమ్మతమగు మతముననే నడచుచున్నది. ఇట్టి వర్తమాన ప్రవర్తనముఁ బట్టియే భవిష్యత్తునుగూడ నెంచి నిశ్చింతతో నుండవచ్చును; కాని యట్లుండుటకు వీలులేదు. సనాతన భయ మింతసులభముగాఁ బోవునదికాదు కాఁబట్టి 'నెగ్గితి' నని యిది విఱ్ఱవీఁగుట కవ

కాశములేదు. మెల్లకువతోడనే మెలఁగవలసి యున్నది.

మరి మొదటినుండియు నిది రాజకీయ రంగములయందుఁ బెద్ద పెద్ద పదవులు వారలే కుండుట బాల్యదశాదోషమే! కాని యీ దోష మిటులుండవలసినదే యేమోనను ననుమానము కలుగుచున్నది. ఈ యనుమాన నివర్తి కేమి"యెగదుడుపులు దిగదుడుపులు" చేయవలయునో తెలియక మేమే సంధిగ్ధావస్థయందున్నాము. కాఁబట్టి "యెప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి యన్యులమనములు నొప్పింపక "నీవు" నొవ్వక తప్పించుకు తిరుగు"మని ధైర్యము చెప్పుచున్నాము. కాని పరమాస్వతంత్ర యైన బాలికకు మనసులోనిదిగులు మాసి పోవుటకల్ల.

ఈ విధముగా సాంఘిక, నైతిక, మత, రాజకీయాది విషయములయందు మన యీ గృహలక్ష్మి పరిపూర్ణముగాఁ గృతకృత్య యగుటకుఁ జాలినంతకాలమునే సంభావింపు చున్నాము. అదియును విజయము నిశ్చయించుకొన్నవారమై !!

ఎందువలన? వయోవిజ్ఞానవృద్ధులగు పెద్దలు, "కాలములు గడపిన కత్తిపీట"ల వంటివారు మాకు సలహాదారులని. మరియు ననురక్తి శక్తియుక్తులగు యువయువతీమణుల నిరంతరసహాయప్రోత్సాహములవలనఁ గొంత వఱకు మాకు "వాగర్థప్రతిపత్తి"యొన గూడు చున్నదని.

తస్మాత్తు శక్తిధ్వజమునుబూని, శారదా శస్త్రహస్తయై లక్ష్మీప్రభాకలితయగు నీ యార్య "గృహలక్ష్మి"ని వినయముతో యథాపూర్వముగ మీచేతులఁ బెట్టుచున్నాము. కృతజ్ఞతా బద్ధులము. మాయెడ దయాభిమానములుచూపి దీనిపరివ్యాప్తికై తాము చేయవలసియున్నది కూడ నెంతో కలదనియు నెఱుకఁజెప్పుచున్నాము. ఏవంకఁ జూచినను ఆర్థికవిషయములఁ గూర్చి హాహాకారములే వినవచ్చుచున్న యిట్టి విషమ పరిస్థితులయందైనను గృహలక్ష్మియందచందముల కేమాత్రపు లోపమునైనఁ గలుగకుండనీక మీదుమిక్కిలి దీనిని నానాటి కధికతరసౌందర్యవతినిఁగాఁ జేయుటకే మనసారయత్నములు సేయఁబడుచున్నవి. ఇట్టియత్నములయందుగూడఁ గవులును జిత్రకారులును నిరంతరసహాయముఁ జేయుచునే యున్నారు. కాని యిట్టి సహాయ మెకప్పుడు మాకుఁ బనికిరాకపోవుచున్నది. దేశకాలపరిస్థితులఁ బట్టి స్త్రీ సమాజమును అటు పరమ పురాతనపద్ధతినుండియు నిటు పరమపాశ్చాత్యసరణినుండియుఁ ద్రిప్పి యీ రెంటికిని మధ్యమమగు నొక త్రోవలో నడపించుటయే, దేశాభ్యుదయ పరంపరావాప్తికి ప్రథమోపాయమని మావిశ్వాసము. ఇట్టిదానికిఁ బ్రాతికూల్యత వాటిల్లునెడ మాకు మౌనముద్రయే శరణ్యమగుచున్నది. ఒక్కొక్కయెడ నుదాసీనతయుఁ బూనవలసి వచ్చుచున్నది. ఇట్లుండుటవలన మాయెడఁ జేయఁబడు కన్నెఱ్ఱలను జూచి "శాంతములేక సౌఖ్యములే"దని పాడుకొని యానందించుచున్నాము.

ఏది యెట్లులైనను, ఎన్నవిధములనెట్టి లోపములున్నను, "దేశారాధనయే మనజన్మలకు సార్థకము" అనుమూలమంత్ర జపమును మానకుందుమేని ఈశ్వరానుగ్రహమువలన మనకార్యములన్నియుఁ దమంతఁ దామే చక్కఁబడును.

నమ్మక మన్నింటికంటె ముఖ్యమైనది "నమ్మి చెడినవారు లే"రని రామదాసు పాడుట మనమెరుఁగమా !!

సోదరీమణులారా, యీసప్తమసంపుటము శ్రీరుక్మిణియొనరించు గౌరీపూజతో నారంభమగుచున్నది. శిశుపాల జరాసంధాది దుష్టులను నిగ్రహించి, యధర్మమును దహించి, రమాభగవత్యంశభవయగు రుక్మిణిని శ్రీకృష్ణుండు పరిగ్రహించునట్లుఁ జేసిన యాపురాణ దంపతులు, గౌరీశంకరులు మీకు సర్వమంగళ ప్రదులై యొప్పుచుంద్రుగాత !! గృహలక్ష్మి సుముఖులై మీమీధర్మములను నిర్వహింపలెండు. ఆపరమశక్తి మీవైపున నున్నది. మీ కెప్పుడును జయమేగాని భయములేదు. లెండు లెండు!!



# ఆకర్షణ

శ్రీమతి పీసుభొట్ల రామలక్ష్మమ్మగారు

సన్నముగ నందముగ బరజంత్రములను
నేయబడు వస్త్రములదాల్చు నియమపరుఁడు మోటులైమొద్దులైనీటుగోటులేని
ఖద్దరుం దుస్తులన్ గట్ట గడఁగినాడు.
సేవకులుగొల్వగా సుఖాసీనుఁడగుచు
సౌధముల మీదనుండు లక్షాధికారి
ప్రమదమేపారగ్రీష్మాత పంబునడుమ
దేశసేవకునై బయల్ దేరినాడు.
అరయదోయిళ్ళనిండ ద్రవ్యంబుదెచ్చి
భోగములబ్రొద్దుబుచ్చు నుద్యోగికూడ
తనదుపదవికి వే సమాప్తంబుజెప్పి
వేడ్కమెయి దేశసేవకు నెడలినాడు.
ఖర్చటన్నను ప్రాణసంకటముజెందు
లుబ్ధధనపతి తనకున్న రొక్కమెల్ల
ఔర! యెవ్వారలున్ దను గోరకుండ
భరతభూమికి వినియోగ పరచినాడు.

గోచిసవరించుకొనలేని కుఱ్ఱమొదలు
మూలబడియున్న ముసలిముద్దదాక
గాంధికిన్ జేయటంచును గౌతుకమున
జేతులెత్తుచు బాడు నీచిత్రమేమొ!
తల్లివిన్ దండ్రివిన్ దాత దైవమనుచు
రాజువనుచును తమబహిః ప్రాణమనుచు
ధనము ప్రాణంబు నీయధీనంబుజేసి
నిలిచియున్నారు నీయాజ్ఞసలుపుకొరకు.
ఆదినుండియు నైకమత్యంబులేని
జనులనందర నొక్కటీటునకుదెచ్చి
నడపుచున్నట్టి నీమప్రజ్ఞాప్రవర్తి
తెలియగానేరితరము గాంధీమహాత్మ!
ఒకరితో మీరు నాపక్షమువాడనుచు
జెప్పకయె, యెట్టిగారడీ జేసినావొ
గానిప్రజనంతనుం నయస్కాంతమట్లు
ఔర! లాగితివయ్య మహాత్మ! నీవు.

# లలిత శ్రీలక్ష్మి

గృహలక్ష్మి నిరతంబు మహిళామతల్లుల
స్వాతంత్ర్యముం గూర్చు భాగ్యలక్ష్మి
గృహలక్ష్మి మానినీగేహనూత్నవికాస
గరిమనొప్పారు శృంగారలక్ష్మి
గృహలక్ష్మి స్త్రీజనవిహితవిద్యావాప్తి
వెలయింపఁ జేసెడు విజయలక్ష్మి
గృహలక్ష్మి దాంపత్యమహితనిత్యానంద
మర్మముల్ సూపు సామ్రాజ్యలక్ష్మి

భావిభారతసౌభాగ్యభారవహన
దక్షమైయొప్పు యోగ్యసంతానముర్వి
బడయుతల్లులసేవించి వరలుచుండు
లలితశ్రీలక్ష్మియే గృహలక్ష్మి సూవె.

సుబ్రహ్మణ్యభాగవతులు.

# ఆంధ్రవనిత

అబ్బరాజు వెంకటరంగారావుగారు

౧

మెట్లుమెట్లుగతీరి మెఱుగారుకురులలో చక్కగానుమమూలసర్దికొనుచు
ముంగురుల్ ముద్దాడు ముద్దులమోముపై తీరుగాతిలకంబుతీర్చిదిద్ది
మొన్ననేతీసిన సన్నకద్దరుచీరె పాదాలపైపయిఁబడఁగ డాల్చి
బాహుమూలముదాటి పైటయందముజాటు రంగు'మైకా'పూలరైక దాల్చి
మందహాసము పెదవుల జిందువాఱ
కరగిపోసినశృంగారకణికవోలె
నిలువుటద్దాని కెదురయి నిలచి చూచు
అతులశృంగారకలిత యీ'ఆంధ్రవనిత'.

౨

తెలిరాళ్లకమ్మల తొలుకాడుదీప్తులు చెక్కిళ్లమిసిమిపై చిందులాడ
నీలాలకన్నుల నిశితంపుచూపులు మహనీయశీలంపుమహిమ జాట
పల్లవమ్ములమీరు పాదాలపనకమ్ము పసపుపారాణితో బంతమాడ
మించుకాంతులనీను మేనిసింగారమ్ము మేల్మిబంగారుతో మేలమాడ
కనులకాటుక లీలమై గిలయదిద్ది
మాటిమాటికె అందానమమతగల్గి
నిలువుటద్దాని కెదురయి నిలచి చూచు
అతులసౌందర్యకలిత యీ'ఆంధ్రవనిత'.

3

వట్టిసౌందర్యాలపుట్ట గాదీకాంత రాజ్యాలనేలెడు రాణిగాని
చిఱకాలదాస్యాన చీకు జీవముగాదు జీవితసంద్రాన నావగాని
సరససల్లాపాల సాలభంజికగాదు మధురవాక్కులదన్నుమాటకారి
బిడ్డలకనివేయు పేర్మియంత్రము గాదు లావణ్యనిధి'గృహలక్ష్మి'గాని
కలముచేబూని సాహితీగరిమజూపు
వీణజేపట్టి గానంబు వినికిసేయు
సమరరంగాన కత్తితో సాముజేయు
అతులచాతుర్యకలితయీ 'ఆంధ్రవనిత.'

# ఆంధ్రేతర గృహలక్ష్మి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఈ విశాలవిశ్వమునందు భగవానుడెప్పుడు మానవులను స్త్రీపురుషులను ద్వివిధజాతులుగా సృష్టించెనో అప్పుడే వారివారి స్వభావములు, వారివారి వృత్తులు, వారివారి ప్రయోజనములు, వారివారి కర్మక్షేత్రములు భిన్నములైనవి. ఎప్పుడివి భిన్నమైనవో యప్పుడే వారికి ప్రతిదానియందును ప్రత్యేకత యేర్పడినది. కావుననే వేషములలో నేమి భాషలలో నేమి, వాక్కులో నేమి వర్తనములో నేమి, సభలలో నేమి సమితులలోనేమి, పాత్తములలో నేమి పత్రికలలో నేమి ప్రతిదానియందును ప్రత్యేకత యావశ్యకమైనది. ఇట్టి ప్రత్యేకత వలదని వాదించెడివారును గలరు గాని జయించిన వారుమాత్రము లేరు.

ప్రత్యేకపత్రికావిషయమున నాంధ్ర స్త్రీల నోములు మొన్నమొన్నటివఱకు కోఱనోములుగానే యుండెను. స్త్రీలయభ్యుదయము నిమిత్త మెన్నియో పత్రిక లుదయించెను. కాని యవి నిరంతరాయముగా జీవించినదిమాత్రము లేదు. పత్రికా ప్రయోజనమును బొత్తిగా గుర్తింపని యాంధ్రదేశమున నిస్సహాయలగు నాంధ్రస్త్రీలకొఱకై యుదయించిన పత్రిక లెట్లు జీవింపగలవు ? విశేషముగా కాకపోయినను కొలదిగానైన నాంధ్రస్త్రీలలో చక్కగా చదువగలవారుండిరి. వ్రాయగలవారుండిరి. గేయములు రచింపగలవారుండిరి. కావ్యముల్లల్లగలవారుండిరి. చిత్రములను చిత్రింపగలవారుండిరి. శాస్త్రములను విరచింపగలవారుండిరి. శిశువాఙ్మయమును సృష్టింపగలవారుండిరి. ఈవిధముగా వివిధవిద్యలను గుశలలైన స్త్రీలున్నను వారినందఱ నొక్కతావునజేర్చి వారి పాండిత్యవిభవమును, వారికళాకౌశలమును, వారియనుభవజ్ఞానమును లోకమున వ్యాప్తము సేయగల పత్రిక యొక్కటియే కొఱతగానుండెను. గృహలక్ష్మి యుదయించుటతో నాంధ్రస్త్రీలకా కొఱతగూడ దీరినది. ఆంధ్రమహిళల భాగ్యరేఖ యొకటి బయటపడినది. స్త్రీల యారోగ్యసౌభాగ్యముల వర్ధిల జేయుటయే గృహలక్ష్మి ముఖ్యాశయము. ఈ యాశయమును సర్వవిధముల సాఫల్యమొందించుకొనుచు గృహలక్ష్మి యాంధ్రదేశపు నలుమూలల విహరించుచున్నది. స్త్రీల పత్రికయని తిరస్కరింపబడక పురుషుల మన్ననగూడ బొందుచున్నది.

సారస్వత విషయమున గృహలక్ష్మి గ్రామ్య గ్రాంథికవిభేదములెఱుగదు. కవిత్వ విషయమున పురాతనాధునాతనకవిత్వములు రెండును గృహలక్ష్మికి సమ్మతమే. మతవిషయమున గృహలక్ష్మి పక్కాహిందువు సాంఘికములందు గృహలక్ష్మి భావము లతివిశాలములు. పసినిసుంగులకు పెండ్లిచేయుడనిగాని, బాలవితంతువుల పీడించుడనిగాని, వరశుల్కకన్యాశుల్కములు స్వీకరించుడనిగాని, హరిజనోద్ధరణ మనావశ్యకమనిగాని గృహలక్ష్మి యెప్పుడును

వాదింపను. ఆర్థికవిషయమున గృహలక్ష్మి మహిళా పక్షపాతి; స్త్రీలహక్కులకై పోరాడుటలో గృహలక్ష్మి వీరబాల; రాజకీయముగ గృహలక్ష్మి ఆత్మగౌరవము కోల్పోనిమిత్తభాషిణి; తన యీడుతోడు పిల్లల నలరించుటలో గృహలక్ష్మి యింపైననేస్తము. విద్యావిషయమున గృహలక్ష్మి ప్రశంస యనగత్యము. ఆమె జీవితార్థమే యది. పాకశాస్త్రమున గృహలక్ష్మి నిక్కముగా గృహలక్ష్మి; హస్తకౌశలమున గృహలక్ష్మి కళావతి; వివిధములుగా ప్రస్తావించుట వ్యాసవిస్తరహేతువు. స్త్రీలకుసంబంధించిన యేవిషయమును, ఏ యవకాశమును, గృహలక్ష్మి జారవిడుచుట లేదు. కాన గృహలక్ష్మి యాంధ్రస్త్రీజీవితము నిరామయముగను, నిరంతరాయముగను, దినదినాభివృద్ధికరముగనే యున్నది.

కాని గృహలక్ష్మి స్త్రీలమాసపత్రిక. జగమున కంతటికి మాతృస్థానము స్త్రీలు. బిడ్డలపోషణభార మెప్పుడును వారి యధీనము. కాని గృహలక్ష్మిపోషణభారము మాత్ర మిప్పటికిని పురుషులమీదనే నిర్భరపడియుండుట యాంధ్రస్త్రీలకు యశస్కరమైన విషయముగాదు. ఆంధ్రదేశమున ఉన్నతవిద్యాకుశలలైన విదుషీమణులుండియుగూడ పత్రికానిర్వహణదక్షయైన ఒక్క విద్యావతియు గానరాకుండుట విచారింపవలసిన విషయము. గృహలక్ష్మి పత్రికాధిపతు లీవిషయమున కృషిజేసియు విఫలయత్నులగుట శోచ్యము. ఆయత్నము ఫలింపమిచే గాబోలు గృహలక్ష్మికి గతవత్సరము సలహాసంఘ మేర్పడినది. కాని యదిచేయుపని యత్యల్పము, బహుశా పత్రికానిర్వహణముయొక్క ప్రాశస్త్యమును గుర్తింపమిచే కాబోలు పత్రికానిర్వాహకత్వము చేయగల స్త్రీలు లభింపకుండుట. ఇంతవఱకు గృహలక్ష్మియభివృద్ధి సమస్తవిధముల సంస్తవనీయముగానున్నను మానవకృత్యము గనుక కొన్నిలోపములుగూడ నుండవచ్చును. కొన్ని పొరబాటులుగూడ జరుగుచుండవచ్చును. అయితే వానిని తెలిపిన తెలిసికొనుటకును, సవరింపుడనిన సవరించుకొనుటకును పత్రికానిర్వాహకు లెప్పుడును సంసిద్ధులే.

గృహలక్ష్మి యింకను నభివృద్ధినందుట యెట్టిదన, స్త్రీల పత్రికయైన గృహలక్ష్మి పూర్తిగా స్త్రీలనిర్వాహకత్వములోనికి వచ్చి స్త్రీల పోషణచే జీవించుచు దాదాపు స్త్రీల రచనలచే నలంకృతయై నిరంతరము స్త్రీల యభివృద్ధికై కృషిసేయునదిగా నైపోవలయును. భగవదనుగ్రహమునలన గృహలక్ష్మి కట్టి కల్యాణదినము లనతికాలములో చేకూరుగాక యని వాంఛించెదను

ఈ మార్చినెల యొకటవ తారీఖుతో గృహలక్ష్మి కారేండ్లు నిండినవి. స్త్రీల యారోగ్య సౌభాగ్యములకై యుదయించిన గృహలక్ష్మి పత్రిక యిటులనే యనేకవత్సరోత్సవముల గావించుకొనుచు చిరకాలము వర్ధిలుగాత!!

# జీవపరిదేవనము

కూచి నరసింహం పంతులుగారు

తండ్రీ! రామచంద్రప్రభూ! నిన్నే నా యిష్టదైవతమును జేసికొని చిరకాలమునుండి భజించుచున్నాను. మనుష్యుఁ డెట్లు దేవుఁడు కాఁగలఁడు? అను యుక్తివాదశులు నన్నెంత యూఁపి యూటాడింపఁ జూచుచున్నను అవ్యక్తభగవత్తత్వము గ్రహింపఁజాలని మందబుద్ధి నగుటచేతఁ గాఁబోలు నీపాదారవిందములపై వ్రాలిన నా మనస్సు మరలింప లేకున్నాను. నీవు గొప్ప భగవదవతారపురుషుఁడవనియును నీనామము తారకనామమనియును నేనింకను విశ్వసించుచున్నాను. "ఎవఁడు నన్నే రూపముతో నేనామముతో సేవించునో వానియభీష్టము లారూపముతోను ఆనామముతోను నేను నెఱవేర్చెదను" అను గీతా ప్రతిజ్ఞ ఆవిశ్వాసమును బలపఱచుచున్నది. శ్రీగాంధి మహాత్మునికి రామనామమహిమయందుండు నమ్మకము "నీవు తప్పుత్రోవ ద్రొక్కుటలే"దని నన్నెచ్చరించుచున్నది. భగవంతుఁ డున్నాఁడో లేఁడో అను వారిని జూచితిని గాని రాముఁడు లేఁడను వారిని మాత్రము నేఁజూడలేదు.

"ఓరీ! అఱువదియెనిమిదవయేఁట నీపిచ్చియుపోద్ఘాతప్రలాపము లేమి?" యని యడిగెదవేమో, విను, విన్నవించుకొనెదను.

నీవు నన్నుఁ బుట్టించిన కుటుంబము ధనవత్కుటుంబము గాకపోయినను సత్కుటుంబము. నా తండ్రియును పినతండ్రులును తల్లియును జిన్నమేనత్తయును భగవద్భక్తులు, జ్ఞానసంపన్నులు. అందు నా పెద్దపినతండ్రి అఖండరామభక్తుఁడు. నీపవిత్రనామ మాయన జిహ్వాపై నెప్పుడును తాండవమాడుచుండెడిది. ఆయన పిచ్చియే కొంతవఱకు నాకును అంటినది. ఆయనకుండిన యవ్యాజకుటుంబానురాగమును స్వార్థత్యాగమును జూచియే యేకాకినగు నేను కుటుంబసంగపాశములలోఁ జిక్కుపడియున్నాను. నా బాల్య యౌవన కౌమారములు నీకృపవలన సుఖముగాఁ గడచినవి. నాయం దత్యంతప్రేమగల నా పెద్దతమ్ముని అకాలమృత్యువు, తన నోట నైచుకొనినను, నా సత్కళత్రముయొక్క సానురాగానునయ పోషణములచేఁ గొన్నాళ్ళ కాదుఃఖము దిగమ్రింగి తేఱుకొన్నాను. తఱువాత మఱిరెండు పెద్దదెబ్బలు పైనిబడినవి. కంటిని ఱెప్పవలె నన్నుఁ గాచుకొనుచుండు నా భార్య పరమేశ్వరీసన్నిధానమునకుఁ జనినది. ఆదుఃఖము చల్లారకముందే, నన్నుఁ గడు భక్తిప్రేమములతోఁ గనిపెట్టుకొని చూచుచుండిన కనిష్ఠసోదరుఁడు కూడఁ గనుమొఱఁగి నాకలోకమునకుఁ బోయినాఁడు. ఇల్లంతయుఁ జీకఁటి యైనది. నాముప్పగడుపునని యెవనిపై నేనాశపెట్టుకొనియుంటినో వాఁడు, వలవలయేడ్చుచున్న తనభార్యను, తల్లి యేల యేడ్చుచున్నదో యెఱుఁగని ముగ్ధశైశవములోనున్న యొకకొడుకును, గూఁతును "నీవు పోషింపు"మని నాతో చెప్పకచెప్పి పాఱిపోయినాఁడు. సన్యసించుటకుఁ గావలయు వైరాగ్యము నాకు లేకపోవుటచేతను, తండ్రిలేని యాపిల్లలను బోషింప శ్రమపడి యార్జించుటకుఁజాలిన జవసత్వములింక నుండుటచేతను, అది నీ యాదేశమేయని భావించి యింతవఱకును లోటేమియు లేకుండ వాండ్రసంసారము సాగునట్లు చేసినాను. ఉభయులకును బెండ్లిండ్లయినవి. కుమారుఁడు నీయనుగ్రహము వలన నాలుగు నెలలలోఁ బరీక్షయందుఁ జరితార్థుఁడయి స్వతంత్రజీవనసామర్థ్యమును సంపాదించుకొని యింటికి రావచ్చును.

ఇట్లుండఁగా నొక మహావిపత్తు తటస్థింపఁ జేసినావు. ఎంతో యనురాగముతోఁ బెంచిన ఆయాఁడుపిల్ల, చిన్నప్పుడు పీఁటయురఁగుమీఁదఁ గూరుచుండి నాతో భజగోవింద శ్లోకములును భక్తికీర్తనలు పాడుకొనుచుండెడు బిడ్డ—అన్నపూర్ణ—పదునాఱు రోజులు చెప్పరాని బాధపడి కడచిన సోమవారము నాఁడు గతించినది. ఈదుఃఖ మెట్లు భరింపఁగలనో యెఱుఁగను. ఇంకను బ్రతుకవలయునను ఆశ దానికుండెను. పందొమ్మిదేండ్లింకను నిండని పసికూనపఁ బ్రాణముపై ఆమాత్రపు తీపియుండుట విపరీతము గాదు. కాని దాని మరణములో వివేకులగు పెద్దలకుఁగూడ వింతగొల్పెడు ధైర్యచిహ్నములు కొన్ని

గలవు. రోగము బహుదోషయుక్తమగు టైఫాయిడ్ జ్వరగ్రస్తమైనప్పటికిని, చచ్చిపోవువఱకు స్మృతి, నిర్మలముగానుండెను. కష్టసహనశక్తి అత్యద్భుతము. ఎంత బాధపడుచుండినను "అమ్మా! నీబాధ యెట్లున్నది?" అని యడిగినప్పుడు "కొంచెము నెమ్మదిగా నున్నది నాన్నగారూ!" అని స్ఫుటమైన వాక్కుతో చెప్పెడిది. నామనస్సు కళవళపడునని యట్లు పలికెడిది గాని బాధతగ్గుటచేత గాదు. నాకును భర్తకును తల్లికిని అన్నకును వదినెకును ఇతరులకును జెప్పిన చివరహితోక్తులు మహా వివేకసూచకములు. మృతిభీతి అణుమాత్రమైన నగపడలేదు. భగవన్నామోచ్చారణము చేయుచుఁ బ్రాణములఁవిడిచిన యాయద్భుతవ్యక్తిని జూచి "అన్నయ్యా! మనస్వామి గీతలోఁజెప్పిన స్థితప్రజ్ఞురాలు గాఁ గానిపించుచున్నది సుమా" యని నాతమ్ముఁ డన్నాఁడు. పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తితెచ్చిన యాపిల్లప్రాణములు నిల్పుకొనుటకై నాస్థితిలో నున్నవానికి సాధ్యమైన యావత్ప్రయత్నములను చేసినాను. కన్నీళ్లతో నిన్నుఁ దలఁచుకొని ప్రార్థించినాను. జపమాలపై నీనామమనేకపర్యాయములు జపించినాను. అంతయును బూడిదలోఁ బోసిన పన్నీరై పోయినది. కారణమేమో నీవే చెప్పవలెను.

'నీడబ్బు దోష' మందువా? నేనార్జించిన ద్రవ్యములో నొకదమ్మిడియైనను అన్యాయార్జితము లేదని నీయెదుట నిలఁబడి నీమీఁద నొట్టుపెట్టుకొని చెప్పఁగలను. "నీకర్మ"మందువా? కర్మము జడము. అదేమి చేయఁగలదు? సర్వశక్తుఁడవును సర్వాధికారివిని అగు నీకు కర్మముపై నధికారముండదా? దుష్కర్మఫలమును గొట్టివేయఁజాలినశక్తి నీకులేదా? ఉన్నది. ఉండియును కర్మముపేరుచెప్పి జీవులనిట్లు నీయిష్టము వచ్చినట్లు త్రిప్పులఁబెట్టుచున్నావు. "నేనొక రాజమాత్రుఁడనుగాని భగవంతుఁడనుగానురా నెత్తివాఁడా! నిరపరాధుఁడగు వాలిని నిర్దోషుఁడగు శూద్రతపస్విని జంపినాననియు, మహాసాధ్వియును గర్భవతియునగు కాంతను గాంతారముల పాలుచేసినాననియు, నాలోపము లెంచుచున్నారు ప్రజలు. భగవంతుఁడు నాపైవాఁడు. అతని సేవింపు" మంగాం? ఈ బొల్లిమాటలకు నే లొంగను. ఎట్లో నీబాధ్యత తొలఁగించుకొనవలెనని మృషావాక్యము లాడుచున్నావు. అమూర్తిమంతుఁడును అదృశ్యుఁడును నైన భగవంతుఁడు సృజించిన సృష్టిలో మాత్రము వైషమ్యనైర్ఘృణ్యాలక్షణము లెన్ని కనఁబడుటలేదు? లయకర్తయును రక్షకుఁడును ఒక్కఁడే యెట్లు కాఁగలఁడు? నీచరిత్రలోని సందేహములకంటె సృష్టికర్తచరిత్రలోని సందేహము లెక్కువగాఁ గానిపించుచున్నవి. నీవే ఆభగవంతుఁడవు. లోకరక్షణార్థము మనుష్యుఁడవై పుట్టితివి. మాయతో మావంటి మనుష్యునివలె నటించితివి. అంతే. ఆభావన నాకుఁబోదు. అది నాప్రారబ్ధము. కొట్టినతల్లి నమ్మనే మఱింతగట్టిగా నంటిపట్టుకొను బక్కశిశువువలె నేను నిన్ను వదలలేను. ముంచినను నీవే. తేల్చినను నీవే!!

నీవు దుర్విజ్ఞేయుఁడవు. "యస్యానుగ్రహమిచ్ఛామి తస్యవిత్తం హరామ్యహమ్" అన్న దయామయుఁడవు. నీమాయ యంతకంటెను దుర్విజ్ఞేయము. నీమాయలోఁ బడవైచి నన్ను బాధింపకుము. ఇఁకనట్టి బాధలు పడుటకుఁ జాలిన దేహబలమనోబలములు లేవు. ప్రేమచేతనే నేను జెడిపోవుచున్నానని నీకుఁదోఁచు నెడల, శాంతిగుండెయే సుఖజీవనమునకావశ్యకమగు నెడల, నట్లే నన్నుఁ బాషాణహృదయునిజేసి నాకు మనశ్శాంతి యొసఁగుము! నీయందు నాకుండు భక్తిని శుద్ధముచేసి దృఢీకరించి నన్ను నీయక్కున జేర్చికొనుము. మమ్మందఱను దుఃఖసాగరములోఁ ముంచిపోయిన మాఅన్నపూర్ణ ఆత్మకు ప్రశాంతిసుఖములను మోక్షానందమును బ్రసాదింపుము. తండ్రీ! యివే నీకు నాశతసహస్రవందనములు!

మ. వృకసందోహము పొంచియుండి పొలమం దేకాకిగానుండు వృ
ద్ధకకుద్మంతముపైకి దూఁకుగతి దుర్దాంతాఘులున్వ్యాధులున్,
జకితస్వాంతతనుండు నన్నఁటమి యేఁచ న్జొచ్చె! గోపాలనా
మక! రక్షించుటకీవె శక్తుఁడవురమ్మా! రామచంద్రప్రభూ!

శా. వంతంబెట్టెడు చిత్తవృత్తులను జంపన్నీ శుభాఖ్యోత్కరం
బెంతో శ్రద్ధ జపింపఁజూడ సకటాయేయుక్కుఁ దన్నిల్వకీ
స్వాంతంబన్కపి యిచ్చవచ్చినటు సంచారంబు గాపించెమున్
శాంతిస్థైర్యములిమ్ము దానికి రమేశా! రామచంద్రప్రభూ!

శా. బాధల్రోఁతలు నన్ను లెక్కుడుగ సేవల్చేయు నావశ్యమున్
గ్రోధంబెట్టివిలేని సన్మతియు, హృచ్ఛోకంబునందఘ్నస
ర్వాధివ్యాధిహరత్వదీయ శుభదివ్యాంఘ్రిద్వయి న్నిల్పుకొం
చే ధైర్యంబుననుండు పాటవము నీవే! రామచంద్రప్రభూ!

మ. అనుతాపాగ్ని మదీయ కిల్బిషవనం బామూలదాహంబుచే.
సిన వెన్కన్భవదీయ భవ్యగుణసంస్మృత్యాదులంబట్టునా
కనులంబట్టు సుశీతలాశ్రుతతి నాకాఁకన్శమింపంగఁజే
సి నను న్భక్తిసుధాబ్ధిఁదేల్పఁగదవే! శ్రీరామచంద్రప్రభూ!

శా. నీపాదాంబుజచింతనాభ్రధుని-గో నే స్నానముంజేసినా,
పాపౌఘంబులఁ గడ్గివైచుకొని శుభ్ర స్వాంతతన్నిల్చి నీ
రూపంబున్మదిఁగట్టి మృత్యువును మిత్రుంబోలె రావోయి! యం
చాపద్బాంధవ! పిల్చునిర్భయతనీవా! రామచంద్రప్రభూ!

—:0:—

# పుత్రుఁడు

త్రిపురాన సత్యానందరావుగారు

తల్లిని సతంబు ప్రేమించు తనయుఁడెందు
నేకపత్నీవ్రతుండగు; నిది ధ్రువంబు.
తండ్రిని సతంబు ప్రేమించు తనయ యెందు
పుణ్యసాధ్వీమతల్లియౌఁ బుడమిపొగడ.
తల్లిదండ్రులఁ బ్రేమించు దంపతులు జ
గత్పితరులై మనియెదరు గౌరవమున.
తల్లిదండ్రుల ప్రేమతత్వంబు నెఱుఁగ
తల్లి, తండ్రియుఁగావలెఁ దానుగూడ;
తల్లి, తండ్రియుఁ దానౌట తగనెఱింగి
తల్లిదండ్రులనడుమను దాఁటిపోవు
నతఁడె పో పుత్రుఁడమలుండు నవనియందు

# శ్రీమదరుణాచలాష్టకము

శ్రీభగవాన్ రమణమహర్షులవారిచే నరవమునఁ గావింపఁబడినరచనమునకు శ్రీవారి యాశ్రిత పరమాణువయిన శ్రీకవిభూషణశతావధాని, విద్వాన్, సోమా వెంకటస్వామిగుప్తగారి తెలిఁగింపు.

౧

మానవాలోచనాతీతమహిమఁదనరి
యల్లదే! కలదొక కొండయవుర! దవుల,
దానిఘనత నారయ సాధ్య మేనికగును?
అల్లయరుణాచలము దేవి నరయలేని
పిన్నపుడె నాదుడెందాన వెలుఁగుచుండె!!
అదెయగుఁ దిరువణ్ణామల యనిరి నాకు
నెవరొ? యట్లయ్యు దానిసమిద్ధత నిద
మిత్థమంచు నెఱుఁగలేనయితిని నంత
దానిచేత నాకృష్టుఁడనై నొగిని ద
రికిని జని యచలమని యెఱింగినాఁడ!!

౨

అల్లయాచలముం గాంచెదు నతఁ డెవఁ డని
మనమునం దెంచఁగను వాఁడు కనఁబడండు
కాని ఉండువాఁడె మదికిఁగానవచ్చె
అటను 'గాంచితిన్ గాంచలే'దనఁగరాదు
తొలిని దక్షిణామూర్తివై తెలిపినట్లె
నీవు మౌనివై తెల్పుదు నిక్కమిపుడు
ఓయచలరాజ! మౌనసంయుతుఁడ! నీదు
తత్త్వమీవెపల్కి తెలుపఁదలఁపనియెడ
నింకనెవరు నీతేజు భాషింపఁగలరొ?
ఈ భవత్తత్త్వముం దెల్పనేకద? యిట
నా స్వరూపపరివ్యాప్తమయిన యచల
భావమూని వెలసినావు పరఁగ నీవు?

౩

నీవు రూపయుక్తుఁడవంచు నేను నిన్నుఁ
జేరఁగోర నచలరీతి క్షితినిలుతువు .
నీదు రూపరహితభావ నీతినెఱుఁగ
యత్నగించు టాకాశంబు నరయఁగోరి
యవనిచుట్టును దిరిగినయటులె యగును,
నీకు రూపున్నదో లేదో నెఱినరయక
నిన్నుఁ గననెంచునాతండు నిక్కముగను
నొక్కచక్కెరబొమ్మ పయోధియంతు
నెఱుఁగ మున్నిటఁబడియందుఁ బొరినిడనదు
రూపువీడి దానఁగలియు నేఁపుగాఁగ
నీదు తేజులో లీనతంజెందు నిజము.
'ఏను నే'నను దానిని నెఱిఁగినంత
నీకునాకును నాకునునీకు నేక
రణిని రూపభేదము దవ్వఁబొసరఁగలదు?
ఓయి! ప్రభు! యరుణాచలాత్మ్యత్మాకృ
తిని దనరునీవె సర్వవర్తివి నిజంబు.

౪

ఇటులఁజెలంగి తేజస రహించు నిర్ణ విడనాడి, దేవుఁ డె
చ్చటఁగలఁడంచుఁగాంచుటన హస్తమునం దివియం ధరించి, చీఁ
కటికయి ప్రాఁకులాడినటు గ్రాలదె? యిన్నిమతంబు లిన్ని వి
స్ఫుటమగురూపులుఁ బొరిని బొల్చివెలింగెడి నీతెఱంగుఁ దె

ల్పుటకునే; యిట్టి నిన్నువియుఁబోలఁగఁ దెల్పవయేని సూర్యుఁ జూ
చుటకునుగానియంధులను జొప్పునఁదప్పక పోలునవ్వి యు
త్క టవిమలారుణాచల! యగారముగాఁగ మదాశయంబు నం
తట నిబిడీకృతంబుగ ముదంబుగనుండు, మతుల్యరత్నమా!!

౫

రత్నహారమందు రత్నంబులందలి
దారమటు సకలమతముల జీవు
లందు నీవు వెల్గునట్టివాఁడ వరుణ
శైలరూప! ధూత సకలపాప!!

రతనము సానినిడ్డటు కరంబు నఘాంచితమైన డెందమ
బ్బురమగు నిర్మలత్వమునఁబొల్చిన డెందముతోడనుం బొరిం
బొరిఁదన సర్వపాపములు పోయెడుదాఁకను ఘర్షణంబునుం
బొరసిన నందుఁగాంచనగుఁబో! భవదీయసుతేజ మప్పుడున్.
మఱి యపు డామనం బితరమైనది వస్తువు ద్రేని ద్రేని సం
కరతనుజెంద, దెమ్మొయినఖండరుచిందగు రత్నమందునన్
మఱొకపదార్థపుంగుఱుతు మాటికొనం బొనరింపసాధ్యమే?
బొరి రవిపాదరంజనముఁబొందినదర్పణ మింక దేనిదై
న రుచినిజెందునే? కనుఁగొనన్ సకలంబును నీవుగాక యిం
కొరుఁడెనఁడొప్పు? సంతతమహోజ్జ్వల! నిర్మలనిర్మలా! నిరం
తరమహనీయ సత్యకరుణాభరణా! యరుణాచలప్రభో!!

౬

సకలాత్ముండవు నీవు; నీవలననే జ్ఞానంబుఁ దేజంబుఁ బు
ట్టుకనొందుఁ భిదగాక నీకడనునెప్డుంబొల్చు బల్వింత శ
క్తికతంబ ప్రాకృతమన్న చుట్లనణుభాతిం బొల్చుచిత్రాఽఽళి పొం
దికఁ దేజోమతు లన్నద్వారమున హృద్దీప్తిప్రథం బర్వ నా
ముకురంపుందెరపైన నీడటు జగంపుంబొమ్మలం జూపు వా
రకవానిన్ బహిరంతరింద్రియములున్ రాణన్ గనంజాలు దీ
నికినెల్లన్ బయినన్న నీపటిమయేనెక్కఁ కతంబెంతయున్
రకమానట్టులకాచదృ (Lens) గ్గతులఁ జూడన్ వచ్చునబ్బొమ్మ ల
ట్లు కనన్ వచ్చినఁ గాకయున్న, నవిచూడన్నీవె; భవ్యాచలా!!

౭

"నే"నను భావంబుమానినయెడల సమస్తభావంబులు మాసివెడలు
వహినంతదాకేవొభావముల్ పొడమిన యవియేరికొఱకని యరయుమొదను

"నాకొఁడ"కను జవాబాకరణినివచ్చు నపు "డాయహంభావము పొడమెనెట?"
నని చర్చనూను మీాయనువునలోతున కరగినయెడ హృదయాంతరాన
నాసీనుఁ బ్రభువును నందుదు వక్కడ ద్వైతంబు లెంతమాత్రము నెసఁగవు.

"నేనునీ"వను భిదధర్మ నిత్యధర్మములును
భవమృతుల్ సుఖదుఃఖములు వెలుంగు
జీఁకటులు నివే కలలట్లుఁజెలఁగుద్వంద్వ
ము, లివిపోయినవెక్కడను బొనరుచల్ల

చిత్తమనురంగమందున శ్రీకుఁడుఁ బర
మాత్మయగు నరుణాచలుం డాడుచుండు
అంతలేనిస్వయంజ్యోతి యమలసౌఖ్య
వార్ధియతఁడు మాంగళ్య ప్రభావమూర్తి.

౮

సాగరనీరమంబుదపుఁజాడ్పున వాసనుగొల్ప నల్లనీ
రేగతులన్ భువిన్గదలి యెన్నిటికడ్డులనేని దాఁటి యం
తేఁగడకున్ సముద్రమున నేకతఁబొంది ప్రశాంతిగన్న య
ట్లోగురుశాంతివార్ధి! యరుణాద్రిధరా! తనువొప్పుజీవి య
ట్లే గరిమన్ నినుంగదలి, మోగముఁగొంచని యొందుసొంపుగై
కోఁగనులేక నీదుకడకున్ జనఁగా మునువచ్చినట్టిత్రో
వేఁగఁగబూని కట్టకడ కంపుగఁగొక్కుకలించి, తావకై
క్యాగమలబ్ధియాదనుక సందఁడుకాంతిని నెందునేని నే
బాగునవేలగూటివిడి పక్కియొకండు నభంబునందు బల్
వేగముగాదవుల్ దిరిగి వే మరలం దనగూటి చోటికై
తాగతిఁజూచివచ్చి యటఁదద్దయు శాంతినిఁజెందునట్లు సు
శ్రీగిరిమాభిరామ! యహరీశచమూసమధామ! శంకరా!!

శ్రీరమణమహర్షి కృతము శ్రీకర మరుణాచలాష్టకమిష్టదం బుమహర్షి
సత్తమునినిచ్చమెఁదెల్గుసల్పె ద్రవిడవాణికి దోమ. వెంకటస్వామిగుప్త.



# కీ॥ శే॥ చల్లా శేషగిరిరావుగారు

సీ॥ ఎవ్వానిసద్బోధ లీయాంధ్రకీమను దిశలువ్యాపించి ప్రతిధ్వనించె
ఎవ్వానివ్యాసంబు లీయాంధ్రమనముల దేశసేవార్థమై త్రిప్పగలిగె
ఎవ్వానినైపుణ్య మీయాంధ్రపత్రికానౌక మునుంగక నడుపగలిగె
ఎవ్వానివాక్యంబు లీయాంధ్రభూమిని వేదవాక్యములౌచు వినుతికెక్కె
గీ॥ ఎవనిదేశాభిమానంబె యింత యంత
యనుచువర్ణింప విధకైన నలవిగాదొ
అట్టిధన్యుడు, మాన్యుడు నలఘుజ్ఞాని
శేషగిరిరాయ డిల గీర్తిశేషుడయ్యె.

గీ॥ ఆంధ్రపత్రిక కార్యాలయంబువీడి హిందుపత్రికసేవకై యేగవలదు
అనుచునాతోడబల్కినీ వనఘుచరిత! యాంధ్రపత్రికవిడనాడి యరుగనేల?
గీ॥ ఆంధ్రపత్రికకార్యాలయంబునందు నిన్నుప్రేమించిసేవించు స్నేహితులకు
వృద్ధుడై క్రుంగుచున్న నావిశ్వదాత కేమిచెప్పితి, "హరి"యని యేగువేళ.
గీ॥ ఆంధ్రరాష్ట్రార్థమై కృషి ననవరతము
వివిధభంగుల నొసరించి విసుగుజెంది
ఆంధ్రలోకంబువినకున్న నలుకబూని
యరిగినాడవె నీవిప్డు డమరపురికి.

ఉ॥ వేనకువేలుగా ధనము వేయివిధాల గడింపవచ్చు న
ద్దానివిశేషమున్ దెలిసి దానముసేయగవచ్చు దానిచే
మాన్యుడు విశ్వదాతయని నూతనకీర్తిగడింపవచ్చు నే
మానిసికైన నిట్టియభిమానిని నిన్ను గడింపశక్యమే?

సీ॥ స్వాతంత్ర్యవిషయమై చర్చింపగాగోరి విఠలుభాయిపటేలు పిలచెనేమొ
మాతృదేశముకూర్చి మాట్లాడరమ్మని పండితమోతిలాల్ పలికెనేమొ
దేశీయులకును సందేశమిచ్చెదనమ్మ పాంచాలకేసరి పలికెనేమొ
తెలుగుతల్లిబుణంబుదీర్చితి రమ్మంచు నాంధ్రరత్నంబు నిన్నడిగెనేమొ
గీ॥ హరిజనులనుద్ధరింప మహాత్ము డొకడె
చాలునని యెంచి, యాత్మవిశ్రాంతిగోరి
యరిగినాడవొ? లేకున్న నరుగగలవె
యాంధ్రమాతను విపులదుఃఖాబ్ధిముంచి.

జోశ్యుల నారాయణమూర్తి.

# దీవనఁబ్రాలు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ. బి. ఎల్.

నేఁడు "గృహలక్ష్మి" పుట్టినదినము. కడచినవి ఆఱేండ్లే. అయినను ఆంధ్రావనిలోని ప్రతిగృహమందును ఈ లక్ష్మి పరిచయభాగ్యమును బడసినది. కావుననే జన్మోత్సవము జన్మించిననెలవునందే గాక, తెలుఁగునేలఁగల ఎల్లనెలవులందును బోరుకలుగుచునే యున్నది! ముద్దుమూటఁగట్టు తమ పత్రికాబాలను చూచి మురియని, దీవనఁబ్రాలామెపై చల్లని ఆంధ్రులు నేఁడెందున్నారు?

"గృహలక్ష్మి" ఎంతో చిత్రమైనది.—పూర్వాపూర్వము లిందు మేళవించినది, పూర్వలక్ష్మి ప్రతిగృహమందును నుండదు.—ఈమెయున్న గీములనుండి కోడంట్రము నోర్వనేరక శారద దూరమై యుండును. హృత్ప్రీతిని గోడలిఁ జేరిచికొని ఎల్లయిండ్లను ప్రవేశించి నేఁటి లక్ష్మి మనసొడ్డినవారికి భాగ్యైశ్వర్యమును ప్రసాదించుచున్నది. నాఁటిది కాకున్నను,—"గృహలక్ష్మి" నాఁటి గృహమందలి మహత్తరాశయములను దోసిలిఁగొని, ఎల్లెడలందు విరజిమ్మి చక్కని జీవితముల నంపాదింపఁ జేయుచున్నది—నాఁటిరమ నెఱిఁగి, ఆమె యుల్లమందలి చల్లందనమును, విజ్ఞానవృద్ధికి వలయు చల్లందనమును దనదగావించుకొని మనోరమయై వరలుచున్నది.

నేఁటి "గృహలక్ష్మి" కనులకింపొనగించు సౌందర్యముతో పరిఢవిల్లుచున్నది. ఆఱేండ్లనుండియు నీ పత్రికాపుత్రిక నూతనకళలతో తేజరిల్లుచున్నది. క్రొత్తయేటిపయనమునకు తొడరుతఱి తాఁజేయవలయు కర్తవ్యమేమో ఎఱుఁగవలెనని ఆతురపడుచున్నది. కడచిన కాలమున తనయందుఁ దోఁచిన గుణదోషములేవియని అడుగుచున్నది. "గృహలక్ష్మి" యెడద చిన్నిదయ్యు, మిగుల విశాలమైనది. గుణదోషముల నెఱుఁగవాంఛించువారు నేఁడు వసుమతియందు ఎందఱున్నారు?

గుణములేగాక దోషము లేమున్నవో తెలుపుఁడనియు, తనభావికర్తవ్యమేమనియు పత్రికాబాల అడిగినపుడు, గుండె యించుక అదరినది. కాని, యీ ప్రశ్నయందు అధ్యాత్మికమగు నర్థము లేకపోలేదని గుర్తించితిని. గుణములకు దోషములు మెట్టులు. గోయిఁగూలక గొప్పకెక్కిన వారెందఱున్నారు? దుఃఖమును గుటకలువేయక సుఖముసఁ గ్రుంకులిడిన వారెందఱున్నారు? తప్పులందు తలక్రిందులుకాక ఒప్పుల నొప్పరికించిన వారెందఱున్నారు? సేగులఁ గూలక, బాగులఁ బట్టనేర్చినవారెందఱున్నారు? ఎట్టిబ్రదుకులోనైన మిట్టపల్లము లుండకపోవు. పల్లములందల్లాడుచు, ఎత్తున కెగయుమంటిమని మిడిసిపడువారు మఱింతలోఁతైన గోతిలో దొరలుదురు. దొసఁగుల నెఱుఁగువారు నాడిగుర్తించి, మెలకువమెయి వర్తింతురు. దోషముల నెఱుఁగ మక్కువబడిన పత్రికాపుత్రికవాంఛ భావబంధురమైనది. అసంతృప్తి, అభివృద్ధికాంక్షలతో నిది నిండియున్నది. అసంతృప్తిలేనివ్యక్తి, నిలిచినచోటునందే నిలిచి, మునిఁగినకుంటయందే మునిఁగి, బండబారి, మొద్దుదేఁటి చావకయు చచ్చినట్లే యుండును. అసంతృప్తియందే అభివృద్ధికాంక్షయు, జీవకళయు, భాస్వంతాశయమును నున్నవి! దోషములనెఱుఁగఁగాంక్షించు హృదయమందు దోషములే ఉండవు.—దోషములుంట దోషములను మఱుఁగు పఱుచుకొను యెడదయందేగాని, అవితోఁచు దిక్కున కిన్నుంచువ్యక్తి హృదయమందుగాదు. "గృహలక్ష్మి" దోషరహిత!— "గృహలక్ష్మి" గుణరత్నాకరము!! ప్రేమమయి!!! సర్వాంగసుందరి!!!! పుట్టిననాఁటనే, ఉత్తమలక్ష్యప్రేరితయై, దేశాటనమునకై అది బయలుదేరినది. ఈ పత్రిక అభిలషించినది ఆంధ్రప్రజల అభ్యున్నతి. —ఆంధ్రమహిళామతల్లుల పురోభివృద్ధి.

ఉన్నతాశయములు మాతృహృదయమునఁ దోఁచి, మాతృగర్భమునఁ బెంపొంది, మహీయం దుద్భవించి, మహితమరీచులను దశదిశలఁ బుత్తెంచునని నిరూఢ మొనరించుట "గృహలక్ష్మి" కర్తవ్యము !

గృహమన నాలుఁగుగోడల వరుసగాదు ; లక్ష్మి యన పెక్కురూకల గుట్టగాదు; స్త్రీయన రక్తమాంసముల చక్కని ఘటనముకాదు. స్వర్గమును చవిఁ జూపి, మోక్షమునకు ద్వారమగునది గృహము ! హృదయవిషాదమును దూలించి, ఆత్మారాము నెదుటఁ బెట్టు పవిత్రశాంతిమూర్తి లక్ష్మి!! సత్వరజస్తమముల (స్త్రీ=స + త — ర. స=సత్వ, త=తమ, ర=రజ) కలయికయందలి గభీరోద్దేశములు వ్యక్తీకరించు అద్భుత సృష్టి స్త్రీ !!! స్త్రీయన గృహమనుఁడు.— స్త్రీయన లక్ష్మియనుఁడు.—స్త్రీయన స్వర్గమనుఁడు. —స్త్రీయన శాంతియనుఁడు.—స్త్రీయన మోక్షసోపానమనుఁడు. స్త్రీని గుర్తింపక, స్త్రీని చీఁకటి కోణమందుంచ నూహించువ్యక్తి, మకుటమునఁ దాల్పవలయు కోహినూరుమణిని కోళ్లబుట్టయందుంచు వాని బోలియుండును—గళమునఁ దాల్పవలయు శమంతకమును గుహయందు దాఁచియుంచు వెలుఁగున కెనయైయుండును. 'స్త్రీరత్నము' వాడుకపదము మాత్రమేకాదు!! భాస్వంతభావమయూఖలు ప్రసరించు చైతన్యయుక్తమణి అది. సచేతనరత్నమందలి కళలలితకళలందలి కళకు మిన్నయైనది. లలితకళలు సౌందర్యనిధానములై ఆధ్యాత్మికజీవనమునకు మార్గదర్శకములగుచో, లలితకళలను మించిన కళతో నొప్పు స్త్రీవదనమును, వదనకళను మించిన సౌందర్యముతో నొప్పారు స్త్రీహృదయమును మహత్తరభావనిక్షేపములై ఆనందమయజీవనమును చేతికందీయవా ? స్త్రీ ఆనందము,—స్త్రీ అనురాగము. దృగ్గోచరముకాని హృదయమే స్త్రీరూపున ప్రత్యక్షమగుచున్నది. హృదయసౌందర్యము స్వర్గసామ్రాజ్యమును జేర్చునని అవతారపూరుషులనిరి కదా ? ఇట్టి సౌందర్యమును,—ఇట్టి సామ్రాజ్యమును పురోభాగమందుంచు అద్భుతవ్యక్తి స్త్రీ! ఈమెను గుర్తించు దృష్టిని ప్రజలకిచ్చుట "గృహలక్ష్మి" కర్తవ్యము !!

ఈ దృష్టి నలవఱుచు విద్యను పురుషుఁడు నేఁడందవలెను. స్త్రీవిద్యకు పీఠికయగునది పురుషవిద్య. నేఁడు పీఠిక వెల్లనై యున్నది—గ్రంథము శూన్యమై యున్నది. సంపూర్ణ మనుష్యజీవనము నుద్గ్రంథమునకు వలయు భావసామగ్రిని చేకూర్చుట "గృహలక్ష్మి" కర్తవ్యము !!!

స్త్రీ, పురుషునకు ప్రాఁపు.—పురుషునకు స్త్రీ పట్టుగొమ్మ. పురుషుఁడు మేధస్సు.—స్త్రీ హృదయము. మేధస్సు గగనచుంబిహిమాద్రివంటిది.— హృదయము, పూతగుణప్రపూర్ణ భాగీరథి వంటిది. సురధుని లేకున్న, తుషారాద్రికి మహత్వమే లేదు.— తుషారాద్రి లేకున్న, సురధుని కైహిక శోభయే లేదు. ఈ రెంటిని గలిగినది కైలాసము. ఈ కైలాసము,— హృదయమేధస్సులనుగలుపు కైలాసము, — సతీపతులను జేర్చు కైలాసము గృహము. ఈ కైలాసమునఁ గోఁచు భావవిభూతి, స్త్రీ పురుషులు పెంపొందించు లక్ష్మి, గృహలక్ష్మి దివ్యభావసమన్వితమైనది. గృహమహత్వమును,—స్త్రీ పురుష జీవనములందలి గభీరార్థమును జనాళికిఁ దెలుపుట "గృహలక్ష్మి" కర్తవ్యము !!!!

"గృహలక్ష్మి" కర్తవ్యము సామాన్యమైనదికాదు.

కర్తవ్య నిర్వహణమునకు తొలుత కావలయునది ఉత్సాహము. తొలినిముసమందే కొండకొనఁ జూచి, నడుముఁగట్టఁగల శక్తిసంపన్నులు సాధారణమానవులందు సకృత్తు. తొలియంజవేయక మఱియడుగునకై ఎగిరిపడువారు కాలువిఱుచుకొని కూలఁబడుదురు. అడుగును అడఁచివైచు అలసదనమును అంత మొనరించునది ఉత్సాహము. ఎట్టికర్తవ్యమైనను, ఉత్సాహద్వారమునఁ బ్రవేశించియే పవిత్రమగు తన ఆశయగర్భాలయమును చేరుకొనఁ గలదు. కర్తవ్యము కదలు తఱి ఎన్నెని నియమములును, విధులును దృష్టి

సాకర్షించును. విధిపరంపరలు ప్రాకారపరంపరలు. ప్రాకారములను దాటి కడనున్న ఆశయదైవతమును జేరినపుడే యత్నఫలితము సమ్మోక్షీన మగును.

ఫలమును బట్టి గుణమునెంచు నలవాటు మానవలోకమందుఁ గలదు.—ఇది కూడదనఁజెల్లును. గుణనిర్ణయ మొనరించునది ప్రయత్నముకాని, ఫలితము కాదు. ఫలితము గమ్యస్థానము గమ్యస్థానమును చేరితినని ఉబ్బి తబ్బిబ్బగు మనుష్యుఁడు మనుష్యుఁడే కాఁడు. ఒకగమ్యస్థానము వేఱొక గమ్యస్థానమునకు ఆదర్శపూరుషుని జీవనపథమునఁ దొలిమైలుఱాయి. ఆశయము దిగ్వలయమువంటిది. దిగ్వలయమున కవ్వల నేమున్నదో,—ప్రయత్నమున కవ్వల నేమిఫలమున్నదో మానవుఁడెఱుఁగఁడు. తాను నిర్దేశించుకొనిన తెరువునుబట్టి తిన్నగ నడుచుట నీతఁడెఱుఁగవలెను. ఈతనిశక్తిని నిరూపించునది ఈతని గమనిక. కుప్పిగంతులును, కోతికొమ్మచ్చులును గమనికలుకావు;—కున్కుపాటునడకయు, అన్సరున్సరుపోకయు గమనికలుకావు. నిర్దిష్టమార్గమున, నియమసోపానముల ననుసరించి ఆశయశిఖరముదెససాగు చలనమే గమనిక. ఉత్సాహమును, దూరదృష్టియు నీ చలనమునకు పరియుక్తమైన కర్తవ్యపంథయందు ప్రసరమగును!

దేశాటనమునకై ఆరేండ్లకుమున్ను పయనమైన "గృహలక్ష్మి" తనకర్తవ్యమార్గమందలి వివిధఘట్టములను చూచుకొనినది. సృష్టిపాటిఁనకొలఁది కుధరమెత్తైయున్నట్లు గుర్తించినది. ఆఱుమెట్లు కడచినది. గిరిశృంగము ఇంకను సుదూరమై యున్నది. ఇంతదనుక "గృహలక్ష్మి" కావించిన ప్రయత్నమును,—కాంచిన వృద్ధియు మాత్రము విమర్శనార్హములు.

ఆరేండ్లకుమున్ను ఆంధ్రమహిళలందు అక్షరములు లేవని తెలుపఱ. నేఁడున్నట్లే నాఁడును కొలఁది బాలికాపాఠశాల లున్నవి. పాఠశాలలుకాక గృహములే విద్యాపీఠములు కావలెనని నాయుద్దేశము. గృహమును విద్యాపీఠముచేయునది విద్యాకాంక్ష. ఆంధ్రగృహిణికిని, ఆంధ్రగృహమందలి జనయిత్రికిని జనయిత్రిని గనినజనయిత్రికిని విద్యాకాంక్ష యొసఁగిన సంస్థగాని, పత్రికకాని ఆరేండ్లకుమున్ను ఆంధ్రసీమయందు ఒక్కటైన నున్నదనుట తెగించి అబద్ధమాడుట. స్త్రీ యుద్యమమునకును, మానవ కల్యాణాభివృద్ధికిని వలసిన ఉత్సాహమును ఊరించు ఈ కాంక్షను ఆంధ్రమహిళాహృదయములందు ఉత్పన్న మొనరించినది "గృహలక్ష్మి" యనక తప్పదు.

ఆరేండ్ల "గృహలక్ష్మి" సంచికలను తెఱచి చూడుఁడు. ప్రతిపుటయందును, ప్రత్యక్షరమందును ఈకాంక్ష తెరలుతెరలై తొలుకాడుచున్నది. ఈ కాంక్ష లేకున్న, ఆంధ్రసీమంతినీహృదయము నేఁడు ఉత్సాహాంసిక్తమై యుండక నైరాశ్యమున నెండియుండెడిది! ఈకాంక్షాపూరమున మొలకలెత్తిన ఆశయాంకురములే క్రమక్రమముగ విశాలమగుచున్న గృహలక్ష్మీకేదారమునకు సింగారమును, రంగారు బంగారుపన్నెను జేకూర్చినవి!—"గృహలక్ష్మి"ని గంధబంధురభావములకు పూలకారుచేసినవి!! "గృహలక్ష్మి" వలననే కదా వాలక్ష్మి నేఁడాంధ్రవనితావసుమతియందు ప్రతిభావసుస్ఫుటలను చిమ్ముచున్నది! "గృహలక్ష్మి" వలననే కదా కంచనపల్లి సోదరి కనదురుకీర్తి నందినది!! "గృహలక్ష్మి"వలననే కదా రత్నమాంబ నేఁడురత్నదీపమై వెలుగొందుచున్నది!!! "గృహలక్ష్మి"వలననే కదా సీతాంబ సీమంతినీ చూడామణులలో నొకర్తుక యనిపించుకొనినది!!!! ఆంధ్రవనితావసుంధరయందు వసుంధర యొకర్తు ఉన్నదని తెలిపినది "గృహలక్ష్మి" కాదా? "గృహలక్ష్మి" లేకున్న శ్యామల, సరస్వతు లెందుండువారు? అడ్డుగోడ వెనుక నిలిచిన శివకాంతమ్మయును, ఇంటిమూల ముక్కాలిపీటపై గూర్చునియున్న వేంకటరత్నమ్మయును బాహ్యావనియందు నేఁడు ప్రతిభా

ప్రభలు వెదలించుటకు హేతుకము వీరిశక్తితైలమును నిజహృదయ ప్రమిదయందు నిలిపి, ప్రేమాకుర క్తినందు వత్తిగనిలిపి ఆశయశిఖనంటించినది "గృహలక్ష్మి" కాదా? "గృహలక్ష్మి" నుండి వెడలు నీమకీ చికాగుచ్ఛమును కాంచియేకదా పల్వురు సోదరీమణులు "జే! జే!!" అని ముందుల కరుదెంచుచున్నారు!

కాని, వీరి ముందంజ కేవలము ఉత్సాహముతో నిండియుండరాదు. వట్టి యుత్సాహము వ్యర్థమైన నురుఁగు. నురుఁగునందుఁ దేలియాడువారు మనుజులు కాక ఎందుబెండులగుదురు. ఏ ప్రయత్నమునకైన నుత్సాహము సంజీవివంటిదనుట నిక్కమే. గభీర యోచనయు పట్టుదలయు తోడుపడకున్న యెడల, దొలుత సంజీవియైన ఉత్సాహము, పసపడి మానవుని ఇటునటు దొరలించి భయదమగు ముప్పునందుఁ బడఁద్రోయును. ఎనుటిపని కష్టతరమై తోఁచినకొలఁది,— పురోభాగమందలి కర్తవ్యమహీధ్రమెత్తై గోచరించినకొలఁది, బలమైన యోచన ఉత్సాహమునకు చేతికఱ్ఱయై యుండవలెను. మానవజీవనమందును,— ముఖ్యముగ భారతజీవనమునందును, భావగమనము జవోపేతమై యుండునేఁడు ఈవిషయము సోదరీమణుల దృష్టి నాకర్షింపవలెను.

భారతజీవనమున సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్య లెన్నో నేఁడు తలయెత్తియున్నవి. వీని నెదుర్కొనుపట్ల తమకు సమాన బాధ్యతయున్నదని స్త్రీలు గుర్తింపవలెను. పురుషులతో సరిసమముగు హక్కులకై సోదరీమణులు ప్రయత్నములు సలుపుచుండుట సంతోషకరము. దైనికజీవనమునకు సంబంధించినవ్యక్తిగత సామాజికవిధులను మెలకువమెయి నిర్వర్తించుట సామాన్యక్రియకాదు. పరిజ్ఞానముగాని, అనుభవము గాని ఎఱుఁగక ముందుల కుఱుకువ్యక్తులు ఘోరమైన అరిష్టములకు పునాదులను త్రవ్వెరనియు, వీనిని కూల్చుటకు శతాబ్దములు చాలినవికావనియు ప్రపంచచరిత్రలు తెలుపుచున్నవి. స్వపరిపాలనము భారతీయుల కింతలో చేఁబడినను, చేఁబడకపోయినను, రాజకీయరంగమందు నేఁటికంటె వారు విశేషబాధ్యతను,— బాధ్యతగాకున్న,— అశేషములైన బాములను గాంతురనుట తథ్యము. ఓటు చేఁబూనుస్త్రీ ఓటుచుట్టు అల్లుకొనియుండు జటిలరాజకీయాంశముల నెఱుఁగవలెను. మానమును అమ్మి పైకమును చేఁబట్టు కెట్టిదో ఓటునుఅమ్మి మూటనింపుటయు నట్టిదే. బాధ్యతయందలి అర్థమెఱుఁగక బాధ్యతజరుపువారు పలుగాకుల నెందఱినో లేపనెత్తినవారగుదురు, క్లిష్టమైన ఆర్థికాంశములు సోదరీమణుల నఖదర్పణములందుండవలెను. నేఁటి "గృహలక్ష్మి"యందు సాంఘిక సమస్యలు కొన్ని చర్చింపఁబడుచున్నవి. వీనిని చేఁబూనుతటి స్త్రీలు తమ అభిప్రాయములను తొలుత తామే నిశ్చయించుకొనవలెను. ఒకవిషయమున నొరులు—వారెంత ఘనులైననేమి—ఏమి చెప్పినను దానిని బాగుగ విమర్శింపక వీరు కైకొనరాదు. 'భళాభళి' బ్రదుకు ఆత్మగౌరవమున్న వ్యక్తికికాదు. నిరంతరము 'తందానతాన' లందు దొరలువాఁడు మనుష్యులం దధముఁడని నా యభిప్రాయము. ఒకఁడు మఱొక్కరున కనారతము ప్రతిధ్వనియై మనగోరియుండుటకంటె మహీతలము నుండి మఱుమాయమగుట మంచిది. విచక్షణ ఎఱుఁగని మనుజుఁడు మనుజుఁడేకాఁడు. అంతరాత్మనుండి యల్లుకొనినమ్మి హేతువును, అంతరంగమందే పూడ్చిపెట్టి, మఱొక్కరునిచేతికి ముక్కుదారమందించి, వంగి సలాములుసేయుచు, వెనుకలఁ బడు నాతఁడు బానిసకుగూడ సిగ్గుఁదెచ్చు నరాధముఁడు! శారీరకముగ గాకున్నను, మానసికముగ నిట్టి హీన జీవనముకడుపు మానవులు నేఁడెందఱో ఉన్నారు. మహత్తరమైనవ్యక్తిమాల సాగిలపడుటయు,— మహత్తరమైన భావమునకు జోహారొనరించుటయు మహాపురుషలక్షణములు! మనుష్యులను దిగమ్రింగు పిశాచములను పదములక్రింద నొక్కియుంచుటయు మనుష్యజాతికి కళంకమునాపాదించు దుర్భావము

లను పుట్టువులోనే దునుమాడుటయు మహాపురుష లక్షణములే!! ఇట్టి తీవ్రసంఘటనములును, తీవ్రదృశ్యములును అనుదినము కుస్తీకై మానవులను సవాలు చేయకపోయినను, అపుడపుడు జెబ్బఁగొట్టుచు నవి యెదుట నిలుచుననుట నిక్కము. కూడనిభావమును, కూడని ఆచారమును, ప్రలోభముఁజూపు దృశ్యమును ప్రతిఘటించుట కెంతేని మానసికశక్తి ఆవశ్యకము. ఒకవిషయమును గుఱించిగాని, ఒకప్రథను గుఱించిగాని సమస్తప్రపంచ మొక్కటఁ తలఁపున నున్నను, విమర్శించియే దాని నొకవ్యక్తి పరిగ్రహింపవలెను. తన యోచనకు,—తన అంతరాత్మకు ఆభావము విరుద్ధమైతోఁచెనేని, ముల్లోకములు గదలుపూని పైఁబడినను, జంకుగొంకులేక తన నిశ్చితాభిప్రాయము చెంతనే తనజండాపూని ఆతఁడు నిలువవలెను. ఎదుటిబలగము పెద్దదై ఆతనిని పూడ్చినను, పూడ్చిపెట్టవచ్చును.—కాని అతనిని దిగమ్రింగిన అణువులు అపూర్వశక్తినంది స్వాతంత్ర్యభావమందలి మహత్త్వమును దిగంతములకును, సహస్రాబ్దములకును గురుగంభీరస్వరమునఁ దెలుపును!— అతఁడోడ్చిన రక్తమునుండి అనంతకాలము జయదుంధుభులు మాఱుమ్రోగును!! తుత్తునియలైన అతని యెముక లొక్కొక్క టొక్కొక్క విజయధ్వజమై నభోసీమనంటును!!! తన స్వాతంత్ర్యమునకై తనను తుచ్ఛమొనరించుకొనిన మహాపురుషుని పాదరేణువులకై తనను తుచ్ఛమొనరించుకొనిన మహాపురుషుని పాదరేణువులకై పంతములాడుచు అమరులు పర్వులెత్తుకొనివత్తురు!!!! సూక్ష్మపరిశీలన, స్వాతంత్ర్యభావములు, వివిధజీవనరంగములందు నేఁడెంతయు నావశ్యకములైయున్నవి. తమ యుత్సాహమునకీ శక్తులను తోడుపఱచుకొనుట సోదరీమణుల ప్రస్తుతకర్తవ్యమని నొక్కి చెప్పుచుంటిని.

ప్రాచీనసాంప్రదాయములు, నేఁటి అభివృద్ధికాంక్షయందు రవరవలు పుట్టించునో, దాని నందల మెక్కించి ఊరేగించునో, ప్రతీచియాచారములు ఆకస్మికముగ అనంతవిజయమును అరచేతి అమలక మొనరించునో, అతలగర్భమున విసరివైచునో నేఁటి అతివలు తమంతదాము యోజించుకొనవలెను. స్వాతంత్ర్యము హృదయమందును, గృహాంగణమందును అంకురించి, మొలకలెత్తి, చిగురించి, శాఖోపశాఖలుగ సంఘజీవనమునఁ బెంపొందునని గుర్తింపక, గృహాశయములను గోఁతిఁగూల్చి, గృహదీపమును గుప్పుమనిపించి, గృహబాధ్యతకు బలాదూరని, గృహస్థునకు దిగనాడుపని, రచ్చపై ఢంకాకొట్టు అభాగినులు అన్యసీమలందు అనేకులున్నారు. అంధానుకరణము తమకుఁగాదని రాయిగ్రుద్ది చెప్పి, తమ ఆదర్శములను పెంపొందించు ఉద్యమమును "గృహలక్ష్మి" పేరుమున వారు లేవనెత్తవలెను. వీరు విమర్శింపవలయు వివిధసమస్య లెవ్వో వివరించుటకీ వ్యాసభూమి చాలదు. తమ ప్రాచీననైతికవిభవము తమ యంతరంగములందే సహస్రాబ్దములనుండి కదలిచేయుచున్నదని ఒకపరి లోనికిజూచి సోదరీమణులు గుర్తింపవలెనని మాత్రము చెప్పుదును.

"గృహలక్ష్మి" యందు సారస్వతాంశములు కొన్ని తోఁచుచున్నవి. ఆంధ్రరమణులు సాహిత్యక్షేత్రమున నింకను అగ్రసరులు కావలెను. వంగసోదరీమణులంగవలె ఆంధ్రసోదరీమణులందు అనురూపనిరుపములు లేరు. అచటి సీతాదేవి ఇచట తలనూపవలెను. ఇచటి పంజ్యోతి అచటి జ్యోతిర్మయికెనయైయుండవలెను.

సారస్వతమే కాక, తర్కతత్త్వశాస్త్రములుకూడ స్త్రీలదృష్టి నాకర్షింపవలెను. ఇవి కూడుగుడ్డలు తెచ్చునాయని నేఁడు కొందఱు విద్యాధికులు బొబ్బలిడుచున్నారు. చెన్నపురి విశ్వవిద్యాలయము తత్త్వశాస్త్రమును తరిమి తరిమి కొట్టుచున్నది. తత్త్వశాస్త్రము మటుమాయమైననాఁడు నేఁటి విశ్వవిద్యాలయములు మసిబొగ్గుగుట్టలగును! మనుష్యత్వసిద్ధికిని, పూర్ణత్వసిద్ధికిని వలసిన మహితభావముల నిచ్చునది తత్త్వశాస్త్రము. భారతీయుఁడు తత్త్వమయుఁడు. కావుననే ఎన్నెన్నిసిలుగు లాతని మెడఁబట్టి నులుముచున్నను, తన ఆత్మను పరమా



కీ॥ శే॥ బ్రహ్మశ్రీ కాకర్ల శ్రీరాములుగారు

వీరు 1877 వ సంవత్సరములో, పశ్చిమగోదావరిజిల్లా లోని ఆకువీడుగ్రామములో జనించిరి. 1895 వ సం॥లో, అనగా తన 18 వ ఏట, 5 గురు పిల్లలతో ఒక రిజల్టు గిరల్సుస్కూలు వీరు ప్రారంభించిరి. అప్పటినుండి, స్త్రీవిద్యగురించి పాటుపడి, అధికారులమన్ననపొందుచు, ఆస్కూలును 1909 వ సం॥వరకు నడిపిరి. 1909వ సం॥లో, 150 మంది పిల్లలతోను, 4 గురు ఉపాధ్యాయులతోను, ఆస్కూలును నర్సాపురం బోర్డువారికి అప్పగించినారు. అప్పటినుండి, 1932 అక్టోబరువరకు పనిచేసి రిటైరు అయినారు. అనగా, మొత్తము 37 సంవత్సరములు స్త్రీవిద్యగురించి పాటుపడి, మొన్నటి వైకుంఠఏకాదశి నాడు, 27-12-1933 సం॥న కాలముచేసినారు.

ఈయన నిష్కపటి. రామభక్తుడు. సర్వలెక్కలలోను, వైద్యమునందును, కవిత్వమునందును ఈయనకు ప్రవేశముండెను. మట్టితో బొమ్మలను ఆయన అభిమానముగ చేయుచుండెడివారు. "స్త్రీవిద్య" అనుసంగతి తెలియని కాలములో వీరు ఆవిషయమున పాటుపడియుండుటవల్ల భీమవరముతాలూకాలోని పెద్దలు చాలామంది వీరి నెరుగుదురు.

పరమేశ్వరుడు వీరి ఆత్మకు శాంతినొసంగుగాక !

త్మకు సంధించి, తన మహత్వమును కాఁపాడుకొనుచున్నాడు! తాను నేర్చినదానిని తన జీవనమందింకించుకొను నలవాటు భారతీయునిది. పాశ్చాత్య తత్వవేత్తలజీవనములందెన్నో హంసపాదులున్నవి. మన తత్వవేత్తలజీవనములు మయూఖమయములనుట జగత్ప్రసిద్ధము. తత్వశాస్త్ర మతశాస్త్రములు అర్ధనారీశ్వరులట్లు వరలి, మానవునిచే "సోహమ్" అనిపించి, భరతభూమిని భవ్యభూమిఁ గావించెనని ప్రతీచీపండితులే ఎఱుఁగుదురుకదా! మైత్రేయీ గార్గిలను మించిన విదుషీమణులు ఏదేశమందు, ఏ శతాబ్దమందున్నారు? వైదుష్యము అన్యసీమలందు ఋజువర్తనము కావచ్చును, కాకపోవచ్చును. వైదుష్యము భారతసీమయందు గురుగుణమంజూషము. మైత్రేయీగార్గిలు చదువులు నేర్చిన వారలే గాక పవిత్రచారిత్రలగు మానినీమణులని ఎవ్వరెఱుఁగరు? పల్వురు గార్గిలును, అసంఖ్యాకులైన మైత్రేయీలును నేఁడు తోఁచినయెడలనే, తొంటి మైత్రేయీ గార్గిల జీవనములు నాఁడే ఎండుపైరై మడియక నేఁడును నవపల్లవములతో శోభిలెనని తెలుపుచును.

దృఢనిశ్చయ, ఇచ్ఛాశక్తి, త్యాగతితిక్షలు కూడి రమణి ఆయెనని పృథ్వికిఁ దెలిపినది భారత సీమయే! ఆత్మగౌరవరక్షణార్థము అగ్నిగుండమున నుఱుకఁగలిఁగిన స్త్రీ భారతస్త్రీ! అవినీతి అత్యాచారములు మార్కొనినను అసిధారావ్రతదీక్షవీడని స్త్రీ భారతస్త్రీ!! ఆకసమువిఱిగి తలపైబడినను తన యున్నతోద్దేశమునుండి పదస్ఖలనమెఱుఁగని స్త్రీ భారతస్త్రీ!!! కల్లోలము కబళింపనెంచినను, అల్లకల్లోల మడలింపఁజూచినను, దివిజకల్లోలిని యట్లు శాంతశీతలగుణముల నొప్పారిన స్త్రీ భారతస్త్రీ!!!! నాఁటిస్త్రీ, నేఁటిస్త్రీ దృష్టియందు ధృవతార కాఁగలిఁగిననాఁడే నేఁటిస్త్రీ పవిత్రమగు తన ధర్మము నెఱుపుకొని ఆదర్శగృహలక్ష్మి కాఁగలదు!!!!

ఆదర్శగృహలక్ష్ములను పునరుద్ధరించు నుద్దేశముగల "గృహలక్ష్మి" ఆంధ్రవసుంధరయందు విజ్ఞాన సౌరభమును గురిపించుచు, చిరంజీవియై రాజిల్లుగాకని కోరుచుంటిని.

---

# నీకటసేమమౌనె?

అధికార్ల సూర్యనారాయణరావు గారు.

ధవళకాంతులు గల నీరదములనుండి
ధారలుగ వర్షజలములు కారుచుండె,
శీతవాయువు చెలరేగి చెట్లనుండి
ఝూంకరించుచు వీచెఁబ్రశాంతిలేక
పరులై పారు చినుకులతీరు చూచి
కరకుగావీచు చలిగాలికతన వడకి
సలుపవలసిన ప్రత్యహచర్య మాని
మసలుచుండిరి యిండ్లనెమనుజులెల్ల
అఖిలఖగ కులంబులు కులాయములయందు
తడిసి ముద్దలై ముచ్చటనుడులు మాని
అప్పుడప్పుడు రెక్కలల్లార్చుకొనుచు
దీనభావంబుచూపుక్కల దెలుపుచుండె
వర్షసలిలకణంబుల బరువుతోడ
శిరసులను వంచి శోకించె తరువులెల్ల
ఎచటజూచిన జలమె కాన్పించుచుండె
బాలభాస్కరు డుదయించు లీలలేదు
ఆత్మలో నేమొకాని విచారమయ్యె
పరుగులిడునేవొ తలపులు భావవీధి
మబ్బుగ్రమ్మినచందాన నుబ్బె దిగులు
చిన్ని జానకి! నీకటసేమమౌనె?

# మల్లిక

శ్రీమతి ఎ. లలితాకుమారీగారు.

౧

నామదిని వర్తించు నాబుద్ధిమెఱయు
నాతోడ బత్తిలో నైక్యతంజెందు
నాకు ముక్తినిచూపు నాచూపువలన
నేను ప్రొక్కెద వానియేనుఁగుమొగంబున్

౨

కలడొక్క బాపఁడు కాససంబందు
తరుణశృంగారమాధవుడన్న పేర,
వరనందనోద్యానవరలక్ష్మి భార్య,
మల్లిక కూతురు; మంగళరూప.
ఒకనాడు మాధవు డొంటరినున్న
పాంథునిజూచెను ప్రణయస్వరూపు
ఆతని జూచియు అమృతస్వరూపు
ఆతని పిలిపించి యర్ఘ్యంబునిచ్చె.
తనపుత్రి మల్లికకు తగినట్టివరుడు
వచ్చినా డని చూచె వానిని లక్ష్మి.
రాగరంజితభృంగరాజంబు పేరు
అనుటచే లక్ష్మియు నానందమొంది
మల్లికపెండ్లని మదిలోన తలచి
పొంగి యానందాన పొరలెను నపుడు,
భార్య సమ్మతిజూపె భర్తతో తాను
భర్త యేగియు భృంగబాబుతో ననియె
ఒక్కచక్కనిచిన్నచుక్కనుదెచ్చి
పరిణయంబును సేతు పరిఢ విల్లయ్య
యనుచు మల్లికఁజూపి అతనితోననగ.
మల్లికఁజూచుచు మదిలోన దలచె
చల్లని కర్పూర చందనంబట్లు
సొగసైన కమ్మని సుమములయట్లు
మాధ్వీకరసముల మాధుర్యమట్లు
కెందమ్మిపువ్వులయందమ్ము లట్లు
సౌందర్యమంతయు బొందుపడినట్లు
ఆనందమంతటి యాకారమట్లు
శ్రీలక్షణంబుల శ్రీపుత్రియట్లు
చలువగొజ్జగినీటిజలకంబులట్లు
కులుకుదళుకులనొప్పు కనకంబునట్లు
చల్లదినంబున శశిరేఖయట్లు
వన్నెదనంబున వెన్నెలయట్లు
ప్రణయబీజంబుల పాదైనయట్లు
ప్రణయలతికలకును ప్రాకైనయట్లు
రాగంబునంతకు రాణియైనట్లు
యానందమిచ్చిన యమృతస్వరూప
మల్లికం బెండ్లాడ మదిసంతసింతు
సమ్మతించు నాతండు యనుమతిదెల్పె.
వాలైనకూతురు వానిని జూపి
యామెయు సంతోష మందుచుండంగ
కోయిలల్ స్వస్తులు కూయుచునుండ
నెమ్మలు నృత్యంబు నింపుగసేయ
సెలయేటిగానంబు శృతిచేయుచుండ
భృంగంపు సుస్వరసంగీతమొప్ప
చెట్లన్ని పుష్పాలసేసలుచల్ల
పక్షులరుతములు బాజాలుగాగ
పచ్చని కుంజముల్ పందిరుల్గాగ
వింతఫలంబులే విందులుగాగ
పెండ్లిని చేసెను ప్రేమతోనపుడు.
కాలంబు గడపుచు మెలగుచునుండ
నొకప్రేవ పొట్టేళ్ల ఒకప్రేవ కోళ్ల
పందాలధ్వని దిశల్ బద్దలగుచుండ
పేకాటలాడుచు పెక్కు రుపొంగ
చదరంగమాడుచు చతురులుపొంగ
పట్నాల బాలురు పరిగిడివచ్చి
తమ్ములతో తాము తనరుచునుండ
అల్లుర కూతుళ్ల నాడపడచులను

రప్పించి వింతైన రంగులనొప్పు
బహుమతులర్పించి పరగుచునుండ
పిల్లలందరు భోగిపిడకలతీసి
భోగిమంటలలోన బ్రొద్దున్న వ్రేయ
దండాలపండుగ దండాలుయనుచు
మంచాలశంకరు పదిదలుపుచుండ
అందరి కానంద మతిశయిల్లంగ
సంక్రాంతి వచ్చెను సంతోషమొప్ప

క్రొత్తయల్లుని పిలిచి కూడుపెట్టించి
యలసివచ్చితివంచు నత్తగారపుడు
ఫలరసంబులతోడ పానీయమిచ్చి
చక్కని చల్లని చందనంబద్ది
మధుమధూకంబుల మద్యంబునిచ్చి
ప్రణయగీతాలను పాడించుచుండె.
మాసంబువచ్చెను మాఘనామంబు
మాఘూనపుష్పించె మల్లిక యపుడు

---

# అన్వేషణము

కుందుర్తి నరసింహారావు గారు.

కృష్ణవేణీ స్రవంతి నిద్రింపదేమి
విశ్వశాంతి ప్రదం బిట్టివేళఁగూడ ?
వీనులంబడి తెలియంగరానివాని
అర్థశూన్యగీతిక లిట్టు లాలపించి,
కూనరాగాల నను వెఱ్ఱివానిఁజేసి
అంతలోనె కిలకిలనవ్వి హాస్యమాడు
నేను తలవాల్చుకొని, యేటిసీమవెలుఁగు
చూడకే దారిఁబడి పోవుచున్నవాఁడు;
ఈ నిశీథమధ్యమున నాహృదయవీణ
దారుణాశాశ్రుతుల్ తంతనస్వనించు
గాలికే తూలిపడిపోవు లీలనేను
చిక్కి సగమయి యిట్లు కృశించినాను;
పూర్వపరిచితమగు జాతిముందు నిలిచి
నలుదిశల్ పరికించుచున్నాను విసిగి
నిబిడనీరదయవనికా నిర్మితమగు
గగననాటకరంగముఖంబునందు
తారకామూర్తి కానరాదయ్యె నొకటి
ఉత్తరదిశాగర్భముననుండి హోరుమనిన
సవ్వడిని వెంబడించెను చల్లగాలి
ఆశలన్నియుఁ గోల్పోయినట్టి నేను
కన్నులెత్తి యుత్తరదిశఁ గాంచినాఁడ

పృథివిపై వ్రాలు తారకాభిన్నకాంతి
మిణుకుమనుచుండె నొక చిన్నమేడమీఁద ;
'బ్రదికితి' నటంచు హృదయవిభ్రాంతివీడి,
నాకొరకు సోలబాడు ప్రేమాకులాత్మ
కృష్ణవేణీమతల్లికిఁ గేలుమోడ్చి
పరుగుపరుగునఁ బోయి, గవాక్షవీథి
చేరఁజేసి కన్నులను వీక్షించినాఁడ
ఆలతాంగికి నిద్దురయైనలేదో,
ఒంటరిగ తా గవాక్షమునొద్ద నిలిచి
చెదరిన శిరోజములు సరిజేసికొనియె;
గురుతుపట్టితి, సంతోషకుహరమైన
నాహృదయసీమ గంతిడె నాల్కకడకు
కాని, నేను స్వతంత్రించలేను మగుడ
'ఆమెయెందున్న?' దనిపల్కి యాగిపోతి
ఆవిలాసిని కనుఱెప్ప లట్టెవాల్చి
ఊరకున్నది; నాయెడ లూగిపోయె,
మాటలాడదు; ఆపాదమస్తకమును
గడగడవడంకుటను వెనుకకు మరల్చి
దీర్ఘనిశ్వాసములతోడ తిరిగిపోతి
మెల్లగా కృష్ణవేణీమ తల్లికడకు.

# ఆలోచనాప్రభావము

శ్రీమతి వి. సీతారామ దేవిగారు

ప్యారిస్‌లో నొకకన్య ఒకయువకుని ప్రేమించెను. కన్య మంచిఅందకత్తె; దాదాపు 19 సంవత్సరములవయస్సు. ఆమె ప్రియునివయస్సు 25 వర్షము లుండును. ఆ కన్యయొక్క తండ్రి మంచిధనవంతుడును, గొప్పగౌరవనీయుడును, పేరు ప్రతిష్టగలవాడునై యుండెను. కాని యువకుడు పాపము కడుబీదవాడు. అందుచే వీరిద్దరకును వివాహమగుట బహుకష్టముగాతోచెను. కాని యొండొరుల ప్రేమ దుర్నివార్యముగదా! యువకు డొకనాడు తన ప్రియురాలితో "నేను ధనసంపాదనమునకై అమెరికా వెళ్లుచుంటిని, అవకాశము లభించినచో మూడు వర్షములలో మీతలిదండ్రులు మనవివాహము నంగీకరించునంతటి ధనము సేకరించుకొనివత్తును; ప్రస్తుతము ఇంతకంటె వేరుఉపాయమేదియు నాకు కాన్పించుట లేదు ప్రేయసీ! నేను నిన్ను ఎట్టిఆకృతితో వదలి వెళ్లుచుంటినో మరలవచ్చికూడ అట్టి యాకృతినే చూడగోరెద. దీనిని లక్ష్యమునందుంచుకొమ్ము" అని వచించెను. ప్రస్తుతము తనశరీర మేరీతి సౌందర్యభరితమైయున్నదో ఆసౌందర్యమును చెడకుండునటుల తిరిగి తానువచ్చువరకు జాగ్రత్తగా నుంచుమని యువకుడు చెప్పినటుల భావించి ఆ యువతి ప్రియునిమాటయందె దృష్టి వ ధ్యానముంచ సాగెను. ఆమె దినమంతయు సాధ్యమైనన్నిసారులు పెద్దఅద్దముఎదురు నిలచి తనయాకారమున నేమయిన భేదము కాన్పించుచున్నదా, యని చూచుచుండెను. కాని ఆమె ఆకృతియందు ఎట్టి భేదమును కాన్పింపకుండుటచే ధైర్యము వహించుచుండెను. ఆమెకు ఈపని రోజుకు 15, 20, సార్లు నిత్యకర్మమైపోయెను. కొన్ని దినములకు ఆమెప్రియుడు అమెరికాయందు ఒకనేరముక్రింద 10 సంవత్సరములు జైలునందుంచబడెను. జైలునందు కష్టము లనుభవించుట చేతను, అనేకదుఃఖములు తటస్థించుటచేతను, బహునిర్బలుడై యుండెను. అతని ముఖమున వృద్ధావస్థయొక్క చిహ్నములు చిందులుద్రొక్కుచుండెను. అప్పటికి ప్రియురాలివయస్సు 32 వర్షములు ఎటువంటి యనుభవశాలియైనను ఆమె వయస్సు 20 సంవత్సరములకంటె మించియుండునని వచింపజాలడు.

ఈ కన్యయొక్క యీఆరోగ్యమును, సౌందర్యమును చూచి ఫ్రాన్సులో డాక్టరులు ఇది యొకవిధమైన సమ్మోహనశక్తియొక్క ప్రయోగమనియు, ఎల్లపుడును తదేకధ్యానముతో నుండుటచేతనే ఈమె తన సౌందర్యమును నిలుపుకొనజాలినదనియు, ఇది కేవలము ఆలోచనాప్రభావమనియు, నిశ్చయించుకొనిరి.

# వీధిబడిచదువు

తాత కృష్ణమూర్తి బి.ఏ;యల్ టి.

"యీ ప్రపంచములో యేమి వస్తువు లుంటవి?"

"ఆవులు."

"డామ్ నాన్సెన్స్, యెంతసేపు ఆవు లేనా? యేవేంటెవుంటవో బాగా ఆలోచించి చెప్పు."

"గేదెలు."

"దట్ విల్ నాట్ డు, మళ్ళీ ఆలోచించి చెప్పు."

"అయితే నాకు తెలియదు."

—కన్యాశుల్కము.

నాకు ఎనిమిదోయేడు, అప్పుడు. రెండో తరగతిలో చదువుతూ ఉండేవాడిని. గోడుకు మూడు పలకపుల్లలు అవసరపడేవని మహా ఉపద్రవంగా చదివేస్తూ ఉండేవాడినని ఊహించకూడదు. చిన్నప్పుడు అసలు చదువంటేనే నాకు తలనొప్పి!

మాబడిలో అందరంకలసి, యించుమించు యిరవైమంది పిల్లలు ఉండేవాళ్ళం. ఇద్దరు ముగ్గురు ఆడపిల్లలుకూడా ఉండేవారు. మొగపిల్లల బడిలోకి అమ్మాయిలను ఎందుకు రానియ్యకూడదో అప్పుడు అనుభవంమీద బోధపడింది నాకు. మొగ్గ అబ్బాయిలను మాసి వాళ్లు నవ్వుతూ నేవారు. అప్పుడప్పుడు పల్లిగిలించి వెక్కిరించేవారు కోపంవస్తే సివంగి పిల్లలవలె మీదపడి గిక్కివారుకూడా. మీదు మిక్కిలి, మాష్టరుతో లేనిపోని చాడీలుచెప్పి మమ్ము కొట్టించేవారు. పాఠాలు చురుకుగా అప్పజెప్పేసి, మా మొగపుర్రవాళ్లను చిన్నబుచ్చేవారు. ఆడపిల్లలు కదా అని, పాఠాలు తిన్నగా చదవకపోయినా, బడిలో ఎంత అల్లరిచేసినా, వాళ్లకు దెబ్బలు తగిలేవికావు. వాళ్లమీద ఎప్పుడైనా కోపం వస్తే, పంతులు లాకోపాన్ని మా మొగమొద్దులమీద ఆర్పుకునేవాడు, అన్యాయంగా!.........ఇంతకూ, ఆడపిల్లలకు చదువుకోవలసిన గ్రహచారమేం చెప్మా అనిపించేది నాకు. వాళ్లేమైనా ఉద్యోగాలు చెయ్యాలా, అప్పుపత్రాలు రాయాలా? ఆడపిల్లలు చదువుకోవడంనుంచే, మొగపిల్లల తెలివితేట లన్నీ క్షీణించిపోతున్నాయి!........

మా బడిపంతులు పేరు సాంబన్న. ఆయనకు సుమారు యాభైయేళ్లు ఉండేవి. చత్వారంచేత కళ్లకు సులోచనాలు పెట్టుకునేవాడు. అతగాడికి పెళ్లాం, పిల్లలు, ఎవరూ లేరు. మనిషి దొడ్డవాడే కాని కించిత్ ప్రథమకోపం ఉండేది. ప్రైమరీ దాకా మాకు చదువుచెప్పేవాడు. అతని యింటి వీధిచావడే మా స్కూలు. ప్రతీయేటా మాకు పరీక్ష జరుగుతూ ఉండేది. క్లాసుకు యింతజీతం అని నిర్ణయంలేదు. ఊళ్లో తక్కినవాళ్లు ఎంతెంత యిచ్చేవారో మానేవారో నాకు తెలియదు కాని, మా నాన్నగారు సాంబన్నకు యేటా కొన్నిధాన్యం, పెసలు, మిరపకాయలు కొలిచేవారు.

సాంబన్న పేరు చెప్తే నాకు వొణుకు! ఇంట్లో అల్లరిచేసినా, ఆయనతోనే ఫిర్యాదు చేసేవారు. బడికి వెళ్లకపోతే అమ్మ కోప్పడేది; వెళితే అయ్యవారు కొట్టేవాడు. 'ముందుకు నుయ్యి, వెనుకకు గొయ్యి!' అన్న సామెతవలె ఉండేది నా అవస్థ. బడిలో చదువుమాట దేవుడెరుగును కాని, శిక్ష చాలా కఠినంగా ఉండేది, తొడపాశాలు, మొట్టికాయలు, వీపుగుద్దులు మొదలైనవి సరేసరి, కోదండం యెక్కించడం, గోడకుర్చీ వేయించడం, ఎండలో నిలబెట్టి పాఠం చదివించడం—యీవిధంగా శిక్షించేవాడు సాంబన్న. పిల్లల్ని ఎంత కొట్టి శిక్షిస్తే, వాళ్లకు అంత బాగా చదువువస్తుందని అభిప్రాయం కాబోలు! అలాగైతే, నేను తిన్న దెబ్బలకు నిజంగా నాకెంత విద్య రావలసింది?

సాంబన్న చేతిలో సర్వకాలసర్వావస్థలయందు బెత్తం ఊగుతూ ఉండేది. ఒకచేత బెత్తం, రెండోచేత సుద్దముక్క పట్టుకొని, చుట్టపొగ కుర్రవాళ్ల మొహాలమీదకి గుప్ గుప్ మని వొదులుతూ, మాస్టరు నావేపు వస్తూఉంటే, నా పంచ ప్రాణాలు ఎక్కడ ఉండేవో ఆ దేవుడికే తెలియాలి. ఎప్పుడైనా స్కూలుకు వెళ్లడం ఎగవేస్తే, ఆమర్నాడు కాళ్ల పీకేదాకా గుంజీలు తీయించి, చావజంపి చెవులు మూసేవాడు. పండుగ, పర్వం వచ్చినప్పుడు మాత్రం మావద్ద ఒక్కొక్క కాని వసూలుచేసి, బడికి సెలవిచ్చేవాడు. ఆ వెధవపండుగలు ఎప్పుడోకాని రావుకద? మనంకోరిన రోజులలో అయితే అవి అసలే రావు!

"అమ్మా, అమ్మా, రోజూ బడిలో మాస్టరు నన్నెందుకు కొడతాడు?" అని ఒకనాడు మా అమ్మను అడిగాను.

మెల్లగా నవ్వుతూ ఆమె, "పెంకెతనం చెయ్యక బుద్ధిగా చదువుకుంటే కొట్టడు. ఉదయం నేను లేచినవేళకు నువ్వుకూడా లేచి, తులశమ్మకు దండం పెట్టి, మొగం కడుక్కోవాలి. అప్పుడు ఎక్కాలు రాసుకొని, బడికి వెళ్లాలి. నిత్యం ఆమోస్తరుగానే చేస్తే, అయ్యవారు కొట్టడు." అని చెప్పింది.

నాకు ఎక్కాలన్నా, లెక్కలన్నా గొంతుకత్తెర! అంటుకునేదు, బడికెళ్లడంతోనే ముందుగా ఎక్కాలే అడిగేవాడు సాంబన్న. ఆస్కూలులో చదివినంతకాలం నిజంగా నాశరీరం ఎక్కాలకే అప్పజెప్పాను!

ఒకనాడు సాయంత్రం 'ప్రథమా విభక్తులు' చెప్పిన తరువాత, సాంబన్న బెత్తంతో నేలపైని తట్టుతూ, "ఏమర్రా, ఇటు వినండి — రేపు మీకందరికీ పరీక్ష జరుగుతుంది. పాఠాలు బాగా చదువుకొనిరండి. లేకుంటే, ఇన్స్పెక్టరు ఫెయిల్ చేస్తాడు. కుళ్లు గుడ్డలు కట్టుకొని రాక, శుభ్రమైన చాకింటి బట్టలు వేసుకొని రండి." అని గట్టిగా అందరికీ వినిపించేలాగు చెప్పి, బడి విడిచిపెట్టాడు.

హాయిగా పుణ్యక్షేత్రాలన్నీ తిరిగి, అప్పటికి నెలరోజులయింది, మా నాయనమ్మ యిల్లుచేరుకొని. వృద్ధాప్యం వచ్చినా, యింకా ఆమె పనిపాట్లు శ్రద్ధగానే చేసేది. వంటలో నిజంగా ఆమెది అమృతహస్తం! ప్రొద్దున్నే యేటినుంచి ఆమె స్నానం చేసివచ్చి, తులసిమొక్కదగ్గిర ముగ్గులు పెడుతూ ఉంటే, నేను పరుగెత్తివెళ్లి, "నాన్నమ్మా, యీవాళ మాకు పరీక్షలవుతాయి. వేగిరం బడికివెళ్లాలి" అని చెప్పాను.

వేరే అత్తెసరువేసి, ఆమె అందరికన్నా ముందుగా నాకు వడ్డించింది. ఈలోపున మా అమ్మ నాకు తల దువ్వి, నీళ్లుపోసి, నుదుట అగరుముక్క పెట్టింది. ఆవాళ క్రొత్త షెరాయి, పట్టుజుబ్బా తొడుగుకున్నాను. దసరాకి మా నాన్న పట్నంలో నాకోసం కొనితెచ్చిన ఒల్లాయి టోపీ పెట్టుకున్నాను. మసిబొగ్గుతో తోమి, ప్రొద్దున్నే పలక శుభ్రంగా కడిగి ఉంచుకున్నాను. క్రొత్త 'పాలపుల్ల', ఎక్కాల బుక్కు, కాపీల పుస్తకం, కరక్కాయ సిరాబుడ్డి, పిట్టకలం, పెన్సిలు, చిన్న దంతంపిడి చాకు — నాసజ్జు యావత్తు పట్టుకొని బడికి బయలుదేరాను.

మా మాస్టరు నల్లని పెద్దకోటు తొడుక్కొని, ఎర్రని పాగా చుట్టాడు. ఇన్స్పెక్టరు రామయ్యపంతులు పదిన్నర గంటలసరికి బడికి వచ్చాడు.

డిక్టేషను, రీడింగు అయిన పిమ్మట ఆయన పాఠాలలో ప్రశ్నలువెయ్యడం ప్రారంభించాడు.

"ఆవుపాలు ఎట్లాఉండును?"

"తెల్లగాను, మధురముగాను ఉండును." అని ఒక కుర్రవాడు చెప్పాడు.

"రైట్. రుచికి ఆవుపాలు ఏవిధముగా ఉండును? — నెక్స్టు బోయి!"

"మధురముగా ఉండును."

"వెరిగుడ్. 'మధురము' అనగా అర్థమేమి?"

"తీప." అని ఒక అమ్మాయి చెప్పింది.

"క్వైట్ రైట్. రుచులన్నిటిలోను ముఖ్యమైనది ఏది?" అని రామయ్యపంతులుఅడిగాడు ఒక అబ్బాయివేపు తిరిగి.

"పంచదార" అని వాడు చెప్పాడు.

"కాదు. నెక్స్టు?—"

"పాకం బెల్లం!"

"నో,—కాదు."

నేను క్లాసులో వెనుకకు కూచుని ఉంటిని. నన్నెప్పుడడుగుతాడా, ఎప్పుడు చెప్పేదునా, అని చాలా ఆతురతగా ఉండేను నాకు. ఎవడు చెప్పిన జబాబూ రామయ్యపంతులుకి నచ్చలేదు. 'తీప' అని ఒకడు, 'పులుపు' అని మరొకడు, 'కారం' అని యింకొకడు, 'తియ్యతియ్యగా పుల్లపుల్లగా ఉన్నది,' అని వేరొకడు—యీవిధంగా తలా ఒక్కొక్క జబాబు చెప్పారు. ఇంతలో రామయ్యపంతులు నావైఖరి చూశాడు. నేను లేవబోతూ ఉండడం, కూచోడం, పెదిమెం లాడించడం, అన్నీ కనిపెట్టి, 'వీడికి తెలిసినట్లుంది!' అని గ్రహించి, నావేపు వేలు చూపించాడు.

"నువ్వు...అబ్బాయి, నీపేరేమిటి?—నువ్వు చెప్పు?" అన్నాడు నన్ను హెచ్చరిస్తూ.

గభాలున నిలబడి, గుక్కవిడవకుండా ఒక్క ఊపిరిని జబాబు చెప్పాను.

"ఈవాళ ప్రొద్దున్న మానాయనమ్మ వంకాయ జీడిగులు, కలిపి వండినముద్దకూర!"

"చబాష్!" అని యిన్‌స్పెక్టరు కడుపుపట్ట లేకుండా నవ్వేడు.

మా మాస్టరుకికూడా నవ్వువచ్చింది కాని, నవ్వు సమాళించుకుని, నావైపు చురచుర చూడడం ప్రారంభించాడు. క్లాసులో ఉన్న అమ్మాయిలు కూడా మొహాలు ప్రక్కకుతిప్పి, విరగబడి నవ్వుకున్నారు. అప్పుడు నాకు కొంచెం మనసు బాధించింది. కాని వాళ్లు ఎందుకు నవ్వుకుంటున్నారో గ్రహించుకోలేక పోయాను. రామయ్యపంతులు వేసిన ప్రశ్నకు ఎవరూ సరియైన జబాబు చెప్పలేనప్పుడు, నేను చెప్పగలిగినాను కదా అని బ్రహ్మానందభరితుడనై కూర్చున్నాను.

మధ్యాహ్నం లెక్కలపరీక్ష. ఉదయం నేను చెప్పిన జబాబుకి చాలాసంతోషించి కాబోలు, "వీడు చాలా చురుకైన కుర్రవాడివలె ఉన్నాడు." అని తలచి, రామయ్యపంతులు రెండోపూట వచ్చీ రావడంతోనే, తక్కినవాళ్లను ప్రశ్నించక నన్ను పరిక్షచెయ్యడం ప్రారంభించాడు.

"అబ్బాయీ, పళ్లెంలో మూడు మిఠాయి ఉండలు ఉన్నవనుకో, పిల్లివచ్చి ఒకటి యెత్తుకొని పోతుంది. ఇంకా ఎన్నిఉండలు మిగులుతవి?"

"అన్నీ మిగులుతాయి." అని బదులుపలికినాను.

"అన్నీ ఎట్లా మిగులుతవి? పిల్లి ఒకఉండ యెత్తుకొ పోతుందిగా?"

"పిల్లిని నేను పళ్లెందగ్గిరికి రానియ్యను. కర్రతో కొట్టి తోలేస్తాను." అన్నాను.

రామయ్యపంతులు తనలో నవ్వుకొని, "నువ్వు అప్పుడు యింట్లోలేవనుకో, పిల్లివచ్చి ఒకటి తినేస్తుంది. ఇంకా ఎన్నిఉండలు ఉంటాయి?" అని గట్టిగా అడిగాడు.

"నేను లేకపోతే మా అమ్మఉంటుంది. ఆమె లేకపోతే మానాన్నఉంటాడు. నౌకర్లు ఉంటారు. ఎవరున్నా లేకపోయినా, మానాయినమ్మ తప్పకుండా సావిట్లో కూచుంటుంది కదా, పిల్లివచ్చి మిఠాయి ఉండలు ఎత్తుకొపోతూఉంటే చూస్తూ ఊరుకుంటుందీ?"

ఇన్‌స్పెక్టరుకు కోపం వచ్చింది. కళ్లెర్రజేసి నావేపుచూస్తూ, "అబ్బాయీ, ఎవరూచూడకుండా వచ్చి, పిల్లితినేస్తుందనుకో." అని బోధపరిచాడు.

"అయితే ఒకటీ ఉండదు." అన్నాను.

"ఏమి? మూడుఉండలలోను పిల్లి ఒక్కటేగా తింటుంది?"

"ఎవరూ చూడకుండా ఉంటే, పిల్లి ఒక్క ఉండ మాత్రం తిని వెళ్లిపోతుందీ? అన్నీ కాజేస్తుంది." అని చెప్పాను.

"అదికాదు. పిల్లి ఒక ఉండ తినగానే నువ్వు లోపలికి వచ్చావనుకో మిగతావి తిననియ్యకుండా పిల్లిని తోలేస్తావనుకో. అప్పుడో?"

"అప్పుడైనా ఒకటీమిగలదు. ఏమంటే, ఆమిగిలిన రెండుఉండలూ నేనుతినేస్తాను. నాకు మిఠాయి ఉండలంటే మహాయిష్టం."

రామయ్యపంతులు నవ్వి. "సరే కూర్చో." అన్నాడు.

బడివిడిచీగానే పరుగునవెళ్లి, మానాయనమ్మతో పరీక్షసంగతులన్నీ చెబుతూ ఉంటే, అమ్మవచ్చి నావెనక నిల్చుంది. కొంతసేపు నాకబుర్లువిని, "ఇట్లారా నాతో." అని తనగదిలోకి తోడ్చుకొపోయింది.

ఏదో తినేందుకు యిస్తుందికాబోలని సంబరపడ్డాను. రోజూ స్కూలునుండి సాయంత్రం యింటికి రాగానే, నాకు యేదైనా ఫలహారం లభించడం మామూలు. ఏదీ లేనప్పుడు మానాయనమ్మనడిగితే, రాత్రికి తన ఫలహారానికి చేసుకున్న రొట్టెముక్కో, ఉప్పుపిండో, పొంగరాలో—ఏదో ఒకటి యిచ్చేది. నాకు చేగోడీలు, జంతికలు, చక్కిలాలు, మొదలైన చిరుతిళ్లంటే చాలా యిష్టం. కాని అవి అజీర్ణం వస్తువులనీ, అనాగరిక భక్ష్యాలనీ కాబోలు, మా అమ్మ నన్ను అట్టే తిననిచ్చేదికాదు. పాలుముంజలు, హల్వా, రవ్వలాడు, కోవాబిళ్లలు, మొదలైన నాజూకు పిండివంటలన్నీ చేయించేది ఫలహారానికి. పట్నంనుంచి నాకోసం బిస్కట్ డబ్బాలు, పిప్పరమింట్లు, చాకొలెట్లు తెప్పించేది. నెలనెలకీ గిన్నె డేసి ఆవిడదం తాగించేది నాచేత!

"అమ్మా, తినేందికి ఏమైనా ఇయ్యవ్?" అని చెయ్యి చాచేను.

"ఈవాళ యేమీలేదు. కావలస్తే పాలు, మీగడ గిన్నెలో తీసియిస్తాను; పంచదారవేసుకొని తిను. నిన్నటి కోరుండలు రెండు గూట్లో దాచి ఉంచితే, పిల్లి యెత్తుకొపోయింది."

"రెండూ తినేసిందీ?" అని అడిగాను.

"పూర్తిగా! ఒక పిసరైనా మిగల్చలేదు."అన్నాది.

"అలాగా? అయితే పోనీలే కాని, అమ్మా, యిటువిను. నాకేమీ తినేందికి వొద్దులే. ఈవాళ యిన్స్పెక్టరు పరీక్షచెయ్యడానికి వచ్చేడా, నన్ను నోటిలెక్కలడిగాడు. 'పళ్లెంలో మిఠాయి ఉండలు మూడు ఉంటే, పిల్లి యెవరూ చూడకుండా వచ్చి ఒకటి యెత్తుకొపోతే, యింకా ఎన్ని ఉండలు మిగులుతాయి?' అని అడిగాడు పిల్లి అన్నీ తినేస్తుంది కదూ? కాబట్టి 'ఒకటీ మిగలదు.'అని జవాబు చెప్పాను. మాఁహూ మరి,...నువ్వు కోరుండలు దాచితే, యేంజేసింది పిల్లి? అలాగే—"

నామాటలు విని మా అమ్మ మెల్లగా నవ్వింది.

"అయితే పరీక్ష పాస్ అయినావా, లేదా? అని అడిగింది, మీద చెయ్యివేసి.

"ఏమో!"

ఆమె దయతో నాశిరస్సు నిమురుతూ, "నువ్వు బాగా చదువుకొని, పెద్దపెద్ద పరీక్షలు పాస్ అయితే నాకు సంతోషంగా ఉంటుంది. రేపటినుంచి నీకు యింటిపద్ద చదువుచెప్తాను నేను; నేర్చుకుంటావూ?" అన్నాది. "ఓ అలాగైతే మరి సాంబన్న బడికి నేను వెళ్ళనక్కరలేదన్నమాట!"అని చంకలు గుద్దుకున్నాను.

"వెళ్ళాలి." అన్నాది ఆమె, నవ్వుతూ. "బడికి వెళితే కాని చదువురాదే, అమ్మా? ఎక్కాలు, దెబ్బలు, ఆడపిల్లల నవ్వులు—ఇవి తప్పవూ మరి?" అన్నాను గునుస్తూ.



“సావిత్రీదేవి వుద్యాపనసమయమందు తాడేపల్లిగూడెం సతీహితసమితిసభ్యురాండ్రు తీయించినఫొటో.

దా॥ లక్ష్మీనరసమ్మ, కార్యదర్శిని.

'దొంగలమఱ్ఱి' లోభీమారెడ్డిపాత్రవహించిన



చి॥ మల్ల సుభద్రాంబ ( 8 ఏండ్లు)

సువర్ణపతక మొసగబడినది.



"ఎక్కడనుండీ యీమ్రోత?"

(శ్రీయుత ఎ. టి. టాడ్హంటర్ నాగ)




విశాఖపట్నంజిల్లా చూచికొండ

బాలికాపాఠశాల

# నెచ్చెలి యెడబాటు

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

క॥ కలకలనవ్వుచుఁ బ్రియమా
పలుకుల సౌశీల్యగరిమఁ బరగెడి "నానె
చ్చెలి యెడబాటు" రచింపగ
కలమాడదు చిత్తవృత్తికలగెడి నకటా.

మ॥ కడులేఁబ్రాయపు చిన్నిపాపలడలన్ గాంతుండు చిత్తంబునన్
బెడిదంబైన వియోగతాపమునకున్ బెంపేదిచింతింప నీ
యెడబాటోపక సోదరుల్ వగవ, నెంతేతల్లియుందండ్రి బి
ట్టడలన్ నిన్గొనిపోయెదైవ మిపు డాహా క్రూరుడై నెచ్చెలీ.

మ॥ కలగుండై తపియించు నెమ్మనముతోఁ గందోయిపెన్నీటితో
బలుదుఃఖంబులసోలు సంగములతోఁ బల్మాఱు హా, పుత్రికా
ఇలకున్ బాసితివేయటంచు నెపుడున్ హెచ్చైనశోకాగ్నిచే
చెలియా! గాసిలుతల్లిఁ బాసి యిటు నిశ్చింతన్ దివిం జేరితే.

చ॥ ననుగని "మీ సముద్రమథనంబను నాటకరాజ మెప్పుడో
కనుగొను భాగ్యమబ్బ"నఁగా ముదమంది "యితోధికంబులౌ
ఘనమగు గ్రంథరాజములఁ గాంచితిరే గద మీర"టన్న 'నా'
"మనవనితల్ రచించునవి మాన్యములౌగద సౌహృదంబుచే
మన"కనినొక్కపల్కు నభిమానవతీమణిసఖ్య మబ్బునే.

చ॥ అలరితి పద్మినీపరిణయంబునుగన్గొని యింకనిట్టులే
సలలితగ్రంథరాజములఁ జాలనొనర్పుము కీర్తిగల్గు న
వ్వలఁ బరమబ్బునీకు కొదవా ప్రతిభానిధివంచుఁ బల్కు నె
చ్చెలి నటఁ జూతునింక నెడఁజేసనె దైవము క్రూరచిత్తుడై.

గీ॥ అమ్మ వైద్యశాలకరిగ సదే యిదే
సచ్చుమాకు పండ్లనిచ్చునంచు
అఱ్ఱులెత్తి చూచునట్టి పాపలనైన
కనికరించి నిన్నుఁగావడయ్యె.

క॥ తులసీ మంగళగీతల
జెలియా రచియింపు మనుచుఁజెప్పిన నీదౌ
పలుకు నెరవేర్పకయ "నె
చ్చెలి యెడబాటు"ను రచింపఁజేసె విధి చెలీ.

సీ॥ శ్రీమహనీయమై చెలఁగి పేరొందిన సద్వంశమందున జననమొంది
భువనాభినంద్యమౌ భూరిసద్గుణముల నెల్లరు గొనియాడ నెలమిగాంచి

వనితాజనంబు నీఘనసౌహృదంబున కలరి మైత్రినొనర్ప నతిశయిల్లి
నేర్పు వల్లభుకడనోర్పు కార్యములందుతీర్పు భాషణలపినీతినలరి
శ్వశురపితృవంశములఁ గీర్తి జగతినెఱయు
రీతిని సతీమణి వసంగ ఖ్యాతినొంది
దేవదేవుని సేవకేతెంచు నీకు
వినుతగుణ, సాటిచెలియేది వెదకిఁజూడ.

గీ॥ నిత్యసౌభాగ్యవతి నొచు నెగడి మంచి
తనయులనుగాంచి విభునిమన్ననలనలరి
భువి సతీమణివై దివిబొందు నీకు
గూర్మి బాష్పాంజలులనిత్తు గొనుము ప్రీతి.

గీ॥ దేవిభువనేశ్వరీ! నిన్ను దలచిచూడ
దేవిభువనేశ్వరివటంచు దెలసికొంటి
కోరి బండెడు పసపుకుంకుమలతోడ
స్వర్గమును జూఱగొనుటచే శాశ్వతముగ.

## కొండగడ్డ

కపికొండల వెంకటరావుగారు

[గీతిక]

నేనీదాఁక భూమిపైనున్నానా?
నన్నీదాఁక నెవ్వరైనఁగన్నారా?
నేకొండగడ్డ నెఱ్ఱచెక్క నేలబిడ్డనూ
నానీటియెఱుపు నెత్తుటికినిలేదు రాదుగా—॥నే॥
మధ్యాహ్నమెల్ల యెండ మాయమైనను
సందేళ చినుకుపడ్డ సాగిపోదునూ—॥నే॥
మబ్బుగమ్ముకుంటుపోతె మనసువిప్పను
మబ్బుమెఱసికుంటుపోతె కనులుగప్పను—॥నే॥
నన్నుజూచి పొంగిపొయ్యె నాథుఁడెవ్వడూ?
నేనునేఁడు కెరలి దొరల నెనరులెవరికే?—॥నే॥
లేదుదుక్కి, లేదుచేను, లేదుచల్లిక
లేదుజగతి కేనుజేయు నేయుపకృతి—॥నే॥
నడకచూస్తె నాకెవింత నాదమీనెడు
గడిముందు లేనిదాన్ని గండికొడితిని—॥నే॥

# మగని చెవిలో

**అనసూయ**

(మరిదిఉద్యోగముగురించి)

మీ తమ్ముడికి నూరురూపాయీల జీతంమీద మేష్టరుపని అయిందట గదూ! ఆహా! ఏమిఅదృష్టమండీ! మొన్న మొన్నను యింకా ప్యాసుఅయినట్లు తెలిసిందో లేదో అప్పుడే యెంతవేగం ఉద్యోగం దొరికిందండీ! అదృష్టంఅంటే అలాగుండాలి! ఎదుగూ బొదుగూ లేకుండా గొర్రెతోకలాగు ఉందిగదా మీప్లీడరుపని! వచ్చిననాడు ఎలాగున్నదో యివాళకూడా అలాగే ఉన్నది. పూర్వమునకూ ఇప్పటికీ భేదమేమిటంటే అప్పుడుయేమీదొరక లేదని అందరూ నమ్మేవారు, ఇప్పుడు మీఅమ్మావాళ్లూ మాత్రం నమ్మరు! అంతేగాని దొరకకపోవడమేమో నాడూ నేడూ ఒక్కలాగేఉంది! నిజంగా ఆ మేష్టరు పనిలో ఏదో రామాకృష్ణా అని, ప్రొద్దున్నా సాయంకాలమూ, అనుకున్నా వంటపడుతుంది, ఫలము ఉంటుంది. పిల్లలతో పని, అమాయకులతో కాలక్షేపము; ఊళ్లుతిరగక్కరలేదు, నాయిళ్లని ఆశ్రయించనక్కర్లేదు, పట్నాయిళ్లను బ్రతిమాల నవసరము లేదు, కడుపులో చల్లకదలనక్కరలేకుండా నమ్మదిగా పనిచేసుకొని పోవచ్చును. ఒక యేడాది పాఠాలుచెప్పిన తరువాత మరియింటిదగ్గర [illegible] అవసరములేకుండా తడుముకోనక్కరలేకుండా చద్దన్నంతినడం బడికి వెళ్లిపోవడం తప్ప మరేమీ చికాకుకూడా ఉండదు. అదికాక పిల్లలకు చెప్పే పాఠాలు నిజమైనవీ న్యాయమైనవీ ప్రమాదము లేనివీ, ఇహపరసాధకములైనవీ, చెప్పేవారికీ, చెప్పించుకున్నవారికీ కూడా శ్రేయస్కరమైనవీ అయిన సంగతులు, మీరు చెప్పేపాఠాలు అటువంటివి కావుగదా! ఒకకేసులో ఇద్దరు ప్లీడర్లవాదమూ న్యాయమై ఉంటుందా చెప్పండీ? ఇద్దరికీ నిజమైన కేసు ఉండదుగదా! కాని యిద్దరూ బడి పెట్టి పాఠాలు చెప్తారా చెప్పరా! చెప్పకపోతే కేసు పోతుందని బెదిరించి అబద్ధాలు చెప్పిస్తారా లేదా? మీరు చెప్పేవన్నీ అబద్ధాలేనా? అయ్యో! వెనుకా ముందూ ఆలోచనలేకుండా గుడ్డెద్దు జొన్నచేనులో బడ్డట్టు మీ రెందుకు దిగేరండీ యీవృత్తిలోనికి! పోనీ! యేం! తండ్రి ప్లీడరని దిగేరా? అన్న ప్లీడరని దిగేరా? మామ ప్లీడరనిదిగేరా? ఈయిల్లు, యీబీరువాలు, యీపుస్తకాలు, యివన్నీపోతాయి, వీటిని కనిపెట్టుకొని ఉండాలని దిగేరా? మీకుటుంబములో యేడు మూడు పురుషాంతరాలనుంచీ లేని యీ ఊబిలోనికి మీ రెందుకు దిగబడిపోయినారు? ఇప్పుడు పైకి పోలేరు, దానిలో ఉండలేరు!

ఔనుగాని అల్లా బెల్లానవాడుట! వాళ్లమ్మ వంటవండీ నీళ్లుమోసీ గణించిన డబ్బుపెట్టి చదువుకొని యేదో నిఖరంరాబడిగల ఉద్యోగములోనికి పోకుండా వాడుకూడా యీవృత్తిలోనికి దిగిపోయేడుట! వాడికేం చెడుకాలం పట్టిందండీ? అల్లా వీధిలో పెద్దమేడకట్టిన ప్లీడరు తనకొడుకుని దాల్లో పెట్టకుండా పోష్టాఫీసులో పడేసేడుటగదూ! నిజంగా అలాంటివాళ్ళ కాళ్ళకి మొక్కాలి! ఒక కుటుంబమును ఉద్ధరించే దన్నమాట! ఇప్పుడు బోధపడక పోయినా క్రమంగా బోధపడకమానదు! మీ అబద్ధపు నరకంలోనికి ఒక జీవి రాకుండా తప్పిపోయినా మంచి వేగదూ! పోనీగాని ఒకటిచెప్పండీ! రోజూ అబద్ధాలాడించే వాళ్ళకు ఏమతము ప్రకారమైనా ముక్తిఉన్నదండీ! ప్లీడరు జపముచేసినా తావళాలువేసుకొన్నా నాకు కాలనేమి జ్ఞాపకం వస్తాడు! ఎరిగెరిగి అబద్ధాలాడించేవాడికి, పట్టుమని పదిరూపాయీలు జిగేలుమని చేతిలో పడేసరికి తన పార్టీ అంత అమాయకుడూ నిర్దోషీ లేడని యింటా బైటాకూడా చాటించేవాడికి, కష్టార్జితమైన కాపువాళ్ళసొమ్ము కల్లలాడించి గడించేవాడికి, జపాలూ, తావళాలూ, గీతలూ, ఏమి మేలుచేయగలవండీ?

ఆతావళాలపులి, ఆపభూతిబుట్ట, ఆ వేదపండు, అయ్యన్నపంతులు ముసలిఘోటకాణా అయిపోయినా ఇంకా కచేరీకివెళ్లి అబద్ధాలాడిస్తూ ఉన్నాడుట కదూ! అతడు ఎన్నిజపాలు, ఎన్నియజ్ఞాలు, యాగాలు చేస్తేమాత్రం ఫలమేమిటి? ఇవతల అప్పులా పెరిగిపోతూవున్నవి, అవతల యేళ్లా నిండిపోతూవున్నవి; కుటుంబములో యెవళ్లో ఒకళ్లు పోతూనే ఉన్నారు! అలాగు అవుతున్నా చాలించలేకుండా ఇంకా ఈ అబద్ధపు వాదాలలో తిరిగేవాడికి, తావళాలు త్రిప్పినంతమాత్రంచేత ముక్తి వెళిపోవస్తుందంటే — ముక్తి రానివాడు ఎవడా అని నాకు ఆశ్చర్యం వేస్తూ ఉంటుంది! అలాగైతే మన శాస్త్రాలూ, మన పురాణాలూ అబద్ధాలన్నమాట! ఒక్క అబద్ధం ఆడడానికి జంకి జంకి ప్రాణం పిడికిటిలో పెట్టుకొన్న ధర్మరాజున్నూ, ఒక్కఅబద్ధమైనా ఆడకుండా ప్రాణాలకుకూడా తెగించిన హరిశ్చంద్రుడున్నూ వట్టి అభాజనులన్నమాట! పూటకు పుట్టెడు అబద్ధాలాడినా చెడిపోవనిముక్తికివాళ్లెందుకు అంతశ్రమపడి అబద్ధం ఆడకుండా బాధలుపడ్డారో! ఎన్నిఅయినా అనండిగాని సత్యాన్ని చంపేవాళ్ళకీ ప్రాణాన్ని చంపేవాళ్ళకీ సద్గతులు ఉన్నాయంటే నేను నమ్మలేనునుమండీ !

"ప్రాణాన్ని చంపనివాళ్లెవరు ? నీవు రోజూ కూరతరిగి ప్రాణాన్ని చంపుతున్నావు కాదూ? సత్యాన్ని చంపేదేమిటి ? సత్యమే దేముడు !"

ఇది బాగుంది ! వెర్రికుదిరింది, రోకలితలకు చుట్టమన్నట్లున్నది ! నేను కూరతరుగుతున్నాను, మీరు రేపు గొర్రెను కోసుకొనితినండి, యెల్లుండి మనుష్యులను నరికి తినండి ! మూడూప్రాణహత్యలే, భేదమేమిటి ? నరమాంస భక్షణమూ, పశుమాంస భక్షణమూ, శాకాహారమూ మూడూ ఒక లాంటివే అయితే మరెందుకు ? బుద్ధుడు చెప్పిన అహింస, గాంధీ చెప్పిన అహింస, యివన్నీ మనముచేయలేనివే! కాబట్టి యికను మనము బ్రాహ్మర్లమైనా కోళ్ళను మేకలను గొర్రెలను పందులను కోసుకొని తినవచ్చును; ఏమితిన్నా జీవహింస తప్పదు; అంచేత యిదైతేనేం, అదైతేనేం ?

ఆహా! ఏమి తత్త్వజ్ఞానం! ఏమి వేదాంతం! ఈపాశ్చాత్య సంపర్కంవలించి కుతర్కం లావైపోయి తెలివితేటలే కాకుండా దయాసత్యశౌచములుకూడా నశించిపోతూవున్నవే! ఈ పాశ్చాత్యవ్యామోహం ఎంతపని చేస్తున్నాది? పూర్వము మాంసాహారులుగా ఉండిన్నీ ఒక్కమారు కులమంతా కూడా అహింసావ్రతము అవలంబించి మాంసాహారము మానివేసిన మనపూర్వులమహిమ గ్రహించుటకు మీకు అర్హతకూడా లేకపోయిందిగదా! ఎంత దుస్థితికి వచ్చినారు! సత్యమే దేముడట! అందుచేత ఏ అబద్ధమైనా సత్యముకాకపోదట! ఇదే నిజమైతే మరి మీ ప్లీడర్లతో మాటాడవశమా? వాళ్లు రోజూ ఆడించే అబద్ధాలన్నీ మీ కారికప్రకారం సత్యాలైపోతూవుంటే మరేం — వాళ్లు యముడిని గిరీశంగాడిలాగు డబరకాయించగల రన్నమాట! అయితే, నాకొకటి చెప్పండి! అన్నీ నిజాలైపోతే — వాడు చెప్పినదీ వీడు చెప్పినదీ నిజమైపోతే మరి ఆమధ్యవాడు ఎలాగు తీర్పుగాసి యేడుస్తాడు ? ఏ నిజాన్ని స్వీకరిస్తాడు ?

అందుచేత మీ కుతర్కం అటుంచండిగాని అబద్ధాలవాడికీ హత్యలవాడికీ అధోగతేకాని ఊర్ధ్వగతి లేదని నా నమ్మకము! మన పురాణాలలోగాని శాస్త్రాలలోగాని వేదాలలోగాని ఇట్టి అబద్ధపుప్లీడరీ వృత్తి వున్నట్లు వ్రాసేరండీ? 'సత్యంవద, ధర్మంచర' అని చెప్పినవాళ్లు ఇట్టి వృత్తిపెట్టి ఉండరు. ఇది తురకవాళ్లో ఇంగ్లీషువాళ్లో మనకు దయచేసిన ప్రసాదమైవుంటుంది. చాలామట్టుకు మన దేశం వాళ్లు జీవహింసచేసి మాంసము తినడానికి లొంగేరు కారని ఈయెత్తు యెత్తినట్లు కనపడుతుంది. ఋషిపుత్రులమని గూడా వాళ్లు ప్రగల్భాలు పలుకుతారు. వాళ్ల చేత జీవహింసకన్నా ఘోరమైన పాపము

చేయిద్దాము అని ప్లానువేసి తురకవాళ్లో ఇంగ్లీషు వాళ్లో మన దేశంలో ఈ స్లేవరీ ప్రవృత్తి పెట్టినట్లు కనిపిస్తుంది. దానితో వేములు గారి కొడుకూ, సోమయాజులుగారి కొడుకూ, దీక్షితులు గారి కొడుకూ, అవధాన్లుగారి కొడుకూ అందరూ ఈ వృత్తిలో జొరబడ్డారు! ఇకనియ్యోగపు పంతులుగారి కొడుకా? వారికి చిరకాలంనుంచీ అనాదిగా ఏదో రూపంగా అన్యాయపుప్రవృత్తి అలవాటైపోయింది. వారికి బాధలేదు. నీటిలో చేపజాలు బడ్డట్లు వారు చేరేరు! మాలవాడు వీధిలోఉంటే ఆ వీధి వదలి మరొక వీధిలోనుండి వెళ్లే నంబూద్రి బ్రాహ్మర్లు కూడా మారేరు. అయ్యర్లు, కన్నడులు, బంగాళీలు, పంజాబీలు, ఓఢ్రులు, తురకలు అందరూ వచ్చి పడ్డారు! ఈ వృత్తిలోనికి తగినవాళ్లు లేరు. అన్యాయాలకీ, అబద్ధాలకీ ఒకరిని మించిపోయేరు ఒకరు! ఇలాగుంటే మన మనుష్యప్రజలు మనలో లేవంటే ఆశ్చర్యమేమిటి? నిజాన్ని ఆశ్రయించుకొని ఉండే శక్తులు ఎలాగుంటాయి అదృష్టపుకొంపలలో?

ఈ వృత్తిని రష్యాదేశంలో తీసివేసేరట గదూ! అలాగు యీ దేశంలోకూడా తీసివేయకూడదూ? మనుష్యులయొక్క దేహాలు ఆత్మలు రెండూకూడా బాగుపడతాయి!

నిర్లిప్తతగా ఉంటే బాధ లేదటండీ? ఓ! మీ నిర్లిప్త చెప్పేదేమిటి? వారం రోజుల క్రిందట మీ కచేరీసావిట్లో యేమిటో గడబిడ జరిగి ద్వారందగ్గిర నేను నిలబడిఉంటే, కోర్టులో సరిగా సాక్ష్యం చెప్పలేదనీ, ఇంటిదగ్గిర చెప్పిన ముక్కలు చెప్పడం మానివేసేడనీ, ఎవడినో పాట్టెసి మీరు కొట్టినంత పని చేస్తూఉండడం చూడలేదనుకున్నారా? అయిపోయినదేదో అయిపోయిందని ఊరుకోక యింటి వద్దకూడా అంతఘర్షణచేసే మీలాంటివారికి నిర్లిప్తత ఎలాగుంటుంది? కేసుపోతే శపంపోయినట్లు దివాలా మొగంవేసే మీకు నిర్లిప్తతా, కర్మఫలత్యాగమూ, ఉంటాయంటే యెవరు నమ్ముతారు!

పోనీయండి! మీ తమ్ముడైనా అదృష్టవంతుడైనాడు! మా అన్న ఉన్నాడు. వా డేదో జుర్రేను కుంటున్నాడు; నేనూ దానిలోదూరి రెండు చేతులా జుర్రేసుకుందామని దీనిలోదూరి పాడైపోకుండా, తన బ్రతుకు తాను బ్రతికేడానికి తగిన జీతము, అబద్ధమూ అన్యాయమూ లేని వృత్తి సంపాదించుకున్నాడు! నూ తోటికోడలు మెల్ల మెల్ల నిజంగా సిరి మెల్లగానే పరిణమించింది!

అదీగాక మీ తమ్ముడు ఎక్కడో మేష్టరుపని చేస్తూఉంటే అతడిదగ్గరకి మీ అమ్మా అప్పా జరుగుతూఉంటారు. కొన్నాళ్లైనా యిచ్చట పోరు లేకుండా కొంపలో నెమ్మదిగా ఉంటుంది!

"మా తమ్ముడికి మేష్టరుపని కావడం నీ అదృష్ట రేఖ బయటపడ్డట్టుంది".

ఆ! ముమ్మాటికీ అలాగే అనుకోండి! ఈ యింట్లో [illegible] దుముఖాలూ కనపడకుండా ఒకరోజైనా ఉంటుందా అని వాచిపోతూ ఉన్నాను. చెడ్డదానినే అనుకోండి, దుష్టురాలినే అనుకోండి! ఏమైనా అనుకోండి గాని కొన్నాళ్లు కాకపోతే కొన్నాళ్లైనా వాళ్లు అక్కడికి వెళ్లి తమ్ముడిదగ్గిర ఉండకమానరు! అప్పుడు యీ యింట్లో కొంతహాయి, ఊపిరి తీసుకోవడానికి కొంత తీరుబాటు, మొగుడితో కొంత స్వేచ్ఛ, కొంత స్వరాజ్యము ఉంటుందని నాఆశ! అప్పుడుఇది నిజంగా మనిషిజన్మము!—అని కనబడితే కనబడవచ్చును.

అప్పుడే మీకు హడలుపట్టుకుంది కాబోలు! ఎవరూ సాయముండరు; వేగం క్లబ్బునుండి వెళ్లిపోరావాలని! ఆహా! అది ఎలాగూతప్పదు! సరిగ్గా నేను వంటకు మడికట్టుకొనేవేళకు తమరు యింట్లో ఉండాలి! లేకపోతే నేను పొయ్యిమీద యెసరైనా పెట్టననుకోండి! మీకు మొండితనముంటే నాకుమాత్రం లేకపోలేదు! ఈసారి అమ్మ వెనకా అప్ప వెనకా దాంగునేటందుకు వీలులేదు. లెండి! చేసిన తప్పుకు ప్రతీకారము వెంటవెంటనే అందిపోకమానదు!

ఏం! మీ గుండెలో రాయిపడ్డట్టుంది కదూ! చెత్తనోవల్సుకూ చేటుక్లబ్బుకూ సెలవివ్వాలని చింత కలుగుతున్నదకాబోలు! ఏమిచేస్తారు! ఊరుకోండి! విచారిస్తే యేమిలాభం! ఓడలుమీద బళ్లూవస్తాయి, బళ్లమీద ఓడలూవస్తాయి! పగలు రాత్రి అవుతుంది. రాత్రి పగలౌతుంది! ఓర్మి ప్రధానం!

# స్త్రీ తత్వము

శ్రీమతి నండూరి సుబ్బలక్ష్మీదేవిగారు

మగవాణ్ణి ఎలామార్చడానికైనా స్త్రీ తత్వమే కన్న వేరే మెథడ్ లేదు. స్త్రీ పేరులోమాత్రం అబలేకాని శక్తిలో ప్రబలే. సంసారసాగరాన్ని దాటించేటందుకు నావ లాంటిది. ఇది నా అభిప్రాయమేగాదు; ప్రతి గృహస్థు వుద్దేశ్యం అనుభవము కూడాను క్రమంగా. తన్ను ప్రేమించేవాణ్ణి తనుప్రేమిస్తూ దాసుణ్ణి చేసుకుంటుంది. అసాధ్యం **(Impossible)** అనేది ఆమె అనుభవంలో లేనేలేదు. లేదేమిటి? ఉండదు. "ముదితల్ నేరనివిద్య లున్న యని యా ముద్దారనేర్పించినన్" అన్నాడు కవిబ్రహ్మ. ప్రతీవిషయంలో పురుషుడితో సమానంగా కంపీటుచేయగల శక్తి, సామర్థ్యము, పరిశ్రమ, పట్టుదల, ఓపిక, లగ్నత, యేకాగ్రత ......యివన్నీ స్త్రీతత్వాన్ని ఆశ్రయించుకొన్నవే. ఇందుకు ప్రమాణం ఏమిటంటారు మీరు? మన బుద్ధే మనకు ప్రమాణం. ఒకచోట నిశ్చలంగా కూర్చొని ఆలోచించిచూస్తే పురుషులందీ పైగుణాలలో ఒకటి రెండు వుంటే అవి స్త్రీ సాంప్రదాయాలే అని పురుషుడు గ్రహించలేకపోడు. అందుకేగాదూ, తల్లిఋణం తీర్చలేమంటారు. ఇన్ని సుగుణాలుపట్టబట్టే స్త్రీని గృహలక్ష్మి అన్నారు. కాని పురుషుడికి మాత్రం 'గృహవిష్ణు' వనే పేరు రాలేదు, ఎన్నితంటాలు పడినాను. మహాత్ముడని, జితేంద్రియుడని, దేశోద్ధారకుడని, విశ్వదాతని, దానకర్ణుడని.......యిలాటి పై పేరులే వచ్చాయి. కాని గృహస్థాశ్రమానికి పనికొచ్చే ఒక్కపేరూలేదు. అందుకు తగ్గ శక్తిసామర్థ్యాలు మగవానిదగ్గర లేకనే కాదూ మరి స్త్రీకి 'గృహలక్ష్మి' అనే పవిత్రమైన పేరు రావడం.—తమ కట్టి యోగ్యతలేకపోవడంచేతే యీర్ష్యపడి కొందరు మగవాళ్లు స్త్రీల నోదుల్కొనిపోతారు సన్యాసులై.

వందమందిమగవాళ్లుకలిసి చేయించలేనిపని వకసామాన్య గృహలక్ష్మి చిటికెలో చేయిస్తుంది. మీ నమ్మకంకోసము యీమధ్య నేను చూసిన విషయం ఒకటి చెప్తాను వినండి.

౧

రామబ్రహ్మానికి సాలుకు నాలుగువేల రూపాయి లొస్తాయి. గ్రామకరిణీకంకూడా వుంది. ధర్మాత్ముడు. దేవతార్చన, సూర్యనమస్కారాలు, గంగాస్నానాలు, కార్తీక సంతర్పణలు, వకటేమిటి! గృహస్థాశ్రమానికి భంగంలేకుండా చాలా శ్రద్ధాభక్తులతో గడుపుతున్నాడు. అతని భార్య సుశీల కూడా పవిత్రమైన గృహలక్ష్మిస్థాన మాక్రమించుకొని తలలో నాల్కలా మసలుతూ వుంటుంది. వారిరువురుకూడా పూర్వాచార పరాయణులే. వారికి మనోరమ అనే పదేళ్ల పిల్ల వుంది. ఒక్కర్తే పిల్లవటంచేత ఆ కొద్ది వయస్సునాటికే మనోరమకు కృతులువరకూ సంగీతం, మధ్యమపరీక్షవరకూ హిందీ,

అయిదోక్లాసువరకూ తెలుగు, కొద్దిపాటి యింగ్లీషుకూడా నేర్పించారు.

ఇంతట్లోకే దేశమంతా ఒకటేగోల 'శారదాబిల్లు, అమ్మయ్యో! శారదాబి'ల్లని. ఈగోలపడలేక కొందరు బుద్ధిమంతులు పిల్లల్ని తీసుకొని ఫ్రెంచి యానాం పోతున్నారు. ఎక్కడచూచినా పెళ్లికొడుకు గిరాకీయే. కొన్ని వివాహాలు గోవిందస్వామిపిళ్లె ప్లేటుతోటే అయిపోతున్నాయి. మరికొన్ని గంగిరెద్దు సన్నాయిలతో. ఈ వడిదుడుకులో 'మనోరమ పెండ్లికూడా అయిపోవాలన్నాడు రామబ్రహ్మం. ఆ కంగారులో అధికప్రయత్నంమీద తమకునచ్చిన వకయువకుణ్ణి ఏరేరు. ఎనిమిదివేల రూపాయిలు కట్నంయిచ్చి మహావైభవంగా పెళ్లిచేశారు.

## 2

కాలము చక్రంలాంటిది. దాని బారిని పడకుండా ఎవళ్లు మిగుల్తారు? విశ్వసూదరం స్ఫోటకంపడి మృత్యుదేవతవాతి పడ్డాడు. పాపం! రామబ్రహ్మం ఆశలన్నీ నిరాశలై పోయాయి. సుశీల దుఃఖం భరించలేక బెంగతో చచ్చిపోయింది. మనోరమ దుఃఖానికి మేరేలేదు. రామబ్రహ్మం సత్కార్యాలేమి అడ్డుపడలేదు పాపం! అతను వీధిలో ప్రజల మొహం చూడలేదు. ఇంటిలో పిల్లమొహం చూడలేదు. గదివిడిచి ఎక్కడకీ కదలటంలేదు. కుటుంబం పెద్దది. తోడులేదు. రామబ్రహ్మానికి ఏమీ పాలిపోవడంలేదు. ఈస్థితిలో కొందరు మిత్రులొచ్చి మనోరమకు మళ్లీ పెళ్లిచేయండి. చిన్నపిల్ల. మీకొచ్చిన ఫర్వాలేదు! అని చెప్పటం ప్రారంభించారు. రామబ్రహ్మము ఒక్కసారి అలా చెయ్యగలడా? సంఘమో! కులమో! వెలోయి! అంక్షోయి! అని గోలపెట్టేవాడు. కొంతమంది (ప్రత్యేకం యీ డిపార్టుమెంటులో ఉన్న) రిఫార్మర్లు దేశంలో అక్కడక్కడ జరుగుతూన్న వితంతూద్వాహాల ఆహ్వానపత్రికలు, అట్టివానిని జయప్రదముగా నడిపించుటకు యేర్పడిన సంస్థల పేర్లజాబితా, పేచీలేకుండా జరిగిన వివాహాలని ప్రశంసిస్తూ వ్రాసిన పత్రికల సకళ్లను పుచ్చుకొని రామబ్రహ్మము దగ్గరకు వచ్చి మనోరమ వివాహం మాట కదుపుతోవుండేవారు. ఇవన్నీజూసి మరింత బిర్రబిగిసేడు. పిల్లవివాహంచేయిద్దామని స్నేహితులొస్తే తన కెక్కడైనా పిల్లని చూసిపెట్టమని బ్రతిమాలేవాడు. నీకెందుకయ్యా పెళ్లి? అంటే దూడాదుడుకు, యిల్లూవాకలి అనే యేడుపుమొగం వేసేవాడు. ఏం జెప్పము! ఎవడిగోల వాడిది! వెనక భీష్మాచార్యులవారు పెళ్లిచేసికోనని ప్రతిజ్ఞచేశారు. ఇప్పుడు పెళ్లిచేసికుంటానని ప్రతిజ్ఞపట్టాడు రామబ్రహ్మము.

## 3

మాఘమాసం. దక్షతలేదని 12 వ యేటే తీసికొచ్చేడు పూర్ణమ్మను. తలిదండ్రులు తీసుకొచ్చిన సంబంధాలన్నీ తోసి రాజని నేనో గొప్పకార్యం చేయాలని రామబ్రహ్మన్నే కట్టుకుంది పూర్ణ. వధూవరు లిద్దరిలోను కొంత వ్యత్యాసముమాత్ర ముంది. ఆధునికబాలికవలె ఆంగ్లసాంప్ర

దాయాలు లేకపోయినా అన్యమైన సహనం వుంది పూర్ణమ్మకు. అదేకాదూ హిందూ మతానికి వన్నె దెస్తోంది మొదల్నించీని. కలరుమల్లూ, గ్లాస్కో—ఏ వర్తకుడు యే సుమాహుర్తాన్ని దిండేడో దేశంలోనికి—ఆ తేదీ లగాయితు యీనాటిదియువరకు వాటిని చూస్తే కన్నతల్లిని మించిన ప్రేమ రామబ్రహ్మానికి—గాంధిగారు గోలపెట్టనీ, సాంబమూర్తిగారు తాను మీద పడ్డా సియ్—ఖద్దరుముట్టడు—చూడడు—పేరు వినడు. ఇంక పూర్ణమ్మ దినచర్యలో రాట్నం నడికడమే ప్రధానకార్యం. భరతమాత ఏరి తెచ్చుకుంది యీఅల్లుణ్ణి తన కూతురుకు !!

ఎలాగైతేం తాళంచేతులు పూర్ణమ్మ చేతికొచ్చాయి. ఆమెది విశాలహృదయము, దూరదృష్టి, యుక్తవిచక్షణ, అపారప్రేమ. మనోరమకు పూర్ణమ్మ తన సవత్తల్లనేమాట స్ఫురించడానికే అవకాశంలేదు. అప్పుడప్పుడు "నన్ను గట్టెక్కించవా! పిన్నీ!" అని యాచించేటట్టుగా చూసేది మనోరమ పూర్ణకేసి. అది నా చేతిలోపనే అనేనవ్వరేఖ పూర్ణమ్మ పెదవులపై చిత్రింపబడి వుండేది. అది మనోరమ గ్రహించలేకపోలేదు.

శ్రావణమాసం శుభ ముహూర్తమున రామబ్రహ్మనికి పునస్సంధాన మహోత్సవము జరపడానికి నిశ్చయించేరు. హిందువులలో యిదివరకటి యాచారం. సోమిదేవి లగాయితు నవమాసాలు నిండిన నవవధువు వరకూ—గ్రామంలోవున్న వాళ్లంతా—తా మిదివరకెన్నడూ ఎరగినట్టు అక్కడకు వచ్చి వాలేరు. పూర్ణమ్మను బాగా సింగారించి లోపలకు పంపేరు. తరువాత...... పేరంటాళ్లు చల్లగా జారుకున్నారు. ఇంకా జాలిగుండెగలవాళ్లక్కడే వున్నారు, తలుపు నాశ్రయించుకొని. పూర్ణమ్మ సంకల్పించుకొనుటకు, కాదుకాదు సంకల్పించుకొనిన ఆశయము పూర్తిచేసికొనుటకు, ఆమెకు కలిగిన ప్రథమావకాశమిదే.

గర్భాదానం గదిలో వధూవరు లిద్దరూ దశరథుడు కైక లయ్యేరట. మోహాలాల సుప్తైనని పాదాలమీద వ్రాలిన భర్తను లేవనెత్తి మంచమ్మీద కూర్చోబెట్టి పూర్ణమ్మగారు [illegible].

"మీరు నన్ను శరీరసౌఖ్యంకోసం పెళ్లాడేరా లేక మరో [illegible] సంబర[illegible]?"

"— శ[illegible] కూడాను. [illegible] అడుగుతావే?"

"మంచిది, నిజము చెప్పండి దేనికి ప్రాధాన్యమిస్తున్నారు మీరు?"

"దేహ...శక్తి...కాదు కుటుంబ... ఊహాలు...[illegible]ంగాగ్యానికీ."

"మీ సుశీలాదేవి చనిపోయిరి గదా? మీరు శ్రీశుకుడు కాలేదు ?"

"ఒక్కసారి కాగలనా?"

"అలాగయితే మనబిడ్డ మనోరమ వివాహమంటే ఏమిటో ఎరుగని చిన్నవయస్సులో వివాహితై అయి, దుష్కర్మవశాన బాల వితంతువై నంతి మాత్రాన ఒక్కసారి శ్రీశుకుడు కాగలదా? నాథా! మీకింత యింగితజ్ఞానము లేదా? నాతో సమాన వయస్కురాలగు మీ



మహిళాసారస్వతసంఘము, నర్సారావుపేట

ఇది శ్రీయుత యం. మానుమన్తరావుగారి యధ్యాపకత్వమున

హిందీనేర్చుకొనుచున్న బాలికల తరగతి



శ్రీమతి యం. హేమలతా యస్. చెట్టిగారు

మంగుళూరు కళాశాలా విద్యార్థిని. మద్రాసు విశ్వవిద్యాలయమందు యం. జె. సిహెచ్. యం. స్కాలర్‌షిప్‌ను పొందినది. శాస్త్రిములో తర్కమునందును చరిత్రమునందును ప్రసిద్ధురాలుగా కృతార్థురాలై పేరుగాంచినది.

చా॥ చి॥ ఆర్. వెంకోబరావు, శ్రీరంగము.



శ్రీమతి పాల్ లూయిస్ సతి

కొచ్చినులో నూతనస్థాపితమగు కేతలిక్ సమతికి అధ్యక్షురాలు. చా॥ చి॥ ఆర్. వెంకోబారావు. శ్రీరంగం.

కూతురు ఇంటిలో ఒకమూల విధవయై కూర్చుండగా మీరు రెండవ పెండ్లాన్ని కట్టుకొని ముచ్చటలాడగలుస్తున్నారా? ఇది అన్యాయమని, స్వార్థమని, మీయంతరాత్మ మీకు బోధించడం లేదూ? ముక్కుపచ్చలారని పసికూనే, కనికరము లేదా? మీ సౌఖ్యమే మీదా?"... అని తలవాచేటట్లు చివాట్లు పెట్టిందట.

"మరిప్పుడు నన్నేమి చేయమన్నావు అన్నాడు రామబ్రహ్మం."

"నేను క్రొత్తదేమీ చేయమనను. మీరు చేసినదే చేయుడు."

"ద్వితీయ వివాహమా?"

"అవును. అదియే. అందుకొరకే నేనుకోరి మమ్మి వివాహమాడినది. మీరు చేయగిలిగితే చేయుడు. లేకపోతే నన్నుకూడా వదలివేయుడు. నేనింతవరకూ పవిత్రురాలనే. అది తేల్చుకొనేవరకు మీరు నన్నంటకుడు." అని గదితలుపు భార్లాపెట్టి చరచర వెళ్లిపోయింది పూర్ణమ్మ.

x

ఆలోచించాడు రామబ్రహ్మం. బుద్ధిమంతుడు, యోగ్యుడుఅవుటచేతనో, లేక తప్పదనో మనోరమకు వివాహం చేయ నిశ్చయించుకున్నాడు.

పూర్ణమ్మ మనోరమదగ్గరకు వెళ్లి "అమ్మాయి! దుఃఖించకు నీవు పతిలేని విధవవు; నేను పతివున్న ......"

"వద్దు,వద్దు. అంతమాటవద్దు. రేపే నేను వరాన్వేషణకై బయలుదేరు తున్నాను" అని అంటూ రామబ్రహ్మం అక్కడకువచ్చి చేరేడు. పూర్ణమ్మను ఒకప్రక్కకు దీసుకున్నాడు. మనోరమను ఒకప్రక్కకు తీసుకున్నాడు. అమ్మాయీ !!!

ఈశుభవార్త దేశంలో నాల్గుమూలలకు అందచేద్దామని అంతవరకూ స్తబ్దుడై చూస్తూన్న వాయుదేవుడు నూతనోత్సాహముతో మేలవించిన జవసత్వాలతో హోరుమని పోవుచున్నాడు. పుష్పవృష్టిలా చిటపట చినుకులు పడుతున్నాయి........

చూచేరా, వందమంది చేయించలేని పని ఒకచిన్న నవయువతి చేయించిందంటే, స్త్రీ తత్వమంటే యిదేమరి. స్త్రీ తలచుకొన్న ఏ పనైనా యింతే? అందుకే స్త్రీ వినా పురుషుడు శరీరం లేని ఆత్మలాంటివాడు.



# ప్రాజ్ఞప్రేమ

శ్రీమతి వేమూరి జ్ఞానాంబగారు

కులమును గోత్రమున్ మిగులగొప్పవటంచును ప్రాజ్ఞుఁడెన్నఁడున్
బాలతిని భార్యగాఁబడయఁబూన కమంచిగుణంబు రూపమున్
గలిగినకన్యనేవలచి కాంతగగైకొను గంధరూపముల్
గలుగుగులాబిపూవు నిల గంటకమధ్యజఁ గౌరవింపరే.

# " భిక్షు "

" సీతారామచతుర్వేది. "

కృష్ణానది యొడ్డున ఒక పురాతన వటవృక్షపు నీడాగర్భంలో మల్లికేశ్వరుని పురాతన మందిరము ఆప్రాంతంలో కాశీవిశ్వనాథుని పవిత్రమందిరం కన్నా ప్రాముఖ్యత వహిస్తూవుంది. విద్యావంతులగు పూర్వులు స్థలపురాణాల్లో ఇట్లా వర్ణించారు.

"కాశీలోని విశ్వనాథుడు జనరొదచే తన నిశ్చల తపోసమాధులకు భంగం కలగటం మాచి, తనఛాయ యగుపార్వతితో అనుకూలప్రదేశం కొరకు ప్రపంచం అంతా తిరిగి, చివరకు ఈ అరణ్యంలో ప్రవేశించి, పరిసరములకు ముగ్ధుడయి, తన మహాతపస్సు ఇచ్చట నిర్విఘ్నంగా జరుగగలదని యెంచి, నిలిచిపోయినాడు" అందుచేతనే చుట్టుపక్కల్లోని పల్లెజనులు, పండితపామరసహితంగా, ఆ అరణ్యాన్నికూడా మహా పవిత్రమైనదానిగా భావిస్తారు. విశ్వనాథుని తపస్సుకు మళ్లా ఎక్కడ భంగం కలుగుతుందో అని వెరచి ప్రజలు ఆ మందిరంలో వుత్సవాదులు సలుపరు. నిశ్చలధ్యానసమాధులకే వుపయోగిస్తారు ఆ దేవగృహాన్ని.

ఆ మందిరావరణంలో ఒక మూల ఒక స్ఫటిక శిలావేదిక, ఆ వేదికమీద ఒక తులసికోటవుంది. చుట్టూ అలంకారప్రాయంగా మధ్యాహ్నపు మల్లె మొక్కలు, నందివర్ధనపుచెట్లు, మల్లెపొదలు, మందారచెట్లు, కొంచెందూరంలో పారిజాతపు చెట్టు, వికసించి తమ సౌరభాన్ని ఆ ఆవరణంలో అంతట వెదజల్లుతూ వున్నాయి.

ఆ మందిరంలోని ఘంటారవం, శంఖనాదం, పరిసరపు మహారణ్యాన్ని చీల్చుకొని చుట్టూవున్న పల్లెల్లో ప్రవేసించి సంసారసముద్రంలో వూపిరాడక కొట్టుకుంటూ వున్న సాంసారికుల సమస్తధ్యానాన్ని, తమవైపు లాగుతూ వారల ఏమరుపాటును పారదోలుతూ వున్నాయి.

ధ్యాన సమాధుల్లో లీనులయి వున్న ఆ పురాణ దంపతులకు అవసరాదులను దీర్చు సేవకుడు సంసారత్యాగి యయిన ఒక వృద్ధ సన్యాసి. తనసేవకుడు గూడా తనలాంటి సన్యాసియే యని ఎంచి సంతృప్తితో, నిశ్చింతతో ధ్యానసమాధిలో లీనుడయి పోయినాడు మహేశుడు. తన భర్తయొక్క సంసారపు భయానికి నవ్వుకొని వృద్ధభక్తుని సేవలో ఆనంద సమాధిలో లీనమయి పోయింది లోకజనని.

ఒకనాటి ఉదయం, సంసారత్యాగి అయిన ఆ వృద్ధసన్యాసి ఒళ్లో, వసంతుని మందమారుతంలో కొట్టుకొనివచ్చి పడ్డాడు ఒక పసిబాలుడు. ఏహ్యాభావంతో కిందికి నెట్టాడు ఆ సంసారపు పిరికి. శిలాఘాతితబాధచే కెవ్వుమన్నాడు ఆ పసిపాపడు. తల్లియొక్క ఆనంద సమాధికి భంగం కలిగింది. ఆ బాలుని రోదనము మాతకు హృదనలమయింది.

తల్లి సమాధిభంగాన్ని గ్రహించాడు వృద్ధసన్యాసి. తలయెత్తి తల్లి కళ్ళల్లో చూచాడు. ప్రేమామృత వీచికలు చెలరేగే జనని నేత్రాల్లో ప్రళయాగ్నిని అనుభవింపసాగాడు ఆ సన్యాసి. అతని హృదయం కంపింపసాగింది. ఒణుకుతూవున్న జీర్ణ హస్తాలతో ఆశిశువును మళ్ళా గ్రహించాడు. తల్లి నేత్రాల్లోని ప్రేమామృతంలో మళ్లా స్నానమాడాడు ఆబాలుని సహితంగా. "సంసారానికి వెరచి నీవు ఎంత దంవ్వు పరుగెత్తుతావో, మోక్షం గూడా నీనుండి అంతే దూరమవుతుంది. మోక్షం ప్రేమలోవుంది. ఆప్రేమ సంసారంలోనే లభ్యం. ఈ వృద్ధాప్యంలో నీ కీఅవకాశం కలిగింది. ఇట్టి అమూల్యమయిన అవకాశం కొరకు మళ్లా నీవు ఎన్నిజన్మాలెత్తాలో" అన్నది తల్లి అతనిహృదయంలో.

"తల్లీ నాఅజ్ఞానానికి క్షమించు" అన్నాడు కంపిత స్వరంతో.

ఆపసిబిడ్డడు బాలచంద్రునిభాతి దినదినాభి వృద్ధిజెంది, పౌర్ణమినాటి చంద్రుడయి, విద్యావినయ సంపత్తిలో కుబేరుడయి, పవిత్రతేజస్సునందు పురాణ

దంపతులకు ముద్దుబిడ్డడయి, వృద్ధసన్యాసి హృదయంలోని ఆనందసముద్రానికి సుధాకరుడయి ఇరువది సంవత్సరములు గడిపాడు.

ఆవృద్ధ సన్యాసియు తనవయస్సువంతా వెచ్చించి, దీర్ఘతపోసమాధులచే సంపాదించిన విద్యను, జ్ఞానాన్ని బాలజోగిపరంజేసి నిశ్చింతతో "తల్లీ ధన్యుడను. చిరకాల ఆకాంక్షితమగు మోక్షద్వారము నాకు దారి దొరికినది. ధన్యోస్మి, ధన్యోస్మి" అంటూ జగజ్జనని పవిత్రతేజంలో కలిసిపోయినాడు.

పల్లెల ప్రజలందరికి ఇప్పుడు బాల జోగియే గురువు. అతడే ఉపదేష్ట. తన విశాల విజ్ఞానమహిమచే, తన పవిత్రభావ పరంపరలచే, ఆప్రజల కందరికి పూజ్యుడయి, శరీరధారుడయిన మల్లికేశ్వరుడయినాడు.

ఆ బాలకుని జన్మయెట్టిదో, ఎక్కడనుండి మందమారుతుడు ఆ బాలకుని గొనివచ్చి, ఆ వృద్ధ సన్యాసి ఒళ్ళో జారవిడచాడో, ఆప్రజలకు తెలియదు. వారికి తెలిసిందల్లా ఆ బాలజోగి పురాణదంపతుల సాంసారిక తపస్సుయొక్క మహాఫలమనియే, వారల ముద్దుబిడ్డడనియే. దాననే ఆబాలజోగికి ఆ ప్రజలు పార్వతీపుత్రుడని నామకరణం చేశారు.

అతని మహిమ పల్లెల్ని దాటి మహానగరాల్లో ప్రవేశించింది. తండోపతండాలుగా వస్తూవుండే వాళ్లు పండిత పామరులు అతని దర్శనంకోసం. అతని పవిత్రతేజానికి ముగ్ధులయి పొయ్యేవాళ్లు. ప్రతివ్యక్తిని ఆకర్షించేది అతని ముఖవర్చస్సు.

విజ్జలదేవి కర్ణుని ఏక పుత్రిక, ఆంధ్రమహాసామ్రాజ్యానికి భావిచక్రవర్తిని విజ్జలదేవి విజ్జలదేవియే. ఆకాలంగో తన జీవితకుసుమాన్ని వెదుకుతూ వుండేవి.

ఒకనాటి వుదయం పవిత్ర కృష్ణవేణిలో స్నానమాడి, రత్నఖచితమయిన స్తనవల్కలంతోను, సరిగంచు ధోవతితోను, వల్లెవాటుగా వేసుకున్న వుల్లిపొరలాంటి వుత్తరీయంతోను, స్వామిపూజార్థం పుష్పాల్ని సేకరించుకొని, నిండుభక్తితో మందిరావరణంలో అడుగుపెట్టింది. ఆ మందిరప్రవేశం ఆమెకదియే ప్రథమం. ప్రశాంతమగు ఆమందిరపు పరిసరములు, ఆమెహృదయాన్ని హరిణింజేసినవి. ప్రభాతమలయానిలంతో సయ్యాటలాడి పాడింది ఆ హరిణి. ఆ సయ్యాటల్లో అలసిన ఆమెహృదయం, తన ద్వాగద్వయంలోంచి వెలువడే కాంతులమీద తేలియాడుతూ తులసిమంటపంమీద ధ్యాననిమగ్నుడయిన బాలజోగిమీద వాలి సేదదీర్చుకో సాగింది.

ఆ బాలయు, పరిసర ప్రభావంలో తన్నుమరచి, తన అస్తిత్వాన్ని మరచి చూపుల్లోని దప్తియయి వాయువులోనిసౌరభమయి, ప్రభావంతుని అరుణకాంతియయి, ఆ బాలసన్యాసిప్రకాశంలో లీనమయి, మందమారుతుని వాహనంమీద ఆ బాలజోగిని సమీపించింది. ఆ బాలజోగి ముఖకాంతుల్లో లీనమయిన ఆమె నేత్రకాంతుల్ని, సేదదీర్చుకొనుచున్న హృదయాన్ని చలింపనీయక పరమేశ్వరుని ధ్యానంలో లీనమయింది ఆ బాల. ప్రకృతి తన కళానైపుణ్యానికి గర్వించి పోయింది. అరుణభానుడు వెనుకటి కథజ్ఞప్తికిరా చిరునవ్వు నవ్వాడు. వసంతుడు తనస్నేహితుణ్ణి ఎలుగెత్తి పిలువసాగాడు.

నాటినుండి ఆబాల ధ్యానపటిమను, నిశ్చలత్వ మహిమను పరీక్ష సాగింది.

ఒకనాటి ఉదయం బాలజోగి సమాధి చలించింది. కళ్లు విప్పిచూచాడు. చూపులు చలించినయి. మళ్లా కళ్లు మూతలుపడలేదు. ప్రయత్నించాడు. విఫలుడయినాడు. తల్లిసేవకు వెళ్లిపోయినాడు.

ఒకనాటి వుదయం బాలజోగి ప్రశ్నించాడు.

"బాలా నీ వెవరు?"

"భిక్షుకురాలను"

"ఈ నిర్జరారణ్యంలో నీకు భిక్ష ఎక్కడ లభ్యమవుతుంది?"

"జనారణ్యంలో అలభ్యం నాఆకాంక్షితం"

మరురొకనాడు గంభీరంగా

"బాలా!"

"దేవా!"

"నీకు భిక్ష ఇక్కడ లభించదు. ధనసమృద్ధమయిన నగరాన్ని చేరుకో"

"నా కల్పవృక్షం పవిత్రమయిన ఈసుందరి చ్ఛాయలో నేవుంది."

జోగికి ఏమీ తోచలేదు.

ఎన్నోమారులు ఆమె ముఖాన్ని చూచాడు. సంపూర్ణవికసిత మందార కుసుమాన్ని పరికించాడు. వాటి రెంటిలోని భేదం అతనికేమో అర్థంకాలేదు. అవి స్థావరము, ఇది జంగమము ఇదే అతనికి చివరకు అర్థమయిన భేదం. కాని అతనిహృదయం ఒక విచిత్ర భేదాన్ని అనుభవిస్తూవుంది. ఆ పుష్పసౌరభం బాహ్య పరిసరాల్లోనే ప్రసరితము, ఈకుసుమ సౌరభం అతని హృదయాంతర్గతంలోకూడా ప్రవేసించ సాగింది. కంపిత హృదయంతో తొలగి పోయినాడు

బాలజోగి నేడు తన హృదయంలో ఒక గొప్ప మార్పును అనుభవింపసాగాడు. అర్థంగాని బాధవొకటి అతని హృదయాన్ని ఆకస్మికంగా ఆక్రమించింది. హృదయం ఆ బాధను సహించలేక కంపింపసాగింది.

బాలజోగికి నేడు నిత్యనైమిత్తికములమీద ధ్యానములేదు. మామూలుప్రకారం ప్రేక్షకుల సమక్షంలో గీతాపఠనమీద మనసులేదు. మాతయొక్క నిత్యసేవను గూడా మరచాడు. దినమంతా అర్థంకాని అగ్నిలో మగ్గిపోయినాడు.

చండభానుడు, తన హృదయేశ్వరిని కౌగిటగ్రుచ్చి యెత్తి శాంతస్వరూపాన్ని దాల్చాడు. చిరకాలం క్రిందట చదివి విడిచిన కాళిదాసును చేగొని శకుంతలోపాఖ్యానాన్ని జేరుకొన్నాడు బాలజోగి.

నాడు అర్థంగాని కాళిదాసు నేడు ఒలిచిన అరటిపండయినాడు.

ఒక్కొక్కశ్లోకం చదువసాగాడు. హృదయం వికసించసాగింది. ఒక్కొక్క శ్లోకాన్ని ఎన్నో మారులు పఠించాడు. హృదయం మత్తెక్కసాగింది. యక్షుడు, తనమంత్రంతో బాలజోగి హృదయాన్ని మయూరంచేశాడు. మయూరం నాట్యంసలుపసాగింది. మేఘసందేశాన్ని మూసి హృదయసందేశాన్ని వింటూ మందార కుసుమాన్ని తదేకధ్యానంతో తిలకించసాగాడు.

బాలజోగి హృదయంలో విప్లవంచెలరేగింది అతనికి ఈవిచిత్రప్రణయానికి కారణం అర్థంకాలేదు. విప్లవస్వరూపమే బోధపడలేదు. మత్తెక్కిన హృదయపు పలుకులు స్వస్వరూపంతో భావాన్ని తెలపలేక పోయినవి.

చుట్టూ కారుమేఘాలావహించినయి గొప్ప తుపాను చెలరేగింది. కారుమేఘాల గుంపులు ఒకదాని స్థానాన్ని మరొకటి ఆక్రమించి అతని నేత్రముల ద్వారా వర్షించసాగినయి. మళ్ళా ఒక్కమారు మారుతుడు వీచాడు. మేఘాలు చెదరి పోయినయి. భారం తగ్గింది. హృదయం ప్రకాశించింది. అరాళకచముల మధ్య ప్రకాశించు రాజకుమారి ముఖబింబాన్ని స్ఫురింపజేయసాగింది నీలాకాశంమీది చంద్రబింబం. ప్రేమ సముద్రాన్ని ఉప్పొంగించు ఆ చంద్రికలకు ముగ్ధుడయి పోయినాడు. పరిసరారణ్యంలోని పక్షుల కలకలారవము, రసాలవృక్షంమీద కోయిల కూతలు, దానిమ్మచెట్లమీద చిలుకల పలుకులు, మందమారుతము, పరిసరముల పుష్పసౌరభం, ప్రియుని ఆగమమున కుప్పొంగి అతనికౌగిలింజేరి ఆనందింప ఉద్యమించి పాపిష్టిసిగ్గు అడ్డగింప, తలుపుచాటునుండి, తమప్రియుని, హృదయంలో ఆనంద తరంగము లెగయ, తొంగితొంగి మాచు నూతనవధువుల స్ఫురింపజేయు పారిజాతచ్ఛాయల దాగిన మనోనాథుని నిక్కినిక్కిజూచు తారకాగణము, అతనిహృదయంలో ఎన్నడూ అనుభవింపని రాగాన్ని, బోధపడని భావాల్ని, అర్థంకాని ఆనందాన్ని చెలరేపినయి.

ఉత్తేజమయిన హృదయాన్ని అణపజాలక ఉన్నురంటూ తులసికోటకు చేరగిలబడి సుఖస్వప్నంలో లీనమయినాడు.

ఉష్ణకిరణ ప్రసారంతో ఆ బాలజోగి కన్నులు విప్పాడు. ధ్యానసమాధిలో ప్రకాశించింది రాజకుమారి.

బాలజోగి అదరి పడ్డాడు.

"బాలా" అని పల్కాడు గంభీరంగా.

"దేవా" అంది రాజకుమారి ఉలికిపడి.

బాలజోగిముఖంమీద గంభీరతకు కంపించింది రాజకుమారి.

"నీవు ఇటనుండి ఇచటికి రాజనదు"

"ఏలస్వామీ!"

"నీకు భిక్షు ఇక్కడ లభించదు"

"............ ..........."

"నీకోరిక దుర్లభం"

"పవిత్రహృదయంలోని కోరిక ఎప్పుడూ దుర్లభంకాదు. తపోశక్తిని దుర్లభం ఎప్పుడూ తేరిచూడలేదు"

రాజకుమారి కంఠంలోని గంభీరతకు బాలజోగి అదరిపడ్డాడు.

"నీసమక్షం నా ధ్యానసమాధికి భంగం కలిగిస్తూవుంది"

బాలజోగి కంఠం వణకసాగింది. నేత్రాలు అశ్రువుల్తో నిండిపోయినయి.

"నిజమా!" అంది రాజకుమారి. హృదయంలో ఉప్పొంగే ఆనందతరంగాలమీద తేలియాడుతూ, ఆనందాశ్రువుల్లో కరిగిపోతుందా అనిపించింది బాలజోగికి.

శాంతి హృదయంలో అశాంతి వీచికలను చెలరేపి, ఆ వీచికలమీద తనివిదీర ఉయ్యాలలూగి నిష్క్రమించింది రాజకుమారి.

విరాగిహృదయం సరాగమయింది. అతనిహృదయంలోని శాంతిసముద్రమధ్యమున అగ్నిపర్వత మొకటి ఉత్పన్నమయింది. దానిగర్భంలోంచి వెలువడే జ్వాలలవలన పరితప్తమయిన హృదయసముద్రము ఆవిరిఅయి, నేత్రద్వారమున అశ్రురూపమున ప్రవహింప సాగింది. ఎన్నియో రాత్రులు ఆ వేడిమిని భరింపజాలక నిర్జరారణ్యమధ్యమునకొచ్చి ఎలుగెత్తి ఏడ్వసాగాడు. మాతపాదములపైబడి దుఃఖింపసాగాడు.

"కుమారా! నేను నీబాల్యమునకే మాతను, నీ యౌవనమునకు నాయొడిశాంతి నొసంగజాలదు. నీకు యౌవనమున మాతృస్థానము వహింప ఆమెయే అర్హ. ఆమె కౌగిలి నీకు శాంతి, ఆనందప్రదాయిని. ఆమె ప్రేమయే నీకు మోక్షద్వారము" అని తల్లి ప్రకృతి రహస్యము నుపదేశించింది.

నేడు బాలజోగి భిక్షార్థం ప్రథమపర్యాయం నగరుకొచ్చాడు. నగరప్రదక్షిణ మెన్నియో మారులు సలిపాడు. రాజవీధులధూళినంతయు నెగురగొట్టాడు. భవనములన్నియు ఘూర్ణించాడు. కాని అతనిజోలె మాత్రము నిండుకొనియే యున్నది.

అత డేగృహముముందును నిలువలేదు. ఏభవనము ముందును భిక్ష నర్థించలేదు.

సూర్యభగవానుడు సంధ్యాదేవి కవాటమును గొట్టాడు. బాలజోగి రాజనగరుకొచ్చాడు.

ద్వారపాలకులు నిండుభక్తితో అతన్ని సమీపించారు.

"తేజస్వీ, లోనికి దయచేయుడు."

"ఏల!"

"భిక్షార్థం"

"భిక్షు నెవరొసంగుదురు?"

"రాజకుమారి!"

"రాజకుమారియా?"

"అవును రాజకుమారియే, ఆంధ్రసామ్రాజ్యాధినాథుండగు కర్ణమహారాజు ఏకపుత్రిక విజ్జలదేవి"

"ఆమె భిక్షనొసంగునా?"

"చిత్తము దేవా"

"ఏమొసంగును!"

"సమస్తమును, ధనకనకవస్తువాహనాదులన్నిటిని. ఆమె దానవిద్యాపరతంత్రమానసి."

"భిక్షుకుల సమస్త కోరికలను దీర్పగలుగునా?"

ద్వారపాలకుడు కొంచెం ఆలోచించాడు. బాలజోగి నేత్రాలూ చూచాడు.

"దేవా, భిక్షుకుల యోగ్యతానుసారము, దానమొసంగుటలో ఆమె కడు నేర్పరి."

"ఎవరది, బాలజోగియా!"

..............................

"తలచని తలంపుగా దర్శనము! దేవా, ఇట్టి ప్రయాస నెట్లోర్చితిరి!"

"భిక్షార్థం"

"చిత్రం, ఇంతటి మహానగరాన్ని అర్థించినా మీజోలెయందు శూన్యతయే తాండవించుచుండెనా!"

"అవును"

"ఏల?"

"అర్హమగు దాత, యోగ్యమగు భిక్ష లభింపమియే"

"భగవానుడా, మీకుకూడా యోగ్యతాయోగ్యతల ప్రసక్తియేనా!"

"అయోగ్యత నర్థించిన హృదయం అపవిత్రం కాదా?"

"మీబోటి పవిత్రమూర్తులకు దాతలుకాగల అర్హులెవరులేరా?"

"రాజకుమారీ, నీవట్టి పుణ్యమును కట్టుకొనలేవా?"

బాలయోగిహృదయంలో ఆ వేగం ఎక్కువకాసాగింది. అశాంతహృదయంతో "దేవా, మీకు యోగ్యమయినపవిత్రభిక్ష నేనేమొసంగగలను?" అంది రాజకుమారి. "దేవీ, ప్రేమభిక్షకన్న పవిత్రభిక్ష ప్రపంచంలో ఏముంది?"

ప్రఫుల్లవదనంతో రాజకుమారి "ధన్యురాలను" అంది, హృదయావేశం అణచుకుంటూను.



## "తెలుగుబాసరో! నీకింకగలుగుశుభము" శ్రీమతి బి. సీతాలక్ష్మిగారు

ఉ॥ ఎన్నడొ మున్న మేటికవయిత్రులు నెందరొ మోహనాంగి వి
ద్వన్నుతలీల మొల్ల మధురవాక్కుల కావ్యకళాంగనై ఖ్యాతి౯
ఎన్నగ పూజసల్పి నను నెంతయు చక్కగ నాదరించిరా
క్రన్నన నేడునన్ను బలు గాడగ నేరరు కాంతలెవ్వరు౯

చ॥ అనుచును నింపెదేల తెను మమ్మరొ! నీదగుచింత మానుమా!
అనునయరీతి నీకు నగు నాదరమొప్పగ సేవజేయ నీ
తనయలు నిల్వరిప్పుడదు సుధావళి సుద్భవజేసితి చిన్నదా
మనమున నిల్పికొల్తు రదె మానము మానుము ఆంధ్రభాషరో.

గీ॥ నిన్ను బూజింప మనుముల నియతితోడ
కార్యరంగమున కుఱికె కాంతలెల్ల
విద్యలన్నియు నేర్చిరి వివిధగతుల
తెలుగుబాసరొ నీకింక గలుగుశుభము.

# ధైర్యము

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

ఆతఁడొకరాజు. ఆతఁడు చిరకాలమునుండి వ్యాధిపీడితుఁడాయెను. వారముదినములలోపల దుర్గకు నొక నరబలి యీయకున్న యాతఁడు తప్పక మరణించును. ఇది యాతని జాతకఫలము.

బలిపురుషునకు గావలసిన లక్షణములన్నియు నొకబీదకాపువాని సుతున కుండెను. హెచ్చుగా ధనమిచ్చి యాబాలుని రాజభటులు దమ యధీనము గావించుకొనిరి.

నియమితకాల మేతెంచెను. బలిపురుషుని స్నానముచేయించి శుభ్ర వస్త్రాలంకృతునిగావించి బలిపీఠమునొద్దకు గొనివచ్చిరి. రాజు మొదలు పూటకు గతిలేని బికారివరకు యచ్చట నిండిపోయిరి. బలివేయువ్యక్తి తళతళలాడు గండ్రగొడ్డలిని జేబూని యాతని కంఠముపై వేయ పైకెత్తెను.

అట్టితఱి నా బాలునివదన మోల్లాందునోగాంచ కుతూహలియై రాజు ముందున కేతెంచి యాతని మోము గాంచెను. ఆశ్చర్యము! నిమిషములో మృత్యుదేవతావదనగహ్వరమున ప్రవేశింపనున్న యా యర్భకునిమోమున చిరునగవు మెరసిపోవుచుండెను. ఆబాలుఁడు నిశ్చలవదనముతో బరమేశ్వరుని బ్రార్థించుచుండెను. రా జాశ్చర్యపడి బలివేయు వ్యక్తిని చేసన్నచే నిలిపి యాతని చిర్నగవునకు గారణమేమని యాడింభకు నడిగెను.

"ఓ రాజా! ఈ యావత్ప్రపంచమునను జీవికి తల్లిదండ్రులే యాత్మ బంధువులు. అట్టివీరలే క్షణభంగురమును నీచమునగు తుచ్ఛధనమున కాసించి నన్ను మృత్యుదేవతాధీనముగా గావించిరి. ప్రజల కష్టసుఖముల విచారించి వారికై తన ప్రాణము లడ్డువేయువలసిన రాజే స్వప్రాణరక్షణార్థమై నా ప్రాణములను దీయ సంకల్పించెను. రాజా! ఇక నన్ను గాపాడువారెవ్వరు? గాన దీనజనపోషకుఁడవగు నో యాపద్బాంధవా? నీవే నాకిక దిక్కని యా కమలాక్షుని బ్రార్థించుచుంటిని. అట్టితఱి నాకు నగవురాకుండ నెట్లుండును." ఇది యా బాలుని ప్రత్యుత్తరము.

నిమిషములో ఆ రాజు మనము కరుణారసముతో నిండిపోయెను. తుచ్ఛప్రాణములకై ఇంతటి ధైర్యసాహసాదులుగల బాలుని జంపింప నాతని మనస్సంగీకరింపలేదు. బలి యాపివేయబడెను. అదృష్టవశముచే రాజు వారము దినముల వెనుక గండముతప్పి యారోగ్యవంతుడై చిరంజీవియాయెను.

# వేదకాలపు స్త్రీలు

జటావల్లభుల పురుషోత్తముగారు, బి. ఏ.

కొంతధనముపై నొకరికి స్వత్వము కలుగవలెనన్న నది మూడుమార్గములచేత జరుగవచ్చును. (1) పిత్ర్యమగు గాని యితరమగు గాని యాస్తిగాని యందలి యొకభాగము కాని సంక్రమించుటవలన (2) ఉద్యోగము మున్నగువానిచేత ధనము నార్జించుటవలన (3) బంధుమిత్రాదులు ప్రేమచేతను సాంఘికమర్యాదల ననుసరించియు నొసగు కట్నములు, కానుకలు మొదలగువాని వలన.

(1)ఇందు మొదటి మార్గముచేత ఋగ్వేదకాలము నాటి స్త్రీలకు ధనమేమైనను లభించుచుండెనా? యను విషయమును విచారింతము.

కుమారులతో బాటు కుమార్తెలకు నాస్తి సంక్రమించునాచారము వేదకాలములో లేదు. అనగా స్త్రీలకు దాయభాగములేదు. ఈవిషయము తై, సం॥ లో స్పష్టముగ జెప్పబడినది. అది యీక్రింది విధముగ నున్నది.

నసోమోనాతిష్ఠత స్త్రీభ్యోగృహ్యమాణస్తం
ఘృతం వజ్రం కృత్వాఘ్నంతం నిరింద్రియం భూతమ
గృహణం తస్మాత్ స్త్రీయో నిరింద్రియా అదా
యాదీః॥ (తై. సం॥ 6, 5, 8, 2)

అర్థము:—దేవపత్నులు సోముని పట్టుకొని యొక పాత్రయందుంచిరి కాని స్త్రీలచే పట్టుకొనబడుటను సహింపలేనివాడై యాతడందులో ప్రవేశించియు కూడ స్వప్రకాశమును కన్పరుపలేదు. అంత నా స్త్రీలు ఆపాత్రలోనున్న ఘృతమును వజ్రముగాజేసి సోమునికొట్టిరి. అందువలన నాతడింద్రియరహితుడాయెను. నాడా స్త్రీలింద్రియరహితుడైన సోముని గ్రహించినారు కావుననే లోకములోని స్త్రీలింద్రియరహితలైనారు. వారికి దాయభాగము లేకుండుటకు కూడ నదియే కారణము.

స్త్రీలింద్రియరహితలగుటవలన వారికి దాయభాగము లేదని చెప్పుటలో కొంతకారణ ముండవచ్చును. ఏమన ధనముకలవారు దానిని రక్షించుకొనుటకు తగినశక్తి కలవారుగ నుండవలెను. మరియు నింద్రియరహితలకు స్థిరచిత్తతయు నాలోచనశక్తియు తక్కువగనుండును. అందుచేత వారికి ధనమును రక్షించుటకేకాక వ్యయపరచుటకు కూడ తగిన సామర్థ్యముండదు.

స్త్రీలకు దాయభాగము లేకుండుటకు మరియొక కారణముకూడ వేదములలో చెప్పబడియున్నది. అది పితరులకిచ్చు పిండదానమునకు సంబంధించినది. అపరకర్మలు చేసిన యనంతరము పిండదానమును చేయువారికీయాస్తి సంక్రమింపవలెనని వేదముయొక్క యభిప్రాయము. ఇహలోకమున తమకు సేవజేయువారికంటె మరణానంతరమున నీళ్ళను వదలువారే యెక్కుడు సన్నిహితులును నాప్తులునని మన ప్రాచీనుల యభిప్రాయము. కావుననే సమస్తసౌఖ్యములను గలుగజేయు దాసదాసీవర్గంబెంతయున్నను వారు పుత్రులకయి పరితపించుచుండిరి, కుమార్తెకు పితృకర్మ చేయు నధికారములేదనియు పుత్రులును పౌత్రులును లేనప్పుడామె కట్టియధికారముండియుండవచ్చు ననియు ముందు స్పష్టపఱుపబడును. కావుననే కుమార్తెకంటె కుమారుడే ఆప్తుడును సన్నిహితుడును నుపకారియు నగుచున్నాడు. వానికే తండ్రి కృతజ్ఞతను చూపవలసియున్నాడు. ఆకృతజ్ఞత దాయభాగము నిచ్చుటయను రూపమున చూపబడినది. ఈ విషయమై యీక్రింది ఋక్కు చూడదగును.

నజామయే తన్వోరిక్థమరైక్చకార గర్భంసనితుర్
నిధానం యదిమాతరోజనయంతవహ్నిం మన్యఃకర్తాస
కృతోరన్య ఋంధన్॥

(ఋ. సం॥ 3-31-2)



శ్రీ పాండురంగ భజనసమాజము, కాటూరు, గన్నవరం తాలూకా

అర్థము:—ఔరసపుత్రుడు సోదరికి పిత్ర్యాగు ధనము నీయడు. అతడామెను భర్తయొక్క రేత స్సును ధరించుదానినిగాజేసినాడు. తల్లిదండ్రులు స్త్రీ పురుషరూపమగు సంతతిని కనుచున్నారు. ఐనను ఈ రెండుసంతతులలోను పురుషుడు పిండదానాదిక ములకు కర్తయగుచున్నాడు. స్త్రీ సంతతి వస్త్రాలం కారాదులచే పూజింపబడునదై యగుచున్నది.

స్త్రీ సంతతి పితృకర్మజేయుట కనర్హాము కావు నను నాడె బాధ్యతను విహించుటకు భర్తయను వాడొకడేర్పఱుపబడియున్నాడు కావునను నామెకు దాయభాగమీయ నవసరములేదని పైవాక్యములవలన తెలియుచున్నది.

దీనినుండి సహజముగ నొకప్రశ్న బయలువెడ లును, 'ఋగ్వేదకాలమున వివాహము లేకుండగనే కొందరు స్త్రీలు నిలచియుండిరిగదా, వారి బాధ్య తను వహించుటకు భర్తలేదుకదా, కావున వారికి దాయభాగము నీయవలసిన విధి తండ్రికిలేదా'యను నదియే యీప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానము ఋగ్వేదములో చెప్పబడియే యున్నది. పెండ్లికాని స్త్రీలకు తండ్రియాస్తిలో నుండి కొంతభాగము నిచ్చుట యానాడాచారముగనుండెను. కుమారు లతో సమానమగు భాగము అట్టి కుమార్తెలకు తండ్రి యిచ్చెడివాడో లేక తనయిచ్ఛను పుత్రులయొక్క యిచ్ఛనుబట్టి యెంతోకొంత యిచ్చెడివాడో చెప్ప లేము. గాని యింతభాగ మామెకిచ్చితీరవలెనను నియమనుమాత్రము లేదు. ఎంతయిచ్చినను గూడ దయాధర్మ భిక్షముగనే యిచ్చెడివాడని తెలియు చున్నది. ఏమనగా అవివాహితయగు కుమార్తె తండ్రి నుండి భాగమును యాచించుచున్నదని ఋగ్వేద ములో నున్నది. పైవిషయములన్నియు ఈ క్రింది మంత్రమువలన తెలియుచున్నవి.

"అమాజూరివపిత్రోస్సచా సతీసమానా దాస దసస్త్వామియేభగం."

(ఋ. సం॥ 2-17-7)

అర్థము:—ఓ యింద్రుడా యావజ్జీవము గృహ మందే జీర్ణించుచు తల్లిదండ్రులతోనుండి భర్తను పొందలేని కుమారిత తనకును తండ్రికిని సామాన్యమైన గృహమునందే యుండి యాతనిధనములో భాగము నెట్లు యాచించుచున్నదో యట్లే పొందదగిన ధనము కొరకు నిన్ను నేను యాచించుచున్నాను.

అన్నదమ్ములులేని స్త్రీకి తండ్రియాస్తిలోని భాగమువచ్చెడిదని చెప్పుటకు వీలున్నది. అథర్వసం హితలో నిట్లు చెప్పబడియున్నది.

అమూర్యాయాన్తి యోషితోహిరాలోహిత వాససః। అభ్రాతర ఇవజామయ స్తిష్ఠన్తుహతవర్చసః॥

(అ. సం. 5-4-17-1)

అర్థము:—ఈ స్త్రీయొక్క యొజ్ఞని రజోవా హకనాడులు నిర్వీర్యములై కదలక నిలచియుండు గాక! ఎట్లన: అన్నదమ్ములులేని స్త్రీ పుట్టింట నిలచి పోవునట్లు.

సాయణాచార్యులు అన్నదమ్ములులేని స్త్రీ పుట్టింట నేల నిలువవలెనను ప్రశ్న వేసికొని సంతా నము కనుటకును పిండదానాదికముకొఱకును నని చెప్పుచున్నారు. పిండదానాదులు చేయువానికే యాస్తి సంక్రమింపవలెనని పైన చెప్పబడినదిగదా! కావున నభ్రాతృస్త్రీకి తండ్రియాస్తి వచ్చెడిదని తేలుచున్నగి.

కుమార్తెకు తండ్రియాస్తిలోని భాగము వచ్చుట విషయమైన చర్చను చాలించి వితంతువుకు భర్త యాస్తిలోని భాగమువచ్చెడిదా యను నంశమును చూతము.

దాయేవపత్యే ఉశతీనువాసా
ఉషాహ్రసేవనిరిణీ తేఅప్సః॥

(ఋ. సం. 1-124-7)

అర్థము:—వితంతువు తన ధనమును పొందుటకు న్యాయస్థానమునకు వెళ్లునట్లు ఉషాదేవత ఆకాశము పైకి వెళ్లుచున్నది.

దీనింబట్టి వితంతువుకు భర్తయాస్తిలోని భాగము వచ్చుట యానాడుండెననియు తెలియుచున్నది. తన ధనమును పొందుటకు వితంతువు న్యాయస్థానమున కేగుచున్నదని యిచ్చట చెప్పబడుటచేత భర్తయాస్తిలో నెంతభాగ మీమెకు రావలయునో యను అంశము తరచుగ వివాదాస్పదముగ నుండెననియు, పరిస్థితులనన్నిటిని నాలోచించి యెప్పటికప్పుడే యీవిషయము నిర్ణయింపబడుచుండెడిదనియు ననగా పోయిన భర్తకు సోదరు లెందరుండిరో భార్య లెందరుండిరో మున్నగు నంశములనన్నిటిని నాలోచించి యీ వితంతువున కెంతయాస్తి రావలెనో యను నంశమును న్యాయస్థానమున పరిష్కరింపబడుచుండెనని యిందువలన తెలియుచున్నది. అనగా నేడు పుత్రులు లేక సమిష్టికుటుంబములో నుండగనే భర్త మరణించిన వితంతువుకు యింతభాగము రావలెనను నియమము లేక తరచుగా పెద్దమనుష్యులో న్యాయస్థానమువారో పరిస్థితుల నన్నిటిని నాలోచించి యెట్లు మనువృత్తిని నిర్ణయించుచున్నారో యించుమించుగ నట్లే యానాడును నుండెనని మన మూహింపవలసియున్నది.

ఇక స్త్రీలు కష్టపడి ధనము సంపాదించుట ఋగ్వేదకాలములో నుండెనా యను నంశమునకు వత్తము. గత ప్రకరణములలోనే యిది పరిష్కరింపబడినది. ఎట్లన:

రాజున కిరుప్రక్కలను స్త్రీలు భటులుగ నిలబడుట (ఋగ్వే 1-95-6) కూడ వేదకాలములో నుండెనని "స్త్రీలు బాహ్యప్రపంచము" అను ప్రకరణమున స్పష్టపరుపబడినది. అదికాక చర్మపుపనులు, లోహపుపనులు, చాపలునేయుట మున్నగునవి స్త్రీలు చేయుచుండిరని చెప్పబడినది. ఈ విధముగ సేవజేసి ధనము సంపాదించు స్త్రీలు స్వల్పసంఖ్యాకలగుటమాత్రమేకాక నిమ్నకులములకు చెందినవారైయుండెడివారనికూడ చెప్పవలసియున్నది. ఏమన నీ పేర్కొనబడిన వృత్తులట్టివే.

బంధుమిత్రాదు లొసగు నలంకారములు కట్నములు కానుకలు మున్నగు ధనమే వేదకాలమునాటి స్త్రీలయొక్క యాస్తిలో ప్రధానమైనది. ఎచ్చట చూచినను స్త్రీలు స్వర్ణాభరణములచే భూషితలైనట్లు కాన్పించుచున్నది. ఈ యాభరణములు తరచుగా పుట్టింటివారు పెట్టుచుండెడివే. కుమార్తె తండ్రి యాస్తిలోని భాగము నాశించెడిది కాదనియు వస్త్రాలంకారాదులనే తండ్రినుండి కోరుచుండెడిదనియు చెప్పుటకు చాల యాధారములున్నవి. పైన నుటంకింపబడిన "నజామయే" యిత్యాది ఋక్కులవలన యీసంగతి తెలియుచున్నది. మరియు వివాహమునకు పూర్వమందును, వివాహమందును వధువు అలంకారములచే భూషితురాలగుచుండినట్లు 'వివాహ' మను ప్రకరణమున స్పష్టపరుపబడినది. అంతియేకాక సాధారణముగ స్త్రీలాభరణములను ధరించు విషయముగూడ వేదములలో గలదు.

యథాహవై యోషాసువర్ణగ్ం హిరణ్యాం
పేశలంబిభ్రతీ॥ (తై. బ్రా. 3-34-5)

అర్థము:—స్త్రీ సువర్ణముచే చేయబడిన ప్రకాశించుచున్న నగలను ధరించినట్లు అను నొక యుపమానము వాడబడినది.

ఆడపడుచు నప్పుడప్పుడు పుట్టింటికి తెచ్చి వస్తురూపముగను వస్త్రరూపముగను మరియు నితరవిధముగను నేనో యామెకు ముట్టచెప్పుచుండుట వేదకాలములోకూడనుండెను తండ్రి జీవించియుండగ మాత్రమే కాక యాతని యనంతరముకూడ నామె పుట్టింటినుండి యీ లాభము పొందుచుండెడిది. తండ్రి లేనిచో సోదరుడే యామె నీవిధముగ గౌరవించెడివాడు. భార్యయొక్క సోదరునివలన నిట్టి లాభముండెడిని కనుక నే స్యాలుడు అనగా బావమరిది గొప్పదాతయని ఋగ్వేదములోను యజుర్వేదములోను చెప్పబడినది.

అశ్రవగ్ హి భూరిదావత్తరావాం
విజామాతురుత వాఘాస్యాలాత్॥

(తై. సం. 1-1-14-1)

అర్థము:— ఓయింద్రాగ్నులారా! మీరు చాల దాతలని నేను వినియున్నాను. అల్లునికంటెను బావమరది(భార్యయొక్క సోదరుడు) కంటెనుకూడ నెక్కుడు దాతలు.

పుట్టింటివారు ధనికులైన కొలదియు స్త్రీ కెక్కుడు సొమ్ము వారినుండి ముట్టుచుండెను. కావుననే పురుషునకు అత్తవారు ధనికులగుట యొక గొప్ప యదృష్టముగా భావింపబడుచుండెను. యజుర్వేదములో శుక్రాగ్రయణాగ్రములయొక్క వివాహ మొకచోట వర్ణింపబడినది. ఆపిమ్మట ఎవ్వడీ వృత్తాంతమును పూర్తిగా తెలిసికొనుచున్నాడో వాడు.

"పవశ్యసో వివాహ మాప్నోతి."

(తై. సం. 7-2-8-7)

అనగా "ధనికులకులమునుండి వివాహమును పొందుచున్నాడు" అని చెప్పబడియున్నది.

పైనచెప్పిన విషయమంతయు స్త్రీకి స్వంతమగు ధనమునకు సంబంధించినది. స్త్రీ ధనము విషయమై విచారించునపుడు మరియొక విషయముకూడ చెప్పవలసియున్నది. అదియే దన: భర్తకు స్వంతమగు నాస్తిలో స్త్రీ కేమాత్ర మధికారముండెడిదను విషయము. భర్తసొమ్మును భార్య యనుభవించుటలోను దానముచేసికొనుటలోను కుటుంబనిమిత్తమై వ్యయపరచుటలోను నేమైన స్వాతంత్ర్యమును కలిగియుండెనా లేదా యను విషయము ముఖ్యమైనది. ఏమన భర్తసొమ్ము అని చెప్పబడుదానిలో చాల భాగము భార్యచేతులలోనే యుండెను. క్రియలో నామెయే దానికి స్వామిని. ఈ స్వామిత్వ మామెకు కలుగుట సహజమే. ఎట్లన గృహమును గృహములోని పదార్థములును యథార్థముచేత భర్తవేయైనను భార్య వానిని తనవిగా భావింపనిచో నొక్కనిమిషమైనను సంసారము సుఖముగ నడువనేరదు. ప్రతియడుగునకును దానవ్యయానుభవాదుల విషయమై భర్తయొక్క యనుమతిని భార్య తీసికొనుచుండుట సాగదు. కావున భార్యయే గృహములోని సమస్త పదార్థములపైనను స్వామిత్వము వహింపవలసిన యావశ్యకత యేర్పడెను. కావున గృహములోని సమస్తమునకును, భార్యయే యజమానురాలను అభిప్రాయ మేర్పడెను. యజుర్వేదములో నొకచోట గృహములోని సమస్త పదార్థములకును భార్యయే స్వామిని యని స్పష్టముగ జెప్పబడినది. ఆసందర్భమేమన:—

యజ్ఞముకొరకై యజమానిగృహమునుండి యజ్ఞశాలయొద్దకు శకటముపై ఘృతపాత్రాదిద్రవ్యసమూహమును తీసికొని వెళ్లుదురు. ఆ పదార్థములను బండినుండి క్రిందకు దింపుటకు పూర్వము యజమానపత్ని యాశకటమును స్పృశింపవలెను. అట్లు స్పృశించుటలో అర్థమేమనగా: యజమానపత్ని ఆ ద్రవ్యమును యజ్ఞమునకై వినియోగించుట కనుమతి యిచ్చినదని. ఆమె యనుమతి యెందులకనగా ఆమె దాని కధికారిణిగదా!

"పత్నీహి పారీణహ్యస్యేశే"|

(తై. సం. 6-2-1-1)

అర్థము:—పత్నియే గృహమునకు సంబంధించిన ద్రవ్యమునకంతకును ప్రభ్వి.

భార్యకు గృహములోని ద్రవ్యమునకు స్వామినీత్వము కేవలము నామమాత్రముచే నంగీకృతముకాదని చెప్పుటకు కొన్ని యాధారములున్నవి. కొన్నిచోట్ల స్త్రీలు గొప్ప గొప్ప దానములు చేసినవారుగ చెప్పబడినారు.

"సనత్సాశ్వ్యం పశుముతగవ్యం శతావయం
శ్యావాశ్వ్య-స్తుతాయ యాదోర్వీరాయోపబర్బృహత్ ||

(ఋ. సం. 5-61-5)

అర్థము:—శ్యావాశ్వ్యనిచే స్తుతింపబడినట్టియు వీరుడైనట్టియు భర్తయొక్క ఆలింగనమునకై తన బాహువులనిచ్చిన తరంతుని భార్య గోసమూహమును, అశ్వసమూహమును, గొర్రెలను శ్యావాశ్వ్యనికొరకు (శ్యావాశ్వ్యుడను పేరుగల నాకొరకు) ఇచ్చెను. దీనింబట్టి స్త్రీ తన భర్తయొక్క ధనమును దానముచేసికొనుటకుగూడ నధికారము కలిగియుండెనని తెలియుచున్నది. అనగా భర్తయొక్క సొత్తును తనసొత్తువలెనే చూచుకొనుట కామె కధికారముకలదు. కావుననే నాటిస్త్రీలకు స్వంతముగ ధనము తక్కువయేయైననుగూడ సౌఖ్యమునకును తగుమాత్రము స్వాతంత్ర్యమునకును లోటు లేకుండెను.

మొత్తముపైన స్త్రీకి ధనము భర్తనుబట్టియే యుండెడిది. ఆతడు నిర్ధనుడైనచో నామెయు నిర్ధనురాలే. పిత్ర్యమగు నాస్తివచ్చుట ఉద్యోగముచేసి ధనము సంపాదించుట అనునవి చాలఅరుదుగనుండిన విషయములే. ధనవిషయములో భర్తతోబాటు మునుగుటయు తేలుటయు ననునదియే సామాన్యవిషయము.

(సమదర్శిని.)

# ముసలాంబ

విద్వాన్ పి. సుబ్రహ్మణ్యంగారు

౧

ధరసనంతపురముపొంత, వరలునొక్క
పల్లె, బుక్కసాగరమది, బహుజనులకుఁ
దావు, సిరికాటపట్టు, సద్ధర్మరతులు
సాధుశీలురును, విమలచిత్తులుఁగల
రచట, నావీటిమగువలార్యానుతగుణాలు,
పరమపతివ్రతల్, సొగసొప్పువారు, గ్రామ
పెద్దరెడ్డి, దీనులపాలి వేల్పుగిడ్డి,
బహుగుణంబుల నలరారు పసిఁడికడ్డి,
పరమప్రేమాపు బుడ్డియా బసవరెడ్డి!

జనులమన్ననఁ గాంచిన సరసుడతఁడు,
సుతులగోడండ్రకల్మిని శోభనొందె,
చిన్నికోడలుఁగల దతిశీలవతియు,
ధైర్యగుణమునమేటి, సౌందర్యపేటి,
అత్తమామలభక్తిచే నలరుబోటి
భర్తృరానంద ప్రాసాదవరకవాటి
అన్నదానహసీకృత హరువఘాటి,
జనులమెప్పునుగొన్న యామానసీయ,
వేడ్కముసలమ్మపేరున వెలయునబల!

౨

కొద్దిదివసంబులేగగ గొప్పవాన
లుగురియంగసాగె, జలమెక్కువగుచు
చెఱువులుప్పొంగె, వఱదలుపొంగె, ప్రజలు
భీతినొందియునేడ్చిరి పెక్కుగతులఁ,
జెంతనున్నట్టి యాచెఱువింతలోనె
తెగెననెడువార్తలుఁగలిగెఁ, దీరమునజ
లంబుపొర్లె, నంపరి నరులముఖకాంతి
వాడగాసాగె, నింతనె గండియొకటి
కట్టలోఁగాననయ్యె; నప్పట్టుననె క
ళవళయొంతొగానంగనయ్యె, వడిజలము
గండినఁబ్రవహింపఁగలిగెఁ, గడుభయమున
జనులుపారఁగాసాగి, రాజనులభీతి
నెన్నగాఁదరమౌనె, వారెంతొభీతిఁ
గదురనాగట్టుపై గుంపుగాఁగలియ, నొ
అలుచుమానవుడొక్క డఱచుచునిట్లు
పలుకఁగాసాగె, "వినరయ్య ప్రజలు, నేను
లోకములకుదొడ్డ, జగంబులోనలేరు
నాకెన, మఱచినారలు నన్ను మీరు,
తగినదండనఁజేయ నేఁదలఁచినాను,
నేనలుగనిట్లయ్యెనిపుడు, నేనెజనుల
చేతమ్రొక్కులఁగొనుదాన, జీవనమిడు
దాన సర్వప్రాణులకుఁ, దీర్ఘంబునావ
శమగు, గంగాభవానిగాఁ జాలగతులఁ
బ్రజలుపూఁజింతురెపుడును, నీజలంబు
తగ్గ నన్నుఁబూజసేయుఁడు తడవులేక,
నిండుచూలాలగుమగువనిడుడి నాకు,
దండిగాబలియివ్వ సంతసముఁగాంతు!
ఇదియెనాకోర్కె, నెరవేర్పుడిపుడ, మీశ్ర
మతొలఁగును, సేమముల్గల్గు, మనియెదరిల
పెద్దకాలంబు" ఈరీతివేడ్కగంగ
పల్కఁబ్రజలెంతొ భీతిచెవడఁకి, రయ్య
యో, యికసుఖము మనకెట్టులొదవుననుచు.
జారెడుయశ్రుధారలతోడఁ, జాలపెకమొ
గములతోడ, వెనుకకునేగ సమగట్టె
వడిగ వాపోవసాగిరి వారిలోన.

నాకళవళంబునువినుచు, నతివయొకతె
జనులసేమంబునకు దానెగావఁబూనె!

3

వడిగముసలాంబ ముందుకువచ్చి 'ఏగె
ద బలిగాను గంగకునేను, ధర్మమిదియె
నాకుఁ, బ్రజకెల్లసేమంబు నావలనఁగ
లుగు'నన, నచటమూఁగిన లోకులంద
'రోయతివ,' యిటు తెంపుసేయుయతివలుగ
లరె, యిటుపలుకఁదరమె లలనలకెప్పుడు,
చాలసౌందర్యరాశివి, బేలవన్ని
సుగుణముల కాటపట్టువు,మగువ, యత్త
మామలమొగనిఁ బూజింతువమ్మ! ఏడు
మాసముల చూలుఁదాల్చెదమ్మ, యిటు
తెంపునీకేలమాయమ్మ, బాపుమీద (వంటి
లపు మగువరో'యంచు, నచటిలోకు లత్త
మామలును భర్తబంధువు ల్మరలనిల్పఁ
జూచిరైనను, నాబాల,సుగుణమాల,
వినుతశీల, సుందరఫాల, వినయలోల,
సకలసద్గుణనికురింబ, సన్నుతాంబ,
రూపజితయంబ, ముసలాంబయపుడువల్కె!
"జననమొందుట యొకనాఁడు చనుటకొఱకె,
ధనములిండ్లువాకిళ్లు సంతతపురములఁ
బోవు వోమనుజుండు గొంబోవఁగలఁడె,
పాపపుణ్యంబులొక్కటె పాయకెపుడు,
మానవునివెనువెంటనే జనెడుగాదె;
కాకిబ్రతికినభంగి బ్రతుకఁగనేమి
మానమొక్కటెజాలు, నిమ్మహిసుఖంబు
నిమిషకాలంబెగాకెప్పుడు మిగులనిలు
వంగఁగలదె, నేఁబోయెద వగవవలదు!"

౪

ఈవిధంబునముసలాంబ యేర్పడఁబలి
కి, తనయత్తమామలకు మరితగుబాంధ
వులకుఁ బ్రీతితోఁ మ్రొక్కియు, పొలతిభర్త
నెంతొభక్తిఁబూజించి, యంచితమతినను
గుఁగోరగి, యాతనిపదముల, లలనమది
లోనఁదలచుచు నాజ్ఞగైకొనియు, నిష్ట
దైవమునుమదిలోననిల్పి, వరుసఁదన
వెంటఁబ్రజలెల్లఁ దద్దయువెళ్ల, మేళ
తాళములు ముందటఁజెలఁగ,ఁ దరుణులిడిన
పసుపుగుంకుమ ఫాలానభాసిలంగ
ఒడినిగట్టిన యొడిఁబ్రాలతోడ మగువ
తనమనంబునీశునిపై స్థిరతనిలిపి,
ఎల్లజనములహృదయముల్ తల్లడిల్ల,
గండిలోనిల్చి గంగనుగలసెనపుడు!

౫

ఆమెజన్మంబు సాఫల్యమందెదాన,
జననమొందరెందఱు జగతి, నిట్టి
తెంపుగల్గునె యాకర్మతెగక! లోని
పంచభూతములెల్లను బయటిభూత
తతినిగలసె, నప్పుడె నీరుతగ్గిపోయె,
గంగకుఁగడుశాంతిగొదవె, గ్రామజనులు
గడుసుఖంబొందిరిలను! నాకాంతపేరు
చంద్రసూర్యులు దిశలును జగతి నిలుచు
నంతకువెలసె! పల్లెకుఁగొంతదూర
మునను, ముసలాంబపేరఁ బ్రాముఖ్యచిహ్న
ముల్ వెలయు, నాదినాన, నసువువిడిచిన
కాంత, కీర్తికాయముతోడ గణనకెక్కె!
నేఁటిదాకనుబూజల నేమముగను

గొనుచునున్న దియాకాంత కొఱఁతలేక
అతివలామెను గృహలక్ష్మియంచు నాద
రింతు. రాత్మార్పణమున వారికిల మార్గ
దర్శిగఁబఱగెనతివ, శ్రీధరుఁడునామె
యాత్మకీవుత శాంతి యవ్యాజప్రేమ!

౬

ఇంతకంటెనుయజ్ఞ మింకేమిగలుగు,
ఇంతకంటెనుబుణ్య మింకేమియుండు,
ఆత్మయజ్ఞంబెయంతకు నధికమండ్రు!
విద్యకొంతయేనియులేనివెలది, దేశ
సేవ, మానవసేవఁజేసి ధర భరత
మాతకు నిజపుత్రియగుచు మహిమఁగాంచె!
ఇట్టికూతుండ్రఁ బెక్కురనింకమీఁద
భరతమాతగాంచెడుగాక! ధరణిసర్వ
సస్యసంపూర్ణయగుగాత! సకలప్రజయుఁ
గాంతురారోగ్యభాగ్యముల్, సంతతమును.

—:o.—

# రాజ్ఞీరుద్రమదేవి

శ్రీ శేషాద్రి రమణకవులు

చ॥ పొలఁతుకవయ్యు యుద్ధములఁబోటరివై యరిరాజసైన్యపం
క్తులసమయించి కీర్తికయికొంటివి, దేవగిరీంద్రుమానస
స్థలమునఁ దావకీనసముదగ్రమనోహరవీరమూర్తిని
శ్చలగతి నిల్పగల్గితివి ధన్యవు నీకెవరీడుమాతరో.

శా॥ పంచారామములందు వైరినృపసంపత్తుల్ సమర్పించి య
త్కించిత్సంశయమైన లోనిడక నీకీర్త్యంకముల్ దిగ్వధూ
కాంచీసంచిత కింకిణీచయముగాఁగల్పించి యాంధ్రావనీ
సంచారంబొనరించునీప్రతిభ సంస్తవ్యంబు రుద్రాంబికా.

గీ॥ స్వార్థనిగళనిబద్ధమై శౌర్యపటిమకోలుపోయిన సంఘంబుకుదురుపఱచి
ఆంధ్రజయకేతనము పశ్చిమాబ్ధిసేతఁ బ్రాతిత్తివిబాగు! రుద్రమాంబామతల్లి.

సీ॥ గణపతిదేవువిక్రాంతిరక్తమునందుఁ గలయుద్ధపుపొంగ సంగరమొనర్చి
ఆంధ్రసామ్రాజ్య కల్యాణవేదికనయి విజయలక్ష్మినిజేర్చి విందు గూర్చి
పరభూమిపాలకపటలంబుచేత నాత్మీయయశంబునుతింపఁజేసి
నిజకీర్తిగీతముల్ నిఖిలదిశాసటీ పాలపట్టికలపైఁ బ్రచురపఱచి
ఏకహేలానుకూలమై యీమహాంధ్రతేజమలరించె నేతల్లి దేశమందు
ఆమహామాతృదేవి పాదారవిందయుగళి స్మరియింతు మానసోత్సాహమొప్ప.

ఉ॥ నీదుపవిత్రజీవితము నేటికిఁ గాలముఖాంతరస్థమై
పాదుకొనెన్, భవత్ప్రతిభ వాఙ్మయమందు సదృశ్యమయ్యె, నీ
యాదరణీయమూర్తికి జొహారులొనర్చుటెఁగాక యింకమా
కేదియుఁజేతగాదు జననీ వసియింపుమి స్వర్గభూములన్.

# పరిచయము

గొల్లపూడి జోగారావుగారు

ఒక స్త్రీ యొక్క దుఃఖమయ జీవితమిది. జీవిత విశేషమంతయు నీ మానవప్రపంచములో ప్రేమకై ఫలవించిన యొక దీనురాలి చరిత్ర. ప్రేమకై ప్రాకులాడి సుఖముల త్యాగముచేసిన ఒక యోగ్యురాలి నిరాడంబరమైన బ్రతుకు.

నేను జన్మించినది ఉత్తర హిందూస్థానంలో ప్రసిద్ధికెక్కిన పట్టణం. జననీ జనకులు మరణించుటచే మాతాతగారి యింటివద్ద పెరిగేను. కన్యాత్వము పోకుండగనే మా తాత నాకు వివాహముజేసి పరమపదించేడు. వివాహసంబంధములో గాక అప్పట్లో చూచేను నాథునొక్కసారి. ఎనిమిది సంవత్సరములవరకు మరి ఆయన కనబడలేదు. ఎందుకు ప్రేమించానో అతణ్ణి ప్రేమించాను. అతడు యెచటికి పోయాడో, యెందుకు తిరిగిరాలేదో యెవరికీ తెలియదు. అతణ్ణి నాకు కూర్చమని మా కులదేవత యగు భవానీని నిత్యమూ ఆరాధించేదాన్ని. అతని మూర్తిని ధ్యానించుకుంటూ వంటరిగా దుఃఖంతో గడిపేదాన్ని కాలం. నా మేనమామ భార్య నా యీ ప్రవృత్తికి సహించలేదు. ఆమె ఎన్నిసార్లు చెప్పినను నాయేకాంతసేవ మానలేదు. ఆమె నన్ను దూషించినది. నేనామెను నిందించలేదు. భవానీదేవిఆరాధన, నానాథునిస్మరణ యివీనానిత్యకృత్యములు. తొమ్మిదవసంవత్సరము పూర్తిఅయినది. ఆమె అహంభావము, అసూయ, అసహనము, అతిశయించెయి. ఒకనాడామె నాయేకాంతమందిరములోనికి వచ్చినది. మోకరించి భవానీని ప్రార్థిస్తున్నాను. ఆమె మండిపడింది.

ఆమె—మానవా?

నేను—భవానీ పూజ!

ఆమె—నాయింటినుండి పొమ్ము!!

నేను మారాడలేదు. ఆమె అవివేకమునకు నవ్వుకున్నాను. ఉన్నట్లుగానే అవలికి నడిచిపోయాను.

అతడు అమాయికుడు. ఆమె క్రూరురాలు. అతనిది జాలిగుండె. ఆమెది కఠినహృదయం. అతనిప్రేమ సంద్రంలో పెనుతుపాను రేగినది నాడు. "నాగడపలోనికి రానీను." ఏమి అనిరంకుశశాసనాధికారము? ఆమె గడపలోనికి రాకపోవుట నాకు సంతోషమే. అతడు వలవల యేడ్చేడు. ఆమె ఆనందబాష్పములు రాల్చినది. ఎందుకో ఆమె కింత ఆగ్రహము?

ఆ అంధకారంలో జ్యోతల్లే వెలిగింది నాప్రేమ హృదయం. భవానీ ఆలయమునకు బయలుదేరేను. ఆలయప్రాంతములో కాళ్లు వణికేయి. ఎందుకో? నీరసంచేతనుకున్నాను. భయంవేసింది. హృదయం ఆరాటపడ్డాది. అతణ్ణి స్మరించుకున్నాను. ఒకమానవ హృదయం భరింపరానంత దుఃఖంవుందినాలో. దేవి సాన్నిధ్యమునకు పోయాను. మోకరించి నమస్కరించేను. "బిడ్డా! ధైర్యంవీడకు." అనుమాటలు శ్రవణపుటముల మారుమ్రోగేయి. ఆ తన్మయమునుండి మేల్కొని పైకివచ్చేను. ఆ నీలిమాకారంలో ప్రకృతి భయంకరంగా వుంది. ఆలయంలోనే పరున్నా. నిద్ర పట్టింది. నిశ్చితాత్మకు యెక్కడ నిద్రపట్టదు గనక.

౨

"ఆమె త్యాగశీలిని. ఆమె జీవితము పరమాద్భుతము. పదిసంవత్సరములబాలికదగ్గరనుండి భవానీదేవి నారాధించుచున్నది విదేశములకు పోయిన్న భర్త కొఱకై. అదిగో ఆమెపర్ణకుటీరం" అని చెప్పుగుంటూవుండేవారు నదికివచ్చి పోతూండే యాత్రికులు, నాజీవనప్రవృత్తిని గూర్చి వూరిలో తెలియనివారే లేరు. ప్రాతఃకాలముననే నదీస్నాతయై వచ్చు భక్తురాలికి పూజాపుష్పములు, ఫలములుగొని యిచ్చేవారు జాలిహృదయులగు ప్రజలు. ఆలయమునకు పోయి దేవీ ఆరాధన గావించి ప్రసాదమును పంచియిచ్చే

దాన్ని క్షుద్బాధా పీడితులకు. నానాథునిపై నేరచించిన కీర్తనలు పాడుకునేదాన్ని నాలోనే.

పది సంవత్సరములు వెళ్లిపోయి పదకొండు ప్రవేశించినది. ఆయన జాడలేదు. భవానీకి కృపకలుగలేదు. ప్రకృతి స్వభావసిద్ధమగు మానవదౌర్బల్యము నన్ను వరించలేదు. నానుధావిలాపము యేలోకంలో మ్రోగలేదో? నాఆకలిబ్రతుకింకా ప్రేమకై తపిస్తూంది. ఎన్నోరాత్రుల్లు నదీ తరంగాల్లో తేలిపొయ్యేయి నాప్రార్థనా కీర్తనలు. ఆప్రశాంతంలో రాలిన వోపండుటాకు, నదీతటమున వోపిల్లకెరటం నాకై జాలిని వెలిబుచ్చేవి. ఇంకాయెన్ని హృదయాలు జాలిజెందుచున్నవో యీ దుఃఖితకై.

## 3

ఆరుమాసములు వెళ్లిపోయాయి. నది కావల యెవరో జమీందా రొకరు బంగళా కట్టిస్తున్నాడని చలనంకలిగింది ప్రజాహృదయంలో. ఎంతకాలం? ఒకటి, రెండు, మూడు రోజులు మాత్రమే. నాప్రణయగీతము లింకా మారుమ్రోగుతున్నాయి ఆ నదీ సైకతస్థలాల్లో. బంగళా తయారై పోయింది నాపర్ణకుటీరాని కెదురుగా. ఆనాడు గృహప్రవేశం. వూరంతా నది కావలేవుంది. ఈమిషపెట్టి బీదలకింత అన్నదానము చేశా డాధర్మాత్ముడు. ఆయనఔదార్యము ప్రజాహృదయము నాకర్షించినది. ఆతని సౌశీల్యం వినుతి కెక్కినది.

నాజీవన ప్రవృత్తిలో మార్పు కలుగలేదు. నాదేవీ ఆరాధన, నాహృదయేశ్వరుని స్మరణ, ప్రశాంత సమయాల్లో నాప్రేమహృదయం వెలిబుచ్చటం నిత్యమూ జరుగుతూనే వుండేవి. రాత్రి పదిగంటలవుతుంది. నిశ్శబ్దంగా వుంది నదీతీరమంతా. దూరాన్ని దీపం మినుకుమినుకు మంటూంది బంగళాలో, నీటిలోకాళ్ళుంచి గట్టున కూర్చున్నా. ఎప్పుడూలేని ఆవేశం కలిగిందినాలో. హృదయం విచ్చి యెలుగెత్తి పాడేను. నది కావలనున్న బంగళాలో కూడ మారుమ్రోగింది నాపాట. పదినిముసములయినది. నదిలో యెవరో వస్తున్నట్టుగావుంది. క్రమంగా నాకుకొన్ని గజములదూరం వరకు వచ్చిందొకనావ.

"మీ రెవరు?"

అది పురుషకంఠస్వరము. అతడొక యువకుడు.

నేను—ఒకప్రేమ పిపాసి.

అతడు—అవివాహితయా?

నేను—కాదు. అతడు దేశాంతర్గతుడు.

అతడు—ఎంతకాలమైనది?

నేను—నేటికి పది సంవత్సరములపై పది మాసములు.

దీర్ఘనిశ్వాస మాతనికడ సెలవుతీసుకొంది.

అతడు గొణుక్కున్నాడు "ఆమెయు నిట్లే యుండవలెను." మబ్బుతునకచాటున ముసిముసి నవ్వులు నవ్వింది తారక.

అతడు—ఏల యీజీవనము?

నేను—అతనికొరకై.

అతడు మరలిపోయేడు. నావ కినబడువరకు గమనించేను.

వారం గడిచింది. ప్రతిదినమూ వూర్లోకి పోయేవాడాయన. ఆ ఔదార్యుని కూర్చి తెలుసుకోవలెనను నభిలాషి కలిగింది మనసులో. నావ తిరిగివెళ్లిపోయేటప్పుడు చూచేదాన్ని యెన్నో ఆశాపులకితమ్ములయ్ని కనులతో. నాడు దేవీఆరాధనగావించుకొని కూర్చున్నాను కుటీరంలో. నామేనమామ లోనికి వచ్చేడు. నాస్థితికి కనుల నీరునించే డాతడు.

"అతడొచ్చేడు."

"ఎవరు?"......ఆతృతతో

"నీభర్త—ప్రఫుల్లచంద్రుడు."

నానిరాశా హృదయం మందహాసం చేసినది.

"ఎచట నున్నాడతడు?"



మిస్ లీలా

ఆంధ్రదేశమున మొట్టమొదట సినీమాలయందుఁబ్రవేశించి పేరుతెచ్చుకొన్నయువతి. ఈమె తెనాలిలో బుట్టినది. తలిదండ్రులు పెట్టినపేరు సుబ్బులు. మిక్కిలి పేదస్థితి ననుభవించి కష్టములుగుడిచి ఉభయత్రపరిత్యక్తయై యావల రంగస్థలమునఁబ్రవేశించి యిప్పుడొక స్థితిమంతురాలైయున్నది.



పురుషవేషధారిణియైన

మిస్ లీలా

"ఇచటనే, నదికావల బంగళాలో."

ఏల యీ దైవసంఘటనము? నాహృదయం కొట్టుకుంది వడిగా.

"నేడే నేనాతని జూచితిని. నీస్థితి యాతనికి తెలియజేసెదను."

నేను మాటాడలేదు. అతడు వెళ్ళిపోయాడు. ఎన్నో వినూత్నభావములను రచించినది నామనసు. నన్ను స్వీకరించుట కాతడొప్పుకొనునా? నాజీవితమున కాతడసహ్యాయించుకొనునేమో.........

పూరంతా మాటు మణిగినది. నదివొడ్డునకు పోయాను. యాత్రికుల సందడి సమసిపోయినది. దూరంగాపోయిన్న ఒకటి రెండు పడవలుకూడ తిరిగి వచ్చాసేయి. అతడేల రాకుంటును. అతనిది విశాల హృదయం. ఇంకా యేవేవో ఆలోచనల్లో పడి పోయాను.

"సుధా !"

వెనుదిరిగి చూచేను. అతడే. నాఆర్తహృదయం పొంగిపోయింది. నావలోనికి 'రమ్మని చేయిచాచేడతడు. నేను జంకేను.

"సుధా !" అతడు మరలపిలిచేడు.

నేను లేచేను. మామయ్యాతనితో చెప్పియుంటాడా? నావదగ్గరకు పోయాను. అతడు నాహస్తమును బట్టుకున్నాడు. నాశరీరము గగుర్పొడిచినది. అతడు నన్ను నావలోనికి తీసుకున్నాడు.

"సుధా ! ఇక నిన్ను విడిచిపోను." దూరాన్ని తోపులో కోయిల 'కుహు కుహు' మని పాడింది కల్యాణగీతి. ఆ వెన్నెలరేయి ప్రశాంత సమయంలో రెండు ప్రేమహృదయములకు పరిచయము గలిగింది.



# తొలిప్రొద్దు

కర్రా చంద్రశేఖరమ్‌గారు

సూర్యుఁడనియెడుమృగరాజు శూరుఁడగుచు
నాకలినిబాపుకొనజూచి యాకసమున
తిరిగివేసారి, హేమంత దినమునందు
కాలమనుమత్తగజమును కరముచేత

మస్తకమువోది రక్తము, మంచిమంచి
ముత్యములనెల్లవిడనాడి, ముదముతోడ
నాకలినిదీర్చుకొనినాఁడు అభ్రవీధి
యందు;మిగిలినదానిని పొందఁగోరి

కావు'కావు'మటంచును కాకులెల్ల
చిందులాడుచునున్నవి చెట్లమీద.
అదిమొదల్గాగతొలిప్రొద్దు అరుణకాంతి
మంచుముత్యాలశోభగా మారిపోయె.

# పార్వతి

పానుగంటి విజయరాఘవరావుగారు

సీ॥ పిలిచిన 'ఓ' యనిపలుకు శ్రీగీర్వాణి యేమహీపతియేలు సీమయందు,
గంటమూనుకవులకడుపు వెన్నంటుటనెఱుఁగ దేభూజానిధరణియందు,
ఏరాజమార్తాండుఁ డేలువీటనడుచు ధర్మంబు నాల్గుపాదాలుమోపి,
ఏప్రభునుపమింప నాప్రభుఁడేసరి యనిదేశదేశాల నంద్రుజనము
గీ॥ లట్టిశ్రీభోజుఁడేలురాజ్యంబునందుఁ గలదుపార్వతినానొప్పు నలఘుచరిత.

గీ॥ ఆమెసౌశీల్యగుణముల నలవరించు
కొందు రలవోకజేజేవెలందు; లామె
'భవము భేదింపఁగారానిబంధ' మనుచు
జందెమును ద్రెంపిపరమాత్మ బాదెఁబడిన
పరమసుగుణాఢ్యులౌ యోగివరులఁ దక్క
జూడనెల్లదు తమ్మిపూఁజూలినైన
భర్తపాదావలోకనపరతఁగనుల.
వయసువచ్చినభార్యను వదలి, కులము
నుద్ధరించుసుపుత్రులయుబుసుమఱచి
అన్నియలమెడుదొక్కటే యనుచునమ్మి
ఆత్మదేహంబుతోడబ్రహ్మార్పణంబొ
నర్చుయతులామెయింటఁదనర్చుచుంద్రు.
కప్పురపుఁగుప్పలొకపరిఁ గదలునట్లు
వేయికల్పవృక్షపుఁబూలు విరిసినట్లు
ఎలమితోవాణివీణమ్రోయించినట్లు
ఆమెసుగుణపుఁదావు లాసాసలందుఁ
బరిమళించెను దాఁచగాఁ దరమెవ్వాని.
అహహ! యెంతటియిల్లాలొ యెనెకువారుఁ,
బూర్వజన్మసువాసనఁబొంద నిట్టి
సద్గుణంబులుగల్గు నాశ్చర్యమేల
ననుచుఁదుష్టాత్ములగువారు,నబ్బయీయామె
యెంతలోనెంతకీర్తి గడించెనని య
సూయచేవేఁడియూర్పుల స్రుక్కువారు
నగుచునొప్పిరితరుణు లాసాసలందు.
తమమువిరియించురవి తొగతరుణికనుల
నంధకారంబు బ్రామినయటులె యొకరి
సుగుణగణమువేఱొక్కరి నొగులఁజేయు.

చ॥ జిలుగుపసిండి చేలమును జేగుఱుపుట్టముమాటునుంచి, రా
త్రులఁజెలిపూయు కస్తురిని తోరపుబూడిద పూఁతఁదూర్చి, య
ర్థులఁదనియించుచేతి కొక దుర్దశఁగల్పనఁజేసి భోజుఁడా
పౌలఁతుకఁజూడనేగె ప్రభుపోడిమిపాడఱఁజేసి జోగియై.

గీ॥ కాలజీమూతమేఘంబు కప్పనేమి
తరణి కిరణాళిలోనుండి తళుకుమనును.
ప్రభుఁడుప్రభునిగానుండిన బాగెకాని
దొంగవేసంబుధరియింప వింగడమగు.
ఆమెప్రభుఁగాంచి మెయివెంచి యాగ్రహించి,
శాపజలముగ్రహించి పైఁ జల్లఁబోవఁ
బ్రభుఁడు గాత్రంబుకంపింపఁ బలికె "అమ్మ

తప్పుఁజేసితి క్షమియింపు దాసునిపుడు.
భవునిమూఁడవనేత్రపుఁ బ్రభ ననొప్పు
నెచటనైనఁ బతివ్రత. యెంతయూష్మ
మున్నదో యంతచలువయు నున్నదచట.
కవులకన్నను, వీరులకన్న,శిల్ప
వరులకన్నఁ బేరును దెచ్చు వనిత తనప
తివ్రతాగుణమున మాతృదేశమునకు.
అమ్మ! నినువంటికాంతల నచటనచటఁ
గనినదగుటచే నింతటిఖ్యాతిఁగనియె
భరతదేశంబు; సౌశీల్యభరితమైన
పొలఁతియే భూషణము మాతృభూమి
కగును.”
అనుచునామెనువీడ్కొని యరిగె
ప్రభుఁడు.
ఎందుఁబుండిరో యిట్టిపూర్ణేందుముఖులు
పట్టపగటింటిచుక్క వగిది,సంద్ర
మునమునిఁగియున్న రత్నాల గనులవోలె.
వారియాత్మలుశాంతిని బడయునటుల
గోటికొన మీటుఁ డొక్కక న్నీటిచుక్క;
పాయు దేశదాస్యము భారతీయులార!



# బీదరాలు

యలవర్తి సీతారామస్వామిగారు

ఆమె ఒకమహాసాధ్వీలలామ, ఆస్య
సీమఁ దొలఁకాడుచున్నవి స్మితరుచులు.
వికసితనవకుశేశయవిసరవిమల
దీధితీతతిసైతంబు ధిక్కరించి
చటుల సర్వసర్వంసహా చక్రనివసి
తాఖిలానూన చంద్రబింబాననాని
వహవిలాససౌందర్యముల్ వమ్ముసేయు
నామె ధావళ్యమంజులోద్దామకాంతి.
అవనినొకరాజ్ఞితో నెనయగునుఆమె.
తరళనేత్రాబ్జనిర్యాతధవళకమ్ర
పృథులరోచులు దిననాథవిపులచండ
కిరణసంభూతకాంతులన్ గ్రేణిసేయు.
ఆయమమహాపతివ్రత, అతులశాంత
మొల్కుచున్నది వదనాన; ఉరువిశాల
గండమండలసంజాతగాఢకాంతి
అరయశశిధరబింబంబు నవఘుళించు.
కడఁగి బ్రహ్మాండభాండమ్ముఁగలచివేయఁ
జాలువిస్తృతతేజంబు సరళముగ్ధ
విమలదేహోద్గతంబయి వెల్గుచుండు
నిఖిలసముదీర్ణ సద్రుచుల్ నివ్వటిల్ల.
కాని పరమేష్ఠిఐశ్వర్యహీనఁజేసి,
దుర్భరనిర్భృతిఁ దోడ్తోఁ దొడరఁజేసి
నాఁడు. ఒకఅనాఘ్రాణిత నవ్యసుమము
భంగిగణియింపఁబడదయ్యె వసుధ నువిద.
ఒకమహోజ్జ్వలంబగుశక్తి ఉత్కటముగ
వెల్లివిరియుచునున్నది వెలదియందు.
కాని, ఆమె అనాదృత క్ష్మాతలాన,
ఆమెఁబరికించువారలే అవనిలేరు.
ఆమెలోకైకరాజ్ఞియే అనగనగును,
ఉద్ధురాస్తోకవిస్ఫూర్తి ఉరువడించి
కడలుకొనుభూనభంబుల, కానిలోక
మామెఁగన్నెత్తియైనను అరయఁబోదు
అతులనిర్వృతియె సంప్రాప్తమగుటఁజేసి.
ఆమె ఒకరాజ్ఞితోనెన యగునుగాక,
కాని ఆమె అనాదృత క్ష్మాతలాన.

# కొండవీటివిజయము

శ్రీమతి వేదుల కృష్ణవేణిగారు

## శ్రీమతులు పద్మావతి, బాపాయమ్మగార్లకు సమాధానము.

"యథాస్త్రీణాం తథావాచాం సాధుత్వేదుర్జనోజనః।"

భవభూతి.

"కొండవీజవిజయము" అనే పేరుకంటె 'కొండవీటిముట్టడి' యని పెట్టిన బాగుండును" అని వీరు శ్రీశాస్త్రిగారికి సూచనచేయుచున్నారు గాని అది యెంతమాత్రము సరిగలేదు. కథాభాగమునందు ప్రత్యేకముగ నొక్క ముట్టడి వర్ణనయే లేదు. మంత్రితో కృష్ణరాయలు యుద్ధాలోచనజేయుట, కొండవీటిని జయింపనేగుట, కొంతసైన్యముతో దుర్గమునుముట్టడించి దుర్గాధ్యక్షుని సహాయము చేయవచ్చు ప్రతాపరుద్రగజపతిని కొంతసైన్యముతో నోడించుట, కొన్నినెల లట్లుండి పిదప దుర్గాధిపతిరాయలును శరణుజొచ్చుట మొదలగు విషయములు వర్ణింపబడియున్నవి. అంతకును ఫలమయినట్టి విజయము ఇందు ప్రత్యక్షముగ చెప్పబడియున్నది. అందుచేత విజయమను నామమే సమంజసముగ నున్నదిగాని ముట్టడి యనుటకు ఆధారములేదు. ముట్టడియందు విజయముండవచ్చును లేక లేకపోవచ్చును.

ఇక రెండవ యాక్షేపణ.

ఇందు కథాభాగము రమణీయముగ నున్నదని చెప్పుటకు వీలుపడకున్నదట. కారణము. ఇందు సూర్యోదయవర్ణన, సాయంకాలవర్ణన శిబిరముల కేగుట యిట్టివర్ణనలు యెక్కువగలవట. మేఘసందేశకావ్యమున కథాభాగ మేమాత్రము? అం దిట్టి విధమగు వర్ణన లెన్నిలేవు? మేఘునిప్రయాణవర్ణనలు, నదులవర్ణనలు, కొండలవర్ణనలు, పట్టణముల వర్ణనలు యెన్నిలేవు? రమణీయత చెడినదా?

"ఇందు వీరరసము ప్రధానరసము. కాని నడుమ అప్రస్తుతముగ యుద్ధాలోచనయం దున్నరాయలు విషయమున శృంగారము వర్ణింపబడియున్నది. గనుక నిది ప్రస్తుత రసవిరుద్ధము"అని వీరి ఇంకొక యాక్షేపణ. గాని యుద్ధాలోచనలోనున్న రాయలు విషయమై యీరసము వర్ణింపబడలేదనియు, మంత్రితో యుద్ధాలోచన జరిగిన తరువాత కొలువు నుండి యింటికివచ్చిన పిమ్మట ఈశృంగారవర్ణన కలదనియు నీక్రింది పద్యమువల్లను తరువాతి పద్యములవల్లను తెలియుచున్నది.

"అంతట పశ్చిమాద్రిదరి కర్కుడు సేరెను, కొల్వు
వీడి రాజంతిపురంబుజేరె, జలజాననయోర్తు...

మరియు సర్వకాల సర్వావస్థలయందును నాయకుడు ఒకే రసమును యవలంబించియుండడు. రసభంగమగునని వేణిసంహారనాయకుడగు భీముడు భార్య ప్రక్కనుగూడ క్రోధరస మవలంబింపవలసిన దేనా? అట్టిది అసహజము. అదిగాక కాళిదాసు వంటి ప్రసిద్ధ కవిగూడ యుద్ధభూమిలో "తాటకాచల కపాలకుండలాజీవితేశవసతింజగామసా" అని చచ్చిపడియున్న తాటకను అభిసారికగ వర్ణించి యున్నాడు.

మరియొక యాక్షేపణ.

"ఇందచ్చటచ్చట శాస్త్రీయవిషయము లిమిడియున్నను, అవి సామాన్యుల కర్థమగు స్థితిలో లేవు. కొన్ని యర్థమగుచున్నను కవిత్వ నవ్యత కవి కంటకములు. భావము, రసము, ప్రధానమగు కావ్యములలో నిట్టి కఠినవిషయము లుండుటచేతనె యిప్పటివారికి ప్రాచీన గ్రంధములనిన దలనొప్పి" అని. అవును, అచ్చటచ్చట శాస్త్రీయవిషయము లిమిడియుండి,

యవి సామాన్యుల కర్థమగుస్థితిలో లేకపోవుటచేతనె సామాన్యులకు పాఠ్యగ్రంథముగ నిర్ణయింపబడక ఉత్తమపఠనీయగ్రంథముగ నిర్ణయింపబడుట.

5. ఇక వీరుజేసిన కవిత్వ విమర్శనకు.

"శ్రీవరునిన్సదాశివవిరించుల దాను సృజించి
వారికిన్
బ్రోవగ సంహరింప జగముల్ సృజియింపగ
శక్తులిచ్చికా
ళీ వరలక్ష్మి శారదల లీలధరించి నవార్ణమంత్రసం
భావితయైనదుర్గ కృతి భవ్యముజేయ నుంతింతు
ముందుగా॥

ఈపద్యమందు క్రమభంగ దోషమట.

బ్రోచుటకు శ్రీహరుని, సంహరింప సదాశివుని, సృజియింప విరించిని శ్రీవరాశక్తి సృజించినది. ఇందు క్రమభంగములేదు. రక్షణసంహారసృష్టిశక్తులను వీరికి ప్రసాదించినటుల వర్ణింపబడి యున్నది. అట్టిశక్తులు గలపై విష్ణు సదాశివ విరించులకు యీ కాళీవరలక్ష్మిశారదలు భార్యలుగ కవి వర్ణించలేదు. వారు నవార్ణమంత్రరూపియగు దుర్గయొక్క అవతారములు అని మాత్రమె వర్ణింపబడియున్నది. కాని భార్యలని ఊహించుకున్న వారికి క్రమభంగమని భ్రమకలుగవచ్చును. పద్యమునందుమాత్ర మాదోషము లేదు. నవార్ణమంత్రమున వరుసగ సరస్వతి లక్ష్మి కాళి బీజములు ఉండుటచేత ఈ కాళీవరలక్ష్మి శారదలప్పే ర్లిందు నివరింపబడినది. ఈమూడుబీజములచే ప్రతిపాదితమగు శక్తులు, వార్లకు భార్యలుకానేరరు. నవార్ణ మంత్రపతిపాదితమగు దుర్గ అవివాహితకన్య. అంచేత నిచ్చట పై దోషములేదు.

6. "కవులెనమండ్రు జాతికొక కావ్యము నొక్కడ నల్ల"………

"ఇందు మనమెరిగిన యష్టదిగ్గజములు కృష్ణరాయని యాస్థానముననుండిరా లేదా" అని ఒకశంక. ఉండెడివా రనుకొన్నప్పటికి కృష్ణరాయలు కాలమున గ్రంథములను రచింపలేదటవారు. అందుచేత శ్రీ శాస్త్రిగారి మాట యెంతవరకు నిజమో ఆలోచింపవలసి యున్నదట! నిజమో అబద్ధమో అసలు విమర్శకురాండ్రకె ఆలోచించవలసిన విషయమట అనగ నిర్ధారణగ తెలియదన్నమాట.

మరియు పద్యమునందు దిగ్గజముల ప్రసక్తియే లేదు. యెనమండుగురు కవులుండిరని మాత్రమె గలదు. కృష్ణరాయ లంతటి రాజునొద్ద ఎనమండుగురు కవులుండుట ఆశ్చర్యమా? వారు గ్రంథములు రచించి యుండగూడదా? విమర్శనకు చాల గొప్పవిషయమే దొరికినది వీరికి. ఇక కృష్ణరాయలు అప్పాజీనిఅవమానపఱచుట అను కాలవిషయమై సందేహమే కలదట. ఎవరికి సందేహము? విమర్శకురాండ్రకేనా? అట్లయిన చరిత్ర చదువుకొని మరియు విమర్శ చేయవలెను. కృష్ణరాయుల చరిత్ర తెలుగునకంటె నింగ్లీషున యెక్కువగలదు.

7. 18 పద్యము.

"పెట్టని కోటయై గిరులు పేర్చెను జుట్టు మహోన్నతంబుగా" అని చెప్పుటకంటె కట్టనికోట యని యుండవలసియున్నది." అని వీరి మరి ఒక ఆక్షేపణ. సరే 'పెట్టని కోటయని' ఎందుచేత నుండగూడదు. భారతమున ఉద్యోగపర్వము ప్రథమాశ్వాసమున "పెట్టనికోట నీకు హరిభీముడు" అనియు, విజయవిలాసమున "పెట్టని కోటగాదె గజబృందము" అనియు ప్రయోగములు గలవు.

8. ఇక 22 పద్య.

"ఖాను లుద్దండులై తన్ను కొలచుచుండ"యను నది అచ్చుతప్పో లేక పొరబాటుగావచ్చును. అట్టిది ఒక ఆక్షేపణవిషయముగాదు. "తన్ను కాచుచుండ" అని దిద్దుకోవచ్చును.

9. 30 పద్యము.

"నా వినిపల్కె రాయలు ఘనంబగు సంగరకౌతుకంబునన్
నీ వసహాయశూరుడవు నిక్కము నీ కరకౌశలంబుయు
ద్ధావని నెన్నడే నెచటనైనను జూపకున్న నన్నునే
నే నహివాహనో జగమదెట్లు లెరుంగును రాజులందునన్"

పై విధముగ కృష్ణరాయలు చెప్పటము ఉచితమే యగును, ఎందుచేతననగ కొండవీటి యుద్ధమునకు బూర్వము స్వయముగ రాయలు యుద్ధముజేసియుండ లేదు. అంతయు తిమ్మరుసు చేతిమీదనె జరిగియుండెను. గాని యిప్పుడుమాత్రము రాయలు స్వయముగ యుద్ధముజేయుట తటస్థించినది. అందుచేత పై జెప్పినది ఉచితముగనె యున్నది.

10. ఇక 96 పద్యము.

"దురమున గెల్పెయుంపవని, తోయనిధుల్వరు
లంచు పెండ్లికూ"

అనేపద్యములో "తోయనిధులు వరుడనుట యనుచితమట, తోయనిధివరు డనవలెనట." గాని పద్యములో వరులు అని బహువచనముండగ తోయనిధివరుడు' అని ఏకవచనముగ వ్రాసి అది అనుచితమని వ్రాయడము చూడగ పుస్తకమును గూడ చదువక ఎవరో చెపితే వ్రాసినటుల తోస్తుంది యీవిమర్శనవలన. పై పద్యము స్వయంవరవిషయము. స్వయంవరవివాహములో అనేకవరు లుందురు. అందుచేత బహువచనము వేయవలసినది.

11. "ఇక 148 పద్యముమొదలు 152 వరకు చేయబడిన వేదాంతోపన్యాసము శాంతరసము. అది ప్రకృతరసానుగుణము గాదు." అని ఒక ఆక్షేపణ. సరే. యుద్ధభూమిలో కృష్ణభగవానుడు చేసిన గీతాబోధ యేరసము? యెక్కడ చేయబడినది? అది అట్లుండనిండు.

యీ గ్రంథమున చేయబడిన యీ వేదాంతబోధ యుద్ధమందు తనకు లొంగిపోయిన గజపతికి రాయలుచే చేయబడినది. యుద్ధమున తనకు అధీనమగు శత్రువుని అవమానపఱచక వానికి వేదాంతబోధ చేయుట నాయకునియొక్క ఔదార్యగుణమును సాటుచున్నది. నాయకోత్కర్షకు కారణమైనట్టియు, రసానుబద్ధమగునట్టి విషయము గ్రంథమున చెచ్చుటనైనను పరిణతము కావచ్చును గాని బాగులేదనుట బాగులేదు.

12. 28 పద్యములో 'చని' యనునది 'వెళ్లి' యను నర్థమున ప్రయోగించబడినదే గాని 'వచ్చి' యనునర్థమున గాదు. 'ద్రవ్యము' అనుదానికి 'పదార్థము' అని యర్థముకలదు. నిఘంటువులు చూచుకోవచ్చును.

'కొండవీడునన్' అనునది సాధురూపము. ఔపవిభక్తి ప్రత్యయములు బాహుళకములు. నిత్యములనుటకు ఆధారములేదు. ప్రామాణిక ప్రయోగములు చాలకలవు.

'నేర్తురున్' అనునది కళమీదసముచ్చయార్థకము గాని ద్రుతము గాదు. 'నేర్తురుకూడ' యని యర్థము. ప్రామాణిక ప్రయోగాలు చాల ఉన్నవి.

నవలలు అనునదికూడ సాధురూపమే. "దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్ నచదేశ్యపదే" అని సూత్రము. సూత్రముయొక్క ప్రచారము నిత్యము కాదు. అందువ 'పల్లవులు,' 'లకోరులు' మొదలగు ప్రయోగాలు ప్రమాణాలు, అందుచేత అపశబ్దములని యనుట కడు సాహసము.

—:o:—

## భారతాంబ

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు

సీ॥ అనిలోన ధీరులై యవనుల నెదిరించి మేటివీర్యము జూపు నాటిపటిమ
ధీరత్వమున నాంధ్రదేశంబు పాలింపగలిగిన నాటి యఖండశక్తి
పలనాటి వీరులవలసల బంపంగ జాలిన నాటి తేజంపుగరిమ
హూణాసైన్యంబుల హుమ్మని పైబడి దునుమాడినట్టి యస్తోకబలము.

గీ॥ రణముగావింపదెల్పి భర్తలనుబంపి
పుత్రులనుగూడ ననిలోన పుణ్యభూమి
కర్పణంబునుగావించి యలరినట్టి
వీరకాంతలగన్నదీ భారతాంబ.




సౌ॥ కమలకు:—

స్త్రీపురుషులకొకేచదువు, ఒకే విద్యావిధానము ఒకేపాఠశాల పనికిరావనియు వారిరువురును మానవవ్యక్తిత్వముయొక్క రెండు బ్రహ్మాండవిభాగములనియు ఒకరి విధానమొకరు నేర్చినను ఒకరితోనొకరు కలసినను ప్రపంచము బ్రద్దలయిపోవుననియు పెక్కురు పురుషులును నారీమతల్లులునుగూడ పత్రికలలో వ్యాసములు వ్రాయుచున్నారు. సభావేదికలనుండి అధ్యక్షకాద్యుపన్యాసముల నిచ్చుచున్నారు. కాని నాకుఁజూడనిది యెల్లయు ననవసర ప్రసంగమునునట్లు తోచుచున్నది.

మొట్టమొదట ప్రాథమికవిద్యావిధానమును తీసుకొందము. ఇందు కాస్తచదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట, చారిత్రక, భూగోళక, శారీరకశాస్త్రజ్ఞానమును లోకజ్ఞానమునుమాత్రమేగదా నేర్పఁబడుచున్నవి. వీనిలో పురుషులకును స్త్రీలకును కావలసిన అక్షరములు వేఱువేఱా అంకెలు వేఱువేఱా శాస్త్రజ్ఞానము లోకజ్ఞానము వేఱువేఱా? ఇవి యేవియును వేఱువేఱుకానిచో బడులు మాత్ర మేల వేఱువేఱుగా నుండవలెను? బాలురు బాలికలను బాలికలు బాలురను చూచినను, కలిసినను, కూడియాడుకొనినను ఏమియో నష్టముకలుగునను వ్యర్థభయము తప్ప ఇట్టిభావములకు వేఱే యాధారమునులేదు. ఊహించుటకుఁగూడ సాధ్యముకాని యిట్టిఅనుమానములును సంకుచితభావములును, ఉత్తమనాగరికతయు విశాలభావములును కలిగి దినదినాభివృద్ధి పొందుచు జీవలక్షణములతో నలరారుజాతికి యోగ్యములు కావనినాతలంపు.

ఇట్లే ఉన్నత విద్యలను ఉత్తమవిద్యలను గూర్చికూడ మన మూహించుకొనవచ్చును. స్త్రీల కున్నతవిద్యకాని ఉత్తమవిద్య కాని కూడనేకూడ దనువారితో మనకువాదమే లేదు. విజ్ఞాన ద్వారములను బంధించి మహిళాలోకమునెల్ల వెలిబెట్టుట తాతలనాటి ప్రాతకాలమున నెన్నడైన చెల్లెనేమోకాని విశాలస్వతంత్ర భావభూషితమైన యీ అధునాతనయుగమునసాగదు. పుత్రులకుబోలె తమపుత్రికామణులకుకూడ ఇట్టివిద్య నేర్పింపనువ్విళులూరుచుండు జననీజనకులును, పురుషులబోలె తామును నేర్చుకొన కుతూహలపడు యువతీమణులును నేడనేకులు ప్రతినగరమున నున్నారు. మన ప్రభుత్వమువారును

వారికి చేయూతనిచ్చుచున్నారుగాని నిరోధించలేదు. ఒకరినిజూచి ఒకరుగా ఇట్టి విద్యకొరకె కెక్కువమంది వచ్చుచున్నారు గనుక నానాటికి వీరిసంఖ్య హెచ్చుచున్నదే కాని తగ్గలేదు. మఱియును హెచ్చఁగలదు. ఆర్థిక, రాజకీయ, న్యాయ, వైద్య, యంత్రశాస్త్రాదులలో స్త్రీలకు పనికివచ్చునదివేఱును పురుషులకు పనికివచ్చునది వేఱును గలదా? అట్లు లేనిచో వీఱికిని వారికిని వేఱువేఱు హైస్కూళ్ళను కాలేజీలను పెట్టుటవలన ఖర్చుజాస్తియగునే కాని లాభము విశేషమగునా? ఇట్లు వేఱువేఱు పాఠశాలలును కళాశాలలును ఉండవలెనని కోరువారుకూడ యువతీయువకుల సహవాస సహపఠనసల్లాప సహ ఖేలనాదులవలన నేమియోయుపద్రవము మూడునని యూహించువారే. వారి భయములును నిరాధారములే.

పురుషులకుకాదని స్త్రీలు ప్రత్యేకముగ నేర్చుకొనవలసినవి వంటపని, కుట్టుపని, చమికీపని, సంగీతము మొదలగునవని కొందఱి తలంపు. ఇవియైనను పురుషులేలనేర్చియుండరాదో నాకు తెలియదు. ఈపనులను కూడ స్త్రీలకంటె ననేకరెట్లుబాగాచేయువారు పురుషులలో లేకపోలేదు. అయినను ఇవి స్త్రీలకుగూర్చు శోభను పురుషులకు కూర్చవని చెప్పవచ్చును. కాని వంట, కుట్టు చమికీపనులకొరకు లక్షలకొలది ధనము వ్యయపరచి పాఠశాలలు పెట్టవలసిన ఆవశ్యకతయేమి? ఈబడులు లేనంతమాత్రమున మన బాలికలకును యువతులకును ఈనేర్పు లేకుండ పోవుచున్నదా? ఒకగ్రామములో ఒకరికిట్టివిద్య వచ్చినదన్నచో పదిమందిలో నికి దానంతట అదే ప్రాకిపోవును, ఇవిచాలా మట్టుగ ఇంటిలో పెద్దలదగ్గరనుంచి చిన్నలు ఇరుగువారివద్దనుంచి పొరుగువారు నేర్చుకొనవలసినవే. కాదు పోదనిన ఒకొక్కపట్టణములో నొక్కొక్క సేవాసదనమువంటి సంస్థను స్థాపించి సంవత్సరమున కేబదిమందికి వొప్పున శిక్షణమొసంగినచో చాలును. ఇట్టివి దేశములోని చిత్రకళలను పెంపొందించుటకు ఒకరీతి అంగులు కాని విద్యావిధానములోని అంగనులు కానేరవు. ఇట్టివి కాని విద్యాసంస్థలలో స్త్రీ పురుషులకు ప్రత్యేక విధానములు కాని ప్రత్యేకబడులు కానియేల ఉండవలెనో తెలియదు.

ప్రస్తుతవిద్యావిధానము పురుషులకే జీవనోపాధిమార్గము కాకున్నది గనుకస్త్రీలు కూడ దానినేల అవలంబించవలెనని కొందరి వాదను. కాని ప్రస్తుతపాశ్చాత్య ప్రపంచములోనేమి భరతవర్షములోనేమి విద్య నేర్పబడుచున్నది. ఇదిమంచిదని కొందరందురు కాదని కొందరు తలచవచ్చును. ఎట్లైనను ఉన్నంతలో ఉత్తమ విద్యలను స్త్రీపురుషులు వేఱువేఱు సంస్థలలోకన్న ఒకే సంస్థలో పఠించిననే ఎక్కువ ప్రయోజనములు కలవని నాతలంపు. వానినెల్ల వచ్చేజాబులో వివరించెదను. ఇందునుగూర్చి నీ అభిప్రాయమునుగూడ నీవు వ్రాయవచ్చును.

ఇట్లు
విమల.

[ఈ యంశమును గూర్చి సోదరీమణులు తమ అభిప్రాయములను లేఖలమూలముగా మాకు పేరులు పెట్టుకొని వ్రాసినచో ఇందు ప్రకటింపఁబడును. గృ॥ సం॥]

# ఆరోగ్యబోధిని

### —: ఆరోగ్యకరములగు కాయగూరలు :—

అపుడే పాదులనుండి కోయబడిన మిక్కిలి లేత కాయలను ఆకుకూరలను ఉచితజ్ఞతతో అనగా మితముగాను మిక్కిలి తరుచుగాను తినుచున్నచో ప్రజల కిన్నివ్యాధులు కలుగనే కలుగవు. కాయగూరలను గూడ తినకుండ కేవలము మాంసాహారములను మాత్రమే తినుచుండినచో చాల అనారోగ్యము కలుగుట నిశ్చయము. మనుష్యులు ఆరోగ్యమునుగలిగి దీర్ఘకాలము జీవించుటకు ప్రాణసత్తులును (విటమినులును) ఖనిజలవణములును (మినరలు సాల్ట్సు) మిక్కిలి అవసరము. ఇవి కాయగూరలలోనే మిక్కిలి హెచ్చుగానుండును.

శరీరమునందు విటమినులును, క్షారము (పొటాషు) గంధకము, భాస్వరము (ఫాస్ఫరసు) ఇనుము, లేక సున్నము (లైము) మున్నగు రసవాద పదార్థములును తగ్గిపోవుటవలననే వ్యాధులు కలుగును.

కాయగూరలలో కొన్నిటిలో ఆహారసత్తు మిక్కిలి హెచ్చుగానుండును. ఉర్లగెడ్డల (పొటాటో) లోనుండు గంజిపదార్థము (స్టార్చి) మనుష్యులకు శక్తిని కలిగించునట్టి (కార్బోహైడ్రేటు యనర్జీ) ప్రధాన ద్రవ్యమై యున్నది. బటాణీలు, చిక్కుడుగింజలు, కాయధాన్యములు మున్నగు వాటిలో శరీరము నిర్మించుట కవసరమగు మాంసకృత్తులు (ప్రొటీను) విస్తారముగానున్నవి. కాయగూరలలో నత్రజని తక్కువగానుండును గాన కాయగూరలతోపాటు గింజలను కాయ ధాన్యములనుగూడ తినుచున్నచో ఆలోటు తొలగిపోవును.

శరీరమునందలి అంతర్భాగముల నిర్మించుటకు కాయగూరలలోని మాంసకృత్తులుమాత్రమే చాలవు. జంతువులలోని మాంసకృత్తులుగూడ అవసరమే యగును. ఇందులకు పాలు, పెరుగు, నెయ్యి, వెన్న మున్నగు వానిని తినవలెను.

కాయధాన్యములను తినుటకు ముందు వాటిని మొదట మంచినీళ్లలో (సాఫ్టు వాటరు) నానబెట్టవలెను. ఉప్పునీళ్లలో (హార్డు వాటరు) నానబెట్టినచో కాయధాన్యములోని మాంసకృత్తులును గట్టినీళ్లలోని సున్నమును వుప్పునుకలసి, కరిగిపోనట్టి యొకమిశ్రమ పదార్థముగా నేర్పడును. నీళ్లను మృదువుగా చేయుటకు ఆ నీళ్లలో ఒకచిటికెడు సోడా బైకార్బనేటును కలుపవలెను. శాకాహారము లన్నిటిలోను కాయధాన్యములలోనే క్షారము మిక్కిలి హెచ్చుగానుండును. ఈక్షారము రక్తాణువులను నిర్మించును. కండరములను తగివస్థితిలోనుంచి కాపాడును.

చర్మమును శుభ్రపరుచుటకు ఆకుకూరలు మిక్కిలి శ్రేష్ఠమైనవి. కావున తమ ముఖకాంతి బాగుగానుండవలెనని కోరెడు వారందరును ముఖ్యముగా స్త్రీలును కాబేజీ, టర్నిపు మున్నగు వాని ఆకులను కొనలను యెంతమాత్రమును పారవేయగూడదు. ఆకు కూరలలోను కారెట్లలోను విటమిను మిక్కిలి హెచ్చుగానుండును. కారెట్లు రక్తమును శుద్ధిచేయును.

రక్తము తగ్గిపోయినవారికి స్పినకును ఈజిప్టుదేశపు కాయధాన్యములును (యీజిప్షను లెంటిల్సు) మిక్కిలి శ్రేష్ఠమైనవి. ఏలననగా వీటిలో యినుము మిక్కిలి హెచ్చుగానుండును. రాడిషులను తినినచో కాల్షియం

లభించును. ఎముకలు పెరుగుటకును శరీరము బాగుగా నభివృద్ధి చెందుటకును గూడ కాల్షియం అవసరమే యగును.

చిక్కుడుగింజలు (బీన్సు) రక్తవృద్ధిని కలిగించును–అన్ని కాయగూరలలోనుండు ఫాస్ఫరసుకంటె హరికటు బీన్సు అను పేరుగల చిక్కుడుగింజలలోనే ఫాస్ఫరసు మిక్కిలి హెచ్చుగానుండును. నాడుల నిర్మాణమునం దదియొక ముఖ్యద్రవ్యమగుటచే నాడీకూటమునకు ఫాస్ఫరసు చాల ముఖ్యమైన ద్రవ్యమై యున్నది. చిక్కుడుగింజలలోను బఠాణీగింజలలోను గంధకముగలదు. ఇది క్రిములను సంహరించును శక్తిమును శుభ్రపరచును. పడుమదనమున బెల్లమును గంధకమును (బ్రిమ్‌స్టోను అండు ట్రీకలు) తినిన వారందరును గూడ యీవిషయమును ధృవపరుపగలుగుదురు. బీటురూటులో చక్కెర మిక్కిలి హెచ్చుగానున్నదిగాన బీటురూటు కొవ్వును వేడిని కలుగజేయును.

కాయగూరలను సరిగా వుడికించకపోవుటవలననే వాటిలోనుండు ఆహారసత్త్వ చాలవరకు తొలగిపోవుచుండును. కావున వీటిని పచ్చడులుగా చేసుకొనితినుటయే ఉత్తమము. ఉడికించదలచినచో ఆవిరిమీద వుడికించవలెను. లేదా కొంచెము వెచ్చచేయవలెను. దీనినే స్ట్యూయింగు అందురు.

సోమయాజుల సోమేశ్వరరావు.

(ఆరోగ్యప్రకాశికమండి).

* * *

నూరేండ్లు బ్రతుకువిధానము

పూర్వ మొకజ్ఞాని "మనుష్యుడు మృతిజెందడు. తన్ను తాను జంపుకొనునని," చెప్పెను. ఇది చాలా నిజము. ఎప్పుడో ఒకప్పుడు యెల్లరును చావవలసియున్నను బహుతక్కువమంది స్వభావికముగా జీవించవలసినంత కాలము జీవించరు. చనిపోవువారివయస్సులు దీసికొని సగటున జూచిన, పాశ్చాత్యదేశములలో సగటు జీవిత పరిమాణము ముప్పది నలుబది సంవత్సరముల మించియున్నది; కాని ఆసియాఖండములోని సగటు వయస్సు ఇరువదియైదుకు మించలేదు. శాస్త్రజ్ఞులు జీవిత పరిమాణము నూరు సంవత్సరములుగా నియమించిరి. కాన చాలామంది తాము బ్రదుకవలసిన కాలములో మూడవవంతు కాలమైనను బ్రతుకుటలేదు. ఈ కారణములచేత జనులు తమ్ముతాము చంపుకొనుచున్నారని చెప్పవచ్చును; లేకున్న వారు నూరేండ్లపైన జీవించియుందురు.

ఈప్రపంచములో కొంతమంది దీర్ఘకాలము జీవించినవారలు గలరు. కొందరు నూరేండ్లకు పైబడి జీవించియున్నారు. ఈనూరేండ్లు జీవించినవారందరు పిన్ననాటినుండియు ఆరోగ్య విషయమై జాగ్రత్తదీసికొన్నట్లు గోచరమగుచున్నది.

మనుష్యుని జీవితకాలము బ్యాంకులోనున్న ధనముతో సరిపోల్చవచ్చును. డబ్బు నిల్వచేసినవాడు కష్టముగా వాడుకొన్నయెడల, నిలువచేసినడబ్బు మరిమరి తీసుకొన నక్కరలేదు; దూబరగా ఖర్చుచేసినయెడల ధనమంతయుముగిసిపోయి బీదవాడగును. ఆవిధముగా మనఆరోగ్యము బ్యాంకులో వేసిన డబ్బుగా భావింపబడును. జాగ్రత్తగల్గియున్న అది క్రమముగా నభివృద్ధిపొందును. శరీరములో నేభాగ విషయమైనను జాగ్రత్తదీసికోని యెడల శరీరారోగ్యముచెడిపోవును. ఇది, బ్యాంకిలో నిలువసొమ్ములో నుంచి కొంతడబ్బు తీసినలాగున, ఆరోగ్యము నేడు కొంత రేపుకొంత చెడి, మనము రోగముచే బాధపడుదుము. రోగిబీదవాడు.

చాలామంది స్త్రీ పురుషులు చిన్నతనమున ఆరోగ్యముగను, బలముగను ఉందురు; కాని వారుచేయరాని దుష్కార్యములు పెద్దలు వలదనినను చేసి చెడు

దురు; మఱియు నల్లమందు పొగాకు త్రాగుడువల్ల కలిగిన రోగములు వారి ఆయుర్దాయముల తగ్గించును, కాన ఆరోగ్యమును చెడుపు దురభ్యాసములను మాని దీర్ఘాయువు కలుగు పనులు చేసిన ఆయుఃకాలము వృద్ధిపొందును. నలుబది సంవత్సరములైన పిమ్మట దురభ్యాసముల విడనాడినవారుగూడ, డెబ్బదిగాని యెనుబది సంవత్సరముల వరకు జీవించినవారు చాలా మందిగలరు.

నూరేండ్లు బ్రతుకుటకు మనుష్యుఁడు మితముగా నుండుట అత్యావశ్యకము. నూరేండ్లు జీవించిన స్త్రీ పురుషుల జీవిత మన్ని విషయములలోను మితముగా నున్నది. ఆహారపానీయములలో మితముగా నుండిరి. ఇంతియగాక కామ క్రోధ విషయములలోగూడ మితముగా నుండవలయును. తృప్తిపడినమనసు ఆయుర్దాయమును వృద్ధి చేయును. కోపము, ఈర్ష్య, అసహ్యము మొదలగునవి శరీరమునకు హానిచేయునవి యగుటచే, ఆయుర్దాయమును తగ్గించును గాన విడనాడుట మంచిది.

అమెరికాలో నూరేండ్లు జీవించియున్న స్త్రీ మొక్కజొన్న, రొట్టె, బంగాళాదుంపలు తిని బ్రదికినది. సిరియాలో 113 యేండ్లు జీవించియున్న యొకఁడు రొట్టె, అత్తిపండ్లుతిని, నీళ్లపాలు మాత్రము త్రాగెడివాఁడు. కొందరు ముసలివారైన తరువాత చాలా మాంసము, సారాయి మఱియు బలమైన పదార్థముల తినవలయునని తలంతురు ఇది గొప్పపొరపాటు. ఎందులకన నీ విషపదార్థము లాయువును తగ్గించును.

ముసలివారికి మృదుతరముగా వండిన అన్నము, ఉడికిన కోడిగ్రుడ్లు, రొట్టె, మఱియు ఈ రొట్టెను మెత్తజేయుటకు వేడినీళ్ళును అత్యావశ్యకము. మాంసము చాలాతక్కువ తీసుకొనుట యుత్తమము. పండ్లు తరచుగా తినవలయును. మఱియు ఉడకబెట్టిన పళ్లు బహుప్రశస్తము.

చాలాకాలము బ్రతుకుట కనుదినపరిశ్రమ మంచిది శరీరము యంత్రమువంటిది. యంత్రముప యోగింపనియెడల త్రుప్పుపట్టును. ఆలాగుననే మనము పరిశ్రమచేసిన యెడల శరీరము గట్టిపట్టును. ముసలి వారు పరిశ్రమచేయని యెడల శరీరము గట్టిబడి కొంతకాలమైనతరువాత కాళ్ళు నడచుట కుపయోగ పడవు. శీఘ్రకాలము జీవించిన పురుషులు అనుదినము వ్యాయామము చేయుట అభ్యాసము చేసిరి. మఱియు వారు చాలా ముసలివారైన పిమ్మట ప్రతిదినము శుభ్రమైన వాయువులో నడచుచుండిరి. మనను శరీరమునలెనే పరిశ్రమ చేయుచుండవలయును. ముసలి వారట్లు చేయుచుండినయెడల చాలామంది చంటి పిల్లలవలె పిచ్చిమాటలు మాట్లాడరు

## దీర్ఘాయువునకు నిబంధనలు.

(1) ప్రతిదినము ఎనిమిదిఘంటలు నిద్రించుము.

(2) నీవుండు గదులలో మంచిగాలి వచ్చునట్లు చూడుము.

(3) శరీర ఉష్ణముతో సమానమగు నీటితో ప్రతి యుదయమును స్నానమును చేయుము. స్నానము చేయగనే దేహమును బాగుగా తుడువుము.

(4) కొంచము మాంసముమాత్రమే తినుము.

(5) అపరిశుభ్రమగు నీరు త్రాగకుము.

(6) మంచిగాలి పీల్చుము.

(7) శరీరములో విషములు, రోగక్రిములు, ప్రవేశింపనీయకుము.

(8) ఎక్కువ పనిచేయకుము, అలసినప్పుడు విశ్రాంతి దీసికొనుము.

(9) ప్రతిదినము పేగులను శుభ్రము చేయుము.

(10) కోపము మనస్తాపము పడకుము. నెమ్మదిగా నుండుము.

శ్రీపాద సుబ్బరామప్ప.




భక్తురాలు — చామెర రాజగోపాలరావుగారు

ఏదిరా నీ మురళి ఊదరా ఒకమారు
సామురాతిరి వేళ నా మోహనాకార!

వ్రేపల్లె వాడల్ల
వెన్నెల్లో చల్లని
వీధుల్లో మెల్లగ
విశ్రాంతి చెందింది!

ఎందుంటివో నాథ!
బృందావనం బెల్ల
నీరాకయే లేక
సిరవించిందిరా!

విసుగులేక యింతదాక
వేచియుంటిని నాథ!
కనులు కాయలు కాచె
కానరావేలరా!



ప్రోత్సాహము — శ్రీమతి ఏ. కోలమ్మగారు

కల్యాణి రాగము—రూపక తాళము



ధీరాభవ జననీతవ కారా త్రిదివత్వ మేతి॥

ప్రేంఖ దలఘు తనయ బంధ
శృంఖలా విఘట్ట జనిత
రింఖ దనల కీల జాల
మర్గసముదయ, మద్యదహతి ॥ధీరా॥
వీరసింహ నాదమిళిత
భేరి నినద మాకలయ్య,
భూరికంప పులకితాంగి
వైరిసంపదయి, బిభేతి ॥ధీరా॥

విజయ కుసుమ మాల్యకలిత
నిజకరయుగ మున్నమయ్య,
విజయసంప దయి, సపూర్వ
గౌరవ, మాసన్నమేతి ॥ధీరా॥
శైలరాజ తుంగశిఖర
ఖేల దతుల కేతన మయి,
లీలయాస్మదీయ విభవ
సారతా మతీవ, వదతి ॥ధీరాభవ॥

## హమీర్ కళ్యాణి—ఆదితాళము

| | | | |
|---|---|---|---|
| ధనిధా \| | రీసా \| | నిసదని \| | పా ,, \| |
| చ-లో \| | సాహే \| | ... \| | లీ ,, \| |
| దనిదా \| | రిగసరి \| | నిసదని \| | పమపా \| |
| చ-లో \| | స-హే-\| | .... \| | లి .. |
| మపగమ \| | గారీ \| | గమపద \| | పమపా \| |
| .. భువ \| | నేశ్వ \| | రి ... \| | న .. |
| మపగమ \| | గారీ \| | గమపద \| | పమపా \| |
| .. సవు \| | మాళీ \| | నె ... \| | ద . ర |
| గామా \| | గారీ \| | సనిసరి \| | సనిసా \| |
| ష న \| | క రి \| | యె...\| | ... |
| ,, గగ \| | గారీ \| | గమపద \| | పమపా \| |
| ,, సుఖ\| | కర \| | న...\| | రి .. |
| మప గగ \| | గారీ \| | గా దప \| | దా ,, \| |
| .. దుఖ\| | హద \| | నా .. \| | రీ ,, \| |
| ,, సస \| | సానీ \| | , దమప \| | గాగా \| గారీ \| |
| ,, మురా \| | తీమా \| | , నియం \| | తర\| ధరి\| |
| గామా\| | పాదా\| | రీ సీ \| | సా ,, \| |
| యే – \| | - - \| | - - \| | - ,, \| |
| దా దరి\| | సా నిద\| | నిసనిద\| | పా మప\| |
| చూా వ-\| | చం దన\| | కుమకుమ\| | కేసర\| |
| గమగరి\| | గపమప\| | గమగరి\| | సా ,, \| |
| అరచన\| | కరిసె-\| | మనహరి\| | యే ,, \| |
| సససస\| | గాగగ\| | పాపపానుపా\| | |
| అబిరగు\| | లాలన\| | పుష్పమాలతీ\| | |
| సీనిని\| | సీనిద\| | పాదరి\| | సనిసా\| |
| మానవ\| | తీధవి\| | మందిర\| | భరియే\| |

చ లో సా హే లీ

(పండిత శ్రీధరవామన గోంధలేకర్ గారి రుక్మిణీకళ్యాణమునుండి.)

# బాలవిజ్ఞానశాఖ

**పాటలు** — సోమయాజుల వెంకటరమణగారు

**అవ్వపాట**

మూలనున్న పిల్లికూన పాలవుట్టికెక్కడం,
కావలున్న ముసిలిఅవ్వ కట్టెతీసికొట్టడం,
పిల్లిపారిపోవడం, పాలకుండ పగలడం,
తాతగారు తన్నడం, అవ్వగారు ఏడ్వడం.

**వినుకొండసీమ**

ఆహా! విచిత్రం వినుకొండసీమ,
ఇతఃపరం కట్టెలు నీళ్లులేవు.
ఆర్కి-సునజ్జ మరిజొన్న బువ్వ,
పితాళ్ళకైన వరిబువ్వలేదు.

---

**హెచ్చరిక** — శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకమ్మగారు, విద్వాన్

కోపంబు కామంబు క్రోధంబు నీకుఁ
దాసహేతువులౌటఁ దరిఁజేరనీకు
మోహంబు మత్సరంబు మదము నీకు
దాహహేతువులౌట దరిఁజేరనీకు
పెద్దలనిరసించి ప్రేలుట నీకు
బుద్ధివిహీనయించు మోహంబు సోకు
చిల్లరజనులతో స్నేహంబు నీకుఁ

జెల్లనుఁ దానిని సేవింపఁబోకు
శ్రీయు సమ్మెచు సంచరించుట నీకు
గాలంబు కైవడి గళమునఁబోకు
పరులనేరము లెంచఁ బాడికాదు నీకుఁ
బోరుగిండ్లకునుబోయి పోట్లాటలేకు
చెప్పినమాటలఁ జెవిఁబెట్ట నీకుఁ
దప్పుగానున్న నాదరిఁజేరరాకు

---

**కాకా కాకా దోనోం నయన్ మత్ ఖావ్.** — శ్రీమతి బసవరాజు వెంకటరాజ్యలక్ష్మమ్మగారు

పరిహ్యాదేశపు అరణ్యంలో వరకొండనాగు దగ్గరకూర్చుని చాలాకాలంనుంచీ షేక్ ఫరీదు అనే ఫకీరు తపస్సు చేసుకుంటూ వుండేవాడు. ఆయన జన్మలో ఎప్పుడూ ఎవరికీ అపకారంచేసియెరుగడు ఉపకారంకోసం తన శరీరమైనా యిచ్చేవాడు ఆ అరణ్యంలో వుండే కాకులుమొదలైన పక్షిజాతులు వాటికి ఆకలితీరేటంతవరకు ఆయనశరీరంలో మాంసం పొడుచుకుతిని ఆయనకమండలంలో నీళ్లు తాగి ఆ అరణ్యంలో చెట్లమీద స్వేచ్ఛగా విహరించేవి. ఫకీరుమాత్రం కదలకుండా నిశ్చలంగా తపస్సు చేసుకుంటూనే వుండేవాడు. ఇల్లా చాలాకాలం గడిచింది. ఫకీరు శరీరంలో ముఖంతప్ప మిగతాశరీరంలో మాంసం యావత్తూతినేసినయి. వట్టిశల్యాలు మాత్రం వున్నయి అప్పుడీ కాకులన్నీ

ముఖంకూడ పొడుచుకుతినటం మొదలు పెట్టినవి. అప్పటికి కూడా ఫకీరు నిశ్చలంగా తపస్సుచేసుకుంటూనే వున్నాడు. ఇంకా కొన్నిరోజులుపోగానే రెండుకళ్లూకూడా పొడుచుకుతినబోతున్నాయి. అప్పుడు ఫకీరు "కాగాకాకా దోనోనయన్ మత్ ఖావ్" అని వాటిని బతిమాలుకున్నాడు. కాకుల్లారా కాకుల్లారా యీ రెండు కళ్లుతప్ప మిగతంతా తినండి నేను యెంతకాలంనుంచో అల్లాని గూర్చి తపస్సుచేస్తున్నాను. ఆ అల్లాని చూచేటంతవరకూ యీ రెండు కళ్లుతినకండి అని దీనంగా ప్రార్థించాడు. మహానుభావుడైన ఆ ఫకీరుశరీరంలోమాంసం తినటంవల్ల ఆపక్షులకుకూడా జ్ఞానం కలిగింది. ఫకీరుమాటలు వినగానే ఆ పక్షులకి పశ్చాత్తాపంకలిగి అయ్యో!! యిల్లాంటి మహానుభావుడి శరీరం లోకండంతా తినేశామే! యీఫకీరుకి చాలా అపచారం చేశామే! అని విచారపడి ఫకీరు చుట్టూ ప్రదక్షిణంతిరిగి ఆయన కాళ్లముందు వాలినవి. అప్పుడాఫకీరు ఫరవాలేదని వాటిని ప్రేమతోసమిరి ఆశీర్వదించాడు. షేక్ ఫరీదుయొక్క తపస్సుకి భూతదయకి అల్లా మెచ్చి ప్రత్యక్షమైనాడు. షేక్ ఫరీద్, నీఓర్పు పరోపకారము చాలా మెచ్చుకోదగినవి. యీపక్షులయాకలితీర్చటంకోసం నీశరీరంలో మాంసం యావత్తూ యిచ్చేశావు. నీకేం కావాలో కోరుకో యిస్తానన్నాడు. అప్పుడు ఫకీరు అల్లాకి భక్తితో సలాంచేసి అల్లా! నిన్ను చూడటంకోసమే యిన్నిరోజులనుంచీ యీకళ్లని యీపక్షులు తినకుండా కాపాడు కున్నాను ఈకళ్ళున్నందుకు నేటికి నా కోర్కె సఫలమైనది. ఇంకనాకు ఏవిధమైన కోర్కెలులేవు. యీ పక్షులకీ నాకూకూడా ఎప్పుడూ నీ సన్నిధిలోనే వుండేటట్లు వర మియ్యమనికోరాడు. అల్లా అప్పుడు ఓ ఫకీరా! యీపక్షులమాట నీకెందుకు? నీ కొకడికే వరమిస్తానన్నాను రమ్మన్నాడు. అప్పుడు ఫకీరు అల్లాకి సలాంచేసి అల్లా! నేను తపస్సు చేస్తున్నప్పటినుంచీ యీపక్షులు నామాంసం తింటూ నన్ను విడవకుండా వున్నాయి. నే నొక్కడినేవస్తే వాటికాహారం యెల్లాగ న్నాడు. అప్పుడు అల్లా ఫకీరుయొక్క పరోప కారానికీ పట్టుదలకీ మెచ్చి పక్షులతోకూడా అతనికి తన సాన్నిధ్యమిచ్చాడు.



## డాక్ బంగాళాదయ్యము

శ్రీమతి హవాయీ కావేరిబాయిగారు బి.ఎ.యల్.టి.

"గాలి, దయ్యం, భూతం, పిశాచం!" వీనినిగూర్చి యనేకకథలు చెప్పుకొనుటవాడుక. ఇందు విశ్వాస మున్నను, లేకున్నను, వినుట కభ్యంతరముండదు. అశరీరరూపులగు శిష్టలేక దుష్టఆత్మలు, వాని తలచు వారియాహాయం దేగాని, మరెంతను లేవని కొందఱి నమ్మకము. నిజానుభవమునలన వేరువిధముగా బలుకు వారు కొందఱు. ఏది యెట్లున్నను, దయ్యాల కథలు మాత్రము మెండుగా నున్నవి. మరొకవిశేషముకూడ గలదు. ఏమన, మనదేశమందుగల దయ్యాలసంఖ్యకు, ప్రపంచమున నేనాగరికతగలదేశమైనను సాటిరాదు. ఎందుకనగా శ్మశానభూములు, పెద్ద కట్టడములు, పురాతనమందిరములు, పెక్కుకాలమునుండి కాళీ పడియున్న లేక పాడుపడినయిండ్లు, బావులు, చెఱువులు, చింత, రావి, మఱ్ఱి మొదలగు వృక్షజాతు లన్నియు నీ యాత్మలకు కాపురస్థలములందురు.

పెక్కుమందికి దయ్యాలకథలు వినుటయందు ప్రీతి. బాలికాబాలురకు మరింతకుతూహలము. నా యుద్దేశము, దయ్యాలకథలు నుడువుమని చేరు చిన్నివారికి నేను తఱచుగా జెప్పుచుండువానిలో ఈ దిగువకథ యొకటి.

ఒకానొక ప్రయాణికుడు ప్రొద్దుక్రుంకువేళ నొక గ్రామము జేరెను. ఈ గ్రామమునకు జెందిన డాక్ బంగళా యేకాంతముగానుండెను. ఎన్నడో గాని, బాటసారు లీమార్గమున వచ్చుటయైనను, బంగళాయందు విడిదియుటయైనను బహుఅరుదు. మన ప్రయాణికుడు గ్రామస్థులను డాక్ బంగళాకు దారి నడిగెను. అతనికి వలయునన్ని విషయములు వివరించి, చీకటిపడుటకు పూర్వమే యా బంగళాను విడిచిపెట్టి వెళ్లనిచో నచ్చటనున్న దయ్యమతని ప్రాణములు తీయుట నిక్కమని గ్రామస్థులు చెప్పిరి. రాత్రులందు బసచేయుటకు సాహసించినవారెవరును, మరునాటికి సజీవులై యుండలేదని నొక్కి పలికిరి.

ప్రయాణికునకు రాత్రి గడుపుటకు మఱెచ్చటను స్థలముండలేదు. మరియు నీసమాచార మతనిని బెదరగొట్టుటకు బ్రతిగా నాబంగళాలోని వినోదచోద్యములను శోధింపవలెనను ఉత్సాహము బుట్టించెను. ఇతడు బంగళా సింహద్వారము సమీపించునప్పటికి దానికిజెందిన సేవకులలో నొక డాయన నెదుర్కొని వంగి, సలామిడి, యిట్లనెను.

**"Saar, Saar, beeg devil here, Saar Bad bungalow, All Sahibs sleeping nights here, dead morning, Saar other place go."**

బాటసారి డస్సియుండుట చేతను క్షుత్పిపాసాబాధాపీడితుడై యుండుటవలనను, కదలి వెళ్లనని చెప్పి, భోజనము తయారుచేయుమని యుత్తర వొసగెను.

**"Boy afraiding bungalow after 7 O' clock Saar, boy serve Khana 6 O' clock and of away, Don't blame boy when devil comes"** ఇట్లు, బాయి, లేక బట్లర్ పలికెను.

గోక్షీరమెట్లో సంపాదించి, డాక్ బంగళా కాంపౌండులోనే యితనియిల్లుండుటచే, నతడు పెంచుచున్న కోళ్లలో నొకదానిని, కొన్ని గ్రుడ్లను వంటలుచేసి, మిక్కిలి భయముతో దొరభోజనపు బల్లమీద వడ్డించి సలాంపెట్టివేసి మరి నిలువక పారిపోయెను. దొరతెచ్చుకొన్న బిస్కోతులు, సారా, పైకి దీసి, విందారగించెను. మనోధైర్యము కొఱకు విస్కీ కొఱత లేక గ్రహించెను. పిమ్మట చుట్టకాల్చుచు నొకవార్తాపత్రికను పఠించుచు గూర్చుండెను.

కొంతసేపటికి కితనిశరీర మెందుచేతనో అకస్మాత్తుగా పులకరించెను. ఎదుటనున్న భోజనపుబల్లమీది కితని దృష్టి వెళ్లెను. దానిమీద రెండు మానవపాదములు మాత్రమే గోచరమయ్యెను. ఇతడు విస్మయమొందుచుండునంతలో, పాదములనుండి మోకాళ్లవరకు శరీరము పెరిగెను. వెంటనే తొడలు, పిమ్మట నడుమువఱకు, నటనుండి వక్షస్థలము, శిరము, హస్తములు, మొదలైనవి, వానివాని స్థానములలో నతుకుకొని యొక సుందరపురుషుని నిండు ఆకారమును వెల్లడిచేసెను. ఇతడు ప్రయాణికుని ముఖమును, చిఱునవ్వుతో రెప్పవేయక, చూచుచుండెను.

బాటసారి ఒడలు నీరయ్యెను. కాని ధైర్యము బిగబట్టి, మ్రోలనున్న విగ్రహమును బలుకరించి, యతడెవరనియు నెందునిమిత్తమిట్టి వికృతవిధముగా వచ్చియుంగెననియు, బ్రశ్నించెను. అందుల కారూపమిట్లనెను.

"నీవుకూడ నన్నుజూచి ప్రాణములు విడుతువని భయపడితిని. నేనెవరికిని హానిచేయువాడను కాను. ఒక విన్నపము చేయుటకొఱకు వచ్చుచుందును. కాని యెందుచేతనో, నన్ను జూచువారందఱు భయపడి చనిపోవుచున్నారు. నీవొక్కడవు, నన్ను బలుకరించుచున్నావు కావున, నాకోరిక నెరవేర్చగలవని నమ్ముచున్నాను. ఒక చిన్నకార్యము జేసినయెడల, నాకు విడుదలగలిగించిన మహానుభావుడ వగుదువు. నేను



ఏలూరులో శ్రీమోతేకృష్ణారావు జమీన్దారుగారి 'రామకృష్ణభవనము'న తీర్చబడిన "కొలువు"లో నొకటవ దృశ్యము.

శ్రీమతి నాళం కృష్ణకుమారి. ఛా॥చి॥



('కొలువు' రెండవదృశ్యము')

మరల నిచ్చటికిరాను. లేనియెడల నీరీతిగా దిరుగవల సినవాడనే."

సమాచార మేమిటో చెప్పుమని బాటసారి యడిగెను.

"నా జీవితకాలమందు నేనొకవర్తకుడను. రైలు పడుటకు పూర్వ మీబాటలో నిప్పటికంటె రాక పోకలు మెండుగా నుండెను. ఒకనాడు కొంతధన ముతో నేను ప్రయాణము చేయుచుండగా నీగ్రామ మువద్ద ప్రొద్దుక్రుంకెను. అడవులలో బ్రయాణము చేయుటకు భయపడి, యిచ్చటికి వచ్చితిని. నాయొద్ద ధనముండు సంగతి తెలిసికొని, యప్పు డిచ్చటనున్న నౌకరులు నన్ను చంపివేసిరి. పిమ్మట నీవు నారూ పము తయారగుట నేరీతిని జూచితివో, యదేప్రకా రముగా నాశరీరమును తునకలుగా నటికి యామూల యందు నేలను కొంతత్రవ్వి, యీముక్కలను పూడ్చి వేసిరి.

"నాకు సరియైన సమాధిచేసి నంతపఱకు, నాయా త్మశాంతి లేక, బాధతో నిట్లు తిరుగును. నీవు నా యెముకలను త్రవ్వి తీసి, సరియైన యాకారముగా నమర్చి, సమాధిలో పెట్టినయెడల నాయాత్మకు తృప్తి కలుగును."

"అట్లుచేసినయెడల వాస్తవముగా, బాటసారులకు తొందరబెట్టుట మానుదువా ?" యని దొరయడిగెను.

"నిస్సందేహముగా. అయితె నాకోరిక నెరవేర్చు దునని వాగ్దానము చేయుము."

బాటసారి వాగ్దానముచేసెను. ఆరాత్రి సేవకుల యిండ్లలో బాటసారి మరణమును గూర్చియే ముచ్చ టించుచుండిరి. వేకువజామున నితని కళేబరమును జూచుటకు మెల్లగావచ్చి తొంగితొంగి చూచిరి. ప్రయాణికుడు చుట్టకాల్చుచు కూర్చుండెను.

పిమ్మట వర్తకుడు చూపినమూల చెంతనేలను త్రవ్వగా నతడుచెప్పినప్రకారమే యెముకలు బయలు పడెను. వానిని దీసి సరిగాజేర్చి తోటలో నొకమూల యందు సమాధిచేసిరి. నాటినుండి యాడాక్‌బంగళా, దయ్యముల భయములేకున్నదని చెప్పుదురు.



<u>చిత్రప్రశ్న</u>

శ్రీమతి పసుమర్తి లక్ష్మాయమ్మగారు

పంచాక్షరములొక్క పంక్తిగావ్రాయగా నేకదంతుండయ్యె బ్రాకటమున
మొదటివర్ణముమాన్పి ముదముతోజదువగా నబ్జాసనుండయ్యె నంతలోన
ఇరువర్ణములుమాని గరిమతోబల్కగా వారిపౌత్రుండయ్యె వైభవముగ
తిగవర్ణములుపాపి తేటగావర్ణింప నలరువిల్తుండయ్యె సలలితముగ
ఏకవర్ణమునిల్పి యెలమితోబలియింప హవ్యవాహనుడయ్యె నందముగను
నిటిశిబాధరములుమీర లింపుతోడ మదివిచారించి పదునైదుమాసములకు,
చెప్పగదరయ్య సత్కవిశ్రేష్ఠులార!

# చిత్రప్రశ్నలకు సమాధానములు

గతసంచికలోని చిత్రప్రశ్నకు శ్రీమతులు యనమండ్ర వసంతాబాయి, కంకిపాటి రుక్మిణమ్మ, పాకల చంద్రకాంతామణి, దామోజీపురపు లక్ష్మీనరసమ్మ గార్లును, శ్రీయుతులు యక్. లక్ష్మణరావు. యస్. కె. డి. ప్రసాదలింగం అల్లంరాజు వెంకట్రావు, సి. హెచ్. సత్యనారాయణ, పి. పేరరాజు, డి. సోమేశ్వర రావు గార్లును సమాధానములు వ్రాసిరి. బడబ, మహిమ, వటువ, కునుకు, కణిక, కంచుకం, గరగ, కరక అనునవి క్రమముగా సమాధానములని యెరుంగునది.




### — అరటిపండ్ల పూరీలు —

ఒక శేరు మయిదాపిండి తీసికొనివచ్చి 20 తులముల నేతిలో వేసి ఒక బాణలితో పొయిమీద పెట్టి యెఱ్ఱగా నగునట్లు వేచి దించియుంచవలయును. తర్వాత బాగా పండిన అరటిపండ్ల గుజ్జు 1 శేరగునట్లుగా జూచి సంగ్రహించి దానిలో పదితులముల వెన్న వేసి చక్కగా పిసుకవలయును. ఇట్లు పిసికిన దానిలో వయిని చెప్పబడిన మైదాపిండియు తులము యాలుకపొడియును, 8 తులముల దాల్చిన చెక్కపొడియును, పొట్టుతీసిన బాదంపలుకులు 5 తులములును వేసి లెస్సగా కలుపుకొని విస్తారము పలుచగా గాకుండ ముద్దగాను చేసి వాటిని బిళ్ళలుబిళ్లలుగా పలుచగా జేసికొని 15 తులముల నేయి బాణలిలో వేసి యీబిళ్లలను దానిలో వేసి యెఱ్ఱగా వేగునంతవరకు నేతిలో నుంచి పిమ్మట నొకపుల్లతో దాని మధ్యను పొడిచి రెండుమూడు నిమిషములుంచి పిమ్మట తీసి ఒక పళ్లెరములో నుంచవలయును. ఇట్లు సిద్ధమైనవానిపైని కలకండపొడి చల్లుచుండవలయును. ఇది భుజించుటకు ఆరోగ్యముగా నుండును.

### — అరటిపండ్ల మేవా —

ఇరువది చిన్న సువాసనగల, పక్వమయిన యమృతపాణిపండ్లను దెచ్చి, యొక శేరు చక్కెర పాకము చేసి, యాపాకములో నొక యర్ధపావు ప్రశస్తమగు నిమ్మపండ్లరసమును బోసి (తొక్కలను పిండకూడదు) బాగుగా కలిపికొని, తర్వాత మూడు తులముల యాలుకపండ్లపొడియును, 5 తులముల బాదంపలుకులును, 5 తులముల గసగసాలపాలను, నీళ్లతో మెత్తగా నూరి వాటిపాలును (గుడ్డలో వేసి పిండుకొనవలయును.) వేసి యొక్కజాజికాయ, దానియొత్తు జాపత్రి, వీటిచూర్ణమును, ఒక నాల్గుతులముల మల్లెపూవులను గాని గులాబిపువ్వులను గాని నానవేసిన నీళ్లును పోసి, ఇవియన్నియు బాగా కలియునట్లు ఆపాకమును చక్కగా కలుపవలెను. ఆ యరటిపండ్లను ఆ పాకములో వేసి కొంతసేపుంచి పిమ్మట నొక బాణలిలో 15 తులముల సువాసనగల నేయిపోసి మరిగిన తర్వాత నీపండ్లను ఒకటొకటిగా వేయుచుండవలయును. పిమ్మట వాటిని తీసి యొక పళ్లెములో నరటియాకు వేసి వాటిపై నుంచుకొని యీపండ్లన్నియు దీసిన వెనుక పాత్రలో మిగిలిన పాకమును బాణలిలో పోసి సన్నపుమంటమీద కలుపుచుండవలయును. పిమ్మట నది చిక్కబడుట చూచి దించుకొని యీయరటియాకున నుంచిన పండ్లను దానిలో వేసి కుదుపవలయును. వయిపాకమంతయు కళాయిపాత్రలోనే చేయవలయును.

శీలా అప్పలకొండ.

### —: సూరత్ గారీ :—

చిక్కని గేదెపాలు అరపడి బాణలియందుపోసి సన్నటి సెగపై కలుపుతూ మరగబెట్టిన జున్నుముద్దవలె కోవా తయారగును. కోవా అంత మైదాపిండి దోరగా వేయించి దానిని, సుమారుగ నేతిలో వేయించి పొట్టుతీసిన ముంతమామిడి, అక్రోటు, బాదంపప్పులను, చక్కెర, యాలకులపొడి, కుంకుమపువ్వు, చారపప్పు, ద్రాక్షకలిపి పూర్ణము తయారు చేయవలయును. నానబెట్టిన మైదాపిండిని అప్పడములవలె చేసి మధ్య పూరణమునుంచి కొనల నీళ్లతో తడిచేసి ఒకటిగ చేర్చి కుచ్చెళ్లవలె నొక్కి మిగిలినభాగములను వేరుచేయవలెను. ఇట్లు తయారుచేసిన వీటిని నేతిలో సన్నటి సెగపై దోరగా వేయించితీసి యుంచవలయును. వీటినే సూరత్ గారీ అని యందురు. వేడిమీద అంతగ రుచించవు ఇది చాలారుచికరమైన వెలగల ఫలహారము. అరపడి గేదెపాలు, అరపడి మైదాపిండి (కోవాలో చేర్చుటకు అప్పడములు చేయుటకు అరపడి చాలును) 5 పలముల బాదంకాయలు, 5 పలముల అక్రోటు, 2 పలముల ద్రాక్ష, 1 పలము చారపప్పు, 2 పలముల ముంతమామిడిపప్పు 10 పలముల చక్కెర, నెయ్యి, కొంచముగ కుంకుమపువ్వు, యాలకులు. ఇది తయారుచేయుటకు వలయు సామగ్రి.

యస్. వరలక్ష్మిఅమ్మ.




## హెచ్చరిక

నత్తారులను నొక సవర్ణజాతివారికిని హరిజనులకును కొన్నిదినముల క్రిందట దేవకోటలో కొట్లాటలు జరిగినవి. ఇందుకు కారణము నత్తారులు హరిజనులను వారియిష్టమువచ్చిన దుస్తులను ధరించరాదనియు స్త్రీలు రవికలు తొడుగుకొనరాదనియు నిర్బంధించుటయై యున్నది. సుమారు 150 మంది నత్తారు ప్రతినిధులు మహాత్ముని కలసి మాట్లాడిరి. హరిజనులెట్టి నేరమును చేయకున్నను వారిని కొట్టవెళ్లుట అన్యాయమనియు, ఒకవేళ నెట్టి నేరమును చేసినను న్యాయస్థానమున ఫిరియాదు చేయవలెనే కాని న్యాయాధికారమును వహింపరాదనియు, ఎవరి కిష్టమైన దుస్తులను ధరించుటకు వారికి హక్కు కలదనియు, జాతులలో ఒకటి హెచ్చు ఒకటి తగ్గు అనుభావమే ఇట్టి విపరీతచర్యలకు కారణమనియు మహాత్ముడు వారికి బోధించెను. హరిజనులుకూడ హిందువులే గనుక హిందువులెల్లరు నుపయోగించుకొనెడి చెరువులు, బావులు, బాటలు, బడులు గుడులు ఉపయోగించుటకు వారికిని హక్కు గలదనియు మహాత్ముడు చెప్పెను.

హరిజనులకు వేరే బావులు నూతులు తమచే త్రవ్వింపబడినవనియు, వానిలో నీరు తోడుకొనుటకు తామభ్యంతరము చెప్పలేదనియు, వానిలో నీరులేనప్పుడు అవి త్రవ్వించక పూర్వము తామే నీళ్లు తోడి తెచ్చి వారికి పోయుచుంటిమనియు, వారు నగలు పెట్టుకొన్నచో తమ కభ్యంతరము లేదనియు, సాధారణసమయములలో నెట్టి దుస్తులను ధరించినను పండుగలలో తమయిండ్లకును నిర్ణీతదినములలో దేవాలయములకును వచ్చునప్పుడు నిర్ణీతమైన దుస్తులను ధరించవలెననియు వారు చెప్పిరి.

ఇట్టి భావములకు కారణము అస్పృశ్యతాసిద్ధాంతమనియు, మానవులెల్లరు సోదరులు సమానులు అను భావములేకపోవుటయనియు చెప్పుచు, వారు తమ సోదరులైనచో వారినట్లే నిర్బంధింతురాయని మహాత్ముడు వారిని ప్రశ్నించెను.

ఇది దేశాచారమనియు, మానవులెవరివృత్తులు ఆచారము ప్రకారము వారువర్తింపవలెననియు, తాము ధర్మమును మాట్లాడుచున్నాము గాని కోర్టులలో జరిగెడి న్యాయమునుగూర్చి మాట్లాడలేదనియు వారు తెలిపిరి.

ఆచారములలో సదాచారములు దురాచారములు కూడ యుండుననియు, సదాచారములను మాత్రమే అనుసరించి దురాచారములు పూర్వకాలమునాటివైనను విడిచిపెట్టవలెననియు, హరిజనులు పాకీవృత్తి చేయకుండినను చింకిదుస్తులు చాల్చుననియు నిరాకరించినచో వారిని నత్తారులు నిర్బంధించజాలరనియు, తాను ధర్మమును న్యాయమునుకూడ మాట్లాడుచున్నాననియు మహాత్ముడు వక్కాణించెను.

హరిజనులకును తమకును తగాయిదా లేకుండెననియు క్రైస్తవప్రచారకులు వారికి చక్కని స్త్రీలను ఎక్కువ రొక్కమునిచ్చెదమని యాశపెట్టి తమ మతములో చేర్చుకొని యేమియు నీయక యిట్టి భేదబుద్ధిని కలిగించుచున్నారనియు, క్రైస్తవులెల్లరును తిరిగి హిందూ మతములోనికి రాగోరుచున్నారనియు వారు చెప్పిరి.

హిందూమతములో నిట్టి అన్యాయముండబట్టియే క్రైస్తవమహమ్మదీయులు అట్టి చర్యలను చేయగలుగుచున్నారనియు మనలోపములను మనము సర్దుకొన్నచో ఎట్టి చిక్కును ఉండదనియు మహాత్ముడు చెప్పెను.

(1) కొందరగ్రజులు కొందరంత్యజులు అనుభావముండరాదు.

(2) ఎవరియిష్టమైన వేషభాషలు వారవలంబించుటకు ఇంకొకరభ్యంతరము చెప్పరాదు.

(3) పూర్వాచారములను ప్రమాణముగా చూపి వారికితర హైందవులకుగలహక్కుల నిరాకరించరాదు.

ఇట్లు చేసినచో విద్వేషములుండవు లేనియెడల హిందూసంఘము పెక్కుకష్టముల పాలగునని వారికి మహాత్ముడు హెచ్చరిక తెలిపెను.

* * *

## ప్రశ్నోత్తరములు

ప్ర. మహాత్మా, తాముపచ్చినప్పుడు ప్రజలీహరిజనోద్యమమునకు సహాయముచేయుదురు. తాము వెళ్లిపోగానే మరిచేయరు కనుక తాము రానప్పుడుకూడ మాకుధనము వసూలయేటట్లు ప్రజలకు బోధచేయరాదా?

ఉ. ప్రజలను నిందించిన లాభములేదు. మీరు శాంతము శ్రద్ధపూని లాభకరమైన పనులను చేయుచూనినచో తప్పకుండా సహాయమువచ్చితీరును.

ప్ర. హరిజనసేవకులకిచ్చు జీతములు అయుక్తమైన ఖర్చులక్రిందకు వచ్చునా?

ఉ. వారి విద్య ఆరోగ్యము మొదలగు వానికొరకు చేయుఖర్చులురావు. ఆఫీసుఖర్చు లెక్కువైనచో అయుక్త మనవలెను.

ప్ర. హరిజనులు సవర్ణుల సేవకులనియు, వారికి సౌకర్యములు కలిగించుట సవర్ణులకర్తవ్యమనియు మీరు పలుమారు చెప్పుదురు. ఇది నిజమేనా?

ఉ. ప్రస్తుతము హరిజనులు సవర్ణులకనంతమైన సేవలుచేయుచున్నారు గనుక వారి సౌకర్యములను గూర్చి నిర్లక్ష్యము చేయుట సవర్ణులకు మహాపాతకము. హరిజనులిట్లే సర్వదా సేవకస్థితియందుండవలెనని నా యుద్దేశ్యము కాదు.

ప్ర. హరిజనులు సవర్ణులపేరులవంటి పేరులను పెట్టుకొనవచ్చునా

ఉ. కొందరట్లు చేయుచున్నారు కాని నాకిష్టములేదు. సవర్ణులు పశ్చాత్తాపపడి వీరిని తమలోకి చేర్చుకొనవలెనే గాని వీరు కృత్రిమనామములను దాల్చి సవర్ణులవలె కనిపించుటకు ప్రయత్నించరాదు.

ప్ర. తమరు స్త్రీలను వారి నగలనిమ్మని కోరుచున్నారుగదా పురుషులను తమగర్వసూచకములైన జందెములనిమ్మని ఏలకోరరాదు.

ఉ. రెండింటికిని సామ్యములేదు. జందెములు ఈశ్వరసేవకొరకు మానవులుతమ్ముతామర్పించుకొనుటను సూచించుచిహ్నములు. ఇష్టమైనవారు దాల్చవచ్చును లేనివారు మానవచ్చును. నేను దాల్చలేదు. గర్వసూచకముగ ధరించరాదు. హరిజనులుకూడ వేసుకోవచ్చును. కాని దానిఅర్థము తెలుసుకోకుండ వేసుకొనెడి యాచారమునకు నేను ప్రోత్సాహమీయజాలను.

ప్ర. జాతిభేదము లుండవలెనా? పోవలెనని నా యూహ.

ఉ. ఒకరెచ్చు ఒకరుతక్కువ అను భావముతో నెవ్వరును జాతిభేదములను పాటింపరాదు. ఈశ్వర సృష్టిలో నందరు నొక్కటే. ఆర్థికముగా వర్ణసంస్థ చాలాగొప్పది. ఈసూత్రమును పాటించినచో నిరుద్యోగసమస్య తొలగి అందరికిని వృత్తులు చేకూరును. ఎచ్చుతగ్గు భావములవల్లనే అస్పృశ్యతాదోషము సిద్ధించుచున్నది. జాతులేకావు మతములుకూడ ఒకటికావచ్చును. మనకందరకు నీశ్వరుడొక్కడే. అయినను ఈశ్వరునిగూర్చి పెక్కుమతముల వారికి పెక్కుఅభిప్రాయము లున్నవి కనుక పెక్కుమతము లుండి తీరును. ఒకమతమునెడల నొకరికి ఒకజాతియెడల నొకరికి సహనము స్నేహము ఉన్నచో, ఎచ్చుతగ్గు భావములులేనిచో ఎట్టిచిక్కులును కలుగవు.

# వివాహ విషయములు

విశాఖపట్టణములో శారదాచట్టమునకు విరుద్ధముగ జరిగిన ఒకవివాహములో పెండ్లికుమార్తెతండ్రి దాసు కనకరాజుగారికి రు 200 లు లేక వారముదినములు విడిశిక్షయు పెండ్లికుమారునితల్లి కునుమంచి రామమ్మగారికి రు 50 లు లేక వారముదినములు విడిశిక్ష, పురోహితుడు కొడుకుల చిన్నసుబ్బారావుగారికి రు 50 లు జరిమానా లేక వారదినములు విడిశిక్ష జనవరి 23-వ తేదిని జిల్లామేజస్ట్రీటు విధించిరి.

25-1-34 ఉదయం కీ॥ శే॥ కాజ కోయ్యాటగారి కుమార్తె చి॥సౌ॥ రామతులిశమ్మయను బాలవితంతువును వేములపల్లి వెంకటప్పయ్యగారి కుమారుడు రామబ్రహ్మం బి. ఎ. గారికిచ్చి ఏలూరులో వివాహముచేసిరి. శ్రీమతి ముల్పూరు చుక్కమ్మగారు రు 80 లు పెండ్లికుమార్తెకు కట్నము చదివించెను. పురప్రముఖు లనేకులువచ్చి ఆశీర్వదించిరి.

పెదనగ్రామములో సుప్రసిద్ధ వైశ్యకుటుంబమునకుచెందిన తమ్మన కృష్ణస్వామి గారికుమార్తె 16 సంవత్సరములు వయస్సుగల శ్రీమతి అమ్మాయిని బెజవాడ వైశ్యులగు పొట్నూరు వీరరాఘవగుప్తగారికిచ్చి వివాహమొనర్చిరి. పెక్కుప్రాంతముల నుండి బంధువులువచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

శ్రీయుత బోయిన వెంకటప్పయ్యగారు శ్రీకవివరపు సూర్యనారాయణగారి కుమార్తె సుందరమ్మయను వితంతువును గంజాంజిల్లా నరసన్నపేట గ్రామములో వివాహముచేసుకొనిరి. 18 గ్రామముల కళింగకోమట్లువచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

1934 లో ఇంగ్లాండులో 3,07, 184 వివాహములు జరిగినవి. వీనిలో 29 లో వధూవరులు 75 సంవత్సరములు దాటినవారు. 80 యేండ్లు దాటిన వరులు 86 గురు, కన్యలు 96 గురు. 80 మంది వరులలో 5 గురికి ప్రథమవివాహము.

కున్వారు రఘువీరసింగుగారు మైనరుబాలికల సంరక్షణబిల్లును చర్చించవలెనని అసెంబ్లీలో నుపపాదించిరి. మైనరు బాలికలకు సంరక్షణ లేకపోవుటచేత పసిబాలలను వృద్ధులకును వయస్సు మీరినవారికిని ఇచ్చి వివాహముచేయు దురాచారములును, బాలికావిక్రయములు విరివిగా సాగుచున్నవనియు ఇట్టి చర్యలు శ్రుతిస్మృతివిరుద్ధములనియు తీవ్రముగావాదించి చెప్పిరి. అయుక్తవయోవివాహములవలన పంజాబులోను, సంయుక్తపరగణాలలోను విధవలసంఖ్యయు పనితలయమ్మకమును హెచ్చుచున్నవని నిరూపించిరి. ఇట్టి చర్యల నాపగల క్లాజులు ఇండియను పినలుకోడ్డులో లేకపోవుటచేత ఇట్టిచట్ట మవసరమగుచున్నదని తెలిపిరి.

బరోడాలో స్త్రీలవారసత్వపు హక్కుసందర్భమున నొకచక్కని శాసనము చేయబడినది. సంయుక్తకుటుంబములోని విధవ స్త్రీ తనభర్తఆస్తికి తనబావలు మరదులవలె సమానహక్కు కలదగుచున్నది. ఆమెకు సంతానమున్నచో తనకొడుకులతో సమానమైన హక్కు సిద్ధించుచున్నది. పూర్వము హిందూకుటుంబములోని కూతురునకు ఆస్తిహక్కు లేదు. వివాహాది ఖర్చులను మాత్రమే కుటుంబము భరించవలెను. ఈలోగా కుటుంబము విభజనమైనచో, తనసోదరునకు వచ్చునంతలో $\frac{1}{4}$ వంతు ఆమెకు వచ్చెడిది. దానికై పంపకమునిమిత్తము దావాచేయ వీలులేదు. ఇప్పుడు ఆమె తన $\frac{1}{4}$ వంతును తాను పుచ్చుకొని తనయిష్టము వచ్చిన ఖర్చుపెట్టుకుంటూ వేరే జీవించవచ్చును. కుమార్తె విధవయైనప్పుడు భర్తలకుటుంబమువారు బీదవారైనప్పుడు పితృకుటుంబపుటాస్తినుండి, ఆమె పితృకుటుంబముతో జీవించకోరు నేని, ఆకుటుంబ యోగ్యతకుతగినట్లు మనువృత్తిని బడయగలదు.

# నవ్వుతాలు

## టెలిఫోన్—అదర్ వర్ల్డ్

'హల్లో—హల్లో'

'ఆఁ'—'ఎవరుమీరు?'

'ఆఁ'—'అదర్ వర్ల్డా?' 'ఆఁ'—'ఎన్ట్రెన్స్ ఎగ్జామినేషన్ పరీక్షా?' వెళ్ళారా?—

'సరే'—'హల్లో'—'ఆఁ'—'రమ్మంటారా?'

"హల్లో—ఆఁ—'వద్దంటారూ?'—'ఆఁ'—రమ్మంటే వస్తాను. అభ్యంతరంలేదు."

"హల్లో"—ఆఁ—సరే మీకు తోచినప్పుడే కానియ్యండి" "వెంటనేవస్తాను."

"ఏమంటారూ—ఏలాగున్నామనా?—చిత్తం చెప్పమంటారా?—చల్లారిపోయిన అప్పడంలాగ చప్పబడి సాగిసాగి సగముచచ్చి—"

"హల్లో—ఏమిటంటారూ?—మాపూర్వులా? వాళ్లు పూర్వం గరగరలాడుచుండేవారని మీవంటి పెద్దలు చెప్పడం విన్నాంగాని—"

"హల్లో—ఆఁ-మాకా—మాలోమాకా!—ఆఁ—చిరచిరా! పరపరా! మెరమెరా!"—"ఆఁ?—ఆఁ? బోధపడదంటారా?"—"ఏమంటారూ?—ఏదో కొత్తమాటపడేస్తున్నారే!!"—"అయ్యో? ఏమిటే?—సిగ్గా?—ఏమిటేమిటీ?—బిడియమా?

హల్లో—తెలిసింది తెలిసింది—చిత్తం చిత్తం—చిత్తనాలుంటే పొట్లంకట్టి—" హల్లో—హల్లో! ఆఁ?—"మాకు చిన్నతనంనుండీ తెలియన్దే!!"

"ఆఁ?"—"మావాళ్లా?—ఆఁ—వచ్చియుంటారేమో"—"హల్లో—ఏమంటారూ?—స్పష్టంగా—దయచేసి—రాష్ట్రాందోళన చేయడానికా? వచ్చారేమో అంటారా?—కాదయ్యా!! మరువం, దవనం, మావిడికాయలూ కొనుక్కోడానికేమో?" "ఆఁ—కాదంటారా?—

"ఐతే మీదనున్నవారు మీరే చెప్పరాదూ?—ఆఁ?—యేమిటీ?—చెప్పనంటారా?—పంతులా?—వంతులా?—బంతులాటా? గట్టిగా చెప్పరాదా?

"మీ రరవలా?—కాదూ?—తెనుగువాళ్లే? !!

"అయ్యోరామా"—మళ్లీ సావకాశంగా మాట్లాడుదామంటారా?—పనుందా?—చిత్తం—అలాగే—ఎంతమాట!! మీవంటి పెద్దలుపిలిస్తే మాకు కోపం కూడానా?—ఆ?—హల్లో—మన కనెక్షన్ బ్రేక్ చేయమన్నంటారా?—మీరెవ్వరో సరీగా తెలియలేదే!! ఆఁ—ఆఁ—ఆఁ! ఆఁ!?—పరీక్షతొందరా? సరే చిత్తం సెలవు"

"పేరుచెప్పకూడదూ?" ఆఁ—రామలింగమా?" "సరే! తెలిసింది!!"

ప॥ కృ మూ॥

* * *

శంకరయ్య:—వీరయ్యా! నీవిప్పు డేతరగతిలో చదువుచున్నావమ్మా!

వీరయ్య:—ఫస్టుఫారమండి!

శం:—పోయినసంవత్సరమో?

వీరయ్య:—అప్పుడుకూడా యిదే!

శం:—యీసంవత్సరము ఎందుకు ప్యాసుకాలేదు?

వీ:—ప్యాసుఅయితే పైతరగతికి జీతముయెక్కువ అవుతుందనండీ!

భ॥ ల॥ నా॥

* * *

మేష్టరు:—రాముడూ! రాముడికి సీతేమవుతుందిరా!

రాముడు:—సార్! చెల్లెలవుతుందండి.

మే:—చప్ వెధవా! ఎలా చెల్లెలవుతుందిరా?

రా:—మరి మా చెల్లెలుపేరు సీతండీ!

* * *

ఉపాధ్యాయుడు:—కమలా! తాటిచెట్టుకీ, కొబ్బరిచెట్టుకీ భేదమేమిటి?

కమల:—తాటిపండ్లుతింటేవాతం, కొబ్బరిముక్కలు తింటే కడుపునొప్పి.

పా॥ చం॥ మణి॥

# పుష్పచయము

అపర్ణపతిత్వం:—

"డెయిలీ మెయిల్" పత్రికలోని 'హెలెన్ రోజ్' కన్యకామణి విరచితమగు వ్యాసరాజమునుండి:—

"ఛీ ఛీ! ఏంభర్తలు! ఓపంతెన కట్టుమను, ఉత్తర ధ్రువం కనుక్కు-రమ్మను, తటాకానికి ప్లాను వెయ్యమను, సేవ నడిపింపుమను—త్రికరణశుద్ధిగా యావత్శక్తి ధారపోస్తారు. బైసికిలు టైరు బాగు చేయమన్నా గడియారం చూడమన్నాకూడా బుద్ధి బలమంతా కేంద్రీకరిస్తారు. అట్టే కష్టంలో పన్లుకావు. కానీ—సంసారమనేటప్పటికి మగలు తుమ్మమొద్దులై పోతారు, చదువంతా చట్టుబండలయి పోతుంది, వికాసమంతా వినాశమవుతుంది, అంతా అయోమయం అగమ్యగోచరమున్నూ; అసలు పుట్టుకతోటే అంధత్వం వస్తుంది గృహస్థాశ్రమంలో!

మానవతత్వం గ్రహించడంలో, చక్కని ఏర్పాట్లు చెయ్యడంలో, సేనాధిపత్యం వహించడంలో, క్రీడా వినోదాల్లో పాల్గొనటంలో మా అంతవారుండరని ఉలుకు. అన్నీ బాగానే ఉన్నాయి. సౌఖ్యానికి నిలయమైన సంసార విషయంలో మాత్రం చాకచక్యమంతా పమ్మయిపోతుంది!

మనిషికి అతీగతీ వైవాహిక సమస్యేకదూ పరిష్కరించేది! ఇంత ముఖ్యాంశంలో మగవాడు ఉదాసీనంగా ఉంటాడు. సాధారణంగా పురుషుడెంత తెలివిమంతుడైతే పతిత్వం అంత అధ్వాన్నంగా వెలుగుతుంది. వ్యాపారంలో ఎంత చకచకలాడుతూ మెరుస్తాడో సంసారంలో అంత శుంఠ, శుద్ధ మొద్దావతారమున్నూ! ఉద్యోగధర్మంలో స్తనశల్యపరీక్షంటే విందు; సాంసారికంలో సూక్ష్మాంశాలు కల్లోనూ గుర్తుకి రావు. ద్రవ్యార్జనకు తాపత్రయం అంటే 'ఊ!'—సాంసారికానుకూల్యత మట్టుకు 'ఉహూఁ!'

తొలుత కన్నె నెన్నుకోడంలోనే పొరపడుతాడు, తగినంత బుద్ధిపాటవం లేక. తరవాత వరసగా తప్పుల పరంపరకు లోనవుతాడు, స్త్రీమోహం! ఎలాగైతేనేం ఆరాటపడి పెళ్లాన్ని సంపాదిస్తాడు. కాని ఎట్లా ఆదరించేదో తెలిస్తేగా! అంధకార బంధురం! పోనీ అని ఈ సముద్రం ఎలా దాటతాము రా దేవుడా అని ఆలోచనా చేయడు!!

నిజానికి సతిని సంతోషపర్చాలని నుంతయినా సంకల్పమే ఉండదు. కర్మవశాన్న ఎప్పుడయినా అలా చేయగల్గితే అఖండప్రజ్ఞకు అబ్బురపడతాడు. ఏమంటే ఆమెకేం కోపంవస్తుందో అన్నమాట తెలియదు. ముద్దిడుకోవలసిన సమయమేదో ఎప్పుడు కూడదో ఎఱుగడు. తఱుచు ఆమె కేల తిక్కా-త్తుకొస్తూంటుందో అవగాహన కాదు.

మొగాడి హయాంలో సంసారరాజ్యానికి త్రాడూ బొంగరమూ ఉండదు. యుక్తాయుక్త వివేచనం శూన్యం. మంచీచెడ్డా తెలియక కొట్టుకుంటాడు. పడిపోతానన్న సంగతి గమనించక కళ్లుమూసుకుని కాలువ వొడ్డునే నడుస్తాడు!

ఇలా అగాధంలో పడుండడం అతగానికి బాగానే ఉండొచ్చు. ఈ మూఢభర్తల కెవరైనా మహానుభావులు ఆదర్శపతిత్వం గఱపే ఒక బడి

పెట్టి ప్రబోధించి పుణ్యం కట్టుకోకూడదూ! మొదట్లో చిన్నచిన్న పాఠాలు నేర్పాలి; అవే అర్థంకాక కొట్టుకుంటాడు! పోనీ ఇలాటి ప్రశ్నల కేం సమాధానం?—భార్యకు క్రొత్తదుస్తు లెప్పుడు కొనాలి? నూత్నదుస్తులు ధరించినప్పుడు ఏమనాలి? ఏడుగంటల కింటికొస్తానని చెప్పి తప్పిదారి ఒకవేళ ఒంటిగంటకు కొంపచేరుకుంటే ఏమని అపరాధం చెప్పుకోవాలి? అలుక సమయంలో ఆమెను లాలించాలా మెత్తగా తన్నాలా? ఈమోస్తరు స్వల్పసంశయాలు నివర్తిచేసికోవాలి!

ఇదిలావుంచి కంఠస్థంచేసికోవాల్సిన హంశాలున్నాయి. పిలుపులు: "ఆహా! కలకల్లాడుతున్న నీ వదనం!"—"కాస్తసాయంచేతునా?"—"ఓహో! క్రొత్తచీర, నీఛాయకు తగ్గరంగు!"—మఱి, కూడనివి కొన్నున్నాయి! "అబ్బే! ఆ చిరుగుల చీరేవిటి?"— "అహహహా! అక్కర్లేదులే!"—"అవస్తువేమయింది?" —ఇత్యాదులు!

వాస్తవానికి తన్నుగూర్చి సతినిగూర్చీ కూడా నేరువదగినవి పెక్కంశాలున్నవి. ఈ కళాశాలకు మూడు మనువులు పోయిన ముత్తైదువ అధ్యాపకురాలుగా ఉండాలి. అప్పు డీగుప్తసమస్య పరిష్కృతమవుతుంది.

మంచి మగలను మనం తయారుచెయ్యాలి కాని, పుట్టుకతోటే ఉండరు!! కావలసిందల్లా గృహస్థాశ్రమ పాఠాలు పురుషులకి బడిపెట్టి ప్రబోధించడమే!"

గుణదోషవిచారణ గ్రాహకులదే!

—ముద్దా. విశ్వనాథము.

మోక్షమార్గము:—

ప్రతిమానవునకును మోక్షాపేక్షకలదు. కాని ఆస్వర్గమునకు పోవుమార్గము మాత్రము ఎవ్వరికి తెలియదు. తెలిసినను చేయ సంకల్పించరు. అతి సూక్ష్మముగ నున్నను గ్రహింపజాలరు. భగవంతుడుదయామయుడు. ఆపరమాత్ముడు మనకు చక్కని మార్గము చూపినను, మనము ఆత్రోవతప్పి, వేరు వంకర త్రోవను పోవుచు మనకు స్వర్గమివ్వలేదని ఆపరమేశ్వరుని తిట్టుచున్నారము. ఆమహామహు డేమిచేయగలడు? ఎన్నియో సూక్ష్మమార్గములు చూపి తద్వారా మనకు మోక్షము నిచ్చుటకు సిద్ధముగనున్నాడు. భగవంతుడు చూపినమార్గ మొకదానినైనను మనము త్రొక్కుటలేదు. పదిమందిని పోషించిన యజ్ఞఫలమిచ్చుచున్నాడు. ప్రతిజీవియు తనకుక్షి నింపుకొనుట గొప్పకాదు. పదిమందిని పోషించుటయే అతిశయము. అట్లుచేసిననాడే జీవించినవాడు; కానివాడు చనిపోయినవానితో సమము. మోక్షము కావలయునన్న భగవంతుని రత్నపీఠమునయుంచి, ఆరాధింపవలయును. దానినిచేయ శక్తిలేనిచో భగవద్గీత 9-వ అధ్యా 26 శ్లోకములో చెప్పినటుల పత్రమో, ఫలమో, పుష్పమో, తోయమో, దేనినైన భక్తితో సమర్పింపవలయును. ఈశ్వరుడు మిక్కిలి సులభుడు. భగవంతుడు ఎంత సులభమార్గము చూపినను, మానవులమగు మనము కన్నులు మూసుకొని స్వోదరమును పోషించుకొనుటకే ప్రయత్నించుచున్నారము. భగవంతుని ప్రసన్నపరచుకొనుటకు త్రికరణశుద్ధిగ నింద్రియములను భగవద్విషయమునకే వినియోగించవలయును. ఎల్లప్పుడు జిహ్వతో కీర్తింపవలయును. నమోనారాయణ యను మంత్రమును భక్తితో అనకున్నను భగవన్నామమగుటవలన మోక్షమిచ్చును. భక్తితో అనిన మిక్కిలియు శ్రేష్ఠము. భగవంతుడన్న కొందరు నవ్వుదురు. ఇది మఱియు విరుద్ధము. వారినిచేరి కొందరు చెడుచున్నారు. పతివ్రతయగుస్త్రీ వ్యభిచారిణితోచేరి ఎటుల చెడునో, అటులనే వారితో వీరును భగవంతునియందు నమ్మకముంచరు. కాని ఆపరమాత్ముడు ఎవ్వరైన కొద్దిగపుణ్యకార్యముచేసిన నుంచుకొనడు. తనవద్దదాచుకొన్న ధనమువలె తప్పక వారివారికి ఆపుణ్యఫలము నిచ్చుచుండును. భగవంతుడు, భక్తుడు ఏవిధముగచేసినను, తనక్రిందనే ఉపయోగించును. కాన ఇప్పుడైనను కన్నులుతెరచి స్వామి చూపించిన మార్గములలో దేనినైనను భక్తితోచేసి పాపపంకిలమునుండి తొలంగుడు.

—జరుగుమిల్లి రామాంబాయమ్మ.

# గ్రంథవిమర్శన

## ప్రబుద్ధాంధ్ర :—

రాజమహేంద్రవరముకలాభివర్ధనీ పరిషత్తువారిచే ప్రకటింపబడు చక్కని తెలుగు మాసపత్రిక. మనోహరాంధ్రసాంఘిక కథారచనా నిపుణుడును, మధురశయ్యావిలాసియునగు శ్రీయుత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు దీని సంపాదకులు. వీరుకాని వీరిపత్రిక కాని ఆంధ్రులకు నూతన పరిచితములు కావు. కొన్ని సంవత్సరముల క్రిందట నాలుగు సంపుటములను ప్రకటించి ఆంధ్రులకు క్రొత్తక్రొత్త సాహిత్యపాకములను చవిజూపించినారు శ్రీ శాస్త్రిగారు. బహుజనసమ్మతమైన 'నిర్దుష్ట' వ్యావహారిక శైలికి శ్రీ శాస్త్రిగారి రచనలు పరవడులని చెప్పఁగోరుచున్నాము. నేడు పునఃప్రారంభమగుచున్న వీరియత్నమున కిక మీదనెట్టియంతరాయమును కలుగకుండవలెనని మా గృహలక్ష్మి యాశీర్వదించుచున్నది. మా కార్యాలయమునకు వచ్చిన జనవరి ఫిబ్రవరిమాస పత్రికలలోని కథలను వ్యాసములును ఒకటి కొకటి యీడుతీయకున్నవి. సంపాదకీయములు ఆంధ్రులకు ప్రబోధదాయకంబులై పత్రిక నన్వర్థనామధేయగా నొనర్చుచున్నవి. కాంగ్రెస్సుపైని కాని అఖిలభారతజాతీయతపైనికాని, హిందీపైని కాని కారము నూరకుండనే యాంధ్రప్రబోధమును సాగించుటకుకూడ మిగుల వీలుగలదు. ఇట్టి ప్రశస్తపత్రికకు సంవత్సరమున కొక్క రూపాయి కారు చౌకయగు చందా. ఆంధ్రులు వేనవేలుగా చందాదారులుగా చేరి దీనిని నిలబెట్టుదురని నమ్ముచున్నాము.

## మోక్షమార్గదర్శిని :—

క్రౌనుసైజు సుమారు 160 పుటలు. రామభక్తి నుద్బోధించు అనేకపురాణములలోని ఉత్తమపద్యములను, శతకములలోని స్తవములను ధ్యానావాహనాది శ్లోకములను అష్టోత్తర సహస్రనామములను గూర్చి రామమందిరములలోని భజనపరులకును తక్కుంగల భక్తులకును నుపకరించునట్లు పిఠాపురముదరినున్న చిత్రాడకాపురస్థులు శ్రీ రాజా చెలికాని చినజగన్నాధరాయునిం బహద్దరువారు సమకూర్చిన పుస్తకరాజము. భక్తాగ్రేసరులవద్ద అవశ్యముగానుండతగ్గది.

## భారతజాతీయ ఋణములు:—

క్రౌనుసైజు 133 పుటలు. వెల రు. 0-8-0 గ్రంథకర్త శ్రీయుత ముదకంటి,జగ్గన్నశాస్త్రిగారు తణుకు, పశ్చిమగోదావరిజిల్లా. పల్లెటూరి గ్రంథమండలి వారి 16-వ ప్రకటనము. జె. సి. కుమారప్పగారు వ్రాసిన గ్రంథమున కనువాదము. హిందూదేశమునకు ఈస్టిండియా కంపెనీనుండియు బ్రిటిషు ప్రభుత్వమునుండియు కలిగిన ఋణమెంతో, అందులో హిందూదేశము న్యాయముగ భరించవలసిన దెంతో బ్రిటిషువారు ముజరా యీయవలసిన దెంతో యీగ్రంథము యుక్తియుక్తముగ రూఢిపరచును. అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు నియమించిన ఒక ప్రత్యేక ఉపసంఘము వారు ఈ నివేదికను తయారుచేసిరి.

## పూలమాల:—

రాయలుసైజు సుమారు 40 పుటలు. దళసరి కాగితములు, చక్కని అచ్చు. చందమామ, కవిత, ఆంధ్రభూమి, పతిసందర్శనము మొదలగు పదునాల్గు విషయములనుగూర్చి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు అతి మనోహరమైన భావములతోగూడిన ఖండకావ్యములను పద్యరూపముగా రచించిరి. శైలి సులభము. భావములు క్రొత్తలు, మనోహరములు. శ్రీయుత అబ్బూరి రామకృష్ణారావుగారు వ్రాసిన మనోహరమైన పీఠిక గ్రంథప్రాశస్త్యమును చెప్పకచెప్పుచున్నది. బాలకవులమనోహరభావకవిత్వములకు బాలకవయిత్రులరచన లెందునుతీసిపోవనుట కిదిచక్కని యుదాహరణము. వెల రు.0-6-0 మాత్రము. వలయువారు విశాఖపట్టణము మెయినురోడ్డులోనుండు కవయిత్రిగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

## ఘంటల పంచాంగము:—

శ్రీయుత ముంషూరు వీరభద్ర సిద్ధాంతిగారిచే గుణింపఁబడి రాజ వైద్యపానాన్నాడ భాస్కరం అండు బ్రదర్సు (రాజమండ్రి) వారిచే ప్రకటింపబడినది.

పాకెటు సైజు. పెద్ద పంచాంగములలో నుండు విపరములు ఫలములు మొదలగునవి యెల్లయు గలవు. ఘడియలను గంటలలోనికి మార్చుకొనవలసిన కష్టములేదు.

నారాజు :—

క్రౌనుసైజు 128 పుటలు. గ్రంథకర్త తాళూరు సుబ్బారావుగారు, పవరుపేట, ఏలూరు. మదాలసయను యువతి రాజ్యకాంక్షచే తనసోదరుని చంపించి, అతని పుత్రుని వధింపనుంకించుటయు, దేవాంగనయను నామె పెనిమిటి విక్రాంతుడును నతని రక్షించుటకు పడిన పాట్లును, దేవాంగన మరణమును, మృణాళిని నిష్కళంక శీలమును, వీరపాలుడను దుష్టుని మరణమును, మదాలస ఆత్మహత్యయు మొదలగు సంభవములతో గూడి సినీమా దర్శనమును బురుడించుచున్నది. 22 అధ్యాయముల చక్కని నవల. శైలి నిర్దుష్టసులభము వెల రు. 0-10-0 లు.

కార్మిక సంఘప్రచురణము నెం. 2 :—

ఈసంఘమువారు ప్రచురించిన ఒకటవకరపత్రము 'కరుణలేని కమతము'ను గతసంచికలో ప్రశంసించితిమి. ఈకరపత్రములో కార్మికులకు జ్ఞానము ఐకమత్యము హెచ్చి యజమానులనుండి తిట్లు అవమానములను సైచక సరిగాపనిచేసి నిర్ణయమైన కూలి పుచ్చుకొనగల దారుఢ్యము లభించుమార్గము సూచింపబడినది. విద్యాధికుల సహాయమును, కార్మికుల మితవ్యయనీతి వర్తనములును కలిగినచో యజమానులకు కార్మికులకు మనసులలో నెట్టి మరమరలును నుండజాలవని బుజువగుచున్నది. వెల యుచితము. కార్మికులు పఠింపగల సులభశైలి గద్యము. చాలవరకు సంభాషణారూపము.

కాలేజిగరల్ లేక పాణిగ్రహణము :—

డెమ్మీ సైజు 120 పుటలు వెల రు. 0-12-0 గ్రంథకర్త శ్రీయుత కాళ్లకూరి హనుమంతరావుగారు సబ్బరపువీధి, ఇన్నీసుపేట, రాజమండ్రి అయిదంకముల సాంఘిక నాటకము. హూణవిద్యాధిక్యతవలన చెడుత్రోవలు పట్టిన రంగమ్మ, ధనాశవలన కన్యావిక్రయము చేసిన చిట్టిపంతులు, దైవభక్తివలన సుశీలయైన కనకరాజేశ్వరి, సచ్ఛీలమువలన నున్నతపదవులకువచ్చిన మనోహర ప్రభాకరులు మొదలగు పాత్రలతోను, సులభశైలితోను, సుందర పద్యములతోను గూడి నాటక మెంతయు నీతిబోధకముగను కాలానుగుణముగనునున్నది.

శాంతికుటీర నివేదిక :—

ఇది 1921-లో పిఠాపురం బ్రహ్మసమాజ సభ్యులచే స్థాపించబడినది. పిమ్మట శ్రీపిఠాపురం రాజావారు దీనిని తమపోషణలోనికి తీసుకొనిరి. 5, 6 గురు బాలురతో ప్రారంభమై నేడు 63 బాలురతో శోభిల్లుచున్నది. ఇక్కడ ఆదిఆంధ్రులకు భోజనములు వసతి బట్టలు పుస్తకములు యీయబడును. వీరందరును 5-వ తరగతి మొదలు 6-వ ఫారమువరకు చదువువిద్యార్థులే. ప్రార్థనము మతబోధనము జరుగును. ఇచ్చట శిక్షితులైనవారనేకులు మంచి ఉద్యోగములలో చేరినారు. గవర్నమెంటువారు దీనికిచ్చెడి గ్రాంటు రు. 2000 నుండి రు 1200లకు తగ్గించుట శోచనీయము. బాలికలకు ప్రత్యేకాశ్రమము 1928-లో స్థాపించబడినది. ప్రస్తుతము 40 మంది బాలికలున్నారు. దీని పోషణకర్తలగు శ్రీ పిఠాపురం రాజావారు ఇట్టి సత్కార్యమును నెరవేర్చుచున్నందు కెంతయు ప్రశంసాపాత్రులు.

సింహపురి గోరక్షణ సంఘము నివేదిక:—

ఇది 5 యేండ్లకుపూర్వము స్థాపించబడినది. చందాలును గడ్డియు వసూలుచేసి దిక్కుమాలినగోవుల నీ సంఘమువారు రక్షించుచున్నారు దీనికి తగినంత ప్రోత్సాహమును సింహపురి వాస్తవ్యు లిచ్చుచున్నట్లు కనిపించదు. గోవుక్షేమమే రైతుక్షేమము, రైతుక్షేమమే దేశక్షేమమని భావించువారెల్లరు దీనికి భూరి విరాళములనిచ్చి పోషింతురుగాక!

ప్రజామిత్ర :—

పూర్వము బెజవాడనుండి శ్రీయుత గూడవల్లి రామబ్రహ్మంగారి సంపాదకత్వమున వెలువడుచుండెడి యీ పత్రిక జనవరినుండియు మదరాసు వాసియైనది. మదరాను కాపురముతో ఆకారమున కొ

విరివి, అందమున కొక తేటు, భావమున కొక ప్రౌఢత చేకూరి అధిక ప్రసంగిరై, యావత్ప్రపంచక సమస్యలలో తల దూర్చుచు ఆరి తేరిన ఆంగ్ల పత్రికలను డీకొనుచున్నది; కనుక ఇప్పుడిది కేవల మొక్క కృష్ణాజిల్లానే గాక సకలాంధ్రమండలముల క్షేమముల నారయుచు ఎల్లరియాదరణము నాకర్షించుట కెక్కువ సావకాశము చిక్కుచున్నది. ఒక్క రైతు పక్షముతో తప్ప యితర రాజకీయ కక్షలతో యిది యెక్కువ జోక్యము పెట్టుకొనక బలవత్తర సక్రమాందోళనము చేయువారికి చేయూతయీయు బూనుకొన్నది గనుక చిరకాలము వర్ధిల్లగలదని నమ్ముచున్నాము సం॥ 1 కి. చందా రు. 3-0-0. 1-4 ఉద్యోగోద్దు, మాంటు గోడ్డున ప్రజామిత్ర ఆఫీసునున్నది.

జాతక నారాయణీయము :—

క్రౌను సైజు 254 పుటలు గ్రంథకర్త శ్రీయుత వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారు బి. ఎ వెల రు. 1-8-0 లు సంజ్ఞాధ్యాయము, గ్రహబలాధ్యాయము, బాలారిష్టాధ్యాయము, ద్వాదశభావాధ్యాయములు, జైమినీ జాతకఫలాధ్యాయము మొదలగు 18 అధ్యాయములు గలవు. బహు గ్రంథములను పరిశీలించి ఫలములు వ్రాయఁబడినవి. చాలామట్టుగ అనుభవమునకు దాఖలా యిచ్చుచున్నవి. యెక్కడ కక్కడ సూత్రములు శాస్త్రకారుల అభిప్రాయములు ఉదహరింపఁబడినవి. ఇతరుల అపేక్ష లేకుండ ఎవరిమట్టుకు వారు ఫలములను చూచుకొని అనుభవమునకు పట్టించుకొనవచ్చును.

గానకళా చంద్రిక :—

బెజవాడ ఉన్నతప్రాథమిక బాలికాపాఠశాలయందు సంగీతాధ్యాపకులుగా నున్న బ్ర॥ శ్రీ॥ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారిచే రచింపఁబడి యాంధ్రపత్రికా కార్యాలయమున ముద్రింపఁబడినది. డెమ్మీ సైజు. 316 పుటలు వెల రూ. 2 లు మాత్రమే.

గ్రంథకర్తగారు సంగీతశిక్షకులేయై యుండుటవలన విద్యార్థుల కవసరములేయగు స్వర, గీత, వర్ణ, గేయములను, సక్రమముగా సుబోధకముగా సమకూర్చి వ్రాసినారు. అక్కరకు మాలిన లక్షణ శ్లోకములఁ గూర్చుటకు శ్రమపడలేదు. గాయకలోకమునఁ బెద్దలగు శ్రీ త్యాగయ్యగారు మొదలగువారి జీవితసంగ్రహములు కొన్ని చేర్చబడినవి. విద్యార్థుల కీయంశములు జ్ఞాతవ్యములేకాక యుత్సాహజనకములునై యుండును. ఈ గ్రంథమునుగూర్చి సదభిప్రాయము లెంతోమంది పెద్ద పెద్ద విద్వాంసు లిచ్చియున్నారు. దీని వెలయును సాధారణమై యున్నదియే కాని 'యందరానిపండు' కాదు. కాఁబట్టి యీపొత్తము, సర్వవిధముల విద్యార్థులవారి యామోదమునకుఁ బాత్రమై యొప్పినదనుట యథార్థము. వలయువారు గ్రంథకర్తగారి పేర వ్రాయవచ్చును.

ప్రేమపరిణామము, శుభోదయము, జన్మభూమి.
యనునవి:—

విశాఖపట్నంజిల్లా యలమంచిలి తాలూకా మేడుపాక గ్రామవాస్తవ్యులగు శ్రీయుత ముద్దా విశ్వనాథంగారు అనువదించిన మూడు టాల్‌స్టాయిగారి కథలు. ఇవి యిట్టివని యొకరు వ్రాయుటయుఁ గొంత మంది యా వ్రాతఁ జదివి యంతతోఁ దృప్తిపడి యూరకొంటయుఁ గాదు. ప్రతివారును జదివి తీరవలెను.

ఇట్టి కథలను జదువుటయే నిజమైన చదువు. పరమ ప్రశాన్త భావముతో నీతినిఁ దలకెక్కించి బిడ్డలను సుఖనిద్రఁబుచ్చఁ దల్లులుపాడు జోలపాటలవంటివే కదా యిట్టి కథలు. కేవలసులభశైలియందు వ్రాయఁబడియున్నవి శ్రీ విశ్వనాథంగారు ఆంధ్రుల ధన్యవాదములకుఁ బాత్రులగుచున్నారు. చదివినఁగాని నిజము తెలియదు. కావున గ్రంథకర్తగారికి వ్రాసి పుస్తకములఁ దెప్పించుకొంటయే కర్తవ్యము.

శ్రీ కుముదవల్లి :—

క్రౌను సైజు 104 పుటలు. దశసరికాగీతములు, చక్కని యచ్చు అనంతపురం శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలవారి 9-వ కుసుమము. గ్రంథకర్త శ్రీయుత శిరిపి ఆంజనేయులుగారు అనంతపురం గవర్నమెంటు పుమన్సు ట్రెయినింగు స్కూలులో తెలుగుపండితులు. గ్రంథము మూడంకముల చిన్నినాటకము. బాలలాడుటకని కవిగారు రచించిరట గాని ప్రౌఢకావ్యము

లనుగూడ తెలదన్నుచున్నది. కుముదవల్లి సోమదేవ రాజు లాదర్శదంపతులు. తలిదండ్రులను అత్తమామలను మన్నించుచు ఎట్టి విపత్తులు కలిగినను అతిక్రమించి ఉత్తమ మానవధర్మములను వారు నిర్వహించి పురుషాళికెల్ల నాదర్శప్రాయులయినారు. శ్యామన్న హరన్నలకు తగిన శాస్తియు, భానుమతికి పశ్చాత్తాపమును కలిగినవి. కథ శుభాంతము. బాలలకు మనోరంజకమై ప్రదర్శనమున కెంతయు తగియున్నది. భావములు సులభములైనను శైలి కొంచెము కఠినపాకమేమో యనిపించును. అయినను పాఠ్యగ్రంథము కావలెనని యూహించి కవిగా రట్లు వ్రాసిరి కనుక రచన మఱ్ఱిపాకమునకే బడినది. ఆంధ్రదేశమెల్ల దీని నాదరించఁగలదని నమ్ముచున్నాము. శ్రీహరి సర్వోత్తమ రావుగారు దీనికి చక్కని తొలిపలుకువ్రాసి యున్నారు.

వివేకానంద సందేశము :—

క్రౌనుసైజు 28 పుటలు. మార్కాపురపు వివేకానంద సమాజమువారిచే 1929-లో జరుపఁబడిన స్వామివారి జన్మదినోత్సవ సందర్భమున శ్రీకూచి నరసింహంపంతులుగారిచే చదువబడిన యుపన్యాసము మేలుపాక వ్యాసకమిటీ వారిచే ప్రకటితము. నూతన భారతదేశమునకు వివేకానందుడొసగిన సందేశము తద్దేశీయులు శూరులు వీరులు, విజ్ఞానులునై అయికమత్యముతో అలరారవలె ననియే. గ్రంథాంతమున వివేకానందుని బోధలుకూడ గలవు. సులభశైలి. వెల రు. 0-2-0 లు మాత్రము.

బసవరాజు అప్పారావు గీతములు :—

క్రౌనుసైజు 200 పుటలు సుమారు 200 గీతములు. కీర్తిశేషులగు బసవరాజు అప్పారావుగారి కవిత్వమును గూర్చి యెఱుగనివారును అతనిపాటలను పాడఁగోరనివారును ఆంధ్రులలో లేరు. "రాగిణి, భావనోద్దీపిత, గానలోల, రసజీవని, వెన్నెలవలె మెత్తనాకన్నెవలపులు కరగి కాలువల జాలువారకముస్నె చుక్కల లోని చందురుకన్న నెక్కుడు బెట్టుసరి" చూపు కవితాకన్య యెల్లబ్రాయమున వశంవదయగు భాగ్యమీ మహాపురుషునకబ్బెనని యెవ్వ రంగీకరించకుందురు? వలపా, బులుపా, వగలా, నిగలా, కనికరమా, భక్తియా, దేశభక్తియా, శౌర్యమా, సంతోషమా, అతని కవిత్వములో లేనిరసమేలేదు. నవరసకవితాపాకములతోఁగూడిన యీవిందు నారగించి ఆంధ్రులు తమజిహ్వ త్రుప్పును దుల్లించుకొనక మానరనినమ్ముచున్నాము. అప్పారాయ మిమోరియలు కమిటీవారిట్టి కుసుమములనెల్ల సేకరించి యీమాల నాంధ్రులకర్పించినందు కెంతయు వంద్యులు వెల రు. 0-8-0 లు మాత్రము. వలయువారు బెజవాడ గవర్నరుపేటలో నున్న గోవిందరాజు వెంకటరామారావు గారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

హైదరాబాదు గర్లుసుహైస్కూలు:—

ఇది 1928 లో స్థాపింపఁబడినది. ఒకయేడాదికి నిర్ణయింపఁబడి, 3 యేళ్ళకు పొడిగించబడి, శాశ్వతమై పూనావుమన్సు యూనివర్సిటీ కనుబంధము చేయబడినది. బాలికల కుచితవిద్యాదాన మొసగబడుచున్నది. దీనికి వలయుధనము చందాలు విరాళములు వలన వచ్చుచున్నది. 1933 లో రు 2511-3-11లు వసూలు రు 2310-11-4-లు ఖర్చులును నయినవి. దీనికి ఒకగ్రంథాలయము, పఠనమందిరమునుకూడ నున్నవి. రెడ్డి పడుచులకును, వారితోకలసి భుజించు వారికిని ఒకవసతి గృహముగూడ ఉన్నది. 6 గురు ఉపాధ్యాయులు జీతముపుచ్చుకొని పనిచేతురు వీరిలో నలుగురు స్త్రీలు. 6 గురు ఉచితముగ పనిచేతురు. వీరిలో 2రు స్త్రీలు. యన్. ప్రతాపరెడ్డి, యమ్. హనుమంతరావుగార్లు దీనికార్యదర్శులై యింతటి యభివృద్ధికి తెచ్చిరి. ఈపాఠశాల కితోధికాభివృద్ధి కలుగవలెనని కోరుచున్నాము. ప్రస్తుతము 3 వ తరగతి మొదలు 4 వ ఫారమువరకు నున్నవి. కేవలము పుస్తకముల జ్ఞానమేకాక స్త్రీలకు కావలసిన యితర సిల్పికళల విషయమైకూడ తగినశ్రద్ధ తీసుకొనబడుచున్నది.

వయోజనవిద్య :—

క్రౌనుసైజు 60 పుటలు గ్రంథకర్త శ్రీయుత శని వారపు సుబ్బారావుగారు, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. వయోజన గ్రంథమాల వారి రెండవప్రకట

నము. హిందూదేశములో హూణపరిపాలనము హూణవిద్యారంభము, ప్రాథమికవిద్యాప్రారంభము, అందుకు నిర్మించినచట్టములు, వానివలన కలుగుచున్న ఫలితములు, వానిలోని లోపములు మొదలగు విషయములెల్లయు నేటివరకు జరుగుచున్న పరిమాణములతోను, ముందు మార్చవలసినరీతుల సూచనలతోను నిండి గ్రంథ మామూలాగ్రము విజ్ఞానభరితమై యున్నది. ఇంత చిన్నగ్రంథములో నింత బహుళమగు సామగ్రి నిమిడ్చి వ్రాయుట మిగుల ప్రశంసనీయము. ప్రతిప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడు, పంచాయతీ ప్రెసిడెంటు సభ్యుడును దీనిని పరిశీలించినచో మిగుల జ్ఞానవంతుడగును. హూణ విద్యలో నారితేరినవారుకూడ దీని నొక్కదానిని పఠించినచో పెక్కు ఆంగ్ల గ్రంథములను ప్రభుత్వ నివేదికలను చదువవలసిన శ్రమతగ్గును. ప్రాథమిక విద్యనుగూర్చి యిందులేనివిషయము వేఱొండుతావున లేదనుట అతిశయోక్తికాదు. స్థానికసంస్థలతోను ప్రయోజన విద్యా ప్రయత్నములతోను, గ్రామ పునర్నిర్మాణ ప్రయత్నములతోను తమకున్న అనుభవమునెల్ల గుచ్చి గ్రంథకర్తగారిందిమిడ్చియున్నారు. శ్రీయుత యర్రమల్లి నారాయణమూర్తి పంతులు బి. యె. బి. యల్. గారు దీనికుపోద్ఘాతము వ్రాసియున్నారు. వెల రు. 0-2-0 లు. మూడణాల తపాలబిళ్లలు పంపినచో 1 ప్రతిని బడయగలరు.

వావిళ్లనిఘంటుస్వరూపము :—

ఇప్పటికి మన ఆంధ్రభాషలో ప్రధాననిఘంటువు శబ్దరత్నాకరము. అదియొక ప్రాథమిక ప్రయత్నమగుటచేత కొన్ని లోపము లుండుట అచ్చెరువుకాదు. సాధారణ లోపములను మనము విడచిపెట్టినను పదములకు వ్యుత్పత్తులును, వానియర్థము లెట్లెట్లు మాఱుచువచ్చుచున్నదియును తెలుపకుండుట నిఘంటువు యొక్క పెద్దలోప మనకతీరదు. కొన్ని పదములకప్పటికిని ఇప్పటికిని అర్థభేదము కలిగినది గనుక ఆభేదములను తెలుపుచు క్రొత్త నిఘంటువు వ్రాయవలసిన ఆవశ్యకత యేర్పడుచున్నది. అప్పటి కాంధ్రభాషలోనికి చేరని అనేక వ్యవహారి కాన్యదేశ పదములు వార్తాపత్రికలు మొదలగు వానిద్వారా ఇప్పుడు చేరుచున్నవి. వానిని గ్రహింపవలసి యున్నది. క్రొత్తనిఘంటువును వ్రాయుటకు ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు పూనుకొని సూర్యరాయనిఘంటు నిర్మాణమను భగీరథ ప్రయత్నము చేయుచున్న సంగతియు ఆంధ్రులకు విదితము అదియొక మహాగంగావతరణమువంటిదనియు, అందుకు చాల కాలము పట్టవచ్చుననియు నూహించి శ్రీవావిళ్ల వెంకటేశ్వర శాస్త్రిగారు వావిళ్లనిఘంటువను పేరిట 45000 పదములతోను పై చెప్పిన సర్దుబాటులుపోను 15000 పుటలు ఒక నిఘంటువును ప్రకటింప నిశ్చయించుకొనినారు. అనుభవజ్ఞులగు శ్రీయుత శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు దీనిని వ్రాయఁ బూనినారు. మాదిరికి మా ఆఫీసుకు మూడుపుటలు వచ్చినవి. పైని వివరించిన మార్పులన్నియు నిందు పొడకట్టుచున్నవి. ఈ మచ్చున నిఘంటువు పూర్తియైనచో ఆంధ్రభాష కొక పెద్దలోపము తీరిన దనవచ్చును.

పూర్వగాధాలహరి :—

ఆక్టోవో సైజు 562 పుటలు. వెల 7-8-0 లు మాత్రము. గ్రంథకర్త శ్రీయుత వేమూరు శ్రీనివాసరావు బి. ఏ. బి. ఎల్. గారు పదునెనిమిది పురాణములేకాక ఛాందోగ్యోపనిషత్తు భారతము, భాగవతము, రామాయణము మొదలగు మరి పదునెనిమిది సుప్రసిద్ధ ఉద్గ్రంథములను పఠించి అందలి స్థలనామములను స్త్రీ పురుష నామములను గ్రహమండలాది నామములను అకారాదిగ పేర్చి ఆయాపురాణములలో వర్ణింపఁబడినరీతి నాయాస్థలాదుల చరిత్రలను సులభశైలిలో నిఘంటు రూపకముగా రచించినారు. పురాణాదులలో గల యేవస్తువిషయమైన గాథనైనను ఈనిఘంటు పుటలు తెరచి పఠించి అనతికాలములో తెలుసుకొనఁగలము. నిఘంటురూపముగనున్నను ఇది నిఘంటుపఠనమువలె నుండక సుందరతరకావ్య పఠనమురీతి నుండును. ఇట్టి కల్పవృక్షము మన ఆంధ్రభాషలో లేకుండుట పెద్దలోప మనక తీరదు. ఇట్టి లోపమును గుర్తించి మిగుల శ్రమపడి యీగ్రంథమును వ్రాసి ప్రకటించిన శ్రీరావుగారి కాంధ్రులెంతయు కృతజ్ఞులై యుండగలరు. ప్రతులు కొంచెమే అచ్చువేయించినారు. వలయువారు మదరాసు కీలుపాకు, పూనమల్లి హైరోడ్డు నెం 82 రు గృహమునందున్న శ్రీకనుపర్తి మార్కండేయ శర్మగారికి వ్రాసుకొనవలెను.




భూకంపంబట యేమి చిత్రమిది శంభో వ్రేల్మిడిన్ సర్వని।
ర్మూకంబయ్యె నికేమియున్నది? వృథాజిజ్ఞాసలంజిక్కి యే।
వో కల్పింతురు కారణంబు లవియెన్నో!! పిచ్చియే కాదొకో।
లోకేశా! యిపుడైన నిన్నెరుఁగరో లుప్తాభిమానాత్ములై॥

జనవరి తే 15 దీ మధ్యాహ్నసమయము, ఉత్తరాయణ పుణ్యకాలప్రవేశానంతరము, సప్తగ్రహకూటదోషశాన్తికై చేయబడుచుండిన నవగ్రహారాధనవేళ. విల్లింగ్డను ప్రభువు, కలకత్తాగవర్నరు, మద్రాసు గవర్నరుగార్ల 'మూర్త్రిత్రయము' హారాస్ట్రేష నులో సల్లాపములు సలుపుసమయము! అట్టి యాసమయమందుఁ బ్రళయకాల మాసన్నమైనదియోయనునట్లు అకస్మాత్తుగ రణగొణధ్వనులతో హిమాలయప్రాన్తమునుండి బెజవాడ కనకదుర్గాలయమువరకు భయంకర భూకంపము సంభవించెను.

ముఖ్యముగ నేపాళ, దర్భంగ, బీహార్, మాంఘీర్, ముజఫర్‌పూర్, చాంపరాన్, సరాన్, భాగల్‌పూర్, మోతీహారీ మొదలగు రాజ్యప్రదేశములను స్వాహాపనాశనము జేసినది. కల్‌కత్తా, కాశీ, ప్రయాగ, లక్నో పట్టణములలో, గొప్పగొప్పభవనము లన్నియుఁగూలినవి; కూలియుఁగూలక యొరిగినవి; బ్రద్దలైనవి; పాతాళమునుండియుఁ

బునాదులనుపైచి కట్టించిన నేపాళ రాజభవనములన్నియు నిమిషకాలమున సినీమాచిత్రములవలె మాయములైనవి. అకటకటా!! అంతఃపురరాజకన్యక లకాలమృత్యుదేవతా పీఠములకడ బలిభూతులైరి.

దర్భంగా మహారాజావారు, కోట్లకొలఁది బెట్టి కట్టించిన 'ఆనంద్‌బాగ్' 'మగ్‌దానీ మహల్' 'మోతీమహల్' 'రాజ్‌మహల్' మొదలగునవి యన్నియు, రెప్పపాటులో నడుగంటినవి. తరతరములనుండియు భద్రపరుపఁబడిన యమూల్యవస్తుసంచయము లంతర్హితములైనవి.

బేహార్, ముజఫర్‌పూర్ ప్రాన్తముల రాజమార్గములు నయోమార్గములుఁ బాతాళమునఁబట్టినవి. మెరకలు, పల్లములైనవి: పల్లములు, మెరకలైనవి. జలాశయములిసుకదిబ్బలైనవి. నదులును గాల్వలును నానాముఖములైనవి. మరికొన్నియెడలఁ బురమధ్యములం బారినవి. పెక్కుడల లెక్కకు మిగిలి భూమి బ్రద్దలై యందుండి విషదుర్గం

ధపూరితములగు వాయువులును, రాళ్లు నిసుకబురదయు నీళ్ళతో గ్రక్కుచున్నది. ఇట్టి మలినజలప్రవాహములవలన మంచినీళ్ళ చెరువులు, బావులు, కాలువలును జెడి త్రాగుటకు నీరులేక జనులు హాహాకారముం బెట్టుచున్నవారు. అట్టి కష్టకాలముననేవృష్టి. ఈయకాలవృష్టివలనఁ దలఁదాఁచుకొనుటకుఁ గూడఁ దావులేక చలిదెబ్బలకులోనై కఫ జాడ్యములకులోనై ముదుసలులును బాలు లునుఁ గడతేరుచున్నారు.

ప్రళయమునంభవించినది పట్టపగలే కాఁబట్టి పురుషు లుద్యోగములకై బయటికి వెళ్ళియుండిరి. ఇండ్లయందుండినస్త్రీలును బిడ్డలే యెక్కువగా మడసిరి. బిడ్డల నోడిఁ బెట్టుకొని పాలిచ్చు తల్లులెందరు భూమా తకు బలియైరో తెలియలేదు. ఆడుకొనుచుఁ బాడుకొనుచుండు బిడ్డలెందరు మట్టిలో మణిగిరో దైవమునకే యెరుక. వేయేల? ఎక్కడవా రక్కడనే ఎట్లున్నవా రట్లులనే భూగర్భమున మునిగిరి. ఇది యిటులుండ నింక నంగహీనులయి యాజన్మదుఃఖము నొందఁ బాల్పడిన వారెందరో! ఇదియంతయు వివరించివ్రాయుట యొక మానవకార్య ముగాఁ దోఁచుటలేదు. ఇంటికప్పులక్రింద, గోడలక్రిందఁ దీయుచున్నకొలది, శవములు కానఁబడుచునేయున్నవి. దిక్కుమాలి వీధు లందుఁబడి కుళ్ళిపోయిన మృతకళేబరములను దినుటకై పారెడి కాకఘూకగృధ్రజంబుకా దులమూలమున జలాశయములుచెడి యం టువ్యాధులును బుట్టుచున్నవి. పాడిపంట లతో ధనధాన్యములతోఁ గలకలలాడుచుం డిన వసుమతియందు రమారమి నలువదివేల చతురపుమైళ్ళమేర నొకభీభత్సమగు మహా శ్మశానము, రెండుమూడు రెప్పపాట్లకాల ములో దయారైనది. ఇందు నొక దైవ చిత్రము వ్యక్తమగుచున్నది. పెద్దపెద్దకట్ట డములలో నున్నవారే యెక్కువగజచ్చిరి. కాని కుటీరములయందుండువారు సాధ్యమై నంతవరకుఁ జావు దప్పించుకోఁగల్గిరి. దిక్కు మాలినవారికి దేవుఁడే దిక్కనుట నిక్కము కదా!

చచ్చినవా రింతమందియను లెక్క యిం కను దేలలేదు. ముజఫర్‌పూర్ న్యాయ వాదియగు బాబూమధుసూదనప్రసాద్ అగ ర్వాలా గారు, ఆనాడు తనకుటుంబమునకుఁ గల్గిన యాపదంగూర్చి యిట్లుచెప్పిరి. "నేనా నాడు కోర్టులో కేసును విచారించుచుండఁగా భూకంపమును విని నాసుందరమందిర మేమి యైనదోయని వెంటనే పరుగెత్తితిని. అంత లోనే మాయిల్లు భూమట్టము ముట్టినది. తల్లికనబడదు. ఎటులనో నిందుచూలాలై యుండిన నాభార్య ప్రసవవేదన యారంభింప నింటిప్రక్కనేయున్న బయలుభూమిపై గుడ్డలతెరలచాటున మగబిడ్డను గనినది" యని. ఇట్టి గర్భనిర్భేదవార్తలింక నెన్ని యణగినవో యెవరికెరుక!

మరియును సూర్యబింబముచుట్టును భయంకరమగు జ్యోతియొకటి యావరించు కొనియున్నట్లు శాస్త్రజ్ఞు లిప్పు డిపుడే కనుఁ గొన్నారు. ఇదియేమి వెలుఁగో! ఇంకనేమి కాఁదలఁచినదో తెలియదు.

లార్కానా జిల్లాలో ఆలీభాయను నూరనుండు మహమ్మదీయ దేవాలయ శిఖరము చిత్ర విచిత్రముగ నూఁగులాడుచున్నట్లును దీనినిఁ జూచుటకుఁ బలుదిక్కులనుండి జనులు గుంపు గుంపులుగా వచ్చి చూచి 'ఇదియొక ప్రళయచిహ్నము' అని యనుకొనుచున్నారనియు కరాచీనుండి మెయిలుపత్రికకు వార్త వచ్చినదఁట. సం 1929 రమున షెడడ్ కోటలో నుండు శివాలయమున లింగము కూడ నీ మసీదుగోపురమువలెనే నెలదినముల వర కూఁగులాడుచుంటను దాను జూచితిననియు, నప్పుడా లింగమునకు శాన్తిచేసిన వెనుక నది తలద్రిప్పుట మానెననియు మహారాజ దేవదత్తుగారు చెప్పుచున్నారు. మొన్నను శ్రీ జగన్నాథక్షేత్రమున బలరామ విగ్రహము బోరగిలఁ బడెనని వార్తా పత్రికలో జదివి యున్నాము. ఇవి 'ఖుషీటప్పాలే' కావచ్చును లేదా నిక్కములే కావచ్చును; కాని యీ విషయములఁగూర్చి వాదోపవాదములు సేయుట కిది యదనుకానేకాదు. "నేను నిలువ నీడలేనివాఁడనైతిని. నారాజ్యమును బున ర్నిర్మాణముఁ జేసుకొంటకై నా కాలమును గడపవలసియున్నది." అని శ్రీ దర్భంగా మహారాజావారు స్టేట్ కౌన్సిల్ ప్రెసిడెంటుకు వ్రాయుచుఁ దమ సభ్యత్వమునకు రాజీనామాయిచ్చిరి. ఇది యంతయు నిటు లఘోరించుచుండ యూరపుఖండమునందు మారణోపాయము లొకవంక నెడతెగక కనిపెట్టఁబడుచునే యున్నవి. దీనింబట్టియే, మనదృక్పథమునకును వారిదృక్పథమునకు నెంతభేదమున్నదియు, మనము తెలిసికొనవలెను.

అన్నవస్త్రదేహనాస్తులయి హాహాకారములుసేయు బీహారు వారికి సహాయము జేయుఁడము, పిల్లలతిల్లులు నిల్లాంధ్రుడు సర్వమంగళారాధనము లొనర్చి తమబిడ్డలను దమ యజమానులను దమ సహోదర సహోదరీ వర్గములను బురికొల్పి యీశ్వరప్రీతికరమగు నీపరమధర్మము నెరపునట్లు చేయు బాధ్యత వహింపవలసిన తరుణమిది. వడివడిగఁ గార్యరంగమునఁబడి, పేదల నిడుమలనుండి తప్పించవలయును. పల్లెయనక పట్టణమనక ప్రతి యింటికి కఫము మొకయణానంతున నైన వసూలుచేయుటయే, మీ కిట్టి మొదఁగ ర్తవ్యము. సోదరీమణులారా, మీ యవ్యాజప్రేమామృత వర్షము గురిపించి పాడుపడినదేశమును మరల వసుమతినిఁగాఁ జేయుఁడు. ఆర్యాంగనలు ధర్మ దయాపరతంత్రలను ననాదిసిద్ధ సమజ్ఞ నిలుపుకొంట కిదేకదా సమయము. లెండు!

మానసంపితుపు గృహములు:—

పసిపాపలను తెచ్చుకొని పెంచి వ్యభిచార వృత్తికి దించి జీవించుచు ధనార్జనముచేయు దురాచారము మదరాసు కలకత్తా బొంబాయి మొదలగు నగరములయందెల్ల సర్వసాధారణముగ నుండెను. దిక్కులేని బాలిక లనేక కులములవారీదుర్వ్యాపారులపాలై అపకీర్తి సంకటములు నరకములపాలగుట యందరకును విదితమే. వీరివలన అనేక యువకులు కూడ దుర్నీతిపాలగుచుండుట అనుభవైకవేద్యము. మదరాసు నగరములోని ఇట్టిగృహములను నిర్మూలించు చట్ట మొకటి మదరాసు ప్రభుత్వమువారు ప్యాసుచేసిన విషయము

పాఠకులకు దెలియును. విజిలెన్సుఅసోసియేషనువారును సిటీ పోలీసువారును కలిసి కనిపెట్టి యిట్టి 130 గృహముల నెత్తివేయించిరి. ఇట్టి గృహములనుండి తప్పించినవారిని, ఇట్టి గృహములకు వెళ్లవలసిన దీనులను పోషించుటకు రక్షణపోషణగృహములను నిర్మించుట అత్యావశ్యకమైనకార్యము. పరసువాకము ఆదియప్పముదలి తెరవులోనున్న "చిల్డ్రిన్సు ఎయిడు సొసైటీ" వారును "సేల్వేషను ఆర్మీ రెస్క్యూహోము" వారును ఇట్టివారిలో కొందరిని పోషించి విద్యాశిక్షణముల నొసంగుచున్నారు. బొంబాయి కలకత్తాలలో ఉదారపురుషులును ప్రభుత్వమువారును స్త్రీసంఘములవారును విరివిగా ధనములనిచ్చి ఇట్టి గృహములనుండి తప్పించిన బాలికలను ప్రౌఢలనుగూడ రక్షించి మంచివృత్తులు కల్పించుచున్నారు. మదరాసునగరమున పై చెప్పిన రెండు సంఘములవారును చేయు కృషియే తప్ప తగిన రక్షణగృహములేదనియే చెప్పవలెను.

మదరాసు చట్టముప్రకారము వ్యభిచారస్త్రీల నట్టి గృహములనుండి తప్పించుటయే గాక రక్షించుట లేక పోషించుటకూడ ఒక కర్తవ్యమగుచున్నది. ఇంతవరకు వారిని తప్పించుటకే ప్రయత్నములు జరిగినవికాని రక్షించుట కెట్టిప్రయత్నములును జరుగలేదు. ఫిబ్రేవరి 1_వ తేదినుండి ఆ చట్టముయొక్క రెండవక్లాజు ప్రకారము వారిని రక్షించుచర్య కూడ అమలుకావలసియున్నది. కాని అట్టి గృహమును నిర్మింపవలెనన్న కనీసము రూ. 10000 లు తొలుదొల్త కావలసియున్నది. ఇందుకు నగరములోని శ్రీమంతపౌరులు విరివిగా చందాలీయవలెననియు, ప్రభుత్వము వారు ఉదారమగు గ్రాంటు నీయవలెననియు వుమన్సు ఇండియను అసోసియేషను సెక్రటరీగారు హెచ్చరించుచున్నారు. నగరపౌరులు, సంస్థలు, కార్పరేషను, ప్రభుత్వమువారు ఎల్లరును గలసి యిట్టి సత్కార్యమునకు తోడ్పడి నగరమును పవిత్రముచేసి దానికి వన్నెగూర్తురుగాక!

వితంతుభరణముల బిల్లు:—

వితంతుభరణములబిల్లు వివిధప్రాంతీయుల అభిప్రాయములకొరకు పంపఁబడినదనియు, ఆ అభిప్రాయములతోసహా బిల్లును అసెంబ్లీసమావేశములో సెలెక్టుకమిటీకి నిర్ణయము నిమిత్తము ఈయవచ్చుననియు పాఠకులకు తెలిసినవిషయమే. ఇంచుమించు అన్నిప్రాంతములనుండియు అభిప్రాయములు వచ్చినవి. పెక్కుఅభిప్రాయములు అనుకూలముగానే ఉన్నవి. మదరాసు ప్రభుత్వమువారు బిల్లుయొక్క సదుద్దేశ్యముతో నేకీభవించుచు విధవకు భర్త ఆస్తిలో సంపూర్ణ హక్కుండరాదనియు, యావజ్జీవనము అనుభవించు హక్కుమాత్రమే ఉండవలెననియు, పుత్రవతి కానిచో భర్తృసోదరులతో సమానమైన హక్కును పుత్రవతియైనచో ఒక్కొక్కపుత్రునితో సమానమైన హక్కును ఉండవలెననియు తెల్పిరి. సర్. కె. వి. రెడ్డిగారు బిల్లు మితాక్షరన్యాయమునకును, పూర్వపు జడ్జిలతీర్పులకును విరుద్ధముగనుండుటచే ఇప్పటిలో దానిని విరమించవలెనని సలహాయిచ్చిరి.

సర్. పి. శివస్వామిఅయ్యరుగారు ప్రస్తుత విధానము హిందూవిధవను చాల దీనముగను పరాధీనగనుచేయుచున్నందుకు విచారించుచునే యీ బిల్లు అనాలోచితముగ వ్రాయబడినదనియు, చక్కనిబిల్లును తయారుచేయుటకు నిపుణులగు హైకోర్టువకీళ్లుజడ్జిలతో గూడిన ఒకకమిటీ నేర్పరచవలెననియు సూచించిరి. మధ్యపరగణాల జిల్లాజడ్జీ లిట్టిబిల్లు అవసరము లేదనియు, అనేకము తగాయిదాలు తెచ్చిపెట్టుననియు చెప్పిరి. అస్సాము గవర్నరుగారునుసభవారును విధవ కిట్టి హక్కు నొసగినచో ఆస్తులు నిర్బంధముగ పంపకము కావలసినగతి పట్టుననిరి. సంయుక్త రాష్ట్రముల గవర్నరు సభవారు సంయుక్త కుటుంబపు బాధ్యతలతో సంబంధములేకుండ విధవకు భర్త ఆస్తిలో సంపూర్ణమైన హక్కు నొసంగుట అన్యాయమని వ్రాసిరి. అలహాబాదు కలెక్టరుగారుకూడ న్యాయనిర్వహణములో ఈ బిల్లువలన ననేకఅనర్థములు కూడునని అభిప్రాయపడిరి. ఇట్టి ప్రబలపరస్పరవిరోధాభిప్రాయములమధ్యను సెలెక్టుకమిటీవారి కది యీయబడునో యీయబడదో, ఈయబడినచో వారెట్టి నిర్ణయమునకు రాగలరో ఊహించుట కష్టము. అసెంబ్లీ సభ్యులు పై అభిప్రాయములను బిల్లులోని క్లాజులను విమర్శతో చర్చించి హిందూ వితంతువుల కన్యాయము జరగకుండ చూడవలసిన బాధ్యత కలవారగుచున్నారు.

**కీ॥ శే॥ రంగసామి అయ్యంగారు:—**

హిందూ పత్రికా సంపాదకులుగ నుండిన శ్రీమాన్ ఎ. రంగసామి అయ్యంగారి ప్రియకాలమరణమువలన హిందూపత్రికకే కాక అఖిల భారత దేశమునకును మిగుల సంతాపము కలుగుచున్నది. అయ్యంగారు ఆర్థిక రాజకీయ సమస్యలలో నఖండపాండిత్యము కలిగి యెట్టివిమర్శకులనైన నమ్మించగల రీతిని సుందరముగ చర్చించి వ్రాయగల నైపుణ్యముగలవారు. కాంగ్రెసుయెడల నతని నిర్భేయత అచంచలమైనది. క్రూరప్రభుత్వ విధానము లతని నెన్నడును విప్లవవాదులలోనికి గాని అతివాదులలోనికిగాని త్రోయజాలవు. దేశముయొక్క భావి సౌభాగ్యమునం దతని విశ్వాస మప్రతిహతము. అతని తుదిజీవితపు చర్య యెల్లయు సదా కాంగ్రెస్సు నాశ్రయించుకొని ప్రభుత్వముయెడల నిస్పృహ చెందక దేశీయనాయకులకును ప్రభుత్వాధికారులకును యుక్తమైన సంధిని సమకూర్చు ప్రయత్నములలోనే జరిగినది. రాజీకి ప్రయత్నించుచు మధ్యవర్తిత్వమునకు బూనుకొనువారు తరుచుగా ఉభయులకును విరోధులగుట తటస్థించునుగాని శ్రీమాన్ అయ్యంగారి సౌశీల్యము, సౌమ్యవాక్కు, సుహృద్భావము, సుందరవర్తనము వారి నుభయులకును ప్రాణమిత్రుని జేసినవి. దుర్భరదుఃఖసముద్రమున మునిగిన అతని కుటుంబము వారికి మాసానుభూతి దెల్పుచు పరమేశ్వరు డతని యాత్మకు శాశ్వతానంద మొనగూర్చుగాక యని ప్రార్థించుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# స్వర్గీయ-బసవపున్నమ్మగారు

ఈ మృదుకుసుమము అకస్మాత్తుగా ఇట్లు చ్యుతవృంతమగునని ఏనాఁడును తలంపలేదు. వికసనమింకను పరిస్ఫుటముగాలేదు. సౌరభతరంగములింకను ఒండొంటి నొరసికొనుచు ప్రవహింపలేదు. తత్సూచనలు మాత్రము ప్రారబ్ధములు.

ఇంతలోనే చ్యుతి! విధివిధానము ఎంతదారుణము!

ఈ సోదరీమణికింకను పదునేడేండ్లు నిండలేదు; ఇరువురు శిశువులు. స్వభావము అత్యంతమధురము. చరిత్రము పవిత్రము. ఈ పాడులోకమును అచిరముగా వీడు వారి జీవితము లిట్లే ఆదర్శప్రాయముగానుండునేమో!

ఈచిఱుత ప్రాయముననే ఈమె ఆంధ్రమునందు మంచి సాహిత్యము సంపాదింపఁగల్గినది. "ప్రబోధము" అను ఒకభావగంభీరవ్యాసమును ఈమధ్య గృహలక్ష్మి (669 పే. 2 సం|| సంఖ్య 8) యందు ప్రకటించినది. అందలిభాషా సౌకుమార్యము, భావోత్కృష్టత, భావిరచనా సామర్థ్యమును సూచించుచున్నవి. పాపము! ఇంక నీమెకు భావికాలమేమి? 13-1-34 ఇదియే తుదిదినము.

ఈమె భర్తయగు నాంగలింగము చినవెంకటేశ్వరులు గారికిని, మేనమామయు విఖ్యాతపండితుఁడును అగు విద్వాన్. నా. వేంకటేశ్వరశాస్త్రిగారికిని, తద్బంధువులకును ఈదుఃఖమును సహించుశక్తి పరమేశ్వరుఁడొసఁగుఁగాక. ఆమె యాత్మకు శాంతి చేకూఱుఁగాక!



స్వర్గీయ-బసవ పున్నమ్మగారు.

## బాష్పాంజలి

౧

సదమలాంధ్రసారస్వత సరసినొరసి
కొసరిమొనసెడి రాయంచ కొదమ నేఁడు
రింగునమునింగిపోయెఁ దరంగములను
గాలమో! దైవమో! ఏదికారణంబొ!

౨

నిన్నుమున్ప్రియగాఁ బెనఁగొన్నయట్టి
కూనలతికల విడదీసికొనుచు, మధుర
మైత్రినెఱపు నాధారపద్మమ్ము వీడి
ఏలకో! ఎచ్చటికొ! పోవనేల! తల్లి!

3

సరసి, సరసీరుహమ్మును, సర్వలతలు
నిఖిల శోభాదరిద్రాణనిద్రసంది
గుమ్ముపియుండవు నీవు లేకున్కిఁ జేసి
నాగలింగము బసవపూర్ణమ్మ! చూడు!

ప్రతాప రామకోటయ్య.

1934 జనవరి 20-వ తేదీ మొదలు 1934 మార్చి 20-వ తేదివరకు

# తగ్గింపు వెలలు

కవికొండల వేంకటరాయ విరచితములు — త్వరపడుడు

| | | | | ప్రతి 1కి అసలు ధర | | | తగ్గింపు ధర | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | జనపదములు | ... | ... | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 2. | మాతృదేశ సంకీర్తనము | ... | ... | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 3. | కలరుతము | ... | ... | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 4. | కుమారకంఠము | ... | ... | 0 | 4 | 0 | 0 | 2 | 0 |
| 5. | చదువులదుత్త | ... | ... | 0 | 4 | 0 | 0 | 2 | 0 |
| 6. | కోనేరు | ... | .. | 0 | 4 | 0 | 0 | 2 | 0 |
| 7. | చిట్టికెత | .. | ... | 0 | 6 | 0 | 0 | 3 | 0 |
| 8. | ఆగడపలు | ... | ... | 0 | 8 | 0 | 0 | 4 | 0 |
| | | | | 2 | 6 | 0 | 1 | 0 | 0 |

షరా:— పై పొత్తములు విడివిడిగ వలసినను ఆయా తగ్గింపు ధరలకు ఈయబడునుగాని తపాలఖర్చులు విశేషమగును. ఒక రూపాయకు తక్కువకాని ఆర్డరుతో రూపాయ ముందుగ మనిఆర్డరు చేసిన యెడల తపాలఖర్చులు ప్రకాశకులే భరించి బుక్కుపోస్టుగ పొత్తము లంపగలవారు.

ఏతత్కవికృతము లింకను అచ్చుపడి వెలకు సిద్ధముగనున్నవి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | త్రయి | ప్రతి 1-కి | 0 | 14 | 0 | రెంటినుంగలిపి |
| 2. | ప్రకృతి చందనము | ,, | 0 | 4 | 0 | రు. 1-0-0. |
| 3. | ఆత్మవ్యక్తి | ,, | 0 | 8 | 0 | రెంటినుంగలిపి |
| 4. | నెలబాలుడు | ,, | 0 | 12 | 0 | రు. 1.0-0. |
| 5. | జంటలు | ,, | 1 | 0 | 0 | రెండునుంగలిపి |
| 6. | పొట్టికత | ,, | 0 | 8 | 0 | రు. 1-0-0. |
| 7. | వివిధకుసుమావళి | ,, | 0 | 8 | 0 | రెంటినుంగలిపి |
| 8. | విప్రసందేశము | ,, | 1 | 0 | 0 | రు. 1-0-0. |

వలసినచో,

కవికొండల వేంకటరావుగారు, బి.ఎ., బి.ఎల్,

ఇన్నీసుపేట, రాజమండ్రి.

అని వ్రాయవలెను.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగులక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపముగలిగినప్పుడు ఉపయోగించిన అమోఘముగా పనిచేయును. గర్భాశయమునుండి మైల సరీగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి (Douche) మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిదిఒక్కటే; ఇది బాలింతలపాలిటి పరమౌషధము.

ప్రశంసలు

౧

*M. R. Ry. G. Suryanarayana Garu, Overseer, Madugula, writes*:—

**The medicine called 'Mahasutikabharanam sent by you did wonderful work for my wife after delivery'**

౨

మ. రా. రా. శ్రీ. డాక్టరు నరసింగరావుగారు, గవర్నమెంటు డిస్పెన్సరీ, బురజ:—

మీరు నాకు పంపిన 'మహాసూతికాభరణము' చాలా ఆశ్చర్యమైనగుణము నిచ్చినది.

౩

మ. రా. రా. శ్రీ. నారాయణం తాయనాచార్లుగారు నేటివ్ డాక్టరు. ఇంకొల్లు:—

"సూతికాభరణము సన్నిపాతరోగులకు వాడినాను. అపరిమితముగా పనిచేసి మీ కీర్తిని ఎక్కువగా చెప్పుకొనుచున్నారు."

ఇత్యాదులు ఇంకనుకలవు.

## వెల తు 1 కి రు 30. వారంరోజులమందు రు 5.

## ఆర్షరసాయనశాల,

## ముక్త్యాల (కృష్ణా.)

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR




## లోధ్ర

బుతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

గర్భాశయదోష జనిత వ్యాధులకు, ముట్టుకుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము ఎక్కువ తక్కువ అగుట, స్రావము అనేక రంగులతో వెడలుట, సూతిక గడ్డ, గర్భాశయమున విష వ్రణములు కలుగుట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టు అగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్ర పుత్రికాభిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

వాతోన్మాదమను హిస్టీరియాను ఆశ్చర్యముగ తుదముట్టించుటలో సాటిలేని దివ్యౌషధము.

నేను లోధ్రను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్టకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతి నెలయును క్రమముదప్పి బహిష్టి 20 దినముల లోపుననే యగుచుండెను. 2 సం॥ల వరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటినిగాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి. నేనిష్టపడలేదు. తమ 'లోధ్ర'ను నాకు పంపగోరుచున్నాను.

బి. ఇందిరాకుమారిదేవి. మెట్టూరు.



నా సహోదరి బహిష్టుకాలమందు పరిమితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నియో ఔషధములిప్పించితిమి కాని నయముకాలేదు. తుదకు తమయొక్క లోధ్ర కీర్తివిని రెండుబుడ్లు తెప్పించి నాసోదరికి వాడినాము. అత్యాశ్చర్యముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రి జననమైనది. ఈ సంతోషవార్త తమకు వెల్లడించుచున్నాము.

డి. రాజేశ్వరమ్మ, దిగుపహండి.

లోధ్ర యెల్లెడల దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.




సంపాదకుడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] ఏప్రిల్ 1934 [సంచిక ౨

*Printed at Lodhra Press, Egmore, Madras.*



# గృహలక్ష్మి

## సలహాసంఘం

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

,, వింజమూరి వెంకటరత్నమ్మగారు

,, చిల్కపాటి సీతాంబగారు

,, గంప శివకాంతమ్మగారు

,, తెలికిచర్ల వసుంధరాదేవిగారు ఎం. ఏ., బి. యస్. సి. (Lond)

మ-రా-రా-శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారు బి. ఏ., బి. యల్.

,, రాయసం వెంకటశివుడుగారు ఎం. ఏ., యల్. టి.

,, వి. వెంకటసుబ్బయ్యగారు బి. ఏ.

# GRIHALAKSHMI

**TELUGU ILLUSTRATED LADIES' MAGAZINE**

*Editor*: DR. K. N. KESARI.

**APRIL 1934.**



**Vol. VII** **No. 2**

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR




## లోధ్ర

ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

గర్భాశయదోష జనిత వ్యాధులకు, ముట్టుకుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము ఎక్కువ తక్కువ అగుట, స్రావము అనేక రంగులతో వెడలుట, సూతిక గడ్డ, గర్భాశయమున విష వ్రణములు కలుగుట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టు అగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్ర పుత్రికాభిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

వాతోన్మాదమును హిస్టీరియాను ఆశ్చర్యముగ తుదముట్టించుటలో సాటిలేని దివ్యౌషధము.

నేను లోధ్రను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతి నెలయును క్రమముదప్పి బహిష్ఠి 20 దినములలోపుననే యగుచుండెను. 2 సం॥ల వరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటినిగాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి. నేనిష్టపడలేదు. తమ 'లోధ్ర'ను నాకు పంపగోరుచున్నాను.

బి. ఇందిరాకుమారిదేవి. మెట్టూరు.

నా సహోదరి బహిష్టుకాలమందు పరిమితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నియో ఔషధములిప్పించితిమి కాని నయముకాలేదు. తుదకు తమయొక్క లోధ్ర కీర్తివిని రెండుబుడ్లు తెప్పించి నాసోదరికి వాడినాము. అత్యాశ్చర్యముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రి జననమైనది. ఈ సంతోషవార్త తమకు వెల్లడించుచున్నాము.

డి. రాజేశ్వరమ్మ, దిగుపహాండి.

లోధ్ర యెల్లెడల దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# స్త్రీలకొక సందేశము



## A Message for Women

స్త్రీలకు యౌవనమునుండి వార్ధక్యమువరకు దేహములో సంభవించుమార్పులే వారి ఋత్వంగములయందు గొప్ప ఉపద్రవము కలిగించుచు ప్రసవసమయమున నింకను బాధ కలిగించుచున్నవి. ఇట్లుండ రక్తహీనత, గుండెదడ, నరముల దుర్బలత మొదలగు వ్యాధులకు వారు గురియగుటలో నాశ్చర్యము లేదు.

ఏకైక రసాయనమను లోధ్రయే యిట్టి ఆపత్కాలములయందు వారి పాలిటి వరప్రసాదమని యాతురతగల స్త్రీలు తెలిసికొననగును. ప్రపంచములోని కృతజ్ఞులగు రోగులందరు మనఃపూర్వకముగా శ్లాఘించియున్నారు.

**కేసరి కుటీరం**
ఆయుర్వేద ఔషధాలయం,
ఎగ్మూరు, మదరాసు.

# కేసరి పుష్పత్రయము

## మాలతి

ఇది బాదంపప్పుపాలనుండి తయారు చేయబడి యొక తెల్లటి సువాసనగల నవనీతమువలె నుండును. దీనిని స్త్రీ పురుషులు తల దువ్వుకొనుటకు ముందు కొద్దిగ రాచుకొని దువ్వుకొనిన వెంట్రు కలు రేగక పట్టుకుచ్చువలె మిసమిస లాడుచుండును. మెదడు చల్లపడి సుఖ ముగ నిద్రవచ్చును. సొగసునకు సొంపు నకు సుఖమైన వాసనకు పేరుగాంచిన మాలతీపుష్పముల అత్తరు ఇందు ముఖ్యముగ చేరియున్నది.

వెల బుడ్డి 1_కి 8 అణాలు.

## మాధవి

ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళ పదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసికొని ముఖమునకు లేపనము చేసికొనిన వెంటనే అది చర్మ ములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికము వలె నిర్మలమగును. ముఖమున లేచు సొబె, మచ్చలు, మొటిమలు మొద లగువాటిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగనుండి మంచు రాచు కొనినట్లేయుండును.

వెల బుడ్డి 1_కి 8 అణాలు.

## మల్లిక

ఇది ముద్దుబిడ్డలకు మురిపమైన లేపము. ఇది మైసూరు చందన అత్తరుతోను మల్లెమొగ్గల సారముతోను తయారుచేయబడిన నవీననవనీతము. శిశువులకు దీనిని ప్రతిదినము స్నానాంతరము కొద్దిగ శరీరమునకు రాచు చుండిన, చర్మము మృదువై బంగారు రంగునిచ్చి చర్మ వ్యాధుల రాకుండచేయును. ఈ లేపమువలన బిడ్డలు రబ్బరుచెండ్లవలె తేరుదురు. ఇందు కాశ్మీరపు కేసరి పునుగుగూడ చేరియున్నది.

వెల బుడ్డి 8 అణాలు.

తిరువనంతపురము, హుబ్లీక్షేత్రములయందు
అఖిలభారత వస్తుప్రదర్శనములలో
ప్రథమతరగతి బంగారుపతకములనుపొందిన

కేసరి

# డెంటల్ క్రీమ్

అను

# దంతధావన నవనీతము




మృదు మధుర పరిమళ మిళితము.

ఎల్లరు ఒకమారు రుచిచూడవలయును. దంతములను
ముత్యములవలె చేయుటయేగాక పంటిజబ్బుల నన్నిటిని నివారించును.
భారతదేశమున భారతీయునిచే భారతీయులకొరకు తయారుచేయబడినది.

అన్ని షాపులలో దొరకును.
అణాలు 8 మాత్రమే.

## కేసరి కుటీరం,
ఆయుర్వేద ఔషధశాల, మదరాసు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566, రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు,(మన ప్రాంతపు 1 రూడుస్కానియా రూ 1-3-0అగును)

నిడదవోలు: తాటిమేటి కుటుంబశాస్త్రిగారు.

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.

జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ,

బరంపురం: నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్ పేపరు ఏజంటు.

గుంటూరు: వెల్ కం అండు కంపెని.

అనకాపల్లి: గ్రంధి కన్నయ్యపంతులుగారు, గాంధిమార్కెటు.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.

పిఠాపురం: న్యూస్ఏజెన్సీ ఎం. నూకరాజు, ఆంధ్ర.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.

పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.

నరసాపురము: కటికల సూర్యారావుగారు, కుమ్మరివీధి.

భీమవరము: అమిరపు శేషాచలశర్మగారు.

ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.

కర్నూలు: చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు.

చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.

సెకంద్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాగానుబజారు.

ఏలూరు: బి. విశ్వనాథంగారు.

విజయనగరం: వటూరి సుందరశివరావుగారు.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు

# విషయసూచిక

# భావ

శా. శ్రీవిశ్వేశ్వర పాదపంకజరజశ్శ్రీవై భవోపేతవై
యావల్లోకహితార్థసంకలితవై యత్యన్తసంపూతవై
ధీవిస్తారతఁ బ్రోదిసేసి యమృతాధేయంబవై నెట్టనన్
భావా, సత్యదయానుభావ, పరమోద్భావంబుతోఁ బుట్టవే॥

చ॥ శివశివ!! చెప్పనేరమిక శ్రీముఖ మాటది, నేతిబీరకా
యవలె నిరర్థకంబయిన దక్కట! గుండె గుభేల్మనుం గదా
యినల విహారదేశమునకెత్తిన యార్తిఁ దలంచుకొన్న! భూ
ధవులఁట, బిచ్చగాండ్రవలె దైన్యము నొందుదురంట వింటివే॥

ఉ॥ ఈవిఁక నెట్టులం బరిణమింతువొ యేమిటి దెచ్చిపెట్టుదో
దైవమెరుంగుఁ; గని పరతంత్రత మాత్రము బాపినీవు స
ద్భావము విస్తరింపుమిట భావ, దయాకలితప్రభావ, యీ
సేవకభావమున్ భరతసీమకు దూరముసేయు మిత్తరిన్॥

శా॥ ఏయా కోయలమో క్షుధోపహతికై యేగంజియో గడ్డలో
ఆయాసం బతిగాక కల్గునదియే యాపూటకుం జాలు నా
పాయంబైనది; యంతెకాని పరమాపాయాత్త మృష్టాన్నమే
హేయంబై కనుపట్టుచున్న యదిగాదే భావ, సత్సంభవా॥

క॥ భేదములులేక తర్కవి
వాదములకుఁబోక భ్రాతృభావము లొదవన్
మోదింత్రుగాక జను 'లుం
డేదే రాము డొకఁడను నుడిన్ వశిఁగొనుచున్॥

ప॥ కృ॥ మూర్తి.

# 'భావోదయము'

కిర్లపాలెం. కృష్ణరావుగారు

అరువదేడులు దేశాలనంటి తిరిగి
ప్రాతచుట్టాలమని చూడవచ్చెనిపుడు,
ఎంత లోకానుభవము గణించినదియొ?
భావమేమున్నదో భావవత్సరమున?
కుసుమములుదాల్చి, చిగురాకుకోకగట్టి,
తేటతేనియలూరెడు పాటబాడు
కన్నెకోయిల మునుముందు కదలిరాగ
స్వాగతంబీయవచ్చె, వసంత లక్ష్మి.
ఈశుభోదయసమయాన, ఈమనోజ్ఞ
సుందరోద్యానవీధి, సానందమయులు,
మధురగాన స్రవంతిలో సుధలుగ్రోల
రండు, నేవేగ, తరుణమురాదు మఱల.
తిన్నయింటనె వాసాల నెన్నకుండ,
శక్తిగలదేని శుభము లొసంగుమమ్మ!
మంచిదానవటం చనిపించుకొనుము,
వాదునీకేల, నో భావవత్సరంబ!

# గృహలక్ష్మి

ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ

సంపుటములు వెలకు సిద్ధముగనున్నవి

ఒక్కొక్క వత్సరపు పండ్రెండుసంచికలు కలిపి బైండుచేసిన నాలుగు సంవత్సరములకు నాలుగుసంపుటములు. కాలికోబైండు. దిట్టమైనఅట్ట. గ్రంథభాండాగారములకు అలంకారములు. ఒక్కొక్కసంపుటము కొద్దికాపీలుమాత్రమే ఉన్నవి కావున త్వరపడి ఆర్డరు చేయవలెను. ఆలసించిన దొరకనేరవు. తిరిగి అచ్చుపడనేరవు.

వెల సంపుటము ఒక్కటికి రు. 6—0—0 మాత్రము

రైల్వేపార్సెలుగా తెప్పించుకొనుట మంచిది.

వలయువారు :

## గృహలక్ష్మి కార్యాలయము

పోస్టుబాక్సు నెంబరు 752, ఎగ్మూరు, మదరాసు.

గృహలక్ష్మి కార్యాలయమున

## వెలకు దొరకు గ్రంథములు

### బిల్వ

డాక్టరు కే యన్. కేసరిగారు వ్రాసినది. బిల్వమునుగూర్చిన శాస్త్రవిషయక పరిశ్రమచేసికూర్చిన సర్వవిషయములు ఇందుగలవు. ఈ మూలిక ఓషధీగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథము. పత్రికలు మెచ్చినవి. క్రౌనుసైజున మంచి ఫెదరువెయిటు కాగితము 48 పుటలు రేపరుబైండు. వెల రు.0-8-0 అణాలు. పోస్టేజి ప్రత్యేకము.

### తులసి

గ్రంథకర్త డాక్టరు కే. యన్. కేసరిగారు. తులసియను జాతీయమూలికనుగూర్చిన యమూల్య గ్రంథము. తులసియందలి భేదములు, తులసినిగూర్చి వైద్యశాస్త్రము చెప్పు వాక్యములు, తులసిదళములు తినుటవలన త్రాచుపాముగరచినవారు బ్రతుకుట, తులసివలన నయమగువ్యాధులు మొదలగువిషయములేకాక తులసి పురాణమును, తులసి గోవిందనామములును, తులసి షోడశోపచార పూజయు నిందుదాహరింపబడియున్నవి. గృహస్థులెల్లరును ఈ గ్రంథమునుచదివి తులసివలన బొందదగిన సర్వలాభములను పొందుదురుగాక. శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఈ గ్రంథమునకు చక్కని పీఠిక వ్రాసియున్నారు. పత్రికలు, ప్రముఖులు ప్రశంసించియున్నారు. క్రౌనుసైజున మంచి ఫెదరువెయిటుకాగితము. 72 పుటలు. రేపరుబైండు. వెల రు 0—8—0 పోస్టేజీ ప్రత్యేకము. మొదటికూర్పుప్రతులు చాలతక్కువగనున్నవి గావున వెంటనేఆర్డరు ఇచ్చుట మంచిది.

# కుప్పమ్మ-కమలమ్మ కథ.

తందనానా తాన తానందనానా, తందనానానాన తందానతాన

కుండలాలావారి కుప్పమ్మ ఒకనాడు, పనిబడీవచ్చింది పక్కింటివేపు
కడుపునొప్పితోటి కమలమ్మ పక్కపై, కళ్లనీళ్లకంగ కారుస్తవుంటే
ఎందుకే ఓకమల ఎందుకే ఏడుస్త, ఏమిబాధో చెప్పి ఏడమన్నాది.
కడుపునొప్పితోటి కడగండ్లు బడుతూంటె, ఎగతాళి గిగతాళి ఇప్పుడా నీకు
అబ్బ యీబాధ నీకబ్బినట్లైతే, యీమాయలన్నీని ఎగిరిపొయ్యేని
మాసి యెళ్లేవారు చెబుతారుగాని, బాధసంగతివారి బాబు యిన్నాడా
కమలమ్మయీలాగు కళ్లెర్రజేసి, దడదడాతిట్టంగ తడబాటులేక
కుప్పమ్మ అన్నాది కొంపేమిమునిగింది, లోధ్ర బుడ్డీ తాగలేక పొయ్యావా
మందులన్నీతాగి మతిచెదరిపోయింది, లోధ్ర గీధ్రావద్దు లోకమేవద్దు
అని లోధ్ర విషయాన అపనిందలాడంగ, కోపగించూకోని కుప్పమ్మఅపుడు
తాను తొందరగాను తనయింటికెళ్లీ, లోధ్ర కొంచము తెచ్చి లోటాలోబోసి
కమలమ్మవద్దంటె కనికరంలేక, తాను బలవంతాన తాగించినాది
అదియేమిచిత్రమో ఆదేవుడెరుగు, దానిలోగుట్టేమొ ధన్వంతరెరుగు
పడకపై మెత్తంగపడి రాగమెడుతూన్న, కమలమ్మ మొగమంత కళలుదేరింది
ఒక్కఎముటునలేచి పక్కపైనుండి, కౌగలించుకోని కుప్పమ్మనపుడు
ఏమిటే కుప్పమ్మ ఏటిమందేయిదీ, మన్నించవేతప్పు మరియిట్లగననే
అని యిట్లు వేడంగ అతిదీనముగనూ, కుప్పమ్మ బిరబిరా చెప్పసాగింది
ఆ సముద్రములోన అమృతంబుమల్లె, కేసరికుటీరమున పూసింది లోధ్ర
ఆడవారీ బాధ లన్ని పోగొట్టుటకు, ధన్వంతరేవచ్చి ధర నిలిపినాడు
లోధ్ర పాండురకీర్తి లోకమంతానిండి, జనులకందరికీని జ్యోతినిచ్చింది
ముట్టుకుట్టులమాన్చి, పొట్టనొప్పులజీల్చి, నడుమునొప్పులగర్వ మడగించుతాది.
ముట్టు సరిగారాక మొత్తుకుంటూఉన్న, ముదితలందరికీని మోదమిస్తాది.
అశ్వత్థవృక్షాల గిశ్వత్థవృక్షాల, చుట్టుముట్టూతిరిగి చీకాకుపొంది
బిడ్డ గిడ్డాలేక బేలయై యేడ్చేటి, ముసలికైనాయిచ్చు ముద్దుబిడ్డలను
గర్భకోశములోని గండాలుపోగొట్టి, సంతానమూనిచ్చు సౌభాగ్యమిచ్చు
ఎందుకింతాగొడవ ఎక్కువెందుకు కమల, దాన్నిమించినమందు ధాత్రిలోలేదు
అది స్త్రీలపాలిటీ ఆకామధేనువే, అది స్త్రీలపాలిటీ ఆకల్పతరువే
ఇదివినీ కమలమ్మ యింతవరకూదాన్ని, తాగనందుకు చాల వగచింది తనలోన
ఇకముందునైనాను లోధ్ర తాగాలనీ, ఘట్టిగా ఓపెద్ద ఒట్టెట్టుకుంది.

ఈమందు అన్ని మందులషాపులలోను దొరకును.



గీ॥ విద్యయొసఁగును వినయంబు; వినయమునను |
బడయుఁబాత్రత; పాత్రతవలన ధనము; |
ధనమువలనను ధర్మంబు, దానివలన |
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు ॥

—సుభాషితము.

# గృహలక్ష్మీ స్వర్ణకంకణ బహూకృతి

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి

లోకమాన్యుని గీతారహస్యము, విద్వల్లోకమున నొక గొప్ప సంచలనము కలిగించినది. దీనివలన సర్వసంఘపరిత్యాగియైన సన్యాసియును లోకసంగ్రహమునకై కర్మప్రవర్తకుడు కావలసివచ్చినది. కాఁబట్టి కొందరు వివేకులు ఈ కర్మయోగమును అనుసరించి, భారత స్వాతంత్ర్యసంపాదనయందు శక్తివంచనలేక పాటుపడి, తమజన్మల సార్థకపరచుకొన జొచ్చిరి.

అట్టి మహాశయులలో నగ్రగణ్యుడు, మహాత్ముడు: మనోవాక్కాయకర్మల, నే లేశమాత్రమును భేదము లేక, కేవల భారతభూమికే గాక లోకమంతటికిని మంగళమునే కోరి తన సర్వస్వమును ధారవోయుటకు గడంగెను. ఈతని త్రికరణశుద్ధి పెక్కు సమయములయందు, అగ్నిపరీక్షలకు లోనైనది: అగుచున్నది: ఇంకను గానుండనోపు. ఈతడు యుగపురుష

డన్నారు పెద్దలు. కావున నిట్టి కర్మయోగి యుపదేశములు శిరసావహింపబడుచున్నవి. అంత్యజు డనబడినవాడు హరిజనుడై యగ్రగణ్యు డగుచున్నాడు. అది యటులుండ నంతఃపురములలో బడియుండిన యంగనామణులు తమ సర్వసుఖములకును సలాము పెట్టి వేయివిధముల కష్టములకు బాల్పడుచున్నారు. దూరదర్శనము గల యార్యులు, తమ ముక్తియంతయు నీ యింతుల మూలముననే లభింపవలసి యున్నదను సంపూర్ణ విశ్వాసముతో వారిని నానాముఖముల ప్రోత్సాహపరచుచున్నారు. ఈవిధముగా నేడు భారతభూమియంతయు నొక మహాయజ్ఞవాటికవలె దోచుచున్నది. శాంతి యనునది లేదు. సర్వత్ర సంక్షోభమే వినబడుచున్నది. ఇట్టి సంక్షోభమును జల్లార్చుటకై నుచ్చుటచ్చుట గొందరు కవిపుంగవులు బ..లవెనెలి యూధాశక్తి వమతమ వాగమృతమును గురియుచున్నారు.

వీరిలో సంఘసంస్కరణోద్యోగులు, ముందుగ జెప్పదగియున్నారు. సంఘములు లోపవంతము లగుటయేగాక పరస్పరవైషమ్యములూనియుండుట సర్వానర్థములకు హేతువగుచున్నది కాబట్టి ప్రతిసంఘమును యథాయోగ్యముగ సంస్కరించి యావల బరస్పరవైషమ్యమును నిర్మూలించి తన్మూలమున సర్వసంఘములకు నైకమత్యము నెలకొల్పి యావల దేశస్వాతంత్ర్యమునకై పనిసేయుట వీరి యుద్దేశము. మరియు సంఘములయొక్క యోగక్షేమము లాయాసంఘములకు జెందియున్న స్త్రీలయొక్క యోగక్షేమములమీదనే యాధారపడియుండుట యథార్థము కాబట్టి మున్ముందుగ వారిని సంస్కరింపబూనుట లెస్స యనియు నీ సంఘసంస్కర్తల యుద్దేశము. అయిన, వీరిలో బలుతెరగులవా రున్నారనుట యొక ముఖ్యవిషయము. కేవల పాశ్చాత్యాచారము ననుసరించుటయే పరమార్థ మనుట యొక తెరగు. అది యెంత మాత్రమును బనికిరాదు కాబట్టి పురాతన పద్ధతులనే పట్టుట శ్రేయస్కర మనుట యింకొక తెరగు. కేవల మదియును గాదు; కేవల మిదియును గాదు; ప్రస్తుత దేశకాల పరిస్థితుల ననుసరించి పై రెండు పద్ధతులకును సాధ్యమైనంత సమన్వయము గలిగింప జూచుట మూడవ తెరగు. మొత్తముమీద నీ మూడు తెరగులు ముఖ్యములు. వీటియందింక నెన్నియో యితరములును అంతర్భాతము లగుచున్నవి.

అది యటులుండ నిక నీమూ త్తెరగులను సమాలోచనచేసి చూచునప్పుడు ఈమూడవ పద్ధతియే, యెక్కువమంది జనులచే నామోదింపబడుచున్నది. దీనివలన సంఘమునకు గాని దేశమునకుగాని, ఆర్థికనైతిక హాని యేమాత్రమునులేదు. మన వేష భాషలను మార్చుకో నక్కరలేదు. స్త్రీపురుషు లుభయులును ఉదారబుద్ధులై వర్ణాశ్రమ ధర్మములను బాటించుట కెట్టి ప్రతిబంధకములును గలుగవు. వివిధసంఘముల యన్యోన్యమైత్రికి ఆభాస యనునదియును గలుగదు. ఇట్టి వ్యవస్థ చేకూరినపుడు దేశస్వాతంత్ర్యమును స్వతస్సిద్ధముః కాగలదు.

ఈపరమార్థము లక్ష్యముగాగొని యిప్పట్టున బాటువడు వివిధవ్యక్తులయందును, సమాజములందును కవులును వారిని మన్నించుసమాజములును శాశ్వతులగుచున్నారు. అట్టికవులయందును స్త్రీలు మరింత సుశాశ్వతలగుచున్నారు. అట్టివారిని మన్నించు సమాజములును మరింత సుశాశ్వతములగుచున్నవి.

ఈ ధర్మమును ముందుగ బాటించి లోకమునకు దారిసూపినది, నెల్లూరు వర్థమాన సమాజము; ఆనాటి మహాపురుషులగు తిక్కన మొదలగువారి నేటేట గౌరవించుచున్నటులే యీనాటి మహిళా రత్నములను గూడ నింకముందేటేట మన్నింపఁ బూనినది. దీనిమూలమున నాగరకులయందొక యపూర్వసంచలనము కలిగినది. దానంజేసి సనాతనాది సర్వపక్షములవారును వర్థమానసమాజముపై పు తమదృష్టిని మరలింపవలసి వచ్చినది. స్త్రీ పురుషులు పొందిన సంభ్రమోత్సాహము లింతంతయని చెప్పుటకలవి కాలేదు. ఔనది సహజమే. ఇంతవరకు గవితా సన్మానసౌభాగ్యము, పురుషులకే యచ్చటచ్చట గొంత కొంత తృప్తికరముగ బట్టినదికాని స్త్రీలకు బట్టనేలేదు. అథవా పట్టినదన్నను అదియే వ్యాసరచనకో యేయు విదకో యే యేబది నూరు రూకలు సేయుపదకమేకాని యిట్టి మహాపట్టణమున నింతవిపులముగా గలిగినది కాదనుట వాస్తవము. ఇట్టి వ్యవస్థ యేర్పడుటవలనతే 11-3-34 దీని శ్రీ తిక్కనజయంత్యుత్సవానుబంధముగా జరిగిన శ్రీ గృహలక్ష్మి కంకణ బహూకరణోత్సవముగూడ నత్యంత వైభవోపేతముగా జరిగినది. ఇందు సన్మానింపబడిన సతీరత్నము, శ్రీమతి కనువర్తి వరలక్ష్మమ్మగారు. సభయందగ్రాసన మలంకరించిన సతీరత్నము, శ్రీమతి తెలికిచర్ల వసుంధరాదేవిగారు. ఇంక వక్తలు, సుప్రసిద్ధులగు పౌరులలోనివారు. మరియు విషయమన్ననో గృహలక్ష్మియందు శ్రీ వరలక్ష్మమ్మగారు శారదలేఖలనుపేర మహోపన్యాసములను వ్రాసి యాంధ్రపురంధ్రీలోకమునకు జేసినసేవ. నెల్లూరియందున్న పెద్దలందరును సభనలంకరించిరి. ఇంకొక విశేషమేమనగా పురుషులకంటె స్త్రీలే యెక్కువగా వచ్చి సభనలంకరించుట.

రాజకీయ, నైతిక, మత, సాంఘిక విషయములయందీ శారదలేఖ లాంధ్ర మహిళాలోకమునకేగాక కొంతవరకు బురుషకోటికిని గావించిన సుప్రబోధమును వక్త లుగ్గడించిరి. మరియు నిట్టి లేఖల నొక్కట గ్రంథరూపమున నుచితముగా బ్రకటించి, అది వేయిప్రతులును, నూటపది యార్లుసేయు సువర్ణకంకణమును సమర్పించి శ్రీ కేసరిగారు కవయిత్రిని గౌరవించుట మహిళాలోకమునంతటిని గౌరవించుటయనియు, నిదివర కారేండ్లనుండియు శ్రీ కేసరిగారు, తమ గృహలక్ష్మిమూలమున నారీలోకమునకు జేయుచున్న హితము అమూల్యమనియు, గ్రంథరచనాశక్తివిషయమున స్త్రీలకు బహుమానయోగ్యత కలుగ లేదను కలంకము నేటితోదీరి ప్రజ్ఞాశాలినులగు సతీమణుల కాంధ్రదేశమున కొరతలేదను

మాట యిక బుజువుకాగలదనియు, ఇట్టి దాని కవకాశముగలిగించిన శ్రీ డాక్టరుగారి యౌదార్య మసామాన్యమనియు నిట్టియవ కాశములను వ్యర్థముసేయక సోదరీమణులు తమయం దడగియున్న శక్తులను మరల బయ ల్పరచుటకై తీవ్రముగ యత్నించుట సంభా వ్యమనియు శ్రీమతి వసుంధరాదేవిగారు రూఢిపరచిన వెనుక గ్రంథకర్త్రి యుపన్య సించుచు సతీజనసహోదరులగు శ్రీ కేసరి గారికే యాగ్రంథమును వారుకోరకయే పితృభక్తితో దనకుదానే అంకితమొసగి ధన్యతగాంచితిననియు, నా మహాసభయందు దమ కృతజ్ఞతను దెలియపరచెను. ఆవెనుక సంగీతమును బాడిన శ్రీమతి గుండ్లపూడి విశ్వేశ్వరమ్మగారికిని, మురళి వాయించిన భానుమతి కన్యకును చందనతాంబూలా దులతో రజతపాత్రములు నొసగబడినవి. ఈసభయందు జదువబడిన స్వాగతపద్య ములును, శ్రీమతి వరలక్ష్మమ్మగారి యుప న్యాసాదులును ఇందు ముద్రింపబడియుం డుట గమనింతురుగాక.

"ఈ వర్థమానసమాజమువారేటేట జేయు నీ తిక్కనజయంత్యుత్సవమునజేయు వ్యాసరచనపోటీపరీక్షలో గెలుపొందిన ప్రథ మురాలికి కేసరీనామకమగు నొక స్వర్ణపద కము పెక్కుసంవత్సరములనుండి యివ్వబడు చున్నది. దానివలన నాంధ్రస్త్రీలయందు గొందరు మంచి వ్యాసరచయితలు పొడ సూపిరి. ఈ శ్రీమతి వరలక్ష్మమ్మగారుకూడ నొకతూరి యీపదకమును బడసియుండెను. అదియటులుండ నింక నింతటినుండియు దేశ హితైకవిషయికములగు గ్రంథములను వ్రాయు విదుషీమణులను యథోచితముగా సత్కరించుట కర్తవ్యముగాదోచినది. కాబట్టి దానికనురూపముగ ముందటి కేసరీ స్వర్ణపద కమే, ఇప్పుడు నామమునందును స్వరూపము నందును విలువయందును, మార్పుచెందవలసి వచ్చినది. దేశహితమునకై, యాంధ్రదేశ మునగల యిల్లాండ్ర యభిమానపాత్రమై పాటునడు గృహలక్ష్మినామమును, కంకణ స్వరూపమును, నూటపదార్లువిలువయు, నీ సన్మానమును కర్హతగల గ్రంథము యొక్క ప్రకటనయు నీబహుమానమున సంతర్భూత ములు. గృహలక్ష్మియందు వ్యాసములు వ్రాయుటకును ఈ బహుమానమునకును ఎట్టిసంబంధమును లేదు" అని వర్థమాన సమాజకార్యదర్శిగారు సభవారికి నివేదించిరి.

అనంతరము 'ఈశానదలేఖలనుగూర్చి వ్యాసములు వ్రాయగల స్త్రీలలో నుత్తమ వ్యాసరచయితకు ఏబదిరూపాయల విలువగల స్వర్ణపదక మిచ్చెద'నని రిటైర్డు సబ్జడ్జి మ-రా-శ్రీ కోట నరసింహంపంతులుగారు సభలో ప్రకటించిరి. అనన్తరమున చందన తాంబూల ఫలపుష్పములచే సత్కరింపబడి సభ విరమింపబడెను.

గృహలక్ష్మి సువర్ణకంకణ బహూకరణ సమయమందు దీయబడిన ఛాయాపటము



ఇందు, నడుమను శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారును శ్రీమతి పాలికిచర్ల వసుంధరాదేవిగారును పుష్పమాలాలంకృతులై యున్నవారు.

ఛా॥చి॥ కడంబ్రదర్స్, నెల్లూరు.

# శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి

## ప్రశంసాపంచరత్నములు.



శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు.

శా. శ్రీకల్యాణయుతంబులౌ సుగుణముల్, చెన్నొందు విజ్ఞానమున్
లోకంబు ల్వినుతించు కీర్తి, విదుషీలోకంబు లగ్గింపఁగా
సాకల్యం బగునట్టి గ్రంథరచనాశక్తు ల్విశుద్ధాత్మయున్
మీకు న్గల్గె మఱెందుఁగాన, వరలక్ష్మీదేవి, కాంతాళిలోన్.

సీ. లలి నిత్యసౌభాగ్యముల పెంపు, కళసొంపుఁ, దిలకింప నీకు శ్రీదేవిసాటి
నిరతంబు పతిపదస్మరణచే మనునట్టివిత మెంచిచూడ పార్వతియె సాటి
పద్యగద్యాత్మకప్రౌఢి కైత లిఖించు సరణి గన్గొన సరస్వతియె సాటి
శాంతి దాంతియు సత్యశౌచము ల్విడక వఱలంగ ధర్మదేవతయె సాటి

తే. అత్మవ త్సర్వభూతాని యని వచించు
ఆర్యవచనమ్ము భక్తితాత్పర్యములను
దగ ననుష్ఠించి మెలఁగు కాంతామతల్లి,
దేవి వరలక్ష్మి, మహిమంబు దెలియ వశమె?

చ. రచనలయందు నీతివిదురత్వమునందు మనోహరంబులౌ
వచనములందు రమ్యమృదువాణిని సజ్జనసమ్మతంబులౌ
సుచరితలందు వస్తుపరిశోధనతాతిచణత్వమందు నిం
కెచటఁ దలంచి చూడ సరియే వరలక్ష్మిసతీమతల్లికిన్ ॥

చ. పడతులు మూర్ఖలంచు మును పల్గతుల న్జనులాడుచుండఁగా
బెడిదపునిందల న్బడుచుఁ బెంపటియున్న సతీజనంబులన్
గడుదయ నుద్ధరింప నిటు కంకణమున్ ధరియించి ధన్యవై
కడుయశమున్ గడించితివి కాంతలకెల్ల ముదంబు గూర్చుచున్.

తే. వయసునందున బుద్ధివైభవమునందు
గ్రంథరచనానిరూఢిని ఘనతయందు
ఆర్య, వరలక్ష్మి, పెద్దవీ వగుట భక్తిఁ
జేతు వందనముల నిట్లు సీతమాంబ.

# ఆశీస్సు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి

శ్రీయుత దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, సంస్కృతపండితులు, V.R. కాలేజి, నెల్లూరు.

క॥ అది 'విద్య' యేది సుగుణాభ్యుదయం బొనరించునో జనోత్కరమున క
య్యది 'ధర్మ' మేది సౌఖ్యప్రదమో జనకోటి కిహపరంబుల రెంటన్ ॥

చ॥ విమలపథంబునన్ నిలపి వృత్తము చక్కనొనర్పదేని, ని
క్కముగ వృథాభరంబగునుగాని, ప్రయోజనమేమి విద్యచేన్ ?
సమగతి విద్యయున్ సుగుణసంపదయుంగల యుత్తమాంగనల్
తమి, మగవారలట్టులె యలంకరణంబులు భూతధాత్రికిన్ ॥

ఉ॥ వేదపురాణ కాలముల బిత్తరులన్ జదివించుచుండిరో
లేదొ యదేల యిప్డు? సమలీల నిదే వరలక్ష్మమాంబయ
ట్లాదట విద్యయుం జదువు నబ్బిన సాధ్వులు కానవచ్చుచో,
పై దలికేల విద్యయను ప్రల్లద మింకను సాగివచ్చునే? ॥

మ॥ పరిశీలించితి నీమె వ్యాసమును ముక్ప్రాజ్ఞతిరియిం జేరి; వా
విరిఁ దత్కల్పిత గాథలన్ జదివితిన్ వేపత్త్రికాశ్రేణిలో
నరరే! చక్కని తర్కశక్తి! మధుర త్వావాస్తియున్ దత్తద
ర్థారసస్ఫూర్తియు భూషణంబులు తదీయాఖర్వ వాగ్రీతికిన్.

సీ॥ పెను 'విడాకులచట్ట' మున నుప్పతిలనున్న డెప్పరంబుల నుగ్గడించు చోట,
జవరాండ్రు నాట్యసంస్థల వేసముల నూనఁ గెరలు దోసముల లెక్కించుచోట,
ముదుసలి మగలు తెంపునఁ బెండ్లియాటకై పడెడుపాటులు బయల్పఱచుచోట,
చదువని యిల్లాండ్రు సభలలో వర్తించు రీతివై చిత్రి వర్ణించుచోట,

తే॥ 'శారదా లేఖ' లనుజూడఁ జను, త్వదీయ చతురరచనల కానందయుతుఁడనైతి;
ఎంతవైశద్య! మెంతటి హృద్యశైలి! లలిత లలితంబు, నీవాక్కు లక్ష్మమాంబ !॥

క॥ మీ శారదలేఖల యుద్దేశంబుల కొకట ననుమతింపనివారున్
మీ శైలి ప్రసన్నతకున్, మీశాంతికి మిమ్ము మెచ్చి మేల్మేలనరే ?

ఆ॥ అతిగభీరమైన యూర్థాంతరంగంబు। ప్రకటమగుత మనకుఁ బ్రతిపదంబు
ఇంతకంటె మెఱుఁగునెనసి శారదలేఖ। లెల్లసాధ్వులకును హితములగుత ॥

మ॥ స్థిరతన్ గేసరి కూర్మిపుత్రి, 'గృహలక్ష్మి' దేవి నీకేల సుం
దరమౌ బంగరు గాజులన్ దొడిగెఁ గాంతల్ మెచ్చగా; నల్లె య
క్కఱ, నిక్కెసరిపట్టనంపుఁ గవితాకన్యాలలామంబు నీ
యెఱుతన్ వైచెను పద్యహారమిది కొమ్మా ! పుణ్యసాధ్వీమణీ ! ॥

క॥ శ్రీముఖ ఫాల్గునమాస। శ్యామైకాదశి, వసుంధరాధిష్ఠిత గో
ష్ఠీముఖమున, వరలక్ష్మి।సీమంతిని కొసఁగిరివ్వి సింహపురబుధుల్ ॥

శ్రీరస్తు

గృహలక్ష్మి

కంకణబహూకరణసమయమున

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి

సమర్పించిన

యాశీర్వాదపూర్వక సుస్వాగత

# పద్యరత్న నవకము

---

శ్రీరంజిల్లఁగ లోకజాలములఁ గుక్షిం బెంచువాఁడా దయా।
పారావారుఁడు, కేశవుం డఖిలసౌభాగ్యంబులం గూర్చి యే।
పారన్ మా కనుపర్తి గోత్ర వరలక్ష్మాంబన్ గటాక్షించి త।
త్ప్రారంభంబుల కెల్ల సిద్ధులొసఁగం బ్రార్థింతుమే మర్థిమై॥

సీ॥ ఇలలోనఁ గనుఁగొన్న తలిదండ్రులను భవసింధువు దాటింపఁజేయు నావ।
అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన విభు నిహపరసౌఖ్యవితతికిఁ బట్టుకొమ్మ।
తనకూర్చుబంధుసంతతివాండు నుత్తమగతుల కారయఁదొలికారణంబు।
కులమువారల నెల్లఁ దలయెత్తుకొనఁజేయు మానవతుల తలమానికంబు।

గీ॥ వృష్టికురియంగ సస్యసమృద్ధిగల్గి। సృష్టియంతయు సుఖపడఁజేయ, ధాత,।
పుడమినీవంటియిల్లాండ్రఁబుట్టఁజేయు। ననిశమీ జీవకోటి నచ్చటచట॥

శా॥ ఈషణ్మాత్రము వేషముల్ పడవు నీకే ఘోషయుర్ వద్దు; నీ
భాషాజ్ఞానము దేశసేవకు సుసంబద్ధంబు; నీ బుద్ధి య
న్వేషించున్ సతతంబు సత్యమును! నీ యిచ్ఛల్ స్వతంత్రంబు; లో
యోషారత్నమ, కర్మయుక్తవగు నీ యుద్దేశమే వే రసల్॥

మ॥ ఒకచో నుత్కటరాజకీయములు, వేరొంటన్ మతార్థంబు, వే
రొకచో నైతికధర్మచర్చ, మరి యింకోచోట సంసార కా।

ర్యకలావస్థితి, యింక నొక్కయెడ లోకాచారసంపత్తి, కొం
డొకపట్లన్ బరతత్త్వభూతి: యిటు లెన్నోసంగతుల్ పల్కినా
వకలంకంబుగ సర్వతోముఖముగా: నా పెద్దలే, 'చాలలే।
మింకనీతో హనుమంతరాయ గృహలక్ష్మి' యంద్రు, మే మొందిరన్ ॥

శా॥ అక్కా, చక్కని దేశమాత నొకస్వార్థాచారశాతాసిచే।
చెక్కాముక్కలుసేసి, సత్యరతులన్ జీకొట్టి, నీచంబులౌ।
లెక్కాడొక్కలులేని జన్మలకు నీ లేఖాప్రపంచం బహో!
దిక్కామొక్కయి యాత్మగౌరవపరాదేశంబు చేకూర్పదే॥

శా॥ పూర్వాచారముపేరువెట్టి పురుషుల్ పూబోండ్లఁ గారించుటే।
సర్వానర్థకహేతువై కడకు భిక్షాపాత్రఁ జేకూర్చె నీ।
యుర్విన్ భారతభూమి కం చెరిగి యుద్యోగించి నీవాక్సుధా।
సర్వస్వంబునఁ జాటినావు మహిళాస్వాతంత్ర్య సౌభాగ్యముల్ ॥

మ॥ పరభాషా పరవేష వాంఛలు, నహంభావం, బసహ్యక్రియా।
చరణాసక్తియుఁ, బారతంత్ర్యగతియున్ సైరింపఁ గాలేక, నీ।
సరివారిం బురికొల్పి యార్యుల యశశ్చంద్రాతపస్ఫూర్తికై
నిరతంబుంబడు నీ శ్రమంబు లభినన్దింపంగ మా శక్యమా॥

ఉ॥ సత్యము నిత్యమౌ స్వమతిసారమెరుంగని యట్టి యాపర।
ప్రత్యయనేయబుద్ధులకుఁ బాఠముఁజెప్పుదు ధీరవై; సుధీ।
స్తుత్యములమ్మ నీ పలుకుఁద్రోవలు, భారతధర్మభాక్శిలా
చైత్యసమగ్రముల్, గుడివిశాలములై విలసిల్లు నెల్లెడన్ ॥

శా॥ నీ కవ్యాహతశక్తి యుక్తమతివౌ నీ కాయురారోగ్య సు।
శ్రీకంబౌత శరీరయాత్ర! వరలక్ష్మి, శారదాలేఖ ల।
స్తోకార్థ ప్రతిపాదకంబులయి సంశోభిల్లుగా!! కార్యవి।
ద్యాకల్పల్, జవరాంద్రు కల్పలతలై యాలింత్రుగా కర్థులన్ !!! ॥

11-3-'34. ఇట్లు,

గృహలక్ష్మి ఆస్థానికుడు, పసుమర్తి కృష్ణమూర్తి.

## గృహలక్ష్మీస్వర్ణకంకణము నందుకొనునపుడు
## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచ్చిన యుపన్యాసము.

సోదరులారా!

నేటి ఈ సన్మానమునకు కారణము, శ్రీ కేసరీమహాశయునకును, వర్ధమానసమాజము వారికిని నాయందుగల యవ్యాజవాత్సల్యమేగాని నా పాండిత్యవిశేష మెంతమాత్రమునుగాదు. ఉభయమత సమ్మతుడగు హరిహర నాథస్వామి వెలసిన దివ్యస్థలమై, ఆంధ్రావలి, మోదముం బొరయ తిక్కనకవీంద్రుడు మహాభారతమును విరచించిన పుణ్యక్షేత్రమై, ఆదికవయిత్రి మొల్లమాంబ యుదయమంది 'తేనెసోకనోరుతీయనయగురీతి' రామకథ రచియించిన రమ్యసీమయై, 'పగఱకు వెన్నిచ్చినచో నగరే మనయూరువేలనాయకులందఱు' అనిభార్యయు, 'అసదృశముగ నరివీరుల బసమీఱగ గెలువలేక పందక్రియ నీ వసివైచి విఱిగివచ్చిన' అని తల్లియు మందలించి సమరపరాఙ్ముఖుని సమరోన్ముఖుని గావించిన వీరపత్నులకును, వీరమాతలకును జన్మభూమియై తనరారిన యీ నెల్లూరిమండలమున నీ పవిత్రపినాకినీతీరమున నీ విక్రమసింహపురంబున సోదరులు కొందఱు, వర్ధమాన సమాజమును నెలకొల్పి పూర్వకవీంద్రజయంతులును మహిళా సన్మానములును, జరుపుట వీరి మండలవిఖ్యాతికెంతయు దగియున్నది.

కాని ఏ పరమాత్ముని యనుగ్రహమున మానవులయం దీశక్తియుక్తు లేర్పడుచున్నవో, ఏపరమేశ్వరు ననుగ్రహములేకున్న మానవుడొక తృణశకలంబు నెత్తుటకైన నసమర్థుడో ఏ పరాత్పరు డీవిశాలవిశ్వమునందలి చరాచరవస్తుజాలమున కంతర్యామియై వసించుచు వానివాని కర్మపరతంత్రము గావించుచున్నాడో ఆ భగవానుడొక్కడే ఈ జగంబున పూజ్యుడు, వందనీయుడు, సమ్మాననార్హుడు. కారణభూతుడగు పరమాత్మ యగోచరుడును, కార్యరూపులగు మానవులు ప్రత్యక్షగోచరులును నగుటచే నిక్కముగా పరమాత్మకు చెందవలసిన గౌరవము నశక్తులగు వ్యక్తులకారోపించి సన్మానించుట లోకవ్యవహారమున పరిపాటియైనది. కావుననే తమ యశక్తతను గుర్తించినవారు 'ఇది భగవదనుగ్రహమేగాని మా ప్రజ్ఞావిశేష మేమాత్రముకా'దని చెప్పినను లోక మొప్పుకొనదు. 'నీమాటలు కట్టిపెట్టుము. నీవుగాక మఱెవరు దీనిని చేసిన'దని మందలించును. కాన నిట్టి గౌరవములయెడ సహజముగా వైముఖ్యముగలవారు సైతమీ పరిస్థితులనుబట్టి యొకొక్కప్పుడు వానికి తప్పనిసరిగా నొప్పుకొనవలసివచ్చును.

ఎవరేమిగాభావించినను నావిషయమున నిది నాస్థితికిమించిన సత్కారమనుటకు సందియములేదు. మఱియు నిది నేనొక్కరితనే పొందదగిన సత్కారముగాదు. జల జల ప్రవహించుచు క్రొత్తగావచ్చిన పినాకినీనదిని

చూచి జనులు మహాసంతోషముతో స్వాగత మిత్తురు. పసుపుకుంకుమలతో పుష్పాక్షతలతో నర్చింతురు. తమభూమినంతయు సస్య శ్యామలముగ చేయజాలిన తల్లి ఈమెయేయని మొక్కులిడుదురు. కాని సూర్యుడు తన తీక్ష్ణతరోగ్రకిరణముల నిదాఘసమయము నందు పుడమియందలి జలముల నావిరిరూపమున గ్రహింపడేని, ఆయావిరి, మేఘముగా నేర్పడదేని, ఆమేఘము శీతలవాతాహతిచే చెదరి చిందరవందరయై జలరూపమున భూమిపై వర్షింపబడదేని, ఆజలము వాకలు వాకలై ప్రవహించి నలుదెసలనుండి పినాకినిలో వచ్చిచేరదేని, పినాకిని యెక్కడ? మన మర్చించు టెక్కడ? అటులనే స్త్రీ, తనభర్త యొక్క సహాయమును సానుభూతిని బడయదేని ఈ గౌరవసన్మానము లందుటెక్కడ? ఆమె పేరైనను వినుటకు సాధ్యమా? కాన నీవిద్యావికాసమునకు సర్వవిధముల తమ యామోద ప్రమోదములను దెల్పి నాకట్టి యవకాశమొసంగిన పూజ్యులగు నాభర్తగారీసత్కారమున ప్రధానభాగస్వాములనియు, వారి యంగీకారమే లేనిచో, నేనొక్క వాక్యమైన రచింపజాలియుండననియు నా విన్నపము. తరువాత నావిద్యాభివృద్ధికి చిన్నతనమునుండియు తోడ్పడిన సోదరులున్నారు. ఇందరిసహాయముచే బడసినవిద్యకీసన్మానము అగుచో నిది నాది యనుకొను టెట్లు? హిందూసంఘమున స్త్రీ, గాజుకుప్పెలోని దీపము. దీపము విశేషప్రకాశముగా నుండుటకై పెట్టెడి ఆగాజుచిమ్నీ యెంత ధవళముగ నెంత నిర్మలముగ నెంత సున్నితముగనున్న దీపప్రకాశమంత తేజోవంతముగ నున్నటులనే స్త్రీలకు ఆశ్రయులైన పురుషుల మనోభావములు, స్త్రీలయెడ నెంత యుదారముగ నెంత సరళముగనున్న స్త్రీజీవిత మంత వికాసముజెందును. వివాహరీత్యా పురుషునకు స్త్రీ, యామె పోషణరక్షణభారము మొదలుకొని పొడిఅక్షరాల సంతకమువఱకు పూర్ణ సర్వస్వామ్య సంకలితము (కాపీరైటు) చేయబడుచున్నది. స్వయముగా పెంపొందు పరిస్థితులేవియు స్త్రీకిలేవు కాన కొందరుస్త్రీ లేదియో కొంచెము న్నతికి వచ్చిరనినచో అది స్వామ్యదారుల ఔదార్యమేయనుటకు సందియమేమి? భగవంతుడు, నిగ్రహానుగ్రహసమర్థుడు. ఆయన మహామహిమ అల్పజ్ఞులగు మానవులు గ్రహించుట కతీతమైనది. ఆయన అనుగ్రహించెనా నిముసములో భిక్షుకుడు ధనాఢ్యుడు, మూర్ఖుడు పండితుడు, అసమర్థుడు సమర్థుడునగును. శారదలేఖలు వినోదార్థము వ్రాయదొరకొనినవి. వాని కట్టివిభూతికల్గినదనినచో అది భగవంతుని పరమానుగ్రహమును, అఘటఘటనాసమర్థతయు గాక వేరొకటియగునా? మన ఆంధ్రదేశమున జ్ఞానవృద్ధలును వయోవృద్ధలును వివిధవిద్యాపారంగతలునై యీ విదుషీసన్మానమునందుట కర్హలైన నారీరత్నము లెందరో కలరు. వారి విద్యావిజ్ఞానములముందు నాకుగల జ్ఞాన మత్యల్పము కాన శ్రీ కేసరిమహాశయుల ఆదరణమున జరుపబడెడి సన్మానమునకు నే నెంతమాత్రము చాలనని నాయభిప్రాయము. అయినను పెద్దలగు వారియానతి

త్రోసివేయలేకయు, ఇది నా యొక్కరిత కొఱకే యుద్దేశింపబడినదిగాక ఆంధ్రమహిళా మణులందరికొఱకు ఉద్దేశింపబడినదగుటచేత నాకై గాక స్త్రీ లందరిపక్షమున వారిలో నొకతెనై స్వీకరించితిని. ఇక ముందు ప్రతి వర్షమునను జరిగెడి యిట్టి సన్మానము లందు నాకంటె అర్హతమలైన విదుషీ మణులు పెక్కురేతెంచి యీకంకణముల స్వీకరించి యాంధ్రదేశమును యశోవిరాజి తము గావింతురుగాకయని యాశించు చున్నాను.

శ్రీ కేసరిగారు మహెూదార్యముతో స్త్రీలకై గృహలక్ష్మి పత్రికను నడుపు చున్నారు. దీనివలన స్త్రీలు బడయుచున్న లాభ మనంతము. ఈపత్రికవలన వారు ఆంధ్ర స్త్రీలకు చేయుచున్న యుపకృతియేగాక యిప్పుడు ఇతరవిధములగూడ నాంధ్ర స్త్రీల గౌరవింపదలంచుట వారి స్త్రీ విద్యాభిమానమునకు నిదర్శనమై తనరారు చున్నది. అయితే వారు గృహలక్ష్మి కంక ణముద్వారా నాంధ్రస్త్రీల నర్చించుటకంటె వారు ఆంధ్రస్త్రీల నుద్ధరించుటకై మాన సికముగా బూనిన దీక్షాకంకణము ఆంధ్ర స్త్రీలకు ప్రియతమమైనది కాన యావ దాంధ్రమహిళామండలము, విద్యాసుశిక్షిత మగువలకు వారిటులనే దీక్షావ్రతులై యాంధ్రయువిదల నుద్ధరింతురుగాక యని మనఃపూర్వకముగ గోరుచున్నాను.

వర్థమానసమాజమువారి యాశయములు మహెూత్కృష్టములైనవి. వారు పురుషు లలో విజ్ఞానవ్యాప్తికై చేయుచున్న సేవయే గాక స్త్రీలనుగూడ నుద్ధరింపనెంచుట ప్రశంస నీయమగు సంకల్పము. వారి యాశయములు సర్వదా సఫలీకృతము లగునుగాకయని వాం ఛింపుచున్నాను.

అహహా ! యీ యల్పజీవికిట
సర్హమగునే ? యిట్టి సత్కృతి
గటికపోచకు నేల యింతటి
గౌరవాదరముల్. ౧.

రామదేవునకు నాపై తన
ప్రేమ గాఢంబగుటనేమో
కూర్చె నిట్టి యపూర్వఘటన
కూర్మితోల్కాడన్. ౨.

బిడియమగుచున్న దకట ! నాకు
బిరుదుకంకణ మందుకొనగా
చేయునర్హత లేనిదేదో
చేయుచుంటి ననుచున్. 3.

అందమౌ కవితా సుమంబుల
నాంధ్రజననిని పూజసలుపుచు
కావ్యకర్త్రిణులై విరాజిలు
కవయిత్రులుండంగా. ౪.

దేహగేహాశ్రేయ సుఖములు
దేశమునకై త్యాగమొనరిచి
ధీరమతులై చెఱలకేగిన
తరుణులుండంగా. ౫.

భవిష్యదాంధ్ర సతీలోకము
బహుళవిద్యల భాసిలంగను
పాఠశాలల నూలుకొల్పిన
పడతులుండంగా. ౬.

సంఘదౌష్ట్యము సరకుసేయక
సాహ సోదార ధీరత బహు
సంస్కరణకార్యాళినెఱపిన
సతీమతల్లు లుండంగా. ౭.

విమల విజ్ఞానపథములందు
అమలభక్తిని శోధలొనరిచి
పరమార్థతత్వ మరసినట్టి
పవిత్రచరిత లుండంగా. ౮.

మాననీయగుణాఢ్య లిందఱు
మహితసత్కారార్హ లుండగ
ఏనుకంకణ మందుకొనుట
యెంత సాహసమోకో ! ౯.

నాదుమనమున నెప్పుడేనియు
నూహసేయని యెదురుచూడని
యిట్టి సత్కృతి లభియించుటకు
నేమిహేతు వొకో ? ౧౦.

ఉన్నదొక్కటె ముఖ్యకారణ
మూహసేయగ దోచుచున్నది
అదియెనిజమై యుండునేమో ?
అరసిచూడంగా. ౧౧.

కేసరీ నరసింహరాయని
కీర్తి విస్తృతి గూర్చినట్టిది
కలదుగదా గృహలక్ష్మి యనెడి
కన్యయొక్కరిత. ౧౨.

ఆఱువత్సరములనుండి నే
నధికముదమున గూర్చుచుంటిని
లీల గృహలక్ష్మి గళంబున
లేఖ సుమమాలల్. ౧౩.

శారదా కుసుమాళి యన్నను
కరముప్రీతి గృహలక్ష్మి కెపుడు
ఆబాల కెంత సమ్మదంబో
యాపూల సౌరభముల్. ౧౪.

ఆమెయే ప్రేరేచెనేమో
అయ్యనిట్టులు సేయుమంచును
కాక కారణమున్నదే నను
గారవింపంగాన్. ౧౫.

దాతయుద్దేశ మెంతధర్మ
యుతమై కనుపించు చుండినను
కలగుచున్నది నాదుమది యొక
కారణమువలన్. ౧౬.

పదియు నాఱేడుల నుండియును
నదియె పనిగా వ్రాయుచుంటిని
తెలుగుపత్త్రిక లన్నిటను నే
నలఘు వ్యాసముల్. ౧౭.

వ్యాసరచనలకు మూల్యముగా
కానుపీసం బైనగానీ
ప్రతిఫలం బెపుడొంది యెఱుగను
పత్రికాధిపతులచే. ౧౮.

నెమ్మి యపరిగ్రహవ్రతమునూని
నేను వ్రాసెడి వాని కిప్పుడు
పరిగ్రహం బిటు వచ్చెనే యని
పరితాప మొదవెను నెమ్మదిన్. ౧౯.

స్త్రీలకొఱకై బెట్టినామిది
స్త్రీలు ఎల్లరు గైకొందు రిక
స్వీకరించుడి ముందువీరన
చేకొనగ వలసెన్. ౨౦.



ఆర్యమహిళాసమాజము, బొంబాయి.

51 వ వర్థంత్యుత్సవము. శ్రీమతి సరోజినీ నాయుడుగారు అధ్యక్షత వహించిరి.



జూనియర్, అండు సీనియర్ సర్టిఫైడుస్కూలు అండు స్టాఫు (పరశువాకము)



బాలికల క్రీడలు

ఆదికవయిత్రి మొల్లమాంబ
యుదయమందిన పుణ్యసీమను
నాంధ్రమహిళల కిట్టి సత్కృతి
యర్హ్యకృత్యమెకా. ౨౧.

నేనుమాత్రము కొలదియే యీ
నెల్లూరిసీమ వైభవంబు
కనకమాంబ సీతమాంబాది
కవయిత్రులున్నారు ! ౨౨.

ఆంధ్రమహిళాభ్యున్నతికినై
యఖండ కృషిసేయుచున్న యీ
సహోదరవర్గంబున కగుత
సకల సంప్రచ్ఛ్రేయముల్. ౨౩.

జయము జయం బీవర్ధమాన
జయంతి సభా సభ్య వరులకు
జయము శ్రీ వసుంధరామణికి
జయము మంగళము. ౨౪.

అస్మదీయలేఖా సుమాళి
కాంధ్రదేశం బన్నిదిశలను
నేమహామహు లాదరంబున
నీమహాశయ మబ్బెనో!

ఆంధ్ర మహిళాభ్యున్నతికినై
యహరహంబును బాటువడియెడి
వరగృహలక్ష్మి జనకుండై
వరలునెవ్వాడో!

ఆ కేసరీమహాశయునకె
యంకితంబొనరింతు లేఖల
నిమ్మహాజన సమక్షమునను
సమ్మదంబునన్.

[గృహలక్ష్మి పత్రికాధిపతులను నేను శారదలేఖల సంపుటములుగా ప్రచురించుడని కోరలేదు. ఇయ్యది వారిహృదయములో సహజముగ నొదవిన సత్సంకల్పము.

అటులనే వారు నీశారదలేఖల దమకు కృతియీయుడని వాంఛింపనులేదు. ఇది నామదిలో గల్గిన తలంపు. శారదలేఖల ప్రచురణము వారి యౌదార్యమునకు చిహ్నమగుచో, ఈలేఖలను నేను వారికే యంకితమొనర్చుటయు నాకృతజ్ఞతకు చిహ్నము కాగలదు.]

# శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి సన్మానసమయమున శ్రీమతి సంఘం లక్ష్మీబాయమ్మగారు ఇచ్చిన యుపన్యాసము

ఏబాలయొక్క యశశ్చంద్రికలు, విద్యుల్లతలపగిది బలుదిశల ప్రాకి కన్నులు మిరిమిట్లు గొలుపుచున్నవో, ఏ బాలయొక్క మృదుమధుర భాషలు ముగ్ధలం దరిని ముక్కుపై వ్రేలునిడి, యక్కజపడునట్లు చేయుచున్నవో, ఏ బాలయొక్క ప్రతాపము బలు గురు బలువోట్ల పలువిధముల ప్రశంశించుచున్నారో, ఏ గుణశీలయొక్క గుణములు కొనియాడ గాయకులు గాబరాబడుచున్నారో, ఏ సుందరియొక్క సౌం దర్యము చక్కగా జిత్రించలేక చిత్రకారులందరు చీకాకుజెందుచున్నారో, ఏ బాలయొక్క ఉపదే శము లాచరణలో బెట్టలేక యంగనలంతా యడలి పోవుచున్నారో, ఏబాల, నారీలోకము నుద్ధరించ నడుముగట్టి నిరాఘాటముగా నడచుచున్నదో, ఆపెయే యీ గృహలక్ష్మి. ఈమె కడులేబ్రాయ. అయితే కడుజ్ఞాని. ఇంతేకాదు. ఆమె హృదయ మతి కోమలము. మతాచారపరాయణ. గొప్ప పండితురాలును. కాని రాజకీయములలో లేదని గాదు. ఈమెకు, కవి, గాయక, పండితుల సన్మా నించుటయందు అతి సరదా. ఈమె యింత త్వరలో నిట్టి ప్రజామోదముబడుటకు, ఈమె తండ్రిగారి యొక్క కార్యదీక్షయే కారణము. ఈ మందస్మితను అందరివలె తండ్రిగారు పాఠశాల కంపలేదు. సాహిత్య సంగీత జ్యోతిషాయుర్వేదగణిత చిత్రలేఖనాది విద్య లన్నియు నింటిలోనే చెప్పించుచున్నారు. అందుకని కొన్ని పండితుల కుటుంబముల బోషించుచున్నారు. చిరంజీవిని యొంటిగ నుంటుందని కాబోలు, కొందరు విద్యార్థినులను గూడ నామెకు తోడుగా నింట విద్య గరపించుచున్నారు. గానమోహిని, సుఖదా యిని, సుందరులు, గృహలక్ష్మి నేస్తము లభించినం దుకుఁ గొంత గర్వించుచున్నారు.

## శారదలేఖలు

ఇట్టి లేఖల నింతవరకు స్త్రీ లెవ్వరేని వ్రాసి యుండలేదు. వీటిని చదివినకొలది యానంద మధిక మగుచుండును. ప్రతిలేఖ ప్రత్యేకనీతి గరపును, శైలి యతి సులభశైలి. భాష సరళభావ, ఆబాల గోపాలమున కర్థమగును. అచ్చ టచ్చట చక్కని సమాసాలు: ముద్దులు గులుకు యుపమానములు. మామూలుగా 'లేఖ'లన ఏ యత్తింటివారిదో, పుట్టిం టివారిదో, క్షేమలాభ రామాయణమని తాత్పర్యము గాని యివి యట్లు కావు ప్రస్తుతము మనదేశములో నుండు దురాచారముల నెక్కగా చాటుచున్నవి. ఇట్టి లేఖల నందుకొను యాడవారిదే. యదృష్టము. వీటిని ప్రతి స్త్రీ చదువుటయేగాక, ప్రతి బాలికా పాఠశాలలో పాఠ్యగ్రంథము గానుంచ యత్నించ వలె. సర్వేశ్వరు డీ శారదను ఆయురారోగ్య భాగ్య ములిచ్చి యాశీర్వదించు గాత.

'నిరాశ్రయా నశోభంతే పండితా వనితా లతాః' యను మాట యేమాత్ర మన్నృతముకాదు. మన దేశములో పండితు లంతగాఁ బైకివచ్చుటలేదు. అన్ని దేశములలోని ప్రభుత్వమువారు పండితుల పోషణార్థమైతేనేమి, సన్మానార్థమైతేనేమి, యనేక వేల ధనము వ్యయపరచుచున్నారు. గాని మన కట్టి యేర్పాటు లేమియులేవు. 'తల్లికి దంచగలిగిన బిడ్డకుఁ బుక్కగలుగు' నన్నట్లు, మగవారికే లేనపుడు ఆడువారి సంగతి యడుగనేలకి పండితులుగాని, కవులుగాని, యెంత ధీమంతులైనప్పటికిన్ని, వారి గ్రంథము లెంత గొప్పవైనప్పటికిన్నీ యాశ్రయము లేనిది రాణించవు. మన మనేకచోట్ల పూర్వపు తపోధనులు వ్రాసిన తాళపత్రములు, శిథిలములై పేరు, ఊరులేక పాడగుట కన్నులార గాంచుచు న్నాము. అంటే పండితులకుఁ బ్రభావము లేదని గాదు. రత్నము రత్నమె. గాని యది మేలిమితో మిళితమైన, దాని శోభ ద్విగుణీకృతమగును. కావున పండితుల కాశ్రయ మవసరము.

అన్నట్లు మరచాము. ఈ మధ్య కొందరు గలసి యన్యాయము జరిపించారు. అది యెవ్వరూ కాదనరు. పాప మెట్లాగైతేనేమి కొంద రీమధ్య కొన్ని పండిత సభలు చేశారు. కొందరిని సన్మానించారు. మరి కొందరికి, కవిరాజులని, కవిసార్వభౌములని, కవిభాస్కరులని బిరుదము లిచ్చుకొన్నారు. గాని యొక్కరుగూడాను స్త్రీలమాట దలపెట్టలేదు. నిజ మాలోచించిన యిది పండితులగు మానవతులకుఁ గొంత యవమానముగానే యున్నది. ఇదంతా మన గుణశీలయగు గృహలక్ష్మికి దెలియకపోలేదు. అందుకని కాబోలు పాపమాపాప తిన్నగా తండ్రివద్దకు పరుగెత్తింది; అంతా జెప్పింది. వారు మాత్రము కాదంటారా? ఎప్పుడూలేదు. ఆత్మజయభివృద్ధికై వార హర్నిశ లెన్ని శ్రమలకైనా లోనగుతారు. ఏ రూపమైతేనేమి, ఏమార్గమైతేనేమి, వారుజేయు యత్నములన్నీ స్త్రీలోకానికేను. అందుకని ముద్దుబిడ్డయొక్క ముద్దులు చెల్లించ సంకల్పించారు శ్రీయుత కే.యన్. కేసరిగారు రివవరలోనే ప్రతియేట, వ్యాస పోటీపరీక్షలో ఉత్తీర్ణులైన యువతీమణులకు, స్వర్ణపతకమిచ్చి గౌరవించుచూ వచ్చారు. ఈ సంవత్సర మది స్వర్ణకంకణముగా మారినది. ఇక ముందుగూడ సమర్థలగు స్త్రీల కిట్టి సన్మానము జరిపించవలెనని శ్రీయుత డాక్టరుగారు సంకల్పించుకొన్నారు.

ఎచ్చటగూడ స్త్రీలమాట తలపెట్టని ఈ రోజులలో శ్రీమతి కుంకుమ శోభితయగు కనుపర్తి వరలక్ష్మమ్మగారిని పూజ్యులగు కేసరిగారిట్లు వెయ్యిన్నూటపదారులతో సన్మానించి మాజాతికంతటికీ ఆనందము గూర్చినందుకు మేము వారికెంతయో కృతజ్ఞులము. ఇది వరలక్ష్మమ్మగారికే కాదు. స్త్రీలలో కాని కంఠటికి అందముగాబెట్టిన యలంకారశుభ చిహ్నము. ఇట్టి యసమానకీర్తి గణించి కాంతల నందరిని గర్వింపజేసిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారికి మే మత్యంత భక్తితో దోసి లొగ్గుచున్నాము.

వరలక్ష్మమ్మగారు, గృహలక్ష్మికి స్త్రీలే సంపాదకురాండ్రుగా నుండవలెనని వ్రాశారు. దాదాపు తొమ్మిదిమాసములనుండి గృహలక్ష్మి యింట నేయుంటూవచ్చాను, గాని యింతవరకిట్టి యూహా, నాకెన్నడూపోలేదు. ఇది విన్నప్పటినుండీ, గృహలక్ష్మి కిది కొరతగా నున్నట్లున్నది.

కాని యీకొరత త్వరగాతీరునట్లు తోచదు. అంటే స్త్రీలకిది యసాధ్యమనిగాదు. ఇంత కెందుకు, అన్ని విద్యలలోను, యన్నివృత్తులలోను, బురుషులతోబాటు పోలతులుగూడ ప్రవేశించుచున్నారు గదా! ఎందుకనియో గాని పత్రికా రచనయందు స్త్రీలు శీతకన్ను వేసినారు.

ఇంతకు పూర్వమె మన నెచ్చెలి గృహలక్ష్మి సతీమణులనే సంపాదకురాండ్రుగా నుండమని మెల్లగా మందలించినది; రమ్మని రాయబారము లంపింది; వచ్చిన వారిని సన్మానించింది; అధికారములన్ని వారల కప్పజెప్పినది. కాని వారెందువలననో కొన్నిరోజులు మాత్రమె యుండగలిగిరి. ఇప్పటికిగూడ గృహలక్ష్మి స్త్రీల సంపాదకత్వమును గూర్చి యత్నము వదలలేదు మధ్యమధ్య స్త్రీలను పురికొలుపుచు నేయున్నది. సమర్థులైనవారలనెల్ల సాసనముగా సవాలు చేయుచునే యున్నది. పాప మాచిట్టిజేయు యత్నములన్నీ చూస్తే కడుజాలేస్తుంది. ఇకముందుగూడ విద్యావతులగు స్త్రీలు పత్రికారచన నభ్యసింప నిచ్చగించిన వారల గృహలక్ష్మి దగురీతిగా మన్నించును. ఇందుకెవ్వరైనా ముందుకు రావలెను.

ఇదంతా జరుగవలెనంటే కొంతకాలము పట్టును. అందుకని, యన్నిటిలో మార్గదర్శకులగు శ్రీమతి వరలక్ష్మమ్మగారే దీనిలోగూడ మార్గదర్శకులుగా నుండి తమయత్యంత అనురాగపతియగు, గృహలక్ష్మి కోరికదీర్చగలందులకు ప్రార్థించుచున్నాము.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి సన్మానసమయమున
## శ్రీమతి శిష్ట్లా వరలక్ష్మమ్మగారు చదివిన యుపన్యాసము

అమ్మా,

మిమ్ములను ఇంతవరకు గృహలక్ష్మి పత్రికా పత్రములందే చూచుచుంటినిగాని, నేడు కన్నులార యీ సభామంటపమున చూచుభాగ్యము గలిగినందుకు సంతోషపడుచున్నాను. మీరు గృహలక్ష్మిలో వ్రాస్తూవున్న శారదలేఖలను చదువుచూవున్నప్పుడంతా మా అమ్మయో, మా అక్కగారో ఎవరో ఒక పెద్దవారువచ్చి నాదగ్గర నిలబడి, ఓ అమ్మాయీ యని పిలిచి బుద్ధులు చెప్పుచున్నట్లుండును. గృహలక్ష్మిలో అన్నిటికంటె మావంటివాళ్లకు బాగా తెలిసేది, తెలియవలసినదికూడ మీ లేఖయందున్న యభిప్రాయమే. సర్వసాధారణముగా యిల్లుకదలని మాలాటివాళ్లకు మీ దక్షిణదేశయాత్రలను గురించి వ్రాసిన యొకలేఖ యెంతయో బాగున్నది.

ఆవూళ్లు, ఆ దేవుడిగుళ్లూ, ఆ గోపురాలు! అహా! అది చదువుతూవుంటే అచ్చంగా అవి అన్నీ కండ్లకు కట్టినట్లె వుంటుందికదా.

ఈలాటివన్నీ మీరు వున్నది వున్నట్లు వ్రాశారు. ఇంకా యిలాటివెన్నో మీరు వ్రాయవొచ్చును. మీరిద్దరు ముగ్గురు స్త్రీలను గురించి వ్రాశారు. అవి చదువుతూవుంటే మా పొరుగింటామె దుఃఖిస్తుంది యిప్పటికిన్నీ. "వ్రాస్తేయీలా రాయాలిలేకుంటె మానెయ్యాలి" అంది ఆమె. అవును. ఎవరికి అర్థం కాకుండావుంటె ఎందుకు వ్రాయడం? వాళ్ల గొప్ప కోసరమా. బియ్యేలు ప్యాసైనాం, యంయేలు ప్యాసైనాం అని. అందులో కొంతమందిని చూస్తే మరింత చికాకు. ఎంతసేపూ పెండ్లాంమీద యేడుపేనా! వాళ్లు పెట్టేపేర్లే ఏదోమాదిరిగావుంటాయి. అసలు, వాళ్లకే అర్థంకాదేమో అనుకుంటాను.

అయితే ఇవన్నీ వ్రాయకూడదనికాదు. ఒక్కనేనే చదివేదాన్ని కాను. నాకుచే రుచికాదు. కాని, ఎవరిరుచి ఎలావున్నా మీరువ్రాసిందిమాత్రం, మనలో వుండే లోపాలన్ని తెలియపరుస్తుంది. కాబట్టి మనకందరికి పనికొస్తుంది. ఈ లోపాలన్ని ఎవరిమట్టుకు వారు దిద్దుకొంటే, సంఘం దాని అంతట అదే బాగుపడుతుంది. యేసంఘాని కాసంఘం నడిచేటట్టు నడిస్తేమనలో మనకీ కొట్లాటలుండవు. దేశం బాగుపడుతుంది. అందుచేతనే మీరు సంఘంవిషయంలో ముఖ్యమైన స్త్రీలను గురించి యెక్కువశ్రద్ధా పట్టుదలా చూపించినట్లుంది.

అయితే మనవాళ్లు కదిలోచాలి. ఎవరింతకంటె బాగా చెప్తారు. మీరెక్కడ కూడా కఠినంగా ఒక్కమాటైనా అడలేదు. నిజంగా మీవంటి నిజమైన జ్ఞానముగలవాళ్లు పురుషులలో వుండేవి ఎంతేసి లోపాలైనా సహించి మంచిమాటలతో చెప్పుదురేకాని కఠినంగా చెప్పలేరు. ఆడదానికదే మంచి లక్షణము గదా! ఇంకా మీరింతచదువుకున్నా తెల్లపిల్లిని నల్లపిల్లిగాను, నల్లపిల్లిని తెల్లపిల్లిగాను తార్మార్ పేరు గొప్పకైపట్టుకు ప్రాకులాడలేదు. అలాటి ఆశయే మీకుండివుంటే యీలాటిలేఖలే మీరు వ్రాసియుండరు. ఈ కాలాన్ని బట్టి మార్పుకావాలన్నా మీరు హిందూమతధర్మమును ఏమాత్రం విడిచిపెట్టలేదు. ఔను. నిండుకుండలు తొణకవు.

ఈ చదువో ఆచదువో ఏదో ఒకటి పూర్ణంగా వస్తే మనుష్యులు వేషభాషలు మార్చుకోరు. దీనికి వెతుక్కోనేల ఇప్పుడిక్కడ ప్రత్యక్షంగా చూస్తూవున్న మీరు, యీ వసుంధరాదేవమ్మగారే చాలు.

అందులకే ఈశ్వరు డీనాడు మిమ్ముల నిద్దరిని చేర్చి ఇంతమందిని ఆనందింప చేస్తున్నాడు.

అయితే ఆమెకు దొరతనమువారు పెద్దపెద్ద సర్టిఫికెట్లనిచ్చి మన్నించేయున్నారు. దేశీయభాషా పండితురాండ్రైన మీవంటివారలను మాత్రము ఎవరు పలుకరించలేదు. ఇంతటినుండి ఆలోపము తీరినది.

అమ్మా, నమస్కారములు. ఈశ్వరుడు ఇట్టి సన్మానములను మీకు లభింపచేయును. మీరు వొద్దన్నను తప్పదు. అదే మావంటి పిల్లలు కోరవలసినది.

# "వాడిపోని పుష్పములు"

శ్రీమతి అప్పాజి కుప్పమ్మగారు.

ప్రవేశము

జ్ఞాన—పద్మ.

ప:—అక్కా నేడు మనబడిలో బాలికలందరు మిగుల వుత్సాహముతోనున్నారు రేపటిరోజుకు బడిపంతులవారు శలవు దయచేశినారు రేపేమి పండుగ?

జ్ఞా:—సోదరీ రేపు యుగాదిపండుగ అనగా క్రొత్తసంవత్సర ప్రారంభదినము.

ప:—ప్రతిఏట యీపండుగ జేయుదురా?

జ్ఞా:—యీలాగే ప్రతిసంవత్సరము వసంత రుతు ప్రథమదినమున తప్పక.

ప:—యీ పండుగవిధానమెద్ది?

జ్ఞా:—ప్రతిఇంట తైలాభ్యంగనములు, నూతన వస్త్రధారణము, దేవతారాధన, పంచాంగపూజ, పంచాంగశ్రవణము, తీపు చేదు పులుసు మిశ్రమముచేసి ఎల్లరు తినుట, దేవాలయములలో అభిషేక వుత్సవాదులు, బళ్లలో పిల్లల విజయ గీతములు మొదలగు మంగళకార్యములు జరుపబడును.

ప:—వసంతరుతు విశేషములెవ్వి?

జ్ఞా:—మల్లె జాజి మొదలగు పుష్పజాతులు విరివిగా పుష్పించి నలుప్రక్కల సుగంధ మిళితములై యొప్పుచుండును.

ప:—పుష్పములగురించి వింటిని నోరూరుచున్నది ఫలములనుగురించి చెప్పుము.

జ్ఞా:—మామిడి, ముంతమామిడి, పనస, దోస, కరబూజ, మొదలగు వృక్షజాతి లతజాతులు ఫలభరితములై యుండును.

ప:—యితర విశేషములెవ్వి?

జ్ఞా:—యీ రుతువు వనవిహారములకు తీర్థయాత్రలకు కల్యాణోత్సవములకు మిగుల అనుకూలమైనది.

ప:—శ్రీరామజన్మదినోత్సవమెప్పుడు?

జ్ఞా:—యిప్పుడే యీరుతువునందేరాగలదు. చైత్ర శుద్ధ నవమీరోజున ప్రారంభమై సీతాకల్యాణోత్సవమువరకు పదిరోజులు మిగుల వైభవముగా జరుపబడును.

ప:—అయితే నాటికి నావిద్యాభివృద్ధి నిమిత్తము సీతారాముల పూజింప కోరికయున్నది. పరిమళము చెడని వాడిపోని పువ్వులను దెచ్చిఇత్తువా?

జ్ఞా:—చెలీ, నీ వేపువ్వులగోరెదవో చెప్పుము తప్పక దెచ్చిఇత్తును.

ప:—మునుపు నీవు చెప్పిన పుష్పజాతుల మరచితి మర్ల చెప్పుము.

జ్ఞా:—మల్లెపువ్వులు

ప:— అది ఎంతకాలము చెడకయుండును.

జ్ఞా:—ఒకదినము మాత్రమే?

ప:—ఇది అల్పసుగంధముగలది వేరొకటి చెప్పుము.

జ్ఞా:—జాజి-మొల్ల

ప:—ఇవి శాశ్వతసుగంధముగలిగినవా?

జ్ఞా:—పైవిధమున నేకొంతసేపటికి నివిగూడ వాడిపోవును.

ప:—తర్వాత

జ్ఞా:—పొన్న, శామంతె.

ప:—యివియో

జ్ఞా:— ఇవికూడ అంతే

ప:—పిమ్మట

జ్ఞా:—గన్నేరుతామర సంపంగి మొదలగునవి

ప:—యివియు

జ్ఞా:—ఇదియు నంతే

ప:—అబ్బా విసుకువచ్చెను. మా రామ పూజకు వాడిపోనిపూవుల గొనిరావా? చెప్పుము, ఏమిటి కీ గొడవ?

జ్ఞా:—నెచ్చెలీ వాడని పువ్వులు ప్రపంచ మున వృక్షలతలందు లభింపవు. మరివచ్చ టననగా కలుషరహితులగు మానవుల హృదయలతలందు అయిదు విధములగు వాడని పువ్వులుండును. అవివారి జన్మనే పుష్పించి చెడనిసుగంధముగలవై శాశ్వత ములై యుండును.

ప:—అవి ఎట్టివి?

జ్ఞా:— శాంతిపుష్పము, దయపుష్పము, క్షమపుష్పము, అహింసపుష్పము, జ్ఞాన పుష్పము, అనునవి.

ప:—ఇట్టివి నాహృదయమందు లేవా?

జ్ఞా:—వున్నవి, వెదకి కోసి తెచ్చి రామపూజ సేయుము.

ప:—సఖి సద్గుణపుష్పములచే భగవానుని పూజించెద, రంగు రంగు పూవులొల్లను.

జ్ఞా:—ప్రాణసఖి అట్లే చేయుము. నాఅభి మతమదియేను. గుణహీనులపూజ భగ వానుడొల్లక నిరాకరించును.

ప:—అక్కా, శెలవు వెళ్లుటకు.

జ్ఞా:—చెల్లెలా, పునర్దర్శనము నెంబడే గల్గుగాక.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు.)



# భవ్యతరగాత్రి జనకభూపాలపుత్రి

శ్రీమతి పరిటాలకమలా బాయిగారు

ఆకట ! ఆగర్భ శ్రీమంతురాలవయ్యు
భర్తనెడబాయకుండ సద్భక్తితోడ
నుగ్రవిపినాళికాపుర ముంటివమ్మ
భవ్యతరగాత్రి జనకభూపాలపుత్రి!

క్ష్మాతలేశుండుదాఁ బరీక్షార్థమునకు
నగ్నిజొరమంచు నీకప్పుడానతీయ
శీతలుండయ్యె వహ్ని సచ్ఛీలవగుట
భవ్యతరగాత్రి జనకభూపాలపుత్రి!

రావణుడులంకలో ననరానిమాట
లన్న పతియాజ్ఞపైని లక్ష్యంబునిల్పి
శాపమిడశక్తికల్గియు శాంలితివి
భవ్యతరగాత్రి జనకభూపాలపుత్రి.

ఇట్టిసద్గుణరాశివైనట్టి నిన్ను
సతిగఁబడయుటకును పూర్వజన్మమందు
దశరథసుతుండుచేసిన తపమదేమొ
భవ్యతరగాత్రి జనకభూపాలపుత్రి.

ధరపతివ్రతలెవ్వరం చరయగానె
హైందవాంగనలం దుదాహరణముగను
నిన్నె పేర్కొనిపరుల గణింపవలయు
భవ్యతరగాత్రి జనకభూపాలపుత్రి.

# పున్న

పి. వి. రామచంద్రమూర్తిగారు

పదునాఱవ శతాబ్ద ప్రారంభమున మేవారురాజ్యము రాణాసంగునిచేఁ బాలింపఁబడెను. గుజరతు సుల్తాను చిత్తూరుపై దండెత్తివచ్చెను. ఆ యుద్ధమున రాజపుత్రు లెందఱో హతులైరి. చిత్తూరు సుల్తానునకు వశమయ్యెను. మహారాణాపత్నియగు కర్ణావతీదేవి శత్రునకు జిక్కకుండ పదమూడువేల యంతఃపుర కాంతలతోఁ జితిప్రవేశము గావించెను. నాటికిఁ గర్ణావతి కుదయసింహుఁడను శిశువొకఁడుండెను. రాణి యగ్నిఁ జొరుటకుఁ బూర్వ మా బాలుని దాది యగు పున్నయను రసపుత్రకాంత నొక్కర్తుఁ బిలిచి, "పున్నా! ఈ బాలకుఁడు మేవారుసింహాసనాధిపతి. ఈ పవిత్రమగు భారమును నీపైనుంచుచున్నాను. ఈ నినుగున కెట్టి ప్రమాదమును రాకుండఁ గాపాడవలెను." అని వచించెను.

పున్న నయనము లశ్రుకణ పూరితములయ్యెను. తన ప్రాణములనైనను, తన కత్యంతప్రియులైన వారి యసువులనైనను ధారవోసి యా బాలకుని రక్షించెదనని పున్న కర్ణావతీదేవి హస్తమందుఁ దనహస్తముంచి వాగ్దత్తము చేసెను. కర్ణావతి హృదయమునకు శాంతి కలిగినది. రాణి కడసారి శిశువును గౌగలించి నిశ్చలమనస్కయై మరణము నెదుర్కొనెను.

ఉదయసింహునకు విక్రమజిత్తను సవతిసోదరుఁడొకఁడు కలఁడు. అతఁడు రాణాసంగుని యనంతరము, అసహాయశూరులును, ప్రభుభక్తికల వారును నగు సామంతుల సహాయమున, గుజరతు సుల్తానునుండి మేవారుసింహాసనమును లాగుకొనఁగల్గెను. కాని యాతఁడు సింహాసన మధిష్ఠించిన కొలఁదికాలమునకే కృతఘ్నుఁడై సామంతులలో ముఖ్యుఁడును, గౌరవనీయుఁడునునగు నొక్కని నవమానపఱచెను. ఈ యవమానమును సహింపనోపక, సామంతులెల్ల ఏకమై కుట్రసలిపి, విక్రమజిత్తును జంపి, పృథ్వీరాజసూనుఁడగు బన్బీరను నాతని మేవారుసింహాసనమున నుంచిరి. మేవారురాజ్యము చేఁజిక్కినను, బాలుఁడగు నుదయసింహుఁడు జీవించి యున్నంతకాలము, బన్బీరునకు మనమున శాంతికుదురదు. అతఁడు తన్నా సింహాసనమున నిల్పిన సామంతులఁ బిలిచి 'రాణాసంగ పుత్రుఁడగు నుదయసింహుఁడు సజీవుఁడైయున్నంతవఱకు నాతని సింహాసనాసీనుఁ జేసి స్వలాభమునకై పాటుపడు ప్రజ లెందఱో యుండకపోరు" అని వచించెను.

సామంతు లాతని పల్కులయందలి యదార్థమును గ్రహించిరి. కన్ను తెఱవని యా బాలుని రాజ్యాభిషిక్తుని గావించి, స్వార్థపరాయణుఁడగు బలీయుఁడొక్కఁడు రాజ్యచక్రముం ద్రిప్పఁబూనుట శ్రేయస్కరముగాదనియు, సమర్థుఁడగు బన్బీరే ఆపరిస్థితులలో మేవారుసింహాసన మధిష్ఠించు టుచితమనియు వారు తలపోసిరి. తుదకు వారందఱును నిరపరాధి యగు నా బాలకుని యసువులందీయఁ గృతనిశ్చయులైరి.

విశ్వసనీయయగు పున్న, ఉదయసింహుని గడు భక్తిశ్రద్ధలతోను అతిగారాబముతోను బెంచుచుండెను. పున్న కొక పుత్రుఁడు గలఁడు. అతఁడును నుదయసింహుఁ డుదయించిన దినముననే జనించెను. వారిద్ద ఱాడుకొనుచు దినదినప్రవర్ధమానులై పెరుగుచుండిరి.

పున్న ఉదయసింహున కన్నమిడి, శయ్యను బరుండఁజేసి, రాజపుత్రు శౌర్యమును జాటు జోలపాటలఁ బాడి నిద్రపుచ్చెను. రాజపుత్రుఁడున్న డోలికకుఁ గొంచెము దూరమున కూర్చుండి, ఆమె నిజసుతు నొడియందిడుకొని నిద్రింపఁజేయఁ బ్రయత్నించుచుండెను. అంతట నెద్దియో కలకలము విననయ్యెను. పున్న అత్యాతురతతో సుతుని నేలఁ గూర్చుండఁజేసి ఊయెలయందు నిద్రించుచున్న రాజపుత్రునొద్దకుఁ బరుగిడెను. తటాలన కవాటము తెఱవఁబడినది. రాజాంతఃపుర సేవకుఁడొకఁడు లోనఁ బ్రవేశించి, 'విక్రమజిత్తు హత్య గావింపఁబడి

వాడ'ను దుర్వార్తనామెకుఁ దెలియఁజేసెను. హంతకుఁ డుదయసింహునిగూడ దెగటార్చనగాని యూరటఁ జెందడని పున్న గ్రహించెను. ఆ తలపామెను భయకంపితగాఁజేసెను. 'రాకొమరుని భద్రముగ దాచవలెను' అని పున్న నెమ్మదిగాఁ బలికెను. 'ఎట్లు? ఎటుచూచినను శత్రువులే. నగరమున నొక్కడైనను విశ్వసనీయుఁడు కానరాఁడు' అని యాభృత్యుఁ డాతురతను దెలియఁజేసెను. పున్న 'నాకొక యుపాయము దోచుచున్నది' అనియెను. దానికై యాతఁ డెదురు చూచుచుండెను. ఆమెవదనము తెల్లబాఱినది. ఆపె కన్నీటిబిందువుల రాల్చుచు తన యనుంగు తనయుని యొద్దకుఁబోయి మోకాళ్లపై నిలువఁబడి 'బంగరుతండ్రీ, నీవు రాజపుత్త్రునివేషము ధరింపుము. చూడుము. ఈ యుష్ణీష మెంత యందముగ నున్నదో! దీనిఁ బెట్టుకొనుము. ఆ ముత్తియముల మొలత్రాటిని గాంచుము, తళతళ నెట్లు మెఱయుచున్నదో! దాని నలంకరించుకొనుము. రాజపుత్త్రుని హంసతూలికాతల్పమున నిదిరించుచు మేవారుదేశపు ప్రభువవైనట్లు కలగాంచు'మని లేని నవ్వును దెచ్చుకొనుచుఁ బలుకసాగెను. ఆ డింభకుఁడును రాణావలె నటించుటకుఁ దన సంభ్రమమును దెలియఁజేసెను. రత్నఖచితమగు నాయుష్ణీష మా బాలకుని మూర్ధమున నుంపఁబడినది. పున్న రాజపుత్త్రుని మౌక్తికమేఖలనుగూడ యాబాలునినడుమునకుఁ దగిల్చినది. అప్పు డా బుడుతఁడు కౌతుకమును దెలియజేయుచు 'అమ్మా, నేను రాణానైనట్లు కలగాంచి నిద్రనుండి మేల్కొన్న యనంతరము గూడ రాణానైయుందునా?' అని యడిగెను. 'తండ్రీ! ప్రభుభక్తియుతుఁడగు రాజపుత్త్రుడు మేల్కాంచువిధమున లేతు'వని పున్న ప్రత్యుత్తరమిచ్చెను.

పిమ్మట పున్న యుదయసింహుని యూయెల యొద్దకుఁబోయి యాబాలుని లేపెను. "నాయనా! నీవిప్పు డొకచోటికిఁ బోవలయును. అచ్చట చిత్రవిచిత్రములగు దృశ్యముల నెన్నిటినో కాంచగలవు!" అని యామె రాకొమరునకుఁ జెప్పినది. 'నామిత్రుఁడుకూడ నాతో నేగుదెంచునా?' అని యాతఁడడిగెను. 'స్వామీ! ఆతఁడు రాఁడు. నీవింటలేని సమయమున నీరాజ్యమును గాచుచు ఇచటనే నిలిచిపోవును.' అని పున్న ప్రత్యుత్తరమిచ్చెను. ఉదయసింహుఁడును మాఱుమాటాడలేదు.

పున్న తన్నింటవిడచి రాజపుత్త్రు నెటకో తీసికొనిపోవుచున్నదని విన్నపు డామె పుత్త్రు డేడువసాగెను. 'నన్నొంటరిగ విడిచిపోవలదు. నన్నుగూడ కొనిపొమ్మ.'అని యాతఁడు తల్లిని బ్రార్థింపసాగెను. 'రాజపుత్త్రవీరుఁడవగు నీకిట్టి భీరుత్వముకూడదు. నేను తిరిగి వచ్చువరకును మాటలాడక పరుండు'మని బిగ్గరగాఁబల్కి, ఉదయసింహునిశెజ్జయందు వానినుంచి, రాణానిమిత్తమైపోరి వీరస్వర్గముంజెంది రాణాఋణమును దీర్చుకొన్న రాజపుత్త్రులగూర్చి పాడుచుఁ బున్న కొమరుని నిద్రపుచ్చెను.

ఆ పాపఁడు కన్నులమూయుటతోనే, జనని యొక్కమూ ముద్దులొలుకువదనముపై దృష్టి సారించినది. ఆ వీక్షణమునఁ బ్రేమయు, దుఃఖమును మిళితములై కన్పడుచున్నవి. మఱుక్షణమున మానసమును జిక్కఁబట్టుకొని లేచినది. ఆమె చిన్నిరాకొమరుని జంకనిడుకొని, సేవకుఁడు వెంటరాఁగా నొక రహస్యమార్గమున నా గదిని విడిచిపోయెను.

వారట్లా హస్యమార్గముంబట్టిపోయి, ఒకనిర్జన ప్రదేశమునుజేరిరి, ఆమె వెతకి యొక పూలజంగెడను దెచ్చి, యం దుదయసింహుని బరుండఁబెట్టి 'కదలవల'దని చెప్పెను. పిమ్మట నాజంగెడ పైభాగమును బూలతోను నాకులతోను నింపినది. పున్న, కూడ వచ్చిన పరిచారకునితో నాజంగెడమగొని దుర్గమావలకుబోయి తనకై వేచియుండుమనిచెప్పి పంపివైచెను.

పున్న యొంటరిగ నంతఃపురప్రాసాదమున కేతెంచెను. ఆపె సుతుఁడు గాఢమగు నిద్రయందుండెను. పున్న శయ్యాప్రక్కను గూర్చుండియున్నది. కొన్ని నిముసములు గడచినవి. తలుపు తెఱవఁబడినది. ఖడ్గ

హస్తుఁడై, భీకర స్వరూపుఁడగుబన్బీరు ద్వారమున దృశ్యుఁడయ్యెను. 'ఉదయసింహుఁ డెచ్చట?' అని యాతఁడు గర్జించి యడిగెను. పున్న మేను చెమర్చినది. ఉబికివచ్చుచున్న దుఃఖ మామె కంఠమును స్తంభింప, నామె మాటలాడ నేరదయ్యెను. ఆ క్రూర హృదయుని ప్రశ్న కుత్తరముగ నామె శయ్యపై నిదురించు తనసుతుని జూపెను. బన్బీ రతిరయమున నా పాన్పునొద్దకుఁబోయి, మేనువంచి, యాబాలకుని బరికించిచూచెను. ఉదయసింహుని దుస్తుల దొడఁగికొని నిశ్చింతతో నిదురించు బాలకునింగాంచి యెట్టి యనుమానమునకును లోనుగాక వాఁడే రాణాసంగ పుత్త్రుఁడని భావించి, ఆ కటికివానిసి నిరపరాధి యగు నాచిన్నిపాఁపని వక్షమున బాకునుగ్రుచ్చి త్వరితగమనమున నావలకుఁబోయెను. పాప మా ఘోరకృత్యమును పున్న కన్నులారగాంచి కెవ్వుమని యఱచుచు నేలకొరిగిపోయెను. దుర్భర పుత్త్రశోక మొక్కసారిగా నామె నావహించినది. ఆమె యాక్రందనమును విని చుట్టుప్రక్కలగల స్త్రీలెల్ల నాగది కేగుదెంచి, మేవాఱుసింహాసనాధిపతి ఉదయసింహుఁడుగూడ హత్య గావింపఁబడెనని గ్రహించి, విలపింపసాగిరి.

పారములేని దుఃఖసముద్రమున గ్రుంకులిడుచు పున్న తనూజుని మృతకళేబరమునకు దహనక్రియలు గావించినది. ఆమె యశ్రుకణములాచితియందలి భస్మమును పవిత్రముగఁ జేసినవి. ఇంక నామె జాగుసేయు టుచితముగాదు. అతిశీఘ్రముగబోయి, కోటవెలుపల తనకై వేచియుండు సేవకుని గలసికొని, ఉదయసింహుని భద్రమగు ప్రదేశమునకుఁ గొంపోవలయును.

కోటయావల నదీప్రాంతమున నొక యిసుకతిన్నెపైఁ బత్రభారమును వహించియున్న పూలజంగెడను మఱుగుపఱచి, ఆ సేవకుఁడు పున్నకొఱకెదురు చూచుచుండెను. ఆమె యేగుదెంచిన యనంతరము వారిద్దఱా జంగెడనుగొని దేవళనగరమార్గమును బట్టిపోయిరి. దేవళనగరమును పాలించురాజు సింగుబాహుఁడనువాఁడు. పున్న యాతని సమీపించి, ఉదయసింహునిజూపి, యాతనికి శరణమిమ్మనికోరెను. బన్బీరున కా రహస్యము దెలిసినచో నా బలీయునితోఁ బ్రబలవిరోధము దెచ్చుకొనవలసివచ్చుననియు, అందువలన ప్రమాదము వాటిల్లుననియు భయపడి సింగుబాహుఁడు పున్న ప్రార్థన కియ్యకొనఁడయ్యెను. పాపము పున్న రక్షకునకొఱకై తిరుగఁజొచ్చినది. విశ్వసనీయుఁడగు నా సేవకుఁడు దక్క నామెకు సహాయు లెవరును లేరు. వారనంతరము డోంజైరుపురమునకు బయనమై పోయిరి. అచ్చటి నాయకుఁడును ఆ రాజపుత్త్రుని గైకొనుటకు సాహసింపఁడయ్యెను. పున్న కాందోళన హెచ్చగుచుండెను. వారి కాహారముగాని నిద్రగాని పూర్తిగా లభింపదయ్యెను. కాని పున్న మాత్రము వెనుదీయలేదు. ఆమె కడుసాహసి. ధైర్యవతి. రాజభక్తి యామెను ముందంజవేయించుచున్నది. భగవంతుని కటాక్షమునం దామెకు సంపూర్ణ విశ్వాసముకలదు.

ఆమె చుట్టుదారి నొకదానిగైకొని ఈడరుద్వారా ఆ రావళీచరియలఁజేరెను. అవన్నియు బాటలులేని సాంద్రారణ్యములు. దినమంతయు వారు మార్తాండుని వాఁడి మయూఖములకు గుఱియై, రాత్రియంతయు శీతలముచే బాధపడఁజొచ్చిరి. కాని పున్న యచట గల భిల్లులతోఁ బరిచయము గావించుకొని వారి సహాయమువలన కొమల్మెరును జేరఁగలిగెను.

ఆ సాషాయను జైనుఁడొక్కఁ డా ప్రాంతమునఁ బాలించుచుండెను. ఆతనియొద్దకు పున్నపోయి, ఉదయసింహు నాతని హస్తములందుంచి, 'ఈతఁడు మీ ప్రభువు. మేవారుసింహాసన మీతనిదే. కాన నీతని నప్రమత్తుఁడవై గాచికొనుము.' అని పలికెను. ఆ సాషా భయాశ్చర్యములకు లోనయ్యెను. 'బన్బీరును సింహాసనముననుంచిన సామంతు లెల్లఱును బలవంతులు. ఉదయసింహుఁడు నా గృహమందుండెనని వారికి దెలియవచ్చినచో వారి యాగ్రహమునకు గుఱియగుదు'నని యాసాషా సందేహింపఁజొచ్చెను. ఆసాషాజనని యాపలుకుల నాలకించినది. 'ప్రభువిశ్వాసముగలవారి కిట్టి యాపద లొక లెక్కలోనివి గావు. ఎందుల కీ భయము? ఆ బాలుఁడు, మహనీయుఁడగు రాణాసంగునిపుత్త్రుఁడు. రాణాసంగుఁడు నీ యజమాని. ఆపదనున్న యీపిల్లవాని నిప్పుడు

చేకొని నీ రాజభక్తిని వెల్లడించేయుము.' అని యామె కుమారుని హెచ్చరించెను. ఆ ధీరవాక్యము లాతని భయమునఁ బాఱఁద్రోలినవి. ఆ బాలుని రక్షింప నాతఁడు బూనుకొనెను. అన్యుల కెట్టి యనుమానమును గలుగకుండ నా బాలుఁడు తన మేనల్లుఁడని యాసాహ చెప్పఁదొడఁగెను.

పన్న భారమిప్పుడు తగ్గినది. తనవిధి నామె నెఱవేర్చుకొన్నది. రాజతనయుని ప్రాణముల గాపాడ, నిజసుతుని యసువుల నర్పించి మహాత్యాగమును జూపినది. యుదయుని యొద్దనైనను తన జీవితశేషమును గడుప నామె నోచుకొనలేదు. కైనవాయకునిగృహమున నొకరాజపుత్రవనిత వసించియుండు టనుమానమునకు హేతువగును. అందువలన ఆ సాహ మేనల్లునివలెఁ బెరుగుచున్న మేవారురాణాకుఁ బ్రమాదము వాటిల్లవచ్చును. అట్టి సందర్భమున నామెజూపిన మహాత్యాగమును బడినశ్రమయు నిరర్థకములగును. అందుచేఁ బన్న ఉదయసింహుని వీడి చిత్తూరునకుఁ దిరిగివచ్చెను. ఉదయసింహుఁడు పెరిగి పెద్దవాఁడై సింహాసన మధిష్ఠించు తరుణమునకై యామె చిత్తూరునం దెదురు చూచుచుండెను.

తుదకా తరుణ మేగుదెంచినది. ఆమె మనోరథ మీడేరినది. బన్బీరు క్రమముగాఁ బాలింపదొడఁగెను. సామంతులెల్లరు 'కొఱవిదెచ్చి తల గోకికొంటి' మని పశ్చాత్తాపపడఁబొచ్చిరి. వారందరును బన్బీరును పాఱద్రోలి రాణాసంగుని వారసు నొక్కనిదెచ్చి సింహాసనమునఁ బ్రతిష్ఠించిరి. నాటికి చరమదశ యందున్న పున్న ఉదయసింహునిదెచ్చి, యాతఁడు గతించలేదనియుఁ జిత్తూరుసింహాసనమునందుఁ బరిపూర్ణమగుహక్కాతనికిఁగలదనియు నిరూపించెను.

పున్న పూతచరిత్ర. మహాత్యాగవతి. ఆమె చితిపై నున్నతమగు చలువరాతి కట్టడమొకటి నిర్మింపఁబడినది. అనుపమానమగు శిల్పవిద్యాకౌశల మందుఁ జూపఁబడినది. ఆమెపైగల గౌరవముచే స్మృతిచిహ్నముగ నా కట్టడమును రాణా ఉదయసింహుఁడు కట్టించెను. ఆకట్టడ మామె యద్వితీయమగు రాజభక్తిని బ్రపంచమునకుఁ జాటిచెప్పుచు నామెను మృతజీవినిగ జేసినది.

* * * *

# పన్నా

హరి రాధాకృష్ణమూర్తి గారు

పన్నా సంగ్రామసింహుని దేవేరియరణపుదాసి. మేవాడ్ రాజ్య సంరక్షకుఁడు వనవీరుఁడు రాజవంశము నిర్మూలింపఁజూడవచ్చునని వినినది. కన్నపుత్రుని యుదయసింహునిగామార్చి శయ్యనిడి వాపోవుచున్నది.

ఉదయాధీశుని పంచవర్షముల నాయుష్కాలముఁ గాలుష్యపుం
బథముం బూని వధింపవచ్చునట! యావజ్జీవముందానె రా
ట్పదవిం బొందగ రాజ్యరక్షకుఁడు; దుర్వ్యాపారమాదీననా
యుదయుం గావగ నీదుపాలఁబడె బాబూ, యెట్లుగాపాడెదో!
కన్నులనైన విప్పి ననుఁగాననివాఁడవెయైన నీకు నే
నన్నిసపర్యలం బ్రియమునందగఁ జేయకయున్నఁ దల్లినై
చిన్నినిసుంగువైన నినుఁజేరిచి పెంచకయున్న నిట్టులో
యన్న, త్వదీయ మాతృఋణమంతయుఁ దీర్పుమటందులోభినై ॥
భూతమయంబునై బ్రతుకుపొందుటకైన శరీరమిద్ది యే
భూతలనాథు నుప్పుదిని పూర్ణమనోరథమయ్యె నట్టివి
ఖ్యాతచరిత్రు నన్వయ నవాంకుర మొక్కమదద్వీపంబు దా
నీతిసడల్చి ద్రుంగ గమనింపగ నూరకయుంట పాడియే!

నాసకి రాజపత్ని నిజనాథునితోడ జోహారుసేయగా
నాసను నన్నుఁ బిల్చి 'యనుగా! కనువిప్పని యీనిసుంగునీ
కై సముపార్జనన్ సలిపె నాచతురాస్యుఁడు వీనినెట్లు నా
కై సుమనస్సుగాఁ బెనిచి యార్జనసేతొయశంబుమానినీ ॥

ఆజ్యముచే హుతాశనవిహారము కొంచెము కానిభంగి యీ
రాజ్యములన్ దురాత్మకులరజ్జువు లెన్నఁడువిచ్చఁగాన మీ
రాజ్యసుఖాప్తికిం దొసగురాజకుమారుని నీకునిత్తునే
పూజ్యత సంగ్రహించి తనువుంగనులక్ష్యముగాంతొ నెచ్చెలీ ॥

చేతులు కావుపట్టినవి చిన్నతనంబుననున్న నీతి వి
ఖ్యాతవు పుణ్యలోకపరమార్థ మెరుంగుదుగాక బాలునిీ
నీతనువుం బలెన్ మనిచి నింపుమశాంతి మదాత్మ'కంచునా
చేతులు పట్టురాణి పలుసేతలు కన్నులగట్టు పుత్రకా ॥

చూడంజుట్టము మ్రొక్కదైవతము లెచ్చోఁగాననన్నట్లు నా
తోడంబుట్టినవారు లేరయిరి, యెంతోకూర్చునాతండ్రి నే
యీాడుంగాననినాడె చేరెదివి, యాత్మేశుండు దేశంబులం
జూడంబోయెను నీవ నావగవు నిచ్చోమాన్పుమా పుత్రకా ॥

నీకునులాలపోసి యళినీలకచంబును జక్కదిద్ది నే
చేకొని కస్తురీనుదుట స్మేరమెసంగగ బొట్టుపెట్టి నీ
కేకనువేదురానొయని యీాక్షణముం బ్రసరింప జంకి యీ
కాకికి నిన్ను నేనొసగగా దయమాలితి నేమిసేయుదున్ ॥

మనసుది సందడించె ప్రియమా మరిమేరయెసంగదాయె స
న్నని యెలుగంతకంతకును నష్టపడెన్ ధృతిమందగించెడిన్
తనయుఁడవైన నిన్నొసగఁదప్పదు గుండెను రాయిచేసితిన్
జనవిభుఁగావ నిట్టియపచర్యకు నన్నుక్షమింపు పుత్రకా ॥

* * * * *

ఇట్లువాపోయి యాలేమ యిలకు నొరగె
నంత వనవీరుఁడటకు తనంత ప్రియము
లొలుకఁజూడగవచ్చి యా యువిదకొమరుఁ
దనదుశాతాసికిడియె రాట్తనయుఁడనుచు ॥

రాజవిశ్వాసమొదవ తనూజునందు
నొక్కఁడగు వానినొసగిన యువిదచేత
రక్షణను బొందినట్టి యారాట్కుమారు
డుదయసింహుఁడుగానేలెయుదయపురము.

# పేద యిల్లాలు

అబ్బరాజు వెంకటరంగారావు గారు

౧

చినిగిపేలికలైన జీర్ణచేలంబులు అంగసౌభాగ్యంబు భంగపఱుప
చిక్కులై దారిద్ర్యజీమూతములజిమ్ము చికురాలు సౌందర్యశ్రీహరింప
లోఁగ్రుంకి నిరతంబురోదించుకనుగవ వదనసుశ్రీకమ్మ వమ్ముజేయ
వసివాడివత్తలై పసదూలు అంగముల్ సహజశృంగారంబు సమయఁజేయ
ఏటయేటనుసంతతి హెచ్చుచుండ
చిఱుతలాఁకటి భాధచేసిగ్గుపఱుప
పొరుగుపుల్లామసూటీల పోరుసొచ్చ
కుళ్ళికృశియించు 'పేదయిల్లాలి'గనుఁడు.

౨

దినమెల్లకష్టించితెచ్చెడి నూకలు ఆపూటగంజికే ఆటిరావు
అరపొట్టనాకట్టి మఱుప్రొటకని దాచుగంజని కుక్కలుగతికిపోవు
కడకుపోమిగిలిన గంజినీళ్లైనను మిత్తులై చీమలు మిగులనీవు
కూలినాలికిబోయి కూడబెట్టినసొమ్ము మగనిసారాయికై మాయమగును.
శీలవతిగాన మగనిని దూలఁబోదు
విధినిదూరదు తనలోనవిసిగికొనదు
చెవినిజేర్చదు పెఱవారి చీదరింపు
లోన విలపించు కష్టాలలోనఁ గ్రుంగి.

౩

కనులంటిప్రాణాలు కడబట్టునీమూర్తి జాతిదౌర్బల్యంబుఁజాటుచుండు
నేలంటిశిథిలమై నీరొత్తునిలయంబు సంఘకాలుష్యంబు జాటుచుండు
అరపూటకైనను సరిలేసినీతిండి దేశదారిద్ర్యంబు తెల్పుచుండు
అరమేనిచుట్టుకు కొఱవడువస్త్రాలు దేశదౌర్భాగ్యంబు దేటపఱచు.
నిన్నుగాదని తనపొట్టనింపుకొనుచు
అతులితైశ్వర్యములదూగు నతఁడెపేద!
మఱియు, నినుగన్న నీదేశమాత పేద!
'పేదయిల్లాల'వని నిన్నుబిలువనేల?

# స్త్రీ పురుష భేదంగురించి

'అనసూయ'

(మగని చెవిలో)

ఆహా! ఇదేకదా ఆడవాళ్ళకీ మొగవాళ్ళకీ భేదం? మీరు జ్వరున చీదితే బెంగపెట్టేసుకొని హడలెత్తి పోయి నిద్రలేకుండా తిండిలేకుండా కావలా ఉంటాము మేము! మాకు ఒంటికివస్తే ఇంతేగదా! చచ్చేమో బ్రతికేమో తిరిగిచూడనైనా చూడరు మీరు! ఎంతసేపూ మీక్లబ్బూ, మీస్నేహితులు, మీ పేకాటా, మీ గొట్టికాయలాటా, మీ బాతాఖానీ, ఇవన్నీ చల్లగాఉంటే చాలు మీకు! మేము ఎలాగుపోతేనేమిటి? కట్టుకున్న పెళ్ళాం ఎక్కడికి పోతుందని తృణీకారం! పోనీ పుట్టింటికేనా పోయి హాయిగా ఏ ఆరునెల్లపాటో ఉందామంటే నేను అంత అదృష్టానికి నోచుకోలేదుగదా! ఈ యింట్లో యిలాగు పాతిపెట్టేసి తిరిగి చూడకపోతే ఏమిటి సాధనం? డాక్టరును పిలిపించడంలేదు, మందు యిప్పించడంలేదు, పోనీ మనిషి యెలాగువున్నదో మీరైనా తొంగిచూడడములేదు!

"ఈవూరు వైకుంఠయాత్ర వైద్యులచేత మందిప్పించడంకన్న మానేస్తేనే తెరిపి."

నాగురించి అంతపని యెప్పుడైనా పడుతుందా? ఈజబ్బులు బాధపెడతాయి గాని ప్రాణాలుతీసీవు! అలా తీసేస్తే ఏవిచారమూ లేదు! పోనీయండి ఎలాగున్నాది అని అడగడానికేమిటి ఆటంకం? ఎంతసేపూ, 'పనితొందర, తీరుబాటులేదు' అని వేషాలు వేస్తారు! నాలుగుగంటలనుండి తొమ్మిదిగంటలదాకా క్లబ్బులో పేకాటలాడడానికీ గొట్టికాయలాడడానికీ, వాడిపెళ్ళాం అలాగు, వీడిపెళ్ళాం యిలాగు, అల్లది వంగొని వంకాయతింది, ఇల్లిది తొంగొని దోసకాయతింది, అని బాతాఖానీ కొట్టడానికీ తీరుబాటు ఉన్నదికాని కట్టుకొన్నపెళ్ళానికి జబ్బువచ్చి పడిపోతే గడియసేపు సంరక్షణ చేయడానికీ మందు యిప్పించడానికీ తీరుబాటులేదూ? అంత తీరుబాటు లేదని మీదినచర్యలలో యేమిటి మానేసేరు? ఒక పని మానేసినానని వేలుమడిచిచెప్పండి చూస్తాను! అన్నిటికీ ఉన్నతీరుబడి పెళ్ళాంగురించి కనుక్కొందికి లేదూ? ఈవూరివైద్యులందరూ పనికిమాలినవాళ్ళేనా? వందలకొద్దీ జీతాలు తెచ్చుకుంటున్నారు, జబ్బులు కుదురుస్తున్నారు, వాళ్ళు మందిచ్చినవాళ్ళంతా చనిపోయేరాయేమిటి? మీ అశ్రద్ధకు అదో సమాధానపు మిషగాని మరేమీగాదు. అభిమానమున్న మగవాడు అలాగని ఊరుకుంటాడా? గాబరాపడి కంగారెత్తి ఏచచ్చు డాక్టరునైనా తీసికొనివచ్చి శక్తివంచన లేకుండా ఇన్ని మందు నీళ్ళు ఇప్పిస్తాడు! ఇంతకూ తమకు అట్టి అభిమానం ఉంటేగదూ! అభిమానం అన్నది మనస్సులో పుట్టాలిగాని తాటిచెట్టెక్కేవాడిని ఎంతకని ఎగసన తోయగలము? కొబ్బరికాయలో నీరూరినట్లు ప్రేమ ఊరాలి! ఆహా! మీచదువుకొంటూ ఉన్నరోజులకీ యిప్పటికీ యెంతభేదం? అదంతా నిజమో అబద్ధమోగాని కలలాగు జరిగిపోయింది! ఆ ప్రేమ, ఆ అభిమానము, ఆ ఆదరణ అవి యెన్నటికీ మరుపురావుగదా! అప్పుడు గంటలకొద్దీ నావద్ద కూర్చొని మాట్లాడుతూ కాలక్షేపము చేసినప్పుడు నావద్దనుండిన గొప్పగుణము లేమిటి? ఇప్పుడు లేనివేమిటి? అప్పుడు మాట్లాడడానికి ఉండిన హంశము లేమిటి? ఇప్పుడు లేనివేమిటి? మనస్సులో ఉండిన ప్రేమవల్లనే అట్లు హంశములూ మాటలూ గౌరవమూకూడా ఊరుతూ ఉండేవి! ఇప్పుడు మరేమీ అక్కర్లేదు, దిక్కుమాలిన క్లబ్బు ఉంటే చాలును! మాట్లాడడానికి కబుర్లే లేవట! పోనీ మాట్లాడవద్దు; యిలాగు జ్వరంగా ఉన్నప్పుడైనా ఎలాగున్నదని తిరిగి చూడకపోతే ఎంతశాంతముగల పెళ్ళానికైనా ఒళ్ళుమండుతుందా మండదా? నిజంగా పరపురుషుడిని పొగడకూడదుగాని మన పొరుగు కృష్ణారావువంటి అభిమానముగల మొగుడు నూటికి వేయికి ఒకడుకూడా ఉండడని చెప్పవచ్చును!

'ఏం! పై వాడిమీద కన్నేస్తున్నావా యేమిటి!'

పై వాడిమీదే కన్నువేస్తే మిమ్మలినిపట్టుకొని యిలాగు యేడవడం యెందుకు? అది లేకపోబట్టే యింతగానన్ను మీరు కాల్చుకొని తింటూ ఉన్నారు! ఆ కృష్ణారావుమాత్రం క్లబ్బుకువెళ్లడూ?

అతడెప్పుడువస్తాడు? మీరెప్పుడు వస్తారు? ఇట్టె వెళ్లి అట్టెవస్తాడు! మగ్గంలో కండెలాగు! మొన్నను అతనిభార్యకు పదిహేనురోజులు జ్వరం వచ్చినప్పుడు అతడు ఎలాగు ఆమెకు సంరక్షణచేసేడో మీకన్నులతో మీరు చూడలేదూ? ఆ పదిహేను రోజులూ ఆడపనీ మొగపనీ కూడా అతనిదేకదూ? పువ్వులాగు సంరక్షణచేసేడు! ఎప్పుడూ కాళ్లకట్టునే కూర్చునేవాడు! అలాగు ఏవో కబుర్లో కథలో చెబుతునే ఉండేవాడు! జావలుకాచేవాడు. మందులు మాకులు యిచ్చేవాడు! పిల్లలకి సంరక్షణ చేసేవాడు! కంటిమీద కునుకైనా లేకుండా కాచుకొని వచ్చేడు! దానివల్ల వాడికేమైనా కీర్తి లోపమైపోయిందా? జబ్బులో బాధపడుతూవున్న పెళ్లామును తిరిగిచూడకుండా మీసాలు తిప్పుకుంటూ మీరు తిరిగినంతమాత్రము చేత మీకు కీర్తివెళిపోవచ్చిందా? చక్రవర్తులై పోయినారా? పోనీ, మీకంత తీరుబాటు లేకపోతే ఒకమాటు డాక్టరుకు చెప్పి ఉంటే బంట్రోతు గుంటడైనావెళ్లి యింతమందుతెచ్చి పారేస్తాడుగద! తక్కిన వాటికా! తక్కినవాటికి దైవమే ఉన్నాడు! గిడగిడ గింజుకున్నా మీ అమ్మా అప్పా కాస్త జాలైనా చేసి పొయ్యారుగదా! పిల్లలిని చూడరుగదా! ఆబంట్రోతు గుంటడు ఉండబట్టి యింకా కొనఊపిరితో ఉన్నాను! లేకపోతే యీపాటికి మీకు నాబాధ నివారణఅయి పోయియుండును. వాడిధర్మమాఅని వాడు కుంపటిలో అగ్గిచేపి ఇన్నినీళ్లు పడేస్తే దానితోనే నేనెలాగో జావ చేసుకొని బాధపడుతూ ఉన్నాను. (అవునుగాని మీ అమ్మావాళ్లకి అంత శత్రుత్వానికి నేనేమిచేసేనండీ? శత్రువులవంటివాళ్లకు జబ్బుచేస్తే ప్రాణము నిలబడడానికి ఏదోమనిషి చేతనైన సాయము చేస్తాము గదా, అలాంటిది వాళ్లు ఈగదిలోనికిరారు! తొంగి చూడరు! ఎలాగుఉన్నదని అయినా అనరు! లోకులు విని చీవాట్లుపెడతారని అయినా వాళ్లకి లక్ష్యము లేదు, ఏమిదారుణపుమనుష్యులండీ! అవును, వాళ్లను అవవలసినపనేముంది? వాళ్లకూ నాకూ రక్తస్పర్శా? బంధుత్వమా? పేగా? పెత్తనమా? అడివిపుసిరికాయ, సముద్రపుఉప్పూ, ఏమిటి సంబంధము? అర్ధశరీరమని అగ్నిప్రదక్షిణాలుచేసి కంఠానికి మంగళసూత్రంకట్టి పెళ్లాడిన మీకే నామీద ఆశాపాశాలేకపోతే వాళ్లకెందుకుంటుంది? కండకులేని దురద బచ్చలికా? మీరు చులకనచేయబట్టే వారికి చులకన అయిపోయినాను; మొగుడుకొడితే మాధుకరంవాడుకూడ కొట్టినాడుట! అలాగైంది నాబ్రతుకు! మీకు జింప్వాలేకపోబట్టే వారినోట్లో పడిపోతున్నాను! మీకు అభిమానమూ ఆశా కొంచెమైనా నామీదఉంటే నా బ్రతుకు ఇంత అవాడీగాఉండదు! ఈ అభిమానమూ ఆశా అణిచేస్తూవున్నది ఈక్లబ్బే! మీరుక్లబ్బువెర్రి కొంచెము తగ్గిస్తేనేగాని మనసంసారము ఎత్తిల్లేటట్లు లేదు! అయిదుగంటలసేపు క్లబ్బులో కాలక్షేపంచేసి వేస్తే మరి పనిపాట్లు చూసుకోవడమూ యిల్లు సంసారము పెళ్లాం పిల్లలు, వీళ్లసంగతి కనుక్కోవడమూ, వీటికి టైముఏదీ? ఎవడుపెట్టేడో యీక్లబ్బు మాబాగాపెట్టేడు! ఆడవాళ్లందరూ సభచేసిగవర్నమెంటుకి రాస్తే నెమ్మదికి భంగం కలుగచేస్తాయని చెప్పి యీక్లబ్బులు తీసేస్తారేమో! ఇదెక్కడచేటు క్లబ్బువచ్చిందమ్మా! 'పెళ్లాంచచ్చినా క్లబ్బుపక్కనుంచే లేస్తారుగద! అప్పుడు మాదామన్నరకములోనికిదిగేటట్లు కనుపిస్తూ ఉన్నాది, అంతికంతకు మీనైతరివాస్తే! శాసనసభలో కాలుపెట్టనియ్యండి! దానిసంగతి చెప్తాను! దానిపని పట్టిస్తాను!

"ఏమిటిచేస్తావు? క్లబ్బులు మూసివేయడానికి శాసనసభకేమి అధికారముంది?"

మీసాగు హక్కులుతీసేసి రైతులకి యిచ్చేడానికి సభవారికి అధికారంఉందీ? మీక్లబ్బు హక్కులు

మాత్రం తీసేసి మాచేతుల్లో పెట్టడానికి అధికారం లేదూ? అసలు పట్టిసే క్లబ్బులు తీసీమని ఏదో తెలివి తక్కువ చట్టము పెడతానను కున్నారా యేమిటి? క్లబ్బులు ఒక్కమారు మూసీమంటే ఇప్పుడు బొబ్బిలి రాజావారిమీద అగ్రహారీకులు యేడుస్తున్నట్లు నామీద పడియేడుస్తారు మీలాంటి క్లబ్బువాళ్ళందరూ! అంచేత అలాగుచేయను. మరేంచేస్తానో తెలుసునా? ఆపాటితెలిస్తే యీ ఊబిలోయెందుకు ఉండిపోతారు? చెప్తాను వినండి! క్లబ్బుకువెళ్లే ప్రతీ మెంబరూ తన పెళ్లాముతోకూడా అక్కడికి వెళ్లాలనీ, ఒక్కడూ వెళ్ళకూడదనీ, వెళితే వెంటనే గెంటించీడమేకాకుండా మేజస్ట్రేటు దగ్గర శిక్షకూడా వేయించడమగుననినీ్న, ఈ మొదలైన రూల్సు క్రమంగా అమలు జరుగుతూ ఉన్నట్లు చూడడానికి ఒకముసలి ఆడ అధికారిని గవర్నమెంటువారు నియమించి క్లబ్బుసొమ్ములో నుంచే దానికి జీతమిస్తూ ఉండవలసిందనీ, యీమోస్తరుగా యింకా కొన్ని కొన్ని షరతులతో చట్టము ప్రవేశపెట్టేసంటే ఆడవాళ్ళందరూ, అంటే ఒకమొగుడినిపట్టుకొని వేలాడే నాలాంటి ఆడవాళ్ళందరూ, నన్ను ఆమోదించడమే కాకుండా బ్రహ్మరథంపట్టేసి, ఆచట్టము సభలో మోసేసేటట్లు మొగమెంబర్ల ప్రాణాలుపీకీకుండా ఉంటారూ?

"బాగానేఉంది కాని ముసిలిదెందుకూ ?"

ఎందుకా! నేనేం అంతవెర్రిబాగులదాన్ని అనుకున్నారా? ప్రపంచజ్ఞానం లేదనుకున్నారా? పడుచుదాన్ని ఉంచితే పదిరోజులలో దాన్ని మీకోడె మెంబర్లు వలలో వడేసుకొని చట్టాన్ని చంపీరూ?

"ముసలిదానికిమాత్రం నల్లమందిచ్చి మచ్చిక చేయలేమూ ?"

ఇలాంటి ముసలిముండలమీదికి ఇన్సపెక్టరు, ఇన్సపెక్టర్లమీద సూపరెంటు, ఇవన్నీ యేర్పాటు కావనుకున్నారాయేమిటి? మచ్చికని చెప్పిన యీ రెండు సంగతులతో చట్టమంతా అయిపోయిందని అనుకోకండి! దానికి యెన్ని చీలికలు, శాఖలు, కొమ్మలు, ఆకులు, పువ్వులు, పింజలు, అల్లిసభలో ప్రవేశపెడతాననుకున్నారు?

"చట్టము అమలులోనికివస్తే నీవుకూడా నాతో వస్తావు క్లబ్బుకి! ప్రమాదమేమిటి?"

నేనొక్కరైనూవస్తే కుదురుతుందీ? మనఅడంగులేం దొరసానులాయేమిటి పిల్లలిని సీమ పంపించేసి పాడీగా తిరగడానికి! మనకు దాసీలు ఆయాలు లేరు కదా! నాతోపాటు పిల్లలందరూకూడా వస్తారు! ఇలాగే ప్రతిమెంబరు పెళ్లామూ పిల్లల సహితంగా క్లబ్బుకి వెళిపోవస్తే అదో పెద్దపందులదొడ్డిలాగు తయారుఅయిపోతుంది! అప్పుడు ఎవరూకోరవక్కర లేకుండానే క్లబ్బు దానంతట అదే మూతపడిపోతుంది! ఒకనెలజీతంమాత్రం ముడితేచాలును ఈబాపతు ఉద్యోగస్థులకి, చట్టముయొక్క ఉద్దేశము నెరవేరిపోతుంది!

ఏమైనా ఈచట్టము శారదా ఆక్టుఅంత చచ్చు చట్టము కానేరదనుకుంటాను. దాన్నిలక్ష్యపెట్టకుండా పెళ్లిళ్లుచేసేస్తున్నారు ! గవర్నమెంటువారికి నూరురూపాయిలు దాఖలుచేసి ముక్కులో పుల్లపుట్టి కదిపితేగాని వారు దఖలుపుచ్చుకోరు ! ఎవరికిపట్టింది ఆబాధపడడానికి! నా చట్టము అలాంటిదికాదు! ఏరూలు తప్పినా, ఆతప్పిన మెంబరు పెళ్లామే ఫిర్యాదీ! అది అనాధైతే ఆ యిరుగుదో ఆ పొరుగుదో లేక క్లబ్బును బల్లిలాగు కనిపెట్టుకొని ఉండే గవర్నమెంటువారుంచే ఆ అడ అధికారో ఎవళ్లైనా ఫిర్యాదుచేయవచ్చును. ఇలాంటి చట్టము మోస్తరు యెత్తేదో చెయ్యాలిగాని ఒక్కమారు దుడ్డుదెబ్బకొట్టేసినట్లు క్లబ్బులు మూసేసేమంటే ఘోరం ఘోరం అని మీలాంటివాళ్లు దొర్లి

దొర్లి యేడవడమేకాకుండా గవర్నరుగారి పాదాల మీద పడదామనీ వైస్రాయిగారి విమానానికి సాష్టాంగపడదామనీ యీ చట్టానికి అంగీకారం యివ్వవద్దనిబ్రతిమాలుదామనీ మీటింగులు, వైర్లు, యేర్పాటుచేసేసి యేక హడావడిచేసేరూ? అందుచేత సాసనసభవారికి అధికారంలేదనుకోకండి! సవరణచట్టాలతోనే హక్కులుపీకి పారేస్తూఉంటే కొత్తచట్టముతో అలాంటిది చేయడం అబ్బుర మేమిటి? అందులోకీ చచ్చుక్లబ్బులను కొట్టడానికి శాసనసభకు శక్తిలేకపోతుందా? అంచేత క్లబ్బువెర్రి కట్టి పెడతారో, లేకపోతే క్లబ్బులమీదికి దండెత్త మన్నారో చెప్పండి!



# మాతృప్రేమ

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు, బి.ఏ.

ద్విపద.

తనశిశువేయని తరుణియొక్కర్తు
తనశిశువేయని తరుణియింకోర్తు
జగడమాడుచు నరేశ్వరుసభాస్థలికి
తగవుదీర్చుకొనంగ తారేగుదెంచి
నిసుగును నరనాథు నికటాననుంచి
"వసుమతీనాథ! మావాదంబువినుము
ఈనిసుగిందులో నెవరిదోచెప్పి
మానితముగవాదుమాన్పి యిర్వురికి
తగురీతిన్యాయంబు దయచేయుమయ్య
సుగుణనిధీ!" యని సుందరుల్ పలుక
రాజేదియునుమాట రాకుండనుండి
యోజించియోజించి యూరకున్నంత
సకలధర్మార్థ విచక్షణుండైన
అకలంకమతి సచివాగ్రణిపలికె
"ఈతగవునుమీరలే తీర్చుకొనుడి
నేతృసమ్ముఖమున నిల్చుండియిచట."
ఆమాటలాలించి యాపూవుబోండ్లు
మోమోటమునువీడి భూమీశునెదుట
శిశువుపైపడి ఒకచేయియొక్కర్తు
వెసమరొక్కర్తుక వేరొక్కచేయి
పట్టిఆశిశువును బాధింపదొడగ
గట్టిగాఏడ్వగా గడగె నాశిశువు
నిసుగుపై ప్రేమనిండిన నెమ్మనమున
అసలుతల్లితలంచెనట కొంతసేపు.
"ఏలఁబాశిశువు నీలీలచేయొకటి
నేలాగియింకొక్కటీ యింతిలాగ
ఎవరిదగ్గరినున్న నేమయ్యెనాకు
ఎవరోఒకరుపెంచుటే నాకువలయు
కానయీశిశువు నిక్కాంతకేవదిలి
నేనింటికేగెద; కాని యీబిడ్డ
నిటులబాధింప నాకెట్లోర్చుమనసు"
ఇటుగొంతసేపు చింతించితావదిలె
శిశువును; మంత్రివీక్షించి యిదంత
అసలైనతల్లియా అంగనయనుచు
నిశ్చయంబొనరించి నృపతితోపలుక
నాశ్చర్యమందె నయ్యవనీశుడపుడు.
సహజపవిత్ర వాత్సల్యసంపూర్ణ
మహాతల్లిమనస్సు నటుపరీక్షించి
నిజమైనతల్లికే నిసుగునొసంగ
ప్రజలెల్లనుతియింప ప్రభుశిఖామణియు॥



మిసెస్. బి. అచ్చుతరావుగారు.

మంగుళూరు లేడీసుక్లబ్బున రెండవ బ్రిడ్జి ఆటపందెములలో

దివాను బహదూరు యస్. యల్. మతయానుగారి కప్పును గెలిచిన సతీమణి.



మిసెస్ జె. మిస్క్విత్ గారు

మంగళూరు లేడీసుక్లబ్బు మొదటి పింగుపాంగుటూర్నమెంటులలో హ్యామిల్టనుకప్పు గెల్చిన సతీమణి.

# భగవంతునికిమట్టుకు వశమా!

శ్రీమతి టి. వి. సుబ్బాయమ్మగారు.

పదునాల్గు సంవత్సరములకు రజస్వలా అయినను తలిదండ్రుల వివాదములతో ఆరు సంవత్సరము లవివాహితగాయుంచి రామెను.

ఇపుడో పదకొండుమాసములక్రితం వివాహితయైనది. తల్లి దాస్యము తప్పినదని సంతసించిన దామె.

వారిర్వురు అన్యోన్యదంపతులు. ఒకరినొకరు నిముసమేని యెడబాసి యుండరు.

ఇపు డామె గర్భవతి ఆరుమాసములు. కుర్చీలోఉన్న భర్తకు తాంబూలమిచ్చి తాను భోజనముచేసి వచ్చునంతలో, అతఁడు మంచినీళ్లని యడిగెను. ఆమె త్వరితముగా తెచ్చునందలో అతఁడు కనులుమూసెను. ఎంత పిలచినను పలుకడు. ఆగృహమంతయు దుఃఖమయమైపోయినది.

డాక్టర్లు వచ్చి చేయిచూచి లాభములేదనిరి.

ఆమె దైవప్రార్థనతప్ప అంతగా ఏడ్చుటలేదు. ఆ జనసమూహంలో యెవరికివచ్చినట్టు వారు ఆమెను నిందించుచుండిరి.

'హా దైవమా! నా పతితోపాటు నన్నేల గొంపోవు? పతిలేని సతి జన్మయేల?' ఈ ప్రార్థనతో, ఆమె పతిప్రక్కనే వాలినది. ఆ నిదురనుండి మఱల మేల్కొనలేదు.

స్వర్గము నలంకరింపబోయిన యా పవిత్రమూర్తుల జన్మ మెంత ధన్యమో గదా! పవిత్రమూర్తుల నెడబాపుట భగవంతునికిమట్టుకు వశమా!

# విద్యార్థి జీవితము

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు.

వెల సులభం ఫల మధికం అని సినీమా వాళ్లు నాటకాలవాళ్లు ప్రకటిస్తూంటారు. మనప్రస్తుత పరిస్థితులలో దానికి వ్యతిరేకం వెల సులభం ఫలమసంభవం అనాలి. ఏమంటే అన్ని దినుసులు చౌకబట్టలు. అనగా మానప్రాణములకు ఆధారాలు. చౌకేకాని, 'అంగట్లో అన్నీవున్నాయి అల్లునినోట్లో శని వున్నది' అంటారే అలాగ చేతిలో డబ్బుం టేగా ఫలమనుభవించడం?

నెలజీతగాళ్లకి చెల్లుతుంది యీ 'వెల సులభం, ఫల మధికం' అనేమాట. ఏమంటే కొనుక్కునే సరుకులు చవకవడంవల్ల ఇది వరకు నెల కేభై రూపాయలయ్యే సంసారి కిప్పుడు ముప్పైచాలుతాయి. అందుచేత వాళ్లకీ సుఖం.

ఇక యీనాందారులు వ్యవసాయదారు లదే అవస్థ. పంటయే జీవనాధారమగుటచే, ఆ కాయదినుసులమ్ముతే వచ్చేది వ్యవసాయం చేయించడానికయినకూలికి సరి. ఏమైనామిగి లితే పన్నుకి సరి. తను, పెళ్లాం, పిల్లలు యింట్లో పస్తు. ఈబాధలుపడలేక రైతు భూమికవులే వొదులుకుంటున్నాడు. భూమి కవులు కియ్యకపోతే రాబడిలేక యీనాం దారుడి పనిసరి. పైగా భూమి బీడపుతుంది. అందుచేత వెనకటికవులు రిజిస్టరుఅయి అయి దేళ్లున్నా, అది రద్దుచేసుకొని ఆ రైతునే మంచిమాటాడో, లేకపోతే మరోడిని బ్రతి మాలో, సగంమక్తాకియిచ్చితీరాలి, చచ్చి తీరాలి. పరిస్థితులిలావున్నా, రాజుగారికోశం తక్కువైతే పన్ను లిష్టమైనట్టు ఎక్కువ చేసి, ప్రజలనెత్తి నిరుద్దే నిరంకుశప్రభుత్వం పన్నుమాత్రం తప్పదు.

ఆదాయం తక్కువైనా వ్యయం తప్పదు కదా! పల్లెటూరి యీనాందారుకి గంపంత బలగము. కొడుకులకి చదువులు అక్కడలేక పోవడంవల్ల దగ్గిరో దూరమో ఓ పట్టణానికి పంపి చదువు చెప్పించాలి. ఆ కుర్రాడు అక్కడ ప్రవేశించి స్టూడెంటులైఫ్ అంటూ వాళ్లనీ వీళ్లని చూచి నెలనెలకి యింటిదగ్గిర నుండి డబ్బొస్తుందిగదా అని అక్కరలేని కానిపోని గుణాలన్నీ పనిగట్టుగుని (చదువు కన్న ఎక్కువశ్రద్ధగా)నేర్చుగుంటాడు. నిన్నటి దాకా యింటిదగ్గిర చద్దన్నముతినేవాడు యిప్పుడు ఆ అలవాటు మానేశాడు గనుక కాఫీతాగుతేనేకాని వుండలేడు. మొదట కొత్తవాడవుటచే ఏపూటకాపూట డబ్బు చెల్లించే తింటాడు. తరవాత కాతాదారవు తాడు (అరువుపెడతాడు). అప్పటినుండి స్నేహితులెక్కువౌతారు. నలుగురు స్నేహి తులమధ్య ఓ గొప్పవాడున్నాడంటే వీళ్లు నలుగురు కలిసి వాడిని జలగల్లాపట్టుకుని ఆస్పేసి తీరారన్నమాటే. ఇక చెప్పేదేమిటి? వీడు పూర్తిగా ఆరిపోయాక తనుకూడా మరొకడిని అలాగే అర్పటానికి ప్రయత్ని స్తాడు. సిగరెట్టుపొగ, యింజనుగొట్టములో నుంచి వచ్చే బొగ్గుపొగలాగ, ఆముక్కులో నుంచి నోటిలోనుండి విరామంలేకుండా వస్తూనే వుంటుంది. మొదట మిఠాయికిల్లీ తర్వాత కారాకిల్లీ మధ్యాహ్నమయ్యేసరికి మళ్లీ టిఫిను. ఇక విస్తరిదగ్గిర కూర్చుంటే

వీళ్లు చేసేభోజనమేముందీ? వూడ్చుకుతింటే నామోషీ. కావలసివున్నా నాలుగు మెతుకులు కతికి లేచిపోతాడు. హోటలు దేవుడికి కట్టే ముడుపుమాత్రం తప్పదు. మూడు పూట్లా పడే టిఫెన్లేమోయలేక బాధపడే పొట్టలు, తమ యజమాని బలవంతంమీాద కొద్దోగొప్పో అన్నంకూడా ఎక్కించుకొని జీర్ణించుకోలేక బాధపడుతుంటే అప్పుడు యజమానికూడా అవస్థపడడం ప్రారంభిస్తాడు. ఏనుగులా వచ్చినవాడు పీనుగవుతాడు. వెలవెలబాడుతూ పాలుపోయి మేడిపండు వంటి శరీరం, సిగరెట్లకు సాయం సినీమాలు నాటకాలవల్ల నిద్రలేకపోవడం, నిద్రరాకుండా టీ పానం, ధూమపానమనే విషపానం, వీటితో వచ్చే జబ్బులకుమందుపానం వీటితో సగం చచ్చివస్తాడు కుర్రాడింటికి, శెలవలిస్తేను.

'అయ్యో మా అబ్బాయి ఏమో చదివి వెలగబెటుతాడని, పొరుగూళ్లోవుండి కష్టపడతాడేమోనని, వచ్చే నాలుగురాళ్లు యింట్లో తిండికి సరిపడకపోయినా, అప్పులుచేసో, ఆస్తులమ్మో నెలనెలకి ఆతారీఖుతప్పకుండా తండ్రి మనియార్డర్లు కడుతూంటే ఏంచదివాడోగాని మా అబ్బాయి యిల్లా తయారయాడేమిటి?' అని తల్లి ఆశ్చర్యబోతుంది. ఏమిటో చదివి తెలివి తేటలు సంపాదిస్తాడని పల్లెటూరినుంచి పట్నంపంపించడం తల్లి దండ్రులు. అక్కడ ప్రవేశించి పై విధంగా యింటిసంగతి, వంటి సంగతికూడా మరిచిపోయి బోలెడేసి అద్దెలు పోసి ఎలక్ట్రిక్ లైట్లు వుండాలంటూ అల్లాంటి గదుల్లోనే వుండడం. కోతుల్లాగ, ఒకడు డబ్బున్నవాడు ఏదైనా మంచిసూటు కుట్టించుకుంటే, డబ్బున్నవాళ్లు లేనివాళ్లు అంతా అల్లాంటి సూటు కుట్టించుకుతీరాలి; లేకపోతే చిన్నతనం. తలకి శుభ్రమైన కొబ్బరినూనె రాసుకుంటే ముసలిపద్ధతిట! నవనాగరికులు వాసననూనెలు రాసుకుంటేనేగాని బాగుండదని బోలెడంత ఖరీదెట్టికొని రాసుకోవడం. పెద్ద లెవరైనా చూచి 'ఇంత చిన్నతనంలోనే జుట్టునెరిసిందేం నాయనా?' అంటే 'యీరోజుల్లో అందరికీ అంతేనండి' అని వెంటనే జబాబు. చిన్నప్పటిదువ్వెన్నలు పనికిరాక గట్టిగా దువ్వకుంటే పళ్లన్నీ రాలిపోయే దువ్వెన్నలు ఎక్కువ ఖరీదుపెట్టికొని దువ్వుకోవాలి. ఇలా చదువుకంటెపోకులకే ఎక్కువలైము ఖర్చుపెడతాడు!

హాయిగా ఒంటికి మంచిగాలి తగిలేలాగ ఓపంచకట్టుకొని, ఉన్నంతలోనే వేళకింత కడుపునిండా తిండితిని, తండ్రితోటి పొలాల్లోను తోటల్లోను స్వేచ్ఛగా విహరిస్తూ దేహపరిశ్రమ చేసుకుంటూ, సినీమాలు నాటకాలు లేకపోవడంవల్ల వేళకి నిద్రపోతూ ఏజబ్బులూ లేకుండా సుఖంగా వుండేవాడు; యింటిదగ్గిర దురలవాట్లు ఏమీాలేక, తలిదండ్రులకు కాస్త చెప్పినమాట వినేవాడు; ఈ యింగ్లీషు చదువులో ప్రవేశించి, చదువులేకపోయినా, డబ్బుఖర్చయీా పద్ధతులు నేర్చుకొని పాడైపోయి యింటికివచ్చి అమ్మా నాన్నా చెప్పినపనిచేస్తే అభిమానమట. పైగా పూర్వపు పద్ధతులతో శుచిగా నున్నవాళ్లని చూస్తేనే అభిమానము, విసుగు, నవ్వులాట. పట్నవాసపుగాలి (దుమ్ముతో కలిసినగాలి) పీల్చడంచేత పాడైపోయిన శరీరాలు, మొద

లైనవానిచేత ఎప్పుడో చావవలసినవాడు యిప్పుడేచచ్చి వూరుకుంటాడుగదా. నల్లగా బొగ్గుల్లాటి పెదవులు, బీడీలు సిగరెట్లవల్ల ఎండిన గుండెలు, చప్పిదవడలు, వాసననూనెల వల్ల నెరసినజుట్టు, కళలుతప్పిన కళ్లు. అబ్బాయికి యింగ్లీషు క్రొత్తభాష గనుక రాదు, తెనుగు మనభాషేగనక అశ్రద్ధచేత రాదు, మొత్తానికి ఏభాష పూర్తిగారాక యింతడబ్బుపెట్టి కొనుక్కొచ్చాడా అన్నట్టు యీరూపుతో తయారవుతాడు. ఇంటికి ఒక్కకొడుకుతో మట్టమై తల్లితండ్రుల యింటి దగ్గిర మాడుతూంటారు. ఇన్నివిధాల డబ్బు ఖర్చుపెట్టి, ఆయురారోగ్యాలులేక, ఉద్యోగాలులేక యింటిదగ్గిర కూర్చుంటాడు. ఈ మాటువూరికే కూర్చోడంకాదు. పొరుగూరి భాగ్యము సిగరెట్లు, కాఫీ మొదలైనవాట్ల కయ్యే సాదరుఖర్చు నాన్నకే బిల్లు (Bill) చేస్తాడు. తనతోపాటు చిన్నప్పుడు తల్లి తండ్రులు ముచ్చటకోసం కట్టబెట్టిన భార్యా పంతులుగారుకూడా దిగుతారు. 'దరిద్రుడికి కుక్కమురికి సంతాన'మన్నసామెతగా యేడాది కోపిల్లకాయ బయలుదేరుతూంటుంది. ఒక్కకొడుకుతోనే మట్టమై పకీరైన తండ్రి కొడుకుకుటుంబాన్నికూడా పోషించాలిప్పుడు. ఇల్లాటి మొగుళ్లతో కాపరంచేసే ఆడవాళ్ల అవస్థ అనుభవించేవాళ్లకే తెలియాలి. భగవంతుడికే తెలియాలి. తనకేమైనా కావాలంటే పుట్టింటివాళ్లింతవున్నలాళ్లై యిస్తేనే తప్పగాని లేకపోతే సిగ్గువిడిచి మామగార్ని అడగాలిసిందే. పిల్లలెప్పుడైనా ఏమైనా కావాలని అల్లరిపెడితే కొనిపెట్టి ఊరుకో పెట్టాలంటే కానీలేదు. ఇన్ని అనర్థాలకీ మూలము తనమగడుపట్నవాసంలో ప్రవేశించి చదివిన 'నవనాగరికపు' యింగ్లీషు చదువే ముఖ్యకారణం.

'అప్రయోజకుడికి అహంకారం ఎక్కువ' అన్నట్లు, యింట్లో పెళ్లాంమీద అత్తారిమీద చిరాకుచూస్తే యింతా అంతాగాదు. వాళ్లపిల్లని బాధపెడితేగదా వాళ్లకి నొప్పి. అసులువేగి తప్పులేకపోయినా సరే పెళ్లాన్ని బాధపెడతాడు. చుట్టుపట్లవాళ్లి దేమన్యాయమంటే, 'నాపెళ్లాం, నాయిష్టం, నువ్వెవడవు నన్నడగడానికి?' అంటాడు. తనచిల్లరఖర్చులకి డబ్బుకోసం అమ్మని పెళ్లాన్ని బాధపెడతాడు. వీళ్లెట్టినవి, వాళ్లెట్టినవి పెళ్లాంమెళ్లో రెండుగుల్లలుంటే అమ్మేస్తాడు. 'ఆదివారం అందలం, సోమవారం జోలి'లాగుంది అబ్బాయిపని. ఇల్లాగున్నాయి యిప్పటివాళ్ల కాపరాలు. చదువుకునేరోజుల్లో యింతోటి చదువుకి సడ్డినొప్పిపెడుతుందని యీంచెయిర్లు క్యాంపుకాట్లు కావాలి. ఇప్పుడుసాదరు ఖర్చుకి కావలసి అవేఅమ్మేస్తాడు.

ఇల్లాగే పెద్దపెద్ద సంసారాలు కూలిపోయాయి, పోతున్నాయి. ఒక్కపంచిచాక్కతో జాతీయవాదులమని కొన్నాళ్లుతిరిగాడు. ఇప్పుడదేంచిత్రమో మళ్లీ ఫేషన్లులో దిగ సూట్లంటూ మొదలెట్టాడు. ఒక్క సూటుకయ్యే ఖర్చుతో రెండుపంచలు, రెండు చొక్కాలు, రెండుఖండువాలు (నాణ్యమైనవి, శుభ్రమైనవి) వస్తాయి. ఎంతడబ్బు డ్రస్సుకే చాలటంలేదు. స్టూడెంటులైఫ్

అంటే వేలంవెర్రిలోకి దిగింది. అదేమియి జార్లో, ప్రపంచకములో దోమకాటు, దానితో పాటు బోదకాలు వృద్ధియాయి; అవికప్పడే యిజార్లొచ్చాయి. తల్లిమెళ్లోను, పెళ్లాం మెళ్లోను బొందులు, అబ్బాయిమెళ్లో కాలరు నెక్టయి. అమ్మమూసివాయనం ముత్తైదు, కొడుకుదొరగారు. తండ్రికి మోకాలు దిగని గావంచా, కొడుకుకు సూట్లు. చివరకిన్ని సౌఖ్యములుకూర్చినతలిదండ్రులు విపతుల్యులు.

'అదనెరిగి అప్పు, పదనెరిగివిత్తనం' అని సామెత లాగ, తనరాబడినిబట్టి ఖర్చుచేసు కోవాలి. యువకజీవితమబ్బుటకై బుద్ధిమంతులు, ధర్మాత్ములు, ఎవరైనా అడ్డుపడి విద్యార్థిజీవితమును సంస్కరిస్తే అనేక హిందూ కుటుంబము లికముందైనను నిలవ గలవని మనవి.

---

## సీతమ్మనిర్యాణం

వేటూరి వాసుదేవశాస్త్రిగారు

అమ్మరో కన్నతల్లి మమునందర బాయగడంగితమ్మ
మానమ్మగ నుంటివేల కనుదమ్ములు మూసితివేలనమ్మ
యింకెమ్మెయి నుండువారల మికెవ్వరు దిక్కని బిడ్డలేడ్వ
సీతమ్మ దివంబుకేగితె సదాశివరావుసుపత్ని, అక్కటా!
పూతచరిత్ర! యీవెపుడు బొంకిమెరుంగవు, బొంకువారలన్
నీతియెకాదటంచు కడునేర్పునబుద్ధులు సెప్పెదోరిమిన్
బ్రీతియు జూపి, లేమిడిని బేర్కొ-స వెప్పుడు కష్టజాలముల్,
భీతియులేదు మిత్తికి గభీరతనేగ దివంబుజూడగన్.
ముప్పదితొమ్మిదేండ్లు కడుమోదమెలర్పగ దెన్గుభాషకై
గొప్పతపంబుజేసి కనుగొంటివి యందలి ధర్మమెల్ల, నీ
వెప్పుడు దోటివారలకు విద్యలునేర్పుటయందె కాలమున్
మెప్పుగబుత్తు, నీకిపుడె కోరికపుట్టె దివంబుజూడగన్!
భారతభామిని ల్భువిని భాసురవాగ్వి భవాభిరామలై
పేరుగడించిరన్నిట నమేయలు ధర్మపరుల్ జగదేగవీరులై
వారిపథంబుద్రొక్కి మనవారలుకూడ నటుల్ జరించ నీ
భారతరాజ్యలక్ష్మి పెరవారలజేరదటంటివీవెకా.
జీవితకాలమెల్లను నిజేశునియంఘ్రిసరోజయుగ్మ సం
సేవయొనర్చినావు, దివి జేరవిభుండు ఫలంబెదంచునా
పావను నాత్మనెంచితివి, పావనుజేసితి వాత్మదేవునిన్
కావున నీవు ధన్యవు, సుఖంబగు, మాకుకదా యభాగ్యమా.

# సుశీలా రజస్వలానంతర వివాహము

శ్రీమతి మద్దుల దమయంతీదేవిగారు

రంగారావుగారు కాకినాడదగ్గర గొల్లపాలెమున నివసించుచుండిరి. ఆయన ధనవంతుడగు వైశ్య ప్రముఖుడగుటచే గ్రామమునకంతకును గౌరవప్రదముగ మెలంగుచుండిరి. ఆయన భార్య కల్యాణి, భర్త కనురూపయై సహధర్మచారిణి నామమును సార్థకమొనర్చుచుండెను. వారి పెద్దకుమార్తె సుశీల, చిన్నకుమార్తె సువర్ణయు, తల్లితండ్రులవద్ద నల్లారు ముద్దుగ పెరుగుచుండిరి. వారిరువురు పేరునకుతగిన సద్గుణములు, మంచి సౌందర్యముగలవారు. అన్యోన్యమున చాల కలిసి మెలసి తిరిగెడివారు. తల్లిదండ్రుల యందు వినయవిధేయతలుకలవారై చక్కని శ్రద్ధాభక్తులతో విద్యాభ్యాస మొనర్చుచుండిరి.

ఒకదినమున మధ్యాహ్నము భర్త భోజనము చేయుచుండగా, కల్యాణి వంటయింటి తలుపున కొరగనిలిచి, "ఏమండీ! మన సుశీలకు పన్నెండు సంవత్సరముల ప్రాయము వచ్చినది; పెండ్లిమాట యేమైన యాలోచించుచున్నారా, లేదా?" యని ప్రశ్నించెను.

రంగారావు మజ్జిగఅన్నము కలుపుకొనుచు దీర్ఘాలోచనతో "ఆలోచింపకేమి? నేను చేయవలసిన పని చేయుచునేయున్నాను. కాని యిప్పు డేమంత తొందరవచ్చినది? అయినను యిప్పుడు వివాహము చేయుటకు శారదాచట్ట మొకటి అమలులోనికి వచ్చినది. పదునాలుగు సంవత్సరములు వచ్చినగాని వివాహముచేయుట కెంతమాత్రము వీలులేదు" అనుచు మెల్లగ తప్పించుకొనజూచెను. కాని కల్యాణి యంతతో నూరకుండునదియా?

"సరే, మీ రిట్లే చెప్పుచు కాలముగడుపఁ జూచుచున్నారు. పన్నెండు సంవత్సరములు వచ్చినవి, యింకను చాలదా? పదునాలుగు సంవత్సరములు వచ్చుదనుక నే నుంచజాలను—ఇంతవరకు వచ్చునప్పటికే నాకు చాల కష్టముగనున్నది. ఇక నొకటి రెండేండ్లలో నమ్మాయి రజస్వలయగును. 'లోకులు కాకు'లని మనలను కులమునుండి వెలివేతురు. అందువలన మనకు తీరని యవమానముకలుగును. మన గృహమున కితరు లెవరును రారు. మనల నెవ్వరు పిలువరు. ఏది యెటులున్నను ముందు వారికి భయపడవలసివచ్చుచున్నది. కాన మంచివరుని వెదకి త్వరలోనే మన సుశీలకు వివాహముచేయవలెను" అని యామె చిన్న యుపన్యాస మిచ్చునప్పటికి రంగారావునకు కొంచెము కదలికపుట్టెను. అయిన యాలస్య మిట్లైననయ్యెను, కావున కల్యాణి బుర్ర తిప్పనిదే యీవేళ విస్తరిముందునుండి లేవకూడదని యాతడు దృఢనిశ్చయ మొనర్చుకొనెను. మొదట నామెపై లేనిపోని కోపము తెచ్చుకొని యిట్లు ప్రారంభించెను.

"ఏమిటీ గొడవ? భోజనముదగ్గరనేనా? దీనికి మరిసమయము దొరకలేదా? ఇదిగో, చూడు. నే నొకటేమాట చెప్పుచున్నాను. ఈ రోజులలో నెక్కడ చూచినను రజస్వలానంతరవివాహములు నిర్భయముగను, మిగుల నుత్సాహముతోను జరుగుచున్నవి. బ్రాహ్మణులుకూడ నిరాఘాటముగ నిట్టి వివాహములు చేయించుచుండ, నింకను నీవు భయపడుచున్నావా? 'వారు వెలివేతురు, వీరు నిందింతురు' అను భయమెందుకు? 'మన యంతరాత్మ కనుకూలమా, కాదా'యను సంగతి యాలోచింపవలెను. నిజముగ స్త్రీలు విద్యావిహీనులగుటచేతనే యిట్టి మూఢాచారములకు లోనైనారు. ధనమున కాశించి, యేమియు నెఱుంగని పసిపాపలకు ముక్కుపచ్చలారని వయస్సులోనే, యే ముసలివానికో లేక యే రెండవ పెండ్లివానికో యిచ్చి ముడివేయుచున్నారు. ఇక నా బాలిక పదవయేటనే రజస్వల

యగును. పదునొకటవయేటనే యమ్మాయిని అత్తవారింట కాపురముచేయుమని పంపెదరు. పాప మా బాలిక విద్యావతికాదు.—చిన్నతనము—కాపురమేవిధముగ దిద్దుకొనవలెనో, పతిసేవ యేవిధముగ చేయవలయునో తెలియదు. ఇక వెళ్లినది మొదలు అత్తగారు మంచి గుణవతియైన సరే—లేనిచో నామె యా బాలికను పెట్టు కష్టములు యిన్నియని వర్ణింప నలవిగాదు. ఇదిగాక రెండవవైపున నాడుబిడ్డల సాధింపులు. ఇక భర్తస్థితి చూడవలెను. అతని కొకవైపున భార్య, మరియొకవైపున తల్లి. ఎవరినేమనిన యెవరికి కష్టమోయని సమాధానము చెప్పజాలక యిద్దరిమధ్య నలిగిపోవును. ఆసమయమున పాపము సరళస్వభావయగు నా బాలిక హృదయము దుఃఖాగ్నిలో నెంత కుమిలిపోవునో యెవరు చెప్పగలరు? 'బాల్యమున విద్యచెప్పింపక, యేమియు దెలియని దినములలో వివాహమొనర్చుటచేత నేకదా నే నీ యకూపమునబడి యిన్నికష్టముల పాలు కావలసివచ్చినది'అని దీర్ఘవిచారముచే కృశించి పోవును. ఈ సంగతి తెలిసి యామెతల్లిదండ్రులు ఆమెపడు కష్టములన్నిటికి తామే కారకులమని మిగుల పశ్చాత్తాపపడెదరు. చిన్నతనముననే సంతానవతులగుటచే, వారిని సవరించుకొనజాలక, యిల్లు సరిగా దిద్దుకొనజాలక, యెవరిమీది కోపమునో ఆమె తన బిడ్డలపైన చూపసాగును. తెలిసినదా, చిన్నతనమున కాపురముచేయుచున్న బాలికల దుస్థితి యీవిధముగనున్నది. ఇక భర్త చనిపోయిన బాలికలగతి చెప్ప నవసరములేదు. కనుక, బాగుగ ఆలోచించుకొనుము. మన బాలికల కున్నతవిద్య నేర్పించి, పదునైదు వత్సరములు వచ్చినతరువాత, వారికి నచ్చిన వరులనుచూచి వివాహముచేయుదము. 'పెద్దవారైనతరువాత వివాహముచేసినమాత్రము కష్టములురావా'యని నీవడుగుదువేమో, వారు జ్ఞానము తెలిసినవారు, విద్యావతులు గావున నప్పుడు కష్టముల తప్పించుకొనగలనేర్పు వారికి కలుగును. ఒకవేళ కష్టములు వచ్చినప్పటికిని వాటిని ధైర్యముతో సహించగల్గుదురు. అదిగాక, వారంతటవారు, స్వయముగ ప్రేమించి చేసుకొనిన భర్తయేగాన, నెన్నికష్టములు వచ్చినను తల్లిదండ్రుల నిందింపవలసిన యగత్యము లేదు. లోకమున నీవిధమగు వివాహము లెన్నియో జరుగుచున్నవి."

రంగారావు తన లెక్చరు పూర్తిచేయునప్పటికి తాను భోజనముచేయుచున్న సంగతి జ్ఞాపకము వచ్చెను. "అబ్బ! ఎంతయాలస్యమైనది?" అని యొకదీర్ఘముతీసి కాళ్లుచేతులు కడుగుకొనిపోయి ఒక కునుకుతీసెను. తరువాత లేచి మెల్లిగ ఆఫీసునకు చేరుకొనెను. ఈ విధముగ రంగారావు కల్యాణుల మధ్య కుమార్తెల వివాహవిషయమున ప్రతిదినము వాదప్రతివాదములు జరుగుచుండెను. రంగారావు ఆమె హృదయమున కెక్కునట్లుగ, వివిధములగు సాంఘికవిషయములగూర్చి యాధునికపద్ధతులతో చర్చింపసాగెను. ఎట్లైనను కల్యాణి బుద్ధిమతి, యాలోచనాపరురాలు, క్రమక్రమముగ కల్యాణికి రోజుజరిగెడి యీచర్చలవలన, మంచిచెడ్డలు, సుఖదుఃఖములు తెలియసాగెను. కాలక్రమమున మనను పూర్తిగ పరివర్తనము పొందెను. చివరకు భార్యాభర్తల యభిప్రాయ మొకటేయయ్యెను. స్త్రీజాతి యున్నతినందుట లోకమున కెంత శ్రేయస్కరమో యామె గుర్తింపగల్గెను. అప్పటినుండి యామె తన బాలికల భావిసౌఖ్యమునకై వేవిధముల ప్రయత్నింపసాగెను.

౨

సుశీల సువర్ణలు యింటివద్దనేయుండి యమితోత్సాహముతో విద్యాభ్యాసమొనర్చుచుండిరి. ఆంధ్రము, ఆంగ్లము యిదివరకే చదువుచుండిరి. ఇప్పుడు రాష్ట్రభాషయగు హిందీనికూడ చక్కగ నేర్చుకొనసాగిరి. సుశీల స్కూలుఫైనలు ప్యాసయినది. హిందీలో నున్నతపరీక్షయగు 'రాష్ట్రభాష'కు చదువుచున్నది. ఇద్దరు సోదరీమణులును సంగీతమున చక్కని పాండిత్యము సంపాదించిరి. ఒకరు వీణవాయించుట

యందును, మరియొకరు ఫిడేలువాయించుటయందును మిక్కిలి కృషిసల్పుచుండిరి. సుశీల వీణవాయించుచు త్యాగరాజకీర్తన పాడినదన్న మోడులు చిగుర్చవలసినదే. ఆ చక్కని కంఠస్వరము, సన్ననివంపులు తిరిగిన ఆవేళ్లతో తీగెలమీటుట, వీణపై చాకచక్యముతో వేళ్లనట్టె పరుగెత్తించుట, యివన్నియు చూచినవారు మంత్రముగ్ధులైపోవుదురనుటలో సందేహములేదు. ఆమె యాంధ్రమున చక్కని వ్యాసముల వ్రాయుటలో నత్యంత నిపుణురాలయ్యెను. అప్పుడప్పుడు చిన్నచిన్నకథలువ్రాసి 'గృహలక్ష్మి'కి పంపుచుండెను. నిరతంర విద్యాగోష్ఠివలన నామె హృదయమున్నతభావపరిపూతమై, యామె జీవితమునకొక క్రొత్తకాంతి, క్రొత్తమాధుర్యమును కలుగజేసెను. ఆమె శరీరమునందలి యాంధ్రరక్త మొక్కసారిగ యుప్పొంగెను. తనలోని యాంధ్రత్వము నుజ్జీవింపజేసుకొనుటకును దాని నిలబెట్టుకొనుటకు నామె యత్నింపసాగెను. ఆంధ్రనారీమణుల గరిమామయ జీవితమును తన యాదర్శముగ బెట్టుకొని యామె తనచేకాగల యల్పసేవచేయుచు జీవితమును సార్థకపరచుకొనసాగెను. పదునైదేండ్లు నిండునప్పటికే యామె కీర్తిసుగంధమువలె నలుదెసల బర్వసాగెను.

సుశీల రజస్వల యైనప్పుడు కల్యాణి తనహృదయ దౌర్బల్యమునకువశయై కొంతభయపడెను. కాని యాహ్వానించిన పేరటాండ్రందరువచ్చి సుశీలను హృదయపూర్వకముగనాశీర్వదించి మంగళహారతుల నిచ్చిరి. ఫలములు తాంబూలములు తీసుకొని కళ్యాణి హృదయమునందలి యనవసరభయమును పోగొట్టిరి. కాని యెవరో యిద్దరు ముగ్గురు పూర్వాచారపరాయణులు మాత్రము రాలేదు.

కల్యాణి మరల పెండ్లిపాట పాడసాగెను. రంగారావు తగినవరుని వెదుకుటకు పూనుకొనెను. మంచి సంబంధము లున్నవని తెలిసినచోటికెల్ల వెళ్ళి పరీక్షించెను. అందరు సుశీల రూప గుణ సంపదలు విన్నవారగుటచే నామె సంబంధమున కెగబ్రాక నారంభించిరి. కాని రంగారావున కేసంబంధము నచ్చలేదు. మద్రాసులో చక్కని సంబంధమొకటి యున్నదని తెలిసి యచ్చటికి కూడ ప్రయాణమయ్యెను.

## 3

రంగారావు తిన్నగా సెంట్రలుస్టేషనునుండి క్రిష్టియన్ కాలేజికి వెళ్లెను. సుదర్శనుడు బి.ఏ. క్లాసులో చదువుచుండెను. చూచీచూచుటతో రంగారావునాతడాకర్షించివైచెను. ఇరువదియొక్కసంవత్సరము లుండునేమో. మంచిరూపసి. ఉన్నతాశయములు కలవాడు. కాలేజీ కంతకు తలలో నాలుకవలె మెలంగుచు ప్రిన్సిపలుచే కూడ మన్ననల నందినవాడు. ఇక లోటేమున్నది? ధనముకా? అతని తండ్రి రామారావు హైకోర్టువకీలు, మంచిగౌరవనీయుడు, సంఘసంస్కర్త. తనకుమార్తె సోనాబాయినికూడ 'లేడీ విల్లింగ్డన్ కాలేజీ'లో ఉన్నతవిద్యకై చదివించుచుండెను. ఆయన సోనాభాయికి రజస్వలానంతర వివాహము చేయదలంచుటయేగాక తనకుమారుడు సుదర్శనునికి కూడ ఒకరజస్వలయగు కన్యకనిచ్చియే వివాహముచేయ నిశ్చయించుకొనెను.

ఆనాడు సాయంత్రము నాలుగుగంటలకు తన స్నేహితులకూడ వెంటబెట్టుకొని రంగారావు రామారావుగారింటికి వెళ్లెను. మంచిమర్యాదగల కుటుంబము. అదివరకే సుదర్శనునివలన నన్నిసంగతులు తెలిసుకొనియుండుటచే రామారావు వచ్చినవారందరిని గౌరవించి కూర్చుండజేసెను.

అందరుకలసి వివాహవిషయము లన్నియు మాట్లాడుకొనుచుండిరి. రంగారావు భువనమోహనకరమగు సుశీలఫొటోను వారికి చూపుచుండెను. ఇంతలో సుదర్శనుడు కాలేజీనుండి తిరిగివచ్చెను. సుదర్శనుడు కూడ ఫొటోనుచూచి ముగ్ధుడైపోయెను. సుందరి యగుటయేకాక విద్యావతి కుండవలసిన సమస్తలక్ష



శ్రీమతి కె. నాగమణిగారు, హరిదాసి,
విజయనగరము.

ఈమె బీహారు భూకంపనిధి సహాయార్థము, భీమునిపట్టణము మ్యూనిసిపల్ హైస్కూలు హాలులో 21-2-34 తేదిని ఒక లవ చరిత్రమును హరికథా కాలక్షేపము చేసి సుమారు 260 రూపాయలు నిధికి సమకూర్చెను. ఈమెకు బహుమతిగా ప్రజను ఇచ్చిన సువర్ణపతకమును గూడ భూకంపనిధికి పంపించిన ధార్మికురాలు.



మిస్. వి. అనసూయాదేవి.

విశాఖపట్టణము మిసెస్ ఎ. వి. యన్. కాలేజిలో ఫస్టు ఇయరు క్లాసు విద్యార్థిని. బరంపురం ఆంధ్రవిద్యార్థి సభలో సంగీత ప్రావీణ్యమునకై బహుమానము బడసినది.

ణములు నామెయందు మూర్తీభవించియుండుటచే నతడమితానందముతో తన యదృష్టమును కొనియాడసాగెను. తల్లిదండ్రులుకూడ సంతోషముతో వివాహమునకు తమసమ్మతినిదెల్పిరి. ఈ విధముగ సంబంధమును స్థిరపరచుకొనిరి. సుదర్శనుని తల్లి సుగుణమణి విద్యావతియేకాక పతివలెనే నూతన భావములుకలది. చదువుకొనిన చక్కనికోడలు రానున్నదని యామె కూడ మిగులసంతసించెను. ఇక సుదర్శనుడు యెప్పుడువెళ్లి సుశీలను దర్శింతునాయని యువ్విళ్లూరసాగెను. మఱునాడే అందరుకలసి గొర్లపాలెమువచ్చి తాంబూలములు పుచ్చుకొనిరి. పెండ్లికొడుకువారు, లగ్ననిశ్చయముచేసుకొని వెళ్లిపోయిరి. ఫిబ్రవరి 26 వ తారీఖున సుశీల పెండ్లిమూర్తమని నిర్ణయింపబడెను. సుదర్శనునివంటి యోగ్యుడగు పతి లభించుటచే సుశీల మిగుల యుత్సాహముతోనుండెను. ఆమె యానందమున కడ్డులేకుండెను:

పెండ్లిపను లతిచురుకుగ సాగుచుండెను. గృహమంతయుశుభ్రపరుపబడి చక్కగ నలంకరింపబడెను. రంగారావు గృహము నిత్యకళ్యాణము పచ్చతోరణముగనుండెను. పెండ్లివాకిలియంతయు, చంటిబిడ్డల యేడ్పులతోడను, ముత్తైదువుల సందడులతోడను, వియ్యపురాలి హడావుడులతోడను కలకలలాడుచుండెను. పిల్లవాండ్ర యల్లరులకు మితిలేదు. కల్యాణి రంగారావులు గ్రుక్కతిప్పుకొనక పనిచేయుచుండిరి. సువర్ణ యక్కగారివివాహమని చాలసంతోషముగ నిటునటు తిరుగుచుండెను. ఇంత హడావిడిగా రాత్రి యెట్లోగడిచిపోయెను. ఉదయము తొమ్మిది గంటలగునప్పటికే మేళతాళములు మ్రోగసాగినవి. బ్రాహ్మణబృందమేతెంచినది. సుశీల, సుదర్శనులు మంగళస్నానములొనర్చి నూతన వస్త్రధారులై పెండ్లిపీటలపైగూర్చుండిరి. పెండ్లి పందిరంతయు, బాలురతోను, వృద్ధులతోడను, స్త్రీలతోను, యువకులతోడను, నిండి కిటకిటలాడుచుండెను. గొర్లపాలెము పల్లెటూరేయైనను, యాగ్రామమున నిదే మొదటి వివాహమగుటచే యితరగ్రామములనుండి కూడ యనేక ప్రేక్షకులువచ్చిరి. ఊరివారందరువచ్చిరి. ఆ కల్యాణమును చూచుటకు చాలమంది సనాతనులు కూడ వచ్చిరి. ఒక్కసారిగ మంగళవాద్యములతోను, బ్రాహ్మణులమంత్రములతోను కల్యాణమంటపము ప్రతిధ్వనించిపోయెను. ఆశీర్వాదములలోను, కవిపుంగవుల పద్యరత్నములతోను, ప్రేక్షకుల ప్రశంసలతోను వివాహ మత్యంతవైభవముగ జరిగిపోయెను. స్వపక్షవిపక్ష భేదములేక అందరు నా వివాహమున నుత్సాహముతో పాల్గొనిరి. వచ్చిన స్త్రీపురుషులెల్లరు తమతమ యుత్సాహమును వెల్లడిచేసిరి. వివాహము పూర్తియయ్యెను. సుశీల యొకయింటి కోడలయ్యెను. తన బిడ్డకు మంచివరుడు లభించినందులకును, వివాహ మత్యంతవైభవముగజరిగినందులకును కల్యాణి చాల సంతోషించెను. సుశీల వివాహమైనప్పటినుండి యూరిలోని స్త్రీలందరిలో వారివారి బిడ్డలకు రజస్వలానంతర వివాహములే చేయవలయునని కల్యాణి ప్రబోధముచేయ మొదలిడెను.

---

## చిరస్మరణీయురాలు

నందివాడ వెంకటచలపతిరావుగారు

ఉ॥ పూరుష దుర్లభంబయిన భూరిపరాక్రమ శౌర్యలీలలన్
మారిమసంగిన ట్లరులమార్కొని యెల్లెడఁదానెయై గనన్
వీరవిహారమున్ సలిపి, భీకరసంగరరంగమం దభ
శ్చారులుమెచ్చి సన్నుతులుసల్పగ గీర్త్యవశేషయయ్యె వి
స్తారయశోరమంగనిన "ఝూన్సి" చిరస్మరణీయురాలగున్॥

# స్నిగ్ధ ప్రణయము

పాటిబండ మాధవశర్మగారు.

౧

అదిపరిణద్ధయుష్మదధరామలరక్తిమకాదు సుమ్ము, నా
హృదయకటాహనిస్సరదసృక్పరికల్పిత లేపనమ్ము, అ
య్యదియు భవద్దృగంచలమహః ప్రభగాదు మనోజ్ఞరాగసం
పదమలమైన నాహృదయపంకజరక్తిమగాని నెచ్చెలీ!

౨

నాఁడు హఠాత్తుగా కలిసినారము నీవును నేను; నేనుక
న్నోడిచికొంటి తావకమనోహరతైజసకాంతిలోన, ము
ద్దాడితి నీకపోలముల, నానితి నీచిబుకమ్మునుఙ్, క్షుధా
పీడితబుద్ధినై విడిచిపెట్టకపోయితి నిన్ను నెచ్చెలీ!

౩

కేలుఁగవఙ్ నిగిడ్చికవుగింటికిఁ జేరుచుకొంటినిన్ను; అ
ద్దాలనధఃకరించెడు సుధారసదిగ్ధకపోలపాళిలో
నీలిమలీను నిర్మలకనీనికలందున ముగ్ధరోచులఙ్
వ్రేలుచు నాదుమూర్తి కనుపింపఁ దొడంగినదంతకాలముఙ్.

౪

ఏయపరాధశిక్షయని యీయవమానము పైఁ బుమంటి, ని
ర్మాయికమైనముగ్ధహృదయంబున నిఙ్గయినేసి నందుకా?
మోయఁగలేనిప్రేమభరముఙ్ దిగ్భ్రమింగెడు నేర్పులేక శో
భాయుతమైన నీదువదనాంచలముఙ్ స్పృశియించినందుకా!

౫

తీయనిప్రేమభిక్షకయి తేపకుతేపకు నీగృహాంగణ
చ్ఛాయల నాశ్రయించుటకుఁ జాలితిగాక, అకారణక్రుధా
హేయములైన మూకపరిహేళన లోర్చుటకుఙ్ వృథావ్యథా
దాయకనిష్ఠురోక్తులవితానముపై పనుగాదు నెచ్చెలీ!

౬

కలవుముహూర్తముల్ తొలుత కంటిజలమ్ములలోన నీవునఙ్
గలఁచికరంచికైవసముగా నొనరించుకపోయినట్టి రో
జులు, కృతకాధికత్వములుచొప్పడ పూతపరాకులూని నీ
పిలుపులనేని నేను చెవిఁబెట్టనిరోజులుగూడ నెచ్చెలీ!

౭

నావదనమ్ము నీదువదనమ్మును నొక్కటిగాఁగ, నామెయిన్
నీవపువొక్కఁడై కలతనిద్దురలోన సుధాప్రసన్నరా
గావిలభావనాపులకితాంగులమై శయనించినట్టిమో
దావహశాంతిపూతసమయమ్ములునుంగల వెన్ని యోతొలిన్!

౮

చెదరిన రత్నఖండికలచేత పరశ్శతధావిభిన్నవ
ర్ణదురధిగమ్యరూపశబలత్వవికారితదర్శనమ్ము, దు
ర్విదితయథార్థ మీహృదయభిత్తిక చెక్కులుడుల్చి శోభన
ప్రదనవనీతసౌధపరిపాండువుగా నొనరించియుంచితిన్

౯

తళుకులనీను నిర్మలసుధాపరిధౌతములైన కుడ్యవీ
థులపురతఃస్థలిన్ నిలిచి తొంగలి ఱెప్పలనొత్తిగించి, శీ
తలప్రణయాతిమోహనసుధాపరిషేచనకృత్కటాక్షదృ
క్కులఁ దిలకింపు మింత, కనుగొందువు నీసుకుమారరూపమున్.

౧౦

ఎఱుఁగుదు నేఁటతేపట గ్రమింతువు మద్భవనాంగణస్థలిన్
దరదరవిందసుందరపదద్వయికందునొయంచు ముందుగా
పరవులుగా నమర్చితిని పల్లవపేశలమైన నాయెదన్
వెఱవకసాగిరమ్ము! విలపింపదు ప్రీలదు వాడిపోవదున్

౧౧

ఈవిమలప్రభాతముల, నీకృపణాత్మక సౌధవీథికిన్
దేవతవోలె నీవు చనుదెంచెడువేళ, భవత్పదద్వయీ
పావననిక్వణాంతములు వైదికఋక్కుల నాలపించె, శో
భావరణీయవక్త్రమున భాసిలెముగ్ధములై యుషస్స్వసన్.

౧౨

అవిరళధాళధళ్యహృదయంగమసౌరభమిద్ది దేవతా
భవనము, తత్ప్రసాదపరిపావితచిత్తముతోడ శాంతివై
భవనిభృతాంతరంగమున వర్ధిలు మిచ్చట కోటివర్షముల్!
భవభయవిస్మృతిప్రద మపాయనిబర్హణమిద్ది నెచ్చెలీ!

౧౩

వేడుకతోఁడుగా నడుగు వెట్టితి, ఘంచిదయుంటి; ముంగిటన్
జూడకపోతి వీశ్వరుని శోభనమూర్తిని, ఊరకుంటి; నీ
నీడలనేని చూఁచుకొననేరక పోతివి, స్వచ్ఛమైన యీ
గోడపయిన్ మషీమయజుగుప్సలు చేసితివౌర నెచ్చెలీ!

౧౪

అంటిన యీ మషీమలిన మారకపూర్వమతీసివైచి, నీ
వెంటలబొమ్మ; లేనియెడ వేగమ యీమలినాంకపాళిపై
కంటికి నాత్మకున్ గడుసుఖప్రదమౌ భవదీయమూర్తినే
గంటులుదేలి నెత్తురులుగాఱుసటుల్ లిఖియింపుమింతటన్.

౧౫

విరిసిన రాగరేఖ, యరవిందము, వెచ్చని కౌగిలింతలో
మురియుగదాయటన్న యొకమోహముతో నుదయించుబాలభా
స్కరుఁడు హతాశుఁడై మగిడిచన్నదినమ్మున, లోకమెల్లరూ
పఱచె, వడంకవేసగము, లబ్ధులుపొంగవె, పృథ్వికృంగదే!

---

## సంస్మరణము

శ్రీమతి వోలేటి వేంకటరామాంజనేయమ్మగారు

శ్రీపీఠికాపుర మహారాజ్ఞీమతల్లి శ్రీచిన్నమాంబా నిర్యాణ దినము (12-2-34)

మనమహారాజ్ఞి మనతల్లి మనలవిడిచి
తనమహత్వంబు, తనపెంపు, తనయశంబు
తనవినిర్మల వృత్తంబు ధరణివిడిచి
యప్పుడేఁ నేఁటికేఁ డాదియయ్యెనయ్యొ!

౨

భర్తకర్ధాంగలక్ష్మి యీపరమసాధ్వి
యెఱిఁగిచేయని ఘనకార్య మేదిగలదు
ఎంతదయ తండ్రికో తల్లి కంతప్రేమ
ఎంతచేయయ్యకో యమ్మ కంతయీవి.

౩

మనమహారాజ్ఞి మనతల్లి మరణమందె
నక్కటాయని పలవింతు మంతెకాని
యమృతమూర్తియై యద్దేవి యాశ్రితాళి
నరయుచున్నది దివ్యకృపార్ద్రదృష్టి.

౪

అమ్మహారాజ్ఞి కలిపిన యట్టినీతి
యతివలకు నెల్లఁకేని సర్వాంగరక్ష
అమ్మహాదేవి చరియించి నట్టిరీతి
పురుషులకు నింతులకుఁగూడఁ బరమపథము.

౫

చిన్నమాంబపేరు గన్నయీగ్రంధాల
యంబుగూడ నామె యాత్మఁబోలి
విమలభావమయము విజ్ఞాననిలయమై
జగతినిలుచుఁగాత శాశ్వతముగ.

# టిబెట్టుస్త్రీలు

చట్టి రామారావుగారు బి. ఏ.

టిబెట్టుదేశము ప్రపంచములోని యన్ని దేశములలోను కొన్ని విషయములలో, విపరీతముగా భేదించును. టిబెట్టుజనుల యాచారవ్యవహారములు, బుద్ధితత్వములు చాల చిత్రములైనవి. అచ్చటి స్త్రీల యొక్క స్వభావస్థితిగతులు, క్రొత్తగా నా దేశమున కేగిన వారికి వింతగా గోచరించును. ఆసియాలోని యితరదేశపు స్త్రీనైజస్వభావములకును, టిబెట్టు స్త్రీలనైజస్వభావములకును చాలవ్యత్యాసమున్నది; అందులో నిండియా, చైనాస్త్రీలకును, టిబెట్టుస్త్రీలకును కొండంతభేదమున్నది.

చైనాస్త్రీలకును ఇండియాస్త్రీలకును సహజమైన ముగ్ధత్వము, అబలత్వము, అణకువమొదలగుగుణములు మందుకైన వీరిలోఁ గానరావు. టిబెట్టుకాంతలు కాయపుష్టిగలవారు; వారికి లోకజ్ఞానము మెండు, ధైర్యసాహసము లత్యధికములు. వారు దేశాభివృద్ధి సాధనములైన వ్యవహారములలో ముఖ్యపాత్రధరింతురు.

కాని మిక్కిలి చోద్యమైనదేమన; టిబెట్టుభాష స్త్రీల తక్కువతనమును బ్రకటించును. "కైమన్" అన, స్త్రీయనియర్థము. ఈపదము "స్కై-డ్మెన్," (అనగా, తక్కువపుట్టువుకలది) అని వ్రాయబడును. ఇది గాక, స్త్రీలే తమ తక్కువతనమును గ్రహించి ఆడపుట్టుక పూర్వజన్మ మహాపాపఫలితమనియు తమది తక్కువపుట్టువనియు తలతురు, కాని, అబలలకు సహజమైన లావణ్యము, సౌకుమార్యము వారలందుండదు. తన తక్కువతనమును, యీవిధ, నిరాడంబరముగా నొప్పుకొనును; కాని భర్తకును దనకును ఏసందర్భముననైన అభిప్రాయభేదముండినను, మహాపౌరుషముతోను, పట్టుదలతోను నిరాకరించును. బహుశా, టిబెట్టుపడుచు, తన కసామాన్య కాయపుష్టి యున్నదని యెఱుగుటచే నిట్లు చేయునని నానమ్మకము. స్త్రీ సహజహీనతను, ఆమె శరీరబలము పోగొట్టును. ఇదిగాక, ఒక్కస్త్రీయే, శాస్త్రసమ్మతముగా, అనేకభర్తలతో, సంసారము చేయవచ్చును. ఇట్టి శాస్త్రసమ్మతములైన పురాతనాచారవ్యవహారములు కూడ స్త్రీసంఘమునకుఁ బూర్వమునుండియు నాధిక్యమునిచ్చుచున్నవి.

దీనినిబట్టి టిబెట్టువారి నాగరికతలో లోటులున్నవని తలంపరాదు. సామాన్యముగా టిబెట్టువారి యాచారవ్యవహారపద్ధతులను తగువిధమున నర్థముచేసికొనలేక చాలమంది గ్రంథకర్తలు దురభిప్రాయపడుదురు. ఇది వట్టి పొరబాటు, అన్యాయము. టిబెట్టులో స్త్రీస్వాతంత్ర్య మున్నదికాని,నిరంకుశత్వము, నాగరకతకు మచ్చదెచ్చు స్వేచ్ఛావిహారము కానరావు. టిబెటియనులు ఇంద్రియులోలత్వమున కణుమాత్రమైనను లోబడరు. శృంగారభావమును, కళారూపముగాగాని, మతపూర్వకముగాగాని, హిందువు లేకొద్దిగనో వెలిబుత్తురు; కాని టిబెట్టువారికి శృంగారమనునది తెలియదు. శృంగారసంతానములైన కామమోహములు నిస్సారములని వారి యభిప్రాయము. కనుకనే మోహపూరితమైన ప్రేమను చిత్రించు గాథలు టిబటియన్ నాటకకళలో మెండుగాఁ గానరావు. టిబటియన్ తనభార్య తనకు ద్రోహమొనర్చిన, నామెను జంప యత్నింపడు. ఇట్లే, టిబటియన్ స్త్రీ తనపట్ల భర్త ద్రోహబుద్ధి పూనిన, అతనిని సిగసించుటకుఁగాని, కడతేర్చుటకుఁగాని యత్నింపదు. ఇటువంటి సంగతులను వారు వ్యవహారరీత్యా పరిష్కరించుకొందురు. వ్యవహారనిపుణత వారికి ఉగ్గుపాలతోనే యబ్బును. "దాంపత్యమును భంగపరచు పరస్పరద్రోహకృత్యములు వ్యవహారపూర్వకముగాఁ బరిష్కరించుకొనుట" అను సంగతి, పశ్చిమనాగరికతాదృష్టికి ఏహ్యముగా కనబడవచ్చును, కాని యీమార్గము చాల లాభకారణము. దాంపత్యమందలి ద్రోహదోషమునకు వారు

మతిఁగోల్పోయి, చీకాకుపడక, ఫిర్యాదుచేయు రెండవపక్షమువనిషి, (భార్యకాని, భర్తకాని)ప్రతిఫలముగా నేరస్తునివద్దనుంచి తానెంతసొమ్మును గోరిన నష్టపరిహారమనుగనో, ఆసొమ్ముయొక్క మొత్తమును మనస్సులోఁ జిత్రించుకొనుచుండును. సామాన్యముగా టిబెట్టులో, వడ్డీరూపముగనో, నష్టపరిహారరూపముగనో, పరిష్కారము కాని వ్యవహారముండదు.

ఊరి పెద్దకాని, కులపెద్దగాని, మామూలుగా నేరస్తుడు చెల్లించవలసిన జుల్మానావిధించును. కాని యిట్టి వ్యవహారమార్గము పట్టియాలస్యకారణము.ప్రతిఫలముగా వచ్చుసొమ్ము ముట్టునదాక టిబెటుకాంత యూర్వలేదు; పరిష్కారమగునంతవరకు హామిగా, ప్రతిపక్షమువారినుండి తీసికొనగోరును. నేరస్థుడైన మగడు,అడిగినవెంటనే తాకట్టువస్తువు నీయనియెడల, అతనిని గద్దులతోను గిల్లులతోను సత్కరించి,బలవంతముగా నగనో బట్టనో లాగికొనును.

వివాహసంబంధమైన వ్యవహారములన్నియు న్యాయచట్టములకు లోనైయుండును. కాని జనులు సామాన్యముగా తమ జాతిధర్మములకు, దేశాచారములకుఁ గట్టుబడుదురు. తూర్పు టిబెట్టులో పురుషుడొకే ధర్మపత్నితో జీవనముచేయును. భార్యవలన సంతానలాభము పొందనిపక్షమున నింకొకస్త్రీని వివాహమాడును. ద్వితీయవివాహము న్యాయశాసన సమ్మతమైన యొడంబడికయైన కావచ్చును; లేదా స్త్రీపురుషు లిద్దరును పరస్పరముగా సమ్మతించి భార్యాభర్తన్యాయముగా కాపురము చేయవచ్చును.

మధ్యటిబెట్టులో ఒక్కస్త్రీయే యనేకభర్తలతో సంసారముచేయు నాచారమున్నది. పెండ్లి సమయమున, పెండ్లికుమారుని తమ్ములపేర్లు వరుసగాఁ జదవబడును; వీరందరును, పెండ్లికూతురు సమ్మతిపైని, భర్తయొక్క హక్కులలో భాగస్వాములు వీరందరికి నామె శాస్త్రసమ్మతమైన యర్థాంగి. ఒక్కొకపుడు పెండ్లికొడుకు తమ్ములలో నెవడైన నూరిలో లేకపోవచ్చును; అట్టి సందర్భమందైనను, అతడు ఇంటికి తిరిగివచ్చినపిమ్మట,ఁ దానుగూడ వివాహితుడనైతినని తెలిసికొనును; పెండ్లివాడతడు లేకపోయినను అతని తల్లిదండ్రులు, పెండ్లి యొడంబడికపత్రములో నతని పేరుకూడ జాగ్రత్తగా వ్రాయింతురు. ఇట్టిపద్ధతి యొవనికైన సరిపడని యెడల, అతడింకొకస్త్రీని పెండ్లాడవచ్చును. కాని, ఉమ్మడిభార్య నిట్లు వదలినప్పుడనేక చిత్రమైన తగవులు సంభవించును.

అన్నదమ్ముల బిడ్డలొకరిలొనొకరు సంబంధములు చేసికొనరాదు. రక్తస్పర్శవారిలో వివాహసంబంధము నిషేధము. కాని కుమారుడుపోయినపిమ్మట, విధవయైన కోడలిని మామగారు పెండ్లాడవచ్చును, లేక పూర్వపుమనువులోఁగల్గిన, కూతురును తల్లినిఁ గూడ వివాహమాడవచ్చును.

గతించిన భర్తల దాతృత్వమునే ననేక వితంతువులు ధనికులగుదురు. వీరిమాటగాక, మఱి యేకన్యయైనను, ధనాశచే వరుడు తన్ను పెండ్లాడుచున్నాడని భయపడనక్కరలేదు వరుడు కట్నము తీసికొనరాదు. అతడే, కన్యాప్రదాతల కేత్యణమో ముట్టచెప్పవలెను. భార్యార్థము వరుడు చెల్లించెడు శుల్కమునకు (Nowrin) "నారిన్" అనిపేరు. దీని యర్థము పోషణధనము. వివాహానంతరమింకొకరి పిల్లయవవలసినబిడ్డను పెంచినందులకు శమనివారణార్థము, కన్యాప్రదాత లీసొమ్మును స్వీకరింతురు. ఈకట్నునిర్ణయము, కొంత రండాగొండి, కొంత తర్క వితర్కము, అయినపిమ్మటకాని స్థిరపడదు.

పశ్చిమదేశములు, పెండ్లికూతు రత్తవారింటికిఁ బోవునప్పుడు సారెపెట్టిపంపుదురు. ఈసారెనిచ్చుపని, టిబిటియనులకుఁ బరిహాసముగా నుండును. కొందరు టిబిటియన్ పెద్దమనుష్యులతో నీపద్ధతిని గూర్చి ముచ్చటింపగా, వారిట్లు వేళాకోళము చేసిరి. "బహుశా, మీయాడువారు సుందరులు కాకపోవచ్చును; అందుచేతనే వారు సొమ్మును లంచమిచ్చి భర్తలను సంపాదించుకొందురు."

నిజముగా టిబెట్టువధువునకును పుట్టింటివారు సారెకై రొక్కమిచ్చెదరు. ఇది కేవల మామెయొక్క సొత్తే. భర్త దానిని తనయిష్టప్రకారము వ్యయపరుపలేదు.

చాల సందర్భములలో స్వతంత్రులైనను, టిబెటియన్ కన్యలు తమంత తాము భర్తల నెన్నుకొనలేరు. పిల్ల తల్లిదండ్రులే వరుని వెదుకుదురు. కూతులను గారాబముగా జూచువారు, పిల్లయొక్క యభిప్రాయముగూడ తెలిసికొందురు. పిల్ల కిష్టములేనియెడల నాసంబంధము తప్పిపోవును; కాని గొప్పకుటుంబములవారు వివాహవిషయమై శ్రద్ధతీసికొనరు. వారు ముఖ్యముగా సదుపాయముకొఱకే పెండ్లాడుదురు. వధూవరులు పెండ్లికిముందు ఒండొరులఁ జూచుకొననక్కరలేదు; పరస్పర రూపలావణ్య ప్రవర్తనలతో నొండొరులకు నవసరములేదు.

భర్తకు విడాకులిచ్చి స్త్రీ మరల స్వేచ్ఛనొందవచ్చును; కాని యీపద్ధతి సులభముకాదు. భర్త, చాల సొమ్మునుపోసి భార్యను సంపాదించుకొనుటచే నతడు సమ్మతింపక పోవచ్చును, ఇదిగాక విడిపోదలచుభార్య కొంతరొక్కము చెల్లింపవలసియుండును; కాని యామె చెల్లెలినె యతడు స్వీకరించిన నామె ముదరానీయనక్కరలేదు.

ప్రేమభావములో స్వతంత్రత టిబెట్టులో సామాన్యవిషయము. ఇట్టి స్వతంత్రతవలన దోషముగాని, నగుబాట్లుకాని రావు. వదలిపెట్టబడిన స్త్రీలవిషయములోను, వితంతువుల విషయములోను, శాసనసమ్మతమైన వివాహముకంటె, నీపద్ధతియే యవలంబనీయముగా పరిగణింపబడును.

టిబెట్‌లో వ్యభిచారవృత్తిచేఁ బొట్టబోసికొనువారుండరు; నీతి బాహ్యులైన స్త్రీలుకూడ నుందురు, కాని వారు ప్రియులను స్వేచ్ఛగా నెన్నుకొనవచ్చును, లేదా మానవచ్చును. ఉంపుడు వృత్తిమానిన కొంతకాలమునకు వారు మరలఁ బెండ్లాడుదురు, కాని వారి పూర్వపు జీవనమున కెవరును తప్పుపట్టుకొనరు.

స్త్రీ పురుష సమానత్వములో టిబెట్టు, అన్ని దేశములకంటె ముందంజవేసినదని చెప్పవచ్చును.

శాస్త్రసమ్మతముగా సంసారముచేయు గృహిణి, కుటుంబవ్యాపారముల నెట్లు దిద్దుచుండునో, అట్లే, శాస్త్రవిరుద్ధముగాను, కేవలము స్వసమ్మతిచే భార్యాధర్మమున కొడంబడినయువిదకూడ సంసారమును దిద్దును. స్త్రీసంఘములో పెక్కురు విద్యాగంధములేనివారే, టిబెట్‌లో బాలికాపాఠశాలలు ప్రత్యేకముగానుండవు. బాలురయొక్క చదువుకూడ మతగురువుల చేతులందుండును. చదువులేదన్నకొఱంతను సహజమైన సూక్ష్మబుద్ధి తీర్చివేయును. వారు నేర్చుకొనని దానినైనను ఊహించి యర్థముచేసికొనగల్గునట్లు కనబడుదురు. అన్నిరకములైన జమాఖర్చులు, చిట్టాఆవర్జాలుకూడ వారు సులభముగా జ్ఞాపకముంచుకొనగలరు; సులభముగా నెంతలెక్కనైన నోటితో కట్టివేయగలరు.

భార్యాభర్తల సొత్తులు వేరువేరువే. దేశపద్ధతులు చాలవఱకు స్త్రీకి యనుకూలముగా నుండును. ఆమెభర్తయొక్క యాస్తిలో వాటా పొందవచ్చును; కాని పురుషునకు మాత్రము స్త్రీధనముపై కాసంతైన హక్కులేదు. తండ్రులయాస్తి పుత్రికలకుఁ జెందదు; కాని తల్లియొక్క సొత్తంతయుఁ గూతుళ్లదే. దానిలో మగబిడ్డలకు చిల్లిగవ్వయైన రాదు; ఇదిగాక పుత్రికాప్రేమ గల జనకులు, రొక్కపూర్వకముగనో, భూరూపముగనో, ఆడుబిడ్డలకే ముట్టజెప్పుదురు; ఇట్లు కన్య వివాహితయైనపుడామెకు స్వంతమైన సొత్తేర్పడును; ఈస్వధనమే యామెయొక్క రాబడికి మూలము; ఇదియే యామెకూతుళ్లకును జెందును.

ఏదియో యొకవిధమైన వ్యాపార మవలంబించని స్త్రీయే యుండదు. వ్యాపారజ్ఞానము వారికిఁ జిన్ననాడే యలవడును. ఏదైన కొంతసొత్తు వారికబ్బిన

దానినుండి లాభము రాబట్టుటకు వారు యత్నింతురు. భాగ్యప్రతిష్ఠలున్న కుటుంబ కన్యలుకూడ, 13, 14 సంవత్సరములప్పుడే, డబ్బు వడ్డీకిచ్చుటకాని, పాలు, పెరుగు, యున్ని మొదలగునవి అమ్ముటగాని చేయుదురు. వర్తకవిషయమైన సంబంధములన్నియు పిల్ల యొక్క యింటికడనే జరుగును. సరకు కొనువారు, అప్పుపుచ్చుకొనువారు నక్కడికే వత్తురు. ఒక్కొక్కప్పు డామె తనతల్లి సలహాను తీసికొనుచుండును; కాని సాధారణముగా తనంతతానే వ్యాపారము చేయును.

వివాహమైనవెన్కఁగూడ స్త్రీ తన వ్యాపారమును, పుట్టబోవు ఆడుపిల్లల బాగుకొఱకు, వృద్ధి చేయును. వర్తకము టిబెట్టు స్త్రీల హక్కని చెప్పవచ్చును, ఏలనఁ బురుషులు మిగిలినవృత్తులు చేసికొందురు.

టిబెట్టు స్త్రీ సహజగుణములను బట్టి, ఆదేశమందు అనేక రాణులుండిరనిన వింతకాదు. టిబెట్‌లో నీశాన్యమున "గొలాగ్" పీఠభూమికలదు. ఇందలి తెగలవారికి స్త్రీ ప్రభుత్వమే. వీరు, తమరాణీ దేవాంశసంజనితయని భావింతురు. ఈరాణీకూతురు రాజ్యమునకు వారసురాలు. బందిపోటు ఈతెగవారి ముఖ్యవృత్తి. బందిపోటువారనిపించుకొనుట వీరికి గౌరవనీయమేకాని గర్హనీయముకాదు. బందిపోటు తనము పౌరుషకృత్యమని వారి నమ్మకము.

సాధారణముగా, ఆశియా ఖండపు స్త్రీలకు మతములో జోక్యముండదు; టిబెట్ స్త్రీలుకూడ మతవిషయములలో జోక్యము కల్గజేసికొనరు, కాని ఆధ్యాత్మిక చింతచేసి, తరించు మార్గముఁగూడ వీరు నిస్సందేహముగాఁ బూనవచ్చును.

టిబెట్ స్త్రీ యనేకవిధములఁ దనసూక్ష్మబుద్ధిని మరుకువమును, అనుభవజ్ఞానమును, ప్రకటించుకొనును. "దేశముయొక్క కీర్తి, సౌభాగ్యసంపత్తులకుఁ గాంతాజనములే యాధారము" అనునీతి సత్యమైన. ప్రస్తుతము మూలబడిన టిబెట్ కూడ, కొద్దికాలములోఁ బునర్జీవమును బూని, నూతన వికాసము వహించి; యభివృద్ధిపొందుట నిస్సందేహము.



## కోరిక

శ్రీమతి జె. కె. రాధాకుమారిగారు

కాంతులనీనెడి
కాంతునిగూర్చియు
మరదుల, మరద
ళ్ళను దరిజేర్చియు
అత్తమామలకు
ఆగ్రహమణచియు
కనికరింపుమో దేవీ!
కోరిక
కలగానీకుము మాయీ!

సిరి సంపదలతో
చిందులుద్రొక్కుచు,
మన్మథు డనదగు
మగనితో కులుకుచు
తన్ఫలితముగా
'తనయ'ల బడసియు
ఒడినెడబిడ్డలు, తల్లీ!
ముద్దుగ
ఊగనుజేయుమ, కాళీ!

# స్త్రీలు—అందము

కె. సచ్చిదానంద రావుగారు

పేదరాలైన హిందూస్త్రీ తన సౌందర్యాతిశయమునకై ప్రాకులాడుటలేదు. ఆమె తన నైసర్గికమైన శరీరముతో సంతృప్తి చెంది తన పూర్వాచారపద్ధతులనే యవలంబించుచున్నది. కాని నవనాగరిగతచే పురజనస్త్రీలు తమ పాశ్చాత్యసోదరీమణుల యలవాటులను కొలదిగ నాచరించుచున్నారు. పాశ్చాత్యులవలె భాగ్యవంతులైనగాని వారి యభ్యాసములను హిందూ వనిత లవలంబింపలేరు.

ప్యారిస్ పట్టణములోని స్త్రీలు నవనాగరిగతకును (fashions) ఫేషన్సుకును పేరు పొందిరి. ఇటీవల అమెరికా దేశపుస్త్రీలు వీరిని మీరుచున్న ట్లనుమానము కలుగుచున్నది. అమెరికాదేశపు వనితయొక్క దినచర్యవినిన చాలయాశ్చర్యముగ నుండును.

అమెరికాదేశపుయువతి యందముగా నుండుట ప్రజలను మెప్పించుటకొఱకేయని యూహించును. వారమున కొకపరి యామె శరీరమర్దనకై ప్రత్యేకముగా నిర్మింపబడిన శాలలకేగి యలక్ట్రిక్ యంత్రములతోను, క్రీములతోను, లోషనులతోను దేహమంతయు మర్దనచేయించుకొనును. దేహమున క్రొవ్వు ఎక్కువగానున్న చోటుల తగ్గించుటకును, కండపుష్టి, మాంసపుష్టి లేనిచోట కండ పెరుగుటకును, తగిన క్రీములతో మర్దనాచేయించుకొనును. పిదప కోడిగ్రుడ్డుతో తయారుచేసిన మందు నామె మంచు గడ్డతో ముఖముమీదిముడుతలుపోయి గట్టిపడుటకై తోమించుకొనును. తరువాత ఆమె కనుబొమలను తీరుగా దిద్దించుకొని, ముఖముమీది వెంట్రుకలనూగు మీసముల నూగు యున్నయెడల నదియు పూర్తిగా తీయించుకొనును. మెడకూడ గుండ్రముగాను కాంతివంతముగాను యుండుటకు మందులను కొన్నిటి నాపె మర్దనాచేయించుకొనును. పిదప ఈశాలలో తలవెంట్రుకలు దువ్వి యిష్టమైనరంగు వాటికివేసి గాని లేక తెలుపుచేసి గాని, లోషనులతో కడిగి శుభ్రపరతురు. పిమ్మట చేతులను కడిగి గోళ్లకు రంగువేయుదురు. కాలిగోళ్లను గూడ యందముగా కత్తిరించి వాటికి మెరుగు పెట్టుటయయినగాని యామె శాలలోనుండి తిరిగిరాదు.

ఈ తీరున నవనాగరికతాశిఖామణులు ప్రతివారమును ఒకటి రెండు పర్యాయములు పైన వర్ణించిన శాలలలోనికి బోయి వత్తురు. మిగిలిన దినములలో యింటివద్ద యుపయోగించుటకై బాత్ సాల్ట్సు (bath salts) లోషనులు, యుడికొలోను (Eue-de-cologne), సువాసన సబ్బులును కొని యామె యింటికి తెచ్చుకొనును. ముఖము శుభ్రపరచుట కామెకు సబ్బు చాలదు. మొదట క్రీముతోను, పౌడరుతోను యింటివద్ద ముఖమును గట్టిగా రుద్దును. తరువాత చర్మమును గట్టిపరచుటకు తయారుచేసిన టానిక్కు (Tonic)తో కడిగి మొగము మీదనున్న మచ్చలను మురికిని బోగొట్టి, పిదప మెడనుగూడ యామె యారీతిగానే పరిశుభ్రముచేయును. అంగమున కొకరంగు గలదు. ఆమెకు మెడ కొకరంగు, పెదిమెల

కొకరంగు, కనుబొమ్మల కింకొకరంగు, రెప్పలకు మరొకరంగు, కంటి క్రిందిభాగము నకు వేరొకరంగు కలదు. ఇటులనే యామె యనేకరంగుల నుపయోగించును. ఆమె పండ్లకై చాలా శ్రద్ధతీసుకొనునని వేరే చెప్ప నవసరములేదు. ఈవిధముగా రోజున కెన్నోసారు లామె తన దేహమును క్రీముల తోను సబ్బులతోను శుభ్రపరచును.

ఈ క్రమమును ధనవంతులే యవలంబించు దురని యాశ్చర్యముతో చదువరు లూహింతురు. కాని ఒక్క అమెరికా (United States of America) దేశములోనే 10,00,000 పదిలక్షలు స్త్రీలు యిట్టి యభ్యాసముకలవారని తెలిసిన చదువరులు పైవిధమున నూహించరు. ప్రతిసంవత్సరమున సగటున నొక్కొక్క యువతికి యమెరికాదేశమున క్రీములు, లోషనులు, సబ్బులు మొదలగువానికై నూరుపౌనులు లేక సుమారు పదిహేనువందల రూపాయలు ఖర్చగుచున్నది.

ఇదియే నవనాగరికత. ధనము వృద్ధి యగుట లాభమా? నష్టమా? ఎక్కువగా సెంట్లను లోషనులు మొదలగువానిని యుపయోగించుటచే దేహమున కందమువచ్చుచున్నదో లేక యందవికారము కలుగుచున్నదో తెలియకున్నది. ఎండలోయెండి, వానలోతడిసి, కాయకష్టముల కలవాటుపడిన హిందూస్త్రీకి అందముకొఱకై లోషనులు క్రీము లనవసరము. కాయకష్టములు పడి మొగముమెరుగునకాసపడని హిందూస్త్రీ బ్రహ్మ సృష్టించిన స్త్రీజాతిని బోలి యుండును. నవనాగరికయువతి మనుష్యునిచే తయారుచేయబడిన బుట్టబొమ్మవలెనుండు నని తోచుచున్నది.

——:o:——

# సేవకావృత్తి

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

అవనిసేవకవృత్తియే హైన్యమగును
అందు నీచులసేవింప నడుగనేల!
గుణముగలవారుగుణములో గొప్పవాని
కొలిచియుండిన నదికొంత గొప్పయగును॥

వ్యక్తిస్వాతంత్ర్యమునుగన్న భరతదేశ
ప్రజలుకొందఱు తురకలపాలనమున
విసుగుచెందిరి బానిసవృత్తివలన
నివుడుసేవకవృత్తిలో నిపుణులైరి॥

పూవుఁజేరిననారకు తావియట్లు
సజ్జనులఁజేరగల్గు యశస్సు,సుఖము
అల్పజలమందుచేపల కాపదవలె
అల్పులనుజేరగల్గును అపయశస్సు॥

పరిజనులమీఁదదయలేని ప్రభునిగొల్చి
యుంటకంటెనుహైన్యమిం కొకటిగలదె;
హీనమానవసేవచే మానవునకు
తెలివిమానమ్ముప్రాణమ్ము త్రెళ్లిపోవు॥

హీనమానవులను నాశ్రయించువారి
జన్మమంతయుదుఃఖ భాజనమెయగును
చూడనిట్టిది కేవల శునకవృత్తి
పడినయాయాసమెల్లని ష్ఫలమెయగును

# మంచిమాటలు

## మల్లాది రామక్రిష్ణశాస్త్రిగారు

[రాముడు నవవధువుతో ఇష్టోపభోగములను అనుభవిస్తూ అత్తవారింటిలో ఉన్నాడు. పెండ్లి వేడుకలన్నీ జరిగిపోయిన పిమ్మట దశరథుడు కొడుకులు కోడండ్లతో నిజరాజధానికి బయలుదేరినాడు.

సీత అరికట్టలేని బాష్పవేగాన్ని బలవంతాన నిరోధించుతూ అలసగమనంతో భర్తతో కూడి తండ్రికి నమస్కరించింది.

జనకరాజర్షి ...మతిమంతుడు...కూతురిని ఊరడించి పోయిరమ్మని దీవనలు ఇచ్చి హితము ఉపదేశించినాడు...]

అమ్మాయి! చక్కనిదాననీ గుణవతిననీ, మహారాజకుమారిననీ.... అనవసరంగా గర్వించవద్దు. ఆడుపిల్లలకు పెనిమిటి మెచ్చినదే (మెప్పే) పెద్దరికము.

సంసారం లక్షణంగా తీర్చిదిద్దినట్లు అమరడానికి భార్యాత్వం సాఫల్యతను అందడానికి పురుషుడేకారణం......, అంతేకాని, నేనే గృహలక్ష్మిని అని ఉత్కర్షఅంతా తానే ఆరోపించుకోవడం అవివేకం అన్నమాట! మేఘవిజృంభణమునకు మెరుపుతీగ ఉపకరించదు; కాని, నీలాంబుదముపాటులేనిదీ తటిల్లత రాణించదు.

మగనిమీద ఎంతకోపంవచ్చినా పరుషంగా నొప్పించేమాటలు అనకూడదు. పెనిమిటిని అదుపులో ఉంచడానికి...ఆలాటిసమయాల్లో...కులపాలికలకు మౌనమే ఉచితమైనదని పెద్దలు అంటారు.

పతివ్రతఅయిన పిల్ల తనశీలమువలన (భార్యయందు గుణసమృద్ధిని ఆశించే) పతిని రక్తునిగా చేసుకుంటుంది. చ్యుతశీల అయినభార్య గుణస్పృహుడైన పతిచేత పరాభవింపబడుతుంది. (ఆతడు ఆమెను ఆదరించడుకదూ!)

నేను నీకు విశేషంగా చెప్పడం ఎందుకూ! ఒరులచేత వేలు చూపించుకోకుండా...జరాభారంచే క్రుంగిపోయిన ఈముదుసలి హృదయాన్ని వ్రయ్యలు చేయకుండా...నలుగురిచేత ఔననిపించుకునేటట్లు మెలగుము.

(ఈకోరికలు అన్నిటికీ విధికూడా అనుకూలుడు అవుతాడనే నాహృదయ వాంఛితము వ్యర్థమై పోవదని ఆశిస్తూన్నాను ..)

[కుమారదాసభూపాలుని జానకీహరణ మహాకావ్యమునుండి.]

# గువ్వలచెన్నని కథ

శ్రీమతి బురాడ లక్ష్మీనరసమ్మగారు

శ్రీ కృష్ణదేవరాయలయొక్క సభాస్థానములో ఆస్థానపండితులుగనున్న అష్టదిగ్గజములలో పేరెన్నికనుగన్న భట్టుమూర్తి (రామరాజభూషణుడు) అని అందరికు దెలిసిన విషయమే. ఒకనాడీయన గ్రామాంతరం వెళ్లుటకు బయలుదేరి "నేను గ్రామాంతరం వెళ్లవలసియున్నది. నేను వచ్చేసరికి వారం రోజులు కాగలదు. ఇంటిలో జాగ్రత్త" యని భార్యతో చెప్పగా నామె సంతోషించి "నాథా! గ్రామాంతరము వెళ్లిన నా ప్రాణాంతరం కాగలను. భగవంతుని దయచేత మనకు వంటకొలకు గలదు కాని వంటచెరకులేదు. ఈసంగతి మీకు దెలియజేయుట ముఖ్యముగాన నాయందు గరుణించి యీ వారంరోజులకు దగిన వంటచెరకు నింటబడవైచి మీరు గ్రామాంతరం వెళ్లడం ఉభయసమ్మత"మని చెప్పగా భట్టుమూర్తి అందులకంగీకరించి వీధిలో నెవరితో నైన చెప్పెదనని బయలుదేరి యా సంగతి మరచి కొంతదూరము పోయేసరికి స్నేహితులు కలసి మాట్లాడుచు నాతని గొనిపోయిరి.

ఈ సంగతినంతయు గువ్వలచెన్న డనే కట్టెలవాడు విని, సంతోషించి ప్రతిదిన మందొక్కొక్క కట్టెలమోపు దీసికొనివచ్చి భట్టుమూర్తిగారి పెరటి గుమ్మములో బడవేయుచు బోవుచుండెను. ఈ సంగతి భట్టుమూర్తిగారిభార్య చూచి భర్తగారే యిట్లుసమకూర్చిరని తలచుచుండెను. వారం రోజులు పూర్తియైనవి. రామరాజభూషణుడు స్వగ్రామమునకు విచ్చేసెను. తరువాత కొంతసేపటికి భట్టుమూర్తి భోజనముచేస్తూ కట్టెలెట్లు సమకూరినవని భార్య నడుగగా యదార్థమామె వివరించెను.

ఆ కట్టెలువేయున దెవరోయని రామరాజభూషణుడు వాడు తెలిసికొనుట కింటనేయుండగా నెప్పటి యట్లే కట్టెలమోపువడినది. అసమయము గని యావలనున్న గువ్వలచెన్నని గాంచి "గువ్వలచెన్నా! నీ బుద్ధివిశేషమును గొనియాడవలసియున్నది. నీ కేమి కావలయునో కోరుకొనుము. తప్పక యిచ్చెద" ననగా, "అయ్యా! మీకు నా యెడ నట్టియనుగ్రహము గలిగినయెడల కీర్తివంతమైనదియు, బహువురచే గొనియాడబడినదియు, తనువు నశించినను నశింపనిదియునైన కృతి కావలె" ననగా, భట్టుమూర్తి,

కం॥ సారాసారము లెఱుగని
బేరజుకు బుద్ధిసెప్ప పెద్దలవశమా
నీరెంతపోసి పెంచినఁ
గూరౌనా నేలవేము గువ్వలచెన్నా.

కం॥ కలిమిగలనాఁడె మనుజుడు
విలసనముగుకీర్తిచేత వెలయగవలెరా
కలిమెంత, యెల్లకాలము
కులగిరులారా? కదలకుండ గువ్వలచెన్నా.

కం॥ ధనమే మైత్రినిదెచ్చును
ధనమే వైరమునుదెచ్చు ధనమే సభలన్
ఘనతనుదెచ్చును నెంతటి
గొనములకుప్పలకునైన గువ్వలచెన్నా.

ఈలాంటి పద్యములతో నొక పుస్తకము రచించి గువ్వలచెన్ననకు గృతినిచ్చెను. రామనాథశాస్త్రిగారి గ్రామఫోను పాటలవలె లోకమంతయు గువ్వలచెన్నని పద్యములు విస్తరించెను. గువ్వలచెన్నడు తనకెదురుగుండా ఈ పద్యము లెవ్వరు చదివెదరో తనవద్ద నేమియున్నను వారి కది యొసంగుచుండెడువాఁడు. ఒకనాడు పిల్లలు వేళాకోళమునకు జదువుచుండగా గువ్వలచెన్నడు కట్టెలసొమ్ము వారికి పంచి పెట్టెనట. ఒకరికి తనుకట్టు కొట్టుకొను గొడ్డలి నిచ్చివేసెనట. ఈవిధముగా దనవద్ద నేమియున్నను నిచ్చేవాడట. దాతృత్వమన్న గువ్వలచెన్ననిదే కదా! ఈ పద్యములు రారాజైన కృష్ణదేవరాయల కట్లో తెలిసి యాస్థానకవులను ప్రశ్నింపగా రామరాజభూషణుడులేచి "నేను"అనెను. "ఎందువల్ల నా

గువ్వలచెన్నునికి కృతినిచ్చితి''వన "వానివద్దనున్న దాతృత్వమునకు మెచ్చి యిచ్చితి" ననెను.

రాజుగారు గువ్వలచెన్నుని దాతృత్వము బరిశీలింప భట్టుమూర్తితో బయలుదేరి యొక కోనేటి యొడ్డున చేపలబట్టుచుండగా జూచెను. గువ్వల చెన్నా! అని పిలిచి భట్టుమూర్తిగా రొక పద్యము జదివెను. అప్పుడు గువ్వలచెన్నడు తనవద్ద నేమియు లేకునికి నీటిలో గూర్చొనియుండి తన గోచినివిప్పి పిడిచివైచి భట్టుమూర్తిని దీనికొనమనెను. వెంటనే కృష్ణదేవరాయలు మరియొక పద్యము జదివి "గువ్వల చెన్నా, నా కేమియిచ్చెద"వని యడుగగా గువ్వల చెన్నడు "నేను కోనేటిని గట్టుకొని గోచినిచ్చితిని. నా భార్యకు నిల్లుగట్టుకొనుమని చెప్పి యామె వద్ద చీరను నీవు పుచ్చుకొను"మని చెప్పగా రాయలాతని దాతృత్వమునకు లోలోన సంతసించుచుండెను. పిదప ఆతని భార్యవద్దకు వెళ్లి చీరనిమ్మన నామె తలుపుచాటుననుండి చీరను బారవైచి తలుపు వైచుకొని యీశ్వరధ్యానము జేయుచు భర్త వచ్చు వరకు గాలక్షేపము సేయుచుండెను.

కృష్ణదేవరాయలు తనలో నిట్లు తలపోసెను. "ఆహా! ఆ పుణ్యదంపతుల నడవడి నేమని కొనియాడెదను. ఇంత ధనవంతుడనయ్యు నావద్ద నంతటి దాతృత్వములేదు. దాతృత్వముమాట యట్లుండ నాతని భార్య యనుకూలత్వము, సౌశీల్యము, భర్తృవాక్యపరిపాలనము వింతగొలుపుచున్నవే. ఆమె పాతివ్రత్యమే పాతివ్రత్యము. గువ్వలచెన్నుని దాతృత్వమే దాతృత్వమని సర్వకాలములయందు తలచుచుండెను. గువ్వలచెన్నడు రాజుగారి దయకు బాత్రుడై ధనధాన్యసమృద్ధితో దులదూగెననుట వింత యగునా?



## నవ్వు మొగము

అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి.ఏ., బి.ఎల్.

అమ్మతో అయ్యతో మాటలాడునపుడు
నీదుచెలియలపై ప్రేమ నెరపునపుడు
తోడివారలతో జట్లు గూడునపుడు
అన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

బావవచ్చినాడని చెల్లిపలుకునపుడు
చూచిచూడక నావైపు చూచునపుడు
తెచ్చెనో వింతలని పెట్టెతీయునపుడు
అన్ని వేళల జానకీ! నవ్వు మొగమె!

పలుకకేమియు గనుజూపె పరపినపుడు
తెలుపకుండనె భావంబు తెలసినపుడు
చిన్నితలవంచి నునుసిగ్గుగన్నయపుడు
అన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

పరులువచ్చిన మాటలమాను వేళ
చనినయంతనె యేమి లేదనెడు వేళ
తిరిగి యేమేమొ ముచ్చటల్ జరపువేళ
అన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

చిట్టికోపాల కనుబొమల్ చేర్చువేళ
క్రొత్తసిగ్గుల తళుకులు గూడువేళ
ముద్దుగొంతున రాగాలు మొలచువేళ
అన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

ఎదురుగాజూడ మెరపులు మెరయుచుండు
వలువ ముఖముగప్పిన కనుల్కులుకుచుండు
మోమునటుత్రిప్ప చెక్కిళ్లు మురియుచుండు
అన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

ఏమియో యోచనల మనంబెగయుచున్న
గలచుతలపులులేక నిశ్చలతగన్న
కనులు మూసిన తెరచిన గానిపించు
నన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

చిరునగవులేక యొకమాటచెప్పలేవు
చిరునగవులేక యేపని చేయలేవు
నవ్వువితనాల నెన్నిటి నాటినావొ?
అన్ని వేళల జానకీ! నవ్వుమొగమె!

# వంట యెవరు చెయ్యాలి

శ్రీమతి యస్. సరోజినీ దేవిగారు

మీరు పదేపదే వాణ్ణి అంతగా పోరటం బాగావుండదు. మన మేంచేస్తాం? వింటే చెప్పేవాళ్లమేగాని వినకపోతే వాడి కర్మం అన్నది తమలపాకులు వేసుకుంటూ హనుమాయమ్మ

అల్లా వాడి ఇష్టంవచ్చినట్లుగా తిరగనిచ్చి స్వచ్ఛమైన వంశాన్ని పాడుచెయ్యమన్నావా అన్నాడు శేషయ్యశాస్త్రి.

ఆసమయానికే ఎక్కడనుంచో రామారావు ఇంట్లో అడుగుపెట్టాడు.

మళ్లీ అడిగిచూద్దాం అని రామారావును పిలిచి ఆ అవధాన్లుగారి పిల్లని చేసుకోరా. వాళ్ల వంశం చాలా మంచిది. మనకు fashions ఎందుకు? అన్నాడు శాస్త్రి.

నాన్నగారూ నేను మీతో ఇక పెండ్లి విషయం మాట్లాడను. మీరు ఆవిషయం నాతో మాట్లాడవద్దు. ఇందాకా శేషగిరి రావు మామగారి పిల్లని చేసుకుంటానికి మాట్లాడాను. Settle అయిపోయింది. రేపు పంచమినాడు ముహూర్తం. అల్లా కాకంటారా నేను పెండ్లేచేసుకోను. సన్యాసం పుచ్చుకుంటా అంటూ కాళ్లకి జోళ్లు వేసుకొని యెక్కడికో తొందరగా వెళ్లాడు రామారావు.

హనుమాయమ్మను పిలచి "భవితవ్యతా బలవతీ" రేపు పంచమినాడు వివాహమంట. శేషగిరిరావుగారి పిల్లని చేసుకుంటాడుట. పనిపాటలు మొదలుపెట్టించు. పోనీ మన బరువు వదులుతుంది అన్నాడు శాస్త్రి.

..............................

సరే. కొద్దిరోజులకే కాంత కాపురానికి వచ్చింది. క్రొత్తకోడలు గనుక పనిచేసినా చెయ్యకపోయినా యేమీ అనేది కాదు హనుమాయమ్మ.

ఎన్నాళ్లని కోడల్ని కూర్చోబెట్టి అత్తగారు పనిచేస్తుంది, అందులో ఈకాలంలో?

హనుమాయమ్మ పోరు అంతులేక పోయింది. పని అంటే చాలా అసహ్యం కాంతకు. పాపం యేంచేస్తుంది. ఇక ఇల్లా కాదు వేరింట కాపురంపెట్టించాలి. రామారావు ఏమంటాడో, వచ్చి సరిగా పదినెలలు కాలేదు, అని సందేహిస్తూ కొంతకాలానికి ఏమైనాసరే ఈవిడతో కాపురం చెయ్యటం చాలాకష్టం అనుకొని ఒకరోజున రామారావు గదిలో ఫలహారంచేస్తుంటె దగ్గరకు వెళ్లిందు ధైర్యంచేసి. చదువు సంధ్యలు నేర్చిన పిల్లగాదూ, యేంచెప్పిందో యేమిటో! దొడ్లో భావిదగ్గర బట్టలు వుదుకుతున్న తల్లిదగ్గరకు వెళ్లి, అమ్మా యేమిటే. మీ కోడల్ని తిడుతున్నావుట. అటువంటి Fashions కావాలనేగాదా మీమాట వినకుండా కూడా Marriage చేసుకున్నాను. అప్పుడే వేరింట కాపురంపెట్టపోకే నా కంటూ హనుమాయమ్మ పిలుస్తున్న కొద్దీ వెళ్లిపొయ్యాడు రామారావు.

ఏమండోయి. మన అబ్బాయి సంగతి విన్నారా? మన మాటా పలుకు ఏమీ లేదు. సర్వం కాంతామయం అయి

పోయ్యాడు. ఏమ్మందు పెట్టిందో ఆ మహా తల్లి. ఆ విడను వెనకేసుకొని నాతో కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. వేరే కాపురం వుంటాట్ట అని హనుమాయమ్మ శేషయ్యశాస్త్రితో చెప్పింది.

నే నిదివరకే అనుకున్నాను. ఇదంతా ఆపి.....ఎందుకులే, తెలిసి కలియగూడదు, కలిసి తెలియగూడదు అన్నారు అని శాస్త్రి గా రంటూంటే, ఇద్దరు పెద్దమనుష్యులతో శేషగిరిరావు వచ్చి, కూర్చోండి భావగారు అనే శాస్త్రిమాట వినిపిచ్చికోకుండ, "పెద్ద వాళ్లైనకొద్దీ కోపము చాదస్తం ఎక్కువైతూవుంటాయి. మీరు పెద్దవారైనారు. మా అమ్మాయిని హనుమాయమ్మగారు వేరేవుండమందిట. శాస్త్రిగారూ మా అల్లుడు భాగంపంచండి. పెద్దమనుష్యులు గూడా ఇక్కడేవున్నా"రంటూ కఠినంగా మాట్లాడాడు. అయ్యా ఆస్తిపంచటాని కెంతవుంది. అబ్బాయినిగూడా రానియ్యండి అన్నాడు శాస్త్రి.....................

అత్తగారిచేతి కొంచెం సాయంచెయ్య లేని కాంత ఒక్కతె ఇంతపనీ చేస్తుందా? యేమిటో వుట్టికెక్క లేనమ్మ స్వర్గా నికెక్కుతుందా అన్నట్లు. సరే అన్ని పన్లూ చేసి వండిపెట్టటానికి శేషగిరిరావుగారే ఒక బ్రాహ్మణ్ణి కుదిర్చేడు.

రామారావు బియ్యేగూడా ప్యాసు కాలేదు. అందువల్ల ఉద్యోగం దొరకటం చాలా కష్టంగావుంది. మొత్తంమీద రామారావు ఉద్యోగంలేక రికామిగానేవున్నాడు. పెద్దఆస్తిగలవాళ్లు కారేమో, ఖర్చు భరించ లేక మొఖం తేలేస్తూవచ్చాడు అప్పుడప్పుడు రామారావు. వంటబ్రాహ్మడు. యెంత పదార్థం తెచ్చినా పదిహేనురోజుల్లో అయ్యవారి నట్టిల్లుచేస్తున్నాడు. వాడు కాజేస్తూ న్నాడేమో చూడమని కాంతతోచెపితే,నే క్లబ్బుకి వెళ్లాలని విసుక్కొంటుందేమోనని తానే కొన్నాళ్లు ఆఘార్జీ పుచ్చుకున్నాడు. ఇంటి దొంగని ఈశ్వరుడైనా పట్టలేడని తోచింది. ఆ బ్రాహ్మణ్ణి "యత్తే అగ్నే" చెప్పమన్నాడు. అంత కాంతకు వంటపని వచ్చింది. ఆ పొగలో కూర్చోటం అదీ న్యూసెన్సు అనుకొంది. ఒకరోజున రామారావు యెక్కడికో ప్రయాణం అవుతూంటే నేనుగూడా మావాళ్లింటికెళ్లి రెండు రోజుల్లో వస్తాను అని తానుగూడా ప్రయాణం అయింది.

....... .. ...............

శేషగిరిరావు అల్లుడుకి కొన్నిరోజులైంతరువాత ఒక వుత్తరం వ్రాశాడు. అందులో సంగతి ఇది. మా అమ్మాయి వంటా అది చెయ్యలేదు. చెయ్యదు. నీకిచ్చి Marriage చెయ్యటం చాలా పొరబాటుఅయింది. అయిందేమో అయింది. వంటచేసేమనిషిని పెడితేనే మీ యింటికివస్తుంది. ఏసంగతి విచారించుకొని వుత్తరం వ్రాయవలసినది.

రామారావు చాలా చిక్కులోపడి పోయ్యాడు. తల్లి దండ్రులను ద్వేషించాడు. వంటబ్రాహ్మణ్ణి పెట్టడానికి డబ్బు

లేదు. ఏమీతోచక నేనే నండిపెడతాను ఉద్యోగందొరకేదాకా అని ఖబురంపాడు. శేషగిరిరావుగారు ఎందుకనో కుక్కిరి మిక్కిరిమనకుండా ఊరుకున్నారు. చాలా రోజులు ఒంటరిగానే కాలంగడపేడు. కొంత కాలానికి ఆశవదలుకొన్నాడు. శేషగిరిరావు స్నేహితులుగూడా కాంతను పంపిచ్చట్ట శేషగిరిరావు అని చెప్పారు రామారావుతో. ఏమనుకుందో ఏమిటో కాంత ఒకనాడు అన్నగార్ని తీసుకొని భర్తదగ్గరకు వచ్చింది. రామారావు ఆసమయానికే ఎక్కడికో వెళ్లటానికి ప్రయాణమయ్యాడు. మర్యాదలన్నీ చేశాడు. ప్రొద్దు కూకుతున్నది. ఇద్దరికీ సందేహామే వంట యెవరుచెయ్యాలో!



## క్రొత్తకోడలు

కప్పగంతుల సత్యనారాయణగారు

సీ॥ మనసార పేరున మరిమరిఁబిల్చుచు నధికానురాగముఁజూపు నత్తయుండ,
'అమ్మాయి' యనిపిల్చి యరుదుగాఁబనిఁజెప్పి మన్ననలందెడి మామయుండ,
పచ్చీసునాడఁగాఁ బలుమారురమ్మని వదలక వెంటాడు వదినెయుండ,
అవకాశమాత్రాన నానందమునుఁబొంది, మాటలనుడికించు మరదియుండ,

తే॥ గీ॥ ఎపుడుఁ దనయొద్దనుండంగి నేగుదెమ్మ
టంచుబలుకుచు ప్రేమలు మించునటుల
యక్కునను జేర్చుభర్తయు నమరియుండ
క్రొత్తకోడలి కేదేని కొఱతగలదె!

మ॥ ధనధాన్యంబులు లేకపోయినను బాధన్ జెంది దేమాత్రమున్
పనిపాటల్కడు శ్రద్ధతోనెఱపుచోఁ బాల్యాలికం బొందబో
దనిశంబున్ మసిపాతదాల్చు హృదయంబానంద పూరంబుగా
వనజాతాక్షి దన న్విభుండు కృపయాచేతస్కుడై గాంచినన్.

తే॥ గీ॥ కన్న తల్లిదండ్రులబాయఁ గష్టమనక
తోడఁబుట్టులవీడంగ దుఃఖపడక
భర్తృగృహమున కేగెడు పడతివాంఛ
నాథుప్రేమంబుకన్న నన్యంబుగాదు.



మట్టుగ గూరుచుండి యసమానవిలోల విలోకనంబు లా
పట్టున నగ్నిపై బెనముపై దనపై నిలబెట్టి యొక్కటన్
జుట్టుచు, నాత్మనాథుని రుచుల్ దలపోయుచు నాల్కయూర్చుచున్
రొట్టెల జేయుచున్నది సరోజముఖీమణి, చూడుసోదరీ.



... కలిమిలేముల నొక్కటిగా దలంచి। ఫలములేమియు గోరక భర్తృపాద
పంకజ ... విభూతిసంభావ్యయగుచు। దులసిపూజ జేయు నీతోయజాక్షి.




శ్రీ ల. విమలక్కగారికి చెల్లెలు కమల నమస్కరించి వ్రాయునది.

సోదరీ నీవు వ్రాసిన జాబందికొని ఆ మూలాగ్రముగ పఠించితిని. నీవు వ్రాసినట్లు ప్రాథమిక విద్యావిధానము స్త్రీపురుషులకు బాగుగనేయున్నది. అందు వేఱువేఱుగ నేర్ప వలసిన అంశము లెవ్వియు లేవు. కాని సోదరీ, అట్లే పెద్ద చదువులలోనికి వెళ్ళుకొలదిని లెఖ్ఖలు, జామెట్రీ, ఆల్జీబ్రా, ఒకటేమిటి ఎన్నెన్నో నేర్పెదరుకదా! స్త్రీల కిన్ని లెఖ్ఖ లెందుకు? స్త్రీలు ప్రత్యేకముగా నేర్చుకో వలసినవి వంటపని, కుట్టు, చమ్కీపని, సంగీతం అనే వ్రాశావు, బహుశః మర్చి పోయావనుకుంటా శిశుపోషణ. మాట, పై పనులు పురుషులకంటె స్త్రీలు చేసిననే అందమూ, లాభమూనూ; ఉద్యోగము చేయు పురుషున కింట వంటచేయుట కవకాశమేది? ఏపనినైన మీరేల నేర్చుకొనరాదని మనము పురుషుల నడుగవచ్చును కాని, పిల్లలను కనుట, వాళ్ళనిపెంచేభారం మనదే. మనం ఉద్యోగం చెయ్యాలంటే, డాక్టరు స్కూలుమేష్టరు, ఇవే బాగుంటాయి. సన్నని కోకిలకంఠంతో గానమొనర్చగల్గిన మనము న్యాయవాదులమై కోర్టులోబల్లగుద్ది అబద్ధపు సాక్ష్యాన్ని బలపరుస్తు సింహంలాగు గర్జించ గలమా? ఇక యంత్రశాలతో మనకుపనే లేదు,అసలా కాలేజీలోనే చేర్చుకోరు. ఉన్నత విద్యకు వెళ్లేకొలదీ పాశ్చాత్యభాషే. పరమావధి అవుతోంది. ఆంధ్రభాషకు అగ్రస్థానమే లేదు. స్త్రీలు ఉద్యోగానికాసిస్తేతప్ప లేకుంటే పురుషుల పాఠశాలలో స్త్రీ నేర్వవల సిన దంతగాలేదు. ఉత్తమమైన స్త్రీ విద్య కావాలంటే, గుంటూరు, రాజమండ్రి, ఇలాటి పూళ్లల్లోవున్న శారదానికేతనం, సంస్కృత కళాశాల ఇవే ఉపయోగమనుకుంటాను. అలాంటివి ప్రతిపూరిలోవుంటే స్త్రీలకి తగిన విద్య రాదూ? వానికి ఎన్ని లక్షలుకావాలి? వేఱు వేఱు సంస్థలలో వేఱు వేఱుగా స్త్రీ పురుషులు విద్యనభ్యసిస్తే మంచిదేమోయని నాఊహ. అయినా చిన్నదాన్ని నాకు తెలిసిన దానికంటె తెలియనిదెక్కువ కాబట్టి తప్పు లుంటే మన్నించు.

ఇట్లు

సోదరి, కమల.

# ఆరోగ్యబోధిని

## శిశు సంరక్షణ

శిశుసంరక్షణ అనగా పిల్లలను పెంచుటయందు గమనించవలసిన ఆరోగ్యవిషయములు. వీటినిగూర్చి కొద్దిగా చెప్పుచున్నాను. మన దేశములో పిల్లలు నాలుగైదేండ్లు యీడు రాకముందే చాలామంది చనిపోవుచున్నారు. గనుక, పసిపిల్లలను పెంచు విషయమై చాలామందికి బాగుగా తెలియకపోవుట చేతను, సంరక్షణచేయు విషయములో జరుగు పొర బాటులచేతను పిల్లలు ఆయాజాడ్యములతో బాధపడి చనిపోవుచున్నారు. అదిగాక యీ దేశస్త్రీలు ప్రతి రోగము ఏదో యొక దేవతయో, పిశాచమో, కోపమువచ్చి పంపించుచుండునని సాధారణముగా నమ్మెదరు. ఇది యొక మూఢవిశ్వాసము. మన హిందువులు తర్చు తమ పిల్లలను దాసీలకిచ్చి తాము వేరేపనులు చేసుకొనుచుందురు. వివేకముగల తల్లులు తమ దాసీలు యెంత నమ్మకమైనవారుగా కనబడి నను వారు చెప్పినట్లు వినరాదు. తమ బిడ్డలప్రాణము కాపాడుకొనుభారము తమదిగాని మరియొకరిది కాదు. కాబట్టి బిడ్డలు సౌఖ్యముగానుండుట కేమేమి యగత్యమో ఆ సంగతులు, అనగా ఆహారము, పానము, పరిశుభ్రత, బట్టలు, చలి, తేమ, యెండ, మొదలగు సంగతుల విషయమై తెలుసుకొన వలెను.

శిశువు నిండు నెలలైన తరువాత ఆరోగ్యముగా పుట్టినట్టయిన ఏడుపౌనులయెత్తు తూగును. పొడుగు పదునెనిమిది అంగుళములుండును. మొదటి నాలు గైదు రోజులలో అయిదారు ఔన్సుల బరువు తగ్గును గాని మంచి ఆహారముతో పెంచినయెడల దినదినము బరువెక్కువై యేడాదివచ్చునప్పటికి 18 మొదలు 22 పౌనులదాకా తూగును. కావున శిశువునకు ఆరంభములో కొన్ని నెలలవరకు సహజమైన ఆహారము, ఆరోగ్యముగల తల్లిపాలే. ఏలయన అందు చాలాభాగము నీరును, ప్రోటీడ్ (అనగా ఎముక మాంసము పుట్టించు ప్రథమ వస్తువు) క్రొవ్వు, పాల చక్కెర, క్షారములుయున్నవి. ఈ పదార్థములు మారి బిడ్డ శరీరములో ఆయా అవయవములు త్వరగా ఎదుగుటకు కావలసిన పోషణయావత్తు నిచ్చును. శిశువుకు స్వాభావిక ఆహారమగు తల్లిపాలు లేన ప్పుడు తల్లిపాలకు బదులు యియ్యాబడు పాలు వీలై నంతవరకు చనుబాలవంటివై అనగా ఆపాలలో ఏయే పదార్థము లేయే పాళ్లచొప్పున చేరియుండునో ఆయాపదార్థము లాయాపాళ్లచొప్పున చేరియుండు పాలై యుండవలెను.

ఇపుడు శిశువులకు ఆహారమిచ్చు విధానములు అలవాటులోనున్నవి, మూడు. (1) తల్లిగాని, దాదిగాని పాలిచ్చుట. (2) తల్లి పాలిచ్చుచు మధ్య మధ్య డబ్బాపాలు పట్టుట. (3) చేతిపాలుపోసి పెంచుట. తల్లి, బిడ్డకు పాలిచ్చుకాలములో తాను సులభముగా జీర్ణమగు వస్తువులు, చక్కగా ఉడికిన కూరగాయలు, ఆయాకాలములయందుపండు ఫలములును మితముగా భుజింపవలెను. మత్తువస్తువులు, సారాయి, బ్రాంది మొదలగునవి మంచిపాలు పడునట్లు చేయునని కొందరు పుచ్చుకొందురు. ఇది శుద్ధ అబద్ధము. మంచి ఆహారవస్తువులే రక్తవృద్ధిచేసి పాలు పడుటకు కావలసిన వస్తువులను రక్తములో చేర్చును గాని మత్తుపదార్థము లెన్నడైన యిచ్చునా? ఒక

వేళ పాలిచ్చు తల్లికి ఎక్కువదాహముగ నుండ వచ్చును. అట్టి సమయములయందు యేదైన పిండితో కాచిన గంజి, జావ, బార్లీనీరు, నీళ్లుకలిపిన పాలు, సోడా మొదలగునవి యివ్వవచ్చును. పాలిచ్చు విష ములో పిల్ల ఏడ్చినప్పుడెల్లా పాలిచ్చుటవల్ల తల్లి ఒళ్లు చెడును. బలహీనము ఎక్కువగును. శిశువు పుట్టిన ఆరంభములో దినమెల్లా నిద్రపోవుచునేయుం డును. పాలకొరకుమాత్రమే నిద్రమేల్కొని యేడ్చును. బిడ్డ యెదిగి తెలివితేటలు వృద్ధియైన కొలది నిద్రతగ్గును. పిల్లలు తర్చు ఎక్కువగా పాలు కుడుపుటవల్ల పుట్టే అజీర్తి కడుపునొప్పివల్లను, దాహమైనప్పుడును, జడుసుకొన్నప్పుడును, ఎండ వేళల వెచ్చతురుకు తాళలేకను, బట్టలు తడిసినప్పు డును, గుడ్డలు బిగువుగానుండినను, పిన్ నూసులు గుచ్చుకొనినను, దోమలు, నల్లులు, కుట్టుటచేతను ఏడ్తురు. కాబట్టి బిడ్డయేడ్పు జాగ్రత్తగా కనిపెట్టి పరీక్షించితేనెగాని యెందుకు ఏడ్చుచున్నది తెలిసి కొనుట కష్టమగును. అట్టి వేళలందు జాగ్రత్తగా కనిపెట్టవలెను. ఈ సంగతి తెలుసుకొనలేక ఏడ్చి నప్పుడెల్లా పాలిచ్చుచుందురు. అందుచే చాలా నష్ట ములు కలుగును. ఇక మనము దాదులచే పాలు పెట్టించునపుడు చాలా జాగ్రత్తగానుండవలెను ఏల యన వారి పుట్టుపూర్వోత్తర మెట్టిదో ఆరోగ్యము గలవారో కారో యేమియు తెలిసికొన వీలుండదు. కొంతమంది పిల్లలు ఏ హేతువుచేతనో రాత్రిళ్లు నిద్రపోక పోరుపెట్టి యేడ్చుచుందురు. అట్టిసమయ ములందు ఆయాలు తమ నిద్రచెడకుండవలెనని నల్ల మందు పెట్టు దురభ్యాసముకలదు. కాబట్టి దాదు లను పెట్టుటవల్ల హానియేగాని లాభమేమియు లేదు. ఒకవేళ తల్లికిగాని, దాదికిగాని, జ్వరముగాని మరి యే జబ్బుగాని రావచ్చును. అట్టిచో పోతపాలు పోసి పెంచవలసివచ్చును. అపుడు డబ్బీపాలు కొద్ది దినములు వాడవలసివచ్చిన మొదట బాగాకాచి, చల్లార్చిన మంచినీళ్లలో కొంచెము డబ్బీపాలు కలిపి ఆవుపాలంత పలచనిగానుండునట్లుచేసి పిల్లకు పోయ వలెను. ఏహేతువుచేతనైన యీ డబ్బీపాలు శిశు వుకు నాలుగువారములకంటె ఎక్కువదినములు పోయ వలసివచ్చినయెడల మంచి నారింజపండు రసముగాని ద్రాక్షపండు రసముగాని ఒక చిన్నగరిటెడు, పట్టెడు పాలతో కలిపి దినమునకు రెండుసార్లు యియ్యవలెను.

పోతపాలుపోసి శిశువులను పెంచవలసి వచ్చి నపుడు మంచి ఆరోగ్యముగల ఆవుపాలే శ్రేష్ఠము. అవి తీసుకొని వాడుకొనువరకు బహు జాగ్రత్తగా నుంచవలెను. పాలు పరిశుభ్రమైన సీసాలోనో, మరియొక పాత్రలోనో పోసి చల్లగా నుండుచోట పెట్టి, ఈగలు పడకుండ దుమ్ము మొదలైనవి రాల కుండా మూతపెట్టి యుంచవలెను. లేదా మంచి తెల్లని గుడ్డతో కప్పి యుంచవలెను. ఏలయన ఈగలు, పెంటకుప్పమీదను, కుళ్లువస్తువులమీదను, మొదటవాలి, లేచివచ్చి పాలమీదను వ్రాలవచ్చును. అప్పుడు వాటివల్ల విషపు అంకురములు పాలనంటు కొని బహువేగముగా వృద్ధియై పాలను చెడగొట్టును. ఆ పాలుత్రాగిన బిడ్డకు విరేచనములగును. కావున బిడ్డపాలు సిద్ధము చేయుటకు వినియోగించు, జగ్గులు, పిడతలు, కోపాలు, గరిటెలు, కొలపాత్రలు మొద లైన వస్తువు లన్నియు బహు పరిశుభ్రముగా నుంచ వలెను. అదియును గాక పోతపాల కుపయోగించు పాలబుడ్లు చాలా పరిశుభ్రముగా నుంచవలెను. ఉప యోగించు బుడ్డిలో పాలన్నియు అయిపోవువరకు గాలి చొరకుండా యుంచవలెను. బుడ్డి కడుగుటకు వీలుగా నుండవలెను. బిడ్డ త్రాగగా మిగిలియున్న పాలు ఉంచి యింకొకసారి త్రాగించరాదు. మిగిలిన వన్నియు పారబోసి బుడ్డి వెంటనే కడిగివేయవలెను. అతి తరుచుగా పాలు యీయరాదు. అడుగడుగుకు పాలిచ్చినందువల్ల చాలా హానికలుగును. ఒకొ్కక్కప్పుడు పసిబిడ్డలు పాలు వేగముగా త్రాగుచు వారి కడుపు కెక్కువగా త్రాగుదురు. ఆ యెక్కు వైనది నోటివెంట కుదపలుగా బైటికివచ్చును. అటు వంటి సమయములలో బిడ్డను ఆడింపక నెమ్మదిగా

పరుండబెట్టుట మంచిది. ఇంక ఒక్కొక్కప్పుడు పిల్లలు విస్తారముగా డోకుచో యేమాత్రము పాలు నిలువకపోవును. ఇది ఎందుచేత? మనము వేళ కని పెట్టక అతితరుచుగా పాలు త్రాగించుటచేతను, పిండివస్తువులు కలిసిన ఆహారవస్తువులు పసిబిడ్డలకు ఇచ్చుటచేతను, విస్తారము వెన్నపట్టె చిక్కని పాలు పోయుటచేతను, కలుగుచుండును. అటువంటి సమయములందు ఆకారణము కనిపెట్టి వాటి కను గుణ్యముగా నడువవలెను. పైనిచెప్పిన సంగతులు పదిమాసముల లోపుపిల్లల విషయమై. ఇక 10 మాసములపైవారి సంగతి మాత్రము. బిడ్డకు తల్లిపాలు మాన్పించిన తరువాతను, పుట్టినప్పటినుంచి బుడ్డిపాలు త్రాగి ఎదిగిన బిడ్డకు ఏడాదివెళ్లిన తరువాతను, దిన మున కొకతడవ మెత్తగా వండిన అన్నమైనను, ఏదైన పిండితో చేసిన జావైనను ఇవ్వవచ్చును. మిగిలిన పూటలు పాలు యివ్వవలెను. అప్పుడప్పుడు రొట్టె, వెన్నకూడా తినిపించవచ్చును. ఏదిపెట్టినను, సులభముగా జీర్ణమగు ఆహారమే పెట్టవలెను. పండ్ల యొక్క రసము దినమున కొకపూట యిచ్చుచుండిన బహు ఆరోగ్యకరము. ప్రతిబిడ్డకు ఎంత ఆహారము పెట్టవలెనో, ఏమి పెట్టవలెనో, వారి తత్వమును బట్టి కనిపెట్టవలెను. అందఱకు ఒకేపంథా పనికి రాదు. ఈ విషయములో పొరబాటు చేసినయెడల బిడ్డ ఆరోగ్యముచెడి,చిక్కి, నీరసించిపోవును. బిడ్డకు పెట్టే ఆహారము సరిపడినది లేనిది విరోచనములో కనబడు మార్పునుబట్టి తెలుసుకొనుచుండవలెను. చిన్నపిల్లలకు తేనీళ్లు, కాఫీ యీమొదలైన దురభ్యాసములు యీప్రాంతములయందు, యీదినములలో ఎక్కువగా ప్రబలియున్నది. ఇట్టి దురాచార పిశాచమును పారదోలిన గాని బాలారిష్టములు తప్పవు

ఇక పసిపిల్లలకువేయు బట్టలనుగూర్చి చూతము. పసిపిల్లలకు శరీరదార్ఢ్యమనునది తల్లిదండ్రుల పిండ బలమునుబట్టి కలుగునదియేగాక పెంపులో వినియోగింపబడు జాగ్రతను బట్టికూడా చాలావర కుండును. పెద్దవారికంటె పసిపిల్లలు చలి, కాక మొదలగు వాయు స్థితిభేదములకు సులభముగా లోబడుదురు. చలి విశేషము తగిలినను, పిల్లలకు త్వరగా జబ్బు చేయును. పసిపిల్లల చర్మము బహు మృదువుగాను, మెత్తగానుండును గనుక వారికి వేయుబట్టలు అతి మృదువుగాను, తేలికగాను, చలికి, కాకకు ఆపునవిగాను, యుండవలెను. శరీరమంతా సమానముగా కప్పవలెను. చేతులు పాదుగంతా మూయవలెను. మెడపైవరకు రావలెను. ముఖ్యముగా ఎదురు రొమ్ముకు చలి తగలనీయరాదు. వీరికి వేయుబట్టలు బహువదులుగానుండుట ముఖ్యావసరము. ఇక పిల్ల బట్టలు ఉతుకుట విషయమై తల్లియే స్వయముగా చూచుకొనుట మంచిది. బిడ్డను ఉదయమున ఎడ యెక్కకముందును, సాయంత్రము ప్రొద్దుదిగిన తర్వాతను, బైటికి తీసుకొనిపోవలెను. ఇంటిలోనుండగా బిడ్డను విస్తారముసేపు చేతులలో ఎత్తుకొనుట మంచి అలవాటుకాదు. పెద్దవారిచేతుల కాక పిల్లలకంత మంచిదికాదు. అదియుంగాక మనవారు ప్రేమ కొరకో మరి యేలకో పిల్లల నెల్లప్పుడు ఎత్తుకొని బుగ్గలనుకొరుకుచు ముద్దాడుచు త్రిప్పుచుందురు. ఇది చాలా చెడ్డఅలవాటు. ఇందుచే వీరి పండ్లనున్న విషము పసిపిల్లల బుగ్గలపై నంటుకొని కురుపులుగా మారి వారి ఆయువు తీయునంతకష్టము కలుగజేయును. ఇట్లనే అనేకమంది మృత్యువాతపడిరి. గాన బిడ్డలు గల ప్రతిస్త్రీ యీవిషయమై గమనించుట ముఖ్యావసరము పసితనమందు పిల్లలకేమి యాహారము పెట్టవలెనో, ఎటువంటి బట్టలు వేయవలెనో, తెలుసుకొంటిమి. ఇపుడు పిల్లల నెటువంటి గదిలో ఉంచవలెనో ఎట్లు వారిని కాపాడవలెనో తెలుసుకొందము.

పిల్లలు ఆరోగ్యముగా పెరుగవలెనంటే వారిని దినమంతా ఉంచు గది పెద్దదిగానుండవలెను, శుభ్రమైన గాలి గదిలోకి చక్కగా రావలెను. మురికి గుంటలుగాని, పాయిఖానాదొడ్లుగాని దగ్గరనుండరాదు. చెడువాయువులు చిన్నబిడ్డల ఆరోగ్యమును

చెడగొట్టుటయేగాక నీరసము పుట్టించును. గదినిండా అక్కరలేని సామానుపెట్టి యుంచరాదు. గోడలమీద గుడ్డలు వ్రేలాడవేయరాదు. శిశువు నెన్నడు ఇంకొకరిప్రక్కను పరుండ బెట్టరాదు. చిన్నమంచము ప్రత్యేకముగా ఉంచి, దానిమీదగట్టి పరుపువేసి, ఆ పరుపు తడియకుండా ఆయిల్ క్లాతు కప్పియుంచవలెను. గదిలో మంచము ఒక గోడదరివేయవలెను, బిడ్డ కండ్లమీద బలమైన వెలుతురు తగలనీయకుండా చూడవలెను. అట్లు తగలనిచ్చినయెడల నిద్రచెడుటయేగాక కండ్లకు జబ్బుచేయవచ్చును. వర్షాకాలములో గదిబైటి తలుపులు రాత్రివేళ మూసియుంచుట మంచిది. పిల్లలు ఆరోగ్యముగా నుండవలెనంటే నౌకర్లపై పెట్టక పిల్లలగది శుభ్రముగా నున్నది లేనిది తల్లియే కనిపెట్టుచుండవలెను. నౌకర్లు ఎంతమంచివారైనను, వారియజ్ఞానము అజాగ్రత యింతంతయని చెప్ప వీలుండదు. ఇక పిల్లలకు పండ్లువచ్చు కాలము పిల్లలకు తల్లులకు కూడా కష్టకాలమే. పండ్లువచ్చునప్పుడు జబ్బులురావలసిన అగత్యములేదు. కాని యీసమయములో పిల్లలశరీర తత్వమొక్కటే తీరున నుండకపోవుటవల్ల ఆయాజబ్బులు పుట్టును. ఈ యీడున పిల్లలు అతిత్వరగా ఎదుగుదురు. కాబట్టి యేమాత్రపు అల్పకారణములకైన ఆరోగ్యము చెడిపోవును. రెండు రెండున్నర యేండ్లు వచ్చునప్పటికి బిడ్డలకు మొదటవచ్చు పాలపండ్లు వచ్చును. ఇవి ఆరుఏండ్లకు ఒకటితరువాత నొకటి ఊడిపోయి పెద్దతనమువచ్చువరకు ఉండే ఖాయమైనపండ్లు రాసాగును. పండ్లువచ్చుచున్న కాలములో ముఖ్యముగా శుభ్రమైనగాలి, బిడ్డయుండుగదిలోనికి రానీయవలెను. బిడ్డను తర్చుగా ఆరు బైట త్రిప్పవలెను. రాత్రిళ్లు కూడా వేడినీళ్లతో స్నానము చేయించవలెను. తల శుభ్రముగాను చల్లగాను ఉంచవలెను. బిడ్డకు చాలినన్నిపాలు సమృద్ధిగా ఇయ్యవలెను. ఈవిషయములలో తగినంత జాగ్రతచేసిన యెడల పండ్లుతేలికగా వచ్చి బిడ్డకు తల్లికికూడా యే తొందరలేకుండా పోవును. సామాన్యముగా బిడ్డకు రెండవనెలలోగాని మూడవనెలలోగాని టీకాలు వేయించవచ్చును. అట్లుచేసిన మశూచికము మొదలగు జబ్బులుకలుగవు. శిశువు ఆరోగ్యము బాగుగానుండును. బిడ్డ ఉదయమున నిద్రనుండి లేవగానే ఒకటికి పోయుటకు ఎత్తిపట్టుకోవలెను. ఇది మొదట చేయవలసినపని. తరువాత స్నానముచేయించి సిద్ధముచేసిన ఆహారము యివ్వవలెను. బిడ్డకు వాడేసబ్బు మంచిరకపుదిగా నుండవలెను. జబ్బురకపు సబ్బులను లేనిపోని రంగులను, సువాసనద్రవ్యములను కలిపి యమ్ముదురు గనుక అట్టివాటిని వాడరాదు. ఒక్కొక్కప్పుడు అట్టి సబ్బులు పిల్లల లేతచర్మములకు రోగములుపుట్టించును. స్నానమైన వెంటనే మెత్తని తువాలుతో ఒళ్లంతా తుడిచి చంకలలోను, తొడలసందునను, పిఱ్ఱలసందునను మంచిపౌడరు యేదైన పూయవలెను. బిడ్డచేతిగోళ్లు, కాలిగోళ్లు చక్కగా కత్తెరతో కత్తిరించవలెను. బిడ్డను ప్రొద్దుట బైటికితీసికొనిపోకముందు గదితలుపులన్నియు కిటికీలు తెరచి పరుపులు తలగడలు మొదలగునవి ఎండలో ఆరవేయవలెను. పగలు పదకొండు పన్నెండు గంటలవేళ బిడ్డకు పైబట్టలు తీసి కిటికీలైనను తలుపులైనను కొంచెము మూసి నిద్రబుచ్చి రెండుమూడు గంటలసేపు పరుండనిచ్చిన చాలా ఆరోగ్యము. దోమలు మొదలగునవి పుట్టకుండా దోమతెరలు వేయుటమంచిది. బిడ్డలు ఊపిరి విడుచునప్పుడు నోరుతెరుచుకొని యుండక ముక్కుతోనే యూపిరించుటకు అలవాటుచేయవలెను. దాసీలు పిల్లలకు, గిలకరాళ్ళు మిఠాయి మొదలగు వస్తువులు పెట్టుదురు. ఈయలవాటు మాన్పింపవలెను. దాసీలు శుభ్రముగానుండునట్లును ప్రతిదినము

స్నానముచేసి బట్టలు మార్చుకొనునట్లును చూడవలెను. పసిపిల్లలను సంరక్షించుటయందు క్రమమైన అభ్యాసములు నేర్పుట ముఖ్యము. దినము పొడుగున జరుగవలసిన ప్రతిపని, వేళప్రకారము జరుగునట్లు చూడవలెను. ఇట్లుచేసిన, పిల్లలకు మంచి అభ్యాసములు పట్టుపడును. పసిపిల్లలు అనారోగ్యముగా నుండుటకు ముఖ్యకారణములు, అజీర్తివిరోచనములు, విరేచనబద్ధము. ఈరెండు జబ్బులు, పిల్లలకు త్రాగించు పాలు తిన్నగా జీర్ణముకాకపోవుటచేతను, ఆదానీలు పిల్లలకు బైటికి కూర్చుండుటకు క్రమమైన అభ్యాసములు చేయకపోవుటచేతను పుట్టుచున్నవి. గనుక జాగ్రత్తవహించుటమంచిది. పిల్లలు నడువనేర్చుకొనునప్పుడు అతివిస్తారముసేపు నిలువబడియుండనీయరాదు. బలవంతముగా నడిపించరాదు. వారు స్వయముగా లేచి నడుచుటకు మొదలుపెట్టినప్పుడు పడకుండా దగ్గరనుండి కనిపెట్టవలెను. కాళ్ళకుకావలసిన బలమురాక ముందే నడిపించినందున దొడ్డికాళ్లు, ముడికాళ్లు ఏర్పడును, కావున వారిబలమునకు మించినపని చేయకూడదు. పిల్లలు పెద్దవానిచేయి పట్టుకొని నడుచునప్పుడు బిడ్డచేయి పొడుగుగా లాగరాదు. పెద్దవారు, బిడ్డభుజము పైకెత్తకుండా క్రిందికే యుండునట్లు చూడవలెను. నడుచునపుడు తనకిష్టమైనంత వేగముగానో మెల్లగానో, బిడ్డను నడువనీయవలసినదేగాని తొందరపెట్టకూడదు. పసిపిల్లలను రెక్కపట్టి పైకెత్తరాదు. చంకక్రింద రెండుచేతులు పెట్టి పైకి జాగ్రతగా ఎత్తవలెను.

కావున బిడ్డలుగల ప్రతిస్త్రీ యీవిధముగా బిడ్డలను సంరక్షించిన బాలారిష్టములు అకాలమరణములు మొదలగునవి లేక ఆరోగ్యవంతులై దినదినాభివృద్ధి గాంచి మాతృదేశమునకు ఖ్యాతితెత్తురని నమ్ముచున్నాను.

ఇదియే నేను వ్యాసములు వ్రాయుటలో మొదటిది. అనేకదోషములుండవచ్చును. గాని వాటిని పాటించక సోదరీమణులెల్లరు ప్రోత్సహింతురుగాక.

—సత్తరవు లక్ష్మీనరసయ్యమ్మ.



# మనస్సంబోధనము

దిగుమర్తి వెంకటసీతారామస్వామిగారు

సీ॥ వింతకోరికల కువ్విళ్లూరి విఫలత్వమంది సంతాపమ్మునందనేల?
అరయ స్వకర్మమిట్లగుననిదలపక పరులదూషింపఁ బాల్పడఁగనేల?
ఐనదానికి కానిదానికి దొరకొని క్రిందుమీఁదెఱుఁగక కెరలనేల?
పాపమెఱుంగని భామామణులపయి లేనినిందలమోపఁ బూనుటేల?

గీ॥ ఏదియెట్టుల నగునో యటు లదియగునని
నిత్యసంతుష్టిగనుచును సత్యమెఱిగి
నడుచుకొను మెప్పుడేని యే చెడుగురాదు
వినయమునుబూని మెలఁగుమా మనమ వినుమ!




భగవద్గీత

కీ॥ శే॥ దామర్ల సీతమ్మగారు.

ప్రథమాధ్యాయము. (వరుస. సావిత్రీవరమున నుదయించెను వలె.)

ధృత:—ధర్మభూమియగుకురుభూమిని నాతనయులు పాండవపుత్త్రిలునూ
కలహాపునెపమున చలమునగూడియు నేమియొనర్చిరో యెరిగింపు
సంజయ, ఏమియొనర్చిరో యెరిగింపు॥

సంజ:—రాజ, వినుము ధృతరాష్ట్ర! నీసుతుడు పాండవసేనను బరికించి
ధనురాచార్యుని కడకేగియు తానిట్లనిబల్కెను జెచ్చెరను
తానిట్లనిబల్కెను జెచ్చెరను॥

ధీయుతుడును నీశిష్యుడు ద్రుపదకులావతంసుడును బన్నిన యా
వ్యూహముగనుమో యాచార్యోత్తమ! కౌంతేయుల ఘనసేనయది!
యాకౌంతేయుల ఘనసేనయది॥

రణశూరులు భీమార్జున తుల్యులు విలువిద్యా నిపుణులు ఘనులు
యుయుధానుడు విరాటుండును ద్రుపదుడు మొదలగువారు మహారథులు
అతిధీరులు భుజబల గర్వితులు॥

ఇక మనసేననుగల వీరులగను మీవును భీష్ముడు కర్ణుడునూ
కృపుడును నశ్వత్థామయు మున్నగువారలు జయశాలురు వినుము
అనివార్య పరాక్రమమున నిజము॥

తక్కినయోధులుపెక్కురు రణపండితులై నీకొరకు సురులనూ,
విడువగబూనిరి కడునియమంబున నీరణభూమిని నింపుగను
వారీరణభూమిని నింపుగను॥

భీష్మ రక్షితంబగు మనసేనయు బర్యాప్తత జెందగలేదు
భీమ రక్షణను వారలసేనయు బర్యాప్తిని బొందినదయ్యొ
యతి బర్యాప్తిని బొందినదయ్యొ॥

వ్యూహమార్గముల మీరెల్లరును మీ మీనెలవులయందుననూ
జాగరూకులై నిలిచి భీష్ముని గాపాడగవలయును సుండీ
వడి గాపాడగవలయును సుండీ॥

అనిపల్కిన రా రాజు సంతసమునందగ గాంగేయుం డపుడూ
సింహనాదమునుజేసి శంఖమును పూరించెను, సేనయునపుడె
పణవాదివాద్యములు గావించె॥

అటుపై మాధవుడును నర్జునుడును తెల్లగుర్రముల తేరుననూ
కడు రయముననుండియు బూరించిరి దివ్యశంఖముల దివిముట్ట
తమ దివ్యశంఖముల దివిముట్ట॥

పాంచజన్యమును హృషీకేశుడును, దేవదత్తము ధనంజయుడు
పౌండ్రంబను నామహాశంఖమును వృకోదరుండును వరుసగను
ఆ వృకోదరుండును వరుసగను॥

అనంతవిజయం బనుశంఖంబును నా యుధిష్ఠిరుండును పిదప
సుఘోష మణిపుష్పకముల గవలతి మోదంబున బూరించిరిగా
అతిమోదంబున బూరించిరిగా॥

కాశీరాజు శిఖండియు విరటుడు ధృష్టద్యుమ్నుడును సాత్యకియు
పాంచాలుం డుపపాండవు లా యభిమన్యుడు పూరించిరి యపుడు
తమ శంఖమ్ముల నొక్కుమ్మడిని॥

ఘనమానాసినదము భూమ్యాకాశాంతరముల బ్రతిధ్వనింపగను
వడి నీతనయులహృదయపుటంబుల వ్రయ్యగజేసెను కడువేగ
నవి వ్రయ్యగజేసెను కడువేగ॥

భూజానీ విను మర్జును డంతట, సమరసిద్ధమా కురుసేనన్
కలయగనుంగొని గాండీవంబునునెక్కిడి యిట్లనె నీశునితో
తా నెక్కిడి యిట్లనె నీశునితో॥

భారతజాతీయమహిళామండలసమావేశము.



అధ్యక్షురాలు, శ్రీమతి మనిక్‌లాల్ ప్రేమ్‌చంద్ సతి. శ్రీ మహారాణీసాహేబా, బరోడా.

పురుషోత్తమ మనరథమును నిరుసేనలకును నడుమను నిలుపగదే
యెవరితోను సమరమునొనరింపగవలయునో యెరిగెడి నందాకా
రణశూరుల గనుగొనునందాకా॥

అనుటయు తోడన నచ్యుతుడును నా తేరున వీరుల కెదురుగను
నిల్పిచూడు మోగుడాకేశ యా సుయోధనాదుల ననిబల్కె
నా సుయోధనాదులననిబల్కె॥

ధనంజయుం డట నిరుబలములగల తాతలు తండ్రులు మామలునూ
బావలు తనయులు మనుమలులోనగు వారలగని యిట్లనిబల్కె
నతి దుఃఖితాత్ముడై దఃఖగదుర॥

కృష్ణా చూచితి, రణమొనరుప నిటగూడిన మామక బంధులను
దేహబలంబును దెగిమెను చేతను గాండీవము నిలుపగజాల
యీరథమున నుండ నశక్తుడను॥

మది భ్రమజెందెను మాధవవినుమా దుశ్శకునంబులు దోచినవి
బంధుల రణమున బరిమార్చియు నే శ్రేయంబును జూడను వినుము,
నే శ్రేయంబును జూడను వినుము॥

కోరనువిజయము కోరనురాజ్యము గోరనుసుఖమును జీవితమున్
పూజ్యులెల్లరును పోయిన వెనుకను, యెక్కడి సుఖములు యీభువిని
యిక నెక్కడి సుఖములు యీభువిని॥

వారలు ననుజంపగ వచ్చినను, వారల నేజంపగనొల్ల
ముజ్జగాధిపత్యమునకునైనను మురియుచు వారి నడంపనుగా
నా కీభువిపాలన మననెంత॥

సుయోధనాదుల సుడివడజేసిన సారిదిని పాతకమే గలుగున్
దురాత్ములైనను వారలజంపిన దుర్యశమే గలుగును మనకు
క్షితి దుర్యశమే గలుగును మనకూ॥

కులనాశనమగు, నిల సనాతనాచారము లన్నియు హరియించి
అధర్మజాలం బలమికొనుట నచ్యుత చెడుదురు కులకాంతలును
నందులనగు జాతుల సంకరము॥

పితరులు పడుదురు పిండోదకములు లోపమగుటనో లోకేశా
వంశనాశకునకును నరకంబున వాసంబౌనగను వినమె
చిరవాసంబౌనగను వినమె॥

కావున నశ్వరకార్యములకు నే పాపపంకమున బడజాల
రాజ్యము నొల్లను రహినిట భిక్షుకవృత్తియె తగు వారిజనాభ
భువి భోగంబుల గోరను వినుము॥

అనుచుబల్కుచు నాకిరీటియు ఘనదుఃఖంబున మదికలగ
శరచాపంబుల విడచియు తేరున చతికిలబడెసమ్మోహమున
వడి చతికిలబడె సమ్మోహమున॥



## సంప్రార్థనము

శ్రీమతి ఎ. కోమలమ్మగారు.

౧

భారత, తావక మృదు పద పంకజ
సంతత చింతన రతి మమలామ్।
క్రూరతరారి సమూహ నిషూదన
సముచిత బలయుత ధృతి మతులామ్॥

౨

తావక జయజయ గీతీ గానే
కర్ణమనోహర కంఠరవన్।
మోహక కవితా లింగిత పటుతర
కోమల తర వాణీ విభవమ్॥

3

తావక బంధన తోడన శక్తిమ్
త్వత్ప్రతీత్వ స్థాపన యుక్తిమ్
కరుణా మంజుల, సంతతి వత్సల
యాచే సవినయం అయి దిశమే॥

## గాంధి దేవుడు

శ్రీమతి త్రిపురనేని సాధువమ్మగారు.

(నందనందనుని అనే మట్టుమాదిరి)

సజ్జననుతుడగు గాంధిమహాత్ముని సత్కథవినరమ్మా!
దీనను మోక్షముగలదమ్మా!
దేవునిరూపమె యతడమ్మా!
దీనబాంధవుని లీలలు మదిలో దీటుకొల్పరమ్మా!
తత్వము దెల్పెద వినరమ్మా!
సమకాలికులము మనమైనందుకు సంతసింపరమ్మా!
ధర్మస్థాపన మిదిసుమ్మా!
ముఖ్యస్థానము మనదమ్మా!
సత్యహితంబగు శాంతిసమరమిది సమయము విడకమ్మా!
ఇది యేయుగమున లేదమ్మా!
ధర్మంబెల్లను జెడుకాలం బిల గాపురమైనపుడు
లోకముక్షోభ జెందునపుడు
సజ్జనపద్ధతి జెడునపుడు
సర్వజ్ఞుండగు దేవదేవుడే సత్యముస్థాపింపన్,
మోహనదాసుగ జన్మించెన్.
విశ్వముకొరకై నాల్గువేదములు విబుధులు వ్రాసియును
పరమార్థము సూచించియును
సత్యార్థము బోధించియును.
అన్నిజాతులు తరించుట కనువుగ నందుబాటులోను,
విజ్ఞానము వెదజల్లగను,
పలుశాస్త్రములకు భారతవర్షము పాదై యుండగను
స్త్రీలును పురుషులు మెలకువను
అందరుచదివి తరింపగను
భారతదేశమె సర్వకళలకును పట్టని పొగడగను
మించెను సాటిదేశములను.
కాలక్రమమున భారతదేశపు గౌరవమణగగను
విద్యాశూన్యత హెచ్చగను
స్వార్థపరత్వము మీరగను
తాకరానివారనుచు వచించిరి తమలోకొందరను
ఊరికి వెలిగావించియును.

గాంధిమహాత్మం డీదేశపు దుర్గతినవలోకించి
పంచమజాతిని తిలకించి
తనమదినెంతయు విలపించి
భారతవర్షపు దుస్థితికిదియే పాదనిగమనించి
హరిజన రక్షణ నూహించి

అంటరానివారనగా ధరలో నసలేలేరనుచు
ఇదిమన పౌరపాటేననుచు
బాగుగపరికింపుండనుచు
మనసోదరులను దూరముజేయుట మనకేకీడనుచు
పరులకు చుల్కనయగుననుచు.

ఆత్మారాముం డందరియందున నలరుచుండెననుచు
దివిభువి నిండియుండెననుచు
భేదము లెంచుట తగదనుచు
బ్రహ్మజ్ఞానము నెరిగినవారే బ్రాహ్మణులని యనుచు
పల్కెను ధర్మంబిదెయనుచు.

పరీక్షింపు డీజగదోద్ధారుడు పట్టువిడువకుండి
వచ్చినకార్యమె యిదియండి
ధర్మస్థాపన నిజమండి
దీక్షకొరకు తనజీవములూడిన దిగులుజెందకుండి
పురుషోత్తముసేవకు రండి.

జీసను క్రీస్తు మతోద్ధరణమునకు జీవములర్పించెన్
బుద్ధుండసువుల త్యజియించెన్
శ్రద్ధానందుడు గతియించెన్
గాంధిమహాత్ముడు గడచినపిమ్మట గలదేచింతించన్
లెండస్పృశ్యత నడగింపన్.

భారతభాగ్యవశంబున బుట్టిన పరబ్రహ్మమమ్మా!
జాతికి శల్యపరీక్షమ్మ!
త్యాగము జూపవలయునమ్మా!
బంగారక్షరముల మీవిజయము ప్రకటింతురు సుమ్మా!
భేదపుబుద్ధి విడువరమ్మా!

# బాలవిజ్ఞానశాఖ

కాకిశకునం

దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

—ముత్యాలసరాలు—

కాకూలమ్మా! కర్రాలమ్మా!
చుట్టాలమ్మా పక్కాలమ్మా
సాయంత్రానికి చుట్టాలొస్తే
ఖరేల్ని గంతెయి కాకమ్మా!

కాళ్లాకి గజ్జెలు కడతా
ముక్కూకి ముత్తెం పెడతా
ఏడడుగూలు ఎదురూ వెళ్లి
కబురూ తేవే కాకమ్మా!

కావూకావూ కాకూలమ్మా
మాయింటికీ చుట్టాలొస్తే
పరుగూపరుగున ఎదురూపోయి
కలిసీరావే కాకమ్మా!

తోడూ లేదూ నీడా లేదూ
ఒంటిగయింట వున్నానమ్మా
మావారు వస్తూవుంటే
గరుక్కూన గంతెయి కాకమ్మా!

వంటాఅంతా అయ్యేనమ్మా
వడ్డిద్దామని ఉన్నానమ్మా
వస్తారా? రారా? మాయింటీ
వారూ చెప్పూ కాకమ్మా!

మడిగట్టుకుని పెరటీలోనా
మాటాశకునం అడిగేసరికీ
దండెంగెడమీదా ఆరుస్తూ
గంతేసింది కాకమ్మా!

కాకమ్మా గంతూవేసి
కావూకావని అరిచేటంతలొ
చెప్పులజోడూ చప్పుడువింటూ
సీతా పొంగీపోయింది.

---

పిల్లల పాటలు:

శ్రీమతి మద్దాల సుభద్రమ్మగారు

౧. అటవీస్థలముల కరుగుదమ,
వటపత్రంబుల కోయుదమ;
చెలికత్తే చెండ్లాడుదమ,
చేరువవనముల కేగుదము;
దాగుడుమూతల నాడుదమ,
తరువులచాటున దాగుదమ;
కోతీకొమ్మచ్చు ఆడుదమ,
కొమ్మలచాటున దాగుదమ;
తియ్యనిగంధము తీయుదమ
బాలిక మెడలకు పూయుదమ.

౨. మామిడాకు కోసి,
దోరణాలు కట్టి
చింతాకు దూసి,
బుట్టల్లో పెట్టి
అల్లమువారి కుక్కొచ్చి
బొంయ్యిమంటే
నాకాళ్ల గజ్జె
గల్లుమన్నాది!

## భగవంతుని ఎట్టికోరికలు కోరవలయును?

శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతిదేవిగారు

ఆసేతుసీతనగ మధ్యోర్వీపర్యంతమున గల పుణ్యక్షేత్రములలో అనంతపద్మనాభ మను నొకక్షేత్రరత్నముగలదు. అందలి అనంతపద్మనాభుడు, భక్తవత్సలుడై భక్తాభీష్ట ప్రదాయకుడగు కతమున వేనవేలుప్రజ లాదేవదేవుని సందర్శింప జనుచుందురు. త్రివేంద్రము పరిపాలకుడు గర్వోన్మత్తుడుగాక దైవభక్తి పరుడగుట ఏటేట నొక్కదినమున ఆస్వామిని దర్శింపనేతెంచుచుండు. గోబ్రాహ్మణ పూజాధురంధరుడగు నామహీకాంతు డట్టిసమయమున నొక్కనాడు అటనున్న విప్రులగాంచి 'మీరేదికోరిన దాని నొసంగెద కోరుకొనుడు' అని నుడివిన కొందఱు గృహములను, కొందఱు కన్యలను, కొందఱు దాసీజనమును కోరుకొనిరి. కొందఱు వడుగుల జేయించుమనిరి. కొందఱు ధనమిమ్మనిరి. కొందఱు ఆవులనిమ్మనిరి. కొందఱు భూదాన మడిగిరి. ఇట్లుండ ఒకబీద బ్రాహ్మణుడు, ఇల్లు లేక తంటాలుపడువాడు, పెద్దసౌధమును దయచేయుమని యడుగుసంకల్పముతో మహారాజుకడ కరిగెను. ఆతనికి చిరకాలము నుండి పొడుముపీల్చు దురభ్యాసముండెను. పొడుముపీల్చెడువానికి అదిలేకున్న నేమియు తోచదు. అతడు దివ్యసౌధము నడుగబోయి పరాకున పొడుము దయచేయుడు అని ఆ నరేంద్రచంద్రు నర్థించెను. ఆపలుకాలించి నంతనే ఆపుడమికాంతు డుగ్రుండై "ఈ బాపడెట్టివారి నెట్టికోర్కె లడుగవలయునో ఎఱుగనేరడు. ధనమా? వామాక్షులా? అశ్వంబులా? పాడియావులా? సౌధంబులా? హంసతూలికా తల్పంబులా? ముక్కుపొడుము! ఇదెక్కడికోరిక"యని ముక్కుపై వ్రేలువైచుకొని 'ఇతనికి వీసెడుముక్కుపొడుమునొసంగి నాయూరి పొలిమేరదాట సాగనంపుడు' అని గర్జించి పల్కెను.

మనము భగవంతుని కోరెడు కోర్కెలు నిట్టివియే. దయామయుడగు నాతడు "బిడ్డలారా! అడుగుడు మోక్షకవాటముల తెఱచుకొని కూరుచున్నాడను. మోక్షమొసంగెదను" అనిన "నాకుబిడ్డలిమ్ము, నాకు పెండిలి సేయుము. నా కుద్యోగమిమ్ము, నా దినాహారము నాకిమ్ము. నాకు నగలిమ్ము. నాకు బట్టలిమ్ము. నాకు ప్రెమోషను చేయుము" అని పారుడుకోరిన ముక్కుపొడుము కోరిక వంటి అల్పకోరికల నారమానాథు నర్థించిన నాతడాయల్పకోరికలొసంగి తనమోక్ష సామ్రాజ్యమునుండి మనల గెంటివేయడా? మోక్షమే మనలక్ష్యమైనపుడు తక్కుంగల కోరికలుతీరవా? గనుక ఉన్నతపదవినే కోరుకొని ఈజనన మరణ కష్టములను సంసార బంధములను దాటిపోవుదము. శ్రీహరిస్మరణ నిత్యమొనర్చుదము.



## అమూల్యోపదేశం

శ్రీ॥ ల॥ కాంతంగారు

ఒకానొకనాడు చక్రవర్తి ఒకడు పరివారముతో షికారు బయలుదేరాడు. ఈసమయంలో ఒకసన్యాసి అతనికి తారసిల్లేడు. ఆ గోచీపాతరాయడు బిగ్గరగా ఏమంటున్నాడంటే నాకు పదివేల కాసులు దానం చేస్తే వానికి నేను ఒక మంచినీతిని ఉపదేశిస్తానని. ఈ వింతమాటను విని చక్రవర్తి మోహించిపోయి వానితో, 'అంత బంగారం పుచ్చుకొని ఏ ముపదేశిస్తావు?' అని అన్నాడు. సన్యాసి ఏమి బదులుచెప్పాడంటే, "మహారాజా! నే కోరిన సొమ్ము ఇప్పించండి; దానితో నా ఉపదేశంకూడా అమూల్యంగానే ఉంటుంది." "సరే, కానియ్యండి; ఇదిగో హుకుంపత్రం" అన్నాడు రాజు. సన్యాసి ఈ విధంగా ఉపదేశించాడు.

"పరిణామాన్ని విచారించకుండా ఏ కార్యంలోనైనా దిగకూడదు." ఇదే నా ఉపదేశం.

పరివారమంతా యీమాటకు చక్రవర్తి తప్పక సన్యాసిని దండిస్తాడు అని తలంచేమో స్తరుగా దరహాసంచేసేరు. కాని చక్రవర్తి మిక్కిలి సారభూతమైనదని ఆనందించేడు. తప్పక దీనివల్ల ఏదో ఒక లాభముండాలి. నిష్కారణంగా సన్యాసు లీ విధంగా మోసంచేయురు అని అనుకొని నమస్కరించి సన్యాసిని చక్రవర్తి వీడ్కొలిపాడు.

చక్రవర్తి నగరులోనికి వచ్చి ప్రతి గోడమీద స్వర్ణాక్షరాలతో ఈ వాక్యాన్ని చిత్రింపజేసేడు. కొన్నాళ్లకు చక్రవర్తిగారి మంత్రి ఒకడు ఏలాగైనా చక్రవర్తిని నశింపజేసి సింహాసనాన్ని ఆక్రమిద్దామని తలపెట్టాడు. ఈ దుష్కార్యాన్ని సాధించడానికి రాజవైద్యు నొకని చేరదీసి విషంతో కూడుకొన్న ఒక శస్త్రాన్ని చేతికిస్తూ 'ఎలాగైనా దీన్ని చక్రవర్తి రక్తంలోకి ప్రవేశించే మోస్తరుగా చూడాలి. అట్లుచేస్తే వెంటనే పదివేల మొహుర్లు ఇవ్వడమే కాకుండా నే సింహాసనం ఎక్కిన వెంటనే నిన్ను ప్రధానమంత్రిగా చేస్తాను' అని ఆశకొల్పాడు. డబ్బు, ఎంతటివాడినైనా మోహింపజేసి గ్రుడ్డివాణ్ణి చేస్తుందికదా! హితాహితచింత మన హృదయమున నిలువదుకదా! ఇంతలో దైవవశాత్తు ఈ దుష్కార్యాన్ని సాధించడానికి ఒక మంచి అవకాశంకూడ దొరికింది. చక్రవర్తిగారి ఒంటిమీద ఏదో ఒక చిన్న కురుపు ఒకటి బయలుదేరగానే దాన్ని శస్త్రచికిత్స చేయడానికి వైద్యుణ్ణి పిలిపించాడు. వైద్యుడున్ను తక్కిన శస్త్రాలతోపాటు ఈ విషశస్త్రాన్ని కూడా తీసికొనిపోయి చక్రవర్తిగారి శరీరంలోపల ప్రవేశింపజేతామని ప్రయత్నించే అంతలో అకస్మాత్తుగా గోడమీద స్వర్ణాక్షరోపదేశం కంటబడింది. వైద్యుడు వెంటనే స్తంభించిపోయి మనస్సులో ఏమాలోచించేడంటె—'ఇప్పుడు నేను రాజు గారి ఒంట్లో విషాస్త్రాన్ని ప్రయోగించగానే రాజు చావకతప్పదు గదా. వెంటనే నేను పట్టుపడి రాజద్రోహనేరమునకు పాల్పడి ఉరికంబ మెక్కవలసిందే కదా! అప్పు డీ పదివేలమొహరీలూ ఎందుకైనా పనికొస్తాయా? నే నుంటేకదా డబ్బుయొక్క ప్రయోజనం' అని ఆలోచించి వైద్యుడు మఱి ఆ శస్త్రాన్ని ప్రయోగించక యథాప్రకారంగా మళ్లీ పెట్లో పెట్టేసి వేఱొక చిన్నఅస్త్రాన్ని తీసేడు. చక్రవర్తి దీని వైఖరిని కనిపెట్టాడు. ముఖం వాడిపోడం, తీసిన శస్త్రాన్ని దాచివేయడం సందేహానికి కారణమైంది. కారణం అడిగేడు. వైద్యుడు 'ఆ అస్త్రం తాలూకు చివర చాలా వాడిగాఉంది. దీనిమీద ప్రయోగించకూడదు' అని చెప్పిన జవాబుకి సంతృప్తిపొందక రాజు దానిని చూపింపుమని ఆజ్ఞాపించేడు. ఇదంతా అబద్ధమని రాజునకు నమ్మకము కలిగింది. దీనిలో ఏదో భయంకరమైన విశ్వాసఘాతుకత్వ మున్నాదనిన్నీ నీ యభిప్రాయాన్ని స్పష్టముగా చెప్పాలనిన్నీ లేకపోతే నీ బుఱ్ఱ తీయించివేస్తాననిన్నీ కఠోరంగా శాసించేడు. వైద్యుడు గడగడ వడకిపోయి అభయమిమ్మని ప్రార్థించి జరిగినదాన్నంతాను ప్రకటించి,

ఈ స్వర్ణాక్షరోపదేశము నాకంట పడకపోతే తప్పక విషశస్త్రాన్ని ప్రయోగించి ఉండునని తెల్పేడు.

పిమ్మట చక్రవర్తి సభలోనికి వచ్చి ఆ ఆకతాయి మంత్రికి చేయవలసిన శాస్తి చేయించేడు. సభ్యులలో "ఆ ఉపదేశాన్ని ఆనాడు మీరు హేళన చేసేరు కాదూ. ఇప్పుడు దానిమూల్య మెంతో తెలిసిందా. ఇదే నా ప్రాణాన్ని నిలబెట్టింది సన్యాసికి ఇంకా బహుమానమివ్వాలి గనుక వెదకి తీసికొనిరండి" అని అన్నాడు.

ఈ నీతికథను సర్వకాల సర్వావస్థలయందును స్మరించడం లాభకరం.

[స్వామి కృష్ణానందుని నీతిరత్నమాలనుండి అనువాదము.]

—:o:—

**చిత్రప్రశ్న** — శ్రీమతి కొమ్మారెడ్డి హేమావతిగారు

సీ॥ జపమాలపేరును, సాధ్వీరత్నముపేరు నొక్కటై చెన్నారు చుండవలయు.
రాగంబుపేరును, రాజ్యంబుపేరును, నొక్కటై చెన్నారు చుండవలయు.
పితనామమొక మహీపతి నామమునుగూడ నొక్కటై చెన్నారు చుండవలయు.
పక్షినామంబు సర్పంబునామముగూడ నొక్కటై చెన్నారు చుండవలయు.
తే॥ గగనమును, వస్త్రమొకపేర గ్రాలవలయు.
బాణమును నేత్ర మొకపేర బరగవలయు.
నోషధియు దేశ మొకపేర నొసరవలయు.
నన్నిటికి నాల్గువర్ణంబు లమరవలయు.

—:o:—

# చిత్రప్రశ్నలకు సమాధానములు

మార్చినెల గృహలక్ష్మిలో ప్రకటింపబడిన చిత్రప్రశ్నకు శ్రీమతులు ధర్మపతి పంకజం, కట్టికమల, ఆలపర్తి సీతామహాలక్ష్మమ్మ, వారణాసివరలక్ష్మి, బి. శారదాదేవిగార్లును, శ్రీయుతులు అల్లాడి విశ్వనాథం, ఉభయభాషా ప్రవీణ ఉప్పల కోటయ్య, దంతుర్తి గోపాలము, అల్లమురాజు వెంకటరావుగారలును సమాధానములు వ్రాసిరి. వీరిలో శ్రీయుత ఉప్పలకోటయ్యగారిది విపులమునను సవ్యాఖ్యానముగను నుండుటచేత నిందుదహరించుచున్నాము.

ఉమా కుమార—పార్వతీ పుత్రుడగుటచే వినాయకుడు.

...మాకుమార—మా-లక్ష్మి, కుమార-పుత్రుడు. లక్ష్మీ పుత్రుడును విష్ణు పుత్రుడగుటయే గదా. బ్రహ్మయని యర్థము.

......కుమార—వారి పౌత్రుడు. వారి పుత్రుడన నీటికి పుత్రుడగు అగ్నిదేవుడు. ఇతని పుత్రుడు కుమారస్వామి. "అగ్నిర్భూర్గుహః" అని అమరసింహుడు (నీటికి పౌత్రుడు).

.........మార—మారుడనగా మన్మథుడు. "మదనో మన్మథోమారః" అని అమరము.

............ర—"ర" దీనికి అగ్ని. (హవ్యవాహుడు) అర్థము. "రః పుమాన్ పావకే కామే తీక్ష్ణే వజ్రే శయే బుధైః" "రః-అగ్నికిని, మన్మథునకు నాశనమునకు, వజ్రాయుధమునకు, హస్తమునకు, ఋతువునకు, అర్థము" అని నానార్థరత్నమాల




## ఉసిరికాయల షర్బత్తు.

ప్రశస్తమగు పండిన వుసిరికాయలు ఒకవీసె తెచ్చి రోటిలోవేసి దంచి వాటిరసము నొకకుండలో వేసి (ఈరసము 5 పావుశేర్లుండవలయును) దానిలో లవంగములు, జాజికాయ, జాపత్రి, దాల్చినచెక్క వీటిచూర్ణ మొక్కొక్క తులమున్ను, 6 గురిగింజ లెత్తు కుంకుమపువ్వు చూర్ణమున్ను వేసి కలిపియుంచవలయును. ఇట్లుచేసి ఆకుండపైని మూతబెట్టి రెండు రోజులవరకుంచి, మూడవనాటి యుదయమున ఆ రసములో 50 గులాబిపువ్వులను, 1 తులము పచ్చ కర్పూరపొడియును, 1 ధాన్యపుగింజయెత్తు కస్తూరి చూర్ణమునువేసి బాగా కలియబెట్టి, మూడు ఝాముల వరకుంచి అప్పుడు ఈ రసమును బాగా కలియబెట్టి మరియొకకుండలోనికి వడియగట్టవలయును. అట్లు వడియకట్టిన రసములో సేరు కలకండపాకము దించుకొని ఆపాకము నారసములోవేసి కలియబెట్టవలయును. ఇది రెండును బాగుగా కలిసినపిమ్మట 10 నిముషములవరకు పోయిమీదబెట్టి సన్ననినుంట బెట్టవలయును. పిమ్మట ఆపాకమును చల్లారబెట్టి గాజుబుడ్లలో పోసియుంచుకొని 5 తులముల షర్బత్తు నెత్తి కొంచెము నీళ్లలోవేసి కలిపి త్రాగినచో శరీరమునకు పుష్టియు కాంతియు నిచ్చును.

## చక్కెరపానకము నెయ్యితో తయారుచేయబడు ఖిరి.

మోహన్ భోగ్ అని పిలువబడు ఇంచుక వాసనగల బియ్యము ఒకశేరు, ప్రశస్తమగు శనగపప్పు మూడర్ధపావులు, ఈ రెంటిని చక్కగాకడిగి ఆరబోసియుంచుకొని, 2½ శేర్లు పంచదార లేతపాకము వచ్చునట్లు మరగనిచ్చి, అది చక్కగా వడియగట్టి మరియొక పాత్రలోబోసి పోయిమీదబెట్టి, $\frac{1}{4}$ శేరు నీళ్లు దానిలోబోసి మరగనిచ్చుచుండవలయును. ఈ పానక మట్లు మరుగుచుండగా బాణలిలో చాలినంత సువాసనగల నెయ్యిబోసి, దానిలో బియ్యమును పప్పును పదునుతప్పకుండా వేయించి వాటి నా పానకములోబోసి మూతబెట్టవలయును. ఇట్లు వేసినవి బాగుగ పక్వమగుటను కనిపెట్టి శేరు నెయ్యిగాని అర్ధశేరు వెన్నగాని వేసి కలియబెట్టుచు 1 తులము యాలకులు 1 తు|| దాచినచెక్క ఈ రెంటియొక్క పొడివేసి కలియబెట్టి దించుకొని భుజించవచ్చును.

—శీలా అప్పలకొండ.

## బంగాళాదుంపలకూర.

బంగాళాదుంపలు పెద్దవిగా తీసుకొని పాత్రలో వేసి దుంపలు మునిగేటట్టుగా నీళ్లుపోసి వుడకపెట్టవలెను. దుంప బాగుగా వుడకనియ్యకుండా కొంచెము పదునుగావుండగానే దించివేయవలెను. దుంపలు చల్లారినతరువాత పొట్టుదీసి పెద్దవిగా ముక్కలుకోసివుంచవలెను. ఎక్కువగా వుల్లిపాయముక్కలు పచ్చిమిరపకాయముక్కలు కొంచము అల్లము సన్నముగాతరిగిపెట్టుకోవలెను. కళాయిలోగిద్దెడు నేయిగాని నూనెగానివేసి పొయ్యిమీదవుంచవలెను. మిరపకాయముక్కలు, నెల్లుల్లిపాయ రేకులు, కరివేపాకు, మినపప్పు, ఆవాలు, జీలకర్ర, చమురు వేసి దోరగా వేగినతరువాత, తరిగివుంచిన వుల్లిపాయముక్కలు, పచ్చిమిరపకాయముక్కలు, అల్లంముక్కలు, వేసి గరిటతో కొంతసేపు కలుపుతూయుండవలెను. తరువాత బంగాళాదుంపముక్కలువేసి, కూరకుసరిపోయేటట్టుగా వుప్పున్ను, కొంచెము రవ్వపసుపున్ను, వేసి బాగుగాకుదిపి కొద్దిగానీళ్లుపోసి మూతపెట్టవలెను. నీరుయెక్కువగాపోసిన దుంపకరిగిపోవును. నీరుయిగిరిన వెంటనే దించి నిమ్మకాయ రసముపిండి గరిటతో బాగుగాకలిపి భుజించిన చాలరుచిగానుండును.

—బి. రామనాథమ్మ.

# హరిజనాభ్యుదయము

## హరిజనుల కష్టములు

ముప్పదిఆరుగురు హరిజన ప్రతినిధులు, తాలూకా బోర్డు మునిసిపాలిటీల సభ్యులు హరిజనుల కష్టములనుగూర్చి గాంధిగారి కీవిధముగ విన్నపము చేసుకొనిరి.

(1) హోటలులు, లాండ్రీలు, క్షౌరశాలలు, కాఫీ క్లబ్బులు, సత్రములు, బంగాళాలు, స్కూళ్లు, అగ్రహారములు, బావులు, చెరువులు, కొళాయిలు పోస్టాఫీసులు మొదలగువానిలోనికి మమ్ము రానీయరు.

(2) కొన్నియూళ్లలో మేము గొడుగు, చెప్పులు, మోకాలుదిగు పంచలు, చీరలు, నగలుధరించినచో సవర్ణులు అపశకునముగా నెంతురు.

(3) పదిమందివలె మేము మా శవములను కొన్ని వీధులనుండి తీసుకొనిపోరాదు. ఒక గుడి అడ్డమున్నచో దానినితప్పుకొనుటకు దూరపు పొలములఁబడి పోవలెను.

(4) హరిజను లెవ్వరును గుఱ్ఱములనెక్కరాదు.

(5) గ్రామముల బజారులలో మాకుకావలసిన బట్టలను మేము తాకి బేరము చేసుకొనరాదు.

(6) ప్రమాదవశమున మే మేమిటాయిఅంగడిలోని పదార్థముసైన తాకితిమేని యజమాని ఆ అంగడి సామానునంతటిని ఖరీదుకట్టి మావద్ద వసూలు చేయును.

(7) గ్రామములలో హరిజనులకు స్వంతయిండ్లు లేక భూఖామందు నేలపైనే గుడిశలు వేసుకొందురు. ఇట్లు జాగా యిచ్చినందుకు భూఖామందులు వారికి సరియైన కూలులుగాని సరియైన దినుసుగాని సరియైన కొలలతోగాని యీయరు.

(8) పెండ్లిండ్లు మొదలగు కార్యములకు సవర్ణులు మాకు మేళతాళములు చేయరు.

(9) కొన్ని గ్రామములలో మమ్ము బస్సులనెక్కనీయరు, మాకు జట్కాలు కట్టరు, బైసికిళ్లెక్కనీయరు.

(10) సవర్ణులుపోయే దొడ్లలోనికి మేముపోరాదు. ఎంతో తగాయిదాచేస్తే మునిసిపాలిటీవారు మాకు వేరే దొడ్లుకట్టింతురు.

(11) లోకలుబోర్డు ఆస్పత్రులలో సవర్ణ డాక్టరులు మాకు సరిగా మందిచ్చి ఆదరించరు.

(12) చలివేంద్రిలో మాకు పాత్రతో నీళ్ళియ్యక చేతులలో నీళ్లుపోసే దురాచారము మిగుల దుస్సహము.

(13) మేము స్థానికసంస్థల కెన్నుకొనబడినచో సవర్ణులు తమపదవులనైన వదలుకొందురు. లేదా మాకువేరేగా దూరముననైన కుర్చీలువేయుదురు.

(14) సవర్ణులు త్రోవపోవునప్పుడు మేము మా అరుగులమీదినుండి లేచి దండముపెట్టి పూజించవలెను, లేకున్న తిట్లు కొట్లు. ఇట్లా భేదముచేయవద్దని మేము బ్రతిమాలినప్పుడు మీలో భేదములులేకుండా ముందు సరిబెట్టుకున్నారా యని సవర్ణులందురు. ఈ ఎచ్చు తగ్గు మెట్ల భేదము హిందూ సంఘమునంతటినీ ఆవరించి యుండగా మేముమాత్రము దానినుండి యెట్లు తప్పించుకొనగలము. మేమును దానికి దాను

లమై బాధపడుచున్నాము కనుక పైవారు మార్గదర్శకులై ముందు తొలగించుకొని మాభేదములను తొలగించవలెను.

(15) సవర్ణులు మమ్ము కొళాయిలనద్దకు రానీయని తావులనెల్ల మాకు వేరే కొళాయిలను కట్టించుచున్నారు.

(16) గ్రామపాఠశాలలలోనికి మమ్ము రానీయరు. రానిచ్చినను దూరముగ కూర్చోమందురు. ఏదైనా తెలియక ఉపాధ్యాయునిదగ్గరకు వెళ్లినచో అతను మైలపడుదునన్న భయముతో కఱ్ఱతోనో పలకతోనో దూరముగ నెట్టును. ఒక్కొక్కప్పుడు గదిబైట కిటికీదగ్గర నిలబెట్టి మమ్ము వినుమందురు. పిల్లలకు బ్లేకు బోర్డైనను కనిపించదు. చిన్నతరగతులు దాటగానే పెద్దతరగతులకు వేరేబడివుండును. ఆ బడి మేనేజరులు మమ్ము పెద్దక్లాసులలోనికి రానీయరు. ఎంత్రెయినింగు ప్యాసైనను మావారి కచట ఉద్యోగములీయరు. సవర్ణబాలురు పోయేదొడ్లోనికి మా బాలురను రానీరు. స్థానికసంస్థలయందున్న మా ప్రతినిధులు అప్పుడప్పుడు స్కూళ్లు పోయి స్థితిగతులను పరీక్షించినచో తమకెట్టి ముప్పుకూడునో అని పరీక్షించబోరు. కోయంబత్తూరు నగరముదగ్గరనున్న సింగనల్లూరు ఇరుగూరుగ్రామములలో ఇట్టి సంగతులు మరీ జాస్తీగా నుండును. చిన్నచిన్న నగరములలోని ప్రాథమిక పాఠశాలల గతియు నిట్లేయున్నది. హైస్కూళ్లలో మావాళ్లను కుండలలో చెంబుముంచుకొని త్రాగనీరు. ఏసవర్ణుడో వచ్చి చేతులలో పోయవలెను. ఫలహారముల గదులలోని కసలే పోరాదు.

(17) పోస్టాఫీసులకు నేరుగాపోయి కార్డుకొనుక్కొనుటకో మనియార్డరు కట్టుకొనుటకో మేము చేసుకొనరాదు. ఏ సవర్ణుడో దయదలచి మా కదిచేసిపెట్టవలెను.

(18) మీవంటి మహాత్ములు మాకులములో పుట్టితే మా కష్టాలన్నీ తమకుబాగా తెలిసివచ్చును. అట్లు పుట్టనందుకు విచారించుచున్నాము.

మహాత్ముడు ఈ పిటిషనును విచారించుచు ఇవి అన్నియు యదార్థమనియు, సవర్ణులకు సిగ్గుచేటనియు, మతము పేరిట నిట్టి అనాగతములు జరుగకుండా సనాతనులు కృషిసల్పవలెననియు హెచ్చరించుచున్నాడు. జాతిమాత్రమున తాను సవర్ణుడైనను హరిజనవర్ణము నతడు స్వీకరించెననియు హరిజనుల యిబ్బందులు తీరవన్నాళ్ళు తనకు నిద్రకాని హాయికాని యుండదనియు వీరికి మహాత్ము డభయమిచ్చుచున్నాడు.

విద్య—దేవాలయములు:—

గాంధిమహాత్ముని కొందరు హరిజనులు 'మాకొఱకు వసూలుచేయబడిన ధనమెల్లయు మా ఆర్థిక సౌఖ్యమునకే వినియోగించుడు కాని దానితో దేవాలయములు కట్టవద్దని ప్రార్థించుచున్నారు. కొందరు సనాతనులు 'దేవాలయప్రవేశసమస్యను ఇప్పుడు విడిచిపెట్టుడు. మా అంతరాత్మను క్షోభపెట్టకు' డని వ్రాయుచున్నారు.

ఇరువురును పొరబడినారని మహాత్ముడు తాను వ్రాయుచున్నాడు. ఈ ధనముతో అతను దేవాలయములను కట్టింపబూనుకొనలేదు. ప్రాతదేవళములలోనికి అధిక సంఖ్యాకుల సమ్మతిపైని మాత్రమే పోనిచ్చుటకు ప్రబోధము కలుగజేయుచున్నాడు. అతను సవర్ణులను క్షోభపెట్టుటకును పూనుకొనలేదు. వారు సంతోషపూర్వకముగ తెరచిననే వారిని పొమ్మనుచున్నాడు కాని తెరచెదరా లేదా యని దండింపలేదు. వారు తెరవవచ్చును లేక మానవచ్చును తెరచిన పిమ్మటనైనను వీరు వెళ్లవచ్చును మానవచ్చును. హిందూదేవాయములు హైందవుల ఆధ్యాత్మికసంపత్తికి నిధానములని మహాత్ముని తలంపు. ఈ సంపత్తిని ఇంతవరకు సవర్ణులొక్కరే అనుభవించుచున్నారు. హరిజనులకు కూడ పంచుడని మహాత్ముడు వారిని హెచ్చరించుచున్నాడు. హరిజనులకీసంపదయందు ప్రీతియు వాంఛయుగలవని అతనికి అనుభవపూర్వకముగ తెలియును. ఇట్టి ప్రచారము కొరకు ధనవ్యయ మవసరమును లేదు. అతను చేయనులేదు. ఇదంతా వారి విద్యనిమిత్తమే వ్యయముచేయుటకు తగిన ప్రయత్నములు జరుపబడుచున్నవి.

# వివిధ విషయములు

బెజవాడవాసులగు చింతలపాటి యజ్ఞయ్యగారు మరి అయిదుగురిపైని మానేపల్లి బాపనయ్యగారు శారదాయాక్టు అతిక్రమించినందుకు కేసుపెట్టిరి. యజ్ఞయ్యగారి కుమార్తె యెనిమిదేండ్ల బాలికను తాడేపల్లి కుటుంబశాస్త్రిగారి కుమారుడు పదునైదేండ్లవాని కిచ్చి వివాహముచేసిరి. వధూవరుల తండ్రులకు చెరి రు. 700 లు, తల్లులకు చెరి రు. 100 లు పురోహితు లిరువురకు చెరి రు. 300 లు మొరకి రు 2200 లు జిల్లామేజస్ట్రేటుగారు జరిమానాలు విధించిరి.

గుంటూరు శారదా నికేతనమునందు ప్రస్తుతము గుంటూరు వారు 40 మందిన్ని, పై జిల్లాలవారు 16 గురున్ను బాలికలు పఠించుచున్నారు. వీరిలో 7 గురు అనాథలు, 5 గురు వితంతువులు. 2 రు హిందీరాష్ట్రభాషలోను 4 గురు ప్రాథమికములోను ఉత్తీర్ణులైరి. 4 గురు ఆంధ్రయూనివర్సిటీ విద్వాన్ పరీక్షలోను 7 గురు ప్రిలిమనరీ పరీక్షలోను ఉత్తీర్ణులైరి. 8 గురు హరిజన బాలికలకును 3 గురు రెడ్డిబాలికలకును వివిధ సంస్థలవారు విద్యార్థినీ వేతనముల నిచ్చుచున్నారు. మార్చి 11-వ తేదిని శారదానికేతన వార్షికోత్సవమున పరీక్షలయందు ప్యాసయినవారికి శ్రీయుత వింజమూరి భావనాచార్యులుగారున్ను, ఆటలలో గెలుపొందిన వారికి శ్రీమతి రాయసం రత్నమ్మగారును బహుమతులను పంచిపెట్టిరి. పట్టణమునుండియు ఇతర ప్రాంతములనుండియు వేయిమంది వచ్చి సభనలంకరించిరి.

నంద్యాలలో ఆరేండ్ల మహమ్మదీయ బాలుడు రంగు రంగుల పొడలుగల పాముతో స్నేహము చేయుచుండెను. దాని కెవరివల్లనైన్ని హానికలిగినను తాను మరణింతునని చెప్పుచు దానిని కాపాడుచుండును. అతనితలపై పాము పడగవంటి ఒకగుర్తు కలదట. పాము వచ్చి అతని శరీరమును చుట్టుకొని కౌగిలించుకుంటూవుంటే తాను దానికి పాలు పళ్ళుయిచ్చి ముద్దాడుతాడు. వారిద్దరు అదోచిత్రమైన భాషలో మాట్లాడుకుంటారట. పాముకు వెఱచి తలిదండ్రులు ఏయింటికి మారినా పాము అక్కడికే వెళుతూవుంటుందట.

భూకంపము బాధ ఒక్క బీహారుకే కాక నేపాలు దేశమునకుకూడ జోరుగాతగిలినది. నేపాలులో 3400 జనులకు పైగా మరణించిరనియు, 100 సంవత్సరముల యీలోగా యిట్టి విపత్తు కలుగలేదనియు, అప్పుడు ప్రజలు నెలదినములు బాటు ఊరుబైట నివసించిరనియు నేపాలు యువరాజుగారు చెప్పుచున్నారు. లక్ష రూపాయీల జింకురేకు ఇండ్లనిమిత్తము కొన్నారట. నేపాలు మహారాజావారి గ్రామోద్ధరణప్రయత్నముల కీ భూకంపము అడ్డువచ్చినదట. ప్రతిదేవాలయము చుట్టునున్న దివ్యభవనములును కూలినవటగాని ఒక్క దేవాలయమైనను చెక్కుచెదరలేదట. ఇదంతా దైవ మాహాత్మ్యమని ప్రజలు నమ్ముచు భక్తిపూరితులగుచున్నారట.

స్త్రీలు ముఖములకు అవయవములకు తలలకు రాసుకునే రంగులు, మందులు, వెన్నలు, పొడులు, ముద్దలు, తైలములు మొదలగువానికొరకు ఒక్క బ్రిటనులో సాలుకు పదికోట్లపౌనులు అనగా సుమారు 150 కోట్ల రూపాయిలు ఖర్చగుచున్నవట. ఒకొక్క స్త్రీ నిముషమునకు 4 పెన్సులు వచ్చించుచున్నట్లు లెక్కలు తేలుచున్నవి. ఈ వేలాము వెఱ్ఱివలన కొందఱికి అసలే వినుగెత్తి షోకులన్నీ విడచిపెట్టి చివరకు కట్టుబట్టలు కూడవీడి దిగంబరలై తిరగవలెనని బుద్ధిపుట్టుచున్నదట. కనుకనే ఇట్టివారి సంఘములుకూడ అచ్చట దినదినమునకు హెచ్చుచున్నవి.

# పుష్పచయము

## స్త్రీలు—సంస్కృతవిద్య:—

స్త్రీలు చదువుకోనేకూడదు. చదువుకున్నా ఏ కొద్దో చదువుకోవాలి. దానిమూలానే చాలా నష్టాలున్నాయి. పాపాలు ముత్తేస్తాయి అనే మహాపురుషులకి నమస్కారాలు. నేను చాలామందితో స్త్రీవిద్యనుగురించి మాట్లాడుతూ స్త్రీలు పురుషులతో సమానమైన విద్యాబుద్ధులు నేర్చుకోవాలని అన్నివిషయాల్లోనూ స్త్రీలు ఏమాత్రం పురుషులకి తీసిపోరనీ వాదిస్తూండేవాణ్ణి. స్త్రీ సంస్థలకోసం అభిమానంతో పాటుపడేవారుకూడా కొంతవరకు వ్యతిరేక భావం చూపుతూవొచ్చారు. నా నమ్మకం మాత్రం నాకు పోలేదు. మార్చి ఒకటవతేదీని పని మీద కాకినాడ వచ్చి నా మిత్రుడు శ్రీ దువ్వూరి సూర్యనారాయణమూర్తిని కలుసుకోడానికి మహిళా సంస్కృత విద్యాలయానికి వెళ్లాను. అచ్చట నా మిత్రునిబాలికలను చూచి ఆనందపడి పరీక్షచేదామని రిజిష్టరు తిరగవేశాను. అరవైమంది బాలికలున్నారు. ఏభైమంది హాజరయారు. వారిలో పదునాలుగేళ్ళు దాటిన బాలికలు లేనేలేరు. రఘువంశ కుమారసంభవ మేఘసందేశ భారవి తరగతుల బాలికలను మీకు తోచిన శ్లోకాలు చదివి భావం చెప్పమని అడిగాను. అందరు అడగడంతడవుగా క్రమంగా చక్కగ చదివి భావములను చెప్పారు. అంతతో తృప్తిపొందక నాకు తోచిన శ్లోకముల నడిగాను. వాటినికూడా చక్కగ చెప్పారు. నా సంశయమంతటితోటి కొంత స్థిరపడింది. వ్రాతలో ఏమాత్రం చతురతఉందో చూతామని పేపర్లు యిచ్చాను. భారవితరగతిలో శ్రీమతి మాడుగుల రత్నమాల (14 వయసు), చేబ్రోలు రుక్మిణి (13 ఏండ్లు) అను బాలికలు నూటికి 64, 63 మార్కులను సంపాదించిరి. మేఘదూతలో శ్రీమతి క్రోలి సూర్యప్రకాశము (14), కీర్తికమల (11) అను బాలికలు 65, 50 మార్కులు, కుమారసంభవం తరగతిలో, చివుకుల సూర్యప్రకాశము (13), నందగిరి శేషమ్మ (12) అను బాలికలు 47, 40 మార్కులను సంపాదించిరి. వారి రచన నాకెంతో ఆనందం కలగచేసింది. రఘువంశం తరగతిని నోటినే మరల పరీక్షిద్దామని తోచి పేపరునిమ్మని బాలికలడిగినా ఈయలేదు. ఎన్ని శ్లోకములడిగినా తప్పకుండా అర్థము, భావము చెప్పారు. నిర్దయగా ఎంత వక్రంగా అడిగినా తొట్రుపడకుండా చెప్పారు. ఆ బాలికల వయస్సు చాలతక్కువ. శ్రీమతి చేబ్రోలు సరస్వతి (9 వయసు), మాడభూషి నాంచారి అమ్మాళ్ (వయస్సు 8) అను బాలికలు వీరిద్దరు ఇంత చిన్నవయసులో రఘువంశంలో అట్లా పరీక్షనివ్వడం ఆనందం కలగచేయడం కాకుండా ఆశ్చర్యము కలగచేసింది. మగపిల్లలింత చిన్నవయస్సులో నే చూచినంతవరకు ఎక్కడా ఇట్లా చదవడం ఎరగను. ఈ బరిబాలికలింకా ద్వితీయ చతుర్థాది వాచకములను, ఎక్కాలను, ఇంగ్లీషు మొదలగు వాటిని చదువుచు నాకు పరీక్షలో తగుసమాధానముల నిచ్చిరి. బాలికలంతా ఉదయం ప్రతిరోజూ, శుక్రవారం సాయంకాలం ఒక గంటాను, ప్రార్థనలు చేస్తూంటారు. స్త్రీలచేతను నడిపింపబడుతుండే ఇటువంటి సంస్థలెన్నో నా దేశానికిప్పుడు కావాలి. స్త్రీలకు విద్య అబ్బితేనేగాని దేశానికి సౌఖ్యము లేదు. ఇటువంటి స్త్రీ సంస్థలకు మహారాజులు

మొదలు బీదసంసారి వరకు యథాశక్తి సాయం చేస్తూ అభివృద్ధిలోకి తీసుకురావాలని ప్రార్థన. విద్యాలయ నిర్వాహకురాలగు శ్రీమతి బాలాంత్రపు శేషమాంబగారికి ఉత్సాహం పురికొలుపుతూ విద్యాలయాన్ని వృద్ధిలోకి తీసుకువొచ్చేలాగున సాయపడేందుకు భగవంతుణ్ణి ప్రార్థిస్తూన్నాను.

—కనకదండి గోపాలకృష్ణశాస్త్రి.

నీకోడలి పాతివ్రత్యము నా కిరీటముకన్న విలువగలది.—

అది ఢిల్లీ ఫాదుషాయగు జహంగీరుచక్రవర్తి జమానా, పాదుషా మహలులో అప్పుడే భోజనము చేసి నూర్జహానుతో సల్లాపాలు చేస్తున్నాడు. ఏకాయెకీ మహల్ ముందర గంట, ఒకేరీతిగా కొట్టుకోబట్టింది. ఎవరైనా మొరపెట్టుకోవాలి అంటే దేవిడీయందుండు గంటను మోయించుతే ఎట్టి సమయమునందైనా సరే చక్రవర్తిగారు స్వయంగా బయటకివచ్చి విచారించేవారు. ఈ గంటశబ్దము విన్నంత నే జహంగీరు ఫాదుషా స్వయముగా దేవిడీ బయటకువచ్చినాడు. ఒకముసలామె గంటవద్ద నిలుచుకొనివుంది. చక్రవర్తిని చూచిందికాని ఏమిన్ని మాట్లాడదు. రెండునిమిషాలు యిద్దరూ వూరక నిలబడ్డారు. ఫాదుషాగారు ఏంసగతి అన్నారు. జబాబులేదు. ముసలిది వణుకుచున్నది. శరీర మాద్యంతం కోపముతో నిండివున్నది. ఆఖరున యిట్లాపలికింది.

"హుజూర్', ఈదినము అర్థరాత్రి మీకొత్వాలు సాదుల్లా నాకోడల్ని చెఱపనున్నాడు. మేము బీదవాళ్లము. నాకొడుకు బర్ఖందాజీ నౌఖరీ చేస్తున్నాడు. నెల కారురూపాయలు జీతము. మాయింటికి మీకొత్వాలు దినమూ అష్రఫీలు రూపాయలు, సంచులు సంచులు పంపిస్తున్నాడు. మేము వాటినిముట్టేది లేదు. ఈ వెండి బంగాముకంటె కోటిరెట్లు మా పాతివ్రత్యమే హెచ్చు. మేము తినేది రొట్టె చట్నీ. మాకదియే బిర్యానిపులావు. మేము సంకటేత్రాగి పడివుంటాము కాని ఈ మానమునకు విరుద్ధముగా నడచుకొనము. మాకీ రాత్రి మాత్రము సహాయమిప్పించిరా మేము తెల్లవారకముందే వేరే దేశము పోవుచున్నాము. బండి కిరాయి ర రూపాయలు మాట్లాడుకున్నాము. నాకోడలు సొమ్మొకటిషరాబువద్ద నమ్మి దుడ్డు తీసుకొన్నాము. యిప్పుడే పోదామంటే ఎడ్లు అలసినవి. తెల్లవారువరకు వల్లకాదని బండివాడంటూన్నాడు. మాకేమైన అపకారం జరిగెనా ఆ అపకీర్తి ఆ అన్యాయానికి శిక్ష నీవేపొందవలసివచ్చును."

ఇట్లా ఒక చిన్న వుపన్యాసంకొట్టింది దాముసలిది. ఫాదుషా నెమ్మదిగా విన్నాడు. శాతంగ "ముసిలీ నీయిల్లెక్కడ వున్నది" అన్నాడు. ముసిలిది పత్తా అంతా చెప్పింది. సర్కారువారిట్లన్నారు. "సరే, మంచిది చూతాము, గానిపో" అంటూ లోపలికి పోతున్నారు.

ఏమిరా యింతసేపు కొట్టుకున్నదంతా వ్యర్థమే అయింది అని ముసలిదానికి పట్టరాని కోపంవచ్చింది. "ఓ ఫాదుషా! ఒకనాడు నీవున్ను దేవునియెదుట జవాబియ్యవలసివచ్చును. మే పుందరమును చత్తుము కాని నీ కొత్వాలుకు వశులముకాము. ఈ ఖూనీకి నీవే కారకుడవని యెంచుకొమ్ము" అంటూ యింకా యేమేమో తిట్టుకుంటూపోయింది. ఫాదుషా యేమిన్ని జవాబియ్యకుండా లోపలికి పోయినాడు.

అట్టి ముసలిదాని యింటిముందట సగమురాత్రికి రెండు గుర్రముల కాలిచప్పుడు వినవచ్చింది. కొత్వాలు, గుర్రమును ముసలిదాని పెంకుటింటి గోడకు నిలబెట్టి అట్లే కప్పుపైకెక్కి లోపలికి దుముకినాడు. ఇంట్లో అంత గడబిడ జరుగుతూ వున్నది. ఇంతలో యొకవ్యక్తి ఆయింటివద్దికి వచ్చినాడు. కొత్వాలు సైసుయింటిబయట వున్నాడు. "అరేసైస్, ఈ గుర్రాని యిట్లే గోడఅంచుకుబట్టు, నే నెక్కుతాను" అన్నాడు. సైసు యిట్లన్నాడు. "ఎవరయ్యా నీవు బుద్ధిలేదుపో. లోపల మా నవాబ్ కొత్వాల్ సాహెబ్ బహద్దరున్నాడు. వచ్చి నిన్ను

చూచేవా, నీ ప్రాణాలు దక్కవు." ఇట్లా వాడింకేమేమో చెప్పుచుండగానే పడీలుమని చెంపమీద పక్క దెబ్బవేసి వాన్ని పడద్రోసి ఆవ్యక్తి తానే గుర్రాన్ని గోడకానించి మిద్దె యెక్కినాడు. పైనుండి మాచేవరకు లోపల కొత్వాలుసాహేబుగారు ముసలిదాన్ని యీడ్చి పక కొట్టిడిలో నూకి తలుపువేసినాడు. దాని కోడలిని బట్టి లాగుతున్నాడు. ఈ నూతనవ్యక్తి గభీలుమని అంగణములో దుముకి అరే సామ్లా కొత్వాల్ హుర్రాంజాదే అని గర్జించినాడు. కొత్వాలు దిగ్భ్రమచెంది చూచేవరకు ఆ వ్యక్తి యింకెవరు! స్వయముగా చక్రవర్తి జహంగీరుగారే!! గడగడ వడకుచూ కాళ్లమీద పడ్డాడు. నాలుగు తన్నులుతన్ని బయటికీడ్చికొనిపోవుచూ గుర్రము త్రాడుతోనే కట్టివేసి కొత్వాలు గుర్రాన్ని యెక్కి లాగుతూ దేవిడీకి వెళ్లినాడు. మర్నాడు దర్బారు చేసినాడు. ముసలిదాన్నికూడా దర్బారులో కూర్చోబెట్టినాడు. జరిగిందంతా అందరికిచెప్పి తాను సింహాసనమునుండిదిగి తన కిరీటాన్ని ముసలిదాని పాదములవద్దపెట్టి, "తల్లీ, నా కిరీటంకంటే నీకోడలి పాతివ్రత్యము విలువగలది" అన్నాడు. దర్బారంతా పాదుషాగారి శీలమునకు ఆనందాశ్రువులు విడిచిరి. కొత్వాలుకు ఖతల్, ముసలిదానికి అష్రఫీలమూట, దర్బారు బర్ఖాస్త్. సర్కారు మహలులో.

ఇది నిజంగా జరిగిన కథ. కల్పనగాదు. జహాంగీరు స్వయముగా తన జీవితచరిత్రలో వ్రాసుకున్నాడు.

మొంగలాయి చక్రవర్తుల నన్యాయంగా బద్నాం చేసే యింగ్లీషుచరిత్రలు చదివేవారు యిదికూడా భక్తితో చదునండిఅని కోరుతూవున్నాను.

### భాదేశ్వర జాగీర్దారిణి:—

భాదేశ్వర జాగీరు ఉదయపూరు సంస్థానములోనిది. జాగీర్దారుడు సంతానములేకయే మృతినొందెను. వాని వితంతువు ఒక కుమారుని దత్తత చేసికొనుటకు సంకల్పించెను. కాని ఉదయపూరు సంస్థానాధిపతు లందుకు సమ్మతించలేదు. ఆ జాగీరును తమ సంస్థానములో గలుపుకొనుటకు గూడ నుద్యుక్తులైరి. అయినను జాగీర్దారిణి తన సంకల్పమును వదులుకొనలేదు. ఫలాని రోజున దత్తత స్వీకారము చేసికొనుచున్నానని ఉదయపురాధీశునకు ముందుగ నోటీసు పంపెను.

ఉదయపురాధీశుడు వెంటనే ఆ దత్తత స్వీకారము బలవంతముగ నాపివేయ వలసినదని చిటోర్గర్ హాకీమున కుత్తరువు చేసెను. ఈ హాకీముగారు కొందరు సిపాయిలను వెంటనిడికొని దత్తతను నిలిపివేయుటకు భాదేశ్వరమునకు జనెను.

భాదేశ్వరములో ఒక బాలుని దత్తత చేసికొని, వానిని వెంటనే జాగీర్దారునిగ జేయుటకు పట్టాభిషేక మహోత్సవ ప్రయత్నములన్నియు సాగుచుండెను. కాని చిటోర్గర్ హాకీము కొంత సైన్యముతో తనపై దాడివెడల నున్నాడని రాణికి ముందుగ నెటులనో తెలిసెను. కాని రాణి జంకలేదు. ఉత్సవమును జూడవచ్చిన జనమంతయు నుద్రేకపూరితులైరి. రాణి వాసమంతయు ఆయుధపాణులై హాకీమును నిరోధించుటకు నిశ్చయించుకొనిరి.

చిటోర్గర్ హాకీము 200 మంది సైన్యముతో భాదేశ్వరమునకు వచ్చెను. వెంటనే రాణి, రాజమందిరమును విడిచి, కొంతసైన్యముతో నూరిబయటకు వెడలెను. ఈ సందర్భమును జూచుటతోడనే, హాకీంసైన్యము పలాయన మయ్యెను. రాణీ జాన్సీ లక్ష్మీబాయి తిరిగి అవతరించెనా యని లోకమంతయు విస్మయము నందెను.

ఉదయపురాధీశుడు రాజపుత్రస్త్రీపై దాడి సాగింపజూచుట లజ్జాకరము. దత్తతహక్కును భంగ పరచుటకు ఏ సంస్థానాధీశునకును అధికారములేదు.

అయ్యది హిందూధర్మ సంప్రదాయములలో నొకటి. ఝాన్సీశ్వరరాణి యీహక్కును స్థిరపరచుటకు జూపిన ధైర్యసాహసములు స్త్రీలోకమున కంతకును గౌరవ ప్రదములు.

(కృష్ణాపత్రిక.)

పాత పాటలు:—

[ఈదిగువ కొన్ని పాతపాటల పల్లవులుమాత్రము పొందుపరచియుంటిని. ఇవి యీసరికి ముద్రితమైనవో, లేదో తెలియుటలేదు. కావున పాఠకురాండ్రు వీటిలో అచ్చుపడిన వేవైనయున్నచో దయతో తెలిపినయెడల, వాటిని మినహాయించి, మిగిలినవి యీ పత్రికాముఖమున చదువరుల కందచేయబడును. పాఠకురాండ్రు యీపత్రికాముఖముననే పైవిషయము తెలుపు ప్రార్థన.]

1. రాఘవకళ్యాణము

హరుడు విల్లావిరవనూ
ఆరామచంద్రులు వచ్చినారూ
శీతామహాదేవితో శ్రీరాము శెలవిమ్మ
చెలియలందరు జెప్పరే॥

(150 చరణాలు)

2. సరస్వతీదేవి వర్ణన

హిరణ్యగర్భాన పుట్టినదేవి
ఇంతినిను స్మృతియింప ఇష్టాన్నమాయె
కనకాసనంబెక్కి కూర్చున్న దేవి
కాంతనిను స్మృతియింపకాంక్షలయ్యెనె॥

(25 చరణములు.)

3. అమ్మవారి అలంకారాలు

ఘట్టికావెచీర, పట్టురవికామంచి
మట్టెలు, పిల్లేళ్లు, బొబ్బిలికాయాలు,
వీరామద్దెలుతోడా, వెలయ పాజేవులు,
చక్కనైనా మంచి నొక్కుపావడములు,
కాళ్లకడియమ్ములు, కలసినగజ్జెలు
కాళ్లనందెలు, ఘల్లు ఘల్లునడిచేటి
దుర్గా రా మంగళం మంగళం॥

(8 చరణాలు)

4. శుక్రవారాల పాట

అక్కరో రారమ్మా చెలులుమీరు!
శుక్రవారపుసేవకూ॥

(12 చరణాలు)

5. అన్నపూర్ణ పాట

అన్నపూర్ణమ్మ నిన్ను
అంతరంగమున దలతూ।
సన్నపీఠంబుపై వనరునిలచి॥

(14 చరణాలు)

6. పూజపాట

పచ్చలా పళ్లెములోను।
నవరత్నామూల జ్యోతివెలుగుచు।
ఆనందామూతో వీణమీటుచు।
అనురాగములే దెలుపుతూ।
అంగనామణులారా అంబకు
మంగళామని పాడరే॥

(20 చరణాలు)

[వరుసలు, పూర్తిపాటలు ప్రచురించేటప్పుడు తెలుపబడును.]

—శ్రీమతి మల్లవరపు లక్ష్మీదేవిగారు

# గ్రంథ పరిచయము

ప్రార్థన గీతావళి:—

మహాత్ముని సత్యాగ్రహాశ్రమములో దినదినమును పఠించబడుచుండు ప్రార్థనశ్లోకములు, శృతులు, కీర్తనములు, ఇందు సతాత్పర్యముగ శ్రీయుత శనివారపు సుబ్బారావుగారిచే బొందుపరుపబడినవి. నూరు పుటలకు మించిన గ్రంథము. గవర్నమెంటు టెక్స్టుబుక్కు కమిటీవారు దీనిని 1929లో లైబ్రరీ బుక్కుగా ఆమోదించి ఫోర్టుసెంటుజార్జిగజెటులో ప్రకటించినారు. శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు దీనికి వ్రాసిన పరిచయ వాక్యము ప్రార్థనల ఆధ్యాత్మికప్రభావమును వాని యుద్దేశ్యములను, ప్రయోజనములను, వ్యక్తిగత ప్రార్థనలు, సాంఘిక ప్రార్థనలు మొదలగు బహు విషయములనుగూర్చి సంపూర్ణచర్చను సంగ్రహముగ తెలుపుచు మహాత్ముని యొన్నికశ్లోకముల కెనయైన యుపోద్ఘాతమై వన్నెగూర్చుచున్నది. వెల రు.0-4-0 లు మాత్రము. ఇది ఆంధ్ర గ్రంథమాలవారి 24వ కుసుమము. వలయువారు, తంబుచెట్టి వీధి, నెం 7 రు నందున్న ఆంధ్రగ్రంథమాలవారికి వ్రాసి ప్రతులు తెప్పించుకొనవచ్చును.

తెలుగు ప్రేమప్రచారక్:—

రాయలుసైజున 18 పుటలుగల తెలుగు మాస పత్రిక. సంవత్సరి చందా రు. 1-4-0లు ఆంధ్ర సత్సంఘమువారి తరపున శ్రీయుత వి. రామ బ్రహ్మం బి. ఏ. గారిచే ప్రకటింపబడుచున్నది ప్రేమతత్వమును, భక్తిమార్గమును, గురుసేవను, దేశాభిమానమును, రాధాస్వామివారి మతమును బోధించు వ్యాసము లిందు వ్రాయబడుచుండును. మూఢవిశ్వాసములను, పరమతాసహిష్ణుతను పార ద్రోలి నిజమైన విజ్ఞానమును బోధించును.

రామాయణ సారసంగ్రహము:—

డెమ్మీసైజు 25 పుటలు. వెల రు. 0-4-0. గ్రంథకర్త శ్రీయుత పత్రి విశ్వేశ్వర శాస్త్రిగారు, కర్నూలుజిల్లా, జటప్రోలు సంస్థానమునందు మొరవ కొండపోస్టు. కొల్లాపురమునందలి స్నేహలతా కవితా సంఘమువారి 25-వ పుష్పము. రామాయణ చరిత్రముఅంతయు సుమారు 100 పద్యములలో పొందుపరుపబడినది. సులభశైలి. పారాయణ కనుకూలము.

కవితా కాంతా విహారము:—

డెమ్మీసైజున 12 పుటలు. గ్రంథకర్త శ్రీయుత వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు, బి.ఏ. ఇదియు పై స్నేహలతా కవితాసంఘమువారిచే ప్రకటింపబడిన 27-వ పుష్పము. గ్రంథకర్త, కవితా సతి తనకు కలలో ప్రత్యక్షమై కవిత్వమనుగ్రహించి సుందరకావ్యరచనమునకు ప్రోత్సహించిన యుదంతమును, తన ప్రేయసి కిందు సుమారు డెబ్బదిపద్యములలో వివరించినారు. ధార నిరర్గళము.

కార్మికసంఘ ప్రచురణము నెం 3 రు:—

తెనాలి తాలూకా అనంతవరమునందలి యీ సంఘమువారు ప్రచురించి ఉచితముగ పంచుచున్న కరపత్రములలో ఇది మూడవది. 1, 2 పత్రములను మాపూర్వసంచికలలో విమర్శించినాము. ఇందలి కథ, భూకంపముచే కృశించిపోయిన బీహారు రాష్ట్రము నందలి దర్భాంగకు చెందినది. పసినినుగులపై నభిమానమునుకోసి, తాబేదారుల యనురులను పోసుకొని, విశ్వాసపాత్రులసేవలను హింసించి, దొంగ లెక్కలను వ్రాసి, కూడబెట్టుకొన్న రామప్రసాదుని యావదాస్తియు అప్పుపత్రములును భూగర్భములో అరనిమిషములో కూలిపోయినవి. ఈ మహోపద్రవములో చచ్చినవారు చచ్చి వారి శవములను కాకులు పొడుచుకొనుచుండగా మిగిలినవారు పేదసాద భేదములేక యేకమట్టమునకు వచ్చిరి. రామప్రసాదునికి అతని భార్య బిడ్డలను, అతను అష్టకష్టములు పెట్టిన సోముడుపోతన్నలే సుంతగంజిపోసిన గలదు లేకున్న లేదు. క్షణభంగురములగు సిరులకు మురిసి పేదలకు పిండుకొనుటకంటె పెద్ద యజ్ఞానములేదని యిందలి 15 పుటలలోని చిన్నకథయు తెలుపును.

**ఆంధ్ర విశ్వకళాశాల తెలుగుసంఘ పత్రిక సంక్రాంతి సంచిక:—**

వీరు ప్రకటించుచుండిన ఇతర సంచికలవలె ఇదియు గంభీర గద్యవ్యాససంకలితమై, సుందరపద్య శోభితమై, పండితాగ్రగణ్యులుకూడ అవశ్యము పఠింపతగినదై, విశ్వవిద్యాలయమువారి ధీపరిశ్రమలను విశదీకరించుచున్నది. పిట్టకథలు, హాస్యములు మొదలగు కేవల పామరజనరంజకములైన సాధారణ విషయముల జోలికిది పోకుండుట దీని ప్రతిష్ఠకెంతయుఁదగియున్నది. సంధియుగము, సరళాదేశము, రసపరిష్కారము మొదలగు వ్యాసములు సాహిత్య విమర్శకుల కాదర్శకరత్నములు. ఏలపాటలను వ్యాసము, ప్రస్తుతపు భావకవుల కఠినసమాస గుచ్ఛములు నిజమైన యేలపాటల కెంత దవ్వగనున్నవో తెలియఁజేయును. విద్వచ్ఛ్రీమంతులగు దీని పోషకవర్గమువారి యాదరణముక్రింద నిది ఇట్టి యనన్యసామాన్యప్రతిభతో చిరకాలము వెలువడుచుండుగాక యని ఆశీర్వదించుచున్నాము.

**రంధ్రాన్వేషి:—**

శ్రీయుత యమ్. కోదండరామ రెడ్డిగారి సంపాదకత్వముక్రింద ప్రతి బుధవారమును నెల్లూరినుండి వెలువడు చిన్న చక్కని విమర్శనపత్రిక. ఆచార వ్యవహార సాహిత్య సంరంభములలో పొడసూపుచుండు దోసగుల నెత్తిపొడిచి తొలగించి సంస్కరించుటే దీని యాశయము. అద్వేషబుద్ధితోనే యీ రంధ్రాన్వేషణము జరిగించబడినన్నాళ్లిది మంచి సేవ చేయగలదు. సంవత్సరపు చందా నెల్లూరువారికి రు. 0-12-0లు. ఇతరులకు రు. 1-8-0.

**గీతాసారము:—**

క్రౌనుసైజు 50 పుటలు. వెల రు. 0-4-0. గ్రంథకర్త్రి శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారు, పిఠాపురం. భగవద్గీత పద్దెనిమిది అధ్యాయములలోని విషయమును అధ్యాయసరణిగా 200 గీతపద్యములలో సంగ్రహించి వ్రాసిన కవయిత్రి ప్రయత్నమెంతయు సంస్తవనీయము. గ్రంథము దుఃఖోపశమనము విజ్ఞానదాయకము. శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు దీని కొక సుందరతర పద్యపీఠికను వ్రాసిరి. కవులకు తత్వజిజ్ఞాసకులకుఁ గూడ పఠనీయము.

**చెన్నపట్టణములో:—**

డెమ్మీసైజు సుమారు 270 పుటలు. వెల రు. 1-4-0. గ్రంథకర్త శ్రీయుత వేమూరి శ్రీనివాస రావుగారు, బి.ఏ., బి.యల్. ఇది యొక్క చక్కని సాంఘిక నవల. మదరాసు కళాశాలలలో విద్యార్థి విద్యార్థినీ జీవనము ఎట్టి చిత్తచాంచల్యము కలుగఁజేయునో యీ నవల తెలియఁజేయును. పరిశుద్ధ భారతజీవనము పాశ్చాత్య విద్యాభ్యాసవ్యాపనము వలన నెట్టివిషయలోలుపత్వంబునకు గురియై విచ్ఛిన్నమగుచున్నదియు, దీనివలన కానవగును. తొలుదొల్త చిత్తవిభ్రమములకు లోనయ్యు పుణ్యవిశేషంబున సత్పథంబు జారక దీపించిన సోమేశ్వరశశిలేఖల చరిత్రము ప్రశంసింపతగ్గది. ప్రతులు వలయువారు మదరాసు, వేపేరి, పూనమల్లి హైరోడ్డు, నెం 82 రు నందుగల శ్రీయుత కనుపర్తి మార్కండేయ శర్మగారికి వ్రాసి బడయఁగలరు.

**సౌందర్యమంజరి:—**

డెమ్మీసైజు 64 పుటలు వెల రు 1-0-0 గ్రంథకర్త కవిశేఖర కాళ్ళకూరి గోపాలరావుగారు. సంకల్పము, శక్త్యుపాసన, భాషోపాసన, రసోపాసన, మన్మథోపాసన, కుమారీస్వయంవరము, కృతిసమర్పణము అను నేడు అధ్యాయములుగల రసతుందిలమగు కావ్యము. శబ్దపుష్టి, ధ్వని, సౌందర్యము, రసస్ఫుటము తత్వదృష్టి మొదలగు ఉత్తమకావ్య లక్షణములన్నియు నిందునిండి, నిబిడీకృతమై యున్నవి. సనాతనాధ్యాత్మిక అధునాతనభౌతిక విజ్ఞానమెల్లయు నిందు విరజల్లబడియున్నదని సర్. రాధాకృష్ణనుగారు దీని నువ్వెత్తుగపొగడియున్నారు. శ్రీయుత దేశోద్ధారక కాశీనాదుని నాగేశ్వరరావుపంతులుగారు ఈగంభీర కావ్యము నడుగంటఁజదివి 32 పుటలు దీర్ఘప్రశంసను వ్రాసి అనన్యసామాన్యమైన మెఱుగుపెట్టియున్నారు. కావ్యలక్షణములు సాంఖ్యశాస్త్రము, అద్వైతజ్ఞానము, యోగసిద్ధి, మొదలగు గంభీర విషయముల గ్రహించి తరింపగోరువారు ఈకావ్యమును శ్రీ దేశోద్ధారకుని వ్యాఖ్యానమును పూర్ణముగఁబఠింపఁవలెను. కాళీ

దానువంటి కవియున్నచో భోజరాజువంటి కృతిభర్త లభింపకపోడనుటకు జయపురసంస్థానాధీశులు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మగారు దీనికి కృతి భర్తయైకవిపుంగవుని గౌరవించి ఆంధ్రభాషామతల్లి నర్ఘాసనమందు గూర్చుండఁ బెట్టుకొనుటయే నిదర్శనము. కృతికర్తకు, భర్తకు, విమర్శకునకుగూడ శాశ్వత యశోదాయకమై యీ 'ప్రేమోపనిషత్తు' తక్కిన ఆర్షోపనిషత్తులవలె ఆంధ్రసాహిత్యమునం దనవరతము నలరారగలదని నమ్ముచున్నాము. ప్రతులు వలయువారు జార్జిటవును, ఆచారప్పన్ సందు నాల్గవనెంబరు ఇంటియందున్న ప్రకాశకులు విశాల్యా డిపోవారికివ్రాసి బడయగలరు.

విశాఖపత్త్రిక:—

ప్రతి బుధవారమును ఆంధ్ర ఆంగ్లములలో ప్రచురింపబడు పత్రిక. స్థానిక, రాష్ట్రీయ, భారత రాజకీయములను చర్చించుచు సక్రమాందోళనా బద్ధకంకణయై రాజిల్లవలెనని దీనియాశయము. పత్రికా నిర్వహణ నైపుణ్యములో ప్రాతపులి యనఁదగు శ్రీయుత యన్. రంగమన్నారుగారి సంపాదకత్వముక్రింద ఇది విశాఖపట్టణము నొకయూపు యూచునని యూహింపవచ్చును. అన్నివిధముల ముందుకు వచ్చుచున్న వైశాఖపురిని పత్రికాప్రకటనమున నెనుక పడకుండ ముందున కీడ్చుకొని వచ్చుచున్న ప్రకాశకి సంపాదకుల ప్రయత్నమెంతయు ప్రశంసాపాత్రము. సంవత్సర చందా రు 4-0-0. అర్ధసంవత్సరమునకు రు 2-0-0 లు, విడిపత్రిక రు 0-1-6 లు.

సేవాశ్రమనివేదిక: (పెదపాలెము)

1905 లో ఆర్య బాలసమాజ మొకటి పెదపాలెమున స్థాపించబడెను. అప్పటినుండి 1921 వరకు ఇందలి సభ్యులు రాజకీయ, రాష్ట్రీయ, సాంఘిక సంచలనములందెల్ల చేరి జనులలో ప్రబోధమును కలిగించుచుండిరి. 1926 లో సేవాసంఘమను నొకదానిని ఆ యూరి యువకులు స్థాపించి పైసమాజము నుద్ధరించుటయేగాక, ఒక వైద్యాలయమును నిర్మించి గ్రంథాలయమును బాగుపరచి, ఉచిత విద్యాలయమును స్థాపించి, బాలసరస్వతి యను పత్రికను కొంతకాలము నడిపించి అనేకవిధముల సేవచేయుచున్నారు. వీరు హిందీప్రచారముచేసి బాలురను పరీక్షలకంపి ప్యాసు చేయించుచున్నారు. ఖద్దరును విక్రయించుచున్నారు. యాత్రలు సాగించుచున్నారు. ఈ సమాజమునకు ఉదార శ్రీమంతులగు ఫ్రతుంభాక కుటుంబమువా రొనర్చుచున్న మహాసహాయమువలన ఇది శుక్లపక్ష చంద్రునిమాడ్కి రాణించుచున్నది గనుక సమాజమువారికి శాశ్వతకృతజ్ఞులై యలరారుచుండగలరు.

వైద్యదీపిక:—

గుంటూరునుండి మాసమున కొకతూరి ప్రచురింపఁబడుచుండును. ప్రొఫెసరు డి. రంగాచార్యులుగారు దీనికి ప్రధానసంపాదకులు. ఇందు ఆయుర్వేదచికిత్సా విధానములనుగూర్చిన మంచి పరిశోధక వ్యాసములు, వైద్యలోకమునకు సంబంధించిన కేసుల నివేదికలు, సంఘువార్తలు, సంస్థల సమావేశముల సమాచారములు మొదలగునవి ప్రకటింపఁబడుచున్నవి. దేశీయ వైద్యుల గౌరవ సౌకర్యములను పరపతిని సంరక్షించుఁ బూనుకొనిన మేలుబంతి. సంవత్సరచందా రు 2-0-0 మాత్రము.

'సహకారిమిత్ర' ఉగాదిపండుగ సంచిక:—

హరిద్రపత్రములతోను శ్యామల వృంతములోను నలరారుచు 28 పుటల పరిమాణముగల యీసహకార కుసుమము ఆర్థికవిజ్ఞాన సౌరభము నాంధ్రదేశమున వెదజల్లుచు ఈ మధుమాస ప్రారంభమున విహరింపఁ దొడగుచున్నది. వ్యాసము లొకదానికొకటి యీడు తీయవు. విషయము సర్వసహకార జనావశ్యకమైనది. సహకార భవనములు నాయకులయొక్క చిత్రములు పత్రికనెల్ల శోభస్కరముగా చేయుచున్నవి. సాహిత్యరాజకీయ పత్రికామతల్లులుమాత్రమే యింతవరకు గుత్తగాగొని అలంకరించుకొనుచున్న యిట్టి దివ్యాభరణములనెల్ల ఫ్రణికి తెచ్చి తమసహకారదేవత యొడల సింగారించి ఆంధ్రదేశమును తిలకించఁజేసిన సంపాదకులు శ్రీయుత మన్నెపల్లి రామకృష్ణారావుగారిని మేమెంతయు అభినందించుచున్నాము ఇట్టి సర్వజనావశ్యకమైన పత్రికకు సంవత్సర చందా రు, 3-0-0 లు మాత్రమే. కార్యాలయము నెల్లూరు.



# సంపాదకీయములు

వెంకటరామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషావాదము:—

రావుసాహెబ్ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారికి జరిగిన సప్తతితమ జన్మదినోత్సవము అనేకవిధములుగా ఆంధ్రులకు సంస్మరణీయమైన దైనప్పటికీ, అందువల్ల వ్యావహారికభాషకు అతనుచేసిన సర్వతోముఖసేవ స్పష్టతరమౌతున్నది కాబట్టి మఱింత ఆదరణపాత్రముగా ఉంటుందనడమునకు సందేహములేదు. పంతులుగారు బొడ్డున పొన్నపూవు పెట్టుకొని పుట్టిన ఆగర్భ శ్రీమంతులుకారు. సాధారణ సంసారి బిడ్డ. కష్టసాధ్యముమీద విద్యాభ్యాసముచేసి ఆకాలములో ఉత్కృష్టముగా ఎంచబడే బి. ఏ. పరీక్షలో ఘనముగా ఉత్తీర్ణులై పర్లాకిమిడీరాజావారి కళాశాలలో ప్రధాన చారిత్రకోపన్యాసకులై కళాశాలకు సంస్థానమునకుంగూడ వన్నె తెచ్చినారు. ఈఅయ్యవారివృత్తిలో అణుమాత్రముగా చిక్కే విశ్రామసమయములోనూ, ఆ వృత్తినుంచి విశ్రాంతిపొందిన తరువాత లభించిన పూర్ణవిశ్రామములోను వారు పఠించినఅసంఖ్యాక గ్రంథములు, చేసిన అనంత విమర్శాపరిశోధనలు, ఏర్పరచుకొన్న సిద్ధాంతములు, ఆంధ్రేతర భాషాపరిచయములు, సవరభాషా వ్యాకరణనిఘంటురచనములు, శాసనపరిష్కారములు, దేశసంచారములు, వాదోపవాదములు, వ్యాసపరంపరలు చూస్తే ఎటువంటి బుద్ధిమంతులకూ కూడా అత్యాశ్చర్యకరంగా వుంటుంది. ఆహారనిద్రా సమయములు మినహాగా మిగిలినకాలమంతా విమర్శాపూర్వకమైన చదువులు చర్చలలోనే గడుపుదురు. ఆహారనిద్రల ననుభవించుటయును ఈ విద్వజ్జీవయాత్రార్థమేకాని వేరు కార్యము నిమిత్తముకాదు. ప్రభుత్వముల వద్ద యుచ్చకములకుకాక, ప్రజలలో రాజకీయనాయకత్వమునకుకాక, ఇహములో సంపదలు పోగుపెట్టుకొనుటకుకాక సాధారణమగు నొకభాషావిషయమున నిట్టియనన్యచిత్తముతో రేయుంబవళ్లు గడపేవారు బహు తక్కువగాపుంటారు. ఎందులో చేసినసేవయైనను వేగము నేటికి వచ్చునుకాని ఈ విషయమై పడినశ్రమయంతయు సాన క్రిందివన్నెవంటిది. అయితే పంతులుగారి కదిప్రాణము కంటెకూడా మధురమైన ఆసవమై, అతని జీవనమును రసపుష్టము చేసి, చిందులు త్రొక్కించి ఆంధ్రభాషాభిమానులకందరికీ ఆనందదాయకునిగా చేసినది.

అతని సప్తతితమ జన్మోత్సవమున ప్రకటింపఁబడిన మహాసంచికకు ప్రాచ్యులు పాశ్చాత్యులు, ఆంధ్రులు, అరవలు, బంగాళీలు మొదలగు జాతులలోని పండితాగ్ర

గణ్యులు. అతని కర్త్యాప్యాయనములైన భాషాతత్వ శాస్త్రము, శిక్షా శాస్త్రము, శాసనపరిశోధనము, పురావాస్తు శాస్త్రము మొదలగువానికి సంబంధించిన వ్యాసములు ఆంధ్ర ఆంగ్లభాషలలో సుమారు 600 పుటలుగా వ్రాసించి తమ భక్తివిశేషములను ప్రదర్శించుకొనిరన్న, అతనికీర్తి యెంత దిగంతవిశ్రాంతమో, అతనిపరిశ్రమ యెంత గంభీరమైనదో మన మూహించుకో వచ్చును. ఆంధ్రవ్యావహారికభాషావిషయమునమాత్రము వారుచేసిన పరిశ్రమను దిఙ్మాత్రముగ ఇందు ప్రశంసింపఁ బూనుకొనుచున్నాము.

ఆంధ్రభాషలో తెలుగు వచనగ్రంథములూ, వచనశైలీ వీరేశలింగం చిన్నయ్యసూరి మొదలగు ఆధునికాంధ్రపండితులతో మాత్రమే పుట్టలేదనిన్ని, అంతకుముం దనేక వచనగ్రంథములు పండితులచేత వ్రాయబడి వుండినవనిన్ని వాటిలోనిశైలి పద్యముల శైలివలెగాక సులభమై వ్యావహారికపదభూషితమై ముద్దులుమూటకట్టుచుండె ననిన్ని "గద్యచింతామణి" మొదటిభాగము ద్వారా అతను తెలియఁజేయుచున్నారు. ఈ గ్రంథములో ఆంధ్రదేశమున వివిధసమయములలో రచింపఁబడిన కథలు, లేఖలు, వ్యాసములు, వ్యాఖ్యానములు మొదలగువాని నెత్తిచూపించి వ్యావహారిక భాషాశైలి యొక్కటిమాత్రమే తెనుగుగద్యమునకు అనుశ్రుతమైనదనిన్ని, వచనరచనలలో కావ్యభాషను ప్రవేశపెట్టుట పూర్వుల సంప్రదాయంకాదనిన్ని ఋజువుపరుస్తున్నారు. ఆయా కాలములలో వ్రాయబడిన రామాయణ భారతభాగవతవచనములు, ప్రాచీన లిఖిత గ్రంథములు, తత్వగ్రంథాలు, కథలు, దేశ చరిత్రలు, కైఫీతులు, తీర్పులు, వార్తాపత్రికలు, వ్యాఖ్యానములు, లక్షణగ్రంథములు, బడిపుస్తకములు, ధర్మ జ్యోతిష సిద్ధాంత వైద్య భరతశాస్త్రములు, నిఘంటువులు, దినచర్యలు మొదలగు సుమారు 200 గ్రంథములనుండి వ్యావహారికశైలి కుదాహారణములు చూపించినారు. వీనిని వ్రాసినవారందరూ పండితులు. ప్రజలకు సులభముగా తెలియడముకొఱకు అనుశ్రుతమైన తెలుగు భాషలో వ్రాసినారు. అచ్చువచ్చినప్పటి నుండియే ఇట్టి స్వచ్ఛందశైలికి స్వస్తి చెప్పఁబడి, దాని స్థానే తప్పులతడకమైన కృత్రిమ గ్రాంథికశైలి పండితులవలన ప్రవేశపెట్టబడినదనిన్నీ విశ్వవిద్యాలయమువారు దీనికి పట్టముగట్టి అసలుభాష కన్యాయముచేసినారనిన్నీ యీ గ్రంథమువల్ల తెలియఁగలదు. పంతులుగారు యదార్థనిరూపణము చేసినారు. ప్రస్తుత పత్రికాధిపతులు, విద్యాశాఖవారు మొదలగువారు ఇప్పటికైనా కళ్లుతెరచి ప్రయోజనవిద్యాప్రచారకరమైనట్టిన్ని అనుశ్రుతమైనట్టిన్ని శైలికి తిరిగీ గౌరవస్థానము నిస్తారో లేక గ్రుడ్డివారై 'గ్రాంథిక' భాషాకూపములోనే కొట్టాడుకుంటారో భవిష్యత్కాలమే తెలియఁజేయఁగలదు. వ్యావహారికభాష మహార్ణవమువంటిది. 'గ్రాంథిక' భాష కృత్రిమజలము కృత్రిమవాయువులతో కూడిన మదరాసు

మెరీనావంటిది. ఆంధ్రజన జలచరములు స్వేచ్ఛారతములై ఆ మహార్ణవమున విచ్చల విడిగా విహరించునో లేక యీ ప్రదర్శనా గారమున నూపిరిసలుపక కొట్టాడుకుంటూ, కృత్రిమాభిరుచుల కలవాటుపడిన నవనాగరక యువతీయువక పండితప్రవరుల ప్రశంసలకు మురియుచుండునో నిర్ణయించుకో వలసియున్నది.

ఇదీగాక ప్రస్తుత గ్రాంథికవాదులశైలీ వారివ్యాకరణములూ ప్రతీవానిని ఒకానొక సంశయసముద్రములోనికి త్రోసివేయు చున్నవి. ఈ సంశయవిచ్ఛేదము చేసేనిమిత్తము శ్రీ పంతులుగారు బాలకవిశరణ్యమనే 358 పుటల గ్రంథమును తయారుచేసినారు. చిన్నయసూరిగారినుండి నేటివరకు పండితులు వ్రాయుచున్న గ్రాంథికమనుశైలి కలవాటుపడినవారికి స్వతస్సిద్ధముగా తెలుగు శిష్టులు వ్యవహారమునం దుపయోగించే ప్రతిమాటవిషయమునా ఇది తప్పాఒప్పా, వార్యకణమొప్పుతుందా ఒప్పదా, ప్రయోగాలున్నవాలేవా అనే సందేహము కలుగుతునే వుంటుంది. ఈ ఆలోచనలోనే సగము బుద్ధిపోతే విషయము మనోరంజకంగా ఎట్లా వుంటుంది? ఇంతా ఆలోచించి తేల్చుకున్న పదమేదో పరిశుద్ధగ్రాంథికమా అంటే అదేదో ఒక కృతిమగ్రాంథికమై తప్పై ఎవూరు కుంటుంది. ఆవ్యావహారికపదము తప్పను కొనేది వట్టి భ్రమ అనిన్నీ, వ్యాకరణరీత్యా సాధువనిన్ని పూర్వకవుల పద్యకావ్యముల లోనే అట్టిపదములు వేనవేలు ప్రయోగములై యున్నవనిన్నీ తెలిస్తే ఇటువంటి బ్రహ్మ సందేహాలు లక్షలకొలదీ తీరిపోయి ప్రతి ఆంధ్రుడు శిష్టమైన తెలుగును ధారాళముగా వ్రాయగలుగుతాడు. వ్యవహారములో ఎంత సాధువైనపదమైనా కవిప్రయోగమున్న దంటేనేగాని శిష్టమని నమ్మలేకపోవడము తెలుగువారికి సహజమైపోయింది. తెలుగు వారికి ఇట్టి నమ్మకము కలిగించడముకొరకు శ్రీపంతులుగారు వేనవేలు ప్రయోగాలు పూర్వకవుల గ్రంథాలనుండి యెత్తిచూపించి వాటిని సాధువులని నిరూపణచేసి యీ గ్రంథమునిండా ఉగహరించినారు. వీనిలో కొన్నింటిని ఈదిగువ నుదహరిస్తే యీగ్రంథమువలన తెలుగుభాషకు తెలుగువారికి పంతులుగారుచేసిన మహోపకారముయొక్క విలువగోచరమాతుంది. వ్యావహారిక భాషా ద్వేషులుకూడా సిద్ధాంతములను అంగీకరించినా అంగీకరించకపోయినా పంతులుగారి పరిశ్రమనైనా మెచ్చకపోరనే విశ్వాసముతో, వారు సాధువులని నిరూపించిన కొన్ని ప్రయోగాలని ఇచ్చట ఉదహరిస్తాము. కూతుళ్లు, కూతురిని, కూతురుకు, ఆకొంట, మేలుకొంట, వసింతురు, పూజింతుము, చేతురు, కోతురు, రాజుకు, అందుకు, మోముకు, వాగుకు, కొడుకుకు, చెలువుకు, పురముకు, అందటికి, ఆరుగురికి, ఇక్కడికి, చాలా, కూడా, ఇంకా, అయినా, మూడో, ఎనిమిదో, సేనా, తలా, అంతా, ఇంతా, వద్దు, కద్దు, మొక్క, కొద్ది, వల్ల, నెల్లాళ్లు, ఇరువై, అఱువై, తొంబై, వాటి, వీటి, వేటి, ప్రాణాలు, మీసాలు, జగాన, వాళ్లు, కొమాళ్లు, కళ్ళు, అల్లుళ్లు, పెల్లి, ఒళ్ళు,

మళ్ళు, వెళ్లు, రక్షించు, చేయించు, పెట్టుక, పట్టుక, నుంచి, వద్ద, పట్టుకో, పట్టుకోక, చేయడము, కట్టడము, త్రవ్వడము, చేదాము, విందాము, కోసము, అయితే, అంటే, ఆరగింపు, లేకను, చేసినాను, చేస్తిని, చేస్తాను, చేసును, కోసును, చేసింది, ఓరాత్రి మాబాగు, ఎగాదిగ, చెల్లాచెదరు, కానీ, తెలిసీతెలియక, మ్రొక్కేము, వచ్చిని, మెఱుగెట్టె, గంతువేయు, తాటాకు, నవ్వాను, మొదలగు ప్రయోగము లెన్నియో శిష్టము లని నిరూపింపఁబడినవి. ఇటువంటి హామీ కుదిరినతరువాత నిర్భయముగా నోటికివచ్చిన శిష్టపదమునెల్లా ప్రయోగించి నిస్సంకోచముగా అది శుద్ధమని నమ్మి ముచ్చటైన గద్య పద్యకావ్యములను బాలకవులు వ్రాయగలుగుట కాటంకముంటుందా?

ఇక ఈ రెండుగ్రంథముల వల్లా కూడా సందేహములు తీరక చేతనయినంత మట్టుగ గ్రాంథికభాషలోనే మన శైలిఅంతా వెలిగిద్దా మనుకొనేవారివ్రాతలు ఎట్టి తప్పుల తడకలుగా నుంటవో తెలుసుకోవలెనంటే వారు రచించిన 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము'ను చూస్తే చాలును. ఉద్దండ గ్రాంథికభాషావాదులలో మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారిని మించినవారు పుట్టబోతారని యైనా ఊహించుకోడానికి వీలులేదు. బిడ్డలను ముద్దాడడము, నౌకర్లకు పని చెప్పడము, బిచ్చగాండ్రను కసరడము, భార్యతో సరసము లాడడము మొదలు, విద్యార్థులకు సభికులకు ఉపన్యసించడం గ్రంథాలు వ్రాయడంవరకుగల ప్రక్రియలన్నీ గ్రాంథికభాషలోనే వెలిగించేవారని ఆయననుగూర్చి యిప్పటికీ అనేకులు చిత్రవిచిత్రమైన కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. పులుకడిగిన ముత్తెమువంటి అతని శైలిని గ్రంథములను పట్టుకొని విమర్శించి అతనికి గ్రాంథిక శైలి రాదని ముక్కూ మొగమూ వాచిపోయి నట్లు చీవాట్లు పెట్టినారు కళాప్రపూర్ణ వేదం వెంకటరాయ శాస్త్రిలుగారు. అతని కెందుకా ఆ చీవాట్లు? అతనిలాగ మన మెవ్వరమూ తప్పులు వ్రాయకుండా ఉండే టందుకట! వెంకటరత్నం పంతులుగారికే గ్రాంథికశైలి రాక చీవాట్లు పడవలసిన యోగ్యత వుంటే ఇక మన పాట్లేమికాను! అయితే అదృష్టవశమున వెంకటరత్నం పంతులుగారు శాస్త్రిలుగారు చెప్పినంతటి మూర్ఖులు కారనిన్నీ శాస్త్రిగారికే గ్రాంథిక భాష తెలియక పోవుటవల్ల పంతులుగారిని తిట్టవలసిన అవస పట్టిన దనిన్నీ, శాస్త్రిలుగారికే గ్రాంథికశైలి తెలియదని వారి గ్రంథములవల్ల ఋజువు పరచవచ్చుననిన్నీ గిడుగు రామమూర్తి పంతులుగారు వ్రాసిన యీ గ్రంథము తెలియఁజేయును. సంస్కృత భాషా పారావారములై, వ్యాకరణశాస్త్ర పారంగతులైన అట్టి మహనీయులకే గ్రాంథిక భాష వచ్చునా రాదా అని సంశయముగా ఉంటున్నప్పుడు అట్టి శైలిని మననిత్య వ్యవహాములోనికి మనబోంట్లు జొప్పించి పరిశుద్ధ గ్రాంథికభాష వ్రాసే మనుకోవడంకంటె అహంకారము వేరులేదు. ఇంతకంటె దూష్య మని చెప్పడానికి వీలు కానటువంటి వ్యావ

హారిక భాషలోనే వ్రాస్తే మన పరువు తక్కువ కాదనుకుంటే తప్పా?

రామమూర్తి పంతులుగారి వాదననచ్చిన వారుకూడా వ్యవహారభాష విషయమై ఒక ఆటంకము చెప్పుతారు. సిద్ధాంతములో ఇదంతాబాగుంది కాని ఆచరణలో పేలవము అశ్లీలము (Slang) కాకుండా ఈ శైలిలో వ్రాయడం సాధ్యమా అని అడుగుతారు. ఆచరణమూలకంగాకాని దీనికి జబాబుచెప్ప లేము. పంతులుగారు కేవల విమర్శకులేగాని సాహిత్యకర్తలుకారనే అనుకొందము. అయినను అతనువ్రాసిన బహుకొద్దిపాటి వ్రాతలైనను అతని సిద్ధాంతములను ఆచరణ రూపముగా బలపరుస్తున్నవని చెప్పుట కాటంకముండకూడదు. పై గ్రంథములవల్లనేమి వ్యాసావళి అను అతని ప్రత్యేక గ్రంథమువల్లనైతేనేమి అతని శైలి ఎంత సజీవమై, బలిష్ఠమై, రసవంతమై, విశ్వాసజనకమై, హృదయంగమమై వున్నదో మనము తెలుసుకోవచ్చును. వ్యాఖ్యాతలు, బోధకులు, ఉపన్యాసకులు, కవులు మొదలగువారు దానిని చేబట్టి విజృంభించినచో వారివారి మనస్సులందు గుప్తమైయున్న సౌందర్యవిజ్ఞాన సంపదలెల్లయు జనుల హృదయాంతరాళములలోనికి దారిచేసుకొని ప్రవేశించి వాటిని దేదీప్యమానములుగఁజేయవా?

**మదరాసు విధవావివాహ సహాయసభ:—**

ఇది త్యాగరాజనగరమున 1927వ సంవత్సరములో స్థాపించఁబడినది. నిర్బంధవైధవ్యమువలన గలుగు అనర్థములను తెలుపుచు వీరు ఆంగ్ల, ఆంధ్ర, తమిళభాషలలో కరపత్రములు పంచుచున్నారు. గతసంవత్సరమునందీ సభ సభ్యులు 32 పట్టణములలో నుపన్యసించిరి. వీరు కేవల ముపన్యాసములతో తృప్తులుగాక విధవలను తెచ్చి తమభవనమున పోషించి తగినవరుల నన్వేషించి వివాహములు చేయుచున్నారు. ప్రస్తానసంవత్సరములో వీరు 22 రు కన్యలను పోషించిరి. వీరిలో 15 గురికి పెండ్లిచేసిరి. ఈసభకు జస్టిసు యమ్. వెంకటసుబ్బారావుగా రధ్యక్షులు, శ్రీమతి యమ్ సుబ్బారావుసతిగారును, రావుబహద్దూర్ టి. భగవంతం గుప్తగారును ఉపాధ్యక్షులు. కరుణామయులగు నీరి యాదరణముక్రింద నీసభ దినదినప్రవర్థమానమై రాజిల్లవలెనని కోరుచున్నాము.

**ఆంధ్రమహిళాకళాశాలా ప్రయత్నములు:—**

ప్రాథమిక ఉన్నతవిద్యలవలె ఉత్తమవిద్య అనగా కళాశాలలలో నేర్పనగు విద్య ఆంధ్రయువకులనువలె యువతీజనంబులనుగూడ ఆకర్షించుచున్నది. అయినను వందలకొలది యువకులుచేరి పఠించుట కవకాశముగల కళాశాలలు వివిధనగరములలో నున్నట్లు యువతులు పఠించుప్రత్యేక కళాశాల ఆంధ్రదేశమునకంతటికి నొక్కటియైనలేదు. ఉత్తమవిద్య నభ్యసింపఁగోరు యువతులు పురుషులతో కలసి ఆంధ్రనగర కళాశాలలలోనైనఁ జదువుచున్నారు లేదా మదరాసు, పూనా, కలకత్తా మొదలగు నగరములకేగి యచ్చటి

మహిళాకళాశాలలలోనైన విద్యనేర్చుచున్నారు. ఇట్టివారేయల్పసంఖ్యాకులో యైనచో ఎక్కడనో ఒకచోట నిమిడి విద్యాభ్యాసము చేయుచున్నందుకు సంతసించవలసినదే. కాని వీరిసంఖ్య నానాటికి పెరుగుచున్నది. ప్రస్తుతము మదరాసు క్రైస్తవ స్త్రీ కళాశాలలో 18 గురు, క్వీనుమేరీకళాశాలలో 19 గురు, కాశీ విశ్వ విద్యాలయములో నలుగురు, మదరాసు, నెల్లూరు, బందరు, గుంటూరు, కాకినాడ, విశాఖపట్టణం మొదలగు నగరకళాశాలలలో పురుషులతో కలసి సుమారు 90 మంది ఆంధ్రవిద్యార్థినులుత్తమ విద్యను నేర్చుచున్నారు. స్త్రీలకు ప్రత్యేక కళాశాలయే యున్నచో ఇంకను నెక్కువమంది ఆంధ్రయువతులుచేరి ఉత్తమ విద్యలు నేర్తురనుటకు సందేహములేదు.

ఆంధ్రదేశమున కొక ప్రత్యేకమహిళాకళాశాల స్థాపించునిమిత్తమై శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులై యుండునప్పుడే కొంతకదలిక పుట్టినది. వారొక నివేదికను తయారుచేయించిరి. శ్రీమతులు సత్యనాథం, కజిన్సుసతి, శ్రీనివాసమ్మగార్లు, పండిత కార్వే ప్రభృతులు దాని ఆవశ్యకతను నిరూపించుచు అభిప్రాయముల నిచ్చియుండిరి. కాని యీ సంవత్సరము ఫిబ్రేవరి 25-వ తేది వరకు దీనినిగూర్చి తిరిగి కదలించినవారెవ్వరును లేకుండిరి. ఆనాడు జరిగిన ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేటు సమావేశములో శ్రీయుత మాగంటి బాపినీడు గారు వెంటనే ఆంధ్ర విశ్వవిద్యాలయమువారొక మహిళాకళాశాలను స్థాపించవలెనని తీర్మానమును ఉపపాదించిరి. శ్రీమతి పద్మాసనమ్మగారీతీర్మానమును బలపరచుచు దీనినిగూర్చి అఖిలభారతమహిళాసభలోగూడ నిట్టి తీర్మానము ప్యాసయినదని చెప్పిరి. కళాశాలకంటె విశాఖపట్టణములో స్త్రీలకు ప్రత్యేక వసతిగృహ మెక్కువ ఆవశ్యకమని కొందరు వాదించిరి కాని చివరకు శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారి సవరణతో బాపినీడుగారి తీర్మానమే నెగ్గినది. ఈ సవరణప్రకారము ఇట్టి కళాశాలను స్థాపించుటకు కావలసిన ద్రవ్యసహాయమును చేయవలసినదిగా సిండికేటువారు ప్రభుత్వమువారిని కోరుచు ఉత్తరప్రత్యుత్తరములను జరుపఁగలరు. వీరిప్రయత్నములు సఫలములై ఆంధ్రదేశమునకు చిరకాలవాంఛితంబైన ప్రత్యేకమహిళా కళాశాల అచిరకాలములోనే లభించునుగాక యని కోరుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# యస్. టి. పి. యూనియన్, నరసాపురము.

స్థాపితము, 1901. రిజిష్టర్డు, 1917.

రాజపోషకులు:—శ్రీ రాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు, పిఠాపురం మహారాజావారు.

పోషకులు:—శ్రీయుత యఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారు, అడ్వొకేట్, నరసాపూర్.

## ఆంధ్రస్త్రీల పోటీపరీక్ష 1934

వచ్చేపరీక్ష దివి 1, 2, డిశెంబరు 1934 సం|| తేదీలలో జరుగును. పరీక్షకుగాను స్త్రీలు తమ గ్రామములను విడువనక్కరలేదు. ఈ పోటీపరీక్ష పోస్టాఫీస్ ఉన్న ప్రతిగ్రామమందును అభ్యర్థినులు ఉన్నచో (ఒక్కరైనను సరే) మాచేనియమింపబడిన స్త్రీసూపరింటెండెంటులచే పై తేదీలలో జరుపబడును. వయస్సు విషయమునగాని, జాత్యాదిభేద విషయమునగాని స్త్రీలు సంకోచింప నక్కరలేదు. స్కూళ్ళలోని బాలికలుగాని, ఇండ్లలోని స్త్రీలుగాని ఈ పరీక్షకు పోటీచేయవచ్చును. పోటీలో మొదటిక్లాసువారికి మా కార్యనిర్వాహక వర్గపు ఏర్పాటుల ననుసరించి బంగారుపతకములు బహుమాన మివ్వబడును. నూటికి 60 వంతున మార్కులను మొత్తము మార్కులలో సంపాదింప గలిగినవారు మొదటిక్లాసులో కృతార్థులయినటులు ఎంచబడుదురు. ప్యాసుకుగాను ప్రతిఅంశములోను మూడవవంతు మార్కులు రావలెను. ప్రతిఅంశమునకు 100 మార్కులు విధింపబడును. ఈ పరీక్షకు ఈదిగువ గ్రంథములు పఠనీయగ్రంథములుగా నియమింపబడెను.

## పఠనీయగ్రంథములు.

1. సాహిత్యము : పద్యకావ్యము:–మహాభారతములోని "నలోపాఖ్యానము." మహాభారతము నుండియే చదువుకొనవచ్చును. విడిగా కావలసినచో వావిళ్ళవారిది టీకతో ఖరీదు రు. 0–6–0.

2. డిటో. వచనము:–"మణిమేఖల" నరసాపురం, కమలకుటీరమువారి ప్రచురణము. మా అభ్యర్థినులకు మాత్రము ఖరీదు. రు. 0–6–0.

3. డిటో. వ్యాసరచన:–"రాధ" నవల.(గ్రంథకర్త్రి) శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకమ్మగారువిద్వాన్. మా యభ్యర్థినులకు మాత్రము ఖరీదు. రు. 0–8–0.

షరా:—సాహిత్యమునందలి సామాన్యవ్యాకరణ సూత్రములు పద్యములయొక్క (వృత్తములయొక్కమాత్రము) గణ విభజనయు చక్కగా నేర్చుకొనవలయును.

4. గణితము:–సిలబసు రాబోవుసంచికచో ప్రచురింపబడును. ఏ పుస్తకమునైన నుపయోగము చేసుకొనవచ్చును.

5. శాస్త్రము:–"శిశురక్షణ" (గ్రంథకర్త్రి); శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు, హైదరాబాద్. మాయభ్యర్థినులకు మాత్రము ఖరీదు. రు. 0–8–0.

షరా:—ఈపయిన నాచే పేర్కొనబడిన పఠనీయ గ్రంథముల నన్నిటిని మాయభ్యర్థినులకు పోస్టుఖర్చుల సదుపాయము నిమిత్తము నావద్దకే తెప్పించియుంటిని. వి. పీ. గా బడయవచ్చును.

అద్దంకి బిందుమాధవరావు, కార్యదర్శి.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

1. వసుమతి:— సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:— నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:— ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీ వస్త్రసంరక్షణము:— (ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:— (ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:— ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:— అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు పలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

---

### రావ్‌సాహేబ్, మ॥ రా॥ శ్రీ॥ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములు.

| | | | | |
|---|---|---|---|---|
| వ్యాససంగ్రహము:— | సుమారు | 750 | పుటలు. | వెల 7 8 0 |
| గద్యచింతామణి:— | ,, | 370 | ,, | వెల 1 8 0 |
| బాలకవి శరణ్యము:— | ,, | 360 | ,, | వెల 1 8 0 |
| ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము:— | ,, | 210 | ,, | వెల 1 0 0 |
| వ్యాసావళి:— | ,, | 172 | ,, | వెల 1 0 0 |

ప్రకాశకుడు :—

తెలికిచర్ల వెంకటరత్నంగారు,

గుంటూరు.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగాపనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగులక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపముగలిగినప్పుడు ఉపయోగించిన అమోఘముగాపనిచేయును. గర్భాశయమునుండి మైల సరీగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి (Douche) మొదలైనవి అవసరము లేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిదిఒక్కటే; ఇది బాలింతలపాలిటి పరమౌషధము.

ప్రశంసలు

౧

*M. R. Ry. G. Suryanarayana Garu, Overseer, Madugula, writes:—*

**The medicine called 'Mahasutikabharanam sent by you did wonderful work for my wife after delivery'**

౨

మ. రా. రా. శ్రీ. డాక్టరు నరసింగరావుగారు, గవర్నమెంటు డిస్పెన్సరీ, బురజ:—

మీరు నాకు పంపిన 'మహాసూతికాభరణము' చాలా ఆశ్చర్యమైనగుణము నిచ్చినది.

౩

మ. రా. రా. శ్రీ. నారాయణం తాయనాచార్లుగారు నేటివ్ డాక్టరు. ఇంకొల్లు:—

"సూతికాభరణము సన్నిపాతరోగులకు వాడినాను. అపరిమితముగా పనిచేసి మీ కీర్తిని ఎక్కువగా చెప్పుకొనుచున్నారు."

ఇత్యాదులు ఇంకనుకలవు.

## వెల తు 1 కి రు 30. వారంరోజులమందు రు 5.

# ఆర్యరసాయనశాల,

## ముక్త్యాల (కృష్ణా.)




సంపాదకుడు

# డాక్టరు. కే. యస్. కేసరి

సంపుటము ౬.] 1934 [సంచిక ౯

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# లోధ్రను సేవించుటవలన

ఋతుదోషమువలన కలుగు నడుము నొప్పి, కడుపునొప్పి, కీళ్లనొప్పి, వాత నొప్పులు మొదలైనవి నివర్తియగును.



## Why Suffer With Backache

గడచిన మూడు సంవత్సరములనుండి నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. 2, 3 నెలల కొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పులు, కీళ్ల నొప్పి, బలహీనము, దేహము బరువుగ తోచుట మొదలగు బాధల ననుభవించు చుంటిని. మీ లోధ్రను రెండు సీసాలు తెప్పించి వాడినంతలో పై వ్యాధు లన్నియు మాయమైనవి. నావలెనే బాధ పడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలె నని ఖండితముగా తెల్పుచున్నాను.

జయలక్ష్మమ్మ, కొల్లిగల్.

V

నాకు బహిష్టికాలములో కడుపునొప్పి చే చాల బాధ కలుగుచుండెను. మీ కేసరి కుటీరం లోధ్ర నాలుగు బుడ్లను తెప్పించి త్రాగినాను. అది మొదలు నాకు చాలా ఆరోగ్యముగనున్నది. బాధకూడ తగ్గినది. గనుక మా స్త్రీలవ్యాధులకు తమ లోధ్ర కల్పవృక్షమువంటిది.

గునుపూడి కాంతమ్మ, కావలి.

లోధ్ర అన్ని షాపులయందును దొరకును.

**కేసరికుటీరం, :: ఎగ్మూరు, :: మదరాసు.**



# గృహలక్ష్మి

## సలహా సంఘం

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

,, వింజమూరి వేంకటరత్నమ్మగారు

,, చిల్కపాటి సీతాంబగారు

,, గింప శివకాంతమ్మగారు

,, తెలికిచర్ల వసుంధరాదేవిగారు ఎం. ఏ., బి. యస్. సి. (Lond)

మ-రా-రా-శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారు బి. ఏ., బి. యల్.

,, రాయసం వెంకటశివుడుగారు ఎం. ఏ., యల్. టి.

,, వి. వెంకటసుబ్బయ్యగారు బి. ఏ.


**GRIHALAKSHMI**

TELUGU ILLUSTRATED LADIES' MAGAZINE

*Editor*: DR. K. N. KESARI.

MAY 1934.





Vol. VII No 3

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరి మితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచ బడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింప వలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలము లకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండ వలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవల యును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తర ములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసము లను అందుకొనుచు ఈవలకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరు వాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరని వారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదికి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలు పమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథా రీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందా దారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారు లుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుట గాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంప గలము.

## ముఖ్యమైన మనవి

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తర ములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.



‘పిక్కకుపిక్కా వేటుకువేటూ’



‘ద యా వి లా స ము’

యడల పురాణ అజీర్ణరోగములు కుదురును. ప్రదర రోగము అతిమూత్రరోగము, గ్రహణి, అతిసారము, రోగములకు మిక్కిలివిహితము.

## అరటిపువ్వు

నేతపువ్వు దంచి రసంతీసి నాలుగు తులములు గ్రహించి దానిలో రెండు తులములు ఆవుపెరుగు కలిపి సేవించిన రక్తగ్రహణి, యీ తుర రక్తస్రావము, వెంటనే కట్టును. ప్రతిదినము రెండు మూడుపూటలు తీసుకొనవచ్చును.

## అరటిపండు

బాగుగాపండిన చక్రకేళి, రసదాళి, కర్పూరకేళి పండ్లు మితముగా భుజించిన పురాణరక్తగ్రహణి, అజీర్ణ విరేచనములు కట్టును. మంచిపండిన పండు పరుండుసమయమున చక్కగాభుజించి నీరుత్రాగిన తెల్లవారి చక్కగా కాలప్రవర్తియగును. బాగుగపండిన యరటిపండ్లలో20(Per cent)చక్కెరయుండును. అరటిపండు 3½ తులం, 1½ తులం ఉప్పు బెల్లము, పావుతుల మెగ్గు ఈమూటినికలిపి దినమునకుమూడు తడవులు భుజించిన పైత్యరోగములు, అనగా, తల తిరుగుట వాంతులు, నోటనీరూరుట, మొదలగునవి నిలుచును. 24 తులముల చక్కెరగ్రహించి ¼ తులం పటికనుదంచి కొంచం నీటిలోకలిపి దీనిని పంచదారలోవేసి మరికొన్ని నీళ్ళువేసి తేనెపాకంబట్టి దానిలో గోరగామాగిన అరటిపండ్లువేసి బాగాకలిపి దించి మంచిసీసాలో భద్రపరచునది. ప్రతిదినం తెల్లవారి సాయంత్రము 1 తులం సేవించిన మేహశాంతి, కాక, పైత్యరోగములు, స్త్రీల కుసుమరోగములు, పాడిదగ్గులు, అణచి మంచిరక్తంపుట్టించి బలము, వీర్యవృద్ధికలుగజేయును. 24 తులములు వంటాముదములో సజాతీయ్యమైన అరడజను పండ్లనువేసి 40 దినములు సూర్యపుటంబిడి తరువాత 1 తులంగల పండునుగ్రహించిన ఆమవాతము కీళ్ళ నొప్పులు బోగొట్టునని ఒకమిత్రుడు మాకు వ్రాసెను. దీనిని పరీక్షించవలెను.

పచ్చిపట్ట (Bark) దంచి 4 గురు చుక్కలు మొదలు 8 చుక్కలువరకు బిడ్డలకు ఉపయోగించిన నల్లమందు అధికమోతాదువల్ల కలిగినదుర్గుణములు వెంటనే నివారించును.

గట్టును సమూలముగా కాల్చి భస్మముచేసి ఆ భస్మమును గుడ్డలకు ఉపయోగించవచ్చును. అనగా భస్మమును నీటిలోవేసి గుడ్డలుకలిపి బాగావుడకబెట్టి వుతికినయడల మురికిపోయి గుడ్డలు తెల్లనగును,

అరటిసంబంధమైన ప్రతిభాగము అతిమూత్రము, రక్తాతిసారము, కుసుమరోగములు, రక్తస్రావములకు మిక్కిలి పథ్యకారిగాయుండును,

—డాక్టరు. యస్. రాజారావు.

## జబ్బుల కారణములు

(1) చాలామంది జబ్బు తప్పించుకొనలేమని గురిభ్రాయపడుచున్నారు.

(2) వైద్యులు, శాస్త్రవేత్తలు, రోగములు ప్రత్యేక కారణములచే గల్గునని విశదీకరించుచున్నారు. కాని కొన్ని జబ్బులు తగిన యాహారము లేకపోవుటవల్ల గల్గుచున్నవి. ఉబ్బసము అట్టి జబ్బే.

(3) విషపదార్థములు శరీరములో చేరుటచేత వ్యాధులుపుట్టును. అగ్గిపుల్లలు చేయు యంత్రశాలలో పని చేయువారు ఫాస్ఫరస్ (Phosphorus) అను విషజాడ్యముచే బీడింపబడుదురు.

(4) దురభ్యాసములచే జబ్బులు గల్గవచ్చును. ఎట్లన తిండి తినుటలో దురభ్యాసముచేత అజీర్ణరోగము సంభవించును.

(5) జబ్బు కల్గించు సూక్ష్మపురుగులే తొమ్మిది పంతుల వ్యాధులకు ముఖ్యకారణము.

# బాలవిజ్ఞానశాఖ

## ౧. పాటలు

నవ్వులనారాసి అత్తకొడుకువచ్చి
నువ్వులునూర్చాలని నూరుయెడ్లనడుగు.
'పాలుతాగిమాయెడ్లుపత్తి నూర్చనెల్లె'
'పదిపుట్లధాన్యమ్ము నూర్చేముగాని
పత్తిచేనెన్నడూ నూర్చియేయెరుగ
నూరుపుట్లధాన్యమ్ము నూర్చేముగాని
నువ్వుచేనెన్నడూ నూర్చియేయెరుగ
అత్తకూతురివని అడిగితిగాని
అతిజాణవేయాట నిన్ను నేనెరుగ
మామకొడుకువని మన్నించితిగాని
మాటకారుడవాట నిన్ను నేనెరుగ
నిన్నతిన్నవిస్తళ్లు నేతులడ్డాయి
నీతిమాలినపెళ్ళికొడుక లేచిరావయ్య
మొన్నతిన్నవిస్తళ్ళు మోపులడ్డాయి
మొండిపెళ్ళికొడుక లేచిరావయ్య
ఏనుగులులేవని యేలడిగినారు
నెల్లగాడిదనెక్కి లేచిరావయ్య:
గుఱ్ఱాలులేవని మొఱ్ఱయేలమీకు
గుడ్డికుక్కనెక్కి లేచిరావయ్య
పల్లకీలులేవని యేలడిగినారు
పందికొక్కునెక్కి లేచిరావయ్య
మేనాలులేవని మీకేలచింత
ఎలుకపోతునెక్కి లేచిరావయ్య.
కొకొల్లంక కొడవల్లంక
ముత్తీబియ్యం మునగపేడ
కాళ్లగజ్జ కంకణమ్ము
ఏకులసుద్ద వెన్నముద్ద
గారకాయి గచ్చపప్పు.

---

## ౨. బాలక్రీడలు

శ్రీమతి యేలేశ్వరపు వెంకట మహాలక్ష్మమ్మగారు

(పిల్లలు చెయ్యిచెయ్యి పట్టుకొని గిరగిర తిరుగునప్పుడు యీరీతిగా పాడుదురు)

నప్పులకుప్ప వయ్యారిభామ
వియ్యలకుచ్చు వాలుమొగ్గ
విస్తారంట యీనిపుల్ల
సన్నబియ్యం చాయపప్పు
గూట్లోరూపాయి నీమొగడుసిపాయి.



## 3. కథలు

[బాలవిజ్ఞానశాఖలో ప్రకటింపబడే కథలు బాలబాలికలకు ఉత్సాహంకలిగించడం కొరకై యున్నవి. శుద్ధమైనసులభమైన వ్యావహారికభాషలో చిన్నచిన్న వాక్యములుగా వ్రాస్తేనే వారు గ్రహించుకోగలరు. ఇక ముందీభాగములో ప్రకటించవలసిన కథలను ఇట్టిశైలిలో వ్రాయవలెనని లేఖరులను హెచ్చరించుచున్నాము.

గృ॥ సం॥]

# విషయసూచిక

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్‌రిప్రజంటేటివ్ ఆఫ్‌న్యూస్. |
| మచిలీపట్టణము: | పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, 566, రెసిడెన్సి పెద్దగడియారం, చౌరమార్కెటురోడు,(మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాటిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్. |
| జెమ్‌షెడ్‌పూర్: | టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్‌కంపెనీ, |
| బరంపురం: | నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్‌పేపరు ఏజంటు. |
| గుంటూరు: | వెల్‌కం అండు కంపెని. |
| అనకాపల్లి: | గ్రంధి కన్నయ్యపంతులుగారు, గాంధిమార్కెటు. |
| సామర్లకోట: | ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు. |
| పిఠాపురం: | న్యూస్‌ఏజెన్సీ ఎం. నూకరాజు, ఆంధ్ర. |
| రాజమండ్రి, విశాఖపట్టణం: | ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు. |
| మదరాసు: | వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు. |
| తణుకు: | వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు. |
| బెజవాడ: | ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట. |
| పాలకొల్లు: | లొల్లా వెంకటరావుగారు. |
| నరసాపురము: | కటికల సూర్యారావుగారు, కుమ్మరివీధి. |
| భీమవరము: | అమిరపు శేషాచలశర్మగారు. |
| ఒంగోలు: | తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు. |
| రంగూను: | వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్‌వీధి. |
| కర్నూలు: | చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు. |
| చిత్తూరు: | వాటంబాటి. వెంకటసుబ్బయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు. |
| సెకండ్రాబాదు: | కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాగానుబజారు. |
| ఏలూరు: | బి. విశ్వనాథంగారు. |
| విజయనగరం: | ఇవటూరి సుందరశివరావుగారు. |
| నెల్లూరు: | సి. యల్. నృశింహం బ్రదర్సు, ట్రంకురోడ్డు. |

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

**ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు**

త్వరపడుడు! ఆంధ్రనారీమణులారా! త్వరపడుడు!!

# గృహలక్ష్మి స్వర్ణపదకమును గెలుపొందుటకు యత్నింపుడు

గతనెల గృహలక్ష్మిలో కొంత పాఠ్యక్రమము తెల్పబడినది. గమనింపుడు.

## SYLLABUS IN ARITHMETIC.

లెక్కలలో నే పుస్తకము ననుసరించినైనను యీ క్రింది యంశములను నేర్చుకొనవలెను :—

(1) లక్షలవరకు సంఖ్యానీకము. సంఖ్యల నంకెలతోను అక్షరములతోను వ్రాయుట. (2) భిన్నమును దశాంశముగాను, దశాంశమును భిన్నముగాను మార్చుట. (Conversion of a decimal into a Vulgar fraction and Vice-versa) (3) దశాంశములయొక్కయు సామాన్య భిన్నాంశములయొక్కయు కూడిక, తీసివేయుట, గుణించుట, భాగించుట (The four simple rule as applied to decimal and Vulgar-fraction).

(4) రూపాయలు, అణాలు, పైసలు, మైళ్ళు, ఫర్లాంగులు, గజములు, అడుగులు, అంగుళములు, బారువులు, మణుగులు, వీశెలు, శేర్లు, పలములు, తులములు, ఎకరములు, సెంట్లు, గజములు, రీములు, దస్తాలు, గ్రోసులు, డజనులు, ఇవిపన్ను వివిధసంఖ్యల వ్యవకలన గుణకార భాగహారములు, యుక్తిలెక్కలు. (5) $\frac{1}{2}, \frac{1}{3}, \frac{1}{4}, \frac{1}{6}, \frac{1}{8}, \frac{1}{9}, \frac{1}{22}, \frac{1}{16}$. ఈ భిన్నమునుమాత్రమే వచ్చునట్లుగా పైమానములలోనుండు యుక్తిలెక్కలు. (6) త్రైరాశికము (Rule of Three). (7) పంచరాశికము (Compound Rule of Three). (8) సరాసరి లెక్కలు (Average). (9) శాతములు (Percentages). (10) లాభనష్టములు (Profit and Loss). (11) నాడుకలెక్కలు, సామాన్యనాడుకలు, మిశ్రమనాడుకలు (Simple Practice and Compound Practice)

(12) సామాన్య బారువడ్డి, అసలు, మొత్తము, నూటికివడ్డి, సంవత్సరములు, ఏమూడు ఇచ్చినను నాల్గవదానిని కనుగొనుట. (Simple interest and to find out the fourth when any three of Principal, amount, Rate Percent and time, are given). (13) డొక్కగ్గపద్ధతిని సరళవడ్డీని, ఘనవడ్డీని కనుగొనుట.

(14) ఏకవనుమార్గము (Unitary Method). (15) పన్నులు, శిస్తులు మొదలయునవి (Problems on Rates and taxes) (16) కాలము, పని, దూరము (Simple Problems on time and work and distance). (17) త్రోవలు, వరండాలు, దాని వైశాల్యమును కనుగొనుట (Area of Verandahs and foot-Paths). (18) నాలుగు గోడల వైశాల్యమును, గోడలను వెల్లవేయుట, గది నేలకు తివాసీ పరచుట వగైరా (Area of four walls, cost of white-washing the walls and carpeting the floor.)

సగా:— యుక్తిలెక్కలన్నియు ప్రతిదినము ఉపయోగములోనుండు వ్యవహారము ననుసరించియుండును. అంకెల సంఖ్యలు నాలుగంకెలకుండు మొత్తముల మించియుండవు.

### పరీక్షా విధానము

తేది 1-12-1934 (శనివారము) 11 ఘంటలు మొదలు 1 ఘంటవరకు పద్యకావ్యము. 2 మొదలు 4 వరకు గద్యము. 4-10 మొదలు 5-10 వరకు వ్యాసరచన.

తేది 2-12-1934 (ఆదివారము) 11 మొదలు 1 ఘంటవరకు లెక్కలు. 2 మొదలు 4 వరకుశాస్త్రము.

పరీక్షకు దరఖాస్తులను పంపువారు యీ కార్యస్థానమునుండి దరఖాస్తు ఫారములను పుస్తకముల తోబాటు తెప్పించుకొని అక్టోబరు మాసములో దరఖాస్తు 1-కి రు. 0-4-0 రుసుముతో దరఖాస్తు ఫారములను పూర్తిచేసి యీ కార్యస్థానమునకు పంపవలెను.

“ఈపరీక్ష మొదలు యేటేటను ప్రథమురాలుగా గెలుపొందిన నారీమణికి “గృహలక్ష్మి” తరఫున “గృహలక్ష్మి స్వర్ణపతకము”ను తత్పత్రికాసంపాదకులు సదయహృదయులై ఒసంగి బహూకరించుటకు అంగీకరించిరి గాన తెలుపుచున్నారు. ఆంధ్రనారీమణులు ఎల్లరును “గృహలక్ష్మి స్వర్ణపతకము”ను పొందుటకు యత్నింతురుగాక ! ఇట్లు సదరు గృహలక్ష్మి సంపాదకులు మా సంఘముపట్ల తమకుగల ఆదరణము జూపుటచే మేము వారికి మిక్కిలి కృతజ్ఞులము. ఆతరువాత మా సంఘపు పతకములుండును.”

అద్దంకి బిందుమాధవరావు.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR




గర్భాశయదోష జనిత వ్యాధులను, ముట్టుకుట్టు, క్రమముతప్పి బుతువగుట, బుతుస్రావము ఎక్కువ తక్కువ అగుట, స్రావము అనేక రంగులతో వెడలుట, సూతిక గడ్డ, గర్భాశయమున విషవ్రణములు కలుగుట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టు అగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్ర పుత్రికాభిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

వాతోన్మాదమను హిస్టీరియాను ఆశ్చర్యముగ తుదముట్టించుటలో సాటిలేని దివ్యౌషధము.

## లోధ్ర

ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

నేను లోధ్రను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్టుకాలమందు మిక్కిలి బాధ కలుగుచుండెను. ప్రతి నెలయును క్రమముదప్పి బహిష్టి 20 దినములు పోవునట్లు యగుచుండెను. 2 సం॥ల వరకు ఆసుపత్రియందు [illegible] గాని గుణము కనుపించలేదు. పెద్దలు నాకు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి. నేనొప్పుకొనలేదు. తమ 'లోధ్ర'ను నాకు పంపగోరుచున్నాను

బి. ఇందిరాకుమారిదేవి. మెట్టూరు.

నా సహోదరి బహిష్టుకాలమందు పరిమితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నియో ఔషధములిప్పించితిమి కాని నయముకాలేదు. తుదకు తమయొక్క లోధ్ర కీర్తిని విని రెండుబుడ్లు తెప్పించి నాసోదరికి వాడినాము. అత్యాశ్చర్యముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రి జననమైనది. ఈ సంతోషవార్త తమకు వెల్లడించుచున్నాము.

కె. రాజేశ్వరమ్మ, దిగువహంపి.

లోధ్ర యెల్లెడల దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# అమృత

## రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన ఔషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

పెద్దబుడ్డి 12 ఔన్సులు రు 3_0_0. చిన్నబుడ్డి 6 ఔన్సులు రు1_10_0.

జటప్రోలు మహారాజుగారి అనుమతిపై మీ అమృత ద్రావకము చక్కగ పనిచేసినదని వ్రాయుచున్నాను. మొదటి బుడ్డివలన కల్గిన సుగుణములను చూచి మరియొక బుడ్డి అదే రోగికి వాడినాము. గుల్మము, కడుపులోమంట, మలబద్ధము, బలహీనము, తలనొప్పి మొదలగునవి అన్నియు మొదటిబుడ్డి ఉపయోగింపగనే తగ్గినవి.

కె.వి. నాయకర్, ఐ.యమ్.ఎం.డి.,

జటప్రోలు.

నేను నిదివరలో చూచినవాటికంటె అమృతయే శ్రేష్ఠమైన రక్తశుద్ధిద్రావకము. నా స్నేహితులు పెక్కురైనను అమృతను వాడియుండనివారు తోడనే కొని వాడుకోరెదను.

టి. అరుణాచలయ్యరు,

సబ్. అసిస్టెంటు ఇంజనీర్,

కోలారు గోల్డుఫీల్డు.

మీరు పంపిన అమృత చేరినది. మంచి గుణమిచ్చుచున్నది.

శ్రీరాజా రామచంద్రసూర్య

హరిశ్చందన దేవుగారు,

తర్లరాజు.

## అమృత దివ్యామృతమే.

అన్నిషాపులయందు, కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసున దొరకును.




శా॥ 'ఏదో కోమటిశెట్టిగార్ల కథలోయీ' యందురేమో! యదే
కా; దాగోమఠపీఠముంగొలిచి విఖ్యాతాత్ములై తొల్లి యా।
మీదన్ విశ్రుతబౌద్ధధర్మసభలన్ మేటిల్లి శ్రేష్ఠాంకులై
వేదోక్తాఖిలకర్మఁజేసెడి ద్విజుల్ వీరమ్మరో, వింటివే॥

—కన్యకావిజయము.

# ఆర్యవైశ్యులు

సాంఘికాచార వ్యవస్థల, నేకముఖముగా బెట్టుటయను నుద్దేశము మాత్రము గొప్పది యనక తప్పదు; కాని యీ యంశమునందు 'తలతల పెద్దలు, దండినాయకులు'ను ముల్లు దీయఁబోయి కొర్రడచుచున్నారనుట సాహసముకాదు. ఈ యనేకత్వము చూచిన నెట్టి శాన్త చిత్తుఁడైనను జలింపకమానఁడు.

నానాటికి స్థితిగతులు చెడుచున్నవియే కాని యెంతమాత్రమును బాగుపడుచుండుటలేదు. ఈ బహునాయకత్వము మిక్కిలి భయంకరముగా దోచుచున్నది. ఏవైపునకుఁ బోయిన నేమి ముప్పువాటిల్లునో యని కాలానుభవముగల పెద్దలు తటస్థులై యున్నారు. పిన్నపెద్దలను తారతమ్యజ్ఞానము శూన్యమైనది. పాశ్చాత్యాచారప్రియు లొకవంకను పూర్వాచార ప్రియులు మరియొకవంకను బట్టి లాగుచుండ సామాన్యులమిత బాధలఁ బడుచుండుట యనుదినమును గనుగొనుచున్న విషయమే.

ఈ యవస్థలన్నియు ద్విజులలో ముఖ్యమగు బ్రాహ్మణసంఘమునకు లెస్సగా బట్టియున్నవి. క్షత్రియసంఘము మిగుల బరి

మితమై యున్నది కనుక దాని కష్టసుఖములు లోకమున కంతగాఁ దెలియుచుంటలేదు. ఇఁక మిగిలియున్నది వైశ్యసంఘము. ఇద్దానినిగూర్చి కొంచము పరిశీలనజేతుమేని నిది, మొదటిసంఘము పడుచున్నన్ని పడిపాట్లు పడుచుండలేదని స్పష్టముగా దెలియఁగలము. దీనికిఁ గారణమేమో మహా గొప్పదికాదు. అప్పటికి నిప్పటికిగూడ గొంతమంది పెద్దలు చేరి చేసిన యేర్పాటులకు లోబడి నడచుకొనుటయే యీ సంఘము నన్నివిధముల రక్షించుచున్నది. ఈసంఘముయొక్క పూర్వ మర్యాదల నెరుగుట కొక్క కన్యకాచరిత్రము చాలును. వీరు, బౌద్ధయుగమునందు గోమఠపీఠమునకు జెందియుంటవలనఁ గోమటులనియు ధర్మసభలయందు న్యాయవాద న్యాయాధిపత్యాది శ్రేష్ఠస్థానముల నలంకరించుచుండుటంజేసి శ్రేష్ఠులనియు వ్యవహరింపఁబడుచు వచ్చిరి. వీ రాయాకాలములందు జేయుచువచ్చిన త్యాగము లత్యద్భుతములు. వాటియందెల్ల ముఖ్యమైన దిది:—

పెనుగొండ యొకప్పుడు మహావైభవముతో నుండెను. ఇది యీ వైశ్యులకు ముఖ్యవాణిజ్యస్థలమై యుండెను. ఈసంఘమున కప్పుడు, కుసుమశ్రేష్ఠియను నాతండు 'కులపెద్ద'యై యుండెను. ఆతఁడు సంతానము లేక కులగురువగు భాస్కరాచార్యుని యానతి ననుసరించి పుత్రకామయజ్ఞము నొనరించి తత్ఫలముగ నిరువురు కవలను గాంచెను—ఒక యాఁడుబిడ్డయు నొక మొగబిడ్డయు. వాసవియు విరూపాక్షుఁడు నను నామములతో నా సన్తానము మిగుల గారాబముతోఁ బెరుగుచుండెను. అట్టియెడ విష్ణువర్ధనుఁడను రాజు, తీర్థయాత్రామిషంబున దేశముల దిరుగుచు మార్గమధ్యముననున్న యీ పెనుగొండనుగూడ జూడవచ్చెను. ఊరేగుచు వచ్చుచుండిన యీ నరపతికి బురమందలి తరుణులు నీరాజనములఁబట్టి మరియాదల నెరపుచుండిరి. అత్తరిఁగుసుమశ్రేష్ఠియు దన యిరవుకడకు నరవరు డరుదేరగనే, తన పుత్రికయగు వాసవిచే గర్పూరహారతి బట్టించెను. అట్టిసమయమున రాజా పదిపంచ్రెండేండ్ల కన్యనుజూచి కామశరావిద్ధుఁడై యీపెను ఏనకిచ్చి పెండ్లిచేయుమని కుసుమశ్రేష్ఠిని నిర్బంధించెను. సర్వతంత్ర స్వతంత్రుడే యయ్యును గుసుమశ్రేష్ఠి సంఘమున గల పెద్దలతో నాలోచింపక యేదియుఁ జేయఁడు; అది యాతని మర్యాద. సామాన్య విషయములందే యట్లులున్నపు డిఁక నిట్టి యసామాన్య విషయమున నాతని చర్య యెట్టులుండునో వేరుగఁ దెల్పనేల? ముఖ్యములగు పదునెనిమిది పట్టణములయందున్న వణిజపుంగవులకు నీయుదంత మాద్యన్తము దెలియఁ జేయఁబడెను. మహాజనులందరు బెనుగొండయందుచేరి గొప్ప సభగావించి వైశ్య బాలికను క్షత్రియకులజున కీయరాదని సిద్ధాన్తపరచి యీ వృత్తాన్తము రాజున కెరింగించిరి. అదివిన్నవెంటనే రాజు, కోపోద్దీపితుండై వైశ్యకులనిర్మూలనముజేతునని పెనుగొండపై కెత్తివచ్చెను. సంఘమర్యాదను నిలువఁబెట్టుకొనుటయా, లేక రాజునకు లోబడుటయా, యను విషయము చర్చించుకొనుటకు మహాజనులు మరియొకసభ చేసిరి.

అందు, కన్యకయగు వాసవి, సభవారి వాదోప వాదముల నొక్కఁబెట్టున గట్టిపెట్టి సంఘ మర్యాదను విడకయు రాజుచేతఁ బడకయు నుండుటకు దా నగ్నిప్రవేశము జేతుననియు, నాత్మగౌరవమే ముఖ్య మనుకొన్నవారు, తనతోఁగూడ నగ్నిప్రవేశము జేయవచ్చు ననియు రూఢిగఁ దెల్పెను. ఆ తీర్మానము చొప్పున రమారమి నూరు కుటుంబముల వా రా కన్యకామణితో నగ్నికాహుతులై యాత్మగౌరవమును రక్షించుకొనిరి. అతి సంక్షిప్తమేయైనను ఆనాటి సంఘమర్యాదల నెరుఁగుదమను వారి కీ విషయ మింతే చాలును.

ఒక కన్య ధర్మాధర్మ నిర్ణయముచేయుట, దానియందున్న గుణగౌరవముఁ బాటించి సంఘమునందలి పెద్దలును బిన్నలును దల లొగ్గి యగ్గింబడుట! ఇది సామాన్యమా!! కాదు కాదు!! "స్వధర్మే నిధనమ్ శ్రేయః పరధర్మో భయావహః" పరధర్మము నను ష్ఠించి దానంగలుగు నాత్మగౌరవనష్టివలన లభించు సుఖపుష్టికంటె స్వధర్మమును బాటిం చుటవలన గలుగుచేటే యుత్కృష్టతరము కదా! ఇది యార్యుల తెరఁగు; దీనికిఁ దిరుగు లేదు! అథవా యెవ్వఁడైనఁ దిరుగుబా టొనర్చునా వానికి మరి సంఘమర్యాదయున్న; వాఁడెంతవాఁడు కానీ!!

అట్టి కట్టుబా టీ నాటికినిఈయార్యవైశ్య సంఘమునఁగలదనుట యతిశయోక్తికాదు. వీరేశలింగం పంతులుగారు తమ యావజ్జీవ మును శ్రమపడి పూర్ణసిద్ధినొందలేని బాల వితంతూద్వాహవిషయమున నార్యవైశ్యు లిటీవలఁ గొలదికాలములోనే యెంతో కృత కృత్యతఁబడయఁగల్గుట మనకనులయెదుటి మాట. సంఘమునందు బదిమంది పిన్నపెద్దలు చేరి చేసిన కట్టుబాట్లకు లోఁబడి నడచు కొంట కలవాటుపడియుంట యీయార్యకుల ముకు కుగ్గుపాలతోఁబట్టఁబడినది. దానధర్మ ప్రతిష్ఠాపనలయందును సంఘ మేకీభవించు చున్నదియే కాని "యెవరికివారే యమునా తీరే"యనుటలేదు. ఇప్పట్టున నిట్టిభాగ్యము విప్రసంఘమునకే పట్టునేని దేశ మొక్కతూరి యీ దరిద్రదశనుండి విముక్తముకాదా!! సోదరీసోదరులారా, ఒక్కమాట చిత్తగిం పుఁడు:—పసునాలుగేండ్లబాల, ముక్కుపచ్చ లారనిది విధివిపాకమున గతభర్తృకయయ్యె నా దానిపని యంతే! అంతరాత్మ'యౌను సరే'యనుచున్నను అహంకారము మాత్ర మయ్యువారిని విడువకున్నది. ఇదే సమయ మని యాంగ్లేయాచారవాది సంస్కరణమను పేర ననర్థకుఁడగుచున్నాఁడు. ఎద్దెండకూ పోతునీడకూ లాగుచున్న యీబండి ఒడి దుడుకులఁబడుచున్నది.

ఇట్టియెడ రక్షకులెవరు? మనసోదరీమణులే! ఔను, వారే!! ఆడువారి కష్టసుఖము లాడు వారే యెరుగవలయును. గనుక సంఘమును యథాయోగ్యముగ సంస్కరించుట కిప్పట్టున నడుము గట్టుకొనుట యవసరము. సమ యము పడినప్పుడు అగ్నిప్రవేశముజేయుట వారికిఁ బెండ్లియింటఁ బ్రవేశించుటవలె పర మానందము. రాజకీయపుఁజిచ్చునఁ జొచ్చిన యిల్లాండ్రే, అదియటులుంచి యీ సంఘ

వ్యవస్థలను జక్కఁజేయం బూనుకొనియుండి నచో దేశ మింతవర కెంతో ముందుకువచ్చి యుండును. కాని అదియట్లు కాలేదు. ముందుగా వాకిలిఁదుడుచుకొనియావల నిల్లు దుడుచుకొంటవలె వ్యత్యస్తమైనది. ఐనను బాధలేదు. ఇప్పుడు వానిం‍ద్రిప్పుకొనుట కవకాశములు పోలేదు. ఇందుకు మన యార్యవైశ్యసంఘమే నిదర్శనము. ముందుగ నిపుడు పూనుకొనవలసినది స్వసంఘలోప సంస్కరణమునకే! కష్టమంతయు దీనిలోనే యున్నది. ఇది జయప్రదముగ నిర్వహింపఁ బడునేని రాజకీయసంస్కరణముల కంత శ్రమయుండనేయుండదు. సంఘమంతయు నొక్కటియే యభిప్రాయముతో నడువ నున్నపుడు దానికి వ్యతిరేకముగ రాజశాసన మెన్నఁడును జేయబడనేరదు. అథవా చేయఁబడినను అదియేమూలనో పడియుండ వలసినదే యగును.

కాబట్టి మున్ముందుగ సంఘసంస్కరణమే యథాయోగ్యముగ గావలసియున్నది. ఇదియు సమగ్రముగా గానలయునన్నయెడ స్త్రీలే పూనుకొనవలెనని యొత్తిచెప్పుట పునరుక్తికాదు. అందువలన మనసోదరీమణు లిప్పట్టున సంఘసంస్కరణ విషయమున బూనికనహించుట లెస్సయని మరియొక తూరి హెచ్చరించుచున్నాము.



## స్మృతి

నరహరిశెట్టి శేషగిరిరావుగారు

సీ॥ దిగుమర్తివంశాబ్ధి తీవ్రకరేతరుండగు రఘునాధరాయని ద్వితీయ
పుత్రికామణివయిపుట్టి పుప్పలవంశవార్థిచంద్రుని చెట్టబట్టి నిజస
తీత్వమ్ము వెలయించి ధీమంతు లీయమ సాధ్వియనంగఁ బ్రశస్తిగాంచి
పతిసేవసలిపి యప్పతిమన్ననలగాంచి ఇంతులలోన మేల్బంతివగుచు

గీ॥ నెసగికటకటా!! యిర్వదియెన్మిదేండ్ల
కే సుఖాస్పదమైన యీాయిహముపీడి
పరమునకు నీవుజనితివి భవ్యసుఖము
వరలుత న్నికహా లక్ష్మినరసమాంబ॥

గీ॥ సరసమగుపక్కిఁ బ్రేమసాగరము వ్రాసి
నావు; కవయిత్రివౌట నా నాకమందు
గల శచీదేవి పొత్తున వెలయునీకు
శాంతి జేకూర్చు గావుత శంకరుండు ॥

# మాధవస్మరణము

శ్రీమతి కె. ఎ. కమలాంబగారు

ఉ॥ శ్రీరఘురామచంద్ర, సరసీరుహసన్నిభ చారునేత్ర, పం
కేరుహ సంభవార్చిత, నృకేసరిరూప, మహాత్మ, త్వత్పదాం
భోరుహముల్ మదిన్నిలిపి పూజలు సేయుచునుంటి. నన్ను నే
తీరుగ మంచిదారి గడతేర్చెదో భారమునీదె మాధవా ॥

ఉ॥ ఎచ్చట జన్మమొందితినో? యెంతయు బాల్యవిహారలీలలం
దెచ్చట కాలయాపనము నే నొనరించితినో దలంపగన్?
యెచ్చటనుండివచ్చితినో? యెచ్చటికేగగ నున్నదాననో?
అచ్చెరువయ్యె నావిధము నంతయెరుంగుదు వీవె మాధవా॥

ఉ॥ ఎన్నిభవంబులందితినో? యెన్నగరాని భవాబ్ధితీరమున్
గన్నదిలేదు. నీ చరణకంజములన్ విడనాడ. నింకనన్
కన్నడ సేయ నీకుదగునా, సుగుణామృతపూర, పావనా?
పన్నగతల్ప, భక్తగణపాలనమున్ వహియింపు మాధవా ॥

ఉ॥ ఎక్కడికేగియున్న విధి నెవ్వరుదాటగలేరు. ఎవ్వ డీ
ఫక్కిజరించినన్ జనము ప్రాక్తనకర్మము మార్పుజెందునే?
పెక్కురు పెక్కురీతుల వివేకములేక వచించుచుంద్రు. నే
నక్కరపాటుతోడ భవదంఘ్రియుగంబునుగొల్తు మాధవా॥

ఉ భక్తులు నీచరిత్రమును భక్తిమెయిన్ వినుచుంద్రు. మూఢుల
వ్యక్తులు నిన్నుగానక భవాంబుధిలోబడి కొట్టుకొంచు వి
ధ్యుక్తములైనకర్మముల నొక్కరు సేయరు ఏవిధిన్ భవ
న్ముక్తిపదంబు బొందుటకునోతురో చెప్పగజాల మాధవా.

# కాంతాజన కల్పభూరుహము

శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతిదేవిగారు



ఏప్రియలునెల 'గృహలక్ష్మి' యందలి స్వర్ణకంకణబహూకృతినిగాంచి నంతనే కాంతాలోకముపొందిన యానంద మింతంతయనరాదు. బహు పురాతనకాలమునుండియు గూడ చరిత్రపుటల దిరుగివేసిన మా కెచటను గూడ నిట్టి అపూర్వ అనన్యబహూకృతి గిన్పట్టదయ్యెను. మనుచరిత్రను కృతి నందుకొని యెనువేళ పల్లకీ తనచేతబట్టి ఎత్తిన రాజచంద్రునివంటి అఖండ ఆంధ్రకవితా పోషకుని కాలమున గూడ స్త్రీలిట్లు గౌరవింపబడలేదు. అంతియగాక అనన్యసామాన్య ప్రతిభావంతురాలై, కలికల్మషహరంబును, సంసారసాగరతరణంబును, ముక్తివిధానమునగు రామాయణము నా బాలగోపాలము పఠించునట్లు అత్యంత సుబోధకముగ రచించి అజరామరకీర్తిని బొందిన మా సోదరి మొల్ల తనకాలమున ఇట్టి యఖండకీర్తికి గురియైనట్లు వినియుండలేదు.

ఈ మహానందమునకు కారకుడు గృహలక్ష్మిపత్రికాధిపతియగు డాక్టరు కే. యన్. కేసరి మహాశయుడు. స్త్రీజనసముద్ధరణకై నరసాపురంతాలూకాభివృద్ధిసంఘమునకు ఏటేట నొక స్వర్ణపదకమీయ ఈ మధ్యనే సంకల్పించిన యాతని యుదారత ఎంతయు సన్నుతనీయము.

శారదలేఖల వేయిపత్రుల సచ్చొత్తించి యుచితముగ తత్కవయిత్రి కర్పించిన వీరి యీావియు తత్సభాముఖముననే వారి కంకితమొనర్చిన యామె కృతజ్ఞతయు స్తుతిపాత్రములు. పత్రికానిర్వహణ మిక్కాలమున నెంతయు కష్టసాధ్యము. అట్టి ధనవ్యయ ప్రయాసములకు లెక్కింపక అత్యద్భుతరీతిని 'గృహలక్ష్మి'ని ప్రకటించుటయెగాక ఈవిధమున స్త్రీజనోద్ధరణమునకు నడుము గట్టిన కేసరి మహాశయు డెంచిచూడ 'కాంతాజనకల్పభూరుహము' గాక మరేమి యగును. కేసరి మహాశయుడు ఆయురారోగ్య ఐశ్వర్యములతో తులదూగుచు అఖండయశోవిశాలుడై స్త్రీజనసముద్ధారకుడై వెలయుగాక.

సరస్వతీ స్వరూపురాండ్రైన స్త్రీల నీవిధిగౌరవించు ప్రథమ స్త్రీస్వర్ణ కంకణ బహూకృతి యనెడు మహాభాగ్యమునకు గురియైన కేసరిగారిని అభినందించుచు ఆగౌరవమునకు పాత్రురాలైన సోదరి వరలక్ష్మికి మాయాశీస్సుల నొసంగుచున్నారము.

# కన్నీటి కానుక

శ్రీమతి కృష్ణకుమారిగారు

అమ్మా,

చిన్ననాఁడు నీయొడిని గూర్చుండి స్నిగ్ధమగు నీయమృతహస్తములతో నాశిరము నిమురుచుండ, ఓనమాలు దిద్దినదానను. నీయొడిని గూర్చుండిన యంగకములతోడనె, నీచేతియొరవడిదిద్దిన చేతితోనె, నీపలుకుల ననుకరించిననోటితోడనె యిపుడు నీకు వీడ్కోలు వ్రాసి చదువుచున్నదానను. ఇది మాయ విశ్వాసతకుఁ బ్రబలనిదర్శన మందువుకాఁబోలు! కాని అమ్మా! అట్లుకాదు. కాలమున కెదురీదువా రెవరు?

'కమలములు నీటఁబాసినఁ గమలాప్తు నిరశ్మిసోకి కమలినభంగిన్, దమతమ నెలవులు దప్పినఁ, దమ మిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ' అనునట్లు కాక, స్థానభ్రంశము నొందినను మనమనసు లెపుడును కృతఘ్నతాపరితప్తములు కాకుండుఁ గాత. వేదాంతమునఁ బలికిన 'సహనావవతు. సహనౌభునక్తు. సహవీర్యంకరవావహై. తేజస్వినావధీత మస్తుమా విద్విషావహై. ఓంశాన్తి శ్శాన్తి శ్శాన్తిః' అను వాక్య మెన్నడు నవితథము కానేరదు. చిరకాల పరిచిత లని కాని, చిన్ననాఁటి శిష్య లని కాని, మురిపమునఁ బెంచిన ముద్దుబిడ్డ లని కాని, తల్లి నెడఁబాసిన యభాగిను లని కాని, యనుకంపనీయ లని కాని, యెట్లైనఁ గానిమ్మ మమ్మొకపరి స్మరించుచుండుము. అంతియె కాని నిన్ను విడనాడఁ బొల్పడితి మని మాయందు కృతఘ్నతాధూర్తలక్షణముల నారోపింప కుందువు గాక!

మాతృహృదయముయొక్క ప్రగాఢతను మే మీనాఁటికిఁ గనుగొంటిమి. ఏ మందువా? ప్రేమ ప్రపూరిత మగు నీహృదయకుహరమున మమ్మెట్టులా మంత్రించుచుంటివో! లేకున్న నెన్నఁడో చదువు సెప్పఁ జాలించిన నీపై మామన సిట్లు పర్విడ నేల?

ఆనందమయమగు శైశవమునకుఁ దల్లివోలె, బ్రహ్మచర్యమునకుఁ దండ్రివోలె, ప్రాపంచికసుఖానుభవమునకు భర్తవోలె, భావిజీవితము నానందకందళిత మొనర్చుటకు మూలకంద మగు విద్యకు నీవాద్యవు. మా యీవిద్యార్థినీజీవితమునకు నీద యాద్యసృష్టి 'భవతి విద్యాం దేహి' యని చేయిచాచి వచ్చిన మాకు నీవిడినదే ప్రథమభిక్ష. వర్తకుఁడు బోణీ బేరము శుభచిహ్నముగ స్మరించినట్లే, మావిద్యాజీవితమున నీశిక్షాప్రారంభమె పవిత్రమైనదిగఁ బరిగణింపఁబడుచున్నది. ఇక్కారణముననె నీవు సుస్మరణీయవైతివి.

కనిపెంచిన తల్లి మూర్ఖ యగుచో, నాబిడ్డ చతుర యయ్యు బోధనము లేమి నంధప్రాయ యగును. ఆ నింద యాబిడ్డతల్లి నలమికొనును. కాని విద్యామాత వగు నిన్నానింద యలమికొనదు. నీవు జ్ఞానము నేర్పుటకే తల్లివైతివి. అంధజీవితమున జ్ఞానప్రభను వెల్గించుటకే మాతవైతివి. సత్త్వైకప్రసన్న మగు మనముతోఁ బరికించితిమేని బిడ్డకుఁ దల్లిని మించి వేఱు గతిలేదు. అట్టి జీవనప్రభాత మను విద్యామాతను నిన్ను మరతుమా! మఱవము. మఱవఁజాలము. మఱతు మను మాటయే మఱతుము.

అమ్మా! నీవు దయామతి వనుకొంటిమి, కాని కొన్నియేండ్ల యవినాభావసంబంధము నొక్కమాఱు త్రెంపఁ జూచుచున్న యోప్రణయమూర్తి స్నేహప్రపూరితహృదయమా! ఇపుడు దయావిహీన వైపోతివా? ఎన్నేండ్లనుండియో నిశ్శబ్దగాన మొనర్చుచున్న మాహృదయవీణయొక్క ప్రేమతంత్రుల నొక్కమాఱు త్రెంపఁజూతువా! తెగిపోయిన తంత్రుల మఱల నెవరు బిగింతురు! బిగింపకున్న సుప్రసన్నగానమధురిమ కలవడిన మాజీవకుసుమ మొక్క మొగి నాగిపోయిన యీ గాననైశ్శబ్ద్యాతపమును సహింపఁగల్గునా! పదునాల్గేండ్లనాఁటి నాందీప్రస్తావన కీనాఁడు భరతవాక్యరూపక మగు మంగళము బాడుచుంటివా! తల్లీ! నీకిది మంగళదిన మగు నేమొ కాని, మాకు మాత్రము మహాకాళదివసము,

బిడ్డల నదయులై వీడఁ జూచుట నీకు బాడి గాదు. కాని నీవేమి సేయుదువు? మేమేమి సేయుదుము? కాలబద్ధుల మగు మనము శోకించియు లాభములేదు. సంతోషించియు లాభములేదు. తట్టుకొనివచ్చు హృదయావేగము నాపలేక, తలమున్క లగు శోకవార్ధిని మ్రింగలేక వ్రాసిన యీ వ్రాతఁచే విలపించితి మనుము. ఏమైన ననుము. కాని సహజమగు బిడ్డలధర్మమును వీడలేము. పొంగి పొరలివచ్చు శోకము నాపలేము. ప్రేమామృతవృష్టి గురియు నీవాత్సల్యమును మఱవలేము. కౌగితముపై కల మాడుటలేదు. కంఠము రుద్ధ మగుచున్నది. బుద్ధిస్థ మైయున్నంత ప్రతిష్ఠ మగుటలేదు.

జీవితమున సుఖదుఃఖానుభవమునఁ దలపునకు వచ్చు జననివోలె, పుస్తకము తెఱచుసరికి నీయమృతమూర్తి కండ్లకగపడక మానదు. నీవిద్యాదానము స్మృతికిఁ దట్టక మానదు. దానిని నివారించుట మాతరముకాదు. హృదయమున సుస్థిరముగఁ బాతుకొనిన నీమూర్తిని దుడిచివేయఁ గల్గుదుమా! తల్లీ! యంత కృతఘ్నులము కాఁజాలము. ఇందలి పౌనరుక్త్యము మందీభూత మగు మాశోకమును ద్విగుణీభూత మొనర్చుచున్నది.

త్వద్విరహితులమై మాతృప్రణయప్రపంచమున స్థానము గానక గాలితాఁకుడున కల్లలనాడు లతలవోలె తల్లడమందుచుంటిమి.

గర్భస్థశిశుపాదప్రహరణము నానందముతో సైచు మాతబోలె, అర్భకుని యసభ్యసంభాషణముల శుభదృష్టిఁ దీర్చి దిద్దు తల్లిబోలె, క్రించుదనమున దిరుగాడు సంతానమును మంచిదారికిఁ ద్రిప్ప నుంకించు జననివోలె, మా నేరముల నన్నిఁటిని నీవు సైరించి మమ్ము సుశిక్షితలఁ గావించి సన్మార్గగాములుగ నొనరించితివి. మిగిలిన తప్పులకు 'దాసులతప్పు దండముతో సరి' యనున ట్లనుగ్రహింపుమని యంజలి మోడ్చి యభ్యర్థించుచుంటిమి.

ఇయ్యది నీకు వీడ్కోలంటివా! కాదు. వినతిపత్రమా! అదియుఁ గాదు. పరిచయభ్రష్టతనొందుచు క్రూరుడగు దేవునకు నీక్షేమమునకుఁ జేయు ప్రార్థనమా! కానే కాదు. నీభావిజీవితమునకుఁ బాడు మంగళగీతియా! అంతకంటె కాదు. నీశుభోదయమునకుఁ బల్కు స్వస్తివచనమా! కాదు, కాదు. మఱేమి! నీభావిసుఖపథము నతిపరిచయముచే నడ్డగించు కన్నీటికాన్క!!

(ఇయ్యది రాజమహేంద్రవరమునందలి 'శ్రీఆంధ్రయువతీసంస్కృతకళాశాలోపాధ్యాయిని యగు ఉభయభాషాప్రవీణ శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారి వీడ్కోలుసందర్భమునఁ జదువఁబడినది.)

---

# హెచ్చుపన్నులు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

గంజినీళ్లను ద్రావు కడుపేదవారైన తప్పక కొనియెడి యుప్పుమీద।
ధనికదరిద్రతా తారతమ్యములేక నెల్లరికగు నిప్పువుల్లమీద।
పసిబిడ్డలకు బోయు పాలలో సైతముతఱచు వాడెడి పంచదారమీద।
దినదిన మింటింట దీపాలకై ప్రజ మానక గొను మట్టినూనెమీద।
మరల పన్నులు తగిలించె దొరతనంబు అసలె డబ్బులేక ప్రజ లల్లాడుతఱిని
హెచ్చుపన్నులు గూడ పైవచ్చిపడిన జనుల మనుగడ యేరీతి జరుగునింక?॥

# దైవరక్షితంబైన శిశువు

శ్రీమతి వరసా సీతారామమ్మగారు.

ఒకనాటి సాయంసమయమున నేను నా యనుంగు సహవాసపు కత్తెయగు వసంతయు మా గ్రామమునుండి అక్కగారివూరికి పోవుటకు బ్రయాణమైతిమి. నేనుండు పల్లెకును ఆ వూరికిని సుమారు అయిదు ఆరు మైళ్లుండును. అది సాయంసమయమగుటజేసి కొంత దూరముబోగా సూర్యభగవానుఁడు పడమటిదిక్కున నస్తంగతుఁడయ్యెను. ఆకసంబున బక్షులు దినంబంతయు నాహారంబునకై తిరిగి తిరిగి సంపాదించి వాటిని తమ చిన్నపక్షుల కిచ్చుటకై గూళ్లం జేరుచుండెను. సమస్త జనంబులును వారి వారి దినచర్యలు మాని విశ్రాంతికొరకు గృహంబులకుం జేరుచుండిరి. అయ్యది బహుళపక్షమగుటచే గాఢాంధకారము నతిత్వరితంబుగ నాలుగువైపులం జుట్టుకొనియెను. అట్టి నిశీథసమయంబునందేనును నా చెలికత్తెయు నొక నదీతీరంబు జేరితిమి. ఆనదీతీరంబున దిరుగులాడు పక్షుల కిలకిలనాదంబులును, కాపువాండ్ర కేకలును, గూళ్లంజేరిన పిట్టల సరసపు వచనంబులును నాహృదయంబున జెప్పరాని భావంబుల నంకురింపజేసినవి. నేనును నా స్నేహితురాలును నా నదీతీరంబున బారులు తీరియుండు వృక్షంబుల మధ్యనుండి మాటలాడుచు బోవుచుంటిమి

అట్టి సమయంబున మిణుగురు బురుగులును, కాపువాండ్రు వేయు మంటలు, నీటి ప్రతిఫలింపులు నా హృదయంబు నాకర్షించి పరమానందము గలుగజేసినవి. అప్పుడు తటాలున నొకపసిబాలుఁడు సంతోషంబుచే కిలకిలమని కేకలువేయుట మిక్కిలి మాధుర్యంబైన గానంబువలె నా చెవులంబడినది. ఆ గానంబును నిశ్శబ్దుండనై యాలకించితిని. ఎచ్చటనుండి యాశబ్దము వచ్చుచున్నదని ఆబాలునకు ముందునకును వెనుకకును నా గాఢాంధకారములో తీక్ష్ణదృష్టులచే చూచితిని. అచ్చట ఏలాటి బండ్లసందడియు లేదు. పసిపిల్లల చంకనిడుకొని చనువారెవరు గాని బొడసూపరైరి. చుట్టుప్రక్కలయం దుండు పొలములలో నా సమయంబున మనుష్య సంచారము ఏమియూ లేదు. మాటిమాటికి ఆచిన్నబాలుని మృదుమధురమైన కేకలు స్పష్టముగ నా కుడిప్రక్కనఁ బాఱు నదియొక్క వొడ్డున వినిపించినవి. నేనంతట నా మార్గంబువదలి యానదీప్రవాహంబు వొడ్డుననే యిటునటూ పరికించుచూ నడువనారంభించితిని. ఆ చిన్నబాలుని వచ్చియురాని యఱపులు వినవచ్చుచుండెను.

అంత నేనచ్చోట కొంచెముసేపు నిలచితిని. నాఎదుట నీటికి సుమా రొక రెండు గజంబుల దూరంబున ఒకబాలుఁడు ఆరు మాసముల బ్రాయపువాఁడు కాళ్లు చేతుల గదలించుచు నాకసంబున దేదీప్యమానంబుగా బ్రకాశించెడు నక్షత్ర సముదాయంబుతో నాడుకొనుచు నొక యిసుక తిన్నెపై బరుండియున్నాఁడు. ఇదేమి యాశ్చర్యంబని తలంచి యాబాలుఁడు నీటిలో దొర్లి పడునేమోయనుభీతిచే నా చోటును జేరితిని. నాల్గువైపుల బరికించి చూచితిని. అంత నా బాలుని సమీపమునంజేరి చూడ నాతడు

కృష్ణరూపియై, నడుమున మొలతాడులేక చిటిసవ్వులు, కిలకిలధ్వనులతో నా యిసుక తిన్నెపై శయనించి యున్నాడు. ఆ యిసుక తిన్నెయే ఆ బాలునికి పానుపయ్యెను. అంత నేను "ఎవ్వరిచ్చట ? ఎవ్వరిచ్చట ? ఎవ్వరుగానరారే? ఈ బాలుడెవడు ?" అని పెద్దగా నఱచితిని.

నాయఱపుల కం దెవ్వరును ప్రత్యుత్తరః బొసంగరైరి. నదియందలి ప్రవాహము మఱింత శీఘ్రముగా బాఱజొచ్చెను. చీకట్లు దట్టముగా నాలుగువైపుల వ్యాపించెను. నేను యింకొకమాఱు బిగ్గఱగా నఱచితిని. ప్రవాహము విసుగుచే వెడలిపోయెను. అప్పుడు నా వ్రాహాలకు మేఱలేదు. దుర్మార్గస్త్రీలెవరైనా యీశిశువు నిచ్చట వదలిరేమో? దొంగలు నగలకై దెచ్చి చంపచేతులు రాక నిట వదలిపోయిరేమో ? అంత నాబాలుని తడివితిని. ఎక్కడను అప్పుడు ప్రసవించిన నిసుగుగుర్తులు లేవు. పుట్టి కొన్నిమాసంబులైనట్లు తోచినది. అప్పుడు నా భయంబునకు మేఱలేదు; పిశాచంబుల బిడ్డడేమో? దేహంబు జలదరించి యిటునటు చూచితిని. పాదములు చేతులు సరిగానేయున్నవి. ఎవ్వరో కావల యునని బరుండబెట్టినట్లు దోచినది. అంతట నేను కొంతధైర్యముదెచ్చుకొని చిటికెలు వేయుచు నా శిశువు నాడించుచుంటిని. ఆ శిశువు మొదట ఏడ్వనారంభించినను తుదకు నవ్వ నారంభించెను.

ఇట్లుండగా నా వెనుక "ఏ బాబమ్మగారు" అను నొక ధ్వనిరాగా నాగుండెలు దడదడమని కొట్టుకొనసాగెను. అంత ఒకస్త్రీ చీపురుకట్ట మోపొకటి తలపై నిడుకొని యా నదిని మెల్లమెల్లగా దాటి వచ్చుచుండెను. ఆమె వొక ఎఱుకుల చిన్నది. ఆమె తన జీర్ణాంబరమును సాధ్యమైనంతవరకు సర్దుకొని తలపైనుండు భారము నచటదింపి నవ్వుచు నచ్చట నాడుచున్న శిశువునెత్తుకొని నిలుచుండియే పాలిచ్చినది. చింపిరిజుట్టు నల్లని శరీరము చినిగిన వస్త్రము నామెను వికృత రూపిగా చేసినను మోమున కళ అంగసౌష్ఠవము నామె నెఱుకులవారిలో సందగత్తెగా చాటినయవి. అంత నాబాలుని వేఱొక గుడ్డతో గట్టిగా గట్టుకొని "ఏమీ బాబమ్మగారూ?" అని సన్ను పలుకరించినది.

నిలుచుండి యింతవరకు మాట్లాడక వింత పడిచూచు నాకు కోపమువచ్చి నీకు బుద్ధి లేదటే ? బాలుని నీటివద్దవిడిచి వెళ్లినావు!! దొర్లిపోతే ? అడవిమృగములు తినిపోతే ? పాములు తేళ్లు కుట్టితే ? ఏమనుకున్న ఏమున్నది? అని చీవాట్లు పెట్ట నారంభించితిని. ఆమెనవ్వుచు నావంకజూచి "ఏంట్లోనండీ! మీకేమండీ యిళ్లూ వాకిళ్లూ వున్నాయి!! మాకు పొలాలు అడవులు బయళ్లేనండీ మా యిండ్లు." అని పలికి ఎక్కడవున్నావురో? యని కేకవేసింది. "ఆ" అని అనదివొడ్డున ఒకపొలములో నుండి ఒక ధృడకాయుడు నల్లనివాడు ఎఱుకులవా డొకడు ఎలుకుల బుట్ట బుజానవేసుకొని గోచియు చినిగిన తల పాగయు గలిగి మాకడకువచ్చెను. ఎన్నెలకలు పట్టావురా? యని యామె యన్నది. నలభై మూడేయని వాడన్నాడు. పొలము కాపులు ఎలుకకు అర్ధణా యిచ్చెదరు.

హారినేత్రంబులు ఆ గాఢాంధకారంబున దేజరిల్లుట కనుగొంటిని. మోపునెత్తి మీద పెట్టావేమో యని పిల్చా. ఈ బాబమ్మగారు వెకలిస్తుండారు. అని నవ్వుచు చెప్పెను. 'ఏ' యని వాడేడవ ఆమె పిల్లవాని సమాచారము అంతయు వాడితో చెప్పినది. అంత నావంక దిరిగినవ్వుచు బాబమ్మగారూ! మాకేమిటండీ మేడలా మిద్దెలా! మేము చెట్టు క్రింద రాళ్లక్రింద నివశించాలీ. చెట్టుక్రింద అన్నంతినాలీ! భగవంతుఁడే మమ్మలను రక్షించాలి. నక్కలు అడవి మృగాలు మాకు చుట్టాలండీ" అనియెను. భార్యనెత్తిపై మోపెత్తిన తరువాత ఆ దంపతు లిద్దరు నడువ సాగిరి. నేనును వారితోకూడాబోతిని. వారు ప్రకృతిమాత శిశువులు. ప్రకృతియనిన వారికి భయమేమి? ఆ యెఱుకలదంపతులు వారి విచిత్రప్రేమవాక్యముల నానందించుకొనుచు పిల్లవానిని గారాబపుమాటలతో పలుకరించుచు నన్ను మఱచి పోవుచుండిరి. వారిజీవితముల మహానందము నాకుగూడ నెప్పుడును నుండవలయునుగదా యని పెద్ద నిట్టూర్పు విడిచితిని.



# పంచరత్నములు

బుక్కపురీ రామానుజాఖ్యుఁడు

వరకాంచీపురనాథా!
వరదా!వరదా!యటంచు వాకొనుచుఁ నిఁ
నిరతము గొలిచెడి యేత
త్పురవాసులభాగ్యమహిమ పొగడఁ దరంబే॥
శ్రీమదనంతాచార్య
స్వామిని వేదాంతశాస్త్రిపారంగతునిఁ
మామకపరమాచార్యుని
నేమంబున గొల్చువాడ నిత్యము భక్తిఁ॥
శ్రీకాంచీప్రతివాద్యతి
భీకరపీఠస్థులుగను వేడ్కలరఁగ నీ
లోకంబున విలసిల్లుచు
సాకతమున శిష్యజనుల సాఁకవె యార్యా॥
ఆచార్యశేఖర! సాష్టాంగదండంబు
భూలోకగీష్పతి! బుద్ధి బుద్ధి
గురువర్య! గురువర్య! కోటినమస్కృతుల్
పరమపావనరూప! ప్రణతి ప్రణతి
భక్తశిఖామణి! భద్రముల్ మీ కగు
శ్రీదేశికవతంస! శ్రీ లెసఁగుత!
భాగవతాగ్రణి! భాగ్యముల్ పెం పొందు!
వేదవేదాంతజ్ఞ! వినతి వినతి
శ్రీమదణ్ణంగరాచార్య! శిష్టచర్య!
చారుగంభీరవాగ్ధుర్య! మేరుధైర్య!
దేవరాజదయాపాత్ర! దివ్యగాత్ర!
జయము!పాపగుల్మలవిత్ర! జయము!జయము!
నరనారాయణు లనియెడి
యిరువురలో నొక్క రగుచు నిలలో మీరల్
కరుణాతిరేకమున నవ
తరించి రటంచు నేను దలఁతును మదిలోన్॥
మింటిని దూర్యనినాదము
లంటెను; విప్రావళినిగమాగమఘోషల్
వింటిని వీనులవిందుగ;
కంటిని భూసురుల కొసఁగ ఘనదక్షిణలఁ॥

[శ్రీమత్కాంచీపుర ప్రతివాదిభయంకరపీఠస్థులును దిగంతవిశ్రాంతకీర్తులును నగు విద్వచ్ఛిరోమణి ఉ॥ వే॥ అనంతాచార్యస్వామి షష్టిపూర్తిమహోత్సవమునందు సమర్పించుకొన్న స్తోత్రము శ్రీమత్పరమపురుష పరమాచార్య స్వాచార్యస్తోత్రములు.]

# వేళకు వలయు వేంద్రము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం.ఏ;బి.యల్.

ఆర్థికములైన యిబ్బందులు, రాజకీయములైన యిక్కట్టులును తలసూపినపుడే మహోద్యమములు ఉద్భవించును. ప్రజలమనస్సులందు గడ్డకట్టియున్న సంతృప్తిని కదలించి ఘనకార్యములకు వారిని పురికొల్పుటకు ఘోరమైన ఆపదలు అవసరమైయుండును. వీనిని గుర్తింపక, ఇవి తోచినపుడు ఉలికిపడుదుము. ఆర్తనాదము చేయుదుము. దుర్విధిని దూరుదుము. ఇట్టి సంచలనములందే గొప్పఉద్యమము లుదయించును. రాజకీయములందు బుట్టినఉత్సాహము, ఉద్వేగమును రాజకీయములందు తెచ్చినఫలితము ఆయబెల్లమే అయినను సాంఘికరంగమున చూపినఫలము అనిర్వచనీయమైనది. కావుననే సంఘసేవను దృష్టియందిడికొనిన "గృహలక్ష్మి" ఎండకాలమందు చిగిరించి, కనులపండువొనరించు వసంతశోభలీల నతిరయమున కనదురు రూపునంది కాంతిలుచున్నది.

సంఘసేవయందు నేడు స్త్రీలను ముందులకుదెచ్చినది "గృహలక్ష్మి"యే. పత్రికలవలన ఉన్నతఉద్యమము లెట్లుపెంపారునో "గృహలక్ష్మి" తెలిపినది. కొలదియేండ్లకుముందు ఆంధ్రస్త్రీలు తామెవ్వరో గుర్తెఱుగకుండిరి. వీరిపురోభివృద్ధికై "హిందూసుందరి" సుమారిరువదెనిమిదేండ్లనుమున్నే నడుముగట్టినను, వేళకు యేవేంద్రము నెఱుగక, కదలికనొల్లని నాటిమహిళాజాతి నుండవలసినంత ఉత్సాహమును, ప్రోత్సాహమును అందజాలకపోయెను. వేంద్రపువేళలోబుట్టి పెఱుగుట "గృహలక్ష్మి" యొక్క అదృష్టము.

ఈ వేడిమియందు బుట్టినఅసంతృప్తియే అపూర్వదృశ్యమును మనకనులెదుటం బెట్టుచున్నది. సుమారు పదేండ్లనాటి స్త్రీలకును నేటిస్త్రీలకును ఎంతేని వ్యత్యాసమున్నది. సంఘసంస్కరణమనిన నాటిస్త్రీలు కూడనితెగుపని కనులెఱ్ఱజేయువారు; నేడో? ముందు కురుకుచున్నారు. లాలిపాటలతోను, గాలిపాటలతోడను సంతుష్టినందక, ఇంటిలో అచ్చట్లతోడను ముచ్చట్లతోడను ప్రొద్దుపుచ్చక చక్కనైనపద్యములను, భావబంధురమైనగద్యలను, రసమునదొలుకాడు పాటలను నేడాంధ్రవతులు వ్రాయుచున్నారు. సంఘసేవయందు పురుషులకంటె స్త్రీలుపనిచేయగలవారు. సాహితీసేవయందు వారితో సములము కాగలమని వీరు నేడు రూఢిపఱచుచున్నారు.

వైదుష్యమును, గంభీరయోచనయు అలవడుటకు కొంతకాలముపట్టును. తీవ్రమైన లోకానుభవమును, తీక్ష్ణమైనదృష్టియు నున్నగాని సాహిత్యసేవకు గురుపీఠమీయగల యీ గొప్పగొనములు అలవడనేరవు. ఈ గుణములుకల ప్రజ్ఞాధురీణులను ప్రపంచమంతయు గలయ వెదకినను, నేడైదాఱుగురుకంటె నధికులు కానరారు. ఉత్తమసాహితీలక్షణములను కొలబద్దలు చేసి నేటివ్రాతలను పరీక్షింతుమేని ఇవికొఱగాని గుడ్డపేలికలట్లు మూలబడుననుట తథ్యము. రచనయందు సిద్ధహస్తులై, వాఙ్మయసేవయందు తలపండించుకొని దొడ్డవారనియు, గొప్పవారనియు పేరుగాంచి రచ్చలందును రంగములందును శాల్వలుగప్పుకొని ఉన్నతాసనములనదిన దిట్టలే బోర్లపడుచుండ ఆదర్శసాహితీసూత్రముల సమక్షమున తప్పటడుగు లిడుచున్న స్త్రీరచనములను నిలువంబెట్టి క్రొనుపరీక్షకు గడగుట నిష్ఠురమును దౌరాత్మ్యమునని తెలుపనక్కఱలేదు. తమంతదాము శ్రమించి, ధృతగతి సద్భూతప్రజ్ఞ నలవఱచుకొజాలని సారస్వతసేవకులకును సేవికలకును నేటివేడిమి నిమిషనిమిషమునకు ఎంతేనివిజ్ఞానమొసగుచున్నది. చరచర ముందరకు రాజాలిన కనుపర్తి-కాంచనపల్లి సోదరీమణులు తమయభివృద్ధిహేతువిట్టిదని గ్రహించియేయుందురు.

నేడు కనుపర్తిసోదరి స్వర్ణకంకణమునంది ఆంధ్రు

లకు ఆనందమునుగూర్చినది. ఉత్తమబహూకృతినంద ఆమెయు ఎంతేని ఆనందించి యుండును. తనకీ ఆనందభిక్షను, సంతోషభిక్షనుపెట్టిన ఆసంతృప్తిని ఆమె మఱువకుండు గాక! విశాలకేసరీహృదయమిచ్చిన రంగారుబంగారువన్నెగల నూటపదార్లు నేటిసంతుష్టి నుండి ఆమెను మరల నసంతుష్టిదెసకు నుడాయించి వేయినూటపదార్ల రెండవఘట్టమున నామెనుజేర్చి మరల మరల కురుక్షేత్రమున నామెను పురికొల్పగల దని నాయాశ. ఇట్టి యుపాయన మందని తక్కిన సోగరీమణుల యెడందలందీ పసదనము అభివృద్ధి కాంక్షను సలసలగ్రాగించునని కూడ ఆశపడుచుంటిని.

సేవాధర్మము నెఱపుపట్ల పారితోషికముల యపేక్ష ఏలయందురా? పుట్టువుతోడనే "గీత"ను కంఠమందిమిడ్చుకొని నిర్గుణోపాసనము ననుష్ఠించుట మాటల పనిగాని చేతలపనిగాదు. ఉత్కృష్టములైన అధ్యాత్మికసాధనములను నిముసములో అందిపుచ్చుకొనుడని సనాతనధర్మము తెలుపుచుండలేదు. సాధనమనినగంతుకాదు, మఱి క్రమానుష్ఠానము. సగుణోపాసకుడెన్నడు ధనంజయుడు కాజాలడు. నేటి స్త్రీ యుద్యమము విశేషాభివృద్ధి నందవలెననిన స్త్రీలు కావించుకృషి గుర్తింపబడవలెను. బహూకృతులీ గుర్తునకు గుర్తులు.

---

# ప్రణయకోపము

అధికార్ల సూర్యనారాయణరావుగారు

"కాలంబు హాయిగా గడుపుకొందాము
జానకీ! వేగరావలె మేడపైకి
అనుచునీతో జెప్పి యరిగినయంత
నందరు నున్నవా రను భీతిచేత
రా శంకనొంది యాలస్యమొనరింప
చిత్రమిది జానకీ! చిన్నతప్పైన
పెద్దగా గాన్పించి ప్రేమనంతయును
మాయంబుకాజేసి మహితరోషంబు
నాత్మలోపల నించి హాయి తొలగించు!
నిజమైనకోపంపు నిప్పుకల్ రగుల
నావేళ యేమేమొ యాచరింపంగ
పూనికవహియించి మోమును ముడిచి,
చూడ్కుల గోపమే చూపించుచుండి
మనసున గోపమే మంటమండించి
మాటలుమానంగ మదినిశ్చయించి
కోపాగ్నిశిఖలపై కూర్చుండియుండి:—
ఏధ్వనిచెవిబడ్డ నీరాకెయంచు
నెంచి నిరీక్షించి యంతకును నీవు
రాకపోవుటచేత శోకంబుచెంది
వేగవచ్చిన నెంత బాగుండుననుచు
దలచుకొనుచుండంగ.—మెల్లమెల్లగాను
కుచ్చెళ్లరాపిళ్లకును నొక్కమారు
ముచ్చటౌ గళరవంబుల కొక్కమారు
నాయాత్మ యుప్పొంగి నాట్యమాడంగ
మేడమెట్లెక్కి నాజాడ నీక్షించి
కోపంబుతోనుంట గుర్తించి నీవు:
అలుకయెంతోసేపు నిలుపదలచేమొ
నిజశక్తి బాగుగా నెరుగుట నేడో
తుదకీవె జయమునొందెద వంచునేమొ
నవ్వువెన్నెల వదనమున గాయించి
కన్నుల నానందకాంతి వెల్గించి
'కోపమా' యని చిన్నకోలను విడిచి
మేన మెత్తనిచేయి మెల్లగానుంచి
మోమునకెదురుగా మోమును బెట్టి
కనులతోడుత నాదుకనుల మంత్రించి
మోహనాస్త్రముబోలు ముద్దునిడినంత
తిట్టదలచినవన్ని దీవనలౌను
కోపమంతయుబోయి గొప్పవలపౌను
ఆననంబున నిల్చు లేనవ్వుకళలు
తుద కనురాగంబుతో కౌగలింతు!

# దురదృష్టవంతురాలు

కీ. శే. శ్రీమతి దామెర్ల సీతమ్మగారు

ఒకనాటి సాయంకాల మొకయంగన ఆరుబైటనిలచి దీనవదనంబున దనభావంబున గల దుఃఖంబు దేటబడ నాకసమువంక దృష్టిబరపి తనలో తా నిట్లని వితర్కింప దొడగె. ఓదయామయా? నీవు సర్వజీవులయెడ సమత్వముగలవాడవనియు, దయా సముద్రుడవనియు పక్షపాతరహితుడవనియు బుధులు వక్కాణించుచున్నారు. అదేల రిత్తయగు? జనకుడు నిర్దోషులగు బిడ్డలకు సంతసంబును గూర్చి, దోషుల శిక్షించుచుండునుగదా!! లోకపితవగుట మాలోపాలోపంబుల బాగుగ నారసి మాకు తగిన శుభాశుభంబుల నిత్తువని గ్రహించితి. నీవు నా కనుగ్రహ పూర్వకముగ దయచేసిన ప్రతివిషయంబును నానందముతో ననుభవింపగలదాన. నీ సృష్టిలో వోడలు బండ్లగుటయూ బండ్లోడలగుటయు చూడ బడుచున్నది. అట్లనే నాగతియూ నయ్యె. లోకారాధ్యా, నాయుదంతము నీ వెరుంగనిది కాదు. కాని నామనోవేదన నీకడ నొకమారు విన్నవించిన కాని, నాబాధ నివారణకాజాలదు. నీవు ప్రేమస్వరూపుడవగుట నీబిడ్డనగు నాపై నీకుగల ప్రేమంబున నించుక సావధానము కలిగి యాలకింతువని మొరవెట్టుచున్నాను వినుము. నేనొక సత్యసంధుని కుమార్తెను. ఆగర్భశ్రీమంతురాలనని కొంత కాల మందరును ననుచుండిరి. నాతండ్రి నెల యొకటికి మున్నూరు రూపాయిలు సంపాదించుచుండెను. ఇరువురన్నలతోడ బుట్టిన గారాబుపట్టిని. మిక్కిలిగారవంబున జిన్ననాటనుండియు దలిదండ్రులచే బెంపబడి యగ్రజుల యాదరంబున విద్యాబుద్ధులుగరచి సుశీలయన లోకంబుచే బొగడొందుచుంటి. పిదప లోకైక సుందరుండును, సుగుణభూషితుండును, సత్కులసంజాతుండును నగు పతిం బడసి యైకమత్యంబున నంతవారు లేరనిపించునట్లు దాంపత్యధర్మము నెరపి నీ యనుగ్రహమున సంతానవతినైతి. నలుగురు తనయులును నొక్కతనయుంజనుగూడ కలిగిరికదా! అన్నల యాదరం బతిశయమగుట చేతను భర్త, తగినయుద్యోగమం దుండుట చేతను, యెట్టిలోపంబునూలేక సంతసించుచు నిన్ను మాత్రము మరువకుండ నుంటి. కలగని లేచిన తెరంగున నాభూతకాలసంతసము సౌఖ్యములన్నియు. నొక్కమారుగ నంత తరించినవి. జగత్పితా, లోకంబున ప్రతివారికిని కష్టములును, సుఖములును గలవనుట నిశ్చయమేకాని నాయట్టి దురదృష్టశాలినికి కష్టములే యాహారము, కష్టములే జీవితము. యెట్టి స్థితి, నిమిషములో యెట్టిమార్పు చెందినది!! నాహృదయ మెంతకఠిన మూనినది!! పాషాణమునకైన పగులు స్వభావము కలదు కాని దీనికిలేదు. కాకున్న ప్రాణాధికుడును, నిహలోకదైవతంబును, నైహికాముష్మికానందదాతయునగు పతిమరణంబు సహింపవచ్చునే? తోడనే వంశము నుద్ధరింపగల యాఏకపుత్రమృతియు సంభవింప జంకుగొంకు లేక సహించినది. పిమ్మట వరుసగ జామాతయు, సకలబాధలను బాప సమర్ధుడును జనకుని మరపించి కంటికి రెప్పగ గాపాడి దుఃఖతిమిరంబును బాప జ్ఞానసూర్యుని ప్రసా

దించిన గురువరుంమును నగు అగ్రజుండును, ద్వితీయజామాతయు వెనువెంటనే నిహ లోకంబును వీడ నించుకంతయు భీతిచెందినది కాదు. తదుపరి జ్యేష్ఠపుత్రిక తనయునకు మారుగా తలచియుండ విద్యావతియు సుగుణరాసియు కుటుంబభారావహ సమర్థయునగు నామెకూడ తరలిపోవ నా బాధ సహితము భరించి బ్రయ్యుదయ్యె. ఇంకను దేహారోగ్యము చెడినది. చేత ధనములేదు. లేవ శక్తిలేదు. ఎట్టివారికినీ కీడులో మేలును జూపుదువనుటకు సాక్షిగి నొకమహామహుండు, ధనాశారహితంబుగ చిరకాలము నుండి ధర్మబుద్ధితో నెన్నేని యౌషధంబుల నిచ్చుచుటకాని నానిర్భాగ్యత వ్యాధికుదుర దాయె!! ప్రేమమయా, ఇవన్నియు నటుండ పతియనంతరము ప్రేమము నేను మరచి హృదయమును రాయిజేసుకొనిన నాకేల ప్రేమను గల్పించితివి. నే ప్రేమించిన చెలి నన్నేల ప్రేమించరాదు. అట్టియోగ్యత నాకు లేదని తోచెడిని. నిజమే!! యెట్టియాధిక్యతయులేని నన్నేల ప్రేమింతురు. పోనిమ్ము లోకముతో నాకెట్టి జోక్యమును లేదు. సుఖము సున్నయయ్యె.

బాధలకు పరిమితిలేదు. ఇంతకాలము నుండి యెట్లో సహించితికాని యికశక్తి చాలకున్నది. దీనదయాళూ, దీనురాలనగు నన్ను కాపాడుము. భక్తమందారా, నీభక్తురాలను. నీకన్న అన్య మెరుంగను. నాకు సర్వమును నీవే. ఇహపర సుఖానందము లొసగి బ్రోచుదాతవు తల్లివి, తండ్రివి, మిత్రమవు, తోడు, నీడ సకలంబును నీవే. నా యీ ప్రపంచబాధలబాపి నీసాన్నిధ్యము జేర్చుకొమ్ము. దోషినగు నేను నీసన్నిధిజేర తగదందువా? ఎట్టి పాపులైననూ, పశ్చాత్తాపమున పావనులగుదురని నీవు నియమించితివదే కదా. దయగల తండ్రీ, నే నెరిగినంత వర కెట్టియకార్యములను జేసియుండలేదు. అసూయాది దుర్గుణముల కెన్నడును బాల్యమ్మొ యెరుగ. దుష్టమగు తలంపులు మనంబున బొడమలేదు. దురాశలకు జోటుకలుగలేదు, నీవెరుంగనిది లేదు. నిన్నుదప్ప నన్యమ్మును ప్రేమింపకుందునటుల అనుగ్రహింపుము. ఆపద్బాంధవుడవు నీవుదక్క నన్యులుగారు. కావున విపదంబుధిబడి దరిగానక తపించుచున్న నాకు దీరంబును జూపుము. నామొర నాలకింపుము. దీననాధుడవగుట నన్ను గాపాడుము. నా యొనర్చిన దోసములకు దగినశిక్షల అనుభవించితి. ఇంక నెట్టిబాధలను పడజాల. దేహబలంబును, మనోబలంబును కూడ దెగిపోయినవి. బాధలను భరింప శక్తిలేదు. నా బాధల బాపజూచువారు నీవుదక్క నితరులుకారు. ఇకనేమియు వాగొనజాల నన్ను దరిజేర్చి రక్షించుము. మాంపాహి. మాంపాహి. మాంరక్ష. మాంరక్ష. ఆపదోద్ధారకా, మూర్ఖురాలనై కొంతకాలము బంధువులును, మిత్రులును ఆదరింతురనియు కష్టసుఖములకు తోడ్పడుదురనియు భ్రమజెందితి. అది రిత్తయయ్యె. యెట్టివారైననూ మంచి స్థితియందున్నప్పుడు చూతురుకాని, దుస్థితియందున్నప్పుడు జూడనొల్లరు. ధనహీననగుట ధనమడుగుదునని యు, నారోగ్యహీననగుట నుపచరింపు

మందుననియు, నెల్లరు దూరముగనుండ చూతురు. వేయేల నా సర్వస్వము నెవరిని నమ్మి ప్రాణాధికముగ నెంచితినో అట్టివారు నన్ను నిరసించుట చూడ అంతయు నసహ్యముగతోచె. ఒకరు నిరసనజేసిరని వగవనేల, నిన్ను దక్క నితరుల నమ్ముట నాతప్పుగాని, నన్ను వారు చులకనచేయుట తప్పుగాదు. బంధువులు భాగ్యమును జూతురు. మిత్రులు హెచ్చుమిత్రులజూచి మరతురు. కావున లోకంబున నీ వొక్కరుడవే ప్రేమించువాడవు. నిర్వ్యాజప్రేమగల నీవే నన్ను ప్రేమించి నా బాధల బాపవలయు. శీఘ్రముగ నన్ను దయజూచి నా బాధల నడంపుము. నామనంబునకు శాంతినొసంగుము. నాప్రేమపూర్వక వందనముల నందికొనుము. శరణు. శరణు. రక్షింపుము. రక్షింపుము. నీదయగల్గుదనుక నీ యొసగినవానిని, సంతసపూర్వకముగ ననుభవించుచుందు. శరణాగతరక్షకా, రక్షింపుము. రక్షింపుము.

కానిమ్ము సహింపరాని బాధల సహింపుచున్నాను. నన్నెవ రెంత నిరసించినను నేనుమాత్రము ధర్మవిరుద్ధముగ నడువకుండునటుల ననుగ్రహింపుము. నే నెవరి నేమియు కోరలేదు. నీవుమాత్రము నాయందు దయజూపి స్పర్శమాత్రమున నా బాధలన్నియు బాపి నన్ను కాపాడుము. ప్రకృతిసిద్ధములగు మార్పులకు గంతనందియున్న నా మనంబునకు గురువరుండవగు నీవ కదా దిద్దినిశ్చలముగ జేయవలయు. ఇహవిషయంబులన్నియు ముగిసినవి. ముక్తిమార్గముజూపి నన్ను దయజూడుము. పురాణములందు జెప్పబడు భక్తుల నెట్లు కాపాడితివో నన్ను కూడ నట్లే రక్షింతువని నమ్మి నాదీనచరితము నీకు విన్నవించుకొంటి. నాచరితము వినుటచే నెంత యలసితివో!! నీదేవేరులచెంత కేగి సేవలంది సేదతేరుము. మోక్షార్థులరాలనో కానో నీవే యోచింపుము. శరణు శరణు. తండ్రీ! రక్షించుము.



## తోడవు

శ్రీమతి దిగుమర్తి బంగారమ్మగారు

గీ॥ పతికిమారాడఁబోక, సన్మతిసతతముఁ
బూజలొనరించుచుఁ నిజపూరుషుని మ
హేశ్వరునిగాదలంచుచు నెన్నఁడేని
పరుసములువల్కఁబోక రంభామనోహ
రత్వమునఁ దన్పుచునుండు రామరామ
తరుణులకరయఁగా సతీత్వమ్మెతోడవు.

ఆ॥ పతినిఁగష్టఁబెట్టి బాధించు నానారి
నారిగాదు పెద్దమారి గాని
పతిని మోసపుచ్చి వర్తించు నానాతి
నాతిగాదు పందుకోతిగాని.

# మనీపర్సు మహాత్మ్యం

శ్రీమతి కె. కాత్యాయనీదేవిగారు

చెన్నపట్నమండలి బజారులలో చైనాబజారు నాయకమణివంటిది. ఆ వీధికి వచ్చుపోవు జనము సుమారు రాత్రి 8, 9 గంటలవఱకు బహుసమృద్ధమై తెల్లని యావిద్యుత్కాంతులయందు నల్లని వారి శిరస్సులం జూడ తిలతండులన్యాయముగా గన్పట్టుచుండు. ఆ బజారునందు వివిధరకముల వస్తుసముదాయమేగాక సుగంధద్రవ్యాదులు, వస్త్రములు చౌకగా విక్రయించబడునని వదంతి. ఆ వదంతి వాస్తవమెఱుంగగోరి తత్శృంగారవీక్షణాయత్తచిత్తలై వచ్చిన మత్తకాశినుల యాభరణాదులపై నచ్చటనున్న విద్యుత్కాంతులు ప్రసరించి ఆవాడ శృంగారమునకు వన్నెదెచ్చుచుండెను. అత్యావసరముగా వస్తుసముదాయముం గూర్చవలసినదిగా జనకునాజ్ఞ కాగా శిరసావహించి బజారునకొచ్చితి. నేనా బాజారు వీక్షించ, ప్రకృతికాంత నన్నాహ్వానించుచున్నదో యనునట్లుండె. నేను వస్త్రములు మినహా మిగిలినవన్నియూగొని ఖాదీభాండారముదెస బోదలంచునంత అడయారునుంచి వచ్చినకారు నావెనుక శబ్దమివ్వ తిరిగి చూచితిని.

చూచుచుండగనే సుమారు 18, 19 సంవత్సరముల నవయువ్వని మేఘములనుండి వెలుపడిన చంద్రబింబముతో దీటైన మొగముగలిగి విద్యుల్లతవోలె బస్‌దిగి వస్త్రాలయాభిముఖియై బోదొడంగె. ఆమె లేగులాబీ చీరధరించి యదేరంగుగల ముఖమల్ చెమికీపూల రవికె తొడిగికొనెను. ఆమె ధరించిన వస్త్రముల రంగును ఆమె చెక్కిళ్ళ రంగుతీసి పోసుండె. నంచియందే దోషమున్నగాని రాణించదనుటకు యామె ధరించిన నల్లని పెద్దయద్దముల కండ్లజోడు అదే రంగుగల జపానుబూట్సులే సాక్షి. త్వరితగమనయై వస్త్రాలయప్రవేశముజేసి కావలసిన వస్త్రములుగొని చేసంచినుండి మనీపర్సుతీసి వారికి పైకమిచ్చునంత నావిక్రేత కొత్తరకములు చూప నవి చూడదలంచి ఆ పర్సు వస్త్రములచ్చటబెట్టి చూచుచుండ 8 గంటలు యెదర గడియారము గొట్ట వస్త్రములుమాత్రము గైకొని మనీపర్సు మరచిపోయి పోయెను.

పోవునపు డాపె వదులైన కోడెత్రాచువంటి జడ ఛాతిపైబడ నామె సర్దుకొనుచుండ మరలయచ్చటనే పడుటచూడ నిజముగా పామేమైన పగబట్టినదాయని చూపరులు భ్రమపడునట్లుండె. నే నామె సౌందర్యామృతము గ్రోలుచూ మైమరచియుంటి. ఆ వస్త్రాలయ యజమానికే కాక నాకు స్పృహ గల్గింప వారి కుడుపు చెల్లించినటు జూడ నా బల్లపై యాపె పర్సుండె. ఆవస్త్రాలయాధికారి కదియందజేయబోవ నన్నాపె కందజేయమనియూ ఆమె అబస్ వద్ద నవసరపడుచున్నదనిచెప్పి నన్ను నాపెవద్దకు పర్సుతోగూడ బంపె.

౨

బస్ వుండుచోట నామెలేదు. కలయజూడ ముందుపోవుబస్‌లో నామెవస్త్రమగుపడ నదియాత్తగాగొని యచటికిబోవునంత నది సాగె. అతికష్టముపై నా బస్ నాపి నామెనుద్దేశించి "మీవస్తువులన్నియూ మీవద్దనున్నవా" యనునంత నన్నాపాదమస్తకము నిముషములో తీక్ష్ణముగా పరిశీలించి తనవస్తువులు జూచుకొని నన్నుద్దేశించి "నాపర్సుపోయిన"దని కళవళపడుచూ దీనవదనయై పలికె.

నే :—యెన్చటపోయినది?

ఆమె:—......షాపులో మరచినగుర్తు.

నే:—నిజము. ఇదిగో గ్రహించుడని నేనిప్వనామె గైకొనుచూ చూపి వెంటనే మరుగుపరచిన భావముఁజూడ మనోజ్ఞములై దొంతరదొంతరలుగావచ్చి వొడ్డుకుతగిలి సమసిపోవుతరంగముల భాతినుండె.

ఆమె:—తమ విశాలహృదయముతో నాకిచ్చినందులకు కృతజ్ఞురాల. ఇదియే మరియొకరు చేయజాలరు. చేసంచిలో పరుసుపెట్టితినని భ్రమచేతను బస్ వుండదనెడి యాదుర్దాలో చూచుకొనక షాపునుండి వచ్చితి. శ్రమయిచ్చినందులకు

క్షమార్హురాల. తమవిలాసమిచ్చెదరా మరల దర్శించెదనని నే విలాసమివ్వ బస్ కదిలిపోయె. కను చూపందువరకా బస్‌చూచి గృహాభిముఖుడనైతి. భోజనానంతరం శయనించనేగితి.

పడుకొంటినేగాని నిద్రపట్టలేదు. ఆ నారీమణి వాక్కులే నాకర్ణముల ప్రతిధ్వనించుచుండ యెటుల నిద్రపట్టునో? అయ్యో! యింక రెండు మూడు మాటలైన మాట్లాడించక పోయితినే? అహా! యేమి ఆవాక్కుల మృదుత్వ, వినయ, విధేయతలు. పంచమస్వరములో లీనమై కోకిలా స్వరమునుకూడ ధిక్కరించుచూ మనోజ్ఞముగా నుండెగా! అమృతము చిలుకునట్లున్నదే! పెక్కుగ మాటాడిన యాణిముత్తెములు రాలునని కాబోలు మాటాడ మోమాటపడినది. అదానిమ్మగింజలవంటి పలువరుసలో నవ్వులుచూడ వికసించిన మల్లెలవలె నుండెనే—ఆ లోలక్కుల తళుకుబెళుకులు—కొబ్బెరపంటి నాశిక—ఆ ఆకర్ణాంతనయనములు—దానిపైని నల్లని కండ్లజోడు—దొండపండును ధిక్కరించు యధరము—లేగులాబి రంగుగల చెక్కిళ్లు—శంఖమునంటి మెడ—చెక్కుటద్దమునుంబోలి నునుపైన ఫాలమూ—మరతునన్ననూ మరపురావు గదా యని యామె హావ, భావములం దలంచుచూ నిద్రాదేవికి వశుడనగునప్పటికి 3 గంటలైనట్లు గుర్తు.

## 3

మరుదిన మామెవచ్చి తనకృతజ్ఞత తెల్పించెను. అపుడపుడూ మేము బజారునందు కలసినప్పుడు క్షేమ సమాచారము తెలిసెగెడివారము కొన్నిదినములు సముద్రతీరమందు కొలదిగ కలసి విడిపోయెడివారము పరిచయ మెక్కువ లేమిచే. క్రమక్రమముగా మా పరిచయము వృద్ధికాదొడంగె. సంభాషణ నిమిత్యార్థమై నే ప్రత్యేకముగా కలసెడివాడ నా సముద్ర తీరమందలి సైకతస్థలముల నామెను. మా పరిచయము క్రమముగ మైత్రియై స్నేహములో మారి వుభయులకు తీరికగా యున్నప్పుడు నే నచ్చటికి పోవుటో యామె నావద్దకువచ్చుటో జరిగెడివి కొన్ని రోజులు. కతిపయ దివసానంతరం మా వుభయుల స్నేహలత ప్రణయలతగా మారి ఒకరికెరుక లేక ఒకరి హృదయమున నల్లుకొని వసస్థాన మేర్పరుచుకొనె. ఆప్రణయబీజము మొలచినతదుపరి వృక్షమై, పూలు పూచి, కాయలుకాచి, పండ్లుపండు టెన్నడో నే ననుభవించు టెన్నడో దైవమున కెరుక. నేనా ఫలము కొరకై యాతురతగా యున్ననూ పైకి గంభీరముగా యుంటి కాని యామె చైదములుచూచి యిదమిద్ధమని నిర్ణయించ జాలకుంటి. ఆమెకూడ చదువునది వైద్యవిద్య గనుక నదురు బెదరులేక స్వేచ్ఛగా సంచరించుటయు దాంగ్లయువతులకు తీసిపోక హిందూ యువతుల కాశ్చర్యము గల్పించుచుండె. ఆమె తరుచు స్త్రీ స్వాతంత్ర్యమునుగూర్చి ముఖ్యముగా బాల్యవివాహాదులగూర్చి సంఘదురాచారముల గూర్చి నాతో చర్చించెడిది. నాకు జూడ తెలుగునందుకన్న యాంగ్లముననే యామెకు పరిచయ మధికమని యామె చమత్కార యాంగ్లసంభాషణయే చెప్పుచుండె. యేదైన విషయము చర్చించునప్పుడు దానిని సంఘలోపముగామార్చి తనప్రజ్ఞ చూపెడిది. నన్నుకూడ సంఘమును సంస్కరించుటలో తనకు సాయపడ గోరెడిది. ప్రథమమందు నే నామెకు ఈ విషయమున విరుద్ధముగా యున్నా ఆమెదీనులగు అనాథలు పడు అవస్తలు, కడగండ్లు నాకు కంటియెదుట యామెమాటచే చూపి నన్ను తనవశ్యునిజేసికొనె. ఆమె యుక్తియుక్తముగ, సహేతుకముగా నాయభిప్రాయముల ఖండించినందున నే నామెకు సాయము జేయ స్థిరసంకల్పుడనైతి. అనాథలసేవయే భగవత్ సేవగాతోచె. ఆరోజు మొదలు మే ముభయులమూ, సంఘసంస్కర్తలను పిలపించి సభలుచేయించియూ ఉపన్యాసములిచ్చియూ కార్యరంగ ప్రవేశ మొనర్చితిమి. అంతటితో నూరుకొనక స్వీయాచరణ చేసినగాని యితరులకు మామాటయందు గౌరవముండదని తలచి నా యభిప్రాయమును హృదయపీఠముల పెట్టి పూజించుచూ సమయముకై నిరీక్షించుచుంటిమి. కాని మాసేవ భగవంతునకిష్టమో అయిష్టమో! నా దేవదేవునిలీల లనంతములు గదా?

## ౪

అవిక్రిస్టమస్ రోజులు. ఒకరోజు కమల నా నివాసమునకు పగలు రెండుగంటలకొచ్చెను. చూడ చాల యలసినట్లు గనుపించుచుండె.

నే:—శ్రమపడి యెండలలో వచ్చితిరేకే? మంచినీరు కావలెనా? ఈ కుర్చీలో గూర్చొనుడు.

కమల:—మోహన్, క్రొత్తవారివలె నన్ను పరామర్శ చేసెదవేమి? యనుచూ నామె కుర్చీలో కూర్చుని యెదరనున్న నిలువుటద్దమునం జూచుకొనుచూ చెదరిన ముంగురుల సరిజేసుకొనుచూ ముఖకమల మున ముత్యములవలెనున్న శ్వేదబిందువుల తన శిల్కు చే రుమాలుచే తుడుచుకొనుచుండె.

నే:—అలసినట్లున్నది. ముందు మొగము నాకొళాయి వద్ద కడుక్కునిరాకోరెద. కొద్ది ఫలహారముచేయ కోరెదనన ఫలహారమొద్దని యామె కొళాయివద్ద కేగి ముఖముకడిగి యద్దమున చెదరిన ముంగురుల సంస్కరింపుచుండె. నా ప్రతిబింబ మద్దమున కన బడుచున్నమాటగూడ మరచి యద్దమందలి యామె ప్రతిబింబమును చూచుచూ "యెంత సౌంద ర్యము" అని అప్రయత్నముగా నంటినో లేదో ముక్కుపైకి వ్రేలొచ్చి తన విధ్యుక్తధర్మముం దీర్చె, అవ్విధముగా యెంతసేపుంటినో గాని యామెపిలుపు నాకు స్ఫృహగల్గించె.

కమల:—ఈరోజు పార్కునందు ప్రపంచవిఖ్యాత ముష్టియుద్ధసార్వభౌముడగు గన్‌బోట్ జాక్ గారి ముష్టియుద్ధమట, అందులకై మిమ్ముల శ్రమ పెట్టదలంచినందులకు క్షమించుడు. నా ఈస్వల్ప ప్రార్థన నిరాకరించరనెడి ధైర్యముచే యెండ గూడ లక్ష్యముజేయక తమ సాన్నిధ్యమున కొచ్చితి. సాహసమునకు మన్నించకోరెద.

నే:—నేనూ అదే ప్రయత్నములోనుంటి, మీరు యింక $\frac{1}{4}$ గంటయాలశ్యముగా వచ్చియుండిన నే మిమ్ముల గలసెడివాడగాను యనుచూ పోయి దుస్తులు ధరించిరా మేముభయులమూ పార్కుకు . పోతిమి.

అచ్చట ననేక రకముల ఆటలు, గుఱ్ఱపుపందె ములు, లాటరీలు, ప్రదర్శనశాలలు, నాటకశాలలు, బూటకశాలలు విపరీతముగా లెక్కకుమించియుండె. వీటి నన్నిటిదాటి ముష్టియుద్ధప్రదేశమునకేగితిమి. ప్రథమమున రెండు జోడులు పోట్లాడిరి. తదుపరి ఆకలిగొన్నసింహములవలె అసలు జోడా యుద్ధరంగ ప్రవేశము జేరి పోట్లాట ప్రారంభించిరి. సుమారు 5 నిముసములు గడచెనో లేదో ఒక పెద్ద జనప్రవా హము కటకటాలు విరుగద్రొక్కుకొచ్చుటమాచి మే మాకెసజూడ నచ్చట యగ్నిప్రమాదముచే వేయబడిన పాకలంటుకొని మంటలు మాదెసరాదొడంగునంత అతికష్టముపై నాజనసమూహమునుండి వెలువడి వడిగా నడచి జంతుప్రదర్శనశాలవద్దనున్న నదీతీరముం జేరితిమి. ఆనదియందున్న నొకనోనెపడవం జూపుచూ ఆమె:-"దీనిని మీరు నడుపగలరా"?

నే:—నాకభ్యాసము తరుగు.

క:—నే బాగుగా నడుపగల. ప్రతి శని యాదివార ములందు నేను నా స్నేహితురాలగు మేరీతో వచ్చి దీనిపై విహరించెడిదాన. అప్పుడు నే నేర్చుకొంటిననుమండ నే పరధ్యానములోనుంటి. ఆమె శరవేగమునబోయి టిక్కట్టుకొని మరమ రాలుతెచ్చి నానావయందాశీను డ న గు మ న నాసీనుడనైతి. ఆమె నాయానపాత్రము నతి నిపుణతతో నడుపుచుండ నే విలాసముగా నామె వైపూ ప్రకృతికాంతవైపూ జూచుచూ వీరిలో యెవరందకత్తెలో తేల్చ ప్రయత్నించుచుంటి. అప్పుడె సాయింత్ర మైదుగంటలాయె. ఆయేటి యందు విహరించు బాతులు మాయొద్ద కెరకై వచ్చె నా సాయంసమయమున. మలయ మారుతమల్లనల్లన వీవదొడంగె. సాయింత్రమగు టచే జలపుష్పములభాతి మత్స్యములు పై కెగు రుచూ మరల పడుచూ నీటిపై వినోదించుచుండె. మేమువేయు యెఱకై ఆమత్స్యములూ బాతులు పోరాడుకొనుచుండుట చూడ మాకు నేత్రానంద ముగానుండె. నీటిలోని నాచు మానావచే గలి గిన కదిలికచే పైకి క్రిందికి వుయ్యాలలూగుచుండుట చూడ నది మాతో దాగుడుమూతలాడుచున్న ట్లుండె. సంధ్యారాగము ఆమె మొగముపైబడి

తనకు మించిన సౌందర్యవతిగా గ్రహించె ప్రాచీ దిశాంగన. ఆమెపై క్రోధమువహించెనో యనునట్లు పశ్చిమదిక్కెఱ్ఱబారె. ఎచ్చటచూచినను బంగారురంగు లీన ప్రకృతికాంత శోభాయమానముగా వెలుంగజొచ్చె. అదేసమయమున బాతుల జంట యొకటి ఆమెవేపు యెఱ్ఱయైన గ్రహించక సరస సల్లాపములాడుచూ మైమరచి నిజ ప్రేమతత్వము వెల్లడించుచుండె. ఆమె నాటిని జూచుచూ మరల నావంక జూచుచూ వేడి నిట్టూర్పుల నిగుడించుచుండె. ఆ వేడినిట్టూర్పుల వేడిగాలి సోకిచూడ ఆమె నా వైపూ యీ జంటవైపు చూచి చిరునవ్వు పెదవులయందే యణచుకొనె.

నే:—నవ్వేదరేల?

కమల:—తమకన్న చిన్నదాన్ని స్నేహితురాలుగాన నన్ను యింతటినుంచి పరాయివారిల గౌరవించినట్లు మీరు గౌరవింపవలదని ప్రార్థన.

నే.—అలవాటు. ఏదో పెద్దలనెడు రాయుక్షణమాని పట్టింపా?

క:—నే గోరెడి దదియే.

నే:—అదియా కారణము

క:—(మౌనం)

నే:—నీ మనస్సుకు కష్టముగల్గించునదైన—రహస్యమైన—యిష్టములేనిదైన

క:—రహస్యమేమున్నదీ. ప్రస్తుత మన స్థితిచూచి, రేపు నేవుండుస్థితి తలంపుకురా, మనకు సద్దు యింతలో మరల మనకు సమాగమముకల్గునో లేదో యని కష్టముతో చిన్ని......

నే:—తో చిన్ని......పై విషయము చెప్పెదవా?

క:—నిస్సందేహముగా. నాకు 5-వ యేటనో 8-వ యేటనో గుర్తులేదు కాని వివాహమయ్యె. నాతండ్రి ధనాశాపీడితుడై భాగ్యవంతుడగు నొక వృద్ధునకు నన్ను బాల్యవివాహమునకిచ్చె. కనీసం వత్సరమైన తిరగకముందే నా భర్తయూ తండ్రియూ గతించిరి. అనకూడదుకాని నాకు విధవత్వం ఆవిధమువల్ల కలిగినది. నేచిన్ననాటినుంచియు విద్యయందు ఆసక్తిగలదాన నగుటచే ప్రతి తరగతియందునూ ప్రథమురాలుగ నుత్తీర్ణురాలనయ్యెడిదాన. నావిద్యల కిలుపు ప్రభుత్వము వారు సాయముచేయ వైద్యవిద్యకై వారి యుపకారవేతనముపై వచ్చి చదువుచుంటి. పూర్వాచార పరాయణుడూ, లుబ్ధాగ్రేసర చక్రవర్తి అసూయాదేవతాస్వరూపుడగు నా పినతండ్రికి గత్యంతరములేక నాతో పట్నమువచ్చె. అతనికి నాఐశ్వర్యముపై దురాశవుండుటచే నన్ను యవమానపరచె. ఆగోకే ప్రమాదవశమున ట్రాముచే త్రొక్కబడి మరణించె. ఆయన మరణింపక పూర్వము నా పునర్వివాహ విషయము ప్రస్తావింప నాకుండిన భూతావతారమగు నతడు నన్ననరాని మాటలాడిన స్త్రీ కాదశివుంచినట్లుగా జ్ఞప్తి.

నే:—షుమారు 2 నెలల క్రితం సెంట్రల్ స్టేషన్ వద్ద చనిపోయిన రామస్వామయ్యగారా?

కమల:—అవును. చాలా బాధలుపెట్టి చనిపోయినాడు. రేపు వెంగళూరుపోయి కొన్ని అత్యవసర వ్యవహారములు సరిచేసుకోవలయు. యిక నింతలో తమదర్శనభాగ్యము లభింపమికి చింతగా నుంటి.

నే:—నీ కంత యభిమానమున్న వచ్చిపోగూడదా?

క:—పరిస్థితులు క్లిష్టముగాయున్నందున దుర్లభమని తలచెద.

నే:—సరే. త్రికరణశుద్ధిగ వివాహమాడ దలంచితిరా?

క:—ఆ! ఈ భూదేవి, యీ కాశీవాణి, మనక్రింద నున్న జలదేవతా సాక్షిగా.

నే:—సరియే! సంఘము నెదుర్కొనెదరా? కష్టసుఖము లాలోచించితిరా? మాటలచే గాక క్రియాచరణచేయుట ఉత్తమలక్షణము. సంతోషముకాని సం.........

క:—యిక సంఘాన్ని గురించా! ఈసంఘం—స్వార్థపరుల సంఘం—పాపులసంఘం—హద్దులేని నిరంకుశసంఘం—భుక్తికికూడా కాకిసంఘం—మూర్ఖ



శ్రీమతి సుందరీ అమ్మాళ్

కూనూరులో భారతమహిళాసభకు అధ్యక్షురాలుగా నెన్నుకోబడెను, ఈయే డాదికి.

ఫొ॥చి॥ ఆర్. వెంకోబరావు శ్రీరంగం.



శ్రీమతి రాజం ఎ. నాథన్

కూనూరులో భారతమహిళాసభకీ యేడు కార్యదర్శినిగా నెన్నుకోబడెను.



కీ॥ శే॥ ధర్మాల అన్నపూర్ణమ్మగారు

మార్చిసంచికయందు శ్రీయుత కూచి నరసింహం పం॥గారు వ్రాసియుండిన 'జీవ పరిదేవనము' అను వ్యాస మీమె గూర్చియే. కీ॥ శే॥ కూచిగోపాలంగారి పుత్రిక. సత్కుటుంబినియు, చదువరియు, సౌభాగ్య సద్గుణవతియు నగు నిట్టి యువతీరత్న మకాల మరణమొందుట యాంధ్రమాతకు నష్టదాయకము. ఏమను చేయున దేమున్నది? ఈశ్వరుఁడు పునరావృత్తిపద మొసంగుగాత.



శ్రీ పబ్బిసెట్టి లక్ష్మీకమలమ్మగారు

విశాఖపట్టణంలోనైన నాల్గవ స్వదేశ వస్తు ప్రదర్శనమున (1934-మార్చి) కఱ్ఱపై చిత్రపుపని (Fret work) కై యోగ్యతా పత్రమును బడసెను.



చి॥ ప్రేమకుమారి

వయస్సు 16 మాసములు.

గ్లాక్సో, హార్లిక్సు, లాక్టోజన్ మొదలగు కృత్రిమాహారములతో గాక కేవలము ఆవుపాలతోనే పెరుగుచున్న బిడ్డ!!

నా॥ చి॥ పి. సుందరరామయ్య, పెదపాలెం.



చదువరు దంపతులు

లగు ఛాందసుల సంఘం—దౌర్భాగ్యసంఘం— నే పసిదాని నై యుండగా నా కుతిక కోసిన సంఘం.........

నే:—సరియే......కాని......

క:—యింక నాపాతివ్రత్యాన్ని గురించా? మాపాప సాక్షిగా, త్రిమూర్తుల సాక్షిగా నేను పాతివ్రత్యానికి భంగం గాచరించలేదు.

చదివేడిది వైద్యవిద్య గనుక దాని కనుగుణముగు వేషభాషల నుండవలసివచ్చె.

నే:—ఇంతలో బెంగుళూరునుంచి రావా?

క:—ఇక వివాహాముకే వచ్చుట.

నే:—ఎవరి వివాహము?

క:—నాదే?

నే:—(ఆశ్చర్యముగా) నీదా? ఎప్పుడు?

క:—సుమారారుమాసముల పైన.

నే:—సంబంధము?

క:—ఏవ్యక్తి యువకసంఘసంస్కర్తలయందు అగ్రగణ్యుడని పట్నమునందు నుతించబడుచుండెనో—యేవ్యక్తి నాధారముగాగొని నేసంఘసంస్కరణ ప్రారంభించితినో—యేవ్యక్తి తన సౌందర్యము చేతనూ వినయవిధేయతాది సద్గుణములచే నా మానసము చూరగొనెనో—ఆవ్యక్తి నాప్రత్యక్షవైవాన్ని పరీక్షించే గూర్చబడిన సంబంధాన్ని.

నే:—(సంభ్రమాశ్చర్యములుప్పతిల్ల) నిజమే! ధన్యుడననుచూ నాపెం గాఢాలింగనమొనర్చి అధర సుధారసాస్వాదనచే మైమరచి సుఖాంబుధి నోలలాడితి. ఆమెయూ ప్రణయ సామ్రాజ్యమందు పట్టమహిషియై గాఢాలింగనమొనర్చుచూ అర్ధముకుళితనయనయై నాముఖకమలము వీక్షించుచూ మైమరచె. ఆ సుఖమున నెంతికాలముంటిమో మాకే తెలియదు. పమ్మలచూచి యోర్వలేనిదై నిశాకాంత తనచెలియగు చక్రవాకిచే గూయింప నాబాల తెలివొంది నన్నుజూచి సిగ్గుపడజొచ్చె. 'మావుభయుల సుఖాంతము తెల్పుచున్నదో' యను నట్లు కిటికీకటుగ్రమ్మె. టవరుగడియారమపశకునముగ 7 గంటలుకొట్టె. అంత నాడామె పడవంత్రిప్పి పడ్డుంచేరె. అంతె నామె నావనుండి దిగుచూ బురదలో పడె. నేసహాయపడ ఆమె పడ్డుకొచ్చి అచ్చటనున్న మేకు కాపడవంగట్టె. గృహాభిముఖులమై స్టేషన్ వద్ద అతికష్టముపై వీడి నేతూర్పునకు ఆమె దక్షిణమునకు పోబోవ ముందు యెవ్వరో తుమ్మినట్లు వినికిడి.

అవి చెన్నపట్నమందలి కలరారోజులు. యేవీధిన చూచిననూ యేభాగమున చూచిననూ విచారదృశ్యములే. యెచ్చట వినిననూ మృత్యుదేవతా నాట్యధ్వనియే. ప్రజల కానదంబుగూర్చు సముద్రతీరము నిస్తేజమైయుండి కాష్టమయమాయె. నగరమునందచ్చట చూచిననూ భీభత్సము మెండుగానుండె. కాలకృత్యానంతరం వార్తలెరుంగగోరి పత్రికాపఠన మారంభించ అకాలమున అయాచితముగా నిద్రాదేవికి నాపై కరుణగలుగ నేనొక స్వప్నముంగాంచితి. 'నాప్రియురాలు విహారార్థమై సముద్రతీరమందలి పొదరిండ్ల కొచ్చినట్లు నన్నుజూచి ఆమె నాకభిముఖియై రాదొడంగునంత నొకత్రాచు అకాలమృత్యువువోలె నామెం గరువ గమకించుచూ వెనుకరానే నదలింపనెంచు నంత నామె కాటం...' అయ్యోయని కలతమనస్సుతో తెలివంగ చూతునుగదా గదియందలి గవాక్షమునుండి వేడిగయున సూర్యకిరణములు నాపై ప్రసరించుచుండె.

కొలదిసేపటికి కొకలేఖరా చదువందొడంగితి. అందులో నాప్రణయప్రతిమ యపాయమందున్నట్లు నాసాయ మపేక్షించినట్లు వ్రాయబడియుండె. నాహృదయమందామెను జూడవలెననెడి యాదుర్దా వాయువేగమునుమించి వేగిరపడదొడంగె. నేవెంటనే యామెయిచ్చిన విలాసమునకరిగి లోపలజూడ నెవ్వరో కలువరింపుచున్నట్లు హీనస్వరము వినంబడె. నాసహాయమూలగాగొని యావ్యక్తి శయనించిన మందిరద్వారము ప్రవేశించబోవునంత నాపై 'నాధా! ఆచిలుకాగోరువంకల సౌఖ్యము-యిస్-డేగ-పాపమా వియోగి-చూడజాల' ననుచూ కనుదమ్ములు ముకుళించి శయనించియుండె. నేనామె శయ్యాంతరి నిర్జీవప్రతిమ

వోలె చూచుచూ అనుచేతడనై బాహ్యజ్ఞానశూన్యుడనైయుండ దాహమని కన్నులువిచ్చె. నేదాహమివ్వ నేదదీరి నావేదనాయుతవదన మీక్షించి యిస్ యనుచూ కండ్లుమూసి కనుదమ్ములనుండి సెలయేటి ప్రవాహమువలె బొటబొట కన్నీరుం గార్చదొడంగె. నేనూ ఆదేస్థితియందుండియూ, నామె చూచిన అబలానామము సార్థకపరచుననని తలంచి, గంభీరించి నా కన్నీరు చేరుమాలచే వత్తుకొనుచూ నామె గార్చు ప్రవాహమున కడ్డువైచుచుంటి. మరల ఆమె కండ్లుతెరచిఁ వచ్చితిరానాథా, ధన్యరాల, సమయమున కొచ్చినందుల కభినందనములు. నే తమ వియోగము భరించజాలకయూ వ్యవహారము లోకదారి కొచ్చుటచే మొన్న బెంగుళూరునుంచి వచ్చితి. నా కారోజె కలరా తగులుటచే తమ సాన్నిధ్యమునకు రాజాలకపోయితి. ఇక నాకు జీవితాశలేదు. నా భావిసౌఖ్యమూ ఆలోచనలు ఆకాశహర్మ్యములైనవి. నాథా! ప్రియా! అబ్బా—యిస్—నా పెన్నిధీ! నేమరణించుటకు పూర్వము నాకు రెండు కోర్కెలుగలవు. అవితీర్చ ప్రార్థనగాన మనవివినుడు. అల్లదే నాయల్మరాతీయుడు. దానిలో కనబడు మా చిరపరిచితురాలైనపర్సునిండన నేనివ్వ నామె దానిం గన్నుల నద్దుకొని నన్ను సంభోధించి 'యే పర్సు మనకు రాయబారియై యింత స్నేహాభివృద్ధి చేసినదో—అప్పటినుంచి యేది నాకభిమానియై ప్రాణసమానమాయెనో ఆపర్సు నాప్రాణాధిక్యునకు-యమూల్యునకు—అపారప్రేమాస్పదునకు— నా ఈ ప్రేమ జ్ఞాపకచిహ్నంగా నీయదలంచి పిలిపించితి. ఇక రెండవకోర్కె నా యావదాస్తియూ నిన్న తమ పేరవ్రాసి రిజిష్టరుచేసితి. దాని యాదాయముచే ననాథల కాశ్రమము గల్పించుడు. ఎన్ని కష్టము లొచ్చిననూ నాప్రేమస్మరించి వానినెల్ల జయించెదరను ధైర్యముచేతనూ తమయందుగల స్వతంత్రముచేతనూ తమ యనుజ్ఞగోరకే చేసినపనికి క్షమించ ప్రార్థన. నా ఈమృతదేహ మా యాశ్రమమందు సమాధిపర్చకోరెద' యనుచూ పర్ సిచ్చి అతికష్టముపై నాతొడపై తనశిరస్సుంచి బాహులతచే నన్ను బెనవైచి నావదన మీక్షింపుచూ నయనద్వారముల నుండి హర్షబాష్పములు రాల్చుచూ యిహ లోక యాత్ర జాలించె.

ఆమె పల్కులు వినుచూ స్తబ్ధుడనై మేఘము గప్పిన చంద్రబింబమువలె నున్న యామె ముఖము వీక్షించుచుంటి. పిల్లియొకటి గదిలో ప్రవేశించి పాలగిన్నెంబడద్రోసె. వాకిట కావలికుక్క కుయ్యోమనె. గడియారము 2 గొట్టె, గాలికి గోడనున్న రాధాకృష్ణపటము క్రిందబడి భిన్నమాయె. ఈ శబ్దముచే బాహ్యజ్ఞానముకల్గి దైవవిధి—కృష్ణా నీలీలలనంతములుగదా' యనుచూ నామె యాజ్ఞ పాలింప నిశ్చయించి కార్యక్రమ మారంభించితి.

౬

గిండీకిపోవుదారిలో నొక యనాథశరణాలయము సంఘసంస్కర్తయగు దేవధర్ గారిచే తెరువబడి ప్రస్తుత మైదువందలకుమించిన యనాథలకు కల్పతరువువోలెనుండె. అచ్చట హిందీ, సంస్కృతము, ఆంగ్లము గృహపరిశ్రమలు నేర్పబడుచుండె. నా యాశ్రమమందలి తయారుకాబడిన వస్తువులు ప్రదర్శనములం దగ్రస్థానమువహించి పతకముల బొందుచుండె. ఆశ్రమ బాలికల విద్యాప్రావీణ్యమునకు మెచ్చి ప్రభుత్వమువారు కొన్ని పతకములిచ్చి బహూకరించిరి. ఆపతకములచే కమలాసమాధిమందిరమున కెదురుగా కమలామందిర్ యని కూర్చబడె. వాని ప్రక్కనే అద్దపుపెట్టెలో బెట్టిన పర్సు తన ప్రభావముం దెల్పుచుండె. ఆశ్రమముఖద్వారమున కార్పొరెషన్ వారు తమ స్వంతకర్చుపై వివిధరంగుల విద్యుద్దీపములచే మోహన్ కమలామందిర్ యని కూర్చి ఆయాశ్రమమునకై వివిధ కష్టములకు లోనైననూ జంకక జయముగాంచిన మోహన్ రావు పేరుగూడ చేర్చి వారికి మోహన్ యందునూ అనాథలయందునూ గల యభిమానము వెల్లడించిరి.

త్యాగధనియై కీర్తిశేషురాలైన కమల మృతజీవియై యనాథలకు చిరస్మరణీయురాలుగదా!

# పశ్చాత్తాపము

కవికోవిద. రాపిపాటి లక్ష్మీనారాయణగారు

సీ॥ పంకంబు నందుండి వ్యాధుల దొలగించు, బాతులు నన్నేమి పట్టిచేసె
కొక్కరో కోయంచు కూసి నిద్రనులేపు, కోళ్లు నా కేసిల్లు కోరిసల్పె
ఎఱువునున్నిఁబాల నిచ్చెడు సాధువుల్, గొఱ్ఱెలు నా కేమి మందొనర్చె
చెడుపదార్థము తిని చెఱుపులఁ బోఁద్రోచు, పందులు నా కేమిటాటు దెచ్చె.
గీ॥ అరరె, నాకుఁ జేసెదు మేళ్ల మఱచి స్వార్థ
మున ననపరాధముల సర్వమునకు నన్ను
నమ్ము మృగముల దయలేక నఱకి వాని
మురికి తిననేల? గింజలు భువినిఁ గఱవె?

ఉ॥ కన్నులపంటవైన పృథుకాంతినిఁ గూడి తరూపవిష్టమై
యున్న విహంగ దంపతులు మూర్కొని తాగ్కొని కేరుచుండఁగాఁ
గన్నపు దొంగవోలెఁ జని గాటగునమ్మునవేయఁ బెంటియుం
దన్నుకలాడి చచ్చెగద! తత్ఫల మూరక యెందు వోయెడిన్.

శా. ఔరా దుర్మతినై తిఁ! బిల్లకునుఁ దోకాడించుచున్ బ్రేమతో
క్షీరంబిచ్చునజంబునున్ నఱుకనే! చింతన్ లలిన్ శాబమా
త్రీరై యేడ్చి కృశించి చచ్చెఁగద! తద్దృశ్యంబు నెంతేఁ గనం
గా, రాయైన ద్రవించు, దానిఁ జదువంగాఁ జేతులెట్లాడెనో.

గీ॥ ఎఱలఁ జూపి యాశను జనియింపఁ జేసి,
వచ్చినట్టి చేపల బట్టి బయటవైచి
తినిగదా! నీటివెలుపల దిక్కులేక,
నాదుచేతఁబడి, ప్రతిక్షణమును నిదిగొ.

గీ॥ నన్నుఁగమును నిన్ మ్రింగు చున్నానటంచు
ఘోరవికృతరూపముతోడ నోరుదెఱచి
పేర్చుచున్ మృతియున్ భయపెట్టుచుండ
నెంతియేడ్చెనో! యీకోల యెట్లు పోవు......

చ॥ ఇది మొదలింక నెప్పటికి హింస నొనర్పఁగ బోను, మాంసమున్
మదినయినందలంపఁ, బశుమారణ వారణ మూని క్రౌర్యమున్
వదలెదఁ; గాయగూరలను భక్షణసేసెద; దేవ దేవు నె
మ్మది భజియించువాఁడ; నిక మాన్యుఁడనై చరియింతు నిమ్మహిన్.

# పాపఫలము

శ్రీమతి బి. లక్ష్మీవెంకాయమ్మగారు

పూర్వము బుందేలు నగరమును క్రూరుడును పరస్త్రీలోలుడును అగు ఉస్మాన్‌జా అను మ్లేచ్ఛుడు పరిపాలించుచుండెను. అతని రాజ్యములో ప్రజలు లేశమైనా సుఖములేక అష్టకష్టము లనుభవించుచుండిరి. సౌందర్యవతులగు స్త్రీలు అతని కంటబడినయెడల వారిని తనవశ మొనర్చుకొనును. ఆ గ్రామములోనున్న రత్నసేట్ అను వైశ్యుని భార్య అసమానసౌందర్యవతియైయుండెను. ఆమె పతినే దైవముగా భావించి పూజించుచు పతివ్రతయై ప్రఖ్యాతిగాంచెను. దేశమంతటను ఆమె రతీదేవిని మించిన చక్కనిదనియు అరుంధతీదేవినిమించిన పతివ్రతయనియు చెప్పుకొనసాగిరి. ఈసంగతి ఉస్మాన్‌జా విని ఆమె నెట్లైనను వశమొనర్చుకొనవలెనని నిశ్చయించెను. పాపకర్ముడగు ఉస్మాన్‌జా స్త్రీవేషము ధరించి రత్నసేట్ యింటికి వెళ్లెను. నవాబుగారి పెద్దబీబీ వచ్చినదని జ్యోతిర్మయీదేవితో చెప్పమని దాసీతో కబురంపెను. పతివ్రతయగు జ్యోతిర్మయీదేవి కపటవేషముతోనున్న బీబీని గౌరవించుటకై వచ్చెను.

ఆమె సౌందర్యము అతని కన్నులకు మిరుమిట్లు గొల్పెను. సోదరీమణులారా, పతివ్రతకు తెలియని దేమున్నది! చూచుటతోనే ఆమె స్త్రీవేషముతోనున్న పురుషుడని గ్రహించెను. ఆమె అతనికి బుద్ధివచ్చునట్లు జేయుదమని తలంచి దాసీకి సౌంజ్ఞ చేసెను. దాసీ సౌంజ్ఞ గ్రహించి రత్నసేట్‌ను తీసుకొనివచ్చెను. రత్నసేట్ జ్యోతిర్మయీదేవివలన జరిగిన సంగతంతయు విని అతనిని స్తంభమునకు కట్టి కొరడాతో బాధింపసాగెను. దెబ్బలకు తాళజాలక అతడు నిజముచెప్పి, రక్షించవలసినదనియు ఇకనుంచి పరస్త్రీలను తల్లులవలె భావించెదననియు ప్రార్థించెను. కరుణామయులగు దంపతులు అతనిని వదలిరి.

రత్నసేట్ యుండగా జ్యోతిర్మయీదేవి తనకు లభించదని తలచి తుచ్ఛుడగు ఉస్మాన్‌జా రహస్యముగా అతనిని చంపెను. అతశవము నొకపెట్టెలోనుంచి ఆమెకు పంపెను. ఆమె పెట్టెలోనున్న పతి కళేబరమును చూచి మూర్ఛనొందెను. ఆమె ఉన్మాదిని యైపోయెను. నాపతిని చంపినవానిశిరము వారము రోజులలో ఒక పతివ్రతవలన ఖండింపబడును అని శపించెను. ఆమె కళేబరమును శిరసుపై నుంచుకొని అరణ్యసంచారము చేయసాగెను. భూలోకసంచారమునకై వచ్చిన పార్వతీదేవి ఆచిన్నదానినిచూచి జాలినొంది సంగతేమని యడిగెను. జ్యోతిర్మయీదేవి పార్వతీదేవికి సాష్టాంగనమస్కార మాచరించి, తల్లీ, జగజ్జననీ, త్రిలోకేశ్వరీ, మాతా, మహిషాసురమర్దనీ! నా ప్రాణేశ్వరుని బ్రతికించుమని పలువిధముల ప్రార్థించెను. పార్వతీదేవి ప్రసన్నురాలై రత్నసేట్‌ను బ్రతికించెను. దంపతులిరువురును దేవిని పలుతెరంగుల స్తుతించిరి. దేవి సంతసించి అష్టైశ్వర్యములు పుత్రపౌత్రాభివృద్ధి గల్గునటుల దీవించి అదృశ్యమాయెను. దంపతులిరువురును పురము

నకు వచ్చిరి. జనులందరు జ్యోతిర్మయీ దేవి పాతివ్రత్యమును వేతెరంగుల పొగడ సాగిరి. ఉస్మాన్‌జా పద్మగంధియను రాజ పుత్రస్త్రీని మోహించి బలిమింబట్ట సంకిం పగా పతివ్రతయగు నామె ఉగ్రురాలై నిశిత కరవాలముతో శిరస్సు ఖండించెను. పాప కర్ముడైన ఉస్మాన్‌జా మరణమునకు జను లందరు సంతసించిరి. సుగుణవంతుడగు రత్నసేట్‌ను ప్రజలందరు కలసి రాజును గావించిరి. జ్యోతిర్మయీ రత్నసేట్‌లు లక్ష్మీనారాయణులవలె విరాజిల్లుచు ధర్మ ముగా పరిపాలించుచుండిరి.



## మాలాలి

శ్రీమతి రాజేశ్వరి గారు

బంగరుపతంగి యొక్కటి నింగినుండి
వ్రాలినది మా యొడిని భాగ్యవశముచేత
ప్రేమతెరగూటిలో దాచినాము: దానిఁ
జూడ సుంకంబు చెక్కిలి చూరగొనుటె.

నిదురలోనైన నఁ బిడికిళ్ల వదలకుండ
నేమి దాచిపెట్టెదో కాని మేమెరుగము
భావి భాగ్యమో, ప్రేమ సంజీవనంబొ!
కట్టుకథ రీతిగా మాకు గానుపించు.

కాలికి కాలును కేలికి
కేలును తగులంగనీక కేవల మమృతాం
దోళికపై బవళించిన
మా లాలిని బోల చందమామ యొకండే!

ఒక లేవెన్నెలరేక కన్బొమలపై యుయ్యాలలూగంగ స్వా
ప్నిక మాధుర్యము దోచబోలునుసుమీ నీ లేయెడందన్; కపో
లకళాసీమల చిన్నిగుంటలువడన్ రాణించు చిర్నవ్వు నే
రికగన్ నేర్చితివమ్మ మా యనుగు లాలీ! తెల్పుమీ నాచెవిన్

మురిపించి మబ్బుచాటున
కొరిగి యొరిగి పోవుచుంటి వో జాబిలి! నీ
వరిగిన నరుగుము; మాకీ
మురిపెంపులప్రోవె నిండుపూర్ణిమ యెపుడున్।

# ప్రేమ పాశము

బాలకవి వత్సవాయి సత్యనారాయణవర్మగారు

"ప్రేమ" శబ్ద మత్యంతమధురమైనది. శబ్దమే యింత మధురమైయుండ దాని యర్థ మెంత మాధుర్యముగనుండునో వేరుగ వ్రాయవలయునా? కాని ప్రేమ అనంతమైనటువంటిదియు, అవ్యయమైనదియు నగుటచే దానియర్థము తెలిసికొనుట చాల కష్టము. యువకులు దేనియందు మగ్నులయ్యెదరో, వృద్ధులు దేనిస్మరణమాత్రమున తమ జీర్ణశరీరముల యొక్క బాధను త్యజించెదరో, అట్టిప్రేమ శబ్దార్థము వర్ణనాతీతముగదా? సాహసము, ధైర్యము, పవిత్రతయు, మఱియు ఆత్మవిశ్వాసము, యీనాలుగును ప్రేమశబ్దార్థము తెలిసికొనుటకును, పొందుటకును సాధనములు.

* * *

మోహనసింగు కల్యాణపురమునగల ప్రజలలో మిక్కిలి ధనవంతుఁడు, సుఖవంతుఁడును, సదాచార సంపన్నుఁడు, సజ్జనుఁడును కూడనైయుండెను. కాని జూదమాడుటయన్న నాతని కెక్కువయిష్టము. అంత్యమున కాతఁడు తనసర్వస్వమును కల్యాణపుర పాలకుఁడైన ఠాకుర్ శ్యామసింగునకు జూదమున నర్పించెను.

* * *

"వీణ" పదునారేండ్ల యువతి. సద్గుణసంపన్నురాలును, సౌందర్య రాశియునైయుండెను. వీణ బాల్యముననే యెన్నియో గ్రంథములఁ జదివెను. ఆత్మవిశ్వాసమే మనోప్సితంబుల నెరవేర్చునని తన విద్యవలన తెలిసికొనెను. తానొక భూపాలకుని పత్నిగావలెననితన మనోభిలాష! ఈమె తనతండ్రి మోహనసింగు జూదమున సర్వస్వమును గోల్పోవుట కెంతయు చింతించెను. కాని విద్యావతి యగుటచే తిరుగ ధైర్యమవలంబించెను.........ఆసమయమున కల్యాణపుర సమీపమున గల పల్లెలందును, కల్యాణపురమునందును, "రామజోగి" యను క్రూరుఁడు తన యనుచరులతో దోపిడిచేయుచుండెను. కల్యాణపురమునందా క్రూరుని భయముచే రేయింబవళ్లు ద్వారముల బంధించి స్త్రీపురుషులు భయభ్రాంతులై నిద్రాహారములులేక వసింపుచుండిరి.

* * *

అశోకుఁడు రామనగర సేనాధిపతి. మిక్కిలి ధైర్యశాలి యగు యువకుఁడు. బలాఢ్యుడు సుందరుఁడుకూడనైయుండును. అశోకుఁడు రామజోగిని వెదకుచు తిరుగుచుండెను. ఒకనాఁడు కల్యాణపుర సమీపమున కరుదెంచెను. సమీపమున జరుగుచున్న యొక భయంకర ఘోరపోరాటము నాతఁడు తిలకించెను. ఆశ్చర్యక్రోధములచే నాతని శరీరము కంపించెను. పదిపండ్రెండుగురు దుష్టులతో నొక వీరరమణి పోరాడుచున్న ట్లాతనికి కనుపించెను. వెంటనే యచ్చోటి కరిగెను. దుష్టులు పరుగిడిరి. వీరరమణీ యశోకు లొకరినొకరు ప్రేమదృష్టులతో చూచుకొనిరి. ఇరువుర హృదయములందును ప్రేమ యంకురించెను. "ప్రేమపాశము"చే నిరువురు గాఢముగా కట్టబడిరి వీరరమణి మనవీణయే! దుష్టులు రామజోగి యనుచరులేకదా!

* * *

మరునాటి యుదయమున దొంగలు పట్టుపడిరని వదంతి బయలుదేరెను. కల్యాణపురజనులెల్ల నిశ్చింతతో గృహములనుండి వెలికివచ్చి తిరుగాడఁజొచ్చిరి. "సాయంకాలము నాలుగుగంటలాయెను. రామజోగియనుచరు లొక పథికుని దోచిరి. మఱియు నాపథికుని చేతనే కల్యాణపురగ్రామజనులకు "రామజోగి వచ్చుచున్నాడు. జాగ్రత్త"యని వర్తమానమంపిరి. జనులెల్లరు యథావిధి మందిరంబులఁ జొచ్చి ద్వారముల బంధించుకొనిరి. ఆవర్తమానము తెచ్చిన పథికుని కెవ్వరు నిలువస్థానమైన నివ్వరైరి. "రామజోగి వచ్చుచున్నాడు." అను వాక్యము విన్నంతమాత్రమున వీరరమణియగు వీణయొక్క శరీరము క్రోధముచే కంపించెను. వెంటనే తన తండ్రి కరవాలమును చేతధరించెను. సింహనాద మొనర్చుచు కల్యాణపుర మైదానమందు నిలచెను. మఱియు పిఱిపందలై గృహంబుల దాగియున్న ప్రజల కిట్లు ధైర్యము గొలుపఁబలికెను. "స్త్రీల యొక్కయు, బాలబాలికల యొక్కయు ప్రాణముల రక్షింపజాలని వారు పురుషులు కారు. నపుంసకుల క్రిందనే పరిగణింపఁబడుదురు. ఇండ్లయందుఁ దాగియున్నచో బలవన్మర

ణమునకు పాత్రులయ్యెదరు. నేనబలను! నా పేరు వీణ యనెదరు! మీకు సహకారిణిగానుండి యీ దుష్టుల దునుమాడెద! పిఱికిపందలై ఇండ్లలో నిద్ర బోకుఁడు. మనజన్మలు శాశ్వతము లకావు. రండు! మీ మగతనముజూపి పోరాడుఁడు. దుష్టసంహార సమయమున ప్రాణముల గోల్పోదుమా, వీరస్వర్గము లభించును! లేదా, విజయము సమకూడిన, సర్వోచారముగ వసింపవచ్చును! సోదరులారా, భయమేవ తను పారద్రోలుడు! దుష్టుల దునుమాడుడు!...... వీణ యొక్క సాహసవాక్యములు గ్రామజనుల మనంబుల కఠోరఘాతంబులవలెఁ జొచ్చెను. గ్రామజను లెల్ల ధైర్య మవలంబించిరి. తమతమ ఆయుధంబుల దీసిరి. వీణచెంతకు వచ్చిరి. వీణ కాధిపత్య మొసంగిరి. ప్రాణములపై నాశవిడచి పోరాడిరి. వీణ తన కరవాలముచే రామజోగి కుడిభుజంబున గొప్ప గాయము కలుగఁజేసెను. అకస్మాత్తుగా నశోకుఁడా సలమునకు వచ్చెను. రామజోగి పోరాటమున నిలువలేక తనయనుచరులతో పరుగిడెను. వీణ యొక్క సాహస కార్యమునుఁజూచి యశోకుఁడు మిక్కిలి సంతసించెను. మఱియు నిట్లు బల్కెను. 'ఇట్టి దుస్సాహస కార్యములవలన నెప్పుడైన ప్రాణ హాని సంభవించును సుమీ!'

అశోకుని వాక్యముల కడ్డమువచ్చి వీణ గంభీర పూర్వకముగ నిట్లు బల్కెను. జీవనము లశాశ్వతములు. ఎవ్వరును అన్యులపై నాధారపడి యుండరాదు. మన సర్వస్వము దొంగిలించిన పిదప మన మేమి చేయగలము.' ఆహా! వీరాంగనయగు వీణ ధన్యురాలు. ఇట్టి భారత వీరాంగనలను దైవము ప్రసాదించుగాక! అశోకుఁడు వీణతో ప్రేమపూర్వకముగ మరల కొలఁదిదినములలో కలియుదమని బలికెను. రామజోగి వృత్తాంతము తెలియఁజేయుటకు రామనగరునకుఁ జనెను.

* * *

మోహనసింగు సర్వస్వమును గోల్పోవుటచే ఠాకుర్ శ్యామసింగునకు లొంగిపోయెను. ఒక నాఁడు మోహనసింగ్ శ్యామసింగుల కిదిగువ సంభాషణమాయెను.

శ్యామసింగు:—మోహనా? నీవు ప్రస్తుత మత్యంత దరిద్రదశలో నుంటివి. నీకట్టి యిక్కట్టులును లేకుండఁజేయుదును. నీ పుత్రికయగు వీ...ణ...నునా...కొసంగుము లేనిచో పలుచిక్కులకు లోనయ్యెదవు!

మోహ:—మహాశయా, నా యాత్మతో సహితము నా సర్వమును తమ కర్పించియే యుంటిని. గాని నా పుత్రిక నొసంగుటకు నా మనంబొప్పదు, నా శక్యముకాదు.

శ్యామ:—అటులైన నీవు పలుచిక్కులకు లోనయ్యెదవు! నాతో వైరము నీకు తగదుసుమీ!

మోహ:—ప్రభుచిత్తము. "సత్యమేవ జయతి"

* * *

శ్యామసింగు బహు క్రూరుఁడు. చిరకాలమునుండి వీణపై తానత్యధిక వ్యామోహముతో నుండెను. అందుకై యెన్నియో క్రూరకార్యముల నాచరించెను. తుదకు జూదమున మోహనసింగు యొక్క సర్వస్వము లాగుకొనియెను. వీణను బలాత్కారముగ తన గృహంబునకు తీసికొనిబోవ యత్నించెను. అందు కొఱకే "రామజోగి" యను చోరుని వేషమును ధరించి గ్రామమున దోపిడి యగునని భయము కల్పించెను. చివరకు పోరాటమున నోడెను. వీణ పతివ్రతయు, వీరరమణియు నగుటచే వీని యాటలు సాగలేదు. ఎన్నియో కుట్రల యోజింపుచుండెను.

* * *

మోహనసింగు శ్యామసింగువలన తన కేమికీడు వచ్చునో యని భయపడుచుండెను. మఱియు పుత్రిక యగు వీణతో గూడ కల్యాణపురము విడచి యేదేని గ్రామముపోవ నూహించుకొనెను. తన యభిలాష వీణ కెఱింగించెను. వీణ అశోకుని యందుండెడి ప్రేమచే అందుల కంగీకరించకపోయెను.

* * *

ఠాకుర్ శ్యామసింగు మోహనసింగుతోపాటు వీణను కూడ తన కోటయందు బంధించెను...... రామనగరున అశోకుని కీ వార్త తెలిపెను. వీణ కిట్టి కష్టము ప్రాప్తించెనని విన్నంతమాత్రమున అశోకుని ముఖాకృతి మారెను. నేత్రములనుండి క్రోధాగ్ని వెలువడుచుండెను. తత్క్షణమే వలయు దుస్తుల ధరించి తురగమునెక్కి కల్యాణపురమువైపు అత్యధిక వేగముగ గుఱ్ఱమునుం దోలెను. వాక్యము బలుకునంతలో అశోకుని యశ్వము కల్యాణపురపు కోటద్వారము చెంత నాగెను. అశోకుఁడు తన గుఱ్ఱమునుదిగి దాని నచ్చోటనుంచి యొరనుండి కరవాలమునుదీసి ఇటు నటు ద్రిప్పుచు నిర్భయముగ కోటలోనం బ్రవేశించెను. వీణయున్న గదిచెంతకుంబోయి వీణను విడిపించెడి యత్నములో నుండెను. ఇంతలో శ్యామసింగు పలువురు సహచరులతో యశోకుని బంధించెను. పిమ్మట అశోకుని ఒక పెట్టెయందుంచి మూత బిగించి రామనగరు పరిపాలకునకు కానుకగా బంపెను.

* * *

నాఁడు శరత్కాలపూర్ణిమ. రామనగరు ప్రభువగు ప్రతాపసింగు తనకోటలో పడకకుర్చీయందు కూర్చొని చల్లగాలి సేవించుచుండెను. ఇంతలో కల్యాణపురమునుండి యొక పెట్టెవచ్చెనని ద్వారపాలకుం డొకఁడు ప్రతాపునకు విన్నవించెను. వెంటనే దానిని తెప్పించి విప్పించెను. చూచుసరికి ప్రతాపుని హృదయము కలవరమందెను. అశోకుని శేవనెత్తి శైత్యోపచారముల చేయించెను. అశోకుని వలన ప్రతాపుడు విషయమంతయు తెలిసికొనెను. సైన్యము సిద్ధముచేయించెను. అశోకుఁడు తనసేనతో కల్యాణపురము కోటపై దాడివెడలెను.

* * *

ఇచ్చట శ్యామసింగు మోహనసింగును పలుబాధలు పెట్టెను. ఎన్ని చిక్కులుపెట్టినను మోహనుఁడు, వీణను తనకొసంగుటకు ఇష్టపడలేదు. ఎట్టకేలకు వీణను తన మనోప్సితంబు నెఱుంగజేసెను...పాపము. వీణ శ్యామసింగున కిట్టి బుద్ధికలదని ఇదివర కెఱుంగదు. ఇందులకై తన్ను బంధించెనని కూడ తెలియదు. తండ్రి జూదరి యగుట తన్నుగూడ పందెములో నొడ్డెనేమో యని మాత్రమే యామె యనుకొనుచుండెను. లేనిచో ఇంతకు పూర్వమేయైనచో నాతని యనువుల గొనెడిదియే! వీణపై సామదాన భేద దండోపాయంబు లుపయోగించెను. అంత్యమునకు శ్యామసింగు ఆలోచించి తన సమ్మతము తెలియఁజేయుటకు వీణకు మూడుదినంబుల నొసంగెను.

* * *

మూడవనాటి యుదయమున పరిస్థితులు మారెను. రామనగరు సైన్యమంతయు కల్యాణపురపు కోట చుట్టును ముట్టడించెను. ఇరుసైన్యములకు గొప్ప పోరాటము కలిగెను. అశోకుఁడు జయమందెను. కోట స్వాధీనముఁ జేసికొనెను. శ్యామసింగును బంధించెను. వీణా మోహనుల విడిపించెను...... అశోకుఁడు శ్యామసింగు, వీణా మోహనులతో రామనగరు చేరెను. ప్రతాపసింగున కాజన్మాంత కారాగారవాసశిక్ష విధించెను. మోహనసింగునకు తన సర్వస్వమును ఇప్పించెను. వీరుఁడగు అశోకుని కల్యాణపురప్రభువుగా నొనర్చెను. ఆహా! నాటి వీణాఅశోకుల యుత్సాహ మపారము. ఒక్కమారుగ నిరువురు కౌగిలించుకొనిరి. వీణా అశోకుల కత్యంత వైభవముగ వివాహము జరిగెను.

* * *

ఎల్లప్పుడును సత్యమే జయముపొందుచున్నది... దుర్మార్గుల కెల్లప్పుడు కష్టములే సంభవించును... ఆత్మవిశ్వాసమే కార్యసాఫల్యము...ధైర్యమే ప్రధానము...సోదరీమణులు, విద్యయున్న నేగాని విదుషీమణులు కాజాలరు...విదుషీమణులులేని దేశమునకు సౌభాగ్యము చేకూరదు.



'పల్లెటూరి సంసారి'



శ్రీ సీతారామమ్మగారు, బి.ఏ.ఎల్.టి.

ఆంధ్ర విశ్వవిద్యాలయమునుండి గణితశాస్త్రమందు పట్టపరీక్షలో కృతార్థురాలైన మొదటి హిందూ బ్రాహ్మణయువతి.

ఈమె డాక్టరు కనగాల లక్ష్మీనరసింహారావుగారి ప్రథమపుత్రిక. 27-6-1910 తేదీని జన్మించి, 1930 సంవత్సరములో పట్టపరీక్షయందు కృతార్థురాలై, నాటినుండి గవర్నమెంటు విద్యాశాఖలో పనిచేయుచున్నారు. ప్రస్తుతము ఏలూరు గవర్నమెంటు ట్రెయినింగు స్కూలులో ఈమె ప్రథమ సహాయోపాధ్యాయినిగానున్నారు.

# అమ్మమ్మ

రాయసం వెంకటశివుఁడు గారు

ప్రేమవిషయమున అమ్మకు అమ్మమ్మకు, ఎండ వెన్నెలలకుండు భేదము గలదు. తల్లిప్రేమ అగాధము నిర్మలము ననుమాట నిజమె. ఐనను, ఒకప్పుడది గడిదుడుకులతోను సుడిగుండములతోను గూడియుండును. ముత్తవతల్లిప్రేమ యడ్డులేని ప్రవాహము. మాతృప్రేమ యతిమధురమైనను, ఒక్కొక్కప్పుడు వెగటుగనుండును. మాతామహీయనురాగము మాత్రము నిత్యము తీపియె.

అమ్మమ్మను జగతిని పీడించు బాధలు, కలంచు కష్టములును గడచిపోయినవి. ఇంక నంతయు నామెకు తీఱికసమయమే; లోకమామెకు పెద్ద విశ్రాంతిభవనము. ఆమె సెలవిచ్చిన విద్యార్థిని; పాత్రనభినయించి కూర్చుండు నటి; ఒడ్డుచేరిన యాత్రికత్తె!

అమ్మమ్మ కెట్టి కొదిగుండనక్కఱలేని సర్వస్వతంత్ర. నిండు వలపున నిన్నామె ముద్దాడఁగలదు. నిన్ను లాలించి బుజ్జగించును. అమ్మవలె నీమీఁద చీఁదరించుకొని మోముచాచి నీవాయనిన జడియవు. నీవేమిచెప్పినను, ఏమిచేసినను, ఆమె కంటగింపదు; చిఱునవ్వుతోనె నీకు బుద్ధిగఱపును. ఆమె నీవశముచేసిన కథలసంచి జన్మమందెన్నటికిని తఱుఁగునదికాదు! ఆమెబోధించిన సుద్దులు, అనుదినము నీకు చేయూఁతయగును. ఆమె నేర్పిన నీతులు నీ కష్టములను గట్టెక్కించును.

అమ్మమ్మ, నీకు తీయని పలుకులు చెప్పును. కమ్మని మిఠాయిలు పెట్టును. ఆమె, నీమీఁదకోపపడదు. నిన్ను దండించుట కామెకు చేతులురావు. ఆమె మాట జవదాటుటకు నీకును మనసొప్పదు. ఆమెవాక్కులు పూవులవలె మృదువగునవి, చక్కెఱవలె మధురమగునవి, మంచినీటివలె సేదదీర్చునవి. బుజ్జగింపులె యామె శాసనములు. అమ్మమ్మ సదా నీమీఁద గురిపించునది మురిపెములు, దీవనలును! ఇంతటిభాగ్యమనుభవించు నీ వెంతటి సౌజన్యవతివి కమ్మని సదా యామెకోరుచుండునో యూహించుకొనుము!

# మాలపిల్ల

శ్రీమతి పర్ల సుశీలగారు

చాలవృద్ధిగఁబండిన, సస్యమెల్ల
గోసికొనెఁగర్షకుఁ; డపు డొక్కొక్కగింజ
యక్కడక్కడఁ బడఁ బక్షియట్లు మిగులఁ
బ్రీతినేరుచుండెను మాలపిల్ల యొకతె ॥

మాసినచీరపైఁ జినుఁగు మాటికిసర్దుచు నొక్కచేతితో
భాసురమైనమోము పయిఁ బల్మరుఁబడ్డ చికాకు వెండ్రుకల్
వే సవరించుకొంచు మది విన్నదనంబు స్ఫురించు రూపవి
న్యాసముతోడ నుండెఁ గరుణామయమూర్తియొ నాగ నచ్చటన్

నాచుగప్పిన సుందరనలినమట్లు
కంది కమలినవదనపుఁ గాంతితోడ
హృదయపేటిక గోనముల రొదలు లోన
నడఁగి పైదుమ్ము వారిన యట్టు లలరె ॥

కాలుఁడో యంచు భీతిమదిఁ గల్గఁగఁజేయుచు దున్నపోతులన్
దోలుచుఁగర్షకుండు తనదుడ్డునుదాలిచి రౌద్రమూర్తితోఁ
గాలినిజోడు కిర్రుమని గర్జనసేయఁగ వేగ నంత నా
బాలికయున్న తావునకు వచ్చియునిట్లనె నామెవణ్కఁగన్ ॥

ఎవ్వతెవోసి గింజలివి యేమని యేరుచునుంటి? వింతగాఁ
గ్రొవ్వితె? యింతసాహసము కూడునె? పోయెను గింజలన్ని నీ
వెవ్వరితాతమూటయని యేరితి వింతటిదాఁకఁ బొమ్ము పొ
మ్మెవ్వరి నడ్గివచ్చితివి యీడ్చెదనిప్పుడె యింక నిల్చినన్ ॥

ఇంతమాత్రమైన ననుగ్రహింతురనుచు
నయ్యగా రివి యేరుకోరనుచుఁదలఁచి
యేరితినిబాబు సోలెఁడెయేని కావు
ఈయకుండినఁ దీసికొం డివిగో తండ్రి ॥
సిగ్గులేదటె మాటలు చెప్పుటకును
కాఱులటచెదవేటికే నోరుమూయు
మనుచు దుడ్డుతోనొక్కటి యట్టెమోదె
మూర్ఛపడెఁ బాప మా మాలముద్దరాలు ॥
అంత స్మృతిలేక కొంతసేపట్టులుండి
కటికయుపవాసములచేత గమలియున్న
తనువు నిండినబొబ్బగన్గొనియుఁ గనక
యల్లలాడఁగఁ బదయుగ్మ మపుడు లేచె ॥
చేయ నాపొట్టకొఱకయి చింతనింత
కాని ముదుసలిపితరులు కడుపుకాలి
దగనిక్షుద్బాధచే స్మృతితప్పిడస్సి
యెట్టులుందురో యనుచు శోకింతు మదిని ॥
ననుచు నాదీన పొగులుచు నచటువాసె ॥

# నేనూ—అతనూ

ముదుంబి నరసింహాచార్యగారు

నేనూ, అతనూ, బాల్యస్నేహితులం, సహాధ్యాయులం. లలితకళాపిపాసతో మే మిద్దరం కొన్నాళ్ళు కవితాకన్యక నారాధించాం; చిత్రకళాదేవత నుపాసించాం. మా కళాకుసుమాలు ప్రపంచోద్యానవనాన్ని సహజమధురపరిమళంతో ముంచెత్తివేశాయి. తోడి విద్యార్థుల, ఉపాధ్యాయుల అత్యుక్తులు ఉత్ప్రేక్షలు వినలేక మా చెవులు గింగురులెత్తిపోయ్యాయి. తటిల్లతలవలె మా విద్యార్థిజీవనాలు అలౌకికమైన ఒక స్వర్గజ్యోతిని మెఱపించి యింతలో అదృశ్యమైపోయ్యాయి. కనులు తెరచి చూతుము కదా, ఆ స్వర్గీయ పవిత్రజీవనానికి ఎన్నో వేలమైళ్ల దూరంలో—భయంకరనరకవాసనలతో కూడిన సంసారసాగరంలోపడి కొట్టుకొంటున్నాం, నేనూ అతనూను.

అంతవరకూ, నేనూఅతనూ మధుర దివ్యస్వప్నపథాలలో విహరించే భావకవి చిత్రకారులం. ఇద్దరం ఏకపట్టణవాసులం, పవిత్రప్రేమోపాసకులం; అహంభావరహితులం. కాని యిప్పుడు జీవితంలో ఆ సారళ్య మాధుర్యాలేవి? ఒకానొక అవ్యక్తమైన ఆశంకతో మాహృదయాలు చలించిపోతున్నాయి. దివ్య స్వప్నరాజ్యాలనుంచి పదచ్యుతినంది, ఉదరనిర్వహణంకోసం సామాన్యమానవవాసనలతో యీ సంసార మరుభూమిలో పరిభ్రమిస్తున్నాం. ఒక దారుణ యంత్రణ—దురంతపరివేదన—భీషణ అనుతాపం మా హృదయకుహరాల్లో, దుఃఖాంధకారంతో కలిసి ముఖరితమగుచున్నది. జీవితంలో యెన్నడెఱుంగని నిగూఢత, సంకుచితభావం, వ్రీడాప్రవర్తన, అనుభవంలోనికి వచ్చాయి. ఇవన్నీ కలిసి మాయిద్దరి జీవితంమధ్య ఒకప్రగాఢ యవనికను కల్పించినవి. ఆ యవనికాభ్యంతరములలోనుండి మా హృదయాలు ఒకదానికొఅకు ఒకటి పరితపించిపోతూన్నవి. మా జీవితనాటకాలలోని వియోగగీతికల యాలాపనలను లోకం ముక్తకంఠంతో పొగుడుతోంది. అతని కళాలాపసలలోని వర్ణరాగాలకు నాహృదయం ఉప్పొంగిపోతుంది. నాకవితాలాపాలలోని గీతికారాగా లతనికి శ్రావ్యములై హృదయసందేశాల నొసంగుతూంటాయి. అతను అల్పసంతుష్టి, నిరాడంబరుడు, నిస్పృహుడు. నేను అర్థవంతుడను, పైగా దానశీలుడను, కీర్తికాముడననికూడ లోకాపవాదు. ఇంత భేదం యేర్పడిపోయింది మా కుసుమసమాన జీవనాల్లో. ఎందుచేత? బాల్యం, సారళ్యం, మాధుర్యం, మాగ్ధ్యం మాజీవితాల్లోనాశనం అయిపోయాయి గావున. ఈ పాడు ప్రపంచకంలో, దుర్ధర్షణమైన కర్కశమైన జీవనభారం మా సుకుమారజీవితములపై విరుచుకుపడింది కనుక. కాని మాలో మిగిలిన, కొన ఊపిరితోనున్న బాల్యవాసనను ఆధారంగాచేసుకొని మాపరస్పరస్నేహం దిన దినం అభివృద్ధిపొందుతూనే ఉంది. భావనామయమైన దివ్యలోకాల్లోనిభావోద్యానాల్లో, చెట్టాపట్టాలు వేసుకుని విహరిస్తున్నాం నేనూ అతనూను.

...... ..........................
...... ..........................
....................................
నేను అతన్ని చూసి యుగాలుగతించిపోయి నట్లుంది. కాని అతను నన్ను మరచిపోయాడని నే ననుకోనను. చిత్రకళాప్రపంచకంలో అతనితూలిక అత్యద్భుత ప్రావీణ్యాన్ని ప్రదర్శించింది. గ్రంథములు పత్రికలు అతని కళాకుసుమసౌరభమును దేశంలో వెదజల్లుతున్నాయి. నే నానందం పట్టజాలక పోయే వాడను. బహుశః అతను నన్ను కూడ ఆన వాలు పట్టే ఉంటాడు. నా కవితాకన్యక తారుణ్యప్రభలనీక్షించిచకితుడై యుంటాడు. నా కవితాకాంతకు లోకంలో జరిగే సన్మానాలకు అతను సంతోషింతోషించని నాడు నాకు సంతుష్టిలేదు. ఈవిధంగాఆత్మైక్యతను పొందితిమి నేనూఅతనూను.

౨

లోకం దృష్టిలో నాజీవితానికి వసంతోదయం అయింది. అంటే నావివాహం నిశ్చయమైంది. నాహృదయం స్వప్నభంగం అయినందుకు తల్లడిల్లిపోయింది. నేనొకవిధంగా నాసంతప్తహృదయాన్ని శాంతిపరచుకొన నిశ్చయించుకొన్నాను. కవితాకళాకన్యకల హృదయపూర్వకమైన ఆశీర్వాదవారిధారలతో తప్తజీవన మరుక్షేత్రాన్ని సించితం చేసుకొని సాఫల్యతనంద కాంక్షించాను. అతను తన కళాకాంతతోవచ్చి మధుర ఆశీస్సులతో నన్ను ముంచెత్తాలనియు—నేను అతనికి కనకాభిషేకంచెయ్యాలనియు నాఆశ. కళాప్రపంచకంలో అతనికి ప్రత్యేకత ప్రాముఖ్యత ఉన్నాయని నాఉద్దేశ్యం. కాని ప్రత్యేక ఆహ్వానంతో అతన్ని పిలువడానికి నాకు ధైర్యం చాలలేదు. అతనిదృష్టిలో వివాహం ఒకపెద్దబంధనం. కావ్యసాహిత్య ప్రపంచకంలో స్వచ్ఛందవిహారంచేస్తూ మధురస్వప్నపథాలలో విహరించుతూండే కళోపాసిజీవితం, ఒక క్షుద్రబాలికయొక్క-సామాన్యజీవితంలో కేంద్రీభూతం అయిపోతోందంటే అతనెంతమాత్రం ఒప్పుకొనడు. పవిత్రమైన కళోపాసనకు తుచ్ఛసంసార బంధనం గాఢప్రతిబంధకంఅని అతనితలంపు. అట్టివానిని నే నెట్లాహ్వానించగలను? స్వచ్ఛ తేజోమయమగు వినిర్మలగగన మండలములో విహరిస్తూన్న శుకముఖమునుండి పంజరబద్ధ పికజీవితాన్నిగూర్చి పాడించగలమా?

అహంభావంచేత అభిమానంచేత-ఇచ్ఛ కాలచేత ఆ తపోజీవితాన్ని భంగపరచడం నాతరమా? నేను సంకటంలో పడ్డాను. స్వయంగా అతని శుభదర్శనంచేసుకొనుటకు సాహసంలేకపోయింది. అనంతావేదనలచే నా హృదయం పరితప్తమైపోయింద. నాఉన్మాదావస్థనుచూచి లోకం నవ్వింది—పరిహసించింది. అంతుపొంతులేని భావవీచికలచే హృదయసాగరం పొర్లిపోయింది. నాహృదయంశిథిలమైపోయింది. నేను వినిర్మలశాంతిని ఆశించాను. హృదయాన్ని సుదృఢపరచుకొనుటకు కొంతవ్యవధి అవసరమైంది. కాని లోకం నామనోప్రవృత్తులను లక్ష్యపెట్టలేదు.

అశుభఘడియలు—కాదు, శుభఘడియలు రానేవచ్చినవి. నిర్విఘ్నంగా 'వివా

హాం' అయింది అనిపించారు. దేశదేశముల లోని కళోపాసకులు తమతమ లలితకళా కుసుమాలతో నాజీవితవసంతోద్యానవనాన్ని సాఫల్యత నందించారు. యథోచిత రీతి వారందఱు సత్కరింపబడ్డారు. నాకు అతను రానిలోటు దుర్భరమనిపించింది.

నాజీవితసంగీతంలో ఏదో అపశ్రుతి ఆవహిల్లింది. అతని లలితకళాకుసుమాలతో నామస్తకం అభిషిక్తంకాలేదు. ఉన్నతాదర్శంతో కూడుకొన్న కళోపాసికి నేను తగిన గౌరవం చెయ్యలేకపోయ్యాను. అతనికి తగిన సత్కారం చెయ్యనిదే నామనస్సుకి శాంతిలేదు.

ఒక దారుణాశంకతో నాజీవితం దహించుకొని పోతోంది. పశ్చాత్తాపవహ్నికీలికలు నాఉత్తప్తహృదయపుటాన్ని భస్మంచేస్తున్నాయి. నేను స్వయంగా ఆకళామూర్తిని ఆహ్వానింపలేకపోతిని, తన శుభాకాంక్షలను నాపై వర్షించటాన్కి అతనిఆత్మ ఎంతో పరితపించిపోయి ఉంటుంది. నాకు తెలుసు, అట్టి సద్యోగ మతనికి కల్గించకపోవుట నాదే తప్పు.

స్త్రీ అయినంతమాత్రంచే—స్త్రీజాతిని నేను దూషించను—కష్టసహిష్ణుత వినమ్రత సేవాభావముల సంఘటనమే స్త్రీ యని నా ఉద్దేశ్యం. స్వర్గధామంలోనుండి యీదేవీమూర్తులు పాపపంకిలమైన యీపాడులోకంలోకి ఎందుకువచ్చారు? పురుషులకర్కశపాషాణహృదయాల్ని కట్టుకొని తలపగుల కొట్టుకొనుటకేనా? ప్రేమయొక్క ఆదాన ప్రదానంలోనే జీవితమాధుర్యం యిమిడి ఉన్నదని నే ననుకొంటాను. నాశుభోదర్కాన్ని విని అతను సంతోషించే ఉంటాడు.

## 3

కాలం తన సంవత్సరావృత్తాల్లో ఏన్నో సార్లు దొర్లిపోయింది. అతని హృదయాన్ని అజ్ఞాతరూపంగా నేను అనుభవంలోకి తెచ్చుకొంటున్నాను. నాహృదయపరితాపంలో అతడు భాగం పంచుకున్నాడు. నేను అతని విషయంలో దురంతపరివేదన పొందుతున్నానని ఆహృదయం గ్రహించింది. అతని సుకుమార హృదయాన్ని కష్టపెట్టాను. నాకెందుకింతవెఱ్ఱి. అతడు తన భౌతికశరీరాన్ని ఎల్లాగో అల్లాగ నావద్దకు జేరేస్తేనేకాని మాపవిత్రస్నేహం అభివృద్ధి పొందదూ? హృదయాలు నిష్కళంకాలయినప్పుడు బాహ్యాడంబరా లెందుకు?

ఇక మరేమీలేదు. అమూల్యమైన ఆ పవిత్రసుహృదత్వానికి స్మృతిచిహ్నంగా తుచ్ఛమైన నావజ్రాంగుళీయకం ఒకటి అతని దగ్గరఉంది. అతడా ఉంగరంతో తన బాహ్యశరీరాన్ని అలంకరించాడో లేదో నాకు తెలియదుగాని—నేను దృఢంగా నమ్ముతున్నాను. అతని పవిత్రహృదయాగారంలో అది సజీవరూపంగా భద్రపరుపబడిఉంది. దాని ప్రతిచ్ఛాయమే, ఇదిగో శాశ్వతంగా నాకళ్ళ యెదుట ప్రత్యక్షమైఉంది. ఆ అంగుళీయక స్మృతిచ్ఛాయలో నిరవధికశాంతి సామ్రాజ్యాన్ని అనుభవిస్తున్నాం, నేనూఅతనూను.

# సావిత్రిస్వప్నము

బయ్యే సుబ్బారావుగారు

"కన్యా విక్రయులై ధనంబునకపేక్షించెంది లోకంబునం
దన్యాయం బొడిగట్టికొందలచి దుర్వ్యాపారము లూహింప సా
మాన్యప్రాభవమిచ్చగించి; రకటా! మర్త్యాళిశిక్షింపలే
రన్యుల్; నీవు సహించియుండుటకు చోద్యంబయ్యె సీతాపతీ"||

నేనొక బ్రాహ్మణవితంతువును. సన్నాయిపాటలు పాలకీప్రయాణములు నాకించుకజ్ఞప్తియుండుటచే నేను పుట్టుకతోడనే పూర్వసువాసినిని కానన్న విషయము స్పష్టమగుచున్నది. నాతలిదండ్రులు నాకు సావిత్రియని పేరిడిరి. ప్రేమయననేమియో భర్తయననేమియో యెరుగని నాకు, నిజేశు డీ జీవితములకై యమునితో వాదులాడి, మెప్పించి తత్ప్రాణముతో బాటత్తమామలకు జననీజనకులకు శుభంబులు గొన్న సౌభాగ్యవతియగు సావిత్రిపేరామెకేతగును గాని నాబోటి నికృష్టజీవి కెట్లు వర్తిలును? ఆమె పతివ్రతలలోనెల్ల నగ్రగణ్య. భర్తకై తన సర్వస్వము నర్పింపసమకట్టినది. చిరకాలము భర్తృసేవాపరాయణయై పేరువడసిన పరమసాధ్వి. నేనన్నో భర్తముఖమైన జూడనోచుకొనని పరమదౌర్భాగ్యను.

పన్నెండు సంవత్సరముల వయసువచ్చువరకు చాల సౌభాగ్యముగనే యుంటిని. కాని యొకనాటి సూర్యోదయమున కటికవాడు మేకగొంతుకోసి చర్మము దిగతీసినట్లు నాశరీరమందలి సర్వాభరణములు మాతలిదండ్రులు నిర్దయులై తీసివైచిరి. ముద్దుగుల్కు ముంగురులతో బాటు నా కేశభారమును విదళించిరి. కటికనేల పరుండవలెననియు, ఒక్కపూటమాత్రమే భుజింపవలెననియు వేడినీళ్లు స్నానముచేయరాదనియు కట్టడిజేసిరి. జాకెట్టు-కాదు, తుదకు రవికలగుడ్డకూడ నిషేధింపబడినది. ఇట్టి కఠిననరకము ననుభవించుటకు సంసిద్ధనైకూడ యుండలేదు. శాఖాఖండితరసాలముకైవడి వివర్జితాలంకారనై కురూపినై కుందవలసివచ్చెను. ఈ హఠాత్సంఘటనమున కేనెంతయు కలగిపోయితిని, సొగిలిపోయితిని. ఆదినములలో శాసనోల్లంఘనోద్యమముగాని, అట్టి యితరోద్యమములుగాని నియమములలో లేకున్నను నిష్కారణముగ మూడవతరగతి ఖైదీనైతిని. ఎందుచేత నన్నిట్లుశ్రమపెట్టుచున్నారని యొకదినము నాతల్లినడిగితిని. "నీమగడు చచ్చాడుకదూ!!" అని కండ్లనీరు గ్రుక్కుకొనుచు చెప్పినజబాబు తప్ప వేరేమియు నామె వాక్రుచ్చియుండలేదు. కాని ధనాశచే నాతండ్రి నన్నొక ముదుసలికిచ్చి వివాహము— కాదు విక్రయించినట్లు లిరుగుపొరుగమ్మలక్కలవలన దెలియవచ్చినది. నాకమోఘవైధవ్యము. నాతండ్రికనూనధనప్రాప్తి. అదంతయు గతజలసేతుబంధనము.

కొంతకాలమునకు నాతల్లి మరణించెను. మాకుటుంబమునకు నా జనకుని క్రొత్తయత్త అధికారిణియాయెను. ఆమెయు నావలె ముండమోపి యని వేరుగ చెప్పనక్కరలేదు. కుటుంబవ్యవహారములయందామెకున్నంత నైపుణ్యమొరులకుండదని చెప్పుట అతిశయోక్తిగానేరదు. సూర్యోదయమైనది మొదలు రాత్రి సగమాకటితో నేలపై మేనువాల్చువరకు నారక్తమాంసము లింటిపనులకై ధారబోయవలసినదే. నాతండ్రి నా క్షేమమునుగూర్చి యెన్నడును విచారించియుండలేదు. "ఎవ్వరెట్లాబోతేనాకేమి? ఎవళ్లక్కూడులేకుంటేనాకేమి? నామట్టుకునాకు ఏదో ఒహరావుబహద్దూర్‌తోబాటు నెలకు ఏబదారువందలు కిట్టితేచాలదు?" అనే బాపతులో మనిషివలె నా క్షేమమునుగూర్చి కించిత్తైనను యోచించెడివాడు కాడు.

సంవత్సరమునకు రెండుసార్లు నాసోదరుడు సెలవులకింటికి వచ్చుచుండెడివాడు. నన్ను చాలగారాబముతో ప్రేమించుచుండెడివాడు. అన్నరసముకంటె

ఆదరరసము ఎక్కుడుగదా! తా నింటికడనున్న దినములే నాకు సౌఖ్యదాయకములు. ఆదినములలో కడుపార నన్నము లభించెడిది. అట్లు కానిచో మాతండ్రికి తెలియచేయుటయో లేకున్న కలహము రేపుటయో జరుగకమానదని మాయజమానురాలు జాగ్రత్తపడియే యుండెడిది. మత్సోదరు డప్పు డప్పుడు సమీపమున గూర్చుండి విధవ లింతకఠినముగా జూడబడనిచోట్ల గూర్చియు, ముండమోపులు పునరుద్వాహము గావించుకొను ప్రదేశముల గూర్చియు పెద్దగా చెప్పుచుండెడివాడు. అట్టి గాథల నాకర్ణించునపుడెల్ల నామనోరంగమున నూతనకోరిక లీలికలెత్తుచుండెడివి. ఒక్కొకతఱి మనదేశపు 'విధవ చట్టములపై' తిరుగుబాటు చేయుదమని యుద్రేకము గలుగుచుండెడిది. కాని నానిస్సహాయత యింతలోనే నిస్పృహగొలుపుచుండెడిది. స్త్రీలు మాత్రమే యెందుచేత నింతటి దుర్భరకష్టములకు పాలుగావలయును? ఏబదివర్షములప్రాయుడగు నాతండ్రి నాకండ్లయెదుటనే నాకంటె మూడేండ్లు చిన్నవయస్సుపిల్లను బెండ్లియాడెనే! నేనొకపురుషుని వివాహమాడి నాయక్కచెల్లెండ్రవలె నేల సౌఖ్యముగ నుండరాదు? నామనోరంగము నొకని కర్పింపక యెన్నినాళ్ళిట్లు ఖాళీగా నుంచవలయును? స్త్రీలకు పురుషులకు ఒక్కడే భగవంతుడా లేక వేర్వేరుభగవంతులా? ఇట్టి ఘోర కష్టము లనుభవించుటకంటె సహగమనమే వేయిరెట్లు సౌఖ్యముగనుండెడిదే! ఇతరుల ప్రేమింపకయు నితరులచే ప్రేమింపబడకయు యెన్నినాళ్ళు గడపగలను?

నా మారుటితల్లికాపురము నాబ్రతుకంతటి నిరర్థకము గాకపోయినను మొత్తముమీద నామె తనతోడివార లనుభవించుచున్నంతసౌఖ్యమును అనుభవించుటలేదు. ఆమె ప్రాతనేస్తునివలె పరిగణింబడుచుండెడిది. వీధి గుమ్మములో నిలుచున్న తప్పు; తలదువ్వి కీల్జడవేసినచో ముప్పు. ఆమె "ఏక్లాసు ఖైదీ" నేను "సి క్లాసు" ఖైదీని. ఒకనా డంట్లుతోముచున్నప్పు డొకపాత్రచేయిజారి క్రిందపడి బీటవారినది. ఇక చెప్ప తగ్గదేమున్నది? వర్షపాతమువలె తెడ్డుదెబ్బలు నానెత్తిపైపడినవి. తిట్లులసంగతి వేరుగ చెప్పనక్కరయేలేదు. నా పాలిటి మృత్యుదేవతయో యాయన భయంకరాకారముతో మా ముసలియజమానురాలు నామీద విజృంభించినది. ఎంతకై యోర్చియుండగలను? చేతనున్న రాగిపాత్రతో నేను కూడ యెదుర్కొంటిని. శాంతము నన్ను వీడిపోయినది. సత్యాగ్రహము నిష్ఫలమైనచో విగ్రహమే కర్తవ్యము గదా? నా కసిదీరయామెపైబడి మోదితిని. తిరిగి వంటపాత్రలు ముట్టకయే నా ఖైదుకొట్టు—ఖైదుకొట్టుగాకింకేమి యగును? —నాఖైదుకొట్టుబ్రవేశించి లోపలబీగము వైచుకొని యేడ్చుచు గూర్చుంటిని. ఏడ్చిఏడ్చి నిదురపోతిని. నాజీవితమందు సుషుప్తియే సుఖావస్థ. ఆట్టి సుషుప్తియం దపూర్వమగు నొకకలగంటిని. సావధానచిత్తులై యాకర్ణించినచో నాస్వప్నగాథ వ్యక్తపరచెదను.

"నేను పూర్వమువలె బోడిముండనుకాను. ఆకటిచే కృశించిన యింటిపనికత్తెనుకాను. చక్కనియువతినైతిని. బాహువులనుమించి శిరోజములు వ్రేలాడుచున్నవి. స్వర్ణకాంతిని నిర్జించు నామేన నత్తరుపన్నీరులలందుకొంటిని. అమూల్యాభరణములచే స్వాకృతాలంకృతినైతని. పీతాంబరములు ధరించితిని. బుటేదారు పనిచేసిన జలతారుపాదరక్షలధరించి పురవీధులలో విలాసముగా తిరుగుచుంటిని. ఆపట్టణరాజము నాకెంతయు నపూర్వము. దానిశోభ వర్ణింప నా కశక్యము. ఎత్తైనమేడలు, వింతవింత ప్రాసాదములు, స్ఫటికశిలానిర్మితములై రమణీయముగనున్నవి. చలనహేతుశకటములు, త్రొక్కుడుబండ్లులెక్కకు మించి రాజబాటలయం దతిరయమున తిరుగాడుచున్నవి. ఎచ్చోటచూచినను స్త్రీలే కాన్పించుచుండిరి. బాటలన్నియు స్త్రీజనసంకీర్ణములై విరాజిల్లుచున్నవి. విలువైన చలువవసనములధరించి విలాసముగ తిరుగువారు, తులలేని నగలుధరించి వివిధశకటము

లధిరోహించి వాహ్యాళి బోవువారు లెక్కకు మించియుండిరి. పురుషులు చాలయరుదుగ గన్పడు చుండిరి. వారైనను బెదురుచూపులతోను అదురునడకలతోను పోవువారు. తెరువబడియున్న గవాక్షముల గుండచూచిన పురుషులనేకు లింట కార్యనిమగ్నులై యుంట దృగ్గోచరమగు చున్నది. కొందరు స్త్రీలు గృహోపకరణములం దుచితపీఠములం దుపవిష్టులై యుండ పురుషులు వారిచెంత చేతులుకట్టుకొని నిలువబడుటయో లేక వారికి వలయు సౌకర్యముల నొడగూర్చుచుండుటయో గాననగుచున్నది. కొన్ని కిటికీలనుండి జడలుకట్టిన శిరోజములు, దుబ్బుగా పెరిగి చీదరబుట్టించు గడ్డములుగల పురుషుల ముఖములు కన్పించుచున్నవి. క్షౌరముగాని, స్నానముగాని, నూనెతో శిరోజముల చక్కజేయుటగాని వారిపాల నిషేధింపబడినట్లు దోచుచున్నది. జీర్ణమలినవస్త్రముల ధరించియుండిరి. శరీరములు చాలకృశించి యున్నవి. అంతియకాక వారు నడచునపుడు వారి మెడలయందు కట్టబడిన చిరుగంటలు గణగణమని ధ్వని చేయుచున్నవి. నన్నుచూచి వారు తలుపులు బిగించుకొన మొదలిడిరి. అట్లు చేయుటచే వారిని సాంతముగ చూడ కోరిక హెచ్చసాగెను.

అట్లుతిరుగుచు నే నొకదివ్యప్రాసాదముముంగల చేరితిని. ఆభవన పురోభాగమున నొక స్త్రీ సుఖాసీనయై యుండెను. ఆమె వయసున ముప్పదికి మించియుండును. ఆమెచెంత ద్వాదశప్రాయుడగు యువకు డొక డొక్కతాళవృంతము చేబూని యామెకు విసురుచుండెను. నన్నుజూచి యామె మందహాసము చేయుచు చేరువకు బిలిచినది. నన్నొక కుర్చీమీద కూర్చుండ నియమించినది. అట్టియువకుడున్నచోట నిలుచుండుటయే నాకు సిగ్గుగాతోచును. కాని యామె నిర్బంధముజేసిన కూర్చుండక తప్పినది కాదు. నన్నుచూచి ఆయువకుడే చాలసిగ్గిలసాగెను. తొట్రుపడజొచ్చెను.

సమీపమున సేవకు లెవరును లేకుండుటచే ఆ యువకునిచేతనే నాకై కొంచెము 'కాఫీ' తెప్పించినది. అనంతరము మాకిరువుర కీక్రిందిసంభాషణ జరిగినది.

ఆమె: 'ఈపట్టణమునకు మీరు క్రొత్తగా వచ్చినట్లు తోచుచున్నది.'

నేను: 'ఔను, నా కీపుర మపూర్వము. ఇచ్చటి విశేషములు నాకెంతయు ననూహ్యములుగ నున్నవి.'

ఆమె 'మీరు పురుషరాజ్యమునుండి వచ్చినవారు కావచ్చును. ఇయ్యది స్త్రీరాజ్యము. ఇచ్చట శాసనములు, పద్ధతులువేరు.'

నేను 'అట్లే తోచుచున్నది. ఇచ్చట ప్రతివిషయము నాకాశ్చర్యము కలిగించుచున్నది. ఇప్పటివర కిచ్చటనుండి, ఇప్పుడు లోపలకుబోయిన పురుషు డెవరై యుండవచ్చును?'

ఆమె: 'అతడు నాభర్త—నా రెండవభర్త.'

నేను: 'ఏమి? రెండవభర్తయా? ఇచ్చట స్త్రీలు రెండేసి వివాహములు చేసికొనవచ్చునా?'

ఆమె 'ఔను రెండేకాదు, ఎన్నివివాహములయినను చేసికొనవచ్చును. మాయక్కకు మొదటి భర్తవలన సంతానము లభింపమి తిరిగి వేరొక యువకుని బెండ్లాడినది. అత డచిరకాలముననే మరణించుటచే మొన్ననే యింకొకనిని పెండ్లియాడినది. ఆమెకు మొదటి భర్తవలన యిరువురు పుత్త్రిలు గలరు కాని 'అపుత్త్రిస్యగతిర్నాస్తి' యను వేదవాక్య మమోఘముగదా!'

నేను: 'మీ మాటలు నా కాశ్చర్యమును గలిగించుచున్నవి. మీయక్కవయసెంత?'

ఆమె: 'ఆమె కిప్పుడు నలువదియవ సంవత్సరము. అందుచేతనే ఆమె వంశోద్ధరణకొఱ కొక యాడునిసువుకై యారాటపడుచున్నది. చాల ధనమున్నది కాని యాడుసంతానములేదు. ఇప్పటిభర్త చాల యోగ్యుడు. వినయవిధేయతలు గలవాడు. శీఘ్రకాలముననే యామెకు భగవంతు డొక స్త్రీ శిశువును బ్రసాదించుగాక.'

నేను: 'ఏమి! వంశము నుద్ధరించువారు పురుషులా స్త్రీలా? ఆస్తికి వారసత్వపుహక్కు ఆడుపిల్లల కెట్లు కలుగును?'

ఆమె: 'మీమాటలు నా కాశ్చర్యముగనున్నవి. ఆస్తి యాడుబిడ్డలదిగాని మగబిడ్డలదికాదు. ఆపె కుమారులు తమతమ భార్యల యిండ్లకుబోయి కాపురముచేయుదురు. మత్సోదరి వారలకు కొలదిగా విద్యాభ్యాసము చేయించినది. పురుషవిద్య పరువు చేటని యనేకు లాక్షేపించిరిగాని మేమది లెక్కగొనలేదు. కుటుంబవ్యవహారమునందు గూడ వారిని బాగుగ తర్ఫీతుచేసినది. వారి కుచితకాపురములు లభించు టంత కష్టమైనపనికాదు. నాభర్త సంగతి చూడుడు. అతడు గౌరవమైన కుటుంబమునకు చెందినవాడు. సాంసారికవిషయములం దసమానకౌశలము గలవాడు. మిమ్ముగాంచి యతడు సిగ్గుజెందుట మీరు గమనించియే యుందురు. నాకట్టి దెంత మాత్రము సహింపదు. నేను సంఘసంస్కారపక్షమునకు జెందినదానను. నాస్నేహితునితో చనవుగా తిరుగుటకు మాట్లాడుటకు నేనెంతయు ప్రోత్సహించుచుందును. నాతోకలసి బహిరంగసభలకు గమ్మని బలవంతపఱచుచుందును. కాని యాచారమన్నిటికి నడ్డుతగులుచుండును.

ఏడ్చుచున్న పసిబిడ్డ నెత్తుకొనివచ్చి యామెభర్త యామె కుర్చీవెనుక వినమ్రుడై నిలువబడి పదిలముగ బిడ్డ నామె యొడియం దుంచెను. ఏతద్దృశ్యము నా కత్యంతాశ్చర్యము గలిగించెను. కాని యంతకంటె నెక్కు డాశ్చర్యము నద్భుతము గలిగించు మెడయందు చిఱుగంటలున్న విపరీతపురుషుల యుదంతము తెలిసికొనగా మనను వేగిరపడుచుండెను. తుద కావిషయమై ప్రశ్నింప నామె 'వారు తమ భార్యల గోల్పోయిన దురదృష్టవంతులు. వా రాజన్మాంత మవ్విధమున నే యుండవలయును. వారి పునర్వివాహములు మా సాంప్రదాయముల కననుకూలములు' అని జవాబిచ్చెను.

'శిరోజములను, గోళ్లను పెంచుకొని వికృతాకారమును పొందియుండుటకు కారణమేమి?' యని నే నడిగితిని.

'పత్నీహీను లపవిత్రులు. శుభకార్యములందు వారి దర్శన మమంగళము. తక్కిన పుణ్యపురుషుల నుండి వారిని వేరుగా నుంచుటకును, విలాసవతుల కంటబడకుండుటకై హెచ్చరికకుంగాను, యితర స్త్రీలచే వారు ప్రేమింపబడకుండుటకు వారియాకారములు వికృతములుగా నొనర్పబడి యందు గంటలు కట్టబడినవి.' అని యామె జవాబిచ్చినది.

'వీ రాజన్మాంతము వివాహము జేసికొనకుండవలసినదేనా' యని తిరిగి ప్రశ్నించితిని.

'మా శాస్త్రనియమముల ననుసరించి యట్లే యుండవలయును. అందిట్లు వ్రాయబడి యున్నది,-'పత్నీహీనుడు పునరుద్వాహము గావించుకొన్నచో భార్యకు దేవలోకమున మనోస్వస్థతయుండదు. వాని పితృదేవతల కేడు జన్మములవరకు పుట్టగతులుండవు. తాను రౌరవాది ఘోరనరకములకు లోనౌను. భార్య సజీవయైనను నిర్జీవయైనను సరే తచ్చరణ సేవానురక్తులకే మోక్షప్రాప్తి. మరియు వైధవ్య మనుభవించు పురుషుడు క్రొత్తదుస్తులుగాని శుభ్రవస్త్రములుగాని ధరింపరాదు. దినమున కొక్కపూటయైనను తప్పక యుపవసింపవలెను. సంవత్సరమున కొకటి రెండు సార్లుకంటె నెక్కుడు స్నానముచేయరాదు. నఖశిఖఖండన మసలే కూడదు. నూనెరాసి తల చక్క జేయరాదు. ఈ నియమములలో నేది తప్పినను దేశమునకు క్షామము వాటిల్లును. అన్నియుదప్పిన ప్రళయమే సంభవించును' అని వ్రాయబడి యున్న'దని యామె నుడివెను. పిమ్మట భర్తవైపుచూచి 'రామూ! ఆమె చాల అలసినట్లున్నది కొంచెము తేనీరు తీసికొనిర'మ్మని చెప్పినది. చెప్పుటయే తడవుగ నాయన లోనకుబోయెను. మా సంభాషణమాత్ర మాగలేదు.

ఆమె: 'దుర్భరవైధవ్యదుఃఖ మనుభవించుట వయసుచెల్లినవారికే కష్టతమము. ఇక పడుచువారల సంగతి వేరుగ జెప్పవలయునా? లేఁబ్రాయపు కుఱ్ఱలనేకు లీ యకాలసంఘట్టనకు గురియగుచున్నారు. అట్టివారి సంరక్షణకుగాను మొన్ననే మేమొక చట్టమును శాసనసభయందు ప్రవేశపెట్టి విజయము గాంచితిమి. కాని పునర్వివాహము చేసికొన సాహసించు పురుషులు బహుఅరుదు. ఆక్షేపణలు మెండు. పాడుశాస్త్రము లెప్పుడు రచింపబడినవోగాని యనేక పసిబాలురకు ప్రాణకంటకములుగా నున్నవి. నిజముగా పురుషులచే రచియింపబడినచో నింత యనర్థదాయకములుగా నుండియుండవు. భగవంతుని దృష్టిలో నందరము సమానులమే. అందొకరికి మహావైభవము మరియొకరికి బలవద్దుఃఖప్రాప్తి. అందరి యెడలను సమముగా వర్తించునవే శాస్త్రములన నొప్పును గాని ప్రత్యేకవ్యక్తి క్షేమము నామోదించునవి శాస్త్రములు గావని ఘంటాపథముగా జెప్పగలను. శాస్త్రము లేమి చేయుచున్నవి? లెక్కకు మీరిన పెక్కుయువకుల జీవితముల నడవిగాచిన వెన్నెలవగిది నిరర్థకములు చేయుచున్నవి.'

నేను: 'మీ పురుషు లిట్టి కట్టుబాట్లకు లోనయి వర్తింతురా? వారికీ నియమములు కటువుగా నున్నవని తిరుగుబాటు చేయరా?

ఆమె: 'తిరుగుబాటా! విధవపురుషులు తిరిగి పెండ్లియాడవచ్చునని శాసనమును మే మమలునకు దెచ్చినందు కనేక పురుషులు తమ పత్నీవ్రతమునకు భంగమాపాదించితిమని మాసంఘసంస్కరణపక్షమువారిని దూషించుచున్నారు. పూర్వము భార్యచచ్చినచో భర్త నామెతోబాటగ్ని కాహుతిజేసెడివారు. కాని యట్టి యమానుషకార్యములు జరుగరాదని ప్రభుత్వమువా రొక యసాధారణ చట్టము నమలు పఱచుటచే నిప్పు డది చాలమట్టుకు తగ్గినది. ఐనను అట్టి వక్కడక్కడ ఇంకను జరుగుచున్నట్లు వినుచునే యున్నాము. తమ భార్యల చితిపై దాము చచ్చుటకు ప్రభుత్వమువారు నిరోధించుటంజేసి నీటమునిగియో, విషముద్రావియో, యురిపోసికొనియో కొందఱు పురుషులు చచ్చుచునే యున్నారు నాభర్త కొంతచదువుకొన్నవాడే యైనను యిట్టి విషయములందు పట్టుదల గలవాడు. ఇట్టి ప్రశంస నెత్తినచో వాని యభిప్రాయమును మీరే తెలిసికొనగలరు.'

ఇంతలో నామెభర్త తేనీరు దెచ్చుటచే నామె బలవంతమునంజేసి యొకించుక గ్రోలితిని. ఆమెయు త్రావుట చాలించి 'రామూ, ఈమె మనరాజ్యమునందు పురుషపునరుద్వాహముగూర్చి నీయుద్దేశమును విన గోరుచున్నది. సిగ్గిలక నీయభిప్రాయమును వెల్లడించుము' అని చెప్పినది.

ఆయన కొంచెము సిగ్గుపడెను గాని యెట్టకేల కిట్లు నుడువ నారంభించెను. "ఎంత దారుణము! భార్యావిహీనుడు మరల పెండ్లియాడుటయా? కలికాలము! పవిత్రుడైనపురుషు డొక్క భార్యను దప్ప యితరుల ప్రేమింపనొల్లడు. భార్యయే దైవము, భార్యయే సర్వస్వము. తన కేడుగడయగు భార్యను పోగొట్టుకొన్నచో నది వానిపురాకృతకర్మము. మరుజన్మమున నామెనే పత్నిగా బడయుటకై నిరంతరము ప్రార్థనలు చేయుచు శేషజీవితమును గడుపవలయును. నుదుటివ్రాత దప్పింప నెవరిశక్యము! భర్తకు భార్యతోడిదే లోకమనియు, పత్నీపదకమలపూజయే పరమావధియనియు పురాణములు ఘోషించుట లేదా?'

అట్టి మాటలు వినుటకు నాకే సిగ్గగుచున్నది. ఆశ్చర్యమునకు మేరయేలేదు. అయినను సాహసించి 'స్త్రీలుమాత్రము రెండవవివాహము చేసికొనుట లేదా? మీరేల చేసికొనరాదు?' అని ప్రశ్నించితిని. అందు కాయన 'వారు స్త్రీలు. మేము పురుషులము. వారెన్ని వివాహములు చేసికొన్నను తప్పులేదు. మేమో, పురుషులము. మాకు పత్నీవ్రతమే

పరమధర్మము. పత్నీవ్రతుడుకాని పురుషున కిహపరములయందు తావులేదు. శాస్త్రసమ్మతము గాని పనులు చేయుట కెవరు సాహసింపగలరు? పత్నీ వ్రతుడు ప్రాణమైనను గోల్పోవుట కొప్పుకొనును గాని పరస్త్రీలను కన్నెత్తియైనను చూడ సాహసింపడు' అని జవాబిచ్చెను.

ఆమె నన్నుజూచి నవ్వుచు, 'చూచితిరా! అతని జవాబు. నేను సంస్కరణసభకు కార్యదర్శిని. మా 'యింటాయన' యభిప్రాయము లిట్లున్నవి. వారి క్షేమమునకు వారే ప్రబలశత్రువులు కానున్నచో మన మింకేమి చేయగలము?' అని పలుకుచు భర్త వైపు తిరిగి, రామూ! నీవిట్టి పిచ్చియభిప్రాయములు వదలి నాయుద్దేశములతో నేకీభవించి యుండనిచో నిజముగా నిన్ను విసర్జించి భార్యావిహీనుడగు వేరొక చక్కని యువకుని బెండ్లియాడెద'నని చెప్పెను. ఆయనయు సిగ్గున తలవంచి చిరునగవునవ్వుచు బిడ్డ నామె యొడియందు బెట్టుచు, 'మీచిత్తము వచ్చినచో నట్లే చేయుడు. మీకెవ్వ రడ్డుచెప్పగలరు? మీరు సర్వాధికా......' ఇంతలో తలుపు నెవరో తట్టుటచే మెలకువవచ్చినది. ఇక చెప్పవలసిన దేమున్నది? విధి వినిర్మిత—కాదు, కాదు, శాస్త్రములసృష్టించిన సృష్టికర్తలచే విధింపబడిన నా యీబాలవైధవ్య దుఃఖమును నేను మీకు విన్నవింప దలంచుకొనలేదు. వైకుంఠ సౌఖ్యము నొడగూర్చు ఇట్టి స్వప్నదృశ్యముల నేనినైన మరల గాంచుభాగ్యము లభించినచో నయ్యవి తప్పక మీకు నివేదించుకొందును.



# భావకాహ్వానము

అబ్బరాజు వెంకటరంగా రావుగారు

భావా! నీకాహ్వానము.
ఈవా! మా కతులితలంపు టీవుల ప్రోవుల్
భావా! స్వాగతమిదిగో
ఈవా? మా కనవరతము నీప్సితసిద్ధుల్.

తెల్గుభూము లపంట తేలిపోయినదంట సమకూర్తువా మాకు సస్యలక్ష్మి.
తెల్గురాజసమంత దిక్కులదాగెను రప్పింతువా వారి రాజ్యలక్ష్మి
తెల్గుసంపదలెల్ల దేశాలబట్టెను తిరిగిచేర్పింతువా దివ్యలక్ష్మి
తెల్గుమాధ్యంబెల్ల తెట్టువగట్టెను పూనిసాయింతువా జ్ఞానలక్ష్మి

తెల్గువారలు అన్నిట తెన్నుమీరి
తెల్గుగృహలక్ష్మి దీప్తిచే తేజరిల్లు
తెల్గుసీమలు శుభముచే దేలునట్లు
తెల్గుదేశంపుభావ! నీతెల్వి జూపు.

# శ్రీకూర్మక్షేత్రము, డోలాయాత్ర

శ్రీమతి కోకా హనుమాయమ్మగారు

శ్రీకూర్మమున యేటేటా జరుగు ఈ యుత్సవము సకలజనామోదకరంబును, సుజనసేవితంబును, నగుటచే నేత్రానందకరంబుగా నెల్లరు వీక్షించి సంతుష్టిఁబొందవలసినదే!

శ్లో॥ డోలాయమానగోవిందం మంచస్థంమధుసూదనం। రథస్థవామనందృష్ట్వా, పునర్జన్మ నవిద్యతే॥

అని, ఎచ్చటెచ్చట నుండియో జనులు వచ్చిపడెదరు. ఈ క్షేత్రనివాసస్థులకుయేటేటా యిది గొప్పదెబ్బయని తలంపవచ్చును. ఏగృహంబు జూచినను యతిథిజనంబులతో నలరారుచుండును. యాత్ర పదిదినములున్నదనగానే గృహస్థులు, అతిథుల సత్కరించు కార్యాలోచనులై సంచరించుచుందురు. గృహిణులు తమచుట్టంబులకు తగినన్ని దినుసులు దయారుచేయుచుందురు.

ఈ వత్సరపు టుత్సవముకూడ చాల నేత్రానందకరముగా జరిగినది. ఉత్సవము వారముదినము లున్న దనగానే, కంచరిదుకాణములు, బట్టలషాపులు, సోడామిషన్లు, ఒకటా వివిధవస్తు విక్రేతలువచ్చి తమ మామూలు స్థలములు అద్దెకు పుచ్చుకొని పాకలువేసికొన మొదలిడిరి.

శ్రీకూర్మము తూర్పుదిశను గొప్ప బయలు ప్రదేశముకలదు. ఆ స్థలము విజయనగరము సంస్థానము వారు, ఆ మూడుదినముల ప్రయోజనత్వమునకై యేమువందలకు వేలాము పాట పాడిరి, సదరు గ్రామనివాసి యొకండు ప్రతియేటా దానిని పాడి గజము 1 రూ. ధరను అద్దెల కిచ్చి చాలాలాభము సంపాదించును. యాత్రా దినములలో ఆనిర్మానుష్య స్థలమంతయు జనముతో క్రిక్కిరిసి యుండును.

దేవుని కోవెలకు ముందుస్థలమంతయు, పందిళ్లు పాకలు వేసిరి. రెండు మూడు దినము లుండగనే యాత్రికులు రాదొడఁగిరి. ఈ యుత్సవము, పున్నమునాడు జరుగవలసిన యుత్సవము, మరునాడు జరిగినది. కారణము మఘ నక్షత్రముతోఁ గూడినదినము కావలెనట. పైగ్రామస్థుల కీసంగతి తెలియమి యథాప్రకారమువచ్చిరి. పల్లెటూరి యమాయకులగు రైతులు తమ యాలుబిడ్డలతో పోతుల బండ్లపైని మూడు దినముల గ్రాసము మూటకట్టుకొని నిరంతర ప్రయాసముకోర్చి యొక్కవరసని యెడతెగని సంఖ్యతో వచ్చిపడిరి. ఆరోజు వచ్చిన బండ్లసంఖ్య 800. బండికి పదిమందిలెక్కని చూసిన యెడల 8000జనము శ్రీకూర్మము చేరినదానాడు. కాని వారియాశయంతయు నిరాశయయ్యెను. వారనుకొనిన దినముకాక, అప్పటికి నాలుగు దినములున్నది ఉత్సవము. వారు తెచ్చుకొనినభత్యము సరిపడిపోవును. అమీదవారు మలమల మాడవలసిన యవస్థకు జిక్కుపడెదరు. ఎందులకనగా, శ్రీకూర్మమున ఆరోజులలో మాయప్రియము. కాసీకి వక వంకాయ దొరుకునో దొరకదో సందేహమే. అట్టికరువుకాయలెన్నియని కొని కడుపు నింపుకొన

గలరు! కనుకనే, ఈగ్రామస్థులు ముందుగానే కాయకూర లన్నియు జాగ్రత్త చేసికొని యుందురు. లేని యెడల గృహస్థులు తల తడవికొనవలసినదే' అప్పుడీ వచ్చినజనమంతయు గ్రామము చుట్టుపట్ల బసలు వేసికొని చెరువుల ఒడ్డున వండుకొని తిని దేవుని దివ్య దర్శనముతో తృప్తినిగాంచి మరలపోవురు. ఈజనమంతయు నిలిచియున్న యెడల చాల ప్రమాదములు జరిగియుండును.

కోవిలకు సమీపముననే, యొక గుండముకలదు. దానినామము శ్వేతకుండము. అందు సకల కల్మష హారియని సకల జనులును మునిగి తేలుచుందురు. సకల కల్మష హారియని యనుటకన్న సకలశరీరదుర్మలినాపహారి యనిన నొతయు సమంజసముగా నుండును. ఈ దినములలో నీరు ప్రాకుడు దేరి పచ్చగా నుండును. ఇట్లువ్రాసినందుకు దైవభక్తి పరాయణులు నన్నుదూషింపకుందురుగాక!

చాలమంది కా నీరుత్రాగిన స్వర్గంబు చేకూరునని సదభిప్రాయము కలదు. నిజమే, దానికినేనును అంగీకరించెదను. ఆమూడు దినములున్నూ నీరు కాచకుండా, వడియబోయకుండా త్రాగినయెడల వారికిస్వర్గంబు కరతలామలకంబె. అందు సత్యా సత్యంబులు జూపఙలవి.

గ్రామమున నెచట జూచినను, వంట వండువారు చిరుతిండ్లను తినుచున్నవారునై యాత్రీకులు మానసోల్లాసకరముగా గనుపట్టు చుందురు.

ఏవీధి చూచినను వినోదములతో నిండి యుండును. గృహిణు లేయింటంజూచినను అతిథిపూజాధురంధరలై యలయికందోప తమయరుగులపై నిల్చుకొని యానందంబుగా యాత్రాది విశేషంబుల నరయుచుందురు.

ఉత్సవము మూడుదినములు జరుగును. మొదటదినము కామదహనము, రెండవ దినము పడియా (శూన్యదినము), మూడవ దినము స్వామివారు డోలికపైని వేంచే యుట, ఇది కార్యక్రమము.

కామదహనమనగా, పెరుమాళ్లు రాత్రి 12 గంటల సమయమున గ్రామమునకు తూర్పుననున్న మంటపమునకు ఉత్సవముతో జనియెదరు. అచ్చట అరటి డొప్పలతో అగ్ని రగుల్కొల్పిన తరువాత స్వామి ఆలయము నకు తిరిగి వచ్చివేసెదరు. దీనిని గాంచుటకు యాత్రీకులెల్లరు గుమిగూడి యుందురు. రైతులు కామదహనానంతరము శేషించిన బూడిదగ్రహించి తమ సస్య క్షేత్రములలో వేసుకొనెదరట. దానిమహిమచే సమృద్ధిగా పండునని వారినమ్మకము. ఇందుకై యాకాలీ కాలుచున్న కట్టెలనే గొని పరుగులెత్తెదరు. ఆసమయముననే చాలామందిశరీరములు కాలి పోవుచుండును. ఈవినోదము చూచి చాలా మంది పల్లెటూరివారు తమ గ్రామములకు పయనమయ్యెదరు.

రెండవదినము యెట్టి యలజడియునుం డదు. యాత్రీకులు, శ్రీకూర్మనాథుని సంద ర్శింప జనుచుందురు. గర్భగుడికి జనుటకు ప్రతిమనిషికి అణాటిక్కట్టు చెల్లింపవలెను. ఈమూడు దినములకున్నూ ప్రజలు చెల్లించి

నసొమ్ము 2,00 రూ. సంస్థానమువారికి జమ కూడినవట. దీనినిబట్టియే యెంతజనము వచ్చినదియో నిర్ధారణ చేయనచ్చును. తరువాత గ్రామమున నెచ్చట జూచినను ప్రజల పదధ్వనులు, పశువుల గళములనున్న గంటల ఘణఘణా రవములు, యాత్రీకులు పారవేయు యెంగిలాకుల మెతుకులకై కాకులుజేయు కావుకావు శబ్దములు, గర్భగుడిపై గరుడ పక్షుల కృష్ణాయను సన్నని శబ్దములు విను వారికి భయసంభ్రమాశ్చర్య భక్తిభావంబు లొక్కుమ్మడి గలుగును. ఈదినముననే జనమంతయు నూర్కొట్టునకు తిరుగబడెదరు. ఎవరి హస్తంబులు జూచినను బొమ్మ సామానులు, యినుప పనిముట్లు, ఇత్తడి బిందెలు, రాగి డేగిసాలు ఏదోయొకటి పట్టుకొనియే జనుచుందురు.

ఇంకను మూడవ దినము, స్వామివారు బాలభోగ మారగించి, దివ్యవసన పుష్పమాలాలంకృతులై, చూపరులు భక్తిభావంబుతో కేల్మోడువ, గజవాహనారూఢులై, బహు వైభవముతో సూర్యోదయ కాలమగుసరికి గ్రామమున కుత్తరమున నుండు డోలామంటపముమీదకు వేంచేసి, డోలికలోనికి యుత్తరాభిముఖముగా వేంచేయుదురు. స్వామి యుత్తరాభి ముఖముగా వేంచేయు సమయము పుష్కర కాలమని, అప్పుడు స్వామిముఖారవింద సందర్శనోత్సుకులై జనులు సంభ్రమించుచుందురు.

అట్టిసమయమునందే చాలాప్రమాదములు జరుగుచుండును. పూర్వము మంటపమునకు జనులకు నెట్టి యాటంకము నుండెడిది కాదట, యాత్రీకు లొకరిపై నొకరుపడి ప్రాణహాని జరుగుచుండెనట.

ఇప్పుడు కొన్నియేండ్ల నుండి, మంటపమునకు చుట్టునున్న కటకటాలను కట్టి ద్వారములనుంచిరి. ఈసమయమున ద్వారములను మూసివైచి కాపలాకాయుచుందురు. స్వామి వచ్చేసమయమున తలుపును తీసెదరు. అప్పటికిన్ని ఒక్కసారి జనము ప్రవేశింప ప్రయత్నించుటచే కొన్ని ప్రమాదములు జరుగుచుండును. బాలురును, స్త్రీలును జననిశ్చయించుట సాహసము. ఇది యాకడపటదినమున జరుగు యుత్సవపుగడబిడ. యాత్రయైన మరుచటిదినమే గ్రామమున యాత్రీకులెల్లరు మాయమయ్యెదరు. ఇంత సంరంభము నిశ్శబ్దత వహించును. ఈవేడుకనంతయు జూచిన మనభారతీయులభక్తి ప్రభావమునే వేనోళ్లజాటుచున్నది. ఈ మూడుదినములు జనులు నిష్కల్మష హృదయులై భక్తిభావంబుతో దేవుని దివ్యపాదారవిందసేవాతిరేకంబున నర్చించి తదక్కిస్వామి భజనానందులై పరితృప్తిం బొంది తదుపరి ప్రయాణాయత్తచిత్తులై యుందురు గదా. ఆహా! శ్రీకూర్మక్షేత్రమాహాత్మ్యము దెలుపు యాత్రావిశేషంబు బొగడ నేరితరంబు! కాన, అధికమహిమచే రాజిల్లు శ్రీకూర్మనాథుని సంస్తుతింపజాలక, స్వామి పాదారవిందంబులకు భక్తిపూరితాంతఃకరణనై వందన శతంబులనర్పించుచు నింతటితో విరమించుచున్నదానను.

# మమైకదైవ సంప్రార్థనము

కవికొండల వేంకటరావుగారు

౧. సూరేకారముపాలు మానవునిలోఁ జూపట్టునట్లో మహో
దారా! నీయెడ నిట్టియిట్టి కనుచోఁ దగ్ధంబుగాదే జగం;
బేరే నేవ లేనిమేషమున నేన్ హృష్టుండ వీ వెప్పుడున్
నేరం బెంచవు కోపగించవు: ప్రసన్నింపన్ భజింతున్ నినున్.

౨. చెట్లన్ వ్రేళులు భూమిలోఁ జలువకై చీకాకుగా నల్లుకొం
చట్లిట్లై యిసుకన్ శిలన్ దిరుగుచందానన్ మనుష్యుండునున్
గొట్లాడున్ దనభుక్తికోస, మయినన్ గొండాడకున్నే నినున్?
పుట్లాదిన్ బువులాకులన్ దొడిగి యింపుంగాయుశాఖల్ బలెన్.

౩. పింగాఁశిం గొనుమన్నవాఁ డెవఁడు? వే భిన్నంబుగా దానికై
చెంగున్ బాష్పములొత్తుమన్న దెవఁ? డిస్సీ! యంతెసంసారపుం
సింగారంబులు!! వానికోసమయి ప్రస్వేదాదులన్ దేహితాఁ
బొంగుంబాటుల నోడ్చియూడ్చుకొన సంబుద్ధంబె సర్వేశ్వరా.

౪. ఆయుర్దాయ మొసంగు దేవ! నిను సత్యాసక్తిఁ బూజింప; నే
నే యుద్దేశ్యము దీఱఁ బుట్టితినో దానిం జేసికోనిమ్ము; వే
తే యీభూమిపయిన్ జనించుటలు నన్ లేకుండ చాకుండ ని
న్నే యైక్యత్వము బొంది ముక్తిగొను నట్లీశా! ప్రసాదింపుమా!

౫. లేపుము నన్ను ముందుగను; లేపి భవత్ప్రియమేమొ సేయఁగాఁ
బ్రాపుగనుండి పంచు, మనురాగము సూపుము నాయెడన్ ప్రభూ;
తేపనుజాగుబుద్ధి నిడ కెప్పటి దప్పుడు చప్పుచప్పునన్
నీపనిగా నొనర్చుటకు నీతిని శక్తిని యుక్తి నీయుమా!

౬. ఒయ్యారం బెటనున్న నందమది యెం దోహో యనన్ దోచినన్
జియ్యల్ నేర్పిన చిత్తనిగ్రహముతోఁ జింతింతు; గాపట్యమున్
సయ్యాటందున నేని చూపను ప్రభూ! సర్వజ్ఞ! సత్యద్రుమా!
కయ్యంబన్నను గాలుదువ్వను నను గాపాడుమా సర్వదా!

౭. ఆనందం బొకయప్డు పుట్టు నెద నిర్వ్యాజంబుగా నజ్జరే!
గానం బొండొకవేళ నుప్పతిలు రానేరాక యిట్టే యొహో!
జ్ఞానం బచ్చుపడున్ దనంత నొక యుచ్చస్థాయిలో నెంచకే
మేనం బుల్కలు గుల్కు లొక్కొకతరిన్ మే తే యెఱుంగన్ ప్రభూ!

౮. ఏడుపు నవ్వుగా నగవులేడుపుగా నెపుడెందు మాటుటో
చూడగనీవు మ మ్మభవ! శుద్ధమనోవిభవంబు నీదిగా
పాడినపాటకున్ వెనుక పర్వతిమట్టుల నీవుసల్పి వి
జ్ఞోదువుగాక మాటుబుటిః జోద్యముగా వినిపింతు పుర్వరిన్.

౯. లేదోయీ నినుమించి వేఱొకఁడు సద్విమంబు; నీవన్నిటన్
చేదై నన్ మధురంబదైనఁ గడుదుర్జేయంబుగాఁ జూపుచున్
వాదుల్ వో వెలయింతు వీవ సుధ; నాస్వాదూక్తికిన్ దెట్టతె
న్నేదో యీయని చింతమై నెమకఁగా నేలా తథాప్రేమమే.

## జాగ్రత !

శ్రీ కుటుంబరాయశర్మగారు

ఓ! స్వయంవరా! జాగ్రత.

నీవు నాకు ఆత్మార్పణముఁ జేయుదువు! కాని నీ జీవితము దుర్భరముగ నుండును. నీకు నీ శరీరమే దుర్భరముగ నుండును. నీ దినములు చాల జాగరూకతతో కూడుకొని యుండును. ఏలనందువా? నాగృహము శృంగాటక ము ప్రక్కన నున్నది. దాని తలుపులు ఎప్పుడును—ఎల్లరికిని, తెరచియేయుండును. నా మనస్సన్నో! మనస్సు నందుండదు. నేను గానప్రియుఁడనగుటయే దీనికి హేతువు.

నీ హృదయమును నాకర్పింతువు! కాని దేనికని నన్ను బాధ్యునిగ జేయకుము. ఇపుడు కృతజ్ఞతతో నా నైజసంగీతధోరణిని నీ సాంగత్యాతిశయముపై నొట్టుపెట్టు కొనుచుందునుగాక! సాధ్యమైనంతవరకు దానిని ప్రతిష్ఠనీయను; సడలనీయను. కాని కర్మవశాత్తున నాగళమధురిమ యంతరింపవచ్చును. నాశక్తి యుడిగిపోవచ్చును. వసంతర్తుగానమందలి వగరుశోభ శరత్తునకు రాదాగిదా మరి; కనుక నప్పుడు క్షంతవ్యుఁడను. అపుడు నీ దయాదృష్టులకు మాత్రమే పాత్రుడను.

నాకు నీ మనస్సు సర్పణముజేయునెడల ప్రేమబిగిలో జేసెదు నావాగ్దానములనే సదా స్మరింపకుము. తద్వాక్యపరిపాలనాధికృతుల కర్తృత్వము నాపై వేసికొనను.

నీ దృక్పరిణయతంత్రము లోలుకు సంగీతములతో నా ప్రేమను ప్రశ్నింతువు. కూనకెర టాలురేగు నీ నవ్వులలో నా స్నిగ్ధహృదయమును పృచ్ఛసేతువు! నాప్రత్యుత్తరములు అసంగతములుగానే గాక, మార్దవరహితములుగ నుండవచ్చును. కావున క్షమింపవలసియుందువు. ఆ ప్రత్యుత్తరములు చిరవిశ్వసనీయములే కాని, అచిరవిస్మరణీయములు. కనుక జాగ్రత!



శ్రీమతి, కమలాబాయి కైబ్

ఇందూర్ ఉపమంత్రిగారి పత్ని గొప్ప కవయిత్రియు వక్త్రియు; సాంఘిక సేవాప్రియ; ఇన్డియన్ హిస్టారికల్ రకార్డ్స్ కమీషన్‌లో సభ్యురాలుగా దొరతనమువారిచే నియమితయయ్యెను.



డా॥ మిస్ సుభద్రాబాయ్ హెచ్ నోసాలియా

కచ్ఛీవాడులో వైద్యశాస్త్రమునందు పట్టభద్రురాలైన మొదటియువతి! బొంబాయి సర్వకళాశాలలో జగివినది.



మొక్కల సంరక్షణ



బొంబాయి గిరల్ గ్గైడ్ వార్షికోత్సవము.



మ్యూనిసిపల్ గరల్ గ్గైడ్ రాలీకమిటీ బొంబాయి.

నడుమ నున్నవారు బొంబాయి మేయరుగారగు మి|| డా|| యం.సి. జవ్ లేగారు.

# పంతులవారి పరలోకయాత్ర

పసుమర్తి కృష్ణమూర్తిగారు

మాయింటికిఁ బొరుగున నొకపంతులుగా రుండెడివారు. వారు నియోగులు, మేము వైదికులము. వారిది పెద్దమిద్దె; మాది చిన్నయిల్లు. వారు మంచిగొప్ప యుద్యోగముగలవారు: పెద్ద యాస్తిపరులు—మాకవేవియు లేవు. శ్రీపంతులుగారు మంచి మతాభిమానులనుమాట తరుచుగా వినఁబడుచుండును. దొరలు సులభముగా నుచ్చరింపఁ గలిగియుండుటకు "మిస్టర్ స్యామ్" అని వారిపేరు, వారియింటి యావరణగోడమీద నొక చిన్న బల్లపైఁ జిత్రింపఁబడి యంటింపఁబడి యున్నది; కాని వారి సరియైన పేరు శ్యామసుందరరావుగారు. ఇంటియొద్దఁ జూచునపుడు విభూతిరేఖలు, రుద్రాక్షమాల, పట్టెడు జందెములు— "ఆహా! సాక్షాత్తు రుద్రులు! రుద్రులు! రుద్రులే" యని వారి యాశ్రితకోటిలో ముఖ్యులగు సోమయాజులుగారు 'ఢంకాకొట్టి' చెప్పుటలో నతిశయోక్తి యెంతయులేదు; కాని, వారినిఁ గార్యాలయమునఁ జూచినవారు మాత్రము "ఆంగ్లో యిండియన్" అనుకో వచ్చును. అదియొకతిప్పా! దూరస్థులకు యథార్థము తెలియకుండుట తప్పుకాదు. అట్టివారు శ్రమయనక మహారాజశ్రీ పంతులవారి యింటికిఁ బ్రాతఃకాలమందువచ్చి యొకసారిచూతురేని, మావలెనే సోమయాజులవారి 'ఢంకా'కు వారును పక్కతాళము వేయకమానరు. పద్యములఁ గురిపింతురు. పత్రికలలో నెగురవేయుటకుఁ బూనుదురు. నిజమే! ఒకవంక దేవతార్చనగంట, యొకవంక స్వస్తివాచకములు: మరియొకచోటఁ బంతులుగారును సోమయాజులుగారును గలసిచేయు నుపనిషత్పారాయణము: "ఆహా! యెట్టి నాస్తికుఁడైనను మాయింటికివచ్చి రెండుపూటలుంటే ఆస్తికుఁడు కాకుండడు" అని పంతులవారు పలువురితోనను మాట సత్యము, ముమ్మాటికి సత్యమే! అందువలననే యోపికలేని మేము "మీరు పట్టినాస్తికులు ఫూల్స్" అని వారు మాయెడఁగల యభిమానముచేఁ దిట్టుచుండినను మారుపలుకక నోరుమూసికొని యూరకొనుచుందుము. సర్వవిధముల బలవంతులగు వారితో మాకేల! అట్టివారుపకారముజేసినఁ జేయవచ్చు లేకున్న మానవచ్చుఁ గాని యపకారము మాత్రము మతిసులభముగాఁ జేయుదురని మాభయము. ఐనఁ బంతులవారట్లు చేయుదురని కాదు—లోకపరిపాటి చెప్పితిమి. అదియటుండ నిఁకఁ బంతులవారి సంసారము సంగతి యేమని యడుగుదురేమో? అదిమాకుఁ దెలియదు; కాని, మాయిల్లాలుమాత్రము పలుమారు కొనియాడుచుండుట వినియున్నాము—"ముసలికాలానికి పంతులు మూడో పెళ్లి చేసుకొన్నా!—పిల్లమాత్రం బంగారం!!"అని: మరియుఁ బంతులవారి ప్రథమకళత్రజుని, ద్వితీయ కళత్రజను మాత్రము నేనెరుగుదును. వారు పుట్టుట మాత్రం మాపొరుగుననే కాని, పెరుగుట పెండ్లిండ్లగుట మొదలగునవి యన్నియు మేనమామల యిండ్లనే. ఇపుడుగూడ వారిచటలేరు. ఈయమ్మాయిగారును జిన్నపిల్లకాబట్టి తరుచుగాఁ బుట్టింటనే యుండును:—విజయనగరందగ్గర నేదోయొక చిన్న యూరు.

ఒకనాడు మధ్యాహ్నమున రెండుగంటల సమయమునఁ బంతులవారు కార్యాలయమునుండి యస్వస్థుగ నింటికిదయచేసి, నాకును సోమయాజులుగారికిని మరెవరికో యొకరిద్దరికిని వర్తమానమంపిరి. మేమును వెంటనే వారిదర్శనమునకై వెళ్లితిమి. అపుడు వారొకపత్రమును జదువుమని నాచేతికిచ్చిరి. అందులో మరేదియు నేను జూచియుండలేదు; మున్ముందుగఁ బంతులవారికొక గొప్పబిరుదము వచ్చియుంటఁ జూచితిని: దానిక్రింద నొక నీలిరంగుగీటు పెట్టఁబడి యుండెను. నేనావార్త నచట సదస్యులగు సోమయాజులు మొదలగువారికి సావధానముగా నెరింగించితిని. విన్నవారందరిలో సోమయాజులుగారు మాత్ర

ములికిపడి "యెంతపనైంది! ఎంతమాట!! ఎంతమాట!! ఎప్పుడెప్పుడు!!" అనుచు నాయొద్దికివచ్చెను. పాప మా బ్రాహ్మణుని గుండెలెగిరిపోయినవి. యెవరో "గచ్ఛాకొట్టేశా" డేమోయనుకొన్నాడు. అయిన నాలోపము నాదే. ఏమందురా — నే నింగ్లీషులోఁ జదువుట — అది యట్లుండఁ జదువునప్పుడు నా మొగము నిస్తేజమై యుండుట. ఇదికూడ నతఁడు చెప్పినదే కాబట్టి, దానినిఁ గాదనక సరిపెట్టి యూరకున్నాను; మరియుఁ బెద్దవాఁడుగదాయని పప్పులోఁ బడినకాలుగడిగి భావము వెల్లడించితిని. తరువాతఁ బంతులుగా రొకరిద్దరితో రహస్యముగా మాటలాడి యానెనుక మాకందరికి సెలవిచ్చిరి.

ఆరోజులలో బిరుదులరుదు; కాబట్టి నేనేవీధిలోఁ బడి వెళ్లుచుండినను ఈమాటలే వినఁబడుచుండెడివి. "ఆసేతు హిమాచల పర్యంతం," "ఆబాల గోపాలం" "ఆపాదమస్తక పర్యంతం" — ఈమాటే. మాసోమయాజులుగారు పంతులుగారికి విశ్వరూపమును విశ్వవ్యాప్తియు జాతకములో నున్నదని చెప్పిరి. సంతర్పణలు, సమారాధనలు, టీపార్టీలు, ఎట్‌హోములు రెండు నెలలవరకు నెడతెరపి లేక మునురుపట్టినవి. ఈ యన్నింటి మాటకేమిగాని మొట్టమొదటి టీపార్టీ గౌరవముమాత్రము మా మిత్రమండలివారిది. ఈ మా మిత్రమండలి పూర్వము పూజా నమస్కారములు లేక బూజుపట్టి యుండెడిదేకాని, యీ దెబ్బతో జిల్లాలో నున్న దొరలకందరికిఁగూడ దానిమహిమ యెరుకపడినది. తక్కిన మిత్రులందరికంటె నే నెక్కువగ వీధిఁబడితిని. అనామకుఁడనైన నాసంతకముతో వెళ్లిన యాహ్వానపత్రము ననుసరించి జిల్లా దొరలందరు సకుటుంబ సపరివార మోటారులై దయచేసి రన్నప్పుడిఁక మనవారిమాట యొక లెక్కయా!! వీరువస్తే నెంత రాకుంటే నెంత! — సరే. ఇక వినతిపత్రము — ఆద్యంతపుణ్యకాలము లైదువందలు — చూడఁబోతే యేమియులే దందులో — ఒక వెండిగొట్టమును అందులో నొక డిమ్మికాగితం! కాని దాని పని వాడితనంలోనున్నది "మజా" యంతయు.

ఆపత్రముం జదువునపుడు నామనస్సు మనస్సులో లేదు. ఆసంగతి యట్లుండనీ — తరువాత — ఆనాటి కార్యదర్శి క్రమముఁ జెప్పుచున్నాను — నాకష్టము మాట దేవుఁడెరుగుఁ గాని నేను లేకుండిన నంతయు తారుమారై యుండెడిదిదేమో!! అయ్యో! పంతులు వారివెంట నంటియుంటిని: వారియాజ్ఞ ననుసరింపక తీరదు. వారురాఁగానే ఫిరంగివేయించుటకు నేను — వారికిఁ బుష్పాంజలి యర్పించినది నేను — వారియోగ్యతాపత్రముఁ జదివినది నేను — వారిని దొరల ముందుఁ గూర్చుండఁబెట్టినది నేను — బల్లలు తెచ్చి పళ్లెరములభద్రముగా బల్లలపైఁ బెట్టించుటకు నేను — ఇంతయేల? పంతులవారి నీడవలెనంటి యుంటిననఁ జాలదా! మరియు నటులుండుటవలన నాకుఁ గొంత మేలే యైనది. ఏమందురా — దొరలు భోజనమెట్లు చేయుదురో కొంతవర కానాడు తెలిసినది — వారు చాకులతోఁ గోసి మేకులతో నోటఁబెట్టుకొందురు. మరియొక విశేషము: — పంతులుగారి ప్రక్కనే కూర్చొనియున్న ఫాక్సుదొర పంతులుగారినిఁజూచి "హౌమచ్ సివిలైజ్‌డ్ యు ఆర్! మిస్టర్ ప్యామ్" అన్నాఁడు!! మరియొకదొర "క్వైట్ సో" అన్నాడు! ఆమాటలకు నాయొడలు పులకరించినది. కేవల మనాగరికులము మనము! ఇట్టి మనవాఁడొకఁడు — అందులో బ్రాహ్మణుఁడు — విశేషించి మంచి నైష్ఠికుఁడొకఁ డిట్లు వేషభాషాది విషయంబులం దెల్లవారి మెప్పుఁబడయుట సామాన్యమా? ఊరకే వచ్చునా బిరుదములు? సర్వవిషయముల వారితో మనము లీనమై పోయినపుడే వారు మనలను గౌరవింతురు. సరే! యట్లుండనీ — కాని టీపార్టీమాత్రము అద్వితీయముగా జరిగినది. పంతులుగారి మనోరథము పరిపూర్తిగ నెరవేరినది.

అయ్యో! అదియైన రెండుమూడు దివసములకుఁ బిమ్మట నవసరముండి నేను పంతులవారియింటికి వెళ్లితిని. మేడమీద హాలులో వారొక్కరే పడక కుర్చీమీదఁ గూర్చొనియుండిరి, నేను నెదుట నిలువఁబడి "నమస్కార" మన్నాను. వారి శరీరస్థితి యెటు

లుండెనో నే నెరుఁగను గాని వారు నా నమస్కారము బహుళాయాసమున నెడమచేతితో, నందుకొనలేక యందుకొనలేక, సగము సగముగా నందుకొంటయుఁ జిత్తరువువలె నాసనమున కంటిపెట్టుకొని పెదవిగదలపక రెప్పవేయకయుంటయుఁ జూడం జూడ నాగుండె లెండిపోయినవి. పది పదునేను నిముసములట్లే నిలచియుండి, యిఁకఁ బ్రమాదించు నేమోయని భయముదోప బిర బిర యింటికి వచ్చుచుండు నంతలో, వారి యావరణదాటియు దాటక మునుపే మా పేరిశాస్త్రి—శ్రీవారి యాత్రికుఁడు—నాముందుకువచ్చి "పంతులవా రేమిచేయుచున్నా" రనియడిగెను. నేను దఃఖముఁబట్టలేక "మరేమున్నది! పంతులవారికిఁ గంటిచూపే గాని నోటమాటలే"దని ఉన్నది యున్నట్టులఁ జెప్పివేసితిని. పాప మా బ్రాహ్మణుఁ డాపట్టుననే వెనుకకు మరలి పరుగులెత్తసాగెను. అతఁ డెవరితో నేమి చెప్పెనో కాని, జనులు తండోపతండములై పంతులవారి యావరణ నిండిరి నేనుమాత్రము నాపనిఁ జూచుకొన బజారునకుఁ బోతిని. అయ్యయ్యో! నన్నడుగనివాడే నాకుఁ గనఁబడలేదు—"ఏమైనది పంతులుగారికి?" "ఏమైనది" "మొన్న మాతో నంతచక్కఁగా మాటాడుచుండెనే! అయ్యో ఇంతలో నింతచేటా" అని ఆబాధపడలేక చెరువుగట్టుమీదికిఁ బోతిని! అక్కడఁ గూడ నీదిక్కుమాలిన గోలయే! ఏమిచేయుటకుఁ దోచక యింటికి సమాచారమంపి యిచ్ఛాపురమువఱకుఁ బయలుదేరితిని. అయ్యయ్యో! రైలుబండిలో నిదే మాట ఆహా! పక్షికా! యిట్టిదేకద లోకము—గతానుగతికము : నిజము నీ కెరుక; లోకమునకేమి యెరుక ! పట్టి మాటలు గట్టివిగను, గట్టిమాటలు పట్టివిగను గ్రహింపఁ బడుటయే లోకపరిపాటి—ప్రభువులు మొదలు పాకివాండ్రపర్యంత మిదియే యలవాటు. సరియే అదియటుండనిండు. నేను మాత్రము నెలదినములవరకును మా యింటివైపు తిరిగి చూడలేదు.

అటుతరువాత నెట్టెటులో మరలవచ్చి యిల్లు చేరుకొంటిని. కాని పంతులవారి కంటమాత్రము పడ నిశ్చయించుకొనలేదు. అయిన నిది యెట్లు సాధ్యపడును? వారు మేడయెక్కినఁ జాలును, వీధులను బెరళ్ళను వారికిఁ గనఁబడుచునే యుండును. ఇఁక నేనెట్లు వారికిఁ గనఁబడకుందును? ఒకనాడు నేను వీధింబడి పోవుచుండ వారు పచారిచేయుచు నన్నుఁ జూచికేకవైచిరి. నేనును వారిముఖావలోకనభాగ్యపరవశుండనై చేతులెత్తుచుంటిని. కాని నాకంటె నాయనయే ముందుగఁ జేతులెత్తివేసెను. మరియు రమ్మని తలయాడించెను. ఇక నేనెట్లు తప్పించుకొందును? కాళ్లు తడబడుచుండ నెట్టెటులో మేడమీదికిఁబోయి శ్రీవారియెదుటఁ బడితిని. పంతులువారు వెంటనేవచ్చి నాకుడిభుజమంటి 'నీవు మహా చెడ్డ హ్యూమరిస్టువోయ్ పంతులు-నేనేమో యనుకున్నాను-నాదుంపతెంచావే!!' యనుచుఁ దాము కూర్చుండఁబోవుచు నన్నుఁగూడఁ గూరుచుండమనిరి. ఇప్పటికి నాప్రాణములు గూటఁబడినవి! 'బ్రతుకుజీవుఁడా'యనుకొని కూరుచుంటిని. అంతలో మన సోమయాజులును శాస్త్రియునువచ్చి మామ్మాలు మరియాదలందుకొని యుపవిష్టులైరి.

పం:—పంతులూ! టీపార్టీవిషయంలో నాకాంప్లిమెంట్సు నందుకోలేదే నీవు

నేను:—అంతా మీదే-యిక నాకెందుకండి బాబూ కాంప్లిమెంట్సు?

పం:—ఐనా అంతచక్కగా నడిపించడంలో విశేషం వున్నాదికాదూమరి! అనుచుండ పంతులుగారి కాఫీనువేళ యైనందున లేచి యందరికిని సెలవిచ్చి పంపిరి.

అయ్యో, యిదిమాపంతులవారి పరలోకయాత్రకుఁ బూర్వరంగనిరూపణ. ఇదియైన మూడుమాసములకుఁ బంతులుగారికి నిజముగాఁ బ్రమాదస్థితి వచ్చినది. పాప మొకనాడు కచేరీలో నుండగానే యకస్మాత్తుగ నూటనాలుగు డిగ్రీలజ్వరము వచ్చినది. వెంటనే వారింటికివచ్చి డాక్టరుగారికి వర్తమానమంపిరి.

బంట్రోతు లిటునటుఁ బరువులిడుచుండిరి. ఇంతలో 'ఈరాత్రికి వచ్చుచున్నాము. రైలుకు బండిని మనుష్యులను బంపుడు' అని విజయనగరమునుండి యమ్మగారిప్పించిన టెలిగ్రాఫు వచ్చినది. 'ఆవిషయమై నీవు శ్రమపడవాలి పంతులూ'యని శ్రీవారు నాతో ననిరి. నేను గూడ నట్లే యంటిని. ఇంతలో డాక్టరు గారు దయచేసి 'హల్లో!! వాట్స్ ది మేటర్ విత్యూ! మిస్టర్ పామ్' అనుచు వారి మంచము సమీపించెను. కార్యక్రమమంతయు మన మెరిఁగి యున్నదే కదా! టెంపరేచరుతీయుట, గుండెపరీక్ష మొదలగునవి యన్నియు నైనవి. ఇఁక మందుకొరకై డాక్టరుగారితోఁ గూడా నొక 'ఫ్యూను' వెళ్లినాడు. నేను మాత్రము మంచమునకు దగ్గరనే యొకకుర్చీ తెచ్చి వేసికొని కూరుచుంటిని. పాపము! పంతులు గారు నావైపుఁజూచి, 'పంతులూ నీవు మాత్రము నన్ను విడిచిపెట్టనని ప్రామిస్ చెయ్యాలి' యనెను. ఆమాట లాయన చెప్పవలెనా? డాక్టరుయొద్దికేగిన బంట్రోతు మందుతేగానే పంతులుగారి కొకడోసు నోటఁబోసితిని. ఆవెనుక నేనును నాభార్యయుఁ గలసి పంతులవారిబండిని మరియొకబండిని దీసికొని రైలుస్టేషనుకుఁబోయి యమ్మగారిని వారి యమ్మగారిని పరిచారికను దోడ్కొనివచ్చి యిల్లుసేర్చితిమి. అనంతర మారాత్రియంతయు పంతులుగారి చెంతనే యుంటిని. అబ్బబ్బా! ఏమియుష్ణము!! ఆపలవరింత కర్థమేయున్న యెడల - ఛీ అమాటలేల యిప్పుడు? అదియుఁగాక పండువంటి బ్రాహ్మణుఁ డట్టి మహా పాపకార్యములను జేయునా? నేను నమ్మను. అందులో నుష్ణపుఁ బలవరింతలు. అందులో నవియుఁ బరధనదారాపహరణాదివిషయికములు !!! రామ రామ!! వద్దువద్దు!! వాటి స్మరణమాత్రమే పాపదాయకము. మనకేల. నేను మాత్రము వానియెడ గౌరవముజూపుట మానను. అది యట్లుండనిండు. ఆ దిక్కుమాలిన యుష్ణము వారముదినములైనను విడువ లేదే. సన్నిపాతములోనికి దింపినది. డాక్టరేమి చేయును? మొదట మలేరియాయన్నాడు ఆవెనుక ఫిలడెల్ఫియా యన్నాడు. చివరకు టైఫాయిడ్ అన్నాడు. ఏమన్నను మందు మానలేదు, కాని యామందు గొంతుదిగలేదు. ఇక నాహారము మాట చెప్పనేల? ఇది యిట్లుండ నింక వచ్చెడివారికిఁ బోయెడివారికిఁ జవాబులు చెప్పలేక నాయను మంగలి రాముడుగానికిని గొంతులు రాచిపోయినవి. నా మాట కేమిగాని రాముడుగాని కష్టమే చెప్పితీరవలెను. పంతులుగారి పెద్దబాబు టెలిగ్రాఫులమీద రాగానే నాపను బాధతప్పినది గాని రాముడుగానికి మాత్రం ద్విగుణమైనది. ఆహా! పరిచారసంఘవ వాడే గాక! ఇట్టి కష్టజీవులనుగాంచి యెవడు జాలి పడుచున్నాఁడు?

చదువరులారా! నానోట శనియున్నదని శాస్త్రియును సోమయాజులును ఎన్నెన్ని తిట్టినారో ఆ యీశ్వరునకే యెఱుక; కాని నాయదృష్టవశమున పంతులుగారు మాత్ర మీలోకమునకు వచ్చినారు. క్రమక్రమముగా మంచమువదలి కుర్చీలయొద్దికిని, అచటనుండి వరండాలమీదికిని రాగలుగుచుండిరి కాని మేడ మాత్రము దిగలేదు. డాక్టరు సర్టిఫికేటుపై మూడునెలలు సెలవు-నిండుజీతముతో గూడ-నీయఁబడినది. క్రమక్రమముగా బంధువులు వెళ్ళిరి. రెండునెలలైనవి. ఇక మూడవనెల ప్రవేశించుననగా నొకనాడు పంతులుగారు ఈజీచైరుమీదఁ గూర్చొని సోమయాజులగారితోడను శాస్త్రిగారితోడను మాటలాడుచుండిరి. ఆసమయమున నేనుగూడ వెళ్ళియుంటిని. అప్పటికి వారేదియో పరమార్థ ప్రసంగము కాఁబోలుఁ జేయుచుండిరి. నేను విన్నదిది:-

సోమ:—ఆయీశ్వరుడు చాలా దొడ్డవాఁడు!!

శాస్త్రి:—ఆహా!! సందేహమా! లేకుంటే మన కెవరు దిక్కు.

పం:—అయ్యా, దానికేమిగానీ ఒకవిచిత్రమైన సంగతిమాత్రం జరిగింది సుమండీ సోమయాజులుగారూ—

సోమ:—చిత్రం చిత్రం-

పం:—యింతవరకూ కూడా నేనెవ్వరితోనూ చెప్ప లేదు.

శా(స్త్రి:—తమకింకా కంఠస్వరము స్ఫుటముగా రాలేదునుండీ.

సోమ:—భయంలేదులే! క్రిమంగా అదే కుదటపడు తూంది.

పం:—అయ్యో చూశారూ- పరలోకం అన్నమాట కూడా ఎదో ఒక బూటకమనే తోస్తుంది.

శా(స్త్రి:—అది యొకవిశ్వాసం. మనము చూడలేదు కదా—

పం:అ:--వుండండి వుండండి నేనుచూశాను! నేను చూచాను. అదే యివుడు మీతో చెప్ప వస్తున్నాను. నాకాపృష్ణం వచ్చిన కొద్దిరోజుల వరకూ ఏమిలేదుకాని తరువాతమాత్రం-ఒకనాడు నన్నెవరో యిద్దరు- చేయిపట్టుకొని లాక్కొని పోయినారు-

శా(స్త్రి:—మిమ్ములనా!! మిమ్ములనా!!

సోమ:—ఎంతమాట! తమచేయి!!- పట్టుకోడమా!!- నేనులేకపోయినా నండి-

పం:—ఆతరువాతమరి- యేదో మెరుపుతీగవలె మెరిసింది- నాటకంలో చూశారూ- హఠాత్తుగా నే వేషాలుకనిపిస్తాయే అలాగే- ఏదో ఒక పెద్ద సింహాసనం- దానిమీద యేదో తేజోమూర్తి-- దానిచుట్టూ పరివారం- అబ్బబ్బా!! యేమిటో చెప్పలేను. నేను చూడలేకపోయినాను కాని ధ్వనిమాత్రం స్పష్టముగా వినబడుతూంది. ఆమాటలు నాకింకా చెవులలో గింగురుమంటున్నాయి- ఐతే ఒకటండీ, నాగరికతమాత్రం లేదని రూఢిగా చెప్పవచ్చును—అదీ—పాశ్చాత్యులకే చెల్లింది- లేకుంటే నన్ను 'ఏమిరా యంటాడా!!- వాడెంత దివ్యమూర్తియైనా!!-

శా(స్త్రి.—అది గర్విపోతుతనం

సోమ—:కాదూమరీ- హేమాహేమీలు- పెద్దపెద్ద దొరలు! బారెడేసి కితాబులిచ్చి బహూకరిస్తూ వుంటే- నదురూ బెదురూ లేకుండా ఏకవచన ప్రయోగమా! నేను లేకపోయినాను-

శా(స్త్రి:—మీరుంటే వారి కాజబ్బే రానియ్యరు అప్పుడు-

సోమ-సందేహమా! మృత్యుంజయదండకం చదివేసరికల్లా తోకతెంచుకొని పారిపోవద్దూ- యెంతవాడైనా!

నేను:—మీకు బ్రెయిన్ కూడా కొంచం చెదరినట్టుంది నుమండీ!

పం:—ఏమి చెడినాచెడ్డాదే- ఆతరువాత-విన్నారా శాస్త్రిలుగారూ ఆవెనకనుండి యెవడో లొడలొడమంటూవచ్చి నామొగంమీద మొగంపెట్టి నవ్వుతూ- నిర్భయంగా "సామీ, నాకూతురు బాగున్నదిగదా! నామనుమలను విడిచిపెట్టకుమా" యన్నాడు. ఎవడురాయని చూతునుగదా మా తోటమాలి వీరడు!! నాకేమీ తోచలేదు- లోకము కాని లోకమున్నదా? అక్కడనున్నవాడెవడూ? అనుకొన్నాను- సరే దానికేమి, తరువాత మరియొకచిత్రమండోయ్ సోమయాజులుగారూ!! మీతాతగారికి తండ్రిగారట లోకేశ్వర మనోయాజిగారట—

సోమ:—ఔనౌను.

పం:—ఆయనయే యజ్ఞంచేసినవారట మీవంశంలో

సోమ:—ఔను—అందుకే మాకీ బిరుదు—సోమ యాజులని!!

పం:—ఆయనవచ్చి—'ఔరా అబ్బీ, మాసూరిగాడి మరికూడ నిలుపబెట్టితివి' యనుచు నేమేమో చెప్పవచ్చెను కాని దానికేమని యనుకొన్నాను. నేను గదండీ మీయమ్మాయి కేదో జలోదరం లాటి రోగం వచ్చినపుడు డాక్టరుచేత మందిప్పించి బాగుచేయించాను. దానికీ-నన్ను స్తుతి చేయడం మొదలెట్టారు.

నేను:—బాబూ, వారి భాష మనకు బోధపడునా?

పం:—ఏమీ! బోధపడకేమీ! బంగారంలాగ బోధపడుతుంది—

శాస్త్రి:—అదికాక వారేమీ క్రొత్తసంగతులు చెప్పలేదుగా-అంతా జరిగిందే-మన జీవితాంశములోనిదే

పం:—ఆవెనుకనే మావదినెగారు!!

సోమ:—మీతో మాటాడిందీ ఆవిడే-

పం.—ఏమీ మాటాడకేమీ-తెగులు-'శ్యామం, మీయన్నగారి యాస్తి బాగుగా నభివృద్ధి చేసుకొన్నావే! నీకు తెలియలేదు కాని నాకొడుకు నాయొద్దకేవచ్చి చేరినాడు సుమా!! నీదయవల్ల-నీవిక్కడి కెట్లువచ్చితివి?-ఏమటులున్నావు?-నా మొగంవంక జూడవేమి?— నీవిక్కడ వచ్చితివెట్లు?-ఓధర్మరాజా, నీవు రప్పించితివా ఈయన్నపృథ్యుని?' అనుచు నోటికిగాని మాటలాడిందండీ!! చూశారా! జ్ఞాతిశ్చేదనలేనకిమ్మన్నా డూరికేనా!!!

అయ్యా. యీలాగిం కెందరో!! అదంతా చెప్పలేను!! ఇప్పటికి నా కాభయం తగ్గలేదు. డాక్టరుతో చెప్పినాను- ఈభయాని కేదైనా మంచి మందీయమని. అంటే అత డీవాళే పంపించాడు-

ఒరే, రాముడూ—మామా—గోడబీరువాలో పొద్దున్న డాక్టరుగారు పంపిన మందుసీసా తెలునునా?

రాము:—చిత్తం-చూస్తే తెలీదా.

పం—నీ మొహం!!-ఇటు చూడు-తెల్లనిసీసా-గుర్రపు బొమ్మవుంటుంది.

రాము:—తెలునును బాబూ-ఇదివరకు నేనిస్తూ వున్న దేకదా-

పం:—ఓరె వెధవా!!—ఆమందు కాదిది. ఇది మరొకటీ-

రాము:—చిత్తం తెస్తాను (అనిపోయినాడు)

పం:—అయ్యా! నౌకరంటే వీడండీ-దిక్కుమాలిన నాసంసారానికి నిజంగా వీడిపంటివాడే లేకుండునా మాసరిగూద వీధిలో నుండేదే-ఇక నా జబ్బులోనైతే వాడు పడినకష్టం చెప్పతరం కాదు.

నేను:—ఆమాట నిజమండీ బాబూ. వాడి కేమిచ్చినను ఋణం తీర్చలేము—

పం:—పంతులూ-ఆమాటకొస్తే నీకేమిచ్చి నీఋణం తీర్చుకోగలను?—ఎక్కడికీ ఋణాలకి!! ఋణం వుంటేనే వారు మనవంటివాళ్లకి చాకిరీ చెయ్యాలం—టేమంటే యెదుగుతాడు యీవాస్తలను!!

రాముడు:—మందు తెచ్చాను బాబు.

పం:—అక్కడుంచు—ఓరే రాముడూ, వారికికూడా లెమనేడ్బుడ్లు తెచ్చు

నేను:—నాకక్కరలేదండీ—అలవాటే లేదు.

సోమ:—ఆదేమిటయ్యా! అలాగంటావు—మాకు మాత్ర మలవాటా? వారిచ్చినపుడు పుచ్చుకోను. అది మరి కూడదా గాదు

పం:—అటువంటి ధర్మసూక్ష్మాలు మీవంటి పెద్దలకు తెలియవాలి—పడుచువాళ్లకు తెలుస్తాయా?

రాముడు గాజుగిన్నెలలో కమిలేడు పోసి సోమయాజులగారి కివ్వం బోవుచుండెను.

పం:—ఓరే—జాగ్రత—వారిని ముట్టుకొంటావు! మంగలి ముండాకొడకా! క్రిందపెట్టు వారు తీసుకొంటారు.

రాముడు:—చిత్తం చిత్తం.

పం:—ఓరే రాముడూ—అన్నట్టూ—నీకు బహుమతీ చేసిన పట్టుకండువా మనవాళ్ళకి చూపించావూ?

రాము ;—లేదు—చూపిస్తా—యిదో.

నేను:—నీతలకు చుట్టివుంటే మాకేలాగరం తెలుస్తుంది ?

రాము:—లేదుబాబూ అక్కడక్కడ చింకులున్నాయి! శిగ్గేస్తుంది బాబూ.

పంతు:—చూశావా పంతులూ యీ వెధవకి సిగ్గట—రాస్కెల్—ఇచ్చినగానితో తృప్తిపడడం లేదు—అందుకే వీళ్ళదరిద్రం తీరదు.

పంతులూ ఒకనాడు—మనలో మాట—నేను మా దొరగారి టికి వెళ్ళినప్పుడు ఆయన బట్టలుసర్దుకొంటూ వుండేను. నేనూ వెళ్ళగానే 'రండీ, కూర్చోండీ' యన్నాడు అంతలో వొకమేజాజోడు—స్టాకింగ్సు—కనబడ్డాది. ఆతనికేం బుద్ధిపుట్టిందో "మిస్టర్ ప్యామ్, ఐలైక్ టు ప్రెజంట్యూ విద్దిస్" అన్నాడు. "యస్ యువరానర్" అన్నాను వెంటనే.—ఏదిచ్చినా పుచ్చుకోవాలి! అదే మనకుధర్మం!! భగవంతుడైనా "పత్రంపుష్పం" అన్నాడు గాని "పట్టువస్త్రం బంగారం కడియం" అనలేదు.

నేను:—చిత్తం చిత్తం—సెలవిప్పించండి—బజారుకు వెళ్లవాలి.

పం:—ఏం తొందరయ్యా—కూర్చో—ఏ మిలా గొచ్చావు—అడగడం మరచి పోయినాను.

నేను:—ఏమీ లేదు—ఊరికే వచ్చాను—ఇంతలో మీరేదో చెప్పుతూవుంటే వింతగావుందని వింటూ కూర్చుబడ్డాను.

పం:—అయితే వుండు మరి—వెళతానంటావేం?

నేను:—ఇంకాకొంచం వున్నాడాయేమి?

పం:—విశేషంలేదులే—ఇదుగో మందుపుచ్చుకోనీ—చెప్తా—ఊపిరి యింకా అందకుండావుంది పంతులూ—(అని మందు పుచ్చుకొనుచు, శాస్త్రివైపు జూచి) ఏమిటి శాస్త్రులుగారూ ఆకాగితాల మడతే?—పంచాంగమా?

శాస్త్రి:—కాదు కాదు ఆంధ్రపత్రిక.

పం:—ఆహాం! మీకూవచ్చిందీ చాదస్తం!—ఎందుకండీ యీ దిక్కుమాలిన పత్రికలు—చదువ గలిగితే యింగ్లీషు పత్రికలు చదవాలి.

రాము:—మా తమ్ముడు శీతిగాడికిదే ప్రాణం బాబూ. అదిలేకుంటే సస్తానంటాడు.

పం:—ఏడిశారుగాడిదెలు. అందుకే యీలాగైంది మనబ్రతుకు. సరే మనకెందుకులెండి—విన్నావూ పంతులూ! ఆతరువాత చెప్పడానికి మరేమీలేదు గాని ఆ ఫూల్ అన్నమాటేనాకు మరచినామరపు రాలేదు. రెండునెలంతర్వాత నన్ను పిలచి తీర్పులు చెపుతాడట.

సోమ:—ఏడిశాడు—నేను రుద్రయజ్ఞంచేసి వాడి పని పట్టిస్తానండండి! మీరే వెళ్లడమో వాడే మీదగ్గిరికి రావడమో తెలుస్తుంది.

నేను:—మీలో నట్టి ప్రభావంవుండేదని విన్నాము; కాని యిపుడెట్లావుండో.

శాస్త్రి:—ఇపుడుమాత్రం మేమైంది! చేయాలంటే మూడులిప్తలు.

పంతులు:—ఒరే రాముడూ, నీవు నేనుచెప్పిన సీసాలో మందేతెచ్చావా?

రాముడు:—లేదుబాబూ—అదేతెచ్చాను. అదేఅదే.

పం:—ఏడిశావురా వెధవా—వరిగెత్తి డాక్టరును పిలూ—ఊపిరందలేదు—గుండెలాడలేదు. పంతులూ, భయంవేస్తూంది పట్టుకో............... అనుచుం గన్నులు వేలవేసెను. తల భుజములమీది కొరగినది. సోమయాజులును శాస్త్రియు "ఏమైంది పంతులూ ఏమైంది" యనుచు దూరమునకు బోయి యడుగుచుండిరి. నేను బట్ట నడుమునకు బిగించుకొని పంతులుగారిని పట్టుకొంటిని: పాదములంటితిని : తల యాడించితిని—శ్రీమన్నారాయణ !!! వెంటనే క్రిందనున్నవారికిం గేకలువేసితిని. మరికొంతసేపటికి డాక్టరుగారు కూడ దయచేసినారు. వారు వెంటనే పరీక్షించి పెదవులు విరచినైచిరి. ఇదియేమని నేనాయన నడిగితిని. ఆయన చిరచిరలాడుచు "హో ఇటీస్ నథింగ్ బట్ విస్కీరియా" అని బిరబిరం బోయినాడు.

నాలుగు లిప్తలలో నలువదేడుల నాటకము సమాప్తమైనది. అయ్యో! మంచి చెడ్డలేయుండును.

# నా స్వర్గలోక యాత్ర

కె. వి. యల్. నరసింహారావుగారు, బి.ఏ.

నాకు కవిత్వం అంటే భలేయిష్టం. ఇష్టమేకాదు; వ్యసనంకూడా. అందులో భావకవిత్వం అంటే పడి చచ్చిపోతాను. భావగీతాలు వింటానికి చెవులు తెగ్గోసుకుంటా. కళ్లు చిల్లులడేలాగ పత్రికల్లో చదువుతుంటా. ఏ భావకవన్నా టౌన్‌హాల్లో గీతాలు పాడుతాడని తెలిసిందా ముందు వెళ్లేది నేను. కవి తరువాత నేనే ఆనందించేది ఆపద్యాన్ని. రోజూ వకగంటైనా పఠనచేసి పరవశుణ్నైపోతే గాని, నాకు తోచదు. కాసేపు విరహగీతాల్లో మరిగిపోతాను. యెంకి, నాయుడు బావతో కొంం డెక్కుతున్నానంటే, నావల్లు నాకు తెలియదు. కొంతిసేపు మలయపవనునితో కలసి గోదావరీ అలల కొనలమీద నాట్యంచేసి, ఆపడంగా రివ్వున దుమ్ముతో ఆకాశంలోకి వెళ్లి, స్వేచ్ఛగా తిరిగి, గభాలున క్రిందపడిపోతాను. ఒకప్పుడు నా హృదయం పక్షిలాగ కొండలెక్కి, సముద్రాలు దాటి, యెక్కడికో వెళ్లిపోతుంది. పాతాళలోకంల్లో యిరుకుసందుల-దు కొట్టుకులాడుతుంది వకప్పుడు.

ఇంతకు చెప్పబోయేదేమిటంటే? ఆనాడు వైకుంఠయేకాదశి. స్వర్గలోకం తలుపులన్నీ తెరిచి వుంటయిట. పాపాత్ముడైనా ఆనాడు కాలంమూడి చచ్చాడంటే నిర్భయంగా స్వర్గాని కెళ్లచ్చు. ఢోకా లేదు దీనికి. అడిగేవా డుండడెవడు! ఆత్మహత్య చేసుకున్నా అడ్డంలేదు.

ఆరోజన యెండుచేతనో నబ్బా! బాగా అలసట మీదున్నాను. ఉపవాసాలని ఆడవాళ్లు ఫలహారాలు చేసుకుంటారుగా! అవన్నీ మస్తుగా తిన్నాను. ఆరాత్రి వకగంట భావగీతాలు పారాయణచేసి, దుప్పటి శవంలాగ కప్పుకొని కాళ్లునిగడ దన్ని పడుకున్నా. ప్రాణం యెక్కడికిబోయిందో? నావల్లు నాకు తెలియదు.

ఒకగమ్మత్తు కలొచ్చింది. నేను బొందితోనే స్వర్గానికి ప్రయాణం చేస్తున్నా. దోవలో చాలా యాతనపడ్డా; ఒక్కణ్ణి; భయం; అంతా అంధకారం; ఏమిచెసేదీ? టార్చిలైట్ (Torch light) వేసుకుని మెల్లగా చచ్చిచెడి చాయంగల విన్నపము లని వైతరణీ నదివొడ్డున చేరాను. అబ్బా! అంతా చీమూ, నెత్తురూ! అది దాటేదెల్లాగా? నేను చచ్చిపోయుంటే మావాళ్లు గోదానాలు చేసేవారు; ఆ ఆవుతోక పట్టుకొని దాటేవాణ్ణి. ఇప్పుడెల్లాగా? అక్కడ పుణ్యాత్ములను దాటించడానికి వకడున్నాడు. నాకూ యీమధ్య లంచాలు మరిగేట్ట. వాడి కేవోయిస్తానని అవతలొడ్డుపడ్డా. అక్కడి నుంచి యకాయికీని వెళ్లిపోయాను స్వర్గానికి.

అమితదాహం అయింది నాకు. నాలుక పీక్కుపోతున్నది. సోడా దొరుకుతుందేమోనని అటూ యిటూ చూచా. ఏమి పికరులేదు. ఇంతలో వక చక్కని కొలను కనుపించింది. దిగటాని కెవరన్నా చూస్తారని భయం. ఎవరూలేకుండా చూసి కాసిని మంచినీళ్లు పుచ్చుకున్నా. తస్సదియ్యా! అమృతంలా వుంది. బడలిక వదిలింది కాస్త. ఇక స్వర్గాన్ని చూడాలిగా? ఒక వీధిని పడిపోతూవుండగా వకచోట పొయట్స్ బ్లాకు (Poets' Block) అని వుంది. ఓహో! మన ఆంధ్రకవులంతా యిక్కడుంటారు గామాల్సని లోపలికెళ్లాను.

ఆహా! నా భాగ్యమేమి! కవులంతా స్నానసంధ్యానుష్టానాలు తీర్చుకొని ఫలహారాలు తయారయ్యేలోపల ఆధునికకవులనుగూర్చి మాట్లాడుదామని వక చిన్నసభ చేస్తున్నారు. నాకు వాళ్లమీద భక్తి శ్రద్ధలున్నా, భావకవులమీదుండే అభిమానం చేత యేమి జరుగుతుందో చూద్దామని చాటుగా చతికిలపడ్డా.

నన్నయ, పోతన, శ్రీనాధుడు, తిక్కన, పెద్దన మొదలైనవారంతా అలంకరించారు సభను. నన్నయ్యగారు అధ్యక్షుడు. సభ ప్రారంభించారు.

అగ్రాసనాధిపతి లేచి మొదలెట్టాడు వుపన్యాసాన్ని. సారాంశం యిది.

"కవి సోదరులారా! మనం యిక్కడెందుకు సమావేశమయిందీ మీకు తెలియును. మన యావజ్జీవాలు ధారపోసి మనశక్తి కొలదీ ఆంధ్రభాషను పోషించి, ఆంధ్రభాషావధూటికి చెక్కుచెదరని సొమ్ములు పెట్టేం. భావకవులంటూ యీమధ్య కొంతమంది బైలుదేరి భాషనంతా చెడగొడుతూ యున్నారు. ఈ రోజుల్లో ప్రతివాడూ కవిత్వం చెప్పేవాడే. లఘువులు, గురువులు గుర్తించటం తెలియగానే కవిత్వం చెప్పటం మొదలుపెట్టాడన్నమాటే. ఎక్కడ చూచినా వీరి పుస్తకాలు—పుస్తకాలుమట్టుకు అందంగావుంటయి. వాళ్లకు కవితాధార సున్న. పూర్తిగా వక పద్యమూ వుండదు. సగం వ్రాశాక, కవి భావప్రవాహానికేదో అడ్డు తగిలి ఆగిపోతుంది. చుక్కలుంటాయక్కడ. బుర్రబగలగొట్టుకున్నా కవి హృదయం తెలియదు గదా! ఎవరన్నా దీని అర్థం యేమిటని కవి నడిగితే, "నీ మొహం అర్థం ఏమిటి? కవి యెంతసులభంగా చెప్పకలడో అలా తన భావాన్ని వ్రాశాడు. ఆలోచించు నీకే తెలుస్తుంది. తెలియకపోతే "అఘోరించు" అంటాడు. యతిప్రాసలమాట చెప్పక్కర్లేదు. అన్నీ బూతులే! కవికి ఆమాత్రం స్వేచ్ఛ వుండాలిట. శైలి చూద్దామంటే అదీలేదూ, భాష లేనిదే శైలి యెల్లావస్తుంది. విరహం, ప్రణయం, మోహం, గాలి, ధూళి, పొగ, పిల్లవాయువులు—యివి కవితాసామాగ్రి. ఇలాంటి చొప్పదంటు కవిత్వం అడివిలాగ పెరిగిపోతున్నది. వీళ్లలో చక్కని కవిత్వం వ్రాసేవాళ్లువున్నారు కొంతమంది. వాళ్లసంగతి మన కక్కరలేదు. స్వేచ్ఛగా యిష్టమొచ్చినట్లు వ్రాసేవారి సంగతి ఆలోచించాలి. నయానో, భయానో మంచి మార్గాన పెట్టాలి. కాబట్టి మీరంతా ఆలోచించి యేదోమార్గం చెప్పాలని కోరుచున్నాను" అని కూర్చున్నాడు

ఇంతలో భీమకవి కళ్లెర్రజేసి "దాని కింత ఆలోచనెందుకండీ! బాబూ, నాయినా అంటే వాళ్లు వింటారా? మీ అందరి అనుజ్ఞ అయిందంటే వక పద్యం చెప్పేస్తా. ఎక్కడి భావకవులూకూడ యెగిరిపోతారు. ఖాళీబుర్రలతో భావాలకోసం ఆకాశంచూస్తూ కవిత్వంవ్రాసే అధునికకవులంతా. చేతిలో కలాలు జారవిడిచి, అలాగే కొయ్యలై పోతారు" అన్నాడు.

దొంగతనంగా యిదంతా వింటున్న వాణ్ణి ఊరుకోక, వేనేదో మనగాణ్ణని ముందరికెళ్లి "అయ్యా! మీరంతా పెద్దలు; అంత తొందరపడకట మంచిది కాదు. వాళ్లేదో నూతన ఫక్కీమీద కవిత్వం వ్రాస్తున్నారు. తప్పులుంటే సలహాలిచ్చి మరమ్మతు చేయండి. అదిలేకుండా చంపుతామంటే నా కేమీ బాగాలేదు. చంపితే జైల్లోపెడ్తా"రని అన్నా.

భీమకవి ఆవేశంగా గబగబ నామీదికురికాడు. ఆమనిషిని చూసేసరికే నా ప్రాణాలు యెగిరి పోయాయి. "అబ్బాయి! ఎందుకొచ్చావిక్కడికి? అవతలి కెళ్లిపో" అని మర్యాదగా చెపితే వెళ్లి పోనూ? అందరూ చూస్తూనే వూరుకున్నారు. ఆయనంటే భయమేమో వాళ్లకు! నన్ను చెవులు పట్టుకు లేవదీసి మెడమీద వక్కటిచ్చాడు. "చచ్చానురా......బాబో!" అని కేకపెట్టా. మా అమ్మ విని నిద్రలేపి ఏమిటన్నది. కలవరించావన్నా.






శ్రీ ల. విమలక్కగారికి చెల్లెలు కమల నమస్కరించి వ్రాయునది.

సోదరీ, నీవు వ్రాసిన లేఖ చేరినది. దానిని బట్టియే ఆధునికనాగరకసిద్ధాంతములకు నీవెంత వెనుకబడియున్నావో తెలియుచున్నది. స్త్రీలకు పరదాపద్ధతి తీసివేయవలయునని మన నాగరికయువతులు ఘోషించుచుండుట నీవు వినలేదు కాబోలును. ఘోషాపద్ధతి తీసివేయవలెననగా ముసుగులు బుఱ్ఱలమీదనుండితీసి భుజములపైని వేసుకొని కూర్చుండవలెనని కాబోలు నీ యుద్దేశ్యము. సర్వవిధములను స్త్రీ పురుషులు సమానులని సకలవిధములైన సేవలు, భోగములు, గౌరవములు స్త్రీ పురుషులెల్లరును చేయుట కర్హులు, చేయవలెననియే యీ సిద్ధాంతరహస్యము. ఇంజనీరింగు కాలేజీలలోనికిగాని వ్యవసాయ కళాశాలలలోనికిగాని స్త్రీలను చేర్చుకోరంటే అది విద్యావిధానమునందలి లోపము. దానినితొలగించుటకు మన మాందోళనముచేసి వానిలోకూడ మనము చేరి ఉన్నతోద్యోగములు బడయవలెను.

పురుషులునేర్చెడి సమస్తవిద్యలను మనమునేర్వవలెనన్న వారికి వేఱు కళాశాలలు మనకు వేరు కళాశాలలు ఏలయుండవలెను? స్త్రీమాత్రము నేర్వగిల కొన్ని ప్రత్యేకవిద్యలను మాత్రము నేర్చుకొనఁగోరు స్త్రీలకు ఆకాలేజీలలోనే స్పెషలు తరగతుల నేర్పాటు చేయవచ్చును. ఉపాధ్యాయులు స్త్రీ పురుషులలో నెవ్వరైననై వుండవచ్చును. 1931వ సంవత్సరములో లాహోరులో జరిగిన మహిళాసభ వారు ఇంచుమించు ఇట్టి తీర్మానమునే చేసిరి. తిరువాన్కూరు సంస్థానములో నిట్టులనే జరుగుచున్నది.

మనదేశములో అనాదినుండియు పురుషలోకజాతి స్త్రీలోకజాతి అనుచితగ వ్యవహారము జరుగుచున్నది. అందుచేత పురుషులేమో మహాగొప్పవారుగను స్త్రీలేమో తక్కువవారుగను పరిగణింపబడుచున్నారు. సమానులవలె సమానగౌరవములతోను నీతితోను నిర్మొగమాటముతోను ఒండొరులు గలసి దేశీయవ్యవహారములను జరుపుటకు సంకోచించుచు అనుమానించుచున్నారు. ఒకరికొకరు దూరదూరమున మెలగుట కలవాటుపడిపోయినారు.

సోదరీ, నీవు నూరుకాదు వెయ్యిచెప్పు. స్త్రీపురుషులు సమానదర్జాతోను, సమాన

గౌరవముతోను, అరమర అభ్యంతరములు లేకుండను ఒకరితో నొకరుకలిసి పఠించుట, ఉద్యోగములుచేయుట, గృహకృత్యముల బాధ్యతవహించుట, సభలలో వాదప్రతివాదములుచేయుట, ప్రజాసేవచేసి దేశోద్ధరణము గావించుట, నాటకములలో వేషములు వేయుట, క్లబ్బులలోనాడుట మొదలగుపనులు నెఱవేర్చలేవనినచో మన దేశమునకు స్వరాజ్యమురాదు. ఇతరదేశములతో మనము తల యెత్తుకొని తిరుగలేము. ఇట్టి సదాచారము మన దేశములలో నెలకొల్పవలెనన్న అది అమాంతముగవచ్చి మనపై వ్రాలదు. దానికి సంతతాభ్యాసముకావలెను పాఠశాలలే భావి సత్పౌరులను తయారుచేయు సంస్థలు. అక్షరాభ్యాసము మొదలు అఖిలవిద్యాపారంగతులమగునరకు వారును మనమును కలిసిమెలసియే పఠించుచు పరిభాషించుచు మసలవలెను. లేనియెడల స్త్రీ పురుషుల మధ్యగల యీ యగాధ మట్టులనే యుండి పురుషులుగొప్పవారివలె విఱ్ఱవీగుచు మసలుచుండుటయు మనము బానిసలవలె తగ్గియుండుటయు తప్పదు. కావున మనము పాఠశాలలను సంస్థలను, సహపాఠమును, నీయాచారమును నెన్నడును చేకూర్చుకొనరాదు.

ఇంక మనపూర్వాచారపరాయణుల నెల్లను పీడించుచున్నదే భయపిశాచము. స్త్రీ పురుషులు కలసి చిన్నవయస్సులోను పెద్దవయస్సులోను పఠించుచున్నచో వారికి చిత్తవిభ్రమములు కలిగి, విద్యమాట దేముడెరుగునుగాని, నీతిబాహ్యమగు పనులొనరింతురని చదువుకొన్నవారిలోను, చదువురానివారిలోను, పాఠశాలలోను బయటకూడ ఇట్టివారు కొందరుండరని నేనువాదించను. ఎవరో ఇట్టివారు కొందరుందురని సర్వసమానత్వదాయకంబగు ఈ సదాచారముదెస మనము పెడమొగము పెట్టుకొనవలెనా? అవినీతిని పూర్తిగా తొలగించుటకుకూడ ఈ సహపాఠము, సహాచారము, సహభాషణము, సహసేవాభిలాషతప్ప వేరొండు మార్గము లేదని నీవు గుర్తింతువుగాక! మా పాఠశాలలో మేము యువతీయువకులము కలసియే అరమర అభ్యంతరములేక పఠించుచున్నాము. మాలోనెవ్వరును చెడిపోయినవారులేరు సరేగదా పురుషులకు స్త్రీలన్న నొక అపూర్వాభిమానము గౌరవముగలిగి మర్యాదగా ప్రవర్తించుచున్నారు. అనేకయుగములనాటి అలవాటువశంబున పురుషులకొక రీతి గర్వాధిక్యము స్త్రీలకొకరీతి భీరుత్వము నాశ్రయించియున్నవి. వీనిని తొలగించుటకు సహపాఠమే దివ్యౌషధము. నేను చెప్పిన మాటలు నీకు నమ్మకములేకున్నచో మా కాలేజీకివచ్చి ఒకసారిచూడుము. మరియు ఏప్రిల్ 8వ తేదీ సండేక్రానికలులో శ్రీయుత ఆర్. వి. శ్రీనివాసన్, ఎమ్. ఎ., గారు వ్రాసిన వ్యాసమునుపఠించుము. నాపూర్వపు జాబునకువలెనే దీనికిని నీవు సమాధానము వ్రాసి అజ్ఞానాంధకారనిమగ్నులగు మన ఆంధ్రయువతీ సోదరీమణులకు నీయమూల్యమైన సలహా నొసంగవలెననికోరుచున్నాను.

ఇట్లు
విమల.



# పాకకళ

## —సెనగకాయల బర్ఫీ—

పచ్చిసెనగకాయలు తెచ్చి, కాయలువొల్చుకుని, సెనగలమీదిపొట్టు తీసివేయవలెను. అట్లు తీసినవి పావుశేరు రోటిలోవేసి మెత్తగారుబ్బి వుంచవలెను. పావుశేరు కోవా తెచ్చి బాణలిలో కొంచెము నేయి వేసి కోవా దోరగావేయించుకొని దింపవలెను. అదే మాదిరి రుబ్బిన సెనగకాయముద్దను వేయించుకొని రెండు ఒకచోట కలుపవలెను. ఒక గిన్నెలో కొంచెము నీళ్ళుపోసి ¾ సేరు (15 తులములు) చక్కెర వేసి ముదురుగా పాకముపట్టి దీనిలో వేయించిన ముద్దనువేసి కలుపుచుండవలెను. ఏలకులపొడి కుంకుమపువ్వువేసి బాగాకలిపి దించుకొని ఒక వెడల్పు పళ్ళెములోవేసి పిస్తా, బాదాం, జీడిపప్పు సన్నగా తరిగి పైన చల్లవలెను. చల్లారిన తర్వాత బిళ్ళలుగా కోసి తినిన మిక్కిలి రుచిగానుండును.

—శింగీతం. యిందిరాదేవి.

## —అరటికాయతొక్కల పచ్చడి—

మంచి ముదిరిన అరటికాయలు తెచ్చి ఆయాకుటుంబములకు చాలినన్ని కాయలకు తొక్కతీసి చిన్న దమ్మిడీలంత ముక్కలు తరిగి అవి బాగుగా నీటిలో కడిగి భాండిగ పొయ్యిమీద కాలనిచ్చి కొంచెము నెయ్యిగాని నూనెగాని వేసి ఈతరిగిపెట్టిన ముక్కలను బాగా పడిలేవరకూ వేయించి అటుపిమ్మట దింపి ఒక పాత్రలోవుంచవలెను. ఆభాండిగ తిరిగీ పొయ్యిమీదపెట్టి నెయ్యిగాని నూనెగానివేసి, మిరపకాయలు శనగపప్పు మినపప్పు ధనియాలు ఆవాలు మెంతులు కరివేపాకు ఇంగువవేసి పెళపెళ వేగనిచ్చి మంచి మంచి సువాసనగా వున్నప్పుడు దింపి, మొదట వేగిన ముక్కలను, అనగా అరటితొక్కలను తగిన చింతపండు వుప్పు పసుపువేసి రోటిలోవేసి మెత్తగా రుబ్బవలెను నీళ్ళు యెక్కువగాపోసిన సాయంత్ర మగుసరికి వాసనవేయును కనుక గట్టిగా రుబ్బవలెను. ఇట్టి పచ్చడి నిదివరకెరుగనివారు యొకపరి యీయము పైమోస్తరు తయారుచేసి రుచి గ్రహింతురుగాక.

కాం॥ వేం॥ రంగనాయకమ్మ.

## —బిస్కత్తులు చేయుట—

మైదాపిండి ½ శేరు తెచ్చి దానిలో వెన్న 15 తులములు చిట్టెడు సోడాగుండ చీనీగాని వుప్పుగాని కొద్దిగావేసి పాలు చల్లుతూ ముద్దగా కలుపవలెను. ఆముద్ద 1 గంటకాల ముంచిన తరువాత పూరీవత్తి నట్లువత్తి చిన్న డబ్బామూతితో అచ్చులుతీసి చీపురుపుల్లతో కన్నములు పొడిచిన చిన్నచిన్న బిస్కత్తులు మాదిరిగా ఉండును. ముద్దంతవత్తి వుంచుకొని, పొయిమీద బాణలిలో ఇసుకవేసి దానిమీద పలుచని రేకు పెట్టవలెను. రేకుకు పట్టినన్ని బిస్కత్తులువేసి మీద మూత ఉంచవలెను. కొంతసేపటికి ఎర్రగా కాలును అన్నియు కాల్చి ఒక డబ్బాలో ఉంచుకొని కాఫీ తాగేప్పుడు తినిన బాగుండును. మనము బజారులో ఎన్ని కొనితినినప్పటికి స్వంతముగా చేసుకొని తినినంత రుచియుండవు. డబ్బు ఎక్కువ ఖర్చుఅగును. కాన ఇటువంటివి ఇండ్లలో చేసుకొనుటయే మంచిది

—బి.బి. సీతమ్మ.

## అత్తయుక్తి

శ్రీమతి పాకల వెంకటకామేశ్వరదేవిగారు

ఒకవూళ్లో ఒకముసిలమ్మవుండేది. ఆమెకొక్కడేకొడుకు. ఆకొడుక్కు పెళ్ళిచేసింది. కోడలుయుక్తవయస్కురాలై కాపరానికి వచ్చింది. ఆమె తనతల్లి కేకపుత్రికకనుక ఆమెకూడా వీరింటనే చేరుకుంది.

తల్లీకూతుళ్లిద్దరూచేరి అల్లుణ్ని వశపరచుకొని ఆముసిలిదాన్ని నానాబాధలు పెడుతూ వుండేవారు. ఆవిడ చాలా చమత్కారవంతురాలు. వియ్యపురాలూ కోడలూ తనకు లొంగిఉండడానికి ఒకఉపాయం ఆలోచించుకొంది.

కొన్ని గులకరాళ్లూ చిల్లపెంకులూ యేఱి ఒక సంచీలోపోసికట్టి ఆసంచీని దిండులో పెట్టికుట్టింది. రోజూ ఆదిండును తలక్రింద పెట్టుకొనిపడుకొ్కని, తెల్లవారగానే తన పక్కతానే యెత్తుకొని జాగ్రతపెట్టుకొనేది. రాత్రి తిరిగితానే పక్కవేసుకొనేది. పగలల్లా యెవ్వరూ దానిని ముట్టుకోకుండా జాగ్రత్తగా కాచుకొనివుండేది.

తల్లీకూతుళ్లిది కనిపెట్టేరు. అందులో చాలామట్టుకు ధనము దాచుకొని వుంటుందని భ్రమపడ్డారు అప్పటినుంచి ఆమెమీద గౌరవాభిమానములున్నట్లు నటిస్తూవుండేవారు. నేలనడిస్తే కాళ్లుకందిపోతాయి కాబోలుననునంత జాగ్రతగా ఆమెను సేవించుచుండేవారు. కోడలే రోజూప్రక్కవేస్తూ యెత్తుతూ అత్తగారికి కాళ్లువత్తుతూవుండేది. తాను పన్నినయుక్తి సమంగా పారిందిగదా అని ఆముసిలమ్మ సంతోషించింది.

ఇల్లాగుండగా కొన్నాళ్లకు ముసిలమ్మ కాలంచేసింది. కోడలు పట్టరానిసంతోషంతో ఎవరూచూడకుండా గదిలోకిదూరి ఆమెదిండుచించి అందులోనున్న సంచీనిచించి ఎంతధనమువుందో అని చెయ్యిపెట్టి తణివింది. ఏముంది అందులో! గుల్లలూరాళ్లూ చేతికితగిలాయి!! మళ్లీచూసించి. మళ్లీ అంతే!! ఆమెకు పట్టరానంతదుఃఖంవచ్చింది. డబ్బులేకపోయింది గదా అని అత్తగారి శవందగ్గరకు వచ్చి మీదపడి గోలుగోలున ఏడవడం మొదలుపెట్టింది. "అయ్యో ఎంతమోసం చేసేవే మా అమ్మతల్లీ!" అనుకుంటున్ను. ఇరుగుపొరుగుల వారందరూ దుఃఖందేనికో తెలియక కోడలుయొక్క అభిమానానికాశ్చర్యపడి ఓదారుస్తున్నారు.

తల్లికూడా తనకూతురుకి నిజంగానేఅత్తగారు పోయినందుకు దుఃఖమే అనుకుంది. దుఃఖంలోపడి అసలు సంచీసంగతి మరచిపోతున్నది కాబోలనుకుంది. ఆమెకు సంచీసంగతి జ్ఞాపకంచేదామనుకొని "అది భద్రమేనా కూతురా"అని యేడ్చింది. కూతురుదాని అర్థమును గ్రహించి "అందుకే ఈయేడుపో అమ్మా అవి రాళ్ళోవో అమ్మా అవిగులకలే ఓ అమ్మా"అని జవాబుగా ఏడ్చింది. ఆమె దుఃఖం మరీయెక్కువయింది.

చుట్టుప్రక్కలవారందరూ తల్లీకూతుళ్ల విచారమునుచూచి ఆశ్చర్యపోయినారు. వాళ్లకేమితెలుసు నీలోపలిగుట్టు!! శవం కదిలిన తరువాత తల్లీ కూతుళ్లు ఇద్దరు కూర్చొని ఈమోసమును తలచుకొని తలచుకొని మరీయేడ్చారు. కథకంచికి-మనమింటికి.

వులనుతో తివాశీ

పూర్వం వలగుడ్డతో పతాలుకుట్టెడివారు ఆవలగుడ్డ ½ గజం తెచ్చుకునేది 12 రంగుల వులన్ తెచ్చుకునేది. ఆరంగులు ఏవంటె లేతఆకుపచ్చదానికైనా ముదురు ఇంకా ముదురు ఇటులనే పసుపు పచ్చ 3 రంగులు, రోజులో 3 రంగులు, నీలంలో 3 రంగులు, అన్ని తయారుగా నుంచుకొని గుడ్డమీద లేత ఆకుపచ్చచీల్చి క్రాసుగా ఐమూల 9 ది ఇండ్లువేసి మరల అడ్డం 9 ది ఇండ్లు మరల తొమ్మిది ఇట్లు గుడ్డకొన ఐమూలవెయ్యగా కల్యాణకుంభమువలె నచ్చును. దాని ప్రక్కన నీలంవేసేది మరల మొదటి రంగులనే మార్పుచేసుకునేది. 9 ది ఇండ్ల లేపపైన రెండవరకం పచ్చచీల్చకుండ అడుగురంధ్రం లోనుంచి సూది బైటికితీసి అడ్డంగాపైనుంచి ఈప్రక్కన బోలుగా రెండుధారాలు ఎత్తుకునేది. ఇట్లనే ఇటుకు అటుకు 7 ధారాలు, 5 తర్వాత 3 వేసుకుంటూవొచ్చి ఇదే మాదిరి పూర్తిఅయినానక అడుగు తొమ్మిది ధారాలువిడిచిపెట్టి పైమూడువరసలు కత్తెరతో సమభాగంగా నడిమికి కత్తిరిస్తె తివాసి వలె వచ్చును. రంగులు ఇంద్రధనస్సువలె వచ్చును. ఈతివాసిమడిచి నాలుగుప్రక్కల మడిచికుట్టి కుర్చీమీదవేసిన బాగుండును. ఇంకా మన ఇష్టం వచ్చినమాదిర్లు ఇట్లనే కుట్టుకొనవచ్చును.



చిత్రప్రశ్న — శ్రీమతి చీమలకొండ రామసుబ్బలక్ష్మిగారు

చెడ్డవానికి నూరచేరునదేది? విలువగలలోహమున కేదిపేరుభువిని?
పరగుసరసీరుహము కేదిమారుపేరు? నిదురకన్నులచేరగ నీయదేది?
పక్షులెట్టుల నుదయాన పాడుచుండు? పెద్ద లెవ్వరుజనియింప ప్రీతులగుదు
రన్నిప్రశ్నలజబాబులందు కూడ నమరునాలుగునాల్గేసి యక్కరములు
మొదటిమూడవయక్కర మొకటెయగును చిక్కువిడదీయరమ్మమా! అక్కలార!

## చిత్రప్రశ్నలకు సమాధానములు

[ఏప్రిల్ మాసపు చిత్రప్రశ్నకు శ్రీమతులు ఏలేశ్వరపు జయలక్ష్మమ్మ, వారణాసి వరలక్ష్మి, కంకిపాటి రుక్మిణమ్మ, శిఖరం కమలాంబ, పాకల కనకరత్నమ్మ, నందిగామ సౌభాగ్యవతి, నాయని నాగమణెమ్మ, మంకరి రామానుజమ్మ కన్యగార్లును, పప్పు అప్పయ్యశాస్త్రిగారును సమాధానములు వ్రాసిరి. మొదటిదానికి అందరును అక్షమాల అనియే వ్రాసిరి. రెండవదానికి భూపాళము అని కొందరును, కాంబోజమని కొందరును, సౌరాష్ట్రమని కొందరును, మూడవదానికి జనకుడనియు, నాల్గవదానికి అండజమనియు, అయిదవదానికి అంబరము, ఆరవదానికి అంబకమనియు, ఏడవదానికి కాశ్మీరము, నేపాళమనియు వ్రాసిరి. శ్రీమతి ఏలేశ్వరపు జయలక్ష్మమ్మగారు రెండు సమాధానములను వ్రాసిరి. గృ॥ సం॥]

# హరిజనాభ్యుదయము

ఏప్రిల్ తొమ్మిదవ తేది హరిజనపత్రిక కొక విలేఖరి యిట్లు వ్రాయుచున్నాడు:—

ఉదయము లేవగానే గోవునుదర్శించెడి యాచారము హిందువులలో నున్నది. గోవును దర్శించినంత మాత్రముననే పుణ్యము రాదు. ఆవును చూడగానే దానికి సరిగా మేతపడ్డదో లేదో, కుడితి పెట్టిరో లేదో, సాల శుభ్రముగ నున్నదో లేదో, మొదలైన విషయములను పరిశీలించిన ఆవుకు కావలసిన సదుపాయములు చేయుటకు వీలుకలుగును. నోరులేని జంతువు కనుక దానిసంగతి మనమే కనిపెట్టవలెనని ఈ ఆచారముయొక్క ఉద్దేశము. ప్రస్తుతము హరిజనులు గోవుకంటె కూడ నోరులేనివారై దీనావస్థలో ఉన్నారు కనుక గోవుకు బదులు హరిజనసేవకులందరూ హరిజనులగూడెములకుపోయి వారికష్టయిష్టములను కనిపెట్టుచుండవలెనని నేను కోరుచున్నాను. ఈ వూరిలో మేము కొంద మట్లే చేయుచున్నాము.

మునిసిపాలిటీవారు 10 అడుగులు పొడుగు 8 అడుగులు వెడల్పుగల గదికి మూడడుగుల వెడల్పుగల వంటింటికి, గదిలో $\frac{1}{4}$ వంతు విస్తీర్ణము గల వరండాకు కలిపి రు 2 మొదలు రు 6 లు వరకు అద్దె పుచ్చుకొనుచున్నారు. ఒక్కొక్క గదిలో రెండేసి మూడేసి కుటుంబములుండును. ఇంటద్దె జాగాయొక్క విస్తీర్ణమునుబట్టి కాక అందు నివసించు వారిలో సంపాదకులయొక్క సంఖ్యనుబట్టి తలకొక రూపాయి చొప్పున నిర్ణయింపఁ బడుచున్నది. యిళ్ళల్లో మనుష్యులను క్రుక్కుచున్నారనుటకు సందేహములేదు. ఈ సంగతి మేము చెయిర్మేను గారితో చెప్పగా మునిసిపాలిటీకి వేరే స్థలము లేదనియు, ఎవరైనా ఇళ్ళు అద్దెలకిస్తే కొందరిని వాటిలోనికి మారుస్తామనియు చెప్పినారు. మహా కష్టముమీద కొందరట్లు యిచ్చుచున్నారు. పది హరిజన కుటుంబముల నింతవరకట్లు మార్చగలిగినాము.

కొందరు విద్యార్థులకు వుచితముగ పుస్తకముల నిచ్చినాము. జీతములులేకుండా స్కూళ్లలో చేర్పించినాము. కొందరికి గుడ్డలిప్పించినాము. 20 కుటుంబముల గుడిశలను మరమ్మత్తుచేయించినాము. ఆస్పత్రులలో మందులిచ్చే యేర్పాటులు చేయించినాము. నిరుద్యోగులకు ఫ్యాక్టరీలలో కూలిపను లిప్పించినాము. కొందరు శ్రీమంతులను బ్రతిమాలి జాగా కొనిపించి యిండ్లు కట్టించి హరిజనులకు అద్దెకిచ్చునట్లు ప్రోత్సాహించుచున్నాము. ఇతర పట్టణముల లోని హరిజనసేవకులుకూడ యిట్లే చేయవలెను.

## యోగ్యమైన ప్రార్థనము

ఈ విషయమునుగూర్చి మహాత్ముఁ డిట్లు వ్రాయుచున్నాడు:—

నా ఉద్దేశము ప్రకారము ప్రపంచములోని ప్రధానమతములన్నియు సత్యములే. మానవకోటికి కావలసిన ఆధ్యాత్మికాభివృద్ధినిగూర్చుట కవియన్నియును తోడ్పడుచున్నవి. ఒక కిరస్తానీపిల్లనుగాని పార్సీపిల్లనుగాని మహమ్మదీయబాలునిగాని పెంచమని నాకు ఒప్పగించినచో నేను వారిని పెంచి ప్రతి వానికి లేక ప్రతిదానికి వారివారి మతమున కనుకూలమైన శిక్షణమును ప్రార్థనమును మతగ్రంథములలోని

విజ్ఞానమునే నేర్పుచున్నాను. ఒకవేళ నామతమును గురించి తప్ప అన్యమతములనుగురించి నాకు మిక్కిలి తెలియకున్నచో వారి మతగ్రంథములను ఆచారములను నేర్చుకొని వారికి నప్పచెప్పుచున్నాను. అంతే కాని నా మతాభిప్రాయములను ఆచారములనుగాని నేను వారిపైని జొప్పించను.

నిజమైన ప్రార్థనము మాటలతో ముగియక క్రియలలో వ్యక్తీకరణము కావలెను. మహమ్మదీయులకు కాని క్రైస్తవులకు కాని హరిజనపిల్లల నొప్పగించినచో వారు వారిని తమమతములోనికి మార్చుకొనకుండ హిందూమతోచితమైన శిక్షణమునీయగలుగుటకు సిద్ధముగ నున్నారా? వారట్లు చేసిననే వారిది నిజమైన ప్రార్థన మనిపించుకొనును. అస్పృశ్యతా నివారణమునుగూర్చి సకలమతములవారును నాకు సాయముచేయవలెనని కోరుచున్నాను. సర్వులును సానుభూతి చూపి సాయముచేయుదుమని వ్రాయుచున్నారు. వారిసాయము హరిజనులకు తమమతములోనికి కలుపుకొనటకాక, వారికి కావలసిన మతశిక్షణము నొసంగు రూపముగా నుండవలెను. వారి ప్రార్థనమీదిగువ రూపముగ నుండవలెను.

"ఓ దేవా, సకలమానవులును వారివారి మతములకుచితమైన రీతులను నిన్ను పూజించి నీ యడుగు జాడల వర్తింపగల్గునట్లు వారికి తగినబుద్ధిని ప్రసాదింపుము."

"ఓ దేవా, నేను నా మతానుసారము నిన్నెట్లు ప్రార్థించి అనుసరించుచున్నానో సర్వులును వారివారి మతానుసారముగనే యొనరింతురు గాక."

మిత్రులందరు నిట్లొనరింపగల్గినచో నిశ్చయమైన హరిజనసేవయే కాక సకలమానవ సేవనొనర్చువారే కాక సకలమానవ సౌభ్రాతృత్వమును శాంతిని నొసగూర్చిన వారుకూడ నగుదురు.

## అస్పృశ్యత—శాస్త్రములు

ఇందునుగూర్చి మహాత్ముగాంధీగారు వ్రాయుచున్నారు:—

అస్పృశ్యత మనహిందూమతములోని కెప్పుడు దూరినదో నేను చెప్పజాలను. మనదేశములో కనిపించుచున్నరీతి నున్న అస్పృశ్యతశాస్త్రసమ్మతమని నాకు తోచదు. వేదములలో దీనిప్రశంసలేదు. స్మృతులలో నున్నను ఆశ్లోకములు ప్రక్షిప్తములని అనుమానించుట కవకాశమున్నది. ఏదియెట్లున్నను అస్పృశ్యతపవిత్రభావముకాదు. ప్రస్తుతపు హరిజనులు పూర్వపు అస్పృశ్యతసంతతివారని రూఢిగ చెప్పుటకు వీలులేదు. శాస్త్రుల్లువారినడుగుతే జనాభాలెఖ్ఖల లోపలనున్న వ్రాయబడియున్నది మా మతమన్నారు. జనాభాలెఖ్ఖలను కూర్చువారికి అస్పృశ్యులెవ్వరో తెలియదు. ఒక భాగములో అస్పృశ్యులుగా వ్రాయబడినవారి నింకొకభాగములో స్పృశ్యులుగావ్రాయబడినారు!! వీటినాధారము చేసుకొని మానవులకు వారి జన్మహక్కులు నిషేధింపరాదు.

హరిజనసేవకులు తమంతటతామే ఈ సమస్యను గూర్చి ఆలోచించుకొని ఇదే ఘోరదురాచారమని భావించినచో తొలగించ బూనుకొనవలెను. అస్పృశ్యత పీటవెట్టుకొని కూర్చున్నచో హిందూమతము నాశనమగుట నిశ్చయము!! నిజమైనహరిజనసేవకులు ఈ శాస్త్రుల్లువారి వాదనలకు భ్రమపడి అస్పృశ్యత హిందూధర్మములో నొకభాగమేమోయని విశ్వాసమునకు పాలుకారాదు. మనకు శాస్త్రుల్లువారి పుస్తకములుకాదు ప్రధానమైనవి: మానవకోటికంటె ప్రశస్తతరమైన గ్రంథములేదు. శాస్త్రములే నొకొన్నిసంగతులనుమాత్రమే తెలుపును కాని మానవకోటియను యుద్గ్రంథమునకు మానవుని సర్వధర్మపరిపూర్ణుని చేయగలవు. హరిజనులు యుత్కృష్టమానవకుటుంబమునకు చెందినవారు. వారి నుద్ధరించుటవలన మానవుడుత్కృష్టుడగును. వేదములు జీవకోటియెల్లయు నొక్కటేయనియు అది పరమేశ్వరాంశమనియు సందేశము నొసగుచున్నవి. ఈ జీవకోటినుండి హరిజనులుమాత్రమెట్లు బహిష్కరింపబడగలరు?

# వార్తలు విశేషములు

శ్రీమతి ముల్పూరి చుక్కమ్మగారి ధర్మనిధి యొక్క ధర్మకర్తలు మార్చి 21వ తేదీ సమావేశమయిరి. ఈసంవత్సరము గుంటూరు శారదానికేతనము వారికి 30 లును, ఏలూరు అన్నపూర్ణాజాతీయ బాలికాపాఠశాలకు ప్రస్తుతము 20 లును యివ్వుటకు నిర్ణయించిరి, 1933 ఏప్రిల్ నుండి 1934 సం॥ మార్చిఆఖరువరకు ఈ నిధినుండి రు 250 లు కమ్మబాలికా వితంతులవివాహము కయి వెచ్చింపబడెను. ఆనిధి కార్యదర్శి ముల్పూరి రంగయ్యగారు ఇట్లు వ్రాయుచున్నారు.

జపానుదేశములో హేకోడేటు అనునది మంచి శ్రీమంతమగు రేవుపట్టణము. ఫ్యాక్టరీలకేమి దుకాణములకేమి పట్టుకొమ్మ పట్టణము ఫ్యాక్టరీలన్ని జోరుగా పనిచేయుచుండగా, పొగలు గుప్పునవచ్చుచుండగా. అగ్నికణములుకూడ ఎగురుచుండగా, ఒక్కనుడిగాలివీచినది. ఈదెబ్బకు పట్టణమంతా గుప్పున ఒక్కసారిమండినది. ఫ్యాక్టరీలు, దుకాణములు, మేడలు, అన్నికూలి భగభగమని మండజొచ్చెను. 650 మంది చనిపోయినట్లును, 460 మందికి గాయములు కలిగినట్లును, 27 వీధులలో 24 భస్మమైపోయినవి. 150000 మందికి నిలువనీడ లేదు. అనేకమంది ఈఆపదను తప్పించుకొనగోరి చప్పున సముద్రపుటొడ్డుకుపోయి పడవలలోదూరి సముద్రములోనికిపోయిరి. ఆనుడిగాలి వారిని అక్కడకూడ వదలలేదు!! పడవలతోపాటుగా వారినమాంతముగా విసిరివేసినదట!! పదమూడు పడవలుఎక్కడకుకొట్టుకొనిపోయినవో ఏమయినవో తెలియదు. సమారమి 50,00,000 పౌనులు విలువగల ఆస్తి భగ్నమైనదని తెలియుచున్నది.

సికింద్రాబాదు కాపురస్థులు శ్రీయుత బాజీ క్రిష్ణారావు బి. ఏ. బి.యల్. గారును వారిభార్య శ్రీమతి శారదాబాయి గారును యిందిరాబాయి యను పేరుగల తమ దత్త వితంతుపుత్రికను శ్రీయుత ఆర్. పద్మనాభరావు గారికిచ్చి రాజమహేంద్రపురములో ఏప్రిల్ 8వ తేదీని వివాహమొనరించిరి. పౌరులనేకులువచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

25-3-4 తేదిని నెల్లూరు వితంతువివాహ సంఘము వారి తరపున ఇస్కా చంచయ్యగారి యింట్లో శ్రీమతి లక్ష్మమ్మగారను 22 యేండ్ల వితంతువుకును శ్రీయుత కె. సుబయ్యగారికిని వివాహము జరిగెను. బలిజసంఘములో యిదే ప్రథమవితంతువివాహము. నూరుమంది స్త్రీపురుషులు విచ్చేసి వధూవరుల నాశీర్వదించిరి.

డార్టుమండు నగరమున ఒక లాయరు ఒక విధవ తరపున వకాల్తనామాపట్టి కేసు వాదించెను. కేసు వీగిపోయెను. అతను తిన్నగా పనిచేయకపోవుటచేత కేసు వీగిపోయెనని అతనిమీద నామె ఫిర్యాదు చేసెను. కోర్టువారు 500 పౌనులామె కతను చెల్లించవలెననియు సంవత్సరమునకు 140 పౌనుల చొప్పున ఆమె యావజ్జీవము చెల్లించుచుండవలెననియు తీర్పు చెప్పిరి.

చైనాలో క్వాంగ్సీ రాష్ట్రములో ఒక పెద్ద రోడ్డు వేయించుచున్నారు. ఆపని చేయుచున్నవారందరును స్త్రీలే. నిరుద్యోగస్త్రీలకు పని కల్పించుటకే వీని ప్రారంభించినారు. 5000 స్త్రీలు పని చేయుచున్నారు.

సిల్చారు నగరమున కళాసేన రాజకుమారుడను నతను అలోపతి ఆస్పత్రిలో కాంపౌండరు. అతని కొకసారి జబ్బుచేయుటచే జీతముపైని కొన్నాళ్లు సెలవుకోరెను. సివిలుసర్జను అతనిని పరీక్షించి రోగ కారణమున నెలదినములు సెలవు శాంక్షనుచేసి తగిన మందు లిమ్మని సబ్ అసిస్టాంటు సర్జనుతో చెప్పెను. అతను కొన్ని మందులనిచ్చి పథ్యపానములను చెప్పెను. కళాసేనుడు స్వగ్రామమగు లఖిపురమునకు వచ్చి మందు సేవించుచుండెను. ఒక దినమున అతనికి స్మృతి తప్పిపోయెను. అతని బంధువు లొక ఆయుర్వేదవైద్యుని తెచ్చి మందిప్పించగా నిమ్మళించెను. అసిస్టాంటు సర్జను ఈసంగతి తెలిసి సర్జనుతో చెప్పెను. సర్జనుగారికి కోపమువచ్చి తాలూకా బోర్డువారితో చెప్పి ఆయుర్వేదమందు ఉపయోగించినందుకై అతనిని డిస్మిసు చేయవలసినదని తీర్మానము చేయించెను.

"అటువంటివాడు తెల్లవారి మందులకు కాంపౌండరుగా నుండతగడు. ఇటువంటివారి నుద్యోగములో వుంచుకుంటే మన ఆస్పత్రులయందు ప్రజలకు విశ్వాసం చెడును. ఈమందులలో విశ్వాసమున్న కాంపౌండరులు చాలామంది యున్నారు. ఇతని కిచ్చిన శలవు పూర్తికాగానే ఇతనిని పనినుండి తొలగించి మరియొకనిని వేసుకొనవలెనని నేను సిఫార్సు చేయుచున్నాను" అని అతను బోర్డువారికి వ్రాసెను. పాపము కాంపౌండరు తనపై దయతలచి ఉద్యోగముంచవలసినదని డివిజనలు కమీషనరుగారి కప్పీలు చేసుకొనెనట.

బొంబాయి కార్పొరేషనువారు 10 లక్షల రూపాయీలు ఖర్చుపెట్టి పేదవారి కిండ్లు కట్టించుటకు తీర్మానించిరి. ఇట్లు చేసినచో పట్టణములో ననారోగ్యకరములగు గూడెములన్నమాట ఉండదు. ఈ సొమ్ముతోనే వారికొరకు కొన్ని స్కూళ్లుకూడ కట్టింతురు. ఇందువలన పేదలయిళ్లు బాగుపడుటయే కాక కరువుకాలములో వారికి కూలిపనికూడ కూర్చినవారగుచున్నారు. ప్రెసిడెంటు రూజువెల్టుగారు అమెరికాలో ఇట్టి పనులనే చేయించుచున్నారు. అతను ఎంతో సొమ్ము ఖర్చుపెట్టి 30,00,000 పనిలేనివారికి పని కల్పించి వారిచే చెట్లు నరకించి వ్యవసాయభూములు తయారుచేయుట, కాలువల మరమ్మత్తు చేయించుట మొదలగు పనులు చేయించుచున్నాడు. ఇందువలన అమెరికా మున్ముందు మరింత శోభస్కరమై అలరారగలదు. బ్రిటిషు ప్రభుత్వమువారు పట్టణములలోని పనివాండ్ర కిండ్లు కట్టించుటకు 11,50,000 పౌనులు వెచ్చించుచున్నారు.

బొంబాయిలో నెయ్యిమందికి ఒక్కొక్కటి చొప్పున రేడియో సౌకర్యముకలదు. ఇంగ్లాండు అమెరికాలలో కంటె యీసంఖ్య మిక్కిలి తక్కువ. ఇంగ్లాండులో 6,000,000 అమెరికాలో 237,000,000 రసీదులు గలవు.

కొలంబో ప్రముఖులు డాక్టరు రవీంద్రనాథ టాగూరుగారిని ఆహ్వానించిరి. డాక్టరుగారు శాంతినికేతనం విద్యాంసులను, కళానిపుణులను వెంటబెట్టుకొని మేనెలలో వెళ్లెదరు. కొలంబోలో సంగీతము. చిత్రకళ ప్రదర్శించుటకు తగు ఏర్పాటులు జరుగుచున్నవి.

పని దొరకనట్టి ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు చెందిన పట్టభద్రులకును పట్టభద్రులు కానివారికిని ఉద్యోగములను లభింపజేయుటకు తగిన సలహానొసగు వుద్దేశ్యముతో ఆంధ్ర విశ్వవిద్యాలయమువారొక సంఘము స్థాపించియున్నారు. ఈసంఘము యొక్క సహాయమును కోరు పట్టభద్రులు, పట్టభద్రులు కానివారు ఆంధ్ర విశ్వవిద్యాలయపు రిజిష్ట్రారుతో (వాల్తేరు) వుత్తర ప్రత్యుత్తరములు జరుపవలెను.

# పుష్పచయము

ఆంధ్రదేశకళావంతులసభ మార్చి 25 వ తేదీని బందరుపట్టణములో శ్రీయుత భాస్కర్ల యీశ్వరుడిగారి అధ్యక్షతను జరిగినది. భీమవరపు దుర్గా ప్రసాదరావుగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. వారల యుపన్యాసములనుండి ఈ దిగువ భాగములు గమనింప తగ్గవి.

సంఘమునకుముందీ పదివత్సరములలో జరిగినమార్పు అత్యద్భుతము. విద్య ప్రబలుచున్నది. వివాహము లధికముగ జరుగుచున్నవి. గాని నైతికముగ నెంత బోధించినను విననివా రచ్చటచ్చట తమ బాలికలను పడుపువృత్తికి దింపనెంచు చుండుట యెంతయు సంతాపకరము. నయమున నెంత బోధించినను వినని వారి విషయమున కఠినచర్య నవలంబింపవలయునని యువకులు కుతూహలులగుచున్నారు. ఇది సమంజసమే. బాల్యవివాహములు జరుగకుండుటకై దేశీయు లెల్లరు పూనుకొని శారదాచట్టము ముసాయిదా జరుపుట కెంతో ప్రశంసనీయమగు పనిని జేయుచుండగా బాలికలను వ్యభిచారవృత్తికి ప్రేరేపించు అధమాధముల విషయమున మిన్నకుండుట కూడనిపని. కాని ప్రస్తుతచట్టము లిందుకు సహాయకారులుగ లేవు. కొన్ని చట్టములున్నను అవి నిరుపయోగములు. ప్రభుత్వ మీవిషయమున యుదాసీనము వహించకుండునటుల చూచుచు తగిన చట్టముల నొనరించుటకు దేశీయులు పూనుకొనవలయును.

కళావంతుల సంఘములు తగినపనిని జేయుచు ఎచ్చటెచ్చట ఎవరెవరు తమబాలికలను పడుపువృత్తికి దింప నెంచుచున్నారో, దించినారో వారిపట్టికలను సంపాదించవలయును. ఎంత బోధించినను వినని వారి విషయమున ప్రభుత్వదండనకు పాత్రులను జేయ బూనుకొనవలయును. ఇట్లు అచ్చటచ్చట జేయు

చుండిన గాని మూఢులకు బుద్ధిరాదు. శారదాచట్టము నందు బాల్యవివాహ మొనర్చిన పిమ్మటనే శిక్షార్హులైనటుల వ్యభిచార నిర్మూలచట్టములందు గూడ బాలిక వ్యభిచార మవలంబించిన పిమ్మటనే శిక్షార్హులగుదురు. ఇట్టివిధాన మవలంబించుటకు పూర్వము బాలికవయస్సు, పోషకులపేర్లు, తగిన సాక్ష్యమును సంపాదించవలయును. లేనియెడల హాస్యాస్పదులగుదురు. శిక్షను పొందుటకంటె శిక్షనుండి తప్పించుకొనుటకే వీళ్ళనేకములు ప్రస్తుత చట్టములందుండుటయే దీనికి కారము.

పూర్వ మేకారణములచే యీవృత్తిప్రబలినను యిపుడు దీని మనుగడకు కారణము కాన్పింపదు. బాలికలను పడుపువృత్తికి దింపనెంచుటకు కారణము మేళములు. ఇదివరలో యీనాములు కారణములుగ జెప్పివారు. శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారి నిరంతర కృషివలన ఆనెపము తప్పినదిగాన మేళములు పూర్తిగ బహిష్కరింపవలయును.

వ్యభిచారస్త్రీలు మేళములు చేయుచుండు నంత కాలము సంఘమునకు అగౌరవమేగాని కీర్తినున్న. కళను పోషింపవలయుననినచో వివాహితస్త్రీలు హరికథలు, పాటకచ్చేరీలు, జేయుచున్నటుల నృత్యవిద్య నభ్యసించి వివాహ మొనర్చుకొనిన అన్నిసంఘము లందలి స్త్రీలు మేళములు దేశగౌరవము కాపాడ

బడును గాని వ్యభిచారులను ప్రోత్సహించు నంతకాలము అగౌరవము తప్పదు.

పేరుమార్పు:—

మనలో కొందరికి కులనామము మార్పుచేయు విషయములలో భేదాభిప్రాయము లుండియున్నవి. కులనామమును మార్పుచేయకయే, కులమునకు కళంకముగానున్న యీ పడుపువృత్తిని నాశనముచేసిన చాలునని పెడివారలలలో నే నొకడను. కులనామము మారినంతమాత్రమున దానిని పట్టుకొనియున్న పడుపువృత్తి యను పిశాచము తొలగిపోదు. పడుపువృత్తి పిశాచము వదలిన కులమునకు కళంకములేదు. అప్పుడు మార్పునకు అవసరమగపడదు. మన శరీర మాలిన్యము పోవలయునన్న, స్నానము చేయవలయునుగాని, యితరులకు కనబడకుండ చాకలింటి క్రొత్తదుస్తులు వేసిన ఏమి ప్రయోజనము? ఈవిషయములో సోదరీమణులకు ఒక ప్రత్యేక విన్నపము. సోదరీమణులారా! మీ బిడ్డలు, పడుపువృత్తి యను కళంకముగల ఈ కులముపేరు చెప్పుకొనుటకు పరులు అవమానపరతురని లజ్జాభయములచే పీడింపబడు చున్నప్పుడు మీకేల జాలిరాదు? మీరేల ముందంజ వేసి, పడుపువృత్తినిమాని, కులముపేరు మార్చుటకు అవకాశ మిసుమంతయైన ఇయ్యక, భారతమాతకు గల కళంకమును ఏల తొలగింపరు? మీ బిడ్డల కొఱకై మీరు త్యాగము చూపించవలెనని నేను వినయపూర్వకముగ వేడుచున్నాను. పడుపువృత్తిని రూపుమాపుటకుగాను ఇటీవల మద్రాసు శాసనసభవారు క్రొత్తల్సు ఆక్టును ఏర్పఱచినారు. 1933 అక్టోబరునుండి ఆయాక్టు బెజవాడ, కాకినాడ మున్నగు కొన్ని మ్యునిసిపాలిటీలలో అమలులో నుండునట్లు గవర్నమెంటువారు ఒక ఉత్తరువును కావించినారు. ఆక్టుక్రింద కేసులు జరిపించుటకు ఆయా మ్యునిసిపాలిటీలలో విజిలెన్సు కమిటీలను ఏర్పఱచి, ఆ చట్టమును పోలీసువారు సరిగా అమలు జరుపుచున్నదియు, లేనిదియు కనిపెట్టుచుండవలెను. ఈవిధమైన కమిటీలు లేనియెడల ఆ చట్టము నామమాత్రముగనుండును. పడుపుటిండ్లలోనుండి తప్పింపబడిన బాలికల గతియేమి? శరణాలయములు (Rescue homes) లేనియెడల ఈ చట్టము నిష్ప్రయోజనము. కాబట్టి ప్రస్తుతము ఒకటియైనను తగు ప్రదేశమున ఏర్పాటుచేయుటకు గవర్నమెంటు వారిని కోరవలెను. మనముకూడ తగుప్రయత్నములు చేసి ఒక శరణాలయమును ఆంధ్రదేశములో నెలకొల్పవలయును. ఇది చాల ముఖ్యము.

*  *  *

ప్రతిదినము యీశ్వరసేవకై యెంతకాలము వినియోగించితిమి! పరమేశ్వర స్వరూపులైన మానవుల సేవకు మన మెంతకాల ముపయోగించితిమి యను విషయము చింతించుకొనుచుండినచో, కార్యోత్సాహులము కాగలుగుదుమని నా నమ్మిక. అట్లుగాక ఉదరపోషణకే మనకుగల కాలమంతయు వృధపుచ్చినచో మనకిచ్చిన జ్ఞానమును వినియోగించుకొనలేక మనలను మనమే వంచించుకొనువారల మగుదుము. జ్ఞానులు చెప్పిన మార్గములను, నియమములను అవలంబించి మానవజీవితము సార్థకమొనర్చుకొనుట మన విధియైయున్నది. కనుక మనము నిత్యానిత్య వివేకము, శమదమాది సద్గుణములు కలిగి పరమేశ్వరుని ముఖ్యవిధిగా ప్రతిదినము సేవించుచు నిత్యానందపదవికై ప్రయత్నింపవలెను.

(శ్రీమతి ఈదర సుబ్బమ్మగారి యువతీజన ప్రార్థనాసమాజాధ్యక్షోపన్యాసమునుండి—2-4-34)

—:o:—

# గ్రంథపరిచయము

### కార్మికసంఘ ప్రచురణము నెం 4:—

'ముసలివాని గతియేమి' అనుపేరుగల 14 పుటల కరపత్రము. తెనాలితాలూకా అనంతవరము నందలి కార్మికసంఘమువారిచే ప్రకటితము. గ్రంథకర్త శ్రీయుత ఆచార్యరంగా బి. యే. (ఆక్స్‌ఫర్డు) గారు. అవతల దివాణములు, యజమానులు; ఇవతల, బిడ్డలు, బంధువులు, మానవునిచేత జవసత్వములున్నన్నాళ్ళు పీల్చిపిప్పిచేసి పనిచేయించుకొని, మూలపడగానే గంజిపోయక దేశముమీదపడి భిక్షమెత్తుకుంటకు ధారపోసే దురాత్మ లేక నిరాత్మ జీవనమును నిరసించెడి చిన్నకథ. ఇట్టివారికి ప్రభుత్వమువారు పెన్షనివ్వాలని ఆచార్యులుగారివాదము. మనహిందూదేశప్రభుత్వమునకట్టి అయిశ్వర్యముకాని సంకల్పముకాని స్వరాజ్యం వచ్చేలోపల సంభవించదనుట రూఢి. దివాణాలు, యజమానులు తిరిగిచూస్తే దివాలెత్తుతామని భయపడడం మనంప్రత్యక్షంగా చూస్తున్నాము. కనుక పిచ్చమ్మలాంటి సంసారులు సూర్యంలాంటి చిన్నారిమనమలే వారికష్టాదు ఏడుగడలౌతున్నారీ దేశములో. ప్రతులు ఉచితముగా పంపబడును.

### నవ్వగలవా:—

18 పుటలు చిన్న హాస్యములపుస్తకము. వెల మూడుకాన్లు గ్రంథకర్త కె. వి. రంగారావు బరంపురం

### ప్రజాసేవ:—

వారమునకొకతూరి నెల్లూరునుండి ప్రకటింపబడు వారపత్రిక. సంపాదకులు శ్రీయుత ఘాలిసుబ్బరామయ్యగారు. హాస్యములు, వార్తలు, వ్యాసములు, సంపాదకీయములు మొదలగు తదంగములతోగూడి ముచ్చట లూరుచుండును. రెండవసంచిక యందలి మూవురు రెడ్లప్రశంస యందుత్పేక్ష లేదు. రైతుల దురవస్థలను యథాశక్తిగా ప్రకటించి తీర్ప యత్నించుచున్నది. చందా రు. 2—0—0

### చంద్రిక:—

చెన్నపురి ఆనంద ముద్రణాలయమునుండి ఈ ఉగాది నుండియు ప్రకటింపబడు మాసపత్రిక ఆంధ్రదేశమున అన్ని ప్రాంతములయందును పేరుప్రోసిన పండితవర్యుల వ్యాసములు ఇందు ప్రకటింపఁబడును. శ్రీయుతులు దోమా వెంకటస్వామిగుప్త, ఆదిభట్ల నారాయణదాసు, ఈ భాష్యకార్లు, బులుసు వెంకటరమణయ్య, జటావల్లభుల పురుషోత్తం, చిలుకూరి నారాయణరావు, వత్సవాయి నీలాద్రిరాజుగార్లున్ను శ్రీమతులు కంచనపల్లి కనకమ్మగారు, పులవర్తి కమలావతిదేవిగార్లును మొదలగువారు వ్రాసిన 20 వ్యాసములు, వివిధ మహాపురుషులయొక్కయు కట్టడములయొక్కయు 12 చిత్రములుకలిగి సుమారు 78 పుటలతో రాణించుచుండును. ఇట్టి సుప్రసిద్ధపూరుషులసు దరవ్యాసముల సంపాదించి ప్రకటించుచున్న సంపాదకుల సారస్వతసేవాభిరుచియెంతయు ప్రశంసనీయము. సంవత్సరచందా రు, 4—0—0 కార్యాలయము ఆనందప్రెస్సు, లోనుస్క్వేరు, మద్రాసు.

### ఆరామద్రావిడ:—

ఈ సంవత్సరము ఏప్రిల్ మాసమునుండి పశ్చమగోదావరి జిల్లా కాకరపఱ్ఱు గ్రామమునుండి వెలువడు సుమారు నలువదిపుటల మాసపత్రిక. సంపాదకులు శ్రీయుత పురాణపండ రామమూర్తి గారు. ఆంధ్రమండలములలో ఆరామద్రావిడ శాఖలోని స్త్రీపురుషులనేకులు విద్యలయందు, పాండిత్యమునందు, కళలయందు, కవిత్వమునందు, ఆధునికసంస్కరణ సంరంభములయందు మిగుల రాణగాంచుచున్నారు. అందునను కాకరపఱ్ఱుకేవలము విద్యాపీఠ మననొప్పును. కనుక

ఈ పత్రిక సాహిత్యప్రవాహమునందొక నూతనజీవనమును ప్రచురింపఁజేయునని ఆశింపవచ్చును. ఏప్రిల్ మాసపు ప్రథమకుసుమమట్టి పరిమళమును విరజిమ్ముచున్నదనియే చెప్పవచ్చును. పేరునుబట్టి ఇది సాంఘిక తత్త్వములనుగాని శాఖాభేదములనుగాని పెల్లగించి పెంపిల్లఁజేయునని అనుమానపడ నవసరములేదు. సకలాంధ్రజనుల సాహిత్యసేవలకును పత్రిక స్వాగతమిచ్చుచున్నను తచ్ఛాఖీయ యువకకవిశ్రేణికి ఇది గణుతింపరాని ప్రోత్సాహమునిచ్చి తన్మూలమున తచ్ఛాఖారామమునఁ చూచు వివిధ నూతనకుసుమ విశేషముల నేరి మాలలుగా గ్రుచ్చి ఆంధ్రసాహిత్య దేవత కంఠమునందు భూషణములుగా నలంకరించ గలదని నమ్ముచున్నాము. సంవత్సరం చందా రు. 1-8-0-లు. విడిపత్రిక రు. 0-2-0.

శ్రీరామ శతకము:—

క్రౌనుసైజు 21 పుటలు వెల రు 0-1-0. గ్రంథకర్త్రి శ్రీమతి మంచి సీతమాంబగారు. తెనాలి భారతీ ప్రెస్సులో ముద్రితము. ఆంధ్రభాషలో స్త్రీలు రచించిన భక్తిపూర్వకములగు శతకము లత్యల్పములు. శ్రీమతి సీతమాంబగారి కృతి అట్టి లోపమును పూరించుచున్నది. ఒక్కొక్క కందపద్యము పాఠకులను భక్తిపరవశుల నొనరించును. ఇట్టి శతకములను పఠించువారికి మోక్షసామ్రాజ్యము కరతలామలకమగుటలో అచ్చెరువేమి ?

చెన్న బసవపురాణము (వచనకావ్యము):—

డెమ్మీసైజున సుమారు 190 పుటలు. వెల రు. 1-0-0. గ్రంథకర్త శ్రీయుత అన్నదేవర నాగభూషణ రావుగారు. శ్రీ శైవగ్రంథమండలివారి ప్రథమ ప్రచురణము. హైందవపురాణము లెల్లయు సంస్కృతములో కాని పద్యకావ్యములలో కాని బద్ధములై ప్రజాసామాన్యమున కందుబాటులోలేకుండుట పెద్దలోపము. వయోజనవిద్య బహుళముగ వ్యాప్తమగుచున్న యీ దినములలో వాటినెల్ల వచనములలోనికి మార్చి ప్రజల కందించుట పండితుల కర్తవ్యము. గ్రంథకర్తగా రట్టిసేవ నొనరించినందులకు ధన్యులు. శైవమతమునకు సంబంధించిన అనేక కథ లిందుగలవు. అధునాతననాగరకులు వానిని పుక్కిటి పురాణములని కొట్టివేయుట సులభము కాని మానవునకు చిత్తసంస్కారము, ఆత్మజ్ఞానము, జాతీయతాభిమానము మోక్షప్రాప్తి గూర్చుటలో వానికీడైన యితిహాసము లేమియులేవు. ఇట్టి పుణ్యసాధనముల చేతనే భారతీయులు జైన బౌద్ధాది నాస్తికమతములను ఖండించి వైదికమతప్రతిష్ఠ నిలబెట్టి భారతసంప్రదాయములను పోషించిరనుమాట మరువరాదు. అప్పటికన్న ప్రాచ్య పాశ్చాత్యభావ ధర్మసంకరమగుచున్న యీ యుగములో యిట్టి గ్రంథముల యావశ్యకత మఱియు నెక్కువగానున్నది. హిందూమత పునరుద్ధారణమున కిట్టి గ్రంథము లెంతయు ఉపయోగించగలవు.

వివేకానంద పుస్తకభాండాగార నివేదిక:—

1929లో ఇది తణుకులో శ్రీయుత ముళ్లపూడి తిమ్మరాజుగారొసగిన 650 పుస్తకములు బీరువాలు మొదలగు పరికరములతోను ప్రారంభమైనది. 1930-లో ఇది తాలూకాబోర్డువారికి స్వాధీనపరచఁబడినది. బోర్డువారు ఒక లైబ్రేరియనును నియమించిరి. ఇప్పు డిందు 1000 గ్రంథములున్నవి. మూడు వార్తాపత్రికలు, 5 త్రిమాసపత్రికలు వచ్చుచున్నవి. 99 గ్రామములుగల యీ తాలూకాను బోర్డుఅధ్యక్షులు 19 సెంటర్లుగా విభజించి సెంటరుస్కూల్ల హెడ్మాస్టరులను కార్యదర్శులుగా చేసి వారిద్వారా అన్ని గ్రామములకు అందజేయుచున్నారు. చాలా సెంటర్లకు బంట్రోతులు ఏర్పాటు చేయఁబడిరి. 99 గ్రామములవారును జీవితసభ్యులుగాను చేరవచ్చును. మెంబరు సంవత్సరము ఒకటికి రు 3 లును, జీవిత సభ్యులు ఒకేసారి 35 లును చెల్లించిన చాలును.

ఇట్టి విధానమువలన వయోజనవిద్య అతిశీఘ్రముగ వ్యాపించఁగలదు. ఇతర బోర్డు లిట్టిరీతిగనే గ్రంథాల యోద్యమవ్యాప్తికి తోడ్పడును గాక !

భారతనీతులు:—

డెమ్మీసైజు 24 పుటలు. అనేక ధర్మములను గూర్చి వ్యాసముని చక్కని అభిప్రాయములను భారతములో విశదీకరించి యున్నాడు. కవిత్రయము వారు వానిని తెనిగించియున్నారు. కర్నూలుజిల్లా, జటప్రోలుసంస్థానం కొల్లాపురం స్నేహలతా కవితాసంఘమునకు చెందిన శ్రీమతి వాజపేయాజుల మహాలక్ష్మిగారు వాని నొక్కచో గూర్చి సటీకగా ప్రకటించినారు. బాలబాలికా పాఠశాలల కెంతయు నుపయోగించును. వెల రు. 0-4-0

పోతన్న భక్తివైరాగ్యములు:—

డెమ్మీసైజు 11 పుటలు. భక్తివైరాగ్యముల పాలవెల్లియగు భాగవతమునుండి కరడులనెల్ల గొని తెచ్చి యొకటఁజేర్చి పాఠకులకు శ్రీమతి మహాలక్ష్మిగారే యర్పించుచున్నారు. దీనిని భాగవతసార మనవచ్చును. వెల రు. 0-2-0 లు.

చిత్రప్రశంస:—

10 పుటలు 34 పద్యములు గల చిన్నగ్రంథము-లక్ష్మీ సరస్వతుల బొమ్మలు తిలకించుచు శ్రీయుత వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు రచించినది. శైలి సుమధురము-ఇదియును పై సమితి వారిచేతనే ప్రకటితము.

జ్యోతిర్మయి:—

క్రౌనుసైజు 20 పుటలు. గ్రంథకర్త శ్రీయుత శెట్టిపల్లి వేంకటరత్నం చౌదరిగారు. 'పవిత్రచరిత్రలగు హైందవ బాలవితంతువుల చరణారవిందముల' కిది 'భక్తి పురస్సరమైన యంకితము. ఇందు 13 చిన్ని ఖండకావ్య గీతమాలికలున్నవి. అన్నియు ఆంధ్రబాలికల ప్రబోధమునకొఱకే. సంయుక్త, జిజియా, రుద్రమదేవి మొల్ల మొదలగు వీరరమణీమణులు కవయిత్రులను గూర్చి పఠించునప్పుడు 'మేనం బులకలిప్పుడుం బొడమెడిని'. శ్రీయుత గరికపాటి మల్లావధానిగారి పీఠికయేమి, గ్రంథకర్తగారి యిష్టగోష్ఠి వాక్యములేమి గ్రంథమునకు తిలకప్రాయములై యున్నవి. చౌదరీ ఆనందవిలాసహోటల్ పవరుపేటకు వ్రాసిన ప్రతులు లభించును.

గ్రంథస్వీకారము:—

పురుషోత్తమ మహాత్మ్యము-గ్రంథకర్త శ్రీయుత చివుకుల వెంకటాచల శాస్త్రిగారు.

---

# నా వాంఛ

వఝ్ఝల వేంకటేశ్వరకవిగారు, బి.ఏ.

పూవులతోటగా విరిసిపోవఁగనిమ్ము ప్రపంచమెల్ల; నా
జీవిత మొక్కనిద్రవలెఁ జింతలెఱుంగని చిన్నిపుష్పమై
పోవఁగనిమ్ము; తీయఁదనముల్ గలతేనెలు గ్రుమ్మరించుచున్
లేవలపుల్ నిరంతరము నింపఁగ నిమ్ము రహస్యవైఖరిన్.




## పురుషులకు మేలిముసుగులు

అఖిలభారత హిందూ సాహిత్యమండలికి అనేక భాగములనుండి స్త్రీలు విచ్చేసిరి. వారెల్లరును శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతిగారి అధ్యక్షతక్రింద సమావేశమై అనేక స్త్రీసమస్యలనుగూర్చి చర్చించిరి. భారతదేశపు రాజకీయముక్తి స్త్రీల చేతులలోనున్నదని అధ్యక్షురాలు చెప్పిరి. ఆడవాళ్లకు ముందుగా ముక్తివచ్చినగాని భరతదేశమునకు రాదనిరి. మేలిముసుగులు తొలగించుకొని, శాసనసభలలోనికి వచ్చి, వివాహవిచ్ఛేదన స్వాతంత్ర్యము వారసత్వపు హక్కులనుగూర్చి చట్టములను ప్యాసు చేయించవలెను; కార్మికయువతులకు విద్య నేర్పించవలెను; స్వదేశీ పరిశ్రమలను పోషించవలెననికూడ చెప్పిరి. ఇందుకు పురుషసభ్యులెల్లరును తోడ్పడవలెనని శ్రీమతి గడోడియాగారు చెప్పిరి ఈ హక్కులకొరకు పురుషులను బ్రతిమాలుకొనక వారినుండి బలవంతముగా పెరుకుకొనవలెనని శ్రీమతి కుంతలకుమారిగారు చెప్పిరి. పురుషపత్రికావిలేఖరులనుగూర్చి శ్రీమతి లక్ష్మీబాయిగారు పరియాచకముగ మాట్లాడుచు వారికి తెరలు తగిలించి వారిని సభలకు బయటనుంచవలెనని చెప్పుటచే వారికి కోపమువచ్చి తమంతట తామే బయటకు నడచిరట!

## మసోదా పెళ్లిళ్లు

యుగోస్లేవియాలో ఉత్తరభాగములో క్రైస్తవమతాధికారులు మసోదాపెళ్లిళ్లు ముందుచేయుంచి, ఆసంబంధా లిష్టమైతే వాటిని ఖాయంచేస్తున్నారట. బడులలో చదువుకుంటున్న పన్నెండేసేండ్ల బాలికలకు ప్రధానములవలె యీ పెళ్లిళ్లు చేస్తారు. పిల్లతలితండ్రులే వారి కిష్టమైన పురుషుల నా బాలికలకు చూపించి ప్రధానంచేయిస్తారు. పిల్లకు పదహారో యేడు వచ్చేదాకానే యీ పెళ్లిళ్లు ఖాయం. తరువాత పిల్లలకిష్టమైతే అవే స్థిరమౌతాయట. లేకుంటే బాలికలు వాటిని రద్దుచేసుకొని వేరే పురుషులను పెళ్లి చేసుకోవచ్చును. పరింటతొమ్మిదిలో పిల్లలు చిన్ననాటి సంబంధాలకే ఒప్పుకొని సుఖంగా సంసారాలు చేస్తున్నారట. పదహారేళ్లలోపల పెళ్లిళ్లు చేయకూడదని ప్రభుత్వచట్టము లున్నవటకాని, ఈ మసోదాపెళ్లిళ్లు ఆ చట్టమునకు విరుద్ధముకాదనే అక్కడి పెద్దలు భావిస్తున్నారు! వీరు మన సనాతనులకన్న రెండాకు లెక్కువ చదువుకున్నవారే!

## చదువుకన్న సంస్కార మెక్కువప్రధానము

హిందూదేశస్థులకు చదువురాదు కనుక వారికి సంస్కరణము లీయరాదనీ, యిస్తే వారు యోగ్యులకు వోటునియ్యలేరనీ కొందరాంగ్లేయ రాజకీయవాదుల వాదము. ఈ వాదమును ఖండిస్తూ ఎడ్వర్డు విలియమ్సుగారు ఇట్లు చెప్పుచున్నారు. "చదువుకున్న ఆంగ్లేయులు మనుష్యుల మొగాలుచూచి, వారు చెందిన పక్షము పేరునుచూచి వోటిస్తారు కాని భారతీయులు రాజకీయసమస్యలనుగూర్చి ఆలోచించి తమ కనుకూలముగా ఎవరు పనిచేస్తారని తోస్తే వారికి వోటిస్తారు; లేనివారికి మానేస్తారు. చదువు రాకపోయినా వారి కీర్తి సహజసంస్కారము ఆంగ్లేయులకంటె ఎక్కువవున్నది కనుక మనకంటె వారే స్వపరిపాలన కెక్కువ అర్హులు." ఇంత చక్కటి తత్వం ఆంగ్లేయులందరికీ తెలియవలెనంటే యెన్నాళ్లు యెంత చదువులు చదువుకుంటే సాధ్యమౌతుంది! ఇంగ్లీషు ప్రభుత్వము వారికి కొంతవరకు తెలిసే నిర్బంధోచిత ప్రారంభవిద్య మన దేశంలో ప్రవేశపెట్ట నవసరము లేదనుకుంటున్నారు!

### పొగాకు ఎప్పుడు బాగా చెల్లుతుంది?

బీహారు భూకంపమువల్ల స్థితిమంతులు దరిద్రులై, దరిద్రులైన పాటకప్రజలు శ్రీమంతులవుతున్నారు. స్థితిమంతులంతా పూర్వము తమ ధనము పెట్టి పట్టణములలో ఇళ్లు, మేడలు కట్టించుకొని అద్దెలకిచ్చి సుఖంగా జీవించేవారు. వారు యిళ్లుకూలి దరిద్రులైనారు. ఇప్పుడు ఇళ్ళు క్రొత్తగా కట్టించవలసిన పని మస్తుగా తగలడంవలన కూలివాళ్లకు కంట్రాక్టరులకు మేస్త్రీలకు ధనము జాస్తీగావస్తున్నాది. ఈ కారణముచేత పొగాకు దిట్టముగా చెల్లుతున్నాదట!

### ఉద్యోగ సమస్య!

బ్రిటనులో వేయింటికి 932 పురుషులు, 912 స్త్రీలు చదువువచ్చినవారు. అమెరికాలో 955, 930. ఫ్రాన్సులో 965—940. జర్మనీలో 990—980. డెన్మార్కులో 996—995. జపానులో 995—996. ఇండియాలో 50—20!! చదువు యింత సన్నగిల్లివుంటే పత్రికలు విరివిగా చెల్లవని విచారించిన లాభమేమి? ఇక ఈ చదువుకున్నవాళ్లకైనా గుమాస్తావుద్యోగములు లేవు; చదువుకోని వారికి కూలిపనులుకూడా తక్కువైపోతున్నాయి. పూర్వము ఫలానజాతివాడు ఫలానిపని నేర్చుకొని చేయవాలనే సంప్రదాయముండబట్టి ప్రతీవానికీ ఏదో పనిలో నేర్పుండేది. ఇప్పుడాచారాలు తారుమారవడంచేత పూర్వపుపనులు చేయము. క్రొత్తపనులు రావు. నేర్చుకుంటామంటే ఎవరేపనికి పనికివస్తారో నిర్ణయించే సాధనాలులేవు. యువకుల తత్వాలు వారి వంశమునుపట్టీ, వారి యుపాధ్యాయులను భోగట్టాచేసి కనుక్కొనీ, పనిలో పెట్టి చూసీ, ఎందుకు పనికివస్తారో కనిపెట్టి అందులో పెడుతున్నారట అమెరికాలో. లండనులోకూడా 15,.16-వ యేట బాలబాలికలు బడులు మానగానే వైద్యపరీక్ష, మానసిక శారీరపరీక్ష చేయించి ఎవరెవరెందుకు పనికివస్తారో శోధించి వారినందులో ప్రవేశపెట్టిస్తున్నారట. మన దేశము గతిమాడండి! పేదవారి కెందులో కూలిపని దొరికితే అందులో దూరిపోవడము లేకుంటే పస్తుండడముతప్ప గతి లేదు. కాస్త భాగ్యవంతులై చదువుకుంటున్నవారు కూడ తా మెందుకొరకు చదువుకుంటున్నారో తమకే తెలియదు. ఇండియాలోకూడ "నేషనలు ఇనిస్టిట్యూటు ఆఫ్ ఇండియను సైకాలజీ" అని ఒక సంస్థ కలకత్తాలో ఉన్నదట. వారు 200 మంది కివిధముగా పరీక్షచేయించి వృత్తు లిప్పించారట. పాపము వారెంత అదృష్టవంతులై, పూర్వజన్మమునందు పెట్టి పుట్టినవారలో! వీరు చురుగ్గా పనిచేస్తే చాలా మందికి ఉద్యోగాలు ఇప్పించవచ్చునట! కాని అసలు ఉద్యోగా లెక్కడనుంచి తెస్తారని ప్రశ్న!

### ఇంటిపనుల చేయుటకు శిక్షణము

హిందూదేశములో ఏ అమ్మనైనా "ఏమమ్మా క్లబ్బుకు రావడంలే"దని అడుగుతే "తీరుబాటెక్కడమ్మా?" అంటారు. హిందూదేశపు స్త్రీలు సర్వకాల సర్వావస్థలయందూ నంటా పెంటా పిల్లాపాపా మొదలగు ఇంటిచాకిరీయందే నిమగ్నలై క్లబ్బుకు రావడానికైనా తీరుబాటులేకుండా వున్నారంటే చాలా విచారకరమైన సంగతి అని ఒకరు వ్రాస్తున్నారు. ఇల్లాంటివారు కూపస్థమండూకముల వలె యింట్లో కొట్టుకుంటూవుంటే మగలకు తగిన భార్యలుగా ఎట్లుండగలరని కొందరు పాశ్చాత్యవనితలకు ఆశ్చర్యకరంగా వుంటుందట. "లండనులో ఒక పూటకూళ్లమ్మ తన హోటలు వ్యవహారాలన్నీ చక్కపెట్టుకొనికూడా సాయంకాలమయేసరికి తప్పకుండా క్లబ్బుకు వెళ్లి తీరుతున్నదట. ఎంతోమంది వచ్చి భోంచేసిపోయే హోటలు చక్కపెట్టుకునే నేను క్లబ్బుకు వెళుతున్నానుగదా, పదిమందివున్న కుటుంబమును చక్కపెట్టుకొని క్లబ్బుకు వెళ్లలేకపోవడం ఆశ్చర్యంకాదా అని ఆమె అడుగుతున్నదట. క్లబ్బుకు వెళ్లేపాటి కాలమునైనా కుదుర్చుకోలేకుండా భారతస్త్రీలు ఇంటిపనులే చేస్తున్నారంటే, వారి కింటిపనులు చురుకుగాను చక్కగానూ చేయడం తెలియదనే ఆమె వుద్దేశం. ఆమె మన దేశం

వచ్చి స్త్రీలందరికీ యిల్లు సరిపెట్టుకోవడమును రింగుచి, క్లబ్బుకు వెళ్లడమును గురించీ మంచి శిక్షణ మిస్తుందేమో కనుక్కోవాలి!

## ప్రకటనల చెత్త

ఒక్క మన చెన్నపట్నంలోనే కాదు, ప్రతీ పట్నంలోనూ అంతే. గోడల వీధివైపున కెవ్వరైనా కాస్త సున్నం, సీమెంటు, గోబీ వేసేదాతలున్నా లేకపోయినా సినీమాపేపర్లు, టాకీపేపర్లు, మందుల ప్రకటనలు ఒకవరసన అంటించుకుంటు న్నేపోతారు. ఒకటి చిరిగితే ఇంకోటి సిద్ధం. కొందరు ఈ కాగితాల బాధపడలేక రంగులతోను కుంచెలతోను చిత్రవిచిత్రమైన అవినీతికరమైన బొమ్మలుకూడా వ్రాసుకొంటూపోతారు. పాపం చెట్లుచేమలకి, టెలిగ్రాములు, టెలిఫోను స్తంభాలకుకూడా ఈగతి తప్పదు! ఏదో ఒకబల్ల తగిలించేరన్నమాటే. కలకత్తా కార్పొరేషనువారు వీరి బాధపడలేక ఒకటే ఆర్డరు ప్యాసుచేసేశారు. తమ అనుమతిలేనిదీ, ఎవరెక్కడ దేని నంటించినా లేక చెక్కినా, లేక తగిలించినా పోలీసువారు పీకి పారేయవలసినదనిన్నీ, అటువంటి పనులుచేసే నేరస్థులనుపట్టి శిక్షించవలసినదనిన్నీ!! పట్నంసొగసు నీతిమాట దేముడికెరిక కాని వ్యాపారస్థుల గతి యేమికాను!

## బలవంతురాలు

"నాతో ఎవరైనా కుస్తీపట్టగలిగితే రండి. బస్తీమేసవాల్" అనుకుంటూ ఎర్నిను అనే కన్య టర్కీదేశమంతా తిరిగి, ఎవరూ రాకపోవడం చూసుకొని తారాబాయి రుక్మాబాయిలలాగ బల ప్రదర్శనంచేస్తూ పొట్టపోషించుకుంటున్నది. ఆమె సరాసరి 28 గుళ్లు తూగుతుంది. 50 పౌనుల గోదుమ బస్తాను నలుగురు మనుష్యులను ఆమెమీది కెక్కించుకోగలదు. పళ్ళతో ఒక గుడపమును పట్టుకొని ఇద్దరు మనుష్యులు వచ్చి దానిని చెరి యొకవైపు నుంచీ వంచవలెనని ఆజ్ఞాపించుతుంది. ఆడవాళ్లలో మాత్రం కోడి రామమూర్తిని పోలిన బలవంతులుండరా యేమిటి?

## బంగారు గోళ్లు

ఇదివరకల్లా పాశ్చాత్య సుందరీమణులు సెలూన్లకేగి క్షవరములు చేయించుకొని, కురులు దువ్వించుకొని, ముద్దలు మర్దనాలు చేయించుకొని, గోళ్లు తీయించుకొని వాటిమీద రంగులువేయించుకొని ఇళ్లకు రావడంతో సరిపోయేది. కాలంముదిరి నాగరికత హెచ్చౌతున్నకొద్దీ ఇంతతో తెమల్తుందా? ఇంతకన్న డబ్బు దండుగయ్యే సొగసులు రోజుకు రోజుకూ కనిపెడుతున్నారు. ఇంద్రధనస్సులోని రంగులన్నీ తెచ్చివేసినా అసలుగోళ్ళు కేవలము కృత్రిమగోళ్లలాగుంటాయా? ఇదేమిటి బాధ అని ఫ్రాన్సులో విలాసవస్తు వ్యాపారులు సెల్యూలాయిడు గోళ్ళు తయారుచేసి వాటిమీద విలవైన రాళ్ళు పొదిపి విక్రయిస్తున్నారు. ఫ్రెంచివిలాసిను లిప్పుడు వానినే ధరించెదరు. ఇంగ్లీషువా రంతకన్న భాగ్యవంతులు కదా! వారు వెండి, బంగారు, ప్లేటినములతో గోళ్ళు తయారుచేసి వాటిమీద నానారకముల విలువ గాళ్ళు తగిలించుతున్నారు. డబ్బుంటే చాలు ఎంత సొగసు నాగరికత వయ్యారము కావలస్తే అంతా కొనుక్కోవచ్చును!

## మళ్లీ ఆడవాళ్లకు వంటిళ్లేనా!!

జర్మనీదేశంలో హిట్లరుగారు పెండ్లిచేసుకోకుండా ఉద్యోగాలుచేస్తూ కూర్చుంటామనే స్త్రీలపై పన్ను వేసినాడు. పెళ్లి చేసుకొని ముగ్గురేసి, నలుగురేసి, అంతకంటె యెక్కువమంది పిల్లలు గన్నవారికి బహుమానము లిస్తున్నాడు. ఈవిధంగా రెండు ఉపకారాలు చేశాడాయన జర్మనీకి. మొదటిది మగవాళ్లందరికీ ఉద్యోగాలు చూపించడం, రెండవది ఆడవాళ్లందరికీ ఇంటియందు కుటుంబమునందు ఆసక్తి పుట్టించడం. పూర్వం ఆడవాళ్లూ మగవాళ్లూకూడా ఉద్యోగాలసంతలో దూరిపోవడంవల్ల ఎవరికీ కుదరక అంతా యేడుస్తూ, ఏమిస్తే దానితోటే సంతోషించేవారు. ఇప్పుడో సగముసరుకును ఇళ్లల్లోకి మరల్చి నందున తక్కిన సగానికి పుష్కలంగా జీతాలూ

కూలులూ యియ్యగలుగుతున్నాడు. పెళ్లి చేసికోని వాళ్లకు పన్ను తగిలించాడు కనుక సంసారాలేర్పడ్డాయి. సంసారంచేస్తే బిడ్డలుపుడితే వారిని పోషించలేమని యెక్కడ విచారిస్తారో అని యిద్దరు ముగ్గురు బిడ్డలదాకా మీరు పోషించుకోండి. తరువాత నేను పోషిస్తానని హామీయిచ్చాడా ధర్మదాత!

అయినా ఆధునిక సంస్కారప్రపంచ మూరుకుంటుందీ? ఆడవాళ్ళవిరోధి అని, స్త్రీస్వాతంత్ర్య విధ్వంసకుడనీ, మూఢాచార భూయిష్టమైన హిందూదేశంలోలాగ స్త్రీలకు మునుగులు తగిలించి నాలుగుగోడలలోకి తరిమి వంటాపెంటలలోను పిల్లలనుగనడములో నలిపి బానిసలుగా చేస్తున్నాడనీ ఒకటేయెత్తిపోతలు!! వీరికందరికీ సమాధానమిస్తూ జర్మనీమంత్రులలో నొక్కరగు డాక్టరు గోయిబెల్సుగారు అసలు యథార్థము నీవిధముగా చెప్పుతున్నారు. జర్మనీయుద్ధమునకుముందల్లా మగవాళ్ళు ఉద్యోగాలుచెయ్యడం ఆడవాళ్ళు ఇళ్ళుచక్కబెట్టి సంసారం వృద్ధిచెయ్యడమే మామూలు. సనాతనంనుంచి ఇదే ఆచారం ఇదే ప్రకృతిధర్మం. జర్మనీయుద్ధంలో కోట్లకొలది యువకులు పరలోకయాత్ర చేయడంచేతను, సంపాదించేదిక్కెవ్వరు లేకపోవడంచేతను, పాపం! ఆడవాళ్ళే ఆకాశీలలోజొరబడి ఉద్యోగములుచేసి యిల్లుకూడా చూసుకోవలసివచ్చింది. ఉపద్రవములు ఉప్పెనలు కలిగినప్పుడల్లా ఇల్లాగే సంభవిస్తుంది. ఎలాగైతేనేమి యిందులోనుంచి దేశాలుకొంచము తెప్పిరిల్లినవి. మగవారిసంఖ్య భర్తీఅయినది. ఉద్యోగాలుచేసి సంపాదించి మునపటిలాగే యిళ్ళునడపడానికి సమర్థులైనారు. అయితే ఆడవాళ్ళు తమస్థానాలలోనుంచి కదలి వీరికి సులభంగా ఖాళీచెయ్యమంటె ఖాళీ చేస్తారా? ఎవరిసొమ్ము వారు సంపాదించుకొని, ఎవరిష్టమువచ్చినట్లు వారుఖర్చుపెట్టుకుంటూ, అధికారంచలాయిస్తూ దర్జాగాబతకడం యెవరికిమాత్రం మక్కువకాదు? లేదా?

ఒక్క జర్మనీదేశంలోనేకాదు, అన్నిపాశ్చాత్య దేశములలోను, వాటిననుభవించగల్గిన ఆసియాఖండ దేశములలోనూ ఈ భావములే విషజ్వరములాగ అల్లుకొనిపోయినవి కాని జర్మనీలో అన్నిదేశాలకంటె యెక్కువఅయిందట!! దీనినుంచి నిరుద్యోగ సమస్యలు, దారిద్ర్యములు, దేశీయులలో దేశీయులకు ఒకదేశీయులతో ఇంకొక దేశీయులకు పోటీలు, కొట్లాటలు హెచ్చిపోయినవి. ఈ అరాచకమును సంస్కరించవలెనని హిట్లరు తలపెట్టినాడు. దేశమంతా అతనికి దన్నయినది. చట్టముమీద చట్టము చేస్తున్నాడు. దేశములోపంట, పనిముట్లు, వస్తుసామగ్రి, పౌరుషము, బలము, విద్య, సౌకర్యములు మొదలయినవి పెరిగి ఇది ఇన్నాళ్ళనాటి జర్మనీయేనా అనిపించుతున్నది. తమకు అన్యాయము తలబెట్టి అవమానపరుచుచున్న అంతర్జాతీయసమితిని ప్రతిఘటించి గడగడలాడించగల అదృష్టముపట్టినది నేడు జర్మనీకి!! ఎందుచేత? ఆడవాళ్లనాడవాళ్లస్థానంలోను మగవాళ్ళ మగవాళ్లస్థానంలోను నిలబెట్టుకోగలగడం చేతనేనట! ఉద్యోగాలు, రాజకీయములు, ప్రజాహితబహిరంగ జీవనము పురుషులవిగాను, గృహనిర్వాహణము స్త్రీధర్మముగాను నేడు జర్మనీదేశములో పరిగణింపఁబడుచున్నది. స్త్రీ పురుషుల నిజమైనబలము ఎవరిధర్మమువారు నిర్వహింపగలగడములోనే ఉన్నదని ఒకరిధర్మము నింకొకరు నిర్వహింపఁగోరుటలోనే వారి మనోదౌర్బల్యమున్నదనిన్నీ డాక్టరు గొయిబెల్సుగారు సమర్థిస్తున్నారు. పురుషులకు స్త్రీలయెడల నిజమైనగౌరవమున్నదా లేదా అని నిశ్చయించుటకొకటే సోదాఅట. వారు స్త్రీలను స్త్రీల కుచితమైన గృహనిర్వహణమునందేయుంచి ఉద్యోగపుసంతలలోనికి, రాజకీయకూపములోనికి, బహిరంగజీవనములోనికి రానీయకుండా చూడడమేనట. మన హిందూదేశపుఘోష లేక పరదాపద్ధతికంటె ఇది కొంచెము తక్కువకఠినమైన పద్ధతోయేమిటో ఆలోచించవాలి! తల్లీకూతురూ వన్నెకత్తెలయితే వండివార్చిపెట్టేవారెవరూఅని మగడూపెండ్లాముకూడా దేశో

ధ్ధరణాలేచేస్తూవుంటే ముందుకుకావలసిన పౌరులను, మగడూ పెళ్ళాలను, తలిదండ్రులను తయారుచేయు గల ధర్మసంస్థలెవ్వి? గృహములే. స్త్రీలే అట్టి పవిత్రవ్యక్తుల తరిబీతు చేయగల దేవతలని నాశిసిద్ధాంతము. కాని నవనాగరికులు దీనినెంతమాత్రము హర్షించరు.

## ప్రకృతి వికారాలు

మానవప్రకృతే చెప్పలేనన్ని వికారాలుండి ఫలానామానవుడి ప్రకృతి ఫలానామోస్తరుది అని నిర్ధారణచేయడం కష్టంకదా. మానవులను, జంతుకోటిని, స్థావరములను, పంచభూతములను, ప్రతినిత్యముకని పోయుచూ, పెంచుకుంటూ, చంపుకుంటూ వుండేప్రకృతికి వికారాలుండవంటే ఎవరునమ్ముతారు! తల్లి సారంకాకుంటే పిల్లలకు మరెవరిసారంవస్తుంది? మన వికారాలన్నీ వారసత్వేనా ఆవిడనుంచి వచ్చినవే కాదూ! ప్రకృతికి కొన్నిధర్మాలున్నాయనీ ఆధర్మాల ప్రకారమే అది వర్తిస్తూవుంటుందని హేతువాదులు చెప్తారు. ప్రకృతిఅన్నది మాయఅనీ అదిఏమిచేసినా చేయగలదనీ ఈశ్వరవాదులు లేక బ్రహ్మవాదులు చెప్తారు. మనుష్యులు ధర్మసూత్రములమీద వర్తిస్తే ప్రకృతికూడ అట్లే వర్తిస్తుంది; లేకుంటే వికారాలు పోయి వారినిశిక్షిస్తుందని మహాత్మునిబోలునీతివాదులు చెప్తారు. ఎవరివాదనలో నిజానిజములేమైనా ప్రకృతికి కొన్ని స్థిరమైనధర్మాలున్నవన్నమాట నిశ్చయమైనా, మానవుడికున్నట్లే దానికికూడ కొన్నివికారాలున్నాయి కనుక ఆధర్మానికి వ్యతిరేకంగా అగుపించేపనులు గారడీలలాగ అప్పుడప్పుడు మన కళ్లకు యెట్టయెదుట ప్రత్యక్షమయితే మనమాశ్చర్యపడనక్కరలేదు. ఇలస్ట్రేటెడు వీక్లి అను ఆంగ్లపత్రికలో ఒకదొరగారు మొన్నమొన్న జరిగినవని చెబుతూ యీ క్రిందిసంభవముల నుదహరిస్తున్నాడు; ఆశ్చర్యంపడితేపడవచ్చును కాకపోతే మానవచ్చును కాని అది నమ్మకపోవడానికి వీలులేదు. ఏమంటే అది వేదముకాదు, పుక్కిటిపురాణముకాదు, భేతాళుడి కథలుకావు.

ఒకసారి ఒకయెడారిలో ప్రయాణంచేయుచున్న వారికి గరికబయలు (Oasis) లేనిచోట గరికబయలు అవుపించింది. తీరాదగ్గరకు వెళ్ళేసరికి మళ్ళీయెడారి. నేలమీద పడవ తేలి నడుస్తున్నట్లు, పెద్దకోతో, ఎలుగుగొడ్డో, ఎదుటకనబడి దగ్గరకొస్తున్నట్లు, కొండ కాని పట్టణంకాని లేనిచోట కొండోపట్నమో తయారైనట్లుకనిపించుతే అదిప్రకృతివికారముకాదూ? న్యూఫౌండు ల్యాండుదగ్గర "మెయిదు ఆఫ్ సెంటు ఆర్లీన్సు" అనే పడవలో ప్రయాణంచేస్తున్నవారికి చూస్తూవుండగా ఏమీలేనిచోట ఒక మంచుగడ్డ గుట్ట (Ice berg) నీటిలో తేలుతూదానిదగ్గర ఒక పడవఆడుతూ అగుపించినవి. దానిదగ్గరకు పడవనడుపుతూవుంటే అదినిలువునా ఒక్కసారి కరిగిపోయిందట. మనహిందూదేశంలో ముక్తీకొండల దగ్గర ఒక ప్రకృతి శాస్త్రపరిశోధకుడు కొంచెము రోజుల క్రిందట ఒకచిత్రం చూశాడు:-ప్రతిదినమూతనయింటి దగ్గరనుంచి చూపుమేర దూరంలోవుండే ఒక చిన్న అరణ్యం ఒకనాడు తెల్లవారి లేచిచూసేసరికి మరి లేదు!! గతరాత్రి అరణ్యమున్నంతమేరకు ఒక భూకంపమువచ్చి చెట్లను మొక్కలను అన్నింటిని భూగర్భంలోకి తోసేసి, భూగర్భంలోవుండే గులకరాళ్ళుగల గొడ్డుభూమిని పైకి ప్రత్యక్షంచేసింది!! చూస్తూవుండగానే చెరువులు, నదులు, చిన్నసముద్రములు యెండిపోవడం కలదట! హెలుస్ట్రోము అను పేరుగల ఒక స్వీడేను దేశపుయింజనీరు సుడిగాలి తుపానులు వచ్చి 12 మొదలు 24 గంటలవరకు ఉండి సముద్రములోనికి చొచ్చిచొచ్చి నీటినినాలుగు వైపులకు చెల్లాచెదరు చేసి అడుగుమన్ను పైకి వెళ్లగిస్తూ అల్లకల్లోలము చేయుట చూచినాడట.

ఇక మెఱుములు పిడుగులు చేసేపనులు మరీచిత్రమైనవి!! మెరుపుదెబ్బలు పురుషులు స్త్రీలు కట్టుకొన్న బట్టలకు తగిలి బట్టలను తొలగించి వారినినగ్నులంచేసెనట; కాని వారికి మాత్రమపాయము కలుగలేదట! ఒకడు వుస్కీ తాగుతూవుంటే వాడిచేతిమీద కూజామీద మెఱుపుదెబ్బతగిలి దూరముగా త్రుళ్ళి.

పోయినదట!! ఒక వ్యవసాయకుని కొంటికణ్ణుకు తగిలి ముద్దముద్దయిపోయినదట కాని వారిద్దరికీ మాత్రము దెబ్బతగలలేదు! ఎస్సెక్సులో ఒకదినము మెఱుపుదెబ్బ తగిలి మండిపోతూవుంటే ఫైరింజనులు తీసుకొని వెళ్ళి ఆర్పిసారట!! మెరుపులు ఫొటోగ్రాఫులుకూడా తీయగలవట. పెద్దతుపాను పెట్టిందట ఒకప్పుడు. ఒక కూలివాడు వక్కసాపు షెడ్డులో కూర్చున్నాడు. దానికి మెరుపు తగిలి యిల్లుకూలిపోయింది రాత్రి. పాపము వాడు దానిక్రింద ఉండిపోయివాడు. కాని చావలేదు. తెల్లవారి అకూలిపోతున్న గోడలోనుంచి కప్పులోనుంచిబయటకివచ్చివంటికేమయి నా గాయాలు తగిలాయేమో చూసుకుంటూవుంటే వాడిగుండెల మీద మూడుబొమ్మ లవుపించాయి. రెండు యెదుట నున్న పైను, పొప్లారుఅను చెట్లవి- మూడవది తన వాచీది- షర్టు కొంచెము కాలిందట కాని శరీరానికి గాయాలులేవు. ఒక ఆవిడ ఆవుకు పాలు పితుకుతూ వుంటే మెరుపుదెబ్బతగిలి ఆవు చచ్చిపోయినది. ఆమెకు స్మృతి తప్పిపోయినది. తెలివివచ్చి శరీరాని కేమైనా గాయాలు తగిలాయేమోఅని బట్ట సవరించు కుంటూ చూచేసరికి ఆ ఆవుయొక్క ఫోటోగ్రాఫు ఆమెశరీరం నఖశిఖపర్యంతం పడ్డావట-కాని ఆమెకు హానికలుగలేదు. గాలిలోనుంచి భూమిమీదికి విద్యుచ్ఛక్తి తాపీగాపడుతూవుంటే నిప్పురవ్వలు పెద్దబంతులులాగ కూడ పడతాయట- 1852 లో ప్యారిసు నగరములో ఒక దర్జీవాడు తన కొట్లో పంట్లాలు కుట్టుకుంటూవుంటే సీమరేగుపండంత పరిమాణము గల ఒక విస్ఫులింగం తలుపుసందులోనుంచి యింట్లో కివచ్చి అతనిని గదల్లా వెంటపెట్టిందట- వాడు భయపడి భావురుమని పదిమందినీ సహాయమునకై పిలచే టప్పటికి, ఇకచాల్ను విద్దులాట అనుకొని కాబోలును చిమ్నీలోనుండి పైకెగిరిపోయి ఇంటికప్పు చేరగానే ధామ్మని ఒకధ్వని చేసిందట- ప్రకృతి యిల్లాటి వికారాలు చేస్తున్నప్పుడు మన మూరుకుంటే సరేసరి. లేక దాని వికారాలకు సాయం మనవికూడా చేర్చి వినోదించు దామనుకుంటే అది కొప్పక తగిన శాస్తి చేస్తుంది. ఇద్దరు ఫ్రెంచిపిల్లకాయలు ఒక గుఱ్ఱపు సాలలో ఆడుకుంటూవుంటే శ్యామలవర్ణముగల చక్కని నిప్పుబంతియొకటి అందులోకివచ్చి యెగురు తుండెను. వారిలో నొకడు దానిని పట్టుకున్నాడు. పట్టుకొనేసరికి చేతులు కాలినవి. పెద్ద చప్పుడయి నది, మంట లెచ్చయినవి. శాంత మహాసముద్రములో తరుచు గా నీరు అప్పుడప్పుడు, ఉండిఉండి ఒకస్తంభాకారంతో మీదికి ఉబికి కొంతసేపు అల్లాగే వుంటూవుంటుందట- కాని అల్లాటివి నాలుగుస్తంభాలొక్కసారి లేచి సముద్ర మట్టమునుంచి ఆకాశంలో దూసుకుంటూ మేఘములమీదుగా నిగిడి ఎంతోసేపు వుంటే కొంతమంది పడవప్రయాణీకులు చూచి ఆశ్చర్యపడ్డారు.

మెరుపులతోటి, నిప్పులతోటి,నీళ్ళతోటిమాత్రమే కాక వర్షంలోకూడ ప్రకృతి అప్పుడప్పుడిల్లాటి చిత్రాలు చేస్తుందట- ఎఱ్ఱనీటివర్షము, పసుపునీటి వర్షము, పచ్చనినీటివర్షం, నల్లనినీటివర్షం అక్కడక్కడ కురిసినట్లు వింటున్నాము. నార్వేదేశంలో ఒకసారి బ్రతికివున్న యెలకలే వర్షంలాగకురిశాయి!! నేపిల్సులో నారింజపండ్లు యెడతెగకుండాకురిశాయి!! ఎటువంటి గారడీవాణ్ని పిలవండి వాణ్నిమించిన గారడీలు చేస్తునేవుంటుంది ప్రకృతి. ఎంత వస్తుశాస్త్రవేత్తను పిలవండి, వాని కవగాహనము కాని పనులు చేస్తూనేవుంటుంది. ఎక్కడేనా మన బడాయిలు చెల్లుతాయి కాని మహాశక్తి ప్రకృతి మాత దగ్గరనా !

## సూర్యచంద్రులు చల్లబడుతున్నారు.

సూర్యచంద్రు లిద్దరూ కూడా ఉదయాస్తమయములయందు మునపటిలాగే ఋణిగ్గా కనిపించకుండా అతిరొఱ్ఱగాను నిస్తేజముగాను అవుపించుచున్నారట- విశాఖపట్టణములో. దీనిని బట్టి అప్పుడే యేదో ఉప్పెన సిద్ధమౌతున్నాదని పల్లెవాళ్ళు పట్నాలవాళ్ళు లెఖ్ఖలు కట్టుకొని బెంగపెట్టేసుకుంటున్నారు- ఈమాట విన్న మర్నాడు కొందరు చెన్న

పట్టణంవారు ఈబింబాలను పరిశీలించి మాకు కూడా అలాగే అవుపిస్తున్నట్టున్నదన్నారు. ఈసంగతి వినని వాళ్ళు ఇంకా చూడలేదు. చూచినా, ఎవరైనా చెప్తే కాని పోల్చుకోలేనివారు చాలామంది!!

## కోతిఉద్యోగస్థులు

డార్విను ఊరికే చెప్పేదూ మనిషి కోతిలోంచి పుట్టాడని. మనకీ వాటికీ జ్ఞాతి వైరమున్నది. కాకుంటే ఈఉద్యోగాల కఱవుదినాలలో మనుష్యులు చేసేకొన్ని వుద్యోగాలలోకి కోతులు దూసుకొని వచ్చి వారికంటె బాగా నిర్వహించి వారిని త్రోసి రాజు చేయడ మేమిటి? సయాములో కోతులను కేషియరులు (షరాబు) గా వేసుకుంటున్నారట- ఎవరైనా వెండినాణెం చెల్లించగానే ఇవి కొరికి చూచి మంచివెండి అయితే వుంచుకొని చెడ్డదైతే విసరికొడుతున్నాయట!

## అయిరోపాలో కూడా విధవలెందు కెక్కువుండాలి?

అయిరోపాదేశంలో కూడా పెళ్లాలు చచ్చిన మగవాళ్లకంటె మొగుళ్ళు చచ్చిన ఆడవాళ్లే ఎక్కువట. విధవావివాహములుగల దేశములలో ఇది ఆశ్చర్యముకాదా. యుద్ధపుదర్శిలానంటే మగవాళ్ళు తక్కువై విధవ లెక్కువైనారు కాని యిప్పుడు కూడా తగ్గకపోవడ మేమిటి? అందులోనూ భార్యాహీనులకంటె వీరిసంఖ్య ఇంత హెచ్చుచుండడ మేమిటి అని డాక్టరు ఇ.వి. ఏలెనుగారు ఆలోచించి పరిశోధనలు సల్పి పురుషుల జీర్ణకోశములు, ఊపిరితిత్తులు, మెదడు మొదలైనవి దుర్బలములైనవనిన్నీ అందుచే వారికి వేగము రోగములువచ్చి చత్తురనిన్నీ స్త్రీలు పురుషులకంటె సహజముగ ఆరోగ్యశాలురగుటచే వైధవ్యమనుభవించుచు బ్రతుకుచున్నారనియు తీర్మానమునకువచ్చిరి!

## తద్దినాలు నిజంగా పెట్టాలా?

భౌతికశాస్త్రజ్ఞాన మెంతసేపూ టెలిగ్రాఫులు, టెలిఫోనులు, వైరులెస్సులలోనే సరిపోతున్నది కాని, ఇంతకు కొంచెం పైకెగిరి చనిపోయినవారితో సంభాషించి రమ్మంటే దానికి చేతకాదు. కాని దమ్మిడీ ఖర్చు అక్కరలేకుండా చనిపోయినవారితో మాట్లాడుకోగల సదుపాయాలు కలకత్తాలో జరుగుచున్నవట. ఈమధ్యన శ్రీమతి సరస్వతీదేవిగారు స్వర్గీయాంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో మాట్లాడి తెలుసుకోవలసినటువంటి అనేక ధర్మాలతనివద్దనుంచి తెలుసుకొని ఆంధ్రమహాజనుల ఆనందంకొరకు పంద్రంగి కేశవరావుగారి ద్వారా పత్రికలలో ప్రకటించినారు.

పై సంభాషణనుబట్టి ఒక్క సంగతి స్పష్టమాతున్నది. తద్దినాలు, ధర్మోదకాలు జరపకపోతే పితృదేవతలకు సుఖముకాని తృప్తికాని చిక్కదట. పితృదేవతలకు తద్దినం మంత్రాలు లేకుండా బ్రహ్మసమాజంవారిలాగ ఉట్టుట్టి పాటలూ, పద్యాలు, ఉపన్యాసాలూచేస్తే అందులో యేమీ రుచివుండ లేదట- వేడివేడిగారెలూ, జారుజారుగా నెయ్యికలిపిన పెసరపప్పు పారణంముద్దలు దర్భదబ్బలతో కూడా సంస్కృతం మంత్రాలు చదివేటప్పటికి కాని చచ్చిన సుఖమెక్కదట-

ఈ తద్దినాలను గురించి చాలా కష్టంగావుంది. తద్దినాలనాడు ఉద్యోగస్థులకు శలవులు దొరకవు. ఇంట్లో ముసలవ్వలు పెందలాడే తెమలలేరు. కర్త కాఫీ ఇడ్లీ తినందే ప్రొద్దెక్కేదాకా కనిపెట్టుకొని వుండలేడు, భోక్తలు తొమ్మిదిగంటలు కొట్టకుండగావంచా లెండవేసుకొని యెప్పుడు మెతుకులు పడునా దేముడా అని అరుగులపై యేడ్చుచుందురు. మంత్రబ్రాహ్మణుడు నాలుగుగుక్కలలో మంత్రమంతా యాకరువు పెట్టిస్తాడు. ఎన్ని అనాగతాలైనాపడి యీపారణంముద్దలే తింటాము కాని సంధు సంస్కారులు చేసేమోస్తరుగా తెలుగు ప్రార్థనలు, ఇస్త్రీబట్టలతో భోజనాలు, మైసూరుపాకు, పులిహోరి, ఉల్లిపాయల పకోడీలు, ముల్లంగి పులుసు, వంకాయ పెరుగు పచ్చడి మాకు సాయించవంటారాయె ఆపితృదేవతలు. ఇది కేవలం ఆంధ్రరత్నగారి వ్యక్తిగతాభిప్రాయము కాక పితృదేవతల కందరికీ ప్రతినిధిగావచ్చి యీఅభిప్రాయం చెప్పుచున్నట్టున్నది. ఐతేమాత్రం భౌతికవిజ్ఞానశాస్త్రపారంగతుల మైయుండి కూడా మనమటువంటి పుకారు కబుర్లను నమ్మితే మనకెక్కడనైనా పరువుంటుందా?




**నేనొక్కడనే సత్యాగ్రహిని:—**

పై వాక్యము నుచ్చరించుచు మహాత్ముడు వ్యక్తి శాసనోల్లంఘనమునుగూడ విరమించి దేశమును పూర్తిగా సక్రమాందోళన పరుల వశముగావించినాడు. నిజమైన సత్యాగ్రహి చేయగలదింతకన్న గత్యంతరములేదు; కామ క్రోధలోభ మోహమద మాత్సర్య వర్జితులై యెదటి కక్షివారిపై కూడ ప్రేమగల్గిన మహోదార మనస్కులే సత్యాగ్రహము చేయుట కర్హులు. ఇక్ష్వాకులనా డట్టివారు వందలకొలదియైననుండిరేమో కాని యిప్పుడు దేశమెల్ల గాలించినను పట్టుమని పదిమందియైననున్నారేమో తెలియదు. వేలకొలది జనులు వందలకొలది నాయకులు జెయిళ్లకు పోలేదా, లాటీదెబ్బలు తినలేదాయనినచో వారి దేశాభిమానము, త్యాగము, సహనము, స్వాతంత్ర్యాభిలాష, దీక్ష ప్రశంసనీయములే కాని వారి యాధ్యాత్మికాధికారము ప్రశ్నింపదగియేయున్నది. వారు దానిని కాలానుగుణ్యమైనట్టియు పరిశుద్ధతరమైనట్టియు, కొంత చిత్త సంస్కారకరమైనట్టియు ఆయుధముగ పరిగణించి ఉపయోగించగల యంత యోగ్యముగ ప్రయోగించిరి. అంత వరకు వారు ప్రశంసార్హులే. ఉప్పు, కారము, పులుసు తినుచు ఆర్థికసంపత్తికొఱకుమాత్రమే స్వరాజ్యము కాంక్షించుచున్న వేలకొలది లక్షలకొలది జనులను ఋషీశ్వరులకుకూడ సాధ్యాసాధ్యమైన అధికారులు కావలెననిన అది గొంతెమ్మకోరిక కాని వేఱుకాదు. జన సామాన్యమునంతటిని శోధించి అంతమందియు సమూహముపై నట్టివారు కాలేరని తెలుసుకొని, వ్యక్తులలోనైన నట్టివారుపలువు రుందురనుకొని వ్యక్తిపరముచేసెను. వ్యక్తులలోకూడ కావలసినచో మరినాలుగునెలలు జెయిలులో కూర్చొనగోరువారు మాత్రమే కలరు కాని తానుతలచిన ఆధ్యాత్మిక యోగులు లేరని తెలుసుకొనెను. వారూ, వీరూపోగా ఇకమిగిలినవారు తనసత్యాగ్రహాశ్రమవాసులు. వారేమో తన కండ్లయెదుట తరిఫీదయిన శిష్యవర్గమగుటచేత తక్కిన నాయకులకంటె శిష్టులనితలచి రాజేంద్ర బాబుగారి సలహాపైని క్రొత్తగా జైలు నుంచి వచ్చిన శిష్యవర్గమును పిలిపించి వారితో నాలోచించెను. వారిలో నుత్తము డని తాను నమ్మిన యొకమిత్రుడు తాను జెయిలులో నుంటినేగాని జైలుపనులకంటె తనపుస్తకములు తన చదువు తన జ్ఞానోపార్జనమొదలగువానియందే యెక్కువ ఆసక్తి

కలవాడననియు తనకుగల యీలోపము మహాత్మునకు తెలిసియే యుండవచ్చుననియు వ్రాశుచ్చెను. జెయిలులోనుండగా జెయిలు పనులయందుకంటె యితరములందెక్కువ శ్రద్ధ పెట్టుకొనుటయు సత్యాగ్రహ సిద్ధాంతమునకు విరుద్ధమట. ఇంతటిగొప్ప సహచరునియందే యిట్టి లోపముగలదని మహాత్ముడిన్నాళ్లును తెలిసికొనలేని తనయంధత్వమునకు నగచి ఎవరివద్ద నెట్టి లోపములుండునోయను భయమున తా నొక్కడనే సత్యాగ్రహిగా నుందుననియు ఇతరులెవ్వరు తన యనుజ్ఞలేనిదే సత్యాగ్రహము చేయరాదనియు ఆజ్ఞాపించినాడు.

సత్యాగ్రహమును విరమించుటకు కారణము సత్యాగ్రహులులేమి యొక్కటియే కాదు. రెండు పార్టీలవారికిని సత్యాగ్రహమునందు గౌరవవిశ్వాసములులేనిచో అది వెంటనే క్రియకట్టదు. మానవత్వము మహాపూజ్యమైనదనియు, అజ్ఞానదురాశాపిశాచములావేశించి మానవుల నప్పుడప్పుడు రాక్షసతుల్యులుగా నొనరించినను నిజమైన సత్యాగ్రహి చూపు త్యాగసహనాది సద్గుణప్రదర్శనములవలన అది సంస్కరింపబడి దైవత్వతుల్యమగుననియు అతని విశ్వాసము. కాని ప్రభుత్వమునకు సత్యాగ్రహముయెడ నెట్టి గౌరవమునులేదని స్పష్టమయ్యెను. ప్రజల అహింసాపరాయణత్వమును అవకాశము చేసుకొని వారు హింసాశస్త్రములను మఱింత ఘోరముగ ప్రయోగించ మొదలుపెట్టిరి. సమాధాన మార్గము స్వయంవినాశకపథమనియే చర్చిలు హోరుప్రభుతులనమ్మకము. గుండ్రబల్ల సమావేశము కపటనాటకసూత్రమాయెను.

పోనీ మనదేశీయులకైన సత్యాగ్రహము యెడల గౌరవముగలదా యనిన అదియు శుద్ధ శూన్యమని స్పష్టమయ్యెను. కాంగ్రెసువారు సభలను బహిష్కరించుటయే తడవుగ స్వార్థపరులు ప్రభుత్వమునకు మఱియెంతదన్నయి ఊహింపసాధ్యముకాని ఘోరచట్టములకు వోటులనిచ్చి ప్యాసుచేయించిరి. ముసల్మానులు బిఱ్ఱబిగిసి ప్రభుత్వపక్షములోనే దూరి యెక్కువ సంరక్షణములను సంపాదించుకొనిరి. మహాత్ముని పద్ధతులయందెన్నడు విశ్వాసములేని విప్లవవాదులు దౌర్జన్యపద్ధతులను విసర్జించకుండుటలో ఆశ్చర్యములేదు. ఇవతల సత్యాగ్రహులు తక్కువయై, అవతల రెండు పార్టీలవారికిని జరుగుచున్న పాటి సత్యాగ్రహముయెడలనైనను గౌరవముతక్కువైనప్పుడు "నేనొక్కడనుతప్ప మఱెవ్వరును సత్యాగ్రహము చేయరా"దని మహాత్ముడు శాసించుట సముచితముకాక వేఱేమి?

అయినను సత్యాగ్రహమునకు మూలపురుషుడైన మహాత్మునకు సత్యాగ్రహమునందు పూర్ణవిశ్వాసమెన్నడును చెడదు. ప్రపంచమునెల్ల ధ్వంసముచేయుచున్న జాతీయ వ్యాపారిక రాజకీయ సామ్రాజ్యదురాశాపిశాచములను, శాస్త్రీయ హింసాప్రధాన మారణశస్త్రాస్త్ర క్రూరప్రయోగములను పటాపంచలు చేయగలశక్తి, సత్యాగ్రహమునకు మాత్రమే యింకను గలదని అతని విశ్వాసము. సత్యాగ్రహాస్త్రప్రయోగమునందు తన కితరులకంటె నధికతరపాండిత్యము

కలదనియు తానింకను దానినిఁ శోధించెద ననియు నతడింకను భీష్మించియున్నాడు. తన యత్నమునందు విశ్వాసములేనివారికి తమకుతోచిన రీతిని దేశసేవ చేసుకొనవచ్చు ననిచెప్పి ఆశీర్వదించి తనకు సాధ్యమైనంత సహాయమును చేయుదునని వాగ్దానముచేసి నాడు. మహాత్ముడొనరించిన యీవ్యక్తి శాసనోల్లంఘనవిరామమునందు సంతసింప వలసినదెంతో విచారింపనలసినదెంతో ఆలోచించవలసియున్నది. ప్రభుత్వమునకు, శాసన సభ్యులకు, విప్లవకారులకు, సాంఘికవాదులకు నేడైనను మహాత్ముడారాధించుచున్న సత్యదయాశౌచాది సద్గుణపరంపరలయందును ప్రాపంచిక శ్రేయోభిలాషయందును, సర్వమానవ సౌభ్రాతృత్వమునందును విశ్వాసముకుదిరి ఒకరితోనొకరు సౌమ్యభావముతో సంప్రదించుకొని లోకకళ్యాణకరమగు మార్గమును త్రొక్కగలిగిరా సరే, లేనియెడల మహాత్ముని ప్రాణములకును, తన్మూలమున తక్కిన మానవకోటియొక్క డెందములకును, బీహారు భూకంపమును వేయిరెట్లు మించిన యెట్టి సంచలనము కలుగగల దుర్భర పరిస్థితులు మూడనున్నవో ఊహింపనైన సాధ్యముకాదు.

ఆంధ్రరాష్ట్రపు టుత్తరసరిహద్దు:—

ఉత్కళులు తమకు ప్రత్యేకరాష్ట్రముండవలయునని కోరుట సహజము. ఆంధ్రులెల్లరును వారి కోరికయెడల సంపూర్ణ సానుభూతిని చూపుచున్నారు. అయినను ఉత్కళరాష్ట్ర సమస్య అంత సులభమైనది కాదు. "సన్యాసి వాని పెండ్లికి జుట్టుదగ్గర నుంచి యెరువే" అనునట్లు ఉత్కళరాష్ట్ర నిర్మాణమునకు మొదటినుంచి చివరవరకు నన్నియు యెరువులే. మొట్టమొదటిలో అది పేదదేశము; ప్రత్యేక రాష్ట్రమును భరించగల శక్తి చాలదు. అయినను భరతదేశ ప్రభుత్వమువారు సింధురాష్ట్రమునందువలె వారియెడలకూడ పక్షపాతము వహించి, రాజకీయకారణములవల్లనైననేమి యితర కారణములవల్లనైననేమి, వారికి రాష్ట్రము నొసంగి దాని కగువ్యయములో కొంత భాగమును అఖిలభారత దేశపు ఖజానానుండి సర్దుట కంగీకరించినందువలన వారు కృతార్థులయిరనియే చెప్పవలెను. ఖర్చులనిన ప్రభుత్వమువారు కొంత భరించగలరు కాని భూమి యెక్కడనుంచి తేగలరు? శ్రీయుత గిడుగు రామమూర్తి పంతులుగారు చెప్పినట్లు వారు అసలు ఒడ్డీలు—గంజాం మండలమున వారిని ఒడ్డివాండ్రందురు—ఒడ్డీలనగా వేరువేరుస్థలముల వ్యాపించియున్నవారని యర్థము. హిందూదేశపుచరిత్ర మధ్యయుగములో నెన్నడో వారు ఉత్తర హిందూస్థానమునుండి వచ్చి కొందరు బంగాళమునందు కొందరు బేహారునందు కొందరాంధ్రమండలములయందు చెల్లాచెదరై వ్యాపించిరి. ఒక్క కటకప్రాంతమునందు తప్ప మరెచ్చటను వా రధికసంఖ్యాకులు కారు. ప్రత్యేకరాష్ట్రము చేయవలెనన్న ఈ మూడు రాష్ట్రములనుండి కొన్ని భాగముల నిందు చేర్చవలెను. బంగాళా బేహారు రాష్ట్రములవారు తమసీమలకు చెందిన కొన్ని తునకల నిందు కర్పించుట కంగీకరించలేదు.

ఎటునుంచి వచ్చినను మన ఆంధ్రు లొక్క రనాథలుగ గనపడుచున్నారు. వీరి దగు గంజాం మండలమునుండి బరంపురం, ఛత్రపురం మొదలగు భాగములను ప్రభుత్వమువారు కాబోవు రాష్ట్రములో చేర్చినారు. ఇది మదరాసు శాసనసభవారి తీర్మానమునకు విరోధము. ఏ కమిషనువారు కాని దీనిని సంపూర్ణముగ నంగీకరించలేదు. ఋషికుల్యానది మొహిరీకొండల కుత్తరభాగములయందుండు భూమియే శుద్ధ ఉత్కళము. తక్కిన భాగములందెల్ల ఆంధ్రులు తక్కిన లకంటె నెక్కువగ ఉన్నారు. పర్లాకిమిడిలోని కొన్ని భాగములనైన ఉత్కళములో చేర్చవలెనని పర్లాకిమిడి రాజావారు మొండిపట్టుపట్టి భూస్వాముల సంఘములోని కొందరిచేత గవర్నరుగారి కొక రాయబారము నడిపించినారు. వీరిపూర్వు లెన్నడు నిట్టి విపరీతపు కోరికలు కోరలేదు. బలవంతముమీద యెక్కువమందిఆంధ్రుల నుత్కళరాష్ట్రములో గ్రుక్కలేని వీరు క్రొత్తరాష్ట్రమునకు గుండెలమీదికుంపటియై వదలించేవరకు అసంభావ్యమగుదురు. గంజాంమండల ఒడ్డీజమీందారు లెల్లరును శ్రీమంతులము మనమన్నమాట సాగును గదా యని యిచ్చవచ్చిన ప్రచారములు చేసి ప్రభుత్వమునకు కన్నుగప్ప జూచుచున్నారు. మదరాసు ప్రభుత్వమువారు కాని భారత ప్రభుత్వమువారు కాని పార్లమెంటువారు కాని ఇట్టి వెఱ్ఱిమొఱ్ఱి ఆందోళనలను లక్ష్యముచేయరని నమ్ముచున్నాము. అయినను విరామములేని ఆందోళనముచేసి ప్రభుత్వమువారికి సర్వదా సత్యము తెలియఁజేయుచుండవలసిన బాధ్యత ఆంధ్రులపైనున్నది.

వయోజన విద్య:—

ఇది ప్రజాయుగము, ప్రజాసంస్థలయుగము ప్రజాపరిపాలనముల యుగము. మంత్రులనే కానిండు ప్రెసిడెంటులనేకానిండు ఆఖరుకు డిక్టేటరులనేకానిండు వారే యెన్నుకొనవలెను. ఎటువంటి సర్వాధికారియైనను తనస్థానగౌరవమునకునుస్థిరత్వమునకును నిరుపేదవాని పర్ణకుటీరము చెంత వాని వోటుకొరకై అభ్యర్థిగా నిలువవలెను. రాజ్యాంగచక్రములు ఆర్థికసంస్థలు, చివరకు మతధర్మములుకూడ జనతరంగములెట్లాడించిన నట్లాడవలయును. పాశ్చాత్యదేశములలోను జపానులోను 1000 కి 900 మందికంటె నెక్కువగా స్త్రీపురుషులకు విద్యవచ్చును. భారతదేశము 1000 కి 50 మంది పురుషులు 20 మంది స్త్రీలుమాత్రమే చదువువచ్చినవారు.

ఆంధ్రులెల్లరికి చదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట, సామాన్యముగ నవసరమైన లౌకికజ్ఞానమును శాస్త్రజ్ఞానమును ఆధ్యాత్మికజ్ఞానమును నేర్పుటకు శ్రీయుత కె. బి. బాబురావు యమ్. ఎ. బి. యల్., (ఏలూరు, జిల్లామున్సిఫ్) గారు ఒక చక్కని విధానమును నాలుగుపుస్తకములలో నిడిమిచ్చి వ్రాసినారు. మూడునెల లీవిధానము ననుసరించి తగినవారు నేర్పిరేని మనదేశపు జానపదులకు, కార్మికులకు, కర్షకులకు హరిజనులకు, ఇంకను వెనుకబడిన జాతులవారి కెల్లరికి యీ జ్ఞానమును ఒలిచిన యరటి



జయవంతిటాకీసువారి 'ధ్రువకుమార'లోని యొక దృశ్యము.



శ్రీ దేవికన్య 'ధ్రువకుమార' నాటకములో నతిమనోరమైన పాత్ర.

పందువలె చేతబెట్టవచ్చును. నేర్చుకొను వారికిని నేర్పువారికినికూడ అత్యుత్సాహ కరముగనుండును. 'నూతనాక్షరాభ్యాసము' అను గ్రంథమునుబట్టి అక్షరములను అంకెలను బొమ్మలవలె యానందముగా నేర్చుకొనవచ్చును.

నూతన శాస్త్రజ్ఞానము అను గ్రంథమున పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, శారీరశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, పరిశ్రమలశాస్త్రము మొదలగువాని సారమెల్లయు తేటతెలుగులో స్టీమరులు, బయస్కోపులు, రెయిల్లు, టెలిగ్రాపులు, విమానములు మరలు మొదలగు ఉదాహరణములనుండి యెత్తి చూపించినారు. పండితులకు పామరులకుకూడ తెలుసుకొనవలసినట్టియు నిత్య వ్యవహారములో నత్యావసరమైనట్టియు అనేక విషయము లిందు సుందరముగ పొందు పరచబడినవి. నూతన నీతిబోధయను 116 పుటల గ్రంథములో ధర్మాచరణము, సంసార విరాముము, దైవసహాయము, మానవసేవ, దేశక్షేమము, నియమజీవనము మొదలగు యంశములనుగూర్చి లోకోక్తులు ఇతిహాసములు, పురాణకథలు ప్రపంచపు ముచ్చటలు ఎన్నియో ఉదాహరణముగాగొని పామరులకు మనోరంజకమగు రీతిని వ్రాసినారు. వీని కన్నిటికిని తలమానిక మనదగునది హిందూధర్మబోధిని. స్వధర్మము నెఱుగనివా డెన్ని గ్రంథములు బట్టీపెట్టి యెన్ని డిగ్రీలు పుచ్చుకొని యెన్ని బిరుదము లందినను నిజమగు విద్యావంతుడేనా యనిపించును. స్వధర్మమును స్వచ్ఛముగ నాచరించుచు అసత్యమాడక, అప్రమాణములు చేయక, అతిథి అభ్యాగతుల నాదరించుచు శాస్త్రవిహితకర్మల నాచరించుచుండువారిలో చాల మంది అక్షరములు రానివారున్నారు. వారిని గూర్చి "విద్యావిహీనః పశుః" అని హేళనచేయుట పాడికాదు. కనుక హిందువులైనవారెల్లరును చదువుకంటె ముందుగా కూడా హిందూఆచారముల నభ్యసించవలెను. ఉదయమున లేచుట, పవిత్రభావములతో మనస్సును నింపుట, ఆచమనము, శౌచవిధి, గండూషణవిధి, దంతధావనవిధి, స్నానవిధి, ఉపవాసవిధి, భోజనవిధి, శయనక్రమము మొదలగు హిందూ ఆచారము లెల్లయు దేహమున కారోగ్యము, బుద్ధికి వికాసము, మనస్సుకు శాంతి, ఆత్మకు మోక్షము నెట్లు చేకూర్చునో రావుగారు స్పష్టపరచి అఖిలాంధ్రప్రజాబాహుళ్యమునకు నెనలేనిసేవ సేసియున్నారు.

శ్రీ బాబురావుగారు ఇట్టి యుద్గ్రంథముల కెట్టివిలువయు నిర్ణయింపకుండ ఉపయోగపరచుకొన గోరువారికెల్ల చిక్కునట్లుచితముగ నొసంగుచుండుట వయోజన విద్యావ్యాప్తియందు వారికిగల అనన్యానురాగమును ప్రకటించుచున్నది. వయోజన విద్యాసంస్థలలో దేనితోనైన కలసి పని చేయుచున్నవారుగాని లేక స్వయముగా తద్విధానవ్యాప్తికి శ్రమపడుచున్నవారుగాని గ్రంథకర్తగారికి రు. 0-4-0 తపాలాబిళ్లలు, పై పొత్తముల నంపుటకు పలయు తపాలా ఖర్చులకుగాను పంపినయెడల ప్రతులు బడయగలరు. ఆంధ్రు లిట్టి యవకాశమును

గోల్ఫోక విరివిగా తెప్పించుకొని యుపయోగించుకొనెదరు గాకయని కోరుచున్నాము.

రైతు రక్షణము:—

ఆర్థికదుష్పరిస్థితులవలన బొత్తిగా చెడిపోయినవారు రైతులు. ఆంధ్రదేశపు రైతులు నిండిపండిననాడైనా భోగభాగ్యములెరుగరు. దివాణమునకు శిస్తులకు సాహుకార్ల వడ్డీలకు చెల్లించిన మరునాటినుండి వారిల్లు శుద్ధశూన్యములై తిరిగి గంపపట్టుకొని సాహుకారింటిమీదికే భుక్తికికావలసిన అప్పులకై ప్రయాణము!! ఏరైతుచూచినా అప్పులలో మునిగిఉన్నాడు. 1928-కి పూర్వముమాయధరలొక్కసారిగాలేచి రైతులను కలకలలాడ జేసినవి. దానిమీద వారు కాస్త ధైర్యముగొని తీర్చుకోలేకపోతామా అని కాస్తచదువుకని, గొడ్లకని ఇంటికని పొలముకని యెక్కువ వడ్డీలమీదే అప్పులు వాసుకొన్నారు. ధరలు మరి నాలుగేండ్లపాటైనా ఆయెత్తుననున్నయెడల వారు కుదుటబడి కలకలలాడుచు దేశమునకు వెన్నెగూర్చెడివారు. కాని యింతలోనే ఉప్పెనవచ్చినట్లు ధరలు పడిపోయినవి. ధరలుపడి వస్తువులు చౌక అయితే అందరూ సంతసించవలసినది. కాని రైతు నాపత్తులన్నియు అలముకొన్నవి. వారు కట్టవలసినసిస్తు తగ్గదు. అప్పుతగ్గదు; వడ్డీతగ్గదు; కొనుక్కోనవలసిన వస్తువులధరలేమీ తగ్గవు. రైతు పాపమిట్టియురిలో తగుల్కొన్నాడు. పోసీ భూములూ యిల్లూ అమ్ముకొని అప్పుతీర్చుకొని కుదుటంబడి కూలికిపోదామంటే వాటిధరలు నాలుగోవంతుకో అయిదోవంతుకో పడిపోయినవి. ఇది ఒక భారతీయరైతుకే పట్టినదా, భూలోకంలో వ్యవసాయంచేసుకొనే రైతులందరికీనూ అంతే. పట్టలేదా అంటే స్వపరిపాలనగల దేశాలలో ఏదో తాసికమాసికలుచేసి ప్రభుత్వములు రైతుల సహాయమునకు వచ్చుచున్నవి. మనదేశంలోనో రాష్ట్రకేంద్రప్రభుత్వములు ఒకరిమీద నొకరు వంకలుపెట్టి కాలయాపనము చేయుచున్నవి. రైతులు ఆందోళనచెయ్యగా చెయ్యగా శాసనసభ్యులు ఈసమస్యనుబట్టి ఊచగాఊచగా ఢిల్లీప్రభుత్వమువారు రాష్ట్రీయప్రభుత్వప్రతినిధులతో కలిసి ఆలోచించడానికి నిశ్చయించుకున్నారు. ఢిల్లీలో ఈసభ సమావేశమౌతుంది. ఈలోపున రైతులు తమ ఆందోళన విరమించకూడదు. అప్పుల వసూళ్లు ఆపించుటకు వడ్డీ అసల్లను తగ్గించుటకు వాయిదాలమీద ధాన్యరూపకముగా తీర్చించుకొనుటకు పూర్తిగా మునిగిపోయిన వారికి ఒకకాడియెడ్లయినా దక్కేటట్లు చేయుటకు సాహుకార్లను నిర్బంధించవలెను. రైతుభాగ్యమల్లా ఇదివరకు సాహుకారే జుర్రుకొన్నాడు కాబట్టి ఇప్పుడీమాత్రం సాయం చేయించవలెను. కోర్టులు త్వరత్వరగా జప్తుకి అములుకి ఆర్డర్లివ్వకుండా చేయవలెను. ప్రభుత్వము శిస్తులను తగ్గించుకోవలెను. ఒకకోటి రూపాయిలైనా చవకవడ్డీపైని రైతులకు బదులివ్వవలెను. ఇవన్నీ ప్రభుత్వము చేయించకపోతే దేశమునకు వెన్నెముక విరిగిపోతుంది. దేశము స్మశానతుల్యమవుతుంది. తరువాత విచారించిన లాభములేదు. ఇట్టి విచారకర పరిస్థితులలో రైతులకు ధైర్యస్థైర్యముల

బురికొల్పుచు ఆవిపోయుచున్న ఆచార్యరంగా గారిని మే మెంతయు అభినందించుచున్నాము.

అంధ్ర రైతాంగవిద్యాలయము:—

ఆచార్య రంగాగారి రైతుసేవాపరాయణత్వ మింతతో ఆగలేదు. వారిస్వస్థలమగు నిడుబ్రోలులో రామానీడు విద్యాలయము నందు కర్షకులు, కార్మికులు, హరిజనులు ప్రచారకులు మొదలగువారెల్లరు దేశమునకు రైతుకు సంబంధించిన ఆర్థిక వ్యవసాయక రాజ్యాంగ విషయములను నేర్చుకొనుట కొరకొక వయోజన విద్యాలయమును నెలకొల్పుచున్నారు. ఇది ప్రతివత్సరమును రైతులు మొదలగువారిని ఒక్కొక్క నెలబాటు సమావేశపరచి ప్రవీణులచే వారికి పై విషయములనుగూర్చి ఉపన్యాసము లిప్పించుచుండును. ఈ సంవత్సరము ఏప్రిల్ 22 నుండి మే 28 వరకు ఇది నడచును. దీనికధ్యక్షులు శ్రీరంగాగారే. మే 21 వ తేదీవరకు నిడుబ్రోలునందును, పిమ్మట 28 వరకు కళ్యాసకావూరునందు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారి యాశ్రమమునందును ఉపన్యాసములు జరుగును. నిడుబ్రోలులోని రంగాగారి గ్రంథాలయము విద్యార్థులయుపయోగమునకై సదా తెరవబడియుండును. విద్యార్థులు తలా యెనిమిది రూపాయిలును భోజనము బసలనిమిత్తము చెల్లించిన చాలును. శ్రీయుత కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు, కె. రామకోటీశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శనివారపు సుబ్బారావు, గూడవల్లి రామబ్రహ్మం గార్లును ఇతరులును తమవాగమృత ధారలను విజ్ఞానోత్సాహము వెల్లివిరియ గురిపింతురు. ఇండియను ఎక్స్ప్రెసుపత్రికా సంపాదకులు శ్రీయుత కె. సంతానంగారు దీనికి ప్రారంభోత్సవము జరుపుదురు. శ్రీమంతులగు తెలుగువారెల్లరును ఆచార్యరంగాగారికి విరివిగా ధనసహాయముచేసి యిట్టి సత్ప్రయత్నము విజయవంతమగునట్లు చేయుదురుగాక !

విధవావివాహ సహాయక సభ:—

(బ్రాంచి: మదరాసు, జార్జిటౌను, బ్రాడ్వే, 161 నెం. గృహము)

ఇది 1931 లో నెలకొల్పబడినది. రిటైరుదు సబ్ జడ్జీ శ్రీయుత యన్. రామస్వామి అయ్యారుగారి యధికారమున నిదిసాగుచున్నది. ఇంతవరకిందు 100 మంది విధవలు చేరిరి. పెక్కురు పెండ్లిండ్లుచేసుకొని సంతోషముతో వెళ్లిపోయిరి. యోగ్యమైన వితంతువులు కొంచెముమందినింకా చేర్చుకొనుట కవకాశమున్నది. భోజనము, బసఉచితము. వితంతు వివాహోద్యమమునం దనురాగము గల మిత్రులు తమయెరికలో నట్టివారున్నచో యిచ్చుటకు పంపవలెను. మరి యెట్టిఉత్తర ప్రత్యుత్తరములు విచారణలు జరుపవలసి యున్నను ఆఫీసుకు వ్రాసుకొనవచ్చును; అని గౌరవకార్యదర్శిగారు సర్వులకు మాపత్రికా ముఖమున తెల్పుచున్నారు. సంస్కారప్రియులగు ఆంధ్రులు వీరి ప్రకటనము గమనించి తగిన శ్రద్ధ గైకొందురని నమ్ముచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0
2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0
3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0
4. ద్రౌపదీ వస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0
5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0
6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0
7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యార్థినులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0
8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

---

## రావ్‌సాహేబ్, మ॥ రా॥ శ్రీ॥ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వ్యాససంగ్రహము:— | సుమారు 750 పుటలు. | | వెల | 7 | 8 | 0 |
| గద్యచింతామణి:— | ,, 370 | ,, | వెల | 1 | 8 | 0 |
| బాలకవి శరణ్యము:— | ,, 360 | ,, | వెల | 1 | 8 | 0 |
| ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము:— | ,, 210 | ,, | వెల | 1 | 0 | 0 |
| వ్యాసావళి:— | ,, 172 | ,, | వెల | 1 | 0 | 0 |

ప్రకాశకుడు :—

తెలికిచర్ల వెంకటరత్నంగారు,

గుంటూరు.

---



P. Kothandaram Pillai.




సంపాదకుడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] జూన్ 1934 [సంచిక ౮

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# లోధ్రను సేవించుటవలన

ఋతుదోషమువలన కలుగు నడుము నొప్పి, కడుపునొప్పి, కీళ్లనొప్పి, వాత నొప్పులు మొదలైనవి నివర్తియగును.



# Why Suffer With Backache

గడచిన మూడు సంవత్సరములనుండి నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. 2, 3 నెలల కొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పులు, కీళ్లనొప్పి, బలహీనము, దేహము బరువుగ తోచుట మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ లోధ్రను రెండు సీసాలు తెప్పించి వాడినంతలో పై వ్యాధు లన్నియు మాయమైనవి. నావలెనే బాధ పడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెల్పుచున్నాను.

జయలక్ష్మమ్మ, కొల్లిగల్.

V

నాకు బహిష్టికాలములో కడుపునొప్పిచే చాల బాధ కలుగుచుండెను. మీ కేసరి కుటీరం లోధ్ర నాలుగు బుడ్లను తెప్పించి త్రాగినాను. అది మొదలు నాకు చాలా ఆరోగ్యముగనున్నది. బాధకూడ తగ్గినది. గనుక మా స్త్రీలవ్యాధులకు తమ లోధ్ర కల్పవృక్షమువంటిది.

గునుపూడి కాంతమ్మ, కావలి.

లోధ్ర అన్ని షాపులయందును దొరకును.

కేసరికుటీరం, ∴ ఎగ్మూరు, ∴ మదరాసు.



# గృహలక్ష్మి



# GRIHALAKSHMI


TELUGU ILLUSTRATED LADIES' MAGAZINE

*Editor*. DR. K N. KESARI.

JUNE 1934.





Vol. VII No. 4

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్థసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈపఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లుతెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR

# లోధ్ర

## ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.




గర్భాశయదోష జనిత వ్యాధులకు, ముట్టుకుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము ఎక్కువ తక్కువ అగుట, స్రావము అనేక రంగులతో వెడలుట, సూతిక గడ్డ, గర్భాశయమున విష వ్రణములు కలుగుట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టు అగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్ర పుత్రికాభిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

వాతోన్మాదమను హిస్టీరియాను ఆశ్చర్యముగ తుదముట్టించుటలో సాటిలేని దివ్యౌషధము.

నేను లోధ్రను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతి నెలయును క్రమముదప్పి బహిష్ఠి 20 దినముల లోపుననే యగుచుండెను. 2 సం॥ల వరకు ఆసుపత్రియందు పుచ్చుకొంటినిగాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి. నేనిష్టపడలేదు. తమ 'లోధ్ర'ను నాకు పంపగోరుచున్నాను.

బి. ఇందిరాకుమారిదేవి. మెట్టూరు.

నాసహోదరి బహిష్టుకాలమందు పరిమితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నియో ఔషధములిప్పించితిమి కాని నయముకాలేదు. తుదకు తమయొక్క లోధ్ర కీర్తివిని రెండుబుడ్లు తెప్పించి నాసోదరికి వాడినాము. అత్యాశ్చర్యముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రి జననమైనది. ఈ సంతోషవార్త తమకు వెల్లడించుచున్నాము.

డి. రాజేశ్వరమ్మ, దిగుపహండి.

లోధ్ర మెల్లెడల దొరకును.

కేసరీకుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# స్త్రీలకొక సందేశము



# A Message for Women

స్త్రీలకు యౌవనమునుండి వార్ధక్యమువరకు దేహములో సంభవించుమార్పులే వారి ఋత్వంగముల యందు గొప్ప ఉపద్రవము కలిగించుచు ప్రసవసమయమున నింకను బాధ కలిగించుచున్నవి. ఇట్లుండ రక్తహీనత, గుండెదడ, నరముల దుర్బలత మొదలగు వ్యాధులకు వారు గురియగుటలో నాశ్చర్యము లేదు.

ఏకైక రసాయనమను లోధ్రయే యిట్టి ఆపత్కాలములయందు వారి పాలిటి వరప్రసాదమని యాతురతగల స్త్రీలు తెలిసికొననగును. ప్రపంచములోని కృతజ్ఞులగు రోగులందరు మనః పూర్వకముగా శ్లాఘించియున్నారు.

కేసరి కుటీరం

ఆయుర్వేద ఔషధాలయం,

ఎగ్మూరు, మదరాసు.

# కేసరి పుష్పత్రయము



## మాలతి

ఇది బాదంపప్పుపాలనుండి తయారు చేయబడి యొక తెల్లటి సువాసనగల నవనీతమువలె నుండును. దీనిని స్త్రీ పురుషులు తల దువ్వుకొనుటకు ముందు కొద్దిగ రాచుకొని దువ్వుకొనిన వెంట్రుకలు రేగక పట్టుకుచ్చువలె మిసమిస లాడుచుండును. మెదడు చల్లపడి సుఖముగ నిద్రవచ్చును. సొగసునకు సొంపునకు సుఖమైన వాసనకు పేరుగాంచిన మాలతీపుష్పముల అత్తరు ఇందు ముఖ్యముగ చేరియున్నది.

వెల బుడ్డి 1_కి 8 అణాలు.

## మాధవి

ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళ పదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసికొని ముఖమునకు లేపనము చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికము వలె నిర్మలమగును. ముఖమున లేచు సోబె, మచ్చలు, మొటిమలు మొదలగువాటిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగనుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1_కి 8 అణాలు.

## మల్లిక

ఇది ముద్దుబిడ్డలకు మురిపమైన లేపము. ఇది మైసూరు చందన అత్తరుతోను మల్లెమొగ్గల సారముతోను తయారుచేయబడిన నవీననవనీతము. శిశువులకు దీనిని ప్రతిదినము స్నానాంతరము కొద్దిగ శరీరమునకు రాచుచుండిన, చర్మము మృదువై బంగారు రంగునిచ్చి చర్మవ్యాధుల రాకుండచేయును. ఈ లేపమువలన బిడ్డలు రబ్బరుచెండ్లవలె తేరుదురు. ఇందు కాశ్మీరపు కేసరి పునుగుగూడ చేరియున్నది.

వెల బుడ్డి 8 అణాలు.



**అన్ని షాపులయందును దొరకును.**

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# ఇద్దరును సుప్రసిద్ధులే

## సర్. కె. పి. పుట్టన్న చెట్టి, సి. ఐ. ఇ.,

పూర్వము మైసూరుకౌన్సిలు ప్రథమ సభ్యులు; బెంగుళూరు

"డాక్టరు కేసరిగారి దంతధావన నవనీతమును నేను వాడితిని. అది నాకు సకలవిధములను సంతృప్తికరముగ నున్నది. అది దంతములను ఇగుళ్ళను శుద్ధి పరచును. నోటికి చక్కనివాసనను రుచినిగూర్చును. పండ్లకును ఇగుళ్ళకును కస పట్టించి బలపరచును. విదేశి పల్లుపేస్టులకు వేనికిని అది తీసిపోదు. అది స్వదేశీది కనుక బహువిరివిగా అమ్మకము కాగలదు."

## సర్. రాధాక్రిష్ణన్.

ఆంధ్రవిశ్వవిద్యాలయపు వైసుఛాన్సలరు, వాల్తేరు.

"డాక్టరు కేసరిగారి దంతధావన నవనీతమును నేను కొంతకాలము వాడితిని. అదిమిక్కిలి శ్రేష్ఠమైనదని నాఅభిప్రాయము. స్వదేశీ పదార్థముల యందభిమానము పెచ్చుపెరుగుచున్న యీ దినములలో అది బహువిరివిగా అమ్మకము కాగలదని నేను నిస్సంశయముగా చెప్పగలను."

## కేసరి కుటీరం

ఆయుర్వేద ఔషధశాల.

ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

త్రివర్ణచిత్రము:

గోపిక

ఛాయాచిత్రములు:

శ్రీమతి సుధారాణి; డా॥ మిస్ యస్.జి.వి. పాటెల్, యం బి.బి.యస్.; బాంద్రాబాలికా పాఠశాలాప్రదర్శనము. బొంబాయి గవర్నరుసతీమణికి ఒసగబడిన ఉపాహారము; నేషనల్ ఇణ్డియణ్ ఎసోసియేషణ్, బొంబాయి; స్త్రీశాఖ. గానకోకిల మిస్ రామతిలకం; సైరంధ్రి శ్రీమతి లీలాకన్య; నూతన వధూవరులు; శ్రీమతి మునుపల్లె రామకోటమ్మగారు; కాకినాడ మహిళాసంస్థల వార్షికోత్సవములు; రాకుమారి శ్రీమతి అక్కా-సాహెబ్; శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు; శ్రీమతి మిస్. శకున్తలా పరన్‌జిపాయ్ గారు;

-:o:-

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ ప్రిప్రజం టేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566, రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు, (మన ప్రాంతపు 1 రూపాయి రూ 1-3-0 అగును)
నిడదవోలు: తాటిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ,
బరంపురం: నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్ పేపరు ఏజంటు.
గుంటూరు: వెల్ కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: న్యూస్ ఏజెన్సీ ఎం. నూకరాజు, ఆంధ్ర.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.
తణుకు: వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.
భీమవరము: అమిరపు శేషాచలశర్మగారు.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.
కర్నూలు: చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
సెకండ్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాగాకుబజారు.
ఏలూరు: బి. విశ్వనాథంగారు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
నెల్లూరు: సి. యల్. నృశింహం బ్రదర్సు, ట్రంకురోడ్డు.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెనీ.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.




# కీ॥ శే॥ కోటికలపూడి సీతమ్మగారు

విమల పథంబునన్ నిలిపి వృత్తము చక్కనొనర్పవేని ని
క్కముగ వృథాభరంబగును గాని ప్రయోజనమేమి విద్యచేన్?
సమగతి విద్యయున్ సుగుణసంపదయుంగల యుత్తమాంగనల్
తమి మగవారలట్టులె యలంకరణంబులు భూతధాత్రికిన్.

—దుర్భా సుబ్రహ్మణ్యకవి.

వర్తమానయుగమున నాంధ్రదేశమున స్త్రీల యభివృద్ధికై పాటుబడిన మహనీయులలో శ్రీయుత కందుకూరి వీరేశలింగం పంతులుగా రగ్రగణ్యులు. ప్రాతఃస్మరణీయుడగు నా మహనీయునివలన విద్యావిజ్ఞానముల బడసి యాయనచేయు సమస్త దేశహితైక కార్యములందును పాల్గొని దాదాపు నలుబదేండ్లకాలము స్త్రీల యభివృద్ధికై పాటుబడిన మహనీయ శ్రీమతి కోటికలపూడి సీతమ్మగారు. ఆడుది చదువుకొనిన మగవాని కర్థాయువని అడలిపోవు దినము లవి. ఆడుది చదివిచెడు—మగవాడు చదువక చెడునను సామ్యము క్రియాపూర్వకముగా వాడుకలోనున్న దినము లవి. ఆడుది చదువుకొని యేమి చేయవలయును? ఉద్యోగము చేయునా? ఊళ్లేలునా?యని వికటముగా వితర్కించు దినము లవి. ఏవిషయమునను స్త్రీయొక్క వ్యక్తిత్వము గుర్తింపబడని దినము లవి. అట్టి దినములలో లోకుల యాక్షేపణలను లెక్కసేయక బెదరింపులకు భీతిల్లక విఘ్నములకు వెనుదీయక మహాధైర్యముతో స్త్రీల యున్నతికై పాటుబడినయేకైక నారీరత్నము శ్రీసీతమ్మగారు. శ్రీ సీతమ్మగారి కృషి, యొక్కవిధముగానున్నది కాదు; పలువిధ

ములుగానున్న డి.సీతమ్మగారు గొప్ప విదుషి, కవయిత్రి, వక్త,పరోపకారిణి,సేవావ్రత, భక్తి తత్పర. అనన్యసామాన్య శేముషీ దురంధరులగు శ్రీ వీరేశలింగము పంతులుగారి ప్రియ ఛాత్రిణియగుటచే వారికడ గల ప్రజ్ఞావిశేషములన్నియు సీతమ్మగారియందును గలవు. సీతమ్మగారు సాధురక్షశతకము, అహల్యాబాయి,పద్యభగవద్గీత మున్నగు గ్రంథములు వ్రాసిరి. మఱియు ననేకపత్రికలలో ననేక వ్యాసములు వ్రాసిరి. అనేక స్త్రీసమాజముల వార్షికోత్సవ సభలకును తదితరానేక స్త్రీల సభలకును నధ్యక్షతవహించుటయేగాక 1913వ సంవత్సరమునందు బాపట్లయందు జరిగిన ప్రథమాంధ్రమహాసభతోబాటు జరిగిన మహిళాసభకుగూడ శ్రీ సీతమ్మగారే అధ్యక్షతవహించిరి. మంచి వక్తృత్వ నైపుణ్యము గలవారగుటచే శ్రీసీతమ్మగారే సందర్భమున నెచ్చటికె వెళ్లినను స్త్రీలసమావేశములను జరిపి చక్కని హితోపదేశ రూపకములగు నుపన్యాసము లిచ్చుచుండిరి.

మతవిషయమున శ్రీ సీతమ్మగారు పరిశుద్ధాస్తికమతమందును నిర్గుణోపాసనయందును విశ్వాసముగలవారు కాన కడవఱకును వారటులనే వర్తించిరి. నైతికవిషయములందు సీతమ్మగారికి పంతులుగారికివలెనే రక్తిమెండు. ఏసందర్భమున నన్యులనూడ కుండుట వారి జీవితవ్రతములలో నొకటి. 1932 వ సంవత్సరమునందాంధ్రరాష్ట్రీయ మహిళాసభ రాజమహేంద్రవరమున జరిగి నపుడు శ్రీసీతమ్మగారాసభకువిచ్చేసియందు గావింపబడిన విడాకుల తీర్మానము వగైరా తీర్మానములు చేయుటకును నేయెడను ఆత్మోన్నతికి సాధనభూతములగు నాధ్యాత్మిక విషయములనుగూర్చిన తీర్మానమొక్కటియు లేమికిని మిక్కిలి వగచిరి. నీతి పటిష్ఠంబగు ధార్మికవర్తనమున కలవాటుపడిన శ్రీ సీతమ్మగారికి విశృంఖలములగు నా సభా తీర్మానములు మనస్సును కలతపెట్టుటచే "గార్గీ మైత్రేయి లింతపంది విద్యాసరస్వతు లిచట సమావేశమగుటచే కన్నులార గాంచుటచే యత్యంతానంద మొదవుచున్నను సాధ్వీధర్మమునెడ చేయు నీ తీర్మానములు వినుటచే కంపరి మొదవుచున్న దని నిండుసభలో వలవలాడిరి.

శ్రీసీతమ్మగారు తొల్లిటనుండియునారోగ్యవద్దేహముగలవారు కారు. దుర్భరమైన కాసామయము వారిని సదాపీడించుచుండెను. మఱియు హృత్తాపకరములగు గృహచ్ఛిద్రములుగూడ వారి నెక్కువగనే యలమటపెట్టుచుండెను. అయినను శ్రీసీతమ్మగారు లక్ష్యపెట్టక పరోపకారార్థమిదం శరీరమ్మను సూక్తిని సార్థకమొనరించి కృతార్థతజెందిరి. భర్తృమరణానంతరము చరమదశయందు శ్రీ సీతమ్మగారు బహిరంగసభాదిక వ్యవహారములతో పాల్గొనుట దాదాపుగా విరమించినను మహాసాధ్వియు విదుషీమణియు సచేత విద్యావ్యాసంగసంసక్తచిత్తయునగు శ్రీ కీ॥ శే॥ పీఠాపురపు మహారాణీ గారి యాదరమునుండి వారికి యాంధ్రసాహిత్యమును ఛందోలక్షణాదులను గఱపువారుగానుండిరి. విదుషీమణియగు సీతమ్మగారు విద్యాప్రియయగు మహారాణీగారి ప్రాపును

బడయుటచే 'మణినావలయుంవలయేనమణిః' యన్నట్లు పరస్పరము శోభిల్లిరి. వ్యవహారమున నాశ్రితాశ్రయధర్మమున్నను నిర్మల హృదయలగు వారిరువురును కూర్మి నెచ్చెలులట్లుండి సదా సజ్జనగోష్ఠియందును పారమార్థిక విచారణయందును విద్యావ్యాసంగమునందును గడపుచుండిరి. ఇట్టి మహారాజ్ఞిగారు గతవత్సరము ఫిబ్రవరినెలలో స్వర్గస్థురాలగుటచే 'కృష్ణరాయలతోదివికేగ లేక బ్రతికియున్నాడ జీవచ్ఛవంబనగుచు'నని పెద్దనవలెనే మహారాజ్ఞీవియోగంబునకు కరము దుఃఖించి కడపట గడచిన ఫిబ్రవరి నెలలో జరిగిన శ్రీమహారాణీగారి ప్రథమ మృత సాంవత్సరికసభలో నుపన్యసించి తమ కృతజ్ఞతను వెల్లడించి యిక రాణీగారి యెడబాటు సైపజాలనన్నట్లు మార్చి పదునొకండవతేదీని యిహలోకమును బాసిరి.

శ్రీసీతమ్మగారు ఆంధ్రబ్రాహ్మణులలోని నియోగిశాఖకు జెందినవారు. ఈమె భర్తగారగు కొటికలపూడి రామారావు పంతులుగారు, డిస్ట్రిక్టు మున్సిఫ్‌కోర్టులో నుద్యోగిగా నుండిరి. ఈమె పుట్టినింటివారు అబ్బూరివారు. గుంటూరుజిల్లా తెనాలితాలూకా జెవుడుపాడు వీరి స్వగ్రామము. కాని యీమె సోదరులగు అబ్బూరి సుబ్బారావు పంతులుగారు సోమశేఖరరావు పంతులుగారు అనువారు నైజామునయిలాకా ఉన్నతోద్యోగములుచేసి విశేషధన మార్జించి యుపకారవేతనములు బడసి ప్రస్తుతము తెనాలియందున్నారు.

ఈమెకొక కుమారుడును కొమార్తెయు గలరు.

శ్రీ సీతమ్మగారు స్వర్గస్థులై యిప్పటికి దాదాపు మూడుమాసములైనది. అయినను ఆంధ్రదేశమునందలి యేప్రసిద్ధపత్రికయు నీమె మృతినిగూర్చి సంతాపమును తెలుపకుండుట పత్రికాలోకమున కెంతయు కళంకమని చెప్పకతప్పదు.

మన భారతవర్షమున ననాదినుండియు మహనీయులగువారి జీవిత చరిత్రములను భద్రపఱచెడి యాచారములేదు. కావుననే యెన్నియో సుగంధకుసుమముల సౌరభమును మనము గ్రహింపజాలకపోతిమి. యెన్నియో యనర్ఘరత్నముల కాంతులను మనము దర్శింపజాలకపోతిమి. దాని కిప్పటికిని మనము కుందుచున్నాము. తమ జీవిత చారిత్రముల నేల భద్రముచేసియుండరాదని ప్రాచీనులపై కన్నెఱ్ఱచేయుచున్నాము. ఐహికములగు యశోవిశేషాదులయందు సహజముగా విరక్తులగుటచే మనపూర్వులు వీసియం దంతగా ననురక్తులు కాకపోవచ్చును. మఱియు ఆనాడు ప్రతివిషయమును నిప్పటివలె క్షణములో ముద్రించు నచ్చుకూటములాలేవు. విశ్వవ్యాప్తిచేయగల వార్తాపత్రికలాలేవు. వైరాగ్యమే యలంకారముగా గల యాపెద్దలకు తమ చరిత్రము నిచట భద్రపఱచిపోవలయునను వాంఛయు లేదు. అది యొక యుగము. ఇదియొక యుగము. ఎల్లరు భౌతికసుఖలాలసులగు పాశ్చాత్యులయడుగు జాడల ననుసరించు యుగ మిది. ప్రతియల్ప

విషయము సధికముగాఁజేసిగణించి పత్రికలలో ప్రకటించుట యిప్పటి యాచారము. పాశ్చాత్త్యుల సంపర్కమువల్లనై తేనేమి స్వయముగానే తమకు తోఁచుటచేనైననేమి యీ లక్షణములు మనకుగూడ కొంతపట్టుబడినవి. ప్రతిసామాన్యజీవియొక్క వృత్తాంతము మన మిప్పుడు పత్రికలలో గాంచుచున్నాము. అట్టిచో విదుషీమణియు, కవయిత్రియు, సంఘసంస్కారప్రియయు, సేవావ్రతయు, సరళసాధువర్తనయు నగు శ్రీ సీతమ్మగారి విలువను నాంధ్రులును నాంధ్రపత్రికలును గుర్తింపకుండుట వారికే యగౌరవకరము గాని సీతమ్మగారికికాదు. నిరాడంబరులగు వా రెప్పుడును లోకస్తుతి కాసింపరు. కాని వారి యాధిక్యతను లోకము గుర్తింపకుండుట మాత్రము మెచ్చదగిన విషయముకాదు. స్త్రీయైనకారణముననే సీతమ్మగారి ప్రస్తావన మిట్లు నిర్లక్ష్యపఱచుటకు కారణమగుచో నాంధ్రదేశ మభ్యున్నతిగాంచుట యింకను యెన్నియో యుగముల దూరమున నున్నదని భావింపవలయును.

సీతమ్మగారి జీవిత మాదర్శనీయమైనది. స్వయంకృషిచే విద్యాజ్ఞానము లలవర్చుకొనెను. అలవర్చుకొనిన విద్యాసంపదను లోకసేవకై వినియోగించి సార్థకజన్మ యయ్యెను. శ్రీ సీతమ్మగారి జీవితము కలకాలము యింతులకు మేలిబంతియైయుండుగాక!! శ్రీ సీతమ్మగారి యాత్మకు పరమేశ్వరుడు శాంతి నొసంగి తన సాన్నిధ్యమును ప్రసాదించునుగాక.

—కనుపర్తి వరలక్ష్మమ్మ.

---

# నీ తడయుటలో నర్థము

త్రిపురాన సత్యానందరావుదొరగారు

గున్నమామిడిచేరువఁ గొమరు మిగులు
మాలతీనికుంజంబున లీలనుండి
తనువు మఱచినానెదఁ బరధ్యానపరత;
అంతనొకదూత గొబ్బున నరుగుదెంచి
స్వామి! నీరాక ప్రకటించి చనియెవడిగ;
వేచివేచియుంటిని మది విసుఁగుదనుక.
నాదుభవనగర్భములోని పేదగుడిసె
కరిగి బిరబిరమేని వస్త్రాభరణము
లన్నియునుదీసి, కైకొని యలుకవేస
మేను చినిఁగినచాఁపపై మేనుసేర్చి
యుంటి,మునిమాపువఱకుఁ బెల్లొదవఁగలదు
తీరికేలేనిపనియంచు దేవ! నీకు.
అంతలో భోజనసమయమగుడుఁగవులు
గాయకజనములు ప్రబోధగానములను
పాడి;రీవైన నేనైన భవనమునకు
రామి నాదునెచ్చెలు లబ్బురంబుగొనిరి.
కన్ను మోడిచి నిదురింపఁగాఁ దొడంగ
నిద్రరాదయ్యెఁ; బిదపఁ గన్విచ్చిచూడ
నాదుప్రక్కనె పరుండి మోదమలర
ముంగురులదిద్దు నిన్గంటిఁ; బొందనైతి
నద్భుతము! దాని కొక్కింతయైనమదిని
గుడిసెబెజ్జాలఁబడి చూడఁగువలయేశ!
దీటుకొనుకాటకంబున దేవురించు
దీనజనకోట్లు మృష్టాన్నపానరతిని
ఉంటఁగన్గొంటిఁజాల నేత్రోత్సవముగ;
నీతడయుటలో నర్థమున్ దెలిసితపుడు.

# సౌభాగ్యసిద్ధిరస్తు

శ్రీపాద వేంకటావధానిగారు

ఏభూమి వేదశాస్త్రేతిహాసజ్ఞలౌ
సాధ్వులకు ననుంగుజన్మభూమి
ఏతల్లి యతులితమృదులకావ్యములల్లు
కవయిత్రులకుఁ గూర్మికన్నతల్లి
ఎచ్చోటు మహితలోకైక విక్రమకళా
భ్యుదయలౌ మహిళలు పుట్టుచోటు
ఏదేశమతిపూత హృదయశోభితపతి
వ్రతలఁ గాంచినయట్టి భవ్యదేశ
మట్టి కల్యాణదాయకమైన భరత
భూమి జనియించి, తొల్లింటిపుణ్యశీల
సతులమార్గమ్ములారసి సలుపునీకు
చిన్నిగృహలక్ష్మి, సౌభాగ్యసిద్ధిరస్తు!!!

# భారత నారీమణుల భావికర్తవ్యం

శ్రీమతి ప్రేమా దేవిగారు

హిందూస్త్రీల ధర్మాధర్మ విచక్షణవిజ్ఞానం ఇంకా నశించలేదు.

స్త్రీలు అబలలంటారు. విలాసినులంటారు. శృంగారంలో తప్ప మనకి ఇంకేవిషయంలోనూ అభిరుచి లేదని భావిస్తున్నారు. మనంకూడా అదె నిజమే ననుకుంటున్నాం. ఆదురభిప్రాయాలన్నీ మాసిపోవాలి. భారతీయస్త్రీలు సబలలు కావాలి. శృంగారంచేసుకొని పురుషుల్ని రంజనచేయడమే మన ప్రధానకర్తవ్యంకాదు. నిలవనీడలేక, కడుపుకు తిండిలేక, కట్టగుడ్డలేక, మనలో అనేకమంది మలమల మాడిపోయేకాలంలో అలంకారం చేసుకొని ఆటలాడడం అఘాయిత్యం. కుళ్లి కుసిమారిపోయిన హిందూసంఘంలోవున్న జాడ్యాలు, దురన్యాయాలు, గుండెగిడుతనాలు, మనబడులలో లేసు రిబ్బన్లు పెట్టుకుని, జంపరురవికలేసుకొని, ఒక్క కులుకు కులికి, చిన్నమందహాసంజేసి, ఏహార్మనీమియానో కూనురాగందీస్తే పోతాయా? తన వయస్సంతా విద్యలో గడిపి, ఇంక చదువు అనేది లేనంతవరకు కళాశాలలలో, విశ్వవిద్యాలయాలలో చదివి, శరీరారోగ్యంకూడా లెక్కచేయకుండా కష్టించి, పరీక్షలలో అఖండజయంపొంది, చివరకు ఇల్లూవళ్లూకూడా గుల్లచేసుకుని, ప్రపంచములోకి వచ్చేసరికి బ్రతుకు తెరువులేక, జీవనోపాధి దొరక్క, నీవా నాయనా, అని ఇంటింటికేగి, గుమ్మం గుమ్మానికీ, ఏడుత్తరమో, ఏసర్టిఫికెట్లో పుచ్చుకుని, కాళ్ళుపడిపోయేలాగు తిరిగి విఫలమనోరథు డవుతూన్న భారతీయయువకుడిగతి మనంచూస్తున్నాం. ఇంటెడుపిల్లలతో, వోపలేని భార్యతో రోజూరోజల్లా చెమట వోడ్చి కాయకష్ట పడ్డాకూడా అందరికీ కడుపునిండా గంజిఐనా పొయ్యలేని దిక్కుమాలిన కూలివాడు, మనకు ప్రతిచోటా ప్రత్యక్షం. మనదేశపు మహాపట్నాలలో నిర్మించిన ఉన్నత సౌధాల పునాదులలో ఎంతకుళ్లు వుందో, ఎన్ని అన్యాయాలు చేసి, ఎన్ని అబద్ధాలుఆడి, చేయరానిపను లెన్నోచేసి, సంసారాలుకూల్చి అవి నిర్మించగలిగారో మనకు తెలును. ఏదైతే మనమంతా గొప్పగా భావిస్తున్నామో, ఏది ఘనత అనుకుంటున్నామో అదిఅంతా బూటకమనీ,అబద్ధమనీ, నోరూ వాయీలేని పరమబీదల చెమటచుక్కలు—కాదు, నెత్తుటిధారలమీద అవి ఆధారపడివున్నవని గ్రహిస్తున్నాం. ధనమూల మిదం జగత్తని అంటారు. అది నిజంకాదూ? ధనంవుంటే, ఆధనం ఏవిధంగా వచ్చినాసరే, మర్యాద, గౌరవం, జ్ఞానం ఇవన్నీకూడా వాళ్ళకి వున్నాయని భావిస్తారు. ధనంవుంటే దేవుణ్ణికూడా కొనవచ్చు. మఠాచార్యుల్ని మరిపించవచ్చు. ఆకాశంలో ఎగరవచ్చు. కళ్ళునెత్తిమీదకి వస్తాయి. పరిచితులు, స్నేహితులు, బంధువులు కనబడరు. మధ్యమధ్య ఏగొప్పకో ఒక చిన్నబహిరంగదానం చేస్తారు. అది పత్రికలలో ప్రకటిస్తారు. దానివల్లకలిగే గౌరవంకోసం దానం; కాని మనస్ఫూర్తిగా చేసేవారు అరుదు. ఈ చిన్నచిన్న దానాలుమాత్రం ఎవరికి? తమలో తమకే!! సంఘం ఈవిధంగావుంటే జీవితభారంవల్ల కృంగి, నిరాహారంవల్ల కృశించి,అటు చావలేక ఇటుబతకలేక బాధపడలేక లక్షోపలక్షలైన భారతీయబీదలగతి ఏమిటి? ప్రపంచం అని పిలిచే ఈ మహాయెడారిలో వాళ్ళకు తావెక్కడ?

ప్రపంచం పరమేశ్వర సృష్టిఅయితే ఇటువంటి దురన్యాయాలు జరుగుతాయని నాకు నమ్మకంలేదు. మనచుట్టూ కమ్ముకుని మంచు ముసుగులా మనసంఘాన్ని ముంచేసి, మనకళ్ళు మూసేసి, ముందుదారి కనబడకుండా చేస్తూన్న ఈ అఘాయిత్యాలన్నీ కేవలం మానవ నిర్మితం.

పాడిపంటలలో, ధనధాన్యాలలో, సిరిసంపదలలో, వ్యత్యాసం ఏవిధంగానో వచ్చిం దనుకుందాం. పోనీ, ఒకమనిషినిచూస్తే ఇంకొకడికి ఈర్ష్య, ఉదాసీనత, అపనమ్మకం, క్రౌర్యం, విరసం ఇవన్నీ ఎక్కడివి? మానవుడి మెదడులో పుట్టిన పురుగులు!!

ఒకమతాన్ని చూస్తే ఇంకో జాతివాడికి అసహ్యం. కులానికీకులానికీ మధ్య వృత్తికివృత్తికీ నడుమ, ఈ విరోధం ఎందుకు?

ఏదైనా ఒక ధర్మవాదం ఈరోజుల్లో దాంట్లో వున్న సహజధర్మంవల్ల జయిస్తుందా? లేదు. డబ్బా కావాలి, వీధివీధినీ, వాడవాడనీ వాయించాలి. అల్లరి చెయ్యాలి. ప్రచారంకావాలి. న్యాయంకానీ, అన్యాయంకానీ ఆవిచక్షణ అక్ఖర్లేదు. కావలసింది డబ్బా. డబ్బాలతో లోకం జయించవచ్చు!!డబ్బాకి డబ్బు కావాలి. ఆ డబ్బునిజంపల్ల రాగు. అంతా బూటకం కల్ల!! అవేసాధనోపాయాలు.

ఈ దుర్మార్గాలన్నీ మనం, భారతీయ స్త్రీలం, చూస్తూవూరుకుని, వాటికిసహాయం చేస్తామా? నేరం జరిగేటప్పుడు చూస్తో వూరుకోడం కూడా ఒక నేరమే. ఆవిధంగా మనం నేరస్థుల మౌదామా?

ఇది స్త్రీలనే ఉద్దేశించి వ్రాయవలసిన అవసరం ఏమిటి? నానమ్మకం, 'ప్రపంచంలో న్యాయం, ధర్మం, ఎక్కడ నశించినా భారతీయయువతి మనస్సులో ఇంకా మాసిపోలే'దని. మనలో కొందరు చీనాదేశపు పింగాణీబొమ్మలు, అమ్మలక్కలు వున్నారనుకోండి. వున్నా స్త్రీ బాహుళ్యం ఇంకా చెడిపోలేదు. స్త్రీకివున్న సహజమైన ఓరిమితో చూస్తున్నారు. అగ్నిపర్వతం కాగినట్టు కాగుతున్నారు. ఇప్పుడిప్పుడే పొగలు పైకి వస్తున్నాయి ఈ అన్యాయాల మీద, ఈ కళంకాలమీద ఎప్పుడో శక్తిస్వరూపిణులు విర్చుకుపడతారు. పడాలి. లేకపోతే వీల్లేదు.

స్త్రీల హక్కులు, పురుషుల అన్యాయం అని అవసరమైన అల్లరుచేసి మనం కులాసాగా మోటార్లలో తిరిగితే పనికిరాదు. పురుషులు స్త్రీలనే అన్యాయం చెయ్యటంలేదు. తమలో తామే అన్యాయం చేసుకుంటున్నారు. ధనవంతులు బీదల్ని తింటున్నారు. సంఘంలో ఒకమనిషికి ఇంకొక మనిషికి సర్వసమానత్వం తీసుకువచ్చిన తర్వాతగాని స్త్రీపురుషుల వ్యత్యాసాలు మనం చర్చించడానికి అగత్యంలేదు.

ఒకవేళ కష్టపడి స్త్రీస్వాతంత్ర్యం సంపాదించినా సంఘంలోవున్న ఎగుడుదిగుళ్లు, అనవసరమైన కష్టనిష్టురాలు తొలగిస్తేనేగాని స్త్రీల కర్తవ్యం కొనసాగినట్టుకాదు. ఈ మహాకార్యం చేయడానికి స్త్రీలే ఎందుకు కంకణం కట్టుకోవలెనని అడగవచ్చు. సంఘాన్ని దోచి మనపురుషులచే దోపించి మనవొళ్లంతా నగలతో నింపుకుని కులికినా, మనం ఎన్నిచేయరాని పనులుచేసినా హృదయంలో సహజంగా వున్న న్యాయాన్యాయ విచక్షణ ఇంకా నశించలేదు. భౌతిక సౌందర్యంలో మునిగి తేలుతూవున్నప్పటికీ ఆ పిపాస తీరదు. సౌందర్యంలో సూక్ష్మమైన రకంకూడా వుంది. అది మనోనేత్రానికి పొడగట్టుతుంది. ఈ సూక్ష్మసౌందర్యం మనకు లభించనంతవరకు ఆత్మశాంతి వుండదు. సంఘం ఇంత వికృతాకారంగా వుండగా ఇంత కురూపంగా వుండగా మనమృణ్మయ శరీరాన్ని మెరిసిపోయేలోహాలతో నింపడంవల్ల మనకు శాంతి చేకూరదు. అసహజమైన తృష్ణతీరదు. ఏదైతే అందమైనదో అదే ఆనందకరమన్నారు. అదే ఉత్తమమన్నారు. ఉత్తమమైనదే అందమన్నారు. సృష్టిలోనే అందంకోసం తీరనిదాహంతో పుట్టిన స్త్రీకి తనచుట్టూవున్న ఈ కురూపం తీసివేస్తేనేగాని తృప్తివుండదు. వుండకూడదు.

నిజంగా స్త్రీచిత్తం వున్న ఏనారీమణిగాని మన సంఘంలో ప్రస్తుతం జరుగుతూవున్న 'దోపిడ్'చూచి సహించలేదు. దోపిడి అంటే బలమైనవాడు నీరసుణ్ణి తినెయ్యడం. అన్నిందాలా వాణ్ణికష్టపెట్టి, దాని ప్రతిఫలం తాను అనుభవించడం. కష్టమంతా ఒకరిది. సుఖమంతా మరొకరిది. ఇది అన్యాయం. మన భర్తలమీద మనకి అనురాగంవుంటే వాళ్ల ఆసాములు ప్రతినిత్యమూ వాళ్ళను దూషించే సాగరుపోతు వాగుడులోంచి వాళ్ళని తప్పించాలి. మన తండ్రులమీద మనకి ఆపేక్షవుంటే దుర్భరమైన వాళ్ళజీవితంలో సుఖం కలుగజేసి వాళ్లకి సంతోషం కలిగించాలి. మన సోదరులమీద మనకు మమకారంవుంటే దుర్మార్గుల్ని ఆశ్రయించి పొట్టపోసుకోవలసిన హైన్యంలోంచి వాళ్లని తొలగించాలి. మన సంతానం మీద మనకు ప్రేమవుంటే వారి భావిజీవితం సుఖప్రదంగా చెయ్యాలి. అనార్జితమైన పిత్రార్జితంతో, అన్యాయార్జితమైన స్వార్జితంతో వొళ్ళువాచి, సోమరిపోతులుగావున్న ధనవంతుల నీచ, పాప, హీన, దుర్మార్గపు చేతుల్లోంచి వాళ్ళని రక్షించి సంఘంలో సర్వసమానత్వం నెలకొల్పాలి.

ప్రతి స్త్రీ కూడా సంఘంలో ఈనూతన పరిణామం లేవడంకోసం నడుంకట్టుకుని పనిచెయ్యలేకపోవచ్చును. కాని నిద్రమత్తులోవున్న సంఘముయొక్క జ్ఞానం మనప్రచారంవల్ల వృద్ధిచెయ్యవచ్చు. సంఘానికి మన ప్రవర్తనవల్ల శిక్షణచేయవచ్చు. ఏ చిన్నతనంలోనో, కాటికి కాళ్ళుచాచుకున్న ఏముసలమ్మ సంతోషంకోసమో, మనం ముక్కూ మొగం ఎరగని ఎవడికో పెళ్లిచెయ్యబడి, అసహ్యమైన, అనారోగ్యకరమైన వెధవపిల్లల్నికని, ఒకప్పుడు కనడానికి శక్తిలేక చచ్చిపోయి, యిల్లావుండేకంటే సంఘసేవకోసం మనం శాశ్వతబ్రహ్మచర్యం అనుసరించినా నష్టంలేదు. సంసారాల్లో వున్నవాళ్ళు కూడా తమ నిరాడంబర జీవితంవల్ల చుట్టుపట్లకి ఆదర్శంగావుండవచ్చు.

ఆసుపత్రిలో మనం చూస్తాం. అక్కడ నర్సులంతా స్త్రీలు స్త్రీలే ఎందుకు దీనికి వుండాలి? వారిలో, వారి స్వభావంలో చికిత్సచేసే గుణంవుంది గనక. ఇప్పుడు ఒకరోగికాదు, ఇద్దరుకాదు సంఘం అంతారోగులే అయినప్పుడు ప్రతిస్త్రీకూడా ఈ జాడ్యం నయంచెయ్యాలి.

ఇంకకొన్నాళ్ళు పోతే మనఇంటో ముసలమ్మలు చెప్పినట్టు పాపంపెరిగి భూమి బద్దలైనా కావచ్చు. అంతవరకు సహించాలదు ప్రతి స్త్రీ కూడా కింకర్తవ్యతామూఢ్యంవదిలేసి, తనలోవున్న అనంతశక్తుల్ని వెల్లడించి కార్యసాధనం చెయ్యాలి.

(ప్రజామిత్ర.)

---

## నిర్హేతుక జాయమానకరుణ

సీరిపి ఆంజనేయులుగారు

శ్రీవిరాజిల్ల జగముల సృష్టిచేసి,
యందు సచరాచరంబుల నలవరించి,
వాని వర్తనవిధిని లోకానుభవముఁ
బెనిచిమనుచు నేఘనుఁడెల్ల మనుజవితతి,
ఎవనిలో లీనమయి ప్రభలించుమరల
నీ నిఖిలభువనమ్ము: లేవానియాత్మ
తానకంబగు భవ్యవిజ్ఞాననిధికి:
నట్టి లోకోత్తరునకు జోహారులివియ.

ఆసరసియందు, సరసీరుహాసనమున
నెలమివసియించి, యలుఁగు దున్వలువఁగట్టి,
లేఁబసుపు ఒరికదొడి, వాలిన యనుగ్ర
హానవచ్చితి నెవ్వరిదాననమ్మ?
వలయములుగేల, దండ చేబందియలును,
పవడపుంబేర్లు వనమాల పతకసీము,
బెరసి మెఱయఁగ, నెలమురిపెముల నెనసి
యొసఁగు నందాలబరణి నీవెవరవమ్మ?
జౌదలకిరీటఘృణు లాసలావరింపఁ
గెంపుగమ్మలరుచులు చెక్కిళుల మలయ,
మురువునగవులుఁ జూపులు మోవికావి
యలర, వెలసెదవెవరు? నాయమ్మచెపుమ!
నుదుటితిలకము చెమరునఁ బొదలిచెదర,
నెఱులు విరివాఁటి వెన్నున నెఱసిపఱవ,
నొలసి వ్రేళులు వీణెతంత్రుల నటింప
గానరసమాని చొక్కెడు కాంతలెవరు?
ఎనిమిదేండ్లు దాఁటని పసితనమునంద
యఖిలశాస్త్ర పురాణేతిహాస వితతిఁ
గఱచి చర్చింపఁదొడఁగె దచ్చెరువు గొలుప
చూడ నెన్నఁడు; నీపల్కుజాడవిందు.
తెలిసె! నో! పలుకులవలంతివి గదమ్మ!
'యనుఁగు కానరా'యని యేలయడుగసింక?
వచ్చితికదమ్మ నీచిన్ని పట్టిగుడిసెఁ
జేరఁబేర్మిని, నిదె నమస్కారమమ్మ.
నే సుతుఁడనని చెప్పికోనేరనైన
వినతిమై నొక్కవరము నిన్వేఁడువాఁడఁ;
దావకవతంసభృంగ సంతతులయందు
నను నొకడుంగఁ బ్రీతిఁ జేకొనుము తల్లి!

# తల్లి

రావు వెంకటరంగ నాయకులుగారు

తల్లి ఎవరు?

తల్లి ఆదిశక్తి.

ప్రాణిమాత్రమునకు జనని.

తల్లి ప్రపంచమును ప్రకాశింపజేయు జ్యోతి.

పరివారముయొక్క నాయిక, గృహస్వామిని.

తల్లి సాక్షాత్తుప్రేమ; ఆమె యానందము తన సంతాన సుఖముకొరకు జీవనము విసర్జించుటయందైయున్నది.

ఆమె తపస్సు మరియు త్యాగముయొక్కమూర్తి.

తల్లి జననము పతితోద్ధరణకొరకు, పాపుల ప్రాయశ్చిత్తముకొరకు, మరియు లోకకల్యాణముకొరకు.

తల్లి దేశము మరియు జాతియొక్క అస్తిత్వము (విద్యమానత్వము) నకాధారము.

ఆమె రాష్ట్రమునకాత్మ.

ప్రపంచమున తల్లి పదము సర్వశ్రేష్ఠము, అది పరమ పూజ్యము.

ఆమె జగద్వంద్యదేవి.

# పశ్చాత్తాపమే పతితపావనము

శ్రీమతి దుర్భా హనుమావతీగారు

[ఈవ్యాసమును రచించిన వ్యాసకర్త్రి, శ్రీయుత కొండా వెంకటప్పయ్యాపంతులు అయ్యదేవర కాళేశ్వరరావుగార్ల సిఫార్సులపైని, "ఇప్పుడిప్పుడే చిగిర్చుచున్న జాతీయభావములను పెంపొందించుకొనుటకు", (తల్లిదండ్రులును అత్తమామలును కాదనుచున్నను) భర్తగారితో సహా వార్ధావెళ్లి జమ్నాలాలు బజాజుగారు స్థాపించిన సత్యాగ్రహాశ్రమములో మూడుసంవత్సరములు విద్యాభ్యాసముచేయు సంకల్పములతో చేరినారు. ఆశ్రమమునందీమె యొక్కతెయే ఆంధ్రబాలిక. భర్తగారు చుట్టుపట్లగ్రామ పునర్నిర్మాణ కార్యక్రమమును పరిశీలించుచుందురు. ప్రకటింపబడుచున్న కథా సందర్భమునుగూర్చి ఆమె యిట్లు వ్రాయుచున్నారు. "మాకుటుంబములో జరిగిన ఒకానొక ఘటనను ఉదాహరణముగాగొని స్వానుభవముచే వ్రాసిన వ్యాస మిది కాన స్త్రీలోకమునకు జరుగు అన్యాయములను ఖండించనంతవరకు నామనస్సొప్పినదికాదు".ఇట్టి సంభవములు జరుగకుండునట్లు ప్రచారముచేయవలసినభార మాంధ్రదేశీయులపై నున్నది. గృ॥ సం॥]

౧

మోహనరావు:—పిన్నీ! మీవారు నీతో అనుకూలంగా ప్రవర్తిస్తున్నారా? మొన్ననే తాతయ్య 500 రూపాయలు పంపించమంటే, పంపించాడట. అంతటితో తృప్తిపొందాడా లేక డబ్బుకి తెప్పించమని కొడుతున్నాడా?

శాంతాకుమారి:—అబ్బాయి! క్రిందటి వారం నాడు నాన్నిచ్చిన కట్నకానుకలపేరు తీసికెళ్లి అక్కకూతురికిచ్చారు. డబ్బంతా తీసికెళ్లి స్నేహితులకు వేశ్యలకు ఖర్చెడతారు. ఆ మాయలమారి అక్క, మాఅత్తగారు లేనిపోని పుల్లిందాలపెట్టి నాదుంప తెంపుతున్నారు. ఎన్నివిధాల బతిమాలినా, ఎంత వేడినా నామాటలు చెవినిబెట్టరు సరిగదా, నా మోమైనా చూడరు. హిందూ సంఘమందు స్త్రీలు పడుపాట్లు ఎవరులెక్కిస్తారు! కాపరానికొచ్చినది మొదలు సుఖమెట్టిదోయెరుగను! రోజు దెబ్బలు తిట్లుతప్పవు!! మానాన్నకు ఏకపుత్రిక నగుటచే ఆయనకు నాయం దపారప్రేమ. నాసుఖానికొరకు ఆయన ఎన్నిపాట్లైనా పడ్డాడు. ఎన్నివంచనలయినా భరించాడు. ఎంతడబ్బయినా ఖర్చెట్టాడు. కాని ఏమిలాభం? ఆయనచూస్తే నాగుండె తరుక్కుపోతోంది. ఆయన కష్టాలన్నిటికి నేనేకదా కారణం అని అప్పుడప్పుడు దుఃఖం పొంగిపొంగి వస్తూండేది. కాని హైందవభార్యకు దిక్కెవ్వరు. వాళ్ళమొరాలకించేవారెవరు!! పురుషు డేపని చేసినా చెల్లుతోంది.

మోహ:—పిన్నీ! మనసంఘంలో స్త్రీజీవితము చాల దుర్భరముగానుంటుంది. పూర్వాచారాలభావాలని ఆచరణలో పెట్టలేక ఎవరి కనుకూలముగ నున్నట్లు వారు వారియిచ్చ వచ్చినరీతి ఆచరణలో పెడుతూ సంఘమును సంస్కారము చేస్తేనేగాని స్త్రీలకు ముక్తి దొరకదు. సరే నేను వెళ్ళుతున్నాను. తాతయ్యతో ఏమని చెప్పమంటావు.

శాంత:—కులాసాగా ఉన్నానని చెప్పు. నాకర్తవ్యాలను, ధర్మాలను శాంతస్వభావంతో నెరవేరుస్తున్నానని చెప్పు జైలుకెప్పు డెళ్లుతావురా అబ్బాయి.

మోహ:—వచ్చేవారం జాతీయవారం. కాంగ్రెసు ఆదేశానుసారంగా శాసనతిరస్కారంచేసి జైలుకెళతాను.........సరే, వెళతా.

౨

శాంతా! శాంతా!! ఎక్కడున్నావ్? డబ్బుకు రాస్తావా?

శాంత:—ప్రాణేశ్వరా! దుర్వినియోగం చేస్తే మానాన్నగారు మట్టుకు ఎందాకా పంపిచగలరు? సద్వినియోగంచేస్తే పంపుతారు కాని ఒకసారియైన మీకరుణాకటాక్షవీక్షణాల్ని నామీద ప్రసరింపజేయండి!! నా సేవలను స్వీకరించండి! నామీదజాలి కలుగదా? వ్యర్థంగా అర్థాన్ని దుర్వినియోగంచేసే బదులు వార్తాపత్రికల దెప్పించండి; సద్గ్రంథకాలక్షేపము చేయండి;పరమపవిత్రమగు గృహస్థాశ్రమమునందు అర్థాంగి నగు నాసహాయమును గూడ నపేక్షించి ఉభయుల జీవితాన్ని సార్థకముజేయండి. దేశంలో గాంధీశకమందు జరిగే మార్పులగాంచి, మీకర్తవ్యమును గూడ నెరవేర్చండి.

సుందరమ్మ:—ఏమే, వొళ్ళుపై తెలియకుండ మాట్లాడుతున్నావు!! మెగుడు మర్యాదా అక్కర్లే!! శ్రీరంగనీతులు చెప్పుచున్నావు!! పొయ్యిదగ్గర కూర్చుండేదానికి ప్రపంచకసంగతు లెందుకే నీకు? —ఏంరా అబ్బాయి ఆట్టేసాగిస్తున్నావు అటలు అదురుబెదురు పెట్టక్కర్లా?

భర్త:—భడవ,.........బద్మాష్...! ఒళ్లు తెలియక ప్రేలుతావ్"......అని బాదేడు శంకర రావు తనయక్కయగు సుందరమ్మమాటలువిని.

## 3

అత్తగారింటినుంచి పుట్టింటికొచ్చి ఆరునెలలైనా నాథర్తగారి మనస్సునుమార్చి జీవితాన్ని సార్థకము చేసుకుందామని ఎంతప్రయత్నించినా భగవంతు డన్యథాతలంచేడు. ఆదర్శహిందూరమణీమణియొక్క పవిత్రధర్మము భర్తృపాదారవిందముల సేవయేగదా!! కాని పురుషులహృదయాలు పాషాణములవలె కఠినముగానుండ కోమలహృదయులగు నారీమణులకు తావెక్కడ. రాతిలో మొక్క మొలుస్తుందా! ఎన్ని పొర్లువేడుకొన్నా స్వీకరించారుకారు నాథర్తగారు. వారుతొందరపడి ఎక్కడ మృదుత్వాన్ని వెళ్లడిస్తారోయని మాఆడబిడ్డయగు సుందరమ్మ విషపూరితోపదేశాల్ని వారిహృదయములో నింపేసేది. కాపరానికి వెళ్లిందిమొదలుకొని మాయింటి కొచ్చేవరకూ ఒకరోజు—ఒకరాత్రియైనా సుఖమెరుగనిచ్చింది కాదు ఆమహాతల్లి!! ఇంతకూ ఒకరినంటే ఏమిలాభం? ఇదంతా నాఖర్మం!!

ఇంటికొచ్చి 8 మాసములైనాయి. భావిభాగ్యాని కెదురుచూస్తూండేదాన్ని—నాథర్తహృదయం మారిపోతుందా, ఎల్లకాలం కష్టాలుంటాయా యనియనుకునేదాన్ని. నాతలిదండ్రులను దుఃఖంనుండి పూరడిస్తూండేదాన్ని. భక్తిప్రేమ కరుణలతో లేఖల్నివ్రాసి హృదయపరివర్తనానికి ఎదురుచూస్తూండేదాన్ని.

సంవత్సరమైంది కారుమబ్బులింకా తీవ్రరూపాల్ని దాలుస్తున్నాయి; ఆశాపాశము వదలలేదు. సంవత్సరంపాలుగుమాసాలు గడిచాయి. గాఢధ్వాంత సమితుల్లో విద్యుత్కాంతులకేసి చూస్తుండేదాన్ని. సంవత్సరంన్నర గడిచింది.

ఒకరోజున మానాన్న పొంగిపొంగి వస్తూన్న దుఃఖాన్ని అపుకొంటూ కన్నీళ్ళతో ఒకవుత్తరం చూపించాడు నాకు: నాథర్తగారి పొరుగింటాయన వ్రాసేడు ఆవుత్తరం: ఆయన నాయందు మానాన్న గారియందు చాలాప్రేమగా యుండేవాడు: గౌరవ సీయుడు. వుత్తరంలో, సదాచార సంపన్నుడగు ఒక అమాయకబ్రాహ్మణ్ణి మాటలతో మోసగించి, నాథర్తకు మా ఆడబిడ్డ అత్తగార్లు సంబంధం కుదిరించారనీ నాథర్త వాళ్ళప్రోద్బలముచే రెండోపెండ్లి చేసుకొన్నాడని వ్రాసేడు. ఈసంగతి వినగానే గుండె గుభేలుమన్నది. ఆశాపాశలన్నీ ఒక్కమారు తెగిపోయినవి. భయక్రోధ సంభ్రమములన్ని ఒక్కమారు ఉత్పన్నమైనవి. ప్రపంచమంతా చీకటి కమ్మినట్లు తోచింది. జీవితమంతా వ్యర్థమేగదాయని యనుకొన్నాను. ఇల్లా ఆరునెలలుగడిచాయి. ఇద్దరుభార్యలున్నవాళ్ళెంతమందో ఉన్నారుగదా, నన్నుగూడ లోకంలో ఇతరులవలె స్వీకరించి సంసారసాగరాన్నీదమని పెద్దమనుష్యులు, మానాన్న ఎంతో చెప్పేరు నాథర్తగార్కి. కాని ఏంలాభం!! అబలలపై అత్యాచారాలు చేయటానికి సంఘమొప్పుకుంటుంది కాని పురుషుణ్ణి దండించటాని కొప్పుకుంటుందా? వాని కేమి మొగాడు. వా డిష్టమొచ్చినట్లు చేస్తాడని అటుందికాని—అయ్యో! పాపం! ఆనారీరత్నము యొక్కగతిఏమిటి. ఆపతివ్రతామతల్లి తనజీవితాన్ని బూడిదలోపోసిన పన్నీరువలె వ్యర్థపరచవలసిందేనా యని విచారింపదుగదా.

ఆశలన్నిటిని నిరాశచేసుకొన్నా! శ్రావణమాసం: వూళ్ళో తోడిబాలికలందరు రకరకాల చీరెలతో వొంటినిండా ఆభరణాలు ధరించుకొని పార్వతిలాగ నొసటకుంకుమబొట్టు దిద్దుకొని, కాళ్ళకు పసుపు పూసుకొని మా యింటిముందరినుంచి వెళుతూ నన్నుగూడా పేరంటానికి పిల్చేవారు. నాహృదయాంతర్గతంలో శోకాగ్ని ఎల్లా ప్రజ్వరిల్లుతుందో వారికేమితెలుసు. వస్తూన్న దుఃఖాన్ని అపుకొని ఇంటిలోపనిఉందని వంకబెట్టి పేరంటానికిగూడ వెళ్ళేదాన్నిగాదు. వెళ్లేఅర్హతకూడ నాకేముంది. భర్తను వొదిలిపెట్టిన ఈమెగూడ రావాలీ పేరంటానికి అని అంటారులోకులు. నాతలిదండ్రుల దుఃఖాన్ని చూడ లేకపోయేదాన్ని కొన్నాళ్ళు. నాఆడబిడ్డను అత్తను దూషిస్తుండేదాన్ని సంఘాన్ని దూషిస్తుండేదాన్ని; కొంతకాలం సంఘదృష్టిలో స్త్రీలు, పురుషులయొక్క

భోగ విలాసాలకు తృప్తికలుగజేసే వస్తువులని, ఎల్లప్పుడు వారు పొయ్యిదగ్గర పనిచెయ్యటానికని, ప్రపంచకంతో వారికేమి సంబంధ ముండకూడదనీ, స్త్రీలజీవితములు పురుషుల చేతులలో వుండాలనీ, పురుషు లేమిచేసిన స్త్రీలు సంహించాలనీ ఉన్నప్పుడు సంఘాచారాలన్నీ నిర్మూలించక ఇతరులను దూషిస్తే లాభములేదనుకున్నా. నాభర్తకు ఇవ్వగా మిగిలిన ఆభరణాలన్నీ పెట్టెలోదాచి సమయము వచ్చినప్పుడు దేశసేవకు వినియోగిద్దామని నిశ్చయించుకొన్నా. ప్రపంచములో ఎవరికోసమో బ్రతుకుటయని తలపోసేదాన్ని. ఆత్మహత్య చేసుకొందామాయని అనుకొన్నాను. 'ఛీ' ఆత్మహత్య మహాపాతకమను మనశాస్త్రములఘోషింపు వెంటనే కర్ణకుహరద్వారములజొచ్చేది. మోహనునివలె దేశసేవచేయటానికి వెళుదామా యని యనిపించేది. కాని కుళ్లి కృశించిపోతూన్న మాజీవితాల్ని సంఘబహిష్కారాలతోను, నిందలతోను, ఇంకాకృశించి పోతాయని అనుకొని భయముచే మానుకొన్నాను. ఈవిధంగా మనస్సునకు శాంతికలిగేదేకాదు. నా అవస్థలన్నీ నామనో వైకల్యాల్ని ఎవరితో మొరపెట్టుకునేది. న్యాయమార్గమున చూపు సమదర్శిని ఎవరు స్త్రీలకు. సంఘంలో సహజంగా స్త్రీ మంచికీను చెడ్డకీను అతి సాహసురాలు. ఆసహజగుణమే నాలోకూడ ఇప్పుడు ప్రజ్వరిల్లింది. ఓనాడు దేశసేవ చేస్తామా యని బయలుదేరనిశ్చయించుకొన్నా: బయలుదేరానుకూడ. ఇంతలో నావృద్ధ మాతాపితలు, అదేమోకాని నన్ను చూచి 'కవ్వు'మన్నారు. స్త్రీ హృదయంలో ఎంత సాహసమున్నదో ఎంత అభినివేశముందో, అంత కోమలత్వము, అంత సరళత్వము కూడా వుంద కాబోలు!! వారిదీనాలాపాల్ని చూచేసరికి నాసాహస హృదయం, నాపట్టుదల అట్టే కరిగిపోతాయి. దేశసేవకై నేను బయలుదేరనున్నానని ఎల్లాగో గ్రహించాడు మానాన్న. రాత్రల్లా నిద్రపట్టిందికాదు నాకు. పరిపరి విధాల ఆలోచనలు పోయాయి: జీవితంలో ప్రతివాడు కోరేది కర్తవ్యపాలనే కదా. కర్తవ్యపాలనముంటేకదా ఆత్మశాంతి ఆనందముపొందేది. నాముదుసలి తలిదండ్రులకు వేరు దిక్కెవ్వరును లేరు గదా! అంతా వారికినేనేకదా! ఎవరైతే నాసుఖమే వారిసుఖముగా నెంచి నాజీవితాన్ని యభివృద్ధిలోనికి దీసుకొచ్చి సార్థకము చెయ్యాలని తమశక్తిలోనున్న దాన్నంత త్యాగం చెయ్యటానికికూడ సంసిద్ధమైనారో అట్టి నాతలిదండ్రులసేవయే ఇప్పుడు నా కర్తవ్యపాలన యని నిశ్చయించుకొన్నా. తత్కర్తవ్యపాలనమునందే నాకు ఆత్మశాంతి లభిస్తుందని నిశ్చయించుకున్నాను.

౪

మోహ౯:—పిన్నీ! నాజైలుజీవితం నాకొక గొప్పపాఠం నేర్పించింది. కష్టసుఖాలను ధైర్యోత్సాహంతో ఎదుర్కొనేవాడికి లోబడనిది ఏదీలేదు. మనస్సులో వున్నకల్మషం, ఆడంబరము, అహంకారము, స్వార్థము మొదలగువాటిని పోగొట్టుకొనడానికి మార్గంచూపించింది నాజైలుజీవితము. జైలులో గొప్పగొప్పవాళ్ళయొక్క పరిచయంవల్లను సద్గ్రంథ కాలక్షేపంవల్లను, సామాన్య జీవితంవల్లను(Simple life)మనసంఘంలో నీతిపేరిట యవినీతి ఎంతగాఢంగా నాటుకొందో గ్రహించడానికి అవకాశంకలిగింది.

శాంత:—అవును, సంఘదురాచారాలన్నీ నీబోటి యువకులు నిర్మూలించి నాబోటి యనాథబాలికలను తరింపజేయాలి. అన్నిపయైన నాజీవితం వ్యర్థమేకదా ప్రపంచములో జీవన్మృతను.

మోహన్:—పిన్నీ! అలా అనొద్దు. సత్యదయాశౌచములనే యాదర్శములుగాగొని, నీముదుసలి తలిదండ్రులసేవ చేస్తున్నా భర్తసేవచేస్తున్నా దేశసేవ చేస్తున్నా ఒకేగమ్యస్థానానికి చేరుతావు. దేశసేవలోను భర్తసేవలోను, నీముసలి తలిదండ్రులసేవలోను సత్యదయాశౌచములే యాదర్శనీయములు. ఫలితము క్రియాబాహుళ్యాన్ని బట్టికాదు భావబాహుళ్యము, నిర్మలత్వాన్నిబట్టి. మిల్టన్ మహాకవియన్నట్లు (The mind is in its own place, And in itself can make a Heaven of Hell, and a Hell of Heaven) అంటే స్వర్గము నరకతుల్యంగాగాని, నరకం స్వర్గ




శ్రీమతి సుధారాణి

శ్రీబర్ద్వాన్ మహారాజకుమారి 'కర్మ' అను ఫిల్ములో రాకుమారిపాత్ర ధరించిన కళాభిమానిని.



డా॥ మిస్ యస్.జి.వి. పాటెల్, యం.బి.బి.యస్.,

బొంబాయిరాష్ట్రమున ఖోజాసంఘమం దింతవరకు

చదివిన దీమె యొక్కతయే.

ల్యంగాగాని, సుస్థిరమనోభావాన్నిబట్టే కలుగుతుంది. కాబట్టి మనోభావమే ప్రధానముకాదు...సరె, వెళ్ళుతా. నేనుగూడ ఇక్కడేవుండి నా భావిజీవితాన్ని ఆదర్శనీయంగా చేసుకోవాలి. సంఘదురాచారాల్ని తెంపి నాభార్యకుకూడ భావిజీవిత సౌభాగ్యాన్ని గురించిన్ని, ఆదర్శకుటుంబ జీవితాన్ని గురించిన్ని విద్యచెప్పాలి.

❧

మర్నాడు మోహనుడు నాపేర "భారతి" 'గృహలక్ష్మి' 'కృష్ణాపత్రిక' 'ఆంధ్రపత్రిక'లను పంపమని తత్పత్రికా కార్యాలయాలకు వ్రాసేడు. ప్రాతఃకాలమునలేచి గృహకృత్యాలు దీర్చుకొంటూ అవకాశము కలిగినప్పుడెల్ల ఏదోఒకటి చదువుతుండేదాన్ని. మానాన్నదగ్గర సంస్కృతాంధ్రములును అభ్యసించేదాన్ని. వూళ్లోవాళ్ళంతా 'నారిముచ్చనీ, భర్తృబహిష్కృతురాలికి పత్రికా పఠనమెందుకనీ, వూళ్ళో నలుగురితోపాటు ఎవరితోను మాటలాడదనీ ఎంత బెట్టుదమ్మా, లోకంలోసంగతులు దీనికెందుకనీ, పరిపరివిధాల వేళాకోళములు చేసేవారు. మానాన్నకు నాయందపారప్రేమ యుండుటచే మనశ్శాంతికిని జ్ఞానాభివృద్ధికిని ఏమిచేసినా యనేవాడుకాదు. నా జీవితము, ఆయనకు స్త్రీవిద్యయందభిమానము కలుగజేసింది యని వీధులోకెళ్ళగనే మానాన్నను నలుగురు నాలుగుమాటలనేసరికి, పాపం! ఆయన చిన్నవోతుండేవాడు కాని నాసత్ప్రవర్తన నాకేసాక్షి. ఎవరేమనుకుంటేనేమి.

మోహనరావు మాపెత్తల్లిమనుమడు; వయసునకు చిన్నవాడైనను మంచియాదర్శాలు కలవాడు. ప్రస్తుతము మనదేశమునందు ముఖ్యముగా ప్రతివాడు అభ్యసింపవలసినట్టి సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీభాషలను అభ్యసించేవాడు. మంచివక్త. తానుఏదైతే సత్యమని నమ్ముతాడో, ఎవరేమనుకున్నా, ఎన్ని ఆటంకాలు కలిగినా చేసితీరేవాడు; ఉదారుడు; పరోపకారపరాయణుడు. అత్తవారి వూరీవూరే. హైమతలిదండ్రులు పూర్వాచారపరాయణులు. అన్యమతాలపేరు చెప్పుతేసరి "శివశివ" యని చెవులు మూసుకుండేవారు శివావధాన్లు. కూతురుకి చదువుచెప్పమని అల్లాచెప్పక పోతే భావిజీవితం భయంకర రూపం దాలుస్తుందని తరువాత పశ్చాత్తాపం పడితే లాభములేదని మామగార్కి మోహనుడెన్నో లేఖలువ్రాసేడు. కాని ఆడవాళ్లకు చదువెందుకు ఈరోజుల్లో ఆడవాళ్ళకుచదువొస్తే ప్రపంచకాన్ని దక్కనిస్తారా. వాళ్ళ శాంతమ్మనుగురించి లోకులు ఎల్లాఅనుకుంటున్నారో చూడుమని చదువు చెప్పించేదుకాదు. హతాశుడై మోహనుడు మావూళ్ళోనే వచ్చివుండడం మొదలెట్టాడు. నయాన భయాన హైమను చేరదీసి చదువు చెప్పేవాడు. హైమతలిదండ్రులకు, వూళ్లో ఇరుగమ్మ పొరుగమ్మలకు 'ఈ అనాచారదృశ్యం' కంటకంగా వుండేది. వూళ్లోవాళ్ళంతా హేళనచేసేవారూ నిందించేవారే కాని వారి భావిజీవితాన్నిగురించి ఆలోచించేవారు ఒకరూలేరు. మోహన్‌కు అత్తమామలకు అప్పుడప్పుడు పెద్దకలహంజరిగేది. చదువుచెప్పుతానంటాడు వీడు! వద్దంటారువాళ్ళు! వూళ్లోవాళ్ళూనూ! చివరికి వీనిపంతమే నెగ్గేది. అనేవాడు 'పిన్నీ సత్యం నా పక్షముంది కాబట్టే నెగ్గాను.' అని నవ్వుతూ. వాని సత్యదీక్ష సంఘదురాచారాల యెడల తిరస్కరింపు చూసేసరికి వెనుకటి విచారాలన్నీపోయి నూతనోత్సాహం ఆనందం కలిగేదినాకు. రజస్వల అయిన ఆరోజునాటినుండే భార్యయగు హైమను వెంటేసుకొని నదీతీరానికేసి ప్రకృతి సౌందర్యాన్ని అనుభవించుటకు షికారుగా వెళ్ళేవాడు. ఈ విపరీత దృశ్యాన్ని చూచేసరికి మావూరిలోవారందరూ మరీ ఇరుగమ్మ పొరుగమ్మలు వేళాకోళాల్ని నిందల్నికురిపించేవారు. అంతటితో తృప్తిపొందక హైమతల్లిదండ్రులను కేకలెయ్యడం మొదలెట్టారు పాపం! వారేమిచేస్తారు!!అట్టేదిగులుపడి కన్నీళ్ళుకారుస్తుండేవారు.

భార్యాభర్తలిరువురును పవిత్ర గృహస్థాశ్రమపు మహోన్నత తత్వాన్ని బాగా గ్రహించేవరకును, స్త్రీకి కనీసము పదునెనిమిదియేండ్లును పురుషునకు

ఇరువదినాలుగేండ్లును దాటేదాక గృహస్థాశ్రమము స్వీకరించకూడదని దీక్షబూనే హైమామోహనులు. ఐహిక భోగాపేక్షలతోను స్వార్థముతోను నిండిన లోకులు బాహ్యానుకరణమే ప్రధానమని తలచేరేకాని వారి పవిత్రదీక్ష సంగతేమైనా గ్రహించారా? నేను కూడా సంఘంలోవాళ్ళని తిరస్కరించి సాయం కాలము చేలకేసి వెళుతూ సస్యాల సౌందర్యశోభను అనుభవించేదాన్ని. ఊరిలోవాళ్లంతా ఒకటి నేను హైమా ఒకటి. సంఘదురాచారాల్ని తిరస్కరించలేక మొగాళ్ళ దుర్మార్గాలకు 'దాసోహం' యని అత్తవారింటనూ పుట్టింటనూ పడరాని యిక్కట్లుపడు మాబోంట్ల నారీమణు లెందరున్నారోగదా యని యనిపించేది. మాకు, వాళ్ళకుకూడా జ్ఞానమార్గాన్ని చూపించి భర్తృ బహిష్కృత జీవితాల్ని ఆదర్శనీయంగా సార్థకంచేసుకోటానికి ప్రచారం చేయడం కల్పించా. సంఘదురాచారాల్ని. అందును, అబలలపై సలుపు అత్యాచారాల్ని ఖండిస్తూ దినపత్రికలకు మాసపత్రికలకు వ్యాసాలు కల్పనాకథలు వ్రాస్తుండేదాన్ని. ధైర్యంతో సంఘదురాచారాల్ని ఎదుర్కొనేటప్పటికి ఎవ్వరు మాటలాడ సాహసించేవారు కారు. నోరులేని యబలలను అణచటానికి ప్రయత్నించుతారుకదా పురుషులు అని అనుకొన్నా.

గాంధీగారు లండన్‌నుంచి భారత తీరములమీద కాలిడగానే స్వాతంత్ర్య రణభేరి మ్రోగింది. మోహనుడు శాసన తిరస్కారము జేయడానికి సిద్ధమైనాడు. హైమకూడ భర్తతోపాటు కారాగృహానికి వెళ్ళ సమకట్టింది. తలిదండ్రులు ఇరుగమ్మ పొరుగమ్మలు ఆటంకపరచేరు. వంశానికి అపనింద కలుగజేయడానికి చెడబుట్టిందనీ, బోగందానిలాగు తయారైందనీ, యెవరి ఇష్టమొచ్చినట్లు వారుదూషించేరు. ఇన్నాళ్ళనుంచి గ్రామంలోనేవుండిసంఘంనస్కారాన్ని పూనుకున్నా కాని హైమకూడ మొగాడిలాగు వీధులో కల్లి మాటలాడి కొట్టువద్ద కల్లుపాకలవద్ద పికెటింగ్ చేయడానికి వెళ్ళేసరికి వూరిలో బ్రాహ్మణులు యావన్మంది శివావధానులుగార్ని శివమ్మగారిని బహిష్కరిస్తామని బెదరించేరు. తలిదండ్రులెంత మొత్తుకున్నా లాభము లేకపోయింది. ఓవైపున బిడ్డయందుండు ప్రేమ, ఇంకొకవైపున సంఘబహిష్కారము!! మధ్యవీరిద్దరు నలిగిపోయినారు పాపం! ఎలా ఐతేనేమి హైమ భర్తతోపాటు జైలుకెళ్ళింది. నాకు కూడావెళుదామని కోరికపుట్టింది. కాని నాతలిదండ్రులసేవ నన్నావేశించింది. అదిగాక మాతల్లి రేపోమాపో అన్నట్టిస్థితిలోవుంది.

ఆరుమాసాలైనాయి అప్పుడే స్త్రీసమాజాల్ని చుట్టుప్రక్కల గ్రామాదుల్లోస్థాపించేను. రోజుమధ్యాహ్నము కాసేపు వార్తాపత్రిక చదివి వినిపించేదాన్ని. తరువాత భారతభాగవత కాలక్షేపం చేసేదాన్ని ఐహికభోగాపేక్షలనే ప్రధానముగ గొను పాశ్చాత్య నాగరికతవ్యామోహనమను నుడిగుండమునందు తిరుగు నేటి స్త్రీ సమాజములను ఖండిస్తు, అనుకరణ శీలమును విడనాడి స్వభావశక్తిని, ఆధ్యాత్మికశక్తిని పెంపొందించు సమాజముల నభినందిస్తూండేదాన్ని. సావిత్రి, దమయంతి, పద్మిని, మొదలగు హైందవ నారీరత్నముల మార్గము ననుకరింపుడని ప్రబోధిస్తూ వుండేదాన్ని. దేశహితైక కార్యములందు స్త్రీలు ఝాన్సీలక్ష్మీబాయి వలె పురుషులకు ఏమాత్రము తీసిపోగూడదనియు, పురుషులకు చేయూతనొసగి తమకర్తవ్యమును నెరవేర్చాలనిఉద్బోధన చేసేదాన్ని. ఈవిధంగా సంఘసేవ నాతలిదండ్రులసేవ చేస్తుండేదాన్ని.

## ౬

మోహన్:—నారెండవ యాత్రకూడ ముగించేను హైమఇంకావారంరోజుల్లోవిడుదలౌతుంది. అమ్మమ్మ అవసానకాలమందు చాలా బాధపడ్డదని విని చాలా విచారించాను.

కాంత:—అందరము ఒకరోజుకాకపోతే ఒకరోజైనా పోయేవాళ్లమే. నాజీవితంలో నాతల్లి యెడల నాకర్తవ్యాన్ని పూర్తిగానెరవేర్చగల్గా. అదే నామనస్సుకు శాంతిప్రదాయిని.

మోహన్:—నీబోటి యబలలందరు సంఘానికి వెరచి జీవితాల్ని వృధాగా గడపటము చాలా శోచనీయము!! సంఘమా! ఎంతమందియబలలను, ఎంతమంది నారీమణులను, కూపంలోపడేసి మ్రింగేస్తున్నావు!! వారికిగూడ పురుషులవలెనే సత్కార్యాచరణముల యందు నవకాశ మిచ్చేటట్టయితే ఈపాటికల్లా భారతమాత దాస్యశృంఖలాలు తెగిపోయేవే...... పిన్నీ! నేను హైమ అత్తయ్యకు సేవచేస్తూంటాను, నీవుకూడ ఒకసారి జైలుజీవితం అనుభవించిరా. ఈలోగా నేను ఆశ్రమమును స్థాపించుతాను. అందరము కలిసి సమాజసేవ చేస్తుండవచ్చు.

## ౭

నాసవతిపేరు సుశీల; సార్థక నామధేయురాలు. సుందరమ్మ చనిపోయిన తరువాత నాథరత్నగారికిగూడ కాస్త మెకం విచ్చిపోయింది. తిరిగి నన్ను స్వీకరించమని ఎంతో చెప్పింది సుశీల; కాని నేను జైలుకి వెళ్లానని, ఆశ్రమంలో హరిజనులను చేరదీసి నారసేవ చేస్తున్నానని స్వీకరించుతే సంఘము బహిష్కరిస్తుందని తిరస్కరించేరు ప్రప్రథమమున. సుశీల చాలాగుణవతి. చదువుకాస్త అయినప్పటికీ న్యాయాన్యాయ ధర్మాధర్మవిచక్షణ జ్ఞానమెక్కువ!! ఆమె బోధనలవల్ల నాథరత్నహృదయం పూర్తిగమారిపోయింది. తనఅజ్ఞానాన్ని నిందించుకునేవారు. కుటుంబజీవితంలో మాయలమారి అత్తాఆడుబిడ్డలు ఎలాగు విరోధంకల్పించుతారో తెలుసుకున్నారు. నాపవారుచేసిన అన్యాయానికి చాలాపశ్చాత్తాపపడ్డారు. పత్రికలకు తరుచు నేవ్రాసే వ్యాసాలను చదువుతూండేవారు; ముగ్ధులైపోయేవారు. ఒక్కొక్కసారి వ్యాసాల్లోను కల్పనాకథలలోను నేప్రకటించే భావాల్ని సంఘదురాచారాల్ని అబలలపైజరుగు అత్యాచారాల్ని చదువుచు, బొటబొట కన్నీరు కార్చేవారు!! తానుజేసిన మహాపాపానికి పరిహార మేమిటాయని ఆలోచించేవారు.

ఒకరోజున ఆశ్రమంలో ఆశ్రమవాసులకు రాట్నమొడుకుట నేర్పిస్తుంటే సతీసమేతుడై బాష్పాకులనేత్రుడై మోకరించి అన్నారు నాథరత్నగారు "శాంతా క్షమించు నీవు నిజంగా శాంతిస్వరూపిణివి" అని. నేను సజలనేత్రురాలనై "మిమ్మల నేనా క్షమించుట!! మీయందు దినుసంతయు తప్పులేదు. సంఘంలో దురాచారా లిట్లుండ దానికి మీరేమి చేయగలరు? నాసోదరి సుశీలను తమ సహధర్మచారిణిగా గొని సాంఘిక రాజకీయాభివృద్ధికై పాటుపడండి. సంయమధారిణినై నాజీవితాన్ని ఈవిధంగా సమాజసేవయందు గడుపుతా.

హైమామోహనులవలె సుశీలాశంకరులు గూడ సంఘసంస్కారమునందును, కాంగ్రెస్సునందును జీవితాల్ని గడుపమొదలెట్టారు. నన్ను ఆశ్రమ యజమానిగా జేసి నా గౌరవార్థమై ఆశ్రమమునకు "శాంతి ఆశ్రమము" అనిపేరుపెట్టారు. ఆశ్రమంలో అందరు నన్ను తల్లివలె గౌరవించడమే కాకుండా నాఆజ్ఞలను కూడ శిరసావహించేవారు. దీనిలో ముఖ్యంగా నావలె భర్తృ బహిష్కృతురాండ్ర యొక్కయు బాలవితంతుల యొక్కయు జీవితాల్ని దేశసేవయందును హరిజనులసేవయందును వినియోగించడానికి ఉద్బోధన జరిగేది. హరిజనుల బాలికలకు గూడ సమాజసేవచేయుటకు తగురీతిగా 5 సంవత్సరాలకు తక్కువకాకుండ విద్యగరపేవాళ్లం. ఆంధ్రదేశపు హరిజనపర్యాటన జరిగేటప్పుడు మహాత్ముడు మొన్ననే దీని ప్రథమ వార్షికోత్సవాన్ని జయప్రదంగా జరిపేడు. ఇప్పుడీ యాశ్రమమునందు సంఖ్య 85.

శంకరరావు:—శాంతా! క్షమించావా అన్నాడు భావగంభీరంగాను.

శాంత:—అన్నిటికిని క్షమించువాడు ఆదయామయుడే క్షమించునుగాని నేనెంతటిదానను. పశ్చాత్తాపమేపతితపావనము గదా!

# కీ. శే. ముళ్లపూడి బాలాత్రిపురసుందరమ్మగారు



కీ॥ శే॥ బాలాత్రిపురసుందరమ్మగారు

స్వర్గవాసినియగు సుందరమ్మగారు, ఏలూరు తాలూకా పినకడియము గ్రామవాసిని. భూస్వాములును, జాతీయవాదులును నగు శ్రీయుత చలసాని జయరామయ్యగారి ఏకైకపుత్రిక. శ్రీయుత ముళ్లపూడి కాశీ చౌదరిగారి ధర్మపత్ని. కాంగ్రెసు కార్యములలో, రైతులకు సహాయకరములగు పనులలో పాల్గొనుచుండుటయేగాక అస్పృశ్యతా నివారణ వితంతువివాహాది సంస్కరణ కార్యములలో నాకు దోడ్పడుచు చనవుగను స్వతంత్రముగను వ్యవహరించుచుండెడిది. ఈమె మరణము మార్చి 31-వ తేది ప్రాతఃకాలమున 7 గంటలకు సంభవించెను. ఇరువదిదినములలో సన్నిపాతజ్వరమువలన యీ సోదరిజీవనలీల యిరువదిఐదువత్సరముల లేతప్రాయములో పరిసమాప్తమయ్యెను.

విద్యాధికురాలుగాని యీమె, పూర్వాచారములకు పేరుగాంచిన పల్లెటూరిలో జన్మించిన ఈ పవిత్రమూర్తి మహాత్మాజీ దివ్యవాణి కారణముగ సంఘసంస్కారిణియై ముందంజవేసెను. అస్పృశ్యతనుగూర్చి గాంధీమహాత్ముడు చెప్పుటయే తడవుగ వీరి గృహమున తన చేతితో వండినవంటకములతో సవర్ణులకు అవర్ణులకు స్వయముగ తనచేతితో వడ్డించి విందుజేసినది. పై విందుకారణముగ గ్రామస్థులు తమనుబహిష్కరించినను జంకక తన పట్టుగలతో గ్రామస్థులలో కదలిక పుట్టునట్లుజేసి ధైర్యస్థైర్యముల గనుబరచినది. మొన్న మహాత్మునకు ఏలూరి కరుదెంచినపుడు తనచేతి బంగారుగాజులను హరిజననిధికర్పించినది. ఇట్టి ధైర్యవతి సంస్కర్త్రి లేతప్రాయమునందే మరణించుట దేశముయొక్కయు స్త్రీలయొక్కయు దురదృష్టమని చెప్పవచ్చును.

ఈ పవిత్రమూర్తిమరణముచే దుఃఖతులైయున్న వీరిభర్తగారికి జననీజనకులకు నాసానుభూతిని వెల్లడించుచున్నాను.

ఈమె పవిత్రాత్మకు భగవానుడు శాంతిని బ్రసాదించుగాక!

ముల్పూరి చుక్కమ్మ.

# పందిరిమంచము

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

నేను ఒకగొప్ప జమీన్‌దారును. పేరు గోపాలరావు; వయస్సు ముప్పదేండ్లు; మా తండ్రి నా చిన్నప్పుడే పోయినాడు. ఏదో చదివాను కాని,చదు వంటలేదు. కాని చాల డబ్బుంది. నాకు దేశాటనమంటే చాలసరదా. అంచేత దేశయాత్రకి బయలుదేరా.

చాలదేశాలు తిరిగి చాల వినోదాలు చూచి యొకవూరు చేరుకున్నా. ఆవూరిలో బండివొకటి కట్టించుకుని వూరు చూడ్డానికి బయలుదేరా. ఒకదాసవెంబడి యొకటిగా యావూరిలోని వింతలు, వినోదాలు, చూచి చీకటిపడుతున్నప్పుడు, బండియెక్కి వెడుతూ బండివాడిని యిలాఅడిగినాను.

"సాహెబు,యీవూరిలో యింకా చూడ వలసినచోట్లు యేమైనా వున్నాయా?

"అయ్యా ఎక్కువవియేమిలేవు; కాని జూదములచావిడి మాత్రము యొకటివుంది. అయినా మీబోంట్లు వెళ్లేచోటుకాదు."

"ఫరవాలేదు. బండితోలు అక్కడికి. నేనసలు వూరు చూద్దామనే వచ్చాను."

బండివాడు యెంత దూరమో చెప్పి చూచాడు కాని నేను వినలేదు. వాడిచేత బండి యక్కడికి తోలించాను. బండిదిగి వాడికి అద్దెయిచ్చి పంపేశాను.

౨

అదియొకపెద్ద మూడంతస్థులమేడ: చూడ టానికి చాల దర్జాగావుంది.విద్యుద్దీపములతో కళకళలాడుతున్నది. వాకిటి బంట్రోతు నిలుచునివున్నాడు. వచ్చేవాళ్ళకి లోపలికి దోవ చూపుతున్నాడు. ఈభవన మసలు జూదముల చావిడిగనే కనుపించలేదు: పెద్దక్లబ్బులాగ వుంది.

ఆబంట్రోతు దారిచూపితే లోపలికి వెళ్లాను. పెద్దహాలు; దానిలో చాల బల్లలు, చుట్టూ కుర్చీలు వేసివున్నాయి పైన పంకాలాడుతున్నయి. ఒకటేబిల్‌వద్ద నలుగురు పెద్దమనుష్యులు తదేకదృష్టితో డబ్బు పెట్టి చీట్లు ఆడుతున్నారు. వాళ్ల మధ్య సగము ఖాళీయయిన విస్కీసీసా, రెండుగ్లాసులు పెట్టివున్నాయి. ఇంకొక టేబిలుదగ్గర వొకడు కొంచెము మధ్య వయస్కుడు, సిగరెట్టు పొగవిడుస్తూ పేపరు చదువుతూ, మధ్యమధ్య యాలోచిస్తూ కూర్చొనివున్నాడు. తక్కిన బల్లలవద్దకూడ జనులుకూర్చొని వారివారి పనులలో మునిగి యున్నారు.

నేను లోపలికివెళ్లి యొక కుర్చీలోకూల బడ్డాను. నాకంతా తమమాగావుంది. వారి యాట ముగిసింది. అందులోయొకడు తక్కిన వాళ్ళెంతబ్రతిమాలుతున్నా వినిపించుకో కుండా యాటలోకి రానని వెళ్లిపోయినాడు. తక్కినముగ్గురు నన్ను చూచారు. ఆటకు రమ్మని పిలిచారు. మొదట రానన్నాను. ఆటతెలియదన్నాను. ఎట్లాగైతేనేం చివరకి వాళ్ల బలవంతంవల్ల వొప్పుకోవలసివచ్చింది.

ఆటమొదలు పెట్టి యాడినాము. నేను వోడిపోయినాను. నాకు పట్టుదల యెక్కు

వైంది. తిరిగి యాట సాగించాము. నేను పట్టుదలతో ఆడి యాట గెలిచాను. ఆట పైన యాటజరుగుతున్నాది. ప్రతి యాటలో గెలుపు నాదే! రూపాయలు గలగలమనివచ్చి పడుతున్నాయి! తక్కిన ముగ్గురు నావైపు చుర చుర చూస్తున్నారు. కాని యాట మాత్రము జరుగుతున్నాది. అందరు నిశ్శబ్దముగా, నిశ్చలంగా యాటసాగిస్తూ, మధ్య మధ్య హుషారు కోసము విస్కీ సేవిస్తూ యాడుతున్నాము.

## 3

చాల రాత్రియయింది యాట ముగిసేటందుకు. నావద్ద దాదాపు వెయ్యిరూపాయిలుచేరాయి!! తక్కిన ముగ్గురు మొదట యాటనుంచి వెళ్లిపోయినవాడు నలుగురు నావేపు చురచుర చూచివెళ్లారు. నేనూ లేచి డబ్బుతీసుకుని బసకు వెడదామని లేచాను. తక్కిన వారందరు యెప్పుడులేచి వెళ్లేరో మేము గమనించనేలేదు.

ఇంతివరకూ మౌనముగా కూర్చున్నవాడు నావద్దకువచ్చాడు.

"అయ్యా యెక్కడికి బయలుదేరారు?"

"నాబసకు"

"ఇక్కడకు యెంతదూరము?"

"కొంచెము దూరమే అయినా యింత రాత్రివేళ వెళ్లడానికి భయంవేస్తోంది."

"మీరిప్పుడు యెంతమాత్రము వెళ్లవద్దు."

"ఎంచేత"

ఇప్పుడు మీతో యాడినవారు చాల దుర్మార్గులు. వారు మిమ్ములను దారిలోకొట్టి డబ్బుతీసికెడతారు."

"అయితే నన్నిప్పు డేమిచేయమంటారు? నాకు మాత్రము చాల కంగారుగావుంది."

"ఈక్లబ్బుపైమేడ హోటలు. ఆపై యంతస్థున వసతిగదులున్నాయి. మీరుకావలిస్తే యీరోజుకుమాత్రము పైన పడుకోండికాని బయటికిమాత్రము వెళ్లవద్దు."

నాకుభయమెక్కువైంది!వచ్చింది క్రొత్త చోటు. చేతిలో డబ్బుంది. పైన వీడు లేనిపోని భయంపెట్టాడు. "సరే! గదులు హోటలు చూపించు"అన్నాను.

వాడితోకూడ వెళ్లాను హోటలులోకి. అది ఒక పెద్దహాలు. కుర్చీలుబల్లలుఅన్నీ యమర్చివున్నాయి. చాల రాత్రియవడమువల్ల యన్నిబల్లలు కాళీగావున్నాయి. కాని నాకు యెడలంతా దడగా భయంగా యేమితోచకుండావుంది. అంచేత యేమి సరిగా చూడలేదు. ఎట్లాగో నాస్నేహితునితో యొక బల్లవద్దకూర్చున్నాను. నాస్నేహితుడు రొట్టె కాఫీ ఆర్డరుచేశాడు. అవిపుచ్చుకుని బిల్లు యిచ్చేసి గదిలోకి వెళ్లడానికి లేచాము.

## ౪

మూడవఅంతస్థుకు వెళ్లాము. మెట్లు ఎక్కడంతోనే యొక్కపెద్దవరాండా; దానిని ఆనుకొని వరుసగ అయిదారుగదులున్నాయి. అన్నీ తాళములు వేసివున్నాయి. నాస్నేహితుడు ఒకగదితాళము తీశాడు. గదిశుభ్రముగావుంది. గదిలోచుట్టు కావలసినన్ని కిటికీలువున్నయి కాని అన్నీ మూసివున్నయి. నడుమ యొక పందిరిమంచము, పడక తల

గడలు అన్ని బాగున్నయి. పడక గుడ్డలన్ని తెల్లగా సుభ్రముగవున్నాయి. పందిరిగూడ గట్టిగా బాగుంది. ఒకప్రక్కన గుడ్డల డ్రాయరు పోక టేబిల్ ప్రక్కన కుర్చీయన్నీ వసతిగ వున్నయి. నాకుమాత్రము స్నేహితుడు యెప్పుడు వదలిపెట్టునా యెప్పుడు పడుకుందు నా యని వుంది. ఏదోపరధ్యానముగా వున్నప్పుడు నాస్నేహితుడు వీపు మీద తట్టాడు. వులికిపడ్డాను.

"ఇదేగది మీరు తలుపులు అతిజాగ్రత్తగవేసుకుని పడుకోండి. లేకుంటే వాళ్లు తలుపులు త్రోసుకొచ్చి మిమ్ములను హింసిస్తారు."

"ప్రక్కగదిలో ఎవ్వరువుండటము లేదా?"

"ప్రస్తుతము అన్నీ కాళీగనే వున్నాయి."

"అయితే రాత్రిగడవటము ఎట్లా? మీరైన సాయంపడుకుంటారా?

"నేను క్రిందనే వుంటాను. కావలిస్తే పిలవండి; అయినా మీరు యలసివున్నారు. త్వరగా నిద్రపొయ్యేట్టువున్నారు. తలుపులు జాగ్రత్త; నేను వెళుతున్నా; సెలవు"

"సెలవు"

౫

నాస్నేహితుడు వెళ్లిపోయినాడు. వాడు నాకు పూర్తిగ భయముపెట్టాడు. నాకు ఆందోళన యెక్కువగవుంది. కోటుతీసిమేకుకు తగిలించాను. డబ్బుమూట టేబిలుమీద పెట్టాను. మంచముఒడ్డునకూర్చుని సిగరెట్టు వెలిగించాను. కొంచెముకాల్చి దానిని పారేసినాను. తలుపును గడియలుపెట్టి లాగి చూచాను. రాలేదు కాని నాభయముకొద్దీ కుర్చీ బల్ల రెండుతలుపులు త్రోసుకురాకుండా యడ్డముపెట్టాను. ఇంకా భయముగావుంది. కిటికీలన్ని లాగిచూచా. అన్నీ గట్టిగనేవున్నయి. గదంతా మళ్లా చూచినాను. నామంచమునకు కుడివైపు యొకరాజుబొమ్మ తగిలించివుంది.

ఇంకొకసిగరెట్టు వెలిగించా; పరధ్యానముగా కాలుస్తున్నా. పొగ, వుంగరములు, వుంగరములుగ, చూరువఅకు వెడుతున్నది. చూస్తూన్నా: భయంవల్ల త్రాగిన విస్కీగాని కాఫీగాని పనిచేయలే. ఇవ్వన్నీ నిద్రాభంగము చేసినాయి.

౬

నిద్రపోవడానికి ప్రయత్నిస్తామని కుడివైపు పటమువంకచూస్తు పడుకున్నా. కొంచెము సేపటికి నిద్రవచ్చేటట్టు తేలకండ్లుపడినయి. చూస్తూవుండగనే పటముయొక్క యడుగు చట్టము బొమ్మపాదములు కనుపించలేదు. కలయేమోయనుకొని కండ్లునులుముకుని చూచాను. ఇంక కొంచెము భాగము కనుపించలేదు. నాకు నిద్రమాయమైనది!! మళ్లా భయం నన్నావేశించింది. ఆపటమువంకే చూస్తున్నా. చూస్తుండగనే పటముకొంచెము కొంచెముగ తగ్గిపోతున్నది. చివరకు బొమ్మ తలపై చట్టముకూడ కనిపించలేదు. ఇదేమిటాయని ప్రక్కకు పొర్లేసరికి ఏముంది మంచముపై పందిరినా తలదగ్గరకువుంది!! ఒక వుదుటున క్రిందకు పొర్లా. ఆవుత్తరక్షణముననే పందిరి క్రిందకువచ్చి పడకను గట్టిగ యణచివేసింది. నేను పందిరిని తాకిచూచాను. అది గట్టిగ వుక్కుతోచేసుంది. నేను నిద్రపోయి

వుంటే యీపాటికి యెక్కడవుండే వాడినో? ఆపందిరి యెంతవేగముగ క్రిందకువచ్చిందో యంతవేగముగ పైకివెళ్ళి యథాస్థానము చేరింది.

ఇప్పుడు, నాకు నాస్నేహితుని కుట్ర బోధపడింది. వాడు నన్ను నమ్మించి మోసముచేశాడు. మత్తుకాఫీ నిద్రపోవడానికి పోయించాడు. నాయదృష్టము!! అవేమి పని చేయలే. ఇప్పుడు నాకు ముందుకంటె భయం యెక్కువైంది. వాళ్ళందరు తెల్లవారేనా శవాన్ని తీసికెళ్ళడానికి వస్తారు. నేను బ్రతికి వుంటే, నన్ను తప్పక చంపుదురు. ఏమి చెయ్యడానికి తోచలేదు. అప్పుడు బండి వాడు చెప్పినమాటలు జ్ఞాపకమువచ్చాయి. వాడిమాట పాటించనందుకు బాగా శాస్తి అయిందనుకున్నా. కొంచెముసేపు బొమ్మ వలె కుర్చీలో కూలబడ్డాను. తర్వాత లేచి బయటపడడానికి, ఏదైనా మార్గము వుందే మోయని, వెతకటానికి లేచా. కిటికీలన్ని కదలించిచూచా. అన్నీ గట్టిగవేసివున్నాయి. తలుపులు తెరవగనే వాళ్ళు ప్రత్యక్షమై, బుర్ర బద్దలుచేస్తారేమోయని భయం. మళ్లా మళ్లా కిటికీలు ప్రయత్నించా లాభము లేక పోయింది. భయము ఎక్కువైంది. వణకు పుట్టింది. ఒళ్లంతా ముచ్చెమటలు పోశాయి. శ్వాసయాట్టములేదు. ఉక్కగావుంది. మళ్లా కిటికీలు ప్రయత్నించా. చివరకు, యొక కిటికీ గట్టిగా తన్నాను. వూడివచ్చింది. దైవ వశాత్తు వాటికి వూచలులేవు. క్రిందకు యెక్కడో గోడ్డువుంది. వెన్నెలమాత్రము పిండారబోసినట్లువుంది. కిటికీ తెరవగనె చలి గాలి ప్రవేశించింది. దానితోటి నాకూ ధైర్యము వచ్చినట్లుంది. కిటికీప్రక్కగ, నా యదృష్టమో యన్నట్లు లావుపాటి వానగొట్టమొకటి క్రింద రోడ్డువరకు వుంది. కిటికీలో నుంచి యీగొట్టమువెంబడి వెళ్ళుటకు నిశ్చయించుకొన్నా. దిగవలెనని బయలుదేరా. డబ్బుమాట జ్ఞాపకము వచ్చింది. మొదలు డబ్బుపోతేపోయింది ప్రాణందక్కితే చాలనుకున్నా. మళ్లా యింత పాటుపడి వాళ్లకు దక్కనీటమా యని డబ్బు బాగా మూట కట్టి నడుముకు గట్టిగకట్టి, వానగొట్టము, పట్టుకుని, జారి రోడ్డుమీద నిలబడ్డా. నిలబడి యక్కడవుండక ఒక్క పరువున దగ్గరున్న పోలిసుస్టేషనులో పడ్డాను.

'సార్' యని పిలచాను.

'ఎవరువారు?'

'జరూరు పనివుంది, దయచేయండి.'

బయటికి వచ్చాడు, పోలీసు బంట్రోతు.

'మీ యిన్స్పెక్టరును పిలవండి'

యిన్స్పెక్టరు వచ్చాడు. సంగతంతా చెప్పాను.

'తెల్లవారనీయండి, విచారిద్దాము.'

'నాకు చాల భయముగావుందండి'

'మీరుకూడ స్టేషనులోనే పడుకోండి.'

సరేనని, యక్కడి బల్లమీద పడుకుని జరిగిన మోసాన్ని యాలోచిస్తూ కలతనిద్ర పోయినాను.

ఎట్లాగో తెల్లారింది. కాలకృత్యాలు తీర్చుకొని, కొందరు, భటులు యిన్స్పెక్టరుతో బయలుదేరాను.

8

క్లబ్బుకు వెళ్లాము. వాకిట్లోనే కూర్చుని వున్నారు నలుగురు చోరులు. వాళ్లమొహాన్న కత్తివేటువేసినా నెత్తురుచుక్కలేనంత, పాలిపోయివుంది. బిక్కమొహాలు వేసుకుని వున్నారు. నన్ను చూడ్డంతోటే, వాళ్ళపై ప్రాణాలు పైనే యెగిరిపోయ్యాయి. నేరస్తులను చూపాను పోలీసులకు.

నేరస్థులు యధారీతిగ నాశవముకోసము ఆగదిలోకి వెళ్ళారు. అక్కడ నాశవము కాని, నేనుకాని కనుపించలేదు. వాళ్లు భయంతో కంపించిపోతున్నారు.

వీధిలోనే పోలీసుభటులు వారికి అరదండాలువేశారు. ఇద్దరు భటులు వారిని స్టేషనుకు పిలుచుకుని వెళ్ళారు.

ఇక పోలీసుభటుడు, యిన్స్పెక్టరు, నేను లోపలికి వెళ్ళాము. మాగది తెరచేవుంది. గది శుభ్రముగావుంది. నేరము చెయ్యడానికి వీలుందా యనిపించేట్టుంది. ఇన్స్పెక్టరు సంగతంతా విన్నాడు కనుక యతనికి రహస్యభేదనము చెయ్యాలని ఆ దుర్దాగవుంది. అంతా వెతికాము, చూచాము. ఏమి విపరీతంగా కనుపించలేదు. మేము వెతుకుతున్నాము ఇంతలో పోలీసు 'కనుకున్నా'నని కేకవేశాడు.

అందరము పరుగెత్తాము. రెండుగదుల మధ్య తెలిసితెలియకుండ ఒకగదివుంది. ఆ గదికి, నాగది గోడవైపున గోడమీదకు ఏవో పలకమీద మరలున్నాయి. వాటిని క్రిందకు నడిపి చూచాము. మరలు పైకి క్రిందకు నడిచేయి.

నేను, యిన్స్పెక్టరు మంచము గదిలోకి, వచ్చాము. భటుడు మరను నడిపాడు. మర నడిపితే, మంచముపందిరి క్రిందకు దిగటము పైకి నడవటము కనుపించింది. అప్పుడు వీళ్ల కుట్రంతా బోధపడింది.

ఆ పోలీసు యిన్స్పెక్టరు. 'ఓ అదా ర రహస్యము. రెండురోజులకు, గోనెలో కుక్కిన శవము కనుపిచటానికి కారణము' అన్నాడు.

---

## గుహుఁడు—రామునితో

బులుసు నరసింహశాస్త్రిగారు

శా॥ దాటింపంగలవాఁడ గంగను యదార్థం బేను శ్రీరాఘవా!
దాటింపఁదగు దీవు సంసృతిపయోధామంబు, నెందేనియున్।
సాటింబొందిన వృత్తితోట దనకున్, సర్వేశ! పణ్యంబునే
పాటింపన్, నిను వేడుచుంటిని భవాంభఃపారముల్ జూపవే॥

# మారుమనువు

చంద్రుపట్ల రామారావుగారు

విశాల భర్తృగృహం ప్రవేశించి నాలుగేళ్లయింది. ఐతే, పాపం ఆమె అనాఘ్రాతపుష్పంలా ఉండి పోయింది. కారణం, భర్తకు ఆమెపై గలిగిన అసహ్యభావమే.

విశ్వేశ్వరరావుకు మేనమామకూతురు విశాల. అతనికి చిన్నప్పటినుంచీ కృత్రిమసౌందర్యం అంటే పిపాస హెచ్చు. నవనాగరికతా వాతావరణంలో పెరిగాడు. ఇప్పుడు నవనాగరికుల కితగాడు మొనగాడు. అందుకు తగిన భావాలూ—ఆశయాలూను.

అనగా, విశాల సౌందర్యవిహీన అని కాదు. చామంతి అందమైనదీ కాదూ! ఐతే, సెంకిసముందు తలవాల్చ వలిసిందేగా. మరి చామంతిలో ఉన్న మధురపరిమళగోచులు సెంకిసలో ఎక్కడ! అలాగే విశాలసౌందర్యం వేశ్యాంగనసౌందర్యానికి లొచ్చు. తస్మాత్, విశ్వేశ్వరరావు విశాలయెడల విముఖుడు. "ఒక తుమ్మెద అనేక పుష్పాలమీద వాలొచ్చు" అని అతని సిద్ధాంతం. ఒక పుష్పం మీద అనేక తుమ్మెదలు వాలడం అతని నెరుగడులా వుంది.

నిర్మలము, పవిత్రమునైన హృదయంతో ప్రణయ రసాస్వాదనకి చాతకిలా తహతహలాడిపోతోంది, విశాల. విశాలమై ఆనందాలుకురిసే ఆమె లోచనాల్లో నిర్మలమైన వెలుగు ఇప్పుడులేదు. తృష్ణ—ఆపగాని తృష్ణమాత్రమే ఆ కనులలో ప్రస్ఫుటమౌతోంది. తన అర్ధశరీరంనుంచి శీతలాతిశీతలమైన ఒక్క అమృత స్పర్శకోసం—హృదయతాపాన్ని అణచే ఒక్క హాస జ్యోత్స్నామయూఖంకోసం ఆనందలోకాలకు దారి చూపే ఒక్క ప్రణయావలోకనంకోసం పరితపించి పోతోంది. కాని, నానాటికి ధర్మపత్నికి ఉండే జన్మహక్కు నిరంకుశంగా అణచివేయబడుతోంది. ఇంతకంటె స్త్రీకి దుర్భరమైనబాధ ఉండదు. ఈ ఘాతతో విశాల లేతహృదయం కుమిలి కుమిలి పోతోంది.

విశ్వేశ్వరరావు చివరకు వేశ్యలయిండ్లలో శీతాలోక చిలుకలలా అలంకరించుకొనేవారి కృత్రిమ సౌందర్యంలో తెచ్చిపెట్టుకొనే ఆ అలతినవ్వులలో ఆనందపు బకులు మైకంకలిగించే ఆ ప్రేమప్రకటనల్లో నిరపరాధులకు సంకెలలు తగిలించే అభ్యాస జనితములైన ఆ వికృతపుటోయారములలో మునిగి తేలుతూ తన్నుతాను మరచిపోయాడు. విటశలభాలను భస్మీకరించే ఆమదవతుల వాలుకన్నుల్లోని ప్రకాశం ప్రళయాగ్నిచ్ఛటలని తెలుసుకోలేక ప్రేమజ్యోతి అని భ్రమసిపోతున్నాడు. పోనీండి. రాత్రింబగళ్లు వేశ్యవాడలలోనే అతని నివాసం.

ఇక్కడ గృహంలో ఏకాకినిగా శిథిలమైన హృదయంతో విరహరవాస్యావమానంతో క్రుళ్లుతూ రోదనం చేస్తోంది, విశాల. యౌవనప్రాగల్భ్యంవల్ల పొంగి మిసమిసలాడే ఆమె అవయవాలు వాడి, కృశించి పోయాయి. ముఖంలో ఆతరళిమా లేదు ఆ సౌకుమార్యమూ లేదు. దైన్యం కాపురేసుకొని ఉంది.

౨

రోజులు గడిచిపోయాయి. ఇప్పుడు విశాల వియోగిని కాదు, యోగిని. చివరకు అత్తవారింట పట్టెడు మెతుకే కరువై, పుట్టినింటికి చక్కావచ్చింది.

సుశీల విశాలకు చిన్ననాటి చెలిమికత్తె. ఒకరికొరకొకళ్లు ప్రాణాలువిడుస్తారు. సుశీల విగతభర్తృక—విశాలప్రోషితభర్తృక. సరి. ఇరువురూ సమానదుఃఖితలే, కొద్దిపాటి వ్యత్యాసంతో. విశాల హృదయాన్ని తెరిచి తన దుఃఖాన్ని అంతా ఆమె ముందు వెళ్లపోసుకుంది. సుశీల ఆదరపూర్వకంగా వింది. తన జీవితం ఎప్పటికైనా ఆనందపథాల్లో నడుస్తుందా అని వాపోయింది విశాల. ప్రశాంతంగా యోచించింది సుశీల, కాస్సేపు.

"నేను చెప్పినట్లల్లా ప్రవర్తించావా, స్వల్ప కాలంలోనే నిన్ను నీ భర్తలో ఐక్యంచేసేస్తాను" అంది సుశీల.

విశాల, "నువ్వు ఏదిచేయమంటే అది చేస్తా" నని చేతిలో చేయివేసింది, ఆతురతగా.

"సరే, అలా అయితే కాగితం, కలం తీసుకురా నేను చెప్పినట్టు వ్రాయి."

## 3

విశ్వేశ్వరరావు ఇప్పుడు మదరాసులో మకాం. మధురం అనే వేశ్యవాళ్ళిల్లో బందాయై, ఆమెకి విన మ్రుడైపోయాడు. దినాలుగడచిన కొలదీ, అతని ఐశ్వర్యమున్నూ అతనికి తెలియకుండానే హారతి కర్పూరంలాగ హరించిపోతోంది.

మధ్యాహ్నం పన్నెండయింది. విశ్వేశ్వరం సోఫాలో పడుకొని, ఎదురుగా నిలుచుని తమల పాకులు చిలకలు చుట్టుతున్న మధురం సౌందర్య మధువుని రెండుకళ్లా త్రాగేస్తున్నాడు. అంతలో వీధితలుపుదగ్గిర పిలిచినట్టయింది. మధురం గబగబా క్రిందకిదిగి వెళ్లి రెండు నిమిషాల్లో తిరిగొచ్చింది. అదో తరహా వలపుమైకంలో ఉన్న విశ్వేశ్వరం, "చదువు" అన్నాడు సోఫాలో వెనుకకు జేరగిలబడి. మధురం చదువడం ప్రారంభించింది.

"మహారాజశ్రీ విశ్వేశ్వరరావుగారికి విశాల నమస్కారములు. మనకు తెలియని అజ్ఞానావస్థలో మనల నిరువుర్నీ అల్పమైనప్రణయరజ్జువుతో బంధించారు మన పెద్దలు. దాన్ని మీరు సునాయాసంగా త్రెంచుకొని, ఒక్క పెట్టుగా రెక్కలు విప్పుకొని వేశ్యవాడల కెగిరిపోయారు. నేను భరించలేని అవమానదుఃఖంతో చాలకాలం మీ ఎడబాటును సహించాను. ఇక సహించలేను. నేటితో మీరు ధర్మపత్నినైన నాయెడల చూపిన నిరాదరణకి ప్రతిక్రియ ప్రారంభమౌతోంది.

రెండుదినాల్లో నేను తిరిగి వివాహం చేసుకోంటున్నాను. ఎందుకు ఆశ్చర్యం! దమయంతి ఏ అధికారంతో పునః స్వయంవరాన్ని ప్రకటించిందో అలాటిధర్మమే నాపునర్వివాహానికిన్నీ. ధర్మశాస్త్రం స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులనే ప్రసాదించకపోలేదు. పురుషుల నిరంకుశప్రవర్తనకి కులకాంతలొంగిఉండడం ఎప్పటికీ కుదరదు. "అష్టవర్షాణ్యాపేక్షేత, బ్రాహ్మణీ ప్రోషితంపతి, అప్రసూతాతు చత్వారీ పరతోన్యంసమాశ్రయేత్." అనే అధికారంతో నేను పునర్వివాహాన్ని తలపెట్టాను. న్యాయస్థానం నా ఈవ్రతాన్ని భంగపరచగల దనుకొంటున్నారేమో! అది వృథాఆశ.

ఇకమీరు

"పడిగము తమ్ములం బుమియు పల్లవకోటికినోరు?

జేణియు

గడిసపగంబు, ......లచ్చరచ్చసా

విడియెద, యూరువుల్ గడిమి వాతి యనంటులు,

మో విరజ్జి గిజ్జిడి"

అయిన వేశ్యాంగనతో సుఖించండి.

శలవు

విశాలం.

## ౪

విశాలచూపిన సాహసానికి ఒక్క పెట్టుగా మండిపోయాడు విశ్వేశ్వరం; కానైతే, అచిరకాలంలోనే శాంతించాడు. తనజీవితపథం నిష్కంటకమైందని ఏకోసమాధానంపడ్డాడు.

విశ్వేశ్వరం కాపురమున్న మేడకు ఎదురుగా ఓ తెలుగు జమీందారుగారి సుందర భవనముంది. తరుచుగా అది అద్దెకివ్వబడుతుంది. ఒకరోజున ఆభవనంలోనికి ఓ తరుణవయస్కుడు తనభార్యతో కాపురానికి ప్రవేశించాడు. విశ్వేశ్వరం వారిని చూడడంకలిగింది. అతని భార్యచక్కటిదే అనుకొన్నాడు. రెండుమూడుపర్యాయములు చూడగా ఆమె విశాలఅని తెలుసుకొన్నాడు. ఆరిపోయిన క్రోధాగ్నిఒక్కసారిగా ప్రజ్వరిల్లింది. "ఎదురురొమ్ము మీద కుంపటిలాగ నాముందుఏమిటీసొద!" అనుకున్నాడు. "నన్ను అవమానపరచాలనే దురుద్దేశంతో ఇక్కడికిచేరిం"దని నిశ్చయించుకొన్నాడు.

ప్రతిరోజూ ఆనూతనదంపతులు సాయంత్రంపడగానే బీచికిషికారు వెళ్ళడం—వెన్నెలలోతనకళ్ళ యెదుట ఉద్యానంలో విహరిస్తూఉండడం చూచిన

కొలదీ విశ్వేశ్వరానికి అరికాలుమంట నెత్తికెక్కుతోంది.

రెండు రోజులనుంచి ముసురుపట్టింది. ఆరోజున కుంభవృష్టికురుస్తూంది. నాలుగయింది. అప్పటికే చీకట్లు ముసురుకొంటున్నాయి విశ్వేశ్వరం కిటికీ తలుపులు తెరచి వీధివైపు చూశాడు. అతని బుజంమీద తలపెట్టి మధురం నిలబడింది. "తుపానువట్టింది పట్నమంతా జలమయమైపోయింది." అన్నాడు విశ్వేశ్వరం. మధురం ఈమాట వినిపించుకోలేదు. ఎదురుగా విశాలఉన్నహర్మ్యం వైపు నిశ్చలంగా చూస్తూంది. "ఏమిటిచూస్తున్నావు." అన్నాడు.
"అలాచూడండి"

విశ్వేశ్వరం చూశాడు. కళ్ళు జేగురుముద్దలైపోయాయి శరీరం ఒక్కసారిగా ఒణికింది. "మీరెందుకలాఅవుతారు." అంది మధురం. విశాల భర్త కౌగిలిలో మంచుగడ్డలాగ కరిగిపోతోంది. ఇరువురు ఐక్యమైపోయారు. "దాంపత్యంఅంటే అలాఉండాలి." అంది మధురం, నవ్వుతూ.

ఈ మాటశూలంలాగు విశ్వేశ్వరం హృదయంలో గసక్కున నాటుకుంది. తిరిగి ఆవైపుచూశాడు, తీక్షణంగా. కిటికీలోనుంచి విశాలఆమెభర్త స్పష్టంగాకనిపిస్తున్నారు.

విశ్వేశ్వర్రావు ఉగ్రుడై, గబగబా మెట్లుదిగి నడిచి విశాలభవనంలో ప్రవేశించాడు. తాను ఏమి చేస్తున్నది అతనికి తెలియదు. తటాలునమేడెక్కి విశాలభర్తపైకి లంఘించాడు అతను కోపంతో "ఎవరునువ్వు పో. అవతలకి." అన్నాడు రూక్షంగా "మిమ్మల్నిఇద్దర్నీ హతమారుస్తా;నరుకుతా." అంటూ విశ్వేశ్వరం అతన్ని పట్టుకున్నాడు అతిప్రయాస మీద అతను విడిపించుకొన్నాడు. ఈపెనుగులాటలో విశ్వేశ్వరం అతను పురుషుడుకాడని గ్రహించాడు. అతను గదిలోనికిపోయి స్త్రీగామారి తిరిగివొచ్చాడు విశ్వేశ్వరం నిలువునీరైపోయాడు. ఆమె సుశీల. "ఆడవాళ్ళమీదకి యుద్ధానికి బయలుదేరడంలో మీరుసింహం" అంది, నవ్వుతూ, సుశీల. లజ్జతో విశ్వేశ్వరం పాతాళానికి క్రుంగిపోయినట్లయింది. విశాల చేయిపట్టుకొని "నన్ను క్షమించు తగినట్లు బుద్ధిచెప్పావు." అన్నాడు.

---

## త్రిమూర్తిస్తుతి

శ్రీమతి అవధానుల పార్వతీదేవిగారు

చ. అనుదిన మాత్మయందు భవదంఘ్రి సరోరుహయుగ్మ మెంతునో
వనజభవాది సర్వసురవందిత దివ్యపదాంబుజాతయో
ననజిత పూర్ణచంద్ర కరుణాభరణా మహనీయమూర్తియో
సనకసనందనాది మునిసన్నుత దీనశరణ్యయీశ్వరా.

చ. నిరతము నీదునామమును నిశ్చలభక్తి స్మరింతు నిందిరా
వర సురరాజనీలమణివర్ణ జగద్భరితా ప్రమేయయో
నరసఖ దుష్టరాక్షసవినాశకరోత్సుక దీనురాలనన్ .
గిరమను రక్తిఁబ్రోవుము శుకాది మునిస్తుత దేవకీసుతా.

చ. అనవరతంబు నాహృదయమందున నిల్పెద నీదుమూర్తినో
వనరుహగర్భలోక పరిపాలక శ్రీసుతహంసవాహనా
ఘనదురితాపహార యనఘా కరుణాకర నీకు మ్రొక్కెదన్
నను కృపజూడవే నిగమనాథ పితామహ భారతీపతీ.

# కుటుంబములో

ప్రతివ్యక్తికి సరసవివేక మధురవాచాలత యావశ్యకముకావలెను.

భార్యాపుత్రులకొరకు ఖర్చుచేసినసొమ్ము సద్వినియోగముగా దలప వలెను. సహనశక్తి యత్యావశ్యకము.

ప్రతిస్త్రీయు గృహకార్యదక్షతయం దప్రమత్తతతో మెలగవలెను. ప్రతి పురుషుడును అట్టిపనులకు కృతజ్ఞతాసూచక మందహాసము చూపవలెను.

అప్రీతికరములగు ప్రసంగములు అనవసరసభికులయెదుట విప్పబడ కూడదు. వాటికి సంబంధించిన మనుష్యులతోడనే సంబంధించియుండవలెను. నలుగురు కూర్చుండునప్పుడు, భోజనసమయములందు అహితకరములగు వచన ములకు తావీయరాదు.

గృహకార్యములయం దశ్రద్ధవిడిచి నియమితకాలములందు ఆయాపనులు నిర్వర్తించుకొను నభ్యాసము మరువరాదు. ఇది లేనిదే యేగృహాము గృహశబ్ద వాచ్యము కాజాలదు.

పెద్దలు ఆదర్శప్రాయులై యుండి బిడ్డలగూడ అట్లాచరింపచేయగలి గినవారు కావలెను. కుటుంబములో విశుద్ధప్రేమ యుద్భవించిన యయ్యది విశ్వమునంతయు నావరించుకొనును. గృహయజమానులు ఈవిషయమం దజాగ్రత్తవహించిన బాలుర భవిష్యజ్జీవితము పాడుచేసినవా రగుదురు. వాదము కూడనిపని. ఇది నిర్వ్యాపారత్వమునవలన గలుగును. గృహశాంతికి భంగకరము. దుర్వినియోగము శ్రేయస్కరముకాదు. అట్టిగృహము ఆదర్శకప్రాయము కాజాలదు. గృహయజమాని కుటుంబావశ్యకతలను తృణీకరింపరాదు. వీలై నంతవరకు సాధ్యమైనంత త్వరలో అట్టివి సేకరించుచునేయుండవలెను. గృహ లక్ష్మి వాటి జాగ్రత్తవిషయమై ప్రమత్తత జూపించరాదు.

సంపన్నుల గృహములే సౌఖ్యానందముల కావాసమనుట పిచ్చితనము. మూఢవిశ్వాసము. బీదకుటీరమందు సౌఖ్యకిరణములు ప్రసరించుననుట అసం భవముకాదు.

— నండూరి సుబ్బులక్ష్మి.

# సోదరి మహాదేవి

పట్టి రామారావుగారు, బి.ఏ.

భరతభూమి మహాజ్ఞానపుంగవులను గన్న తల్లి. అందులో ముఖ్యముగా కర్ణాటసీమ వన్నెకెక్కిన భాగము. ఆ రాజ్యస్రవంతినుండియే బహువిధములైన వేదాంతవాహినులుద్భవమై దేశముననేగాక ప్రపంచమున నల్దెసలఁ బ్రవహించినవి. బ్రాహ్మణమతము లోని త్రిశాఖలగు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములకు మూలపురుషులగు శంకర రామానుజ, మధ్వాచార్యులు తమ సిద్ధాంతములఁ బ్రకటించి, తమ జ్ఞానతేజమును ఈ ప్రాంతమందే ప్రజ్వలింపజేసిరి.

బసవేశ్వరుడిట్టి మతస్థాపకులలో నొకడు. కన్నడములో నితనికి "భక్తిభండారి" (భక్తిధనాగారము) అను పవిత్ర బిరుదము కలదు. కృశించి శల్యావశిష్టమైన వీరశైవమతమునకు నూతన జీవముఁబోసి, దానిని వ్యాపింపజేసిన దీ మహాపురుషుడే. ఇతని శిష్యబృందములు నైజాంలోని కల్యాణ పురమును గేంద్రముగా జేసికొని, క్రీ॥ శె॥ 1160 సం॥ ప్రాంతమున బసవేశ్వరుని బోధనలు కన్నడ దేశమునఁ బ్రచారముసల్పిరి. ఈ శిష్యకోట్ల "వచన"ల కొక రూపమొసగిరి. "వచన"లు అను అర్థగర్భితములై, సత్యపూర్ణములైన వాక్యములు. ఇవి దులు కొన్ని సందర్భములందు నుపనిషత్సమమగు ప్రతిభఁగూడ బ్రకటించును.

ఈశ్వరప్రేరేపితులైన బసవేశ్వరుని శిష్యులలో మహాదేవి యను నామె యొకతె. మహాత్ములు తమ్ము తాము వెల్లడించుకొనరు. వీరి జీవితమహోద్దేశములును శీఘ్రప్రచారములు కావు. అరుఁమాటునఁ గప్పబడి, తన వాసనల బరచు మల్లెవలె వారు తమ యాశయములను కీర్తికాములు కాకుండగనే లోకమున వ్యాపింపజేయుదురు. మహాదేవి జీవితముకూడ నిట్టిదే. ఆమెఁ గూర్చి లోకమెఱిగిన విషయములు బహుస్వల్పములు. పరంపరగా తరతరములకు మామూలుగా వచ్చుచుండు గాథ లామె బాల్యముఁ గొద్దిగా చెప్పును. ఆమె "వచన"లు ఆమె కాధ్యాత్మికమార్గమున వాటిల్లిన శ్రమలను జయమును దెల్పును.

"కర్ణాటమున ఉడుతాది యను పట్టణమున ధనసంపత్తిగల వీరశైవవంశమున నీమె జన్మించెను. చిన్ననాడే యీమె యద్వితీయప్రభ వెల్లడియయ్యెను. దేశప్రభువగు కేసితకభూపాలు డీమె రూపలావణ్య ప్రవర్తనలు విని, ఈమెను తన సభ కాహ్వానించి పెండ్లాడ గోరెను. అతడు జైనమతస్థుడు. మహాదేవి తల్లిదండ్రులకు గుండెలు ఝల్లుమనెను. తమ యేలిక, తమ పుత్రి నిమ్మనిన వారు నిరాకరింప సాహసింపగలరా! కాని యితర మతస్థునకుఁ గూతు నిచ్చుటెట్లు?

మహాదేవి, యీశ్వరప్రసాదితమగు సహజధైర్యమున తన మతశ్రేష్ఠత్వమును

వర్ణించి, తా నామెను ధర్మపత్నిగా గైకొనఁ గోరిన రాజు శైవుడవలెనని నుడివెను. జైన పక్షపాతియగు రాజు అన్యమతమును స్వీకరింప బూసలేదు. మహాదేవి, తాను ఆ జన్మాంతము నవివాహితగానుందునుగాని, ఇహసౌఖ్యమునకై యన్యమతస్థుని స్వీకరింపజాలనని శపథమొనర్చెను. ఈమె దీక్ష, నైర్మల్యము, ధైర్యము రాజును నిర్ఘాంతునిగాజేసెను. ఇట్టి కాంత తన రాజ్యమునకు భూషణమని సంతసించి యామె యిష్టముచొప్పున సేవకునివలె స్వయముగా నామెను బసవేశ్వరుని సన్నిధికి గొంపోయెను.

అప్పటినుండియు నామె ప్రపంచమును ద్యజించి సన్యాసినియై గురుపాదసాన్నిధ్యముననే నిల్చెను. అపారపాండిత్యమువలనను, అగ్నిసమమగు పవిత్రతవలనను ఆమె వీర శైవ ఋషులలో నగ్రగణ్యయాయెను. సోదరసన్యాసు లామెకుఁ జూపిన భక్తి గౌరవములు స్తుత్యములు. "సోదరియగు మహాదేవియందు ద్వైతభావ మెంతమాత్రమునులేదు. ఆమె యనంతునిలో లీనమైనది" అని చన్నలబసవడు చెప్పుచున్నాడు. జెయ్నులకును, శైవులకును పరస్పరవిరోధము జనింప, వీరశైవమునకు భంగము రాకుండ నీమె శ్రీశైలమున కేగి సిద్ధి చెందెను.

ఇఁక మహాదేవియొక్క యాధ్యాత్మిక జీవితముఁ జూతము. ఈమె బాల్యముననే విరాగినియై, ఐహికసుఖవిముఖయాయెను. చిన్ననాడే జీవితమసారము; అనిత్యము అని గ్రహించెను.

"అన్యవర్జిత కంచుకమాళమీర విడువగోరదుచాకెత,
తొడగిదాని;
అట్టిగతి, లోభమోహముల్వదలనైతి, దీనురాలిని
బ్రోవుము దీనబంధు."

"గూటిఁదనచుట్టుఁగట్టి తాగిట్టుకాద పట్టుపుర్వొంచ;
నట్లునే వాంఛలనెడు
పాశములఁజిక్కుకొంటి నా బంధములనుద్రెంచి
మోక్షసాధనఁజూపుము దీనబంధు."

"ఘోరసంసారమందునఁ గూలి కొట్టుకొనుచునుం
టిని నాగతి క్రూరమయ్యె;
నెట్లుభరియింతు నీబాధ నేమిచేతు? నీ చరణ
తరణియొదిక్కు నిశ్చయముగ
ప్రాణకారణ పరమాత్మ దీనబంధు."

ఇట్టి వచనలు మహాదేవి భక్తి వైరాగ్యములను చాటుచున్నవి. నానాటికి నాధ్యాత్మికచింత, సత్యాన్వేషణము, ద్వంద్వభావ విచ్ఛేదనము లామెయం దినుమడించెను.

"పంజరాంతరకీరము వనవిహారులైనతనవారిఁ జేరఁ
దానరయునట్లు,
జన్మపంజరమున ననిశంబునిన్నుఁ జేరఁగోరుదు;
దయయుంచి చేరుమయ్య
'రమ్మ నాబిడ్డ' యనుచునన్ రయముగాను;
ఆకలియు, దప్పి, నిద్రయు నన్నిమఱచి
నిన్ను వెదకంగ సెలవిమ్మ కన్నతండ్రి."

ఈవిధమున భక్తిపారవశ్యముచే దన్నుఁ దామరచి ప్రకృతిలోని సకల ప్రాణులను దనకుఁ జిద్విలాసునిఁ జూపుడని బ్రతిమాలుచుండెను. అంతర్యామిని వెదకుటకై యామె దృఢచిత్తయై, యేమైనసరే, ఆ దివ్యమూర్తిని గాంచవలెనని సంకల్పించెను. అట్టి దృఢసంకల్పుల కసాధ్యమేమి!

ఇట్టి స్థితిలో నీశ్వరుడు జాగుచేయునా? సమాధినిమగ్నయై గురుకటాక్షమున నీశ్వర సాక్షాత్కారముం బొందగల్గెను. ఆమె సచ్చిదానందమునం దన యనుభవ మిట్లు వర్ణించుచున్నది.

"అకలంకుడగు సచ్యుతిని దర్శనమైనది. విశ్వమంతయుం దన దేహమున నిడికొని భయరోగనివారణమగు మందహాసమున నా దివ్యతేజము నా దృష్టిని పావనమొనర్చెను. ఆ మహద్దర్శనముచే జన్మజన్మములనుండియు సంభవించిన నా కన్నులకఱువు తీఱిపోయినది. ఆయాదిశక్తి సాక్షాత్కారమున జన్మ తఱించినది."

ఇప్పు డామె దృక్పథము మారెను. "జీవితము కేవల మేహ్యముకాదు; అది పరమపవిత్రము" అని యామె గ్రహించెను. సృష్టి యామెకు శాంతి సంతోషముల కాటపట్టుగాం దోచెను. తుద కామె పరమాత్మునిలో లీనమయ్యెను.

"ప్రాణమూలకారణుడగు భాస్కరునకు వీతి
హోత్రునిజ్వాలకు భేదమేమి?
వెన్నకును బాలమీగడ భేదమెట్లు? దివ్య
తేజంబునన్ నాదుదేహమేడ
'నేను' శూన్యము; ఎల్లెడనీవె యింక నేనె నీవు
నీవే నేను నిజముగాను
ప్రాణకారణ పరమాత్మ దీనబంధు."

ఇట్టి వచన లింకను ఎన్నియో యున్నవి. కన్నడభాషలోని మూలములైన వచన లద్భుతములు. వాని మంజులత్వమును, గూఢభావమును మనము సామాన్యముగాం జూడజాలము. పవిత్రమై, ఈశ్వరప్రేరేపితమై, వైరాగ్యోద్రేకపుంజమైన యీ కాంతాలలామ జీవితము హైందవసోదరీమణుల కాదర్శప్రాయమగుగాక!



# పువ్వులరంగడు

దామెర రాజగోపాలరావుగారు

సాయంకాలం సంతచెరువు
వీధులంట అమ్ముకొంటు
పువ్వులబుట్ట నెత్తినిబెట్టి
పోతూవున్నాడే పువ్వులరంగిడు
—పోతూవున్నాడే!

౨

తెల్లనినవ్వుల మల్లెపువ్వులు
వెన్నెలవన్నెల సన్నజాజులు
రంగురంగుల రకరకాలపూలు
ఎన్నెన్నో యింకా వున్నవి చాలా!

౩

కూతుళ్లకి కొత్తకోడళ్ళకి
కొంటారా యెవరైన మాదగ్గర ఒకటేమాట
బేరంలేదు గీరంలేదు మారుబేరగాళ్లం
కామండీ కొనేవారుంటే కొనండీ!

౪

సిరిలేనియింటికి సిరిని గూరుస్తాయి
అందంలేనిం అమ్మాయికి అందమిస్తాయి
ప్రేమలేని మగనికి ప్రేమకలిగిస్తాయి
జుట్టులో వీటిని పెట్టుకొంటేనే చాలు!



బాంద్రాబాలికా పాఠశాలాప్రదర్శనము.



బొంబాయి గవర్నరుసతీమణికి ఒసగబడిన ఉపాహారము

నేషనల్ ఇన్‌డియన్ ఎసోసియేషన్ స్త్రీశాఖ.



నేషనల్ ఇణ్డియన్ ఎసోసియేషన్, బొంబాయి

స్త్రీ శాఖ.

గవర్నరుగారి సతీమణికి ఉపాహారమిచ్చిరి.

# సణుగుట గురించి

'అనసూయ'

(మగని చెవిలో)

ఏమిటండీ! నే నెప్పుడూ సణుగుతానని అంటారా! దెబ్బలాడడానికి శక్తి సామర్థ్యములు చాలని నాలాంటివాళ్ళు సణగకపోతే యెలాగు! వారి కడుపులో దుఃఖము పైకి పోవడమునకు మరి మార్గమేదీ? దానివల్ల కార్యము ఉంటేఉన్నది. లేకపోతే లేదు, మనస్సులోఉన్న దుఃఖము కొంత శమించుతుంది కదా? తేలు కుట్టినవాడు ఎందుకు ఏకుస్తాడు? అలాంటిదే యీసణగడం కూడాను! ఈసణగడం నేను పక్కర్తినే చేసిన పాపంకాదు, నాస్థితిలోఉన్న ఆడవాళ్లందరూ చేసేదే? ఇది ఈ కాలమందేకాదు, పూర్వకాలంనుండీ అనాది సిద్ధంగా వస్తూఉన్నదే! బహిరంగముగా ఎదిరించి తమకార్యము నెరవేర్చుకొనలేని అబలల కిది సనాతనముగా వజ్రాయుధములాగు ఉంటూఉన్నది.

పూర్వము తన్ను అడవికి తీసుకొని వెళ్లవలసినదని సావిత్రి సణగడం ప్రారంభించేసరిక్కి సత్యవంతునికి ఆమెను తీసుకొనివెళ్లక తప్పినదికాదు! అరణ్యానికి, నేను కూడావస్తానని సీత అంటే రాముడు ఆపడానికి ప్రయత్నించాడుగాని ఆమె నారచీర తీసి కట్టుకుంటూ రాకమాననని సణగడం ప్రారంభించేసరికి, యిక లాభంలేదురా అని అనుకొని రాముడు ఒప్పుకున్నాడు. దండకారణ్యములో మాయలేడికోసం సణిగి సణిగి, రాముణ్ణి పంపించింది; ఆతర్వాత రామసహాయార్థం లక్ష్మణుడు వెళ్లకుండాఉంటే సీత సణగిన సణుగులు ఉన్నాయే, అవి త్రికాలముల యందూ కూడా మనస్సులో శూలాలలాగు గుచ్చుకొని బాధపెట్టి యుండకపోవు! అగ్నిప్రవేశము దగ్గిర 'తగునే నన్నిటులాడ' అనిన్నీ 'పురుషులు నమ్మరేని తమపాల్తుల' అనిన్నీ రాముణ్ణి జణాయించి సీత సణగిన సణుగులు అందరికీ తెలిసినవే! సణుగులకీ, ఇంకా కోపమువస్తే తాపులకీ సత్యభామ అంతటి మరి ఒకతె లేదుగదా! పారిజాతపుచెట్టు తెచ్చేదాకా కృష్ణుడికి నిద్రపట్టకుండా మరొక పని తోచకుండా సణగినది సత్యభామేగదూ! రుక్మిణికూడా అప్పుడప్పుడు సణగి ఉంటుందిగాని అది మనఅందరికీ వెల్లడిగా తెలియదు! సత్య సణుగులముందర దాని సణుగులు దీపాలలాగు వెలవెలపోయి ఉంటాయి! భ్రమర గీతలన్నీ గోపికల సణుగులు కాక మరేమిటి? కృష్ణుడు విన్నన్ని తిన్నన్ని సణుగులు మరెవరూ విని తిని యుండరు!

'సణుగులు విని వెగ్గ్రత్తక పోవుటచేతనే అతడు దేవుడని చెప్పవచ్చును.'

ఇంకా ద్రౌపది సణుగు లెందరికి ప్రాణాలమీదికి తెచ్చాయో లెక్కలేదుగదా! దమయంతి సణుగులు వినలేక నలుడు చీరచించి అడవిలో ఆమెను వదిలేసి పారిపోయినాడు! అందుచేత సణుగులు నాతోనే పుట్టినవి కావు, నేను ఒకర్తెను మాత్రమే నేర్చుకొన్న విద్యకాదు! అంతెందుకూ, మీప్లీడర్ల పెళ్లాలలో సణగనివా ళ్ళెవరు! కమ్మప్లీడరు కంపూరి చాలా మట్టుకు కట్టించిందికదూ అతడి పెళ్లాం! ఎలాగు సాధించింది? కొట్టిందా, తిట్టిందా? సణుగులచేతనే జయించింది! రాత్రీపగలూ సణుగుల రేవుపెట్టి విశ్వనాథరావు పెళ్ళాం మొగుడిచేత వేరింటి కాపురం పెట్టించిందా లేదా? నియ్యోగపు ప్లీడరుని ఇప్పుడు అతని పెళ్ళాం ఇల్లే కదలనివ్వదట! సణుగులు చాలకనో సణుగులు యెక్కువయో అల్లా లావాటి తెలగా ప్లీడరు పెళ్లాం వెర్రెత్తిపోయింది! పొట్టిప్లీడరు పెళ్లాం సణుగులకి సత్యభామే కదా! ఇక కృష్ణారావుకా! మీరు ఎలాగూ పేరు పెట్టనేపెట్టేరు! వాడు నాటి

11P

కృష్ణుడిలాంటివాడే అని కాసి ఒకటి సుమండీ, ఆవిడే నోట పల్లెత్తుమాట అన్నట్లయినా కనిపించదు! తేలుమీటలాగు సన్నసన్నంగా ఏమిచేస్తుందో గాని బయటకురాదు. అంతా లోపల స్వయంపాకమే అయి యుంటుంది! అల్లా ప్రథమశాఖ ప్లీడరు సణుగుల బాధ పడలేక పెళ్లాన్ని ఏకంగా పుట్టింటే ఉంచేశాడు! దెయ్యాలప్లీడరు పెళ్లాం చెప్పనక్కరలేదుగదా! వాడికి రోజూ దెయ్యమువాలినట్లే చేస్తుంది! మచ్చలమొగం ప్లీడరుసంగతి అందరికీ తెలిసినదే! మూడేళ్లనుండీ వాడు వాడి పెళ్లామును చూడాలంటే అత్తారి వూరు పోవడమేగాని ఆవిడే యిక్కడికి దర్శనమే యిప్పించడంలేదు! గుర్రపుబగ్గీమీద వెళతాడు వెల్నాటు ప్లీడరు. వాడు భూమిపుత్రా యిల్లూవాకలీ అంతా పెళ్లాంపేరే రాసేశాడు; పాగామాత్రం తన స్వంతం క్రింద ఉంది! ద్రావిళ్లపు ప్లీడరు పెళ్లాం దంపులే. ఆమె సర్వాధికారిణి, సణుగులబాధలేదు! అల్లా అనాథప్లీడరు పెళ్లాం సణిగి సణిగి ఏకంగా ఈ ఊరునుండి మకామే యెత్తించివేసింది! చెవిటిప్లీడరు పెళ్లాం సణుగులు నాలుగురోడ్ల మధ్యనే జరుగుతూ ఉంటాయి! ఇక మేష్టర్ల పెళ్లాలూ స్కూళ్ల ఇన్స్పెక్టర్ల పెళ్లాలూ చెప్పే అక్కర్లేదు! రోజూ చాకలి రేవే! అయితే చాకలిరేవులో వేసవిలో నీటిలోపం వల్ల పని తక్కువగా ఉంటుంది! వేసవిలో సెలవులు గనుక వాళ్ళకు మాత్రం సణుగులబాధ యెక్కువగా ఉంటుంది!

వీటివల్ల ఏమిటిలాభమనా అంటారు! పుండుపుడితే యేమిటిలాభం? పుండుసలిపితే యేమిటిలాభం? కాని పుళ్ళుపుట్టడం మానేస్తాయా? దుష్టరక్తం ఒంట్లో చేరితే పైకి కురుపులరూపంగా ఉబుకుతుంది! అలాగే దుఃఖమూ క్రోధమూ మనస్సులోనుండిమరొకవిధంగా బయటికి పోలేక సణుగులరూపంగా పైకివెళ్లిపో వస్తవి! దానివల్ల మనుష్యులయొక్క శోకభారము కొంతతగ్గి మనస్సుచులకబడుతూఉండడమేకాకుండా ఆడవాళ్ళు వెర్రెత్తిపోకుండా ఉంటారు. ధైర్యముగా దెబ్బలాడలేక ఈమోస్తరుగా సణుగలేకఉండే ఆడది మానమామూలు యిళ్ళలో కనపడదు! పిచ్చాసుపత్రికి పోవలసినదే! ఈపాటి సణుగులేనా లేకపోతే ఆడదానిని యింట్లో తిండితిననిస్తారూ మీమగవాళ్లు! మనుస్మృతినాటినుండీ పాతేస్తున్నారు గదా ఆడవాళ్ళను—వాళ్ళకు ఈ ఆయుధమేలేకుండాఉంటే యీపాటికి ఆడవాళ్లందరినీ మగవాళ్లునోట్లో పడేసుకోకపోయేరా? ఆత్మహత్యలు చేసుకొన్నస్త్రీలు మగవాళ్ళచేచంపబడినస్త్రీలు వాళ్లేలెక్కకు మిక్కిలి అయియున్నారే! బాధలుపడుతూ చావకుండా బ్రతకకుండా ఘోషాలలోకుళ్లి కుమిలిపోతూ స్వేచ్ఛలేక జీవచ్ఛవాలలాగు ఉన్నవాళ్ళసంఖ్య యెంతో యెవరు చెప్పగలరు? అయితే ఇదంతా మనదేశములోని శోభేగాని పడమటదేశంలో యీపప్పుడకదట! మీరుచేస్తూఉన్న తప్పుకు అనగా క్లబ్బునుండి ఆలస్యముగావస్తూ ఉండినందుకు పడమటిదేశంలో ఆడవానికి కోర్టువారు విడాకులు యిప్పించివేశారట! అంతదాకా వెళితేనేగాని మగవాళ్ళు మార్గంలోనికి వస్తారా? మాట్లాడితే మారుమనువు! ఎదురుతిరిగితే మగామేకు! అన్నభయం ఉంటేనేగాని మగవాళ్ళు ఒకంతటలొంగుతారా? ఒకంతట తమ పిత్రీయపు సింహాసనాలమీంచి దిగుతారా?

"పోనిద్దూ! పరమపతివ్రతలైన మనస్త్రీలకూ పతులను తృణీకరించు పడమటదేశపు స్త్రీలకూ సాటియేమిటి?"

ఇలాగనే మాకొంపతీసేరు! మొగవాళ్ళు వారి యిష్టప్రకారం వందలూవేలూ పెళ్ళాలని పెళ్ళాడవచ్చునట! ఆడవాళ్ళుమాత్రం కూడదట! పరపురుషుడిని కన్నెత్తిచూడకూడదట. అట్టి పాతివ్రత్యంఉంటే సావిత్రీ, సీతా, లాంటివాళ్లైపోతారట! మగవాళ్ళు మాత్రం సత్యహరిశ్చంద్రునిలాగు రామునిలాగు ఏకపత్నీవ్రతస్థులేలకాకూడదు? వ్యభిచారిణి అగు ఆడదాన్ని ఎలాగుచూస్తారో అలాగే వ్యభిచరించు పురుషుని ఏలచూడకూడదు! విశ్వామిత్రుడు చక్కని

మాలగుంటలను తెచ్చి పెళ్ళాకమంటే నిరాకరించిన హరిశ్చంద్రుడు వట్టి అభాజనుడనేకదూ మీలాంటి వాళ్ళ తాత్పర్యం? చక్కని ఆడపిల్లలు దొరికితే మాలవాళ్ళనీ పెళ్ళాంఉండనీ ఇట్టి క్షుద్రకారణాల చేత మీవంటి మహాత్ములు వదిలేస్తారా?

"ఎన్ని పువ్వులన్

ప్రాలదు తేటి, యట్లె మగవాడును! వానికి దోష మున్న దే?" అన్న రకంలో వారు మీరు! ఇట్టి నీతులే కదూ కొంపతీశాయి! అంతఃపురాలలో ఒక్క రాజు గారి భార్యలు వందలకొలదిమంది, పువ్వులవనంలాగు, ఆతుమ్మెద రాజుగారికోసం కాచుకొని కూర్చుండి ప్రాణాలు విసికివిసికి మత్సరంచేత మాడిమాడి, చింత చే వేగి వేగి, చిక్కి శల్యావశిష్టలై సహింపరాని మనోవ్యథచే అనుభవించే క్షోభఉన్నదే అది యెప్పటికైనా మగవాళ్ళను కట్టి కుడుపకపోదులెండి! సముద్రముకన్న మహాగంభీరమైన ఆకాంతము, భూమికన్న ఎక్కువగా చూపే ఆఓర్మి అమానుషము గదా! అటువంటిఆడవాళ్ళని వారికి తగినగౌరవము తో మనదేశంలో చూస్తూఉన్నారా? అమ్మలకీ అప్పలకీ పప్పగించేశారు! ఆచ్చీ, అప్పీంలాగు చాకిరీకి పెట్టేశారు! ఎన్ని కట్టుదిట్టాలు, ఎన్ని యేర్పాట్లు చెయ్యాలో అన్నీ చేసి ఆడవాళ్ళకు నరకట్లు బిగించే శారు! తాము మాత్రము స్వచ్ఛందజీవనం చేస్తున్నారు మగవాళ్ళు! మగవాడుపోతే ఆడదానికి ప్రాణాలు పోయినవన్నా ఘోరము; ఆడదిపోతే మగవాడికి పైమీదవాణీపోయినట్లే! దేవరవాడు యింటికితెస్తే మరొకటి కొనవచ్చును; లేకపోతే బజారుకివెళితే ఎక్కడబడితే అక్కడే దొరుకుతుందిసరుకు!! ఈ దారుణం చూడండి! అబ్బాయికి అబ్బాయిలుపుట్టేరు; తనకుయింకా ఎవరైనా పిల్లనిస్తారేమోయని పుట్టె డాశతో మేష్టరు గట్టి ప్రయత్నంచేస్తున్నాడు. ఆ ముసలిడొక్కు లేస్తే కూర్చోలేడు, కూర్చుంటే లేవ లేడుకాని యిప్పుడెవరేనా పిల్లనిస్తే చేసుకుందికిసిద్ధం! వాడెంత చదువుకుంటే కార్యమేమిటి? ఏమైనాజ్ఞానం నానోనిగ్రహము ఉన్నాయా! కదలలేకపోయినా కన్యకను చూచి ఒకటేగాథరా ఒకటేఆందోళనా! ఇప్పుడు షష్టిపూర్తి అయిపోయినతరువాత ఈ కొత్త పెళ్ళాంతో ఏమిచేస్తాను అని యోచనలేదుకదా! కంపునోటివాడు గణిస్తే కమ్మనినోటివాడు అనుభవిం చేడన్నసంగతి అమలులోనికి వస్తుందని తెలియను కాబోలు. ఒకజీవితపు అనుభవమంతా పూర్తిఅయి పోయి, నరాలలో రక్తము కొరకుబారిపోతూ కొత్తలోకపు ఇవతలకొన కనబడుతూ ఉంటుంది! అతనికి. ఇంకా ఆ అనుభవముయొక్క 'ప్రథమపాదే ప్రథమవర్షే, ప్రథమయామే ప్రథమనిమిషే'యందుం టుంది ఆమె. వీళ్ళిద్దరికీ యెలాగుమనస్సులుకలుస్తాయి! దేహాలమాట అటుఉండనీయండి! శృంగారకావ్యానికి వైరాగ్యశతకానికి లంకె యెలాగు? ఉద్యానవనంలో శ్మశానములాగు యేమిశోభగాఉంటుంది ఆ దాంప త్యము !! తుప్పతుప్పన బంతిలాగుత్రుళ్ళే ఆమెకూ, దర్భీమని పేడసున్నలాగు చతికిలబడే ఆయనకూ కలిపి మెడలమీద పెళ్ళిపూజపెడితే సంసారశకటము ఎలాగునడుస్తుంది? "ఏదో మనస్సులో కించఉండి పోయింది! అదిచేసి అత్తాఅనుగది" అని ముసలి అల్లుడు అత్తగారితో తనపెళ్ళామును కలుపమని చెప్పినట్టు ఇప్పుడు గుర్రకొద్దీ పెళ్ళాడడమేకాని అందుకు పర్యవసానం దానిగొంతుకు కోసీడానికితప్ప మరేమైనాఉందీ? ఆమెయొక్క బాధ అతనికేమి తెలుస్తుంది? పెనతబాధ పేనుకేమి తెలుస్తుంది? కనుక అటని వివాహప్రయత్నంలోనే ఉన్నది మీ మగవాళ్ళయొక్క ప్రబలదౌర్జన్యమంతా! భూమి వ్రాసియిస్తాడు పుత్రవ్రాసియిస్తాడు కాని యావనపు కానుక వ్రాసియివ్వగలడా? మీవంటితగుమనుష్యులు వద్దని యిస్సాహడదూ సంజహో అతనికి! అతనికొడుకే మైనాడు? అతడైనాకూకలు వేసి చెప్పకూడదూ?

"వాడు పితృవాక్య పరిపాలకుడు; వాడట్టి పని చేయడు!"

అట్టి పనిచెయ్యడూ? చెయ్యకపోతే భీష్ముడి

లాగు కన్యకను తెచ్చి పప్పుచెప్తాడా యేమిటి? లేక పోతే "నీతల్లిన్ గనినట్టి శుక్రువలన న్నేడీ జరం బొందితిన్ నాతండ్రీ యదునామధేయతనయా నావృద్ధతన్ దాల్పవే నీతారుణ్యము నాకు నీవె; తనివో నిండార గొన్నాళ్లు నే నేతోజాడ సుఖంబుగన్ తిరిగెదన్ శృంగారినై పుత్రకా" అని యయాతి అడిగినట్లడిగితే అతని చిన్నకొడుకులాగు యౌవనముకూడా తండ్రికి యిచ్చివేస్తాడా యేమిటి?

"తనవద్దనుంటే యిచ్చేదానికి అట్టివాడే. ఇచ్చే వాళ్లుంటే అడగడం మానేస్తారూ? ఆశకుముదిమి యేమిటి? దాతలేమి యాచకుడికి కావాలి?"

"అలాంటి వివాహం అయినతరువాత ఆడదానికి సణుగులు కాకపోతే మరిచేసేపనేమిటి? ఈమోస్తరుగా ఆడవాళ్ళు అనేక రకాలైన బాధలుపడుతూ బానిసలుగా ఉంటే వారికి మరసుఖమెక్కడిది? అదీ కాక మామూలుగా పిల్లలు పుట్టకమునుపు ఏకాస్త సుఖం అనుభవిస్తారో అదే కదా దక్కేను! తరువాత 'దినదినగండం వెయ్యేళ్ళాయుర్దాయము!' అన్నట్లే గదా ఆడదాని బ్రతుకు మోస్తరు. చాకిరీ, తిట్లు, కష్టాలు ఇవితప్ప మరొకవిధమైన కాలక్షేపము లేదు! మనిషీ మనస్సూకూడా చివికిపోవడమే కదా! అలాగు ఉంటే పాతిక ముప్పయియేళ్ళకు ఆడవాళ్ళకు ఎందుకు రాకుండా ఉంటుంది ముసలితనము? దానికి తోడు మగవాళ్ల నిరసన! అగ్గిమీద గుగ్గిలంలాగు!

ఇంతే కాకుండా సమిష్టికుటుంబపు అరిష్టమంతా ఆడదానిదే కదూ! అత్తల ఆర్భాటములు, ఆడబొట్టెల అపూర్వకలహములు, తోటికోడళ్ల యీనులు జట్టీలు ఇవి ఘోరముగా జరుగకమానవు! స్పెయిను దేశపు యెడ్ల పోట్లాటలాగు యీపోట్లాట మాచి యిరుగు పొరుగువాళ్లు ఆనందిస్తూ ఉంటారు!

ఇట్టి స్థితిగతులలో సణుగులే లేకపోతే చెరువు కలం కొట్టేసినట్లు మనస్సు కలం కొట్టెయ్యదూ? వెర్రెత్తిపోదూ? చెరువుకు వాలుగొమ్మ యేలాంటిదో మనస్సుకు యీసణగడం అటువంటిది! కాబట్టి సణగడం గురించి ఆక్షేపణ చెయ్యడానికి బదులు హర్షించండి! మీపూర్వులకన్న మీరు గొప్ప వారా యేమిటి?

ఇప్పటివరకూ నాసణుగులు విని మరొక మజా కూడా జరుగుతూ ఉన్నది! మగనివైపు పెళ్లాము, పెళ్ళామువైపు మొగుడు కొంచెం కోపంగా చూచుకోవడం మొదలుపెట్టేరు—అనేక అనుమానాలచేత! స్నేహితులు రహస్యాలు అనుకుందికి జంకుతున్నారు. ప్రతీవాడి పెళ్ళాము తనమీద ఏదో నింద ఉన్నదని అనుకుంటున్నాది! దీనికేగదా పుచ్చకాయలదొంగ అంటే భుజాలు తడుముకోవడ మంటారు!

పోనీయండి! ఈసణుగులవలన మీరు బాగుపడక పోయినా, యితరులైనా బాగుపడితే అదెంతకాదు! నిందలు మీకు, నిందలఫలం వారికి!



# చిత్తవృత్తి

దేవేంద్ర రాధాకృష్ణకవులు

[అటనుత్తుంగ హర్మ్యాంతర్భాగమున సీత. మహితసామ్రాజ్యాధీశమండితంబగు స్వయంవరమంటప మధ్యంబున నుంపఁబడినది శరాసనము. ధనుర్భంగమునకై యత్నించి విఫలమనోరథులైనారు పెక్కురు భూమీశులు.—కార్ముకారోపణమునకై మంటపముసమీపింపనున్న శ్రీరామునింజూచినది సీత; ఆనందపరవశయయినది. రామునిఁబతిగాబడయనెంచినది. సఫలీకృతమనోరథను గాఁగలనాయని శంకించుచున్నది.]

ఎందఱురారుమున్ను ధరణీంద్రు, లవక్రపరాక్రమంబు చె
న్నొందెడువారు, శౌర్యనిధు, లూర్జితబాహుబలాభిభూతి సం
క్రందను? లల్లవారలును కార్ముకమెత్తఁగనోడలేదె!! వి
ల్లంది శరంబు నెక్కిడఁగనౌనొకొ యీతనికిన్ దలంపఁగన్?.

అందగరానిమ్రానిఫల మాసలొనర్చుటలౌనెయంచు నా
కుం దలపుల్ ఘటిల్లెడి నిగూఢనివృత్తమనోజభావనా
స్పందితచిత్తవృత్తి నది బాయఁగ తావొనగూడదె; నేమి సే
యందగునో యెఱుంగదెఱవా? మదిచంచలతన్ వహించినన్.

అతిసుకుమారుఁడీతఁ డసహాయపరాక్రముఁడౌను గాక!! వ
జ్రతులితమై యెసంగునదిచాపము: భూరిబలాఢ్యులట్ల నే
గతినగు నెక్కు వెట్టుటలు? కగ్జముగాదని శోచెడిన్; వృథా
మతిఁదలపోయనేమిటి కమానుషకృత్యములౌ నటంచునున్.

నోచగలేదు మున్నెపుడు నోముల భూరిసుఖప్రదమ్ములై
యోచనసేయుకార్యముల కుచ్ఛ్రయమౌఫలమిచ్చువాని; నేఁ
డూచెద వేల మానసమ యూరక నీతలపోయుకోర్కె వే
జే చనబోదికెందు సవలీలమెయిన్ ఫలియించునంచునున్.

కలవరమందనేల హరకార్ముకమున్ వెస నెక్కువెట్టి భూ
పులు మదినబ్బురంపడఁగ బూజ్యుఁడు రాఘవుఁడీక్షణంబ నీ
తలఁపును దీర్చునంచు వితథంబుగ చెప్పెదు మానసంబ యీ
విలు కడుభార; మీతఁడలతి పిన్నయటంచు నిరాసతోచెడిన్.

అనునయరీతినేర్చెడె స్వయంవరమన్నది రాజకన్యకా
మణులకునెన్నఁడే; నిపుడు మజ్జనకుండును నట్లనేసి యీ
పనువున గార్ముకంబు నొకపట్టున నుంకువఁ బెట్టనేలకో?
వనజముఁజొచ్చు భృంగి నటు వారిజపత్రము లడ్డుకొనఁగన్.

కనగన మన్మథాకృతినిఁ గాలెడి నీతనిరూపు; వక్త్రమ
న్నను శశినిన్ హసించెడి, ఘనంబులుతోయజ సన్నిభంబులై
దనరెడినేత్రముల్, యితని తమ్మికటల్ అధరమ్ము నంటగా
బెనగొని వీనిబాహువుల కెన్నుఖ మందఁగనున్న నాతియే
జనకునియింటనుండెనో? విచారము నింతగ సేయనేటికిన్.

హేసావిత్రి, సరస్వతీ, అసల, వందేవిష్ణు కాత్యాయనీ,
హేశంభో, మఘవన్, కుబేర, వరుణా, హేభానో, గాయత్రి, వా
ణీశా, హేఖగనాయకా, కృపమెయిన్ యీతండు నీవింటినిం
బ్రాశస్త్యంబుగ నెక్కు వెట్టనగునా బాటంగనంజేయుడీ.

నవలావణ్యవయోవిలాసముల నానందంబు జేకూర్చు వీ
ని విభుంగా గనుభాగ్య మందవగునేనిన్ దండకారణ్య సీ
మ విహారంబును నైననేతు నొకటం బద్వాబ్దసంవత్సరా
ల్పు విచారంబున బంచభూతములె యిచ్చో సాక్ష్యమిద్దానికిన్.

అది రెడివామనేత్రము మహత్తర సంతసమబ్బునంచునున్
మది కెలఁగించుచున్నయది; మత్కృతపుణ్యములుండియున్న నీ
యదనుస నవ్వియన్నియు మహాఫలదంబులు నొచు నాకు స
మ్ముద మొసఁగూర్చుతన్; సుర లమోఘవచఃపరిశేషణక్రియా
భ్యుదయమునందజేయుత; మహోత్కట సౌఖ్యతరంగపూర వా
ర్నిధి భవదోలికానితతి నిత్యము నే జరియింతు గావుతన్.



## మధుశాల

వఝ్ఝల కాళిదాసు గారు

క్రొంజిగిలేతమావిచిగురున్ జెలువమ్ము తలంపఁజేయునీ
సంజవెలుంగు నేలదిగజారినవేళల గోస్తనీ రసం
బుం జవిచూచుచున్ పరుసముద్దులతేనెల గ్రోలిసోలుచున్
మంజుతరప్రమోద సుఖమాధురులన్ బులకింతమా చెలీ!

౨

తారాకల్పితరంగవల్లికల సౌందర్యాంకురచ్ఛాయలన్
ద్వారరంగంబునఁదీర్చిదిద్ది ప్రణయోత్ఫుల్లాత్మయై యామినీ
నారీరత్నము చందమామవలపున్ వాంఛించు వేళన్ సుధా
పూరంబుల్ తని వారగ్రోలుదమ సమ్మోదంబుమై నెచ్చెలీ.

# పల్లెటూరి విద్యార్థి

తాత. కృష్ణమూర్తిగారు, బి.ఏ; యల్.టి.

"నిజంగా కంట్రీలైఫులో చాలా చమత్కారం వుంది. బెస్టు టొబాకో, బెస్టు గేద పెరుగు, మాంచి ఘీ—అంచేత నేనోయ్, పోయట్సు, 'కంట్రీలైఫ్, కంట్రీలైఫ్' అని దేవులాడుతారు."

—కన్యాశుల్కము.

పల్లెటూరు కాపురం మొత్తంపైని చాలా యోగ్యంగా ఉంటుంది. పట్నవాసంఅంటే, అది పైసాతో పని. మర్త్యంలో మోక్షం కావాలంటే మాత్రం అగ్రహారాలే శ్రేయస్కరం! రామాకృష్ణా అనుకుంటూ, నిర్విచారంగా కాలం గడపవచ్చును. భుక్తికి సరిపడే గింజలువచ్చే భూవసతి ఉండి, చిన్నయిల్లు వాకిలి ఉన్నాయంటే, చోర్లంగివంటి అగ్రహారంలో స్వర్గవైభవంతో బ్రతకవచ్చును. బస్తీలలో ఉండే ధూళి, దుమ్ము, బళ్లు గిళ్లు, రోగాలు, పన్నులు—ఏబాధాలేకుండా, కలిగిన దానితో యింత గంజీ అన్నం అయినా శుభ్రంగా వండుకొని, తిని, పడుకోవచ్చును. మడితడి, దేవుడు దెయ్యం, మన చిత్తం వచ్చినట్లు జరుపుకోవచ్చును.

'చోర్లంగి' అగ్రహారం పర్లాకిమిడికి సుమారు పది పన్నెండు మైళ్లదూరంలో ఉంది. చాలా చిన్న గ్రామం. పదిపదిహేను బ్రాహ్మణకొంపలు తప్ప, అధికం లేవు. బ్రాహ్మణవీధి చాలా విశాలంగా, శుభ్రంగా ఉంటుంది; ప్రతీయింటికీ వీధిగుమ్మాలకు పెట్టిన ముగ్గులు 'చూడు చూడు' మని ఉంటాయి. ఆ వీధిచివరను ఒకపెద్ద రావిచెట్టు ఉంది. ఆచెట్టు నీడనే సాంబన్నగారి యిల్లు—అనగా మా స్కూలు. చెట్టు దాటగానే ఉత్తర దక్షిణంగా ప్రవహిస్తూ ఉన్న 'వంశధార' అనే యేరు ఉంది: మంచి ఆరోగ్యమైన జలం. రాళ్ళు, రప్పలు తినేసినా జీర్ణం చేయగల నీరు. నది చిన్నదైనా వరదరోజులలో గ్రామం ముంచివేస్తుందా అన్నంత భీకరంగా ఉంటుంది.

'ఈతకొట్ట నేర్చియుండుము' అని పెద్దలుచెప్పిన [illegible] నేను వృధా పోనియ్యలేదు. స్కూలు పిల్లలతో కూడి మాటికీ చీటికీ యేట్లో దుమికేవాడిని. శీఘ్రంలో యీత బాగా నేర్చుకున్నాను. కాని ఆ విద్యయొక్క ప్రయోజనం ఎన్నడూ నా అనుభవంలోకి రాలేదు. మీదుమిక్కిలి కొన్ని అనర్థాలు కూడా అప్పుడప్పుడు తటస్థించడం కద్దు. నదిలో యీదుతూ ఉన్నప్పుడు మావాళ్లెవరైనా నన్ను చూడడం తటస్థిస్తే, వెంటనే తాళాధ్యాయం తప్పేది కాదు. అదిగాక, వేళాపాళాలేక నీట్లో నానడం వలన అప్పుడప్పుడు జలుబుచేసి ఉష్ణం తగిలేది.

తొమ్మిది పదేళ్లవాడి నయినదాకా నాకు చోర్లంగే నివాసస్థలం అయింది. చదువు, సంధ్య యేవిధంగా జరిగాయో వేరే చెప్పనక్కరలేదు. సహవాసదోషం కూడా తగలకపోలేదు. తోడిపిల్లకాయలతో కూడి నేనుకూడా కొన్నికొన్ని వికార విద్యలు నేర్చుకున్నాను. కోతిపిల్లి కర్ర, గోణేబిళ్ల, గోట్టికాయలు, బొంగరాలు, డూడూ, మొదలైన ఆటలలో గొప్ప ప్రవీణత సంపాదించాను. నీట్లో యీదడం, చెట్లుచామలు అవలీలగా యెక్కడం, యీడువాళ్లతో తగవులాడి ముష్టియుద్ధం చెయ్యడం, సమయం చిక్కినప్పుడల్లా బరి యెగవెయ్యడం, తోటలలో దూరి పళ్లు, కాయలు దొంగిలించడం, ఎక్కడికి వెళ్లినా కుక్కజట్టీలు తెస్తూఉండడం—ఇవన్నీ బాగా అలవడ్డాయి. పల్లెటూరిగాలి బాగా తగిలింది. పెంకెతనం పూర్తిగా అబ్బింది. "సంగతి బాగులేదు. ఇక యీఊళ్లో ఉంటే కుర్రవాడు చెడిపోతాడు." అన్న భయం పట్టుకుంది మానాన్నకు.

వెంటనే నన్ను పర్లాకిమిడి తీసుకొపోయినాడు. అక్కడ మాదగ్గిరబంధువులే ఉంటే, వాళ్ళయింట

నన్ను అప్పజెప్పి, గుడ్డగుడును కట్టించి, కొంతడబ్బు నాచేతికిచ్చి, "నాయనా, బుద్ధిగా చదువుకో" అని నాకేవో ఉపదేశాలుచేసి, పరశురామస్కూలులో నన్ను ప్రవేశపెట్టినాడు.

పట్నవాసానికి వచ్చానుకదా అని మొట్టమొదట కొంచెం గర్రాగా ఉండేది నాకు. కాని స్కూలుకు నాలుగురోజులు వరసగా వెళ్ళడంతోనే క్రమంగా పర్లాకిమిడి మీద అదొక అయిష్టత అంకురించింది. చోర్లంగిలో అనుభవించిన స్వేచ్ఛ జ్ఞాపకం వచ్చినప్పుడు, బడీగిడీ విడిచి యెక్కడికైనా పారిపోదామా అన్న దుర్బుద్ధి పుడుతూ ఉండేది. అయితే అంత తెగింపుపని చెయ్యడానికి ధైర్యం చాలక పోయింది. ఏమాత్రం అవకాశం దొరికినా స్కూలుకు వెళ్ళడం యెగవేసేవాడిని.

పరశురామస్కూలు ఆరోజులలో చాలా పేరు పడిన బడి. నాకు మాత్రం ఆస్కూలుకు పోవడం అంటే, పులిబోనులోకి వెళ్ళినట్లు ఉండేది. ప్రప్రథమంనుండీ నాకు పాఠశాలంటే అయిష్టత, బెంగ, భయమున్నూ! అందుకు తోడు బడిలో మాస్టర్లు సాంబన్నవంటి వాళ్లయితే, నాఘోష చెప్పేదేమిటి?

పరీక్షచేసి నన్ను మూడవతరగతిలో చేర్చుకున్నారు. అదే నాకు పెద్ద బి.ఏ. క్లాసువలె ఉండేది ఏబీసీడీలు నేర్చుకోవడంతోనే, ఇంగ్లీషుయావత్తూ సాధించగలిగాననే అప్పుడు నాభావం! క్రమంగా చిన్నచిన్న యింగ్లీషుపేర్లు చెప్పడం ప్రారంభించారు. ఆ వెధవపేర్లు నాకు తిన్నగా వచ్చేవికావు. అచ్చులో ఒకమోస్తరు, వ్రాతలో యింకొకమోస్తరు, ఉచ్చారణలో మరొకమోస్తరు—ఏంభాష! ఒకదారి, ఒక తెన్నూ ఉంటేనా? సులభంగా ఇంగ్లీషు నేర్చుకోలేకపోతే, లోపం నాలో ఉన్నదా, భాషలోనా? మాస్టర్ల అభిప్రాయంలో లోపమంతా విద్యార్థులదే! ఎంతో శ్రమపడి ఆ యింగ్లీషు పేర్లన్నీ నేర్చుకునేవాడిని; కాని జ్ఞాపకం ఉండేవికావు. జ్ఞాపకం లేదంటే అయ్యవారు ఊరుకుంటాడా? శిష్యులకు జ్ఞానం, జ్ఞాపకశక్తి అభివృద్ధి చెయ్యడానికే కదా దేవుడు మాస్టర్లను సృజించినాడు! కాబట్టి వాళ్లకు పాపభయం అనేది ఉండదు. జీవహింసకూడునా అనేసందేహమే కలగదు. అదిగాక, దండం దశగుణం భవేత్, అన్నారు పెద్దలు! విద్యార్థులను ప్రయోజకులను చెయ్యడానికి ఉపాధ్యాయులు కనిపెట్టిన సూక్ష్మమార్గం బెత్తం! కనుక, వృత్తిధర్మాన్ని అనుసరించి కుర్రవాళ్లను శిక్షించడం వారికి విధికృతం. అజ్ఞానం, బుద్ధిమాంద్యం, జ్ఞాపకలేమి, మొదలైనవి శరీరసంబంధమైన వ్యాధులవంటివేనని వారి అభిప్రాయం. వాటిని కుదర్చడానికి పేపబెత్తు తప్ప యితర మందులు లేవని కూడా ఒక గట్టి నమ్మకం!

ఆదిని యీదివ్యౌషధం కనిపెట్టిన ధన్వంతరి ఏ మహాపురుషుడో కదా!......సాలమన్ వంటి బుద్ధిమంతుడు కూడా, 'స్పేర్ ది రాడ్, ఎండ్ స్పాయిల్ ది చైల్డ్!' అన్నాడు. అనగా, 'బెత్తం విరిగేపర్యంతం కుర్రకుంకను చావదన్నవలసినదే; ఏమాత్రం దయతలచినా వాడు చెడిపోతాడు!' అని ఉపాధ్యాయులకు హెచ్చరిక. ఆమహానుభావుని ఉపదేశాన్ని పెడచెవిని పెట్టిన స్కూలుమాస్టరు నేటికికూడా భూలోకంలో ఒక్కడూ లేడు.

తక్కినవాటి విషయమై అతని అభిప్రాయం ఎట్లా ఉన్నా, ఇంగ్లీషు నేర్చుకునేందుకు నాకు జ్ఞాపకశక్తి బొత్తిగా చాలదని మామాస్టరు సిద్ధపరచుకున్నాడు ఆరోగ్యం కుదర్చడానికి చింతామణివంటి దివ్యౌషధం పేపబెత్తే కనుక, అనునిత్యం ఆయన దయతలచి నాకింత మందు యిస్తూ ఉండేవాడు. సాధారణంగా మందులు కడుపులోకి పుచ్చుకున్న తరువాత కాని పనిచెయ్యవు. ఈమందు అట్లుకాక, శరీరంమీద ఏభాగంపైని ప్రయోగించినా, వెంటనే నెత్తికెక్కుతుంది. కూలైన ఔషధం కాబట్టి, మోతాదు చిన్నదైనా, ఆ ధనరుడు వెంటనే కళ్లవెంబడి నీళ్లురాక మానవు. రోజూ నాకీమందు సేవించడం తప్పేదికాదు. కాని రెట్టింపు మోతాదుల



రాకుమారి శ్రీమతి అక్కాసాహెబ్

ఆండ్ సంస్థానము. ఈయమ మంచిసంఘ సేవ చేయుచున్నారు. లలితకళల యందును. హరికధ సేయుటయందును ఈమె మెకుగల కౌశల మునకై స్వర్ణ పదక మీయబడెను.



శ్రీమతి త్రుల్లినాటి రాజరాజేశ్వ రిమ్మగారు

ప్రథమ దక్షిణ హిన్దూదేశ గ్రన్థాలయ సమ్మేళనమునకు ఆహ్వాన సంఘాధ్యక్షురాలు.



శ్రీమతి మిస్. శకున్తలా పరన్‌జిపాయ్ గారు

ఈమె కేంబ్రిడ్జి యూనివర్సిటీలో రాంగ్లర్ పరీక్షనిచ్చి మొన్ననే యిన్డియాకు తిరిగివచ్చెను.

## నూతన వధూవరులు



శ్రీమతి డి. శృంగారమ్మగారు, పండిత డి. దేశికాచారిగారు.

సహితం గుణం కనబడలేదు. దుగ్ధమ్మకుదరకపోవడంచేత, మాస్టరుకు అంతకంతకూ నామీద కోపం హెచ్చింది.

ఒకనాడు స్కూలుకు వెళ్లడం చాలా ఆలస్యమైనందున మాస్టరు కోపగించి, బెంచిమీద నిలబెట్టి నన్ను, "ఏం పుల్లయ్యా! నిన్నకూడా ఐదునిమిషాలు లేటుగా వస్తివి. ఈవాళ అరగంట ఆలస్యం అయింది. కారణం ఏమిటి?" అని అడిగినాడు.

ముఖం వేలవేసి, వేళ్లు నులుపుకుంటూ ఊరుకున్నాను.

"ఏం?—అడిగిన ప్రశ్నకు జవాబుచెప్పక, మునిగిపోతులాగు ఊరుకుంటావేం? సరియైన సమాధానము చెప్పలేకపోతే పులుసులోకి యెముకలు లేకుండా తంతాను". అనిగర్జించాడు మాస్టరు,

ఇంకా మొండికత్తె ఊరుకుంటే తాళాధ్యాయం తప్పదనిగ్రహించి, ఉన్నది ఉన్నట్లుగా నిజమైన కారణం తెలియచేశాను.

"........'అత్తా' బరికి వేళకావచ్చింది; చద్ది అన్నంపెట్టవూ వేగం? అని అడిగితే ఆమె 'నాయనా' మడికట్టుకున్నాను చద్దికుండముట్టుకోను ఈవాళ వొదిననుపెట్టమను అని చెప్పింది. వొదిన చెరువునుంచి యింకా అప్పటికిరాలేదు.ఆమె రావడం కొంచెం ఆలస్యంఅయింది. వచ్చి, పొత్తిపంచ కట్టుకొని, నాకూ ఆమెకు చెరొక కంచంవేసింది. ఆవకాయ అటకమీద ఉండిపోయింది. మా అత్తయ్యకు నిచ్చెన ఎక్కిందుకు భయం. పొత్తిపంచమడితో వొదిన ఆవకాయకుండ ముట్టుకోకూడదు. తరుచుగా నేనే అటకెక్కి ఆవకాయతీసేవాడిని, కాని యీవాళ చలిగావుండబట్టి ప్రొద్దున్న నేను స్నానం చెయ్యలేదు. 'పోనీ' అప్పడాలురెండు కాల్చితెస్తా ఆగు! అనిచెప్పి, వొదిన నీళ్లపొయ్యిదగ్గరికి వెళ్లింది. చప్పున రమ్మనిచెప్పి, నేను నా కంచందగ్గరే కూచున్నాను. ఆమె ఎంతసేపటికీ రాలేదు. అప్పుడు నేను కూడా పెరటిలోకి వెళ్లాను. ఒదిన అక్కడ లేదు. అప్పడాలు అలాగేఉన్నాయి పొయ్యివద్ద. ఇటూ అటూ చూసేసరికి, పందిట్లోకనిపించింది వొదిన. నన్ను చూసి ముసిముసిగానవ్వింది. 'బరికి ఆలస్యంఅయిపోతూఉంటే, అప్పడాలు కాల్చకుండా పందిట్లో నిల్చుని యేంచేస్తున్నావు?' అని కోపంగా అడిగేను. దొండకాయలు కోస్తూ నిల్చుందనుకున్నాను. 'చద్దన్నం నువ్వేపెట్టుకోవాలి; బయటఉన్నాను ' అని మెల్లగాచెప్పిఁది.

ఒళ్ళుకడుక్కోకుండా నేను చద్దికుండ ముట్టుకోకూడదు. అప్పుడు పొత్తిపంచవిడిచి, గావంచా కట్టుకొని, డేగిసాలోవేడినీళ్ళు తోర్లించుకున్నాను. నీళ్ళు చాలవేడిగావుండబట్టి, చన్నీళ్ళు తోడవలసి వచ్చింది. బడితొందరలో గబగబనీళ్ళు తోడడానికి హడావిడిగా చాద నూతులోవేశాను. తాడుజారింది అత్తకూకలువెయ్యడం ప్రారంభించింది. చాదతియ్యడానికియింట్లోగాలంలేదు; పొడుగైన చాంతాడూ లేదు. అప్పుడు జంగంవీధి పరుగెత్తి గాలంతెచ్చాను, చాంతాడుకోసం అప్పలమ్మ కొట్టకువెళితే తాళ్ళు లేవు అక్కడ. బజారుకువెళ్ళి తాడుకొనుక్కొచ్చాను కొంతసేపుతంటాలుపడి బాల్చీతీశాను.

చప్పుచప్పున నాలుగుచెంబులు నెత్తిమీద పోసుకొని, అటకమీద ఆవకాయతీసి, చద్దన్నంపెట్టుకొని తొందరతొందరగా తిన్నాను, వెంటనే బట్టలువేసుకొని, పుస్తకాలు తీసుకొని బయలుదేరాను. స్కూలుకు సగందూరందాకా వచ్చేసరికి కాపీలపుస్తకం మాట జ్ఞాపకంవచ్చింది. ఆ పుస్తకం మరచిపోతే మీరు కొడతారని భయంవేసింది. వెంటనే వెనక్కిమళ్ళి, తూరీగలాపరుగెత్తి యింటికివెళ్ళాను. ఆతొందరలో గడపలోనిల్చున్న మావొదినను చూడనేలేదు. ఆమెనుదాటుకొని లోపలికివెళుతూఉంటే 'ఆగు...ఆగు!'అన్నాది ఆమె. 'అంత చూసుకోకుండావెళతావేం? బట్టలుతడుపుకో; నన్ను తగిలావు' అన్నది. ఈదురోమని పెరటితన్న తిరిగివెళ్ళి, నూతి

పద్దస్నానంచేసి, చాకింటిబట్టలు తీసితొడుక్కొని, సాధ్యమైనంత త్వరలో మళ్లీస్కూలుకు బయలుదేరాను. అందుచేత యింతఆలస్యం అయింది."

నాకథవిని మా మాస్టరు నిర్ఘాంతపోయినాడు. ఏమనడానికి ఆయనకు తోచిందికాదు. నేను చెప్పిన సమాధానం నిజమా అబద్ధమా అని తనలో వితర్కించుకున్నాడు కాబోలు ఏం నిశ్చయించుకొన్నాడో కాని బెంచిమీద నిల్చున్న నన్ను కూచోమని సౌంజ్ఞ చేశాడు. దెబ్బలు తప్పినందుకు మనసులో సంతోషించుకుంటూ కూచున్నాను.

కాని నాడు నేను లేచినవేళ మంచిదికాదు. ఉదయంనుండీ అన్నీ అపసవ్యంగానే పరిణమించాయి. మాస్టరు ఇంగ్లీషుపాఠం ప్రారంభించాడు. ప్రశ్నలువేశాడు. క్లాసు అంతాఒక్కలాగేఉంది. అందరూ తప్పుతున్నారు. మాస్టరుకి వెర్రికోపం వచ్చింది; అందర్నీ వరసపెట్టికొట్టడంప్రారంభించాడు. అతని వైఖరి చూసేసరికి నాకు మీదిప్రాణాలు మీదనే లేచిపోయినాయి. వొచ్చిన ముక్కలుకూడా చెప్పలేకపోయాను. తప్పినకొద్దీ, నన్నే ప్రశ్నలువేశాడు. నోట మాటరాలేదు నాకు. కొయ్యబొమ్మవలె నిల్చున్నాను. తీవ్రమైన కోపావేశంతో ఆయన, బెత్తం తీసుకొని నన్ను చావదన్నినాడు. ఆదెబ్బలకు ఒంటిమీద తట్లుతేరి, అక్కడక్కడవాచి, రక్తంగూడు కట్టింది.అయినా అతగాడికి తృప్తితీరలేదు.శక్తిపూరా అచిపెట్టి ఒక్కలెంపకాయ కొట్టాడు. గూబగింగురుమన్నది. ఒక్కక్షణం కళ్ళు చీకట్లుక్రమ్మి ఒళ్ళుతెలియలేదు. పళ్ళంటరక్తం చిమ్మింది. లాగుతడిసింది.

అదిమొదలు నాకు చదువంటే ఉపద్రవమైన భీతాహంకలిగింది. ఈచదువుఏనాటికైనా తప్పుతుందా, అనిపించింది. 'ఏమైతే అదికానీ' అన్నమనోనిశ్చయం చేసుకొని, ఆపూటనుంచి పరశురామస్కూలుగుమ్మం మరిత్రొక్కలేదు.

అమర్నాడు కొంచెం జ్వరం తగిలింది. మొదట నేను లక్ష్యపెట్టలేదు. అఘత్యంపైని ఊష్ణం బలపడింది. వెంటనే మా నాన్నకు కబురువెళ్లింది. సమాచారం తెలిసిన ఉత్తరక్షణం బయలుదేరి బ్రాహ్మడు యెకాయెకిని పర్లాకిమిడి చేరుకున్నాడు. సంగతి కనుక్కొని, "వెధవచదువు! దీనికోసమని కుర్రవాణ్ణి చంపుకుంటామా ? చదువులేకపోతే పీడానాడా కూడాపాయెను! బ్రతికిఉండే, బలుసాకులు తిని జీవించవచ్చు" అని మా మాస్టరుమీద కొంతసేపు గాపాయించి. తక్షణం బండిమీద నన్ను చొర్లంగి తీసుకొపోయాడు.

విద్య నేర్పినవాడు గురుడనీ, హరుడనీ పెద్దపెద్ద కబుర్లుచెప్తారు మనవాళ్లు. వశిష్టుడినీ, బృహస్పతినీ ఉదాహరణక్రింద చూపిస్తూ, గురుభక్తివంటి ఉత్కృష్టధర్మం మరొకటిలేదని బోధిస్తారు పిల్లలకు. గురువులంటే దయాదాక్షిణ్యాలు లేక పసిపిల్లల్ని పశువును బాదినట్లు కొట్టే మూర్ఖులనీ, రాక్షసులనీ, ఉన్న నిజం ఎవరూ చెప్పరు. ఈ అయ్యవారులకు నిజంగా పుట్టుగతులు లేవనుకుంటా! గుడిలో పూజారిపనిచేస్తూ దేవుడిసొమ్ము అపహరిద్దామనుకున్నవాడికి మరుసటిజన్మలో కుక్కపుట్టుక వస్తుందని వ్రాసి ఉన్నదట భారతంలో. ఈ స్కూళ్లలో ఉపాధ్యాయగిరీమిషమీద పిల్లల్ని చావదన్నే ప్రముఖులకు ఏంపుట్టుక వస్తుందో ఏ పురాణంలోనూ ఎవడూ వ్రాయడు !



# సాగరము

యేల్చూరి నాగయ్యగారు

సర్వ కళ్యాణతమ గుణసాగరుండ
రమ్ము వేరమ్ము నెచ్చలీ రమ్మటంచు
స్వాగతము నిత్తువానాకు సంతసమున
దుష్టునంచును పోదువా దూరముగను?
స్వీయగుణ పరివర్తన భీతిదక్కి

పూర్ణవ్యతిరేకగుణ గణపూర్ణమైన
ఆపగా స్నేహమొనరించు అబ్ధియొక్క
కదిమిగూడయు కలుగదా కలుగనాకు
తావక స్నేహవిషయికా ధైర్యలవము.

# పాతివ్రత్యము

శ్రీమతి మూలవీపాల పార్వతిగారు

చ॥ పతి కెదురాడుచుండి సతి భక్తిసపర్యలు సేయకన్ ననా
రత మతిధూర్తయై పతిని రాపిడిసేయుచు రత్నభూషలన్
సతతము గోరరా దటుల సారసగంధులు గోరుచుండినన్
పతితలెయౌట సత్యమది భావమునం దలపోసి మానుడీ!

మ॥ పతియేదైవమటంచు నెమ్మదిని సంభావించి యేవేళలన్
పతిమాటన్ జవదాటకుండ తిరమౌ భక్తిన్ సదాఆత్మలో
పతిపాదాంబుజము ల్దలంచుచును పాతివ్రత్యమున్ భూస్థలిన్
సతులెల్లం దలదాల్చినేర్చి యికనీ సద్ధర్మమున్నిల్పరే!

తే॥గీ॥ అవనిలో పాతివ్రత్య మతివ కెపుడు
కష్టసాగరముననుండి గడపనావ
కలుషమతులను ఖండింప గత్తియునదె
అంత్యమున స్వర్గమున కేగ నదియెబాట.

ఉ॥ అట్టి పతివ్రతామణుల కారయగల్గు నలభ్యయోగముల్
నెట్టనగల్గు సంపదలు; నీరజనాభు కృపాకటాక్షమున్
గట్టిగగల్గు; నంత్యమున గాంచును దేవగణాళికెల్ల తా
పట్టగుస్వర్గలోకమున భవ్యచరిత్రుని కాంచనాంబరున్.

సీ॥ ఒకసతి జమునితా త్రికమకగాజేసె పరలోకగతుడైన పతినిబడయ
ఒకయింతి పతిప్రాణ మొసరనిల్పగబూని సూర్యోదయంబాపె సొంపుమీర
ఒకచాన పతికోర్కె నొయ్యారముగదీర్ప సప్తసంయమిసతు ల్సరణినయ్యె
ఒకనాకి తనమాన మొప్పుగాఁలుపంగ సత్రిమూర్తుల బాలకులనుజేసె.

తే॥గీ॥ మరియు నొకలోలలోచన మానసంపు
నిశ్చలత్వంబుదెలుపంగ నిలచెనగ్ని
నట్టివారి పాతివ్రత్య మవనియందు
నెన్నశక్యంబె వేనోళ్ల పన్నగునకు

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ. బి. యల్

స్త్రీవిద్యనుగురించి ఆలోచనము కొంతకాలమునకుమున్నే తలనూపినది. ఇది ఆవశ్యకమైనదని గుర్తింపనివారు నేడెవ్వరును లేరు. అయినను ఈవిద్య ఎట్టిదైయుండవలెనో నిర్దేశించినవారు సకృత్తు. నేటి విద్యాలయములందలి విద్య దీనికి మేలుబంతియై యుండవలెనా?

మనవిద్యాలయములందు కఱపబడు విద్యనుగురించి ఎన్నెన్ని ఊహాపోహలు పొడసూపినవి. ఈచదువు పట్టి అబద్ధపు హళాహళియనియు, వ్యయభూయిష్ఠమైనదనియు, దారిద్ర్యదుఃఖములను మాపుచేయునది గాక బిడ్డలనట్లు వానినడ్డాలియందిడుకొని పెంచునదనియు, ఈచదువులేకున్న దేశము బాగుపడుననియు పలువురు అనుచున్నారు. తనకు హక్కు దొరకినయెడల విశ్వవిద్యాలయమును మూసివేతునని ప్రఫుల్లచంద్రరాయ్ చెప్పినాడు. ఇతరదేశములలోని జనసంఖ్యను, విశ్వవిద్యాలయముల సంఖ్యను, ఈదేశపు వానితో, పోల్చి, ఇవి మిక్కిలి తక్కువైయున్నవని యశస్తిలకుడు గాన్ధాకృష్ణుండనినాడు. రాధాకృష్ణునివచనముమీదనే శుభాశంసలుచల్లి, సత్యమూర్తి 'భళాభళి'! అనినాడు. కళారాధనము కూడుగుడ్డలియ్యదు, బాబులూ! మీకీచదువు వద్దు అని పెద్దలూ చిన్నలూ మొరలిడుచున్నారు. వృత్తివిద్య కావలెనని హబీబుల్లా మున్నగు ముసలిపండులనుచున్నారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఈభావమును కొంతకుగొంత మన్నించుచున్నది. కొంతకాలమువరకు వృత్తివిద్య భోజనసమస్యను దీర్చును గాని దీనితో బాటుగ కష్టము గట్టెక్కదు. నేటి విదేశములస్థితి ఇందులకు ఋజువు. కొంతకాలము కలకత్తా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షుడైయుండిన డాక్టర్ ఆర్క్‌రట్ అనినాడు! ఇదంతా పెద్దపెద్దవాళ్లుచేసే పెద్దగొడవ. మొట్టికాయ తినుచున్న విద్యావిధానము ఎంతో అభివృద్ధినభిలషించు స్త్రీవిద్యకు ఒరవడి ఎట్లుకాజాలును?

నేడు మనముపొందే చదువు గుండెనునొక్కిపట్టి బుద్ధిను సాగదీయునది! మేధావృద్ధికి తోడ్పడునదే ఈవిద్య. హృదయవిద్య కన్నుపొడుచుకొనినను కానరాదు. అధ్యాత్మిక, నైతికవిషయ పఠనీయము నున్న! ఉన్నతాశయముల గోష్ఠి లేనేలేదు. ప్రత్యక్షజీవనమందును, మహాపురుషసంసర్గమందును ఏకొలదిమంది అలవఱచుకొను ఉన్నతవిద్యయే దేశమునకు శోభ తెచ్చుచున్నది. జ్ఞానజిజ్ఞాస కొలదిమందికి మాత్రము కలదు. పలువురు పరీక్షలకై చదివిచదివి పరీక్షలైనంతనే—నెగ్గినను, బోర్లపడినను—గాలిబుట్టలగుచున్నారు! పెద్దఉద్యోగములు తద్దినాయనములట్లు ఒడిలోబడునని మడిమాన్యములూ, పుస్తెపూసలు అమ్మి చదువులలోనికి దిగిన అయ్యలు 'ఏదీగతిమాకు!' అనేపాటను వెక్కివెక్కి ఆలాపిస్తున్నారు. "ఆశలడుగంటె దైవోపహతులమైతి" మని చతికిలబడుచున్నారు. ఈ చదువుకు కుక్కముట్టుకొన్నది! ఇది పొగచూరుకుపోయినది! దీనికోసము ఖర్చుఅయిన కోటిమార్కు నూనెడబ్బాలైనా గిట్టుబడికి రాలేదు. సేర్లకొలది గొంతుకందుబడిన టీకైన డబ్బులైనాకళ్లబడలేదు అని పరిపరివిధముల మనయువకులు అఘోరిస్తున్నారు. Dignity of Labour అనేది ఒకటి ఉన్నదనియు Necessity is the Mother of Invention అనేది శాస్త్రమైన సూత్రమనియు కొందరు పట్టభద్రులు రిక్షాలను, జోళ్ళను పట్టుచున్నారు. ఛా! ఇదంతా ఎందుకు నాగళ్ళనుపట్టి పొలముదున్ని దేశాన్ని ఉద్ధరించండోయ్ అని పెద్దపెద్ద ప్లాటుఫారములెక్కి పెద్దపెద్దనాయకులు మీసములకు కొండిశిఖలు చుట్టుతూ బొబ్బలు పెట్టుచున్నారు. కాని మంచెయెక్కి వడిసెలచేబూను నాయకులుగాని, పొలముసజొచ్చి నాగలిబట్టిననాయకులుగాని ఇంకను పుట్టలేదు. ఎందునూ పొందనిచదువునకు దిగపడుతున్నవారును, బ్రతికియుండగానే యమలోకాన్ని ప్రత్యక్షం చేస్తూఉంది దీనిదుంపతెగా దీనికింక బలాదూరు

ఆసేవారును ఎందరెందరో ఉన్నారు. అయినను విశ్వవిద్యాలయములు పెరుఁగుచునే ఉన్నవి. ఎవరేమనుకొనినను వానిపని అవి చూచుకొనుచునే ఉన్నవి! జ్ఞానజిజ్ఞాసను పుట్టించుటకు గాని, ఆర్థికాభివృద్ధిని కనుకెదుటం బెట్టుటకు గాని నేటి విద్యాసంస్థలు పనికిరావని చాలకాలమునకుమున్నే రూఢిఅయినది. మనుష్యత్వ వృద్ధికిని, ఉత్తమచారిత్ర గ్రథనమునకును వలసిన విజ్ఞానము మనవిశ్వవిద్యాలయములందు పూర్ణానుస్వారము! ఒక రాధాకృష్ణుడును, ఒక రామనును, ఒక రవీంద్రుడును ఉన్నచోటులందు విశేషమైనమేలే చేకూరినది. తథ్యమే! అసంఖ్యాకులగుభారతవిద్యార్థులలో నెందఱికి వీరి చరణోపాంతమున గూర్చుండఁజాలు నదృష్టముపట్టినది?

విద్యవలన మనుష్యహృదయమందలి విభిన్నశక్తులు వృద్ధియగును. ఒకరీతి శక్తి వృద్ధియై, వేఱొకతీరు శక్తి సన్నగిలెనేని, మరగుజ్జుమనిషివలె మానవ మానసము సౌష్టవముగాని, సౌందర్యముగాని ఎఱుఁగనిదై యుండును. యోచన (Thinking), సంకల్పము (Willing), భావనము (Feeling) నను శక్తులు సమముగ పెఱిగినఁగాని మనుజుఁడు శాంతి నెఱుఁగజాలడు. హృదయమేధస్సులు జయవిజయు లట్లు పెంపొందవలెను. ఒకకాలు పొడవు, ఒకకాలు పొట్టి అగునేని, అడుగిడఁదలఁచినపుడు మనుజుఁడు బోరగిలపడునట్టులు మేధస్సునకు సంబంధించిన యోచనాశక్తి అధికమై, హృదయముతో గూడిన భావనాశక్తి క్షీణించెనేని మానవుఁడు తలక్రిందు లగుట తప్పదు. సాహితీప్రపంచమును, ప్రత్యక్షప్రపంచమును ఎన్నేని దృష్టాంతములు చూపుచున్నవి. యోచనాశక్తియందు అద్భుతప్రజ్ఞనంది, సంకల్పశక్తియందుఁ గొఱవడిన హేమ్లెట్ క్రియాంగణమునఁ జొరలేక ఇటునటు లూఁగిసలాడినాఁడు. విశాలహృదయులై మేధాశక్తియందు వెనుకఁబడి యుండుటచే, ఒక పిశాచివలన మోసపడి, ఒథెల్లో డెస్డిమోనాలు ఘోరదుర్మరణమునకు పాల్పడిరి. జీవనవిజయమునకు హృదయమేధస్సుల సమన్వయమావశ్యకము. హృదయమేధస్సులను కవల లట్లు పెనుచు వారు అద్భుతచారిత్రు లగుదురు.

ఒక్కొక వ్యక్తి యంతరంగమందు ప్రత్యేకశక్తులు నిహితమైయుండును. తన యంతరంగమందలి నాడి నొకఁడు తానే పరీక్షించుకొనవలెను. తన శక్తి ఎట్టిదో గుర్తించి దాని నతఁడు వృద్ధిగావించుకొనవలెను. తమ ప్రకృతికి, తమ రుచికి ప్రతికూలమైన తెరువునఁ బడువారు బోర్లబడి, బొప్పి గట్టికొందురు. రవీంద్రుఁడు సైన్సుక్లాసులోను, జగదీశచంద్రబోసు సాహితీశ్రేణి విద్యార్థులందును ప్రవేశించియుండిరేని, సభ్యప్రపంచమునం తను దేజమొసఁగిన మనీషులుకాక తమ తరగతులందు "దిష్టిబొమ్మ"లై యుండెడివారు. సహజభావనాశక్తిఁ గలిఁగి, వికసితహృదయయై చిఱుతప్రాయమునందే కైతనల్లుతెరు వెఱిఁగిన సరోజిని చేతికొక లెక్కనీయ, అంకెలనడుమ నామె పద్యపంక్తుల నిరికించినదఁట! అంకెలనుండి తొలగించి, రామానుజము నెవ్వరేని సాహిత్యమందుఁ బ్రవేశపెట్టియుండిరేని అతఁ డెందును బొందనివాఁడై యుండువాఁడు. తన మనసు కందిన విజ్ఞానశాఖను బట్టినవాఁడు, తుదికొమ్మను చేరఁజాలును; యత్నించెనేని, తక్కుంగల శాఖలందు, గొంత యభినివేశము చూపఁగలఁడు. విద్యాభివృద్ధినందఁగోరువారీ విషయమును తొలుత గుర్తింపవలెను.

ప్రకృతి ననుసరించిన శక్తులందు దోఁచు విభేదములు ఒకేజాతివారియందుఁగాక వేఱు జాతియందు అధికమైయుండును. స్త్రీజాతి పిడికిలియందుఁ జేరు శక్తులు పురుషజాతి గుప్పిలియందు జేరఁజాలవు. ఒకరు చేకూర్చినవికాక ప్రత్యేక ప్రకృతి ననుసరించియు, ప్రత్యేకమానసికస్థితి ననుసరించియుఁ గొన్ని వ్యత్యాసములుండును. సాధారణులందు మాత్రమే ఈ వచనము చెల్లును. స్త్రీవిద్యనుగుఱించి యోచింపవలయు విషయములు బహుళములు. తరువాతి వ్యాసమున వీనిని పరికింతుముగాక.

# 'గానకోకిల' మిస్ రామతిలకం

ఈమె నివాసస్థలం బెజవాడ. ఈమె తండ్రి ఆంధ్రదేశంలో మృదంగ వాద్యమునందు ప్రసిద్ధిగాంచినవారిలో నొకరగు పువ్వుల వెంకటరత్నంగారు. స్వజాతీయుడగు పువ్వుల నారాయణగారివద్ద ఈమె సంగీతం చెప్పుకున్నది. సంగీతంలో కచ్చేరిచేయుటకు తగినంత జ్ఞానం సంపాదించింది. కొన్నిచోట్ల కచ్చేరీలుకూడాచేసి బహుమతులుపొంది ప్రశంసింపబడ్డది. ఈమె వయస్సు 23 సంవత్సరములు. కొంచెం పొట్టి. నొక్కులుగల్గిన మృదువైన శిరోజములు. విశాలమైన నేత్రాలు. పెద్ద సౌందర్యవతి గాకపోయినా, ఆ నేత్రాలు, ఆ జుట్టు, ఆ చూపులు, ఆ వయ్యారం జనాన్ని ఆకర్షిస్తాయి. కట్టుగా సంగీతం చెప్పుకొనుటచే చక్కని పాట పాడుతుంది. మంచి ఒదుగుబడిగల శారీరం. తాను ధరించే పాత్రముల ఔచిత్యాన్ని అర్థంచేసుకునేటంత భాషాసంస్కారం పొంది స్టేజీమీద చాల హోంలీగాయుంటుంది. 4 సంవత్సరాలక్రితం మైలవరం కంపెనీ మేనేజరుగారైన కీ॥ శే॥ కొమ్మూరు పట్టాభిరామయ్యగారు స్థాపించిన లక్ష్మీవిలాస సభలోను, అనంతరం కపిలవాయి రామనాథశాస్త్రిగారి బాల భారతి నాట్యమండలియందును, చింతామణి, చిత్రాంగి, సత్యభామ, అహల్య, సావిత్రి మొదలైన వేషాలువేసింది. 1932 సం॥రము, నవంబరులో కలకత్తా ఈస్టు యిండియా ఫిల్ము కంపెనీవారిచే తయారుచేయబడిన తెలుగు సావిత్రి టాకీ ఫిల్మునందు సావిత్రిపాత్ర ధరించి అఖండకీర్తి ప్రతిష్ఠలార్జించినది. 1933 మార్చిలో కలకత్తా మదన్ ఫిలింకంపెనీవారి తెలుగు చింతామణి టాకీయందు చింతామణిపాత్ర ధరించినది. ఈమె సావిత్రి టాకీఫిల్ము తీర్థప్రజవలె జనుల నాకర్షించుచు లక్షల కొలది ధనము నార్జించినది.

సింహా.

# సభలు

(ప్రథమ కమ్మ మహిళాసభ: తెన్నేరు 27-4-34)

(స్వకీయవిలేఖరి)

## అధ్యక్షురాలు శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మీదేవిగారి యుపన్యాసము:

(బెజవాడ, ఏప్రిలు 28)

[ప్రథమ కమ్మ మహిళాసభ నిన్న ఉదయం తెన్నేరులో శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మీదేవిగారి యధ్యక్షతను సమావేశమయ్యెను. వారు యీక్రిందివిధముగ నుపన్యసించిరి.]

### స్త్రీలు వెనుకపడుట దేశము వెనుకపడుటే:

మానవశ్రేష్ఠుడనదగిన గాంధిమహాత్ముడు చెప్పినటులు "దేశమునందు సగముప్రజలు అధోగతియందున్నప్పుడు యేదేశమును వృద్ధికి రానేరదు." సగము ప్రజలు అనగా స్త్రీలు అని అర్థము. మనదేశమునందు అందు ముఖ్యముగా మనసంఘమునందు స్త్రీలు, ప్రతివిషయమునందును వెనుకబడియున్నారు. విద్యయందేమి, నాగరికతయందేమి, తదితర విషయములందేమి అనేక మడుంగులు వెనుకబడియున్నారు. మనసంఘము ధనముగలదైనప్పటికిని, ముఖ్యవిషయములం దిటులు వెనుకబడియుండుట మిగుల శోచనీయము. కనుక మన స్త్రీసంఘముకూడ పైవిషయములందు అభివృద్ధి చెందునటులు చేయుటయే ఈ మహాసభయొక్క ఉద్దేశ్యమైయున్నది.

### దేశములో స్త్రీవిద్య హెచ్చవలెను.

హిందూదేశమునందు విద్యాభివృద్ధినిగురించి విచారణ సల్పుటకు యేర్పరుపబడిన 'హార్టాగ్ కమిటీ' వారు స్త్రీవిద్యనుగురించి ఆలోచించుచు, స్త్రీవిద్య చాల వెనుకబడియున్నదనియు దానిని వృద్ధిచేయుటకు గవర్నమెంటువారు తగు చర్య తీసికొనవలెననియు సలహా నిచ్చియున్నారు. ప్రతిగ్రామమునందు బాలికలెల్లరు బాలురతో పాఠశాలలకు పంపబడవలయును. కొన్ని గ్రామములందు ప్రత్యేకమగు బాలికా పాఠశాలలులేకపోయినను బాలురపాఠశాలలకే బాలికలను పంపవలయును. ఇందు తప్పేమియులేదు. ముఖ్యముగా ప్రాథమిక పాఠశాలలయందు బాలురును బాలికలును కలిసియే చదువవలసియున్నది. ప్రతితల్లియును తనకుమార్తెను పాఠశాలకు పంపుట తనవిధ్యుక్తధర్మమని యెంచవలెను. వారలట్లు చేయనియెడల తమ బాలికల భవిష్యత్తును పాడుచేసినవారగుదురు. కొంతమంది స్త్రీలు తమ బాలికలు ఇంటిలో నున్నయెడల తమకు గృహకృత్యములందు సహాయము చేయుదురను ఉద్దేశముతో బాలికలను పాఠశాలకు పంపక వారి భవిష్యత్తును పాడుచేయుచున్నారు. బాలికలను ఇంటివద్ద నుంచుటవలన తాత్కాలికముగా తల్లికి కొంచెము సహాయము కలిగినను బాలికలకు తీరరాని నష్టము కలుగును. బాలికలు పాఠశాలకు వెళ్లుచుండియు పాఠశాల లేనిసమయములయందు ఇంటిదగ్గర తల్లికి సహాయము చేయుచునే యుండవచ్చును. కనుక ప్రతిస్త్రీయును ప్రాథమిక విద్యనైనను తమ బాలికలకు చెప్పింపవలయునని నాప్రార్థన.

### స్త్రీలకు ఉన్నతవిద్య కావలయును.

స్త్రీలకు ఉన్నతవిద్యకూడ ముఖ్యావసరమని చెప్పక తప్పదు. ముఖ్యముగా వైద్యవిద్యయందును, ఉపాధ్యాయపదవులందును ఉన్నతవిద్య అత్యవసరమైయున్నది. మన దేశమునందు స్త్రీ డాక్టర్లు చాల కొలదిగనున్నారు. మన సంఘమునందే స్త్రీలకు అనేకవిషయములందు వైద్యసహాయమునకు ప్రతిదినము వెళ్ళుచుండుట తెలియచేయుచున్నది. స్త్రీలు

స్త్రీవైద్యుల సహాయము దాపున లేనందున పురుషులకు చెప్పవెరచియు, పురుషవైద్యుల సహాయము లేనందువలన కొంతమంది ప్రసవసమయములందు ప్రాణములనుకూడ గోల్పోవుచున్నారు. కనుక సోదరీమణులారా! వీలైన ప్రతివారును తమ బాలికలను సాధ్యమైనంతవరకు వైద్యవిద్యకు పంపి స్త్రీవైద్యులను తయారుచేయవలయును. అదియునుగాక స్త్రీల పాఠశాలలు, కళాశాలలు వృద్ధిఅయిన కొలదియు ఉపాధ్యాయినులు చాలమంది కావలసియుందురు. కనుక స్త్రీలు వీలైనవారు తమ బాలికలను ప్రాథమికవిద్యతోనే మాన్పించక కళాశాలలకు కూడ పంపి ఉన్నతవిద్య చెప్పించి ఉపాధ్యాయినులను తయారు చేయవలయునని నాప్రార్థన.

ఇందుకు కమ్మమహాసంఘమువారు తోడ్పడి బీదలైనవారికి విద్యార్థి వేతనము లిచ్చి ప్రోత్సహించవలెనని మనము వారిని కోరవలయును.

స్త్రీ విద్యను వృద్ధిచేయు విషయములో ఒక విషయము మనమందరము గమనింపవలయును, అది యేమనగా వార్తాపత్రికలు చదువుట. ప్రతిదినము వార్తాపత్రికలు చదువుటవలన మనము విద్యను ప్రపంచజ్ఞానము వృద్ధిచేసికొనగలము; కనుక స్త్రీలందరు మధ్యాహ్నము పనిలేని సమయములందు ఒకచోట గుమిగూడి పనికిమాలిన సంభాషణలచే కాలమును వృథాపుచ్చక ఆంధ్రపత్రిక, ప్రజామిత్ర, భారతి, గృహలక్ష్మి మొదలగు వార్తాపత్రికలను చదివి లోకజ్ఞానమును వృద్ధిచేసికొనవలెను. వార్తాపత్రికలను చదువుటయే సగము విద్య నేర్చుటయగును.

## స్త్రీలు: గృహపరిశ్రమలు.

ప్రతి స్త్రీయును గృహపరిశ్రమలను గురించి బహు శ్రద్ధ వహించవలెను. గృహపరిశ్రమలనగా కుట్టుపని, రాటముమీద నూలుదీయుట, అల్లిక, పేముపని మొదలుగాగలవి. ఇట్టి పరిశ్రమలవలన కుటుంబముయొక్క ఆర్థికము బాగుపడును. కుటుంబముయొక్క ఖర్చులు తగ్గించుకొనుటయేగాక గృహ ఆదాయమును గూడ వృద్ధిచేసికొనవచ్చును. సాధారణముగా మన స్త్రీలకు ఉదయ సాయంకాలములు గృహపనులుండి మధ్యాహ్నసమయమందు తీరికగానుండెదరు. అట్టి తీరికసమయములను గృహపరిశ్రమలకు ఉపయోగపరచిన కుటుంబవృద్ధికి తోడ్పడుదురు. చీనా జపానుయూరపుదేశములలో స్త్రీలు చాలమంది ఇట్టి గృహపరిశ్రమలచే కుటుంబపోషణ చేసుకొనుచున్నారు. ప్రతిదినము మనము జపాను మొదలగు విదేశవస్తువులను వస్త్రములను కొనుచున్నాము. అట్టివి మానివేసి మన స్వదేశీవస్త్రములను కొనుటకు దీక్షబట్టి మనదేశములందు గృహపరిశ్రమలను వృద్ధిచేయుటకు తోడ్పడినయెడల మన సంఘము కూడా వృద్ధికి రాగలదు.

## ఆరోగ్యము—శిశుపోషణము.

మనమిక గృహకృత్యములను గురించియు గృహ ఆరోగ్యమును గురించియు ఆలోచించవలయును. ఎంతభాగ్యవంతమైన కుటుంబమయినను గృహము సంతుష్టముగా నుండనియెడల సౌఖ్య ముండనేరదు. గృహముయొక్క సౌభాగ్యము అందము గృహిణిమీదనే ఆధారపడియున్నది. గృహమును స్వర్గతుల్యముగ చేసినను కష్టములపాలుచేసినను గృహిణిదే బాధ్యత కనుక కుటుంబమునందు ప్రతి స్త్రీయును తనయొక్క విధులను క్రమముగా నెరవేర్చి గృహమును ఆరోగ్యముగను, సంతోషదాయకముగను ఉంచవలెను. ఎటువంటి భాగ్యవంతురాలైనను సోమరితన ముండగూడదు. సోమరితనము వలన గృహము అల్లరిగా నుండుటయేగాక స్త్రీలకు ఆరోగ్యము కూడ చెడును. స్త్రీలు ఎల్లప్పుడును గృహమునందే ఉండువారు గనుక వారు గృహకృత్యములను స్వయముగా నెరవేర్చి శరీరకష్టమును చేయనియెడల వారికి వేరేవిధముగా శరీరమును ఆరోగ్యప్రదముగా నుంచుకొనుటకు అవకాశ ముండనేరదు. శిశువును పోషించు బాధ్యత ముఖ్యముగా తల్లిదైయున్నది. శిశువుల ఆరోగ్యము తల్లి తగుజాగ్రత్తగా కనిపెట్టి యుండవలెను. శిశువులను దాదులకు వదలి వారిని అనారోగ్యవంతులనుగా చేయక తల్లులు స్వయముగా బిడ్డలను ఆదరింపవలెను.

ఇక మన సంఘమునందలి దురాచారములను గురించి ఆలోచించవలసియున్నది. పెండ్లిండ్లయందును శుభకార్యములయందును మనవారలుచేయు దుర్వ్యయమునకు అంతులేదు. ఇట్టి ఖర్చులవలన అనేక కుటుంబములు పాడయినట్లు మనము కన్నులార గాంచుచున్నాము. ఇట్టి ఖర్చులకు ముఖ్యముగా స్త్రీలే



'గానకోకిల' మిస్ రామతిలకం

ప్రోత్సాహకులైయున్నారు. స్త్రీలు కష్టసుఖములను గ్రహించి అట్టి ఖర్చులను తగ్గునట్లు చేయవలెను.

* * *

## ఘోషాపద్ధతి

పూర్వకాలము హిందువులందును ఘోషాఉన్నట్లు కానిపించదు. మధ్య మహమ్మదీయకాలములో ఆకాల పరిస్థితులనుబట్టి ఘోషాపద్ధతి యేర్పడినది. అట్టి కాల పరిస్థితులు ఇపుడేమియు లేవు. కనుక ఘోషాపద్ధతి అనవసరము. దీనిని నిర్మూలించవలసిన బాధ్యత మన స్త్రీలలోనే యున్నది. ఘోషాను తీసివేయుట అనగా కట్టుబాటులేక పెద్దల నతిక్రమించి సంచరించుట కాదని గ్రహింపగోరెదను. ఇదివరకు ఘోషా ఎక్కువగానున్న గొప్ప మహమ్మదీయ రాజ కుటుంబములగు 'నిజాము'గారి కుటుంబమునందును తురుష్కదేశమగు టర్కీదేశమందు కెమల్ పాషాగారి పరిపాలనమునందును ఘోషా తీసివేయబడినది. ఘోషా ఎక్కువగానున్న ఉత్తర హిందూస్థానమందును ఇపుడు ఘోషా తీసివేయబడుచున్నది. ఈ విషయమును ప్రత్యక్షముగ నేను కాశీ విశ్వవిద్యాలయమునందు చదువుచున్నప్పుడు తెలిసికొనగలిగితిని. అదియును గాక మన తెలుగుదేశమునందు జమీందారీ కుటుంబములందుకూడ ఘోషాపద్ధతి రానురాను తగ్గిపోవుచున్నది. అట్టితరి మన సంఘములో మాత్రము ఘోషా ఎందుకుండవలయును? మన సంఘమునగూడ, దక్షిణజిల్లాలయందును నెల్లూరు, చిత్తూరు జిల్లాలయందును, పట్టణములయందును ఘోషాలేదు నాగరికత గల మన మాగాణి ప్రదేశములందు మాత్రము ఇది కాన్పించుచున్నది. మనలను పాలించు బ్రిటిషు ప్రజలయందు యెట్టి కుటుంబములందునుగూడ ఘోషాలేదు. బ్రిటిషు ప్రజలందేగాదు, ప్రపంచమునందు ఖ్యాతిగాంచిన యే యూరోపియను జాతియందును ఘోషాలేదు. ఇది యదియనేల? మన హిందువులందు కొన్ని కుటుంబములందును, మహమ్మదీయులయందు కొన్ని కుటుంబములందును దక్క ప్రపంచమున మరెక్కడను ఘోషాలేదు. ఘోషాలేని ప్రజలకన్నను మనము యెవ్విధమునను ఉన్నతస్థితియందు లేము. ఘోషాపద్ధతి అనాగరకపద్ధతియైయున్నది.

## అంటరానితనము

మన హిందూసంఘమునందు "అంటరానితనము" మిక్కిలి అవమానకరముగు మచ్చగానున్నది. ఇట్టి అంటరానితనము హిందూసంఘమునందు దక్క ప్రపంచమునందేమతమునందును ఎచ్చటను గాన్పించదు. "అంటరానితనము" మన కమ్మసంఘమునకు మిక్కిలి హానికరమును నష్టదాయకమునైయున్నది. ఎందుచేతనన మన సంఘము ముఖ్యముగా వ్యవసాయవృత్తి నవలంబించియున్నది గనుక వ్యవసాయపు పనులందు హరిజనులతో మన కెక్కువ సంబంధము గలదు. అంటరానివారగు "మాలలు" "మాదిగలు" ముఖ్యముగ మన సంఘముయొక్క అభివృద్ధికి మూలాధారమైయున్నారు. వారలు లేనిదే మన వృత్తిపనులలో నొకటైనను ఒక దినమైనను కొనసాగదు. అట్లు మనకు సహాయభూతులుగనున్న నిమ్నజాతులను ఆదరించి అభివృద్ధికి దీసికొనివచ్చు బాధ్యత మనమీదనున్నది. నిమ్నజాతుల శ్రేయము అభివృద్ధి మనయొక్క అభివృద్ధికి సహాయపడును. అదియునుగాక వారిని మన హిందూసంఘమునుండి విడదీసి వేరుగ బెట్టినయెడల హిందూమతమునకు ప్రబలమగు హానికలుగును. నిమ్నజాతులవారు అనేకమంది ఇప్పటికే అన్యమతములగు క్రిస్టియను మతమును మహమ్మదీయ మతమును స్వీకరించియున్నారు. మన మతములోని వారిని మన అనాదరణవలన బోగొట్టుకొనుటకంటె వారిని ఆదరించి బాగుచేసి మన మతములో నైక్యముజేసికొనుట మన మతమునకు ముఖ్యావసరమైయున్నది. అంటరానితనము తీసివేయు విషయములో మనవారలు కొంతమంది కృషి సల్పుచున్నప్పటికిని సాధారణముగా పూర్వాచారపరాయణులగు స్త్రీలు ఇంకను అందుకు తోడ్పడుటలేదు. మనము ఏనాది, ఎరుకు, లంబాడి మొదలగు అనాగరకజాతులను మన యిండ్లయందు తిరిగి మనతో కలిసి మెలసి పనిపాటలు చేయనిచ్చుచున్నాము. కాని మాలమాదిగజాతులను మాత్రము అంటరానివారలుగా చూచుచున్నాము. ఇది యెంతయు అన్యాయము. మాల, మాదిగలు పైజెప్పబడిన జాతులకన్నను పరిశుభ్రతయందును, నడతయందును యెంతయో బాగుగనున్నారు. అయినను వారలను అంటరానివారలుగ చూచుచున్నాము. వారిని దేవాలయములకును ఉత్సవములకును పాఠశాలలకును రానిచ్చి ఆదరించి మన సంఘమునందు జేరునట్లు జేయవలయును. మన గ్రామములందు

చెరువులకు నీళ్లకొరకు అనాగరిగ జాతులను ఎరుకు, ఏనాది, లంబాడి మొదలగువారిని రానిచ్చెదరుగాని హరిజనులను చెరువు చెంతకైనను నడువనివ్వరు. కనీసము కుక్కలను, జంతువులను, పందులను, చెరువులందు నీళ్లు ముట్టనిచ్చెదరుగాని సోదరమానవులగు హరిజనులను ముట్టనివ్వరు. కుక్కలు మొదలగు జంతువులను తాకెదరుగాని హరిజనులను పొరపాటున తాకిన ఆపాపము పోవునందుకు స్నానములను ప్రాయశ్చిత్తములను చేయుదురు. మానవులలో కొందరిని ఇట్లు చూచుటవలన మనము మన మానవత్వమును నిందించుకొనుటకాదా? గాంధిమహాత్ముడు బీహారు భూకంపమునకు కారణము మన సనాతనులు హరిజనులకు తరతరములనుండియు చేయుచున్న పాపమునకు అక్రమమునకు ఫలితమని చెప్పుచున్నారు. బీహారు భూకంపమునకు కారణము మనము హరిజనులకు జేసిన పాపము అయినను కాకపోయినను మన సవర్ణహిందువులు వారికి అనేక శతాబ్దములనుండియు చేయుచున్న అక్రమమును, మహాపాపమని ఒప్పుకొనక తప్పదు. పాపభూయిష్టమగు నాయాచారము ఎంత త్వరలో తొలగించిన అంత మంచిది.

## ఇతర సంఘములతో మైత్రి.

సోదరీమణులారా!

ఇంక మన సంఘము ఇతర సంఘములతో ఎట్లు కలసి మెలసియుండి సమానభావముతో మెలంగవలసినది రెండుమాటలు చెప్పి ముగించెదను. మన సంఘమును మనము శక్తికొలది వృద్ధిచేసికొనవచ్చును. కాని యితర సంఘములయెడ ఈర్ష్యభావముతోను ద్వేషముతోను ఉండగూడదు. ఇతర సంఘములతో, చిన్నవారైనను, పెద్దవారైనను ఎల్లప్పుడును కలసి మెలసియుండి, వారి కష్టసుఖములను మనవిగ నెంచుకొనవలయును. వీలైనయెడల మన సంఘమువారు ఇతర సంఘములకుగూడ సహాయము చేయుచుండవలయును. ఏ సంఘమైనను, ఎంత గొప్పదియైనను ఇతర సోదరసంఘములతో నేమాత్రమును సహకారములేక వేరుగానుండుట దుర్లభము. అన్ని సంఘములును గలసి దేశక్షేమమును దేశాభివృద్ధిని తమ లక్ష్యముగా నుంచుకొనవలయును.

## ప్రథమ దక్షిణహిందూదేశ గ్రంథాలయ సమ్మేళనము. ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారి ఉపన్యాసము.

(బెజవాడ 28—4—34.)

ప్రతినిధులారా! గ్రంథాలయోద్యమ సేవకులారా! ఎండగాడ్పులకోర్చి శ్రమయనుకొనక యీసభను జయప్రదముగా జరుపుట కేతెంచిన తమ కందరకు వందనములు. ఆహ్వానసంఘమువారము చేసిన యేర్పాట్లలో లోటుపాట్లు గలవని యెరుగుదుము. అవన్నియు క్షమించి ఆదరణతో కార్యక్రమమును నెరవేర్పగలందులకు మిమ్ములనందరను ప్రార్థించుచున్నాను. ఈ పురాధీశ్వరియగు శ్రీ కనకదుర్గాంబా తల్లి గ్రంథాలయోద్యమము నాశీర్వదించుగాత!!

అనాదినుండియు స్త్రీలను సమానగౌరవ ప్రతిపత్తులతో జూచుచుంట భారతదేశ సాంప్రదాయమై యున్నది. విద్యారంభసమయమున సరస్వతీపూజ చేయుట హిందూమతాచార మగుటచే స్త్రీకట్టి స్థానము యీదేశమున నివ్వబడినదో చెప్పక చెప్పుచున్నది. గనుక నాయర్హతను బట్టి గాక స్త్రీ సంఘమునెడ గల యభిమానముచేతనే మీకందరకును స్వాగతమిచ్చు భాగ్యము నాకు లభింపజేయబడినది. అందులకు ఆహ్వానసంఘమువారికి వందనములు.

దక్షిణ హిందూదేశమున ముఖ్యముగ తెలుగు, తమిళము, మళయాళము, కన్నడము భాషలుగలవు. ఈభాషలు మాటలాడువారందరును ఒకేరాష్ట్రమగు చెన్నరాజధానిలో చేర్చబడియున్నను, వ్యవహారసౌకర్యార్థము పెద్దలు భాషలనుబట్టి రాష్ట్ర విభజన చేసియున్నారు. దొరతనమువారినిగూడ యా విభజనము నేయ నంగీకరింప గోరుచున్నారు. గ్రంథాలయోద్యమము ప్రజలకందరకు నందుబాటు కావలయునన్న భాషలనుబట్టి యేర్పరుపబడిన రాష్ట్రవిభజన సూత్రమునే ప్రాధాన్యముగ జేసికొనవలయును. ఆ సిద్ధాంతము నంగీకరించియే ఆంధ్రులు, తమిళులు, మళయాళులు, కర్ణాటకులు గ్రంథాలయోద్యమమును నడుపుచున్నారు. 1885 సంవత్సరమున ఆంధ్రదేశమున గ్రంథాలయముల యేర్పాటు ప్రారంభమైనను 1914వ

సంవత్సరమున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘస్థాపన చేయబడి తదాది నేటివరకు పదునారు ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభలు జరుపబడినవి. సంఘస్థాపన కేమి, ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము వ్యాపింప జేయుటకేమి, కీర్తిశేషులగు బ్రహ్మశ్రీ నూరి నరసింహశాస్త్రిగారును, అమితోత్సాహముతో అహర్నిశలు ఇప్పటికినీ పనిచేయుచున్న మహారాజరాజశ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారును యే విధముగ తోడ్పడినది చెప్పుట చర్వితచర్వణము. గ్రంథాలయోద్యమముపట్ల హిందూదేశము నంతటిని మేల్కొల్పినది నరసింహశాస్త్రిగారేయనుట యతిశయోక్తి గానేరదు. వారలకు ఆంధ్రు లెల్లప్పుడును కృతజ్ఞులు.

సుమారు నాలుగు సంవత్సరముల క్రిందట కేరళదేశ గ్రంథాలయసంఘము యేర్పడినది గాని విశేషమగు చలనము జూపుచున్నటుల లేదు. 1928 వ సంవత్సరమున ప్రథమ కర్ణాటక గ్రంథాలయ మహాసభ ధార్వారునందు కీ॥ శే॥ నూరి నరసింహశాస్త్రులుగారి అధ్యక్షత క్రింద జరిగినదే కాని ద్వితీయసమావేశము జరిగినటుల తెలియుట లేదు. ఈసంవత్సరమే తమిళనాడు గ్రంథాలయ సంఘము యేర్పడి జూను నెలలో రాష్ట్రసభ జరుగు యేర్పాట్లు చేయబడుచున్నవి. ఈ వివిధరాష్ట్ర గ్రంథాలయ సంఘములన్నియు నికముందు దినదినాభివృద్ధి నొందగలవని యాశించుచున్నాను.

పైదెలిపిన రాష్ట్రసంఘములు గాక పుదుకోట, మైసూరు, తిరువాన్కూరు, నిజాము హైదరాబాదు, మొదలుగాగల స్వదేశసంస్థానములలోను, చెన్నపురిలోను గ్రంథాలయోద్యమము అభివృద్ధిలోనున్నది. పుదుకోట సంస్థానములో యెనిమిది సభలు జరిగినవి. కొచ్చిను సంస్థానమున సంచలనము లేకపోవుట విచారకరము. శ్రీయుతులు ధర్మవీర్ వామన్ నాయకు, మాడపాటి హనుమంతరావు పంతులుగార్లు 1914 సంవత్సరమునుండి హైదరాబాదు రాష్ట్రమున గ్రంథాలయోద్యమవ్యాప్తికి పాటుబడుచున్నారు. దాదాపు 80 గ్రంథాలయములు యిప్పుడా రాష్ట్రమున గలవు. మహారాజావారు మైసూరురాష్ట్రమున గ్రంథాలయోద్యమము సాగించుచున్నారు.

దక్షిణ హిందూదేశమున పైనసూచించినరీతిని వివిధప్రాంతముల గ్రంథాలయ సంస్థలు పనిచేయుచున్నప్పటికిని అవన్నియు ఒకదానితో నొకటి సంబంధముకలిగి పనిచేయు నవకాశములు లేకున్నవి. సర్వత్ర ఇంగ్లీషు చదువనేర్చిన వారున్నను వారల సంఖ్య అతిస్వల్పము. తక్కిన ప్రజలలో చదువనేర్చినవారు వారివారి స్వభాషాపరిచయులయి యున్నారు. ఏయేభాషారాష్ట్రమున ఆయారాష్ట్ర గ్రంథాలయ సంస్థలు పనిచేయుచున్నను, ఆయన్ని రాష్ట్ర సంస్థలు ఒకదానితోనొకటి సంబంధము గలిగి పనిచేయనిచో గ్రంథాలయోద్యమము ప్రజోపయుక్తము గాజాలదు. మన రాజధానియందున్న వేర్వేరు రాష్ట్రములయందు అనగా తమిళనాడు, కేరళదేశము, కర్ణాటకము, మాతృభాషతక్క యన్యభాషా పరిచయముగాని, యన్య సాహిత్య ప్రవేశముగాని, యుండుటకుదు. గ్రంథాలయోపయోగము సంపూర్ణముగా దక్షిణ హిందూదేశములోని సర్వజనులకు ప్రయోజనకారి గావలయుననిన ఒకభాషారాష్ట్ర గ్రంథాలయ సంఘము మరియొక రాష్ట్ర గ్రంథాలయ సంఘముతో చేయికలిపి కృషిచేయువలయును. తమిళనాడునకును అదేవిధముగా నితరభాషా రాష్ట్రకేంద్రములకును సులభముగా మార్చుకొను సదుపాయములుండుట అవసరము. ప్రతిభాషారాష్ట్ర కేంద్ర గ్రంథాలయసంస్థకు ప్రపంచవిజ్ఞానము సేకరింపగల ఆంగ్లగ్రంథములు ఆయారాష్ట్ర భాషాగ్రంథములు చేకూర్చుటయే సులభసాధ్యము కాదు. అట్టియెడ తక్కిన భాషాగ్రంథ సముదాయమును సమకూర్చుట సంభవమగునా? ఈ సమస్యానివారణకొరకే దక్షిణహిందూదేశమందలి భాషాప్రయుక్తరాష్ట్ర గ్రంథాలయ సమ్మేళనము అవసరమగుచున్నది. దీనికితోడు వివిధ స్వదేశ సంస్థాన గ్రంథాలయ సంస్థల సమ్మేళనముకూడ యుండుట అవసరము. ప్రతి స్వదేశ సంస్థానమును, భాషారాష్ట్రమును తమతమ స్వపరిస్థితుల కనుగుణ్యముగ కేంద్ర గ్రంథాలయసంస్థ లేర్పరచుకొనినప్పుడు అవన్నియు చేదోడుగ పనిచేయగల సమ్మేళన (Federation) యొక్క ఆవశ్యకతయేర్పడుచున్నది.

ఈ ప్రథమ సమావేశముయొక్క ఉద్దేశ్యము వివిధరాష్ట్ర గ్రంథాలయ సమ్మేళనము చిరస్థాయిగ జేయుటకే అయియున్నది. అటువంటి సమ్మేళన ముండినగాని సంఘీభావముండి, ప్రజాసమ్మతము

గను, ప్రజోపయోగ కరముగను, ప్రజా సంస్థల సహాయములతోను, గ్రంథాలయోద్యమ బీజాక్షరములను ప్రతి పల్లెటూరునందును విరివిగ వెదజల్ల నవకాశములు చిక్కవు. అంతియగాక గ్రంథాలయోద్యమవ్యాప్తి నరికట్టగల శాసనముల నెదుర్కొని సలహానిచ్చి మంచిత్రోవను శాసనముల నేర్పాటు జేయింప నవకాశముండదు గ్రంథాలయోద్యమము రాజకీయ సంస్థగాని మతసంస్థగాని కాదు. అది కేవలము సాంఘిక విద్యాసంస్థ. జాతిమత భేదములు లేక, బీదవారు భాగ్యవంతులను తారతమ్యము గమనించక స్త్రీపురుషవ్యత్యాసము గణింపక సర్వజనాంగీకారమై ప్రజలనందరను యాకర్షించి దేశాభ్యుదయకరమగు మహోగొప్ప సంస్థగ గ్రంథాలయోద్యమము నడిపింపబడవలయును. ఈ యాదర్శము ప్రధానముగ జేసి సర్వశక్తుల దీనిని కేంద్రీకరించుటకు వివిధవ్యక్తి గ్రంథాలయ సంఘములు యేకకూటముగజేరి ఒకే సంస్థగా కృషిసల్పవలయును. ఇది దక్షిణ హిందూదేశ మండలి అన్నిగ్రంథాలయ సంస్థల సమ్మేళనమువలన జరుగగలదని మనయాశయము. ఆవితర్కణకే యీ మన సమావేశము. ఈమహోద్దేశమును చిరస్థాయి జేసి కార్యరూపమున బెట్టుటకుగాను మీ కందరకు నీమండువేసవిలో శ్రమ కలుగజేయవలసి వచ్చినది. సౌకర్యలోపములను క్షమింప మరియొకమారు ప్రార్థించుచు, మనకు చిరపరిచితులును, నిపుణులును, కార్యశూరులును అగు శ్రీయుత కె. బి. మాధవా గారి ఆధిపత్యముక్రింద యీసభను జయప్రదముగ జరుప వేడుచున్నాను.

శ్రీసర్వతిబాలికాపాఠశాల బాలికల బహుమతీ వితరణోత్సవము (1-5-34) న శ్రీమతి చుండూరి రత్నమ్మగారివల్ల యివ్వబడిన అధ్యక్షిణ్యుపన్యాసమునుండి.

ఇప్పుడు మనము పట్టణములలో జూచుచున్న ఈ కొలది విద్యాలయములు మచ్చునకైనను చాలవు. ఆకొలదిలో వైశ్యసేవాసదనము, శారదానికేతనము, మున్నగు విద్యాలయములు జాతీయవిధానమున విద్యను గరపుచున్నవి. ఇటీవల శ్రీమతి కొల్లిపర లక్ష్మీనరసమ్మగారు ఏలూరున లక్ష్మీసేవాసదనమును స్థాపించి తమకుగల స్త్రీవిద్యాభిమానముచే దేశసేవజేయ సంకల్పించినారు. ఇట్టి విధమున మన ఆంధ్రదేశమున శ్రీమతులు గుమ్మిడిదల దుర్గాబాయమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, కాళంగి శేషమాంబ, కలగర పిచ్చమ్మ, పొణకా కనకమ్మ, బత్తుల కామాక్షమ్మ, మున్నగు ఆంధ్రస్త్రీలు యువతీ విద్యాలయములను స్థాపించి జాతీయవిద్యను గరపుచున్నారు. అందు కేవలము భాషయేగాక సంగీతము, కుట్టుపని, అల్లిక, నేత, చిత్రలేఖనము, రాటము, మున్నగు పరిశ్రమలను నేర్పుచున్నారు. కావున మనయువతులు తాము చదివిన విద్యఫలలను, తాము నేర్చిన కళలవలనను స్వతంత్రజీవనసాధనము పొందుటయేగాక దేశసేవయును చేయగలుగుదురు. ఇదిగాక మనయువతులు శిశుపోషణము, ప్రసవవైద్యము, గృహపాలనము, పాకశాస్త్రము మున్నగు విషయములలో పరిచయము కలిగించుకొనవలెను. ఈవిధమున వేలకొలది విద్యాలయములు నెలకొల్పినచో మన యువతులు అందునేర్చి ఆర్థికదుస్థితిలోనున్న తమ కుటుంబములను, నిరాధారులగు నారీమణులను గాపాడగలుగుదురు! బీదలకు పిడికెడు మెతుకులు దొరకగలవు!

పాశ్చాత్యదేశము మహోన్నతదశయందుండుటకు వారి స్త్రీలు విద్యావతులగుటయే కారణము. దేశాభివృద్ధికి స్త్రీపురుషాదులు సమానముగా విద్య నేర్చినచో నాగరికతయు, విజ్ఞానమును సమానముగా పొందుటకు అవకాశము కలుగును. పురుషులకన్న స్త్రీలే గృహకృత్య నిర్వహణభారము వహింపవలసియున్నది గాన వారధికముగా గృహపరిశ్రమలు, చేతిపనులు, లలితకళలు, మున్నగు విద్యలలో ప్రావీణ్యమును పొందవలయును.

ఈపరిశ్రమలతో పాటు ఈత, కత్తిసాము, మున్నగు దేహపరిశ్రమలు విధిగా నేర్చియుండవలెను. ఆత్మరక్షణ చేసికొనుటకును, మానప్రాణముల గాపాడుకొనుటకును, యివి తోడ్పడును. మనము నేర్చు విద్య సేవకావృత్తికి గాక స్వాతంత్ర్యభావముకలిగి దేశసౌభాగ్యమును పెంపొందించుటకు నేర్వవలయును. జపాను స్వాతంత్ర్యదేశమనుటకు కారణము స్త్రీలే. పాశ్చాత్యదేశమున స్త్రీలు విద్య నేర్చియుండుటచే, వారిని పురుషులు గౌరవించుచున్నారు.

---

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు

నెచ్చెలీ! నేటికి నెల్లూరుపట్టణమును దాని పరిసరప్రదేశములను కన్నులారగాంచి తెలుపగలిగినందులకు మిగుల ముదమందు చున్నాను. మనలో సాధారణముగా నొక లోపమున్నది. అది యేదియనగా నెంత సుప్రసిద్ధస్థలములనైనను సమీపముగానున్న చూడము. దూరస్థములు, ప్రాచీనములు, కష్టసాధ్యములగువానియెడనున్నంత గౌర వము సమీపస్థములు, నవీనములు, సులభ సాధ్యములగువాని యెడ మనకుండదు. ఇందు వలననేగదా "పెరటిచెట్టు మందుకురాదు, దూరపుకొండలు నునుపు," అను సామెతలు పుట్టినవి జగములో. లేకున్న నిట్టి ప్రసిద్ధి గల నెల్లూరు పురవరంబును నేటివఱకు నేను మెట్టి చూడకుండుట యెందులకు సంభవిం చును? ఎన్నిమారులో యానగరము మీ దుగా వెళ్లితిని, వచ్చితిని; కాని యాపుర ములో మాత్రము దిగలేదు. ఉద్యోగవశ మున గూడ మా కామండలము చొచ్చు నవకాశము లభింపలేదు. ౧౧-3-33 తేదీని విక్రమసింహపురమను నామాంతరముగల నెల్లూరు పురవరంబును మొదటిమారు చూడ గల్గితిని. నెల్లూరుపురము ఆంధ్రదేశమునందలి ప్రాచీన పురవరంబులలో నొకటి. ఆపట్టణ మును తిలకించినను దాని ప్రాచీనత స్పష్టము గనే గోచరించును. ౧౧ తేదీని వెళ్లితిమన్న మాటయే గాని యానాడు మేము పుర ములో చూచిన దేమియులేదు. సందర్భవశ మున నొక పురమందిరమును మాత్రమే చూడగలిగితిని. అతివిశాలమైన యాపుర మందిర మాపురలక్ష్మి కొక యమూల్యా లంకారమే యగును.

మఱునా డుదయమే లేచి మునుముందు పెన్నలో స్నానముచేయుటకు వెళ్లితిమి. ఇది మైసూరు రాజ్యమున చంద్రదుర్గమున నుద యించెను. పర్వతములచే యడ్డగింపబడి విల్లువంపుగా ప్రవహించుటచే ఈనదికి శివ ధనుస్సగు పినాకిని యను నభిధేయము కలిగె నట. మైసూరురాష్ట్రమున నందిదుర్గమునం దుదయించిన మఱియొకనదికి దక్షిణ పినాకిని యని పేరుంచుటంజేసి దీనిని ఉత్తర పినాకిని యనియు, నుత్తరపెన్న యనియు వ్యవహరిం తురు. పినాకినీనదిని చూడగనే అయిదారేం డ్లక్రితము శ్రీకాళహస్తిలో గాంచిన సువర్ణ ముఖీయను యేఱు గుప్పున జ్ఞాపకమువచ్చి నది. ఆ యేఱుగూడ యిటులనే లోతులేక స్వచ్ఛమగు బొండు యిసుకనేలపై చక్కగా ప్రవహించుచుండును. నిదాఘసమయములు సమీపింప నుండుటచే గాబోలు పెన్నయం

డెన్నో నీళ్ళులేవు. అయినను స్వచ్ఛమగు గఱుకుటిసుకపై వడివడిగా బాఱుచున్న పెన్నలోని చల్లని తేటనీరు కొంచెమైనను మనస్సును మిక్కిలి ఆకర్షించును. ఆయేటిలో పసిబిడ్డలైనను సుఖముగా నడువవచ్చును. నీరు చెంబులతో నెత్తి పోసికొనవలయునేగాని కృష్ణగోదావరులలో వలె మునకలువేయుటకు వీలుకాదు. పెన్న చూచుటకింత మృదువుగా కన్పించుచున్నను, నిరపాయమనుటకు వీలులేదు. నీరు కొంచెమైనను ఆప్రవాహవేగమున కొక మనుష్యునిగాని వస్తువునుగాని తత్క్షణమే యిసుకలో కూరుకొనునట్లు చేయగల సామర్థ్యముగలదు. ఎడనెడగల గభీర హ్రదములు సుళ్లుదిరుగుచు మనుష్యుని సులభముగా నీడ్చుకొనిపోయి ముంచివేయును. మఱియు ఆకస్మికముగా వచ్చుట దీని స్వభావము కాన ఆవలి యొడ్డునుండి యీవలకు వచ్చులోపల నాకస్మికముగా ప్రవాహ మధికమై పశువులకును మనుష్యులకును నప్పుడప్పుడపాయము గలిగించుచుండునని వింటిని. ఇందువలననే కాబోలు పెన్న గడిస్తే పెరుమాళ్ళసేవయను సామ్యమువచ్చినది.

మేము పెన్నలో కొంచముదూరము నడిచివెళ్లి నీ రధికముగా నున్న తావున స్నానముచేసితిమి. ఆ యేటియందలి చల్లని తేటనీటి స్నానము బహు ఉల్లాసకరముగనుండెను. మాతో స్నానమునకు వచ్చిన యొకబాల చెంబులతో నెత్తి పోసికొనుటచే తృప్తిగలుగక తన తలను ప్రత్యేకముగా పిట్టవలె నీటిలో ముంచుచు విదలించుచు వినోదముచేసెను.

పినాకినీనది యెంత పవిత్రమైనను నీప్రాంతీయులలో నొక దురాచారమున్నది. మలవిసర్జనమునకై బహిర్దేశములకు వెడలువారు చెంబుతో నీళ్ళుతీసికొని పోవక యీయేటి యొడ్డులకు పోవుట యిచ్చటివారి వాడుక. వెనుక సువర్ణముఖీ తీరమందు గూడ నీదురాచారమును గాంచి మిగుల నసహ్యపడితిని. మరల పినాకినీతీరమందుగూడ నది కనుపించినది. స్నానపానయోగ్యములగు పవిత్రనదీజలముల నిట్లు మూత్రపురీషాదులచే మాలిన్యమొనర్చుట యెంత హేయమో, ఎంత హానికరమో, యిచ్చటివారు గుర్తింపకుండుట విచారకరము. ఇందువలన విశూచి మశూచికాది సాంక్రామికవ్యాధులు మనుజులలో వ్యాపించుట కవకాశముగలదు. అలవాటుచేతనేమో నీయేటిగట్టుల బహిర్దేశమునకు వెడలువారికి బిడియముగూడ నుండదు. మేము యేటిలో నడుగుపెట్టియు పెట్టకమునుపే యిట్టి దృశ్యమొకటి కనుపించుటచే మాతోవచ్చిన బాలికలకు కడుపుబ్బ నవ్వుటకు చాలిన సామగ్రి మొదటనే లభించినది. పెన్నలో స్నానముచేయుట ముగియగనే రంగనికోవెలకు పోవుటకు పయునమైతిమి. పెన్నలో నడచి తీరమున కేతెంచుచు నేను 'పెన్నలో నడకెంతో ప్రియముగా ఉన్నాది. ఈ నీటిలోనే మనము నిలిచిపోదామా....................

...గట్టెక్కి రంగనిచూచి పోదామా' అంటిని. 'ఔనండీ యీయేటిలో నడచుట బహు తమాషాగా ఉన్నది' అని వారందఱు కిలకిలా నవ్విరి.

నెల్లూరులో శ్రీరంగనాయకస్వామివారి ఆలయము సుప్రసిద్ధమైనది. ఇది పినాకినీ తీరముననే యున్నది. ఈ ఆలయమునుండి నదిలోనికి పోవుటకు సోపానములు గూడ గలవు. అప్పుడు తొమ్మిదిగంటలు దాటి యుండును. స్వామివారికి ఉదయకాలపు అర్చనలు ముగిసినవి. కాన జనులసందడి లేక ప్రశాంతముగా నుండెను. రంగని గర్భాలయము గాఢాంధకారము. స్వామికి సమీపముననున్న దీపకళిక యాయంధకారమును విదారింపగలిగినంత తెలివిగాలేదు. ఎన్నిమడమాన్యము లున్నను మన దేశమునందలి దైవముల కీ దీపపుకఱవు సర్వసామాన్యమేగదా. అందులకు గుడిగాక రంగనాయకస్వామి మాత్ర మెట్లు తప్పించుకొనగలడు? ఎటులనో ఒకరిచేయి నొకరము పట్టుకొని యెత్తుపల్లములుగా నున్నతావులు తడుముకొనుచు దాటి గర్భాలయము ప్రవేశించితిమి. కర్పూర హారతి వెలుంగున స్వామిని చక్కగా దర్శించి ప్రణమిల్లి వీడ్కొని యమ్మవారి యాలయమునకు విచ్చేసితిమి. రంగనాయకస్వామివలె యీచూడికుడుత చిక్కని చీకటిలోలేదు కాన, దివ్యముగా దర్శింపగలిగితిమి. ఇచ్చట గూడ అర్చన పూజాదులు చేయించి ప్రసాదమున్స్వీకరించి యటనుండి యద్దాలమండపము జూడ మరలితిమి.

ఆ ఆలయమునందు చూడదగిన వానిలో ముఖ్యమైనది అద్దాలమండపము. అద్దాల మండపము పెద్దదికాదు. వర్తులముగానున్న యొక సామాన్యమైన గది మాత్రమే; అయినను చూడ సొంపుగానున్నది. ఆ మండపము యొక్క అంతర్భాగములందలి కుడ్యముల దిగువభాగము విచిత్రలతాపుష్పాదులచే నొప్పారు పింగాణి ఫలకములతోడను, మధ్య భాగము నిలువుటద్దములతోడను పై భాగము దశావతారాది చిత్రలేఖనములతోడను విరాజితమైయున్నది. ఆమండపమునకు మధ్యను నాల్గుకంబముల యొక చిన్నమండపమును నందు అమ్మవారిని వేంచేపుచేయుపలకయు, జరీపనిచేసిన ముఖమల్‌పంకాయు మున్నగు నవిగలవు. విచిత్రమేమన ఆయొక్క మండపమును, నొక్కపంకాయు, చుట్టును తాపడము చేయబడియున్న ప్రతియద్దమునందును ప్రతిబింబించుటచే ఆమండప మెంతో పెద్దదిగను అసంఖ్యాకమండపములు, అసంఖ్యాక పంకాలుగలదిగను భ్రాంతిగొలుపుచుండును. ప్రతిశుక్రవారము రాత్రిపూట నమ్మవారి నక్కడ వేంచేపు చేయుదురట. మేము పగటి వేళ చూచుటచే దానిశోభ యింకను కనుపించలేదు గాని రాత్రిసమయమగువో దాని సౌందర్య మింకను నినుమడించియుండునని యనుకొంటిని. అటనుండి మే మూరిలోని విశేషముల నరయుటకు బయలుదేరితిమి. అదియొక శ్రీవైష్ణవుల తిరుమాళిగ. అందిరువురు వృద్ధదంపతులు లక్ష్మీనారాయణుల వలె నున్నారు. శ్రీరంగనాయకస్వామివారి యంగరంగవైభవములకెల్లను వీరే కారకులట. వారియింట స్వామివారి యాలయముపై నుంచుటకు తయారుచేయబడుచున్న ఆరుశిఖరముల చూచితిమి. వానికి బంగారు మలామా చేయబడుచున్నది. ఆగృహిణీ రత్నముకడ సెలవుగైకొని పిదప వారి మేడ

మీదకు వెళ్లితిమి. మీదిహాలులో నలువురు సాలీలు మగ్గముపెట్టి యొక పట్టువస్త్రము తయారుచేయుచున్నారు. ఆసాలెవారికాపురస్థలము కంచియట. దట్టమైన పట్టెనామములతో వైష్ణవులవలెనేయున్నారు. వారు యెఱ్ఱని పట్టువస్త్రముపై విష్ణుసహస్రనామములు వచ్చునట్లు జరీ(సరిగె)తో నేయుచున్నారు. మగ్గము క్రిందుగా కూర్చుండి యానామముల జూడుడని వారు తెలుపనేనటులనే కూర్చుండి చూచితిని. ఏమి ఆశ్చర్యము! విష్ణు సహస్రనామావళి చక్కని తెలుగక్కరములతో రెండువరుసలుగాజరీతో నేయబడియున్నది. ఆవస్త్రము తయారగుట కొకవత్సరము పట్టునని వా రనిరి. పాశ్చాత్యయంత్రపరిశ్రమలు మన దేశమును ముంచివేయుచున్నను, దొరతనమువారి తోడ్పాటు ఆ విదేశీయపరిశ్రమదారులకే గాని మన దేశీయులకు లేకున్నను, దేశీయుల కళాకౌశలమును గుర్తింపగల సామర్థ్యము మనదేశీయులలో బొత్తిగా నశించుచున్నను, దేశములో సంపన్నులగు జమీందారులు, రాజులు, వర్తక శ్రేష్ఠులు, ఉన్నతోద్యోగులు మున్నగువారినెల్ల విదేశవస్తువ్యామోహమే యావేశించి పీడించుచున్నను అతిమనోజ్ఞమగు యిట్టి పనితనము మన దేశీయులలో నశింపనందులకు నాకెంతయో సంతస మొదవెను. ఆవస్త్రము నెన్నిమారులు చూచినను మరల చూడవలయుననియే యనిపించుచుండెను. కాని యప్పటికే మధ్యాహ్నమగుటచేతను నింకను చూడనెంచినవి యుండుటచేతను నటనుండి బయలుదేరి కస్తూరి విద్యాలయమున కేతెంచితిమి.

బాలిక లప్పుడే బడికి వచ్చుచున్నారు. ఉపాధ్యాయులలో నొక్కరు మాత్రమే యప్పటికి బడికి వచ్చియుండిరి. కస్తూరీదేవి విద్యాలయము సుప్రసిద్ధ దేశసేవికామణులలో నొకరగు శ్రీమతి పొణకా కనకమ్మగారి కృషిఫలితము. దానిని చూచుటతోడనే దేశమునందలి జాతీయ సంస్థలన్నిటికిని బట్టిన ద్రవ్యలేబరము ప్రజలయనాదరము దీనికిని పట్టినట్లున్నదనిపించినది. ఈవిద్యాలయస్థాపకురాలైన శ్రీ కనకమ్మగారు దీర్ఘ కారాగృహవాసమువలన నారోగ్యముచెడి చెన్నపురిలో చికిత్సబడయుచున్నారనియు, అందువలననే యీవిద్యాలయము మఱింత సన్నగిలుటకు కారణమయ్యెననియు వింటిని. ఆదరించి ప్రోవవలసిన యాపత్సమయముననే యనాదరించి యిట్టి పవిత్రసంస్థల రూపుమాపుదురే! మన దేశీయుల యలసభావమేమని చెప్పవచ్చును. నెల్లూరి పౌరులు తమవిధిని గుర్తింపరైరిగదా యనుకొనుచు నటనుండి బసకు మరలితిమి.

నాటిమధ్యాహ్నము ఆయూరి స్త్రీలక్లబ్బు వార్షికోత్సవము కాన దానిని తిలకించుటకై యించుమించు సాయంత్రం నాలుగుంటలకు అచ్చటి కేగితిమి. ఏమిఆశ్చర్యము! జిల్లాకు ముఖ్యపట్టణమైన యానెల్లూరు పురమున నాడు స్త్రీసమాజవార్షికోత్సవమైయుండ పట్టుమని పాతికమంది స్త్రీలైనను సభకు వచ్చియుండలేదు. ఆ సభను చూడగనే నాకు విచారము గలిగినది. స్త్రీసమాజముల ప్రయోజనము నాంధ్ర స్త్రీలింకను

గురించవలేదుగదా యనిపించినది. ప్రస్తుతము భారతదేశమున మహిళాసంఘములో అనేక మార్పులు జరుగుచున్నవి. అనేక హక్కులు గుర్తింపబడుచున్నవి. ఇట్టి తరుణమున ప్రతి చిన్నగ్రామమునందును మహిళాసంఘము లేర్పడి పనిచేయవలసియుండగా నిట్టి పెద్ద పట్టణములోనింత కొద్దిమంది స్త్రీలా సమావేశము కావలసినది? నెల్లూరుస్త్రీ లీవిషయమున ఉత్తరసర్కారు స్త్రీలకంటె చాల వెనుకబడియున్నారు. స్త్రీసమాజములకు వెడలిన నెవరిచే నాక్షేపింపబడుదుమోయని వీరికి కడుభయము. వీరేగాదు మన ప్రాంతమునగూడ స్త్రీల కీవిషయమున బెదురుతీరలేదు. కల్పలతా! తలచిన యక్కజమనిపించును. స్త్రీలకై స్థాపింపబడి స్త్రీలచేతనే నిర్వహింపబడుచు స్త్రీలవలననే పోషింపబడుచు స్త్రీలయభివృద్ధికై పాటుబడెడి స్త్రీసమాజములనిన స్త్రీలకేల యింతభయమో నాకు తెలియకున్నది. అటులని మనయాంధ్ర స్త్రీ లెక్కడికిని రానివారు పోనివారా యనిన నదియులేదు. ఒకశాస్త్రిలుగారి పురాణమనిన చాలును గుంపులుగుంపులు! ఒకదాసుగారి హరికథయనినచాలు తండోపతండములు!! ఒకపేరంటమనినచాలు ఓ పిల్లజెల్ల కడుపులు గట్టుకొని బయలుదేరుదురు!! ఒకచేమిటి ఒకవూరిలో నూరేగింపు, ఒకదేవళములోని యుత్సవము, ఒకపుణ్యక్షేత్రమున తీర్థము అని తెలిసినచాలును అక్కడక్కడికెల్ల మనవనితామణులు పురుషులకంటె పదిరెట్లధికముగా వెడలిపోగుదురు. ఇంత ధారాళముగా ప్రతిదానికిని వెళ్లెడినారీమణులకు తమ సంఘములమీాద యీా యేవగింపు యీా వెఱపు, యీాయుదాసీనత, యేలనో తెలియకున్నది. బహుశా యీాసంఘస్థాపనలు నవీనములగుటయే వీరు వెనుకంజవేయుటకు కారణమనుకొందును కాని మన ఆంధ్రస్త్రీ లీవిషయమున ముందంజవేసినగాని యభ్యుదయ మందరని నాయభిప్రాయము.

౧3-3-3౮ తేదీ యుదయమే లేచి నెల్లూరి కేడుమైళ్లదూరమున నున్న జొన్నవాడ వెళ్లితిమి. జొన్నవాడ కామాక్షియమ్మవారు ప్రసిద్ధమైన దేవత. ఈమె పెనిమిటి మల్లికార్జునస్వామి. కామాక్షి దేవాలయము పెన్నకావలియొడ్డున నున్నది. మేము పెన్న కీవలి యొడ్డున మోటారుబండినిదిగి నది నుత్తరించి యద్దరినున్న కామాక్షి దేవాలయము చొచ్చితిమి.

అప్పుడు దయ మెక్కిమిదిగంటలై యుండును. గాలితాకుడుచే గల్గిన చిరుకెరటములతో నెడతెగక పాటెడి పినాకినీజలంబులపై యుదయభానుని బంగారుకిరణములు ప్రసరించి యా నదినంతయు బంగారు జల్తారు పనిచేసిన నేలపటుపుగా జేసివైచెను. కల్పలతా! ఆ వాయుప్రసారములోను నా కిరణప్రసారములోను నెట్టి క్రమగతిగలదో కాని యదియంతయు నొక్కవిధముగా హెచ్చుతగ్గులులేక గడులు గడులు గావచ్చునట్లు చంకీపని చేసినటులున్నది. ఆ యద్భుతము నారయుచు మేమెంతయోసే పాయేటి జలంబులందు నిలువబడితిమి. కామాక్షిదేవి యాకృతి కడుసౌమ్యముగను నాకర్షకముగనునున్నది. కామాక్షియమ్మ

వారు మహాసత్యముగల దేవియని యచ్చటి వారి విశ్వాసము. రోగనివృత్తికేమి, సంతానప్రాప్తికేమి, కామాక్షికి అచ్చటివారు వరపడుచుందురు. అచ్చట అమ్మవారికి పూజచేసిన పూజారి వృద్ధుడు. అయినను ప్రతినామము దృఢముగను, స్పష్టముగను నుచ్చరించి ప్రతినామమునందలి భావము విదితమగునట్లుగ నామార్చన చేసెను. సాధారణముగా దేవాలయమునందలి యర్చకులకు నామార్చనయందు దీ నిదానముండుటరిది. దేవాలయములో పూజార్చనాదులు గావింపజేసి యా దేవ్యాలయమునం దింకను చూడవలసినవాని నెల్ల తిలకించివచ్చితిమి. అమ్మవారి యేకాంతమందిరమునందు అన్ని పటములతో బాటు మహాత్మాగాంధీగారి చిత్రపటముండుట యించుక ఆశ్చర్యము గొల్పెను. కామాక్షీదేవ్యాలయమునుండి వెలువడి మరల పెన్నను దాటునప్పటికి చాల ప్రొద్దెక్కుటచే సూర్యకిరణములలోని పసిడి చాయలు విఱిగి తెలుపెక్కు వెండిపనితనము చేసిన వలువవలె పినాకిని కనుపట్టినది.

అటనుండి నరసింహులు కొండ యనెడి ప్రసిద్ధనామముగల వేదగిరి నరసింహస్వామి యాలయమునకు మే మెక్కిన కారులు పయనమైనవి. మెట్లమీదుగా నడిచిపోవు వారికి గాక ఆ కొండకు కారులు పోవుటకు గూడ ప్రత్యేక త్రోవయున్నది. కారులా రాళ్లమీదుగా పర్వతారోహణము గావించుట యెంత భయావహముగనుండెనో, అంత ముదావహముగనుండెను. సరాసరి మా అయశ్శకటము లతివేగముతో వెడలి దేవాలయముముందర నిలిచెను. మధ్యాహ్నమగుచుండుటచే మే మిక్కడ పూజా పురస్కారము లించుక కుంచించితిమి. నరసింహస్వామి యాలయమున కింకను కొంచె మెగువను నమ్మవారి యాలయమున్నది. అచ్చటికిపోయి నలువైపుల నుపలక్షింప భూపురంధ్రియొక్క సహజసౌందర్యమంతయు నొకమారు దృష్టిగోచరమయ్యెను. ఆ కొండకు చుట్టును నేడు కోనేరులున్నవనిరి. కాని మా కన్నియు కనుపించలేదు. మేము వచ్చిన బాటమాత్ర మొకచారవలె యగుపించినది. అంతకంతకు మార్తాండు డుగ్రుడై తన తీక్ష్ణకరముల మమ్ముల నలయింప నుంకించుటంజేసి సావధానముగ నచ్చటి విశేషములనెల్ల నరయకయే మరలవలసినవారమైతిమి. అటనుండి బయలువెడలి నెల్లూరి విపణివీధి నించుకనరసి విడిదిగృహమున కేతెంచితిమి. ఇంటికి వచ్చినవెంటనే భుజించి వేవేగసామానులు సరదికొని రెండు గంటల పొగబండి కందుకొని స్వస్థలము చేరితిమి.

ఆ యూరియందు మూలస్థానేశ్వరుని దేవాలయమొకటి గొప్ప ప్రసిద్ధ పురాతన దేవాలయము గలదట. కాని వ్యవధిలేమిచే నేను దానిని చూడలేదు.

నెల్లూరిలో మేమున్నది లెక్కపెట్టినట్టు నలుబదియెనిమిది గంటలు మాత్రమే అయినను యీ రెండు దినములలో రాత్రి నిద్రా సమయమునదప్ప మేము విశ్రమించినదిలేదు. ఇంత యల్పకాలములో వీనినన్నిటిని చూచుటకు సామాన్యముగానైనచో దుస్తరమే

కాని యెచ్చటికి పోదలంచిన నచ్చటికి వెంటనే తీసికొనిపోవుట కెప్పుడును సిద్ధముగా నిలబెట్టియున్న రెండు మోటారుబండ్లును, తమ పురమునందలి విశేషములనెల్ల మాకు జూపవలయునను కుతూహలముతో సంసిద్ధమైయున్న శ్రీమతి సత్యవతమ్మగారును, మేమిన్ని విశేషముల నింత శీఘ్రకాలములో నరయగల్గుటకు కారణభూతులు. మేము నెల్లూరియందు శ్రీయుత విన్నా రాజగోపాల రావు పంతులుగారింట బసచేసితిమి. వారి సతీమణియే సత్యవతమ్మగారు. "అన్నపూర్ణకు నుద్దియే యతని గృహిణి" అను మాట యామెయందు సార్థకమైనది. రెండవవారు ఆయూరి స్త్రీల క్లబ్బుకు కార్యదర్శినియైన అల్లాడి అన్నపూర్ణమ్మగారు. వీరు సుప్రసిద్ధులైన మామిడిపూడి వేంకటరంగయ్య పంతులుగారి కొమార్తెయట. ఆమె విద్యావివేకములును, సరళస్వభావమును, కార్యాసక్తియు, నామె యాభిజాత్యమునకు దగియున్నవి. ఈ యిరువురు సోదరీమణులును మేము రైలుదిగి నెల్లూరిలో యడుగుపెట్టినది మొదలు మరల రైలుకు బయలుదేరువఱకు మా వెంటనేయుండి సర్వము చూపించిరి. వీరి కెంతయు మా కృతజ్ఞత తెలుపవలసియున్నది.

ఇక మా సహయాత్రికలైనవారి నలువురినిగూర్చియు నీకు పరిచయము గల్గించినచో నాపని పూర్తియగును. వీరు శ్రీమతులు గుండ్లపూడి విశ్వేశ్వరమ్మ, పసుమర్తి భానుమతమ్మ, ఎస్. వరలక్ష్మమ్మ, సంఘము లక్ష్మీబాయమ్మగార్లు. మొదటివా రిరువురు గృహలక్ష్మి పత్రికకు ప్రస్తుతము సహాయసంపాదకులుగానున్న పసుమర్తి కృష్ణమూర్తిగారి పుత్రికలు. గానకళయం దత్యంతకుశలలు. 11 తేదీని నెల్లూరునందు జరిగిన సభలో నీ యక్కచెల్లెం డ్రిరువురు తమ యసమాన గానకళాకౌశలమును ప్రదర్శించి శ్రీ డాక్టరు కేసరిగారిచే రజతపాత్రములు బహుమతి వడసిరి. విశ్వేశ్వరమ్మగారికి నాటకాభినయమునందున ప్రవేశముగలదు. విశ్వేశ్వరమ్మగారు ఫలహారమునకు, భోజనమునకు, సభకు వెడలుటకు, కారులో నెక్కుటకు ప్రతిదానికిని ముందుగా వచ్చుచుండుట గని యన్నిటికి ముందుగా వచ్చెడి నేర్పు గలిగి యుండుటచేతనే కాబోలు నాటకరంగమునకుగూడ ముందుగా వచ్చితిరంటిని. అది నా యిష్టముగాదమ్మా. నా భర్తగారి యాజ్ఞయని యామె బదులుచెప్పెను. ఆమె అమాయికస్వభావమును గుర్తించిన వెనుక నది సత్యమైయుండునను కొంటిని. మూడవ ఆమె గృహలక్ష్మి పత్రికాధిపతులగు కేసరిగారి కోడలు. బహుఉల్లాసముగల బాలిక. సహజముగా శ్రీమంతుల బిడ్డలకుండెడి గర్వము, డంబము, అసహనము, కోపము మున్నగు నసహ్యగుణము లామెయందు మచ్చునకైన కానరావు. సుప్రసన్నమైన యామె ముఖారవిందము సర్వదా ఆనందమునకు దానలమై విరాజిల్లుచుండును. ఏదియో వింతవిషయము నందించుకొని యెల్లప్పుడు కిలకిల నవ్వుచుండుట ఆ అమ్మాయి స్వభావము. రత్నత్రయము నిదివఱకే వడసిన కేసరిగా రిట్టిస్నుషారత్నమును

గూడ బడయగలుగుట భాగ్యమే యన వచ్చును. నాల్గవవిదుషీమణియగు సంఘము లక్ష్మీబాయమ్మగారు. ఈ దేశసేవికామణి యాంధ్రదేశమునకు సుపరిచిత. శారదా నికేతన మెఱిగినవారికి లక్ష్మీబాయమ్మ గారినిగూర్చి చెప్ప నవసరములేదు. నికేతన మునందు విద్యాభ్యాసము గావించి ముగించి యిప్పుడు కేసరిగారి యాదరమున చెన్న పురియందు చిత్రలేఖనము నభ్యసించు చున్నారు. దేశమునందు భక్తియు, విద్య యందనురక్తియు, కార్యపరతయం దాసక్తియు నీమెకు పెట్టని సొమ్ములు. ఇట్టి యువతీమణులతో గూడి చరించి దర్శించు భాగ్య మొదవినప్పుడు మా నెల్లూరియాత్ర యెంత యుల్లాసకరముగనుండెనో వేఱె చెప్పనేల? కల్పలతా! సెలవు.

భావపురి
1934 మే 1

ఇట్లు: మిత్రురాలు,
శారద.



## హరిజనకుమారి

బి. ఏ. సూర్యనారాయణమూర్తిగారు

ఎందుబోయిన నీకులమేది యంచు
నడుగ నస్పృశ్యకులజాత నంచు బల్కు
వేళ నీకమ్రవదనారవింద మెంత
చిన్నవోయెనొసిగ్గుచే జెప్పదగునె?
పాఠశాలను నీసహపాఠలెల్ల
దారుణాలాపముల మమ్ము దరియబోకు
మంచువచియింప కోమలమైన నీదు
హృదయమెంతగనొచ్చెనో యెఱుగనగునె?
మందువేసంగిబడినుండి మగిడివచ్చు
వేళ దప్పిగొని జలంబు వేడ మైల
సోకునను భీతి నిలుచేర రాకుమంచు
హైందవాంగన లదరింప నడలినావె!
లీలనిన్నలరించు నీ వేగకింత
కసవుకై చేనిగట్టున మసలునిన్ను
పరుషవాగ్బాణతతి గాయపఱచు కాపు
భీకరాకృతికెంత వెఱచినావొ?

కమలగర్భునిగూర్చి ప్రఖ్యాతభాగ
వతులు వీనులవిందుగా నతులభక్తి
జెప్పుకథలను విననేగ జేరరాకు
మంచు వెడలింప నెంతదుఃఖించితొక్కొ?
పర్వదినమున గ్రామదేవతకు బూజ
సలుప దేవాలయమునకు జననిగూడి
బ్రీతితోనేగ ఛండాల స్త్రీలురాన
నర్హులిం దంచు బల్కహతాశవైతె?
దారుణాచారపాశావితానబద్ధు
లనద లనుకంపనీయగుణాఢ్యు లాత్మ
జాతిసంజాతు లనుపమశ్రమలజిక్కి
వగచుటనుగాంచి నీవెంత దిగులువడితొ!
ఇదుమలెన్నేని గొన్నాళ్లు బడగవచ్చు
గాని కలకాలమీరీతి గష్టవఃధి
రంగదుత్తుంగభీకరభంగమగ్న
నై బ్రతుకలేను బ్రతుకలే ననకుమమ్మ!




## దేవత్వమో, రోగమో?

విద్యుచ్ఛక్తిదీపములవంటి వెలుగులు మనుష్యుల గుండెలలోనుంచి పైకి ప్రసరిస్తూవుంటే అది దేవత్వ మనుకోవద్దూ? మేరియామొనారో అనే యువతికి ఆరీతిగా ప్రసరిస్తున్నాయట. గుండెలలోనుంచి ప్రసరించి పరుపునిండా వ్యాపించి ఆ కిరణములు మొగమునకు తగిలి ధగధగ మెరస్తూవుంటాయట. ఈవిధముగా ప్రతీరాత్రీ మూడు నాలుగు సార్లు ఈలాటి వెలుతురు పుడుతూవుండడం, పుట్టినప్పుడల్లా రెండేసి మూడేసి సెకండ్లు వెలిగి ఆరిపోతూ వుండడం జరుగుతున్నదట. మన దేశములో అయితే యీపాటికి దేశదేశాలనుంచి భక్తులు వచ్చి దేవతా ప్రత్యక్షమని దర్శించి కొబ్బరికాయలు, పసుపు, కుంకుమ, హారతి, పూజ, దక్షిణలతోకూడా కొలుస్తూవుండేవారే. కాని పడమటితెల్లవారి కట్టి పిచ్చి యేమీలేదు. అమ్మలక్కలందరూ విద్యుద్బాల (ఎలెక్ట్రిసిటీ వుమను) అను పేరుపెట్టినారు ఈ వెల్తురెట్లా వస్తున్నాదిరా అని ఆలోచించుకుంటూ పరిశోధించడానికి తగిన పరికరాలతోకూడా శాస్త్రజ్ఞులు అక్కడకువచ్చి వాలుతున్నారు. డాక్టర్లు ఇదో జబ్బు కావచ్చునని తలచి మందులుకూడా పట్టుకొనివచ్చి సిద్ధముగావున్నారు. ఇదమిద్ధమని తెమిలేదాకా వీరిద్దరిలో నెవ్వరుకాని ఆమెను విడువరు.

## ఈ కప్పగ్రుడ్లెన్నేళ్ళక్రిందటివి?

మన దేశంలో ఒక ఆసామీ వర్షంలో వస్తున్నాడనుకోండి. అప్పుడు ఆ వర్షంతోపాటు ఒక బారెడు పొడుగుగల పాముపిల్ల పడగయెత్తుకొని ఆడుకుంటూ అతని నెత్తిమీదపడి కాళ్ళమీంచి తుళ్ళుతూజారి, కరవకుండానే తన దారినిపోతుంది. అతను దానినిచూసి కాస్త భయపడి, కరవకుండా వెళ్ళిపోయినందుకు సంతోషిస్తూ, మళ్ళీ రాలేదుగదా అని వెనుకా ముందూ యీప్రక్కా ఆప్రక్కా చూసుకుంటూపోతాడు. ఇంటికివెళ్ళి యెవరితోనైన చెపితేచెపుతాడు. చెప్పకపోతే చెప్పడు. అంతే. ఇది యేలాగు పుట్టింది, ఏలాగు వచ్చింది, ఎక్కడకు పోతుంది అనే తత్వచర్చ ఏమైనా చేస్తాడా? ముసలమ్మకు తెలిస్తేమాత్రం జ్ఞాపకంవుంచుకొని వచ్చే నాగులచవితికి దానిని తలుచుకుంటూ మరో రెండు గరిటెలపాలు ఎక్కువగా దాని పేరుపెట్టి పుట్టలో పోసి, పుట్టమన్ను పిల్లలందరి చెవులకూ రాస్తుంది.

తెల్లవాళ్ళైతే అల్లాగు ఊరుకుంటారూ? దాని పుట్టుపూర్వోత్తరాలు ఎక్కలాగి బైలపెడదారు. ఉదాహరణములకు కొదవలేదు. ఈమధ్యన వాషింగ్టను దగ్గర యిసగకొండలలో కొందరు పనిచేస్తూవుంటే చిన్న చిన్న కప్పపిల్లలు లక్షలకొద్దీ దండులాగవచ్చి వారి చుట్టూ పరిగెత్తాయి. అన్నీ గ్రుడ్డివేనట. ఇసక రంగులోలు. సాధారణంకప్పలమల్లే గ్రుడ్డులోనుంచి పైకి కాళ్ళులేని బల్లిలాగ రావడం, తోకలు క్రమేణాతగ్గి కప్పల ఆకారం కుదరడంకాక అవి పుట్టుకతోనే కప్పలుగావుంటున్నాయి. వీటిని పొదగడానికి వేరే తల్లు లక్కరలేదు. సూర్యకిరణాలకే పొదుగబడుతవి. వెంటనే శాస్త్రపరిశోధకులక్కడికివచ్చి అవి యిరవైఅయిదువేల యేండ్లనాటి గ్రుడ్లయియుండవలెననీ, భౌతిక కారణములవల్ల వాటిమీద యిసకారాళ్ళూపడి ప్రాతుకపోయియుండవలెననీ, ఇప్పుడు త్రవ్వగానే బయలుపడి కప్పలులాగ దుముకున్నాయనీ సిద్ధాంతం చేశారు.

## ఇంక వదలీ వచ్చును!

మనుష్యులకు సంభవించే భౌతికోపద్రవములు వారి పాపములకు ఫలములనిన్నీ, బీహారు భూకంపము అస్పృశ్యతాదోషఫలమనిన్నీ గాంధీగారు

అన్నమాట నిజమే. వెంటనే టాగూరుగారు దానిని ఖండించారు. గాంధిగారు తన అంతరాత్మ అల్లా సెలవిచ్చిందని యేదో సమాధానం చెప్పేరు. అంతటితో అది చల్లారలేదు. రెండు పక్షాలా యేవో వాదనలు జరిగేయి. చదువుకున్నవాళ్లు చదువుకున్నారు, లేనివాళ్లు లేదు. మళ్లీ మొన్న కలకత్తా మెడికలుకాలేజీ విద్యార్థి బిరజా రాయిగారు గాంధిగారిని నిలవదీసి ప్రశ్నించారు. (1) అది అస్పృశ్యతాదోషఫలమైతే తక్కిన రాష్ట్రములనన్నిటినీ మాని ఆ రాష్ట్రముమీదనే యేల పడవలెను. (2) ఈ భూకంపంలో సవర్ణులేకాక అవర్ణులుకూడ ఏల చావవలెను. కౌరవుల తప్పుకై పాండవులేల మడియవలెను? అని అతని సందేహాలు.

గాంధిగారి సమాధానము భౌతికశాస్త్రజ్ఞులకు నచ్చకపోయినా, యుక్తియుక్తముగానున్నది! పరమేశ్వరుని నైతికవిధాన మెట్లు వర్తించుచుండునో సరిగా నిర్ణయించుట కెవ్వరి తరమును కాదు. తన అంతరాత్మ అవిధంగా చెపితే తానట్లు నమ్ముచున్నాడు. నమ్మనివాళ్లు మానివేయవచ్చును. ఇంకెవరి అంతిరాత్మ అయినా యింకోలాగ చెపితే నమ్మకోవచ్చుననికూడా చెప్పినారు. ఇక నతనిని కుక్కపీకుడుప్రశ్నలు వేయకుండా విడిచిపెట్టుట మంచిదికాదా!

## మహత్తూ కాదు, మంటిగడ్డలూ కాదు!

కలరా, ప్లేగు, మన్యజ్వరము మొదలైన రోగములచే చనిపోవువారి శవములు, అన్నిరకాల దుర్గంధపదార్థాలు గంగానదిలో పారేస్తూవుంటారు. వాటిని ప్రక్కకూ ఆ ప్రక్కకూ త్రోసేస్తూన్నే పుణ్యం కావలసిన యాత్రికులంతా కాసీలో స్నానాలు చేస్తూవుంటారు. ఇదంతా మేయో కన్నె దర్శనం చేసుకొని హిందువులు వట్టి మూఢులు, మూర్ఖమతస్థులు, అనాగరికపు మృగములు స్వరాజ్యానర్హులు అని 'మదర్ ఇండియా' నిండా ఎత్తిపోసింది. కాని ఇండియానుంచి ఇంగ్లండు వెళ్లేటప్పుడు ప్రయాణాంతంవరకూ వారికి కావలసిన నీరంతా హుగ్లీదగ్గర ఇంగ్లీషువారు పట్టుకొని తీసికొని వెళ్లితే ఆనీటికట్టి క్షీద్రమురాదు. మనమాట సరేసరి. ఇంటింటా యేడేళ్లనాటిదైనా సరే, గంగాజల ముంచుకొని పెద్దజబ్బులు చేసినవారికల్ల మూడేసిగంటెలుపట్టి దానివల్లనే నిమ్మళించిం దనుకొనేవారి ఉదాహరణము లున్నవి. ఇట్టి శక్తి లండనులోని థేమ్సునదికి లేదు. అక్కడ నీరుపట్టితే పోర్టుసైడ్డుదగ్గరకు వచ్చేటప్పటికే కంపు. అక్కడ మళ్లీ మంచినీరు పట్టుకొని ఇండియాకు తేస్తారు. ఈ మహత్వము దేనిదీ అని ప్రశ్న. నీటిదా లేక శవాలు మొదలగు దుష్పదార్థములదా? సి. ఇ. నెల్సను అను ఆంగ్లవైద్యుడు అందులోపడిన శవములయొక్క రసిది అంటున్నాడు. ఆ నీటికి పట్టిపోయిన రసి అందులో మునిగినవారికీ ఆ నీరు త్రాగినవారికీ టీకాలమాదిరిగా యెక్కి ఏ రోగము రాకుండా కాపాడుతుందని సిద్ధాంతము చేయుచున్నాడు. థేమ్సునదిలోకూడా యిట్టి కంగాళీ చేసి ఆ నీళ్లవలన అట్టి గుణము కలుగుతుందేమో పరిశీలించనిదే యీ సిద్ధాంతము చేయుటలో కొంచెము తొందరపాటు ఉందనుకుంటాము.

## నగ్నసంఘముపై పన్ను!

అమెరికాలో కెంటుక్కీ అనే దేశంలో స్త్రీలు బట్టలు విప్పుకొని వీధులంట తిరుగుతూ ఆదాము భార్యా ఈవుని జ్ఞాపకం చేస్తున్నారట. వీరందరూ ఒక సంఘముగా కూడిరట. ఇట్టి పద్ధతి అపనీతికరమని వీరినందరిని 20 అడుగుల యెత్తుగల ఒకగోడ ఆవరణలోపెట్టి బట్ట విప్పుకున్నందుకు సంవత్సరమునకు రు. 3000లు పన్ను చెల్లించుకోవలెనని ఆ ప్రభుత్వమువారు శాసనముచేసిరి. ట్రేడు డిప్రెషను రోజులలో బడ్జెటు సరిపెట్టుకుంటను మంచియెత్తు! అయినా వీరి భర్తలు చాలా సంతోషిస్తున్నారట. ఈ సొమ్ము కావలిస్తే మేము చెల్లించుకుంటాము కాని వీరి బట్టలకయ్యే ఖర్చులు భరించలేము, అందులో నిది శతాంశమని వారంతా ధన్యవాదాలు చేస్తున్నారట. ఇట్టి నగ్నత భూమిమీద నివసించే మానవులనీతికి విరుద్ధముగా ఉండబట్టే ఇట్లు చేశాము కాని ఇది దైవధర్మమునకు విరోధముకాదనిన్నీ,

పంచభూతములూ, స్వర్గంలో నివసించే దేవుడూ, కావలిస్తే యీ 20 అడుగులయెత్తు గోడలూ దాటి లోపల ప్రవేశించి దర్శనంచేసుకుంటే తమ కభ్యంతరంలేదనిన్నీ శాసనసభాసభ్యులు చెప్పుతున్నారు.

నిద్దర మహత్తు

అమెరికాలో వోకుపార్కులో ప్రాటీషియా మాగరీ అనే స్త్రీ 15-2-1932 తేది లగాయతు నేటివరకూ ఒకటే నిద్రపోతున్నట: ఇప్పుడామెకు ముప్ఫయ్యోయేడు. ఎన్ని ప్రయత్నాలుచేసినా లేవదు. వైద్యులు ఇది యొకవిధమైన రోగమని నిర్ణయించి ఎన్ని చికిత్సలుచేసినా లేవలేదు. ఎప్పుడైనా కాస్త అటుంచి ఇటుప్రక్క చేసుకుంటూ ఉంటుంది, కళ్లు కొంచెం కదుల్తూవుంటాయి. పాపము, తల్లి మేరీ, తండ్రి పీటరు ఆమెకు ఎప్పుడు తెలివి వస్తుందో అని వొకరుతప్పితే ఒకరు దగ్గరే అతురతతో కూర్చుంటారు. ముక్కులోంచి గొన్నాళ్లు పాలు పోసేరు. ఇప్పుడు గుడ్లు, పాలు, పళ్లరసం నోటికందిస్తే మింగేస్తుంది. ఒక డాక్టరుగారు ఒక చిన్న అస్పత్రి కట్టించి ఈమె నందులోవుంచి టిక్కట్లుపెట్టి వచ్చేపోయేవారికందరికీ చూపించి ఆ సొమ్ములో కొంత తల్లిగారికి పంపిస్తూవుంటానని బ్రతిమలాడాడట కాని ఆమె వొప్పుకోలేదు. అప్పటినుంచి యిప్పటికి ఆమె 30 పౌనులు బలిసింది. నిద్దరలో ఇట్లా మనుష్యులను బలిపించే శక్తి కాక వారి సౌందర్యమును వృద్ధిచేసే శక్తికూడా ఉన్నదని ఒక పాశ్చాత్యసుందరి నెలలతరబడి నిద్రపోతూ స్వానుభవపూర్వకముగా తోడినారీమణులకు బోధించుచున్నది. ఇందుకనే కాబోలు కుంభకర్ణుడారేసి నెలలకొకమాటు అరగంటమాత్రమే మేలుకొంటూ మళ్లీ నిద్రపోయేవాడు. బలవంతానైనా సరే వీరు లేవరు. కుంభకర్ణునివలె బలవంతాన లేపితే మరణింతురని నిర్ణయించి మన పురాణములు నిజమేనని రుజూవుపరచుటకు సాధ్యము కాకున్నది.

దెయ్యాలుండవూ?

నగరుకోయిలు అనే పట్టంలో రోమనుకేతలిక్కు చర్చిలో కొంతకాలంనుంచి వయస్సు ముదిరిన ఆడవాళ్లు మతగురువు బోధనచేస్తూవుండగానే అది వినకుండా లేచిపోయి పైశాచికనృత్యం (Devil Dance) జరిపిస్తూవుంటారని రెవరెండు ఫాదరు విన్సెంటు ఫెర్నాండిజుగారు చెప్పుతున్నారు. సైతాను పట్టుకొన్నాదని పాపం వాళ్ల తల్లితండ్రులూ పెనిమిటులూ చుట్టునిలబడి యేడుస్తూవుంటారు. వొళ్లూ కాళ్లూ అష్టావక్రంగా తిప్పుకుంటూ కరచుకుంటూ ఉండడంవల్ల దేహమంతా గుండాపిండి అయి కీళ్లన్నీ పట్టేస్తాయిట. అయినా వారికి వొంటిమీద తెలివివుంటే కాదూ! అలాగే పాపము గెంతుతూవుంటారు. బైబిలులో చెప్పబడివున్నది కనుకను, అక్కడక్కడ ప్రత్యక్షంగా అగుపించుచున్నది గనుకను ఫాదరు ఫెర్నాండిజుగారికి మన దేశస్థులవలె దెయ్యాలలో నమ్మకమున్నది. దీనిని వైద్యులెవ్వరూ కుదర్చలేకున్నారు కాబట్టి యిందులో ఏదో Super-natural element అనగా భౌతికాతీతమైన మహాశక్తి ఉండవచ్చునని ఫాదరుగారు శలవిస్తున్నారు. క్రీస్తువులదాకా యెందుకు? ఈ మధ్యన మన హిందువులలోనే యెవరికో దెయ్యం పట్టినట్టుగ, మొక్కుగుంటే పోయినట్టుగ, మొక్కు చెల్లించకపోతే అంతకంటె యెక్కువగా పీడించినట్టుగ, చెల్లించగానే నిమ్మళించినట్లుగా మనం పేపర్లో చదివాము కామూ? అయితే కిరస్తానీ దెయ్యాలు మొండిదెయ్యాలు. మొక్కుబళ్లకూ ఉపారాలకు లొంగే జాతికాదు! మన దెయ్యాలే నయంలాగుంది.

'నాగరికతోకు ఫలములు!

అయితే ఈ పాశ్చాత్యనాగరికత ప్రాగ్పశ్చిమ దేశాలకు మేలుచేసిందా, కీడుచేసిందా? దానిని గూర్చి మనము గర్వించవలసిందా లేక సిగ్గుచే తలవంచుకోవలసిందా అని ప్రశ్న. ఈకాలంలో తూర్పువాళ్లం (అనగా ఆసియా ఖండస్థులం) చెప్పే మాటలకు ఎక్కడా విలవలేదు కాబట్టి మహనీయులైన ఆ పాశ్చాత్యుల నోటనే దీనికి సమాధానం చెప్పిద్దాము. రిచ్చీకాల్డరు అనే పాశ్చాత్యశాస్త్ర

జ్ఞుడు (సైంటిష్టు) 'డెయిలీహెరాల్డు' అను పత్రికలో దాని నీ క్రిందివిధంగా ఖండిస్తున్నాడు:—

ఉత్తరధ్రువ సమీపమందుండు లేబ్రడారు మంచు కొండలలో ఎస్కిమోలు అనే ఒక దీనజాతి నివసిస్తూవుంటారు. అక్కడి చేపలలో మంచి వేడిమి ఉంటుంది. కనుక వాటి మాంసము తింటూ, చర్మం కప్పుగుంటూ అక్కడి శీతలంనుండి తమ్ము కాపాడుకొంటూవుంటారు. ఆ తెల్లవాళ్లదికూడా చలిదేశమే కనుక వారికికూడా ఈ చేపలే కావాలి కాని వారి సముద్రాలలో ఇవి చిక్కవు. అసలీ చేపలు లేబ్రడారులోనే తక్కువగావుంటాయట. ఆ వున్నపాటి వానినీ తెల్లవాళ్లు స్టీమర్లు తీసుకొని వెళ్లి వారి దేశములకు తెచ్చేసుకుంటూవుండడంచేత పాపం అక్కడివాళ్లు చలికి నానిపోయి చచ్చిపోతున్నారు. ఇక వాళ్లకు తిండీ అంటేనో వారి తత్వాలకు పడనటువంటి అయిరోపా పంటలలో రసాయనికాహారాలలో వాళ్లకు ఎగుమతి. ఎందుచేతనంటే తెల్లవాళ్లు తినేదే 'పుష్టికర' ఆహారము కాదంటే వాళ్లొప్పరు. ఈలాగ రెండుపక్కలా వాళ్లకే వాయింపు. చెంపపెట్టు, గోడదెబ్బ!

తెల్లవాళ్లకు ఇంకోపట్టుదల యేమిటంటే వారిలాగే ప్రపంచకాన్ని 'సివిలైజు' చేతామనే ఆవేశము, ఆశ! మన దేశకాలపరిస్థితులకు తగినట్లు మనమున్నాం, వారి దేశకాలపరిస్థితులకు తగినట్లు వారుంటారు అని ఊరుకోరు. వారిని కిరస్తానీ మతంలో చేర్చి, తమ గుడ్డా గుడిశా, మందూ మాకూ మప్పి 'ఉద్ధరం' చేదామనే వారి బాబాక్రం. ఈ బాబాక్రంతో వారు పాపం ఆఫ్రికా ఖండంలో ఉండే నీగ్రోలపైబడి వాళ్లని క్రైస్తవు లనిపించి తీరుతున్నారు. ఇంతతో ఆగితే ఏవో జ్ఞాను. వాళ్ల కాళ్లకీ చేతులకీ బుజ్జలకీ దట్టమైన దుస్తులుచేర్చి వారిని నాగరికులను చేతామని సంకల్పం పెట్టుకుని అట్లాగే తగిలిస్తూ పత్రికలలో తమనీ తమ 'నాగరికత'నీ దాన్ని వ్యాపింపచేస్తున్న ప్రజ్ఞనుగురించీ మిన్నంటేటట్లు పొగడుకుంటున్నారు. దీనివల్ల సద్యః కొంత ఆర్థికలాభంకూడావుంది. తెల్లవాళ్ల పోకులు నల్లవారందరికీ మప్పితే వాటికి కావలసిన సరుకును తమవద్దనే కొనుక్కుంటూ వారి బొక్కసాలు నింపి వారి యంత్రాలయములకు పని కల్పించి వారి కార్మికులకు కూలులు హెచ్చింపుతారు. ఇందుకోసం పాప మా అనాగరికజాతుల ఆరోగ్యభాగ్యం దహనం కావలసిందే. అయిరోపా చలిదేశం కనక వారు మస్తుగా గుడ్డలు జోడించుకొని పోకుతో కులుకుచుండకతీరదు; కాని ఆఫ్రికాలో శరీరాలకు ఎండా గాలీ తగలక ఉక్కిరిబిక్కిరియై, పాశ్చాత్యుల పంటిజబ్బూ, ఒంటిజబ్బూ అంటుకొని చస్తున్నారు. ఒకప్పుడు నీగ్రోపళ్లు తెల్లగా జిగజిగమెరసేవట. ఇప్పుడు వీరి టూతుపేస్టులతో కాబోలు అవి సలుపూపోటూతో కదలడం ప్రారంభించి ఎక్కలాగక తీరకుండావుందట. ఇందువల్ల మళ్లీ వాళ్ల మందులకీ సర్జనులకీ పని తగిలి వారు శ్రీమంతులు కూడా అవుతారు. ఆలాగుండాలి ఎత్తులంటే.

ఇంతకూ ఈ పాశ్చాత్యులు సాధించిన 'అభివృద్ధి' (ప్రోగ్రెసు) నిజమైన ప్రోగ్రెస్సేనా అంటే అది చాలావరకు అనుమానాస్పదమైనది అనగా కాదన్నమాట. 'పైదేశాలకు పంపించడానికి వారు తినుబడిపదార్థములను కల్తీచేశారు. వీరికాటి కాగలేక భానుమంతుడు ఫ్యాక్టరీ పొగలచాటున దాగొని కనిపించలేకున్నాడు. మానవులను ఎండ గాలి మొదలగు ఆరోగ్యపరిసరములనుండి యీడ్చుకొని వచ్చి పశువుల మందలలాగ ఫ్యాక్టరీలలో కుక్కి పని చేయిస్తున్నారు. వారు పల్లెలలో వ్యవసాయం చేసుకొని బ్రతుకుతూవుండేలాగుంటే వారి మలమూత్రాదులు ఎండలో ఎండి, మంటిలో చేరిపోయి, వర్షాలలో కొట్టుకొనివచ్చి భూమినంతటినీ సారవంతముగా చేసేవి. వీరిని పట్టణాలలో కుక్కడంచేత ఈకుళ్లును తొలగించడానికి 'శాస్త్రీయ' పద్ధతులు కనిపెట్టవలసివస్తోంది. అయినా వారికి ఏవో ఒక మోస్తరు రోగాలు తప్పకుండావున్నాయి. వీటికోసం డాక్టరు బిల్లులు. వీటితో బీదవాళ్ల కూలి డబ్బులు సరి!

మానవునికి స్వతస్సిద్ధమైన ప్రకృతిజీవనం తప్పిపోయి పొగలు, ధ్వనులు, తొందర్లు, కష్టాలు మెండలైన బాదరబందీజీవనం తటస్థించింది. దీనితో



శ్రీమతి మునుపల్లె రామకోటమ్మగారు.

తెనాలి వితంతు శరణాలయ రక్షకురాలు శ్రీయుత యం. వి. శేషగిరిరావు గారి భార్య. ఈ దంపతుల శ్రద్ధవలన తెనాలి వితంతు శరణాలయము సక్రమాభివృద్ధి నొందుచున్నది. తొలుత ఈ యువతీరత్నము విధివశమున వితంతువైయుండి యీ శరణాలయమందేయుండి 1930-లో శేషగిరి రావు గారిని మగల వరించెను.



శ్రీవిద్యార్థినీసమాజము, మహిళావిద్యాలయము,
హిన్దూసున్దరి, శ్రీరాజ్య లక్ష్మీపుస్తక భాండాగారముల వార్షికోత్సవములు.

గుండెజబ్బులు, కఫరోగములు, ఎగవూపిర్లు మొదలైన రోగాలు విచ్చలవిడిగా విహరిస్తున్నాయిట. అంటువ్యాధులూ సుఖసంకటాలూ ఈ నాగరికతతోనూ, విచక్షణలేకుండా కలుస్తూ తింటూ సంభోగిస్తూవుండడంవల్లనే యెక్కువై వ్యాపించుచున్నవని కూడా కొంద రనుభవజ్ఞులు సిద్ధాంతం చేస్తున్నారు. గత నలభైసంవత్సరాల జనాభాలెఖ్ఖల్ని పట్టిచూస్తే జనసంఖ్య (ఎన్ని బర్తుకంట్రోలు పద్ధతులు పెట్టుకున్నా) నూటికి 110 రెట్లు హెచ్చడం తప్పింది కాదే కాని బుద్ధిజాడ్యములు వచ్చి పిచ్చి ఆస్పత్రులలో చేర్పించిన వారి సంఖ్య నూటికి 468 రెట్లు హెచ్చిందట.

ఈ ముప్పుకంతటికీ రెండు ప్రబలమైన కారణాలని శాల్డరుగారు శలవిస్తున్నారు. ఒకటి ఏమిటంటే మానవుల ఆరోగ్యముకంటె ధనమూ భోగమే యెక్కువ ప్రధానంగా చూసుకోవడం. రెండవది మానవుడి సుఖజీవనమును ప్రకృతికంటె 'సైన్సే' వృద్ధిపరచగలదనినమ్మి మనుష్యులను 'సైంటుఫిక్కు' పద్ధతులలో బిగించడం. దీనినిబట్టి పాశ్చాత్యనాగరికత మేలుచేయక కీడేచేసిందనిన్నీ దానినిగూర్చి వారు గర్వించడానికి బదులు సిగ్గుచే తలవంచుకోవలసిందనిన్నీ చెక్కిచెక్కి పారేశాడు.

## విశ్వామిత్రసృష్టి!

రష్యాదేశపుశాస్త్రజ్ఞులు రసాయనపదార్థములతో గుండెకాయ తయారుచేసిరి. సజీవుడైయున్న మానవుని గుండెలువలె అది అన్నిపనులను చేయునట. గుండె జబ్బుగలవారిగుండె పైకితీసి మరమ్మత్తుచేసి బాగుచేసేవరకు దీనిని దానిస్థానమున నమర్చవచ్చునట!! ఈ అంచీనుండి మానవులనే తయారుచేయుట సులభమనుకొంటున్నారు. ఈవార్త విన్నవాళ్లకు పంచతంత్రముకథలో కోతి తనగుండెకాయను తీసి ఇంటివద్ద చిలకకొయ్యకు తగిలించితినన్న మోసపు వార్త జ్ఞాపకమువచ్చుచున్నది. అమెరికాలో లాంగు అయిర్లండుఅనే ద్వీపములో రసాయనిక ద్రవ్యముల మందులవలన పురుషసంపర్కములేకుండానే యిద్దరు స్త్రీలకు గర్భాధానముచేసిరట. అప్పుడే ఒక త్తెకు కూతురు పుట్టింది. ఈ ఊతమీద మరోపన్నెండు గురికిగూడా ఇట్లాగేచేశారు. ఈపద్ధతి బాగా అమలులోకివస్తే బ్రహ్మదేముడు పెన్ననుపుచ్చుకొని మూలకూర్చోవచ్చును. పాపము, అల్లసాని పెద్దన్నగారు చెప్పినట్లు అతను "ముదిమదిదప్పిన మొదటివేల్పు" అయిపోయినాడు. పోతవిగ్రహాలు చేయడము ఊపిర్లు పొయ్యడం, వారి పూర్వజన్మములచరిత్ర తిరగవేసి వారి కష్టసుఖములను గుణించికట్టి అనుభవించడానికి మొగాలమీద మూడుపజ్తులూ వ్రాయడం ఈ బాధ అంతా తప్పిపోతుంది!

## "అచటపుట్టిన చిగురుకొమ్మైనచేవ"

అల్లసానిపెద్దనగారు తెలియకచెప్పినది కాదీమాట ఒకొక్కప్పు డేవంశంలోనైనా ఇట్టి ఉద్దండులొకకొంతకాలం పుడుతూవుంటారు. అల్లాగపుట్టకపోయినప్పుడు దేశమంతటాయేలాటివాళ్ళుపుడితే ఆలాటివాళ్ళనే, అందరినీ ఇంట్లోపెట్టి, స్కూళ్ళోపెట్టి, ఆటల్లోపెట్టి పాటల్లోపెట్టి, లాలించి, పురికొల్పి, ఆవేదనహెచ్చించి నేర్పి ఊహించుకొనేటట్లుచేసి ఉద్దండవిజ్ఞాన పరాక్రమవంతులుగా శిక్షణచేయవచ్చునని అతనికేకాదు అనేకవిద్యాశాఖాధికారులకుకూడా తెలియదు. ఇప్పుడు అన్నిదేశాలలో నిర్బంధోచిత ప్రారంభవిద్య నిర్బంధసైనికశిక్షణము అను విధానములు నాలుగుకాళ్ళమీదా పరుగెత్తి నరజన్మమెత్తిన పురుగులనైనాసరే వీరాధివీరులను విద్వాంసులనుచేసి మానవకోటికి శోభ కూర్చుచున్నవి. వీనికెల్లచూడామణి రష్యా.

అక్కడంతా నిర్బంధమే! నిర్బంధముగా చదువులు నేర్చుకోవాలి, సైనిక తరిఫీదులుపొందాలి, స్కూటులలో చేరాలి, ఆటలుఆడాలి, నాటకాలవేషాలు వేయాలి, సినీమాలు మొదలైనవి చూడాలి, షికార్లు వెళ్ళాలి ఆనందంపొందాలి, స్వేచ్ఛననుభవించాలి, లేకుంటే ప్రభుత్వముఒప్పదు.ఎంచేతంటే దేశమంతా ప్రజలదికనుక దానిలో అందరికీసమానమైనహక్కులు మాత్రమేఉన్నవి కనుక ఎవరైనా ఇంకొకరికంటె యెక్కువ దోచేసుగోకుండాను ఎవరికైనా ఇంకొకరికంటె తక్కువరాకుండాను ఆవిద్య, బలము, బుద్ధి, ఆనందముఅన్నీ త్రాసుపెట్టితూచినట్లు సమానంగా

సంపాదించుకొని అనుభవించచగలనేర్పూ విద్వత్తూ అక్కడ అందరికీ నిర్బంధంగా నేర్పుతున్నారు. నిర్బంధమనగా తన్నీకొట్టే అనిఅర్థం కాగు సుమండీ ఇప్పటి వార్తాపత్రికాపారిభాషికంలో తప్పకుండా అనేఅర్థము. కొట్టుట తగదుసరేగదా బుజ్జగింపు హెచ్చరింపు ఇప్పటి విద్యావిధానమునకు పెట్టని యలంకారములు. అయితే యీవిద్య, యీఆటలూ, ఈవినోదాలూ అన్ని ప్రభుత్వంవారు ఏగీటుపెడితే ఆగీటుప్రకారమే కావాలితప్ప యెవరికి వారు నిర్ణయించుకుంటకీ తప్పించుకుంటకీ వీలులేదు. అయినా, ప్రభుత్వం ప్రజలదే కనుక వారిని వారే నిర్బంధించుకుంటే, అందులోనూ కులాసాగా ఉల్లాసకరంగా నిర్బంధించుకుంటే, అది నిర్బంధమనిపించుకోగు. అభివృద్ధిదాయకమును మనఃపూర్వకమునునగు నియమమనిపించుకుంటుంది. రష్యాలో ఈవిధంగా ఆర్థిక వైజ్ఞానిక రాజ్యాంగ వివిధదేశ ప్రస్తుతచారిత్రిక జ్ఞానము నెంతజోరుగా కురిపించుచున్నారో చూస్తే ఆశ్చర్యమవుతుంది. రష్యాలో పూర్వరాజుల, ప్రభువుల, మతాధిపతుల యజమానుల దుర్మార్గములు, లెనినుమొదలగు ధీరులు వారిని బరిమార్చి దేశమును కార్మికులగు తమదిగాచేసిన విధానము తాము అధికారమును బూనినప్పటినుండియు ప్రజలు, పంటలు, ధనము విజ్ఞానము ఉల్లాసము స్వాతంత్ర్యము వర్ధిల్లుటకు పన్నుచున్న పాంచవర్ష ప్రణాళికలు పరదేశముల దుష్పరిపాలనము వాటినితమవలె చేయవలసిన బాధ్యత అన్నియు రోళ్ళారోకళ్ళా పట్టించి పిల్లలచెవులు గింగురుమనేటట్లు పాడుతూ పాడించుతూ వుంటారు.

ఇట్టి దివ్యలోకములో తయారవుతున్న ఆడపిల్లలూ మగపిల్లలూ యెంతటి బుద్ధిమంతులు,ఆశయమంతులు, విజ్ఞానమంతులు అవగలరో ఊహించడమే మనకు కష్టముగనక నమ్మముకాని, నిజం. ఒకచెంపనుకొడితే పాలు ఒకచెంపనుకొడితేనీరూకారే పదకొండేనేళ్ళ తెల్లని పిల్లలను చూడండి. మనదేశంలో అయితే ఆయీడువారు కంఠతావచ్చిన సుమతీశతకం పద్యాన్ని తప్పులులేకుండా తిరిగిరాయలేరు. మన విద్యావిధానంకర్మమే అనుకోవాలి. ఆదేశంలో ఆయీడువాళ్లిటువంటి ప్రశ్నలకు సరదాగా సమాధానములు వ్రాయగలుతున్నారో చూస్తారా? వాళ్ళ తాలూకు పరీక్షపేపర్లనుండి కొన్నిప్రశ్నల నీదిగువన ఉదాహరణం క్రింద వ్రాస్తాము.

రవాణా సౌకర్యములను హెచ్చించుటవలన వివిధదేశముల మధ్య నడుచు వ్యాపారము ఎంతవరకు ఏరీతిని అన్యోన్య లాభప్రదము కాగలదు?

అయిరోపా అమెరికా ఆసియాఖండములలోని రాజకీయ పరిస్థితులు వెంటనే తగిన చర్య దీసుకొనక తీరనంతవరకు విషమించి యున్నవని నీవెట్లు బుజువు పరచఁగలవు?

రష్యాదేశము వ్యావసాయకావస్థను దాటి పారిశ్రామికమైనదని, కావలసిన అంకెలు పద్దులువేసి స్పష్టపరచునది.

అంతర్జాతీయ వర్తకము స్తంభించినచో వివిధ దేశముల దుర్గతి యే యేరీతిగ నుండును?

వ్యవసాయోపయుక్తమగు జంతువర్గము మన దేశములో నెందువలన నింత విపరీతముగ తగ్గిపోయినది?

కీర్తిశేషుఁగు రంగసామయ్యారుగారు కాని, కీర్తిమంతులు డాక్టరు పట్టాభిగారుకాని, తుదకు ఆర్థిక సభ్యుడగు షష్టరుగారైనా సరే పాతరిపోటులు చూడకుండా తణువుకోకుండా యిటువంటి ప్రశ్నలకు సమాధానములు వ్రాయగలరేమో మాకు సందేహమే. అయితే ప్రస్తుత ఆర్థిక, వ్యావసాయక, వ్యావహారిక, రాజ్యాంగ, రాజకీయ శాస్త్రజ్ఞానము కడుపులోపడని పిల్లలకు సహా ఉత్తరపుత్రునికివలె పట్టించుచుండుటచేత అచ్చటి బాలుర బాలికల ముందర పరదేశముల పండితులైనా దిగదుడుపుకు పనికిరాకున్నారు. బలే, రష్యా! కార్మికప్రభుత్వము సమిష్టి ఆస్తి, సమానవంపకము, తారతమ్యావిచ్ఛేదము అను ఈనవయుగధర్మము లవలంబించి నీవు నీ పిల్లల నెంతవారిని చేసినావు! విమానముల రొదను మించిన విచిత్ర సంగీతము కాని, కార్మికుల హక్కులను మించిన కమ్మని కవిత్వము కాని బ్రహ్మసృష్టిలో వేఱొండులేదని ధృవపరచుచున్నందుకు ప్రపంచము నీకెంత కృతజ్ఞతాబద్ధమై యుండఁగలదు!

# బాలవిజ్ఞానశాఖ

## కానుకలు

శ్రీమతి జయలక్ష్మమ్మగారు

కంచికామాక్షమ్మ మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను గజనిమ్మపండ్లు
కాశీవిశాలాక్షి మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను రంగుకోకల్లు
కలకత్తకాళికా మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను దండకడియములు
నెల్లూరుమహాలక్ష్మి మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను రవలనాణ్యములు

తిరుపతీఅలివేలు మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను తిరుపతిగారెల్
జగన్నాధసుభద్ర మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను బదరవేణీలు
మధురమీనాక్షమ్మ మాతల్లిగారు
కొని తెచ్చియిచ్చెను మల్లెగంపల్లు
వైకుంఠశ్రీలక్ష్మి మాతల్లిగారు
నిత్యకానుకలిచ్చు నిత్యకల్యాణి.



## మీ దేశంలోనూ ఇల్లాగేనా !!

వ్యాకరణ విద్యాప్రవీణ ఆకెళ్ల శేషాద్రిగారు

గుంటూరులో ఒక బ్రాహ్మణుడు ఉండే వాడు. అతనికి లేకలేక ఒక కూతురు పుట్టింది. ఆమె పేరు 'కనకం'. ఆమె క్రమంగా పెరిగి పెద్దదయింది. లేక లేక పుట్టినపిల్ల అవడంచేత తల్లితండ్రులు ఈమెకు ఇంట్లో పని ఏమీ చేప్పేవారుకారు. ఎంత వెన్నప్పంలాగ పెంచుకున్న పిల్లనైనా ఒక అయ్యచేతిలో పెట్టడం తప్పదు కనుక కొన్నాళ్లకు కనకానికి పెళ్లిచేశారు. పెద్ద దయి కాపరానికి వెళ్లింది. ఇప్పటికే ఈమెకే అత్తెసరుపెట్టడం, కందిపప్పుపచ్చడిలాంటివి చెయ్యడంమాత్రం చేతనయినాయి.

కనకం చాలా అదృష్టవంతురాలే! ఆమె కాపరానికి వెళ్లగానే భర్తకు గోదావరిజిల్లా కోనసీమలో కొత్తగా ఉద్యోగం అయింది. కనకానికి మామగారు పెళ్లినాటికేలేడు. ఇంక కోడలు గృహప్రవేశంకాగానే అత్త గారు గంగాప్రవేశం అయింది. ఇంట్లో పెద్ద దిక్కు ఎవ్వరూ లేకపోవడంచేత కనకాన్ని ఒక్కర్తెనే తీసుకొనివెళ్లి కొత్తదేశంలో కాపరం ప్రారంభించాడు.

నిత్యం వంట ఏదోవిధంగా సరిపెట్టుకునే వారు. ఏవైనా పిండివంటలు చేయవలసి వస్తే మాత్రం పక్కయింటి ఆవిడదగ్గరకి వెళ్లి, "అమ్మా! మీదేశంలో ఈ పిండి వంటలు ఎల్లా చేసుకుంటారూ?" అని అడి గేది. ఆవిడ అంతా చెప్పినతరవాత కనకం "మీ దేశంలోనూ ఇల్లాగేనా! సరే! వెడ

తాను" అని వెళ్లిపోయి ఆమె చెప్పిందంతా గుర్తుంచుకుని ఆ పిండివంటలుచేసి భర్తకు పెట్టి తాను తింటూండేది. ఈవిధంగా భర్తకూ, పొరుగావిడకీకూడా తన లోటు తెలియకుండా కాలక్షేపం చేస్తూండేది.

ఒకరోజున అమావాస్య. భర్త ఆరాత్రి అన్నంతినడు. మినపరొట్టె కాల్చమని చెప్పి వెళ్లాడు. సరే! మామూలే కాదూ! పొరుగింటి ఆవిడదగ్గరికి వెళ్లి "మీరు రొట్టె ఎల్లా కాల్చుకుంటారమ్మా!" అంది.

"ఏముందమ్మా" మినపపప్పు నానపోసి మెత్తగారుబ్బి, బియ్యంపిండి అందులోకలిపి, బూర్లమూకుడులో కొంచెం నూనెపోసి, అది కాగినతరవాత ఈపిండి అందులోవేసి, కింద మంటపెట్టి, కొంతసేపు అయినతరవాత పైన నిప్పులుపోస్తే రొట్టె బాగా కాలుతుంది" అని ఆవిడ చెప్పింది. కనకం మామూలుప్రకారం "మీ వూళ్లోనూ యింతేనా" అనేసి యింటికివచ్చి, ఆవిడ చెప్పినట్టు అంతాచేసింది. భర్త ఎప్పుడొస్తారో అని కనిపెట్టుకొని కూర్చుంది.

సాయంత్రం అయింది. భర్త వచ్చి, కాళ్లు కడుగుకొని, మడికట్టుకొని, జపంచేసుకొని, రొట్టెముక్క పెట్టమన్నాడు. ఆకువేసి రొట్టెపెట్టింది. ముక్క విరిచేటప్పటికి మధ్యను బొగ్గులు! ఆయన ఆశ్చర్యపడి "ఇదేమిటే?" అన్నాడు చిరునవ్వుతో. అప్పుడు కనకం "ఈ దేశంలో ఇల్లాగే చేసుకుంటారట! ఈ పక్కయింటి ఆవిడ చెప్పిందండీ!" అంది. "నీ మొహంలావుంది, ఏమని చెప్పిందేమిటి?" అన్నాడు భర్త.

ఆవిడ చెప్పిన ప్రతిక్రియ వరసగా పాఠం అప్పచెప్పినట్టు చెప్పింది. "పిండిమీద పళ్లెం వేయాలని చెప్పడం మరిచిపోయి నిప్పులు పోయాలని చెప్పింది కాబోలు! నీ వింత తెలివితేటలు కలదానవని తెలుస్తే ఆమాట కూడా చెప్పేదే పాపం!! మొత్తానికి ఆవిడిదే పొరపాటు!" అని చెప్పి తన భార్య తెలివికి సంతోషించి ఆరాత్రి మహాశివరాత్రి చేసుకొని కడుపులో కాళ్లు పెట్టుకొని పడుకొన్నాడు.

—:o:—

## పిల్లల పాటలు

గోపరాజు రాజన్నగారు

౧

తుమ్మచెట్టుమీద గెద్దవాలింది
తుపాకితేర పడగొడదాము
తప్పకుండ లెక్కపెడితె ముప్ఫయ్యొక్కటి

౨

చెంచమ్మమాయింట గెంతువేసింది
చెలవుల్లనాయుడూ గొడుగుతెచ్చాడు
గొడుగుకీముచ్చళ్ల గూడుకట్టారు
గూడులోమాతాత పెళ్లిచేసారు

పెళ్లికీమేమంత విందుకొచ్చాము

♦ ♦ ♦

విందులూ గోవిందుల్లు
విద్యార్థుల చదువుల్లు
చదువుల్ల తెలువుల్లు
తెలువుల్ల తేటల్లు

♦ ♦ ♦

మాటలతేటలు మాయింట
మాపిటిభోజనం మీయింట.

# ఆరోగ్యబోధిని



(శ్రీమతి నెమిలి చంద్రమతిగారు వ్యాసకర్త్రి)

## ఆరోగ్యమే మహాభాగ్యము

దేవుడు ప్రతి జీవికిని నొక దేహమును, ప్రాణమును నొసగియున్నాడు. ఆ దేహమును కాపాడుచు ఆత్మను నిర్మలముగానుంచిన కదా ప్రపంచ సుఖ మనుభవించుటకు. ఒకరాజొకనికి యొక గుఱ్ఱమునిచ్చి, దానితో దేశయాత్ర గడపిరమ్మని చెప్పిన, యతడు దానిని తీసికొనిపోయి బాగుగ మేతవేయకపోయిన, నది చిక్కి శల్యమైన, యాత్ర యెట్లు గడచును? తిరిగి రాజున కొప్పజెప్పుట యెట్లు? గుఱ్ఱమును బాగుగా మేపి దానితో యాత్ర గడపివచ్చి తిరిగి దానిని రాజున కొప్పజెప్పినకదా రాజు సంతోషించును. అటులనే మనకు ప్రపంచ యాత్ర గడపిరమ్మని దేవుడిచ్చిన శరీరమును మిగుల జాగ్రతతో కాపాడి, మనము జేయవలసిన సత్కార్యములజేసి, తుదకు మృతిబొందుట మానవధర్మము. దేవునికి ప్రీతికరము. ఆరోగ్యముచెడి రోగముల పాల్బడి అకాలమరణమును బొందిన యిహమునందు గాని, పరమునందుగాని శాంతి, సుఖములు లేవు. బుణ్యమును లేదు.

ఆరోగ్యము చెడినవానికేగాని, ఆరోగ్యము యొక్క విలువ తెలియదు. అంతవరకు కండ్లు మూసుకొనియుందురు. అలక్ష్యము చేయుదురు. పునాది గట్టిగానుండినగాని మేడ నిలువదను సామెత వలె దేహము దృఢములేకయుండిన మనసును దృఢములేక స్థిరముగా నిలువదు. చంచలమైన మనస్సుతో దేవుని ధ్యానించుట కెట్లు వీలగును? కాదు గదా? దేవుని సృష్టి వైచిత్ర్యములు, సూర్యోదయము, సూర్యాస్తమయము మొదలగు ప్రకృతిరహస్యములు చూడజాలరు. అనుభవింపజాలరు, ఆలోచింప జాలరు, నూతనవిషయముల గనిపెట్టు శక్తియు చాలదు. ఆరోగ్యము మానసికశక్తుల దినదినము పెంపొందించి ఘనతర కార్యములను చేయించి యమోఘసుఖమును బడయజేయును. ప్రపంచముయొక్క పైమెట్టు నెక్కు ఆరోగ్యసూత్రము లందరికిని తెలిసియున్నవి గాని యాచరించువా రరుదు. వాటిలో ముఖ్యమైనవి ఏవన,

(1) పరిశుభ్రమైన గాలి.
(2) నిర్మలమైన నీరు.
(3) నియమితకాలమునకు పుష్టికరమైన మితాహారము.
(4) వ్యాయామము.
(5) విశ్రమము.
(6) సూర్యరశ్మి.

మొదలగునవి తెలిసిన విషయములే.

పూర్వము మన హిందువులు ఆజానుబాహులై, జ్ఞానపరులైయుండిరని తెలియుచున్నది. వారు శాస్త్రోక్తప్రకార మన్నియు జరుపుచుండిరి. మడి, యాచారము, ఏకాదశి యుపవాసములు, పూజలు, పునస్కారములు మొదలగునవన్నియు శరీరము యొక్కయు, ఆత్మయొక్కయు, శుచికొఱకు శాంతికొఱకేనని బోధపడుటలేదా? అది తెలుసు కొనక కొందరది మూఢత్వ మనుకొనెదరు.

తలిదండ్రులు తమ బిడ్డలకొఱకు ఆస్తి కూడబెట్టి యుంచుట గొప్పకాదు గాని అమూల్యమైన ఆరోగ్య మహాభాగ్యము నిచ్చుట ప్రధానము. రెండవది విద్య, మూడవది ధనము. ఎంత ధనమున్న నేమి, యారోగ్యములేకున్న దానితో నెట్లు సుఖింతురు? ధనములేకున్నను బలిష్ఠుడయియున్నచో కాయకష్టము పడి సంపాదించుకొనుచు సుఖముగ జీవనము గడుప గలడు.

సౌందర్యముకూడ నారోగ్యముమీదనే ఆధార పడియున్నది. ఎంతటి సౌందర్యవంతులైనను ఆరో గ్యములేమి ప్రకాశింపరు. బంగారమునకు మెరుగు వన్నె దెచ్చునటుల సౌందర్యమునకు నారోగ్యము వన్నెదెచ్చును.

నూతనజీవులను ప్రపంచములోనికి దెచ్చు భారము తల్లిది గాన ముఖ్యముగా తల్లుల యారోగ్యము గమనించవలసియున్నది. తల్లి యనారోగ్యవంతురా లయిన బిడ్డలుకూడ బలహీనులయియుండి మరణింతురు. జీవించినను ఏదో నొకవ్యాధిచే యా జన్మాంతము పీడింపబడుదురు. బిడ్డలను సాకుట తల్లి పని కదా? తల్లియే కడు బలహీనురాలయియుండిన బిడ్డల నెట్లు సాకును? గృహకృత్యముల నెట్లొనర్చును? అన్నిటికి నశక్తురాలయియుండును.

నేటి శిశువులే రేపు తల్లులు, దండ్రులు, దేశ సేవాపరులు కాబోవుదురు గాన వారి యారోగ్య ధైర్యసాహసములను వృద్ధిపఱుచవలెను. చెడ్డసహవాసము లేక మంచిమార్గముననే పోవునటులజేసి, సకల విద్యాప్రావీణ్యులుగజేసిన వార లెంతటి ఘనతర కార్యములయిన జేయగలుగుదురు!

ప్రతియొకరు నిటుల సంపూర్ణారోగ్యము సంపాదించుకొనుటకు ప్రయత్నించినయెడల మన హిందూదేశము సర్వవిషయముల సర్వవిధముల వృద్ధిపొందు ననుటకు సంశయములేదు!



## ము ది మి

కొసకొసదగ్గు, గద్గదపుగొంతు, నపక్రమమైనయూర్పు, బల్।
మసకలువారుచూపు, లతిమందతమశ్రవణంబు, బోసినో।
రు, సగముమాటత్రొప్పు, విసరుల్, కసరుల్, పరిహాసపాత్ర మీ।
ముసలితనంబువంటి పెనుముప్పు మరొక్కటి యున్నదా హరీ॥

ప॥ క్ర॥ మూ॰ శ్రీ.

# వార్తలు-విశేషములు

లైలాపూరు 11 ఏండ్లవయస్సుగల ఒక సిక్కు బాలిక 8 మాసముల క్రిందట ఆంగ్ల భాషాభ్యాసము మొదలుపెట్టి గబగబ ప్రతీక్లానూ ప్రతీఘారం ప్యాసయి మెట్రిక్యులేషను ఎగ్జామినేషనుకు వెళ్లి మొదటితరగతిలో ఉత్తీర్ణురాలయ్యెను. ప్రైవేటు ట్యూటరుదగ్గర నేర్చుకొని ప్రైవేటుగానే పరీక్షకు వెళ్లెను గాని ఏపాఠశాలలోను చదువలేదు. ఇది కేవలం స్వయంకృషియా లేక జన్మవాసనా?

## వివాహమునకు ముందు రజస్వలయైన వైశ్య కన్య

నారాయణవరం గ్రామమునకు 3 మైళ్ళదూరము నందుండు పుత్తూరుగ్రామంలో ఉండే ము.రా. నరసింహులుశెట్టిగారి కుమార్తె రజస్వల ఆయెను. వైశ్య కులములో (కోమట్లు) బ్రాహ్మణుల మాదిరి రజస్వల కాకముందే ఆడబిడ్డలకు పెండ్లిచేయు ఆచారము కలదు. ఒకవేళ రజస్వల అయినప్పటికిని మూసి పెట్టు ఆచారము కలదు. శ్రీయుతులు నరసింహులు శెట్టిగారు దొంగత్రోవ త్రొక్కక ధైర్యసాహసము లతో బహిరంగపరచి వూరిలోనుండు వైశ్యుల నంద రిని ఆహ్వానించిరి కొంతమంది వైశ్యులు మునుగులో గ్రుద్దులాడిరి కాని బహిరంగముగా ఏలాటి ఆక్షేపణ లును చేయక వారి ఆహ్వానములను స్వీకరించి వారి వారి యిండ్లకు వెళ్ళిరి. ఇట్లు జరగడము చిత్తూరు మండలములో ఇదే ప్రథమము. (విలేఖరి)

## ఆంజనేయస్వామి దేవాలయము

శ్రీయుతులు సి.వి. రంగంశ్రేష్ఠిగారు వారి సోద రుడు కూరపాటి తిరుమణిశ్రేష్ఠిగారు ఒక సంవత్సర ముకు ముందు శ్రీ ఆంజనేయస్వామి జీర్ణదేవాల యోద్ధరణము ప్రారంభించిరి. ఇప్పటికి పూర్తిఅయి నది. సుమారు రు 7500 లు ఖర్చుపెట్టిరి. ఏప్రిల్ నెల తే 25 దిని ప్రోక్షణ ప్రారంభమై 29 వ తేది ఆదివారంనాడు పూర్ణాహుతి జరిగినది. మండల ప్రముఖు లందరు విచ్చేసిరి. 29 తేదిని శ్రీయుతులు దేశోద్ధారక కాసీనాథుని నాగేశ్వరరావుగారు దేవాలయమును బహిర్గతపరచిరి.

గంజాంజిల్లా కోటబొమ్మాళిపోస్టు సీతన్నపేట గ్రామం మొఖాసాదారు శ్రీయుత అంబటిపూడి సీతారామయ్యగారి యేకపుత్రికయు గంగాధర భట్ల వెంకటేశం పంతులు (రిటైరుడు పోలీసు ఇనస్పెక్టరు) గారి భార్యయు అగు శ్రీమతి సీతారామమ్మగారు ఈసంవత్సగి చైత్రశు॥నవమీ శుక్రవారంరోజున పరమ పదించిరి. శైశవదశలోనున్న ఆరుగురు బిడ్డలు, భర్త, తలిదండ్రులు బంధువర్గమును మిగుల దుఃఖము పాలైరి. క్రోధిసంవత్సర ఆశ్వీయుజ శు ౧౧ శినాడు జనించుటచే 30 సంవత్సరము లయినను నిండలేదు. దేవతారాధన ధర్మకార్యములయం దాసక్తి మెండు. కోటబొమ్మాళిలో సర్వవర్ణులును (హరిజనులుకూడ) ఉపయోగించుకొనుటకు ఒక బావిని త్రవ్వించుటచే యీమె కస్పృశ్యతానివారణోద్యమము నందు గల అభిమానము విశదమగుచున్నది.

బటాలో (పంజాబురాష్ట్రము) ఆనేపూరిలో ఒకపూజారి పూజచేసుకొనుటకు ఒకదేముడుగుడి లోనికి వెళ్ళగానే తలుపులు వాటంతట అవే మూసు కొని పోయినవట! ఎంతమంది వచ్చీకూడా వాటిని తెరవలేకపోయిరి. ఎవరో ఒకమహానుభావుడు వచ్చి వానిని తాకేవరకు అవి తెరచుకొనినవట-మంత్రాలు, మాయలు, మహత్వాలరోజు లింకా అయిపోలేదు!

బెంగుళూరిలో ఒక పదేండ్లబాలిక 12 గంటలు 8 ఏండ్లబాలిక 15 గంటలు ఈదిరి. ఈ పోటీలు కలకత్తాలో జరిగినవి.




## ౧. ఉపదేశము

శ్రీమతి ఎ. కోమలమ్మగారు

పాడుమమ్మా చెల్లెలా!
పాడుమమ్మా చెల్లెలా!
పలుకు పలుకున తేనెలొలుకగ,
కులుకు నుడువుల తళుకులుబుకగ,
తెలుగువారీ మోహతమసము
కలగి కరగి తొలగి పోవగ,
పాడుమమ్మా చెల్లెలా!

పరులవెంబడి ప్రాకులాడుచు,
తెరువు గిరువు తెలియ కిడుమల
పరుగులెత్తే, తెలుగుసీమను
సరస భావస్రవంతు లూరగ
పాడుమమ్మా చెల్లెలా!

నేడు పడమటిగాలి విసరున
వాడి చెడి వ్యక్తిత్వ ముడిగి
మాడిపొయ్యే తెలుగుతీవియ,
గడియలోపుగ చివురులెత్తగ
పాడుమమ్మా చెల్లెలా!

కత్తిపోటుకు కలముప్రాతకు
పొత్తుకలిపిన కృష్ణరాయలు,
హత్తుకొని మన తెలుగువారి
చిత్తములలో చిందులాడగ
పాడుమమ్మా చెల్లెలా!

కవి కుమారుల కావ్యకమలిని
భావపుంజం బనెడు కమ్మని
తావి జిమ్ముచు, లోకమంతట,
భావుకుల నానందపరచగ
పాడుమమ్మా చెల్లెలా!

తెలుగు తల్లీ కీర్తి చంద్రిక
కళలు దేరి నాల్గుదిక్కుల
నలముకొనుచు నింగి కెగయగ,
లలితమౌ నీ కంఠమెత్తి
పాడుమమ్మా చెల్లెలా.

౨. భృంగి గౌరు శివ సంవాదము (సంపాదకుడు) కొత్త వీరభద్రయ్య చౌదరిగారు

భృ. రాజరాజ నరేంద్రపురమున
రాచకార్య మేమొకాని,
రమణి నొకతెను, తెచ్చియున్నా
రెరుగవా? నీవే మెరుగవా?

గౌరి. తేజముగ నఖండగౌతమి
తీరమందున యుంటిగాని
రాచకార్య మేమొ యెరుగను
రమ్యముగ భృంగీశ్వరా, పల్కరా,
నీవే దెల్పరా, ఆవార్త లేమొ పల్కరా,
నీవే దెల్పరా.

భృ. బంగారు బొమ్మవోలె పార్వతీ నీవుండ
గాను, గంగమాంబనుదెచ్చి శివుడు
పొంగి శిరసున బెట్టికొన్నా డెరుగవా?
నీవేమెరుగవా? ఓపార్వతమ్మా!
అడగవే, శివుని, యడగవే.

గౌరి. ఏమయా, స్వామీ! యేమయా
యీలాటి వింత లేమయా? పల్కరే
మయా? గంగమాంబను దెచ్చినా
రట, మన భృంగిగాడు జూచినాడట
యింగిత మెరుగని పనులు రంగడు
బోధించినాడా? యేమయా స్వామీ
యేమయా?

శివు. ఎరుగనే నేనే మెరుగనే
నిండువేసవి కాలమునజల
ముండునో లేకుండునో యని
దండిగా నదిదెచ్చి జడలో దాచి
యుంచినానె గాని యెరుగనే నేనే
మెరుగనే ఓపార్వతీ! నమ్మవే, ముద్దుల
గుమ్మవే.

భృ. కానిపోనీ మాటలన్నీ కల్పనా జేశాడు
గానీ స్వామిదెచ్చిన యుదకమైతె
చక్కనీ మోముండుటేమొ అడగవే
నీవే యడగవే ఓపార్వతమ్మా! అడగవే,
శివుని యడగవే.

గౌరి. కానిపోని మాటలట, కల్పనజేసితిరట
మోము గానవచ్చెనట, మన భృంగి
గాడు జూచినాడట యేమయా
స్వామీ యేమయా?

శివు. చాడీకోరు భృంగిమాటలు చక్కగా
నమ్మితివి నీవు, వాడిగల యుదకంబు
నందు వనజములుండుట నీవు
ఎరుగవా? నీవేమెరుగవా? ఓపార్వతీ
భామరో, వినవే లేమరో!

భృ. సమయ మైనప్పుడు బొంకులు చక్కగా
బల్కేరుగాని విమలమైన కమలమైతె
విశాలనేత్రము లుండుటేమొ అడగవే
నీవే యడగవే ఓపార్వతమ్మా—

గౌరి. కల్లలు మీమాట లని మనపిల్లవాడు
బల్కినాడు ఫుల్లపంకేరుహములైతె
పూనినేత్రము లున్నయట ఏమయా
స్వామీ, యేమయా—

శివు. కల్ల, వద్దీమాటలు మనపిల్లవానికి చెల్లు
గాని చల్లని యుదకంబునందున నల్లని
మీనములు గిలవు భామరో వినవే
లేమరో.

భృ. తల్లిరో నామాట స్వామి కల్లలని
బల్కేరుగాని మొల్లలుగ మత్స్యంబు
లైతె, నల్లనికురు లుండుటేమొ
అడగవే నీవే యడుగవే.

గౌరి. కురులు గానవచ్చెనట మనకుఱ్ఱవాడు
జూచినాడట వెఱ్ఱిపనులు వలదుమీకు
యెక్కడ నేర్చిరోగాని ఏమయా!
స్వామీ ఏమయా!

శివు. కుఱ్ఱవాని మాటలువిని
వెఱ్ఱిపడి నీవడుగ దగునా
కుటులుగావే పద్మములపై
కూడిన తుమ్మెదలుగాని
భామరో వినవే లేమరో.

భృ. మింటబారెడి తుమ్మెదలు మన
యింట గలిగియుంట జాలును
జంటబాయక స్వామిమెడలో
కంఠమున మెరయుచునున్నది
చూడవే నీవే చూడవే, ఓపార్వతమ్మా!

గౌరి. కంఠము కానవచ్చెనట మన
చంటివాడు జూచినాడట
యింటవంటా లేనిపనులు, కొంటెపిల్లలు
నేర్పిరా ఏమయా? స్వామీ—

శివు. కొంటెపిల్లవాడు మన
యింటనే యున్నాడుగాని
పంకజాక్షీ, నదులయందు
శంఖము లుండుట నీవు
యెరుగవా నీవే—

భృ. అబ్బురంబుగ మగని మాటల
కుబ్బితబ్బిబ్బైతి విప్పుడు
నిబ్బరంబగు మేనిపై
గబ్బిగుబ్బలున్న వవిగో, చూడవే
నీవే చూడవే, ఓపార్వతమ్మా—

గౌరి. నిబ్బరంబగు మేనిపైన
గబ్బిగుబ్బలున్నవని గొబ్బున నాతోమన
అబ్బిగాడు పల్కినాడు
ఏమయా స్వామీ—

శివు. తబ్బిబ్బుమాటలు భృంగికి
తార్కాణమై చెల్లుగాని
జబ్బులేని యుదకమందున
జక్కవ పక్షులు గలవు
భామరో, వినవే లేమరో.

భృ. కన్నెపడుచును దాచితే స్త్రీ
చిన్నెలు దాగునా
తిన్నని యుదరముపైన
పన్న నూగా రున్న దదుగో
చూడవే, నీవే—

గౌరి. తిన్నని యుదరముపైన
సన్ననూగారున్నదని
పన్నుగా నాతోటి మన
చిన్నవాడే బల్కినాడు
ఏమయా, స్వామీ—

శివు. చిన్నవాడు యెన్నడూసా
మాన్యుడు గాదనుచు యెరుగవ?
సన్నుతాంగీ కంఠమున
పన్నగము లుండుట నీవు
యెరుగవా? నీవేయెరుగవా?

భృ. తల్లిరో నామాట నిజమా
అల్ల సామిమాట నిజమా
తల్లి మన ముగ్గురికి సాక్షి
స్వామి మార్కండేయులున్నా
రడగవే నీవే—

గౌరి. గంగమాంబను తోడితెచ్చుకు
పొంగుతూ శిరమున బెట్టుకు
గంగగాదని మీరునాతో
దొంగిమాట లాడెదరు
ఏమయా? స్వామీ—

శివు గంగగాదే, గౌరు! మనకు
కయ్యము పెట్టుటకొరకు
భృంగిగాడికి సాధుజనులు,
బోధజేసినారు యెవరో
అరుగవే భృంగిని యడగవే

గౌరి. పల్కరా, భృంగిదెల్పరా,
ఆవార్తలేమొ పల్కరా, భృంగీ,
ప్రేమతోడుత శివుని సంవాదమొనరగ
జేసినట్టిజనులు, యెవ్వరు బోధజేసిరి
భృంగి పల్కరా—

భృ. వాసిగా వైకుంఠ రామదాసురాలు
జేసెగాని, మనసునా రంజల్ల నేను
మనవి జేసుకొంటి గాని
ఎరిగినే నేనే మెరుగనే—

భృంగి, గౌరు, శివుని వాదము
పొంగుచూ పాడినావిన్నా
రంగుగ కైవల్యమిచ్చును
నగధరుడు వారికి
ఆనందము బ్రహ్మానందము.

అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు

3. తలపులు

పూరేకు పొత్తిళ్ళ
హాయిగా నిదురించి
సౌరభము వీవగా
మేల్కాంచి పోదునా?
మేఘాల రథమెక్కి
తారకలతో దివ్య
నృత్యగానంబులను
నేర్తునా ముదముతో?
నెలవంక వెలుగులో
పొదచాటు నీడలో
మెరసేటి మిణుగురుం
బురువునై యెగురనా?

శ్రీమతి బసవరాజు వెంకటరాజ్యలక్ష్మమ్మగారు

౪. ఏమో!

ఆకసమునమబ్బు దట్ట
మైక్రమ్మెను చిటపటమను
చినుకులతీయనిపాటలు
చెవులకింపు గూర్చుచుండె,
పిట్టలువినువీధినెగురు,
పండుటాకులన్నియుపడి
కొండవాగులోన గలసి
గుసగు సలాడుచుపోయెను
గున్నమావికొమ్మలందు
కోయిలపాడెడుపాటలు
వినవచ్చుచుండె, కానీ
మనసేమోమాటుమణిగె!




## — వుస్తికాయకూర —

పచ్చివుస్తికాయలను తెచ్చి పండుకాయలను ఏర్పరచి తీసివేయవలెను. పచ్చికాయలుమాత్రం చిన్నరాతితోగాని రోకలితోగాని నలగగొట్టి గింజలుండిన చేదుగలుగును గనుక గింజలను గుజ్జును పోవునట్లు బాగా నీళ్లుపోసి కడిగి వడియవేయవలెను. పొయ్యిమీద నీళ్లు మరగబెట్టి కడిగియుంచిన వుస్తికాయపలుకులను అందులోవేసి కొద్ది పసుప్పొడి తగినవుప్పు పులుసువేసి మూతపెట్టవలెను. మెత్తగా వుడికినవెంటనే నీళ్లువార్చి ఆరబెట్టవలెను. పొయ్యిమీద బాణలివేసి తగిన నూనెవేసి శనగపప్పు, మినపపప్పు, ధనియాలు, ఇంగువ, మిరపకాయలు ఇవి దోరగావేయించి రోటిలోపోసి నూకపిండిగా పొడిచేసివుంచి పచ్చికొబ్బెరతురిమి యుంచుకోవలెను. అటువెనక పొయ్యిమీద బాణలి లేక గిన్నె యుంచి నూనె లేక నెయ్యి తగినంతవేసి ఆవాలు కొద్దికరివేపాకువేసి వేగినవెంటనే వుడికిన వుస్తికాయపలుకులు అందులోవేసి తురిమిన కొబ్బెరకూడ చల్లి బాగా వాడ్చవలెను. వాడినపిమ్మట దంచియుంచుకొన్న పప్పులపొడుము కొంచెము చక్కెర చల్లి కలియబెట్టి సెగలో 5, 6 నిమిషము లుండనిచ్చి దించి వడ్డించుకొన్న బహురుచికరము. దేహమునకు ఆరోగ్యకరమైనది. పైత్యహరము.

—అప్పాజి కుప్పమ్మ.

## — ఆనపగింజల పచ్చడి —

ఆనపకాయతరిగి అందులో గింజలుతీసి అవి ఒక గిన్నెలోపోసి నేతితోగాని నూనెతోగాని దోరగా వేయించి రుబ్బి మిరపకాయలు, ఆవాలు, జీలకర్ర, మినపప్పు వేసి తాలింపుపెట్టి కొంచెము పసుపువేసి కలిపి చింతపండుపులుసు కాని నిమ్మకాయపులుసు కాని తగుమాత్రము కలిపి కొంచెము ఉప్పు వేయవలెను. ఆ పచ్చడి అన్నములోకాకుండ ఇడ్లీలలోకి కూడ చాల బాగుంటుంది.

—శివలంక రాజరాజేశ్వరి.

## — మామిడిపండ్ల షర్బత్తు —

ప్రశస్తమగు తియ్యని మామిడిపండ్లను దెచ్చి వాటిరస మొకసేరుతీసి ఒక శుభ్రమగు కళాయి పాత్రలోవేసి దానిలో 5 తులముల పెద్దయాలకుల పొడియును, 10 తులముల ప్రశస్తమగు పన్నీరును, అరతులము పచ్చకర్పూరపుపొడియును, 5 గురిగింజలెత్తు కుంకుమపువ్వుపొడియును వేసి చక్కగా కలియబెట్టి, 50 తొడిమలుతీయని మల్లెపుష్పములను వేసి మూత బెట్టి మూడుగంటలసేపటివరకుంచి పిమ్మట దానిలో ముప్పావుశేరు చక్కని చక్కెర పాకమునుబోసి కలియబెట్టి ఇట్లు సిద్ధమైనదానిని కొంచెము దళముగానుండు గుడ్డలోబోసి వడియగట్టవలయును. ఈరీతిగా వడియగట్టినవానిని ఒక సీసాలోపోసి కొంచెము కొంచెముగా నీళ్లుకలపకుండ వేసవికాలమందు సంధ్యాసమయమందు పుచ్చుకొనినయెడల శరీరమున కుత్సాహకరముగానుండును.

## — మామిడిపండ్ల హల్వా —

ప్రశస్తమగు 15 అంటిమామిడిపండ్లను దెచ్చి చల్లనినీళ్లలోవేసి రెండు మూడు గంటలయిన వెనుక వాటిపయి చెక్కుతీసి చిన్న చిన్న ముక్కలుగా కోసి యొకపళ్లెములో నుంచుకొనవలయును. పిమ్మట నొకశేరు గోధుమపిండి ముప్పావుశేరు నేతిలో వేచుకొని దానినిగూడ వేరుగనుంచవలయును. పిదప 20 తులముల కిస్మిసుపండ్లు నీళ్లలోవేసి చక్కగాకడిగి, పిక్కలుతీసిన 10 తులముల ఖర్జూరపుపండ్ల తునకలను, 10 తులముల బాదముపప్పు, 10 తులముల పిస్తాపప్పు, కొంచెము నేతిలోవేసిన సెనగపప్పు వీటి పొడియును 2 తులముల యాలకులచూర్ణమును,

1 తులము దాల్చినచెక్క యిష్టమయినయెడల తులము సోపుపాడి వీటినన్నిటిని గలిపి పయిని చెప్పబడిన వేచిన గోధుమపిండిలోవేసి కలుపవలయును. పిమ్మట అర్ధశేరు ప్రశస్తమగు పాలు తెచ్చి పొయ్యిమీదపెట్టి యుడుకుచున్నపుడు ఒక అర్ధ పావు నేయి ధారగా విడుచుచు మామిడిపండ్ల ముక్కలను వేయవలయును. ఇట్లు యివి అన్నియు పక్వమగుచుండు సమయమున 20 తులముల కండ చక్కెరపొడివేసి బాగుగ కలుపుకొనవలయును. ఇట్లు కలుపబడినదానిలో తిరుగ నొక పావుశేరు పెసరపిండినివేసి అర్ధపావునేయి ధారగాపోయవలయును. పిమ్మట దీనిని దించుకొని అర్ధశేరు చక్కెరను సరిపడునంత పలుచని పాకముగా దించుకొని పయినిచెప్పబడిన సిద్ధమయిన హల్వాను, ఈ పాకములోవేసి తిరుగ అర్ధపావు నేయి పోయవలయును. ఇది అంతయు లెస్సగా పాకముకానిచ్చి క్రిందికి దించుకొని చల్లారుసమయమున తులము దాల్చిన చెక్క పొడియును కొంచెము బాదముపప్పు తునకలను దానిపైజల్లి చల్లారినవెనుక చీలకలుగచేసి భుజించవలయును.

—శీలా అప్పలకొండ

## —— అరటిముప్వ పచ్చడి ——

లేత అరటిముప్వ (చెట్టుమధ్య తెల్లనిచుట్టులా వుంటుంది) తెచ్చి తోటకూరవలె సన్నగాతరిగి కడగవలెను. తరువాత ఒక పాత్రలోవేసి గోగాకు వలె దోరగావేయించి రోటిలో మెత్తగా రుబ్బవలెను. నూనెలో ఇంగువ, మిరపకాయలు, ఆవాలు, మెంతులు, జీలకర్ర, మినపప్పు వేయించి తాలింపు పెట్టవలెను. తగుమాత్రం ఉప్పు, చింతపండు వేసి కొలది బెల్లంకూడా కలపవలెను. ఆ పచ్చడి అన్నం లోవేసి ఏంపచ్చడని చెప్పమంటే చెప్పకోలేరు.

—చీమలకొండ రామసుబ్బలక్ష్మి

## —— ఫలసమూహా పానకము ——

ఆవుపాలు అర్ధపావుశేరును, కొబ్బరిపాలు అర్ధ పావుశేరును, వెలగపండ్లరసము పదితులములును, ద్రాక్షపండ్లలరసము ఎనిమిది తులములును, నిమ్మపండ్లరసము పది తులములు, దబ్బపండ్లరసము ఐదు తులములును గలిపి బాగుగా తఱచవలయును. 2 తులముల యాలకులపొడి, 1 తులము జాజికాయ, 1 తులము జాపత్రి, వీటిపొడుము తఱచిన పాకములోఁ గలుపవలెను. పావుశేరు పంచదారను పాకముబట్టి అందులో తఱచి సిద్ధముగానుంచిన పానకముబోసి యుపయోగించుకొనవలయును. ఆ యాసముగానున్నపుడును, వేడిగానున్నప్పుడును, పుచ్చుకొన్నచో శ్రమనుబోఁగొట్టి యుత్సాహము కలుఁగజేయును.

## —— ఉసిరికాయ షర్బత్ ——

పండిన యుసిరికాయలఁదెచ్చి యొకశేరు రసమునుబోసి కుండలోగాని తదితర పాత్రలోగాని యుంచవలెను. 1 తులము లవంగములు, 1 తులము యాలకులు, 1 తులము జాజికాయ, 1 తులము జాపత్రి, 1 తులము దాల్చినచెక్క, వీటినన్నిటిని మెత్తగా చూర్ణముచేసి యైదు గురిగింజలయెత్తు కుంకుమపువ్వుపై యుసిరికాయ చూర్ణములోఁబోసి కలుపవలయును. అట్లు కలిపిన తదనంతరము దానిపై మూతనిడి రెండు మూడు రోజులుంచి మూడవ నాటియుదయ మా రసములో నేబది గులాబిపువ్వులు 1 తులము పచ్చకర్పూరము, 2 గురిగింజలయెత్తు కస్తూరివేసి చక్కగాఁ గలియఁబెట్టి 8 గంటలుంచి మఱియొకకుండలోనికి వడియకట్టవలెను. 1 శేరు పంచదారను పాకముఁబట్టి వడియకట్టిన రసములోఁ బోసి కలిపి పావుగంటకాలము సన్ననిమంటలో ఉడుకనిచ్చి దించవలయును. ఉడికి చల్లారినతరువాత సీసాలోఁబోసి భద్రము చేసియుంచవలెను. అర్ధానినిఁ గొంచెము నీళ్లలో 5 తులములు వేసికొని త్రాగినయెడల పైత్యరోగము, అజీర్ణవ్యాధులు పోవును. ప్రతిదిన మైదు తులములచొప్పున 40 రోజులు సేవించినచో నారోగ్యముగలుగును. శరీరమునకుఁ గాంతి, పుష్టి నిచ్చును. ఈ యుసిరికాయ షర్బత్ నుమారు పదునైదుదినములవఱకు నిలువయుండినచో రుచికరముగానుండును. అంతకుఁ బైననుండినచోఁ జెడిపోవును,

—చదలవాడ రాఘవాంబ

# గ్రంథపరిచయము

**పురుషోత్తమ మాహాత్మ్యము:—**

డెమ్మీ సైజు 220 పుటలు. గ్రంథకర్త శ్రీయుత చివుకుల వేంకటాచలశాస్త్రిగారు, ఇమాంబావుడీ బజారు (2838) సికిందిరాబాదు (దక్కను.) వెల రు. 1-8-0 లు మాత్రము. పురుషోత్తమమాసమను పేరుగల అధికమాసముల మాహాత్మ్యమును తెలుపు ఉద్గ్రంథము. అనేకమంది యొక్క తలంపు అధిక మాసము శూన్యమాసమనియు అందు శుభకార్యములు కాని పుణ్యకార్యములు కాని తలపెట్టరాదనియు. కాలవాహినిలో అయోగ్యభాగ మెద్దియు లేదనియు, పుణ్యకార్య ప్రారంభమునకు సర్వకాలములును యోగ్యములే యనియు, తెల్పుటకు బృహన్నారదీయములోని యీఉపాఖ్యానములనెల్ల తెనిగించి ఆంధ్రుల కర్పించిన కవిగారి ప్రయత్న మెంతయు వర్ణనీయము. అధికమాసమహాత్మ్యము, వ్రతపాలనము, పాలించి మోక్షమందినవారి యోదంతములుగలిగి గ్రంథ మామూలాగ్రమతి మనోరంజకముగ నుండును. శైలి నిర్దుష్టగ్రాంథికము, సులభము, ద్రాక్షాపాకము.

**శ్రీ శివస్తోత్రము:—**

తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురం తా॥ గెద్దనాపల్లి కాపురస్థులు శ్రీయుత చాగంటి రామచంద్రరావుగారు ఈశివాష్టకమును సంపాదించి ప్రకటించిరి. ఆంధ్రదేశములో ఈఅష్టకములోని మొదటి శ్లోకమగు‘వందేశంభుముమాపతిమ్’ అనునది యొక్కటియే వ్యాపకములో నున్నది. తక్కిన యేడింటిని సంపాదించి ప్రకటించిన శ్రీరావుగారి కృషి యెంతయు ప్రశంసనీయము. అష్టకమెల్లయు భక్తిరసపూరితము. వెల రు 0-1-0.

**కార్మికసంఘ ప్రచురణము నెం 5 :—**

నెలనెలకీ నెలపొడుపువలె యీసంఘమువారి ప్రచురణములు నీమము తప్పకుండా వచ్చుచున్నవి. ఈ ఏప్రిల్ నెల ప్రచురణము 15 పుటల చిన్నికథ. మనదేశంలో పనివాళ్ళస్థితే మహాదుర్గమము; అందులోనూ వ్యవసాయపుపనివాళ్ళైన చెప్పనక్కరలేదు, వారు హరిజనులైతే యిక అడగవలెనా? ఈకథలో లక్ష్మయ్య అనే యజమాని, నాగమ్మ సోమయ్య అను తల్లికొడుకులు తనకు చేసిన చాకిరీకి తాను చేసిన ఉద్ధరింపుచూస్తే గుండె బ్రద్దలైపోవును. నాగమ్మ చచ్చినది. సోమయ్య కష్టసాధ్యముమీద వాని బాండునుండి తప్పించుకొని కల్యాలతో కూడా పట్టం చేరుకున్నాడు. ముసలితనంలో జట్కాతోలుకొని బ్రతకడానికి లక్ష్మయ్య ఏమికట్టుకుని పోయినాడు? సోమయ్య తమ్ముడు చిన్నతనాన్నే లక్ష్మయ్యకు తెలికుండా సిలోను, అమెరికా పారిపోయి కూలినాలి చేసుకొని విద్యాధికుడై కార్మికసంఘములలో పని చేసి, తన దేశీయులగు కార్మికుల కష్టాలుతీరే ఉపాయా లుపదేశించ వచ్చినాడు. మనదేశపు కార్మికు లీలాటి కథలు చదివితీరాలి-ఉచితము. తెనాలి తా॥ అనంతవరం వ్రాసి అందరూ ఏల తెప్పించుకోరు?

**చిత్రగుప్త:—**

మొదట ఆనందబోధిని మాసపత్రిక-పిమ్మట చిత్రగుప్త మాసపత్రిక-ఇంతలోనే చిత్రగుప్త పక్షపత్రిక-ఇట్లు శీఘ్రతర పరివర్తనములందుతూవున్న పత్రిక యెవరి కానందదాయకము కాకుండగలదు? ఒకఅంచీకాడికి ఇంకొకటి సుందరతర మౌతున్నది.

గుసగుసలు—వీనిలో శిల్పికారి తనకుంచెను తేలికైన రంగులలోనే కదలించుచున్నను, వాటి వాడిమి మాత్రము సరీగా తగలవలసిన గుండెలకే తగులుతూ పాత్రలను ఆత్మవిమర్శనాపాత్రములుగ జేయుచున్నవి.

దేశదిమ్మరి—తిరిగీవచ్చి ప్రపంచకం భోగట్టాలన్నీ పడియాలపిండివంటి తన స్వంతరిమార్కులతో కూడా కలిపి వెళ్లగక్కుతున్నాడు.

ఆంధ్రావాలా—వచ్చి తన ఆందోళనం తాను చేసుకుంటూపోతున్నాడు.

స్వరాజ్యపార్టీ—ఇది తలనెత్తి జూపినప్పటినుండీ చిత్రగుప్తుడికి పనిజాస్తీ అవుతున్నది. పేరుపేరు వరసన తెచ్చి పెద్దపెద్ద బొమ్మలనందరిని చెరకక్కిస్తున్నాడు.

సంపాదకీయాలు—చక్కచక్కని మాటలు చల్లచల్లని కోతలు. తక్కినవ్యాసాలా,—ఎడిటరుపేరు చెప్పా, పేపరుధోరణి చెప్తానన్నట్లున్నవి. వద్దువద్దు, రకరకాలు, కపిలగొల్లలు నిదర్శనములు—

కథలు—తులసి, భయానక ప్రపంచం, కాగణం లేని కంగారు మొదలైనవి నిత్యవ్యవహారములోని కల్పనలే అయినా, నీతిగాంభీర్యముతో పులకరించుచుండును.

శైలి—పాటకపుజనులైనా తమంతట చదివి అర్థం చేసుకోవచ్చును.

చందా—రెండే రూపాయీలు సంవత్సరానికి.

సంపాదకులు—యస్.జి. ఆచార్యగారే.

చిత్రగుప్త కార్యాలయం, సావుకార్పేట, మదరాను.

## మధుపాన పిశాచము:—

క్రౌనుసైజు 20 పుటలు. వెల రు 0-4-0 గ్రంథకర్త బత్తుల సుందరరావుగారు, రంగూన్ 40 వ వీధి 145 వ యింటికి వ్రాసి తెప్పించుకొనవలెను. పద్యకావ్యము. కల్లుత్రాగుటవలన కలుగు కీడులు తేల్లముగా పద్యములలోను పాటలలోను వర్ణించబడినవి. కూలినాలి చేసి కష్టపడువారందరూ తెప్పించుకొని చదువుకొన్నచో యీదురభ్యాసమునుండి విముక్తులగుదురు.

## ఏంచేయమంటారు:—

క్రౌనుసైజు 14 పుటలు. గ్రంథకర్త శ్రీయుత వెన్నెలకంటి రాఘవయ్యగారు, నెల్లూరు. దీనికే 'ఒక హరిజనుని హృదయావేదన' అని మరియొక పేరిడినారు గ్రంథకర్తగారు. ఇది ఒక హరిజనుడు కాదు అరుకోట్ల హరిజనుల హృదయావేదన-హరిజనుల ప్రధానమైన యిబ్బంది ఇందు తెలియ పరచబడినది. గ్రామాలలోని మోతుబరి రైతులు వాళ్లని పిండి పనిచేయించుకొని సరియైన కూలియీయక నిరంతరంగా దారిద్ర్యమున ముంచియుంచుట. ఈకష్టము తీర్చకుండా వారిని తాకితేనేమి, గుళ్ళలోకి లాగితేనేమి, గుడ్డగుడిశ పంచితేనేమి, చదువులు చెప్పి స్నానాలుపోస్తేనేమి? ఇవన్నీ పేపర్లలో వ్రానుకొని నాయకులు అనిపించుకోగోరేవారి దంభములే కాని నిజమైన హరిజనసేవ కాదని హరిజనుల అభిప్రాయమని స్పష్టమవుచున్నది. ఈమార్పు తేవడము మీదమీద సాధ్యముకాదు. ధనికుల దురాశాపాతక పిశాచము దరిద్రులు చచ్చీదాకానో, తిరగపడి బాదేదాకానో యిలాగే చెలరేగుతుందో లేక ధనికులను వదలి వారిని మానవ జనోచితోదార భావభరితులను చేస్తుందో పరమేశ్వరునికే తెలియవలెను. ఒక్కమాట నిజము-కేవల దానధర్మాలు, మంజూలో పన్యాసాలు, సంచారప్రచారాలు, పత్రికాప్రకటనలు హరిజన లేక అస్పృశ్యతాసమస్యా పరిష్కారమునకు సరియైన మార్గములు కావని గ్రంథకర్తగారి అభిప్రాయముతో పలువు రేకీభవింతురనియే నమ్ముచున్నాము. హరిజనదారిద్ర్యాగ్ని పర్వతముపై కట్టుకొనిన ధనికజనసౌధములు కూలకమానవు అగ్నిపర్వతము కుములుచున్నది. శైలి అచ్చ హరిజనుల వ్యవహారభాష-పేద, సాదా ఎల్లరు తెప్పించుకొని చదువుకొనవలెను.

## హరశతకము:—

క్రౌనుసైజు 25 పుటలు. 125 కందపద్యములు గ్రంథకర్త కవిరాట్టు హనుమత్కవి, అన్నపట్టు, బాపట్ల తా॥ గుంటూరుజిల్లా. సదాశివుని మహిమలు వర్ణించు గంభీరపద్యములు-ప్రతిపద్యమును జీవకళలు గ్రక్కుచు శ్రీహరుని ప్రత్యక్షము చేయుచుండును. వెల రు 0-4-0

## నవ్వులరాణి:—

మచిలీపట్నమునుంచి ప్రతిమాసమును వెలువడు హాస్యరసప్రధానమగు పత్రిక-సంపాదకులు క. కోటీశలింగంగారు. ఇందు కథలు పాఠకులను కడుపుబ్బ నట్లు నవ్వించును. నీతిబోధకములు. సంవత్సరమునకు చందా రు 1-0-0.

పాంచజన్యము:—

బెజవాడనుండి శ్రీయుత మేమూరి సుబ్రహ్మణ్యం గారి సంపాదకత్వమున వెలువడు వారపత్రిక. పెద్దలచే వ్రాయబడు గంభీరవ్యాసములు సనాతనధర్మనిర్ణయమునకు తోడ్పడుచున్నవి. సంపాదకుని శైలి పటుత్వము కలిగియున్నది. అన్నివర్ణముల వారికిని ఆత్మగౌరవము, పరస్పరస్నేహము, మతవిషయిక స్వాతంత్ర్యము కలిగించి పెంపొందించుటకై యిది చేయుచున్న కృషి ప్రశంసనీయము—12 పుటలు—సంవత్సరమునకు చందా రు 3-0-0 లు.

శ్రీ. ఉభయభాషా వాచస్పత్యము:—

ఇదియొక సంస్కృతాంధ్ర ప్రతిపదార్థపర్యాయ పదనిఘంటువు. గ్రంథకర్త ఆంధ్రవిద్యా వాచస్పతీత్యాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ కొట్ర శ్యామల కామశాస్త్రిగారు, కరప, కాకినాడ. వీరు లక్ష్మీనారాయణీయమను శుద్ధాంధ్రప్రతిపదార్థపర్యాయ పదనిఘంటువు' కర్తలగు కీ॥శే॥ శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి పుత్రులు. తండ్రిగారి గ్రంథరచనమున చేదోడు వాదోడుగానుండి అఖండానుభవము సంపాదించియున్న వీరు పైగ్రంథమునకు 'తత్సమ పదములను చేర్చి, విడిచిపెట్టబడిన దేశ్యములను స్వీకరించి, ప్రకృతి శాస్త్రాదులయందలి పారిభాషిక పదములను గూర్చి పర్యాయపదములను జేర్చి, నూతన నిఘంటువు' ను వ్రాయబూనినారు. ఇందు రమారమి 80000 తత్సమ, అచ్చతెనుగు పదములుండును. ప్రతిపదమునకు భాషాభాగము, అర్థము నానార్థములు గూఢార్థము గూఢపదములకు ప్రయోగము తెలుపఁబడును. ఈనిఘంటువుయొక్క మరియొక్క విశేషము సంస్కృతాంధ్ర పర్యాయపదములన్నియు వ్రాయబడును గనుక దీనిని చూచుకొనువారికి యితర ఆంధ్రగద్య పద్య పూర్వనిఘంటువు లెవ్వియు చూడ నవసరముండదు. ఇది ముద్రించబడుచున్నది. పదిపుటల మచ్చు పదములు పండితాభిప్రాయసంపాదనార్థము ముమ్ముందు ప్రకటించి పంపించబడినవి. పైని వివరించిన గ్రంథకర్తగారి సంకల్పము లన్నియు నిందు ప్రతిబింబించుచున్నవి. ఈమచ్చున గ్రంథమునెల్ల ముగించి ప్రకటించవలెనని గ్రంథకర్తగారిని ప్రోత్సహించుచున్నాము. పూర్ణముగ అచ్చుపడుటకు కొంతకాలము పట్టును. గ్రంథము వెల రు 25 లు. ముందుగానే పంపించినచో రు. 15 లు మాత్రమే-గ్రంథము మూడు భాగములుగా ప్రకటింపఁబడును. ఒక్కొక్క భాగమునకే అడ్వాన్సు పంపగోరినను రు. 5,6,7 లు క్రమముగా పంపవచ్చును. శ్రీమంతులు పోషకులు మహాదాతలుగను చేరి విరివిగా ధనసహాయమునుచేసి శీఘ్రముగ గ్రంథమును ప్రకటింపజేయుటకు సర్వసహాయమును చేయుదురుగాక యని కోరుచున్నాము.

నౌకాభంగము:—

క్రౌనుసైను 97 పుటలు వెల రు 0-12-0. గ్రంథకర్త శ్రీయుత వజ్ఝల వేంకటేశ్వరకవిగారు బి.ఎ. జయపురం. జయపురం సంస్థానాధీశులు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మగారి కంకితము. ఆంగ్లకవి టెనిసను వ్రాసిన 'ఇనక్కు ఆర్డెను' కథావస్తువును తీసుకొని స్వతంత్రముగరచించిన ఆంధ్రకావ్యము. పద్యములన్నియు మనోహరములైన క్రొత్తపోకడల నున్నవి. ఉపమాద్యలంకారము లపూర్వములు-ధారమధుతుల్యము-. ఉన్నత తరగతులలో పఠనీయ గ్రంథముగ నిర్ణయమైనచో విద్యార్థులకు కవితాభిలాష, భాషాజ్ఞానము వర్ధిల్లును. కవిగారు మఱికొన్ని యిట్టి కావ్యములు రచించి క్రొత్తక్రొత్త రుచులను ఆంధ్రులకు గఱపుదురుగాక!

ఆధునిక రాజ్యాంగసంస్థలు:—

(1-2 భాగములు)

గ్రంథకర్త శ్రీ ఆచార్య రంగాగారు. మొదటి భాగము 320 పుటలు రెండవభాగము సుమారు 300 పుటలు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గారికి రెండుభాగములును నంకితములు. పురాతన హిందూ గ్రీసు రోమను కాలములనుండి నేటివరకు వివిధదేశముల స్థానిక, మాండలిక, రాష్ట్రీయ, సంయుక్త, సామ్రాజ్యరాజ్యాంగసంస్థ లెట్లు ప్రారంభములై పరిణామము నొందినవియు నేటతెలుగు భాషలో పండిత పామరజన సుబోధకమగు సుందర వ్యావహారిక శైలిలో వర్ణింపఁబడినది. ఏక పురుషాధి

పత్యము, స్వల్పజనాధిపత్యము, ప్రతినిధుల ఆధిపత్యము, కార్మిక జనాధిపత్యము_ అను నీ అధికార భేదముల తారతమ్యములును మేలు కీడులును నిష్పక్షపాతముగ విమర్శింపఁబడినవి. వీనన్నిటిలో ప్రాతినిధ్యపరిపాలనమే (డిమోక్రసీ) ఉత్తమోత్తమమైనదనునట్లు గ్రంథకర్తగారి వాదనమువలన పాఠకులకు సుస్పష్టముకాగలదు. ఉద్యోగవర్గము, శాసనసభ, న్యాయాధిపతులు అను నీమూడుసంస్థలలో 'మిగతి' అధికారము ఎవరిచేతులలోనుండిన ప్రజాక్షేమకరము అను సమస్యకూడ అమెరికా అయిరోపా ప్రభుత్వముల యుదాహరణములో చర్చింపఁబడినది. శాసనసభల పరముగనే ఈఅధికార ముండవలయునని ఆచార్యగారు స్థిరపరచుచున్నారు. హిందూదేశము నూతన రాజ్యాంగవిధాన నిర్మాణకార్యక్రమమునందు అనన్యచింతతో తన్నుకొనుచున్న యీసమయమున అక్షరాస్యులును నిరక్షరాస్యులును గూడ ఇట్టి సమస్యలను గూర్చి ఆమూలాగ్రముగ తెలుసుకొని తమకుత్తమమైన విధానమును నిర్ణయించుకొని తన్నిర్మాణమున కుపయుక్తులగు సభ్యులను శాసనసభల కెన్నుకొనవలసిన ఆవశ్యకత యెంతయేనికలదు కనుక ఈగ్రంథముల నత్యుచితమైన సమయములో శ్రీ ఆచార్యగారు వ్రాసియు, కాకినాడ భారతనికేతనమువారు ప్రకటించియు ఆంధ్రమహాజనుల కత్యంతోపకారము చేసిరనక తప్పదు. ఇట్టి గ్రంథములను విద్యాశాఖాధికారులు పాఠశాలలలోను కళాశాలలలోను పెట్టి విద్యార్థుల కీవిజ్ఞానమును కరతలామలకము చేయవలెను. దేశసేవకు లెల్లరును పఠించి యీవిజ్ఞానమును దేశమునందలి లక్షోపలక్షల పయోజనుల కుపన్యాసముల మూలమున బోధించవలెను. గ్రంథములలో గ్రంథకర్తగారు సంపూర్ణముగ చర్చించి తమ యభిప్రాయముచొప్పున పరిష్కారము తెలుపని రాజ్యాంగధర్మసందేహములు లేవనియే చెప్పవచ్చును. రానున్న యెన్నికల ప్రచారములో పాల్గొనవలసిన జాతీయసేవక యువజన బృంద మెల్లరికిని ఇవి అత్యంత ప్రయోజనకరములని యెఱుంగవలెను. రెండింటి ఖరీదును చెరియొక రూపాయి అనగా రెండు రూపాయిలు మాత్రమే.

బ్రిటిషు గ్రంథాలయములు:—

రాయలుసైజు 8 పుటల గ్రంథము. గ్రంథకర్త శ్రీయుత యాతగిరి లక్ష్మీవెంకటరమణగారు. గ్రంథాలయోద్యమము ద్వారా పయోజనవిధానము నతిత్వరితముగ వ్యాపింపఁజేయు శక్తి మన ఆంధ్రదేశమున కిప్పు డిప్పుడే తెలియుచున్నది. ఇట్టి సమయమున బ్రిటిషు దీవులయందు ప్రజా ప్రభుత్వ పరస్పర సహకారమువలన నీయుద్యమము దేశమునందెల్ల నెట్లల్లుకొనుచున్నదియు తెలుసుకొనుటవలన మనకు మిక్కిలి ప్రయోజనము కలుగకమానదు. పైదీవులలో నేయే రకము గ్రంథాలయము లేయేరీతి నేయేతరగతి పాఠకుల కెట్లుపయుక్తములై యున్నవియు తెలుసుకొన గోరువారు వీనిని పఠించి తన్మార్గము నవలంబించినచో మనదేశములో కూడ ఈయుద్యమము ద్వారా అట్టి ప్రయోజనమునే బడయుగలుగుదు మనుటకు సందేహములేదు.

శిథిలమందిరము:—

గ్రంథకర్త శ్రీయుత ముదా విశ్వనాథంగారు, వ్యాసకుటీరం, మేలుపాక ఎలమంచిలిపోస్టు, విశాఖపట్టణంజిల్లా. వెల రు 0-1-0. టాల్‌స్టాయి వ్రాసిన యొక చిన్నకథ కనువాదము. న్యాయస్థానములలో నేరస్థులు తరచుగా తప్పుకొనిపోయి సాధువు లన్యాయముగ దురంతశిక్షల పాలగుటకలదు. అట్టి వారికి జైలు జీవనము భక్తి ప్రదముగ పరిణమించుట సాధ్యముకాని నిజమగు నేరస్థు లంత మాత్రమున తప్పుకొని పోయినట్లు కాదు. వారు చేయని నేరములకు వారును శిక్షింపఁబడి ప్రాతనేరమునకు పశ్చాత్తాపము నొందెదరు. ఇట్టి సంభవము నొకదానిని తీసుకొని రసవంతముగను జాలిగను ఈకథ వ్రాయబడినది. ఇట్టి కథలను పఠించుటవలన జనసామాన్యమునకు మంచి నైతిక సంస్కారము కలుగును.

గ్రంథస్వీకారము:—

మహర్షి దేవేంద్ర నాథఠాకూరుగారి జీవితచరిత్ర అనువాదకుడు ఆకురాతి చలమయ్యగారు ఆంధ్రనాటక సాహిత్యసంఘసంచిక (జెంషెడ్పురము) ప్రకాశకుడు భాగవతుల నృశింహ శర్మగారు.




కాదాచిత్కపద్యరత్నములు:—

కవిరాణి శ్రీమతి చిల్కపాటి సీతాంబా విరచితమగు ఈ చిన్నపొత్తమును సాదరమున నందికొంటిమి. ఈ కవయిత్రి "గృహలక్ష్మి" పాఠకులకు క్రొత్తకాదు. ఈమె చరిత్రము 1933 మేనెల సంచికయందు ప్రకటింపబడి యున్నది. ఈమె రచించిన పద్మినీపరిణయ విమర్శ 1933 మార్చిలో నున్నది. ఈమె ప్రస్తుతమున నెల్లూరి కాపురస్తురాలు. జన్మస్థానము కందుకూరుతాలూకా కలికివాయి.

కాదాచిత్కపద్యము లీయమ యపుడపుడు గృహలక్ష్మి భారతిలోనగు ననేక పత్రికలకు వ్రాసినవయియున్నవి. ఇవి పందొమ్మిది వేరువేరు విషయములపై నున్నవి. వినిలో పదియునైదు ఈ గృహలక్ష్మి నలంకరించినవి. ఆరత్నములిందు 1,2,3,4,5 6,7,8,9,10,11,12,15,16,17, సంఖ్యలుగల వియైయున్నవి.

కవిత్వమునం దీమె కశిక్షిత నైసర్గికశక్తియు పటుత్వమును గలవు. మొత్తమువిూద ఈమె శైలి లలితమై మధురమై శ్రోత్రపేయమైయున్నది. ఈ పద్యము లందందు విడిబారియున్నందున గుణగ్రహణప్రావీణులు నెల్లూరిలో ప్లీడరు మహారాజశ్రీ బెల్లముకొండ వెంకటవరదాచార్యులవారు వీనినెల్ల గ్రహించి సంహితజేసి కాదాచిత్కపద్యరత్నములను నన్వర్థనామమున క్రౌను ఆక్టెవో సైజున ముప్పదినాల్గు పుటల పుస్తకముగ నైనూరుప్రతుల వేయించి వానినెల్ల నీమెకు విశ్రాణనముజేసిరి. దీని వెల 0_4_0లు.

ఈమె రచన నైపుణ్యమును మాధుర్యమును కనుగొనవలయునన్న ఈమె వ్రాసిన గ్రంథములనే జదువవలయును. స్థాలీపులాకమున నీరత్నములనుండి కొన్ని ఈ క్రింద ప్రకాశింపజేయబడియున్నవి.

(1) శ్రీ తల్పగిరి రంగనాయక స్తుతి:—

గంగాతరంగసంగత పాదపద్మముల్
  భూనీళలతివేడ్క బూనియొత్త
కదళికాసౌందర్య కలితోరుసీమపై
  లలితకాంచన దుకూలంబు మెఱయ
నాభిపొందమ్మిపై నల్మొగంబులపావ
  దర్శిలివసియించి యాటలాడ
శ్రీవనమాలికా శ్రీవత్సకౌస్తుభ
  కలితవిశాలవక్షంబు దనర
ముద్దులొల్కెడు తిరుముఖమండలంబున
  నూర్ధ్వపుండ్రప్రభ లొప్పుచుండ
కోరి శ్రీమత్పినాకినీతీరమందు
  పశ్చిమాభిముఖంబుగ పవ్వళించు
భక్తపరిపాల శ్రీలోల ధర్మచేల
  తల్పగిరివాస రంగేశ దైత్యనాశ.

(2) తిరుమామణిమంటప వర్ణనము:—

*   *   *   *

*   *   అందునవిందున నెందుజూచినఁ
ముచ్చటలొల్కు రంగవిభు ముద్దులురూపులు
వేనవేలుగా
తచ్చనలాడుచందమున దాగిలమూతల నాడుతీరునఁ
మెచ్చుననొద్దజేరినవి మేలముగా వెనువెన్కకేగన
ట్లచ్చుపునెమ్మి కట్టెదుట నాదటనిల్చి.   *   *

(3) కృతజ్ఞతా పంచరత్నములు:—

సంతతారూఢ భాగ్యవిస్తారయుఁ గృ
పాకలిత రామణీయక భవ్యదేహ
యతులితానంద కీర్తిలతాలవాల
పూజ్యయీస్త్రీలపాలిటి రాజ్యలక్ష్మి.

(ఇందు ప్రతిపాదమునందలి కడపటి యక్షరముల గూర్చిన "గృహలక్ష్మి" యగును.

(6) గ్రీష్మము:—

దివ్యమా పుణ్యనదీ తోయములును
భవ్యసౌధోపరి భాగ్యవాసములు
చల్లనినీరముల్ చలువచందనము
మిల్లిపూబందిరుల్ మలయానిలంబు
వలనొప్పసలిపెడి వనవిహారములు
బలురమణీయమా పర్యంకపాళి

*   *   *

గలుగుశ్రీమంతుల గాసినొందింప
గలుగుదే గ్రీష్మమా? కడుపేదవారి
నలయింపజేతు వియ్యది మెలెనీకు?
తలగిపోపొమ్ము సంతాపంబువీడి
వర్షాగమంబున వసుధాస్థలంబు
హర్షంబునొందు శ్రీహరికటాక్షమున.

(12) కష్టజీవి:—

పుట్టిననాటినుండియును పూజ్యులకుఁ నిరుపేదవారికిఁ
పట్టెడునన్నమిచ్చి కడుభక్తిని వస్త్రమొసంగి పున్నెముఁ
గట్టుకొనంగలేక వృధగా గలకాలము బుచ్చుచుండు నీ
కట్టిడికష్టజీవిధర గల్గగజేసితివేల యీశ్వరా.

(7) యశోద—పుత్రవాత్సల్యము:—

చోరుడవంచునిన్ను గనుచో వినుచో బురివార
లెల్లరుఁ
సారెకుదూరుచున్నారు బెలుచఁ బలుచందములఁ
గుమార నీ
కారయిదేటిదూరు తనయా వినయాన మెలంగరాదె నీ
వేరినిజేరకింక వినవే నినువేడెద జిన్నిపుత్రకా.

(8) రాధాకృష్ణ విలాసము:—

దూతిచేనంపు నాలేఖ ప్రీతినంది
సారెసారెకు తనలోన జదివిజదివి
మరలజూచుచు నాయందు మనసునిలిపి
కన్నులఱమోడ్చి వివశతనున్న విభుని
కెరుకలేకుండ వెన్కగానేగి యపుడ
కన్నులనుమూసి యీవేడ్కగాంతుననుచు
అల్లనల్లన నేర్పుగా నడుగులిడుచు
వెడదపెన్నెరి ముడిజారి వ్రేలుచుండ
పవిపెచెంగావి సరిగె దువ్వలువజార
పొంచితరుమూలమున నేమరించినిలిచి
వచ్చునగవాపికొని ప్రియుపజ్జకరగి
తమ్ములనుబోని దనదు కేల్దమ్ములల్ల
నల్లనమనోహరుని నయనాబ్జములకు
నిరుగడలజేర్చి బలుమీలనేలజాలు
కనుగొలంకుల మోహంబు గడలుకొనెడు
నడటుజూపుల   *   *   *

(9) దసరాపండుగు:—

మేల్మిరతనంపు సొమ్ములు మేననుంచి
మిసిమిపయ్యెదకొంగరమునుగువైచి
పాదముల నందియలుమ్రోయ బాలయొకతె
రాధికావేషమునవచ్చె వీధివెంట.

(15) నెచ్చెలి యెడబాటు:—

దేవిభువనేశ్వరీ నిన్ను దెలిసిచూడ| దేవిభువనేశ్వరి వటంచు దెలసికొంట
కోరి బండెడుపసపుకుంకుమలతోడ స్వర్గమును జేరగొనుటచే శాశ్వతముగ.

(19) నెల్లూరు పల్లికొండ రంగనాథస్వామి గరుడోత్సవము:—

హరుడె నరుండటుంచు గమలాసనుడే ప్రభుడంచు దేవుడా
హరియయటంచు బల్గతుల నార్యులు వాదులు సల్పనేలని
త్తిరిగడ తేర్పజాలు పరతత్వమిదేయనిజూపు లీలశ్రీ
హరిపదపాతితార్ష్యుడడె హస్తతలంబున నిల్పెబొల్పుగన్.

ఈమె గ్రంథముల జదువుటయె ఈమె నటులగును.
యెడ గొప్ప వాత్సల్యాభిమానముల జూపి

నిడుబ్రోలు పాఠశాల:—

అర్థశాస్త్రమనగా నింతవరకు వస్తు సామగ్రిని తయారుచేయు యంత్రములను నిర్మించుట, పనులు చేయించుట, వర్తకము చేయుట, సావుకార్లు లాభములు తీయుట అనియే పలువురు శాస్త్రవేత్తలయొక్క కూడా అభిప్రాయముకాని భూములు వ్యవసాయము, శిస్తులు, గ్రామములు, గృహపరిశ్రమలు ఈ మొదలైన విషయముల కందు తావుగలదనియే చాలమందికి తెలియదు. పూర్వపు పాఠ్యగ్రంథములలో ఈ విషయమే లేకుండెను. దరిమిలా గ్రంథములలో దానికి అణుమాత్రము స్థాన మేచివరనో ఒసంగబడుచుండెను. అది రానివారు కూడ పరీక్షలను దాటుట కాటంకిము లేదు. కాని హిందూదేశమువంటి వ్యావసాయిక దేశములలో అర్థశాస్త్రమునకు దీనితోనే తప్ప యితర యంత్రములు, మిల్లులు, వర్తకములు మొదలగువానితో నత్యంత సాంగత్యము సంపాదింపవలసినంత సంబంధమంతగా లేనేలేదు. వానివలన వ్యవసాయమునకుగాని వ్యవసాయకులకుగాని వారి గృహపరిశ్రమలకుగాని యెట్టి యుపద్రవమును కలుగకుండ చూచుటమాత్రమే అర్థశాస్త్రవేత్తల ముఖ్యధర్మమైయున్నది. హిందూదేశ జనసంఖ్యలో నూటికి యిరవైయైదు చొప్పుననున్న మిల్లుప్రొప్రయిటరులు కూలివాళ్లను గురించికంటె నూటికి డెబ్బైయైదు చొప్పుననున్న కార్షికులవిషయమై యెక్కువ శ్రద్ధవహించుట ప్రభుత్వమువారి బాధ్యతయైయుండనున్నది. అయితే పట్టణవాసములలోనుండే మిల్లుల హక్కుదార్లు, కూలివారు, వర్తకులు నాగరికులై సలుకుబడిగలిగి ఆందోళనచేయగల సమర్థులగుటచే వారి కనుకూలములగు చట్టములను ప్రభుత్వమువారిచే చేయించుకొనగలరు కాని యీ పల్లెటగ్రామాదులవారి లేమిని కష్టములను చూచేవారేయుండరు. పట్టణవాసములవారి కేయే యేర్పాటులవలన లాభములు కలుగునో వాని యన్నిటిమూలము

నను పల్లెలవారికి నష్టము కలుగకతీరదు. ఈవిధముగ ప్రపంచమంతటనుగూడ కొన్ని పట్టణములు లేచి మిల్లులు మరలు వర్తకములుచేసి పల్లెటూళ్లను కొల్లకొట్టి గుల్ల చేసినవి. కొన్ని దేశములలో పల్లెటూళ్లు నిర్మానుష్యములైనవి. కొన్ని పట్టణములలో లీనమైనవి. కొందరికి పట్టణములలో పనులు దొరికినవి. అనేకులు దొరకక గింజుకొనుచున్నారు. పల్లెటూళ్లనుంచి పోగా మిగిలిన వ్యవసాయదారులు పండించిన పంట నెల్ల కొంచెము ఖరీదిచ్చి పట్టణవాసస్థులు తీసుకొని కాసుచేయని తమ యంత్రనిర్మిత పదార్థములను విపరీతధరలకు రైతుల కమ్మి వారి పంటను ధనమునుకూడ అపహరించి, పంటలను తినలేక యెగుమతి చేయలేక కుళ్ల పెట్టుచు, ధనమును పైకితీయక బ్యాంకులలో బిగించుకొని, వర్తకములు స్తంభించి లాభములు రాకపోవుచున్నవేయని గుందుచున్నారు. లాభములులేక బ్యాంకులే దివాలాలెత్తుచుండ, వానిలో ధనము దాచుకొన్న శ్రీమంతులమాట వేఱే అడుగవలెనా ? ఈ పరిస్థితులనన్నిటిని చూచి ప్రస్తుత ప్రభుత్వములు అర్థశాస్త్రపండితులు బాగాఆలోచించి వ్యవసాయమునకు రైతులకు వారి పటిష్ఠతకు సిరిసంపదకు తగిన యేర్పాటులు చేయుచున్నారు. పట్టణవాసస్థులు వింతవింతగను చిత్రవిచిత్రములుగను వస్తువుల ధరలను తారుమారుచేసి తాము మీదికిలేచి రైతులను త్రొక్కిపెట్టియుంచెడి యవకాశములను చట్టపూర్వకముగ నిర్మూలనము చేయుచున్నారు. మనది స్వరాజ్యము కాకపోవుటచే యీ యేర్పాటులు చేయుటకు ప్రభుత్వమేమియు పూనుకొనక వ్యవసాయదారు డెట్లు చెడిపోతే తన కేమి, జమీందారు, వర్తకుడు, విదేశమిత్ర ప్రభుత్వములు వీరికి తృప్తికరముగ ప్రవర్తింపక తప్పదనునట్లు ప్రవర్తించుచున్నది.

ప్రభుత్వమువారు తమంతట తాముగా యిట్టి పరిస్థితులను మార్చుట కెట్టిప్రయత్నమైనను చేయుదురని మనము ఊహించలేము. ప్రజలు ఆందోళనచేయనిదే ప్రభుత్వము లేమియును చేయవు. ఇదియునుగాక శ్వేతపత్రముద్వారా మన కేమో అధికారము లిచ్చివేయుచున్నామని దొరతనము వారు చెప్పుచున్నారు గనుక, ఆ అధికారముల నుపయోగించుకొని మనము ఆ కార్యములను సవ్యమైన ప్రతినిధివర్గము నంపి చేయించుకొనవలెను. మన దేశపు రైతులకు 'కఱువువచ్చినది, ధరలు పడిపోయినవి, సిస్తులు హెచ్చిపోతున్నవి, సావుకార్లు భూములు నగలు కట్టుకొనుచున్నారు' అని దుఃఖించుచు క్షీణించుచు చచ్చిపోవుచుండుట యొక్కటే తెలుసునుగాని ఇట్టి ఘోర ఉపద్రవము లెందుకు వచ్చుచున్నవి, ఇవి దైవకృతములా మానవకృతములా, వీనిని యితర దేశములవా రెట్లు తొలగద్రోసుకొనుచున్నారు, మన మెట్లు తొలగద్రోసుకొనగలము, ఎవరు మనకిందు సాయముకాగలరన్న ఆలోచన యేమీలేదు. ఇట్టి నిద్రాణజనంబునెల్ల ప్రబోధించవలసియున్నది. ఇందుకొఱకు నేకమంది ఉత్సాహపూర్ణులగు యువకులును యువతులును శిక్షితులు కావలసియున్నారు.

ఇట్లు తయారుచేయుటకే ఆచార్యరంగాగారు నిడుబ్రోలులో ఒక పాఠశాలను మే మాసములో నడిపించిరి. ప్రతి సంవత్సరము నిట్లు నడిపింతురు. ఈయేట సుమారు ముప్పదిమంది యువకులు పన్నెండుగురు యువతులు శ్రీయుతులు ఆచార్యరంగా, హరిసర్వోత్తమరావు, కల్లూరి చంద్రమౌళి, భమిడిపాటి సత్యనారాయణగార్లు మొదలగు వారల గంభీరబోధనలు విని క్రొత్తవిజ్ఞానమును నూతన సంచలనోత్సాహములను బడసి తమ తమ ప్రాంతములయందు ప్రచారముచేయుటకు సిద్ధులైనారు. ఈ విజ్ఞానమునెల్ల కేవల ముపన్యాసములు, వ్యాసములు మూలకముగా విద్యార్థుల డెందములలో పాదుకొనునట్లేగాక పద్యములు, పాటలు మొదలగు ఉత్తమసాహిత్యరూపము నెత్తించి భజన, ప్రచారముల రూపముగా వీథులను వాడలను రంగాగారు ప్రవహింపజేసిరని చెప్పవచ్చును. రాయలసీమయందును మరి యితర జిల్లాలయందును దేశీయ నాయకు లిట్టితరగతుల నేటేట యొక్కొక్క మాసము జరిపించుటకు నిశ్చయించుకొనుచున్నారు. ఇట్టి తరగతులు జరుగు తావులకెల్ల శ్రీరంగాగా రవకాశము తీసుకొని వెళ్ళి, వారి నూతన ఆర్థికసిద్ధాంతము లెవరి కత్యంత ప్రయోజనకరంబులో అట్టి రైతుజనావళికి ఉత్సాహపూరిత, సర్వజనపరిచిత, సుందరశైలిలో ఉపన్యసించి ఆంధ్రదేశమును ఉత్తేజింపజేయుదురుగాక!

మాలమాదిగ సమస్య:—

గాంధీమహాత్మ డొనరించిన అపూర్వ త్యాగప్రబోధములవలన సవర్ణులలోనైనను అత్యంతమగు సంచలనము కలిగి, హరిజనుల యెడల దయాభిమాన వాత్సల్య సహోదరత్వభావములు చాలవరకు కుదిరి, వారివారి నడుమనున్న దూరము చాలా తగ్గి, కలసిమెలసి తిరుగుట కవకాశము కుదురుచున్నది కాని, మాలమాదిగలమధ్య భేద మేమాత్రము తగ్గక హెచ్చుచు విషమించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. హిందూసంఘము యొక్క అట్టడుగున త్రొక్కివేయబడియున్న వారియుభయులయొక్కయు పురోభివృద్ధికి ఇతర వర్ణములవారు తమ గర్వాధిక్యభావములను తగ్గించుకొని వారి పాలెములకు వచ్చి, కష్టసుఖములు విచారించి, విద్యాబద్ధులు గఱపి, పౌరహక్కులను బడయుటకు చేయూత యిచ్చుచున్న యీసందర్భదినములలో మాలలు మాదిగలకంటె నెక్కువ వర్ణములవారమనుకొని తమ చెరువులలోను బావులలోను నీరు తాకనీయమియు, తాము భుజించు హోస్టలులలో మాదిగ విద్యార్థుల సహపఙ్క్తి నొల్లమియు, రామభజన చేయునప్పుడు గజ్జలు తొడలదగ్గిరనే కట్టుకొనవలెను కాని తమవలె కాళ్లకు ధరించుకొని ఉత్సవములకు దేవాలయములకు వారిని రానీయమియు నీచపు పేరులు పెట్టి పిలుచుచుండుటయు జూడ హరిజనాభ్యుదయవాంఛాపరుల డెందములెల్లయు కుందకమానవు. పశ్చిమగోదావరిజిల్లా మల్లవరంలంకలో చెరువులో నీరు తీసుకొనవచ్చిన మాదిగ పడుచుల కుండలను మాలవారు పగలగొట్టి, వారిని చెఱువులోనికి

త్రోసి, వారి గుడిశెలు పీకివేయ సిద్ధపడినట్లును, పంగిడిగూడెంలో లేబరు డిపార్టుమెంటువారు ఉభయులకొఱకును త్రవ్వించిన నూతిలోనుంచి మాదిగలను మాలలు నీరు తోడుకొననీయక తరుముచున్నట్లును, కోర్టుకెక్కుచున్నట్లును, మాదిగల పక్షమున పని చేయుచున్న మాలయువకులను మాలపెద్దలు బహిష్కరించు చున్నటులును శ్రీయుత పోలుకొండ భద్రయ్యగారు ప్రకటించుచున్నారు. ఇట్టి విపరీతకార్యము లితర ప్రాంతములలో కూడ జరుగుచున్నవనుట కాటంకములేదు. ఇట్టి సందర్భములలో సర్వవర్ణములవారును కొంతవరకు ఆత్మను సమాధానపరచుకొని సస్నేహముగా యిట్టి చెరువులు, బావులు, బడులు, గుడులు మొదలగువాని వలన గలుగు సౌకర్యముల ననుభవించుకొనగలుగుట ఉత్తమపక్షము. ఎవ్వరి మూర్ఖత్వమువలనకాని, అయిష్టతవలనగాని, అట్టి పొత్తు కుదురుట కష్టమనితోచినచో ఒకరినొకరు నిర్బంధించక అభ్యంతరములు గల వర్ణములవారు వేరేవేరే యేర్పాటులు చేసుకొనుట రెండవపక్షము—ఇట్లు చేయుటకగు ఖర్చులను అధికులమనుకొను వర్ణముల వారే భరించుట ధర్మపద్ధతి. వేరువేరు ఏర్పాటులు చేయుటకు వీలులేని సందర్భములలో కూడ ఈసంస్థల నొకరు భుక్తముచేసుకొని యితరులను రానీయమని దౌర్జన్యము పూనుట దైత్యపద్ధతి. ఇట్టి పద్ధతికి పూనుకొనుటవలన కొట్లాటలు కేసులు శిక్షలు మాత్రమే తప్పవు కాని జరుగవలసిన పనులేవియు ఆగవనియే యెల్లరును నమ్మవలెను. ప్రతీ గ్రామములోనున్న పెద్దలును పరిస్థితులింతవరకు విగటించక మునుపే తగిన యేర్పాటులు చేసి సర్వులకును సౌకర్యము కలుగు పద్ధతులను సూచించి అవలంబింపజేయుదురు గాక!

**అపురూప వివాహము :—**

ఈనడుమ బెంగుళూరులో పండిత డి. దేశికాచారిగారు శ్రీమతి శృంగారమ్మగారిని వివాహమాడిరి. ఇందు విశేషమేమనగా వరుడు ఆయుర్వేద మార్తాండ భిషఙ్మణీత్యాదిబిరుదాంకితులై కీర్తిశరీర విహారులైన పండిత డి. గోపాలాచార్యుల వారి సోదరులు. ఇచటనున్న సుప్రసిద్ధాప్త మహాజనులలో నొకరు. జగద్విదితమగు ఆయుర్వేదాశ్రమమునకు ప్రొప్రైటర్లు. వయసు 58. ఇంక వధువు కర్ణాటక బ్రాహ్మణవంశ సంజాత; స్కూల్ ఫైనల్ పరీక్షనిచ్చి యింటర్ క్లాసులలో చదివి మానినది. రూపసి. వయసు 22. మైసూరు సెక్రెటరేటులో నున్న తోద్యోగులగు శ్రీమాన్ కె. ఐ. శ్రీనివాసయ్యంగార్, బి.ఎ. గారి కుమార్తె. ఈ నూత్న వధూవరుల గౌరవార్థమై బెంగుళూరులో కేసరికుటీర మందు విందుచేయబడినది. అనేకులు పెద్దలు దయచేసి నూత్నదంపతుల నాశీర్వదించిరి.

దేశమునందు శాఖానాడీభేదముల నంతరింపజేసి దాంపత్యానుకూల్యతను విస్తరింపజేయుటకై సుప్రసిద్ధులగు నిట్టి కుటుంబములు పూనుకొనుట యెంతయు శ్లాఘ్యము. పరమేశ్వరు డీ నూత్నదంపతుల కాయురారోగ్యైశ్వర్యము లిచ్చి రక్షించుగాక!

**శ్రీయువతీ విద్యానిలయము:—**

సుమారు యిరువదిసంవత్సరముల క్రిందట శ్రీమతి చోడగుడి సీతమ్మగారు బాపట్లలో స్త్రీలకొరకొకపాఠశాలను ఒకసమాజమును నెలకొల్పిరి. ఆకాలమున నచ్చట విద్యనభ్యసించిన కొందరు దర్శిలాను హైయరుగ్రేడు ట్రెయినింగు ప్యాసయి ఉపాధ్యాయినీవృత్తియం దిప్పటికిని కీర్తిగాంచుచున్నారు. 11—9—32-వ తేదిని యుక్తవయసు వచ్చిన యువతీమణులకొరకును, వితంతువులకొరకును శ్రీయువతీ విద్యాలయము పునఃప్రారంభింపఁబడెను. పిన్నవయస్కులును నిందుచేరుచున్నారు. 8వ ఫారమువరకునేర్పఁబడును. పిన్న పెద్దలు రావీలగునట్లు 11 మొదలు 5 గంటలవరకు క్లాసులు జరుగును. 3రు ఉపాధ్యాయినులున్నారు. శ్రీమతి నండూరి సుందరమ్మగారు వ్యాకరణమును పద్యములను, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు నైతిక పాఠములను ఉచితముగ నేర్పుచుందురు. 70 మంది విద్యార్థినులున్నారు. గ్రంథములు, పటములు, బెంచీలు, కుర్చీలు మొదలగు పరికరముల నన్నింటినిగూడ ఉదారచిత్తు లభిమాన పూర్వకముగ దీని కర్పించియున్నారు. సంగీతము, చమ్కీపని, హిందీ కూడ నేర్పింప యత్నములు జరుగుచున్నవి. శ్రీయుత వెలగపూడి సుబ్బారావుపంతులుగారు రు 1200లు పెట్టి గృహమును కట్టించియొసంగిరి. విద్య, పురుషులకెంతయావశ్యకమో స్త్రీలకును నంత ఆవశ్యకమే. మనదేశములో ఆడువారిచదువు లత్తవారిండ్లకేగుటతో ముగియును. దేశమునకు నూతన రాజ్యాంగ సంస్కరణములు రానున్నవిగనుక స్త్రీలెల్లరు విద్యావిచక్షణలునేర్చి దేశాభివృద్ధి మార్గముల నెఱుగవలసిన యావశ్యకత కలుగుచున్నది. తరువాత నేర్పినను నేర్పకున్నను కాపురమునకు పంపులోపలనైనను పిల్లలకు తగినవిద్యను గఱపింపుడని కార్యదర్శి శ్రీమతి వెలగపూడి సరస్వతమ్మగారు బాలికల తలిదండ్రులకు చేయుచున్న ప్రబోధము సార్థకము కాగలదనియే నమ్ముచున్నాము.

**తెనాలి విధవావివాహ సహాయకసంఘము:.**

ఇది 1—5—1932 వ తేదిని స్థాపించబడినది. ఈ సంవత్సరము ద్వితీయవార్షికోత్సవము జరిగినది. ఇంత వర కిందు పదివివాహములు జరిగినవి. శరణాలయముఁ జేరు వితంతువులు వివాహములు చేసుకొని అత్తవారిండ్లకు పోవువరకు వారి కిచ్చట భోజనమజ్జనాది సౌకర్యములు, అనుకూలవరాన్వేషణములు జరుగుచుండును. చక్కనికట్టుబాట్లు. దేశములోని సంస్కారప్రముఖులెల్లరును దీనిని దర్శించి పనిపాటులన్నియు విమర్శించి యొసగిన సదభిప్రాయపరంపర వీరు ప్రకటించిన విజ్ఞప్తియందు కానఁగును. ఆంధ్రదేశములో వీరేశలింగము పంతులుగారు స్థాపించిన రాజమహేంద్రవర శరణాలయము తరువాత నిదిమిగుల ప్రాధాన్యమువహించుచు కీర్తిశేషులగు గంగారాంగారి లాహూరుకేంద్రసంస్థ కనుబంధమై రాజిల్లుచున్నది. సభ్యత్వచందా సాలుకు రు 1—0—0 విరాళములు కృతజ్ఞతతో స్వీకరింపఁబడును. దీనిని జయప్రదముగ నడుపు

చున్న గౌరవకార్యదర్శి శ్రీయుత యమ్. వి. శేషగిరిరావుగారు ఆంధ్రుల మన్ననకెంతయు పాత్రులు. ఆంధ్రులెల్లరును దీనికి తగిన చేయూత నొసంగుదురుగాక!

శ్రీమహిళా సంస్కృతవిద్యాలయము:—

కాకినాడలో శ్రీమహిళావిద్యాలయము హిందూసుందరి శ్రీరాజ్యలక్ష్మి పుస్తక భాండాగారములను మూడుమహిళా సంస్థలు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి అనర్గళ దీక్షవల్ల కడునేర్పుతో నిర్వహింపఁబడు చున్నవి. అవి పరస్పరాధారములై సమానాభివృద్ధినందుచున్నవి. వీని వార్షికోత్సవములు ఏప్రిల్ నెల 30, మేనెల 1—వ తేదీలలో శ్రీమతి వి. సరస్వతమ్మ బి. ఏ. యల్టి (డిప్యూటీఇన్‌స్పెక్ట్రెసు ఆఫ్ గర్ల్సుస్కూల్సు) గారియొక్కయు శ్రీయుత దుగ్గిరాల వెంకట సూర్యప్రకాశరావుపంతులు (బి. ఏ.) గారియొక్కయు అధ్యక్షతను జరిగినవి. ఏతత్సందర్భమున జరుపఁబడిన బాలికలరాసక్రీడ ప్రదర్శనము "భోజకాళిదాస" కాళిదాసుని సంస్కృత శాకుంతలనాటకముల ప్రదర్శనము ను ఆవిద్యాలయమునందలి విద్యార్థినులకు నేర్పఁబడు లలితకళలయొక్కయు లోకానుభవముయొక్కయు నిదర్శనములైయున్నవి. వేషపుటమరికలో నుడికారపుతీరులో ఐతిహాసికజాతీయతలో ఒకపాత్రకొకపాత్ర ఈడు తీయక ఎల్లరును అశేషసభాసభ్యుల గౌరవామోదములకు పాత్రులైరి. వీరందరికిని యథోచితముగ బహుమానములు పంచఁబడినవి. ప్రతివిద్యార్థినికిని ముందుసంవత్సరము చదువవలసిన క్లాసుపుస్తకము లుచితముగ నీయబడినవి. అధ్యక్షురాలు తమ అంత్యోపన్యాసములో ప్రస్తుతము మ్యునిసిపలుబోర్డు బాలికాపాఠశాలలలోని విద్యావిధానముకంటె శ్రీమహిళా విద్యాలయమున విద్యావిధానము వేయిరెట్లు బాగున్నదనియు, ఇట్టి విద్యయే ప్రతిబాలికకును యువతికిని ముఖ్యావసరమనియును, దీని యభివృద్ధికెల్లరును తోడ్పడుట విధ్యుక్తధర్మమనియు స్వానుభవపూర్వకముగ ప్రశంసించుట శ్రీమతి శేషమ్మగారి దూరదృష్టికిని చాకచక్యమునకును నిదర్శనము. మనదేశమునకు స్వరాజ్యముకంటెను విద్యావిధానమున సంపూర్ణస్వాతంత్ర్య మత్యవసరమనియు, ప్రభుత్వమువారు తమ విద్యాతంత్రమును బలవంతముగ ప్రజలపై దొర్లించకుండా విరమించుకొని సంస్థలకుతగిన గ్రాంటులను మాత్రమిచ్చుచు కూరుచున్నచో, ఐ.ఇ.యస్ యమ్.ఇ.యస్. ఉద్యోగులకంటె వేయిరెట్లం దమై ప్రయోజనకరమై ఉత్సాహమును రేకెత్తించు జాతీయ విద్యావిధానమును మన ఆంధ్రమహిళామణు లల్లగలరనియు ఈ పాఠశాలయొక్క అభివృద్ధిచెప్పక చెప్పుచున్నది. పరమేశ్వరు డిట్టి సుందరసంస్థలకు వలయు సహాయము నాంధ్రదేశస్థులొనరించునట్లు చేయునుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

———:o:———

1. వసుమతి:—సాంఘిక సాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... .. ... ... వెల 0 8 0

4. ద్రౌపదీ వస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.



# వినోదిని

## ఆంధ్రదేశానికంతటికి

## నవ్వుల మాసపత్రిక

యిది యొక్కటే. ఇప్పుడిది మాసమున కొక్కొక్క త్రివర్ణముఖ చిత్రముతోను, మునుపటికంటె హెచ్చుగ హాస్యపు బొమ్మలతోను, హెచ్చుపుటలతోను వెల్వడుచున్నది. చక్కని వ్యాసములకు బహుమతులుగూడ యివ్వబడుచున్నవి.

సం॥ రం చందా రు 1. మాదిరి సంచిక ఇనాముగ పంపబడును.

ప్రతి ముఖ్యపట్టణమునందు యేజెంట్లు కావలెను.

వినోదిని కార్యాలయము,

V. K. (4) 174 — 234, గోవిందప్పనాయకన్ వీథి, మద్రాసు.

---




మాపరిశ్రమశాలలో ఢాజిలో డైమండ్, శాస్త్రీయపుష్యరాగములు, ఇమిటేషన్ పుష్యరాగములు, పట్టెకెంపులు, కుచ్చుకెంపులు, వైక్రాంతములు, నీలములు, పచ్చలు కలవు. ప్రతిరాగి సీమకమలములకువలె, పట్టెలుతీర్చి గ్యారంటిగా పంపబడును. దీనియందు మాకు సుమారు 160 సంవత్సరములుగ వంశపరంపరగా అనుభవముకలదు. మావద్ద పరీక్షితులగు వ్యాపారుల నెరిగియుండినను క్రొత్తగావ్యాపారము చేయతలంచువారు చిన్నఆర్డరుఇచ్చి ఒకసారి తెప్పించిన పైవిషయము ఎల్లరకు తెలియబడును.

ఎలక్ట్రిక్‌సానలో రవవడితో తయారు చేయబడిన అసలురంగూన్ కమలములు గారంటీగా పంపబడును.

## పి. గోపాలస్వామినాయుడు అండు సన్సు

వెలల జాబితా ఇనాముగా పంపబడును:—

కార్యాలయము, కర్మాగారము:
5. పుదుపేటవీథి,
పరింగిమలై పోష్టు.

బ్రాంచి:
234 గోవిందప్పనాయనివీథి
జి. టి. మదరాసు.

మీ భవిష్యత్తును

# ది డెక్కన్ అస్యూరెన్సు కంపెనీ,

(లిమిటెడ్) నందు

## భీమా చేసికొనుడు

ప్రీమియములు స్వల్పములు

పద్ధతులు ఆకర్షణీయములు, నవీనములు

పోల్చరాని ఎందునులేని సౌకర్యములు

బోర్డుఅధ్యక్షులు

శ్రీరాజా నాయని వేంకటరంగారావు బహదూరు, మునగాల జమీాందారు

స్త్రీల అడ్వైజరీబోర్డు

శ్రీమతులు డా. ముత్తులక్ష్మిరెడ్డి, ఆచంట రుక్మిణిలక్ష్మిపతి,

అమ్ముస్వామినాధనుగార్లు

అన్నిచోట్ల విద్యావతులగు స్త్రీలు తమ కాలమును వృథాపుచ్చక మా కంపెనీఏజన్సీతీసుకుని పనిచేసిన స్వలాభమును పొందుటేగాక ప్రజలకు అందు ముఖ్యముగా స్త్రీలకు ఎక్కుడులాభమును చేకూర్చినవారగుదురు. సంకోచింపక కృతనిశ్చయులై నేడే యికార్యసాధనోపాయముల నరయుటకు మాకు వ్రాయుడు.

ఆంధ్రుల సౌకర్యమునకై ఉత్తర ప్రత్యుత్తరములు
తెలుగు భాషయందు కూడ జరుపబడును.

బ్రాంచిఆఫీసులు:—
మద్రాసు,
బెంగుళూరు, హైదరాబాదు (డక్కన్)

హెడ్డాఫీసు:—
మునగాలభవనము
బెజవాడ




సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] జూలై 1934 [సంచిక ౫

*Printed at Lodhra Press, Egmore, Madras.*



# గృహలక్ష్మి

## సలహాసంఘం

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

,, నిజమూరి వెంకటరత్నమ్మగారు

,, చిల్కపాటి సీతాంబగారు

,, [illegible] శివకాంతమ్మగారు

,, పాలికిచర్ల వసుంధరాదేవిగారు, ఎం. ఏ., బి. యస్. సి. (Lond)

మ-రా-రా-శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారు. బి ఏ., బి. యల్.

,, రాయసం వెంకటశివుడుగారు. ఎం. ఏ., యల్. టి.

,, వి. వెంకటసుబ్బయ్యగారు, బి. ఏ

# GRIHALAKSHMI

TELUGU ILLUSTRATED LADIES' MAGAZINE

*Editor* DR K N KESARI

JULY 1934



Vol. VII No. 5

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్థ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువమేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు:

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR




గర్భాశయదోష జనిత వ్యాధులకు, ముట్టుకుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము ఎక్కువ తక్కువ అగుట, స్రావము అనేక గంగులతో వెడలుట, నూతిక గడ్డ, గర్భాశయమున విష వ్రణములు కలుగుట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టు అగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్ర పుత్రికాభిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

వాతోన్మాదమును హిస్టీరియాను ఆశ్చర్యముగ తుదముట్టించుటలో సాటిలేని దివ్యౌషధము.

## లోధ్ర

## ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

నేను లోధ్రను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతి నెలయును క్రమముదప్పి బహిష్ఠి 20 దినముల లోపుననే యగుచుండెను. 2 సం॥ల వరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటినిగాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి. నేనిష్టపడలేదు. తమ 'లోధ్ర'ను నాకు పంపగోరుచున్నాను.

బి. ఇందిరాకుమారిదేవి. మెట్టూరు.

నా సహోదరి బహిష్టుకాలమందు పరిమితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నియో ఔషధములిప్పించితిమి కాని నయముకాలేదు. తుదకు తమయొక్క లోధ్ర కీర్తివిని రెండుబుడ్లు తెప్పించి నాసోదరికి వాడినాము. అత్యాశ్చర్యముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రి జననమైనది. ఈ సంతోషవార్త తమకు వెల్లడించుచున్నాము.

డి. రాజేశ్వరమ్మ, దిగుపహాండి.

లోధ్ర యెల్లెడల దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# స్త్రీలకొక సందేశము



## A Message for Women

స్త్రీలకు యౌవనమునుండి వార్ధక్యమువరకు దేహములో సంభవించుమార్పులే వారి ఋత్వంగముల యందు గొప్ప ఉపద్రవము కలిగించుచు ప్రసవసమయమున నింకను బాధ కలిగించుచున్నవి. ఇట్లుండ రక్తహీనత, గుండెదడ, నరముల దుర్బలత మొదలగు వ్యాధులకు వారు గురియగుటలో నాశ్చర్యము లేదు.

ఏకైక రసాయనమను గ్రోధ్రియే యిట్టి ఆపత్కాలములయందు వారి పాలిటి వరప్రసాదమని యాతురతగల స్త్రీలు తెలిసికొననగును. ప్రపంచములోని కృతజ్ఞులగు రోగులందరు మనఃపూర్వకముగా శ్లాఘించియున్నారు.

**కేసరి కుటీరం**
ఆయుర్వేద ఔషధాలయం,
ఎగ్మూరు, మదరాసు.

# ఇద్దరును సుప్రసిద్ధులే

## సర్. కె. పి. పుట్టన్న చెట్టి, సి. ఐ. ఇ.,

పూర్వమూ మైసూరుకౌన్సిలు ప్రథమ సభ్యులు; బెంగుళూరు

"డాక్టరు కేసరిగారి దంతధావన నవనీతమును నేను వాడితిని. అది నాకు సకలవిధములను సంతృప్తికరముగ నున్నది. అది దంతములను ఇగుళ్ళను శుద్ధి పరచును. నోటికి చక్కనివాసనను రుచినిగూర్చును. పండ్లకును ఇగుళ్ళకును కస పట్టించి బలపరచును. విదేశీ పల్లుపేస్టులకు వేనికిని అది తీసిపోదు. అది స్వదేశీది కనుక బహువిరివిగా అమ్మకము కాగలదు."

## సర్. రాధాక్రిష్ణన్.

ఆంధ్రవిశ్వవిద్యాలయపు వైసుఛాన్సలరు, వాల్టేరు.

"డాక్టరు కేసరిగారి దంతధావన నవనీతమును నేను కొంతకాలము వాడితిని. అదిమిక్కిలి శ్రేష్ఠమైనదని నాఅభిప్రాయము. స్వదేశీ పదార్థముల యందభిమానము పెచ్చుపెరుగుచున్న యీ దినములలో అది బహువిరివిగా అమ్మకము కాగలదని నేను నిస్సంశయముగా చెప్పగలను."

## కేసరి కుటీరం

ఆయుర్వేద ఔషధశాల.

ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్‌రిప్రజంటేటివ్ ఆఫ్‌న్యూస్.
మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566, రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్తా మార్కెటురోడ్డు,(మన ప్రాంతపు 1 రూఉస్మానియా రూ 1-3-0అగును)
నిడదవోలు: తాటిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్‌కంపెనీ,
బరంపురం: నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్‌పేపరు ఏజంటు.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్‌ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: పై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్‌స్టోర్సు, బకింగుహామ్‌పేట.
పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.
భీమవరము: అమిరపు శేషాచలశర్మగారు.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్‌వీధి.
కర్నూలు: చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
సెకండ్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పొగాకుబజారు.
ఏలూరు: బి. విశ్వనాధంగారు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
నెల్లూరు: సి. యల్. నృశింహం బ్రదర్సు, ట్రంకురోడ్డు.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెనీ.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.

హిగిన్‌బాతమ్ స్టాలువద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.




## గం॥ భా॥ స॥ వెన్నెలగంటి హనుమాయమ్మగారు

"ఎందరో మహానుభావులు|
అందరికీ వందనము ॥లెందరో॥

*        *        *        *

మానస వనచరవర సంచారము నిలిపి|
మూర్తి బాగుగ బొడగనేవార లెందరో॥

*        *        *        *

—త్యాగయ్య.

ఈమె పుట్టినింటివారు వెలగపూడివారు. ఈ కుటుంబమువారియొక్క అనాదిస్థావరము నెల్లూరుజిల్లా కోవూరుతాలూకా చెముడుగుంట [?]. వెలగపూడివారు వేలనియోగులు. కొంచెము శైవమునుంచిన స్మార్తపక్షము వారు. అద్వైతాభిమానముగలవారు సదాచార సంపన్నులు. వీరు ఆత్రేయసగోత్రులు. ఉద్యోగధర్మములవలన ఈ కుటుంబమువారు కొందరు కృష్ణా గుంటూరు మండలములలో నున్నారు.

హనుమాయమ్మగారి తండ్రిగారు వెలగపూడి సుందరరామయ్యపంతులు, ఎం.ఎ. బి.యల్., గారు. మద్రాసు యూనివర్సిటి స్థాపింపబడిన తరువాత ప్రథమమున ఎం.ఏ., పట్టమును బొందినది వీరే. వీరి అభిమాన శాస్త్రము గణితము, జ్యోతిషము. హనుమాయమ్మగారి తల్లిగారు నెల్లూరు రంగనాయకులపేట వాస్తవ్యులు, భారద్వాజులు, శ్రీ తల్పగిరి రంగనాయకస్వామివారి గోపుర చిత్రకూటాద్యనేక కైంకర్యములు జేసిన

స్వర్గీయ యరగుడిపాటి వెంకటాచలం పంతులు గారి తమ్ములు నిరతాన్నదాతలు ఆత్యంతికమగు శ్రీరామభజనాతత్పరులు కాశీ వాసులు. డిస్ట్రిక్టుమునసబుగానుండి పింఛను బొందిన స్వర్గీయ యరగుడిపాటి గోపాల కృష్ణమ్మ పంతులుగారి కుమారిత భూదేవమ్మగారు.

ఇట్లుభయతః పవిత్రగోత్రాన్వయములచే నొప్పిన ఈ హనుమాయమ్మగారు గడచిన యువనామసంవత్సర శ్రావణ బ॥ లు రేవతీ యుక్తస్థిరవారమునకు సరియగు 1875 స॥ ఆగస్టు 25-తేది నెల్లూరు రంగనాయకుల పేటలో మాతామహగృహమున జననమొందిరి. ఆవల యీరేండ్లకీమెకొక తమ్ముడును గలిగెను.

ఈమె తండ్రిగారు చెంగల్పట్టుజిల్లా తిరువళ్లూరు డిస్ట్రిక్టుమునసబుగనుండి అకాల మరణము నొందినారు. అప్పటికి వారికి ముప్పదిరెండేండ్లు. ఈయాపద సంభవించినంతటనే మాతామహులు ఈమెను ఈమెతల్లి గారిని తమ్ముని నెల్లూరికి దెచ్చుకొన్నారు. నాటినుండియు నీమెయు అమ్మయు తమ్ముడును మేనమామయొద్దనే యుండిరి.

హనుమాయమ్మగారు పసితనమునను ండియు సుకుమారి. కష్టమును కోర్చునది కాదు. తుదకు బడికికూడ బోయియెరుగదు. తన తమ్ముడును మేనమరందులును చదువుకొనుచుండ, మహామేధాశాలినియగు నీమె వారి సంవట నప్రయత్నముగ వారు జదువునదంతయు నేర్చినది. బ్రాహ్మణులిండ్ల నాడుపిల్లలును మగపిల్లవాండ్రు నుండు చోట నూత్నవటువున కుపాధ్యాయుడు సంధ్యావందనము జెప్పుచుండ, వానికి వల్లెవుదిరినోటికివచ్చు లోపల మంత్రములన్నియు, తు,చ, తప్పకుండ నాడుపిల్లలకు వచ్చుచుండుటయు తమయన్నదమ్ములు తిప్పలుజెప్పిన దిద్దుటయు జూడ వేడుకగను ముద్దుగను ఉండును. ఇట్లుగనె సత్సంప్రదాయములుగల యిండ్లలో వేద పాఠములును కావ్యపాఠములును ఆడపిల్లల కనాయాసముగను అనక్షితముగను లిఖితపఠితములవలె లగ్నములై వారివారి భాగ్యోదయము ననుసరించి యుత్తరకాలమున నుపయోగపడుచుండుటయు, ఈ విధమున నొక్కొక్కకి యొకప్పు మహాప్రతిభాశాలినియై గొప్ప కవిత్వశక్తిగాని, సంగీతనైపుణ్యము గాని చిత్రకళాప్రావీణ్యముగాని కొందరు స్త్రీలు జూపుటయుకలదు. ఇందు సామాన్య సృష్టి కతీతమగు అమానుష విశేషమేమియు లేదు. ఇట్టి సృష్టిధర్మము గం॥ హనుమాయమ్మగారియం దేకీభావముగ నుండినది. ఆమె కవకాశములును చుట్టివిగ లభించినవి. తండ్రిగారుపోవు నీమె చిన్నపిల్లయయ్యెను మహాపండితులగు తండ్రిగారి సాహచర్యమున కొంతకుగొంత విద్య లగ్నమైయుండగలదు. వారికిశాస్త్రజ్ఞులగోష్ఠియు మెండుగనుండినది. ఇక మేనమామల వంశము శిష్టసంప్రదాయ ముగుటచేతను అచటవిరివిగ దేవతారాధనలు, శ్రీరామోత్సవాదులు, భజనలు, పురాణ శ్రవణములు,ఆధ్యాత్మికప్రచారములు పండిత గోష్ఠులు, బ్రాహ్మణసంతర్పణ సమారాధనములు విశేషముగ జరుగుచుండినందున ఈ బాలిక కప్రయత్నముగను చిరంతనవాసనా

విశేషముచేతను భక్తిజ్ఞానమార్గములు గిట్టిగ పట్టు బడినవి. స్త్రీజనసామాన్యమగు గార్హస్థ్యప్రక్రియలందును ఈమె కడునైపుణ్యము కలిగియుండినది. వినినదియు కనినదియు అట్లట్లె యామె హృదయఫలకమున చిత్రార్పితమువలె నిలిచియుండును. అప్రస్తుత ప్రశంసంబోనాడిప్రకృతమున నీమె యెపుడు జదివినదియో యెవరియొద్దనేర్చినదియోగాని సంస్కృతమున దృఢమగు సాహిత్యమును ఛందోవ్యాకరణాలంకారపరిచితియు, బొందినది. ఇట్టి అసదృశప్రజ్ఞావతుల జూచియె కాబోలు కాళిదాసు "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" యని స్త్రైణమునకంతయు నిదానస్థానమై మంగళాకరమైయుండు పార్వతీదేవిని ప్రశంసించియున్నాడు.

శారదాశాసనాపద యుదయింపని యా ప్రాతకాలమున బ్రాహ్మకర్మముల ననుసరించిన యుక్తవయసున నీమెకు మహావిభవముగ వివాహోత్సవము మేనమామలింట జరిగినది. భర్తగారిపేరు వెన్నెలగంటి నటేశముగారు: హారితసగోత్రులు. ఈమె సంసారమునకు పోయిన కొలదికాలమునకు దైవగతిచే భర్తృవియోగము సంభవించినది.

వైధవ్యప్రాప్తితోటి యనపత్యయగు నీమె కాచిరుతప్రాయముననె చిరాభ్యస్తవాసనా విశేషముచే భక్తిజ్ఞానవైరాగ్యత్రిపుటి యలవడి బ్రహ్మచర్యమున నీమె జీవిత శేషమును హ్రస్వము జేసికొనుచున్నది. ఈమెకు శ్రీగాయత్ర్యనుష్ఠానమున నభిమానమతిశయించియున్నది. అద్వైతానుసంధానమె నియతవ్రతము. పలుమారు మహాయాత్రలు పూర్తిజేసి భూప్రదక్షిణమను యాత్రయును జరిగించుకొనినది. బ్రహ్మకపాలకేదారాది మహాక్షేత్రయాత్రలనెల్ల బూర్తిజేసినది. ఈమె తమ్ముడు వెలగపూడి రామచంద్రరావుగారు బి.ఏ. నెల్లూరుజిల్లాలో తహసీల్దారుగ నుండినారు. ఆత డీమెయెడల మాతృగౌరవమును గురుభక్తిని నెరపుచుండి ఈమె తలపెట్టుకొనిన యాత్రాదులు తీర్థాటనాదుల కెట్టికొదువ లేకుండునట్లును ఈమె సంకల్పించిన దానధర్మవ్రతోపాసనా విషయముల నిరంతరాయముగను నెరవేర్చుచుండినాడు. మాతృభ్రాతృవియోగానంతరమునను నీమె "నమేకించిత్" అనునీతిగల మనోధృతియు బ్రహ్మైక్యభావమును దృఢతరముగ స్వానుభవమునకు దెచ్చుకొని వైరాగ్యమూర్తియై యున్నది. ఈమె శ్రీగురుదత్తాత్రేయోపాసకురాలు. ఇందుకు నీమె ప్రతిబింబము నాచ్ఛాదించియుండు శాటియందు "శ్రీదత్తశ్శరణంమమ" యను మహోపదేశమహావాక్యము నాగరాక్షరముల నామూలాగ్రముద్రకమైయున్నది.

అధీతులగువారి కందరకు బోధాచరణప్రచారపాటవ ముండుటలేదు. మహాపండితులు శ్లోకశత్రువులుగనున్నారు. కష్టపడి నైఘంటికపదముల నేరి వాని గణబద్ధము జేసిన నాకవిత్వము గుగ్గుళ్ళలో గులకరాలు బోసినట్లుండును. ఈమెకు సహజపాండిత్యముతోటి సంస్కృతమున మధురమగు కవనశక్తియు ఘటించినది. విశ్వామిత్రప్రోక్తమగు నధ్యాత్మరామాయణమునందలి యుత్తరకాండాంతర్గత పంచమ సర్గయందలి శ్రీరామ

గీతలనియు శ్రీరామ భగవద్గీతలనియు ప్రసిద్ధిగల శ్రీరామలక్ష్మణ సంవాదరూపమగుభాగమునకు నీమె తెలుగున నుత్తమములగు టీకాతాత్పర్యముల రచించినది. ఈమె రచించిన తెలుగు గ్రంథ మదియొకటియె కన్పడుచున్నది. ఈమె సితృజ్ఞాతులు బాపట్లయందు సుప్రసిద్ధులగు ప్లీడరుగనుండిన వెలగపూడి దక్షిణామూర్తి పంతులుగారు ఈ గ్రంథమును 1904 సంవత్సరమున నచ్చువేయించినారు. గ్రంథస్థవిషయము దెలియుటకై శ్లోక మొకటియు దానికీమె జేసిన టీకాతాత్పర్యములును ఈక్రింద బొందు పరుపబడినవి.

"అవతారిక.

"సంసారము బుద్ధినిష్ఠమె కాని ఆత్మనిష్ఠముకాదనే విషయమందు అన్వయ వ్యతిరేకములను ప్రమాణముగా జెప్పుచున్నాడు.

ఇచ్ఛాదిరాగాది సుఖాదిధర్మికాః
సదా ధియః స్సంసృతిహేతవః పరే
యస్మాత్ప్రసుప్తౌ తదభావతః పరః;
సుఖస్వరూపేణ విభావ్యతేహినః॥"

"టీక:—పరె సర్వసాక్షియగు ఆత్మయందు సంసృతిహేతవః సంసృతి సంసారమునకు హేతవః కారణములగు ఇచ్ఛాది ఇచ్ఛమొదలగునవియు రాగాది రాగము మొదలగునవియునగు సుఖాది సుఖము మొదలగునవియునగు ధర్మికా ఇట్టి ధర్మములుగల ధీవృత్తయః బుద్ధివృత్తులు సదా కాలత్రయమందునుంగలవు. ఇది ఆత్మకు అన్వయమగును. యస్మాత్ ఏకారణమువలన సుప్తౌ సుషుప్తియందు తదభావతః తత్ ఆబుద్ధివృత్తుల యొక్క అభావతః అభావమువలన ఇది బుద్ధివృత్తులకు వ్యతిరేకమగును. పరః పరమాత్మ సుఖస్వరూపేణ సుఖమాత్రముగా,నః మనకు విభావ్యతె భావింపబడుచున్నాడు. హి ఇది సర్వానుభవ ప్రసిద్ధము. తాత్పర్యము: సర్వసాక్షియగు నాత్మయందు సంసారహేతువులగు సుఖదుఃఖరాగేచ్ఛాదులగు బుద్ధివృత్తులు జాగ్రత్స్వప్నములయొక్క కాలత్రయమందుండగా సాక్షిత్వేన ప్రకాశించియుండుట ఆత్మకు అన్వయమగును. ఏకారణమువలన నిద్రారూపమగు సుషుప్త్యవస్థయందు ఆత్మస్ఫురణ కలిగియుండగా ఇచ్ఛారాగాది బుద్ధి స్ఫురింపమియె బుద్ధివృత్తులకు వ్యతిరేకమగును. అనగా బుద్ధివృత్తులులేని సుషుప్త్యవస్థయందు ఆత్మకు కర్తృత్వభోక్తృత్వరూప సంసారము లోపమిచేత సర్వసంసారంబును బుద్ధినిష్ఠమెగాని ఆత్మనిష్ఠముగాదనెడి యర్థము సర్వలోక ప్రసిద్ధమగునని యభిప్రాయము."

ఈమె రచించిన సంస్కృత గ్రంథములు నాలుగు లభించినవి.

(1) ఈమె గురుస్వాములగు శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ బ్రహ్మానందసరస్వతీ స్వామివారి పాదుకాపూజనము. ఇది 1916-లో బొంబాయిలో నిర్ణయసాగరముద్రాక్షరశాలయందు నాగరాక్షరములతో అచ్చువేయబడి ఆసంవత్సరముననె రాజమహేంద్రమునందలి విద్యానిలయమందు తెలుగు అక్షరములందును కూర్పబడినది. దీనియందు ఆ గురుస్వాములవారి పాదుకాపూజా విధానమంతయు సంకల్పము మొదలు ప్రదక్షిణ నమస్కారములవరకు చెప్పబడియున్నది. శైలిరచనలు దెలియుటకు గ్రంథాంతమందలి యొకధ్యానశ్లోక మీక్రింద కనపరుపబడినది.

"నిర్బీజాది సమాధిసంస్థితపదం నీవారశూకోపమం
నిష్పాపం నిగమాంతవేద్యనిలయం నిర్లేపకం నిర్గుణం
నిర్ద్వంద్వం నిరుపద్రవాత్మసదనం నిర్వాణదీపం నిజం
బ్రహ్మానందసరస్వతీగురువరం మోక్షప్రదం తంభజె॥"



శ్రీ

# గాయత్రీస్తవం

పుష్పమాలికా బన్ధం

మహాస్రగ్ధరా వృత్తం

శ్రీమద్గంగాభాగీరథీసమానయా

వెన్నెలగంటి హనుమాంబికయా

సంగ్రథితం

హంసస్థాం సత్యసన్థాం మగజగనిగమాధారవాస్స్వరస్థాం
గాయత్రీంయజ్ఞయజ్ఞాం సురవరవరదాం పంకజాంకమ్బుకణ్ఠీం
సావిత్రీం విశ్వవిద్యాం శ్రుతిమతిగతిదాం దేవసావర్ణవర్ణాం
వన్దేహం దేవదేవీం విమలమణిమయీం కుందసౌందర్యదన్తాం

'గృహలక్ష్మి'
1934

ప॥ కృ॥ మూ





గం॥ భా॥ స॥ వెన్నెలగంటి హనుమాయమ్మగారు



:॥ శే॥ శ్రీ యన్. హెచ్. జె. శామ్యూల్గారు

ఈగ్రంథమున ముప్పదిరెండు శ్లోకములును శ్రీ గురుస్వాములవారి యష్టోత్తర నామావళియుం గలవు. ఈనామావళివలన శ్రీస్వాములవారి పూర్వాశ్రమజన్మాద్యాశ్రమస్వీకారానంతర వృత్తాంతమంతయు తెలియగలదు. ఆనామావళి యిటులుండును.

ఓం మంగళాద్రిమహాక్షేత్ర జన్మస్థానాయ నమః
... షట్సహస్రనియోగాఖ్యాయ నమః
... రాఘవామాత్యనందనాయ నమః
... గోవింద గాఙ్గగృహాఖ్యాయ నమః
... రుధిరోద్గారి భాద్రపద శ్రీపూర్ణిమాదిత్య వారజాయ నమః
... బ్రహ్మానంద సరస్వతయే నమః

చరిత్రాంశ విషయములేగాక శ్రీస్వామివారి తపఃప్రభావ ప్రశంసయు ఈనామావళి యందుగలదు.

ఓం అవిద్యావిషయేంద్రియ నిగ్రహాయ నమః
... దత్తోపాసనాతత్పరాయ నమః
... సంప్రజ్ఞాత సమాధిస్థాయ నమః
... స్వాంతర్లీనమానసాయ నమః
... కేశవాది స్వనామాత్మత్రింశద్యత్యుప దేశకాయ నమః

(2) 1920 లో 'శ్రీదత్తపూజా గీతాకదంబం' అను గ్రంథమును రచించినది ఇది బొంబాయిలో నాగరాక్షరములలో ఇందుప్రకాశ ముద్రణాలయమున ముద్రింపబడినది. ఇందు శ్రీదత్తాత్రేయపూజా విధానమంతయు సంస్కృతమున గీతముల(పాటల) రూపమున రాగతాళములతో చెప్పబడినది. ఇందు కొన్ని శ్లోకములు గాక నలువదిరెండు గీతములున్నవి. ఒక్కొక్క గీతమునకును చరణము లనేకములున్నవి. మచ్చునకొక గీత భాగి మీాక్రింద జూపబడుచున్నది:—

లాలీ

మధ్యమావతి రాగము—జంపెతాళము
లాలీతి జగు రమరిలలనా స్త్వాం దత్త!
నారద స్త్వేకదా శ్రీబ్రహ్మసదసి॥
లోహచణకా భూర్యాపపాక పరిశీలా।
అత్రిజాయా పతివ్రతేతి ప్రశశంస॥ లాలీ॥
శ్రుత్వాథ వాణీ రమోమాతిరుష్టాః।
ప్రేరయంత్యాః పతీఙ్తస్యాః సత్వహృత్యై॥
అతిథయో భూత్వాత్రివేశ్మేత ఈశాఃనగ్నత్వం
భూత్వాద్య నోఽన్నం ప్రదేహి॥ లాలీ॥
నోచే న్న గృహ్ణీమశాపం దదామ।
శ్రుత్వా తస్మాత్త్వచసార్భకవదితాఙ్॥
దైవాత్సుతీదుగ్ధం తాన్ప్రతిదత్వాడోలికాయాం
సతీస్వాపయదుచ్చైః॥ లాలీ॥

ఈపూజా గీతములందు శ్రీదత్త ప్రబోధము (మేలుకొలుపు) మొదలు ముఖమార్జనాది సమస్తోపచారములును లాలి ముద్రాంతములై వర్ణింపబడియున్నవి. ఈగీతముల బొంబాయి కోస్తాలో దత్తోపాసకులు చాల గౌరవించెదరు.

(3) 1926 లో జగద్గురు శ్రీశంకర భగవత్పాదాచార్య పూజావిధిని నిరూపించినది— ఇది శ్రీకాశీలో జ్ఞానమండలయంత్రాలయమున నాగరాక్షరముల నచ్చువడియున్నది. ఇందును షోడశోపచారపూజావిధి బోధింపబడియున్నది—ఇందలి శ్లోకమొకటి యుదాహరింపఁబడుచున్నది:—ధ్యానం

"భాష్యం వామకరే నిధాయ పరత శ్చిన్ముద్రయా ప్రాక్కుండీవర దండశిష్య సహితం [బోధితం।
పద్మాసనస్థం ప్రభుం।
ఫాలే భస్మధరం సుధాకరనిభం రుద్రాక్షహారా న్గళే
శ్రీమచ్ఛంకరపూజ్యపాద మనిశం ధ్యాయామ్యహం సద్గురుం॥

ఈగ్రంథమున శ్రీశంకరాష్టోత్తరమును గూడ జెప్పినది. ఈనామావళియందు శ్రీమదాచార్యులవారి చరిత్రసంగ్రహ మిమిడి యున్నది—ఈనామావళి గాక ఈగ్రంథమున ధ్యానావాహనాది నమస్కారాంతముగ ఇరువది శ్లోకములుగలవు.

(4) 1933 నందు లోకోత్తరమగు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య సహస్రనామావళిని మున్నూట ఇరువదితొమ్మిది యనుష్టుప్పులపై జెప్పినది. ఈ శ్లోకముల ననుసరించి ఓంకారపూర్వక నమోంతములగు 1021 నామములున్న విభక్తములయియున్నవి—ఈ సహస్రనామావళి శ్రీవిద్యారణ్య కృత శంకర విజయాదిగ్రంథములపై నాధారపడియున్నది. శ్రీజగద్గురు చరిత్రయంతయు ఈనామావళి యందు విపులముగ వివరింపబడియున్నది—ఈ సహస్రనామస్వరూప సంభావనకై స్థాలీపులాకన్యాయమున గొన్నిటి నీక్రింద గననగు:—

ఓం శుద్ధాద్వైత మతోద్ధర్త్రే నమః
... శివదేశిక నందనాయ నమః
... ఆర్యాంబాహస్త భూషణాయ నమః—
... బ్రహ్మసూత్రజ్ఞాయ
... ద్వాత్రింశదబ్దాయ—
... మాత్రాకాంక్షిత దేహాంతసంస్కారకృతి నిశ్చయాయ—
... విష్ణుపాదాది కేశాంతవర్ణన స్తవకారకాయ
... శివపాదాది కేశాంత వర్ణన స్తవకరాయ
... జితశంఖరథాంగాంకాయ—
... ఆసేతు శివశైలాంత బ్రహ్మవిద్యాప్రచారకాయ
... సత్యమద్వైత మిథ్యార్థ్వ బాహూద్ధోషధన నిశ్చలాయ—

శైలికొరకొక్క శ్లోకముజాలును:—
చిత్తవ్యాఘ్ర మదధ్వంసీ మనోమర్కటసూదనః।
మోహగ్రహ మహామంత్రో మూలాజ్ఞానగజాంతకః॥

శ్రీశంకరావతారకాలము క్రీ॥శ॥ దాదాపు 800 అని బహుమతమైయున్నది—కాల మెద్దియైనను ప్రథమ జగద్గురువులును వైదిక మతోద్ధారకులును నిజతత్త్వ ప్రకాశకులును నగు వీరి పూజావిధానమును నామావళులును క్రీ॥శ॥ ఇరువదియవ శతాబ్దమున నీవరకీహానుమాంబాపర్యంతము వేచియుండ వలసియున్నది. ఈకీర్తి నెల్లూరికిని యారువేలవారికిని స్త్రీ ప్రతిభకును యుద్దేశింపబడి నట్లున్నది. జగద్గురువులవా రాంధ్రదేశ దిగ్విజయము జేసినపుడు ఆఱువేలమంది నియోగి శాఖవారు (ప్రాయికముగ గ్రామకరణములు దేశపాండ్యాలుగ నుందురు) శ్రీమదాచార్య శిష్యత్వమంగీకరించి తన్మతానుష్ఠానతత్పరులై శపథముల బూనినటులను అందుచేత ఈశాఖకు 'ఆరువేలవారు' అను సంకేత మేర్పడినటులను యొక యైతిహ్యమును గలదు. ఇది నిజమైనను కాకపోయినను చింతలేదు. ప్రస్తుత గ్రంథకర్త్రి ఈశాఖలోనిది.

నామావళింగూర్చి దెలుపదగు గొప్ప విషయ మింకొకటిగలదు. గ్రంథము పూర్తియైనపిదప దీని నామె శ్రీబ్రహ్మానంద సరస్వతీ స్వాములవారి కప్పగించినది. సమీకరణముకొరకును శ్రీమచ్ఛృంగగిరి పీఠానుమతికొరకును దానిని వారు శ్రీశృంగేరి మహాస్వాములవారి సన్నిధానమున జేర్చిరి. అంత నచట పండితోత్తములు దీనింజూచి విస్మయ

మంది తామొక సహస్రనామావళిని రచించిరి. దానియందు 372 శ్లోకములును 1010 నామములును గలవు. ఈరెండు సహస్రనామగ్రంథములను శ్రీబ్రహ్మానంద సరస్వతి స్వాములవారి యభిమాన పూర్వకముగ శ్రీకాశీలోని రామఘట్టమందుండు 'హితచింతక యంత్రమున' యాగపద్యముగ నచ్చొత్తింపబడినవి. హనుమాంబా విరచిత గ్రంథమునకు శ్రీబ్రహ్మానందులవారువ్రాయించిన పీఠికయందును కేవల చరిత్రాత్మకముగు నీవాక్యముగలదు.

గ్రంథోయం పూర్వవిరచితోపి గురుభక్తి విశేషేణ శ్రీశృంగగిరిపీఠాస్థానపండితవరవిరచిత సహస్రనామావళీగ్రంథం ప్రథమతో ముద్రాపయిత్వా తదనన్తర మిమం గ్రంథం ముద్రాపితవానస్మి। శ్రీమదాచార్యపాదానాం పూజావిషయె అపూర్వమిమం గ్రంథ ముపయుంజానాః భక్తాః గురు భక్త్యా పురుషార్థభాజో భవన్త్వి త్యాశాస్మహె

ఇందు శృంగగిరి పండిత న్యూనాధికతా విచారలేశ మేమాత్రమును లేదు. శ్రీజగద్గురువులవారి యారాధనయే ప్రధానప్రయోజనము.

గ॥ హనుమాయమ్మగారి గాయత్ర్యభిమానము పూర్వగ్రంథమునసూచింపబడియె. గాయత్రీదేవి నుద్దేశించి ఈమె యనేక గీతములు స్తోత్రశ్లోకముల రచియించి యుండి నటులను అవి యచ్చునకై కాశీక్షేత్రమున శ్రీగురుస్వాములవారియొద్ద నున్నటులను దెలసినది. అవియు త్వరలో యచ్చుపడ వచ్చును. పోయినసంవత్సరమున నీమె శ్రీగాయత్రి స్తోత్రశ్లోకమొకటి స్రగ్ధరావృత్తమున పుష్పమాలికా బంధరూపమున కూర్చినది. అదిస్థలాన్తరమున గననగు.

శ్రీబ్రహ్మానంద సరస్వతీ స్వాములవారి లోకహితచింతచే జగద్గురు శ్రీశంకరాచార్యులవారి యవతారోత్సవము లిటీవల గ్రామగ్రామమునను స్మార్తజన మాచరించుచు నాటిదినము గురుపూజాదికములు జేయించుచున్నారు. ఆంధ్రదేశమున నీగురుపూజావ్యాప్తి ఎక్కువగనున్నది. శ్రీదత్తాత్రేయోపాసకులును యెక్కువ యనుచున్నారు. ఇట్టి సందర్భములలో గ॥ హనుమాయమ్మగారి గ్రంథములు తెలుగు అక్షరముల లభింపగలిగియుండిన ఆంధ్రదేశమున కత్యంతోపకారముగ నుండును. ఆంధ్రేతర మండలములందును ఆంధ్రాక్షర పరిచితి గలవారు బహుజనముగలరు. అట్టి వారికిని ఇవి యుపయోగింపగలవు. కాబట్టి ఈగ్రంథముల తెలుగు అక్షరముల నచ్చువేయించి సులభ క్రయమునకు దొరకునటుల చేయుట లోకోపకారముగ నుండగలదు. ఈయుపకార నిర్వహణదక్షులు శ్రీబ్రహ్మానంద సరస్వతీ స్వాములవారె యనిజెప్పిన కేవల స్తవ మాత్రము గాక యథార్థమును అయియున్నది.

---

# స్తుతి వాక్యాలు

శ్రీమతి మల్లాది రాజ్యలక్ష్మిగారు

ఆర్తత్రాణపరాయణా! సృష్టి స్థితిలయకారణుడవై సర్వభూతాంతరాత్ముడవై ఆదిమధ్యాంతరహితుడవై చిత్స్వరూపుడవై నిత్యానందస్వరూపుడవై అఖండతేజోమూర్తివై అవ్యయుడవయ్యు మాయామానుషలీల గైకొని రఘువంశపయోధిరాకాశశాంకుడవై కౌసల్యాగర్భ శుక్తిముక్తాఫలమవై పితృవాక్యపరిపాలనాదక్షుడవై మానిజనహృదయాభిరాముడవై అహల్యాశాపవిమోచనుడవై దైత్యజనభంజనుడవై ఏకపత్నీవ్రతుడవై నెగడి యోడినూనవ లోకమును కృతార్థతనందించిన భవత్కృపావిశేషము వర్ణనాతీతము. జగత్పితా! సీతామనోహరా! పాపాత్మనని యెంచక త్వదీయ పాదభక్తిమరందమును గ్రోల యాచించు నీ దీనురాలిపై నొక్కింత కరుణాకటాక్షవీక్షణముల బరపి నా మనోరథమును దీర్ప ప్రార్థించుచుంటి. అక్కటా చిత్తమా! అడియాస నొందనేల. యోగిజనహృదయ దుర్లభుడగు నా పరమాత్మయేడ! సంసారతమోంధకారమున పరిభ్రమించు అజ్ఞానహృదయమేడ! పయోధిపల్వలంబులరీతి నొప్పు అరిషడ్వర్గంబుల జయించి కేవల సత్వగుణోపేతవై ఇంద్రియనిగ్రహంబొనరించి విషయవిరక్తవై సన్మార్గగామివై అనన్య భక్తియుక్తవగాని ఆపరాత్పరుని జేరు నర్హత నీకుగలదా! అహంకార మమకార విశిష్టవై సర్వభూతసమత్వమన నేమో తెలియజాలక కామ్యకర్మంబుల నొనరించుచు దేహాత్మభావనచే భేదబుద్ధి గలిగియుండు పర్యంతము నా చిదానంద స్వరూపుని మహిమాలేశమైన తెలియజాలవని ముమ్మాటికి నమ్ముము. ద్రౌపదీ మానసంరక్షణా! దీనాతిదీనవై సంతతము త్వదీయమూర్తివిశేషమును ధ్యానించి ప్రార్థించుచుంటి. దయానిధీ! భక్తజనపాలకబిరుదు సార్థకతనొందుసమయమిదే! రక్షించినను భక్షించినను నాదిక్కు నీవేయని ముమ్మాటికి నమ్మితి. గజేంద్రవరదా! ప్రహ్లాదరక్షకా! మాంపాహి. మాంపాహి.

# పద్మిని

పి. వి. రామచంద్రమూర్తిగారు బి. యే.

మేవారురాజ్యమును రాణా భీమసింహుఁడను రసపుత్రవీరుఁడు పాలించుచుండెను. భీమసింహుని రాణి పద్మిని. పద్మిని నిరుపమాన సౌందర్యవతి. ఆమె ముఖలావణ్యము వర్ణనాతీతము. ఆమె నయన కాంతిముం గల నక్షత్రములెల్ల వెలవెలఁబోవును. ఆ కోమలాంగి యవయవములెల్లఁ బుష్పదళములకన్న నతి సుకుమారములైనవి. ఆ పల్లవాధర రదనములు ముత్తియములకన్న ధవళములై యొప్పెడివి. ఆమె కోమలకరద్వయము తామరసపుష్పముల యాకృతిని దాల్చెను. పద్మిని రూపవతిమాత్రమే కాక సుగుణ ఖనియై నారీలోకమునకెల్ల మార్గదర్శినియైయొప్పెను.

ఆ కాలమున ఢిల్లీసింహాసనమును అల్లాయుద్దీన్ అధిష్ఠించెను. అతఁడు రాజపుత్త్రుల పీచమడఁచి హిందూదేశమున నేకచ్ఛత్రాధిపత్యము వహింపఁజూచుచుండెను. తదుద్యమమున నాతఁడు నిమగ్నుఁడై యుండ నొకనాఁడాతనికి మేవారురాణి యద్వితీయ సౌందర్యమునుగూర్చి తెలియవచ్చెను. నాటినుండియు ఢిల్లీపాదుషా తన యంతఃపురమునువీడక రాత్రింబవళ్లా సౌందర్యరాశి పద్మినినిగూర్చి తలపోయఁజొచ్చెను. చక్కని చుక్కలని పేర్వడ్డ యంతఃపుర నారీమణు లెందఱో చక్రవర్తికిఁ గలరుకాని వారందఱాతని కరుణాకటాక్షవీక్షణము లెన్నఁడు దమపైఁ బఱుపఁబడునో యని యెదురుచూచుచు నాతని చిత్తము నాకర్షింప నహర్నిశము పాటుపడుదురు. కాని యసమానలావణ్యరాణి యగు పద్మిని యాతని చేతోవీథిని బ్రవేశపెట్టఁబడినది మొదలాతఁ డంతఃపుర కాంతలపై దృష్టి మరల్పఁ జాలకుండెను.

పాదుషా సైన్యములన్నియు మేవారునకు రాజధాని యగు చిత్తూరును ముట్టడించినవి. ఆ తురుష్కుఁడు పద్మినిని దనకు వశము చేసినయెడల తన సైన్యమునంతను మరల్చికొనిపోదునని రెండుపర్యాయములు భీమసింహునకు వార్తనంపెను. ఆ నీచుని యుద్దేశమును గ్రహించిన ప్రతి రాజపుత్త్రుని యొడలును భగ్గుమని మండఁజొచ్చినది. రాజపుత్త్రులెల్లరెట్టి ఘోరమరణమునకైన వశులగుదురుకాని అట్టి దారుణకార్యమునకు మాత్ర మొడిగట్టఁజాలరు. అల్లాయుద్దీనుని దుర్మార్గమును దలఁచుకొన్నకొలఁదిని రాజపుత్త్రుల పౌరుష మెక్కుడు కాఁజొచ్చినది. ఆ పౌరుషమే దండెత్తివచ్చిన కరకుతురకల నొక్కయడుగైన ముందునకు రానీకుండఁజేసినది.

ఇట్లు చిత్తూరుకోట శత్రుసేనాపరివృతమై యున్న సమయమున లోనఁ బద్మిని యధికమగు నాందోళనకు లోనయ్యెను. ఆమె మానసమును గుదురుపఱచుకొనఁ బ్రయత్నించుచుఁ దన్ను జుట్టియున్న యున్నతవంశ సంజాతలగు నబలాజనమును ప్రాచీన గ్రంథరాజములఁదెచ్చి 'రసపుత్త్రవీర్యమునుగూర్చి చదువు'దని యానఁబెట్టును. రాజపుత్త్రుల శౌర్యమును జాటు పాటల వినఁగోరును. ఒక్కొకప్పు డా సాధ్వి యొంటరిగఁ దన సౌధమునకు ముంగలిభాగమున నెద్దియో యోజించుచుఁ బచారుసేయును. ఒక్కొకప్పు డేమియుఁ దోపమి, మెట్లు దిగివచ్చి, పొంతనున్న సరసిచెంత కేగుదెంచును. మరియొకప్పుడు తన భవనమందలి యున్నత శిఖరము నెక్కి నిలువఁబడి దూరముననున్న పర్వతపంక్తులపై దృష్టి సారించును. ఒక్కొకప్పు డా యబలహృదయమున నతి విషాదకరములును భయంకరములును నగు తలపులు ప్రవేశించును. ఒక్కొక తఱి నాకాంత కోటను జుట్టియున్న యాపచ్చికబయళ్లన్నియు రసపుత్త్రవీరుల శోణితముచే నింపఁబడుచుండఁ గ్రూరులగు తురుష్కుల జయధ్వానములు వినవచ్చుచున్నట్లూహించును. అంత నొక్కుమాఱుగా నామె నేత్రము లెఱ్ఱఁబాఱును. ఆమె హస్తములు ముకుళింప నామె పిడికిలినెత్తి శత్రుసేనావాహిని కెదురుగా నొడ్డి 'కానిండు. రాణా భీమసింహునిసతి మేనఁ బ్రాణము

లున్నంతదనుక నీ తురుష్కునకుఁ జిక్కఁడు.' అని పలుకును.

అల్లాయుద్దీనుఁడు చిత్తూరును ముట్టడించి చాల కాలము గాఁజొచ్చెను. పద్మినిం జూడ పాదుషా కన్నులు కాయలు కాచుచుండెను. రాజపుత్త్రులు లొంగు విధాన మాతినికి గోచరమగుటలేదు. తుద కాతఁడు విసిగి, రాణా కింకొకమాఱు వార్తనంపెను. సౌందర్యతిలకయగు పద్మిని నొక్కమాఱు తిలకింప నిచ్చినఁ దనసైన్యముంగొని మరలిపోదునని యాతఁడు తెలియఁజేసెను. 'రాజాంతఃపురవాసిని యగు నా వనిత యన్యునికంటఁ బడనొల్లదని మీరు సంకోచించిన యెడల నామె ప్రతిబింబమును దర్పణమునఁ జూపినఁ జాలును. నేను సంతుష్టుఁడనై మగలిపోదు' నని యాతఁడు పలికెను. ఇట్టి ప్రార్థన కియ్యకొన్నఁ దప్పేమి లేదనియు, నంత వినయముగఁ గోరిన పాదుషా వేడికోలును దిరస్కరించుట పాడిగాదనియు యోజించి రాణా భీమసింహుఁడు 'వల్లె' యనెను. అల్లాయుద్దీనుఁడును ననుమాన మొదవకుండఁ గొలఁది పరివారముతో జిత్తూరునగరమును బ్రవేశించెను. పద్మినీప్రతిబింబము కొన్ని క్షణములా యవనుని నయనములకు విందొనర్చినది. పాదుషాయును నా దృశ్యముంగాంచఁ దనజన్మ ధన్యమయ్యె నని వెలిపుచ్చుచు, మైత్రిఁ బురికొల్పు వాక్యము లెన్నియో పలికి సెలవు గైకొనిపో నుద్యుక్తుఁడయ్యెను. రాణాయును దన నగరు కతిథియైవచ్చిన పాదుషాను గోట వెలుపలవఱకును సాగనంపఁబోయెను. తురుష్కప్రభువును రాజపుత్రవీరునితో దియ్యని పలుకులఁ బలుకుచుఁ గొంపోయెను. కాని యల్లాయుద్దీను పయోముఖవిషకుంభము. నమ్మినవారి గొంతుక గోయుటకు వెనుదీయువాఁడు కాఁడు. ఏమియు ననుమానింపక దన్ననుసరించివచ్చు రాణాను ద్రోహ మొనర్చి బందీగాఁగొనిపోవ సుల్తానీవరలో నచటఁ గొందఱు సైనికుల దాఁచియుంచెను. వాఁలును ప్రభుని కనుసన్నగొని, ఖడ్గపాణులై ముందరి కేతెంచి, తెల్లబోయి నిలువఁబడిపోయిన రాణాను, ఆత్మరక్షణార్థమై నిజకృపాణము నొఱనుండి పెఱుకుకొనుట కాతని కవకాశ మియ్యకయే బంధించివైచి సుల్తాను గుడారమునకుఁ గొంపోయిరి.

ద్రోహియగు సుల్తాను తన పన్నాగము సఫలమైనందుల కెంతయు సంతసింపఁదొడఁగెను. అతఁడనుచితమని దలంపక 'నీభర్తకు బంధవిముక్తి కలుగఁజేయఁ గోరెదవేని, నీవు నాగుడారమున కేగుదెంచి, నివసింపవలసి యుండు'నని పద్మిని కొకలేఖను వ్రాసి పంపెను.

ఆలేఖను జదివినప్పుడు పద్మినికిఁగలిగిన యాగ్రహమునకు మేరలేదు. తననాథు నక్రమముగాఁ జెఱఁబట్టుటయేగాక, క్రొవ్వి, తన కట్టి లేఖనువ్రాసి తన్నవమానించిన సుల్తానుపైఁ 'నేను బగదీర్చుకొనక మాన'నని యామె ప్రతినఁబట్టెను.

పద్మిని భువనైక సుందరియనియు, సుగుణ ఖనియనియుఁ బేర్కొనబడినది. ఆమె యతిమేధావంతురాలు. ఆమె తననాథుని శత్రువునుండి తప్పింపఁగల యుపాయము నన్వేషింపదొడఁగెను. తన్నవమానించిన పాదుషాకుఁ బ్రతీకారముఁజేయు టెట్లని యోజింప మొదలిడెను.

అనతికాలముననే యామె కాలోచన తట్టినది. మఱుక్షణముననే పాదుషా జాబునకు సమాధానము పంపఁబడెను. 'నేను మీయాజ్ఞప్రకారము మీసన్నిధికేతెంచుటకు సంసిద్ధురాలను కాని, మహారాణావారి పత్నినై మెలఁగియుంట గ్రహించి, నా కుచితమగు పరివార జనమును వెంటబెట్టుకొనిరా ననుజ్ఞ యియ్యవలెను' అని యాయుత్తరమున లిఖింపఁబడెను.

పాదుషా యానందమునకు మేరలేదు. తుద కామె తన కంత సులభముగ వశమగునని యాతఁ డనుకొనలేదు. ఎవ్వియో హిరణ్యాక్షవరముల నడిగికాని తన గుడారమున కామె రాఁ బ్రయత్నింపదని యాతఁ డుద్దేశించెను. కాని యామె వెలిపుచ్చిన కోర్కె యతి సులభముగఁ దీర్చఁదగినది. పరివారజనమును గూఁడ దెచ్చుకొనుటకుగదా ఆమె యనుమతి వేడి

నది! ఆప్రార్థన కియ్యకొన్నఁ బ్రమాద మేమియు లేదు. అతఁ డింతకు మున్నెన్నియోమార్లు దిగ్విజయములఁ గాంచెను. కాని యిట్టి యానంద మాతని కీవరలో లభించలేదు. నేఁ డాకఠినుని హృదయ మతి త్వరితముగఁ గొట్టుకొనసాగినది. పద్మిని చేఁజిక్కనున్నది .ఆమె తన యంతఃపురమున బంధింపఁబడును. పిమ్మట మేవారు రాజ్యమును వశముగావించుకొనుట కొక్క క్షణముపట్టును.

అల్లాయుద్దీను పద్మిని కప్పుడే సమాధానము వ్రాసి పంపెను. ఆమె తనకుఁగల వనితాజనమునంతను పరివారముగఁ దెచ్చుకొనవచ్చును. పాదుషాయొక్క గుడారమును జేరినప్పు డామె రాణాపత్ని కుచితముగు స్వాగతమును బొందఁగలదు.

మోహాంధుఁడగు సుల్తానుని జాబు గాంచినపుడు, పద్మిని ముఖమునఁ జిఱునగవు మొలకలెత్తెను. పద్మిని 'యేడునూర్ల పల్లకీలు, ఢిల్లీనగరమునకు బోనున్న తన్ననుసరింపవలయు'నని యాజ్ఞయిడెను. వాని నధిరోహించి, ఢిల్లీనగరమునకు రావలెను. ఘోషాపద్ధతుల కెట్టి లోపమును జరుగకుండఁ బ్రతి పల్లకీయును జక్కగా నలంకరింపఁబడవలెను.

రాణి యనుజ్ఞప్రకార మేడువందల పల్లకీలును తయారు గావింపఁబడినవి. ప్రతి పల్లకియును దట్టముగు తెరలతో నింపఁబడినది. కాని యాశిబికల యందున్నవారు రాణివాసపు స్త్రీలు గారు; ఉక్కుతునకలవంటి రాజపుత్రయోధులు. ప్రతి పల్లకియును వాహకులవలె మాఱువేషముల ధరించిన యార్గురు సైనికులచే మోయఁబడెను. పద్మిని నగరును వీడనే లేదు. ఆమె యంతఃపురప్రాసాదమున నతినిగూఢముగ వసించెను. విశ్వసనీయులగు కొందఱు సేవకులకు మాత్రమే తెలియును. చిత్రవిచిత్రములుగఁ బహువిధముల నలంకరింపబడి, యతి వైభవముతోఁ దుల తూఁగుచున్న బంగరు పల్లకీ యొకటి మధ్యగాఁ బోవుచుండెను. రాణి యాపల్లకియందు గలదని ప్రజలు దలంచిరి. ప్రభుభక్తి విశ్వాసములుగల జనులెల్ల రా పల్లకీల పంక్తిని గాంచి, రాజపుత్ర ధర్మమును నేలఁగలిపి, వశమగు చున్నదని తలచుచు ఖిన్నులుగాఁ జొచ్చిరి. ఆపల్లకీలన్నియు నతివైభవముతో పాదుషా గుడారప్రాంతమునకుఁ జేరుచున్నవి ఆశిబికాసముదాయమును గాంచినప్పుడు సుల్తాను హృదయమున నెట్టి యనుమానమును జనింపలేదు. 'కీరము చేఁజిక్కెన'దని యాతఁ డువ్విళ్లూరఁజొచ్చెను. 'ప్రప్రథమమున నామనోభీష్టము నెరవేరవలె, అనంతరము రాణా విడుదలంగూర్చి యోజించవచ్చు'నని యాతఁడు తలపోసెను.

పాదుషా హృదయము వేగిరపడఁజొచ్చెను. పల్లకీలన్నియుఁ దురుష్క సేన కనతిదూరమున విడిసియున్నవి. పద్మిని తనయొద్ద కేగుదెంచుటకేల జాగు చేయుచున్నదని యాతఁడు ప్రశ్నించెను. అందులకు సమాధానముగ నాతని కొకవార్త వచ్చినది. పద్మిని రాణాతో నొక్కమారు ప్రసంగించి, కడసారి యాతని సెలవుగైకొని వత్తునని కోరుచున్నది. పాదుషా యందుల కియ్యకొనెను. రాణా భీమసింహుఁడు విడుదల గావింపఁబడెను. ఆదంపతుల ప్రసంగమున కొక్క యరగంట మాత్రమే వ్యవధి యీయఁబడినది. రాణా యాబంగరు పల్లకీయందుఁ బ్రవేశించెను. ముప్పది నిముషము లొకదాని నొకటి త్రోసికొనుచు గడిచిపోయినవి. అల్లాయుద్దీను తన గుడారమున వేచియుండెను. గంటయైనది. అల్లాయుద్దీ నింక నోరిమి వహింపఁజాలఁడు. అతఁడు 'తత్ తక్షణమే పద్మినింగొని తెం'డని యానతిచ్చెను.

ఆబంగరుపల్లకీ యదృశ్యమయ్యెను. మోసము జరిగెనని సుల్తాను గ్రహించెను. రాణా భీమసింహుఁడు సతినిజాతునను మిషతో దప్పించుకొని జవనాశ్వము నొండెక్కి, సుల్తాను కన్నుదెఱచు సమయమున కప్పుడే చిత్తూరు మార్గమును బట్టి సగము దూరముపోయెను.

వనితయొక్కర్తు తన్ను వంచించినదని సుల్తాను దెలిసికొన్నప్పుడాతని కత్యాగ్రహము కల్గెను. అతఁడు 'రాణాను బట్టి తెండ'ని యాశ్వికదళము కొకదానిని బంపెను. పల్లకీలందు వచ్చిన రాజపుత్త్రవీరులును, సైనికులును, నాతురుష్కసైన్యము నడ్డగించి, వారికిఁ గొంచె మాలస్యమును గలుగఁజేసి రాణాకు చిత్తూరును జేరుట కవకాశమియ్యఁ జూచిరి కాని వారందఱును గదనమున హతులైరి. తార్తారసైనికులును రాణాను బంధించి తెచ్చుటకుఁబోయిరి. రాణాభీమసింహుని హయమతిరయమునఁబోవుచుండెను. చిత్తూరు దుర్గ మాతని దృష్టిపథమునకే తెంచెను. శత్త్రుసైనికులును వరుసవరుసన నతని సమీపించిరి. దుర్గరక్షకులు బురుజులపై నిలువఁబడి హెచ్చరించుచుండిరి. అతి సాహసియు మహాపతివ్రతయునగు పద్మిని రాజనగరునఁబతికై యెదురు చూచుచున్నది. తార్తారసైనికు లశ్వముల చబుకులతోఁగొట్టి పర్వెత్తించుచుండిరి. దుర్గకవాటము దెఱవఁబడినది. శరవేగమున భీమసింహుని తురంగములోనికిఁ బర్వెత్తి యదృశ్యమైనది. మరుక్షణముననే తురుష్కులును గోటగుమ్మమును జేరిరి. కాని 'ధామ్'అను శబ్దముతోఁ దలుపులు మూయఁబడినవి.

అంతరాజపుత్త్రులకును దార్తారులకును రణమయ్యెను. ఇరుకెలంకులవారును జయమో లేక మరణమో యన్వేషించుచు యుద్ధమునకు దిగిరి. కోటపరిసరము లన్నియు రక్తమయమయ్యెను. నాఁడు రాజపుత్త్రయోధులెందరోహతులైరి. తురుష్కసైన్యము రసపుత్త్రసైన్యముకన్న పదిమడుంగులున్నను శౌర్యనిధులగు రసపుత్త్రులు తురుష్కులనొక్క యడుగైనను ముందునకు రానీయరైరి. నాఁడు రసపుత్త్రులెల్లఁ దమరాణి మానమును గాపాడఁబోరుచు నసమానపరాక్రమమును జూపిరి. సూర్యుఁడు పశ్చిమాద్రిఁ జేరకముస్నె దుర్గరక్షకులెందరో మడిసిరి. సైన్యమంతయు మూల్గులతో నిండెను. అయినను దుర్గముమాత్ర మల్లాయుద్దీను సేనకుఁజిక్కలేదు. పాదుషాయును జాల సైన్యమును గోల్పోయెను. హతశేషులేమియుఁజేయఁజాలక తిరిగిపోయిరి. ఇట్లు రాజపుత్రులు దమ యనుఁబులఁ గోల్పోయియుఁ దమరాణి పద్మిని మానమును గాపాడఁగలిగిరి.

అల్లాయుద్దీను పద్మినిచే వంచింపఁబడినాఁడు. చిత్తూరు దుర్గమునైనను వశముఁజేసికొనలేక పోయెను. అతఁడప్పటినుండియు రాత్రింబవళ్ళు నిద్రాహారములు లేక రాజపుత్రులపై బగదీర్చుకొనుటకై యుపాయములు వెదకుచుండెను.

కాని యాతనికిఁ బద్మినిపైఁగల మక్కువ నానాటి కభివృద్ధిగాఁజొచ్చెను. ఆమె నెటులైనవశము చేసుకొనక తప్పదు. సుల్తా నందులకై క్రొత్తసైన్యములఁ జేర్చఁదొడఁగెను. పదుమూఁడు వర్షములిట్లు గతించినవి. అప్పు డాతఁడు తనగొప్పసైన్యమునుగొని చిత్తూరు దుర్గమును వశముచేసికొని పద్మినింగొనిపో కృతనిశ్చయుఁడై దండెత్తిపోయెను.

ఈవరలో జరిగిన యుద్ధమువలన గల్గిన సంక్షోభమునుండి రసపుత్రులింకను గాలుసేతులుకూడఁ దీసికొనలేకపోయిరి. పాడైన దుర్గప్రదేశము లింకను బాగుచేయఁబడలేదు. వారు సేననుగూడ పూర్తిగాఁ బ్రోగుచేయఁజాలరైరి. అట్టి సమయమున నినుమడించిన క్రోధముతోనుఁ బట్టుదలతోను పాదుషా యసంఖ్యాకమగు దళమునుదెచ్చి చిత్తూరును ముట్టడించెను. రాజపుత్రులెప్పటివలెనే శౌర్యాగ్నిని గురిసిరి కాని ఎన్నటికిని తఱుఁగని యాతురుష్కసైన్యమును తఱుఁగు నిశ్చయించుట వృథాప్రయాసము. తార్తారసైనికులకు దుర్గముయొక్క దక్షిణభాగము వశమైనది.

పద్మిని రాజనగరున నిలువఁబడి యుద్ధమును పరికించుచున్నది. దక్షిణమున దుర్గము శత్రువులకుఁ జిక్కినదని యామె గ్రహించినది. తక్షణమే యామె రాణివాసపు కాంతలనెల్లరఁజేరఁబిలిచి 'తార్తారులు కోటను బ్రవేశించుచున్నారు. ప్రాణముకన్న మానమునం దెక్కుడుగౌరవముగలవనితలు నన్ననుసరింపుఁ'డని పలికెను. ఆస్త్రీలెల్ల నుత్తమకులసంభూతలు.

వారిలో నొక్కతెయు వెనుదీయలేదు. వారందఱును నిజమానములఁ గాపాడుకొనఁ గృతనిశ్చయులైరి. ఆయబలల ముఖములం దొకనూతనమగుకాంతి యావిర్భవించెను. అందు విచార సూచకములగు చిహ్నము లెవ్వియుఁగానరావు. వారందఱు రాణిపలుకుల నాలకించి, మాఱుమాటాడక యామె వెన్నంటిపోయిరి. గొప్పచితులు పేర్చఁబడినవి. రాజపుత్రులును తమసతీమణులు 'నిజాంగములనగ్ని కర్పింపఁబోయి' రను వార్తవిని, నిశ్చింతతోఁ బోరఁదొడఁగిరి. ఆయంగనలెల్ల ఒకరివెంబడి నొకరనలమున నుఱికిరి. అందొక్కతెయైనను దనకోమలావయవముల నగ్నిదహించుచున్నపుడు బాధను వెలిపుచ్చలేదు. వారిలోఁ దుట్టతుద నగ్నికాహుతియైనది మహాసాధ్వీమతల్లి పద్మిని. ఈవిధముగ నామె తనమానమును గాపాడుకొనఁగల్గినది. ఇంక పాగుపా యామె నేమియుఁ జేయఁజాలడు.

రాజపుత్రులెల్లరు నిశ్చింతతోఁబోరి వీరస్వర్గమును జూఱఁగొనిరి. సుల్తానును చిత్తూరునగరమును బ్రవేశించెను. పద్మినిచితినుండి ధూమమింకను నెగయుచున్నది. ఏవంకఁ జూచినను రాజపుత్ర వీరులకళేబరములే. ఏవైపుచూచినను సంక్షోభమే!! నేలయం గ రక్తమయమైనది.!!!

అల్లాయుద్దీను తానుజేసిన బ్రహ్మప్రయత్నమంతయు బూడిదఁబోసిన పన్నీరుచందమాయెనని గ్రహించెను. ఆతనిమనోరథమొక్కటియు ఫలించలేదు. చిత్తూరును వశముచేసుకొనవలెనని యాతఁడభిలషించెను. ఆనగర మాతనికి వశముకాకపోలేదు కాని యదియొక రుద్రభూమిగా మాఱిపోయినది. పద్మినీ కరగ్రహణము కొఱకాతఁడాశించెను కాని విఫలమనోరథుఁడయ్యెను. పద్మిని పరలోకముననున్నది. ఆతని పన్నుగడలు కాని, సైన్యముకాని పద్మిని నేమియుఁజేయఁజాలవు. సుల్తానిట్లన్నివిధములహతాశుఁడయ్యెను. ఆతనికి నుడుకుఁబోతుతన మెక్కువయ్యెను. ఆతఁడు తన క్రోధమును శమింపఁజేసికొనఁజాలక, ఉత్తూరునందుఁగల దేవాలయములను దివ్యభవనములను నిర్మూలింప సైనికులకాజ్ఞనిడెను. చిత్రచిత్రములగు చెక్కడములఁగల్గి చూపఱడెందముల కానందముగొల్పు భవనములెన్నియో నేలఁగలిసినవి. తనకసి దీర్చుకొన సుల్తాను స్వయముగా నిట్టి ధ్వంసము సేయింపఁ బూనుకొనెను. ఆకఱకుతురకలు గొడ్డళ్లతో సర్వమును నాశముఁ గావించుచుండిరి. సుల్తాను పద్మినివసించు సౌధమును మాత్రము వారినంటనీయలేదు. ఆభవనమాతని దృష్టి పడినప్పుడాపె దివ్యసుందర విగ్రహమాతని కన్నులకుఁగట్టి నట్లయ్యెను. ఆతని కఠినమానస మొక్కమాఱుగా మెత్తనైనది. ఆపెనివాస మాగృహమునకు వన్నెదెచ్చినది. దానంజేసి, యాభవనమున కమృతత్వము ఘటిల్లినది. కనుకనే యది తురుష్కుల పరశ్వాఘాతములకు లోనుగాక నిలిచిపోయినది. పొంతనున్న సరోవర మందలి నిర్మలజలమం దాభవనము ప్రతిబింబించుచున్నది. నేటికిని నస్తమితభానుఁడా యున్నత శిఖరములపైఁ దనసువర్ణకిరణముల బఱపుచున్నాఁడు.



# థామస్ ఎ బెకెట్

ప॥ కృ॥ మూర్తి

శా॥ "ఏవిశ్వాసముతో నహర్నిశలు నెన్నే నల్లభూజానికిన్ ।
సేవల్ సేయుచుఁ దత్ప్రసాదమునకై చింతింపుచే నుంటినో ।
ఆవిశ్వాసము నీయెడంగలిగి నిన్నర్చించియేయుందునేన్ ।
దేవా, యిట్టి జరాభరంబున మహార్తిం జెందియుండం గదా॥"

# కవయిత్రీ ప్రశంస

శ్రీ. వె. నరసింగరావుగారు బి. ఏ.

1. కవికంఠభూషణము.

సరసోక్తు లన్నవిత చాతురిమై విరచించి యాంధ్రసో
దర సోదరీమణులఁ దన్మయులన్ బొనరించి సద్యశం
బరుదారనందిన మహామతి న క్కనుప ర్తివంశజన్
వరలక్ష్మి నిగ్గిరిజ వర్థిలఁజేయుత యెల్లకాలమున్.

2. క్రౌంచపది.

కైతలు తెల్గుం బాసను జెప్పంగల వనితల కిల గరువనునాటన్
జాతురి మీఱన్ జెప్పితి వెన్నో సరసపుగృతులను జగతినుతింపన్
జేతములెల్ల న్నూతనరీతిన్ జిగురులుదొడుఁగుచు సిరులఁజెలంగన్
జోతలు జోతల్ లక్ష్మిరొనీకున్; శుభచరితములకు సురభివిగమ్మా

3. సీసము.

లలిత భక్తిరసంబుఁ గిలకొట్టి శృంగార నవనీతమిడె నాంధ్రభువికి నొకతె,
ప్రచుర ధీరోదాత్త పటిమంబుఁ గురియించి పృథుభావసస్యము ల్పెంచెనొకతె,
తలఁపు లుంకువపెట్టి దక్షిణ నాయకున్ నటియింపఁజేసె మానాట నొకతె,
చతురత మెఱయించి సకలేశులీలలన్ జిత్రించి మమ్ముఁ దేర్చినదియొకతె.

తే॥గీ॥ ఇట్లు ప్రాక్తన కవయిత్రు లీఢ్యమాన
శేముషిన్ సరస్వతిని బూజించినారు
ఆంధ్రజాతీయతను మా హృదంతరముల
వెలయజేయుమ, తొల్లిటి విభవమొప్ప.

4. కందము. వరలక్ష్మి పాణి స్ఫుర
దరుణాబ్జ రుచి 'గృహలక్ష్మి' యలరునుగాదే,
వరలక్ష్మి! నీమృదుకర
సరసిజ మదియెంత యమృత సంభరితంబో!!

5. శార్దూలము.

స్వాతంత్ర్యమ్మున కుద్యమించిన ప్రజాసంఘాంతరంగోజ్జ్వల
జ్జాతీయత్వము నిర్నిరోధగతి నాశాంతమ్ముల న్నిండఁగన్
గైతల్సెప్పి సదాసువర్ణ సదలంకారాప్తి సంపూర్ణసం
ప్రీతిన్ శ్రీ కనుపర్తి నామ గృహలక్ష్మి! నీవు రాజిల్లుమీ!

# మొల్లరామాయణము

శ్రీ శేషాద్రిరమణకవులు

స్త్రీలువ్రాసిన యాంధ్ర గ్రంథములలో మొల్ల రామాయణము ఉత్తమోత్తమ గ్రంథము. దీనిరచించినది ఆతుకూరి మొల్ల. శ్రీరామాంకితముగ ఇహపరసౌఖ్యసాధనమని మొల్ల యీకృతి రచించినది. ఆంధ్రకవుల చరిత్రమునందు శ్రీ వీరేశలింగము పంతులువారు వ్రాసిన దానికంటె నీయమ చరిత్రము ఆంధ్రప్రపంచమునకు ఎక్కుడుగాఁ దెలియదు. తెలిసికొనుటకుఁగృషి గూడఁ జేసినటులఁ గనిపింపదు.

మొల్ల రామాయణమును ఇరువురుసుప్రసిద్ధప్రకాశకులు ముద్రించిరి. ఒకరు వీరేశలింగముపంతులువారు. వీరిప్రతి చిరకాలము క్రింద రాజమహేంద్రవరమున ముద్రింపఁబడినది. తాళపత్రగ్రంథములు రెంటిమూఁటిని సమన్వయించి ఒకనిర్దుష్టపాఠము స్వీకరించి పంతులువారీ గ్రంథము ముద్రించి ఆంధ్రవాఙ్మయమున కుపకారము గావించిరి. రెండవ ప్రతి గ్రంథప్రకటనమూలమున ఆంధ్రభాషాసేవజేయుటలోఁ గృతకృత్యులగు బ్రII శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు ముద్రించి ప్రకటించినది. వావిళ్లవారి ముద్రిత ప్రతి కీII శేII రామస్వామిశాస్త్రిగారు సంస్కరించి వ్రాసియుంచినవ్రాత ప్రతి ననుసరించి ముద్రింపఁబడినది. ఈరెండు పుస్తకములలోను గవయిత్రికవితాస్వరూపమునకు వ్యతిరేకములగు పాఠములు విశేషించికలవు. ఈరెండు పొత్తములకుఁ గొన్నితావుల పొత్తుకుదురుటలేదు.

మొల్ల రామాయణము లిఖితప్రతులు ఆంధ్రదేశమున విరివిగ లభించుచున్నవి. కవయిత్రి యభిప్రాయానుగుణముగ వ్రాతప్రతులనుండి యీగ్రంథమునెత్తి వ్రాసి ముద్రించుట యత్యవసరమగు కార్యము. ఏలయన?ఆంధ్రసారస్వతమున విదుషీమణులు రచించిన కావ్యములలో నిది మొదటిదిగాన నిది యుపేక్షాదృష్టితోఁ జూడఁదగిన కృతి కాదు. ఈరామాయణ విషయమున మిగులఁ గృషి చేసి శుద్ధప్రతి వ్రాయించినవారిలో ఆంధ్రభాషోద్ధారకులగు బ్రౌనుదొరవారు ముఖ్యులు. పాఠభేదములు సూచించుచు కాగితమున కొకవైపునమాత్రమె వ్రాయఁబడిన బ్రౌనుదొరవారి మొల్ల రామాయణ ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందుఁగలదు. ఈ యుత్తమగ్రంథమును బూర్వోక్తముద్రితగ్రంథములతోఁ బోల్చి సరిజూచి భిన్నదేశజములగు వ్రాతప్రతులు నాలుగైదింటితోఁ బోల్చినచో నిర్దుష్టమగు మొల్లరామాయణప్రతి సిద్ధమగును. సుపరిశోధితమైనచో నీగ్రంథము మిగుల నుపయుక్తముకాఁగలదు.

వ్రాతప్రతులలోఁ గొన్నివిశేషములు ముద్రితప్రతిలో లేనివి గోచరించుచున్నవి. ఆరంభమునుండియు నేలకోయుద్ధకాండము నందుఁబాఠభేదములు విశేషించికలవు.కొన్ని ప్రతులలో యుద్ధకాండములు చాలభేదముగ నుండుటచే నొకటి ప్రక్షిప్తమనియు నొకటి కవయిత్రి రచనమనియు విశ్వసింపవచ్చును. తీవ్రపరిశోధనమువలనఁగాని మాతృకనిర్ణ

యింప సాధ్యముగాదు. భాషాభిమానులెవ రేని యీ యుత్తమగ్రంథమును బరిశోధించి ముద్రించుట యవసరము.

ఒకయుద్ధకాండమునందు మాత్రమె ఆశ్వాసవిభాగము గోచరించుచున్నది. అన్ని కాండములకుఁజివరను యుద్ధకాండమున కన్ని యాశ్వాసముల చివరకు "జలజాక్ష భక్తవత్సల" యను కందపద్యము ముద్రిత ప్రతులలోఁగలదు. గాని వీరేశలింగము పంతులు వారి ముద్రితప్రతిలో కాండాదియందును ఆశ్వాసమున కొలదియందును శ్రీరామస్తుతి పద్యములులేవు. వావిళ్ళవారిప్రతిలో స్తుతి పద్యములుగలవు. మొత్తముమీఁద పంతులు వారి ప్రతియందుఁగల పద్యముల కంటె వావిళ్లవారి ప్రతియందె పద్యములెక్కువ. బ్రౌనుదొరవారి వ్రాతప్రతిలో ముద్రిత ప్రతులకంటెఁ బద్యసంఖ్య యెక్కువ. ఇంతియ గాదు. గద్యమునందుఁ గిథావిషయసూచిక కలదు, ఒకానొక వ్రాతప్రతిలో యుద్ధ కాండము రెండవ యాశ్వాసమునందుఁ బరశురామ శ్రీరామ సంగ్రామకథ చెప్పఁబడినది. ఈ విధముగా విభేదముగ గోచరించు మొల్ల రామాయణప్రతుల సంశోధించి నిర్దుష్టప్రతి గురించి సమగ్రమగు కవయిత్రిజీవితము జతపఱచుట యవసరము.

ధనైకసాధ్యమగు నీకార్యము సామాన్యులవలన నెరవేరఁజాలదు. స్త్రీలభాషా విజ్ఞానమునకె గాక ఆంధ్రసారస్వతమునకుఁ గూడ సమగ్రమగు కృషిసల్పుచు విదుషీమణుల సత్కరించుచున్న గృహలక్ష్మి సంపాదకులు తమపత్రిక కనుబంధముగాఁ బూర్వకవయిత్రి రచితములగు గ్రంథముల వరుసగఁబ్రకటించుచుఁ దద్గ్రంథమాలకుఁ దొలిపూవుగ మొల్లరామాయణము నిర్దుష్టముగా సర్వాంగసుందరముగ ముద్రించి ప్రచురించిరేని వాఙ్మయమున కెంతయో మేలుకలుగఁగలదు. ఈవిషయమున విదుషీమణులె పరిశోధకురాండ్రుగనుండిరేని గ్రంథ ప్రశస్తి యినుమడి కాఁగలదు.



# పతనము

**కొమర్రాజు వినాయకరావుగారు**

కొండకొసలకుప్రాకి కొండంతయాసతో,
దివ్యప్రకృతి దృశ్యతేజస్సు లానుచో,
విఱిగి నల్లనిగుండు జాఱిగి క్రిందికినుఱికె;
చప్పునన్ దొలగితిని! చావకే బ్రతికితిని!

* * *

గాలిలోమేడలను గట్టిగాకట్టికొని,
కనుమూసి, నీకలల్ గాంచగాబోవుచో,
గుబుకునన్ సౌధమ్ము గూలిమట్టమ్మాయె;
దబుకునన్ లేచితిని! తలగిపోవగను!

* * *

కలలఁశకుంతమ్ముగా, హాయిగాపర్వి
చదలుముద్దియ్య చెల్వు సర్వమ్ముబీల్చుచో,
పడిపోతిఁ తల్పమ్ముపై నుండి క్రిందునకు
దడదడ గుండియల్ వడినడిం గొట్టుకొన!

# దారిద్ర్యము-మోసము

శ్రీమతి వెలిదండి మాణిక్యమ్మగారు

(నిజమైనకథ)

"అయ్యా ఈ హౌసుఓనర్సు మీరేనా"?

"అవును మీకుగాని ఇల్లుకావలెనా ఏమి?

"అవునండీ. మీఇంట్లో ఏదో ఖాళీగా ఉన్నదట గదా చూపిస్తారా ఒకసారి?"

"రండి చూపిస్తాను"అని ఇంటికోసరంవచ్చినతన్ని వెంటబెట్టుకుని ఇంటియజమాని ఇంటిని చూపించుతూ "మీ రేడిపార్టుమెంటులో పనిగాఉన్నారు?" అని అడిగారు.

"హార్బర్లో క్రొత్తగా ప్రవేశించినాను. మాదేశం నుంచి మాకుటుంబం నాల్గయిదురోజుల్లో రానున్నారు. దీనిబాడుగెంతండీ?"

"పదిరూపాయలు. ఇంకా నల్గురయిదుగురు ఇల్లు కావలెనని వస్తున్నారు. మీకు అవశ్యము కావలెనన్నయడల అడ్వాన్సు ఇస్తే బాగుంటుంది. మీపేరేమిటండీ?"

"నాపేరు టి. వి. శంకరయ్యరు. నాకాపురం తిరుచునాపల్లి"అని అంటూ జేబులోఉన్న పదిరూపాయలనోటునుతీసి ఇంటియజమానిచేతిలో పెట్టి వెళ్లుచున్నానని చెప్పి వెళ్లిపోయెను.

2

వెంకటేశ్వరరావుగారు ఒకరోజున కాలేజీనుండి వచ్చి వీధిచావట్లోకూర్చుని'ఇండియన్ ఎక్సుప్రెసును' చూచుకొనుచుండగా కలెక్టరాఫీసుక్లర్కు ఒకాయన వచ్చి "ఏమండీసార్ మీరింత పెద్ద ఇంటిని పెట్టుకుని మాబోటివాండ్లను ఇంతచిన్న చూపు చూచుట న్యాయమేనా?" అనెను.

"ఏంచెయ్యానండీ సార్ అప్పుడే 20 రోజులు కావచ్చుచున్నది. ఒకదక్షిణాది అతనువచ్చి తనకిల్లు కావలెనని అడ్వాన్సుకూడా ఇచ్చిపోయినాడు. నాటికి నేటికి పికరు అయిపూకూడాలేదు. ఒకరికిచ్చేందుకూ మాకెందుకుకూడ తోచకుండా ఊగిసలాడుతున్నాను."అని ఇలాఅంటూ ఉండగానే ఎదురింటి నాయుడుగారు కేకలువేసుకునివస్తూ ఉండటంచూచి "ఏమండీనాయుడుగారు! మీఆఫీసులో ఇటీవలనే ప్రవేశించి పనిచేయుచున్న ఆశంకరం అయ్యారుసంగతి ఏమైనా తెలిసిందో?" అని అడిగిరి.

"చెప్పటం మరిచిపోయినందుకు క్షమించండి. వాళ్లవాళ్లు నాల్గయిదురోజుల్లో వస్తారని నిన్ననేను కనుక్కొనగా తెలిసింది. ఈమధ్యనేవాళ్ల తండ్రిగారు వచ్చి చూచుకొన్నారటగదా"

"అవును ఒక్కసారేవచ్చి చూచుకొని వెళ్లిపోయినారు గాని మాతో ఏసంగతీ మాటాడకుండా వాళ్లకర్మాన వాళ్లు వెళ్లిపోయినారు."

3

"కక్కీ, అతనితండ్రి భార్యవాళ్ళు వచ్చినారు సుమా అతని పెండ్లాన్ని నీవు చూసేవా?"

"ఏమీ పొట్టిగాఉన్న దనేనా!! అంతేగదా. ఆపిల్ల అతనికి స్వంత మేనగోడలే అటగదా."

"నీకంతవరకే తెలుసును. ఇంకాఆపిల్ల కాపరానికి రాలేదట. పదిరోజుల్లో మనకందరికి బూరెముక్కలున్నాయి సుమా."

"పోనీ పాపం. చాలా మంచివాళ్లు సుమా ఒకరిజోలీ సొంఠీ ఏమీ వాళ్ళ కక్కర్లేదు. వాళ్ళకున్న స్థలంలోనే వాళ్ళకున్న సామాన్లలోనే కుదిమట్టంగా తంటాలుపడతారు. ఒకదాన్ని గురించిరైనాఎప్పుడూ ఏమీ కంప్లైంటు చేయరుగదా చూస్తున్నాను దాదాపు ఇరవై రోజులై. ఇంటివాళ్ళు దగ్గర ఉన్నారంటే ఏదో ఫిర్యాదులు చేయుచుండటమే మామూలు అద్దెవాళ్ళకి. అదిగాక ఆయన అత్తగారు (అక్కూడాను) పాటలోను చదువులోనుగూడా కొంచెము ఆరితేరిన చేయ్యేసుమా. ఒకనిమిషమైనా వృథా

పుచ్చకుండా ఏదో వ్యాపకముమీదే ఉంటూఉంటారు. అలా కాలంయొక్క విలువ తెలుసుకుని ప్రవర్తించేవాండ్లని చూస్తే నాకు చాలా సంతోషం."

"ఉండు. ఊరుకో. ఆమె, కూతురు, వస్తున్నారు. ఇలా రండమ్మా పాపము మీ కీ యూరు సదుపాయముగా లేదు కాబోలు. అదిగాక భాష కొత్త. మనుష్యులు కొత్త."

"కొత్త కేమున్నది. ఒక్కరోజుంటే అందరం తల్లితోడులాగ నోరుమంచిదైతే కలిసిపోతాము. ఈకాలంలో ఒక్కచోటనే కూరుచుందామనుకొన్నా కాలం మనల్ని కూర్చోనీయదు. ఎక్కడెక్కడ ఎన్నాళ్ళు ఆన్నోదకాలు ప్రాప్తో అన్నాళ్ళు ఉండక తప్పదు. అదిగాక మాకెప్పుడూ మీ తెలుగువాళ్ళతో స్నేహమే."

"మీఇంట్లో కార్యానికి సామానులు, వగైరాలేమైనా అవసరముంటే మొగమాటంపడక అడిగి తీసికోండి. అన్నిరకముల సామానులు మాఇంట్లో చాలా మట్టుకు ఉన్నాయి. దేశంకాని దేశం వచ్చినప్పుడు అందరికీ అవసరం కలుగుతుంది. మనలో మనం ఈ మాత్రమైనా సర్దుకోకపోయినట్టైతే ప్రపంచంలో ఇంక మనలాభం ఇతరులకి ఈషణ్మాత్రం లేదన్న మాట" ఇంతట్లో లోపలనుండి ఎవరో పిలుచుచున్నట్టు వినబడగానే తల్లి కూతుం డ్రిద్దరు లోపలికి వెళతారు.

౮

"అక్కగారూ! మీప్రక్క ఏమైనా గులాబి, సంపెంగ, పువ్వులువస్తే పోనీయకండీ. ఇదిగో రెండణాలు. భక్షణాలు చేస్తుంటాను. నిలబడటానికి వీలేలేదు. మీరే బేరమాడి కొని, పిల్లలకు జడ గూడా వేసిపెట్టాలి. ఇలా నేను చెప్తానని ఇంకో విధంగా అనుకోకండి."

"కొని పెట్టడానికి అభ్యంతరం లేదుగాని జడ మాత్రము మీదేశపువారు వేసినట్టుగా మేము అంత బాగా వేయలేము."

"మీ రదంతా పెట్టుకోకండీ! మాదేశపువారికి వస్తే రావచ్చుగాని నేనుమాత్రము మీమాదిరిగానైన వేయలేనండీ" అని అంటూ లోపలికి పనితొందరవల్ల వెళ్ళగానే ఇంటివారు, వారిలోవారు

"పాపము వీళ్లు దక్షిణాదివారైనా అందర్లాగా గాక మనందరిలో తలలో నాల్కలాగ తిరుగుచున్నారు. వీళ్ళ తరహా చూడగ, మనవాళ్ళకంటె దక్షిణాదివారికే ఇల్లిచ్చుకోవడం మంచిదనిపిస్తున్నది. ఖర్చు వెచ్చముల్లోగూడా కూట్నీళ్లు చాలుగాకుండా కలిగినదానిలోనే పాలు పెరుగు నెయ్యి వగయిరాలు కొనుక్కొని మితంగా వాడుకుంటున్నారు. ఇంట్లో మాట బైటికి ఏమాత్రము రాకుండా కాలక్షేపం చేసుకునేటందుకు వాళ్ళ తరువాతనే ఇంకొకర్ని చెప్పాలి."

"సరేగాని మనఇంట్లోఉన్న రెండు కుర్చీలు, బల్ల, మంచము, ఈమూన్నాళ్లు ఇయ్యావలెనని అనుకున్నాముగదా. వాళ్ళతో ఈసంగతి అన్నావా."

"అనటం ఎందుకు. మనమే తీసికొనివెళ్ళి అమర్చిస్తే వాళ్ళుమాత్రం వద్దంటారా. మన మేమనుకుంటామో అని వారు వెనక్కి తగ్గుతారుగాని వారికి మాత్రము సరదాలు లేవా ఏమి? మనకంటే వాళ్లకే సరదా లెక్కువ."

"ప్రొద్దుగూకింది. పెందలాడే నాల్గుపనులూ చక్కపెట్టుకుంటే పీటలమీదివేళకు మనం తెములగలము."

౯

"అక్కగారూ! ఈరోజునే మాదేశంనుంచి తిరిగి జాబువచ్చింది. నన్ను అర్జంటుగా బయలుదేరి రమ్మని"

"అయ్యో అప్పుడేనా. పాపము చిన్నపిల్ల కదా ఇంకా రెండునెలలపాటైనా ఉంటే కొంతవరకు నయం. మీతమ్ముడుగా రేమంటున్నారు?"

"నాతమ్ముడనటాని కేమున్నది. వాడిపనికూడా మార్చి 15 తేదిలోగా ఉండేదీ ఊడేదీ తేలుందట.

అప్పుడు అందరంకలసి వెళదామని వాడు అంటున్నాడు. గాని వచ్చినఉత్తరం మాదిరిచూస్తే మాత్రం నేనింక ఉండటం మర్యాదగాదు. ఈపిల్లమీద ఆయనకు ఎక్కువ మక్కువ కాబట్టి ఇన్ని దినములవరకూ ఉండుటకు వీలైంది. ఆయన వంట్లోకూడా సుస్తీగా ఉన్నదట ఏమిచేయుటకు తోచకుండా ఉన్నది. ఇక్కడ పిల్లని వదలిపెట్టలేకుండా ఉన్నాను. మా తమ్ముడ్ని అక్కడే పని చూసుకోవచ్చును, రమ్మనమని ఎన్నివిధాలచెప్పినా వాడు వినకుండాఉన్నాడు. వేరే దిక్కూ మొక్కూలేదు. ఏమైనా ఎల్లుండి మాత్రము ప్రయాణము నిజము. ఇంక మీరే బంధువులు, తల్లి, దండ్రీ. మానాన్న ఉంటాడని నిబ్బరమే గాని అతనికీ ఏమీ తెలీదు. వాడు, అదీ, గూడ పసివాళ్ళేగదా. ఏవిధంగా వాళ్ళను కనిపెటుతూ ఉంటారో" అని గ్రుడ్లనిండా నీరు త్రిప్పుకుంటుంది.

"సుబ్బలక్ష్మమ్మగారూ, ఇంత ఖంగారుపడితే పిల్ల బెగులుతుంది. తప్పనిసరి వచ్చినప్పుడు ఎవరుమాత్రము ఏమిచేయగలరు? ఈ కరువుకాలంలో కడుపు చేత బట్టుకుని ఈమాత్రపు, ఆమాత్రపు, జీతాలకే దేశదేశాలకి పోవలసివస్తున్నది. మన మొత్తు దైవమే తీర్చాలి. మీపిల్లను మాపిల్లమాదిరిగానే చూస్తుంటాము. మీరేమీ అనవసరంగా బెంగపెట్టుకోకండి."

౬

"ఏమండీ అక్కగారూ! మన అరవమ్మాయి ఏమో బద్ధకంగా ఉన్నట్టు కనబడుతున్నది. నిన్న ప్రొద్దుట తిన్న అన్నమంతయు వెళ్ళబోసుకుంది. మీరూ నేనూకూడా అప్పుడప్పుడు ఏదోవకటిచేసి ఇస్తునేఉన్నాము. నిన్నటితో నాకు అనుమానము తీరిపోయింది"అని ఇంటిలో కాపురంఉన్న సుందరమ్మగారు అన్నారు.

"నేనుగూడా, ఈరోజు మధ్యాహ్నమే తలంటి నీళ్లు పోస్తుండగా పరికించిచూచాను. కాని బొత్తిగా అల్పిరిపిల్ల సుమండీ! మనంఅంటే ఏదో ఇంత తలంటి నీళ్ళు పోయగలము పైన మంచి చెడ్డా చూస్తూ ఉండగలము. కాని పిల్ల మహానీరసించిపోయింది ఈవేవిళ్ళ మూలాన్న."

సుంద:—లోపల ఏంచేస్తున్నదో ఇలాగు పిలవసా ఒకసారి.

సూరమ్మ:—ఎందుకు అనవసరముగా. మగడు పెండ్లాముకూడా చిలకా గోరింకల్లాగ ముస్తాబులై బీచిషికారు వెళ్లబోతున్నారు. ఇంతట్లో లోపలినుంచి రాజం రాగానే వీరిద్దరూ నవ్వగా ఆ అమ్మాయి గూడా చిన్ననవ్వు నవ్వి సిగ్గుపడుతుంది.

సుందరమ్మ:—ఏమమ్మా రాజం! నీసంగతి మీ అమ్మకు రాశావో.

రాజం—రాసింది కేముంది. మా పనిమాటకూడా ఒక నెలరోజుల్లో తెలుస్తుంది. అప్పుడు మేము వెళ్లడమో వాళ్ళురావడమో తేల్తుంది. నేను బీచికివెళ్లి ఇప్పుడేవస్తాను.

౭

"అయ్యో పాపం. వాళ్ళరాజం కడుపునొప్పితో చాలా బాధపడుతున్నదండీ. అత డేమో ఆఫీసుకు వెళ్ళిపోయినాడు. ఆ అమ్మాయేమో ఊరికే ఏడుస్తున్నది.

సూరమ్మ:—పాపం. తిరిగి వాళ్లవైపుకు తరుమా పెర్పుటకు మాకు సందర్భం తక్కువగా ఉంటుంది. మాచావడి ఖాళీచేసి మంచం, పక్కవేస్తాను. ఇంతట్లో మీరు దగ్గరఉండి అలా మెల్లిగా రమ్మనండి. అని గబగబా ప్రక్కవేసి వచ్చిన ఆ అమ్మాయిని పక్కమీద పడుకోమ్మని కొంచం వేడివేడి కాఫీ ఒకకప్పు కాచిఇచ్చి త్రాగమని ఏవో ధైర్యం మాటలాడుతూఉంటే ఆకాఫీ త్రాగి పెద్దవమనము చేసుకొనును. సూరమ్మ అది చూచి "అమ్మాయీ నీకేమీ భయములేదు. కొంచెము సర్దుకొని పడుకో. పనిమనిషి రాగానే నేను చెప్పి అంతా శుభ్రపరచెదను,"అని అంటూ

ఉండగానే పనిమనిషివస్తుంది. అది రాగానే సూరమ్మగారు సంగతి సందర్భం అంతా చెప్పగానే అది ఏమాత్రం అడ్డుచెప్పకుండా ఆవాంతులు ఎంగిళ్ళు అన్ని ఎత్తి పారపోసి ఫెనైలు నీళ్లుపోసి కడిగి వేరేప్రక్కవేసి జాగ్రత్తగా పండుకో బెట్టును. ఇంట్లో ఉన్నవారు 'ఎనీమా' సిద్ధపరచి తెచ్చి "ఏమే బూబూ, మేము దగ్గరకు రావటానికి వీల్లేదు కాబట్టి ఇంట్లోపని మేము చూచుకుంటాము. నీవు మాత్రము కాన్పుప్పుడు దగ్గిర ఉండాలి. ఈఎనీమా బహుజాగ్రత్తగా ఇయ్యి."

బూబు:—"అమ్మగారూ, మీరింత సెప్పాలండీ. అది ఒగ్గిండి. మీరాడ నిలబడితే చాలు. నేనంతా సేస్తాను" అని అప్రకారంగా ఆ ఎనీమా సాధనముచేసి తిరిగి పడుకోపెటుతుంది. ఇంతట్లో అదృష్టవశాత్తు ఒకడాక్టరుగారు ఏదో పనిమీద వెంకటేశ్వరరావుగారితో మాట్లాడటానికి రాగానే వెంకటేశ్వరరావుగారు ఆయన్ని లోనికి తీసికొనివచ్చి "ఏమండీ సార్. మాఇంట్లో అద్దెకు మీదేశపువారే ఒకరు దిగినారు. ఆ అమ్మాయి యిప్పుడు 3 మాసము లెగించి బైటచేరి బహు బాధపడుతూఉంది. దిక్కూమొక్కూ ఎవరూలేరు. ఇప్పుడు మేమేమి చేయవలెనో కొంచెము సలహాఉంటే చెప్పండి.

డాక్టరు:—మీరు చాలా మంచివారు గనుక ఇన్నివిధాల మాస్తున్నారు. మిమ్మల్నే భగవంతుడు ఆఅమ్మాయికి చూపించకుండా ఉంటే ఎంత ఇబ్బంది పడిపోయేదో. దిక్కులేనివారికి దేవుడే దిక్కని అంటారు ఇటువంటివారిని చూసేగాబోలు."

వెంక:—మొట్టమొదట, సద్యః చేయవలసిన దేదో చెప్పండి.

డాక్టరు:—చెప్పడాని కేముంది. ఫస్టు ఎయిడంతా మీరే చేసివేసినారు. వెస్నీర్ రబ్బరుసంచులు మాత్రము పొట్టమీద వేసికొని పండుకోమనండి. అంతా అయినతరువాత గాని ప్రస్తుతము ఏమీ అవసరములేదు." అని డాక్టరు వెళ్ళగానే రబ్బరుసంచులు వేన్నీళ్లు పోసిఇచ్చి పొట్టమీద వేసినారు.

. .

## ౮.

"ఏమీ రాజం బాగున్నావా?"

"ఖులాసగానే యున్నదండీ. డాక్టర్ని పిలచి మందు మాకు ఇప్పించి వేళపట్న ఆహారమిచ్చి నాల్గు రోజులు నన్నింట్లోపెట్టుకుని సాకేరు. రాత్రీపగలూ కూడా నాకోసరం ఇంటిల్లిపాది శ్రమపడ్డారు."

"కష్టమోనిష్ఠురమో మొట్టమొదట మీఅమ్మ వెళ్ళుచున్నప్పుడు అప్పచెప్పినందుకు తిరిగి నీవు నీభర్త కలిసి ఉండటం మాకు కావలసింది. మందు మాత్రము శ్రద్ధగా పుచ్చుకో. ఇటూ అటూ అట్టే తిరక్కవెళ్లి పడుకో" అని చెప్పి సూరమ్మగారు లోపలికి వెళ్ళిపోయినారు. ఇంక నాల్గురోజులు గడచినతరువాత ఉదయం సుమారు ఏడు ఎనిమిది గంటలకు సూరమ్మగారు భావిదగ్గరకువచ్చి

"ఏమండీ సుందరమ్మగారూ ఇంకా రాజం ఇప్పటివరకు బయటికి రాలేదేమి? మళ్ళీఏమీ ఒంట్లో నల్తలేదుగదా పాపం. ఒకమాటు పెద్దానుపత్రికి ఎన్నిమాట్లు రమ్మన్నా రాలేదు.

సుందరమ్మ:—నేనూ ఏదో పనిసందట్లో నేయున్నాను. అంతగా గుర్తించలేదు. చెయ్యితెరపి చేసుకుని వెళ్ళిచూడాలి" అని అక్కడ అంట్లుతోముచున్న బూబునుచూచి "ఏమే ఆ అమ్మను చూచావటే ప్రొద్దుటలేచి."

బూబు:—ఏమోనమ్మా ఆబాబే ప్రొద్దుటలేచి నాదగ్గిరఉన్న గిన్నెచెంబును తొందరగా తోమి ఇమ్మని లోపలికి తీసికొని వెళ్ళినాడు. ఆవిడికి నీరసంగా ఉండి పండుకుందేమో." ఇంతట్లో వీధిచావట్లోనుంచి "ఏమండీ అమ్మా ఆఅరవోళ్ళేరు తలుపుతాళం వేసిఉన్నదేటండీ. ఆఅరవనాకొడుకులు నాసొమ్ము ఎగ్గొట్టేశిరా ఏటితల్లీ."

"ఏమే అంతతొందర. మాతోనూ ఎవరు చెప్ప లేదు. నేను వీధిలో నిలబడి ఏదో బేరమాడుతూఉంటే అతడు ధర్మిగ్లాసు చేత్తోపట్టుకుని వెళుతూఉండగా చూచాను గాని ఆఫీసుకే అని అనుకున్నాను. ఒక వేళ ఈఊళ్లోనే వాళ్ళవాళ్ళెవరికో బాగసాలని అన్నది. అక్కడికిగాని లేకపోతే విజయనగరంలో ఎవరింట్లోనో వెళ్ళిఅన్నట్టు జ్ఞాపకం అక్కడికేనా గాని వెళ్లిఉండాలి. ఎక్కడికైనా చెప్పివెళ్లితే బాగుండును.

సుందరమ్మ:—ఏమో ప్రపంచంలో మర్యాదకెక్కడా ఇప్పుడు తావులేదు అయినా చూద్దాం. వాళ్ళు చాలా మంచివాళ్లు. అని అంటూఉండగానే కబ్జలమనిషి ఒకర్తెవచ్చి "అమ్మా ఆఇంట్లో ఉన్న శంకరం బాబు ఏరమ్మా. నాకు రూపాయ లియ్యాలి. ప్రతినెల ఫస్టుకే ఇచ్చి మరీ వెళ్లేవాడు. ఈష్టరు సెలవులైపోయినాయి ఇంకారాలేదు. మాసావుకారు ఊరికే అగ్గైపోతున్నాడుమామీద.'

నూరమ్మ:—ఏమో నాకు కూడా ఏమీ తెలీదు. చూడచూడ వింతగానున్నది. ఇప్పటి కిప్పుడే నీవుకాక 5,6 గురు అప్పులవాళ్లువచ్చి తిట్టేసి వెళ్ళిపోయినారు. మాకు ప్రతినెల ఫస్టుకే అద్దె ఇచ్చివేసేవాడు. కాని క్రిందటినెల ఈనెలకూడా తన కిబ్బందిగా ఉన్నదని అద్దెకూడా ఇవ్వలేదు. పోనీ పాపం ఎక్కడికి పోతుందనే నమ్మకంతో ఊరుకున్నాము.

కబ్జలమనిషి:—ఏం అరవబాపనాళ్ళమ్మా. మా రుణాన్ని పుటతారు. నిన్నలేక మొన్నలేకదమ్మా మీఅందరిచేత అడ్డమైన చాకిరీచేయించుకున్నారు. జ్ఞానంలేని పశువులకైనా విశ్వాసంఉంటుంది. వీళ్ళంతకన్నా నీచకం అయిపోయారు. ఇన్నాళ్లు నెలనెలకే ఇచ్చేసేవాడేనమ్మా. అదేం బుద్ధిపుట్టిందో సెబాను. బలేగట్టివారుంటారమ్మా ఈప్రపంచకంలో" అని ఆమనిషి తిట్టుకుంటూ వెళుతుంది. కొంతసేపటికి వెంకటేశ్వరరావుగారు ఇంటికో సరం వచ్చిన మరి ఇద్దర్ని వెంటబెట్టుకుని లోపలికివెళ్ళి పైన తాళంవేసిఉన్న తలుపును చూపించి "ఇదిగోనండీ ఈభాగమే దక్షిణాదివా రుండేది. లోపల ఏముందో చూచిందికూడా వీల్లేదు. తలుపుతీస్తే బాగుండదని సంశయిస్తున్నాను."

"మీరిలా సంశయిస్తున్నన్నాళ్ళు ఆఇల్లు అలాగుండవలసిందే. మేమందరం సాక్ష్యంఉంటాము. తలుపు తీసి అందులో సామానుఉంటే తిరిగి తలుపువేసేయండీ. లేకపోతే మీరు మోసములో పడ్డారన్నమాటే" అని ఆతాళాన్ని బలముగా ఒక్కలాగు లాగుతాడు. దానితో ఆతాళం చేతిలోకి రాగానే అందరూ పకాలున నవ్వుకుంటూ లోపలికివెళ్ళి చూడగా డబ్బామూతలు. చింకిచీపురు.

వెంకటేశ్వరరావుగారు నిర్ఘాంతపడి, ఇంటిలో ఉన్న తమకుగాని, ఆప్రక్కగదిలోనే కాపురంవున్న ఇంకొకరికి గాని ఏమాత్రం అనుమానమేనా కలక్కుండా సామానుతోసహా ప్రొద్దుట తొమ్మిదిగంటలవరకు తానుండి ఏష్యం అవటం ఆలోచిస్తూ ఆవచ్చిన వారితో "అయ్యా ప్రపంచకములో ఇదికూడా ఒక గుణపాఠమే. ఎంత మంచివారికైనా సరే విశ్వాస హీనులుగను, నరహత్యాపాతకులుగను, చేయున దేదంటే దారిద్ర్యము. దారిద్ర్యము. ఈ అయ్యరు కూడా ఈ యూరికి కొన్ని నెలలక్రిందట వచ్చినప్పుడు చేతిలో ఒక కానీకూడ లేనివాడే. ఇక్కడ హార్బరాఫీసులో 40 రూ. పని దొరకంగానే తనదేశం నుండి, సంసారం తెప్పించుకుని ఏలాగో ఒకలాగు కాలం గడుపుకొనుచుండగా అకస్మాత్తుగా పని ఊడిపోయింది. ఏనెలజీతము ఆనెలకు సున్నాకు సున్న. హళ్ళికి హళ్ళి. ఇంక మిగిలేదేమిటి. పైగా అప్పులు. పనిపోయినవెంటనే అప్పు లెగేసి ఇంటివా రొనరించిన సాయముసైనా తలపక దొంగతనముగా ఇల్లువిడిచి ఇందరిని మోసపుచ్చవలసిన దుస్థితిని బొందెను. ఈఆర్థిక దుస్థితిదినములలో ఎంతమంది మర్యాదస్థులుగూడ ఇటువంటి దౌర్భాగ్యవాతావరణములోపడి మానవజీవితాదర్శమునుండి మృత్యు లవుచున్నారోగదా. ఇందుకు ఎవరు బాధ్యులు."

## పూలమాల

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

ఇది సౌభాగ్యవతి స్థానాపతి రుక్మిణమ్మగారు రచించిన ఖండకావ్యముల సంపుటము. ఈ కావ్యగుచ్ఛ మీమె ప్రథమ యత్నమైనను "ఉత్తమకావ్యరచన కనువైన" క్లుప్తత, శక్తి, అన్వయశుద్ధి ఇందులో కనబడుచున్నవి. వంటయింటిలోను, పూర్వాచారాభ్యాసములోను కృశించిపోతూన్న తెలుగురమణుల రసికత అనుకూలదోహదమువల్ల మొలకలెత్తగలదనడాని కీ ఖండకావ్య సంపుటము నిదర్శనము.

'శ్రీ మదోంకార పంజరాసీనశుకము, ప్రాంచదుపనిషదుద్యాన పరభృతమ్ము, ఆగమారణ్యవీథి మహామయూరమైన కాత్యాయనీదేవి' యీమె కిష్టదైవము. "పదియును రెండు రోజులు విపక్షులభీకరసేన లన్నిటి"ని, 'ఎవ్వరి యుపాయసహాయము లొందకే, కదనవిలాసమందిరముఖంబున జంపిన వీరబాల' లక్ష్మీబాయి కీమె చేమోడ్చి మ్రొక్కుతోంది. 'ప్రథితపాండుభూవరకుమారకులు, దాస్యశృంఖలాబద్ధులై తల్లడిలుటకాంచి సైరింపనోపక కదనరంగవిధుల బోధించి' సంగ్రామానంతరము తపోశీలయైన వీరమాత కుంతీదేవి నిరంజనత్వము నీమె బయటికిదెచ్చింది. ఈమె "రుధిరనిష్యంది" లేఖనీప్రభావమున "సంధిప్రస్తావమున సంక్షుభిత హృదయయై అశ్రుపూర్ణనయనములతో ప్రతి హింసకై రోజు కాలభుజంగి సన్నిభమగు కుంతలకలాపమును చేబూనిన పాంచాలి" కంపితగాత్రము కృష్ణునికేమో గాని మనకు కనబడుచున్నది. పతిసందర్శనార్థము ఘటోత్కచకుమారుని తన ఆహారముకోరకు నరులను దెమ్మని పాండవులున్న వైపు పంపిన హిడింబి కథను ఈమె తిరిగి వినిపిస్తున్నది పద్యముఖాన్ని. సత మరుంధతీముఖపుణ్యసాధ్వులు పాలించి అమరపథమాక్రమించిన ధర్మమును శాండిలిచేత నీమె తన తెనుగుతోబుట్టువులకు చెప్పిస్తోంది. దశావతారములను నేకరువుపెట్టుటతో కావ్యత్వసిద్ధి పల్చబడిన గుమ్మడు పాటలోని 'గోపిదేవి' విస్మయము నీమె 'మధుస్యందిలేఖినీ' ముఖమున స్త్రీల పక్షమున తిరిగి ప్రత్యక్షీకరించుచున్నది. ఈ ఖండకావ్యగుచ్ఛము తెనుగుతోబుట్టువుల కంకితము. స్త్రీత్వమునం దింత యభిలాష గన్నరచిన యీమె "తోబుట్టువులకు" అని అందరినీ కలిపిందేమా అనుకుంటూంటే విశాలహృదయులగు అని కనబడింది.

స్త్రీలకు సహజమైపోయిన నైరాశ్యము, ఉత్సాహరాహిత్యము, పిరికితనము ఈమెయందు లేవనవచ్చును. తన స్త్రీత్వమీమెకు నిరుత్సాహకరము కాలేదు. ఈసంపుటమునందంతటా పైన చెప్పినట్లు, స్త్రీమూర్తి, 'వెలలేని రతనాల సలరారు బహువిధ కరకంకణమ్ములు ఘల్లురనగ ఘుమ్ము ఘుమ్మున' పెరుగు తఱచుచున్నది. కదన విలాస మందిరముఖంబున ఖడ్గప్రహార విఖ్యాత పాండిత్యమును వైరివీరులకు చవిచూపుచున్నది. దాస్యశృంఖలాబద్ధులై తల్లడిల్లు కుమారులకు కదనోత్సాహము పుట్టగా బలుకుచున్నది. వసుధామర

మంత్ర పవిత్రవారి ధారావళిజేసి పావనము లైన శిరోజము'లను గ్రహించిన పాపావహుని హస్తశిరమ్ములు వ్రక్కలై పోవలెనని సిద్ధసంకల్పయై శపించుచున్నది. "జడలు వల్కలములును గాషాయవస్త్రతతి మొదలగున వెవ్వియు దాల్పకుండ"నే యరుంధతీ ముఖ పుణ్యసాధ్వులు పాలించిన ధర్మము ననుసరించి సూర్యచంద్రాది లోకములను దాటిపోవుచున్నది. 'అవని సస్యసమృద్ధమై యలరి ప్రకృతి సర్వము నమృతమై బ్రతుకుగాక' యని ఆంధ్రలోకమున నక్షతలు చల్లుచున్నది. రుక్మిణమ్మగారి ఉత్సాహము పూజనీయము.

ఈమెకు కాత్యాయనీదేవి సుధాస్యంది లేఖిని నొసంగినది. లేఖిని శక్తిని చూడండి.

క్షణము చిత్తమ్ము, విత్తమ్ము క్షణమెనుమ్ము
క్షణము జీవితకెల్లను, క్షణము నటన
ఎఱుక తెలియదు యమునికిఁ గరుణలేదు
కాన జాగర్తి! జాగర్తి!! కాచుకొనుడు
(ఎక్కడా అడ్డులేదు అన్వయానికి)
ఆనవిని మందహాసవద
నాంబుజుండౌచు మురారి తొల్లి నే
వినుకలిగా శతాకృతుల
వేడ్క-ధరించి భయంకరోగ్రులా
దనుజుల గర్మపాత్మకుల
దాల్మివధించి సమస్తలోకముల్
గొనకొని సంచరించితిని
గుమ్మడటన్న విచిత్రమయ్యె; నెం
దును గనలేదు ఇప్పుడెట
దోచెను చూపగదమ్మ ప్రెముక్కడట.

పదిమాటలలో చెప్పడానికి వీలుపడేది రెండు మాటలలో ముగుస్తున్నది. ఘటోత్కచు డంటున్నాడు వృద్ధబ్రాహ్మణునితో.

'మీలో నొక్కరినిచ్చిన
జాలును. అవశిష్టులెల్ల సంతోషముతో
హేలాగతి బోవచ్చును
ఆలాగున గానియెడల నందరి కగ్గో.

ఆధునికకవుల్లో వ లీమెకు 'భర్తృసహవాసమున' పరిచితములవుతున్నవి కొంచెము కొంచెముగా.

"ఎందఱెందరో రుధిరనిష్యంది లేఖి
నుల తెనుగుసీమ యోధసంకలితమనుచు
వ్రాసిరే కాని; నేడది వ్యర్థమయ్యె
వీరుడొకడును గనరాని కారణమున.

పాప మీమె తన మగతోబుట్టువులను ఉత్తేజితులనుచేయు నుత్సాహములో సీతారామరాజును మరచిపోయింది.

సద్గుణములు గలిగిన ఈ సుమంగళి శైలి సాపుదేగి, పురాణబద్ధమైన ఈమె దృష్టి విశాలమై, ఈమె అమృతనిష్యంది లేఖినితో తెలుగుదేశములో జయభేరి మ్రోగించుగాకయని ఆశించుతున్నాను.

---

# గీతికామౌక్తికహారము

శ్రీమతి మానికొండ అలివేలుమంగతాయారుగారు

హృదయ మవియంగ ప్రేముడి నెన్నిమార్లో,
పిలిచితిని ప్రేమభిక్షకై ప్రియుడ! సుంత
పలికినను నోటిముత్యాలు ఒలుకునోయి!
పూజనేసిన నాభావ పుష్పసమితి,
విరసమగుచుండె, నీపాద సరసిజముల
అమృతమయ దృష్టి నలరింప వైతివేల?;
మేళవించితి ననురాగ లీలనాదు
హృద్విపంచి, ఉపేక్షచే ప్రిదులగలదు,
ప్రణయగీతమ్ము వాయింపరాదె నాథ!
కాంతుగదిసిన నా ఉషఃకాంతనొసట
ప్రొద్దుపొడిచెను, వెలవెలబోతి నేను,
అర్ఘ్యమును గొంటకేనియు అవధిలేదె?

# ఉపవాస దీక్ష

శ్రీమతి జి. సీతాలక్ష్మిగారు

"ఉపవసించు మనుజుడు అసత్యమాడరాదు. ఉపవసించుచు అనృతమాడినవాడును, కఠినచిత్తుడై దుష్కార్యముల జేసినవాడును పవిత్రమైన ఉపవాస దీక్షను, అపవిత్రపరచుచున్నారు. అట్టివారి ఉపవాసమును పరమేశ్వరు డంగీకరింపడు."

*　　　*　　　*

"నీవు ఉపవసించునప్పుడు మొగము వ్రేలాడవైచికొని తిండి 'మానితినే'యని తిండిమీదను ధ్యానముంచుకొనరాదు. నే నుపవసించుచున్నానని బడాయికి ప్రకటించుకొనరాదు. పరులెవరైనను నిన్ను దూషించినను, నీతో కలహించినను, వారిని తిరిగి దూషింపక వారితో కలహింపక, ఉపసించుచున్నానని మాత్రము సూచింపుము" (మహమ్మద్ ప్రవక్త).

*　　　*　　　*

ఉపవసించుటయన్న ఆహారమును వర్జించుట. కేవలము ఆహారమును వదలినంతమాత్రమున ఉపవసించుట యనదగదు. ఆహారమును వర్జించి, చిత్తము నీశ్వరాయత్తము జేయవలయును. తిండి మానితిమే యని, తిండిమీదనే ధ్యానముంచి మొగము వ్రేల వేయుచు చేసిన యుపవాసము నిరర్థకము, నిష్ఫలము.

ఉపవసించుట వలన ఫలమేమి? దీనిని గురించి కొంచెము విచారింతము. శరీరము రథమువంటిది. దీనిలో పవిత్రమైన ఆత్మ రథికుడు. ఆరథము క్రిరామొదలైనవి లేక, సౌమ్యముగ సాగవలెనన్న సాధనమొకటి యుండవలెను. రథము రథికుని స్వాధీనములో నుండవలెను కదా! చక్రములకు తారు, రథవేగమును తగ్గించుటకు, హెచ్చించుటకు, తగిన ఉపకరణములు (Brakes) అవసరము. ఉపవాసము శరీరరథమును స్వాధీనములోనికి దెచ్చును. ఆత్మ యొక్క ఆజ్ఞలకు శరీరములోబడి, ఆజ్ఞలను నిర్వర్తించునట్లు జేయును; ఆత్మతేజమును హెచ్చించును. ఉపవసించు మనుజుడు ఆత్మశక్తి నపారముగ వృద్ధి జేసికొనగలడు. అధర్మము నడచగలడు. దైవకృపకు పాత్రుడై హృత్కమలమున పరమాత్మను నిలిపికొని యానందింపగలడు.

ఉపవసించునప్పుడు మనస్సును కార్యదీక్షయందు లగ్నము జేయనగును. కావున ఉపవాస మనునది దీక్షలలో నొకటి. ఆత్మతేజ ముద్దీపింప జేసికొనుటకును, పరమేశ్వరుని సాంగత్యమునకును, ఆదయామయుని కరుణ వడయుటకును, ఉపవాసదీక్ష, తగిన సాధనము.

ఈ ఉపవాసదీక్ష ప్రాచీనయుగములందును, నవీన యుగమునందును, ఏమహామహు లాచరించి ఎట్టి దుర్ఘటకార్యముల సాధింపగలిగినదియు కొంచెము విచారింతము. త్రేతాయుగమున, మహాసాధ్వియు లక్ష్మియవతారము దాల్చినట్టి మహాతల్లియునైన సీత ఘోరోపవాసదీక్షచే లంకలో కృశించి రావణ సంహారమునకు కారణభూతురాలయ్యెను. ద్వాపరమున రుక్మిణి ఉపవసించి జగదీశ్వరి నారాధించి శ్రీకృష్ణుని భర్తగా బడయగలిగెను. మహాసాధ్వియైన సావిత్రి తనభర్త మరణమునకు ముందు త్రిరాత్రోపవాస మొనర్చి భర్త ప్రాణముల తిరిగి సమవర్తినుండి పొంది మనోభీష్టమును పొందగలిగెను. ఇట్లనేకమంది సాధ్వీమణు లెందరెందరో ఉపవసించి దుర్ఘటకార్యముల సాధింపగలిగిరి. ఇక పురుషపుంగవు లెందరో ఉపవసించిరి. శ్రీరామచంద్రమూర్తి పట్టాభిషిక్తు డగుటకు పూర్వ ముపవసించెను. లక్ష్మణమూర్తి ఘోరోపవాసదీక్ష బూనినట్లు నిదర్శనములుగలవు. కౌరవ వీరుడైన భీష్ముడు మోక్షమును పొందుతలంపున శరతల్పగతుడై యుపవసించెను. బుద్ధదేవుడు జ్ఞానోదయమునకు పూర్వ ముపవసించెను. ఏసుక్రీస్తు ప్రభువు నలువదిదినములు ఘోరోపవాసదీక్ష బూని సైతానును జయించి భగవంతుని కరుణకు పాత్రుడయ్యెను. ప్రవక్తయైన మహమ్మద్ ఉపవసించి లోకమున భగవంతుని ఆదేశమును వెదజల్లెను. 'రమ్‌జాన్' అను ఉపవాసదీక్ష నెలకొల్పెను. ఇక నవీనయుగమున మహాత్మగాంధి ఘోరోపవాస దీక్షలబూని ఆత్మతేజ ముద్దీపింప జేసికొనెను.

కావున ఉపవాస దీక్ష సామాన్యమైనదికాదు. ఇది పవిత్రకార్యము. ఇయ్యది భగవంతుని ఆదేశములలో నొకటి. స్థూలదృష్టితో విచారించిన ఉపవాసము వలన అజీర్ణాది రోగములు నిర్మూలమై శరీర రథమును నడుపగలుగుటకు మన కవకాశ మేర్పడుచున్నది. ఇట్లు ఉపవాసదీక్ష ఐహికాముష్మిక ఫలప్రదము.

# వింతమార్పు

శ్రీమతి పుదూరువెంకటమ్మాళుగారు

'యేమేసుసీలా, వూరికే యెందుకే అల్లా ధుమధుమలాడుతుంటా?'వన్నాడు-లేసుఅల్లుతున్న భార్యనుచూచి—కాంతారావు.

సుసీల:—మరే!!నేనే యెప్పుడుచూసినా ధుమధుమలాడుకుంటూ, మెటికలు విరచికొంటూ, మూతిముడుచుకొంటూ అస్తమానం మీకు కనుపిస్తాను. పాపం! మీ అమ్మో? మూసినముత్యం పాసినపగడం!! ప్రొద్దుటినుంచి ఆవిడ అల్లా రాల్చిపోస్తూవుంటే మీకుచెవుడువచ్చిందా? అల్లారాల్చిపోయడానికి నే నేంజేశాను? అంట్లుతోవమంది. తోవనన్నాను. నాకేమికర్మం! అంట్లుతోమితేగాని నాకుసాగదా? అంట్లు తోమనన్నానని 'అయ్యో! గారాబాలకూచివే! నీవు పనిజేస్తావనుకొన్నానే తల్లీ! యేనాడైతే మా యింట్లోని కాలెట్టేవో ఆనాడే అనుకొన్నానమ్మా యెంతమాత్రం చేదోడువాదోడు కావని!!ఎల్లాఅనుకొన్నానో అల్లాగేచేస్తున్నావు. నీవే గనక పనిచేస్తే యీపాటికి సప్తసముద్రాలు యింకేపోయుండును. అయ్యో! నాబ్రతుకా యేకష్టము యెరగకుండా ఆ మహారాజు బాగానే దాటారు. నేను నీకు చాకిరీచేయటానికే యింకా బ్రతికున్నాను. రామ!! నేను యింటిచాకిరీ చేయలేక చచ్చిపోతున్నానుగదా!! చెట్టంతకోడలు చేతికంది యుంటేనాలాగేసుఖపడుతున్నారాఅంటాను. నాకే రామచంద్రమూర్తి చావన్నా బెట్టేయీపాటికి చచ్చినట్టే యింటిచాకిరీ అంతానేర్చుకొనేదాన'వని నోటికివచ్చినట్టు తిట్టి, వీరిని వారిని పిలచి నీకోడలు మంచిదికాదనియు ఒకపనికైనా సాయములేదనియు వీళ్ళకి పూటపూట వొండిపోయలేకపోతున్నాననిన్నీ బుడిబుడిదీర్ఘాలు పెట్టి అందరినోట్లో నన్ను పడేసింది. అంతా 'అయ్యో చిన్నదా చితకదా లక్షణంగా యిల్లు చక్కబెట్టుకొనే యీడు'అని నోళ్లునొక్కుకొని వెళ్లేరు. నేనేమన్నా అనుకుంటాననేనా లేకుండా యిదేమన్నా బాగుందా? యేమన్నాఅంటే మీకు కోపమొస్తుందికదూ, చాలాబావుంది!! నా ప్రాణంపోయినాసరే పనిచేయను.

కాంతారావు:—యెందుకే సుసీలా యింటనున్న కాపురము వీధిలో పెట్తావు? చెప్పు ఆవిడమాత్రం బలంగావుంటే యీపాటికి పెదవి కదల్పకుండా చేసేదికాదుటే. పాపం బలంలేదు. నీవు సాయంచెయ్యావ్. యెల్లాచేస్తుంది చెప్పు. నీవు కొంచెం పని చేస్తే ఆవిడ ఓపికకి తగ్గపని ఆవిడచేసి నిన్ను అప్పుడే నంటపొయ్యిదగ్గిర పెట్టకుండా చేస్తుందే! ఏడాదిఅయింది కదా కాపరానికొచ్చి ఒక్కపనైనా చేస్తున్నావేమో నీవే చెప్పు. పోనీ పంజేసేదన్నా లేదుకదా మొన్న మొన్నటిదాకా యేదో యెప్పుడన్నాతోస్తే అలికిన యింటికైనా ముగ్గుపెట్టేదానవు. యిప్పుడదీలేదుగా!!యెంతసేపు నీకు నీషోకులతోనే సరిపోతోందిగదా! కొంచెంగూడ అయ్యో ఆవిడిచేసుకోలేదని నీకు తోస్తుంది. పక్కింటి రమణమ్మచూడు: ప్లీడరుకూతురు పుట్టింటిలో యెంతైనాగారాబంగా పెరిగిందే!!

అవుతేమాత్రం అత్తారింట్లో సకలమైనపనులు చేసి భర్తకి అత్తగారికి కింద అరికాలుమోపకుండా చేస్తూంది. నీకేం!! వూళ్ళోవాళ్ళంతా పలాని కాంతారావు పెళ్లాము సుసీల అత్తగారిని యేడిపిస్తోందని చెప్పుకుంటుంటే చాలా తలవంపుగావుంది సుమా!!

సుశీల:—(కోపంతో) పాపం వూళ్లోవాళ్లంతా సుశీల సుశీల అని వూరికే అనుకొంటున్నారంటూ రెండుకూ, నేజేసేది తప్పుపని అయితే అందరు గడ్డిపెట్టచ్చు. ఇదేం కర్మం అంట్లుతోమటం పేడచేయటం మావాళ్లు నాకు నేర్పలేదు ఏంచేయమంటారు?

కాంతారావు:—ఆపన్లు రెండుమాంతే యింకచేయాలసినపనులు యెన్నివున్నాయి చెప్పు.

సుసీల:—అయ్యో! యిదంతా నాపాపం కాబోలు; ఆడాళ్లెల్లాగో యేడుస్తారు. మధ్య మీకెందుకు పిల్లతల్లి బాగుండగా మంత్రసాని గండంలాగా మధ్య మీకేంకష్టం!!

కాంతారావు:—అయితే యింకా చేయాలసినపను లేవీలేవ్వా?

సుసీల:—లేకేం చాలావుంటాయి. నేను లేదన్నానా యేమిటి? వీధిలో వూడుస్తుంటే మావాళ్లెవరైనా చూశారంటే ఆక్షేపిస్తారు. ఫలాని మాధవరావుగారికూతురు సుశీల వీధి పాచిచేస్తుందంటే మాఅమ్మకి మానాన్నకీ గాకుండా మాఅక్కలకీ అన్నలకీ ఒకటేమిటి అందరకీ అగౌరవమే.

కాంతారావు:—ఆడది యింట్లో పని చేసుకుంటే యింతమందికి అగౌరవమా?! యేంబావుంది.

సుశీల:—మధ్య మాటాడుతారెందుకూ చెప్పేదంతా పూర్తిగా వినండీ! యింక నీళ్ళు తోడాలంటే యీగుంటూరు నూతుల్లో నీళ్లు తోడలేనుబాబూ,ఒకవేళతోడేనా చేతు లెఱ్ఱగాబొబ్బలెక్కి పుళ్లవుతాయి. యింక బట్టలుతుకుతుంటే పక్కింటివాళ్లంతా కొత్తగా చాకలిదెవరైనావచ్చి బట్ట లుదుకుతోందా అనుకుంటారు. యింకగదు లూడుస్తుంటే యెవరైనా చుట్టాలువచ్చారంటే ఏమండీ కావమ్మగారూ, ఈపనిజేసేమనిషిని యెప్పుడు కుదుర్చుకొన్నారండీ అంటారు. యిలాంటి చిక్కులు చాలావుంటాయ్ యిలాంటివివున్నప్పుడు యేలాగండీ చేయడం అని ఓ లెక్చరిచ్చేటప్పటికి

కాంతారావు ఆశ్చర్యపడి 'అయ్యో! సుశీలా నీవెంతయు వివేకంగలదానివి కాకపోడం నాపూర్వ జన్మపాపంసుమా? ఆడది యెంతమాత్రం యిల్లా ఆలోచిస్తూవుండి యిల్లావుంటే కాపురాలు యెల్లా గట్టెక్కుతాయి చెప్పు? యెందుకే అల్లా ధుమధుమలాడుతూ వుంటావన్నాననేకదా యింత మట్టుకువచ్చింది. పాపం మాఅమ్మనిచూస్తే యెల్లాంటివారికైనా జాలేస్తుందే!దానికితోడు చేదస్తంచేత ఒక్కొక్కపని ఒక్కొక్కగంట చేస్తూవుంటుంది. అల్లాంటప్పుడు పనికి ఓపిక లేక సాధిస్తుందంటే తప్పా? యింకైనా నా మాట వింటావా! వినవా?

సుశీల:—చీ!తీద్దుకూ నేర్చుకపోయారు. యెవరన్నావింటే నవ్విపోతారు!! నాకు వంద చెప్పండి వెయ్యిచెప్పండి నేను పనిచెయ్యనూ. అంతగామీకు భారంగావుండి సాధిస్తూ

వుంటారా పుట్టింటికెళతాను పంపెయ్యండి అంది సుసీల లోపలి కెళ్లుతూనూ.

కాంతారావు:—దీనికి చెవితేవినదు. మా అమ్మనందామనుకొంటే నానాచాకిరి చేస్తూ వున్నప్పుడు ఓపికలేక విసుక్కొంటేమాత్రం ఎందుకమ్మా అల్లావిసుక్కుంటావని నే నే మొఖంపెట్టుకొని అనను (అని ఆలోచించు కొంటూ)సంవత్సరంనించి యిల్లాయేడుస్తోంది కాపురం. యేవన్నా అంటే తిండితిందు; యేడుస్తుంది. ఆకదిల్లావుంటే యెల్లాగాకాపురం చెయ్యడం!!నేను చెప్పడమేతప్పు. ఒకటీ దాని కెక్కటంలేదు. ఆతల్లిదండ్రి దరిద్రులు యిల్లాపెంచారు, వెధవపెంపకం!! (అని విసుక్కొని బంకెమీదవున్న కండువాతీసుకొని బయలుదేరాడెక్కడికో.)

కాంతమ్మగారు బయటనుంచి "సుసీలా! పెట్టెలో తెల్లపంచ యీలాపారే ఆరేస్తాను మడి కేమీ బట్టలులేవూ యేమీలేవు.అంది.

సుసీల:—పెట్టెలోనున్న తెల్లపంచెతీసి ఆవిడకాళ్ళదగ్గరకు విసిరేసింది. మల్లెపూవు లాంటి పంచెదుమ్ముచే నల్లబడిపోయింది.

కాంతమ్మకి దానిని చూడ్డంతోటే ఒళ్ళు తెలియని వెర్రికోపంతో, ఒసే. పొగరు బోతా, నీకేం పోయేగాలమువచ్చిందే మల్లె పూవులాంటి పంచ మట్టిలో మండబెట్టేవూ నీకు వళ్ళుతెలియటల్లేదేమిటే దౌర్భాగ్యు రాలాయని కేకలువేసింది.

సుసీల:—ఏవిటమ్మా నేనేం జేశానని అల్లామాట్లంటారు. పంచెపారెయ్యమన్నారూ పారేశాను. యిష్టంలేకుండావుంటే మాట్లాడ్డంమానెయ్యండి అంది.

కాంతమ్మగారు:—యేమే నంగనాచీ, తప్పువనిచేసి మళ్లీ పంచెపారేశాను, ఏతప్పూ అంటావా? వుండు నీపొగరణుస్తా కాంతం రానీ అంటూ కోపంతో వెళ్లిపోయింది.

యింతలో కాంతారావువచ్చి జరిగిన సంగతిఅంతా విన్నాడు. సుశీల యెంతమాత్రము యింకవూరుకుంటే బ్రహ్మదేవుడికైనా సాధ్యమవ దనుకొన్నాడు. దండనచే పెంకితనము పోగడ్తామా అనాలోచించాడు. మళ్ళాఎందుకు ఇదో అల్లరికూడాను అనుకొన్నాడు. ఎవరిని యేవనకుండా తనగదిలోకి పోయి తక్షణం మామగార్కి వుత్తరం రాశాడు. మర్నాడు ప్రొద్దున్న మెయిల్‌లో సుసీలను పుట్టింటికి పంపాడు.

అక్కడ తనవదినగారు తల్లికిచేయు సపర్యలను కళ్ళారచూసింది. తనతల్లి కోడళ్ళపై చూపు ప్రేమాతిశయముకి ఆశ్చర్యపడింది. తనవదినగార్లు తనతల్లిని అత్తగారూయని నోరారబిలవడం అమ్మాయీ కామాక్షమ్మా సుందరమ్మాయని తనతల్లిపిలవడం తనవదినగార్లు కాపురముకి వచ్చింతరువాత యిదివరకున్న పాలేళ్ళనుతీయించి పేడవూడ్చుట మొదలగు పనులయందు ఎంతశ్రద్ధగావుండడం చూసింది. తత్క్షణమే సుశీలకి క్రొత్తవూహా తట్టింది. మునుపటిలాగా తల్లి తండ్రి ఎక్కువప్రేమగావుండక మామూలుగానే వుండుట గ్రహించింది. తనుకూడా దాసీయే కదా అనుకుంది. తనవదిన్లూ పుట్టింటగారా బంగాపెరిగినవారేకదా అనుకొంది.తనవదినల మీద తనతల్లి యెంతప్రేమగా చూస్తోందో

తమభార్యల సుగుణముల కెంత సంతోషిస్తున్నారో, తననిగూడా మంచితనముగావుంటే తినఅత్తగారు భర్త యెంతప్రేమగా వుండే వారో అనుకొని చాలాసిగ్గుపడింది. యిది వరకులాగా పెన్నాళ్ళు పెంకితనంగావుంటే చేజేతులకాపురము కూలదోసుకొందును కదా అనుకొని చాల విచారించింది. యేముంది. భర్త సుశీల పట్టుదల చూడలేక పోతే పనిచెయ్యని ఆడదియెందుకని విడిచి వేస్తే విడవవచ్చును. తక్షణమే తండ్రితో అత్తవారింటికి తీసుకెళ్ళమంది. సిద్ధంగానే వున్నాడు. కనక అప్పుడే రైలెక్కించి తీసుకు వచ్చాడు. వెళ్ళగానే వత్తులుచేసుకొంటూ గోవిందనామము జపించుకొనుచుండిన ముదుసలి అత్తగారిని చూసింది. అత్తగారూ తెలియక చేసినతప్పులని క్షమించమంది. బుద్ధి తక్కువచేత ఒళ్ళుతెలియక మీకు అవచారపడ్డానని సాష్టాంగపడింది. అత్తగారు ఆశ్చర్యపడి అయ్యో నీవెందుకే దండంపెడతావు. నీవేమిచేశావేఅంతతప్పునాదే: చాల్లేవేఅంది. సుసీలలేచి అత్తగారూ, అల్లా యెప్పుడు అనొద్దు; ఇవాళనించి అన్నిపన్లుచేసి వంట గూడా నేనే చేస్తానని గబగబ లోపలికివెళ్లి స్నానంచేసి వంటవండేసుకు కూర్చుంది మొగుడొచ్చేటప్పటికి. మొగుడాశ్చర్యపడి యేమేవ్ సుసీలా నీవు వంటజేస్తున్నావేమిటే యెవరైనా చుట్టాలొచ్చారంటే ఏవండీ కాంతారావుగారూ వంటమనిషిని యెప్పుడు పెట్టుకున్నారండీ అంటారు"అని పకపకనవ్వాడు. సుసీల నవ్వుతూ చాల్లెద్దురూ ఎవరున్నావింటే నవ్వుతారంది. ముసలమ్మ మాకోడలికి నెలతప్పిందనిమురుస్తూంది.



## నిశ్చయము

కర్లపాలెం కృష్ణరావుగారు

[రవీంద్రుని 'గీతాంజలి' నుండి స్వేచ్ఛానువాదము]

౧

అస్మదీయాంగకములెల్ల, నతిపునీత
మయ్యె, నీ సజీవ స్పర్శనందియుంట,
గాన, ప్రాణంపు ప్రాణమా! ఏ నికెప్డు
అన్యమంటను, దేనికి నాశపడను.

౨

హృదయపీఠాన నిన్ బ్రతిష్ఠించుకొంటి
గాన, వికసించె ప్రేమప్రసూన, మింక,
చీకుచింతల నాదరి, జేరనీను
గానమొనరింతు తమిని నీలోన గలియ.

౩

నాయొనర్చు సమస్త యత్నంబులందు,
శక్తిసామర్థ్యముల నిచ్చి, జయము గూర్తు
వీవె, గావున, ప్రీతితో నెల్లపనుల
ప్రతిఫలింపగ జేతు,నిన్ బ్రౌఢిమెరయ.

౪

మంచిచెడుగుల గుర్తించి, సంచరింప,
నొక మహావెల్గు నాలోననుంచి తీవు
గాన నికమీద కల్లలు కపటములను
తరిమివేసెద రానీక తలపులకును.

# నాఁటి గృహలక్ష్మి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం;ఏ. బి;యల్.

మానవజీవనమును సార్థకముచేయునది ఆత్మశక్తి. ఈశక్తిజ్యోతిని తనుపుతైలము హృదయమందు తోలు కాదు సద్భావము. ఉత్తమగుణమరీచికాగుచ్ఛమైన చరిత్రము పూతహృదయమున వెలుఁగు ప్రదీపము. ఉత్తమచరిత్ర కవికలమునుండి దొరలు అత్యుక్తి కాదు; గాయకుని మధురోక్తినుండి ఊరకనుప్పొంగు గీతతతి కాదు. ప్రత్యక్షప్రపంచమున ప్రభాకలితమై తేజరిల్లు ఆదర్శమయ ఆలోకము! ఈఆలోకము అనవరతము కనులఁబడునది కాదు.—అన్నిచోటులందు కాంతిలునది కాదు. కాలపరిస్థితులును, దేశస్థితులును, బహువర్షములనుండి పెంపొందు సాంప్రదాయములును, చిరసాధనములును కలిసి ఆదర్శ చరిత్రమును భాస్వరితమైన దివ్వెఁజేయును. ఇట్టి చరిత్ర ప్రాచీనభారతమున తేజరిల్లి సభ్యప్రపంచమునకు మిరుమిట్లు గొలిపెను. యిట్టి చరిత్రము పురుషులందుకంటె స్త్రీలందు విశేషముగా ప్రకాశించినది. ప్రాచీనభారత సారస్వతమును పరిశీలించితిమేని, ఈ నుడువును ఋజువొనరించు దృష్టాంతరములు ఎన్నేని గోచరించును.

వాత్స్యాయనుని 'కామసూత్రము' భారతప్రాచీన సాంఘికపరిస్థితులను తేటతెల్లముగ తెలుపుచున్నది. ఈయుద్గ్రంథము వెలువడిన సమయమును గుఱించి పండితులు వేఱువేఱు అభిప్రాయములను వెలిబుచ్చిరి. మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి, డాక్టర్ పీటర్‌సన్, ప్రొఫెసర్ బటుక్‌నాథ భట్టాచార్య, ప్రొఫెసర్ జాలీ, కె.పి. జయస్వాల్, ప్రొఫెసర్ ఎ. బేనర్జి, ప్రొఫెసర్ వింటర్‌నిజ్ మున్నగు విద్వాంసులు ఈసమయమును గుఱించి తెలిపిన అభిప్రాయములందు ఇంచుక భేదము కానుపించుచున్నది. ప్రొఫెసర్ హారన్‌చంద్ర చక్‌లాదర్ వ్యక్తీకరించిన ఋజువులు పలువురచే ఆమోదింపఁబడినవి. క్రీస్తుశకము మూఁడవశతాబ్దమునకు నడుమ వాత్స్యాయనుఁడు 'కామసూత్రము'ను రచించెనని ఈతఁడు నిరూపించెను.

గృహస్థునకు నాగరకజీవనము అపేక్షణీయమైయుండెడిదనియు, శృంగారసరములందాతఁడు ఓలలాడువాఁడనియు స్పష్టవాక్కులందు వాత్స్యాయనుఁడు తెలిపెను. విలాసామోదములందు తేలియాడక కర్తవ్యనిర్వహణమున స్త్రీ, ఆకాలమున తనజీవనమును గడుపుచుండెడిది. ధర్మశాస్త్రములందు నిరూపింపఁబడిన ఆదర్శ స్త్రీలక్షణములు ఆదర్శములై అట్టె నిలిచియుండలేదు. ఈమహద్గుణములను తనకాలమందలి వనిత ఆచరణమందుఁబెట్టెనని తెలుపుచు, వాత్స్యాయనుఁడు ఎన్నేని దృష్టాంతరములను పేర్కొనినాఁడు. పతియెడల నీమె చూపుచుండెడి ప్రేమ నిరుపమానమైనది. తానుపాసించు దేవునియెడల ఉపాసకుఁడు చూపు భక్తికిని, భర్తయెడల నీమె చూపు భక్తికిని, ఆవంతయైన వ్యత్యాసములేదు. దైనికజీవనమున పతికివలయు అక్కఱలను బాగుగ గుర్తించి, ఏమరక వాని నాతనికామె చేకూర్చుచుండెడిది. భక్ష్యపానీయములనే కాక, అతని ఆనందశృంగారములకు సముచిత సంభారములను సమకూర్చెడిది. పతిరుచులను, అరుచులను బాగుగ గ్రహించెడిది. నిజేశుని నెచ్చెలులు గృహమున కరుదెంచినపుడు, బహుభంగుల వారిని బహూకరించి, బహుమానములొసఁగి, నిండారుభక్తితో వారికి అతిథిసత్కారము సలిపెడిది. అత్తమామలయెడల నడకువ మెయివర్తించుచు, వారి ఆదరానురాగములు అందుచుండెడిది. చుట్టములపట్ల ఆమె చూపు గౌరవము అనల్పమైనది. పరిచారకులదెస కరుణాదృష్టి పఱపి, వారి కష్టనిష్ఠురములు తనవనియెంచి, పిడికిలిమాయక వారి అక్కఱలు తీర్చుచుండెడిది. అవ్వలినుండి పతి

యింటికి మరలుతఱి, ఎదురేగి, ఆతనికి వలయు పరిచర్యకై పరిచారకులను నియోగింపక తనంతదానే నెరపుచుండెడిది. ఆటలం దాతనివెంట చనుచుండెడిది. మనసు నొప్పించు మాటలాడిగాని, మఱే తీఱునఁగాని పెనిమిటి తనయెడల అనుచితముగ వర్తించినను, కటూక్తులతో నుత్తర మొసఁగునది కాదు. పతి అనుమతినందియే, తోడి నెచ్చెలులను గూడి ఉత్సవములను చూచుటకై ఆమె యరిగెడిది. హృదీశుఁ డెఱుఁగకుండ, ఆమె ఏమియు బయలకొసఁగునదికాదు. తన నడతను గుఱించి పతి అనుమానింపనిరీతిని మిగుల మెలఁకువతో ప్రవర్తించెడిది. సంశయచారిత్రలదెస కన్నెత్తక, కలుషితలైన యోగినుల దాపలఁజేరక, నాట్యకత్తెలపొందు నపేక్షింపక, 'మూలకారిక'లను శాంబరక్రియలం దాఱితేఱిన వారిని చెంగటఁ జేరనీయక, ఏకాంతప్రదేశములందు మసలక నాఁటిగృహిణి అప్రమత్తయై మెలఁగియుండెడిది. పెనిమిటి అనుజ్ఞనంది వివిధకళలందు పరిజ్ఞానము పడసెడిది. తఱచుగ పతియే ఆమె కాచార్యుఁడై యుండువాడు (Vide Kama Sutra page 28—Sutras 2 and 3; page 197—Sutra 36; page 310-Sutra 9) 'స్వప్నవాసవదత్తము' యొక్క ఐదవ యంకమందు తనపత్నిని 'హా ప్రియే! హా! ప్రియశిష్యే' అని ఉదయనుఁడు సంబోధించిన దృష్టాంతరమును అధ్యాపకుఁడు చక్లాదర్ పేర్కొనినాఁడు. మహాకవి కాళిదాసు రఘువంశమును చదివినవారు, ఇందుమతీవియోగమునకు చింతిలుపతి అజుడు 'ప్రియశిష్యా, లలితకళానిధి' యనుపదములు (Vide Raghuvamsa Viii 57) వాడిన ట్లెఱిఁగియుందురు.

ప్రాచీనయువతి సహనమునకు రెండవపేరు; మితముగ నామె భాషించును; బిగ్గఱగ మాటలాడుటామె ఎఱుఁగదు; నలుగురు వినునట్లు నవ్వదు. అత్తమామ లేమనినను ప్రతివచన మొసఁగదు; అతులైశ్వర్యమున తులదూగుచున్నను, ఆడంబరముఁగాని గర్వముగాని ఎఱుఁగదు; సామాన్యవస్త్రములనే ఆమె ధరించును; ఉత్సవసమయములందు అవ్వలి కరుగునపుడు కొలఁదినగలను దాల్చును; మెత్తనై, చక్కనైన వలువలుగట్టును; చందన లేపనములను, సుగంధ ద్రవ్యములను, అల్పముగ వాడును; తెల్లపూవులనే అలంకారమునకై ఉపయోగించును; పని చేయునపుడు ఇంపుసొంపులనటించును. శుభ్రశరీరయై, కురులను చక్కగ దువ్వికొనును. వివిధ నగలను దాల్చును, వేర్వేరు రంగులతో నొప్పు సురభిళ కుసుమములను చేకొనును. సుగంధతైలముల నుపయోగించును. సర్వాంగసుందరియగును; పుష్పమాల్యములను కంఠమునదాల్చును; శిఖయందు పూవులు దుఱుముగు; చెవి నగలపై ఎక్కువ మక్కువచూపును. నొసలు మీఁదను, చెక్కిళ్ళపైనను వివిధరీతుల రంగుచిత్రములను రచించును; ఈచిత్రములందు ఒక్కొకపుడు తమాలపత్రములను తదితరపర్ణములను ఉపయోగించును. (Vide Kamasutra page 124—Sutra 19; page 206—Sutra 32; also Saunderananda Kavya Chap. Iv,) కొన్నినగలనైనఁ దాల్పక పతియెదుట-ఒకర్తుకయై ఉన్నపుడైనను—ఆమె నిలువరాదని వాత్స్యాయనుఁ డనెను. (Vide! Kmasutra page 226—Sutra 13) యాస్కునికాలమందు కూడ నీభావముండెడిదని ప్రాచీనభారత సారస్వతము తెలుపుచున్నది. ప్రేమరూపిణియైన పత్ని అమూల్యాంబరములుదాల్చి నిజేశునిమ్రోలనిలుచు లీల, తనయందలి భావమును గుర్తించు వాని కనులెదుట వేదము తోఁచునని యాస్కుఁడనెనను. కనీసము నాల్గు తూరులు ఋగ్వేదమందు ఉల్లేఖింపఁబడిన భావమునే యాస్కుఁడిచ్చో దెలిపినందున, ఇది కడుప్రాచీనమైన భావమని బోధపడుచున్నది. (The Vedic Passage quoted lypraf. Peterson is జాయేవ పత్యఉశతీ సువాసాః Rvi. 124. 7; See also Iv. 3. 2; X 71. 4 and X 91. 13. Of also జాయాపతిమివవాససా Av X VIII 2. 51) పతి అవ్వలనున్నపుడు పత్ని దుఃఖితయై యుండును; నగలను విడచివైచును; దువ్వలువలు వదలును; వివాహితయని తెలుపు శంఖపు మురువుల నొకజత మాత్రము దాల్చును' ఉపవాసములు సలుపును; లేఁబవలులు

దేవతారాధన మొనరించును. అత్తింటి సన్నిహిత బంధువులయిండ్లకైన పోదు; వారాపత్కాలముం దున్నపుడు మాత్రము తన నియమమును సడలించి ఆమె చనును; పూజాది సత్క్రియలు జరుగువేళలందు ప్రవాసవేషమును మార్పక చుట్టములకడ కరుగును. అపుడైనను, పెనిమిటివైపుబంధుగులను దోడుకొని చని, అచిరములో మరలివచ్చును. పతి యింటికి మరలుతఱి ప్రవాసవసనములతోడనే ఆతని కెదురేగును; పదంపడి దేవపూజసలుపును; ప్రేమదేవుని ఉపాసించును; అన్నదానము చేయును; పక్షులకు ఆహారమిడును.

గృహదేవాలయమున త్రికాలములందు పూజలను సలిపి, గృహధర్మమునకు సంబంధించిన నిత్యకర్మలను, దానాది సత్క్రియలను నెరపును. భర్త జరుపవలయు ఉపవాసములను, మ్రొక్కులను తానే సలుపును. ప్రాణపతి కైశ్వర్యము లభించినపుడును, ఏదేని పూనికయందాతడు విజయుండైనపుడును, రోగపీడితుండై ఆతం డారోగ్యలాభ మందినపుడును ఇష్టదేవతల కామె మ్రొక్కుబడులు చెల్లించును. **(Vide! Kamasutra —Page 311; Sutra 20 )** ఏదేని దేవతను కొలుచుట ఆమె ముఖ్యవాంఛలలో నొక్కటైయుండెను. (దేవతానాం పూజోపహార ప్రవర్తనమ్ **Kamasutra Page 340.—Sutra 25.**) వాత్స్యాయనుడు తెలిపిన ఆదర్శపత్నీ లక్షణములును, సిద్ధార్థునకు అర్ధాంగిని కోరుతఱి శుద్ధోదనుండు వాకొనిన లక్షణములును భేదరహితములైనవి. **(Vide! Libita-Vistara cbapter XII).**

తన యేలిక అనుజ్ఞబడసి కుటుంబభారమునంతయు పత్ని తనతలం దాల్చును. వార్షిక ఆదాయము నెఱింగి, ఆయమొప్పురీతిని పైకము నామె వెచ్చించును. దైనిక ఆయవ్యయములను ఎప్పటికప్పుడు తానే చూచుకొనుచుండును. ఈకర్తవ్యము భార్యపై నుండవలెనని మనువు స్పష్టవాక్కులం దెలిపెను (అర్థస్యసంగ్రహేచైనాం వ్యయేచైవ నియోజయేత్ **Manu X.II.** సాంవత్సరికం ఆయం సంఖ్యాయ తదను రూపం వ్యయం కుర్యాత్ **Kama Sutra Page 229—Sutras** 332—33). తన ఆదాయమునకు మించిన వ్యయ మొనరించునపుడు, రహస్యముగ నామె పతిని మందలించి, ఆతని యుద్దేశములను నిరోధించును. గృహోపయోగమున కక్కఱయైన సంబారములను కూడంబెట్టి, వెచ్చమగు కొలది తగు సమయములందు లోటువస్తువుల నామె నింపుచుండును. గృహనిర్వహణమునకు వలసిన గణితమందామె సిద్ధహస్తయైయుండును. పరిచారకుల జీతములను చెల్లించి, సేద్యమునకు వలయు వ్యవస్థసలిపి, పశువులను మిగుల కాపాడి పతిచేర్చు పెంపుడుపిట్టలను, జంతువులను మిగుల జాగ్రత్తతో నామె కనుపెట్టుచుండును. గృహము నంటియుండు తోట రమ్యమై, క్రమాభివృద్ధినందుటకు వలయు యత్నములను గృహిణి స్వయముగ జరపికొనును. పతి యింటలేనపుడు, ఆతని వ్యాపారములన్నిటికిని తానే అప్రమత్తయై చక్కబెట్టుచు, యజమానిలేని లోపమును దల యెత్తనీయకుండును. ఇట్టి సమయములందు సాధ్యమైనంతవఱకు ఆమె యింటిఖర్చును తగ్గించివేయును. విశ్వసనీయులగు పరిచారకుల మూలమున వలసిన క్రయవిక్రయములను జరపించి, కుటుంబధనమును వృద్ధిగావించును; వంటయింటిపనిని తానే జరపుకొనును; తీఱిక వేళలందు నూలువడకును. బట్టలు నేయును. ఆర్థికముగను, నైతికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను, పరిపూర్ణత్వ సిద్ధినందిన సీమంతినీ చూడామణి.



# ఆత్మబోధ

శ్రీమతి ఎ. కమలాంబగారు

మ॥ అనుగుంబిడ్డ డటంచు నమ్మెదవు నీ వశ్రాంత మిట్లాసతో
ననువొందన్ భవసాగరంబున మహావ్యామోహమాయావశం
బున మున్ మున్ వడినట్టి పెన్ శ్రమలచే మోసంబునన్ గుందితో
మనమా, మేల్కొను మింకనైన పరమాత్మధ్యాన హృద్యస్థితిన్॥

మ॥ అనుజుల్ నందను లాత్మనాథుడు విశేషానందసంధాత లం
చనయంబున్ తలపోయుచున్ విమలవిద్యారూఢి పోనాడగా
జనునే? కష్టము గల్గునం చెరుగ వీ చాంచల్య మింకేల నో
మనమా, మేల్కొను మింకనైన పరమాత్మధ్యాన హృద్యస్థితిన్॥

మ॥ మునుమున్ గోరికలన్ ద్యజించితివి సమ్మూర్ఘస్థితిన్ ప్రస్తుతం
బున నజ్ఞాన ఘనాంధకారమున నంభోజాక్షుపాదాబ్జసే
వన సేయన్ దలపోయనైతి వకటా పల్మారు నిన్ వేడెదన్
మనమా, మేల్కొను మింకనైన పరమాత్మధ్యాన హృద్యస్థితిన్॥

మ॥ అనువొందన్ దను వస్థిరంబు నిజకర్మాధీనతన్ ద్రోచునాఁ
కనివాసాదిసుఖంబు లస్థిరము లింకన్ సుస్థిరానందవ
ర్ధన సౌభాగ్యము మాధవస్మరణచేతన్ పొందనోగాన నో
మనమా, మేల్కొను, మింకనైన పరమాత్మధ్యాన హృద్యస్థితిన్॥

మ॥ తనుభావంబుదలంప నామఘటమధ్య స్థాంబుసాదృశ్యమై
దనరుం జూడ ప్రతిక్షణక్షరము వంధ్యాపుత్రచారిత్ర లీ
ల నెసంగున్ వెస భూరిసంసరణ మీలాగంచు యోచించియో
మనమా, మేల్కొను మింకనైన పరమాత్మధ్యానహృద్యస్థితిన్ ॥

వాల్కుర్చీలో కూర్చుని వార్తాపత్రిక చూచుకొంటున్నాడు ప్రసాద్. 'ఈపండుగ కేనా గాజులు చేయించరా?' అంటూ పైట సవరించుకొంటూవచ్చి సమీపంగావున్న కుర్చీలో కూర్చుంది లక్ష్మి. ప్రసాదు తన ధోరణిలోనే యున్నాడు.

మిమ్మల్నే మాట్లాడరేం.

ఓహో! యెప్పుడు దయచేశారేమిటి రాణీగారు? అంటూ పత్రిక టేబుల్పై నుంచాడు.

'తెలియనట్లు నటించడం బాగానేర్చారు'.

'నీవువచ్చిన సంగతేమిటో చెప్పు'.

'ఈపండుక్కైనా చేయించరూ?'

'ఏపండుగ? ఏంచేయించాలి?'

'సంవత్సరాది! గాజులు చేయిస్తానని మీరే కాదూ అన్నారు'.

'నే చెప్పినమాటవింటే చేయిస్తా' నన్నా.

'అరవై య్యేళ్ళొచ్చాక చదువుకోక మన్నుకొట్టుకోనా' అని యిక నాకేంచదువు'.

'నీవడిగిందికూడా అంతే అనుకో'.

'ఈ చదువుగోలతో చచ్చేయోగ మొచ్చింది' అని సణుక్కుంటూ వెళ్లింది ప్రసాదు పురమందిరంకు వెళ్ళాడు.

'లక్ష్మి వంటయిందా? త్వరగా వెళ్లాలి వడ్డించు'.

'కంచం పెట్టుకోండి వడ్డిస్తా'.

'బెండికూడా ముట్టుకోని విధవాచారం యెవరునేర్పారు?'

'ఈ ఒకరోజేకదా నేముట్టుకోను. తిడితే యేలా చెప్పండి'.

'ఏం యివాళ ముట్టుకుంటే'.

'సంతతిశుక్రవారం నోము. యిక ఒక యేడేవుంది. యీమాటు మాఅమ్మగారింటికి వెళ్లినప్పుడు వుద్యాపనచేసుకుంటా లెండి.'

'కాస్త అక్షరంముక్క వచ్చుంటే యీ పిచ్చివేషా లుండకపోను'.

'ఇక మొదలు మాట్లాడితే చదువుచదువో అన్నమాటే కదా'.

'నీకేంబాధ? నామాట నీచెవి కెక్క నీయవుకా!!'

'చదువురాకుంటే? సంసారనిర్వాహణాన్కి యేమన్నాలోటా?'

'లోటుకాదూ! రూపాయి చిల్లరతీసుకో వలసినచోట రెండవకాలు తక్కువగా తీసు కొంటావు. చాకలి ప్రతీమాటు బట్టలు పారవేయడం. నీవు తెలుసుకొనుటలేదు. లక్ష్మి, నీకిదేచెప్పడం చదువునేర్చుకొనకుంటే నీతో మాట్లాడను తెలిసిందా.'

'టౌనుహాలునుంచి వచ్చేవరకూ మాట్లా డరుకాదూ?'

'నీవువిద్య నభ్యసించేవరకూ!'

'నిజంగా? యీలాచూడండి నావైపు.'

'కోటుచిరిగి పోతుంది వదులు.'

లక్ష్మిఅంటే పంచప్రాణాలు ప్రసాదుకు. కాని చదువుకోమని యెన్నివిధాల చెప్పినా వినదికాదు. చదువుట నేర్చుకొంటే నీవడిగిన

వల్లా చేయిస్తానన్నాడు. ససేమిరా అంది. లక్ష్మితో మాట్లాడ్డం మానేసి చూదామనుకున్నాడు. తమాషాకన్నా డనుకుంది లక్ష్మి. అంతప్రేమగా ప్రవర్తించే భర్తతో పలకడం మానేస్తాడని కల్లోకూడా అనుకోలేదా వెఱ్ఱిబాగులపిల్ల!! భార్యాభర్తల కిరువురకూ వాగ్వాదం జరిగిననాటినుండీ లక్ష్మితో పలుకుట మానినాడు. అనేకవిధాల భర్తను పలుకరించి చూచింది లక్ష్మి. జవాబియ్యలేదు ప్రసాదు. లక్ష్మికూడా అతన్ని పలకరించటం విరమించుకుంది. చెల్లెల్ని చూచి వెళ్ళటానికి వాళ్ళన్నయ్య వొచ్చాడు. సంగతి సందర్భాలన్నీ గ్రహించాడు. వెళ్ళి తండ్రి చెవులో వూదాడీ సంగతి. కుమార్తె బాగోగులుచూచే నిమిత్తం ఆయనవచ్చారు. కూతుర్ని సంగతేమిటని యెన్నివిధాలడిగినా తగిన సమాధానం రాలేదు. అమ్మాయిని తీసుకువెళ్ళాలని వున్నదని తనయుద్దేశ మల్లునకు తెలియపర్చారాయన. తన అభ్యంతరం లేదన్నా డల్లుడు. రావలసినదని కుమార్తెను కోరుకున్నారు. యెంతమాత్రం రావీలులేదని చెప్పేసింది నిర్మొగమాటంగా. వీళ్లిద్దరిలో యేదో గొప్పరహస్యమిమిడి వుందనుకున్నాడాయన: వచ్చిన దారినే చక్కా వెళ్లారు. ప్రక్కయింటియిందిరతో పరిచయమయింది లక్ష్మికి. క్రమేణా వాళ్ళస్నేహం వృద్ధయింది. గృహకృత్యాలు పూర్తిఅయినవంటే యిరువురూ ఒకచోటనే వుండేవారు. యిందిర విద్యావతియని లక్ష్మి గ్రహించింది. లక్ష్మి పరిస్థితులన్నీ గ్రహించింది యిందిర; లక్ష్మిని విద్యా సంపన్నురాలినిగా చేయాలని సంకల్పించింది. యిందిర అప్పుడప్పుడు గృహలక్ష్మి తెచ్చి చదివివినిపించేది. స్త్రీలకిది ముఖ్యమైన పత్రిక అనికూడా తెలియజేసింది.

లక్ష్మి—నీవునాకు చదవటం నేర్పావంటే నేను తప్పక గృహలక్ష్మి తెప్పించుకుంటా ఇందిరా.

'అదెంతసేపు నిమిషం. కాని నే నడిగిన దానికి తగిన సమాధానమియ్యి లక్ష్మి'

'నీవడగటం, నే చెప్పకపోవటంకూడానా'

'నాతో చెప్పకుండా యేదో గొప్ప రహస్యం దాస్తున్నావు కాదూ?' (అంది నవ్వుతూ.)

'నీతో చెప్పకూడని రహస్యము నాకు' అంది తలవంచి.

'దాచటంలేదని ఒట్టేయి చూదాం!'

'ఒట్టేమిటి నీ ముఖం. లేదని మాటంటే చాలదూ.'

'నీ సంగతంతా నే కనిపెట్టాను. నీవేమేనా చెపుతావేమోనని చూచా.'

'అయితే యెప్పటినుంచి చదువు ప్రారంభిస్తావు?'

'నా చదువువిషయంతో కొంతకాలం నీ విక్కడే వుండవలసివస్తుందేమో? అందుకు మీవారేమనా అంటారేమో యిందిరా?'

'అలాటి వేమీ లేకుండా నే చూచుకుంటాగా! నీవు చదుకోవాలికాని వారిచే నే చివాట్లు తిన్నా నాకు చింతలేదు.'

'నీఋణం నే తీర్చుకోలే నిందిరా నిజంగా.'

'గురుదక్షిణ సమర్పించుకుందువుగానిలే. వంటవేళవుతోంది నే వెళతానింక.'

3

లక్ష్మి విద్యాపరిపూర్ణురాలయింది. పురాణగ్రంథములు చదివి వాటి మంచి చెడ్డలు గ్రహించే శక్తి అలవడింది. కొద్దో గొప్పో ఆంగ్లమూ హిందీకూడా చదువుట వ్రాయుటా నేర్పింది ఇందిర. ఒకరోజు మధ్యాహ్నం నిలువుటద్దానికెదురుగా నిలబడి జెడ వేసుకుంటోంది లక్ష్మి. చడీచప్పుడూ లేకుండా వచ్చి లక్ష్మి కళ్లు మూసింది యిందిర.

లక్ష్మి—ఇందిరా, నాజెడ బాగారాలేదు. నీవ్వేద్దూ. కళ్లమీాద చేతులు జెడమీాదకు రానీయి.

'ఇక్కడ వుక్కగావుంది. పంచలోకి రా, అక్కడ వేస్తా.'

మాటలసందర్భాన్ని యీాలాఅంది యిందిర లక్ష్మితో.

'లక్ష్మి యిప్పటికేనా...'అని నవ్వుతూ. లేదన్నట్లు తలూపింది లక్ష్మి.

'ఛా నిజంగా.!!'

'అబద్ధమా నీతో యిందిరా.'

'ఏలావున్నావు యిన్నిరోజులు మాట్లాడకుండా? పోనీ నీవేనా మాట్లాడించి చూడక పోయినావా వేరే యేమేనా...'

'అలాటి స్వభావంకాదు వారిది. చాలా మంచివారు.'

'ఏం మంచో? యింతకాలం నీవు కనుక సరిపోయింది. మరొకరయితేనా?'

'ఎవరైనా సహించవలసిందే. మొదటి నుంచీ యీాలాటి స్వభావమైన మనిషైతే నాకీ చింతలేకపోను యిందిరా.'

'విచారించకు. నీకంటె అతను చాలా బాధపడుతూవుంటాడు.'

'విశేషాలేమేనావుంటే రేపు చెప్పుకో వచ్చు. నే వెళ్తా లక్ష్మి.'

గృహకృత్యాలు పూర్తిచేసుకొని తన గది చేరుకుంది లక్ష్మి; మామూలుగా గ్రంథకాలక్షేపణ ప్రారంభించింది. చదువుకొనుచున్న ప్రసాదు, లక్ష్మి గదిలో కెళ్లడం చూచాడు. నెమ్మదిగా లక్ష్మిగదిలో ప్రవేశించాడు. లక్ష్మి గ్రహించలేదు. లక్ష్మి పరుచున్న రత్నకంబళంమీాదే ఆమెప్రక్కగా కూర్చున్నాడు. ప్రసాదుని చూచి లక్ష్మి లేచి నిలబడింది.

'విద్యావతివగు నినుగాంచి ధన్యుణ్ణయినా లక్ష్మి. ఇలా నా సమీాపంగా కూర్చో. ఇంతకాలంనుంచీ నా ప్రవర్తనకు నీ వెంత చింతిలుచున్నావో. నీ విద్యావిషయంలో నే నే నింత కఠిన మూనవలసివచ్చింది. మరోలా గనుకోకు. ఇదిగో నీవు కోరిన గాజుల జత.'

'మీా దయవల్ల హస్తముల కలంకారమేదో గ్రహించాను. మీా వప్పుదలమీాద అవి గురుదక్షిణగా యిందిరకు యీాయదలచాను.'

'సదుద్దేశముల కెప్పుడూ ఆటంకపరచను. ఈ గాజులజతమూలాన్నే నీవు విద్యావతి వయావు కనుక యివి నీకే చెందవలసుంది. ఆమెకు మరొకజత సమర్పించుదువు గాని.'

'అంతవరకూ వీటిని నేను ధరింపను. ఇం కొక్క కోరిక మిమ్మ కోరదలచాను.'

'అదేమో అడుగు చూదాం.'

'ఇకమీద మీ రేలా నడుచుకోమంటే ఆలా నడుచుకుంటా. ఇంత కఠినయాత్ర యెప్పుడూ వహించకండి నే సహించలేను.' అంటూ కాళ్లమీద పడింది. లక్ష్మిని లేవ దీసి హృదయాని కదుముకున్నాడు ప్రసాదు.

లక్ష్మి యిందిరకు సమర్పించిన గురు దక్షిణ లక్ష్మికే చేరింది. లక్ష్మి తెలివితేట లకు మెచ్చి యిందిర మరల యిచ్చివేసింది. లక్ష్మి అనుగకపోయినా ప్రతిపండుగకూ నూతనవస్తువు తెస్తూనేయున్నాడు ప్రసాదు. ఆ ప్రేమైకదంపతులు హాయిగా కాలం గడుపుతున్నారు. ఇందిర రోజు కొకమారు వచ్చిపోతూనేయుంది.



# సాధ్వి

బయ్యా సూర్యనారాయణమూర్తిగారు

కల్లకపటము లెఱుఁగక♦నెల్లవేళ
లందుఁ బ్రాణేశు చరణార♦విందయుగళ
భజన సంజనితానంద♦భరితచిత్త
వంచు నీముఖాబ్జము వచి♦యించునమ్మ.

ప్రవిమలంబై ప్రశాంతమై♦భవ్యమంద
హాసచంద్రికా శోభితం♦బై చెలంగు
నీదు నెమ్మోముగన్గొన్న♦నిఖిలఘోర
పాపములుగూడ తృటిలోన♦బాయునమ్మ

ఘనతరాభీల చలదూర్మి♦కావితాన
భరితమైనట్టి సంసార♦ వారిరాశి
పలువిధంబుల జలకేళి♦సలుపవలను
గలుఁగు కొలనౌను నీనేర్పు♦కలిమిబలిమి.

నీవు మసలెడు తావుల♦లోవిచార
దుఃఖభయగర్వనైస్పృహా♦దులకు నిలువ
నీడయైనను లభియింప♦నేరదమ్మ
పూతభావంబులే నీకు♦భూషలౌట.

ఎపుడు నిద్దురవోవుదు♦వెపుడులేతు
వింటిపనులెల్లఁ జక్కగా♦నెపుడుదిద్దు
దాగతాతిథినికరంబు♦నాదరింతు
వెప్ప డెంతయు చిత్రమౌ♦నెంచిచూడ.

మంచిసుంతైన లేనట్టి♦మనుజుఁడేని
నిన్నుఁగాంచిన యంతనె♦నిరుపమాన
భక్తి కేల్మోడ్చి నీపాద♦పంకజముల
కెఱఁగు నిదియెట్టి శక్తియో♦యెఱుఁగనమ్మ

# మగని చెవిలో

'అనసూయ'

(తన అక్క గురించి)

మా అక్కయ్య వెంకటలక్ష్మి యింట్లో ఉంటే ఎంతనిండో చూశారూ? దాని మొగము ఎప్పుడూ కలకలలాడుతూ ఉంటుంది! దాని మనస్సులో విచారము ఉంటేఉండ వచ్చునుగాని పైకి యింత పిసరైనా కనపడనియ్యదుగదా! ఎప్పుడూ ముఖము మీద చిరునవ్వు. రాజాలకళ! దాని దురదృష్ట వశముచేత మావాళ్ళయింట పుట్టిందిగాని నిజంగా రాజకుటుంబంలో పుడితే ఏస్వతంత్ర రాజుకో రాణీ ఆయి దేశవిఖ్యాతి సంపాదించి యుండునన్నమాట! దానిమాటలు ఎంత నెమ్మదో విన్నారుగదా! తూచి మాట్లాడినట్లు ఉంటాయి! దానిమాటలకు అందుచేతనే కాబోలు అంతవిలువ! మీవాళ్ళమాటలు చాడలో రాళ్ళువేసి ఆడించినట్లు డబడబలాడడమే కాకుండా మాటలు మోటుగాను పెటుకుగాను ఉంటాయి! మావెంకటలక్ష్మి అక్కయ్య మాటలుమాత్రం యెంతో మృదువు; దాని నడకయెంతో సున్నితము; అలాగే దాని మనస్సుకూడా నవనీతము సుమండీ!

ఇన్నెందుకు! మా అక్కయ్యలాంటివారు లోకంలో లేరనేద్దూ!"

నేనేం లోకంచూచేను గనుక అట్లనడానికి! మీరు తీసికొనివెళ్ళి ఎన్నిదేశాలు ఎన్నివింతలు చూపించేరు గనుక వాటి అన్నిటితోనూ సరిపోల్చడానికి! ఇవతల కొండలు! అవతల సముద్రం! ఈమధ్యనే యిప్పటి వరకూ జీవితమంతా గడచిపోయింది! ఈజాగాలో చూచిన వింతల్లోకల్లా గొప్పవింతలు మీఅప్పగారూ మీఅమ్మగారూ! వీళ్ళు దినదినమూ ఒకకొత్త రకపు దుండగము చూపిస్తూఉంటారు! వీరుచేసే వింతలే నేను చూచే నిత్యవిచిత్రాలు. ఈవింతలనే నిత్యమూ చూస్తూ ఉండేనాకంటికి, ఈయిద్దరు అమ్మలక్కల డబడబలు, డాబులు, కంచుగంట గొంతుకలు, ఊళ్లిరిగిపోయేటట్టి నవ్వులు, మోటుపెడ సరపుమాటలు, లక్ష్యములేని ప్రవర్తన, ఇవి చూచిన పైని మాఅక్కయ్యని చూస్తే నిజముగా దేవకన్యకను చూసినట్లే ఉంటుంది! దానిబుద్ధి, దాని మప్పితమూ, దాని వినయమూ, దానిఓర్పు. నిజంగా మరి యెవరికీ నాయెరికవారిలో లేవు! నాకూ కొన్నేళ్ళువచ్చేయి; నేనూ కొద్దో గొప్పో ఆడవాళ్లను చూచేను! గాని అది నామనస్సుకు నచ్చినట్లు మరియెవరూ నచ్చలేదు! అయితే అది మాఅక్కయ్య,అందుచేత పొగడుచున్నానని అనుకోగలరు! అదికూడా ఉంటేఉండ వచ్చును గాని అదివక్కటే కారణమంటే నేను వప్పుకోను! దానినిగురించి దాన్ని యెరిగినవాళ్ళు అనేకమంది నామోస్తరుగానే అనేకసార్లు అనడం విన్నాను. భక్తి అన్నప్పుడు దానిదే భక్తి!

'మాఅక్కకుమాత్రము లేదాభక్తి?'

'చెప్పేదేమిటి మీఅక్కభక్తి! అది నక్కభక్తి! దగ్గోజనంభక్తి! నలుగురు భజనలో పొగ్గితే వాళ్ళతో 'వీళ్ళు యిలాగు, వాళ్లు అలాగు' అని నిందలు ఆరోపణచేస్తూ టప్పాలు కొట్టడానికి ఆసక్తిగాని అది భక్తికాదు! మాఅక్కదో! దాని పెదవులైనా ఆడించినట్లు కనబడదు! దేవుడుపెట్టెదగ్గిర ఉదయముకాగానే స్నానముచేసి నిశ్చలముగా ఒక్క అరగంటమాత్రం ధ్యానంచేసి పూజచేసికొని పనిపాట్లు చేసుకుంటుంది. మధ్యాహ్నం పనిపాట్లు అయిన తరువాత ఏపురాణమో చదువుకొని ఒకగంటసేపు మాత్రం నిద్రపోయి తిరిగీ యింటిపనులు చేయడం మొదలుపెట్టి రాత్రి చక్కబాట్లు అయేవరకూ ఒళ్లు వంచి పనిచేస్తుంది. రాత్రి పడుక్కొనేటప్పుడు భక్తి శ్లోకాలు ధ్యానశ్లోకాలు చదివి భర్తకు సేవచేస్తూ నిద్రపోతుంది! ఇంటి కెవరువచ్చినా ఎంతమర్యాద! ఎంతఆప్యాయము! ఎంతమంచి! ఎంతనెమ్మది! ఎన్నాళ్ళున్నా అలాంటివాళ్ళ యింట్లో ఉండాలనే ఉంటుందిగదా! దానిపిల్లలు అలాగు అల్లరపెడతారు గదా, వాళ్ళను పెద్దకేకలు వేయకుండానే నెమ్మది మీదనే భయంఉంచుతుంది! దానికి దానధర్మంకూడా

ఉంది! అలాగని దూబరాలేదు! అంచేతనే దాని మొగుడికి అది ప్రాణపదం! అది యేమిటంటే అంతే, దానిమాటకు ఎదురులేదు! మాఅక్కయ్యవద్ద మా బావకు భయమనికాదు; దానియందు గౌరవము; అంతేగాని నిజముగా అతని వద్ద మా అక్కయ్యకే భయము! ఆమెకు ఆయనపైని భక్తిప్రేమలు కూడా విశేషము. అతడు మీలాగుకాదు; పెళ్లామంటే అతనికి అభిమానము, ఆదరణ! వాళ్లిద్దరిదీ ఒక్కటే మాట; కొకడొకరు లాగితే కొకమ్మొకరు లాగడం వారిలో లేనేలేదు! వాళ్ళు వాదించుకొన్నట్లైనా ఎవరికీ తెలియదు! అంత అన్యోన్యం!

మాబావ పోలీసు ఇనసపెక్టరు అయినా చాలా మంచివాడు, శాంతుడు, ధర్మరాజు లాంటివాడు!'

"చెప్పేదేమిటి! అందానికి నేనూ గానానికి మా అప్పా అన్నట్లు నిజానికి ప్లీడర్నీతికి పోలీసువాడినే చెప్పు!"

పోలీసు యినసపెక్టరుకున్నూ ప్లీడరుకున్నూ సాటి తెస్తున్నారా? పులికీ పిల్లికీ సాటితెచ్చినట్లే ఉన్నది! ఆహా! మిమ్మలిని చూచి నమస్కారం పెట్టేవాడే ఉండడుగదా! దారంటవెళితే ఒకడూ లేవడుగదా! ఒకడూ ఇచ్చకపునవ్వు నవ్వడుగదా! ఒకడూ పండూకాయా పంపడుకదా! మీరు ఇతరులను ఆశ్రయిస్తూ తెచ్చిపెట్టుకొనే యిచ్చకపునవ్వులతోనే మీ బ్రతుకంతా సరిపోతుంది! మిమ్మలిని యిచ్చకం చేసేవా డెవడు? పోలీసుఇనసపెక్టరుకు అలాగు కాదుగదా! ఎక్కడికి వెళ్లినా పోలీసుకనిష్టీబులు సబుఇనసపెక్టర్లు ఉంటారు! నాటకాలలో బస్సులలో నమస్కారంపెట్టి నాలుగుగంటలు అదనంగా ఆపి ఫస్టుక్లాసు యిస్తారుగదా! కనిష్టీబులు వెనుకా ముందూ నడుస్తూఉంటే యెంతోనిండు! బళ్ళవాళ్లు బజారువాళ్ళు భయపడతారు! బళ్లవాళ్ల మాటెందుకు? ఎఱ్ఱటోపీఅంటే అందరికీ యిచ్చకమే! మీప్లీడర్లకు మాత్రం వాళ్ళంటే భయంలేదూ? ఎఱ్ఱటోపీ పెట్టుకొని రైల్వేపోలీసుకనిష్టీబువాడువచ్చినా దసరా కట్నం చచ్చినట్లు చెల్లించుకోవలసినదే కదా! వాడికీ మీకూ యేనాడూ యెట్టి సంబంధం లేకపోయినా!! ఏంజేత? భయంచేతనేపో? అన్నిరకాల బంట్రోతులకీ దసరాకట్నాలు అడగడానికి హక్కులు ఉన్నాయిగాని ప్లీడరు బంట్రోతులకు అట్టివి లేవు గదా! పోలీసువాళ్ళు కాలుకదిపితే కారు, ప్రయాణమైతే బస్సు! వాళ్ళు కార్లు అడిగితే యివ్వలేమని చెప్పలేక ఆఖరికి కార్లు అమ్మేసుకున్నవాళ్ళు ఎందరు లేరు? కనిష్టీబులకన్నా కనికష్టపు బ్రతుకుగదా మీ ప్లీడర్లది! మిమ్మలిని చూచి బస్సువాడు బస్సు నిలపెట్టడు, బండివాడు దారియివ్వడు; ఎంతసేపూ పట్నాయిళ్ళతో వాటాలుతప్ప మీకు పైవాళ్లవల్ల కలిగే గౌరవాతిశయాలేమిటి? గనుక పోలీసు వాళ్లకూ మీకూ సాటి చెప్పకండి! నాగుపాముకీ బురదబుక్కడానికీ సామ్యం చెప్పినట్లే ఉంటుంది!

"అది కాదు నేనన్నది! పోలీసువాడికి నీతి యెక్కడుంటుంది అని అన్నాను!"

"పోలీసువాడికేనా నీతి ఉంటుందిగాని ప్లీడరుకి నిజం ఉండదనే నే నంటున్నాను! తక్కినవి న్యాయంగా పోవడానికి అవకాశమున్న వృత్తులు. మీది అలాంటిది కాదు. రూపాయి యెగరవేస్తే ఒకమారు బొమ్మ, ఒకమారు అక్షరాలు పైకి ఉంటూ ఉంటాయి. అలాగుగానే మీ కేసులలో ఒకవైపు నిజము. ఒకవైపు అబద్ధము; అబద్ధమువైపు ఒక ప్లీడరు తప్పడు! నిజంవైపుకూడా ఒకప్లీడరు ఉంటాడనుకొండి; కాని ఆ ఉండడం అతని ప్రయోజకత్వముకాదు! ఈ అబద్ధపువాదమూ ఒక పుట్టెడు రూపాయిలూ అతనికే యిచ్చేస్తే, కుక్క యెముక ముక్కను పట్టుకొని వదలకుండా ఉత్సాహంతో కొరికేటట్లు, ఎన్నైనా అబద్ధాలాడించి తన వాదమే నిజమని మహా అమాయకపుమొగంతో చాలా పట్టుదలగా ఘోషపెట్టి సాధించడానికి ప్రయత్నం చేస్తాడు! అంచేత మరి మీరు యితర వృత్తులను ఆక్షేపణ చేయబోకండి!

"మా వృత్తిలోమాత్రం గాంధీ రామేశం ఇలాంటి వాళ్లు లేరూ?"

మూడు పేర్లు చెప్పండి! ఊరుకున్నారేం? అంతటితోసరి! ఎవళ్లో ఉంటారు: నిజమాడే ప్లీడర్లూ,

ఆడది అక్కర్లేని మగవాళ్లూ—శ్రీశుకుడు ఋశ్య శృంగుడులాంటివాళ్లు! తక్కినవాళ్లందరూ మామూలు సంసారపంకంలో కొట్టుకోవడమో, లేకపోతే విశ్వామిత్రుడు పరాశరుడు వీళ్లలాగు మొదట బంకాలుపలికి తరువాత ఊబిలో దిగిపోవడమో!! యిలాగున ప్లీడర్లందరూ అబద్ధాలసముద్రములో ఈదు చున్నవాళ్లే! స్ఫటికంలాగు ఉండే ఆ రాజమండ్రావిళ్లపు ప్లీడరు ఇప్పుడు అబద్ధాలపులి అయిపోయినాడని మీరే నిత్యం అంటూ ఉంటారు? ఇప్పుడు మహా సంకల్పం వ్రాస్తే సప్తసముద్రాలకూ మరి వకటి చేర్చి అబద్ధాలసముద్రం అష్టమసముద్రంగా నమోదు చేయవలసి ఉంటుంది; దానిలో చెప్పిన 64 విద్య లకీ ఇది 65 విద్యగా 'చౌర్య' అన్న తరువాత చేర్చ వలసియుంటుంది! చౌర్యంవంటి వృత్తిగలవాళ్లు మీరు! మీవంటివారిమీద అధికారంగలవారు పోలీసువాళ్లు! వాళ్లతో మీకు యీ సేమిటం!

ఇంతకూ చెప్పవచ్చినదేమిటంటే మా అక్కయ్యా మాబావ ఒక్క ప్రాణంలాగుంటారు. మా అక్కయ్యా దగ్గర అరగంటసేపు కూర్చుంటే విచారమంతాపోయి యెట్టివారికైనా ఒకవిధమైన శాంతి నెమ్మది కలిగి మనస్సులోని విచారము బరువులాగి పారవేసినట్లు మాయమైపోతుంది! దాని మాటలలో ఎంతో నిదా నము ఆలోచన ఉండడమే కాకుండా ఆమె యెక్కు వగా చదువుకొన్నది. చదువుకొన్న సంగతులు ఒంట పట్టించుకొని ఆచరణలోనికి పెట్టుచున్నది! దాని జ్ఞానము, జ్ఞానమునకుతోడు సుగుణసంపద, రెండూ చేరి దానిని నిజంగా వేలలో లెక్కపెట్టవలసిన మనిషిగా చేస్తూయున్నవి. మీ అక్కకు దానితో సాటితెచ్చేరా? వెలిగారానికీ బంగారానికీ పోలి కేమిటి? ఎన్ని పుటాలు పెడితే మీ అక్క మా అక్క అవుతుంది? ఎన్నిమార్లు నీటిలో ఉతికితే కుక్క గంగిగోవు అవుతుంది?

మీ అక్కగారి వినయసంపద అందరికీ తెలిసి నదే! దెబ్బలాట ప్రారంభించిందంటే యిరుగుపొరు గులవాళ్లు ఏదో ఊరు అంటుకొన్నదేమోనని పనులూ పాట్లూ మానేసి పారిపోరావలి! నవ్వెందిరా అంటే పిచ్చాసుపత్రిలోంచి ఎవళ్లైనా తప్పించుకొని వెళిపోవచ్చేరేమోనన్నట్లు ఉంటుందిగదా! కబుర్లు చెప్పిందంటే గుమ్మురైలు చేసినంత చప్పుడు! కోపము ఎప్పుడూ ముక్కుకొనను సగం వేలాడు తునే ఉంటుంది! ఇక నోటివడితనమూ! కాపవాళ్లూ, కడపవాళ్లూకూడా దానితో సాలలేరన్నమాట! బంధుమర్యాద చెప్ప నక్కర్లేదుగదా! ఆవిడే ఆవిడె తల్లిగారు కలిసి, వచ్చినవాళ్లని వచ్చినదగ్గరనుంచీ ప్రయాణంచేస్తునే ఉంటారుగదూ! రెండు పూటలు ఉండేసరికి ఎంత మొండిచుట్టమైనా తారెత్తి పారి పోతారు! పిచికమీదా కాకిమీదా పెట్టి వెటకా రాలు ఆడుతూ ఉంటే ఎవరు ఉండగలరు? ఇంకా ఉంటే ఎంగిలికూడేగదూ! ఇకను భక్తి, శాంతము, గుణాలు చెప్పనక్కర్లేదు! ముఖ్యమైనమాట మా అక్కయ్యా అయిదవతనముగల దేవత! మీ అక్కయ్యా మీ అక్కయ్యే! వాళ్లిద్దరినీ ఏకకాలమందు పేర్కొ నడము చాలాతప్పు! మీ అక్క ఉన్నయింట్లో సం తోషమూ సౌఖ్యమూ రెండూ ఎకస్పార్టీయేగదా!

నేను గనుక ఇలాగు యీ యింటిలో పడి యున్నానుగాని మరెవరేనా అయితే, మూడురోజు లలో మొగుడుకో దండం, కాపురానికో దండం, వారిబాధ పడలేమని చెప్పి పారిపోతారు! నేను యెంత ఓర్చి ఉంటున్నానో ఎంత నెమ్మదిగా పల్లెత్తుమాట అనకుండా కాలక్షేపము చేస్తున్నానో మీకుమాత్రం తెలియదా యేమిటి?

'అవునుగాని మా అక్కయ్యా రేపు మెయిలులో బయలుదేరి వెళ్లిపోతుందట! దానికీ దాని పిల్లలకీ యేవైనా బట్టలు కొనాలండీ! వాళ్ల యింటికి నేను వెళ్లినప్పుడు పిల్ల పిల్లవరుసను మీరు రాకపోయినా మీకుకూడా కలిపి బట్టలు పెట్టేరుగదా; ఇప్పుడు యేమీ పెట్టకుండా దానిని వట్టి పసుపుకుంకంతో పంపించివేస్తే బాగుంటుందీ? మీదగ్గర లేకపోతే, ఎలాగో అప్పో సప్పో చేసి అయినా దానికీ దాని పిల్లలకీ బట్టలు పెట్టకతప్పదు! తరువాత తీరా ప్రయా ణంవేళకు 'అన్నా, మరచిపోయినా'నని వెర్రిమొగం వేస్తే లాభంలేదు! కాబట్టి ప్రొద్దున్నే జ్ఞాపకంగా తెప్పించి ఉంచండి! మరచిపోకండేం!

# కీ॥ శే॥ శ్రీమతి నెల్లీజోషిగారు

శ్రీమతి ఇ. ఆర్. ఈనోక్‌గారు

ఈమె కుష్ఠరోగ నివారణయందు సుప్రసిద్ధిగాంచి, మదరాసు గవర్నరుగారిచే కైసరిహింద్ పతకమువడసిన, డాక్టరు జోషీగారి ప్రథమ పుత్రిక. 1907 సం॥ అక్టోబరు 28-వ తేదిని జననమొంది, నిండు యవ్వనమందు అనగా 1933 సం॥ డిసెంబరు 15-వ తేదీని కాలముచేసిరి.

తెనుగు దేశమునందలి బాప్టిస్టుమిషను వారివలనను, విదేశీయులైన మిస్సనెరీవారి వలనను తనభక్తికావ్యము కొనియాడబడెను. స్వగృహమునందు మాతాపితలచే అల్లారుముద్దుగా పెంచబడి కష్టమనునది ఎరుగక, తక్కినబిడ్డలమధ్య గొప్పపుష్పము వలె పెంచబడెను. ఇంతగా ప్రేమించబడిన తన బ్రతుకును సార్థకపరచుకొనుటకేమో అనునట్లు సర్వకాల సర్వావస్థలయందును యితరులమేలే కోరుచు, తన్నుతాను ఉపేక్షించుకొనెను. ఇంటిలో తనకంటె చిన్న వారి వలనను, పాఠశాలయందు తనతోటి వారివలనను, యుపాధ్యాయులవలనను, గౌరవింపబడినప్పటికి యందునుబట్టి గర్వింపక మరీ యణకువగాను, తన్నుతాను మిక్కిలి యల్పముగాను భావించుకొని నడచుకొనెను.

7 సం॥ ప్రాయముప్పుడే "బాలమిత్ర" యనెడి సచిత్రమాసపత్రికకు వ్యాసములను, వ్రాయుచుండెను. ఈమె 8, 9 సం॥ ప్రాయమపుడే జే. సి. యి. యను చిన్నసభకు సభాధ్యక్షురాలుగనుండి తనకంటె చిన్న బాలబాలికలకు మిక్కిలి యాసక్తితో నీతి కథలను చెప్పుచుండెను. రామచంద్రపురం బోర్డుహైస్కూలులో బాలురతో చదివిన మొదటి బాలికలలో యీమె యొకరై. అచ్చటి యుపాధ్యాయులచే యాంగ్లేయ భాషాప్రవీణతకును మంచి ప్రవర్తనకును పొగడ్తలు నడసెను. మదరాసు స్త్రీల కళాశాలలో విద్యార్థినిగయున్నప్పుడు యీమె పూర్ణహృదయముతో చేసిన సాంఘిక సేవగూర్చి యింకను యచ్చటనున్న ఉపాధ్యాయులు యానందించుచున్నారు. గాయపడిన యుద్ధభటులకొరకు చందాపోగుచేయుట రామచంద్రపురములో మొదట స్థాపించిన దీమెయే.

1929 సం॥ డిసెంబరు 26-వ తేదిని ఎం.యె. పరీక్షప్యాసయి యిపుడు గుంటూరులో Sub Registrarగా యున్న ప్రభాకర్‌సామ్యేలు గారికి వివాహము కావింపబడిరి. ఈవివాహావస్థయందు ముద్దులొలుకు నలుగురుబిడ్డలుదయింపగా బలహీనులై రక్తలేమిచే 1933-వ సం॥ డిసెంబరు 15-న తేదిని కాలముచేసిరి. ఈమెను చూచుటకు ఈమె బంధుమిత్రులు విచ్చేసి భూస్థాపన ఎంతో ఘనముగ జరిపిరి. ఈమె విలువగల కళేబరముదగ్గర మిగుల పేరుప్రసిద్ధులగాంచిన స్నేహితులుగాక యనేక నిరుపేదలు ఈమె వారికి జాలితో యొసగిన అన్నపానాది వస్త్రములగూర్చి చెప్పుచు మిగుల దుఃఖితులైరి. పరమేశ్వరుడు ఈమె ఆత్మకు శాశ్వతానందమును శాంతిని గూర్చుగాక!

# ధర్మము, అస్పృశ్యత

ఎల్లమరాజు నారాయణభట్టుగారు

"ధర్మ ఏవహతోహన్తి| ధర్మోరక్షతి రక్షితః
తస్మాద్ధర్మోనహంతవ్యో| మనోధర్మోహతోపధీత్"

ఈ శ్లోకాశయ మిది:—

'ఎవడు ధర్మమును హత్యచేయునో, వాడు తన హత్యచేయుచున్నాడు. ఇందువలన ధర్మహత్య చేయ వలదు. ఎందుకనగా ధర్మసంహారము వలన మన కల్యాణము కలుగజాలదు.' అని

'ధర్మ' శబ్దముయొక్క వ్యుత్పత్తి 'ధృ' అను ధాతువునుండి యైనది. ధారణచేయుటని దీనియర్థము. దీనిని ధారణచేయుట వలన ప్రయోజనము కల్యాణము. నిస్సంశయముగా శాస్త్రము లిచ్చు నాజ్ఞయిదియే. (జ్ఞానము) వేదము. (బుద్ధి) శాస్త్రము. ఈవిషయమునే ప్రకటించుచున్నవి. వాని యాశయ మిది.

"ఏది మనుష్యునకు, హితకారియగునో అది ధర్మము. అహితకారి యగునది ధర్మము కానేరదు."

ఆర్యవిద్యా సుధాకరమందు మహావ్యాఖ్య యిట్లు చూపట్టుచున్నది:—

"తత్రపతితో జనానాశ్రయోభూత్వా ధరతీతి ధర్మశబ్దస్య యోగార్థః" అని.

ఏది పతితజనుల కాశ్రయమయి అథవా రక్షించునో అది యౌగికార్థమందు ధర్మశబ్దముచే వాడబడుచున్నది.

హితముకోరునది, రక్షచేయునది స్పష్టప్రయోజనమందు కళ్యాణకారి యగుచున్నది.

ఇట్టి కల్యాణకారిత్వమునకే మనుజుడు విముఖుడగునో వాని కహిత మయితీరును.

ఇచ్చట ప్రశ్న యిది:—'ఆపతితు డెవడు?' ఉత్తరమందిది స్పష్టము. దుర్విచారము చేయువాడు, ఆచరించువాడు ఆలోచనము వ్యవహారము రెంటియందును చెడుగుకలవాడే, అధఃపతితుడు. వాడే ధర్మముచే హీనుడు. వాడే పతితుడు. ఈనిమిత్తముననే పతితుడైనాడు. ధర్మముచే హీనుడు. మరియు ధర్మరక్ష చేయడు. ఇందువలన పతితుడు.

కావున, ధర్మమును ధారణ చేయవలసిన యావశ్యకత, వానికొఱకే! ధర్మము వానికొరకే ఆశ్రయస్థానమగుచున్నది.

ఎవడు ధర్మమును ధారణము చేసియున్నాడో వాడు ధారణముచేయ నావశ్యకత లేదు. ఎందుకనగా వాడు చేసియే యున్నాడు. చేయకున్నచో ఆవశ్యకత యుండెడిది.

ఈవిధమగు పరిభాషణమువలన నిచ్చట స్పష్టమగు నంశ మేమనగా:—

ధర్మము నీచుల నున్నతులను జేయుచున్నది, కాని, ఎవ డున్నతుడో వాని కవశ్యము లేదు.

అట్టి యున్నతుడు ధర్మధారణ చేసినవాడు నేడున్నాడా యని వివేచించినచో మాదృష్టియందు పూర్ణముగా భారతవర్షమే పతితమైపోయినది.

పతితము కాకున్నచో ధర్మధారణము చేయవలసిన యావశ్యకత యుండదు.

నేడు భారతవర్షమందు నిమ్నజాత్యుద్ధరణ ఘోష, విధవావివాహ ప్రచలనము, బాల్యవివాహ నిషేధము మొదలగు ననేక ధారణలకొఱకు సుధారకుల ద్వారా ఆందోళనము జరుగుచున్నది. ఇదియేమి? ఎందునిమిత్తము? జనుల నడవడులను సహజప్రవృత్తికి సంఘర్షణమేల కలుగవలెను?

ఇది స్పష్టమగుచున్నది. భారతవర్షము పతితము. పతితము కాదేని సుధారణావశ్యకత యెక్కడిది? సుధారణావశ్యకత నిజమైన పతితమునందే ప్రకటించును.

కాని సుధారణ యావశ్యకమను ననుభవ మెవ్వరి కయ్యెను?

ధర్మాత్ములకు: ఎవరు ధర్మమును ధారణము చేసి యున్నారో వారికి, అధర్మాత్ములు, లేనిపట్ల అనుభవ మీవిధమున నాందోళనారూపము తాల్చియుండదు. తమ యనుభవమువలననే రెండవవారిని ధర్మధారణము చేయవలసినదిగా చెప్పుచున్నారు.

ఎప్పుడు ధర్మాత్ము లితరులచే ధర్మధారణము చేయింపబూనుదురో అప్పు డధర్మము దాని కడ్డు తగులుచున్నది. సంసారమందు సంఘర్షణము ప్రారంభమగుచున్నది.

భారతవర్షమందు సుధారక సందేశమునకు ఏండ్లు వచ్చినవి; కాని పరిస్థితి ప్రమోదావహముగా లేదు. దానికి కారణ మిది:—సమస్తలోకులు ధర్మాత్ములు కారు. ధర్మానుభవ మందఱిలో నుండదు. ప్రపంచానుభవమునుబట్టి మన మీ పరిస్థితిని గమనించినప్పుడు ధర్మాత్ము లెందుకులేరు అను ప్రశ్న పుట్టుచున్నది. సంసారమం దందఱికి ధర్మానుభవ మెందుకులేదో కూడ తేలవలసియున్నది. ఇప్పుడు సంసారముపంకకు మనదృష్టిని మరల్చి విస్తృతముగ వివేచింపదగును.

అస్పృశ్యులయందు శుభ్రము సదాచారము తక్కువ. సస్పృశ్యులం దివి దుర్బలముగా నున్నవి. వీ రిద్ద్వ రీ విషయమున ధ్యానమిచ్చి విమర్శించుకొనుటలేదు. అస్పృశ్యుల నిరీక్షణ మిది:—

ఎక్కువతరగతి యేప్రకారము కలుగుచున్నది? ధర్మాత్ము లెట్లగుదురు? సస్పృశ్యుల సంశయమిది. నిజము బయటపడిన నేమిమూడునో ఈప్రకారముగ నిర్వురు ధర్మముచే వంచితులైన కారణమున నొకరి నొకరిపట్ల సాముదాయక సహధర్ములు కాకున్నారు. ఇద్వురును త్యక్తధర్ములైయున్నారు. కర్తవ్యపాలనము చేయుటేధర్మము. అస్పృశ్యులు తమ విధిని గుర్తించియుండలేదు. సస్పృశ్యులు తమ కర్తవ్య పాలనమును చేయుచుండుటలేదు.

అస్పృశ్యులు ముఱికి కొటపట్టులై సస్పృశ్యులం దైక్యమగుటకు జంకుచున్నారు. ఈవెలితిని మేళనము చేసికొని సముదాయశుద్ధు లగుటకు సస్పృశ్యులు దుర్బలులైయున్నారు. మాదృష్టియం దిర్వురు నస్పృశ్యులై యున్నారు. కావున నీ యిరువాగులు పతితులు. ఇరువురు తమతమ ధర్మముచే హీనులు. హీనులయి ధర్మసంహారము చేయుచున్నారు. ప్రధానాత్మ శక్తిని నశింప జేసికొన్నందున భారతజాతి 'అరక్షిత' మైనది.

ఇట్టి స్థితిలో క్రిస్టియను ముసల్మానులు 'అరక్షిత' మృగములనువలె భారతజాతిని వేటాడుచున్నారు.

సనాతనులను కొందరి ట్లు చెప్పుచున్నారు. 'అస్పృశ్యుల నే దశయందుగాని అండకు దీసినచో ధర్మము దూరమగును' అని.

ఈవాచాలత్వ మాశ్చర్యము గొలుపుచున్నది. ఈ దౌర్బల్యవాక్యముల కాధారము ధర్మనిష్ఠాలోపమే. నిష్ఠనిజమైనవా రెన్న డిట్లు చెప్పియుండలేదు.

మనువు తన ధర్మలక్షణములు పదింటియందు మొదట 'ధృతి' శబ్దమును వాడెను. పిమ్మట తక్కిన లక్షణములను వివరించెను. ధార్మిక దార్ఢ్యమే మనుజునియందు లేదో, ఆమనుష్యుడు ధర్మమును ధారణ చేయజాలడు. ఈదృఢత్వము లేనిచో వాడు నిష్ఠాపరుడగుట కవకాశములేదు. ధర్మమును ధారణ చేయనేజాలడు.

ఇందువలన సిద్ధమగున దేమనగా అస్పృశ్యులతోడి వ్యవహారమువలననే ధర్మము తరలిపోవు ననువారి యందు ధర్మనిష్ఠ బొత్తిగా తక్కువ. అది నిజమగు ధర్మము కానేకాదు.

ఈ అస్పృశ్యు లెవరు? మన సోదరులు. మన అంగమునుండి అంగము దేహమునుండి దేహము. కాదేని, చూడుడు.

ప్రాతఃకాల శౌచక్రియానంతరము వామహస్తము పతితమైపోవుచున్నది. అందుచే దక్షిణహస్తమునకు

దానిని పవిత్రముచేయుట కర్తవ్యమగుచున్నది. తాను పవిత్రముగ నుండుటబట్టియే రెండవదానిని పవిత్రముచేయ గలుగుచున్నది. ఇక నొక విశేషము. వామహస్తమును పవిత్రము చేయదేని స్వయముగ తానపవిత్రమైపోవుచున్నది. ఎంతవఱకు పవిత్రవిషయమున ప్రయాసపడుచుండునో అంతవఱకు తాను పవిత్రముగనే యుండును. ఉదాసీనత వహించిన మరుక్షణమే స్వయముగ దానపవిత్రమైపోవును.

ఈయపవిత్రతా పవిత్రతలయొక్క ప్రయోజనమిది:—మనము కూర్చొనియుండుతావు మురికియై యుండునెడల, అరాత్ ధూళిధూసరితమై యుండునెడల, దానిని సమ్మార్జనాదులచే చక్కబఱచుట మనధర్మము: కూర్చుండుట లేమటవలని సంసర్గమున మనముకూడ పవిత్రముగ నుండగలుగుదుము.

కాని అది మురికికి తానై శుద్ధముగా లేకయుంటకు వీలాసగుదుమేని, మన మశుద్ధులమైపోవుటలో సంశయములేదు.

నేడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య మహాశయులు పతితావస్థలోనుండి జీవనవ్యతీతము చేయుచున్నారు. ఈపతితావస్థయే వీరిగుణహీన దౌర్బల్యములకు హేతువు. గుణహీనులైనంతనే కర్మహీనులు కాకతప్పదు. కర్మహీనతయే ధర్మమును ధారణము చేయుటనుండి తప్పించుచున్నది. కావున నిప్పుడీ కర్మహీను లెవరు? సంస్కారహీనులు. సంస్కారహీను లెందులకయిరి? పరంపరాగత పతితకర్మబద్ధులయి జననాదు లెత్తుటవలననే!!

ఈ ప్రకారముగ ప్రశ్నోత్తర పరంపరనుండి బయలుదేరుసారమిది:—'జీవాత్మయొక్కధర్మమేదో దానిని పూర్ణముగ త్యజించినది' అని.

స్వకర్మఫలమును భోగించుచు భోగించుచు వచ్చుట తప్ప సంస్కారము గాననిదైయున్నది.

విద్యను ధారణచేయుట జీవాత్మయొక్క ధర్మము. ఈవిద్యవలన నున్నతావస్థకొఱకు అవశ్యకర్మనుచేయుట తన్మూలమున నన్యులప్రభావశీలముల కత్యుత్తమసరణి నేర్పఱచుట, ఈమూలమున సముదాయమున కల్యాణమును సాధించుట జీవాత్మకు ముఖ్యకర్తవ్యము.

తన్నావరించి యంధకార మున్నప్పుడు ప్రకాశము నభిలషించు మానవు డేమిచేయును? దివ్వెయందు నూనెనించి వత్తినెక్కించి ప్రజ్వలింపజేయును. ఈ కర్తవ్యపాలనమున గలుగు ప్రయోజనమేది. ప్రకాశమందు తన్నుతాను నిలుపుకొనుట. కాని యుపర్యుక్తకర్మ నొనరింపక కేవలము ప్రకాశమునే కోరునెడ నెవ్వడును తన విచారమును సఫలము చేసికొనజాలడు.

ఇట్లే కర్మపాలనమున సంసారమందు సుఖమును పొందగలుగుచున్నాడు. ఈ కర్మయే మనుష్యధర్మము.

కర్మచేసి అంధకారమును పారద్రోలగలిగినట్లే ధర్మధారణచేసి పతితావస్థనుండి మానవు డున్నతావస్థను పడయగలుగుచున్నాడు.

ఈ యున్నతావస్థ యతని సంచితశక్తి, జన్మజన్మాంతర సంస్కారకేంద్రీకరణము. ఇట్టి సంచితావస్థల మానవు డేదియు చెఱుపజాలదు. కావున, అస్పృశ్యసంసర్గమున ధర్మము దూరమగుననుట ధర్మధారణచేయని కర్మహీనుని కల్పితాశయముడు గాఢమగు కల్యాణ విముఖత్వమును.

ధర్మముయొక్క అయిదవలక్షణమున మనువు 'శౌచ' శబ్దమును గూర్చెను. దానియర్థము శుద్ధత.

ఈశుద్ధతను కేవలము గృహమునకే సంకీర్ణము చేయలేదు. యింట,నెలుపట,గ్రామమున, నగరమున, సమాజమున, సాముదాయిక శుద్ధియే కళ్యాణకారిగా నిరూపించెను. ఈశౌచమును మనము ధారణచేసినచో అస్పృశ్యతయని చెప్ప సాహసించున దేదియు మన దృష్టియందుండబోదు.

ఈవిధమగు విశుద్ధతను ధ్యానమందుంచుకొని మన మొక ముసల్మానుని యింట భుజించికూడ పతితులము కాము.

మసీదులలో పరమాత్మనామమును స్వీకరించి ధర్మబాహ్యులముకాము. క్రిస్టియనులతో భోజనాచ్ఛాదనములపట్ల పూర్ణముగ నేకీభవించి సముద్రమును పయి సాగిననుకూడ మతభ్రష్టులమగుట సంభవింపదు.

నేడు ధర్మముపేర ప్రబలుచున్న తగవులన్నియు మన త్రుటితవ్యవహారములవలననే. విశుద్ధవేదమందలి ధర్మ వ్యవస్థ కొంచెము నిలిచియున్నచో నేటి యీ తగవుల కాధారముండదు.

జీవులతో సమానవ్యవహారముల కాజ్ఞ యిచ్చునది వేదము. మనకొఱ కదియే సర్వోత్తమమయినది. దాని యాశయమిది. 'ఏ యీశ్వరుడు మనల గావించెనో ఆ యీశ్వరుడే అస్పృశ్యప్రాణుల రచనచేసి యున్నాడు. ఈమహతీ సృష్టియందు సమానరూపమున విచరించుభాగ్యము మనమెట్లు పడసియుంటిమో సమస్తప్రాణుల కట్టివిధినే యీశ్వరుడు ప్రసాదించియున్నాడు.'

ఈవిధమగు వేదవాణియే సర్వోత్తమమైనది. తక్కినవి కృత్రిమములు. ధర్మస్వరూపము నీవిధముగ గుర్తించి సమస్తప్రాణులను సమానదృష్టితో జూడ నేరవలయును. ఈభావనయే ఆరంభశ్లోకమందలి యర్థమును సఫలము చేయుచున్నది. ఈసమదృష్టి కస్పృశ్యతాసమస్య యంతరించిపోవును. తన్మూలమున మానవకళ్యాణము చేకూరును.'

—:o:—

# కర్షకవనిత

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు, బి. ఏ.

శిరసునధరియించు వరివెన్ను మోపుతో
ఆననంబునకింత అందమొదవ
వ్యవసాయ సాధనంబగు చిన్నికొడవలి
చిగురుచేతులకింత చెన్నుగూర్ప
తలబరువున వినతాంగకంబులు మంద
గమనంబునకు వింతగరువమొసగ
దినపరిశ్రమ సముదితవిభాస్వత్స్వేద
కణతతిమేనికి కాంతినింప.

దైనికపరిశ్రమాన్నత్యధన్యజీవి
తానవరతాధికానంద మతిశయిల్లి
పల్లవారుణాధరసీమ నుల్లసిల్లి
చిరునగవు దోపనిదె కాపుగరితవచ్చె.
భారతదేశౌన్నత్యము,
భారతదేశప్రశస్తి, భారతపర్జా
పారైశ్వర్యము,రూపము
గా రాజీవజుడు చేసె కర్షకవనితన్.

# నాజన్మభూమి

శ్రీమతి నల్లూరి రత్నమాంబగారు

సీ॥ నిష్ఠురనిస్తంద్ర నీహారనిష్యంద
ధారాకలిత హిమాధరముతోడ
స్వాంతసమ్మదవారి పరిపూర్ణవిభ్రాజి
తవితతకాసార తతులతోడ
సౌరభ్యనిర్భర శతపత్రసంఘాత సంయు
తోరుధునీ ప్రచయముతోడ
నానాతరులతావితానసముద్యోత
సాంద్రవిమలవనీ చయముతోడ
లలితధావళ్యకౌముదీ వ్రజమునెమ్మి
త్రస్తరించెడు ధవళసౌధములతోడ
మించి యేపునుగాంచి రహించిధరణి
సరవి జెలువారు సతము నాజన్మభూమి.



శ్రీమతి చన్ద్రావతీలక్ష్మణపాల్, బి. యె. బి. టి.

గురుకుల విశ్వవిద్యాపరిషదాచార్య శ్రీమాన్ సత్యవ్రతగారి భార్య అలహాబాద్ హిందీ సాహిత్య సమ్మేళనమున 'స్త్రీలస్థితి' యను గ్రంథమునకు రూ 500 ల బహుమాన మీయబడెను.

# మంగళవాక్యములు

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

ఆదితేయుల మ్రొక్కులసందు వజ్రి
సమరమున వృత్రదానవుఁ జంపువేళ
బలిమి నే మంగళంబు గాపాడెనదియె
నిన్ను రక్షించుఁగాక! నా చిన్నితనయ॥
అమృతమునకేగు నా వినతాత్మజునకు
జనని యేమంగళంబిచ్చి పనిచినదియొ
అట్టిమంగళమిప్పుడ యుగ్రాటవులను
నిన్ను రక్షించుఁగాక నా చిన్నితనయ॥
కడలియందుండి సుధబుట్టుకాలమందు
దైత్యులను జంపఁబూనిక చేఁదఱలు వజ్రి
కదితి యేమంగళమొసంగె నట్టిశుభమె
నిన్ను రక్షించుఁగాక నా చిన్నితనయ॥
భువనముల్ మూడుపదములు బూనికొలుచు
నమితతేజస్వియౌ హరి కాదినెట్టి
మంగళంబియ్యఁబడెనో యా మంగళంబె
నిన్ను రక్షించుఁగాక నా చిన్నితనయ॥
పాపహారులు భద్రస్వరూపులైన
యాగమంబులు ఋతువులు సాగరములు
దిక్కులును లోకములు సరిద్ద్వీపములును
నిన్ను రక్షించుఁగాక నా చిన్నితనయ॥

చ. అనయము భక్తి భర్తృపద మాత్మఁదలంచెడిదాననైన స
ద్వినుతపతివ్రతాగరిమ విశ్రుతికెక్కినదాననైన నన్ఁ
ఘనమగు శాంతముఁ దపము గల్గి మెలంగెడిదాననైన నె
మ్మన మలరంగఁ జల్లనగు మాకపివీరునిపట్లఁ బావకా॥

చ. వినుతయశుండు, రామపృథివీపతి నాయెడ నించుకైన నె
మ్మనమునఁ బ్రేమముంచినఁ గ్రమంబుగ నీ భువి నా కదృష్టముం
డిన శమమూని నాదగునడిఁ మదినెంచి కృపన్వహించి నె
మ్మన మలరంగఁ జల్లనగు మాకపివీరునిపట్ల పావకా॥

చ. వనితలయందు ధర్మపథ వర్తనగల్గినదాన నంచు నె
మ్మనమున భర్తృసేవకయి మాటికిఁ గోరెడిదాన నంచు నా
ఘనుఁడగునట్టి దాశరథి గట్టిగ నాత్మనెఱింగియున్న నె
మ్మన మలరంగఁ జల్లనగు మాకపివీరునిపట్ల పావకా॥

ఉ. నావసటన్ దలంప కరుణాపరతన్ మదిఁ బొక్కినార్య సు
గ్రీవుడు సత్యసంగర హరిప్రవరుండు వియోగతాపదుః
ఖా విలచి త్వన్నైన నను గాచు తలంపున నుండెనేని మా
పావనిపట్ల చల్లని స్వభావముఁ దాల్చుము హవ్యవాహనా॥

# రెండు పుష్పాలు

బొడ్డు బాపిరాజుగారు

అది పవిత్రమైన ప్రాతస్సు. ఉషఃకాంత చెదరిన నీలాలకములు సరిచేసికొనుచున్నది. చీకట్లు కాకులై అరచినవి. ఉదయాచల శిఖరమునుండి అభ్యుదితమయిన స్వర్ణరేఖలు దిగంతముల బందీకొన్నవి. కోకిల కమ్మని కుహూకారములో వనలక్ష్మి సహస్ర నేత్రములువిప్పి వసంతుని ప్రత్యుత్థానము సేయు సన్నాహమున మునిగియున్నది. వ్యధాకలుషితమైన మానవుని జీవితమున స్వచ్ఛందమైనది బాల్యము; ఉషస్సువలెనే అనంతము శూన్యమునగు ఆకాశమును, నిత్య నూతనమగు ఉదయరాగమును నిర్మలినమగు తన హృదయ ఫలకమున చిత్రించుకొనుచున్నది.

ఒకచిన్ని చెరువు.

జీవితమునకు ఉన్ముఖములైన పూవులనేకములున్నవి ఆకొలనులో. అజ్ఞాతహృదయములగు ఆతమ్మిమొగ్గలలో రెండు కాబోవు పూవులు తలలెత్తుకొన్నవి—చొరచుకొని వచ్చిన ఉత్తుంగహిమవత్ శృంగములవలె. తదితరములు చుక్కలముందు మిణుగురులైనవి. ఆరెండు మొగ్గలు ఒకదానినొకటి ఒరసికొనియున్నవి. వాటి దృక్పథములు భావికాలమును గురుతెరుంగకనే ఒకే గమ్యమునకు పెనవైచుకొని యున్నవి. దానిని కాలము నెల్లడించినది. కాని, ఆజంట, సంగీత సాహిత్యములవలె పరస్పర భిన్నమును, అభేద్యమును. రసికుల చూపులు వాటిని అభిషేకించినవి. ప్రకృతిమాత తనవరద హస్తమునెత్తి దీవించినది. అవి ఫలించినవి.

వికాసస్ఫూర్తికి ముందుగా సన్నని పైరుగాలి విసిరినది. ఆ అరవిరిమొగ్గలు పులకించినవి. చలువకు తియ్యందనమునకు మురిసి పడినవి. ఆసన్నని పైరుగాలియే పనిగట్టుకొని వాటి రెప్పలు సోకదినది. అబోధములగు వాటికి లోక మొకవింత. ఉదయరాగము కనుబడినంతనే ఇంతదనుక ఆత్మకుహరముల విగూఢముగానున్న రాగపిపాస పైకి చిందినది ఒకటి అలౌకికమగు వర్ణసమ్మేళనమునకు భవదూరుని తూలికావిలాసమునకు దోయిలించినది. వేరొకటి ముగ్ధమోహనమగు ప్రకృతి వీణారవమువిన హృదయ తంత్రులను మేళవించుకొని నిశ్శబ్దగానమున భావగీతములకూడ బలుకుకొన్నది. కనబడిన దిరువురకు ఒక్క ఉదయరాగమే.

ఆమధురహృదయములు దాగియుండ లేదు. భాస్కరుని అపరంజి కాంతులలో తమ సౌరభమును నింపివైచినవి. కొలనిలోని తక్కినపూవులకు కొరకొర లాగవినను రాయంచలు వానియంచులు పక్షములు విదిలించి విశ్రాంతి తీసుకొనుట మానలేదు. లోకమే ఎరుగనినాడు కన్నులువిప్పిన సన్న గాలి ప్రపంచమున వాటికొక ప్రత్యేకస్థానము తీసుకొనివచ్చి యిచ్చినది. పంకిలమగు ఆకాసారమునకు అవి ప్రతిష్ఠాస్తంభములు.

ఏమండువేసగి నిప్పుటెండలనో యాకొలకు తన బుద్బుదజీవనము గోల్పోయినను లోకమున అక్షరమై వెలయగల చక్కని రూపమును దిద్దిపెట్టి యూపిరి పోసినవియు నవియే తీరని కోరికలతో అదేపనిగా మధుర హృదయము రసపిపాసువులకు విప్పినవి. అందులకు అలబలముతో ఎన్నియో ముగ్ధమధువములు ముసురుకొన్నవి. లేదనకుండ కీర్తికాముకమై పంచియిచ్చిన దొండు. దానికీర్తులు దిగంగణముల నూరుమ్రోగినవి. భగవంతుడు సృష్టివలె తన యానందము పొంకె పంచియిడినది మరొండు. దానికీర్తులు దిగ్భిత్తికల నలంకరించినవి. అవి కళార్థిబృందమునకు చెవులబండువయు కనువిందును గూర్చినవి. జిజ్ఞాసువులగు వారిప్రేమ చిత్తములే వాటికి స్థిరనివాసములైనవి. వాటి గానములో సెలయేటి యలలబడి వచ్చెడి తియ్యని వంశీనినాదము చివురించినది. వాటి చిత్రణమున వెన్నెలలందు చెమరించిన మంచు బిందువుల నాచిపట్టుకొను కుసుమకోమలుల చిరునవ్వు పుష్పించినది. అవి లోకములో ఎట్లు మారినను, పరస్పరముగా స్వర్గీయ సుందరములు.

పెరిగినకొలదియు సూర్య చంద్రుల వలె వాటి సమ్మేళనము తనువు లోరసికొని తిరిగిన బాల్యమువలెనే దూరమైనది. దివ్య సంధ్యాతపమువల్లు నిర్మలినములైన అవి వెల్లుకబళింపని ఏమునిమాపుప్రొద్దులందో కలసికొని మూగబాసలో హృదయములు చెప్పుకొని, తీరనిఆకాంక్షతో కొరతవడని ఉబలాపమున ప్రక్కలకొరగి పోవుచుండెడివి. ఆ అనురాగమయములగు లేతచిత్తములు ఒకదానికొకటి ఛాయ. ఆవిషయమంతగా వాటికే తెలియదన్న లోకము మాట అనవసరము.

సరసునుండి వాటికి సెలవు చీటీ వచ్చినది. చిరసహవాసమైన ఆహ్లాద ఆవాతావరణమును వీడి వ్యథాకులమగు లోకములోపడి ఉక్కిరిబిక్కిరైనవి తొలుత. ఒకటి, వలపు నిండిన తలపులతో నిండిన హృదయముగల ఒక కుసుమకోమలికి చిక్కినది. అబిక ముఖములో తనయందములను చూచుకొన్న దాపూవు. పువ్వులో తనతియ్యనివలపు ప్రతిబింబమును చూచిన దాపడుచు. ఒకటి వేరొకటిని తనకై సృజింపబడినదనుకొనినది. పూవునకు పడుచునకు గలిగిన తగులమే ఆ బాల్యమగు చెలిమికి ఆనకట్టయినది. పువ్వు తనలో ఆపడుచును నింపివేసుకొన్నది. పడుచు కూడా దానిని నెత్తిన పెట్టుకొని మోచినది. తొలకరిమేఘములు మెరపునకువలె ఆపూవునకు ఆమె అంగరక్ష. విరికుమారిని దక్షిణానిలుడువలె ఆమె సోయగమును చరితార్థమొనరించినది ఆపూవు. ఆమెకు మనసిచ్చియున్నను ఆపూవు తన స్వామ్యమగు పరిమళమును లోకమునకు కానుక వెట్టుచునే యున్నది. ఆపడుచు చిన్నమనస్సునందు అది దేవతుల్యము. విశాలమగు ప్రపంచమునకు మాత్రమది నిత్యయౌవనమును మధురమును అక్షరమును అగు కవికుమారుని తియ్యని తేటగీతి.

రెండవది ప్రకృతికాంత ఒడినుండి విడివడి ఆనందవర్ధకములగు పరంజ్యోతి పాదములు ముట్టినది. పరమాణువగు తనలో భగవంతుని అంశ పసికట్టినది. కళాశింజితమగు తన హృదయమున వెల్వడిన మధురిమచే ప్రకృతికే కన్నుగుట్టించినది. కాంక్షలకు దూరమువడ్డ కళాభిమానమానతములగు రెప్పలయంచులలో బిగబట్టినది. అంతతో ఊరకుండక పరాధీనమలినానిలమున సుడివడియున్న లోకమున తనస్వేచ్ఛాపరిమళములు విరజిమ్మినది. దుష్ప్రవర్తకులు కొందరు ఉపయోగమెరుగక నలిపివేయ నుంకించిరి. ఫలితము సశూన్యము. జగముతోడి అంటునకంటె సౌందర్యసమర్చనమే ఆమె నుదుటిస్రావాలు. చాచియుంచిన భగవంతుని విశాలహస్తములలో అది మెరుగులు తీర్చు మాణిక్యమైనది.

ఆజంటపువ్వులకు పరిమళము విరజిమ్ముటయే పుట్టుకతో గొనివచ్చిన అక్షయ విభూతి. అదిగ్రహించి అనుభవించి ఆనందించుటయే లోకమునకు కర్తవ్యము. ఆంధ్రలక్ష్మిగళమున ఒకటి కవిస్వరూపము రెండవది శిల్పిస్వరూపము. రెండును జగత్తునకు పూజాభాజనములు. వాటి నింతగాచేసిన ఆ చిన్నిసరసు మెరసినది; సన్నగాలి మురిసినది.



## ప్రణయ వేదాంతము

'రాజేశ్వర'

చిన్నికాల్వలు నదులను చేరబోవు,
నాపగాంగన వార్ధిలో నైక్యమగును,
స్వర్ణదీప్రాంత శీతలవాతతతులు
స్థిరతరముగ నొండొంటిలోఁ గరగిపోవు,
ధరణిలోనెందు నొంటరితనములేదు,
సకలవస్తువు లోకదివ్య శాసనాను
వర్తితములు, పరస్పర బంధితములు,
గాన, భవదీయ హృదయ కింకరుఁడనైన
నన్ను నీలోన లీనమొనర్చుకొమ్ము.

అంబరము మహోన్నత శృంగచుంబితమ్ము,
కడలి కెఱటమ్ము లొండొంటిఁ గౌగిలించు,
పుడమి పెదవుల దినరాజుముద్దుఁగొనును,
తుహినకిరణుఁడు చంచల దూర్మికాల
లనల చలువచేతులను లాలనమొనర్చు,
సరయు పద్మినీరమణి క్షమూర్ధ్వగాను
నిజమనోహరు, మధుపు, మన్నింపకున్న,
నీవిచిత్రమ్ములందు సంతృప్తియేది
యుష్మదనురాగ వీక్షణమొకటిలేక.

## పితృచ్యుతి

వజ్ఝల వేంకటేశ్వరరావు, బి. ఏ.

పండుటాకులప్రాపునఁ బరువుఁగొనిన
యలరుజొంపమ! రాల్చెదేలా తరళహి
మాశ్రుకణములు రెప్పలయంచులందు?—
అకట! ప్రిదిలిన యొక పండుటాకుకొఱకొ?
దారుణారుణ గాఢసంతాప వహ్ని
కీలమో, నవధవళవిలోల హాస
వాసనావేశమో, కనుపట్టునిపుడు:
గతమునకునొండు, భావిభాగ్యమునకొండు,
దాఁచుకొనియెదవో హృదంతరమునందు?

# పాప మా బాలు డేమాయెనో?

గ్రంధి అప్పారావుగారు

ఆవేళ హాస్యనటకాగ్రేసర చార్లీచాప్లిన్ ఫిలుము గుటచే నేను తప్పనిసరిగా సాయంత్రము ఆరు ఘంటలకు సినిమాహాలునకు బయలుదేరితిని. కృష్ణపక్షపురోజులలో నే నిల్లుకదలకపోవుటకు కారణము దొంగలభయము. అప్పుడది శుక్లపక్షమే యగుటచే చంద్రుడు దేదీప్యమానముగా నంబరవీధిని ప్రకాశించుచుండుటచే నేను ధైర్యముగా నొంటరినై బయలుదేరితిని. సినిమాహాలువద్ద జనము మిక్కుటముగా నుండిరి కాన చాలప్రయాసతో టిక్కెట్టు కొనగలిగితిని. ఆట ప్రారంభమయినది మొదలు అంతమయ్యేవరకు ప్రేక్షకులు కడుపు చెక్కలగునట్లు నవ్వుటకు చాప్లిన్‌యొక్క వింతవింత చేష్టలనియే నిరాఘాటముగ చెప్పవచ్చును. నే నపరిమితానంద భరితుడనైతిని. సినిమాయధికారులకు యిటువంటి ఫిల్ము తెప్పించినందులకు నాలో నేనే వారిని కొనియాడితిని. ఆట ఆఖరై నప్పటికి పదిఘంటలయినది. నేను గృహోన్ముఖుండనైతిని.

అప్పటివరకు పుచ్చపువ్వవలెనున్న వెన్నెల మటుమాయమైనది. కారుమబ్బులు గగనవీధిని ఆవరించియుండెను. ఉరుములు మెరుపులు మానవకోటిని భయపెట్టుచుండెను. అప్పుడు నామనము యీతరానివాడు సముద్రమధ్యమునపడిన యెట్లుండునో యట్లులుండెను. ఒడలు కొంచెము వడకజొచ్చెను. గుండె ధైర్యము చేసుకొని, దైవమును తలంచుకొనుచు బయలుదేరితినే కాని సగముదూరము పోయినతరువాత కొందరు మనుష్యులు నన్నాచరించుచున్నటుల నాకు కనబడెను. కేవలము భయముచేతనే ఆట్లాయులటుల కాన్పించుచున్నవని గుండె మరింత ధైర్యము చేసుకొని చరచరనడచుట కుద్యుక్తుడనైతినిగాని యంతలోనే యేదో ఒకచేయి నాజేబులోని కెక్కుచున్నటుల నాకుతోచెను. ఈసారి నాభయమునకు మేరలేకుండెను. దొంగవా డెవడో నాజేబులో చెయి పెట్టుచున్నాడని తెలిసికొని సగము ప్రాణముతో నున్న నేను ప్రాణమునకు తెగించి ఆదొంగవానిచేతిని నా రెండుచేతులలో నాయావచ్ఛక్తిని ఉపయోగించి పట్టుకొంటిని. నేను పట్టుచేయి యెనిమిదేండ్ల బాలుని దని నాకు అప్పుడు మెరసిన మెరపుకాంతివలన దెలిసెను. దొంగవాడు బాలుడని నేను తెలిసికొనినప్పుడు నాకు చాలధైర్యము వచ్చినది. వానిని పోలీసుస్టేషనులో నప్పగించుటకు బయలుదేరితిని. వర్షము కురియ నారంభించెను. అంత మేమొక యరుగుమీదకు వచ్చితిమి.

దొంగపిల్లవా డమాయికముగ నేడ్వజొచ్చెను. ఆయేడ్పుధ్వని వినినతోడనే నామనస్సులో నొక విధమయిన కనికరము పొడచూపుటచే వానిని యేడ్చుటకు కారణమడుగగా నాతడు వెక్కుచు "అయ్యా! నేనపరాధిని. నన్ను మీరిప్పుడు ఖైదులో పెట్టుటకు తీసుకొని వెళ్ళుచున్నారా? నేనాపని చేయుటకు కారణమును చెప్పెదవినుడు." అనుచు కొంచెము సేపాగి 'తల్లీ! దైవము మనకు దూరమైనా' డని క్రిందపడిపోయెను. అప్పటికి వాన తగ్గిపోయెను. నేను సినిమాహాలువద్దకు పరుగునవెళ్ళి సోడాబుడ్డి నొకటి తీసుకొనివచ్చి ఆబాలునికి పట్టగా వాడు కొంతసేపటికి తెలివి దెచ్చుకొని 'అయ్యా! నాకొక తల్లియున్నది. తండ్రిసంగతి నాకు తెలియదు. నా తల్లి యీవూరిలో బిచ్చమెత్తి నన్ను పెంచుచున్నది. కాని నాలుగురోజులనుండి యామెకు జబ్బుగా నున్నది. ఆమెకు యీరోజున తెలివి దప్పిపోయినది. నాతల్లి నెటులయిన కాపాడుటకు యీరోజున బిచ్చమునకు పోగా నొకతండ్రియైనను గుప్పెడు బియ్యము వేయలేదు. నాకును నాతల్లికిని నాలుగురోజులనుండి తిండిలేదు. ఆమె యిప్పుడు చావ సిద్ధముగ నున్నది.

కావున సినీమాకువచ్చెడి ధనవంతులజేబులలో డబ్బు దొంగతనము చేయుటకొరకు..." అని చెప్పుచు నా బాలుడు బేలగ నేడ్వజొచ్చెను. వానిని కొంచె మోదార్చితిని. వాడు చెప్పినదంతయు నిజమో లేక నా చేతులలోనుండి బయటపడుటకు వాడట్లు చెప్పెనో తెలిసికొనుటకు నన్ను వానియింటికి తీసుకొని పొమ్మంటిని. వాడు సరేయని బయలుదేరెను.

వాడు నన్నొక తాటాకుయింటిదగ్గరకు తీసుకొని వచ్చి నిలుపబడెను. నేను లోనికి ప్రవేశించి చూడగ నాయింటిలో నొక కునుకుదీపమును, పాత నులక మంచముమీద నొక స్త్రీ 'మంచినీళ్ళు' అని హీన స్వరముతో పలుకుచుండుటను గాంచితిని. బాలుడు భోరున యేడ్వసాగెను. పాప మా స్త్రీ బాలుని దగ్గరకు రమ్మని సైగచేసి వానిమోము తనమోముపై జేర్చుకొని కన్నీరు వలవల కార్చజొచ్చెను. కొంత సేపయిన తరువాత నామె కండ్లు మూసివైచెను.

బాలుడు చెప్పిన మాటలన్నియు నిజమని నిర్ధారణ యయ్యెను. నేను పరుగుపరుగున నాస్నేహితుడగు డాక్టరు యింటిదగ్గరకువెళ్ళి వానితో జరిగినసంగతి క్లుప్తముగా చెప్పి వానిని పిల్లవాని కుటీరముదగ్గరకు తీసికొనివచ్చితిని. డాక్టరు ఆస్త్రీచేయి పట్టిచూచి ఆమె యంతకుముందే చనిపోయెనని తెలిసికొని చెప్పెను. అంత నాపిల్లవాడు వా రిద్దరివైపు చూచుచు యేడ్చెను. నేను వానికి 'మరణము' అందరికి వచ్చుట సహజమనిన్నీ, యెప్పటికైనను ప్రతి వ్యక్తి కూడ చనిపోవలసిన వాడనిన్నీ కొన్ని వేదాంతవాక్యములజెప్పి వానిశోక ముపశమనము జేసితిని. వాని తల్లియొక్క అంత్యక్రియలు స్వయముగా నేనే జరిపించి పిల్లవానిని నేనే తిండిపెట్టి పెంచెదనని చెప్పి వానిని నాయింటికి తీసికొనిపోయితిని. వాడు రెండురోజులు మాత్రమే నాయింట భోజనముచేసి యుండెను. మూడవరోజున వాడు నాకు కనపడ లేదు. ఊరంతయు వెదకితిని. జాడలేదు. పాప మా బాలు డేమాయెనో?—



## భావగీతమ, నీజన్మ పాడుకాను!!

కోడి. నారాయణస్వామిగారు బి. ఏ.

సీ॥ వివిధ ధర్మాధర్మ విజ్ఞానచంద్రికా ప్రభలగ్రాలు, 'భారత' ప్రముదనుడులు;
హరికథామృతసేవ నమరత్వమొందిన 'భాగవతా' బ్జాక్షి భాషణములు;
శృంగారరససింధు భృంగార్భటశ్రుతిఁ బాడు 'నైషధ' నారి భవ్యగీతి;
బహుభావ సౌరభభరిత ప్రసూనమౌ 'వసుచరిత్రాం'గనా వాక్యసరణి;

తే॥గీ॥ వినఁగుతూహలమొందు మాదీనులందు,
భావ మదియేమొ గలదను భ్రాంతితోడ,
వెఱ్ఱికూతలనిడి వెఱ్ఱివీగెదేల?
భావగీతమ!, నీజన్మ పాడుకాను!!

# స్త్రీలు-సంస్కృతాది విద్యలు

దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

నేటి స్వర్ణయుగమున స్త్రీవిద్యావిషయమై యనేకవిధముల పాటుపడువారు పెక్కురుగలరు. నిష్కలంకమైన హృదయముతో నట్టి విద్యాభివృద్ధులకై పాటుపడువారల కనేక నమస్కృతములు—

మొన్నమొన్ననే జన్మించి దినదిన ప్రవర్ధమానుండగు బాలచంద్రునివలె నొప్పుచు సంస్కృతాంధ్ర సంగీత చిత్రలేఖనా ద్యనేక విద్యావిరాజమానంబై పూతగోదావరీ శీతలతరంగవారములచే నద్భుతమగు నభివృద్ధినందుచు కళాశాలలలో నగ్రస్థానమువహించినది యాంధ్రయువతీకళాశాల అనే వైశ్యసేవాసదనము (రాజమండ్రి)—

చిరకాల మవిచ్ఛిన్నముగా జరుగుటకు నీపాఠశాలకు శ్రీ దానకర్ణ నాళం రామలింగయ్యగారు లక్ష రూపాయలు మూలధన మొసంగియున్నారు. శ్రీమతి యుభయభాషాప్రవీణ బత్తుల కామాక్షమ్మగారు ప్రిన్సిపాలుగా నున్నారు.

ఈసదన మిట్టి ధురంధర త్రితయముచే నిరవద్యముగాఁ బాలింపఁబడుచు గొప్ప పండితులచే విద్య నేర్పఁబడుచున్నది. ఇందు బాలికలు యువతులుగలసి 120 మందివఱకు సంఖ్యగలదు. 1931 వ సంవత్సరమునందే గవర్నమెంటువారిచే రికగ్నైజు చేయఁబడి కాలేజీగాఁ బరిగణింపఁబడుచున్నది. ఇందలి విద్యావిధానము చాల జాగరూకతతోను నిపుణముగాను నిర్వహింపఁబడుచున్న దనుటకు సాక్ష్య మందలి పరీక్షాఫలితములే—

ఇందు 1933 వ సంవత్సరమున నుభయభాషా ప్రవీణ (బి) గ్రూపు ప్రిలిమెనరీ పరీక్షకు ముగ్గురు యువతులు కట్టి ముగ్గురు ప్యాసయియున్నారు. 1934 వ సం॥రమున గూడ ముగ్గురు కట్టి యొక్కరును తప్పిపోవక యుత్తీర్ణులైయున్నారు. కాలేజీ క్లాసులలో నాల్గుసంవత్సరముల కోర్సునకు నాల్గు తరగతులున్నవి. అందు ప్రిలిమెనరీ మొదటి రెండు క్లాసులలో నలుగురేసి యువతులును, ఫైనల్ మూడవతరగతిని నల్వురును, నాల్గవవత్సరము తరగతివారు ముగ్గురును గలరు. ఈకాలేజీ క్లాసులుగాక ఎంట్రన్సు (ప్రవేశ) పరీక్షలు చదువు స్త్రీలు చాలమందిగలరు. అందీవత్సరము గత మార్చినెలలో దరఖాస్తు చేసినవారు 9 గురు. పరీక్షాఫలితము లింకను దెలియలేదు.

ఇంక నీపై కన్యల ప్రకారము విద్య నభ్యసించువారిలోఁ గొందరు సంగీతము నభ్యసించుచు 1933 వ సం-మున ముగ్వురు మదరాసు సంగీత పరీక్షలకు వెళ్లి యిరువురు ఫస్టుక్లాసులోను నొకరు మూడవతరగతిలోను ప్యాసయియున్నారు. వీరింత బలువులేని పిల్లలుగూడ వీణపట్టి చూపు గానకౌశలము ముద్దులమూట కట్టుచున్నది. మఱియు చిత్రలేఖనమునకై 1932 లోనే నవంబరునెలలో జరిగిన పరీక్షలకైదుగురు వెడలిరి. నలుగురు ప్యాసయియున్నారు.

హిందీభాష నేటిదినములలోఁ బ్రాముఖ్యము వహించియుండుట సర్వవిదితము. ఈభాషగూడ నీకళాశాలయందు నేర్పబడుచున్నది. ప్రాథమిక పరీక్షకు ఏడుగురు కట్టినారు. ఐదుగు రుత్తీర్ణులైనారు. 5 గురు గూడ ఫస్టుక్లాసులోనే రాఁగలిగిరి. రాష్ట్రభాష కొక్కరే కట్టి ప్యాసయినారు. విశారద పరీక్షకుఁ జదువువారుగలరు. ఈభాషయు సమర్థులగు పండితులచే నేర్పఁబడుచున్నది.

మఱియు నూలు, ఊలు, పట్టు మొదలగువానితో నల్లుట కుట్టుట మిషనుకుట్టు (లేసు) పనులు రాట్నము వడకుట, యనేకవిధముల చేతిపనులును గూడ చూచి తీరవలెను.

ఇందు 50 మంది కన్నిరకముల స్త్రీలకు నుచితముగా భోజనసదుపాయము చేయఁబడుచున్నది. ముగ్గురు స్త్రీలకు గవర్నమెంటు స్కాలరుషిప్పు లియ్యఁబడుచున్నవి.

ఇట్టి సంస్థలు పూర్వమునుండి యున్నచో మన స్త్రీలోకము నేటి కెంత యభివృద్ధిలోనికి వచ్చెడినో గదా? విశాలమైన యావరణలు ఎలెక్ట్రిక్ దీపములు, గలవు. ఆరోగ్యమైన గాలివచ్చు గోదావరీతీరముననే భవనము కట్టఁబడినది. ఇందలి దాసీలు నౌకర్లు నుచితముగానే పనిచేయుచున్నారు.

నేటి లోకమున దాతలనేకులున్నను వారివారి ధనము లనేక సత్కార్యములకె తోడ్పడుచున్నను నిట్టి స్త్రీ విద్యావిషయమై ధన మురుదుగా ఖర్చగుచున్నది. ఇట్టి మహోదారాశయము చిరకాలమునుండి మనస్సుననుంచుకొని సమయము చూచి తమ కోరికను సార్థకముగాఁజేసికొన్న శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి తప్పక లోకమంతయు చేతులెత్తి నమస్కరింపవలసినదే. ఇంకను నీమె విద్యార్థినులను దమ పిల్లలనుగాఁ జూచుకొనుచు నీషన్మాత్రమును లోటుపాటులు లేకుండ సమానాభిమాన గౌరవ ప్రేమాదరములతో వేయికన్నుల కాచుచుండును. ప్రతిదినమును సదనమున ప్రార్థనలు జరుపఁబడుచుండును. తాను దినినను తినకున్నను తన సౌఖ్యమును మరిచి "పరోపకారార్థమిదం శరీర" మన్నమాటను సార్థకము చేసి లోకమునకెల్ల మహోపకారము చేయఁదలచి యీమె యొనర్చుసేవ యమూల్యము. ఇట్టి స్త్రీవిద్యాభిమానము కలవారలు లోకమున నల్వురైదుగు రున్నచో మన స్త్రీలోకములోని యజ్ఞానాంధకారము పటాపంచలై పోవఁగలదని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పుచున్నాను. ఇట్టి సమాజములకును తత్పాలకులకును పోషకులకును భగవానుఁడు చిరాయురారోగ్యములిచ్చి రక్షించుగాక. ఇంత యభివృద్ధితో నున్నను గవర్నమెంటువారింకను గ్రాంటేమియు నివ్వకపోవుట చింత్యము.

## పతివ్రతాతిలకములు

శ్రీమతి అవధానుల పార్వతీదేవిగారు

చ॥ పరిణయమైనవత్సరమె ప్రాణముబాయునతం డటంచు మున్
సురముని చెప్పినన్ వినియు సుస్థిరప్రేమను సత్యవంతునే
పరిణయమాడి యాతడటు ప్రాణమువాయగ దుఃఖమందియున్
వెరపొకయింతలేక యము వేడి పతిన్ బ్రతికించుకొన్నయా
ప్పరమపతివ్రతామణికి పాపములెల్ల దొలంగ మ్రొక్కెదన్॥

చ॥ హరిహరపద్మజుల్ నిజప్రియాంగనలం దనియింప నెంచి
భూసురులటు రూపుదాల్చి యనసూయ గృహంబునకేగి యమ్మ మే
మరయుచునుండ వడ్డన దిగంబరవై యొనరింపుమన్న మూ
వుర నొనరించి పిల్లలుగ బువ్వనుబెట్టిన నాతిమిన్నక
ప్పరమపతివ్రతామణికి పాపములెల్ల దొలంగ మ్రొక్కెదన్.

చ॥ పురువులటంచు కన్నులను పుల్లను గ్రుచ్చగ నగ్గి యమ్మునీ
శ్వరు డతికోపియై కఠినశాపము నీయదలంచ నాతనిన్
పరిణయమాడి సాధ్వియయి, ప్రాణవిభున్ నిజదైవతంబుగా
నరయుచు లోకమాన్యయయి నాథుని రూపసి జేసినట్టి య
ప్పరమపతివ్రతామణికి పాపములెల్ల దొలంగ మ్రొక్కెదన్.

# శ్రీ యోగినీనిలయము

శ్రీమతి ఇప్పగుంట వేంకమాంబగారు
(అరండల్ పేట : గుంటూరు)

గుంటూరునందలి అరండల్ పేటలో స్త్రీ సనాతనధర్మమండలి యను పేర నొకసంస్థ నేర్పాటుచేసి అందులో బాలికలకు విద్యయు, స్త్రీలకు పురాణము, ఉపన్యాసములు మున్నగునవియు జరుపుచు షుమారు ముప్పది సంవత్సరములనుంచి పని చేయుచున్న విషయ మాంధ్రలోకమునకు బరిచితమైనదే కదా! ప్రస్తుత మీసంస్థ కనుబంధముగ యోగినీనిలయము అను మరొకసంస్థను నెలకొల్పవలయునని నిశ్చయించినారము. ఆసంస్థయొక్క విధులేమనగా:-

1. వితంతువుల నందుజేర్చుకొని వారికి వైరాగ్యపూర్వకమగు అధ్యాత్మవిద్యను గరపుటయు, అద్వైతమతము యొక్క యథార్థమును, సంస్థాపనావిధానములును, అలాగే ద్వైత విశిష్టాద్వైతములను నేర్పుటయు, సమర్థులైనవారిని స్త్రీలోకమునకు మతప్రచారకులుగా తయారుచేయుటయు, విద్వాన్, శిరోమణి మొదలగు పరీక్షలకు తయారుచేయుటయు, హిందీలో ఉన్నతపరీక్షలకు బంపుటయు, సంస్కృతవిద్య సామాన్యభాషగా నేర్పుటయు,

2. యోగాభ్యాసము, మంత్రోపాసనము అభ్యసింపజేయుటయు,

3. జ్యోతిషమునందు జాతకములు వ్రాయుట, పంచాంగములు గుణించుటలయందు తయారు చేయుటయు,

4. ఇంగ్లీషులో టీకాలువేయు పరీక్షకు పంపుట,

5. ఆయుర్వేదము, హోమియోపతి, రంగు సీసాల వైద్యము, సూర్యకిరణ చికిత్స, జలచికిత్స మొదలగు పరీక్షలకు వెళ్లనెంచినవారికి తగినంత ఇంగ్లీషును నేర్పి పరీక్షలకు పంపుటకు నిశ్చయించుకొని ప్రారంభింప నెంచితిమి

ఇందు ప్రవేశించవలెనను నభిలాషగలవారియొక్క యిరువదిమంది యభిప్రాయములు మాకు తెలియబరచిన వెంటనే ప్రారంభింపబడును. ముందుగా ప్రవేశపత్రముల నంపినవారికి సదుపాయములన్నియు నేర్పరుపబడును. తమ జీవయాత్రనంతయు నిందే గడుపుకొన నిశ్చయించుకొనిన పారమార్థికులకు మాత్రము నివాసమునకు తగిన సదుపాయములు చేయబడును. ఉద్యోగాపేక్షితులకు ఉచితముగా విద్య నేర్పుటకు మాత్రము యేర్పాటుచేయుదుము. ఈ విద్యానిలయమునందు ప్రవేశింప నెంచిన ప్రతివారును మా దరఖాస్తుఫారముమీదనుండు కాలములన్నియు స్వదస్తూరీతో పూర్తిచేసి ప్రవేశరుసుము అయిదు రూపాయిలతో కార్యస్థానమునకు పంపవలెను. దరఖాస్తుఫారములు కోరువారు ముందు ఒక అణా పంపిన ఫారమును అందజేయుదుము.

## విద్యార్థినుల విభాగములు

1. విద్యార్థినులు ప్రాకృతులనియు పారమార్థికులనియు రెండు విధములుగ విభజింపబడుదురు. పారమార్థికులలోను ఆంతరంగికులనియు, సామాన్యులనియు, రెండు తెగలుగ నేర్పరుపబడుదురు. ప్రాకృతులనగ విద్యవలన జీవించువారు.

పారమార్థికులనగ కేవల నిరపేక్షులై పరోపకారమునకు ఉద్గ్రంథముల పరిశీలించి వానియొక్క సారాంశములు లోకోపకారార్థమై వినియోగపరచుచు స్త్రీలోకమునకు ధర్మమును ప్రబోధించుచు, తమ జీవితమును గడుపుకొనువారుగ నుందురు.

ఆంతరంగికులు, సర్వ వేదాంత సిద్ధాంతధర్మములను తెలిసి తద్విధివిధానముగ స్థితప్రజ్ఞాలక్షణములు గలిగి భక్తిజ్ఞానవైరాగ్యములతో ఆంతరంగిక సంఘమందు జేరుచుండు అధికారులగువారికి భక్తిజ్ఞానము

లును ప్రబోధించుచు భక్తివైరాగ్యములందు తమతమ జీవితములను గడపుకొనుచుందురు.

## ఉపపత్తి నిర్ణయము

అంతరంగికశాఖవారు తమ జీవనార్థము సుమారు నె. 1-కి రు. 5-0-0-లకు తక్కువగాని మనోవృత్తిగాని, లేక వెయ్యిరూప్యముల రొక్కముగాని కలిగియుండవలయును. ఆ జీవితార్థమును తనయొక్క స్వాధీనమందుగాని, బ్యాంకిలో తనపేరనుండిగాని లేక ఈ విద్యాపీఠముయొక్క స్వాధీనమందుగాని యుండవలయును. మనోవృత్తిరూపమున స్థిరాస్తి స్వాధీనముగలవారుగాగాని, లేక రొక్కమిచ్చుచో దానికి తగిన హామీగాని కలిగియుండవలయును. ఆయాంతరంగికులు తమ జీవయాత్ర గడుపుకొనుటకు తగిన వసతిగృహము యీ విద్యాపీఠాధికారుల అనుమతినిపొంది వారిచే నిర్ణయింపబడిన పద్ధతిప్రకారము వారు నిర్ణయించిన స్థలమందు కట్టించుకొని తమ జీవయాత్రను గడుపుకొనుటకు తగియుందురు. వారు సర్వస్వమును విద్యాపీఠాధికారులయొక్క స్వాధీనములో నుంచుకొను నధికారముగలదు.

పారమార్థికులు, తమ జీవనార్థములను ఆస్తులను తమ స్వాధీనమందుంచుకొని తమ నివాసమునకు వలసిన గదిని విద్యాపీఠాధికార్లవలన నిర్ణయింపబడిన స్థలమందు నిర్ణీతమగు పద్ధతులతో పీఠాధికార్లయొక్క అనుమతిని కట్టించుకొని తమ జీవయాత్రను గడుపుకొనునంతవరకు హక్కుకలిగియుందురు. ఈ పారమార్థికసంఘమువారి మనోవృత్తులు మొదలగు ఆస్తుల బాధ్యతాబాధ్యతలు పీఠాధికారులపై నుంచుకొనరు. వారి భోజనాదికములకు వలసినపదార్థము, పాకసామగ్రులు వారే సమకూర్చుకొనుచుందురు.

అంతరంగిక సంఘముయొక్క సర్వవిధముల పోషణాదిక బాధ్యతలన్నియు పీఠాధికారులపై నాధారపడియుండును.

అంతరంగికులుగాని, పారమార్థికులుగాని, నివాసమునకు కట్టించుకొనినగదుల దానవిక్రయములకు అధికారులు కారు.

ప్రాకృతసంఘమువారు విద్యాభ్యాసకాలమందు దప్ప తక్కిన కాలములలో పారమార్థిక, అంతరంగిక సంఘములతో పీఠాధికారుల అనుమతిని పడయక కలుసుకొనుటకు అవకాశమియ్యబడదు. విద్యాపీఠమునకు పీఠాధికారులు, అంతరంగిక సంఘమువారును సర్వస్వతంత్రములను గలిగియుందురు. అందును అవసరమైనచో నొక సభచేసి అందు హెచ్చుమంది అభిప్రాయానుసారము కార్యనిర్వహణము జరుపుచుందురు.

## సభలు

సంవత్సరమున కొకతూరి మహాజనసభయు,
ఆరుమాసముల కొకపరి విద్వజ్జనసభయు,
మూడుమాసములు కొకటి సాంఘికసభయు,
జరుగుచుండును.

అంతరంగికసంఘములో చేరి అన్నవస్త్రములకు లేనివారయినచో వారిని అన్నవస్త్రములిచ్చి పోషించు బాధ్యత పీఠాధికారులకు కలదు.

ఈ సంస్థకు అధ్యక్షులు, కార్యదర్శులు, పీఠాధికారులు కేవలము వితంతుస్త్రీలే యేర్పడియుందురు. ఈసంస్థకుగాను యేర్పాటుచేసిన ఆవరణములోనికి పీఠాధికారియొక్క అనుమతి వ్రాతపూర్వకముగా లేనిది పురుషులెవరును ప్రవేశించకూడదు. వ్రాతపూర్వకమైన అంగీకారము పీఠాధిపతివలన పొందినను రెండు గంటలకంటె హెచ్చుకాలము లోన నివసింపవలసివచ్చినచో పీఠాధికారులయొక్కయు, అంతరంగికసంఘమువారియొక్కయు లిఖితపూర్వకమైన తీర్మానమునకు నకలుపొందనిది పురుషులు లోనికి రాకూడదు.

## విద్యార్థినుల వయోనిర్ణయము

1. ప్రాకృతవిద్యార్థిని ఇరువది సంవత్సరములకు లోపుగను పదునైదేండ్లకు తక్కువగాకను ఉండవలయును.

2. పారమార్థిక విద్యార్థిని ముప్పదియేండ్లకు మించకుండ నుండవలయు.

3. అంతరంగిక విద్యార్థిని నలుబదేండ్లకు మించకుండనుండవలయును.

4. సామాన్యవిద్యార్థినులకు వయో నిర్ణయ ముండదు. ప్రతి విద్యార్థినియు పరీక్షించి చేర్చుకొనఁబడును.

విద్యార్థినులు వారివారి మతానుసారము కృత్యములు చేయుటయందు నియమితులు. కులమందుగాని, మతమందుగాని, గుణములందుగాని, ప్రవర్తనమందుగాని, నిందితులుగానుండువారు చేర్చుకొనబడరు. రోగగ్రస్తులు చేర్చుకొనబడరు. కుంటి, గ్రుడ్డి, చెవిటి, మూగవార్లను, పిచ్చివారిని, చర్మవ్యాధిగలవారిని చేర్చుకొనవలనుబడదు. సంతానయుతులను (పసిపిల్లలతల్లులను) చేర్చుకొనవలనుబడదు.

ఇట్లు,

కార్యనిర్వాహకసంఘము.

మేనేజరు: ఇప్పగుంట వేంకమాంబ,

కార్యదర్శిని: చల్లా అరుంధతమ్మ.

ఉపకార్యదర్శినులు:

యలమర్తి సీతారత్నమ్మ,

గొడవర్తి శ్యామలాంబ.

---

# మాతృహీనుఁడు

తుమ్మల వెంకటరామయ్య చౌదరిగారు

ఈవిశాల ప్రపంచాన నెవరులేరు
నాకు—నేనొంటివాఁడను—దిక్కులేని
పక్కిని, ననుగన్నజనని వదలిచనియె,
ఎఱుఁగ నేటికిని జనకుఁడెవఁడో... ఆమె

జననియై, జనకుఁడై, నన్ను సాకుచుండె,
ఇప్పుడెవ చిచ్చువెట్టి తానేగె... ఆ వి

యోగదుఃఖానల కణము లొక్కటొక్కటి
గలసి మంటయై, జ్వాలయై గ్రమ్ముకొనగ
లేఁగాపార్లి పొంగు కన్నీటియేఱు
దువ
విప్పవేయుచునున్నది- అంతకొంత
శాంతి చేయుచున్నది హృదయాంతరాన,

మఱచిపోఁజాల-పోవను—మాతనెపుడు
వల
పగిటఁ బచిపోలేను—పోవను—మాతృశబ్ద
తనమునూత్రాన యొడలెల్ల జలదరించి
లేపనముఁ వచ్చునాయమ చర్యలెల్ల.

పండువెన్నెలలో, ఆరుబయలునందు
చల్లనౌ యమృతము జిల్కు చంద్రుజూపి
బువ్వతినిపింపగా నను బుజ్జగించు
అమ్మను మఱచిపోలేను... అనవరతము

ఆటపాటలమునిగి నేనలసిసొలసి
వచ్చినంతనె ననుగాంచి “వచ్చినాడ
వ, ననుగన్నతండ్రి”యనుచుబలికి, ప్రేమ
కౌగిటంజేర్చి ముద్దాడు కన్నతల్లి
కనులకుం గట్టినట్టుల గానుపించు.

కలకలధ్వనుల పులుఁగులు లలితరాగ
ములఁ బలుకువేళ నను లేపి, మొగముకడిగి
కూరుచుండగజేసి, నా కురుల దువ్వి
తానమాడించియు చలిది యన్నమునిడి
“బడికి పోనాన్న!”యని సాగఁబంపుతల్లి
ఏది? ఎటనున్నదో? ఏమొ? ఎవరికెఱుక
లేదు—ఈజన్మమున ఆమెలేదు—నాకు
ఈవిశాలప్రపంచాన నెవరులేరు.

# రెడ్లరాణి

శ్రీ కుటుంబరాయ శర్మ (కవితావిహారము)

"ఉగ్గుపాలనె శౌర్యమ్మునోడ్చి, రంగ
రించి", కడుపుకేసెడు తల్లి రెడ్లరాణి,
కొండవీడున పెనుకోట కొమ్మలందు
తీయమున నింకను పచార్లుచేయునేమొ!

బిగుతైన నునులేతజిగియారునవుమ్ముపై కణుపుచీరెలముడిగట్టిదనము,
పైరణీరయికలో పైపైకి నెగసెడు గుత్తంపువక్షోనిగూఢనమ్ము
అచ్చంపుతాబేటి యచ్చునందొత్తిన పాదాలలక్క నీరూముసొగసు,
దట్టంపుకుంకుమబొట్టు పెట్టెడినట్టి దిక్కనికనుబొమల్ చక్కదనము.
పునుఁగు జవ్వాజుల తలంటిఁబోసికొన్న
సంజకన్నులకెంపు పసందుపైని
మూఁగు చీఁకటివెంట్రుకల్ మురువునం ది
కేమిమిగిలె? నీపాలిపోయిన జగాన!

ఈవెదురులపొద యీలలెన్నవవంతు? నాతల్లి యీలకంఠమ్మునందు,
ఈనీటిచాళ్ళవి యేమియెఱుంగును? సదయమాయమ్మ వెడదమనస్సు,
ఈగిరిగైరిక యేమిజేవురుకద్దు? గండరించినతల్లి కంటిముందు,
ఈజీర్ణశృంగాలనిపుడు క్రుంకెడిరవి నామాతృసర్చస్సునకు సుమారె?
తొలివయస్సును చెల్లిన పలుకులేని,
ఈదరుల్ చూపు గద్దరింపెంతపాటి?
కటినిచేజేర్చి నిడుకడగంటఁజూచి
వింటిబొమలెత్తి తీవ్రాజ్ఞవెట్టుసతికి!

వజ్రంపునిగ్గువ వలుదచన్గవపాలు త్రేన్పగాత్రావించు తీపిఁదెలిసి,
ప్రాకాడిపట్టింటి నేకరువెట్టుచో! నవ్వుకోపముఁజూపు నయమెఱింగి,
కురుతప్పుటడుగులఁ గూడుచునడయాడ ముద్దుపైముద్దిడు మురిపెమొంచి,
బడికేగకేనాడు మారాముచేయుచో, బ్రతిమాలిబొమాలు భావమరసి,
పెద్దవాఁడైననేనేమొ! పేరుకెక్కి
తన్నుమరియుద్ధరిం తనుకొన్నతల్లి
యాశలడలంచి నేఁబడుసట్టిదేమి?
కోర్కెలే మిగిలిన అంపకోఁత దప్ప.

మాయశస్సుల మహాసూళ్లు మనసుసందు తేపతేపకు నెమటకుఁ దెచ్చికొనుచు,
సన్నివిధముల దాస్యమ్మునందుఁ ద్రుగ్గ వెట్టిబ్రతుకునకన్నిట ట్రులోత్తు.

—"హిందూప్రతిష్ఠ"




## ఋతుదోషములు

డాక్టర్ ఎస్. శేషగిరిరావు ఎల్. ఐ. ఎమ్.

### ఋతుశూల

ఆంగ్లేయభాషలో ఋతుశూలకు "డిస్‌మెనోరియా" యనిపేరు. ఈ శూల స్త్రీలకు బహిష్టుసమయములందు సంభవించుచున్నది. హిందూదేశమునందు యీ వ్యాధిచే పీడింపబడువారనేకులున్నారు. ఈ వ్యాధిచే బాధపడువారిని చూచిన ఘోరముగనుండును. స్త్రీలపాలిటి కిది పెనుభూతమె. ఈ కడుపునొప్పి భరింపజాలక క్రిందపడి పొర్లుటయు, విల్లువలె వంగిపోయెదరు.

ఈశూల మొదలగు గర్భాశయరోగములన్నిటికిని కారణము ఋతుదోషమే. ఋతువు రోగాక్రాంతమగుటకు స్త్రీలు ఋతుసమయములందు నియమములను పాటింపకుండుటయే కారణము. స్త్రీలు నియమముల పాటించిన ఎట్టి వ్యాధులు కలుగనేరవు.

### ఆవశ్యక నియమములు

స్త్రీ ఋతుమతియైన రోజునుండి మూడురోజుల వరకు బ్రహ్మచర్యము మొదలగు వ్రతములచే నియమవంతురాలై పగటినిద్ర, కన్నులయందు కాటుక పెట్టుకొనుట, రోదనము, స్నానము, చందనాద్యనులేపనము, అభ్యంగనము, గోళ్లుతీయుట, పరుగులిడుట, దుముకుట, నవ్వుట, అధిక సంభాషణము, గొప్పధ్వని వినుట, తలదువ్వుకొనుట, మిక్కుటమైన గాలి, ఆయాసకరమైన పనులు మున్నగువానిని వర్జించవలయును. ఈనియమవర్తనమున కలవడనిచో ముందుముందు అట్టి స్త్రీలకుకలుగు సంతానము అన్యాయముగ బాధపడవలసి యుండును. ఋతు దినములందు స్త్రీచేయు పగటినిద్రవలన నిద్రబోతుతనము, కాటుకవలన గ్రుడ్డితనము, రోదనమువలన వికారమైన దృష్టి, స్నానలేపనములవలన సదా దుఃఖించు స్వభావము, అభ్యంగనమువలన కుష్ఠురోగము, గోళ్లు తీసికొనుటవలన పుప్పిగోళ్లు, పరుగెత్తుట దుముకుట వలన చంచల స్వభావము, నవ్వుటవలన దంతములు పెదవులు తొడలు నాలుక వీనియందు శ్యావవర్ణము, అతి సంభాషణమువలన ప్రలాపము, అధికశబ్ద శ్రవణమువలన చెవిటితనము, తల దువ్వుకొనుటవలన బట్టతల, విపరీతపువాయు సేవనమునను, ఆయాసకరమగు పనుల జేయుటవలన ఉన్మాదము శిశువులకు సంక్రమించును.

ఋతుమతియగు స్త్రీ, దర్భపై శయనించుట, దోసిలిలోగాని మూకుడులోగాని ఆకులలోగాని శాల్యన్నము లేక యవాన్నాదికములను నిడుకొని వానిని ఘృతక్షీరాదులలో దేనితోనైన జేర్చుకొని భుజించుట ఋతువైన మూడు దినములు భర్తను దర్శింపకుండుట అను నియమముల నాచరింపవలయు. నాలవదినమున నూతన వస్త్రమును ధరించి ఆభరణాదులచేతను హరిద్రాకుంకుమాదులచేతను సాలంకృతయై భర్తను చూడవలయును. ఋతుస్నాతయగు స్త్రీ తొలుత నే పురుషుని జూచునో అట్టి పురుషునివంటి సంతానము కలుగునని మానసిక తత్వశాస్త్రజ్ఞుల వాదము. ఇదియే సుశ్రుతుని నిర్వచనము.

స్నానము వర్జింపవలయుననిన అపరిశుభ్రముగ నుండమనికాదు. వీలయినంత పరిశుభ్రముగనుండవలయును. ఈకాలమున కొందరు రెండవ దినమునుండి స్నానము చేయుచున్నారు. ఇది మంచిది కాదనియే చెప్పవలయును. ఋతుకాలమున శుచిలేకుండుటవలన కొందరికి ఆకలి మందముగను, మరికొందరికి ఎక్కువగను ఉండుట కలదు. పదార్థసేవనమందు చలువ పదార్థములను భుజింపకుండుట అవసరము. అజీర్ణము చేయు పదార్థములనుగూడ గైకొనకుండుట ముఖ్యము. ఎక్కువ కారము, పులుసు సేవింపరాదు. పరిశ్రమలేక

శయనించుట మంచిది. గాలిలో శయనించరాదు. నిదురకూడదనినను కొందరు అధికముగ యీకాలమున నిదురించెదరు. సాత్మ్యమగుటచే అధికదోషముండదేమో. తేమస్థలములయందు పడుకొనరాదు. కూర్చుండరాదు. ఈ కాలమున ప్రయాణము సేయరాదు. వెన్నెలయందు కూర్చుండుట తగదు. ఈ నియమముల పాటించిన ఋతువు రోగాక్రాంతము కాదు.

## ప్రథమ రజస్వల

ఈ సందర్భమున ప్రథమ రజస్వలాసమయమున గమనింపవలసిన నియమములనుకూడ తెలుపుట మంచిది.

పూర్వము మన దేశమున బాలికలు రజస్వల కాగానే మూడు దినములు పండుగ చేయుట ఆచారము. ఆ దినములందు నల్లనువ్వులు, బెల్లము దంచి ముద్దలుచేసి పేరటాండ్రకు తాంబూలాదులతో పంచి పెట్టెవారు. బాలికచే ఎక్కువగ తినిపించెదువారు. కొన్నిచోట్ల నువ్వులనూనె త్రాగించెదువారు. రజస్వలఅయినపుడు గర్భాశయము వికసించి ఋతురక్తము నిరాటంకముగ స్రవించుటకు ఉష్ణవీర్యము గల పదార్థములను యిప్పించుట ముఖ్యము. అట్టి పదార్థములలో నువ్వులు బెల్లము శ్రేష్ఠమైనందున చిమ్మిలి తినిపించు నీ ఆచారము. భోజనపదార్థములు కూడ ఉష్ణవీర్యము గలవే. పాయసము, చక్కెర పొంగలి, అటుకులు, నువ్వులు, బెల్లము కలిపి చేసిన ఫలాహారములు, నెయ్యి, అరిసెలు, పప్పుపులగము వాడెదువారు. ఈవాడుక చాలకాలముగనుండెడిది. నేడన్ననో వేడుకలే మిగిలినవిగాని ప్రధాననియమములు అడుగంటినవి. ఎట్టి విచక్షణములేకుండ పులుసు, కారము, ఉప్పు కలిపిన ఆహారము, ఔషధమువలె చిమ్మిలిని వాడుచున్నారు. దాన బాలికలకు ఋతుదోషములు విపరీతముగ కలుగుచున్నవి. ఇప్పటికైనను నష్టము తెలుసుకొని అర్థముగలయిట్టిపూర్వాచారముల గమనించిన మేలు. బాలికలు ఋతుబాధలులేక ఆరోగ్యముగనుండగలరు.

ఈ ఋతుశూల సాధారణముగా బాలికలయందు ఎక్కువ. సంసారము చేయుచున్న వారలలోను, బిడ్డతల్లులలోను కొంచె మరుదే యని చెప్పవచ్చును.

గర్భాశయమునుండి ఋతురక్తము 'సాఫీగా' వెలుపలకు రాక అడ్డుపడి యీ ముట్టుకుట్టు సంభవించుచున్నదను అపోహ కొంతవరకు కలదు కాని ఇది కారణముకాదనియు గర్భాశయపుకండరముయొక్క ఈడ్పువలన నిది కలుగుచున్నదనియు ప్రస్తుతము నిర్ధారణజేసినారు. కొన్ని స్థితులయందు యీకారణమేకూడ కాకపోవచ్చును.

బాలికలకు మొట్టమొదట బాధ కలుగకపోయినను రానురాను ఈడ్పువలన, ఋతుసమయముల యందు బాధకలుగుచున్నది. ఋతుస్రావమునకు కొన్నిగంటలు పూర్వము ప్రారంభించి ఋతుస్రావమగుటతోడనే యీబాధ తగ్గిపోవును. కొన్ని సమయములందు 12 మొదలు 24 గంటలవరకు యీబాధయుండును. బాలికలు సంసారులై బిడ్డతల్లులగుదురేని యీబాధ మాయమగుచున్నది. నాడీ బలక్షయము కలవారికిని, పరిశ్రమ చేయనివారికిని, అధికముగ పనిపాటలు కలవారికిని యీబాధ కలుగుచున్నది. గర్భాశయము స్వస్థానమున లేకుండినను, అసంపూర్ణమైనను యీబాధ కలుగుచున్నది.

సంసారులకు, బిడ్డతల్లులకు ఒకచో రక్తాధిక్యతచే యీశూల కలుగుచున్నది. అది తీక్ష్ణముకాక పీకుడునొప్పియై యుండును. నొప్పి ఒక వారమునకు ముందే ప్రారంభమగును. పార్శ్వపునొప్పి వెన్నెముకనొప్పి విశేషము. ఈ నొప్పికి కారణము లనేకములుండినను ముఖ్యము వాతాదిదోషముల ప్రకోపము, ఋతురక్తము గర్భాశయమందు గడ్డకట్టుకొనియుండుట, గర్భాశయ ద్వారము మూసికొని మైల వెలుపల వచ్చుటకు ఆటంకము, యోనియందు గ్రంథులు పెరిగి అడ్డుకలుగుట యీ కారణముల ఋతురక్తము ధారాళముగరాక నొప్పి సంభవించును.

కొందరు స్త్రీలకు గర్భాశయమునుండి పేరుకొనిన రక్తపుగడ్డలతోడను పొరసంబంధములగు తునకలతోడను ఋతువు స్రవించుచుండి స్రావము బొత్తిగ నిలుమవరకు కడుపునొప్పి బాధించును. ఇది వంధ్యలలో కానవగును.

(చికిత్స పైసంచికలో)

# పాకకళ

—గువ్వలు చేయువిధము—

శేరు మైదా తెచ్చి దానిలో అరసోలెడు నెయ్యి వేసి కలిపి ముద్దలయేటట్లు గట్టిగా కలిపి చిన్న గచ్చకాయలవలె ఉండలు చేసి చుట్టతాలూకూ అంచు కయినా చాటఅంచుకయినా గట్టిగానొక్కి వ్రాస్తే చిన్న గువ్వలవలె వుండును. భాండిగ పొయ్యిమీద పెట్టి దానిలో సోలెడు నెయ్యిపోసి బాగుగా కాగనిచ్చి చేసివుంచుకున్న గువ్వలను నేతిలోవేసి యెరుపు రంగుగా వేగనిచ్చి, పావువీశడు పంచదార చిన్న గిన్నెలోవేసి అరసోలెడు నీళ్లుపోసి పాకంరానిచ్చి అనగా వుండపాకం రానిచ్చి క్రిందదింపి దానిలో చేసి వుంచుకున్న గువ్వలను ఆపాకంలోపోసి కలపవలెను. అటుపయిన దానిరుచి అతి మాధుర్యముగా వుండును. ఒకసారి చేసిచూడవలెను.

—కొం॥ వెం॥ రంగినాయకమ్మ.

—మామిడితాండ్ర పచ్చడి—

10 తులముల ప్రశస్తమగు పుల్లనిదిగాని తియ్యనిదిగాని మామిడి తాండ్రను దెచ్చి సలసలలాడుచుండు మూడుతులముల వేడినీళ్ళలోవేసి రెండుమూడు నిమిషము లయినవెనుక చిటికెడు కుంకుమపూవుపొడియును, 2 తులముల చక్కెరపొడియును, 5 మాషములయెత్తు సైంధవలవణపు పొడియును బాగా కలుపుకొని పిమ్మట 2 తులముల సన్నగాతరిగిన అల్లపు ముక్కలను, పావుతులమెత్తు జీలకర్రపొడియును, బాణలిలోవేసి కొంచెముపొంగు వచ్చినతర్వాత నీ పచ్చడిలోవేసి కలుపుకొనవలయును. పిమ్మట నేతిలో నెర్రగావేగిన 3 లేక 4 మిరియాలపొడి కూడ కలుపవలయును. వేడిపదార్థము భుజించిన యెడల శరీరమునకు ఆరోగ్యముగనుండును.

—శీలా అప్పలకొండ.

—పెసరపప్పు పాటోడా—

అర్థశేరు పెసరపప్పు నీటిలో నానబోసి పొట్టుతీసి వడియగట్టవలెను. ఆపప్పును రోటిలోవేసి అందులో పచ్చిమిరపకాయలు అల్లం కొద్దిగా ఉప్పువేసి బాగుగా (మెత్తగా) రుబ్బవలెను. బూరెలమూకుడు పొయిమీదవుంచి 15తులముల నేయిగాని, నూనెగాని బోసి బాగుగా కాగినతరువాత నాలుగు యెండుమిరపకాయలు తుంచి ఆనూనెలో వుంచవలెను. అవి వేగినతరువాత మినపపప్పు, ఆవాలు, జీలకర్ర కరివేపాకువేసి తిరుగబోత పెట్టవలెను. అవి కమ్మని వాసనరాగానె పైనజెప్పిన పిండిని యీతిరుగబోత పెట్టిన నూనెలోనే, బాగుగా వేగేదాకా తిప్పవలెను. యిష్టమున్నవారు తిరుగబోత వేయునప్పుడు వుల్లిపాయల ముక్కలుకూడ వాడవచ్చును. పిండి వేగిన తరువాత యెర్రదాసుగా వుండగా దింపి చిలుము చేరని మరొక పాత్రయందు యీదించిన పిండిని వుంచి నిమ్మకాయలపులుసును వేసి కలపవలెను. వేడి వేడిగానుండు యీపాటోడాను భోజనమందు కూరగాగాని, విడిగాగాని భుజించిన రుచిగాను, కమ్మగాను వుండును. పెసరపప్పుకు బదులు సెనగపప్పు గూడ వాడవచ్చును.

—ఆదిపూడి వెంకటశేషమ్మ.




## ఆజ్ఞాపనము

శ్రీమతి ఎ. కోమలమ్మగారు

భువనే సకలే భవతా నవదతి,
భీషయమాణే విముఖే సత్యపి
ముక్తకంఠమయి మానసవార్తాం
ఏకాకీ వదరే.

దుర్గమగహనా ధ్వస్యమయే త్వాం
లోకే నానుసరత్యపి పశ్యతి,
క్షతిచరణాభ్యాం పధిగత కంటకం
ఏకాకీ దలరే.

ఘుంఘుః వాతాంధతమస సమయే
నాలోకే సతిద్వారే పిహితే
వజ్రజ్వాలిత వక్షఃపంజర
ఏకాకీ చరరే.

## మేలుకొలుపు!

కొత్త వీరభద్రయ్యచౌదరి (వాగీశ్వరిసమితి)

మేలుకొనుమింక భరతపుత్రీ
మేలుకొనుమింక భరతపుత్రీ
చాలునిద్దుర నీదుదేశము
నేలుకొన కడువేగమే॥ మే॥
పశ్చిమాంబుధిఁ బడెనదినమణి
ప్రాగ్దిశాసతి దరికిఁ జేరెను
వచ్చినీరాజనము లీయఁగ
వలయుఁగావున సత్వరన్॥ మే॥
మందపవనుఁడు శాంతిసమరము
నందుపాల్గొను వీరులకు నా
నందమొప్పఁగ స్వాగతమ్మును
నందఁజేయుట గాంచఁగన్॥ మే॥
ఎలుఁగునెత్తి సుఖస్వరంబున
పులుఁగుకన్నెలు నీకువిజయము
కలుగనలెనను పాటగీతపు
కలరవంబుల వినుమికన్॥ మే॥
తక్రభాండమునందు కవ్వము
తాళగడి నడపించు కాపుని
తంబినుల కరకంకణమ్ముల
ధ్వనులయర్థము దెలియుమా॥ మే॥
పూజ్యులగు బ్రాహ్మణులు సలిపెడు
భూర్భువస్స్వహా నిస్వనమ్ములు
భూమియాకస మంటుచుండఁగ
నేమొకో? వినుపింపదా?॥ మే॥
కనకగర్భగృహమ్ములందున
స్వామిదేవత నృత్యమాడుట
వినిన నగుదురు పరులు సోమరి
తనము వీడుము నీవికన్॥ మే॥

# బాలవిజ్ఞానశాఖ

## పిల్లల పాటలు

గోపరాజు రాజన్నగారు

౧

ఓరోరినాయుడా వంగపండునాయుడా
బోడిగుఱ్ఱమెక్కావు బొమ్మలాటాడావు
నక్కపాలుపితికావు చిక్కనపోశావు
నన్నెచూడు మన్నావు.

౨

ఆటల్లుపాటల్లు అత్తవారింట
అతిరాజుచిట్టి పనులు కన్నవారింట.

౩

అత్తవారింటికి కొత్తల్లుడొచ్చాడు
తోటకూర పిండివంట లత్తమ్మ
నాకడుపు గుడగుడ లత్తమ్మ
పెంటమీదకెళ్ళవోయి పెద్దల్లుడ
బుగ్గోసికప్పవోయి బుద్ధిమంతుడా.

౪

నానచెల్లెలు నత్తగుల్ల
నత్తగుల్లచెల్లెలు ఆల్చిప్ప
నాఅత్తవారు కందివలస
నత్తగుల్లత్తవారు పెసరవలస
ఆల్చిప్పత్తవారు ఉలవవలస.

౫

తూర్పుతెల్లవారె లేగదే
అమ్మనీకు దణ్ణమైన పెట్టమనగదే
తల్లివైతె నీవు నాకు
శిరసున సంపెంగతయిల మంటుమీ
పరిమిళాలనలుగు పెట్టుమీ
అమ్మనాకు పన్నీట జలకమార్చుమీ
పట్టుశాలచంగు లియ్యుమీ
అమ్మనాకుకట్టపూని మరుగుచెంగులగా

గుత్తమైన గులివెందలూ
అమ్మనాకుగుచ్చి సందిటగట్టుమీ
ఎక్కువైన మాణిక్యమ్ములూ
అమ్మ నాకుపేరు కంఠానవెయ్యుమీ

గంటాలపతక మియ్యుమీ
అమ్మనాకు గంటశీల చేతికియ్యుమీ
గుండకనిండ పాలు పొయ్యుమీ
అమ్మనాకు ఉడక్కానే కజ్జంపెట్టుమీ

ఉక్కతోటి బువ్వపెట్టుమీ
అమ్మనన్ను ఎత్తుకు తినిపించుమీ
అటుకులన్నివాడిని బొయ్యుమీ
అమ్మనాకు అరటిపళ్లు చేతికియ్యుమీ

పాలపళ్లు వాడిని పొయ్యుమీ
అమ్మనాకు పనస్తొనలు చేతికియ్యుమీ
సెనగలన్నివాడిని పొయ్యుమీ
అమ్మనాకు చెఱుగ్గడలు చేతికియ్యుమీ

ఈతపళ్లువాడిని పొయ్యుమీ
అమ్మనాకు యీశిపళ్లు చేతికియ్యుమీ
వీధిలో ఆడమనుమీ
అమ్మనన్ను వీరావతారుడనుమీ

గోవుల గాయుమనుమీ
అమ్మనన్ను గోపాలకృష్ణుడనుమీ
మేఘాలు గాయమనుమీ
అమ్మనన్ను మత్స్యావతారుడనుమీ.

౬

అంచెఅంచె అడుగుదీసి
మంచి బాలుడూతాను
పంచవేగసరులు అన్ని
పలికెగజ్జెలు పక్షిణిఅందెలు
రత్నకంఠాలు మ్రోయగాను
కుసుమరావిరేఖ మధ్య
కాయ లమరెను—
అాకించి తల్లిబిలువ
సంకోజములాయె
పంకజ నాభుడనగ
పరుగనొచ్చెను
ఉబ్బుచూ కన్నతల్లి
గొబ్బునా దుడుములేచి
నిబ్బరాన చెయ్యిపట్టి
నిలపె కొడుకుని
ఎక్కడికి బోకుమా
ఎదటనేను అడవయ్యా
చక్కనీ నాతండ్రి చాలనమ్మితీ
పాలలూ దూరినీవు
సతుల యిళ్లదూరి
పాలుఆరగించవయ్యా బాలకృష్ణునా
ఎండలెక్కె మాయిల్ల
వంటపనులు యేమిగావు
చెయ్యివిడచి ఆడవయ్యా చిన్నికృష్ణుడా.

---

## లక్ష్మిసరస్వతుల పందెం

శ్రీమతి సుంకరి రామానుజమ్మగారు

ఒకనాడు లక్ష్మీసరస్వతులు విహారార్థం బయల్దేరారు. దారిలో వారికి మాటా మాటావచ్చింది: నేను గొప్పదాన్నంటే నేను గొప్పదాన్నని. ఆసమయంలో వాళ్ళు సముద్రపుఒడ్డున వెళ్తున్నారు. ఆఒడ్డునే ఒక జాలరివాడు వలవేసి నిల్చున్నాడు. లక్ష్మీదేవి వానిని చూపించి, 'చూడు వాణి శక్తి. వీడ్నియెంత గొప్పవాడ్ని చేస్తానో? నీవు చేయగలవా? నేను వాడ్ని గొప్పవాడ్ని చేయలేకపోతే నేను నీదాసిగావుంటాను. చేస్తేమట్టుకు నీవు నాదాసిగావుండాలి' అని అన్నది.అందుకు ఇద్దరూ సమ్మతించారు. జాలరివాడు వానివల వేసినప్పుడల్లా మేలైనరత్నాలు వలలో వచ్చేవి. వాట్ని అమ్మేసేవాడు. ఈలాగు వాడు కొద్దిరోజుల్లోనే చెప్పలేని గొప్పవాడై, మేడలు మిద్దెలు కట్టించాడు. కుబేరుడంత గొప్పవాడని పేరు వ్యాపించింది.

ఈజాలరివాని వూరికి దగ్గరగావున్న పట్నంరాజు వీని యైశ్వర్యంచూచి తనకుమార్తెను వానికిచ్చి పెండ్లిచెయ్యడానికి ఒప్పుకున్నాడు. జాలరివానికి చెప్పలేని ధనంవుంది కాని పొట్టచీల్చితే అక్షరంలేదు. ఆరాజుకూతురో, అందానికి రంభే మరి గానవిద్యలోనో మళ్ళీ సరస్వతే. ఆమెనిచ్చి పెండ్లిచేశారు. జాలరిపెండ్లికొడుక్కి మాటాడ్డమైనా సరిగారాదు. తీరాతెన్నా!!

రాజుకూతురు తనభర్తను సంతోషపెట్టడానికి వీణపై పాడింది. జాలరిపెండ్లికొడుకు బండవలె మంచంపైబడి దగ్గరున్నవాళ్ళు భయపడేలాగు గుఱ్ఱుపెట్టి నిద్రపోయాడు. తాను పాడినపాటకు తన భర్తకు ప్రీతికలుగలేదనుకొని రాచకుమార్తె భిన్నురాలై గదివిడిచివచ్చేసింది. మరుసటి దినంకూడ యిట్లేజరిగింది. మూడోనాడు ఆమెశక్తంతాపెట్టి మంచిమంచి సంగతులువేసి వీణవాయించి పాడింది. పెండ్లికొడుకునుండి మెప్పులులేవు సరేకదా పలుకు వులుకులేకుండ బెల్లంమొత్తిన రాయిలాగ వూరకున్నాడు.

అప్పుడు రాజకుమార్తె పెండ్లికొడుకు ఒకమూర్ఖుడని గ్రహించింది. తనతండ్రి డబ్బుచూచి తనగొంతుక

కోసేశాడని మిక్కిలివిచారించి ప్రాణత్యాగం చేసుకోడానికి సిద్ధమైంది. తనచెంగుతో ఉరిపోసుకోడానికి ప్రయత్నించింది. ఈసంగతి లక్ష్మీదేవి కని పెట్టి తాను యేమిచెయ్యలేక సరస్వతి దగ్గరకు పరుగెత్తింది. వెంటనే నీవువచ్చి రామమూర్తి ప్రాణాలు కాపాడాలి అని సర్వతిని బ్రతిమాలింది. ఆవెంటనే సరస్వతివచ్చి పడుకొనియున్న జాలారివాని నాలుక మీద బీజాక్షరాలు వ్రాసింది.

అప్పుడు జాలరి పెండ్లికొడుకు నిద్రనుండి లేచినట్లు లేచి మృదుమధురవాక్యములతో ఆమె సంగీతసాహిత్యములనుగూర్చి గానవిశారదుని మాదిరిగానికూడ మొదలుపెట్టెను. వానిమాటలు విన్నకొలది రామమూర్తికి ఆనందం హెచ్చింది. నేను తొందరపడి ప్రాణహత్య చేసుకొంటే యీలాంటి మనోహరుని చెంత బాయుదునే అని రామమూర్తి విచారించెను. వాగ్దానం ప్రకారం లక్ష్మీదేవి సరస్వతికి దాసియై యుంటా నన్నది. అప్పుడు సరస్వతి 'అమ్మో మీరు పెద్దలు. అట్టిమాటనవద్దు. నాకోర్కె చెల్లిస్తే నేను ఒకమాట చెప్తాను' అని అన్నది. అప్పుడు లక్ష్మీదేవి అదేమిటన్నది. అందుపై సరస్వతి నాకోరికేమంటే నేను యెచ్చటుంటే మీరు అచ్చట ఉండడానికి వప్పుకొండి' అన్నది. అతిసంతోషంతో వప్పుకొంది. కాని యీకలికాలంలో యిదేం కనిపించడంలే.

## చిత్రప్రశ్న

శ్రీమతి చీమలకొండ రామసుబ్బలక్ష్మిగారు

ప్రాణి దేనిచే పాపాలబడుచునుండు?
వేనికై యెప్డు పూజారి వెదకుచుండు?
అమర నేకాక్షమునకేది నామమొకటి?
తరణిచంద్రుడు నివసించు తావదేది?
కోరుచుండును మోక్షము కోర్కెనెవడు?
దేనినాడిలోకి జాబిల్లి దీయుచుండు?
అన్ని ప్రశ్నముల జవాబులందుకూడ
అమరుచుండును నాల్గేసి యక్షరములు
ఒక్కటేయగు మొదటిరెండక్కరములు
చిక్కువిడదీయరమ్మ మాయక్కలార!

## చిత్రప్రశ్నలకు సమాధానములు

మేనెల గృహలక్ష్మిలో ప్రకటింపబడిన చిత్రప్రశ్నకు శ్రీమతులు వై. కాంతాబాయి, ఏలేశ్వరపు జయలక్ష్మి, చివుకుల కోటీశ్వరమ్మ, శివలెంక రాజేశ్వరి, వారణాసి వరలక్ష్మి, చీమలకొండ రామసుబ్బలక్ష్మి, మందపాటి సీతామహలక్ష్మి, గోళ్ళమూడి గిరిజాబాల, దామోదీపురపు రామాయమ్మ, కోసూరి కామాక్షమ్మ, వుత్తా రామాయమ్మగార్లును శ్రీ బులుసు బుచ్చికృష్ణ సత్యనారాయణరావుగారును సమాధానములు వ్రాసిరి. జవాబులీక్రిందివిధముగ నున్నవి.

(1) కళంకము, కంటకము, తిట్టుతిమ్మ, శాశనము
(2) కనకము
(3) జలజము, నలినము
(4) కలికము, ప్రదీపము, తహతహ, సరసము
(5) కిలకిల, కువకువ, ముదముతో, కలకల, కిచకిచ
(6) మనుమలు




## ఆరోగ్యమును గురించి

మత్ పుత్రికారత్నమైన సౌభాగ్యవతి యగు లక్ష్మికి అశీర్వచనములు.

హృదయపురి, మనోవీధి,
1-5-34.

కుమారీ! ఆరోగ్యముగానుండుటకు భోజనము,నీరు, నిద్ర, ఎటు లవసరమో అటులనే స్నానముకూడ ముఖ్యముగా ఆవశ్యకము.

మనుష్యచర్మములో వేలకొలది రంధ్రములున్నవి. ఈ రంధ్రములు మనము కండ్లతో చూచుటకు శక్యముగానంత చిన్నవిగా వుండును. ఈ రంధ్రములద్వారా రక్తనాళములోని మురికి చెమటరూపకంగా బయటకు వచ్చుచుండును.

మనము స్నానముచేసినపుడు యీ మురికి కడిగివేయుచుందుము. ఇప్పటి నాగరికులంతా పై మెరుగులకు పలువిధములగు సబ్బులను వుపయోగించుచున్నారు గాని దానివల్ల ప్రయోజనములేదు. పరిశుభ్రమైన శీకాయపొడుముతోగాని ప్రశస్తమైన పెసరపిండితోగాని శరీరము రుద్దిన మంచిది. అటులచేసిన చర్మము ఎల్లపుడు పరిశుభ్రముగనుండును. నియమప్రకారముగా మనము స్నానము చేయనియెడల యీ మురికి వొంటిని జీర్ణించి చర్మరోగములు పుట్టును. పసిబిడ్డలకుకూడా స్నానము మాన్పించిన గజ్జి మొదలగు వ్యాధులచే బాధపడవలసివచ్చును. దీనివల్ల మరియొక లాభ మేమన శరీరము ఎల్లప్పుడు చల్లగా నుండును. ప్రతిదినము కనీస మొకటి, రెండుసార్లు అయిననూ తప్పక స్నానము చేయవలెను. వేడిప్రదేశములలోని ప్రజలు దినమునకు 2, 3 పర్యాయములు స్నానము చేసిననూ ప్రమాదములేదు.

స్నానము చేయునపుడు మనము గమనించవలసిన విషయములు కొన్ని కలవు. భోజనం చేసినవెంటనేస్నానము చేయరాదు. అలసినవెంటనేగాని, వ్యాయామము, ఆటలు మొదలగునవి అయిన వెంటనేగాని స్నానము చేయరాదు. మనము యీ ఆరోగ్యనియమముల నుల్లంఘించినచో జలుబుచేయుట జ్వరమువచ్చుట సంభవించుచుండును.

ఆరోగ్యము బాగుగనున్నపుడు చన్నీటియందు స్నానము ఎక్కువ మేలైనది. వీలైనంతవరకు వేడినీరు మానుటయే శ్రేయస్కరము. ఎందుచేతననగా నిరతము వేడినీళ్ల స్నానముచేయుటచే నరములు బలహీనమగును. ఆరోగ్యము చెడిన దినములందు మాత్రమే వేడినీరుగాని యితరములందు ఎంతమాత్రము వలదు. తక్కిన విషయములు ముందు ముందు తెలియజేయుచుండెదను.

ఇట్లు నీ జనని,
పార్వతి.

# లోకంపోకడ

## నిషాసూచి

కాలము యొక్క విలువను గుర్తించినవారిలో రష్యా కార్మికప్రభుత్వమును మించినవారు వేరొకరు లేరు. తక్కిన దేశములవారికి అర్థభోగములు ప్రధాన దైవతములు. ఇవి దేశములో నే కొందరికో సిద్ధించ డంకొరకు ఎన్నిలక్షలమందికి అవి లేకపోయినా లక్ష్యములేదు; ఎంతమందికి పని దొరక్కపోయినా, దాని తోటిపాటువే అయిన ఈ అర్థభోగములు రష్యాలో అల్లాగకాదు. అంతా అపసవ్యము. ఎవరి దగ్గరా తలకుమించిన అర్థముండరాదు. ఎవరికీ అను కూలమైనంతకంటె తక్కువగా అర్థభోగము లుండరాదు. ఇందుకొరకు అందరూ ఒక నిమిష మైనా వ్యర్థముచెయ్యకుండా పనిచేయవాలి. ఎవ రెంత ప్రశస్తమైన పని చేయగలిగితే అంత పనీ చేయవాలి. కష్టపడి తీరవాలి, ఫలమనుభవించి తీర వాలి. ఇందులో ఎందులోనూకూడా కమ్యూనిష్టు పార్టీవారు దయాదాక్షిణ్యాలు చూపించరు. ఇట్టి సంకల్పసిద్ధికొరకు శ్రీమంతతరగతిని, వ్యాపార పరాయణులను, శుష్కకళావిద్యావినోదులను దేశము నుంచి చీల్చి చెండాడినారు. పంచవర్షప్రణాళికలను పెట్టి లక్షలకొలది యెకరములను సాగులోనికి తెచ్చి నారు. పట్టణములను పెంచి ఫ్యాక్టరీలను పెట్టినారు. ఇళ్లు, భవనములు కట్టించి అనుకూలవసతులు, విద్యా లయములు, ఉపన్యాసమందిరములు, లైబ్రరీలు మొదలగువానిని నెలకొల్పిరి.

ఇవన్నీ అంటే చేసీగలరు కాని మనుష్యులకుగల దురభ్యాసపరాయణత్వమును, సుఖసోంబేరీశీలమును కనిపెట్టి ఒక్కత్రోవున నిర్మూలముచేయగలరా? మన దేశములో గాంధీమహాత్మ డొకొక్క రాజ కీయతరంగమును తీసుకొచ్చినప్పు డల్లా కాంగ్రెస్సు నాయకులము వాలంటీర్లము అంతాకలిసి కల్లు పాకలదగ్గర, బ్రాందీ కొట్లదగ్గర, విదేశీషాపులదగ్గర నిలచి ఖడేరావు అని పికెటింగుచేసి చెలోజావు అని జైళ్లకు లాటీపోటులతో సహా వెళ్లుతున్నాము. ఆతరంగము సమసి మనము ఇంటిమొగము పెట్టగానే మహాజనులందరూ మళ్లీ పాకలమొగము కొట్ల మొగము పెట్టుతున్నారు. అమెరికా ఖండములో పుస్సీఫుట్టులవంటివారు కృత్యాద్యవస్థలుపడి పొడి చట్టాన్ని ప్యాసుచేయిస్తే అచ్చటి పీపులంతా మనం కారాదాఅన్నను తిరస్కరిస్తున్నట్లు, అది అములులో నున్నన్నాళ్లు దాన్ని తృణాతకృరముచేసి ఇప్పుడు దాన్ని పుస్తకంలోంచికూడా చించేశారు. ఇట్టి మహాప్రయత్నమును రష్యాప్రభుత్వమువారు పిక్కె టింగులు చట్టాలులేకుండా చల్లగా సాగిస్తున్నారు. అక్కడ ఒక సైంటిష్టు ఒక పరికరమును తయారు చేశాడు. మెడదగ్గర వంపు కలిగివున్న ఒక గాజు గొట్టములో ఒకమోస్తరు ద్రావకంపోస్తారు. ఇట్టి గొట్టాలు ప్రతీ పోలీసుస్టేషనులోను గవర్నమెంటు ఫ్యాక్టరీలోను ఆస్పత్రిలోను వుంచుతారు. ప్రతీ మనుష్యుడూ అక్కడకురాగానే దాన్ని పట్టు కొని 15, 20 నిమిషములదాకా ముక్కుదగ్గర పెట్టు కొని దిగఊపిరి వదలవాలి. వాడు అల్కహాలు సేవించివుండెనా ఆ ద్రావకమునకు బూడిదవర్ణము వస్తుంది; సేవించివుండడా అది యెరుపవుతుంది.

ముంజేతికంకణాని కద్దమక్కఱలేనట్లు వీరు త్రాగేరా లేదాఅనినిర్ణయించుటకు వేరేసాక్ష్యము అక్కఱలేదు.

త్రాగుబోతుకు వాడి ఆటపాటలకంటె వేరే సాక్ష్యము కావలెనా అని అనుభవజ్ఞులగు మన దేశపు మధుసేవకు లడుగవచ్చును. ఇది అట్టి రొయిక్కువ నిషాచేసేవారి మాట. ఎవరికీ తెలియకుండా కొంచెము మజాకొరకు సేవించేవారి సంగతి నిప్పుడు ఆలోచిస్తున్నాము. ఇట్టి దురభ్యాసమును చిగిరిస్తున్నప్పుడే చిక్కేయవాలని వారి సిద్ధాంతము. లేకుంటే వారు చేయవలసిన పని తగ్గిపోదూ, కాలమును వ్యర్థపరచిన నష్టమురాదూ, వస్తూత్పత్తి తగ్గిపోదూ, పంచవర్షప్రణాళికలు కుంటుపడవూ!

ఇట్టి మహోపాయమువలన మరికొన్ని నష్టములు కూడా కలుగకుండగలవు. నేరములు తగ్గును; రోగములు తగ్గును. ఇంతేకాకుండా వివేకము కృషి హెచ్చును. ప్రజాశ్రేయస్సును ప్రధానముగా పెట్టుకొన్న నాజీప్రభుత్వములు, ఇతర ప్రభుత్వములు, కనీస మీ పాఠమునైనా రష్యాదగ్గర నేర్చుకొని అవలంబిస్తే తమ ప్రతిష్ఠ కేమీ భంగము రాదని గట్టిగా చెప్పవచ్చును.

## కాలినడకల మహాత్మ్యము

ధర్మబోధలుచేయఁ దలచుకొన్నవారికి కాలినడకలను మించిన ఉత్తమసాధన మింతవరకు కనిపెట్టఁబడలేదు. గాంధీమహాత్ముడు హరిజనప్రబోధమునకుగాను రైలు మోటారు ప్రయాణములనాపి శిష్యవర్గముతో సహా యెండవానలలోను, అడవులు బయళ్లలోను కాలినడకను ప్రారంభించినట్లు మనకు తెలుసును. ఇది ఆర్యఋషి సంప్రదాయమనికూడ అతను సెలవిచ్చుచున్నాడు. అతని సందేశ మీవిధముగ ప్రజలలో దృఢతరముగఁ బాదుకొనుచుండుటయు మనము చూచుచున్నాము. ఇది చూచి 40 మంది సనాతనయోగులుకూడ జటావల్కలధారులై, అశ్వములు, గజములు, తమవెంట సామానులు మోనుకొనుచు వచ్చుచున్నను వాని నెక్కక, మైలపడతామన్న భయముచే రెయిళ్ల నసలేచూడకుండా, ఉత్తరహిందూస్థానములో కాలినడకను ప్రచారము చేయుచున్నారు. పైగా వీరిది స్వహస్తపాకం, ఏకభుక్తం కనుక వీరి బోధలనే ప్రజ లెక్కువగా ఆచరించుతారు కాబోలు!

## రామేశ్వరము వెళ్లినా శనేశ్వరము తప్పదు

శారదాసంఘముల కండ్లలో దుమ్ముకొట్టి, సర్కారు కీయవలసిన జరిమానాల కెగనామము పెట్టి, తమ కన్యలకు బాల్యముననే వివాహములు చేసుకొన గోరు సనాతను లిప్పుడు పరాసుపేట, యానాము మొదలగు తావులకుపోయి కర్మ ముగించుకొని పునీతులైనా మనిపించుకొనుచున్నారు. కాని ఇది వట్టి భ్రమ. ఇట్టి వివాహములను చట్టముక్రింద కీడ్చుకొనివచ్చి కేసులుపెట్టి శిక్షలు వేయించుట కవకాశమున్నదను రహస్యమును కొజ్జల్లిపేట (బ.దరు) సంఘకార్యదర్శిగారు కనిపెట్టి సనాతనులకు తెలియబరచుటచే వారందరును హడలిపోవుచున్నారు. ఇక ముందు పెళ్లిళ్లైనా మానీయాలి, రజస్వలా వివాహములైనా చెయ్యాలి, జరిమానాలైనా యివ్వుకోవాలి. అవ్వా, బువ్వా రెండూ చిక్కవు. ఏమిటీ బాధ, ఆపద్ధర్మమనుకొని సర్కారు చట్టముప్రకారము వర్తించుటకంటె సరియైన మార్గములేదు వీరికి, బాగా ఆలోచించుకుంటే. సనాతనధర్మంలో యీ పేరుతో ఎట్టి అవాంతరాలనైనా దాటుకుంట కవకాశమున్నది కాదా!

## రోగవేగము

వేగమనేది ఈ యుగముయొక్క ప్రధానమైన లక్షణము. పదేళ్లలో భూమిపై స్వతస్సిద్ధముగా పండేపంటను ఒక్క యేడాదిలో పండించడం, పదిహేనేళ్లలో వేలకొలది మనుష్యులు తయారుచేయలేని సరుకును కొన్ని నెలలో కొంచెము ఫ్యాక్టరీలలో కొంచెముమంది కూలీలచేత తయారుచేయిం

చడము, మూడుజన్మలలో మూడువేలమంది సంపాదించలేనంత ధనమును అయిదారేళ్లలోపల ఒక్కడే సంపాదించుకొని బ్యాంకులలో వేసుకోవడం, ఆరునెలలలో అరవైమంది చేయలేనంత దూరప్రయాణమును మూడు నాలుగు రోజులలో ముగ్గురు నలుగురు కలిసి విమానాలమీద యెగిరి సలపడం—ఇత్యాదులీ యుగపురుషుల కెక్కడలేని ప్రసిద్ధి ప్రతిష్ఠలను గూర్చుచున్నవి. ఇదంతా వ్యాపారశీలముతో కూడిన వస్తుతత్వజ్ఞానముచే ప్రకృతి నిరోధములనన్నింటిని అతిక్రమించగల చాకచక్యమువల్ల లభ్యమవుతున్నది. మానవు డీ వేగమహావాయుసముద్రములో కొట్టుకుంటూ ఎగురుతూ ఎవరెస్టుమీద కాఫీతోటలు వేయవచ్చునేమో, పాతాళలోకంలో పంచదార ఫ్యాక్టరీలు పెట్టవచ్చునేమో అంగారకాదిగ్రహములలో మన సరుకులను ప్రియముగా చెల్లించుకొని లాభాలు మూటకట్టుకోవచ్చునేమో అని యెత్తుమీద యెత్తు వేసుకుంటూ తీరుబాటులేకుండా తిరుగుతున్నాడు. ఇట్లు వేగము వాయువుకుకాని అతని వాహనములైన వీళ్లకుకానికూడా ఉన్నదేమో అని ఆశ్చర్యంవేస్తుంది. ఇంతకుమించిన వేగము కొన్ని విధములైన రోగములకు తప్ప మరెవ్వరికీ లేదని స్పష్టమౌతున్నది. విమానములుకూడా వెంటాడి యెదిరించలేనంత వేగము వీటికున్నది. కుక్కలకొకమోస్తరు వెఱ్ఱిరోగమువచ్చి అందరిని కరిస్తే అవి కరిచిన కుక్కలకీ నరులకీకూడా వెఱ్ఱెత్తి చత్తురు. వారు తిరిగీ యితర జంతువులనల్లే కరుతురు. ఈరోగము సాధారణముగా పెంపుడు కుక్కలను ఆశ్రయించుకొని వాటినుండి నరలోకమునకుకూడా సంక్రమిస్తుందట. ఈకాలపు యెగుమతి దిగుమతి సరుకులలో కుక్కలేమాత్రము వెనకస్థానములోనుండవు. కుక్కలు లేకుంటే దొరగార్లకు కాని దొరసానిగార్లకుకాని క్షణమువేగదుగదా! విభూతి పెండెకట్లు, గంధాక్షతలబొట్లు, తిరుమణి తిరుచూర్ణనామాలు గడియైన మొగములపై వుంటే కాని వీలులేని అయ్యరు అయ్యంగారు బ్రాహ్మణ శ్రీమంతుల యిళ్లలోను మోటారుకార్లలోను పట్టు పంచలు కట్టుకొని మడిగా జపాలుచేసుకొనే విధవ జనయిత్రుల కమ్మని శరీరములనుకూడా అవి సదా నాకుచు ముద్దులాడుచుండక తప్పరు. ఇక జమీందార్లు సంస్థానాధీశులమాట లడగక్కరలేదు. వారిలో అనేకులు ఎస్టేటు లమ్ముకొని కుక్కల జమీందార్లే అయిపోయినారు. ఏ వ్యాపారమాగినా పరవాలేదుకాని ఈ వ్యాపార మాగిందిరా అంటే ఆకాశంవిరిగి నేల పడిపోకతప్పదు. 1918లో ఇట్టి శునకమూర్తిని విమానములో తీసికొని వెళ్లుతుండెనట ఒక ప్రభువుగారు. ఆ కుక్కకు పైనిచెప్పబడి వున్న రోగమున్నదని అతనికి తెలియదు. తెలియకపోతేమాత్రం రోగం దానితో ప్రయాణం చెయ్యడం మానుతుంది గనకనా? అది క్రొత్తగా వెళ్లిన దేశములో కొన్ని కుక్కలకీ కొందరు మనుష్యులకీ ఈ రోగమును తగిలించినదట. అక్కడనుంచి అది ఎన్నెన్నో దేశాలకు నాగరికతకంటె వేగముగా వ్యాపించిందట. ఈలోగా వైద్యులూ సైంటిష్టులూ వూరుకోలేదు. వెంటనే చికిత్సలు కనిపెట్టినారట. అయితే చేయి కాలినతరువాత ఆకులుదొరికితే నేమి లాభము! ముప్పైమూడుకోట్ల రోగములలోను అదికూడా ఒక అగ్రస్థానంవహించి ఆస్పత్రులు కట్టించుకొని డాక్టర్లతోను, సర్జనులతోను, నర్సులతోను, సీసాలు మొదలగు పరికరములతోను స్ప్రింగు మంచాలపై మహావైభవముతో విచ్చలవిడిగా విహరిస్తున్నది.

## పుణ్యానికిపోతే పాపంవస్తుంది

కల్లలాడి యిల్లు నిలబెట్టవాలన్న సూత్రమును మన సనాతనులంతా శారదాచట్టము మూలముగా చాలామట్టుకు నిలపెట్టుతున్నారు. ఏలాగైనా ఒక పిల్లవాడికీ ఒక పిల్లదానికీ పెళ్లయినదీ అనిపించడంవల్ల వీరికి ఎనలేని పుణ్యంవచ్చి, ఇక్కడ ఒకవేళ జరిమానా చెల్లిస్తే చాల్ను గనుక జైలునివాసం

తప్పినా, శాశ్వతస్వర్గనివాసము మాత్రము తప్పదు. ఇందుకోసం జాతకాలు బనాయించేవారు, పెళ్లితో తమకు సంబంధంలేదని తప్పించుకొన్న సంరక్షకులు, శారదాశాసనమంటూ ఒకటి ఉన్నదని తమకు తెలియదని స్పష్టపరచిన పురోహితులు విరివిగా ప్రబలుతున్నారు. ఇందులో ఎటువంటి దోషాలున్నా, కన్యాదానఫలం వీరి నమాంతంగా స్వర్గంలోకి లాగీక మానదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అయితే వీరి అబద్ధాలవల్ల అసలు పెళ్లికే చెఱుపు రాకుండా, వధూవరు లిద్దరూ పెద్దయినతరువాత ఒక ఇంటివారైతేనే వీరి కాఫలం దక్కుతుంది కాని అసలు దాంపత్యమునకే మూలచ్ఛేదకములైన అబద్ధాలాడితే వీరి కా పుణ్యం చెడిపోకుండా ఉంటుందేమో ఉద్దండపండితులే నిర్ణయించవాలి. ఈమధ్య మధుర జిల్లా తిరుప్పరంకుండ్రం క్షేత్రములో అలఘునంబి చెట్టియారు మతములో రెండు సనాతన కుటుంబముల వారు తమ 11, 9 యేండ్లు వయస్సులుగల కన్యలకు యథాశక్తి శాస్త్రోక్తముగా వివాహమొనరించిరి. శారదా కమిటీవారు కేసుతో తయారైనారు. స్కాట్టుబ్రౌను యమ్. ఎ., ఐ. సి. యస్. గారు విచారణకర్తలు. ఫిర్యాదుల తరుపున 10 మంది సాక్షు లేకగ్రీవముగా వివాహమనేది జరగడము తాము చూచామన్నారు. ప్రతివాదుల తరపున ముగ్గురు సాక్ష్యులు ససేమిరా పెళ్లే కాలేదన్నారు. కుత్తిగంట్లూ, పుస్తెలులేని మెడలతో పిల్లలను తీసుకొనివచ్చి, ఇదుగోటండీ వీరిమీద పెళ్లిచిహ్నాలేమీ లేవని ప్రతివాదులతరపు ప్లీడరు వాదించాడు. ఈ టక్కరితనం దొరగారికి తెలియదూ?! అయితే దాచేసివుంటారని చెప్పి వివాహములు స్థిరపరచి వరులిద్దరికీ తలా రు. 150-లు వధువుల తండ్రులకు తలా రు. 50-లు జరిమానాల రూపకముగా అక్షతలుజల్లి ఫిర్యాదీకి రు. 50-లు కట్నమిచ్చి ఆ రెండిళ్లు నిలబెట్టినాడు. లేకుంటే ఈ పబ్లికుసాక్ష్యాన్ని బట్టి వరులు పిల్లల నొల్లకుంటే జరిగిన తంగునుబట్టి పిల్లలకు మరి పెళ్లిళ్లు కాకుంటే, కన్యాదాతల కొక వేళ స్వర్గం సిద్ధించినా భూమిమీద రెండు యిళ్లు కూలిపోవలసిందేగద! ఇటువంటి ఆపత్తురాకుండా కాపాడిన ఆ దొరగారు వందనీయులు. ఇకముందు సనాతను లెట్టి కల్లలనైనా ఆడవచ్చునుకాని యిటువంటి తోవలు తొక్కి చేతులారా తమ కూతుల గొంతులు కోయకుండుటే వారిని కనుక్కొన్నందులకు సార్థకము. లేకుంటే వాళ్ల పిల్లవుసురు వారికి తగిలి నరకంలోంచి మరి లేవనీయదనుకోవాలి.

## డబ్బుకు దయ్యం జడుస్తుంది

దెబ్బకి దెయ్యం జడుస్తుందని సామెత. కాని డబ్బుకుతప్ప జడియని దెయ్యాలు కొన్ని ఉన్నాయి. డబ్బుకు అంటే డబ్బు యిస్తానంటే అనికాదు. డబ్బంటే దయ్యాలకుకూడ ప్రీతే. దాని కాశపడే అవి మనుష్యులచేత నానా కానిపనులూ చేయిస్తాయి. డబ్బుకంటే డబ్బు ఇయ్యమంటే అని అర్థము. ముల్తానులో సినీమా ప్రొప్రయిటర్లు వాళ్ల సినీమారంగాలలోకి కాస్తా కూస్తా డబ్బిచ్చి నటనకత్తెలను తెచ్చి తెకతెక గెంతిస్తున్నారు. సినీమా ఏలాగునట ఉండనీ, ఈ పడుచులవిలాసాలు చూచి కామోద్రేకం కలిగించుకుంటకు అనేక యువకులూ సరసులూ వాలుతున్నారు. దీనివల్ల దేశమంతా నీతిబాహ్యమవుతున్నదట. ప్రొప్రయిటర్లకీ సభికులకు ఇది అంత రోతగా కనిపించకపోయినా వాటిలో పనిచేసే పనివాళ్లకే ఇది సర్వాసహ్యంగా కనిపించింది. ఇటువంటి దుశ్చర్యలు మీరు చేసేరంటే మేము మీ పనులు మానుకొని, మీ సినీమాల కొచ్చే వారినందరినీ రానీకుండా పికెటింగు చేస్తామని నోటీసిచ్చారు. ఇల్లాగైతా తాము దివాలా యెత్తవలసినదే అని ప్రొప్రయిటర్లు గ్రహించారు. ప్రస్తుతపు కంట్రాక్టులు పూర్తికాగానే ఇప్పుడున్న పడుచులనందరినీ పంపించేస్తామనిన్నీ, ఆటుతరువాత క్రొత్తవారిని మరి తీసుకొనిరామనిన్నీ ప్రొప్రయిటర్లు పనివాళ్లకు పూచీకత్తు లిచ్చారు. నీతినిర్మలత్వం అన్న సదోభధనలకు లొంగని దెయ్యాళ్లు

డబ్బు లాక్కుంటామంటే అతిచిత్రముగా లొంగి పోయి తమ తాబేదార్ల కాళ్లమీద పడ్డాయి. సాధారణంగా ఏ పెట్టుబడి సంస్థలలోనైనా ప్రభువులు ధనలోలురు, కొనుక్కొనే ప్రజలు విలాస లోలురు. అవి విజృంభించాలంటే మానవుల దుర్వాంఛలను పెంచే ప్రకటనలు చేయాలి. దీనిమీద యెవరికైనా రోతలుపుడితే వారిద్దరి దుర్వాంఛలు తీర్చడానికీ ఉపయోగించబడుతున్న సేవవారగు కూలీలకే. కార్మికులు తలుచుకుంటే క్షణంలో ఏ సద్ధర్మమైనా నిలుస్తుంది, ఏ దురాచారమైనా సమస్తుంది.

సినీమాలు ఎక్కడమొలిస్తే అక్కడ ఇదే అల్లరి లాగవుంది. అవయవాచ్ఛాదనమునెంత తొలగిస్తూవుంటే, 'కళ' అంతబాగా ప్రకటమవుతుందని చాలామంది నటులయొక్కయు, చిత్రకారులయొక్కయు, రసికులగు సభాస్తారులయొక్కయు అభిప్రాయమైనట్లులోస్తుంది. అమెరికాదేశంలో సంసారపద్ధతిలో వుండే స్త్రీలకు దైవచింతనలుగల మిషనరీలకు ఇవి తలుచుకుంటేనే సిగ్గౌతున్నదట. ఇట్టి ప్రదర్శనములు యౌవనమునకు విషపురుగులనిన్నీ, దేశమునకు నాశనహేతువులనిన్నీ, మతాసక్తికి మరిడీసంకటాలనిన్నీ వారభిప్రాయపడుతున్నారు. వీరందరూ ఈదిగువ వ్రాసిన ప్రమాణపత్రములమీద సంతకములు పెట్టి ప్రచారంచేసి దేశస్థులచేత సంతకాలు పెట్టిస్తున్నారు.

"కామోద్రేకకరములగు చలనచిత్రములవలన ప్రజలు క్షుద్రకామోద్రేకములపాలై, అవినీతిపరులై మతిపోయి చరించుచున్నారు కనుక అట్టి కంపెనీల వారి చర్యలను నేను ఖండించుచున్నాను.

"ఈకంపెనీలవారి ప్రదర్శనములను చూచి పాతకము సాధారణ దినచర్యయొక్క సల్లక్షణముగను, దుండగీడులగు పోకిరీలు ఉత్తమలక్షణలక్షితులగు సత్పురుష వీరులుగను, ఏహ్యములగువారిచర్యలు పవిత్రప్రేమ తత్వసిద్ధాంతములుగను ప్రజలు భ్రమించుచున్నారు కనుక వారిలో వీనియెడల విముఖత్వము కలిగించి వారి అభిరుచులను యోగ్యరీతికి మార్చుటకు నేను ప్రయత్నించుచున్నాను."

ఇట్టి ప్రచారము ఇంకెన్ని దేశాలలో చేయవలసి ఉంటుందో యెవరికి వారే ఆలోచించుకోవచ్చును. ఏదేశంలోనైనా సరే న్యాయపక్షం వారిలాగ సహకారంచేసినా, మితవాదిపక్షం వారిలాగ ఉపన్యాసాలిచ్చినా యీప్రొప్రయిటర్లుమానరు. సత్యాగ్రహాలు పికటింగులుచేసి సంచీకి పట్టువచ్చేపద్ధతి నాచరిస్తే సభ్యమైనబొమ్మలు తెరమీద కక్కుతూ వుంటాయి.

## కృత్రిమ సౌందర్యము

ఒక్క లండనుపట్టణపు ధనవంతులు తమ సౌందర్యపోషణంకొరకు సాలుకు 6 కోట్లపౌనులు ఖర్చు పెడుతున్నారు. తెగతిని వొళ్ళూ బొజ్జా అందవికారంగా బలియపెట్టి రోగాలపాలు కావడం, వాటి నణచడానికి మందులూ సాధనలూ ప్రయోగిస్తూవుండడం శ్రీమంతులకు పరిపాటు అయినది. ఇదంతా దుర్వ్యయమేఅని గయినుహాస్పిటలు అసిస్టంటు ఫిజిషియను, డాక్టరు ఎ. హెచ్. డౌథువర్టు గారు వ్రాస్తున్నారు. ఊరుమీద ఊరుపడ్డా, కరుణంమీద కానుపడదు. ప్రపంచాన్నంతటినీ పీల్చిపిప్పిచేస్తున్న ఈధనకాటకం వారికి లవలేశమైనా జ్ఞానమును ఆత్మవిమర్శను ప్రసాదించినట్లు తోచదు. అసలా కాటకానికి కారకులేవీరై, అకాటకంమీదే బలిసి వర్ధిల్లుతున్న ఈమహామహులకు ప్రపంచంమీద దయ యేలాగున కుదురుతుంది. సరియైన ఆహారాన్ని మితంగాతింటే చాల్ను మీరు కోరుకొనే సౌందర్యం మిమ్మల్ని వరిస్తుంది, సాధారణ సంసారుల్లాగ మీరుకూడా సళాకుగావుంటారని ఈడాక్టరుగారే సలహాయిస్తున్నారు కాని ధన మంటూవుండగా వారి కిట్టి కర్మమేమి? వారికి కావలసినది ప్రకృతి ప్రసాదమగు సహజ సౌందర్యముకాదు. యువతీ యువకులకళ్ళకు మిరుమిట్లుగొలిపి అగాధకూపములోనికీడ్చు ద్రవ్యమాత్ర సాధ్య కృత్రిమ సౌందర్యము.

అసలు సౌందర్యముయొక్క సుఖశోభల గుర్తించ నేరని శుష్కహృదయులకే దీనియం దెక్కువ పిపాస. ఈపిపాసను పూరించుటకు తక్కినవారి పొట్టలుమాడి వారిప్రకృతిసౌందర్యముకూడా దగ్ధమై, లోకము విషాదపూరితము కావలసినదే. సహజసౌందర్య జ్ఞానము నే కవియోగియో ఉపదేశించకున్నయెడల ప్రపంచ మీ కృత్రిమ సౌందర్యదేవతకు బలి కావలసినదే.

## మతము—మూర్ఖమతము

మతానికి రిలీజ నంటారు. మూర్ఖమతానికి సూపర్‌స్టిషనంటారు. అంతేతేడా. హేతువా దానికి రెండూ కట్టుబడవు. సాధారణంగా మతావేశంగలవారికి తమ మత మీశ్వరసందేశంగాను, ఇతరుల మతాలు సైతాను చరిత్రలైన అజ్ఞాన మూర్ఖత్వములుగాను కనుపించుతాయి కనకవారి నందరినీ నరకంలోంచి తప్పించడానికి మతదీక్ష నియ్యడానికి ప్రయత్నాలు జరుగుతూవుంటాయి. కాఫర్ల నుద్ధరించడానికి కత్తి నెత్తడం, హీనుల నుద్ధరించడానికి ధనము నెఱచూపి ఆకర్షించడం మహమ్మదీయ క్రైస్తవ మత ధర్మములు. ఒకమతంలోంచి ఒకమతంలోకీ, ఒక జాతిలోంచి ఇంకొకజాతిలోకి మారడం సనాతనిష్టులకు దోషం కనుక అట్టివారి నందరినీ బహిష్కరిస్తూ మనుష్యులు సన్నగిల్లినా మతానికి అంటుదోషం సంపర్కదోషం కలగకుండా దాచుకోవడం వారి కర్తవ్యం.

కూర్చున్నచోట కుర్చీ, నిల్చున్నచోట నిలువుటద్దం, గుమ్మందిగితే కారు, మేడెక్కితే విలాసాలు, పెట్టెతెరిస్తే ప్రామిసరీనోట్లు కలవారికి మతమూ అక్కరలేదు, మూర్ఖమతమూ అక్కరలేదు. వారి ప్రాభవ మెక్కటితప్ప తక్కినదంతా వారికజ్ఞానజన్యమై గేలిసేయ తగ్గదే. కడుపుమాడి కాలూచేయీ నొచ్చి పాడిదగ్గుతో ముసలితనంవచ్చి, పెళ్లాంపిల్లలూ పరివారం లక్ష్యంచేయనప్పుడే సాధారణముగా అనేకులకైరెండింటియొక్క అవసరమూవస్తుంది. పిల్లలకు ప్రాణంమీదికొస్తే వెంకటేశ్వరుడికి కొప్పు మీదు గట్టుకోక తప్పని బ్రహ్మసమాజంవారు లేకపోలేదు. వర్షాలు కురవకపోతే పూర్వం మేకలను చంపి యజ్ఞాలు చేసేవారు బ్రాహ్మలు. కాటకాలు వచ్చినప్పుడల్లా గ్రామదేవతలకు జంతువుల ప్రాణాలు లంచాలుగా నిస్తూనేవుంటారు మన పల్లెటూళ్ళవారు. జీవబలులు లేకుండా కేవలం సహస్రఘటాభిషేకాలు, లక్ష పత్రిపూజలు, బ్రాహ్మణసమారాధనలు, సప్తాహములు మొదలైన దీక్షలతోనే తిరిగిపోయే అపాయాలు వుండనేవున్నవి.

పూర్వం కరువులూ కాటకాలూవస్తే వారికి రష్యనులకిలాగ, ఇండియాగవర్నమెంటువారికిలాగ రూజువెల్టుకిలాగా ప్లానింగులు తెలియవు. ఉన్నవారు లేనివారికి పెడుతూవుండడం, చాలనివారు మరోదేశం పోతూవుండడం మామూలు. ప్లానింగుల వల్ల ప్రపంచకాన్ని అట్టు తిరగవేసినట్లు తిరగవేసి రెండుప్రక్కలా రుచికరంగా వుడికేటట్లు మాడ్చగల మని ఇప్పటి అర్థశాస్త్రవేత్తల అభిప్రాయము. అయితే అందరికీ ఇంత మహావిజ్ఞాన మెక్కడూకున అబ్బుతుంది? 'అడుక్కో, నీకీయబడుతుంది' అనే పాతబైబిలు వాక్యమందే సాధారణుల కింకా కొట్లాడుకుంటున్నది.

ఇది ఒకహిందూదేశస్థులకేకాదు. మూర్ఖమతాన్నేకాదు. అసలుమతాన్నే చెరిపేసి మానవ స్వాతంత్ర్యసౌభాగ్య విజ్ఞానరాజ్యాంగమును నెలకొల్పుటకు ప్లానింగులు వేస్తున్న పాశ్చాత్యదేశస్థులలో కూడా ఈసంవత్సరం ఎండతాకుడువల్ల ప్రాతమూర్ఖ మతాలు జ్ఞాపకంవస్తున్నవి. ఒక్కయేడాది వాన రెత్తికట్టేటప్పటికల్లా, మంత్రాలా, తంత్రాలా, దిసమొలలతోడి పూవులు రెమ్మలతో ఆడవాళ్ళ నాట్యాలా, అనాథలను దేవతాప్రీతికై నూతులలో త్రోసిడాలా ఒక్కరొత్తున చెలరేగుచున్నవి. క్రీస్తుకు మహమ్మదుకు బుద్ధుడికి ఈశ్వరుడు ప్రత్యక్షమై తారక మంత్ర ముపదేశించినట్లే వీరికికూడా ఉపదేశించాడు.

కాబోలు. ఊరుకుంటే ఈఆచారములు ప్రబలుతాయి, ఎదురిస్తే విజృంభిస్తాయి. మన హిందూమతంలో అయితే అందరూ ఒకేమతమహాసముద్రంలో కొట్టుకుంటూ, బ్రాహ్మలయజ్ఞాలను శూద్రులు, శూద్రుల జాతరలను ఇతరులు దర్శించి భక్తిపూర్వకంగా లెంపలు వాయించుకుంటూ 'స్వస్తిప్రజాభ్యాం' మంత్రమును అందరము పారాయణచేసుకుంటూ తీర్థయాత్రలుసేవిస్తూ, గుళ్లూగోపురాలు కట్టిస్తూ భూలోకమంతటినీ దేవభూమిగా చేసేవచ్చును!

## తెల్లని హరివిల్లు

తెల్లటి కాకులులేవని మనము స్పష్టముగా సుమతీ శతకములో చదువుకున్నాము. తెల్లటియేనుగ ఒక్క దేవేంద్రుడికిమాత్రమే యింకావుందని పురాణాలు ఘోషించుకున్నాయి. తెల్లటి హరివిల్లుంటుందా అన్నసందేహమే యిదివర కెవ్వరికీ కలగలేదు. కాని యుగోస్లావియాలో ఒకకొండమీద తెల్లని హరివిల్లు విరిగిఉండెనని రూటరుగారు లండనుపట్టణ వార్తాపత్రికలలో ప్రకటించారు. లోకములో అనేకము వింతలిప్పుడు మనం వింటున్నాము. అందులో ఇది ఒకటికాబోలు. రంగులులేకుంటే ఇంద్రధనుస్సేమిటి, అది యేదో తెల్లమేఘం కాబోలు వంగివుంటే పామర జనాలుచూచి అల్లాగ భ్రమించినారని కొందరు బుద్ధిమంతులంటారు. ఇంద్రధనుస్సు ముసలిదైపోవడం చేత తారుణ్యలావణ్య వర్ణములన్నీ వెలిసిపోతే, పాపం! వెలవెల పోతూవుందని కొందరు పరిణామవాదులు తలపిస్తున్నారు. మనుష్యులు తమ పూర్వాచారాలు కులవృత్తులూ మానుకొని యిష్టము వచ్చినట్లుగా విహరిస్తున్నారా లేదా, ప్రకృతి చిత్రాలు మాత్రమెందుకు మానేస్తాయి, ఈవేళ రంగులు లేకున్నా విల్లులాగేనా అవుపించిందికాని రేపావిల్లు వంపుకూడా లేకుండా నలుచదరముగానో వంకర టింకరగానో కూడా అవుపిస్తుందేమో అని కొందరు ఛాందసులంటున్నారు. అయితే రంగులు లేకపోయినా విల్లువంపు లేకపోయినా, వంకరటింకరలైనా అదియింకా హరివిల్లే అనుకోవాలా అని ధర్మసందేహము.

## నాగరికతకు ప్రథమలక్షణము

చైనాదేశ మిదివరకల్లా విద్యావివేకములులేని అనాగరక దేశమనీ, మగవాళ్ళు జడలు వేసుకుంటారనీ, ఆడవాళ్లు పాదాలు పెరుగనీయరనీ, అందరూ నల్లమందుమైకంలో మునిగి తామసప్రవృత్తులై వుంటారనీ అనుకునేవాళ్ళం. వాళ్ళకీ జ్ఞానాలువచ్చాయి, నాగరీకులైనట్టుగే. మగవాళ్ళు మరి జడలువేసుకోరు, ఆడవాళ్ళు చాలామంది పాదాలు బిగించుకోవడం మానేశారు. నల్లమందు నిద్దరమత్తులు తగ్గి, వ్యవసాయం వాణిజ్యం చదువులై బ్రతుకులు లెక్చర్లు రాజకీయాందోళనలు జాతీయభావములు గలిగి, చకచక తక్కిన నాగరిక దేశాలతో సహపంక్తికి వస్తున్నాది. ఆదేశంస్త్రీలు ఉపయోగించే విదేశీపౌడర్లు, స్నోలు, దంతధావనసుగంధ పరిమళగుటికలు, తైలములు, సబ్బులు, గౌనులు మొదలగు పరికరముల' బట్టియే వారెంత నాగరీకులౌతున్నదియు తెలియగలదు. 'చెన్ పావో' అను ఒకదేశీయ వార్తాపత్రిక వలన ఈపరికరములనుగూర్చి యీదిగుమతుల సంగతులు తెలియవచ్చుచున్నవి.

చైనాలోకి దిగుమతులు, ఎగుమతులను మించిపోవుచున్నవి. ఈదిగుమతుల భారాన్ని సరిపెట్టుకోవడంకోసం సాలుకు 70 కోట్ల చీనా నాణెముల విలువగల వెండి ఎగుమతి చేయవలసి వస్తున్నది. ఈ సంవత్సరం ఒక మార్చి నెలలోనే **4,68,00,000** నాణెముల విలువగలవెండి పంపించబడినది. దిగుమతులన్నీ శ్రీమంతులుమాత్ర మనుభవించగలట్టివియు, సంసారు లుపయోగించుకొని దివాలా తీయునట్టివియు, దేశమును క్రమముగా దౌర్భాగ్యవంతముగా చేయునట్టివియు ఈభోగలేపనములు, ఆహారములు మొదలగునవే. తెల్లదొరసానులను చూచి వారిలాగే కులుకుచుందామని అభిలషించుచుండు చీనాస్త్రీలకొరకే ఈద్రవ్యమంతయు దండుగవుచున్నది.

ప్రస్తుతం చైనాకు అసలు వెండే నిండుకొను స్థితి పట్టింది కనుక, వీరైనంతవరకు స్వదేశీవస్తువులనే

వాడుకోవలసిన దనిన్నీ, ఒకవేళ చైనాలో అటు వంటివి లేకపోతే తయారుఅయేవరకూ కనిపెట్టుకొని వుండవలసినదనీ, తయారుకాకపోతే కురూపిగానే వుండవలసినదనీ, చక్కనివాళ్ళ కివి అక్కరలేదనీ, కురూపుల కివి చక్కదనాలు తేవనీ పైపత్రికయు ఇతరపత్రికలును తీవ్రతరాందోళన చేస్తున్నాయి.

## ఎలకలరాజ్యాలు

నాగరికము, అర్గనైజేషను, ప్రభుత్వము, ఆరోగ్య రక్షణము అన్నీ మానవుడు లోకసంగ్రహంకోసం కనిపెట్టిన మహామంత్రాలనీ, ఇతర జంతుకోటి నీ విషయాల్లో మించిపోవడమే మానవ విశిష్టతయనీ సైంటిష్టులందరూ మిడిసిపడుతూ వుంటారుకాని ఈ మాత్రం పనిని యెలకలుకూడ చేయగలవని ప్యారిసులో కేట్ లేబరేటరీలో ప్రొఫెసరుగానున్న టానను గారు తెలియచేస్తున్నారు. మనుష్యులకీ వాటికీ యెప్పుడూ విరోధమే కనుక వారు సంపాదించినదల్లా అవి తినేసి బలుస్తూవుంటాయి. వాటిని పట్టడానికి వీరు బోనులు విషాన్నాలు కనిపెడితే వీరిని నాశనము చేయడాని కవి ప్లేగు, టైఫాయిడు మొదలగు విషపు రోగాలు కనిపెట్టాయి. పూర్వం ఫ్రాన్సులో పొడుగాటి చెవులు, తోకలు, వాడిగోళ్లు, బిగువైన కాళ్లు కలిగి చెట్టూ చేమలూకూడా యెక్కి సంసారాలు పెంచు కోగల చిన్న నల్లయెలుక లుండేవట. ఇండియాలో చిన్నచెవులు చిన్నకాళ్ళు చిన్నతోకలు కలిగి సమస్త సముద్రాలు యీదగల శక్తి కలిగి వీటికన్న మిక్కిలి ప్రాణోపద్రవకరమైన గోధుమ వర్ణముగల యెలుక లుండేవట.

క్రీ. వె 1927 లో హిందూదేశంలో కాటకాలు భూకంపాలూ సంభవించినప్పుడు ఈగోధుమ యెలుకలు తెములుకొని తమ మాతృభూమిని విడిచిపెట్టుకొని పడమటిదేశాలమీదికి తగిన నాయకులక్రింద శిక్షితములైన సేనలతో గజినీమహమ్మదులాగ, పిల్గ్రిము ఫాదర్సులాగ, దండయాత్రలు ప్రారంభించినట్లు టానను గారి పరిశోధనలవల్ల తెలుస్తున్నది. 'గట్టు దాటి, పుట్టదాటి, గోరింట వనముదాటి' సప్తసముద్రాలుదాటి, ఎడారులు కొండలతో కూడుకొన్న మహా ఖండాలుదాటి ఫ్రాన్సుదేశం నదులలోదూరి, వాటి తీరములలో నానాదినుసు ఆహారపదార్థ బస్తాలతో కూడుకొన్న మహా పట్టణాలను ఈస్టిండియా కంపెనీవారిలాగ ఆక్రమించుకొన్నవి. అక్కడున్న నల్లయెలకలను ఇవి తుక్కుచితగదన్ని పల్లెలకీ పొలాలకీ ప్రవాసశిక్షలు విధించి పంపించేశాయి. ఫ్రాన్సులో ఇప్పుడొక దివ్యభవనం కట్టేరురాఅంటే, దాని అడుగునా గోడలలోను ఇవి గ్యాలరీలు కట్టుకొని వారికంటె యినుమిక్కిలిగా అంగరంగ వైభోగము లనుభవిస్తున్నా యన్నమాటే. విషవస్తువులేవో సాదావస్తువులేవో అవి యిట్టే పోలుస్తాయి. బోనులు పెడితే వాటినిచూస్తూ నవ్వుకుంటూపోతాయి పెద్దవి, తెలివితక్కువకొనం కొద్దీ చిన్నవిపడితే అవి తప్పించేస్తాయి. పదిసంవత్సరాలకి పరిపడే దినుసునైనా అవి తస్కరించి యెవరికీ తెలియని చోటులలో పెడి పోనికీతిగా నిలవచేసుకుంటాయి. ఏదైనా ఒక యెలకకు అంటువ్యాధి వచ్చిందిరాఅంటే ఇతరుల కది సంక్రమించకముందే మెల్లిగా భూమిమీదికి తరిమేసి మానవలోకాని కంటించేస్తాయి.

తమ స్వస్థానమును వీడి మరో దేశాన్నాక్రమిద్దామని వాటికి బుద్ధి పుట్టగానే పాశ్చాత్యులలాగే అవికూడాముందుఎక్స్ప్లోరర్లని స్కౌటులనుపంపించి తగిన వసతులేవియా అని విచారిస్తాయి. కోపము వచ్చినప్పుడవి అన్నీ ఒకేమోస్తరుగా కేకలువేయడం వల్లను, సంతోషము వచ్చినప్పుడొకమోస్తరుగానే కిచకిచలాడడము వల్లను వాటికొక నిర్దిష్టమైన భాష కూడ ఉన్నదని మనమూహించుకోవచ్చును.

1727-లో ఓడిపోయిన నల్లయెలక లూరుకోలేదు. జర్మనీలాగే అవమానం సహించలేక తమ తొంటి గౌరవస్థానమునకు రావడానికి సర్వ ప్రయత్నాలూ చేస్తున్నాయి. వాళ్లకి హిట్లరులాటి నాయకుడు దొరికి నిర్బంధసంసారా లేర్పరచి జనాభా నతివేగ

ముగా హెచ్చించేశాడు. జపానులాగ అప్పుడే అవి ప్యారిసుమీదికి పిల్లపిల్లదూసళ్లు వేస్తున్నవి. అయిరోపాలో ఆయుధవిసర్జనసభలు విఫలములైనాయి కనుక మరోయుద్ధం అదుగో ఇదుగో అన్నట్లున్నది. దానికి కొంచెం ముందో వెనకో ఈ యొలుక మహా సంగ్రామముకూడా అతిఘోరంగా జరుగుతుంది కాని మానదు. రాజీ కుదరడంమాట వట్టిది. యూటుకధర్మమంటూ తగిన ప్రతికావిలేఖరుల నేర్పాటుచేశారురా అంటే ఈవార్తలనుకూడా మనము శ్రవణానందంగా వింటాము.

ఫ్రాన్సు దొరతనమువారు జర్మనీతో యుద్ధానికైనా సిద్ధముగావుండి జయమందగలమన్న ధైర్యముతో నున్నారు కాని ఈయొలుకలయుద్ధమంటే హడలిపోతున్నారు. పిల్లులను పెంచడము, విషాన్నం పెట్టడము, బోనులు కట్టడము, బడితలతో బాదడము మొదలగు పురాతనసాధనము లేమీ చిన్నమెత్తు పనిచేయలేదు. 'ఫ్లుడుసప్లై' ఆపేసి వాటిని ఉక్కుపెట్టి చంపేదామని నిశితంగా ఆలోచిస్తున్నారు. వీరివస్తువులు వీరికి అసలు అవి దక్కనిస్తే కాదూ వీరి ప్లానింగు సాగడానికి! ఈవిధంగా అధునాతన కేపిటలిష్టులు, యుద్ధశాస్త్రవేత్తలు, స్కౌటులు, ఎక్స్ప్లోరర్లు, సంతాననిరోధం లేక సంతానవృద్ధివాదులు, ఆరోగ్యశాఖాధికారులు మొదలైనవారు యొలుకలవద్ద నేర్చుకోవలసిన విషయాలెన్నో ఉన్నవి. తగిన వైజ్ఞానికులు దొరికితే దీనికోస మొక యూనివర్సిటీ పెట్టడం మంచిది.

## బలే సిగరెట్లు

మన కాశీపండితులు భంగునిషా చాలక ఉమ్మెత్తగింజలు అందులో నూరి కలుపుకొని త్రాగడం మన మెరుగుదుము. చుట్టనిషా చాలక సిగరెట్లు కనిపెట్టినవాడు ధన్యుడు. ఆ నిషా చాలక అందులో ఆల్కహాలుచేర్చి అమ్మేవారున్నారు. ఇదీ చాలక క్రొత్తరకం సిగరెట్లు ఇప్పుడు వస్తున్నవి. ముందుగా ఆంట్వెర్పు హేంబర్గువారు వీనిని కనిపెట్టి రహస్యంగా తక్కిన సిగరెట్ల మాదిరిగానే వీటిని యెగుమతి చేస్తున్నారు. ఇవి బ్రిటనులోకి దిగబడ్డవట. మెక్సికోదేశంలో పెరిగే 'మాంజువానా' అనే ఒకమోస్తరు గడ్డితో వీటిని తయారు చేస్తారు. ఒక్క దమ్ము పీల్చేటప్పటికి కొంతవాడూ వీటికి దాసు డౌతాడు. దమ్ముమీద దమ్మూ, సిగరెట్టుమీద సిగరెట్టు అల్లాగ పడుతూవుండవలసినదే. దీనికి తృప్తి అంటూ కుదరదు. ఒక్క నిముషమున కల్లా మానవుని కెక్కడలేని చైతన్యమూ వస్తుంది. చకచకమని ఉత్సాహం ఉరుకు ఉద్భవిస్తాయి. వారికి గుస్వాన్యమైన పనులు లేనట్లు తోచి ఎట్టి యుపద్రవకర కార్యములనైనను చేయుటకు సిద్ధమౌతారు. ఇట్టి సమయములలో స్త్రీ పురుష మిశ్రమసంఘములో వారుందురేని వ్యభిచారదేవత నిర్వక్రముగా విహరించవలసినదే. దీనితోకూడా కాళ్లూ చేతులూ కదలడము మానేసి, మెదడు స్తంభించి మనసునకు పిచ్చెత్తుతుంది. సాధారణ సిగరెట్లెవో ఇవేవో పోల్చుకోవడానికి బ్రహ్మదేముడి తరంకాదు. ప్రతీ అల్లరిమూకలోనూ హత్యలలోనూ ప్రమాదములలోనూ వేరే పోలీసువారు వీరిని పట్టుకొని త్రాగుబోతులేమో అని చూస్తే అట్టివాసనేమీ వేయదు. వీరి వికారాలు చూస్తేమాత్రం ఏ బ్రాందీబుడ్డీగానికిని ఉండవు. విచారించిచూస్తే బ్రిటనులో వేలకొలది మహానుభావులు దీనికి అప్పుడే దాసులయిపోయినట్లే తెలుస్తూన్నది. సిగరెట్టు ఖరీదు 4 షిల్లింగులు. ఈ కంపెనివారెవరో ఫోర్డురాకు ఫెల్లు మొదలైనవారినందరినీ కొంచెం కాలంలో వెనక్కు తన్నేసేటంత భాగ్యవంతులయేటట్లున్నారు. అసలు వీరెవరో పట్టుకుంట కే సాధ్యం కాకుండట. అదీ వ్యవహారచాతుర్యమంటే!

# వార్తలు—విశేషములు

18-5-34 తేదిని దివితాలూకా మంగళగిరి గ్రామములో కొమ్మూరి గురవయ్యగారి కుమార్తె వెంకట సుబ్బమ్మ యను బాలవితంతువును రామన్నపేట వాస్తవ్యులు గోళ్ల మంగయ్యగారికిచ్చి కొమ్మూరి రత్తయ్యగారు వివాహ మొనరించిరి. చుట్టుపట్ల 10, 12 గ్రామముల పెద్దలు 200 మంది వచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

గుంటూరు ఆంధ్ర శుద్ధిసంఘమువారు చురుకుగా పని చేయుచున్నారు. ఉన్నవ లక్ష్మీనారాయణ, త్రిపురనేని రామస్వామి చౌదరిగార్లు అక్కివారిపాలెం, యీతేరు గ్రామములో 77 గురు మతాంతరులకు హిందూమత మిప్పించిరి. ఈ సంవత్సరం జనవరినుండి ఏప్రిల్ మాసాంతరమువరకు 270 మందిని కలుపుకొనిరి. ఇంకను 30 దరఖాస్తులు సంఘమువారికి వచ్చియున్నవి.

రోమేను రోలాండుగారి పేరు అనేక భారతీయులకు పరిచితమైనది. అతను విఖ్యాత ఫరాసు కవిశేఖరుడు. గాంధీమహాత్ముని సిద్ధాంతములలో అచంచల విశ్వాసము గలవాడు. మహాత్ముని జీవితచరిత్రమును రచించి అయిరోపీయులను ప్రబోధించినవాడు. మహాత్ముడు తన పశ్చిమదేశ యాత్రలో నతని యతిథియైకూడనుండెను. అతను తన 69-వ యేట తన కార్యదర్శియగు ఒక వితంతువును క్రొత్తగా వివాహము చేసుకొనినవార్త మిగుల సంతోషకరము.

కలకత్తాలో ఒకవనిత, రోగియగు తనభర్త మరణించునని నిశ్చయించుకొని అతనిశవముతో చేర్చి తన శవమునుకూడ కాల్చుటకు ముందుగానే ఆత్మహత్య చేసుకొనెను. ఇది సహగమనమును మించిపోయి యున్నది.

మేనెల 24-వ తేదిని విశాఖపట్టణములో డాక్టరు యమ్.వి. ఆర్ కృష్ణరావుగారియింట వారిచెల్లెలు శ్రీమతి కామేశ్వరమ్మగారికిని శ్రీయుత తిమ్మరాజు సత్యనారాయణరావుగారికిని వివాహముజరిగినది. కామేశ్వరమ్మగారు కాసీవిశ్వవిద్యాలయములో బి.యస్.సి చదువుచున్నారు. సత్యనారాయణరావుగారు ఎమ్. ఎ. ప్యాసయి మదరాసు విశ్వవిద్యాలయములో రిసెర్చిస్కాలరుగానున్నారు.

శ్రీయుత ఉన్నవలక్ష్మీ నారాయణగారితమ్ములు సుబ్బారావుగారు మధురనివాసినియగు శ్రీమతి వెంకటసుబ్బమ్మగారను వితంతువును జూను నెల 2-వ తేదిని తెనాలిలో వివాహము చేసుకొనిరి.

మహానంది ఆర్యవైశ్యసభలలో విధవావివాహములు కూడునా కూడదాఅని ఉత్తరాదివైశ్యులకు, రాయలసీమవైశ్యులకు వాదప్రకారములు జరిగిన పిమ్మట ఉత్తరాదివారివాదమే నెగ్గినది. నెగ్గుటయే కాక దేవమ్మ అనేవితంతువును సుశీలఅనే క్రొత్త పేరుపెట్టి ఐ. వెంకయ్యగారికిచ్చి నాళంకృష్ణారావుగారు కన్యాదానంకూడా చేసినారు.

శ్రీమతి కందర్ప అన్నపూర్ణమ్మఅను బాలవితంతువును బలిజేపల్లి రామకోట భాస్కరరావుగారికిని చేబోలు చంద్రశేఖరంగారి పౌరోహిత్యమున జూను నెల 1-వ తేదిని వివాహముజరిగినది. పురప్రముఖులు పలువురువిచ్చేసి వధూవరుల నాశీర్వదించిరి.

వర్షాకాలము ప్రారంభమగుచుండుటచే మహాత్ముడు తనకాలినడకయాత్రనుమాని పూర్వమువలె

రైళ్ళు మోటారులమీద నే ప్రయాణములు సాగించి హరిజన ప్రబోధము గావించుచుండును.

అసెంబ్లీసభ్యులగు భగత్ చండిలాల్ గారు తమ యొనిమిదేండ్లపిల్లకు వివాహముచేయుచుండగా మేజస్ట్రీటు గారు అట్లు జరుపరాదని ఉత్తర్వుచేసిరి. చండిలాలుగారు ఉత్తరువు నతిక్రమించి వివాహము జరిపిరి. కేసు జరుగుచున్నది.

కర్లపాలెం పెనుమత్స రామరాజు గారి కుమార్తె శ్రీమతి అన్నపూర్ణమ్మ అను బాలవితంతువును యిందూరి సోమరాజు గారు వివాహమాడిరి. క్షత్రియులలో నిదియే ప్రథమవిధవావివాహము. కర్లపాలెం క్షత్రియులు దీనిని సహించక రామరాజుగారి యింటిమీద రాళ్ళు పేడనీళ్ళురువ్వి అల్లరచేసిరి. మంతెనపాలెం క్షత్రియులు కర్లపాలెంవెళ్లి అట్టి అల్లరులు చేయరాదని నీతిబోధనలుచెప్పి వచ్చుచుండగా ఖాజీపాలెం క్షత్రియులు వారిని బాగుగా కొట్టిరట. కొందరికి బలమైన గాయములు తగిలి ఆస్పత్రిలో చికిత్సలనందుచున్నారు. వ్యవహారము లింకా కోర్టుకెక్కలేదు. పూర్వాచారపరాయణులు దౌర్జన్యపద్ధతులతో తమ యాచారములను నిలబెట్టుకొనగడంగుట వారి అవివేకమును ధర్మదౌర్బల్యమును సూచింపకమానదు.

శ్రీమతి యర్రగుంట్ల జనార్దనమ్మ గారి మరణమునకు సానుభూతి తెలుపుటకుగాను రాజమహేంద్రవరములో శ్రీమతి జాలూరి తులసమ్మ గారి అధ్యక్షత క్రింద నొక బహిరంగసభ 25-5-34 తేదిని జరిగెను. శ్రీమతి జనార్దనమ్మ గారు చాలకాలమునుండి స్త్రీసమాజముల స్థాపనమునకును స్త్రీజనుల ప్రజాహిత జీవనమునకును పాటుపడినవారిలో నొకరు.

కాకినాడదగ్గరనున్న ఫ్రెంచివారిదగు యానాంలో మహూర్తమునకు నూరేసి, ఒక్కొక్కపందిరికి నాలుగేసి ఒక్కొక్కబజంత్రీ మేళముతో యిరవయ్యేసి ఒక్కొక్కపల్లకీతో పన్నెండేసి పెండ్లిండ్లు శారదాచట్ట ప్రతికూలముగా జరిగినవి. అయిదు రాత్రుళ్ళ దీక్షలంతరించినవి. కొందరు బ్రిటిషు ఇండియాలోనుండి పారిపోయి పన్నులిచ్చుకుంటూ పరాసుప్రాంతములలో నివసించి పరాసుపౌరులై బాల్యవివాహములు చేసికొని పిమ్మట బ్రిటిషు రాష్ట్రియములోని తమవూళ్ళువచ్చి తిరిగీ బ్రిటిషుపౌరులవుతున్నారు.

విశాఖపట్టణందరి మధురవాడ సత్రంలో ఒకనాడు రాత్రి శారదాచట్టమునకు విరుద్ధముగ 12 పెండ్లిండ్లు జరిగినవి. బొడ్డుపాలెం కరణం గారు పెండ్లికి అయిదు రూపాయిలచొప్పునయిస్తే కాని సర్కారుకు రిపోర్టుచేస్తానని బెదరించి మధ్యవర్తుల సలహాపైని మూడేసిరూపాయిలకే ఒప్పుకొని పెండ్లిండ్లుకానిచ్చినారు. ఈపన్నెండు పెళ్ళిళ్లకుచెందిన గార్డియనుల పైని 5 గురు పురోహితులపైని పట్టణశారదాసంఘము వారింకా యెట్టిచర్యయును తీసుకొనలేదు.

చీపురుపల్లితాలూకా పెదలింగాలపాడు గ్రామస్థుడు దన్నా అప్పయ్యగారు తన కూతురు సీతమ్మను ఆగ్రామమునసబు లుకలాపు అప్పలనాయుడు గారి కుమారుడు సత్యారావుకుయిచ్చి మద్దూరి సత్యనారాయణగారి పౌరోహిత్యముక్రింద వివాహమొనరించెను. వరుడు 15 ఏండ్లవాడు. వధువునకు 6 సంవత్సరములు వయస్సు. కె. యస్. గుప్తగారు కేసుపెట్టిరి. విజయనగరం జాయింటుమేజస్ట్రేటు వృద్ధుగారు వధూవరుల తల్లిదండ్రులకు తలవక 50 రూపాయీలు జరిమానావేసి ఫిర్యాదీకి 30 రూపాయీలు ఖర్చులనుజరగా యిప్పించెను. పురోహితునిపై సాక్ష్యము దొరకకపోవుటచేత విడచిపెట్టెను.

అనకాపల్లిలో మద్ది వెంకట్రామయ్యగారి కుమార్తెను (10 యేండ్లు వయస్సు) నాగులగొండ శ్రీరాములు గారి పుత్రునకు (14 యేండ్లు వయస్సు) ఇచ్చి వివాహము చేసినందున మొదటి ఆయనకు రు. 700లు రెండవ ఆసామీకి రు. 400 జరిమానా విధించి దావాచేసినవారికి ఖర్చులు రు. 100లు ముజరా యిప్పించిరి.

చోడవరం కాపురస్థులు తమ్మన రామమూర్తిగారు తమ కుమార్తె (11 యేండ్లు వయస్సు) కామేశ్వరకు వివాహము చేసినందుకు రు. 800లు జరిమానా విధించబడినది.

# గ్రంథ పరిచయము

**వైజయంతి:—**

అనంతపురంజిల్లా జటప్రోలుసంస్థానం కొల్లాపురి మునందలి స్నేహలతా కవితాసంఘమువారి తరపున శ్రీ చేబ్రోలు సరస్వతీదేవిగారిచే సంపాదితమైన ద్వితీయ వార్షికపత్రిక. వెల రు. 1-0-0 గ్లేజు కాగితము 60 పుటలు, చక్కనిఅచ్చు, సుందరమగు గద్యపద్యవ్యాసములు 17 ఇందు కాననగును. పేరుమోసిన కవీశ్వరులు వ్రాసిన ప్రసిద్ధకావ్యములనుండి కొన్ని పద్యవ్యాసములు పునర్ముద్రితములు. నిర్దుష్ట సుందరాంధ్రకవితా సరస్వతి యాంధ్రదేశమునుండి అంతర్హితము కాలేదనియు శ్రీమతి సరస్వతీదేవి (సంపాదకురాలు) గారియందు లీనమై సుందరతర కావ్యములను రచింపఁజేయుచు సంగ్రహింపజేయుచు ఈ సంఘముద్వారా నేడును విహరించుచునే యున్నదనియు ఈ పత్రిక ఋజువు పరచుచున్నది. ఇవి కావ్యమాత్రములు కావు. ఆధునికాంధ్ర కవితాశేముషి యందలి మేలిమి మీగడతరక లనవలెను. ఇట్టి దివ్య సంపుటమును ప్రకటించినందుకు సంపాదకురాలికి మా అభినందనశతంబులు.

**హంసతారావళి—లలితాశతకము:—**

ఇదియును పైసంఘమువారిచే ప్రకటితమైన 34 వ ప్రచురణము. క్రౌనుసైజు సుమారు 80 పుటలు. వెల రు 0-4-0. గ్రంథకర్త శ్రీయుత సరిపల్లి విశ్వనాథ శాస్త్రిగారు. వీరు సంస్కృతాంగ్ల పాండిత్యమున యమ్. ఎ. యును ఆంధ్రమున విద్వాంసులును అయి యున్నారు. భారతీయ తత్త్వవిజ్ఞానమున కనర్ఘాలంకారమగు శ్రీవిద్యారహస్యమును పూర్వపుణ్యవశంబునఁ గరతలామలకంబుగఁ జేపట్టి విమల విద్యాగుణ శోభితులై అలరారుచున్నారు. దీనికి తోడు సహజ సుందరనుగమ కవితాశోభితులు. మొదటి 27 పద్యములును 'న' ప్రాసపై నుత్పలమాలికలుగను, రెండవ 100 పద్యములును 'ల' ప్రాసపై మత్తేభములుగను వినుగుపుట్టనట్లు ధారాళముగ నడిపింపగలిగి రన్న వీరి అనర్గళకవితాధార విశదము కాగలదు. బహుపండిత ప్రశంసల బడసినది.

**శశి:—**

విజయనగరం కవితామండలివారు ప్రకటిస్తున్న 'సచిత్రమాసపత్రిక.' ఇప్పటికి ఆరుసంచిక లప్పుడే వెలువడినవి. బాలకవుల పద్యాలు, పెద్దలువ్రాసిన వ్యాసాలు విరివిగా వికసిస్తున్నాయి. హాస్యరసం మీద శశికి మొగ్గుఎక్కువ. శ్రీయుత మోటూరు వెంకట్రావుగారు సంపాదకులు. సాలుచందా స్థానికులకు 10 అణాలు, పైవూళ్ళవాళ్ళకు 13 అణాలు.

**సరస్వతి:—**

శ్రీయుతులు వెంపటి సత్యనారాయణ వఝ్ఝల కాళిదాసుగార్లు సంపాదకులు. విశాఖపట్నంనుంచి వెలువడడము. కథలు, కబుర్లు, ముచ్చట్లుహాస్యాలు, పోటీలు క్వచిత్తుగా లోకసమాచారాలు కలిగి ఇప్పటికి 32 వారాలయి వెలువడుతున్నది. ప్రతి ఒకటికి ఒకఅణా.

**హరిజన సేవామృతము:—**

క్రౌనుసైజు 38 పుటలు. వెల రు. 0-3-0 లు. గ్రంథకర్త శ్రీయుత సాయం వరదదాసస్వామిగారు, ఓంకారాశ్రమము, తెనాలి. శ్రీస్వామివారు హరిజనోద్యమమును తత్వదృష్టితో తిలకించి భక్తిరసముతో మిళితముచేసి పామరజనంబులకెల్ల నవగాహము కాగల కీర్తనలలో జ్ఞానామృతమును పంచిపెట్టినారు. ప్రతిపాటకును వరుసలు వ్రాయబడినవి. అవరుస లాంధ్రప్రాంతముల వారందరికి పరిచితములైనవి. పద్యములు వేమన యోగితత్త్వములను, పాటలు రామదాసు, యెడ్లరామదాసు కీర్తనలలోని భక్తితరంగములను బురుడించుచుండును. మహాత్ముడు

చెప్పినట్లు హరిజనోద్యమమాధ్యాత్మికమైనదయినచో, ఆదిరాజకీయవేత్తల ఉపన్యాసములు, మానవసేవాపరుల ఔదార్యాభిమానములు, ప్రభుత్వధర్మవాదుల బలవత్తరచట్టములు, న్యాయాన్వేషకుల తీర్పులు, కార్యవాదుల జోరావరీతనము మొదలగు వానివలన గాక భక్తులగీతామృతమువల్లనే సాధింప సాధ్యమై స్థిరతరము కాగలది. ఆంధ్రదేశములో ఈయుద్యమము ఇట్టి యోగివర్యునియొక్కయు, అనన్యభక్తపరునియొక్కయు, గానకళావినోదియొక్కయు కవితాధారకు పాత్రమగుట ఆంధ్రహరిజనుల పుణ్యవిశేషము. కీర్తనలు దయారసము నొలుకుచు సవర్ణావర్ణులమధ్యను మానసిక సామరస్యమును గూర్చుటకెంతయు నుపకరించును. హరిదాసులు, దాసులు యాచకులు ప్రచారకులు మొదలగు వారెల్లరును విరివిగ అభ్యసించి ఈతత్వమును దేశమందెల్ల సౌరభింపఁజేయుదురుగాక!

మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారిజీవచరిత్ర:

క్రౌనుసైజు 86 పుటలు వెల రు 0-8-0 లు. అనువాదకుడు శ్రీయుత ఆకురాతి చలమయ్యగారు. పిఠాపురం శాంతికుటీర గ్రంథమాల వారి ద్వితీయ పుష్పము. దేవేంద్రనాథుగారు కవి చక్రవర్తియగు రవీంద్రుని జనకుడు. జమీందారువంశజుడయ్యు విద్యావిశారదుడై ప్రకృతిమహత్వపరిశీలకుడై, ఈశ్వరగంభీరభక్తిప్రబోధితుడై, అన్వర్థమహర్షిబిరుదాంకితుడై, రవీంద్రునివంటి కవీంద్రునికి జనకుడై, బ్రహ్మసమాజమతమునకు పట్టునై వెలసిన యోగివర్యుడు. అత నెట్టి పరిసరములలో నెట్టి యభూత శిక్షణమును బడసినవాడో తెలుసుకొనుట కీచిన్ని చరిత్ర మిగుల నుపకరించును.

హరిజన నాయకుడు:—

క్రౌనుసైజు 176 పుటలు వెల రు 0-8-0. గ్రంథకర్త ఆచార్యరంగాగారు, రైతు గ్రంథమండలి, నిడుబ్రోలు, గుంటూరుజిల్లా. ఆధునికసాంఘిక ఆర్థిక రాజ్యాంగోద్యమములు కమ్మ, కాపు, మాల, మాదిగ, క్రైస్తవాదిసంఘములలో కలిగించిన మార్పులు, ఈసంఘములవలన తొలుదొల్త జనించిన వైషమ్యములు, ఒకవిధమగు సమానభావము స్నేహదృష్టియులవడి అవియన్నియు నొకటితో నొకటి మిళితమై నూతన జాతీయత యేర్పడుచున్న విధానమును వర్ణించు చక్కని సాంఘికనవల. నవల కేవలకథాసరణివలన మనోహరముగ నుండుటయేకాక, ఆకథాసందర్భమున నిందలి పాత్రము లనేక సాంఘిక ఆర్థిక రాజకీయ సమస్యలను చర్చించుచు గనుక ప్రస్తుతకాలమున కత్యావశ్యకమైన విజ్ఞానమును వెదజల్లుచు పఠితలను యోగ్యులుగను సత్పౌరులుగను చేయఁ ప్రయత్నించుచున్నది.

ఆంధ్రనాటక సాహిత్యసంఘసంచిక:—

ఫూలుస్కేపుసైజు 48 పుటలు. జంషెడ్పురము నుండి దెందులూరు గణపతిశాస్త్రిగారివలన సంపాదింపఁబడి భాగవతుల నృసింహశర్మగారివల్ల ప్రకటింపఁబడినది. ఇందలి పైసంఘముయొక్క షోడశవార్షికోత్సవ నివేదికయూ, కాళీమట్టీకబుర్లు అను వ్యాసములును అన్యప్రాంతములయందు ఆంధ్రు లెట్టి విద్యావ్యాసంగములయందు కాలక్షేపము చేయుచున్నదియు తెలుపుచున్నవి. భక్తి, నాట్యకళ యనునవి చక్కని సారస్వత వ్యాసములు. స్వోహాలు పఠించుటకు చాలా కులాసాగా నుండును. రసవంతములగు పద్యములు మధ్యమధ్య సౌరభము చిమ్ముచుండును.

ప్రాథమిక పాఠశాల:—

ఈ మాసపత్రికయొక్క ఆరవసంపుటము ఒకటవ సంచిక మాకార్యాలయము నలంకరించినది. అన్ని వృత్తులలో నుత్తమోత్తమమయ్యు, జీతములలో నధమాధమమై దారిద్ర్య పీడలంగుందు ఆంధ్రదేశ ప్రాథమికోపాధ్యాయసంఘము అయిదుసంవత్సరము లీ పత్రిక నెట్లో యొకరీతిని నడపగలుగుటయేకాక, ఈసంవత్సర మీబాలకు క్రొత్తచీరకట్టి, క్రొత్తబొట్టు పెట్టి, క్రొత్త కాటుకకన్నులకలు దిద్ది, క్రొత్త

భావములతోను మాటలతోను పల్లెపల్లెకును బంపగలుగుట మిగుల నుత్సాహదాయకమైన విషయము. శ్రీయుత అయినంపూడి గురునాథశర్మగారు, పత్రికను తలాతోకాలేని యేవో సారస్వత వ్యాసాలతో నింపక అద్యంతము ప్రాథమిక విద్యార్థులకు, ఉపాధ్యాయులకు కావలసిన విద్యావిషయమును గూర్చిన ప్రసంగములే సంపాదించి ప్రకటించినారు. ఇట్టి పత్రికను చేబూని పఠించెడు ప్రతి ప్రాథమికోపాధ్యాయుడును తా నుపాధ్యాయవర్గమునకు చెందినందుకు గర్వపడుచు, నేర్పవలసిన విషయములను గఱపవలసిన విధానములను దెలిసికొనుచు అవిద్యాంధకారమును భేదింపబూనుకొన్న అపూర్వనక్షత్రంబు మాడ్కి రాజిల్లకమానడు. ఇందలి 'ఆదర్శకథానిధి' భాగము కేవలము బాలురకొరకు నిర్ణయింపబడినది గనుక 'శుద్ధ' మగు వ్యావహారికభాషలో నుండవచ్చును. పత్రికను ఉపాధ్యాయుల కనుకూలించునట్టియు బాలుర కుపచరించునట్టియు రెండుభాగములలో వ్యావహారికశైలిలో కథలు పద్యములు పాటలు చిత్రమైన ప్రశ్నోత్తరములు, సాధ్యమైనచో కొన్ని బొమ్మలు చేర్చినచో పత్రిక కేవలముపాధ్యాయవర్గమునకే గాక, విద్యార్థి లోకమునకు వారి వికాసమును గోరు తల్లిదండ్రులకుగూడ ప్రీతిపాత్రమై, ఎక్కువ ప్రచారమును గూడ బడయును. సంపాదకుడు కోరినట్లు ఆంధ్రదేశములోని జిల్లాబోర్డులు దీనికి తగిన చేయూతనొసంగుచో సంచిక మరి కొంతకండకట్టి, పెద్దదై, గంభీరమై ప్రాథమికోపాధ్యాయులకే గాక ప్రాథమిక విద్యాప్రయత్నమునకే యెనలేని సేవచేయుచు కీర్తివంతము కాగలదు సుమారు ముప్పదిపుటల సంచిక. సంవత్సరచందా రు. 1-8-0

గోలకొండపత్రిక, సంవత్సరాదిసంచిక:—

హైదరాబాదునుండి జి. బలరామకృష్ణారెడ్డిగారి వల్ల ప్రకటింపబడుచున్న గోలకొండ వారపత్రిక వారు ప్రకటించిన తొమ్మిదవ సంవత్సరాదిసంచిక. క్రౌనుసైజు 72 పుటలు. 'హైదరాబాదు ఆంధ్రులలో పేరెన్నికగన్న వ్యాసకర్తలు, కవులు, రాజకీయశాస్త్రజ్ఞులులేరు. అదంతా తురకమయ'మను అభిప్రాయ మీపత్రిక పఠించినవారికి తొలగిపోవును. ఇందు ప్రకటింపబడిన వ్యాసములు ఆంధ్రసీమవారి వ్యాసముల కెంతయును వెనుదీయకుండుటయేకాక కొన్ని మనవాటిని తలదన్నుచున్నవనవలెను. హైదరాబాదు సంస్థాన పూర్వ పశ్చిమచరిత్ర, రాజ్యాంగము దానిని సంస్కరించవలసిన విధానములను గూర్చిన వ్యాసములు పత్రికకెంతయు తగి, విజ్ఞానదాయకములైనవి. హైదరాబాదు నవాబు కుటుంబమువారి యొక్కయు, సుప్రసిద్ధ దృశ్యములయొక్కయు చిత్రములు పెక్కు ఇందు కాననగును. ఇంత చక్కని సంచికను ప్రకటించినందు కాంధ్రులు సంపాదకు నెంతయు నభినందింపదగును

మీరాబాయి:—

క్రౌనుసైజు 60 పుటలు. వెల రు 0-8-0 గ్రంథకర్త్రి శ్రీమతి వి. ఆర్. సరస్వతిగారు, 88 బ్రాడీరోడ్డు, మైలాపూరు, మదరాసు. పరమభక్తాగ్రగణ్యురాలగు మీరాబాయి జీవచరిత్రము. పెండ్లియననేమో తెలియని చిన్నివయస్సున శ్రీకృష్ణ విగ్రహమును పతిగా భావించి మీరా ఆడుకొనుచుండుట; వివాహయోగ్యమగు వయస్సున ఆబొమ్మను తప్ప వేరొక పురుషుని వివాహమాడనని మొండిపట్టుపట్టి ప్రాణత్యాగమునకై గడంగుట; మీరా పుచ్చుకొన్న విషమును శ్రీకృష్ణుడు తాను త్రాగి వివర్ణుడై ఆమెను బ్రతికించి కుంభరాణాను వివాహమాడ ననుజ్ఞయిచ్చుట; కుంభరాణా విష్ణుభక్తుడేయయ్యు విధివశంబున మీరావలన నకారణానుమానము బొంది ప్రాణత్యాగము చేసుకొమ్మనుట; అట్లు చేసుకొనిన ఆమెను శ్రీకృష్ణుడు తిరిగీ జీవింపజేసి రాణాకు భార్యగా గాక వారికిని యితర మానవలోకమునకు నుపదేష్టగా నుండుమని తిరిగి మానవలోకమున కంపుట; కృష్ణజయంతిదినమున నామె శ్రీవిష్ణువులో లీనమగుట మొదలగు చిత్రవిచిత్ర సన్నివేశము

లతో మీరాబాయి చరిత్రము మనకన్నులయెదుట యదార్థముగ జరుగుచున్నట్లు సజీవశైలిలో శ్రీమతి సరస్వతిగారు రచించినారు. వ్యర్థపదములుగాని అనుచితాశిష్టపదములు గాని 'హల్కా' పదములుగాని క్లిష్టాన్వయములుగాని నీర్ఘతరవాక్యములుగాని శైలియందెచ్చటను గానరావు. అలంకార గుంభనముతోగాని, అప్రస్తుతవర్ణనలతోగాని పాఠకుల బుద్ధిని త్రోవనుండి తప్పింపక, వారిదృష్టిని కథావిషయమై కలగ్నమొనర్చు చతురశైలిగల కతిపయాంధ్రలేఖకులలో శ్రీ సరస్వతీగారొకరని చెప్ప సాహసించుచున్నాము. దీనిని పాఠ్యగ్రంథముగ నంగీకరించుటలో పాఠ్యగ్రంథ నిర్ణయసంఘమువారు దీని యోగ్యతను వాస్తవముగ గ్రహించిరనియే చెప్పవలెను. విద్యా, బోధనానుభవములుగల పెద్దలు సదభిప్రాయముల నొసంగియున్నారు.

భగవద్గీతోద్దేశము:—

114 పుటలు. గ్రంథకర్త పిఠాపురంలో రిటైరుడు సబ్ రిజిస్ట్రారుగానున్న చిల్లరిగె వెంకటలక్ష్మీనరసింహాంగారు. రు. 0-1-0 తపాలాబిళ్ల నంపువారికి పుస్తకము ఉచితముగా పంపబడును. ఆర్యసమాజంవారు, బ్రహ్మసమాజంవారు, బౌద్ధులు, జైనులు, హైందవులు, హింసావాదులు, అహింసావాదులు, సర్వులును భగవద్గీతను ప్రమాణముగా గ్రహించుచు ఒకరినొకరు కాదనుకొనుచున్నారు. భగవద్గీత వీరినెవ్వరినికాని తెగడకున్నను అందరిలోపాలోపములను జూపెట్టుచు సనాతనకర్మలతో గూడిన వైదికమత పునరుద్ధరణముకొఱకును, తద్ద్వారా తదతీతమగు అద్వైతసిద్ధికొఱకును, తన్మతవ్యాప్తికొరకును వ్రాయబడినదని యీ గ్రంథమును పఠించినవారికి తెలియగలదు. గ్రంథకర్తగారికి భగవద్గీతయు, దీనితో సంబంధించిన యితర శాస్త్రగ్రంథములును కరతలామలకముగ నవగాహనమైనవి. ప్రతి శ్లోకమునకు నెట్టి నిర్దిష్టటీకను చెప్పవచ్చునో పూర్వాపర సందర్భశుద్ధితో సమర్థించగలవారు. భగవద్గీతాపాఠకులీ గ్రంథమును దగ్గరపెట్టుకొని పఠించిరేని భగవద్గీతను స్వతంత్రముగను చక్కగను సవిమర్శకముగను గ్రహింపగలుగుదురు.

భారతదేశపు రైళ్లు:—

క్రౌనుసైజు 52 పుటలు. వెల రు. 0-1-0. గ్రంథకర్త శ్రీయుత దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ గారు. బెజవాడనుండి ప్రకటింపబడుచున్న రాజకీయ విజ్ఞానప్రచురణములలో ఇది నాలుగవది. ఖరీదును తపాలాచార్జీయును బెజవాడ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారికి తపాలాబిళ్లల రూపమున పంపించినచో వలయువారు ప్రతులను బడయగలరు. సర్వదేశములకును సౌఖ్యప్రదము లగుచున్న రైళ్లు మన దేశములో సర్వానర్థముల కెట్లు మూలకారణము లగుచున్నవియో, ఇందుకు కారణములు, ఇవి తొలగగల ఉపాయములు—ఇట్లు కోట్లకొలది రూప్యముల విలువగల రహస్యములు క్లుప్తముగ వ్యవహారభాషలో రచియించి గ్రంథకర్తగారు ఆంధ్రదేశస్థుల కనల్పమగు మేలు చేసినందు కెంతయు అభినందనీయులు.

భోజకుమారము:—

డెమ్మీసైజు 81 పుటలు. వెల రు. 0-12-0లు గ్రంథకర్త రిటైర్డు డిప్యూటీ తహసీల్దారు శ్రీయుత తాడూరి లక్ష్మీనరసింహరావు పంతులుగారు, రాజమహేంద్రవరము. నలువది సంవత్సరముల క్రిందట నిది రచింపబడినట్లు కవిగారు పీఠికలో వ్రాయుచున్నారు. ముంజరాజు తన రాజ్యకాంక్షచే అన్నకుమారుని చంపించుటయు, ప్రజలు తిరుగబడుటయు, ఒక కాపాలికుని తంత్రముచే చనిపోయిన భోజకుమారుడు బ్రదికి పట్టాభిషిక్తుడగుటయు కథావిషయము. గద్యపద్యములు శుద్ధమైన శైలిలోనున్నవి. రసగ్రహణపారీణులే యిందలి హాస్య శృంగారముల పఠించి ఆనందించగల సమర్థులు.

ఉషస్సు (మాసపత్రిక):—

సంపాదకులు శ్రీయుతులు మాధవశర్మ, యజ్ఞన్న శాస్త్రిగార్లు, ఏలూరు. సంవత్సరమునకు చందా

రు. 1-0-0. ఇది విద్యార్థులకోసమే జన్మించి వారి యాశయములను సఫలపరచ గోరుచున్నది కనుక విద్యార్థు లీ యవకాశమును తీసుకొని తగిన జ్ఞాన, రచన, విద్యాభిరుచులను పొందుదురు గాక. కథలు, వ్యాసములు, పేలవములు గాక మిగుల గంభీరముగ నున్నవి. విద్యాధికులును, సదాశయులును, ప్రతిష్ఠ వ్యాసరచనాపరులును కలిసి దీని నుత్తమతరగతి సాహిత్యపత్రికగ చేసి దేశమునకు నూతన శాస్త్రీయార్థిక జ్ఞానమును ప్రసారించి దేశీయులకు నూతన దృక్పథమును కలిగించినచో ఈ పత్రిక సార్థకమగును.

## మాధురి (మాసపత్రిక) :—

శ్రీయుత పి. వెంకట్రామయ్యగారు, తెనాలి. సంవత్సర చందా రు. 0-11-0. చక్కని కథలును, వ్యాసములును ఆధునిక సాంఘికజీవనమును విమర్శించుచుండును. సదాశయ, సత్సాహిత్య, సత్కళ, సద్భావములయం దభిరుచిగూర్పగల సరసతతో వ్యాసములు ముద్దులు కులుకుచుండును. జనసామాన్యమును రంజింపఁజేయు సులభశైలి, చల్లని హాస్యము, సభ్యములగు భావములు గలిగి రాణించుచున్నది.

## దూదేకుడు :—

క్రౌనుసైజు 92 పుటలు. వెల రు. 1-0-0. గ్రంథకర్త శ్రీయుత ఆలపాటి కామేశ్వరరాయ కవి, సుబ్రహ్మణ్యంపేట, విజయనగరం. చిన్న హాస్యగ్రంథము. అల్పవిద్యావంతులై, భావపరిపక్వము కాని, అన్వయశుద్ధి కాని లేక, ఏదేనా వ్రాసి పేపర్లలో పడేసి ప్రసిద్ధిపొందుదామనే ఉబలాటంతో ప్రేయసిమధు, సుషమ, రహః అను వింతవింత పదములనందందు జొనిపి పద్యములు వ్రాసి, దుస్తులలోను వేషములలోను ఒక ప్రత్యేక నీటుతనము నవలంబించి తిరుగుచుండు కొందరు సాధారణ యువకుల చర్య లిందు ఏకబడినవి. సవ్యములై అగాధ భావపరిపూర్ణములైన ఉత్తమ పద్యములు వ్రాయువారు దీనినిజూచి కినియవలసిన అవసరములేదు. తక్కిన యీ యేతన్మాత్రులమీదనే ఈ దండయాత్ర. వీరు తమ పద్యముల సువ్వొత్తుగ పొగడుకొనుచు, తప్పక ప్రకటింపబడునను నాశతోను వింతవింతబిరుదులతోను భారతి మొదలగు ఉత్తమ పత్రికలకు పంపుచు, ప్రకటింపఁబడనిచో కడుపుడుకు పుట్టి పత్రికాధిపతులకు కోపపూరితములగు లేఖలు వ్రాయుచు, చేతిలో నేమాత్రమైన దుడ్డున్నచో క్రొత్త పత్రికలు పెట్టి కొన్నాళ్లు ప్రకటించుకొనుచు పరిహాసపాత్రులగుచుండు విషయములెల్లయు నిందు వర్ణింపఁబడినవి. ఒకసారి చదివి నవ్వి విడచి పెట్టవలసిన ఇట్టి రకము పుస్తకములకు రెండణాల కంటె ఎక్కువ ఖరీదుంచతగదు.

## శ్రీ ముకుందస్తవరాజము :—

ఫూలుస్కేపుసైజు 20 పుటలు, 112 కందపద్యములు. వెల రు. 0-8-0లు. గ్రంథకర్త శ్రీయుత ఆలపాటి కామేశ్వరరాయ కవిగారు. శుద్ధమైనధార. పద్య పద్యమునను విష్ణుభక్తి పరిమళించుచుండును.

## సత్యవాణి :—

విశాఖపట్నం జిల్లా అనకాపల్లినుండి ప్రతి ఆదివారం వెలువడే జిల్లావిషయిక పత్రిక. శ్రీయుత యమ్. సుబ్బారావు బి.ఏ., బి.ఇడి. గారు సంపాదకులు. 1-వ సంపుటము 5-వ సంచిక వీరు చెప్పినట్లు "సత్యకంఠముతో సర్వవిషయములూ చర్చించు" చున్నది. సంవత్సర చందా రు. 2-8-0లు రాబోయే యెన్నికల హడావిడిలో కాంగ్రెస్సు సందేశమును జనులందరికి తెలియఁబరచి ఇది అపారమైన సేవ చేయగలదని నమ్మవచ్చును.

## పురుషార్థములు :—

రాయలుసైజు 122 పుటలు. వెల రు. 0-8-0లు. గ్రంథకర్త కీ॥ శే॥ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు. ప్రకాశకులు శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠి, బెజవాడ. మానవజన్మను సార్థకముచేసి తరింపజేయునవి హక్కులు, భోగములుగాక చతుర్విధపురుషార్థములై యున్నవి. ఈ విషయమును భారతీయులే గుర్తించిరి. నేడు వారు దానిని విస్మరించుటచేతను, తక్కినవారి కది తెలియకపోవుటచేతనే సర్వానర్థములను కూడుచున్నది. అనర్థములను చెఱుపుటకు తాత్కాలికోపాయములు ప్రయోగించినచో ఇక్కడ పుండ్లు మాని అక్కడ పుట్టుటేతప్ప శాశ్వతచికిత్స కలగదు. ఈపద్ధతికి సరిపడునట్లు మన సంఘస్థితిని,

విద్యావిధానమును సంస్కరించుకొనవలసియున్నది. ఇట్టితరుణౌషధము నీ గంభీరగ్రంథములో గోపాలకృష్ణయ్యగారు చూపించినారు. గోష్ఠివారు ప్రకటించినారు. భారతీయు లెల్లరును సేవించెదరా? ఆంధ్రులు దీనిని కనీసము పఠించి గుర్తించనైన గుర్తించెదరా? ఇందలి దివ్యవాక్యములు స్వర్గజ్యోతులు కాని పదముల కలయికలు కావు. గోపాలకృష్ణుని కేవలము హాస్యరస చక్రవర్తిగాను, రాజకీయరంగవీరునిగాను, ఉపన్యాసక శిరోమణిగాను, నిర్మాణచతురునిగానే గాక, పరమయోగిపుంగవునిగ నెఱుంగఁగోరువారు దీనిని పఠించి తీరవలయును.

నెల్లూరు వర్ధమానసమాజము (1934 నివేదిక):—

ఇందు ప్రస్తుతము గౌరవసభ్యులు 7 గురు యావజ్జీవ సభ్యులు 10 మంది సామాన్యసభ్యులు 231 గురున్నారు. ఎప్పటికప్పుడు కార్యనిర్వాహకవర్గమువారియొక్కయు ఇతర సభ్యులయొక్కయు సమావేశములు జరిగి పనిబాటలు చక్కగా నెరవేర్పబడుచున్నవి. దసరా, వేదం వేంకటరాయ శాస్త్రిగారి జయంతి, తిక్కన జయంతి ఉత్సవములు యథావిధిగ జరుగుచున్నవి. బహుమానములు పతకములు పంచిపెట్టబడుచున్నవి. ఈ సంవత్సరము గృహలక్ష్మి స్వర్ణకంకణదానము ప్రారంభింపఁబడినది. ప్రథమకంకణము శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి కొసంగబడినది. ఇందునిమిత్తము స్వర్ణకంకణ రూపేణా రు. 116లును, శారదాలేఖల పునర్ముద్రణ రూపేణా రు. 800లును వరలక్ష్మమ్మగారికిని, గీతావాయిద్య విశారదలు శ్రీమతులు విశ్వేశ్వరమ్మ, భానుమతమ్మగార్లకు, రజతపాత్రములు డాక్టరు కేసరిగారు బహుమానములుగా నొసంగి తమ వదాన్యతను ప్రకటించుకొనినారు. ఏటేట యిట్టి మహోత్సవ మీ సంఘము తరపున జరిపించుటకు బూనుకొన్న కేసరిగారు ప్రశంసనీయులు. సమాజాధ్యక్షులు పఠనాలయమును మరమ్మత్తు చేయించి మనోహరముగ నొనర్చిరి. గ్రంథాలయమునుండి శిథిలపుస్తకములను తొలగించి క్రొత్తవానిని 451టి చేర్చి మొత్తము 7,161టిని చేసినారు. ఆంగ్ల, ఆంధ్ర, తమిళ, సంస్కృత, హిందీ గ్రంథములు గలవు. జమా ఖర్చులు ఆడిటు చేయించబడినవి. ప్రాతబాకీలు సభ్యులు సరిగా చెల్లించవలసిన ఆవశ్యకత యెంతయో కలదు. బోర్డువారు, పురపాలక సంఘమువారు తమ విరాళము నాపివేయుట విచారకరము. సభ్య లెక్కువమంది చేరవలసియున్నది.

భారత వైశ్య:—

బెజవాడనుండి శ్రీయుత మానేపల్లి బాపనయ్యగారి సంపాదకత్వమున వెలువడుచుండు వారపత్రిక. సంవత్సర చందా రు. 3-4-0లు. ఈ పత్రికయొక్క 1-వ సంపుటము 6-వ సంచిక నందుకొంటిమి. వైశ్య పురంధ్రీమణులు పురుషశ్రేష్ఠులయొక్కయు ఉపన్యాసములు, విరాళములు, దానముల వృత్తాంతములు, సంస్థల ప్రశంసలు కలిగి కడుంగడు కమనీయమైయున్నది. సంఘసంస్కరణమునకు ముందంజ వేయుచు, గాంధీమహాత్ముని నాయకత్వముక్రింద విజృంభించుచున్న కాంగ్రెసుయొక్క జయభేరిని వాయించుచు వచ్చేయెన్నికలలో నిది అపారమగు సంరంభము చేయఁగలదని నమ్మవచ్చును.

వేప:—

డాక్టరు కే. యన్. కేసరిగారు వ్రాసిన 48 పుటల వైద్యగ్రంథము. వెల 0-8-0లు. వేపచెట్టుయొక్క గాలి, ఆకు, చిగురు, పూవు, పండు, గింజ, చెక్క మొదలగువాని యన్నిటివలన మానవదేహమున కట్టి ఆరోగ్యము కలుగునదియు నిందు వివరింపఁబడినది. గజ్జి, పుండ్లు, జ్వరము, ఆటలమ్మ, మసూచికము, తామర, కుష్ఠు మొదలగునవి అన్నియు వేపయొక్క ఉపయోగమువలన కుదరగలవు. డాక్టరుగారు బహుగ్రంథములను చదివి తమ స్వానుభవముతో మిళితముచేసి వేపనూనె, వేపగుల్కందు, వేపలేహ్యం, వేపషర్బత్తు, వేపసబ్బు మొదలగు సౌరభయుక్తమైన ఔషధవిశేషములను తయారుచేయు రీతు లిందు తెలిపినారు. ఈ సలహాల ననుసరించి జీవించువారు డాక్టర్ల బిల్లులకుగాను డబ్బు పోయనక్కరలేదు. పేదలకు, సాధారణ వైద్యులకు మిగుల నుపయోగకరము. వలయువారు, లోధ్రా ప్రెస్సు, ఎగ్మూరు, మద్రాసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.




**మా ప్రథమవ్యాసము :—**

శ్రీమతి గం॥ భా॥ స॥ వెన్నెలగంటి హనుమాయమ్మగారి చరిత్రమును చిత్రపటమును సంపాదించి పంపించిన శ్రీయుత ఒంగోలు వెంకటరంగయ్య పంతులుగారికి మేమెంతయు కృతజ్ఞతను దెలుపుచున్నాము. దానిని ఈ సంచికయొక్క ప్రథమవ్యాసముగా ప్రకటించి మా కామెయందుగల భక్తిని విశదము చేయుచున్నాము. పత్రికా పాఠకలోకమునకు తెలియుక, పల్లెటూరి ప్రాతసంప్రదాయములయందు పంకటాకుల చాటుననుండు పరిపక్వఫలంబులవలె నణగి మణగియుండు విద్వత్తిలకములు, పురాణ వ్యాఖ్యానవైఖరీసమేతలు, యోగినీ మణులు, నైష్కర్మ్యసిద్ధిని బడసి బ్రహ్మభావమునందిన మహిళామణు లెందఱేని యున్నారు. ఆంధ్రదేశమున నట్టివారి సంఖ్య అల్పముకాదు. వారి నిరాడంబరజీవితము వారిని మనకు చాటుచేయుచున్నది. అయినను అట్టివారిని తెలుసుకొని వారి చరితామృతమును గ్రోలలేని ఆధునిక మహిళామణుల జీవనములు సాంఘికముగను ఆధ్యాత్మికముగను పరిపూర్ణములు కానేరవు. కనుక అట్టివారి జీవితములను సంగ్రహించి సచిత్రముగఁగాని, సాధ్యముకానిచో అచిత్రముగఁగాని పంపించవలెనని పాఠక లేఖక మహాశయులను గోరుచున్నాము.

**పునర్వివాహము :—**

కీ॥ శే॥ జనమంచి వెంకట్రామయ్యగారి కుమార్తె శ్రీ మహాలక్ష్మిగారికిని, పర్లాకిమిడి వాస్తవ్యులు శ్రీ కృష్ణచంద్ర పాత్రో గారికిని కాకినాడలో బ్రాహ్మధర్మ పద్ధతిని వివాహము జరిగినది. వధువు పి. ఆర్. కాలేజీలో ఇంటర్మీడియేటు చదువుచున్న బాలవితంతు విద్యార్థిని, ఆంధ్ర బ్రాహ్మణ పుత్రిక. వరుడు బి.ఏ., బి.ఇ.డి. ప్యాసయిన ఓఢ్ర బ్రాహ్మణేతరుఁడు. వధువు కుటుంబమువారు సత్సంప్రదాయబద్ధమగు ఆంధ్ర తెలగాణ్యులు, ఆంధ్ర సాహిత్యసేవయందు పేరెన్నిక గాంచుచున్నవారు. ఇట్టి సత్కుటుంబమునకు చెందిన వధువు తల్లియు, సోదరుఁడును హృదయపూర్వకమగు సంప్రీతితో వర్ణాంతర జాత్యంతర వరునకు తమ కన్యక నిచ్చి వివాహమొనర్చుటంబట్టి ఆంధ్రదేశంలో సంఘసంస్కారమెంత శరవేగమున ప్రచారమగుచున్నదియు, వివాహవిషయములో సంకుచితములగు శాఖ, జాతి, వర్ణ, మతవిచక్షణలకంటె వధూవరుల పరస్పరానుకూల్యతకు ప్రాధాన్యమెక్కువ క్రమముమైనదిగ నెట్లంగీకరింపఁబడుచున్నదియు

కానవగును. సభూవరులకు నిరంతరాయు రారోగ్యైశ్వర్యసిద్ధియు, దేశసేవాదీక్షయు పరమేశ్వరుడు ప్రసాదించును గాక!

**రామదండు:—**

మన భారతదేశమున స్కౌటు, హిందూస్తానీ సేవాదళము, మొదలగు సేవాదళము లెన్నియో ఉన్నవి కాని అవి యెవ్వియు భారతమతసంప్రదాయసిద్ధములుకావు, ఆయా సమయముల నించుక ఆడంబరవిలాసములు చూపి అనంతరము నామావశిష్టములగు చున్నవి. జాతిసంప్రదాయములు సేవాదళ జీవనములలో లీనములై యుండకున్న చో అట్టి దళములు సజీవములై శాశ్వతములై సఫలములై వర్ధిల్లగలుగుట దుర్లభము. భారతదేశములో నీయుద్యమము వర్ధిల్లవలెననిన, సత్సంప్రదాయముల ననుసరించి వానిని స్థాపించుట అత్యావశ్యకము. స్వర్గీయ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు 'రామదండు' అను పేర ఆంధ్రదేశమున సేవాదళమును స్థాపించుటయు, గ్రామస్థులు వేనవే లందులో చేరి మతావేశపూరితులై భారతీయ కళావిలాసములతోను భక్తి త్యాగదీక్షా వ్రతములతోను భజనసంకీర్తన స్తవారావములతోను జాతీయోద్యమములోని కుటికి అనుపమానమగు సేవచేసి గాంధీమహాత్ముని ప్రశంస బడయుటయు మన మెల్లఱమును నెఱింగినదే. చెంగావిధోవతి, చెంగావిచొక్కా, చెంగావి తలపాగా, కుంకుమతిలకము, శంఖము, తులసి పూసపేరు లేక రుద్రాక్షహారము, తామ్రపాత్ర, దండము, తాళపుచిరుతలు, నవీన జీవకళాసూచకంబగు నొకపచ్చని రెమ్మ, సంచీ, అందులో దస్తా తాలింపుసామాను నిప్పుపెట్టె మొదలగు వేషముతోను, 'రమారమణగోవిందో హరి, హరహరమహాదేవ, రామరామ, దశ్శరథా' ది కేకల భజనలు పాటలతోను, శర్మ, వర్మ, గుప్త, దాసు, రావు, పంతులు రామదాసు మొదలగు వ్యవహారికవర్గముతోను రాష్ట్రీయసంస్థయై అదిరాజిల్లుచో ఆంధ్రులకొక నూతన జీవకళ వచ్చి యెట్టి ఉత్తమప్రయత్నమునైనను సాధించి తీరుదురనుటకు సందేహములేదు. కాంగ్రెసువారి శాసనసభాప్రవేశదీక్షతో దేశమొకక్రొత్త సక్రమకార్య విధానము నవలంబించవలసియున్నది. ఇందుకొరకు దేశములో నొకవినూతన ప్రబోధమును సేవకాదళమును అత్యావశ్యకము. ఇట్టి కార్యోపక్రమణమునకు కావలసిన సంస్థలు, దానిని నెరవేర్పందగు విధానమును శ్రీగోపాలకృష్ణయ్యగారు తన అద్వితీయ సరసగంభీరశైలితో గూడిన వ్యాసోపన్యాసములద్వారా ప్రకటించి తన సందేశముగా విడిచియే కీర్తిశేషులయ్యెను. దీనినంతటిని సేకరించి 81 పుటల సుందరగ్రంథముగా విజయవాడ ఆంధ్రవిద్యాపీఠగోష్ఠి వారు ప్రకటించిరి. ఆంధ్రదేశ మీ ప్రతులు పఠించి, వేర్వేరు భాగములలో నీ సంస్థల నేర్పఱచి శీఘ్రతరకార్యక్రమమునకు గడంగనిచో కాంగ్రెసు శాసనసభల యెన్నికలలో నెగ్గలేకపోవుటయు, నెగ్గినను యితర పక్షముల కంటె నెక్కువ ప్రతిష్ఠావంతము కాకపోవుటయు తప్పదు. కనుక దేశీయనాయకులెల్లరు నిట్టి పవిత్ర సంస్థాప్రతిష్ఠాపనమును చేసి దేశమును సజీవ, సజాతీయ, సంప్రదాయబద్ధమగు ఆందోళనముతో చెలరేగునట్లొనరింతురుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS

---

# పనితనముగల వెండిసామగ్రుల నిలయము









## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి & కంపెని,

నగలవ్యాపారులు

25. చైనాబజారురోడ్డు, మదరాసు. 62. గోవిందప్పనాయక్ వీథి

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగు లక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపము గలిగినప్పుడు ఉపయోగించిన తప్పక పనిచేయును. గర్భాశయమునుండి మైల సరిగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరచును. వాతమును పోగొట్టును. పిచికారి **(Douch)** మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిది ఒక్కటే; ఇది బాలింతల పాలిటి పరమౌషధము.

వెల తు. 1–కి రు. 30.

పుడదు వారమురోజులకు మందు రు.5

---

## రజోదర్శిని

స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన వ్యాధులకు మంచి మందు. ముట్టునొప్పి, మైల సరిగా కాకపోవడం, బొత్తుగానే బహిష్టు కాకపోవడం, మొదలైన బాధలను నివారించును. రజస్వల కాని వారలుకూడ సేవించిన పిదప రజోదర్శనమైనట్లు ప్రశంసలు గలవు. వివరములు కోరిన పంపబడును.

50 మాత్రలు రు. 2.

పైరెండు ఔషధములనుగూర్చిన వివరములు కోరినవారికి ఉచితముగా పంపబడును. **160** పేజీలుగల 'ఆయుర్వేద చికిత్సాదర్పణము' అను గ్రంథము 0-2-0 లకు పోస్టేజీబిళ్లలు పంపినవారికి ఉచితముగా పంపెదము.

***Consulting Physician :—***

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకర శాస్త్రి,

ఎ. ఎం. ఎ. సి.




సంపాదకుడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] ఆగస్టు 1934 [సంచిక ౬

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువరైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరని వారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.



# బాలపాపలే దంపతుల ప్రేమబంధము

స్త్రీకి మాతృస్థానము గౌరవప్రదము. ఆమెకు గృహయాజమాన్యము లభించును. ఆత్మానందము కలిగించును. భర్తకు తనయెడల భక్తి ప్రేమ భావములు దినదిన మభివృద్ధినందును. దీని కంతటికిని కారణము?

మాతృత్వమే!

మాతృత్వమునకె ప్రతి స్త్రీయును ఆసగొనును. ముద్దుబిడ్డను కర కమలములం దిడుకొని ఆడించు తలంపు స్త్రీకి యెక్కుడు.

స్త్రీకి లభించవలసిన యీ మహోన్నత స్థానమునకు ఆటంకములను కల్పించు గర్భాశయ రోగములను దూరముచేయువలయును. ఇందులకు లోధ్ర సేవనమే రాజమార్గము.

## లోధ్ర

**వనితల ఋతుదోషాది రోగములకు వజ్రాయుధము.**

లోధ్ర యెల్లెడల దొరకును.

కేసరీకుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR

# లోధ్ర

## ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.




ఈ ఔషధ రాజము సుప్రసిద్ధవన ఓషధులచే తయారు చేయబడినది. గడచిన ముప్పదిఅయిదు సంవత్సరములనుండి హిందూదేశమునందే గాక పరదేశములయందు గూడ డబ ప్రసిద్ధిగాంచిన దివ్యౌషధము.

ఈలోధ్రను వాడినవారు యిది వనితలకు వరప్రసాదమనిన్ని, రసాయనములకు రాణి యనిన్ని, స్త్రీలపాలిటి కల్పవృక్షమనిన్ని, కొంగుబంగారమనిన్ని మరియు ననేకవిధములుగ స్తోత్రము చేయుచుండుట యెల్లరకు దెలిసిన విషయమైయున్నది.

గర్భాశయదోషజనితవ్యాధులగు ముట్టుకుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము జాస్తి తక్కువ లగుట, స్రావము అనేకరంగులతో వెడలుట, నూతికగడ్డ, గర్భాశయమున విషవ్రణములుకలుగుట, మంట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్రపుత్రికా భిక్షనుపెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

చీకటింటిని ప్రకాశింపజేయు ఈ దివ్యజ్యోతిమహిమను యెల్లరు గుర్తెరుంగుదురు గాక!

12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 అణాలు.

లోధ్ర యెల్లెడలను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

## జీవచ్ఛవములనుచేయు ఆ పిశాచి!



జ్వరము—మానవుల శక్తిని, జీవనమును పీల్చివేయును. కనుక జ్వరము మిమ్ము వహించినదనగనే దానిని పారద్రోలవలయును. అట్లుచేయుచో మిమ్మాపిశాచి జీర్ణించి పిప్పి చేయదు. జ్వరమువచ్చినదనగనే అర్కను ప్రయోగించుడు.




# అర్క

### సర్వజ్వరనివారిణి

ఆహార, విహారఋతుభేద దోషంబుల వలన అన్నాశయమునందు క్రిమికూటముచేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములు, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను, అర్క కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

6 ఔ. రు 2-8.   3 ఔ. 1-8   1 ఔ. 8 అణాలు.

అర్క యెల్లెడల దొరకును.

## కేసరి కుటీరం,

ఎగ్మూరు, మదరాసు.

# మల్లిక

ఇది ముద్దుబిడ్డలకు మురిపమైన లేపము. ఇది మైసూరు చందన అత్తరుతోను మల్లెమొగ్గల సారముతోను తయారుచేయబడిన నవీననవనీతము. శిశువులకు దీనిని ప్రతిదినము స్నానానంతరము కొద్దిగ శరీరమునకు రాచుచుండిన చర్మము మృదువై బంగారురంగునిచ్చి చర్మవ్యాధుల రాకుండచేయును. ఈ లేపమువలన బిడ్డలు రబ్బరుచెండ్లవలె తేరుదురు. ఇందు కాశ్మీరపు కేసరి పునుగుకూడ చేరియున్నది.

వెల బుడ్డి 1-కి 8 అణాలు

# కుంతలకాంతి తైలం

సువాసన తలనూనె. స్త్రీపురుషులు తలదువ్వుకొనుటకు ఇది మంచి సువాసనతైలము. దీనిలో పరదేశపు అత్తరులను కలుపక స్వదేశ పుష్పములతో తయారైన అత్తరులతోనే తయారుచేయబడినది. పరదేశపు అత్తర్లు బొగ్గు తారులోనుంచి తీయుదురు. స్వదేశపుఅత్తరులు హిందూదేశపు మల్లె, జాజి, గేదంగి, మాలతీ, మాధవీ మొదలగు పుష్పములలోనుంచి తయారు చేయుదురు.

బుడ్డి 1-కి 12 అణాలు.

# కేసరి పోమేడ్

దీనిని తలదువ్వుకొనుటకు ముందు కేశములకు కొద్దిగ రాచుకొనిన వెంట్రుకలు రేగక మిసమిసలాడుచుండును. ఇందు పేరుగాంచిన అత్తరులు చేరియున్నవి.

బుడ్డి 1-కి 3 అణాలు.

 సౌందర్యవర్ధకములగు నవనీతములకొఱకు

సింహము మార్కు గలవానినే

తప్పక కొనుడు.




కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

తిరువనంతపురము, హుబ్లీక్షేత్రములయందు
అఖిలభారత వస్తుప్రదర్శనములలో.
ప్రథమతరగతి బంగారుపతకములనుపొందిన

కేసరి

## డెంటల్ క్రీమ్

అను

# దంతధావన నవనీతము




మృదు మధుర పరిమళ మిళితము.
ఎల్లరు ఒకమారు రుచిచూడవలయును. దంతములను
ముత్యములవలె చేయుటయేగాక పంటిజబ్బుల నన్నిటిని నివారించును.
భారతదేశమున భారతీయునిచే భారతీయులకొరకు తయారుచేయబడినది.

అన్ని షాపులలో దొరకును.
అణాలు 8 మాత్రమే.

## కేసరి కుటీరం,
ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

నిరీక్షింపుడు!                                        విడుదలకై నిరీక్షింపుడు!!

మన రాష్ట్రమున—మన ధనముతో

మన సుప్రసిద్ధ నటులతో

| సాటిలేని ఫోటోగ్రఫీ | తయారుచేయబడిన<br>వేల్‌పిక్చర్సు లిమిటెడ్‌వారి | చక్కని రికార్డింగు |
|---|---|---|

# సీతాకల్యాణము

(తెలుగు టాకి)

అద్భుత దృశ్యములు!                                అత్యద్భుత వేషధారణము!!

## అసమాన నటనా కౌశలము!!!

మనోహర నాట్యము!                                మధురతర సంగీతము!!

## అపూర్వ నటీనట సమ్మేళనము!

| స్త్రీలు | | పురుషులు | |
|---|---|---|---|
| మిస్ రామతిలకం | కైక | శ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్య | విశ్వామిత్ర |
| శ్రీహరి | కౌసల్య | మాష్టరు కల్యాణి | రామ |
| రాజరత్నం | సీత | తీగెల వెంకటేశ్వర్లు | రావణ |
| కమలకుమారి | అహల్య | నెల్లూరు నాగరాజరావుగారు | దశరథ |
| కోకిలామణి | సుమిత్ర | మాష్టరు సూరిబాబు | గౌతమ |
| రంగనాయకి | నర్తకి | గోవిందరాజుల వెంకట్రామయ్య | జనక |




# సంస్కరణం

తే॥ గీ॥ ద్యుమణి, పద్మాకరము వికచముగఁ జేయుఁ;
కుముదహర్షము గావించు నమృతసూతి;
అర్థితుఁడుగాక జలమిచ్చు నంబుధరుఁడు;
సజ్జనులు తారె పరహితాచరణమతులు.॥

'భర్తృహరి'

సంఘసంస్కరణం—అనఁగానే చప్పున వితంతువివాహాలమాటే స్ఫురిస్తూవుంది చాలామందికి: అదికాకుంటే వర్ణాంతరవివాహం: అదీకాదూ—దొరసానులమాట! అంతేకానీ, మరేఁవిఁటుందో అని ముందూ వెనకా చూడరు! "యజ్ఞానికేజ్కావాలిరా అంటే కత్తీ, కటారీ" అన్నాడ్ట. అలాగ్గా. యేవి ఆఖరు 'పాయింట్లో' అవే ముందుగా తీసుకురావడఁవాఁ! అన్నిఁటికంటే యేది ముందుగా కావాలో ఆవిషయం కొసాకు నెట్టేడంవాఁ!! యేఁవిఁ న్యాయంవిదీ!

ముఖ్యంగా ఐకమత్యంకావాలి మన సంఘాల కిప్పుడు. అదిలేదు. యెందుచేత? యిప్పటి పరిస్థితులు తెలుసును కొందరికీ; తెలియవు కొందరికీ; తెలిసీ తెలియవు మరి కొందరికీ!! యిలాగ తెలకపిండికి మూడు నాట లన్నట్లయింది సంఘవ్యవహారం. చూడబోతే యేఁవీఁలేదు మళ్లీ—నలుగురూ వొక్కచోట చేరివుండడం!! వొక్కటే పని యని కాదు, పనులు వేరుకావచ్చును; కాని లక్ష్యంమాత్రం వొక్కటే—ఆత్మోన్నతి; తద్వారా సంఘోన్నతి; ఆమీఁక దేశోన్నతి!!

అంతేకాని ముందే 'దేశోన్నతి దేశోన్నతి' యని గోలపెడితే—సంఘోన్నతి లేకుండా దేశోన్నతి యేలాగొస్తుందీ? ఆ వెనుక ఆత్మో న్నతులు లేకుండా సంఘోన్నతి యేలా సంభవిస్తుందీ? కాబట్టీ ఆత్మోన్నతీ, సంఘో న్నతీ, దేశోన్నతీ అన్న క్రమం తలక్రిందులు చేయడం తప్పూ!! మన కిప్పుడు ముప్పుకి మూలంవైం దీతప్పే!! ఐతే 'యిది మనం దిద్దుకోరాదా?' అంటారు. దిద్దుకోవొచ్చు. కాని చాలా కష్టపడాలి! మత్సరాలతో మనస్సులు మగ్గిపోయున్నాయి! తనకిలేదని యేడ్చి వొకకన్నూ—పొరుగువాడికున్నాదని యేడ్చి మరోకన్నూకూడా పోగొట్టు కున్నాడట్ట యెవడో!! ఆలాగ్గా ప్రతీసంఘం కూడా రానురానూ తయారై పోతూవుంది. పైకంతానటన'మేమంతా వొక్క కంచంలో తిని వొక్క మంచంమీద పడుకుంటాం'సని. నిజం సర్వాంతర్యామికే తెలుసును గదా!! అందులోనూ— 'సర్వాధికారపత్రం వొకప్పుడు మా చేతులోనేవుండేదీ లేక యిప్పటికీ వున్నాది' అని విర్రవీగు చుండే అగ్రవర్ణాలవాళ్లని చూస్తూవుంటే వాళ్ల వ్యవహారాలు కేవలం గర్భనిర్భేదకం గావుంటాయి!! "అధమవర్ణాల" వాళ్లను వొక్క విషయంలో కాకుంటే మరోదాన్లో నైనా వోదారికి తేవొచ్చునుకాని అల్లా పెద్దవాళ్లమాటకే భయం!! 'చాపచిగిరితే చదరంతా' అన్నట్టు వాళ్లపూర్వులు సంపాదించివుండిన జ్ఞానంలో వొకలవం యేలాగో మిగిలివుంది—యిప్పటికీన్నీ. ఆ రవంతపాటితోనే యిప్పుడూ, రాజ్యాలు పాలిస్తాంవని పట్టుకు పాకులాడుతున్నారు; కాని యెవరువింటారు వీళ్ల పాఠాలూ!! "కూటికొచ్చిందా గుడ్డకొచ్చిందా" అని యీానడింపులకిందికి దిగిందికూడాను మీాది మిక్కిలి!!

అమ్మా, "మావూరికి మీావూ రెంతో— మీా వూరికి మా వూరంతా!!" కాదా మరి! ఈ జ్ఞానం చిన్నవయస్సులోనుంచీ కలగాలి గాని నడిమంత్రంగా తెచ్చి పెట్టు కుందాంవంటే యిం(వు)డుతుందా? వెర్రి మాట! పాచిపోయిన అన్నం బాగుపడదు. కాబట్టి మనకు లేకున్నా మన పిల్లలకైనా యీా దివ్యజ్ఞానం పట్టుబడనీ అని ఆర్యా వర్తంలో అక్కడక్కడ కొన్ని పాఠశాలలు నెలకొల్పిందా వసంతాదేవి. ఐతే "అదంతా బాగానేవున్నాదీ—కానీ...కానీ...ఆడపిల్ల లూ మొగపిల్లలూ కలిసేవుండడం మాత్రం— కొంచం...కొంచెం...వూం(వూం)..." అని చీదడం మొదలెట్టారు కొందరు!! వున్నదే కదూ మనలో—ఆడదీ మగాడూ—అన్నా చెల్లెళ్లైనా సరే—కలిసి మాటాడితే చాలు. తయారైపోయిందే వెంటనే—మంగళ సూత్రం! ఈ దిక్కుమాలిన అనుమానం మొండిచేతివాడికి శనగలుతినడం తప్పిన ట్లైంది కొన్నిజాగాల్లో!! సరే అదుండనీ— ఆ సంస్థలుకూడా అడుగంటిపోతాయేమో అన్నట్లుంది. ఆ ముసలమ్మ వసంతాదేవి కుని కేశిందికూడానూ.

ఆతరవాత చెన్నపట్టంలో సేవాసదనం వంటూా బైల్దేరింది మరోసంస్థ. యిక్కడ

మాత్రం కేవలం ఆడపిల్లలకే!—మగపిల్లల కిక్కడ మరి చోటులేదు. శ్రీయుత ముత్తా వెంకటసుబ్బారావుగారనీ—హైకోర్టుజడ్జీ!! ఆయన భార్యా శ్రీమతి ఆండాలమ్మగారు— అదిగో ఆవిడా యీ సంస్థకు 'మూలవిరాట్టు!' యే డెనమండుగురు పిల్లలతో ఆరంభించా రీ సంస్థ—ఆవిడా మరికొంతమందీకూడానూ. ఇప్పుడో—రెండువందలకు పైనున్నారు పిల్లలు!! అక్కడేవుండి చదూకునేవాళ్లు 150 మందికిపైనుంటారు!

"ఏవో నాలుగు క్లాసులూ—వోపది పుస్తకాలూ—అవినాలుగూ చదివీడం— ఆతరవాత యీవలకు రావడం—అంతతో చెల్లు—" యీలాటి చదు వక్కడ లేనేలేదు. నిర్వీర్యపుచదు వది వచ్చినా రాకున్నా వొకటే!! చచ్చుచదువు రాకుండడంవే మేలూ వోపక్షానికి. అంతేకాక 'యేదో పదిమందివీ చేరుకున్నాం వోచోట. డబ్బు చ్చుకునో ధర్మానికో ముప్పొద్దులా యింత ముద్ద తింటూ కాలయాపనం చేద్దాం'వనే పద్ధతీ కాదిది. గొప్పయింటి బిడ్డలకేగాని సామాన్యుల బిడ్డలకు, దిక్కూ మొక్కూ లేనివాళ్లకు, తల చెడ్డవాళ్లకు, తల చెడ కున్నా చెడినవాళ్లలోనే లెక్కపడ్డవాళ్లకూ వాల్మీకాశ్రమం లాటిది: అతిశయోక్తి కాదు! డబ్బు బాగా యిచ్చుకోగలవాళ్లూ వున్నారు. యేవీ యిచ్చుకోలేనివాళ్లూ వున్నారు; సంసారిపక్షంగా యేదో కొంత— కేవలం లేదనకుండా—చంద్రునికో నూలుపో గన్నట్లు యిచ్చుకునేవాళ్లూ వున్నారు. డబ్బువిషయంలో అంత మొడమీాదకత్తి వ్యాపారం మాత్రం లేదు. పాపం వా భార్యాభర్తలు వేలకువేలూ స్వంతద్రవ్యం యిచ్చుకోవడంవే కాకుండా దేశాలవెంటతిరిగి చందా లెత్తి నానాకష్టాలూ పడి తెస్తారు! అదీగాక యిదంతా వట్టిపేరు గొప్పకేనా లేక దీనిలో వుపకారచింత యేవైనావుందా అని లోకులు కనిపెట్టరూ మరీ! వూరికే యిచ్చేస్తారా వందలూ వేలున్నూ—హైకోర్టుజడ్జీ కాదు ఆ పైవారైనా!! డబ్బుమాటకేం వదల్లా వుంచండి.

అసలుమాట చదువేలాటిదో చూడొద్దూ! పందుం రూపాయిలూ ఖర్చుపెట్టి పశుచుతనంవంతా కడముట్టించి పాఠశాల విడచి బయటబడ్డ తరువాతా 'ముండభత్తెం' లాగ ముప్పైయైదురూపాయిల గుమాస్తాగిరీ చేయాలి లేకుంటే ముష్టెత్తుకోవాలి గాని మరోపని చేతకాదూ అంటే ఆ ఖర్చెం దుకూ—ఆ కష్టం వెందుకూ—ఆ కాలయాప నెందుకూ? కఠినంగా అడుగుతున్నానని కోపపడకుమా! నేనూ నీ కొక సోదరుడనే! నీ కన్నతల్లికడుపున పుట్టకపోతే నీ దేశ మాత కడుపునన్నైనా పుట్టినవాణ్ణే కదా!! నాకుమాత్రం కడుపుమంట వుండదనుకుం టూవా తల్లీ! దిక్కుమాలిన సేవకవృత్తికేనా చదువంటే—మరి స్వతంత్రజీవనం వొద్దూ!!

ముద్దినుసు ముక్కారుపనులూ నేర్పుతారు సేవాసదనంలో! ఐదారేళ్లందులో గాని తరిఫీదైవొస్తే ఆడపిల్ల తన యిల్లు కద లక్కర్లేదు—రోజూ వోరూపాయి డబ్బులు తెచ్చుకోవచ్చు—సునాయాసంగా: యే చెమ్కీ పని చేశో—యే లేసుపని చేశో—యే కుట్టు

పని చేశో!! దేహీయని వొకణ్ణి చెయ్యి చాచనక్కర్లేదు. రెండో కంటివాడికి తెలియ నక్కర్లేదు తినవునికి సంగతి-విన్నావా!

ఆ భాగం వాళ్లాగుంచి మళ్లా మొదటికి రా? అన్నిజాతులపిల్లలూ కలిసేవున్నారని చెప్పడం మరచిపోయినానేమో! సరే యిప్పుడై నా సేచుంలే: అంతా కలిసేవుంటారు: తింటారు: ఆడుకుంటారు: పాడుకుంటారు: 'అక్కా' అంటే 'చెల్లెలా' అని యెంతో అన్యోన్యంగా వుంటారు. వాళ్లువాళ్లు నేర్చుకునే విద్యావిశేషంచేత వాళ్లవాళ్ల యాత్మోన్నతి, అంతా కలిసి అరమరా అభ్యంతరాల్లేకుండా వుండడంవల్ల సంస్థకు చిరాయువు: యీలాంటి సంస్థవల్ల దేశాని కభ్యుదయంవున్నా!-యేంవలా చూస్తావు?- వర్ణసంకరం వనా-సారే!! ఆ పిల్లలంతా యెవరిళ్లకు వాళ్లొచ్చినతరువాత మళ్లీ యెవరి జాతిలో వాళ్లే వుంటారు!! అది మారి పోదు! కానీ, కంసాలి వీరమ్మని చూస్తే కరణాల కాంతమ్మ 'అక్కా' అని కాగలించు కుంటుంది కాని "నన్ను ముట్టుకోకు నా మాలకాకీ" యని దూరంగా నిలబడిపోదు! యెందుచేతా? అల్లా బాల్యస్నేహంచేత! మనసారా వీరమ్మను కాగలించుకున్నంత మాత్రాన్నే కరణాల కాంతమ్మ, కంసాలి వీరమ్మ నై పోతానేమో అని భయపడదు. ఆలాటిగాలి పీల్చలేదామె సేవాసదనంలో.

ఇదుగో యీలాటి వ్యవస్థయే మన సంఘాల్లో యేర్పడాలంటారు నిజమైన పెద్దలు. "మా కారోగ్యం, మా కైశ్వర్యం, మాకు ధనం, మీకు ఋణం" అన్నది ఆత్మోన్నతి కాదు! "సరు లేయవి యొనరించిన నరివర, యప్రియము తన మనంబునకగు తానొరుల కవి చేయకునికియె పరాయణము పరమ ధర్మ పథమంబులకున్" అని తెలుసుకొని ఒకరినొకరు తూలనాడుకోక 'అన్ని సంఘాలూ వొక్కటే' అని చూడడంవే ఆత్మోన్నతి; కాని నేను మహా గొప్పవాణ్ణనుకోడం ఆత్మోన్నతి కాదు: అహంకారం ననిపించుకుంటుంది! అదే- ముమ్మాటికీ అదే- మన కొంప తీస్తూవుంది.

ఈమాటే యెన్నివిధాల చెప్పినా పట్ట లేదు. పట్టలేదుకదా అని నిరాశచెంది పోవడం ధర్మం కాదు గదా! అందుచేత మళ్లీ చెప్పవచ్చును: నిజంగా సంఘసంస్కరణమే చేయాలంటే హరిః ఓమ్మని పిల్లలను ముందుగా సంస్కరించవాలి. దీనికిగాను ప్రతీజిల్లాలోనూ అధమంగా వొకటైనా యీలాటిసంస్థ వుండితీరాలి! యే జిల్లాలో వున్నయిల్లా జిల్లా మొత్తానికి కష్టపడితే యిది సిద్ధించకపోతుందా!! వెర్రిమాట! గంగ తాగి కటకురాళ్లమీద పడుకొన్న కాంతామతల్లుల కిది యొక కష్టంవా? తిలువులు మింగేవాళ్ల కప్పడా లడ్డా!! సమయంవస్తే సంసారాలైనా ధారపోసే స్త్రాంవన్న వుదారమతులు లేరా! యేంవుంటే నేమీ!! ఉత్సాహంలేదు!!

ఆ వుత్సాహం కలుగుతుందేమో అనే యీ విషయం, వ్రాయబడ్డది; కాని సేవాసదనపుగొప్ప చెప్పడానికికాదన్న యథార్థం మాత్రం తెలిస్తే చాలు మా సోదరీమణుల కందరికీ! కంకణంగట్టుకొని కర్మ



చెన్నపురి సేవాసదనముననున్న ఉపాధ్యాయినులును విద్యార్థినీబృందమును



సేవాసదనమున లక్కపూత (Lacquer work)
పనినేర్చుకొనుచున్న విద్యార్థినులు



సేవాసదనమున చిత్రకార విద్యయు (Painting) దీపములకు
షేడ్లు చేయుటయు (Lamp shade making)
నేర్చుకొనుచున్న విద్యార్థినులు

యోగంలోకి దిగితే జ్ఞానం దానంతటదే వొస్తుంది. దేశానికి మనకూకూడా ముక్తి ఆ వెంటనే వుంది. వితంతువివాహాలూ వర్ణాంతరవివాహాలూ యెవరి క్కావలిస్తే వాళ్లు చేసుకుంటారు లేకుంటేలేదు. దానికితరులప్రమేయం లేకున్నా బాధలేదు. 'కానున్నవి కాకపోవు'. కాని యీలాంటి మహత్తర సంస్కారవాచ్యములైన సంస్థలు మాత్రం పదీమందీ కూడితేనేగాని సాగవు. కాబట్టి దేశసేవకులునూ సేవకురాండ్రున్నూ యీ విషయంవేపు తమ దృష్టి మరల్చుట లెస్స. స్వభావస్థాపనము, స్వదేశాచార నాగరకతలూ యిలాంటి వింకెన్నో గుణాలు పట్టుపడాలంటే సేవాసదనపు ఫక్కీనే బాలికాపాఠశాలలన్నీకూడా మార్చుకోవాలి. ఉపాధ్యాయినులే వుండాలి. వాళ్లు ప్రజ్ఞావిశిష్టలై వుండాలి. లోకవ్యవహారజ్ఞానం బాగావుండాలి వాళ్లకు.

ఈ సంస్థలోచేరి చదూకుని బాగుపడ్డవాళ్లెంతోమంది లోకయాత్ర చేస్తున్నారు మరియీదగా. వాళ్లనుచూస్తే ముచ్చటేస్తుంది—ఆతీరూ, ఆమాటతెన్నూ ఆ మర్యాదాభిమానాలూ—పదిమందిలో మెసలడం మాటంటా అమ్మా! అమ్మకానివాళ్లి నమ్మా ఆనాలి. నాయనకానివాళ్లని నాయనా అనాలి! అంతేకాని "దొండకు తోడు గిట్టదు—పొట్లకు పొరుగుగిట్ట" దన్నట్టు బ్రతుకుతాంవంటే అన్యోన్య స్నేహభావాలు మన కొస్తాయీ! అదిలేకుండా 'గాంధీకిజే' యన్నా వొకటే—'కందిపప్పుకీ జే' యన్నా వొకటే!! ఆ కార్యదీక్ష మనం సంపాదించాలంటే "మాతృవత్పరదారేషు, పరద్రవ్యేషు లోష్ఠవత్, ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపండితః" అన్నమాట ప్రతీరక్తబీజానికి యెక్కించాలి! అదొక తపస్సూ—మాటలా!!! అదీ బాల్యాదారభ్య చేయాలి. దాని కాశ్రమాలీ సంస్థలు. ఇక్కడ భేదబుద్ధి పనికిరాదు. లక్షాధికారి కూతురైనా భిక్షాధికారి కూతురైనా నొకటే. ఎక్కువ తక్కువ లెంతమాత్రం చెల్లవు!! యెంతచక్కా తెల్లారకముందే లేవడం, శౌచం, స్నానం, ధ్యానం, భోజనం, చదువులూ, ఆటలూ, పాటలూ,—అంతేకాని అక్కరకుమాలిన ప్రసంగాలు చెయ్యకూడదు! యిదే తపస్సన్నాను—అంతేకాని ముక్కుమూసుకుని మూలకూచోమని కాదు నా అభిప్రాయం! క్రియలవల్ల చిత్తసంస్కారం కలగాలిగానీ "కొంగజపా"ల్లో మరింత చెడిపోతుంది చిత్తం.

కాబట్టి సేవాసదనమంటే ఆశ్రమం—యీలాంటి ఆశ్రమాలేకావాలి ప్రతీజిల్లాకూ—అంతేకాని యెక్కడో చెన్నాపట్నంలో వొకటీ గుంటూరులో వొకటీ—మరెక్కడో మరోటీ కాదని నా మొర.

విన్నారా?

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం.ఏ; బి.ఎల్.

## ౨

రూపులందును, గుణములందునువలె వ్యక్తుల రుచులందు వ్యత్యాసములుండును. విద్యాశాఖలు వేర్వేరు రుచులకు సంబంధించినవి. ఎల్ల రుచులను, ఎల్ల శక్తులను ఒక్కని నాశ్రయించుట అరుదు. విద్యాశాఖలనన్నిటిని పిడికిట బట్టగలిగిన వ్యక్తులు లేనేలేరని చెప్పవచ్చును. గత భవప్రయత్న ఫలమువలననేమి, వంశసంప్రదాయము మూలముననేమి, స్థల వాతావరణమువలననేమి, చెలికారము మూలముననేమి పిన్నతనమందే ఒకని హృదయము ఒకతీరు విద్యాశాఖపట్ల ప్రత్యేకాభిమానమును జూపును. టాగూరుల కుటుంబము లలితకళలకు నిక్షేపము. చిత్రలేఖనకవిత్వములను టాగూరు వంశీయులు ఉగ్గుపాలతో గ్రోలుదురు. నృత్యమును సంగీతమును టాగూరులను తమ పొత్తిళ్లయందు పెంచి పెంపొందించినవి. అవనీంద్రునకు చిత్రలేఖనమును నేర్పినవి అవనీంద్రుని ఇంటిగోడలు. రవీంద్రునకు కవిత్వమును నేర్పినది శాంతినికేతన వనమందలి దేవేంద్రనాథుని (ఇది నేటికిని గలదు) వేదిక. మన రాష్ట్రమందు శొంఠివారికిని గణితశాస్త్రమునకును అవినాభావసంబంధమున్నది. తంజావూరు, చిదంబరములందు సంగీతమువారు పల్వురున్నారు. ఒకలోయనుండి వేఱొక లోయలోనికి దిగు కల్లోలినియట్లు ఒక వంశమునుండి వేఱొక వంశమునకు ఒకతీరు పరిజ్ఞానము పారుదలనందుచుండును. ప్రత్యేకరుచులు ప్రత్యేకవృత్తులను, ప్రత్యేకవృత్తులు ప్రత్యేకరుచులను పెంపారజేయును.

వృత్తి అభిరుచి ననుసరించినదైనను, అభిరుచి దృష్టి, విశాలమైనది. కేవలము వృత్తితోడనే తృప్తిపడి అది ఊరుకొనదు. ఈదృష్టి జ్ఞానసముపార్జనమునకై మేరువును,—మేరువునే కాదు నక్షత్రమండలమునుకూడ నతిక్రమింపగలదు! గభీరసింధువునందు గ్రుంకులిడగలదు!! ఫలితమును కాంక్షించి ఇది పనికి గడంగదు. పనియందలి తియ్యందనమే దీనిని తనదెస కాకర్షించును. ఇట్టి తీపిని, ఇట్టి రుచిని, ఇట్టిదృష్టిని గలవారు మానవులందు దలమానికము లగుదురు.

ప్రత్యేకవ్యక్తి తన ప్రత్యేకరుచిని గుర్తించుట సగమువిద్యను చేబట్టుట. బీగము చేజిక్కిన మీదట మంజూషమందలి మాణిక్యములు చేతం బడుట కెంత యాలస్యముపట్టును?

ప్రత్యేకరుచులును, ప్రత్యేకవృత్తులును, ప్రత్యేకవ్యక్తులందు ప్రత్యేకజాతుల ననుసరించి విశేషమై, విస్పష్టమైయుండును. స్త్రీపురుషజాతులం దివి అనల్పములైయుండును.

సాధారణముగా శాస్త్రములదెస గాక కళలదెస స్త్రీదృష్టి పాఱును. స్త్రీ కళామయి. పుష్పదళమునకును, చంద్రకళకును, రవిమరీచికకును, స్త్రీరూపునకును భేదములేదు. స్త్రీమానసమునకును, కుసుమమానసమునకును వ్యత్యాసములేదు. స్త్రీహృదయమునకును, శారదచేతి వీణియకును భేదములేదు. మనీషులు ముల్లోకములని పేర్కొనినది స్త్రీరూపును, స్త్రీచిత్తమును, స్త్రీఆత్మను అని నా తలంపు. సృష్టియందలి అద్భుతములన్నియు కళయందున్నవి గాన స్త్రీప్రకృతియందును నున్నవి.

మనసు నాకర్షించి, హృదయమును పొంగించి, నిహితశక్తులను రేకెత్తించి, అంతరంగసృష్టికి అపూర్వచలనమిచ్చి, అసాధ్యక్రియలను అరచేతి యుసిరికలు జేసి, ఉత్తుంగకాలశైలమున మానవునకు కైలాసపట్టమును కట్టునది కళ. మహితగుణములన్నియు కళయందున్నవి! మనుష్యత్వమంతయు కళయందున్నది! మానవజన్మ మహత్త్వమంతయు కళయందున్నది! కారణము: మానవకాయమను ఐహికఆవరణమందు, అంతరంగమను కొలువున హృదయసింహాసనమున నాసీనయై సృష్టికి తానై తాను సృష్టికై కళ

విరాజిల్లుచున్నది! నక్షత్రపుష్పముల కెనయైన భాస్వంతాళయములతో నీమె పీఠము వెలుగొందుచుండును! స్త్రీహృదయమును సుఖావాసము జేసికొనుటకు కళ మిక్కిలి మక్కువపడును. కళాకాంతకు స్త్రీ యంతరంగమునందున వనము!—స్త్రీ హృదయము దివ్య బృందావనము! కొండసానువులందు అల్లనబాఱు శైవలినీ పూరమట్లు, మురళినుండి కలస్వన మొనరించుచు ప్రవహించు తోడిరాగమట్టులు, కల్వమోములం జల్లగ సోను పొంపుచందురుని చిరునవ్వులట్లు ప్రియురాలి కెంపుమోవినుండి అల్లన స్రవించు తియ్యని గుసగుసలట్లు కళాభావము హాయితుంపురులు చిమ్ముచు నీ బృందావనమున పాఱుచునుండును!

లోనిశక్తికి బాహ్యవ్యక్తీకరణ మొసగునది విద్యయంటిని గదా. 'విద్యాగంధ' మందురు—అదేమి? అంతరంగకుంజమున రంజిలు ప్రఫుల్ల భావకుసుమములనుండి వీచు సౌరభమే! తన మనసునందలి మాధుర్యమును మానినిమొత్తు వసుమతిపై గుమ్మరింపవలెననిన, తాను తొలుత కళాశోభయందు గ్రుంకులిడవలెను. హృదయగర్భాలయమందలి దివ్యభావరాసులను గుర్తింపవలెననిన కళాసుందరీమందిరమున నిత్యవ్రతము సల్పవలెను. అంతరంగమందలి దివ్యమూర్తిని గుర్తించుటకే కదా సగుణోపాసకుఁడు బాహ్యమూర్తి నారాధించును. అంతరంగస్థఅమృతసూతిని పొడగాంచనెంచియే కదా తారకలు జాబిలిచుట్టును చేరి నిస్తబ్దగీతికాకళలచే నాతని నారాధించును! ఆత్మశక్తికి అవనిపై మందిరములు కట్టుటకై కాంతలు కళారాధనమునకు గడంగవలెను. వారందులకు గడంగి,అవ్వల పువ్వులు చల్లిన శుభముహూర్తమున వారి మానసదివ్యాలయమున మిరుమిట్లు పుట్టించు తలపు తళుకులు, జలజలరాలు నక్షత్రములట్లు వాతూలమున గంతులిడు సంగీతసంగతులట్లు ఉదయకిరణములందు నవ్వులు చిమ్ము మంచుతుంపురులట్లు కవికలమున నుప్పతిలు రసబిందుసందోహమట్లు అయ్యవి జగతిపై గురియును! మిసిమిమెత్తని మనసుగలదై భావఖచితహృదయముతో నొప్పు కాంత తన తపసుచే అంతరంగస్థ కళాసామ్రాజ్యమునకు బాహ్యావనియందు చక్కని రహదారులు దీయఁగలదు.

కళలకన్నిటికిని నొక్కటే యంతరంగము. గానమనుడు, నృత్యమనుడు, చిత్రలేఖనమనుడు, కవిత్వమనుడు, శిల్పమనుడు అరువదినాలుగు కళలనుఁడు,—వీని హృదయవీథినుండి ఒకతీరు భావధుని ప్రవహించుచున్నది. విశేషముగ దృష్టి జూఱగొనగలిగినవి లలితకళలు. మన విద్యావిధానమున చరిత్రపఠనమునకును, శాస్త్రపఠనమునకును విశేషస్థానమున్నదిగాని లలితకళలకు లేదు. లలితకళల లలితకవాటికలందే విద్యార్థినుల పుష్పవేదిక లమరియుండును! మన పాఠకట్టడములందు రాళ్లవంటి శాస్త్రాంశములే యున్నవి. ఇందు కళలసంఖ్య సకృత్తు. స్త్రీసంఖ్యయునట్టిదే. మన రాష్ట్రమున స్త్రీవిద్య అభివృద్ధిగానున్నదని ప్రభుత్వనివేదికలు తెలుపుచున్నవి. ఈ నివేదికలు పేర్కొనిన విద్య ఉన్నతవిద్య. ఈ యున్నతవిద్య స్త్రీని స్త్రీయనియు, పురుషుని పురుషుఁడనియు,—మనుష్యుని మనుష్యుఁడనియు గుర్తింపజేయగలుగునది కాదు స్త్రీ రుచికిని, స్త్రీప్రకృతికిని, స్త్రీ జీవనమునకును, స్త్రీ ధర్మమునకును సంబంధించిన విద్య ఈ యున్నత విద్యలో సున్న. కావున నిందు స్త్రీవిద్య ఉన్నదనియు, మన రాష్ట్రమున స్త్రీవిద్య ఉన్నతపీఠమున నాసీనయైయున్నదనియు దలచుట వట్టిభ్రమ.

## గృహలక్ష్మి

శ్రీమతి బి. సీతాలక్ష్మిగారు

మధువుచిందించు మందారమాలకన్న
రమ్యమైబరగు గులాబిరాణికన్న
మధురతరవాసనల్నింపు మల్లెకన్న
పడతులకునెల్లెడ ప్రేమపాత్రమగుచు
ధరణిమపానయు పుష్పవితానమెల్ల
మరచునట్టుల విజ్ఞానమధువుశోడ

మేలుసాహిత్యసుమముల మీకు గూర్చు
లలిత"గృహలక్ష్మి" వెయ్యేండ్లు కళల దనరి
నవ్యరీతుల నొప్పుచు నాంధ్రభూమి
సకలగృహలక్ష్మి యాచును సాటిలేక
తేజరిల్లుత యనుచును దినదినంబు
ప్రార్థనంబును సలుపుడో పడతులార!

# లూలియా

గో. నెల. నరసింగరావుగారు, బి. ఏ.

ప్రకృతిసుందరి మునిమాపువలువ చెఱఁగు
మొగమునందూని నిట్టూర్పు లెగయఁ గన్ను
గొలఁకులన్ వేడికన్నీరు దొలఁకుచుండ
నురువియోగాగ్ని వేగెడు తరుణిమద్ది.

పూవులసెజ్జఁ దావులు గుబుల్కొన స్వామివియోగవేదనా
భానపరీమళస్ఫురణ పైపయిఁజిమ్మ సుధాప్రరోచులన్
గ్రేవ వసించియున్నఁ దనప్రేయసుఁడౌ నల షాజహానుపై
నావిలదృక్పరంపరల నప్పటికప్పటి కామె నించెసిన్.

ఆమె యురస్సునన్ మణిమయాంచిత దివ్యకిరీటభాసమా
నామలమాళిభాగ మకటా గదియించి కవోష్ణబాష్పధా
రామిళితైక రాగరసరంజిత మంజిమఁగూర్చి "లూలియా,
ప్రేమమయీ, ప్రియా, పలుకవే, కనవే;" యని యేడ్చె బాదుషా.

విన్నదనంబుతో గనులువిచ్చి మృదూజ్జ్వలబాహువల్లరిన్
గ్రన్ననఁబాదుషా యఱుత గాఢతమిన్ బిగియించిపట్టి యా
కన్నుల నవ్వువెన్నెల జగాజిగిఁ దా మెఱయించి "లూలియా
నిన్నెడబాసెదుం; సెలవె నేఁ?"డని పల్కె నిరుద్ధకంఠయై.

తటుకున వానిగుండియ, రుథాయథలయ్యెను; నామెపైఁదమ
చ్చట వడిమూఁగె; నొండొరుల సందిట విస్మృతులైరివారు; లె
చ్చట నిటులే యగుంగద భృశమ్మగుప్రేమమె యుండెనేని; యు
ద్భటగతి మృత్యు వుగ్రముగఁ బైకొనుగా కది సంచలించునే?

లోకములోన నద్భుతవిలోకనసప్తకమందు బేర్మివిం
దాకవహించి ప్రేమ రసతత్త్వపవిత్రతకున్నిదానమా
నాకడ, షాజహానునృపుఁ డా ముముతాజిసమాధి డాసి యే
కాకిగ నామెకై వగచెఁ గంటికిమంటికి నేకధారగన్.

ఆగ్రాపురి కిదియే మొద। లగ్రత్వము గల్గుటకు, యథార్థముగా; వా
రగ్రణులు దంపతులకు: స। మగ్రప్రేమంబె స్థాయియగుగద యెపుడున్.

'గృహాలక్ష్మి' పరిరంభణోత్సుకత లేదే నట్టి జన్మంబు దు
స్సహ మెవ్వారికి; నాకు నేటికిఁక నీసామ్రాజ్యలక్ష్మీకర
గ్రహణోద్యద్విభవాతిరేక మది, భారంబాచు బాష్పా ముహు
ర్ముహూరుత్కంఠతఁ గోహినూర్ గఱుఁగ నాక్రోశించె నున్మాదియై.

మీర:—ఆమె భక్తురాలు. కల్లకపటములను తెలిసికోలేని కలికిహృదయమునుండి ఆమె భక్తిరేకులను విరిసికొన్నది. ప్రసవమూర్తి తన నిండారు జీవితమును విచ్చికొన నెంత పరివేదన ననుభవించునో అంత పరివేదన ననుభవించి ఆమె భక్తి విప్పారినది. ఆమె భక్తిలో వజ్రవైడూర్యగోమేధికాంకితమయిన కిరీటము నిర్లక్ష్యమున ధూళీపాళిలో దొరలిపోయినది. మృత్యుభీషణమయిన కాలకాకోలము పాలువలె విరిగిపోయినది. ఆమె బొమ్మ పాత్రికలలో తారాడుచుండ ఆమె హృదయసీమను వైష్ణవసూక్తములు పాదుకొన్నవి. వైష్ణవు లగు తల్లిదండ్రులు ఆ భావకందళమునకు ప్రోది సేసినారు.

కుసుమసుకుమారజీవితము నల్లుకొనిన అంతము పొంతము లేని లోకాపవాదములను ఆమె గణించినది కాదు. అవి భౌతికశరీరమున కని ఆమె చిఱునవ్వినది.

ఆమె కన్నీరు భక్తిపరము. విశ్వాసము భక్తిపరము. ఊహ, మాట భక్తిపరము. సకలము భక్తిపరము. భక్తి మూర్తిభవించినది: మీరాబాయి అయినది.

మీరా గాయని గానకళాపరిజ్ఞాత. ఆమె గొంతెత్తిన ఎన్నియో సుస్మితప్రసూనములు తమ దివ్యామూల్య జీవితములను పదాంకితము చేసికొనును. ఆమె పాటలో చదలేటి కెరటాల నురుగువెన్నెలల మిసిమి కాంతుల గలగలలు నిత్యము మొరసికొనును. ఆమెకు వలుదెసలనుండి తిరస్కార ఘంటికానిస్వనము వినిపించినది. ఆ నిరాకృతి విశ్వజనని చెవి సోకకుండగనే ఆమె దైవములో చేరిపోయినది.

## ౨

"బాజాలు నాన్నా బాజాలు"

"అవును చిట్టి తల్లీ"

"బాజాలతో అదేమిటి నాన్నా!"

"పల్లకీ తల్లీ !"

"పల్లకీ పల్లకీ"

"..........."

"పల్లకీలో ఎవరు నాన్నా?"

"పెండ్లికొడుకు"

"పెండ్లికొడుకు—హహా! హ! హ!"

"అవును చిట్టి తల్లీ"

"పెండ్లికొడుకు—బాగున్నాడుకదూ"

"చాలా బాగున్నాడు"

"నాన్నా ! నాన్నా"

"ఏమి చిట్టి తల్లీ !"

"నాన్నా..."

"ఏమి తల్లీ."

"నాకూ కావాలి—నాన్నా !"

"ఏమి కావాలి చిట్టి తల్లీ !"

"పెండ్లికొడుకు."

"హ! హ! హ! హ! పెండ్లికొడుకు కావాలా! చిట్టితల్లీ ! అప్పుడే—పెండ్లికొడుకు"

"కావాలి నాకు—నాన్నా..."

"సరే చిట్టి తల్లీ—సరే సరే"

అది వసంతము. నవోషస్సు. అవ్యక్త శకుంత మధురారావములు కల్యాణోత్సవ మంగళ తూర్యారావములలో నిస్వనించినవి, అరుణారుణరాగము పెండ్లికుమారుని కంటికెంపులో తుంపెసలాడినది. ఝరీభాంకారములతో నృత్యగీతములతో హిమవాలుకా కస్తూరికాగురు ధూపధూమములతో వందిమాగధుల కైవారగీతావారముతో వివాహశుభోత్సవము మేరట రాజభవనము ఛాయలనుండి సాగిపోవుచున్నది.

మేరటి సంస్థానాధిపతి రాజారతుకి భాటియా రాణా. అతడు ఆరేండ్ల కుమారికతో సౌధోపరినుండి వసంతనవోదయశ్రీ విభూతిని చూచుచున్నాడు.

నిసర్గరామణీయకమును చూచుచున్న ఆ రాకుమారిని మంగళతూర్యారవములు కైవసము చేసికొన్నవి. పల్లకీయందు పెండ్లికుమారుడు అనంత శ్రీవిభవము నిండార కూరుచున్నాడు. అన్నెము పున్నెము ఎఱుంగని అమాయికబాలిక పెండ్లికుమారుని వాంఛించినది. తండ్రి, కుమార్తె ఈప్సితము తీర్ప నిశ్చయించుకొన్నాడు.

రాణా వైష్ణవేయుడు. ఆతని కులదైవతము శ్రీకృష్ణభగవానుడు.

## ౩

"మీరా! మీరా! ఇదుగో అమ్మా! నీ పెండ్లికొడుకు"

"ఏడి నాన్నా ఏడీ!"

"ఇదుగో..."

"ఆ! ఎంత అందగాడో—ఎం చక్క—"

తండ్రి ఒసగిన బంగారు గోపాలమూర్తిని కోర్కెలు పూర్ణించుకొన్న హృదయముతో పేరాసతో తీసికొన్నది. ముద్దుగొన్నది. హత్తుకొన్నది. 'నా పెండ్లికొడుకు' అమృతానందములో క్రేళ్లురికి అవశ యైనది. 'చిట్టి తల్లీ! ప్రతిదినము నీ పెండ్లికుమారుని అభ్యంగనస్నానము చేయించుము—జిలుగువసనములతో భూషలతో అలంకరింపుము—ఆరాధించుకొనుము' అని తండ్రి ఉపదేశము చేసినాడు.

ఆమె చిన్నారి వదనము అమితగంభీరభావముతో గభీరప్రసన్న మయినది. ఆమె లేత హస్తములలో విగ్రహహృదయము పరితోషముతో నిండుకొన్నది. నందనవనములోని కల్పశాఖి జలజలప్రసవములను గురియించినది.

స్వర్గాంగణపాళీవితానములోని ఘంటిక జయవెట్టినది.

## ౪

కాలమునకు పురోగమనము. మానవుల అభివృద్ధికి పురోగమనము. ఎందులో విపర్యయము సంభవించినను ప్రతివిషయమున ప్రళయము. తుదకు లోకమునకు ప్రళయము.

మీరా వయస్సుతో, ఆమెతో చిన్నవాడు తొలకరించిన భక్తిభావము చిగిర్చి రేకుల విచ్చి పుష్పించినది.

ఆమె భక్తి మూగది కాదు. మాటలను నేర్చినది. పాటలను నేర్చినది.

చెక్కుగీటిన పాల్గారునాడే ఆమె చిన్నిహృదయమునుండి చిన్నిచిన్ని పాటల వన్నెచిన్నెలు సురభీకరించెడివి. ఇప్పుడామె పాటల పాలవెల్లి అయినది.

ఆమె వసంతవయస్వి. చిన్నికృష్ణునియెడ వాత్సల్యము అనురాగము అయినది. అనురాగము ప్రణయమయినది. వసంతకోకిలపోలిక ఆమె గోపాలకృష్ణుని గీతార్చనలతో అర్చించుకొనుచు తన దినచర్యను మధురార్ద్రము చేసికొనుచున్నది. ఆమె కవయిత్రి. ప్రతిదివసమామె నివేదించు గీతికలు ఆమె కపోలకల్పితములు; మథియించిన హృదయమునుండి తొలకరించిన అమృత గీతాకందళములు; ఆమె పాటలు ఉషోదనీకంఠకలకంఠ గానశకలములు. ఆమె కంఠమెంత మాధుర్యమో అంత మాధుర్యమామె రూపరేఖ. ఆమె శరీరము సౌష్టవము, ఆమె సౌందర్యము, ఆమె వైదుష్యము నానావనీశకుమారుల చెవులబడినది. నానా దిగంతములనుండి ఆమెకు సంబంధములు వచ్చుచున్నవి.

ఆమె దినచర్య ఒక క్రీడ. వేకువ విరియగనే ఆమె కన్నులు విచ్చును. కన్నులు తెరచుకొనగనే ఆమె గళమునుండి పాట రెక్కలను విదళించుకొనును. ఆ పాటతో ఉషస్సతికి ఆహ్వానము. ఉదయాచల సానూపలపాళికల శయించియున్న బాలభాస్కరునకు మేలుకొలుపు. యమునావత్సమును ముద్దాడ దివినుండి దిగజారు తరుణకిరణము పోలిక ఆమె, పాడుకొనుచు గోపాలమూర్తి చెంతకుపోయి ఆతని స్నిగ్ధహేమకపోలమును తనివిదీర ముద్దాడును.

మూర్కొనును, మోపిఇచ్చును. కౌగిలించుకొనును. సిగ్గుపడును. ఏవోఏవో మాట్లాడును. కలహించును. అలుకతో, అరమోడ్పుకన్దోయితో ఆలాపము మాని మలయచాలిత కదంబశాఖికవోలె ఆతావుబాయును.

౫

నుదుట దిద్దితీర్చిన కస్తూరీతిలకము. శరీరమునకు చందనచర్చ. సిగకు మయూరపింఛము. నును బొజ్జకు మొలనూలు. కరాంగుళులలో వేణువు. కృష్ణుడు నవవేణువును కెంబెదవుల నూది బహ్మగీతము నాలపింపనున్నాడు.

"వద్దు. ఏమంత తొందర, నీ అలంకరణమునకు సంపూర్తి. నన్ను అలంకరించుకొని రానిమ్ము. నీవేణు రంధ్రములనుండి పాటవెల్లువల విరియించెదవు గాని' అని మందహాసమున మీరా వీడ్కొన్నది. ఆ ఆగారములో దివ్యత్వము పరిమళించుచున్నది. మేలి పతానమునుండి వ్రేలుచున్న వజ్రపంజరమునుండి గోరువంక.

'రాణా! నమస్తే! నమస్తే! నమస్తే' అన్నది. అచ్చటకు కంచుకి ముందు వచ్చినది. ఆమె వెనుక రాణా ధీరగమనముతో ప్రవేశించినాడు.

"అమ్మాయి ఇటలేదు; గోపాలమూర్తిని అలంకరించినది. పూజాద్రవ్యముకోసము పోయిఉండును, నీవు' వజారమున వేచియుండు కంచుకీ." 'చిత్తము ప్రభూ.' కంచుకి అల్లనల్లన వెడలిపోయెను. కొంత కాలము నిశ్శబ్దము. మీరా శృంగారించుకొని పూల సెజ్జతో, కుముదహృదయమున సోత్సవముతో తాండవించు చంద్రకిరణమువోలిక నర్తించుకొనుచు గోపాలమూర్తిని జేరినది. ప్రసవములను జల్లుచు వర్తుల నృత్యముచేయుచు కుసుమవృష్టిని గురియించి

'కృష్ణా! ఇపుడు పాడుము. నేనును పాడెదను. నీ పాట మధురమో, నా పాట మధురమో, శారీ! నీవు చెప్పవే' అని గోరువంకవంక తిరిగి రాణాను చూచి చిన్నపుచ్చుకొన్నది. తల వాల్చుకొనియే అల్లనల్లన పోయి జనకుని పాదముల వ్రాలి లేచినది.

"తల్లీ! సిగ్గిల్లకుము. అవసరకార్యమున వచ్చి నీ పూజను భంగముచేసితిని" అని రాణా పల్కినాడు.

"లేదు బాబా!"

"చిట్టి తల్లీ..."

"ఏమి బాబా!"

రాణా నిట్టూర్చిగాడు. ఏమియు పలుకలేక పోయినాడు. చింతాయుతుడైనాడు.

"ఏమి బాబా ఆలోచించుచున్నావు"

"తల్లీ! నీకు యుక్తవయస్సు వచ్చినది."

మీరా మోము వాంచికొన్నది.

"మీవారురాజన్యుడు రాణాకుంభుడు నిన్ను ఆకాంక్షించుచున్నాడు. అతని రాజ్యము విశాలము. అతడు వీరుడు. ధీరుడు. సరసుడు. శాస్త్రాభ్యాసి"

మీరా ఇంకను మోమువాంచి ఓరగా నిలిచినది. "నీ కది తగినసంబంధము. అతని ప్రవృత్తి నీకెటులుండును. నీ తలపూవు వాడనీయడు. నిన్ను హృదయమున నిలుపుకొనును. ఏమి తల్లీ!"

మీరా తండ్రివంక చూచినప్పుడు కనులు నిర్మల నీలోత్పలములు.

తల వాల్చికొని మరల తండ్రివంక చూచినప్పుడు చంచలనీలోత్పలములు.

తలవాల్చికొని మరల తండ్రివంక చూచినప్పుడు నీరపూరితనీలోత్పలములు.

రాణా హృదయము స్పందించినది. ఆమె కన్నీటి భావమును గ్రహించినాడు దగ్గరకుపోయి శిరమును మూర్కొని

"చిట్టి తల్లీ! గోపాలమూర్తి నీతోనే ఉండును. నీ వాతనిని వీడనప్పుడు నిన్నాతడు విడనాడడు. శ్రీకృష్ణమూర్తి చాయనే వసించును.

మీరా వదనమున వెన్నెలరేఖను చూచి రాణా ప్రఫుల్ల హృదయముతో ఆశీస్సు పలికి వెడలిపోయినాడు.

వజ్రపంజరములోని గోరువంక "రాణా! నమస్తే! నమస్తే! నమస్తే!" అని వీడ్కొన్నది.

## ౬

సువర్ణ భూషణభూషితము లయిన మదకరీంద్రములు. వానివెనుక సజ్జితాశ్వములు. తరువాత పదాతులు. అటుతరువాత కరపతాకలుదాల్చిన వందిమాగధగణము. వానివెనుక శారదానవమేఘశకలముల బోలు పల్యంకికలు. వానివెనుక స్యందనశ్రేణి. మరల పదాతులు, బారులు దీరి మీవారు రాజవీధికవెంబడి పోవసాగెను. గజఘీంకారములు, హయహేషానినాదములు; భటజయజయధ్వానములు; మంగళతూర్యారవములు రోదసిని పిక్కటిల్లినవి.

నాడు మీవారులోని ప్రతిజీవికి ఆనందభావమున తలమునకలయినది.

నాడు మీవారు దేవేరి మీరావరుని గృహప్రవేశము సేయ పుట్టింటినుండి తరలివచ్చినది. ఆ మంగళోత్సవము వచ్చివచ్చి రాజప్రాసాదము కడ నిలిచినది. మంగళవాద్యములు మిన్నందెను. నవరత్నఖచితమయిన ఒక పల్యంకి ఉత్సవమునుండి విడివడి రాజభవనములోనికి బోయెను. దానిని ఆరు పల్లకులు అనుసరించెను. వాని ఇరుపార్శ్వముల పరిచారకులు.

ఆ పల్లకి రాజసౌధము దాటి శుద్ధాంతఃపురద్వారముచెంత ఆగినది. బోయీలు పల్లకికలను స్త్రీ పరిచారికావశము చేసి వెడలిపోయిరి.

సువాసినులు అవకుంఠనవతులు కొందరు లోనుండి వచ్చి నిలిచిరి. ఒక సుందరి బంగారు హారతి పళ్లెరముతో ముందుకు వచ్చినది. అఖండకర్పూరము జాజ్వల్యమానముగా వెలిగిపోవుచుండెను. ఆమె హారతెత్తి కాకలీకలస్వనముతో పల్లవి పాడి చరణము పాడినది. ఆ చరణముతో సరసనున్న పురంధ్రీమణులు తమ గొంతుల నెత్తిరి.

పాట ఆగినది. ఆమె మరల నీరాజన మిచ్చినది. ఇరువురుతరళాక్షులు ముందుకువచ్చి పల్లకిలో కూరుచున్న మీవారుదేవేరికి తమ మృదుమృణాళకరముల నందిచ్చిరి. మీరా వారి హస్తసహాయమున బయటకు వచ్చినది. అందరి కనులు మిఱుమిట్లుగొన్నవి. ఒక్క నిముసము కాదు తరళసౌదామని నిలుకడ గాంచినది.

అందరి హృదయములు ఆనందాతిరేకమున ఉప్పొంగినవి.

రతీసతీమణి మర్త్యనారీరూపమున సాక్షాత్కరించినదని వారిహృదయమున నొకభావము మెఱసినది.

ఒక మాంగల్యవతి తిలకముతీర్చి హారతిచ్చినది. మీరా సరసనున్న అత్తగారి పాదధూళిగొని పురంధ్రీయుతయై శుద్ధాంతములోనికి బోవుచున్నది. రాణాకుంభునితల్లి మీరాసరసను నడచుచు కోడలి ముగ్ధమనోహర రూపమును చూచి తలయూచి లోలోన నవ్వుకొని తనివితీరక పదేపదే చూడ సాగినది.

పదేపదే చూచుచున్న ఆమె హాసవదనము కుంచితమైనది, భ్రుకుటికుటిల మయినది. తక్షణమే 'నిలుము' అని మేఘస్వనము. అందరు నిలిచిపోయిరి. పరిచారకులు నిలువున నీరయిరి. పురంధ్రులు ఒకరిమొగము ఒకరు చూచుకొనిరి.

"మీరా! నీ హస్తమునం దది యేమి" అన్నది రాణామాత!! ఆమె ప్రశ్నలో నవాభ్రము గర్జిల్లినది. "నా గోపాలమూర్తి" ఆమె సమాధానములో సెలయేరు తీయని ఎలుంగుతో గలగల మన్నది.

"ఏమీ! నీవు వైష్ణవివా! నా శుద్ధాంతములోనికి వైష్ణవత్వము లావణ్యరూపమున ప్రవేశించుచున్నదా!! వలనుపడదు" అన్నది రాజమాత.

నారీలోకము నీరవితమాయెను. మీరాపరిచారికలు స్థాణువు లయిరి. మీరాహృదయము కలగుండు పడెను.

"పుట్టినిల్లు అరణ మిచ్చినది కాబోలు. ఈమెను లోనికి తీసికొని రావలదు" అని పరిచారికల కాజ్ఞ, చరచర లోనికి పయనము. ఒక్క ముహూర్తములో జరిగినవి.

ఆమె శాంతేయి.

## ౭

ఆకారవిభేదము పొత్తునకు ప్రాఁగొడ్డము కాదు. కాని అభిప్రాయ విభేదము పొత్తునకు చుక్కవాలు.

నాటినుండి మీరా మీవారుశుద్ధాంతములో కాలు పెట్టలేదు. ఆమె వాసము ప్రత్యేకప్రాసాదము. ఆమె పరిచర్యకు ప్రత్యేకపరిచారకులు. మీవారు శుద్ధాంతమునుండి ఎగసి ఒక్క ఈగ మీరాభవనమున వాలరాదు. అక్కడి పరిచారకులకు ఇక్కడి పరిచారకులను చూచిన కన్నెఱ్ఱ. ఇక్కడి పరిచారకులకు అక్కడి పరిచారకులను చూచిన శరీరకంపనము.

రాణాకుంభుడు మీరా భవనద్వారము త్రొక్కరాదని మాతృశ్రీయాజ్ఞ.

విచక్షణావిహీనుడయి రాణాకుంభుడు ఆయానను తలదాల్చెను.

కల్యాణము జరిగినదన్న మాటయే కాని మీరా, ప్రియుని ముఖదర్శనము కాని కరస్పర్శము కాని చేసి ఎఱుగదు. ఆమె నిరంతరము తన హృదయాధినేతయైన శ్రీగోపాలమూర్తి చరణసన్నిధినే దినములు పుచ్చుచుండెను. రాణాకుంభుని ప్రవర్తనకు జాలువారిన కన్నీటితో శ్రీకృష్ణుని పదకుశేశయముల నార్ద్రము చేయుచుండెను. అత్తగారి నడవడికి ఉరలు కన్నీటిని శ్రీకృష్ణుని అనిమిషనేత్రముల చూచి అంతర్లీనము చేసికొనుచుండెను.

ఆమెకు విషాదసాదమువలన శరీరకంపనము కలిగినప్పుడు బాలగోపాలుని యాలింగనము. ప్రణయోద్వేలమున పెదవులు చలించినప్పుడు ముద్దుకృష్ణుని కెంపెదవుల ముద్దులపూజ. ఆమె భక్తి, పౌరులచెవుల బడి వారిని తన్మయులను చేసినది. కాని ఆమె గాఢభక్తియే యామె జీవితమును కుంచించినది.

అనేకులు అనేకముల తలపసాగిరి. కొందరి తలంపున మీరా అన్నము పున్నె మెరుగని పారిజాతలతాంతము. కొందరి తలంపున మీరా కశ్మలమును పూర్ణించుకొనిన ఉమ్మెత్తపూవు. ఆ అనేకభావములు రాణాకుంభుని కర్ణపథములబడి అతని హృదయమును మలీమసము చేసినవి. మీరా అతనికన్నులకు భాద్రపదతమస్విని జలదరించు కారుమేఘఖండము.

౯

"ముచ్చటగా అల్లుకొన్న జడను లాగెదవా! పూలను అట్లు విరజిమ్మెద వేమి?"

"................."

"అదిగో వద్దు. ఇప్పుడు వద్దు. హ! హ! హ!"

"..............."

'నా పెదవితాకిన నీపెదవి మలినమాను? హ!హ!'

"............"

"ఒక్క పాట పాడవు? నీవు గాయకసార్వభౌముడవట ఏదీ ఒక్క పాట పాడుము"

"........."

"పాడకున్న మానె. ఈవసంతసంధ్యావేళ ఏరితెచ్చిన పకుళములను మాలగా గ్రుచ్చినాను. సరసకు రమ్ము. మెడలో వైచెదను."

"........."

"ఎందుకు మొగము మోరగానంచెదవు. నేనేమి చేసినాను. నాతో మాటాడవు. పలుకవు. పలుకే బంగారమా. నా జీవితవు కదు? పలుకవు. ఒక్క మాట మాటాడు. నీమీద పదమల్లినాను. నీ మనను వచ్చిన రాగముతో ఆలపించెదను"

"........."

"తలుపు, తలుపు!"

"మీరా ఉలికిపడెను."

"తలుపు, తలుపు, తలుపు!"

"మీరా నిర్ఘాంతపోయి నిలిచెను."

"తలుపు, తలుపు, తలుపు!"

"మీరా తలుపుతీసెను."

ఎదుట రాణాకుంభుడు. కరములోని ముక్తఖడ్గము తళతళ మెరయుచుండెను. నేత్రములు కెందామరలు. భృకుటి కుటిలము. అతనిశరీరము నిలువెల్ల చలియించుచుండెను. అతని హృదయము అనుమానముతో ఈర్ష్యతో ఉడుకెత్తి పోవుచున్నది మీరా వాతాహత కర్పూరకదళి.

రాణాకుంభుడు, హృదయముగడ్డవారిన మృత్యుభీషణమూర్తి.

రాణా మీరాగదియెల్ల కలయచూచెను. వసంత ప్రత్యూషసమయాంబరమువలె విజనము. నిశ్చలము,

రాణా మీరావదనము చూచెను. శారద జ్యోత్స్నామానివలె స్వచ్ఛము. గభీరము.

"ఎవ్వరితో ముచ్చటలాడుచున్నావు?"

ఆ ప్రశ్నలో చిచ్చరపిడుగులు ఉరిమినవి.

"నా పెండ్లికొడుకుతో".

ఆ సమాధానములో నదీగర్భములోనినిండుశాంతి నిండుకొన్నది.

ఆ ముగ్ధసమాధానమునకు రాణామానసము శత వృశ్చికదంశకమాయెను.

"పాంశులా! నేనుకాక నీ పెండ్లికొడుకు ఎవ్వడు?"

"నీవా. నాయెడ ఇట్లు ప్రవర్తించిన నీవా?! రాణా, నా పెండ్లికొడుకువు......నా హృదయాధిష్ఠానప్రభువు. నా జీవికాజీవిక నా శ్రీగోపాల మూర్తి. అతని దివ్యమంగళమూర్తిని హృదయమున ప్రతిష్ఠించుకొన్నాను. వలపుకన్నీటిపూలతో అభిసేచనము చేసికొన్నాను. వలపుటూర్పులతో నీరాజన మిచ్చికొన్నాను......కాని...కాని...... ఈ వసామాంసావిలమయిన ఈ శరీరము మీవారు దేవునిది. నా హృదయము, నా ప్రేమ, నా విశ్వాసము, నా జీవము శ్రీ కృష్ణపరమేశ్వరునిది. అతడు లోకనేత. నా హృదయనేత. నేను అతని నిత్య సేవకను. అతడు నా జీవనైక సర్వస్వము."

ఆమె ఉచ్చరించిన ప్రతిమాట విశ్వాసమున బరువు వారినది. అమాయికత్వమున స్వచ్ఛమయినది. ఆ నిర్మాయికప్రేమవచనములు రాణాకుంభుని నీరవుని జేసెను.

భాద్రపదాకాశమువసంతాకాశమయినది. రాణా కుంభుడు పెదవి మెదపలేదు. నిలుచుండిన తలము నుండి కదలలేదు. అతని భీకరరూపము ప్రసన్నమందినది.

శిరనువంచి చంచలచ్చంచలవలె నిలువబడియున్న మీరాను చూచి నిట్టూర్చి వెనుదిరిగి రాణా కుంభుడు వెడలిపోయినాడు.

౬

మీరా యనిన రాణాకుంభునకు గౌరవతాత్పర్యములు కుదురుకొన్నవి. తన నిరశనాపరాధమునకు జీవితాంతము మీరాచరణజీవితుడు కావలయునని భావించెను. కాని మాతృ శ్రీయాజ్ఞ. అది మేరు పర్వతము. తరింప నశక్యము.

రాణాకుంభుడు మీరాకొరకు గోపాలాలయము నిర్మించెను. అది మీరాకు ఆనందగీతి. రాజమాతకు హృదయశల్యము.

మీరా ఉభయసంధ్యారాధనలు వెలితిలేకుండ జరగిపోవుచుండెను. ఉభయసంధ్యల ఆరాధనగీతలతో గర్భాలయము ప్రతిధ్వను లీనిపోవుచుండెను. ఆ గానామృతవృష్టికి ఆ దేవాయతనావరణమున మంకెనప్రసూనములు తామరతంపరలైనవి.

ఆ మధురగానము నాలింప శాస్త్రీయులుకూడ వచ్చి ఆ గానకల్లోలమున కూగాడి తన్మయత్వమున కృష్ణదేవు చరణాంకపీఠి కచ్యుతప్రసూనముల వలె వ్రాలుచుండిరి. ఆమె భక్తికి వివశులయి ఆమె చరణవిన్యాసములో తమ చరణవిన్యాసములు కలుపుచుండిరి.

అది శిశిరవాసరము. కరివేలంతలు మాగన్ను పెట్టుకొన్నవి. మునిమాపునవే చల్లగాలి. మీరా ఎట్టులెట్టులో కొన్ని ప్రసవములనేరి ఏరి వనమాలిక ఒక్కమాలిక కూర్చుచుండెను. ప్రకృతి వివృత యయినదని నాడు మీరా భువనమోహనముగా నలంకరించుకొన్నది. ఆమె పోషితమయూరము పురివిచ్చి దూరమున నర్తించుచు సారెసారెకు అర్రెత్తి ఆకాశమును చూచుచుండెను.

ఇంతలో శుద్ధాంతకాంతలు అచ్చటకు వచ్చినారు. ఆమెను చూచి మునిముసి నవ్వుకొన్నారు.

"ఈమెకు లోకవాసనలు విడువలేదు. ఏమి వైరాగ్యము" అన్నది ఒక్క వనిత.

"ఈమె పుణ్యనదీస్నాతయైనట్లు గోచరింపదు. ఏమి భక్తి" అన్నది ఒక్క లతాంగి.

"ఈమె కందమూలఫలాదికము నారగింపనే యారగింపదు. ఏమి పూజ" అన్నది ఒక విధుముఖి. "ఈమెకు మంత్రశ్లోకములు రావు. కిన్నరివలె చక్కగా పాడును. ఏమి అర్చన" అన్నది ఒక మంజుఘోష. మీరా వారి వచనములను విన్నది. క్రోధవివశయయినది కాదు. వినీతిని వీడుకొన్నది కాదు. గోపాలమూర్తిని హృదయమున అర్చించుకొన్నది. "అవును. సత్యమే. నన్ను లోకవాసనలు విడువలేదు. గంగాస్నాన మాచరింపను. కాయకసరులతో నిమిత్తములేదు. మంత్ర తంత్రముల నెఱుగను. నేనేమియు నెఱుగను. నేను ప్రేమించుటనే ఎఱుగుదును. పొంపొచ్చెములేని హృదయములో; ప్రతిఫలశూన్యమయిన కాంక్షలతో ప్రేమించుట ఎఱుంగుదును. నిజమే. నేను కిన్నరీకాంతవలె గానము చేయుదును. నా గానము నా జీవితము నా గోపాలచరణాంకితము" అనుకొనుచు నాడు రచించిన గీతికాలాపముతో నృత్యము చేసికొనుచు తాను కూర్చిన కుసుమదామమును శ్రీకృష్ణుని గళసీమ నలంకరించెను. ఆమాల కృష్ణుని హృదయము సోకగనే కృష్ణుడు విస్ఫారవిలోచనముల నవ్వెను. ఆ కృత్యమును సరసనున్న నాకిలోకము చూచినది. వెలవెల్లబోయినది. ఆమె భక్తికి తల వాల్చినది.

ఆ పాలవెల్లిలో వారు తరంగితులైరి. వారు కూడ ఆమె పదవిన్యాసములో తమ పదవిన్యాసమును కలిపి ఆమె గొంతుతో గొంతు కలపిరి. భక్త్యావేశుల హృదయములలో స్వమతవిమత విభేదమునకు తావులేదు.

౧౦

మీరా గానము మీవారుహృదయమునే కాక హిందూహృదయమును పులకితము చేసినది. ఆమె ఆరాధనాగీతికలు అబాలగోపాలము ఆలపింపసాగినవి.

మీరా భక్తురాలు. గానకళాసరస్వతి అని దేశములు తలవాల్చినవి. ఆమెను దర్శించుటకు, ఆమె గాన మాలించుటకు హరిదంతపదములనుండి ప్రజ వచ్చుచున్నారు. మీవారు యాత్రాస్థానమయినది.

ఆమె దినము దినము నూతన గీతికలను నూతన రాగములతో రాజపుత్రస్థానమును ముంచెత్తి వేయుచున్నది ఆమె నిత్యకృత్యము శ్రీకృష్ణారాధన. ఒక్కవేళ అపూర్వశోభామయియయి కృష్ణుని అర్చించును. మరియొక్కవేళ సర్వసాధారణయయి గోపాలుని పూజించును. ఆమె ఆరాధనకు లేనిపోని భేదములేదు నిశాదిన విభేదములేదు. ఎల్లవేళల ఆమె హృదయము పూజావినీతము. ఎల్లవేళల గోపాలాలయము నిత్యకల్యాణము పచ్చతోరణము. ఆమె సంసారజీవితము మాత్రము విరహరేఖ.

౧౧

"జహాపనాహ! సూర్యుడు కైవాలినాడు. మీరాదేవి వచ్చువేళ అయినది" అనినాడు తాన్‌సేను.

"ఇంకను రాలేదే. వచ్చుచున్నదా?"...అని పలికినాడు అక్బరుపాదుషా.

"జహాపనాహ! వచ్చువేళ అయినది. దయచేసి తమ రాచమర్యాదల నిచట........" అనినాడు తాన్‌సేను.

"పాటింపను సోదరా! మీరాదేవిఎదుటనా నా సార్వభౌమత్వపదవి" అని తాన్‌సేనుభుజము తట్టినాడు.

తాన్‌సేను చిరునవ్వినాడు. పాదుషా చిరునవ్వెను ఆ ఇరువురు కలసి చిరునవ్వినారు.

ఒకరి తరువాత ఒకరు వచ్చి భక్తిపరులు ఆలయవితర్దికలమీద నిషణ్ణులగుచున్నారు. నాడు మంగళదినము. ఇతఃపూర్వముకన్న నాడు మీరా దేవతార్చనకు సంధ్యతో వచ్చును.

దేవాలయము నంటియున్న ఉద్యానమార్గమునబడి మీరా వచ్చుచున్నది. ఆమెవెనుక ఇరువురు పరిచారకులు. పూజాద్రవ్యములు పళ్లెరము ఆమె

చేతనేయున్నది. ఆమెను జూచి దేవాలయము ప్రశాంతమయినది. ఆ ప్రశాంతిలో అనంతమంగళ జ్యోతులు వికాసిల్లినవి. మీరా వల్లుగమనమ్ముతో అక్బరుపాదుషాసరసనుండియే గర్భాలయమునకు పోయినది. అక్బరు అనిమిషుడయినాడు. తాన్ సేను పాదుషాఉత్సేకమును అనునయించినాడు.

మీరా సంధ్యాగీతితో పూజాదికమును ప్రారంభించినది. జయఘుంటిక మొరసినది. పూవులు కురిసినవి. ఆమె గానమునకు అక్బరు ఆనందమున త్రుళ్లింత లాడినాడు. మరల మీరా గానముచేసెను. ఇప్పుడు గీతిలేదు. రాగములేదు. అక్బరు తన్ను దాను మరచెను తాన్ సేను తన వివశతలో అక్బరుని తేర్చెను.

పూజ సమాప్తించినది. మరల జయఘుంటిక మ్రోగినది. పూవులు వర్షించినవి. కృష్ణుని ఎదుట మీరా మోకరిల్లినది.

"ఇంకొకసారి, ఇంకొకపాట. నా జీవితము ధన్యము'' అన్నాడు అక్బరుషా.

"చిత్తము" అన్నాడు తాన్ సేను.

మీరా నిశ్చలసమాధినుండి లేచినది. తాన్ సేను గాన మాలపించినాడు. అంతటి గానమును మీరా విని చకితయైనది. నిలిచినచోటనే నిలిచిపోయినది. అతనిపాటకు సమాప్తి. ఈమె పాటకు ఉదయము. దేవాలయమును మరియొక్కసారి ప్రశాంతి పక్షము లావరించుకొన్నవి. మీరాగాన మయినది. అక్బరు ముందుకువచ్చి, "దేవీ! నీ భక్తి అపారము. నీ గానము అపరూపము. ఈ నిరుపేద ఏ మీయ గలడు'' అని ఒక వజ్రాలహారము ఆమె కొసగి అంజలించెను. మీరా ఆ హారమును చూచి విస్మయంపడినది. "ఈ అమూల్యహారము........'' అనుచున్నది. "నేను పూర్వాశ్రమములో రత్నాల వర్తకుడను. ఇప్పుడు నా వ్యాపారము చిదికిపోయినది. ఈ హారమమాత్రము మిగిలినది. ఈ హారము మీ కుపహారము'' అని అక్బరుషా ధీరగమనమున దేవాలయసోపానశ్రేణిని అవతరించెను. తాన్ సేను అతని పదములలో పదములిడెను. మీరా ఆ హారముతో కన్నులు మూసికొని అట్లే నిలిచినది. కన్నులుతెరచి గోపాలమూర్తిసరసకు పోయి ఆ హారము కృష్ణగళాంకితముచేసి "నమస్తే ప్రభూ! నమస్తే ప్రభూ! శితాంశోరమృతార్పణమ్" అన్నది.

## ౧౨

ఆ వజ్రహారము అక్బరుపాదుషా దని నిర్ధారించినారు. అక్బరుపాదుషా ఆ దేవాలయమునకు రహస్యంచారము చేయుచున్నాడని కోడెత్రాచువలె బుసకొట్టినది. కర్ణాకర్ణి రాణాకుంభుని చెవిసోకినది. రాణా ఈర్ష్యతో కోపముతో ఉన్మత్తచిత్తుడయి నాడు. అకళ్మలభావముతో మీరా భవనమునకు మరల నింకొకసారి ప్రవేశించినాడు. ఆదియేతుది.

అతని అవస్థ పూర్వముకన్న భీకరముగానున్నది. అత డెందుల కచ్చటకు వచ్చినాడో ఆమెకు తెలిసిపోయినది. ఆమెకు భయములేదు. విచారములేదు. కాని అతనినిచూచి మీరా జాలిపడినది. ఎంతటి ఆఖిలరూపమును ఆమెను స్వర్గీయానంద సౌఖ్యమునుండి చ్యుతము చేయలేదు. ఆమె అచల, ఆమె పూజామతి. ఆమె గాయిని. ఆమె శ్రీ గోపాల మూర్తి చరణదాసి ఆమెకు భయములేదు; విచారములేదు.

"ఆ వజ్రహారము ఎక్కడిది?" అని కలమేఘము స్వనించినది.

"శ్రీ గోపాలకృష్ణుడు లీలాపురుషుడు. ఆతనికి వలసి తెప్పించుకొనెను. ఇచ్చతో అలంకరించుకొనెను" అని మీరా కలకంఠకంఠమున పలికినది.

రాణా క్రోధమున చలించిపోయినాడు. అతని ఉత్సేధము కంపించి పోవుచుండెను. ఓరిమి భూమిని చేరుకున్నది. రాణా ఆటునిటు చూచి కరతాళము గావించినాడు. పరిచారిక ప్రవేశించి రాణాకు మ్రొక్కినది. ఆ దాసీకన్య హస్తమున విషపాత్రిక. ఆ పాత్రికను రాణా గ్రహించి మీరా కొసగినాడు. ఆమె కిమ్మనకుండ పుచ్చుకున్నది.

"త్రాగివేయుము" అని శాసించినాడు.

ఆమె క్రిందు మీదు చూడక ఒక్కపరి కన్నులు మూసి కన్నులు తెరచి ఆ విషపాత్రికను నోటను పట్టుకొని త్రాగివైచినది. ఆమె శరీరమంతయు ఒక్కపరి హరిద్రవర్ణమైపోయినది. ఉత్తరక్షణము ననే ఆమె నిసర్గమహస్సుతో ప్రకాశించినది. ఆమె చెక్కుచెదరలేదు.

రాణా నిస్తబ్ధుడు నీరవుడు అయినాడు. నేత్రముల దృష్టి సన్నగిల్లినది. వెర్రివెర్రిగా చూచుకొనుచు ఆ దివ్యతలమును బాసినాడు. ఒక గడియకు కంచుకి అచ్చటను వచ్చినాడు. మీరా ఇంకను అచ్చటనే యున్నది. ఆమెను రాణావారి శ్రీముఖమందిచ్చినాడు.

"మీరా! నీవు పాంసులవు. నిన్ను నిర్వాసితను చేసినాము".

## ౧౩

మీరా! బయలుదేరినది. మీవారుశుద్ధాంతము వీడి బయలుదేరినది. ఆమె వెడలునపుడు మీవారునకు సంబంధించిన ఒక జీవిసహితము సమాశ్వాస వచనము పలుకలేదు. కరుణాప్రసక్తి చేయలేదు ఒక్క నేత్రము తడివారలేదు. శరీరమునుండి ఒలిచి వేసిన అలంకారవారమును శయ్యాతలముమీదనే ఉంచివేసినది. ఏకవస్త్రముతో ఏకతారతో ఆ నడికిరేయి శుద్ధాంతమును వీడి ఎటకో ఎటకో బయలుదేరినది. ఆమెను దారితోడు జగతీతలమును కారుకొన్న అంధతమస్సు. హృదయములోని శ్రీ కృష్ణభగవానుడు. ఆమె ఉడుకెత్తిన హృదంతరమునుండి తీగలువారుచున్న పాటపదములు పాటల వెలుంగువెల్లికలు ఆ భీషణతామిస్రమును ప్రకాశము చేయుచుండెను. ఆమె నడక సుగమమగుచుండెను. ఆమె హృదయము నిష్కామపరిపూర్ణము. శ్రీ కృష్ణమూర్తియుండే ఆవాసము. వీక్షలో కృష్ణ. నిట్టూర్పులో కృష్ణ. కన్నీటిలో కృష్ణ. పాటలలో కృష్ణ. ఆమెకు తెలియకుండగనే ఆమె పదములు బృందావనసీమకు దారిపట్టినవి. తెలతెల వేగినది. నాడు శకుంతగీతాకలకలముతో ఆకాశవీధులు ముఖరితమగుటలేదు. ప్రత్యూషఃపథము మీరా దివ్యపదముల తోరణవారముతో ప్రేల్లితమగుచుండెను. జనపదములనుండి పక్కణసీమలనుండి విపినవీధులనుండి జనులు మీరాపాటలతో ఆమంత్రింపబడుచుండిరి. ప్రత్యూషస్సతీవదనము అరుణరంజితము. మీరా హృదయము కృష్ణానురాగప్రసన్నము. జనుల హృదయము భక్త్యుత్సాహవిలసితము. రాణాకుంభుడు ఆమెను వీడినాడు. సంగతి యామెను చేపట్టినది. జోహారు పెట్టినది. జయ పెట్టినది.

నాడునాడు ఆమెకు ఛాత్రగణము విశేషించిపోవుచున్నది. ఆమె ఎక్కడ మజిలీ చేసిన అక్కడనే మహాజనసంక్షుభితనగరము. ఆ బృందావనయాత్రల నివేశమేని కష్టము నీయలేదు. ఆనందము నిచ్చినది. అనుచరుల నిచ్చినది. పాటల నిచ్చినది. జీవనము నిచ్చినది. శ్రీ కృష్ణమూర్తి సన్నిధి చేర్చినది. శరత్కాలవిపాకమున ఆమె బృందావనసీమను చేరుకున్నది.

## ౧౪

ద్వారక కథేవాడలోని పట్టణము.

పవిత్రబృందావనసీమలో కొన్నినాళ్లు గడపి ద్వారకకు మీరా పయనించినది. ఆమె జీవితశేషము అచ్చట గడుపదలచినది. శ్రీకృష్ణుడు తన జీవితశేషమును అచ్చటనే వాసించుచేసినాడు.

మీరాపాటలు వినుటకు, ఆమెగానమాలించుటకు ఆమె భక్తిని చూచి పారవశ్యము నొందుటకు వైష్ణవేయులు, భక్తులు నానాదేశములనుండి వచ్చి ఆమెను పలుమట్టుచుండిరి. వచ్చినవారు వచ్చినట్లే యక్కడ నిలిచి ఆమెను కొలువసాగిరి. మీరా విడిసిన వటచ్ఛాయ ఆశ్రమపదమయిపోయినది.

మీరా భక్తిగేయములు ఉత్తరహిందూస్థానములో దొప్పలు దోగినవి. ఆమె భక్తికి నిస్సీమ. ఆమె, పాటలో లేమను. పాటలో శయనించును.

ఆమె ఆహారము తీసికొన్నదో లేదో ఎవ్వరికి తెలియదు. ఆమెకు తెలియదు. దినము దినము ఆమె కృశించుచున్నకొలది ఆమెలో మహామహత్వము వెలిగిపోవుచున్నది.

మీరాగేయములు రాణాకుంభుని చెవిని బడినవి. మీరాభక్తితత్పరత జనులవలన విన్నాడు. అతని కఠినహృదయము కరగజొచ్చినది. రాణా, మీరాపవిత్రజీవితము విన్నాడు. అతని అనుమానహృదయము పునీతముకాజొచ్చినది. భక్తులనోట మీరాపాటలు. భిక్షుకుల నోట మీరాపాటలు. వైష్ణవులనోట మీరాపాటలు. శైవులనోట మీరాపాటలు. ఆనాడు ఈనాడువలెనే ఉత్తరహిందూస్థానము మీరాపాటపదములతో నిబిడీకరించిపోయెను. మీరాపాటలను విన్నకొలది, ఆమె జీవితము నాలించినకొలది రాణాహృదయము మీరాకయి తపించిపోవుచుండెను.

ఆమె సాక్షాత్పరదేవత, తాను ముగ్ధుడు అన్న భావము అతని హృదయమున రేగినది. ఆ భావమును ఉభయసంధ్యల వీనులబడుచున్న ఆ వరగాయనీ గేయములు ప్రోదిచేయుచున్నవి. ఆతనిలో ఆందోళనము రేగినది. అంబరము నీరదనీరంధ్రము. వాయువు ప్రచండముగ వీచుచున్నది. ప్రకృతిమూర్తి ఉన్మత్తపోలిక కొట్టుకొనిపోవుచున్నది. ఆ ప్రళయవేళ రాణాకుంభుడు మీరాదేవికయి బయలుదేరినాడు.

౧౫

అది శ్రావణమాసము. నాడు జన్మాష్టమి—శ్రీకృష్ణుని జన్మదినము. ఆ జన్మవాసరమున ఆ మంగళోత్సవము చూడగోరి జనులు దేశదేశములనుండి ద్వారకకు విచ్చేసిరి. ఆ కృష్ణదేవాయతనము నూతనము. భారతచిత్రములు భాగవతచిత్రములు ఆలయ భిత్తికలమీద చిత్రింపబడెను. దేవళమంతయు నవజీవనచైతన్యము తొలుకాడు కుసుమజాతముతో చిత్రవిచిత్రగతుల విరచింపబడెను. నాడే ఆ నూతన దేవతాయతనమున విగ్రహప్రతిష్ఠ. మీరా హృదయము అమృతానందమున తుందిలము. ఆనాటికి మీరా ఎన్నియో నూతనగీతల నల్లెను.

గర్భాలయము దీపావళితో విరాజమానముగా నున్నది. అగరుధూపముతో దేవాలయము గుమాళించుచుండెను. కర్పూరము అఖండముగ వెలిగిపోవుచుండెను. శుభముహూర్తము దగ్గరిల్లెను. అవనీసురులు మంజుఘోషతో మంత్రోచ్చారణము సలుపుచుండిరి. మీరా మంగళస్నాత అయినది. నూతనగీతాలాపము చేయుచు చిఱుతప్రాయమునాడు తండ్రి ఉపాయనముగానిచ్చిన బంగారు గోపాలమూర్తిని శుభముహూర్తమున ఆ గర్భాలయమున ప్రతిష్ఠించి సోత్సవనృత్యము చేయసాగినది. ఆ లీలాతాండవములో దిదృక్షుల ఆనందము తేటగీతులయినది.

విగ్రహప్రతిష్ఠ జరగిపోయెను. జయగోవిందవాక్యము దేవాలయపథము దాటి సాగరోత్తుంగభంగవీధి ప్రతిధ్వను లీనసాగెను. మట్టమధ్యాహ్నమాయెను. ఆలయము విజనమాయెను. మీరా ఇంకను గోపాలమూర్తి సమక్షమున సాష్టాంగపడి ఉండెను.

ఆ నూతనాలయప్రాంతమున హయహేషలు గజఘీంకృతులు వినవచ్చెను. అంతకంతకు ఆ ఘోష దగ్గరిల్లెను. ఆజానేయములు, తరువాత రాజసేవకులు, చతురంగయానములు, ఆటుపయి మత్తకుంభీంద్రములు. ఒక మదకరిపై మీరట్టురాజకేతనము వాయుచాలనమున చలితమగుచుండెను. ఒక బంగారుపల్యంకిక వచ్చి దేవాలయదేహళిచెంత నిలిచెను.

మీరా గర్భాలయమువీడి ద్వారకవాటముజేరి చతురంగయానములోని పురుషపుంగవుని చూచి వినీతితో నమస్సు లర్పించి దేవాలయద్వారమును బంధించుకొనెను.

ఆ పురుషపుంగవుడు రాణాకుంభుడు. మీవారు ప్రభువు మీరాదేవిని తీసికొనిపోవ వచ్చినాడని

ద్వారక పౌరులకు తెలిసిపోయెను. మరల నొకసారి దేవాలయప్రాకారమును జనులు వలజుట్టిరి.

మధ్యాహ్నము దాటెను. సూర్యుడు కైవాలుచుండెను. ఇంకను ఆలయకవాటములు వివృతములు కాలేదు. రాణా హృదయము తామరాకుమీది నీటికణము. వ్రజ హృదయము ఆశ్చర్యసంకలితము.

సూర్యభగవానుడు హరిద్రవర్ణముతో నస్తమించెనని జ్యోతిష్కులు ఏదియో గుణించుకొనిరి. ఇంతవరకు నీరవిభుడుగానున్న రాణా ఆలస్యమున కోపవలేకపోయెను. ఆలయద్వారములను బలవంతముగా తెరచివేయుడని భటులకు నిదేశము. ద్వారములు తెరువబడెను. రాణా త్వరితముగ లోనికి పోయెను. ఆలయము శూన్యము. మీరా గోచరింపలేదు. రాణాహృదయము స్పందించెను. చరచర గర్భాలయమును ప్రవేశించెను. గర్భాలయము శూన్యము.! రాణాహృదయము శూన్యము. మీరా దాల్చిన పీతాంబరము పూజావేదిక చెంతనుండెను. భక్తహృదయమును తనలో లయింపచేసికున్నందులకు శ్రీ కృష్ణమూర్తి కిలకిల నవ్వుచుండెను. రాణా అది చూచెను. నిట్టూర్చెను. సంధ్యాసౌందర్యరేఖ అష్టమీతమోగర్భమున విలీనమాయెను.

---

# ఆంధ్రసోదరా!

శ్రీ మాదిరెడ్డి సూర్యనారాయణరావు గారు

చ॥ వగగ్రృయింపఁబోకుము; సుభాషితమిచ్చునభీష్టసంతతుల్।
మగువలఁబోలె యేలనిటు మ్రాన్పడియుండెదో? నీకుఁబాఁడియే?।
తగదిఁక; మేనుపెంచియుఁ బ్రతాపముఁ గాంచుట ధర్మమిప్డు; నీ।
కుఁగల సమస్తమున్ విడుము కొంచక భారతరాజ్యలక్ష్మికై॥

చ॥ అనుపమదివ్యబోధ మహిమాధికులయ్యును నొక్కఁడన్నదా।
ఘనమగునంత రాయములుఁ గైకొనరే? యిక రాజ్యలక్ష్మిదా।
ననితర సాధ్యమానవిన; నజ్ఞతఁగాదె? సుకీర్తివచ్చునే?।
వినుతినిఁ గాంచుమయ్య! ఘనవీరుఁడవై యిల "నాంధ్రసోదరా!॥

చ॥ పలుమరు రాజ్యభాగ్యముకుఁ బట్టుపుయత్నము సేయఁగావలెన్।
సలుపక యూరకుండనది చాలమియందురు గాదె? యింకనీ
పలుకుల "నోస్వరాజ్య" మనవచ్చునె? అయ్యది స్వప్నవృత్తమే!!
సలిఁపెపుఁ గార్యవీరులకు శౌర్యమెయుండినఁ జూపఁగావలెన్॥

ఉ॥ చేకుఱు నాత్మశక్తి హృదిచింతితకార్యసమృద్ధి, కీర్తియా।
పై కలుగున్: దృఢంబగు స్వయంకృషి చాతురి నవ్వి గల్గుదో।
నేకమనస్కతిం బరుప నెవ్విధిఁగల్గు యసాధ్యకార్యముల్?।
బ్రాఁకట "యాంధ్రసోదర" స్వరాజ్యముఁ గైకొనుమయ్య వ్రేల్మిడిన్॥

'ఏంజేస్తున్నా—వింట్లో? మాట్లాడవేం? నిన్నే' అన్నాడు గట్టిగా కామశాస్త్రి జపంచేస్తూ

'.........'

'ఇదిగో...'

'.........'

'ఒసేయి, తప్పుడుముండా, చెముడొచ్చిందాయేం?'

'ఏమిటీ హడావుడి, ఇదేనాజపం' అంటూ విసుగుదలగా మాట్లాడుతూ తడిబట్టలతో ప్రత్యక్షమయింది కామమ్మ నీరు గారుకుంటూ.

'ఎందుకూ కేకలు యిందాకటినుంచీ.'

'ఎందుకా?—యేడవను!!'

'సరే, కానీయండి: యింకా యేంజేస్తారు లేకపోతే!!...సరే చెప్పండి సంగతేమిటో'

'ఏంచెప్పను! యీాముప్పెల్లా తప్పుతుందా అని అఘోరిస్తున్నా'

'ఏడ్చి యేంచేస్తారూ, మనకే గాదుగా యీా అవస్థ అందరికీవుంది యీా దినాల్లో తిరిగితిరిగి శేషయ్యగారికి బలపాలు కట్టుతున్నయి కాళ్ళు, ఇంతవరకూ కుదురలేదు. అట్లాగేమనకూను.'

'......ఓం భూర్భువస్సువః' అన్నాడు బిగ్గరగా. రామకృష్ణా అన్నాడు మరల. మొత్తంమీాద జపమాల తిరుగుతూనేవుంది ఆగకుండా!

'కేకలువేసిన సంగతి చెప్పరేం'

'ఏముంది? రామావధాన్ల సంబంధంకూడా దాటిపోయింది. వేరయ్యావచ్చి చెప్పిపోయినాడిప్పుడు.'

'నన్ను పిలవలేదేం? నే నెక్కడికి చచ్చిపోయినాను!!'

'చెరువుకు. ముందుగ తేమిటిమరి?- కట్నం చాలదా యేమిటి ఆయనగారికి? సంభావనలు పుచ్చుకొని, అడ్డమైనగడ్డీ కుడిచి సంపాయించాడుగా!! యిప్పుడు ఆ భాగ్యంమీాద కళ్లు గనబట్టంలేదు. పూర్తిగా రెండువేలిమ్మన్నాడా?'

'రెండువేలైతే సరేలే అనేవాణ్ణే!! యింకా పైన ఆడపిల్లలలాంఛనాల కైదువందలు గావాలట.'

'ఇస్తే మనకేంవుంటుంది.'

'లేకేం ఒకపెద్ద అక్షయపాత్ర—విభూతి పండు.'

'నాయనా' "ఆడుంగాన్ను గంటకన్న సతి గొడ్రాలౌటయే మేలు, నూతేడుల్చెంచి నంగూతు రేమిసతమా" అనేపద్యం చెప్పాడు మానాన్న చిన్నప్పుడు. సరే యెందుకీగోల. అయితే సక్రమమైన పెండ్లి అవుతుంది. కాకపోతే శారదాబిల్లుపెళ్లీ!!ఏంజేస్తాం అంతకన్న.

'ఛీ! పాడుముండా! సంకరుణ్ణి అవమంటావు నన్ను...అది మీా అన్నయ్యకు. బి.యే. బి.యల్. ప్యాసై వున్న ఆస్థిఅంతా తగులబెట్టి చెక్కగట్టి దమ్మిడీ సంపాదనలేకుండా గోళ్ళుగిల్లుకుంటూ కూర్చొని యేడాదికో



చెన్నపురి సేవాసదనమునందలి యుపాధ్యాయినులును అక్కడనేయుండి చదువుకొను బాలికలును

(Residential Pupils)



సేవాసదనమున నగిషీపనియు గిల్టు వేయుటయు
నేర్చుకొనుచున్న విద్యార్థినులు



చి॥ అనసూయా సీతాంబలు

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమాంబగారి బిడ్డలు.
ఇటీవల చెన్నపురిలో "మ్యూజికల్ ప్రాడక్ట్సు" వారు
చేయుచున్న రికార్డ్లలో నీబిడ్డల యొక్కపాటలు మొదలగునవి
రికార్డు చేయబడినవి.

పిల్లనుగంటున్నాడే వాడికి ఆ శారదాబిల్లు!! అందుకనేగా పదమూడేళ్లువచ్చినా పెండ్లి చేయకుండా కూర్చున్నాడు!!

'చాల్లెండి యీసాటికీపాట—నేను సమర్త పాట పాడినట్టుగావుంది మీపాట.'

'పాడుదువుగానే మీవాళ్లింట్లో!!'

'మనింట్లోమాత్రం పాడొద్దూ!! తప్పతుందా... అయితే వోమాట అడుగుతాను. పన్నెండేండ్లుదాటితే కన్యాదానఫలందక్కదు ఆపిల్లకు పెళ్ళిచేస్తే: అట్లాంటి పిల్లకెప్పుడు పెళ్ళిజేసినా సరేఅని మనువు చెప్పాడట. అని మొన్న మీరుజేసిన సనాతనసభలో ఆశాస్త్రుల్లుగారు అరుస్తూ చదువుతున్నాడే శ్లోకాలు. మరి మనపిల్లకు పదమూడోయేడు కూడా వచ్చింది, యెప్పుడు జేస్తే యేంమరి?! ఫలం దక్కకపోయింతర్వాత...'

'ఒసి పాడుముండా నీవూవచ్చావక్కడికి? ఆడవాళ్లని సభల్లోకిరానిస్తే, యిదేతిప్పలు!.'

'మాలవాళ్లను ఆలయాల్లోకి దీసుకొస్తామని చెప్పేవాళ్లని రానీయకుండా పోలీసులను కాపలాబెట్టినట్లుగా, ఆడవాళ్లని రానీయకుండా కూడా కాపలాబెట్టక పోయినారూ?!'

'ఒసి నీదుంపతెగా మొన్న మీఅన్నయ్య వచ్చినాడు. అప్పుడు చెప్పినాడా యేమే యివి? నాకొంపకూడా దీస్తున్నాడూ!!'

'మాఅన్నయ్య వుసురుబోసుకోకపోతే, మీరు చేసేపని మాత్రం యేమిటి! సంబంధాలకోసం తిరుగుతునే వున్నారుగా!! మరి పెళ్లి చేయలేదేం. తిరిగి మీకెంతలాభం వచ్చిందో, తిరగకుండా మా అన్నకూ అంతే లాభం. భారతంచదివి మీరే చెప్పారుగా చిట్టివారింట్లో...భీముఁడు, అర్జునుడు మొదలైన వాళ్లంతా యుద్ధాలు, రాద్ధాంతాలు జేసి, వీరులు అనుపేరు సంపాదించారు. ధర్మరాజు యేమీచేయకుండానే వీరుడనిపించుకున్నాడని... ..అల్లాగే తిరగకుండా మా అన్నయ్య...'

'సరే దయచేయి...నాదేవతార్చనంతా తప్పుతోంది.'

'మిగిలింది బాపట్ల సంబంధమేగా! సరే వెళ్లిరండి దానికికూడా' అంటూపెరట్లోకి బోయింది రొనరొనలాడుతూ యింట్లో బడ్డనీళ్లు కాలితోరాచి.

కామశాస్త్రి ఆకాశాన్నిచూస్తూ, మీనమేషాలు లెక్కిస్తూ తనకు గోచారరీత్యా యెల్లావుందో చూచుకుంటున్నాడు. ఏదో సమాధానం చెప్పుకున్నాడు. పిల్లది ఉత్తరాషాఢానక్షత్రం చతుర్థచరణం. కర్కాటక లగ్నం. జననకాలరవిశేషం వత్సరం. వర్తమానం కుజునిలో రాహువులో శుక్రుడు రాహువు ద్వితీయంలోవున్నాడు. కుజుడు చంద్రుడు సితోగలసి సప్తమంలోవున్నాడు. తక్కిన గ్రహాలున్నయి ఓమోస్తరుగా. పిల్లకు వివాహం గావాలిసిందే కాని రజోదర్శనం కూడా అయ్యేటట్టేవుంది. అని అనుకుంటూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. పదునైదు దినాల్లో వివాహంగావాలి అని నిశ్చయించాడు. తనజాతకమూ, పిల్ల జాతకమునూ బట్టి పెండ్లికుమారుణ్ణి గాలించటానికి యివ్వాళే బయలుదేరాలి అనుకున్నాడు. రైవత మహారాజుకుమార్తె రేవతీ (బలరాముని

భార్య) వృత్తాంతం స్ఫురణకువచ్చింది. విధి వ్రాతకూడా తప్పుతుంది గాబోలు. చంద్రకుజులు సప్తమంలోవున్నారు. కేతువు శుక్రుడితో అష్టమంలోవున్నాడు. ఏమవుతుందో పిల్లకు?! అబ్బా!అని తిరిగిచక్రంమీదబడ్డాడు. ఇంతలోకే వంట అయింది నాన్నా అని పూర్ణాంబగొంతు వినబడ్డది.నీవనేచూస్తున్నా అన్నాడు దగ్గుత్తికతో. పూర్ణాంబ చదువుకుంటూన్నపిల్ల గనుక అర్థంచేసుకున్నది. చిన్నపుచ్చుకున్న ముఖంతో చెప్పకుండా చప్పున చక్కాబోయింది.

అతి కష్టంమీద కామశాస్త్రి సంబంధమొకటి నిశ్చయించుకొనివచ్చాడు. పెండ్లి పదిదినాలుంది. ప్రయత్నాలన్నీ జేశారు. చేస్తున్నారు. పెండ్లికుమారుడు విద్వాన్ పరీక్షకు వెళ్లాడు—తెల్లవార్లు ప్రొద్దుగూకులూ నిద్రాహారాలులేకుండా చదివి! నాలుగురోజులుంది వివాహం. పూర్ణాంబకు పెళ్లి కళ వచ్చింది.

అతిరహస్యంగా వచ్చింది కామశాస్త్రి వద్దకు కామమ్మ.

'ఏమండోయి...అయింది!!!'

'పెద్దమనిషా....పిల్ల'అన్నాడు. ఆత్రంతో కళ్లు తేలవేశాడు: కళ్లతోచెప్పింది సమాధానం కామమ్మ .. వెళ్లింది.

కామశాస్త్రి విచారం ఆదుర్దా పాఠకులే వూహించాలి. ఆవిచారంచూస్తే కలం ఆట్టం లేదు అక్షరంవ్రాయటానికి. లగ్నం నాడు స్నానం. మొన్ననే దస్కత్తుజేశాడు. రజస్వలానంతరవివాహం జేయకూడదని కలం విరిగేటట్టు. ఎల్లాగో దాచారు. పెళ్ళివారు వచ్చారు. దశమినాడురాత్రి వివాహం. ఆడవాళ్లలో బడ్డది. అనుమానాలు పడుతున్నారు. కష్టాలు అందరికీ వస్తయి అన్నారు కొంతమంది. అసూయాగ్రస్తులు పెళ్లికుమారునితో చెప్పుతామన్నారు. తలకాయకో పలుకు.

పెళ్లివారువచ్చారు. మొత్తంమీద బైట పడకుండా జరిగింది పెండ్లి. నాకబలిదినం వచ్చింది. ఆనాడు పెళ్లివారిలో గొందరికీ ఆడవాళ్లకి అనుమానండట్టింది. అందులో ఆడవాళ్ళకు చప్పున జెలుస్తయ్యాయను యీ విషయాలు. పెండ్లికుమారునిదాకా వచ్చింది. పెదవి విరిచాడు. గతించినదానికి చింతిస్తే లాభంలేదనుకున్నాడు. పెండ్లివారు వెళ్లిపోయినారు. తిరిగి మళ్ళదోరణమున కల్లుడు రాలేదు. అల్లుడురాంది పిల్ల విషయంలో గాదు. పరీక్షకు గష్టపడటం వివాహబడలిక, అన్నీ గలిశాయి. సన్నిపాతజ్వరము యిరవై యొకటోనాడు!!! వదిలేశాడీ లోకాన్ని.

కామశాస్త్రి కుటుంబమంతా అల్లుడి దగ్గరనేవుంది. లోపల కుమిలిపోతున్నాడు. రజస్వలానంతర వివాహంజేస్తే సంభవించదా యీవిపత్తు? శాస్త్రాలు వూరికే బోతయి? అదేమిటోగాని, దేవతలు, శాస్త్రాలు, నమ్మేవాళ్లనే విరుచుకుతింటాయి. ఈరజస్వలానంతర వివాహాలు జేసేవాళ్ళందరికీ వస్తున్నయి యివ్వి? ఎబ్బె! అమావాస్యామంగళవారం నాడు పెళ్లిచేసుకున్న యేనాదివాళ్లు పిడిరాళ్ళుగావుంటారు. గ్రహబలం, లగ్నబలం,

అన్నిబలాలు సరిగాచూచుకొని చేసిన పెళ్లిళ్ళకే వస్తయి ఆపదలు...

ఇంతకూ యీ బాలవిధవను బెట్టుకొని యేంజేసేదియింట్లోనేను? ఇంతకు దానిజాతకం. పురుషునికి సప్తమస్థానంలో అంగారకుడుంటే ద్వితీయవివాహంగాని భార్యావియోగం గాని పొందాలి అనిజ్యోతి శ్శాస్త్రమతం. శ్రీరామచంద్రమూర్తి అంతవాడికి కుజుడు సప్తమంలోవుండి యీఫలితం యిచ్చాడు. స్త్రీకికూడా రెండోపెళ్లి అవుతుందా యేం జెప్మా? ఛీ! స్త్రీజాతకానికిగాదు. ఏమో చెప్ప లేను. జాతకాలుమాత్రం సరిగా జరుగు తున్నయ్? ! కాలాన్నిబట్టే అవిగూడాను. అని యేమేమో ఆలోచించుకుంటూ కొన్నాళ్ల కింటికిజేరారు.

కామశాస్త్రి బావమరిది, కూతునకు ప్రత్యక్షంగా రజస్వలానంతర వివాహం జేశాడు. దంపతులు, చిలుకా గోరువంక లలా, కులాసాగాయున్నారు. కామశాస్త్రి చూచాడు; అసూయబడ్డాడు. మానవుని మనస్సు నేత్రము, అసూయ కాకరంగదా కలికాలంలో.

అన్నపూర్ణాంబకు ద్వితీయ వివాహం చేయాలిసిందని గట్టిగా జెప్పాడు. కామమ్మ గూడా వేధింస్తోంది భర్తను, పిల్ల అవస్థచూడలేక. యజ్ఞోపవీతాలు తెంచు కుంటానన్నాడు కామయ్య.

పూర్ణాంబ తల్లిదండ్రుల వివాదమంతా విన్నది. తనజీవితంమాట ఆలోచించుకుంది. తెల్లవారుజామున 'శారదానికేతనా'నికి వెళ్లాలని నిశ్చయంజేసుకుంది. మేనమామ సలహా... వెళ్లిపోయింది అక్కడికి! ఆరంభిం చింది కావ్యాలు.

వివాహం మాత్రం యింకా గాలేదు. చేసుకోటానికి నిశ్చయించుకుంది. సనాతన కామశాస్త్రికీ తిప్పలువచ్చినయ్ నోరు మూసుకొని తిరుగుచున్నాడు 'నాజాతకం' అనుకుంటూ.



# భ్రాంతి

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మిగారు

కుసుమమొక్కటి యొతయో మిసిమిగల్గి
సొగసు గురియింపుచుండె దాసోయగమున
భ్రమరమది చూచి తాను విభ్రమమునొంది
దాని తేనియగ్రోలంగ దలచివ్రాలె.

* * *

కాని; ఆపూవు తేనెలొల్కునది కాదె;
అకట; ఆతేటియాస నిరాసయయ్యె
పూర్వభవమున జేసిన పుణ్యఫలమొ
దైవ యోగంబొ తెలియగరాదరమె మనకు.

కటకటా; యొతమోసంబు కలిగెనాకు
కుసుమమందున దేనియ గ్రోలుదునని
తలచి నేవ్రాలితినిగాని, దబ్బరయ్యె
నంచు భ్రమరంబు నెమ్మది, కించనొందె;

* * *

వేసమును, రూపమునుజూచి మోసపోతి
మిసమిసలెగాని లోపల పస హుళక్కి
యనుచు గ్రహియించి భ్రమరంబు యచట
వాసి! మరల రాదాయె నాచెట్టుదరికైన.

# వ్యాస శకుంతల—కాళిదాస శకుంతల

శ్రీమతి 'కృష్ణకుమారి'

(ఈ వ్యాసము మహానందిలో నీనడుమ జరిగిన కవిపండిత సభలో చదువఁబడినది.)

వైలక్షణ్యా మున్ననాఁడే ప్రజ యాకర్షితమగును. ఒకవస్తువును జూచి మరల నట్టివస్తువునే చూచుటకు లోకులు వినుగందుదురు. 'క్రొత్త యొకవింత, ప్రాఁత యొకరోఁత' యని కదా యార్యులనుడి!

తొలుత మనము వ్యాసునిశకుంతలను దర్శించుచో, ఆ శకుంతల ప్రౌఢతకు ముక్కున వ్రేలువైచుకొని యాశ్చర్య మందుదుము. మరల నట్టిచిత్రమునే కాళిదాసు చూపినాఁడు. కాని భావములు వేఱు. ఆ ముదురురంగులు లేవు. అప్పటిస్థితులు లేవు. ఆ వ్యాసుని వైదికప్రపంచమునుండి యొక్కమాఱు కాళిదాసుని కళాప్రపంచమునకుఁ బరుగులిడినది మనసు. ఆ మోటుశకుంతలను జూచి యాశ్చర్యపడి సంభ్రమించిన మనసు, ఈ కాళిదాసుని ముగ్ధాశకుంతలను జూచి తెప్పిరిల్లినది.

వ్యాసునిశకుంతల అతిప్రౌఢ యని చెప్పికొంటిమి కదా. చూతము గాక. దుష్యంతుఁడు వేఁటకై యడవికి వచ్చినాఁడు. వచ్చి దారియం దగపడిన పూజ్యుల మన్నించుట తగ వని కణ్వాశ్రమమునకు వచ్చెను. వచ్చుటతోడనె శకుంతల యాతని కంటఁబడినది. 'సంకులమిళితాళినీలపరికుంచితకోమలకుంతలన్ శకుంతలను' జూచుటతోడనే దుష్యంతుఁ డామెను వలచెను. 'ఏకాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరింపు'ట తప్పని యైన నెంచక యామెతో మాటలాడినాఁడు. ఆమెయు నతిధీరయై సామాన్యాశ్రమవాసినులఁ బోలె నిర్లజ్జాశీలముతో నతనికి జవాబుల నిచ్చినది. దుష్యంతుఁడు శకుంతలను జూచియే వలచెనో, వలచియే చూచెనో చెప్పరానంతత్వరితముగ నారెండుపనులునుజరిగిపోయినవి. దుష్యంతుఁడు శకుంతలసజాతీయ యగునో కాదో, యని యొకించుక శంకించి 'దాని సర్వావయఁబులఁ జూచి సంచలితహృదయుఁడై 'నీ వెవ్వరికూతుర విట్టి రూపగుణసుందరి విందుల కేల వచ్చి'తని యామెను బట్టువోలెఁ బొగడి యడిగెను. ఆమెయు తడవుకొనకుండ తనపుట్టువును బూర్తిగఁ జెప్పివైచినది. అంత రాజును బంధించిన ధర్మశృంఖలలు తమంతట తామే సడలిపోయినవి. అంతయు విని రాజు శకుంతల సజాతీయ యగుట సంతసించి గాంధర్వమునఁ బెండ్లియాడు మని యాచించి ప్రేరేచినాఁడు. శకుంతలయు 'జగతీనాయక......సమయం బొకండు విను నాయం దైన పుత్త్రుండు రాజుగ నీ పిమ్మట నిమ్మహీతలమునం బట్టము గట్టునట్లైన నా, దగు పాణిగ్రహణం బొనర్పుఁడగు లేదా కాదు సంగం బిలన్.' అని టకాయించి జవాబు చెప్పినది. అప్పటి కున్న ఉద్రేకము చేతను, బహుశః తాను ముందామెయెడఁ జేయఁబోవు దారుణమగు మోసము నూహించియు ఒప్పుకున్నాఁడు దుష్యంతుఁడు. పాపము! శకుంతల ప్రౌఢ యయ్యు లౌకికజ్ఞానము తక్కు వగుటచే నభివాంఛితము తీరిన దను సంబరముతో రాజుతోడి వివాహమునకు సమ్మతించినది. శకుంతలాదుష్యంతుల వివాహమా 'ఏచి తలిర్చిన లతానికుంజముల'లో గాంధర్వవిధిని గుమ్మగ జరిగిపోయినది. కాని యావివాహము నిష్కల్మషమును బవిత్రము నగు ప్రణయబంధముచేఁ గట్టువడలేదు. ఘోరమును నతిప్రగల్భమును నగు శుల్కమున కమ్ముడు వోయినది.

దుష్యంతుఁడు తనరాజధానికి వెడలిపోయెను. కొంతకాలము దొరలిపోయినది. ఏండ్లకేండ్లు గడచినవి. ఈ లోపల శకుంతలకు కుమారోదయ మైనది. అతఁడు భావిసామ్రాజ్యధారేయుఁడే. కణ్వుఁ డంతయు యోగదృష్టిని గనిపెట్టి శకుంతలయదృష్టము

నకు సంతసించి యామెను దారకసహితనుగ నత్తింటికి శిష్యులఁ దోడిచ్చి యంపెను. శకుంతల రాఁబోవు సౌఖ్యములఁ దలఁచుచు నానందమున మున్కలు వేయుచుఁ బుత్త్రుని ముందిడికొని రాజునెదుర 'సాక్షాత్కరించిన మదనదేవత'యో నాఁగ నిలువఁబడినది. రాజు మానసమునఁ బూర్వగాథ యంతయుఁ దళుక్కన మెరసిపోయినది. కాని యసమర్థుఁడు; లోకమునకు వెఱచి యసత్యమునకు జంకక తెలిసియుండియు తెలియనియట్లుపేక్షించెను శకుంత. లయా నా యుపేక్షఁ జూచి సందియమంది 'ఎఱుఁగఁడోకో నన్ను! నెఱిఁగియు నెఱుఁగనియట్లుండు నొకో? యెదదవ్వగుటన్ మఱచెనొకో? ముగ్ధలధిపులు మఱవరె బహుకార్యభార మగ్నులు గారే!' అని తనలోఁ దర్కించి తానె ముందు రాజునకుఁ దమపూర్వవృత్తము వినిపించినది. కాని లాభ మిసుమంతయు లేకపోయినది. 'ఎఱుఁగనినాఁడెల్ల పాట నెఱిఁగింపనగున్, మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని కఱటిని దెలుపంగఁ గమలగర్భునివశమే?' తుదకు, రాజు మోమోటమి యైన లేక యామె నెఱుఁగనని తిరస్కరించెను.

శకుంతల మాత్రము లొంగిపోవు బేల కాదు. ధీరస్వాంతయై రాజునకు 'సతియును—యైన వనిత నవజ్ఞాన్వితదృష్టిఁ జూచు నతిదుర్మతి కిహముం బరము గలదే?' యని ధర్మ మెఱిఁగించినది. సాక్ష్య మవసరమైనది. కాని సాక్షు లెవరు? 'ఏన కాని దీని నెఱుఁగ రిం దొరు లని తప్పఁ బలుక నగునె ధార్మికులకు' అని గుట్టు బయల్పఱచి దెప్పినది. ఇంక నెన్నియో నీతు లుపదేశించినది. కాని రాజు చలింపలేదు. శకుంతల యావేగముతో నవమానముతో దుఃఖముతో రేకెత్తుచున్నది. ఒంటరిగఁ బెండ్లియాడిన యద నిప్పటికి రాజునకుఁ గలిసివచ్చినది. సమయము చూచి శకుంతలకుఁ బశ్చాత్తాపము కల్గించినాఁడు. బాగు! శకుంతలయవినయమునకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగినది. కాని యది చిరకాలానుభవమునకు రాలేదు. పుండు బాధపెట్టినఁ గాని తచ్ఛాంతి జరుగదు. కాని యింతలో కథ యడ్డుతిరిగినది. నిస్సహాయయై, నిస్పృహతో వెడలిపోనున్న శకుంతలకు బాసటయై నిలిచి యాకాశవాణి సాక్ష్యము పల్కినది. ఇంకేమున్నది! రాజు ఇనుమడించిన సంతోషముతో శకుంతలను బరిగ్రహించి సత్యమును సభ్యుల కెఱుకఁజేసినాఁడు. కథ ముగిసినది. కాని గానశ్రవణానంతరమునను చెవులలో గింగురు మనుచునే యున్నది. రాజాంతఃపురమున నున్న శకుంతల యిట్టి యసత్యవంతుని పోషణమున నెన్నియిక్కట్టుల నందుచున్నదో యను భావమును గల్పించినాఁడు కవి. కథ సుఖాంత మయ్యుఁ దత్పరిణామము దుఃఖాంతమేమో అని యనుకొనుటకవకాశము లగపడుచున్నవి. శకుంతల యొకటాగవోలె మనదృష్టిపథము నెదురొడ్డుచున్నది. ఇఁక నిట్టి గ్రీష్మమునకుఁ దట్టుకొనఁజాలము.

కాని యింతలో చలువనీడ యబ్బినది. మహాకవి కాళిదాసు కథ సాగించినాఁడు. కళాపిపాసువై రసైకదృష్టితో నా చిత్రమునకు మెఱుఁగులు దిద్దినాఁడు. అందు రసగులు చిప్పిలఁజేసినాఁడు. ఆ రసమును మనకు నందించినాఁడు. ప్రకృతిసమవలోకనముచేఁ గల్గు నిసర్గపారవశ్యమును యథాస్థితిఁగఁ బ్రదర్శించి యట్టియానందమునే పాఠకులకుఁ గలుగఁజేయువాఁడే విదగ్ధుఁడగు కవి. అట్టి మహాకవి ధన్యుఁడు.

కాళిదాసుని శకుంతలను బరిశీలింతము గాక. ఈ శకుంతలకు లౌకికవ్యాపారము తెలియును. కాని యామె లజ్జాశీలము నేర్చికొనినది. ఆమెకుఁ బ్రౌఢాత్వ మన నేమియో తెలియకపోలేదు. కాని ముగ్ధాత్వ మామె సహజశీలము. కవి యామె స్వాతంత్ర్యప్రవృత్తి కెచటను నిర్బంధము కల్గింపలేదు. కాని యామె సాధ్యమైనంతదనుక స్వాతంత్ర్యదూరయైయే ప్రవర్తించినది. భిన్నభిన్నప్రకృ

తుల కలయిక ముదావహమై యుండును. ఈ శకుంతలాసృష్టిలో, ఆమె స్వభావములో, ప్రకృతివిరుద్ధములగు స్వాతంత్ర్యనియమములు లాశ్రమములందలి సింహాది మృగములలోవలెఁ గలసి మెలసి యాడిపాడినవి. ఇది శకుంతల జననమందు, పోషణమునందు, వివాహమునందును గన్పడుచునే యుండును. ఆమె యతినియమియగు విశ్వామిత్రునకును, స్వేచ్ఛాపరతంత్ర యగు గణిక మేనకకును బుట్టినది. ఆమె పెరిగిన యాశ్రమము కూడ నిట్టిదే. ఒకప్రక్క ముక్కుమూసుకొని వ్రతులై దినములు గడపు జపధారులు; వేఱొక ప్రక్క 'మాపరచిత్త మాఁకఁనుగొను' విశృంఖల ప్రకృతి సౌందర్యసమాకలిత యగు వనలక్ష్మీనృత్య మొనర్చుచున్నది. ఈమెవివాహ మన్ననో, నాగరికుఁ డగు రాజు పెండ్లికొడుకు. ఆశ్రమవాసినియు నతియమాయిక యగు ముగ్ధ వధువు !!

వేఁటయందు దుష్యంతుఁడు వైఖానసవచనప్రబోధితుఁడై కణ్వాశ్రమమునకు వెడలెను. రాఁబోవు శకుంతలావివాహరూపకమున కీ వైఖానసవచనములే నాందీ ప్రస్తావనము లైనవి. కణ్వాశ్రమముజొచ్చిన రాజు శకుంతలను జూచి 'అపి తపో వర్ధతే' అని యడిగినాఁడు. కాని శకుంతల లజ్జపెంపున జవాబు నీయలేకపోయినది. 'మౌనమ్ భూషణ'మ్మను వాక్యోక్తి నీ ముగ్ధాశకుంతల సార్థక మొనర్చినది. ఇందు రాజు శకుంతలజననవృత్తాంతమును చెలులనడుగును. అనసూయ చెప్పినది. ఇందు శకుంతల కెట్టి ప్రసక్తియు లేదు. ఈ ఘట్టమున శకుంతల మనసునందలి కల్లోలముచేఁ దన్నుఁ దాను గాననట్లున్నది. అయ్యును శకుంతల 'యద్వాత్మనః ప్రభవిష్యామి' అని వ్యంగ్యముగఁ దన్నెఱిఁగించుకొనకపోలేదు. శకుంతలవృత్తాంతము వినినవెంటనే రాజామెను బెండ్లియాడ నిశ్చయింపలేదు. శకుంతలా దుష్యంతుల చిత్తపరిశోధనమున కీ మధ్య కొంతవ్యవధి యేర్పఱుపఁబడెను. ఇద్దఱును బెండ్లిచేసికొనుటే మేలని యెంచిరి. శకుంతల తమపెండ్లికి శుల్కముగ నెట్టివరములను గోరలేదు. కాని యది యనసూయా నర్మగర్భవాక్యములలో వ్యంగ్యముగ నుండిపోయినది. ఆమె 'పౌరవరక్ష అవినయం మదనసంతప్తాపి నఖల్వాత్మనః ప్రభవామి' అని విన్నవించుకొనునది. శకుంతలవినయ మిందు స్పష్టమగుచున్నది. అటుపై రాజుప్రబోధముచే వారిద్దఱికి నా చల్లనినీడలలో నతిప్రశాంతముగఁ బెండ్లి యైనది.

దుష్యంతుఁ డంగుళి నానవాలుగ నిచ్చి తాను వెడలిపోయినాఁడు. ఈ ప్రథమసమాగమమే శకుంతలకు పతనము నాపాదించినది. కాని యీ పతనమే యామెను దివ్యోన్నతస్థానమునఁ గూర్చుండఁబెట్టినది. కణ్వుఁ డంతయు దివ్యజ్ఞానమునఁ దెలిసికొని సంతసించి శకుంతలను శిష్యులఁ దోడిచ్చి దుష్యంతుని కడ కంపెను. దుష్యంతునొద్దకు వెడలునప్పటికి శకుంతల దారకసహిత యగుచో జనకునిరూపప్రతినిధి యగు భరతకుమారుని ముందిడికొనియే వాదించి యుండును. కాని కవి, రాజున కట్టియవకాశమును గల్పింపలేదు. రాజామెను నిష్కరుణముగఁ దిరస్కరించెను. శకుంతల 'ఇద మవస్థాంతరం గతే, తాదృశే అనురాగే కిం వా స్మారితేన' అని విన్నఁబోయినది. ఆమె రాజును 'అనార్య' యనుటకే కష్టపడెను. ఆమె రాజును నచ్చఁబల్కలేకపోయినది. రాజామెను దిరస్కరించకపోయినచోఁ దాత్కాలికావేగమునకు గురియైన మోహప్రవృత్తిచే శకుంతల హంసపదికలలో నొకహంసపదికయై యుండెడిది.

ఇటుపై గాథ యంతయు మహాకవి ప్రతిభావిలసనమే. నిస్సహాయయై, యవమానదుఃఖిత యైన శకుంతల తిరిగి కణ్వాశ్రమమునకుఁ గొంపోఁబడక మరీచ్యాశ్రమమునకుఁ దీసికొనిపోఁబడినది. 'పూపులమ్మినచోటఁ గట్టె లమ్ముట కష్టము గదా!' శకుంతల యిపు డమేయ మగు నైశ్శబ్ద్యమున దుఃఖశాంతి నొనర్చుకొనుచున్నది. తనపై విశ్రమించిన పాపమునకుఁ దగిన శాంతిగ విరహతప మొనర్చి దివ్యసాత్త్విక మూర్తిగ మాఱినది. ఏదేని మహత్తర మగు పదము నందఁగోరుచో నద్దానికిఁ దగు వ్యవసాయమే చేయ

పరెను. అందులకే శకుంతలా దుష్యంతులు రాఁబోవు తమస్థిరప్రణయప్రాసాదమునకు వియోగరూపక మగు తపశ్శ్రేణినిఁ గట్ట నారంభించిరి. అప్పటినిశ్చబ్దత నంతను భరతకుమారుఁ డొక్కఁడే చెవరఁగొట్టి వేయుచున్నాఁడు ఇపుడు శకుంతల పవిత్ర మగు మాతృత్వసామ్రాజ్యమున కభిషిక్త యగు పట్టభద్ర. ఆమె నెదుర్కొనువా రిపు డెవరును లేరు. ఎదు ర్కొనుచో వాడును సర్వదమనుఁ డూరుకొనువాఁడు కాఁడు. ఇందులకే కాఁబోలు రవీంద్రుఁడు 'మాతృ త్వమున కందు నపజయము లేదు!' అనినాఁడు.

అనుకొనకుండఁగనే దుష్యంతుఁడు శకుంతలను గలిసికొనెను. కాని శకుంతల తొందరపడ లేదు. నిశ్చలగంభీరయై నిలిచినది. ఆమె భర్తృ చిరకాల దర్శనమున కేమియు నుద్రేకము చూపలేదు. ప్రణ యినుల పవిత్రప్రణయమునకు వారిసుదీర్ఘవిరహమే యొకకొలతబద్ద. ఆమె, తనవలెనే విరహితపశ్చరణ ముచేఁ బూతాత్ముఁడై తనకుఁ బ్రణమిల్లి క్షమింప వేఁడిన దుష్యంతుని, శాంతభావముతో స్వీకరించినది. తండ్రి యని తెలిసినవెనుక కూడ, దుష్యంతుఁడు శకుంతలను వేఁడుకున్నచో, భరతుఁడు బాల్యచాపల మునఁ దండ్రి నొకచపేటముతో భరతము పట్టి తన సర్వదమనత్వమును సార్థకపఱచుకొనువాఁడే.

వ్యాసునిశకుంతలయే యీస్థితి కిద్పఁబడినచో 'ఖూన్ కీ బదలా ఖూన్ హీ హై' యనునట్లు దుష్యం తుని మాఱుమాటాడక తిరస్కరించియుండెడి దేమో? ఎట్లైన నేమి! మహాకవియీప్సిత మీడేరినది. ప్రణ యము దివ్యమై లౌకికమునకుఁ గట్టుపడక మార్గదర్శ కమై నిలిచినది.

శ్రీమదానందవర్ధనాచార్యులు 'నహి కథా ప్రద ర్శన మేవ కావ్యస్య ఫలమ్, ఇతిహాసాదేవ తత్సిద్ధేః' అని రచించియున్నాఁడు. దీనిని మహాకవి సత్యాసిద్ధ మొనర్చియున్నాఁడు. శకుంతలాపురస్కృతుఁ డగు మహాకవిపై లోకము పూలసోనఁ గురిసినది.

---

# వసంత సేన

శిరోమణి వారణాశి గంగాధరశాస్త్రిగారు

ప్రకృతి సౌందర్యమెల్ల రాల్పఁగఁగడంగి
యున్నచందమునేని చూపోపనటుల
నిజహిమానీ సమావృత నిఖిలభువను
శిశిరునెదిరించు తలపుతోఁచెను! మతేమొ!

తరులతా పల్లవారుణి తాల్చుఁడగుచు
నిశితకింశుక తీవ్రనిస్త్రింశమూని
ఘనఘనార్భటిఁ బురుహూత కార్ముకంబు
దాల్చి యరుదెంచె వేగవసంతరాజు.

తలఁచినంతట నెంతటి ధైర్యశాలి
నయినను జితోస్మి యనిపించునట్టి సమ్మ
దాళితతితోడఁ గనుసన్న నరయుచపుడు
రాజుతోడుత మంత్రివర్గంబు కదలె.

అనుఁగు మిత్రున కుచితసాహాయ్యమొసఁగ
ననమసాయకుఁడై క్షువాధిజ్యధనువు
నవదరించుచుఁ గతిపయాక్షౌహిణులను
గూడికొనివచ్చె యూహావక్షోణికపుడు

సాంద్రచంద్రిక ధౌతవస్త్రము ధరించి
శుకపికాలాపజయ పదస్ఫూర్తి మెఱయ
మలయమారుత నిశ్శ్వాసచలనమునకు
గుబ్బలను పుష్పమాల సంకులముగాఁగ
జారుదత్తేక్షణాత్మ సంచారయగుచు
సంతసముతోడనేగె వసంతసేన.

# వృషభరాజు

శ్రీమతి నుదుఁగమాటి శేషమ్మగారు.

తొల్లిరాజయితాను నడపిన
యెల్ల గోసముదాయ మొకచో
గూడుకొని తననాయకరమును
విడిచిపోవ దలంచినన్. 1.

తెలిసికొని ముదుసలితనమ్మున
బలముసడలిన యంగములతో
వృషభ మొకటి వనాంతరమ్మున
భీతమై కనుమూసెడిన్. 2.

చూడు డదిగో, సిదాఘతపనుని
వేడిమికి నిసుమంతతలకక
నీటికొంగలు చిలుకలును స
య్యాటలాడెడి మింటిపై. 3.

రాకపోకలు సేయు కోతుల
మూక లర్ధముతినిన ఫలముల;
మ్రానుబిల్లులు పచ్చబయళుల
లోనడాగి చరించెడిన్. 4.

సాలెపురువులు సూక్ష్మతరసూ
త్రాల కట్టెడి చెట్టుచెట్టుకు
మక్షికమ్ములు చచ్చినామై
కుక్షినింపగ జేరెడిన్. 5.

చెట్టుచుట్టూ చుట్టుకొని తన
చుట్టుప్రక్కల పసిమిచేయుచు
రాచసిరి యుడిగిన గవాధిపు
చూచునొక పెనుసర్పము. 6.

అని నిహతుడగు రాజువలె సా
యంతనమ్మున నినుడువలె గో
పతియు తన పతనమ్ము వడసె న
పారధైర్యముతోడనే. 7.

కొదమయూదూ డొకటి మదమున
బెదురుమదిలే కెదిరి తనపతి
ముసలిమై కడికండలుఁగ కొ
మ్ములను పొడిచిచనెన్. 8.

మందలన్నియు నిహతకల్పుని
కొందలంపడువాని నధిపతి
నరయ చనుదెంచియును నొకమా
రయిన మూర్కొని విషవవు. 9.

అందనుక తన బలముకతమున
నడవిజంతులనుండి కాచిన
యాలపోతుఁ గృతఘ్నతన్విడి
యవి యెటకొ చనియెన్. 10.

శక్తిసడలిన ముసలివృషభము
రక్తమున నుదరములు నింపగ
గ్రద్దలును రాబందులును గుమి
గట్టి తిరిగిన వచటనే. 11.

కందరము వెలువడిన సింగ మ
మందముగ నెలుగిడిన విని యా
ముసలియాఁగో తరనిదుర నుం
డుసురుకొని విప్పెనుగనుల్. 12.

తలనడిమి నెత్తురు తొరంగుచు
నిలబడిన కని వృషభపతి దూ
రస్థ గోసముదాయమును పది
లమ్ముగా పసిపట్టెను. 13.

ఆధిపత్యచ్యుతికతమ్మున
నరకృశించిన యట్టి గోపతి
నరయ రాయెదకల్గు మానిసి
యైన పశు గడుదుఃఖము. 14.

అరిగెసర్వము తత్పురోన్నతి
అరిగెనఖిలము తత్తనూద్గతి
మిగిలినవి నిర్మాంసములు నె
మ్మిగములును చర్మంబును. 15.

కనుడదిగో; విమలాపమగు సర
సునను నీర్మెడక్రిందు తాకగ
మక్షికలు పక్షులును చుట్టును
మసలనిలచిన దచ్చటన్. 16.

మోఘమయి విస్మృతచరాచర
భూతపంచక వర్తనమ్మయి
పఱియవాఱిన డెందమున నా
పగిదినిల్చిన దచ్చటన్. 17.

నిలచియున్నది నిలచినట్టులె
పొలములను బచ్చికబయళ్లను
రణపరాజిత వృషభసింహ
ప్రకరముల తలపోసెను. 18.

తల్లివెంబడి తోకవిడువక
నెల్లపుడు పచ్చనిపొలాలను
మెలగినప్పటి బాల్యచాపల
ములను కలగాంచెన్. 19.

కొండకోనల డిగుచు నెక్కుచు
పండువుగ తనతల్లికనులకు
మందగూడుక యేగినప్పటి
చందమును కలగాంచెను. 20.

కోడెదూడలతోడ పెయ్యల
తోడ నడువగలేక వెనుబడ
దాపుననె యా వాగిచూచిన
చూంపుకలగాంచెన్. 21.

విమలజలపాతములదరి ఘా
సమురుచుల తీపెఱుగ; ధేనువు
విడిచి తనకయితన్ను; వెడలిన
వేళ కలగాంచెన్. 22.

కాళులును దేహమ్ముబలపడి
పాలకొమ్ములయుగమ్ము వెలువడి
కొండచఱియల నుదుటునను డీ
కొనుటకలగాంచెన్. 23.

జంగమకుభృద్భంగి నిలబడి
సమవయస్కుల కకుద్మంతుల
శృంగసంగరమున జయించిన
చేవ కలగాంచెన్. 24.

తారకలు సుముఖమ్ములయి గ్రహ
వారములు శుభపదగతములయి
మందలకు నొడయనిగ జేసిన
మహిమ కలగాంచెన్. 25.

జవ్వనపు పేరాముకతమున
సకలవృషనాయకుల నోరిచి
యెదగొనిన లేఁబెయ్యఁగూడిన
చదురు కలగాంచెన్. 26.

యుద్ధమున నందీశ్వరుఁవలె
క్రుద్ధమయి తోకెత్తి ఎదురెవ
రనెడి క్రియస్వేచ్ఛగ మెలంగిన
దినము కలగాంచెన్. 27.

క్రమగమితసూచ్యగ్రముల శృం
గముల చీలిచి నేల రెండుఁగ
నడవి యదరగ నెలుగిడిన యా
గడము కలగాంచెన్. 28.

దారికడ్డిన వృషముగానీ
కోరికొల్లని గోవుగానీ
ఎదిరినిలచిన హరిని కానీ
ఎఱుగమిని కలగాంచెను. 29.

వనపరిభ్రమణాల నొకతరి
తనవిషాణమువాడి యెఱిగిన
మృగము రెండవసారి యెదురయి
అగపడమి కలగాంచెను. 30.

అడవిమెకముల నదరజేసెడు.
నట్టికొల్పులిమైన తనతో
పోరిరెండవసారి పొంతను
పోమి కలగాంచెన్. 31

పూర్వపౌరుషములను నెద తల
పోసి యానందించుచును వృష
రాజు తనకలలోనె రాజయి
తావడినగతి నిలచెను. 32.

ఇనుపముక్కుల గ్రద్దగమిపై
నెనసి యానందమున దనమై
తొరగి మిగిలిన నల్లద్రావగ
దొరకొనిన, పెన్వేదనన్. 33.

నిదురమేల్కని తత్క్షణము స్వా
ప్నికము తనకోసార్వభౌమత
తెలిసికొని యాముసలినృపపతి
వెడలె నెప్పటికో. 34.

అధిపత్యంబెంత కలిగిన
నంగపత్వం బెంత మెఱసిన
వార్ధకమ్మున జీవి కుత్తల
పాటు తప్పదిలన్. 35.

—'Bull' అను ఆంగ్లరచన కనువాదము.



# విషాదము

యలమర్తి సీతారామస్వామి గారు

అభ్రతలమును అండకొనియెడు
విపులశాఖా విలసితంబగు
దీర్ఘభూరుహ సంచయమ్ములు
ధ్వంసమయ్యెను నొక్కట. !—

సర్వమానవ సంఘములకును
సమ్మదంబును సరవిగూర్చే
ఫుల్లమంజుల పుష్పపుంజము
పుడమిఁగలియునే !—

నిఖిలసంపద నివ్వటిల్లగ
వితతసుఖములు వెల్లివిరియఁగ
సౌఖ్యమందే జనసమూహము
సతమట్లుండునే !—

విశ్వమెల్లయు వేడ్కబొందగ
విశ్రుతంబగు విమలగానము
ఆలపించే అతివయెప్పుడు
అవనిమనబోవునే !—

అఖిలజగముల ఆవరించిన
అంధకారము నణగద్రొక్కిన
ఆహిమాంశుడు ఆకసమ్మున
అలరజాలడుగదా !—

కుతుకమొసగెడు కుముదబాంధవు
కౌముదీతతి గహ్వరీస్థలి
శాశ్వతంబుగ సంచరింపగ
జాలదుగదా !—

అచ్చటచ్చట ఆనభంబున
ప్రభలనీనుచు పరగుచుండెడి
ఉడుగణమ్ములు ఒక్కక్షణమున
మాయమగునుగదా !—

# భూకంపము: విచిత్ర దైవ సాహాయ్యము

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

మాంగీరుపట్టణమున నొక డాక్టరు గలడట. ఆయన స్వంతషాపుపెట్టుకొని దీనిరాబడిపై జీవించుచుండెనట. తనయింటియం దర్ధభాగము రోగులకై విడచి తా నాలుబిడ్డలతో మిగిలిన సగముభాగమున నివసించుచుండెనట. ఇట్లుండ మాంగీరులో మొన్న భూకంపమైన దినమున యాతనియింటియం దిరువురు ముప్వురు రోగులును కాంపౌడరును గలరట. భూమి కదలుట ప్రారంభమైనతోడనే యాడాక్టరిది గ్రహించి ఇల్లు మీదబడునను భయమున ఆలుబిడ్డలను తల్లిని ఇంటివిడచి ఆవలకు బొమ్మని చెప్పి తానుగూడ వారితో వెడలుచు, ఇంతలో ఇంటియందు రోగులును కాంపౌండరును గలరని జ్ఞప్తికిరా వారిని గూడ రక్షింపదలచి పోవుచున్న యాతడు వెనుదిరిగి రోగులున్న యెడకు వెడలబోవుచుండెనట. ఈతడొకవసారావద్దకు వచ్చునప్పటికి ఇంటి పైకప్పును గోడలును కూలి యాతనిమీద బడిపోయెనట. వెంటనే యాతనికి స్మృతితప్పి తిరిగి నాల్గుదినములకు తెలివిగల్గెనట. అట్లు స్మృతితప్పినవెనుక చూచుసరికి దైవవశమున ఇంటిపైకప్పతనిపై నొక గుహావలెబడెనట. ఈతనికి దాహముచే గొంతెండిపోవుచుండుటచేత తడుముకొనగా నొక నీళ్లతోనిండినకుండ యొకటియు, ఇల్లు పడునప్పుడు త్రోసికొనిపడిన యొక పిండికుండయు, పంచదారకుండయు, చేతికిదొరకెనట. వెంటనే యాతడు దాహబాధానివర్తికై యానీటిని గొంతద్రావి క్షుద్బాధానివారణార్థమాపిండిని, పంచదారను కలిపితినుచు ఇట్లు పదునొకండురాత్రులా గుహాలోగడిపెనట. ఇంటిపైకప్పు పడునప్పు డొక చిన్న రంధ్రమేర్పడగా అందుండి గాలి పీల్చుకొనుచుండెనట. పైనుండి వాన భోరున కురియునప్పు డీ రంధ్రముద్వారా నీరు పడుచుండెడిదట. అట్లు పడునప్పు డొక మూల నొదిగి కూర్చుండుచు, పైనుండి వర్ష బాధను, దిగువనుండి శవములు కుళ్లుటచే గల్గిన దుర్గంధభూయిష్టమైన వాసనను భరించుచు పాపమాతడు పదునొకండుదినము లట్లా నరకవాసము ననుభవించెనట. నిలుచుండిన పైకప్పు తగులుచుండుటచే ఈ పదునొకండు దినములు కూర్చొనియే యుండెనట. ఇట్లుండ నక్కలు కొన్ని శవముల దినుటకై భూమిలోనుండి సొరంగములు జేసికొని వచ్చుచుండెనట. ఒక నక్కమాత్రము ఇండ్లు పడుటచే గల్గిన ఇటికిరాల కుప్పలోనుండి సొరంగము చేసికొని శవమను భ్రమచే యాతని దరికి వచ్చెనట. అంత నీతడు దగ్గరనున్న రాతిని దానిపై విసరెనట. ఆ నక్క చేసిన సొరంగమును తొంగిచూడగా యాతనికి బయలు ప్రదేశము గానవచ్చెనట. అంత నాతడీ నరకవాస మనుభవింపలేక ఇంతవరకు గాపాడిన యాసర్వేశ్వరుడే ఇంకను గూడ రక్షింపగలడను ధైర్యము జేసికొని యా సొరంగములో బడి ప్రాకుకొనుచు

అతికష్టములో బోయి పైన బడెనట. వెంటనే యాతడు చుట్టుపట్ల బరికింపగా దూరములో గొందరు మనుష్యులు గనబడ వారిని చేసంజ్ఞచే బిలచి మూర్ఛాగతుడై యచ్చటనే బడిపోయెనట. దూరముననున్న మనుష్యు లీతని చేసంజ్ఞచే నచటికి వచ్చి మూర్ఛనున్నయీతని సమీపముననున్న హాస్పిటలు కుగొనిపోయి తగుచికిత్స గావించిరట. మరల మూడుదినముల కితనికి తెల్వి గల్గెనట. తెల్వి గల్గినవెనుక తన స్థితి నంతను వారలకు దెల్పి తన యాలుబిడ్డల గూర్చి యడుగగా వా రాతనియింటివారు క్షేమముగా నున్నారనియు, వారు మొదటవీధి దాటుచుండగా యింతలో ఇల్లు కూలుటచే గొన్ని గాయములు తగిలె ననియు, అంత వారలనుకూడ నింక హాస్పిటలుకు గొనిపోయిరనియు, తగుచికిత్స బొందినవెనుక వార లిప్పుడు క్షేమముగా నున్నారనియు అచట నున్నవారు తెల్పిరట. మరునా డీతడు కొంత స్వస్థచిత్తుడైనవెనుక తన దారపుత్రాదులను గలసికొని యానందాబ్ధిలో మున్గెనట. యాత డీ వూరనున్న తన బంధువులకు వ్రాసెను. ఆహా! దైవసాహాయ్యమే లేకున్న నాత డిట్లు బ్రతికి బయట బడునా!! లేకున్న గాలి వీల్చుట కా రంధ్ర మేర్పడుట యేమి? ఇంటిలో నేమూలనో యున్న పిండికుండయు, బంచదారకుండయు నీతని దరి పడుట యేమి? అట్లు బడియు నయ్యవి బ్రద్దలుగాక, తల క్రిందులుగా బడక, స్థిరముగా బడుట యేమి! అంతవర్షము గురిసినను ఇల్లు నేలమట్టముగాకుండ ఈత డున్నంత వరకు గుహవలె నుండుట యేమి? తిరిగి యీతడు బయటకు వచ్చుటకై సొరంగము గూడ గన్పడుట యేమి? తన ప్రాణమున కాసింపక రోగులను కాంపౌండరును రక్షింపబోయి కదా యీత డిన్ని బాములుబడెను. అందులకే దైవ మట్టు దోడ్పడి యీతని దిరిగి యీతని దారపుత్రాదులతో గలపెను. గన బరులకు సాయము చేయువానిని దైవము రక్షించును గదా!

——:0:——

# భరతమాత!

శ్రీమతి తుమ్మల చుక్కమ్మగారు

సీ॥ సతతశోభాపూర్ణ సస్యజాలావృత మేదినీస్థలముల మిగుల నెగడి
సర్వసౌఖ్యప్రద సకలార్థములచేత రత్నగర్భ యనంగ రహిని బరగి
విమలజలాధారవిహిత గంగాయమునాది సన్నదులచే నరయ వెలసి
ఖండఖండాంతర ఖ్యాతిగాంచిన జ్ఞాననిధులకు నిలయమై పృథివి జెలగి

గీ॥ యనిశమునులచ్చికిరవయి యలరినట్టి నీవు పెద్దమ్మకిప్పుడు నిలయమైతి
వక్కటక్కట హృదయంబు నిక్కువముగ!! బ్రదలయ్యెడు నెట్లహో భరతమాత

# భారతనారీమణుల యాదర్శము

శ్రీమతి వెలిదండ చూడికుడుత్తమ్మగారు

మనము తెల్లవారి కన్నువిచ్చి చూచుసరికి ప్రత్యక్షమగునది స్థావరజంగమాత్మకమైన ఈ చరాచరసృష్టి-ప్రపంచకము. మరికొంచము ఆలోచించిన యెడల ఈ సృష్టియంతయుకూడ భిన్న భిన్న ప్రకృతులతో కూడియున్నదనియు, సృష్టిలోని ప్రతి అణువును తనకున్న సాధన సంపత్తితో అభివృద్ధిని పొందుటకు ప్రయత్నించుచుండుట స్వభావికమనియు మనకు స్పష్టముగా కనబడును. అందులో ముఖ్యముగా సృష్టికర్తయైన పరమేశ్వరుడు మానవునకు ప్రత్యేక విలక్షణమైన బుద్ధిజ్ఞానశక్తుల నొసంగి, తదుపయోగములో మానవునియొక్క అభివృద్ధినంతయు నిమిడ్చియున్నాడు. స్త్రీ పురుషులిద్దరికిని ఈ శక్తులు సమానముగా ప్రసాదింపబడినవి. కాని వాటిని ఉపయోగించుకొనుటలో మాత్రము ప్రత్యేక ప్రత్యేకముగా నిష్కంటకమైన రాజమార్గములు ప్రకృతి సిద్ధముగా ఉన్నట్లు స్పష్టముగా కనబడుచున్నది. పురుష ప్రకృతి దృఢమై, వీర్యయుక్తమై అధికారసూచకమై దేహ మనో కష్టములను సహించునదై యున్నట్లు గాన్పించును. స్త్రీ ప్రకృతియన్నో ప్రేమయుక్తమై, సునిశితమై, మృదుమనుకమంజులమై ఉన్నట్లు గాన్పించును. తియనది అన్నమొక్కటైనను, వివిధములైన రుచ్య పదార్థములతో మేళగింపబడినప్పుడు ఆ పదార్థముల యొక్క ధనసు ఆ అన్నమునకు సంక్రమించి ఎట్లు రుచ్యముగా ఉండునో, అదేవిధమున సరిసమానముగా మానవులందరికి భగవత్ప్రసాదితమైన బుద్ధి, జ్ఞానశక్తులు ప్రకృతి సిద్ధములు ఈ వివిధ స్వభావములతో మేళగింపబడి క్రియారూపమును దాల్చినప్పుడు వివిధ రూపములుగా కనిపించుచుండును. స్త్రీపురుష ప్రకృతులు భిన్నములుగానున్నను, పరస్పరాధారములై, ఏకోన్ముఖములై, ఏకాదర్శ సంధానకర్తలై ఒకదానికింకొకటి మేళవింపు జేసికొనుచు వినిర్మలానందమును అనుభవించుచూ ప్రపంచమున తమ జీవితగమన స్థానములను చేరగల్గుటకు అవకాశమును పొందుచున్నవి. స్త్రీ ప్రకృతి ఎల్లప్పుడును తన సహనశక్తిచేతను, ప్రేమపూరిత హృదయముచేతను, సునిశితమైన బుద్ధి చాతుర్యముచేతను, మృదుమనుమంజుల వాక్కులచేతను పైకి జయించునట్లు కనబడినను, లోకమునంతటిని తన అరచేతను ఇముడ్చుకొనగల్గినంత శక్తిని కల్గియున్నది. అట్లుండినప్పుడే నిజమైన గృహస్థధర్మము జరుపబడుచూ గృహము స్వర్గముగా గాన్పించునట్లు చేయును. పరమేశ్వరుని ప్రేమమంగళస్వరూపము కన్నులార అందు గాంచగల్గుదుము. అట్టి కుటుంబములే ఆదర్శకుటుంబములు. ఇట్టి కుటుంబినులుగానుండుటే భారతనారీమణి జీవితాదర్శము. అతిశయోక్తులే కానిండు. నిజములే కానిండు. భారతనారీప్రపంచమున మాత్రము దేవతలను సహితము తమ హస్తమున ఇముడ్చుకొనగల్గినంత శక్తి తమ పవిత్రచరిత్రమూలమున పొంది యశోదేహినులై కీర్తిగాంచినట్లు నేటికిని నమ్మబడుచున్నది.

పురుషులు కొంతవరకు స్వతంత్రులు గాన స్త్రీలను భేదస్వభావములను స్వలాభపరాయణులు కొంతమంది ఆరోపించినారని నాదవ కొప్పుకొందను. స్వలాభపరాయణులగు కొంతమంది వ్యక్తులచేత స్వలాభముకొరకు చేయబడిన కర్మ ఒకదేశమున కంతటికి కొన్నివేల సంవత్సరముల తరబడిగా అమలులో ఉండి సర్వజనామోదమును పొందునని ఇంగితజ్ఞులగు ఎవ్వరైన ఒప్పుకొనెదరా? ఇది ప్రకృతి సిద్ధము. మృగములలో సహితము విమర్శనా దృష్టితో పరిశీలించిన నిజము బోధపడును. పుంజు, పెట్ట, ఎద్దు, ఆవు, గండుపిల్లి, మగపులి, ఆడపులి, మగకాకి, ఆడకాకి, మగపిచ్చుక, ఆడపిచ్చుక, ఇవి అవి అననేల? సాధారణముగా మనము చూచు

ప్రతి జాతిలోగూడ స్త్రీజాతి పురుషజాతికంటె భిన్నప్రకృతి గల్గినట్లు స్పష్టముగ గాన్పించును. అన్నిటికిని వ్యతిరిక్త స్వభావమును కనబరచుచున్న ఇప్పుడుగూడను పురుషుడు భరించువాడుగను, స్త్రీ భరింపబడునదిగను ప్రపంచమునందంతటను గాన్పించుచున్నది. యుద్ధరంగములలోగాని, సముద్ర మధ్యమునగాని పెద్ద పెద్ద ఆపత్తులు సంభవించినప్పుడు మొట్టమొదట చేయబడునది స్త్రీలను బిడ్డలను కష్టములు పడకుండ తప్పించుటకే ప్రయత్నించుట. తన ప్రాణములనైనను ఒడ్డుటకు వెనుదీయదుగాని స్త్రీల యొక్క మానమర్యాదలకు మాత్రము వీసమెత్తు లోపము వచ్చుటకు అంగీకరింపదు పురుషప్రకృతి. ఇట్టి సంగతి సందర్భములలో నీరు తన చల్లదనమును వదలి, తనలోకూడ బడబానలము ఉన్నదను నెపమున ఉష్ణస్వభావమును పొంద ప్రయత్నించిన ప్రపంచమున కెంత అశాంతి ప్రదాయకమో, స్త్రీ సహితము తన సహజస్వభావికశక్తులకు భిన్నమైన అనుకరింపు అనుకరింప ప్రయత్నించుట ప్రపంచ శాంతికి అంత భిన్నము.

కొద్ది సంవత్సరములనుండి మన దేశస్థులు, పర దేశస్థులచేతను, కొంతమంది స్వదేశస్థులచేతను కూడ మన దేశములో స్త్రీలను బానిసలకన్న హైన్యముగా చూచుచుండురను ఒక పెద్ద మచ్చను ఆరోపించుచూ, అనేక నెపముగా ఈ దేశస్థు లెందులకునూ పనికిరారను తోసి రాజుకు గురిగా జేయుచున్నారు. ఇప్పుడు ఒక ప్రశ్న బయలుదేరుచున్నది. వారు పనికిరానివారుగా మారినతరువాతనా స్త్రీలను బానిసలగా జూచుట, లేక స్త్రీలను బానిసలగా జూచినతరువాతనా వారు పనికిరానివారుగా మారుట.

ప్రపంచమున ఎక్కడైనను తాను అష్టైశ్వర్యములను అనుభవించుచూ తన దేవతయైన తల్లినీ, సహభాగినియైన భార్యనూ ప్రేమపరిణామస్వరూపిణియైన ముద్దుబిడ్డను, దాసీలగా జూచుట సంభవమా. ఇప్పుడును మగపిల్లలకన్న ఆడపిల్లలనే ఎక్కువ ముద్దుగా జూచి తగినవరు లెట్లు లభింతురో అని ఆరాటపడుచుండుట లోకవిదితము.

హైందవజాతీయపురాణపురుషులైన త్రిమూర్తులునూ తమ భార్యలకు ఏ స్థానమొసగి గౌరవించిరో లోకవిదితము. అటుపిమ్మట మహోన్నతదశయందున్న వేదకాలమున గార్గి, మైత్రేయి, భానా, సూర్యా మొదలగు ప్రసిద్ధికెక్కిన విదుషీమణులు పెక్కుమంది ఉన్నట్లును జగద్వంద్యమైన జనకసభవంటి గొప్ప గొప్ప సభలలోగూడ పండితులతో సరిసమానముగా నిజతత్వమును గ్రహించుటకుగాను వాదోపవాదములు సల్పుటయునూ, వారిచే వ్రాయబడిన ఋక్కులనుకూడ చిరస్థాయియైన వేదముతో చేర్చుటకును తగిన అవకాశములను కలిగియున్నట్లునూ కనబడుచున్నది. ఉపనిషద్యుగములోను, పురాణయుగములోను, బౌద్ధయుగములోను చివరకు మహమ్మదీయయుగములోను గూడ హైందవనారి యాదర్శమునకు ఏమాత్రము భంగము రానిచ్చుకొనక రాజ్యాంగ నిర్వాహిణులుగను, మతబోధినులుగను, కవయిత్రులుగను, యుద్ధరంగవిశారదలుగను ఉండి పేరెన్నిక గాంచినట్లు ప్రబల నిదర్శనములు గాన్పించుచున్నవి. ఇప్పటికిని గణితశాస్త్రజ్ఞులకు దురవగాహమైన గణితశాస్త్రమును లిఖించిన లీలావతియొక్క మేధాశక్తి అతిస్తుత్యము గదా. "యథా రాజా తథా ప్రజా" అన్న సామెతమాత్రము నిరాధారము గాదు. మొన్న మొన్నటి తంజావూరు రాజుల కాలములలో, చోళరాజు కాలములలో, కృష్ణదేవరాయల కాలములలో, మొల్ల ముద్దుపళని మొదలగు పెక్కుమంది విదుషీమణులకు మన దేశమవకాశ మొసంగియుండెను.

పరదేశరాజుల దాడుల సందర్భములలో లెక్కించుటకు శక్యముకాని విజ్ఞానపీఠముల నన్నిటిని అగ్నిహోత్రుడు తన పొట్టను పెట్టుకొనెను. గనుక పూర్వుల చరిత్రనుగూర్చి తగినన్ని నిదర్శనములు చూపగల్గుటకు ప్రస్తుతము ఆధారములు దొరకుట

కష్టసాధ్యముగానున్నది. అట్లు గానిచో ఒక్క మన హిందూదేశమునందే గాక ప్రపంచమునగల ఖండఖండాంతరవాసులచేతను, అత్యుత్తమ గ్రంథ రాజమని పొగడ్తకెక్కిన గీతాకారు డెవరో నేటికిని గుర్తింపగలిగితిమా. ఎప్పుడైతే పరరాజుల దౌష్ట్యచేతలకు ఈ దేశము గురిగాజేయబడుటకు మొదలిడినదో అప్పటినుండియే దేశమునకు విజ్ఞానములోనేమి, మానాభిమానములలోనేమి, దిగుదల గాన్పించు రోజులు మొదలిడినవని ఒప్పుకొనక తప్పదు. గృహమేధికి బయటి ఒడుదుడుకులు ఎక్కువగుచున్న కొలది గృహమునగల సమస్త విషయములను దిద్దుబాటు చేయుటకు వినుగుదల కలుగుట ఎట్లు సహజమో అట్లే దేశమునందు విజ్ఞానస్థానే అజ్ఞానము తాండవించినప్పుడు దిద్దుబాటు చేసుకొనుటయందు అలసత ఏర్పడుట సహజము. కేవలము విరేచనబద్ధముచేతనే శరీరమంతయు అనేకవిధ రుగ్మతలకు ఆకరమై ఎందులకు కొరగానట్లు రాజులయందు నిజమైన విజ్ఞానము నశించి, కేవలము తృష్ణాతురులై, లోభపరులై, పరస్పర ఈర్ష్యాతురులై నశించుటకు మొదలిడినప్పటినుండియే దేశమునఅనేక విధములైన దురాచారములు చూప మొదలిడినవి. క్రమక్రమముగా దేశీయులలో ఒక గొప్పవాడు ఒక ప్రత్యేక మానసికపరిస్థితిచే ఒక పని చేసిన అదే గుడ్డెద్దు ఆచారముగా దేశమంతటిచే అవలంబింపబడుటకు మొదలిడుచూ హైన్యస్థితికి వచ్చినను ఆ రాజులు ఏమియు చేయజాలక ఆ ప్రవాహమున తాము బడి కొట్టుకొనిపోవునంతటి హైన్యస్థితికి పాల్పడిరి.

అందువలననే ఎక్కువ ఒడుదుడుకులుగల ఉత్తర హిందూదేశమున సహగమనము, నరబలి మొదలగు అనేక దురాచారములు ఆచరణలో ఉండుటయు, అంతగాలేని దక్షిణ హిందూదేశమున అంతకన్న కొంత నయముగానుండుటయు అందరికి తెలిసిన విషయమె. అంతియేగాని స్త్రీలమీద ప్రత్యేక కార్పణ్యముచేత పురుషులు విధించినారను వాదుక కేవలము అసంభవమైనది. స్త్రీలతోపాటు పురుషులుకూడ కొన్ని కొన్ని అజ్ఞానవిధానములకు గురిగా బడుచుండిరను విషయము చరిత్రకారులకు విస్పష్టము. కాలమాన పరిస్థితుల ననుసరించి రాజ్యాంగ ధర్మములు మారుచున్న కొలది మన స్థితిగతులు "నానాటికి తీసికట్టు నాగంభొట్లు" అన్నట్లు నేటి కీ స్థితికి వచ్చితిమి. ఇప్పుడు మన మొదటిప్రశ్నకు సమాధానము దొరకినది. వారు ముందు బానిసలగా మారిరో, స్త్రీలు ముందుగా బానిసలగా మార్చబడిరో అన్న విషయము.

వర్తమానయుగమున రాజకీయవాతావరణము ఎంత త్వరితగమనమున పరువులిడుచున్నదో అంతకన్న వడిగా స్త్రీజనవాతావరణమునందుగూడ అనవరత సముద్రతరంగమాలికలవలె స్వాతంత్ర్యతరంగము అనిశము మారు మోగుచున్నది. దానిని స్వాతంత్ర్యతరంగ మనవలెనో, స్వేచ్ఛాతరంగ మనవలెనో బోధపడకున్నది. అది సృష్టిని పరమ మంగళస్వరూపముగా జేయునో, శ్మశానభూమిగా మార్చునో తెలియకున్నది. రాజకీయ స్వాతంత్ర్యమును, వివాహ స్వాతంత్ర్యమును, విడాకుల స్వాతంత్ర్యమును, ఇక ప్రపంచమున ఎన్ని స్వాతంత్ర్యములున్నవో అన్నివిధములైన స్వాతంత్ర్యములను అనుభవించుచున్న అమెరికా దేశమునందలి స్త్రీల విషయమై కొంచెము విచారించుదము.

ఆ దేశములోనే పేర్వడసిన హైకోర్టుజడ్జీ ఆ దేశములో నూటికి కనీసపక్షము 80 మంది విద్యార్థిదశలోనే దుష్ప్రవర్తనలై ఆత్మవంచితలైవారని బహిరంగముగా చాటిచెప్పెను. వేరొకచో ఒక డాక్టరుగారు తనవద్దకు వచ్చిన విద్యార్థి పేషెంట్లలోనే ముప్పాతిక మువ్వీసము సుఖసంకటములవారే గలరని నొక్కిచెప్పెను. వేరొక సమయమందు పేరెన్నికగన్న ఆ దేశస్థుడే ఒకానొకచోట మాటాడుచూ తమ దేశమున వివాహమునకు నిజమైన కన్య దొరకునను ఆశలేదు అని వగచెను. పాపము అందులకనే ఎంత ధనవంతులైనను ఆదేశమున వివాహమన్న అంత భయపడుదురని వాడుక. ఇక వివాహముల

విలువ చెప్పవలసిన పనిలేదు. యుక్తవయసు వచ్చి నేను నిన్ను మనస్ఫూర్తిగ ప్రేమించి నీ కష్టసుఖము లలో సమభాగినిగా ఉందునని ప్రమాణవాక్యములు పలికి వివాహము చేసుకున్న యువతులే ఒకఘుంటయై నను నిక్కచ్చిగా ఆవివాహసూత్రమునకు బద్ధులుకాక ఉన్నట్లు పత్రికాపాఠకుల కందరికి విశదమే. విద్యా వతులై మనస్సు ఒకరికి దత్తము చేసినట్లు ప్రమాణము చేసి తిరిగి వెంటనే విడబడుట ఎంత నీచతరమో, ఎంత విశ్వాసరాహిత్యమో, ఎంత అనీతిదాయకమో యోచించిన బోధపడకపోగు. పరమపవిత్రములైన శాశ్వత ధర్మసూత్రములకు గొడ్డలిపెట్టు గదా ఇట్టి ఆచారములు. ప్రపంచమున కంతటికి శాశ్వత లాభ కారియై మానవజీవితమునకు సాఫల్యకారియై ఒప్పు చున్న సత్య, నీతి, ధర్మ, సూత్రమునకు ఎప్పుడైతే విచ్ఛిత్తి కల్గుటకు మొదలిడినదో అప్పుడే కుటుంబ శాంతి, దేశశాంతి, ప్రపంచశాంతి, సమస్తము నశిం చక తప్పదు.

అందులో ముఖ్యముగా స్త్రీలే సంఘమునకు పునాది వంటివారు. సత్య, నీతి, ధర్మములకు పట్టు గొమ్మలు. భవిష్యత్సంతానోద్ధారకలు. అట్టియెడ వారిలోనే కట్టుబాటు నశించి వెకిలితనమునకు ప్రాధాన్యత కనబడిన ఇక చెప్పెడిదేమున్నది.

అందుకనే మహానుభావుడగు గీతాకారుడు స్త్రీనీతి విషయములో ప్రత్యేకముగా కొన్ని శ్లోకములు విర చించెను ఇంకను లోతుకుపోయిన పాశ్చాత్య నాగరికతకు చిహ్నమైన స్త్రీల అంతస్థు ఎంత జొన్న త్యములోనున్నదో అందరికిని తెలియును. వస్త్ర ధారణలోనేమి, సౌందర్యములకొరకు వారు పడు పాట్లుగూర్చియేమి, యోచించినచో పురుషులు సహితము తలలు మోకరించవలసినదే. ఇక న్య సంఘముల వింతలు చెప్పవలసిన పనిలేదు.

పరమపవిత్రమైన ధర్మముకొరకు తమ జీవితము లనుకూడ తృణప్రాయముగా అర్పించిన మన దేశ మున సహితము ఇట్టి వాతావరణమే ఆదర్శనీయమా!! పీడపోయి పిశాచము పట్టుకొనినట్లు అజ్ఞానవాతావర ణము నశించినదానికి బదులు ఇదియా మన మాచరించ వలసినది. అనేక పాట్లుపడి దేశమంతయు చే జిక్కించుకొనినను ఒక స్త్రీనైనను చేజిక్కించుకొన లేదని అనేకమంది పరరాజులచేత స్తుతింపబడి పేరిన్నికగాంచిన పవిత్ర హైందవనారీ ప్రపంచమున ఇట్టి పరిస్థితులకు చోటు దొరకకుండుగాక. పరమ మంగళస్వరూపుడగు పరమేశ్వరుడు తన మంగళ దృష్టిని మనమీద విడనాడక ఇట్టి పరిస్థితులు కలుగ కుండునట్లు మనలను రక్షించుగాక!!

---

## శాపవాక్కు

గుంటూరి వేంకటశాస్త్రిగారు.

అది ప్రశాంత సముద్రమధ్యమున నావ
నిండుజలముల పయనమం దుండువారి
కదియె తొలిసారి దంపతు లందుగలరు
రాగబంధము మాటలు రానిబిడ్డ.
విభుడు చుక్కానిదాల్చె నావెలది తేడ్డు
పట్టినదిబిడ్డ పాటలు పాడినాడు.
గాలిదేవుని మితిలేని కనికరమున
నావపయనము వారి కానందమొసగె.
గోచిపాతకిరాతుడు చూచినాడు
మేనుపులకింప గుటకలుమ్రింగినాడు
మగువ తనదనిభావించి మతిచలించి
గుండుధట్టించి నావను కొట్టినాడు.
వినపడెను దిక్కులందెల్ల విషపునవ్వు
ఇట్టెచూచిరి చుక్కాని పట్టుసడలె
తెడ్డు జలముల పడిపోయె. బిడ్డపాట
లాగిపోయెను. మఱి బ్రద్దలయ్యె నావ.
ఆశతో రెండుచేతుల నామెకొఱకు
చాచినాడు కిరాతుడు శాపవాక్కు
చూచినా డామెకనులలో వీచెప్రళయ
కాలవాయువు రౌద్రరంగమ్ము జలధి.



యువతీ విద్యానిలయము
బాపట్ల



భీమునిపట్టం ఉన్నతపాఠశాలా
విద్యార్థిబృందమువారి నాటకప్రదర్శనము.

# ప్రశ్నత్రయము

చట్టి రామారావుగారు బి.,ఏ.

ఒకప్పుడు ఒకరాజుండెను. అతనికొక నాడు వింతగానొక యుద్దేశము కల్గెను. ఒకపనిని జేయుటకుఁదగిన యదను; సరియైన సలహానిచ్చుటకు దగిన మనుష్యులు; ఏక్షణ మందైననుఁదా జేయవలసిన ముఖ్యవిధి" వీని నెరిగినచో, బరిపాలనాసందర్భమున తప్పక విజయమొందగలనని యెంచెను.

ఈమూడు విషయములకు సరియైన సమాధానములు చెప్పువానికిఁ బెద్దబహుమానమిత్తునని చాటించెను. అనేక పండితులువచ్చిరి. కాని, యొకరి సమాధానము లింకొకరి వానితో నేకీభవింపలేదు. ఒక్కొక్క రొక్కొక్క విధముగాఁజెప్పిరి. రాజు సంతృప్తి పొందలేదు.

ఊరివెలుపల నొకసన్యాసియుండెను. అతడు చాల కుశాగ్రబుద్ధియని ప్రసిద్ధి. గొప్పవారనిన నతనికి కోపముమెండు. వారిని దనచెంతకు రానీయడు. కాని వారి కష్టములందు సాయముచేయుచుండెను. ఈసంగతి నెఱిగి, రాజు, మారువేషమున సన్యాసివద్దకు బోయెను.

తన పాకముందు సన్యాసి మొక్కలకు గొప్పు త్రవ్వుచుండెను, "మహాత్మా, మూడుప్రశ్నలకు నాకు సమాధానము కావలెను. ఏసమయమున నేపని చేయవలెను?; నేముఖ్యముగా నెవరి సహాయము గోరవలెను? అన్నిటికంటె మహాముఖ్యమైన కర్తవ్యమేమి?" అని రాజడిగెను.

శాంతగంభీరవదనముతో సన్యాసి విని, గొప్పు మరల త్రవ్వసాగెను. "అయ్యా, ఆపార నిటు తెండు. మీ రలసినట్లున్నది. నేఁ గొంచెముసేపు త్రవ్వెదను" అని రాజు పారతీసికొని త్రవ్వెను.

కొంతసేపటికి రాజు పారను గ్రిందనుంచి సమాధానములు చెప్పుడనివేడెను. సన్యాసి పారతీసికొనుచు, "నీవు కాసేపు విశ్రమింపుము" అనగా, వలదని రాజు మరల త్రవ్వ మొదలిడెను. చాలసేపైనది. అతడు విసుగొంది "అయ్యా, మీరు నా కుపదేశము చేయలేనియెడల బోయెదను. సెలవు"అని లేచునంతలో నొకమనుజుడు మహాందోళనములో నచ్చటికి పరుగునవచ్చెను. ప్రక్కలోఁ దగిలిన గాయమునుండి రక్తమువరదలై ప్రవహించుచుండెను. అతడు చేతులతో గాయమును గట్టిగా నొక్కిపట్టెను గాని, యతని చేతులు రక్తముతో తడిసిపోయెను.

రాజతనిగాయమును గడిగి కట్టుకట్టెను. పిమ్మట మంచినీరు తెచ్చి వాని దాహము తీర్చెను.

పొద్దుగ్రుంకెను. హాయిగా చల్లగాలి వీచుచుండెను. రాజాశరణాగతుని మెల్లగా పాకలోనికి మోసికొనిపోయి పరుండజేసెను. తానును అందే నిద్రించెను.

ఉదయమున నతడు కన్నులు తెరుచునప్పటికి గాయము తగిలినవాడు విచార సూచకవీక్షణములతో దీనముగా రాజును

దిలకించుచుండెను. "అయ్యా అపరాధిని నన్ను క్షమింపుము" అని వేడుకొనెను.

"నే క్షమించుటయేమి? నీవెవరవో నే నెరుగనుగదా!"

"కాని మిమ్ము నేనెరుగుదును. మీరు మాయన్న చేసిన నేరమునకై వాని నురి తీయించి వాని యాస్తిని దివాణములోనికిఁ గల్పుకొనిరి. నేను మిమ్ములను జంపెదనని శపథముచేసి, పగసాధించుటకు యత్నించు చుండ భటులు నాజాడలు తీయుచుండిరి. నిన్న మీరొంటరిగా సన్యాసి కుటీరమునకు వచ్చెదరని విని దారిలో బొంచి తిరిగి వచ్చునప్పుడు చంపనెంచితిని. మీభటులు నన్ను గుర్తించి పొడిచివైచిరి. నేను తప్పించుకొని పారివచ్చితిని. మీరు నా గాయమునకుఁ గట్టు కట్టితిరి. ఎవనిని జంపుటకు యత్నించితినో వానినే శరణుజొచ్చితిని. నే మహా శత్రువని యెవనిని దలచితినో యతడేనాప్రాణ దాతయాయెను. నేజీవింతునేని మీబంటునై మీసేవచేసికొనెదను" అని యా యపరాధి చెప్పెను.

రాజు వానిని క్షమించుటయేగాక వైద్యునిఁగూడఁబంపెదనని చెప్పి ప్రశ్నలకు జవాబులు చెప్పునేమోయని సన్యాసివద్ద కేగెను;

"నీప్రశ్నలకు సమాధానమిదివరకే వచ్చినది." అని సన్యాసియన రాజాశ్చర్య మొందెను.

సన్యాసి యిట్లుపల్కెను "నీవు, నిన్న నాపై జాలిపడి గొప్పుత్రవ్వక నేనీశంకానివారణకావింపలేదని వెళ్లిపోయిన వాడు నిన్ను దప్పక చంపియుండెడివాడు.

కనుక నీవు నాకు సాయమొనర్చిన నిముసమే మంచి ముహూర్తము; ఆక్షణమున నేజాల ముఖ్యమైనమనిషిని అప్పుడు నీవు నాకు సాయముచేయుట నీపరమకర్తవ్యమై యుండెను. ఆ మనిషి నీశరణుజొచ్చిన తర్వాత వాని నాదరించి రక్షించిన సమయమే యుత్కృష్టతరుణము!! ఏలనన నీవట్లు రక్షింపనియెడల అతడు తననేరమునకై పశ్చాత్తాపమొందకే మరణించియుండెడివాడు; కనుక నప్పుడతడు నీకు ముఖ్యావసరమైన మనిషి. నీవతని కొనర్చిన సాయము పరమావశ్యకమైన కర్తవ్యము.

"కాన అనుక్షణమును మహాప్రయోజనము; ఏలనన ఆక్షణమైపోయిన అప్పుడు చేయవలసిన పనినిక చేయలేము. నీచెంతనున్నవాడే నీ వాక్షణమున ముఖ్యముగా గోరు మనిషి!! ఏలనన అతడు నీశ్రేయోభిలాషి. నీయొద్దనున్న వానికి మేలుచేయుటయే నీముఖ్యమైనవిధి. ఏలన పరోపకారార్థమే మన మీలోకమున జన్మించితిమి. సత్యమును మర్వకుము."

-:0:-

# అవధి

యమ్. వి. జె. వి. సుబ్బారావుగారు

పూర్ణచంద్రుని మించినది వాసవదత్త సౌందర్యము. కమలముకంటె మృదువైన దేహము. వీణ నతిక్రమించిన వాఙ్మాధుర్యము. హరిణములను లజ్జపరచుచున్న నేత్రములు తన యభిలాషానుసారము తన కోమల కరములతో సజీవమైన సువర్ణవిగ్రహమును తయారు చేశాడు విధాత.

భువనమోహితమైనశోభ—మనోహరమైన సౌందర్యము—ఇచ్చి కూడా ఆమెను వేశ్యనుగా చేయుట ఉచితమే? పంకమందు పంకజములను, ముండ్లలో ఫలములను పండించు యాతనికే ఎరుక.

* * *

వసంత ప్రభాతము. కోయిలల మధురగానాలాపములతో వీస్తోంది మలయమారుతము. సువిశాలమైన వాసవదత్తయొక్క ప్రాంగణద్వారమువద్ద భిక్షకై నిలచియున్నా డొక శ్రమణి. హఠాత్తుగా తన దృష్టి మరల్చినది వాసవదత్త. ఒకమారు చూచింది-రెండుమార్లు-నూరుమార్లు-చూస్తూ నిలబడిపోయిం దామె.

ఉపగుప్తుడు వాని పేరు. ప్రపంచదృష్టిలో యాతడు భిక్షువే కాని స్వర్గీయదృష్టిలో రాజరాజేశ్వరుడే వాస్తవముగా—మానసమును మించి శ్రేష్టమైన విశాలరాజ్య మేదియు లేదుగదా!—అట్టి మానసముపై విజయమునుగాంచిన యోగి ఉపగుప్తుడు. రాజాధిరాజు, తాను. సమస్తేంద్రియములు అతని ప్రజ. విశ్వముయొక్క చంచలత, అశాంతి వాని వంటవు. వాని నిశ్చలనేత్రములు శాంతములు. స్వర్గీయ దివ్యకాంతులచే భాసమానమైనది యాతని ముఖమండలము. కాషాయవస్త్రములు వాని కినుమడించిన శోభనిస్తున్నవి.

* * *

విశ్వమంతను ఓడించు సామర్థ్యముగల వాసవదత్త ఓడిపోయిం దా భిక్షువు యెదుట. వాని సౌందర్యమును చూసి ముగ్ధురాలైంది. చీరచెరగు జారిపోయింది. కేశబంధము వీడి పుష్పమాల నేలపై పడిపోయింది.

ఉపగుప్తుని దగ్గరకుపోయి భిక్షాపాత్రను ముందుకు చాపమన్న దామె. భిక్షాపాత్రను చాచి సాశ్చర్యముగా "నీ హస్తద్వయము రిక్తమైయున్నది. నా కేమి ఇవ్వగలవు?" అన్నా డాతడు.

"ఈ హస్తద్వయము నీ వీ ప్రపంచములో పొందలేని వస్తువు నిచ్చును."

"అనగా?".

"ఈ హస్తములు రిక్తములు గావు."

"నేనా స్వర్ణభూషణముల నేమి చేసుకొందును?"

"స్వర్ణభూషణముల సంగతి గాదు. ఈ హస్తములు రిక్తములు గావు. ఇవి ప్రేమాలింగనముతో నిండియున్నాయి. నీ నా యాలింగనమునే నీ కర్పింతును ఏ వాసవదత్త స్పర్శమాత్రమునకు రాజాధిరాజులుకూడా వ్యాకులపడుదురో ఆ వాసవదత్త నీకు ప్రేమాలింగన మర్పించుటకు సిద్ధమైయుంది."

ఉపగుప్తుని ముఖభావములు మారలేదు. మాటలాడ కూరకున్నా డాతడు.

"భిక్షాపాత్రను చాపుము. నా హృదయ మర్పించెదను."

"దీని అర్థము?"

"అనగా నీ యీ సుకుమారశరీరము భిక్షావృత్తికి గాదు. నీ యీ అనుపమలావణ్యము విశ్వస్పర్శనుండి దూరములోనున్న వనములలో శిథిలమగుటకు గాదు. రమ్ము నా సదనమునకు. నీ దాసి నగుదును నేను."

ఒక్క చిరునగవు నవ్వి ఊరకున్నా డుపగుప్తుడు. వికలమతియై జవాబిమ్మంది వాసవదత్త.

"అనేక కారణములవలన యిప్పుడు వీలుకాదు."

"అయితే ఎప్పుడు?"

"తిరిగి కొన్నిదినముల తర్వాత!" తనలో తా నాలోచించింది వాసవదత్త: రమణీ రూపమునకే అవమానమా? ఒక సామాన్యభిక్షువే తిరస్కరించెనా? చూచెదనుగాక, నే నా సమయము నిరీక్షింతును.

వేగముగా సంఘము వైపుకు వెళ్లిపోయా డుపగుప్తుడు. నిశ్చలదృష్టితో చూస్తూ సువర్ణమూర్తి లాగున నిలచియుంది వాసవదత్త.

* * *

తన స్వల్పజీవనముయొక్క ప్రకాశమును కనపర్చి తీవ్రగతితో పోయింది సంధ్యాకాలము. శరదాకాశమున ఉదయించే చంద్రకిరణములు రూపోజ్జ్వల కాంతులతో వెన్నెలను వెదజల్లుచున్నవి. సాంద్రారణ్యముయొక్క చరణములను కడుగుతూన్నదా యనునట్లు కలకలధ్వని చేస్తూ ప్రవహిస్తోంది గంగామతల్లి. పగలంతా భిక్షాటనచేసి యలసిన ఉపగుప్తుడు ఆ వనమునుండా వెళుతున్నాడు తన మఠమునకు.

వెళ్లుతూన్న ఉపగుప్తుని చూచి హింస్రపశువగు కేసరి యొక టాతనిపై ఉరుకుటకు సిద్ధమైంది. భిక్షువు చూశాడు. శిరము వంచాడు. ఒకవైపు ఉపగుప్తుని భక్షించుటకు సిద్ధంగా ఉంది సింహము. వేరొకవైపు సింహమున కాహారమై నిలుచున్నా డుపగుప్తుడు. దగ్గర పొదలోనున్న వేటకా డొక డా భయంకరదృశ్యము చూశాడు. భిక్షువుపై కురుకబోతూంది సింహము. ఇంతలోనే వేటకా డా సింహమును భూశయనం చేశాడు — నలువైపుల చకితుడై పరికించా డుపగుప్తుడు. తన కార్యసాఫల్యమునకై చిరునగవు నవ్వుకుంటూ ధనుర్ధారియైన వేటకాడు వస్తున్నా డుపగుప్తుని వైపుకి. దుఃఖస్వరముతో "ఆహా! ఏమి చేసితివి? అకారణముగా నిరపరాధి జంతువులను హత్యచేసితివి? నీకే మపకారము గావించినది?" అన్నాడు భిక్షువు.

"సింహము — నిరపరాధిత్వము!" తనలో తా నాలోచించాడు వేటకాడు. తన దయాహీన కఠోర జీవనములో కరుణాదేవీదర్శనమున కిదియే మొదటి పర్యాయము ఆ వ్యాధునికి. చక్రాంకితమూర్తివలె స్తంభితుడైపోయాడు. ఉపగుప్తుని కరుణార్ద్రదృష్టి వ్యాధునిపై పడినది. వ్యాధునిహృదయము మౌని సందేశమును గ్రహించింది. నయనములు చూశాయి. హస్తద్వయము కదల్చేడు. భుజముపైనున్న అమ్ముల పొదితీశాడు. గంగానదీ గర్భమందు పారేశాడు. వాని నిర్దయత గంగలో మునిగిపోయింది. తన భుజబలముతో రెండు ముక్కలుగా చేసి క్రింద పారేశాడు ధనస్సును. అతని కఠోరత అంతిమశ్వాస తీసుకో నారంభించింది. ఆపై నాత డా భిక్షువుపాదములపై పడ్డాడు. "దేవా! ఇదే నా కడపటిహత్య" అన్నాడు. ప్రసన్నముఖముతో నాశీర్వదించా డా భిక్షువు. వేటకాడు తన నూతనప్రపంచములో ప్రవేశించుటకు వెళ్లిపోయాడు. కరుణ యాతని మార్గదర్శిని.

దయార్ద్రహృదయుడైన ఉపగుప్తుడు కేసరిని వీక్షించాడు. బాణము బాగుగా గుచ్చుకొనిపోయింది హృదయములోకి. బహుప్రయాసచే గంగాతటమునకు తీసుకువెళ్లా డా సింహమును. గాయమును కడుగ నారంభించాడు.

గంగామతల్లియొక్క చంచలహృదయములో గానామృతమును దశదిశల వర్షిస్తూపోతోంది ఒక నావ. శరచ్చంద్రిక బాగుగా నృత్యము చేస్తూ వనప్రాంతమునకు, గంగాకెరటములకు అపూర్వశోభ నిస్తోంది.

స్వకార్యతత్పరుడైయున్నా డుపగుప్తుడు. మృగరాజు జీవితాశ అయితే కొద్దికాని దత్తచిత్తుడై తన పని చేసుకుంటున్నా డా భిక్షువు. నావ ఆవైపుకే వస్తోంది. గానస్వర మిప్పుడు స్పష్టముగా వినిపిస్తోం దాతనికి. దృష్టి సారించాడు. నావలో ఎవరు? ఎవరో కాదు ముక్తకుంతలారూపసియగు నావాసవ

దత్తే శరచ్చంద్రికతో నయనయుద్ధంచేస్తో పాడు తోంది.

సింహము హృదయమునుండి బాణము లాగుటకు చేయి చాపేడు. హంఠాత్తుగా గాన మాగిపోయింది. నావ భిక్షువు సమీపమునకు వస్తోంది. అకస్మాత్తుగా చకితురాలై "భిక్షు! ఏమి చేస్తున్నావు? ఈ భయంకరమైన హింస్రపశువు జీవితలాభమును పొందియు ప్రాణదాతను గుర్తెరుగజాలదన్న సంగతి తెలియదా? నీకు సర్వనాశనము కాగలదు'' అని అరచింది నావ నుండి వాసవదత్త.

"రమణీ! నీవు పొరపడుతున్నావు. బాహ్యసుందరములైయున్న హింస్రపశువులకంటె క్రూరమైనది కాదీ హింస్రపశువు. మానవులలో శత్రుత్వమును పెంపొందించి హత్యలుకూడా చేయించే సుందర రూపముకంటె కఠోరతరమైనదియు గాదు. తన బంధనములో మానవుని బంధించే మనోహరమైన మోహముకంటె భయానకమైనదియుంగాదు" అన్నాడుపగుప్తుడు గంభీరస్వరంతో. వాసవదత్త ఏమియు తెలియజాలకపోయింది. ప్రేమోన్మాదిని యై "భిక్షువా! నేను ప్రతీక్షచేస్తో చేస్తో విసిగిపోయాను. నీవు రాలేదు. మరచిపోయావా?"అంది వాసవదత్త.

"లేదు, మరువలేదు. నేను వస్తాను కొన్నిదినములు పోయినతరువాత."

"నేడే రమ్ము. ఇంతకంటె మించినసమయమెప్పుడు రాగలదు? నేడు చంద్రుడు విశ్వముయొక్క అంధకారమును తొలగించుతున్నాడు. నీవు నా హృదయాంధకారమును తొలగించుము."

"ఆగు"మని సింహము హృదయమునుండి బాణము లాగుతున్నాడుపగుప్తుడు.

"నీవు సౌందర్యమనే బాణంతో నన్ను బాధిస్తున్నావు. మున్ముందు నాకు ప్రాణదానమిత్తువా?''

"ధైర్యమూనుము సుందరీ! నేను తప్పకవస్తాను."

"ఎప్పుడు? నీ నిరీక్షణచేస్తో నా నేత్రజ్యోతి చల్లారిన తర్వాతనా? దినములు లెక్కపెడుతూ కాలము నాజవ్వనమును లాగుకొని తీసుకొనిపోయిన తర్వాతనా?........ఎప్పుడు? ఎప్పుడు వచ్చేదవు?"

"ఈ జీవితములో.''

"ఈజీవితములో? దీనికి చాలాకాలము పట్టును."

"అయితే ఎప్పుడు?''

"ఈ క్షణమునుము.''

"కాదు''.

"మరెప్పుడు? యీ వారములో.''

"కొలది సంవత్సరములలో.''

"భరించలేను. ఈ మాసములోనైన...?"

"ఈ సంవత్సరములో వస్తాను. ఇది నిజమని నమ్ము."

"సరే! నేను వ్రేళ్లపైన దినములు, శ్వాసపైన క్షణములు లెక్కించుకుంటాను."

వాసవదత్త వెళ్లిపోయింది. మృతప్రాయయై పడియున్న సింహమునుండి బాణము లాగుతున్నాడుపగుప్తుడు.

* * * *

శరదృతువు గడిచింది. శిశిరముపోయింది. హేమంతముపోయింది. కాని ఉపగుప్తుడు రాలేదు. అనేకసార్లు అశ్రుపూర్ణనిరీక్షణములు చేసింది వాసవదత్త. అనేకసార్లు శృంగారించుకొంది. అంతా వ్యర్థమైంది.

సుమన, సుగంధ, సంజీవనులలో వసంతము వచ్చింది. భిక్షువు రాలేదు. చూస్తూండగా అవధి గడచిపోవచ్చింది. కాని ఉపగుప్తుడు రాలేదు.

ఇంక రెండు మాసములు అవధి—ఒక మాసము. ప్రపంచములోని పాంథనివాసియైన వర్షర్తువు వెళ్లిపోవుటకు నిశ్చయించుకుంది. శిశిరకంబళిభుజముపై

ధరించింది. హేమంతపు బిఛానా బిగించింది. వసంతపు పుష్పవస్త్రమును తీసుకుంది. గ్రీష్మాతపత్రము చేతిలోనూ, పాదరక్షలు పదములకు ధరించి ముందుకు సాగుతోంది. వికలచిత్తయై 'నా ప్రియతము డీ సంవత్సరము రాడా?' అనుకొంది వాసవదత్త.

రాత్రిసమయము. జగమంతయు నిబిడాంధకారములో మునిగింది. సహస్రవిద్యుత్కాంతులతో విరాజమానమై ప్రకాశిస్తోంది వాసవదత్త భవనము. తేజఃకిరణము లామె స్వర్ణభూషణములలో ప్రతిఫలిస్తూ విలాసతరగతి కపూర్వశోభ నిస్తున్నాయి. అసంఖ్యాకములైన విద్యుద్దీపముల మధ్య నక్షత్రమధ్యమందున్న చంద్రునివలె ప్రకాశిస్తోంది వాసవదత్త ముఖమండలము.

ఆరోజున వాసవదత్త భవనమందు ఆమె ప్రేమియగు నొక లక్షాధికారికి స్వాగతార్థమై ఉత్సవము జరుగుతోంది. ఒకవైపు నృత్తవాద్యగీతములు, మరియొకవైపు సురాపానములు. మధ్య అభాగుడైన లక్షపతి మునిగిపోయాడు.

అర్ధరాత్రి సమయము. లక్షపతి సురాపానమత్తతచే అచేతనుడైయున్నాడు. సంగీత మాగిపోయింది. దాసదాసీజనంబు లెవరి గృహములకు వా రేగిరి. వాసవదత్తా లక్షపతులుమాత్ర మచ్చటనుండిరి. కాదు కాదు. వారికి తెలియకుండా నచ్చట కూర్చుని యున్న దొక పిశాచిని. ఎవరామె? వాసవదత్త పరిచారికయే. నలువైపుల పరికించి పరనుండి కత్తిని తీసింది వాసవదత్త. అర్ధరాత్రి సమయమున నొక వేశ్యా హస్తమున కఠారి! ఏమి చేయగోరుతుం దామె. సంగీతామృతమును వర్షించే చంద్రముఖి వజ్రవర్షము వర్షించగలదా?

ఆ అర్ధరాత్రిసమయమున నరపతిని వధించుటకు సాగిం దామె ముందుకు. కఠారియుక్తహస్తము "జాగ్రత! భగవంతుడున్నాడు సుమా!!" యని గగ్గోలు పెడుతూనేయున్నది. పాపినియగు నామె హస్తసంకేతమును గుర్తింపజాలకపోయింది. ఒక్కసారి హఠాత్తుగా పొడిచివేసింది లక్షపతి హృదయంలో. లక్షపతి కడపటిమాట "హా! పిశాచినీ! కపటపిశాచీ!'' అని.

రూపవతియగు రాక్షసి— సుకుమార పిశాచిని— తన విజయమునకు ప్రసన్నురాలైంది. ఇంతలో ఎవరో "వాసవదత్తా!" యని పిలచిరి. ఎవరు? ఎవరో కాదు మన శ్రమణి ఉపగుప్తుడే. కిటికీగుండా చూచింది వాసవదత్త.

"వచ్చితివా?"

"లేదు. శీఘ్రంగా పోవుచున్నాను."

"ఈకుసమయములో వచ్చుటకు కారణము."

"ఏమీలేదు విహారంకొరకు. ఇచ్చట నీ జ్ఞాపకము వచ్చినది. పోవుచున్నాను."

"ఆగు నీ ప్రతిజ్ఞ జ్ఞాపకమున్నదా?"

"అవును.''

"నీ వీ సంవత్సరములోపున కలుసుకొనుటకు ప్రతిజ్ఞ చేసితివి.''

"ఇప్పటి కింకను అవధి ఎంత?''

"ఒకపక్షము మాత్రము.''

"నేను అవధిలోపున తప్పక వచ్చెదను."

"అబద్ధమాడుచున్నావు. నన్ను మోసపుచ్చుచున్నావు.''

"బౌద్ధభిక్షువు అబద్ధమాడడు. కపటమోసములు వాని ధర్మములు గావు''

* * * *

వాసవదత్త ధనముకొరకు హత్యచేసింది లక్షపతిని. రహస్యము వెల్లడైంది. న్యాయాలయములో ఉరిశిక్ష దొరకలేదు. ప్రాణశిక్ష ఆమె అశాంతజీవనమునకు శాంతినిచ్చేది. కాని అట్టిశిక్ష కేవలము ఆశీర్వచనముతో సమానము.

ఆమె రూపము విరూపము చేయబడింది. చంద్రముఖి కన్నులు పీకివేయుటకును, ముక్కు చెవులు కోసివేయుటకును, మృదుహస్తముల నరుకుటకును,

ధనసంపత్తులు లాగికొనుటకును శిక్షవేయబడింది. ఆసమయమున ఆమె కరుణాస్వనముతో "నే నొక వారము అవధి కోరుచున్నాను. నేను నాయొక ప్రేమితో కలుసుకోవలెను. తరువాత ఘాతకుల హస్తములకు నా దేహమును అత్యంతప్రీతితో వప్ప గించగలను" అంది; కాని ఎవరును ఆమె వినయ మును వినలేదు. ఘాతకు లామెను కురూపినిగ చేసి వేసి రాజమార్గమందు వదలిరి. వీధినుండు పోవు వారల కామెయొక్క పాతకకథను బిగ్గరగా చెపు తూ ఒకమనిషి ఆమెవద్దనుండెను.

నాటినుండియు సౌందర్యోపాసకులైన రసిక లామె సౌందర్యమును దూషింప నారంభించిరి కొంతిమంది అసహ్యతచే ఆమెపైన నుమియ నారం భించిరి. పథికులలోనుండు కుంటివాడై కుష్టురోగ ముచే పురుగులుపట్టిన దేహముగలవాడుగూడ అచ్చటి దృశ్యమునుండి తప్పించుకొనుటకు ప్రయాస పడుతూండెను.

ఆ సమయములో హాజరయ్యా డుపగుప్తుడు.

"ఎవరు?" అంది చకితురాలై వాసవదత్త.

"నేను."

కంఠస్వనము నానవాలుపట్టి "ఎవరు—ఉప గుప్తుడా?"

"అవును. నేను ఉపగుప్తుడనే."

"తిరిగిపొమ్ము. ఎందుకు వచ్చితివి? పరిహసిం చుటకా?

"తిరిగి పొమ్మంటావా? నాప్రతిజ్ఞానుసారము."

"హా! నా దేహము వసంతసౌరభ్యముతో పరిమ ళించునప్పుడు నీవు రాలేదు. నా శోభాచంద్రుడు భూమిపైన అమృతచంద్రికను వర్షించునప్పుడు రాలేదు. చివరకు విరూపినిగ చేయబడకముందైనను రాలేదు. నా సౌందర్యదీప మారిపోయింది. నా శోభాసూర్యు డస్తమించాడు. ఈసమయములో నీ వెందుకొచ్చావు?"

"సోదరి! నేను ఇంద్రియసుఖములచేగాని స్వార్థ ముచేగాని ప్రేరితుడనై రాలేదు. శరీరసౌందర్యము వ్యర్థము. నీ ఈ శరీరమే దానికి సాక్ష్యము. ధనము నిస్సారము. నీ అతులైశ్వర్యము దీనికి జవాబి స్తోంది. నేను నీవద్దకు వచ్చాను. చెప్పవలసిన దేదో చెప్పు."

"నేనేమి చెప్పుదును? నీ యీ ప్రశ్న నా జవాబును లాగివేసింది. నేను చెప్పవలసిన దేదియు లేదు. నీ స్పర్శచే నాబాధ శాంతించగలదు. నీ వచనములచే నా సంతాపము దూరమౌతోంది."

"ఆశ ప్రపంచదుఃఖముల కాటపట్టు. నీ వీ ఆశకు దాసివైతివి. నీ వా ఆశకై నీ ధర్మమును అమ్మివేశావు. ధనాశచే లక్షపతిని హత్యచేశావు. ఈ దుఃఖసమయములో నీ ఆశ ఏ సహాయమును చేయజాలకపోయింది."

"హా! నీ వింతసముందేవచ్చి నన్నేల రక్షించక పోతివి. వచ్చితివి. కాని ఆలస్యముగా వచ్చితివి"

ఆలస్య మేమియులేదు. ఇంకా చాలా వ్యవధి ఉంది. నీ వీ సమయములో హీనురాలవైనప్పటికినీ అంతర్నేత్రము వికసించియేయున్నది. లెమ్ము. భగవంతుని నమ్ముము వాడు నీ దుఃఖముల దూరము చేయును."

వాసవదత్త హృదయాంతరమున అమృతధార వర్షించింది. ఆమెకు ప్రపంచకపు క్షణభంగురత బోధయైనది: బోధయేకాదు అనుభవముకూడాను. భిక్షుచరణములపై వాలింది "నేను సిద్ధంగాఉన్నాను. నన్ను తీసుకొనిపొమ్ము. నా చెరగుపట్టుకొని శాంతి రాజ్యమును చేర్చుము"అంది వాసవదత్త.

భిక్షువు తన పవిత్రహస్తములతో స్పృశించాడు. ఇద్దరును సంఘమువైపు మరలిరి. పాపతాపములో మండిపోతూన్న వాసవదత్త ప్రాయశ్చిత్తమనే దేవతాసాగరమున స్నానముచేసింది. సన్యాసినియై తన జీవితశేషమును గడిపింది.

—హిందీనుండి అనువాదము.

# శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఆధునికాంధ్ర కవయిత్రీమణులలో గణనీయులగువారిలో శ్రీమతి చిల్కపాటి సీతాంబగారొకరు. ఈమె ఆంధ్ర వైష్ణవ కుటుంబమునకు జెందిన శ్రీమాన్ పర్ణశాల రాఘవాచార్యులవారి కొమరిత. శ్రీమాన్ చిల్కపాటి వేంకటనారసింహాచార్యులవారి పత్ని. నెల్లూరుజిల్లా కందుకూరుతాలూకా కలికివాయి అను గ్రామము ఈమె జన్మస్థలము.

ఏవిద్యయైనను నొకరియం దుద్దీపించుటకు గారణము, వారి పూర్వపుణ్యవిశేషముచే వారి కలవడిన విద్యావిజ్ఞానములే గాక పరిసరముల ప్రభావముగూడనై యుండును. పండితుల యింటిబిడ్డలు సహజముగా పండితులగుటయు, వైద్యుల యింటిబిడ్డలు వైద్యులగుటయు, కవుల యింటిబిడ్డలు కవులగుటయు, సర్వసామాన్యము. కావున జన్మించిన కుటుంబముయొక్కయు, వసించిన దేశముయొక్కయు ప్రభావముగూడ నొకప్పుడు మనుజులయందలి విద్యాకౌశలము రాణించుటకు సహాయమగుచుండును.

కవయిత్రీమణియగు సీతాంబగారియందు పైనుదహరించిన వంశసారము, భూసారము, స్వకీయబుద్ధిసారముగూడ మిళితములై యున్నవి. ఈమె తల్లివంశము, తండ్రివంశము, భర్తృవంశముగూడ పండితులు, కవులునై విఖ్యాతి గాంచినవారు; కాన నేవాడ చిలుక యావాడపలుకుపలుకు నన్నుచందముగ కవిపండితవంశములకు జెందిన యీ విదుషీమణి కవయిత్రియగుట వంశసారము ను నిరూపించుచున్నది. ఇక భూసారమునుగూర్చి చెప్పవలసినదేమి? ఆదికవయిత్రియగు మొల్లను బ్రసాదించిన నెల్లూరు మండలము విదుషీమణులకు పంటపొలము గదా. అట్టి నెల్లూరిసీమయే ఈ కవయిత్రీమణికి జన్మసీమ యనినచో నిక భూసారము యొక్క ప్రాశస్త్యమును చెప్పవలయునా? ఇక సీతాంబగారి విద్యాసారమునుగూర్చి చెప్పవలసినదేమి. ఆమె గ్రంథములే యందుకు తార్కాణ. కాన నీ ముప్విధము లగు సారములచే సారతరమైనది శ్రీ సీతాంబగారి కవిత్వము. కవిశేఖరులగు వడ్డాది సుబ్బారాయుడుగారు తమ భక్తచింతామణిలో వర్ణించినట్లుగా యే కావ్యమునకైనను వలసినవియు, వన్నెతేగలవియు,

"పదలాలిత్యము, అర్థగౌరవము, భావవ్యక్తి, సారస్యసంపద, నానాద్భుతకల్పనల్."

అను నీ యైదువిషయములే. శ్రీ సీతాంబగారు వాగ్వల్లి గ్రంథమాలద్వారా ఆంధ్రలోకమున కనుగ్రహించిన పద్మినీపరిణయము (పద్యకావ్యము), సముద్రమథనము (నాటకము) అను రెండు గ్రంథములందును పైనుదహరించిన యైదువిషయములు నొప్పియున్నవి.

పదలాలిత్యమునకు శ్రీ సీతాంబగారి కవిత పెట్టినది పేరు. ప్రతిపద్యము లలితపదభూయిష్ఠమై రసము చిప్పిలుచుండును.



మిస్. శాపిషిఁల్ (సినీమాతార)

శా॥ శ్రీకంజాక్షినివాసమై శుభదమై
శృంగారపుంబ్రోవునై
నాకంబు న్నిరసించు శోభగలదై
నానాసుఖవ్రాతమై
శ్రీకల్యాణయుతంబునై చెలువమై
శ్రీనాథసంప్రీతమై
వీక్షన్ శోభవతీపురంబలరు
నుర్వీమధ్యభాగంబునన్.

—పద్మినీ పరిణయము.

కేవలము లలితపదముల కూర్పే గాదు. అర్థపటిమయందును సీతాంబగారి కవిత ప్రశంసనీయమైనది.

తే॥ వ్రతములొనరించినను నేమి యతులనిష్ఠ
జపము గావించినను నేమి తపసియగుచు
జడలు దాల్చినఫలమేమి జనునిమదిని
కరుణయును శాంతి లేకున్న గలదె ఫలము.

---సముద్ర మథనము.

ఈ చిన్నిపద్య మెంతియర్థమును గలిగి యున్నది! అర్థమపటిమయందే గాక భావవ్యక్తీకరణమునందును సీతాంబగారసమానమైన నేర్పును కలిగియున్నారు.

ఆ॥ వె॥ కడుభయంబుగూర్చు పిడుగులుపడిగాని
యఖిలజీవదాయియైనయట్టి
వర్షమొదవుచుండు వసుధ నీరీతిన
కష్టములె శుభముల కారణములు.

—సముద్రమథనము.

ఈ పద్యమునందలి భావ మతిమధురము గదా. సారస్యసంపదయందును సీతాంబగారి రచనములు తీసిపోవు. పద్మినీ పరిణయమునందలి ప్రణయినీప్రణయుల సమావేశములు సంభాషణలు సారస్యమునకు దావలములై యుండును. వారి కల్పనాశైఖరియు యత్యద్భుతము. మఱియు ప్రకృతిని వర్ణించుటయందు సీతాంబగారి రచనము లతి సహజములై మృదులములై మనోహరములై యుండును. చూడుడు ముదిమిని గూర్చి సముద్రమథనమునందు.

సీ॥ నీలంపుజాలముల నెగడుశిరోజముల్
రాలుచు నెఱ పాండురత వహించు
లావణ్యపుంజమై గహించు వదనంబు
దంతంబులూడంగ దలుగునన్న
దేహపటుత్వంబు దరిలేకుండుచు
కడుగోత పుట్టించు ముడుతలువడు
కనులకు వెస పొరల్ గ్రమ్మ చిత్తమ్మ స్వా
ధీనమొందదు వాక్కు దిటము చెడును
చెవుడు ప్రాప్తించు దండంబు చేతనమరు
సతియునుసుతులును బరిజనుల్ సరకుగొనరు
పానముద్రయు గైకొని మంచమునను
కష్టముల నట్టికాలంబు గడుపవశమె?

ఇంక దుర్భరంబగు వార్థక్య మెంత స్వభావసిద్ధముగ వర్ణింపబడినది! ఇట్టి నిసర్గ వర్ణనలే గదా కావ్యమునకు సారస్యమును గూర్చును.

తే॥ గీ॥ చరమగిరియనియెడు తాళతరువునుండి
పండిరాలిన పరిపక్వ ఫలమనంగ
నఖిలదిక్కుల రాగంబు లలమికొనగ
బశ్చిమాంబుధిలో గ్రుంకె భానుడంత

—పద్మినీపరిణయము

తే॥ గీ॥ కువలయమునకు మోదంబు గూర్చురాజు
వచ్చునెడ దిక్సతులు కానుక లిచ్చునట్టి
మహితశుభ దీప్తవ్రజంపు మణులనంగ
నరవి నభమందు నక్షత్ర సమితి పొల్చె.

—పద్మినీపరిణయము.

ఇట్టి మనోహరవర్ణనల నొప్పారు పద్యము లెన్నేని రెండుగ్రంథములందును గలవు. భవ్యమునొక్కరుచి నెంతవిపుల

ముగా వర్ణించి వివరించినను తిసకనే గ్రహింప నసమర్థులగుకాలులు కావ్యము యొక్క సారస్యమును చదివియే తెలిసికొనవలయునుగాని వర్ణనలచే తెలియజేయుట దుస్తరము. సాధారణముగా పద్యరచనము చేయువారు గద్యరచనయందును, గద్యరచన చేయువారు పద్యరచనయందును నకుశలలై యుందురు. కాని సీతాంబగారు గద్య పద్య రచనల రెంటను కుశలలై యున్నారు. పద్మినీపరిణయమునందలి గద్యలును, సముద్రమథనమునందలి సముచిత సంభాషణంబులును వారి వచనరచనానైపుణిని విశదము చేయుచున్నవి. కాన యేవిధముగఁ జూచినను సీతాంబగారి గ్రంథము లత్యుత్తమములనుటకు సందియము లేదు.

కాని సీతాంబగారు విశిష్టాద్వైత సాంప్రదాయమునకు జెందినవారగుటచే గాబోలు ఉమాశంకరులను తమ సముద్రమథన నాటకమున మిగుల నసమర్థులుగ జేసిరి. శివుని హాలాహలభక్షణగాథ సుప్రసిద్ధమైనది. అది పార్వతి పరార్థపరత్వమునకును, శంకరుని లోకరక్షణకాంక్షకును నిదర్శనమై భాగవతాది గ్రంథములలో ఘనముగా వర్ణింపబడినది. జగంబుల దాహంబు నొందింపనున్న హాలాహలమును లోకహితార్థమై శివుడు భక్షణసేయ నుంకించుటయు, అందుకు పార్వతియు నొడబడుటయు, తదుపరి యా భయంకరవిషంబును, హరుఁడు భక్షించుటయు, భక్షించియు శివుడు తాపంబు జెందకుండుటయు, భాగవతములో గిలదు. కాని యీ సముద్రమథనమునందు గరళభక్షణము సేయనున్న పతిని పార్వతి వారించినదనియు, వినక శివుడు హాలాహలమును మ్రింగి స్మృతిహీనుడై పడిపోయెననియు, అప్పు డుమాసతి భయంబునొంది విష్ణుమూర్తిగూర్చి మొఱవెట్టుకొనెననియు అప్పుడు శ్రీహరి ప్రత్యక్షమై హరుని రక్షించి పార్వతిదుఃఖ ముడిపెననియు నిందు వర్ణింపబడినది. ఇది యే గ్రంథమున గలదో తెలియదు. అయినను కవులగువారు తమ కావ్యములందు తమ మతాభిప్రాయములను వివరించుట లోకసామాన్యమగుటచే యీదును కవయిత్రి కవిసాంప్రదాయమునే యనుకరించెనని చెప్పనగును.

సీతాంబగారి కవితాధార అనర్గళమైనది. మృదుమధుర మనోజ్ఞపదసంయుతమై తిన రారునది. ఈమెవలె కవిత్వము చెప్పగలవారు స్త్రీలలో చాల కొలదిగనే గలరు. కాన శ్రీ సీతాంబగారి గ్రంథముల నాంధ్రమహాజనులెల్లరు విరివిగాగొని కవయిత్రికి ప్రోత్సాహ మీయగలరని వాంఛించుచున్నాను. పాఠశాల పఠనీయగ్రంథ నిర్ణాయకులీ కవయిత్రి గ్రంథముల నాదరించి పాఠశాలలలో నుపయోగపడునటుల నామోదింప గోరెదను.

వనితయు, కవితయు, లతయు, నాశ్రయములేక శోభిల్ల వనుమాట నిక్కువము. ఎంత చక్కని గ్రంథరచనము చేయుగలవారైనను ప్రజాదరములేనిచో నిరుత్సాహమొందుదురు. కాన మనోహరమగు

సీతాంబగారి కావ్యములు ప్రజాదరము బడసినచో నింతకంటె ప్రౌఢతరములును మనోజ్ఞతరములునగు రచన లాంధ్రమహాజనుల వలన నందుకొనగలరనుట నిక్కువము.

దేశ కాల పాత్రానుసారముగా రచనా రీతులును క్రొత్తదారుల ద్రొక్కుట సాజము. భారతభూమి స్వతంత్రరాజ్యమై తనరారిన నాడు, రాజులు కావ్యపోషకులై యొప్పిన నాడు, రాజుల చరిత్రములు కావ్యవస్తువులై యుండెను. నేటి భారతదేశము తీరు వేఱు. ప్రజల యభిమతము వేఱు. నేటి పరిస్థితుల కనుగుణ్యముగా కావ్యవస్తువును మార్పు నొందవలయును. అతిసామాన్యమగు క్షుద్ర వ్యక్తుల ప్రస్తావన నిప్పటి జనాళిక ప్రియతమము. కాని శ్రీ సీతాంబగారు ఆధునిక నవీన కవితారీతులననుసరించి తమ యనర్గళ కవితాధారను ప్రవహింపజేసి యందును యశస్సు గడింపగలరని నమ్ముచున్నాను. ముఖ్యముగా నాంధ్రమహిళాలోక మీ కవయిత్రి గ్రంథము లధికముగా గొని ప్రోత్సాహ మీయ గోరుచున్నాను.

# గోదావరీ స్తుతిపంచకము

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

సీ॥ పాపజాలముబాపఁ బ్రహ్మాద్రిని బుట్టి రాజహంసులఁ గన్ని రాముఁ గొల్చి
శబరిచేరికఁ గొని శుభతోయరూపివై ఖండసాగరునితో సఖుండవగుచు
కాశికీడగు కోటి వాసికెక్కఁగలిగి క్షేత్రమహిమచేతఁ జెన్నుమీరి
పంచగిరులచుట్టు ప్రఖ్యాతివహియించి గౌతమముని గొల్వ గౌతమియన
అంబ, త్వద్దర్శనంబున నమరు ముక్తి । కాశి మరణంబుచేఁ గాని కాదు ముక్తి
గాన నీసన్నిధానమే కాంక్షసేయు । మమ్ము గోదావరీ మన్నమన్నింతంబు

ఉ॥ ద్వాదశవత్సరంబులకుఁ దా మహనీయముగాద పుష్కరంబునన్
నీదుపవిత్రతోయముల నిండుమనంబుల స్నానమాడి దా
నాది సమస్తకర్మల ననాదిగఁ జేయుచు భక్తియుక్తులై
నీదుమహాత్మ్య మెన్నుచును నిర్మలజీవితులై తరింపరే.

తే॥ గీ॥ సింహరాసిని బొందును జేవగురుఁడు పుణ్యసమయంబున నీలోన ప్రోగువడును
దేవమానవఋషులు నో దేవి నిన్ను పుష్కరాఖ్యసిరిఁ గొల్వ పుష్కరంబు.

ఆ॥ వె॥ గంగ కప్పయనఁగ గణ్యతఁగాంచిన నీదు మొదలునాఁటి తుదివెడల్పు
రానురాను యశము రాజమండ్రియందు నీవె శరణుమాకు నిర్మలాంబ

చం॥ వరదను పేరఁ దెచ్చెదవు పంటకుఁగా మహావృక్షరాజముల్
పరగను పంటభూము లతిసారయుతంబగు నీమతీరమం
దరమహిమంబుచే కనెడి దాతవు నీవె ఘనంబుకొద్ది నే
అరమరసేయకే కనుమహాశివమస్తకజూటవాహినీ!

# ఆంధ్రరత్న స్మృతి

యు. కొండయ్యగారు

తే. రామదాసునికాలాన రామనగరు
వైభవమ్మెల్ల తలగొని వాసిగాంచె;
రామదాసునితర్వాత రామనగరు
వైభవమ్మెల్ల నీటిలో వ్రాతయయ్యె॥

సీ. ఎప్పుడాడెనో యాతఁ డీసైకతపుసీమపై నేఁడు భయదమై పరిఢవిల్లె,
ఎప్పుడలరెనో యాతఁ డీకొంకులను నిప్పటికియ్యెఁ జోరుల పట్టుకొమ్మ
ఎప్పుడుండెనో యాతఁ డీయింటిలోఁ బాటసారుల కీనాఁడు సత్రమయ్యె
ఎప్పుడలరెనో యాతఁ డీరాతియరుగుపై కుక్కలకప్పుడు కొంగుఁబఱచె

తే. సంతతానందభరితమై వింతగొలుపు
సట్టిపుణ్యాలవాలంబు నైనభూమి
పాలిపోయిన పచ్చికబయలులయ్యె
సట్టయిఁటదినాంధము లావరించె.

సీ. నీవాగమృతఝరీ నిస్స్వనస్ఫుటనట తీరపురికినేమిఁ జెప్పినావు
నీమీఁదివలపుచే నిన్నుఁ జేరిచికొన్న రామనగరి కేమి వ్రాసినావు
నీరూపలావణ్య నిర్భరసమ్మోద ప్రకృతినేయటవికిఁ బంపినావు
నీమీఁదిభక్తిచే 'సామిసామీ'యన్న శిష్యలోకమునెటఁ జేర్చినావు

తే. ధీర, గోపాలకృష్ణ, సుధీనికాయ
రమ్యగుణ రసికమనోభిరామ సద్గు
ణాలవాల విశ్రుతయశ ఆంధ్రరత్న
రామనగరీనివాస శ్రీరామదాస.

సీ. నినుగాంచువేషాలతో ననయంబుసరుదెంచు పండితావళికేమి పలికితీవు
సంపూర్ణపూర్ణిమా శశివలెనినుఁ గాంచు ప్రజలనేదారినిఁ బంచితీవు
నాపెన్నిధానంబు నామేనువనినిన్ను నెంచుసీసతికేమి యుంచితీవు
ముద్దుమాటలుగట్టు భువనమోహనుపుత్రు నేదారినెటనప్పగించితీవు

తే. యాదవునినల్లడల రహస్యాలుబలుకు
పాండవులయట్ల నినుజేరు భరతయోధు
లెల్లరకు నేమిసలహాల నిచ్చితీవు;
రమ్యగుణభూషణోల్లాస రామదాస.

సీ. తనశరీరచ్ఛాయ తావించు బంగారు నిగనిగానిగనిగల్ నిగ్గుఁజూప
తననెత్తితలపాగ యెనలేనిమణిమయ మకుటంపువిభ్రాంతి మమతఁజూప
తనచేతిదండంబు ధరణీశకోదండ భావనానాలమై ఠీవిఁజూప
తనబొట్టుకట్టుచే వినుతస్వేచ్ఛాగాన లోలుఁడీతండని లోకమాడ.

తే. భారతీమాతకాన్పువై భారిదండ
తాడితమహామహోగ్రయూ కోడెత్రాచు
రమ్యసద్గుణశాలి మా రామదాసు
దేలనీవీధులందురా దేలపిపుడు.

సీ. శ్వేతపాలకదండ భీతిలేదన రామ నగిరీరివాసంబె తగినసాక్షి
సర్వసర్వంసహా కుశీర్వాదనటన్న దండధారణమె యుద్దండసాక్షి
అరచేతభువనాల నాడింపగలనన్న నాయకత్వమె యశఃకాయసాక్షి
స్వాతంత్ర్యగానంబు సలుపునాఁడవటన్న సాటుపద్యాల నియతిసాక్షి.

తే. ఇంతచిన్నతనాన నూరేండ్లువిండి
నవటనో యీరా! నిజంబెక్కుణంబెయున్న
నైనచాలదె నీలాటి వానిబ్రతుకు?
కాల్చనా మమ్ముకోసి కంటకంపు
జీవితములు? నీసన్నిధిఁ జేరలేక
బ్రతికియున్నాము ... వాలనోలె.
పూర్వులోదేవుఁడు ఘట్టనోపాయునై
... నాపిద్దియై
జయము... సాగిపోవు, కీర్తిసాగిపోవున్.



## గ్రహణము

గుంటూరి పేరిశాస్త్రిగారు

జగతినంతయు నీదుతేజంబుమెరయు
దిరిగితివికాదె ఇప్పటివరకు చంద్ర!
ఇంతలోనెంతలోనరించె నీశ్వరేచ్ఛ
నిన్నుగాంచిన రాలు కన్నీటిధార.

శంకరుజటాగ్రసీమ వాసంబునీకు
సర్పములువాసిమేన భూషలుగనుండు
ఉచ్చయుందున్న నినుజూచి యోర్వలేక
ఉరగమేదైన నొకవేళ గఱచెనేమొ?

# జాబులు

(సౌభాగ్యవతియగు లక్ష్మికి:—)

హృదయపురి,
1-8-34.

(మితవ్యయము)

కుమారీ, గతనెలయందు ఆరోగ్యమును గురించి వ్రాసినందుకు దానిని పాటించి తగు శ్రద్ధ తీసుకొనుచుంటినని వ్రాసినందులకు మిక్కిలి ఆనందించితిని; కాని, నీ జాబును పూర్తిగ పఠించనిపూర్వమే మరియొక విశేషము చదువుటచే నా ఆనందము నశించి నీ అజ్ఞానమైన బాల్యదశయందుచేయు కొన్ని పనులకు నాకు కొంత విచారము కల్గినది.

యీమధ్య నీకు వుగాదిపండుగ కానుకల నిమిత్తమై పంపిన ఏబదిరూప్యములు కొంత లాండ్రీవానిబాకీక్రిందనూ కొంత సొమ్ము దర్జీవానికి కుట్టుకూలిక్రిందనూ, వినియోగ పర్చితినని వ్రాసితివి. నీవు నూతనముగ కాపురమునకు అత్తవారింటికి వెళ్ళుటవల్ల యింకనూ అజ్ఞానావస్థ వదలకపోవచ్చును. గాని, యిట్టి ధనవ్యయవిషయములలో పెద్దల ఆలోచననునుసరించి మెలంగిన, ముందు ముందు నిశ్చింతగా కాలముగడుపగలవు.

కుట్టుయంత్రము కొకదానినికొని యింట నుంచిన నీకుటుంబమునకు కావలసిన గుడ్డలు ధనవ్యయములేకుండ కుట్టుటయేగాక యితర బీదకుటుంబములకు వుచితముగ నీవు సహాయ మొనర్చిన నీవు ధనవ్యయము తగ్గించి పరోప కారము చేసినదాన వగుదువు. బట్టయొక్క విలువకంటె కుట్టుకూలి అధికమగుటవల్ల కొంతనష్టము కల్గుచున్నది. తరుచుగా లాండ్రీలకు పంపుటవల్ల ఎట్టివిలువగల బట్ట అయిననూ ఆవిరిసహాయమున త్వరలో ఎంత శుభ్రపరచుచున్నదో అంతత్వరితముగ చినుగుచున్నది. యిది కొంత నష్టము. దీనిని బట్టి చూడు:నీభర్త నెలజీతము మీకుటుంబ మునకగు బట్టలకు వాటికగు ఖర్చులకైన జాలదు.

దినమంతయు కష్టపడి తిండివంటబట్టక నిద్రాహారములు మనశ్శాంతి లేక రెక్కలు ముక్కలు చేసుకుని దాస్యశృంఖలాబద్ధులై కుటుంబపోషణమునకు సరిపోవునా లేదా యని దిగులొందుచూ తెచ్చెడి జీతపురాళ్లను ధనముయొక్క విలువనెరిగి మితముగ ఖర్చుచేయుచు నెలకు కొంతసొమ్ము నిలువ చేయుచు భర్తయొక్క దిగులు పోగొట్టి మనసునకు సంతసమొనగూర్పవలెను.

నిలువజేయుట యనగా భర్తకు ఎరుక జేయక రహస్యముగనుంచుట స్త్రీకి మర్యాద గాదు. వుభయుల పరిముఖముగ ఆలోచించి సాధ్యమైనంతవరకు ధనవ్యయము తగ్గించి ఒకచో కూడబెట్టవలయును.

భర్తకు తెలియకుండా యింటియందలి సామగ్రి విక్రయించినగాని రహస్యముగా ధనము దాచివుంచినగాని ఆసంసారము వృద్ధి పొందనేరదు.

నీమనసునందు ఎట్టి మర్మములేక కపటము విసర్జించి ఎల్లప్పుడు సత్యము వచియించి నీవు చేయు ఖర్చులు తెలియజేయుచూ వుండిన, నీయందు దయ, అభిమానము, నమ్మకము, మొదలగునవి శాశ్వతముగనుండి మీవుభయుల మనములందు ఎట్టి కల్మషము లేక సౌఖ్యమందెదరు.

ముందు నీవు కొంచము కష్టపడి ధన వ్యయము తగ్గించిన, అది ఎటుల లాభించునో ఆలోచింపుము.

ఎప్పటిపరిస్తితు లెట్లుండునో మనకు తెలియదు. రేపు ఎటులజరుగునో, మనము గ్రహించలేము. అదిగాక మనపూర్వులకున్న ఆరోగ్యబలములు యిప్పుడు నశించినవి. అశక్తి, అధికమైనది. సౌఖ్యముగ కాలుమీద కాలు వేసుకుని నిశ్చింతగా కూచుని తిండ మన్న, భూములుగల యీనాందార్లకు పంటలు లేక ధరలు పడిపోయినవి.

వుద్యోగమే ఆధారమని నమ్మినవాండ్లకు ఎప్పుడైన కొంచెము అనారోగ్యముకల్గి కొంతకాలము శెలవుపెట్టదలచిన జీతము నష్టమాయె. అట్టిస్థితిలో ఆపురుషుని హృదయవేదన మెట్లుండునో గ్రహింపుము.

కావున మనకు ఎట్టిలోటును కల్గకుండగ ముందు తెలివిగ ప్రవర్తించి సంసారసాగరము నుండి యీ అశాశ్వతమైన జీవనౌకను, తాను కష్టజాగరూకతగనుండి నడుపుచూ భర్తకు ఎట్టి మనోవ్యాధియు కల్గకుండగ సాధ్యమైనంతవరకు ఎల్లప్పుడు ఆనందమొసగూర్చునదియే 'గృహలక్ష్మి'యని పిలువబడును. అట్టి పత్నిగల పురుషుని జీవితము నిర్విచారముగ నుండుటయేగాక ఆగృహము నిత్యము ఆనందమయముగ నుండును.

లక్ష్మి, ఆరోగ్యవిషయమున ఎటుల శ్రద్ధవహించితివో యీ నా రెండవలేఖయగు ధనవ్యయమునుగూర్చి కూడ అటులనే శ్రద్ధ వహించి నడచెదవని నమ్ముచున్నాను. లేనిచో నీయొక్క దుర్వ్యయమును చూచి లోకులందరు యీ బిడ్డకు యింతఖర్చు ఏమిటనియూ ఏ తల్లి నేర్పెనమ్మా యనియూ చెప్పుకొనక మానరు. అది నీకునూ శ్రేయస్కరముకాదు గాన పుట్టినింటికి అత్తవారింటికి కీర్తితెచ్చి యికముందు జ్ఞానముగ వర్తించవలెను.

నీచిన్ననాటినుండియూ వకయింటపెరిగి ఏకగర్భజనితులవలె మెలంగిన నీ నెచ్చెలి యగు సరస్వతి నీపేర అత్తవారింటనుండి జాబు వ్రాసినది. ముందునెలలో అందలి విషయములు తెలియజేసెదను. ఆమె పేరునకు తగినటుల విద్యాబుద్ధులుకల్గి ఎక్కువ జ్ఞానవతురాలై మెలంగుచున్నది. నీవును అట్టిస్థితికి రాగలందులకు దైవమును ప్రార్థించుచున్నాను.

ఇట్లు నీజనని,
పార్వతి.

——:0:——

# హంపీ యాత్ర

సెచ్చెలీ,

నాడు నీదగ్గర సలవు గైకొని యరుగుట నీ వెరుంగుదువు కదా! తదుపరి బళ్లారి సురక్షితముగ ప్రవేశించితిమి. మరునాడు బస్సుల మీద ఒకానొకప్పుడు ఆంధ్రమాతకు ఆశ్రితకల్పకమై విరాజిల్లిన యా శ్రీకృష్ణదేవరాయని ముఖ్యపట్టణమగు హంపీనగరిని చూడ ప్రయాణమైతిమి. దారియందంతయు మనము చదివిన అష్టదిగ్గజముల సుకీర్తి వైభవములు, తెనాలి రామకృష్ణుని హాస్యరసోక్తులు. కృష్ణదేవరాయని తెలుగు పాండితీగరిమయు, గౌరవాదరములును జ్ఞప్తికివచ్చి మనసు కొలదిగ వ్యాకులత నొందినది. తనంతటనదియే వైరాగ్యజిజ్ఞాసకు లోనైనది. ఈతలంపులకు అంతేమున్నది. హంపీ చేరితిమి. శ్రీ విరూపాక్ష దేవాలయమునందు బస. ఆ దేవాలయమున్న ప్రదేశమంతయు పూర్వము బజారట. చిన్న చిన్న కొట్లుమాత్రము కొన్ని శిథిలముకాక యున్నవి. అవన్నియు నిర్మానుష్యమై యున్నవి. జాతర దినములయందు ఆకొట్లకు బాడుగ మిగుల ప్రియమట.



శ్రీమతి కో. లీలావతిగారు

పిదప పరమపావనియగు తుంగభద్రలో జలకమాడుట కరిగితిమి. మార్గము కంటకావృతమై యున్నది. ఒకరిని గడువ నొకర ముత్సాహవంతుల మగుటచే వాటిని సరకుగొనకయే పరుగెత్తితిమి. తుంగభద్రా నదీజలములు మిగుల నిర్మలములై కల్మషరహితములై కనులపండువగ ప్రవహించుచున్నవి. అచ్చటి ఇసుక మిగుల తెల్లనై స్వచ్ఛమైయున్నది. ఆ శేతభాస్కరుని కిరణపుంజము లా ఇసుక రేణువులపైబడి మిల మిల మెరయుచుండుట నీవు గాంచిన ఎంతేని సంతసింతువు.

మరియు నల్లటిగండశిలలు గచ్చుచేసిన రాళ్లవలె మనోహరముగనున్నవి. ఆ నిర్మల నదీతోయముల గ్రుంకులాడితిమి. ఎంతసేపు నీటనున్నను తనివి దీరలేదు. కాని ఎంతసేపుందుము? ప్రవాహము మిగుల వడిగనున్నది. లోతు విస్తారముగలేదు. అజాగ్రతగనున్న కొట్టుకొనిపోదురు. మా పాదములపై నదిలోని చిన్న చిన్న రాళ్లు ప్రవాహపువడిచే కొట్టికొనిపోయినవి. స్నానానంతరమున బసకు వచ్చితిమి.

అపుడు హంపీవిశేషముల నరయ బస్సుమీద నేగితిమి. బస్సొక మెట్టప్రదేశ మెక్కుచుండెను. అది మిగుల నెత్తుగనున్నది. ఎటు చూచినను నల్లటివియు మిగుల నెత్తైనవియునగు శిలలే. నున్నగ ఈగవాలిన జారునట్లున్నవి. నాకవి ఎంతయో ఆనందమును గల్గించినవి. కాని నా యానందమునకు భగ్నము గల్గెను. ఏమందువా? బస్సు ఆమెట్ట పైభాగమువరకును వెళ్లి ప్రవేశపడక క్రిందికి జార నారంభించెను. అది మిగుల నపాయకరమట. ఏమో! నేనది అపాయమని తలంపలేదు. కారు మరల సురక్షితముగ పై ప్రదేశమును చేరినది. కొంతదూరము ప్రయాణము సల్పితిమి. అంతయు శిథిలము. ఎచ్చట జూచినను విశాలమగు బయళ్లు. మున్నొకనాడు ఆంధ్రరమణీమణికి నాయకమణియై సంతత కవితామతల్లి కాశ్ర

యమై పగవారికి హృదయశల్యములగు మహావీరాధివీరుల కునికిపట్టై కలియుగకృష్ణుడని పేరెన్నికగాంచిన కృష్ణదేవరాయలకు ప్రియమొనర్చునదియై విలసిల్లిన హంపీనగరు, నేడు అడుగిడుటకు భయముగనున్నది. అంతయు నిర్మానుష్యము. అచ్చటచ్చట అనాగరికులగు కొండజాతివారు కొలదిగ కాన్పించిరి. అచ్చటచ్చట శిథిలములైన కొన్ని భాగము లెన్నియో కన్పించినవి. వాటినిబట్టి యూహించుట కేమి యాధారమున్నది?

వీటిని గడచి మాతంగ పర్వతమును జేరితిమి. దాని నారోహించితిమి. చెలీ! అదేమి కుతూహలమో కాని అలసట నిసుమంతయు జెందలేదు. రెట్టించు గోర్కెతో దాని నధిరోహించితిమి. దానిమీద విశేషము లేమందువా? అయ్యది రామాయణకథకు సంబంధించిన పర్వతము. దానిమీద రాముడు బాణమువేసి నీటిని బయటకు తెప్పించెనట. అది ఒక బావివలె విశాలమైయున్నది. తదుపరి కోటి లింగములని చెప్పబడు స్థల మచ్చటనేయున్నది. దానిని చూచితిమి. అందు నిజముగ నన్ని లింగములు లేవు. ఏముప్పదియో యుండును. దానిమీద దేవాలయ మొండున్నది. అందు విగ్రహము లేదు. అందలి మండపమునందు శిల్పచాతుర్యము మిక్కుటముగ నున్నది. ఒక రాతియందే పెక్కు స్తంభములు చెక్కబడియున్నవి. ఇవి మాతంగగిరి విశేషములు.

పిమ్మట (Queen's bath) మహారాణీ జలక్రీడా భవనమున కరిగితిమి. అది ఏమియు చెడిపోలేదు. అందు విశేషములకన్న విచార మెక్కువయున్నది. ఏమందువా? ఒకనాడు సుందరులగు తరుణుల కాహ్లాదదాయినియగు యౌవనము పోతుటీగకుగూడ చొరగ నశక్యమైన యా మందిరము నేడు అటవిని దిక్కులేక పడియుండుట విచారకరముగాదా! అది యొక విశాలమగు చావడి. మధ్య మందువావలె పెద్ద లోతుప్రదేశ మున్నది. అందే జల ముండి యుండును.



విరూపాక్షాలయం అంతర్భాగం

అనంతరము "Underground Temple" అనగా భూగర్భములోని గుడి కరిగితిమి. అదియును మిగుల శిథిలము కాలేదు. అంతయు భూమట్టముతో సమానముగనున్నది. అందు గర్భమంటుబోటుకొరకు పెట్టిన స్థంభములున్నవి. ఆ శిల్పితనమునకును ఈ శిల్పితనమునకును హస్తిమశకాంతర మున్నది. అందునంది ఈవలి కీడ్వబడియున్నది. !ధ్వజస్తంభము విరుగగొట్టబడియున్నది. గర్భగుడియంతయు చీకటి. విగ్రహములేదు.

తదుపరి హజా రామనాథ దేవాలయమున కరిగితిమి. అదికూడ బాగుగనేయున్నది. ప్రాకారములపై రథ, గజ, తురగ, పదాతి సైన్యము చెక్కబడియున్నది. అయ్యది ఆంధ్రవీర్యమునకు వెల్లడింపు గదా! లోపల నల్లనిగచ్చునుపోలు రాళ్లతో చేసిన స్థంభములును, పలకలును నిగనిగలాడుచు నూత్నములై కన్పించుచున్నవి. ఏ దేవాలయము చూచినను శిల్పుల శిల్పచాతురిని వెల్లడించుచున్నది. ఏ దేవాలయమున చూచినను ఒకరాతియందే పెక్కు స్థంభములున్నవి.

పిమ్మట ఉగ్రనరసింహస్వామి దేవాలయమున కరిగితిమి. మార్గ మాహ్లాదజనకము. చుట్టును పచ్చని చెట్లు, చల్లటిమారుతము, చిన్ని సెలయేరు. ఇవి యానందకరములు గావా? ఉగ్రనరసింహుని భీకర విగ్రహమంతయు ఒకటేశిల. సుమారు పదునైదడుగుల ఎత్తుండును. దానికిప్రక్కన మహాలింగమట యొండున్నది. అది పెద్ద లింగాకారము. దాని చుట్టును జలమయము. అం దొకమూలనుండి జలము పడుచుండును. అయ్యది కాశీ గంగ యని ప్రతీతి యట. అది చూచి బస కరుదెంచి దానికి కుడివైపున ఉన్న మెట్ట నధిరోహించితిమి. మార్గమంతయు నున్నటి నాపరాళ్లు గచ్చుచేసినట్లున్నది. మీద గణేశదేవాలయమును సందర్శించితిమి. అది చీకటిగ నున్నది కాని ఏమి భీకరవిగ్రహము! మిగుల భీకరము. నరసింహుని విగ్రహముకంటె నిది ఎత్తైనది. విగ్రహపు తొండము, బొజ్జ, కాలు విరుగగొట్టబడి యుండుటగాంచి కనులు చెమ్మగిల్లినవి. ఆ కొండ యంతయు కలయదిరిగితిమి. జైనదేవాలయమును చూచితిమి. ఈశ్వరాలయములు పెక్కులున్నవి. కొన్ని పూజార్చనలు కలిగియున్నవి. కొందరు సాధువు లచ్చటనుండురు. కాని మిగుల యాహ్లాద మేమందువా? దానిమీద శిలలు మిగుల ఎత్తై నల్లనై యున్నవి. ఒక్కొక్కచోట మిగుల పొడుగును, విశాలమునగు నల్లటిశిలలు మెట్లవలెయుండి వాటి యడుగున సలిలములు ప్రవహించుట మిగుల యానంద దాయకము. మరియు మన మేడంత ఎత్తుగల నల్లటి రాళ్లు గదులవలెను, హాలులవలెను ఏర్పడి మిగుల విశాలముగనున్నవి. అది మిగుల చిత్రముగనున్నది. ప్రకృతిజనని తన బిడ్డలగు సాధులకు కానుకలుగ నర్పించిన దివ్యసౌధములు కాబోలు. అందే విశాలమైన కొలకున్నది. అదియును చూచుట కానందముగనున్నది. అంతయు చూచుట కానందముగ నున్నది. అంతయు నాపరాళ్లే. గచ్చుచేసినట్లుండి మిగుల పరిశుభ్రముగనున్నది. భోజనార్థము బస కరుదెంచితిమి. అందు కోతులు మిక్కుటముగనున్నవి.

భోజనానంతరము రామస్వామి యాలయమును చూచుట కరిగితిమి. ఆ మెట్టయు గండశిలలు, ఇసుకతోను కూడియున్నది. వాటిని గడచి రామస్వామి ఆలయమున కరిగితిమి. మొదట నర్చకుడు స్వామిదర్శనమునకు టిక్కెట్టు కావలెనని కోరెను. కాని తీవ్రవాదనానంతరము పశ్చాత్తప్తుడై స్వామిని చూచుట కంగీకరించెను. విగ్రహము నల్లగను ఎత్తుగనుయుండి నిగనిగ లాడుచున్నది.

పిమ్మట Lotus Mahal అనగా తామరపూ మందిరము. దానిని చూచుట కరిగితిమి. దానిచుట్టును కొలదిదూరము లోతుగ నీరుండెడిది గాబోలు కాలువవలెనున్నది. ఇప్పు డేమియును లేదు. దాని మధ్య నీమహ లున్నది. అవి రెండంతస్థుల మందిరములు. ఎచ్చటను శిథిలమగు భాగములు లేవు. చుట్టును నీరుండుటచేతనే ఈ మహలున కా పేరు గలిగియుండవలెను. అనంతరము కొలదిదూరముననే యున్న Elephants Stable ఏనుగులశాలను సందర్శించితిమి. అది ఏమియు చెడిపోవలేదు. ఎత్తై, విశాలమై చక్కటి శిల్పచాతుర్యముతో నిర్మింపబడియున్నవి. మావటీనికిగా ఒకదానినుండి ఇంకొక దానికి చిన్న చిన్న ద్వారములు గల్గియున్నది. పైన డాబావలెనున్నది. దానికి మెట్లున్నవి.

అద్దానికి సమీపముననే Horses Stable గుఱ్ఱపుశాలయున్నది. ఆ కొట్టములుకూడ విశాలమై యున్నవి. అచ్చటి భాగములుకూడ అంత శిథిలములుకాలేదు. వాటికి చుట్టును ఎత్తైన ప్రాకారమున్నది. అది పెద్ద పెద్ద రాతిపలకలు పేర్చి కట్టి కట్టినది. అతుకేమియును లేకుండ ఇప్పటికిని చెడకుండనున్నవి.

ఇవి చూచి యనంతరము శ్రీ విఠల్ దేవాలయమున కరిగితిమి. మార్గమున చాల ప్రదేశములందు చిన్న చిన్న స్థంభములు రెండు వరుసలుగనున్నవి. వానిపైనుండి బోదెలవలె చిన్నకాలువ గట్టబడియుండుట చూచితిమి. బహుశా వీటిమూలముననే రాయలు హంపీవాసులకు తుంగభద్రా నదీజలముల నందుబాటు చేసియుందురేమో. మిగుల ఎత్తగు ప్రదేశమునను౦డిన హంపీనగరికి దానికి మిగుల లోతుగనున్న నదీతోయముల త్రాగుటకు వీలగునట్లు చేసిన రాయలు సంస్తవనీయుడు గదా! చెలీ! విను గొందితివా? వినుగొందకుము.

విఠల్ దేవాలయమున నత్యద్భుతమగు శిల్పచాతుర్యమును పొడగాంచితిమి. పైభాగమంతయు

చూరము చేయబడినది కాని, సన్ననిచీలికయుం డుటైన పనితనము కాన్పించినది. లోపలి మండపములయందుగల కంబములయందు ఒక్కొక్క స్థంభమునందు రెండు చీలికలువలె రెండు స్థంభములున్నవి. అందు చిత్ర మేమందువా! అందు సంగీతధ్వని విననగును. ఎడమవైపు స్థంభముమీద వ్రేలితో గొట్టిన స,రి,గ,మ యనియు, కుడివైపు వ్రేలితో గొట్టిన ప,ధ,ని,స యనియు స్పష్టముగ విననగును. ఇది



విరుపాక్షాలయం బహిర్భాగం

హృదయానందము గదా! అందే గర్భగుడి కాబోలు భూగర్భముననున్నది. అంతయు కారుచీకటి. అందు దిగితిమి. గట్ల చివర పైనుండి వెలుగుపడుచున్నది. ఇంకొక ప్రక్క పైకివెడలుటకు మెట్లున్నవి. అవి యధిరోహించి బైటికివచ్చితిమి. ఆ గుడియందే వేరొకచోట రాతిరథమున్నది. దాని గుఱ్ఱములు విరుగ గొట్టబడినవి.

విఠల్ గుడిని చూచినపిదప రాయల సభామందిరమును చూచితిమి. అది మిగుల విశాలమైయున్నది. అంతయు రాతితో కట్టబడియున్నది. అందే గద్ద యున్నది. అది విరుగగొట్టబడియున్నది. పైకప్పేమియును లేదు.

అది చూచినతర్వాత వేయికాళ్ల మండపమును దారిలో చూచితిమి. అది శిధిలావస్థయందున్నది.

తర్వాత కిష్కింధకు ప్రయాణమైతిమి. వాలి మార్గమంతయు మిన్నంటు రాతికొండలతోను, ఇసుకతోను ఆహ్లాదకరముగనున్నది. మార్గమున నొకచోట నెచ్చట నుండియో చిన్నప్రవాహ మొండువచ్చుచున్నది. అందలి నీరములు మధురముగను, నిర్మలముగను నున్నవి. ఆ ప్రవాహము పేరు తురుత్ కాలువ (Turut Channel.)

కిష్కింధకేగుటకు తుంగభద్రను దాటి యేగవలెను. దాటుటకు నావలులేవు. గుండ్రటి తొట్లవలెనున్నవి. చుట్టును తోలు మూయబడియున్నది. అందు కూర్చుండి నదిని దాటితిమి. ఆ ప్రదేశమున నదియందు మొసళ్లుండునని పడవవాడు చెప్పినాడు. మరియు లోతును, వడియు మిక్కుటముగనున్నవి. కొందరందీది యావలి గట్టుచేరిరి. ఈదుటకు కష్టముగనున్నదట. నదిని దాటి సుమారొక మైలు నడచితిమి. మార్గము పరిశుభ్రముగనున్నది. అందందు కోతులున్నవి. హంపీయె కిష్కింధయన్న నుడిని హంపీనగరిని మిక్కుటముగ కన్పించు కోతులు రూఢిపరచుచున్నవి. మే మేగినది కిష్కింధలోని యొక భాగము. అదొక రాణీ పరిపాలనక్రిందనున్న ప్రదేశమట. దానిపేరు ఆనెగొంది. ఆనెగొంది యందే కర్రస్తంభములుగల మేడ నొకదానిని చూచితిమి. హంపియందు కర్ర కన్పించుట కదియే ప్రథమము. అందేమియును లేదు. తిరిగి నదిని దాటునప్పటికి సూర్యుడపరాంబుధి గ్రుంకుటయు పశ్చిమకాంత సిందూరతిలకమును దాల్చుటయు నీక్షించి గృహోన్ముఖులమైతిమి. భానూ, నమ్ముదువో నమ్మవో. హంపీని వీడుటకు మన సొప్పలేదు. కాని వీడకుండిన యెట్లు? ఇంటికి వచ్చినను ఇంకను హంపియందున్నట్లే భావన. చెలీ, చిరకాలపు అభిలాష నెరవేరినది. చూచినది వ్రాయకున్నచో గరువమని గేలిసేతువని నా చిలుతహృదయమునకు జప్తి యున్నదంతయు వ్రాసియంపితిని. జవాబునకు వేచియుండెద.

ఇట్లు
కూర్మి చెలియలు
లీల.

రాజమండ్రి,
14-6-1934.

# వరలక్ష్మి

కృత్తివెంటి వెంకటసుబ్బారావుగారు, యమ్.ఏ.

క. చిటపటచినుకులుసాగెను। పెటపెటవలివీచె చెట్లు పెల్లగిలెను, పే
రటములఁబిలువఁ జనినవా। రటనటఁ జడిఁదడిసి యెక్కి రరుఁగులమీదన్.

క. విడిచిరి పిల్లలుపడవల। నెడతొందరపడిరి విప్రులిలునిలుఁబో, నం
గడిజనులును పూలబ్బులు। చెడె పండుగబేరమనిరి చీదరయయ్యెన్.

గీ. వచ్చెవేళకు శ్రావణ పట్టి సరిగ। ముఱిసిరిక క్రొత్తపెండ్లికూతురును తల్లి,
నానవోసినసెనగ లానందపడిరి। ఆఱఁబఱచిరి మడిబట్టలన్నియింట.

గీ. దొఱకిరని చెప్పియుంచి రైదువులముందె। రమ్మనిరి ప్రొద్దుపోకుండ బ్రాహ్మణులను,
క్రొత్తనగలు సవరసులు, మొత్తమునకు। పోరితెప్పించుకొని రెట్లొ పొలఁతులంత.

ఉ. పచ్చివిదెచ్చి మామొగపైఁబడవైతురు, దిక్కుమాలివా
చచ్చుట వారికేమి నిముసాలపయిన్ మఱి వంటకావలెన్
రచ్చగునేమియన్న, నవురా, పోయిమండదు, కళ్లుపోవు, పై
పెచ్చువిబెట్టినన్ దగులఁబెట్టరు, నోర్చల యంచు నింటికిన్
వచ్చెడువేళ కట్టె మగవారలఁదిట్టుచు, పిల్లలున్నచో
మచ్చికరెండుగొట్టినడుమన్, దడిబట్టల నీళ్లుగారఁబో,
గ్రుచ్చిన పూలమర్చి, 'యిదిగోమఱిజా గికయెంత' యన్ని, నో
ర్వచ్చినదాకవిప్పిరి శెబా సబలల్ గద సాధుకోపనల్.

శా. ఈలోఁజిత్రము వానచే వ్రతముచేయింపంగ విప్రుండు సూ
తాలస్యంబుగ నేగుదెం సధికారా-ద్భట సందర్భవా
గ్జాలం బేకరువెట్టె భాగ్యవతి వాచాలత్వమున్ సైపఁగాఁ
జాలెంబో యెదురాడలే కతఁడు చేష్టుండక్కనిట్టూర్చుచున్

శా. ఆలించెం బతి, యాగ్రహమ్ము మఱియంతై యంతకంతై, పనిన్
జాలించెన్, వెధవ్రతమ్ము వెధవా వారమ్ము ఈబ్రాహ్మలా
చాలంచున్ బురుడించె తత్పతి, నివంతన్ జూచుచున్ ముక్కుపై
వ్రేలుంచెన్ సతియోర్తు, వెన్కదిఱిగెన్ వ్రీడాఢ్యయభ్రాంతయై.

గీ. ఎంతయెక్కసమైనది యింత పిలిచి। పూజచేసిన నీకేమిపుంమువుట్టె?
పోవుచున్నావు మెల్లిగా మూతివిఱిచి। పూటతిండికిలేకున్న నీటుపోదు.

గీ. బాబుగారికివేళయ్యె పాడుబ్రాహ్మఁ। డేమిరోగము పూరుపూరెల్లతిరిగి
యిప్పుడా? వానినన్నందు కేమినీకు పుస్సువచ్చినదా? ఏన పోనిపోదు.

మ. పద వడ్డించుమటంచు లేచె పదవీభాగ్యుండు, డబ్బిచ్చి డె
బ్బదిమందిం బిలిపింతు, వీళ్ళుపయినబ్బుల్ వత్తురం చట్టె లో
వద రెల్, వంటిలుకుక్కవచ్చి సవరింప౯, బోయెనిర్భాగ్యుఁడ
య్యెద గచ్చేరికి, నాఁడభోజనము చేయించె౯ దమదో్యగమే.

క. ఎదురయ్యె జాబొకటి పథి। పదవిని తొలగించినాము ప్రస్తుత మని, ఇ
ల్వదలిచనెను వంటరి, స౯। పదలధికారమ్ములు నిటువంటివొ యేమో.

ఆ. వె. మొయిలు తెఱలుతీసి చెయువులు సాకిరి। వాడిచూపె నెండవానలిట్లు
లొకటివెనుక నొకటెఱుక యెవ్వరికిభువి। ప్రాణములకుపోక వానరాక.

మ. తనకోర్కె౯ సగమిచ్చి యాఁచనకు భర్తల్ గ్రామసంచారమం
పినసాధ్వీమణి మానినీత్వమునఁ లేమి౯ గాసరానీక చి
న్గినచీర౯ మడికారవై చి వరలక్ష్మిపూజ కే ద్రవ్యముల్
గొనితేఁగల్గునొయంచు రాక కెదురాలోకించె నిల్లాలహో.

సీ. చిఱుమబ్బుల ముసుంగు తెఱలమాటుననుండి ఇంద్రాణితో వచ్చునేమొయనుచు
మినువాకవేవెలుంగును నావగాఁజేసి ఇంపుగా విహరించునేమొయనుచు,
నెడనెడనుఱుముసవ్వడి యాకె యరదంపు టిరుసురాపిడిచప్పు డేమొయనుచు,
కొనగడ నునుమెఱుంగుల తళుక్కుతీగె లయ్యతివవాల్గనుచూపు లౌనొయనుచు,

గీ. తెఱచి సోరణగండ్లు, వాతెఱచి, కండ్లుతెఱచి, వినురచ్చ నొకపేద తెఱవ చూచె,
కపురపుందావి యాచూడ్కి గ్రమ్మరించె అచ్చు వరలక్ష్మి గావచ్చు నతివవైపు.

గీ. రాగిడబ్బంత కుంకుమ గాణనుదుట ముక్కుకడనడ్డబొసమేల్ ముత్తియమ్ము
పాలముఖి సరిగంచు దువ్వలువగట్టి వచ్చెవరలక్ష్మి సరిగ శ్రావణిగనపుడు,

గీ. తల్లిరావమ్మ చూచుమిందాక నీదు దరిసెనమునకె దయపుట్టి తరలినావు
పరమకల్యాణి! మాయిల్లు పావనమ్ము చేసిమఱిపొమ్ము, ఈపేదరాసికనుము.

ఆ. వె. భాగ్యవంతులిండ్ల ప్రతిపట్టునుందువు లేకయున్నమాని శాకపాక
మున్నదాని లోపముండదు, పప్పన్నమైన మనసుచూచి యారగింపు

ఉ. పండుగపబ్బమం చిఱుగువారల సాటువపిల్లలేడ్తురే
ముండియొ లేకొ వారికెదొ యొక్కటి చేయకయుండలేముగా
వండినవెల్లచల్లఁబడె; వారును పిల్లలు వచ్చువేళయే
దండముపెట్టెద౯ గడియతాళగ,తల్లిశ్రమమ్ము సైపుమా.

ఉ. మక్కువచే నొడంబఱచి, మానిని పూటయొనర్చి కూతుతో
చొక్కక లేమికిన్ నవరసుల్ నగలున్ మెడసూత్రముంచియే
మ్రొక్కె 'సుమంగలీభ' వని మోదపడన్ విసవచ్చె, నంతలో
నక్కజ మొక్కకాసు గొని యాపె కుమారుఁడు వచ్చెనింటికిన్.

గీ. నాఁడు విప్రుండు దెచ్చె బంగారుతులము వెనుక టుద్యోగివాచన విస్మరించె
హేమగిరి నెక్కినటు సంతసించి రందరెందు సంతుష్టజీవన మిదియకాదె!

గీ. చాలప్రొద్దెక్కెనమ్మ యీవేళమీకు ఈసరికె తిండియరిగిపో నెచ్చటేని
ఐన మాబోట్ల పేదవిందనుభవమ్ము లెపుడు మీబోటులకు, మఱపెపుడురాక,

చ. అనుచును నింతలోనఁ బరమాన్నముః మున్నగు నేవొచేసి, య
య్యనిమిషకాంత తన్వీమనసారనొనర్ప యతిష్యమాణయై
తనకొలఁదిన్ విశెమ్మిడియె, తత్సతియంత వదిష్యమాణయై
వినిచెనుతొంటి భాగ్యపదవీ మదమూర్ఘుని గేహవృత్తమున్.

మ. అదికాఁబో లధికారలక్షణముమీదై కన్నుమిన్నేకమై
పదవీభ్రష్టత గ్రుంగిపోవుట, యథాప్రాప్తంబు హృష్టాత్ములౌ
టిదికాఁబోలును పేదవారిధృతి—ఎందేనొక్క విశ్వాస మి
ట్లిద, దీవించియె వారినే మెఱుగనట్లెంచె నద్దేవియున్.



## అతఁడు — ఇతఁడు

"అవతార్"

అతఁడు విష్ణ్వంశసంభూతుఁ డితఁడునట్లె
అతఁడు చెప్పెనుగీతను బతితుబ్రోవ
నితఁ డనువదించెదానిని బతితతతిని
గావః నతఁడు రారాజశిరోవతంస
మణిమకుట కాంతిశోభిత మాన్యపాద
యుగళుఁ, డతఁడు రాజరాజోత్తమాది
ధర్మనియతాళి సేవితోత్పలపరుండు
అతఁడు చక్రముచేబట్టి నరులగూల్ప
నితఁడు చక్రముబట్టి హరింపఁగఱవు
లోను గాగల జనవైరి లోకములను
అతఁడు శత్రుభయంకరుఁ డితఁ డజాత
శత్రుఁ డరినైన జూచుట మిత్రుపగిది
అతఁడు హైందవరాజకీయ మతసాంఘి
కార్థికాది తత్వానుపమాక్షరజ్ఞుఁ
డితఁడు సర్వప్రపంచకుత్సిత మతౌఘ
శోషకాఖిల సంస్కారశోభితుండు.

# ఆరోగ్యబోధిని

## ఋతుదోషములు

డాక్టరు యస్. శేషగిరిరావు.

### ఋతుశూల—చికిత్స

ఋతుశూలవలన బాధపడునపుడు స్త్రీలు ఆహార విహారములయందు జాగ్రతగయుండుట అవసరము. బాధ ఎక్కువగనుండిన పడుకొనియుండుటయే మంచిది. ఆహారము సూక్ష్మముగ జీర్ణము కాగలదై యుండవలయును. నిర్ణయ సమయములయందు భుజించుచు ఇతర సమయములయందు మిక్కుటముగ నీటినే త్రాగుచుండుట హితము. ఋతువు కాని సమయములయందును శరీరస్థితిని గురించి జాగ్రత తీసికొనవలయును. ఆహారవిహారములయందు చక్కని అలవాటుల నలవరచుకొనవలెను.

గర్భము ధరించిన ఋతుశూల నివర్తించునను అభిప్రాయము కలదు కనుక రజస్వలైన బాలికల తలితండ్రులు తమ బిడ్డలకు ఈశూల యున్నచో, వెంటనే కాపురమునకు పంపుట మంచిది. పుష్టిలేని బాలిక యయిన ఇటుల చేయుట అంత సమంజసము కాదు.

బాధానివారణకై తత్సమయమునకని ఎన్నియో ఔషధములు వాడుచుందురు. అయితే ఇటుల వాడునపుడు మత్తును కలిగించు ఔషధములు మాత్రము వాడరాదు. మత్తునిచ్చుమందులను వాడిన కడకవి విడువలేని దురలవాటులుగ యేర్పడును.

ఋతుశూలవచ్చినప్పుడు వెంటనే శమనమునకు ప్రక్రియలరయవలయును. అనంతరము దేహస్థితి నాధారపడి కలుగు యీ బాధాకార్యాలనమునకు తగిన ప్రక్రియల నరయవలయును. కాలప్రవృత్తి ఎల్లపుడును చక్కగ నగుచుండిన యీబాధ అంత యుండదు. అందువలన స్త్రీలు కాలప్రవృత్తికి తగు ఆహారౌషధములు సేవించవలయును. ఋతుసమయమునకు ముందు విరేచనమున కేదైన తీసికొనిన బాధ అంతగవుండదు. ఋతుశూలకై యీక్రింద వివరించియుండు ఏదైన ప్రక్రియ నుపయోగించి బాధానివర్తి చేసికొనవచ్చును. యీ ప్రక్రియలు సులభ సాధ్యమైనవి.

ఋతుశూలయందు ఋతురక్తస్రావము హెచ్చగను లేక తక్కువగనుయుండుట కలదు కనుక యీ ప్రక్రియలను ఉపయోగించునపుడు కొంచెము విచక్షణ అవసరము. నువ్వులు, ఇంగువ, తురకవేప, ప్రత్తి ఇవి కలిసిన యోగములను ఋతుబద్ధముతో కూడిన ఋతుశూలయందును అరటిపువ్వు సున్నము కలిసిన ప్రక్రియలను ఋతుస్రావము ఎక్కువగనుండు శూలలందును వాడనగును.

౧

గంజాయి ఆకులు పూలు వీటినుండి తీయు జిగురు, బాడిశపుఆకు స్వరసము, అరటిపువ్వురసము— పెరుగు, అడవిమల్లియాకు పసరు వీటిలో దేనినైనను సేవించిన ఋతుశూల హరించును. ముఖ్యముగ బాడిశపుఆకు స్వరసము ఋతుశూల చిరకాలముగనుండినను హరించును.

౨

బహిష్ఠు అయిన నాలుగు దినములలో ప్రొద్దుట పూట్లను పూటకు అయిదారు తులముల యొత్తు

చెప్పిన తురక వేపాకు రసములో కొద్దిగ మిరియముల పొడుము గలిపి యిచ్చిన బుతుశూల కట్టును. ఈనాలుగు దినములును పాలు, నెయ్యి అన్నము పథ్యములు.

### ౩

ఇండుపకాయంత రాతిసున్నము, చిన్న ఉసిరికాయంత వెన్నలోగాని, చింతపండులోగాని, బెల్లములోగాని పొదిగి స్త్రీలు బహిష్ఠుయియుండు దినములున్ను ప్రొద్దుటిపూటల నిచ్చిన బుతుశూలలు నివృత్తించును.

### ౪

ప్రత్తివేరుపట్టె నాలుగు ఔన్సుల యెత్తు తీసికొని నలభై ఔన్సులు నీరుపోసి ఇరువది ఔన్సులుగా కాచి వడియగట్టి ఒకటి లేక రెండు ఔన్సులు దినమునకు మూడు నాలుగు మార్లు వాడిన బుతుశూలలు నివర్తించును.

### ౫

అయిదు మొదలు ఇరవై గ్రెయినులవరకు నల్ల జీలకర్ర చూర్ణము, రెండు మొదలు అయిదు గ్రెయినుల వరకు ఇంగువ బెల్లముతోడను, పన్నెండు మొదలు ఇరవైనాలుగు గ్రెయినులవరకు జాతీఫలాది చూర్ణము తేనెతోడను బుతుశూల నివర్తికై వాడవచ్చును. జాతీఫలాది చూర్ణము జాజికాయ, గంజాయి, కర్పూరము, ఏలకాయలు, లవంగములు, నేదురువళ్ళ, చిత్రమూలము సమభాగములుగ తీసికొని తయారు చేయనగును. చూర్ణము దినమునకు మూడుమార్లు వాడవలయును. (1 తులం లేక 1 రూపాయియెత్తు 180 గ్రెయినులు)

### ౬

నువ్వుల చూర్ణము పది గ్రెయినులు దినమునకు మూడునాలుగు మార్లు వాడినను, కుంకుమపువ్వు వాడినను ముట్టుకట్టు నివర్తించును.

### ౭

వెచ్చనినీటిలో నలగగొట్టిన నువ్వులుగాని ఆవాలుగాని వేసి కటిస్నానము (Hip bath) చేసిన నొప్పి వెనువెంటపోవును. వీటిపరిమితి ఒక పిడికెడు.

### ౮

Pessaries (గర్భము కదలకుండ యోనియందుంచెడి సాధనములు) కుంకుమపువ్వుతో తయారుచేసిన గర్భత్రాణములు వాడిన గర్భకోశ సంబంధమైన శూలలు నివర్తించును.

---





చెన్నపురి సేవాసదనం (పారిశ్రామికశాఖ)



మిస్. యస్. కె. కన్నమ్మాళ్

వేలూరు సంగీతసమాజమువారి యాజమాన్యమున జేయబడిన సంగీతపోటీ
పరీక్షలో వీణకు మొదటి బహుమానమొందిన బాలిక.

(ఛా. చి.) ఆర్. వెంకోబార్యా.



'ఆనందం'



శ్రీమతి దమయంతిదేవి

ఆం|| మహిళాసమాజకార్యదర్శిని. ఘోషాపద్ధతి విడచిపెట్టినసాధ్వి. (ఛా|| చి||) ఆర్. వెంకోబరావు.




## మామిడిపండ్ల పానకము

బాగా పండిన మామిడిపండ్లు తొక్కలు తీసి రోటిలో బెట్టి దంచి ఆ రసమును సన్నపాటి జల్లెడలో వేసి వడకట్టి దానిలో కొద్దిగా యిందుపుగింజల గంధమును, తేనె కొలదిగను కలిపి అందు ఏలకలు 1 తులం, లవంగాలు 1 తులం, ఆకుపత్రి ½ తులం నాగకేసరములు, మామిడిపండ్ల రసములో కలపవలెను. వాటిలో లవంగపుష్పము, శొంఠి, మిర్యాలు, జీలకర్ర ఒక్కొక్క అరతులముచొప్పున చూర్ణము పైదానిలో కలిపి కాచి వడకట్టి దినమునకు రెండు పార్లు 4 స్పూన్లు చొప్పున సేవించిన మంచి ఆరోగ్యముగను రుచికరముగను బుద్ధికిని బలమును సౌఖ్యము నిచ్చును.

—యు. వెంకటరమణప్ప.

## కొబ్బరిపాలతో జేయబడు గోధుమపిండి పాకములు

ఒక శేరు గోధుమపిండి తెచ్చి యొక శేరు నేతిలో యెర్రగా వేచి తీసుకొని యుంచుకొనవలయును. పిమ్మట 1 అర్ధశేరు కొబ్బరిపాలు దీసి దానిలో 5 తులముల బాదంపప్పు, 5 తులముల పిస్తాపప్పు, 5 తులముల అక్రోటిపప్పు వీటిని కొంచెము వేచుకొని పొడిచేసి దానిని కొబ్బరికాయపాలలో కలుపవలయును. బాగుగ చిక్కబడునంతవరకు గరిటతో కలిపి దానియందు 1 తులము లవంగములు, తులము యాలుకులు, తులము దాల్చినచెక్క, తులము శొంఠి వీటిని దంచి వస్త్రగాళితము చేసిన పొడియును, 6 మాషముల యెత్తు కుంకుమపూవు పొడియును సిద్ధముచేసి యుంచుకొనవలయును. పిమ్మట శేరు చక్కెర తెచ్చి ముప్పావు శేరు నీళ్ళలోపోసి చక్కని పాకముగా దించుకొని కొంచెము పన్నీరు కలిపి బాగుగ పక్వమయిన తర్వాత దాచి కొంచెము వేడిగానున్నపుడే 10 తులముల యెత్తుగల కిసిమిసి పండ్లనువేసి యుండలుగా జేసికొనవలయును. సీతా కాలమందు భుజించిన శరీరమునకు నుష్ణముకలుగ జేయును.

—శీలా అప్పలకొండ.

## శీమవంకాయల జాం

శీమవంగపండ్లు, మంచి ఎర్రగ పండిన పండ్లు, చిన్నసైజువి పండ్లుగానే పెద్దవి నడిమికి రెండు ముక్కలు చేసినవి అన్ని సగుటుకు 1 వీశ పండ్లు తయారుగా వుంచుకొని ½ వీశ చక్కెర లేతపాకం పట్టేది. మంచి కళాయిపాత్రలో లేతపాకంలో ఈ పండ్లన్ని బాగ శోధించివేసి సన్నపుసెగపై వుడక నిచ్చేది. పండ్లరసము చక్కెరపాకం రెండు కలిసి బాగ వుడికేటప్పటికి గంటె జారుగ అగును. అప్పుడు ఒకపలం పచ్చిద్రాక్షపండ్లు ఒక ఆరంజిపండు తొనలువలిచి, ఆపాకంలో వేసి ఒక వుడుకు రానిచ్చి దించి చల్లారనిచ్చి ఒక గ్లాస్‌జాడిలో వేసి పెట్టుకుని తెల్లవారిగాని, మధ్యాహ్నంగాని పండుముక్క జాముతోడి భుజించినయెడల కాలప్రవర్తి సాఫీగాయగును. ఉష్ణశమనము. ఇది 15 రోజులు నిలవవుండును.

## సబర్మతీపాకు

ఒక ఆళాకు వేరుశనగపప్పు, ఒక ఆళాకు బాదంపప్పు, ఒక ఆళాకు ముంతమామిడిపప్పు, ఈ మూడింటిని కొద్దిగావేయించి రోటిలోపోసి పిండి కొట్టి ఆపిండి కొలిచి దానికి మూడంతలు చక్కెరపాకు పట్టి అంగుళం పాకురానిచ్చి పిండిపాకులోపోసి, పిండెంతో నెయ్యంత బాగ కాచినదిపోసి కలిపి పేరిపేరని నెయ్యి వతివుండేటప్పుడు తట్టలోపోసి మన ఇష్టప్రకారం ముక్కలు కోసుకొని భుజించిన స్వర్గమున కెంతో దూరముండదు.

—కంకిపాటి రుక్మిణమ్మ.

# హాస్యకళ

## చింకి చెప్పు

ఒక 'పెద్దమనిషి'—గొప్ప హోదాలుగలవాడే-ఆదివారంనాడు సావకాశంగా సావిట్లోకూర్చుని తనకున్న చెప్పులన్నీ పరీక్షిస్తున్నాడు. అలా టప్పుడు వొక చింకిచెప్పు కనబడ్డాది. అది చూడగానే అతనికి వొళ్ళుమండింది "యీవెధవచెప్పింకా దాచి వుంచావురా వెధవా!! దానితో నీకు...తే, బుద్ధి వొస్తుందేమో!!" అన్నాడు. నిజంవేఁ! బొటనవ్రేలుండేదగ్గిర శుభ్రంగా కుట్టుతెగిపోయి తెల్లగా దారపుముక్కలు కిందా మీదా కనిపిస్తూవున్నాయి మరీ!! ఐతే 'రాముడి' కంటికి మాత్రం అది పండ్లికిలించి నవ్వుతూవున్నట్లు కనిపిస్తూవుంటే యిన్ని చెప్పుదెబ్బలూ తిన్నా, ఆ 'వెధవ' మళ్లీనవ్వుతూ "బాబూ, నవ్వుతూవున్నాది! చూడండి" అన్నాడు. "పెద్దమనిషి" కోపంపట్టలేక ఆచింకిచెప్పు చేతబట్టుకుని ఆ'వెధవ' ముఖంమీద విసరాలనుకుని చేయెత్తి మళ్ళీ అంతలో ఆగి దాన్నోమూలకు విసిరేశాడు. ఆ మూలపడి అది మరింత నవ్వుతూవున్నట్టు కనబడింది. ఆ'వెధవ' దాన్నిచూసి మరింత నవ్వడం...

అతడికి వొళ్లూపై దెలియనంతకోపంవొచ్చి యీ సారి నిజంగా ఆచింకిచెప్పు చిరిగేవరకూ వాడికి దేహశుద్ధి చేశేద్దాంవని చటాలున లేవబోయేసరికి ముందున్న టేబిలు మోగాలికి తకీమంది. అప్పుడు చెప్పు నిజంగానే నవ్వింది. దానితో రాముడు సరే సరి!

పెద్దమనిషి మరి కదలలేదు. ఆ"వెధవా చెప్పు"ల వేపు రెప్పవేయక చూస్తూ కూచున్నాడు. 'వెధవ' మాటకేఁ—వాడెన్ని చెప్పుదెబ్బల్ తిన్నా నవ్వుతూ వుండడంవేఁ వాడిస్వభావం! కాని, చెప్పు నవ్వడం వేఁవిఁటీ!! నమ్మతారా యెవరైనా?—పోనీ నమ్మకపోతే!! "పెద్దమనిషి" మోసపోతాడా?! అది నవ్వుతూనేవుంది యింకా!! "నిన్ను నలగదొక్కేస్తానుండుం" డన్నాడు. చెప్పు మరింతనవ్వింది!! దాని చుట్టూ యేదో తెల్లని కాంతివొగటి కనిపించింది పెద్దమనిషికి! "ఇది కలయా కల్లయా?" అని స్టేజిమీద రాఘవాచార్యులుగారివలె కుర్చీమీద నిగిడి కూచున్నాడు. అది కలాకాదు-కల్లాకాదు!! తెల్లంనైఁన నిజం!!—చెప్పు నవ్వుతూవుంది!! రాముడో?—రాయిలాగ కదలడూ మెదలడూ. వాడినవ్వు తకేలని బందైపోడంవేఁ కాకుండా మీదు మిక్కిలి బెగులు బెగులుమంటూవుంది వాడిముఖం: "దెయ్యంవోఁ భూతంవోఁ!!—చెప్పు కాదది" అనుకున్నాడు. ఏదటకానీ—గాని నవ్వుతూనేవుంది: నవ్వడంకేఁ కాదు మాట్లాడ్డం మొదలెట్టింది "ఏఁవన్నావోయ్ పెద్దమనిషీ?" అని.

యేఁవంటా డింకా "పెద్దమనిషి!!" తన కాలికింద పడివున్నాన్నల్లూ నలగదొక్కేశా దన్నమాటే గాని యిప్పుడో! పడగవిప్పుకుని ఆడుతూవున్న తాచు పాఁముఁలాగ కనిపిస్తూవుందది-మఁడవఁమీద నిలబడి యిటూఅటూ వూగుతూ లేస్తూపడుతూనూ! ఐనా "పనికిమాలిన నీకింత పొగరా!!?" అన్నాడు పాపం! అయ్యో, దానితో చెప్పు బుసకొట్టడాని కారంభించింది!!

"వోయి 'కృతఘ్నచింతామణీ' నేనిప్పుడు నీకు పనికిమాలినదాన్నైనానా !? 'వోడదాటిందాకా వోడమల్లయ్యా వోడదాటితేబోడిమల్లయ్యా' అంటా

వా!! నాతనువంతా నీకింద ధారపోశానే! రాళ్ళలో ముళ్ళలో-అయ్యో! తలుచుకుంటే కడుపు చక్కలౌతుందే..." అని అంటూ వుంటే "పెద్దమనిషికి శాంతం వెగిరిపోయింది!

"ఛీ స్కౌన్‌డ్రల్, నోరుము'య్యన్నాడు- పళ్లు కొరుకుతూ.

ఓయ్ పెద్దమణిసీ' యేఁవన్నావ్- స్కౌండ్రల్!

ఔను మరి! నీవు నన్నామా టనకపోతే మరెవరంటారు ఆలోచించుకో. పచ్చకామెలరోగికి ప్రతీదీ పచ్చగానే కనిపిస్తుంది కాదోయ్!! అయ్యో నిన్ను చూస్తే నాకు జాలివేస్తుంది. బ్రతికివున్నాళ్లూ కూడా యెవరికీ పనికిరాకపోయావే యిక చచ్చిన తరవాత నిన్నెవ్వరు స్మరిస్తారు? నీడబ్బునైతే నీ పెండ్లాంవూం బిడ్డలూ దాచుకుంటారు గాని నీతోలు దాచుకోలేరే..." అంటూ నవ్వుతూవుంది చిఁకి చెప్పు.

"చుప్ రాస్కెల్—వొరే రాఁవుఁడూ దీన్ని కాలువలో పారె"య్యన్నాడు పెద్దమనిషి దర్జాగా.

"అయ్యో, కాలవలో నన్ను పారేశినా యేపుక్కలకైనా నేను పనికొస్తాను; కాని నీమాటాలోచించుకో—నామాట విను!! నీమాటాలోచించుకో—యేఁవంటూవుంది 'టిక్ టిక్ దొంగవాకొండే' అంటూవుంది కాదూ నీగుండె!! నాస్థితి నీ కొస్తే యేజంతువులైనా నిన్ను ముట్టుకుంటాయా?"అంది.

"Dam, fool, stupid, idiot, nonsense get out-you rascal..."

"వోహోహో దొరగారూ—నే నిండియాలో పుట్టిన గొడ్డునే.—ఐనా యింగ్లాండువెళ్లి కొట్లలో రెండేళ్ళు పడివుండి యీమూర్తినై మళ్ళీ యిండియా కొచ్చి వొకదొరకాళ్ళపడ్డాను. దైవవశాత్తూ వాడి ద్వారా నీయింటికొచ్చాను. స్వదేశస్తుడవు కదా అని సంతోషించాను. కాని నీవు నన్నింత అవమానంచేస్తావనుకోలేదు. వాడి దగ్గిరే వుంటే యింతంత మాటలు రావుగదా! వడగళ్లవర్షం కురిపించావు మహారాజా......"

"Still you talk rot and rubbish!! you bloody......"

"నేను తెలుగుగొడ్డునేనయ్యా-నీలాగే. అయితే నువ్వు చదువుకొన్న తరవాత యిలాగ తెగులుగొడ్డుగా మారిపోయా వనుకోలేదు......"

"నిన్ను నైట్రిక్ యాసిడ్ పోసి తగలేస్తా చూడు"మని లేచాడు "పెద్దమనిషి."

"కోప్పడకోయ్ సామీ!! 'కోపమేలరా నా సామీ కోపమేలరా' అని జావళీపాడుతూ నీ మోహనాంగిలాగే ముద్దెట్టుకుని వొడిలో కూచుంటానుందు" మంటూ చింకిచెప్పు లేవడం మొదలెట్టింది మెల్లి మెల్లిగా. రాముడు పారిపోయాడు గది విడిచిపెట్టి! 'పెద్దమనిషి' 'రాముడూ రాముడూ' అంటూ అరిచాడు. కాని రాముడు పలకలేదు. ఎప్పుడు పడితే అప్పుడూ యెవరికిపడితే వారికీ రాముడు పలుకుతాడా!! కష్టజీవి ముండాకొడుకు!! బియ్యపు మరవేపు పరిగెత్త్యాడు—అక్కడ తనవాళ్లున్నారని.

అది యీలా గుండనియ్యండి: అంతలో పాపంవా 'పెద్దమనిషి' యవస్థచూసి పాదరక్ష కొంచం జాలి పడ్డాది. మెల్లిగా యీలాగంది:—

'అయ్యా, పంతులూ, భయపడకు. పుట్టుకచేత నీవు మంచివాడివే కాని మధ్య యిలాగున మారిపోయావు! అది నీ తప్పుకాదు. ఆవిషయం వాలా వుంచుగాని నే నొక్కటి చెప్తాను విను: విశ్వాసపాత్రుడెవడో విశ్వాసపాత్రుడు కానివాడెవడో తెలుసుకో బాగా. తొందరపడిపోకు. నా జన్మ వృత్తాంతం నీకు తెలియదు! నే నొక గోవును సుమా! పాలిచ్చినన్నాళ్లూ మేతవేశాడు. తరవాత కసాయివాడి కమ్మేశాడు నా యజమాని. వాడూ నీవంటివాడే!! మాటిమాటికీ అదేమాటా అనకు: సందర్భం వొచ్చి చెప్పినదేగాని కోపంలేదు. కొన్నాళ్లకీ జన్మాంతరం కలిగింది. ఐనా స్వభావసిద్ధంగా నా ప్రతీ రోమకూపానికీకూడా పట్టివున్న సాధుత్వం వుండే అదిమాత్రం పోలే దిప్పటికైనా. అందుచేత నీవు నన్నెన్ని పడివాట్లుపెట్టినా పడ్డాను. నీకు తెలీదా!! నీ యిష్టంలేకుంటే నన్నేమూల పడివుండనివ్వకుండా "వెధవచెప్పని నిరర్థకపు బిరుదిస్తావా! నీలాగే నన్నూ చేశేస్తా!! న్యాయంవాఁ?!'

నావంటివాళ్లని చూసి జాలిపడడం నేర్చుకో.

ఏ ముహూర్తంవచ్చు డీమాట లాతని చెవిని పడ్డాయో కాని ఆ గోవులాగే మారిపోయాడు కాని ప్రయోజనంమాత్రం లేకపోయింది!! చిత్రగుప్తుడి నోట్లో పడిపోయాడు!! పాపం!!

"త్రాత"

# హరిజనాభ్యుదయము

## ఆదిఆంధ్ర యంగుమెన్సు అసోసియేషను,

### క్రిష్ణాంపేట, (తిరువల్లిక్కేణి)

ఈ సంఘము 1933 సం॥లో రావుబహదూరు డాక్టరు సి. నటేశముదలియార్ యల్.యమ్.అండు. యస్., యమ్.యల్.సి. వారివల్లను, ఇ. కార్నన్ స్మిత్ యెస్క్వయర్, ఐ.సి.యస్. వల్లను స్థాపనము చేయబడెను.

ఈ సంఘమున కొక గ్రంథాలయము కలదు. ఆ గ్రంథాలయములో 213 పుస్తకములు కలవు. ఈ గ్రంథాలయము ఉదయం 10 ఘం॥ మొదలు 12 ఘం॥ వరకును, సాయంత్రం 6 ఘం॥ మొదలు 8 ఘం॥ వరకును తెఱచివుంచబడును. ఇందు 40 మంది మెంబర్లున్నారు.

రీడింగ్ రూమ్ గ్రంథాలయమునకుగాను హరిజన సేవాసంఘమువారు వారపత్రికలు నెలపత్రికలు సహాయము చేయుచున్నారు. కృష్ణాపత్రిక, ప్రజామిత్ర, వినోదిని, చిత్రగుప్త మొదలగు పత్రికల నుచితముగ ఇచ్చుచున్నారు. వయోజనులకు దేశీయ సాంఘిక ఆర్థిక విషయములను, బోధించుటకును మధ్యమ ఉన్నత తరగతులలో పఠించు విద్యార్థులకు వారివారి స్కూలుపాఠములను చెప్పి దిట్టపరచుటకును ఒక రాత్రిపాఠశాలకూడ హరిజనసేవకసంఘమువారివల్ల జరుపబడుచున్నది. విద్యార్థులనుగూర్చియు ఇతర బోధనలనుగూర్చియు శ్రీయుత వి. వెంకటసుబ్బయ్యగారు మిక్కిలి శ్రద్ధ తీసికొనుచున్నందులకు మేమెంతయు కృతజ్ఞులము. రీడింగ్ రూమునకుగాను దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర దినపత్రికను ఉచితముగా అంపుతున్నారు. శ్రీయుత వావిళ్ల వెంకటేశ్వర శాస్త్రిగారు త్రిలింగ పత్రికను ఉచితముగా పంపుచున్నారు. కొన్ని పుస్తకములు గ్రంథాలయమునకు ఉచితముగా యిచ్చినారు.

ప్రతిదినము ఉదయవారు సంఘమెంబర్లు పత్రికలు చదివి యితరులకు చెప్పుతున్నారు. సేవనలు హెల్తు అసోసియేషనువారు నెలకు రెండు తడవలు మేజిక్కులాంతరు చూపించి ఉపన్యాసము లిచ్చుచున్నారు.

శ్రీయుత కె. సంజీవకామతు, బి.ఎ.,బి.యల్. గారు వైసుప్రెసిడెంటుగాను ఉన్నారు. మందా రామయ్యగారు యావజ్జీవ వైసు ప్రెసిడెంటుగానుండి మిగుల శ్రద్ధతో పని చేయుచున్నారు. ప్రతి సంవత్సరమునను దసరా, ఆరోగ్య ప్రదర్శన ఉత్సవములు జరుగును.

ఈ సంఘములో శివాజీ రోవర్ క్రూ స్థాపించినారు. వారమునకు ఒకదినము సంఘమెంబర్లందరు చేరి గ్రామము శుద్ధిచేయుచున్నారు. ఈ సంఘమునకు కార్పొరేషన్ కమిషనర్ గారు మిక్కిలి సహాయము చేయుచున్నందు కెంతయు వందనములు.

కె. రాఘవయ్య, కార్యదర్శి.



కీ॥ శే॥ శ్రీమతి రెడ్డి మహాలక్ష్మమ్మగారు

మ-రా-శ్రీ రెడ్డి లక్ష్మీనారాయణరావుగారి భార్యామణి గంజాంజిల్లా ఇచ్ఛాపురం తాలూకాలోని లొద్దపుట్టి గ్రామము కాపురము 38-వ యేట 16-6-34 తే మరణమునొందిరి. విద్యయందు అపరిమితమగు ఆసక్తిగలవారు. తెలుగు ఇంగ్లీషు భాషలయందు మంచిజ్ఞానము సంపాదించిరి. మతము భక్తి విషయములందును మంచి ఆసక్తి గలిగియుండిరి. చేతి పనులు, కుట్టు అల్లిక మొదలగు పనులయందును ప్రావీణ్యతయుండెను.

# బాలవిజ్ఞానశాఖ

## ౧. పిల్లల పాటలు

శ్రీమతి: నండూరి సుబ్బలక్ష్మిగారు

౧

మాయెద్దు మీయెద్దు నీళ్ళకెళ్ళింది
తాతగారెద్దొచ్చి తన్నిపొడిచింది
ఆయగారెద్దొచ్చి ఆలకించింది
మామగారెద్దొచ్చి మంతరించింది
మీబుల్లి మాబుల్లి చిట్టిబుల్లీలు
మీయమ్మ మాయమ్మ తోటికోడళ్ళు
మీబాబు మాబాబు అన్నదమ్ములు
కరణాలదొడ్డిలో కంకణాలిప్పి
బోషోడిదొడ్డిలో భోజనాలెట్టి

౨

రాయూకుపాపమ్మ ఆడవేపాప
రాజులందరుగూడి చూడవచ్చారు
చూడవచ్చినారు ఏమితెచ్చినారు
పట్టాభివుంగ్రాలు పెళ్లిబటివూలు
నన్నుకన్నాతండ్రి చీరెట్టవమ్మ
చీరకచిలకల అంచెట్టరమ్మ
పిలికికి రత్నాల పేరెట్టరమ్మ
పేరుకీ పెట్టెలతో సొమ్మెట్టరమ్మ.

—:0:—

## ౨. టింగుబుర్ర కథ

శ్రీమతి కాతూరి రవణమ్మగారు

ఒక చిన్నపల్లెలో ఒకబ్రాహ్మడు ఉండేవాడు వానికి మంచమంత జొన్నచేను. ఆచేను మరిన్ని పిచుకలువచ్చి తినుచూయుండగా ఆ బ్రాహ్మడు చూచుచు ఏడ్చుచుండెను. ఆత్రోవను పార్వతి పరమేశ్వరులు పోవుచు ఆబ్రాహ్మణుని ఏడ్పువిని ఏమి బ్రాహ్మణుడా ఏడ్చుచున్నావని అడిగిరి. మరి ఏమిలేదు నామంచమంత జొన్నచేను పిచుకలువచ్చి తినిపోవుచున్నవని చెప్పెను. ఈమారు పిచుకలు వచ్చినపుడు పిచ్చుకలు అన్నీ టింగుబుర్ర అనుము. అవన్నీ చచ్చును. అనిచెప్పెను.

రెండవసారి పిచుకలు వచ్చినవి. జొన్నచేను తినుచుండెను. పిచ్చుకలు అన్నీ టింగుబుర్రఅనెను. అవన్నీ చచ్చినవి. అవి ఇంటికిగొనిపోయి భార్యకిచ్చి కూరవండుమనెను. భార్య కూరవండి కూర అంతాతిని రెండుముక్కలు మాత్రమే భర్తకు ఉంచెను. భర్త పొలమునుంచివచ్చి చూచెను. కూర కొంచెము ఉన్నది. భార్యపై కోపమువచ్చి నాభార్య టింగుబుర్రఅనెను. అతని భార్యచచ్చెను.

తల్లి చచ్చినదని అతని కుమారుడు ఏడ్చుచుండగా నాకుమారుడు టింగుబుర్రఅనెను. అతని కుమారుడు చచ్చెను. పొలమునకుపోయి జొన్నచేను చూడగా పండలేదు నాజొన్నచేను టింగుబుర్రఅనెను. అప్పుడు చేను ఎండిపోయినది. నాకు భార్యలేదు, కుమారుడు లేదు జొన్నచేను లేదు నేనుకూడ టింగుబుర్ర అని అతనుకూడ చచ్చెను.

## 3. రాహుకాలమహిమ

శ్రీమతి వరసా సీతారామమ్మగారు

మావూరికి సమీపంబునయుండు కోడూరు పాడుగ్రామంలో ఒక అస్తోపిస్తపు బ్రాహ్మడుండు వాడు. ఆయనకు పిత్రార్జితము ఏమీలేదు. తెలుగు ముక్కలునాలుగు వీధిబళ్లో నేర్చుకొన్నాడు. ఏ.బి.సి.డీలు ఎట్లావుంటాయో తెలియనివాడికి వుద్యోగం ఎవరిస్తారు? అందుకని యీబ్రాహ్మణుడు "భిక్షాందేహీ" అనే వుద్యోగం లోప్రవేశించాడు. ఏపద్యాలో ఏఅధ్యాత్మరామాయణ కీర్తనలో కృతులో పాడుతూ ఇంటికిపోయి ఏవిధంచేతనో సంసారం నెగ్గించేవాడు. రోజు అరుణోదయంబుననే నిద్రనుండిలేచి ఒంటినిండా నామాలుపెట్టి తెల్లగాతో మిన చెంబుదీసుకొని జపమాలధరించి నాట్యమాడుతూ, పాటలుపాడుతూ బయల్దేరేవాడు వూళ్ళోకి. ఒకరోజు వొళ్ళుకొంచెం బద్ధకంగావుంటె నిద్రనుండి ఆలస్యంగా లేచాడు. ఆలాజరగడం అందరికీ సహజమే. యథాప్రకారం బయల్దేరాడు వూళ్లోకి వుద్యోగానికోసరం. అంతలోనే భార్యవచ్చి చెయ్యిపట్టుకొని, నాథా! యీవాళ యిప్పటికి రాహుకాలం వచ్చింది. ఈరోజుమాత్రం భవతిభిక్షాందేహీ, మానుకొండి అని చెప్పింది. ఆమె మాటల కాబ్రాహ్మణుడు మండిపడి ఆయిల్లాలిని అర్ధచంద్రప్రయోగం చేసి వెళ్లాడు వూళ్ళోకి. పాపం ఆభార్యకంట తడి బెట్టుకొని యింటిలోనికివెళ్ళింది.

"శయనించినాడే శేషశాయి శయనించినాడే" అని ఆలాపనచేస్తూ ఒకసమ్మములోనికి ప్రవేశించినాడు. వాకిట్లో నిల్చోకుండా యింట్లో ప్రవేశించడం బ్రాహ్మణులకు సహజమే. ఆయింట యజమానునిపేరు శేషశాయి. ఆరాత్రంతా నాటకాన్ని చూచివచ్చి అప్పుడే పడుకొన్నాడు. నిద్రపట్టలేదు. ఆసమయంలో యీబ్రాహ్మణుని మాట లాతని చెవిలోబడిన తోడనే నిద్రాభంగం చేశాడని మహాకోపంతో శేషశాయిగారు కాలినున్న బూటుతీసి అంటించినాడా బ్రాహ్మణుని. అంతటితో ఆపాట ఆవీధిని విడిచిపెట్టి యింకొకవీధిలోప్రవేశించి అరణ్యవాసం రాముడుపోవడం దగ్గఱనుంచి "పోయి వస్తావా రామయ్యాతండ్రీ—మళ్ళీవస్తావా" అని పాడుతూ ఒకయింటివాకిట నిలబడ్డాడు. ఆయింటి యజమానునిపేరు రామయ్య. ఆయన చచ్చే స్థితిలో యున్నాడు. ఒచ్చేప్రాణం పొయ్యేప్రాణంగా వున్నది. బంధువులంతా ఆయన చుట్టుచేరి ఏడుస్తూన్నారు. వీలునామా తయారుచేస్తూన్నారు. కొంత మంది యీమాటలు విని కోపంచేత కినిసి వానిమీద బడి చావమోదినారు.

బ్రాహ్మణుడు రాముణ్ణితలిస్తే లాభందులేతన్నులు తగిలాయి అనుకొన్నాడు. సీతాదేవి రావణుని లంకలోవుండగా ఆంజనేయుడు అంత ప్రవేశించి వనంలో అశోకవృక్షంక్రిందవున్న సీతను చూచినదగ్గర నుంచి మొదలుపెట్టి "కనుగొంటినమ్మ సీతమ్మతల్లీ— కనుగొంటినమ్మా దివ్యస్వరూపం కనుగొంటినమ్మా కన్నులనిండా- తనివి దీరకనుగొంటినమ్మా నిజస్వరూపం-ఆనందముగా కనుగొంటినమ్మా- యితరుల వలన భయములేదమ్మ-చిక్కులనుండి విడదీతునమ్మా" అని పాడుతూ ఒకబజారు ప్రవేశించి నెమ్మదిగా నడుస్తూన్నాడు. ఆబజారు మొదటియిల్లు సీతమ్మగారిది. ఆమెవిధవ. కొంచెము రూపసి. గయ్యాళి. మహాకోపి. ఆమెయింటికి ప్రహరీగా బజారు సరిహద్దునవున్న గది సిధిలమై మొండిగానున్నదిగోడ. ఆగోడప్రక్కన భావివున్నది. సీతమ్మ దిగంబరియై స్నానం చేస్తూవున్నది. యీపాట ఆమెవిన్నది. అందరు భాగ్యవంతులే వుంటారా! డబ్బులేక గోడ కట్టించుకోలేదు. ఆమెకు కోపమువచ్చి బట్టచుట్టుకొని గబగబ వాకిట్లోకిపోయి యింట్లోకి రమ్మని పిలిచిందా బ్రాహ్మణుని. ఆహా! నామొర వినేటప్పటికి కరుణ గలిగింది సీతమ్మగారికి. కాబట్టియే స్త్రీలహృదయములు చాలా జాలిగలవి అని యెంచి యింట్లోకి ప్రవేశించాడు. యీమాటలు కూడా విన్నది సీతమ్మ. అగ్నికి తోడు వాయువుసాయమైనట్లైనది. నెమ్మదిగా తలుపువేసింది. మూలనుండు మొండి చీపురుతీసి చేతులలో సత్తువవున్నంతవరకు దేహంశుద్ధిచేసిందా బ్రాహ్మణుని. అప్పుడాతడా భార్య చెప్పినమాటలు జ్ఞాపకందెచ్చుకొని రాహు కాల ప్రవాహినికి సూడలై యిల్లుచేరాడు.

## ౫. ప్రశ్నలు

శ్రీమతి యమ్. వి. రత్నావళిగారు

(ఈ దిగువను 7 గుచ్ఛములు (గ్రూపులు)న్నవి. ఒక్కొక్కగుచ్ఛమున కొన్నిపేరులున్నవి. ఒకొక్కపేరునుండి ఒకొక్కఅక్షరముతీసి అందందు ఉదహరింపఁబడిన స్త్రీపేరో భర్తపేరో వ్రాసి అంపించవలెను.)

**స్త్రీ పేరు**
మకరసంక్రాంతి
అనేకప్రయత్నాలు
వరహాలపేరు
నళినీకశము

**భర్తని పేరు**
యిదిప్రహసనము
అనుమానము
మంగళసూత్రము
కృష్ణతులాభారము
అడుగవలెను

**ఆభరణము పేరు**
వుపకారము
అసురవధ
విజయలక్ష్మి
ఏకదంతుడు
బ్రహ్మాండము

**గ్రామం పేరు**
సమారాధన
మేకలమంద
యీశ్వరకృప
కర్పూరహారతి
సులభము

**కాయ పేరు**
వేపచెట్టు
చేదుఃతినరాదు
సర్వాంతర్యామి
వేసవికాలము
అనసూయ

**పుస్తకము పేరు**
అభయదానము
భక్తమంజరి
అద్దాకలవి స్తరి
జగన్మోహిని
చింతకాయ
యమునానది

**పుష్పము పేరు**
అవతారము
మధుసూదన
బచ్చలికూర
పురాణము
నవ్వుముఖము

పై ప్రశ్నలకు వరుసను ఒకటిచొప్పున అక్షరముతీసి పేరు పూర్తిచేయువలెను.

---

## ౬. చిత్రప్రశ్న

బయ్యా సూర్యనారాయణమూర్తిగారు

సీ॥ సిరిసంపదలచేతఁ జెన్నొందు ధన్యాత్మ
 లిలవసించెడు నింటి కద్ది పేరు?
సతిపంపుననుగాళి నతిభక్తినర్చించి
 కాళిదాసెద్దానిఁ గాంచినాఁడు?
జాపరహృదయుంబుఁ జారగొనెడిరూప
 వైభవంబెత్తెఱఁ బడయునరుఁడు?
గానుపింపకజీవ గణము కప్పుడునాయు
 రభివృద్ధిఁజేయు పదార్థమెద్ది?
అన్నిటికిఁగూడ నాల్గేసి యక్కరములె
మొదలునరికిన నన్నియు మదమెఱప్ప
నడవికిని నీటికిని గూడ నగును జెల్ప
నూటిగాఁదెల్పుడవ్వాని సుదతులార!

---

## చిత్రప్రశ్నలకు సమాధానములు

గతమాసముసంచికలోని చిత్రప్రశ్న శ్రీమతులు శిఖరం కమలాంబ, ఏలేశ్వరపు జయలక్ష్మమ్మ, పాకల చంద్రకాంతామణి, వారణాసి వరలక్ష్మిగార్లు మొదలగువారు సమాధానములు వ్రాసిరి.

మమతచే, ననలకై, వివిక్తము, గగనము, ముముక్షువు, శశమును, అనునవి సమాధానములుగా నెఱుంగునది.

# వార్తలు—విశేషములు

బెజవాడ, కాలికట్టు, కాకినాడ, రాజమహేంద్రవరం, తంజావూరు, విశాఖపట్నం, కోయంబత్తూరు ఈ రోడ్డుమునిసిపాలిటీలలోను వాటి చుట్టుపట్ల 5 మైళ్ల దూరములోనుకూడ వ్యభిచార నిర్మూలనచట్టము అమలులో నుంచబడునని ప్రభుత్వమువారు ప్రకటించిరి.

*　　*　　*　　*

రసాయనపద్ధతులపై స్త్రీలు అమెరికాలో విరివిగా పిల్లలను గనుచున్నారు. ఇట్టివారు చాలామంది అవివాహితలు. ఇట్టి పద్ధతిని అణచుటకు ప్రభుత్వమువారచ్చట నొక బిల్లు ప్రవేశపెట్టినారు.

*　　*　　*　　*

ఉత్తరకనరాజిల్లా హనవరుగ్రామ కరణము 50 యేండ్ల వయస్సున 13 యేండ్ల బాలికను వివాహము చేసుకున్నందుకు రు. 250-లును, పిల్లతల్లి రు. 500-లును జరిమానాలు విధించబడిరి.

*　　*　　*　　*

పశ్చిమగోదావరిజిల్లా శారదా సంఘ సభ్యుడు మేమూరి చలమయ్యగారు, డి. రామయ్యగారు మొదలుగాగల యేడుగురు స్త్రీ పురుషులపైని వారు శారదా శాసనమును తిరస్కరించి రామయ్యగారి బావమరిది కొమారుడికి, వదినగారి కూతురికి పెండ్లి చేసినారని కేసుపెట్టిరి. పెండ్లికొడుకు 18 యేండ్ల లోపలివాడగుటచేత నతనిని, పెంచినది రామయ్యగారగుటచేత అతని తండ్రి కాయన్నగారిని విడచిపెట్టిరి. రామయ్యగారు తన మతాచారప్రకారమట్లు చేయుట తప్పినది కాదని తెల్పుచూ చలమయ్యగారు కేసు పెట్టుటకు వేరేకారణమున్నదని చెప్పి దానిని స్టేటుమెంటులో నుదహరించెను. రామయ్యగారికి చలమయ్యగారు రు. 1700-లు బాకీ, దావాచేసి డిక్రీ పొంది అసలును సిద్ధముగానుండగా ఏమైనా కని పెట్టుమని అడిగాడు. ససేమిరా కనిపెట్టని లేనందువలననే శారదాకేసు పెట్టబడినది. నేరము నిజమైనప్పటికీ కేసుపెట్టుటకు కారణము పగ సాధించుటకే యను దురుద్దేశమేయని జిల్లామేజిస్ట్రీటు కుడ్వాగారు నమ్మి రు. 50-లు మాత్రము రామయ్యగారికిని మరియిద్దరికి తలా రు 25-లును జరిమానాలు విధించి చలమయ్యగారికి ఖర్చులు ముజరా యిప్పించలేదు. ఇట్టి సభ్యులవలన శారదాకమిటీల కవమానము కలుగుననియు, పూర్వాచారపరాయణులయెడల ప్రజల సానుభూతి హెచ్చి సంఘసంస్కారము క్షీణగతి నొందుననియు దీర్ఘమగు బోధనమునుగూడ జిల్లా మేజస్ట్రేటుగారీ సందర్భమున జడ్జిమెంటులో వ్రాసిరి.

*　　*　　*　　*

గోవిందస్వామి ముదలియారనునతను 26 సంవత్సరముల వరుడు. అతని తండ్రి తాత మొదలుగాగల 6 గురుపై 14 ఏండ్లకు వివాహముచేసిరని రామస్వామి ముదల్యారనునతను కుంభకోణం జాయింటు మేజస్ట్రీటు యస్. వై. కృష్ణస్వామి, ఐ.సి.యస్. గారియొద్ద కేసుపెట్టెను. ఈ పెండ్లి జరుపుటను ఆపుటకుకూడా 1932-నుంచి ప్రయత్నములు జరుగుచున్నవి. 1932లో మదరాసు ఇండియను వుమన్సు అసోసియేషనువార్లు అట్టి వివాహమువలన రాగల ఉపద్రవములనుగూర్చి ఉభయపార్టీలకు బెదిరింపు లేఖల వ్రాసినందువలన ప్రథమ ప్రయత్నము నిలిచిపోయినది. 1933లో యీ ఫిర్యాదియే ఈ వివాహము జరగకుండా ఆపవలసినదని తంజావూరుజిల్లా మేజస్ట్రేటుగారికి పిటిషను పెట్టెను కాని కోర్టువారు

తమ కట్టి అధికారము లేదనుటచే వివాహము జరిగి పోయెను. ఫిర్యాది పిమ్మట కేసు పెట్టెను. ఇప్పుడు విచారణ జరుగుచున్నది. గోవిందస్వామి ముద ల్యారుగారి పార్టీ సాక్షులు కొందరు వివాహము జరిగినదనీ, కొందరు లేదనీ, కొందరు తమకు తెలియ దనీ చెప్పుచున్నారు.

*　　*　　*　　*

సారనాథను అనునతడు స్టోక్సు అను అమెరికను ఫాదరీకి హిందూమతదీక్ష నిప్పించెను. అతనికి ఇప్పుడు 'సత్యానంద' అని నామధేయము. ఇట్లు పైమతములవారిని తమ మతములోనికి చేర్చుకొనుట సనాతనమత విరుద్ధము కనుక సారనాథుగారిని బహి ష్కరించవలసినది అని భిషుదాసు ధర్మారాము అను వారు ప్రజల కుద్బోధనముచేసిరి. తనను బహిష్కరిం పుమని ఇట్లు ఉద్బోధించుట తనకు పరువుతక్కువ గనుక మాననష్టపరిహారము నిప్పించవలని మేజస్ట్రేటు అజియుద్దీను సాహేబుగారిచద్ద సారనాథుగారు పిటిషను పెట్టుకొనిరి. సాహేబుగారు ఇద్దరికిని తలా రు. 100-లు జరిమానా లేక తలా మూడుమాసములు శిక్ష విధించెను. వారిరువురును అంబాలా సెషన్సు జడ్జీయొద్ద అపీలుచేసిరి. సెషన్సుజడ్జి కేసంతా చూచి ఇందుకు మాననష్ట మేమీలేదని అభిప్రాయపడి శిక్షను తీసివేసెను.

*　　*　　*　　*

శ్రీకాకుళం కాపురస్థుడు గన్నవరపు జగన్నా థంగారు వగైరా 4 గురుమీద జగన్నాథంగారు 11 యేండ్ల వయస్సుగల కూతురికి వివాహముచేసిరని విశాఖపట్టణం శారదాకమిటీవారు కేసుపెట్టిరి. రెం డవ ముద్దాయీ వరుడు 21 సంవత్సరములు వయస్సు గల వరుడు పోలీసుఉద్యోగస్థుడు. వివాహం కాలే దనియు ప్రధానమే జరిగినదనియు వాదనపెట్టు కొనిరి. కాని జిల్లా మేజస్ట్రేటు వృద్ధుగారు వధువు తండ్రికి రు. 300లు, వరునకు 100లు జరిమానావేసి ఫిర్యాదీకి రు. 50లు పరిహార మిప్పించెను.

*　　*　　*　　*

శృంగవరపుకోట గ్రామమునసబు, మోపాడ సత్యనారాయణగారు వగైరా ముగ్గురిమీద సత్య నారాయణగారి 9 యేండ్ల కూతురు చిన్నమ్మని 14 యేండ్ల వరుడు అప్పలు యనునతనికిచ్చి వివా హము చేసినందుకు విశాఖపట్టణం శారదాకమిటీవారు కేసుపెట్టిరి. వివాహము తాను చేయలేదనీ, ఆ వివా హము చాలాకాలము క్రిందట జరిగినదనీ అచ్చు శుభ లేఖలు వగైరాలు తెచ్చి వాదించెను గాని మేజస్ట్రేటు గారు దానిని నమ్మక సత్యనారాయణగారికి రు. 500-లును పురోహితునకు రు. 100-లును జరిమానా విధించి ఫిర్యాదికి రు. 50లు ఖర్చులు నిమిత్తం యిప్పించెను.

*　　*　　*　　*

కుంభకోణము బ్రాహ్మణులు ఒక యజ్ఞములో 23 మేకలను, ఇంకొక యజ్ఞములో 10 మేకలను ఆహుతిచేసిరి. జీవకారుణ్య సమితివారు ప్రభుత్వము వారికి వీని నాపవలసినదని పిటీషను పెట్టుకొనిరి కాని వారు ప్రవేశించుకొనలేదు. జగద్గురు శంకరా చార్యులుగారు వీనిని ప్రశంసించుచున్నారట.

*　　*　　*　　*

జర్మనీనియంత హిట్లరుగారు తన మిత్రులలో చేరినవారే తనను గూల్చుటకు కుట్ర పన్నుచున్నా రని తలచి ఒకరాత్రి 140 మందిని వధించెను. తనకు ముందు ప్రధానమంత్రిగానుండిన వాన్ ష్లేషరు అతని నడ్డుకొనబోయిన భార్య తుపాకివాత బడిరి. కేప్టను రూముగారు తుపాకితో ఆత్మహత్య చేసికొనుట కంగీకరించనందున చంపబడెను.

*　　*　　*　　*

భారతదేశ గృహపరిశ్రమలను స్థాపించుటకు ఒక బ్యూరో (సంఘమును) ఇండియా ప్రభుత్వమువారు స్థాపించి దానికి 5 లక్షల రూపాయీలను కాంక్షను చేసిరి. గత మూడు సంవత్సరములలో యీ అయిదు లక్షలు ఖర్చుపెట్టి కొన్ని విచారణలు ప్రకటనలు మాత్రము సల్పినది. జూలై 9-వ తేదిని సిమ్లానగర మున భారత పరిశ్రామిక శాఖాధ్యక్షుడు సర్ ఫ్రాంకునాయిడుగారి అధ్యక్షతక్రింద వివిధ రాష్ట్ర ముల మంత్రులు, డైరక్టరులు సమావేశమైరి. నేత పరిశ్రమ, చేతిమగ్గములు నిమిత్తము ఏటేట 5½ లక్షల రూపాయీల చొప్పునను పట్టుపరిశ్రమ పరిశోధనల నిమిత్తము 1 లక్ష రూపాయీల చొప్పునను, 5 ఏండ్లవరకు నిచ్చుటకు కాంక్షను చేయబడెను.

# గ్రంథ పరిచయము

హరిజన:—

హరిజనుల పక్షమున ప్రతిమాసము వెలువడు మాస పత్రిక. సంపాదకుడు ఉ. సుబ్బారావుగారు; కార్య స్థానం రాజోలు, తూర్పుగోదావరిజిల్లా. సంవత్సర చందా రు. 1-8-0 జూన్ మాసపు నాల్గవసంచిక మా కార్యాలయమును చేరినది. ఇది ఆంగ్లహరిజన పత్రికకు ప్రతిబింబముకాక ఆంధ్రదేశాభ్యుదయకరవ్యాసము లతోను వార్తలతోను నందగించుచున్నది. రసవంత ముగ వ్రాయగల హరిజన విలేఖరు లిందు ధైర్యముగు వ్యాసములు వ్రాయుచుండుట ఎంతయు ప్రశంస నీయము. హరిజన విద్యార్థులెల్లరును దీనికి తగిన ప్రోత్సాహమును గూర్తురుగాక!

కాశీవిశ్వనాథంగారి ఉపన్యాసము:—

వీరు తెనాలి సాంఘిక మహాసభ కాహ్వాన సంఘాధ్యక్షులై ఒసంగిన ఉపన్యాసము మాకు చేరి నది. వివాహము, స్త్రీవిద్య, ఓటింగు, దాయ భాగము, శుద్ధిసంస్కారణము, అస్పృశ్యత మొదలగు విషయములనుగూర్చి గంభీరముగ విమర్శించి పూర్వపు మూర్ఖాచారములకు స్వస్తి చెప్పవలసిన ఆవశ్యకతను రూఢిపరచుచున్నది.

శ్రీరాజకీయోన్నత మహిళాపాఠశాలా వార్షికనివేదిక:—

(అనంతపురం 1934)

ఇది వీరు ప్రకటించిన రెండవవార్షిక సంచిక. ఈ పాఠశాల ఇప్పటికి 14 ఏండ్లు గడపినది. ఇందు ట్రెయినింగు, స్కూలుఫైనలు సెక్షనులు రెండును గలవు. హాస్టలులో 36-గురు బాలికలున్నారు. వారమువారము బాలికలు ఉపన్యాసములు చేయు చుందురు. సహభోజనము, హంపీప్రయాణము, ఆటలు పందెములు, స్కౌటింగు ప్రాతవిద్యార్థి సంఘము మొదలగు అంగులతో ఇది సర్వాంగ సౌం దర్యముతో వృద్ధినొందుచున్నది. శ్రీమతి ఏ. కోటమ్మ బి.ఎ; యల్.టి; గారు ప్రధానోపాధ్యాయిని 13 స్త్రీ ఉపాధ్యాయినులు, యిరువురు పురుషోపాధ్యాయులు పఠనాలయము, చక్కని లైబ్రరీయుగలవు. ఈసంచిక యంతయు విద్యార్థులురచించిన ఆంగ్లాంధ్రవ్యాసములు పద్యములతో చవులూరుచున్నది. చక్కని బొమ్మలు, దళసరిగ్లేజుకాగితములు స్ఫుటమగు అచ్చు కలిగి చిరకాలము దాచుకొని బాలికలెల్లరును పఠింపతగి నదియైయున్నది. ఉ. తరాదిస్కూలుల బాలికలును పాఠశాలలును వీరి యుదాహరణము ననుకరింపఁ గోరుచున్నాము.

గీతాత్రయము:—

క్రౌనుసైజున 40 పుటలు. గ్రంథకర్త శిరిపి ఆంజనేయులుగారు విజ్ఞానవల్లిక, అనంతపురం. ఇందు కరుణాగీత, గాయత్రీగీత, జ్ఞానగీత అను మూడు భాగములు కలవు. మొదటిది కరుణమును రెండవది నిష్ఠను మూడవది వివేకమును బురికొల్పును. సులభ శైలి. ఒకఅణా తపాలచీట్లు నంపువారందరికి ఇది ఉచితముగ నొసఁగఁబడును.

అన్యాపదేశశతకము:—

క్రౌనుసైజు 30 పుటలు గ్రంథకర్త శిరిపి ఆంజనే యులుగారు. దీనికి శ్రీయుత మున్నంగి శర్మగారు చక్కని యుపోద్ఘాతమును వ్రాసినారు. వారిదపు ఔదార్యము, గంగపరహితజీవనము, ద్వీపగృహపు లక్ష్యము మొదలగు 52 అంశములనుగూర్చి సులభ సుందర గీతపద్యములు ఇందుగలవు. బాలురు బాలికలు పాఠశాలలలోను ఇంటియొద్దను చదువుకొనుట కెంతయు నుపయుక్తము.

మాతులస్మృతి:—

శ్రీయుత రాయపురపు రామమూర్తిగారి నిర్యాణ సందర్భమున వారి మేనగోడలు శ్రీమతి గిడుగు లక్ష్మీ కాంతమ్మగారు రచించిన 16 సానుభూతిపద్యములు. కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింపఁజేయు దుఃఖరస ముతో పాఠకుల హృదయ భేదన మొనర్చుచుండును.

**లోకలు బోర్డు:—**

తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వరపురమునుండి శ్రీయుత చాగంటి శేషయ్యగారి సంపాదకత్వమున నిది ప్రకటింపఁబడుచున్న సంగతి గృహలక్ష్మీపాఠకులకు విదితము. అజ్ఞాన, అనారోగ్య అనైకమత్య నిర్ధనత్వాది అనంతానర్థములకు గుఱియై తలయెత్తుకొనలేకున్న మన ఆంధ్రదేశపు గ్రామపంచాయతీ శిశువులకు ఈ పత్రిక తాను చేయుగల ప్రధానసహాయముగు మంచిసలహాలను, ఆదర్శోపదేశములను నొసగుచు సాధ్యతరములగు ఉపాయములను సూచించుచు రెండు సంవత్సరములు నిరుపమానమగు సేవ చేసి మూడవసంవత్సరమున బ్రవేశించినది. అవ్వాయి తువ్వాయి కథలు, హాస్యములు పరిహాసకములు, లోకాభిరామాయణములు మొదలగు ఖుషీటపాలు గాదీ పత్రిక. ఇందలి ప్రతిపుటలోని ప్రతియక్షరమును దుర్భర దుఃఖపీడితులగు గ్రామవాసులకు అమృతబిందువు. పంచాయితీవ్యవహారములా, కోర్టుపద్ధతులా, ధరవరుల హెచ్చింపు తగ్గింపుల ప్రశంసలా, బియ్యపుదిగుమతులగోలలా, పంచాయితీలవారి అనుమానములను కనుగొని వానికి సమాధానములా, ఇట్టి సర్వతోముఖసేవ నిరాడంబరముగఁ జేయుచున్న సంపాదకునికి మాహృదయపూర్వకాభినందనములు. వ్యవహారచతురులగు ఆంధ్రగ్రామీణులు యీసేవను గుర్తించలేరని నమ్మజాలము. ఈ పత్రికకు పంచాయితీలు చేయగల సేవ యెల్లయు స్వగ్రామసేవయేకాక వేఱొకరకపు ఖర్చుగా భావించక నిందుగౌరవముతో చందాదారులై ఆదరింతురుగాక అని హెచ్చరించుచున్నాము.

**గీతాతరంగిణి:—**

క్రౌనుసైజు 16 పుటలు. వెల రు 0-2-0 అణాలు. కీర్తిశేషులగు వడ్డాది తిమ్మరాజు కవిగారిచే రచింపఁబడి ఖాసింకోట సంస్థానోద్యోగియగు వారి సోదరుడు భీమశంకరదాసుగారిచే ప్రకటింపఁబడినది. ఇందు ఏతత్కవికృతమగు గోపాలసహస్రమునుండి కొన్ని పద్యములును, కేశవనామములతో శ్రీకృష్ణుని సంబోధించుచు వ్రాసిన 24 కీర్తనలును గలవు. భక్తిరసపూరితము.

**భక్తరక్షణశతకము:—**

డెమ్మీసైజు 18 పుటలు. వెల 1 అణా. చక్కని ఉపమానములు, ఉన్నత తత్వవిమర్శనలు, ఉత్తమ భావములు, రసవంతమగు శైలిగలిగి యిందలి నూరు పద్యములును చదువుట కానందకరముగను కంఠస్థము చేయుట కనుకూలముగను నున్నవి. శ్రీయుత వడ్డాది భీమశంకర కవికృతము.

**శ్రీమదాంధ్రకిరాతార్జునీయము:—**

సంస్కృతకవి భారవి రచించిన కిరాతార్జునీయ కావ్యముయొక్క భాషాంతరీకరణములో తృతీయభాగమును తద్గ్రంథకర్త శ్రీయుత భువనగిరి విజయరామయ్యగారు, మాకార్యాలయమునకు విమర్శనార్థము పంపించినారు. అర్థగౌరవమునకు గుఱియైన భారవి నాంధ్రభాషాగౌరవభూషితుని ఆంధ్రావళిమోదముం బొరయునట్లొనర్చిన కవిగారెంతయు సంస్తవ్యులు. సంస్కృతాంధ్రపదము లల్లిబిల్లిగ నల్లుకొనిన యత్యంచితపదౌచిత్యము గంభీరభావముల అనర్గళగమనమునకు శోభగూర్చుచు కవిగారికి పౌరాణికకవులలో నొక విశిష్టస్థానము నిచ్చుచున్నవి. కవులకు, పండితులకు, విద్యార్థులకు, సత్కావ్యసాధారణపఠనాసక్తులకు నెల్లఱకు వారివారి కనువగు హాయిని గూర్చును. డెమ్మీసైజు 160 పుటలు. వెల రు 1-8-0 లు. ప్రతులు గుంటూరు లోకలుఆడిటు ఆఫీసులోనున్న కవిగారివద్ద లభించగలవు.

**కర్ణచరిత్ర (పూర్వఖండము):—**

డెమ్మీసైజు 68 పుటలు. వెల రు 0-10-0 లు. బరంపురం కళాప్రచారకసమితివారి 8 వ ప్రచురణము. గ్రంథకర్త శ్రీయుత మల్లాది వేంకటకృష్ణశర్మగారు శ్రీకాకుళం. ఈ పూర్వఖండములో మూడాశ్వాసములుగలవు. కర్ణుని అంగరాజ్య పట్టాభిషేకమువరకు జరిగిన చరిత్రమిందు వర్ణితము. కవిగారు మిక్కిలి యువకులు. ఇది యింతవఱకు వారి ప్రథమప్రయత్నమయ్యు పెక్కుఅ ప్రౌఢకవితలను బురుడించుచున్నది. కవిత్వము తీయని తేనెకాలువఁబోలె యింపునింపుచు నెంతసేపు ఈదులాడినను విసుగు జనింపనీయదు. తెలుగుపదములకంటె సులభ

మైన దీర్ఘసంస్కృత పదసమాసములు, సులభసంస్కృతపదముల సుందరగుచ్ఛముల మధ్య విచ్చి ముచ్చటలూరుచుండు అచ్చతెనుగుపదముల ప్రచ్ఛాదనమును, స్వతంత్ర కథాకథనవిధానమును, నిరుపమానమైన ఉపమాద్యలంకారములును, మితియథోచిత ప్రాతస్సాయంతన ఋతుతరుసరోవరాదివర్ణనంబులును, పాత్రపోషణనైపుణ్యమును కవిగారిరచనకు విశిష్టలక్షణములైయున్నవి. ఆంధ్రులెల్లరును దీనిని పఠించి యితరఖండముల కెదురు చూచుచుందురుగాక!

**అయోమయ పంచాంగం (హాస్యము) :—**

క్రౌనుసైజు 78 పుటలు. గ్రంథకర్త శ్రీయుత కొమ్మాజ్యోస్యుల వేంకటరమణయ్య శర్మగారు, సాలూరు, విశాఖపట్టణము జిల్లా. ప్రార్థనశ్లోకములు, వాటి విపరీత వ్యాఖ్యానములు, ఆదాయవ్యయములు లగ్న నక్షత్ర స్వప్నఫలములు, దుష్ఫలప్రతీకారములు మొదలగు వివిధ విషయములతో ఆద్యంతము నవ్వు పుట్టించు చక్కని గ్రంథము. చదువువారికి విశేష లోకజ్ఞానముకూడ కలుగును. అసభ్య అవాచ్య ప్రసంగముల కెక్కడను తావీయ లేదు. గ్రంథకర్తగారికి చక్కని హాస్యధోరణి గలదు. కేవలము హాస్యగ్రంథములకంటె హాస్యరసముతో మేళవించిన కథలు నవలల కెక్కువ ఉన్నతస్థానము సాహిత్యమునం దున్నది కనుక వీరు అట్టి రచనలలోకూడా చేయిబెట్టి హాస్యకళకు వన్నె పెట్టుదురుగాక! కొన్ని సంఘదురాచారములను నొప్పించకుండ విమర్శించి సంస్కరింపగల నేర్పులో హాస్యరసము ఎన్నడును పైచెయ్యి. వీరి రచనలవలన అట్టిసేవ మన సంఘమునకు కలుగునుగాక అని కోరుచున్నాము. వెల రు. 0-4-0 మాత్రము.

**కళ్యాణి :—**

40 పుటల ప్రమాణముగల ఉత్కృష్ట సాహిత్య మాసపత్రిక. జ్యేష్ఠమాసపు సంచిక మా కార్యాలయము చేరినది. సంపాదకులు శ్రీయుత గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు. చాలాకాలమునుండి ప్రకటింపబడుచు పండితుల పద్యరచనలచే అంచగించుచుండు ఈ పత్రికను పాఠకులకు మేము క్రొత్తగా పరిచయపరచవలసిన ఆవశ్యకతలేదు. ఈ సంచిక శ్రీయుతులు నిడదవోలు వెంకటరంగారావు, వడ్డాది సీతారామాంజనేయులు, మండా జగన్నాథ కవి మున్నగువారల గంభీరపద్యములు కొన్ని చక్కగ గద్యకథలతో రాజిల్లుచు పండిత పామర జన హృద్యమై నవరసభరితమైయున్నది. ఆంధ్రులెల్లరి మన్ననకును పాత్రమైనది. సంవత్సరము చందా రు.2-0-0లు మాత్రము. విడిప్రతి రు.0-4-0. కార్యస్థానము విజయనగరము.

**దివ్యతేజోనిధులు (మొదటిభాగము) :—**

క్రౌనుసైజు 56 పుటలు. వెల రు. 0-4-0లు. గ్రంథకర్త శ్రీయుత నేదునూరు గంగాధరంగారు. రాజమహేంద్రవరం పోస్టు కొంకమూరు. శ్రీ మహాలక్ష్మి ధర్మపుస్తక భాండాగారము వారివల్ల ప్రకటితము. ఇందు సుప్రసిద్ధ పౌరాణికవ్యక్తులగు అర్జునుడు గరుత్మంతుడు, పృథుచక్రవర్తుల పరాక్రమచరిత్రలు గంభీర గ్రాంథికశైలిలో వర్ణింపబడినవి. ఉన్నత తరగతులకు పాఠ్యగ్రంథముగాను౦డగల పదపటుత్వము, భావగాంభీర్యము, విజ్ఞానపరిచయము నిండు తొలకుచున్నవి.

**నూతన దసరాపద్యములు :—**

ఇదియును పై గ్రంథాలయమువారిచేతనే ప్రకటింపబడునది. దేవతల ప్రార్థనలు, దశమీ వివరము, రామాయణ సంగ్రహము మొదలగు పెక్కువిషయములనుగూర్చి డెమ్మీసైజు 16 పుటల పద్యము లిందు గలవు. వెల ఒక అణా.

**ఏకాదశీ మహాత్మ్యము :—**

ఇదియు నేదునూరి గంగాధరంగారిచే వ్రాయబడి రాజమహేంద్రవరం గుండు జగన్నాథం అండు సన్సు వారిచే ప్రకటింపబడిన డెమ్మీసైజు 16 పుటలుగల స్త్రీలపాటల పుస్తకము. వెల ఒక అణా. ఎల్లరెరింగిన రుక్మాంగద మహారాజుచరిత్ర కథావిషయము. స్త్రీలకు లోకనీతి, ధర్మబుద్ధి, దైవభక్తి మొదలగు సద్గుణపరంపర లిట్టి గ్రంథములవలన కలుగునని వేఱ చెప్పనక్కఱలేదు.

# లోకం పోకడ

## కోమలవల్లీదేవి దయ

కుంభకోణంలో 75 యేండ్ల వయస్సుగల రుక్మిణి అమ్మాళ్ అనే పేరుగల ఒక వైష్ణవబ్రాహ్మణ అవ్వగారున్నారు. చీకటి రాత్రిళ్లు. పెరట్లో చప్పుడయింది. ఇదివర కాతోవను వారింట్లో దొంగలు వచ్చారు కనుక మళ్లీ దొంగ లొస్తున్నారేమో అని అనుమానంవేసి హరికేనులాంతరు వెలిగించుకొని ఒక్కర్తే పెరట్లోకి వెళ్లింది. పెరట్లో ఎత్తైన ప్రహరీ గోడలు. 25, 40 సంవత్సరముల వయస్సుగల ఒక ఆసామీ గోడమీదనుంచి క్రిందికి జారుతున్నాడు. వెంటనే వాడి కాళ్లు పట్టి క్రిందికీడ్చేసి 'దొంగోయి' అని అరచింది. మళ్లీ గోడెక్కి పోవీలులేదు. వాడి చేతులు పట్టుకున్నది. బలవంతుడేమో, ఆమెను మెడ్డాయించి తప్పుకొని యింట్లో దూరుదామనుకున్నాడు. ఆమె మనమరాలు నిండుపొద్దుల మనిషి, వాడిని యింట్లోకి రానీయకుండా ఆపి తలుపు వేసేసింది. ఈ ముసిలిది మళ్లీ వాణ్ణి పట్టుకొని గోడకువేసి కొడదామని చూసిందట. కాని సాధ్యమయింది కాదు. వాడామెపట్టు విడిపించుకొని ఒక పనసకాయకత్తి తీసి ఆమె మణికట్టుమీద కొట్టేడు. గాయముపడిన ఆ మణికట్టుతోటే కత్తి బారెడుదూరాన పడేటట్టు కొట్టిందట. మళ్లీ మరో చాకుతీసి పొడవబోయినాడట. దానినికూడా పట్టుకోబోతే అరచేతిలో గుచ్చుకుని రక్తం కారడం మొదలుపెట్టింది. ఎడమచేతితో లాంతరు పట్టుకొని మళ్లీ వెంటపెట్టిందట. కాని యేలాగో గోడ అవతలికి గెంతేశాడట. ఆమె ఆస్పత్రిలో చికిత్సపొంది నిమ్మళంగావున్నారు. మద్రాసు మెయిలు పత్రికా విలేఖరి ఇదంతా ఆమె ముఖతా తెలుసుకొని 'మా పేపర్లో వేయిస్తాము. మీ ఫోటోగ్రాఫు తీసుకుంటా' నన్నాడట. ఆ ఛాందసపుటిల్లాలు ఎంత మాత్రం వీలుకాదంది. ఆమె ధైర్యసాహసములను అతను ప్రశంసిస్తే "నాలో ఏముంది నాయనా, అంతా కోమలవల్లీదేవి దయ" అని ఆమె సెలవిచ్చింది. ఇదే మన మెవరమేనా చేసివుంటే మన ప్రతాపమే అని చాటుకొని ఫోటోగ్రాఫులతో సహా అన్ని పేపర్లలోనూ అచ్చువేయించి ప్రకటించుకొనివుండుము.

## పుట్టుపూర్వోత్తరము

ప్రసిద్ధపురుషులకులాగే సుప్రసిద్ధాచారములకు ఫేషన్లకుకూడా పుట్టుపూర్వోత్తరా లుంటాయి. సాధారణులైతే ఆ పురుషులను గౌరవిస్తూ ఆ ఆచారాల ననుకరిస్తూ పోతారు. చరిత్రకారులైతే వాటి పుట్టుపూర్వోత్తరాలను పరిశోధించి బయలుపెట్టుతారు. ఇప్పుడిప్పుడు మన భారతదేశంలోకూడా అమలులోకి వస్తూవున్న ఒకానొక ఫేషనుయొక్క పుట్టువును గురించి యిప్పుడు విచారించవలసివున్నది.

ఒకప్పుడు స్త్రీలకు ఆజానుబంబమగు కేశపాశ మందమని భావించబడేది. ఇందుకొరకు నానారకముల తైలములను వాడుచుండేవారు. 'అతి సర్వత్ర వర్జయే' త్తను సూత్రమునుబట్టి ఇట్టి సుందరతరకచభరంబుపైకూడ స్త్రీలకు రోతపుట్టి కత్తెరప్రయోగం సాగుతోంది. 'పెరుగుట విరుగుటకొరకే' అని ఊరకే చెప్పేరా? పెంచినన్నాళ్లూ కురులను ముద్దుగా పెంచి జడలు సిగలు పువ్వులు నగలు పెట్టి అల్లారుగారాబముగా పెంచినారు. కాని నాగరికత మహాప్రవాహంలో సర్వసమానత్వ ధర్మవిజృంభణంలో వాటికికూడా 'మగపురుషు'ల జుట్టుకుపట్టిన గతే

పట్టింది. క్రాపింగు కత్తిరింపు, గొరుగుడు, డ్రెస్సింగు! దీనికి సరియైన తెలుగుపేరింకా యెవ్వరూ కనిపెట్టలేదు. కనుక 'బాబింగు' అను దాని పాశ్చాత్య నామధేయమునే మనముకూడా ప్రయోగిద్దాము.

సుమారు నూరు నూటయేబది సంవత్సరముల క్రిందట ఫ్రాన్సులో సైనడ్ డి ముల్ ఎన్లోక్లూజు అనే సుందరస్త్రీ వుండేది. సర్వాంగ సౌందర్యము, చక్కని తెలివితేటలు, విలాసలోలత, విస్తారసంపదా కలిగి పురుషులను సదా ఆకర్షించుతూ ఆరాధించబడుతూ ప్యారిసుపట్టణములో ఒక వెలుగు వెలుగుతూవుండేటప్పటికీ, పాశ్చాత్య నీతిశాస్త్రప్రకారమామెను నీతిరహిత యని చెప్ప వీలులేదు. ఫ్రెంచి చక్రవర్తి తన నుంచుకుంటానంటే మొగము ముడుచుకొని తిరిగీ యింటికి రానీయలేదట. ఇల్లాగే ఎంతమందో ప్రభువులు ఆమెను కొలిచినవాళ్లు కొలిచి, ఆశపడినవాళ్లు ఆశపడి, తుదకు భగ్నహృదయులై యింటిమొగము పట్టిరట. కౌంటు ఫిస్కే అనే అతనిమీద ఆమెకు మోహముండేది. పెండ్లాడుతుందని అతనూ పైవాళ్లూ అందరూ అనుకొనేవారు. అయితే అతనిమీద ఆమె కెంత మోహమో అంత యెక్కువగా జగడమాడి చికాకు పెట్టుచుండేదట. ఇదికూడా ఒకవిధమగు మోహలక్షణమేమో! తుద కతను విసిగిపోయి నిరాశోపహతుడై ఒక అర్ధరాత్రివేళ యెవ్వరికీ చెప్పకుండా ప్యారిసు నగరము విడచి యెక్కడకో పారిపోయి వాడట. ప్యారిసునగరంవాళ్లు చిలవలు పలవలుగా దీని కనేక కారణాలు సృష్టించి చెప్పుకొనేవారు. నిజము దేముడి కెరుక.

ఎల్లాగైతేనేమి సైనకు పశ్చాత్తాపం వచ్చింది, దుఃఖించింది, పరాభవం గుర్తించింది, అత నెక్కడున్నాడో తెలిసి ఉత్తరంమీద ఉత్తరం వ్రాసింది. అయితే అతను కిక్కురనలేదు. తుదకు అతనికి తన యందు విశ్వాసం పుట్టించుకోవడంకోసం ఒక ఉత్తమోపాయము, త్యాగనిదర్శనము, పౌరుషచిహ్నమగు మార్గమును కనిపెట్టింది. బంగారంవలె తళతళ మెరయుచు, మంటలవలె ముఖమండలమునను అంసభాగంబులను కటితటంబువరకును ముసురుకొనుచు వ్యాపించిన దీర్ఘకేశపాశమును కత్తెరతో కత్తిరించి అతనికి పంపించింది. అతను మిత్రజన మధ్యస్థుడయ్యు ఈ కేశములను చూడగనే గుండెలు కరిగి యేడ్చి తలమీద టోపీ, గుండెలమీద జుబ్బా లేకుండా ప్యారిసు వీధులవెంట పరిగెత్తివచ్చి సైనను మ్రోలనిలచి ఆమె యీ హ్రస్వకేశములతోనే వేయిమడుంగు లెక్కువ సుందరముగనున్నదని పొగడి ఆమెతో హాయిగానుండెను. నాటినుంచి ఫ్రెంచి సుందరులెల్లరు ఈ పద్ధతినే అవలంబించిరి. దీని "ఈటను క్రాపు" అందురు. అప్పటినుంచి ఈ సదాచారము అయిరోపా నగరములం దన్నిటను వ్యాపించి స్టీమర్లు, రైళ్లు యెక్కి తూర్పుదేశాలకు వచ్చి హిందూ నాగరికయువతులనుగూడ వశపరచుకొనుచున్నది. ఇట్టి పరమరహస్యములను హిందూ సచిత్ర వారపత్రికద్వారా లోకులకు బహిరంగపరచుచున్న సైగలు జేమ్సుగారికి మనము కృతజ్ఞులమై యుండవలెను.

## ఉద్దండ పిండాలు

అవకాశాలిస్తే అన్ని డిపార్టుమెంటులలోనూ ఆడవాళ్లు మగవాళ్ల నవలీలగా మించిపోగలరని రష్యాచరిత్ర తిలకిస్తున్నవాళ్లందరికీ తెలుస్తుంది. కార్మిక ప్రభుత్వము రాకముందు రష్యాఆడవాళ్లెల్లాటివాళ్లో యెవ్వరికీ తెలియదు. ప్రభుత్వము వారు సమస్తావకాశంబులను వారికి తెరవగానే వాళ్ల సంపూర్ణ రేఖలు బయలుపడ్డాయి. ఆరోగ్యశాఖలో నూటికి 71 గురు స్త్రీలు. ఉపాధ్యాయశాఖలో నూటికి 56 గురు వారే. కళాశాల విద్యార్థులలో వారు నూటికి 33 గురు. వైద్యశాఖలో పనిచేయుచున్నవారిలో పురుషులకంటె స్త్రీలు మూడు రెట్లెక్కువ. సాంకేతికవిద్యలను నేర్చి పరిశోధనలు చేసి క్రొత్త క్రొత్త సులువులను (technical inventions) కనిపెట్టినవారు 20,000 మంది వున్నారు.

చిత్రకారితనములో ప్రథమ బహుమానము స్త్రీది. రబ్బరు ఫ్యాక్టరీలు నడిపించడంలో అనేక నుళువులు కనిపెట్టి మనుష్యులు పనిచేయ నక్కరలేకుండా సుఖపెట్టిం దింకో ఆమె. ఉత్తరధృవంలోకి చొచ్చుకొనిపోయి అక్కడి రహస్యములను బయలుపెట్టుచున్నవారిలో అగ్రగణ్యులు స్త్రీలు. ఇందుకొఱకు రష్యాలో ఒక పెద్ద డిపార్టుమెంటు వున్నది. అనేక ముఖ్యస్టేషనులు వున్నవి. వీటిఅన్నింటిలో ప్రధానాధికారులు స్త్రీలే. గత యీ యిరవైసంవత్సరాల యీలోపల రష్యాలో ఉద్భవించిన యీ శక్తిని తలుచుకుంటే ప్రపంచకానికంతటికీ దిగ్భ్రమ కలుగుతుంది.

## పాతికేళ్ల వధువులు యాభై యేళ్ళవరులు.

ఫ్యాషనులకల్లా మూలకందమైన ప్యారిసునగరంలో విజ్ఞానవతులైన స్త్రీలు పైవిషయమును చర్చించి కూడును, కూడదు అనుచున్నారు. ఉభయ పక్షములవారు చెప్పుచున్న కారణాలూ చాలా సమంజసంగానే కనిపిస్తున్నాయి కనుక ఇక్కడ ఉదహరిస్తే మనదేశపు విజ్ఞానవతులకుకూడా వివాహవయోనిర్ణయమునుగుఱించి ఒక తగుమైన తెన్ను కనిపించవచ్చును.

కూడదన్నవారు అంటారు:—ఇట్టి వయోతారతమ్యము తండ్రి కూతుళ్ళకుండవలసినది కాని మగడూ పెండ్లాలకుండవలసినదికాదు. పాతికేండ్ల పిల్లకింకా ప్రపంచకజ్ఞానమే వుండదు. తనకురెట్టింపు వయస్సు కలపురుషుని మోహము నాకర్షించగల శక్తి ఆమెకు చాలదు. ముప్పైయేండ్లు దాటినతరువాతే ఆమెకు మోహమంటే ఏమిటో తెలుస్తుంది. సమానమోహము సమానశుద్ధి వుండకుంటే దాంపత్యము రంజిల్లదు. సమానవయస్కులకే సమానమైన అభిరుచులు, ఆవేశములు, ఆనందములు వుంటాయి. మగ డెప్పుడైనా పెండ్లాముకంటే చిన్నవాడైతేనే మంచిది.

దీనికి పూర్వపక్షం వాళ్లంటారు:—స్త్రీలలో రెండుతరగతులున్నారు. మోహమెక్కువగా కలవారొకరు, బుద్ధి యెక్కువగా కలవారొకరు. మొదటి రకంవారు సమానవయస్కులను, రెండవరకంవారు తమకంటె పెద్దవారిని వివాహమాడవాలి. పాతికయేండ్ల పిల్ల యాభైయేండ్ల కుఱ్ఱవాణ్ని పెళ్ళాడినప్పుడు ఈ బేరంలో లాభమంతా ఆడదానిదే. యౌవనం చులుకుతనం, చాకచక్యం, బలం ఆమె వద్దనుంటవి కనుక పెనిమిటి ఆమె అదుపాజ్ఞలలోవుండి శాంతము దయ అభిమానం యెక్కువ చూపించుతూ విధేయుడై వుంటాడు. ఇటువంటి వివాహము లాదర్శనీయములు. పెళ్ళాన్ని చూస్తూవుంటే అతని యౌవనము విలాసము క్షీణించకుండా క్షణక్షణమునకూ మెఱుగు పడుతూవుంటాయి. మొగుణ్ని చూస్తూవుంటే ఆమె బుద్ధీ, విచక్షణా శాంతమూ సహనమూ వర్ధిల్లుతూ వుంటాయి.

మొత్తముపైని రెండుపక్షములవారూ ఒక విషయములో ఏకీభవించినారు. వివాహాలు కాకముందు స్త్రీపురుషు లిద్దరూ పదిమందితోనూ కలిసి వలసినంతమట్టుగ ప్రేమానుభవములు సంపాదించుకొని చివర కెవరినో ఎంచుకొని పెళ్లాడుకోవాలి. లేకుంటే తొందరపడి చేసుకున్న వివాహములు స్థిరంగావుండవు. గడియగడియకూ విడాకులే.

మనదేశంలో అంతవరకూ ఆవిధంగా కనిపెట్టుకునివుంటే యౌవనము పరిసమాప్తమే అవుతుంది. ఆటుపైని జరుగవలసిన కర్మకాండ మఱియేమీ బాకీ వుండదు కనుక యీపద్ధతి మన సంస్కర్తలకుకూడా అంగీకారయోగ్యము కాదేమో. అయినా చర్చలు చేస్తే కాని సారం బయలుదేరదు.

## విచిత్రమైనపందెములు

మనదేశంలో గుఱ్ఱపుపందెములు, పేకాటలు మొదలైన మరికొన్ని పందెములే వున్నవికాని సకలవిధములైన పందెములూలేవు. కొన్నిపందెములవలన కొన్నివేళల డబ్బు దండుగైనాకొన్నివేళలలోకొందరికైనా కర్మంజాలక కొంత డబ్బు చిక్కుతున్నది కనుక వానిని కేవలం అవివేకమని కొట్టేడానికి వీలులేదు. కాని కొన్నిపందేలలో కానీ లాభం లేకపోయినా పందెము నెగ్గిందనిపించుకుంటకే పందెము వేయడము, అందులో మానావమానాలని గుఱించి కూడా

యేమాత్రం లక్ష్యంచేయకపోవడం ఈచిత్రకళకు శిరోభూషణములవంటివి. అయితేనేమి అమెరికా ఖండములలో ఇట్టి విచిత్రచరిత్రులు చాలాకాలము నుంచి చాలామంది ఉంటున్నట్లు శ్రీ గ్రీస్టానుక్రాను గారు హిందూ సచిత్రవారపత్రికలో ప్రకటించుచున్నారు.

1663 లో జేమ్సుగోకీ అనే కెప్టాను లండనుపట్టణపు కల్లువీధిలో ఒక మైలుదూరము పొర్లుకుంటూ పోతానని పందెము వేశాడట. కార్ట్బట్టు అనే అతని మిత్రుడు "ఇతనింతటి అవమానకరమైన పనిచేస్తాడా" అనే సందేహముతో 'యేదీ చూదా' మన్నాడుట. వెంటనే అత నంతపనీ చేశాడు. ప్రజలు నవ్వుతూ చప్పట్లు చరుస్తూ అతనివెంట పడుతూ మీదపడుతూ వుంటే జమాజెట్టీల్లాంటి ఆరుగురు మనుష్యులు బలవంతంమీద వారి నిటూఅటూ సర్దేరు. లండను పట్టణమీదృశ్యమును చూచి యెంతో ఆనందించి వుంటుంది!

1789 లో మిస్టర్ బ్రౌన్సుకోంబు అనునతను (తరువాత అతనికి సర్ బిరుదముకూడా వచ్చింది) లండను హేలుబజారులో పూర్తిగా దిగంబరుడై స్నానముచేసి నూరుపౌనులు వాయించేశాడు. అప్పటి లండనుప్రజల కిప్పటి వారికున్నంత నీతిగౌరవములు లేకపోయినా, వారికి కూడా ఇది ఆశ్చర్యమునే కలిగించింది.

1812 లో జార్జి గాస్లింగు అనే శ్రీమంత యువకుడు ఏదైనా తగిననేరము అనగా 15 యేండ్లకు తక్కువకాని శిక్షపడే నేరముచేసి న్యూగేటు జైలులో పెట్టబడి 48 గంటలుండి పైకివస్తానని చెప్పి 250 పౌనులకు పందెమువేశాడు. వెంటనే అతను చింకిపాతలను కట్టుకొని పేదదొంగవానివేషము వేసుకొని తనతండ్రిగారి కొట్టులోని వస్తువులను దోచుకోవడం ప్రారంభించాడు. తండ్రి అతనిని తన కుమారుడని పోల్చుకోలేక అరెస్టుచేయించి తన్నించి జైలులో పెట్టించాడు. 48 గంటలు కాగానే అతను తనతండ్రికు త్తరంవ్రాసి పందెము సంగతి వివరించాడు. తండ్రి తనకుమారుని ప్రజ్ఞకు సంతోషించి కేసు ఉపసంహరించుకొని కొడుకు నింటికి రప్పించుకున్నాడు.

1682లో ఒక ఫ్రెంచిప్రభువు తన కత్యంతప్రేమాస్పదురాలైన ప్రియురాలిప్రేమను నాశనము చేసుకొందునని పందెమువేసెను. వారమురోజులు తాళి

అతడు ఆమెను నానావిధములైన మాటలూ ఆడి చేష్టలూచేసి చీకాకుపెట్టి, ఆమె అతనిని పొమ్మనేటట్లు చేసుకోవాలని ప్రయత్నంచేసెను. కాని ఆమెది మనహిందూదేశపు కులస్త్రీలకుమల్లె బండప్రేమ కాబోలును! ఆమెకు విరక్తి కలగలేదుట. చివరకామె చెలికత్తె లీపందెము రహస్యము గ్రహించి ఆమెకు చెప్పిరట. పందెముపోతే పోనీ కాని నేనాతనిపై మోహమును మాననందట ఆయిల్లాలు. పాప మతనిపందెము పోయింది!

1734 లో ఫ్రాంకుక్రాఫ్టను అను నతను నేపిల్సు పట్టణము వెళ్ళి ఒకనాటకము చూస్తూవుండెను. 'ఒక్కటే మాటనని యీజనసమూహమున కీ ఆనందము తప్పించి గాభరాచేసి అల్లకల్లోలము చేయనా' అని అతనితోడి ప్రయాణికమిత్రునితో పందెమువేసెను. ఆఒక్కటీ ఏమాట అయివుంటుందో అతని మిత్రుడు పోల్చుకోలేక 'ఏదీ అను చూతా' మన్నాడు. వెంటనే అతను(Fire)అనగా యిల్లు కాలిపోతున్నాదని గట్టిగా అరచాడు. నాటకం సగంలో వుంది. మంచి వుత్సాహం పట్టు. అందరూ ఛట్టున లేచి ఒకరిమీద ఒకరుపడబోతూ తప్పించుకుంటకు ప్రయత్నంచేయడం మొదలుపెట్టారు. మరి మతిస్థిమితం యేమిటి? ఈగడబిడలో నలుగురు చచ్చారు, తక్కినవాళ్ళకి కాళ్ళూ చేతులూ విరిగినవి. క్రాఫ్టను మహాశయునికి కూడా ఒకకాలూ ఒకచేయీ విరిగి నవి స్నేహితులు అతనికి దేహశుద్ధిచేసి ఉన్నకాలూ చేయీ ముక్కుమూతీ విఱచేసేవారు కాని ఫికరు లేకుండా ఆపుంతనుంచి తప్పించుకొని పోయినాడట.

కొన్నేళ్ళక్రిందట ఆస్ట్రేలియాలో ఒక కాలేజీ విద్యార్థి గ్లాసెడు విస్కీ ఒకటే గుక్కను తాగుతానని చెప్పి తాగి చచ్చిపోయినాడు. నిరుడు జర్మనీలో ఒకయువకుడు 40 రోజులు నిరశనవ్రతము చేస్తానని చెప్పి 18 రోజులు కాగానే చచ్చిపోయినాడు.

సర్ హూరేస్టు విల్కిన్సు అను నతడు మ్యూనిచిపట్టణం జంతుప్రదర్శనశాలలో ఒక పంజరములో ఉన్న సింహముదగ్గరకువెళ్ళి దానిని తట్టి పైకి తప్పించుకొని వస్తానని పందెము వేసెను. అతని ప్రాణముపోవుట కిష్టములేక అచ్చటి అధికారులు దాని కంగీకరించలేదు. దానికి తిండిపెట్టుటకై తలుపుతెరచిన బోను లోకి దూరి దానిని ఘట్టిగాతట్టి దానిచేత చంపఁబడ

కుండా తప్పించుకొని పైకి గెంతీశాడు. అంతా ఆశ్చర్యపోయేరు. కాని స్టాన్లీలూయీస్టెన్సను అను మరియొకడు సింహంపీకేసిన తనమిత్రుని టోపీతీసుకొని వచ్చుటకై బోనులో దూరి హుటాహుటినిపోరి దానిచే ముద్దముద్దగా చీల్చి చెండాడబడ్డాడు. ఒక అమెరికావాడు అందరికంటె తానెక్కువకాలం నిద్రిస్తానని పందెముకట్టి ఒకదుకాణం కిటికీలో పండుకొన్నాడు. ఎంతమంది తన్నినాలేవడు, కొట్టినా లేవడు, జనులు చుట్టూ అల్లరి చేస్తూనేవున్నారు. సూర్యోదయాలు అస్తమానాలు అవుతూనే వున్నాయి. అతని ప్రతిజ్ఞ యెప్పటికి తీరుతుందో, తీరిందని అతనికెల్లాగ తెలుస్తుందో! మనదేశంలో కూడా ఇంత ఘనమైన పందేలు కాకపోయినా తత్తుల్యమైన పందేలయినా వేసిన వారును, వేయగలవారును ఉండగలరు కాని మనదేశములో చరిత్ర రచనాపద్ధతి యింకా బాల్యదశలో వుండడంచేతను, తత్పరికరములు, చేసినపనుల దినచర్య వ్రాసుకునే అలవాటులూ లేకుండుటచేతను, వారినిగూర్చి ఆలోచించి బయలుపెట్టేవారు లేకుండా పోతున్నారు.

## ఎవరెస్టు ఎక్కినట్టులే

కొన్ని పనులుచేస్తే కాశీలో గోవును చంపినంత పాపమని మనవాళ్ళ అభిప్రాయం. మరికొన్ని పనులు చేస్తే భూప్రదక్షిణం చేసినంత పుణ్యమనికూడా మన పూర్వులసిద్ధాంతం. ఈ రహస్యం తెలుసుకొని వృద్ధగౌతముడు తన గోవుచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచేసి భూమిచుట్టూ తిరిగివచ్చితినని చెప్పి ఇంద్రాదిదేవతలను మోసగించి అహల్యను చేబట్టి ఆమె కొంపదీసి, అడవిలో రాయియై పడివుండమని శాపం పెట్టేశాడు. ఈపుక్కిటి పురాణాలమాట అటుంచి లండనులో ఒక సైంటిస్టు కొన్నిపద్ధతులు కనిపెట్టి, వాటి అన్నిటిలో విజయమునంది ఇక ఎవరెస్టు నెక్కగలనని శపథము చేయుచున్నాడు. ఎవరెస్టుకంటె యెత్తయిన ప్రదేశములలోకి ఎగరగలిస్తే ఎవరెస్టుమీది కెక్కగలిగినట్లే కదా! అతను లండనులో ఒకచిన్నగదిని గ్లాసుగోడలతో కట్టుకొన్నాడు. ఎవరెస్టుమీదయెటువంటివాతావరణస్థితి యుండునో అటువంటిస్థితి నందులో నిర్మించినాడు. అందు వారముదినములు జీవించి తలుపులు తెరచుకొని పైకివచ్చినాడు. ఇంతేకాకుండా గంటకు వేయిఅడుగుల యెత్తున యెగరగల వాయువిమాన పరికరములను కూడా దానికి తగిన సవేగప్రాణవాయు సమూహముతో నిర్మించినాడు. ఇట్టి సాధనసంపత్తితో బయలుదేరితే తెల్లవాళ్ళు ఎవరెస్టుమీదికి వెళ్లి జీవించి యెందుకు తిరిగి రాలేరని అతను ప్రశ్నిస్తూ అప్పుడే వెళ్లి వచ్చినట్లే గర్విస్తున్నాడు!

## కవితోపాసన

మన దేశంలో పూర్వకవులు పూవులుపెట్టి సరస్వతీదేవిని పూజచేస్తే ఆమె వారికి కలలో ప్రత్యక్ష్యమై ఆవేశించి కావ్యాలు వ్రాయమని ఆజ్ఞరిచ్చేది. ఆ మర్నాటికి కావ్యం తయారు. పిల్లలమఱ్ఱి పిన్న వీరభద్రుడు లాటివాళ్లకు ఆవిడే సహస్రఘంటాలు పట్టుకొని చీకట్లో కావ్యాలు రాసి పారేసేది. తెల్లవాళ్లుకూడా కొన్ని ఉపాయాల నావేశిస్తే కాని కవితామతల్లి వారి నావేసించి కావ్యాలు వ్రాయించేది కాదు.

ఆల్ఫ్రెడు డిముస్సెట్టు అనునతనికి చీకట్లో దీపం పాగదగ్గర తప్ప కవిత్వం వచ్చేదికాదు. అతను వ్రాసిన కావ్యాలన్నీ అర్ధరాత్రివేళే. అథవా పగలు వ్రాసినా తలుపులు తాళాలు బిడాయించి దీపం వత్తి వెలిగించుకొనేవాడట. వెర్లేను అనే బెల్జియను కవి త్రాగినప్పుడుతప్ప ఒక్కపదీ వ్రాయలేకపోయేవాడు. అలెగ్జాండరు డ్యూమాసు అనే ఫ్రెంచి నవలకారుడు లెమ్మనేడు త్రాగితే చాలు యెంత గ్రంథమైనా వ్రాసేవాడు. బెల్జాకు అనునతడు కప్పుమీద కప్పు కాఫీ త్రాగడం దస్తామీద దస్తా కాగితాలు రాసీడం. ఒకనాడు నూరు కప్పులు త్రాగి తెగరాసి చచ్చిపోయాడు. సర్ వాల్టరుస్కాటులాగే ఇతనికికూడా అప్పుపత్రాలు చూపించి అప్పులవాళ్లు లాగేస్తూవుంటే కాని కలం సాగేదికాదు. వీరు ఇల్లాగే గ్రంథాలు వ్రాసి అప్పులు తీర్చుకున్న అదృష్టవంతులు. మేసెనెట్టి అనే ఫ్రెంచికవి, విక్టరు హ్యూగో అనె ఫ్రెంచినవలా రచయిత ఉషఃకాలమందు ప్రారంభిస్తేకాని కలాలు సాగేవి కావట. హ్యూగో, చార్లెసుకీడు, విల్కికోలిన్సు అనువారలు తమ నిలువుయెత్తున డస్కులు చేయించుకొని నిలుచొని వాటిమీద వ్రాసేవారు. కొందరు పగలల్లా పడుకొని సాయంకాలం వ్రాతలు వ్రాసేవారు. కొందరికి అంగుగా విగ్గులు, జల్తారుకోకలు, చింకిగుడ్డలు కట్టుకుంటే కాని కవిత్వం వచ్చేదికాదు.

రూసోకు పరిశుభ్రమైన పరిసరములలో వ్రాతలు సాగేవికావు. వాల్టేరు అంతకన్న మంచిభోగి. అతను మూడు డస్కులు ముందరపెట్టుకొని మూడు గ్రంథములు ప్రారంభించి మూడు గ్రంథాలు వ్రాస్తూ మూడూ ఒకనాటికే ముగించేవాడు. చాటే బ్రియాండు అనునతడు మంచు కురుస్తున్న రాళ్ల మీద జోళ్లులేకుండా నడుస్తూవుంటే అతనికి కవిత్వము వచ్చేది. జర్మను కవి స్కిల్లరుగారుకూడా చితగగొట్టిన మంచులో కాళ్లు బిగించి కట్టుకొని కవిత్వం వ్రాయడం ప్రారంభించేవాడు. బీటుహోవెను అను జర్మను గాయకుడు మంచు లాంటి నీళ్లలో శిరస్నానముచేసి కలం పట్టుకొని గీతాలు రాసేసేవాడు. మహానవనాగరికమైన యీకాలంలోకూడా వాల్టువిట్మను అనే అమెరికను కవి కట్టెలకుచ్చెలి మీద పడుక్కుంటేకాని కవిత్వం వ్రాయలేక పోయేవాడు. ఇందులో అనేక రకాలు మనకేమీ వింతలుకావు. అల్లసాని పెద్దన్నగారు ఊయ్యాలలో వూగుతూ, ప్రియురాలంపిన కర్పూరతాంబూలం సేవిస్తూ, రసజ్ఞులు భళీభళీ అంటు పొగడుతూవుంటేనే మనుచరిత్ర సంపూర్తి చేసివుండవచ్చును. చుట్టలకట్టలను సిగరెట్టుపేకట్లనూ కాల్చేస్తూ, కారాకిళ్లీలను నమలేస్తూ, పొడుముడబ్బాలను కాళీచేస్తూ, పకోడీ పళ్లేలు తినేస్తూ అధ్యక్షోపన్యాసాలు భావకవిత్వాలు మొదలైనవి అనేకులు వ్రాస్తూన్నట్లు వారి వారి ధోరణులనుబట్టి ప్రత్యక్షంగా కనిపించుతునేవుంది. ఎవరి నాగరికతకు స్థితికి తగినట్లు వారు ఏవో కొన్ని ఉపాసనలు చేయకపోతే కవితాశక్తి యేమైనా అచ్చివున్నదా ఏమిటి?

## విచిత్రమైన మరణశాసనము

అమెరికాలో ఒక ధనవంతుడు వ్రాసిన ఒక మరణశాసనమువలన తన యావత్తు సంపదతోను తన జీవితములో తానేమాత్రము సౌఖ్య మనుభవించినదీ తెలుస్తూవుంది. ఈ శాసనమును చూచినవారందరికీ ధనమునకూ జీవితసౌఖ్యమునకూ ఏమాత్రంసంబంధమూలేదనీ, వేలూ లక్షలకొద్దీ అన్యాయాలు చేస్తూ ధనాలుకూడబెట్టుకొనేవారు సౌఖ్యంకోసం ధన మార్జింపలేదనీ, అన్ని పిచ్చితనాలలాగే ధనార్జనానిమగ్నతకూడా ఒక మోస్తరు పిచ్చితనమనీ స్పష్టమవక మానదు. ఈ మరణశాసనమువలన అతనికి జీవనమంటే ఎంత రోతపుట్టిందో తెలియకమానదు.

అతడు తన భార్య కిచ్చినదల్లా ఆమె సరసుణ్ని తప్ప మరేమీలేదు. అతడు చావగానే ఆ ఆస్తి అంతా కబళిద్దామని ఆశలుపొందుతూ వారిద్దరూ ఉవ్విళ్లూరిరి కాని వారనుకున్నంత తెలివితక్కువ మొద్దుపెద్దమ్మను కానని అతని శాసనములో వ్రాశాడు.

కొమారుడు స్వంతంగా కష్టపడి పని చేసుకొని అనందించవలెనే కాని ఒక్క దమ్మిడీకైనా హక్కుదారుడు కాకూడదని వ్రాసివాడు. గత ముప్ఫయేళ్లాయా సోంబేరిలాగ చెడుతిరుగులు తిరుగుతూ ఈ ఆస్తి అంతా తనదే అనుకున్నాడట గాని ఈ శాసనంతోకూడా అతనికి తగిన ప్రాయశ్చిత్తమౌతుందని వ్రాసినాడు.

అతను జీవించినన్నాళ్లూ అతని చింకికోట్లూ జుబ్బాలు, టోపీలు మాత్రమే దొంగతనాలుచేస్తూ వినయవిధేయతలతో పెద్దమనిషిలాగ ప్రవర్తించిన బంట్రోతువానికి చిరిగిపోకుండావున్న మంచి దుస్తులు అన్నీకూడా దఖలుచేశాడు.

మెకానిజము తెలియక అతని మోటారుకారు మొదలగువానిని విరగగొట్టి అనంతనష్టములనుగూర్చిన డ్రైవరికి సగముచెడిన కాయలన్నిటినీ పూర్తిగా విడిచివేయవలసిందని ఆర్డరుచేశాడు.

ఒక్క కూతురు విషయంలోమట్టుకు చాలా దయ తలచినాడు. అతని అల్లుడు అతనికిచ్చిన కట్నాని కాసించి అతని కూతుర్ని చెట్టబట్టి కన్నెచెఱవిడిపించాడు తప్ప మరేవుపకారం చేయలేదు. మరే సౌఖ్యం పెట్టలేదు కనక ఆమెకు సాలుకు రెండువేల డాలర్లు రాబడివచ్చు నికరాస్తిని యిచ్చినాడు. మన దేశంలోకూడా వివేకవంతులైన ధనవంతులు కొందరీ మోస్తరుగాచేస్తే అందరికీ బుద్ధివస్తుందేమో!

## పాతస్వర్గము—క్రొత్త మళయాళము

రవి కాననిచోటులు కవి కాననిచోటులు అయినా వుండవచ్చును కాని తెల్లవాడు కనుకోని చోటు లీ భూప్రపంచకంలో మటిలేవనీ కొత్త భూములకొఱకు యితర మండలాలలోకి విమానాలమీద ప్రయాణంచేసి చూడాలనీ యిదివరకంతా అనుకొనేవాళ్లము. కాని వారాక్రమించుకొనివున్న ఆస్ట్రేలియాలోనే వాళ్ల కళ్లను

మెఱుగి దేదీప్యమానమైన నాగరికతతో పరిల్లుచు సస్యశ్యామలమైన ఒక సుందర భూఖండమున్నదంటే చాలమంది నమ్మరు. తెల్లవాళ్లింతసేపూ సముద్రపు టొడ్డులు, శాద్వలతలములు, శీతలప్రదేశములు, ధనదాయకములుగా ఉండే స్థలములనే ఆక్రమిస్తారు కాని మండేయెడారులూ బండరాళ్లకొండలూ అవుపించాయిరా అంటే వాటినిదాటి మఱివెళ్లరు. కాని యింకవరూకూడా అక్కడికి వెళ్లడం వాళ్ల కిష్టం వుండదు. కనుక వారు ఆస్ట్రేలియా చుట్టూవున్న చక్కటి ప్రదేశముల నాక్రమించుకొని యింకెవ్వరినీ ఆ ఖండమధ్యమునకు చొలుకొనిపోకుండా కాపాలా కాస్తున్నారు. కాని అక్కడ మానవమాత్రులు నివసిస్తారనియైనా వారూహించలేదు. ఊహిస్తే వారు నాగరికులైతే వారితో వర్తకము మొదలుపెట్టి వారి పిసరూపిప్పి ఊడ్చేసివుందురు. అనాగరికులైతే ఆఫ్రికా అమెరికాల కేసుమతిచేసి లాభాలు తీసివుందురు. కొంచెము మోటపొయిన జాతియైతే ఆష్ట్రేలియా లోయిడులకు మల్లె వారిని నిర్మూలముచేసి ఒకరిద్దరిని చూపులకోసం మ్యూజియంలో దాచుకొనివుందురు. కాని వీరు తెల్లవారి దృష్టిని పడకుండా యిన్నాళ్లెట్లా తప్పుకొనివుండిరా అంటే అది ఆశ్చర్యకరమైన విషయమే.

ఇప్పుడు విమానాలు వచ్చినవికదా! ఒక విమానముమీదనెక్కి పైనుంచి యెగిరిపోతున్న ఒక వైమానికునికి ఇదివరకు ప్రపంచకం మ్యాపులలో నెక్కడా కనపడని క్రొత్తభూమి కనపడితే అది ఆశ్చర్యంగా అతను చెప్పినాడుట. ఇది విని 'పీపిలు' పత్రికయొక్క విలేఖరి, ఆ దేశమును చూచివచ్చినట్టి ఆర్. బస్బీ అనువాతను 20 సంవత్సరముల క్రిందట చెప్పిన అచ్చటి జనులచరిత్రను ఈవిధంగా వర్ణించి వ్రాసినాడు.

బస్బీకి ముందుగా కొందరుస్త్రీలు కనిపించారు. వారు పొడవరులు బందోబస్తుగాబలిసి కాలూచేయీ ముక్కు మొగమూ అందముగా చెక్కబడినట్లేర్పాటు చేయబడిన సుందర విగ్రహములు. ఇతనిని చూడగానే యిదేమిట్రా యీ అవస్థఅని ఇతనివైపు వీపులు త్రిప్పి చరచరా నడచిపోజొచ్చిరి. కాని వారికేమీ అపకారము చేయనని అభయమిచ్చి స్నేహం చేసుకొని వెంబడించి వారంరోజులు వాళ్లసీమలో వుండి అతను తిరిగివచ్చెను. అక్కడవున్న శాంతము కాని కట్టుదిట్టముకాని నాగరకతగాని యెక్కడన్నా లేవు. ఇదివరకల్లా నాగరక భావాలన్నీ తెల్లవాళ్ల సొత్తు అని భావించుకొనే బస్బీకి తమతో సంబంధం లేనివీరి కిట్టియోగ్యతయేలాగన కలిగిందిరా అని ఆశ్చర్యంవేసిందట. ఆదేశాన్నివారు "స్వర్గము"అని పిలుస్తారు. అక్కడ ప్రభుత్వంస్త్రీలది. బలిష్ఠ విగ్రహము, చిత్తరిమాపులు ఎవరైతేకుంటే ఆమెను రాణిగా ఎన్నుకొంటారు. ఆవిడ ఆజ్ఞలకు తిరుగుచెప్పకూడదు. అక్కడి పురుషులు మనకంటె చాలా బలవంతులు సూలాకారంగలవారూ అయినా ఆఆడవాళ్ల ముందర పిల్లిగా అగుపడి వారిచెప్పుచేతలలో వుంటూ వుంటారు. ఇంట్లోచాకిరీ మగవాళ్ళది. అక్కడి ఆర్థిక నైతిక పరిస్థితులు చట్టములు(బహుశా రష్యాలో లాగేమో) చాలా సుందరముగా ఆస్త్రీవర్గముచే యేర్పాటు చేయబడడంచేత చట్టముల మీరవలసినటువంటి అవసరమే యెప్పుడూరాదు. అథవా యెప్పుడైనా యేమగవాడైనా ఏచిన్న నేరమో చేశాడురా అంటే యిద్దరు దుక్కలలాటి ఆడవాళ్లు వచ్చి వానిని కొరడాపుచ్చుకొని బాదుతారు. అక్కడికి క్రైస్తవమిషనరీలను పంపించి మతమిప్పించి వారి ఆత్మలనుద్ధరిస్తే యెంతబాగుంటుంది కదా అనుకున్నాడట బస్బీదొరగారు; కాని వారు అంత మీదమీద తమ విశ్వాసములను విడిచిపెట్టే బాపతుకాదని అతను గ్రహించాడు. వాళ్ల అతిథిసత్కార మతిచక్కని దౌటచేత వానినట్టే కాలుకు కష్టపెట్టుట కిష్టములేక బస్బీతిరిగి వచ్చేశాడుట. వారి యిళ్లూ వాకిళ్లూ పాశ్చాత్యులవాటికి మల్లే చాలాసొగసుగావున్నాయని వైమానికుడుకూడా చెప్పుచున్నాడు. వారి జనసంఖ్య సుమారు రెండులక్షలుంటుందట. దినదినాభివృద్ధిపొందుచున్నారు. మిసెసు ముత్తులక్ష్మిరెడ్డి డాక్టరు సుబ్బరాయనుసతి మొదలగు మనదేశపు స్త్రీసంస్కర్తలు జనీవాకాన్ఫరెన్సులోనసి కొట్టుకోకుండా ఈదేశమునకువెళ్ళి వారి ఆచారవ్యవహారములనన్నిటినీ స్టడీచేసి నేర్చుకొనివచ్చి మనదేశములో తదనుకూలములైన చట్టాలుచేయిస్తే మన భారతమహిళామణులందరూ వారి కనేకరెట్లు ఎక్కువ కృతజ్ఞులై ఉండకపోరు.

## బహుభార్యా పద్ధతి

మనహిందూ మహమ్మదీయాచారములు బహుభార్యాత్వము నంగీకరించడంవల్ల ఆర్య మూఢాచారములనీ, కిరస్తానీమతము దాని నంగీకరించకపోవడం వల్ల అది ఉత్తమపద్ధతి అనిన్నీ అందరూ ఒకటే పాట పాడుతున్నారు. కాని డాక్టరు హెన్రీ క్యాంపుబెలుగారు బహుభార్యాపద్ధతిలో వుండే సుగుణాలను కొన్నిటిని పొగడడంవల్ల ఈ రెండు మతములకు గౌరవము హెచ్చి వీటిలోకి కొన్వర్టు లెక్కువగా రావచ్చును. సాధారణంగా ఒకపురుషుణ్ని పెక్కుమంది స్త్రీలు వలచినా, పెక్కుమంది స్త్రీల నొక్కపురుషుడు స్వాధీనంచేసుకోగలిగినా, అతనిదగ్గర అనన్యసామాన్యమైన సౌందర్యమో, చాతుర్యమో, పరాక్రమమో, ప్రస్ఫుటముండి తీరుతుందని అనేక చారిత్రకోదాహరణములున్నవట. ఇట్టి సల్లక్షణపరంపర అతనిలో అంతమందకుండా అతనెంతమందిని పెండ్లాడి, ఎంతమంది బిడ్డలనుకని యింతమందిద్వారా ప్రపంచమున వ్యాపింపజేస్తే లోకమున కంతకళ్యాణముకాదా అని అతను ప్రశ్నిస్తున్నాడు. కిరస్తానీజాతులలో బహుభార్యాత్వములేకపోయినా అంతపరవాలేదు. ఒక్కొక్కవివాహమును రద్దుచేసుకొంటూ వారెన్ని పెండ్లిండ్లాడుటకైనను వారికి చట్టములున్నవి. అట్టి చట్టములులేని మనము మనపద్ధతి నేపోవడం మంచిదని మనలో ప్రవీణుల అభిప్రాయం. అందుకనే వారు బహుభార్యాత్వమంగీకరిస్తూ డైవోర్సు బిల్లులను ప్రతిఘటిస్తూ వుంటారు. కాని క్యాంపుబెల్లుగారి కంతమాత్రంతో సంతృప్తిలేదు. ప్రపంచకంలో నాగరీకం ముదరిన కొలదీ తనసూచన యెక్కువగా అంగీకరింపబడుతుందనే ఆశిస్తున్నాడు.

ఇతనికిప్పుడు మిస్సు ఎల్లెను విల్కిన్సను అనునామె 'జాన్‌బుల్' అనే ఇంగ్లీషు పత్రికలో మద్దత్తుగా వ్రాస్తున్నది. ఒకమగవాడు ఇద్దరు ముగ్గురాడవాళ్లతో వేగగలడా, లేక యిద్దరుముగ్గురు స్త్రీలు ఒక్కపురుషుడితో సంతోషిస్తూవుండగలరా అన్న ప్రశ్నకు ఆమె టర్కీ ఇండియా మొదలగు దేశాలలోనున్న కొందరిని విచారణచేసి చూచింది. శ్రీమంతులెంతమందికైనా సరే పుస్తెకట్టేసి జనానాలో త్రోసేసి కూడుగుడ్డ చీరెబూరె పెట్టి పోషించుకోగలరు. పేదవారల కెంతమంది పెళ్ళాలెక్కువైతే అంతలాభకరము. మరో ఆడమనిషి యింట్లోకివస్తే మరో యింతకూలిపనిచేసి డబ్బుసంపాదించి సంసారాన్ని వృద్ధికితెస్తుంది. మధ్యరకంవాళ్ళు సాధారణంగా రెండేసి పెళ్లిళ్ళాడరు. టర్కీలో ఒకమగవాణ్ని 'ఇద్దరు ముగ్గురు ఆడవాళ్లని భరించగలవా?' అంటే "వారు బి.ఏ., ప్యాసవకుండాను ఇంగ్లీషు రాకుండానువుంటే చులాగ్గాభరిస్తాను. చదువుకున్నవాళ్లైతే సమానత్వం స్వాతంత్ర్యం అని వాదిస్తారు. వాళ్ళతో సలాం." అలాంటి వాళ్ళొద్దన్నాడట. పేదకుటుంబ స్త్రీలు సంసారాలెత్తి పెట్టుకోలేని అవసంతి ఆడవాళ్ళు మొగుణ్ని రెండో పెళ్ళిచేసుకోమని పోరి పిల్లనెంచి తీసుకొనివచ్చి కట్టుతారు. అయితే వాళ్లు చక్కటివాళ్లైతే తమమీదే స్వారీ చేస్తారుగదా అని సాదాగా దుక్కలాగుండే పడచువాళ్ళను తెచ్చికట్టి చాకిరీ చేయించుకుంటారట.

హిట్లరుగారిప్పుడు జర్మనీలో యీపద్ధతిని పెట్టకతప్పదు. మొట్టమొదట అతనికి జనసంఖ్య యెక్కువకావాలి. రెండవది అతననేకమంది స్త్రీలను ఉద్యోగములనుండి తప్పించి వాటిని పురుషుల కిప్పించినాడు. వారి కుద్యోగములు లేవుగదా సంసారాలు కూడా లేకుంటే యేలాగ? పెళ్లాడుదామంటే కాళీపురుషులు లేరు. కిరస్తానీవాళ్లలో ఒకమగవాడి కిద్దరు పెళ్లాలుండకూడదని శాస్త్రం. అయితే శుద్ధకిరస్తానీ ధర్మంప్రకారం పోతే ప్రస్తుతరాజ్యాలూ నాగరికతా నడుస్తాయా? కత్తో తుపాకీయో పట్టుకొని దాన్ని కొంచం అనుటూ తొలగించాలి. హిట్లరు ఆపనిచేయావాలి. కాని అట్లు చేసేముందర ఆడవాళ్ళు చదువుకోకుండా ముందుగానే ఒకచట్టమును ప్యాసుచేయవలసివుంటుంది. లేకుంటే చదువురానివాళ్లనీ లోకజ్ఞానం తెలియనివాళ్ళనీ తంతే పడేవాళ్లనీ యెంతమందినైనా భరించేటట్లు చదువుకున్న ఆడవాళ్లనిద్దరిని భరించడం జర్మను యువకులవంటి వీరాధివీరులకు కూడా సాధ్యముకాదు. కొంచెములో జులు ఏనవాబుగారి హారెములోనైనా వారికి ఘోషా ట్రెయినింగుఇప్పిస్తే ఎంతమందైనా చెప్పినపనిచేస్తూ ఒక కొట్లో పడివుండి బిడ్డలను కనిపోషించుకుంటూ వుండగలరు.




**ఆంధ్రభాషాభిమానము:—**

ఈమధ్యను ప్రబుద్ధాంధ్ర, ఆంధ్రభూమి, చంద్రిక మొదలైన మాసపత్రికారాజములు కొన్ని, కేవల మాంధ్రభాషోద్ధరణ శ్రద్ధబూని ఆంధ్రదేశములో హిందీభాష పొందుచున్న అత్యధిక అనుచిత ఆదరణమునుగూర్చి తీవ్రముగ విమర్శించినవి. వారి సంకల్ప మాదరణీయమగుటచేత వారి ధోరణి జోలికి పోయి మేము విమర్శింపక మిన్నకుంటిమి. అయినను దానినిగూర్చి మా అభిప్రాయము ప్రకటింపవలసిన ఆవశ్యకత యేర్పడుటచే వెల్లడించుచున్నాము.

హిందూదేశమున కొక సామాన్యభాష లేకున్నచో ఏకజాతీయత యేర్పడదన్న భావము గాంధీగారితోనే ఉదయించలేదు. ఇప్పటికి సుమారు ముప్పది నలువది సంవత్సరముల క్రిందటనే ఆభావ ముదయించినది. సంస్కృతము నట్టిభాషగా తయారు చేయవలెనని కొందరు ప్రయత్నించిరి కాని అది వాడుకభాష కాకుండుటచేతను, పామరజనసాధ్యము కాకుండుటచేతను ఆ ప్రయత్నము విరమింపబడినది. అంగ్లభాష విదేశీయమగుటచేతను, భారతీయులకు సంస్కృతముతో తుల్యమైన కఠినమైనదగుటచేతను ఆ ఆలోచనయు విరమింపబడినది. హిందీ ఉత్తరహిందూస్థానములో బహుళసంఖ్యాకజనభాషితమగుటచేతను, ఉత్తరహిందూస్థానభాషలతో సమీపసంబంధము కలదగుటచేతను, సంస్కృతజన్యమై దక్షిణహిందూస్థానమువారికిగూడ తక్కిన పై రెండుభాషలకంటెను సులభతరగ్రాహ్యము కాగలదగుటచేతను తుద కది యెన్నుకొనబడినది.

తెలుగుఅరవములకంటె వయస్సులో చాలాచిన్నదై విస్తార ప్రాచీన గ్రంథసముదాయశోభితము కాకున్నను, అది కాగల సామాన్యభాషగా నెన్నుకొనబడినప్పటినుండియు అన్నిప్రాంతములవారిచే ఆదరింపబడి అభ్యసింపబడుచు, దినదినాభివృద్ధి పొందుచు, అనేక నవీన సాంకేతిక సాహిత్య గ్రంథరాజములతో విరాజిల్లుచున్నది. గాంధిమహాత్ముని నాయకత్వము క్రిందికి కాంగ్రెస్సు జారిపోయినప్పటినుండియు అది రెండు పువ్వులూ మూడు కాయలూగా వర్ధిల్లుచు కాంగ్రెసువేదికల నాక్రమించుకొన్నది. హిందీభాషాభిమానులగు శ్రీమంతులు విస్తారము ధనమును చందాలుగనిచ్చి ప్రచారకసంఘముల నేర్పరచి పాఠశాలలు తరగతులు పట్టణములలో వీధివీధులయం

దును పల్లెలయందునుగూడ జరిపించి పరీక్షలు నడిపించి సర్టిఫికేటులనిచ్చి జనులను ప్రోత్సాహపరచుచున్నారు. ఈ డిప్రెషను రోజులలో అది నిరుద్యోగసమస్యనుగూడ కొంతవరకు పరిష్కరించుచున్నది. ఏ రాష్ట్రభాషాపరీక్షయో ప్యాసయి తగిన తజీతము పుచ్చుకొని యేమూలకోపోయి ఒక క్లాసుపెట్టుకొని జీవించుచున్న యువకుల సంఖ్యయు అన్నిరాష్ట్రములలోవలె ఆంధ్రరాష్ట్రముననను విస్తారము గలదు. ఇన్ని ప్రయత్నములు చేయుచున్నను అది మన రాష్ట్రములలో పొందవలసినంత వ్యాప్తిని పొందలేదనియే మా యూహ. కాంగ్రెస్సుకు పోయే యువకులలోనూ నాయకులలోనూకూడా వేదిక మీదనుండి హిందీ ఉపన్యాసములు సాగుచున్నప్పుడు ఇంగ్లీషు తెలిసినవారివీపులు గోకుచు చెవులను వారి మూతులదగ్గర పెట్టుకొని అయోమయముగాను ఆత్రముతోను కనిపెట్టుకునేవారి సంఖ్య చాలా హెచ్చుగానే ఉన్నది. ఇందుకు కారణము మన ద్రవిడభాషలకు ప్రాకృత భాషలకుగల అమితమైన దూరమే. ఆంధ్రులకు అరవము, కన్నడము వచ్చినంత వేగముగా హిందీ రాదు; వచ్చినా అతివేగము మరుస్తారు. అయినా ప్రయత్నము విడచిపెట్ట వీలులేదు. విడచిపెట్టితే, భారతజాతీయ చర్చలలో పాల్గొనలేక వెనుకబెంచీలమీద నిలబడినవారమే అవుతాము, ఇప్పటికే అయి వున్నాముకూడాను. ఇటువంటి సందర్భములో హిందీప్రచారమువారికీ, తదభిమానులైన పత్రికాధిపతులకీ, దేశనాయకులకీ వారు చేస్తున్న కృషికి తగిన ప్రతిఫలము చూపలేకపోతున్నందుకు విచారించవలసివుంటుంది. ముఖుకోలపెట్టి వారు మనని పోషిస్తూవున్నందుకు మనము కృతజ్ఞులమయియే ఉండవలసినది. పత్రికాసంపాదకత్వభారము వహించి ప్రజాభిప్రాయములను అభిరుచులను సంస్కరించి బలపరచవలసిన బాధ్యతను మీద వేసుకొన్నవారు ఈ ప్రయత్నములకు తమ రచనలు వ్యాసముల ద్వారా తగిన దోహదముకూడా చేయవలసివున్నది. అట్టి దోహదము చేయుచున్న ఆంధ్రపత్రిక, కాంగ్రెసు మొదలైనవానిని మేము ప్రశంసింపకమానలేము.

హిందీభాషావ్యాప్తివలన ఆంధ్రభాషాభిమానము, అభివృద్ధి అణికట్టబడుచున్నవనుట వెట్టియూహ. ఆంధ్రభాష మన మాతృభాష. ఉగ్గుపాలతోకూడ దాని నభ్యసించుచున్నాము. అది మన శల్యాశల్యమును పట్టియున్నది. దానిని మనము మరచుట మనలను మనము మఱచిపోవునాడుతప్ప తటస్థింపదు. హిందీవంటి అరువుభాషను అరువుకే అభ్యసించి అరువుకార్యములకే ఉపయోగింతుము. తక్కిన వ్యవహారమెల్లయు స్వంత భాషలోనే చేసుకొందుము. మన భాషలో ఎప్పటికప్పుడు క్రొత్తపత్రికలు లేచుచున్నవి; క్రొత్త గ్రంథములు వెలువడుచున్నవి; క్రొత్త కవితలు వ్రాయుచున్నవి; క్రొత్త వ్యాసములు మొలుచుచున్నవి; క్రొత్త భావములు రేగుచున్నవి. ఆంగ్లము హిందీ మొదలగు అన్యభాషల సంపర్కమువలన దానితీరు సొరులును హావభావములును

హాసవిలాసములును వర్ధిల్లునేకాని వసివాళ్లు వాడవు. కీర్తిశేషులగు జంధ్యాల శివన్న శాస్త్రిగారి హిందీభాషాపాండిత్యమువలన వారి ఆంధ్రకవితాపటుత్వము తగ్గినదా? ఉపన్యాసకశిరోమణులగు శ్రీయుతులు మాటూరు సత్యనారాయణ, భోగరాజు పట్టాభిసీతారామయ్యగార్ల అనర్గళ హిందీ వచోవాహినులవలన వారి ఆంధ్రభాషా ధోరణి యేమైనా వన్నెతగ్గినదా? వారు హిందీభాషాభ్యాసమే మానేస్తే వారి ఆంధ్ర భాషాపాండిత్యమును ఉపన్యాసధోరణియు ఇంతకన్న సుందరతరముగా ఉండునా? ప్రజ్ఞావంతులకు అన్యభాషాపరిచయమువలన స్వభాషాపాండిత్యము వర్ధిల్లితే వర్ధిల్లెను లేకుంటే మానెను కాని తగ్గడముమాత్ర మెప్పుడును తటస్థించదు.

ఇక సాధారణులు కొందరు హిందీభాషాభ్యాసనిమగ్నులై వారి భాష నసడ్డచేయు చున్నారని వీరు నేరమునుమోపఁ జూడ వచ్చును. తనభాష నంత అసడ్డచేసి అన్యమునకై అంత ప్రాకులాడుకొనువారిది శుద్ధ చపలత్వముకాని వేఱేమియుకాదు. అట్టి చపలచిత్తు లెప్పుడును నుండకపోరు. వారి కెందునను స్థితప్రజ్ఞ కుదరదు. వారికి హిందీ భాషవల్లనే చపలచిత్త మేర్పడ్డదని చెప్ప వీలులేదు. హిందీభాష లేకున్నచో మరో వ్యావృత్తిపెట్టుకొని వారి చపలత్వమును వారు సార్థకము చేసుకొనుచుందురు. వారు హిందీభాష నభ్యసించినను అభ్యసించ కున్నను ఆంధ్రభాషకు చేసే మహోపకార మేమియు నుండదు. వారైనను వారి చపల త్వమును మరోవిధముగా దుర్వ్యయము చేయక హిందీభాషమీద ప్రయోగించుట గ్రుడ్డిలో మెల్ల యని సంతోషించవలసినదే.

ఇకను ప్రస్తుతాంశమునకు వత్తము. ఆంధ్రభాషలో కొన్ని చక్కనినవలలు, కవితలు, పత్రికలు వెలువడుచున్నను ఆంధ్ర దేశములో ఆంధ్రభాషకు తగినంత ఆదరము లేని మాట నిజము. ఇతరరాష్ట్రములలో వారివారి భాషలయెడలనున్న ఆదరణ పోషణములు మనరాష్ట్రములో మనభాషకు లేవు. ఇది మన అలసత్వము, బడాయికోరుతనమువలననే కలుగుచున్నది కాని హిందీభాషావ్యాప్తివలనఁగాదు. రసజ్ఞులగు రాజులును అమాత్యపుంగవులును సమర్థులు శ్రీమంతులునగు భాషాపోషకులును గతించిరి. ప్రస్తుత శ్రీమంత జమీందారీ పుత్రులు పాశ్చాత్యభోగలాలసత్వముకొరకు వ్యయించు సొమ్ములో నూరవవంతైనను ఆంధ్రభాషాభివృద్ధికిని ఆంధ్రకవిపోషణమునకును వెచ్చింపరు. కొందరికి కొంచెము కీర్తి కాముకత్వమున్నను, ఆస్థానకవిబిరుదము నిచ్చి యొకరి నిద్దరిని కడుపుమాడ్చుతూ తమవద్దనుంచుకొని వారిచే పద్యములు గ్రంథములు వ్రాయించి తమపేరుతోను బిరుదులతోను ప్రకటించుకొనిన వెంటనే అది చల్లారుతున్నది. మధ్యతరగతి యినాందార్లు పట్టణములుపట్టి పోకుండా పల్లెటూళ్లలో కొందఱున్నను, వారికి కావలసిన పేపర్లు గ్రంథములు ఆరుమైళ్ళదూరమైనను నడిచివెళ్ళి మరెవరిదగ్గరనైనా చదివేసుకొని వచ్చేవారును, కాకుంటే పని మానిపించి

తమపాలికాపుల నంపించి తెప్పించుకొని వాపసు చేయువారునే కాని తాము డబ్బు పెట్టి గ్రంథములను పత్రికలను కొనుక్కొని యింటివద్ద నుంచుకొనే అభ్యాసముగలవారు లేరు. పెక్కుజాతులలో విద్యావాసన లేని వారే శ్రీమంతులును, కలవారు దరిద్రులు నై యున్నారు. సాధారణ పాటకజనులలోను రైతులలోను విద్య చాలాతక్కువ. వారు అప్పులలో మునిగి సాహుకారుల దయాధర్మ భిక్షులవలన జీవించుచున్నారు. దినము వెళ్ళుటే కష్టముగ నున్నది. ఇట్లాంధ్రభాష అన్నివిధములగు పోషణలును చెడియున్నది.

అయినను అది ప్రాచీనమై స్థిరపడిపోయిన భాష కనుకను, పూర్వకవుల యుత్కృష్ట గ్రంథములు నిరంతరముగ జాతిని భాషను ఉజ్జీవింపఁజేయగల రసవత్తరములగుటచేతను యువకబృందమునెల్ల నక్కున కాకర్షించి ఆశ్లేషించి గాఢాభిమానావేశపూర్ణులను చేసి, విపరీత పరిస్థితులనుమీరి వినూతన రచనలను సృజింపఁజేయుచునే యున్నది. అయినను సవ్యమైన సాహిత్యమునకుకంటె అపసవ్యమైన సాహిత్యమునకే ఆదరణ మెక్కువగానున్నది. అందుకు కారణము అది అచ్చుతప్పులు క్షుద్రపత్రములైనను కాలుచొరగ నుండుటొకటి. రసహీనమును ఉపజ్ఞాశూన్యమైనను పాఠ్యగ్రంథనిర్ణయ సంఘమువారి ఆశీర్వాదములనుపొంది విద్యార్థులు కొనుక్కోక తీరని దింకొకటి. ఇట్టి సందర్భములో యోగ్యులగువారి కవితావేశములు వారిహృదయాగ్నిలోనైనను మండి భస్మమగుచున్నవి; వారి నాలుకల మీఁదికివచ్చివచ్చియైనను చల్లారిపోవుచున్నవి, వారి కాగితములమీఁది కెక్కియైనను చిమ్మటపురుగుల వాతఁబడుచున్నవి. అచ్చు వేయించుకుంటకు శక్తిలేదు; వేయించుకున్నా చెల్లవు. పత్రికలకు పంపితే దీర్ఘములని త్రిప్పివేయుదురు. హ్రస్వములైన వానికైనను కృతజ్ఞతగాని అర్థసత్కారము కాని లేదు. మనపత్రికలు తమ బ్రతుకే తాము చూచుకోలేకున్నప్పుడు ఇంకొకరి బ్రతుకుకై చేయెత్తి యిచ్చేదేమిటి? కాస్తకోలుకొన్న పత్రికలుకూడా యిస్తామని కంకణముకట్టుకుంటే యేమిచిక్కులు వస్తాయో యెంత దండుగ కలుగుతుందో అని భయపడి అసలే చేయి ముడుచుకొనుచున్నవి. ఇచ్చే పత్రికలైనను రహస్యముగ నిచ్చుచు రసము నెడలకంటె అనుసరింపులయెడల నెక్కువ పక్షపాతము చూపుచున్నవి. ఎంతచేయి ముడుచుకున్నను యువకుల కొకమోస్తరు వెఱ్ఱికవితాభిమానమును రచనాభిలాషయు పేపరెక్కితే చాలుననే ఉబలాటమును ఉండుటచేత పత్రములు నిండిపోవుచునే యున్నవి. ప్రజ్ఞావంతులగు పత్రికాసంపాదకులును విలేఖకులు ఒక్కచో సమావేశమై సంఘముగా నేర్పడి యిట్టి విషయములెల్ల ఆలోచించి కొన్నిసూత్రము లేర్పరచుకొని ఆప్రకారము వర్తింపకున్నచో ఇవి యెల్లయు సరికావు. స్వాభిమానములు, సాంఘిక భేదములు, వ్యవహారపు పోటీలు అడ్డము రాకుండా యిట్టి సమావేశముల నెట్లు జయప్రదముగా చేయఁగలమో ఆలోచింపవలసిన

విషయము. అంతవరకును ఈ అనాగత మిట్టులుండవలసినదేనా అని విషాదము జనియించుచుండును.

ఇంతకును ప్రస్తుతప్రపంచమునెల్ల ఆవరించియున్న యీఆర్థికదుస్థితివలన సకల వ్యవసాయవ్యవహారవ్యాపారోద్యమములకు వలె సాహిత్యవికాసమునకు గూడ తీరరాని చేటు వాటిల్లుచున్నది. ఈతరంగము దాటేవరకు మనము వేచియుండవలెను కాని వేఱుత్రోవే లేదు. ఈలోపల నెన్ని మునుగునో యెన్ని నిలచునో యెన్ని తేలునో చెప్పలేము. ఇట్టి ఘోరపరిస్థితులమధ్యనుకూడ ధైర్యమును గోల్పోక, లాభము నాలోచింపక, నష్టమును సరకుగొనక నూతనాశయములతో కవిత్వములు కథలు వ్యాసములు రచించి పత్రికలకును సాహిత్యమునకును కళాకాంతుల నిచ్చుచున్న ఉత్తమవిలేఖరులకును, ప్రాతపత్రికలకును, క్రొత్తపత్రికలస్థాపించుచున్న నూతన సంపాదకులకును భాషాభిమానులెల్లరును కృతజ్ఞులై యుండవలెను. ఇందుకు పాఠకులును చందాదారులును కూడ నెంతో సహాయము చేయవలసియున్నది. జీవయాత్ర జరుగుబాటుకు లోపములేని వారెల్లరును వారి స్వల్పాదాయములలోనో అధికాదాయములలోనో యెంతో కొంత మినహాయించుకొని తమకు నచ్చిన యేపత్రికల యెడలనైనను అభిమానముపూని తెప్పించుకొనుచు ప్రోత్సాహము నిచ్చుచుండవలెనని ప్రార్థించుచున్నాము. ఏది యెట్లున్నను ఇంగ్లీషుపత్రికలకొఱకును హిందీపత్రికలకొఱకును ఆంధ్రపత్రికలకుకంటె యెక్కువధనమును వ్యయముచేయుట దుఃఖకరము. ఇట్లు చేయుచున్నవారు పేదసాదలుకాదు. శ్రీమంతులు విద్యావంతులే. వాటిని తెప్పించుకోవడం ఫ్యాషననీ గౌరవమనిన్నీ, తెలుగు పత్రికలను చదవడము కాని తెప్పించుకొనడము కాని ఎవరో పామరులు చేయవలసిన పని అనిన్నీ వారిలో కొందరు భ్రమించుచుండుటయును గలదు. ఇట్టి భ్రమ వారు వెంటనే నివారణ చేసికొనవలెను. అంతవరకు తెలుగుపత్రికల వారెల్లరును ఆందోళనము చేయుచుండవలసినదే.

### శ్రీయుత వడ్డాది సీతారామాంజనేయ కవిగారు:—

శ్రీయుతులు వడ్డాది సీతారామాంజనేయులు, గుంటూరు సీతారామ దీక్షితులు, కొల్లూరు సత్యనారాయణ కవిగార్లచే రచింపఁబడి ఎలమంచిలిలో శ్రీయుత ఆకెళ్ళ సూర్యనారాయణగారిచే ప్రతిష్ఠింపఁబడిన శ్రీరామలింగేశ్వరస్వామివారి కంకితమొనర్పఁబడిన రామలింగేశ్వర శతకమను రు 0-2-0 లు మాత్రమే విలువగల గ్రంథరాజము మా కార్యాలయము నలంకరించినది. పద్యములు స్వతంత్రభావపూరితములు, భక్తిరసభరితములు. శ్రీయుత గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారిచే వ్రాయబడిన 'ఎలమంచిలి చరిత్రము' మొదలగు నితరవిషయములుకూడ ఇందు గానవగును. శ్రీయుత మారేపల్లి

రామచంద్ర కవిగారు దీనికి చక్కని పీఠికను వ్రాసిరి. ఏతత్స్వామివారి పట్టాభిషేకాద్యుత్సవ కార్యనిమగ్నులగుచేత 'శతకరచనాభార మనమర్హుడవగు నాపై మరికొంత పడిన'దని శ్రీసీతారామంజనేయులుగారు పీఠికలో వినమ్రముగ వ్రాసుకొనుచున్నారు. వీరు విశాఖపట్టణముజిల్లా ఖాసింకోటవాస్తవ్యులు. ఆంధ్రదేశ మా బాలగోపాలమును వారి పేరు నెరుగనివారుండరు. వారు, శ్రీపండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు వారి శిష్యులగుటచే, వారి సంస్కృతాంధ్ర భాషా పాండిత్యము, గంభీరభావము, పటిష్ఠశైలి, అనర్గళధాటినిగూర్చి ప్రశంసింపబనిలేదు. ప్రసిద్ధాంధ్ర మాసపత్రికాపాఠకుల కదికొంత అనుభవైకవేద్యమే. వారి రచనలలో ప్రకటితములైన వానికంటె అప్రకటితామూల్య రత్నములు మరియు నెక్కువగనున్నవి. అవకాశము చూచుకొని వానిని వా రాంధ్రదేశమున విరజల్లగలరనియు, ఆంధ్రమహాశయులు వారి కట్టి అనుకూల్యములను సమకూర్పఁగలరనియు ఆశించుచున్నాము. గంభీరపద్య కవిత్వరసాస్వాదనదక్షులగు పండితాఢ్యులకే గాక సాధారణ పదకవిత్వలోలురగు అశేష పామరజనంబులకుఁగూడ వారినామమును రచనలును మృదుమధురములు. 1920 ప్రాంతమున వారు రచించిన 'దండాలుదండాలు భరతమాతా' యను దీర్ఘపదరచన ఆంధ్రుల కపూర్వ రాజకీయవిజ్ఞానము, అనుపమాన దేశభక్త్యావేశము, అనల్పమగు సేవాదీక్ష, అత్యధికత్యాగశక్తి సమకూర్చుచు ప్రతీజిహ్వాగ్రమునందును తాండవించినది. ఆ సందర్భమున వారు ప్రభుత్వకారాగారభోగమును కూడ అనుభవించిన యోధులు. ఆంధ్రులు వారినామమును మఱచునట్టి కృతఘ్నులు కాని, వారి రచనలకై యెదురు చూచుచుండని రసశూన్యులు కాని, కారు. భాషాభూషణంబును లోకకళ్యాణకరంబునునగు నిట్టి రచనాశక్తి వారిలో నిద్రాణమై కాక జాగ్రద్విజృంభణమునందే యున్నది. సంసార సాధారణ కష్టంబులును, కుటుంబభరణ భారంబులును, ప్రకటనాసాధ్య ద్రవ్యపరిస్థితులును ఆమహాశక్తి నణచిపెట్టుచున్నవి. వీని నతిక్రమింపఁగల సాధనసంపత్తిని, దీర్ఘాయురారోగ్యములను ఈశ్వరు డీ యువక కవిశ్రేష్ఠున కొసంగును గాక యని ప్రార్థించుచున్నాము. ఆంధ్రులయుల్లముల నుత్తేజింపఁగల అతని రచనల ఆవశ్యకత అప్పటివలె నిప్పుడును అత్యావశ్యకమై యున్నది కనుక ఈసంగతిని వారిలేఖిని గుర్తించి రసబిందువుల నాంధ్ర సాహిత్యబృందావనంబునఁ జింది అమంద సౌరభతుందిలంబులగు మందార సుమంబులతో నందగింపఁ జేయునుగాక అని కోరుచున్నాము.



EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్‌రిప్రజంటేటివ్ ఆఫ్‌న్యూస్.
మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566, రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెట్టురోడ్డు,(మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును)
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్‌కంపెనీ,
బరంపురం: ఎన్: కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్‌ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్‌స్టోర్సు, బకింగుహామ్‌పేట.
పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్‌వీధి.
కర్నూలు: చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
సికింద్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పొగాకుబజారు.
ఏలూరు: బి. విశ్వనాథంగారు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
నెల్లూరు: సి. యల్. నృశింహం బ్రదర్సు, ట్రంకురోడ్డు.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెనీ.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కాకినాడ: పడిమి సూర్యనారాయణగారు.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.



# వినోదిని

## ఆంధ్రదేశానికంతటికి

## నవ్వుల మాసపత్రిక

యిది యొక్కటే. ఇప్పుడిది మాసమున కొక్కొక్క త్రివర్ణముఖ చిత్రముతోను, మునుపటికంటె హెచ్చుగ హాస్యపు బొమ్మలతోను, హెచ్చుపుటలతోను వెల్వడు చున్నది. చక్కని వ్యాసములకు బహుమతులుగూడ యివ్వ బడుచున్నవి.

సం॥ 1 కి చందా రు 1. మాదిరి సంచిక ఇనాముగ పంపబడును.

ప్రతి ముఖ్యపట్టణమునందు యేజెంట్లు కావలెను.

వినోదిని కార్యాలయము,

V. K. (4) 174 — 234, గోవిందప్పనాయకన్ వీథి, మద్రాసు.

---



మాపరిశ్రమశాలలో ఈజిప్టుడైమండ్, శాస్త్రీయపుష్యరాగములు, ఇమిటేషన్ పుష్యరాగములు, పట్టెకెంపులు, కుచ్చుకెంపులు, వైక్రాంతములు, నీలములు, పచ్చలు కలవు. ప్రతిరాయి సీమకమలములకువలె, పట్టెలుతీర్చి గ్యారంటిగా పంపబడును. దీనియందు మాకు సుమారు 160 సంవత్సరములుగ వంశపరంపరగా అనుభవముకలదు. మావద్ద పరీక్షితులగు వ్యాపారుల నెరిగియుండినను క్రొత్తగావ్యాపారము చేయతలంచువారు చిన్నఆర్డరుఇచ్చి ఒకసారి తెప్పించిన పైవిషయము ఎల్లరకు తెలియబడును.

ఎలక్ట్రిక్‌సానలో రవవడింకో తయారు చేయబడిన అసలురంగూన్ కమలములు గారంటీగా పంపబడును.

## పి. గోపాలస్వామినాయుడు అండు సన్సు

**వెలల జాబితా ఇనాముగా పంపబడును:—**

కార్యాలయము, కర్మాగారము:
5. పుదుపేటవీథి,
పరింగిమలెపోష్టు.

బ్రాంచి:
234 గోవిందప్పనాయనివీథి
జి. టి. మదరాసు.




సంపాదకుఁడు

**డాక్టరు. కే. యన్. కేసరి**

సంపుటము ౭.] సెప్టెంబరు 1934. [సంచిక ౭

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువరైన ప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, పెద్దచావిడి, ఆంజనేయులగుడి దగ్గర, 168, సుల్తాన్ బజారు. (మన ప్రాంతపు 1 రూఉస్మానియా రూ 1-3-0అగును)

నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు.

జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్.

బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.

గుంటూరు: వెల్ కం అండు కంపెని.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు

పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.

పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.

ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.

చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.

సెకండ్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పొగాకుబజారు.

ఏలూరు: బి. విశ్వనాథంగారు.

విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెనీ.

నరసాపురం: వై. సత్యనారాయణగారు.

కాకినాడ: పడిమి సూర్యనారాయణగారు.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.



## బాలపాపలే దంపతుల ప్రేమబంధము

స్త్రీకి మాతృస్థానము గౌరవప్రదము. ఆమెకు గృహయాజమాన్యము లభించును. ఆత్మానందము కలిగించును. భర్తకు తనయెడల భక్తి ప్రేమ భావములు దినదిన మభివృద్ధినందును. దీని కంతటికిని కారణము?

మా తృ త్వ మే !

మాతృత్వమునకె ప్రతి స్త్రీయును ఆసగొనును. ముద్దుబిడ్డను కరకమలములం దిడుకొని ఆడించు తలంపు స్త్రీకి యెక్కుడు.

స్త్రీకి లభించవలసిన యీ మహోన్నత స్థానమునకు ఆటంకములను కల్పించు గర్భాశయ రోగములను దూరముచేయవలయును. ఇందులకు లోధ్ర సేవనమే రాజమార్గము.

# లోధ్ర

**వనితల ఋతుదోషాది రోగములకు వజ్రాయుధము.**

లోధ్ర యెల్లెడల దొరకును.

**కేసరీకుటీరం, ఎగ్మూరు, మదరాసు.**

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR




## లోధ్ర

ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

ఈ ఔషధరాజము సుప్రసిద్ధవన ఓషధులచే తయారు చేయబడినది. గడచిన ముప్పదిఅయిదు సంవత్సరములనుండి హిందూదేశమునందే గాక పరదేశములయందు గూడవాడబడి ప్రసిద్ధిగాంచిన దివ్యౌషధము

ఈలోధ్రను వాడినవారు యిది వనితలకు వరప్రసాదమనిన్ని, రసాయనములకురాణియనిన్ని, స్త్రీలపాలిటికల్పవృక్షమనిన్ని, కొంగుబంగారమనిన్ని మరియు ననేకవిధములుగ స్తోత్రమును చేయుచుండుట యెల్లరకు దెలిసిన విషయమైయున్నది.

గర్భాశయదోషజనితవ్యాధులగు ముట్టుకుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము జాస్తి తక్కువ లగుట, స్రావము అనేకరంగులతో వెడలుట, సూతికగడ్డ, గర్భాశయమున విషవ్రణములుకలుగుట, మంట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్రపుత్రికా భిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

చీకటింటిని ప్రకాశింపజేయు ఈ దివ్యజ్యోతిమహిమను యెల్లరు గుర్తెరుంగుదురు గాక!

12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 అణాలు.

లోధ్ర యెల్లెడలను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.



# పఠానుల బలపరాక్రమము

## కాశ్మీర పుష్టి మీకు కావలయును

మానవులందరును బలిష్ఠముగను దార్ఢ్యముగను జన్మింపరు. కాని శరీరమునుపట్టి పీడించే నిస్సత్తువను నిర్మూలించి నిగనిగలాడు దేహముతో నిండు ఉత్సాహముతో అవయవముల పుష్టితో హాయిగానుండు టవసరము. అది మానవుని జన్మహక్కు. అందులకై ప్రతి ప్రాణియు ప్రయత్నింపవలయును.

దేహమందు రక్తము నిష్కళంకమగు ఉష్ణ రక్తము ప్రవహించుచో దేహమునకు ఆరోగ్యము, ప్రాణికి ఆనందము, జీవితమునెడల ఉత్సాహము ఉండగలదు. జీవాధారమగు ఉష్ణరక్తమును వృద్ధిచేయుటకు సాధనము అమృతకంటె వేరులేదని చెప్పకతప్పదు. శుష్కించిపోయిన మానవుని మన్మధునిగ చేయును. పిరికివానిని పరాక్రమునిగ మార్చును. మందబుద్ధిని బుద్ధిమంతుని చేయును.




# అమృత

## రక్తశుద్ధి ద్రావకము

రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులో మంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 లు.

అమృత యెల్లెడల దొరకును.

**కేసరికుటీరం,** ఎగ్మూరు, మద్రాసు.

# మాధవి




ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళపదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మలమగును. ముఖమున లేచు సోబి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగ నుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

———:o:———

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీ వస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

వచ్చుచున్నది ! వేల్ పిక్చర్సు వారి వచ్చుచున్నది !!

# సీతాకల్యాణము

త్వరలో ప్రదర్శింపబడ నున్నది.



శివధనుర్భంగ మొనర్చి

సీతాకరగ్రహణ

మొనర్చిన

శ్రీరాముని దర్శింపుడు !

పతితపావనుడగు

అహల్యాశాప

విమోచకుని

కనులార గాంచి

తరింపుడు !!

అందమగు సీనులు !

ఆకర్షకమగు అభినయము !!

## సాటిలేని సంగీతము!!!

ముప్పిరిగొన్న యీటాకీని తప్పక దర్శింపుడు.

## ఎదురు చూడుడు!

# విషయసూచిక

# మద్రాసు సేవాసదనము

ముఖ్య ప్రాపకురాండ్రు

హర్ ఎక్సలెన్సీ కౌన్టెస్ ఆఫ్ విల్లింగ్డన్ (శ్రీ గవర్నర్ జనరల్‌గారి సతీమణి)

లేడీ బీట్రిక్స్ స్టాన్లీ (మద్రాసు గవర్నరుగారి సతీమణి)

అధ్యక్షులు

జస్టిస్ ముత్తా వెంకటసుబ్బారావు

ఉపాధ్యక్షులు

టి. ఆర్. వెంకట్రామశాస్త్రి, సి.ఐ.ఇ.

శ్రీ కొల్లెంగోడు రాజాగారు, నైట్, సి.ఐ.ఇ, యం.యల్.ఎ,

శ్రీ కుమారరాజా యం. ఎ. ముత్తయ్య చెట్టియార్, బి ఎ, యమ్.యల్.సి.,

దివాన్‌బహద్దర్ ఎ. యం. యం. మురుగప్ప చెట్టియార్, యం.యల్.సి.,

గౌరవ కార్యదర్శినియు కోశాధ్యక్షురాలును

ముత్తా ఆండాళమ్మ

(గౌ॥ న్యాయమూర్తి వెంకటసుబ్బారావుగారి సతీమణి)

గౌరవ సహాయకార్యదర్శి

రావ్‌సాహెబ్ టి. సి. ఆదికేశవులు పిళ్లె, బి.యె. బి.యల్.,

వ్యవస్థాపకురాలు

మిస్. విడా డేవిడ్, బి.యె., యల్.టి.

శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥

సోదర సోదరీమణులారా,

దుఃఖభాగినులగు మన స్త్రీలస్థితి బాగుపరచి వారిని తమపై తామే యాధారపడి తమ్ము తామే రక్షించుకొనగల శక్తిమతులనుగా జేయుటయే యీ సేవాసదనముయొక్క ముఖ్యలక్ష్యము. అది యభివృద్ధి యగుచుండుట యెల్లెరకు విశదమే. సం॥ 1923-రములో ఒక చిన్నయింట్లో ఏడుగురు బాలికలతో ఆరంభింపబడిన యీ సంస్థ సం॥ 1928-రములో సేవాసదనమను పేర పూర్ణప్రతిష్ఠ చేయబడినది.

ఈ సంస్థనుగూర్చి తెలియదగిన ముఖ్యవిషయ మేమనగా ఇదికూడ యిప్పుడున్న మామూలు బాలికా పాఠశాలలవంటిదే యొకటిమాత్రముకాదు : సర్వవిధముల నిది యొక శరణాలయమే ! దాని గౌరవమర్యాదలకు తగినట్టి ప్రదేశమం దిది ప్రతిష్ఠింపబడవలెనన్నప్పుడు చెట్‌పటులో షెన్‌స్టన్‌పార్కు (Shenstone Park) అను పేరుగల 8¼ యెకరముల స్థలము—నివేశనసహితమైనది— యొకటి కొనవలసివచ్చినది. మిక్కిలి యారోగ్యకరమగు ప్రదేశమునందు, చక్కని సువిశాల భవనముతో గూడిన యీస్థలము ఒకలక్షరూపాయ

లైనది. ఇందు బాలికలు హాయిగా తిరుగవచ్చును. బంతియాటలు (Badminton, Base Ball etc Courts) ఆడుకోవచ్చును. తోటలు దొడ్లు నేర్పాటు చేసుకోవచ్చును. ఇతరుల ప్రమేయమేమాత్రము నుండదు. ఎంత మందియైనను హాయిగా మెలగవచ్చును.

ఇట్టి సేవాసదనముయొక్క ప్రయోజనము వృద్ధిసేయుటకు సర్వవిధ ప్రయత్నములు చేయబడు చున్నవి. రానురాను చాలామంది గృహస్థులు దీని మంచిచెడ్డలు తెలియుచున్నారు. కేవల మద్రాసు రాష్ట్రములో ప్రతిజిల్లానుండియు అన్ని తెగల బాలికలును వచ్చియుండుటయే కాక సిలోను బర్మాలనుండి కూడా విద్యార్థినులు వచ్చి యిందున్నారు. ఈ హైస్కూల్ విద్యాశాఖయును దీనికనుబంధముగానున్న యితర చేతిపనులు అనగా గిల్టుపూత (Enamelling) లక్కపూత (Lacquer work) ఎలెక్ట్రిక్ దీపములకు వేరువేరురంగుల పట్టుగుడ్డలతో షేడ్లుచేయుట (Electric lamp-shade making) కుట్టుపని (Needle work) జల్తారునగిషీపని (Embroidery) దుస్తులు తయారుచేయుట (Dress-making) బెత్తుకుర్చీలు మొదలగునవి చేయుట (Rattan work) మొదలైనవన్నియును, సంగీతమును, కేవల నూతనపద్ధతుల ప్రకారము బోధింప బడుచున్నవి; మరియు సర్కారువారి ప్రశంసల కివి పాత్రములై వారి సహాయమునుగూడ బొందుచున్నవి.

వీటికన్నింటికిని మంచి కుశలలగు ఉపాధ్యాయినులే యున్నారు. మొత్తముమీద 22 ఉపాధ్యాయినులు—వీరితో నలుగురు బి. యే., యల్. టీ. లును, (B. A., L. T.) ఒక యం. యే., యల్. టీ. యును (M. A., L. T.) కలరు. ఈ యుపాధ్యాయినుల మాసికవేతనములకును భోజనాదివ్యయములకును, నెలకు 3000 రూపాయ లగుచున్నది. ఇందు విద్యార్థినులుగానున్న 210 మంది బాలికలలో 130 మందికీ సేవాసదనమే స్వంతయిల్లు. ఈ 130 మందిలో కొందరు (అనగా కొద్దిమంది మాత్రము) యేర్పాట్లు నను సరించి పూర్తిగా డబ్బు చెల్లింతురు. మరి కొంతమంది సగము మొత్తము చెల్లించుకోగలవారు. ఏమాత్రము గూడ డబ్బు చెల్లింపలేనివారును ఉన్నారు. యథార్థము చెప్పవలెనల వీరే యెక్కువమంది యున్నారు. పాశ్చాత్యదేశములం దిట్టి సంస్థలకు ఆర్థికసహాయముజేయుట పరమనిధియని శ్రీమంతులును సామాన్యులును గూడ భావించి శక్తికొలది యట్లు చేయుచున్నారు. కాని మనదేశమున కట్టి మహద్భాగ్యము పట్టలేదు. ఇంతపెద్ద రాష్ట్రమున కిట్టి సంస్థ యిదొక్కటే! ఈయొక్క దానికిగూడ లోకమునం దిపుడు సర్వత్ర ప్రబలియున్న ఆర్థికమాంద్యమువల్ల సర్కారువారి గ్రాంటును, జిల్లాబోర్డు, భూస్వాములు మొదలగువారిచ్చు విరాళములును సన్నగిలుచున్నవి.

ఇచటికి వచ్చియున్న దుఃఖభాగినుల జీవితములందు కలుగుచున్న మంచిమార్పులను తాము ప్రత్యక్ష ముగ చూడగలిగియుండినయెడల మీయంతట మీరే సాధ్యమైనంతవరకు ధనసహాయము చేసియుందురు. కాని యది దుర్లభము. అందువలన నేనే మి మ్మిందుమూలముగా నర్థింపవలసివచ్చుచున్నది. ఈ యుత్తమ సంస్థ నీలాగుననే నడపించుచు దీనికి చిరస్థాయిత్వము గలిగించి "సేవాసదన"మను పేరు ప్రత్యక్షరసార్థక ముగ జేయుట మీచేతనున్నది. "ఇంటి కొకపుష్పమైన నీశ్వరున కొకమాలికయగును" గదా! ఆ ధర్మ సూత్రమును మీరు దయయుంచి గమనించి, మీచేతనైన సహాయమొనరించి యీ సదుద్యమమును గొన సాగింతురుగాక !!

తామియ్యగల విరాళమును కార్యదర్శిని పేరబంపవచ్చును.

ఇట్లు మీ హితవాదిని,

ముత్తా ఆండాళమ్మ.

(గౌ॥ న్యాయమూర్తి వెంకటసుబ్బారావుగారి సతీమణి.)



# అసెంబ్లీయెన్నికలు

అస్పృశ్యతా నిర్మూలన ప్రచారమునకే తన కాలమును సర్వమును వినియోగింప నిశ్చయించుకొని, రాజకీయ విరామవ్రతమును పూని, ఆరునెలలు అపూర్వ సంచారమొనర్చి, అనంత ధనముకూర్చి, హరిజనుల దుఃఖములార్చి, ఏతత్సందర్భంబున తనశిష్యవర్గంబులును అన్యపక్షంబులును నొనర్చిన అహింసా ప్రచారక కృత్యంబులకు ప్రాయశ్చిత్తార్థముగ వారముదినము లుపవాసవ్రతమును బూని, కరుణాళుడగు పరమేశ్వరుని యనుగ్రహంబున ఆరోగ్యభంగములేకుండ దానిని పరిసమాప్తి నొందించి స్వర్భానునిర్ముక్తభానుబింబము మాడ్కి ధగద్ధగప్రకాశమానుడై గాంధీ మహాత్ముడు రాజకీయరథమునకు సప్తాశ్వములనుబూన్చి పరిగెత్తించనున్నాడు. ఇట్టి శుభ తరుణమ్మున మాలవ్యా ఆనీగారలు పార్లమెంటరీ బోర్డునుండి విడివడి జాతీయపక్షమును స్థాపించవలసి వచ్చుట విచారకరమైయెనను, జాతీయపక్షమువలన దేశీయ మహాసభవారి కార్యక్రమమున కావంతయు సేగిచేకూరదనియు, శ్వేతపత్రనిరసనసందర్భంబున జాతీయపక్షము గాంధిగారి పక్షముతో లీనమై హుటాహుటిం బ్రభుత్వము నెదిరించి భారతదేశముయొక్క గౌరవమును నిలబెట్టుటకు సందేహముండదనియు ఆయుభయుల పూర్వచరిత్రములను, వారి పక్షాదర్శములను పరికించినవారి కందరికిని స్పష్టముకాకమానదు. పూజనీయుడగుగాంధి యీరెండుపక్షముల సమ్మేళనమునకు ననువగు ధర్మసూత్రమింకను కలదనియు, తానిప్పు డూహించిచెప్పలేకున్నను, ఆరెండు పక్షములును తప్పక కలియగల మార్గమును

పరమేశ్వరు డేర్పరచుననియు తన అంతర్వాణి చెప్పుచున్నట్లే శెలవిచ్చుచున్నాడు. సర్వాదర్శములలోను ఆచరణములలోను ఆరెండు పక్షములును సంపూర్ణముగ నేకీభవించును గాక, లేక తమ భేదములను విడనాడలేకుండునుగాక, వారి భేదమెన్నడును దేశప్రతికూలకరమైనది కాఁజాలదని శ్వేతపత్రావలంబులగు వారి ప్రతిపక్షులు రూఢిగ నెఱుంగుదురుగాక!

అఖిలభారతమహాసభ శాసనసభా ప్రవేశవాదము నంగీకరించి యిప్పుడొనరించుచున్న సింహనాదము సత్యాగ్రహ సమరముకాదు; శాసనోల్లంఘనవిజృంభణమునుగాదు. బ్రిటిషుపార్లమెంటువారు మనమీదగిరవాటు వేసిన తెల్లకాగితము మనకు శ్రేయోదాయకమనియు మన అంగీకారముపైన నొసఁగబడినదనియు ఆంగ్లేయులు నాగరకప్రపంచమునకు చాటుచుండగా, అది మన కశ్రేయస్కరమైనదనియు మనమంగీకరించలేదనియు వారేర్పరచిన నియోజకవర్గము ద్వారానే ప్రపంచమునకు చాటుటకై మనము ప్రయత్నించుచే. తెల్లకాగితములో నిచ్చిన సంస్కరణములు చాలవని యేకొద్దిమంది విద్యార్థి కవిప్లవాందోళకులో చేయుచున్న అల్లరియే కాని, నియోజకవర్గమంతయు ఈ సంస్కరణములతో అపరిమితానందభరితులై యున్నారనియే వారు చాటుచున్నారు. భారతీయాశయములనుగూర్చి ప్రపంచమున వారు గ్రమ్ముచున్న యీ యజ్ఞానధ్వాంతము నంతము చేయుటకే గాంధిమహాత్ముడభినవ భాస్వంతస్వరూపుడై శాసనసభావాదులకు సారథియై సచివుడై నెయ్యుడై వియ్యుడై దివ్యమంత్రముల నుపదేశముచేసి కార్యక్రమమును కొనసాగించుచున్నాడు. అక్టోబరులో జరుగనున్న అసెంబ్లీయెన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులందరును గెలిచినయెడల శ్వేతపత్రము భారతీయాంగీకృతము కాదనియు, వీగిన యెడల అంగీకృతమనియు స్పష్టముకాఁగలదు. కాంగ్రెసుపక్షము గెలిచి శ్వేతపత్రమంగీకృతము కాదని మనము స్పష్టపరచినచో బ్రిటిషువారు ఇప్పుడు చేయుచున్న 'అంగీకృతము, శ్రేయస్కరము'అన్న ప్రచారము నుండి విరమించి, మనకు 'అంగీకృతము శ్రేయస్కరము'అయిన మరియొక ప్రణాళిక కొరకు ప్రయత్నించవలసియుండును. అంతర్జాతీయసమితిలో భరతఖండముకూడ ఒక సభ్యురాలై యున్నదనుమాట మనము మఱువరాదు. అంతర్జాతీయసంఘము వారంగీకరించిన 'స్వయం నిర్ణయసూత్రము' ప్రకారము, భారతజాతికెట్టి పరిపాలనము 'శ్రేయస్కరమును అంగీకృతమును' అగునో నిర్ణయించవలసినది భారతదేశపు నియోజకవర్గమువారు కాక వేఱొకరుకారు కనుక వారియొక్క సభను పార్లమెంటువారు పిలిపించి 'మీకుకావలసిన పరిపాలక తంత్రమును మీరు నిర్ణయించుకొనుఁ'డని చెప్పవలసియుండును. అప్పుడు వారు నిర్ణయించిన క్రొత్తప్రణాళిక యీ తెల్లకాగిత ప్రభుత్వమునకు స్వస్తిచెప్పును. అదియే నిజమైన స్వరాజ్యమగును. ఈస్వరాజ్యస్థాపనమునకే గాంధిమహాత్ముడును కాంగ్రెస్సును కంకణము కట్టుకొని పార్లమెంటరీబోర్డుద్వారా అభ్యర్థు

లను నిలబెట్టుచున్నారు. ఆంధ్రరాష్ట్రము తరపున గంజాంవిశాఖపట్టణము మండలములకు బారిష్టరు వి.వి. గిరిగారును, గోదావరి కృష్ణాజిల్లాల తరపున దేశోద్ధారక నాగేశ్వరరావుగారును గుంటూరునెల్లూరుజిల్లాల తరపున ప్రొఫెసరు యన్. జి. రంగాగారును అభ్యర్థులుగా నిలబెట్టబడినారని పాఠకు లెరుగుదురు. పశ్చిమాంధ్రము తరపునగూడ కొలదికాలములో తగిన అభ్యర్థిని నిలబెట్టగలరు.

కాంగ్రెసువంటి మహాసంస్థ అభ్యర్థులను నిలబెట్టుచున్నప్పుడు, వారి కెదురుగ ఇతరు లెవ్వరును నిలువకుండుట భారతదేశమున కకలంకకీర్తికరము. అయినను భారతదేశ మంత భాగ్యమునకు నోచుకొనలేదు. మితవాదులు, న్యాయపక్షులు, స్వతంత్రులు, జాతీయవాదులు మొదలగు నెందరో వివిధ ప్రాంతములలో వారివారి పార్టీలతరపున కాంగ్రెసువారికి విరుద్ధముగ అభ్యర్థులను నిలువబెట్టుదురనుట నిశ్చయము. మన రాష్ట్రములో జాతీయవాదులు మితవాదుల పోరంతగాలేకున్నను జస్టిస్‌పక్షముయొక్క పోటీ మహాఘోరముగా నుండగలదు. న్యాయపక్షము ప్రస్తుతము అధికారస్థానమునం దున్నది కనుక ప్రజలను రహస్యముగ బెదిరించి తమ యభ్యర్థులకు వోటులను వేయించుకొనుటకు పూనుకొనవచ్చును. జమీందారులును ధనాఢ్యులును దానికి పట్టుకొమ్మలై యున్నారు కనుక ధనమును మంచినీళ్లవలె దేశమున కలయంపిజల్లి తమ యభ్యర్థులను నెగ్గించి కాంగ్రెస్సునకు పరాభవమును గూర్పగడగవచ్చును. అయినను అధికారము బెదరింపజాలనట్టియు ధనమాకర్షింపజాలనట్టియు శీలసంపదకు మన దేశమున లోటులేదు. కాంగ్రెసుసందేశమును విని ఆంధ్రదేశమున వేనవేలు జనులు కారాగారముల నిడుమల గుడిచిరి. లాటీ పోటులతో యెముకలు విఱుగగొట్టుకొనిరి. పుష్కలమైన ఆస్తులు వుద్యోగములు వ్యాపారములు మానుకొని దారిద్ర్యదేవతను వరించిరి. కాలేజీ చదువులు మాని కాలినడకను కద్దరమ్ముచు గ్రామసంచారముల నొనరించిరి. అంతఃపురసంచారములను అంగరంగవైభోగములను మాని యెండకన్నెఱుగని యిగురుబోడులెల్లరును ఉప్పుగల్లీలు దోచి ముప్పుతిప్పలుబడి జయిళ్లలో వసించి కృశించిరి. ఇట్టి రాష్ట్రమున కాంగ్రెస్సు అభ్యర్థుల కపజయము కలుగునని యూహించుకొనుటకూడ సాధ్యము కాదు. కేవలము కాంగ్రెసుఅభ్యర్థులనే వ్యామోహముతోడనే కాక వ్యక్తిగతప్రజ్ఞల నవలోకించినను, గిరిగారివంటి కార్మికనాయకులు, దేశోద్ధారకునివంటి త్యాగమూర్తి, రంగాగారివంటి అర్థశాస్త్రపండితుడు, రైతుజన కల్పశాఖి, కేవలమొక్క ఆంధ్రదేశమునకే గాక అఖిలభారత వర్షమునకుగూడ వన్నెగూర్పగలమూర్తులు. కేవలము కాంగ్రెసు గౌరవము కాక ఆంధ్ర దేశపుగౌరవ మఖిల భారతశాసనసభలో మనము నిలబెట్టుకొనవలెనన్నను, వీరిని కాదని మన మన్యుల నెన్నుకొనజాలము. కాన కాంగ్రెసేతరపక్షుల బూటకప్రబోధములకుగాని, మాటలకుకాని

ధాటీకిగాని నియోజకవర్గమువారు మోసపోక తమ వోటుయొక్క విలువను గుర్తించి దాని నొసంగుటమూలముగా తమ గౌరవమును కాంగ్రెస్సు గౌరవమును లోకులకు జాటుదురుగాక !

మఱియు నెంత పేదపెండ్లికైనను బూరెలు తప్పవను సంగతిని మనము మఱువరాదు. కాంగ్రెస్సు ఎంత ధర్మపక్షమైనను అది తన ధర్మసందేశమును రాష్ట్రములోని మూలమూలలకు పాటలు పద్యములు నాటకములు లెక్చర్లు మూలముగా ప్రచారకుల వల్ల సాగింపనిచో ప్రజలకీ సంగతి తెలియక యెదుటనిలబడి యెవరు లాగితే వారికే ఆ వోటుల నిచ్చివేయుట సహజము. కాంగ్రెసు ఇప్పటినుంచి మెలకువగొని ప్రతీ కుగ్రామము నందును కాంగ్రెసు కమిటీని పెట్టి, మెంబర్లను చేరిపించి, ధనమును వసూలుచేసి, మీటింగులు తేపతేపకు జరుపుచు, నియోజకవర్గమునకు బోధలు సలుపుచు వారి విశ్వాసమును జూఱగొనుచుండవలెను. నాయకులు ప్రచారకులు మొదలగువారెల్లరును అప్రమత్తులై తగిన సన్నాహము నిప్పటినుండియే చేయవలెను. సత్యాగ్రహసమరములో చేరి కారాగారములకు వెళ్లినంతమందికంటె యెక్కువమంది నారీమణులు ఈ నియోజకప్రబోధము, వోటువసూలు, ద్రవ్యసముపార్జనము, నిర్మాణకార్యక్రమము మొదలగు విధానములలో పాల్గొని కాంగ్రెస్సు జండాయొక్క గౌరవమును నిలబెట్టగలరనియే ఆశించుచున్నాము. అఖిలభారతదేశములోనేమి ఆంధ్రరాష్ట్రములోనేమి నారీమణుల ప్రబోధమునకును స్త్రీ స్వాతంత్ర్యోద్యమమునకును గాంధీమహాత్ముడు చేసినంతసేవ మరి యేయొక్క వ్యక్తియును జేయలేదు. భారతనారీమణులును కాంగ్రెసు ఉద్యమమునం దశేషముగ బాల్గొని గాంధిమహాత్ముని ఋణము తీర్చుకొని అతని కృతజ్ఞతకు బాత్రలైరి. ఈ యుద్యమము నందుగూడ వారు వేనవేలుచేరి సుడిగాలి వంటి తమ దివ్యప్రబోధముతో దేశమునెల్ల చుట్టబెట్టి కాంగ్రెస్సు విజయమును భీమా చేసియుంచుదురుగాక !

---

# వరలక్ష్మీ ప్రార్థన

శ్రీమతి దుగ్గిరాల దమయంతీదేవిగారు

కనకమయహారముల్ కదలుచుండ
రమ్మ మాగేహసీమకు రమ్యముగను
వందనంబులు మాపూజ లందుకొనుము
సేసలిడిమమ్ము దీవన చేయుమమ్మ.
కలశవారాశి గన్నట్టి లలనలక్ష్మి
వుదయమందితి వరలక్ష్మి వనగనేను

భక్తినర్చించు మానినీ భక్తగణము
పొందవరమిమ్ము సిరియుసంపదలు భువిని
వరునివక్షస్థలంబున హాసముండి
వైజయంతంబు ఛాయనీ వమరసతుల
సేవలందుచునుంతు నీ సేవజేయ
భారమయమగు భవపరంపరలు లేవు.

# మాతృవందనము

శ్రీ శేషాద్రి రమణకవులుగారు

పరమపావనమైన నీప్రాణరక్త
సారమున నన్నొనర్చినా జలజభవుఁడు
కాని నీరూపు, నీదు చక్కఁదనంబు
నీసువర్ణతనుచ్ఛాయ నీబలంబు. 1

నిక్కవంబుగ నేనొంద నేరనైతి
జనని, నీ కీకురూపియౌ తనయునందుఁ
బుత్రభావంబె కాక యపూర్వమైన
స్నేహభావంబు నెలకొల్పి సేవఁ జేసి. 2

'నాదు బంగారుకొండ, రత్నాలమూట,
చక్కదనములకుప్ప, నాజన్మఫలము,
నాచిరంతనపుణ్య సంతానసుమము,
నా...............'అనుచు. 3

నన్ను ముద్దాడుతఱిఁ జెంతనున్న సతులు
తమ్మిపూఁబోఁడి యొడిలోని తుమ్మెదయని
చందమామకుఁ బోనుండెఁ గందటంచు
నన్ను నిను బరిహాసమొనర్చినపుడు. 4

కాని జంకెనచూపులు కలయఁబఱపి
చెలిమికత్తెలనందఱఁ జీదరించి
పుత్రవాత్సల్యరసవార్ధి మునిఁగిమునిఁగి
ఆప్తలగు స్త్రీలతోడ 'నాయాత్మజుండు. 5

నల్లఁగానుండెనా? ఇట్టి పిల్లఁడున్నె!
రత్నములరాశి నా పుత్రరత్న'మంచు
అక్కునం జేర్చి తని వింటి నమ్మ, తొల్లి.
చాలదే నీదుప్రేమ కీ సాక్ష్యమొకటి. 6

శాస్త్రవేత్తలఁ బిలిపించి జాతకముల
నెలమిమీఱంగ వ్రాయించి కలఁతఁ దొలఁగి
'కొడుకు శతవర్షజీవి నాకొఱంత దీఱె
సర్వభాగ్యయుతుండఁట నాసుతుండు. 7

సుకవియగునఁట నాముద్దుసూనుఁ డౌర
ఎంతటి యదృష్టశాలిని నే' నటంచుఁ
బెంచితివి నన్ను సమ్మదోదంచితముగ
నిర్భరానందవతి జననీ నమోస్తు. 8

నీ మధురదుగ్ధధారల నేనుగ్రోలి
నీ యనన్యకృపాదృష్టి నే గడించి
నీ దయారసవార్ధిలో నే మునింగి
నీ మహోజ్జ్ఞాసుధలను నేను గ్రోలి. 9

సుకవిబృందంబులో నొక్కసుకవినైతి,
నీదు గర్భంబునందు జనించి నేను
రాచబిడ్డలు పొందఁగారాని నిఖిల 10
సౌఖ్యములనొందితిని; జన్మ సఫలమయ్యె

వయసుదాటుచునున్నది వార్ధకంబు
దరియుచున్నది యీజీవితంబునందుఁ
దావక స్తన్యధారల ద్రావునపుడు
తావకదయార్ద్రదృష్టిచేఁ దనియునపుడు. 11

తావకీనకరస్పర్శ దగులునపుడు
దావకకృపావలోకన దనరునపుడు
జనని నాసత్యవాక్యమువినుము నన్ను
బోలు ధన్యుండులేఁడని పొంగుచుందు. 12

# దౌహిత్రుడు-పౌత్రుడు

జటావల్లభుల పురుషోత్తముగారు ఎం.ఏ.

ప్రస్తుతము హిందూసంఘములో కుమాళ్లు లేనివాడు కుమార్తెలున్నను పైవానినొకనిని దత్తతచేసికొనుట చూచుచున్నాము. ఇది మిక్కిలి యమానుషము నశాస్త్రీయము నని చెప్పవలెను. కడుపారకనిన కుమార్తె యుండగ పైవానినొకని నాదరించి వాని కాస్తియంతయునిచ్చి వానిపైననే తన భవిష్యత్తంతయునున్నదని నమ్ముట స్త్రీ సంఘముపట్ల మహాపచారముచేయుటయే. మానవప్రకృతిని చూచినను, నీతిని చూచినను, శాస్త్రమును చూచినను నిదియత్యంతము హేయమని స్పష్టపడును. వంశము నిలబెట్టుటకు పుత్రుడుకావలెను గదాయను సాకు నిరర్థకము. ఏమన తన కుమారితెకు కుమారుడు పుట్టుచో తనవంశము నిలబడినట్లుకాదా! మనుస్మృతిలోని యీక్రింది శ్లోకమును జూడవచ్చును.

పౌత్రదౌహిత్రయోర్లోకే విశేషోనోపపద్యతే।
దౌహిత్రోపిహ్యముత్రైనం సంతారయతిపౌత్రవత్॥

(96 అధ్యాయము 139 శ్లోకము)

తాత్పర్యము:—కుమారుని కుమారునకును కుమార్తె కుమారునకును భేదము లేదు. ఏమన దౌహిత్రుడుకూడ తాతను పరలోకములలో తరింపచేయగలడు.

మనుస్మృతివంటి స్మృతిరత్నముకూడ దౌహిత్రునకింత ప్రాముఖ్యమిచ్చుచుండగా కొందఱు శాస్త్రముపేరను వంశోద్ధరణము పేరను ననుంగుకూతుకుమారు నుపేక్షించి పైవాని నొకని నెత్తిపై నిడికొనుట స్త్రీసంఘమునకును శాస్త్రమునకును గూడ మహాపచారముచేయుటయే గదా! ఈదురాచారము మనలో నెంత హెచ్చుగనున్నదన పుత్రులులేక కేవలము కుమార్తెలేయున్న వానిని సంతానహీనునిగానే లోకము భావించుచున్నది.

కుమార్తెయున్ననుగూడ నామెకు పుత్రులుగల్గుదురో కల్గరో తెలియదు కాన నామెకు పుత్రులు గల్గుదురని నమ్మి పైవానిని పెంచుకొనకుండుట వివేకమా యనిన నీప్రశ్న పుత్రుని విషయమై మాత్రము రాదా యని శంకింపవలసివచ్చును. ఈవిషయమున కుమార్తెకును కుమారునకును భేదమేలేదు. ఏమన: పుత్రులులేనివాడు కూతును కుమారునితో సమానురాలినిగ చేసికొనుట కొక విధి శాస్త్రములలో గన్పట్టుచున్నది. ఆ విధి యిట్లున్నది. అపుత్రకుడు కాబోవు అల్లుని పిలచి యిట్లుచెప్పవలెను. "నీకీయబోవు పిల్లయందు జన్మించుపుత్రుడు నాకు స్వధను చేయుగాక!"

శ్లో॥ అపుత్రోనేనవిధినా సుతాంకుర్వీతపుత్రికాం।
యదపత్యంభవేదస్యాం తన్మమస్యాత్స్వధాకరం॥

(మను 9—127)

ఈవిధముగ నియమముతో వివాహితయైన కూతునకు మాత్రమే పుత్రికయని

పేరు. ఇతరులకు దుహితలనియే పేరు. ఏమన నీమెవలన తండ్రికి పున్నామనరకము తప్పుచున్నది. ఇట్టి కుమార్తె పుత్రునికంటె నేమాత్రము తక్కువకాదనుటకు మనుస్మృతి నుండియే మఱొక శ్లోకమును జూపుచున్నాను.

పుత్రికాయాం కృతాయాంతు యదిపుత్రోను జాయతే।
సమస్తత్రవిభాగస్స్యాత్ జ్యేష్ఠతా నాస్తిహి స్త్రియాః॥

(9...134)

తాత్పర్యము:—కూతురు పుత్రికగా చేయబడిన పిమ్మట కుమారుడు పుట్టువో నపుడా యిరువురకును సమభాగములుగానే యాస్తిని పంచిపెట్టవలెను. పెద్దదైనను కూతునకు నెక్కుడుపాలు రాదు.

ఇట్టిస్త్రీ తన సంతతివలన నుభయవంశములను తరింపచేయును. ఏమన ఈమెకు కల్గిన మొదటిపుత్రుడు మాతామహవంశమును నితరపుత్రులు పితృవంశమును తరింపచేయగలరు. "అస్యాంయో జాయతేపుత్రః" అనుచోటనున్న యేకవచనమున కిదియే యర్థము. ఇట్టి పుత్రికాకరణము వేదములో కూడ నున్నట్లు ముద్రచితమైన 'వేదకాలపు స్త్రీలు' అను గ్రంథమునుండి (పుట 105) కూడ తెలియగలదు. ఈ విధానముచే ననేకులు పూర్వమందు తమ వంశములను నిలబెట్టుకొనిరని మనుస్మృతి చెప్పుచున్నది.

శ్లో॥ అనేనతువిధానేన పురాచక్రేథ పుత్రికాః।
వివృద్ధ్యర్థంస్వవంశస్య స్వయందక్షః ప్రజాపతిః॥
దదౌ స దశధర్మాయ కశ్యపాయ త్రయోదశ।
సోమాయరాజ్ఞే సత్కృత్య ప్రీతాత్మా సప్తవింశతిం॥

దక్షప్రజాపతి యమునకు పదిమందికూతులను కశ్యపునకు పదముగ్గురను సోమునకు నిరువదియేడ్గురను నిచ్చి తన వంశమును వృద్ధిపొందించుకొనెనని యీ శ్లోకములు చెప్పుచున్నవి.

ఇట నొకమాటమాత్రము చెప్పవలెను. జన్మచేతనే పుత్రత్వముగల కుమారునికంటె సంస్కారముచే తద్గుణమునొందిన కుమార్తె కొంచెము తక్కువయేయని తేలుచున్నది. 'ఔరసోధర్మపత్నీజ స్తత్సమః పుత్రికాసుతః' మున్నగుచోట్ల 'సమః' అని యుండుట యిట్టి న్యూనతను నిరాకరించునని చెప్పలేము. ఏమన ఈషదల్పార్థబోధకముగ కూడ సమశబ్దము ప్రయోగింపబడును. మఱియు పుత్రిక జ్యేష్ఠురాలైనను విశేషభాగమును పొందదని చెప్పు పైనీయబడిన యొక శ్లోకము కూడ నీ యభిప్రాయమును బలపఱచుచున్నది. ఇట్లు పుత్రతుల్యుడేయని చెప్పదగిన పుత్రికాపుత్రుని వేఱుగ దత్తతచేసికొననక్కరలేదు. అన్యోదరుడగు దత్తునికంటె వేయిమడుంగులు సన్నిహితుడు ఇట్టి వంశోద్ధారకుడగు వానిని ప్రసాదించు నర్హతగల కూతులను గల్గియున్నవా డపుత్రుకుడుగ భావింపబడుట కేవలము మౌఢ్యజన్యమనక తప్పదు.



# భ్రాతృభక్తి

శ్రీమతి మూలవీసాల పార్వతిగారు

ఉ॥ శ్రీరఘురామచంద్ర మునిసేవితపాద! పయోజనేత్ర! నిన్
క్రూరతగానద్రోయమని కోరినమాటల పాటిజేయకన్
నేరమటంచునెంచకను నెమ్మనమందు మదీయకోర్కె నిం
పారగతీర్ప రాజ్యమును పాలనజేయగ రమ్మయోధ్యకున్.

శా॥ కైకేయీ కృతక్రూరకృత్యమున నీ కర్మంబువాటిల్లె నా
కైకేయింగొని రాజ్యమిమ్మనుచు నే కాంక్షించితే? నిన్ను నీ
కీకారణ్యము కంపుమంటినొకొ? వేగేహంబుకున్ రమ్ము నే
లోకంబాడెడు నిష్ఠురోక్తులను లో లో సైపలేనగ్రజా.

చ॥ ధరణిజగూడి నీవిచట దైన్యముతో మునివృత్తినుండ నే
కర మనురాగవృత్తిని సుఖంబులనందుచు రత్నపీఠిపై
స్థిరముగనుండి రాజ్యమునుసేయుట ధర్మమె? రమ్మురామ! నీ
వరయగరాజ్యమేల పురికర్మిలి జానకిదేవితోడుతన్.

తే॥ గీ॥ రాజు ప్రజలనురంజించి పూజగాంచు
ప్రజలకోర్కెలదీర్చుచు బరగునతడె
వారెనిన్నిష్ఠరాజుగా గోరుచుండ్రి
వారికోర్కెలనైన దీర్పంగరావె?

తే॥ గీ॥ మనజనకు డందుమరణించె మానసీయు
డతనిరాజ్యంబునేల స్వర్గంబునీకె
ప్రజలకోర్కెయు నాకోర్కె బరగనదియె
కానరాజ్యంబునకురమ్ము కానవీడి.

చ॥ ఘనమగుభారమూనగను గంధగజంబున కౌనుగాని నెం
దున నయినం దరంబగునె తుచ్ఛమృగంబున కట్లె కార్యముల్
పెనగొనురాజ్యభారమును బెంపువహింపగ నీకెగాక నా
కనయముమోయగాసగునె యన్యులకౌనె యయోధ్యనేలగన్

ఉ॥ ఆరయనగ్రజుండె యిల నర్మిలినేలుట ధర్మమౌట నా
తీరున రాజ్యమేల నరుదెమ్ము పురంబున కట్లుగానిచో
ఘోరవనంబునందు నినుగూడి తపోధనువేసమూని నీ
చారునిభంగి బాదపరిచర్యనుజేయుచునుందు నిచ్చటన్.

# కవివాక్సిద్ధి

భ॥ పట్టాభిరామయ్యగారు, ఎం. ఏ. ఎల్. టి.

## నాటకపాత్రములు

భీమేశుఁడు:—దాక్షారామమునందలి శివుఁడు.

పార్వతి:—దాక్షారామమునఁ బూటకూళ్ళయిల్లుగల విధవ బ్రాహ్మణ స్త్రీ.

భారతి:—
సుమతి:— పార్వతిస్నేహితులు. వివాహితలు.
వసంతవల్లి:—

సూరయ్య:—ధనికుఁడును ఆచారపరాయణుఁడు నగు విప్రుఁడు, దాక్షావాసి.

నరసింహము:—దాక్షారామమునఁ బురోహితుడు.

రమణయ్య:—
సత్యనారాయణ:— దాక్షారామమున నితర బ్రాహ్మణులు.
వీరశర్మ:—

శంకరం:—కోవెలయం దర్చకుఁడు.

కళింగగంగు:—కళింగపట్టణము ముఖ్యపట్టణముగాఁగల కళింగదేశపు రాజు.

లక్ష్మాజిరావు:—కళింగగంగుని మంత్రి.

జయవర్మ:—కళింగగంగుని సేనాధిపతి

విజయరామ భూపతి:—ఉన్నట్లుండి మంచి దశ నొందిన రాజకొమరుఁడు. తరువాత కళింగదేశపు రాజు.

ఆనందుఁడు:—నాటకసమాజమునకు సూత్రధారుఁడు.

పరశురామ దైవజ్ఞుఁడు:—కళింగగంగుని యాస్థానజ్యోతిష్కుఁడు.

వీరబాహు:—దాక్షారామమున వెట్టివాఁడు.

మరిడి:—కళింగగంగుని మంగలి.

శ్రీహరి:—కళింగగంగునియెడ భక్తిఁగల రాజసభ్యుఁడు.

ఇంకను గాయకులు, నటకులు, ఏనుఁగులు, అశ్వములు, మున్నగునవి.

రంగము:—కొంతవఱకు దాక్షారామము. కొంతవఱకుఁ గళింగపట్టణమున్న తత్సామీప్య ప్రదేశములును.

### కవివాక్సిద్ధి

ప్రథమాంకము. ప్రథమరంగము.

(దాక్షారామమునఁ బార్వతి పూటకూళ్ళయింటి యెదుటవీధి. శ్రీ భీమేశుని కోవెలకుం బోవుచు, భారతి, సుమతి, వసంతవల్లియుఁ బ్రవేశింతురు)

భారతి:—

శా॥ లోకేశుండు దయాపరుండగయినచో-
లోకంబు నాకంబగున్।
లేకుండుంగద ఆమయంబులు వెతల్
లేముల్ విపద్వర్గముల్।
లోకస్థుల్ సుఖజీవులై సుతదునిం
లోకేశుంగూర్చి తా।
మేకగ్రీవముగాను కీరములమై యిచ్ఛాగతిం
బాడరే?॥

అయినను యథార్థ మదికాదు. కృతజ్ఞతాపూర్వకమగు ప్రీతికంటె, భయముచే, మన మీశ్వరుని యాగ్రహముం దప్పించుకొనుటకై, కానుకలిచ్చి యారాధింతుము. లేనిచో, మనములను రంజిల్లఁజేసెడి లతాంతములతోడను, బిల్వాదిపత్రములతోడను, తమపరి కొన్ని రాగిడబ్బులతోడను, దేవాలయమునకేగ నేల? ఈ కానుకలేగద శంకరము పోషించుచున్నవి. మనుజులకును దేవునికిని మధ్యవర్తిగఁ దా వర్తించుటకుఁ దగినంత హిరణ్యాభ్యుష్పము ముట్టనియెడల శాశఁడెంత యొఱఁగత్తి బేరములాడునో మీ రెఱుఁగరా?

వసంతవల్లి:—మనుష్యుడు మనకుం చేసెడి యెగ్గులు లేనవేలుండ, భగవంతుఁడు న్యాయముచొప్పున మనకుం జేసెడి శిక్షలనెంచి, యీశుని దూఱనేల? ఏదికైనను పూర్వజన్మఫల మనుభవించుట తప్పదు. సుకృతములం జేసినచో సుఖమును, దుష్కృతములం

చేసినచో దుఃఖములను మనము పొందితీరవలయు. పీడనాశ్శృంఖలములయందు దైవికవలయములకంటె మనుష్యకృతములే కడు దుర్భరములు.

(పార్వతి ప్రవేశించి గుమ్మమును చీపురుతోఁ జిమ్మును.)

అదిగో! పార్వతి! ఈపిల్ల వివాహితయైనచో లోకాదర్శకమగు నిల్లాలగును గదా. దీని సౌందర్యము, తెలివి, పనిపాటలయందు శ్రద్ధయు నితర కన్యలయందుఁ జూడఁబోము.

భారతి:—ఇది కన్యగాదు. విధవ. వివాహమిదియని యెఱుగందగు వయస్సు రాకమున్నె దీని భర్త గతించె. ఇఁక పునర్వివాహము లేక జన్మమంతయు నితరుల కలవచాకిరిఁ జేయుచుండుటయే గద దీనిగతి? ఆహా! భగవదాజ్ఞ!

వసంతవల్లి:—ఇది భగవదాజ్ఞయా? ఎంతమాత్రము కాదు. మనుజులు నిర్మించిన క్రూరచట్టములే దీని నరకకూపమునం ద్రోసె. దానియంత సౌందర్యము లేని మనమెల్లరము సంసారసుఖము ననుభవించుచుండ, ప్రేమామయుఁడును దయాంభోనిధియు, పరమదాతయు నగుఁ బరాత్పరుఁ డీ సుందర కోమల కుసుమమిట్టి యొంటరి బ్రతుకుచే నిష్ఫలముగఁ గృశించునట్లు విధియించునే?

సుమతి:—మన సాంఘిక చట్టముల నిర్మించిన వారు పరమధీమంతులు సుమీ. వారి బుద్ధిగాంభీర్యమును మన మింతయని యెఱుఁగజాలము. విధవలంగదు పునరపి వివాహము చేసికొన్నయెడల, కన్యల గతియేమి? విధవలనేకులు గొంతకాలమైనను సంసారసుఖ మెఱిఁగినవారు. సున్నైన నట్టిసుఖ మెఱుఁగని కన్యలను విధవలకంటె వివాహముచేసికొను హక్కు యెక్కువగదా? (బిగ్గరగా) పార్వతీ! నీవును మాతో దేవాలయమునకు రావా? నేను మహాశివరాత్రి. శివదర్శనమునకు మిక్కిలి యనుకూలమగు పర్వదినము. సంవత్సరమున కొకమారే యిది వచ్చును గాన సద్భక్తులు శివదర్శనమున కిట్టి తరుణముఁ బోగొట్టుకొనఁ గూడదు.

పార్వతి:—నేను కొంతతడవుండి కోవెల కొగ్లైన నేగెదను. ఇప్పుడు మీతో రాఁజాల. నేను తక్కిన దినములకంటె నెక్కువగా భోజనార్థ మనేకులు నాయింటికి వచ్చియున్నారు. వారిరాకయే నాజీవనాధారము. ఇంకను పెక్కుగంటలసేపు వారికి నేఁ బరిచర్య చేయవలసియున్నది. నేను తక్కినదినములకంటె నాకు నాలుగుడబ్బు లెక్కువ లభించును. దానితో ధరించుట కొక చీరనైనను కొనవచ్చును. జన్మమంతయు నాకీ చాకిరియే గతి. విశ్రాంతిని, నలుగురుస్నేహితులతోఁ గాలము సలిపెడి యానందమును, నే ననుభవించెడి భాగ్యమును నోఁచనైతి. కావున నిట్టి నిర్భాగ్యురాలిపైఁ గరుణనుంచి, ముందు జన్మములయందైనను నాకు వైధవ్యము రాకుండునట్లు నాపక్షమున మీరు భీమేశునిం బ్రార్థింపుఁడీ.

వసంతసేన:—ఎప్పుడు నీవు కొంత పనితీరి మాతో నీశ్వరసన్నిధికి రాఁగలవే?

పార్వతి:—నడిరేయి యగును.

వసంతసేన:—(భారతికిని, సుమతికిని) చెలులారా! స్వామిదర్శనమునకు మనకు రాత్రియంతయు నున్నది కావున, మన మిప్పుడు యిండ్లకేగి యర్థరాత్రిని మరల వచ్చి పార్వతింగూడఁ దోడ్కొని స్వామిసన్నిధి కేగుట బాగని నాకుఁ దోఁచెడిని.

పార్వతి:—నాయం దింతదయఁగల మీకు నే నెంతయుఁ గృతజ్ఞురాలను. ఇప్పుడు నాకు సెలవిండు. (నిష్క్రమించును.)

వసంతసేన:—అయ్యో! పాపము! ఈపార్వతి మనతో నప్పుడప్పు డొకగడియ మాటాడుట తప్ప యితర సుఖ మేమియు నెఱుఁగదు గదా! కావున దానిని వదలి యేగుటకు నాకు మనసు రాదయ్యో. (నిష్క్రమింతురు.)

ప్రథమాంకము ద్వితీయరంగము.

(పార్వతి యింటి లోపలి భాగము. గురులింగము తప్ప యితరు లెవరును లేరు. పార్వతి ప్రవేశించును.)

పార్వతి:—సంవత్సరమున కొకసారి యీ శివరాత్రినాడు పలువురు నాయింటి కన్నమునకై వచ్చుటచే నాకు నాలుగు డబ్బులు దొరకును కాని, నడుము విఱుగఁ బని తగులును. ఇంటి నలికి యూడ్చుట, వంట వండుట, వడ్డించుట మున్నగు వన్నిపనులను చేయుటకు నేనొక్కర్తునే గదా. రేపు జబ్బుచేసి మంచమునం బడినను సరే, ఈరాత్రి జాగరము సేయ నా శక్తికొలఁది యత్నించెద. ఎవ రాతఁడు? తదితరు లెల్లరు పోయిన నీతఁ డొక్కఁడే రొంటుకలతో యింక నిట నున్నాఁడు. పరపురుషులతోఁ బొమ్మనిన మర్యాదకు లోపము. రే పెవ్వరు నాగుమ్మముఁ ద్రొక్కరు. నా యన్నమున రాయి పడును. పొమ్మనకున్నచో నంతకంటెఁ గీడు వాటిల్లు. ఏమియనఁ బార్వతి పరపురుషునితో రాత్రి గడపెనని నవనింద పాలగుదును. కావున గుమ్మము వద్దఁ గూర్చుండి నాచెచ్చెలులు వచ్చినతోడనే నలువురుఁ గలసి యాతని వెడలఁగొట్టుట మేలు.

(గురులింగము ప్రవేశించును.)

గురులింగము:—అమ్మా! దయచేసి యీక్షేత్రముం గూర్చి నాకుఁ గొంత చెప్పుమీ. దాఁదాపు పదునేను సంవత్సరములు సాధువులతోఁ గన్యాకుమారినుండి కైలాసమువరకు మనదేశమంతయుఁ గ్రుమ్మరితిని. వారివద్ద సామాన్యు లెఱుఁగని కొన్ని విశేషవిద్యలం గొంత చతురత నొందితిని. సాముద్రిక శాస్త్రమున నాకు బాగుగఁ బ్రవేశము గలదు. నీమోముం జూడ సామాన్యుల మోమువలెఁ గాక విశేషాంశములు నీ కున్నట్లు నాకుఁ దోఁచెడిని.

పార్వతి:—సత్యముం బలికితిరి. అయ్యా, నావంటి పరమనిర్భాగ్యురాండ్రు సాధారణముగ నెందు నుండరు. ఈ విశేషాంశము నాయందు నిక్కముగాఁ గలదు.

సీ॥ దాంపత్య మిదియని- తెలవంగ నేరని
బాల్యంబునందె నా భర్త మడిసె।
తల్లి దువ్వుమనున్న- తండ్రి ముద్దిడుచున్న
నీలంపు కురులెల్ల- నేలఁబడియె।
పసుపు కుంకుమ పోయె- పర్యాద తలకెక్క
పరుల సేవయె నాకుఁ- బ్రాప్తమయ్యె।
గంధంబు పూవు ల- గరును ధరించెడి
భాగ్యంబు నే నిలఁ- బడయనైతి।.

గీ॥ దుశ్శకునమని కనువారు- దూఱుచుండ।
వీధిలో స్వేచ్ఛ నేగ నే- వెఱతు నయ్య।
ధవుఁడు లేకయె పరుల ని- ర్దయను బొందు।
నిట్టి దురవస్థ వలదయ్య- యేరికైన॥

గురులింగము:--వనితా! నే నిచ్చకము లాడు వాఁడను గాను. నీ ముఖవర్చస్సుం జూడ నీయం దొరులకు లేని విశేష మెద్దియో యున్నట్లు గోచర మగుచున్నది. నీ యఱచేయిఁ జూచిన నిది యెల్ల దెల్ల మగును. కావున సిగ్గువిడిచి చెయిం జూపుము.

పార్వతి--(సిగ్గుతోఁ జేయి సాచును. (అయ్యా! మీ యిచ్ఛానుసారముగఁ జిత్తగింపుఁడు.) గురులింగము చేయిం బరీక్షించుచుఁ దనలోఁ దా నేమో గొణుఁగుకొనును) మీ పరీక్ష సంపూర్ణ మాయెనా? విశేష మెద్దియో సెలవిండు.

గురులింగము:--ఆహాహా! ఇంతకంటెను విశేష మేమియున్నది? కోరితివి కావునఁ జెప్పెద.

గీ॥ భూపతులచేత నైతము. భూషితుండు।
ఘనయశస్వియు నగు సుతుం- గందువమ్మ॥

పార్వతి:--(కోపముతో దిగ్గన లేచి చీపురుఁ గట్టతో గురులింగమును గొట్టి తఱుముచు.) ఛీఛీ! దుర్మార్గుఁడా! వెడలు మిటనుండి. జ్యోతిషము మిషఁజేసికొని సరసల్లాపము నాతో సలుప నెంచి తివా? (గురులింగము తడఁబడి పారిపోవును.) ఆహా! లోకము మెచ్చుటకై యీతని నే నిట్లు తిట్టి కొట్టి తఱిమివేసితిని కాని, యాతఁ డాడినమాట హృదయం

గమముగనే యున్నది. నా యంతరంగమున సంసార సౌఖ్యముపైని, పుత్రప్రాప్తిపైని నాకు వాంఛ లేదా? నావలె నున్నచో నెవ్వతె కుండదు? లేనిసుఖముకై వాంఛనుఁ దప్పించ నాతరమా?. వాంఛయే భగవంతుఁడు మన కిడిన భాగ్యములలోఁ బరమభాగ్యము. చింతామయమగు సంసారవార్ధిలో మనలం దేల్చెడి తెప్ప యిదియే. అవసాన మాసన్నమైయున్నను, మరణానంతరమున సద్గతి గల్గునను నాశచేతనే కదా నరుని మొగము చిఱునగవుతో వికసించును! స్వేచ్ఛావర్తనకు లేనిపోని విఘ్నముల నిడి మనకుఁ జింతఁ గలుగఁజేయువారు మనుజులే కదా? అయినను బయలు పెట్టక నాయంతరంగముననె యీవాంఛను దాఁచెద. జిహ్వా! పరాకుగాఁ బ్రేలకుమీ. చూడ్కులారా! ననుం బట్టియీయకుఁడీ. అల్లదుగో! నా చెలియలు వచ్చుచున్నవారు. వారి వీక్షణములు నా హృదయాంతరమునెల్ల వెదకుచున్నట్లున్నవి. వారితో దేవాలయమునకేగెద. (నిష్క్రమించును.)

## ప్రథమాంకము తృతీయరంగము

(భీమేశుని యాలయమున గర్భగృహము. దీపములకై చమురుఁ దీసికొని శంకరము ప్రవేశించును. గంటను, పళ్ళెరములను, శఠగోపమును, తీర్థపాత్రలను అమర్చును. కర్పూరమును, పువ్వులనుఁ గొంత సొమ్మును చేతఁబట్టుకొని వసంతవల్లి భారతి సుమతియు, రిక్తహస్తములతోఁ బార్వతియుఁ బ్రవేశింతురు.)

శంకరము:---అమ్మలారా! లోనికి రండు. శీఘ్రముగఁ బూజ ముగించుకొని వెడలుఁడు. లేనిచో గుంపులో నలిగి చావఁగలరు. మీ పూజాద్రవ్యములు నా కిచ్చి మీ రొక్కొక్కరియు తన కిష్టమువచ్చిన కోరికం గోరిన, భీమేశుఁడు తప్పక యిచ్చును.

సుమతి:-పార్వతీ! రిక్తహస్తములతో వచ్చితివా? ఈ పూజాద్రవ్యములనుఁ గొంత సొమ్మునుఁ గైకొనుము.

పార్వతి:—పూజాద్రవ్యములును దక్షిణయుఁ గోరిక లున్నవారికే. నేఁ గోరఁదగినదియు, దేవునిఁ బ్రార్థింపఁ దగినదియు నెద్ది యున్నది?

భారతి:—కోర్కి లేకున్నను భగవంతుని గౌరవింపవలయును గదా?

గీ॥ ప్రభువునైనను, మఱి భగవంతునైన
కుత్తివారలనైన నీ గురువునైన
ప్రేమసినియైనఁ జూడ నీ వేళరతినిఁ
జనఁగఁదగ దంద్రు రిక్తహస్తములతోడ॥

అను లోకోక్తి యెఱుఁగవా?

శంకరము:—అమ్మలారా! కాలహరణమేల?

[అడువాండ్రు తాము తెచ్చిన వస్తువులను దక్షిణయును బూజారికి నిత్తురు. అతఁడు మంత్రములతోఁ బూజనేసి, కర్పూరము వెలిగించి లింగముముందు త్రిప్పి, ప్రసాదము వారికిఁ బంచి యిచ్చును. వారు వెడలుచుందురు:]

భారతి: --వసంతా! నీ వేమి కోరితివే?

వసంతవల్లి:—నీ యభీష్టము ముందుఁ దెల్పుము.

భారతి:—మొదటిప్రశ్నకు మొదటప్రత్యుత్తర మిడవలయును.

వసంతవల్లి:-నాథగ్రహ కున్నతోద్యోగమును మంచి దశయునుఁ గల్గ వేడుకొంటిని. [భారతితో] నీవు? అదిగో నీనగవు నిన్నుఁ బట్టియిచ్చుచున్నది. నీమనమున నుండెడి కోరిక నే నెఱుఁగుదు.

భారతి:-ఇతరుల మనోభావ మెఱుంగఁజాలిన దాననైనచో నాఁ గోరినది యెద్దియో నీవే చెపుమా.

వసంతవల్లి:—అనుదినము నీస్నానముం దినుచుండెడి గయ్యాళియగు నీయత్తగారు పెందలకడ శరించుట దక్క మఱి నీవు కోరఁదగినది యే మున్నది.

భారతి:-సత్యము కాని యిది మనలో మాటసుమీ. సుమతీ నీ వేమి కోరుకొంటివే?

సుమతి:—పరమనోవ్యాపార వేదియే బదులు చెప్పనిమ్ము.



మిస్. మేతాబ్.



మిస్. కోకిలామణి.



ఎగ్మూరులో 11-8-34
తేదిని జరుపఁబడిన వుమన్సు
ఇండియన్ అసోసియేషను
వారి 17-వ సాంవత్సరికోత్స
వమున కధ్యక్షతవహించెను.

# శ్రీమతి సరోజినిదేవిగారు

బయ్యా సూర్యనారాయణమూర్తిగారు.

సీ॥ సత్కవీశ్వరుల హృత్సరసీరుహంబుల వికసింపఁజేయు కవిత్వశక్తి
విద్వాంసులకుఁగూడ విభ్రాంతిఁగల్గించు విశ్రుతసదసద్వివేకశక్తి
స్థావరాళికిఁగూడ చలనశక్తిని బ్రసాదింపఁగాఁజాలు వక్తృత్వశక్తి
పరిపంథివీరుల భయసంభ్రమవిషాద గ్రహపీడితులఁజేయు కార్యశక్తి

అఖిలజనపూజితంబైన యాత్మశక్తి
యిట్లునీయందుఁగ క నిం కేరియందుఁ
గాంచఁగలమమ్మ! మూర్తీభవించియుంట
ధీనిధీ! శ్రీ సరోజినీదేవి! సుమతి!

వసంతవల్లి:—సుమతి గర్భవతియని మన మెఱింగి నదియే. కావున సుపుత్రునికై యాది ప్రార్థించి యుండును.

[సుమతి సిగ్గుతోఁ దలవంచుకొనును]

సుమతి:—పార్వతీ! ఇఁక వరుసచొప్పున నీవు నీ కోరికం జెప్పవలయు.

పార్వతి:—నేఁ గోరఁదగినదియుఁ బ్రార్థించఁదగిన దియు నెద్దియు లేదని యిదివరకే నేనంటినిగదా?

[మోమునఁ గడు సిగ్గుం జూపును]

భారతి:-మనోవేదీ,పార్వతి యథార్థముఁబల్కెనా?

వసంతవల్లి:-అసిగ్గుఁ జూడ నది ధ్యాడినది కల్లయని తోఁచెడిని. కాని యీవిషయమై చర్చఁ జేసిన దాని మనసు నొంచినవార మగుదుము గాన మానివేయుఁడు పాపము! పార్వతిని మనము దయతోఁ జూచుట తగును గాని నిందించుట పాడిగాదు.

శంకరము:-అమ్మలారా! వెలుపలికి పోయి యితరులకుఁ జోటీయరాదా? తగుమనుష్యులు స్వామి దర్శనార్థము వేచియుండుటం జూడలేదా? అదిగో, సూరయ్యపంతులుగారు వేంచేయుచున్నారు. వారి నాహ్వానము సేయవలయు. [శంకరము నిష్క్రమించును.]

వసంతవల్లి:-[సుమతిని భారతినిఁ బ్రక్కకుఁ బిలచి] రాబోవు జన్మయందు వైధవ్యము లేకుండఁ జేయుమని యది యీశుని వేడె. దాని మనమున కాయాసము గల్గునేమో యని దానియెదుట నేఁ జెప్పనొల్ల.

[వసంతవల్లి, సుమతి, భారతియు నిష్క్రమింతురు]

పార్వతి:-చం॥ పరిపరి గెంటఁబూనినను, పాయదు నాదు మనంబునుండి యీ తెరువరి జ్యోత్స్నయుఁ డందిడిన తీవ్రసుపుత్రకవాంఛ, నేడు నా శిరమును వంచి యీశ్వరుని చెంతను నేఁ బ్రణమిల్లు వేళలో హర! హర! పుత్రునిం గనిన సత్యపకీర్తినిఁ జెందకుందునే॥

[పార్వతి నిష్క్రమించును. శంకరము, సూరయ్య నరసింహము, రమణయ్య, సత్యనారాయణ, వీరశర్మ, ప్రవేశింతురు.]

నరసింహము:—[శంకరముతో] ఇదిగో సూరయ్యగారు, ధనికులు. నీవు మర్యాదఁజేసిన బహుమతి నొందఁగలవు త్వరపడుము.

శంకరము: [మిక్కిలి శ్రద్ధతో దీపముల వత్తులన్నియు నెగఁద్రోసి, యతివినమ్రతతో] మహాప్రభూ! లోనికి విచ్చేయుఁడు. ఇంకను గుంపు రాకమున్నె తా మిటదయచేయుటయే బాగు. ఎక్కువ శ్రద్ధతోఁ డమ పూజ సలుపుటకు నా కవకాశము గల్గె. [ఇచ్చకపు నవ్వు నవ్వును.]

సూరయ్య:—నరసింహమూ! మనము దెచ్చిన ఫలపుష్పాదుల నాతని కిచ్చి యర్చన మాపేరఁ గావింప నియమింపుము.

[నరసింహము పూజాద్రవ్యముల నందియ్య, శంకరము మిక్కిలి యాడంబరముతోఁ బూజ సలిపి యెల్లరకుఁ బ్రసాద మొసఁగును. వారు వెడలిపోవ మరలుదురు.]

వీరశర్మ:—[సూరయ్యతో] పంతులుగారి వర్థంతి విందు మా కెన్నడు లభించునో!

రమణయ్య:—రానున్న బహుళపాడ్యమినాడు.

సత్యనారాయణ:—నరసింహము నిస్సందేహముగాఁ జెప్పఁగలఁడు.

నరసింహము:—ఔను రాఁబోవు బహుళపాడ్యమినాడే. వారి జన్మనక్షత్రము ఆరుద్ర.

వీరశర్మ:—అయ్యా! అదినమునఁ దమపేర నిచట నర్చన జరుపుటకై పూజారితో ముందుగాఁ జెప్పనక్కరలేదా?

సూరయ్య:—ఔనౌను. మఱచితిని. అ...పూజారిం బిలువుము.

నరసింహము:—పంతులుగారి సెలవగుచున్నది.

శంకరము:—[పరుగిడివచ్చి యెదుటనిలచి ]మహాప్రభూ! ఏమిసెలవు? తమ దాసుఁడను.

సూరయ్య:—రాఁబోవు బహుళపాడ్యమి నేను పుట్టిన దినము కావున...

శంకరము:—వాడుక చొప్పునఁ దమపేర నర్చన చేసెద.

సూరయ్య:-ఔను. అది జ్ఞప్తిసేయుటకే పిలచితిని.

శంకరము:-[ఇచ్ఛకపునవ్వుతో] తమసేవకునికి జ్ఞప్తి సేయ నేల?

సూరయ్య:-సరి మన మింక వెడలిపోదము. రండు.

[శంకరముతప్ప యితరులెల్ల నిష్క్రమింతురు.]

## ప్రథమాంకము చతుర్థరంగము.

[పార్వతి యింటిలో గది. నడిరేయి పార్వతి ప్రవేశించును.]

పార్వతి:—ఆ దిక్కుమాలిన సాముద్రికుఁ డాడిన మాట నాచెవులలో నింకను మ్రోఁగుచున్నది. సతతము నామనమును విడువకున్నది. ఎంత మఱచుటకు ప్రయత్నముచేసినను, శివరాత్రిని శ్రీభీమేశుని యెదుటనిలచి ప్రార్థన చేయునంతసేపు నా కిదియే తలంపయ్యె. నాటినుండి నేటివరకుఁ దిన్నఁగా నాకు నిదురలేదు. ఆరోగ్యమునకు భంగము గల్గుచున్నది. ఒక్కదినమైనను నే మంచమునఁ బడితినా నాలుక యెండిపోవుచున్నను గ్రుక్కెడు నీరుఁబోసి నాదప్పిఁ దీర్చువా రెవరును లేరు. దేహారోగ్యముండి పాటుపడు చుండిననే నేను జీవించఁగలను. జాడ్యము వచ్చెనా నవిసి నవిసి చచ్చుటయే నాగతి. హా! యీశ్వరా! [ఆగదిలో నున్నట్టుండి యొక వెలుఁగు గన్పడును] నా కుటీరము నిట్లు వెలుగంగఁజేయు వారెవరు? చోరుడా? కానేరఁడు. అట్టి వారు వెలుఁగుకంటెఁ జీఁకటినే కోరుదురు. మఱియు నీవెల్గు మానుషికముగఁ గన్పడదు దివ్యతేజముగ నున్నది!

[దేహమునుండి వెడలు తేజముతోను, జడలు, సర్పములు, పునుకచిప్పలతోడను, శిరమున నర్ధచంద్రుని, చేతఁ ద్రిశూలముం బూని, బూదిఁ బూసి కొని, గజవ్యాఘ్రచర్మముల నంబరములుగను, కంఠమున రుద్రాక్షమాలికలను ధరియించి భీమేశుఁడు ప్రవేశించును. పార్వతి కృతాంజలియై నమస్కరించును.] దేవా! రక్షింపుము.

భీమేశుఁడు:-భీతినొందకుము. మూర్ఖులగు లోకులు నిన్ను విధవయనినను నీవు శుద్ధచరితవగుఁ గన్యవు సుమీ. నీప్రార్థన నాలకించితిని. [పార్వతిని లేవనెత్తి యభయహస్తము నాయమ శిరముపై నిడును. పార్వతి గజగజ వణఁకును] నీవు కోరినచొప్పున నాకృపచే నీవు మహాయశస్వియగు పుత్రునిం బడయఁగలవు.

పార్వతి:-[కన్నీరుఁ గార్చుచు] మహాదేవా! ఏమో తెలియక వేడితిని గాని, లోకాపవాదముపాలై నలుగురిలోఁ దలవంచుకొను దుర్గతినుండి నన్నుఁ గాపాడుము. పాహి! పాహి! శంభో!

[అభయహస్తము మరలఁజాపి భీమేశుఁ డదృశ్యుఁ డగును. గదియంతయుఁ జీఁకటియగును.] విపరీత ప్రసాద మిప్పుడే నాదేహముం జొచ్చె అయ్యో! దీనికంటె మరణముమేలు. దీనితో నే నెటుల నలుగురియెదుటఁ బ్రదుకు? ఎటులు దీర్ఘకాలము దాఁగి యుండఁగలను? మున్ను పుణ్యకాలురగు పూఁబోడులు, కన్యలయ్యు, భగవదనుగ్రహముచేఁ బుత్రులం బడసిరి. ఇక్కాలమున నట్టివింత జరిగినదన నేరు నమ్ముదురు? వ్యభిచారిణియని నన్నును, గోళకుఁడని నాకొమరుని లోకులు నిందింతురుగదా! అపనిందలపాలై బ్రదుకుటకంటె మరణమే మేలు. నేను కొమారునికై శ్రీభీమేశునిఁ బ్రార్థించినది నిక్కమే. తెలివితక్కువకొలఁది యట్లు వేడితిని. దేవా! యీ యవమానముకంటె నాకు మరణమొసంగి నీసన్నిధిం జేర్చుము. [ఏడ్చును. తెల్లవారును.]

## ప్రథమాంకము పంచమరంగము.

[దాక్షారామములో నొకవీధి. భస్మధారియై దర్భను, గంటమును, తాళపత్రములను, పంచాంగమును కేలంబూని నరసింహము ప్రవేశించును.]

నరసింహము:-నాభార్య మృతినొంది యాఱువర్షములాయె. ఒక్కనాఁడీ విధవపై వలపుపుట్టి కొంత శృంగారసంభాషణలో దిగఁగా నది త్రొక్కఁబడిన త్రాఁచువలెఁ గోపోద్రేకములో రివ్వునలేచి నను

దటిమివేసె__నన్ను__దాక్షారామవిప్రులలో నగ్ర గణ్యుని! ఇటీవల దనపురోహితుఁడై యుండిన నన్నుఁ దప్పించి యా మొద్దుపెద్దమ్మయగు వీరశర్మనుఁబిలచి పడపించె. పొట్టఁబొడిచినను వానికి వేదజ్ఞానము లేదు. ఒక్కమంత్రముఁ బఠింపఁజాలఁడు, దాని యర్థ మెఱయుట యటుండనిమ్ము. ఓహో! వాఁడే వచ్చుచున్నాఁడు.

[వీరశర్మ ప్రవేశించును.]

మహాపుణ్యశాలి నీవెఱిఁగిన విధవ యీయూర నుండి లేచిపోయినదఁట. గతశివరాత్రినాఁడు తన యింటనుండి యొకసుందరాంగుని వెడలఁగొట్టినట్లు నటియించెనఁట. అయినను అతనిమూలముగా నామె గర్భవతి యాయెనని వదంతిగలదు. [వీరశర్మ నిట్టూర్పు నిగిడించును.] అయ్యో! దానియెడల నీ కెంత జాలియో! నాకు లేదు. అట్టి పాపిం జూచి "అయ్యో" యన్న నాఱునెలల పాపము వెంటఁదగులును. నేఁడు సాయంసంధ్యాసమయమున నీయూరనుండు విప్రు లెల్లరు సమావేశమగుట కీప్రకటనను లిఖియించితిని. ఈసభలోఁ పార్వతి దుశ్చరితయంతయును ఖండించి దానినెల్లగు బహిష్కరించునట్లు చేసెద. ఈప్రకటనం జదువుము. [విష్ణుశర్మ యొక తాళపత్రము నందిచ్చును.]

విష్ణుశర్మ:__[చదువును] దాక్షారామమందుండిన విధవ పార్వతివ్యభిచారిణి. అదిగర్భము ధరించుటయుఁ దీర్థయాత్ర సలుపు మిషతో నూరనుండి యెవరికిం దెలియక వెడలిపోవుటయు దాని దుర్వర్తనమునకుఁ దార్కాణములు. యథార్థము బుజువుతో బయలు పడియె. కావున దాక్షారామ విప్రులెల్ల నేఁడు సాయంకాలము కోవెలలో సాంఘికసభఁ జేసి, శ్రీ భీమేశుఁడుసాక్షిగా, ఈ పార్వతినిన్ని, దానికిం బుట్టఁబోవు శిశువున్ను బహిష్కరించి యెవరును వారిపంక్తిని భోజనముసేయఁగూడదని శాసింపవలయు నని యిందుమూలముగ నెల్లరకుఁ బ్రకటనసేయడమైనది."

నరసింహము:__సభ పతి నేఁడీ సభం జేర్చును. వెట్టిఁడు డప్పుకొట్టి యూరంతటఁ జాటును.

వీరశర్మ:__ఎంత ఘోరశిక్ష! పారిపోయిన యపరాధిని యేల వెంటఁదరుముట? లాభమేమి?

నరసింహము:__లాభమా? లోకమున న్యాయము జరుగుటయే. అపరాధులను శిక్షించనిచో, నెల్లర మేలుకై యేర్పడిన మన చట్టములను ఆచారములను, మఱియెవరైన లక్ష్యపెట్టుదురా? [పటపట పండ్లు గొఱుకుచు] నేనే సద్బ్రాహ్మణుఁ డయినచో, నా యజ్ఞోపవీతముసాక్షిగా నీ విధవ కిహపరముల సద్గతి లేక చేసెద, చూడుము నాప్రభావము [నిష్క్రమించును.

విష్ణుశర్మ:__పార్వతికి నితనికి నెద్దియో కలహము సంభవించినది; యాతని పౌరోహిత్యము మాన్పి నన్నుఁ దన పురోహితునిగ నియమించె. సభలో నే నికారణము నొక్కి చెప్పి, యిందుచే నీక్రూరుని కామము యొక్క నింత క్రోధమని వాదించెద.

[వీరబాహు డప్పు వాయించుచుఁ బ్రవేశించును. వీరశర్మకు నమస్కారము సేయును.]

వీరబాహు:__ఈరోజు సాయంత్రం భీమేశంకోయిల్లో యీయూళ్ళోని బ్యామ్మలందరు అళ్ళ కులఁయిషయ మాలోశించఁడానికి సబ శాస్త్రరండోయి! మా రాశీ సూరయ్య పంతులుగోరు అద్దెచ్చులు. సభాపతి గారి చలవుకో అందరికి సెప్పడ మయిందండోయి! [నిష్క్రమించును.]

వీరశర్మ:__ఓహో అప్పుడే మనవాఁడు చిచ్చు ముట్టించినాఁడు! నా శక్తికొలఁది దీనికిఁ బ్రతిహతము చేసెద. శీఘ్రముగ నేమను యత్నించిన మేలు. శ్రీభీమేశుఁడునాకుఁ దోడ్పడుగాత. పాపులగు మనుజులు వారి యహంభావముకొలఁది న్యాయవిచారణ కెంతసమకట్టినను, చివరకు దుష్టుల శిక్షించఁ దగినవాఁడు సర్వసాక్షియగుఁ బరాత్పరుఁడేగాని వేఱెవరు?

క|| ఉర్విని దుష్టులు మది సతి
గర్వితులై పరులఁ దాము ఖండింతురుగా!
సర్వైకసాక్షియగు నా
సర్వేశుఁడె శిక్షలొసఁగఁజాలును సుమ్మీ||

# 'లోకము గ్రుడ్డిది'

కొవ్వాలి లక్ష్మీనరసింహారావుగారు

ఆమె వయసు పదునారేండ్లు. వివిధభాషల నభ్యసించిన వినయవతి. ఆమె రంగు చామనచాయ. తీర్చి దిద్దిన కనుముక్కు తీరు—దీర్ఘములైన కురులు—నునుపైన లేత చెక్కులు-ఆమె సౌందర్యాతిశయమును చాటుతుండేవి.

ఏమయిన నేమి? ఆమె విధవరాలు. సూర్యరశ్మిలేని కమలము భాతి యామె తనూలత నానాటికి వాడుమొగము పట్టినది. ఆమెకు జీవిత మొకవెగటుమందయినది. విద్యాశక్తి నానాటికి సన్నగిలజొచ్చినది.

హేమకు తలిదండ్రు లూరిలేనప్పుడు ప్రబలమైన జ్వరము వచ్చినది. మంచము దిగుటకు గూడ నామె యసమర్థురాలాయెను. అంతకు మున్నెన్నడును నామె పొరుగింటి శ్యామును కన్నెత్తియైన చూడలేదు. ఆ యువకుడు యోగ్యుడనిమాత్ర మామె వినియున్నది.

ఉదారుడగు శ్యాము హేమ కెల్లవిధముల నుపచర్యల గావించి యుత్తములగు వైద్యులచే సౌషధసేవనము జేయించెను.

హేమకు క్రమముగా వ్యాధి మళ్లినది. హేమజీవితములో నొక దివ్య జ్యోతి వెలుగుచున్న దిప్పుడు. శ్యాము దర్శనము- విద్యాప్రసంగములు- ఆమె హృదయమునకు సంపూర్ణస్వస్థతను చేకూర్చినవి.

హేమ తలిదండ్రులు గ్రామాంతరమునుండి వచ్చిరి. హేమా శ్యాముల వృత్తాంతమును వన్నెచిన్నెలతో వాడవాడల జెప్పుకొనుచుండుటను విని వారు భరించలేకపోయిరి. హేమతండ్రియగు శర్మ యీయప్రతిష్ఠకు తాళజాలకపోయెను.

ఆనాడు సంక్రాంతిపండుగ. మామూలుప్రకారము శ్యాము హేమను జూడవచ్చెను. శర్మ శ్యామును పండుగకు తమయింట పాయసమును ద్రావుమని నిర్బంధించెను. దానిని నిరాకరించిన, హేమ చిన్నబుచ్చుకొనునను తలంపుతో శ్యాము పాయసమును ద్రాగి యింటికి బోయెను.

'శ్యాము నెత్తురు కక్కుకొని మరణించెను.' అను దుర్వార్త ఆ క్షణమె యూరంతయు పాకినది. హేమకు హృదయము వ్రీలిపోయినది- ఇపు డామె యున్మాదిని. అప్పుడప్పుడు హేమను జూచు సద్ధర్ములగులోకులుకొంద రిపుడును 'హేమాశ్యాముల పవిత్రసోదర వాత్సల్యము నీ లోకము గుర్తింపలేకపోయినది- ఈ లోకము గ్రుడ్డిది' అనుచుందురు.

# 'సీతమ్మ గోస'

గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు, బి. ఏ.,

నరసింహారావు పంతులుగారు మంచి తెలివితేటలు గలవారు. బియ్యే. బియ్యెల్. పరీక్షలు పాసైనారు. గుమస్తా ఉద్యోగం నుంచి క్రమంగా మేజిస్ట్రేట్ - తాసీల్దార్ - డిప్టీ కలెక్టర్ - ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ - వగైరా ఉద్యోగాలన్నీ చేసి కొన్నాళ్లు జిల్లాకలెక్టర్ పనికూడా ఆక్టింగుచేసి కొసకు పింఛను పుచ్చుకున్నారు. ఆయన భార్యా సీతమ్మ గారు చాలా యోగ్యురాలు. ఆవిడ దైవ భక్తీ, పతిభక్తీ, బంధువులయందు ఆదర బుద్ధీ, పేదలయందు కనికరమూ, దానధర్మ ములయందు ఆసక్తీ, మొదలైన సుగుణసంపద కలిగిన ఒప్పులకుప్ప. మంచి సౌందర్యవంతు రాలు- పంతులుగారు కూడా మంచి న్యాయ బుద్ధి గలవారు- చాలా గౌరవమూ, ఘనతా, సంపాదించారు. కాని 'చంద్రుడికి కళంకం' అన్నట్లు, ఆయనకు ద్రవ్యాశా, ప్రథమ కోపం. ద్రవ్యాశఅంటే లంచాలు పంచాలు పుచ్చుకొనే రకమని అనుకోబోయేరు సుమండీ! అదికాదు. ఆయన యెప్పుడూ డైరెక్టుగాగాని ఇండైరెక్టుగాగాని లంచాలు పుచ్చుకోడం యెరగరు. ఆయన ద్రవ్యాశ అనేది కేవలమూ లోభత్వం- చూసి చూసి డబ్బు ఖర్చుపెట్టలేక పోవడం. డబ్బుకీ, ప్రాణానికీ లంకెఅంటారే ఆగుణం అని చెప్ప వలసివుంటుంది. ప్రథమకోపం అనేది, పితృ క్రమాగతంగా వస్తున్నటువంటిన్నీ, అస్త మానమూ కూర్చొనివుండడంవల్ల వృద్ధి అయ్యేటటువంటిన్నీ మూలవ్యాధి ఉండడం వల్ల తాటాకులమంటలాగ ఒకొక్కప్పుడు ఆయన మండిపడిపోయి, భార్యను నానా మాటలాడి తిట్టి, కొట్టడం గూడా జరిగిస్తూ ఉండేవాడు. కాలంగడుస్తూవున్నకొద్దీ ఆయన కోపంకూడా పెచ్చుపెరుగుతూ వచ్చింది. ఆ మహాపతివ్రత ఆయనచేత దెబ్బలుతిని, పాపం, ఏడ్చుకుంటూ గదిలోకి పోయి తలుపు వేసుకొనేది. నేరంఉన్నా లేకపోయినా, ప్రతి స్వల్పవిషయానికీ ఆయన పాపం ఆ మహాయిల్లాలిమీద పడిపోయి, కొట్టి, తిట్టి, నానాఅల్లరీ పెడుతూ ఉండే వాడు. మనమల్ని ఎత్తినప్పటికీ ఆవిడకు యీబాధ ఎక్కువగుతున్నది కాని తగ్గలేదు. ఇలాగ బాధపడుతూ ఉన్నప్పటికీ ఆవిడ తన కర్మం ఇలాగున్నదని అనుకొనేది కాని భర్త గారిని ఎప్పుడూ పల్లెత్తుమాట అనలేదు. కోపం వచ్చినప్పుడు ఇలాగ మండిపడినప్ప టికీ, తరవాత ఆయన పశ్చాత్తాపపడి 'కోపం మీద ఒళ్ళు ఎరగక అన్నాను. కొట్టేను. మరేమీ అనుకోబోకు' అని ఎన్నో క్షమా పణలు చెప్పుతూవుండేవాడు.

ఒకనాడు ఇంట్లో శుభకార్యం జరిగింది. నలుగురు చుట్టాలూ- బంధువులూ- అంతా వచ్చారు. ఊళ్లో ముత్తైదువులు అంతా చాలామంది, పసుపూ- కుంకానికి వచ్చారు. అటువంటి సమయంలో ఆయనకు రింగుమని కోపం పేడత్తింది. ఆమెను పట్టుకొని ఆయన అనేక తిట్లుతిట్టి, అనరాని మాటలని, దవ

డలు వాచిపోయేటట్టు ఎడాపెడా లెంపకాయలు వర్షంకురిపించాడు. ఆదెబ్బలకు పాపం ఆ యిల్లాలు మూర్ఛపడిపోయింది. వచ్చిన చుట్టాలు, పక్కాలు, ముత్తైదువలు- అంతా నిర్ఘాంతపడ్డారు. కొందరు బుద్ధిమంతులు చటుక్కున చన్నీళ్ళు తెచ్చి ముఖంమీదచల్లి విసినికఱ్ఱలతో విసిరి, శైత్యోపచారాలు చేసి పాట్లుపడగా కొనకు ఆమెకు తెలివి వచ్చింది. కంటికీ నేలకూ ఒక్కధారగా యేడుస్తూ, చాలా చిన్నబోయి, పాపం, భరింపరాని దుఃఖంతో గదిలోకి వెళ్లిపోయింది. పంతులుగారు పక్కచీడీలో పచారు చేస్తూ, తాను చేసినదానికి పశ్చాత్తాప పడుతూ 'ఎంతకాలం యిలాగ నేను, కోప శీలుడనై, నిష్కారణంగా నా యిల్లాల్ని బాధపెడుతూవుండడం? ఈ దుర్మార్గం మొదలంట నశించిపోవాలె. ఏసాధనం అవలంబించాలె?' అని తనలో తాను గాఢంగా ఆలోచించుకోవడం ఆరంభించాడు. వెంకట్రావుగారు నరసింహారావు పంతులుగారికి సంబంధి. ఆయనతో చనువుగా మాటలాడగలవాడు, ఈ సంగతి గట్టిగా కనుక్కుందామనే సంకల్పంతో అతడు పంతులుగారి దగ్గిరకువచ్చి సంభాషణ ఆరంభించాడు.

వెం:—"ఏమండోయి పంతులుగారూ! ఏఁవిటీ! పేరు సార్థకం చేసుకుంటున్నారే. మీ రిలాంటివారు కాబోతారని ముందు పసిగట్టి తాతగారు మీకీపేరు పెట్టినట్టుంది. ఇదేఁవిటండీ! దురంతం- దొడ్డమ్మగారు మనమల మామ్మ- భూలోకమాత- ఆవిడ యింకా మీచేత దెబ్బలుతినడం యేమిటండీ? ఇది మీకు యేమీ బాగులేదు సుమండీ! కోపంవస్తే నన్నుకూడా రెండుకొట్టండి- తింటాను. అనేమాట లేవో మొహంయెదుట అనేస్తాను—"అని యింకను యేమో చెప్ప బోతూవుంటే అడ్డమువచ్చి-చెయ్యిపట్టుకొని, ఆగమని సంజ్ఞచేసి

"బాబూ! వెంకట్రావూ! అసలు నాలో నేనే లజ్జపడి ఏడుస్తూవుంటే నువ్వు ఇంకా నన్ను పొడిచి కాలుస్తావెందుకూ? నేను చేసింది చాలా తప్పుపని; నాకు తెలుసును. ఐనా, పాలపొంగులాగ ఆ కోపంవచ్చేసరికి నాకు వొళ్లూవయీ తెలియదు. సున్నపురాళ్లలాగ ఆవివచ్చి రక్తంఉడికి వెఱ్ఱెత్తిపోతున్నాను. 'ఏసాధనంచేత యీ క్రోధ పిశాచాన్ని సాధిద్దాఁవా' అని యత్నిస్తున్నాను. నమ్ము-నేను మేజస్ట్రేట్ పని చేస్తూన్నప్పుడు అనేక నేరాల కనేకమందిని విచారణచేసి శిక్షలువేశాను. ఐనా, యింతవఱకూ నన్ను నేనే శిక్షించుకుంటేనేగాని యీసంకటం కుదరదు. కనుక ఇవాళనుంచి నేను కోపం చేత పాపం చేసినప్పుడల్లా, నన్ను నేనే విచారణ చేసుకొని, భగవత్సాక్షిగా నాకు నేనే తగిన శిక్ష విధించుకుంటాను." అనెను.

వెం:—ఏఁవిటా శిక్ష? గుంజీలుతీస్తారా? లెంపకాయలు కొట్టుకుంటారా? లేకపోతే మీయిల్లాలుగారిచేత పేపబెత్తం దెబ్బలు తింటారా? ఏఁవిటి మీతాత్పర్యం?

నర:—అబ్బే గుంజీలు లెంపకాయలు ఆడదానిచేత దెబ్బలూ తింటే కుదిరేరోగం కాదిది. ఏది చేస్తే ఎవడికి ఎక్కువబాధ కలుగుతుందో ఆశిక్షవే స్తేనే వాడికి నసాళం

అంటె రోగం చప్పగాకుదిరి బుద్ధివస్తుంది. మరేం చేసినా ప్రయోజనంవుండదు. నా **Weakness** ఏఁవిటంటే నేను చూసిచూసి డబ్బు ఖర్చుపెట్టలేను. కనుక నేను చేసే నేరాన్నిపట్టి నాకు నేనే జుల్మానా వేసుకుంటాను.

వెం:—ఆజుల్మానా సొమ్ము మాకెవరికైనా యిప్పించండి. సంతోషిస్తాం.

నర:—మనుష్య మాత్రులకు ఎవరికీ యివ్వను. అగ్నిహోత్రుడికి సమర్పిస్తాను.

ఏం:—అంటే రూపాయిలు కరిగించేస్తారా?

నర:—కాదు కాదు కరెన్సీనోట్లు కాల్చేస్తాను.

వెం:—అబ్బే అలావద్దు; మీ యిల్లాలికి యివ్వండి. పాపం.

నర:—అలాగా యివ్వను. ఆయివ్వడం వల్ల నేను వేసుకొనేశిక్షకు ప్రయోజనం వుండదు.

వెం:—పోనీండి ధర్మఖర్చు చెయ్యండి.

నర:—చేసినా ప్రయోజనముండదు. నా కష్టార్జితం నాకళ్లయెదుట నాచేతులతోటి నేను కాల్చుకుంటేనేగాని నాదురాగ్రహమున్నూ అందువల్ల జరుగుతూవున్న పాపములున్నూ పరిహారంకావు. "కోపము పాపములకెల్ల కుదురై యుండున్"అని పెద్దలు చెప్పారు. అదేమాట. ఈరోజు నేరానికి నేను నూరు రూపాయిలు జుల్మానా వేసుకున్నాను. కీలెరిగి వాతపెట్టుకోవాలి. ఈ అంకుశపుపోటు తగిలితేనే కాని నాలోభత్వం అనే మదపుటేనుగు లొంగుబాటుకురాదు." అని లేచి ఇనపపెట్టితాళముతీసి నూరురూపాయల నోటుతీసి పట్టుకొని పెట్టితాళమువేసి వెంకట్రావు యెదుటనే వణుకుతున్న చేతులతో అగ్గిపుల్ల వెలిగించి నోటుకు నిప్పుముట్టించి, కళ్ళనీరు కార్చుకుంటూ నోటు కాల్చి బూడిదచేసేశాడు. ఎంతకష్టపడి ఆర్జించిన సొమ్ము! ఆనోటుమంటలే లోభికి కడుపుమండినంత ఆవేదన కలిగించింది. అతడు పడుతున్న యాతనా, శోకవికార రూపమూ చూడలేక "కలకంఠికంట కన్నీరొలికిన సిరి యింట నుండనొల్లదు సుమతీ" అనుకొనుచు వెంకట్రావు మతిలేని పంతులుగారి సెలవు తీసుకొని వెళ్లెను.

నరసింహారావు పంతులుగారి మనస్సెంతో దుఃఖించింది. నాటినుండి అతనికోపం మందం కావడం ఆరంభించింది. స్వేచ్ఛగా గంతులు వేస్తూవుండే అతని దురాగ్రహమనే గుఱ్ఱానికి నోట్లో కళ్లెము తగిలించినట్లు నిర్బంధం కలిగింది. అయినా అలవాటుచొప్పున దూకి కోపం కలిగినప్పుడు అతను ఒక్కడేగదిలోకి పోయి తనమీద తానే నేరం ఆరోపించుకొని తానే విచారణచేసుకొని తానేశిక్షించుకొని జుల్మానా వేసుకొని పాలిపోయిన ముఖంతోనూ, వణుకుతున్న చేతుల్తోనూ తన ప్రాణంకంటె ప్రియతరమైన ధనంపెట్టె తెరిచి నూరురూపాయిల నోటుతీసి,ఏడుస్తూ నిప్పుముట్టించి "నీఖర్మం అనుభవించక తప్పదు" అని నిట్టూర్పులతో కాల్చి దుఃఖం అనుభవిస్తూ ఉండేవాడు.

ఇలాగు నాలుగైదుసార్లు అయేసరికి అతనికి మరికోపం అన్నది కలగలేదు. సీతమ్మగారిమీద మరి అతనికి కోపం రానేలేదు.

ప్రథమకోపి నరసింహారావు పంతులుగారి నేరాలకు లోభి నరసింహారావుగారికి ప్రాణపద మైన ధనం దగ్ధంఅవుతూ రాగారాగా,తుదకు ఆయన దురాగ్రహాలోభత్వాలు రెండూ, మొదలంటా నశించిపోయినవి.

సీతమ్మ గోస సామాన్యమైనదికాదు. శ్రీరాములవారి సీతమ్మగోస దేవాంతకుడైన రావణాసురుని దుంపతెంపింది. ఈ సీతమ్మ గోసతో సమూలంగా పంతులుగారి క్రోధ లోభాలనే రాక్షసులు నిర్మూలం అయి పోయారు.

కం:—"దానము భోగము నాశము పూని కతో మూడుగతులు భువిధనమునకున్ దానము భోగమునెరుగని హీనుని ధనమునకు గతి తృతీయమె పొసగున్" అనే భర్తృహరి వాక్యాని కప్పుడు పంతులుగారికి అర్థంబోధ పడింది. దురాగ్రహ లోభత్వాలను విస ర్జించి పంతులుగారు లోకోత్తర చరిత్రమైన భార్యామణితో భగవద్ధ్యానపరాయణు డున్ను, ధర్మకార్యాసక్తుడున్ను అయి యోగ్య మైన జీవనము చేస్తూవుండెను. ఈవిధంగా పాపం ఆయిల్లాలిబాధలు తప్పినవి.

---

# ప్రేమదేవి

పోలుకొండ భద్రయ్యగారు

చండభానునికిరణాల చాలనొగిలి
వేడిగాడ్పులనేనెంతొ వేగివేగి
నడచినడచి చేరితినొక్కనాడు, విజన
ఘోరకాననమందలి సరసిచెంత.
శీతవాతాంకురములు సుశ్రీలజిమ్మ
పికమధురగానములు స్నిగ్ధవిటపిఛాయ,
లన్నియునునన్నుగన్నన నలరజేసె;
ఆప్రకృతిదేవినిద్దపు టంకసీమ
గాఢతరసుషుప్తినిబడి కలగిపోతి;
సాంద్రతరనీలమేఘాలచాటునుండు
తరళమౌ తటిల్లతబలె, తన్వియోర్తు
నాదుమున్ముందువ్రాలె సమ్మోదమలర
భయవిషాదలజ్జా ఘనభరముతోడ
నాదుహస్తాబ్జములు మోడ్చి నయముమీర
అతివ! ఎవ్వరిదానవీ వని పలికితి.
దివ్యవాక్సుధాలహరి నాదేవిపలికె

"తల్లినై నీకుప్రేమార్ద్ర దాయినైతి;
చెల్లెలిగనుండి నీప్రేమ కొల్లగొంటి;
ప్రీతిసుతనయి నీప్రేమ ప్రిదులుకొంటి;
నిజముప్రేయసిరూపనై నీదుజీవ
నపువిపంచిక మ్రోయించినానుగాదె;
శూన్యప్రాణపంచకా శావితానమందు
దెల్లమనుజులగాపాడ నెల్లయెడల
ప్రేమభిక్షలనిచ్చుచు బ్రీతితోడ
నిన్నిరూపాలవిహరింతు నిచ్చమెయిని
ఏనుప్రేమాధిదేవత ననబరగుదు"
అనుచు, నేమేమొ పలుకుచునామెచనియె
ఈసుఖమయప్రపంచాన నెవరులేక
మోహునై, శిలనై శాంతి పోడిమిచెడి
విసిగి నేనిక యాదేవి విమలచరణ
చింతనాభాగ్యమున నెంతొసంతసిల్లితి.

# రూపాయ్!!

పసుమర్తి కృష్ణమూర్తిగారు

చం॥ జనులకుఁ గూర్చుదానఁ గను సాహసకార్యము లాచరించుదా
నను. నను రూకరూకయను నామముతో సకలార్థసిద్ధికై
యనయముఁ గండ్ల నద్దుకొని యాంతరభక్తిని బూజసేయుటల్
గనఁగొనుచుందు నిత్యము. సుఖంబన లోకమునందు నేను పె
ట్టినదికదా సుభిక్ష! మెవఁడే నన్గఁజేదక యుండునోటు! జీ
వనము నిరర్థకంబుఁ గడుభారము వానికి; వెండియుం దృణం
బునకయినన్ సమానుఁ డనఁబోలదు వాని! వృథాభిమానులై
పనిచెడి దూరుచుందురు సభాభవనంబుల నన్నుమూఢులై !!
ఘనులమటంచు నెంచుకొని కాదె!! యిసీ!! యల 'నక్కద్రాక్షపం'
డ్లను కత దా రెరుఁగరొకో! లజ్జకుఁజేటు! కవీంద్రులార, మీ
యనుపమధీవిశేషకవితాతిశయంబులు గవ్వసేయునే
నను నిరసింప?! నేనెరుఁగనా—కడులుబ్ధుని దానకర్ణుడం
చును, గుణహీను సర్వగుణశోభితుడంచును, నీచజన్ముఁబా
వనుఁడని, మూర్ఖచిత్తుని సభాపతియంచుఁ, బరాంగనాభిలా
షిని రసికుండటంచు, మధుసేవకు భోగసహస్రనేత్రుఁడం
చును, బరమార్థశూన్యుని విశుద్ధమనస్కుఁడటంచు, సత్యహీ
నునిఁ గడుఁశాక్యుఁడంచు, మదనుండని యా'హనుమంతు', మీరెగా
వినుతులుసేయుచుందురు వివేకములేః: మదర్థమేకదా
గొనకొని మెట్టి నీచమునకున్ వెనుదీయరు బోద్ధలార, మీ
మనముల మీరదొంగిలి యమానుషకార్యము లేలచేయ? నీ
పని విడనాడుఁ డింతట శుభంబగు మీకు ధరాతలంబునన్॥

# సంస్కరణ వివాహములు

శ్రీమతి వెలివండ చూడీకుడుత్తమ్మగారు

సీతారామశాస్త్రి పేరుపడ్డ ఎలెక్ట్రికల్ ఇంజనీయరు. సంస్కారి. అతనిని ఎవరైనా అకస్మాత్తుగ చూచిమాడగానే గొప్ప మేధావంతుడనియు, ఉదారమైన ఉన్నతవంశీకుడనియు భావించక తప్పకమానదు. ఆయన భార్య రామలక్ష్మమ్మయు భర్తకుతగిన భార్యయని అనిపించుకొనుటకు ఏమాత్రము తీసిపోదు. విద్యావిషయములోనేమి, యుక్తాయుక్త విచక్షణలందేమి, నైతికకట్టుబాటుల దృఢత్వమునందేమి, ఆమెబుద్ధి పదునుపెట్టినకత్తి. అంత ఐశ్వర్యవంతులైనను ఎప్పుడునూ ఏదో ఒక సత్కార్మయందే మనస్సును లగ్నపరుచుకుంటూ తనకన్న తక్కువవాని, పేదవాని, తల్లివలె చూచుటకు ఎల్లప్పుడూ, ప్రయత్నించుచుండును. రాజమహేంద్రవరమునందు ఈ దంపతులను చూచి పూజ్యభావముతో సంతోషించనివారులేరు. కారణము, వీరి పవిత్రప్రవర్తనమే. వీరి మూలమున లోకమునకు ఒక పవిత్రసందేశమును తెలియబరచుటకేమో అన, భగవంతుడు సుమార్తెలనే ఇద్దరిని ఇచ్చినాడు. కాని చూచినవారందరూ 'అయ్యో వంశానికి ఒక మగచిన్నవాడు లేక పోయెనా'అని విచారించేవారు. ప్రాప్తలాభ సంతుష్టి పరులగు వీరుమాత్రము కలలోగూడ అట్టి కించను పెట్టుకున్నట్టు కనబడదు.

ఆదివారము మధ్యాహ్నము భోజనములైన తరువాత ప్రసంగవశాత్తు రామలక్ష్మమ్మ భర్తనుచూచి, 'మన సరళమ్మనుగూర్చి నేచెప్పినది ఏ మాలోచించినారు? స్కూలుఫైనలుపరీక్ష ప్యానుచేసినది. మీ మేనల్లుడు మీకు తగినఅల్లు డనిపించుకొనుటకు అన్ని విధములా తగియున్నాడు. అమ్మాయికి కూడా అతన్నిగూర్చి మంచి అభిప్రాయమున్నది. వాళ్ళ తండ్రి తాతలు చాలా మంచివారు. అతను 25 ఏండ్లు పూర్తిగా నిండకమునుపే యం. యస్‌సి. ప్యాను చేసి, కాలేజీకర్తల్లకి గౌరవము తెచ్చినవాడనియూ, బుద్ధిమంతుడు తెలివైనవాడనియు గొప్పపేరు ప్రతిష్ఠలను సంపాదించినాడు. మీ మేనల్లునిగూర్చి మీకు మాత్రము తెలియదా ఏమి!' యనెను.

శాస్త్రి:—ఏమంత తొందర. అమ్మాయి బి. ఏ. మట్టుకైనా ప్యానుచేసిన తరువాత ఆలోచించవచ్చును. అదిగాక, అమ్మాయిని ఏమైనా కదిపావా? లేక నీవే అల్లివేయుచున్నావా పన్నమంతాను.

రామలక్ష్మి:-మీ రలా అంటారని నాకు మొదటే తెలునును. ప్రస్తుతకాలాన్ని పుచ్చుకుని మీ రలా ఉపేక్షవహిస్తారు. కాని నూతనానురాగవల్లికలు అంకురించే తరుణానికి ఒక అవలంబనమును నిర్ధారణ ఏర్పడిననే తప్ప, ఆవల్లికలు చెల్లాచెదరై మొరడుతేరి వాటి సౌందర్యమును పోగొట్టుకొనుట సహజము. కేవలము పరమయోగినులుగా ఉన్నవాళ్ళ విషయములో తప్ప, మొత్తముమీద నూటికి 99 పాళ్ళు ఈ రకములో చేరక తప్పని బాపతులే.

శాస్త్రి:—ఏమిటో అర్ధరుగా మాటాడుచూ, తప్పదని అంటున్నావే. ఎంతమంది కన్యకలు ఇచ్చవచ్చినన్నాళ్లు అవివాహితలుగా ఉండి స్వేచ్ఛను అనుభవించటంలేదు.

రామలక్ష్మి:—నే ననటంలో అర్ధరుగా ఏం కనబడిందో నాకు బోధపడటంలేదు. సముద్రమునకు తరంగాలు ఉండుననడంలోను, అగ్నిహోత్రుడు వేడిగాఉండు ననడంలోను ఎంత అస్వాభావికమో నేను తప్పదనటంలోకూడా అంత అస్వాభావికమే! సరేగాని ఇప్పు డెందు కంత అనవసరప్రసంగము నాకు. పిల్లకు యుక్తవయస్సువచ్చిన తరువాత వివాహము చేస్తేమాత్రము వచ్చిన నష్ట మేమిటో నాకు తెలియకుండాఉన్నది. ఎరిగున్న సంబంధము, తగినసంబంధము అయినప్పుడు వివాహము చేస్తే

మాత్రము విద్యకు భంగం కావలసిన అవసరమేమిటి? విద్య మహాసముద్రము. అవకాశ మున్నంతవరకు జ్ఞానార్జనకు ప్రయత్నించవలసినదే. చిన్నమ్మాయి మాట తరువాత ఆలోచిద్దురు గాని:ఇప్పటికి దీనికైనా నాకోరికప్రకారం చేయండి. పిల్ల లోపల భాగవతము చదువుచున్నది. ఒకసారి పిలుస్తాను. అని కుమార్తె నుద్దేశించి 'అమ్మా సరళా' అని ఒక కేక వేసెను. సరళ నిజముగ సరళస్వభావయే. ఆముద్దులు మూటగట్టు నూతనయౌవనాంకురితమందగమనముతో లోపల చదువుకొనుచున్న సరళ, తల్లికేకవినగానే వచ్చి విమర్శనాదృష్టితో తల్లిదండ్రుల నొకసారి చూచి "అమ్మా ఎందుకు పిలిచితివి?" అని ప్రశ్నించెను.

రామః—అమ్మా మరేమీ తొందరలేదు. నీ వివాహవిషయమై నీతో కొంచము యోచించవలెనని మీ నాన్నగారు పిలిపించమనగా పిలిచాను. మీ బావ శంకరశాస్త్రినిగూర్చి నీకు సదభిప్రాయమే యుండునని అనుకుంటాను.

సరళ:—అమ్మా ఇప్పు డప్పుడే అంత యోచించవలసిన అవసరమేమిటి. నాకింకా 16 సంవత్సరము లైనా గడవలేదుగదా.

రామ:—తల్లీ నీకు అనుభవముచాలదు. అయినప్పటికిని యుక్తవయస్కురాలవగు నీమనస్సు కనుక్కొని నీఉద్దేశానుసారముగా మేము చేయవలసిన కార్యమేగాని ఇంకొకవిధంగా ఎప్పుడూ జరగదు. వివాహమనునది ఒక పవిత్రమైన శాశ్వతసంబంధముకొరకు ఏర్పడిన పవిత్రకర్మగాని ఇంకొకటి, ఇంకొకటి గాదు. అటువంటప్పుడు నిదానముగా యోచించి మరీ తీర్మానించుకొనవలెను గాని రోడ్లమీద కనబడినంత మాత్రమున కేవలము మోహమునకు దాసులై పశుస్వభావమునకే ప్రాముఖ్యతనొసగి విలువైన జీవితమును వ్యర్థపరచుకొనువారు పరమదురదృష్టవంతులు. నీ కుటుంబముయొక్క విలువను గ్రహించి నీ మేనత్తగారి కుటుంబగౌరవమును యోచించి విద్యావంతుడును, సుగుణసంపన్నుడునూ అగు మీ బావను చేసుకొనుట కంగీకరింపుము.

శాస్త్రి:—నీవు వట్టి పిచ్చిదానవు సుమా. ముసలమ్మలాగ వంశమునకు ఏమో మహా ప్రాముఖ్యమిచ్చి మాటాడుచున్నావు. వరుని ప్రాముఖ్యతా, వంశము ప్రాముఖ్యతా మనకు ఎక్కువ కావలసినది.

రామలక్ష్మి:—ఈ విషయములో మీరు బాగా యోచించలేదనియే నా అభిప్రాయము. లేకపోతే ప్రపంచకజ్ఞానసంపన్నులును, చారిత్రవేత్తలును అగు మీరు గుర్తించకపోవటం ఆశ్చర్యముకదా. చివరకు ఫలవృక్షములలో సహితము సాంకర్యముచే ఫలించిన ఫలమునకు అసలైన జాతిఫలమునకు తారతమ్యముండునని అందరికి తెలిసినదే. వంశములకు ప్రాముఖ్యతయిచ్చుట ఏదో రూపముగా ప్రతిఖండములోనూ ఇప్పటికినీ వారిలోఉన్నట్లు మనకందరకూ విదితమే. అంతమాత్రముచేత ద్వేషభావము పురికొల్పవలెనని దాని ఉద్దేశమా!? మంచివంశములో పుట్టినవాడని దుర్మార్గుడైనా చేసుకోవచ్చునని నా అభిప్రాయముకాదు. వరునివిషయములో మన మెంత ప్రాముఖ్యత యిచ్చెదమో, వంశవిషయములోనూ, సాధ్యమైనంతవరకూ అంత ప్రాముఖ్యత యీయవలసినదే. సత్సంతానముబడసి జీవితానందమును పొందవలెనంటే, తప్పకుండా ఆనుపూర్వికమైన వంశమర్యాదలను గూడ గుర్తించవలసినదే. తల్లిదండ్రుల పోలిక, లేక మేనత్తలు మేనమామలు పినతండ్రులు మొదలగువారి పోలిక, పిల్లలకు కలగటం వంశములో ఎవరికో ఉన్న కొన్ని దుర్వ్యాధులు తల్లిదండ్రులకు లేకపోయినను పిల్లలకు కలగటం మనం చూచుచునేయున్నాము. పూర్వపురుషులకు వ్యక్తిగౌరవం చూపించటం విధాయకమేగాని సత్సంతానమాత్రమునకు బద్ధమైన వివాహసంబంధము మాత్రము పొత్తుమీద ఆచరించతగ్గది కాదు. వంశగౌరవము, వరునిప్రాముఖ్యము రెండునుకలిసిన సంబంధం ఉన్నప్పుడు ఇంక కావలసినదేది...

సరళ:—అమ్మా! ఆంగ్లేయ భాషావైదుష్యమును పొందిననీవే ఇటువంటి మాటలాడటం వింతగాఉన్నది.

రామ:—ఇప్పు డందరికీ ఉన్న దుకభిప్రాయమే అది. జ్ఞానసంపాదనకొరకు నూతన విజ్ఞానముకొరకు ఇతరభాషలను నేర్చుకొనినంతమాత్రమున మనలో ఉన్న సద్విషయములను గర్హించవలసినదని ఎక్కడైనా ఉన్నదా ఏమి. ఎక్కడికైనా భోజనమునకు వెళ్లామనిన, మనకు హితవగు వస్తువులనే తిందుము. వారికి మనకు ఆపూటతో సరిగాని శాశ్వతముగా అంటుకోవలసిన దేదియూఉండదు కాలవైపరీత్యము కొద్ది, నిజస్థితిని గమనించలేనంత దుస్థితికివచ్చితిమి. కాలక్రమేణ నిజము బయటపడకమానదు.

శాస్త్రి:—తల్లీ: విన్నావుకదా మీఅమ్మమాటలు. నీవునూ బాగా ఆలోచించి నీఉద్దేశమును స్పష్టముగా చెప్పుము.

సరళ:—నాన్నగారూ! నన్ను కని పెంచి పెద్దదానిగాచేసి విద్యాబుద్ధులు గరపి, నాక్షేమమే, మీక్షేమముగా రాత్రింబవళ్లు యోచించుచుండిన అనుభవజ్ఞులగు మీకు ప్రపంచానుభవమునను ఎంతయో దూరమందున్న నేనా చెప్పుట? తల్లి తండ్రులు మూర్ఖులైనప్పుడు, వారిసంగతే వారు నిర్ణయించుకొనుటకు అసమర్థులుగాన బిడ్డనుగూర్చి మాత్రము వారు తగిన నిర్ణయమునకు వచ్చుట అసంభవము. విజ్ఞులైన మీరు నన్నుగూర్చి నా భవిష్య జీవనముగూర్చి యోచించునంత, నన్నుగూర్చి నేను యోచించలేనని నాకు గట్టినమ్మకము. అని కొంచెము మనుసిగ్గుదొంతరలు మొగమునకు ఒకవిధమైన వన్నె దోప తల్లిదండ్రులకు నమస్కరించి వెళ్లిపోయెను.

౨

'కేశవా మీఅమ్మను ఇలా గొక్కసారి రమ్మను' అని తన మూడేండ్ల ముద్దుకుమారునితో తండ్రి శంకర శాస్త్రి చెప్పగానే గునగున పరుగులెత్తుకుంటూ తల్లి వద్దకువచ్చి, తన వచ్చీరాని అస్పష్టపుమాటలతో ఆ ఖబురును ఏలాగో అందజేసితే, నేమో గొప్పకార్యమును నిర్వహించినట్టు దిగ్విజయసూచకమైన ఒక గర్వపుచూపు చూచి చంకకెగబ్రాకెను. తల్లి సరళయు మాతృవాత్సల్య ముప్పొంగ బిడ్డను చంకవైచుకుని ముద్దులు కురిపించుకొనుచునే, భర్తవద్దకువచ్చి ఆయన చదువుకొనుచున్న హిందూపేపరును వెనకాలే తానూ చూచుటకు ప్రారంభించింది. ఆయన ఛప్పున పేపరు మూసేసి ఒకచిత్రమును ముట్టుకు కన బరచుచూ, "సరళా వీ రెవరో నీవు తెలిసికొగలవా? చూడు."

సరళ నిదానముగా చూచి ఇది మాచెల్లెలు కమలం. ఈయనెవరో నాకు తెలియదుగాని ఈపేరుకు తగిలించియున్న డిగ్రీలనుబట్టి, డాక్టరుగారని స్పష్ట మౌతున్నది.

శంకరశాస్త్రి చిన్నవవ్వు నవ్వుతూ 'సరళా, నీవు కేవలము దురదృష్టవంతురాలవు సుమా. నీ చెల్లెలు చూడు ఎంతచక్కగా బి య్యేల్ పట్టపరీక్షలో డిగ్రీ పట్టాముపొందిందో. మొన్నమొన్ననే బంతులాట పోటీపరీక్షలో కప్పు గెల్చుకుంది. ఇప్పుడొక డాక్టరు'జోసఫును'సివిలుమారేజీ అక్టుక్రింద వివాహమైంది. ఒకరు లాయరు. ఒకరు డాక్టరు. ఏదీ నీకా అదృష్టము పట్టినదా? ఏదో నాబోటి అనామధేయుణ్ణి చేసుకొని ఇంతదూరానికి రావలసివచ్చింది. నమ్మకములేకపోతే చూసుకో ఈ పేపరును' అని చేతికిచ్చెను. పాపము సరళమాత్రము దిగ్భ్రమను పొందిన మనస్సును సందరించుకుంటూ, బిడ్డను అక్కడున్న ఆయాచేతికిచ్చి, మరేమియు బదులు పలుకలేక, మ్రాన్పడి ఆకాగితము ఆమూలాగ్రము చదివి ఒక వేడినిట్టూర్పు వదలెను.

శాస్త్రి:—ఏమలాగు మిన్నువిరిగిమీదపడినంత విచారిస్తున్నావు? ఇప్పుడెన్ని అల్లాగు జరుగుచున్నాయి కావు! వాళ్ళు మాత్రము కలిసిఉన్నంత కాలము భార్యాభర్తలనిపించుకొని ఆస్తిపాస్తు లనుభవించుట లేదా? ఇందులోఉన్న ప్రత్యేక సదుపాయం ఒకటి నూతననూతనచవులు రుచిచూడవచ్చును. అని ఒక వినురుమాటాడి ఎరుగనట్లు ఊరుకుండెను.

"మాఅమ్మ అనుకొన్నంతా అయినది. మొత్తము మీద యౌవనోద్రేకమునకే ఎక్కువ ప్రాముఖ్య మిచ్చినప్పుడు, కలిగేఫలితము ఆవిధముగా ఉండక తప్పదని మాఅమ్మ మొదటనే మానాన్నగారితో వాదించినది. మాతో తిరుగుచూ చిన్నప్పట్నించి అత్యంతమిత్రులుగాఉన్న మీపింతండ్రి కుమారుడు నారాయణకిమ్మని మాఅమ్మ ఎన్నివిధాలో అన్నది. తగినఇంటి అబ్బాయి, లక్షాధికారి, రూపసి, విద్యాధికుడు. మొన్నమొన్ననే ఖండాంతరములకు వెళ్ళి పరిశ్రమ విద్యలన్నీ ప్యాసుచేసి స్వయముగా ఒక పరిశ్రమాలయాన్ని స్థాపించి దక్షతతో నిర్వహిస్తున్నాట్టగదా! ఇంతకూ విధివిధానాన్ని తప్పించువా రెవ్వరు."

"నన్నింకా పెళ్ళికి పిలుస్తారని అత్తారింటికి వెళ్ళి అల్లరికం కొన్నాళ్ళు చెలాయిద్దామని గంపంత ఆశతో ఉంటే నాఆశలన్నీ ఒక్కసారి పోగొట్టిందని నాఘోషనాది. అయిందేమో అయింది. వాళ్లేమో చిలకాగోరింకల్లాగ ఈపాటికి సౌఖ్యపరంపరలో మునుగుతూ ఉంటారు. ఎందుకొచ్చిన ఆలోచన. ½ గంట దాటిపోతున్నది. 11 గంటలకు నా డిపార్టుమెంటును చూపించటానికి కొంతమంది పెద్దలను వెంటపెట్టుకొని మాలవ్యాపండితుడు వస్తాడట; నేను కొంచము త్వరగా వెళ్ళాలి."

"అన్నీ సిద్ధంగా నేయున్నవి. మీరు భోజనానికి వెళ్ళవచ్చును." అనిచెప్పి లేచి ఆయన బట్టలు వగయిరాలను సిద్ధపరచుటకు మేడమీదకుపోయెను.

* * *

నాడు సంక్రాంతిపండుగ సీతరామశాస్త్రిగారి గృహము భూలోకవైకుంఠమువలె, చూడ ముచ్చటగా ఉండెను. రామలక్ష్మమ్మ ఊపిరి విడుచుటకైనా తీరుబడిలేక వ్యవహరించుచున్నను, మొగమునందు మాత్రము హృదయాంతర్గత మైనకించ ఒకటున్నదని చూచరకు కనిపించకమానదు. ఆరోజు స్వయముగా ఆమెయే వచ్చినవారందరకు వర్ణవివక్షత లేకుండా భూరి అన్నప్రదానము చేయుచూ, వికలాంగులకు వస్త్రదానము గూడా జేయుచూ, సాక్షాత్తు కలియుగఅన్నపూర్ణాదేవివలె కానవచ్చుచుండెను.

ప్రపంచాన్ని, అందులో ముఖ్యముగా మన దౌర్భాగ్యభారత వర్షాన్ని, ఎదుర్కొన్న క్లిష్టపరిస్థితి ఈదారిద్ర్యమహాభూతమే గదా. ఆరోజంతయు ఆమె సత్కారములోనే లీనమై యున్నది. రాత్రి9-30గంటలైనది. సీతారామశాస్త్రి, కూతురు అల్లుడు మనమలూ అందరూ చుట్టూకూర్చునియుండ, తాంబూలము వేసుకుంటూ, పిల్లలచేత ఏవో చిన్నచిన్న మాటలను మాటాడించి సంతోషించుకూతురు సరళనుచూచి "అమ్మా! మీ అమ్మకు మనందరితో కలిసి కూర్చుటకు ఇంకా తీరుబడికాలేదు కాబోలు. పెద్దదాతున్నకొద్దీ చాదస్తము ముదురుచున్నది సుమా." అని అనేసరికి, ఆమాటలను లోపలనుండి రామలక్ష్మమ్మ, చేతులను తువాలుతో తుడుచుకుంటూ విని "ఇదిగో నేనూ వస్తూనేయున్నాను. మీరు చాదస్తమని అన్నారే. అది నాకంటె మీకూ ఎక్కువగా ఉండవలసినదే నా. అని అంటూ తానూ అక్కడకూర్చుని చిన్నకుమార్తె బిడ్డయగు 'జాను'ను దగ్గరకు తీసికుని, తలనిమురుచూ "అమ్మా జానీ! మీఅమ్మా, నాన్నా ఎందుకురాలేదు? ఈగృహ సంబంధమైన ఆనందముల్లో వాళ్ళకంటికి నీచముగా కనబడెను కాబోలు! ఒక్కరోజైనా నల్గురముకలసి ఒకచోట అనుభవించుట కవకాశములేదట. కాలపరిస్థితి!" అనెను.

సీతారామశాస్త్రి:—ఇప్పటికా నీకు వెస్తతగిలినది. అతనిని ఆఊరినుండి బదిలీచేసినందున పని విస్తారముగా ఉన్నదట. ఇంక అమ్మాయికూ వాదించవలసిన అర్జంటు కేసులు చాలా ఉన్నాయట: అందు

కోసరం నీ విలా అనుకుంటావనే పిల్లల్ని మనిషి నిచ్చి పంపారు.

లక్ష్మమ్మ:-ఆహా ఇంత ఉభయులు కలసి ఒకచోట ఉండటానికి కూడా వీల్లేదు కాబోలు ఈఉద్యోగ ధర్మాన్ని పుచ్చుకుని; కాని జానూ! మీతమ్ముడేమిటి చదువుతున్నాడు.

జాను:—వాడు ఏమీ చెప్పిన మాటవినడు. మీదు మిక్కిలి దగ్గొకటి తీసుకుండా వాడ్ని బాధపెడుతున్నాది.

రామలక్ష్మి:— వాడి ననపలసిన పనేమిటి. ఇంటి వద్ద బాధ్యతవహించి బిడ్డలను జాగ్రత్తగా చూచుకుని వాళ్ళను క్రమమైన శిక్షలో ఉంచవలసిన తల్లి ఇతర వ్యాపకంలో లీనమైనప్పుడు వారెల్లాగు సరిగా ఉండగలరు? ఎంతమంది దాసదాసీజనములున్నను తల్లి పెంపకమునకు ఇతరుల పెంపకమునకు హస్తిమశకాంతరం లేడా భౌతికాభివృద్ధిలోనూ మానసికాభివృద్ధిలోనూ ఉండును. అది అటుండనిచ్చి అంత మంచిగాలిలోఉన్న ఎవరికీలేని ఆమాయదగ్గుకూడా ఎక్కడ్నించి వచ్చినదో ఖర్మము. అతను రాకపోయినమానె. కమలయైనావచ్చిన, నామనస్సుకు ఈవర్తి ఉండకపోవును. ఎందుకు అనుకుని లాభమేమిటి?

శాస్త్రి:-ఏమిటండీ మీరును నిత్యం అలాగు అనుకోవటం తప్పని నాఅభిప్రాయము. అనవసరముగా వాళ్లమనస్సునూ నొప్పించినవారవుతారు. మీదు మిక్కిలి మీరిలా తరచూ అనడంబట్టి వాళ్ళలో వాళ్ళకు పొరలుపుట్టడానికి అవకాశం ఉంటుంది. నేను మొన్న నీమధ్య వాళ్ళభార్యాభర్తలమధ్య కొంచం పొరలుపుట్టి, పెరిగి, డైవర్సువరకూ తదంగం ముదిరిందని కొందరివల్ల విన్నాను. నాపనిమీద నేనూ అక్కడికి వెళ్లడం తటస్థించింది గనక అప్పటికి నాకు తోచినట్టు కమలతో చెప్పివచ్చాను. ఇద్దరికీ గట్టిగా చెప్పడానికి వీల్లేదు. ఊరుకుందామన్న మనసొప్పదు. ఇప్పుడు ఖులాసగా నేయున్నారు.

రామలక్ష్మమ్మ:—మనవార్ని "అలుమగలకయ్యాం అద్దంమీద పెసరగింజ"అని సామెత పాడిచేవాళ్ళు. ఎటువంటివాళ్ళకు ఏదోసమయాన ఆమనస్సు తన యొక్క స్వభావచంచలాన్ని పైకుబికించకమానదు. తరువాత పస్తాయింపులు వాటంతటవేకలిగి సంసార యాత్ర తిరిగి సరళముగానే జరిగించుకుంటూ సంతోషముగా కాలక్షేపము చేసుకొనుటకు ప్రయత్నించేవారు.

శాస్త్రి:-ఇప్పుడుమాత్రము కలిగిన నష్టమేమిటి? మనవెత్తికాని, ఇదేమిటో ఒకసారి చూడండి. అని తనచేతి రుమాలులో ముడిచి పట్టుకొన్న మిలమిల మెరిసే వజ్రములు పొదిగిన ఒకపతకమును చేతిలో పెట్టి "మామామ ప్రొద్దుటే చూచినారు. మీకెక్కడా తీరుబడిలేనందున ఇప్పటివరకూ చూపించటం పడింది కాదు."

సరళ:—అబ్బా ఈయనకెంత జ్ఞాపకము. పని మల్లే దానిని గుర్తుంచుకుని ఇక్కడికి తీసికొచ్చినారు. ఏదో వాళ్ళ సంతోషం కొద్ది ఇచ్చినారుగా?, అందులో మనఘనతేముంది.

శంకరశాస్త్రి:—అది వాళ్ళ సంతోషం; అవులే, ఇది నాసంతోషం. అని ముసిముసి నవ్వులు నవ్వటం మొదలుపెట్టాడు.

సీతారామశాస్త్రి:—నీ వో గుడ్డికంటిదానవు. చత్వారంజోడు కావాలి. నేచెప్తానువిన్దూ దాని సంగతంతాను. నాల్గయిదు నెలలక్రిందట పేపర్లో ఒక పోటీ పరీక్ష ప్రచురించబడిన సంగతి నీవేకదా నాకు చూపించినావు. ఆపరీక్షావిషయము "ప్రపంచంలో ఉన్న గొప్పమతము లన్నిటినీ పేర్కొని వాటి విజ్ఞానమునకూ హైందవ విజ్ఞానమునకూ ఉన్న సాట్లను పోలుస్తూ, అన్నిట్లోగల సారాంశమును స్వయముగా విమర్శించుట"అని నీకు జ్ఞాపకముందా? అవ్యాసము వ్రాసినవారికి 1,000 ఖరీదుగల వజ్రపతకమిచ్చెదమని కూడ అప్పుడేగదా ప్రచురించారు. దానికి మన సరళ చక్కనివ్యాసము వ్రాసి అహిందూ యూని

వర్శిటీవారి బహుమానము పొందిందట. మనము ఈసందట్లో రెండురోజులనుండి పేపరు చూడటం లేదు. వారంరోజులక్రిందటే ఆబహుమానము ఇచ్చి వారట. నాఉద్దేశము మాత్రము ఆ బహుమానము నీకురావలసినది సుమా. ఎందుకనీ, నీకుమాత్రె గనుక.

శాస్త్రి:—అందులో సగం నాకూ_డాను. నాతో సరిగా లాటిన్ నేర్చుకుని అందులోఉన్న పుస్తకాలను నాకన్నముందుగానే చదివి, అవిరీతులు వ్యాసు చేసినది. అందుకనీ నాకు సగం.

లక్ష్మమ్మ:—(సంతోషసూచకమైన మొగముతో) బాగానేఉంది. మీమామా అల్లుండ్రి వేళాకోళములు.

కొట్టబోయేది పదకొండుగంటలు. మనమాటల సందట్లో చూడలేదు. పిల్లలు పాపము ఏలాగు పడు కున్నారో చూడండి. పదండి ప్రక్క_మీదకు.



# జాబిల్లిసకియ

అధికార్ల సూర్యనారాయణ రావుగారు

పొలుగారెడినీమోము ప్రాలుమాలి
వింతగాతోచునేమొ? జాబిల్లిసకియ!
క్రాగుతలపులనరుణ చక్రంబులోన
వన్నెచెడియిటులొంటిమై వగచెదేల?
మానవప్రపంచకంబెల్ల మాటుమణిగె
పోరుమనియెడు సంద్రంపుఘోషలెగసె,
మెల్లగా అర్ధరాత్రము మీరిపోయె!
నెచ్చెలీ! యింకనీవేల నిదురపోవు?
కనులదీర్చిన కాటుకకరగిజార
ఆననముచూపెనేల విషాదరేఖ?
మురువుగులికెడు ముత్యాలసరులుద్రెంచి
పారవైచితివేల విమానవీథి?
వెదకుచుండెదవిట్టులే ప్రియునిజూడ
మోముసీమనాశాకళల్ మురువుసూప?
చింతమునిగెదవెవ్వాని చెలిమిగోరి?
వెలది!నీకేలగల్గె నీ విరహబాధ?
ప్రణయరాగామృతముగ్రోలు ప్రౌఢసతుల
మోదవాయువులందేలు పూవుప్రియుల,
వలపుతేనెలజవిచూచు పులుగుచెలుల,
గనెదవాలీల, ఫలమేమికలదెచెలియ?
మండియధికోష్ణమున దెల్లపడినమోము
తరుణి!పలుమారు జలనిధీదర్పణమున
జూచుకోనేల? శోకాన సోలిసోలి
నేత్రముల మంచుకన్నీరునించెదేల?
నిర్మలాకాశశీతలా నిలము లేచి
రివులుకొలిపెనో మదిననురాగవహ్ని?
శీతవాయువుపాలేల లేతమేను?
ఘనదుకూలంబు నొక్కింత కప్పరాదె!
నిన్నువిడనాడిపోయిన వన్నెకాని
నెమకి వేసారి నాజాడనిలచినావె
క్రొత్తశోకాలజ్వాలలు గుబులుకొనెనె?
మందభాగ్యుననునుజూచి కుందెదేల?
వలపుప్రియులను మున్నెడబాపినావొ;
చెలువుప్రేమించి దోషమేసలిపినావొ,
మగువ! మనసారగోరిన మగలబాపి
యొండొరులజూచుకొని శాంతినొందవలసె!
నెచ్చెలీ! ధైర్యమేమియు నిలుపలేక
నెమ్మదిని గోరియున్నాను నీదుమైత్రి!
చెలిమివలచిననన్నీవు తలచుకొమ్మ!
ఎవరితోచెప్పుకోగల మిట్టిసొదలు?
ఆదరములేనిపతులకై వేదనపడు
హృదయములగాల్చుకార్చిచ్చువదలుటెట్లు?
శోకభారంబునాపుకో లేక మనము
చెలులమైనామె నేడు వెన్నెలపొలంతి!

## శరణాగతి

అష్టావధాని వఝ్ఝాది సీతారామాంజనేయులుగారు

సీ॥ ఆనందకందమా నాంధ్రీపయోధరోన్నత రత్నగిరిఁ దనంతటజనించి
పార్వతీశానేభవక్త్రార్క పరివేష్టనమున సంవర్ధమానతవహించి
పావనపంపాస్రవంతీ లసద్గాంగధారాభిషిక్తతఁ దీరుఁగాంచి
సత్యవతీలతా సంయోగమహిమ నానాశాఖకాపత్రనవత మించి,

గీ॥ నిఖిలభువనమ్ములన్ దననీడఁజేర్చి। సకలపురుషార్థములనిచ్చు సత్యదేవ
కల్పవృక్షాశ్రయమ్ము ప్రాగ్భవమహత్వ। యోగమేలేక మర్త్యుల కొదవునొక్కొ?

సీ॥ సూర్యనారాయణ శుభపదంబంటు రత్నగిరీంద్రశిఖర మాస్థానసీమ
యమృతఖాదక సుమనోభీష్టదాయక మన్నవరంబు విహారభూమి
పృథుగుణత్రితయమా వీరవేంకట సత్యనారాయణమూర్తి నామధేయ
మార్యరత్న కవీశ్వరానుయాయి సుపద్యరత్నమాలిక ఘనోరస్థదామ

గీ॥ ముపనిషత్సారమా సత్యమువిదమిన్న। వరపదోద్భవి దివ్యపంపాస్రవంతి
గాఁగనోజగన్నాథ! భక్తవ్రజమ్ముఁ। గరుణనేలునీకిదె నమస్కారశతము.

చ॥ కుతుకముమెండు నిన్ దెలిసికోవలెనంచు, శ్రుతుల్ పఠింపధీ
చతురతనున్న, కర్మములుసల్ప ధనమ్ముహుళిక్కి, యోగప
ద్ధతికసమర్థుఁడన్, మనసు ధ్యానపథమ్మునసిల్వ, దీనె నా
గతియని నమ్మినాఁడ, మమకారముమాన్పవె జ్ఞానదాయివై.

ఉ॥ ఆయతఖేదమందెద వరాన్నమునొందఁగ సత్యదేవ! నా
రాయణ! మన్మనోబ్జములు వ్యస్తవరాన్నపదమ్ముఁజేసి ని
శ్శ్రేయసమిచ్చి ప్రోవఁగదెచెచ్చెర, దానను నీకుసైతమున్
బాయుఁజుమా శిలోచ్చయనివాసము, పద్మవిలాస మబ్బుటన్.

సీ॥ తనియుఁగా కృతిమెచ్చుకొనఁగవి, నీజగత్కృతిశ్రుతి నుతియింపనేమిదలఁతొ?
కవికల్పనమె యచ్చెరువుఁగూర్పనవుర! నీ సృష్టివైచిత్రి వచింపఁదరమె?
చిత్రమ్ములన్ బ్రదర్శింతువుమాకు, వర్ణింప వాక్సుధఁబ్రసాదింపవేమొ?
సగుణరూపంబె ప్రశంసింపలేమయ్య, నిర్గుణాత్ముని నిన్ గణింపఁగలమె?

గీ॥ శరణుసొచ్చినవానిపై నుఱుమకుండఁ। గురియుజలదముగతిఁ గృపఁగురిసెదవఁట!
రక్షకుఁడవీవెనాకుఁ బురాణతీర్థ!। సత్యదేవ! నారాయణ! శరణుశరణు.



'ప్రాకృతిక'

జయపురసంస్థానం



జయపురసంస్థానమున

నొక సుందరదృశ్యము.



చిట్టివాడు 8 నెలలవాడు

అచ్చంపైన ఆవుపాలతో పెరుగుచున్నాడు!

చూచారా!!



బొంబాయి సర్వకళాశాలా విద్యార్థినులు.

లండనులో ఉన్నతవిద్య గరచుటకు మొన్ననే బయలుదేరినారు.



శ్రీమతి, జేబ్ ఉన్నిస్సాబేగం.

ఈమె వయసు 15 మహమ్మదీయబాలిక. అతి రసవంతమైన కవిత్వ మీమె కలవడియున్నది. పరదాపద్ధతిమీరి బయటకువచ్చి యీమె తనవారి నుద్బోధించుచున్నది.



‘ అల్లరిలో ఆనందము ’

# విడాకులు

శ్రీమతి నెమిలి చంద్రమతిగారు

విమల కిరువది సంవత్సరములు నిండినవి. ఆమె సద్గుణరాశి, సౌందర్యవతి. భర్త గృహమునకు వచ్చి అయిదు సంవత్సరములయినది. భర్త రామచంద్రుడు యిరువది యయిదేండ్ల ప్రాయమువాడు. సుందర పురుషుడు, గుణవంతుడునై యుండెను అతడు గొప్ప యుద్యోగస్థుడు, యాస్తిపరుడుకూడాను. ఒకనాడైనను యొకరినొకరు విడివియుండలేదు. ఒకనిముష మెడబాటు యొకయుగముగ తోచుచుండెను. ఒకరినొకరు మిగుల గాఢముగ ప్రేమించుచుండిరి.

ఇటుల సంతోషముగ వారు కాలము గడుపుచుండగ విధివశమున రామచంద్రుడు స్ఫోటకముపడెను. దానితో యతని రూపు మారిపోయెను, కండ్లుకూడ పోయినవి. ఇది మాత్రము చాలక దరిద్ర దేవత కూడ యాహ్వానించెను. ఉద్యోగము పోయెను. ధనమంతయు గోల్పోయెను. విమల యిదంతయు చూచి మిగుల చింతించెను. ఏమి చేయగలదు? దైవయత్నము! కండ్లుపోయి వికృతముగ మారిన తన భర్తను మునుపటి కంటె వేయిరెట్లధికముగ ప్రేమించుచుండెను. విమల కొంత విద్య నేర్చినదవుటచే కొంతమంది పిల్లలకు చదువు చెప్పి స్వల్పముగ వేతనము సంపాదించి, దానితో కాలము గడుపుచుండెను. భర్తకు తోడు నీడై మెలగుచుండెను.

ఒకనాడు రామచంద్రుడు భార్యతో నిట్లు చెప్పెను. "విమలా, మన దేశమున విడాకులచట్ట మమలులోనికివచ్చిన నెంత బాగుండును! నే నిక యావజ్జీవము గ్రుడ్డివాడనై యీవిధముగ నుండవలసినవాడనే కదా? ఈ దరిద్రునితోకూడ నున్న నీ కేమి సుఖము? సంపదలతో తులతూగు మనము పూటకు గతిలేనివారమైతిమి కదా? ఆహా కాలము! ఎంతటిలో నెంతమార్పు కల్గెను! నన్ను నా దారిని విడువుము. నేను భిక్షమెత్తుకొనియైన బ్రతుకగలను. పట్టు పాన్పులపై పండుకొను నీవు యీ కఠిన నేలపై పండుకొనుటకు నీ కోమలశరీర మెట్లోర్చుచున్నది? నీయట్టి సౌందర్యవతి, సద్గుణవతియగు భార్యనుగూడి సుఖించుటకు నేను పుణ్యము చేయలేదుకదా? నే నిక నీ ప్రపంచములోనుండి యేమి ప్రయోజనము? చూచి యానందించుటకుకూడా కండ్లు లేవు. నీ విష్టపడిన నీ క్షణముననే నెంతోమంది యౌవనులు, సుందరులు, ధనవంతులు నిన్ను చెట్టబట్ట నువ్విళ్లూరుచుందురు. ఒక ధనవంతుడైన సుందరపురుషుని పెండ్లిచేసుకుని సుఖముగ జీవింపవచ్చును కదా నాతోనుండి కష్టపడుటకంటె."

ఇది విని విమల నవ్వుచూ "నాథా, మీరు నిజముగా నీ మాటలు నుడువుచున్నారా లేక పరిహాసార్థముగానా? ఎంతమాట చెప్పితిరి!! అగ్నిసాక్షిగ పరిణయమాడిన పంచప్రాణములతో ప్రేమించుచున్న భర్తకు విధివశమున కండ్లుపోయి, ధనమును గోల్పోయినంతమాత్రమున యతనిని విడచి వేరొకరిని ప్రేమించుటయా?

మరియొకరిని చెట్టబట్టుటయా ఈ జన్మలో! ఆహా ఏమికాలము! మీకు చెప్పుటకైన నోరెట్లువచ్చినది?

సిగ్గు, సిగ్గు. హిందూదేశముయొక్క పతివ్రతాధర్మము మఱచినారా? పతివ్రతల చరిత్రలు జ్ఞప్తికిరాలేదా? ఈధర్మ ముండ బట్టియే 'భారతనారీమణు'లని పేరు వచ్చినది. అట్లుగాక పాశ్చాత్య యువతులవలె చీటికి మాటికి విడాకు లిచ్చుచుండిన ఆ పే రెందుకువచ్చును? మూడు నాళ్లలో మూలబడిపోదా? భార్య భర్తయొక్క యర్ధాంగి కదా? ఎంత కష్టము కల్గినను, ఎంత సుఖము కల్గినను ఇద్దరును సమముగ అనుభవింపవలసినవారే కదా? ఒకరిని మనసారగ ప్రేమించిన మనస్సు వారిని విడిచి వేరొకరిని ప్రేమింపకల్గునా? ఈవిధముగ చపలమైన ప్రేమ ప్రేమయగునా? భార్యా భర్తల ప్రేమ పవిత్రమైనది, నిష్కల్మషమైనది, నిశ్చలమైనది, నిర్మలమైనది కదా. అటువంటి ప్రేమను తృణీకరించిన 'ప్రేమ' యను పదమే నశించిపోదా? విడాకులచట్టము మన దేశమున కెంతమాత్రము పనికిరాదు.

అయితే పురుషులలో కొందరు కలియుగరాక్షసులు కూడనున్నారు. భార్య చనిపోయిన మరునాడే వేరొక సతిని చేబట్టుటకు సిద్ధముగానుందురు. భార్యను సదా పీడించువారు కొందరు. ఇటువంటివారికి శిక్ష విధించు చట్టము వచ్చిన బాగుండును కాని, విడాకుల చట్టము మంచిదికాదని నా యూహ" అనెను.

"నా సుగుణముల ఖనివగు విమలా! నా ప్రేమమయమూర్తీ! నే సన్న మాటలకు నన్ను క్షమింపుము. నీ విలాగున చెప్పుదువని తెలిసియే నే నటులంటిని. నీవంటి భార్యను బడయుటకు నా పూర్వజన్మ సుకృతముకాని వేరుకాదు" అని విమలను దగ్గరకు తీసుకొని శిరసుయక్కునజేర్చి ఆనంద బాష్పములు రాల్చెను. కొంతసేపు యిరువురును పరమానందసముద్రమున లీనమైపోయిరి!

* * *

ఆహా! కళంకరహితమైన ప్రేమయొక్క ప్రభావమేమి! ఎటువంటి కష్టములోనైనను భార్యా భర్త లిరువురి హృదయము లేకమైన నీటిలోనుండియు తామరాకునకు జలము సోకనటుల కష్టములోనుండియు వారి కది సోకదుకదా?

—:0:—

## భేదాభేదములు

శ్రీమతి విద్వాన్ కంచనపల్లి కనకాంబగారు

"భేదమేయున్నచో భేదమేయుండు
భేదమరయకున్నఁ బ్రీతియేనుండు
వ్యవహారముననెట్లు పరమార్థమందు
శివజీవభేదంబుచే నట్లుకుండు
భేదింపగాఁద త్త్వ భేదంబుకలుగు
సాధింపగానౌన సామ్యమవ్వలను

దలవెంద్రుకలకుండుఁ దద్దయుఁబూజ
తలవదలినవెన్కఁదగునె యాపూజ
మైక్యసిద్ధిని దేవునసుభవంబుండు
నైక్యంబులేనిచో నధముఁడై యుండు
నేదైన, నెట్లున్న, నీశ్వరుండన్న
రాదుజన్మం"బాత్మరాముఁడే"యన్న

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ; బి. యల్.

కళోపాసనమునకును, ఆనందవ్రతమునకును వలసిన అభిరుచి స్త్రీప్రకృతియందుఁగలదు. స్త్రీసహజప్రజ్ఞ వలన కళావీక్షు అవలీలగ నెరవేరును. స్త్రీచల్లిన పువ్వులను, నైవేద్యముగ నామె ఇచ్చిన ఫలములను గైకొని కళాదేవి సౌందర్యమాధుర్యములతోఁ దోలు కాదు తనహృదయమున నామెను తావొసఁగును. కళామయియై స్త్రీ-కళాసామ్రాజ్యమందు పట్టమహిషియైయుండును.

లలితకళలను మించినకళ జీవనకళ. లలితకళోపాసనమందేగాక జీవనకళోపాసనమునఁగూడ స్త్రీ అగ్రస్థానము నందఁగలదు. జీవనకళయందలి సౌభాగ్యమును, సౌందర్యమును అనిర్వచనీయమైనవి. సంఘజీవనమందును ప్రత్యేకవ్యక్తిజీవనమందును శోభిలునది ఈకళ. ఇది అనురాగసంభరితమైనది. ఆనందమయమైనది. ఉత్తమాశయములు కుసుమించు సంఘమందును వ్యక్తిజీవనమందును దీని సౌరభము తెరలు తెరలై ఉప్పొంగును.

నేఁడే జీవనకళ ఎట్లున్నదో కన్గొనవలెనన్నిన నేఁటిమానవసంఘమును మనము పరీక్షింపవలెను. నేఁటిప్రపంచజీవనమును పరీక్షింపవలెను.

జీవనమునకును విద్యకును అవినాభావసంబంధము కలదు. ఇవి రెండును వేఱురూపులుగల ఒకే శక్తియని తెలిపినను, తెలుపవచ్చును. తలఁపునున్న జీవనము విద్య, క్రియయై తోఁచిన విద్య జీవనము. 'తాను స్మరించుభావమే తానగును' అని ఈశోపనిషత్తు వాకొనుచున్నది. తన మనసున మనుజుఁడు కూడఁబెట్టుకొను తలఁపులే అతనివిద్య. ఈ విద్యయే అతని ఆచరణములను నడుపుశక్తి. ఈ ఆచరణముల కలయికయే నాగరకత. వర్తమాననాగరకత వర్తమానవిద్యయందు ఉద్భవించినది. ప్రస్తుతవిద్య ప్రస్తుత నాగరకతవలన పెంపొందుచున్నది. ఈ నాగరకతావిద్యలందు ఆచార్యపీఠము నందినది ప్రతీచిగోళము. ఏ రవికవియో, ఏ గాంధియో ప్రాచీభావదార్ఢ్యమును, ఆదర్శబంధురక్రియామహత్త్వమును వ్యక్తీకరించుచున్నను, రాజచక్రమును త్రిప్పుచున్నది పాశ్చాత్యసభ్యతయే. ఆత్మవంచనచే నుడులుదిరిగినకంఠ "నేనే మనుష్యుఁడను! నేనే దేవుండను!! నేనే సర్వంబను!!!" అని గొంతెత్తి పలుకుచున్నది. కండ నాశ్రయించునది కావరము కాని కారుణ్యమా?

కనులెత్తి అధునాతనయుగమును పరీక్షింపుఁడు. స్వార్థము, ఈర్ష్య, ద్వేషము ప్రత్యక్షమగును. అభ్యుదయమిచ్చు పరికరములు అరిష్టములకు కూడ పనికి వచ్చునుగదా! నేఁటివాణిజ్యమును, నేఁటిభౌతికశాస్త్రమును నేఁటిఆర్థిక నిరంకుశత్వమునకును, సామరికసంక్షోభమునకును తలిదండ్రులాయెను. ఇవి ఎన్నెని దుష్ప్రవృత్తులను రేకెత్తించెను. వీనికి విజయము చేకుఱుట కల్ల. కాని, ఇవి విజయమునకై విజృంభించుచున్నవి! వేడిపొగలను, విషవాయువులను ప్రపంచవాతావరణమున విరఁజిమ్ముచున్నవి! మతము ప్రబోధించు భ్రాతృత్వభావముపై చింతనిప్పులు గుమ్మరించి, దైవమును వెక్కిరించుచున్నవి! మనసునందలి సెగలే యుద్ధాంగణములందును, వాణిజ్యరంగములందును గుభుల్గుభుల్మని వెడలుచున్నవి! ఒకదిక్కునుండి గరళమును గ్రక్కుచునను వేఱొకదిక్కున అమృతమును వెడలింపను. జాడ్యముచే పీడితుఁడగువాఁడు మూలుఁగునందు మోదముజూపను. ఆర్థికరాజకీయరంగములందు అనర్థములచే పైశాచికనృత్యముఁజేయించు చిత్తము సాంఘికరంగమందు అద్భుతజీవకళచే 'నాట్యము చేయింపనేరదు. బలమంది, పెచ్చిల్లుచుండు నొక దుర్గుణము వెనుక నెంతేని పరివారముండును. స్వార్థమునకు దురాశ దౌరాత్మ్యములు అనవరతము వింజామరలు వీచుచుండును. స్వార్థమును, విలాసవ్యామోహమును, రక్తమాంసములపై స్వారిచేయునపుడు, మనుజుఁడు చేయఁజాలని చెట్టయేది? దుర్వృత్తులన్నియు చేతులు కలుపుకొని మనసునందు గజ్జఁగట్టి ఆడుచుండ, కన్నెత్తి మనుజుఁడు కలుషమునే కాంచును గాని,-కుళ్లును క్రక్కు జావళులకే చెవియొగ్గును గాని,

మధురతారకమంత్రమును హృదయమునఁ జేర్చు కొనునా? ఆత్మ వెనుకఁబడియుండ, వర్గములు త్రెంచుకొని ఇంద్రియములు దశదిశలఁ బర్విడుచుండ, దైవభక్తి పాపభయములు హృదయక్షేత్రమునుండి నిష్క్రమించి, దవ్వునకుఁ దొలఁగియుండఁ గళాసం దీప్తమగు ఆదర్శప్రవర్తనము ఎట్లు దృగ్గోచరమగును? ఆత్మకు సంబంధించిన ఆశయములు అదృశ్యమైయుండ, పాశ్చాత్యులు విచ్చలవిడినడతను అంజలులెత్తుచు, తాము స్వాతంత్ర్యమును ఆరాధించుచుంటిమని అట్ట హాసము చేయుచున్నారు. License, Liberty కాదు. విచ్చలవిడినడత స్వాతంత్ర్యముకాదు. ఇది రెప్ప వాల్చక తేజఃపథమున నగ్రసరమగునది—అదియో కనులుమూసికొని పరువులెత్తి తమోమయమైన కూపమునఁ గూలఁబడునది! అమృతార్థముఁగల ముక్తికి అవరరూపై, ఆత్మశక్తినుండి దీపించు స్వాతంత్ర్యము, జఘన్యప్రవర్తనమునకు కన్నతల్లియగు విచ్చలవిడి నడత ఎట్లగును? అంధకారబంధురమనస్కులకు ఆలోకమయమైన అభిధేయములుండుట కలదుగాన, నీతిమాలిననడతకు కొందలు స్వాతంత్ర్యమని పేర్వెట్టి నను, పెట్టవచ్చును. ఆదర్శతత్త్వమెఱిఁగి, కనులు కలిఁగి విమర్శించు వారికి వీరిప్రవర్తనముగాని, వీరి నుడువులుగాని ఎట్టి ఎగ్గును చేయలేవుగాని ఒరుల కివి చేయు చెరుపు చెప్పవలవికానిది. మానవులలో వల్వురు గొఱ్ఱెలమంద కెనయై మెలగుదురుగాని, తమ మేధస్సులను తట్టి స్వతంత్ర చింతయందు మన నము చోరనీయరు. అంధానుకరణము వీరికి పరమా పధి యగుచుండును. అధునాతన నాగరకతకు పీఠ భూమియైన పశ్చిమఖండముచుట్టును పృథ్వీజాతులు రామభజనచేయుచుండుట లోకవిదితము. పాశ్చాత్య నాగరకత నేడు రాజై ఏలుచున్నది. యథారాజా తథాప్రజా కాదా? ఈసభ్యతకు వసుంధర నేఁడు చేతులు మొగుచుటందు అక్కజమేమున్నది? ఈ వసుంధరనుండిగాని, ఈ వసుంధరయందు వీచువా తూలమునుండిగాని, విద్యనుగాని విమర్శనముగాని ఎఱుఁగని భారతీయులు విడివడిపోఁజాలరు. అందుల కెన్నేని తార్కాణములును కన్పట్టుచున్నవి.

మనసును, మనుష్యత్వమును, సుఖమును స్వాతం త్ర్యమును గుటుక్కున మ్రింగు అంధానుకరణమునకు, భారతీయులకు ప్రతికూలమైన శక్తు లెన్నో తోడు పడుచున్నవి. ఈ శక్తులందు తొలుతటిది మనో దాస్యము! ఆదర్శతత్త్వవిమర్శనమునకు తోడ్పడు ప్రాచీనవిజ్ఞానమునకు అంటుకొనినమంట రెండవశక్తి!! సత్యనిరూపణమునకు చేయూతగు సమష్టిచింత సంఘీ భావములను దగ్ధమింగు అంతఃకలహము మూడవ శక్తి!!! అజ్ఞానము నాల్గవది. అర్థానుస్వారజ్ఞానము ఐదవది. వీని చెలికత్తెయై మెలఁగు అహంకారము ఆఱవది. దురాశనిరాశలును, దురాచారములును తక్కుంగలవి. భారతమానసమును నేఁడుపట్టిన జాడ్య మొక్కటికాదు పృథ్వియ వలి జాడ్యములన్నియు పులుగులై, దానిపై వ్రాలినవి. జాడ్యములకు సత్వర చికిత్స అనివార్యము. వ్యాధి గుణముతెలుఁగక గడం గితిమేని నిముసములో రోగిని చితియందుఁ బరుండఁ బెట్టెదము. హేతుఫలముల సంబంధమాత్రమును తొలుత మనము చేతఁబట్టవలెను. హిందూసంఘము యొక్క దుస్థితికి కారణములు కొన్ని హిందూ దురాచారములనుట నిక్కమే. వీనిని తొలగింప సంఘసంస్కర్తలు యోజింపవలసిన విషయము లెన్నేనికలవు.

ఇవి హిందూమతమునకు సహజమైనవి కావనియు, సనాతనధర్మముయొక్క అంగప్రత్యంగములు కావ నియు, వీరు తొలుత గుర్తింపవలసిన విషయము. రోగమును చంపుటను మాని రోగినిచంపు హింసా వృత్తికి, మహత్తర హిందూమతమునంటిన దురా చారములను గాక సనాతనధర్మమునే మట్టుపెట్టుట హేయక్రియయని వీరు పదపడి గుర్తింపవలసిన విష యము. సంఘసంస్కరణమనిన అంధానుకరణము కాదనియు, దృష్టిని తనదెసకు పడలాగు పాశ్చాత్య సభ్యతయందు గ్రహింప వర్హమైన గుణములు కొలఁ దిగను, గ్రహింప నవర్హములై, గర్హ్యములైన ఆచారములు అధికముగను నున్నవనియు, నవనాగర కతకు సంపూర్ణమైన అతిథిసత్కారమీయక, దానిని బోనులోనిలిపి పుంఖానుపుంఖముగ బ్రానుపరీక్షచేసి గుణానుసారమైన ఆదరము దానికీయవలెను గాని,

అఖిలార్థసాధకమైనదనియు, మనచే అందలము మోయించుకొనుట కర్హతగల ఆచార్యుఁడనియు యోజించి దానిపై పుష్పవృష్టి విసరరాదనియు వీరు గ్రహింపవలెను.

మన కిపుడు వలసిన విద్య మన హృదయములను, మనసంఘమును సంస్కరింపఁజాలినదై యుండవలెను. సముచితభావ దీక్షవలనఁగాని సంస్కరణ వ్రతము నెఱవేరఁజాలదు. జ్ఞానశక్తిలేని తావునందు ఇచ్ఛాశక్తి క్రియాశక్తు లెట్లుండును? మూడుశక్తులు కలిసినగాని, మానవజీవనము కళాకలితము కాఁజాలదు. మన సోదరీమణులందు నేఁడెంతేని సంచలనము పొడసూపుచున్నది. సంస్కరణపథమందును, కర్తవ్యాంగణమందును ముందంజవేయ వీరు ఆతురంపడుచున్నారు. సంతోషము. భాస్వంతమైన తమ ఆశయముదెసఁ జనుతటి వీరు యోజింపవలయు అంశములు చాలకలవు. వానిని పిదపఁ బరికింతుము గాక!!

—:o:—

# ఆవల్లి కేగతి యగుపడునొక్కో?

వాడపల్లి గంగాధర శాస్త్రిగారు

శ్రీస్వర్గనై సర్గిక స్వర్గకుటజ
సందోహమందందు సుందరంబొంద,
జాతీకురంటక కేతకీకుంద
మందారబృందంబు నందంబుగూర్ప,
శారికాపరభృత కీరకపోత
బంభరసారస సంభృతంబైన
యుద్యానవనమధ్య నుద్యత్సుశోభ
నయనగోచరమాయె సుయశంబుమీర
మల్లికావల్లీమతల్లికయొకటి;
ఏపుమీరుచునుండె నేచితలిర్చి.

సుందరంబుగనుండ, స్ఫుటరుజకలిగెఁ;
జైత్రకలతికలు వ్యాకులమంది
వడిఁబ్రతికించెను బటురుజనుండి
సౌందర్యవల్లితా సన్ననిదయ్యె
నదమలాత్మబలంబు సరగుననెంచి
కళలనుగఁబవంగఁ గడఁగెనామల్లె.

సకలార్థ సంచయజ్ఞానంబుగొనుచు;
సత్కవీశ్వరబృంద సన్నుతంబగుచుఁ
జిత్రవిధంబుగాఁ బత్రముల్ కల్గి
ఏకహృదయమందు నెన్నొ భావములు
జన్మించుటనుజూప జనులకందఱకు
మూలభూపధి వల్లి చాలతీగలను
విస్తరింపఁగజేసె విజ్ఞానమొప్ప.

ఇంతలోనుడపవల్లి సంతాన ముపమ
రహితంబుగా దీప్తివిహితంబుగాఁగ
నలరుచుండఁగనందువిలసిల్లెనొక్క
లతిక యత్యద్భుతగతులసమృద్ధి.
అర్థాభివృద్ధితో వర్ధిల్లుచుండెఁ,
దీవంచచౌవంచ తీవలుపెరుగ
విఘ్ననాయకుపూజ విమలసద్భక్తిఁ
దవిలియొనర్చెను దైవానుకంపఁ,
బూర్వజన్మక్రియా పుణ్యఫలంబొ
ప్రస్తుతజీవన ప్రారబ్ధమేమొ
యొక్కటైననుగాని యుక్కమీరంగ
పూర్ణసఫలతను బొందఁగాలేదు.
నిద్రస్థితిస్థవి నిర్మలవిటప
సంహతులయ్యెఁ బ్రోత్సాహహీనతను.

సద్గుణసంపత్తి యుద్గాఢమైన
స్వసహాయమది యనుస్వారమగునేని
పరసహాయంబది పరిపూర్ణబంధు
వగుటచే జింతావహంబయియున్న
యావల్లికేగతి యగుపడునొక్కొ?

# నీ నిరీక్షణ

రావు వెంకట రంగనాయకులుగారు

ఎంతో ఉత్కంఠితహృదయముతో నీరాక నిరీక్షించుచుందును. నే నేదైన పనిజేయునపుడు నామనము నీచింతనము జేయును. నాహృదయము నీకొరకు వ్యాకులపడును. నాకండ్లు నీదర్శనముకొరకు కలతపడును. నాచేతులు నీయాలింగనము కొరకు తహతహపడును. నాయధరములు నీచుంబనముకొరకు నాతురపడుచుండును.

ఎప్పుడైతే నీవు నాదగ్గరకు వచ్చెదవో అప్పుడు నాయానందమునకు హద్దుండదు. ఎప్పటివరకు నాదగ్గరుందువో యప్పటివరకు నేను చాతకపక్షి విధముగా నీవైపు జూచుచుందును. నాకిందులో జాలయానందము గలుగును. నీమాటలు నాకు విలక్షణముగానుండును. దానిలో యొంతరసము, ఎంతవినోదము, ఎంతయాకర్షణగలదు! నీమాటలవలన నాకెప్పుడును దృప్తి యుండదు. నేను వాటిని యహర్నిశము వినగోరుదును.

కాని ప్రియుడా! నీవు వెళ్లుదునని జెప్పునపుడు నేను వ్యాకులపడుచుందును. నామనస్సుద్విగ్నమగుచుండును. నిన్నాపగోరుదును గాని నీయిచ్ఛకు విరుద్ధముగా నానాలుక లేవదు. నీవు నాతో సెలవుదీసికొని యచ్చటికి బోవుదువు; మరియు నా సుఖదుఃఖములయొక్క మిశ్రితభావములతోనిండినమనస్సిక్కడ నీమధుర చింతనములో మునిగిపోవుచుండును. తిరిగి నీరెండవ శుభాగమనముయొక్క నిరీక్షణ యారంభమగును.

"హిందీ అనువాదము."

# అటా కారీ దండ్లు?

రాయసం వెంకటశివుడుగారు

చిన్ననాడు మాయమ్మ మాకు జెప్పిన కథలలోనెల్ల పూర్వకాలపు దొంగలను గూర్చినవియె ముఖ్యములు. సాధారణముగ రాత్రులందె యీ వృత్తాంతములు మాకు వినవచ్చుచుండెడివి. ఆ నిశ్శబ్ద గాఢాంధ కారసమయమున నివి యూఁగొట్టి భయ కంపితులమయిన మా బాల్యచక్షువుల కపుడు వీధినిపోవు ప్రతి బాటసారి యాకృ తియు, పెరటనిలిచియుండు ప్రతి చెట్టును ఒక్కొక గజదొంగవలెఁ గనబడుచుండును!

తన తల్లి ముత్తవతల్లి చిన్నతనమునం దివి జరిగెనని మాయమ్మమ్మ చెప్పుచుం డును. కావున నివి సంభవించినది యిప్ప టికి సుమా రిన్నూ ఱేండ్లు. అప్పటికి బ్రిటీషు దొరతన మీ ప్రాంతములందు పాదుకొన లేదు. ఆకాలమున తఱచుగా మరాటీలు, పిండారీలు దండెత్తివచ్చి దేశమును కొల్ల గొట్టుచుండువారు. వీరి మూకలను అటా కారీదండ్లని జనులు చెప్పుకొనుచుండురు. దండు వచ్చుచున్నదని గ్రామమున దలారి డప్పు వినబడగనే ఊరంతయు గగ్గోలు పడు చుండును. ఏపనిచేయువా రపు డాపనిని గట్టిపెట్టి, పిల్లలను నగలను వెంటగైకొని, ఊరికి దూరస్థమగు నడవులలోనికి బారి పోవుచుందురు. ఈ దండు సామాన్యముగ రాత్రులు వచ్చుచుండుటచేత ప్రాణసంరక్ష ణకై పారిపోవు జనుల బాధలకు మితిలేదు. చీకటిలో బెడ్డలలోను ముండ్లలోను బడి, యలజడితో స్త్రీలు పురుషులు, పిన్నలు పెద్దలును పలాయితులగుచుందురు.

రాత్రియంతయు నిర్జనప్రదేశములందు గడిపి, ప్రాణము లెటులో దక్కించుకొని తెల్లవాఱిన పిమ్మట నూరుసేరిన గ్రామస్థు లకు కొల్లగొట్టబడి 'బావు' మనుచుండు తమ యిండ్లు గానబడును. ఈ దోపిడి గాండ్రు కుటుంబములతో వచ్చెడివారట. మిడుతలదండు వాలిన పొలమందలి సస్యము వలెనే రాత్రి దండు కొల్లగొట్టిన గ్రామము మఱునాటి యుదయమునకు సర్వశూన్యమై యుండును! ఇంట గానబడిన యేమాత్రపు విలువగల వస్తువయినను దొంగలు గొని పోవలసినదె. నగలు, నాణెములు, చెంబులు, తప్పెలలు, బండిపోటు వారి వశమగుచుం డును. లేగలతో పాడి పశువులుకూడ వారి చేత జిక్కుచుండును. గాదెలలోని ధాన్యా దులు వలసినంత దొంగలు వెంటఁగొని పోయి, మిగిలినది పాడుచేయుదురు. వం టిండ్లలోని పచ్చడులు, నూరుగాయలును వారిపా లగుచుండును.

దురదృష్టవశమున నింట జిక్కువడిన మనుష్యులు కంటి కగపడిరా, గృహమం దెచ్చట డబ్బు దాచియుంచిరో చూపింపు డని వారిని మరాటీలు మిక్కిలి హింసిం తురు. చేజిక్కిన చిన్నపిల్లల నొక్కొకప్పుడు దొంగలు తమవెంట గొనిపోయెదరు. ఏ డెనిమిదేండ్ల యీడుగల తమ బంధువులపిల్ల యొకతె గతి యిట్లయ్యెనని మా యమ్మమ్మ చెప్పునప్పుడు మా సంగతియు నిటులె యగునేమోయని పిల్లలము మేమును

భీతిల్లి, ముత్తవతల్లి నంటిపట్టుకొని కూర్చుందువారము!

మరాటీలచేతజిక్కి, యిట్టి యవస్థనుండి యదృష్టవశమున దప్పించుకొనిన యింకొక బాలిక ప్రస్తావన మా యమ్మమ్మ తెచ్చు నప్పుడు, కొంత తెప్పిరిల్లి మేము వినుచుం దుము. పొరపాటున విడిచిపెట్టబడిన బాలిక యొకతె మంచముమీద నిదురించుచుండగా ఇల్లుసొచ్చిన యటాకారీలు లేపి, దానిని దమతో గొనిపోదలంచిరట. వారంతట వెరదుసొచ్చి, నగలపాతులుండు చోట్లు పరి శీలింతమని యింటి చెట్లచుట్టు గామిచుట్టును ప్రదక్షిణముచేసిరి. తమతో నిట్లు తిరిగిన యా యింటివారిపిల్ల తమ్మును వెంబడించు చున్నదని యెంచి, మరాటీ లంత గ్రామము వెడలిపోయిరి. చోరుల కాగడావెలుతురున గనులు తెఱచి నిద్రమేల్కనిన యా బాలిక కీ బందెపోటు కథ కలవలె దోచెను. వారితో చెట్లచుట్టును తిరిగినను, ఆపిల్ల క్రొత్తవారి వెంట జనక, నిద్రాపారవశ్య ముచే నొక జామిచెట్టు మొదట గూల బడెను. బాలిక యెడబాటునకు వగచుచు గృహస్థులు మఱునాడిలుసేరి చూడగా దొడ్డిలో నొకచెట్టు మొదట నిద్రించెడి తమ పిల్ల కానబడెను. క్రొత్తవారిని జూచి యేడ్చిన యా పిల్లను మఱపించుటకై రాత్రి మరాటీలు దానిచేత నిడిన చిన్నకంచు పాత్ర బాలిక చెంతనే యిపుడు పడియుం డెను. మా యమ్మమ్మగారి యింట నఱిగి పోయిన కంచు 'ఆపుకోరా' నొకటి చిన్న నాడు మేము చూచుచుందువారము. ఎవరి కిని దెలియని భాషలో గొన్ని యక్షరములు దానిమీద జెక్కబడియుండెను. ఇది గుజ రాతీ లిపియని మావాండ్రు చెప్పుచుందు వారు. నాటిరాత్రి యటాకారీలు బాలిక చేత బెట్టిపోయిన కంచుపాత్ర యిదియెయని మే మనుకొనుచుందువారము!



# భ్రమ

కంగుకూరి రామభద్రరావుగారు

నీదివ్యవిమలాంఘ్రి
నీరేజయుగముపై
భ్రమరినై పాడంగ
భ్రమపుట్టెనోయి!

పద్మరాగప్రభలు
ప్రసవించునచ్చోట
బదుకుసుమాళించు
పరిమళంబచ్చోట నీదివ్య॥

అవ్యక్తగానాంత
మానందతన్మయము
మాధుర్యభాగ్యమ్ము
మకరందమచ్చోట నీదివ్య॥

దివసావసానమున
తమసానకనుమోడ్చ
నిజమాతృవక్షంబు
నిఖిలాత్మకంబద్ది నీదివ్య॥

# వేలాంగణ్ణియుత్సవము

శ్రీమతి హవాయి కావేరిబాయి గారు

వేలాంగణ్ణియను గ్రామము తంజావూరుజిల్లా యందు కలదు. ఇందుల కీ పేరువచ్చుటకు కారణముగా నొకకథ జెప్పుదురు. ఒకానొకనాడొక కృషికుడు పొలము దున్నుచుండ నొక దక్కిణయందుండి ప్రతిమయొకటి కనబడెనట. దానిని దీసి పరీక్షింపగా, కన్నియ మరియమ్మవారి ప్రతిమయని తెలిసెనట. ఆ గ్రామస్థులా ప్రతిమకొఱ కొక కోవిలను గట్టించి వారు పూజించుటయే గాక నేటేట నొక గొప్పయుత్సవ మచ్చోట జరుగుచుండుటంజేసి, యనేక గ్రామములనుండి రోమన్ క్యాతలిక్ యాత్రికులు వేనవేలుగా నీప్రతిమ దర్శననిమిత్తము వచ్చుటయు గలదు. ఆ గ్రామమునకు 'వయల్ కన్ని,' యనగా 'పొలముకన్య' యని యఱవభాషయం దర్థమిచ్చు నామమువచ్చెను. కాని, 'వయల్ కన్ని,' వాడుకలో, 'వేలాంగణ్ణి' యని మారెను.

తిరుచినాపల్లివద్ద వేయబడిన ధూమశకటమార్గము నిదివరలో, గ్రేట్ సదర్న అఫ్ ఇండియా రైల్వే Great southern of India Railway యనెడివారు. దీనిపై, తంజావూరు నాగపట్టణముల మధ్య తిరువళ్లూరు స్టేషనుండును. అటునుండి యొకబండియు, ఇటునుండి మరియొకటియు, మాత్రమే నడచుటవలన తిరువళ్లూరు మీదుగా దినమునకు రెండే రైలుబండ్లు వెళ్లుచుండెను. తిరువళ్లూరునుండి మూడుమైళ్ళ దూరములో సిక్కిల్ అను గ్రామమున్నది. జోసఫ్ పిళ్లే Joseph Pilly గ్యాంగ్ మేయిస్త్రీ Gang-maistry ప్రయత్నములవలన సిక్కిల్ ఒక ట్రయల్ స్టేషన్ trial statian గా నేర్పడెను. సిక్కిల్ నుండి, మూడుమైళ్ళ నాటుప్రయాణములో వేలాంగణ్ణి కలదు.

సుమా రొకయిరువదియేండ్లకు పూర్వ మీక్రింద వివరింపబడిన విషయము, తిరువళ్లూరునందు, జరిగెను. ఆ సమయమందు స్టేషనుకు చెందిన యుద్యోగస్థులు, నక్షకథ లీ పేర్కొనబడినవారు. మహారాష్ట్రీయుడై, క్షత్రియకులమునకు జెందిన రామారావు, స్టేషన్ మాస్టర్. ఇతని జీత మిరువది రూప్యములు: రామస్వామిఅయ్యర్, గుడ్స్ క్లార్కు Goods clerk, ఇతని జీతము 15 రూపాయలు. నారాయణస్వామి అయ్యర్, సిగ్నలర్ Signaller జీతము 10 రూపాయలు. గోవిందరావు, బుకింగ్ క్లార్కు Booking-clerk. కుప్పుస్వామిఅయ్యర్, ట్రాఫిక్ బ్రాంచ్ Traffic branch యందు పేయిడ్ ప్రొబేషనర్ Paid probationer. తంతిశాఖయందు అన్ పేయిడ్ ప్రొబేషనర్ un paid probationer జోసెఫ్ అను నతడు. ఇందు, పేయిడ్ ప్రొబేషనర్, (Paid-probationer) నామము మరియొకటి కాని, ప్రస్తుతము, గుండూరావను కొందము.

తిరువళ్లూరు ప్లాట్ ఫార్మ్ Platform మిక్కిలి నిడుపాటిది. రైల్వే ఫెన్సుకు Railway fence మూడు ద్వారములుండును. సాధారణదినములలో నొకటిమాత్రమే వాడబడుచుండెను. ఉత్సవదినములలో నన్నిద్వారములవద్దను టికెట్ల పరీక్ష జరుగుచుండెను. ఈ కథ ప్రారంభమందు వేలాంగణ్ణి మహోత్సవము జరుగుచుండెను.

ఒకనాడు నాగపట్టణమునుండి వచ్చిన పొగబండి మీద యాత్రికులు క్రిక్కిరిసియుండిరి. మూడు ద్వారములవద్దను టిక్కెట్ల చెక్కింగ్ (Checking) జరుపుచుండిరి. వీరిలో నొకడు గుండూరావు. తిరువళ్లూరు గమ్యస్థానముగా గలిగినవారిలో, నల్లని కుష్ఠించిన కాయముకలిగి, యుత్తడి శిలువమీదనున్న యేసుక్రీస్తువారి ప్రతిమను కంఠమునకు ధరించి న వాడైన, ముదుసలి యొకడు. బలహీనతచే, జనసమూహములలో మార్గము చేసికొని దిగలేకుండెను. ఇంతలో రైలు కదలెను.

"అయ్యా, తిరువళ్లూరులే, ఎరంగణో?" "తిరువళ్లూరిలే ఎరంగణొ?" తిరువళ్లూరులో దిగవలెను' యని యఱచుచుండెను.

సడేయప్ప యను పోర్టర్ (Porter), "ఇవ్వళో నేరం ఎన్నా సేయిదే?" (ఇంతవరకు ఏమిచేసినావు) యనుచు, ముసలివానిని క్రిందికీడ్చెను.

పాప మా వృద్ధుడు ప్లాట్ ఫార్మ్ క్రింది సందులో పడుటవలన నడచుచున్న బండ్లయొక్క ఫుట్ బోర్డ్

(Foot board) యతని వీపును గాయము చేయుచుండెను. స్టేషన్ అధికారులందరు, దాదాపుగా, నున్నత జాతివారగుటంజేసి, "హర, నార" యని పరితపించుచు నిలిచి చూచుచుండిరేకాని, ప్రాణాపాయములోనున్న సహపాటి మానవుని రక్షింప ప్రయత్నింపరైరి. ఒక ఆర్డర్లీ (Orderly) టికట్ కలెక్టర్‌నకు సహాయమొనర్చుచుండెను. ఒకపోలీసు భటుడు గుండూరావుకు సహాయముగా టికట్లు పరీక్షించుచుండెను.

తన టికట్లను పోలీసుభటున కప్పగించి, గుండూరావు ముసలివానియొద్దకు పరుగిడి, చంటిపాపను పైకెత్తులాగున వృద్ధుని, బైకిదీసెను. ఇట్టి కరుణాకటాక్షక్రియకు సంతసిల్లుటకు ప్రతిగా, సహపాటులందఱు, బ్రాహ్మణుడు 'మాలవాని'ని స్పర్శగావించెనని కోపోద్రిక్తులైరి. గుండూరావును బిలిచి రేగిపడిరి. "ప్రాణరక్షయందు, మాలవాడైనను, బ్రాహ్మణుడైనను, ఒక్కటియే," యని గుండూరావు ప్రత్యుత్తరమివ్వగా, నతనిపై మండిపడిరి. వారిలో వారాలోచించి, గుండూరావును వెలివేయవలెనని నిశ్చయించి, యతడు భోజనము చేయుచుండిన గృహమువారికి వార్తనంపిరి.

ఇంతలో దనకు దగిలిన మైలదోషమును దొలగించుటకై గుండూరావు ఓడంపోకి నదికడకేగి, యజ్ఞోపవీతము మార్చుకొని, నదియందు శాస్త్రోక్తముగా 108 మునుగులు మునిగి, 108 గాయత్రిమంత్రములు చదివి, యంటు పోయెనని యెంచి, భోజనము చేయుటకై యింటికిజనెను. అచ్చట నతనిని బ్రవేశింపనివ్వరైరి. భోజనము లేదు పొమ్మనిరి.

తిరువళ్లూరు స్టేషనుండు గ్రామముపేరు, విజయపురము. ఇచ్చట బ్రసిద్ధికెక్కిన త్యాగరాయకోవిల కలదు. గుండూరావు కోవిలకేగి, ప్రసాదము, ఫలహారములు కొని యారగించి, దేవాలయపు సోపానములపై నిద్రించెను. మరుచటిదినము మరల నింటికి వెళ్లెను. మరల దిరుగ గెంటబడినవాడై, దేవాలయమునే చేరెను. ఇప్పటికి, క్షుద్బాధ కోర్వజాలక, కులస్థులు చేయివిడినందున, జోసెఫ్ కడకుబోయి, క్రీస్తుమత మవలంబింపవలెనన, జేయవలసిన కార్యమేమిటని యడిగెను. బ్రాహ్మడికి, క్రీస్తుమతమును గూర్చి సలహా జెప్పినయెడల, పురబ్రాహ్మణులు తన్ను హత్యగావించుట నిశ్చయమని జోసెఫ్ భీతిల్లి, యేమియు బలుకకుండెను. కాని గుండూరా వతనిని విడువకున్నందున, విప్రుల కోపాగ్నికి తన్నప్పగింపవద్దని వేడుకొని, యాయూరి 'సామియార్' (పాద్రి) యొద్దకు బొమ్మనెను.

సామియార్ గుడిలో నున్నందున నతని సలహా బొందునిమిత్తము, గుండూరావు దేవాలయము బ్రవేశించెను. ఇంతలో స్వప్రాణరక్షణార్థము, జోసెఫ్ గుండూరావు చేయ నిశ్చయించిన కార్యమిట్టిది యని స్టేషన్‌వారితో జెప్పివేసెను. అచ్చట నంతయు కంగారుగానుండెను. గుండూరావును బలిమిచే బట్టి తెమ్మని, సడేయప్పను బంపిరి. ఇతడు రైలుపట్టాలను దాటి యడ్డదారినివెళ్లి, గుండూరావు నెత్తుకొని వచ్చెను. స్టేష నుద్యోగస్థులు మరల నితనిని దూషింపసాగిరి. ఒక మానవుని ప్రాణమును కాపాడిన సత్కార్యమును గూర్చి యేల యట్లు దూఱవలెనని, గుండూరా వడిగెను. ఇంతలో పురబ్రాహ్మణులందఱు స్టేషనులో గుమికూడి, మైలదోసమును దొలగించుటకు ప్రాయశ్చిత్తమనునది యొకటి యుండగా, గుండూరావు నట్లేల హింసించవలెనని, రైల్వేవారిని ప్రశ్నించిరి.

వేదశాస్త్ర నిపుణులగు నీవిప్రులు, బ్రాహ్మణుల కన్నము పెట్టించినయెడల ప్రాయశ్చిత్తము కాగలదని యుపదేశించి, యొక మాసవేతనము నీకార్యముకొఱకిమ్మని యడిగిరి. గుండూరా వట్లే యిచ్చెను. సంతర్పణము జరిగినపిమ్మట, గుండూరావును మరల కులములో జేర్చిరి.

కాని, రెండవ సిద్ధార్థునివలె నున్నతజాతివారు 'అస్పృశ్యుల' యెడల జూపు కారుణ్యవిహీనత, యమానుష్యమని యెంచి, నిరంతర దుఃఖస్వాంతుడై, గుండూరావు తుట్టతుదకు, తన కులభక్తివలన రెండవయాత్మకు తాపము కలుగరాదని నిశ్చయించి, పై జెప్పబడిన విషయము జరిగినపిదప నొక పదునైదేండ్లు గడచునంతలో, కళ్ళికోటయందు తన మతమును విసర్జించెను.

# శిశు వాత్సల్యము

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

ఆమె యొక సైనికుని భార్య. భర్త రణరంగమునందు మృతుడైనాడు. శవమును తెచ్చి యింటిలో పరుండబెట్టినారు. ఇరుగుపొరుగు స్త్రీలు ఆమెను ఓదార్చుటకు వచ్చిరి.

ఒక యువతి మెల్లగ సైనికుని (భర్త) యొక్క మంచి గుణములను, వాని సుస్వభావములను మిక్కిలిగ పొగడి చెప్పినది.

భార్య చలించలేదు. శిలాప్రతిమవోలె కూరుచున్నది. కంట ఒక్క అశ్రువునైన రాల్చలేదు.

మఱియొకర్తుక లేచి శవము దగ్గఱకు వెళ్లి దాని ముఖముమీద కప్పబడిన గుడ్డను కొంచెము తొలగించినది. అప్పుడైనను, ఆ సతీతిలకము చలించలేదు. నిశ్చేష్టురాలై కూరుచున్నది.

దగ్గఱవుండిన స్త్రీలందరు ఆమె అవస్థనుమాచి చాల భయము చెందినారు. ఎవరికిని ఆమె జీవించునను ఆశ తోచలేదు.

ఇంతలో నొక ముదుసలిదాసి లేచి వెళ్లినది. మరుక్షణమున ఆదాసీది చక్కని చుక్కయగు నొక వత్సరపు శిశువును తెచ్చి, 'భార్య' ఒడిలో కూర్చుండబెట్టినది.

దుఃఖసముద్రమున తుపాను చెలరేగినట్లు ఆయెను. ఆమె పెద్దపెట్టున రోదనముచేసెను. అశ్రువులు సంతతధారగ ప్రవహింప మొదలిడెను.

'బిడ్డా! నీకోసమై నేను జీవించియుండెద'నను పలుకులు ఆమె నోటి నుండి అప్రయత్నముగ వెలువడినవి.

ఆహా! శిశువాత్సల్యము.

## లక్ష్మి

శ్రీ ఆకెళ్ల సీతారామంగారు

అది మధ్యాహ్నము. ప్రభాకరుని తీక్ష్ణ కిరణముల ధాటి కాగజాలక పక్షులన్నియు తమతమ గూండ్ల నక్కియున్నవి. పశు శాలలనుండి ఆవులు, లేగలు దాహముచే గొంతులెత్తి 'అంబా' అని యఱచుచున్నవి. వీధులన్నియు నిర్మానుష్యములై నిశ్శబ్ద ముగనున్నవి. అట్టితఱి నొక్క యువతీ లలామ తన మృదుపదంబులు కందునని భయ మొక్కించుకయు లేక తివ్వన దవ్వననే యున్న బావికేగి చల్లని మంచినీటిని దెచ్చి మగిడిగృహంబు జేరెను.

శ్యాములుడు రూపసి. విద్యావంతుడు. ఇతడు ఏం.ఏ. పరీక్షయం దుత్తీర్ణుడయ్యెను. తొలుత భాగ్యవంతుడేయైనను విద్యాభ్యాస మునకై ధనమంతయు వెచ్చించుటచే నిప్పుడు నిరుపేదయయినాడు. తల్లి తండ్రుల కేకపుత్రుడగుటచేతను, స్థితిగతులు బాగుం డుటచేతను మోహనరావుగారు తమ ప్రియసుత లక్ష్మి నిచ్చి పెండ్లిచేసిరి. మంచి నీటికై యెండలో బావి కేగివచ్చిన పల్లవ గాత్రి లక్ష్మియే.

లక్ష్మి-శ్యాములులు గుంటూరునం దొక యింటిని బాడుగకు దీసికొని అందు గాపుర ముండిరి. పిత్రార్జితమంతయు ఖర్చగుటచే భార్య యొడలిపైనున్న రెండువేల రూప్యా ముల నగలతో నా దంపతులు గడపు చుండిరి.

అంతవిద్యనభ్యసించియు నేదయిన నుద్యోగము సంపాదించుట కడుదుర్ఘట ముగానున్నది. అయినను శ్యాములుడు ప్రయత్నము మానలేదు. పవలంతయు నెండదో కాలముగడపి రాత్రి యగుసరికి గృహము జేరుచుండును. అనుకూలవతియు, సుగుణవతియు, సౌందర్యవతియు, నర్ధాం గియునగు లక్ష్మి, భర్తకు నెంతయు దన యమృతమయ వాక్కులచే నాహ్లాద మొన ర్చుచుండెను. పాప మామెమాత్ర మేమి చేయగలదు? ఉద్యోగమునకై తన భర్త పడుచున్న ప్రయాసములు వృధాయగు చున్నవి. కాలము మారిపోయెను. ఆమెయొడలి పైనున్న నగలుమాత్ర మెంతకాలముం డును? అవియు నొకదానిపై నొకటి మార్వాడీల వశమయ్యెను. వ్యవసాయ వృత్తి చేయుదమన్న గోష్పాదమంత భూమి యుగూడ లేదు.

శ్యాములుడు తనలోదా నిట్లు తలపోయ మొదలిడినాడు. "కాల మిట్లు తీరున మారునని ముందే తెలిసియుండినచో యీ పాడు హూణవిద్య నభ్యసింపకయే యుందునే! మామగారియింటి కేగుదమా యన్న, అల్లున కత్తవారింట మెలగుటకన్న చౌకదన మింకొకటిలేదే. ఏమయినను యిట్టి తఱి ధైర్యమును వహించి వేరొకయూర వంటలవాడుగానైన గుదురుట యుత్త మము."

మరునాడు లక్ష్మీ శ్యామలులు బెజవాడ చేరినారు. శ్యామలుడు తిన్నగా నొక భోజనహోటలునకేగి దాని యజమానితో సంభాషించి తన్నా హోటలునందు వంటల వాడుగా నియోగించునట్లా యజమాని నొప్పించినాడు. శ్యామలు డొక యింట బస కుదుర్చుకొని, అందు తన భార్యనుంచి హోటలునందు పనులన్నియు ముగిసినపిదప లక్ష్మివద్ద కేగుచుండువాడు. హోటలు యజమాని యొకనాడు శ్యామలునితో "శ్యామలా, నీ కిచ్చు స్వల్పజీతములో మఱల వేఱొక గృహమును బాడుగకు తీసు కొంటివి. అట్లుగాక నీ భార్యతోగూడ నీవు మా యింటనుండుట యుక్త"మని చెప్పెను. మఱియు నామెకూడ నచ్చట బనిచేసినచో కొన్ని రూకలను బడయగలదని వాక్రుచ్చెను. ఆత డిదివఱకు నెచ్చట బనిచేయుచుండెనో, యెట్లు జీవయాత్రను సాగింపగల్గుచుండెనో లక్ష్మి కిసుమంతయుజెప్పలేదు. కాని యిప్పు డామె కీ సంగతి దెలియబఱచి యామెకూడ వంటకత్తెగానుండుట కొప్పించెను. యజమా నియు లక్ష్మిసౌందర్యమున కెంతయు డెంద మున మహదానందమునందుచు, నామెకు దటస్థించిన దురవస్థకు లోలోనం గుందుచు దంపతుల నతిదాక్షిణ్యముతో జూచుచుం డెను.

కొంతకాలమునకు లక్ష్మి తండ్రి మోహనరావుగారు నేదో పనిమీద బెజ వాడ వచ్చి మన లక్ష్మి-శ్యామలులున్న హోటలునకే భోజనమున కేతెంచిరి. మోహనరావుగారు ప్రఖ్యాతివడసిన న్యాయ వాదులగుటచే హోటలుయజమానికూడ వారిని సన్మానించి వంట లవనున్నవనియును, వంటవాం డ్రతినిపుణులనియును జెప్పి వారితో ముచ్చటింపజొచ్చెను. ఇంతలో వంటలు తయారైనవనియు, వడ్డన జరుగు చున్నదనియు వినబడినకేకకు మోహన రావుగారు వడ్డనశాల జేరిరి. వా రచ్చట గాంచిన దృశ్యమునకు నిశ్చేష్టులై యిది కలయా నిక్కువమా అని, తన్నుజూచి సిగ్గున దలవంచుకొన్న ముద్దులపట్టియు, శృంగారగాత్రియు, పూర్ణేందువదనయునగు లక్ష్మి నొక్కమారు దగ్గరకు చేరంబిలిచి కౌగిటనొత్తి యామె దుస్థితి కెంతయు బరి తపించెను. మఱియు కార్యనిమగ్నుడై యున్న శ్యామలుని జూచి 'చదువుకున్నందు లకు ఫలితమిదియా' అని లోలోన గుందుచు కొంతసేపట్లే నిశ్చేతనుడయ్యెను.

తదుపరి లక్ష్మి-శ్యామలులను వెంట బెట్టుకొని తన నిజపురంబున కేగి భార్యకు వారి దుస్థితినిగూర్చి తెలియజేసెను. అనతి కాలముననే జామాతశ్యామలునకు మంచి యుద్యోగము నిప్పించి యెప్పటియట్లు దంప తుల నానందాబ్ధి నోలలాడించెను. కొలది కాలములోనే లక్ష్మి, శృంగారగాత్రు డు, తేజోవంతుడు, గుణవంతుడునగు సుపుత్రుని గాంచెను. అట్లు లక్ష్మి-శ్యామలు లెల్లపుడును పరస్పరము ప్రేమించుకొనుచు సుఖముగనుండిరి.

# పల్లెటూరి వైద్యము

తాత కృష్ణమూర్తిగారు, బి.ఏ; ఎల్.టి.

"......మనకీ యింగ్లీషు చదువు అచ్చిరాదని పోరిపోరి చెబితే విన్నావు కావు. మా పెద్దన్న దిబ్బావధాన్లు కొడుకుని యింగిలీషు చదువుకు పార్వతీపురం పంపించేసరికి వృష్టంవొచ్చి మూడ్రోజుల్లో కొట్టేశింది. బుచ్చబ్బి కొడుక్కి యింగ్లీషు చెప్పిద్దాంవనుకుంటూండగానే చచ్చినంత ఖాయిలా చేసింది." —కన్యాశుల్కము.

దినేదినే జ్వరం తీవ్రం కాజొచ్చింది. ఒంటిమీద స్మారకం లేకుండా ఊష్ణం పాక్కిపోసింది. కుర్రవాడు బ్రతుకుతాడా లేదా అన్న భయం పట్టుకుంది మా నాన్నకి. చదువుకోసమని చెప్పి నన్ను పరాయిఊరు పంపించడం యింత చేసిందని మా నాయనమ్మ సాధింపు. నా ఊష్ణంమాట అలా ఉండగా, యింట్లో రోజూ మానాన్నకీ, నాయనమ్మకీ వివాదం!

"తల్లిలేని పిల్లణ్ణి, చదువుపేరుపెట్టి అడవిలో పారేసినట్లు యెక్కడికో పంపిస్తే వాడు బెంగపెట్టుకున్నాడు కాబోలు. పసిపిల్లవాడిని పశువును బాదినట్లు కొట్టడానికి వాడికెలా చేతులొచ్చాయో? ఈ అయ్యవార్లకు పిల్లలుండరు కాబోలు! గొడ్డుముండాకొడుకులకు దయాదాక్షిణ్యాలుండవు" అంటూ మా నాయనమ్మ కళ్లవెంబడి నీళ్లు తెచ్చుకునేది.

"అమ్మా,......యిప్పుడు విచారించి యేం లాభం? మనవాళ్లు ఉన్నారుకదా అని పర్లాకిమిడి పంపించాను; వస్తూ పోతూ ఉండడానికి దగ్గరకదా అని. ఇట్లా వస్తుందని నే నేం కలగన్నానా? ఎన్నాళ్లని వీడిని బడికి పంపకుండా ఊరుకోగలం? మొగపుట్టుక పుట్టినతరవాత కుర్రవాడు చదువుకోక తప్పదుకదా? నానా శ్రమదమాలు పడాలి. కష్టసుఖాలకు ఓర్చుకోవాలి. వీడి అన్నలు చదువుకోవడం లేదూ మరి, దూరస్థలాలలో?" అని మానాన్న యేదో సమాధానపరచేవాడు.

"నాయనా, మన పుల్లయ్య ప్రయోజకుడు కావడం నాకుమాత్రం ముచ్చటకాదూ? ఈ యింగ్లీషు విద్య చదువుకుంటేనే కాని, వాడి పొట్ట వాడు పోషించుకోలేడా యేమిటి? ప్రయోజకత్వం అంటే నాలుగురాళ్లు గణించుకోవడం, నలుగురికీ ఉపచరించడం, లోకానుభవం సంపాదించడం, మంచివాడనిపించుకొని బ్రతకడం! అంతేకాని, యిల్లూ వొళ్లూ గుండ చేసుకొని, మెట్టుదాకా చదివి, గుమస్తానౌఖరీకి తల అమ్ముకొని అఘోరించడమనేది ప్రయోజకత్వమనిపించుకోదు. మన పూర్వులంతా అప్రయోజకులేనా యేమిటి? వాళ్లు చదువుకోలేదూ? ఈ యింగ్లీషు చదివితేనేకాని విద్య అనిపించుకోదా యేమిటి? నిజంగా ఆలోచిస్తే, యీ స్కూళ్లచదువు సర్కారునౌఖరీకి తప్ప మరెందుకైనా పనికివస్తుందీ?......పోనీ, ఏదో ఒక చదువు చదువుకోనీ అనుకుంటే, యిదేమిటీ అన్యాయం? పిల్లవాడిమీద తనకేమి హక్కు ఉన్నదని, ఆ మాస్టరు యిట్లా కొట్టడం? చదువు చెప్పడమంటే చావ దన్నడమనా అర్థం?" అని ముసలమ్మ యెదురుతిరిగేది.

"విద్యనేర్పడానికి గురువు శిక్షించడం తప్పు కాదు; కాని శిక్షించడమే విద్యనేర్పడమనుకోవడం చాలా తెలివి తక్కువ."

రెండోరోజున మానాన్న, నాయనమ్మ యీ విధంగా వాదంపెంచి, మాట్లాడుకుంటూఉంటే మాఅమ్మ (సవితితల్లి) వెళ్ళి, మీరిట్లా వాదించుకుంటూ కూచుంటే, పిల్లవాడి జ్వరం ఏంకాను?

వైద్యుణ్ణి పిలిపించండి. అబ్బాయిస్థితి యేమీ బాగు లేదు. పలవరిస్తున్నాడు. ఇప్పుడొక వాంతి అయిందికూడా," అని చెప్పింది.

తక్షణమే కంబారినిపిలచి మా నాన్న కబురు పంపినాడు సూరన్నకి. ఆచుట్టుప్రక్క గ్రామాలకంతా అతగాడు పేరుపొందిన వైద్యుడు. వెళ్లిన మనిషితో ఆయన, "ఇప్పుడు వచ్చేందుకు తీరుబడి లేదు. రెండోపూట వస్తానని చెప్పు." అని చెప్పినాడట. అప్పుడు స్వయంగా మా నాన్నే బయల్దేరి వైద్యుడియింటికి వెళ్ళినాడు.

"అయ్యా, సూరన్నగారూ, ఇప్పుడు రావడానికి తీరుబడిగాలేదని సెలవిచ్చారట. ఎలాగైనా వీలుచేసుకొని, శ్రమఅనియెంచక, రావలసిందని నా ప్రార్థన. కుర్రవాడికి యేమీ బాగులేదు. తమ రొకసారి దయచేసి, చెయ్యి చూస్తేనేకాని కాదు." అంటే

"ఫరవాలేదండి. కొంచెం జ్వరం తగిలితే తెలిసినవారైకూడా మీరు అధైర్యపడడం భావ్యం కాదు. ఇప్పుడు నాకు కొద్దిగా జరూరుపనిఉంది. తెరిపిచేసుకొని, మధ్యాహ్నంవచ్చి చూస్తానులెండి." అన్నాడట సూరన్న.

"తమ రట్లా సెలవిస్తే ధర్మమా? ఒక్కక్షణం తెరిపిచేసుకొని యిప్పుడు దయచెయ్యాలి." అని మా నాన్న ప్రాధేయపడినాడట.

"భుక్తగారూ, మీకు చాదస్తంకాని జరూరుపని మీద ఉన్నానని మనవిచేస్తే నమ్మరుకదా!...సరే లెండి. తమరు వెళ్ళండి. ఇప్పుడే వస్తాను." అన్నాడట సూరన్న.

సాధ్యమైనంత త్వరలో రావలసినదని మరీమరీ ప్రార్థించి, మా నాన్న వైద్యుడివద్ద సెలవు పుచ్చుకున్నాడు. కాని సూరన్న యెంతసేపటికీ రాలేదు. నాకు జ్వరం ఏమీ తగ్గలేదు. మాఅమ్మ నామంచం దగ్గిర కళ్లనీళ్లుపెట్టుకొని కూచుంది. నాయనమ్మకి వంటతోచక, నిమిషనిమిషానికీ గది గుమ్మందగ్గిర నిల్చొని తొంగిచూస్తూ, "అబ్బాయికి ఎలాఉంది?" అని అడుగుతూ ఉండేది. వైద్యుడు రాలేదని మా నాన్నమనసు దాగట్లోపడిన వెలగకాయవలె పరిపరివిధాల దొర్లింది. "బాబూ, మరొకమాటు నువ్వు వెళ్ళి కనుక్కో." అన్నాడాయన మా చిన్నన్నయ్యతో. వాడువెళ్లి, కాళ్లుచేతులు పట్టుకొని, బ్రతిమాలి, అట్టహాసంమీద సూరన్నను తోడ్కొచ్చాడు.

సూరన్న మాకు దగ్గిరబంధువు. మా తాతగారి మేలువలన వాళ్లసంసారం బాగుపడింది. సూరన్న తండ్రి పాపన్న మావలన చాలా ఉపకారం పొందినవాడు. ఆయన గతించి సంవత్సరంపైగా కావచ్చింది. అతగాడు మంచి పేరుపడిన వైద్యుడు. చెయ్యికూడా మంచిది. చాలా గ్రంథం చదివినవాడు. కొన్నికొన్ని సాధనాలు స్వయంగా కనిపెట్టి, భద్రంగా రాసి ఉంచుకున్నాడు. మరణసమయమప్పుడు కొడుకును పిలచి, "సూరీ, యీపుస్తకం చదువుకొని, సాధనాలు ప్రయోగించు; అవి రెండో కంటి వాడి కెవడికీ చూపించకు. రహస్యాలు తెలిసిపోతే వైద్యం క్రియ కట్టదు." అని చెప్పి, యేవో ఉపదేశాలు చేశాడట. సూరన్నకూడా తండ్రిమాటలు శ్రద్ధగా చెవినిపెట్టి, గ్రంథం చాలామట్టుకు వల్లించాడు. అదిగాక, పాపన్నగారి కుమారుడు కనుక, సూరన్నకికూడా వైద్యంలో గొప్పపేరుప్రతిష్టలు లభించాయి. సూరన్నకీ డబ్బుకీ లంకె! పరువుకన్నా పైసా ప్రధానమని దేవులాడేవాడు. ఇప్పుడు వచ్చిన గట్టిచిక్కు యేమిటీఅంటే, అతను మాకు బంధువుడు, మావలన మేలు పొందినవాడున్ను కాబట్టి మావద్ద పైసా నిలవదీసి పుచ్చుకోలేడు— పుచ్చుకోకుండా మందుపొయ్యడమంటే అతడికి మనస్కరించదు! ధైర్యంచేసి మావాళ్ళు పైసా యిస్తామని చెప్పలేరు. ఒకవేళ సూచావాచా అట్టిభావం తెలియజేస్తే, అతడేం తప్పుపడతాడో అని బెంగ. 'చంకలోకురుపు; మామగారివైద్యం.' అన్న సామెత వలె వచ్చింది!

వైద్యుడు యింటికి రావడంతోటే అందరూ లేచి నిలబడ్డారు. పైటకొంగుతో అమ్మ కళ్లు తుడిచేసుకుంది. వంటయింటి తలుపు చేరవేసి, నాయనమ్మవచ్చి గదిగుమ్మంలో నిల్చుంది. ఎవరూ మాట, మంతిలేదు. వైద్యుడు కొంతసేపు నన్ను నిదానించి చూసి, "ఏదీ, అబ్బాయీ......చెయ్యిచూడనీ" అన్నాడు. నాడి పరీక్షించి ఆలోచిస్తూ ఊరుకున్నాడు.

"సూరన్నగారూ, జ్వరం ఎలాఉన్నదండీ? దిగుముఖానికి వస్తున్నదా?...పిల్లవాడు చాలా ఆయాసం పడిపోతున్నాడండీ!" అన్నాడు మానాన్న.

"ఊఁ..., ఎన్నాళ్ళయింది ఉష్ణంతగిలి?"

"మూడురోజులు"

"జ్వరం తీవ్రంగానే ఉన్నదండీ. బడియవేటు జ్వరంమోస్తరుగా కనిపించదు. నాడిలో వాతపైత్యగుణాలు రెండూ కనిపిస్తున్నాయి. విషమజ్వరం క్రింద దించుతుందేమో అని అనుమానంగాఉంది!... దగ్గుఉన్నదా?" అన్నాడు వైద్యుడు.

"ఉంది." అని నాన్న బదులుచెప్పాడు.

"ఆదగ్గువలన గుండెలో నొప్పిగా ఉంటుందంటాడు. పొడిదగ్గేకాని కఫంలేదు."

"అలాగనా? కఫం యేమీలేదా?"

"లేదు." అని చెప్పి, మానాన్న అమ్మవేపు చూసి, ఏం?...కఫం లేదుకదూ?" అన్నాడు.

ఆమె లేదని తలఊచింది.

"సరే, దానికేమీ భయంలేదు లెండి. గుండెలో నొప్పిగాఉంటే, చందనం అరగదీసి, పట్టువెయ్యండి. ఆనొప్పి తీసేస్తుంది." అన్నాడు వైద్యుడు.

"దాహం దాహం అని నీళ్లకోసం అల్లరి చేస్తాడండీ—గొంతుక అర్చుకొపోతూఉందని. యేదైనా సాధనంచేతురూ." అన్నాది అమ్మ.

"దాహంఉండడం ఎలాగా తప్పదు. ఉష్ణం విడిస్తేనేకాని ఆ దుర్దాహం కట్టదు. అడుగుతాడని మాత్రం నీళ్ళు పదేపదే యివ్వవద్దు." అన్నాడు సూరన్న.

"కాచిన నీళ్లు కొంచెంయిస్తే ఫరవాలేదు కదా అండీ?"

"వద్దమ్మా, అసలు నీళ్లే యివ్వకూడదు. కాచినదైనా నీరు జలుబుచెయ్యదూ? ఒక్కొక్కప్పుడు నీళ్లే చాలా ప్రమాదం చేస్తాయి. అంతగా కావలిస్తే, లవంగాలు రెండుకాల్చి యిస్తూఉండండి—అంతే!"

ఈలోపున మా చిన్నన్న గంధంసాన, తమలపాకులు, తేనెసీసా, బొగ్గులకుంపటి, గళానుతో మంచినీళ్లు, చిన్న రెండిగిన్నె అన్నీ తెచ్చి వైద్యుడి యెదట ఉంచాడు.

కాని సూరన్న లేచి నిలబడి, "ఇప్పుడు ఔషధం యేమీ అవసరంలేదు......భుక్తగారూ, మరి నేను సెలవు పుచ్చుకుంటాను" అన్నాడు.

"అయితే, ఔషధం యెప్పుడిప్పిస్తారు?" అని అడిగినాడు మా నాన్న.

"ఈ జ్వరంయొక్క నైజం ఐదురోజుల పిమ్మట కాని రూఢిగా తెలియదు. మరి రెండు రోజులు చూసి, అప్పుడు చికిత్స ప్రారంభించవచ్చును."

వైద్యుడి మాటలకు వెలవెలపోయి మా అమ్మ, "హారం యేమిటిమ్మన్నారు?" అని అడిగింది.

"లంఖణం మంచిది. 'లంఖనం పరమౌషధం!' అన్నారు మనవాళ్లు!' అయినా, అంతగా ఆకలిగా ఉన్నట్టయితే, కందికట్టూ, అన్నం పెట్టండి" అని సలహా యిచ్చాడు సూరన్న.

"చారు వెయ్యవచ్చునా, అండీ?"

"కూడదు. చారుచల్లపోస్తే రోగం బలపడదూ!!"

"హాసం లేనందున బొత్తిగా నీరసించి పోతున్నాడండీ! మంచంమీదినుంచి లేస్తే మనిషి తూలిపోతున్నాడు. పాలతో సగ్గుబియ్యం కాని, గోధుమనూక కాని జావకాచి యిస్తే?" అన్నాడు మా నాన్న.



సీతాకళ్యాణములో కౌసల్య,

పాత్రధారిణి శ్రీమతి శ్రీహరి.

(వేల్ పిక్చర్సు లిమిటెడ్)



శ్రీమతి పొణ్ణుకణ్ణు సాంప్సన్‌గారు
సర్కారువారిచే ట్యూటికొరన్
ఆనరరీ మేజిస్ట్రేటుగా నియమింప
బడినవారు. లేడీస్ రిక్రియేషన్
క్లబ్బుయొక్క కార్యదర్శిని.



శ్రీమతి సరూప్‌రాణీ కిచ్లూగారు
గ్వాలియరులో నూతనప్రతిష్ఠిత మహిళాసమా
జమునకు కార్యదర్శినిగా నెన్నుకోబడినారు.



శ్రీమతి నీలిమదత్తు
ఢిల్లీ సర్వకళాశాలలో ప్రజ్ఞావతి యనిపిం
చుకొని మఖ్ఖన్‌లాల్ స్వర్ణపతకము పడసిన
ఉత్తమ హిందూయువతి.

" 'వెర్రికుదిరింది; రోకలి తలకిచుట్టండి!' అన్నట్లుంది మీ మాట. పాలు పైత్యం కాదండీ? అంబా పెరిగిపోతుంది. అంత పథ్యం చెయ్యలేనివాళ్లు నన్ను మందిమ్మని బలవంతంచెయ్యడ మెందుకు?" అని విరసంగా నవ్వాడు సూరన్న.

"తమ రట్లా ఆగ్రహించడం ధర్మమా? వైద్యులనే కదా శ్రమయిచ్చి మిమ్మల్ని అడగడం? తమ ఉత్తరువుకు వ్యతిరేకంగా చెయ్యం" అన్నాడు మా నాన్న.

"అయితే పథ్యపానాల విషయమై నా సలహాను మీరు అక్షరాలా మన్నించవలసి ఉంటుంది. ఏమంటే యిది సాధారణజ్వరం కాదు. మనం కొంచెం జాగ్రత్తగా ఉండాలి. కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు!" అని ముఖం గంభీరంగాపెట్టి చెప్పినాడు వైద్యుడు.

మానాన్న చాలా ధీరుడు. ఆకాశంవిరిగి మీద పడినా చలించని గుండెధైర్యం కలవాడు. సాధారణంగా సంసారంలో వచ్చే వొడుదుడుకులకు భయపడే ప్రకృతి కాదతనిది. కాని ఎందువల్లనో వైద్యుడి మాటలకు కొంచెం బెదిరినట్లు కనబడినా డప్పుడు. ఎవడికీ, దేనికీ, ఎన్నడూ భయపడనివాడు సూరన్న బెదిరింపులకు నుతలాము లొంగిపోయి, అధైర్యంగా అంగవస్త్రంతో కన్ను లద్దుకున్నాడు, ముఖం ప్రక్కకు తిప్పుకొని. పుత్రప్రేమంటే అట్లా ఉంటుంది కాబోలు!

"పిల్లవాడిని మీ చేతిలో పెడుతున్నాం. వాడిని కాపాడేభారం మీది. 'వైద్యో నారాయణో హరిః' అన్నారు పెద్దలు. మీరు దేవుడితో సమానం!..,మీతో నేను మనవి చేయవలసినది యేమీ లేదు. సర్వం మీకు విశదమే. ఎంత డబ్బు ఖర్చయినా సరే, వెనకతియ్యను. పథ్యపానాలు మీ ఆజ్ఞప్రకారం నడుపుతాం" అన్నాడు మానాన్న గద్గదస్వరంతో.

నాయనమ్మ గుమ్మందాటి కొంచెం ఇవతలికి వచ్చి వైద్యుడివైపు తిరిగి, "బాబూ, సూరన్న బాబూ, మడిలో ఉన్నాను. ఒక్కమాటు యీ గుమ్మంలోకి వస్తావూ?" అన్నాది.

గదివిడిచి సూరన్న వరండాలోనికి వెళ్లాడు. చాటుకుపిలచి నాయనమ్మ అడిగింది, "నాయనా, కుర్రవాడికి మరేమీ ఫరవాలేదు కదా?"

"అవ్వగారూ, ఏం చెప్పగలం? ఆయుర్దాయానికి మనం కర్తలం కాము కదా? ఆ పరమేశ్వరుడి కృప!" అన్నాడు వైద్యుడు కొంచెం బిగ్గరగా.

* * * *

వంకాయలవారి గచ్చుచావడిలో అమ్మలక్కలంతా కూర్చుని, లోకభోగట్టాలు, తమతమ కష్టసుఖాలు, కాలక్షేపకబుర్లు చెప్పుకుంటూ ఉన్నప్పుడు నానేస్తం గుంపయ్య అక్కడ ఉండడం తటస్థించిదట. వాడు వచ్చి నాతో అన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. ఆడవాళ్ల కమిటీలో పడిన సంగతులకి సాధారణంగా తీగలు, కొమ్మలు పుట్టడం సహజం. వాటికి మరో రెండు చిన్నెలు, వన్నెలుపెట్టి, పువ్వులు కాయలు చేర్చి వర్ణిస్తాడు గుంపయ్య!...

జోగమ్మ—చూశా, వెంకూ! వాళ్ల పుల్లయ్యకి మందు పొయ్యనన్నాడట సూరన్న.

వెంకమ్మ—ఔను మరి,...రోగం నయమవుతుందని అతగాడికీ ధైర్యం తోచలేదు.

చాయమ్మ—(చాగోరిన మనిషి లేచికూచుని) అదికాదో వొదినా, అందులో ఉండే రహస్యం నేచెప్తాను విను. డబ్బు యివ్వరన్న భయంచాత సూరన్న అలా అని ఉంటాడు. అంతేకాని ఉష్ణం కుదరదనికాదు. మొన్న శాంభుక్తగారి కోడలికి పురిట్లో సెలపడేసినప్పుడు సూరన్న సాధించాడు కాదూ? వీళ్ల పిల్లడిది అంతకంటె పెద్దజబ్బు కాదు కదా? నిన్న సాయంత్రం నేను చూశాను. ఒళ్లు

మాత్రం కొంచెం వేడిగా ఉంది. చక్కగా లేచి కూచుంటాడు. మాట్లాడతాడు. కొంచెం నీరసంగా కానొస్తున్నాడు. అంతే!

వెంకమ్మ—(పెదివి విరిచి) నా అనుమానంవేరు. ఏమైనా ఆశ ఉంటే, సూరన్న వదిలిపెట్టే మనిషి కాడు. డబ్బు రాదన్న భయం అతడికి ఎన్నడూ లేదు. బంధువులయేది, రొవరటయేది—సానమీద రూపాయిలు పెట్టించుకొని మరీ మందుపోస్తాడు. మొగమాటం లేనివాడికి డబ్బురాదని భయమెందుకు? ఇంతకూ వాళ్లు డబ్బు లేనివాళ్లు కారు కదా? సమయం వచ్చినప్పుడు ముందు, వెనక చూడకుండా ఖర్చుపెడతారుకూడాను. ఒకవేళ వైద్యుడు మొగమాటం కొద్దీ పైసా అడగకపోయినా, అతగాడి కష్టం వాళ్లు ఉంచుకోరు. ఏదో ఒకవిధంగా ముట్ట చెప్తారు. సూరన్న వాళ్ల డబ్బు ఎన్నడూ తినలేదా యేమిటి? జబ్బు నయంకాదనే యేమీ పురస్కరించుకోక ఊరుకున్నాడు.

చాయమ్మ—పోనిస్తూ, అలాంటిమాట మనం అనకూడదు. ఇంతకూ వాళ్ళ అదృష్టం ఎలా ఉందో?

విశాలమ్మ—గవరయ్యని పిలిపించి చూపిస్తే బాగుండును.

పార్వతమ్మ—ఔను సుమ్మా. నాకూ అదే తోచింది. జ్వరం పీడసంబంధమేమో? లేకుంటే, ఏవరైనా ప్రయోగించారో?

విశాల—గవరయ్య మంత్రించి యింత విభూతి యిచ్చాడంటే, ఏదోషం ఉన్నా పోతుంది.

చాయ—మనం అనుకోడమేకాని, సుందరం మన మాటలు వినదే! దానికి చిల్లంగి, గిల్లంగి అంటే నమ్మకం లేదు. దెయ్యం, భూతం అంటేనే నమ్మదు!...ఇంట్లో దానిమాటే సాగుతుంది కాని, మరెవరిమాటా చెల్లదు.

పార్వ—ఎవరికీ దెయ్యంపట్టడం ఆమె చూడలేదేమో! అంతేకాని, ఆడదానికి దెయ్యం దేవత అంటే నమ్మకం లేకపోవడమేమిటి? దేవుడియందు నమ్మకం ఉంటే, దెయ్యాన్ని నమ్మి తీరాలి!

చాయ:—సుందరం మనలాటి పూర్వకాలం మనిషి అనుకున్నావా యేమిటి? చదువుకున్న పిల్ల. దాని తండ్రి గొప్ప పండితుడు.

చిట్టెమ్మ—కొంచెం నాగరీకంగా ఉంటుంది కాని, సుందరం చాలా ఉత్తమురాలు. చిన్నదైనా మంచి తెలిసిన మనిషి. న్యాయంపట్టి లోకంలో సవతితల్లుల కెవరికైనా తొలిసంబంధం పిల్లలమీద అభిమానం ఉంటుందీ? కాని సుందరంమట్టుకు సవతిపిల్ల లందర్నీ తన సొంతబిడ్డలవలెనే చూసుకుంటుంది. ముఖ్యంగా యీ పుల్లయ్యని చూస్తే, దానికి ప్రాణం.

చాయ—ఆమాట నిజమేకాని, కొంచెం తలతిక్క మనిషి, అది! దానికి రొంతతోస్తే అంతే కాని, ఒకరు చెప్పినట్లు వినదు. మొన్న నీమధ్య సూరన్న వాళ్లయింటికి పిల్లడిచెయ్యి చూడడానికి వెళ్లినప్పుడు, దాహానికి మంచినీళ్లు పదేపదే యివ్వ వద్దని గట్టిగా చెప్పాడట. కాని వైద్యుడిమాట లక్ష్యపెట్టక, అడిగినప్పుడల్లా జ్వరంలో ఉన్న పిల్లడికి నీళ్లిచ్చేస్తూవుందట, ఆమె. ముసల్ది వొద్దమ్మా అని మందలిస్తే, "ఊరుకుందురూ, అత్తా! నీళ్లకు అపత్యమేమిటి?" అని అడ్డువాదన చేస్తుందట. లంఖణాలు, పథ్యపానాలు అంటేనే గురిలేని మనిషికి దెయ్యాలు, భూతాలు అంటే యేంనమ్మకం ఉంటుంది?

కనక—మీ కెవరికీ ఉన్న నిజం తెలియదు. సూరన్న మందివ్వకపోవడానికి నిజమైన కారణం యేమిటంటే, మందు పొయ్యమని వాళ్లు గట్టిగా నిర్బంధించలేదు—వాళ్ల పెద్దల్లుడు వొస్తున్నట్లు ఉత్తరం వచ్చిందట.

చాయ—ఎవరు? కామేశ్వరి మొగుడా?

కనక—అవును. అతగాడు పెద్ద యింగ్లీషు డాక్టరు కదూ మరి? అంచాత, సూరన్న వైద్యం

అవసరం లేకపోయింది. అదిగాక, సూరన్న వైద్యం అంటే, వాళ్లకి భయంకూడాను,—లంఖణాలుకట్టి, పాషాణం పెడతాడని! మనం యెరగమా యేమిటి సూరన్న వైద్యం? చచ్చినంతచేసి బ్రతికిస్తాడు. "బావ రానే వస్తున్నాడు, నేడో రేపో—మరెందుకు లెండి సూరన్నమందు?" అన్నాడట వాళ్ల రెండోవాడు, రామం.

జోగ—ముసిల్ది ఊరుకుందీ, మందిప్పించకుంటే?

కనక—ఆవిడేమాత్రం యేంజేస్తుంది? ఆమెకు మందులంటేనే నిగాలేదు. ఎప్పుడూ దేవుళ్లూ, దేవతలు, మొక్కులు, తీర్థయాత్రలు—వీటిమీదనే దృష్టి. ఇదివరకే యే దేవుడికో మొక్కి, ముడుపు కట్టి ఉంటుంది; సందేహంలేదు.

వెంక—ఆమాట నిజమేను. పిల్లడి జబ్బు నయమైతే, భద్రాద్రిరాముణ్ణి సేవిస్తానని దండంపెట్టింది. ఆవిడెకు కలలో రామలక్ష్మణులు కానొచ్చారట! మంచి భక్తురాలు. ఎంత పుణ్యంచేసుకుందో! అన్ని తీర్థాలూ సేవించుకుంది. కాశి, రామేశ్వరం, శ్రీశైలం అన్నీ తిరిగింది.

చాయ—అయితే కనకం, ఎందుకొస్తున్నాడు, వాళ్లల్లుడిప్పుడు?

కనక—ఎందుకేమిటి? పెద్దపండుగ యింకా పది రోజులే కదా వుంది?

చాయ—రెండో అల్లుడుకూడా వొస్తాడా?

కనక—ఆదేమో.

విశాల—పోనీ అమ్మా, వాళ్ల పెద్దల్లుడే వొస్తే, యే బాధాలేదు. అభిమానంతో మందు పోస్తాడు.

వెంక—మందంటే పొయ్యగలడు కాని, ఆయుష్షు పొయ్యగలడా యేమిటి, ఎంత గొప్ప డాక్టరైనాను?

చాయ—ఏమైనా మరి సూరన్నకోసం ప్రాధేయ పడ నక్కరలేదు కద.

విశాల—నయమే. సమయానికి వస్తున్నాడత గాడు.

కనక—పిన్నీ...ఉండు...(చెవియొగ్గి) ఏమిటా ధ్వని?...గంటల చప్పుడు వినరాలేదూ?

చాయ—ఔను, బండిచప్పుడే అది! బహుశః వాళ్ల బండే అయి ఉంటుంది. ఇక లేదాం మనం కూడా వంటకి ప్రొద్దు పోయింది.........

ఇంతలో రెండెడ్లబండి వచ్చి, మా యింటివద్ద ఆగింది; మా అక్కయ్య, బావ బండిదిగి లోపలికి వచ్చారు.

మూడు పూటలు మా బావ ఔషధం యిచ్చే సరికి, నా జ్వరం వదిలింది. ఇంకొక వారం రోజులలో పూర్తిగా తేరుకున్నాను. జఠరాగ్ని తీక్ష్ణం అయింది. ఉపద్రవమైన ఆకలి! నాయనమ్మ ధర్మాన చిరితిండికి యేమీలోటు లేకపోయింది. మా బావకి తెలిస్తేమాత్రం యేదీ తిననిచ్చేవాడు కాడు.



# సాధు శాంతారామ్

శ్రీమతి 'కవితిలః' పులవర్తి కమలావతిదేవిగారు

విష్ణురావు బి. ఏ ప్యాసుఅయినాడు. పాపము ఉద్యోగంకోసం అతను ఎందరికో దరఖాస్తు లంపినాడు. దర్శనాలు చేసినాడు. ఏమీ లాభం లేకపోయింది. తుదకు ఇంటర్ వ్యూకు రమ్మనమని తేనాంపేట సర్వీసు కమిషనుకడనుండి అతనికి శ్రీముఖము వచ్చినది. ఇంటర్‌వ్యూ అనగానే ఉద్యోగ మయిందనే వీరి ఆశ. పాపము తీరా–విష్ణురావుకడ డబ్బు లేదు. స్నేహితుల నడిగిచూశాడు. లాభం లేకపోయింది. భార్య పుట్టింటివారు మంగళ హారతిపళ్లెంలో నాలుగు రూపాయలువేస్తే అవి లాక్కున్నాడు కాని మెడ్రాసుకుటిక్కెట్టు చార్జీకవి సరిపోవు. ఏలాగో రైలులో దూరి ఊరికేనే ప్రయాణం చేయ నిశ్చయించాడు. చిన్నస్టేషనులలో టిక్కెట్టు కలెక్టరు కంట్లో దుమ్ముగొట్టడం నిమిషం. రైలెక్కాడు. బండి కదిలింది. కంపార్టుమెంటులో ఒక సాధు కూర్చున్నాడు. అతనిపేరు సాధు శాంతారామ్. రామకృష్ణ మిషనుకు చెందిన వాడు. అతడు కొంత ఇంగ్లీషు పఠించాడు. ఇద్దరికీ బాతాఖానీ బాగాసాగింది. స్నేహముకలిసింది. తనదగ్గిర చపాటీ తినడాని కిచ్చాడు సాధువు. విష్ణురావు తిన్నాడు. ఇంతలో బెజవాడవచ్చారు. టిక్కెట్టు కలెక్టర్లు బండీకొకడు ఎక్కారు తలుపులు తాళాలు వైచి.

ఏలాగరా భగవంతుడా యని విష్ణురావు తల్లడిల్లి పోతున్నాడు. శాంతారాముకూడా మెడ్రాసుకే ప్రయాణం చేస్తున్నాడు. తన టిక్కెట్టు విష్ణురావు కిచ్చి టిక్కెట్టు చూపవలసినదని అతనితో చెప్పి బహిర్దేశాని కరిగినాడు. టిక్కెట్టు కలెక్టరువచ్చి తన్ను టిక్కెట్టు అడిగినాడు. అతనిదగ్గిరలేదు. సాధు టిక్కెట్టునే నా టిక్కెట్టు అని అతని చేతి కిచ్చాడు. అతడు దాన్ని కత్తిరించి తనకిచ్చి 'ఆజేగురుగుడ్డలవాడు పాకీదొడ్లో దూరాడా?' అని ప్రశ్నించెను; రాగానే వాణ్ణి పట్టుకొని వాడేమి మొరపెట్టుకున్నా వినకుండా రైల్లో నుంచి దింపించి బయటికి వెళ్ళగొట్టాడు. విష్ణురావు సుఖంగా చెన్నపట్నం చేరాడు. సాధువులను పాడుచేస్తే విష్ణురావు ఎప్పుడైనా బాగుపడతాడా? కమిషను ఇంటర్‌వ్యూలో విష్ణురావుని అక్కరలేదు పొమ్మన్నారు. చేతిలో రూపాయలు ఖర్చు అయిపోయినాయి. సాధువుని మోసంచేసినా ఫలం లేకపోయిందిగదా యని అతని హృదయంలో ఒకవిధమైన ఆవేదన బయలుదేరింది. కూమునదీతీరాన్నే వెళుతూ యున్నాడు. అందులో పడి ఆత్మహత్య యొనర్చుకొన్నాడు. పాపం బంధువులంతా స్వగ్రామములో విచారించారు. లోకం మళ్ళీ ఎప్పటియట్ల సాగిపోతూయున్నది.

# పట్టాలు జాగ్రత్త

శ్రీమతి పోడూరి రత్నావళిగారు

౧

భాస్కరరావుగారికి ఒకత్తే కూతురు. ఆ పిల్ల చిన్నప్పటినుంచి వాళ్ల బామ్మ వెంకాయమ్మగారి దగ్గరే పెరిగింది. నాలుగేళ్లొచ్చాయో లేదో పెళ్లి మాట యేం ఆలోచించావురా అంటు భాస్కరరావు గార్ని నిలేసింది వెంకాయమ్మగారు సావిట్లో ఒక రోజున. 'ఇప్పటినుంచీ ఆలోచించేదేమిటి? సరిగ్గా వాలుగేళ్లైనా నిండలేదు. అది కాకపోయినా యిప్పుడేం పెళ్లి. ఇదివర్లాకాస్కరు శారదాబిల్లొచ్చింది అని చెపుతూ చిలకొయ్యమన్న కండువా తీసుకొని వీధులోకి వెళ్లపోతాడు భాస్కరరావుగారు 'ఏం నిర్లక్ష్యంరా నీకు? చెప్పేది వింటూనే ఎగడిపోతావు శారదాబిల్లంటో. చేసేవాళ్లంతా చేసుకోడంల్లా?! మనకే తగులడింది ఆ శారదాబిల్లు, శారదాబిల్లూనూ. చలపతిరావుగారి కొడుకు యిన్యూలుఫేసు ప్యాసవుతాట్ట. కావలసిన సమంధం, కొద్దో గొప్పో మనకి వాళ్లకి గౌరవమంటో వచ్చిందిగా అన్నీ గొరుక్కుపోయినా!! ఏం తీపా! చేసెయ్యరాదూ. పెద్ద ముండాకొడుకు యింటికొచ్చి నోరెట్టు కడిగాడు' అంటూ సతాయింపు గుక్కతిరక్కుండ మొదలెట్టింది వెంకాయమ్మగారు. భాస్కరరావు ఆలోచించాడు. ఏంలాభం కనబడలేదు. 'సరే రేపు పంచమీ బుధవారం మంచిది. వెళ్లి తాంబూలాలు పుచ్చుకొస్తా' అని వెళ్లిపోయాడు. పెళ్లి నిశ్చయమయింది. పరాసుపేటనుంచి దిగారు పది రోజులకు పెళ్లిచేసుకొని. 'పిల్లకు ప్రస్తుతం పట్టాలుపెట్టారు. తరువాత ఎప్పుడో రు. 700 నగలు చేయిస్తారట! వాళ్ల ముఖం' అంటూ బండీలోనుంచి దిగింది వెంకాయమ్మగారు.

౨

'అమ్మాయీ ఊరికే వళ్లు తెలియకుండా అస్తమానం తిరుగుతూవుంటావు. పట్టాలు జాగ్రత్త సుమా, ఉన్నవి అవియొక్కటే ప్రస్తుతం' అంటూ పిల్లకంటికి కనబడినప్పుడల్లా చెపుతూఉండేది వెంకాయమ్మగారు రాత్రుళ్లు తనదగ్గరే పడుకోపెట్టుకొని అప్పుడప్పుడు లేచి పిల్లకాళ్లు తడుముతూ ఉండేది పట్టాలు ఉన్నాయో ఊడాయో అని. ఇట్లా ఉండగ మామగార్కి తమ అల్లుడు తమ్ముడు వడుగు అమ్మాయితో సహా రావలసిందని బండీతోసహా కబురొచ్చింది. 'అమ్మాయీ, పట్టాలు జాగ్రత్త సుమా. అక్కడకు వెళ్లి ఆ ఆడబిడ్డను యీ ఆడబిడ్డను రాసుకుంటూ తిరక్క పట్టాలు కూడా చూసుకుంటూ తిరుగు. సీల అసలే వదులుగా కూడాయుంది' అని గట్టిగ చెప్పడం మొదలెట్టింది వెంకాయమ్మగారు పిల్లకు. బండివాడు ప్రొద్దెక్కిందని తొందరపడుతున్నాడు అటతాళంమీద. పిల్లనెవరు తీసుకెళతారన్నాడు భాస్కరరావు. నే తీసుకెడతానంది పెళ్లాం. కాని వెంకాయమ్మగారి కడుపులో అప్పుడే కదులుతున్నాయి అగ్నికణాలు. అప్పుడే ఎక్కారు పిల్లతల్లి బండి. ఎక్కడంతోటే బండి సాగింది. ఇంతట్లోకే భాస్కరరావుగారి యింట్లో చెంబులు తప్పాళాలు మొదలైన పాతర సామాను పెంకు లెగిరిపోయేటట్లు మ్రోగుతున్నాయి. 'ఏమమ్మ నీవుకూడా వెడదామని ఉందా ఏమిటి' అన్నాడు భాస్కరరావు అది కనిపెట్టి. 'నేనుకూడా ఎందుకు పంపావుకాదు ప్రతులను రెండు, దొండు— దొంద ఒళ్లుతెలియకుండా కొళ్లుకబుర్లు చెప్పుకుంటూ ఉండడానికి' అని విసుక్కుంటూ అంది వెంకాయమ్మ. భాస్కరరావు ఏమనుకున్నాడో బండినాపించి వెంకాయమ్మగార్నికూడా ఎక్కించాడు. 'నేనుకూడా? వెడితే నీ భోజన మెక్కడా' అంది వెంకాయమ్మ. 'ఏ హోటల్లోనో ఏడుస్తాలే ఆవేళకు' అంటూ భాస్కరరావుగారు దిగడ్డారు.

# శారద లేఖలు

నెచ్చెలీ! కల్పలతా! భక్తిరసభరితమగు నొక నాటకమునందు స్త్రీల ననమానపఱచెడి యొక రంగ మసందర్భముగా చేర్చబడుటయు, 'కాలేజీగరల్' అను పేరుతో నొక ప్రత్యేక నాటకమే వెలువడుటయు, మఱికొన్ని యిట్టివే ప్రహసనములు, కథలు, వ్యాసరాలు వెలువడుచుండుటయు నేను గూడ చూచుచేయున్నాను. వీనికి తోడుగా 7-7-34 తేదీని ఆంధ్రపత్రికయందు ప్రచురితమైన వసంతలేఖయు నున్నది.

బహుశా యీరచయితలెల్లరి యుద్దేశము యీనిందాగర్భితరచనలచే ఉన్నతవిద్యాభ్యాసముచేసియు దుశ్శీలలై వర్తించెడి యువతుల మనోవృత్తులు చక్కబడునని యేమో; కాని యిది అపోహ. చెడ్డపనులుచేయువా రెప్పుడును, లోకభీతికిని పాపభీతికిని, వెఱువనివారుగనే యుందురు. వెఱపున్నచో వారి దుర్వృత్తి సాగుటెట్లు? కాన వీరి రచనలు వారిని బాగుచేయగలవనుట భ్రాంతి. వారు బాగుపడుట లేకపోగా యిట్టి వ్రాతల వలన శీలమర్యాదలు చెడకుండ నున్నతవిద్య నభ్యసించిన యువతీరత్నముల మృదుల హృదయముల నెంతయైన నొవ్వజేయుచున్నారు. స్త్రీల శీలముచెడుటకు కళాశాల పట్టభద్రతయే కావలయునా? విద్యావిహీనలలో దుశ్శీల లుండుటలేదా? అయినను విద్యావతుల హృదయములు వ్రీలునట్లు వీరిట్లు వ్రాయనేల? వీరిపై స్త్రీలు కలమెత్తరు గదా యని ధైర్యముచేతనా? స్త్రీల విద్యాభివృద్ధినిచూచి యోర్వలేకనా? మన వలెనే వీరును విద్యావతులగుదురో మన మాట వినరేమో యనెడి స్వార్థభయముచేతనా? ఏదియోకారణ ముండియుండవలయును. స్త్రీల నొకవిధమగు పశువుల వలెను, యంత్రములవలెను, తదితరానేక జడోపకరణములవలెను చూడ నలవాటు పడిన వారికి స్త్రీలలో గల్గుచున్న విద్యావికాసము, స్వసంఘశ్రేయోభిలాష, దృష్టికి దుస్సహమై వేదనగల్గించుటచే ఆవేదన మనసునందిముడక పోవుటవలన నిట్టి రచనల వెలువరించుచున్నటులున్నది. స్త్రీలు ఉన్నతవిద్య నభ్యసించుట లోకసాధారణము కాకుండుటచే తమ్ము యెవరేమి యందురో యని చదువుకొనిన వారు సామాన్యముగనే యుందురు. ఎక్కడ లేని విపరీతపునాగరికతయు నిజముగా చదువురాని స్త్రీలయందే కనిపించుచున్నది. విద్యావతులైన స్త్రీలే సాధారణముగా భర్తయం దెక్కువ ప్రేమతోను, గృహకృత్యములయం దెక్కువ శ్రద్ధతోను ధనవ్యయమునం దెక్కువ పొదుపుతోను ప్రవర్తించు



'గర్బా' నృత్యము

బొంబాయి యస్.యన్.డి.టి. కళాశాల చతుర్థవార్షికోత్సవమున

విద్యార్థినులచే ప్రదర్శింపబడినది.

చుందురు. ఎక్కువగా చదువుకొనిన స్త్రీలు మర్యాదగా నుండరను నపవాదొకటి లోకమున వ్యాపించియుండుటచే వారు తమ జీవితము నాదర్శనీయముగా జేసికొనుటకై అట్లు మెలకువతో వర్తించుచున్నారు. అధిక సంఖ్యాకులు వీరే యనుటకు సందియము లేదు. విధికృతమున వీరిలోఁగూడ అందఱిలో నున్నటులనే కొందఱు దుశ్శీలలుండవచ్చును. విద్య దూష్యమగునా? చదువుకొనినవారు దుర్వినీతు లగుదురా? విద్య యసలు అనర్థహేతువా? అయిన స్త్రీపురుషుల కన్ని విద్యాశాల లెందులకు? ఇవియు చాలవని గగ్గో లెందులకు? స్త్రీకి మాత్రమే విద్య పనికిరాదా? అయిన బాలికాపాఠశాల లెత్తివేయించరాదా? లేక కళాశాల విద్య మాత్రమే చెట్టచేయునా? అయినచో కళాశాలలలో బాలికలు ప్రవేశింపకుండ నిరోధింపరాదా? అటుగాక విద్యావతులగు స్త్రీల నపహేళనము చేయుచుండుట యుచితముకాదు.

కేవలము విద్యావతులగు స్త్రీలను మాత్రమే యిట్లు పేరెత్తి చూపుటేలనో నాకు గ్రాహ్యము కాకున్నది. చదువురానివారెల్లరు మంచివారనియే వీరి యుద్దేశమా? మాయింటిప్రక్క నొక అవధానులుగారు కాపురముండిరి. పాప మా బ్రాహ్మణుఁడు కడునిష్ఠాపరుఁడు, వైశ్వదేవము చేసిన వాఁడగుట యొరులచేతివంట భుజింపఁడు. ఆయన భార్య యొకనాఁడును పిడికెడన్నము వండి యాయన విస్తరిలో పెట్టదు. పర్యవసానమేమనగా నిత్యము ఆయన చేయికాల్చుకొనిననే కడుపునిండును. లేకున్న లేదు. ఈమెకొక యక్షరపుముక్కయైనను రాదు. కాని యామె భర్తనింత నిష్ఠురముగా జూచునేల? ఒక న్యాయస్థానోద్యోగియున్నాఁడు. పెద్దవాఁడైనాఁడు; పెన్షను పుచ్చుకున్నాఁడు. ఆస్తిపాస్తులున్నవి. ఆయనభార్య వంటచేసి పెట్టనందున వచ్చి హోటలులో ప్రవేశించినాఁడు. ఈవిధముగా ఆయన పూటకూటింట జీవితము గడపుచుండ ఆమె యందులకు [illegible]శీయపడకపోగా పైగా యుపకారమేమనగా నామగనికి మీరేల భోజనము పెట్టెదరని నిత్యము హోటలువారితో పోట్లాడిపోవుచుండును. తాను వండిపెట్టదు సరిగదా ఆయననే పూటకూటింటనైన తిని బ్రదుకనీయదేమని విచారింప ఆయన యింటనున్నప్పుడు ఆమెకు బిడ్డలకు గూడ వండిపెట్టువాఁడట. ఇప్పుడామె తనకు తనబిడ్డలకు వండుకొనవలసి వచ్చుచున్నదట. ఈమె చదువుమొగ మెఱుగని యిల్లాలేసుమా!

ఒక గ్రామములో నొక స్త్రీ యుండెను. ఆమెకు పెనిమిటి లంచము పట్టుటలో నసమర్థుఁడని యాతనిపై తగని కోపము. ఒకనాఁడా కోప మాపుకొనలేక యామె పచ్చడి నూరుచున్న రోకలిబండ నాతనిపై విసరెను. అది యాతని మోకాలిచిప్పకు దగిలెను. అయ్యో కుంటుచుంటి రేమని యెవరైన నడిగినచో ఆ పెద్దమనిషి పరువుగలవాఁడగుట 'సర్క్యూటుకు వెళ్లినప్పుడు బండిమీదనుంచి పడుటచే మోకాలికి దెబ్బ తగిలిన'దని చెప్ప దొడంగెను. ఈమెకును విద్యాజ్ఞానములేదు. వీరందఱు విద్యా

జ్ఞానములేని సాధ్వీమణులే గదా. వీరిలో నింత పశుత్వమేల? కాన విద్యావిహీనత స్త్రీలను యోగ్యలనుగా జేయుననియు, విద్యావతులు చెడిపోదురనియు భావించుట పొరబాటు.

విద్యావిహీనురాలగుటచే స్త్రీ యెంత వివేకతాసమర్థతలున్నను అనేక వ్యవహారములలో పురుషులచే వంచింపబడుచు నాస్తిపాస్తులను గోల్పోవుచు నిరాధారయగుచున్నది. ఇతరుల కుపకారములేకున్న మానె తమ పనులను తాము చక్కబెట్టుకొనుటకైనను స్త్రీలు చదువుకొనుట యావశ్యకము.

వసంతలేఖయం దుదాహృతమైన సతీపతుల సన్నివేశ మతివిచిత్రమైనది. ఎటువంటి దుర్మార్గస్త్రీగాని యటుల ప్రవర్తించియుండుట అసంభవము. అందును విద్యాధికుడగు పెనిమిటిపట్ల నట్లక్రమముగావర్తించుట కసలే యధికారములేదు.

నేడు స్త్రీ లేకొంచముగానో చదువుచున్నను, సర్వాధికారములు పురుషహస్తగతములై యేయున్నవి. ఆతడు భార్య పెట్టిన పాట్లన్నియు పడవలసిన పనిలేదు. అతడు భార్యను విడనాడవచ్చును. మరల వివాహము చేసికొనవచ్చును. ఇల్లు వదలి పోవచ్చును. సన్యాసము పుచ్చుకొనవచ్చును. భార్యను ఎన్నివిధముల హింసించి పరిత్యజించినను తుదకు హత్య చేసినను నిరాక్షేపణగా జీవించుటకు పురుషున కవకాశమున్నది. పురుషుడు సర్వస్వతంత్రుడు. స్త్రీ తదాశ్రితప్రాణి. లోకధర్మ మిట్లుండ అతడు భార్య అడుపాజ్ఞలకు ఒదిగియుండి కాఫీకాచి యివ్వవలసిన కర్తవ్యమేమి? మఱియు నతడు విద్యాధికుడును ఉద్యోగనిపుణుడు కాన నతడసలే భార్య ఆజ్ఞానువర్తియైయుండ నగత్యములేదు. మామగారి వద్ద తీసికొనిన కట్నమునకై యాతడు భార్యకు భృత్యుడు కావలసిన పనిలేదు. అట్టి యేర్పాటుతో నాతడు కట్నమును గీసికొని యుండలేదు. కాన అతడట్లు చేయకున్నచో వెనుకతీసుకొనిన కట్న మతనిని సేవకునిగా నిర్బంధించదు. చిరకాలమునుండి నే నెఱిగియున్న యొక కుటుంబమున్నది. ఆమెకు భర్త తన యిష్టముపై యున్నతవిద్య చెప్పించెను. ఆమెకు నూరు రూప్యముల వేతనము. ఆమెభర్త ఉద్యోగము సేయుటలేదు. ఆ జీతపురూక లామె తీసికొనివచ్చి భర్త హస్తమున నిడును. ఆయనే యజమాని. బయటికివెళ్లిన నుద్యోగిని; ఇంటికి వచ్చినచో భర్త చెప్పుచేతలలో మెలగు యిల్లాలు. తాను డబ్బు తెచ్చుచుంటినను గర్వ మామె కేనాడునులేదు. గృహకృత్యము లామె యాతనిపై నిడదు. ఇటనున్నంతసేపు గృహకృత్యములు చేయును. భర్త నుపచరించును. బిడ్డలను చూచుకొనును. వారి కుటుంబమునం దెప్పుడుగాని కలహము లుద్భవించినట్లు నేను చూడలేదు.

ఇట్టి యిల్లాం డ్రెందఱోయుండగా విద్యావతులగు నారీమణులపై విచిత్రకల్పనలు

కల్పించి యేదియో వ్యాజమున దూషించు చుండుట వారి కేమి కీర్తికరమో తెలియకున్నది. స్త్రీ పురుషుల మనోభావములలో మార్పు గల్గినదనుట కెక్కడనో నాటకములలో సంభాషణాసందర్భమున కల్పించి వ్రాయబడిన పద్యము దృష్టాంతము కాజాలదు. ఒకవేళ నట్టిమార్పు గల్గుచుండుట నిజమేయగుచో నందుకు సృష్టికర్తయే బాధ్యుడు. అప్పుడును స్త్రీలు బాధ్యులు కారు. కాన వారిని నిందించుట తగదు. కాన విద్యావతులగు స్త్రీల మనఃబులు నొచ్చున ట్లిట్టి వ్రాతలు సోదరులు వ్రాయకుందురుగాక.

మఱియు మన స్త్రీలు నాత్మగౌరవము గలవారైనచో స్త్రీలు దూషించెడి నాటకములను రచనలను బహిష్కరించుట యుక్తము. కాని యట్టి నాటకములలో స్త్రీలు పాత్రధారణ చేయుచుండిరని తెలియుచుండ నొరులు వ్రాసినదానికి కినిసిన ప్రయోజనమేమి? కల్పలతా! ఇంతకును విద్యావతులైన స్త్రీలలో విచ్చలవిడిగా ప్రవర్తించువారొకరిద్దఱుండుటచేతనే విద్యావతులైన స్త్రీ లిట్టి నిందావాక్యములకు గురి కావలసివచ్చుచున్నది. ఇది స్త్రీ లెల్లరికిని నవమానకరము; మఱియు స్వసంఘ శ్రేయమునకును హానికరము. కాన విద్యాభిలాషలగు స్త్రీలు విద్యతోబాటు వినీతవర్తనమును నలవర్చుకొని పరిశుద్ధజీవనమును గడుపగలుగుదురేని స్త్రీ సంఘమునకు యశోభివృద్ధులు గూర్చినవారయ్యెదరు! మఱి స్త్రీలపై విపరీతగాథ లల్లుటకును నితరుల కవకాశము లేకుండబోవును.

ఇట్లు
శారద.

---

## 'ఆంధ్రుల యాడుబిడ్డ!'

కర్లపాలెం, కృష్ణారావుగారు

కనుబొమల్ ముడిపెట్టి, కాంచుమునల్దెసల్ వైరులగుండెలు పగులులాగు,
గాజులు 'ఘల్లన' కరమెత్తిశాసించు దుర్మార్గులెల్లరు తొలగిపోవ,
మోనిపై చిరునవ్వు మొలకలెత్తింపుము జగమెల్లహాయిగా చల్లబడగ,
అరమోడ్పుకన్నుల నందంబుజిల్కుము కనకాభిషేకంబు గలుగునట్లు,

పాడుపడమటిగాలికి వాడియున్న
నేటియువకుల హృదయాలనాటుకొనగ,
రాలుగరుగంగ, దివ్యానురాగమొదవ
పాడుమోయమ్మ! ఆంధ్రులయాడుబిడ్డ!

# హాస్యకళ

## వెంకయ్య తండ్రి

శ్రీమతి శివలెంక రాజేశ్వరిగారు

ఒరేయి—నాయినా! యిహ ఆ దూడదగ్గిర పేడ అంతేట్రా? వాకిలి ఎల్లాఉందో చూశావూ? బ్రాహ్మలకొంపేనా మన్ది ఆవీధిని బండ వెంకట్రాజుగారిల్లు చూడు. ఆడవాళ్ళు ప్రజల కళ్ళుపడకపోయినా తెల్లారకుండా దూళ్లదగ్గిర బాగుచేసుకుని వాకలి పళ్లెంలా పెట్టుకుంటారు. యిక నీ తెలివి నే బతికున్నన్నాళ్ళు యిల్లా తెల్లారిపోవలసినదే !!

ఏమిటయ్యా నాన్నా! నిన్ననే నాపీట విరిగేటట్టు బాదాను, దూడకి చిట్టు తిన్నగా పెట్టటం లేదని. మళ్లీ పొద్దుపొడిచేటప్పటికి ఒళ్ళు దులిపేసుకుంది. "ఏమేవ్! యీపూట పేడతియ్యటం ఎగపెట్టావూ? నిన్ను నేను లొంగదియ్యలేననా నీయభిప్రాయం. నీకేనా ఉండాలి వినుగు నాకేనా ఉండాలి. యిల్లా రా నీసంగతని గదులో లేనుకుట్టుకుంటున్న పిల్లని అమాంతంగా జుట్టుపట్టుకుని, తిన్నగా వీధిలోకి యీడ్చుకొచ్చి రెండుగుద్దులు ఢంఢంమనిపించి, ఓ తన్ను తన్ని, సూదివిసగగొట్టి జబ్బసత్తువకొద్ది గిరవాటెట్టి, సగం కుట్టిన లేసుపూలు చింపి కిందపారేసి కాలితో రాసి కసితీరక వాటిమీదతుబుక్కున ఉమ్మి వేసి, మళ్ళి జెడచేత్తో పుచ్చుకోపోతున్నాడు.

ఆసమయానికే రెండో పట శిస్తువసూలు నిమిత్తం బయలుదేరిన గ్రామమునసబు పాపయ్య, యిద్దరు వెట్టివాళ్ళు వెనకరా ఆయింటి గుమ్మందగ్గిర కొచ్చేసరికి యీదృశ్యం సిద్ధమయింది. నిర్ఘాంతపోయి ఆపుకోలేక పాపం ఆఆసామీ 'యిదేమిటయ్యా వెంకయ్యగారూ, బ్రాహ్మలుకూడాను. ఆపిల్లనల్లా వీధిలోకి తీసుకొచ్చి కొట్టడం మీవంటివారికి తగిన పని కాదండి' అన్నాడు.

'ఏమిటోయి నీపెత్తనదారీఅంతా!! ఎవడిపెళ్ళాన్ని వాడు బుద్ధిచెప్పుకుంటుంటే అడ్డం రావడంకూడానా ఏమిటి!! మాపుత్రాడు చెప్పినమాట వినకపోతే వాడిపెళ్ళానికి వాడు బుద్ధిచెప్పుకుంటే మనకెందుకూ. నీదారిని నీవు వెళ్ళుమూ' అన్నాడు వెంకయ్య తండ్రి. యీమాట ముసలాయన నోటినుంచి వచ్చేసరికి మునసబు, కూడావున్న వెట్టివాళ్ళు "యిదెక్కడి తంతయ్యా" అని ఒకళ్ళమొఖం ఒకరుచూచుకుని నవ్వ ఆరంభించారు.

"ఎవళ్లురా మీరు? మీతాళ్ళు తెగా! బ్రాహ్మల గుమ్మందగ్గిరే గింజుకుంటున్నారు. మీకళ్ళు నెత్తిమీదికొస్తున్నాయి లెండి, మీకో గాంధిముండాకొడుకు దొరికాడు. వాడిధర్మమా అని మీరు మామీద తిరగబడి మమ్మల్ని వెక్కిరించడందాకా వచ్చింది. నోరెత్తారంటే డొక్క బద్దలుచేయిస్తాను. నోరు మూసుకుపొండి నాగుమ్మందగ్గిరనుంచి—ఏమోయి పాపయ్యా నువ్వు మునసబు వయితే అయావు, యింక దయచెయ్యి యిక్కడినుంచి వాళ్ళను తీసుకుని. ఇదుగో: ఆపిల్ల మాయింటికి కోడలుకాదు. భూతకి దాపరించింది. మాపుత్రాడు యీకాలంవాడు కాదు కాబట్టి భరిస్తున్నాడు. మేముకాగా ప్రపంచంకోసం సహిస్తున్నాము. నీకేం తెలుసు దానిసంగతి. తెల్లారి లేవటంతోటే కాఫీ కాచుకుతాగటం పొయ్యిమీద గిన్నెపడేసి లేసుకుందెట్టుకు కూచోటం, మెతుకులు వాటంతట అవి ఉడకవలసినదే. తినేవాళ్ళకి దంతసిరి ఉంటే సరిగాఉంటుంది. లేకపోతే లేదు. యింతకీ మా కీఅవస్థ లేదు. మావాళ్ళు పుట్టింటికెళ్లమట్టి యీవిడ ఒండడం పెట్టడంవచ్చింది. లేకపోతే దానిచేత నైనట్టు ఏగొడవలేకుండగా రెండుపూటలకీ శుభ్రంగా ఓమాటే ఉడకేసిపెట్టేది. ఏమో పెద్దవాడి నయాను.

ఎందుకు ఒద్దండం అని యీమధ్య వాళ్లవాళ్ళు, వాళ్ల పక్కయింటిపిల్లకి వచ్చేదశమినాడు గాజులు తొడిగిస్తారు పంపమనివస్తే పంపించాను. అదే యిప్పుడు యీపిల్లకి పట్టినపిశాచమునూ. అగనైఏళ్ళవచ్చిన అత్తగారు ఏటేట పుట్టింటికెళ్లి ఏటికి ఆరునెల్లు కూర్చోటమేమిటని".

"ఊరుకోవయ్యా నాన్నా మనగోడవంతా వీళ్లతో వెళ్ళబోసుకోవాలా ఏమిటి. నాకెపరడ్డం రాగలరు. ఏమయ్యోయి, పాపయ్యగారు మీరాశ్రేట్టి కలగజేసుకున్నారంటే మీరిక్కడుండగానే మళ్లొతన్నా. నాసంగతింకా మీకు తెలియదు. ఓమాత్రానికి జడిసి యింట్లోకి పరిగెత్తే వాజమ్మనికాను. యీవిడే మహా తెలివైందనీ, అందకత్తెనీ, నాగరికురాలనీ, మేమంతా దూడల్లోలెఖ్క అని యీవిడ అభిప్రాయం. ఏం నేనుమాత్రం చదువుకోలేదూ పైమెరికిదాకాను. మా నాన్నమాత్రమేం అంతకంటే ఎక్కువ చదివాడా ఏమిటి ఆయన చిన్నతనంలో! మానాన్నకి మాఅమ్మకి ఏమిలోటు. యిల్లువాకలీ, దూడదుడికే చక్కపెట్టుకోడానికి నేచదువుకున్నది చాలదా ఏమిటి. పెద్ద చదువులు చదువుకున్నవాళ్లని ఎందరిని చూట్టంలేదు. గొంపగోడి అమ్ముకుని తిండిలేక ఏడుస్తున్నవాళ్లని. యింటికి యిల్లాంటి పెద్దమ్మలు దాపరించమట్టే నువ్వు నువ్వు వీథమ్మట వెళ్లేవాళ్ళు తిన్నగా వెళ్లకుండా వేలెట్టి చూపెట్టడందాకా వచ్చింది. ఏం పేడతియ్యమంటే తియ్యకూడదుం! రోజూ తియ్యాదుట. ఎప్పుడైనా పాలేరాడు రాకపోతే అపుడు అల్లాంటిపనులు చేస్తుందిట. అల్లాయిమాంటె మాఅ మ్మొచ్చిదాక దూళ్లకాడాణ్ని పెట్టనేపెట్టం. పుట్టింట యీవిడ ఎల్లా పెరిగితే మాకేం. మాయింటిదగ్గర మాయిష్టం మీద నడుచుకోవలసిందే" అన్నాడు వెంకయ్య సగర్వంగా.

అప్పటికి పాపయ్యకి పూర్తిగా చికాకు కలిగింది. వెంకయ్య తెలివితక్కువకి మూర్ఖత్వానికి, జాలి, నవ్వు కూడవచ్చినా, పిల్లనిచూసి ఆ పడే దుఃవస్థకి గాబరాపడ్డాడు; మనకెందుకని ఊరుకోక ఓపబాయింపు డబాయించాలని స్థిరపర్చుకున్నాడు. డబాయింపేమిటి అందాకావస్తే అనుకున్నంతా చెయ్యాలనే సంకల్పం.

"ఏమయ్యోయి ఒకసంవత్సరాన్నుంచి సంగతంతా వింటున్నా; నేడు ప్రత్యక్షంగా చూశా. అదృష్టం కొద్ది ఆఅమ్మాయి దొరికింది. అయినింటిపిల్ల. ఆమె తండ్రిగార్ని నే బాగాఎరుగుదును. చాల గారాబంగా పెంచి, పక్కవాళ్లో యివ్వడం. దూరమిస్తే చూడకుండా ఉండలేము. ఏమో యీముసలాయనకి దత్తుడవుగదా స్థితి బాగుందని యిచ్చాడు. యిచ్చినందుకు బాగా చేస్తున్నారు. యిల్లా బాధపెటుతున్నారని వినే ఆయన యీమధ్య మంచమెక్కినట్టు విన్నాను. మళ్లిమీరు ఎప్పుడైనా ఆఅమ్మాయిని కొట్టినట్టు విన్నానంటే తండ్రికి కబురంపించి తీసుక్కెళ్లమని చెపుతా. యిల్లాంటికాపురం ఏమయితే ఏమి. మాబోటి వాళ్లయితే నీఆటలు సాగనిద్దుమా? జాగ్రత్త బుద్ధితెచ్చుకో యిక్కడినించైనా. వెళ్లమ్మా అమ్మాయి. యింట్లోకివెళ్ళు. మీ పూర్వపుణ్యాం. మీరేమిచేస్తారు. మీతండ్రిగారైన మంచిఉద్దేశంతో చేశారుగాని, చివరికివాళ్ళు యీమోస్తరుగా తయారవుతారనుకున్నారా? ఆయన చాల అమాయికుడు. మాఅందరకు ఆయనంటే అమితగౌరవం. యిక మీకు ఫరవాలేదులెండి. యిక కొడితే నేను ఊరుకోను కాస్త కబురు తెలుస్తేచాలు" అని అన్నాడు.

"ఓస్ నువ్వేంచేస్తావో చూస్తాలే. ఎవడొచ్చి పంపమన్నా పంపేవాడెవడు? గుమ్మం దాటనిస్తేకదూ?" అంటు ఆరుగెక్కాడు వెంకయ్య.

"చాల్లేవయ్యా నేర్చుకున్నావు. ఏకులం అయితేమిటి గుణం లేకపోయాక. మాణిక్యం లాంటి అమ్మాగార్ని ఎల్లా ఏడిపిస్తున్నారో. అక్కరకొత్తారెంటయ్యా మీరు, ఆఅమ్మాయి ఉసురంతా పోనుకుంటురుగాని లెండి. నడండి బాబు మునసబుగారు. మనల్ని తిడతారింక. ఆరికేటి" అన్నాడు ఓవెట్టివాడు. సరే రండ్రా అన్నాడు మునసబు నడుస్తూ.

వెంకయ్య, తండ్రి వెట్టాళ్లమాట్లకి నిర్ఘాంతపోయారు. దెబ్బతిన్న సుందరమ్మ, ఆవేళకి, మునసబు, ఎట్టాళ్ళు తనపాలిటి త్రిమూర్తులే ననుకుని, లోలోన సంతసిస్తూ, జరిగిన అవమానం, శరీరబాధకి దుఃఖం అనుభవిస్తు కళ్లనీళ్ళు కడవలైరాగా, లోన ప్రవేశించి, గదిలో మంచంమీద బోరగిలపడి ఏడ్చిఏడ్చి చివరికి నిద్రలో లీనమైంది.




## బంగాళదుంపల ఆవకాయ

శుభ్రమైన సేరు బంగాళాదుంపలను దెచ్చి పై తొక్క తీసివేసి సన్నముగా తరగవలెను. పిదప వాటికి తగుమాత్రము ఆవాలు, మిరపకాయలు, ఉప్పు వేసి కొంచెము నీళ్లు వేసి రుబ్బవలెను. ముందర తరిగిన ముక్కలను అందులోవేసి కొంచెము పసుపు, నూనె వేసి తీసివేయవలెను. పిదప అందులో నిమ్మకాయరసము పిడవవలెను. ఇవి వారము రోజులు నిలవఉండును.

## మినపపప్పు పకోడీలు

సోలెడు మినపపప్పు నానవేసి శుభ్రముగ కడిగి మెత్తగా రుబ్బవలెను. తరువాత అందులో ఉల్లిపాయలు సన్నముగా తరిగి పచ్చిమిరపకాయలు చిన్నచిన్న ముక్కలుగాచేసి కొంచెము ఉప్పు వేయవలెను. బాణలిలో నెయ్యి మరగనిచ్చి, పకోడీలవలెనే ఆ కలిపిన మినపపిండిని వేసి వేయించవలెను. వేడిగా ఉన్నప్పుడే తినిన చాల రుచిగా ఉండును.

## ఆనపకాయ హల్వా

లేత ఆనపకాయను కొబ్బరికోరువలె కోరవలెను. బెల్లముగాని, పంచదారగాని అందులో సగమునకు కలపవలెను. తరువాత అది పొయ్యిమీద పెట్టి గట్టిపడేవరకు తిప్పవలెను. రమారమి ఒక గంటకు అది గట్టిపడును. అందులో అప్పుడు ఏలకులపొడి, కొంచెము నెయ్యివేసి పళ్లెమునకు అంటకుండునట్లు నెయ్యిరాసి, పళ్లెములో ఉంచవలెను. అది చల్లారిన పిదప కత్తితో ముక్కలుగా కోయవలెను. ఈ హల్వా వారంరోజులు నిలువఉండును. రోజు ప్రొద్దున్న తిన్న పైత్యమును పోగొట్టును.

—గొల్లకోట సుందరీదేవి

## బెండకాయ పచ్చడి

లేతబెండకాయలు తెచ్చి ముచికలు కోసి యెఱ్ఱని నిప్పులలో పెట్టి అయిదునిమిషములు బాగుగకాలనిచ్చి వుడికినతరువాత దుమ్మంతయు శుభ్రముగా దులిపి గోటిలోవేసి పసుపు,చింతపండు,వుప్పువేసి మెత్తగా రుబ్బవలెను. చింతపండు తగిలిన వెంటనే బెండకాయ జిగురు యెక్కడిదక్కడ కరిగిపోయి స్వచ్ఛముగనుండును. బాగుగ నలిగినతరువాత ఒక గరిటెలో నూనె కొంచెము కాగనిచ్చి మిరపకాయలు జాస్తిగా తుంపి నూనెలోవేసి వేగినతరువాత మెంతులు, ఆవాలు వేసి చిటపటలాడనిచ్చి దింపివేసి వేగిన మిరపకాయలు మాత్రము పచ్చడితోటి కలిపి రుబ్బవలెను. తరువాత వేగిన మెంతులు రుబ్బకుండగనే పచ్చడిలో కలిపి వేయవలెను. ఇది కొత్తవారు తిని ఏమి పచ్చడో కనుక్కొంటే బహుమతికూడ యివ్వవచ్చును.

## కొబ్బరికాయ కూర

నీళ్లు కలిగిన కొబ్బరికాయలు తీసుకొచ్చి ఒలిచి సమానముగా రెండు చెక్కలగాకొట్టి ఆ చెక్కలను మరకోరముతో సన్నముగా కోరవలెను. తరువాత పొయ్యిమీద గిన్నె కాలవేసి అందులో కొంచెము నూనెవేసి కాగనిచ్చి మిరపకాయలు ముక్కలుగా కోసి అందులోవేసి వేగినతరువాత మినపపప్పు, ఆవాలు, మెంతులు వేసి వేగనిచ్చి కొబ్బరికోరు తెచ్చి గిన్నెలోవేసి కాస్తపసుపు, ఉప్పు వేసి చక్కగా చింతపండు పులుసు కలిపిపోసి యిత్తడి సిబ్బి మూతవేసి బాగుగ మగ్గనియ్యవలెను. మగ్గి పులుసు యిగిరినతరువాత ఆకులోగాని, మాయపళ్లెములోకిగాని తీసివెయ్యవలెను. నిమ్మపండ్లు వున్నయెడల చింతపండుపులుసుకు మారుగా తగినంత నిమ్మపండ్లరసము పోసిన బాగుగనుండును.

—చావలి నరసమ్మ




ఆనందగృహలక్ష్మి

శ్రీమతి ఎమ్. వి. రత్నావళిగారు

బిళహరి రాగం—రూపక తాళం.

సా ససరి దద సదపా। గప దసదప గమ గరిసా
శ్రీ ఽ లక్ష్మిఇ జయ అలక్ష్మి। అఅ నందఅ గృహా లఅక్ష్మి
గపదస ససరి దద సదపా। గప దసదప గమ గరిసా
శ్రీఇఇఇ లఅక్ష్మిఇ జయ అలక్ష్మి। అఅ నందఅ గృహా లలక్ష్మి
దసరిగమగ రిససరి దద సదపా। గప దసదప గమ గరిసా
శ్రీఇఇఇలఅ అఅక్ష్మిఇ జయ అలక్ష్మి। అఅ నందఅ గృహా లఅక్ష్మి

సరిగా పమపామ గామ రీగ సరిగపగరిసద సా
నిఇకీ ర్తిఇనేఎ నెన్న నాత రం...పొఒఒ ఓ

అనుపల్లవి

గా గగగరి గప పపాప। గప గపదద పద పసాస
ఆ రువత్సఅ రము లలోన। అమ రితివిఇ దెఎ శమేల్ల
దగ రిససా డస దపపా। గప దసదప గమ గరిసా
మఅ టలచే పఅ టలచే। భఅ క్తిఇజ్ఞఅ నం బఅగూ

సరిగా పమపామ గామ రీగ సరిగపగరిసత సా
వ్యఅసా వళులాఅ చేఎ ఏఎ నింంండిఇతిఇ వీ
గా గగగరి గప పపపా। గప గపదద పద పదసా
ఆ టలఅడు బఅ లులకూ। యువ తుడులైన అఅ క్కలకూ
దగ రిససా దస దదపప। గప దసదప గమ గరిసా
సొఒ దరసో దరి మణులకు। నిఇ తినిబాడి ధిం చితిపీ

సరిగా పమపామ గామ రీగ సరిగప గరిసద సా

సిఇజ్జా నలనీదగ నెన్న జాల నలమ్మల లలక్ష్మిఇ ఈ

చరణం

సరి గగగగగాగ రిగ గపపప

పలు విధంబులశోక పఅ కములను

గప దదదదదాద పద సపాస। గగి రిసరిగారి సపదప

పలు రకంబులచేతి పను లనెల్ల। సర శమతినైఇ దెల్పితివి

పద సదసస ససాదపగ। గా గగగగ గప దసనా

సఅ అలధ్విఇ శ్రీఈఇఇఇ। కే సరిముద్దు తన యఅఆ

సరి సరీస దస దసాద। పద పదాప గప గపాగి

అఅ అఆఅ అఅ ఆఅఅ। అఅ అఆఅ అఅ అఆఅ

రిస సరిగప గరి సదసా

అఅ అఅఅఅ అఅ అఅఆ

సరిగా పమపామ గామ రీగ సరిగపగరిసద సా

స్తిరసా భఅగ్యాంబు గాల్గు గాఅ తఅఅఅఅఅలఅ క్ష్మి

---

పైన వ్రాసిన కీర్తనకు అన్నిస్వరములు తెల్లమెట్లపైననే పలుకబడును.

* యీ గీటువున్న మ స్వరము నల్లమెట్టుపై వేయవలెను. స్వరమునకు దిగువను ——— యిట్టిగీత వున్న కొందరగాపాడి తాళము పూర్తిచేయవలెను.

## ఏల భ్రమిసెదవు!

శ్రీమతి ఎ. కోమలమ్మగారు

ఏల భ్రమిసెదవు! యిడుమల నేల బడియెదవు!!

పరుగులిడెదవదేల చెల్లెల! సరసకరిగెద వేల చెల్లెల
దూరమునకదు మెరయునట్టివి విరులనేరుట కంత బిరబిర
మురియుదేమో మంచినీళ్లని, కరము సూదులముంచు బ్రమాకులు
తిరముగా మృగతృష్టికల్ సుమి! మరుగులో కలదమ్మ బిలమట.
గోముచూపెదవేల చెల్లెల! పోతగిల్లెద వేల చెల్లెల
మోముముందర ముద్దుచూపుచు రతనమబ్బిన దంచునెమ్మది
నేమమింతయులేని విసముల జతనమున నొకమారుచూడుము
గీముపామది నమ్మబోకుము. జ్యోతిరింగణ మచటనున్నది.

మిడిసిపడెదవదేల చెల్లెల! పడమరంగని మిడుతపోలిక
మూడునిముసాలే సుమీ! ఆ పోకముల నామాట నమ్ముము.

# ఆరోగ్యబోధిని

## శిశుసంరక్షణ

నాగరికతవలన నెన్నియో అనర్థకములు కలుగుచున్నవి. వీనిలో నవనాగరికపువనితలుకూడ చేరెదరు.

సంతానము బడయుటయే స్త్రీలకు ప్రథమ కర్తవ్యము. అందువలననే వారు భగవంతునికృపను ప్రజల గౌరవమును బడయగలుగుదురు. స్త్రీలకు సభావేదికలు, క్లబ్బులు కచ్చేరీలు మున్నగునవి ప్రథమ కర్తవ్యములుగావు; కాని యీవిషయములు యిప్పటి నాజూకుస్త్రీలు గ్రహించుటలేదు. వీరు సంతానవతులైనను తమ శిశువులకు తమ స్తన్యము నియ్యరు. స్వయముగా శిశువులను పెంచరు. చదువును జ్ఞానమును శుచి శుభ్రతలులేని ఒకదాసికి తమ శిశువు నప్పగించెదరు. అందువలన శిశువులకు చాలా హాని కలుగుచున్నది.

శిశువుకు తల్లిచనుబాలే మిక్కిలి బాగుగా సరిపడును. చనుబాలలోని ద్రవ్యము లన్నియును సరిగానుండును గాన నవి శిశువునకు సులభముగా జీర్ణమై పుష్టినిచ్చును. చనుబాలలో విటమినులు అను ప్రధానాహారద్రవ్యములుకలవు. చనుబాలను కాచరు గాన నివి అంతరింపవు. ఆరోగ్యవతియగు తల్లి చనుబాలలో విషక్రిములు యేవియు నుండవు. తల్లి స్తనమును శిశువు కరచిపెట్టి చనుగుడుచును గాన మధ్యగా నీపాలు చెడిపోవుట కెట్టి యవకాశమును లేదు. వ్యాధులనుండి శిశువులను కాపాడునట్టి రక్షకక్రిములు గూడ స్తన్యములలో నున్నవి. శత్రువులు పారిసు నగరమును ముట్టడించినపుడు స్త్రీలందరును తామే తమ శిశువులకు స్తన్యము లియ్యవలసిన నిర్బంధము కలిగినది. గాన నపుడు శిశువుల మరణములు మిక్కిలి తక్కువగా నుండెను. యిరోపా మహాసంగ్రామము జరిగినపుడు జర్మనీలో లభించెడిపాలను ప్రజలందరికిని దొరతనమువారు కొద్దికొద్దిగా పంచియిచ్చుటచే శిశువులకు పోయుటకు ఆవుపాలు లభించనందున తల్లులే పాలియ్యవలసి వచ్చినది. అందువలన నచటగూడ నపుడు శిశువుల మరణములు తగ్గినవి. (ఒకస్త్రీ తన శిశువును శ్రద్ధతో పోషింపనొల్లనిచో ఆమె సంతాననిరోధకవిధానము నవలంబించుటయే మంచి పనిగాని సంతానవతియై శిశువును సరిగా పోషింపకుండుట అనుచితము.)

క్రొత్తగాపుట్టిన శిశువుకు యెప్పటినుండి పాలియ్యవలె ననునది మరియొకప్రశ్న. ప్రసవమైన మూడవ నాడుగాని సామాన్యముగా తల్లికి స్తన్యమేర్పడదు. అయినను శిశువుపుట్టి నప్పటినుండియు తల్లి చనుగుడుపుచుండుటవలన చాలా లాభములు ఏర్పడును. దీనిని శిశువు త్రాగుటవలన పుష్టికలుగుటయేగాక సుఖవిరేచనముగూడ నగును. చనుగుడుచు పద్ధతి శిశువుకు అలవాటగును. శిశువు చనుగుడుటవలన తల్లికి త్వరగా పాలుపడును. గర్భాశయము ముడుచుకొనును. శిశువు చనుగుడువదని చాలామంది స్త్రీలు చెప్పుచుందురు. ఇందువలన మొన సరిగా ఏర్పడక బిడ్డనోటికి బాగా అందక పాలధార సరిగా నోటికి తగులకపోవుట మరియొక కారణముగాన తొందరపడి శిశువు చనుగుడవదని నిశ్చయింపగూడదు. కొన్నిరోజులపాటు అలవాటు చేయవలయును. శిశువుకు చన్నుకుడుపుచున్నచో మొదట స్తన్యమేర్పడని స్త్రీలకుకూడ కొన్నిరోజులైన పిమ్మట, స్తన్యమేర్పడును. శిశువుకు చనుకుడుచుట అలవాటగును. తల్లికి పాలుపడును. కొందరు రొమ్ముగొట్టము (బ్రేస్టుపంపు) నుపయోగించెదరు. ఇందువలన శిశువు చనుగుడువ జాలదు గాన త్వరలోనే స్తన్యమింకిపోవును.

శిశువులకు పాలు ఇచ్చుటలో ప్రతిదినము వేళలకు పాలిచ్చుచుండవలెను. అనాలోచితముగా పాలిచ్చుట వలననే శిశువులకు ఎల్లప్పుడు అజీర్ణవ్యాధులుకలుగును. శిశువుపుట్టిన నిమిషమునుండియు సరియైన అలవాటు చేయవలయును. మొదటిరోజున, మూడుసారులు. తరువాత రెండుగంటల కొకసారియు చనుగుడుపవలయును. శిశువు బలిష్టముగా నున్నచో మూడుగంటల కొకసారి పాలిచ్చిన చాలును.

మొదట 5-6 వారములవరకు ఉదయము 6 గంటల మొదలు రాత్రి 10 గంటలవరకు రెండుగంటల కొకసారి తరువాత మూడుగంటల కొకసారి పాలియ్యవచ్చును. ప్రారంభములో రాత్రి రెండుసారులు, తరువాత రాత్రి వక్కసారి పాలిచ్చిన చాలును. వక ప్రక్కనే గాకుండా రెండుప్రక్కలను మార్చి ఇచ్చుచుండవలయును.

తల్లిపాలు శిశువుకు చాలకపోవచ్చును. వాటివలన సరియైన పుష్టి కలుగకపోవచ్చును. పాలు మిక్కిలి పలుచగానున్నచో శిశువుకు పుష్టికలుగదు సరికదా శిశువుశరీరము లావెక్కుట గూడ తటస్థించును. అలసట, ఆహారము సరియైనది లేకపోవుట ఆందోళనము. మందులుతినుట మున్నగుకారణములవలన తల్లులకు పాలు సరిగా నుండవు. అపుడు తల్లికి సంపూర్ణమగు విశ్రాంతి ఇయ్యవలెను. గాలి బాగుగా తగులవలెను. ఎట్టి ఆందోళనము ఉండగూడదు. చాలాసేపు నిద్రించవలయును. మాంసము, చేపలు, గ్రుడ్లు పాలు మున్నగు మాంసకృత్తులుగల ఆహారములను హెచ్చుగా నామె తినుచుండవలయును. అపుడు పాలు బాగుగా కలుగును. బార్లీవాటరు మొదలగు పానీయములు హెచ్చుగా త్రాగుటవలన, గూడ పాలు అధికమగును.

మనదేశమున నిపుడు చాలామంది స్త్రీలు శిశువులు ఏడ్చినపుడు నట్టిరబ్బరు చనుమొనలను శిశువుల నోటబెట్టుచుందురు. అది చాలా హానికరము. దీనివలన విదేశీయులగు వర్తకులకు మనము ధనము ఒసగుటయే గాక మనశిశువుల ఆరోగ్యమును చేతులారా పాడు చేయుటకూడ తటస్థించుచున్నది.

ఈరబ్బరు మొనలను శిశువునోట బెట్టినపుడు అవి జారి రోడ్డుమీదనో, తూముకాలువలలోనో పడినచో అవి తుడిచి మరల నోటపెట్టుదురు. దానిలో విషక్రిములుచేరును. అవి శిశువుల శరీరములో ప్రవేశించి దారుణవ్యాధులు కలిగించును. ఈరీతిగా ఎల్లప్పుడు చప్పరించుటచే, నోటిలో చొంగయు కడుపులో రసమును విస్తారముగా నేర్పడును గాన ఆహారము సరిగా జీర్ణముకాదు. రబ్బరు పెట్టిన శిశువులు ఏడ్పు మానెదరని తల్లులు చెప్పెదరు. ఇట్టి దురలవాటు కలుగకుండ మొదటినుండియు బూనవలయును. లేనిచో తొలగించుట చాలా కష్టమే. మనప్రాచీనులు పెక్కు శతాబ్దములనుండి రబ్బరు చనుమొనలు మున్నగు కృత్రిమ సాధనములను వాడకుండ ఆరోగ్యమును, బలమునుగల శిశువులను కనిపెంచి యుండలేదా? ఇపుడు ఇపుడు మనము మాత్రము ఏల వీటిని వాడవలయును?

ఆరోగ్యప్రకాశిక.



కాంతమ్మ:—ఇదేం దొంగతనంరా పొట్లపొగలు కాయలు తెంచేస్తున్నావు?

దొంగ:—పొట్లపోగలు కోసుకుపోయినా దొంగతనమేనా యేటాండి.

మరదలు:—భావా! రాత్రి నీవు నాలుగురూపాయిలు యిచ్చినట్లు కలవచ్చింది.

బావ:—అయితే జాగ్రత్తగా మాఅక్కచేతికిచ్చి దాచుకో.

# బాలవిజ్ఞానశాఖ

## ౧. పాతపాటలు

సంపాదకుడు కంభంపాటి రామచంద్రరావు చౌదరిగారు

౧

ఓలమ్మాయి తలమీద గోరింక
చెప్పకు చెప్పకు చెడియెదవె
చెప్తే నీముక్కు చేదిస్తా
దూలంనుంచి దూకిస్తా
పందిరెనుంచి పాకిస్తా
పట్టెడన్నం తినిపిస్తా
కడివెడునీళ్లు త్రాగిస్తా
కళ్లల్లోకారం కొట్టిస్తా.

౨

కొండమీద బీరకాయ
కొయ్యనావద్దా
అత్తాతెచ్చిన పట్టుచీర
కట్టనావద్దా
మామతెచ్చిన మల్లెపూలు
గుచ్చనావద్దా
మొగుస్తో మొట్టికాయలు
తిన్నావద్దా.

---

## సత్యవతి

(సం॥ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు)

శ్రీహరిఋషిపల్లె సోమావీధులనూ
ఊరికీ ఉయ్యాలలమ్మావచ్చినవీ
కొమరాకొడుకుల తల్లికొనరేఉయ్యాల
చేరాతోచేరెడు ముత్యాలుపోసి
కొన్నాదెశీతమ్మ బంగారుతొట్టె
వేసేనెసీతమ్మ పొగడంపుచీర
కట్టేనెసీతమ్మ పొన్నామానులకు
ఇటునుంచిఊపితె ఇంద్రూనిచాయ
అటునుంచీఊచీతె చంద్రూనిచాయ
కొండావంతలలోను కోనేటినడుమా
పాపన్నామిముగంటి బండామరుగులను
ఏడవకూలవకుమార! రామాకుమారా!
ఏడిస్తేనిన్నెవ్వా రెత్తుకొనువారు!
పుట్టాటందెలుబూని పులిగోళ్లెబూని
భూదేవిమీయవ్వ వచ్చేనేడవకు
కాళ్లాఅందెలెబూని కడియాలెబూని
కౌసల్యమీయవ్వ వచ్చేనేడవకు
దేవాతార్చనపెట్టె దేముళ్లుబూని
జనకూడుమీతాత వచ్చెనేడవకు
ధనమూమిక్కిలిబూని ధాన్యాలూబూని
దశరథులూమీతాత వచ్చేరేడవకు
పరగాదేవాసూరా యుద్ధమ్మునాడు
సీలపుడూవిరిగీయు తేరూగ్రుంకంగ
వేలితోకైకమ్మా తేరూయెత్తంగా
మీతాతదశరథులు తానేమెచ్చి
కోమలీకోరూమి వరమూలిచ్చెదను
నాటివరములుఐన నేడూతాగోరి

మీతండ్రీ పట్టాభిషేకమ్మునాడూ
వరమూలందిన అవ్వ వచ్చేనేడవకు
చెవలాపోగులెబూని చెల్లాలెబూని
శాంతమ్మామేనత్తా వచ్చెనేడవకు
రూకైనబంగారు రుమ్మాళ్లేగొనుచు
ఋష్యశృంగుడు మేనమామ వచ్చెనేడవకు
ఉగ్గూబంగరుగిన్నె ఉయ్యాలెగొనుచు
ఊర్మిళాపినతల్లి వచ్చేనేడవకు
చక్కానిచుక్కల్లా చెక్కిళ్ళుమెరయూ
శతకీర్తి పినతల్లి వచ్చేనేడవకు
మల్లేలుమొల్లాలు మాడాలెగొనుచు
మాండావి పినతల్లి వచ్చేనేడవకు
బంగారుపావాలె గొడుగూలుగొనుచు
భరతూడు పినతండ్రి వచ్చేనేడవకు
లక్షావేలూజేయు రాజూలనణచు
లక్ష్మణుడూ పినతండ్రి వచ్చేనేడవకు
శత్రుల్ని సంహరింప చంద్రాయుధముబూని
శత్రుఘ్నుడు పినతండ్రి వచ్చేనేడవకు
అంచూపంచలుబూని అందలాలెబూని
హనుమంతుడు మనబంటు వచ్చెనేడవకు
ఒడలెల్లవిభూది జడలెల్లదాల్చి
కులగురువువశిష్ఠు వచ్చేనేడవకు
పట్టూగొడుగులనీడ పల్లాకియెక్కి
పట్టభద్రుడు మీతండ్రి వచ్చేనేడవకు
మనమంతాగూడూను అందలాలెయెక్కి
అయోధ్యకువెళదాము అయ్యాయేడువకు
బంగారుమేడల్లో రత్నాలతొట్లలో
మిమ్మూ పడుకోబెట్టి జోలాబాడెదను.

—:o:—

## తాడాచుట్టే, దుడ్డాబాదే

శ్రీమతి న్యా॥ మంగమ్మగారు

అనగా, అనగా ఓఊళ్ళో ఓ బీదబ్రాహ్మడుండేవాడు. ఆత డొకనాడు అడవికివెళ్ళి భగవంతుని ధ్యానముచేస్తుంటే పార్వతీపరమేశ్వర్లు ప్రత్యక్షమయి, "ఓ బ్రాహ్మణుడా, నీకేమికావలె"నని అడిగేరు. బ్రాహ్మడు తిరిగి, ఓభగవంతుడా, నేను చాల బీదవాణ్ని. చాలపిల్లలు కలవాడను. నాలుగు రోజులయి తిండిలేక మలమల మాడుచున్నాను" అని అన్నాడు. పరమేశ్వరులు జాలినొంది, ఒక భరిణను ఆబ్రాహ్మడికిచ్చి, "దీనిని పూజించిన యెడల, పంచభక్షపరమాన్నములు దొరుకు'నని చెప్పి అదృశ్యమయేరు. బ్రాహ్మడు ఇంటికిపోయి భార్యాబిడ్డలకు ఆహారమిడి సంతోషపఱచేడు.

నేడు ద్వాదశి. సూర్యోదయము కాగానే రాజుగారింట బ్రాహ్మణులందరకును విందు. మన బ్రాహ్మడు ఆనాడే సరిగ ఆఊరనున్న బ్రాహ్మణులందరికిని తనింటికి విందుకు రమ్మన్నాడు. అందరును ఆశ్చర్యముజెంది, నిజము తెలిసికొనుటగాను సూర్యోదయముకాగానే బ్రాహ్మణగృహముచేరేరు. బ్రాహ్మడు భరిణను భక్తితో పూజించేసరికి వచ్చిన వారందరికిని వెండికంచములతో పంచభక్షపరమాన్నములు తయారయినవి. అందరును సంతోషించి కడుపులు నిండ భుజించిరి.

ఈవార్త రాజుగారిచెవుల పడడంతోనే, బ్రాహ్మణుని భరిణ తమస్వాధీనము చేసుకున్నారు. బ్రాహ్మడు మళ్లా అడవికిపోయి భగవంతుని ధ్యానముచేసేడు. పార్వతీపరమేశ్వరులు మళ్లా ప్రత్యక్షమయేరు. బ్రాహ్మడేడ్చుచు తన దుఃఖవార్త విన్నవించుకొన్నాడు. ఈమారు పరమేశ్వరులు ఒక సంచీనిచ్చి, "దీనిని దులుపుమండినకొలది రూపాయిలు లభించు"నని చెప్పి అంతర్ధానమయేరు.

బ్రాహ్మడు ఇంటికిపోయి నిజముగ రూపాయిలు వచ్చునో లేదో అని సంచిని దులిపెను. ఘల్లుఘల్లుమని రూపాయిలు క్రిందపడెను. వెంటనే రాజుగార్కిట్లు కబురంపెను, "మీకోటలో ఎక్కువ ధనమున్నదో, నాదగ్గఱ ఎక్కువ ధనమున్నదో, చూతము." అని. రాజుగార్కి కోపమొచ్చింది.

"ఔరా, నీకింత పొగరుబోతుతనమా? అట్లయిన నీధనము తెమ్మ"ని తిరిగి కబురంపేరు. బ్రాహ్మడు

రాజుగారి కోటకు తనసంచి పట్టుకెళ్లేడు. రాజుగారు కోటలోనున్న ధనమంతా ప్రోగుచేయించేరు. అదికాగానే బ్రాహ్మడు అంతంలేకుండ సంచీదులుప నారంభించేడు. రాజుగారి ధనముకంటే బ్రాహ్మడిధనం రెండింతలయింది. రాజుగారు లజ్జెంది, బ్రాహ్మడి సంచీకూడ ఉడాయించేసేరు.

బ్రాహ్మడు మళ్లా అడవికెళ్లేడు. మళ్లా పార్వతీ పరమేశ్వర్లు ప్రత్యక్షమయి, సంగతి తెలసికొని, ఈమారొక మూరెడు త్రాడు జానడు దుడ్డు ఇచ్చి, 'తాడా చుట్టే, దుడ్డాబాదే అనిన నిన్నెందరు బలవంతులయినను ఎదిరింపజాల'రని తెల్పి అంతర్ధానమయేరు.

బ్రాహ్మడిల్లుచేరి ఈసారి రాజుగార్ని యుద్ధమునకు రమ్మన్నాడు. రాజుగారు కోపగించి తన ఇద్దరు బంట్రోతులను బ్రాహ్మణుని కాళ్లు చేతులు కట్టితెమ్మని పంపేరు. బంట్రోతులు బ్రాహ్మణుని ఇల్లు చేరుసరికి బ్రాహ్మడు 'తాడాచుట్టే, దుడ్డాబాదే' అన్నాడు. త్రాడుపోయి ఇద్దరు బంట్రోతులను గట్టిగా కట్టివైచెను. దుడ్డు చావమోదెను. బంట్రోతులు 'బాబో, నాయినా రక్షింపుము రక్షింపు'మని వేడుకున్నారు. బ్రాహ్మడు తిరుగ వానిని పిలచివైచెను. వారు రాజుగారి దరికిపోయి ఈ వృత్తాంతము తెలియజేసేరు. మరికొందరు బంట్రోతులను పంప వారికిని అదేగతి ప్రాప్తమాయెను. కడకు రాజుగారే పదివేల సైన్యముతోడను, ఏనుగుల తోడను బ్రాహ్మణ గృహాభిముఖులై బయల్దేరేరు.

కొంతదూరములోనే రాజుగారి సైన్యముండ బ్రాహ్మడు 'తాడాచుట్టే, దుడ్డాబాదే' అన్నాడు. అనగానే త్రాడుపోయి పదివేల సైన్యమునుగూడ ఒక్కమారుగ కట్టివైచెను. దుడ్డుపోయి మొదట రాజుగారి తలపై నొక్కపోటుపెట్టెను. తరువాత సైన్యమందరిని చావమోదెను. త్రాడు రాజుగారి పీక నులుముచుండెను. దుడ్డు చావ మోదుచుండెను. అప్పుడు రాజుగారు, "బాబో, నాయినో, మమ్ము రక్షింపుము. నీ ధరిణయు సంచియును ఇచ్చివేసెద"నని మొత్తుపెట్టుకొనెను. బ్రాహ్మడు త్రాటిని, దుడ్డుని పిలచివైచెను. రాజుగారు కోటచేరి ధరిణను సంచిని తిరుగ బ్రాహ్మడి కిచ్చివేసేరు.

కథ కంచికి, మనం మనింటికి.

చలసాని లక్ష్మీనారాయణ శర్మ.

---

## చిత్రప్రశ్న

భుజగిభూషణునకు భోజనపాత్రేది ?
అంగుష్ఠభాగి సమాఖ్యయేది ?
కామాతురుడుకన్ను గనజోనపేరికై ?
యీశుడాబాలేందు నెందుదాల్చె ?
పాపరేనికిముఖ్య భాగంబునేమంద్రు ?
దేవాళియనుపేరు దేనికొప్పు ?
ప్రజలుభూపునకిచ్చు పన్ను నేమనవచ్చు ?
నెడలేనివానల నేమియంద్రు ?
అన్నిటికికూడ మూడేసియక్కరములు
పాదపాదాన ప్రథమార్థభాగిమునకు
నైనయుత్తరమే ద్వితీయమునకగును
త్రిప్పివ్రాయగ వీనినితెలియుమన్న.

## చిత్రప్రశ్నలకు సమాధానములు

గత సంచికలో ప్రకటింపబడిన బయ్యే సూర్యనారాయణమూర్తిగారి చిత్రప్రశ్నలకును శ్రీమతి రత్నావళిగారి చిత్రప్రశ్నలకును సుమారు 100 మంది విదుషీమణులును, 60 మంది యువకులును సరియైన సమాధానములను వ్రాసి పంపినందుల కెంతయు సంతసమగుచున్నది. గ్రంథవిస్తరభీతిచే యెల్లరి పేరులను ప్రకటింపజాలనందుకు క్షమింపవేడుకొనుచున్నాము. సూర్యనారాయణమూర్తిగారి ప్రశ్నలకు : (1) భవనము, (2) కవనము, (3) యావనము, (4) పవనము అనునవి క్రమముగ సమాధానములని యెఱుంగునది. శ్రీమతి యమ్. వి. రత్నావళిగారి ప్రశ్నలకు : (1) రత్నావళి, (2) హనుమంతుడు, (3) కానులదండ, (4) కామేశ్వరము, (5) పనసకాయ, (6) భక్తవిజయము, (7) తామరపువ్వు అనునవి క్రమముగ జవాబులనియు నెఱుంగునది.

(గృ॥ సం॥)

# వార్తలు విశేషములు

## స్త్రీ హితైషిణీమండలి వార్షికోత్సవము, బాపట్ల.

ఈ మండలియొక్క తృతీయ వార్షికోత్సవము జూలై నెల 30, 31 తేదీలలో శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారి అధ్యక్షతక్రింద నత్యంతవైభవముతో జరుపబడినది.

**30-7-34** తేదీ మధ్యాహ్నము 2 గంటలనుండి కార్యక్రమము ప్రారంభమైనది. తొలుత దైవప్రార్థన, నివేదన జరిగినవెనుక అధ్యక్షురాలి యెన్నిక జరుపబడి శ్రీ అధ్యక్షురాలగు రాజరాజేశ్వరమ్మగారు కర్పూరమాలాలంకృతలై కరతాళధ్వనులు చెలరేగుచుండ నగ్రాసనము నధిష్ఠించి ప్రారంభోపన్యాసము గావించిరి. తదుపరి కార్యదర్శినివారిచే నివేదిక చదువబడెను. అనంతరము చంద్రమౌళి చిదంబరరావు పంతులుగారును వారి పుత్రికామణియు విరచించిన పద్యములు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే చదువబడెను. పిమ్మట శ్రీమతి దర్శి వజ్రమ్మగారు హిందీయందును, శ్రీమతి పులిపాక సుందరమ్మగారు తెలుగునందును ఉపన్యాసము లొసంగిరి. శ్రీమతి డి. భారతీదేవిగారు పంపిన 'స్త్రీలు—ఐకమత్యము' అను వ్యాసమును గండవరపు సావిత్రమ్మగారు చదివిరి. తరువాత 'మాలతి పాకకళాపాండిత్యము,' 'పంచమబాలిక ఆలయప్రవేశము,' 'తాతయ్యపెండ్లి ప్రయాణము' అను ప్రహసనములను బాలికలు అత్యంత మనోహరముగా ప్రదర్శించిరి. తదుపరి మంగళగీతముతో నాటి కార్యక్రమము ముగింపబడెను.

**31-7-34.** మరునాడు 3 గంటలకు మరల కార్యక్రమ మారంభమయ్యెను. దైవప్రార్థనానంతరము, భాగవతుల సంభాషణ జరిగినవెనుక, 'కుచేల' యను భక్తిరసభరితమైన ద్వైదంకముల నాటకమును ఎ. రాజ్యలక్ష్మమ్మ, జి. సత్యవతమ్మ, డి. చంద్రకాంతమ్మ, కె. సుందరకామాక్షమ్మ, ఎ. చారుమతమ్మ, యస్. సావిత్రమ్మ, పి. విజయలక్ష్మమ్మ, డి. కృష్ణవేణమ్మ అను బాలికలు అత్యంతమనోహరముగా ప్రదర్శించిరి. ఎడనెడ రంగమధ్యమునందు ఆర్. వరలక్ష్మమ్మ యను బాలికామణి హార్మోని యను వాయిద్యముచే సభ్యులరంజింపజేయుచుండెను. తదుపరి హిందీ పరీక్షలయందు కృతార్థులైన స్త్రీలకు యోగ్యతాపత్రములును, ఆటపాటలలో పాల్గొనిన బాలికామణులకు వెండికుంకుమ బరిణెలు, అల్లికసంచులును అధ్యక్షురాలిచే నొసంగబడెను. తదుపరి అధ్యక్షురాలి అంత్యోపన్యాసము గావించెను. పిమ్మట కార్యదర్శిని అధ్యక్షురాలికిని పురస్త్రీలకును, భవనమునొసంగిన మ-రా-శ్రీ మోదముగు భావనారాయణ శ్రేష్ఠిగారికిని తదితరానేక సహాయములొనర్చిన సోదర సోదరీమణులకును వందనము లర్పించినవెనుక మంగళగీతముతో సభ సమాప్తము చేయబడెను. సభ జరిగిన రెండు దినములును పురస్త్రీ లసంఖ్యాకముగా విచ్చేసిరి. రెండు దినములు సభికులందరకు శ్రీ భావనారాయణ శ్రేష్ఠిగారి సతీమణి ఆదెమ్మగారు ఖర్జూరము, వడపప్పు విరివిగా పంచిపెట్టించిరి.

అధ్యక్షురాలగు రాజరాజేశ్వరమ్మగారు తమ రెండుపన్యాసములందును, స్త్రీ సమాజముల ఆవశ్యకత, స్త్రీ సమాజములు చేయవలసిన ధర్మములు, పరదేశములలో నారీసంస్థలు చేయుచున్న కృషి మున్నగు అనేక విషయములనుగూర్చి యుక్తియుక్తముగా నుపన్యసించిరి. ముఖ్యముగా యీ స్త్రీ హితై

షిణీ మండలికి సొంతభవనము లేకుండుట మిక్కిలి విచారకరమనియు, దొరతనమువారు స్థానికసంఘములవారు పురజనులుగూడ యిందుకు బాధ్యత వహించి యీ స్త్రీసమాజము సొంతభవనము బడయుటకు గట్టిగా తోడ్పడవలయుననియు నొక్కి వక్కాణించిరి. భావగర్భితమైన వారి యుపన్యాస మెల్లర మనస్సు నాకర్షించినది. ఈవిధముగా తృతీయ వార్షికోత్సవమును జయప్రదముగా నడుపగలిగినందులకు భగవంతునకు వందనము లర్పించుచున్నాము.

శ్రీ హితైషిణీ మండలి, బాపట్ల 3-8-34. } క. వరలక్ష్మమ్మ, కార్యదర్శిని.

## శ్రీ మైత్రేయాశ్రమము

శ్రీ మైత్రేయాశ్రమము ఈ వైశాఖబహుళ నవమి బుధవారమునాడు రేపల్లెతాలూకా గూడవల్లి గ్రామమున స్థాపింపబడినది. ఈ గ్రామమున వానప్రస్థదీక్షను గడపుచు స్త్రీజనమునకు భక్తి జ్ఞాన వైరాగ్యబోధల నొసగుచు సాధ్వి రత్తమ్మగారు పేరెన్నిక గాంచియుండెను. ఈయమకు కొంత ఆస్తిగలదు. గుర్వాజ్ఞ ననుసరించి అప్రతిగ్రహ దీక్షతో కాలము గడపుచుండెను. బంధువులనుండిగాని మిత్రబృందములనుండిగాని ఏమియు తినుబండారముల నయితము స్వీకరింపక పరమపవిత్ర జీవితమును గడపుచుండెను. భక్తురాండ్రెందఱెందరో పండునైనను తమవలన ఆమె స్వీకరింపకయుండుటచేత తమ భక్తిని సఫలము చేసికొనలేమని చింతించుచుండిరి. 'మమ'నాది అనుభావమునకు గురియగు వస్తువేదేని ఉన్నంతకాలము పరులవలనిదేనిని ప్రతిఫలము నొసంగకుండ తీసికొనరాదని శ్రీ రత్తమ్మగారి గురువు బోధించును. ఆమె తన ఆస్తిని ఈశ్వరార్పణముగా విడిచివేసినయెడలను, భగవత్సేవగా పరోపకారము సలుపునెడలను, ఆమె ఇతరుల పోషణను అంగీకరించదగునని సెలవిచ్చెను.

ఆ సదుపదేశానుసారముగా శ్రీ సాధ్వి రత్తమ్మగారు ఆనాడు శ్రీ హనుమజ్జయంతి సలిపి, స్త్రీజనోపయోగార్థము భక్తి జ్ఞాన విద్యాప్రచారము సాగించు నిలయముగా శ్రీ మైత్రేయాశ్రమమును నెలకొలిపినది. తన ఆస్తినంతను ఆ ఆశ్రమమునకు సమర్పణము చేసి వ్రాసియిచ్చినది. మఱియు గ్రామపుపెద్దలను పలుకుబడిగల స్త్రీ పురుషులను ఎల్లఱరావించి వారి సమక్షమున తురీయాశ్రమ స్వీకారము చేసినది. ఆవెంటనే జోలెగట్టుకొని గ్రామమునందు మాధూకరము చేసినది. ఈమె నిర్మలశీలమును పవిత్రదీక్షానురక్తిని గాంచి ఆనందబాష్పముల విడువని వారలు లేరు. సాధు రామయ్యగారును సాయం వరదదాసస్వామివారును శ్రీమతి భ్రమరాంబగారును భజనలు సలిపి ఎల్లఱ నానందవార్ధిం ముంచిరి.

ఆనాటి రాత్రి బహిరంగసభలో శ్రీ సాధ్వి రత్తమ్మగారు తన అభిప్రాయములను పవిత్ర సేవానురక్తిని పురవాసులెల్లఱకును వివరించి చెప్పినది. శ్రీ తత్త్వానందస్వామియు శ్రీ సాధు రామయ్యగారును శ్రీ సాయం వరదదాసస్వామివారును ఆ సభలో భక్తి వైరాగ్యాహింసాధర్మములగురించియు హిందూమతమున స్త్రీజనమునకుగల మహాపవిత్ర పదవిం గూర్చియు గంభీరోపన్యాసముల నిచ్చిరి. ఇట్లంకురించిన శ్రీ మైత్రేయాశ్రమము దినదినప్రవర్ధమానము గాంచి ఆచంద్రతారార్కము స్థిర స్థాయియై వఱలుగాక. (విలేఖరి)

## మహిళాసమాజద్వితీయవార్షికోత్సవము:—

## శ్రీకాకోళము.

ఏప్రిల్ మాసము 7 వతేదిని యీపట్టణములోని గవర్నమెంటు ట్రెయినింగుస్కూలులో, జార్జిసన్ సతి (ఇచ్చట సబ్ కలక్టరుగారి సతీమణి)గారి ఆధిపత్యమున, యీపుర మహిళాసమాజ ద్వితీయవార్షికోత్సవము, కడువైభవముతో జరుపబడెను. సభ మధ్యాహ్నము 4 గంటలకు ప్రారంభింపబడెను. సభకు సుమారు 300 మంది సభ్యురాండ్రు ప్రేక్షకులు వచ్చిరి. జార్జిసన్ సతిగారిని సభకు అధ్యక్షురాలుగా నెన్నుకొనిరి. మహిళాసమాజ అధ్యక్షురాలగు బుర్రాసూరమాంబగారు జార్జిసన్ సతీమణి సద్గుణము

లను కొనియాడుచు, మహిళాసమాజము అభివృద్ధికి తోడ్పడవలయునని వేడుచు, కొన్ని చక్కని పద్యములు చెప్పిరి.

జార్జిసన్ సతి, తమ అధ్యక్షోపన్యాసములో పాశ్చాత్యదేశములలో స్త్రీల ఉద్యమము ఎటుల కొనసాగుచున్నదో, భారతదేశమున కూడ ఎటుల యీ మహిళాప్రబోధము హెచ్చుచున్నదో తెల్పెను. భారతస్త్రీలు రాబోవు రాజ్యాంగ సంస్కరణములలో హెచ్చుగా పాల్గొనవలసి యుండునని చెప్పిరి. భారతనారీమణులు శిశుసంరక్షణాలయములు, స్త్రీలకు వైద్యశాలలు, ప్రతిపట్టణమందును స్థాపింపవలయునని, ఆందోళన చేయవలెనని ఆనెసుక సమాజముయొక్క 1933-34 నివేదికను కార్యదర్శిని చదువుచు ఆసంవత్సరమున మొత్తము 53 సభలు జరిపిరనియు, అందు 8 అవసర సభలనియు దెల్పిరి. బీహారు భూకంపనిధికి ధనసహాయము చేయవలెనని తీర్మానించిరనియు, రూ 73-8-0 వసూలుచేసి శ్రీరాజేంద్రబాబుగారినిధికి పంపిరనియు నుడివెను.

తరువాత, బాలికలు, శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు వ్రాసిన ప్రహసన మొకదానిని, సావిత్రీనాటకమును కడుచక్కగా ప్రదర్శించిరి. ప్రేక్షకులు చాల కొనియాడిరి. ట్రెయినింగుస్కూలు ప్రధానోపాధ్యాయులగారి సతీమణి శ్రీమతి కట్టు కామేశ్వరమ్మగారు బాలికలందరకు, వారి ప్రదర్శనమునకు మెచ్చి, వెండిపతకములను బహుమతి నొసంగిరి.

అధ్యక్షురాలు అంత్యోపన్యాసములో సమాజ అభివృద్ధికోరిరి.

అధ్యక్షురాలికి, సభ్యురాండ్రకు, ప్రేక్షకులకు, సభను జరుపుటకు తమ భవనము యిచ్చిన ట్రెయినింగుస్కూలు హెడ్మాష్టరుగారికిని సమాజముతరఫున, తనతరఫున, కార్యదర్శిని వందనములతో నాటి సభ ముగింపబడెను.

ఈ సందర్భమున సమాజసభ్యురాండ్రు, నాటకమున పాల్గొనిన బాలికలు, ఛాయాపటమును తీసికొనిరి.

డి. సువర్ణాబాయి.
గౌరవ కార్యదర్శిని.

ఉపవాసము—గాంధిజీ ప్రకటన.

"ఆశ్రమ జీవితమున ఉపవాస వ్రతమొక నిత్యవిధిగ నెన్నబడుచున్నది. చిత్తశుద్ధి, అంతర్దృష్టిలేనిదే అస్పృశ్యతా నివారణ మసాధ్యమగును. ఉద్యమము నందు విశ్వాసముగల్గి, అకుంఠితదీక్ష, సంతత కృషి సల్పి, ఆత్మ పారిశుద్ధ్యమును సంపాదించినవారు కృషి చేసినగాని, అస్పృశ్యతా మహారాక్షసి పోజాలదు.

ప్రతిదానికి, ప్రతిఒక్కరికిని ఉపవాసవ్రత ముత్తమము కాదు. విశ్వాసము లేకుండ ఉపవాసదీక్షను మొదలుపెట్టిన, ఒకప్పుడు ప్రమాదకరమగు ఫలము గూడ కల్గుచుండును. అనర్హులగువారికట్టి ఆధ్యాత్మికోపలబ్ధికరములగు ఆయుధములు హానికరమగును.

కాంగ్రెసు వాదులును, కాంగ్రెసు సేవకులును, ఒక విషయమును గమనింపవలెనని గోరుచున్నాను. ఈ ఉపవాసదీక్షా కాలము యేడునాళ్లు, గత ఒక నెలనుండివలెనే, నాతలంపులన్నియు వారినిగూర్చియే యుండెను. కొన్నిచోట్ల కాంగ్రెసు యెన్నికలెట్టి పార్టీస్పర్ధలకాకరమైనది, కాంగ్రెసువాదులు కృత్రిమ మార్గముల వోట్లు నెటుల సంపాదించినది, ఖద్దరు నెల్లకాలము ధరింతుమని గావించిన నిబంధన నెటుల ఉల్లంఘించినది మూడగా నాకు భయము వ్యాకులత కల్గెను. సత్యమై, అహింసాత్మక పద్ధతులే యవలంబింపదగునని కాంగ్రెసు నిబంధనలు గలవు. కొన్ని రాష్ట్రములందు సత్యము, అహింసలు అనుష్ఠానమునందు కంటె, తదుల్లంఘనయందె విస్పష్టమయ్యెను. నా యీ ఉపవాసదీక్ష యట్టి దుర్మార్గములనుగూర్చి సంకల్పింపబడినదికాదు. అయినప్పటికిని కాంగ్రెసు వాదులు నేవ్రాసిన మాటలవలన నామనోవ్యథను గ్రహించి, యీ ఆత్మ పారిశుధ్య వారమున, వారు ఆత్మపరీక్ష గావించుకొని, కాంగ్రెసునుసంస్థలను, కాంగ్రెసు సిద్ధాంతముల కనువర్తించుచు, కాంగ్రెసు సిద్ధాంతములిట్లు కాంగ్రెసు సంస్థలందు మూర్తీభవించెనని చూపరులకు దృఢపడునటుల చేయవలెనని గోరుచున్నాను. కావున కాంగ్రెసు సంస్థలు పునీతమగుటకే సదా ప్రార్థించుచుందును. ఇట్టి మహోత్కృష్ట జాతీయసంస్థాపకవ్రతము హరిజనోద్యమమున కెంతేని కార్యకారిగ నుండగలదు. ఏలన కాంగ్రెసుగూడ అస్పృశ్యతా నిర్మూలనమునకు ప్రతిజ్ఞనూనెను."

(దీనబంధు)



నూత్న వధూవరులు

శ్రీమతి సరిహద్దు [illegible] నాగసుందరి గారు

శ్రీయుత శేషగిరి రావు గారు

శకుంతలా గ్రంథకర్తలు. కవులకు కవయిత్రులు భార్యలుగా లభించుట పూర్వపుణ్య విశేషము కదా !!



మిస్ ముష్తారి

# గ్రంథపరిచయము

**శకుంతల:—**

క్రౌను సైజు 133 పుటలు. వెల 0-12-0 గ్రంథకర్త శ్రీయుత నరహరిసెట్టి శేషగిరిరావుగారు, ఈస్టర్ను స్ట్రీటు, ఏలూరు. శ్రీయుత మోతే నరసింహారావు జమీందారుగారి కంకితము. కాళిదాసు నాటకము ననుసరించి, అధ్యాయములుగా విభజించి, శకుంతలచరిత్రము నిందు గ్రంథకర్త గద్యరూపమున వ్రాసినారు. శైలి గంభీరగ్రాంథికము. మూలము కాళిదాసుదే యైనను కథావిధానమున కొన్ని స్వంత మార్గములు కూడ త్రొక్కబడినవి. పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారిచే అంగీకరింపబడి మొదటికూర్పు చెల్లి రెండవకూర్పు తయారైయున్నది.

**లోకనాటకం:—**

డెమ్మీసైజు 64 పుటలు వెల రు 0-8-0 లు గ్రంథకర్త శ్రీయుత నేదునూరి గంగాధరంగారు. గోదావరిజిల్లా కొంతమూరు నందలి మహాలక్ష్మీ ధర్మ పుస్తక భాండాగారమువారిచే ప్రకటింపబడినది. ప్రాచ్యపాశ్చాత్య సంఘములసంఘర్షణలవలన భారతదేశపు భావములు ఆచారములు ఎట్లు దుష్పథములు పట్టుచున్నదియు తెల్పుచు, సంఘమును సవ్యమగు పద్ధతులప్రకారము సంస్కరించవలసిన ఆవశ్యకతను ఈగ్రంథము సూచించుచున్నది. అయిదంకముల హాస్యరసప్రధాననాటకము.

**మోక్షదాయకశతకము:—**

క్రౌనుసైజు 20 పుటలు. వెల 0-4-0 కీ. శే. శ్రీమాన్ గుద్దంటి చినగోకర్ణకవిగారిచే రచింపబడినది. గుంటూరుజిల్లా పేరాలలోనున్న శ్రీమాన్ గుద్దంటి పెద్దగోకర్ణముగారియొద్ద ప్రతులు వెలకు లభించును. భక్తిరసప్రధానము. సులభశైలి.

**స్త్రీహితైషిణీమండలి—తృతీయవార్షిక నివేదిక. (బాపట్ల):—**

ఈమండలి బాపట్లపురమునందు మిగుల వర్ధమానస్థితియందుండి పనిజరుపుచున్నది. వారపుసభలు, పండుగలు, స్మారకసభలు మొదలగునవి కలిసి గతసంవత్సరము (1933-34) సుమారు 130 సభలు జరిగినవి. అనేక స్త్రీపురుష వక్తల సదుపదేశ శ్రవణభాగ్యమును పురవాసులకు కలిగించినది. సుమారు 15 దినవార మాసపత్రిక లీసమాజము నలంకరించుచున్నవి. నేడిందు 1050 గ్రంథములు రాజిల్లుచున్నవి. సంఘము రిజస్టరయినది. హిందీతరగతులు జరిగి నలుగురు మధ్యమతరగతియందును ఒకరు ప్రాథమిక తరగతియందును కృతార్థులైరి. ఇట్టి సంఘమునకు 41 రు మాత్రము సభ్యులై రు 13-6-0 మాత్రము మాసాదాయమగుట విచారింపతగ్గది. స్వంతభవనమునకై చేయబడుచున్న ప్రయత్నములు సఫలమైనచో మండలి యింతకన్న నెక్కువ కార్యమును చేసి చూపగలదనుటకు సందేహములేదు. సమాజము నిట్టి యభివృద్ధికరమైన స్థితికి తెచ్చిన అధ్యక్షురాలు శ్రీమతి రామరాజు వెంకాయమ్మగారును కార్యదర్శినులు శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మ ముప్పాళ్ల జనార్దనమ్మగార్లును ఎంతయు ప్రశంసనీయులు.

**మహాలక్ష్మీపఠనమందిర ద్వితీయవార్షిక నివేదిక (గుంటూరు):—**

ఇందు 35 గురు సభ్యులుగలరు. ప్రతిదినమును 1 గంటసేపు హిందీక్లాసు జరుగును. 500 పుస్తక

నులుగలవు. 10 వార్తాపత్రికలువచ్చును. ప్రతిబుధవారము భజనజరుగును. శ్రీమతి అమరవాది అనసూయమ్మగారు ప్రతిదినమును భాగవతపురాణము జరిపి అది సమాప్తము కాగానే దేవీపూజయు సమారాధనమును నొనర్చిరి. గుంటూరుపుర పురంధ్రీమణులెల్లరును సహాయపడినచో దీనికొక ప్రత్యేకమందిరము కట్టించుట సులభము. సమాజమున కధ్యక్షురాలై శ్రీమతి పంగులూరు రాజ్యలక్ష్మమ్మగారును కార్యదర్శినులై శ్రీమతులు బొడ్డుపిల్లి బాలాత్రిపురసుందరమ్మ అద్దంకి బాలాత్రిపుర సుందరమ్మగార్లును చేయుచున్న కృషియెంతయుఁ బ్రశంసనీయము.

కార్మికసంఘప్రచురణము:—

ఇది జూలైమాసమున ప్రకటింపఁబడినది. కార్మికులు దుర్వ్యయము చేయుదురని ప్రతివారును వారిమీద నేరము మోపుదురు. ఆనేరము అనగా త్రాగుడును కారణము వారి అర్థాకలికూలియేయని మరతురు. వారు త్రాగుబోతులని తిట్టేవారేవారికి కల్లునమ్మి శ్రీమంతులగుచుందురు. ఈత్రాగుడువలన వారు కొంత తెలివితప్పి ఐకమత్యవిహీనులై చెడుచుండుట నిశ్చయమైనను ఒకానొకనాడావేశమువచ్చి జండాపట్టుకొని తమకు విజయసిద్ధి చేకూరువరకు నిలచి పోరాడగల సమర్థులు కాగలరని యీప్రచురణము తెల్పును. వెల రు రు 0-0-3 క్రౌనుసైజు 17 పుటలు. చక్కని అచ్చు యెర్రనిఅట్ట కలిగి అతి మనోహరముగనున్నది. కార్మికసంఘ కార్యాలయము అనంతవరం, తెనాలి పోస్టు గుంటూరుజిల్లా.

శ్రీ శివమహిమ్నస్తోత్రము:—

క్రౌనుసైజు సుమారు 30 పుటలు- 45 పద్యములు. వెల రు 0-2-0 లు మాత్రము గ్రంథకర్త అష్టావధాని శ్రీయుత వడ్డాది సీతారామాంజనేయ కవిగారు ఖాసింకోట, విశాఖపట్టణముజిల్లా. 'శ్రితశిష్యచయ హయగ్రీవుండు, దక్షిణామూర్తియు, మందారభూజ మగుచు, మహితదేవీస్వరూపుడై మహినివెలసి, నాకు ప్రత్యక్షదైవమానాదుగురుని' శ్రీ పురాణం 'సూర్యనారాయణ కవీంద్రు శుభపదాబ్జ పీఠిపై నీస్తవమ్ము నర్పించుకొందు' నని వ్రాసి యీకృతిని తీర్థులవారి కంకితమొనర్చి తమ యిరువురకును కవిగా రజరామర మైన కీర్తినిగూర్చి నారనుట కాటంకములేదు. భక్తాభీష్టఫలప్రదంబై, మోక్షప్రదంబై, శ్రీ శివమహిమా ప్రకటనంబై గంభీరసజీవకవిత్వగుంభితంబైయుండు శ్రీపుష్పదంతాచార్యుని కృతిని యొకవీసమును వాసిపోని సుందరసులభ పటుత్వకవిత్వముతో ఆంధ్రీకరించి కవిగారు ఆంధ్రభక్త కవిపండిత మండలికెల్ల మండనులైనా రనుట కాటంకములేదు. మచ్చునకొకటి రెండు పద్యము లుదహరించుటకంటె యీ కృతినిగూర్చి హెచ్చుగ పొగడుట దుస్సరము.

చ॥ తటమటనొందె నీచరణతాడన నిబ్బువి;
యభ్రమెల్ల నీ
చటులభుజార్గళప్రహతి జర్జరితగ్రహ
రాజియయ్యె; నీ
జటల పటుప్రహారమున స్వర్గము ఘూర్ణిలె;
లోకరక్షకై
నటనము నీవొనర్చుతరుణమ్మున
నోవిపరీతవర్తనా!

ఉ॥ కాటుకకొండయంత మసిగల్పిన సింధువుపాత్ర
జేసియా
హాటకగర్భురాణి, భువనాతతపత్రమునందు
గల్పకో
త్పాటితశాఖిలేఖినిగ బాణిగ్రహించి భవ
న్మహత్వముం
బాటవమొప్పవ్రాసియును బారమునొందదు
సూవె యీశ్వరా.

భారతవైశ్య:—

ప్రతి బుధవారమును బెజవాడనుండి మానేపల్లి బాపనయ్యగారి సంపాదకత్వమున వెలువడుచుండు వారపత్రిక. సంవత్సరం చందా రు. 3-4-0లు. సాంఘికవిషయములలో సంపూర్ణసంస్కారము,

రాజకీయములలో సంపూర్ణ స్వాతంత్ర్యమును బోధించుచు కాంగ్రెస్సుకు వెనుకదన్నయి మహోసహాయము చేయదలచుకొన్న పత్రిక. అందందు మంచి సాహిత్య రచనలు, ఆర్థికచర్చలునుగూడ కాననగును. వైశ్య మహాజనుల యుత్కృష్టవిశిష్టతను ప్రతిభను ప్రకటించును గనుక శ్రీమంతులగు వారియందరి యాదరమును బొంది చిరకాలము స్థిరతరసేవ చేయగలదని విశ్వసించుచున్నాము.

తానాజీ :—

క్రౌనుసైజు 145 పుటలు. వెల రు. 0 4-0లు. గ్రంథకర్త శ్రీ వ్వలి లక్ష్మీనరసింహారావుగారు, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరం. ఛత్రపతి శివాజీ యొక్క సేనానియగు తానాజీ సింహగడదుర్గము నైకైకవీరుడై తన భుజబలదర్పంబున జయించి మరణించిన విషాదాంత చారిత్రక నవల. ఆంధ్రభాషలో కొంతకాలమునుండి భాషాంతరీకృతనవలలే కాని స్వయంకల్పితములైన నవలలు వెలువడని లోటు నిది తీర్చుచున్నది. పీటముళ్లు వంటిప్లాటు, ప్రకృత్యతిరిక్తములైన సన్నివేశములు మొదలగు అద్భుతకల్పనలెవ్వియులేక స్వభావసిద్ధమగు సుందరకథగ ప్రాతచరిత్రను ప్రదర్శించిన గ్రంథకర్త నైపుణ్య మెంతయు నెన్నతగినది. పుణ్యవంతులగు శ్రీ శివాజి, తులసీదాసు, జీజీబాయి, తానాజీగార్లు సజీవముగ మన యెదుట నిలచి రాజకీయవ్యవహారములను నడిపించుచున్నట్లు గోచరించును. చారిత్రకరంగములో గ్రంథకర్త కిది ప్రథమ ప్రవేశమయ్యు రచన విజయసిద్ధి నందినదనవలెను. మరియు నిట్టి యితర గ్రంథములను వ్రాసి ఆంధ్రభాష నలంకరించవలెనని యీ యువక కవికి మా సంపూర్ణప్రోత్సాహము నిచ్చుచున్నాము.

బొబ్బిలియుద్ధ నాటకము:—

డెమ్మీసైజు 104 పుటలు వెల రు. 1-0-0. గ్రంథకర్త కీ॥ శే॥ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిగారు. ద్వితీయ ముద్రణము. ఈ నాటకమును పఠించిన శరీరములు పులకలెత్తి వచ్చిన పౌరుషములు అంధ్రరక్తమునుండి పైకుబకకమానవు. ప్రతాపరుద్రీయమువలె వ్యవహారభాష, జాతీయపదములు కలిగి యాదార్థ్యమున కత్యంత సమీపమున నుండును. ప్రతులు వలయువారు వేదము వేంకటరాయశాస్త్రి అండు బ్రదర్సు, నెం. 4, మల్లికేశ్వర వీధి, జార్జిటౌను, మదరాసుకు వ్రాయవలెను.

నందిగ్రామ తాలూకా భూగోళము:—

క్రౌనుసైజు 32 పుటలు. వెల రు. 0-4-0లు. గ్రంథకర్త్రి శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మగారు, ప్రధానోపాధ్యాయిని, బోర్డు బాలికాపాఠశాల, కంచికర్ల, కృష్ణాజిల్లా. మూడవ తరగతి విద్యార్థుల కత్యుపయుక్తమగు రీతిని వ్రాయబడినది. భూగోళశాస్త్రజ్ఞానము స్వస్థలము, స్వప్రాంతములనుండి ప్రారంభమై తరగతి తరగతికి హెచ్చుచు సర్వప్రపంచ పరివ్యాప్తము కావలెనను సూత్రమునుబట్టి మూడవతరగతి విద్యార్థుల యుపయోగముకొరకీ పుస్తకము గ్రంథకర్త్రి చక్కగ వ్రాసినారు. పై తరగతులకుగూడ యిట్టి గ్రంథములను వ్రాయవలెనని హెచ్చరించుచున్నాము.

కవిరాయలు :—

క్రౌనుసైజు 27 పుటలు వెల 0-4-0. గ్రంథకర్త కొత్త వీరభద్రయ్యచౌదరిగారు సంగం జాగర్లమూడి, తెనాలితాలూకా, గుంటూరుజిల్లా. పృధ్వీరాయల ఆస్థానకవి చాందుభట్టు తన ధీప్రతిభవలన మహమ్మదుఘోరీని వశపరచుకొని రాయలచేత పగ తీర్చుకొనునట్లు చంపించిన అద్భుతచరిత్ర. సులభశైలి. వీరరసప్రధానము.




## పులిమీద బుఱ్ఱ

ఇది సైన్సుయుగం. సైన్సుకు యంత్రమాధారం. యంత్రానికున్న ఆకలి భూమిమీద ఎవరికీ లేదు. మనుష్యులందరికీ యెంత ఆకలో యంత్రాలకీ వాటి సొంతదారులకీ అంతకన్నా యెక్కువ ఆకలి. ఆకారణంచేత నేగదా జనసామాన్యముయొక్క సిరి సౌభాగ్యాలు, ఆయురారోగ్యాలు, జీవనాధారాలు స్వాతంత్ర్యవిలాసాలు సర్వమూ శ్రీకృష్ణార్పణమంటూ యంత్రపురుషుని హోమకుండములో త్రోసివేయబడుచున్నవి. ఈబకాసురుని ఆహారమునకు భూమిమీదనున్న చెట్లన్నీ చాలక, భూమిలోవుండే బొగ్గు అంతా చాలక, గనులలోవుండే కిరసనూనె చమురంతా చాలక, విద్యుచ్ఛక్తికూడా చాలని మహాదశ సంప్రాప్తించుచున్నది. ఎక్కడపడితే అక్కడ దొరికే ఆహారమేదియా అను ప్రశ్న శాస్త్రజ్ఞులందరినీ వేధించుచున్నది. ఈక్రొత్తవస్తువు నెవ్వడైనా కనిపెట్టాడంటే వాడు బొగ్గు, చమురు విద్యుచ్ఛక్తి మొదలగు వానిలో మొనాపలీ (స్వహక్కులూ) సంపాదించుకొన్నవారందరినీ వెనుకకునెట్టి వారి తలమీదికెక్కి తాండవము చేయగలడనుటకు సందేహము లేదు.

ఈఅదృష్ట మొక జపానీయునికి పట్టేలాగుంది. ఆరకావానగర వాస్తవ్యుడు కిచినోసూకు షిబ్యూకావా అనేఅతడు గాలిని చలవమీద నీరుగామార్చి, ఆనీరును సన్నగాకాచి ఆవచ్చేమంటవల్ల బ్రహ్మాండమైన యంత్రాలను పనిచేయించగల శక్తిని కనిపెట్టినాడు. బొగ్గు, చమురు, కరెంటు మొదలగు వానికిని దీనికిని చాలా భేదముగలదు. వానిని ఒకసారి ఉపయోగించినచో హరించిపోవడం, క్రొత్తశక్తి కావలస్తే తిరిగీ ఆపదార్థములను కొనుక్కోవలసిరావడం తటస్థిస్తున్నది. ఈపద్ధతిలో అలాగుకాదు. గాలిని చలవమీద నీరు చేయడం, ఆనీరునే గాలిగా మారుస్తూ శక్తిని నిర్మించడం, ఆగాలినే మళ్లీనీరుగా మారుస్తూవుండడం ఆయంత్రంలో జరుగుతూ వుంటుందట. గాలి యెక్కడపడితే అక్కడ దమ్మిడీయియ్యనక్కరలేకుండా చిక్కుతుందిగదా. యంత్రం కొనుక్కోవడం నడపడం నేర్చుకోవడం తప్ప దీనికట్టే మదుపుకూడా అక్కరలేదు. శాస్త్రజ్ఞులందరూ యీవిధానమును పరిశీలించి యోగ్యతాపత్రములనిచ్చినారు. ఈ విధానమునందరికీ ప్రయోజనకరమూవట్లభ్యాసముచేసి వాకచేసి ప్రచారముచేయుటయే తరవాయి. ఈయంత్రమును తానుతప్ప యింకెవరూ తయారుచేయకుండా వుండేటందుకు జపాను మొదలుగాగల ముప్పైనాలుగు దేశాలలో షిబ్యూకావా పేటెంటును పొందినాడు. ఇంగ్లాండు, అమెరికా, ఫిన్లండు మొదలుగాగల దేశములనుండి యెంతోమంది ధనాఢ్యులు అతనిదగ్గరకువచ్చి వారివారి దేశములో ఆయంత్రమును అమ్ముకొనుటకై పేటెంటు హక్కుల నిమ్మని కోరుకుంటున్నారు. అన్ని యంత్రాలకీ సాయం ఇదొకటి ప్రస్తుతయంత్రాధికారుల చేతులకు చిక్కిందిరా అంటే మరీ చాలామంది పేదసాదలకి మిల్లులలో కూలిపనినుండి ఉద్వాసన తటస్థించక మానదు. ఎవరినోట్లో యే బెడ్డపడినా యజమానుల సౌఖ్యం మరికొంత హెచ్చకమానదు. 'ముదుటన్ వ్రాసినవ్రాత తప్పదుగదా నూరేండ్లు చింతించినన్'

ప్రస్తుత నిరుద్యోగులకూ, యిక ముందు ఉద్యోగముల నుండి తరిమివేయఁబడే అభాగ్యులకూ, ఇంతకంటె చింతోపశమనకరమగు వేదాంతవాక్యము నవ్వరుపదే శింపఁగలరు?

## రబ్బరుకు దెబ్బ

జర్మనీలో కృత్రిమపునీలిరంగు బయలుదేరగానే హిందూదేశంలో నీలిమందుపంట, వంట, వర్తకం, వీని ననుసరించిన అనేకవేలజనుల జీవనాధారం తగ్గిపోయినవి. జర్మనీనుంచి వచ్చురు-డరాగానే మన దేశపు చాయపనుపువసకూడా సన్నగిల్లింది. ద్యోగములకదేగదా పూత! ఇట్లే కొన్నికొన్ని ప్రతి పదార్థముల సృష్టివల్ల అసలు పదార్థముల నడిగేవారుండకపోతారు. సైన్సు తలయెత్తినప్పటినుండి యేవో కృత్రిమపదార్థాలను సృష్టిస్తూ, అసలుపదార్థాల నడచివేస్తూ, పెక్కుమంది జీవనాధారములను కూలుస్తూ, కొద్దిమందిని విపరీత ధనాఢ్యులనుచేస్తూ, ఉద్యోగుల కూలులు తగ్గిస్తూ పేదసాదలనఁదరినీ హీనానికిగ్గి మానానికిమగ్గి ధనవంతుల ఫ్యాక్టరీలపొగలు పీలిపించి అల్పాయుర్దాయవంతులను చేస్తూ ప్రత్యక్షమృత్యుదేవతా స్వరూపమై తాండవమాడుతున్నది. బెంగాలులో జనపనార, తెలుగుదేశంలో వేరుసెనగ, ధాన్యము మొదలగు వ్యాపారములు తగ్గి జనులు మొఱపెట్టుతున్నారంటే యేసైంటిస్టుమాహాత్మ్యమో అయివుండాలి.

ఇప్పుడు సైటింస్టు రబ్బరుమీదికి యెత్తేడు జండా! రబ్బరు పంట వరి, జనపనార, చెరుకులవలె సామాన్య జనుల చేతులలోలేని మాటనిజమే. రబ్బరుచెట్లు పెంచేవాళ్లు, వండేవాళ్లు, వస్తువులుచేసి అమ్మేవాళ్ళు అందరూ ధనవంతులైన తెల్లవారనుమాటయు నిజమే. అయినను ఆతోటలను ఫ్యాక్టరీలను వ్యాపారమును అనుసరించుకొని యెంతోమంది నీగ్రోలు, ఇండియనులు, చీనావారు బీదవారు బ్రతుకుతున్నారు. కాని లేకపోలేదు. కృత్రిమపు రబ్బరును భూరిప్రమాణముమీద తయారుచేయడము సాధ్యమైతే ప్రస్తుతపు రబ్బరుతోటలు పడుకోవలసినదే. ప్రకృతపు రబ్బరుకంటె కృత్రిమపు రబ్బరు యెక్కువ కార్యముల కుపయోగించును కనుక యింతకంటె యెక్కువఖరీదుగావున్నను అదేచెల్లి దీనిని మూలకు త్రోయఁగలదని వర్తకులప్పుడే అంచనాలు వేయుచున్నారు. పెద్ద యెత్తుమీద తయారుచేయించితే యింతకంటె చౌకచేసి ప్రకృతపు రబ్బరుయొక్క పోటీని చంపివేయవచ్చునని కొందరిఆలోచన. అయితే సైంటిస్టులంటారు, 'ఇది ఇంతవేగం సాధ్యమయ్యేపనికాదు. ప్రస్తుతం కొన్నిడబ్బాలను, పంపులను, వానకోటులను మొదలగు వాని లోపూతకు మాత్రం పనికి వచ్చునంతమట్టుకే తయారౌతుంది. రబ్బరుతోటలవారు ఇప్పటినుంచే బెంగపెట్టుకోవద్ద'ని అభయహస్తమిస్తున్నారు. ఈ పుణ్యాత్ముడెవడో కాని దీనికికూడా పేటెంటు పుచ్చేసుకొని ఖరీదులు బిగించేసి లాభాలను హెచ్చించుకోవడంకోసం ప్రజలను దోచేనుకోకుండావుంటే ధన్యుడు. లేదా వారివలె ఇతడును మరియొక అదృష్టవంతుడు, ప్రజలకు మరియొక చిన్నగుదిబండ!

## చావు తెలివి

ప్రాణాలుపోగానే హిందువులు శవాలను తగలేస్తారు. ఇదేదో ఆరోగ్యపద్ధతంటారు. ఇట్లు చేయుటవల్ల వారి శరీరములలోని పచ్చిపదార్థములు కుళ్లుతుండడం, గాలిలో ఆకంపు పైవారికి వీచుతుండడం, వింతవింత రోగాలు వ్యాపకం కావడం మొదలగునవి తప్పుతాయన్నమాట నిజమే. కాని, దీనిలో ఒక ప్రమాదం లేకపోలేదు. మనము కాల్చేసినవారందరూ నిజంగా చచ్చిపోయినవారేనా, లేక కొంపతీసి కొందరు బ్రతికున్నవాళ్ళనుకూడా కాల్చేస్తున్నామా అని ప్రశ్న. సాధారణముగా తెలుగువైద్యుడైతే నాడి, ఇంగ్లీషువైద్యుడైతే గుండెలు పరీక్షించి కొట్టుకోవడంమానీగానే కాటికి మోసీమని అనుజ్ఞయిస్తారు. కాని, వల్లకాటిలో చితిమీదనున్నప్పుడు సెగ తగలగానే తెలివీప్రాణాలు కొందరికి వచ్చాయని

చెప్పుగుంటూవుంటే మనము విన్నాము. తరువాత ఆయువు తిరిగీ అందులోకి దూరుట కవకాశమున్నదని కొందరు సైంటిస్టులుకూడా ఒప్పుకోవచ్చును. కాల్చేసిన తరువాత ఆయువువస్తే పుష్టేమిటి? ఉపాధియైన శరీరము కాలిపోయిన తరువాత ఆజీవము అశరీరమైన దయ్యమై వారినీ వీరినీ పడుతునే వుంటుంది.

అందుకనే కాబోలు క్రైస్తవులు మొదలగువారు శవాలను కాల్చకుండా పూడ్చిపెడతారు. అయినా ఇందువల్లనెట్టి ప్రయోజనమును లేదు. ఆయువు తిరిగీ ఆమంటిలో ప్రవేశించి శవములోకి దూరలేదు. దూరినా బ్రతికినమనిషి పైకిరాలేక ఊపిరాడక రెండో చావు చావవలసినదే. అయితే దయ్యాలుమాత్రం భూస్థాపితం కావలసినదే కాని యితరులను హింసించవు. అయినా తప్పించుకొని వస్తున్నవి లేకపోలేదు! ఈకారణాలచేత అమెరికా సంయుక్తరాష్ట్రములలో ఆలబామా బర్మింగహాము నగరవాస్తవ్యురాలు మిసెను ఎలీజాబ్యాంక్సుఅనే ఆమె ముందే తెలువుకొని ఒక ఉపాయము నాలోచించింది. ఆమె యిప్పుడారోగ్యముగానే ఉన్నది. కాని ప్రాణముపోవుట అనగా యెంత? జబ్బుచేసి మంచముమీద పడగానే ఊపిరాడకపోవడం చూసి పాతేస్తారు! తనను ఒక పెట్టెలోపెట్టి పూడ్చవలెనన్ని దానిమీద బులబులాసుగాను పల్చగాను మన్నుపోయవలసినదనీ ఆమె యేర్పాటు చేసుకొన్నది. ఆపెట్టె తాను స్వయముగానే తయారుచేయించుకుంది. ఆపెట్టెకు మిత్రుల యిండ్లకు టెలిఫోను కనెక్షను పెట్టించుకున్నది. తెలివి రాగానే గంటవాయించి మాట్లాడుకొని పట్టంలోకి వచ్చి అందరితో ముచ్చటగానుండవచ్చును. పెట్టెలో పెట్టగానే మన్నుపోసీక కొంచెము రోజులు తాళవలసినదనికూడా ఆజ్ఞాపించుచున్నది. ఈమెకు ప్రాణాలు తిరిగీవచ్చి టెలిఫోనుతో మాట్లాడడం చూచారురా అంటే సంపదలనువిడిచి చచ్చిపోనిష్టములేని మహానుభావులందరూ ఈమోస్తరు తెలివినే తెచ్చుకొని యీమోస్తరు జాగ్రత్తనే పడుతూవుంటారు.

## స్పృశ్యతా ధర్మము

పాశ్చాత్యులు ముఖ్యంగా ఒక్కవిషయములో మనకంటె తలమించి తాటి ప్రమాణం నాగరికులైనారనడానికాటంకంలేదు. వారికి అస్పృశ్యతాదోషమనేది యెక్కడా కోస్తే లేదు. సర్వేసర్వత్రాస్పృశ్యతా మహాధర్మం వ్యాపించి వున్నాదనడానికి ఆదేశాల్లో తాకడమేకాకుండా గట్టిగా కౌగిలించుకొని ముద్దులుకూడా సనాతనకాలంనుంచి పెట్టుగుంటూవుంటూ వుండడమున్ను నవయుగంలో అదిమరీ యెక్కువౌతూ వుండడమున్నే ప్రబలనిదర్శనము. మనదేశంలో ఈఅస్పృతాసిద్ధాంతం ఒక్కహరిజనుల యెడలను మాత్రమే పాటించబడుతున్నాదనుకోవడం కేవలం అధర్మము. పాశ్చాత్యదేశాల్లోలాగ మనము యెవరిమీదనైనా అభిమానం రేకెత్తుకొనివచ్చినప్పుడు అమాంతంగా మీదపడి కౌగిలించుకొని ముద్దుపెట్టుకొని ప్రకటించగలమా? తల్లినే కానీ తండ్రినేకానీ, పెద్దలనేకానీ పిన్నలనేకానీ, పరిచితులనేకానీ అపరిచితులనే కానీ మనం యెంతప్రేమవున్నా ఒకరికొకరము తగలకుండానే దూరదూరంగానిల్చి నమస్కరించడం పలకరించేవాళ్ళని పలకరించడమే తప్ప, ముద్దుపెట్టుకోవడం కాదుగదా చేయైనా తగలనిచ్చామా, ఇదేమిటీ చెయ్యిముట్టు సరసమని యిరుగుపొరుగువాళ్ళు వీపు విరగగొడతారు. అస్పృశ్యత వెలసివున్న జాతులలో అల్లా ఇదేకర్మం! అందువల్లే పాశ్చాత్యులు అస్పృశ్యత అప్రేమవల్ల వస్తుందనీ, నిరభ్యంతరంగా అందరినీ తాకుతూ కౌగిలించుతూ ముద్దులాడుకుంటూ విలాసంగా విహరించేజాతులలో మాత్రమే ప్రేమ అవతారమూర్తియై వెలసివుంటుందనీ, హిందూదేశానికి ఈ ప్రేమధర్మము నుపదేశముచేసి తమలాగే తరింపఁజేదామనినీ విశ్వప్రయత్నము చేస్తున్నారు. మనము కూడా వారికి యథాశక్తిగా తోడ్పడుతున్నాము. ఇప్పుడు మనదేశంలో మునపటంత మొగమాటం, ముభావం ముట్టుకోకపోవడం, ముద్దెట్టుకోకపోవడం యెక్కడేనావుందా?

అస్పృశ్యతపోయి స్పృశ్యతబాగా సిద్ధించడమంటే యెక్కడో రెయిళ్లలోను పడవలలోను స్కూళ్ళలోనూ ఆఫీసులలోను సంతలలోనూ సమ్మర్దములలోనూ ఒకరినొకరు రాసుకోవడం మాత్రమే కాదనిన్నీ, అవసరాలు కల్పించుకుంటున్ను అయినా ఒకరికొంగు ఒకరికీ ఒకరిచెయ్యి ఒకరికీ, ఒకరిఅంటు ఒకరికీ ఒకరిపెదిమె ఒకరికీ తగిలించుకుంటూ విఱ్ఱవీగడమే సుస్పృశ్యత అనిన్నీ భావించేవారు అనేకులు లేకపోలేదు. అస్పృశ్యత యీకాలంలో కావాలని కోరుకొనే తెలివితక్కువవారెక్కడైనావుంటే వారికి భారతదేశం యేలాగున ఆదర్శమైయున్నదో సంపూర్ణస్పృశ్యత కోరుకొనే మనము కొంతవరకైనా పాశ్చాత్యుల పరిశుద్ధస్పృశ్యాచారములను పఠించి అభ్యసించవలసి వస్తుందనుకోవాలి!

స్పృశ్యజాతులన్నిటికీ ముద్దు ఒకప్రధాన ముద్రిక మాత్రమేకాక ఆయుధంకూడా అయివున్నది. ఒకప్పుడు చక్కనిపడుచుఫ్రెంచిరాణీ ఒకముసలిబంట్రోతును నిద్రపోతూవుంటే ముద్దాడింది. ఏమమ్మా అంతమోహమని చెలికత్తెలాక్షేపిస్తే తానతని శరీరమును చూచి కాక అతని ఆత్మని తలచుకొని ముద్దాడితినని బదులుచెప్పెను. 1784లో డెవన్షయిరుడచ్చెసు, ఫాక్సు అనే పార్లమెంటు అభ్యర్థికొరకై వోట్లకొరకు ప్రచారము చేయుచుండెను. ఆదేశంప్రజలుకల్లుకూ డబ్బుకూ లొంగివోట్లియ్యరు. ఈమె చక్కనిచుక్కేమో, ఒకొక్కముద్దు తగిలిస్తూవుండడం ఒక్కొక్కవోటు ఖరారు చేయించుకోవడం మొదలుపెట్టింది. ఒక నెత్తురుకోతవాడు ఎంతమంది బ్రతిమాలినా ఫాక్సుకు వోటియ్యనని హఠాయిస్తే యీమె అమాంతంగా అతనిమీదపడి ముద్దెట్టుకొని మరీవోటు వేయించుకుంది. ఆరోజుల్లో ఇదంతా ఒకపెద్ద వింతలాగ పేపర్లన్నిటినిండా బొమ్మలువ్రాసి యెక్కించారుట. ఇప్పుడది సర్వసాధారణమేమో తెలియదు.

ఫ్రెంచి రివల్యూషను సమయములో ఫ్రెంచివాళ్లు ఇంగ్లండుమీదికి దండయాత్ర వస్తారేమో అని భయం. వేనవేలు యువకులను సైన్యములోకి చేర్పించవలసినదని హంట్లీప్రభువుగారికి ఉత్తరువువచ్చింది. అయితే ఫ్రెంచి రివల్యూషనంటే ఆంగ్లేయప్రజల కిష్టము. వారి దేశములోకూడా ఆ మోస్తరు విప్లవమువచ్చి స్వాతంత్ర్యం సిద్ధించవలెనని వారి ఆశయము. కనుక వారు సైన్యంలో చేరరాయెను. అప్పుడు జానీగార్డెను ప్రభ్వి యేమిచేసెను? పూర్తిగా మిలిటరీడ్రెస్సు వేసుకొని పట్టణములు పల్లెలు అడవులు కొండలు వెంటపడి ముందెల్లా సైన్యంలో చేరమని బ్రతిమాలి యెప్పటికీ వినకపోతే చేరిన వాడికి ఒకొక్క ముద్దుచొప్పున పెట్టి చేరిపించింది. అట్టి దివ్యసుందరీవిగ్రహము ముద్దెట్టుకుంటానంటే యెవరు వద్దనగలరు? దేశాభిమానమంటే ఆలాగున వుండవాలి!!

ఒకప్పుడు బహిరంగంగా పెళ్లాన్నయినా సరే, పిల్లలు చూస్తూవుండగా మొగుడు ముద్దుపెట్టుకుంటే తప్పు అని రోమునగరంలో భావించేవారట కాని, నాగరికత వ్యాపించిన తరువాత అట్టి చట్టములను పుస్తకములనుండి చించేశారు. జపానులో బహిరంగపు ముద్దులాటలను నిషేధిస్తూ ఇంకా చట్టంవుంది కనుక అక్కడ అస్పృశ్యత పూర్తిగా నశించలేదేమో అనుకోవాలి. తెల్లవాళ్ల జండాక్రిందవున్న మన దేశంలో ప్రజల కల్లాటి వెఱ్ఱిముద్దు లిష్టములేకపోయినా పార్టీలొప్పుకొని బహిరంగంగా చుంబనాలు చేసుకుంటే శిక్షించాలని యేలాటి చట్టంలేదు. గాంధీమహాత్ముడు అస్పృశ్యతాపిశాచంపైని చేస్తూ వచ్చిన దండయాత్రలో డబ్బా యేగానికోసం, గాజులూ ఉంగరాలుకోసం, పుస్తేపూసకోసం వర్ణవిచక్షత, లింగవివక్షత, వయోవివక్షత, తెలుపూ-నలుపూ, కుళ్లూ శుభ్రం, విధవా—పునిస్త్రీ వివక్షత లేకుండా అందరినీ తడవుకొని అయినకాడికి దేవీను కున్నాడే కాని ఆదేశసమయమున అనురాగపూర్ణమైన ఆలింగనములు చుంబనములు చేసుకుంటూ వచ్చేలాగుంటే అస్పృశ్యతాపిశాచ మీపాటికి హడలి

పోయి అడవులు పట్టిపోయివుండునని కొందరు సంపూర్ణ స్పృశ్యతావాదుల విశ్వాసమైయున్నది.

### కుంభకోణం కీర్తి

కుంభకోణం అయ్యార్లు మంచి బుద్ధిమంతులు, విద్వాంసులు, హైకోర్టు వకీళ్లు, జడ్జీలుగ అయి రాణించిరని మన మెరుగుదుము. ఈమధ్యన ఇతర ప్రాంతములలోకంటె అక్కడ యజ్ఞము లెక్కువ జరిగి అనేకము మేకలు తరించినవి కనుక వారికి సుప్రసిద్ధ సనాతనులన్న కీర్తిపట్టా వచ్చినదనికూడా యెరుగుదుము. ఎక్కడెక్కడ హోటేళ్లనుంచి, సంతర్పణలను, వారికొరకై దరఖాస్తులు వెళుతూవుంటాయి కనుక వారిలో పెక్కుమ పాకశాస్త్ర ప్రవీణులనికూడా మనకు తెలునును. కాని యస్. దేవనాయకిగారు కనిపెట్టిన ఒక దివ్యరహస్యము మనవంటి కాఫీపానరతుల కందరికీ మిక్కిలి ముఖ్యమైనది. నేపిల్సు పట్టణమును చూసేసి మరీ చావమన్నారు కాని కుంభకోణం కాఫీని త్రాగేసి మరీ బ్రతకమంటున్నా రావిడ. ఆకాఫీ కా సువాసన ఆ ఘాటు ఆ కమ్మదనము ఆకీర్తి యెక్కడనుంచి వచ్చాయిరా అంటే ఆ అయ్యరుపిల్లకాయల చేతులనుండే వచ్చిందనడానికి సందేహంలేదు. కాని, పరిశోధన (రిసెర్చి) చేసేవాళ్లల్లాగ ఒకమాట చెప్పేసి నోరు మూసుకుని వూరుకోరు. దాన్ని గూర్చి ఒక ట్రీటైజు (వ్యాసం) వ్రాసి మరీ ప్రకటిస్తారు. ఆంధ్రదేశస్థులుకూడా దానిని పఠించి అయ్యారులతో ఆఖరు కందులోనైనా పోటీచేసి సమానులవవాలనే వుద్దేశ్యముతో ఆమె పరిశోధనాఫలితములనిందు హిందూవారిపత్రికనుండి తెలిగించి ప్రకటించుచున్నాము.

కాఫీగింజలను వాసనవచ్చేదాకా వేచి పొయ్యిమీదనుంచి దించీవాలి. వెంటనే ఒక కాగితపు టట్టమీదకాని పీటమీదకానీ పోసీవాలి. మూకుట్లో యేమాత్రమునే వుంచీసినా మాడిపోతవి. పిమ్మట వానిని అతివేగముగా చల్లారబెట్టి పొడిచేసి డబ్బాలకెక్కించవాలి. మనవాళ్లు తరుచుగా ఈవాళ వేచడం రేపు పొడిచేయడం జరగిస్తారు. లేదా ఎప్పుడు చల్లారితే అప్పటికే అని వూరుకుంటారు కాని తొందరగా చల్లాగబెట్టే వుపాయ మాలోచించరు. కాని వాటి కెంతసేపు అనవసరంగా గాలి పట్టిస్తే గాలిలో వుండే చెమ్మ వాటికిపట్టి మెత్తపడిపోయి వాటి వాసన అంత తగ్గిపోతుంది. ఎంత వేగం చల్లారబెట్టి గుండచేస్తే అంత కమ్మదనం హెచ్చుతుంది. అందుకోసం కుంభకోణంవారు విసినికఱ్ఱలతో విసిరి వేగము చల్లారబెట్టి వెంటనే పొడిచేసి డబ్బాలలో కుక్కేస్తారు.

అసలు మజాఅంతా యీ తరవాతనే ఉంది. ఉచితమైన పాళ్లతోపాటు పంచదార డికాక్షను కలిపేవరకూ అంత కష్టమేలేదు. కలిపిన తరువాత చల్లారపెట్టడములోనే కుంభకోణంలోని బాలురైనా సరే, ఆంధ్రదేశంలోని మహావిద్వాంసులను కూడా మించిపోతారు. సాసరులోపోసి చల్లారపెట్టడంవల్ల కాని, కాఫీగ్లాసు నీళ్లబిందెలో ముంచడంవల్లగాని కమ్మదనం తగ్గిపోతుంది కాని మానదు. అందుకనే ఆ బాలురు రెండు గ్లాసులను రెండు చేతులలోనూ పట్టుకొని ఒక చేతిని నెత్తికిపైగా చేయి వెళ్లగలిగినంతమీదికి యెత్తుతారు. రెండవ చేతిని మోకాలుకిందికి దించుతారు. చేతులను మీదికీ కిందికీ మారుస్తూ ఆ గ్లాసులోనుంచి యీ గ్లాసులోకి యీ గ్లాసులోనుంచి ఆ గ్లాసులోకి కాఫీని చరచర పోస్తారే. చూసేవాళ్ల కదంతా క్రింద పడిపోతుంది కాబోలనిపించినా ఒక్కడివ్వ క్రిందను పడనీయరు. ఈవిధంగా ఆ కాఫీత్రాగే పాళంగా చల్లారేలోపల యెంతగాలిని బిగించి బంధించవచ్చునో అంత గాలిని అందులో బంధిస్తారు. కాఫీ ఒక కప్పైతే నురగరెండు కప్పుల యెత్తున దానిమీద నిలబెట్టి ఆ బాలురు అతిథులయెదుట పెడతారు. ఈ నురగంతా మన గొంతుకలోనూ నాలుకమీదా అణిగిపోతూవుంటే వుండే ఆనందము కైవల్యసిద్ధిని పొందిన తపశ్శాలికైనా వుండదని ఆమె శలవిస్తు

న్నాది. మన ఆంధ్రవిద్యార్థులకంటె తమిళవిద్యార్థులు పెందరాడే లేచుటకు కారణంకూడా ఆ నురగ అణగిపోకుండావుండే అట్టి ఆ కాఫీని సేవించి బ్రహ్మానందము పొందుదామా అనే తొందరచేతనే అని ఆమె అభిప్రాయము. ఇల్లాటి కాఫీ తెల్లవారేటప్పటికి దొరుకుతుందంటే రాత్రి నిద్రపోకుండానే మేలుకుంటారు కొందరు మహానుభావులు. తమ బిడ్డలు ఎమ్మే గిమ్మే పరీక్షలు తొలిసంవత్సరంలోనే తప్పకుండాప్యాసు కావలెనని కోరుకొనే శ్రీమంతులు ప్రశస్తమైన కుంభకోణం బ్రాహ్మలను వంటకు నియమించుకుంటే సరిపోయేలాగుంది.

## అట్టకిటికీలు !

యంత్రపరిశ్రమలు, స్కూళ్లు కాలేజీల చదువులు, కచ్చేరీ కుర్చీలమీద వుద్యోగాలు, శాసనసభలలో ఆలోచనలు చర్చలూ మొదలైనవి ప్రారంభమైనప్పటినుండి ప్రజలకు తిండీ తిప్పలూ మాట దేముడికెఱుక కాని చల్లనిగాలీ, తియ్యనినీరూ కమ్మనియెండే కఱువైపోయినాయి. సిరి అబ్బదు కాని చీడ వేగ మబ్బుతుంది. యంత్రపరిశ్రమలవల్ల లాభాలు యేకొంచెము మందిమాత్రమో మూటకట్టుకుంటున్నారు కాని దారిద్ర్యాన్ని అశేషజనసామాన్యమూ అనుభవించి పంచుకుంటున్నారు. పూర్వము ప్రజలంతా ప్రకృతి మహాదేవి బిడ్డలై యెండలో యెగురుతూ నీడలో ఆడుతూ నీళ్లలో తేలుతూ గాలిలో తూలుతూ సుఖంగా కష్టపడుతూ కష్టంగా తింటూ (అనగా కావలసినకంటె యెక్కువగానే అన్నమాట) ఆరోగ్యమూర్తులై వుండేవారు. ఇప్పుడో గాలివేసే గది, యెండవచ్చే వాకిలి యెవరెవరో మహానుభావులకు తప్ప జనసామాన్యమున కనుకోకూడని మహాపరాధములు. ఈ సైంటిఫిక్కు నాగరీకయుగములోనున్న లక్షాముప్ఫైమూడుకోట్ల రోగాలకు తగినయెండ లేకపోవడమే కారణము. ఎండలోవుండే అల్ట్రావైలటు కిరణములలో దేహాలకు జీవాణువులనిచ్చి వృద్ధిచేయు శక్తియున్నదని వైద్యశాస్త్రజ్ఞులు కనుగొని, రసాయనపదార్థముల ద్వారా అట్టి శక్తిగల మాత్రలను తయారుచేసి క్షీణించుచున్న రోగులకు మందులుగా ఇచ్చి బలిష్ఠులుగా చేయుచున్నారు. కొన్ని అస్పత్రులలోను శానటోరియములలోను రోగులపై నిట్టి కిరణములను ప్రసరించి రోగములను కుదుర్చు పరికరములును అమర్చబడుచున్నవి. ఎండదూరని గాలివీవని ఫ్యాక్టరీలలోను, కచ్చేరీలలోను పొట్టకూటికై మితిమీరిన కష్టములు పడుచుండుటవలన గదా ఇట్టి యిక్కట్టులు కలుగుచున్నవి. ఈ కూలీలకును ఈ ఉద్యోగస్థులకును ఈ కొలువులవల్ల, చదువులవల్ల వచ్చే డబ్బుకన్న వానివల్ల వచ్చే రోగములను కుదుర్చుకొనుట కెక్కువడబ్బు ఖర్చు అగుచున్నది. అయినను యీ సంగతిని బాహాటముగ లెవ్వరును అనరాదు. అంటే అట్టివారిని నవనాగరిక శ్రీమంత విద్వాంసులందరూ ఆ దివ్యతేజస్సు చూడనొల్లని చరిత్రాత్పూర్వకమైన మూర్ఖయుగమునకు చెందిన సనాతన ఛాందసఘూకములని తెగ వ్రాసిపోతురు. అయినను త్రిమూర్త్యాత్మకుడగు సూర్యభగవానుడు, కానిడబ్బు పుచ్చుకోకుండా కనిపించిన వారికందరికీ రోగములు రాకుండా కాపాడెడి దివ్యమగు సజ్జ కిరణములు ప్రజలకు స్వతస్సిద్ధముగా లభించే వ్యాపారమార్గముల నెల్ల విచ్ఛిన్నముచేసి, కోరి తెచ్చిపెట్టిన రోగములను కోట్లకొద్ది ధనముపెట్టి కృత్రిమకిరణములవల్ల కుదర్చబూనుకొనుటే నాగరికతా మహాసుందరి యొక్క నవ్యనాట్యవిలాసముగ పరిగణించుచుండుట కాలవైపరీత్యము గాక మరేమి! తిరిగీ గృహపరిశ్రమలు, స్వంతవ్యవసాయములు, వీధిబడులు, విద్వాంసుల శుశ్రూషచేసి కఱచు ద్రవ్యోపార్జన కొరకుగాని చదువులు ఉజ్జీవింపబడిననాడు తప్ప మన మిప్పుడు మునిగియున్న అనారోగ్యమగు అగాధాఖాతమునుండి ముక్తులమగుటకు మార్గమున్నదా యనిపించును. తిరిగీ ఆ పూర్వకాలం రావాలనుకోవడం మూర్ఖత్వమే కావచ్చును కాని, ఈ యంత్రమహాయుగములో ప్రజలను మునపటివలె దృఢకాయులుగను, సదభ్యాస సచ్చింతనాపరులు

గను, సంతృప్త సంపద్వంతులుగను చేయగలుగు టయు వ్యర్థవాంఛ కాకుండునా? అయితే ప్రపంచమే వ్యర్థము కనుక యీ రెండు వ్యర్థములను గూర్చి యెందు కింత బెంగపెట్టుకోవడమంటే కొంత సమాధానంగా వుంటుంది!

ఎండకటువుపట్టిపోయి రోగములపాలవుతున్న యీ కాలపు సంసారులందరికీకూడా చైనాదేశీయుడగు చేన్ ప్యాంగ్యి అనునతడు కిటికీలకు అద్దపుతలుపులకు బదులుగా ఉపయోగించుటకై కనిపెట్టిన కాగితపు తలుపులు వరప్రసాదము లనవచ్చును. ఈ అట్టలు మామూలు అట్టలలాగ వెలురును రానుండా మూయుటకు గాదు. అద్దములవలె వెలుతురును యెండను రానిమ్మటకే వీని నుపయోగింతురు. ఆరోగ్యకరములగు అల్ట్రా వైలట్టుకిరణములు 40% వరకు ఇందులోనుంచి గదిలోకీ ఫ్యాక్టరీలలోకీ దూరి ఆరోగ్యరక్షణము చేయునట. ఇదివరకు ఇట్టి కిరణములను స్పెషలుగా ఇంటిలోనికి రాబెట్టవలెనంటే అత్యధికమైన వెల చేసెడి ఒక మోస్తరు అద్దములను కొనుక్కోవలసివచ్చేది. ఇవి చాలా చౌకగానుండి పేదసాదలుకూడ తమ యిండ్ల కుపయోగించుకొనుటకు సాధ్యముగనున్నవి. ఇవి చౌక. గాజు తలుపులకంటె యెక్కువ కిరణములను లోనికి విడుచును. ఈ కిరణము లెక్కువ ఆరోగ్యకరమైనవి. ఇంకో విశేషము. అద్దపు కిటికీలలోనుండి వచ్చే యెండ దానికి సూటిగావున్న మేరకే ప్రసరించును గాని, వీనిలోనుండి వచ్చే యెండ గదంతా యిల్లంతా యిటు మూలకల వెంబడికూడా వ్యాపించి తేజోవంతముగా చేయును. కనిపెట్టినా యిల్లాటి పరికరాలని సైంటిస్టులు కనిపెడితే పుణ్యం పురుషార్థం కాని, విషవాయువులు, మందుగుళ్లు మొదలగు మారణసామగ్రినీ, విమానాలూ మరలు మొదలగు దారిద్ర్యకారక సాధనములను కనిపెట్టి మానవజీవనమును హతమార్చుతుండేవారి కట్టె గితులుపట్టునో గదా!

## అల్పాయుర్దాయమున కేమిటి కారణము?

కొంచెము కాలంక్రిందట జారో అఘా అనే పేరుగల టర్కీదేశ వాస్తవ్యుడు 160వ యేట మరణించెను. మనదేశములో అయితే అచావుకు కారణము ఆయుర్దాయము చెల్లిపోవుటయని వేదాంతఫక్కీగా అంటాము. దానికే పాశ్చాత్యశాస్త్రజ్ఞులు గుండె లాగిపోవుట, కీళ్ళరిగిపోవుట మొదలగు మొదలగు సైంటిఫిక్కు రీజన్లను చెప్పుతున్నారు. అప్పుడప్పుడు పెద్ద జబ్బులు చేస్తే అసలాయుర్దాయం చాలా తగ్గిపోతుందని కొందరి వాదమట, కాని 'అన్నిజబ్బులూ అల్లాటివికావు. కొన్ని జబ్బులు చేసి నిమ్మళించినవారు అసలు జబ్బే చేయని వారికంటె యెక్కువ కాలము జీవిస్తారు' అని కొందరు వైద్యులు పైవారి వాదమును తిరస్కరిస్తున్నారు. చావుల సంఖ్య పురుషులలోకంటె స్త్రీలలో యెక్కువవుంటే వుండును గాక కాని దీర్ఘాయుర్దాయాలు పురుషులలోకంటె స్త్రీలలో ఎక్కువయని కొందరు జనాభా లెఖ్ఖల గాండ్రు నిదర్శనాలు చూపిస్తున్నారు. దీర్ఘాయువనేది ఒకమోస్తరు వారసత్వమనీ యెవరి తల్లిదండ్రులు తాతముత్తాతలు దీర్ఘాయుష్మంతులో వారి పిల్లలే తప్ప తక్కినవారికి దీర్ఘాయుర్దాయా లుండవని కొందరి వాదన. 'ఫరవాలేదు, అల్పాయుర్దాయుల వంశంలోపుట్టినా, ఇంద్రియనిగ్రహం, భోగవిముఖత్వం, ఆహారవిహారశుద్ధి మొదలైన సద్గుణములుంటే ఆయుర్దాయమును పొడిగించవచ్చు'నని కొందరు సాధకుల సిద్ధాంతము. డాక్టరుయీ డబ్లినుగారు భీమాకంపెనీ డైరక్టరుగావుండి అనేకులను శోధించాడు. పొట్టిగా, స్థూలంగా, బలువుగా, చిన్నవెన్నెముక, చిన్నగుండెకాయతిత్తి వున్నవా ళ్లెక్కువకాలం జీవిస్తారని చెప్పుతున్నాడు. అధవా పొడుగ్గావుంటే ఆపొడుగుకు తగిన స్థూలం బలువు, పెద్దవెన్నుముక వుండవాలట. పెద్దగుండెకాయ పెద్దవూపిరితిత్తి వుండడానికి మాత్ర మెంతమాత్రమూ ఒప్పుకోడు.

అధికాయుర్దాయానికి కారణాలు కనిపెట్టాలంటే ఇంతమంది ఇన్నితర్జన భర్జనలు పడుతున్నారు కాని అల్పాయుర్దాయమునకు కారణములను వీరందరూఇట్టే నిర్ణయించినారు. బుద్ధిమంతులు, విద్యామంతులు, సౌందర్య రస గ్రహణపారీణులు, చిత్రకళానిపుణులు మొదలగువారందరూ వేగరము చస్తారనీ ఆయుర్దాయమనే అమూల్యమైన మూల్యము చెల్లించనిదే పేయుత్తమలక్షణములు మానవకోటికి లభించవనీ ఖచితంగా నిర్ధారణచేసినారు.



# సంపాదకీయములు

## రాష్ట్రీయాంధ్ర మహిళా మహాసభ:—

బరంపురము ఆంధ్రప్రాంతమునుండి ఉత్కళదేశములో జేర్పబడుటకు సిద్ధమై యున్న యిట్టి క్లిష్టసమయమున రాష్ట్రీయాంధ్రమహిళాసభ యచ్చట జరుపబడనుండుట యొక పెద్దమాటయే. రాష్ట్రమునకు జిట్టచివరనున్నది యీ బరంపురము. అంత దూరదేశమునకు వెళ్లుట యనగా సామాన్యపుమాట కాదు. తథాపి ఆవ్యయ ప్రయాసములకోర్చి యెట్లులైనను వెళ్లియే తీరవలెనని మా సోదరీమణులను ప్రోత్సాహపరచుచున్నాము. ఉత్కళ జమీందారులు తమకున్న యర్థబలమువల్ల బ్రహ్మాండమును దలక్రిందులు సేయుచున్నారు. తరతరములనుండియు జేరియున్న లక్షోపలక్షల తెనుగువారినీ గోలపెట్టించుచున్నారు. స్వార్థపరులగు తెనుగువారే కొందరీ భూస్వాములకు వెనకపాట పాడుచున్నారు.

ప్రదేశమంతయు నొక మహావిచిత్ర నాటకరంగమైయున్నది. ఇటువంటి మహాసమయమున నీ మహిళామహాసభ సమావేశమై తెనుగువారి మానమర్యాదలను నిలువబెట్టుట కర్తవ్యము. ఇంటగెలిచి రచ్చగెలువుమన్నట్లు సోదరీమణులు మునుముందీ యింటిసంగతులు చక్కబెట్టుకొని యావల శాసనసభా ప్రవేశ ప్రణాళికలలో బుద్ధి జొన్పెదరు గాకయనియు మేము కోరక తప్పదు. "గంజాముమండల మేటులబోయిన మాకేమి?!" యనుకొనుట యవివేకము. రాజకీయ సాంఘికవిషయములందు గంజాముమండలము—తత్రాపి బరంపురము—తక్కిన తెనుగుసీమలకంటె నొకమెట్టు పైనున్నదే కాని క్రిందుపడియుండలేదని నివేదించుట యథార్థమేగాని స్వాభిమాన మోహమాత్రము గాదని యాంధ్రమహిళామణులు తెలియుదురుగాక. గంజాముమండలాంధ్ర సాధ్వీరత్నముల చరిత్రములుగూడ నొకటి రెండు మా గృహలక్ష్మి తడవియే యున్నది.

కాబట్టి యిట్టి సర్వోత్కృష్టమగు ప్రదేశమును, ఉత్కళరాష్ట్రాభిమానవశులై ధారవోయుమనుట "మీ యింటితలుపు మా యింటికెత్తి మీరు తెల్లవార్లూ కుక్కలను దోలుకొనుచుండుడు" అని సెలవిచ్చుట వంటిదేకదా. ఘట్టిగా పట్టుపట్టి యీపట్టున నాంధ్రనారీమణులు నలుగురూచేరి దిట్టలై మెలగుదురేని మరి యాలాటి "పప్పులుడకనివ్వ"రని మా నమ్మకము. భవిష్యత్సమావేశమునందీ విషయమే ముఖ్యతమమై యుండవలెను. మరియు నీ సభకు ఆంధ్రస్త్రీరత్నమే ఆధిపత్యము వహించవలసియుం

డునుగాని తదితరస్త్రీ లెంతమాత్రమును బనికిరారనియు మేము తెలియజేయ సాహసించుచున్నందుకు మన్నింతురుగాక! మాతృభాషయందే వ్యవహారమంతయు జరుగవలయునుగాని మరియొక షక్కి ననుసరించుట యాభాసకు మూలమనియు మా యాశయము.

ఐతే యింతపెద్ద మహాసభ కాధిపత్యము వహింపగల యాంధ్రస్త్రీ లెవరైన నున్నారాయను శంకయు చాలమందికి బొడమవచ్చును; కాని యది యనవసరము. శ్రీమతులగు కనుపర్తి వరలక్ష్మమ్మగారు, చుండూరు రత్నమాంబగారు, తెలికిచర్ల వసుంధరాదేవిగారు, తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు, వరాహగిరి వెంకటసుబ్బమ్మగారు, కొల్లా కనకవల్లి తాయారమ్మగారు మొదలగు నిట్టి యిల్లాండ్రెందరో యున్నారు. వీరి కాంధ్రలోకమున నున్నపేరు ప్రతిష్ఠలు సువిదితములే కాని సామాన్యములు కావు. కాబట్టి యిట్టి స్వజాతి స్త్రీరత్న సముదాయమునుండి యే నొక్కరినైనను ఎన్నుకొంట శ్రేయస్కరమని మాయుద్దేశము.

ఇక బరంపురము మన్యమని కొందరికొక దుర్భ్రాంతి యుండుటయుగలదు; కాని యది సత్యదూరము: ముమ్మాటికి సత్యదూరము. పరమపావనములైన ఋషికుల్యానదీజలములు పాతరోగముల బారద్రోలునని సర్కారువారే 'సర్టిఫై' చేసియున్నారు. మరియు శ్రీ దిగుమర్తివారు, గాదెవారు, యిమ్మిడిశెట్టివారు, యిందుపూరివారు వైశ్యరాజువారు మొదలగు సంపన్నకుటుంబములవారు పూనుకొని నడపవలసియున్న యీ యజ్ఞపవిత్రకార్యమున కేగగల యతిథుల సమ్మానసౌకర్యముల కెట్టి లోటును గలుగదనియే మాపూర్ణవిశ్వాసము.

బరంపురమునకును శ్రీజగన్నాథక్షేత్రమునకును ఒకరూపాయిన్నరకాబోలుటికెట్టు. కాబట్టి మహిళామహాసభ కేగగల యిల్లాండ్రకీయాత్రాఫలమును గలసి రాగలదు. కాలము గూడ జల్లగానుండును.

ఆంధ్రరాష్ట్రమునకు ప్రాణతుల్యమైన యీసరిహద్దుతగాదా తీర్చుట కింతకంటె మంచితరుణము మరిరాదు. కాబట్టి యిట్టి మహాతరుణము నూరికే పోగొట్టుకొనక సోదరీమణులు శ్రమపడి దేశచరిత్రమున కొక నూతనాధ్యాయమును గూర్తురుగాక!

**కీ॥ శే॥ శ్రీ మైసూరు రాజమాత:—**

శ్రీ మైసూరు రాజమాతృనిర్యాణము లోకమును శోకసాగరమున ముంచినది. కులాలంకారయు మహిళాశిరోరత్నమునగు నీయమ రొయొక మహాసేనానికి అనుంగుదనయయు శ్రీ చామరాజేంద్ర వుడయవరు రాజచంద్రుని యర్ధాంగియునై యలరారుచుండెను. ఆ మహారాజవరేణ్యులు సం॥ 1894-రమున బరమపదము నొందెను. అప్పటి కీ ప్రస్తుత మహారాజావారు బాల్యదశయం దుండుటవలన వారి తరపున మాతృశ్రీ మహారాణిగారే పరిపాలింపబూనిరి. ఆ యెనిమిదేండ్లలో మైసూరురాష్ట్రమున ఆదాయ, వ్యవసాయములందు గలిగిన యభివృద్ధి యసామాన్యము. రైతుల కార్థిక

సహాయము కావలసినంత యివ్వబడ జొచ్చెను. సర్వవిధముల రైతులను క్షామ దేవత బారినుండి తప్పించెను. కోలారునం దుండు బంగారుగనుల శాస్త్రసిద్ధములగు పద్ధతులపై నత్యంతాభివృద్ధినొందెను. కావేరీ నదీ సహాయమున విద్యుచ్ఛక్తి యంత్రా లయము నెలకొల్పబడెను. వీనికై నవ్యయము ఆదాయముకంటె మించెననుట యథార్థము. విద్యాభివృద్ధికై వలయు వ్యయము $8\frac{1}{4}$ లక్షలనుండి $11\frac{1}{2}$ లక్షలకు హెచ్చింపబడెను. స్త్రీ విద్యాభివృద్ధికై హైస్కూలు ను కాలేజియు స్థాపింపబడుటయే కాక వితంతు వులకు ప్రత్యేకముగా స్కాలర్‌షిప్పు లెన్నో యివ్వబడజొచ్చెను. ఉపాధ్యాయినులకు తృప్తికరములగు వేతనము లేర్పాటుచేయ బడెను. నూతన మందిరములు, రాజమార్గ ములు, జలయంత్రములు, అయోమార్గ ములు నెలకొల్పబడెను. చిత్తసమున్నతియు దెలివితేటలును ఆ రాజ్ఞీమతల్లికి సాజములై యుండినవి. 'డాబుదర్జా' లామెకుగిట్టునవి కావు. స్వమతాభిమాన మాదేవి కెంత యెక్కువయో పరమతసహనము నంత యెక్కువయే. యుక్తిచమత్కారములతో నామె సంభాషణములు శ్రోతలకు గర్ణపేయ ములై యుండెడివి.

అప్పటి రాజప్రతినిధి శ్రీ కర్జన్ ప్రభువు గారు ఆ రాజ్ఞీమణినిగూర్చి యమోఘ శ్లాఘావచనముల వ్రాసియున్నారు. యశోధనయైన యా మహారాజమహిషి అరువదియైదవయేట వైకుంఠయాత్ర నొన రించి దేశమాతను దుఃఖమునముంచెను.

దిలీప:—

కవిరాణి శ్రీమతి చిల్కపాటి సీతాంబ గారిచే నీ యేకాంకనాటకము నూతనముగ రచింపబడి మా కార్యస్థానము నలంకరించి నది. ప్రతివందనముల జేసెదము. శ్రీమతి యాంధ్రకవిపండితమండలమున నిదివరకె ప్రసిద్ధురాలై యున్నది. ఈమె విరచితములగు 'పద్మినీపరిణయ' మను శృంగార ప్రబంధ మును 'సముద్రమథన' మను నేడంకముల నాటకమును ఈమె కవితాప్రౌఢిమను వెల యింపజేసియున్నవి. ఈమె యపుడపుడు "భారతి", "గృహలక్ష్మి", "సుబోధినీ" మున్నగు పత్రికలకు విరామకాలముల వ్రాసి పంపిన పద్యరత్నములను నెల్లూరు విశ్రుత స్థానీయులగు శ్రీమాన్ బెల్లంకొండ వరదా చార్యులు, బి.ఏ.గారు గూర్చి 'కాదాచిత్క పద్యరత్నము' లను పేర ప్రకాశింపజేసి యున్నారు. అద్దాని ప్రశంస గడచిన జూన్ నెల గృహలక్ష్మిలో జేయబడియున్నది.

ఈ నాటకకథ కాళిదాసకృత రఘువం శమునందలి మొదటి రెండు సర్గలనుండి గొనబడినది. ఇది ఏకాంకనాటకమగుటచే ఈకవయిత్రి దీన నంకవిభాగము జేయలేమి రంగవిభాగముమాత్రము జూపుచు ఆ యైదు రంగములకు స్థలకములను పేరొసంగినది. నాటకోపోద్ఘాతముగ మొదటిస్థలకము రెం డవ స్థలకమునను మంత్రప్రవేశమువరకుగల భాగము నీమె కల్పించినది. అచటినుండి నాటకాంతమువరకు కొంచె మించుమించుగ రఘువంశము ననుసరించినది. ఈమె రచన కొన్ని యెడల కాళిదాసకవనమునకు మెరుగు

బెట్టునట్లుండును. దిలీపుడు పుత్రవరప్రాప్తి కొరకు వసిష్ఠాశ్రమునకు పోవునపుడు రాజ్యాధికారమును "సచివేషునిచిక్షిపె" సచివసముహాన కప్పగించినటుల కాళిదాసు చెప్పియున్నాడు. (1=34) నాటకసరణి కిది సరిపడక యీ శ్రీమతి సుమంత్రునామంత్రించి వానిపై బెట్టినది.

ఇంకొక యుదాహరణము: దిలీపునికి సంతానము కలుగకుండుటకు కారణమును వసిష్ఠమహర్షి తన తపోమహిమచే కనుగొను పట్టున కామధేనువు దిలీపునకిచ్చిన శాపప్రశంస రెండు శ్లోకముల జేయబడియున్నది. దుస్సహమగు నీ శాపశబ్దమును పలుమారుచ్చరింపనొల్లక "అధ్వని" యని యీమె భావగర్భితముగ జెప్పినది. ఇట్టి వింకననేకములు గలవు. వానినెల్ల వ్రాయబూనిన నాటకమంత గ్రంథము కాగలదు.

సింహదిలీప సంభాషణములు భాషలు ననదృశము లనదగును. ఈపట్టున నీమె కాళిదాసు నతిక్రమించినది. ఆ భాగమును నొకపరిజూచిన మరల మరల జదువవలయునను కోరిక మితిమీరునట్లు గలదు.

కాళిదాసుని రచనయందు లేక నాటకరీతుల ననుసరించి ఈమె చేర్చిన విషయ మింకొకటికలదు. రఘువంశమున యరుంధతీ సుదక్షిణా సంభాషణములు లేవు. ఔచిత్యము ననుసరించి ఈ కవిరాణి ఈ స్త్రీల సంభాషణల నందందు సొంపుగ గూర్చినది.

ఈమె రచించిన హిమాలయవర్ణన మహారమణీయమై పెద్దనాదులసరణి ననుగమించుచున్నది. దానినిట యుదాహరింప కుతూహలమగుచున్నది.

దిలీ:–ఆహాహా! ఏమి ఈ పర్వత రామణీయకము.

సీ॥ ప్రబలాకృతిని నభోభాగంబునకుఁదాఁక
మిన్నందువెల్ల నా మేడితోడ।
పైనుండిధరణికిఁ బ్రవహించి లలిమించు
నమలగంగా ప్రవాహంబుతోడ
నా దిత్యచంద్రతారాది సద్గ్రహరాజి
సిగపూలవలెవేడ్క జెలువుసూపఁ
నలయేటికాలువల చిలువభూషలరీతి
నంగనందఁబాఱుచు నందమెసఁగఁ
తే॥గీ॥ బ్రమథసిద్ధవియచ్చర పాళికపుడు।
సేవ్యమై సర్వలోకసంభావ్యమగుచు।
ధరణిపెలసిన నయ్యష్టతనునిపోల్కి।
హాళిగ్రాలెతో చెనదిగ నీహారనగము॥

ఈ నాటకము చిన్న యాకృతిగల ముప్పదియేడు పుటలలో నిమిడియున్నది. తెలుగు జదువగలవారొక ఘుంటలోపల దీని బూర్తిజేయగలరు. వారి యానందమనుభవైకవేద్యమై యుండగలదు. ఆంధ్రులెల్లరు ఈ చిన్నపొత్తముంగొని చదువుట కింటు నీమెయెడల వారు జూపగల యాదరము వేరొండుండజాలదు.

నేపథ్య విదానముల నేర్పుజాలమి సింహమును నందినీధేనువును మాట్లాడవలయుచోట్ల "తెరలో"యని నేపథ్య సూచన చేసియున్నది. నాట్యనిపుణులీ రెండంశములందును ఈకాలపు నాగరకతకను రూపములగు నేర్పాట్లు చేయగల్గుదురు.

కథాంశము లనేకములు కావ్యములగను చిత్రలేఖనములగను వెలసియున్నను

అత్యంతాకర్షకమగు సీనాటక కథాంశము నెవ్వరును కావ్యరూపముసగాని చిత్రరూపమునగాని నిలిపినటుల లేదు. ఈ యుపజ్ఞ సీతాంబగారి కుదయించుటయు గొప్ప విషయముగ నున్నది.

నెల్లూరుమండలమున విజ్ఞాన పురుషులును విజ్ఞులును ఆంధ్రసాహిత్య నిష్ణాతులును నగు శ్రీమాన్ మాడభూషి నరసింహాచార్యులు, బి.ఎ. బి.యల్ గారీ గ్రంథమున కవతారిక వ్రాసియుండుట జూడ ఇచ్చటి విద్వన్మండలియొక్క ఆదరము సూచితమగుచున్నది.

మాదిరికొరకీ క్రిందిపద్యములు జూపబడుచున్నవి.

క॥ పెనుపగపున వారిడు నె
చ్చనియూర్పుల నే నొసంగు సలిలము కోష్ణం
బును జెందుగా! కయా నీ
రనయుంబెటుగ్రోలు వారు హా! యగతికులై॥

తఘోవంశము 1_67.

మత్ పరం దుర్లభంమత్వానూన మావర్జితంమయా।
పయఃపూర్వైస్స్వనిశ్వాసైః కవోష్ణ ముపభుజ్యతే॥

శా॥ శ్రీకంఠుండుసమస్తలోకములకున్ సేవ్యుడయేనైననున్
నాకున్బాఙ్యాడరుంధతీవిభుడు, విజ్ఞానంబునన్ జూడు పె
న్వీకన్ గోవును బట్టినీవు మెసవన్ వీక్షించుచున్ బోవగా
నాకున్ జెల్లు నెమద్గురుప్రియము సంధానింపకే బేలనై॥

(రఘు_2_44)

క॥ నిలుచుండుట దర్శించుట
పలుకుటలవిగ్గలైనేని బంధుత్వంబుల్
గలయు. నిలు; మేను నీకుం
జెలికాడను నాదుపనుపు సేయుము ప్రీతిన్॥

రఘు_12_58 సంబంధమాభాషణపూర్వ
మిత్యాది

ఈకవయిత్రి యనేకగ్రంథముల రచించియున్నను నెద్దియు పాఠ్యగ్రంథముగ నింతవరకు నియమింపబడకుండుటంజూడ విద్యావిధాయకులు వీని దిలకింపలేదని యోజింపదగియున్నది. ఈస్థితిని మనసునందుంచికొనియెకాబోలు నీమె తన భగవద్వాక్యమున "కబ్బములు రాజమన్ననగాంచుగాక" యనియు కోరియున్నది.

గో॥ ష్ఠి:—

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో అతని నిర్మాణకార్యక్రమ కృషియ స్తమించకుండ, అతని అంతేవాసియగు శ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారు అతని పీఠమును ఆంధ్రరాష్ట్రరమణీమణికి కంఠస్థకౌస్తుభమైన విజయవాడయందు ప్రతిష్ఠించి శ్రీవారి గ్రంథములను బ్రకటించియు ఉపన్యాసములను సేకరించియు, భావములను క్రోడీకరించియు, గోష్ఠిని నిర్మించియు కొనసాగించుచున్నందు కెంతయు వంద్యులు. వీరు ప్రస్తుతము గోష్ఠియనుపేరట నొక ఆంగ్లమాసపత్రికను స్థాపించి గతఆషాఢముతోకూడా నాలుగుసంచికలను ప్రకటించినారు. భారత ఋషీశ్వరులు ప్రపంచోద్ధరణముకొరకు నిర్మించిన బ్రాహ్మణధర్మమును పునరుద్ధరించి జగద్వ్యాప్తము చేయనిదే దాని వర్ణాశ్రమ ధర్మములలో నంతర్భూతమైన మోక్షాసక్తి, క్షాత్రతేజము,

కృషిప్రాశస్త్యము, సేవాగౌరవమును అను సూత్రములు జగద్వ్యాప్తముకానిదే, భూలోకము స్వర్గతుల్యము కాదను గోపాలకృష్ణుని దివ్య సందేశమును సుబ్బారావుగారు నిర్భీతిగ ఈపత్రికద్వారా చాటుటయేగాక సకలవర్ణముల వారికిని మతములవారికిని తమ తమ కులదైవములు మతదైవములు లేక యిష్టదైవముల నారాధించుకొనుచునే గాయత్రిమంత్రోపదేశమునొంది జగత్సౌభాగ్యమునకు సహాయపడువారినిగా మార్చుటకు తీవ్రమైన కృషిసల్పుచున్నారు. అనన్యసుందరమైన శైలి, అసంకోచమైన భావప్రకటనము, అమలిన మనోహరశీలము, అదాంభిక సుమంగళకర శ్రద్ధ అతని నిట్టి సత్కార్యకరణమున కెంతేయు నిర్మునిగనొనర్చుచున్నవి. ఆషాఢమాసములో ప్రకటింపఁబడిన మనసాంఘిక సమస్యయనుప్రధానవ్యాసము, బౌద్ధుల అహింసా సిద్ధాంతమువలన ప్రపంచమునకు లభించిన నిర్వీర్యనిస్తేజప్రదర్శనము, మహాత్ముని నిరశనవ్రతములపైని విమర్శనములను మొదలగు వ్యాసముల నెల్లరును పఠింపదగును. అఖిలభారతఖండమునందును ఇట్టి సర్వతోముఖనిర్మాణక్రమవ్రతమును బూని విమర్శించుచున్న ఆంగ్లమాసపత్రిక యిది యొక్కటే యని యాంధ్రులు భావించినచో ఎవ్వరును ఆత్మస్తుతిగాగాని అతిశయోక్తిగా గాని పరిగణించరని నిస్సంశయముగ చెప్పవచ్చును. సంవత్సరము చందారు 3-0-0లు మాత్రము. అనతికాలములో అఖిలభారతవర్ష ప్రచారమునంది వర్ధిల్లగల యిట్టి దివ్యపత్రిక నాంధ్రులారంభముననే ఆదరించి పెంచుదురుగాక!

దసరా సంచిక:—

గత సంవత్సరము లన్నిటియందువలెనే యీ యేటగూడ అక్టోబరు 1-వ తేదికి 'గృహలక్ష్మి' దసరా సంచిక ప్రకటించబడును. త్రివర్ణచిత్రములు, ఛాయాపటములు, కథలు, వ్యాసములు, పద్యములు, గేయములు మొదలగువానితో సంచిక సర్వాంగసుందరముగా పాఠకుల కర్పింపబడును. ఆంధ్రదేశమునందున్న మహిళాసమాజ మందిరములయొక్కయు, విశిష్టలగు మహిళామణులయొక్కయు ఛాయాపటములను వానికి సంబంధించిన వివరములను సంక్షేపముగ వ్రాసి సెప్టెంబరు 8-వ తేదిలోగా మా కార్యాలయమున కందజేసినచో కృతజ్ఞతాపూర్వకముగ స్వీకరింతుము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# జమ్మి వెంకటరమణయ్యగారి

## యకృత్ ప్లీహవ్యాధులకు (Liver and Spleen complaints) దివ్యౌషధములు.

ఈ ఔషధము ఆ రోగములను కుదుర్చుటయే కాక, రాకుండ కూడా చేయును. వైద్యశిఖామణులెల్లరును మిగుల పొగడుచున్నారు. ఇతరమందులన్నియు వేసివేసి నిరాశచేసుకొన్న సందర్భములలోకూడా ఇది పనిచేసి విజయమును బడసినది.

అనేక ప్రదర్శనములలో బహుమానమును బడసినది తెనాలిలో జరిగిన ఆంధ్ర ఆయుర్వేద మహాసభలో ఇది ప్రథమతరగతి యోగ్యతాపత్రమును పతకమును బడసినది.

జమ్మి వెంకటరమణయ్యగారి ఫోటోగ్రాఫు దీనికి ట్రేడుమార్కుగా రిజస్టరు అయినది కనుక ఆ ఫోటోను చూచి మందు కొనుక్కొన్నచో మోసపోరు. 5 రూపాయిలకు 10 రూపాయిలకు రెండు రకము లమ్మబడును. జబ్బు లేతగానున్నప్పుడు మొదటిది, ముదిరినప్పుడు రెండవది ఉపయోగించవలెను.

లభించు ప్రధానస్థానములు :

మదరాసు, 8, సాలై వీధి, మైలాపూరు. కలకత్తా, 125, హారిసనురోడ్డు.

# జండూగారి అశోకారిష్టము




(భైషజ్యరత్నావళి)

స్త్రీలకుకలిగే అన్నివిధ దుర్బలములకు నుపయోగించు గొప్ప టానిక్కువంటి దివ్యౌషధము.

స్త్రీలకుకలిగే బహిష్టుదోషము లన్నిటిని నివారణచేయును. అనగా కడుపునొప్పి, ఋతుస్రావము, రక్తస్రావము, సోమరోగములు సహా నివర్తించును.

దీని నుపయోగించుటచేత గర్భహీనతనుపోగొట్టి, గర్భముధరించగలరు. కాన శిశువులు పుష్టిగలవారై వ్యాధులనుండి నిర్ముక్తులగుదురు.

స్త్రీలకు ప్రసవమునకువెనుక అద్భుతమైనబలము కలుగజేయును.

ధర 1 పౌను రు. 1 9 0 ½ పౌను రు. 0 14 0

*Manufactured by*

**The Zandu Pharmaceutical Works Ltd.**
**Bombay 14.**

SOLD EVERYWHERE:

*Sole Agents for Madras Presidency:*

దామోదర అండు కంపెని

78, చైనాబజారు రోడ్డు, జి. టి. మద్రాసు.




సంపాదకుఁడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] అక్టోబరు 1934 [సంచిక ౮

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనచార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగ కాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతిసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.



## బాలపాపతో దంపతుల ప్రేమబంధము

స్త్రీకి మాతృస్థానము గౌరవప్రదము. ఆమెకు గృహాయాజ మాన్యము లభించును. ఆత్మానందము కలిగించును. భర్తకు తనయెడల భక్తి ప్రేమ భావములు దినదిన మభివృద్ధినందును. దీని కంతటికిని కారణము?

**మా తృ త్వ మే !**

మాతృత్వమునకె ప్రతి స్త్రీయును ఆసగొనును. ముద్దుబిడ్డను కర కమలములం దిడుకొని ఆడించు తలంపుస్త్రీకి యెక్కుడు.

స్త్రీకి లభించవలసిన యీ మహోన్నత స్థానమునకు ఆటంకములను కల్పించు గర్భాశయ రోగములను దూరముచేయవలయును. ఇందులకు లోధ్ర సేవనమే రాజమార్గము.

# లోధ్ర

**వనితల ఋతుదోషాది రోగములకు వజ్రాయుధము.**

**లో ధ్ర యె ల్లె డ ల దొ ర కు ను.**

**కేసరీకుటీరం, ఎగ్మూరు, మదరాసు.**

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR



## లోధ్ర

ఋతుదోషాది
జనిత రోగములకు
వజ్రాయుధము.

ఈ ఔషధ రాజము సుప్రసిద్ధవన ఓషధులచే తయారు చేయబడినది. గడచిన ముప్పదిఅయిదు సంవత్సరములనుండి హిందూదేశమునందే గాక పర దేశములయందు గూడవాడబడి ప్రసిద్ధి గాంచినదివ్యౌషధము.

ఈలోధ్రను వాడిన వారు యిది వనితలకు వరప్రసాదమనిన్ని, రసాయనములకురాణియనిన్ని, స్త్రీలపాలిటి కల్పవృక్షమనిన్ని, కొంగుబంగారమనిన్ని మరియు ననేకవిధములుగ స్తోత్రమును చేయుచుండుట యెల్లరకు దెలిసిన విషయమైయున్నది.

గర్భాశయదోషజనితవ్యాధులగు ముట్టుకట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము జాస్తి తక్కువ లగుట, స్రావము అనేకరంగులతో వెడలుట, సూతికగడ్డ, గర్భాశయమున విషవ్రణములుకలుగుట, మంట, వాపు మొదలగునాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్రపుత్రికాభిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

చీకటింటిని ప్రకాశింపజేయు ఈ దివ్య జ్యోతిమహిమను యెల్లరు గుర్తెరుంగుదురు గాక!

**12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 అణాలు.**

లోధ్ర యెల్లెడలను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.


MALLIKA
MALATI
ALMOND

తిరువనంతపురము, హుబ్లీక్షేత్రములయందు
అఖిలభారత వస్తుప్రదర్శనములలో
ప్రథమతరగతి బంగారుపతకములనుపొందిన

కేసరి

# డెంటల్ క్రీమ్

అను

దంతధావన




నవనీతము

మృదు మధుర పరిమళ మిళితము.
ఎల్లరు ఒకమారు రుచిచూడవలయును. దంతములను
ముత్యములవలె చేయుటయేగాక పంటిజబ్బుల నన్నిటిని నివారించును.
భారతదేశమున భారతీయునిచే భారతీయులకొరకు తయారుచేయబడినది.

అన్ని షాపులలో దొరకును.
అణాలు 8 మాత్రమే.

## కేసరి కుటీరం,

ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| బాపట్ల: | ఎ. జగన్నాధరావు. |
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్. |
| మచిలీపట్టణము: | పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు. |
| మచిలీపట్టణము: | ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, పెద్దచావిడి, ఆంజనేయులగుడి దగ్గర, 168, సుల్తాన్ బజారు. (మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాడిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు. |
| జెమ్ షెడ్ పూర్: | టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, లిమిటెడ్. |
| బరంపురం: | ఎన్. కె. మూర్తి అండ్ సన్స్. |
| గుంటూరు: | వెల్ కం అండు కంపెని. |
| సామర్లకోట: | ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు. |
| పిఠాపురం: | ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ. |
| రాజమండ్రి, విశాఖపట్టణం: | ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు. |
| మదరాసు: | వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు. |
| తణుకు: | నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు. |
| బెజవాడ: | ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట. |
| పాలకొల్లు: | లొల్లా వెంకటరావుగారు. |
| ఒంగోలు: | తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు. |
| రంగూను: | వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి. |
| చిత్తూరు: | వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు. |
| సెకంద్రాబాదు: | కె. సుందరరావుగారు Cloth Mills Agent. పొగాకుబజారు. |
| ఏలూరు: | బి. విశ్వనాథంగారు. |
| విజయనగరం: | ఇవటూరి సుందరశివరావుగారు. |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెనీ. |
| నరసాపురం: | వై. సత్యనారాయణగారు. |
| కాకినాడ: | పడిమి సూర్యనారాయణగారు. |
| కొవ్వూరు: | కె. సి. చెన్న కేశవయ్యర్. |
| గూడూరు: | సి. సి. సుబ్బయ్య, మర్చంటు. |

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.




## సంప్రార్థనము

శారదనీర దేందు ఘనసార పటీర మరాళ మల్లికా |
హార తుషార ఫేనరజతాచల కాశ ఫణీశ కుంద మం |
దార సుధాపయోధి సితతామర సామరవాహినీ శుభా |
కారతనొప్పు నిన్నుమదిఁగానఁగ నెన్నఁడుగల్గు భారతీ ||

అంబ, నవాంబుజోజ్వల కరాంబుజ, శారదచంద్రచంద్రికా |
డంబర చారుమూర్తి, ప్రకటస్ఫుట భూషణరత్నదీపికా |
చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్త వివిక్తనిజప్రభావ, భా |
వాంబర వీధివిశ్రుతవిహారిణి, నన్గృపఁజూడు భారతీ ||

'భాగవతమ్'

ఓ జగన్మాతా,

నీ దయావిశేషమువలన మరియొకతూరి యీ సోదర సోదరీవర్గములతోఁగూడ నీ దివ్య పాదపద్మములను సేవించి యానంద మొందఁ గలుగుచున్నాము కదా! సత్య ధర్మములను నిలిపి తద్విరోధులగు దైత్యుల దండింపఁబూని నీ వెత్తిన శక్త్యాద్యవతారములు సర్వజగద్విశ్రుతములు. వేయేల! నీ యుక్తిచేతనే యీశుఁడు జగదీశుఁడుగా ప్రకాశించుచున్నాఁడు. నీ పాదరేణువే యొకటి విధాతకు విశ్వసృష్టియందు వస్తువ యగుచున్నది. ఇట్టి యనంతమహిమావిలసితవగు నిన్నుఁ దెలియుటకీ మానవులేపాటివారు!! తల్లీ, ఒకప్పుడు నీ చిద్విలాస ప్రదర్శనములకు రంగభూమియై వెలయుచుండిన యీ పుణ్యభూమియెడ విముఖవై యున్నావేల? అనంతకోటిమూర్తులతో నీ వత్యంత మహావైభవముల వెల్లివిరియఁ జేయుచుంటివే!! పూజ్యసాంమ్రాజ్యము

లేలి సిరులు గురిపించినావే !! ధర్మము నెరపినావే !! కవిరాజపీఠముల నలంకరించిరది నీ దివ్య మంగళస్వరూపమే కదా ! ఇపుడు సీతవై చెలువొందవేమి ? పాంచాలివై భర్తృజనదాస్యవిముక్తి యేల సంపాదింపవు ? సత్యవై ఘోరనరకదుర్మదభంజన మేల సేయవు ? కౌమారీ, నీ వలసవై తివో? లేకయున్న నింతకాల మిట్లూరకుందువా ?!! పరమలోభము, దురహంకారము, పారుంబోతుందనము మొదలగు దుర్గుణగణము, మూర్తిమంతమై, గజ్జలు గట్టుకొని గలగలమని యానందనాట్యము సేయుచుండేనే !! ఓ చండికా, నీ చెవులంబడుటలేదా ?! నిదురించుచున్నావా ? ఆః కటకటా ! మహాత్ములు మోహభ్రాంతులగుచున్నారు. సత్యము నామమాత్రావశిష్టమగుచున్నది. సాధుపీడనమే సదాచారమగుచున్నది. ఇట్టి కష్టకాలమున నీ యుదాసీనత చెల్లునా తల్లీ దేవతామతల్లీ.

అరుగో యిల్లాండ్రు: నీ ప్రతిమూర్తులు: నీ దివ్యపదపద్మములకు నీ రాజనముల బట్టి 'మంగళమే తల్లీ సర్వమంగళాశ్రిత కల్పవల్లీ' అని వీణాద్యాయుధ సురటనములు చెలగ మనోహరముగం బాడుచున్నారు. ఆర్యా, ఆ యార్యలయందు, అత్యంతమహిమాస్పదంబైన నీ యంశంబు బ్రతిఫలింపం జేయుదువుగాక!! ఆర్యసంతతులై శ్వర్యవంతములై యలరారున ట్లనుగ్రహింపుమో యాదిశక్తీ, యీమహిళారత్నములయందీ వావిర్భవించి యీ దీనుల మానమర్యాదలను గాపాడి నీ జగన్మాతృనామము సార్థకము జేసికొందువు గాక

ఓ దీనరక్షకీ, ఆగమవిదులు నిన్ను వాణివనియు, నిందిరవనియు, శర్వాణివనియు నుతింపుచున్నారే !! అంతేకాదు మరి !! ఈ 'మువ్వురమ్మల'కును 'మూలపుటమ్మ'వు నీవు. ఇట్టి నీ వావంతదయ దలంతువేని, అజ్ఞానాంధకారబంధురమై యున్న యీ భరతదేశమే మరల తొంటివలె సంస్కృతవిజ్ఞానకళావిశిష్టమై తేజరిల్లంగలదు: దారిద్ర్యదేవతా సమ్మార్జితమైన యీ హిందూదేశమే మరల నానాటి కవిజనవినుతమైన వసుమతియగును!! నిర్వీర్యమై బెండువడియున్న యీ పేదసీమయే మఱల నానాటి యనివార్యక్షాత్రవీర్య విలసితంబగు నార్యావర్తమగును!!

ఓ జగద్ధాత్రీ, దేశకాలపరిస్థితులం బట్టి నీ యనంతశక్తి వివిధరూపముల విజృంభించి దేశమునకుం బట్టియున్న యీ సంకీర్ణభావగతిని దప్పించి నూత్నయువోత్సాహము నాపాదించవలయునని ఆ పెద్దల యాశయము: నీవు తల్లివై నీ సంతానములకు స్వరాజ్యము స్వారాజ్యతుల్యమగు నీదివ్య బోధామృతము నుగ్గుపాలతోం బోయుము: ఇల్లాలివై భావదాస్య బద్ధుడగు పురుషుని సద్విద్యాధనోన్ముఖునిగాం జేయుము: సోదరివై సుద్దులు నేర్పుము: "నూత్నయుగ కారకులై వర్ధిల్లి భారతీ స్వాతంత్ర్య సంపాదకులై కీర్తిధనముల నార్జింపుండో బిడ్డలారా" యని దీవింపుము.

ఓమ్ తత్సత్ !!!

# వీరపూజ — దసరా

శ్రీమతి వెలిదండి మాణిక్యమ్మగారు

పరమపితయైన ఏకేశ్వరుడగు పరమాత్మ తన సృష్టినంతను భిన్నత్వముతో నింపియుం డుటచే తద్భిన్నత్వమునందే ఆయన ఏకత్వ మును అనగా ఆయన పితృత్వమును గ్రహిం చుటే సృష్టికి పరమావధియని మన పెద్దలు అనేక సంవత్సరముల తరబడిగా తపోసాధ నల మూలమున గ్రహించి మన కనుగ్ర హించియున్నారు. ఆ ఏకత్వమును గ్రహిం చుట సామాన్యము గాదు. ఎచ్చట జూచి నను రాగద్వేషములు, సుఖదుఃఖములు, సంతోషవిచారములు ఈ మొదలగు సం ఘర్షణలతోనే ప్రతినిత్యమును మన సంసార యాత్ర నడచుచున్నది. వీటిమూలమున గలుగు మానసిక అశాంతికి మానసిక వికార ములకు మేరయుండదు. ఎవరైతే ఇట్టి మానసిక సంఘర్షణలకు అతీతులై మానవ జీవిత పరమార్థత్వమునందు నిశ్చలమైన విశ్వాసముతో తమ జీవితమార్గమును నిష్కంటకముగ నడుపుకొందురో అట్టి వారే నిజమైన మానవులనియు, అట్టివారే నిజమైన గౌరవనీయులనియు నేటికిని ప్రతి ఖండమునందును ఏకగ్రీవముగా ఒప్పుకొన బడి ఆదరణమర్యాదలను బడయుచూ ఉత్కృష్టపదవియందు నక్షత్రముల భాతి వెల్గొందుచున్నారు. నేటికిని మన భరత ఖండమున పరమాత్మస్వరూపముగను విదేశీయులచేత గొప్ప ఆదర్శపురుషుడుగను కీర్తింపబడి కొలువబడుచున్న శ్రీరామ చంద్రుని వనవాససందర్భమున ఆయన ధీరో దాత్తలక్షణమును వర్ణించుచూ వాల్మీకి ఇట్లు వర్ణించియున్నాడు. "ఒకవైపున తన దీనయైన మాత భూమిపైబడి శరీరస్మృతి రహితయై విలపించుచుండ, ఇంకొకవైపున తన ముద్దులతమ్ముడు హోరుమని కంటికి కడివెడునీరు గార్చుచుండ వేరొకవైపున సమస్త ప్రజలను తన కనుసన్నమాత్రమున నడచుటకు ఆతురులై శత్రునిర్మూలనము చేయుటకు వలపలామచు వాపోవుచుండ ఏమాత్రమును తన నిశ్చిత ధర్మసూత్రము నుండి చలించక నిల్చుటకు రాముని కొక్క నికి మాత్రమే సాధ్యమయ్యెను గాని మఱి యెవ్వడును ఆ ధర్మసంక్లిష్టమార్గమున బోవు టకు సాహసింపడు." ప్రస్తుతము శత్రు మిత్రులచేతనూ ఒకేవిధముగా పూజింప బడుచూ ప్రపంచమునంతను ఉఛ్ఛ్వాత లూగించుచున్న మహాత్ముని అగ్రస్థానము నకు కారణమేమి? ఆయనయొక్క మాన సికోత్కృష్టత, ఎంతటి దూషణములు, ఎన్ని దుఃఖములు, ఎటువంటి విచారములు, ఎటువంటి ఒడుదుడుకులు తన్నెదుర్కొనినను ఈషణ్మాత్రమైన చలించని ఈశ్వరవిశ్వాస ముతో హృదయమును మహాసముద్రము వలె పరమ గభీరస్థితియందు నిలుపుకొనుటే మహాత్ములయందు గాన్పించు మహాత్మ్య మునకు కారణము. ఇట్టి శాంతిని, ఇట్టి అంతస్థును పొందుటకు మన కేది సాధనము? పరమేశ్వర సర్వభూతాంతరిత్వమునందుగల ఉత్కృష్టవిశ్వాసమే ఒక్కటైయున్నది.

అవ్యక్తస్వరూపుడైన పరమాత్ముడు ఉత్కృష్ట వ్యక్తులమార్గమున తన్ను దాను వ్యక్తీకరించుకొనుచూ వ్యక్తుడై ప్రపంచ శాంతిని కాపాడుచున్నాడు. అట్టి వ్యక్తులే అవతారపురుషులుగను వీరాధివీరులుగను ప్రపంచమున కొలువబడుచున్నారు. ఇట్టి పవిత్ర ఆదర్శముతోనే కర్మభూమియగు మన భరతఖండమున వారివారి మానసిక ఔన్నత్యము ననుసరించి భిన్నభిన్న రూపము లను కొలుచుట ఆచారమైనది. దీనికి తార్కాణములు గీతలయందు గాన్పించును. ప్రతినిత్యమూ మన గృహస్థజీవనమున పండు గలను పేర శ్రీకృష్ణ, శ్రీరామ, నరసింహ మొదలగు ఆరాధనలు జరుగుచున్నప్పటికి ఈ దసరా అనగా దశ అహరములు పది దినములు వీరపూజకొరకు ప్రత్యేకింపబడి విశాలమగుమన భరతఖండమున వేరువేరుగా ఉత్సవములు జరుపబడుచున్నవి. అవియే, శక్తిపూజలనియు, భేతాళపూజలనియు, సరస్వతీపూజలనియు అనేక రకములుగా ఆ పదిదినములు మహాఉల్లాసముగా బాలురు, వృద్ధులు, యౌవనులు, యువతులు, మొత్తముమీద అందరునూ ఉత్సవములు, ఆరాధనలు, ప్రార్థనలుజేయుచు పండుగ లుగా నేటికిని జరుపుట ఆచారమైయున్నది. అదిగాక ప్రపంచమున సాధారణముగా అశాంతికి కారణము దుర్మార్గులైన బలవం తులు సాధులను బలహీనులను హింసించు టయే. అట్టి అశాంతినుండి తిరిగి ప్రపంచ మును ఉద్ధరించెడి మహనీయులెల్లరు పరమ పూజ్యులుగ గొలునబడుట సహజమే గదా.

ఒకానొకప్పుడు దుర్మార్గుడైన యొక రాక్షసునివలన మానవులందరూ అలజడినిపొంది దిక్కులేక అల్లాడుచున్న సమయమున మహామాతయగు ఆదిశక్తి ఆ దుష్టుని సంహ రించి శిష్టుల అలజడిని మాన్పినందున ఆ మాతను గొలుచుట ఈ దసరా దినము లలో ముఖ్యమైన ఆచారమైయున్నది. ఈ ఆచారమే క్రమముగా అజ్ఞానముచే హింసా త్మకముగా ఒక్కొక్కచోట భయంకర పరిణామమొంది, హైందవ జాతీయపతనము నకు కారణమైన వేరు పురుగులలో ఒకటై పరిణమించినది. ఇప్పటికిని సాత్వికారాధకుల ఆశక్తిని పశుబలముతో కూడిన రాక్షస శక్తిగా గాక, సాత్వికబలముతో గూడిన జ్ఞానశక్తిగా అనగా జ్ఞానమునకు మూలమైన సరస్వతీదేవిగా ఆరాధించుట ఆచారముగా నున్నది. ప్రస్తుతమున మహాత్ముని అహింసా ప్రతిపాదకమగు ఆదర్శముగూడ ఇద్దియే గదా. కర్మవశాత్తు విజ్ఞానము నశించుట వలన పవిత్రాచారములన్నియు నేటికి విషమ పరిణామమును చెందినప్పటికి, తదుద్దేశము నింద్య మనవచ్చునా. ఆదర్శము నశించి ఆరాధనలే మిగిలినచో నష్టదాయకము. ఎలెక్ట్రిక్ కరెంటు అనేకవిధములైన పని ముట్ల మూలము గాన అనేకవిధములుగా ప్రపంచమునకు ఎట్లు ఉపయోగకరమై అమోఘమైన పనులను జేయుచున్నదో అదేవిధముగా అవ్యక్త, నిరుపాధిక, నిర్గుణ మైన పరబ్రహ్మము అమోఘములగు కొన్ని కొన్ని ఉపాధులమూలమున ప్రపంచమున కవసరములగు మార్పులను జేయుచున్నది.



బృందావనము : స్వర్ణాలయము.



మధుర : స్నానఘట్టము

ఆ కర్తృత్వమునకు స్వయముగా తన్నుదాను నడిపించుకొను శక్తిలేనందున ఇంకొకరి సహాయమున ఉపయోగింపబడుచున్నది. ఆ నిర్గుణపరబ్రహ్మమాత్రము తన సంకల్పమాత్రము ననుసరించి ప్రపంచమునకు తెన్ను జూపుచున్నాడు. కేవలము ఆ అమోఘశక్తిని వేరుగా ధారణచేసి తెలుసుకోతగ్గవారు తెలుసుకొనుట అత్యుత్తమమే. మోక్షముమీద సాధారణులకు మాత్రము ఏవే ఉత్తమ ఉపాధులమూలమున భగవంతుడు తన అమోఘశక్తిని ప్రపంచమునకు తేటతెల్లముగా వ్యక్తీకరించెనో అట్టి ఉపాధులతో గూడిన ఆశక్తిని ఆరాధించుట అజ్ఞానము కానేరదు. కేవలము డాంబికములతో గూడుకొని ద్వేషమూలమై నిర్గుణపరబ్రహ్మమును పొందుటకు సోపానముగాక, పతనమునకు మూలమై పరగు ఆరాధనలు మాత్రము పూర్తిగా నిషేధములు, నింద్యములు.

ఇట్టి ఉత్తమవ్యక్తిత్వారాధన ప్రతి మతస్థులచేతను జరుపబడుచున్నది. క్రైస్తవులు క్రైస్తవుని, మహమ్మదీయులు మహమ్మదుని ఇంకా ఆయా మతస్థులు ఆయా మతోద్ధారకులను ఆరాధించుట ఆచారమై యున్నది. కాని మన హైందవమతము మాత్రము అగాధమైన సముద్రమునంటిది. దానియందు అన్నిరకములైన మనుష్యులకు వారివారి మానసిక అంతస్థులనుబట్టి క్రమోన్నతిని పొందుటకు అవకాశమున్నది. అందులకనియే మనవారు చాతుర్వర్ణ్య ఆశ్రమములను ఏర్పరచి, ప్రతివ్యక్తియు ఈ నాల్గు ఆశ్రమములను గడపవలసినదిగా ఏర్పాటు చేసి, వారియొక్క మానసిక వైశాల్యతను గనబరుచుకున్నారు. తక్కిన మతములలో మాత్రము అందరికిని ఒక్కమార్గము తప్ప రెండవమార్గమునకు అవకాశములేదు. ఇట్టి ఆరాధన పరస్పరద్వేషమునకు హేతువుగాక, పరస్పర సహకారమునకు సాధనమై దురభిమాన నిర్మూలనమునకు గణిగినప్పుడే ఆరాధకులయొక్క యుద్దేశము ఆదర్శము నెరవేరును. అవ్యక్తమైన పరమాత్మ వ్యక్తిత్వమూలమున ప్రపంచమునం దిగివచ్చిన మానవశ్రేయోభివృద్ధికారణములగు సుగుణపుంజములే ప్రపంచమునకు తరుణోపాయములు. అట్టి అవతారపురుషులను, వీరాధివీరులను, స్మరణజేయుచూ వారి జీవితమార్గమును మన జీవితమందు మిళితపరచుకొనుటే మనకందరకు జీవితోద్ధారక మార్గములలో ఒక్కటై యున్నది. అట్టి ఉద్దేశమును మాత్రము మరువక జాతీయ వీరపురుషారాధనలను గావించుకొనుచూ తద్వారా మానసిక పరిపక్వావస్థను పొంది మన జీవితలక్ష్యమును పొందుటకు ప్రయత్నింతముగాక!!

---

# మేలుకొలుపు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

చిత్తమును విత్తమును మనజీవితమును బట్టిచూచినచో క్షణభంగురములు
కావగారాదు యమునకు గరుణలేదు ధర్మమును వేగజేయుడో ధనికులార!

# విజయుని జమ్మియాత్ర

శ్రీమతి జూలూరి తులశమ్మగారు

పదిదినములు తక్కువగాపదిరెండగు నెలలునిండె; పదిలపడకనా
మదితాప మార్పవేగమె కదలుము శత్రువులఁబోరఁ గ్రన్ననవిజయా.

ఆనరనాథుపజ్జ సభ నందరుఁజూడ విలగ్నవేణితో
దీనతతో కృశాంగ్యశతదీరి వడంకెడు దేహయష్టితో
మాననిలజ్జతో వెఱపుమై చలియించు దృగంచలంబుతో
నేనొకదాసిభంగి యట నిల్చినఁజూడరె యేపు రర్జునా.

పుట్టితి నగ్నికుండమునఁ భూపతి పాండుమహీశు కోడలై
మెట్టితిఁ గౌరవాన్వయ మమేయగుణాఢ్యులరైన మీకునే
పట్టపురాణినై హరికిఁబాయని కూరిమిచెల్లెలై యిటుల్
కట్టడి దైవవృత్తములఁ గారియనొందుట మేలె యర్జునా.

సింహవిక్రమకళా శ్రీగల్లనేమిపో పోటరితనమంత పొందకున్న
ఉత్తమక్షత్ర సముద్భూతినేమిపో చిత్తకాఠిన్యంబుఁ జెందకున్న
అక్షయతూణీర మందిననేమిపో అనదలయిక్కట్టు లరయకున్న
కోదండపాండిత్య కుశలతనేమిపో పరులనుఁబరిమార్చ నెరుఁగకున్న

బన్నములనెన్నొపడి పరాభవముసైచి జీవితంబెల్ల జింతలంబోవ నిపుడు
ఆఁడుదానను దుఃఖంబు నాపలేక బడితి నీకాళ్లసైరింపు భవ్యచరిత.

సమయోల్లంఘనభీతి మత్స్యపతివేశ్మద్వారమున్ గాచియున్
ప్రత్యేకంబుగమార్చి రూపగుణశుంభద్రాజ చిహ్నాంబుల
న్నత్యంతంబుఁజరించు మిమ్ముఁగని యే నా చింతలందూలుచు
న్నిత్యంబుంబడుపాట్లుగాంచి విజయా నీవింకసైరింతువే.

పరిభవానలశిఖల సంతప్తమైన నాదుమది నెప్పుడార దీ ఖేదవహ్ని
శత్రుసంతతి శరవృష్టి సమయజేసినపుడె చల్లారిసుఖియించు టనఘచరిత.

పలుమరుమాటలేల జని బాహుపరాక్రమ దర్పమేర్పడన్
గలననఁబోరి శత్రుచయగర్వ మఖర్వముగా నొనర్చ మం
తలు తలపోసిపల్కితిటు ధాత్రినినుంబలె బన్నమందనే
పొలఁతులుగల్గఁ బో రుమకుపోక యిటాడితి పోయిరమ్మికన్.

అన్నలకెల్లఁదెల్పు మడియాసల పొద్దుబొకార్పలేవునా
విన్నపమాలకింపు మవివేకియటంచుఁ దొలంగబెట్టకర్
గ్రన్నసమాధవుంగలిసి కార్యగతుల్ దగదెల్పి యుద్ధసం
పన్నతశత్రుసేనల నసారపరాక్రమలీలఁ ద్రుంపుమా.

జమ్మికివలగొని నతులను
మమ్మాకొనరించి విజయ ముదమున శరముల్
గొమ్మికతప్పదు విజయము
నమ్ముము మద్వచనముల ధనంజయ నీవున్.



## శారదాసంస్తుతి

శ్రీమతి కల్పాల పార్వతమ్మగారు

చదువుల వేలుపురాణీ మదినిన్నునె గొలుచుచుండి మామక హృత్కం.
జదలమునందు మరాళీ మదవాహనగాణి బ్రహ్మమానసవాణీ
జగదాధారము సర్వము నిగమాధారంబు జగము నీరజనాథా
రగము నిగమంబు లతఁడును తగభవదాధార మెన్నెదరుగదె బ్రాహ్మీ.
నీనాధుఁడు నీకొమరుఁడు నీనునుచిగియంచవాల నీనిగమసఖుల్
నీనాధుని పితృభ్రాతయు నీనయతత్త్వంబు జగముని శ్యమునేలున్.
నమియింతు నీదుమృదుపద విమలారుణ తరుణకమల విస్తృతమాక్షీ
సముపేతపీఠికను నెద నమరాళినుతాత్మపాద హారితవిషాదా.



## హనుమత్సందేశము

శ్రీ లక్ష్మీ సరస్వతులు

గీ. రామరామాయటంచు నారమణినిన్ను చింతసేయుచునుండెను స్వాంతమందు
భక్తిభావంబులుప్పొంగ భక్తవరద కావఁగారాదొ? శ్రీరామకరుణగల్గి
సీ. ఇంతింతయనరాని యిడుమలఁగుడుచుచు సుదతీలలామంబు సుక్కుచుండె
నిద్రయెఱుంగక నీనామభజనంబె పలుమారు భక్తితోఁబలుకుచుండె
ఆనాఁడు లక్ష్మణునాడిన కఠినోక్తు లెంచియెంతేనిఁ దపించుచుండె
మునుజన్మమందు చేసిన పాపఫలమంచు నెదలోఁ గృశించి దుఃఖించుచుండె
గీ. ఏమిచెప్పుదు సతిమాట రామచంద్ర మేననెట్టులొ ప్రాణంబు మిగులఁజేసి
నిన్నుఁజూచెదు నాసతో నున్నదచట జాగుచేసిన నేమౌనొ? చంద్రవదన.

# ఆంధ్రమహిళామహాసభ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

మన భారతదేశమున నూతనముగా బయలుదేరిన వివిధోద్యమములలో మహిళోద్యమమొకటి. ఈ యుద్యమఫలితముగా స్త్రీలు తమ యవిద్యను తమ అసహాయతను, తమ హైన్యమును, తమ దాస్యమును తెలిసికొని వానినుండి విముక్తి నొందుటకై తీవ్రమగు కృషిసేయుచున్నారు. సంఘములు స్థాపించుట, సభలు జరుపుట రాయబారములు వెడలుట మున్నగు యత్నములన్నియు నీకృషిఫలితములె. గెలుపుకంటె యోటమియే యధికముగా నున్నను ప్రతి సంవత్సరము స్త్రీలకు సంబంధించిన బిల్లులు భారతశాసనసభలోను రాష్ట్రీయశాసనసభలోను ప్రతిపాదింపబడుచుండుటయు నీయుద్యమఫలితమె. స్థానికసంఘములలో నేమి చట్టసభలలో నేమి, రాజ్యాంగవ్యవహారములలో నేమి, స్త్రీలకు ప్రాతినిధ్యము లభించుటయు నీయుద్యమఫలితమే. ప్రయోజనము మాట యెట్లున్నను భారతస్త్రీలయందు గలిగిన యీ పరివర్తనమువలన స్త్రీలది గూడ యొకసంఘమనియు వారి కష్టనిష్ఠురములు గూడ పరిశీలింప దగినవనియు, దొరతనమువారును, దేశీయులును గూడ గుర్తించిరని నిస్సంశయముగా జెప్పవచ్చును.

స్త్రీలలో గల్గిన యీ సంచలనము కారణముగా స్థిరమగు భారతమహిళాసంఘమొకటి యేర్పడి ఆ సంఘము పక్షమున ప్రతిసంవత్సరము అఖిలభారతమహిళాసభలును, వాని కనుబంధముగా రాష్ట్రీయసభలును, వానికి లోబడి జిల్లాతాలూకాసభలును జరుగుచున్నవి. యావద్భారతదేశమునను నీవిధముగా తాలూకాసభలు మొదలుకొని రాష్ట్రీయసభలవఱకు జరుగుచుండుటచే నఖిలభారత మహిళాసంఘమువారు అఖిలభారతస్త్రీజనాభిప్రాయమును గ్రహించి తదనుగుణ్యముగా ప్రయత్నములు సలుపుట కీ సభలెంతయు దోడ్పడుచున్నవి. కాన యావద్భారతస్త్రీజనాభిప్రాయమును గ్రహించుటకీ సభలత్యంతావశ్యకములనుట నిస్సంశయము.

మన ఆంధ్రదేశమున గూడ అఖిలభారతమహిళాసంఘమువారి నిబంధనలకు లోబడి యేఁట రాష్ట్రీయసభలు జరిగినవి. జిల్లాసభలును అందందు తాలూకాసభలును జరుగుచున్నవి. కాన అఖిలభారత మహిళాసభవారి యుద్దేశము మనతెలుగునాట పూర్తిగా సఫలమగుచున్నదని చెప్పవచ్చును. కాని యేండ్లు గడచినకొలది మన యాంధ్రరాష్ట్రీయమహిళాసభ స్త్రీల నధికముగా నాకర్షించి విస్తరిల్లుటకు మారుగా అనాదరమునకు గుఱియయ్యెడి సూచనలు కాన్పించుచుండుట యోచింపదగిన విషయము.

ఇందులకు కొన్ని కారణములున్నవి. అఖిలభారతమహిళాసభ యొక్క కార్యక్రమములాంగ్లమున జరుగుచున్నది. సంఘము వివిధ ప్రాంతములకు సంబంధించిన దగుటవల్లను, ఇంగ్లీషు రాజభాషయై దేశమునందలి సమస్త

వ్యవహారములందే జరుగుచుండుటవల్లను, కేంద్రమహిళాసంఘముయొక్క కార్యక్రమ ముగూడ నట్లు జరుగుట తప్పని సరియైనది. ఈ హేతువువల్లనే వివిధరాష్ట్రములకు జెందిన స్థాయిసంఘసభ్యురాండ్రను గూడ నాంగ్ల భాషవచ్చిన వారిని మాత్రమే నియమించు చున్నారు. యావద్భారతవిషయ మగుట వలన నిట్టి యేర్పాటు లవసరమే కావచ్చును. కాని అవసరమును బట్టి మితముగా నుపయో గించుకొనవలసినఈభాష యొక వ్యామోహ కారణమై యింగ్లీషు వచ్చినవారినే ఆహ్వాన సంఘాధ్యక్షురాండ్రుగను, సభాధ్యక్షురాండ్రు గను, కార్యనిర్వాహకురాండ్రుగను నియ మించుట పరిపాటియైనది. మన రాష్ట్రము నందు జరిగిన యేడు రాష్ట్రీయసభల వృత్తాంతమును తిరుగవైచితిమేని యాంగ్ల భాషాపరిచితిగలవారి చేతిలోమాత్రమే రాష్ట్రీయసభ యెట్లు నడుపబడుచున్నదియు విదితము కాగలదు.

అఖిలభారతమహిళాసంఘము: భారత నారీమణుల యాదరమునకు పాత్రము కావ లయు నన్నచో నీయాంగ్లభాషావ్యామోహ మును వీడవలయును. దేశభాషలకు ప్రా ముఖ్యత నీయవలయును. వారి నిబంధనలు, వారి వార్షికనివేదికలు, యెప్పటి కప్పుడు వారు చేయుచున్న యెల్లకార్యములు, దేశ భాషలలో ప్రచురపఱచుచుండవలయును. ఈ విధముగా అఖిలభారతసభతో స్త్రీలకు సంబంధము కలుపవలయును.

కడచిన యేడు రాష్ట్రీయసభలలో మూడు సభలకు నేను క్రమముగా హాజరైతిని. ఆమూడు సభలలోను, మాకు తెలుగు నిబంధనలు కావలయుననియు, తెలుగు నివేదికలు కావలయుననియు, నఖిలభారత మహిళాసంఘముయొక్క స్వరూపమును మేము తెలిసికొనవలయుననియు, స్త్రీలు కోరిరి. కాని వీరి కోరిక తీర్చబడలేదు. ఈ కారణముచే కేంద్రసంఘముయొక్క యేర్పాట్లు పూర్తిగా తెలిసికొనజాలక యాంగ్లభాష మరుగున నేవియో రహస్యములు జరుపబడు చున్నవనియు, నవి మాకు తెలియలేదుగదా యనియు స్త్రీలు అసంతృప్తిని వెల్లడింప జొచ్చిరి. స్త్రీలలో నిట్టి భావము వ్యాప్తి గాంచుట రాష్ట్రీయసభలకు క్షేమముగాదు. అవసరమగు సందర్భములందు యింగ్లీషు నుపయోగించుకొనవలయును గాని దాని కధిక ప్రాముఖ్యత పనికిరాదు. వీరే సభా వ్యవహారముల కర్తలనియు, నితరు లసమర్థులనియు భావించుట పొరబాటు. ఈ భావ మిప్పటికే స్త్రీలలో వ్యాపించియున్నది. ఇది యింకను ప్రబలిచ్చుట రాష్ట్రీయసభకు నష్టకరము. అఖిలభారతస్థాయిసంఘము నుండి వచ్చిన ప్రతి చిన్నవిషయము గూడ తత్క్షణమే దేశభాషలలో పరివర్తితమై యిది దేశభాషలోనే జరుగుచున్న దనునటుల భావించునట్లుగా రాష్ట్రీయకార్యములు నిర్వహింపబడవలయును. ఇదియొక ఆంధ్రరాష్ట్రమును గూర్చిన విషయమే గాదు యెల్ల రాష్ట్రీయసభలందును జరుగవలసిన పద్ధతి యిదియే. అఖిలభారతమహిళాసంఘముని

పేరుబెట్టుకొని యఖిలభారతస్త్రీలకు సుపరిచితమగు దేశభాషలో తెలియపఱుపబడదేని యఖిలభారతసంఘ మెట్లు స్త్రీల యామోదము బడయును? కాన యీ విషయమును నఖిలభారతమహిళాసంఘమువారును, రాష్ట్రీయసభలను నడిపెడువారును ముఖ్యముగా గుర్తించి సభావ్యవహారములను దేశభాషలలో నడపుట ధర్మము, ముఖ్యము. శ్రేయస్కరము.

రాష్ట్రీయమహిళాసభ అఖిలభారతమహిళాసంఘమునకు లోబడినది. కావున రాష్ట్రీయసభ చేసెడి తీర్మానములన్నియు సాధారణముగా కేంద్రసంఘమువారి సూచనల ననుసరించియుండును. మఱియు నీసభ యొక్క యుద్దేశము విద్యాసాంఘిక విషయములను విచారించుట మాత్రమే. తదితర విషయములు వాని కప్రస్తుతములు. కాన వాని నది ప్రస్తావింపకుండుటయు యుక్తమే. కావున నాంధ్రస్త్రీల (రాష్ట్రేతరాంధ్ర స్త్రీలతో సహా) నెల్లర నొకవేదికపై జేర్చగల యావదాంధ్రమహిళాసభ యొకటి జరుపబడుట యావశ్యకము.

ఈ విశాల భారతవర్షమునందు ఆంధ్రులదిగూడ యొక ప్రత్యేకజాతి. విశిష్టమగు తమభాషను, తమ సాహిత్యమును, తమ కళాపరిశ్రమలను,తమ యాచారసాంప్రదాయములను, తమచరిత్రమును, తమ జాతీయతను నిలువబెట్టుకొనవలసిన బాధ్యత యాంధ్రులది మాత్రమే. వీనితో నితరరాష్ట్రీయులకు ప్రసక్తిలేదు. ఆంధ్ర మహాజనసభ చేయుచున్న కార్యమిదియే. సభకు ఆంధ్రస్త్రీల విషయమై విశేషముగా విచారించుటకు అవకాశము లేదు. కాన దీనిని విచారించుటకు ప్రతి సంవత్సరము జరిగెడి రాష్ట్రీయమహిళాసభతో బాటు యావదాంధ్రమహిళాసభయు జరుపుట యావశ్యకమై యున్నది.

తెలుగు యువిదల ప్రాచీనచరిత్ర సామాన్యమైనది గాదు. రాజ్యముల పాలించుటయందేమి, రాజ్యతంత్రముల నడపుటయందేమి, కావ్యములు విరచించుటయందేమి, శాస్త్రముల పరిశీలించుటయందేమి, పరమార్థ విచారమునందేమి, సర్వవిషయములందును నాంధ్రస్త్రీలు విఖ్యాతిగడించి యున్నారు. వీరి సంస్మరణ మాంధ్రమహిళామణుల కాదర్శపాత్రమై తనరారగలదు. ప్రాచీనాంధ్రేతిహాసమునందే గాక వర్తమాన యుగమునను నాంధ్రస్త్రీలు ముందంజతోనే యున్నారు. మత సంఘ రాజకీయార్థిక విద్యాది సమస్త విషయములందును నాంధ్ర రమణుల విద్యావివేకములు, త్యాగసాహసములు గణనీయములై యున్నవి. ఎన్ని సుగుణములున్నను ప్రత్యేకరాష్ట్రము లేకుండుట ఆంధ్రజాతికి గొప్పకొఱత. ఈ విషయమై యాంధ్రమహాసభ జేయుచున్న ప్రయత్నమున కాంధ్రమహిళామణుల కృషియు తోడ్పడెనేని యాంధ్రుల చిరసంకల్ప మీడేరగలదు. కాన ఆంధ్రరాష్ట్రీయమహాసభలతో బాటు ఆంధ్రమహిళాసభలును జరిగెనేని సమంజసముగా నుండగలదు.

ధీమతులగు సోదరీమణు లీ విషయమును సమాలోచింతురుగాక!

# సంసారగోష్ఠి

శ్రీమతి తాయి జయలక్ష్మిగారు

'ఇదుగో తలుపు.'

'............'

'నిన్నే తలుపు.'

'............'

'ఏం-నిన్నే-ఏం జేస్తున్నావు. తలుపు తీయి' అన్నాడు బిగ్గరగా సూర్యనారాయణమూర్తి.

'ఆఁ—వస్తున్నా.'

'ఎంతసేపు? కాళ్లు గాల్తున్నాయి.'

'అందుకనే వస్తున్నా' అని తలుపు దెరచింది అనసూయ.

'పిలవంగానే తీయలేవు తలుపు. కాళ్లు నెత్తి మాడుతుంటే.'

'...............'

'సమాధానం జెప్పవేం. అల్లా చూస్తావు.'

'...............'

'చెవుడొచ్చిందా యేం' అని దగ్గరకుబోయాడు కళ్లెరుపు జేసుకొని.

'ఏం జేయమంటారు మరి మడిగట్టుకుంటే.'

'తలుపు తీయటానికేం.'

'తిరగమోత వేస్తున్నా-మాడిపోతే ఓ చిన్న యుద్ధం అవుతుందిగా మనింట్లో.'

'అదిమాడితే నీ వీపూ మాడుతుంది' అన్నాడు నవ్వుతూ.

'మనకున్న ప్రయోజకత్వం అదేగా.'

'నోరు మూయి.......'

'మడి గట్టుకున్నాగా.'

'నాన్సెన్సు. నీకుగాదూ చెప్పటం.'

'అబ్బో, ఫస్టు ఫారానికే యింత యింగ్లీషు' అంటూ చక్కాబోయింది వంటయింట్లోకి.'

సూర్యనారాయణమూర్తి చొక్కా విప్పేసి ఆలోచిస్తున్నాడు కుర్చీలో కూర్చొని. నాలుగు తెలుగు ముక్కలు చదువుకుందో లేదో దీనికి పెద్ద గర్వం చదువుకున్నదాననని. 'నేను పట్టి మూర్ఖణి అనే యిది అనుకోపటం. చదువుకున్న పెళ్లాం గావాలి అంటారు కొందరు. ఉంటే యిల్లాగే వుంటుంది గాబోలు. ఛీ! పిచ్చి! నా ప్రథమభార్య చదువుకున్నది గాదూ !!

కాస్త గృహలక్ష్మి, భారతి చదువుతున్నదో లేదో, నేను విద్వాంసురాలననే,.........ఉన్న వూరూ, కన్నతల్లి ఓమోస్తరని చెప్పేవాళ్లు వెర్రి వాళ్లుగారు. స్వగ్రామాన్ని వదిలేశాను యిచి వచ్చిం తరువాత. కాస్త దీనికి సందిచ్చేటప్పటికి నెత్తి కెక్కుతోంది. మూడోపెళ్లి గదా అని మూకీభావం వహిస్తున్నాను. నలుగురు తిడతారని.........

'వంట అయింది.'

'............'

'మిమ్మల్నే, వంట అయిందండీ.'

'ఏంజేశా వన్నంలోకి.'

'కాయ, కూర, పులుసు.'

'ఏం కాయలు. నీ తలకాయా.'

'కనుక్కున్నారే మీరు. నిజంగా మీతలకాయే.'

'గాడిదా! ఒళ్ళు పగులుతుంది.'

'ఎంమకంత కోపం మీకు. అనపకాయ తల కాయ తలకాయవైపు నాది అన్నారుగా మీరు నిన్న కోస్తూ.'

'..........'

'ఇంత మరుపు అయితే యెలాగండీ......సరే గాని మడిగట్టుకోండి త్వరగా.'

'పోవాలా యేమిటి వరలక్ష్మమ్మగా రింటికి.'

'మేము చీట్లు ఆడుతు చుట్టలు తాగంగా.'

'పొడుం బీలుస్తారా మరి.'

'కాదు గంజాయి.......'

'నోరు మూయి' అంటూ చివాలునలేచి చెంప మీద గొట్టినాడు సూర్యనారాయణమూర్తి నెమ్మదిగా, అంటే తగిలీ తగలకుండా.

అనసూయ కళ్లనీరు గారుస్తూ గోడనానుకుని నిలబడ్డది. కుమిలిపోతోంది లోపల. అనేక ఆలోచనలు తట్టాయి మనస్సులో. భార్యలపై యింత అధికారముంది గాబోలు భర్తలకు అని అనుకుంది.

'పో. వడ్డించు త్వరగా.'

'..................'

'నిన్నే పోవే.'

అనసూయ మాటాడకుండా పోయింది వంట యింట్లోకి.

సూర్యనారాయణ సావిట్లో గోడనున్న పటాన్ని చూస్తున్నాడు. పాపం. యిది బతికివున్న రోజుల్లో ......అమాయకురాలు నా గొడవే బట్టేదిగాదు. దానికి ఎంతసేపూ తులసిపూజలు, దానధర్మాలు దప్ప........చచ్చిపోయినవాళ్లే మంచివాళ్లు యెపుడూ! అని అనుకుంటున్నాడు.

'వడ్డించాను. రావచ్చు.'

'................'

'ఇంకోతడవ జెపితే తంటా గాబోలు.'

సావిట్లోకి పచ్చి చూసింది ఆయనగారి స్థితి. పటాన్ని జూడడం, పెదవి విరుచుకోవడం......

'అవిడెకుమాత్రం బ్రతకనిచ్చారు సరిగ్గా. చచ్చిపోయిం తర్వాత యేడిస్తే యేంలాభం. బతికివున్నప్పుడే మైపోయిందో యీ ప్రేమ.'

'ఇక చాలు. ఆపు నీ గ్రంథము. ప్రేమ అంటే యేమిటో తెలును నీకు.'

'ఎబ్బే నాకేం తెలును......కాళిదాసంత పండితులాయను మీరు.'

'ఆఁ అవును. ప్రేమగలవాఁడైతే పెళ్లాన్ని యెందుకు వదిలేస్తాడు.

'ఆలోచనలేకుండా చేయటానికి మనంత మూర్ఖుఁడు గాదు లెండి ఆయన.'

'సౌదామిని అంత పండితురాలవు గాదూ నీవు. మొదట కాళిదాసు మాత్రం మూర్ఖుఁడు గాదా మరి.'

'ఆ గొడవంతా యెందుకు లెండి మనకు...... చెప్పిందానిలో యిదన్నా కాస్త జ్ఞాపకంవుంది. పదార్థాలు చల్లారిపోతున్నాయి. 'చల్లారినయేని చవులుగప్పు" అన్నాడు శ్రీనాథుఁడు కాశీఖండంలో, రాఁడి త్వరగా.'

సూర్యనారాయణమూర్తి వచ్చి కూర్చున్నాఁడు పీటమీద. తిఁటానికి ప్రారంభించాడు గబాగబా.

'కొంచెం నెమ్మదిగానే తిందురూ. లగ్నం మించిపోవటంలేదు.'

'...............'

'మీకే జెప్పేది.'

'పోయి. పెరుగుబొయ్యి.'

'అపుడేనా—? పెరుగులే దివ్వాళ.'

'ఎందుకనీ.'

'పనిజేసేది రాలేదు.'

'రాకపోతే.'

'తెప్పించలేదు.'

'పనిజేసేదాన్ని కోప్పడాలి మరి.'

'నేను కోప్పడలేను. మనం యిచ్చే రూపాయి డబ్బులకు అంత కోప్పడాలా యేమిటి......ముష్టి రూపాయి కూలి చేనుకుంటే సంపాదిస్తారు వాళ్లు. హరిజనులంటు దయగావుండాలట.'

'సరే దయగావుంటే నెత్తికెక్కుతారు. చూడు మనింటిపక్కనున్న ఓర్సీలుగారి భార్య యెల్లా అథారిటీచేసి పని చేయించుకుంటుందో పనివాళ్ల చేత.'

'బాబో. ఆ పోలిక నా కక్కర్లేదు లెండి. పోసేదా మరి మజ్జిగ.'

విసుగుకుంటూ అన్నం తిన్నాడు. వాకిట్లోకి వచ్చి కూర్చున్నాఁడు కుర్చీలో. అతివేగంగా భోజనంజేసి అన్నీ సర్దుకొనివచ్చింది అనసూయ.

'మంచి తాంబూలములేని భోజనము' అన్నాడు.

'సంతతిలేని గృహమో' అన్నది.

'ఏదీ. అంతాపాడు—ఆపద్యం......సరేగాని యెల్లావస్తాయి యిలాంటి పద్యాలు నీకు.'

'చదువుకుంటే.'

'నేను చదువుకోలా మరి.'

'ఇప్పుడు చదువుకోండి చూద్దాం.'

'ఇంకా యిప్పుడేం వస్తుంది.........అయినా ఆడవాళ్లదగ్గర చదువుకోనా.'

'ఆఁ రాకేంజేస్తుంది? జగ్గకవి, మల్లినాథసూరి యెప్పుడు చదువుకున్నారు'

'పెళ్లాం కాపరానికి వచ్చింతర్వాత.'

'మరింకేం. యెలా తెలిశాయి మీ కివి.'

'ఓతడవ చెప్పావుగా నీవు.'

'ఆఁ మరచిపోయాను.'

'మరి మరుపు నీకా, నాకా?'

'సరే గానీండి. మీ డబ్బుకు తగిన చదువుంటే యెంతో బాగుండేది. బంగారానికి వాసనున్నట్లు.........'

ఇంకేం, నీవు రాముకునే నూనెలో వేయిబంగారం'......నాకు చదువులేకపోతే మరేం లోటులేదు. చదువుకున్నప్పటినుంచీ అడ్డమైనవాళ్ల కాళ్లూ పట్టుకోటమేగా!......అదిగాకుండా ధనముంటే సర్వమూవున్నట్టే. ఐశ్వర్యబలముంటే అన్నీ సాధించవచ్చు. అందరూ భయపడతాడు. * అందుకనేగా భీష్మాదులు, దుర్యోధనాధులు ద్రౌపదిని మానభంగం జేస్తుంటే చూస్తూ వూరుకున్నారు. చదువుకున్నదానివిగా! ఆ శ్లోకాలు రావు నీకూ.'

'నేను సంస్కృత భారతం చదవలా.'

'మరి మూలం చదవందేనా భారతాన్ని గురించి చెప్తావు.'

'నే డీయన ప్రసంగంజూస్తే వింతగావుంది' అనుకుంది మనస్సులో.

'మూలాన్ని అనుసరించి వ్రాసిందేగా' అన్నది.

'అనువాదంలో భేదముంది.'

'ఎక్కడ?'

'చాలా చోట్ల.'

'ద్రౌపదీ వస్త్రాపహరణంలో వుందా.'

'పూర్తిగా ద్రౌపదీ వస్త్రాపహరణం జరగలేదని నీవు చదివే గృహలక్ష్మిలో వ్రాశారే! దాన్ని జెప్పి అంటున్నావు గాబోలు.'

'అవును. మీరు చదివారా మూలం.'

'లేదు. మీబోటి విద్యావతులు చెప్పుకుంటుంటే విన్నా.'

'ఏమని?.'

'జరిగిందని.'

'చెప్పండి చూద్దాం.'

'ప్రొద్దుబోయింది. యింకోమారు చెపుతాను.'

'ఆంధ్రభారతం అన్నా చదివారా?!

'కొంచెంగా ఆదిపర్వం.'

'సప్తమాశ్వాసం చదివారూ?.'

'ఆఁ చూచాను. ఏం?'

'ఈ పద్యం జదివారూ.'

'చెప్పు చూద్దాం.'

చం॥ 'నెఱిగురులుఁ గ్రాలఁ విలోలసిత నేత్రయుగంబును
నొప్పులొల్కఁగా.........
...లతాలలితాంగి......విలాససంపదన్.
ఆ. ౭–ప. 73.

'ఇదేమిటి నెఱికురులు అని వుండాలిసింది యిల్లా వుందేం. తప్పుగాదూ. లతా......ఏం చెప్తారూ. లతవలె......

'సరే......ఓహో. ఆ పండితుఁడు వ్రాసిన టీకచూచి అంటున్నావేం. అది తప్పు. యిల్లాగే వుండాలి......నెఱికురులు అంటే వక్రములైన వెంట్రుకలు.'

---

* "బలవాంశ్చ యథాధర్మం లోకేపశ్యతి పూరుషః ధర్మవేలాయాం భవత్యభిహతః పరః। నవివేక్తుం చతే ప్రశ్నమిమంశక్నోమి నిశ్చయాత్." (సంస్కృత భారతం—ఐశ్వర్యబలం)

'నెలిగురులు - సాధువు. ఇది కర్మధారయసమాసంగాన 'క' 'గ' అయింది.

"సూ" పరుషావాస్యరూపేణ ప్రథమాంతో పరిసితాః। కాకా సంబోధనేచా పిహ్యవ్యయే కర్మధారయే। అచేతనార్ధకేశబ్దే' అని శృంగారభూషణంలోవుంది .. తెలిసిందా. ఇక లతకు.....

లతా లలితాంగి - ప్రియంగువలె మనోహరమైన దేహం గలది.

'శ్యామాతు మహిళాహ్వయా। లతాగోవందనీ గున్ద్రాప్రియంగుః ఫలినీఫలీ' అని అమరం. అన్ని లతలలో ప్రియంగులత స్త్రీదేహమున కత్యంత సదృశం. మేఘసందేశంలో 'శ్యామాస్వంగం చకితహరిణీ ప్రేక్షణే దృష్టిపాతం' అనివుంది. 'కృత్వాశ్యామా విటపసదృశం స్రస్తముక్తం ద్వితీయం' అని మాళవికాగ్నిమిత్రం.

ఇంకా ప్రియంగువు గంధపొడికిని, కలపమునకునుపయోగిస్తుంది. చూడు ఋతుసంహారంలో.

'ప్రియంగు కాళీయక కుంకుమాక్తం స్తనేషు గౌరేషు విలాసినీభిః। ఆలిప్యతే చందనమంగనాభిర్మదాలసాభి ర్మృగనాభియుక్తం' అని కాళిదాసు వ్రాశాడు. దీనికిగల పరిమళమును నొక సాదృశ్య కారణము. ఇన్నివిధముల సదృశల సంఘటిల్లుట బట్టియే దీనికి మహిళా నామంగలిగిందని నిఘంటువు లోని 'మహిళాహ్వయా' అను నామము చెప్పక చెప్పుతున్నది. కాబట్టి యిట్టిచోట్ల 'లతా' శబ్దానికి సాధారణలత యనిగాక 'ప్రియంగువు' అని అర్థము చెప్పాలి. అది మహాకవి హృదయానుగుణము...... ఏం అంతేనా! తప్పు జెప్పానా!! తప్పు అయితే మీ పండితులను అడుగు. ఏం చెప్పుతారో!!

'ఎప్పుడు చదివారూ మీరు యివన్నీ......ఆరు నెలలనుంచీ చెప్పాగు గారేం. యింట్లోనే చదువుకునేదాన్నిగా' అన్నది ఆనందంతో.

'ఎబ్బే నాకేం వచ్చు. పట్టి మూర్ఖుణ్ణాయను. అంటూ చొక్కా తొడుక్కొని చక్కాబోయాడు' వక్కలాకులు మెక్కుతూ.

అనసూయ ఆశ్చర్యపడుతూ నిలబడ్డది కొంచెం సేపు. 'నివురుగప్పిన నిప్పు' అన్నది. వాకిట్లోకి జూచింది. మా 'సంసారగోష్ఠి యెవరైనా విన్నారేమోనని, నవ్వుతారేమోనని......వెంటనే లోపలికి బోయింది నవ్వుకుంటూ.

——:o:——

# 'గూగులు'

శ్రీమతి గంజి అన్నపూర్ణగారు

ఎక్కడి గువ్వవమ్మ! మదియేలనటుల్ కదుఁకుందికూయు, నీ
చక్కని యాకృతుల్ వినయచాయలు మాయునుగాదె తల్లి! చూ
డక్కడ నొప్పివచ్చు, మరి యంతయు కంపితమొందుమేను, గూ
డక్కడ నున్నదే! త్వరితమెక్కవె! గూగులు మానుమాచెలీ!
కొట్టెన? నీమనోహరుడు కోపగతిన్ నెటులైనపోయెనా?
నట్టడవిన్ నినున్ విడచి నాథుడు శూలవనిన్ తలంచకన్
ఎట్టిడివాడటమ్మ నినుయిట్టు లఘాతమునందు ద్రోసెనా?
కొట్టెడివారలన్ వినవె! కోమలి! వీడవె సత్వరంబునన్.

అబలలంచును గాదె వారంతరీతి
బాధలనుపెట్ట పలువిదాల్ బలిమికోలఁది
రమ్ముసోదరి త్వరిత వేగమ్ముతోడ
నరయుపోదము నాథుల నాథుగూడ.

# కుటుంబమును గాపాడిన బాలుడు

శ్రీమతి టి. చంద్రమతిగారు

హిందూదేశమును పాలించుచున్న మహిమ్మదీయ పరిపాలనములో ననేకమంది హిందువులు మహిమ్మదీయమత స్వీకరణము నిమిత్తమై ప్రభుత్వమువలన బాధింపబడుచు వచ్చిరి.

అప్పుడొక పల్లెటూరిలో కాపురమున్న యొక రైతు యీ బాధలు పడలేక మతము విడువ మనసొప్పక భార్యను ముగ్గురు బిడ్డలను దోడ్కొని హిందూరాజు పాలించు రాజ్యమునకు బోవ సంకల్పించుకొనెను.

తానట్లు దేశమువిడిచి పోవునట్లు రాజభటులకు దెలిసిన వారడ్డగింతురను భయమున తన బిడ్డలను ముగ్గురను గంపలలో బెట్టి గాడిదవీపుపైన వేసి కట్టి యాపైన కాయకూరలను ఆకుకూరలను సమృద్ధిగా వేసి మూసివేసెను.

పిమ్మట భార్యయు తానును కలసి గాడిదను నెమ్మదిగా తోలుకొనుచూ దారిని బోవువారికి సంతలో కాయకూరలమ్ముకొన బోవు వారను నభిప్రాయము గల్గించుచూ సాగిపోవుచుండిరి. అట్లు కొంతదూర మరుగు నరికి వారికొక సైనికుడెదురుపడెను. ఆ సైనికుడు వారి ముఖములు గాంచి వారి నిజస్థితిని గురించి యనుమానించి కాయకూరల మధ్య బిడ్డలదాచి తీసుకొనిపోవుచున్నారేమోననితలచి 'మీ ఆనబకాయలు ముదురులో లేతలోచూచెదను' అని యనుచు కై జారుదీసి కత్తితో నా గంపలో బొడిచి పైకెత్తెను. కత్తిమొన యెరుపెక్కెనుగాని యేవిధమైన చప్పుడు వినరాలేదు. అందువలన నాతడు సందేహ విముక్తుడై కత్తి కంటిన యెరుపురంగు బహుశా యెర్రముల్లంగి దుంపల రసమైయుండునని తలచి వారిని విడచి వెడలిపోయెను.

పాప మా తల్లిదండ్రుల పరితాపమా యీశ్వరుని కెరుక. వారును ప్రాణములుగ్గబెట్టుకొని పొడవవచ్చు దుఃఖమును మింగుకొనుచు మింగుకొనుచు త్వరితముగా ఖరమును దోలికొని యొక నిర్జన ప్రదేశమును జేరిరి. తరువాత ఒక వైపున బిడ్డ లేవిధమైన యాపదజెందకుండ నిదురించుచుండిరేమో యను యాశయు మరియొకవైపున యా సైనికుని ఖడ్గము వారిని కిక్కురు మనకుండ చంపివేసినదేమో యను భయము నుగల్గి డోలాయమానముగా మానసమూగులాడుచుండ వారు గబగబ నాగంపలపైనున్న కాయకూరలనులాగి పారవైచి గంపలు దెరచిచూచిరి. అందున్న బిడ్డలు జీవముల తోనె ఉండిరి. కాని యాఖరి బాలుని పైకి గీయునప్పటికి వాడు మూర్ఛిల్లునట్లుండెను. కాలి వ్రేలొకటి తెగిపడియుండెను వారా బాలుని పైకెత్తగానె యాబాలుడెంతో కష్టముతో కన్నులువిప్పి వారినిజూచి చిరునవ్వునవ్వి "కాని అమ్మా నేను ఏడ్వలేదు" అని ఎంతో గర్వముగాజెప్పి మూర్ఛపోయెను.

ఆ తల్లిదండ్రులా బాలునికివలయు నుపచారము లొనర్చుచూ సర్వేశ్వరునికి వందన శతంబు లర్పించిరి.

# స్వార్థత్యాగిని

శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు

విషవ్రణంబుచే గృశీభూతుడై దుర్భర వ్యథ ననుభవించుచున్న పతియొక్క పాదార వింద సన్నిధిని శోకంబుచే క్రుంగుచు ధర్మ పత్ని పరిచారము లొనర్చుచు దైన్యంబున మందస్వరమున ఇట్లు పలికెను.

'మహాప్రభో! అనుజ్ఞ యిండు. పాద దాసికి అనుజ్ఞ యిండు.'

'ప్రియా! నీ వాపనికి పూనకుము. నీ గట్టిపట్టుదల గట్టిపెట్టుము' అని ఆరోగి మరల ప్రత్యుత్తరించెను. 'నాథా! తమ రిట్లుల విష వ్రణంబున వ్యథనందుచుండ నాకీ జీవము లేల, భోగములేల ఈ ప్రాణితో యీ విశ్వమునకు ప్రయోజనమేమి?'

'ప్రియా! మాటిమాటికి నిట్టిమాట లాడ కుము. నీ మృదుల దేహము యీ విష వ్రణమున కాహుతియొనర్చుట సహింప రానిది. తలపెట్టకుము సుమీ.'

'ప్రాణేశ్వరా! విశ్వకల్యాణకరణధురీణ మగు తమ జీవమును మానవకోటి యభిల షించుచున్నది. తమయందు విశ్వ మాధార పడియున్నది. అట్టి మీరు అసువులబాసి నచో అజాండము అంధకారబంధురమగును. మీ పుత్రులు గోడుగోడున విలపింతురు. సర్వము శూన్యమగును. అమూల్యమైన తమ జీవకుసుమము రాలిపోకుండ కాపాడు భారము నాపైయున్నది. నా విధ్యుక్త ధర్మమును నన్ను నెరవేర్పనిండు. అనుజ్ఞ యిండు. నామాట త్రోసివేయకుడు.'

'సతీ! పలుమాటలేల. నీ వాపనికి బూన వలదు. నీవే యీ రాజ్యమున కధికారిణివై కన్నబిడ్డలవలె ప్రజల కాపాడుచు సుఖము లందుము. నాకు నేడో రేపో మరణ మాసన్నమైయున్నది నా సుఖమరణము నకు ఆటంకము కల్పింపకుము. మరలుము'

'ప్రాణపతీ! కరుణింపరా. ముమ్మాటికి నా కనుజ్ఞనీయరా. అబలనగు నేను రాజ్యాధికారిణినై దేని నిర్వహింపగలను? అశక్తను. అబలను. తమ పాదదాసిని. నన్ను తరింపనిండు. అనుజ్ఞయిండు.'

'ప్రియా! ఇక మాటలాడకు. నిద్రవచ్చు చున్నది. నీవు పరుండుము. ఆ పనిని మాత్రము తలపెట్టకు. భద్రములందుము'

అతడు నిద్రించెను. నిశీథము. నిశ్శబ్దము.

'వైద్యవిద్వాంసులు నుడివినరీతి యీ విషవ్రణము నాఘ్రాణించి, నా పతి ప్రాణ ముల కాపాడి నే జీవముల బాయుదు. ఇప్పుడు వీరు గాఢనిద్రయందున్నారు. నా తలపెట్టిన పని కిదియే తగినయదను' అని మదిని విచారించి ఆ సతీమతల్లి తన పతి పాదరాజీవములకు ప్రణమిల్లి, ఈశ్వరు దల పోసి తలపెట్టిన కార్యంపు పరిపూర్తికి కడం గెను. భర్తకు దెలియకుండు రీతి దాని నిర్వహించెను. నానాటికి ప్రభువు ఆరోగ్య సంపన్నుడాయెను. అతని సతి విషవ్రణ వ్యథాబాధితయాయెను. శేష మూహించు నది.

మన విజయదశమీ పుణ్యవాసరమున కర్పూరహారతులతో సుగంధద్రవ్యములతో ఆ స్వార్థత్యాగినిని ఆ పతిపరాయణను పూజించి తరింపుడు.

# గేదెల రామక్క జీవితచారిత్ర సంగ్రహము

"చిత్రలేఖ"

గేదెల రామక్క జీవితం ఆంధ్రదేశీయుల కేమాత్రమూ తెలియలేదు. ఆమె బియేప్యాసు కాలేదు; ఉపన్యాసా లివ్వలేదు. ఆమె బొమ్మ ఎప్పుడున్నూ, ఆంధ్రపత్రికలో గాని ఆంధ్రసంచికలలో గాని భారతి గృహలక్ష్మి ఇత్యాది సచిత్రమాసపత్రికలలో గాని పడనేలేదు. * ఆమె మరేవిధంగా గాని తన పేరు ప్రచారానికి తెచ్చుకోలేదు. అయితే, ఆమె జీవితచారిత్రము నిస్సారమై సహారా ఎడారివంటి నిరర్థకమైనది కాదు. తనకున్న అవకాశంలో జీవితాన్ని ఆదర్శప్రాయంగానున్నూ, అభినందనీయంగానూ, సమగ్రతతోను గడిపి కొంతకాలముక్రిందట కీర్తిశేషురాలైంది. "మహాసామ్రాజ్యంలో బంటునై ఉండడంకంటే ఒక కుగ్రామానికి ప్రభువునై ఉండడమే నాకిష్టము" అని వెనుక సీజరుచక్రవర్తి అన్నాడంటారు. ఆ మాట ఎప్పుడూ విన్నది కాకపోయినా మన రామక్క అక్షరాల అట్లాగే బ్రతికి తాను నివసించిన గ్రామంలో ఆ బాలగోపాలానికి 'కావలసిన మనిషి' అనిపించుకొని మరీ చచ్చింది. ఆమె మరణానికి గ్రామమంతా ఘోషించారు అంటే విడ్డూరం కాదు. అందుచేతనే ఆమె జీవితచారిత్రసంగ్రహం పాఠకుల కెరుకపరచడానికి సాహసిస్తున్నాను.

గేదెలరామక్క యింటిపేరు 'గేదల'వారు కాదు. ఆమె ఆపత్కాలంలో అవలంబించిన వృత్తివల్ల ఆమెకా పేరువచ్చింది. రామక్క పుట్టింది చీరాలసమీపంలో కారంచేడు. కులానికి కాపులు. తండ్రి అంతో యింతో కలవాడు కావడంచేత చిన్నతనంనుంచీ గారాబంగా పెరిగింది. రామక్క చామనచాయగా ఉన్నా, బొద్దుగా పెరిగిన జుట్టు పొడవైన జడగా అమిరేది. పెద్దకళ్లు. ఏమున్న కారణమైనా సరే నోసపండు విరియపడ్డట్టు విరగబడి నవ్వేది. అందుచేత చూడడానికి ముద్దువస్తూ ఉండేది. ఈ వికాసానికితోడు చురుకు తెలివితేటలు ఉండేవి. ఇక మాటలు పుట్టి పాటలగింప.

గ్రామంలో కులంవాళ్ళేగాక పైకులంవాళ్లు క్రిందికులాలవాళ్ళు కూడా ఆపిల్లంటే ప్రేమించేవారు. కులంవాళ్ళు కాస్త వరసైతే చాలు- "శాయమ్మా" రామక్క తల్లి పేరని లెండి- "రామక్కను మా అబ్బాయి కివ్వవూ?" అని అడిగేవారు. శాయమ్మ ఎవరికీ మాటయిచ్చేది కాదు. అసలు శాయమ్మకు ఆమె మగనికి—అతడి పేరు వెంకటాద్రి—రామక్క పుట్టిన నాటనుండి తగాదే- మా తమ్ముడికొడుక్కి చేసుకుంటానని శాయమ్మ- మా చెల్లెలికొడుక్కి చేస్తానని వెంకటాద్రి. ఇంతట రామక్కకు వయసువచ్చింది. తల్లిదండ్రి పెండ్లిచేసితీరాలని ఒకరోజున కూడబలుక్కున్నారు. ఎవరి కివ్వడమని మళ్ళ శాయమ్మా వెంకటాద్రి వాదులాడుకున్నారు. ఊహ వచ్చిన పిల్లకదా రామక్క నడుగుదామనుకున్నారు- పిలిచి అడిగారు. గలగల గిలకవలె మాట్లాడే రామక్క 'పెండ్లి' అనంగానే ఎక్కడలేని సిగ్గువచ్చి తలవంచి మౌనంపూనింది. అడగగా అడగగా-"లచ్చయ్య బావను-(వెంకటాద్రి చెల్లెలికొడుకును) చేసుకుంటా" నన్నది-శాయమ్మ ఆమాట వినంగానే" నీళ్ళు నీళ్లవంకకు పారుతవిగాని మిట్టకెక్కుతాయమ్మా!" అని కూతురిని బుగ్గలు పొడిచింది. పోనీ దాని కిష్టమైన వాడికే యిత్తాములే అని మగనితో సమాధానపడ్డది.

లచ్చయ్యది దగ్గరనే అమ్మనబ్రోలు. పది

* ఈమె ఫోటోకై నా శాయశక్తుల ప్రయత్నించితిని గాని నిష్ఫలమైనది. ఆమె గుణగీతముల ననుసరించి, బొమ్మ వ్రాసిపెట్టవలసినదని అభినవ చిత్రకారులగు ఆంధ్రయువకుల కొందఱనడిగితిని. వారును ప్రయత్నింతుమనిరి. వారట్లే వ్రాసియిస్తే వెంటనే "గృహలక్ష్మి" కంపుదును. చి॥ లే॥

గొర్లుమెట్టఉన్నది. తల్లి చిన్నతనంలోనేపోయింది. తండ్రి సం॥రమైంది పోయి. 25 సం॥ లుంటాయి. స్వంతసేద్యం. సన్నగా బలిష్ఠంగా ఉంటాడు. 2సం॥లవుతుందట ఆ ఊరెళ్లినప్పుడు-ఆ కొంటెకళ్ళూ, ఆ కోరమీసం- హాస్యపుమాటలు- సేద్యానికి అవసరమైన ఓర్పు-నేర్పు-చూచేసరికి రామక్కకు లచ్చయ్యబావమీద మనసు లగ్నమైంది. జొన్నచేనికాడ కావలున్నబావకు చద్దికూడు పట్టుకెళ్లితే బావ వరసలాడుతూ రామక్కచేతనే కుంటకాడ దోసిట్లో పోయించుకొని ముంతెడికూడూ తాగేశాడు. మరదలిని మంచెకాడికి తీసుకెళ్లి ఊచబియ్యంకొట్టి బొంతు నలిచి-ఊది-రామక్క దోసిట్లో పోయక-ఆదోసిలెడమచేత్తోపట్టుకొని-వూచబియ్యాన్ని తానే రెండోచేత్తో రామక్క నోటికందించాడు. బావచేయి తగలంగానె మైమరచిన రామక్క అప్రయత్నంగానే నోరుతెరిచి ఊచబియ్యం అందుకొని నములుతున్నప్పుడు ఆ కొంటెకళ్ళల్లో ఉద్రేకం తొట్రిసలాడుతుండగా రామక్క బుగ్గన లచ్చయ్యబావ బింకంగా ముద్దుపెట్టుకొని 'నన్ను పెళ్లిచేసుకోవంటే పిల్లా' అని అడిగాడు. రామక్క తనకు తెలీకుండానే "ఊఁ!" అన్నది. ఇప్పుడు తల్లితండ్రులు ఆలచ్చయ్యబావకే యివ్వడానికి సమ్మతించినందుకు రామక్క కక్కడలేని సంతోషము కలిగింది.

పెండ్లిఅయింది. తోచినసారె చీరాపెట్టి కూతురిని అత్తవారింటికంపారు. వెళ్ళిన కొద్దిరోజులకే అప్పటి వరకాధారమైన ముసలమ్మ మరణించింది. చిలకా గోరంకా అన్నట్టు కాపురంచేస్తున్నారు యిద్దరూ వంటరిగా. చూస్తూఉండగానే వకటికి రెండు సంవత్సరాలు దాటిపోయినవి. ఈరెండు సం॥లు వాళ్ల పాలిటికి రెండునిమిషాల్లా వెళ్లిపోయినవి. లచ్చయ్య పొలంనుంచి రావడం ఆలస్యమైతే రామక్క సగం దూరం ఎదురువెళ్లి కలుసుకొనేది. పచ్చిజొన్న చొప్పకాలంలో రామక్క పైటాలరావడం ఆలస్యమైతే లచ్చయ్యే కోసినచొప్ప మోపుకట్టుకొని సగందూరము వచ్చి అక్కడ రామక్క నెత్తికెత్తి ఇంతాలస్యమేమని చెంపగొట్టేవాడు హాస్యంగా. ఇంకా యిట్లా యెన్నో విలాసపుచేష్టలు. పోరూ పొరపులేకుండా వెళ్లిపోయింది కాలం.

ఇట్లా వుండేసరికి 1914 సం॥లో యూరపు యుద్ధమారంభమైంది. అన్నిటికి ధరలు పెరిగిపోయినవి. అంతేకాక ఎన్నడో అంతరించిన నీలిపంటకు మళ్ళీ గిరాకివచ్చింది. పాడుపడ్డ నీలితొట్లు బాగు చేయించారు, కాస్త కలవాళ్ళు. ఉన్నవాళ్లు కూడా మిగతపంటలు తగ్గించి నీలిపంట వేశారు పొలాల్లో. మన లచ్చయ్య కూడా పశువులమేతకు ఇంకా అవసరాలకు మూడు గొర్లుంచి మిగతాఅంతా నీలివేశాడు. పాడుపడ్డ నీలితొట్టి బాగుచేయించాడు. నీలి బాగా ఎదిగింది. ఆ సంవత్సరము సకాలంలో వర్షంకురిసి అమ్మనబ్రోలు చుట్టుప్రక్కలంతా నీలి పంట బాగా పండింది. కోసి తొట్లకేసే అదును వచ్చింది. లచ్చయ్యకు కుర్రతనపు సాహసము కొంత కాలాన్ననుసరించి ధనాశ కొంత కలిసి ఊళ్ళో నీలి మందంతాకొని నిలవచేసి హెచ్చుధరకమ్మి లాభము పొందుదామని బుద్ధిపుట్టింది. రామక్కతో ఆలోచించాడు. రామక్క మొదట జంకిందిగాని లచ్చయ్య పోకడ కెదురు చెప్పడాని కిష్టంరాక 'సరే' అన్నది. రూపాయవడ్డీకి సం॥ము షరతుతో అయిదువేలు లచ్చయ్య అప్పుతెచ్చాడు. వక్క విసురున చేలు కొన్నాళ్ళు వకటివెంటవకటిగాకోసి తొట్లకేయించాడు. పండించి, ఆరబెట్టించి, అమ్ములుకట్టించి ఊళ్ళో పెద్ద కాళీయిల్లు బాడుగకు తీసుకొని సరుకంతా అక్కడికి చేర్చాడు. కోస్తాలనుంచి వర్తకులు జరీపాగాలవారు, అయిదువ్రేళ్ళ ఉంగరాలవారు, పొన్నుకర్రలవారు, కిర్రుచెప్పులవారు వచ్చి తిరిగి పోతున్నారు. వకరికంటె వకరు పైపోటీగా ధరలు చెప్పుతున్నారు. ఇంకా ధర పెరుగుతుందని అంటున్నారు. అందుచేత సుమారు పదివేలరూపాయల సరుకుకు-లచ్చయ్య మాటయివ్వకుండా నెట్టేస్తున్నాడు. ఆనా దమావాస్య, లచ్చయ్య కాస్త పొదు

పోయి యింటికివచ్చి పైకిపోనుకొని కూడుతిన్నాడు. రామక్కకూడా లచ్చయ్య సరసనే తిన్నది. భోజనమైన తర్వాత మెల్లంగా రామక్క నీలిమందు సంగతి కదిపింది. "ఆశకు అంతులేదు. ఇంకా ఎన్నాళ్లు ఉంచుతారు. బేరమివ్వకూడదా" అన్నది. "తొందరేముంది. ఇంకా ధరవచ్చేగాలి కొటుతున్న"దన్నాడు లచ్చయ్య. ఏమో ఇది తలుచుకున్నప్పుడెల్లా నాకడుపులో కలేపెట్టినట్లుంటుంది బావా అన్నది రామక్క కొతుకుబడ్డ గొంతుకతో. "పిచ్చిపిల్లా, ఎందుకే వెర్రిభయాలు" అని హెచ్చరించి, లాలించి, మరిపించాడు. ఉభయులూ మైమరచి నిద్రపోయినారు.

ఒక రాత్రివేళ ఉన్నట్టుగా ఊరిమధ్యగోల లేచింది. ఏడుపులు–పెడబొబ్బలు–కేకలు–పరుగులు గబాగుబీలు–ఒకడు చెప్పేది మరోడు వినిపించుకోడు. ఒకడు అడిగేదానికి మరోడు నిలిచి సమాధానము చెప్పడు. ఎవరికీ ఎక్కడకు వెళ్ళవలెనో, ఏమిచేయవలెనో తెలీదు. ఎప్పుడు పుట్టిందో ఎప్పుడురాజిందో ఎప్పుడు వలిగిందో ఊరిమధ్యఉన్న ఒక పూరిల్లు తారామండలమంటి మండుతున్నది. కళవళమంతా అణిగింది. కాపు కరణంచేరి నలుగురినీ కమ్మించి ఇల్లుదూయించడ మారంభించారు. కాని లాభం లేకపోయింది. ప్రక్కనున్న పెంకుటిల్లు అంటుకున్నది. వెంటనే కావళ్ళేనుసుని నీళ్ళు తెచ్చి తడుపుతున్నారు. తడిపేకొద్ది మండడమారంభించింది. లాభం లేకపోయింది. పెనుసువాసాలంటుకొని పేలీలు పేలిల్లుమంటుంటే ఎవ్వరూ దరిదాపులయి నిలువలేక పోయినారు. పెంకులుకాలి పగిలి ఎగిరిపోయిపడి దూరపిండ్లంటించినయి. అప్పటివరకు స్తబ్ధుగాఉన్న వాయుదేవుడు పరుగుపరుగునవచ్చి కలుసుకున్నాడు. కొంతసేపు గాలి తూర్పుతట్టు కొట్టింది. అప్పటికే చుట్టుప్రక్కలవారంతా జాగ్రత్తపడుతున్నారు. పూరిండ్లన్నీ దూసివేశారు. పెంకుటిండ్లముందు పందిళ్ళు లాగివేశారు. సామానంతా తీసి బయటవేశారు. ఇదే సమయమని కొందరు సహాయానికి వచ్చినట్లువచ్చి ఇతరుల సామానులు జాగ్రత్త చేశారు. బిందెగాని కుండగాని కనబడడమే తరవాయి. అవి చేతికి చిక్కినవాడెల్లా పట్టుకపోవడము నీళ్ళుతెచ్చి ఇండ్లుతడపడం. ఊరిచెరువంతా ఊళ్లోకి మోసేశారు. ఏమైతేనేమి? వాయుదేవుడు అగ్నిదేవుడు తలుచుకుంటే ఎవరిప్రయత్నాలు సాగుతవి! వారిద్దరు నలుముఖాలా ప్రసరించి ఊరు ఊరంతా ఆహుతిగొన్నారు. కొందరు నిద్రమంపునలేచి ఇవతలపడడమే ఎక్కువైంది. కొందరు ఆకంగారులో ముఖ్యముగా ఇవతలికి తీసుకోవలసిన వస్తువులు విడిచి అవసరముమాలిన వస్తువులు జాగ్రత్త చేస్కున్నారు. ఇందరు ఇంతకంగారు పడుతున్నా ఇంత సంచలనములయిఉన్నా కదలక మెదలక నిలుచున్న వారిద్దరు–వారు మనలచ్చయ్య రామక్క!! తొలిసారి అంటుకున్న పెంకుటిల్లే లచ్చయ్య నీలిమందు జాగ్రత్త చేసిన చోటు. అది అంటుకున్న దనేసరికే లచ్చయ్యకు రామక్కకు మతిపోయింది. కదులుదామంటే కాళ్లురావు. మాట్లాడుదామంటే నాలికాడదు. బిగ్గరగా ఏడుద్దామన్నా గొంతుపెగలదు. నిలువుగాళ్ళు వేసుకొని ఒకరినొకరు చూస్తూ ఇంటిముందు కాళీస్థలములో నిలుచున్నారు. అగ్నిదేవుడు అందరిళ్ళతోపాటు వాళ్లిల్లు (స్వంతిల్లు) ఆదుకునేసరికి తమదికానట్లు ఆపరిసరాలువిడిచి ఊరిబయటికి వెళ్ళిపోయారు. పూచికపుల్ల బయటికి తీసుకోలేదు.

తెల్లవారింది. గ్రామమంతా ఊరిబయట చింతతోపులో వసతిచేసుకున్నారు. అంతా అంతోయింతో జాగ్రత్త చేస్కున్నారుగాని లచ్చయ్య ఏమి ఇవతల తీయలేదని ఇదివరకే చెప్పానుగదా. అతనికి మిగిలిందెల్లా–కొత్తగాకొన్న, యీనమోసిన తొలిచూడి పల్లపడ్డ ఒక్కటే. అది ఆకంగారులో తాడుతెంచుకొని ఊరిబయటకి పోయింది. ఎవరో తోలుకొచ్చి "లచ్చయ్యా! ఇదిగోరా నీపడ్డ. పాపము నిలువునా మునిగిపోయినావు" అని పరామర్శపూర్వకంగా

అప్పచెప్పాడు. లచ్చయ్యా పొద్దెక్కిన కొంతసేపటికి జరిగినదంతా ఆకళింపునవచ్చి పొర్లిపొర్లి యేడ్చాడు. రామక్క ఆతడితోకలిసి కాస్సేపు ఏడ్చింది. ఇరుగుపొరుగు అమ్మలక్కలుచేరి "రామక్కానివ్వా ఏడిస్తే ఎట్లాగే. అతగాడికి ధైర్యముచెప్పాలగాని" అన్నారు. "లే! బావా లే! దేవుడుచేసిన దానికేమి చేస్తాములే! నీగోరెడాయున్ను చక్కంగుంటే మనకేమి లోపము? ఇంతకూ! నీరెక్కలు నమ్ముకున్నానుగా? మరేమి చూడలేదు, లే! బావా లే! నివ్విట్లాఅయితే నేనెట్లా నిభాయిస్తాను. నాకు ధైర్యముచెప్పి నీవు కాళ్ళు నిలవతొక్కాలిగాని ఇట్లాగైతే ఎట్లా?" అన్నది రామక్క. లచ్చయ్యా ఏడుపు దిగమింగి లేచాడు. రెండురోజులకు ఊళ్లో అగ్గి చల్లారింది. చేలో నాలుగు తాటిచెట్లు, గూములో వక యూభై వెదుళ్ళుకొట్టి-పాతయింటి స్థలంలోనే వక పూరిల్లు వేశాడు. నెలరోజులు పట్టింది మళ్ళీ యింట్లో దీపంపెట్టేసరికి, రామక్కకు లచ్చయ్యాకు—

లచ్చయ్యా కప్పిచ్చిన సాహుకారు ఇళ్ళుకాలిన రాత్రి నగదునోట్లు ప్రామిసరీనోట్లు ఉన్న ఇనపపెట్టే ఊరిబయట మర్రిక్రిందికి మోయించుకొని దానిమీదే కూచున్నాడు. అతగాడిల్లు మిద్దెభాగంతప్ప మిగతంతా తగలపడిపోయింది. అతడికి ఊళ్లో బాకీలేనివారు లేరు. షరతులోపల బాకీ యివ్వకపోతే దావాచేసి డిక్రీపొంది జప్తుచేయించి వేలంవేయించి తనబాకీ రాబట్టుకోవలసిందేగాని మరోమాటలేదు. తిరుగ వ్రాయించుకోడం అనేదరుగనే ఎరుగడు. బాకీవున్నవారు ఎంత కష్టములోఉన్నా 'ఇస్తావా చస్తావా' అని గొంతుమీద కూర్చోవలసిందేగాని మరో సౌమ్యమార్గం, పుట్టి బుద్ధెరిగి, అతడు త్రొక్కి ఎరుగడు. దయఅతని హృదయంలో ఏమూల వెతికినా నువ్వుగింజంతైనా దొరకదు. మన లచ్చయ్యాకు వచ్చిన చిక్కుచూచి మరీ తొందరించడ మారంభించాడు. లచ్చయ్యా అప్పుతీర్చడ మెల్లాగని దిగులుపడ్డాడు-మంచమెక్కాడు-"భూమి అంతా అమ్మి తీరుద్దాము-వ్యవసాయపు పరికరాలన్నీ ఉన్నాయికదా. 'పదిగొర్లు మక్తాకు తీసుకుంటే నాలుగేళ్లల్లో మళ్లీ తలెత్తగలము." అని రామక్క ఎంత ధైర్యముచెప్పినా లాభం లేకపోయింది. సం|| గముగడువు గిరుక్కున తిరిగివచ్చింది. సాహుకారు దావావేశాడు. డిక్రీపొందాడు. ఆమాట వినేసరికి లచ్చయ్యాకు రోగం మరీహెచ్చింది. రామక్క వంటిమీదఉన్న నాలుగు గుల్లలు అమ్మి మొగుడికి నంబికేశవాచార్లుచేత మందిప్పించింది. ఇంక ఊళ్లో ఉన్న చిల్లరవైద్యులంతా చూశారు. మనోవ్యాధికి మందులేదని అంతా పెదవివిరిచారు. సాహుకారు డిక్రీఅమలు జరపడానికి జప్తువారెంటుకూడా పుట్టించాడని విన్నరోజుననే లచ్చయ్యా మరణించాడు. పదిరోజులుకాకుండానే సాహుకారు రామక్కకు గేదెపడ్డను, పూరికొంపను పాత్రసామానును విడిచి మిగతభూమి పుట్రాఅంతా వేలంవేయించాడు. ఆతడి భయంచేత ఎవరు పైపాట పెట్టలేదు. లోపాయికారిగా తానే చౌకగా పాడించి కొట్టివేయించాడు. ఆవచ్చింది అతడి కివ్వాలసిన అసలు పాయిదాలకీ బొటాబొటీగా సరిపోయింది. రామక్క 'వచ్చినవాడు ఋణవిముక్తి చెందా'డని అక్కడికక్కడికే సంతోషించి సరిపుచ్చుకున్నది.

రామక్కకిట్లా, ఇంకా అచ్చటముచ్చట అనుభవించాలిసిన చిన్నతనంతో వల్లమాలిన దుఃఖంవచ్చిపడ్డది. రామక్క కట్టుకున్న గాలిమేడంతా కూలిపోయింది. అమిర్చిన పాచికలన్ని చెదిరిపోయినవి. ఊహించిన భాగ్యరేఖ నీటిమీద వ్రాతైంది. జీవితనాటకం మనోహరంగా ఆడదామని నిర్దేశించుకున్న రంగస్థలం తెరకాలిపోయి బట్టబయలైంది. అన్నివిధాలా రామక్కపుట్టి బుడింగని మునిగింది నట్టేట. ఇంకేది దారి? ఏది దిక్కు? ఈ దరీతోవ లేని బ్రతుకెన్నాళ్ళు? నిమిషమైనా గడిచేదెట్లా? పోనీ పుట్టింటి కెళదామాఅంటే రామక్క స్వతంత్ర బుద్ధికదినచ్చదు-తండ్రి రమ్మన్నారా నన్నది.



మద్రాసు సారస్వతశాఖీయ బాలికల గోపికానృత్యము.



బాపట్ల స్త్రీహితైషిణీమండల వార్షికోత్సవ సందర్భమున
కుచేల నాటకము ప్రదర్శించిన బాలికామణులు.



మిస్. జుబేడా

లచ్చయ్యను వీధి అరుగుమీద పెట్టినతర్వాత మరణించడానికిముందు రామక్క "నాకేమి దిక్కు చూపించిపోతున్నావు బావా" అని ఏడుస్తుంటే- కంఠానికి ప్రాణం ఎగదట్టిఉన్న లచ్చయ్య ఎట్లాగో ఆ కృశించిపోయిన చేతో ఎదట కట్టేసిఉన్న పల్ల గేదను చూపాడు. అది జ్ఞప్తిదెచ్చుకోని ఈ గేద మనకు జీవనాధారమని నిర్ణయించుకుంది. బొమ్మ చెదరిపోయినప్పుడు లేదా చెరిగిపోయినప్పుడు చిత్రకారుడు మళ్లీ పలకనిండా దట్టంగా రంగుగొట్టి కొత్తరంగులతో కొత్తబొమ్మ వ్రాయడాని కుపక్రమించినట్లు రామక్క మళ్లీజీవితము క్రొత్తగా వంటరిగా ఉపక్రమించింది. ఇదే రామక్క జీవితచరిత్రకు నిజమైన ప్రారంభము. ఇంతవరకు వ్రాసింది పూర్వగాథ.

*    *    *    *

## 2

చేతికొద్దీ పాడిపంట వకరికిపెట్టి తాను అనుభవించే రోజులు గడిచిపోయినవి రామక్కకు- పెరుగూ పాలూ కంచంనిండాపోసి మగని సరసన కూచోని జుర్రుకొనే రామక్క ఇప్పుడు వాటిని స్వవిషయంలో విషంలా చూచుకుంటున్నది. నా బావ ఉండగా నాకేమని వెనకాముందు లేకుండా వ్యవహరించిన రామక్క పొదుపు నేర్చుకుంటున్నది. నాయింటికి నే రాణి ననుకున్న రామక్క ఇప్పుడు తన యింట్లోనే తాను కూలిమనిషినని గ్రహించింది. ఇదే స్వర్గస్థుడైన బావ చల్లచూపు మాచెట్టు గౌరవంగా బ్రతకడానికి మార్గమని తెలుసుకున్నది రామక్క.

రామక్క చీకటిప్రొద్దున్నే లేచి చేలచాయలవెళ్లి తెల్లారేసరికి గంపెడిగడ్డి దోక్కొస్తుంది. గేదెను కట్టుమట్టుమార్చి గడ్డి ముందేసి దూడనువిడచి, కట్టి, పాలు పిండుతుంది. పాతకుండ ఏరోజు కారోజు శుభ్రంగా తోమి పాలు పెడుతుంది. ముందురోజు తోడుపెట్టిన పెరుగు చిలికి మజ్జిగజేసి వెన్నదీస్తుంది. ఆవెన్న శుభ్రమైన పిడతలోవేసి చక్కగా మూతవేసి ఉట్టిన పెడుతుంది. ఏరోజు గేదపేడ ఆరోజే మురిగిపోకుండా పిడకలుతట్టి ఎండపెడుతుంది. అప్పుడు గేదను రాత్రికట్టేసిన కట్టుమట్టు శుభ్రము చేస్తుంది. తర్వాత గిద్దెడు నూకలుగంజి కాచుకోని తన్నెడు మజ్జిగపోసుకోని తాగుతుంది. కాస్సేపు తనసు రాసినరాతకు ఏడుస్తూ నులకమంచము తిరగేసి పడుకోని వంకూరుక్కతీసి లేచి మళ్లగంప లిక్కపట్టుకోని పొలాలచాయ వెళ్ళుతుంది. సాయంకాలానికి గంపనిండా, వడినిండా గడ్డి దోక్కొని మోమని పైనా మోయలేనంత బరువుతో సాహసోత్సాహబలిమికామాలి ఇంటికి చేరుతుంది. గేదను కట్టుమట్టు మార్చి పాలుపిండి దానిమీద పెట్టి మళ్ళీ గంజికాచి తాగి, పాలలో తోడేసి పడుకొంటుంది. ఈవిధంగా రామక్క నిత్యజీవనం నడుపసాగింది. మొదటిలో మజ్జిగ కోమట్లఇళ్లల్లోపోసి కడుగుగంజి తెచ్చి గేదకు పోసుకుండేది. రామక్కదగ్గర మజ్జిగదొరుకుతుందని ఆనోట ఆనోటబడి బాపనవీధికి పాకింది. బాపనయ్యలు సత్తుప్యాలలు పట్టుకోని వచ్చారు. కాని యిస్తే చింతగింజ మునగని రొడ్డంటి మజ్జిగ మానెడు పోస్తుంది రామక్కని ఊరంతా మారుమోగింది వారంరోజులలో. మరోవారానికి ఎవరికంటే వారికి పోయడం మానేసి నిరుకుగా ఏనలుగురికో వాడుకే ర్పరచుకున్నది. రెండుపూటల విస్తారం గడ్డివేయడం చేత గేద దినుసు మంచిదికావడంచేత పూటకడ్డెడు పాలిచ్చేది. పాలలో జిడ్డెక్కువ. వెన్న బాగా అయ్యేది. ఇంకేమున్నది నెల తిరిగేసరికి పిడకలు, మజ్జిగ అమ్మిన రూకలతో గంజికర్చు-దీపంకర్చు వెళ్లిపోసాగింది. నెయ్యి అమ్మినరూకలు బియ్యపు కుండలో దాచిపెట్టిన చిన్నపిడతలోకి చేరసాగినవి. వెన్న మురగపెట్టకుండా నాలుగురోజులు కొకసారి కరగపెటుతుండేది. ఆ కరగపెట్టడంలోనైనా, మాదరకాగనివ్వకుండా, చల్లతేరలేకుండా జాగ్రత్త తీసుకొనేది. అంచేత రామక్క నెయ్యిదగ్గర మిగత వాళ్ల నేయి దిగదుడుపని ప్రసిద్ధికలిగింది. కరగపెట్టడమే తరవాయిగా ఎప్పటినేయి అప్పుడే పట్టుక

పోతుండేవారు పకకానీ ఎక్కువిచ్చేనా. ఈవిధంగా ఇచ్చిఉంటే దారి దానంత తానేర్పడుతుందని నిరూపించుతూ క్రొత్తబ్రతుకు ప్రారంభించింద రామక్క.

సంవత్సరము తిరగేసరికి పదిరాళ్ళు చేరినవి రామక్కదగ్గర. రెండుపూటల గడ్డికితోడు చిట్టు తవుడుకూడా కొనిపెట్టడంచేత గేద జంకకుండా రెండుపూటలా పాలిస్తున్నది. అమ్మినవాళ్ళను కనుక్కుంటే రెండుసం||లుదాకా పాలివ్వడం దాని తల్లి చాలని చెప్పారు. సంతోషించి బాగా మేపుతున్నది. ఇల్లా ఉండగా ఇంగ్లీషుచదివిన మాస్టరు వచ్చాడు ఊళ్లో చదువులబడికి. కాఫీ అలవాటయినవాడు కావడంచేత రైలుస్టేషన్లోనే వాకబుచేశాడు ఊళ్లో ఎవరైనా పాలమ్ముతారా అని. ఇస్తే రామక్క యివ్వాలన్నారు. ఆసాయంకాలం రామక్కను కబురంపి రోజుకు గిద్దెడుపాలు ఏర్పాటు చేసుక్కున్నాడు. మరునటి నెలకీ పర్వేవాళ్లు వచ్చిపడ్డారు. వాళ్ళలో అయ్యార్లే విస్తారము. ఆరుగురిలో నలుగురు. మిగతా ఇద్దరు తెలుగువాళ్ళు కూడా ఇంగ్లీషు చదివినవారగుటచే కాఫీవాలాలైనా అయ్యార్లంత చేటులే. అంతారోజుకు 3 సార్లు నాలుగుసార్లు పుచ్చుకునేవారే. అందులో మరీ పకాయునకు గాలి కాఫీ-కిల్లీనీరు-అన్నము-ఇదట జీవితావసరక్రమము. వాళ్లు మొదట ఊళ్లో కాపులు సరఫరా చేస్తారేమో పాలుపెరుగు అని చూచారు. కాపులేమి కదలలే. అంచేత రెండురోజులు కాఫీలేకుండామండి-బిక్కమొగమేసి మర్నాడు రామక్కను పిలిచి అడిగారు. రామక్క సర్దుకోడం కష్టమని యోచించింది. అయితే అయ్యార్లు కనీసము 6 నెలలైనా ఉంటారని తెలిసి సరేనన్నది. రెండురోజులు ఊరూ ఉహము తిరిగి కొత్తగా యీనిన గేదె నొకదానిని కొన్నది. అయ్యార్లకు పాలుపెరుగు-ఊళ్ళో బాపనయ్యాలకు మజ్జిగ-పైగా నేతిబేరము. చిల్లరఖర్చుకు పిడకల బేరము-పట్నవాసములో ఉండి కంపునేయి తప్ప కమ్మనినేయి ఏజన్మలోఎరగని అయ్యార్లు రామక్క నేయి చూచేసరికి బ్రహ్మానందంచెందారు. నేయైపోయిందంటే అయ్యార్లు స్వయంగా పట్టుకవచ్చేవాళ్ళు గిన్నెలు "రామక్కమ్మాళ్! నివుదా పొయ్యవలెనెయి. మేముదా సాపాడవలె." అంటు. గేదెలు పకటి రెండయ్యేసరికి రాబడి ఎక్కువైంది. పని ఎక్కువైంది. గేదెలకు గడ్డితగ్గింది. చిట్టుతవుడూ హెచ్చుచేసింది. ఇంతలో స్కూలు పెద్దదైంది. ఇంగ్లీషుమాష్టర్లు ఎక్కువైనారు. దానితోపాటు కాఫీపాల గిరాకి పెరుగు మజ్జిగ నేయి గిరాకీ వృద్ధిఅయింది. రామక్క యింకా రెండుగేదెలను కొన్నది. పనితెమలక పకమాలదాన్ని-అంటే ఇప్పుడు హరిజనుల ఆడుదాన్ని-గడ్డితేవడానికి దూడదుడికి నౌకరికి కుదుర్చుకున్నది. అట్లాగని పనిఅంతా నౌకరి మీద వదలిపెట్టలేదు. తానే అంత స్వయంగా చూచుకుంటుండేది. తీరికున్నపుడెల్లా అది నౌకరి తాను యజమానురాలు అనేభావము లేకుండా దానితో కలిసిమెలిసి పనిచేసింది - కాలానుగుణ్యంగా గ్రామంకూడా పెరిగిపోయింది. ఊళ్లో సబ్ రిజిష్ట్రారు ఆఫీసు సబుమ్యాజస్ట్రేటు కచేరిపెట్టారు. అరిజిష్ట్రారు ఆఫీసు సబుమ్యాజస్ట్రేటు కచ్చేరీల గుమాస్తాలు పక 8-9 మంది వచ్చారు. రిజిస్ట్రేషన్కు కోర్టుకు వచ్చేపోయేవారికై పూటకూళ్ళహోటలు వెలిసింది. వాళ్లకు మధ్యాహ్నము ఫలాహారాలుకై చిన్నహోటలు పుట్టింది. ఇంతలో పోలీసుస్టేషన్ పెట్టారు. ఒక సబ్ ఇన్స్పెక్టరు పదిహేనుగురు పోలీసులున్నూ వచ్చారు. రామక్క గేదెలవల్ల బ్రతుకుసాగించడ మారంభించినపుడు ఆపల్లెటూళ్లో-భూములు మక్తాకిచ్చుకోనో, అప్పులుకట్టుకో-గేదెల మేపుకోను దార్ఢ్యములేని విబాపనయ్యలకో, తీరుబాటులేకుండా బేరసారాలు చేసుక్కునే ఏకొద్దిమంది కోమట్లకో తప్ప మరెవ్వరికి రామక్కతో పనిలేకపోయింది. ఇప్పుడో పట్నవాసపు అలవాట్లు కలవారు ఎప్పుడు బదిలీ అవుతుందో అనేఅస్థిరమైన బ్రతుకు కలవారు అయిన పదిమంది ఉద్యోగస్థులతో ఊరునిండడంచేత-పాలని నేయని-పెరుగని-మజ్జిగని రామక్క అవసరం బాగా

కలిగింది-వంగవోలు నేయంటే మద్రాసులో కళ్లద్దుకుంటారు. అంచేత మద్రాసు వర్తకులు రామక్క దగ్గర కాతాబెట్టారు. కొన్నాళ్లు నేయి తెప్పించారు. తర్వాత వెన్న తెప్పించారు. దానా దీనా రామక్క దొడ్లో యాభైకిమించినై గేదెలు-ఈనినవీ-ఈనమోసినవి-చూడివి-వట్టిపోయినవి-వట్టిపోతున్నవి వీటినంతా చూడడానికి ఇద్దరు మగనౌకర్లు. వీటికొక రేకుశాలవేయించింది. గడ్డికొక బీడు కొన్నది. చొప్పకొని వాములు వేయించింది. గ్రామమంతట్లో-పాలకు-పెరుక్కు-నేతికి-మజ్జిగకు-పిడకలకు-కనీసము నాలుగురూపాయలు చేబదులుకు-వందరూపాయలు నోటుమీద బదులుకు రామక్క అవసరములేనివాడు లేడు.

రామక్కను చూచి చాలమంది ప్రారంభించారు గాని యీపద్ధతి ఎవ్వరికీ స్థితికిరాలే. రామక్క ఎందరిండ్లకు పాలు పెరుగు నెయ్యి వాడుకగా యిస్తున్నా ఎవరింట్లోనైనా సరే తప్పులాడెరుగదు. ఒకవేళ యింటివాళ్ళు లెక్కమరిచిపోయి ఒకటి రెండురోజులు తక్కువచెప్పినా 'పోనీలేండి! మీజ్ఞాపకము వచ్చినప్పుడే యిత్తురుగాని లేండీ, మరు పెవ్వరికైనా ఉంటుంది-' అని సర్దుకుపోతుంది. రామక్క పాలల్లో నీళ్ళుగాని నీళ్లల్లో పాలుగాని పోయదు. పాలుతీసే పాత్రలైతేనేమి, కొలలపాత్రలైతేనేమి, పెరుగువుంతలైతేనేమి అశుచీ అశుభ్రత బాపనిండ్లల్లోకూడా లేదు. పాలుతీయడం తాను స్వయంగానే గాని నౌకర్లమీద వదలదు. దూడచస్తే ఆపాలూ దుత్తలలోకి వస్తయ్యేమాట ఆమెకు స్వప్నేపి లేదు. ఆమె దొడ్లోగేదదూడలన్నీ గుర్రాలవలె ఉంటవి, అదేమి మహాత్మ్యమోగాని రామక్కచేతితో తోడుపెడితే పెరుగు మూడురోజులకైనా పులవదు. తీయ్యంగా పంచదార నోట్లో వేసుకున్నట్లుండవలసిందే. అంచేత పిన్నాపెద్దా అందరూ 'రామక్క పెరుగు రామక్కపెరుగు' అని కలవరిస్తూంటారు. ఎవరైనా, ఏకారణంచేతనైనా పెరుగువాడుక నిలిపివేసుకుంటే, ఆయింట్లో పసిపిల్లలేఉంటే-ఇక ఆయింట్లో ఆరోజు కొలుపన్నమాటే. అల్లాంటి దెప్పైనా రామక్క చెవినిపడితే చాలు. గబగబ యింటికి వెళ్ళి చిన్నముంతతో పెరుగుతెచ్చి ఆపిల్లలను పిలిచి యిచ్చివేసేది. ఆవిడింటికి సాధ్యస్తమానము చిన్నపిల్లలు వచ్చి "రామక్కా పెరుగుబిళ్ల పెట్టవు-మీగడపెట్టవు" అని చేయిజాచి అడుగుతుటారు. ఆచిన్న చేతులు ముద్దుపెట్టుకొని రామక్క ఇంత పెరుగో, మీగడో, వెన్నో పెట్టిపంపి కళ్లనీళ్ళు తుడుచుకొంటుంది. ఒక సంవత్సరమునుంచి రామక్క మజ్జిగ అమ్మడం మానేసింది. ఎవరైనాసరే, ఇంటికివచ్చిన వాళ్ళకు ఒకరక తన్నెడు మజ్జిగ నిరుకుగా పోసేది. నేతిబేరం విస్తారమైన తర్వాత వర్తకులే పట్టుకుపోతుండేవారు. వాళ్లు కల్తీ చేస్తున్నారని విని ఆంధ్రపత్రికలో ప్రకటన చేయించింది పైఊళ్లకు తానే స్వయంగా పంపుతానని-రామక్క చేతిగొబ్బునంచి నేయి ఉపయోగించే వారికి చెందాలసిందే గాని మధ్యవాళ్లెవరికీ దానిలో వేలుపెట్టడానికి కాస్కారము లేకుండా చేసింది. చెన్నపట్నంనుంచి గొప్పగొప్పవాళ్ళు ఆమెపేర ముందుగా తంతిమనియార్డర్లు పంపి నేయి తెప్పించుకునేవారు. ఈవిధంగా మూడు సంవత్సరాలక్రింపట లచ్చయ్యవిడిచిన చిన్నిఅనాథ నిరాధారపుపక్షి తన ప్రయత్నానికి దైవబలంతోడుకాగా, పల్లగేదమూలకంగా-నేటికి కాస్త నిలవతొక్కొని పెద్ద గేదెలమందకు యజమానురాలై 'గేదెల రామక్క' అని పేరుపొందింది.

రెండోసం॥ రారంభంలోనే గంజినీళ్ళు వదిలి వరిబువ్వలోకి దిగింది. ఇప్పుడు వరిబువ్వ-తాలింపుకూర గట్టిపెరుగు ఈమాత్రంలోకి వచ్చింది భోజనపద్ధతి. రామక్కకు ఆమచక్కమీద మనసుబోయింది గాని రెండుమూడుసార్లు, లచ్చయ్యా బావతోనే వాటికీ తనకూ ఋణంతీరిందని గుండె రాయిచేసుక్కున్నది. వాళ్లకులంలో తప్పులేదు కాబట్టి చేతికి మురుగులు గొలుసులు చేయించింది. చెవులకు దద్దులుకొన్నది.

కాస్త దానము ధర్మము కూడా చేస్తున్నది లచ్చయ్య కట్టిన పూరిల్లు అట్లాగే ఉంచి ప్రక్కన ఒక పెద్ద భవంతి వేయించింది. పని పాటల సందర్భంలో అన్నీ మరిచి ఉంటుందిగాని తీరిక సమయాల్లో ఈఐశ్వర్యమంతా చూచుకొనేసరికి ఎందుకీ అడవినగాచే వెన్నెలనిపించేది కాబోలు- కంఠంనిండ నీరుకమ్మి ఎవరైనావచ్చి పిలిచేవరకు నిర్విణ్ణఅయి నిలుచుండేది.

ఈమూడుసం॥ రాలనుంచీ ఎన్నిగేదెలన్నా కొన్నది ఎన్నిటనైనా అమ్మిందిగాని రామక్క లచ్చయ్య కొనిపోయిన పల్లగేదెను మాత్రము విడువలే. దాని దినుసు చూచి చాలామంది అడిగారు. వంద రూపాయలిస్తామన్నారు కూడ!! ఊహూ! ససేమిరాఅన్నది. దాని భిక్షేగా ఈఐశ్వర్యమంతా అని దానియందొకవిధమైన సోదరీన్యాయము మేర్పడ్డది రామక్కకు.

అది ఎదురై మోరెత్తి అరుస్తూ గంతులేస్తూ కట్టుమట్ట కలేత్రొక్కుతుంటే రామక్కకు మూన్నాళ్ళ పట్టపగలుగా వెలిగిపోయిన రోజుల ముచ్చట్లెవో జ్ఞాపకానికొచ్చేవి; నిలవలేకపోయేది. లోపలగదిలో కెళ్ళి తలుపులుమూసి పడుకొని ఏకధారగా కన్నీళ్ళు గారుస్తూ నిశ్శబ్దంగా ఏడ్చేది ఎంతోసేపు. గేద అల్లరంతా చూచి ఏయిరుగుపొరుగు అమ్మలక్క వచ్చి ఏమే రామక్కా! నిద్రపోతున్నావటే ఇందాకటినుంచి గేద అల్లరిచేస్తుంటే వినపడలేదుటే- ఏదారిపోతుందేమో" అని హెచ్చరిస్తే అప్పటికి కళ్ళనీళ్ళు తుడుచుకొని, లేచివచ్చి గేదెనువిప్పి మునసబుగారి దున్నకాడికి తోలుకొనిపోయేది గేదెను. దారిలో అది అటూఇటూ లాగి ఈడిస్తే ఎక్కడలేని సిగ్గుతో దానిని లాలించేది. దానికి 'మా లచ్చిమి' అని పేరు పెట్టుకున్నది. సామాన్యసమయాల్లో రామక్క పిలుపుచాలు-సౌజ్ఞచాలు-చూచాలు దానినే ఇష్టమువచ్చినట్లు చేయించటానికి. ఏమితోచనప్పుడు రామక్క 'మా లచ్చిమి'తో చెల్లెలితోవలె ముచ్చట్లాడేది. 'మా లచ్చిమి' అంటేనేగాదు రామక్కకుప్రీతి. తొలిచూలికిపుట్టిన దున్నకుర్రఅన్నా ఆమెకు ప్రాణం. దాని పుటక చక్కన, దానిఅల్లరి-దానిచలాకి-దాని కొమ్ములపస. అన్నిటికి మించినవి శేషము. రామక్క కాదున్నకుర్రలో ఏవన్నెలు చిన్నెలు చూచి చిన్నతనంలో లచ్చయ్యబావను తాను వరించిందో ఆవిశేషాలు కన్పించేవి. అది రామక్క మనోవికారమో; ఈశ్వరవిలాసమో. దానికి 'కోటప్ప' అని పేరు పెట్టుకొన్నది. అదున్నకుర్ర ఎక్కడున్నా ఉండనీ- 'కోటప్పా' అని రామక్క పిలిస్తేచాలు- గలగలలాడుతు గంతులేస్తు పరుగెత్తుక వస్తుంది. రామక్క కోటప్పమెడకు చిన్నతనంలో చిరుగజ్జెలు కట్టింది. కొమ్ము కన్పించిన తర్వాత పెద్దమువ్వలు కట్టింది. కాస్త పెద్దదై కొంటెచేష్ట లారంభించిన తర్వాత పట్టెడకుట్టించి చిరుగంటలు పెట్టించింది. అది ఘల్లు ఘల్లున గంతులేసుకుంటూ వస్తుంటే రామక్క వాత్సల్యాతిశయముచేత ఈ విశ్వమే మరిచేది. అది ఎంత మంకైనాచేయనీ, ఎంత అల్లరైనాచేయనీ, నౌకరులు దాని వంటిమీద చేయైనా వేయవీలులేదు. గొడ్డుకూ మనిషికీ ఎక్కడిదో ఈ స్నేహము! అసలు మానవునికి స్వజాతియందుకన్నా జంతు, వృక్షశిలలయందెక్కువత్వరగా స్నేహము కుదురుతుందేమో. లేక స్వజాతిని ద్వేషించినంత సులభంగా ద్వేషింపలేడేమో. కాకపోతే పాము, పులి ఇట్లాంటి క్రూరమృగాలతోకూడా ఎట్లా స్నేహము చేయగలుగుతున్నాడు. ఈ ప్రకృతి రహస్యము కన్నవారు కాబట్టే కాళిదాసు, "అథైనమద్రేస్తనయా శుశోచ, సేనాన్యమాలీఢమివాసురాస్త్రైః" (దేవతలచే కొట్టబడ్డ కుమారస్వామికోసమువలె, ఏనుకచే బెరడు రాయబడ్డ దేవదారు వృక్షముకోసరం పార్వతీదేవి దుఃఖించింది) అన్నాడు. తత్తుల్యుడు భవభూతి కూడా. వెనుకట నేస్తాలను, గట్టులను, పుట్టలను, చెట్లను, ఏళ్లను, నెమళ్లను, ఏనుగులను చూపి భోరున ఏడిపించాడు కారణజన్ములైన సీతారాములనుకూడా.

రామక్క మొదట్లో అందకత్తె అయినా, లచ్చయ్యబావ చచ్చిపోయిన తర్వాత వచ్చిన కష్టాల

చేత తిండి తిప్పలు సరిగా లేక, మనస్సుకు ఉల్లాసము లేక పైబడ్డ యేండ్లకు మించిన ఆయుస్సు కుంగి కళ మరుగుపడ్డది. కాని మళ్లీ నాలుగు రాళ్లు చేరి, అనువైన భోజనము, ఉపచారాలు అమిరేసరికి మరుగుపడ్డ కళాకాంతులు ఒకవన్నె తక్కువగా మళ్లీ అంకురించి విస్తరించినవి. చెంపలదగ్గర కాస్త నరిసినా తలకట్టు తీరుగా సంస్కారము పొందడంచేత పూర్వపు అందం మళ్లీ వహించింది. కళ్లల్లో ఆ చిన్ననాటి నిర్భయత్వము అమాయకత్వము నిశ్చింత, చంచలత్వము కనపడకపోయినా, విశాలత్వం అట్లాగే నిలిచి ఉన్నది. అనేక అనుభవాలచేత వచ్చిన పరిజ్ఞానభావము వాటి సౌందర్యాన్ని కళ్లెమువలె లాగి పట్టుకున్నది. చెక్కిళ్లల్లో పూర్వపు మిసమిస నిగనిగ లేకపోయినా శోభ తగ్గలేదు. ఆ పలచదనమే వాటి కొక సొంపుగా ఉన్నది. పూర్వపు విరగబడి నవ్వడం లేకపోయినా, ఆ పెదవుల పలువరుసల అందము తెలుపడానికి ఎంత కోపకారణం కలిగినా అంతరించని ఆ చిరునగవు చాలు. కష్టానుభవాల చేత, వయస్సుచేత నుదుటగల్గిన ఒకటి రెండు రేఖలు కూడా ఆమె ప్రౌఢతనము చాటుతున్నయే గాని సౌందర్యాన్ని తగ్గించడంలే. చేతులుకూడా కాయకష్టముచేత పూర్వపు నవనవ వదలినా లాలిత్యము నిలిచే ఉన్నది. చిన్ననాటి చురుకు చకచక ఇప్పుడు గాంభీర్యముగా మారినవి.

రామక్క సోయగము చూచి ఊళ్లో కొందెగాళ్లు కొన్నాళ్లు చుట్టుముట్టితిరిగారు గాని లాభంలేకపోయింది. సాహసించడానికి ఎవ్వనికీ ధైర్యంకలిగిందికాదు. ఊళ్లోకి క్రొత్త పోలీసు ఇన్స్పెక్టరు ఒక పంతులు వచ్చాడు. ఆయన కొడుక్కు ఇరవైయేండ్లు దాటినవి. ఎన్నాళ్లు చదివించినా చదువు ఈయన కబ్బలేదో, చదువుకు ఈయన దొరకలేదో తెలియలేదు కాని రెండవఫారం దాటకపోవడంచేత నాన్నగారు బడి చాలింపించారు. అయితే కావలసిన అలవాటులన్నీ పట్టుబడ్డాయి. బల్ పోకిరీగా తిరుగుతున్నాడు. ఆతడొకనాడురాత్రి ఊరు మాటుమణిగేవేళకు ఒక చిన్నపత్తితప్పాలె పట్టుకొనివచ్చి 'రామక్కా' అని పిలిచాడు. 'ఎవరు వారు' అని రామక్క అప్పుడే పడుకున్నది లేచి వచ్చింది. 'ఏమి పంతులూ ఇపూలటప్పుడు వచ్చారు' అన్నది అనుమానిస్తూ. 'పెరుగుకావాలి' అన్నాడు. 'ఇప్పుడెందుకు' అన్నది రామక్క. 'బంధువులు వచ్చారు' అన్నాడు పకపకా నవ్వుతూ. ఆ నవ్వుకు తీగలా వణికిపోయింది రామక్క. పంతులు ప్రభావం ఇదివరకే విన్నదికావడంచేత. 'జవాబు నంపలేకపోయినారా' అన్నది రామక్క భయం గొంతుతో. 'నేనే రావాలిసొచ్చా' అన్నాడు సందర్భశుద్ధి లేకుండా ఆతంత. అనుమానిస్తూ లోపలికెళ్లింది. వెంటనే పిల్లపంతులూ లోపలదూరాడు. లోపల ఏమయిందో ఎవరికి తెలేదు. నిమిషంలో రామక్క కెవ్వన కేకవేసి ఇవతల దూకింది. ప్రహరి లోపల ఇల్లు కావడంచేత ఎవ్వరు లేవలేదు. రానూలేదు.

ఒక కాలు గడపఇవతల మరోకాలు అవతలపెట్టి ఒక చేతితో ద్వారబంధం పట్టుకొని రెండవచేతితో రామక్క కొంగుపట్టుక లాగుతున్నాడు పిల్లపంతులు. లోపలికి రమ్మని రామక్కను, అదిలిస్తున్నాడు. బెదిరిస్తున్నాడు. బతిమాలుతున్నాడు. భంగపడుతున్నాడు. లంచాలు ప్రకటిస్తున్నాడు. రామక్క 'ఏమికర్మమురా' అని విసుక్కుంటున్నది. తమ్ముడూ, బాబూ అని వరసకల్పించి పిలుస్తున్నది. కూడదని బుద్ధి చెపుతున్నది. నే నెన్నడెరగనీ కర్మం పంతులూ నన్ను విడిచిపెట్టే అని బ్రతిమాలుతున్నది. నలుగురు చూస్తే నవ్వులపాట్లని భంగపడుతున్నది. ధైర్యము వహిస్తేనేకాని ఈ దుర్మార్గుడు విడవడేమోనని కనుబొమ్మలు ముడివేసి మృదువుగా దూషించింది. ఆపాపిష్టివాడి పట్టు వదిలించుకోడానికి అన్నివిధాలా పెనుగులాడి లాభంలేక కడకు

అబలలపాలి బ్రహ్మాస్త్రమైన ఏడుపు ప్రారంభించింది సన్నగా. ఇవంతా, గేదెల కొట్టంలో కాక— అభిమానం కొద్దీ రామక్క ఇంటి చూరుక్రింద వేసుకున్న 'కోటప్ప' చూస్తున్నాడు. ఎన్నడూ 'రామక్క నీ స్థితిలో చూడలే కోటప్ప. గొడ్డు గోద తమరిని ప్రేమించేవారి కష్టసుఖాలు బాగా గుర్తించగలవు. రామక్క కేదో కష్టమువచ్చిందనీ తానుపోయి ఆదుకోవాలని కోటప్పకు కనిపించింది. పశుబలము రెండుతట్లూ వాడికలది. దానికి ప్రేమా క్రౌర్యాలు రెండూ తీవ్రమైనవే. కోటప్ప కట్టుతాడు లాక్కున్నాడు. రాలే. మళ్లీ బలవంతంగా లాగాడు. ఊహూ రాలే. ఇంకోసారి లాగాడు. కొంచం జరిగింది. మరోసారి గుంజాడు. ఫట్ అని తెగింది. మోరవంచి తోకఎత్తి పక్కగంతేశాడు కోటప్ప పిల్లపంతులమీదికి. గంతేమిటి కుమ్మేమిటి రెండూ వకటేసారి. రామక్క 'ఆ ఆ కోటప్పా' అంటూనే ఉన్నది. కోటప్పకు కోపమాగలే. రామక్క కొంగువిడిచి అప్పటికే కేకవేసి కూలపడ్డ పిల్లపంతులును మహోత్సమ్ముతో పొర్లించాడు. ఇంతలో రామక్క వచ్చి కోటప్పను కట్టుతాడుపట్టి అవతలకు లాక్కుపోయి తుంపులు రెండూ ముడిపెట్టి కట్టువేసింది. వచ్చి చూచును కదా పిల్లపంతులికి ఈ పొర్లిగింతలలో ఏ ద్వారబంధానికో తలుపుకో తగిలి ఎడమచేయి విరిగింది. 'పంతులూ ఎంత చెప్పినా వినకపోతివి కదా. దెబ్బ తగిలిందా పంతులూ' అని అడుగుతూన్న రామక్కవైపు కన్నెత్తైనా చూడక నొప్పికి నెత్తి నోరు కొట్టుకొని బిగ్గరగా ఏడవడానికైనా నోచుకోక లఘువుగా చట్టమీదకూడా దెబ్బ తగలడంచేత కుంటుకుంటూ తనదారిని తాను వెళ్లాడు పిల్లపంతులు. వాళ్ల నాన్నను రామక్కమీద కేసుపెట్టమని అడిగారట గాని ఆయన కొడుకునే చీవాట్లుపెట్టి దొంగకు తేలుకుట్టినట్లు పడిఉండమన్నాడట.

ఏమైతేనేమి. పిల్లపంతులు మళ్లీ ఆవీధిని నడవలేదు సరికదా పైఊళ్లో నేమోగాని ఆ ఊళ్లోమాత్రం మరెప్పుడూ దారితప్పి నడిచినట్లు ఎవరూ చూడలే. ఈ అభినవశృంగారగాథ నిజము ఎవరూ చూచినవాళ్లు కాకపోవడంచేత చిలవలు పలవలు పుట్టించి చెప్పుకుంటుంటారు అమ్మనబ్రోలులో ఇప్పటికీ. విరాటరాజు పట్నంలో సైరంధ్రిని చూచి పౌరులు హడలిపోయినట్లు హడలిపోయేవారు ఆఊళ్లో కొండెగాండ్రంతా రామక్కను చూచి, ఆమె బ్రతికున్నన్నాళ్లు.

రామక్క వ్యాపారము అవిచ్ఛిన్నంగా సాగిపోతూన్నది. నౌకర్లు చాకిర్లు ఎక్కువయ్యేసరికీ పాడే తానే చేస్తూన్నా రామక్కకు తీరికెక్కువైంది. తీరికవేళను మైమరిచే ఆనందంలో వినియోగం చేయడానికి ఏమున్నది సంసారము?! పట్టి మాయు!! పాడుబడ్డ దేవళంలో అఖండము ఎన్నాళ్లు వెలుగుతుంది? ఏమి తోచలే. ఆమధ్య వక బాపనయ్యవల్ల చదవడం నేర్చుకున్నది. అక్షరజ్ఞానమున్నా కొంత అలవడ్డది. ముందు ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలవారివి నవలన్నీ చదివింది. నవల వకసారి చదివినతర్వాత మరి ముట్టుకో బుద్ధిపుట్టలే. తర్వాత వక పండితుడిచేత రామాయణము, భారతం, భాగవతం, పురాణం చెప్పించింది. భారతంలో ధర్మరాజాదులు రాజ్యవిహీనులై అడవులలో తిరిగారని విన్నపుడు ఎంతవారికైనా తప్పవు కల్లవాట్లు అనుకున్నది. నలచరిత్రలో నలుడు దమయంతిని విడిచి వెళ్లాడని ఆమె నానాపాట్లు బడి తుదకు ద్వితీయ స్వయంవరము చాటించి మొగుణ్ణి రప్పించుకున్నదని విని, ఎక్కడున్నాడని పిలిపింతు లచ్చయ్య బావనని ఆరాత్రంతా ఏడ్చింది. ద్రౌపతీ వస్త్రాపహరణం గాథ పట్టు విన్నపుడు 'నా కోటప్ప ఆక్కడుంటేనా' అని నవ్వుకున్నది. యశోదమ్మ చల్లచేశేటప్పుడు బాలగోపాలకృష్ణుడు కవ్వము పట్టు

కొని వెన్న తినేవాడని చెప్పినపుడు ఈ జన్మకు లేదు ఆభాగ్య" మని కన్నులనీరు నించింది. కుచేలుని దారిద్ర్యవర్ణన వినలేకపోయింది. ప్రతి పురాణం పూర్తి అయినతర్వాత పెద్దన సమారాధనలు చేసింది అన్ని కులాలవాళ్లకు. ఇన్ని చేసినా ఆ హృదయంలో వున్న వెల్తికూడుకోలా!!

ఇంతలోకి వచ్చిపడ్డది అంకపొంకాలుగా సహాయ నిరాకరణోద్యమం. ఊళ్లోకి చిన్నలు పెద్దలు గాంధీ ముతావారు వక్కొక్కరుగా వచ్చి పోతున్నారు. ఉపన్యాసా లిస్తున్నారు. ఆడవాళ్లుకూడా రావచ్చు మీటింగులకంటే ఒక మీటింగుకు రామక్కకూడా వెళ్లింది. ఆ రాజకీయాలు రామక్క కేమి తెలియదు. కాని ఆ ఉపన్యాసకుడు (చెరుకువాడ నరసింహంగారు) దేశదారిద్ర్యాన్నిగూర్చి చిలవలు పలవలుగా చెప్పాడు. రామక్క ఆ దుర్భరదారిద్ర్యావస్థావర్ణనము వినలేక కండ్లనీరు పెట్టుకున్నది. 'కదురుకవ్వమాడితే కరువులేదు' అన్నమాట ఆమెకు మనసులో అచ్చుగుద్దినట్టు అతికిపోయింది. కవ్వము ఇదివరకే చేపట్టి తన దారిద్ర్యము బాపుకున్నది. ఇక కదురుచేపట్టి గ్రామదారిద్ర్యము బాపతలచుకున్నది. ముందుగా తా నొక రాట్నము చేయించింది. ఊళ్లోవున్న పురాతనపు ముసలమ్మ నొక నామె నాశ్రయించి నూలువడకడం నేర్చింది. శ్రద్ధగా తీరికగడియలలో నూలు వడికించి. మాల నేతగాడి కిచ్చి కమ్మెంముచీర నేయించుకున్నది. అది మొదలు ఆమె మళ్లీ నెల్లూరు పాలచంగాయ ధోవతులు కొనలేదు. స్వయంగా వడికిననూలు తోనే చీరలు నేయించి కట్టుకున్నది. ధోవతులు నేయించి లచ్చయ్య తద్దినంనాడు బ్రాహ్మల కిచ్చుకొన్నది. దుప్పట్లు నేయించుకొన్నది. నౌకర్లకు పండగలకు చాపులిచ్చే పద్ధతి మానేసింది. వాళ్లు తీరికవేళలో వడుకోమని చెప్పి రాటా లిచ్చింది. వాళ్లు వడికిన నూలు స్వంతకర్చుతోనే ఉంచి పెట్టింది. ఇంతేకాదు. ఒక చిన్నశాల ఏర్పాటు చేసింది. అందులో యాభై రాటాలు. వాటికి దగ్గ ఏకులు, కదుళ్లు, చెవులు, పంటెలు, ముక్కాలు పీటలు, ఏకులు, బుట్టలు అన్నీ ఏర్పాటుచేసింది. అనాధనని ఎవరువచ్చినా సరే వాళ్లచేత నూలు వడికించేది. ఆనూలు వడికినవాళ్లకు రెండుపూటలూ జొన్నసంకటి వండించి ఇన్ని మజ్జిగనీళ్లుపోసి కలిపించి తాగినన్ని పోయించేది. వక్కాకు యిచ్చేది. సాయంకాలము ఇంటికి పోయేటప్పుడు కిరసనాయిలు బుడ్డినిండా చమురు పోసియిచ్చేది. వాళ్లందరికి నులక మంచాలు చేయించి యిచ్చింది. సంవత్సరాని కొకసారి సంక్రాంతి పండుగకు రెండు జతల బట్టలిచ్చేది. పండగ పండగకు పరిబువ్వ, పరమాన్నము. అంగులో ఎవరైనా మంచమెక్కితే వాళ్లకు మందు, మాకు, పథ్యం, పానం, పిండిపంటలుతో భోజనం పెట్టేది. అన్నీ చూచేది. ఈ నూలంతా మాల మగ్గాలవాళ్లచేత నేయించేది. తాను వాడుకున్నన్ని వాడుకొనేది. బీదా సాదా వచ్చి అడిగితే ఊరికనో స్వల్పకరీదుకో ఇచ్చేది.

1923 సం॥లో కాబోలు సబుమ్యాజిస్ట్రేటుగారి కుమార్తె ప్రసవించింది. బారసాల కల్లుడు వచ్చాడు. పీటలమీద అల్లుడు కూతురూ కూర్చున్నారు. మామగారు అల్లుడికి శేలంఅంచు విదేశీపంచలు తెచ్చి చదివించాడు. అల్లుడు చేయిజాచలే. 'ఏమిటోయి' అన్నాడు మామ. ఏమున్నది. ఖద్దరుగాని పుచ్చుకోనన్నాడు అగడుగ్గాయ. మామ ఫరవాలేదు, పుచ్చుకో అన్నాడు. ఊహూ అన్నాడు అల్లుడు. ఇప్పటికి అభాస చేయకు, తర్వాత తెప్పించి యిస్తానన్నాడు మామ మెల్లిగా అల్లుడి చెవులో. 'ససేమిరా' అన్నాడు అల్లుడు. అల్లుడు తోపాటు కూతురూ నాకూ ఖద్దరు కావాలి అన్నది. సబ్ మ్యాజిస్ట్రేటుగారు పళ్లు కొరికాడు. తాను తిట్టుకున్నాడు. ఈ సంబంధమే కావాలని పట్టుబట్టిన

పెండ్లాని పై కేకలేశాడు. ఈయన మ్యాజిస్ట్రేటుగిరి ఇతరులవద్దగాని అల్లుడివద్దనా. అప్పుడు ఎక్కడ దొరుకుతుంది, ఎక్కడ దొరుకుతుంది ఖద్దరు అని కాళ్లు తొక్కుతున్నాడు. ఎవ్వరో చెప్తే రామక్క దగ్గరకు కబురంపాడు మ్యాజిస్ట్రీటు. ఆమె అవసరం కనిపెట్టి తనకోసం నేయించుకున్న కమ్మికోక, లచ్చయ్యబావ తద్దినంనాడు బ్రాహ్మడి కిత్తామని నేయించిన దోవతులచాపు పంపింది. వాటితో సమాప్తిచెందింది మ్యాజిస్ట్రీటుగారింట్లో బారసాల.

ఈవిధంగా తన బ్రతుకు సార్థకంచేసుకొని అక్షయ సం॥రము ముక్కోటి ఏకాదశినాడు హఠాత్తుగా లచ్చయ్యబావను పోయి కలుసుకొన్నది గేదెల రామక్క. ఎంత పుణ్యాత్మురాలని అందరు అన్నారు. ఆమె మరణాని కా గ్రామంలో దుఃఖించనివారు లేరు ఇక జిహ్వకు రుచిగలపెరుగు ఎవరు పోస్తారని అంగలార్చారు. చిన్నపిల్లల పట్టెడమెట్లా నని అంతా హాశలిపోయారు. లచ్చయ్యబావ పోయినతర్వాత రామక్క చచ్చిందీ బతికిందీ చూడని దాయాదులు వచ్చి ఆమె సంపాదించిన ఆస్తిఅంతా తీసుకున్నారు. ఆమె పెట్టిన రెండు సంస్థ లంతరించినవి. అంతా అమ్మి వాళ్లు డబ్బు చేసుకున్నారు. తెలిసినవాళ్లెవరైనా ఆమెకు చెప్పిఉంటే ఆ ఆస్తిఅంతా ఏ ధర్మకార్యానికన్నా ఇచ్చేదే రామక్క. ఏమైతేనేమి? మించిపోయింది.



## దైవభక్తి

శ్రీమతి చర్ల నగరాజకుమారిగారు

రాలకు మ్రొక్కినంతనె, పరాత్పరుఁడంచు నటంచునెంచి దే
వాలయమందు భక్తులయినంత, వనాంతరమందు పుట్టలన్
పాలను బోసినంత, నదిమధ్యమునందు మునింగినంత పా
పాలను బాసిపోదురె? కృపారహితాత్ములు, జారచోరులున్.

ఇమ్మహినర్థగర్వమున నెందరొ యౌవనమందు చాలనే
రమ్ములుచేసి తామిహపరమ్ముల ముక్తినిబొందగోరి, పా
పమ్ములువోవగా జపతపంబులుచేతురు, వృద్ధులైనకా
లమ్మున రామనామము విరామములేక జపింతురూరకన్.

సోదరులందరున్ గలిసి సొంపుగనుండిన వారితండ్రికిన్
మోదముగాదె చేతమున—భూప్రజకంతకు తండ్రియంచుదా
మోదరునెంచి చెప్పరెప్రబుద్ధులు—కావున తోటివారిన
త్యాదరమిచ్చి జూచునపు డార్తశరణ్యుడు సంతసింపడే?



" వృషభరాజాయతే నమః "

చిత్రకారిణి: సంఘం లక్ష్మీబాయమ్మ.



మిస్. సులంనా జిలాని

# భగినీ నివేదిత

శ్రీమతి యేర్లగడ్డ చిలకమ్మగారు

భగినీ నివేదిత ఐర్లండు నివాసియగు ఒక పాదరికొమరిత. తలిదండ్రు లీమెను "మార్గరెట్ నోబుల్" యని పిలచెడివారు. యీమె తలిదండ్రులు గొప్ప పరోపకార బుద్ధి గలవారు. కాన నేవాడ చిలుక యావాడ పలుకు పలుకునన్న చందంబున పరోపకారవంశమునకు చెందిన యీ విదుషీమణి పరోపకారబుద్ధి గలదగుట వంశసారమును నిరూపించుచున్నది.

ఒకానొకదినమున నోబుల్ తండ్రి యొక భారతీయ అతిథిని తన యింటికి రప్పించెను. ఆయతిథికి స్వయముగ వంటచేసి పంచభక్ష్య పరమాన్నములతో భోజనముపెట్టి యాతనిచే భారతదేశము స్థితిగతుల తెలిసికొనెను. భారతదేశము పరిస్థితులు వినిన వెంటనే యీమె హృదయములో మహత్తరమైన మార్పు గలిగినది. వెంటనే భారతదేశము పర్యటనముచేయవలెనని తలంచెను. నోబుల్ తండ్రి తన కొమరిత యాదర్శ భావములు తెలిసికొని యంత్యావస్థయందు తనభార్యతో నిట్లుచెప్పెను. "మన నోబుల్ భారతదేశ పర్యటనము చేయతలంచిన తప్పక నీవు నామెకు సహాయము చేయుము." అని.

పువ్వు పుట్టినవెంటనే పరిమళించుననునట్లు యీమె బాల్యావస్థనుండియు ఆదర్శ భావములుగలిగిన చురుకైనబాలిక. నోబుల్ తలిదండ్రులు గొప్ప విద్యావంతులు. కొద్ది దినములలో కొమరితను విద్యావంతురాలుగ తయారుచేసిరి. ఆమె విద్యావంతురాలై స్వజాతిలో విద్యాప్రచారముచేయ మొదలిడినది. ఆమె యాదర్శభావముల సంఘములో వెదజల్లెను.

స్వామీ వివేకానంద అమెరికాలో ధర్మోపదేశ మిచ్చునపుడు నోబుల్ యక్కడికేగి భారతదేశపరిస్థితులు తెలుసుకొనెను. జీవితమంతయు బీదల సేవజేయుటకై భారతదేశము వచ్చినది. యిక్కడ నామెను "భగినీ నివేదిత"యని నామంబిడి పిలువసాగిరి.

భారతదేశములో స్త్రీల దుస్థితి చూచిన వెంటనే ఆమె హృదయములో కత్తిపోటువలె గొప్ప విషాదము గలిగినది. జీవితమంతయు వారి దుస్థితి బాగుపరచవలెనని ప్రతినపట్టెను. కలకత్తాలో హిందూస్త్రీల తెరంగున వేషభాషలు గలిగియుండెను. మొదట కలకత్తాలోని కూపస్థమండూకము బోలె అజ్ఞానాంధకారమున నుండిన హిందూ సమాజము యీమెను యేవగింపుతో చూచినది. కాని యీమె పవిత్రఆచార వ్యవహారములు చూచిన వెంటనే కలకత్తాలోని జనులు ముగ్ధులయిరి. క్రమక్రమముగ భగినీ నివేదిత యెడల భక్తి శ్రద్ధలు మెండయ్యెను.

నివేదిత నివసించు గృహము చాల నసహ్యముగ నుండెను. యిది చూచి యింటివారిని నామె శుభ్రపరచవలయునని యడిగినది. కాని వారు యిండ్లను తుడుచు పాకీవారము గామని క్రుద్ధులై జవాబిచ్చిరి. వారి కర్ణకఠోరములైన మాటలువిని ఆమెయే

స్వహస్తములతో శుభ్రపరచినది. దీనివలన కలకత్తాలోని జనులు తమతమ గృహములు చక్కగ శుభ్రపరచుకొనిరి.

భారతదేశ స్త్రీలస్థితికిని నీమె పరిస్థితికిని చాలవ్యత్యాసముగలదు. భారతస్త్రీల జీవితములు స్వార్థపరత్వముతో గడచునవి. కాని యీామె గొప్ప స్వార్థత్యాగిని. యీామె కలకత్తాలో వున్నపుడు ఆపట్టణమంతయు ప్లేగు వ్యాపించినది. ఆయనారోగ్యస్థితిని జూచి స్వయముగ నాపట్టణము శుభ్రపరచెను. చాలా బీదజనుల సేవ యొనర్చినది. బీదలసేవకై యువకులతో కలసి సేవాసమితిని స్థాపించినది.

1907-లో "బాకర్‌గంజ్"యను దేశమందు గొప్పకరవు వచ్చినది. అక్కడి జనులకు తినతిండిలేక కట్టుగుడ్డలేక అన్నమో రామచంద్రాయని క్షుధార్తులై కేక లిడుచున్నయనాథులకు దేశభక్తులతో కలసి ఆమె చేసిన సహాయము వర్ణనాతీతము. వారికై యిల్లిల్లుతిరిగి భిక్షమెత్తినది. రోగపీడితులై మృత్యువాత బడనున్న జనులనెందరినేని సేవ యొనర్చి రక్షించినది. ఇట్లే ఆమె యెన్నియో కష్టముల సహించెను.

బెంగాలులో విధవల దుఃఖముల చూచిన వెంటనే ఆమె హృదయము చలించిపోయినది. వారి సహాయమునకై యొక ఆశ్రమము పెట్టినది. అక్కడ పాఠశాలపెట్టి చిన్నచిన్న పిల్లలలో కిండర్‌గార్టన్ పద్ధతిపై విద్యా ప్రచారముచేయ ప్రారంభించినది.

ఈ విదుషీమణి కవయిత్రి. నిండు సభలలో గంభీరముగ ఆదర్శ భావములను కిరణముల ప్రసరింప చేసెడిది. ఈమె వీరావేశభరితములైన మాటలువిని సభయందున్న జనులు నిశ్చేష్టులయ్యెడివారు. వారి హృదయములలో వీరత్వము ఒక్కసారిగ ప్రజ్వలించెడిది.

స్త్రీలయెడల తమ భర్తల పశువ్యవహారముల చూచి చాలదుఃఖించుచుండెడిది. ఈ తుచ్ఛస్త్రీజన్మ మెందుకా యని యీామె మనమున విచారించుచుండెడిది. ఆమె వినయముతో పురుషులకిట్లు బోధించెను. "సమాజములో స్త్రీ పురుషునికి సహాయకురాలు కాని దాసికాదు. పురుషుని చేతిలోని యిష్టమువచ్చినటుల యాడి పారవేయు యాటవస్తువుకాదు. అర్థాంగిఅను మొదలగు బిరుదులు నిచ్చుట స్త్రీలనుమోసపుచ్చుటకా? ప్రతివిషయమునందును స్త్రీ తన జన్మసిద్ధములైన యధికారములు పొందజాలదా?"

ఈ విదుషీమణిని చూచినపుడెల్ల విశ్వప్రేమ, దేశభక్తి, మొదలగు సద్భావములు మూర్తీభవించెనాయనునట్లు తోచెడిది. స్వభావము వెన్నవలెయతిమృదువైనది. జీవితమంతయు బ్రహ్మచారిణిగనుండి, భారతదేశము సేవచేసిన తల్లి. లండనులో జాతీయ సభ జరిగినపుడు, భారతదేశక్షేమముకై యొక నిబంధన వ్రాసి యాసభకు పంపిన క్షేమాభిలాషిణి. దేశసేవచేయుచుండగ యకస్మాత్తుగరోగముచే "డార్జిలింగ్" సమీపమున పర్వతముపై చిర విశ్రాంతి గైకొనెను.

# స్త్రీజన్మ ప్రశస్తమైనదే

శ్రీ సాధ్వీ రత్నమ్మగారు

పలువురు అనుకొనునటుల స్త్రీజన్మ మంచిది కాదు అని నిరుత్సాహపడవలదు. స్త్రీజన్మ ప్రశస్తమైనదే. మానవజాతిలో ఎందరో స్త్రీలు యోగినీలు, యతులు, వీరమాతలు అయి ప్రసిద్ధిగాంచిరి అని పెద్దలవల్ల వింటుము. యిప్పుడు అట్టి తల్లులను కొందరిని చూస్తూఉన్నాము. వారు యెవరందురా, పిచ్చమ్మగారు, లక్ష్మీదేవమ్మగారు, చిన్నమ్మగారు. వీరియొక్క బోధలు వింటూఉంటే యెల్ల కోరికలను సుఖములను తాపత్రయములను మరచి వారి మార్గమును అనుసరించుటకు యిచ్ఛా భక్తి వైరాగ్యములు కలుగునుగదా! స్త్రీలు మృదువైన స్వభావముగలవారు. ప్రేమరాసులును, ఆదరణమూర్తులును అయి ఉందురు. ఎక్కడనేని మతములకుగాని, సమాజములకుగాని, సాధువులకుగాని, యతులకుగాని ధర్మములిచ్చుటలోనైనను యింక యితర సత్కార్యములు చేయుటలోనైనను స్త్రీల సహాయములేనిది జరుగుట లేదు. ఏసుక్రీస్తు మతప్రబోధము చేయునప్పుడు వారిని పురుషులు చాల నిర్బంధనల పాలుచేసిరి. అప్పుడు ఇద్దరు స్త్రీలు చెరి ఒకవైపున నిలుచుండి వారిని కాపాడిరి. ఏసు భక్తిప్రబోధములను శిరసావహించి ఆచరించిరి. తామును వారి వెంటబోయి లోకములో ప్రచారము సాగించిరట. దేశసేవలు సాగించునప్పుడెల్ల స్త్రీల సహాయము లభించినప్పుడే విజయమునకు అవకాశము ఉండునని పెద్దలు చెప్పుచుందురు. శ్రీ వివేకానంద స్వాములవారు ఉపన్యాసము లిచ్చుచుండు కాలమున, న్యూయార్కు పట్టణమున అనూయచేత వారికి యేమో కీడుచేయ కొందరు ప్రయత్నించిరట. అప్పుడు ఒక దొరసాని శ్రీవారికి ఆ విషయమును ముందుగా తెలిపి, సాహసించి వెంటవెళ్లి ఆపదను గడపినది. శ్రీ స్వాములవారిమీద ఆ విరోధులుకూడా తుదకు చాలా భక్తిశ్రద్ధలు పూనునటుల చేసినది. ఆ దొరసానిగారే శ్రీవారి నంతగా పూజించుట జూచి, వారుకూడా స్వాములవారిని ఆశ్రయించి శ్రీవారికడ ఉపదేశములు సయితము పొందిరట! శ్రీరామకృష్ణ పరమహంసలవారి మహిమను శ్రీరాణి రాచమణీదేవిగారు మొట్టమొదట కనిపెట్టి వారియెడ మిగుల భక్తిభావముతో వర్తించెడిది. ఒకనాడు ఆరాణి శ్రీరామకృష్ణునివద్ద కూర్చుండి ఉన్నది. ఆమె మనస్సులోనికి యేదియో ఒక లౌకికవ్యాపారసంబంధమైన సంకల్పము వచ్చినదట. అప్పుడు శ్రీరామకృష్ణుడు రాణిగారి వీపున ఒకదెబ్బ వేసిరి. అంతట రాణిగారి వెంటనున్న సేవకులు శ్రీరామకృష్ణపరమహంసులవారిని కొట్టుటకు సిద్ధమైరి. వెంటనే రాణిగారు అది కనిపెట్టి "శ్రీవారి మహాత్మ్యము మీకు తెలియదు; వూరకయుండుడు" అని తన పరివారమును మదలించినది. తదుపరి వారు శాంతపడి శ్రీపరమహంసలవారికి నమస్కారములు చేసిరి. మహాత్ముల తత్వమును స్త్రీలు గ్రహించునంత సులభముగా పురుషులు గ్రహించలేరు. స్త్రీ స్వభావమున అట్టి కౌశలము కలదు. శ్రీ గాంధీగారు భగవంతుని మహాత్మ్యమును తెలిసి, వానిలో ఐక్యతపడవలెనన్న తనకు స్త్రీభావము రావలసియుండునని పలికిరట. పురుషుడు అహంకరించి కర్తృత్వము వహించును. స్త్రీ కర్తృత్వము పూనక ఎల్లప్పుడును ఒకరికి సేవచేయుచుండ కోరును. అందుచేత ఆమెకు అహంకారము ఉండదు. పురుషునందు సేవాభిలాష అంతగాయుండదు. మనస్సు వంగిరాదు. పురుషునందు అహంకారము మెండుగానుండును. అహంకారము యెక్కడయుండునో అక్కడ ప్రేమయుండజాలదు" అని శ్రీ గాంధీగారు చెప్పియున్నారు. కొంతమంది సాధువులు, భక్తులు, స్త్రీలవలె బట్టలను కట్టుట, వారి సాంగత్యమున తిరుగుట అవలంబించుచున్నారు. ఎందుకనగా స్త్రీల జీవితములు, సాధ

నలు, నడతలు చక్కగా గ్రహించి సేవాభావమును అలవాటు చుకొనుకొరకే వారి సాంగత్యము చేయుట. సేవ మంచి తరుణోపాయము.

సోదరీమణులారా! ఇందులో ఒక రహస్యమున్నది. మనను గాంధీగారే మెచ్చుకొనిరి గదా; మనకేమి కొదువ? అని స్త్రీలము గర్వించుట తగదు. అందులోని సూత్రమును కనుగొని, అది సార్థకము అగునటుల మనము యేమి చేయవలసియుండును అని జిజ్ఞాసాపరులము కావలయును. నేను చెప్పిన స్త్రీలకల్ల స్త్రీ సంఘమునకు గణ్యత ఎట్లు వచ్చినదో, ఆ స్త్రీలు యేమిచేసిరో, పరతత్వము సాధించుటకై వారు ఎంత పాటుపడిరో, ఎన్ని కష్టములకు ఓర్చిరో, మనము బాగుగా గమనింపవలసియుండును. సద్విషయములను శ్రవణమువలన విని, మననము చేసి, ఆచరించవలయును. ఆ స్త్రీరత్నములు ఇంద్రియ సౌఖ్యములను కోరలేదు. దేహశృంగారముకొరకు నగలు, నాణెములు కోరలేదు. యెల్లప్పుడును తమ భర్తల ధర్మమును తమ ధర్మమును అభేదముగా తలంచి దానిని కాపాడుటే తమ జీవనగమ్యముగా పెట్టుకొనిరి. వారికిని దుఃఖములు వచ్చినవి; కష్టములు కలిగినవి. వారును ఆరాటములపాలైరి. కాని తమ ధర్మములను కాపాడుకొనగలరో లేదో అను విషయమును గురించి తప్ప ఇంక యితర విషయముల గురించి వారు దుఃఖించలేదు. హరిశ్చంద్రుని యెడ బాయునప్పుడు వాని భార్య ఏడ్చినమాట నిజమే. అతడును శోకించినాడు. ఎందుకో తెలియునా? భార్యా భర్తలు కౌగిలించుకొని ఏడ్చుట తెలిసి, వారు ఒకరికొకరు కనుపించకుండా పోవుచున్నందుకు దుఃఖించిరని మూఢులము అనుకొనెదము. అది సరికాదు. భర్త సత్యము తప్పకుండా ఎట్లు ప్రతినను కాపాడుకొనగలడో అని చంద్రమతియూ, ఆమె తన పాతివ్రత్యధర్మమును కాపాడుకొనుటలో ఎన్ని కష్టములు పడవలసివచ్చునో గదా అని హరిశ్చంద్రుడును, అట్టియెడ తాము ఒకరికొకరు సాయపడజాలము గదాయని యిరువురును దుఃఖించిరి. ఇంతే గాని ఐహికచింతలతో గాదు; ఇది మనము మరువ గూడని సత్యము.

కాబట్టి మనము యిహసుఖములకై ఆరాటపడరాదు. భర్త ధర్మమును కాపాడుట, తన ధర్మమును కాపాడుకొనుట, బిడ్డలకు ధర్మబోధలు చేయుట, అతిథి అభ్యాగతులను శక్తికొలది సేవించుట, సాధువులను పోషించుట, మిగిలిన కాలమందు తన మనస్సును పరిశోధనము చేసుకొనుట ఉత్తమస్త్రీకి విధి. మనస్సు మంచి విషయములలో సంచరించునా లేక ధర్మముతప్పి నడుచుచున్నదా అని ఏకాంతమున కూర్చుండి చింతచేయవలయును. ఇది అంతయు భగవంతుని అనుగ్రహమువలన నెరవేరవలసియున్నది. వానియొక్క కృపలేనిచో మనము ఏ ధర్మమును నెరవేర్చలేము. "ఓ భగవంతుడా! నా మనస్సే మాలిన్యముచేత ఎప్పుడు తప్పుడుదారికి పోవునో నాకు తెలియదు. నన్ను రక్షించు భారము నీదే తండ్రీ!" అని ధ్యానము చేయవలయును. అటుల చేసినయెడల స్త్రీలకు యే యాటంకములును ఉండవు. "ఇంటిలోనుండి బయటికి వెళ్లనివ్వరు గదా. మాకు పెద్దల సేవ యెట్లు దొరుకును? వేదాంతశ్రవణము మాకు ఇంటిలో యెవరు చేయుంచుదురు? మాకు ధర్మములను ఇండ్లలో యెవరును విపులముగా బోధించరు గదా! ఆ శ్రవణము ఎట్లు దొరుకును? ధర్మసందేహములు ఎట్లు తీరును? హరిశ్చంద్రుడు సత్యధర్మముల కొరకై యెన్ని కష్టములు పడినను ఆ ధర్మమును వదలలేదు అని పెద్దలు సాదృశ్యములు చెప్పుదురే. మా భర్తలకు అంతటి ధర్మనిరతి కలుగగలదా? వారికి వేదాంతమంటే తలనొప్పి వేదాంతులనిన అంతకన్నా ద్వేషము! మేమే తోచినంతవరకు ధర్మముగా నడుచుకొందమంటే, తమకు హితవుగా నడవవలయునని మమ్ముల నిర్బంధింతురు. మగవారు తమకు తెలియని ధర్మములు స్త్రీలకు ఎట్లు తెలియవచ్చినవి? అని శంకింతురు. వేదాంతులవద్దకు పెద్దలవద్దకు స్త్రీలు వెళ్లుట తెలిసినచో మేము చెప్పినట్లు విందురా? లేక యెవరో సాధువులు చెప్పిన

మాట విందురా? అని గద్దింతురు. అప్పుడు మేము యేమి చేయవలసియుండును?" అనుచు స్త్రీలు ప్రశ్నించుదురు.

అనవసరముగా తిరుగకూడదనియే పెద్దలును చెప్పుచున్నారు. పతివ్రతలైన స్త్రీలును నిర్బంధములులేని స్త్రీలనుకూడా అవసరము ఉంటేనే తప్ప యెక్కడకును వెళ్లకూడదు. పురుషు లున్నచోట నిర్లక్ష్యముగా తిరుగరాదు. భక్తి జ్ఞాన వైరాగ్యములను, నిర్మలశీలమును, నేర్పు స్థలములకు పురుషులు వెంటనున్నను లేకున్నను స్త్రీలును లేకపోయినను, ఆ అవసరమునుబట్టియు, వీలునుబట్టియు వెళ్లవచ్చును. అట్టివారికి విఘ్నములేమియు ఉండవు. పెద్ద పెద్ద సభలకును వెళ్లవచ్చును. నిర్భయముగా సాధువుల సేవించవచ్చును. కాని మన దృష్టిని చలించనివ్వకుండ, వృథాగా పోనివ్వకుండా, వర్తించవలయును. యెక్కువమంది జనము ఉండు తావుల యందు యేదియో అనిష్టములు కొన్ని రావచ్చును.

అట్టివాటిని అన్నిటిని ఓర్చుకొనవలయును. ఇంకొక విషయము మరువరాదు. లోకములో అనగా మనలో మంచి చెడు అను రెండును ఉన్నవి. అటులనే సాధువులలోను మంచివారు-చెడువారు, మేలు చేయువారు-మోసము చేయువారు ఉంటున్నారు; కనుక మన పురుషులు జడియుటకు కారణము కొంత కలదు. కొందరు విషయము తెలియకపోవుటచే తత్తరపాటుపడుదురు; స్త్రీలును అటులనే కొందరు మఠములకు వస్తూఉంటే మనము చూచుటలేదా! వారు బెదరు బెదరు చూపులతో వస్తారు. యెవరైన యెరిగినవారు కనబడితే యింటివద్ద చాటున పోయినట్లు భజనలలోనుండి పూజలలోనుండి లేచి పోతారు. ఎందులకు? అవ్యక్తమగు సంశయాలు పెట్టుకొని గదా దేవునిపూజ జరుగుచోట, పరమార్థ విషయములు వినునప్పుడు, ధర్మప్రచారములందు అటుల చాటులకు పరుగెత్తుట ఎందుకు? యీ అలవాటును క్రమేణా తప్పించుకొనవలయును. ఇంకొక సంగతి. స్త్రీలు స్వల్పవిషయములకు తగవులాడుకొందురు. ఇండ్లవద్ద జరిగే సంసారపు ముచ్చటలు చెప్పుకొందురు. ఉద్రేకములు పూని అల్లరిచేయుదురు. ఇట్టిదానిని కనిపెట్టిన పురుషులు "అదిగో స్త్రీలలో గోలపుట్టినది; వారిలో అల్లరిసాగినది. మనము పోయి ఆపినగాని ఆపద తొలగదు" అనుకొనుచుండుట మనము యెరుగుదుము. యీవిషయమునను స్త్రీలు జాగరూకతతో మెలగవలయును. భక్తిచేయుపట్లను స్త్రీలకు ఉద్రేకము, ఆవేశము మెండు. యెట్టి సాధువులకు పాదవందనములు చేయవలయును? యెట్టివారికి పండ్లు, కానుకలు యివ్వవలయును? అను విచక్షణచేయరు. చాలా పొరబాట్లు పడుచుంద్రు. అందువలన వివేకవతులగు స్త్రీలకుకూడా నిర్బంధములు వాటిలుచున్నవి. కావున మనము ఉత్తములగు నారీమణులు ఎటుల వర్తింతురో కనిపెట్టుచు వారిని అనుకరించుచుండవలయును.

నేను మొదట పేర్కొనిన యోగినులు యెటుల నడుచుకొనిరో, యిప్పుడు ఎట్టి స్థితియందు ఉండిరో, బాగుగా గ్రహించి మీరు నడుచుకొనినయెడల మీరు మఠములకు వచ్చిన లాభము! పెద్దలకు సేవచేసిన సార్థకతను పడయగలుగుదురు. యింతకును నేను వినయపూర్వకముగా మిమ్ములగురించి చెప్పునది యేమన, స్త్రీసంఘముమీద దయఉంచి అయినను మీరు మెలకువతో సక్రమముగా నడుచుకొనవలయును. సోదరీమణులారా, పైనచెప్పిన తల్లులవంటి స్త్రీలు వుండబట్టియే సుమీ, గాంధీగారు తమకు స్త్రీ గుణములు రావలెనని కోరుకొనిరి! స్వల్పమైన గుణముల గల స్త్రీలనుబట్టి కాదు. మనము మిగుల జాగరూకులమై నడచుకొనుము, స్త్రీ సంఘమునకు ఎట్టి అపఖ్యాతియు వాటిలకుండ రక్షించుమని భగవంతుని ప్రార్థనచేయుదముగాక. ఇదియే నా మనవి.

శాంతిః శాంతిః శాంతిః

# గానకళ

—మా దేవి.

సంగీతమును గురించిన సమగ్రమగు వివరణము మాబోటివారికి చాల దుర్లభము. తెలిసినంతవరకు వివరించుట నావిధి. సంగీతము స్త్రీలపాలిటి సొమ్ము. ఇతరవిద్యల నేర్చుటందు భారతయువతీమణులకు స్వాతంత్ర్యములేదు. ఈవిద్యవిషయమం దెటులనో కాని మనపెద్దలు కొంతలో కొంతవరకుదారులైరి. ఈ విద్యనుగూడ భోగంవిద్య యని వెక్కిరించువారు లేకపోలేదు.

ఏదియేమైనను సంగీతకళా ప్రావీణ్యమందు స్త్రీలే యతి సమర్థులు. వీరి కంఠములుగూడ గానమున కనుగతమై యొప్పారు. సునిశితమును, సుస్వరమును, గల కంఠముతో పాడునపుడేగదా శ్రోతలకు హాయిగా నుండును. అన్నివిధముల పరతంత్రులగు స్త్రీలు సంగీతమునే యాధారపరచికొని విశాలప్రపంచమునకు రాగలుగుచున్నారు. కాని దీనికి సరియగు గౌరవమన్ననలు, ప్రజాబాహుళ్యమందును, బాధ్యతగల ప్రభుత్వమందును కానరావు. ఇందుచేతనె యీదు పూర్తిగా నారితేరినవారు సైతము గౌరవజీవితమును గడుపజాలకున్నారు. ఇపుడున్న విశ్వకళాపరిషత్తులు దక్షిణకళల పోషించుచుండిరి. యీకళాదౌర్భాగ్య మేమోకాని వెలివేసినటుల దీనిని విశ్వకళాపరిషత్తుల పొంతకే రానీయకుండిరి. అంతవరకుపోనేల? స్త్రీలకుప్రత్యేకించిన తాలూకాబోర్డు గరల్సు స్కూళ్లలో కాని, హైస్కూళ్లలో కాని దీని విలు వావంతయు కానరాకున్నది. ఇందుచేతనెగదా ఇంత నాగరికతా ప్రపంచమందు గూడ సదసద్వివేకము కలవారును, గానకళా ప్రవీణులునగు వనితామణు లనేకులు పరతంత్రులై దుర్భరదుఃఖభూయిష్ఠమగు జీవితమును గడుపవలసివచ్చినది. ఇతర విద్యల పొంతకే పోవుట నోచుకొనని యీస్త్రీలోకమునకు ప్రసాదించిన సంగీతమునకైనను, యితర విద్యలతోటి యర్హమగు స్థానమీయ రెందులకో? మహిళాలోకమంతయు సంగీత విద్య కర్హమగు స్థానమును కల్పించి తద్ద్వారా స్త్రీలోకము నుద్ధరింప ప్రయత్నించుగాత.

ఇట్టి యౌదాసీన్యము మరొకవిద్యకు తటస్థించుచో నెట్టిగతి కానవచ్చెడిదో గదా! సంగీతము సొగసైనవిద్య గనుకనే యాదరమింతదనుక లేకనె యింతకాలము మనగలిగెను. ఈ కళయంతటి హృద్యమైనదియు, సచ్చారిత్రకమైనదియు మరొండుకళ గాన్పింపదు. ఈ విషయ మెరుంగలేక సామాన్యలోకము నిరాదరణ జూపెదరు. ఇక పైన యీవిద్యాప్రాభవమును గురించి విచారింతము.

ముఖ్యముగా సంగీతమునగల మహాశక్తి యీశ్వరునియం దనురాగ భావముల నుద్బోధించుటయే యయియున్నది. దీని చమత్కృతిచేతనేగదా శ్రీకృష్ణభగవానులు పశువుల సైతము తన దరిజేర్చుకొని తరింపజేసెను. పాములవంటి విషజంతువులుగూడ గానకళాప్రవీణుడగు పాములవాడికి నాగస్వరముద్వారా లోబడుచున్నవి. పోయెడి

పక్షులను నిలబెట్టుచున్నారు. పాషాణములను కరగించుచున్నారు. నీటిని పాషాణమయముగా మార్చుచున్నారు. ఇట్టి మహాశక్తి సంగీతములో గలదు. ఇంత హృదయాకర్షకమగు విద్య గనుకనే ప్రతిశుభకార్యమందు నీ కళానైపుణ్యము వాయిద్యముల ద్వారా కాననగును. యుద్ధసమయములందు భేరీ, పటహా, డిండిమ దుందుభులు వర్ణనాతీతములు. శత్రువులకు తనప్రాణముల నర్పించుటకు వెరువనంతటి ధైర్యసాహసముల, త్యాగశక్తి, దేశోద్ధరణదీక్ష మున్నగువాని కలుగజేయున దీ సంగీతమే గదా?

మరియు నాగస్వరము, సనాయి, హార్మోనియా, వీణ, తంబుర, పిడేలు, జలతరంగిణి, పియానా, పిల్లనగ్రోవు, వేణు మున్నగు మెత్తని వాద్యములపై చూపు సంగీత మహత్తును కాననగుచో నెవని హృదయము నీరుగాకుండును? చల్లని వెన్నెలవంటి నాద మెంత సుఖతరమై యొప్పునో చవిజూచిన ప్రతివానికి తెలిసియుండును. ప్రకృతిలోనుండు వస్తుతత్వముల మార్పుచేయు శక్తి యీ సంగీతమునందే గలదు. కనుకనె వివాహాది శుభకార్యములం దీ విద్య నుపయోగించి వధూవరుల హృదయముల కరగించి యేక హృదయముగా తయారుజేయుదురు. మరి దంపతులు విడిపోవుటకు హిందూదేశమున తా వెక్కడిది. ఇంత గానకళా ప్రాశస్త్యమున్నది గనుకనె యితర దేశములందువలె మన దేశమందు విడాకులచట్ట మనవసరమాయెను.

మరియు వేదాంతమునకు సంగీతమునకు సంబంధము మెండు. నాదోపాసన ప్రణవ విజృంభణమే కావున నాదమునకు పరబ్రహ్మమునకు భేదము గాన్పింపదు. ఇటుల పరమాత్మానుభావముల కల్పించి మోక్షప్రాప్తిని కలుగజేయును. కనుకనె మతకర్తలు, మహాభక్తులు, పరబ్రహ్మ సన్నిధికి జనుట కుపకరించు ధ్యానసమాధిలో గూడ సంగీతమును నొక ప్రధానాంగముగా నుపయోగించిరి. కారణమేమనగా: మనోవైకల్యముల తొలగించి చిత్తైకాగ్రతను ప్రసాదించున దీసంగీత మొక్కటియే. కనుకనే రామానుజాది మతప్రవర్తకులేమి, చైతన్య తులసీదాస, వీరబ్రహ్మలు మున్నగు తత్వవేత్తలేమి, త్యాగరాజు, రామదాసు మున్నగు మహాభక్తవరులేమి, గానమునె యాధారపరచుకొని తమతమ మతానుసారముగా ప్రచారమొనర్చి ముక్తిబొందిరి. జయదేవుడు సంగీతవిద్యాకౌశల్యముచేతనె గదా గీతగోవిందమువంటి యుత్కృష్ట గ్రంథము రచింపగలిగెను.

సంగీతమునం దింత ప్రాభవమున్నది గనుకనె నానక్ మున్నగు సిక్కు మతస్థాపకులు సంగీతము ప్రధానాంగముగానున్న భజనసమాజముల నేర్పరచిరి. ఆ భజనకూటముల ననుసరించియే గదా రామభజన, కృష్ణభజన, విఠల్ భజన మున్నగునవన్నియు చెలరేగి సామాన్య మానవుల హృదయము చూరగొనుచున్నారు.

ఇక నీపై సంగీతాంగంబగు స్వరాది క్రమం బెరుంగునది. పరబ్రహ్మ స్వరూపం

బగు "ఓం"కారమునుండియే స్వర ముద్భ వించినటుల పెద్దలు నిశ్చయించిరి. ఓంకార మందున్న ప్రణవమే సంగీతమగును.

ఈ ప్రణవమె బాగుగా విజృంభించి నపుడే స-రి-గ-మ-ప-ద-ని అని సప్తాక్షరి జనించి శృతిస్థానముల ననుసరించి రాగోత్పత్తి యయ్యెను.

మరియు నీ రాగములకు నియమితవేళలు గలవు. నియమితసమయములందు బాడుచో బాగుగా రాణించునని ప్రాక్తనుల యభి ప్రాయమైయుండును. మేఘరంజని మధ్యాహ్నమందును, భూపాలరాగము ప్రాతఃకాల మందును, వసంతరాగము పరాహ్ణమందును, నభ్యసించుచో బాగుగా నలవడును. ఆయారాగముల కాయావేళ లుత్తేజకము లుగానుండును.

మరియు రాగములకు నామములను స్వభావానుగతముగానె యేర్పరచిరి. సారంగ పాడి సారంగముల స్వాధీనపరచుకో వచ్చు ననియు, మేఘరంజని పాడి మేఘముల వర్షింపజేయవచ్చుననియు, శాస్త్రమున చెప్పబడియున్నది.

పైన బేర్కొనబడిన విశేషములన్నియు యథార్థములై యుండనోపు. కారణమేమ నగా "వాట్యువ్యాగన్" యను దొరసాని "యీడోఫోను" యను యంత్రమువలన తాను పాడిన పాటనంతయు ఆయా స్వర జనితములగు రూపములుగా తయారుజేసి ప్రత్యక్షముగా గన్పరచెను. ఇదియే నిజమగుచో మన ప్రాచీనులు కళానైపుణ్యముచే వస్తుస్వరూపంబుల ద్రవింపజేయుటయు, ద్రవస్వరూపముల పాషాణములగా మార్చుటయు నపూర్వములు కాకపో వచ్చును. రూపములేనివానికి రూపోత్పత్తి గలుగజేయునది సంగీతమని యొప్పుకొనక తప్పదు. కనుకనె గదా చైతన్యాది మహాభక్తులు సంగీతముద్వారా స్వరూపరహితుడగు భగవంతుని ప్రత్యక్షము జేసుకొనిరి.

మరియు సంగీత శాస్త్రజ్ఞులగు నారదాదులు రాళ్లను కరగించుటయు, నీటిని రాళ్లుగా తయారుజేయుటయు వాస్తవమైయుండును. సంగీతమం దింతటి మహామహిమయున్నది కనుకనె ప్రతిజీవియు దీనియందున్న మాధుర్యమును చవిజూడ సమర్థమైయున్నది. కనుకనె కృష్ణభగవానులు "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గాన రసంఫణిః" అని నిరాఘాటముగా వాక్రుచ్చిరి.

ఇకను గ్రామవిభాగ స్వరూపముల విచారింతము.

కొంతమంది కలసి యొక కుటుంబ మెటులగునో, కొన్ని కుటుంబములు కలసి యొక గ్రామ మెటులగునో యటులనె స్వరమూర్ఛనకును, మూర్ఛనాపరంపరాజనితములగు మేళముల కారకమగు స్వరసముదాయమే గ్రామమనంబడును. ఇది గ్రామస్వరూపము.

గ్రామమందు మూడు భేదములు గలవు. షడ్జ, మధ్యమ, గాంధార గ్రామములని, అందు షడ్జగ్రామమును గురించి యాలోచింతము. శృతులన్నిటిలో బ్రధానమైనదియు, నాదియైనదియు, షడ్జస్వరము నారంభించినదగుటను, షడ్జగ్రామమునకు బ్రధాన



మిస్. సులోచన

స్థాన మొసంగిరి. మరియు సంవాది స్వర బహుళము నీ గ్రామమున విశేషమగుటచే దీనికి ప్రాముఖ్య మేర్పడినదనుటలో నావంతయు సందియములేదు.

తదుపరి ద్వితీయస్థాన మలంకరించునది మధ్యమ గ్రామము. షడ్జముతో సంవాది స్వరమై దానినె పురస్కరించుకొనియుండుట చేతను, సప్తస్వరములలో చతుర్థస్వరమగుట చేతను, మధ్యమగ్రామమని సార్థకనామము గలిగెను.

"ఏతత్కులప్రసూతత్వాత్ గాంధారోప్యగ్రజేదివి" అని రత్నాకరసూక్తిచేతను షడ్జమధ్యమ పరస్పరసంబంధమువలెనే షడ్జ గాంధార పరస్పర సంబంధము సంవాది స్వరభావము కలదగుటచేతను, గాంధార గ్రామ మేర్పడెను.

ఈ సందర్భమున పంచమముగూడ షడ్జము పురస్సరించుకొనిన సంవాదిస్వరమే గదా? దానికి గ్రామాధికారము లేకుండుటకు గతంచేమి? యనగా సామాన్యముగా మానవశారీరమున రెండున్నర స్థాయిలకంటె నెక్కుడు పలుకుట కవకాశముండదు. కనుక షడ్జమునకు మిక్కిలి దూరమగుచో రెండున్నర స్థాయిలకంటె పైకి పోవలసివచ్చును. అపుడు రసాభాస తప్పదు. అందుచే పంచమమునకు గ్రామాధికారములేదు.

ఋషభనిషాదములు రెండును షడ్జమునకు దగ్గరనున్న స్వరములైనను, సంవాది స్వరములు కావు. పైగా వివాదిస్వరములై గూడయున్నవి. అందుచే వీనికిగూడ గ్రామాధికారములేదు. మరియు దైవతము షడ్జమునకు దూరస్థము, వివాదిస్వరమగుటచే గ్రామ మొప్పుకొనలేదు. కనుక షడ్జ మధ్యమ, గాంధార గ్రామములని గ్రామ త్రయవిభాగమే యుచితము.

మరియు గానోపయోగమునకై గ్రామ త్రయమునకును, సమయముల నేర్పరచిరి.

నీ గ్రామత్రయమునకు క్రమముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లధిదేవతలనియు, హేమంత, గ్రీష్మ, వర్షర్తువులందును, పూర్వాహ్న, మధ్యాహ్న పరాహ్నములందును యథాక్రమంబుగా గ్రామత్రయము నుపయోగింపనగును.

—:o:—

## కుమారీ హితబోధ

శ్రీమతి మిరియప్పల్లి నరసమాంబగారు

సీ॥ విభుబాయలేక దుర్విపినంబులను పలుకష్టముల్ పడు సీతకాంతగతిని
ధవుబాయలేక నుద్దండాటవులయాప దాళిగాంచిన దమయంతిమాడ్కి
పతిబాయలేక దుర్భరకాననంబుల తాపముల్ పొందు చంద్రమతిభంగి
మగనిబాయగలేక మహదరణ్యములలో శ్రమలొందు సావిత్రిసతివిధమున
మరి యరుంధతియల సక్కుబాయియాది సాధ్విగణములరీతి కష్టములనోర్చి
భర్తయే దైవమంచు నెమ్మదిదలంచి తారచంద్రార్కులున్నంత దనుకనధిక
విమలకీర్తిగడించుమా వేగుమారి.

# 'స్త్రీ కన్నీరు'

(శ్రీమతి తాడి నాగమ్మగారు)

'నిషేధింపబడిన మేలు కీళ్ళు తెలిపెడి వృక్షము యొక్క పండు తాను తిని తనభర్తకు తినిపించుట చేతనే పాపము లోకములోనికి ప్రవేశించినది. అందుచేతనే లోకమున కింత శ్రమ, మానవుల కింత కష్టము కలుగుచున్నది. లేనియెడల మానవజీవితము ననాయాసముగానె గడచిపోవును. దీనికంతను స్త్రీయే మూలకారణము' ఇది క్రీస్తువుల ధోరణి.

మహమ్మదీయుల ధోరణికూడ రవంత భేదముకో దానినే యంగీకరించును.

'రామ రావణ యుద్ధమునకు కారణము సీత. రామవనవాసమునకు కారణము కైక. కైకయొక్క దుర్బుద్ధికి కారణము మందర. ఇట్టి స్త్రీసముదాయమువలన రామాయణగాథ పెరుగుటయు తద్యుద్ధమూలముగ మానవమండలి విరుగుటయు కలిగెను.

భారతయుద్ధమునకు మూలకారణము ద్రౌపతి నవ్వు. కీచకవధకు, కౌరవుల వినాశనమునకు, కౌంతేయుల విజయమునకు కారణము స్త్రీ. బాణాసుర భంగమునకు, దైత్యుల దారుణమరణములకు కారణము స్త్రీ.

కనోజీ ఢిల్లీరాజుల వైరమునకు, పృథ్వీజయచంద్రుల విరోధవినాశములకు కారణము రాణీ సంయుక్త. చిత్తూరు ముట్టడికి రాజపుత్రవినాశమునకు కారణము స్త్రీ !! ఇది కొందరి హైందవుల ధోరణి.

'హీబ్రూ వీరుడైన సేమ్సన్ నాశనమునకు పిలిస్టైను స్త్రీకారణము. బైబిలు వీరుడైన 'జాన్ దిబాప్టిష్టు' మరణకారణము స్త్రీ. రోమను చక్రాధిపత్యము వహించిన వెంటనే నశించుటకు ఈజిప్టు రాణియగు 'క్లియోపట్రా' కారణము. పరాసు విప్లవమునకు విపరీతకారణములలో నొకటి పరాసు రాణియగు విదేశపు స్త్రీ. గత మహాసంగ్రామకారణములో నొకటి యగు యువరాజ దంపతులహత్యలలో స్త్రీహత్య యొకటి. నేడు షెషన్సు, హైకోర్టులలో విచారించబడు కూనీకేసులలో నూటికి తొంబదికేసులకు స్త్రీలే కారకురాండ్రు; ఇది కొందరి నాగరికుల ధోరణి. మానవజీవితమునందలి చిత్రవిచిత్రములైన సంఘట్టనలను చక్కగ చిత్రించిన వారిలో షేక్స్పియరు గొప్పవాడని లోకప్రతీతి.

మరదిపై నుండెడు మోహముచే భర్తను మరదిచే చంపించి వెంటనే యాతని పెండ్లియాడి గతించిన పతికై ఇనుమంతయు చింతించక సుఖించుచున్న తన తల్లియొక్క వింత ప్రవర్తన మాచి యామె దోషమును గనిపెట్టి, అంతగా తన తండ్రిని ప్రేమించిన తన తల్లియె యట్టి కార్యమున కొడిగట్టినపుడు ప్రపంచమున మరియే యితర స్త్రీని నమ్మగల ననెడి నిరాశాసముద్రమునబడి హేమలట్ "వ్యభిచారమా నీపేరే స్త్రీ" (Frailty Thy name is woman) అని స్త్రీజాతినంతయు నిందించినాడు. షేక్స్పియరు చిత్రించిన మానవస్వభావములలో నిదియొకటి. ఇది పశ్చిమ మేధావుల స్వభావము గావచ్చు.

"పరుడు చక్కనైన వజ్రాలగనియైన
తళుకుబెళుకువంటి తత్వమున్న
అన్య పురుషవాంఛ ఆడుదానికి నుండు"
..................................నని

వేమన స్త్రీలోకముపై నొక నిందమోపినాడు. ఇది తూర్పుదేశముల అభిప్రాయము గావచ్చును. యుగయుగములనుండియు పురుషుడు వింతస్వభావములను కలిగియున్నాడు. తాను సృష్టికి రాజు. చరాచర ప్రపంచమునకు అధిపతి. అన్నియు తన సుఖముకొరకే కలవు. గ్రహించుటకు నిగ్రహించుటకు తనకే యధికారము గలదు. భోగమునకై తాననుభవించెడి వస్తువులలో స్త్రీయొకటి. స్త్రీ కేవలము

పురుషుని సంతోషపరచుటకే గలదు. పురుషుడు లేకుంటె స్త్రీకి జీవమే లేదు. తలయే లేదు. భక్తి స్త్రీకి చాల యవసరము. పతిభక్తి బోధించుటకై స్త్రీలకు ప్రత్యేకశాస్త్రములు పెక్కులు కల్పించ బడినవి. కథలు సృష్టింపబడినవి. పతియెంత దుష్టుడైనను ద్రోహియైనను సతి యాతని దైవమువలె యారాధించవలెనని ఆ యా శాస్త్రములయొక్కయు సారాంశము. పురుషుడు స్వేచ్ఛావిహారి. తన యొక్క యప్రవర్తనను స్త్రీ ప్రశ్నించకూడదు. అట్లుప్రశ్నించుట పతిభక్తికి లోపము.

సంకుచితమైనట్టియు స్వార్థమైనట్టియు ఇట్టి స్వభావమును కలిగియుంటను కారణము పురుషుని దండించు దాతగాని మర్దించు మామగాని లేకపోవుటయె.

షేక్స్పీయరు, కవి గావచ్చును; పండితుడు గావచ్చును. మానవజీవితయాత్రా సందర్భమైన సంఘటనలను చిత్రించుటయందు దారితేరిన దిట్ట గావచ్చును. గాని తనసుఖమే ప్రపంచసుఖము, తనస్వేచ్ఛయే ప్రపంచస్వేచ్ఛ యని నమ్మి విచ్చలవిడిగ నిరంకుశముగ ప్రవర్తించు పురుషప్రేరేపణముచే హేమలట్ తల్లియందు కలిగిన విచిత్ర సంఘటనను పురస్కరించుకొని స్త్రీజాతినంతయు దూషించుటకు షేక్స్పీయరునకు అధికారములేదు. అతనికే కాదు. మానవమండలియందే వ్యక్తికిని లేదు. మన విషయమునందు కూడ అంతే. స్త్రీ తప్పుచేసినదనిన అట్లు చేయుటకు తనలో భాగస్థుడైన పురుషు డుండవలయును. ఐనను తప్పుమాత్రము స్త్రీది. ఇది మానవుల దౌర్భాగ్యపు టూహ దప్ప వేరుగాదు. Frailty Thy name is woman' అని తేలికగా ననవచ్చును. Frailty Thy name is man అను సముదాయము లేకుండ స్త్రీ వ్యభిచారి కానేరదు. తప్పుచేయుట యందు భాగస్థు లిరువురు గలరు !! నిందమాత్ర మొకరిమీద నే. హేమలట్ తన పినతండ్రి యొక్క ప్రవర్తన నవలోకించుచు తన తండ్రియొక్క తమ్ముడైయుండియు అత డట్లుచేయుట యధర్మమని తలంచి Frailty Thy name is man' అని పురుష జాతిని కూడ నిందించియుండవలసినది. గాని అది ఆకథవ్రాసిన షేక్స్పీయరు పురుషుడై యుండుటయె అట్లు తిట్టకుండుటకు కారణము. దుర్మార్గపు టూహలయందు, వాంఛలయందు దారితేరిన వాడు కాబట్టి వేమన తన గుణములన్నియు స్త్రీలోకమున కంటగట్టి సాహసించినాడు.

ఇంతకు ఒకవిషయము మాత్రము స్పష్టము. ప్రతి విషయమునందు పురుషుడు స్త్రీని శంకించుట పరిపాటియైపోయినది. కారణము వానియొక్క మనోదౌర్బల్యమే. తనకుగల భావములు కోర్కెలు ఆమెకు గూడ నుండునని వాని సంశయము. అందుకై అతడు నిత్యశంకితుడైనాడు. తత్ఫలితముగ స్త్రీలకై ప్రత్యేక శాస్త్రములను ప్రత్యేకవిధులను నిర్మించినాడు. అవి అనుల్లంఘనీయము లన్నాడు. దాటితే పతిభక్తిలోపమన్నాడు. ఇన్ని కట్టుబాట్లుచే స్త్రీజాతి నణగద్రొక్కియు ఇంకను తనమనసును తాను నమ్మలేక సిగ్గువిడిచి "స్త్రీని నమ్మరాదు" అన్నాడు. ఇది పురుషునియొక్క యసమర్థత, మనోదుర్బలత్వము, సంకుచిత దృష్టులను చాటుచున్నది. ఇట్టి నీచమైన పురుషులవలన నరకబాధ ననుభవించు భారతనారీమణు లెందరోగలరు.

(1) ఆమె యొక సుగుణమణి. భర్త దౌర్భాగ్యుడు. నిరంకుశుడు. నిత్యము ఆమెను శంకించుచుండును. ఆమె తలదువ్వుకొనిన యాతనికి గిట్టదు. ఎవనినో సంతోషపరచుటకై ఆమె యట్లు చేయుచున్నదని యాతని సంశయము. తానున్నపుడు చీరగట్టవలెను. తాను లేనప్పుడు చినిగిన ప్రాతబట్టలతో నుండవలెను. అతడు లేనపుడు పొరబాటుననైన ఆమె శుచిగానున్న అతడు వచ్చినవెంటనే పైబడి చావగొట్టును. తిట్టును. వేధించును. ఆమెగతి యేమి కావలెను?

(2) ఆమె మహాసాధ్వి. పురుషుడు దుష్ప్రవర్తన గలవాడు. వేళకు ఇంటికిరాడు. అతడు వచ్చువరకు ఆమె నిద్రాహారములు మాని అతనికై వేచియుండ

వలెను. రాత్రులందు అతడు ఒకటి, రెండు గంటలవేళ వచ్చినవచ్చును. అసలు రాకపోవుట గూడ గలదు. గాని ఆమె అతడు వచ్చినను రాక న్నను నిద్రాహారములు మాని యాతనికై వేచియుండ వలెను. ఇంతకు అతడు వచ్చిచేయునదేమి ?

(3) ఆమె సుగుణశీల. అతడు పొగరుబోతు. త్రాగుబోతు. ఆమె ఎంత యస్వస్థతగా నున్నను అతడు చెప్పినట్లు చేయవలెను. ఆమె సహజముగ బలహీన. అతడు అంతులేని విషయలోలుడు ఆమె యస్వస్థత యాతని కంతులేని యనుమానము లకు తావు. అందుకై యాతడు ఆమెను వేధించును. బాధించును. తిట్టును. కొట్టును. ఆమె కేమిదిక్కు?

ఇట్టి వెన్నియోగలవు. అన్నిటియందు పురుషుడు దౌర్భాగ్యపు టూహలకు దాసుడై స్వర్గమువంటి తన సంసారమును నరకముగ మార్చుకొనుచున్నాడు. తన మనస్సే తనకు నరకరూపమై దేహమును దగ్ధము చేయుచుండును.

సమస్తమునకు ఉత్పత్తి స్థానమే స్త్రీ. స్త్రీయే జగన్మాత. విశ్వమాత, స్త్రీ దుఃఖించిన విశ్వమె దుఃఖించును. జగత్తు క్షోభించును. ప్రపంచము దద్ద రిల్లును.

"కలకంఠకంఠి కన్నీరొలికిన"
జాతియె నశించును. ఆనాదినుండియు పురుషుడు స్త్రీని నిందించుచునె యున్నాడు. గనుకనే తన కర్మము తా ననుభవించుచున్నాడు. భుక్తికై చెమ టోడ్చవలసిన విధి నిర్ణయము, యీమహాప్రపంచము నందు మానవుని పైననే గలదు. ఉదరపోషణము నకై ఉర్వియంతయు కలయవెదకు కర్మము సృష్టిలో నరుని పైననే గలదు. జానెడుపొట్ట నింపుకొనుటకై జగత్తంతయు జయింప యత్నించుటయు అందు జనులప్రాణముల నాహుతిగొనుటయు మొదలగు నీచపు నిర్ణయములు యీ నికృష్ట మానవునిపైననే గలవు. స్త్రీ నగౌరవపరచిన జాతి జగమున జీర్ణించి పోవును. స్త్రీదుఃఖించిన దేశము క్షీణించిపోవును. ఇంద్రాణియొక్క కన్నీరు నహుషునియొక్క సమస్త మును తుడిచివేసినది. ఒక్క సీతామహాసాధ్వి యొక్క దుఃఖబిందువులు రావణమహాసామ్రాజ్య మును దగ్ధము చేసినవి. ఒక్కద్రౌపది పరాభవ వేడి కన్నీరువలన కౌరవనాశనము మానవమండలి క్షయము కలిగినవి భారతనారీమణులైన రసపుత్ర మొదలుగా గల స్త్రీలగౌరవపడుటచేతనే మహమ్మదీయ సామ్రాజ్యములు నామరూపములు లేక శిథిలములై నవి. స్త్రీ నగౌరవపరచి హింసించిన వ్యక్తిగాని, సంఘముగాని, జాతిగాని, మతముగాని, రాజ్యము గాని, మహాసామ్రాజ్యముగాని యీ పృథ్విపై వర్ధి ల్లుట పట్టివి. స్త్రీ కన్నీటిచే విశ్వమె కరిగిపోవును.

---

## నిరీక్షణ

శ్రీమతి ఆమూరి లీలావతిదేవిగారు

బాల, బాలగులాబీల పూలమీద
రాలిపడియున్న తుహినంపు రాసులువలె;
చెక్కిళులపయిచిందు నాస్వేదబిందు
పటలి పథపథికులకుఁ గన్పట్టుచుండె.
ఆమె చూపులేరికొరకొ! అందులోని
భావమేమొ! యెరికెరుక? పూవుపూవు
నువిడదీసి రేకులొలచి పవనపదవి
పై కెగయు సంజపై దృష్టి పరచెనపుడు.
అలికిడే దేని వినిపించినంత తనదు
సోలిపోయినట్టి సోలపుచూపులెల్ల
నల్లెలకులసారించి కనలుచు కూక్ష
వీక్షణములనిపి నిరీక్ష లెవరికొరకొ
సలిపిసలిపియు విసికి వేసారికడకు.
సద్దులేవినబడని యాసంజయందు;
కుమిలికుమిలియు తనలోన క్రుంగిపోయి
నడచెనింటికి నడుగులు తడబడంగ
బాలయొక్కతె రాగార్ద్రిమూని.

# భగవద్గీతా మాహాత్మ్యము

ఉభయభాషాప్రవీణ శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

పుడమి యొకనాడు వైకుంఠపురనివాసు
పరమపురుషుని దర్శించి పలికెనిట్లు
"కర్మసంబద్ధుఁడై యున్న కలుషమతికి
నిశ్చలంబైన సద్భక్తి నిలుచుటెట్లు."
అనుఁడు శ్రీహరి యిట్లను—అవనిజూచి
"కర్మసంబద్ధుడై యున్న కలుషమతియు
గీతపారాయణము తాను ప్రీతితోడ
చేయుచుండిన సద్భక్తి జేరువాని.
మహిని గీతలు ధ్యానించు మనుజవరుడు
అధికపాతకుడైనను అట్టివాని
పంటవలతిరో, పాపము లంటవెపుడు
తామరను నీటితుంపరల్ దాకనట్లు.
ఎట్టియెడ గీతలుండునో; యెట్టిచోట
గీతపఠనమ్ము జరుగునో ఖ్యాతితోడ
నట్టిచో కాశిగయప్రయాగాది పుణ్య
తీర్థయాత్రలు నుండుఁజూ దేవివినుము.
సకలదేవతలును ఋషిసత్తములును
యోగివరులును నుత్తమభోగికులము
నారదోద్ధవపార్షదుల్ కూరిమిఁగను
గీతలుండెడుచోటు నంగీకరింత్రు.
జనము గీతావిచారణ సలుపుచోటు
చదువుచోటును చదివించుస్థలము భక్తి
వినెడుచోటును నిమిషంబు విడువనట్టి
స్థలములైయుండు నాకు నిశ్చయముగాను.
నేను గీతాశ్రయుండనై నిలచియుండు
గీతయెంతయు నుత్తమగృహము నాకు
అతివ, గీతాగతజ్ఞాన మాశ్రయించి
మూడులోకము లేలుచున్నాడ నేను.
పంకజాతాక్షి; గీతయే పరమవిద్య
ఆత్మరూపిణియే; సంశయంబు లేదు
అర్థమాత్రాక్షరయు నిత్య అవ్యయ; మఱి
యవనిఁజెప్పగలేని పదాత్మికయును.
సచ్చిదానందరూపుడే చక్రధరుని
చేత నర్జునునకు గీత చెప్పబడియె
పఠతివేదత్రయంబిదె పరమమైన
నిరవధికసౌఖ్యమునవేగ నిల్పునదియె.
నిశ్చలంబగుబుద్ధితో నిత్యమెవడు
పుడమి పదునెనిమిదధ్యాయములను తాను
భక్తి బారాయణముసేయ భవ్యమైన
మోక్షమును బొందు శాశ్వతముదముజెందు.
పూర్తిగా జదువలేని యేపురుషుడైన
సగము నిత్యముశ్రద్ధతో జదివెనేని
కపిల గోదానమునగల్గు ఘనఫలమ్ము
పొందునాతడు నిజము ఈ భూతలమున.
జగతి మూడవభాగమ్ము చదువువాడు
పరగ భాగీరథీస్నానఫలము జెందు
భక్తి నారవభాగమ్ము పఠనసేయు
నతడు జెందును చక్కగా యజ్ఞఫలము.
అతివ, నిత్యమ్ము నొక్కయధ్యాయమైన
భక్తిశ్రద్ధలతో నెవడు పఠనసేయు
నతడు రుద్రునిలోకమ్ము నాశ్రయించి
యచట ప్రమదాదిగణముతో హాయిజెందు.

అతివ నిత్యమ్ము నొక్కయధ్యాయమైన
భక్తిపారాయణముసేయు శక్తిశాలి
యొక్క మన్వంతరముదాక నుర్విలోన
మనుజుఁడై పుట్టుచుండును మహిమతోడ.
భక్తినధ్యాయమం దొకపదియునైన
నేడునైదైన నాలుగు మూడునైన
రెండుసగమున సగమైన నిండుభక్తి
చదువువానికి నబ్బును చంద్రవసతి.
పృథ్వి, గీతలుచదువుచు మృతినిజెందు
నతడు దేవత్వమునుబొంది యమృతుడయ్యు
మరల పారాయణము తానుమానకుంట
నవ్యయానందమోక్షము ననుభవించు.
పరమపాతకుడైనను ప్రతిదినమ్ము
గీతయర్థమ్మువినునొ సంప్రీతి నట్టి
వాడు వైకుంఠమునుబొంది వాసుదేవు
దివ్యపదములుసేవించి తెలివిగాంచు.
నిత్యనైమిత్తికకర్మల నిత్యమెవడు
చేసి గీతార్థస్మరణమ్ము సేయువాఁడొ
బ్రతికియుండియు ముక్తుడై పరగివాడు
అంతమున మోక్షసౌఖ్యము ననుభవించు.
చక్కగా గీతధ్యానించి జనకుడాది
పెక్కురాజోత్తములు కర్మసృధ్వియందు
పాపములబాసి చివరకు భవ్యమైన
కేవలానందమునుఁబొంది కీర్తిగనిరి.
ప్రథమమున గీతలను బ్రీతిబఠనజేసి
దానిమహిమను చదవక వదలెనేని
పఠనఫలమదివ్యర్థమై బరగివాని
శ్రమముమాత్రమెనిలచు. నిస్సంశయముగ.

---

## సతీత్వము

శ్రీమతి బి. సీతాలక్ష్మిగారు

అంచితమైనరీతిని యనారతముఁ విభుసేవజేయుచుఁ
సంచితపూర్వజన్మఫల సౌఖ్యములఁ గని ధాత్రిభామినుల్
వంచనలేకదానము లవారిగజేసి సుపుత్రులఁ గనఁ
మించినవిద్దెలఁ సతము మేలుగ కీర్తిగడింతు రెంతయుఁ॥

పతియె దైవమటంచు నెంచి స్థిరమూభక్తిఁ గడుఁ సేవ సం
తతముఁ జేయుచు నెన్నడేని నొక నిందావాక్యముఁ బల్కకే
యతులంబైతగుమాడ్కి విద్దెలను నయ్యారీతులఁ నేర్చుచో
స్తుతిపాత్రంబయి కీర్తిగాంచి సతి సంతోషంబునుఁ జెందెడిఁ॥

విద్దెలనెల్లనేర్చియు వివేకముగల్గియు కీర్తిగాంచియుఁ
తద్దయు భోగభాగ్యముల, ద్రవ్యములఁ మఱియెన్నియుండినఁ
యొద్దికతోడ ప్రాణవిభునుల్లము రంజిలజేయకుండ దా
ముద్దియలెప్డుగూడ తగు పూజ్యతగాంచగలేరు ధాత్రిలోఁ॥

'కాలమహాత్మ్యము'

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

బొబ్బర్లంకలా కప్పుడే దాటింది పడవ. ఎగుమతి దిగుమతులకొఱకును, కళాసుల మార్పుకొఱకును ప్రయాణికుల క్షుత్తునివారణకొఱకు నందొక గంటకాలము పడవలను కట్టివైతురు. గట్టుననున్న కాఫీహోటల్సు జనులతో క్రిక్కిఱిసియుండెను. కాఫీ యుప్మాలతో కడుపులు నింపికొనిన ప్రయాణీకులలో కొందరు బస్సులెక్కిరి. కొందరు పడవ నధిరోహించిరి.

సాయంకాల మారుగంట లగుసరికి, అన్నపు మూటలతో ప్రయాణీకుల నెక్కుండను తొందరలతో నా యాపడవల కళాసులొచ్చి త్రాడును లాగ జొచ్చిరి. పెరుగు పెరుగని గొల్లెతలు కేకవిడుచుండిరి. మినపరొట్టి, తాలింపు సెనగలని కోమట్లరచుచుండిరి. చుట్ట బీడి సిగరెట్టగ్గిపెట్లని అరటిపళ్లని కొంద రమ్ముచుండిరి. చెట్లపైదూకు కొండముచ్చుల సంద డింతంతకాదు.

ఇంతలో పదునారుసంవత్సరముల బాలుఁడొకఁడు పరుగుపరుగున రొజుకొనుచు, పడవ నాపండోయి అని కేకలిడుచు గట్టుదరినే వచ్చుచుండెను. వీని అదుర్దాగాంచినవెనుక పడవసరంగాతని నందెక్కించుకొనెను. ఆబాలుఁ డాసరంగున కివ్వవలసిన కేవు చెల్లించి హాలునం దొకచోఁ గూర్చుండెను. వానిముఖ మేలకో వినుగు వైరాగ్యముల సూచించుచుండెను. క్రీడాలీలల కునికిపట్టగు నంత బాల్యావస్థలో నాతని కంత చింతెందులకో!

ప్రవాహవేగము నోరిసికొనుచు క్రమక్రమముగా రేవురేవున నెక్కిదిగెడు జనముతో, ఎగుమతి దిగుమతుల సరుకుల ఖాళీ పూటులనొందుచు పడవ సాగిపోవుచుండెను. గదులలోని చంటిపిల్ల లేడ్చుచుండిరి. నిద్రకళ్ళతో పిల్ల లిల్లే యనుకుని గబగబనడచి నీటిలోఁ బడెదరేమోయని తల్లు లదరించుచుండిరి. హాలునందలి వివిధవర్ణ మనుజుల వింతవింత ప్రసంగములతో, నవ్వులతో నిట్టే రాత్రి తొమ్మిది గంట లయ్యెను.

అది మాఘమాసము. శిశిరలక్ష్మి, దినములు బాగుండని అలంకారరహిత ముత్తైదువువలె, పత్రపుష్ప విహీనయై మోడువారి, విదేశాగమన మొనరింపఁ బోయిన నాథుని రాక కెదురుచూచుచుండిన సతీతిలకమువలె, చూతఫలసమన్వితుఁడగు వసంతుని రాక కెదురుచూచుచుండెను. నిర్మలాకాశమున చంద్రుఁడతి మనోహరముగా ప్రకాశించుచుండెను. పడవలలోని ప్రయాణీకు లుల్లాసముగా నాపండువెన్నెలలో నొకరి చరిత్ర లొకరడిగి తెలిసికొనుచు కాలక్షేపము చేయుచుండిరి. సంభాషణలలో మన బాలుని వంతువచ్చెను.

"ఏ మబ్బాయీ, ఆటఁలాడుకొనుచు నుల్లాసమున గడపవలసిన నీ విట్లతిచింతాక్రాంతుఁడవై యుంటి" వని, యొకవృద్ధుఁడు ప్రశ్నించెను. చెప్పుట కిష్టము లేకపోయినను నలుగురి బలవంతమున తప్పని సరిచే, తన దీనచరిత్ర నీవిధముగా నేకరువుఁబెట్టెను. అందరతి నిశ్శబ్దముగా వినుచుండిరి. పడవ యొకటే వేగమున జరజర పోవుచుండెను. వెన్నెల వెలుగులో నదిలోని చేపల పట్టుటకై తీ,తీ,యను కూతలతో, తీతువుపులుగులు వినువీధిని నెగురుచుండెను. వాటి కఠోరశబ్దముల కందరు, గోపాలకృష్ణుని, రేపల్లె వాడను తలఁచుకొనుచుండిరి. బాలుఁడు తన కథ సాగించ మొందలిడెను.

"మేము నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణులము. నెల్లూరు ప్రాంతమందలి యొక కుగ్రామము మా కాపురస్థలము. మాతండ్రి మొదట పెద్ద యీనాందారుఁడే కాని, యొక కారణాంతరమున యాపదాస్తియు, నొక బంధువున కామీపెట్టి కోల్పో

యెను. అప్పుచేసి మాఅక్కపెండ్లిఁ జేసి చరాస్తి యగు వెండిబంగారములు పోగొట్టుకొనెను. ఈ బెంగచే మతిచెడి, కొన్నాళ్లు తిరిగి, రోగగ్రస్తుఁడై తుదకు చనిపోయెను. ఇట్టి దీనావస్థలో చిన్నవాఁడ నగు నన్నును, మాఅమ్మను, మాఅక్క తనింటికిఁ దీసికొనిపోయెను.

తదాదిగా మాయునికి నిష్టపడని మాభావకు ధుమ ధుమలు, రుసరుసలు యెక్కువై, వాటి పర్యవసానము మాఅక్కగారికి దెబ్బలురూపంగా పరిణమించెను. అది చూడలేక పోయినను, మాకు వేరుపాధి దారిలేనందున, లోలోనకుందుచు, అక్కడనే కాలము గడపుచుంటిమి. నాకు పిత్రార్జితపు కరిణికమొకటి యున్నది కాని, నేను మేజరగువఱకది రాదు. ఇంక రెండేండ్లవఱకీ తీరు తిప్పలు తప్పవని రోజులు వెళ్ళబుచ్చుచుంటిమి. మాబావకు కోపము రాకుండా తటాలున చెప్పినపనులు నేను చేయుచుంటిని. రెండువేళల వంట మొదలగు సమస్త కృత్యములును, మాఅమ్మ చేయుచుండెను. మా అమ్మ దీనావస్థను చూడలేకను, మగని కోపమున కాగలేకను, వెనుక గొయ్యి, ముందు నూయివలె, మధ్య మాఅక్క నలుగుచుండెను.

మాబావగారొక బోర్డుమెంబరు. ఆస్తిపరుఁడే కాని, తగని దుర్వ్యయుఁడు. తర్చు పనులమీద చెన్నపట్నం వెళ్ళుచుండుటలో గుఱ్ఱపుపందెముల వెఱ్ఱిలో మునిగి, వేలకువేలోడుచు వట్టిచేతులతో నింటికి వచ్చుచుండెను. ఆతిక్కచే నింటిలో ఆలు తేలువలె కనబడుచుండును కాబోలును, ప్రహరణములు మాఅక్కకు నేదో సాకున తగులుచుండెడివి. వీరిమీద వారిమీదఁ బెట్టి తిట్లు మాకు సంభవించుచుండెడివి. మనిషికున్నది పుష్టియు, పసరానికి తిన్నది పుష్టియునన్న సామెత రిత్తయగునా? అందులో డబ్బు చేతిలో లేని పురుషుఁ డగ్నిజ్వాలతో సమానము. ఈవిధమున యావదాస్తియు స్వయంకృతాపరాధమునఁ బోగొట్టుకొనెను. మా అక్క యైదువేల రూపాయిల నగలకి, తాళిమాత్రం మిగిలెను. ఇంటెడు పాత్రసామానుల కొక బిందెయు, రెండు గిన్నెలును, గరిటెయు మిగిలెను. ఇంతలో మాబావకి ప్రారబ్ధకర్మఫలమోయన హఠాత్తుగా పక్షవాతమొచ్చి చనిపోయెను. ఇప్పుడు మాఅమ్మే కాకుండ మాఅక్కకూడ నాపాలఁబడెను. వారి నెట్లు పోషించగలను!

ఒక్కగా నొక్క కొడుకగుటచే గలిగినప్రేమ గారాబముల నన్నెక్కువగా మావారలు చదివించలేదు. అల్లరివాఁడనై, చెట్లెక్కి చామలెక్కి, పొలాన షికార్లుఁదిరిగి, మొద్దాబ్బాయినై తిరిగి నే చెడితిని. సర్వీపరీక్ష మాత్ర మేకళనుండెనో నాకు బోధించి, మాబావ చదివించి ప్యాసుఁజేయించెను. మొదటినుఁడియు పరులను చేయిజాచని పరువుగల కుటంబమగుటచే, నీచవృత్తియగు, యాచన చేత కాదు. ఎమ్.ఎ. బియ్యేలకే లేని యుద్యోగములు నాకెవ రిచ్చెదరు? పోనీ యొకరింట వంటపనులు చేసుకొనుట కభిమానము. చింత చచ్చినను పులుపు చావదుకదా?

ఇన్నియు శోధించి. ఏ రాజమహేంద్రవరమంటి పట్నములోనో ఉదారులుంచిన, బీద విద్యార్థుల ఫండ్లు నిధులునుండునని యెంచి, యాట్రస్టీలను బ్రతిమాలి వారిచ్చు ధనముతో చదువుకొందమని బయలుదేరితిని. నాకంటె ముందే నాపెద్దమ్మ ఆకోశాధికారులచేతుల కడ్డము నిలచెను. వారివారి బంధువర్గమే, యాస్థానము లాక్రమించుటచేతను, నాకై తగిన సిఫారసు లొసగువారు లేనందునను, నా కా యోగము పట్టదయ్యెను. దేవుఁడు వరమిచ్చినా పూజారి వరమియ్యఁడనుట కిదే తార్కాణము. బీద విద్యార్థుల నిధులను పేర్లునూ, భాగ్యవంతుల మొగ మాటస్తుల కందు ప్రవేశమున్నూ. హిందూసమాజము లనుటయు, పరదేశ, భాషాక్రీడల కందు ప్రావీణ్యమునూ. చూచితిరా మన పరిస్థితులు, మన స్థితులు, దుస్థితులుగా మారినను, మనము మారలేదు. పులగము



కేసరికుటీరం—బెంగుళూరు.

సం॥ 1934 రమున గృహారామరక్షణ పోటీపరీక్షయం దీయుద్యానలక్ష్మికి రజతపాత్రము బహుమానముగా నీబడెను.







సింహళమహిళా మహాసభాధ్యక్షత వహించిన
శ్రీమతి యేలమ్మ్యార్ సతీమణి.

శ్రీమతి శుభావతి కన్య, బి.యే.,
పంజాబ్ సారస్వత బ్రాహ్మణసంఘమున
బి.టి. పట్టమునొందిన ప్రథమ స్త్రీరత్నము.
సింలా ఆర్యబాలికాపాఠశాలాధ్యక్షురాలు.



ఈమె నందిగాం, సాలూరు, తర్లా సంస్థానములయందు దివానుగపనిచేసి ప్రఖ్యాతిగాంచిన న్యాయపతి కరివరద రామారావు పంతులుగారి ధర్మపత్ని. బీదసాదల నాదరించుటలోను, దానధర్మములందు మిక్కిలి యెన్నికగల స్త్రీరత్నము. అనేక పుణ్యక్షేత్రములు సేవించి పుణ్యనదులలో స్నానమాడిన సనాతనధర్మ; అయిననూ బాలవితంతుల వివాహములు చేయనంగీకరించిన నారీరత్నము. ఈమె గ్రామరైతులు త్రాగుటకు నీరులేక యిబ్బందిపడుట చూచి వారి నిమిత్తం వక కోనేరు వక నుయ్యిని తవ్వించెను. యీమె విద్యావతి; ఆంగ్లభాష యందు కూడా కొద్ది జ్ఞానముకలది. స్త్రీల అభివృద్ధినిగురించి అనేకరీతుల ప్రయత్నము చేయుచున్న మహిళామణి.

మీద పప్పువలె, మెరకనీరు పల్లమునకే యన్నట్లు, గొప్పవారికే విందులు; బీదవారు, గొప్పవారికే సంతర్పణలు. ఇఁకబీదలకు బాధలే. ఇంతలో మా తల్లి నాయనా అక్కను చూచుచుండుమని చెప్పి, యొకనా డెవరికిని, చెప్పకుండ నెచ్చటికో వెడలి పోయెను. ఆమె యెచ్చట నేవిధముగా బాధపడు చుండెనోయని, పదిహేనురోజులుగా మాఅక్కనేను నర్థభుక్తితో కాలము బుచ్చుచు విచారించు చుంటిమి. నిన్ననే మాతల్లివద్దినుండి నాకొక జాబు వచ్చెను. "బిడ్డల యాకలిబాధ చూడఁజాలక, పూవులమ్మిన యారనే కట్టెలమ్మలేక, కాని గ్రామములో కడుపు కక్కుర్తికై, కాయకష్టములు బడి, మీకింత యుపాధిఁగల్గించు తలంపున నీనుమ్మిడి వర గ్రామమున నొక యుద్యోగియింట వంటఁజేయ కుదిరితిని. నెలకు పదిరూకలవేతనమొసగ నిర్ణయము. నీమైనార్టీ తీరి నీకు కరణీకపు భాగ్యము సమకూడువఱ కిట్లనే కాలముగడిపి, మీయాకలు లణచెదను. ఈ జాబందిన తక్షణమే నీవు బయలుదేరి రావలెను. రెండునెలల జీత మడ్వాన్సుగాఁ దీసికొంటిని. అవి గొంపోయి, మరల నేను పంపువరకట్లనో గౌరవ కాలక్షేపము చేయుచునుండుఁడు"యని వ్రాసినది. అదిఁ జూచియే నేనిట్లామె సన్నిధి కేగు చుంటిని. అంత బ్రతుకు బ్రతికిన మాఅమ్మ యిట్లొరుల పంచల సైరంధ్రిగాఁ జేరవలసివచ్చెనే యన్న దిగులు హృదయము బీటలువారఁ జేయుచున్న"దని, పైనిఁ జెప్పజాలక దుఃఖ మణచుకొనుచుండెను.

బాలుని చరిత్ర కందున్నవారందరు దుఃఖించి, యూరడించిరి. "నుదుటన్ వ్రాసినవ్రాలు తప్ప గలదా నూరేండ్లు చింతించినన్" అన్న పెద్దపెట్టి కేగతో తప్పునా!

"అందులో నీ డిప్రషన్ రోజులలో, పాదుషాలే పకీరులైరి. ఎంతెంత ఘనకుటుంబములో చితికినవి. రైతియ్యక, పన్నులు తప్పక, యీనాండార్లు మట్టమై"రని యొకరనిరి. అంతలో నొక ఛాందసుఁ డందికొని, "యివన్నీ యూరికే వచ్చినవా? కలియుగ కలుషములని, అందుచే నల్పాయువులని, కృతయుగంలో వ్యాసులవారే యన్నారు. వర్ణధర్మము లడుగంటినవి. మహా పతివ్రతలచే ఖండఖండాంతరముల వన్నెవాసుల కెక్కిన మనదేశము స్త్రీలు, విడాకులచట్ట తీర్మానామోదము లొనరించుచుండిరి. శారదాబిల్లని ప్రౌఢవివాహములొచ్చి, వర్ణాంతర శాఖేతర వరులను వరించి, తలిదండ్రులను ధిక్కరించుచున్నారు కన్యలు. అపస్వరయుక్తముగ శూద్రులు వేదములు పఠించుచున్నారు. బ్రాహ్మణయువకులు, హూణవిద్యాఫలితముగా, నానాజాతి హస్తపదార్థములను, హోటళ్ళలో స్నాన సంధ్యాద్యనుష్టానములనేమరి మడిమైలలు లేకుండగా నపరిశుద్ధ వాయుభూతాధికమగు పాయఖానాల కేగిన బట్టలతోడను, సకల రోగోత్పత్తినిఁ గలిగించు క్రిమిసంయుత ధూళి రేగుచున్న బజారులందు సంచరించిన వస్త్రముల తోడను, పాదప్రక్షాళనమైన సేయక భుజించుచున్నారు. ఆదిశంకరులుంచిన వర్ణవృత్తుల విసర్జించి, బ్రాహ్మణుఁడు వ్యవసాయము వర్తకము చేయుచున్నాఁడు. కంసాలి, వడ్రంగి పని చేయుచున్నాడు. కాపుద్యోగ మొనరించుచున్నాఁడు. వైశ్యుఁ డుపాధ్యాయ, వకీలువృత్తు లవలంబించుచున్నాఁడు. క్షత్రియులు, వ్యవసాయ, భట్రాజులుగా మారిరి. దేవాంగి నేతమాని, జోలెత్తుకొనుచుండెను. గొల్లఁడు పాలు పెరుగులు మాని, కసాయివానికి మేకల నమ్ముకొనుచున్నాఁడు.

ఈలాగు నాజగద్గురు నిర్దిష్టనియమముల మేర మీరుటచేతనే నానావిధ రోగములు, అకాల మరణములు, అల్పాయువులు, నిత్యదారిద్ర్యములు, భూకంపములు మొదలగు దేశారిష్టము లుద్భవించుచున్నవి.

స్త్రీలు నాగరికాగ్రేసర లగుటచే, సుదయాస్తమయములు కన్నబిడ్డల దాదుల యొడులం బడవైచి, నేదో నెపంబున వీధి షికార్లు చేయుచున్నారు. విద్యావిహీనులగు దాదు లొసగు మలినపదార్థ భక్షణ సేయుచు, తల్లులకొలకు కడు పుబ్బునటుల నేడ్చు

పసినినుగుల పాట్లా పరమాత్ముఁడే యాలించవలె కాని, ప్రత్యక్ష దైవమగు తల్లి వినిపించుకొనదు. శిశు ఆహారముగా భగవంతునిచే నిర్మించిన స్తన్యపాన మొసగని నాగరికాగ్రగణ్యా జనములు గూడ గలరన్న కలియుగ కలుషములుఁ గాక మరేమి? మహాలక్ష్మి పూజలు మరచినారు. కండ్లు నులుము కొనుచునే కాఫీగిన్నెలు మూతి కంటించుకొన నభ్యాసపడిన హిందూ స్త్రీల కిక, యుపవాస వ్రత నియమము లెక్కడ? స్త్రీలు పురుష వివక్షత లేకుండగాఁ కాలేజీలలో విద్యాపఠనము చేయు చున్నప్పుడిఁక శీలగ్రహణ మేది? అన్ని ధర్మము లంతరించి పాపము పండుచున్నది. భూదేవి పాప భరము భరించలేనప్పుడే ప్రళయము సంభవమగు" నని సనాతనుఁడనెను.

"ఏమిటండీ, ఎల్లకాల మొక్కరీతినే ధర్మము సాగునా, పూర్వము మన హిందూమత మొక్కటే గనుక, మన మాడినమాట చెల్లినది. ఇప్పు డన్ననో, ఎడపెడ పలుమతములు బయలుదేరి మనచే నీచాతినీచముగా చూడబడుచున్న దేశ సోదరుల నాదరించుటచే నిరాదరశాగ్ని నిమగ్గ నేరని జాతు లితరమతముల నీడను తలదాచుకొనుచున్నారు. సంఘము క్షీణించుటచే విడివడిన వెంటి ననుకరించు మన మధఃపతనమగు నవస్థను వచ్చుటచే మహనీయులు కొందరు ప్రస్తుత స్థితి తొలగింప శాస్త్ర వాదనల కొంతకాల మెడముంచి, కాలానుసారము మనోబుద్ధులు మార్చుకొనుఁడని ప్రబోధించుచున్నా" రని స్వానుభవశాలి యొకరనిరి.

ఇట్టి తర్కవితర్కములతో తెల్లవారెను. ఎవరి స్థానముల వారు దిగిరి. మనబాలుఁ డాతని తల్లి చెంత కరిగెను. తరువాత పాట్లా పరమాత్మ నిర్దేశాను సారమగును.

---

## పిచ్చికల్లాలు

శ్రీమతి తులసీ లక్ష్మణగారు

తటిపివెన్నెలపచ్చి కెరటాల లేచిపొం
గులువారు పాలబుగ్గలను నులిమి
బంగారుపోత నిబ్బరమూని మెరయుగుం
డ్రని చిట్టిచేతులల్లన గ్రహించి,
మెలమెల్లఁదప్పటడ్గులు వేయఁగాఁదీసి
వ్యత్యస్తపాదాల వంకఁజూచి,
చిఱుబొజ్జమీఁదుగాఁజేర్చి చేతులు ప్రేమ
బుట్టఁబైకెత్తి దోఁబూచులాడి,
చంకనిడికొని మనసార, చొక్కళించు
శిరముమూర్కొని కన్నులఁజేర్చుకొనుచు
నన్నులాలించినట్టి నన్నన్నతల్లిఁ
బిచ్చికల్లాలు మాయమ్మఁ బిలిచికొందు.

---

## కొండవీడు

శ్రీమతి కర్లపాలెం రాజ్యలక్ష్మమ్మగారు

రమణీయముగనుండు రాజమందిరములు
శిథిలమై గూబల జేరదీసె
ఉరుపుష్పఫలశోభితోద్యానవనములు
సర్పరాజముల కాశ్రయములయ్యె
స్త్రీలు జలకమాడు శృంగారసరసుల
జ్వరదాయకంబగు జలమునిండె
సైన్యసంతతినివాసంబయి యలరారు
బురుజులు గబ్బిలంబులను జేర్చె
కోటవాకిళ్లు శిథిలమై కూలిపోయె
అశ్వగజశాలలన్నియు నడగిపోయె
మేటిపట్టణమగు కొండవీటియందు
ఔర విధివశమున కసాధ్యంబుకలదే!!

# శ్రీ శారదాదేవిస్తుతి

కవిరాణి శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

మ. జయ హేయంబ చతుర్భుజే సువిలసత్సౌవర్ణ దివ్యాంబరే
జయఖండాబ్జకలాపరమ్యరచితే సారంగనీలాలకే
జయపాశాంకుశఖడ్గ పుష్పధృత హస్తాంభోజ రమ్యాకృతే
దయ దైవాఱగ మమ్మునేలు శుభసంధాత్రీ నమస్తేశివే.

మ. చెలువౌ క్రొన్నెలరేకతో కరమునం జిన్నారిరాజిల్కతో
కళలం జిందెడి ముద్దు నెమ్మొగముతో కారుణ్యచిత్తంబుతో
నెలచాయల్దులకించు దువ్వలువతో నెత్తావిగందంబుతో
కొలువై మాయొనరించు సన్నుతులఁ గైకోరమ్మ కాత్యాయనీ.

చ. కలుములనిత్తు లక్ష్మివనఁగా విలసిల్లుచు, బుద్ధివైభవం
బలవడఁజేతు వాణివయి, యార్యయనన్ భువికాదిమూలమై
పొలుపుగ నెల్లలోకముల బ్రోతువు, నీమహిమంబు లెన్నమా
కలవియె యోభవాని జగదావళి నేలుదు వేవిధంబులన్.

ఉ. తల్లులకెల్ల తల్లివి సతంబు జగంబున కాదిమూలమై
యెల్లవిధంబులన్ మనుతు నీశ్వరి నీపద నీరజంబులన్
సల్లలితంబులౌ కుసుమజాలములన్ గొని యెల్లవేళలన్
గొల్లగ బూజసేతు మదికోరిక లిమ్ముగ నిమ్ము నెమ్మదిన్.



# కోకిల గానము

శ్రీమతి కోకా హనుమాయమ్మగారు

చిగురులేమావిగున్నపై చింతదక్కి
దిక్కుదిక్కులు జూచుచు దిశలునిండు
రమ్యమృదుతరగాత్రంబు రాణమీర
నీదుకుహూకుహూనాదంబు మోదమొసఁగు.

చండభాస్కరకిరణ పుంజములమిగుల
నలసిశ్రమనొందు పాంథులకక్కజముగ
మధురనిస్వన మొసఁగుచు మందగతిని
నీదుకుహూకుహూనాదంబు మోదమొసఁగు.

సరవిసహకారభూమిజ శాఖపైని
లీల ఫలములమెక్కుచు మేలమాడు
కొంటెపిల్లలబాధకు కోపమొంది
మాటిమాటికివారిని మందలించు
నీదుకుహూకుహూనాదంబు మోదమొసఁగు.

లోకమంతయు సుఖనిద్రలో మునుంగ
మంచువేసఁగిదినమందు మధురఫణితి
పంచమశ్రుతిని హాయిగాపాడుచుండు
నీదుకుహూకుహూనాదంబు మోదమొసఁగు.

# దీపావళి సరదా

శ్రీమతి సమయమంత్రి వందేమాతరంగారు

"అబ్బబ్బ మాట వినబడనీయకుండ యేమల్లరత్రా!! మీనాన్న యెందుకో పిలుస్తున్నారు కనుక్కోరా, రామం" అంది వాళ్ళమ్మ.

"టపాకాయలు కొనమని చెప్పవులే అమ్మా నాన్నతో ?"

"కొంటారులే తొందరేమిటి ?"

"బావను రమ్మని రాశారా నాన్న ? యెప్పు డొస్తాడే బావ?"

"నీకేంరా యెప్పుడో వస్తాడు."

"అలాకాదు త్వరగా రమ్మని వ్రాయమను అక్కను కొట్టించాలి"

"రమణా వాడినేమన్నావే ?

"నే చెపుతానుండవే అమ్మా, మరేమో నే యిందాకా జామకాయలు కోస్తుంటే సూరమ్మగారి తో చెప్పి కొట్టించిందే. బావరానీ చెప్పకపోతే?"

"వాళ్ళ చెట్టుకాయలు కోయవద్దన్నానమ్మా. వినక చెట్టెక్కాడు. సూరమ్మగార్ని పిల్చి చెప్పా. నాలుగు తిట్టింది. బావరానీ, నీపని చెపుతానని గంతులేస్తున్నాడు రామం."

"మేష్టారొచ్చి గంటయితే రావేమిరా" అంటూ బెత్తంతో నాలుగు వాయించారు వాళ్లనాన్న. ప్రయివేటు చెప్పకోటానికి వెళ్లాడు రామం.

నాగభూషణంగారు తాలూకాకచ్చేరిలోగుమాస్తా. జానకమ్మ వారి సహధర్మచారిణి. నాగభూషణం గార్కి పిత్రీయంబాపతు సామాన్యమైన యిల్లుకలదు. మెట్టపొలం కొద్దిగాయుంటే విక్రయించి చిన్న డాబా వేసుకొన్నారు. రమణయే వారి తొలిసంతానం. రాజ్యం రామచంద్రం చిట్టి యీనలుగురే వారి సంతతి. రమణారాజ్యంల పెండ్లిలోనే వుపనయం కానిచ్చి గట్టునపడ్డారు జానకమ్మగారు. చిట్టి రెండేండ్ల లోపువాడే. పెద్దదగు రమణ కాపురమునకు వెళ్ళినది. రాజ్యం యింకా చదువులోనే యుంది. దసరాపండుగకు తీసుకొనివచ్చిన రమణను పంపుడని వర్తమానం చేశా రత్తవారు. దీపావళికి తమ యల్లుని బంపవలసినదనియూ పండుగ గడచిన వెంటనే అమ్మాయియూ అల్లుడునూ బయలుదేరి వత్తురనియూ నాగభూషణంగారు తమ వియ్యంకునకు వ్రాశారు.

నాలుగురోజులు ముందుగానే వచ్చా డల్లుడు. కొన్ని కారణములవల్ల రావటానికి వీలులేదని రెండవ యల్లుడు తెలియపరచినాడు. నరకచతుర్దశి నాటి వుదయం కాఫీ యుప్మా తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళింది రమణ. వుప్మా స్పూనుతో యిటు అటు తిప్పి పరిశీలన చేస్తున్నాడు సుందరం. నానవేసి నల్లరంగు పోవునట్లు శుభ్రముగా కడగిన చింతగింజలు కనుపించిన వరనికి. చిరునవ్వు నవ్వుకుంటూ వుప్మా ప్లేటు దూరంగా పెట్టి కుర్చీలో కూర్చున్నాడు. చప్పట్లుకొట్టి గట్టిగా నవ్వుతూ రామం వచ్చి బావ వళ్లో పడ్డాడు. రాజ్యం నవ్వాగక భోజనాలింట్లోకి పరుగెత్తింది. 'రామం మీఅక్కను పిలు, కొత్త రకపు జీడిపప్పులు తినిపిస్తా' నన్నాడు సుందరం.

'నీవే తిను: మధ్య అక్కయ్య కెందుకు. కష్టపడి తయారు చేసినందుకు. అక్క యేమీ యెరుగదు. నీకు తీసుకురావటానికి పళ్ళెంలోపెట్టి గ్లాసుకోసరం వంటయింట్లోకి వెళ్లింది. నాన్నావాళ్లూ చూడకుండా అందులో పప్పులేరి నోట్లో వేసుకొని జేబులోంచి తీసి వుప్మాలోకుక్కా.'

'పాపం చాలా కష్టపడి తయారు చేసిన పప్పులు వృధాకాకుండా నీనోట్లో కుక్కుతానుండు' అని చేతికొచ్చినంత యుప్మాతీసుకొని రామం నోట్లో పెట్టబోవుచుండగా మరియొక పళ్లెరముతో నుప్మాయూ వేరొక గ్లాసుతో కాఫీయూ తీసుకొని రమణ వచ్చింది. వెంటనే తమ్ముడు విడుదలై పరు

గత్తి వెళ్లినాడు. 'ఆగ్రహమొచ్చినట్టుందే? యీలా హాస్యపుబనుల్లో తాను గెల్చి మిమ్మోడించాలని మీ రాకకోసరం చాలా వేగిరపడ్డాడు మా రాము. వాడిని క్షమించి వాటిని వదలి యివి ఆరగించం'డని చేతిలోనివి బల్లపై నుంచింది రమణ. 'అనుమానం వీడందే యేలా తింటాను?' అన్నాడు సుందరం. 'మాటల కవకాశంలేదు. అమ్మ వక్కతే వంట చేయుచున్నది. ఆమెకు సాయపడాలి వెళ్లి. సందేహాలు తర్వాత తీర్చుకోనవచ్చు'నని లేనగవు మోమున నంకురింప గిరుక్కున తిరిగి వెళ్లి పోయింది రమణ. తమలపాకులు వేసుకొంటూ చుట్టివున్న చిలకలను విప్పదీస్తున్నాడు సుందరం. ఆచుట్టమధ్య లేత అరటాకు ముక్కలు కనుపించినవి. 'యిది రాజ్యం పని. వీళ్లిద్దరివంతూ అయినది. యిక మా రాణి రమణవంతున్నది జాగ్రత్తగా నుండాలే' అనుకున్నాడు సుందరం.

కాగితం కలం చేతపట్టుకొని పిల్లలు చెప్పినవి వ్రాస్తున్నారు నాగభూషణంగారు సావడిలో కూర్చుని. రామం రాజ్యం చెప్పినవన్నీ వ్రాసుకొని 'రమణా నీకేం కావాలో చెప్పుతల్లీ' యన్నారు పెద్దకుమార్తెతో. 'నాకేం వద్దు నాన్నగారూ యింకా చిన్నపిల్లనా?' అన్నదామె.

అప్పుడే పెద్దదానవైతివా వెఱ్ఱితల్లీ! మేమున్నంత కాలం చిన్నబిడ్డవే?'

'వట్టిది నాన్నగారూ, అక్కకేమోనే వేళాకోళంటప్పాసులు కావాలట తెండి'అన్నాడు రామం. తమ్మునకేసి కోపంగా చూచి వెళ్ళిపోయింది రమణ' 'యిదిగో నీకేం కావాలో చెప్పు మళ్లీమళ్లి తిప్పక. 'పూదా చీర కావాలి కదూ? తెస్తాలే కోపగించకు'అంటూ పైమీద కండువా వేసుకొని వెళ్ళినారు నాగభూషణంగారు. కూలివానిచే సామాను పట్టించుకొని సాయంకాలం నాలుగింటికల్లా యిల్లు చేరారు నాగభూషణంగారు.

త్వరగా భోజనాలు ముగించుకొని వీధిలో అరుగుల నిండా యున్న దీపాలవద్ద చేరారంతా బాణసంచాతో. రమణ చిట్టిని వొళ్లో కూర్చోబెట్టుకొని కూర్చుంది చూస్తూ. వీధిలో సందడి డాబా మీదనుంచే చూస్తున్నాడు సుందరం. చిట్టి పంతుల్ని వూయల్లో పరుండబెట్టి వేళాకోళంటపాకాయలపెట్టె తీసికొని డాబా యెక్కింది అడుగుల శబ్దమేనికాకుండ రమణ. పిల్లలు వెలిగించు రంగు రంగుల మతాబులవంక చూస్తూ నిలబడియున్న సుందరం రమణ రావటం చూడనేలేదు. అతని వీపుపై కొట్టటాన్కి ఒక గుండును తీసింది. తప్పు చేస్తున్నావేమో జాగ్రతయని అంతరాత్మ బోధించింది. చేయి దానంతటదే వాలింది. దీపావళి సరదా! కోప మెందుకొస్తుంది కొట్టమని బాల్యచాపల్యమొకవంక వేధింప సాహసించి వినుకొద్దీ వీపుపై పేల్చింది. టపీమని పెద్ద శబ్దమయేసరికి వులిక్కిపడి వీపు తడుముకొంటూ తిరిగి చూచాడు. భర్తకు కనుపింపయే వెనుకకు వెళ్ళి రెండుచేతులతో గుండ్లనాతని వీపుమీద విసరటం ప్రారంభించింది రమణ. 'కలియుగ సత్యనైనా వేమిటి? గుండ్లు చేతికి తీసుకొను సావకాశమున్నట్లు లేదు. ఒకటే పేల్చటం. అవేలా వుంటాయో చూడనియ్యి'అంటూ రమణను సమీపింప బోతుంటే, రమణ పరుగు ప్రారంభించింది. యెంతసేపని పరుగిడగలను ఆయాసంతో ఓమూల కూలబడింది ఆమె చేతిలోని పెట్టెను లాగుకొని అక్కణ్ణుంచి లేచేవరకూ ఆ గుండ్లతో వేటాట్టం ప్రారంభించాడు సుందరం. తిరిగితిరిగి అలసిపోయింది రమణ. గదిలోనికి వెళ్ళి తలుపు వేసుకుందామని పరుగిడింది. కూడానే వెళ్లాడు సుందరం. ఫాలభాగాన్నున్న చెమటపైట చెరగుతో నొత్తుకొనుమా ప్రక్కపైవాలింది రమణ. చేతిలోని గుండ్లు ఆఖరైనందున పట్టిపెట్టెనే భార్యపై విసరి చేరువనున్న కుర్చీలో కూలబడ్డాడు సుందరం. పిల్లలచే టపాకాయలు కాల్పించు సందడిలో యున్న తలితండ్రు లీ దృశ్యాన్ని చూడనేలేదు. దీపావళిసరదా ఆ బాలదంపతుల కెంత ఆయాస పరచినదో చూచారా?

# స్వప్న దృశ్యము

శ్రీమతి పొణకా కనకమ్మగారు

అది స్నిగ్ధోజ్జ్వలమగు మిన్నేట పాల తరగలలో నాణి ముత్యములవలె నక్షత్రముల నారబోయు ప్రశాంతమంజుల చంద్రికాచ్ఛాయలు వెల్లివిరిసియు సమయము.

*　　*　　*　　*

హాయిగా శర్వరీశీతపవన డోలికలలో నూగుచు నిద్రపోవుచున్నారు ఒడలు మఱచి యందఱు వ్రేపల్లెవాడలయందు.

నాకు కొంతసేపు నిద్రపట్టక, అప్పుడే కనుమూసితిని కాబోలును! నా మనస్సు కమ్మతెమ్మెరల ఆనందవీచికలలో స్వప్న వీధుల తారాడుచున్నది.

*　　*　　*　　*

యమునాతీర మనుకొంటాను అది. ఎత్తుగానున్న ఒక సికతాతలమున కూర్చుని, పండువెన్నెలవెల్లువలో రాయంచవగిది మునుకలేయుచున్న చందమామను జూచుచుండగా ఆద్యంతములులేని సృష్టిమర్మము మానసమునకు తట్టినది.

సర్వమత ప్రపంచమునకు పరమలక్ష్యమును, అచింత్యమునునై వెలుగు సన్మయాఖండ అమలజ్యోతిర్మయస్వరూపమునుండి నక్షత్రమువలె ప్రకాశోద్భాసితమై ఒక విస్ఫులింగముగారాలి, అది యొకింతలోనే అనంత భిన్నరూపములను దాల్చినది.

అప్పుడు నే నెవరో స్పృహలే దంతగ. కాని ఒక విమల భావోత్తేజశ్రేణులయందు లగ్నమై నా చూపులు యమునతట్టు తిరిగినవి.

చల్లని సమీరోత్సవములో యమునా తరంగిణీఫేనపంక్తులు గట్లు తన్నుచున్నవి విఱ్ఱవీగుచు. ఆస్రవంతీసంపర్కమున శాద్వలస్థలి ప్రాకృత విరచిత రత్నకంబళమువోలె విరాజిల్లుచున్నది. ఆతటినీతటపరిసరముల తొలిమధురఫలరస వృక్షభరితమును, నవ లావణ్యాతరుణ నికుంజ మనోజ్ఞవిలసితమును, వికసిత కమనీయ కుసుమసౌరభపూరితమునునై ఒప్పారుచున్నది వనలక్ష్మి కనుల పండువగ. కమ్మని క్రొందేనియ లాస్వాదించి, మత్తుచే పుష్పశయ్యలపై సొమ్మసిల్లినవి భృంగరాజములు. నునుచిగురుటాకులు మెక్కిన కోయిల మనోహర స్వాదుగానముకూడ వినబడదు మెచట గాని.

అప్పుడు అందెటుచూచినను, ఎదియో నిర్మలతేజ ప్రతిబింబమొండు లలితమోహన దృక్కుల దిశల వెదజల్లుచు, విహారము జేయుచున్నది కలువలేని ధవళమయూఖముల రాశిలో. అదృశ్య ముపమాతీతము.

*　　*　　*　　*

ఒకచో ప్రియజనని యశోదచే తన అమాయికపు దుడుకుచేష్టలకు దండింపబడుచు, మన్ను తినిన అపరాధమును బాపుకొనుటకై జిగిదేరు పాలబుగ్గలపై, అరుణరాగము రేగ నోరుతెరచి, తన బ్రహ్మాండ విశ్వవిభూతినంతయు నుదరమున జూపుచున్నాడు.

ఒకచో కాళియ భోగి దుష్టఫణాగ్రములపై ప్రబలోత్కంఠతో విజృంభించి

లాస్యము సల్పుచు, నతశిరస్కులై పతిభిక్ష నర్థించు వాని సతీమణులను, కరుణార్ద్ర దృగంచలముతో వీక్షించి, అభయప్రదాన మిచ్చుచున్నాడు.

ఒకచో చెట్లబోదెల నొఱసికొని జాలువారు సెలయేటిదరిని స్వచ్ఛస్ఫురిత శిలావేదిక పై నాసీనుడై వేణువు నూదుచున్నాడు శ్రావ్యముగ. ఆ దివ్యమురళీరవామృతము వీనులసోక, తన్మయతచే గోపకామినులు కామరాగరసోన్మాదినులై నిశ్శబ్దనిశయందు భౌతికముగా నల్లుకొన్న ప్రగాఢ ప్రేమవల్లరులు త్రెంచుకొని, భగ్నమోహాపుటుత్రాళ్లను ప్రదర్శించుటకు మీ నవనీత శుద్ధాంతఃకరణ మెట్లు అంగీకరించెనోయి మురళీ అని నిస్పృహాజనిత నిష్ఠురోక్తులాడుచుచున్నారు.

ఒకచో పరమభక్తుడైన అక్రూరుడు రథముపైనున్న బలరామకృష్ణులను యమునాగర్భమున దర్శించి, ఆశ్చర్యచకిత మానసుడై ముకుళితహస్తములతో స్తోత్రము చేయుచున్నాడు.

ఒకచో కురుక్షేత్ర సమరావనియందు విరక్త వ్యథాచిత్తుడై నిల్చి, అశ్రుధారాప్లావిత నయనములతో కుందు పాండవమధ్యమునకు, నిష్కామ కర్మయోగసిద్ధాంతమును ఉపదేశించి, ఆహవరంగమునకు పురికొల్పి, ధైర్యోపేతుడై రణస్థలియందు వినీలాభ్రపుష్టమున మెరయు తటిత్తువలె ప్రకాశించు పార్థునకు సారథ్యము చేయుచున్నాడు నొగలపై కూర్చుని.

ఒకచో మహాఋషులందఱు చేతులు మోడ్చి తన ప్రాపంచిక సంబంధము నుపసంహరించుకొని, క్షీరాబ్ధియందు చిరుత రూపియై వటపత్రశయనమున నిర్వికల్పుడై మాయాజన్యమగు భౌతికముగాని, అద్వితీయ నిర్గుణ పరబ్రహ్మమే తానని నిరూపించుచున్న వేదాతీతుని ఉపనిషత్సూత్రములలో బంధించి ప్రార్థించుచున్నారు.

* * * *

నేను ఆపుకొనలేని ప్రమోద పుల్కారములతో సోలి, అటనుండి లేవనుంకింపుచుండ, ఆ సర్వమయుడు తన కంఠసీమ నలరారుచున్న అరవిరిమొగ్గల చంపకహారమును కొనగోటగిల్లుచు, ఉద్యత్ప్రీతిమై వచ్చి తన జిలిబిలి గులాబిరంగు ముద్దుపెదవులపై మందస్మితము నాట్యమాడ నా హస్తము బట్టుకొనబోయెను.

* * * *

ఇంతలో హఠాత్తుగా నల్లని మబ్బుల గుంపు వచ్చి జాబిల్లి నడ్డగించెను. వనీతల మంతయు సాంద్రనీలిమతెర యాచ్ఛాదితమై విభ్రమ మావహించినది. ఏమి చెప్పను! అట నటన సల్పుచున్న జగన్మోహన మూర్తి నీలమేఘశ్యాముడు, ఆకసము నీల నీరదము, యమున నీలనీరపూరితము, పృథ్వి సస్యశ్యామలము. ఈ సన్నివేశమున మలయ పవనుడుకూడ శ్యామజడిత వీచికలనే పాఱ జల్లుచున్నటుల స్ఫురింప, ఈ యద్భుత పాంచభౌతికపరిణామ చమత్కృతికి అచ్చెరువు నొందుచు, ఇదియే కానోపు సృష్టికి పూర్వమున్న తమోమయ భావాతీతరూప మనుకొనుచుండగా మెలుకువవచ్చినది.

# వ్యాకరణ చర్చ

శ్రీమతి కూనిశెట్టి రామరత్నమ్మగారు

సకలభాషలకుం దల్లియగు గీర్వాణభాషను సంస్కరించిన పాణిని మున్నగు మహర్షివరేణ్యులు వ్యాకరణములకుఁ బ్రయోగమూలత్వము నంగీకరించి "ప్రయోగమూలం వ్యాకరణం" అని పేర్కొని యున్నారు. వారి మార్గము ననుసరించియే నన్నయగారును "సిద్ధిర్లోకా ద్దృశ్యా" అని రచించి తెనుగు భాషకు మార్గదర్శకముగాఁ జింతామణిని రచించి ప్రసాదించిరి. అహోబలపతి చింతామణికి భాష్యప్రాయమైన యొక విపులవ్యాఖ్యను రచించిరి. అధర్వణాచార్యులు కొన్ని విశేషములను జేర్చి కారికావళిని రచించిరి. ఇవియన్నియు సంస్కృత భాషను రచింపబడుటఁజేసి తెనుగు విద్యార్థులకు దుర్బోధము లయ్యెను. అక్కఱంత దీర్చుటకుఁ గాబోలు చిన్నయసూరిగారు బాలవ్యాకరణమును తెనుగుభాషలో రచించిరి. ఈ గ్రంథము కళాశాలలో బాలురకు నవిచ్ఛిన్నపఠనీయముగా నిర్ణీతమైనది. దీనిం జదువంజదువ సంశయము లమితముగా నుదయించుచున్నవి. సూరిగారైనను ప్రాచీన నవీన ప్రయోగములను స్వయముగా బరికించి ఈ వ్యాకరణమును రచించినట్లు గానరాదు.

"గతానుగతికో లోకః" అనునట్లు వ్యాసకర్తలు జూపిన ప్రయోగములనే తామును సేకరించిరి. సమగ్రముగా భారతప్రయోగములనైన ననుశాసింపక పోవుట మిగుల శోచనీయము. వీరు పాణినీయ సూత్రములనన్నిటిని తమ వ్యాకరణమున జొనిపిరి. అయ్యవి బాలురకే కాదు. వృద్ధులకుగూడ దుర్బోధములుగానున్నవి. కొన్నియెడల వారు చేసిన వివరణములును "టీకా టోకా మపేక్షతే" అనునట్లు అత్యంత దుర్బోధములయ్యె. అయిననేమి "మాలో దిమ్మయ్యే చక్కనివాడు" అన్నట్లు ఈ వ్యాకరణమే నేడు అన్ని వ్యాకరణములలో వాసికెక్కినది. ప్రాజ్ఞులకు బిష్టపేషణములును, నా యల్పబుద్ధికి నవీనములునునగు కొన్ని విషయములను విద్యార్థినిని గాన బేర్కొన సాహసించుచున్న దానను.

క్రియ. 3, సూ. వివరణ. "భూతంబునావిద్య మానధ్వంస ప్రతియోగి."

క్రియ 4. సూ. వి. "భావి నావిద్య మానప్రాగ భావప్రతియోగి."

కారక 4. సూ. వి. "క్రియాసిద్ధిం బ్రకృష్టోప కారకంబు కరణంబు."

తద్ధిత 1. సూ. వి. "ప్రకృతి జన్యబోధంబునందు బ్రకారంబు భావంబు" ఉపోత్తమేత్వము; పర్యుదాస; వ్యధికరణము; తపరకరణము; ఉత్సర్గ; వ్యవస్థితవిభాష; గ్రహ్యాదియోగజము; ఇట్టివి సంస్కృత వైయాకరణులకే విజ్ఞేయములగు సంకేతములు, వివరణములు. తెనుగు విద్యార్థులకు దుర్బోధములుగా నున్నవి.

సంధి 39. సూ. వి. "ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దంబు పరంబగునపుడు తొంటియట్లు లోపను గాగమంబులు........జూపట్టెడు."

తద్ధిత 8. సూ. వి. "మగటిమ్యాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు."

ఇత్యాదులు కేవలము భాషకు బ్రయోగమాత్ర శరణత్వమునే జూపుచున్నవి. ఇట్టి సూత్రములచే విశిష్టజ్ఞాన ముదయింపదు.

తద్ధిత 3. సూ.లో. "చిన్నాదులకు టికవర్ణకం బగు." చిన్న + టికము. కన్నె + టికము. ఇట్లే చుట్టము + టికము, చుట్టటికము. దీనిలో మువర్ణక మెట్లు లోపించినదో గ్రాహ్యముకాదు.

తద్ధిత 17 సూ. "అరివర్ణకంబు మతుబర్థంబునందు జాలాదులకగు" జాదము + అరి, జాదరి. సుంకము + అరి, సుంకరి. మతకము + అరి, మతకరి. వీనిలో మువర్ణము లోపించుటకు సూత్రము కానరాదు.

సంజ్ఞాప్రకరణములో ఙ, ఞ. ఆదియందుగల పదములు తెనుగులో లేవని చెప్పలేదు.

పట్టుక, పండుక ఇట్టి సుప్రసిద్ధరూపముల ననుశాసించలేదు.

తక్, రుక్ మున్నగువానిలోని యిత్సంజ్ఞలకు లోపమును జెప్పలేదు.

క్త్వార్థకకారములకు ప్రాచీనగ్రంథములలో గుప్పతిప్పలుగా బ్రయోగములున్నను సంధిలేదని సూత్రించుట వింత.

కూతురు ప్రథమైకవచనములో "రు" వర్ణము

లేని ప్రయోగము లున్నను నిషేధించినాడు. కూతుండ్రు అనురూపమును సాధించలేదు.

సమాసప్రకరణములో నవ్యయీభావసమాసమును బరిగణించలేదు. మీగాలు, నడిరేయి, మున్నగు ప్రయోగములు కానవచ్చుచున్నవి.

సంధి 34. సూ "షష్ఠీసమాసంబునం దుకారముల కచ్చుపరంబగునపుడు నుగాగమంబగును." ఈ సూత్రమునకు విరుద్ధముగా రూపములున్నవి. మోమందము, శిరసందము ఇత్యాదులందు నుగాగమములేదు. కాన పై సూత్రము సరిగాలేదు.

వ్యంజనమునకు బూర్వమందున్న వర్ణమును గురువని భావించియే "అతిశయముగ బుద్ధిమంతుడగు బుధ సేవన్" అనుచోట వకారమును గురువుగా భావించి యుదాహరించినారు. కాని, క్రియ 50. సూ వివరణలో భుజ్ + ఇయ్ + ఇంచు' అను క్రియలో హల్పగకమైన (భు) అను వర్ణమును లఘువుగా నెట్లు పరికించినారో తెలియదు. ఇది స్వవచన వ్యాఘాతముకాదా?

ద్రుతవిషయము.

సంధి 11 సూ. "నకారంబు ద్రుతంబు" దీని వివరణలో "తాను; నన్నున్; మున్నగునవి చూపంబడినవి. ఈ సూత్ర వివరణములను బట్టి ద్రుతస్వరూపము (న్) హల్మాత్రమా; లేక (ను) ఉత్వ విశిష్టమా? లేక (న) అజ్విశిష్టమా; అను విషయములు నిర్ణయింప నలవిగాక యున్నవి.

సంధి 17 సూ. వివరణలో పూచెను...గలువలు అనుచోట (ను) ఉత్వ విశిష్ట నకారము స్వత్వమని చెప్పుటయు; అట్లే, 21 సూ. ఉదాహరణములో "అదియు నున్నాక" "దివంబుబోలె" అను తావులయందు (ను) అను దానిని ద్రుతముగా నుదాహరించుటచేత నుత్వశిష్ట నకారమే ద్రుతమని స్ఫురించుచున్నది. సంశ్లేషాదులయందు కేవల హల్మాత్రమే ద్రుత మనినట్లు స్ఫురించును.

ఈపట్టున ప్రౌఢ వ్యాకరణ కర్తయు. "ఆగమావ్యయ ప్రత్యయాత్మకంబై యుత్వ విశిష్టమైన నకారమే ద్రుతమని చెప్పినాఁడు" కాని "పదుమూఁడు" దీనియందుఁ గేవల హల్మాత్రమునే ద్రుతముగా నంగీకరించెను. "కమ్మం దేనె" ఇఁట (ని) అను దానిని ద్రుతముగా నంగీకరించినట్లు తోచును. కావున వీరి యనుశాసనము చదువరులకు ద్రుత స్వరూప జ్ఞానమును సరిగాఁ గలిగింపకున్నది.

మఱియు మిన్ను...పడియె ఇది సూరిగారి మత ప్రకారము మిన్ను కళ-కావుననే ప్రథమపై గసడదవాదేశము కాఁగా "మిన్వడియె" అను రూపము సిద్ధించినది. ఇట్లే "కన్ను...పడియె" అను చోట "కన్" ద్రుతమైనది కావుననే గజడదబాదేశమును జెయఁగా "కన్బడే" అను రూపము సిద్ధించినది. ద్విత్వోత్వ విశిష్టములై ప్రథమాంతములైన కన్ను మిన్ను శబ్దములలో ద్రుతకళాభేద మెట్లు వచ్చినదో వివరింపఁబడలేదు.

సంధి 28 సూ. "కర్మ "కర్మధారయంబునం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబున నివచించె" తేనె...ఈగ-తేనెటీగ దుక్కి...ఎద్దు దుక్కిటెద్దు. ఇఁట నుదంతములు కాకున్నను టుగాగమము వచ్చినది. వీటిని పై సూత్రములో సంగ్రహింపలేదు.

సంధి 45 సూ. ఉదంతతద్ధర్మార్థక విశేషణముల లోనే "అది" అను శబ్దము వచ్చునని చెప్పినాఁడుఁ గూడ నీకార్యము కానవచ్చుచున్నది. తెల్ల...అది. తెల్లది; పచ్చది, వీనినిపై సూత్రములో గ్రహింపలేదు.

తత్సమ 12 సూ. "బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు" సమాజము సంఘము మున్నగు శబ్దంబులలో నేకత్వబోధక ప్రత్యయమున్నను బహుత్వ సంఖ్యనే బోధించుచున్నవి.

ఇట్లు పెక్కు తావులందు బాల వ్యాకరణము తెనుఁగు విద్యార్థులకు దుర్బోధమై దురవగాహమై, సంశయంబులకుఁ బుట్టి నిల్లగుచున్నది. దీని పఠనంబునకై పడు ప్రయాసము ప్రాచీన లక్ష్యగ్రంథములలోఁ బడిన బాలురకు మేలని తోచెడిని. పండితమండలి లక్షణ గ్రంథపఠన మావశ్యకమని తలచెనేని ప్రాచీనార్వాచీన ప్రామాణిక ప్రయోగ సంతతి సమగ్రముగా సేకరించి బాలురకు సుగమమగు పద్ధతిని నొక సంపూర్ణ వ్యాకరణమును నిర్మించుట యొప్పు. కాదేని యీ వ్యాకరణమువలన నిర్బంధమును దొలగించి బాలుర కృతజ్ఞతకుఁ బాత్రమగుట లెస్స. భాషా యోషామణి కంఠసీమను మంచి సూత్రసంతతి నలంకరించుట యొండె; కన్నె మెడలో నాపెకు స్వైరవిహార మొనగూర్చుటొండె, లెస్స.

# దౌష్ట్యఫలము

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

సముద్రము, గాలి కూడ నిశ్చలముగా నున్నవి. సముద్రములోవున్న పడవ బొమ్మవలె నిలచిపోయినది. గాలి వున్నకదా పడవ కదలుట.

చడి చప్పుడుకాక, పడుచున్నవి అలలు, సముద్రములో కొండమీద అలలు కొద్దిగ లేచి కొద్దిగ పడుటవలన, ఆకొండకు కట్టిన గంట కదులుటలేదు.

ఆతీరాన్నే బసచేసుకున్న ఒక వృద్ధ సన్యాసి, నావికుల వుపయోగార్థము కట్టినాడు ఆగంట. అది తెప్పమీద తేలుచుండును. అలల తాకుడువలన గంట మ్రోగుచు దానిపనిని అది నెరవేర్చుచుండెను. వర్షాకాలము, తుపాను సమయములందు తెప్ప, గంట కనుపించకపోయినా, నావికులు యీ గంటను విని వారి పడవలను ఆగాధమైన ఆకొండను తప్పించెడివారు.

ఆత్రోవను నడచు నావికులు యీ సహాయమునకు, ఆవృద్ధ సన్యాసిని సదా తలచుచు, వారి కృతజ్ఞతను తెలుపుచుండిరి.

అది ఒకంచి వుల్లాసమైన రోజు ప్రాణి వర్గమంతయు చాల తృప్తిగాను, సంతోషముగాను వున్నది. సముద్రముమీద ఎగురు పక్షులలో, కూజితములందు కూడ, ఒక విధమగు సంతోషము కనబడుచుండెను.

సముద్రపు దోపిడిగాడగు రాముడు విలాసార్థము వాహ్యాళి బయలుదేరినాడు సముద్రములో యీతెప్ప చుక్కవలె స్పష్టముగా కనుపించుచుండెను. రామునిలోకూడ వుల్లాసము పుట్టినది. వాడు చాల ఆనందముగ వున్నాడు. కూను రాగములు తీయుచున్నాడు. కాని వాని వుల్లాసము క్రూరమైనది.

వాని దృష్టి ఆతెప్పమీదకు మరలినది. తోటి నావికులతో "ఓరి మన పడవను ఆ గంట యొద్దకు నడపవలెను. నేను వృద్ధ సన్యాసి పని పట్టెదను." అని చెప్పినాడు.

వాని నావికులు పడవను రాముని యిష్టానుసారము తెప్పయొద్దకు నడపినారు. రాముడు తన పడవలోనుండి వంగి తెప్ప నుంచి ఆగంటను వేరుచేసినాడు.

గంట అస్ఫుటమైన మ్రోతతో మునిగి పోయినది. నీటి బుడగలు బయలుదేరి అణగి పోయినవి. మరల ఎప్పటియట్ల అలలు లేచుచు పడుచున్నవి. "ఆహా యింక యీ త్రోవనునడచు మొదటినావికుడు యీసన్యాసిని తలవడు" అన్నాడు రాముడు ఆనందముతో.

రాముడు ఎన్నోనెల్లు ప్రయాణముచేసి దోపిడివలన డబ్బు బాగుగసంపాదించి యింటి ముఖము పట్టినాడు.

ఆకాశమంతటను దట్టముగా మబ్బుపట్టినది. పైన సూర్యుడు కనుబడుటలేదు.

ప్రొద్దున్నంతయు గాలి హోరునలేచి సాయం కాలమునకు పడిపోయినది. రాముడు పడవ లో నిలబడినాడు. చుట్టుపట్టంతయు చీకటి క్రమ్మి ఎక్కడ తీరము కనబడుటలేదు.

"త్వరలోనే వెలుగువచ్చును. చంద్రు డుదయించు జాడలు కనుపించుచున్నవి." అనినాడు రాముడు.

"అలల విరుగుడు వినబడుటలేదా? మనము తీరముదరినే వున్నట్లున్నది. కాని మనమెక్కడనున్నామో తెలియుటలేదు. అయ్యో, ఆకొండవద్ద గంట మ్రోగిన ఎంతో బాగుండుననిపించుచున్నది." అని చెప్పినాడు వారిలోనొకడు. వారికీ మ్రోతయు విన బడుటలేదు. సముద్రపుహోరు మాత్రము చాల ఎక్కువగనున్నది. గాలి లేకపోయినను ఎట్లో పడవను నడపుచున్నారు.

ఇంతలో పెద్ద శబ్దము!! పడవదేనినో గట్టిగ తాకినది. ఆతాకుడుతో నావికుల గుండెలు జల్లుమన్నవి. "అయ్యో ఆమాయదారి కొండయే" అని నావికులందఱు యేక కంఠ మున పలికినారు.

రాముడు జుట్టు పీకికొనినాడు. తనను తాను శపించుకొనినాడు. ఆఅవస్థలో నలు ప్రక్కలనుంచి అలలుచుట్టి పడవను ముంచి వేసినవి. పడవ మునిగిపోవుచున్నది. మరణా వస్థలోకూడ అస్ఫుటమైన ఆగంట శబ్దం వినుపించుచున్నది. రాముని చెవిలో యమ కింకరులు, వాడు కోసివేసిన ఆగంటతోనే వాని చావుకు సంతోషించుచు ఆహ్వానించు చున్నట్లనిపించినది ఆఘాతకునికి!!



## పరమసుఖము

శ్రీమతి చర్ల సుశీలగారు

మలయశైలశీతల మందమారుతములు
సౌరభంబులజల్లెడు సమయమందు
ప్రకృతినర్తకి నాట్యముల్ సలుపుతరిని
పాటపాడుచు దుమ్మెదల్ వరలువేళ
జిలుకలును ముద్దుపలుకుల బలుకునపుడు
లలితశాఖలువంగి సలాముసేయ
పశులకాపరితనముందు పశువులెల్ల
మేయుచుండగ నొకచెట్టు చాయయందు
బట్టబరచి హాయిగనట బండుకొనియు
వచ్చిరానిపదంబుల పాడుకొనుచు
గోయికోయను కోయిల కూతలకును
దిరిగి కోయని కూయుచు దేపదేప
నవ్వుకొనుచు మదిని మహానందమొందు
పశులకాపరిదే భువి బరమసుఖము.

## గానము

### మాధవా!

శ్రీమతి యెర్నేని శేషమ్మగారు

సాంధ్యరాగము సన్నగిల్లెను
పాంథజనులకు భయముగొల్పగ
నంధకారం బలముకొనియెను
ఎందు వెదకుదు మాధవా!

చిమ్మచీకటి వమ్ముజేయను
రమ్ము రాధారమణ యంచును
నెమ్మిమీరగనిన్ను నెదలో
నమ్మిమ్రొక్కితి మాధవా!

సదయహృదయ త్వదీయసన్నిధి
హృదయమెంతయు పదిలపరిచియు
ముదములోనే మునిగితేలే
విధముదెల్పుము మాధవా!

శిష్టరక్షణ సేతువంచును
కష్టముల్ మదిగణనసేయక
నిష్టగొల్చుచునుంటి, వే
మదభీష్ట మీయుము మాధవా!

దుష్టశిక్షణకొరకు నీవీ
సృష్టి నవతరింతు వందురు
దుష్టమానవకోటి క్రూర
చేష్టలుడుపుము మాధవా!

అందునిందును నెందుజూచిన
పొందుగానీవుందు వందురు
ఎందు వెదకిన యుందువో, నా
కుంచెలియదో మాధవా!

ఆసలన్నియు నంతరించెను
లేశసౌఖ్యము లేదు నామది
గాసిజెందితి కనికరింపుము
దాసురాలను మాధవా!

చిన్ననాటి నీదుచేత
లన్ని మురువశక్యమేయిక
నిన్నుకన్నులగాంచ గల్గెడి
పున్నెమెపుడో మాధవా!

భక్తజనులకు ముక్తినిచ్చెదు
శక్తినీదే యంచు నమ్మితి
భక్తితో ననురక్తితో
నాసక్తిబాడుచు మాధవా!

ప్రేమలోపల ప్రేమవెలుగగ
ప్రేమమయమగు విశ్వమందున
ప్రేమనగు నాపైన నీకరు
ణామృతము చిలుకు మాధవా!

పండువెన్నెల బండుకొనగా
నిండుగా నా నేత్రములలో
నిండియుందువు నిర్మలంబుగ
అంకనీవే మాధవా!

కమ్మతావులు కడలుకొనగా
గ్రమ్మె ప్రేమభావము మెల్లెడ
రమ్మునామది జల్లవరుప, ఏ
కమ్మునీవే మాధవా!

# ఆరోగ్యబోధిని

## గర్భవతి గమనించవలసిన విధులు

సౌభాగ్యవతియగు నెచ్చెలి కమలకు:—

ఆరోగ్యపురి, 4-8-34

నీవు వ్రాసిన జాబునందు నీవు గర్భవతివైతివని తెలియుటచే మిక్కిలి సంతసించితిని. నీవును వివేకవంతురాలవే అయినను అనుభవములేని పసిదానవగుటచేత గర్భవతులు గమనించవలసిన నియమములను గొన్నింటిని దెలుపుచున్నాను. ఆ నియమముల నెరింగి సుఖప్రసవవగుదువని యాశించుచున్నాను.

మనలో నిప్పు డొక్కసారి సంతానము కలుగగనే స్త్రీలు సౌందర్యవిహీనలగుటయు అనారోగ్యవతులగుటయు, మనము కనులార గాంచుచున్న విషయములే. పూర్వకాలపు కాంతలు యెంత సంతానము బడసినను నవయౌవనవతులవలె దారుఢ్యము చెడక సౌందర్యము గోలుపోక నుండెడివారు. అద్దాని కారణము వారివారి నియమముల నతిక్రమింపకుండుటయే. సంయోగముయొక్క యుద్దేశము సంతానము బడయుటకే గాని కామకర్మ గాదు. అట్లుగాక ప్రకృతివిరోధముగా కామేచ్ఛ నివారణగా ప్రవర్తించిన మీరరాని యిక్కట్టు లుత్పన్నమగుచున్నవి.

సంయోగసమయమున మర్మాంగముల రక్తప్రవాహము మిక్కిలి హెచ్చుగా ప్రసరించును. గర్భవతులగు స్త్రీలు కామక్రీడలం దేలుటచే రక్తప్రసారము అధికముగా కలుగుటచే వృద్ధిగాంచు పిండమునకు హాని సంభవించును. ప్రకృతి విరుద్ధమగుటచే తల్లికి కూడ అనేకరోగము లుద్భవించుటకు మూలకారణము. ఆకలి మందము, వాంతి, నీరసము మున్నగు వ్యాధులు నియమవిరుద్ధమువలననే యుత్పన్నమగుచున్నవి. ఇందువలన కేవలము తల్లియొక్కయు, గర్భస్థపిండముయొక్కయు ఆరోగ్యము చెడుటయే గాక పురుషులకు మానసిక శారీరసంబంధములగు ఆరోగ్యము చెడును. గర్భధారణానంతరము గలుగు సంయోగములే మానవకోటికంతకును తీరని దుఃఖములు తెచ్చిపెట్టుచున్నవి. యిప్పటి దినములలో అస్వాభావికపు ప్రసవములు ఎన్ని కలుగుచున్నవో చూడుము. అకాలప్రసవములు, బలహీనులగు శిశువులు గల్గుట మున్నగునవి యింకెన్నియో కలుగుచున్నవి. ఈ కారణములన్నియు గర్భధారణానంతరము స్త్రీ సాంగత్యమువలననే యని ఋజువుచేయుటకు నీకు చిన్ని యుదాహరణము చూపుచున్నాను. వినుము.

భగవత్సృష్టియందలి మానవజాతియందు దప్ప మరి యేయితర పశుపక్ష్యాదులందునుగూడ గర్భము ధరించిన యనంతరము ఏ పశువును సంయోగమున కియ్యకొనదు. వానిలో గర్భధారణకు నొక్కొక్క నియామకము ఋతువున్నది. కాని సృష్టియందలి పరమోత్కృష్టజాతి యనదగు మన మీ నియమము నుల్లంఘించి దైవమునకు వ్యతిరిక్తులమగుటచేతనే యిన్ని బాధలకు లోనగుచున్నాము. మంత్రసానులు, యంత్రసహాయములు లేకుండ ప్రసవించుట మిక్కిలి యరుదగుచున్నది. కాని ప్రకృతి నుల్లంఘించని జంతుకోటియం దెక్కడనైన ప్రసవకారణములచే దేహారోగ్యము చెడుట మన మెన్నడైన కని వినియున్నారమా? వాటియందు మనవలె ప్రసవసమయమున అన్యసహాయములను గాంచుచున్నామా? మృగపక్ష్యాదులు మొదలగునవి ప్రసూతియైన వెంటనే తమతమ వ్యాపారములలో స్వేచ్ఛగా

మెలంగుచు ప్రసూతియయినటులే కాన్పించవు. మానవజాతి ప్రకృతి విరోధముగా వ్యవహరించుట చేతనే మన స్త్రీ జాతికి అస్వాభావికముగాను అసౌఖ్యకరముగాను ప్రాణోపద్రవముగాను గాన్పించు రోగము లెన్నో ఉత్పన్నమగుచున్నవి. కావున ముఖ్యముగా గమనించవలసిన నియమములలో స్త్రీ ఆరోగ్యముగానుండుటకు గర్భవతియైన వెనుక యెంతమాత్రమును పురుషసంయోగమున కియ్యకొనరాదు.

మనలో మరియొక దురావేశ మావహించినది. స్త్రీలు గర్భవతులు కాగానే మిక్కిలి బీదవారు అనగా కేవలము కూలి నాలివలన జీవించువారు తప్ప మిగిలినవారు ఎంత చిన్నపనియైన నొనర్చిన ఆస్త్రీ శరీరము అలసిపోవుననియు, అపాయము కలుగుననియు తలంచి యెట్టిపనియు చేయనీయరు. అది మిక్కిలి పొరబాటు. గర్భవతి ఏపనియుచేయక కదలకయుండినచో నాడులయందలి రక్తప్రసారము మందగించును. బద్ధకము, మాంద్యత, సోమరితనము వృద్ధియగును. గర్భస్థమగు పిండమునకు యిట్టి నిర్బంధములచే పోషణ జరుగుటకు శక్తి చాలక కృశించి అనారోగ్యులు, బలహీనులగు శిశువు లుద్భవింతురు. స్త్రీలుగూడ అనారోగ్యములపా లయ్యెదరు. కావున మన నియమితకార్యములను చక్కగా చేసుకొనుచుండవలయును. శ్రీమంతులు గర్భము ధరించినచో దాసదాసీజనుల నేర్పరచి తమ కృత్యములు నెరవేర్పించుకొందురు కాని సామాన్యకుటుంబికులు పేదవారు తమతమ పనులను తామే స్వయముగా నిర్వర్తించుకొందురు. కావుననే భాగ్యవంతులయందుకన్న పేదవారియందే సుఖప్రసవములు హెచ్చుగా గానవచ్చుచున్నవి. కొందరు పల్లె గ్రామములలో నివసించు కొండజాతివారు మున్నగు గర్భిణులు నాట్యమొనరించియు, ఆయాసపడకుండుటయు సుఖప్రసవమగుటయు యిందుల కుదాహరణము. శిశువులకు అపాయమేమియు కలుగదు. యేనాదులు, యెరుకులు మున్నగు బిచ్చమెత్తుకొను బీద జనులుకూడ ప్రసవసమయ మగుపరకు వీధులవెంట కష్టపడి దిరుగుటయు, ఏ బాధయులేక సుఖప్రసవమగుటయు మనము కనులార గాంచుచున్నాము గదా. కావున సోమరితనమున అన్నిపనులను మాని వుండరాదని హెచ్చరించుచున్నాను.

ఇక నొక విషయము. గర్భవతులు ఏవిధమగు విచారములతోను వుండరాదు. పరిశుభ్రమగు వస్త్రములు ధరించుచు నిర్విచారముగాను, మనోల్లాసముగాను, చురుకుగాను, సంచరించుచుండిననే ఆరోగ్యవంతులు, రూపవంతులునగు బిడ్డల గందురు. ఎల్లప్పుడు దురాలోచనలకు తావీయక సద్గ్రంథకాలక్షేప మొనర్చుచుండవలయును. కలకల నవ్వుచుండవలెను. అట్లయినచో పరాక్రమవంతులు, తేజోవంతులునగు బిడ్డ లుద్భవింతురు.

మరియొక్క విషయము నీవు ముఖ్యముగా గమనించవలసినది: మనలో గర్భవతులైనచో బంధువులు మున్నగువారు ఫలహారములు మున్నగునవి విస్తారముగా యిప్పించెదరు. ఏపనియు చేయనీక కూర్చుండి చిరుతిండ్లు మున్నగునవి తినిన జీర్ణకోశము చెడి అనేకవిధములగు వ్యాధు లుత్పన్నమగును. కావున నియమితాహారమునే గమనించుచు త్వరలో జీర్ణించు ఆహారమునే తినుచుండవలయును. ఎల్లప్పుడును సోమరితనముగా నిద్రించరాదు. కర్ణకఠోర వాక్కులు, భయానకదృశ్యములును గాంచరాదు. అట్టి చోటకు పోవుచుండరాదు రాత్రులందు విస్తారము మేల్కొనుట, పగటిపూట నిద్రించుట మున్నగు దురలవాటులకు లోనుగారాదు.

కావున నేనేమో వ్రాసితినని యెంచక యీ నియమములను పాటించి సుఖప్రసవవయితివని తెలియజేయు జాబు వ్రాసెదవని తలంచుచున్నాను. కరుణాళుడగు పరమేశ్వరుడుగూడ నా యీ యాప్సితములు నెరవేర్చుటలో నీకు సహాయపడు గాకయని కోరుచు యింతటితో నీ జాబును విరమించుచున్నాను.

ఇట్లు భవదీయ హితాభిలాషిణి,

ప్రియసఖి,

'రాజేశ్వరి.'




## —ఫలరస కదంబము...

అయిదు తులములు కొబ్బరికాయనీళ్ళు, (5) తులములు దబ్బపండ్లరసము (5) తులములు నిమ్మపండ్లరసము, (5) తులములు తియ్యమామిడిపండ్లరసము, (5) తులములపడఁగట్టిన యరఁటిపండ్లరసము, (5) పండ్లద్రాక్షరసము, (5) తులములు వెలఁగపండ్లరసము, ఈ రసములన్నియు నొక కుండలోఁబోసి యరగడియ కాలము బాగుగా నేతిలోఁ దఱచవలెను.

తరువాత వేఁడిపాలు పావుశేరు, మూఁడుతులముల యాలకులపొడిన్ని రసములోఁబోసి మూత యుంచవలెను.

తియ్యని పెరుగు మూఁడు తులములు తెచ్చి యందులో ½ తులము అల్లము(3)తులములు అక్రూటు పప్పు (3) తులములు బాదంపప్పు (3) మూఁడు తులములు గసగసాలు, వీటి నన్నిటిని నూరి వడియగట్టిన పాలునూ, (3) తులముల మైదాపిండి, (3) తులముల శెనగపిండి, బాగుగాఁ గలియఁబెట్టి నిప్పుల మీద వెచ్చచేసి పైరసములోఁ బోసి మరల కలియఁ బెట్టవలెను.

మూఁడుతులముల పన్నీరు పావుతులము పచ్చ కర్పూరము పదిచుక్కలు గలాబిఅత్తరు, అందులో వేసి పుల్లతోఁ గలఁదీయవలెను. ఇదంతయు సిద్ధమైన వెనుక అయిదారు నిముషములు నిప్పులమీదనుంచి దింపవలెను. ఈ ఫలరసకదంబము చల్లారిన వెనుక సీసాలలోఁబోసి వాసన పోకుండునటుల మూతి బిగించి ప్రతిదినము ఉదయము సాయంకాలము ఒక్కొక్క తులమువంతున సేవించిన మేహసంబంధ రోగములు పోగొట్టుటయే గాక బలము, తేజస్సు మొదలగునవి కలుగఁజేయును.

## —పన్నీరు పానకము—

ప్రశస్తమైనది, సువాసనగలది, ముప్పది తులముల పన్నీరుదెచ్చి అందులో ముప్పది కొబ్బరికాయల నీళ్ళు, 10 తులముల నిమ్మపండ్లరసము, పోసి పది నిమిషముల వఱకు భూతులసి కొమ్మతోఁద్రిప్పుచుండవలెను.

తరువాత 5 తులముల యాలకులపొడి పాకములోఁ గలిపి వడియగట్టి యుంచవలెను. ఇరువది తులముల పంచదారను పాకముపట్టి, యందులోఁ బానకము కలిపి ప్రతిదినము సేవించిన యెడల మేహవాతములు నివారణయగును.

—చదలవాడ రాఘవాంబ.

## —అమృతపాణీలు చేయువిధము—

1 సేరు బియ్యం నీటిలో నాననిచ్చి అవి బాగుగా కడిగి రోటిలోవేసి మెత్తగా రుబ్బవలెను. ఒక టెంకాయ తురిమి అదికూడా పిండిలోవేసి మెత్తగా రుబ్బవలెను. అందులో 2 సేర్ల పాలు కలిపి, సేరు చక్కెర కల్పి అది ఒక వెడల్పు గిన్నెలో పోసి పొయ్యిమీదపెట్టి కింద మంటపెట్టవలెను. వుండకట్టకుండా కలుపుతూ వుండవలెను. అట్లు కలుపుతూవుండగా ముద్దలాగు అవును. దానిలో యాలకులపొడి పచ్చకర్పూరం చేర్చి కలిపి క్రిందదింపి ఒక పీటకి చమురురాసి దానిమీద గరిటెతో పాలముంజెలవలె పోయవలెను. అటుల యిష్టము లేనివారు అంతా పీటమీద యేకముగా తరచి చల్లారిన తరువాత చాకుతో బిళ్ళలవలె కోయవలెను. అవి వేరుగా పళ్లెరములో వుంచి వుపయోగించిన యడల చాలా రుచికరముగాను మృదువుగాను వుండును. ఒకసారి మా సోదరీమణులు చేసి దాని రుచిని గ్రహింతురుగాక.

కాంచనపల్లి వెంకటవరహా రంగనాయకమ్మ.

# మనోరమా సంఘము

## మా సంఘనిర్మాణము

శ్రీమతి దివాకర్ల శారదామణిగారు

ఉత్తమప్రతిభావంతులగు కవీంద్రులు స్త్రీ విషయికమగు రచనలచేతనే చారుతరమైన కీర్తి గణించుచుండుట ఎల్లరెఱింగిన విషయమే. ప్రపంచమునందన్ని జాతులలోను వాఙ్మయ ధురంధరులైన కీర్తికాములకు రమణీయ రమణీ కథాలోలుపత్వ మొక సాంప్రదాయమైపోయినది. ఇది నూతనముగ మాచే కనిపెట్టబడినది కాదని పాఠకులకు తెలిసియే యుండును. కాని మేము చెప్పబోవు మాయుద్యమ సాఫల్యమునకును ఏతన్మూలమగు తమ యామోదమునకును ముఖ్యముగ చెప్పవలసి వచ్చినది. మేమనుట యేల? గ్రంథకారులును తమ కావ్యములలోని ఘనతకు సారమనియు కాంతావిషయికమగు ఘట్టములయం దున్నదని యేకగ్రీవముగా నంగీకరించుచునే యున్నారు. ఆదికవీంద్రుడగు వాల్మీకి మొదలు అధునికులగు భావకవుల వఱకు అందఱు నొక్కరీతిగ స్త్రీల యుత్తమచరిత్రముల ఘోషించుచునే యున్నారు.

స్త్రీజాతిపట్ల కవులొనర్చిన మహోపకారమునకు వినుతిమణులు హృదయాంతరాళములనుండి ధన్యవాదము లొసంగవలసి యున్నది.

అట్లయిన స్త్రీల దుర్వర్తనములనుగూర్చి 'నోరూర జవులుపుట్ట' కవులు వర్ణించుట లేదా యని కొందరడుగవచ్చును. ప్రపంచమున కద్దమువలె నిర్మింపబడవలసియున్న కావ్యములం దుత్తమకవులు గూడ పతితులగు స్త్రీల దుర్గుణములను జక్కగ ప్రతిఫలించునట్లు లోకమునకు జూపించుచునే యున్నారు. చిత్రవిచిత్రాతి చిత్రమైన ప్రపంచమున మానవజాతియం దెన్నెన్ని వ్యక్తులున్నవో అన్ని భిన్నభిన్న ప్రకృతు లుండుట నిర్వివాదమగు నంశము. ఈ మహామాయా జగన్నాటకమున వేయరాని వేషములను వేయుచు, చేయరాని పనులను చేయుచు, పాడరాని పాటలను పాడుచు నభినయించు పాత్రములను గూడ కవుల కవితా సృష్టియందు గోచరించుచునే యున్నవి.

సృష్ట్యాదినుండి కవులింత సూక్ష్మతర సూక్ష్మతమ భేదముతో స్త్రీలను చిత్రించుచున్నను అగాధమగు కాంతాహృదయ మిప్పటికిని దురవగాహమై యున్నదని విద్వాంసు లూహించుచున్నారు. స్పష్టముగ కవులచే వర్ణింపబడియు స్త్రీల స్వభావ మిట్లస్పష్టీకృత తత్త్వమగుటయే లోకమునకు మహామోహనకరముగ నున్నది.

అందువలన కాంతోదంతముల నెవ్వ రెన్నివిధముల చిత్రించినను ఆకర్షణీయముగ నుండకపోవు. స్త్రీల యపాంగ వీక్షణమునందున్న వశీకరణశక్తి నిరుపమానమైనది. కనకమునకైన నట్టి శక్తి లేదు గద! సామాన్య గృహస్థుల యిండ్లుగూడ నవరసములకు నిలయమగుటకు గృహిణీమణులే మూలము గద!

ఏ యేదేశముల స్త్రీలు గౌరవస్థానముచే నలంకరింప బడుచుందురో ఆ యా దేశములు నాగరికతయందగ్రస్థానముల బొందగల్గునని నిశ్చయముగ చెప్పవచ్చును. అనేక శతాబ్దము లంధకారమున బడియున్న హైందవ నారీసంఘమున కిటీవలనే అజ్ఞానతిమిర విధ్వంసమై ఒక్కమారుగ జ్ఞానభానూదయమగుట కవకాశము లేర్పడినవి. అయినను ఎన్నో తరములనుండి అంధకార బంధురమగు నజ్ఞాతవాసముల నివసింప నలవాటుపడిన స్త్రీసంఘ మింకను పరిపూర్ణముగ జ్యోతిర్మయమగుచున్న ప్రపంచము నుపలక్షించుటకు జంకుచునే యున్నది.

మన సంఘోన్నతికి గుదిబండలని చెప్పదగిన విద్యావిహీను రాండ్రకు సాధ్యమైనంతవఱకు యుక్తా



తాడేపల్లిగూడెం సతీహితసమితి వార్షికోత్సవము
శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు, సభాధ్యక్షురాలు.



శ్రీమతి కపిలగౌరి భగూబాయ్ దేశాయ్ గారు
బ్రోచి జిల్లాబోర్డు సభ్యురాలు (ప్రభుత్వనియమిత)
బ్రోచిజిల్లా విద్యాశాఖ బోర్డునకు ఉపాధ్యక్షురాలు.



శ్రీ కుమారీ పద్మావతిగారు

ఇంగ్లాండులో నిపుడు బెడ్ఫర్డ్ కాలేజియం దున్నత

విద్యాభ్యాస మొనరించుచున్నారు.



భగారా జలపాతము, జయపురసంస్థానము.

యుక్త పరిజ్ఞానమును గలిగించి ఏతన్మూలముగ సాంఘిక సేవ చేయుటయే విదుషీమణుల ప్రధాన కర్తవ్యము.

ఏకోలదిగనో చదువుకొనియున్న మే మయిదుగుర మొక సంఘముగా నేర్పడి మాచేత నైనంతవఱకిట్టి సేవ నేయుటకు సంకల్పించుకొంటిమి. మాలో నాంగ్ల భాషాపరిజ్ఞాన మున్నవారు స్పెక్టేటర్ క్లబ్బునకు (Spectator Club) ప్రతిగా మా సంఘవ్యాపారములను నిర్వహింప వలయునని వాంఛించు చున్నారు. ఆంధ్రభాషాభిమాన మాననీయులగువారు తెలుగు దేశమున "సాక్షి" సంఘ మొనరించిన సేవనే ఆంధ్ర మహిళాలోకమునకు మాసంఘ మొనర్పవలెనని యాసించుచున్నారు. కాని మే మేమైన సేవను జేయగలమో లేమో, లేక పైసంఘముల నకిలీ రూపమున పరిహాసాస్పదుల మగుదుమో యేమో, కాలక్రమమునగాని యెట్లు చెప్పవచ్చును? ఇట్టి పూనికతో మే మైదుగుర మొకచోట చేరినపుడు మా సమాజమున కేమిపేరు పెట్టదగునని యూహించితిమి. మహిళాసమాజ మని సర్వసాధారణమైన పేరుంచక పైన చెప్పిన స్పెక్టేటర్ సాక్షి సంఘములవలెనే మా సమాజములో నిర్వాహకుల పేరేయుంచి కార్యసాధన మొనర్పవలయునని నిశ్చయింపబడుటచేత మా సంఘమునకు "మనోరమాసమాజ" మను నామకరణ మొనర్పబడినది. మిగిలిన సభ్యురాండ్రకువలె విద్యాధిక్యతగాని, వాచాలత్వముగాని, కార్యోత్సాహముగాని, నావద్ద లేకపోయినను మిత్రురాండ్ర పట్టుదలచేత నే నీ సంఘమునకు వ్యవస్థాపకురాల నన్న పేరును వహించి సంఘసమావేశ నిర్వహణ ఉపసంహరణాది కార్యములను సాగింపవలసిన దాననైతిని.

పైన పేర్కొనబడిన సాక్షి సంఘోపన్యాసములవలెనే మా మనోరమా సమాజోపన్యాసములు గూడ ఆంధ్రమహిళాలోకమున కాకర్షణీయముగ జేయ సంకల్పించితిమి. సమాజనిర్వహణభారము నాపై బడియున్నను అందులకు తగినంత నైపుణ్యముగాని వ్యాసరచనా విషయికమగు శక్తిగాని లేకపోవుటవలన నా లేఖలయందు స్ఖాలిత్యము లుండవచ్చును. "ప్రమాదోధీమతామపి" అను నార్యోక్తిని బట్టి బుద్ధిశాలురకును ప్రమాదములు సహజమై యున్నప్పుడు అల్పవిద్య నభ్యసించియున్న మావంటి యాడువాండ్ర కుండకపోవు

ఇక మాసంఘసభ్యులను గూర్చి పాఠకులకు చెప్పవలసియున్నది. నే నెట్టిదాననో నేను వ్రాయువ్రాతలను బట్టియే గ్రహింపవచ్చును.

మా సమాజసభ్యురాండ్రలో ప్రథమగణ్య ప్రియంవద. ఈమె మనదేశమున నెల్లప్రాంతములను దర్శించియున్నది. ధీరస్వాంతయగు నీమె బాల్యప్రాయముననే మనదేశమందలి కన్యా మహావిద్యాలయమున గురుకులమున నుండి విద్యోపార్జన మొనర్చినది. కొంతకాలము పూనా మహావిద్యాలయమున డిగ్రీ చదువులను కూడ కడతేర్చుకొన్నది. విసుగు విరామములు లేకుండ ఎట్టి విషయమును గూర్చియైన ప్రసంగింపగలదు. గంగాప్రవాహమువంటి అనర్గళధారతో నుపన్యసింప నేర్పుగలది. వేదకాలమందలి వేదవతి మొదలు ఆధునిక కాలమందలి అన్నపూర్ణవఱకు ప్రఖ్యాతివడసిన యాడువాండ్ర నెల్ల తాను స్వయముగ జూచినదా యను భ్రాంతికలుగునట్లు మాట్లాడగలదు. నూఱదిలకొలది ఏండ్లక్రిందటనే పరహస్తగతమైన హైందవజాతి యింకను సజీవముగా నుండుటకు హైందవస్త్రీల శీలమే ముఖ్యకారణమను నభిప్రాయము గలది. మన సౌభాగ్యలక్ష్మి పరహస్తగత మగుటకు పురుషులే కారణమైనను దానిని రక్షించుకొనుటకు స్త్రీలే సదా నేర్పువహింపవలయునని యుద్బోధించునది.

ఈమెయే మా సమాజమునకు జంఘాలశాస్త్రియై నిరాఘాటమైన వచఃపాటవసంపన్నతచేతను, నిరుపమాన పాండిత్యాతిశయముచేతను, లోకజ్ఞాన విశేషముచేతను, హాస్యరసప్రధానమైన కథా కలాపములచేతను, కేవల బిడబిడాయమానమైన వాగాడంబరముచేతను మా మనోరమా సమాజమునకే కాక సర్వాంధ్రమహిళా సమాజమునకును హర్షదాయినియై విదుషీమణుల జిహ్వాగ్రములపై తాండవింపగలదని సాహసించి చెప్పగలను.

ప్రియంవదకు తరువాత మా సమాజమున పేరెన్నిక గాంచదగిన యువతీమణి లీలావతి. ఈమె ఆంధ్రులయింట బుట్టిన ఇంగ్లీషుదొరసాని యని చెప్పదగును. చెప్పదగుటయే కాదు. ఆమె యట్లనిపించుకొనుటకే కుతూహలముందుచుండును. ప్రియం

వదినపై డిగ్రీనందుకు జదువక పోయినను ఈమె సర్వజీవిత వ్యాపారములను ఆంగ్లభాషయందే నిర్వర్తింప నభిలషించుచుండును. కాని ఆంధ్రభాషయందే మా సమాజవ్యవహారముల నిర్వర్తింపవలయునను నియమముండుటచేతను ఆంగ్లభాషాభూయిష్ఠమగు "లెక్చరుల" మేమంతగా నవగాహనము చేసికొన సమగ్రతలేనివారమగుటచేతను ఈమె యాంధ్రమున భాషింపక తప్పదయ్యెను. అయినను నడుమ నడుమ సంబారు గుడుపులవలె పంచదార పాకమున మిరియపుగారములవలె చేయగల ఇంగ్లీషు మాటలను ప్రయోగించుచునే యుండును. ఈమె యెల్లప్పుడు నాంగ్లేయ కాంతాశిరోమణులవలె ప్రవర్తింప నూహించుచుండును. లీలావతి యన్న పేరంత బాగుగ లేదని తన పేరు "లైలా" యని వ్యవహరించుచుకొనుచు "లీలా ఆర్ ది స్టార్ ఆఫ్ మాంగ్రెలియా" (Leila or the Star of Mangrelia) యను విఖ్యాత గ్రంథ నామము ననుసరించి తానును ఆ గ్రంథమహిళల యందలి 'స్టారని' యనిపించుకొన కుతూహలముండుచుండెను. వేషభాషాది వ్యవహారములం దెల్లప్పుడును పాశ్చాత్యుల పద్ధతుల ననుసరింప ముచ్చటపడుచుండును. జగమెఱింగిన క్రీడావతియగు లీలారావుగారివలెనే ఈమెయు కూడ టెన్నిస్ ఖేలనా సమయములం దాంధ్రస్త్రీసాధారణమైన దుస్తులను ధరింపక "షార్ట్సు" (Shorts) తొడుగుకొని ప్రత్యక్షమగును. వేయేల? భారతీయస్త్రీలు నిస్సంకోచముగ నన్ని విషయములలోను పురుషులను మించి పాశ్చాత్య వైఖరుల నవలంబింపవలయునని ఈమె యెల్లప్పుడును చెప్పుచుండును.

మూడవ సభ్యురాలి నామము కామేశ్వరమ్మ. ఒక్క వాక్యములో ఈమెను వర్ణింపవలెనన్న ఈమె పూర్వాచారపరాయణురాలని చెప్పవచ్చును. లీలావతి యెంత నవనాగరికాభిలాషిణియో ఈమె యంత ప్రాచీనాచారపరాయణురాలు. వనితాలోకమున గలుగుచున్న నాగరికమార్గముల జూచి ఈమె కంటగించుకొనుటయే కాక "మాలచదువు" లనియు, "మాలపోకడ" లనియు నేవగించుకొనును. పల్లెటూళ్లలోగూడ నాధునిక పద్ధతులచేత నుత్తమ మార్గములన్నియు పూర్తిగ జెడిపోవుచున్నవనియు భారతీయ సాంప్రదాయములన్నియు సర్వనాశనమగుచున్నవనియు నీమె వ్యసనపడుచుండును. ఈమె నిసర్గభావము లెట్టివో ముందు ముందు పాఠకులే తెలిసికొనగలరు.

ఇక మా సమాజమున గవయిత్రియగు కళావతిని గూర్చి వ్రాసి మా సమాజసభ్యురాండ్రను గూర్చిన యుపోద్ఘాతమును ముగించెదను. ప్రథమాచార్యుడగు నన్నయభట్టారకుని మొదలు ఆధునికోత్తములగు భావకవులవఱకు నాంధ్రకవుల కవిత్వపద్ధతుల నీమె లెస్సగా పఠించుటయేగాక ఆయాకవుల కవిత్వవైఖరుల ననుసరించియు కవయింప సమర్థురాలని నా యూహ. నవరసభావాలంకృతమైన కవిత్వమును చెప్పవలయునన్న సహజముగ పురుషులకన్న కృషి చేసినచో స్త్రీలే మనోహరముగ చెప్పగలరనియు సర్వజీవిత వ్యాపారములలోను స్త్రీలకు తగిన స్థానమీయకుండ పురుషులు తమ చేతులలో నుంచుకొని సర్వ హక్కులను "మొనాపలైజు" చేసుకొనినట్లే కవితాస్థానమునుగూడ స్త్రీల నంతగ పైకిరానీయకుండ జేసిరనియు తగినంత కావ్యకళాపరిశ్రమావకాశము లేర్పడనియెడల ప్రతిభావిశేషముగల కవయిత్రు లన్ని దేశములలోను తప్పక నుదయింపగలరనియు నీమె యూహించుచుండును.

మా యుద్యమమునుగూర్చి ఈ గృహలక్ష్మి పత్రికాముఖముననే విదుషీమణులు తమ తమ యామోదములను తెలియజేయవలసియున్నది. నాగరిక ప్రపంచమున స్త్రీల కావశ్యకమై, చర్చనీయమైన మహోదంతములను గూర్చియు ఆశయములను గూర్చియు వృద్ధిమార్గములను గూర్చియు మేము ప్రసంగింతుము.

సాక్షి సంఘోపన్యాసములవలె నుండవలెనని జంఘాలశాస్త్రిచే కొన్నిచోట్ల పలికింపబడినట్లు నవ్వించుటయే పరమప్రయోజనముగ నసభ్యమైన మోటుహాస్యము లొనర్చుటగాని పచ్చిగ మాట్లాడుటగాని చేయువారము గాము. అట్లొనర్చుటయే గాక నిర్హేతుకముగ మాతృస్థానమైన స్త్రీజాతిపై జంఘాలశాస్త్రి యొనర్చియున్న యెకసక్కెములకు, ఎగతాళులకు మఱియు జెప్పరాని అత్యాచార ప్రసంగములకు సామర్థ్యాహాసతరళముగ మే మాయాతావుల యుక్తసమాధానము లిచ్చుటకూడ జరుగవచ్చును.

# వార్తలు విశేషములు

## రజస్వలానంతర వివాహము.

నారాయణవరం 20-9-34:— ఈ యూరికి మూడుమైళ్ళ సమీపమున పుత్తూరు గ్రామములో యుండు ఆర్యవైశ్యులగు తూ.ము.రా. నరసింహులు శ్రేష్ఠిగారి కుమార్తెను (రజస్వలానంతరం) ప్రొద్దుటూరు వాస్తవ్యులగు దొంతి నారమ్మగారి సుబ్బయ్య శ్రేష్ఠి కుమారుడు సుబ్రాయశ్రేష్ఠికిచ్చి యీనెల 13 వ తేది పుత్తూరులో వివాహము జరుగను. యేలాటి ఆక్షేపణలేక ఆర్యవైశ్య శ్రేష్ఠులందరు వివాహము నకువచ్చి విందారగించిరి. ఈ వివాహమును నిర్విఘ్నముగా కొనసాగించిన ప్రొద్దుటూరు వాస్తవ్యులగు శ్రీయుతులు కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారంతయు వందనీయులు. సి. వి. రంగంశ్రేష్ఠి.

## నారాయణవరం.

చిత్తూరుజిల్లా—ప్రాథమిక పాఠశాలలు—హరిజన విద్యార్థులు.

ఈ దిగువ కనిన ప్రకారం 3031 పలకలు చిత్తూరు జిల్లా డిప్యూటీఇన్స్పెక్టరుకు పంపినాము.

చంద్రగిరి-453, చిత్తూరు-605, కాళహస్తి-448, మదనపల్లి-126, పలమనేరు-207, పుత్తూరు-802, తిరుత్తణి-319, నాయల్ పాడు-65, మొత్తం 3031. వారివారి రేంజిలోయుండు హరిజన బాల బాలికలకు ఉపాధ్యాయ సంఘముల మూలముగా పంచిపెట్టెదరు. చిత్తూరుజిల్లాలోయుండు ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులు వెంటనే వారివారి ఉపాధ్యాయ సంఘ కార్యదర్శిగారివద్దనైనను లేక డిప్యూటీ ఇన్స్పెక్టర్ వారి వద్దనైనను పుచ్చుకొనవలయును. సి. సి. రంగంశ్రేష్ఠి,

చిత్తూరిజిల్లా హరిజనసేవాసంఘ కార్యదర్శి.

లండనునగరములో నొక గృహస్థునకు గొంత కాలము క్రిందట నేదో యొక రోగముమూలన రెండు కండ్లును గనబడకపోయెను. పాప మా పేదవాడనేకమంది వైద్యులవలన చికిత్సనొంది యేమియును లాభ మొందలేకపోయెను. "ఇక నీకు దృష్టిగలుగ" దనియే యెంతెంత గొప్పగొప్ప వైద్యులో నిర్ధారణ చేసి చెప్పిరి! పాప మా పేదవా డేమిచేయగలడు? "ఆశలన్నియును అడుగంటి నప్పుడు హరినామస్మరణమే శరణ్య"మని యనుభవశాలురగు పెద్దలు చేసిన సిద్ధాంతమొకటి యున్నదికదా!! దాని చొప్పుననే వాడు గూడ బరిపూర్ణ విశ్వాసముతో విధిని రామమూర్తి యాశ్రయించి ప్రార్థనల చేయ మొదలిడెను. కాలక్రమమున గొంచము కొంచముగా నాతనికి దృష్టి రాసాగెను. ఇప్పు డాతడు మామూల యథా ప్రకారముగా లోకయాత్ర సాగించుకొనుచున్నాడు. వైద్యప్రపంచమంతయును నాడీనుని ప్రశ్నించుచున్నారు, ఆతడు "నమ్మి చెడినవారు లేరు నమ్మక చెడిపోతె పొయ్యేరు" అని యీ భిషగ్వరులకును దక్కిన లోకమునకు కంతటికిని గూడ సమాధానము నిచ్చుచున్నాడు.

బరువు నీరు అని చెప్పబడు ఒకరీతి జలము సైంటిస్టులకు అత్యావసరమైనది. ఇందులో హైడ్రజనుకంటె ఆక్సిజను ఎక్కువగా నుండును. దీనిని తయారుచేయ పలనన్ను ఒకముక్కకు రు 700 ఖర్చగునట. ఇట్టి జలము సైబేరియాలో బైకాల్ అనే సరస్సుయొక్క అడుగున అపరిమితముగ నున్నదని తలచబడుచున్నది. ఇంత లోతైన మంచినీళ్ల సరస్సు ప్రపంచమున నెచ్చటను లేదట. దీని అట్టడుగున కిదివర కెవ్వరును పోలేదు. ఎంత లోతుకు వెళ్లి జలము తెచ్చిన అంత యెక్కువ బరువైన జలము లభించుచున్నదట. ఇట్టి జలము లభించినచో కమ్యూనిష్టు రష్యాభాగ మింత అంత అనడానికి వీలులేదు.

# బాలవిజ్ఞానశాఖ

## పిల్లల పాటలు

శ్రీమతి గోపరాజు రామలక్ష్మిగారు

కలము : రూపమేది ? రమ్యమేది ? నీకు నేను లేకయున్న
నాదుపటిమ లేమియింత జీవమున్నదా? నీకు జీవమున్నదా?

సిరా : కాగితమ, కాగితమ, తగువుతీర్చుమా
ఎవరుగొప్ప యిందులో నెంచిచూడుమా—నీవు ఎంచిచూడుమా.

కాగితము : నీకు గొప్పయింతలేదు, అంతకంటె నీకులేదు
నాదు గొప్పలేదుగాని లేశమైన చెప్పుచుంటి,
కలము నిన్ను పట్టుచుండు, పట్టి నాకు మెఱుగువెట్టు
మనకు జీవమొసగుచుండు కవికుమారు డెల్లయప్డు
అతడు లేకయుండెనేని మనమువెక్కడే, ఇంక మనమువెక్కడే!

—:o:—

## పిల్లల పాటలు

శ్రీమతి శ్రీపాద లక్ష్మిదేవిగారు

1. రాజుగారి నగరిలోను
రతనాల రాసులట !
మాయింటి పెరటిలోను
మాలతీ పూవులోయి !
రతనాల రాసులలో
రంగురంగు కాంతులట !
మాలతీ పూవులలో
మంచిమంచి తావులోయి !

2. పాఠాలయినవి, బడిమూసిరి ఇక
అటకుపోవుద మందరము !
అటబయలలలో ఆడుదము !
ఆడుచుపాటలు పాడుదము !
పాడుచుపరుగులు తీయుదము !
తీయుచు కేకలు వేయుదము !
వేయుచుయింటికి పోవుదము
దీపము వెలుగున కూరుచోని.
రేపటిపాఠము చదువుదము.

3. పీచుపీచు కాని,
బీరపండు పీచుకాదు,
రంగుపమో ఎరుపుకాని
రాగితీగెల జూలుకాదు
ముడిపడదు,
మెలివిడదు,
ఏమోఅది,
ఎరుగుదువా ?
ఎరుగకుంటె వినవోయి,
మరియేమి కాదోయి,
బావాబావా నీపిలకే !

4\. పచ్చగడ్డితోపు పాకలోపుట్టింది,
పెరటితలుపువేయ మరచిపోయి,
మాటలాడుచుండె మాతాతఅవ్వతో,
మేకలంత మేపుమేసిపోయె,

ఆమాటవినినేను అపుడుపరుగునవచ్చి,
కథలుచెప్పుమింక కథలటంచు,
తాతచుట్టుతిరిగి తప్పట్టుకొట్టగా,
తగిలెనాకుచంప దౌడమీద.

—:0:—

## కుంచముభొట్లు

శ్రీమతి జన్మి కనకవల్లీబాయిగారు

ఒకయూరిలో, ఒక పొట్టిబ్రాహ్మణుడు ఉండేవాడు. ఆ వూరిలోనివారందరు ఈతనిని "కుంచముబొట్లు" అని పిలుచుచుండేవారు. ఈతనికి అందరు అలాగు అంటే కోపము వచ్చేది.

ఒకనాడు ఈతని భార్య భర్తతో "అయ్యా, కుంచముబొట్లుగారూ! భోజనమునకు రండు" అని హేళనచేసినది. ఈతనికి కోపమువచ్చి ఆమెను పాతివేసెను. అది ఒక జొన్నమొక్కయై పుట్టినది. అది "విస్! విస్! కుంచముబొట్లూ!" అన్నది. వెంటనే దానిని తీసుకొనిపోయి ఒక గేదెకు పెట్టెను.

ఆగేదె దానిని నములుచు "పర్! పర్! కుంచముబొట్లూ!" అన్నది. దానిపై కోపమువచ్చి దానినిచంపి దాని చర్మముతో జోళ్లు కుట్టుకొని, దానిని కాలుకి వేసుకొని వీధులలో పోవుచుండగా అది "కిర్! కిర్! కుంచముబొట్లూ!" అన్నది. ఆతనికి జోళ్లపై కోపమువచ్చి దానిని మంటలో పడవైచెను.

అది "భగ్! భగ్! కుంచముబొట్లూ!" అన్నది. వెంటనే ఆ కాలుచున్న కట్టెలను ఏటిలో పడవైచెను. ఆయేరు పారుచు "జై యి! జై యి! కుంచముభొట్లూ!" అన్నది. వెంటనే అతనికి ఏటిపై కోపము వచ్చినది. అందుచే ఆతడు ఆ యేటిలోపడి చనిపోయెను.



## యుక్తి

శ్రీమతి తాయి రత్నమాలగారు

అదివేకువజాము. సుధాకరుడింకనూ తనరాజ్యము పాలింపరాలేదు. పక్షులు తమ కులాయములనుండి అప్పుడప్పుడు కూయుచుండెను. ఆసమయమున నొక భిక్షువు గాన మొనర్చుచు రాజసౌధము వెంబడిపోవుచుండెను. రేయెల్ల కలతనిద్దురతో కలలుగాంచుచున్న రాజున కకస్మాత్తుగ మధురగానము వీనులవిందొనర్చెను. తోడనేరాజు పర్యంకము డిగ్గి గవాక్షముగుండా గాన మొనర్చుచున్న భిక్షువునిగాంచి ఆహా! వీనిదే సుఖజీవనము అనుకొనియెను. క్రిందపోవుచున్న భిక్షుకుడు ఒకింత తలయెత్తి రాజునుగాంచి వినయముతో నమస్కరించి ఆహా! ఈ రాజెంత అదృష్టశాలి అని తలపోయుచు వెడలిపోయెను.

రా జంతఃపురము వీడి కొలువున కేతెంచుచుండ నాతని కాలిత్రేలికి చిన్నదెబ్బ తగిలెను. రాజునకు మితిలేని ఆగ్రహము కల్గెను. వెంటనే భటులనుపోయి ఉదయమున గాన మొనర్చిన భిక్షుకుని కొనితెమ్మని ఆజ్ఞయిడెను.

మరునిముసమున రాజసమక్షమున బికారి ప్రత్యక్షమయ్యెను. రాజు భటులను జూచి 'నే నీ ఉదయమున వీని ముఖము గాంచితిని. దానికి ప్రతి ఫలముగ నాకు దెబ్బ తగిలినది. ఈ పిశాచిముఖము చూడరాదు వీని నిప్పుడే ఉరితీయుడు' అని పల్కెను.

ఇంతలో రాజసభలో నొక పన్నెండువత్సరముల బాలుడు మలినవస్త్రములతో ప్రవేశించి 'మహారాజా నమస్కారము. న్యాయముకావలెను' అనివేడుకొనెను. రాజు 'ఓయీ నీవెవడవు? నీకేమి అన్యాయము జరిగినది? చెప్పుము. నీకపకార మొనర్చినవానిని వెంటనే తగుకీతిని దండించెదను' అనెను.

'రాజచంద్రా నేడు నాతండ్రి ఒకని ముఖము చూచెను. ఆవేళ ఎట్టిదో కాని ఇప్పుడాతడు మరణోన్ముఖుడైనాడు. మహాప్రభూ నాకు న్యాయము కావలెను. నేడు మీ రెవనినో గాంచితిరనియు తదుపరి మీకు దెబ్బతగుల వానిని శిక్షించుచుంటిరనియు తెలిసి వచ్చితిని. మీరెట్లయిన నాతండ్రిని బ్రదికించి వానికి తగిన దండన విధించవలెను.'

రాజా మాటలువిని 'సరే వానిని పిలిపింపుము' అనెను. బాలుడు వెంటనే రాజునెదుట స్మృతాననుడైయున్న బిక్షుకుని చూపి 'రాజా ఈతడే నాతండ్రి. ఉదయమున నాతడు చూచినది తమ ముఖమే. ఇప్పుడు నాతండ్రి తలయొగిరిపోనున్నది రక్షింపుడు' అని రాజుపాదములకు నమస్కరించెను.

రా జాశ్చర్యపడి 'ఆహా ఏమి వీని యుక్తి!! తండ్రి నెంత యుక్తియుక్తముగ రక్షింపగలిగినాడు!! నాకా మాత్రపు జ్ఞానమే లేకపోయినదే' అని తలంచి 'ఓయీ నీతండ్రిని రక్షించితిని. కాని నాకే దండన విధించుకొనవలెనో తెలియుటలే' దనెను.

ఒక్కనిముసము సభాభవనము నిశ్శబ్దముగ నుండెను. పిదప మంత్రిలేచి 'మహారాజా ఇకనుండి వీరికుటుంబము బిచ్చమెత్తుకొనకుండ వీరికివలయు ధనమిండు. అదియే మీకు తగినశిక్ష' అనెను.

దీని కందరంగీకరించి బాలుని యుక్తికి మెచ్చిరి.

—:o:—

## త్యాగము

శ్రీమతి కా॥ మైత్రేయిగారు

“ఏదో కడుపు గడవడానికి మాత్రము సరిపోతుంది” అని అన్నము వడ్డించేటప్పుడల్లా అంటూవుండేది రుక్మిణమ్మగారు. సాధారణముగ కడుపుగడిచే సంసారాల్లో విలువైన బొమ్మలు కొనడానికి డబ్బు వుండదు కదా! ఈ సంగతి వసంతకు బాగా తెలుసు. అయినా యొక మంచిబొమ్మ ఒకటి కొనుక్కొని ముద్దుపెట్టుకోవలెనన్న కోర్కెను మాత్రము వీడలేకుండెను.

రుక్మిణమ్మగారి దొడ్డిని ఆనుకుని, ప్రక్కయింటివారి తోటవుంది. ఒకరోజు ప్రక్కయింటి ఆవిడ దొడ్డిగోడవద్దకువచ్చి వసంతతో “వసంతూ! నీకు చిన్నతోటవేసి మొక్కలు పెంచుట యిష్టమేనా? యిదిగో ఆమూల కనుపించే చిన్నపాదులను శుభ్రముగావుంచి మొక్కలను శ్రద్ధగా పెంచితే అందులో వచ్చే పంట నీవు అనుభవించవచ్చు” అని అన్నది.

“అయ్యో! నే నెంతో సంతోషపడతాను. నాకు తోటమాలిపని అంటే చాల సరదా” అన్నది వసంత.

“నేను నీకు బెండ, చిక్కుడు, కాకర, పొట్లగింజలు యిస్తాను. అవి చల్లి, పెరిగి పెద్దలైన తర్వాత, మీ అమ్మకు కొంత యిచ్చి తక్కినవి అమ్ముకోవచ్చు” అని అన్నది ఆ దయగలిగిన ముసలికామాక్షమ్మగారు.

వసంతకు సంతోషము ఎక్కువై యింట్లోకికూడ త్వరగ పరుగెత్తలేకపోయినది.

"ఇది చాలా బాగున్నది అమ్మా! యీ డబ్బుతో నీకు యిష్టమైన వస్తువు కొనుక్కో. నాకు పిల్లలకు మీాకందఱకు. మంచిబొమ్మలను యివ్వవలెనను ఆశవుంది. ఏమిచేయను? కనుక యీ డబ్బుకోసము నీవు చాల శ్రమపడి, దానితో గొనబోవు మంచి సరుకునుగురించి బాగా ఆలోచించు" అని అన్నది వాళ్ల తల్లి.

వసంత రోజూ బడినుంచి రాగానే కామాక్షమ్మగారి తోట్లోకివెళ్లి, ఆ పాదులను పాఱతో త్రవ్వి చదునుచేసి గింజలను చల్లి నీరు పెట్టుచుండేది. కొన్ని రోజులకు చిన్న చిన్న మొక్కలు పాదులన్నింటియందు బయటికి వచ్చాయి. కాని వసంత మాత్రము సదా తన డబ్బుతో కొనబోవు బొమ్మను గుఱించి కలవరిస్తుండేది. అటువంటి బొమ్మే వా రింటి ప్రక్కనున్న బొమ్మలకొట్టులో చూచినది.

2

కూరగాయలు కాసే రోజు వచ్చినది. సంతకు కూరలన్నీ మూట కట్టుతున్నది వసంత. దాని చిన్నగుండె దడదడ లాడుతున్నది సంతోషముతో. డబ్బు చేతిలో పడగానే బొమ్మలకొట్టుకెళ్లి బొమ్మ కొనేస్తుంది. ఇన్నాళ్లనుంచీ కలవరించుచున్న అందమైన పెద్దబొమ్మ ఎప్పటికీ తనదై పోతుంది.

తన చిన్నతమ్ముడు, చెల్లితో సంతకు దగ్గరేగా బయలుదేరింది వసంత. తమ్ముడికి మరుసటిరోజుకు వస్తుంది మూడోయేడు. దారిలో, వున్నట్లుండి వాడు "అక్కయ్యా! మనముకూడ అందరికి మల్లె పుట్టినరోజు పండుగలు ఎందుకు చేసికోగూడదు? నేనూ మంచిబొమ్మ యొకటి కొనుక్కుంటాను. నాకు ప్రక్కయింటిమధు రైలు యింజన్ లాంటి యింజన్ కావాలి అక్కయ్యా" అని అన్నాడు.

"మనము బొమ్మలు కొనుక్కోలేము నాయనా! మనకు డబ్బులేదు" అన్నది వసంత. అయినా తమ్ముడు ఏడుస్తూ "నాకు యింజను కావాలి అక్కయ్యా" అన్నాడు.

వసంత తిరిగి చూసేటప్పటికి తమ్ముడు దారిలో యొక యింటికిటికీలోకి తొంగి చూస్తున్నాడు.

"అక్కయ్యా! వాళ్ల అబ్బాయి యింజెను చూడు" అని సంతోషముతో నవ్వుతూ కేకలేస్తూ వసంతను పిలిచాడు. వసంత తమ్ముడి పిలుపుకు తిరిగి చూసేటప్పటికి కనుపించినది. కిటికీలో కూర్చున్న అమ్మాయిచేతిలో పెద్దబొమ్మ. కాని "అక్కయ్యా! యింజెను కావాలి" అన్న తమ్ముడి మారాము వినిపించుచునేయున్నది వసంతకు పాపము.

3

అంగడి చాలదూర మనిపించినది వసంతకు. పోయినంత దూరము యొక పెద్ద త్యాగమునకు మనస్సు నిశ్చయించుకుంటున్నది.

సంతలో కూరలు యొక అంగడివానికి అమ్మి, డబ్బు పుచ్చుకున్నది. పిల్లలను యింటిదగ్గర దిగబెట్టి వాళ్లు చూడకుండ బొమ్మలకొట్టు కెళ్లినది. మరల వచ్చే

టప్పుడు చేతిలో పొట్లమువుంది, కాని అది బొమ్మమాత్రము కాదు.

౪

మరుసటిరోజు తనకీ పుట్టినరోజు బహుమతీ వచ్చింది అని తెలుసుకుని సంతోషముతో యెట్లా గంతులుపెట్టాడు తమ్ముడు. పెద్ద అందమైన యింజెనుబొమ్మ.

తల్లి ఏమీ మాట్లాడలేదు. పిల్లను మాత్రము గుండెకు గట్టిగా అదుముకుంది. ఆమెకు తెలుసు యీ త్యాగముయొక్క విలువ. ఆమె ముఖమున సంతోషము, గర్వము ప్రతిబింబించుచున్నవి త్యాగశీలమైన తన ఏడేండ్ల కుమార్తెను చూచి. పాపము వసంత మాత్రము తమ్ముని సంతోషములో లీనమైనది. తాను కొట్టులో చూచిన బొమ్మనుగురించి మరచిపోవడానికి ప్రయత్నించినది.

దొడ్డిగోడవద్ద కామాక్షమ్మగారు వసంతను ప్రేమతోపిలచి మాట్లాడేవఱకు తన తల్లి ఆవిడెతో యీసంగతి అంతా చెప్పినట్లు వసంతకు తెలియదు.

"అమ్మా నీ మొక్కలను, నీవు చక్కగ శ్రద్ధగ పెంచావు చాల సంతోషము. కాని నీవు నా కింకొక పని చేసిపెట్టమని అడుగవలెననివున్నాను. అదేమన, వారంరోజులు నా పూలమొక్కలను శ్రద్ధగావుంచి, పాదులలోవుండు గడ్డి, ముళ్లు అవి తీసివెయ్యవలెను. దీనికిగాను యిన్ని రోజులబట్టి భద్రముగ దాచిన ఒక తాయిలం యిస్తాను" అంది కామాక్షమ్మ వసంతతో.

కామాక్షమ్మ లోపలికెళ్లింది. ఆ తాయిలం ఏమిటాయని వసంత ఆలోచించుచున్నది. ఇంతలో దొడ్డిగోడవద్ద 'వసంతూ' అన్న పిలుపు వినబడింది. గోడవద్దకు పరుగెత్తినది వసంత. కామాక్షమ్మగారి చేతిలో పెద్ద అందమైన బొమ్మ. దానికి జుట్టు, తెల్లఅంగీ, వేయను తీయను మేలైన కాళ్లజోడు. ఇన్నాళ్లనుంచి వసంత ప్రపంచములో కోరుతున్న బొమ్మవంటిదే. "ఇది నా కూతురు చిన్నతనంలో ఆడిన బొమ్మ. ఇప్పుడు మా అమ్మాయి పెండ్లి అయి కాపురమునకు వెళ్లినది. ఇదే నా తాయిలం" అన్నది ముసలిఆవిడ బొమ్మను అందించుచూ.



## చిత్రప్రశ్నలకు సమాధానములు

సెప్టెంబరునెలలో ప్రకటింపఁబడిన చిత్రప్రశ్నకు యేబదిమంది నారీరత్నములును యిరువదిమంది యువకులు బాలురును సరియైన జబాబులనొసంగిరని తెల్పుటకు సంతసమగుచున్నది. గ్రంథవిస్తరభీతిచే వారి నామములు ప్రకటించుటకు సాధ్యముకాలేదు (1) పునుక (2) కనుపు (3) సెలత, తలనె (4) పడగ, గడప (5) రునుము, మునురు అనునవి క్రమముగా నాలుగు చరణములలోని ప్రశ్నలకును సమాధానములని యెఱుంగునది. [గృ సం.]

# భావతరంగిణి

## కవి—చిత్రకారుడు

కవియన ప్రకృతి పదార్థముల గావ్యరూపమున రచించువాడు. ప్రకృతియం దీతనికి గోచరింపని విషయముండదు. అందుచేతనే "రవిగాంచనిచో గవి గాంచు"నను నార్యోక్తి జనించినది. కవికిగోచరించిన విషయమంతయు లిఖితరూపమున నుండును. పూర్వకాలమునందు పెక్కండ్రుకవు లనేక గ్రంధరచనను గావించి తమ భావికాలపు సంతతివారికి మహోపకార మొనర్చియుండిరి అందుచేతనే పూర్వకాలమందలి, దేశపరిస్థితులు, జనుల నాగరికత మున్నగున వెన్నియో, నేడు సులభముగ మనము గ్రహింపగలుగుచున్నారము. పురాణములు, నవలలు, నాటకములు మొదలైన గ్రంధములన్నియు నీకవిరచితములే. ఈ కవియే లేనినాడు మన కీ విషయములేమియు దెలియక ప్రపంచ జ్ఞానహీనులమై యుండవలసినవారమే గదా! కాని యా కవిబ్రహ్మ యొనర్చిన మహోపకారముచేతనే నేడు మనము జ్ఞానసంపన్నులమైనారము.

ఇవియన్నియు మనోదర్పణమున బ్రతిబింబించునవియే. ఈ కవికృత గ్రంధస్థ విషయములన్నియు నిరక్షరకుక్షులకు దుర్గ్రాహ్యములు గదా? ఈ గ్రంధములయందలి విషయములను గ్రహింపవలెననిన బండిత సహాయ్య మపేక్షణీయము. గ్రంధస్థ విషయములు మనస్సున కానందదాయకములు గాని, చిత్రలిఖితములు మనో, జ్ఞాన, నేత్ర సంతృప్తిదాయకములనుట నిక్కువము. ఈకారణముచేతనే బాలబాలిక లింట నేడ్చునపు డేవియో కొన్ని బొమ్మల నిచ్చి వారి నోదార్చుచుందుము. చిత్రకారుల రచనలు కవిరచనలకంటె యెక్కువకాల ముండును. ఇందుల కుదాహరణముగ ఆగ్రాయందలి టాజ్మహాలు, ఎల్లోరా గుహలు ఇవి ఎందరెందఱ నాకర్షించి యద్భుతానందపరవశుల గావించుటలేదు. మన మనుదిన మిండ్లయందు, దేవాలయములయందును బూజించు విగ్రహములు, భక్తి జ్ఞాన ప్రపత్తుల నొదవించుటకు గాదా? నాటకములయందును, సినీమాలయందునుగల రూపములు మన మనస్సుల నిల్చి యాయాపాత్రల స్వభావసౌశీల్యాదులు మన కలవడుటకు గదా నిర్మింపబడినవి. ఇంతియగాక ఈ చిత్రనిర్మాణము, స్త్రీల కాభరణ నిర్మాణసాధనమై తనరారుచున్నది. ఏది ఎటులున్నను కొంచము దీర్ఘదృష్టి నరసినచో చిత్రకారునివలననే గ్రామ, నగర నిర్మాణ మేర్పడుచున్నదనుట స్పష్టము. మన మెచటనైన నొకచో నొక సౌధమును గాంచిన దత్పునర్నిర్మాణాధారము చిత్రమే కదా? ఈ చిత్రమును గాంచిన వెంటనే మనోస్థగిత విచారము తొలగి సంతోష మొదవును. పూర్వకాలమందు స్త్రీలు తమ యపురూపలావణ్యమున కనువగు వరుల సమకూర్చిన దీ చిత్రకార రచనాసామర్థ్యమే గదా! ప్రస్తుతకాలమందు యుద్ధరంగముల శత్రుకృతముల రహస్యముగ నెరిగించున దీ చిత్రరచనా నిర్మాణ కౌశల్యమే కావున ముఖ్యముగ గవికృత గ్రంధముల కన్న చిత్రకారుని చిత్రరచనలు చిరస్థాయులై శీత వాతాతపాదులకు శిధిలములు గాక శాశ్వతముగా నుండును. గ్రంధములన్నో పైవానిలో నేయొకటి సంభవించినను నాశనమగుట నిశ్చయమని తెలుపుచు నింతటితో విరమించెదను.

—గోటేటి అన్నపూర్ణమ్మ.

"శారదాబిల్లు, శారదాయాక్టని మనచెవులు గింగురు మనేటట్టుగా యే మహనీయుని నామావళి

దేశమంతయు మ్రోగుచుండెనో, అట్టి సంఘసంస్కర్త, శ్రీయుత హరవిలాస శారదాగారే, అతి బాల్య వివాహములవలని యనర్థములను లోకుల మనంబులకు బాగుగా నాటునట్లు విశదీకరించిన ప్రౌఢవివాహ శాసనకర్తయే, తన్ను దా మఱచి, తన పండ్రెండు సంవత్సరములుగల మేనగోడలికి, రాజశాసన భయంబున, "రాజపుతానాలో నొక గ్రామంబునకుఁ దీసికొనిపోయి, బాల్యవివాహ మొనరించె"నని, ఇండియన్ ఎక్స్ప్రెస్," మొదలగు పత్రికలు ప్రకటించెను.

ఇట్టి ఆదర్శ విహీనత కేమనవలయును? ఇది యెంత ఘోరము! ఎంత అవమానకరము! అందుననే మనలో బల్లలు గ్రుద్ది పలుకువారేకాని, ఆచరించువారరుదని పేరు వచ్చినది. శారదాచట్టము త్రికరణశుద్ధి లేని వాక్శూరత్వ విజృంభణములచే ప్రజలను హడలెత్తించెను. అధునాతన, సనాతనుల మధ్య కలహములు రేకెత్తించెను. అవ్యవధి వివాహములచే అవకతవకలు పుట్టించెను. ప్రౌఢబాలికల ప్రణయప్రేమలచే, అపవిత్ర సూత్రబంధములు ముడిపెట్టించెను. వర్ణేతరశాఖేతర వయోనిర్ణయవిహీన పరిణయములచే సంఘము నల్లకల్లోలము గావించెను.

ఈ శారదాశాసనముచే కులమెక్కడ కూలునో యన్న భయంబున, విసాం మొదలగు పరాను పేటలకు నేరస్థులవలె పారిపోయి, కుంటి గ్రుడ్డి, మూగ, చెవుడు, ముసలివయసు, ఆకార అనాకారములు, భాగ్యాభాగ్య విమర్శనలు లేక, తమ ముద్దు బిడ్డలకు ముళ్ళు పెట్టు యోగమెక్కుడు అయ్యెను. వట్టిమాటలకు లొంగరని, రాజచట్టములో మతమును, దూర్చి, అసలే నిలువెల్ల పన్నులభారములో క్రుంగిపోయిన ప్రజలకు, వివాహములయందలి భరింపరాని వరకట్నములే కాకుండా, "శారదాశాసన విరుద్ధపు జుల్మానాలు కూడ తగిల్పించెను. నిరుద్యోగ సమస్యలలో బడిచచ్చుచున్న ప్రజలను ఇట్టి రొక్కరూపక నిర్బంధక పన్నులతో, నిరాహార సమస్యకుం గూడ పాల్పడఁజేసెను. చివర కిదిగదా శారదాగారు చేసిన పని! తాను పాతిన సంస్కరణ వృక్షమునకు తానే క్రిమియై దుష్ఫలభాజన మొనరించుట అన్యాయ కృత్యము. శభాస్, భళీ యనిపించుకొనినవారే 'ఛీ' యనిపించుకొనుట, సంస్కర్తలకు తలవంపులు.

## కులవిద్య

ప్రస్తుతకాలములో స్త్రీవిద్యావిధానము మన హిందూదేశములో నానాఁటి కభివృద్ధి చెందుచున్న దనుట సత్యమే. కాని యీ విద్యాపద్ధతులవలన ప్రాచీనభారతనారీమణుల చరిత్రములో ప్రసిద్ధికెక్కిన దమయంతి, సీత, సత్యవతి, మొదలగువారి యోగ్యతలలో నే యత్యల్పగుణము నైనను గడింపఁజాలక పోవుటయే గాక భాషావిషయములోఁ గూడ మనకుఁ దగిన కౌశల్యము గాని యభివృద్ధిగాని కనుపట్టుటలేదు. ఇది దూరదృష్టి గలవారి కందఱకును దెలిసిన విషయమే. ఒక్కవిద్యాభ్యాసమే కాక యే యభ్యాసమైనను కులక్రమాగతమై యోగ్యులు దక్షులునగు ఉపాధ్యాయుల శిక్షణము పొందనిది శోభింపదు. ఇది మన యనుభవములోనుండు విషయమే. కొన్ని కుటుంబములలోఁ గవిత్వము, సంగీతము, వైద్యము, ఆచారము, మున్నగునవి విశేషపరిశ్రమము లేకయే లభ్యములగుచుండుటయు స్వల్పకాలములో నే యధికములగుటయు మనము నిత్యమును జూచుచునేయున్నాము. దీనినే కులవిద్యయని వాడుచున్నాము. ఈ కులవిద్య పూర్వజన్మవాసనావిశేషమువలె నప్రయత్నముగానే సిద్ధించుచుండును. సహజసిద్ధమైనది కులవిద్య, బలాత్కారముగాఁ లాగఁబడునది పరవిద్య. సర్వసాధారణముగాఁ గులవిద్యలోఁ గల నేర్పరితనము పరవిద్యలయం దేనాఁటికిని లభ్యపడదు. కావున ప్రస్తుత స్త్రీవిద్యావిధానమంతయు కులవిద్యామూలముగా మారిననాఁడే మన స్త్రీలోకమున్నతస్థితిలోనికి వచ్చుటయు బాగుపడుటయు తటస్థింపఁగలదు గాని యే రెండక్కరములనో నేర్చుకొని పురుషులను దూలనాడినంత మాత్రమునకు గొప్పవారము కాఁజాలము. సహజమైన మనప్రాస్వదృష్టి మనలను విడువవలయును. మనవిద్యలు నీతిపై నాధారపడి యుండవలయును.

—పిఠపాటి అనసూయాదేవి.

## దసరా ప్రారంభము

దసరాపండుగ హిందువులకు చాల ముఖ్యమైనది. దీనినే విజయదశమి యనెదరు. ఆశ్వయుజ శుక్ల దశమినే విజయదశమని పిలచెదరు. ఈవిజయదశమి వివాదాంశముగ నున్నది. ఈనాడు హిందువులందరును శమీవృక్షమును పూజింతురు. శమీవృక్షమునకే జమ్మిచెట్టు అను పేరు వాడబడుచున్నది.

శమీ శమయతే పాపం శమీ శత్రువినాశనీ
అర్జునస్యధనుర్ధారీ రామస్య ప్రియదర్శనీ
శమీ శమయతే పాపం శమీ లోహితకంటకా
ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియదర్శిని॥

అను శ్లోకమును పఠించుచు జమ్మిచెట్టును పూజించెదరు. దసరా ప్రారంభమును గూర్చి రెండు కథలు గలవు. కొందరు విజయుని విజయమునుండి ప్రారంభమయ్యె ననుచున్నారు; మరికొందరు శ్రీరాముడు రావణుని జంపినప్పటినుండి ప్రారంభమాయె ననుచున్నారు. సామాన్యముగ అర్జునుని విజయమునే అందరును ప్రారంభముగ తలంచుచున్నారు.

పాండవులు అజ్ఞాతవాసమున తమరిని ఎవరును గుర్తించకుండ మారువేషములను, పేర్లను ధరించి ఆయుధములను ప్రేతరూపముగ జమ్మిచెట్టుమీద దాచిరి. ఉత్తర గోగ్రహణ కాలమునాటికి పాండవుల 13 సంవత్సరముల అజ్ఞాతవాసము పూర్తియాయెను. ఆకారణమున ఉత్తరుని వెంటగొని అర్జునుడు శమీవృక్షమందుంచిన గాండీవము మున్నగు ఆయుధములను శమీవృక్షమును పూజించి తీసికొని కౌరవులను ఓడించి జయమును గాంచిరనియు అది లగాయతు అందరును శమీపూజను చేసిన తమకును జయము చేకురునను తలంపులో నేటికిని తమ ఇష్ట కామ్యసిధ్యర్థము విజయదశమినాడు పూజచేయుచున్నారు. శ్రీరాముడు రావణుని పదితలలను ద్రుంచినను ఎప్పటికపుడు అవి మొలచుటచే శ్రీరాముడు నిరాశజెంది దేవిని పూజించగా ఆమె తృప్తురాలై ఆశ్వయుజ శుద్ధ ప్రథమదినమున విజయము చేకూరు గాక యని రాముని ఆశీర్వదించెను. నాటినుండియు శ్రీరాముడు పదియవ దినమున రావణుని పూర్తిగ సంహరించి సంపూర్ణ విజయము గాంచెనని ఇంకొక ప్రతీతిగలదు. అయోధ్యకు పోవుటకు ముందుగ శ్రీరాముడు జమ్మిచెట్టునకు పూజచేసెను. ఈ ఉత్సవమునకే నవరాత్రులని పేరుకూడ గలదు. మొత్తముమీద ఉత్తర గోగ్రహణము బహుళపక్షమినాడు జరుగుటచే విజయదశమికి ఇది వర్తించదని కొందరు నిర్ధారణ చేయుచున్నారు. నవరాత్రులు దేవీనవరాత్రులని కూడ దసరాకు పేరు. ఈ నవరాత్రులలో దేవీపూజలు సల్పబడును. ఈ పూజలు ఆశ్వయుజ శుక్లపక్ష పాడ్యమినాడు ప్రారంభమగును. పార్వతీదేవి అవతారములు పది. ఒక్కొక్క అవతారమున ఒక్కొక్క రాక్షసుని జంపి లోకమును కాపాడెనట. ఈనవరాత్రులకు బంధువులందరు కలిసికొని నూతనవస్త్రములను ధరించి మృష్టాన్న భోజనాదులను చేసి హాయిగ కాలమును గడపెదరు. క్రొత్త అల్లుండ్రకు నూతనవస్త్రములను బహుమతి నొసగెదరు. దసరా పదిరోజులు ప్రతిఇల్లును హిందూదేశమున సాధారణముగ కలకల లాడుచుండును.

—జరుగుమిల్లి రామాబాయమ్మ.

## బాకీ

బాకీఅంటే యెవరైనా డబ్బు యివ్వాలసివుంటే వాణ్ణి బాకీదారుడని ఆ డబ్బు బాకీ అని సహజంగా వ్యవహరిస్తున్నారు లోకంలో. ఇదేగాక ఇంకా అనేకవిధాల బాకీలున్నాయి. ఎవరికైనాను పసిపిల్లవాడు చచ్చిపోతే ఇరుగుపొరుగువాళ్ళొచ్చి వాడి బాకీ కాస్త తీర్చుకు పొయ్యాడు. యెందుకేడవటం అని వోదారుస్తారు యేడుస్తూన్న తల్లిదండ్రులను. అంటే యిదో విధమైన బాకీ అన్నమాట. ఇంకా యే కూరగాయలమ్మిదగ్గరైనా కూరలు తీసుకుంటే అవి పుచ్చులో చేదులో అయి పనికిరాకపోతే దాని కన్నడో బాకీ అని మనస్సుకి సమాధానం చెప్పుకుంటారు. ఇదీ బాకీయే. అంటే ఈజన్మలో చేను

కొన్న బాకీ పూర్వజన్మలో చేసుకొన్న బాకీగూడా ఈజన్మలో అనుభవించాలిసొస్తుం దొక్కొక్కసారి.

పూర్వజన్మంలో బాకీచేసి అది తీర్చేలోపల ఇద్దర్లో యెవరో చావటం సంతానం తీర్చకపోవటం లేక మరోవిధంగానో యల్లాగోల్లా ఆజన్మలో తీర్చక పోవటంవల్ల అది ఈజన్మలో బాకీ అయింది.

ఇంకో విషయం. యెవడిదగ్గరైనా అరువుచ్చుకొని అవి తీర్చకుండా చస్తాడనుకోండి. అప్పుడు ఆడబ్బువాళ్ళు 'వాడికి బాకీ వున్నాము. అందువల్లే వ్యవధానం గూడా లేకుండా చచ్చాడు' అని అనుకుంటారు. అల్లా వాడు వీడికి బాకీ అంటామా? లేక మళ్లీ జన్మలో వీడు తీర్చుకోవాలంటామా? యెవరు చెప్పలేరు. అందుకే ఇవన్నీ కర్మలని కర్మఫలా లదృష్టాలని చెప్తారు. అంటే యెప్పటికి దృష్టాలు కావన్నమాట.

ఇంకోలా గూడా బాకీశబ్దాని కర్థం చెప్పొచ్చు. ఇద్దరప్పచెల్లెండ్రు ఒకతమ్ముడో అన్నో వుంటే వీడు అతోబుట్టువుల్లో ఒకావిడను యెక్కువ ప్రేమతో చూస్తుంటాడు. యెక్కువగా చాకిరి చేస్తుంటాడు. తన్నువాళ్ళు ప్రేమించక చీదరించుకుంటున్నా లెక్కచెయ్యడా చీదర్లను. ఇల్లా వుండటం గూడా ఒకబాకీ అంటా—పూర్వజన్మ సంబంధం.

ఒకొక్కప్పుడు కుక్క చూడండి యెక్కడో పొట్ట నిండించుకొచ్చి వాకిట్లో పడుకొని కొట్టి తరిమినా పోక కావలి కాస్తూంటుంది. యేమి టది? బాకీకదూ!!

నే చెప్పే దేమి టంటే నాసోదరీమణులకు, వెధవలైన ఆడబిడ్డలు వాళ్ళూ చాకిర్లు చెయ్యలేదని తోడికోడళ్ళందరికి సమానంగా చెయ్యాలని తన తమ్ములుతోబుట్టువ లందర్ని సమానంగా చూడలేదని పోట్లాడుతుంటారు. ఈచెయ్యటం చెయ్యకపోవటం ప్రేమతో మాట్డం చూడకపోవటం బాకీలని గ్రహించి సంసారాల్లో కలహాలు పెట్టుకోవద్దని.

—శలాక అన్నపూర్ణాదేవి.

## ప్రార్థన

ప్రార్థించుట, లేక ధ్యానించుట యనునది భగవంతుని గురించి మాత్రమే అని మన కందరకు తెలును. అంటే మన కేదైనా కావలసియున్నప్పుడు భగవంతుని జ్ఞాపకము తెచ్చుకొని ధ్యానింతుము. కాని ఆపని మన ప్రయత్నమువల్లనో, లేక దైవబలం వల్లనో ఫలించగానే భగవంతు డంటూ యొకడున్నాడనే తలంపుగూడా లేకుండా పూర్తిగా మరిచిపోవడం మామూలైంది. కాని ప్రార్థన అంటే నిజానికి పైనిచెప్పిన మోస్తరు యెంతమాత్రము గాదు. ఎదురుగా కనబడు యేవ్యక్తినైనా చూచి 'యిదియ్యి అదియ్యి' అని కోరినట్లు భగవంతుని అంత చులకనగా కోరము. భగవంతుని కోరుటకు మనోబలము ముఖ్యముగా కావలయును. మనోబలము లేక చీటికిమాటికి ఏదియో యొకటి కోరుటయు, ప్రయత్నము లేశమంతైనను చేయక భగవంతుడు లేడనిగాని, వానికి చేతగాదని నిందించుటయు పరిపాటు. అది చాల పొరపాటు. ప్రయత్నలోపము మనదైనప్పుడు భగవంతు డేమిచేయగలడు? సాయంత్రమగుట తడవుగా దేవాలయమున కరిగి తనకు కలిగినది కొబ్బరికాయలు, అరటిపండ్లు వగైరాపూజాద్రవ్యముల ముడుపు రూపమున చెల్లించుకున్న మాత్రమున భగవంతుడు దయదలచి ప్యానుచేయునా? అట్టి ప్రయత్నమునకు తగు పూజోపకరణములతో ప్రతివారము ఆలయమున కరిగి, అవి పూజారికి సమర్పించి తాను భగవంతునికి అందరి సమక్షమున సాష్టాంగపడినంత మాత్రమున అది ప్రార్థనఅని యనిపించునా? అంత మాత్రమున భగవంతుడు కనికరించి మన కోర్కల నీడేర్చడు.

శ్రీకృష్ణభగవానుడు సహితము భగవద్గీతలో 'ముందు నీవు కర్మచెయ్యి. నీకర్మయే నా కానందము గూర్చునది. నా యానందము నీవు పొందగలుగుటే జీవిత పరమావధి' అని చెప్పెను. అట్టి కర్మకు సరియగు శక్తిని బడయుటకు భగవంతుని ప్రార్థించవలెను.

దే. వేం. సత్యవతి.

# గ్రంథ పరిచయము

**ఆంధ్ర సారస్వత పరిషత్పత్రిక:—**

సాహిత్యవిశారద శ్రీయుత కోన వేంకటరాయ శర్మగారు ఆంధ్ర సారస్వత పరిషత్తువారి తరపున నీపత్రికను ప్రకటింప ప్రారంభించుచుండుట కెంతయు అభినందనీయులు. ఇది రెండుమాసముల కొకతూరి నరసారావుపేటనుండి శ్రీ వేంకటరాయ శర్మగారి సంపాదకత్వమున వెలువడుచుండును. శ్రావణ భాద్రపద మాసములకు చెందిన ప్రథమ సంపుటపు ప్రథమ సంచిక మా కార్యాలయము నలంకరించినది. సంచిక యంతయు పెద్దఅక్షరములతో 48 పుటల విషయ సంగ్రహమును గలిగియున్నది. సంవత్సరపు చందా రు. 2-0-0 మాత్రమే. ఇందు 6 గంభీర గద్య వ్యాసంబులును, శ్రీ మహామహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రులవారిచే రచింపబడిన ఆంధ్రభారతీ యను 20 పద్యముల పద్యవ్యాసమును ఉన్నవి. ఆంధ్రసారస్వతమునకు చెందిన అనేక క్లిష్టసమస్యల నీ పత్రిక చర్చించి పరిష్కరించు విషయమున మార్గదర్శకత్వము వహించుచున్నందు కెల్లరును నానందించగలరని నమ్ముచున్నాము. ఈ పత్రికను చిరకాలమువరకు నడిపించి శ్రీమంతులగు ఈ పరిషద్వర్గమువారు స్థిరమైన కీర్తిని బడయుదురుగాక!

**సాధనపత్రిక:—**

ప్రతి శనివారమును అనంతపురమునుండి శ్రీయుత పప్పు రామాచార్లువారి సంపాదకత్వమున వెలువడు వారపత్రిక. సంవత్సరము చందా రు. 3-8-0లు మాత్రము. ఈ పత్రికయొక్క 2వ సంచిక మా కార్యాలయము నలంకరించినది. ఆంధ్ర పత్రికా పాఠకులకు సాధనపత్రికా రామణీయకతను గూర్చి క్రొత్తగా తెలియపరచ నక్కరలేదు. ఈ మధ్యను రెండున్నర సంవత్సరములు మాత్ర మది విరమింపబడినది. ఈ పునఃప్రారంభమునకు మా అత్యంతాదరపూర్వక స్వాగత మొసగుచున్నాము. అఖిలప్రపంచ పరిస్థితులనేమి, భారతదేశ పరిస్థితులనేమి ఆంధ్రరాష్ట్ర పరిస్థితులనేమి అతిస్వతంత్రము గను స్పష్టముగను విమర్శించుటలో ఇది ముందంజ వేయుచున్నది. పశ్చిమాంధ్రుల అనురాగాతిశయములను సాహిత్యవికాసములను ప్రదర్శించుచు ఆంధ్ర పత్రికాలోకమున కిది అనుంగు సోదరియై రాజిల్ల గలదనుటకు సందియములేదు. కేవలము ప్రాంతీయులే గాక అశేషాంధ్రమహాజనులును విద్వద్వర్యులును గూడ దీనికి సర్వవిధముల ప్రోత్సాహమిత్తురుగాక యని కోరుచున్నాము.

**సంధ్య:—**

క్రౌనుసైజు 47 పుటలు. వెల రు. 0-6-0లు. గ్రంథకర్త శ్రీయుత ముద్దా విశ్వనాథముగారు. ప్రకాశకులు వ్యాసకుటీరమువారు, మేలుపాక, ఎలమంచిలిపోష్టు, విశాఖపట్టణము జిల్లా. సుప్రసిద్ధ రష్యను గ్రంథకర్త టాలుస్టోయిగారి కథ కనువాదము. మూడుమూర్ల జాగాలో దహనమో పూడ్పో కావలసిన మానవుడు ముప్పైమైళ్ల భూమికి మొఖాసాదారు కావలెనను తృష్ణతో వర్తించి మొదటికే మోసమువచ్చి ప్రాణములను గోల్పోయిన చక్కని కథ. బాలుర కానందదాయకము. పెద్దలకు నీతిదాయకము.

**తూలిక:—**

క్రౌనుసైజు 92 పుటలు వెల రు. 0-10-0. గ్రంథకర్త శ్రీయుత ముద్దా విశ్వనాథముగారు. ప్రకాశకులు మేలుపాక వ్యాసకుటీరమువారు. ఇందు చక్కనివి యేడు కథలు కలవు. కొన్ని టాలుస్టాయివి. మరికొన్ని రాజపుత్రస్థానము గుజరాతు ప్రాంతములవి. అన్నియు నీతిబోధకములు; సులభశైలి; మనోహర కథనము; పాఠశాలలలోని బాలుర కత్యంతోపయుక్తములు.

**షట్స్థల శివపూజావిధానము:—**

గ్రంథసంధాత శ్రీ పీ. మ. స్వా. చిక్కవలి పెదస్వామి దేవరగారు. క్రౌనుసైజు 32 పుటలు. వెల రు. 0-4-0లు. ప్రకాశకులు శ్రీ కాళహస్తి తమ్మయ్య దేవరగారు. శ్రీ శైవగ్రంథమండలి, రాజమహేంద్రవరము. శ్రీ శివధ్యానము, శివపూజ, విభూతిధారణము మొదలగు శ్రీ శైవనిత్యకర్మానుష్ఠానవిధానములన్నియు తత్తన్మంత్రబీజాక్షర సంయుక్తముగా నిందు బొందుపరచబడినవి. శివభక్తులకు

అనుదినోపయుక్తమైన మోక్షసంధాయకమగు గ్రంథము. ప్రాచీన శైవగ్రంథముల ననేకములను తేట తెనుగు గద్యములోనికి తెనిగించి చౌకెధరకు భక్తజనకరాగ్రముల కర్పించు శ్రీ తమ్మయ్య దేవరగారి సంకల్పమునకు శైవులెల్లరును నమితాదరము నొసంగుదురుగాక!

సహకారము:—

మన ఆంధ్రదేశములో రద్దుకాబడిన ఆంధ్ర సహకార సమ్మేళనమునకు, శ్రీయుత గూడూరు రామచంద్రుడుగారు దీర్ఘప్రయాణములను ఘోరోపవాసములను సలిపి అధికారుల మనస్సు కరిగించి పునర్జీవనమిచ్చి నడిపింప సమకట్టినారు. వీరు తొలుదొల్త బెజవాడలో ఒక సహకార పఠనమందిరమును స్థాపించి 'సహకారము' పత్రికను ప్రారంభించినారు. ఈ పత్రికయొక్క రెండవ సంచిక మా కార్యాలయము చేరినది. ఇందు వ్రాయబడిన లల్లూభాయి శ్యామల దాసుగారి ఉపన్యాసములు శ్రీమతి పర్వతనేని సంపూర్ణాదేవిగారి కెనడా ధాన్యవర్తకవిధానము, సూరినారాయణమూర్తిగారి అటోవా ఒడంబడిక విమర్శనము మొదలగు వ్యాసములు సహకారోద్యమమునందలి విశ్వాసమును బలపరచుట కెంతయు ననుకూలములైయున్నవి. ఆంధ్రదేశ సహకారులెల్లరును దీనికైనను తగిన ప్రోత్సాహమిచ్చి చిరంజీవిని చేయుదురుగాక.

వ్యాసావళి:—

క్రౌనుసైజు 82 పుటలు. గ్రంథకర్త ఉభయభాషా ప్రవీణ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు. ఇందు 5 వ్యాసములున్నవి. వానిలో కొన్ని భారతిలో పూర్వ ప్రకటితములు. శాస్త్రిగారికి గల కవి తత్వ పరిగ్రహణశక్తి మిగుల రమణీయము. రచన హృదయంగమము. భావములు విశ్వాస జనకములు. వీరి 5 వ్యాసములలోను కాళిదాసు భవభూతి, కంకంటి పాపరాజు, గురజాడ అప్పారావు, చింతాదీక్షితులు, సహదేవుని సూర్యప్రకాశరావు మొదలగు వారెందరివియో రచనాచాతుర్యములు విమర్శాపాత్రములైనవి. ఆంధ్రభాషాభిమానులెల్లరును బఠింపదగినది. ఆంధ్ర పత్రికాకార్యాలయమున ముద్రితము.

దీర్ఘరోగచికిత్సాసారము:—

క్రౌనుసైజు 132 పుటలు. వెల రు 1-8-0 గ్రంథకర్త శ్రీయుత పారపర్తి నరసింహారావుగారు. దీర్ఘరోగము లనునవి మన మనుకొన్నంత దుర్నివారణములు కావనియు వాటి కారణములను సులభముగ గుర్తించి నింపాదిమీద నివారించుకొన వచ్చుననియు గ్రంథపాఠకులకు విశదము కాగలదు. ప్రతి వైద్యుడును ప్రతి దీర్ఘరోగియు తెలుసుకొనవలయు స్వల్పవిషయములు గొప్పవిషయములను నిందనేకము కలిగి గ్రంథకర్తగారి అవశ్యసామాన్యానుభవవైదుష్యములను విశదీకరించుచున్నది. తేట తెనుగువచనము.

ఆహారశాస్త్రము—మొదటిభాగము:—

క్రౌనుసైజు 208 పుటలు. వెల రు 1 8-0 గ్రంథకర్త శ్రీయుత తేకుమళ్ల రాజగోపాలరావుగారు బి.ఎ., యల్. టి ఆంధ్రసరస్వతీగ్రంథమాలవారి 22వ ప్రకటనము. ఆకలి వేసినప్పుడూ వెయ్యనప్పుడూ కూడా కడుపులో కుక్కుకునే ప్రతివస్తువూ కూడా ఆహారము కాదనిన్నీ, ఆహారపదార్థములలో యే యే లోహములు చమురులు మాంసకృత్తులు మొదలగునవి ఉండవలసినదిన్నీ, ఏయే కూరలు పప్పులు మొదలగు వానిలో పైవి యెన్నెన్ని పాళ్ళున్నదియు, ఎట్లు మిశ్రమము చేసి పుచ్చుకున్న యెంతబలము బుద్ధి మొదలైనవి కలుగునదిన్నీ, యేయే తత్వములవారేయే పదార్థములు భుజింపవలసినదిన్నీ మొదలైన విషయము లిందు ప్రకరణములవారీగా వ్రాయబడినవి. లెక్కలు, పేరులు, చరిత్రలు మొదలగు విషయము లన్నిటి కన్నను ఇది పేదలకు సాదలకు పిల్లలకు పెద్దలకు అత్యావశ్యకమైన శాస్త్రము. ప్రతితల్లియు ప్రతితండ్రియు దీనిని పఠించి సంసారమును దిద్దుకొన్నచో దేశమున కెట్టి వీరులు ధీశాలురు తపశ్శాలురు కావలసిన నట్టివారు పుట్టి వర్ధిల్లగలరు. అనంతకోటి విషయము లంకెలతో సహా యిందు పొందుపరుపబడుటచేత ప్రతిపుటయు అమూల్యమైన దనవలెను. ఆరోగ్యసంఘముల వారు దీనిని పఠించి ప్రజలకు మంచి ఆహారమును సేవించు మార్గముపదేశించవలెను. విశ్వవిద్యాలయమువారు ఇట్టి గ్రంథముల నగ్రపువు చేసి, ఈ శాస్త్రమును విద్యార్థులకు పఠనీయముచేసి యీవిజ్ఞానమును జగద్వ్యాప్తము చేయవలెను.

# లోకంపోకడ

## చచ్చినవారికి విందు

చనిపోయినవారికి విందులంటే మనదేశంలో తద్దినాలవంటి వనుకోకూడదు. ఏలననగా, యీ విందులను తినేవాళ్లు బ్రతికున్నవాళ్లే కాని చచ్చిపోయిన పితృదేవతలంటే విద్యార్థిను లెవ్వరూ నమ్మరు. అసలు పితృదేవత లగుపించకుండానే వుంటే వారు తిన్నారనుకోవడం, భోక్తలు తినడం చూస్తూ వారు తినలే దనుకోవడం, పామరజన సాధారణమైన మూఢవిశ్వాసం కాక మరేమిటి? ఫిన్లండు దేశంలో చచ్చినవారికి విందులు పెడతారు గదా, అదీ పద్ధతి! మనిషి చచ్చిపోగానే శవాన్ని ఊరి అవతల ఒక పాడుకొంపకు తీసుకొనిపోతారు. స్వర్గంలో అతను శాంతి పొందవలెనని ప్రార్థిస్తూ, అక్కడకు పోయిన చుట్టాలందరూ తలావక బుడ్డీ త్రాగుతారు. అప్పుడొక పెద్దమనిషి అంటాడు 'అంతా మనం తాగేడమేనా!? పాపమా చనిపోయిన వానికేమైనా యియ్యరా?' అని. వెంటనే ఒక ఆసామీ యేదో సాధనచే బుడ్డీకి సగం సారాయి అతని దేహములోనికి దింపేస్తాడు. అందరువుంటే అతను త్రాగడని కాబోలు శవమును మాత్ర మచ్చట విడిచి పదినిముషములపాటు తక్కినవారు పైకి వచ్చి కూర్చొని మళ్ళీ లోపలికి వెళ్ళతారు. పిమ్మట దానిని పాతేస్తారు.

ఈ మధ్యన ఒకబాలుని శవమునకు కూడా అలాగే చేశారు. ఆ శవానికి ఆ సారాయి వంటికి పట్టినట్లుంది. నిజమైన విందు నారగించిన బాలుని లాగే అతను చితిమీదనుంచి లేచి పడుతూ లేస్తూ తడుముకుంటూ నడుస్తూ వారి వైపే వస్తున్నాడట. తల్లిదండ్రులూ బంధువులూ చేసుకున్న పుణ్యాం! అల్లాగు లేచొస్తారంటే యెంతమంది తల్లులు చనిపోయిన తమ పిల్లలకు వల్లకాడులలో అటువంటి కమ్మని విందులు పెట్టకుండా వుంటారు!

## కవిసమయము

ఆంగ్లభాషలో విల్లో అనే పేరుగల ఒక చెట్టున్నది. దాని ఆకులు నల్లగా వుంటాయనో, కొమ్మలెప్పుడూ మొగం ముడుచుకొనే వుంటాయనో, మరే కారణం చేతనో గాని దానిని యేడ్పే చెట్టని పిలుస్తారు. విచారశాంతి సూచక సమయములయందు దానిని స్త్రీపురుషులు ధరిస్తారు. స్త్రీలు ముఖ్యంగా విరహవేదన భరించలేని సమయంలో కుమిలికుమిలి వెక్కివెక్కి యేడుస్తూ దాని కొమ్మలను పట్టుకొనే చచ్చిపోవడంకలదట-అయితే యిన్నాళ్లాయను దాన్ని యేడుపుచెట్టంటే యేడుపు చెట్టనడమే కాని అది నిజంగాయేడవడంకాని, కళ్ళవెంట నీరు కారడంకాని చూచిన వా రెవరూలేరు. దాని యేడుపును సాధారణ విద్వాంసు లందరూ ఒక కవిసమయం క్రింద కొట్టేసేవారు.

కాని యీమధ్యన మిల్టనునగరములో ఒకపోలీసు జవాను బ్లూహిల్సుదగ్గిర యెండ వేడి కాగలేక ఒక విల్లో చెట్టుక్రింద నిల్చున్నట్లూ, ఆ చెట్టుమీద నుంచి అకస్మాత్తుగా నీటిబొట్టులు పడపడమని తన మీదపడి బట్టలన్నీ తడిసిపోయినట్లూ బోస్టను ఈవినింగు పత్రిక వ్రాయుచున్నది. ఇదివరకు కూడా దాని యేడుపు కట్టినట్లులేదు. రాత్రీ పగలూ అన్ని కొమ్మల వెంటనూ నీరు అట్లా కురుస్తునే వున్నదట-చెట్టుక్రింద ఒక పెద్దతొట్టి పెట్టితే కొన్ని సెకండ్లలో అది నిండిపోతుందట- గాలివేస్తే ఆ చినుకులే బడబడ వడగండ్లలాగ పడతాయి. పోలీసుస్టేషనుకి

బారెడు దూరాన్నే వుంది. నీళ్లు కారుతున్నా కాని కొమ్మలు ఆకులూ బెరడూ అన్నీ పొడిగానే వుంటాయట- ఆటవీ శాఖవార్డెను అయిన లీయనుమినటుగారు తానిట్టి దృశ్యము నింతవరకును చూడలేదనుచున్నాడు. మిల్టనునగర వృక్షముల ఇనస్పెక్టరు ఆర్థరు అలెనుగారు కూడా అట్లే చెప్పుతున్నారు. పెద్దపెద్ద వృక్షశాస్త్రజ్ఞుల నందరినీ యీవిషయమును గూర్చి తగిన పరిశోధన చేయించడానికి సర్కారువారు రప్పిస్తారట- ఎంతమంది వచ్చినా సరే ఆచెట్టు యొక్క యేడుపునకు కారణం కనిపెట్టడము కవీశ్వరులకు తప్ప యేతన్మాత్రులకు సాధ్యము కాదు. ఎవరి సమయమును కవియే విప్పి తెలిగించవలెను గాని అన్యులు తెలిగించలేరు.

## పెండ్లి చదువులు

మనదేశంలో పురుషులకైనా స్త్రీలకైనా చదువులు చెప్పించడానికి ముఖ్యమైన కారణంతగిన సంబంధాలొస్తాయనే గదా. తగిన సంబంధాలంటే డబ్బుగలవారి సంబంధాలు. ధనవంతుల సంబంధం కుదిరితే మగవాడికి మంచికట్నం వచ్చి యిదివరలో చదువుకొరకు పెట్టిన ధనమంతా ముజరావస్తుంది. చదువవస్తే ఆడపిల్లకు కట్నం యియ్యనక్కర లేకుండానే శ్రీమంతుడో విద్యావంతుడో అయిన పెనిమిటి లభిస్తాడని ఆశ. అయితే చదువుకున్న ఆడవాళ్ళ సంబంధాలంటే చాలా మందికి భయంగా వున్నది. విడాకులచట్టం ప్యాసుకావాలని హడావిడి చేస్తున్నవాళ్ళంతా వాళ్లేకాదూ మరి? తన్నినా, తిట్టినా, తిండి పెట్టకపోయినా చదువు రానివాళ్లలాగ వాళ్ళింట్లో కూర్చుంటారా? విడాకులుచ్చుకొని వెంటనే వేరే వివాహాలు చేసుకోవడం మానేస్తారా? అందుకనే తెలివైన పురుషులందరూ ముందుగానే జాగ్రత్తపడి విడాకులచట్టము ససేమిరా పనికిరాదనీ అదివస్తే మతం పారిపోతుందనీ, విక్టోరియా మహారాణీగారి అభయహస్తమున కది ప్రతికూలమనీ పెద్దపెట్టున ఆందోళన సాగిస్తున్నారు.

వీళ్లభయాలకు సరిపోయేటట్లేవుంది పాశ్చాత్యదేశాల వరుసచూస్తే- విద్యావంతురాండ్రైన యువతీమతల్లులు సినీమా తారలు మొదలైనవారు యీవా శెనరో త్రోవపోయే అందగానినో ధనవంతునో ఉద్యోగస్థునో త్రాగుబోతునో పబ్లికుగానే పెండ్లి చేసుకోవడం, మర్నాడు కోటుకెక్కి ఏదో సాకుచెప్పి ఆ ముడి తెంచేసుకోవడం ఈ విధంగా గౌను కట్టుకుని విప్పుకునేటట్లు మగవాని తరవాత మగవానిని వివాహం చేసుకోవడం విడిచి పెట్టుకోవడం అనే విలాసకరమైన ఆట ఆడుకుంటూ వుండడము మనము చూస్తున్నాము. చదువులు మానిపించుకోవడమా విడాకు లిచ్చుకోవడమా అనేది పాశ్చాత్యులకు పెద్ద ప్రశ్నయైవున్నది. మన సనాతనుల లాటి వాళ్లైతే ఛీ చదువు లెందుకు అని ఒక కసురు కసిరి ఊరుకో పెడుదురు- కాని చదువులు స్వతంత్రాలు మరిగిన తెల్లపిల్లలదగ్గర ఈ పప్పు వుడకదు- చదువులు చెప్పించకపోతే యింట్లోనుంచి లేచిపోయి ఆస్తి పంపకానికి దావా పడేస్తారు.

అయితే చదువులూ విడాకులూ అని రెండు గీతలూ బ్రహ్మదేముడు స్త్రీల ముఖములమీద వ్రాసి విడిచిపెట్టినాడా? చదువుకొని కూడా విడాకుల కర్మం లేకుండా హాయిగా సంసారాలు చేసుకునే నోము నాడవాళ్ళు నోచుకోలేదా? అను సమస్యను విద్యాభిమానులంతా కొలంబియా టీచర్సు కాలేజిలో చర్చించారు. ఆడవాళ్ళకు వివాహజీవనమును గూర్చిన ఉత్తమవిద్య (కాలేజీకోర్సు)ను కాని చెప్పించినట్లయితే విడాకుల కది చాలామట్టుకు విరుగుడుగా వుంటుందని అనేకులు తమ అభిప్రాయములను చెప్పినారు. డాక్టరు పాలుపోపెన్ గారు 1930 వ సంవత్సరము వరకు తాము సేకరించిన జనాభా లెక్కల నాధారముగా చేసుకొని యిట్టి విద్యవలన చాలా లాభము కలిగినట్లే శలవిచ్చినారు. కాలేజీచదువు చదువుకొనిన వాళ్ళు పెండ్లిఅయిన రెండవయేటనో మూడవయేటనో విడాకులు పుచ్చుకొనే వారట కాని

చదువులు ప్రారంభించిన దగ్గరనుంచీ పదోయేటి దాకా కనిపెట్టుకొని వుంటున్నారట; అప్పుడైనా విడాకు లడిగితే అడుగుతున్నారట, లేకుంటే లేదట. విడాకుల కీ రీతి మందు కనిపెట్టినందుకు పాశ్చాత్యు లెలాగైతే నేమి ప్రయోజకు లైనా రనే చెప్పవాలి.

ఈ చదువులు వచ్చి విడాకుల నెట్లు ఆపేశాయా అని అనేకులకు సందేహం కలగవచ్చు. అట్టి మహత్వ మీ చదువులో నేమున్నదని కూడా కొంద రడుగ వచ్చును. ఇందులో మరేమీ విశేషము లేదు. ఇక్కడ చెప్పిన చదువంతా ఇదే. ఆడదంటే యేమిటో మగాడంటే యేమిటో, వాళ్ళిద్దరూ ఎట్లు పెళ్లాడాలో, సంసారమంటే యేమిటో, అది యెందుకు చెయ్యాలో యీచిదంబర రహస్యమే అక్కడ వుపదేశం చేసినదంతా! అప్పు డప్పుడు చిట్టూ బుస్సూమని తగాదా లెందుకు వస్తాయో అవెల్లాగ తీర్చుకోవాలో యీభోగట్టాలు కూడా అక్కడ చెప్పుతారు. ఈ మాత్రం మంత్రాలకోసం బోలెడంత డబ్బు దండుగ పెట్టుకొని పట్నాలువెళ్ళి కాలేజీలలో కూడా చదువుకోవాలా అని మనదేశపు పడుచులకు ఆశ్చర్యం వేస్తుంది. పాశ్చాత్యులకూ మనకూ చాలా భేదమున్న దన్న సంగతి మనము మరవరాదు.

ఆ దేశంలో యే సంగతైనా సరే స్కూలుకు వెళ్లి మేస్టరుగారి దగ్గర నేర్చుకుంటే కాని తెలియదు. అన్నంతినడం, గడప అలుక్కోవడం, భోజనాలు వడ్డించడం, బట్టకట్టుకోవడం, పెండ్లిచేసుకోవడం, మొగుడిదగ్గర మెసలడం, పిల్లలకనడం, పెంచడం అంతా బడిలోకిపోయి నేర్చుకోవలసిందే. దీనికే ప్రాజెక్టు మెథడని కూడా అంటారు. అందుకనే కాబోలు నాదేశాల్లో అన్నిచోట్లా పాఠశాలలు పెట్టేస్తున్నారు. దేశీయాదాయంలో సగం సొమ్ముకు కూడా పైగా పోసి నిరక్షరాస్యపిశాచమును తరిమి కొట్టుతున్నారు. ఎన్ని స్కూళ్ళుంటే అంత విద్యాం సులమని పొంగిపోతున్నారు. ఇవి అన్నీ కూడా ఏ బడికీ బద్దలకీ పోకుండానే యెవరిదగ్గరా నేర్చుకోకుండానే పిన్న పెద్దలను చూడడం మాత్రానే మన పడుచులకు చక్కగా తెలియునని వారికి తెలియదు. వారేదేశాలలోకైనా రాగానే అచ్చట నెన్ని పాఠశాల లున్నాయో, దేశాదాయంలో యెన్నో వంతు చదువుల క్రింద ఖర్చు పెట్టుతున్నారో చూస్తారు. అట్టి దేమీ కనిపించకపోగానే వారిని మూర్ఖాగ్రేసరులుగా పరిగణించి పత్రికలనిండా వ్రాసి ప్రపంచ మంతటా ప్రకటిస్తారు. పాప మా పేదదేశస్థుల నుద్ధరించడానికి బడులుపెట్టి చదువులు మప్పి నానాతంటాలు పడతారు. కాని ఒక ప్రశ్న వుంది. మన పూర్వానుభవము లన్నీ మరచిపోయి శుద్ధ అజ్ఞానులము కానిదే తెల్లవారి దగ్గర మనము చదువు నేర్చుకోవలసిన గతి పట్టదు. అట్టి గతి పట్టక ముందే వారి చదువులకొరకు వెళ్లితిమా, మన పూర్వానుభవములతో బాటు పూర్వజ్ఞానము నశించుట ధృవము— అట్లు అజ్ఞానులమై పాశ్చాత్యుల బడులలో కొన్నాళ్లు చదవడంవల్ల కొంచెం మిడిమిడి జ్ఞానం కలగడం నిశ్చయం. దీన్నైనా పాశ్చాత్య జ్ఞానమనే అనవాలి. మనలను మనము మరచిపోయి పాశ్చాత్యతుల్యులము కావాలంటే పాశ్చాత్యవిద్యా వలంబనంకంటె వేఱే మార్గములేదు.

ఏలాగైతేనేమి కాశీకి వెళ్లడం గంగ తేవడం కావాలి. అమెరికాలో యీ కాలేజికోర్సు ప్రారంభించినప్పటినుంచి వివాహపద్ధతిలో కొంచెము మార్పు కలిగిందిట. మునపటిలాగ చూడగానే మోహించడం మోహించగానే పెళ్లాడడము అనే వెఱ్ఱిపికారాలు తగ్గినవట. అమెరికాలో 12 రాజ్యాలలో కాబోయే వధూవరులను నఖశిఖపర్యంతరం పరీక్షచేసి యేవిధమైన రోగాలూ లేనివాళ్లని వైద్యులు నిర్ణయిస్తేనే కాని పెళ్లి చేసుకోకూడదని శాసింపబడినది. 24 రాజ్యాలలో స్త్రీ పురుషులు తా మెవరిని వివాహమాడ దలుచుకున్నారో ముం

ముందుగా ప్రకటించి తీవలెనని శాసనము చేయబడినది. ఇదిగాక స్కూళ్లలోను కాలేజీలలోను కూడా స్త్రీత్వ పురుషత్వ రహస్యమర్మములను గూర్చి భార్యాభర్తలకు తగవులు కలుగుటకు కారణములనుగూర్చి గంభీరోపన్యాసముల నిప్పించుచునేయున్నారు. దీనినిగూర్చి తరగతివారీగా టెక్స్టు బుక్కులు వ్రాసేశారు. చీచీ బడులకు కాలేజీలకు పోయి యిదా నేర్చుకోవడమని పూర్వాచారపరాయణ ఛాందసులు అసహ్యించుకుంటున్నారట. కాని నవనాగరకు లందఱూ అత్యుత్సాహముతో తమ కన్యకల నీ చదువులకు పంపించుచున్నారు. పంపించకపోతే నిర్బంధించడంకూడా జరుగక తప్పదు. ఏలాగైతేనేమి విడాకుల కోర్టుల జడ్జీలకు, పడుచువాళ్ల నేరముల కోర్టుల జడ్జీలకు కొంచెం పని చులకనపడితే వారు సంతోషించకమానరు. మన దేశములో మన ప్రాతయాచారములు మానడము, క్రొత్త చదువులు చదవడము, స్వతంత్ర వివాహములాడడము, విడాకుల చట్టమునకై తంటాలుపడడం దాకానే వచ్చేను. అదైనా కొంచెము మంచిదే. అనేకమంది పాపము ఇంకా చదువులురాక, పెద్దలుచేసే పెండ్లిండ్లకు కట్టుబడిపోయి, ముండమోసి అఘోరిస్తునేవున్నారు. ఏమైనా విడాకుల చట్టము ప్యాసవుతుంది కాని మానదు. స్త్రీల హక్కుల నణగద్రొక్కి దుఃఖభాజనులనుగా చేయుటకు మన శాసనసభల సభ్యులు ఒప్పరు. మన దేశంలోకూడా విడాకుల చట్టము ప్యాసయిన తరువాత కాలేజీకోర్సులు పెట్టవలసిన సందర్భం తటస్థించవచ్చును. ప్రభుత్వమువా రిప్పటినుంచే బడ్జెట్టులను సరిపెట్టుకుంటూ భూరివిరాళముల నిచ్చుటకు సిద్ధముగా నుందురుగాక!

## ఫోటోగ్రాఫులకు శిక్షలు

కార్మికప్రభుత్వం యేర్పాటయినప్పటినుండీ రష్యా ఉద్దండంగా నాగరికమైనదనీ, నేరములు శిక్షలు తగ్గినవనీ, షష్టిగడియలూ ప్రజలంతా తమ పనులూ, చదువులూ, విహారములూ తప్ప అక్కరమాలిన తిరుగుడులు తిరగరనీ, తిరిగినా కాస్త అనునయించడమే కాని కఠినశిక్షలుండవనీ ప్రయాణికులు వ్రాసిన పుస్తకాల్లో మనము తరుచుగా చదువుతూవుంటాము. కాని యీమధ్యన మ్యాంచెస్టరు గార్డియనుకు మాస్కో విలేఖరి వ్రాసిన విషయాలను పట్టిచూస్తే మానవప్రకృతి అంతటా ఒక్క మోస్తరుగానే వుంటుందనీ, భూమి యెప్పుడూ సంపూర్ణ స్వర్గముకాదనీ, చేయకూడదన్న పనులను తప్పక చేదామనే బుద్ధి కొందరు ప్రజల కెప్పుడూ వుండక పోదనీ, శిక్షలు తప్పకుండా వేస్తూవుంటారనీ తెలియకమానదు.

మాస్కో సెంట్రలుపార్కులో తప్పత్రాగి తిరగడం, తన్నుకోవడం, అసహ్యపుమాట లాడుకోవడం, గరికమీద నడవడం, పువ్వులు గిల్లడం మొదలైనవన్నీ నేరాలక్రింద భావించబడతాయట. ఎవరైనా యీలాటి పనులు చేశారా, శిక్షలు తప్పవు. మన దేశాలలో అయితే జరిమానాలు ఖైదులు వేస్తారు. అక్కడ మనుష్యులజోలికి పోరట. వారి తాలూకుబొమ్మలను తయారుచేయించి క్రింద పేరు వ్రాసి, అక్కడక్కడ వ్రేలాడ వేస్తారట. పదిమందీ యీ బొమ్మలను చూచి తమ చర్యలకు నవ్వుతారు గదా అని వీరప్పటినుంచి నేరాలు మానేస్తారట. ఇవానోవా అనే 19 యేండ్లపిల్ల అమితంగా తాగుతుందనీ, కొంతకాలము బాటైనా ఒక పురుషుడితో కాలక్షేపంచేయక అతిశీఘ్రముగా మగలను మార్చుకుంటుందనీ, పార్కులో తిరుగుతూ పువ్వులేరుతుందనీ నేరములు మోపబడినవి. ఆమె తప్పత్రాగినప్పు డెట్టి వికారముతోవుండునో అట్టి బొమ్మలు తయారుచేయించి, ఆమెయొక్క దుర్గుణముల నాపె బొమ్మక్రింద వ్రాసి పార్కంతటా వ్రేలాడ కట్టినారు, మొదటి రెండు నేరాలకిన్నీ. పువ్వు లేరుకున్నందుకు పదిహేనురోజులూలు జరిమానా వేశారు. క్రామేదు సాఫోవో అనే 22

యేండ్ల యువకుడికి పువ్వులేరినందుకు 25 రోజులు జరిమానా. డాబుసరీగా దుస్తులను వేసుకొని షోకు చేసుకుంటూ పోకిరీతనంగా తిరుగుతాడట. యుక్తంగా ప్రవర్తించడం అతనికి తెలియదని వ్రాస్తూ అతని పోకిరీతనపు బొమ్మలను పార్కులంతటా కట్టినారు. పార్కులో చితార్లూ, ఫ్లూటులు మొదలైనవి వాయించడం పాడడంకూడా తప్పులాగుంది. అక్కడక్కడ పాటగాండ్ల బొమ్మలనుగూడా తగిలించేశారు. పార్కులో ఉండే అసలు చిత్రాలనుకంటె యీ చిత్రాలనే పదిమందీ చూసుకుంటూ కాలక్షేపం చేస్తారేమో! అప్పుడు అల్లాటి పెద్దమనుష్యుల బొమ్మలనుకూడా తగిలించవలసివుంటుంది. సిగ్గు తెచ్చుకొనేవాళ్ళకైతే యిది బాగానేవుంది కాని పైరకం మనుష్యులకు అసలు సిగ్గు కలుగుతుందేమో ఆశ్చర్యం. ఒకసారి రెండుసార్లు సిగ్గుపడి అక్కడనుంచి మోట తేరేవాళ్లుకూడావుంటారు.

రష్యాలో కూలివాళ్ళకీ పనివాళ్ళకీ తప్ప వడ్డీ వ్యాపారం, వర్తకం మొదలైన వృత్తులు చేసే వాళ్ళకు గౌరవంలేదు. వడ్డీ వ్యాపారస్తుడన్నా వర్తకుడన్నా 'దొంగ'వలె ఒకమోస్తరు తిట్టూ దూషణాలాంటి పదాలు. ఈమాటలంటే కొందరికి పౌరుషం వస్తుంది. కొందరికి కోపంవస్తుందట. పీటరు, అనా అనే యిద్దరు దంపతులు పైవ్యాపారాలు చేస్తూవుంటే, వారి పెద్దకుమారుడు 13 యేండ్ల వయస్సుగల మిస్చా అనే కుఱ్ఱవాడికి నామోషీగావుండి పేపర్లో ఒక ఆర్టికిలు వ్రాసేశాడట. తల్లిదండ్రులీ అవమానము భరించలేక ఒకనాడర్ధరాత్రి అతనిని చంపేశారట. అతని శవం పొలాల్లో దొరికింది. మూడునెలల దాకా ఆచోకీ తెలియలేదు. అఖరుకు వారి రెండవ కుమారుడు వాన్యా అనేవాడు ఈ గుట్టు బయలుపెట్టి కోర్టులో తల్లి దండ్రులకు విరోధముగా సాక్ష్యము చెప్పుతున్నాడు. విపరీతపు నాగరికతను తెచ్చిపెట్టితే విపరీత నేరాలుద్భవిస్తూవుంటా యనడానికి యిది నిదర్శనంకాదా!

## దయ్యాలులేని దేశమేది ?

మూఢవిశ్వాసములు భారతదేశములో మాత్రమే వున్నవని క్రైస్తవమతము ప్రాకినంత మేరకట్టి వేమీ లేవనీ ఫాదరీలు తరుచుగా బడాయిలు కొడుతూ పాటలుపాడుతూవుండడం మనంవింటునేవున్నాము. 'ఆహా! మనదేశ మెంత మూఢదేశము, వారివలె మనము విజ్ఞాననిధుల మేనాడు కాగలము' అని తలపోసుకొని యువకులు లేరు మన దేశంలో. కాని ప్రకృతి ప్రతీదేశంలోను ఎల్లకాలం వొక్కలాగే రూల్సుప్రకారం వర్తించుకొనిపోతూవుండదు. మానవప్రకృతిలాగే భౌతికప్రకృతిలోకూడా ఎన్ని చట్టాలు వున్నాయో,'అన్ని చట్టవిరుద్ధవర్తనలుకూడా కనిపిస్తూవుంటాయి. చట్టాల ఆవశ్యకత, రహస్యమే మనకు తెలుసును కాని, అవి తెగిపోవలసిన ఆవశ్యకత, దాని కారణము, ఆ రహస్యమూ మన కింకా తెలియదు. సాధారణప్రకృతికి విరుద్ధముగా ఎక్కడేనా కొన్ని చర్యలు కనిపించితే విజ్ఞానులు వానికి కారణాలు వెతుక్కుంటూ తన్నుకుంటూవుంటారు; సాధారణులు అవి యేవో సైతానుచర్యలు దయ్యాల చేష్టలు అని భయపడుతూవుంటారు; మతాసక్తిగల ఛాందసులు జపతపాలుచేసి వానికి ప్రతీకారం చేయజూస్తారు; సంస్కారచిత్తులు అది మూఢత్వమని హేళన చేస్తూవుంటారు. ఎవరెన్నిచేసినా ఆ ప్రకృతి విరుద్ధచర్య లప్పుడప్పుడు జరుగుతూవుంటాయి కాని మానవు.

మన దేశంలో దయ్యాలు బెడ్డలు విసరినట్లు, చద్దిఅన్నములు తినేసినట్లు, పురిటాళ్ళమంచా లెత్తివేసినట్లు, స్త్రీలను పిల్లలను పీడిస్తున్నట్లు అనేక కథలు చెప్పుకుంటూవుంటారు కొందరు. అవి వట్టి అబద్ధాలని కొందరు కొట్టేస్తూవుంటారు. మనము యెవరినీ కాదనవద్దు. అల్లాటి చర్యలు జరిగినవని పెద్దమనుష్యులు చెప్పినట్లు కాస్త నమ్మదామే అనుకోండి. జరిగితేమాత్రము ఆశ్చర్యమేమి? జరగలేదంటే తీరిపోయిందా? మనవాళ్లనంటే మనము నమ్మడం

మానేస్తాము కాని, పాశ్చాత్యదేశస్థులనుకూడా నమ్మడం మానేస్తామా? ఆ దేశాల్లోకూడా అలాగు జరుగుతున్నాయంటే కాస్త నిదానంగా ఆలోచించ వలసిన విషయమే అని అందరూ ఒప్పుకుంటారని మా వుద్దేశ్యము.

మనకు పాలకదేశమైనటువంటిన్నీ గురుదేశమైనటువంటిన్నీ ఇంగ్లాండులో సౌతురెస్టను అనే ఒక గ్రామములో ఒక దయ్యము ఈదిగువ చెప్పిన పనులన్నీ చేసిందట. కోడిగ్రుడ్లన్నీ తినేస్తుంది. పెంకుటింటి డాబామీదికి పెద్దకన్నాలుపెట్టి యెక్కడినుంచో తెచ్చి నీళ్లు వొలకపోసి యిల్లంతా ముంచేస్తుంది. ఇ టిల్లిపాదిమందినీ భయపెడుతుంది. వింతవింత జంతువులు పిట్టలూలాగ కేకలు అరుపులు యీలలూ వేస్తుంది. బి. గాస్వెలు అనే ఆయన కుటుంబసహితంగా ఆ యింట్లో నివసిస్తున్నాడు. తన పడకగదిలో ఒకనాడు తెల్లవారగట్ల పెద్ద చప్పుడయింది. ఇంటావిడ యెలకలు కాబోలును పోనిద్దురూ అంది. తెల్లవారిచూస్తే మనిషి దూరేటంత కన్నము మేడడాబాలో చేసివుంది. ఇంట్లో తిను బండారములన్నీ అలాగే మాయమౌతున్నాయి. ఎలకలన్న సమాధానము మరీ నచ్చలేదు. ఏవో వింతజంతులైయుంటుం దనుకున్నారు. ఇప్పుడు డాబానిండా పెద్దపెద్ద కన్నాలే; కన్నాలలోంచి సింహాచలం ధారలలాగ నీటిప్రవాహాలే.

పాపము గాస్వెలు ఏమిటిచేస్తాడు! కిటికీలన్నీ తెరిపించేశాడు, అన్ని గదులలోను కాగడాలూ మంటలూ వేయించేశాడు. పాలికాపులను, తోట మాలీలను అందరినీ తెల్లవార్లూ కాపుపెట్టాడు. ఇంతాచేస్తే ఒకపిల్లి హడావిడిగా అందులో పరుగెత్తింది. పిల్లే ఇదంతా చేసివుంటుందని సమాధానం చేసుకుని కాపలా కొంచెం తగ్గించి ఆ యింట్లోనే కుటుంబము కాలక్షేపము చేస్తున్నారు. కాని గాస్వెలు కూతురుకు ఏదో ఒక భయంకరాకారం ప్రతీక్షణమూ కనిపిస్తునేవుంటుంది. ఆమెకు నోట మాటరాక మూర్ఛిల్లిపోతుంది. ఫలానా అని చెప్పడానికికూడా తడబడుతుంది. వూరందరూ ఆ యింట్లో దయ్యమున్నాదని నిశ్చయించేశారు. మన వేదాంతులైతే అది పూర్వజన్మప్రారబ్ధ మంటారు. పూర్వజన్మప్రారబ్ధమైనా కాకపోయినా యీ జన్మలో అనుభవమనడానికి సందేహములేదు. శాస్త్రజ్ఞులు దీనికి సమాధానములు చెప్పి ఆ కుటుంబమును కాపాడితే యెంతో పుణ్యము కట్టుకుంటారు.






సంచికా ప్రశంస:—

ఈ దరరాసంచికలో: వ్రాయబడిన గద్య పద్య గేయాది వ్యాసములెల్లయు స్త్రీ విలేఖరులవి మాత్రమేయైయున్నవని పాఠకులు గమనింపఁగలరు. మన ఆంధ్రనారీమణులు మధ్రుచి సంయుక్తములైన భక్ష్యభోజ్యాది పాకములనేగాక నవరస భరితంబులైన సాహిత్యపాకంబుల గూడ తయారుచేసి స్త్రీపురుషుల కావ్యాయనములగు నామెతలు పెట్టి జిహ్వాత్రుప్పులు దుల్లించగలరని యీ సంచిక చెప్పక చెప్పుచున్నది. కథాకల్పనము, గంభీరాలోచనము, విషయచర్చ, రాజకీయములయందు అనుభవము మొదలగు నంశములలో పురుషుల వ్యాసములకివి తీసిపోవని శ్రీమతులు వందేమాతరం, నాగమ్మ, చూడికుడుత్తమ్మ, రామాబాయమ్మ, వరలక్ష్మమ్మ, రుక్మిణమ్మ, సీతాంబ, తులిశమ్మ మొదలగు వారల వ్యాసరత్నములవల్ల విశదముకాగలదు. ఈ సంచిక మన ఆంధ్రనారీమణుల విద్యాశక్తిని, స్వతంత్రాలోచనాశక్తిని, వ్యాసరచనానురక్తిని, సరస్వతీదేవతాభక్తిని వృద్ధిచేసి, పుంఖానుపుంఖములైన సాహిత్యరచనలు వారి లేఖినులనుండి వెలువడునట్లు చేయునుగాక!

కార్మికగర్భిణుల ఆరోగ్యరక్షణము:—

సంసారనిర్వాహణమునకై వలయు ధనమునార్జించుట పురుషుని కర్తవ్యమును, అంతకు మించకుండనే వ్యయమును సర్దుచు గృహనిర్వాహణ మొనర్చుట స్త్రీకర్తవ్యముగను సాధారణముగా హిందూదేశమున తలపబడుచున్నది. కాని అనుభవములో ఏ పెద్ద జీతగాండ్రకో తప్ప సాధారణవిషయమున ఈ సూత్రము సాగకున్నది. పురుషుడు సంపాదించిన ధనముతోనే స్త్రీ జీవించుట ఆమె ఆర్థికస్వాతంత్ర్యమునకు వ్యతిరిక్తమైనదనియు, పురుషునితో సమాన స్వాతంత్ర్యమును స్త్రీ అనుభవింపఁదలచినయెడల అతనిచే సంపాదితమగు ద్రవ్యముపైననే తానాధారపడక తానుకూడ ఉద్యోగముచేసి తనపేర కొంతధనమును బ్యాంకులో వేసుకొని పురుషుని పూచీలేకుండా తాను ఖర్చుపెట్టుకొన గలిగియుండవలెననియు మొదలగు భావములు పాశ్చాత్యవిద్యా విలాసితలకు తఱచుగా కలుగుచు ఆప్రకారము వర్తించుచుండుటయు మనము చూచుచున్నాము.

కేవలము ఆర్థికస్వాతంత్ర్య దృష్టితోకాక కుటుంబ నిర్వాహణ దృష్టితో చూచినను,

అనేకపేదకుటుంబములలో పురుషునొక్కని యార్జనయు చాలదనియు, అతడు స్త్రీ సహాయమును కూడ అపేక్షించుచున్నాడనియు, స్త్రీ అట్టి శ్రమపడి ధనమార్జించుచు గృహనిర్వహణ మొనర్చుచున్నాదనియు కూడ మనకు తెలిసినవిషయమే. పల్లెటూళ్ల రైతులలో పురుషులు చేయవలసిన భారమైనపని పురుషులును స్త్రీలు చేయగల చులకనైనపనులను స్త్రీలును చేయుటవలననే వ్యవసాయము సాగుచున్నదనుట మనకు ప్రత్యక్షమైన విషయమే. తక్కిన కోతలు, ఉడుపులు, మోతలు మొదలగు కేవలము కూలిపనులలో స్వంత వ్యవసాయములు లేని వారలు వ్యవసాయదారులవద్దకు కూలికి పోయి స్త్రీలును పురుషులును గూడ దినము కూలులు ఆయాసమయములలో పుచ్చుకొందురు; లేని సమయములలో వారును వీరును కూడ నిర్వ్యాపారముగనే ఉందురు. ఇట్టి కాలమునే రాట్నమువడుకుట మొదలగు పనులలో బుచ్చిన సద్వినియోగముచేసి యెంతో కొంత ధనమును సంపాదించుకొనవలెనని గాంధీమహాత్ముడు చెప్పుచున్నాడు. అట్లుచేయుట మంచిదని యెల్లరును గ్రహించియు ఆచరింపకుండుటయు, ఇట్టి చిన్నిచిన్ని పరికరములను విదేశీ దిగుమతి దారులవద్ద కొనుక్కొనుటయు మిగుల శోచనీయము. ఇది పల్లెటూరి పనివాండ్రయవస్థ.

ఇక పట్టణవాసముల పనివాండ్ర యవస్థ చూతము. వీరిలో పెక్కుఱు ఫ్యాక్టరీలు, మిల్లులు మొదలగు స్థిరమైన సంస్థలలో సేవకులే. వీరి కేడాదిపొడవునను పనియుండును. పని చేయునంత కాలమును యజమానులు వీరికి కూలులో జీతములో యిచ్చుచుందురు. వీరి కూలిపనులవల్లనే యజమానులు శ్రీమంతులై అంగరంగవైభోగములను భవించుచు, బ్యాంకులలో సొమ్ము మిగుల నిలవచేసుకొనుచు, క్రొత్త క్రొత్త మిల్లులను కట్టుకొనుచున్నారనుట లోకవిదితము. మరి యేకారణముచేత గాని యజమానులు వీరిని త్రోసివేసినను, లేదా పనిచేయలేని దినములకు కూలులీయరేని వీరు అన్యథా శరణము లేక మలమల మాడిపోవుటయు నిశ్చయము. తమ సంతతికి ఆగర్భ శ్రీమంతులనుగా నొనరించుచున్న కూలివాండ్రపైని ఉద్యోగస్థులపైని యజమానులనురాగ విశ్వాసములు చూపుచు, వారికి కాలు చేయి నొచ్చినప్పుడు నిరాధారులు కాకుండా చూడవలసిన బాధ్యత యజమానులపై గలదని నాగరికదేశములన్నియు అంగీకరించుచున్నవి. మన దేశపు మిల్లుల యొక్కయు కూలివారియొక్కయు పరిస్థితులను విచారించిన లేబరు రాయలు కమిషను వారు కార్మికుల శ్రేయస్సుకొరకు కొన్ని కొన్ని సూచనలుచేసిరి.

ఇట్టి కార్మికులలో నొకభాగమగు స్త్రీల శ్రేయస్సు విషయమున చేయబడుచున్న చర్యలనుగూర్చి మనము కొంత విచారింతము. పురుషుల కెప్పుడో కాలు చేతులు నొచ్చునుగాని స్త్రీలు తరుచుగా గర్భిణులై ప్రసవాత్పూర్వమునను పరమునను కొంత కాలము పని చేయజాలరనుట నిశ్చయము. అట్టికాలములో యజమానులు వారి నసడ్డ

చేయక కూలులనిచ్చి కుటుంబములను నిలువబెట్టవలసిన బాధ్యతలను నెరవేర్చవలసినవారై యున్నారు. వారట్లు చేయునిచో ప్రభుత్వమువారును శాసనసభ్యులును నిర్బంధముగా వారిచేత నట్టి విధాయకకృత్యమును చేయించవలెను. ఇందుకొఱకై శ్రీయుత వి. యమ్. రామస్వామి ముదలియారుగారు మదరాసు శాసనసభలో నొక బిల్లును పెట్టినారు. అది శాసనసభలో చర్చ ముగిసినవెనుక డాక్టరు నటేశముదలియారుగారి అధ్యక్షతక్రింద నేర్పరుపబడిన సెలెక్టుకమిటీకి, తగిన మార్పులకొరకు కొసంగబడినది. వారు కొన్ని మార్పులను చేయుచు నివేదికను తయారుచేసి ప్రకటించినారు. ఆమార్పులు చాలా విశాలదృష్టితో చేయబడి కార్మికయువతుల కెంతయు శ్రేయస్కరమైనవనుటకు సందేహములేదు.

ఈ శాసనము మదరాసు నగరమునను తత్పరిసరములగు మరికొన్ని నగరములలోను గల ఫ్యాక్టరీలకే గాక మదరాసు రాజధాని యందలి ఫ్యాక్టరీల కన్నిటికి వర్తించునట్టుల చేసిన మార్పు మొట్టమొదటిది. ఇందువల్ల యీ శాసనప్రయోజనము కొన్ని ఫ్యాక్టరీల లోని కార్మికయువతులకే కాక అన్ని ఫ్యాక్టరీల యువతులకును సమముగ కలుగును. ప్రసవాత్పూర్వమున నాలుగు వారములు పూర్వమునుంచికూడ యజమానులు యువతులవద్దనుండి పని పుచ్చుకొనరాదనునది రెండవది. ప్రసవాత్పరమునకూడ మూడు వారములు పని పుచ్చుకొనరాదనునది ప్రధానమగు మూడవమార్పు. ఈ యేడు వారములలోను ఆమెకు దినమునకు ఎనిమిదణాల చొప్పున యజమాను లీయవలెనని కమిటీవారు ఏకగ్రీవముగ తీర్మానించినారు. కొందఱు యజమానులు ఈ కూలుల నిచ్చుటను తప్పించుకొనుటకొఱకు ముందుగానే గర్భిణిస్త్రీలను పనులనుండి తప్పించుకొని శాసనప్రయోజనమును వమ్మొనరింపవచ్చును. ఆరేడుమాసముల గర్భిణీస్త్రీలను పనినుండి తొలగించరాదనికూడ మఱియొక నిర్బంధము చేయబడినది. ఈ కూలిలాభము ఆమెకే కాకుండా, ఒకవేళ ఆమె చనిపోయినచో ఆమె నిర్ణయించిన మరియెవ్వరికైనను ఇయ్యవలసినదేయని మఱియొక సూచన చేయబడినది. ఈ శాసనము నతిక్రమించి నిండుచూలాండ్రచేతను లేతబాలింతలచేతను పని చేయించుకొనినట్టిగాని, దినము కూలుల నీయనట్టిగాని యజమానులకు రు. 250 లు జరిమానా విధించవలెనని నిర్ణయించబడెను. కనుక ఇట్టి సూచనలతో కూడిన బిల్లును విశేషము మార్పులు చేయకుండా గవర్నరుగా రంగీకరింతురు గాక యని నమ్ముచున్నాము.

—:o:—

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

స్త్రీవిద్యావిషయిక చదలవాడ శ్రీ వేంకటానందమూర్తి

# స్మారక పద్యరచన పరీక్షాపీఠము

(తృతీయవార్షికోత్సవం, 12-12-1934)

పై వార్షికోత్సవ సందర్భమున "స్త్రీవిద్యావిధానము"నుగూర్చి 25 (పాతిక) పద్యములను వ్రాసి ఈక్రింది నిబంధనల ననుసరించి పోస్టుద్వారా 11-11-1934 తేదీ సాయంకాలము 5 గంటలలోగా పంపించు కవయిత్రీమతల్లులకు (1) ప్రథమబహుమానము సువర్ణ పతకమును, (2) ద్వితీయ బహుమానము రజతపతకమును, (3) తృతీయబహుమానము మొల్లరామాయణగ్రంథ రాజమును, (4) 100 గుణములు సంపాదించువారికి "కవిరాజ్ఞి" బిరుదు నొసంగంబడును.

నిబంధనలు

(1) ఈపరీక్ష తెలుంగులో కవితనేర్చిన స్త్రీలకుమాత్ర మేర్పరుపంబడినది.

(2) పద్యములు ఫుల్సుక్యాప్ అరటావుసైజులో ఒకవైపుననే వ్రాయవలెను.

(3) పద్యముల కాగితములపై వ్రాసినవారిపేరుగాని మరేట్టిగుర్తులుగాని లేక పద్యములు సహితము స్వదస్తూరిలో వ్రాయంబడంగూడదు.

(4) పద్యములు వాపసు కోరువారు పోస్టుబిళ్ళలను పంపవలెను.

(5) పద్యముల కాగితములతో కలిపి సీల్లున్న కవరులో పద్యములు వ్రాసినవారి పేరు చిరునామాయును, ఈ క్రిందివిధముగ సర్టిఫికేటున్నుచేర్చి, కవరుపై ఏమియు వ్రాయక, ఒకే పార్సిలుగా పంపవలెను.

(6) పద్యములు ఎట్టిపాకములో వ్రాయంబడినను లక్షణరస సమన్వితములుగ నుండవలెను.

సర్టిఫికేటు

"ఈ పద్యములు నిఘంటువులనుబోలు లక్షణగ్రంథములు తక్క- మిగతా ఎట్టి పుస్తకములను జూడకయే స్వాభిప్రాయపూర్వకముగ వ్రాయబడినవని ఇందుమూలముగ శపథముజేసి చెప్పుచున్నాను. సంతకము."

(7) మార్కులు: లక్షణమునకు 30; వ్యాకరణమునకు 30; భావమునకు 30; శైలికి 10; మొత్తము 100 మార్కులు.

(8) పీఠాధిపతులు జయనిర్ణయసభలో పాల్గొనరు.

(9) బహుమతులు 12-12-34 తేదీ పోస్టుద్వారా పంపబడును.

1933 సం॥ బహుమతులు

స్వర్ణపతకం: శ్రీమతి సి. సువర్చలాదేవిగారు, మదరాసు.

రజతపతకం: శ్రీమతి సంకా వేంకాయమ్మగారు, హైదరాబాదు.

తృతీయం: శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు, రాజమండ్రి.

వివరములకు:—దైవజ్ఞశిఖామణి, ప్రౌఢకవి, చదలవాడ ధర్మరాజు సిద్ధాంతి, ఆంధ్రజ్యోతి ర్విద్యాలయం, మోటేపల్లివారి వీధి, ఏలూరు, (పశ్చిమ గోదావరిజిల్లా.)



త్రివర్ణ—హాఫ్‌టోన్
లైనుబ్లాకులు
శ్రేష్ఠమైనవి
న్యాయమైన ధరలకు
తయారు చేయుదుము.

త్రివర్ణ చిత్రములు, పోస్టర్లు
చక్కగా అచ్చువేయుదుము.

ఎం. సి. అప్పాస్వామి శెట్టి
అండ్ కంపెనీ,
బ్లాకుమేకర్సు & ప్రింటర్సు,
14, జోన్సువీధి, మన్నడి,
మదరాసు.

*Please correspond in English*

# జండూ గారి అశోకారిష్టము




## (భైషజ్యరత్నావళి)

స్త్రీలకుకలిగే అన్నివిధ దుర్బలములకు నుపయోగించు గొప్ప టానిక్కు—వంటి దివ్యౌషధము.

స్త్రీలకుకలిగే బహిష్టుదోషము లన్నిటిని నివారణచేయును. అనగా కడుపునొప్పి, ఋతుస్రావము, రక్తస్రావము, సోమరోగ ములు సహా నివర్తించును.

దీని నుపయోగించుటచేత గర్భహీనతనుపోగొట్టి, గర్భముధరించ గలరు. కాన శిశువులు పుష్టిగలవారై వ్యాధులనుండి నిర్ముక్తులగుదురు.

స్త్రీలకు ప్రసవమునకువెనుక అద్భుతమైనబలము కలుగజేయును.

ధర 1 పౌను రు. 1 9 0 ½ పౌను రు. 0 14 0

*Manufactured by*
**The Zandu Pharmaceutical Works Ltd.**
**Bombay 14.**

SOLD EVERYWHERE:

***Sole Agents for Madras Presidency:***

దామోదర అండు కంపెని
78. చైనాబజారు రోడ్డు, జి. టి. మద్రాసు.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

———:O:———

1. **వసుమతి:**—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. **బాలనీతి కథావళి:**—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. **విశ్వామిత్ర మహర్షి:**—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. **ద్రౌపదీవస్త్రసంరక్షణము:**—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. **సత్యాద్రౌపదీ సంవాదము:**—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. **జ్యోతి:**—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. **పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:**—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. **శారదలేఖలు:**— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు:

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగు లక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపము గలిగినప్పుడు ఉపయోగించి తప్పక పనిచేయును. గర్భాశయమునుండి మైల సరిగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుద్ధపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి **(Douche)** మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిది ఒక్కటే; ఇది బాలింతల పాలిటి పరమౌషధము.

వెల తు. 1_కి రు. 30.

పురుడు వారము రోజులకు మందు రు.5

---

## రజోదర్శిని

స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన వ్యాధులకు మంచి మందు. ముట్టునొప్పి, మైల సరిగా కాకపోవడం, బొత్తుగానే బహిష్టు కాకపోవడం, మొదలైన బాధలను నివారించును. రజస్వల కాని వారలుకూడ సేవించిన పిదప రజోదర్శనమైనట్లు ప్రశంసలు గలవు. వివరములు కోరిన పంపబడును.

50 మాత్రలు రు. 2.

పై రెండు ఔషధములనుగూర్చిన వివరములు కోరినవారికి ఉచితముగా పంపబడును.
160 పేజీలుగల 'ఆయుర్వేద చికిత్సాదర్పణము' అను గ్రంథము 0-2-0 లకు పోస్టేజీబిళ్లలు పంపినవారికి ఉచితముగా పంపెదము.

*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకర శాస్త్రి,

ఎ. ఎం. ఎ. సి.





---



# బిడ్డల కడుపులోని బల్లల వ్యాధులకు ఘనమైన వైద్యులు వాడిచూచి శ్రేష్ఠమైనదని వాక్రుచ్చియున్నారు.

అనేకమంది ప్రాణములు మృత్యువు వాతనుండి కాపాడబడినవి. అటువంటి అద్భుత ఫలితము లొసంగగల దివ్యౌషధ మిది యొక్కటే యని వైద్యులు ప్రకటించుచున్నారు.

ఈవిషయమున జమ్మి వెంకటరమణయ్యగార్కి గత 30 సం॥లకు పైగానుండి గొప్ప యనుభవముగలదు. తన ఔషధ శక్తివలన వారు 5 సం॥లలో 10000 మంది రోగులకు కంటె యెక్కువగానే చికిత్స చేయగల్గిరి. జమ్మి వెంకటరమణయ్యగారి ఈ యౌషధములు వాడుకలోనికి వచ్చినతరువాత కడుపులోబల్లల వలన గల్గు శిశుమరణములు నూటికి 90 వంతున తగ్గినవని వైద్యులు నుడువుచున్నారు.

10-8-34 తేదీన డాక్టర్ భాత్ గారు ఏమి వ్రాయుచున్నారో చదువుడు:—

"మొదటి రెండు సంవత్సరములలో మీ ఔషధమువందు నా కెక్కువ యనుభవము లేకుండెడిది. అందుచే కడుపులోని బల్లల వ్యాధికలిగిన బిడ్డలు నా దగ్గరకు తీసికొని రాబడినపుడెల్ల అవి కుదరజాలవని పంపివేయుచుంటిని. కాని, తరువాత తరువాత మీ ఔషధములను వాడుచున్న కొలది నాకు కొంత విశ్వాసము కలుగజొచ్చెను. మీ ఔషధములయందు నాకు బాగుగా నమ్మకము కుదిరినవెనుక, ఎట్టి తీవ్రవ్యాధులకును మీ మందులను వాడి, అద్భుత ఫలితములను చూడ మొదలిడితిని.

ఈవిధముగ అనేకమంది బిడ్డల ప్రాణములు మృత్యువు పాలబడకుండ కాపాడబడెను.

నిజముగా మీ ఔషధము అద్భుతముగా పనిచేయుచున్నదని చెప్పవలెను."

(సం.) కే. పి. భాత్.

బాగుగా ముదిరిన వ్యాధులకుగూడ సుగుణమిచ్చినది.

పూర్తి వివరములకు వ్రాసి తెలిసికొనుడు :—

## జమ్మి వెంకటరమణయ్య,

లివర్ అండ్ స్ప్లీన్ స్పెషలిస్టు, & మైలాపూర్, మదరాసు.

125, హారిసన్ రోడు, :: కలకత్తా.

# కె. రత్నం & కంపెనీ

## సానిటరీ అండ్ డ్రెయ్‌నేజ్ ఇంజనీర్స్



331, తంబుశెట్టి స్ట్రీట్,

జి. టి. మద్రాసు.

## నయమైన నమ్మకమైన కంపెనీ

స్నానపు తొట్లు, స్నానపు గదిసామానులు, హిందువులకు కాని ఆంగ్లేయులకు కాని తగు వాటర్ క్లాసెట్లు, వాష్ బేసిన్లు, యూరినల్ సామానులు, ట్రేడేట్సు, వెన్నీళ్లు కాచునవి, ఇనుము పింగాణీ ఫ్లష్‌టాంకులు, నీళ్లకొళాయిలు, నీటిధారకు వలయు ప్రత్యేకపు కొళాయిలు మొదలైనవి, మేజాలకు పైకి వలసిన చలవరాళ్లును, గోడలకు పైకివలసిన మార్బిల్ప్రిట్లు, అస్బెస్టాస్ సిమింట్ షీట్లును, పెంకులు, పూలరాళ్లు మొదలైన ఆరోగ్యమునకు వలయు సామానులు, మంచి తెల్లనిసిమంటును ఇక్కడ దొరకును. దీనికి సంబంధించిన వివరములు, ఆర్డర్లకు ఎదురు చూచుచున్నాము.

---

# ది మెట్రోపాలిటన్ ఇన్సూర్యెన్సు కంపెనీ లిమిటెడ్

స్థాపించిన ప్రప్రథమ వర్షముననే రు. 4,000,000-ల వ్యాపారముచేసి

ఇతర కంపెనీల ప్రాధాన్యమును "త్రోశిరాజు" అనిన

శుద్ధస్వదేశీ కంపెని ఇది యొక్కటియే.

మా కంపెనీయొక్క ముఖ్యాంశములు :

1. తక్కువ ప్రిమియములు
2. ఎక్కువ లాభములు
3. రెండు సంవత్సరములలో అప్పగింత విలువ
4 విరివిగా అప్పుల నొసంగుట
5. మా పాలసీలు "లాప్సు" కావు
6. నవీన పాలసీపద్ధతులు
7. ఏజంట్లకు ఎక్కువ కమిషను
8. సరియైన మానేజిమెంటు.

ఆంధ్రదేశమందంతటను స్త్రీ, పురుషులు ఏజంట్లు కావలయును.

వలయువారు ఈ క్రింది అడ్రసుకు వ్రాయుడు :

మెసర్సు నరసు అండు బ్రో,
ఆంధ్ర జిల్లాల ఆర్గనైజర్లు,
121, చైనాబజారురోడ్డు, మదరాసు.

బ్రాంచి శెక్రిటరీ,
3, ఎఱ్ఱబాలుచెట్టి వీధి,
మ ద రా సు.

పైవారు అక్టోబరులో ఆంధ్రజిల్లాలు "టూరు" చేయుదురు. ఖుద్దున మాట్లాడదలచినయడల వారు మీవూరు వచ్చు తారీకుకై "హిందూ" పత్రిక చూచుచుండును.

# కొలంబియా కంపెనీవారి

ప్రథమ ప్రశస్త ఆంధ్రనాటకము

# "బొబ్బిలి యుద్ధము"

ఒళ్లు పులకరించును

గుండెలు దడదడలాడును

గ్రామఫోను రికార్డులలో

ఇంతచక్కని 'సెట్టు'

ఎక్కడనూలేదు !




ఇది చరిత్రప్రసిద్ధమైన కథ. యథార్థముగ జరుగుచున్నట్లుండును. కొలంబియావారు అనన్య సాధ్యమైన నైపుణ్యముతో తయారుచేసిరి. జీవకళ లోడుచుండును. దక్షిణ ఇండియాయంతటికిని సరఫరా చేయుచున్నది వీరొక్కరే. ఏజంట్లందరియొద్ద నుదొరకును.

## ఆర్'స్ కొలంబియా హౌసు

మదరాసు.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

—:O:—

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింప బడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీవస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యార్థినులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.




సంపాదకుఁడు

# డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] నవంబరు 1934 [సంచిక ౯

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువదైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసినచో జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# నవనాగరికమైన వన్నె చిన్నెల బట్టలు

## కావలెనంటే

ఫ్యాషను సిల్కుష్యాపులను ప్రఖ్యాతివహించియున్నది.



44 యేండ్లాయెను
దక్షిణ హిందూ
దేశమంతట
దీనిపేరు
మ్రోగుచున్నది.

నాణ్యమైన సరుకు
సరసమైన వెల
చాలాకాలము
మనుదల
ఇవి మా
వ్యాపారసూత్రములు

## చీరలు

రకరకాల ప్రకాశవంతమగు రంగులు క్రొత్త క్రొత్త ఫేషనుల అంచులు. ఎవరికెట్టి శుభకార్యములకు వేడుకలకు ఎటువంటివి కావలసిన నటువంటివి దొరకును. తమరు స్వయముగా వచ్చి చూడవచ్చును లేదా జాబుద్వారా ఆర్డరు పంపవచ్చును.

45
రటాన్ బజారు, మదరాస్.

# చెల్లారామ్స్

(చెల్లారామ్స్
కెయూఃచెద్)

బజారుల
మధ్యన గలదు.

# ఆమెకు కష్టముగా ఉన్నయెడల తిట్టకుము



## వైద్యులకు తెలియును ఆ కష్టకారణము

ఆమెకు నగములు పీకుచున్నను, ఆమె కింకపట్టుపట్టినను అందు కేదో ఒక కారణము ఉంటుంది.

ఎ-డి అను జీవాణువులును, సున్నమును భాస్వరమును చాలినంతగా లేకున్నచో పిల్లలకు వొళ్లురాదనియు, ఎముక గట్టిపడదనియు నరములు క్రమముగ పని చేయవనియు వైద్యులు చెప్పుదురు. పై పదార్థములు తక్కువకాగానే పిల్లలు దుర్బలురు, కోపిష్టులు అయి చీకాకు పడుచుందురు.

వైద్యులంగీకరించిన సులభమైన నివారణోపాయము

## స్కాట్సు ఎమల్షను

ఇది అతిసున్నితమగు కాడ్డు లివరు ఆయిలునుండి తయారగును. ప్రాణియొక్క పెరుగుదలకత్యావశ్యకమైన పై పదార్థములు ఇదు చేరియున్నవి కనుక సాధారణ కాడ్డు లివరు ఆయిలు కంటె యిది మూడురెట్లధిక గుణమునిచ్చును. వైద్యులు అరవై సంవత్సరములనుండి సిపార్సు చేయుచున్నారు.

## ఊపిరితిత్తులకుకూడ అమూల్యమగు పుష్టినిచ్చును.

సాదా కాడ్డు లివరు ఆయిలుకంటె స్కాట్సు ఎమల్షను రుచిగావుండును, సులభముగా జీర్ణమగును. పిల్లలత్యాప్యాయనముగా తీసికొందురు. దగ్గు, జలుబు, గుండెనొప్పి మొదలగు సందర్భములలోకూడా తీసుకొనవచ్చును. జ్వరములు సంకటములు నిమ్మళించిన వెనుక తీసుకొన్నచో ఎప్పటి బలమును చేకూర్చును.

**ఆశ్చర్యమైనా యథార్థము**

**స్కాట్సు ఎమల్షను**

ఒక పెద్ద చెమ్చా వెన్న కంటె 80 రెట్లు ఎముక పుష్టియు, 2 పైంట్లపాలు 2 కోడిగ్రుడ్ల గుజూరు 2 పౌనుల అరటిపండ్లు కంటె యెక్కువ బలమును కలుగజేయును.



**స్కాట్సు ఎమల్షను ఏమేమి చేయుగలదు?**

ఎముకలను మాంసకండలను నిర్మించును. నరములను బలపరచును. ఊపిరితిత్తుల కాపాడును. రక్తవృద్ధి చేయును.

# SCOTT'S Emulsion

మందీవర్తకులు :

ఇంపీరియలు కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్,

కలకత్తా, బొంబాయి, మదరాను, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిను, కాలికట్టు, విశాఖపట్టణము, కరాచి, అమృతసరు,

# ప్రకృతిశోభ
# ధ్వంసమైనది!



వృక్షాలు వ్రేళ్లతో కూలినవి
నదులు బుసబుస పొంగినవి
ఇండ్లు పగిలినవి
భూమి బీటలు పడినది

## అది భూకంపము!

# ఆరోగ్యము
# ధ్వంసమైనది!

చలి గజగజ వణకించినది
ఉష్ణము బుసబుస పొంగినది
ఉదరమున బల్ల పెరిగినది
పైత్యము ప్రశాంతతను
తలక్రిందులు చేసినది.

అది జ్వరము

## విషజ్వరము



రెండును ప్రమాదములె—భూకంపములకు విరుగుడు లేదు
కాని జ్వరములకు మాత్రము విరుగుడు అర్క వున్నది.

(సర్వజ్వర నివారిణి)

# అర్క

అన్ని మందులషాపులలోను దొరకును

**కేసరికుటీరం,** ఎగ్మూరు, మదరాసు.

# మాలతి




ఇది బాదంపప్పుపాలనుండి తయారుచేయబడిన యొక తెల్లని సువాసనగల నవనీతమువంటిది. దీనిని స్త్రీపురుషులు తలదువ్వుకొనుటకు ముందుకొద్దిగ రాచుకొని దువ్వుకొనిన, వెండ్రుకలు రేగక పట్టుకుచ్చువలె మిసమిసలాడుచుండును. మెదడు చల్లపడి సుఖముగ నిద్ర వచ్చును. ఇందు ముఖ్యముగ మాలతీపుష్పముల అత్తరు చేరియున్నది. ఈయత్తరు సొగసునకు సొంపునకు సుఖమైన సువాసనకు పేరు గాంచినది.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

తిరువనంతపురము, హుబ్లీక్షేత్రములయందు
అఖిలభారత వస్తుప్రదర్శనములలో
ప్రథమతరగతి బంగారుపతకములనుపొందిన

కేసరి

# డెంటల్ క్రీమ్

అను

## దంతధావన నవనీతము




మృదు మధుర పరిమళ మిళితము.
ఎల్లరు ఒకమారు రుచిచూడవలయును. దంతములను
ముత్యములవలె చేయుటయేగాక పంటిజబ్బుల నన్నిటిని నివారించును.
భారతదేశమున భారతీయునిచే భారతీయులకొరకు తయారుచేయబడినది.

అన్ని షాపులలో దొరకును.
అణాలు 8 మాత్రమే.

## కేసరి కుటీరం,
ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

త్రివర్ణచిత్రము:

'భక్తురాలు'

ఛాయాచిత్రములు:

గాంధి; యమునాబాయ్ రాఠోడ్; 'చంద్రోదయం' కాగలభాగ్యశాలులు జగచ్చరితామృత పాత్రలందరున్; శ్రీగాంధి సేవాసేన. గాంధిజయంత్యుత్సవము సలుపుచున్న బాలికలు; 'సహోదర సౌభాగ్యం' శ్రీమతి యం. మరకతవల్లి; శ్రీమతి మిస్. అనసూయాబాయ్; శ్రీమతి యమ్. యస్. శ్రేష్ఠ; డాక్టర్ యస్. ముత్తులక్ష్మిరెడ్డి;




# దీపావళి

సౌవర్ణకంకణ ఝణఝణనినదంబు శింజినీరవముతోఁ జెలిమిసేయ।
తాటంక మణిగణ ధగధగ దీప్తులు గండమండలరుచి గప్పికొనఁగ।
ధవళేతరాపాంగ ధళధళ రోచులు బాణజాల ప్రభాపటలి నడఁప।
శరపాత ఘుమఘుమ శబ్దంబు, పరిపంథిసైనిక కలకల స్వనము లుడుప।
వీరశృంగార భయ రౌద్రవిస్మయములు।
గలసి భామినియయ్యెనో కాక యనఁగ
నిషువుదొడుగుట దివుచుట యేయుటెల్ల।
నెఱుఁగరాకుండ నని సేసె నిందువదన॥

—'భాగవతం'

శక్త్యనుసారము నవరాత్ర దీక్షసలిపి పేరటాండ్రసేసలు తలఁదాల్చి త్రికరణశుద్ధలై యున్న సాధ్వీమతల్లుల కికముందు రానున్నది దీపావళి యని జ్ఞాపకముచేయుట కోపి యున్నదియే పై పద్యము. లోకకంటకుఁడైన నరకదైత్యుని సేనలఁ జెల్లాచెదరుసేసి భగవంతుని మెప్పొందిన యా భామామణి దివ్యరూపము నొక్కపరి మనసులం జిత్రించుకొని చూచెదరుగాక "రాకేందు బింబమై రవిబింబమై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు......హర్షదాయియై మహారోషదాయియై......హరికి నరికిఁజూడ నందంద శృంగార వీరరసము లోలి విస్తరించు" చున్నది! ఆహా! ముల్లోకములును ముగ్ధములై "బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల, రణరంగమున కెట్లు రాఁదలఁచె..."

బలుకుమనినఁ బెక్కు పలుకని ముగుద యేగతి నొనర్చె సింహగర్జనము" లని చిత్రాకృతిం బొందియున్నవి !!

ఔను: వీరమాతలగు భారతనారీరత్నముల తెరఁగట్టిదే! సమయము వచ్చినపుడగ్ని లోఁబడిమైన నాపదబాపుట; లేనప్పుడు నిజ గృహమందు లక్ష్మీస్థానమున నుండుట. అంతే కాని అనవసరముగ వీధినిబడి యార్భాటము సేయుట యెంతమాత్రముఁగాదు! ఈమర్యాద యనుశ్రుతముగా వచ్చుచునేయున్నది; కాని యప్పుడప్పుడు మాత్రము పరిస్థితులు తద్భిన్నములై యేర్పడుటయుఁ దన్మూలమున ధూర్తవ్యాఖ్యాన ప్రభవములు చెలరేగుటయు బుద్ధిమంతులగు వారికి గోచరించుచునే యున్నవి. అయిన నంతమాత్రమున భయపడ నవసరములేదు. ఏలయన నది శాశ్వతముకాదు: శాశ్వతమైన దల్ల మొదటి ధర్మమే. ఏయుగమునందుగాని యధర్మము వల్లఁ గొంత ప్రజాపీడ గలుగుటయు నది యేదో యొక యపూర్వశక్తి మూలమున నశింపఁబడి మరల యథాప్రకారముగఁ బ్రజాసౌఖ్యము విస్తరించుటయు సర్వత్ర వేద్యములు. దీనికి నిదర్శనములఁ జూపుటకు మనమేదో యొక పూర్వయుగమునకుఁ బోనక్కరయేలేదు. ఈయుగమునందే చూపవచ్చును. ఒక్క మహాత్ముని పిలుపు వినఁబడఁగనే, యెంతమంది యిల్లాండ్రు నిలువఁబడినపాట్లనే వచ్చి సత్యాగ్రహ సమరరంగమున నురకలేదు! అపుడు "భారతస్త్రీ లింతంతవాళ్ళా !!?" అని పరు లాశ్చర్యచకితులు కాలేదా! "మగవారిఁగనినఁదా మరుఁగుఁజేరేడునింతి,పగవారిగెల్వ నే పగిదిఁ జూచె?" నని యీ నారీమణులఁగూర్చి భవిష్యద్వ్యాసుఁడు వ్రాయవలయునుగదా!! కోటానకోట్ల భారతీయులలోఁ బెద్ద పెద్ద యింగ్లీషు చదువులు చదివిన యే కొలదిమందికి మాత్రమే తెలిసియుండిన కాంగ్రెస్ మహాసంస్థకు ఖండఖండాంతర విఖ్యాతికలుగుట మనసోదరీమణుల మూలమునేకదా!! ఈపె జమీన్‌దారిణి, యీమె కర్షకుని యాలియనుభేదముండెనా అప్పుడు!!

ఐతే అప్పటి కాంగ్రెసు కార్యక్రమము వేరు ఇప్పటి కార్యక్రమము వేరు. దీనిం బట్టి "కాంగ్రెస్సు మగంటింది!—గాంధీ అదు గంటినాడు" అను ప్రవాదముఁ బుట్టించి స్వార్థపరు లానందించుచున్నారు. కాని యది నిరర్థకము. ప్రజాశక్తి యెన్నడును మాతృస్థానబలవిశిష్టమైయుండును. ఏ మహాశక్తుల త్యాగములవలన నాడు కాంగ్రెస్ విజృంభించినదో ఆ మహాశక్తుల ప్రచారములవల్లనే నేడు గూడ విజయభేరిని మ్రోగింపఁగలదు. స్త్రీయని నిరసింపఁబడక నాడు హరిచే బ్రోత్సహింపఁబడిన సత్యామానినివంటి వారే నేటి మన సోదరీమణులును— పురాణజ్ఞానియగు మహాత్మునిచేఁ బ్రోత్సహింపఁబడుచున్నారు. "ప్రజాహితోద్యమములయందు స్త్రీలు చేయుచున్న కార్యములను గురుతింపుడు. దేశముయొక్క రాజకీయోద్యమములయందు స్త్రీ లెక్కువ శ్రద్ధ వహించుచున్నారు. వేల

కొలంది స్త్రీలు ఖై దుశిక్షలు నితరబాధలు ననుభవించిరి. అందుచే స్త్రీలు ఎసెంబ్లీలో పాల్గొనుట కవకాశము నొసగుట న్యాయము ..." అని మహాత్ము నంతటివాఁడు మాళవ్య పండితుఁడు గూడ సెలవిచ్చుచున్నాఁడు.

కాబట్టి మానినీమణులు సర్వవిధముల దమ శక్తియుక్తులఁ జూపి మహాసభకు విజయముఁగూర్చి తమతమ దివ్యజ్ఞానదీపికావళితో భారతమాతకు మంగళహారతులు బట్టుదురుగాక ! అది నిజమైన దీపావళి. అంతేకాని యీఘోర క్షామసమయమున నప్పుచేసియైనను బప్పుకూడుఁదిని తప్పుతప్పున నాలుగు పటాకీలను బేల్చివేయుట దీపావళి యెంతమాత్రముగాదు. అంతగా నేమాత్రమైన ధనము మిగిలియుండునెడ శారదాసదనమువంటి యేయుత్తమ సంస్థకో దానము చేయవచ్చును. దానివలనఁబురుషార్థము దక్కును. ప్రమాదములును దప్పును.



## గృహలక్ష్మి !

కొండేపూడి సుబ్బారావుగారు

ఆంధ్రసారస్వతార్యామహాదేవి హస్తన్యస్త వల్లకీతంత్రి వీవు;
మహిళాజనాజ్ఞానమలిన విధ్వాంత నైదాఘమార్తాండ ప్రతాపయుతవు;
సంఘసంస్కరణ దీక్షాధూర్వహత్వంపు నైపుణి నీ చిన్ననాటి యాట;
ఆర్యవిజ్ఞాన జలాశయోద్భూత మనోజ్ఞతుంపురులు నీ కుగ్గుపాలు
దినదినపు వర్థమాన దీధితులతోడ, వినుత సుకుమార నూత్నయౌవనవిలాసి
నీచిరము మధుమాసపు నీతమధుర రాగములవెల్గు మా గృహలక్ష్మితల్లి.



## 'దసరా గృహలక్ష్మి'

వాజపేయయాజుల వేంకటనారాయణగారు

దసరాసంచిక యాంధ్రభామినులచేతన్ బద్యగద్యంబులం
దు సెబా సొప్ప నలంకరింపఁబడుటన్ దుగ్ధాబ్ధిలోఁబుట్టునా
పస మీఱన్ దగు కౌస్తుభంబుపగిదిన్ భాసిల్లి చూపట్టెడిన్
రసదంబౌ 'గృహలక్ష్మి' పాఠకుల కానందంబు సధింపదే ?

# నరకచతుర్దశి

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

ఇది ప్రతి సంవత్సరమును, ఆశ్వయుజ కృష్ణ చతుర్దశీ దినమున చేయబడును. నరకాసురుని వధ యాంధ్రదేశమం దంతటను, దక్షిణమునను దీపావళికి ముఖ్యకారణముగ భావింపబడుచున్నది. కావుననే నరకచతుర్దశి యని యందురు. నరకాసురుడు లోకకంటకుడు కాగా, శ్రీకృష్ణుడు వాని వధింప బ్రయాణమయ్యెను. సత్యభామకూడ వెళ్లెను. శ్రీకృష్ణుడు మురమొదలగు రాక్షసులను చంపెను. నరకుం డిదిచూచి అధిక కోపముతో శ్రీకృష్ణుని బాణముల నొప్పించెను. అప్పుడు సత్యభామ తానే యుద్ధముచేసి అలసిపోయెను. శ్రీకృష్ణుడు ఆమెకు సహాయమై నరకాసురుని సంహరించెను. వారు చనిపోవుటవలననే మనమందర మానాడు తెల్లవారగట్ల స్నానము చేయవలయును. విధవలుకూడ ఆనాడు తలంటి నీళ్లుపోసుకొనవలెను. ఈ పండుగకు ముఖ్యము సత్యభామయొక్క యుద్ధము. ఆ కాలమున స్త్రీలు సహితము యుద్ధకళానిపుణులని భారతీయులందరు సంతసింపవలసినదే.

ఈ దీపావళి మార్వాడీలకు చాల ముఖ్యమైనది. ఆ యుత్సవము నాటికి వారు తమ లెక్కల నన్నిటిని పరిష్కరించుకొని యానాడు క్రొత్త కాతాపుస్తకములు తెచ్చి పూజించి బ్రాహ్మణమంత్ర పురస్సరముగా నాశీర్వాదములంది స్నేహితులతో మహానందముగ భుజింతురు. వారి కానాడే సంవత్సరాది. మనము దీపావళినాడు దీపములు ఎందుకు పెట్టుటయు, యమపూజ నెందులకు జేయుటయు పితరులకు సద్గతి కలుగుటకు ఈనాడు దివిటీలతో నా చీకటిలో బితరులకు స్వర్గమార్గము చూపించుటయు నీ పండుగవలన గలుగునని మన పెద్ద లూహించి ఈ యుత్సవము యేర్పాటు చేసిరి. ఇదికాకుండా మన దేశమున ఇంకొక ఆచారమున్నది. దీపావళి మొదలుకొని కార్తిక మాసాంతమువరకు దీపములు పెట్టుదురు. ఆకాశదీపములని కొందరు మేడలమీద, కొందరు ఎత్తైన గట్లులమీద దీపములు పెట్టెదరు. ఇదియు పితృలకు మార్గదర్శకముగానుండుటకై పెట్టుదురని భావించవలయును. మొత్తమున ఇది యొక మహాకార్యము జరిగియుండ దాని జ్ఞాపకార్థము ప్రతి సంవత్సరము జరుగుచున్నది. చాలామంది శ్రీకృష్ణసత్యలు లోకకంటకుని సంహరించినందున ఆనాడు పుణ్యదినముగా భావింతురు. ఈదిన మొకస్త్రీ బాణప్రయోగముచేసి శత్రువును చంపగా నేడు మనవారు బాణములు కాల్చి (పటాకులు) తమకు హాని కలిగించుకొనుచున్నారు. ఈ పటాకులు కాల్చుటవలన విదేశమునకు మన ద్రవ్యముపోవుట, మన చేతిజిడ్డు వదలుట రెండు. మన పిల్లలకు వీనివలన అపాయము కలుగుట మూడు. మన పూర్వుల ఈవిధముగ నగౌరవపరచుట నాల్గు. ఇవి వీని ఫలితములు.

## గాంధి



యది హ్యహం నవర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః
మమవ ర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ, సర్వశః

'గీత'




శ్రీమతి యమునాబాయ్ రాఠోడ్.

పట్టపరీక్ష యిచ్చిన ప్రప్రథమ రాజపుత్రస్త్రీ. రూ. 30000 లు ఖర్చుపెట్టి రూపవటియందు జ్ఞానయజ్ఞముచేసి బీదలకు దానధర్మముల నొనరించి బ్రాహ్మణసంతర్పణము గావించి భూరిదక్షిణలిచ్చి భూసురాశీర్వాదము లొందిన ధన్య. ఏబదేడుల రాజ్యపరిపాలన మొనరించి కృతార్థమైన గోండల్ రాజకుటుంబముతోగల మైత్రి యిట్లే పెంపొందచుండుటయే యీమె యభిమతము.

# దౌహిత్రుడు—పౌత్రుడు

ఒంగోలు వెంకటరంగయ్యగారు

ఐదవ సెప్టెంబరు గృహలక్ష్మియందు శ్రీమంతులు జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ. గారు "దౌహిత్రుడు—పౌత్రుడు—" అను శీర్షికను వ్రాసిన వ్యాసమునందలి యంశములు సమానాదరణీయములుగ నున్నవి—ఇట్టి యంశములు స్మృత్యంతరములందును జర్చింపబడియున్నవి—ఉదాహరణము— శుక్రనీతిద్వితీయాధ్యాయమున నపుత్రుడగు రాజుం గూర్చి ప్రసంగించుచు ఆచార్యుడు.

"స్వసాపిండ్యవిహీనా యేహన్యోత్పన్నా నరాః ఖలు
మనసాపి నమంతవ్యా దత్తాద్యాస్స్వసుతా ఇతి"

యని శాసించియున్నాడు. ఇది రాజనీతి విషయమని సమర్థకము జెప్ప బూనుదురు గాబోలు. న్యాయసంచారమున రాజునకే గాక ప్రకృతికిని ఈ న్యాయమె యనువర్తింప దగియున్నది. శుక్రాచార్యుని మతమున దత్తపుత్రుడభిమతుడుగాడు:

"తద్దత్తకత్వమిచ్ఛన్తి దృష్ట్వాయఽధనికం నరం"

అని సాధిక్షేపముగ బలికియున్నాడు. అంతియగాక:

"స్వకులోత్పన్నకన్యాయాః పుత్ర స్తేభ్యోవరః"

అనియు ఘోషించియున్నాడు. ఇందుకు కారణముగూడ జూపియున్నాడు:

"అంగాదంగాత్సంభవతి పుత్రవద్దుహితానృణాం
పిండదానే విశేషేణ పుత్రదౌహిత్రయో స్త్వతః"

పితృపితామహప్రపితామహులగు యే ముగ్గురికి పుత్రుడు తర్పణాదుల జేయునో ఆవర్గత్రయమునకే మాతామహమాతుఃపితామహమాతుఃప్రపితామహ సంజ్ఞతో దౌహిత్రుడును తర్పణాదుల జేయుచున్నాడు. ఈ విధమున పుత్రదౌహిత్రుల సామానాధి కరణ్యము సిద్ధమగుచున్నది. శుక్రుడును మన్వర్థము నుపబృంహణము జేసియున్నాడు. దాయవిభాగవిషయమును దౌహిత్రుడును అనంతర జాతుడగు పుత్రుడును సమానులు కావలసియున్నను ఆచారమున నటుల లేదు. అనంతర జాతుడగు పుత్రుడు పూర్వస్వీకృత దత్తుని అతిక్రమించి దత్తుని పంచమాంశ భాక్కుని జేయుచున్నాడు. ఈ న్యాయమీమాంస కిది యవసరము గాదు.

మనుస్మృతియం దుదాహరింపబడిన పుత్రగణములో పుత్రికాపుత్రుడొకడున్నాడు. సామాన్యముగ షష్ఠీతత్పురుషమున "పుత్రికాపుత్రుడు" అనగ కూతురి కుమారుడని స్ఫురింపగలదు. ఈ ప్రకరణమున అర్థ మది కాదు. ఒకానొక ప్రాతకాలమున పుత్రులు లేనివాడు తనకూతు నొకరితను పుత్రుడుగ భావించి ఆమెకు తనదాయము సంద జేయుచుండెను. అందుచేత అట్టి పుత్రికకు పుత్రత్వకల్పన జేయబడి పుత్రుడుగ భావింపబడిన పుత్రికయను నర్థమున పుత్రికాపుత్ర సమాసము ప్రవర్తించినది. ఓరుగంటి సామ్రాజ్యచరిత్రమున "రుద్రమదేవి" ఇట్టిదిగ నున్నది. అందుచేతనే నామెకు కొన్నియు ల్లేఖలు "రుద్రమదేవ!" యని యున్నట్లు తెలియుచున్నది.

దత్తుతెచ్చుకొనిన తలిదండ్రులను వారి యనుంగు కూతుండ్రను ముప్పతిప్పల బెట్టు దత్తపుత్రులకంటె అంగాదంగాత్సంభూతయు హృదయాదధిజాతయు నగు పుత్రిక వేయి మడుంగులు శ్రేష్ఠతరమగును.

# రష్యనుస్త్రీల వీరత్వము

యేల్లెగడ్డ చిలుకమ్మగారు

సోవియటు ప్రభుత్వము చాల త్వరగ స్థాపితమగుట యాశ్చర్యకరమైన విషయము. దీనికి కారణము రష్యనుస్త్రీల వీరత్వము. రష్యాలో విప్లవోద్యమము తలయెత్తినపుడు "చిచ్చునకు గాడుపు సాహాయంబువచ్చు కరణి" యా రష్యను వీరాంగనలు సాయ మొనర్చిరి. పురుషులతో సరిసమానముగ కార్యరంగమున వేలకొలదియు వీరవనితలు దుమికిరి. దాస్య శృంఖలాబద్ధమైన తమ దేశమును విముక్తి గావించుటయే వారి జీవితోద్దేశము. ప్రవాసము ననుభవించిరి. వురికంబముల నెక్కిరి. ఇట్లే స్వార్థరహితముగ నెన్నియో యిడుమల పాలయిరి. రష్యాకొరకు ప్రాణముల నాహుతిచేసిరి. రష్యాలోని వేలకొలది తల్లులు తమ పుత్రులను దేశముకొరకై దిగదుడిచిరి. దాస్య శృంఖలాబద్ధమైన రష్యాను ఉద్ధరించుటకు మరికొందరు వీరపత్నులు తమభర్తలను అర్పించిరి. ఎక్కడ నేవిప్లవమునకైనను వారు సంసిద్ధులైరి. క్షీరోదక న్యాయంబున, బోల్షివిక్ స్త్రీపురుషులు చక్కగ కలసి మెలసి యుండెడివారు. అదియుంగాకరష్యన్ స్త్రీసమాజము రష్యాకు పెట్టనికోట. రష్యను వీరాంగనల యాదర్శభావములు, స్వార్థత్యాగము, వీరత్వము, యాత్మ బలిదానము, నెల్లెడలను మనముగాంచుచునే యుందుము.

సోవియటు ప్రభుత్వము ప్రతిష్ఠింపబడి నంతనే, స్త్రీలకు సర్వవిధముల పురుషులతో సమానప్రతిపత్తి యొసగబడెననుట యతిశయోక్తి గానేరదు. రాజ్యాంగవిషయములం దేమి, సర్వవిధముల పురుషునితో సరిసమానముగ నేటి రష్యాలో స్త్రీలు అధికారము పొందుచున్నారు. ఇట్లు యేదేశమందును స్త్రీలకుపురుషునితో సమానప్రతిపత్తియొసగబడలేదని ఘంటాపథముగ చెప్పవచ్చును. రష్యనుస్త్రీలే యిట్టియున్నతస్థితిలోనికివచ్చిరి. వారే నేడు సంపూర్ణస్వాతంత్ర్యము పొందుచున్నారు. లెనిన్‌మొదలగు మహాశయుల వలె దృఢప్రతిజ్ఞ కల ప్రజ్ఞావతులు వెన్నెల రాకకు ప్రతీక్షించుచకోరంబుభాతి, నెప్పుడు మనము కార్యరంగమున దుమికెదమా, యని ప్రతీక్షించుచుండెడివారు. పాపమతులగు నీచధనస్వాముల పీచమడచుటయే మంచిదని వారు తలంచుచుండెడివారు.

ఎల్లపుడు అత్యంతధైర్యశాలివలె, విప్లవకారియగు యెర్రని ధ్వజమును హస్తమునం దిడికొని, పోరబాటుననైనను భూమిపై దించని, గొప్పస్వార్థత్యాగిని, వీరాంగనయగు "మిస్ ఓలగగోరే కొప్" చరిత్ర తెలుసుకొనెదము.

ఈమె చరిత్ర పలువురు పలువిధములుగ నుడువుచున్నారు. కొందరు ఫ్రాన్సుయువతి యనియు, వేరొకరు రష్యను వీరాంగన యనియు, చెప్పుచున్నారు. వాస్తవమునకు ఈమె బోల్షివిక్‌దళ నాయకురాలు. లెనిన్ ఇచ్ఛానుసారము రష్యాను శాసించినశాసకురాలు. నిరంకుశుడగు జారు చక్రవర్తియైనను

ఈమెను తన పాశములయందు జిక్కించు కొనలేక పోయెను.

వీరాంగనయగు గోరేకొఫ్ చరిత్ర చాల కొద్దిపాటి జనులకు పరిచయమనియే చెప్ప వచ్చును. ఈమెను చక్కగ యెరిగిన యొక వ్యక్తి యిట్లు వ్రాసెను. "మొదట నామెను చూచినవారు ఆశ్చర్యమున ముగ్ధులగుదురు. సింగంబున్న గుహకు మాతంగంబు పోవుచందమున నామెవద్దకు వెళ్ళు జనులు చాల భయపడుచుండెడివారు. బోల్షివిక్ సిద్ధాంతములు చర్చించి చెప్పు సమయంబున, నామె ముఖకమలము దేదీప్యమానమై వికసించుచుండెడిది. హృదయ తరంగిణిలో నాదర్శభావతరంగము లుప్పొంగెడివి."

బోల్షివిక్ విషయములు గాక అన్య విషయములందు జోక్యము కలిగించుకొనెడిది కాదు. ముఖ్యవిషయములకై లెనిన్‌తో సంభాషించుచుండెడిది. లెనిన్ అను మత్తగజంబు ఈమె వాక్యపాశబద్ధుడై యుండెడివాడు. అన్యులతో మాట్లాడి యమూల్య సమయమును వృథాగవ్యర్థపుచ్చని యువతీమణి. ఈమె వీరత్వము ఆదర్శభావముల చూచి లెనిన్ చాల ప్రేమించుచుండెడివాడు.

గోరేకొఫ్ జీవితమంతయు నిడుముల యందే గడచిపోయెను. ఆమె రష్యాలోని యొక కర్షకునియింట జన్మించెను. తలిదండ్రులు నిరుపేదలు. రష్యాలో జరిగిన ప్రథమ విప్లవమునకు, నిరంకుశజారు ప్రభుత్వము, ఈమె తలిదండ్రులను ఇంటినుండి వెడల గొట్టినది. పాపము వారు ఆ చలిబాధ సహించలేక రష్యనుఅడవులలో చిర విశ్రాంతి గైకొనిరి. గోరేకొఫ్ ఈ దారుణ దుఃఖము చచ్చేవరకు మరువలేకపోయెను. తలిదండ్రుల మృత్యువునకు కారణభూతము నిరంకుశజారు ప్రభుత్వమే యని యామె తలంచెను. ఆనాటినుండియు నిరంకుశజారు ప్రభుత్వము నాశనమొనరించి సోవియటు ప్రభుత్వము ప్రతిష్ఠింపవలెనని ప్రతినపట్టిన ప్రజ్ఞావతి.

ఆ సంగ్రామదినములలో గోరేకొఫ్ సైనిక విభాగమునకు సదస్యురాలు. స్త్రీ సేనల సేనాధిపత్యము వహించిన వీరవనిత. ఆమె నాయకత్వముననుండు స్త్రీసేనలకు సామ్యవాద సిద్ధాంతములు ఉపదేశించుచుండెడిది.

లెనిన్ మహాశయుని యధికారముక్రింద రష్యనురాజ్యాధికారము వచ్చిన వెంటనే, యామెను యెదుటకు సేనాసమేతంబుగవచ్చి, 'నాసైన్యసమేతంబుగ నేను మీయధీనురాల' నని యామె నుడివెను. అప్పటినుండియు స్వేచ్ఛగ లెనిన్‌తో కలసి బోల్షివిక్ సిద్ధాంతముల ప్రచారముచేయ మొదలిడెను.

గోరేకొఫ్ బ్రహ్మచారిణి. లెనిన్ వివాహము చేసుకొనుమని ప్రబోధించెను. కాని యామె యిట్లు చెప్పెను "బోల్షివిక్ కార్యములు చేయుటకు నాకు సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెను. వివాహము నా యీ కార్యమునకు ఆటంకము గలిగించును." ఆ వీరాంగన లెనిన్‌వంటి మహాపురుషుని మాట

నిరాకరించెను. ఇంతియేకాదు! భావి రాజ్యాంగవిషయము నాలోచించుటలో లెనిన్ ఆలోచనకు విరుద్ధముగనున్న యామె యాలోచనయే సిద్ధించెను. తుట్ట తుదకు లెనిన్ ఆమెఆలోచనయే యంగీకరించెను.

ఒకసారి లెనిన్‌కును, రష్యను సేనాధిపతి యగు ట్రోజకీకిని కొందు భేదాభిప్రాయము గల్గినది. ట్రోజకి లెనిన్ మహాశయునికి కుడి భుజమువంటివాడు. కాని ట్రోజకి లెనిన్‌ను మంత్రిత్వమునుండి తొలగించవలయునని తలంచెను. ట్రోజకియొక్క యీదుష్టతంత్రము గోరేకాఫ్‌కు తెలిసినవెంటనేమాస్కోలో నున్న ట్రోజకియాఫీసుకు వెళ్లి తీవ్రదృష్టితో చూడ మొదలిడెను. సింగంబును గాంచి మాతంగంబు భయమొందుమాడ్కి నామె తీవ్రదృష్టిగాంచి ట్రోజకి భయకంపితుడయ్యెను. తన యపరాధము తెలుసుకొని ట్రోజకి నాయీయపరాధము క్షమించుమని క్షమార్పణకోరెను. సూర్యుని కిరణములు తాకినవెంటనే హిమంబు కరిగి నీరగునట్టుల గోరేకాఫ్ తీవ్రదృష్టి చూచినవెంటనేట్రోజకి నిష్కల్మషచిత్తుడయ్యెను.

తిరిగి లెనిన్‌వద్దకువెళ్ళి యిట్లు నుడివెను "ట్రోజకి నిష్కల్మషచిత్తుడయ్యె. ఆయన యికముందు చెడుప్రవర్తన చేయజాలడు." గాలివీచు సమయంబున ఆకుచలించుమాడ్కి కంపించుచున్న లెనిన్ హృదయము స్థిరత చెందెను. వాస్తవమునకు ఆమెవలననే ట్రోజకి నిష్కల్మషచిత్తుడయ్యెనని ఘంటాపథముగ చెప్పవచ్చును.

గోరేకాఫ్ తన యమూల్య శక్తులచే శత్రువులను అన్నివిధముల తన స్వాధీనము చేసుకొనెను. రష్యను స్త్రీలు బలహీనలై నప్పుడు సేనను వీర్యవంతముగ చేయుటకు ఆమె పంపబడెను. ప్రతిభాశాలినియగు గోరేకాఫ్‌ను లెనిన్ యెల్లప్పుడు ప్రశంసించుచుండెడివాడు. పిల్లలపై పెద్దలు అధికారము చెలాయించునటులనే యామె లెనిన్ పై నధికారము చెలాయించుచుండెడిది. లెనిన్ గొప్పక్రోధితుడై యున్న సమయంబున నైనను ఆమె వెళ్లినచో చాల భక్తిశ్రద్ధలతో మాట్లాడుచుండెడివాడు.

లెనిన్ మొదలగు వారివలె నెప్పుడు సోవియటు ప్రభుత్వము స్థాపించెదమా, యెప్పుడు ఈ దాస్యశృంఖలములను త్రెగగొట్టెదమా యని యోచించుచుండెడిది. కార్మిక సేవచేయుటయే యామె ముఖ్యోద్దేశము. లెనిన్ మహాశయుడు గోరేకాఫ్ దేశభక్తి, విశ్వప్రేమ, కార్యపరాయణత, ధైర్యము, వీరస్త్రీకి ఉండవలసిన లక్షణములన్నియు నామెయందుగాంచి యామెకు గొప్ప గౌరవ ప్రదమైన పదవియిచ్చెను. అప్పటికి ఆమెవయస్సు ముప్పదివత్సరములు. ఇటువంటి వీరాంగనలు జన్మించు దేశము ధన్యము.

-:0:-

# కవయిత్రి మొల్ల!

శ్రీ శేషాద్రి రమణకవులు

పూవులలోన మొల్ల వలపుల్ బచరించెడి పోల్కిఁ గైతలో
భావము మేళవించి యనవద్యరసోదయ భవ్యధారతో
శ్రీవిభుఁడైన రామనృపశేఖరు కావ్యము నల్లె మొల్ల, ఆం
ధ్రావళి కిట్టి కావ్య మొకటైన లభించుట పూర్వపుణ్యమే.

మొల్లల తావి పోల్కి ముదముం గవనంబున గూర్తువంచునో
మొల్లముగా రసంబు నుడి ముత్తమునం దొగి హత్తునంచునో
మొల్లయటంచు నీకుఁ గవిమోహన నామము గూర్చినార లో
మొల్ల! భవిత్కవిత్వసుమముల్ కవిశేఖర కంఠదామముల్.

సీ. గోపవరాద్రి కన్యాపతిశీర్షస్థ శీతాంశుసుధ కొంత చిందెనేమొ
మొల్ల నీ నోట వాక్పుంజమ్మునఁ దనంత మాధ్వీరసము మాటు మడఁగెనేమొ
జాత్యభిమానయై శారదాదేవి నీ కవిత వల్లకిశ్రుతిఁ గలిపెనేమొ
రామకథామృత రససంగ్రహంబు నీ కావ్యగానంబునఁ గలిసెనేమొ

నుతులసొంపును గబ్బంపు నడకఁ జూచి
వలపున రసాధిదేవత వచ్చినీదు
కవితలోపల నైక్యము గాంచెనేమొ
అరయనిందొండు నిశ్చయమగునె? మొల్ల.

చం. పొలఁతుల కేల విద్యయని పూరుషు లుత్కట శాస్త్రవాదముల్
సలిపెడి కాలమందె సరసప్రథమాన కవిత్వచాతురీ
కలనము చేత రాముకథ కావ్యమొనర్చిన నీదు వైదుషీ
బలము నుతింప శక్యమొకో? ప్రాజ్ఞజనంబులకైన మొల్లరో.

శా. మొల్లా! నీకవనంబులోపల రసంబుల్ సుస్వరూపంబులై
యుల్లాసం బొదవించు, నొక్కయెడ సాహోదార భావార్థసం
ఫుల్లోక్తి ప్రసరంబు బంధురతరామోదంబుఁ జేకూర్చు నీ
సల్లాపంబులు శారదాంబుజ మధుస్పర్ధాళు మాధుర్యముల్.

# రాజీ

శ్రీమతి వి. లక్ష్మీకాంతమ్మగారు

సుబ్బలక్ష్మి బదరివాడ శేషగిరిరావుగారి భార్య. బాగాచదువుకొనినదే కాని చాల అర్భకురాలు. అందులో యేమేటకాన్పు. ముసిలిదేమిటి! పడుచుదే కాని ముసిలిదంటేనే బాగుంటుంది, ఆవిడ అత్తగారు. ఈవిడను అందరు చిన్నమ్మగారంటారు. డాక్టర్లు అంటారంటే విన్నకబుర్లివి—ముట్టుడిగేకాలంకి ఆడవాళ్లల్లో చాలామార్పులు వస్తూంటాయిట. ఒహటంకల్లే వుండేవాళ్లు లావవడమో లేక లావాంటివాళ్ళు ఒహటంకల్లా గయిపోవడమో. యివేవీకాక బహు శాంతమూర్తుల్లా గుండేవాళ్లు చికాకు, పరాకు, అసహనము, దుందుడుకు, అనుమానము వగయిరాలు మనోవైకల్యస్థితుల పొందడమో కల్గుతూంటాయిట! అల్లాంటిస్థితే అయిఉండాలి చిన్నమ్మగారిది. లేకపోతే తాను గర్భిణీతోనుండగనే భర్తకాలంచేస్తే అతని ఆస్తిపాస్తుల యావత్తు దాయాదుల బారినుండి జాగ్రత్తపెట్టుకొని శేషగిరిరావును ఇంత వృద్ధికితెచ్చి విద్వాంసుని చెయ్యగలదా? బందుగులందరిలోను, అవుననిపించుకొని బ్రతికింది కాని ఒహరిచే యెన్నడయినా మాట అనిపించుకొన్నదనుట కయినా తావున్నదా ఆవిడజీవితం! అగ్నిహోత్రము ఆవిడంటేను! భారతభాగవతములు నాల్గూ చదివింది. అపరిమితమైన భగవద్భక్తి భూతదయ!! అన్నీమంచివే కాని వయస్సు మళ్ళినకొద్దీ అబ్బాయి సంసారం యేదో లోకంతో పాటుసాగుతూంటేతానూ తనయావత్కష్టములు అంతరించి సౌఖ్యోదయమయినదికదా అని ఆనందించవలసిన రోజులలో లేనిపోని లంపటాల్లో తగుల్కొని సంసారగొడవల్లో కష్టపడుతోండడం మాత్రం బాగుండలేదనాలి.

## ౨

తనదగ్గరే గారాబంగా పెరిగిన మేనగోడలు, కూతురు విశాలాక్షిని కన్నప్రేమకంటె పెంచిన ప్రేమ ఎక్కువని అంటారుకదూ అల్లాగ ఆపిల్ల చిన్నప్పటినుంచి తల్లిపురిటిలోనే అర్ధాన్నమైపోవటంచేత చంటిగుడ్డుస్థితినుండి తనదగ్గరేపెరిగి పెద్దదయింది. ఇప్పుడు కాపరానికి వెళ్లింది. శేషగిరిరావు దయాంతఃకరణలు గలవాడేగాని కోపమువస్తే మాత్రము వీళ్ళువాళ్ళుఅని చూచేవాడుకాడు. సాధారణంగా కోపమురానేరాదు. వచ్చినా చాలా తమాయిస్తాడు. అతనికి ఇంటికి వచ్చేటప్పటికి ఇంట్లో అంతా సంతోషముగా కనబడితే ఆనందం. ఇంట్లో రుసరుసలు పొడగట్టిందా ఎవరికో ఒకరికి ముంగళాష్టకాలు తప్పవు.

శేషగిరిరావు అప్పుడే కోర్టునుంచి బండి దిగాడు. బారిష్టరు గౌనుతోటి యింటిలోకి వచ్చేటప్పటికి చిన్నకొడుకు నాలుగేండ్లవాడు గుమ్మంలోనే కాళ్లు రెండు కౌగలించుకొని 'నాన్నగారూ' అని ఏడ్చాడు.

'ఏం నాయనా' అని ఎత్తుకొని ఇంటిలోకి వెళ్లాడు. సుబ్బలక్ష్మి రోజూ ఎదురుగా వచ్చేది ఆనాడు లోపల గదిలో కూర్చొని విచారంగా కనపడ్డది. తిన్నగా వంటఇంటిలోకి వెళ్లి 'అమ్మా! ఏం చేస్తున్నావు' అని మామూలుగా అడిగాడు. ఆవిడ ముఖంకూడా సంతోషశూన్యమే! తిన్నగా తన గదిలోనికి వెళ్లి చొక్కా, పాగా, డ్రస్సు అంతా తీసివేసి భార్యను కాళ్లు కడుగుకొనుటకు నీళ్లు తెమ్మన్నాడు. సుబ్బలక్ష్మి నీళ్లు తెచ్చి గదిగుమ్మంవద్ద పెట్టి నిలబడింది.

'తుమ్మల్లో ప్రొద్దుసంకినట్లు అల్లాయున్నా యేముఖాలు?' అని ప్రశ్నించాడు. సుబ్బలక్ష్మి పట్టజాలక 'నే నింక యీబాధ పడలేనండి. యేనూయియో గొయ్యో చూసుకుంటాను' అని ఏడ్వడం మొదలుపెట్టింది.

శేషగిరిరావున కంతా బోధ అయినది. మామూలుగా జరుగుతున్నదే. అయితేం కొంచెము తీవ్రమన్నమాట!

'సంగతేమిటో చెప్పు' అని దగ్గరగా దీసికొని భార్య కళ్లుతుడుస్తూ 'మామూలుదాని కింతవిచారమెందుకు' అన్నాడు.

భార్యను దగ్గరగా తీయడం బుజ్జగించడం గుస గుసలు కొన్నో గొప్పో చిన్నమ్మగారి కంటబడ్డాయి. ఎల్లాపడ్డాయి అంటారేమో? చిన్నమ్మగారికి కొడుకు కోడలు యేం మాట్లాడుకొంటున్నారో. తనమీద ఏం నేరాలు చెపుతోందో కోడలు విందాం అని తోచింది. ఎవరయినా ఇద్దరు కూర్చొని మాట్లాడుకొంటూంటే తన్నుగూర్చియో విశాలాక్షిని గురించియో అనియే అనుమానము. ఈలాంటి అను మానాలు ఆ పెను చాటునుండి పొంచి పొంచి విను టకు ప్రొత్సహిస్తూంటాయి.

## 3

'ఏమీ లేదండీ, యీవేళ మా అందరి అదృష్టము బాగున్నది. మీకు కోపం రాలేదు. నేను సాధార ణంగా ఆవిడ అభిప్రాయాన్ని కనిపెట్టి వెళ్లుతోనే యుంటాను. ఏమీలేదు తమరు, 'అమ్మాయీ నాలుగు రూపాయిలుంటే ఇవ్వవే' అని అడిగారు. 'నాదగ్గర ఏమీలేవు. మీ అబ్బాయిగార్ని అడిగి పుచ్చుకోండి' అన్నాను. దానితో రెచ్చిపోయిన దండి వ్యాపారం.

"నేను అనాధను. చేతులోవున్న డబ్బంతా వాడి మొఘాన పెట్టినాను. బోలెడు డబ్బు ఖర్చుపెట్టి చదివించినాను. ప్లీడరీపరీక్ష చదివించినాను. అన్నీ చేశాను. తుదకు నాగతి ఇల్లా అయింది. నన్నూ నిన్నూ అడగడం లేదనడంన్నూ. నా కింతకంటె హైన్యంవుందా, యిందుకే చేతిలో డబ్బుండా లంటారు. చచ్చినట్లు అప్పుడు నా చుట్టూ యాభై సార్లు తిరుగుతోంటారు" అని యింకా యేమేమో అంటూ నన్నూ మావాళ్లనీ ఒక్కమాట గాదు అన వలసినవన్నీ అనేశారు. నా తల్లిదండ్రులకు అప్ప చెల్లెండ్రకు అందరికి శాపనార్థాలు పెట్టేశారు అప్పుడు నేను.

'ఎందుకండి అందరినీ అనడం. మీ ఇంటికి తిండికి చేరినదాన్ని నేనే గనుక నన్నే అనండి' అన్నాను. ఈ కరువుదినాల్లో మనం అన్నమే తింటున్నామో, గంజే తాగుతున్నామో. డబ్బు చిక్కులు యేమేమి పడుతున్నామో అన్నీ స్వయంగా చూస్తూనేయున్నారు కదా? నిన్న బియ్యంబస్తా మీరు తెప్పించింది అరువు తెచ్చానని చెప్పేసరికి నా కెంతో కష్టముగావుందే. తమ కెం దుకు తెలియదు? అడ్గానే డబ్బు యెక్కడ కురు స్తుంది. డబ్బు చిక్కు దినములలో మీరు ఎక్కడ వినుగుకొంటారో యని పిల్లలు చొక్కాలు లేవని యేడుస్తూన్నా-చినిగిపోయిన చొక్కా చూడండి. శంకరం బడిలోకి నే నిక వెళ్లనన్నా, వాడ్ని ఆ చొక్కాతో పంపడానికి ఎంతో మారాంపెట్టాడు. ఏంచెయ్యను. బతిమాలాను, బతిమాలాను చివరకి నాల్గుతికిపంపాను. ఏంచెయ్యను. బడిలో పిల్లలు మాష్టర్లు 'శంకరం! మీ నాన్నగార్కి కరువు వచ్చిందా. చినిగిపోయిన చొక్కాతో వచ్చావు' అని అంటే వాడు చిన్నబోయిన ముఖంతో నాదగ్గర ఏడ్చాడు. కాసేపు నే నేడ్చాను. ఆవిడకూడా యీ సంగతి స్వయంగా చూచేవుంది. ఏమీ మాట్లాడలేదు.

అన్నీ ఎరిగుండి యీమాటలు యేమిటి చెప్పండి. ఆవిడ అడ్గానే నేను ఇవ్వాలట. మీతో చెప్ప గూడదు. తెలియకూడదు. మీరు మంచివారేనట. అబ్బాయి యేంచేస్తాడు. తెచ్చి ఇంట్లోయిస్తే గృహయజమానురాలు నువ్వు. కనుక యిల్లాంటి వల్లా నువ్వే చూసుకోవాలి. నీ మూలాన్ని నా కొడుకుఇంటికి పరాయిదాన్ని అయిపోయాను. నా బ్రతుక్కుసాయం యీ విశాలాక్షి యెందుకుదా పరించిందో. ఇదికూడ చస్తే యీబాధ యేమీలేకుండ సుఖంగా కృష్ణలో దిగిపోదునుకదా!! అని చంటిపిల్ల లాగ విలవిల ఏడుస్తూంటారు. ఆ యేడుపుమాస్తే నాకే బాధగా ఉంటోంది. ఆవిడ యిల్లా క్షోభ పడడము బాగుందికాదు. ఇదంతా నాతో వచ్చింది కనుక నేనే విరగడ అయిపోతే వదులుతుందేమో" అని సుబ్బలక్ష్మికూడా ఏడ్పు మొదలుపెట్టింది.

## ౪

'శేషగిరిరావు' ఇదంతా విని పెద్దనిట్టూర్పు విడిచాడు. ఒకవైపున కన్నతల్లి. రెండవ వైపున కట్టుకొన్న భార్య. వాళ్లిద్దరకు మనస్సులు పొసగకుండడం తన కపరిమిత పరితాపమునకు కారణమగుచున్నది. ఎవరిని అనుటకు వీలు గాలేదు.

"సరే. చాలా బాగాయుంది" అని చిలక్కొయ్యనున్న పట్టుతాపితా కట్టుకొని, కాళ్లు కడుగుకొని భోజనానికి లేచాడు. చిన్నమ్మగారు వడ్డించింది. శేషగిరిరావు తిన్నాడు. ఇది కావాలి, అది కావాలి అని ఈతడు అడుగలేదు. ఆవిడ పలుకరించలేదు. ఎవరు ముందు పలుకరిస్తే యేం గందరగోళం సిద్ధమవుతుందో అని యిద్దరి మనస్సులలో వుంది కాబోలు!

అంతలో సూర్యం తనవచ్చేరాని మాటలతో "నాన్నా, నాన్నా" అని పిలిచి నెమ్మదిగ వీపు మీద వాలి జందెము చేతివ్రేలికి చుట్టుకుంటూ "నాన్నా! బామ్మ మంచిదికాదు" అన్నాడు. ఎందుచేత గాదురా? అన్నాడు శేషగిరిరావు.

'ఎందుకా' అని బామ్మవైపు చూచి 'చెప్పేత్తాలే' అని 'బామ్మేం అమ్మని కొత్తిందని' అని తలవాల్చాడు.

'భడవా! నువ్వు చూశావుట్రా అమ్మని కొట్టడం?'

'కొత్తలేదు, మలి మలి అమ్మగదిలో కొచ్చి ఏడ్చిందేం మలి?'

'యేడుస్తే?'

'బామ్మకొత్తిందేమోని.'

'అమ్మే కొట్టిందట బామ్మని.'

'లేదు నాన్నా బామ్మేం-బామ్మేం. మల్లీ చేతులతో బాదుకొంది తానే నాన్న గబగబా బాదుకొని ఏడ్చింది నాన్నా.'

'ఏడిశావు. నోరు మూయి. నీ కక్కరలేని సంగతులు' అని సూర్యాన్ని అవతలికి పొమ్మని పంపేశాడు శేషగిరిరావు.

చిన్నమ్మగారి ముఖం కొంచెం కోపాన్నే సూచిస్తుం దనాలి. కుఱ్ఱగాడు నాలుగేండ్లు. వెధవకే ఇంత కావరమా. తప్పు చిన్నమ్మగారిదే అని భావం తండ్రి దగ్గర తేలేశాడు. తల్లి రాక్షసబుద్ధులే పిల్లలకీనీ, తనని అనవసరంగా బయటపడేస్తోందని ఆవిడే నమ్మకం. తన యాధిక్యత కించెత్తూ గుర్తించటం లేదని అభిప్రాయము. ఇంటిపెత్తనం అంతా తనకే వప్పచెప్పింది కాదని మరోకాంక్ష. తన్నిక యెందుకూ పనికిరాని పరాయిదాన్నిగా చేశేశారని సొంత పెత్తనాలు వీళ్లవి అని అప్పుడప్పుడు అనుకోడం. అందులో ముఖ్యంగా సుబ్బలక్ష్మి తాలూకువాళ్లు. యే తల్లో, అప్పగార్లో, అన్నదమ్ములో, ఎవరో వకరు వచ్చారంటే ఆరోజున వంట సరిగావుండదు సరి కదా, యేమూలో కూర్చుని యేడవడమే. అడిగితే నాఅవస్థ నాది, నీవేమయిన ఆర్చేదానవా, తీర్చేదానవా అనడం. మనం కలుగజేసుకోకూడదని ఊరుకుంటే "చూశావా ఆత్తేరి నేనంటే యెవరికి అక్కరలేదు. యేడ్చి యేడ్చి ఆదే ఊరుకొంటుందని పలకరించింది కాదు అంటుంది. సూర్యంగాని, గోపిగాని ఎవరు అయినా దగ్గరకు వెళ్లి "బామ్మా! ఎందుకే యేడుస్తున్నావు" అని ఒడియందు చతికిలబడి రెండు చేతులు మెడకు చుట్టువేసి ముఖాన ముఖముంచి అడగొస్తే "ఛీ వెధవల్లారా! మీనమాత్రం ప్రేమ యేడిసిందిరా. పొండి. అవతలికి పొండి" అని క్రింద దూరంగా కూలవేస్తుంది.

## ౫

ఇరుగుపొరుగు అమ్మలక్కలంతా గుసగుసలు. ఏముంది. సుబ్బలక్ష్మిది తప్పా, అత్తగారిదా అని. సుబ్బలక్ష్మిది కాకపోతే, అత్తగారు ఇంటిపట్టున యెందుకుండదని సంవత్సరానికి పదకొండు మాసముల యిరవైరోజులు అక్కడా అక్కడా కాలం వెళ్లపోనుకోవడమేమి అని. ఇంటిదగ్గరనున్న పదిదినములైనా కలసి మెలసి సంతోషంగా కనబడదని!

ఇరుగుపొరుగువారు అల్లా అంటే యిక బందుగుల సంగతో-వాళ్లు అంతే. సుబ్బలక్ష్మి అత్తగార్ని యింటిదగ్గరనుంచి లేవగొట్టింది. ఇద్దరికి ఒక్కగడియ పడదు. సుబ్బలక్ష్మి మాత్రం తక్కువదా అంటారు!

ఇంట్లో మనస్సులు, మనస్సులు కలియనపుడు ప్రతీదీ చెడ్డగానే కనిపిస్తుంది. ప్రతీదీ అనుమానంగానే తోస్తుంది. సుబ్బలక్ష్మని గురించి అత్తగారే, 'మంచిదని తన్ను అన్నివిధాలా కనిపెట్టే నడుస్తోం' దని ఆవిడికి సంతోషంగా ఉన్న సమయాల్లో అంటోంటుంది. తనకి కోపం వచ్చినప్పుడుగాని చికాకుగా ఉన్నప్పుడుగాని సుబ్బలక్ష్మ సాధ్యమయినంతవరకు తటస్థంగానే ఉంటుంది. తటస్థంగా ఉంటే "మాశారా, నన్నిల్లా పలకరించనైనా పలకరించింది కాదు" అనడం! ఒకరోజున సుబ్బలక్ష్మ, సూర్యం ఏదో అల్లరిచేస్తూ బామ్మని తగిలినాడు.

"వెధవా! మైలడ్డావురా. మరోబట్టైనా లేదు. ఎల్లా ఏడవను" అని కోపముతో వాడిని రెండు చరుపులు చరిచింది. అమ్మదగ్గరకు వెళ్లి అమ్మచీరకొంగు మొగమున కడ్డము పెట్టుకొని ఏడ్చాడు.

'ఎందుకురా బామ్మని తగలడం' అంది తల్లి.

'ఎవలు దగిలాలూ?' అన్నాడు.

ఛా? నాక్కూడా కళ్లు లేవనుకున్నావా?

సూర్యం దార్లో చూసుకోవద్దూ అంత తొందరా మరి' అని రెండు బిస్కత్తులు చేతికిచ్చి పంపివేసింది సుబ్బలక్ష్మ.

'అంతలో నాకూ కళ్లు లేవనుకున్నావా' అన్న మాట చెవిలోబడి కాబోలు చిన్నమ్మగారు చరచర వచ్చి,

"నీ కొడుకును కొట్టటం నాదే బుద్ధి తక్కువ. జ్ఞానము వచ్చింది. నేటి కాలానికి నీచేత నాకళ్లు కూడా లేవనిపించుకోవలసివచ్చింది. నాకు కళ్లుంటే యింతమట్టుకు రాకనేపోను. నన్నిల్లా యేడ్పించి బాధపెడుతూన్నందుకు భగవంతుడంటో ఉంటే మిమ్మల్ని ఒకకంట చూడకుంటాడా. ఈ మిడిసిపాటు యెంతకాలమో చూస్తానులే. నన్ను పెట్టే బాధలన్నీ మీకు తగలకుంటాయీ" అని వెక్కివెక్కి యేడ్వడం మొదలుపెట్టింది.

సుబ్బలక్ష్మ నిర్ఘాంతపోయింది. అత్తగారి బట్ట తగిలిందన్నా తప్పే. ఊరుకున్నా తప్పే. ఏమని సమాధానమిచ్చుటకు తోచలేదు.

"అత్తయ్యా! మిమ్మల్ని నే నల్లాఅంటానా. సూర్యం మిమ్మల్ని తగల్లేదంటే నాకు కళ్లు లేవా అన్నాను కాని నేను చూడటంలేదా మిమ్మల్ని రానుసుపోవడం. మీ రల్లా ప్రతీదానికి మనస్సు కలతపెట్టుకోవడం బాగాలేదు."

"అయ్యో కబుర్ల కేమిలోటు! నీజడ్డ ఎల్లాంటిది. నీకూ నీవాళ్లకీ నా ఉసురు తగులకపోతుందా. నే నిల్లా బతకడంకూడా యిష్టంలేదు. యేదో మిష పెట్టుకొని నాతో దెబ్బలాడుటకు సిద్ధమే. మొగాళ్లని చంపిపుట్టావు. సూర్యాన్ని ముట్టుకోమని నీవే పంపుండాలి. మొన్న ఆలాగే వాళ్ల నాన్నతోటి బామ్మ అమ్మని కొట్టిందనడానికి వాడికి నీవు అనమని చెప్పియుండకపోతే వాడెల్లా అనగలడు? ఇంతకీ యాదవకులానికి ముసలంలాగ దాపరించావు. నీవో నేనో ఒహళ్లం విరగడవుతేగాని యీ అవస్థలింతే."

"అనవసరంగా అల్లాకోపం తెచ్చుకుంటారేమిటి? మీకు పిచ్చి ఎక్కువ అవుతోంది. ఏవో పిల్లలను అన్న ముక్కలు మీమీద పెట్టుకొని యిల్లా అనడం మీకు తగినదికాదు. మీ కంత కష్టముగా ఉంటే నేనే విరగడయిపోతాను. మీరు మీ అబ్బాయి కులాసాగాయుండండి. ఇంక నన్ను మీరేమీ అనవద్దు. అనక మీ అబ్బాయిగారు వచ్చాక పిల్లలను ఆయనకు వప్పగించి నే నేదో దారి చూచుకుంటానులెండి. ఈ సంసారములో నాకేమి."

అంతలో వీధితలుపు తట్టినట్లయ్యేను. శంకరం నాన్నొచ్చాడని గబగబా పరుగెత్తి వీధితలుపుతీసి "నాన్నా-నాన్నా" అన్నాడు.

"అమ్మేం-అమ్మే కాదు నాన్న. బామ్మ-బామ్మేం యేల్చింది నాన్నా. అమ్మని తిత్తింది. అమ్మ పోతానంతోంది నాన్నా" అని వీధిగుమ్మం దగ్గరే ఏకరవుపెట్టాడు.

౬

'నా కదంతా తెలియదు. మీ పిల్లల్ని మీరు జాగ్రత్త పెట్టుకోండి.'

'సంగతి ఏమిటో చెప్పరాదా.'

'యేమీలేదు. యీరోజుతో మీకు నాకూ ఏల యీ లోకంతోటే సరి. నే నింక బ్రతుకలేను.'

'కారణమేమో చెప్పరాదా.'

'ఋణము చెల్లుటే కారణం.'

'పాతకమేనా?'

'నేను ఈబాధ భరించలేను. నేను విరగడవుతే గాని యీ సంసారము బాగుపడదు గనుక.......'

'ఈ వెధవగోల యెప్పుడు ఇంతేనా.'

'నాకు తెలియదు.'

'అవుతే నీ పిల్లల్ని నీతోటే తీసుకెళ్లు.'

'నా కక్కరలేదు. మీవల్ల కలిగినారు గనుక మీకు బాధ్యత.'

'నీవు కన్నావు గనుక నీదే భారము.'

అంతలో చిన్నమ్మగారు వచ్చి "దీనికంతకు కారణం నేను గనుక నేను యే నల్లమందో మ్రింగి చచ్చిపోతాను. మీరిద్దరు సుఖంగా ఉండండి. చిన్నప్పటినుంచి కష్టములే నాపాటు. కాపురానికి వెళ్లినది లగాయితు కష్టాలే నావంతు. పోనీ నువ్వు పెద్దవాడవయి గడించుచున్నావని సుఖపడే యోగ్యతా నాకు లేదు. యీ బాధలనుండి విముక్తి నాకే అవసరం గనుక......"

అమ్మా! నిజముగా నీకు మతిపోతోంది. అనవసరముగా యింట్లో యిద్దరు తగవులాడుతోవుంటే సంసారం యెల్లాగు? యజమానికి కొంచమయినా సుఖముండవలెనా, అక్కరలేదా? ఇంటికొచ్చేటప్పటికి దాని తన్న అది చస్తాను అంటే నీతన్న నీవు చస్తాను అంటూ యిద్దరూ యెవర్ని బెదరింపు. మధ్యన నాకు చావుగానున్నది. మీ రిద్దరకు దెబ్బలాటలు లేకుండా సంసారం అన్యోన్యంగా దిద్దుకుంటామని ప్రమాణం చేసేవరకు నేను యీ యింటియందు అడుగు పెట్టను.

ఇదే వెళ్లిపోతున్నాను అని చటాలున యిల్లు వదలి ఎక్కడికో వెళ్లిపోయాడు శేషగిరిరావుగారు.

కొంపలో యీవరుస జగడములుంటే యజమాని బ్రతుకేమి కావలయును. అత్తగార్లయిన మహా సాధ్వీమణులారా! కోడండ్రపై చలమువహింప ఫలమా? ముక్తియా? మోక్షమా? మీరుకూడ కొండొకతరి కోడండ్రలై మెలగియుండలేదా. అప్పటి బాధ లేమయిన జ్ఞప్తికి వచ్చుచుండునా మధ్య మధ్య. స్త్రీ తోలుత దండ్రిచేతను వివాహానంతరము భర్తవలనను వృద్ధాప్యమందు తనయులచేతను, రక్షణ పొందుచు వారివారి యనుజ్ఞావర్తులయియుండుటే విద్యుక్తధర్మమను పెద్దలనుడువుల యెరుంగరా. అటుల వారలకు తాము చేతోడు వాతోడై ఎల్ల కార్యముల సహాయముచేయుచు గృహమును స్వర్గతుల్యముగ చేయుట మీమీ విధ్యుక్తధర్మము గాదా.

చిన్నమ్మగారును సుబ్బలక్ష్మియు పూర్తిగా రాజీ అయ్యారు. శేషగిరిరావుగారు తిరిగి యింటికి వచ్చాడు. నాటినుండి యింతవరకు మూడేళ్లు కావచ్చింది. ఇంతవరకు యేమీ ఇంటిలో అడావిడులు లేవనే చెప్పాలి!

—:o:—

## అవతారపురుషుడు

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు, బి. ఏ.

సీ. భరతావనీకృత ప్రాక్తన పుణ్యపుంజంబె రూపముగాంచి జన్మమందె
నఖిలహైందవ కృతయజ్ఞ యాగాద్యనుష్ఠాన సత్ఫలమిట్లు సంభవించె
నకలంకశాంతి సత్యప్రేమముఖసర్వ సద్గుణంబులె యిట్లు జన్మమందె
ధర్మసంస్థాపనార్థము పుట్టుచుందుడునా భగవంతుడే యిట్లు ప్రభవమందె

తే.గీ. ననుచు జనములు కొనియాడ నతిపవిత్ర
మైన భారతవర్షంబునందు బుట్టె
నఖిల జనసౌఖ్య సంపాద నానవరత
దీక్షితాత్ముడు శ్రీగాంధి దేవుడిలను.

## రాజా రామమోహన రాయలు

క్రొవ్విడి శేష వేంకట కాశీపతిగారు

ఆత్మవైపునదృష్టి యాతరించినవాఁడు, పురికొల్పి జీవమ్ము బోసినాఁడు।
స్త్రీలను జుల్కనజేసి చూచినవాఁడు, తగదనియడ్డంబు దగిలినాఁడు।
భిన్నమైసంఘమ్ము వేరుమాసినవాఁడు, నల్వురగవకట్టి నడపినాఁడు।
అన్యభాషలనేర్వ ననుమానపడువాఁడు, పలుభాషలనునేర్చి ప్రబలినాఁడు।

నవమతస్థాపకుండును నాయకమణి।
యనుచు భారతజాతికో నతనిగూర్చి।
తెలియనేరనివారలుగలరె? తలప।
నతనితేజమె మనయాత్మలందుగలదు॥

హైందవసంఘమ్మునం దెవ్వరైనను, నవతేజమునుబొంది నడచిరన్న।
బరదేశములకేగి భారతమతముల, పరతత్త్వములగూర్చి పలికిరన్న।
పాలనావిధములోపల గల్గులోపముల్, పార్లమెంటున దేటపఱచిరన్న।
అన్యభాషలనేర్చి యందుమార్దవమైన మంచికావ్యముల రచించిరన్న।

యతడు పెట్టినభిక్షయే యనగదగును।
నతనియాచర్యమే మన కసవరతము।
వందనీయము సత్యవిశ్వాసయుతము।
నతనితేజమె మనయాత్మలందుగలదు॥

బాల్యంబుననె మహాపర్వతంబులదాటి, మేరుధీరుండయి మెఱసినాఁడు।
బౌద్ధసన్యాసుల వాదాననోడించి, ప్రకటవాక్ప్రౌఢిమ బఱగినాఁడు।
స్వమతవిశ్వాసంబు జాటఁగమదినెంచి, ప్రాణంబులనె యొడ్డుబన్నినాఁడు।
భక్తిలేకుండిన బ్రదుకు వ్యర్థంబని మించిగొంతెత్తి ఘోషించినాఁడు॥

తనసువర్తనమున భావితరతరముల।
కరయహైరోడ్డుగాజేసి యలరినాఁడు।
సర్వతోముఖపాండిత్య సార్వభౌము
డతనితేజమె మనయాత్మలందుగలదు॥

## పారవశ్యము

వారణాసి లక్ష్మీనారాయణశాస్త్రిగారు

గీ. నవ్యతరమైన సంస్కర-ణంబుఁగోరి
పూర్వమర్యాదలకు జీవ-ముద్రయైన
ప్రాఁతపత్రాలసంపుఁటి-బారవైచి
సరసకిసలయకుసుమాది-సమితితోడ
సకలతరు లత లలరు వ-సంతవేళ
బహుళపల్లవరాగంబు-ప్రబలువేళ
మందమలయానిలములు క-మ్మనిసుగంధ
బంధురముతౌచుఁ బాంథుల-డెందములకు
విందొనర్చుచు హాయిగా-వీచువేళ
పగరు వగరైనచిగురుల-పసరుచేత
మృదుమధుర కంఠనాదంబు-పదును బెట్టి
లీల భృంగీరవంబుతో-మేళగించి
దెసల నీవెప్పు డొక్కకూఁత-విసరినావొ
అప్పుడే మచ్చుచల్లిన-ట్లంతరాత్మ
వివశమైనది గడిదాటి-పికవధూటి!
బాణకాదంబరీశుక-ప్రజ్ఞనెల్ల
నైషధ నృపాలుహంస వి-శేషమెల్ల
దిగఁదుడిచి సర్వఘుడియలఁ-దెలిపియిడక
పలుకుపలుకున నమృతంబు-తొలుకునీదు
దివ్యగానమె చెవిలోఁ బ్ర-తిధ్వనించు
తలఁపులకు మీఱి వాక్కుల-కొలఁదిగాక
యలలనలిజేఁగు నానంద-జలధిలోనఁ
దలమునుకలౌట నిర్వ్యాజ-తావిశిష్ట
లలితగానామృతాస్వాద-కలితమైన
సహజసౌహార్దమునఁగాక-జాతిమాత్ర
సాధ్యమనవచ్చునే? నీదు-సంఘబలము
కలిమి ననవచ్చునే? వెఱ్ఱి-తలఁపులేల!
జాతియేటికి? నిరుపమ-ప్రీతిలేక
చవులఁజెవిఁగ్రుమ్మరించునీ-స్వాదుగాన
మానితంబైన కోమల-మానసంబు
వివిధవిషయాంతరాసక్తి-విముఖమగుచు
స్రుక్కునో లేదొ యనుభవ-జ్ఞునకె యెఱుక.

---

## నవీనకళార్థినులు

గాలి బాలసుందరరావు,గారు

వదనసౌందర్యాభి వర్ణనమ్మొనరించు లోచనమ్ములకు సులోచనములు,
వాణీపతాకలవలె మందమారుతహతిని గంపించు చేలాంచలములు,
చివురుచేతులలోన జెలువారు, పుస్తకాచ్ఛాదిత పీనవక్షాంతరములు,
నవ్యనాగరికతానంద దేవత కాటపట్టులౌ కంచుక ప్రకటరుచులు.

కైరటములవోలు నీలిముంగురులగములు
దనర, సాగరతీర పథాంతరమున
సాగుచున్నారు తమ కళాశాల వీడి
భారతీదేవి మారురూపములవోలె
తీవతనువులతో కళార్థినులు కనుడు!
ఆధునికభారతీయ కాంతాభ్యుదయపు
చిహ్నములు వీరు; వీరి దర్శించి యింక
దోసిలొగ్గి, భయంపడి తొలగిచనుడు
అతివలకు విద్య పనికిరాదనెడువారు.

విమల భారతతరుణ సేవికలువారు;
ఆర్యభారత వీరకన్యకలువారు;
భారతీగృహభావిదీపములువారు;
వారి కన్నీరు మనయింటి కారుచిచ్చు;
వారి చిఱునవ్వు బహువిభవప్రదమ్ము.

# బరంపురం ప్రయాణము—అమ్మవారు పండుగలు

తాత. కృష్ణమూర్తిగారు బి. ఏ; యల్. టి.

మదిలో పుట్టెడు ఊహలకంటే
మంటల లేచెడు పొగసుడికంటే
వడివడిగా
దడదడగా

మనపొగబండీ మనరైల్ బండీ
జఫ్‌జఫ్ జజజఫ్ జజజజ జజజఫ్
పరుగిడుచున్నది పరుగిడుచున్నది
మరియొక స్టేషన్ వచ్చుచునున్నది. 1.

దెబ్బలు తగిలిన దెయ్యము వలెనే
దేవత పంపిన దూతల వలెనే
తరతరగా
బిరబిరగా

చెట్లూ చేమలు చెరువులు పుట్టలు
ఏళ్లూ కొండలు ఊళ్లూ పొలములు
వెనుకకు వరుసగ పరుగిడుచున్నవి
మనమిక చూడగ కనబడకున్నవి. 2.

బూచిని చూచిన పిల్లలవలెనే
ముంగిని చూచిన పాములవలెనే
తొందరగా
సందడిగా

వచ్చుచునుండెడు బండీతత్తర
అగపడినంతనె ఆవులమందలు
బెదరిపోయి నలుదిక్కుల గబగబ
చెదరిపోవుచును పరుగిడుచున్నవి. 3.

మెరసిన మెరపులు కనబడునట్లే
విరిగిన కెరటము పోయినయట్లే
అదిగదిగో
ఇదిగిదిగో

అదిగో వంతెన అగపడుచున్నది
ఇదిగో వంతెన ఇక్కడనున్నది
కనబడదేమీ వచ్చిన వంతెన ?
కనబడునా మరి పోయిన వంతెన ! 4.

—గిడుగు వెంకట సీతాపతి.

నేను జబ్బుపడి లేచిన కొన్నాళ్ళకు ఒకనాడు సాయంత్రం అంగణంలో పట్టెడమంచాలు వేసుకొని, అందరం కూచున్నాం. బావ గొత్తిగిలి ఒక మంచం మీద కూచుంటే, అతనికోసం తమలపాకులు చీలుతూ ఉంది అక్కయ్య. చిన్నన్న, నేను మరొక మంచం మీద కూచున్నాం. గడపలో కూమని అమ్మ కూర తరుగుతూఉంది. నాన్న అప్పుడే వీధిలోనుంచి వచ్చి, కాళ్ళు కడుగుకుందుకు నూతికి వెళ్లాడు. రాత్రికి ఫలహారంకోసం నాయనమ్మ వంటఇంట్లో పొంగరాలు పోసుకుంటూఉంది.

ఆమాట, యీమాట చెప్పుకుంటూ మధ్యమధ్య నవ్వులతోను, హాస్యాలతోను, అందరం సరదాగా మాట్లాడుకుంటున్నాం.

బావ నావేపు తిరిగి, చిరునవ్వుతో, "బావా, చదువుకుందుకు పట్నంవెళ్లి ఊష్ణం తెచ్చుకున్నావటోయి?" అన్నాడు.

నిజంగా అత నా మాట హాస్యానికే అన్నాడు. కాని నాకది నొచ్చింది. చాలా చిన్నతనం వేసింది. సహజంగా కోపంకూడా వచ్చింది. కాని ఎవరి

మీదా? నాలో యేదో లోపం ఉన్నదని తలచికదా, బావ ఆమాట అన్నాడు? కోపం, అవమానం, సిగ్గు- అన్నీ ఒక్కమాటే జనించాయి నాలో.

నా ముఖవైఖరి కనిపెట్టి కాబోలు, నవ్వు సమాలించుకొని ఆయన, "బావా, మాతో బరంపురం వస్తావూ?" అన్నాడు.

నామనను బ్రహ్మానంద పరవశం అయింది. నేనదివరలో యెన్నడూ బరంపురం చూడలేదు. అక్కయ్య అనేకమాట్లు నన్నా ఊరు తీసుకొనివెళతానని అనేదే కాని, యెప్పుడూ నాప్రయాణం తటస్థించలేదు.

"ఆ ఊళ్లో నన్ను స్కూల్లో ప్రవేశపెడతావా?" అని అడిగాను బావని.

నా భావం తిన్నగా గ్రహించలేక అక్కయ్య, "పోనీలే. నీకు యిష్టం లేకపోతే, బరికి వెళ్లాలని నిర్బంధం యేమీ లేదు." అన్నాది.

"అయితే నేను బరంపరం రానేరాను." అన్నాను మూతి బిగించి.

"ఏం?" అన్నాడు బావ.

"చదువుకుందు కైతేనే వస్తాను బరంపురం! స్కూల్లో నన్ను వెయ్యకపోతే, నాకేం పని మీ ఊరు రావడానికి? పర్లాకిమిడిలో అంటే, ఆ మాస్టరు చాలా చెడ్డవాడు. నిష్కారణంగా కొట్టేవాడు పిల్లల్ని. నేను తిన్న దెబ్బలు యీజన్మలో మరచిపోలేను!"

"నిన్ను కొట్టకుండా నీకు చదువు చెప్పేలాగు యేర్పాటు చేస్తే సరికదా? అట్లా అయితే మాదగ్గిర ఉండి చదువుకుంటావా?" అన్నాడు బావ.

"దెబ్బలు లేకుండా అయితే, యేఊరైనా ఫరవా లేదు. అండమాన్సు ద్వీపాలకు రమ్మన్నా వస్తాను. ఎన్నాళ్ళయినా ఉండి చదువుకుంటాను." అన్నాను ఉత్సాహంతో.

ఇంతట్లో నాన్న పెరట్లోనుండి వచ్చాడు. బావ, నేను మాట్లాడుతూ ఉండడం చూసి, 'ఏమిటి కథ?' అని అడిగినట్లుగా కనుబొమలు పైకెత్తి బావవేపు చూశాడు.

"బావ మాతో బరంపురం వచ్చి, అక్కడ చదువుకుంటానని అంటున్నాడు. మీకేమీ అభ్యంతరం లేదనుకుంటాను? మాతో పంపించండి." అన్నాడు బావ.

'నిజంగా నీకు వెళ్లి చదువుకోవాలని ఉందట్రా?' అని నాన్న నావేపు తిరిగి అడిగినాడు.

"ఊఁ." అని మెల్లగా అన్నాను.

వంటింట్లోనుంచి నాయనమ్మ ఎందుకో వచ్చింది గడపలోకి. ఆమెను చూసి నాన్న, "అమ్మా, వీడు బరంపురం వెళ్లి చదువుకుంటాడట. పంపనా?" అన్నాడు.

"చదువు మిషమీద యిక్కడికి, అక్కడికి పంపకు నాయనా. కొంచెం జ్ఞానం వస్తే వాడే చదువుకుంటాడు. ఇప్పుడు మించిపోయిన దేమీ లేదు. అంతగా వాడికి చదువుమీద అభిలాష ఉంటే, యింటిపద్దనే నేర్చుకోవచ్చును. వాళ్ల అమ్మే చెప్పగలదు." అంటూ మళ్లీ లోపలికి వెళ్లిపోయింది నాయనమ్మ.

"నాన్నగారూ, వాడిని పర్లాకిమిడి పంపించడానికీ, మాఊరు పంపించడానికీ వ్యత్యాసం లేదూ? నేను పరాయిదాన్ని కాను కదా? పంపించండి." అన్నాది అక్కయ్య.

"వెళ్ళడానికి వాడికి, తీసికెళ్ళడానికి మీకు ఉద్దేశం ఉన్నప్పుడు అలాగే కావచ్చును." అన్నాడు నాన్న.

మొత్తానికి నేను బరంపురం వెళ్లడం నిశ్చయం అయింది. నా సంతోషానికి అలవిలేదు. చదువుమాట తల్చుకుంటే మాత్రం అప్పుడప్పుడు గుండె ఝల్లు మనేది. 'దెబ్బలు, లేకుండా చదువుకుందువు గాని.' అని బావ చెప్పినమాటలు మళ్ళీ కొంతధైర్యం

యిన్తూ ఉండేవి. ముఖ్యంగా, నాకు బరంపురం మాడాలన్న కుతూహలం యెక్కువయింది. అది గాక, రెయిలుబండి యెక్కవచ్చును కదా అని సంబరం! వెర్రి సంతోషంతో గెంతులాడింది నా హృదయం.

రెయిలుబండీ యెక్కిన తరువాత నా గాథరా చెప్పతరం కాదు. కిటికీకి దగ్గరగా కూచున్నాను, వెనక్కి పరుగెత్తుతూఉన్న చెట్లు, చామలు మాస్తూ. బండి వడిగా పోతూఉంది. ఒక విమానంలో కూచుని, బ్రతికి ఉండగానే స్వర్గానికి వెళుతూ ఉంటే యెంత ఆనందంగా ఉంటుందో, ఆ మోస్తరుగా ఉండేను నాకప్పుడు. చెట్లు, కొండలు, యేళ్లు, ఊళ్ళు అతి త్వరగా వెనక్కి పోతున్నాయి.

బండి నడుస్తున్నంతసేపూ గాలి తీవ్రంగా వీచేది. స్టేషనువద్ద రెయిలు ఆగగానే జనుల హడావిడి, కోలాహలం బలే తమాషాగా ఉండేవి. వల్లూరాయన గ్రామఫోన్ పాట జ్ఞాపకంవచ్చి నాలో నేను నవ్వుకునే వాడిని. తినుబడి పదార్థాలు, పళ్ళు, కాయలు, పాలు, పెరుగు, ఖిల్లీలు, చుట్టలు, అగ్గిపెట్టెలు మొదలుగా గలవన్నీ విక్రయానికి వచ్చేవి. కొన్ని కొన్ని మిఠాయి దినుసులు బావ నన్ను కొనుక్కోనిచ్చేవాడు కాదు. కాని మొత్తంపైని బరంపురం చేరేదాకా నాదవడ గానుగవలె ఆడుతునే ఉండేది. నిజంగా రెయిలు ప్రయాణం చాలా సరదాగా ఉంటుంది—చిన్నతనంలో.

స్టేషనువద్ద ప్రయాణీకులు సామానులతో బండి యెక్కడానికి పడే అవస్థ చూసి తీరాలి! బండి దిగడం కూడా అట్టే సులువైన పనికాదు. బండి దిగేవాళ్లను యెక్కేవాళ్లు, యెక్కేవాళ్ళను దిగేవాళ్ళు ఒకరినొకరు ఆటంకపరచుకుంటూ, కసరుకుంటూ, తోసుకుంటారు. నాటికీ నేటికీ కూడా మూడోతరగతి బళ్ళు ఒక్కమాదిరిగానే ఉన్నాయి. ఏ పెట్టె చూసినా ప్రయాణీకులతో క్రిక్కిరిసి ఉంటుంది. నానా గోత్రస్థ్యా, అన్ని తరహాల మనుషులూ ఆబండ్లలోనే యెక్కుతారు. ఉక్కిరిబిక్కిరి! ఉపద్రవమైన యిరకటం! అందుకు తోడు ప్రయాణీకుల సామాన్లు కూడా అట్టివే. తట్టలు, బుట్టలు, రంగంపెట్టెలు, చీపురుకట్టలు, కుళ్లు గుడ్డలమూటలు, కూరగాయల గంపలు, ఎండుచేపల జంగెళ్ళు—కలగాపులగం! ఇక ప్రయాణీకులలో నూటికి తొంభైమంది చుట్టలు కాల్చడమో, పొగాకుకాడలు నమిలి బండిలో కూచున్నచోటనే ఉమ్మడమో, యేదో ఒక అసహ్యంపని చేస్తూఉంటారు. రాగం తాళం ఆసందర్భమైన తగవులు, తెలివితక్కువ చర్చలు, కాష్టవాదాలు—వీటితో కాలక్షేపం! రెయిలు ప్రయాణంచేస్తే మూడోతరగతి బండిలోనే చెయ్యాలి. రకరకాల మనుషులు, వాళ్ళవాళ్ల స్వభావాలు, మంచీ, చెడ్డ అన్నీ తెలుస్తాయి. ఉద్యోగస్తులు, అనాగరికులు, ఆడవాళ్ళు, రోగులు, చంటిపిల్లలు, సాయిబులు, పోలీసులు, దొంగలు, బిచ్చగాళ్లు, టిక్కెట్లు లేనివాళ్ళు, బైరాగులు—అందరూ భుజం కలిసి కూచుంటారు.

ప్రయాణీకులు ఎవరేం మాట్లాడుకుంటున్నారో, యెవరేం చేస్తున్నారో, అన్నీ శ్రద్ధగా కనిపెడుతూ కూచున్నాను నేను. బ్రాహ్మలు రెయిలు బండిలో కూచుని, నానా జాతులవాళ్లు చూస్తూ ఉండగా, తగులుతూఉండగా, మైలగుడ్డలతో, చేతులైనా కడుగుకోకుండా భోజనం చెయ్యడమనేది నాకు చాలా ఆశ్చర్యం కలుగజేసింది. చోర్లంగిలో బ్రాహ్మణ వీధంట నేను మాలమాదికల నెన్నడూ చూసి యెరగను. సంతకి 'కొంగ్రాంగోలు' వెళితే, యింటికి వచ్చిన తరువాత గుడ్డలు తడుపుకొని స్నానం చేసేవాడిని. క్షవరం చేసుకుంటే నన్ను స్నానం చెయ్యకుండా యింట్లోకి రానిచ్చేవారు కారు మావాళ్ళు. చద్దన్నం తిన్నప్పుడు పొత్తిగా పంచా కట్టుకుంటే మడేకాని, తడిపి ఆరవేసిన బట్ట కట్టుకోకుంటే అన్నం పెట్టేదికాదు నాయనమ్మ! ఇక శూద్రులు, ముట్టువాళ్ళు చూస్తూ ఉండగా

భోజనం యెన్నడూ లేదు. తుదకు రొట్టెముక్క సహితం వంటింట్లోనే తినమనేవారు మావాళ్ళు. ఎంత రెయిలు ప్రయాణమైనా మడి, నిష్ఠ, ఆచారం అంటే లేకపోవచ్చును కాని, శుచి శుభ్రత అయినా లేకుంటే యెలాగు? పళ్లయినా తోముకోకుండా రెయిల్లో కూచుని కాఫీతాగడం, అడ్డమైనగడ్డీ తిని, ఆచేతులు కడుగుకోకుండా చేతి రుమాలుకు తుడిచేనుకోవడం–ఇట్లాటి అసహ్యాకరమైన పనులన్నీ తెణుకూ బెణుకూ లేకుండా చెయ్యడమే నాగరికత కాబోలు!

ఆ ప్రయాణంలో తుదకు మాబావమీద కూడా నాకు కోపం వచ్చింది. స్టేషన్లవద్ద కొళాయినీళ్ళు తాగడానికే నాకు మనసు యెన్నోవిధాల కొట్లాడింది! అట్లాంటిది, ఎవడో సాయిబుచేత సోడా తెప్పించుకొని నిర్భయంగా తాగాడు బావ. 'పలాస' స్టేషన్‌లో ఎవరో గడ్డాల దొర కనిపిస్తే, అతన్ని పలకరించి, ముట్టుకొని షేక్‌హాండ్ చేశాడు.

మేం కూచున్నబండిలో కాశీకి వెళుతూవున్న విధవవాళ్ళు కొందరు ఉండిరి. విధవల్ని, అందులో ముసలివాళ్లని చూస్తే నాకొకవిధమైన భక్తి, అభిమానమున్నూ. అట్టి వాళ్ళను చూసినప్పుడల్లా మా నాయనమ్మ జ్ఞాపకం వచ్చేది. కాని 'నిజం నిలకడ పైని కాని తేల' దన్నట్లు, యీ బోడమ్మల గుట్టు రెయిలు ప్రయాణంలో కాని బయటికి రాదు. వీళ్ల గోవిందనామాలు, ఘడియఘడియ స్నానాలు ఉపవాసాలు, తులిశమ్మ ముగ్గులు, లక్షవత్తుల వ్రతాలు–అన్నీ దొంగవేషాలేమో అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు.

ప్రయాణానికి కట్టుకున్న మూటలు విప్పి యీ విధవలందరూ తిండికి సిద్ధపడ్డారు. ఒకతె పరిపిండిలో నీళ్ళుపోసి, బెల్లం కలిపి పిసికి, ముద్దగా చలివిడి చేసింది. ఆముద్ద, అరిశెలు, అరటిపళ్ళు, జంతికలు, అటుకులు, పేలాలు, జీడిపప్పు–ఇవన్నీ తిని, పెరుగు కొనుక్కొని తాగారు. నాకు వొళ్లు ఝుల్లుమన్నది. ఏమిటీ రాక్షసితిండి! విధవవాళ్లకు కలరాభయం లేదు కాబోలు!......

రెయిలు సరదా యేమీ తీరకమునుపే బరంపురం స్టేషన్ వచ్చేసింది. ట్రెయిను ఆగగానే బంట్రోతొకడు వచ్చి, మా సామాన్లు దింపాడు.

వాడితో బావ, ''అప్పడూ, బండీవచ్చిందా?'' అన్నాడు.

''వొచ్చింది బాబూ.''

గుర్రంబండీయెక్కి పావుగంటలో యిల్లు చేరుకున్నాం. ఇంటికీ, స్టేషనుకూ చాలా దూరం. పెద్ద పెద్ద యిళ్లు, విశాలమైన రోడ్లు, జట్కాబళ్లు, చక్కని చెరువులు, కొళాయిలు–మొత్తంపైని బరంపురం చాలా రమ్యంగా కనిపించింది.

వచ్చిన కొన్నాళ్లదాకా నాకు చదువు గొడవ లేకపోబట్టి, మనసుకు నచ్చింది తిని, తిరగడం తప్ప వేరే వ్యాపకం లేకపోయింది.

బరంపురం పెద్దబస్తీయే అయినా, పల్లెటూళ్ల సౌకర్యం అక్కడ కొంత లేకపోలేదు. పెద్దపెద్ద పట్నాలలోఉండే యిరకటం, కంపులు, దోమలు, రోగాలు, నాగరికత క్రమంగా యిప్పుడిప్పుడు ఆఊరుకు కూడా వ్యాపిస్తున్నాయి. కాని మ్యునిసిపాలిటీవారి పరిశ్రమవలన ఊరికి కొంత అందం, సౌఖ్యం, యిప్పటికైనా లేకపోలేదు. అక్కడ ఆంధ్రులు, ఓఢ్రులు, మహమ్మదీయులు, అరవవాళ్లు, అన్ని జాతులవాళ్లు ఉన్నారు.

అవతల ఒరిస్సా, యివతల ఆంధ్రదేశం కాబట్టి, బరంపురం సగం ఆంధ్రం, సగం ఓఢ్రం అనుకోవచ్చును. అక్కడ తెలుగు, ఉత్కలం రెండు భాషలూ వాడుకలోనివే. చిత్రం యేమిటంటే, ఆఊళ్లో ఆంధ్రులు ఓఢ్రం బాగా మాట్లాడగలరు–నాబోటి ఉభయభాషాప్రవీణులయితే తెలుగువాళ్లతో ఓఢ్రం, ఓఢ్రులతో తెలుగు మంచిబాగా

మాట్లాడగలరు. ఈ రెండు భాషలు తెలియని పరాయి జాతివాళ్లతో అయితే, తెలుగు, ఓఢ్రం రెండూ కలగలుపుచేసి, అత్యద్భుతంగా మాట్లాడగలరు!

కాలేజి, జడ్జీకోర్టు, జిల్లా ఆసుపత్రి, కోనెలలు, మసీదులు, 'చర్చి'లు సత్రములు, ప్లీడర్లు, డాక్టర్లు, వర్తకులు, వేశ్యలు, కాఫీక్లబ్బులు, ఖిల్లీదుకాణాలు, ఊరు నిజంగా కలకలలాడుతూ ఉంటుంది. 'బరంపురం దేనికి ప్రసిద్ధి?' అని అడిగితే, కొందరు పట్టు బట్టల నేతకనీ, కొందరు ఖారామసాలాకనీ, కొందరు ఓఢ్రమంగలివాళ్లకనీ పరిపరివిధాల చెప్తారు. కాని, నిజంగా ఆఊరు అమ్మవారుసంబరాలకు ప్రసిద్ధని విశదమైంది నాకు.

దేవాంగులందరూ పూనుకొని, ఊళ్లో చందా లెత్తి, డబ్బు ధారాళంగా ఖర్చుపెట్టి, ప్రతీయేటా గొప్ప ఉత్సవం చేస్తారు. ఎక్కడెక్కడివాళ్ళూ చూడడానికి వస్తారు. ఆపదిరోజులూ ఊరు చాలా అలికిడిగా ఉంటుంది. మధ్యాహ్నం నాలుగు గంటల మొదలు రాత్రి యేడెనిమిది గంటలవరకు, 'చిన్న బజారురోడ్డు' జనంతో క్రిక్కిరిసి ఉంటుంది. అరుగులు, మేడలు, గోడలు, ఎక్కడ చూసినా జనం. రోడ్డుమీద నడవడానికి వీలుండదు. రథాలు, వాహనాలు, వేషాలు, భజనలు-అన్నీ చూడడానికి రెండు కళ్లు చాలవు. ఆటలు, పాటలు, కేకలు, ఆడవాళ్ళ కబుర్లు, చంటిపిల్లల యేడుపులు, పోలీసువాళ్ళ హడావిడి, ఆజన సమ్మర్దం, ఆకోలాహలం, ఆధూళి ఇవన్నీ చూసి, ఉత్సవంలోకి జొరపడడానికే మొదట నాకు భయం వేసింది.

బరంపురం అమ్మవారు చాలా సత్యంగల దేవతనీ, ప్రత్యక్షప్రభావం గలదనీ, చెప్పుకోగా విన్నాను. సంబరంలో ఘటంమోసే ఆమెకూడా, అమ్మవారును యేదో దగ్గిరచుట్టం వలెనే కనిపించింది! పెద్ద యెఱ్ఱని బొట్టు, పసుపుచీర, దానిమీద వసంతంమరకలు, విడిపోయి వ్రేలాడుతూ నీళ్లోడుతూఉన్న జుట్టు, నెత్తిమీద వేపకొమ్మలతోఉన్న వసంతంకుండ, చుట్టూ ధూపాలు, గుగ్గిలంపొగ, రోడ్డుధూళి, డప్పులు, బాజాలు, పోలీసు బెత్తాలు-వీటితో వస్తూ ఉంది ఆ సాహసురాలు! వీరావేశంతో తూలిపోతూ ముందుకు నడుస్తూఉంది-పరుగెత్తుతూఉంది-మధ్యమధ్య ఆగి గిర్రున తిరుగుతూ నాట్యంఆడుతూ ఉంది. చుట్టూఉన్న స్త్రీలు ఆమెను, ఆమె తలమీది కుండను, క్రిందపడి పోనీయకుండా కాపాడుతున్నారు. 'జేయి! జగజ్జననీ! కాళీ! అంబా!' అని కేకలు. ఒకరి నొకరు తోసుకోవడం, పోలీసు బెత్తందెబ్బలు తింటూఉండడం, సంబరం వెనుక పరుగెత్తడం-ఇదీ జనుల వేడుక.

రోడ్డుమీద యీకొసనుండి ఆకొసవరకు జనమే. వేలు, లక్షలు ఉంటారు. ఏదో ఒక సదుపాయమైన చోట నిల్చుని, ఉత్సవం చూసి, చప్పున యింటికి పోదామని ఉంటుందా నాకు? ఈచివరనుండి ఆ చివరవరకు, జనాన్ని తోసుకుంటూ, తోపులు తింటూ, అన్నీ చూస్తూ తిరగాలని ముచ్చట.

మరో ముగ్గురు కుర్రవాళ్లతో జట్టుకలిపి, జేబులో ఉన్న డబ్బులన్నీ ఖర్చుపెట్టి పఠాణీలు, కొబ్బరి ఉండలు, వేరుసెనగపప్పు, అన్నీకొని జేబులో పోసుకొని, వాళ్ళకు కూడా యిచ్చి, మహా ఉత్సాహంగా జొరపడ్డాను సంబరంలోకి. ఒక్కక్షణంలో ఆపాద మస్తక పర్యంతం ఒళ్ళంతా ధూళితో నిండిపోయింది. కట్టుకున్న గుడ్డలు మురికి కావడమే కాక, అక్కడక్కడ చినిగాయి. నా తెల్లని షెరాయిమీద చూసో, చూడకో, యెవడో ఖిల్లీ ఉమ్మినట్లున్నాడు. అసహ్యంగా యెఱ్ఱని మరక కట్టింది. నాతోఉన్న కుర్రవాళ్లు కేళిచేస్తూ అది చూపించిన దాకా నేను చూసుకోనేలేదు.

బట్టలు చెడితే నేం కాని, తృప్తితీరా తిరిగాను సంబరంలో. వేషాలు వేసుకుని దండుకునే వాళ్ళను చాలామందిని చూశాను. 'ఉదరనిమిత్తం బహుకృత వేషం,' అని బిచ్చ మెత్తుకుందుకు వేషాలు వేసేవాళ్లు కొందరు; మొక్కుబడులుండి విధిలేక వేషం వేసుకుని

అమ్మవారుకు సమర్పించడానికి దండుకునేవాళ్ళు కొందరు; కేవలం ముచ్చటకొద్దీ వేషాలు వేసుకొని తిరిగేవాళ్ళు కొందరు. ఎన్నెన్ని వేషాలని? 'చోడి గజా' వేషాలు, వెధవముండ వేషాలు, దొరసాని వేషాలు, మందులమారి వేషాలు, యెరుకుల వేషాలు, పులివేషాలు, ఆంజనేయ వేషాలు, ఆడ మొగవేషాలు, –ఇంకా ఎన్నో చిత్రవిచిత్రమైన వేషాలు! వెదురు కర్రల శయనంమీద ఓగాయిత్యంగా ఒకడిని కట్టి పడుకోబెట్టి, నలుగురు మోస్తూ కొత్తకుండలో నిప్పులు, పిడకలు, మిరపకాయలు పోసి పట్టుకొని ఒకడు ముందు నడుస్తూ రొమ్ము బాదుకుంటూ లబోమని యేడ్చే వెంటవస్తూ, అడుగడుగుకీ కానవచ్చేవి శవంవేషాలు! అందుకుతోడు ఉక్కిరిబిక్కిరిగా ఉన్న ఆజనసమూహంలో, ఆమిరపకాయ పొగలో, మధ్యమధ్య పెద్ద యెద్దుబళ్ళు. అందు, కొన్నిటిమీద వస్తాదువేషాలు,–అంటే, నలుగురైదుగురు కండ పుష్టిగలవాళ్ళు కసరత్తు సామగ్రితో వస్తాదులవలె రొమ్ములు విరుచుకొని ఠీవిగా ఆబళ్ల మీద నిల్చునేవారు. వాళ్లలో ప్రతీవాడికీ ఒంటినిండా యెర్రమట్టి పూత, మెడలో ఆంజనేయ విగ్రహంగల చిన్న రాగిరేకు, కాలికో, జెబ్బకో సన్నని వెండిలోడా, బిగువుగా కట్టిన కాషాయ లంగోటిన్నీ, మరికొన్ని బళ్లమీద సానివేషాలు,–అంటే, ఫిడేలు వాడొకడు, మద్దెల గాడొకడు, హార్మొనీ వాడొకడు, ఆడవేషంలోఉన్న మరో యిద్దరు ముగ్గురు యువకులు, అంతా ఒక బండిమీద ముస్తాబై నిల్చునేవారు. రంగురంగుల జరీచీరలు, వొంటినిండా మాయనగలు, కాళ్ళకు గజ్జలు, మొహానికి రంగుపౌడరు, మొలకు చేతిరుమాలు, నోట్లో ఖారాకిల్లీ, చేతికి రిస్టువాచీ, కొప్పులో పువ్వులు, ముసిముసి నవ్వులు, పాట, ఆట, అభినయం–బలే ఖుషీకరంగా ఉండేవి యీవేషాలు! ఇంకా మరి కొన్ని బళ్లమీద నాటకవేషాలు–అంటే, సీతారామ లక్ష్మణులు, ద్రౌపదీ పాండవులు, చిత్రాంగీ సారంగధరులు, సావిత్రీ సత్యవంతులు మొదలైన వేషాలు.

నడిచే యీబళ్లే కాక, ఉత్సవంలో స్థిరంగా ఒకచోట నిలచిఉన్న ఎన్నో పెద్దపెద్ద రథాలున్నాయి. వాటిమీద చూడ సొంపయిన పెద్ద పెద్ద విగ్రహాలు. ఒక రథంమీద రాముడు విల్లెక్కుబెట్టి బాణం విడుస్తూఉన్నట్లు ప్రతిమ. దానికెదురుగా మరొక రథంమీద పదిబుర్రలతోనూ, యిరవై చేతులతోను భయంకరమైన రావణాసురుడి విగ్రహం. ఇట్టివే ఇంద్రజిత్తు లక్ష్మణుడు, సుగ్రీవుడు వాలి, కర్ణుడు అర్జునుడు, సత్యభామ నరకాసురుడు, ఒకరితో ఒకరు యుద్ధంచేస్తూఉన్నట్లు చిత్రింపబడిన విగ్రహాలు. ఈ రథాలమీది బొమ్మలు మాత్రం చాలా బాగుండేవి. అందంగా, నేర్పుగా చేసిన విగ్రహాలవి!

ఉత్సవంలో తిరుగుతూఉంటే, యింకా ఎన్నెన్ని తమాషాలో చూడవచ్చు. భజనసంఘాలు, మిఠాయి కొట్లు, ముళ్ళకంపలమీద పడుకొని ముష్టెత్తుకునే బైరాగి మహాత్ములు, పోలీసులన్నా భయములేని జేబుదొంగలు, నెత్తిని దొరటోపీలు పెట్టుకొని కొంచెం వంగి ఊగుతూ విలాసంగా నడిచే ఉన్నతోద్యోగస్తులు, ముస్తాబై మొగవాళ్ళను రాసుకుంటూ స్వేచ్ఛగా తిరిగే ఆడవాళ్ళు, వయసువచ్చిన స్కూలు విద్యార్థుల పెంకెజట్లు, మాబోటి కుర్రకుంకలు,–యింకా అనేకమైన తమాషాలు! ఒక రోజుకాదు! రెండు రోజులు కాదు; వారం పదిరోజులవరకు జరుగుతుంది, యీ అమ్మవారు పండుగ.



# భక్తియోగము

పనుమర్తి కృష్ణమూర్తిగారు

శా॥ దేవా, యాదవవంశవార్ధిసితకాంతీ, శ్రీపతీ, సర్వధా।
భావంబందునఁ గొంద రర్థిమెయి నిన్ బంధింతు; రవ్యక్తమున్।
భావాతీతము నక్షరంబనుచు సంభావింతు రో కొంద;రిం।
దేవారుత్తమ యోగవేదులుకదా? యీ వానతీవే దయన్॥

మ॥ అని సంప్రశ్నముసేయు పార్థునెడఁ దా నత్యాదరం బొప్పఁగా।
ననునంతన్ భగవానుఁ "డో నవును ముఖ్యంబైన దీ మాటయున్।
ననుఁజింతింపుచు శ్రద్ధతోడుత సదా నామేటి వృత్తంబులన్।
విని రక్తుండగు నిత్యయుక్తుడె సుమీ విద్వాంసుఁడా వెండియున్॥

మ॥ సములై సంతత సర్వభూతహితులై, సాధించి చంచద్ధృషీ।
కము లవ్యక్త మనంత మవ్యయము, నాకాశం బచింత్యంబు స।
ర్వము, సర్వత్రగమున్ ధ్రువం బచల మున్భాసంబుఁ గూటస్థభా।
వమునై యొప్పుచునున్న యక్షరపరబ్రహ్మంబుపాసించు ధీ।
రమతుల్ సూటిగ నన్నుఁజేరుదురు వీరశ్రేష్ఠ, తథ్యంబుగా॥

శా॥ ఆయుద్యోగము మంచిదే! అయిన నే యాధారమూలేమ నో।
పాయం బిట్టి యుపాసనాపరత నెవ్వండేన్ సుఖఃబొందునే
ఆయాసంబు నపారదుఃఖముల పెం పాపై రసాభాసమే।
ఆయాసల్ గల దేహధారులకుఁ గా కన్యంబు సిద్ధించునే॥

శా॥ ఆపేరాసల నేగి యేటఁబడుటేలా? హాయిగాఁ బ్రేమతో।
నాపైఁజిత్తమునిల్పి తత్పరతతో నన్నే యుపాసించి యే।
వ్యాపారంబులనైనఁగాని మరి నాకర్పించు నాభక్తియో।
గోపాయం బదిరా యనన్య: మిదికాదో నీవయోచింపుమా॥

ఉ॥ నాకిఁక భక్తియోగకలనాసముపేతులె యిష్టులౌదు ర
స్తోకమతుల్ యథార్థసుకృతుల్ మరి వారలె; యట్టివారి నే।
వీకొని యీజరామరణ భీకరమౌ భవసాగరంబునే।
నేకద యెల్లవేళలఁ దరింపఁగఁజేయుచునుందుఁ బ్రీతితో॥

మ॥ అనఘా, నీకొకవేళ ఈపని యసాధ్యంబేయగుంగాక సా।
ధనచే సాధ్యముకాని దేదని ప్రయత్నంబెంతయేఁ జేయు;మా।
పనికిం జాలనివాడవేయయిన నోపార్థా, మదర్థంబులే।
యనుకో కర్మల నాచరించునెడ! మోక్షార్హుండవౌ దెట్టులేన్॥

శా॥ పోని మ్మింతయుఁ జేతఁగానిదె యగుంబో యే యుపాంబులే।
దోనాయర్జున, కోరఁబోకు ఫలముద్యోగంబునం దెన్నఁడా।
జ్ఞానాభ్యాసములందుఁ బెద్దయగు జ్ఞానం; బైన నాజ్ఞానమున్।
ధ్యానంబొక్కటమించు; దీనికి ఫలత్యాగంబె మీఁదయ్యెడిన్॥

మ॥ అరరే! యెవ్వఁడు, భూతజాతములయం దద్వేషియై సఖ్యమున్।
గరుణన్ బాగుగఁబూని తుల్యసుఖదుఃఖప్రేక్షుఁడై సైరణన్।
నిరహంకారియు నిర్మముండునయి, నన్నే రూఢిగా నమ్మి సు।
స్థిరయోగ ప్రతిభావిశిష్టుఁడయి బుద్ధిన్ మానసంబున్ సదా।
మరి నాయందె లయింపఁజేయు యతి; తన్మార్గంబులో నెప్పుడున్।
బరమానందము నొందువాఁడు ప్రియుఁడున్ భక్తుండు నాకర్జునా॥

ఉ॥ ఎవ్వనివల్ల లోకమును, ఎవ్వఁడు లోకమువల్ల నెన్నఁడే।
రవ్వయు రట్టులేక యనురాగము మీఱ సుఖించుచుందురో।
ఎవ్వడు హర్షరోషభయహేతు విముక్తుఁడో వాఁడుగాకయో।
కవ్వడి, యెవ్వడింక మరికల్గును నాకుఁ బ్రియుండు, భక్తుఁడున్॥

చం॥ వలపులెపో మనశ్శుచిని బాడొనరించునటంచు దక్షుఁడై।
మెలకువ దోఁపఁగాఁవలకు మించినకార్యము లెల్ల మాని, పొం।
తలఁబడుచున్ మనోవ్యథల దగ్ధుఁడుగాక ప్రియంబుబూని యి।
మ్ముల నలవారువాఁడె కడుఁబూజ్యుఁడు నాకు హితుండు భక్తుఁడున్॥

ఉ॥ మేలగువేళ మోదమున మించుట—కీడగువేళ వంతచేఁ।
దూలుట, యిష్టనష్టమున దుఃఖము—వెండియు లేనిదానికై।
గోలయు, నెగ్గులగ్గులకుఁ గ్రుంగుటపొంగుట లెల్లమాని నా।
లో లయుఁడైన భక్తిరసలుబ్ధుఁడు నాకుఁబ్రియుండు పాండవా॥

మ॥ సమచిత్తంబున, శత్రుమిత్రులయెడన్ సర్వత్రమానావమా।
నములన్, గష్టసుఖోష్ణశీతముల శాంతంబొంది నిర్ద్వంద్వుఁడై।
సమనిందాస్తుతిబుద్ధి గల్గి మునియై స్వల్పంబుతోనైన మో।
దము నొందంగలవాఁ, డసంగుడు, జగద్ధాముండు, సుస్థైర్యవి।
క్రముఁడౌవాఁడు, మహాత్మకుండు, నిజభక్తాగ్రేసరుండౌఁ గదా॥

శా॥ విన్నావా యిది భక్తియోగము: సదావేద్యంబు, ధర్మ్యామృతం।
బన్నా, యెవ్వరు దీని సంతతము శ్రద్ధాసక్తులై భక్తితో।
నన్నేనమ్మి యుపాసనల్ సలిపి యానందింతురో వారెపో।
యెన్నండైన మహాత్మకుల్ ప్రియమునెంతేఁ గూర్తురీనా కన్నిఁటన్॥

వెనుకటి మేనకా వృత్తాంతం జ్ఞాపకానికి వస్తూంది. ఆమె దేవతాకన్య: ఏంచేసినా చేసి ఉంటుంది. కాని భూలోకంలో కూడా ఇలాటి ఉదంతాలు జరుగుతాయా అని పించింది. అయితే వెనుకటి కథకూడా యీ లోకంలోదే! విశ్వామిత్రు డిక్కడివాడేగదా!

'తల్లి' అనగానే ప్రేమచేత ఒళ్ళు గగుర్పొడుస్తుంది. కళ్ళు చెమ్మగిల్లుతాయి. మన స్సెంతో నిండుగా ఉంటుంది. కాని దీనికి కారణం ఆమెకు బిడ్డయెడగల ప్రేమే కదూ! ఆప్రేమ తీసేస్తే తల్లికీ నేలపాషాణానికీ ఏమిటి భేదం?

రెండాకులలో చుట్టబెట్టేసి ఆబిడ్డను పొదలోపడేసి యే అంబరవీధికో ఎగసిపోయిందా తల్లి. పాప మా పసికూన మిల మిలా మెరస్తూన్న కళ్ళతో చిఱుకాళ్ళు కదపుతూ, చిన్నినోరు సవరించుకొంటూ ఆ ఆకులలో సంచలిస్తూంది.

ఆపొదలోనే అలా దినాలుతోపాటు ఆమె కూడా పెరుగుతూంది. విడిన పూలనుండి రాలిన పూదేనె చినుకు లాహారిస్తూ, మంచు నీటిబొట్లు త్రాగుతూ మెల్లగా ప్రాకి వెళ్ళి వెళ్లి క్రిందికి వంగిన కొమ్మలచివురా కందు కొని తింటూ అక్కడికక్కడే తిరుగుతూ, కొంచెం పెరిగి పెద్దదయిందామె సన్యాసి బ్రతుకు; సాత్వికాహారం; స్వచ్ఛందజీవనం; అలాసాగిపోతే ఎంతబాగుండును! పాడు మన స్సలా నిలబడుతుందా? కొంచెం బాహ్యలోకాన్ని చూచింది. ఆచెట్ల పూలయందం చూచింది. ఆరేకుల సొగసూ వన్నెలూ, చిలుగుపనీ, ఇవన్నీ చూచింది

"అయ్యో! ఈ పువ్వెంత అదృష్టవంతురాలో! స్వేచ్ఛగా చెట్టుకొమ్మకొనను నిలబడి నవ్వు మొగంతో లోకాన్ని చూచి ఆనందిస్తూంది. నేను కూపస్థమండూకంలాగు ఈ చీకటిలో ఈపొదమాటున జీవిస్తున్నాను. పుట్టు సన్యాసిలాగు బూది పూతెక్కిన ఈ యొడలితో ముడిచికొన్న యీ మొగంతో నేలనే తిరుగుతూ, ఏలాలిత్యమూ ఎరుగకుండ ఇలాపడి ఉండలేను. ఇంత మౌనవృత్తి బూని ఆకలమలుదిని జీవితం గడుపుకొంటూన్నా ఆదైవం నన్నుదయదలచిందికాదు. ఈ మలిన జీవనమే బుచ్చుకొమ్మని గట్టిగ నుదుట వ్రాసిపడేసింది నన్నీలోకంలోను: అయ్యో! అంత విశాలమయిన ఆకాశాన అన్నిపిట్టలు సంచరిస్తూన్నాయే! జగత్తంతా చూస్తున్నాయే! ఆచిత్రాలూ, ఆజిలుగుపనులూ, ఆవన్నెలూ, ఆవైభవాలూ, అన్నీచూచి ఆనందిస్తున్నాయే! నాకెందుకు కూడదూ ఆ అవకాశం? ..ఏదీ?... లేదు! ఎవరిస్తారు? నిర్భాగ్యపు పుట్టువుపుట్టిన నాకు నిలువనీడే నిధానమయిపోయిందే! ఏంచెయ్యడం? ఆ దేవదేవునెలా సందర్శించడం? నాకెలా స్వాధీనుడవుతా డతడు! ఛీ! ఈ జీవనం పయిని విరక్తిగలుగుతూంది నాకు! బైరాగినైపోతా. నిద్రాహారాలు మానేసి నిలువుగాళ్లమీద తపస్సు చేస్తా!! చూస్తా దేవుడు నాకు ప్రత్యక్ష్యం కాక ఏంచేస్తాడో."

అనుకొని ఆమె ఆపాదమొదట మౌన ముద్ర వేసికొని పాదు కదలకుండ అహోరాత్రాలు జపం చేయడం మొదలుపెట్టింది. కొన్నాళ్ళయేసరికి పూర్వం వాల్మీకిమీద పెద్దపుట్టలు పోసేసినట్లు, ఆమె కనబడకుండా ఆమెచుట్టూ, పట్టులూ, పుట్టలూ, కూడా అల్లేశాయి. ఆమె నిర్విఘ్నతపస్సమాధిలో నిలిచిపోయింది.

ఇదంతా ఎందుకు? లోక సౌందర్యానిని అనుభవించడానికట! అనంతములయిప్రాకే ఈ సృష్టిసౌందర్యపరంపరలన్నీ ఎవరికి గోచరిస్తాయి! ఎవరు వానినన్నిటినీ స్వేచ్ఛగా అనుభవింపగలరు? మీదు మిక్కిలి అందగలరు? కాని లోకంమాత్రం అలా ఊరుకుంటుందా? వెఱ్ఱిజీవులను ఇలాంటివింతలతో ఆడిస్తుంది. రంభాపరిరంభణంకోసం యజ్ఞాదివ్రతనియమాలతో కాలంగడిపే ముసలిసోమయాజికంటె వెఱ్ఱిదా మన కథానాయిక?

ఏమో, ఆమే చెబుతుంది తరువాతి వృత్తాంతమంతానూ, ఆపుట్టలో, ఆపట్టులో, ఏంజరిగిందో మనకేం తెలుస్తుంది.?

"నేనలా తపస్సమాధిలో తదేకధ్యానంతో కన్నులు మూసికొని, లోకాన్ని మరచిపోయి నిశ్చలనై నిర్జీవమైనట్టు పాషాణప్రాయంగా అలాపడిఉన్నాను. అలా గెన్నాళ్లున్నానో, ఏలా గున్నానో, తలుచుకుంటే, నాకే ఆశ్చర్యం వేస్తూంది. ఆశ్చర్యంరాదూ ఆభగవంతునిచేతా? ఏది ఎలాజరిగిందో ఎవడు చెప్పగలడు?

ఒకనాడంతట మోగ నిద్రనుండి నేను త్రుళ్ళిపడి మేల్కొన్నాను. అంధకారమయమయిన నా ఆవరణలో నొకవింత వెలుగు పొడమింది. ఆఁ! ఇది దివ్యకాంతి! నాతపమును మెచ్చికొని దైవం నాకు ప్రత్యక్షమౌతూంది. సరే! ఈ అమూల్యావకాశాన్ని విడువకుండా నాకు కావలసిన వరాలిచ్చి మరీ వెళ్లుమంటూ నాదేవుణ్ణి!! ఊరకే మొగం చూపించి పారిపోతే ఒప్పుకోను!! నాతపోమహిమచేత వానిని మొలకొంగున పట్టుకొని ముంగిట నిలబెట్టి మరీ అడుగుతాను: నేనడిగిన వరాలిచ్చేదాకా వదలను!! రానీ! ఆ ముఖారవిందం నాకంటబడితే అప్పుడుంది. ఇప్పుడేలా! అడుగో! ఆపట్టుచించుకొని మరీ వస్తున్నాడు. రమ్మను నాతో హాస్యాలు కాదు!!

ఆతడు వచ్చేడు. నాఒడలు మెల్లగ తన చేత్తో నిమిరేడు. కొన వ్రేళ్ళతో దువ్వేడు "బిడ్డా! నీతపము మెచ్చికొన్నాను. నీకు కావలసిన వరములడుగు"మని నాచెవిలో చెప్పినట్లయింది, నేను 'స్వేచ్ఛ, సౌందర్యం' అన్నాను తొందర తొందరగా "సరే ఇచ్చేను పొందు"మన్నాడు. నేను కళ్ళు విప్పేను. అంతా అంధకారం! అయ్యో! అప్పుడే ఇంతలోనే ఆతడు పారిపోయాడు. ఆముఖ మొకపరిచూచానుకాను. ఆసౌందర్యం ఒక్కసారి అనుభవించానుకాను. ఆపాదాంబుజకతూరి స్పృశించలేకపోయాను. ఏమో అడుగుతే ఆతడిచ్చానంటే అంతే చాలుననుకొన్నాను. ఏమిచ్చేడు? ఏమో! ఆ అంధకారంలో

నాకేం తెలియలేదు. పైకేలాగయినా ప్రాకి పోయి ఆదేవుడు నాకేమిచ్చేడో చూడాలన్న తొందర హెచ్చయిపోయింది. మెల్లగా ఆ పుట్ట పగిలించుకొని ఆపట్టు చీల్చుకొని పైకి త్రోవ చేసికొనుటకు ప్రయత్నించేను. ఎవరో తెరచినట్టు వింతగా ఆత్రోవ విడింది. పైకి వెడలేను. ఒడలు తేలికగాఉంది. శరీరమంతా విరుస్తూంది. విప్పేను; కనులు మిరుమిట్లు గొన్నాయి పూవురేకులలాగుంది నాశరీర సౌందర్యం. ఆహా! అవన్నెలు ఆజిలుగు ఆ చిత్రరచన ఏపువ్వులోఉంది ?

అయింది పూలగర్వం అడగింది ఆకొమ్మ కొనను నిలబడి అదియేమి గర్వించింది! దాని కంటె ఎక్కువ అందం నాకువచ్చింది... అన్నట్టు స్వేచ్ఛకోరుకొన్నానే.....పై కెగసి చూస్తాను.కుప్పించియెగిరేను గాలిలో విమానంలాగు తేలిపోయాను. అంతరాళాన రంగుల కాగితాల గాలిపటంలా గెగసేను. ఆ పువ్వు దగ్గరకుపోయి దాని గర్వం ఇప్పుడు పరీక్షించుకున్నాను. అది నారెక్కకొననయి నా పోలలేకపోయింది. నేను కొంతసేపలా నిలబడేసరికి అది నాఅందంచూచి ఓర్వలేక నారెక్కలనిండా తన కేసరాల ధూళి చల్లేసింది. నాకు కొంచెం కోపంవచ్చి ఆ ప్రక్కనున్న చిగురుదగ్గరకుపోయి నిలచాను. నాకప్పుడాలోచనమీద నాలోచన పొరలి వస్తూంది. ఆ ప్రొన్ననవై పే కొరకొరా చూస్తూ నిలచిపోయాను. ఏమిటి దీని యెక్కువ! నాకంటె దీనికేమి విశేషాలున్నాయి. వాసన మధువు; మార్దవం; ఇవి నాలోలేవు. అందుచేతనే తుమ్మెద నాతో మంతనాలాడదు; నన్నుప్రేమతో కౌగిలించికోదు. ఈపూవును చూచి పరవశమున పాడుతూ అది దాని పొత్తువిడునదు; నన్ను అది కన్నెత్తి చూడనయినా చూడదు. కాంతాలోకాని కీపూలమీద నెంతప్రేమ! ఎంతగౌరవం! వాళ్ళు నాటిని తలమీద పెట్టుకుంటారు! నన్నెవరలా గౌరవిస్తారు. నేనిలా యీఅడవిలో పేరూ ప్రతిష్ఠాలేకుండా సమసిపోవడమే కాబోలు ఏమో! ఆదైవము ముఖాముఖి నాకడ నిలచినపుడు కావలసినవన్నీ అడుగక ఇప్పుడన్నీ కావాలంటే యెలా వస్తాయి ?

ఇదే నాకడసారికోర్కె:—పూవువలె నేను కూడా కాంతాలోకంలో గౌరవంపొందాలి.'

ఇప్పుడాకోర్కె సఫలీకృతమౌతూందేమో! పట్టుపేలికలతో ఆకుచిలుక ఆకృతిని రచించి రెక్కలమీద చెమ్కీపనులుచేసి సింగారవతులు జడలమీద పొందుపరచుకుంటున్నారు. అది చూచి సీతాకోక చిలుక ఆనందించదూ ?

తపోమహిమ

---

# 'భారతి'

శ్రీమతి కే. యన్. మూర్తిబాయిగారు

"భారతీ" యని పిలిచెను బ్రహ్మానందరావు.

"ఊ. వస్తూన్నాను" అని అంటూ స్యాండెల్సు చప్పుడు చేసుకొంటూ వచ్చినది భారతి.

బ్ర:—నాకు కాలేజీ టయిమయినది. సూటు మడతది తీసియివ్వుము."

మడతసూటు యిచ్చినది భారతి. సూటు ధరించుతూ,

బ్ర:—నేడు యింగ్లీషువిద్య నేర్పెదను. నేర్చుకొనవలెను. "రెడీ"గా యుండుము.

భారతి:—"అబ్బా. నాకు రాదు. యిష్టమునూ లేదు. మరియొక రోజున జూచెదము లెండి."

బ్రహ్మానందరావునకు పట్టరాని కోపము వచ్చి, మొహము ఎఱ్ఱబార, తన ద్విచక్రిపై కాలేజీకి రివ్వుమని వెడలిపోయెను. పాపము ముగ్ధయగు భారతి యింతలి భావమును గ్రహించలేకపోయెను.

బ్రహ్మానందరావుయొక్క నివాసస్థలము చెన్నపట్టణము. ప్రస్తుతము 'బి. యల్.' క్లాసు, 'లా' కాలేజీలో చదువుచుండెను. 'సిటీ' వాస్తవ్యుడగుటచే, 'సిటీ పోలిషు', సిటీ యెడ్యుకేషను', :సినీమా ఫేషను'లయందతనికి యభిరుచి మెండు. యిక భారతియో—పల్లెటూరిపిల్ల. తన తల్లి చిఱుతప్రాయముననే చనిపోవుటచేత తన మాతామహుల యింట నొక కుగ్రామములో పెరిగెను. మరియు తల్లిలేని పిల్ల గనుక, నల్లారుముద్దుగా పెరిగెను. తాతగారు తన మనుమరాలికి తెనుగు, సంస్కృతము ఒక పండితునిచే నేర్పించెను. భారతి యిప్పుడు కవనము నల్లును. ఈ రెండు భాషలలోను చాలా పాండిత్యము సంపాదించెను. భారతికి యుక్తవయస్సు రాగానే, అనగా శారదాబిల్లు అమలులోనికి రాకమునుపే, భారతిని బ్రహ్మానందరావునకు యిచ్చి పెండ్లిజేసెను. బ్రహ్మానందరావు బి. యల్. క్లాసులో చదువుచున్నప్పుడు భారతి కాపురమునకు వచ్చినదాది 'సిటీపోలీష్', 'సినీమా ఫేషన్'లను ఎట్లనో కష్టపడి కొంతవరకు నేర్చుకొనెను. కాని 'సిటీ యెడ్యుకేషను'కు మాత్రము దూరమయ్యెను. సిటీలో ప్రతీ 'జట్కా—వాలా'కు వచ్చిన యింగ్లీషు, భారతికి రాదయ్యెను. నేర్చుకోవలెనని శ్రద్ధయూ లేదు. బ్రహ్మానందరావునకు సిటీలో యుండుటచేతనూ, అందులో 'బి. యల్.' క్లాసు చదువుచుండుటచేతనూ యింగ్లీషుయందభిమానము ఎక్కువ. తన భార్యకూడ యింగ్లీషు చదువుకొని మీటింగులలోనేమి, యింటికి వచ్చిన 'గెస్టు'లోనేమి, యింగ్లీషుతో అనర్గళముగా మాట్లాడవలెనని యాతనికి కుతూహలము. కాని యింగ్లీషువద్ద భార్యాభర్త లిద్దరకు వాదప్రతివాదములు తరచూ జరుగుచుండెను. భారతికి ప్రస్తుతము దేశీయవిద్యయగు 'హిందీ' నేర్చుకొనవలెనని యత్నము. మర్యాదకు భంగము రాకుండుటకున్నూ, గౌరవము పెంపొందుటకున్నూ రాజవిద్యయగు 'యింగ్లీషు' రావలెనని బ్రహ్మానందునకు ఆశయము. అందుచే యింగ్లీషు నేర్చుకొనమని భారతికి పలుమారులు జెప్పెను. బ్రతిమాలెను. కసరెను. భారతి వీటిని చెవిపెట్టక, ఎప్పటికప్పుడు వాయిదాలు వేయుచుండెను. ఒకనాడు బ్రహ్మానందరావునకు ఒడలు మండి, పైజెప్పిన రీతి కోపముగా కాలేజీకి వెడలిపోయెను. భారతి యిది కోపము అనుకొనలేదు. కాని మామూలు పరిపాటు కాదనిమాత్రము గ్రహించెను- అతను మధ్యాహ్నం కాఫీకి రాకపోవడము చేత. బ్రహ్మానందరావు కాలేజీనుంచి సాయంకాలము గృహమునకు వచ్చెను. తన సూటు విప్పుటకు సహాయార్థమై తన యర్థాంగిని పిలువలేదు. పలుకరించనూలేదు. టెన్నీసుఆట నిమిత్తమై దుస్తులను ధరించి, బ్యాటును జేతపుచ్చుకొని క్లబ్బునకు వెళ్లెను. భారతి వెలవెలబోయెను. రాగము సృతి మించిన దనుకొనెను.

రోజులు గడచెను. కాలచక్రము తిరుగుచుండెను. భారతికి మనోవ్యాధి పుట్టెను. బ్రహ్మానందరావునకు మనోనిశ్చయము పట్టెను. అతని దృష్టి తన కాలేజీలో చదువుచున్న కమలపై బారెను. ఒకరినొకరు కలియునప్పుడెల్ల చూచుటము, చిరునవ్వు నవ్వడము, పలుకరించడము, క్రమేపి, ఒకవిధమయిన పరిచయములోనికి మారెను. కొన్ని దినములకే పరిచయము స్నేహముగ పరిణమించినది. ఈడూ జోడూవారగుటచే ఈ స్నేహము అన్యోన్యరాగముతోను, మోహముతోను మిళితమైయున్నది. ఒకరోజు కలయకయుండినచో నెంతో భారముగనుండెను. బ్రహ్మానందరావునకు సర్వము కమలమయమే. అగ్నిముఖముగా పెండ్లాడిన భారతి, ఆంగ్లవిద్యరాని భారతి యిప్పుడు స్ఫురణరాదయ్యెను.

*　　*　　*　　*

భానుమతి, భారతికి మేనత్తకూతురు. చెన్నపురిలోనే మెడికల్ కాలేజీలో చదువుకొనుచుండెను. ఒకనాడు భారతిని జూడనేగెను. భారతివల్ల బ్రహ్మానందరావుయొక్క చర్యయంతయు విని దిగ్భ్రమజెందెను. తనకు సావకాశము చిక్కినప్పుడు తప్పక యింగ్లీషు నేర్పెదననియు, యింతవరకు యింగ్లీషు నేర్చుకొననందులకు తన కాపురమునకు ముప్పు వాటిల్లినదనియు, భర్తను సంతోషపెట్టు మార్గమే యవలంబించవలయుననియు నొక్కి వక్కాణించెను.

*　　*　　*　　*

బ్రహ్మానందరావునకు యిప్పుడు కమల యనయెక్కువ ప్రేమ. భారతి యన యెక్కువ నసహ్యము. ఒకనాటి సాయంకాలము కాలేజీ వదిలినతోడనే టెన్నీసుయాట మాని, కమలతో విహారార్థమై యేగెను. కొంతదూర మేగుసరికి, ఒక యినుకతిప్ప కాన్పించెను. అచ్చట కూర్చొనిరి. సూర్యు డప్పుడే యస్తమించెను. మలయమారుతము వీచుచుండెను. బ్రహ్మానందరావు కమల తొడపై తన శిరమునుంచి పండుకొని, యిష్టాగోష్టిని మాట్లాడుకొనుచుండిరి.

బ్ర:—కమలా! నీకన్న నాకెవ్వరూ యీ ప్రపంచకములో యాప్తులెవ్వరూలేరు.

క: — భారతి లేదా.

బ్ర:—భారతిని నేను ప్రేమించుటలేదు. వంటకు పనికి వచ్చునని యామెను నింటనుంచితిని.

క:—ప్రియా! దానికొరకా వుంచితిరి.? ఒక వంటదానిని కుదిర్చెదను. భారతిని తన పుట్టినింటికి వెళ్లమనుము. మన స్వేచ్ఛకు యాటంకముండదు. నేను మీ యింటికి నిరభ్యంతరముగ, నిరాటంకముగ వచ్చుచుండెదను. మన ప్రేమకు, సుఖమునకు యిక భారతి యడ్డుండదు.

బ్ర:—ప్రేయసీ! అంతకన్న ఉన్నదా. యిప్పుడే భారతిని త్రోలివేసెదను' అనుచూ మరియొకసారి కమలను బిగియార కౌగలించుకొని, తనివితీర ముద్దులిడి, యిద్దరూలేచి గృహాభిముఖులై నెడలిరి.

బ్రహ్మానందరావు భారతిని తన పుట్టినింటికి వెళ్లమని యాజ్ఞయిచ్చెను. కారణము జెప్పలేదు. తలవనీ తలంపుగ, అకారణముగ, భర్తృగృహమును వీడి వెళ్లమను వార్త పిడుగువలె పడెను. భారతి యాతని పాదములపైబడి, తన యింట తుద కొక దాసిగానైన నుంచమని వేడెను. తనను క్షమింపమనెను. కాని, బ్రహ్మానందరావు మూర్ఖపట్టు పట్టెను. కమలానురాగముచే యది ద్విగుణమయ్యెను. కన్నీరు మున్నీరై కాలువగట్ట భారతి ఏడ్చెను. కాని బ్రహ్మానందము మనస్సు కరుగలేదు. అవును. ఎందుకు కరుగును? కమలాలోలుడై, యామె మోహపాశములచే బంధితుడైయుండుటచే, భారతియొక్క యార్తనాదము, దీనాలాపములు వినబడునా? మనస్సున కెక్కునా? భారతి ఎచ్చటకో నేగెను. బ్రహ్మానందమునకు స్వేచ్ఛ యెక్కువయ్యెను. ఆటంకము పెట్టెడువా రెవ్వరునూలేరు. భోజనముకూడ క్రమేపి ఇంగ్లీషు స్టైలులోనికి మారినది. యిదివరకు వెండిపళ్లెములో క్రిందనే కూర్చొని భుజించెడివాడు యిప్పుడో, 'టేబిల్ మీల్సు' అనగా మేజాబల్ల

మీద కత్తులముళ్ల సహాయముతో భోజనం. ఈ 'ఫర్కీ'లో భోజన మారగించుట నవనాగరికత లక్షణము! కాదు-ఎక్కువ గౌరవము!! తనస్నేహితులను యప్పుడప్పుడు విందులకు బిలుచుచూ, యింగ్లీషుస్టైలులో జరిపించుచుండెను. కమలకు యీ సమయములలో చురుకుతనము హెచ్చై లోటుబాటులను దీయుచుండెను. విందనంతరము, 'సిగరెట్సు' కాల్చడము, పలురకములయిన 'డ్రింక్సు' త్రాగడము, డబ్బుపెట్టి బ్రిడ్జి, ఎత్తుళ్లు మొదలగు పేకాటలు ఆడడము జరుగుచుండెను. యిదంతయు గౌరవార్థమునకే; లేనిచో 'సొసైటీయెటికెట్టు'నకు భంగకరమని.

ఒకనాడు సాయంకాలము 'స్పెషల్ లెక్చర్సు' యుండుటచేత బ్రహ్మానందము యింటికి ఆలస్యముగ వచ్చెను. కమల తనకొరకై వేచియుండక మరియొక స్నేహితునితో షికారున కేగెను. బ్రహ్మానందము తన దుస్తులను మార్చి కమలను గలయుటకై యేగెను. కొంత దవ్వేగినప్పటికి చేరువనున్న యొక మామిడి తోపులో, బిన్నగున్న మామిడిచెట్టు క్రింద ఎవ్వరో యిద్దరు యువకులు సంభాషించుకొనుచున్నట్లు అతనికి గోచరమయ్యెను. దగ్గరకు వెళ్లిచూడ, ఎవ్వరు తనను నిండార ప్రేమించెనని యనుకొనెనో, ఎవ్వరి స్నేహమువల్ల భారతిని పోగొట్టెనో, యట్టి కమల, టక్కులమారి, తన సహాధ్యాయుడైన రామారావుని బాహువల్లికలోనుండి మోహావేశపరవశులై, ప్రపంచకమును మైమరచినట్లుండిరి. బ్రహ్మానందరావు నిశ్చేష్టుడయ్యెను. ఆశ్చర్యము, కోపము, విచారము అన్నియు నాతని నావాహించెను. భారతియొక్క నిష్కళంకప్రేమయు పతిభక్తియు, కమలయొక్క కపటప్రేమయు విషపునవ్వులు, తేనెలొలుకు మాటలు, బుజ్జగింపులు-నాతని మనమున కెక్కెను. ఈచిత్రమంతయు, కలయా, కల్లయా. యని భ్రమించెను. ధైర్యము దెచ్చుకొని

బ్ర:—యిది నీకు తగునా కమలా యని గద్గద స్వరముతో ననెను.

కమల:—యిదియూ ఒకవిధమయిన "సొసయిటీ ఏటికెటే" నీవేమి జేసుకొన్నభర్తవా, నన్ను యాజ్ఞపెట్టుటకు?

ఇక బ్రహ్మానందరావు ఒక్క నిముష మచ్చట యుండక గృహమున కేగెను. మనస్సు కలవరమొందెను. భోజన మారగించలేదు. నిద్దురపోలేదు. ఏమో యాలోచనలలో మునిగెను. ఒకవైపున కమలయొక్క దుష్ప్రవర్తన, తన యందలి నిరసన భావము, మరియొకవైపున భారతియొక్క నిష్కళంక ప్రేమయూ, దీనాలాపములు, అన్నియు జ్ఞప్తికివచ్చి మనస్సును బాధించెను. కమలయొక్క యింగ్లీషు విద్యయే యింతముప్పు వాటిల్లెనని యనుకొనెను. స్త్రీలకు యింగ్లీషువిద్య నేర్పించకూడదనియు, యింగ్లీషు వచ్చుటచే గదా మగ, ఆడ, సొసైటీలలో విచ్చలవిడిగ తిరుగుట, క్లబ్బులోను పాల్గొనుట, మగవారితో స్వేచ్ఛగా విహరించుట మొదలగునవి సంభవించుచు గదా యని కమలను నిందించెను. మరియొకసారి యిట్లు తలపోసెను. యింగ్లీషు విద్యను నేర్చుకొనుటలో తప్పేమియు లేదు. అన్నింటికి, మన మనస్సే ప్రధానము. మన బంగారము బాగుండిన, కంసాలివానిని నేల నిందింపవలయు. మనోనిబ్బరము, హృదయపూర్వకప్రేమ, మంచి నడవడి యుండినచో జాలును. ఇంగ్లీషువారు తమ స్త్రీలకు స్వేచ్ఛావిహారము యడ్డుపెట్టరు. వారికి మనస్సే ప్రధానము. నిష్కళంకమయిన మనస్సుతో స్త్రీలను జూచెదరు, కలసిమెలసి తిరుగుదురు. యిక మనవారిలోనో, యట్లుకాదు. సమాన వయస్కురాలగు వనితను జూడగనే, చెడు తలంపులు పుట్టును. అందుకనే, మన స్త్రీలకు స్వాతంత్రము నివ్వక, సొసైటీలలో తిరుగనిచ్చుటకు జంకెదరు. అంతియ కాని వేరుకాదు. యింగ్లీషు విద్యలో నేవిధమయిన జబ్బులేదు. మనలోను మన స్త్రీలలోను యుండు

కొను చెడు తలంపులే, దుష్ప్రవర్తనకు గారణమని నిర్ధారణ జేసుకొనెను. తన యసూయ భారతిని, తొందరపడి గృహమునుండి వెడల గొట్టినందులకు చింతాక్రాంతుడయ్యె యామె యెడల జూపిన నిరాదరణకు తగిన ప్రాయశ్చిత్తముకొరకై యాలోచించుచూ, గాఢనిద్రబోయెను.

తెల్లవారెను. సూర్యభగవానుడు ఈశాన్యదిక్కు నుండి బయలుదేరెను. గడియారము 8 గంటలు కొట్టెను. కాని బ్రహ్మానందరావునకు మెలకువ రాలేదు. మరి కొంతసేపటికి, గవాక్షము లోనుంచి, సూర్యకిరణములు జొచ్చి, తక్షణముగ నాతని మోము పైబడ, మెలకువగాంచెను. కాలకృత్యములను దీర్చుకొని, ప్రాతఃకాలపు అల్పాహారమారగించి, కాఫీ సేవించి, తన యీజీచైరులో కూర్చుండెను. ఒక చేతితో పుస్తకము జూచుచూ, మరొక జేతితో, సిగరెట్టును పీల్చుచుండెను. పుస్తకము జదువవలెనని యత్నమేగాని, కలవరమొందిన మనస్సు యగుటచే, ఆలోచనలతో నిండెను. సిగరెట్టు దమ్ము ఏమీ సహాయము జేయలేదు. ఆతని ఆలోచనలు అన్నియు, కమల చేష్టలతోను, భారతి ముగ్ధత్వముతోను నిండుకొనెను. ఆసమయములో, పోస్టల్ జవాను ఒక ఉత్తరమతనికి నందజేసెను. పైవిలాసము యింగ్లీషుతో వ్రాసియుండెను. లోని సంగతులునూ యింగ్లీషుతోనే వ్రాసియుండెను. దానిలోని సంగతులు ఏమో కాని, ఒక పెద్దనిట్టూర్పు విడిచి, 'భారతీ' నన్ను క్షమింపవా యనెను. ఇది భారతి యింగ్లీషుతో వ్రాసిన క్షమాపణ ఉత్తరము. ఒకసారి, రెండుసార్లు-జదివెను. తృప్తి నొందలేదు. మరియొకసారి జదువుకొనెను. వెంటనే లేచి దుస్తులను ధరించి, యింటికేగెను, అచ్చట భారతిని జూచి

"నేను తొందరపడితిని. అపరాధిని. క్షమింపుము." అనెను మెల్లగ.

భారతి:—క్షమించుట కేమున్నది. యింగ్లీషు నేర్చుకొనక పోవుటచేత వచ్చినది యిదంతయు.

బ్ర:—యింత కొద్దికాలములో యింగ్లీషులో ఉత్తరము వ్రాయగల పాండిత్యమెట్లు సంపాదించితివి?

భారతి:—భానుమతి వదిన చలవ.

బ్ర:—యింగ్లీషువిద్య నేర్చుకొని, ఆచారముల లోనూ, సొసైటీలలో తిరుగుటయందు, యింగ్లీషు వారితో తులతూగవలెనన్న యాశయమే తప్ప వారికుండు మనోనిబ్బరము మంచి తలంపులు, తమ యీడుజోడు స్త్రీలను చూచినప్పుడు, కలిసినప్పుడు మనవారిలో యుండకపోవుటచే కలిగిన యనర్థకముల జవివి చూచితిని. అనుభవించితిని. ప్రాయశ్చిత్తమునకై నీకొరకై వచ్చితిని. క్షమించి నన్ను ఆదరింపుము.

భానుమతి:—యిందెవ్వరి తప్పును లేదు. విధి యిట్లు వ్రాసియున్నది. యీరోజున మాయింట విందారగించి మరి వెళ్ళవలయును.

విందనంతరము, భారత బ్రహ్మానందములు తమ గృహమునకేగి, సంతోషముతో కాలముగడిపిరి.





# తీతువా !

ఉ॥ ఘోరదరిద్రతానిశను గుంది కృశించుచు నుండువారి, భూ
ధారులమంచుఁ గ్రొవ్వున సదా కనుగాననివారి నొక్కటే
తీరున "వల్లకాటికినిఁ దీసుకపోయెద రండురం"డటం
చూరక పిల్తువీవు వినుఁగొందవు కందవు పాడుఁదీతువా !

ఉ॥ ఎట్టివకీలు బాబయిన నిస్సిరొ ! నీవలెఁదాను గీలుఁగ
న్నెట్టి పరిష్కరింపఁదగు నేర్పుగలాఁడె ? దివాణమేని నీ
గట్టి మెలుంగువిన్నయెడఁ గంపమునొందదె ? మిత్తికొల్వులోఁ
బట్టము నీకుఁగట్టి రశిభప్రళయారవ ! పాడుఁదీతువా !

ఉ॥ మిత్తికిరాయబారి, వలమిన్నను గోర్టుననిల్చి వ్యాజ్యపున్
వృత్తిఁబరిష్కరించునెడ బిట్టుగవేసెదు నీదు కేక తా
క్కత్తివిదల్చు నీపొగరి'ఛీ'యని పండ్లిగిలింపఁజేయదే ?
కుత్తుకనీకుఁ బెన్ విసపుఁగుప్పియె యున్నదొగాక ! తీతువా !

ఉ॥ ఏదెస నీవు పాటెదవొ యెంచఁగఁ దత్ప్రతిపక్షమే జయం
బూఁదుట గల్గుచుండునఁట ! యేమిచమత్కృతి ! యెట్టిదిట్ట వీ
వౌదొ ! వహావ్వ ! నిన్ను సలహాయెనరింపఁగవచ్చు జన్మ మ
ర్యాద తొలంగినప్పుడె సుమా జనసంఘము పాడుఁదీతువా !

ఉ॥ తీతువు, తీతువీ వుసురుఁదీతువటంచు జనమ్మునీదు సం
గీతమువిన్న యత్తఱి నెకృఘపు భీతిని నిశ్చయింపదే ?
పూతచరిత్రునాశ్రమము పొంతను వాఁతిని దింట కింతయున్
రోఁతవహింపకున్నపుడు రోసెను నీవిధమద్దితీతువా !

ఉ॥ దక్షిణదిక్కునేలు భయదంబగు మూర్తికి మాఱుమూర్తివై
రాక్షసవృత్తిజీవనికరమ్మును బొట్టను బెట్టుకొంచు, నీ
పక్షమువారిదూఱు పురవాసులపైఁబగఁ గొంటివంట ! ని
న్నీక్షణమాత్ర మృత్యుహరు డీల్గఁ గఁ జేయఁడె? పాడుఁదీతువా !

ఉ॥ అల్లరిచేసి "ఛీవెధవ !" యంచునుదిట్టి, "గొడారివాఁడు ని
న్నల్లనఁగోయు"నంచుఁ దెగనాడి, మహోఘము మమ్ము వీడ, రే
పల్లెను గృష్ణునిన్ మదినిఁబల్మఱుఁజింతన సేయుదాఁక నీ
ప్రల్లదమంతరించునొకొ ? రక్కసతాలువ ! పాడుఁదీతువా.

# పిచ్చి ఎవరిది?

శ్రీమతి కృష్ణకుమారిగారు

ఒకపెరడు. అది వీధివైపునకున్నది. దానికి రెండే గుమ్మాలున్నాయి. అది రెండుగజాల వెడల్పున నలుచదరంగా ఉంది. ఆ పెరడు ఒకగోడమీదనుం డెవరో తొంగి చూస్తున్నారు. దొడ్లో 6 ఏళ్ల అబ్బాయి ఆడుకుంటున్నాడు. ఆ అబ్బాయిచేతిలో తెల్లగా ఒకరూపాయి ఉంది. సాయంతనము గోధూళికాలసమయారంభము.

మామూలుగా పిల్ల లేది చేస్తూంటారో దానిలోనే మునిగిపోతారు. వాళ్ళ కితర చింత లేవీ మనస్సులోనే ఉండవు. తన్మయుడైన కవికి తన ఊహే ప్రకృతి నంతా కమ్ముకొని కనబడినట్లు ఆటలధ్యానంలో ఉన్న పిల్లలకి తమఆటే కాని యింకొకటి వాళ్ల కళ్ళకే కనబడదు.

ఆ అబ్బాయి బొట్టనవ్రేలితో క్రింద నేలంతా గీరి వింతముగ్గులు పెడుతున్నాడు. చేతిలో ఉన్న రూపాయి ఎగురవేస్తున్నాడు. క్రిందబడ్డ రూపాయిని మళ్ళీ తీసికొంటున్నాడు. ఏమిటో అస్పష్టంగా గొణుగుతున్నాడు. పైకేమీ వినబడ్డం లేదు. కాని పెదవులు మాత్రం ఒక్కనిముష మైనా మూతలుబడ్డంలేదు.

ఇల్లాగ ఒకగంట గడచింది. అబ్బాయి ఇంకా ముగ్గులు పెడుతున్నాడు. అలాగే రూపాయితో ఆడుకుంటున్నాడు. అలాగే ఇంకా ఇంకా గొణుగుతున్నాడు.

ఇపుడా పిల్లడిగొంతు హెచ్చింది— "ఓయ్ సూర్యుడూ, నీ కిదిగో రూపాయి యిస్తాను;తీసుకో!! నీలాగే నేనూ రూపాయీ కూడా తెల్లగా ఉన్నాం. మేము నీ దగ్గఱకు వస్తే ఇంకా ఎంత తెల్లబడతామో!..."

తొంగిచూస్తూన్న పెద్దమనిషి కిదేం బోధపడలేదు. ఆ అబ్బాయికి పిచ్చెత్తిందేమో అనుకొన్నాడు. గభాలుమని ఆ పెరడులోకి దుమికాడు ఆ పెద్దమనిషిగంతు ఆ అబ్బాయికి తెలియనే తెలియదు. "ఏమిటబ్బాయి, అల్లా చేస్తున్నావు?" అని మెల్లిగా భుజమ్మీద తట్టి అబ్బాయి నడిగాడు పెద్దమనిషి.

ఉన్మత్తు డులికిపడినట్లు ఎక్కడో తనభావనాప్రపంచంలో, తన చిన్నతనపుటాటల్లో, తన అవ్యక్తఆనందంలో లోతుగా మునిగిపోయి మనుష్యులతో స్నేహం వదిలేశాడేమో అన్నట్లు సూర్యునితో మాట్లాడుతూ ఆట్లాడుకుంటూన్న ఆ అబ్బాయి ఒక్కమారు ఆ పిలుపు విని చకితుడై పోయాడు. ఏమీ తెలియని ఆ చిన్నిహృదయం పరిచయం లేని కంఠం తన్ను తన లోకంలోంచి లేపగానే బెదరిపోయింది.

ఆ అబ్బాయిమొహం అరక్తమైపోయి పెద్దభయాన్ని తెలియజేస్తూంది.

వెంటనే ఆ అబ్బాయి వెఱ్ఱిచూపులు చూస్తో ఆ పెద్దమనిషి చేతుల్లోనే వాలిపోయాడు.

ఈ అబ్బాయిప్రతిబింబ మేమో అనేటట్టు సూర్యుడు కూడా ఎఱ్ఱబడి అంధతమస్సులోకి వాలిపోయాడు.

నిజంగా పిచ్చి ఎవరిది?

# "నారదుడు"

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

నారదుడంటే బ్రహ్మ మానసపుత్రుడు దేవఋషి యన్నారు దేవతలు. శూద్రవనితాసూను డన్నారు పౌరాణికులు. కలహాశనుడు, అగ్గిపెట్టి అన్నారు మానవులు. అంతేకాని అతనివలనను, అతను పెట్టే జగడాల పర్యవసానముకు మొత్తం ఫలితము కీడా మేలా అని ఆలోచించరు కదా! ఇంద్రాణి నందన వనమునుండి పారిజాతపుష్ప మొకటి తెచ్చి కృష్ణుని కిచ్చి రుక్మిణీ సత్యభామలకు కయ్యం పెట్టాడన్నారు సులభంగా. దాని ఫలితం సత్యభామకు పారిజాత వృక్షం ప్రాప్తిన్ని, రుక్మిణీతోపాటు భూలోకంలో పారిజాతపుష్పాలప్రాప్తి మనకున్ను కలిగింది. ఇంద్రుడికి శ్రీకృష్ణుని ప్రతిభ బోధపడింది. సత్యభామ ఇంద్రలోకప్రయాణం మూలకంగా స్త్రీ శక్తి పురుషులకు బోధపడింది.

ఇక రెండవది "తులాభారము". ఆనాటినుండి భర్తను తిరస్కరించిన సత్యభామ గర్వమణచు సదుద్దేశంతోనే నారదుడు మరల వారింటే ప్రత్యక్షమైనాడు. భర్తృదానవ్రత ముపదేశించాడు. అష్టభార్యాపరివృతుడును, భక్తమానసబంధితుడునునగు కృష్ణపరమాత్మను, అహంభావ ధన మదాంధయగు సత్య, తనదేయైనట్లు దానమివ్వ సాహసించిన యామె స్వాంతగర్వ ముడిపి, తుచ్ఛ ధనములకంటె భక్తి తృణములకు తులతూగు భగవంతుని భక్తవత్సలతను నిరూపింపజేసినాడు. రుక్మిణీ సతియొక్క పతిభక్తిని సాత్వీక నిర్మలవర్తనమును జగమున బ్రకాశింపజేసినాడు. సత్యా గర్వభంగ మొనరింపజేసి, ఎందరో మహానుభావులు తనకంటె కలరన్న వినయప్రవర్తనకు కుదురుచేసినాడు. శ్రీ కృష్ణతత్వ ముపదేశించాడు. ప్రాకృతనరులమగు మనకు ఈమె యెంతటిది! కలహభోక్త కానిదే ఇట్టి లోకోపకారపనులు నిర్వహించుట కష్టము. నిజ మాడిన నిష్ఠూర్యము కాని హృదయపరివర్తనము కావాలంటే నిజమాడియే తప్పులు దిద్దాలి. అంతే నారదుని అవస్థ. జగతికున్న లోపా లెంచి చూపిస్తాడు. అందుచేత అంటించడాని కగ్గిపెట్టన్నారు. అగ్గిపెట్టె మండుతే అనేక పదార్థము లుడుకుతాయి అనుభవిస్తామన్న మాటలేదు.

మరి మూడోది గయోపాఖ్యానంలో అర్జునుడికి శరణాగతత్రాణబిరుదం కట్టదలంచి, గయునకు శరణు దొరకు దారి చూపినాడు. పగవహించిన కృష్ణుని కివ్వార్త దెల్పి, నరనారాయణాంశసంభూతులగు భావమరదులను రణోద్రేకుల జేసినాడు. ఇరువురి అస్త్రజ్వాలలకు సహింపని జగద్రక్షణకొఱకై శంకరుని బంపించినాడు. చివర కందరికి ఐకమత్యం కుదిర్చినాడు. భగవంతుని లీలావతారఘట్టముల ప్రదర్శింపజేసి, అర్జుని భక్తి నినుమడింపజేసినాడు. పంచపాండవులయొక్క ధర్మదీక్షను లోకాదర్శ మొనరింపజేసినాడు. శివ కేశవ భేదములు లేవని నిరూపించినాడు. అద్వైత మతోద్ధారకుడగు మన ఆదిగురువగు శ్రీ శంకరులవారికి మూలగురువైనాడు. గయుని ప్రాణరక్షణ మొనరింపజేసి సర్వేజానాః సుఖినోభవంతు అన్నాడు. నారాయణ స్మరణామృతపానుడై, త్రిలోకసంచారియై, ముల్లోకములతప్పులను గమనించి విమర్శింపుచు ఆదిని అహంకారులుగాఁ జేరినవారి నంతమున ఆనందాబ్ధిని ముంచుచున్నాడు. గ్రహించినవారికి మేలే!!

నారదుడంటే భక్తకోటిశిరోనివాసు. హిరణ్యకసిపుని భార్య లీలావతీదేవికి తత్వ ముపదేశించుట వలననే ప్రథమభక్తుడగు ప్రహ్లాదుఁ డుద్భవించెను. "గురువు శిష్యుడాయె" నన్న న్యాయమున పరమ భాగవతులలో తా నుపదేశించిన శిష్యుడు, ప్రహ్లాదుడు ప్రథముడును, నారదుడు రెండవవాడుగను, స్మరణార్హులైనారు. అయితే ప్రపంచ ప్రకటనలైతే చాలునన్న మాబోటివారిలాంటి స్వార్థపరుడు

గనుకనా? అంతా త్యాగమే. తనవలన పరులు తరించుటే చాలునన్న ఆత్మత్యాగి. "పరోపకారార్థమిదంశరీర" మ్మను నార్యవచనానుసారి, నిష్కామయోగియే నారదుడు. అట్టి స్వార్థత్యాగియే మన గాంధిమహాత్ముఁడు. అట్టే చెప్పుటకన్న ఆదర్శముగా ఆచరించువా రధికులు కదా !! అందుకనే వారిని మహాత్మ లన్నారు.

భూలోకప్రజలు పరమనాస్తికులై కలియుగమాయల జిక్కి పాపపుణ్యావిచక్షణాశూన్యులై, ఆర్థికలోభులై "పూర్వజన్మకృతం పాపం రోగరూపేణశిక్షితం" అన్నట్లు, పలురోగములకు జిక్కి తంటాలుపడుచున్న సమయమున మన బాధలకు జాలివహించి శ్రీమహావిష్ణు నాజ్ఞాభూతుడై మనల నుద్ధరించ భక్తి, జ్ఞాన, వైరాగ్య, ధర్మమార్గముల బోధించు పురాణముల సృష్టింపజేసి వ్రతవిధుల నుపదేశించి పుణ్యాత్ములుగా జేయుచున్న మహనీయుడు నారదుడే !! నారదాజ్ఞాబద్ధుడయ్యే శ్రీ వ్యాసమానీంద్రు డీ పురాణములను భాగవత సద్గ్రంథమును లోకోపకారార్థమై రచియించెను.

సవతితల్లి చేసిన అవమానభరంబున కోర్వలేక ధృవకుమారు డడవులబట్టి వెడలుచుండ భక్తిపథగామింజేసి, విష్ణు సాక్షాత్కార మొనరింపజేసి పంచవర్షబాలుని పరమభక్తాగ్రేసరునిగా గావించి, విమలపదవియగు ధృవక్షితి యను ఘనస్థాయిగా నొనరింపజేసిన యుపకృతి మన నారదమహనీయుని నిర్మలహృదయంబుననే కదా కలిగెను! ఒక్క నారదహితోపదేశముతో పతి నిరాదరణావమానాగ్నికిం జిక్కిన సునీతి, భర్తృ స్నేహభాగ్యము పొందగలిగెను. బహుపత్నీత్వ బాధలు తెలిసి, యుత్తానపాదుడు పత్నీహితవంతుడయ్యెను. మత్సరగ్రస్తురాలగు సురుచి తన తప్పును తెలిసికొని సన్మార్గవర్తనురాలయ్యెను. ఇక ధృవునిమాట వేర చెప్పవలయునా. ఇట్లే సర్వాంతర్యామియగు శ్రీవిష్ణునివలె నారదుడు లేని పౌరాణిక రూపకములే లేవు. అంతటా నిండి, అందరిని విమర్శించి, చివరకందరికి నైకమత్యమిచ్చి, ఆనందమిచ్చుటే నారదుని కృత్యము. ఇట్టి నారదుని కనేక లోపములు పెట్టే మహానుభావులము మనమే !! అసూయాగుణముగలచాడీకోర్లను మనము నారదునితో పోల్చుదుము. ఎంత తప్పు ! సమానత్వమొనరించు నారదుని దేవత్వము మనలో లేదు కాని మన తప్పులు కప్పిపుచ్చి ఎదుటివారి తప్పులెన్ను రాక్షసత్వము మనకు గల దింతే.

మన తప్పులు వీపుమీదుండునట. అందుచే కనబడవు. ఒక భాగ్యశాలి పెద్దమేడ కడతాడు. తనయింట్లోయుండే కల్మషజలను బైటకుబోవు గొట్టములు భూమట్టమున బెట్టక పైకే వదిలేసును. ఆ మురికినీరు దారి పోవువారిపై బడుచుండును. అది అలాగాదని తెల్పితే వానికి కోపము. ఆ తప్పు లేకుండగనే గొట్టాలు భూమికంట యెందుకు పెట్టకూడదు? ఆ తప్పు తనకు తెలియదు. ఒకరు తన్ను విమర్శించడ మెందుకంటాడు. ఇంతలోనేయుంది ఐకమత్యం, విమర్శనజ్ఞానం. యజమాని చేసిన తప్పు సేవకుడు చేయకూడదు. భర్త చేసిన తప్పు భార్య చేస్తే అమాంతంగా నరికేస్తాడు. అందుకనే "అత్త పోగొట్టింది అడుగోటికుండ, కోడలు పోగొట్టింది క్రొత్తకుండా" అన్నారు. సామెత లనుభవశాలుల యుపదేశరత్నములు.

ఆధునికులే పూర్వం విద్యలేని స్త్రీలు ఊబుసు పోకకు గెచ్చకాయలు, గవ్వలు ఆడుసంటు జ్ఞానాభివృద్ధి గాంచక, విలువయైన తమ కాలమును వ్యర్థముగా గడిపేవారు. ఇప్పుడో అధిక విద్యాధికులనిపించుకొనే (హూ. అవిద్యాపారంగతులు) వారు స్త్రీలుకూడా పుస్తకాలు మూలబడవైచి, ఆటలు మొదలెట్టారు (క్యారమ్స్) మొదలైనవి. ఇవన్ని భక్తికి దారా ? ముక్తికి దారా ? జ్ఞానాభివృద్ధికి దారా ? ఏదీకాదు. గవ్వల కాలక్షేపమెంతో, క్యారమ్స్ కాలక్షేపము స్త్రీల కింతే. దుర్యోధనుడు తెలియని మూర్ఖుడు. రావణుడు తెలిసిన మూర్ఖుడు. ఇరువురు భగవద్విరోధులే. వ్యర్థకాలక్షేపానికి గవ్వలెంతో, క్యారమ్స్ అంతే. ఇది మంచి పని కాదని విమర్శిస్తేనే నారదు డంటారు. అంతే.

# గ్రంథపఠనము

శ్రీమతి పరసా సీతారామమ్మగారు

గ్రంథపఠనము హృదయంబునకు పరమానందమును, ప్రఖ్యాతిని, సామర్థ్యమును జేకూర్చును. దాని పరిశోధనంబువలన నొంటరిపట్టుననుండు ప్రతివ్యక్తికిని హృదయానందమును, నొకనితో భాషించునపుడు ప్రఖ్యాతియు, వ్యవహారంబుల జక్కగ జరిపించుటయందును దానింగూర్చి సరియైన యభిప్రాయంబుల గలిగించుకొనుటయందును, శక్తిసామర్థ్యంబులు గలుగును. ఏదో యొక వ్యవహారశాఖయందు ననుభవము గలవారు తమయధికారు లొసంగు నుత్తరువుల ననుసరించి వారు కచొప్పున బనులుసేయుచు వాని యందలి వివిధాంశంబుల నొకటివెంబడి నొకటిగా విచారించుచుందురే గాని యిది యిట్లేల జేసితివనిన వాటికి సమాధానంబులు జెప్ప నేర రు. వ్యవహారము యొక్క యన్ని శాఖలలోతుపాతులను చక్కగ నెఱింగినవారు బరిపూర్ణములగు నేర్పాటుల గావించుటయు నూతన పద్ధతులను గనిపెట్టుటయు, వివిధాంశంబుల క్రమానుసారంబుగ సవరించి యొక సంపూర్ణమైన యేర్పాటు గావించుటయు గలుగును. ఏదో యుద్దేశ్యము నెఱవేర్చుకొనుటకు సాధనముగను, జీవిత కాలమున తనకుగల విధాయకకృత్యముల నొనర్పదగియుండుటకును నొకడు విద్యా సంపాదనము గావింపవలయునేగాని తనకవశ్య కర్తవ్యములగు లౌకికవ్యవహారముల నెల్ల నుజ్జగించి యెల్లకాలము విద్యాభ్యాసముననే యుండజనదు. అయ్యది సోమరితనము. ఆయది వాని నిజస్థితిని బయలుపఱచి వానికి మానభంగమును గావించును.

గావున విద్యావిధుల ననుసరించి విషయ విచారణముచేయుట పండితునిమతము. అయ్యవిప్రకృతిని జక్కబఱచును. అనుభవము వలన జక్కబఱుపబడును. వంచకులు విద్యా సంపాదనమును దూషింతురు. బేలలు దానిని మెచ్చుకొందురు. బుద్ధిమంతులు దానిని వాడుకకు తెత్తురు. ఒకడు అన్నివిద్యల బూర్ణముగ నభ్యసించి యుండవచ్చును. అయిన తా నభ్యసించిన వానిని వాడుక లోనికి దేవకపోవచ్చును. కావున తా నభ్యసించినవానిని నాచరణలోనికి దెచ్చుటకు వేఱొకవిధమైన బుద్ధికావలయును. యుక్తాయుక్తజ్ఞానము అలవఱచుకొనవలయుననియే గ్రంథంబుల పఠించవలయునుగాని, గ్రంథకర్త యగునన్నదానిని గాదనుటయు, గ్రంథకర్త యగునన్నదాని నగునని గ్రుడ్డినమ్మకము గలిగించుకొనుటకును, ప్రసంగించుటకు విషయ సంపాదనము సేయుటకును జదువరాదు.

కొన్నిపుస్తకము లూరక రుచి చూడదగినవి. కొన్ని నమలిమ్రింగి వర్ణించుకొనదగినవి. సంపూర్ణముగ జదువతగినవి కాని శ్రద్ధతో చదువ నక్కఱలేనివి. కొన్ని మిక్కిలి శ్రద్ధతో పఠించదగినవి. మఱియు కొన్నిగ్రంథము లొకనిచే జదివించుచు నొకనిచే ముఖ్యభాగముల నెత్తి వ్రాయించి దామూరక వినుచుండదగినవి. కాని యంతగ ప్రాముఖ్యము వహింపని విషయములను గూర్చియు సాధారణ గ్రంథముల గూర్చియు నిట్లు చేయవలయును. అట్లు సేయనిచో



శ్రీగాంధి సేవాసేన. గాంధిజయంత్యుత్సవము సలుపుచున్న బాలికలు.



"సహోదర సౌభాగ్యం"

గాచి వడియబోసిన యనగా నొకటి రెండు తూరులు చదివిన పుస్తకములు కాచి వడియబోసిన యుదకమువలెనె మరల చదువుటకు రుచిహీనములుగ నుండును. చదువుటవలన విషయపరిజ్ఞానము గలుగును. సంభాషించుట వలన సమయస్ఫూర్తి యలవడును. వ్రాయుచుండుటవలన నిశ్చితాభిప్రాయములు గలుగును. కావున కొంచెము కొంచెముగా వ్రాయువానికి ఎక్కువ జ్ఞాపకశక్తి యుండవలయును. కొంచెముగ చదువువానికి దనకు దెలియనిది దెలిసినట్లు నటించుశక్తి యెక్కుడుగ నుండును. చరిత్రపఠనమువలన బుద్ధి మంతుడగును. కావ్యపఠనము బుద్ధి కుశలత గలిగించును. గణితశాస్త్రము బుద్ధి సూక్ష్మతను గలిగించును. నీతివిద్య గాంభీర్యమును గలిగించును. తర్కాలంకార శాస్త్రములు వాదనైపుణ్య మలవఱచును. అభ్యాసము కాలక్రమమున సహజమగును. తగిన పరిశ్రమమువలన బాలగించుకొన సనువుపడని రుజలు శరీరమున లేనట్లు యుక్తపఠనమువలన బాలగించుకొన సనువుపడని యాటంకములు ఎవ్వియు జ్ఞానేంద్రియమునందు లేవు.

ఒకనిబుద్ధి నిలుకడ గలది కాని యెడల నట్టివాడు గణితశాస్త్ర మభ్యసింపవలయును. ఏలయన నా గణితసిద్ధాంతముల యందు వాని మనసు నిలుకడ గలిగియుండును. అట్లు నిలువనిచో సిద్ధాంత మేర్పడదు. మరల నారంభింపవలసివచ్చును. ఒకని బుద్ధి విషయతారతమ్యము గనుగొననేరని దైనచో నాతడు పాఠశాలలో యుపాధ్యాయుల జూచి నేర్చుకొననగును. ఒకనిబుద్ధి యొకవిషయమునుండి వేఱొక విషయమునకు శీఘ్రముగ బోవు చురుకుదనమును, నొక విషయమును సిద్ధాంతీకరించుటకు వేఱొక విషయమును నిదర్శనముగ నుదహరించు చురుకుదనము లేనిచో నాతడు న్యాయవాదులతో సాంగత్యము సేయజనును. కావున నొక్కొక్క మనోదౌర్బల్యమును జక్కబఱచుటకు తదనుకూలమయిన యొక్కొక్క దివ్యౌషధము తప్పక యుండును.

——:o:——

## జిగీష

ఉభయభాషాప్రవీణ కొమ్మసమంచి జోగయ్యశర్మగారు

ఆహవంబున మీరలలసిన ముంగొంగు వీవనన్మెల్లఁగా వీచుదాన
ఎదిరిసేనల సంహరించు చుండెడివేళ హితవాక్యముల బ్రోత్సహించుదాన
శత్రునిర్దళన దీక్షాళుండవగువేళ నేర్పుతో నమ్ము లందించుదాన
ప్రథనరంగమున సారథిచచ్చియున్న పగ్గముబట్టి రథము నేగడపుదాన
వలయుచో నొకవేళ కృపాణమూని
యరికులంబుల నెల్లఁ జెండాడుదాన
నాడుదాననటంచు సన్నపహసింప
కాహవమునకు నన్గొనియఱుఁగునాథ!

# తానాజీ

తటవర్తి సూర్యనారాయణమూర్తిగారు

శివాజీజనని జిజీబాయి రాయగడపు కోటలో నుండి యెవరికోఅకో నిరీక్షించుచుండెను. నాల్గు వైపుల దృష్టి సారించుచు నేదియో ఆలోచించుచు నుండ హఠాత్తుగ నామెకొక యూహతట్టెను. పెద్ద పెద్దకోటలు శివాజి చాల గడించెను. అయినను సింహగడము వశీకృతముకాలేదు. వెంటనే శివాజీ కడకరుదెంచి—శివా! చదరంగ మాడుకొందము రమ్మని పిలచెను.

చదరంగము తల్లియు సుతుఁడును నాడదొడఁగిరి. తల్లి, తనతో ఆడి ఓడి పోవలయునని శివాజీ తలంచుటయే లేదు. చివరకాతఁడే యోడిపోయెను.—జననీ నేనే యోడితిని. నీవేమి కోరుచుంటి వని అడిగెను.

జిజీ:—"నేనొక దుర్గ మపేక్షించుచుంటిని."

శివాజీ:—"ఏకోట కోరుచుంటివి?"

జిజీ:—"నాకేమియువలదు. సింహగడము కావలయును.

సింహగఢముపేరు వినుటతోడనే శివాజీ ముఖము మ్లానమయ్యెను—"తల్లీ! నీకోటిక చాలపెద్దది. ఇట్టి దుర్గమువలె దుర్భేద్యమగునది మరియేకోటయు నీ సహ్యాద్రిపై కానరాదు. అందుపై ఉదయభానుఁడను రాజపుత్రుఁడు విస్తారమగు నిజసేనతో దానిని గాచుచున్నాఁడు. అట్టిదుర్గము మనకెట్లు లలవడును?" అనెను.

జిజీబాయియు ప్రేమకటాక్షపాత మొనరించి "నాకింకేమియు దెలియదు. నాకీ దుర్గమవశ్యము కావలయును" అనెను.

విచారాధీన మనస్కుఁడై కొద్దిసేపటివఱకు శివాజీ నిరుత్తరుఁడై పిదప మెల్లగ నిట్లనియె—"మంచిది. అట్లేకాగలదు. కొంత ఆవశ్యక కార్యమగ్నుడనగుటచే నేను జనక, నాసర్వశ్రేష్ఠ సేనాపతియగు తానాజీని యాపనికై నియోగించెదను. అతఁడు తిరిగి రాగలుగునో లేఁడో చెప్పజాలను."

జిజీ:—"కుమారా! భయపడకుము. తల్లియగు భవాని యాతనికి విజయ మాపాదించును."

శివాజి యొక దూతనుబిలిచి వానిద్వారా మాతృకామనా పూర్ణభారము తానాజీపైననే గలదని కబురు పంపించెను.

రాజాజ్ఞగొని దూత తానాజీగృహము చేరునప్పటికి తానాజీ తనకుమారుని వివాహప్రయత్నములో మగ్నుడైయుండెను. బహుకాలమువఱకు యుద్ధకార్యములందు వ్యస్థుఁడైయున్న యాతనికి బాపమిప్పుడే కొంతతీరిక గలిగెను. ఆ తీఱికసమయములో కుమారునికి పెండ్లిచేసి ఆవేడుకలలో హాయిగ దినములు గడుప నిశ్చయించెను. ఇంతలోనే మఱల యుద్ధప్రయత్నమా? అందులో సాధారణమైన యుద్ధముకూడ కాదు. సింహగడ దుర్గమును స్వాధీనముచేసికొనుట!! వీరహృదయముకూడ నొక్కసారి కంపించివైచెను.

అయినప్పటికి క్షణమైన విలంబమొనర్పక తానాజీ శివాజీ ప్రోల కఱిగెను. శివాజీ సమీపమునకుజేరి ప్రణామమొనర్చి "మహారాజా! చాల చెడ్డసమయములో ప్రభువారీ దాసుని బిలిపించితిరి. పుత్రుని వివాహమునకై వస్తుభండార మంతయు సిద్ధమైయున్నది" అని పలికెను.

ఉదాసీనమనస్కుఁడై శివాజీ "సోదరా! ఈసారి నిన్ను నే బిలువనంపియుండలేదు. నీజననియే నిన్ను స్మరించినది." అనియెను.

జిజీబాయియు నచ్చటనే యుండెను. "తానాజీ! నీవు నాచిన్నికుమారుఁడవు. జననీయాశీర్వాదముచే నీవింకను గౌరవపాత్రుఁడవు కాగలుగుదువు. నీవంటి వీరుఁడున్నను నేఁడు మహారాష్ట్రుల దుర్గముపై మొగలు పతాకయెగురుచుండుటగాంచ నత్యంతాశ్చర్యము గలుగుచున్నది" అనెను.

తానాజీ చేతులుజోడించి—"తల్లీ: నా ప్రార్థన యొకటిగలదు. దుర్భాగ్యవశమున యిదియే నా అంతిమసంగరమగుచో బాలకుఁడగు 'రామునా'కు తమ పాదపద్మములయందు తావొసఁగి యొసంగు దురుగాక" అనెను.

రాజాజ్ఞచే తానాజీ మొదలగు వేయి సిపాయిలకు ప్రేమపూర్వకముగ విందు జరిగెను. ప్రతి సిపాయికిని దుస్తులును, ధనము కూడ నొసంగబడెను. అప్పు డట్లు జరిగిన పిదప ప్రసన్నహృదయులై యందఱు యుద్ధమున కఱుఁగ సన్నద్ధులైరి. ఎనుబది యేండ్ల వృద్ధుడగు శేలారుమామయు సూర్యాజీ అను పేరుగల చిన్నిసోదరుని వెంటగొని తానాజీ రణరంగమునకై బయలుదేఱెను.

రాత్రిసమయమున సిపాయిలు దాగుటకై కోట వద్ద నొక రహస్యస్థాన మేర్పరచి తానాజీ కృషీవల వేషముబూని దుర్గసింహద్వారమును జేరెను. అచ్చట గావలిగాయుచున్న భటులతో "సోదరులారా, నే నొక కృషికుఁడను సొమ్ము చెల్లించుటకై పునహా అరిగి రాత్రి తిరిగివచ్చుటలో దారి మఱచితిని. దయయుంచి ఈ రాత్రి వసించుట కేదైన తావు జూపకుందురేని యీఘోర వ్యాఘ్రాది క్రూరసత్త్వముల కాహారుఁడనగుదును." అని పలికెను.

ఇట్లు పలికి యాతఁడు తన సంచినుండి మంచి మంచి తినుబడిపదార్థములు వెలికిదీసెను. రాత్రుల వేళ నెవ్వరిని యెట్టి పరిస్థితులయందు గూడ లోనికి రానీయగూడదని ఉదయభానుఁడు గట్టిగ కట్టడి చేసి యుంచెను. గాని తానాజీ తీసిన ఖాద్యపదార్థములు జూచుటతోడనే వారికి నోరూరుటచే తానాజీ కచ్చట నుండుటకై యనుజ్ఞ లభించెను. పిదప నాతఁడు దుర్గముయొక్క గుప్తవిషయము లెఱింగి ఏదో మిషపై అచ్చటినుంచి మెల్లమెల్లగా అవలకు జారెను. అతఁ డొసఁగిన ఖాద్యపదార్థములతో మత్తుద్రవ్యములు గలిసి యుండుటచే భటులు వాటిని దినిన కొలఁదిసేపటిలోనే, చేతనావిహీనులై నిద్రించిరి.

కాని సింహగఢపు ఎత్తైన నున్ననిగోడ దాటుట అంత సుకరమైన పనిగాదు. తానాజీవద్ద సుశిక్షితమైన యొక ఉడుముగలదు. అది యనాయాసముగ నెంతటి యెత్తుగల గోడలయినను ఎక్కి మఱల ఎవరు విడిపరచ వీలు లేనట్లు దాని నంటుకొనియుండును. దాని నడుమున కొక త్రాడు కట్టబడెను. అది గోడపైకి యెక్కుటతోడనే ఆత్రాడును బట్టికొని మరాఠీ వీరులు పైకెక్కసాగిరి.

ఈమహారాష్ట్రులే మొదట బందిపోటు దొంగలు. కాని శివాజీ వారిని సిపాయిలుగ నొనర్చెను. ఇందుచేతనే వారు రాత్రులయందలి ఆక్రమణలందు నద్వితీయులు. రాత్రియందాక్రమణము చేయుటకన్న మరి యొండుపాయమే, లేకుండెను.

తానాజీగూడ మూఁడువందల సైనికులు గఢముపైకి చేరిరో లేదో ఇంతలో ఆఉడుమునకు కట్టబడిన పగ్గము తెగిపోయెను. అందుచే దుర్గరక్షకులకు జాడ తెలిసి తానాజీ మొదలగు వారితో దలపడిరి. రాజపుత్రులు మహారాష్ట్రులు నారాత్రి యుద్ధములో నొకరినొకరు ఆత్మపరవివక్షత లేకుండా తెగ నఱికికొనసాగిరి. సంఖ్యను మహారాష్ట్రుల సేనకంటె రాజపుత్ర సైనికులే యెక్కువగానుండిరి గాని మరాఠులకుగల చుఱుకుదనము, ఖడ్గచాలనా కుశలత్వము చూచి ప్రాన్పడిపోయిరి. చూచుచుండగనే రాజపుత్ర సైనికు లనేకులు భూమిపై చిర నిద్రకై యొఱిగిరి. ఇచట మరాఠులుగూడ కొద్దిగనే యుండిరి. గాని తానాజీ వారికి ఉత్సాహము గలుగజేయుచు రణమును మానకుండ సాగించుమండెను. మరాఠులు ప్రాణములను సైతము గణియింపక పోరుచుండిరి. ఇంతలో మహారాష్ట్రవీరుఁడగు తానాజీ ఖడ్గముచే నాహతుఁడై భూమిపై బడిపోయెను. వృద్ధుఁడగు శేలారుమామయు నాయుద్ధమున యువకోచితమగు వీరత్వమును ప్రదర్శించి వీరగతిబొందెను. ఉదయభానుఁడును వారినే యనుసరించెను.

అచ్చట వీలుజూచుకొని తానాజీ తమ్ముఁడగు సూర్యాజీ మిగిలిన యోధులను వెంటబెట్టుకొని దుర్గము ప్రవేశించెను. క్రొత్తసేన వచ్చుటతోడనే రాజపుత్రుల ధైర్యము సడలెను. కోట పూర్తిగా మహారాష్ట్రుల వశమయ్యెను.

సింహగడము జయించినవార్త వినుటతోడనే శివాజీ మహారాజు నేత్రము లశ్రుపూరితములయ్యెను.

బాష్పరుద్ధ కంఠస్వరముతో-"గఢము స్వాధీన మైనదికాని సింహము మాత్రము పోయెను" అని పలికెను.

జిజీబాయి "సుమారా! నేడు మనము పోగొట్టుకొనిన యట్టి అమూల్యరత్నము తిరిగి లభింపదు. తత్తుల్యము మరేదియు లేదు. మరి యింక యిప్పుడు విచారింపవలసిన అవసరము లేదు. నేను నాపుత్త్రిని అంతిమేచ్ఛపూర్ణ మొనరింతును. తానాజీ 'రాయబా' వివాహమునకు సర్వము సిద్ధపఱిచెను. నడువుము. అతని ఉత్తరక్రియ లైనపిదప వివాహకార్యము నుసంపన్న మొనర్తము." అనియెను.

తానాజీ తనపుత్రుని వివాహమును మాత్రము జూడజాలకపోయెను గాని తన నామమును చరిత్రప్రసిద్ధ మొనర్చుకొనెను. ఇట్లనుటలో సందేహ మేమియు లేదు. వీరుల బలిదానముల చేతనే జాతులు తమ మస్తక మున్నత మొనరించుకొనుచున్నవి. నేడు మహారాష్ట్ర సామ్రాజ్యము లేకపోయినను తానాజీ వంటి మహారాష్ట్రులు మహారాష్ట్రజాతి కమరత్వ మాపాదించిరని చెప్పవచ్చును.

—:o:—

# సాంధ్యగీతి

బొడ్డు బాపిరాజుగారు

చెదరిన ముంగురుల్ చెమట చిత్తడి చెక్కులనంట, మట్టియల్
మృదుల రవమ్ములన్ జెవుల నింపులు నింపగ పచ్చగడ్డినిం
గుదురుగ మోపుగట్టి తలకుం బరువైన పొలాలగట్ల నె
మ్మదిచను కాపుచిన్నది సుమాళపు పల్లెపదాలు పాడుచున్.
అలమినసంజ నింటిమొగమై చనుదెంచెడి యాలమంద త్రో
క్కులబడి లేచుదుమ్ము మెరుగుల్ గొను నల్లని మేనిచాయ నిం
పలరగ గొల్లబోయ డొక డల్లన నేగెడి క్రొత్త కిల్లు చె
ప్పులసడి విన్న తల్పుకడ పొంచి కనుంగొను నాలి నెంచుచున్.
పడమటికొండ నెత్తములపై చిలికించిన కుంకుమంబు లా
గడపలు పిల్లగాలితరగల్ విరజిమ్మ పచారుసేయు సం
దడి మొనమొన్న భూమి జననమ్మును గొన్నకురంగశాబకం
బడరిన సంతసమ్ము మెయినారయు మోమెగనెత్తి వింతగా.
తళుకుల సంతరించుచు లతాలలితాంగు లొసంగు పూలతె
ప్పల వలపుల్ గుబుల్కొన త్రపావతివోలె ప్రశాంతవృత్తి కొం
డల యనుగంటి చిన్నికెరటాల గమించు నదీమతల్లి లో
పల ప్రతిబింబముల్ గని నభమ్మున మబ్బులు నవ్వులాడెడిన్.

ప్రకృతి సకలమ్ము నానంద పరతనున్న
ఆశుభక్షణమందు నిష్ఠాత్ము డగుచు
అరయుచున్నాడు దేనినో తరుణు డొకడు
జ్ఞానియో లేక సత్కవీశాను డగునొ!

# ప్రేమ ఫలము

భమిడిపాటి చినయజ్ఞ నారాయణ శర్మగారు

అది విశాలమైన కొండవాగు. తన కళాపాండిత్యము చూపించి ఏ మహానుభావుడూ దానిని నిర్మించి ఉండలేదు సరే కదా, దానికి వన్నెలు పెట్టడానికికూడా ప్రయత్నముచేసి ఉండలేదు. తరుచుగా మనుష్యులు వెళ్ళడానికి అవకాశములేని కొండ ఇరుకులలో ఆవాగు ఉంది. ఆ కారణముచేత నవీన సంస్కారాలేమీ దానిని ఎంగిలి చేయలేదు. అమృతోపమానమైన చక్కని నీళ్ళతో ఎప్పుడూ అది నిండి ఉంటుంది. ఆ నీళ్లు చాలా తేలిక, నిర్మలమైనవి. కాసారంకూడా చాలా లోతుకలది. బండరాళ్లమీదనుండీ, చిన్న గులకరాళ్ల మీదనుండీ, గలగల ధ్వనులు చేసుకుంటూ ప్రవహిస్తూ ఉంటాయి ఆ చెరువులోకి మంచినీళ్ల ఊటలు. ఆగ్నేయమూలగా ఉన్న ఒక చిన్నకాలువనుంచి ఎక్కువైన నీరు పొర్లి పారుతూ ఉంటుంది ఒక కోనలోకి.

౨

పెద్ద చాపరాళ్లు, పళ్లచెట్లు, చెరువు చుట్టూ అక్కడక్కడ ఉన్నాయి అందంగా. రకరకాలపిట్టలు ఆ చెట్లమీద తమ నివాసాలు కట్టుకుని, హాయిగా నివసిస్తూ ఉన్నాయి. ఎండవేళప్పుడు ఆ కొండలమీద ఉన్న వన్యమృగాలు దాహోపశాంతికోసం ఆ జలాశయానికి వచ్చి దప్పి తీర్చుకుని, చెట్లనీడని పిట్టలపాటలు వింటూ అరమోడ్పుకళ్లతో విశ్రాంతి తీసుకుంటాయి. గాలికుర్రాడు చెరువునీళ్లతోనూ, అందులో ఉన్న పద్మాలతోనూ, ఒడ్డున పొడుగాటి పచ్చికతోనూ నిత్యము ఆడుకుంటూ ఉంటాడు. వసంతకాలంనాటి ఆదృశ్యం తనివి తీరా చూడవలసిందే! చూచి అనుభవించవలసిందే!

౩

కొన్ని వికసించినవీ, కొన్ని వికసించనివీ, కొన్ని అప్పుడప్పుడే విడుతూ ఉన్నవీ పద్మాలు. ఆ సాయంకాలపు ఎండకాంతులలో, తమ కాంతులు లీనంచేసి, జలాశయాన్నంతా వెలిగించి వేస్తున్నాయి. పిల్లగాలి గిలిగింతలికి ఇటూ అటూ ఒరిగిపోతూ, సిగ్గు ప్రకటిస్తున్నాయి ఆ కన్నెతామరలు. ప్రకృతిశృంగారమంతా అక్కడ మూర్తీభవించిపోయింది.

౪

సాయంకాలపు చల్లగాలిలో విహరించి వత్తామని, ఒయ్యారపుగీతాలు పాడుకుంటూ మిలమిలా మెరసిపోతూ బయలుదేరాడు ఆ అడవిలోనుంచి ఒక తేటికుర్రాడు. దారిలో కన్నెఉమ్మెత్తలు, సన్నజాజులు, మాలతులు, కొండమల్లెలు, బండిగురివెందలు, ఎన్నో లేతపువ్వులు, వలపువాసనలు కురిపిస్తూ భృంగకుమారునికి స్వాగతమిచ్చాయి; ఆహ్వానించాయి. స్వాగతమంగీకరించాడు; ఆహ్వానం మన్నించాడు. ఆ పుష్పాలలో తనకు కావలసిన మధువు ఏమీ చిక్కలేదు. తుదకు నిస్సారమనిపించింది.

౫

భావగీతాలు పాడుకుంటూ, ఆ మనోహర కాసారపరిసరాలకు వచ్చాడు తేటిబొట్టెడు. ఈలాటి దృశ్యం ఎన్నడూ అతను చూచి ఉండకపోవడముచేత ఒక్కసారిగా ముగ్ధుడయిపోయాడు. ఆ చెరువునడుమ ఆడుకుంటూ, తేలిపోతూ ఉన్న పద్మాలని చూసి, వాటితో ఆడుకోడానికి అక్కడకు వెళ్లాడు. బొగడలనడుమ అప్పుడే వికసిస్తూ ఉన్న ఒక పద్మము అతనిని ఆకర్షించింది. ప్రణయగీతాలు పాడుకుంటూ, ఆమె చుట్టూ ప్రదక్షిణం చేయడం ప్రారంభించాడు. అన్యజాతి పురుగునుకూడా గీతామాధుర్యంచేత తన జాతిలోకి మార్చుకో గలిగిన శక్తి సామర్థ్యంగల భృంగరాజు ఈ కోమలకుసుమాన్ని ఏమి చెయ్యలేడు! ఆ ప్రణయగీతాలతో కాసారాన్నంతా ముంచివేశాడు. ఆ కొండకోనంతా ప్రణయమయిపోయింది. అక్కడి గాలి, పిట్టలు, చెరువునీరు, వృక్షాలు అన్నీకూడా ఆ ప్రణయమూర్తి పాడుతూఉన్న ప్రేమపల్లవిని అందిపుచ్చుకుని, కొత్త కళలతో పాడుతున్నాయి. ఆ సంగీతంలో ఏకీభవించిపోతున్నాయి.

౬

ప్రణయమధువు పూర్తిగా గ్రోలడముచేత పద్మిని తన్మయయై అచేతనురాలయిపోయింది. తానుకూడా ఒక ప్రణయమూర్తిగా మారిపోయి, ఆయాసంగా, కొస కొస గంటిచూపుతో ప్రణయగీతి ఆలాపిస్తూ ఉన్న తుమ్మెద బిడ్డడికేసి చూసింది. అదే సమయానికి అతడుకూడా పద్మినిని చూచాడు. ఒకరి చూపులోనుంచి రెండోవారి చూపు దూసుకుపోయి హృదయాల్లోకి చొచ్చింది. దానితో ఒకరి హృదయం ఒకరికి తెలిసిపోయింది. తేటికుమారుడు ఒయ్యారంగా పద్మిని కరం గ్రహించబోయాడు. పద్మిని శరీరం గగుర్పొడిచి రెక్కలు కదిలాయి. * * * * పద్మిని తన మృదుకరాల్తో తేటికుమారుణ్ని కౌగలించుకుంది. ఆరాత్రి పద్మిని ఇంటనే ఉండిపోయాడు తేటిబొట్టెడు.

౭

పరిశుభ్రత లేకపోవడానికి, మోటుతనానికి పేరుపడ్డది దున్నపోతుజాతి. వాటి గోల తక్క వెనుకనుంచి తమమీదికి దూకివచ్చేవాటినికూడా అవి గమనించవు. "ఇనపసరుకు" అని ముద్దుపేరు పెట్టింది ప్రపంచకం ఆ జాతికంతా! అందులో కారు దున్నపోతుల సంగతి ఆలోచించుకోవలసినదే. క్రౌర్యంకూడా వాటికి ఎక్కువ... ......అది నూనవయస్సులో ఉన్న అడవి దున్న. ఆకలిబాధ ఎక్కువగా ఉన్నా ఎండకి జడిసి ఆలాగే ఒక చెట్టునీడను పడి ఉంది. మేతలేకపోవడానికి తోడు, ఆ యెండగాడుపులకి నాలిక తడి ఆర్చుకుపోయింది. పిపాస తీర్చుకోవడానికైనా కదలలేదు. ఆలాగే ఎండంత కాలము చెట్టు నీడను ఉంది. సాయంకాలము నాలుగు గంటల తరవాత బయలువెడలి తిన్నగా ఈకాసారం చేరుకుంది. నీటితో తొడుకుతూ ఉన్న ఆకాసారంలోకి వికారంగా రంకెలు వేసు

కుంటూ ఒక్కసారిగా ఉరికింది. ఓ! దాని స్వేచ్ఛ: ఆవాగంతా అల్లకల్లోలంచేసి, నానా భీభత్సంచేసింది. దాని హడావిడికి, నీటిపైని మనోహరంగా తేలి ఆడుకుంటున్న జలవిహంగాలు ఎగిరిపోయాయి. జలచరాలు బొరియలలో దూరిపోయాయి. ఆ దున్న తిన్నగా పద్మవనములో ప్రవేశించి, చిత్తానుసారంగా కలచివెయ్యడము ప్రారంభించింది. ఆ విహారవిలాసాల్లో, తామరతూండ్లన్నీ చికిబికిగా తెగిపోయాయి. పువ్వులు, మొగ్గలు, ఆకులు, నలిగిపోయి, చినిగిపోయి చిందరవందర అయిపోయాయి. ఆ సరోవరమంతా కలిగి పంకిలమయిపోయింది. రంభారావణ చరిత్రాన్ని తలపింపచేస్తూంది ఆ సరస్సు దృశ్యం. మహిషమూర్తి తన లీల చాలించి అడవిలోకి తిరుగా వెళ్లిపోయాడు.

౮

ఈ దృశ్యము చూడడముచేతి, సూర్య భగవానుడు తన కోపారుణిత నేత్రాలతో సాయంసంధ్యాకిరణాలు కురిపిస్తున్నాడు. అల్లకల్లోలమయి భీభత్సపురూపు తాల్చిన కోనేరు ఇంకా తేరుకోలేదు. పెళ్లికొడుకులాగు ముస్తాబై, మునపటికంటె ఎక్కువ ప్రణయం కురిపిస్తూ, ఎప్పటిమల్లే వచ్చాడు ఆ తుమ్మెదకుర్రాడు పాటపాడుకుంటూను. మామూలు చోటికి వెళ్లిచూస్తే అక్కడి తామరవనమంతా చిందరవందరగా ఉంది. ఒక్క పువ్వు, ఒక్క మొగ్గ, ఒక్క ఆకు కూడా చినిగిపోకుండా ఉండలేదు. ♦ ♦

౯

తెల్లవారింది. కర్మసాక్షి నవ్వుకుంటూ తూరుపుకొండమీదికి వచ్చాడు. ఆవాగులో నీళ్లు కొంచెము తేరిఉన్నాయి. ఒకమూల చినిగిపోయి, కొన్ని రేకులు రాలిపోయివ పద్మము ఆ నీటిమీద తేలి జాలిగా ఉంది. ఆ చెంగటనే తుమ్మెదకుమారుని భౌతికశరీరం ఆ రేకులతో ఆడుకుంటూంది.

౧౦

పద్మం చితికిపోయినా, తుమ్మెద చచ్చిపోయినా ప్రకృతిమాత్రం మార్పులేకుండా నడుస్తూవుంది. —ప్రభావతి జ్ఞప్తి.



## తెలుఁగునాడు

కర్లపాలెం కృష్ణరావుగారు

తెలుఁగునాడును గొల్వరా! తమ్ముడా! తెలుగుగాలిని బీల్చరా!
తెలివిగలవాళ్లంత—తెలుఁగువారేనోయి! తమ్ముడా!
తెలుఁగు మాటలునేర్చి, తెలుఁగు పంటల మెక్కి,
తెలుఁగు భూముల నిక్కి, ధీరత్వమునుజూప, తమ్ముడా! దేశ-
దేశాల కెక్కరా! తమ్ముడా!.........॥తెలుగు॥
దివ్యతేజమునిల్చె తెలుఁగు సోదరులందు,
తెలుగంటె యేమిటో—తెలుసుకొంటేచాలు:
తెలుఁగునాడును గొల్వరా! తమ్ముడా!.........

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం.ఏ; బి.యల్.

హక్కులును, బాధ్యతలును (Rights and Duties) అవినాభావ సంబంధము కలవి. వీనిదెస వెడమొగము పెట్టి, వానిని పిడికిట బట్టుట ఎవ్వరికిని సాధ్యముకాదు. బాధ్యతలకు బలాదూరని హక్కులను అక్కున జేర్చుకొనజూచువారు ధర్మప్రవర్తనమునకు దూరమైయుందురు.

ప్రస్తుత భారతపరిస్థితులు అధోగతిపాలైయున్నవి. అవ్వలినుండి దాడి వెడలు దురాచారములకు మన యిండ్లయందు రేకెత్తు అత్యాచారములు భుజ మొద్దుచున్నవి. దుర్గతియందు కూలబడు దేశమును లేవనెత్తుటకు స్త్రీ పురుషుల బాధ్యత సమమైయున్నది. ఈ బాధ్యత నివ్వటిల్లిననాడు ప్రస్ఫుటితకుసుమములట్లు స్వత్వములు ఆనందముగూర్చుచు మన చేతుల జిక్కును. ఈ బాధ్యతను నిర్వహించుట పవిత్రమైన సేవాధర్మమును నిర్వర్తించుట.

అధునాతనయుగమున సేవాధర్మము విశేష ప్రశస్తినందినది. వ్యక్తిగతవృద్ధికంటె మానవసంఘాభివృద్ధియందే ఉత్తమాశయసిద్ధి పొడగాంచనగునని గెటే (Goethe) మనీషి పలికిననాటనుండి ప్రతీచీ ఖండమున నీ యాశయము అధికాదరమందినది. ఈ యాశయము ప్రాచీనయుగమునకు క్రొత్తదికాదు. గెటేకవి పల్కులు పల్వుర హృదయతంత్రులను మీటి భావసుధావర్షమును గురిపించినవి. లోకమాన్య తిలకు ఈ భావమును విశేషముగ మనన మొనరించినాడు. గీతకు భాష్యము వ్రాయుచు, ఆ యుద్గ్రంథమున ఉల్లేఖింపబడిన నిత్యకర్మవిధానమునకు సేవాధర్మమని అర్థము చెప్పినాడు తిలకు. కేసరి. ఇతడు సాహసమునకు రెండవ పేరు, స్వాతంత్ర్యమునకు మాఱుపేరు. సేవాధర్మమును నెఱపుపట్ల మాండలే చెరసాలయందు ఆరేండ్లు బంధితుడై గీతకు భాష్యము వ్రాయుటకు ఈతడు కలమును పట్టినాడు. అర్ధాంగిని కోల్పోయి విషాదయోగమున కూలబడక కర్తవ్యముపై కలము సాగించినాడు. గీతలోని ఒక్కొక్క శబ్దమున కేనూఱు అర్థములు చెప్పజాలుదునని ప్రజ్ఞానిధియగు పూరీ శంకరాచార్యులనినాడు. మూలగ్రంథము బహుళభావశాఖలుకల సంస్కృతమైనపుడు,—అందును, గ్రంథములకు రాజైన గ్రంథమైనపుడు, లోకమాన్యునివంటి అద్వితీయ పండితుడు భాష్యకారుడైనపుడు మినుసిలీనుతలపు లెన్నెన్ని సభ్యప్రపంచమున నుదయింపవు!! తిలకు వాక్కులు విని ఎందఱెందఱు దేశసేవకులును, దేశసేవికలును ముందంజ వేయలేదు? సేవను భారతీయులకు తారకమును చేసిన తొలుతటి ఉపదేశకర్త లోకమాన్యుడు కాక మఱెవ్వరు?

సేవాధర్మమును గుర్తించుటకు తోడుపడు విజ్ఞానము ప్రతీచీ నాగరికత ఒసగునంతదనుక అది ఆదరణీయమైనది. వీనికి మించి అందు నేడు గోచరించు విచ్చలవిడి నడవడి, ధనారాధనము, స్వార్థకాంక్ష మనలను చేరరాదు. ప్రతీచీ భూవలయమున నెగయు విషవాయువులును, తుపాకిపొగలును, దుర్వృత్తులును దురాచారములును మనదరిఁ జేరరాదు. ఇట్లని నేటి యువకులకును, యువతీమణులకును మఱిమఱి చెప్పుట అవసరము. అభివృద్ధి యను పేరిట పాశ్చాత్య జీవనవిధానమును సంపూర్ణముగ అనుకరింప వీరాతురపడుచున్నారు. మృష్టాన్నమని భ్రమసి, విషాన్నము నొక ముద్దగ దిగమ్రింగవలెనని వీరు మక్కువపడుచున్నారు. పాలనుండి అంచవలె నీరును వేఱుచేయ నెఱుగక అంతయు దుగ్ధమని వీరపోహపడుచున్నారు. దురదృష్టవశాత్తూ, పాశ్చాత్యులందలి మేల్మిదెస కన్నెత్తక, వారి దోసగులదెస (అవి దోసగులని గుర్తింపక) దృష్టిపాఱించి, తమ జీవనముల కవి యొరవల్లు కావలెనని ఆశపడుచున్నారు. ఱెప్పవాల్పక చూచి, ప్రతీచీ సభ్యత



శ్రీమతి యం. మరకతవల్లి

కరైక్కుడి మున్సిపల్ సంఘమున యెన్నుకొనబడిన సభ్యురాలు.



శ్రీమతి మిస్. అనసూయాబాయ్.

నాగపూర్ కాంగ్రెస్ సంస్థకు చెందిన సుప్రసిద్ధ యువతి. సి. పి. శాసనసభా సభ్యురాలై యీమె వాసికెక్కారు. కాంగ్రెస్ కమిటీయందీమె యొక సభ్యురాలు.





శ్రీమతి యమ్. యస్. శ్రేష.

మంగుళూరు మున్సిపల్ సంఘసభ్యురాలై . మహిళాలోకమునకై పాటుపడుచున్న యుత్సాహవంతురాలు.

యందలి ఉచితాంశములనే కైకొనుడని తెలుపుచుండి దురభిప్రాయమునకు చోటిచ్చి, "మా స్వాతంత్ర్యమునకు, మా సమత్వభావమునకు, మా పురోభివృద్ధికి, మా యుత్థానమునకు అడ్డుగట్టులు నిలుపుచున్నారు" లని ఎదుటివారిని పల్వురు దూషించుచున్నారు. పాశ్చాత్య నాగరికతమీది వీరి వ్యామోహము అధికమగుకొలది పూర్వసభ్యత దెసగల వీరి దృష్టి మందగించుచున్నది. ఒడుదొడుకు పరుగులాటను సంస్కరణమనియు, అభివృద్ధిపథమందలి సమధికగమనమనియు యోజించుచు, సనాతనధర్మముపై కన్నుబున్నులను, కాలుకూతలను ప్రయోగించుచున్నారు. సనాతనులమని పేరు పెట్టుకొను కొందఱు గురాచారములను రేకెత్తించు (అపరాధమును కేవలము వారి తలకే కట్టరాదు) చున్నారుగని, సనాతనమతమంతయు పెంటపోగనియు, దానిని తుడిచివేసి, పాశ్చాత్య సభ్యతనుండి ఇంత రొట్టదెచ్చి, క్రొత్త పందిళ్లకు గట్టి అందు మేళము సాగింపవలెనని వీరభిప్రాయపడుచున్నారు. ఒకపరి ప్రతీచీ సీమలకరిగి, వీరచటి మనీషుల పుస్తకభాండాగారములను తెఱచిరేని, ప్రాచీన భారతవిజ్ఞానము వ్యక్తపఱచు మహాగ్రంథములందు కొల్లలుగనున్నవనియు, దివ్యాదర్శములకై నేమకు అచటి మహనీయులు భారతసీమ దెసకే దృష్టి సారించుచున్నారనియు వీరు గుర్తింపకపోరు. ఉత్తమాశయఖనియైన సనాతనమతమునెడల,—అద్భుతభావవిలసితమైన ప్రాచీన విజ్ఞానముపట్ల పొడసూపు జుగుప్స అచిరములో తుడముట్టినగాని, ఘోరవిధ్వంసమునుండి భారత నాగరికత విడివడనేరదు. అంధానుకరణమునకు నీరు వదలినగాని మన యువకులును, యువతులును అభివృద్ధిని కనజాలరు.

మహత్తర సేవాధర్మమును నెఱపుపట్ల స్త్రీకిగల శక్తి పురుషునకు లేదు. కళోపాసనమున స్త్రీకి సహజసామర్థ్య మున్నట్లు, సేవాజీవనమున నామెకు సహజశక్తి కలదు. కారణము?—కళను సేవను పలసినది హృదయసంపద.

స్త్రీహృదయము నందనము. అందు పుష్పించు సుందరాశయములు ముండ్లులేని గులాబులు. స్వార్థమునకు గాని, గర్వభావమునకు గాని అందు చోటు లేదు. దయనీయమైన దృశ్యమును చూచి,—కష్టభూయిష్ఠమైన సంఘటనము గాంచి, కనులనీరు నించని స్త్రీ లేదు. సెగలు సెగలను చిమ్ముచుండ, అగ్నిప్రవేశ మొనరించి నిప్పులను చారుపల్లవములు చేయగలుగునది స్త్రీ! ప్రాణరక్షణమునకును, మానసంరక్షణమునకును, ఆత్మబలిదానము చేయ ముంగుల కుఱుకునది స్త్రీ!! ఎదుటివ్యక్తి నుడిగుండమున మునుగుచుండ తన గతి ఏమగునోయని యోజించి, చేయి అందించుట కూడునో కూడదోయని పురుషుడు వితర్కించుచుండు నేమో కాని స్త్రీ కాదు. ఈమె దేవీప్రతిమ సల్పుచుండును. సేవాధర్మ నిర్వాహణమందును, త్యాగజీవనమందును స్త్రీ ఆదిపీఠము నధిష్ఠించియున్నది. అగ్రస్థానమున నాసీనయై యున్నది. దేశచరిత్రలను, సాహితీవ్యాఖ్యానములను ధర్మగ్రంథములను, ప్రత్యక్ష ప్రపంచ మహాగ్రంథమును పరికింపుడు. ఎన్నెని దృష్టాంతములను పొడగాంతురు.

ఇట్టివారి సహజశక్తులను త్రుప్పుపట్టనీకుండ, బాహిరమున శీఘ్రమెత్తజేయుట విద్య పని. మనసున గల శక్తులకు అడ్డుగట్టులు నిలుపక, వాని గమనమునకు చక్కని రహదారులు దీయుట విద్యయొక్క ఆశయము. స్త్రీయందుగల సహజశక్తులను ప్రకాశింపజేయునదై యుండవలెను స్త్రీవిద్య.

# మోతీయా

గోనెల నరసింగరావుగారు, బి. ఏ.

తలదాఁచుకొన సులేమా।నల మోతియతోఁడ జకితుఁడై యౌరంగ్జే
బాలయించు మాయ గడవఁగఁ।బలాయనమొనర్చె ఘోరవనసీమలకున్.
భూరుహచ్ఛాయ నొకచోట బాలఁతిఁగూడి।యతఁడు స్వవిషాదగాథలా
యమకు దెలుపఁ బ్రకృతియే వేఁడికన్నీరు రాల్చుచుండ।
నెవఁడు కఱఁగఁబోఁ డొక వజ్రహృదయి దక్క.

"ఈదురదృష్ట కష్టమతి నీ నిహితాశుని వీడకిట్లు నీ
వాదుక మేటి సోయగము నంతయు వమ్మొనరింతువేమి భ
ద్రోదయమిందు నీ వరసితో? మఱి యెక్కడకేఁగి పొందఁగా
రాదె సుఖమ్ము, నీకచట రాశిగఁ జేకుఱునేమొ నెచ్చెలీ!"

అనుచుఁ గన్నీరు గురియించు నతఁనిగాంచి చేలచెఱఁగున నొత్తుచుఁ జిత్తభరము
నల్లనల్లన డింపఁగ నామె యమృత మొలుకు పలుకుల నిట్లని పలికెనపుడు.

"సతికిన్ నాథునితోడిదే జగము; నీసఖ్యంబె యర్థింతు సం
తతమున్; సౌఖ్యమరీచికాను గమనార్థత్వంబు నాకేల? సు
స్థితి నీకే యొనగూడెనేని; యదియే చేకూర్చు సర్వంబు దీ
నతఁబోనాడి స్వకార్యదీక్ష జయమొందన్ లెమ్ము జీవేశ్వరా!"

చేరువపల్లెలోన నొకచిన్న కుటీరమునందుదాఁగి హృ
ద్భారము దీర్చుకోఁబఱచు పట్టున నొక్క చెనంటి యాజమీం
దారుఁడు దారుణమ్మగు విధమ్మున వారినిబట్టి ఢిల్లిభూ
దారున కొప్పగించె; గలదా యిల ద్రోహికి సౌహృదం బెటన్?

పదిలంబొందఁగఁ దల్లడిల్లు సఖులన్ బందీలఁగావింపఁగా
నదనంచున్ దనచారులన్ బనిచినాఁ డౌరంగజే; బన్నసం
పదగానైనఁ దలంపు లోఁ గొనక, సామ్రాజ్యైక తృష్ణాసవో
న్మదుఁడై వారలఁబట్టి "గ్వాలియరు"లోనన్ జంపఁ దీక్షన్ గొనెన్.
మదశుండాలము మార్గమధ్యమున సంరంభించి యౌరంగజే
బదయుండై తనుఁబంపు గోరికను జేయంగా సులేమానునిన్

బదఘాతంబుల నొవ్వఁజేయునెడలన్ వారింప నీవేఁగ నీన్
జదిపెన్, నీ, మృదుభావరక్తి పశుబృందంబారయన్ జాలునే ?

*　*　*　*

భువనాదర్శము నీదుశీలము; గుణాంభోరాశివై నైజరా
గవిరాజద్భవదీయ మానసమహాకాశాగ్రసీమన్ ద్వదా
త్మవిభున్ భాస్వరమూర్తి నెల్లపుడు నుద్భాసింపఁగాఁ బూనినా
వవకుంఠమ్ము పతివ్రతానిచయ మాహాత్మ్యం బహో! మోతియా.

స్నేహితురాలవై విభుని జీవములన్ గొనుచున్న రాజవి
ద్రోహిని నిల్వరించుచు నెదుర్కొని పోరి కృతార్థనైతి; వు
త్సాహము, సాహసమ్ము, పటుశౌర్యము, ధైర్యము, నస్థిరాంగని
ర్మోహము, జ్ఞానదోహదము రూపగు సొమ్ములు నీకు మోతియా!

పవరంబందునఁ బూరుషాకృతిని సశ్వారూఢవై మించి శా
త్రవసందోహ విపాటనోద్భట భుజావష్టంభ సంరంభవై
భవ ముద్దీప్తమొనర్చి భాసిలుచు దుర్వారోద్ధతిన్ జాటితీ
వవనీనాథ కుమారకాను గమయోగ్య ప్రక్రియన్ మోతియా!

పశుభవేళ మీమానము లేకముగా భవదీయదృక్సుధా
పేశల పుష్పదోళికలఁ బెంపుగనూఁగినవో సులేమనో
ర్వీశవతంస! ధన్యుఁడ వహీనముదంబున మీతయామనో
ధీశుఁడవైతి వామెయు శయించెను హాయిగ నీమవక్షస్థలిన్.

అని సంయుక్తయె; రాజ్యపాలనమునం దారాణి రుద్రాంబయే
ఘనసౌశీల్యమునందుఁ బద్మినియె; యోగస్ఫూర్తి మీరాసతీ
మణియే; యీవినుతాత్మ మోతియను నీ విస్సీ, విధీ! ద్రుంగి తే
మనఁగా నేర్తునినున్: జడాత్మునకు యుక్తాయుక్తముల్ గల్గునే ?

గోరీమేయుగు నిద్దరన్ విభునితో గూఢానుషంగానుమో
దారూఢిన్ గృహలక్ష్మివై వెలయుభాగ్యం బొందకున్నన్; దివిన్
ధీరోదాత్తుని, నీసులేమను సఖున్ దీపారు లేనవ్వ లిం
పారన్ జల్లుచు హర్షవారినిధిఁ నోలాడంగదే మోతియా!

# మిస్. స్లేడ్–మీరాబాయి

25 సంవత్సరముల క్రిందట మిస్ స్లేడుకన్య ఒక బ్రిటిషు ఉన్నతోద్యోగి పుత్రికయై ముద్దుగ పెరుగుచుండెను. గాని నేడామె యొక్క భారతవనితగా నన్నివిషయములందును మారిపోయినది. నీలమైన నేత్రములు మధురమైన గాత్రము మీరాను భారత స్త్రీలోకమున కలుపుచున్నవి.

ఆమె మొన్నమొన్న భారతదేశమును వీడి భోగలాలసముల కనువైన లండను నగరము చేరి హైడుపార్కు సమీపమునందున్న యొక హోటలులో చిన్నగదిని తీసుకొనినది. పాశ్చాత్య స్త్రీలవలె పొడవైన పాదరక్షలు వేసుకొని, 'టక్కు-టిక్కు' మని సందడిచేయుచు తిరుగాడక యామె భారతనారీమణివలె నేలపైననే కూర్చొనియుండును. ఆమె నొక విలేఖరి చూడబోయినపుడు నేలపైననే కూర్చొనియున్నది. సన్యాసినిబోలి కురుచగా కత్తిరింపబడిన శిరోజములుగల తలపైనుండి భారతదేశపు బీదరైతుచే నేయబడిన ఖద్దరువస్త్రమును ముసుగు వైచికొనియుండును. ఆమె నివసించు గదియందు విలువయైనదేదియు లేదు. కొన్ని గుడ్డముక్కలున్నవి. వాటి నామె యప్పుడే యుతికి ఆరవేసుకొనెను. కాగితములతో నిండియున్న కాయవాక సూటుకేసొకటియున్నది. విలాసయుతమగు ఆ హోటలుగది నామె సన్యాసాశ్రమముగ మార్చివేసినది. ఆమె యిటుల తెలిపెను.

పది సంవత్సరముల క్రిందట నేను గాంధి ఆశ్రమమున చేరితిని. ఈ పదిసంవత్సరములలో నొక్క లిప్తయైనను నే నందులకు విచారపడలేదు.

నేను అచట ప్రవేశించిన నాదిగ స్వగృహము వలెనేయున్నది. ఆ ప్రజలే నిజముగ నా కాప్తులు.

నేను ఏకారణముచేతనో పాశ్చాత్యుల గర్భమున పుట్టినను భారతదేశమునందే పుట్టియుండుటవలన నా శరీరము భారతదేశమునకు చెందినదే. సామాన్యముగ నేను మరణించిన పిమ్మట భారతదేశమున పునర్జన్మ మెత్తియుండవలసినది. గాని గాంధి మహాత్ముని మహత్తువలన అంతవరకవసరము లేకపోయినది.

నా చరిత్రను ఇంచుక తెలియపరచెదను వినుడు. నా తండ్రి యొక యున్నత సైనికోద్యోగి. అతడు మూడు సంవత్సరములు భారతదేశమున నుద్యోగముచేసెను. నే నపుడు మా తండ్రిగారితో నుంటిని. నేను తిరుగ ఇంగ్లాండు వచ్చునప్పటికి భారతదేశమునుగూర్చి నాకేమియు తెలియదు.

నేను ఇంగ్లాండు చేరినతోడనే యుద్ధము సంభవించెను. పాశ్చాత్యజీవితముపై నాకు రోత జనించినది. అప్పటినుండి యేమి చేయవలయునో తెలియక వికలతజెంద జొచ్చితిని. రక్తపాతము నా కిష్టము లేనందున ఆ యుద్ధసంబంధములయందు నేను పాల్గొనలేదు.

నే నొకదినమున ఫ్రెంచి కవీశ్వరుడగు రోలాండుగారి గ్రంథము చదివితిని. వెంటనే యా కవీశ్వరుని కలుసుకొనవలయునని తలంచి వారి కొక లేఖ వ్రాసితిని. మాయిరువురము కలుసుకొనినపుడు అతడు గాంధినిగూర్చి తెలిపెను. గాంధి రెండవ క్రీస్తని బోధించెను. గాంధిగారిని గురించి యొక గ్రంథము వ్రాసియుంటినని తెలిపెను. నా తపము సిద్ధించినదని తలచి గాంధిమహాత్ముని కలసుకొనుటకై భారతదేశమునకు ప్రయాణము కట్టితిని. గాని వెంటనే వారితో కలుసుకొను టెట్లు సంభవించును? నే నొక సంవత్సరమువరకు ఆశ్రమభోజన పద్ధతుల నలవాటుజేసుకొంటిని. ఈలోపల మహాత్మునకు నా యభిప్రాయమును లేఖ మూలకముగ తెలియజేయుచుండెడిదానను. నేను ఆశ్రమ భోజనపద్ధతుల కలవాటుపడిన పిమ్మట మరల మహాత్మునకు లేఖ వ్రాసితిని. వారు నా రాకకు సమ్మతించిరి.

నేను 1925-వ సంవత్సరం అక్టోబరు 25-వ తేదీని భారతదేశము చేరితిని. ఇపుడు జైలునుండి విడుదలబడిన ప్రసిద్ధ భారతనాయకుడగు వల్లభాయి పటేలుగారు నన్ను ప్రథమమున కలుసుకొనిరి. నేను వారి నెపుడుమాచినను ఆదినము జ్ఞాపకమునకు వచ్చుచుండును.

వల్లభాయిగారితో నేను మహాత్ముని దర్శించితిని. 'నీవు నా పుత్రికగానుందువు' అని మహాత్ముడు నన్ను పరామర్శించి, తిన్నగా వంటయింటనున్న కస్తూరీబాయివద్దకు గొంపోయెను. అప్పటి కామె వంటచేయుచుండెను. ఆనాటినుండియు ఆయింటికి నేను పుత్రికనైతిని.

ఆశ్రమములో పనులన్నియు మేమే చేసుకొనుచుందుము. గ్రామీణులకు సహాయపడుటకు తయారగుచుందుము. నేను నేతపనిని, పశు సంరక్షణను హిందీ మాట్లాడుటను అచట నేర్చుకొంటిని.

సబర్మతీనదీతీరమున నా కొక చిన్న గృహ మొసగబడినది. సోమరితనమన నెట్టిదో యెరుంగక యా కుటీరమున కాలము గడుపుచుండెడిదానను.

ఒక సంవత్సరము గడచినపిమ్మట మహాత్ముడు నన్ను బ్రహ్మచర్య ప్రతినను గైకొనజేసెను. ప్రపంచ విలాస విషయలంపటములనుండి నన్ను వేరుజేసెను. నా తలను మహాత్ముడే స్వయముగ క్షౌరముజేసెను.

గాంధిపక్షమునజేరి బ్రిటిషు పాలనమునకు వ్యతిరేకముగనుండుటచే నన్ను జైలులో వేసిరి. మాకెవరియందును ద్వేషములేదు.

ఇంగ్లాండులో నేను చేయవలసిన పనియున్నదని నాకు ఆకస్మికముగ తోచుటవలన మహాత్ముని యాశీర్వాదమును గైకొని వచ్చియున్నాను.

నే నిపుడు ఇంగ్లాండు, వేల్సు, స్కాట్లాండు దేశములందు పర్యటనమొనర్చి, సత్యసందేశమును చాటెదను. నే నెచటకు వెడలినను, భారతీయ సమస్యనుగూర్చి యెల్లరును అభిమానమును చూపుచున్నారు. గాని వీరి కింకను సంపూర్ణముగ సత్యము తెలియదు. అది తెలిసినచో సంపూర్ణముగ పని చేయుదురు.

"ఐరావతి"



## అశోకవనవాసిని

వాడపల్లి గంగాధరశాస్త్రిగారు

శా॥ అమ్మా! సీతమ! నీదు దుఃఖముల కింకంతంబు లేదెమొకో!
యమ్మా! కోమలివీవు, కాననమునందైనన్ గసన్ లేదు క
ష్టమ్మున్నట్టిది యెట్టిదో ధవుని సత్సాంగత్యముం బ్రేమముం
సమ్మానంబున, నేఁ డశోకవని కష్టంబెట్లు నీవోర్తువో!

సీ॥ మింటికన్నెలవంటి మెఱపుబోండ్లఁ జూచి సరససుందరసుమశయ్య మేనునువాల్చి
రాకాసిమూఁకనే పోకఁ గందొ ప్రకటోరభువి నెట్లు పవ్వళింతొ
కేకిశుకాది పక్షిరవంబుల విని షడ్రసోపేతాన్న సారంబుఁ జవిగాంచి
భీతిదధ్వనుల నే రీతివిందొ కటికోపవాసంబు లెటులసేతొ

తే॥ గీ॥ అగణితామూల్య నిర్మలానందదాయి సద్దుకూలాభరణముల దిద్దిమేనఁ
బాంసు సంకలితంబగు వస్త్రమెట్లు మేనదాల్చుగఁ గల్గితో జానకమ్మ!

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు:—

నెచ్చెలీ ! 24—10—34 తేదీని మనశారద లేఖకు ప్రత్యుత్తరముగా నాంధ్రపత్రికలో వ్రాయబడిన వసంతలేఖను నేనుగూడ చూచితిని. అందు అసందర్భముగను, పూర్వాపరసందర్భ రహితముగను మన శారదలేఖ యున్నదని నేరమారోపింపబడుటయుగమనించితిని. మనవిమర్శకు పాత్రమైన యాప్రథమ వసంతలేఖయు, దానిపై వ్రాయబడిన మన శారదలేఖయు నొక్కమాఱుగానే యేపత్రిక యందైన ప్రచురింపబడినచో నందలి నిజానిజముల నెల్లరు తెలిసికొనియుందురు. ప్రయత్నించినచో నామాత్రపు పని జరిగించుట కష్టముకాదు గాని ఒక్కతల్లిబిడ్డల వలె పరస్పర సౌహార్ద్రగౌరవములతో మెలంగవలసిన వసంత శారదలేఖలలో వైమనస్యములు పెంచుట నామతముగాదు కావున నావిషయ మింక మఱచిపోవుదము.

ఎవరో వినోదినీ మెహతా యనునామె, యిద్దరు బిడ్డలును భార్యయుగల యొక విద్యాధికుని, పెండ్లాడెననియు, ఆవర్తమానమును విని మహాత్ముడు మిగుల చింతించెననియు, నిజముగా నీ విషయము నాకు మిగుల విషాదాశ్చర్యముల గొల్పెననియు వ్రాసితివి. కల్పలతా! నీ వే రాష్ట్రమునందో జరిగిన విషయమునకు విస్మయ విచారములకు లోనగుచున్నావు. కాని యిటీవల మన తెలుగుదేశమున నిట్టి యక్రమ వివాహము లెన్ని జరిగినవో నీవెఱుగనటులున్నది. వితంతూద్ధరణకని కొందఱు, ప్రౌఢవివాహవ్యాప్తికని కొందఱు, అంతర్వర్ణ్యవివాహ ప్రచారమునకని కొందరు, భార్యలుగలవారు, పునర్వివాహములు చేసికొనుచున్నారు. ఆలోచించి చూచినచో నిక్కముగా నిట్టి సంస్కరణవివాహములను వ్యాప్తిలోనికి తేవలసినవారు అవివాహితులగు యువజనులుగాని జీవత్కళత్రులా ! యువజనులు కట్నముల కాశించియు, తల్లిదండ్రుల నిర్బంధములకు లోగియు, ధైర్యసాహసములు లేకయు, శారదాయాక్టునకు వెఱచి చాటుమాటు బాల్యవివాహములు చేసికొనుచుండ నసహాయశూరులగు నీ వృద్ధవరులు, అగ్నిసాక్షిగా పెండ్లాడిన నిల్లాలిని గోలుగోలున నేడ్పించి మఱియొక ప్రౌఢవనితను పెండ్లాడుచున్నారు. వీరి యనుచితసాహసము నేమన వలయును ?

ఇట్టివారెవరో యెక్కడనోయని దూరమాలోచింపబనిలేదు. సాక్షాత్తు మాపిన తల్లియల్లుడే మొన్నమొన్న నిట్టివివాహము చేసికొనినాడు. మాబావ చిన్నవాడుకాడు! నలుబదేండ్లున్నవి. అవిద్యావంతుడుగాడు ; ఆనర్సు బి ఏ. పరీక్షయిచ్చినాడు!! నిరుద్యోగిగాడు ; నెలకు రెండువందలు సంపాదించుచున్నాడు. మఱి యీ యకృత్యమేమి ? భార్య పిచ్చిదా వ్యాధిగ్రస్తయా చదువుకొనినది కాదా శీలవతి గాదా యనిన నామె పిచ్చిదియుగాదు; వ్యాధిగ్రస్తయుగాదు; చదువుకొననిదియు కాదు; దుశ్శీలయుగాదు. మాయక్కయని నే నతిశయోక్తులు వర్ణించుచుంటినని భావింపవేని నేను చూచినంతలో

నా మెవంటి పత్యనురాగయు క్షమావతియు, సుగుణశీలయుగానరాదు. ఏలనసగాతమ్మత్యం తానురాగముతో ప్రేమించెడి పతులపై గాఢానురాగమును జూపెడియిల్లాండ్రెంద రైన లోకములోగలరు. కాని అదిసామాన్య విషయము. అట్లు ప్రేమింపకుండుట యిహ పరములకు దూరమైన కృత్యమనియు చెప్పుటకు సందియము లేదు. కాని భర్తృ గృహము ప్రవేశించినదాది యొక్కమారైన భర్తయొక్క ప్రేమభరితమగు దృష్టికి పాత్రముగాకుండియు నాతనియందే బద్ధానురాగమైయుండెడి నారీరత్నము లోకములో నుండుట యరుదుగదా!! జగత్పూజ్యలగునట్టి యరుదగు పతివ్రతామతల్లులలో మా యక్కయు నొకతె. ఆమెకు భర్త దన్ను ప్రేమింపనక్కరలేదు. ఆయన నివసించెడి గృహములో నివసింపనిచ్చిన చాలును. ఆయన ముఖసందర్శన మప్పుడప్పుడగుచుండిన చాలును. ఆమె చెంబుతో పెట్టియుంచిన నీటి నాతడు పొరబాటుననైన పాదప్రక్షాళనముచేసికొనిన చాలును. ఛీ అవతలకు పొమ్మనెడి ఛీత్కారవచనమైనను నాతని నోటినుండి వెలువడినచాలును. అంతియే గాదు. ఆత నెవరితోనో భాషించెడి సడియైనను నామెకు శ్రుతిగోచరమైన చాలును. ఆమె కేదియో సంతోషము! ఏదియో సంతుష్టి! ఏదియో మహాఫలప్రాప్తి! ఇక భర్త్రానుగ్రహముకొఱ కామెచిత్త మెంతయు త్తలపడుచున్నదో! ఆయన సందర్శనము కొఱ కామెనయనము లెంతయుబలాటపడుచున్నవో! ఆయన వాక్కు వినుట కామె చెవు లెంతనిక్కబొడుచుకొనియున్నవో! ఆయనతో భాషించుట కాజిహ్వ యెంత పరితపించుచున్నదో! వేయేల? ఆ పతి దైవముకొఱ కామె సర్వావయవములు, సర్వేంద్రియము లెట్లు పరితప్తము లగుచున్నవో యెవరు వర్ణింపగలరు? ఇట్లు పతియే గతియని నమ్మి కొలిచెడి యిల్లాలి నల్లాడబెట్టి యే రాజవీథియందో, ఏ సినీమా ఆవరణమునందో, ఏ కలాశాలవాకిటనో, ఏ సభాంగణముననో సవిలాసముగా సందర్శనమిచ్చి యాకర్షించెడి వన్నెలాడిని పరిణయమాడనుంకించెడి విద్యాధికుల వివేక మేమని చెప్పవలయును? నిజసతియొక్క ప్రేమభరితహృదయమునందలి స్వారస్యమును గ్రహింపజాలనిభర్త భర్త్రాభిధేయమున కర్హుడగునా? నిజముగా నిట్టిపతులు మాణిక్యమును విడచి మసిబొగ్గుల నేరుకొనుటకాశించెడి వెట్టివారలలో చేర్పదగుదురు గదా!! మంచిముత్యమేదో మైనపుముత్యమేదో, జాతిరత్నమేదో గాజురాయియేదో, పసిడి శలాకయేదోయిత్తడిముక్కయేదో గ్రహింపజాలని వారి విద్యాధిక్యత యేమిచేయును?

మా బావగారు మరల వివాహమాడిన వృత్తాంతమును విని మనస్సుండబట్టక మా అక్కను చూచుటకు మా పిన్నిగారి యింటికి వెళ్లితిని. నిర్వికారాకృతితో మూర్తీభవించిన దురదృష్టదేవతవలెనున్న మా యక్కను చూచుటతోడనే నాకు పుట్టెడు దుఃఖము వచ్చెను. నే నామె నాలింగన మొనర్చుకొని బావురుమంటిని. మా అక్క కనుకొలుకులనుండి యొక్క కన్నీటిచుక్క

మైనను వెలువడలేము. ఆమె చిత్తమున నూరకప్రజ్వలించుచుండెడి సంతాపవహ్ని యామెనయనయుగళినుండెడి జలస్రావి కలనుగూడ శోషిల్లజేసెనో లేక అపార పారావారజలము నగస్త్యమహర్షి తనలో నిముడ్చుకొనినట్లు తన శోకసముద్రమును తనలో నిముడ్చుకొనినదో యేమో! నా కేమియు తెలియదు. నే నామెనుగాంచి నివ్వెఱజెందితిని. ఇంతలో మా పిన్నియు నామె యత్తగారును వచ్చి మా బావను కసిదీర దిట్టిరి. అట్టి సమయమునగూడ మా యక్క తన సహజమగు యోరిమిని సౌజ న్యతను కోలుపోనక తన పాతివ్రత్యధర్మము మెఱుగెక్కునట్లుగా నిట్లనెను. "ఇదియం తయు నా పురాకృత కర్మఫలము. ఇందు వారినేర మేమియులేదు. వారి నక్రమముగా దూషింపవలదు. నావలన వారికి కుటుంబ సౌఖ్యము లేనేలేకపోయినది. ఈ ద్వితీయ కళత్రమువల్లనైన వారు సర్వసుఖము లను భవింపుచు చిరంజీవులై వర్ధిల్లుదురుగాక" ఎట్టి యుదారహృదయ! ఎట్టి సహనశీల! ఎట్టి వినమ్రభావ! ఆ దివ్యవాక్కు లామె నోటినుండి వెలువడగనే నా తనువు పులక రించినది. నే నొక దేవీసన్నిధానమున నుంటినాయేమి యనిపించినది. మఱియు ముమ్మా రామె చుట్టు ప్రదక్షిణించి యామెకు నమస్కరింపవలయునని బుద్ధి పొడమినది. కాని మాయసిగ్గు నన్నా పనిని ప్రత్యక్షముగా జేయనిచ్చినదికాదు గాని, భక్తిభరితమైన నా చిత్తము మానసిక ముగా నామెచుట్టు నెన్నిమారులు వల గొని నమస్కరించినదో చెప్పజాలను.

ఇట్లు నిండారుభక్తితో ననిర్వచనీయ మగు ప్రేమతో శ్రద్ధామతులై వినయంబున తమ్ము సేవించెడి యిల్లాండ్ర హృదయ మనోజ్ఞతను గ్రహింపజాలక కొందఱు పురు షులు, తామే భయభక్తులతో సేవింపవల సిన స్త్రీలను చేపట్టి తమ ద్రవ్యమంతయు వారికి కొల్లబెట్టుచు, భయభక్తులతో వారి యాజ్ఞలను నిర్వర్తించుచు భృత్యాను భృత్యులై వారి కనుసన్నల మెలగుచుం దురు. ఇది యేమి వెడగుతనమో, యెట్టి విధినాతయో తెలియరాదు. శౌర్య గాంభీర్య సాహసౌదార్యపౌరుషాది ప్రజ్ఞా విశేషంబుల కునికిపట్టులై నిజసతికే చిత్త మీయని పురుషహృదయములలో ఆగంతుక ముగా తెచ్చుకొనిన కట్టుకొనిన స్త్రీలయెడ నిట్టి లఘుభావమున మెలగెడి దుస్థితి నేల పొందువఱచేనో ఆ పరమేశ్వరునకే యెఱుక. మా బావగారి పునర్వివాహ సమాచారము విని మా బంధువులలో నాతనికడ మిక్కిలి చనువుగలవారు వెళ్లి యిది యేమి యక్రమమని యడిగిరట. నే నేమి చేయుదును? ఆమెయందు నాకు ప్రేమలేదు. ఎంతకాలమని నే నామెకొఱకు యొంటరిజీవనము జేయుదును. నా కిష్టము గల యువతిని నే చేపట్టితిని అనెనట. మఱి యీామెగణి యేమన నామెయు వేరొకని వివాహమాడ నెంచినచో నా యభ్యంతర మేమియు లేదనెనట. మా యుభయుల తల్లి దండ్రులు మా యనుమతి లేకుండ జేసిన



డాక్టర్ యస్. ముత్తులక్ష్మిరెడ్డి



# ప్రతి స్త్రీకి
# ప్రతి పురుషునకు
# స్వరాజ్యము జన్మహక్కు
## దీనికి చరిత్రయే ప్రబల తార్కాణము

స్వరాజ్యమునకై ప్రతి ప్రాణియు ప్రతి జాతియు పోరాడవలెను. అది మానవధర్మము—విద్యుక్తధర్మము.

ఇందులకు కృతనిశ్చయము, బలము, ఆరోగ్యము అవసరము. కృతనిశ్చయము బలముమీదను, బలము ఆరోగ్యముమీదను ఆధారపడియున్నది.

ఉష్ణరక్తముగల పురుషులు, ఆరోగ్యవంతులగు స్త్రీలు జన్మహక్కగు స్వరాజ్యమునకు కృతనిశ్చయులై పోరాడవలెను. కాని స్త్రీ పురుషులలో యిందులకు అర్హతగలవారు తక్కువ. అటులని జన్మహక్కును వదలుటయా? అది మానవత్వమునకు విరుద్ధము కాదా?

మానవులు ఉపాయముల నన్వేషింపవలయును.

పురుషుడు పట్టుదలనిచ్చు బలమునకు—స్థైర్యమునిచ్చు కండరముల శక్తికి మార్గముల నరయవలెను.

స్త్రీ ఆరోగ్యమునుగూర్చి—అందునను ముఖ్యముగ గర్భాశయ రోగములను దూరముచేయు సాధనములను వెతుకవలయును.

పురుషులకు బలమును అర్హతను యిచ్చునది **అమృత.**

స్త్రీలను పీడించు గర్భాశయరోగములను నివర్తించి పూర్ణాయురారోగ్యమును ప్రసాదించునది **లోధ్ర.** ఇవి అన్ని మందులషాపులలో దొరకును.

పరిణయమున కిది తగిన ప్రాయశ్చిత్త మనె నట. ఏమి సలహా యిది! కాలిమీది పుండుకు చేతికి కట్టుకట్టమన్నటులున్నది! తండ్రిచేసిన నేరమునకు బిడ్డకా యావజ్జీవ శిక్షయా! తండ్రి తప్పు జేసినచో తండ్రినే శిక్షింపనగును లేకున్న తాను తండ్రియైనపు డిట్టితప్పు జేయక నాదర్శముగా మెలంగ దగునుగాని యందుకొఱకు భార్యను హింసించుట యేమి న్యాయము? మఱియొక సూచన యేమనగా తనవలెనే యామెగూడ పెండ్లాడవలయునట. చిన్ననాడు చేసికొనిన తా నింతతిన్నగా చూచెను గదా ఇక ముదిమిని చేసికొనిన యామగ డెంత ముద్దుగా చూచునో! అయినను మహా తపస్వినియగు మా యక్కవిషయములో నట్టి విషయము స్మరింపరానిది గదా. లోక మాతయు నొక్కటై మేము నిన్నేమియు ననము. నీవు తప్పక పునర్వివాహము చేసి కొనుమని ప్రార్థించినను నామె యొప్పు కొనునా! శీలమర్యాదల శ్రేష్ఠత నెరిగిన నారీరత్నములు తుచ్ఛసుఖములకొఱకు తమ వినిర్మలజీవితమునకు కళంక మాపా దించుకొందురా! త్రాగుబోతగు భర్త యెన్ని యెన్ని విధముల చెప్పినను, తన వృత్తి మాననందుకు కోపించి నీరిమ్మ కుదురుస్తా నుండుమని భార్యగూడా కల్లు త్రాగుట కారంభించినచో నది భర్తృకృతికి ప్రతీకార మగునా లేక యామెగూడ చెడుట యగునా?

కల్పలతా! ఉత్తమ పతివ్రతామతల్లియొక్క హృదయము, సుందర వస్త్రములం గోరదు. అమూల్యాలంకారముల గోరదు. సుగంధపుష్పముల గోరదు. సుఖశయ్యల గోరదు. ధనధాన్యంబుల గోరదు. ప్రేమ భరితయగు భర్తయొక్క యాదరణను మాత్రమే కోరును. అతని ప్రేమైకదృష్టిని మాత్రమే కాంక్షించును. ఈవిధముగా తన ప్రేమభిక్షకై సర్వదా నిరీక్షించుచు, తా నొసగెడి యత్యల్ప గౌరవమునైన మహా ప్రసాదముగా గ్రహించి యమృతోపమాన ముగా భావించి యాప్యాయతతో నాస్వా దించి దానికి వేయిరె ట్లధికముగా తన ప్రేమను చూపబెట్టెడి యిల్లాలిని కాదని, తా నేమి యర్పించినను ఎట్లు సేవించినను ఎంతగా ప్రేమించినను తృప్తిలేక, సంతో షములేక, కృతజ్ఞతలేక, తిరస్కారభావ ముతోనుండెడి స్త్రీలను చెట్టబట్టి వారిపై నెనలేని మోహముగలిగి వర్తించుచు వారి చిట్టుబుస్సులే చీత్కారములే మహాప్రసాద మని భావించెడివారి స్థితి నిజముగా జాలి కరముగదా.

సద్వర్తనాశీలలగు నా సాధ్వీమణుల కేమి? ప్రాణేశునాదరము బడసినను బడయ కున్నను వారి జీవితము తేజోవంతమే యగును. కాని యిట్టి సతీమణులను విడ నాడినవారిదో............!!

౧-౧౧-౩౮,
భావపురి.

ఇట్లు,
శారద.






స్త్రీసంఘ ప్రార్థనగీతిక

పాపికొండల వేంకటరావుగారు

అబలలము హక్కులిచ్చి ఆదరింపుమా ।
ప్రభు ! మాయెడ ప్రభనుగొలిపి ప్రజ్ఞనిలుపుమా ।

మహామడను, క్రిస్టియను, హైందవసతుల
సహవాసవతులనేసి సంఘమునడుపు. (అబ)

జవ్వనమునపెండ్లిసేసి చక్కనసాకు
పువ్వుంబోండ్లను నిండ్లముక్కగనీకు. (అబ)

విద్యనిచ్చి విభవమిచ్చి బుద్ధినిచ్చి—మ
మ్ముద్ధరింపుమో యీశా ! ముగ్ధలమనకు. (అబ)

సత్యశాంతిశౌచములొగి జరుపుకొనుచును
నిత్యమునీపదసేవను నియతినుందుమోయ్ ! (అబ)

---

పాట

కొంపెల్ల జనార్దనరావుగారు

బేహాగ్ రాగం

హృదయపయోజ భ్రమణ రమణ
మృదులవిలాసాయత లాస్యరతా. హృ

విస్మృమర గానకలాదికలా
వివశవిమూఢ ప్రకృతిప్రణయీ. హృ

భావభవీసుధా పులకితహృదయ
ప్రసరిత సర్గప్రళయా. హృ




## కేసరీభాత్ చేయువిధము

ఒక శేరు సన్నబియ్యము తీసుకువచ్చి పరిశుభ్రముగా కడిగి ఒక తెల్లని పొడిగుడ్డమీద ఆరపోయవలెను. తరువాత వక శేరు లేక మూడు తవ్వల నీళ్లు కళ పెళలాడునట్లు మరిగించి యుంచుకొనవలెను. శేరు బియ్యమునకు అరతులము కుంకుమపువ్వు తెచ్చి మరగించియుంచిన ఒకతులమునీళ్లలో నానవేయవలెను. ఒకసోలెడు ముక్కజీడిపప్పు వేయించి వది నాలుగుతులములు కిసిమిసిపండ్లు, రెండు తులముల సీమబాదంపలుకులు బాగుచేసి యుంచుకొనవలెను. తరువాత పొయ్యిమీద గిన్నె కాలవేసి, గిన్నె కాలినతరువాత వకతులము నెయ్యి ఆ గిన్నెలో వేయవలెను. నెయ్యి సలసల మరగిన పిమ్మట పావుతులము లవంగాలు ఆ నేతిలోవేసి అట్లకాడతో దోరగా వేయించవలెను. అటుల వేగినతరువాత ఆరపోసియుంచిన బియ్యము ఆ గిన్నెలోపోసి గుప్పెడితో పట్టుకొనిన చుర్రుమనునట్లు మాడకుండ వేగించవలెను. అట్లు వేగినతరువాత కాచివుంచిన నీరు అత్తెసరుగా సరిపోవునట్లు ఆ బియ్యములో పోయవలెను. ఎక్కువనీరు పోసిన పాడైపోవును గనుక కొంచెము తక్కువపోసి చాలనియెడల పైన కొంచెము నీరు చల్లవచ్చును. అట్లుపోసి నానవేసి యుంచిన కుంకుమపువ్వు కాశికల్వములో మెత్తగా నూరి ఆ బియ్యములోపోసి అంతటా అంటునట్లు బాగుగ కలుపవలెను. తరువాత ఒకపళ్లెము దానిపై మూతబెట్టి అత్తెసరగునట్లు సన్ననిమంటమీద యుడుకబెట్టవలెను. అన్నము బాగా యుడికిన తరువాత పసుపు పచ్చని రంగుగానుండును. అప్పుడు వీశెడు పంచదార ఆ అన్నములోపోసి అట్లకాడతో కలుపవలెను. అపుడది నీరువచ్చి కుతకుత వుడుకును. కొంచెము ముద్దగ అగువరకు అడుగంటకుండ కలుపవలెను. తరువాత బాగుచేసియుంచిన ముక్కజీడిపప్పు మొదలగునవి అందువేసి కలుపవలెను. తరువాత పావుశేరు నెయ్యి అందుపోసి కలిపి పొయ్యిమీద నుంచి దింపవలెను. అట్లు దింపి 10 నిమిషములవరకు మూతదీసి యుంచినయెడల, అది బిగుసుకొని పొడిపొడిలాడుతూ బాగుగనుండును. అప్పుడది తినినయెడల బహురుచికరముగానుండును. యీప్రకారమే బియ్యమునుపట్టి అందు పైచెప్పిన దినుసులు వేయువలెను.

—ఎమ్. రామలక్ష్మి దేవి.

## బియ్య పప్పడములు

ఒకపడి బియ్యము నీటిలోపోసి కడిగి బాగా రెండుమార్లు, 4 ఘంటలసేపైనానక బుట్టలో వడియపోసి, పిండికొట్టి జల్లించి ఆపిండి ఘట్టిగా కలియపెట్టి ఒకపాత్రలో వుంచేది. మరుసటిరోజు ప్రొద్దున్నే గోటవేసి ఆముద్ద రెండు రుబ్బులు రుబ్బి తగిన ఉప్పువేసి దోసెపిండివలె కలిపి, దానిని అప్పుడే కాని, మరుసటిరోజు కాని యిడ్లీపాత్రలో నీళ్లుపోసి పొయ్యిమీద మరగనిచ్చి అరటిఆకులలో కాని బాదం ఆకులలో కాని ఈ పిండి మిళ్లెము లేక రెండు మిస్సలు అప్పళంవలె రాసి, ఇడ్లీపాత్ర తట్టబోర్లవేసి దానిపైన ఈ ఆకువుంచి మూతపెట్టి రెండు నిముషాల కొకతూరి ఆకులుతీసి వేరే పెడుతూ అది వుడికేలోపల దీనిని వొలిచివేసి, అన్నీ అయినానక ఎండపెట్టి చమురు బాగాకాగనిచ్చి వేయించి భుజించిన బహురుచి. నిప్పులో కాల్చి భుజించిన పత్యకారి.

—కంకిపాటి రుక్మిణమ్మ.

# ఆరోగ్యబోధిని

## ఉష్ణమానము

ఎస్. శేషగిరిరావుగారు

ఉష్ణం ఎంతవుందో చూచారా అనడం మనం ఎన్నోమార్లు వినియుంటాము. జ్వరంతో బాధ పడుతూవున్నవాళ్లను చూచినప్పుడు హితబంధు వర్గము యీ ఉష్ణాధిక్యతా వివరములను తెలుసుకొన అడుగుతారు.

ఉష్ణాన్ని చూడడమంటే జ్వరము తీవ్రముగా వుందా సాధారణంగావుందా అంటూ జ్వరము దాని చిహ్నమైన వేడిమిని కొలవడమన్న మాట.

ఈ జ్వరమును-అంటే ఉష్ణమును కొలవడమును అంతా తెలిసికొనవలసిందే. ఇదేమీ తల పగుల గొట్టుకొనవలసిన బండవిద్య కాదు. థెర్మామీటరును చూడగలవారు వేడిమిని చూస్తున్నప్పుడు రెండు మూడు మారులు చూచిన అదే తెలియగలదు.

అపాయకరమైన జబ్బులలో యీరోగి శరీరములోని శీతోష్ణములు దినమునకు ఏ రెండుమార్లో గాక గంట గంటకును చూడవలసివుంటుంది. ఇలా చూడమని, గుర్తుచేయుమని వైద్యులు చెప్తారు. ఈలా చూచునపుడు కొన్ని విషయాలు జ్ఞాపకముంచుకోవడం ముఖ్యం. ఈవిషయాలు అందరికీ తెలియవు. ముఖ్యంగా స్త్రీలకు.

ఈ ఉష్ణము సాధారణంగా ఆరోగ్యంగావుండేటప్పుడు 98, 99 డిగ్రీల మధ్య వుంటుంది. సాయంత్రాల్లో హెచ్చుగాను, తెల్లవారుజామున తక్కువగాను వుంటుంది. భోజనంచేసినా, పరిశ్రమించినా, కత్తరపాటులోవున్నా కొద్దిగా వేడిమి ఎక్కువగాను, జీర్ణకాలంలో, నిద్రలో, చలిలో వేడిమి తక్కువగాను వుంటుంది. ఉష్ణము చూడటానికి నాలుకక్రిందనే థెర్మామీటర్ పెట్టవలెననే నిర్ణయంలేదు. అటుల ఎల్లపుడు చూచుటకూ వలను పడదు. నాలుకక్రింద, చంకలో, మలాశయంలో ఎక్కడైన పెట్టిచూడొచ్చు. ఇలా చూడటంలో కొంచెం భేదముంటుంది. నాలుకక్రింద చూచిన దానికంటె అర్ధడిగ్రి తక్కువగావుంటుంది గజ్జలో చంకలో ఉష్ణము. మలాశయంలో వేడిమిపైన పేర్కొనినదానికన్న అర్ధడిగ్రి హెచ్చుగా వుంటుంది.

అసలు థెర్మామీటరు పెట్టుటకు ముందు పాదరసము 96 దగ్గరవున్నదో లేదో చూడవలె. లేకపోతే విదలించాలి. శీతోష్ణస్థితిని కొలిచిన తర్వాత 96-కు విదిలించి తుడిచి భద్రపరుపవలెను. థెర్మామీటరు రోగులకు అందులో ముఖ్యంగా పిల్లలకు చేతికి యివ్వకూడదు. థెర్మామీటరు నుపయోగించునపుడు రోగిని మాటలాడ నియ్యరాదు. ఇట్లు పరిశీలించినపుడు గొట్టములోని పాదరసము ఎన్ని డిగ్రీల వరకు పెరుగునో అన్ని డిగ్రీల వేడిమి శరీరములో ఉన్నదని తెలిసికోవాలి. ఉష్ణము అధికముగా వున్నా, ఉండవలసిన ఉష్ణము లేక చాల తక్కువగావున్నా, త్వరితగతిని హెచ్చు తక్కువలు కలిగినా వెంటనే వైద్యునికి కబురుచేయాలి.

నాలుకక్రింద థెర్మామీటరు వుంచి చూచేటప్పుడు పెదవులు మూసివుంచవలెను. పెదవులు ఎండివుండిన వాటిని తడుపవలెను. పిల్లల్లో, సన్నిపాతంలో, మూర్ఛల్లో, అప్పుడే శీతోష్ణాహారములు తీసుకొన్నవారిలో యీ నాలుకక్రింద ఉష్ణము చూడటం ఏం ప్రయోజనంలేదు.

పిల్లలకు ఉష్ణము చంకల్లో గజ్జల్లో సులభంగా చూడవచ్చు. థెర్మామీటరును ఉపయోగించుటకు ముందు చక్కగా చెమట తుడిచిపెట్టి రొమ్ముమీదికి గాని పొట్టమీదికిగాని వంచవలయును చేతిని తొడను థెర్మామీటరు జారకుండ. మలాశయంలో చూడటం శ్రేష్ఠం కాని అయితే ఇది అంత అనువుకాదు.

ఈమాత్రం గమనిస్తే పక్కింటి అబ్బాయినిగాని పరులనుగాని దేబరించనక్కరలేదు యీ ఉష్ణం చూడటానికని. ఏమి బ్రహ్మవిద్య కాదు ఇంతకూ.

# మనోరమ

ద్వితీయ ప్రసంగము *

## 'రాజకుమారి'

చ. పరమవివేక సౌరభవిభాసిత సద్గుణపుంజ
వారిజో। త్కరరుచిరంబులై సకలగమ్య
సుతీర్థములై మహామనో। హర సుచరిత్ర
పావనపయః పరిపూర్ణములైన సత్సభాం।
తర సరసీవనంబుల ముదంబొనరం గొని
యాడి వేడుకన్.

—నన్నపార్యుడు.

మే మయిదుగుర మొక సంఘముగా నేర్పడిన ఆ ప్రథమదివసమునందే మా యుత్సాహమును కార్యరూపమునకు గొనిరావలయునను ముఖ్యోద్దేశముతో మా సభాభవనమున సమావేశమయితిమి.

ఆహా! ప్రముఖు లన్నియెడలను సభావేదికలపై సాంఘిక రాజకీయ వాఙ్మయ రంగములలో సింహఘోషమున నుపన్యసించుచు తమతమ వివేకసౌరభముల నెల్లదిక్కులకును బ్రసరింపజేయుచుండగ అబలాలోకమున నయిదుగుర మొకచోటచేరి ఆంధ్ర మహిళావళికెల్ల మోదావహముగ మహదాశయములనుగూర్చి ప్రసంగింప సమకట్టిన మా యుద్యమము పట్ల స్త్రీజనహితైషులగు నుత్తమస్వాంతుల యాశీర్వాదములు మాకుఁ జేరకుండనుండవు గద! మేమును "సంఘం శరణం గచ్ఛామి" యను మహాపవిత్రమగు బౌద్ధధర్మ సాంప్రదాయము ననుసరించి అప్రమేయ గుణపూజ్యమైన సత్సభావళులకు నమస్కారము చేసి కర్తవ్య నిర్ణయమొనర్ప నిశ్చయించితిమి. అపుడు కళావతి మహాభారతసంహితరచనాసందర్భమున ప్రథమాచార్యుఁడగు నన్నయభట్టారకుఁడు గూడ నేతద్విధమగు సభావందనము చేసినాఁడని మాకు జ్ఞప్తికి తెచ్చినది. అందువలన నన్నపార్యుని సభాస్తోత్రమును నూతనోద్యమ సంభరితోత్సాహులగు వారికి స్మృతిపథముననుండుటకై దాని నీ ప్రసంగమున దొలుదొల్త నుదహరించితిని.

మాలో బుద్ధిబలమున విద్యాబలమున ప్రథమగణ్యయగు ప్రియంవదయే ముందు మా సమాజవిషయికమగు కార్యప్రణాళికను నిర్దేశింపవలయునని మే మేకగ్రీవముగా గోరుకొంటిమి. ఒక్క ప్రథమోపన్యాసమే కాదు, అన్ని సమావేశముల నామెయే మా సభారంగమున సూత్రధారిణియైయుండి మా యందఱిచేతను ఉత్తమమైన కథాకలాపములను నిర్వర్తింప జేయవలయునని నేనంటిని.

ప్రియంవద యిట్లు పలికెను:

సఖీమణులారా! సమస్త సత్ప్రయత్నములలోను జయమిచ్చునది యుత్సాహము. మన యుత్సాహపరిణామమునుబట్టియే మన కార్యకలాపముల సఫలతయు మనకు లభించుచుండును. ఆరంభమున మన యందుండు కార్యోత్సాహము కాలక్రమమున క్షీణించినయెడల అందులకు మనమే యుత్తరవాదుల మగుదుమని మీరు సదా జ్ఞప్తియం దుంచుకొనవలయును. జగత్తునసువలెనే మనుజయత్నములనుకూడ

* మనోరమాసంఘ నిర్మాణవిషయికమగు ప్రథమ ప్రసంగము క్రిందటి దసరా సంచికలో ప్రకటింపబడుట పాఠకులు గమనించియేయుందురు.

సరస్థితిలయములనునవి మూడును నైసర్గికములు. పరికించినచో నుత్తమోత్తమములగు నెట్టి యుద్యమములకును నివి క్రమముగ సంఘటిల్లుచునేయున్నవని మీరు తెలిసికొందురు.

ఆహా! ఇంత కాలమునకు గదా స్త్రీల కభివృద్ధిమార్గము లేర్పడినవి! శతశతాబ్దములనుండి క్రమ్మి ఘనీభవించి స్త్రీలోకము నావరించియున్న అజ్ఞానాంధకారము ఇంతకాలమునకు గదా విద్యాకిరణ ప్రసారమున నశింపజేయబడుచున్నది! ఇంత కాలమునకు గదా సర్వజగత్సౌభాగ్య సంపాదనమున స్త్రీలు బద్ధకంకణలై ముందంజవేయుట జరుగుచున్నది! నారీసంఘమునకు అసూయాపరుఁడు, స్వార్థలోలుఁడునగు పురుషుఁడెంత కాలమునుండియో ద్రోహపరంపరల నొనర్చుచువచ్చినాడు. స్త్రీ శ్రేయస్సహనాస్వభావదుర్భరులై యాడువాండ్ర నెల్లపుడు తమ వంటయింటి పడుకటింటి బానిసలుగ జూచుకొనుచు పురుషు లెల్లపుడును తాము, తమ విద్య, తమ సుఖము, తమ శ్రేయస్సే కాని తమ జీవితవ్యాపారములలో సమభాగినులగు తమ ధర్మపత్నులను ముందునకు వచ్చుట కొప్పుకొనక పోయిరి. ఆజన్మాంతమును పేడనీళ్లలో నిల్లలికి కొనుచు, పొయ్యిముందుఁ గట్టెలనడుమ కష్టపడుచు, పిల్లలను కనుటయే పరమవిద్యగా, ఆభరణధారణమే పరమప్రయోజనముగ స్త్రీలుండవలసివచ్చినది. జగజ్జీవనకారణమైన స్త్రీ పురుష సంబంధము లిట్లు విపరీతములగుటవలన మానవజాతి, మనుజజన్మమెత్తిన ప్రయోజనమునే మఱచినదా యనునట్లు ప్రవర్తించుచు వచ్చినది. భిన్న విద్యుద్ధర్మయుక్తములగు పదార్థము లాకర్షింపబడినట్లు భిన్నభిన్న తత్త్వయుక్తులగు పురుషులును స్త్రీలును పరస్పరాకర్షితులగుట ప్రకృతిధర్మము. పురుషతత్త్వమును స్త్రీతత్త్వమును చూచుటకు పరస్పర విరుద్ధముగనున్నను రెండును ఒండొంటిపై నాధారపడియున్నవి. ఒకటి నిష్ఠురము, రెండవది కోమలము. ఒకటి చపలము, రెండవది స్థిరము. ఒకటి హేతుయుక్తము, రెండవది భావప్లుతము. ఒకటి బలవత్తరము, రెండవది దుర్బలము. ఇట్లే స్త్రీపురుష తత్త్వములకు నైసర్గిక వైరుధ్యము కొంతయున్నను అవి సహజముగ పరస్పరాకర్షితములై ప్రమోదభాజనములైయున్నవి.

ఎల్లకాలములయందును స్త్రీల నెవ్వ రెంత యణచియుంచుచు వచ్చినను స్త్రీ సంఘాభ్యుదయాభిలాషులగు మనుజోత్తములు నాగరికప్రపంచమునందన్ని దేశములలోను మన యున్నతికై యుద్యమించుచునేయున్నారు.

సర్వతోముఖమగు నిప్పటి మన భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవముల కివియే మూలమని మీరు గ్రహింపవలెను. అసూయాపరులు స్వార్థలోలులునగు పురుషులు మన సంఘోన్నతి కెట్లు ప్రతిబంధకారులైరో అట్లే స్త్రీ సంఘోన్నత్యాభిలాషులగు పురుషులే మనకు మార్గదర్శకులై మనయెడల సమభావమును జూపుచు జగత్కల్యాణమునకు దోడ్పడుచు వచ్చిరి.

అందువలననే స్త్రీసంఘమున నేడింత సంచలనము—ఇంత శక్తి—ఇంత జీవనము—ఇంత సంక్షోభము—ఇంత ధాటి—సర్వదేశముల, సర్వతోముఖముగ వ్యాపించుచున్నవి. మన భారతీయ స్త్రీ జాతులయందును ఉత్తమ పరివర్తనావకాశము లేర్పడినవి. నేడు భారతీయస్త్రీలు జగజ్జేగీయమానమగు ప్రతిభావిశేషమును ప్రదర్శింప నేర్పరులయి చికాగో నగరమునుండి షాంఘై నగరమువఱకు భూగోళమున జరుపఁబడుచున్న సర్వప్రపంచ సమావేశములకు సహితము గమనతనమున బోయి వచ్చుచున్నారు. సమస్త కార్యభారవహన క్రియాచాకచక్యమునందు, సర్వమార్గదర్శక వ్యవహారనిర్వాహక ప్రతిభాసంపన్నతయందు స్త్రీలు పురుషుల కెంతమాత్రమును తీసిపోవరని సింహఘోషమున బ్రకటింప గలుగుచున్నారు. ఈ మహామాయాజగన్నాటకమున మనమెన్ని సాధించినను ఎన్ని వేషముల విజయప్రదముగ వేసికొన్నను ఎన్ని దిక్కుల విజయధ్వజముల

జేయగల్గినను మాటలో, జూపులో, రూపులో, నడకలో, దలపులో, చర్యలో, నాడువాం డ్రెప్పుడును నాడువారేయగుదురు కాని మగవారెప్పటికిని కాజాలరని ముఖ్యముగ గమనింపవలసియున్నది. స్త్రీలయం దెంత ప్రతిభావిశేషమున్నను, ఎంత విద్యాధిక్యమున్నను, సమస్త కార్యజాతములయందును తమకే యున్నతస్థానము లుండవలెనని అనర్థప్రదమైన నిష్ఫలాందోళనముల జేయరాదు. స్త్రీ విషయికమగు నెల్లయుద్యమములును ప్రశంసావహములే యని మీ రెప్పుడును భ్రమింపరాదు. ఇప్పుడు పాశ్చాత్యదేశములలో అన్ని జంతువుల వలెనే మనుజులుగూడ దిగంబరులయి సంచరింపవలెనను సిద్ధాంతములు (Nudist doctrines) కొన్ని యాచరణములోనికి దెచ్చుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. కావున మన మెంత నాగరికశిఖామణుల మనిపించుకొన దలంపు గొన్నను సాంఘిక వృత్తమునకు వేరుపురుగులని చెప్పదగిన ఇట్టి పాశ్చాత్యసిద్ధాంతములు మనలం బీడింపకుండ చూచుకొనవలెను. కావున స్త్రీ సంఘోద్యమములన్నియు ప్రశంసావహములే యని మీరు తలపరాదు. నేటి స్త్రీసంఘోద్యమారామసీమలలో గూడ గోరంటలు, కుక్కగొడుగులు, గులాబులు, గుల్ షబ్బులు, ఇట్లే వివిధ ప్రకృతు లెన్నియైన నుత్పన్నములగుచున్నవి. ఒకప్పుడు ముండ్లచెట్లును మొండిచేతులును పుట్టునపుడు మహారిష్టదాయకములగు ఉమ్మెత్త, విషముష్టి మున్నగు దుష్టపాదపములును ఆయా క్షేత్రముల నాయా బీజపరిణామమున నుద్భవించుచునేయుండును కదా! ప్రకృతియం దెల్లప్పుడును మంచివే పుట్టవలెనను శాసన మెచ్చటను లేకపోవుటచేత నిట్లు పుట్టిననన్నియు భూమికి భారమైయున్నవనియే తలంపవచ్చును. నిరంతర పరిభ్రమణశీలమగు కాలచక్రమున సారరహితములైన అనర్థకోద్యమములు చెల్లాచెదరుగ జేయబడుటయే గాక క్రమముగ నంతరించితమైపోగలవు. క్షుద్రోద్యమమారక మగు నిట్టి సంఘటనము ప్రకృతి ధర్మమనియే మనము తలంపవచ్చును.

మాయముత్తెమును జూచి మంచి ముత్తెమని భ్రమించినట్లు, ముచ్చెబంగారమును జూచి మేలిమి బంగారమని భ్రాంతిపడినట్లు, అసత్యమునునమ్మి సత్యమని సంతసించినట్లు, అనర్థకోద్యమముల నొకప్పుడు కొందఱు మెచ్చుకొని పొంగిపోవుటయు జరుగుచున్నది. మనుజుల రుచిభేదమునుబట్టి వారి యామోదమును ప్రసరించుచుండును. ఒకప్పుడు గూటిలోనున్న కలకండకుబట్టు కండచీమలకంటె కుళ్ళుగుంటలోనుండు కుంకుడుకాయలకే ఎఱ్ఱపురుగు లెక్కువగ బట్టవచ్చును. కావున ఆధునికడిమోక్రేటిక్ (సర్వజనసమ్మతమైన) పద్ధతుల ననుసరించి సంఖ్యాబాహుళ్యమున గణనీయమైనంతమాత్రమున నెట్టి యుద్యమములును ప్రశంసావహములేయనిమీరు భ్రమించకూడదు. దేనియందైన స్వతస్సిద్ధమైన జవమును, జీవమును, ఘనతయు (Nobility) నుండవలెనని మీరు గ్రహించవలెను.

భారతదేశము నేడు సర్వతోముఖమగు పరివర్తనముల కాలవాలమైయున్నదని మీ రెఱుంగుదురు. ఇట్టి సందిగ్ధసమయమున పాశ్చాత్యవ్యామోహము లొకవంకను సనాతన సాంప్రదాయము లొకవంకను మనల చలింపజేయుచున్నవి. శతశతాబ్దములనుండి దాస్యశృంఖలానిబద్ధమైయున్న ఆర్యజాతి స్వేచ్ఛాసంపాదనమునకై తహతహలాడుచున్నది. కొన్ని వందల యేండ్లనుండి మనదేశమును బట్టికొని పీల్చి పిప్పిచేయుచున్న పారతంత్ర్యభూతములను వదలించుకొనుటలో మన మన్నివిధముల పురుషులకుం దోడ్పడవలెను. బిడ్డల మహావ్యాధులచే, దారిద్ర్యముచే, వైషమ్యముచే ఈకంటినీరు బంగాళాఖాతముగ—ఆ కంటినీరు అరేబియా సముద్రముగ విలపించుచున్న భారతమాతను మనము ధీరస్వాంతనుజేసి సమాశ్వాసింపజేసినయెడల నదియే మన జన్మములకు కృతార్థత్వమని మనము తలంపవచ్చును. ఇక ముందుంజేయబోవు ప్రసంగములం దెల్లయెడల విస్మరింపకుండ మన మెల్లపుడు దృష్టిపథమున నుంచుకొనవలసిన ముఖ్యాంశముల గొన్నిటిని సూత్రప్రాయముగ జెప్పితిని.

మన సంఘమున కొంతకాలము దనుక నవలంబింపఁదగిన కార్యప్రణాళికనుగూర్చి మనమిప్పుడు చర్చింపవలసియున్నది. స్పెక్టేటర్‌క్లబ్, సాక్షిసంఘముల పరమోద్దేశములనే స్త్రీజాతిపట్ల నవలంబింపగోరి మనమిప్పుడు సంఘముగా నేర్పడితిమి. ఆంగ్లభాషకును ఆంధ్రభాషకును వన్నెదెచ్చిన సంఘరాజముల వైఖరిని మనమొక సంఘముగా నేర్పడియు అట్టి సేవనే మహిళాలోకమునకు మనమెంతవఱకుఁ జేయనోపుదుమో చర్చింపవలసియున్నది. నూతనోద్యమ మెవ్వరైన దలపెట్టినయెడల నందేవిధముగ తప్పుబట్టవచ్చునాయని జనులు సహస్రనేత్రములతో ప్రతీక్షించుచుందురు. కావున మన మేయుత్తమ సంఘముల నాదర్శముగ బరిగ్రహించి సంఘముగా నేర్పడితిమో వాని ఘనతకుకూడ మనవలన కీడుపాటు వొరయకుండఁ జూడవలసిన బాధ్యత మనయందున్నదని మీరు సర్వదా జ్ఞప్తియం దుంచుకొనవలెను.

రెండువందలయేండ్లకు పూర్వ మాంగ్లదేశమున స్పెక్టేటర్‌సంఘ ముదయించినప్పుడు యూరప్‌ఖండమున బలుదేశములలో నట్టిసంఘము లేర్పడి తమ తమ దేశ వాఙ్మయములకు వన్నెయువాసియు నొడగూర్చినవి. ఆ య్యాదిమాంగ్లసంఘమును బట్టియే ఆధునికాంధ్రకవిబ్రహ్మయని చెప్పదగిన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి సృష్టినైపుణ్యమున "సాక్షి" సంఘ మాంధ్రభూమియం దుదయించినది. ఈ సమావేశప్రారంభమున కళావతి మనకు వాగనుశాసనుని స్మరణకు దెచ్చినది. ప్రబంధనిర్మాణమున నెల్లప్పుడును కృత్యాద్యవస్థలచే నొప్పుచుండు కవులకు పూర్వకవి సాంప్రదాయములబట్టి తప్పనిసరిగా నన్నయభట్టు జ్ఞాపమునకువచ్చుట సహజమేయైనను మన సంఘప్రబంధమున నన్నయభట్టారకునికంటె రసవద్రచనా విశారదులగు నరసింహారావు పంతులుగారే మనకెక్కువ వందనార్హులని చెప్పగలను.

మన సంఘమునకేయు ప్రసంగములు రెండువందలయేండ్లక్రితమాంగ్లదేశమున బుట్టిన స్పెక్టేటర్ సంఘవైఖరినుండుట యుక్తమో లేక ఇటీవల మనయాంధ్రభూమిని బుట్టిన సాక్షిసంఘప్రసంగములధోరణినుండవలెనో మనమిప్పుడు నిర్ణయము చేయవలసియున్నది. ఇది మనయందఱి యిష్టమునుబట్టి నిశ్చయింపబడవలసినదగుటచేత నాయుపన్యాస మింతటితో ముగించుచు మీ యభిప్రాయముల వెల్లడింపగోరుచున్నాను.

అంతట లీలావతి యిట్లు పలికెను.

ప్రియంవదవలె నేనంత స్పీకర్ (వక్త*)ను గాకపోయినను నాబుద్ధికిఁదోఁచిన ముఖ్యమగు నొకటి రెండు పాయింట్ల (సంగతుల)ను చెప్పెదను.

ఫస్ట్లీ (Firstly) నాగరిక ప్రపంచమున వాయువేగ, మనోవేగములతో అభివృద్ధులు అనగా డెవలప్‌మెంట్స్ (Developments) నంబర్ లెస్ గా (సంఖ్యాతీతములుగ) కనిపెట్టబడుచున్నవి. ప్రపంచమంతటా స్పీడ్, రెపిడిటీ, హరీ (వేగము, సత్వరత, తొందర) సర్వవ్యవహారములలోను గోచరమగుచున్నవి. ఒక్క ఫీమేల్ వేర్ (స్త్రీల యుడుపుల) లోనే చెప్పనలవిగానిమార్పు లగపడుచున్నవి. ఎవ్వరో రావణాసురుని కాలపు పద్ధతుల నవలంబించు చదువురాని అడవిమనుష్యులకు దప్ప—ఐ మీన్ ది వైల్డ్ మెన్ ఆఫ్ ది దండకాఫారెస్ట్ (దండకారణ్యము ఆంధ్రదేశములో భాగమని ప్రూవ్ అయినది) కనుక ఇట్లు చెప్పుచున్నాను.—ఇపుడు చెప్పుచున్న సంగతి యేమనగా సివిలైజ్ అయియున్న అనగా నాగరికతను పొందియున్న వెస్టర్న్ నేషన్సులో (పాశ్చాత్యజాతులలో) ఎప్పుడేయే ఛేంజెస్ అనగా మార్పులు కలుగుచుండునో కనిపెట్టి అవి మన ప్రాక్టికల్ లైఫ్‌లో (జీవితచర్యలలో) అనుస

* లీలావతి తన సహజధోరణిని ఆంగ్లపదభూయిష్ఠముగ మాట్లాడినది. ఆమె ప్రయోగించుచు వచ్చిన యాంగ్లపదముల యర్థమును నాచేతనైనంతవఱకు ఈవిధముగ దెలుపుచుందును.

—మనోరమ.

రించిననే మనచమువునకు, బుద్ధికి సరియైన శోభ కలుగునని మనము గ్రహింపవలెను. ప్రాతపద్ధతుల నవలంబించుట—అనగా ఓల్డుఫ్యాషన్సు—పట్టిబుద్ధి హీనులవని, సింపిల్ ఫూలిష్‌నెస్ (Simple foolishness.)

సెకండ్లీ (Secondly), స్పెక్టేటర్ క్లబ్ అనునది రెండువందల యేండ్లక్రిందట ఇంగ్లండ్ దేశములో పుట్టి అప్పుడే నశించిపోయినది. ఇపుడు మన మా పద్ధతి ననుసరించి మన సొసైటీని వర్క్ చేసిన (జరిపించిన) యెడల అది మనల నందఱిని ఫూల్స్ పేరడైజ్ (Fool's Paradise)నకు తీసుకొనిపోయి విడిచి పెట్టును. అనగా మనము నవ్వులపాలయిపోదుమన్న మాట—ఏ లాఫింగ్‌స్టాక్ (a laughing stock). ఎందుచేతననగా ఇప్పటి కింగ్ జార్జి ది ఫిఫ్త్ రాజ్యమునకు వచ్చువఱకుకూడ ఇంగ్లండ్ దేశములోని స్త్రీలందఱును దీర్ఘమైన గౌనులను ధరించుచు వచ్చిరి. ఇప్పటి ఫ్యాషను లట్లులేవు గద! ఇపుడు చికాకులేకుండ కాలుచేతు లెంత కానవచ్చుచు దుస్తులను ధరించిన నంత బ్యూటీయని (అందమని) కని పెట్టబడుచున్నది. హైజినిక్ ప్రిన్సిపిల్స్ అనగా ఆరోగ్యసూత్రములనుబట్టికూడ ఇప్పటి వెస్టర్న్ (పాశ్చాత్య) ఫ్యాషనులు ప్రాక్టికల్‌గ నుత్తమమని చెప్పవచ్చును.

థర్డ్లీ (Thirdly), సాక్షి సంఘమువలె మన సంఘ ముండవలెననుట రెండవ ఫూలిష్‌నెస్ (బుద్ధితక్కువ) ఈ సొసైటీలోని మెంబర్లము మన మెప్పుడును సాక్షిసంఘసభ్యులతో పోలికలు తెచ్చి పెట్టుకొనగూడదు. దేర్ ఈజ్ నాట్ ఎ సింగిల్ ఫేక్ట్ ఆఫ్ రిజంబ్లెన్స్ బిట్వీన్ అస్ ఎండ్ ది మెంబర్సు ఆఫ్ ది సాక్షి సొసైటీ (There is not a single fact of resemblance between us and the members of the Sakshi Society.) మనోరమ మనలగూర్చి పత్రికలకు బంపు రిపోర్ట్లు (లేఖల)లోనిది సాక్షి సంఘమునకుఁ బ్రతిగా ఎస్టాబ్లిష్ కాఁబడినట్లు అనగా స్థాపింపఁబడినట్లు వ్రాయుచున్నను కాని అట్టి సంఘమే మన సంఘ మనుకొనుటకంటె స్టుపిడిటీ వేఱొకటిలేదు. ఎవ్వెరి వన్ ఆఫ్ ది సాక్షి సొసైటీ ఈజ్ ఎ బ్రూట్, ఎ స్టుపిడ్, ఆర్ ఎ బోర్. (Every one of the Sakshi Society is a brute, a stupid or a bore) "స్పెక్టేటర్‌క్లబ్" అను నాంగ్ల శార్దూలమును జూచి వాతలు వేసికొనిన తెలుగునక్కల మని యనిపించుకొనినను కొంత ప్రాపర్‌గ (సరిగ), ప్రతిష్ఠాకరముగ నుండ వచ్చును గాని ఛీఛీ సాక్షి సంఘమునకు ఇమిటేటరులమని యనిపించుకొనుటకంటె సిగ్గులచే టింకొకటి లేదు. వుయ్ షుడ్ బి రీయల్లీ ఎషేమ్డ్ ఆఫ్ అవర్‌సెల్వ్స్ టు ప్రొక్లెయిమ్ ఏజ్ సచ్ టు ది వర్ల్డు ఎట్ లార్జి అని పొంగి పొరలి వచ్చుచున్న ఆంగ్లపదప్రవాహమును మాపై బ్రసరింపఁజేసి లీలావతి కూర్చుండెను. అంతట కామేశ్వరమ్మ కూడ తన యభిప్రాయమును తెలుపవలెనని నే నంటిని. ఆమె యిట్లు పలికెను.

అమ్మలారా! నే నంత తెలిసినదానను, అంత చదువుకొన్నదానను, అంత జ్ఞానవంతురాలను కాను. ఆ యింగ్లీషుసంఘము లెట్టివో ఈ తెనుగుసంఘము లెట్టివో నే నంతగ పఠించి తెలిసికొనియుండలేదు. నాకు తెలిసిన సంగతులను గూర్చియే సరిగ జెప్ప జాలనిదానను, తెలియని సంగతులనుగూర్చి యెట్లు చెప్పగలను? పుట్టంధుఁడు వర్ణవ్యత్యాసబోధన మొనర్పజాలఁడు గద!

ఎప్పుడో వేదము లెత్తుకొనిపోయిన సోమకాసురుని నాటి ప్రాచీన పద్ధతుల నవలంబించు మే మొక యడవిజాతి మనుష్యులమని మీరు తలంప వచ్చును. తలంచుటయే కాదు—కంఠోక్తిగ నిప్పుడు లీలావతి యట్లే సెలవిచ్చినది. అయిన గానిండు. ఆంగ్లభాష యను నంధకారమున మా కన్నులను గప్పి ప్రత్యక్షముగనే మీరు మమ్ము తిట్టినను తిట్ట వచ్చును.

లీలావతి—ఐ నెవర్ మెంట్ టు అఫెండ్ యు. నిన్నుద్దేశించి నేను తిట్టలేదు. ఎప్పుడును నట్లు చేయుటలేదు

కామే—లేనియెడల సంతోషమే. దివాంధము తన నేత్రపాటవశూన్యతను నిందించుకొనవలెను గాని సూర్యతేజమును నిందింపవచ్చునా? ఆంగ్లభాషా పరిచయము లేనివారు విద్యాగంధశూన్యులనియు పరమమూర్ఖులనియు పంక్తిబాహ్యులనియు మీ వంటి దొరసానుల యూహ కావచ్చును. కాని మీ యింగ్లీషుచదువు లెంతవఱకు వచ్చినవో మీరే యోచించుకొనుడు. ఇప్పటి చదువులన్నియు నగ్న సిద్ధాంతములలోనికి దిగుమన్నవని ప్రియంవదయే చెప్పినది. ఎప్పటికప్పుడు మారిపోవుచున్న వేషను లవలంబించవలయుననియు లేనియెడల నాగరికతా శూన్యుల మనిపించుకొనవలసిన ఆపద మనల బట్టుకొనుననియు లీలావతి ఒక అరనిమేషము క్రిందటనే చెప్పినది. ఇక మీ నాగరికతా సంపన్నతకు ఏది యవధియో నాకు బోధపడకుండనున్నది. ప్రియంవద చెప్పినట్లు ఆడుది ఎన్ని పోకడలు బోయినను మగవాఁడు కాగలడా? ఆడువేషములు వేయు పురుషులైన నటులు సంఘమున పతితులనియు అట్టి భ్రష్టాత్ములు పంక్తిబాహ్యులనియు శాస్త్రములు చెప్పుచున్నవి. కేవల వినోదార్థము నాటకములలో వేషములువేయు మగవాని కర్మమే యిట్లు కాలిపోవుచుండగ ప్రత్యక్షముగ వేషముల నిమిత్తమే మన కండ్లయెదుట దిరుగుచుండు కులస్త్రీ లట్టి పద్ధతుల నవలంబించి మగవాండ్ర మనిపించుకొన ముచ్చటపడుట యెందులకో నాకు తెలియకుండ నున్నది. మగవాండ్రుకూడ సిగ్గుపడి తలలు వంచుకొనునట్లు మీ రిప్పు డింత బాహాటముగ గుఱ్ఱముల నెక్కి, గాడిదల నెక్కి, సైకిళ్ల నెక్కి- తిరుగుచున్నారు గదా! మీ స్వేచ్ఛావిహారముల కిప్పటికైన నంతముండునా? కుక్కలను గాడిదలను ఎక్కి విఱ్ఱవీగినంతమాత్రమున సర్వజగదజయ్యా విక్రముల మైతిమని, దిగ్విజయము చేకూరినదని సంతసించవచ్చునా? "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అను శాస్త్రవాక్యముపై మీరింత పగఁబట్టి మీరిన్ని విధముల గంతులు వేయవచ్చునా? భాగ్య సౌభాగ్య వర్ధనమైన సదాచారములను తృణప్రాయముగ బరిత్యజించుచున్నారు. అంతమాత్రముననైన మీకు మన స్సంతుష్టియగుచున్నదా! నేటి ఫ్యాషను రేపటికి ప్రాతగిలిపోవుచున్నదని కదా లీలావతి యనుచున్నది. ఎప్పటికప్పుడే మీ వైఖరులు మీకే రోత బుట్టించుచున్నపుడు—అట్లు రోత బుట్టించుటయే మీ ఫ్యాషనుల తత్త్వమైనపుడు యిప్పటి మీ పద్ధతుల పై జూపు మమకారమైనను వారి సదాచారములపై నెందులకు జూపలేరు? "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"అను పరమసూత్రమును విస్మరించుటచేతనే కదా భరతజాతి కిన్నిపాట్లు వచ్చినవి!

పరపద్ధతుల నవలంబించి స్వకీయపద్ధతుల దలంపకుండుట ఊరివారికి విందుచేసి తల్లిని పస్తుబెట్టుట వంటిది కాదా? మే మాంగ్లపద్ధతులవలననే సర్వాధికులమయ్యేదమనుట దేవతార్చన మింగ్లీషునజేసి పవిత్రులమయ్యేదమనుట వంటిది కాదా?

ఐదువతన మనగ నేమో దానిని కులస్త్రీలేల పాటింపవలెనో మీ రే లవలేశమును తెలిసికొనకుండ మన యుత్తమాచారముల నసహ్యించుకొనుచున్నారు. పసుపు, కుంకుమ, గాజులు, మంగళసూత్రము, మట్టెలు, కలది కదా ఐదువ!—

లీలావతి—పేడ?—వాట్ ఎబౌట్ కౌడంగ్?

కామే — అమ్మా నీ వైదువ వగుటకు దానిని బూసికొన నక్కఱలేదు. దానిని తాకకుండగనే నీ వీరైదువస్తువులను నుపయోగించిన యెడల హైందవాంగన వనిపించుకొందువు. దొరసానివాయెను! నీ వట్లేల చేయుదువు. ఇంగ్లీషువారి వస్త్రధారణములోని ఆరోగ్యతత్త్వమును గూర్చి యుపన్యసింపగలవు కదా! నీ నోట వచ్చిన గోమయ మందలి ఆరోగ్యగుణముల నెందులకు గ్రహింపఁజాలవు? ఉగ్గుపాలతో ఆంగ్లభాషను పఠించుచు, ఆంగ్లవైఖరుల నవలంబింప నేర్చుకొనుచున్న మీ వలన పారతంత్ర్యవ్యాప్తియే కాని మోక్ష మెప్పటికైన చేకూర గలదా? ఉద్యోగాభిలాషిణులకు, జీవయాత్రావ్యాపారములలో ప్రయోజకురాండ్ర

మనిపించుకొనువారికి, ఇంకను రాజకీయ వ్యవహార పరాయణులాంధ్ర మనిపించుకొన నిచ్ఛగించు స్త్రీలకు ఆంగ్లవిద్యావశ్యకత యుండవచ్చునుగాని తదితరుల కట్టి యవసర మేమి యున్నది? మీ రింగ్లీషు విద్యలను గౌరవింప వచ్చునుకాని మన సదాచారములను బుద్ధిపూర్వకముగ నెందులకు మంట బెట్టవలెను?

స్త్రీత్వమును చెరగొట్టుకొని మగతన మవలంబించుకొన బ్రయాసపడుచున్న మిమ్ములను గన్న దేశమాతకు నవ్వే కలుగునో, కోపమే వచ్చునో, రోతయే పుట్టునో, యేడుపే వచ్చునో, కవులు గారు గదా కమలాసనుండైన వర్ణింపఁగలఁడా? ఆంగ్లవిద్యా ప్రభావముననే గదా విధాతృ సృష్టిచేతనే యేర్పడిన వర్ణలింగ విభేదము లదృఢీకరింపఁబడి ఆ బ్రాహ్మణ చండాలమును ఒక్క మాల కూటిగా కలసిపోవలెనను సిద్ధాంతము లీ దేశమున బొమ్మజెముడువలె వ్యాపించి పోవుచున్నవి! ఇన్నాళ్లకు గదా సంసారిణులు కూడ ఫ్యాషనుల యింద్రజాలమున జారిణులకు గూడ సిగ్గువచ్చు వేషముల నవతరించుచున్నారు! ఇట్టి సంకర స్వరూపముల జూచి నే నేమి తలంపగలను? పూర్వయుగములలో శిఖండి ఒక్కతెయే యుండగా నేడు మగవాఁడు కాకుండ నాడుది కాకుండ ఏదో మధ్య మార్గమున బుట్టినదా యను సందేహమునకు దావలములైన పురుష సువాసినీ స్వరూపము లూరూర గాన వచ్చుచున్నవే! తాను మగవాఁడను కాగల ననుకొని మగవాని పోడుముల దెచ్చిపెట్టుకొన బ్రయాసపడెడు ఆడుదానికి మగవాని చింకములు పట్టుపడక పోవుట యటుండగ సహజములగు నాడుపొంకములు నేల గలిసితీరు ననుట నిశ్చయము. ఇట్టి యుభయభ్రష్టత్వపు పాడురూపములు లోకసమ్మోహనదక్షముగ నున్నవనియే తలంచుచుంటిరా? ఇట్టి సంకరవేషములవలన స్త్రీజన సామాన్యమైన లజ్జా సాధ్వసములు మంటగలిసి పోవుచుండుట లేదా?

ఇకనైన స్వకీయసదాచారములు వదలుటలో, బరకీయదురాచారములను పైన వేసికొనుటలో ఆడువారివంటి కూరు లింకొకరు లేరని మీరు లోకమునకు బ్రకటింపకుండ నుండుడు. ఈ పురుష సువాసినీ స్వరూపముల నికఁ జాలించి ఆర్యసాంప్రదాయానుగుణ్యమైన స్త్రీవైఖరుల నవలంబించుటయే భాగ్యసౌభాగ్యవర్ధనమని మీరు తలంపవలెను ఇక నీ సంఘవ్యవహారములను నిర్వర్తించుటలో విద్యా వివేక సంపన్నులగు మీ రెట్లు నిశ్చయించినను నాకు సమ్మతమే. వీలగునంతవఱకు భారతీయధర్మములకు విరుద్ధముగ నుండని యెట్టి పద్ధతులైనను మన కనుకరణీయములని నేను తలంచుచున్నాను.

అంతట కళావతి యిట్లు పలికెను—

ముఖ్యముగ స్త్రీల కావశ్యకమై చర్చనీయమైన మహోదంతముల గూర్చియు, వృద్ధిమార్గముల గూర్చియు, నాశయముల గూర్చియు బ్రసంగింప నుద్దేశముతో మన మిప్పుడు సంఘముఁ నేర్పడితిమి. ఆంగ్లమున గీర్తికెక్కియున్న సంఘమును బట్టి ఆంధ్రమున సాక్షిసంఘ మేర్పడినది. అయినను ఆ రెంటికిని పోలిక లేనేలేదు. అట్లే పర్యవసానమున మన సంఘమునకును వానికిని పోలిక యుండకపోవచ్చును. "ముఖేముఖే సరస్వతీ" అని పెద్దలు చెప్పినట్లు ఎవరి యంతటివారు వారు. ప్రకృతి సిద్ధమైన రుచిభేదములను బట్టియే మన సంఘములలో బ్రత్యేకతయు, ననన్యాశ్రయమైన సహజ ప్రతిభయు గోచరింపఁగలవు.

కావున మన సంఘోద్దేశములనే మన దృష్టిపథమున నుంచుకొని మన బుద్ధికి దోచినట్లు స్త్రీజన సంబంధమైన సందర్భములగూర్చి ప్రసంగింతము.

ఇంతవఱకు మాట్లాడిన మీ రందఱును మీమీ యభిరుచులను బట్టి యుక్తి యుక్తమగు సత్ప్రసంగములఁ జేసి మీ యూహలను వెల్లడించిరి. మన ప్రసంగము లన్నియు స్త్రీజనాకర్షములుగ నుండవలయునని మీరు ముఖ్యముగ జ్ఞాపక ముంచుకొనవలెను. వ్యాసముల ధోరణినుండుట ఇట్టి సంఘోపన్యాసముల స్వభావము. ఎంత విద్యాధురీణులాంధ్రకైనను కథలపైనుండు ప్రీతి వ్యాసములయందుగాని

ఉపన్యాసములయందు గాని యుండదు. అంత మాత్ర మున మనము నిరుత్సాహులము గానక్కరలేదు. కొంతకాలము దనుక మన ప్రసంగములను కథా రూపమున వెల్లడి చేయుటకు మనకు చక్కని యవ కాశ మున్నదని నాకు స్ఫురించుచున్నది. సత్కథల కున్న యాకర్షణశక్తి నిరుపమానమైనది. ఉత్తమా శయముల బోధించుటకు వర్తమాన కాలమున కథలను బోలిన సాధనము ఇంకొకటి లేదు. అన్నివిధముల నిది నవలాయుగము.

ఉ. "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్
వావిరి బుట్టు రత్నము లవారితసత్కవి కల్పనా విశే
షావహ పూర్వవృత్తములు సానలదీరిన జాతిరత్న ముల్
గావున నట్టి మిశ్ర కథగా నొనరింపుము నేర్పు పెంపునన్."

అట్టికథలకు మన ప్రసంగములలో నవకాశ ముండ దని మీరు తలంపవచ్చును. మన సంఘోద్దేశములకు విరోధము లేకుండ స్త్రీవిషయిక మగు నాదర్శముల జర్చించుచు మన మయిదుగురమును గూడి చెప్పగల యుత్తమ కథయొకటి యున్నది. 'టెన్నిసన్' అను నాంగ్ల మహాకవి ది ప్రిన్సెస్ అనగా 'రాజకుమారి' యను పేర దీనిని రచియించి యున్నాఁడు. చాల కాలము క్రిందట టెన్నిసన్ చేత జెప్పబడిన 'రాజ కుమారి' యందు మన కంతగ బ్రయోజన ముండదని లీలావతి తలంపవచ్చును. కాని యాకవి భావి సంఘటనల నన్నిటిని దూరదృష్టిని గనిపెట్టెనా యని పాఠకులకు భ్రాంతి కలుగజేయున ట్లీ కథ యేడుగురి చేత జెప్పించినాఁడు. అనగ నొకఁడు కథఁజెప్పుట కారంభించి కథ కొంతవఱకు సాగనిచ్చి నడుమ నాపివేయును. రెండవవాఁ డా కథను దీసికొని తన బుద్ధికి దోఁచినట్లు వృద్ధిచేసి మఱల నెచ్చటనో వదలి వేయును. మిగిలినవా రొకరితరువాత నొకరుగ నదేవిధముగ కథను పెంచి వినిపింతురు. ఇది యొక వినోదమైన కథాకలాపము. మనము కూడ టెన్నిసన్ పద్ధతి నవలంబించి టెన్నిసన్ వ్రాసియుంచిన కథనే దీసికొని భారతీయ సాంప్రదాయానుగుణ్య ముగ కథను మార్చి మన యభిరుచులను బట్టి వర్ణించి చెప్పిన నది మనోహరముగ నుండకపోదని నా యభిప్రాయము. 'సత్కవికల్పనా విశేషావహ పూర్వ వృత్తములు సానలదీరిన జాతిరత్నము' లని రామ రాజభూషణుఁడు చెప్పకొని యున్నాఁడు. అట్టి మిశ్రకథనే మన మయిదుగురమును తొలుత జెప్పు కొని మన ప్రసంగములయెడల నాంధ్రనారీలోక మున కభిరుచి పుట్టునట్లు చేయవచ్చును

ప్రియంవద—కళావతి చేసిన యాలోచనము ప్రశంసనీయముగ నున్నది. ఆమె యుద్దేశించినట్లు మన మీ కథను జెప్పగలిగిన యెడల కథాసందర్భ మున మన కనేక విషయములను దర్కించుట కవకాశ మున్నది. ప్రిన్సెస్ వంటి యుత్తమగ్రంథ మింత వఱకు నాంధ్రమునకు బరివర్తింపకపోవుట ఆంధ్ర నారీలోకమునకు మిక్కిలి కొఱత. అట్టి కొఱతను మనలో గవయిత్రి యగు కళావతి తీర్ప నూహించు టయే గాక అట్టి సదుద్యమమున మన సహాయమును గూడ గోరుకొనుట నాకు మోదావహముగ నున్నది. పుట్టుకతోనే సర్వలక్షణ సంపన్నుడై బుట్టిన కళా పూర్ణునివలె కథ మన కాంగ్లగ్రంథమున నుండనే యున్నది. దానిని అంటిపండొలిచి చేతి కిచ్చినట్లు తెలుగువారి కందజేయుటయే కొఱత. కాని ప్రారంభ మున నీయుద్యమమును గనిపెట్టిన కళావతియే దీని నారంభించి చెప్పవలెను. తరువాత క్రమముగ మన మందఱమును జెప్పవచ్చును.

లీలావతి—వాట్ ఎబౌట్ కామేశ్వరమ్మా?

ప్రియంవద—కళావతీ, నేను, నీవు, జెప్పిన యనంతరముగదా ఆమె కథను నడిపింపవలెను. నీవు మా యిరువురివలెఁ జెప్పగలిగిన యెడల ఆమె మన యంతటివలెను చెప్పగలదో లేదో నీవే జూతువు గాని—

లీలావతి—ఇట్ ఈజ్ ఎ లీప్ ఇన్ ది డార్క్ (అంధకారమున దుముకుటవంటిది)

ప్రియంవద—"సంశయాత్మా వినశ్యతి" అని పెద్దలు చెప్పుదురు. నీ కంత సందేహ మక్కఱలేదు. ఇంతకు తినబోవుచున్న కూరల చవు లడుగుట యెందులకు?—నేడు చాల కాలాతీతమైనది. ఇంత టితో నీ సభను చాలింతము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# బాలవిజ్ఞానశాఖ

౧. ప్రాతపాటలు

శ్రీమతి కా॥ మైత్రేయిగారు

కలవారి కూతురూ గారాబుపట్టి
కలువలు వడబోసి కడుగుచున్నాది
వాడాలకాముడూ వీధిలోరాగా
వాడు మల్లెచెండు వనితపై విసరెా
ఏమితెలియని ఆకన్నె ఎత్తిముడువగను
అత్తగా రనియేటి ఆపెద్దరాలు
ఆకులు తెప్పించి లేఖరాయించి
పుట్టింటి కొకకమ్మ పుట్టించెకమ్మ
అత్తింటి కొకకమ్మ అంపించెకమ్మ
బంధువుల కొకకమ్మ పాటించెకమ్మ
ఏడుగురు అన్నల్లు పైరులూనాట
ముద్దుచెల్లెలి మాటవిని సాగిరపుడు
ఏడుగురు అన్నల్లు ఏనుగులమీద
అయిదుగురు వదినెలు అందలంమీద
వచ్చిరే ఎలమంచి, పట్నమ్ముదాటి
నగరి వాకిటికొచ్చి నయముగానిల్చి
పయిడి చెంబులో నీళ్లు పాదములకిచ్చి
స్తంభంమరుగున పోయి కన్నీరునించె
తుడుచుకో కన్నీరు ముడుచుకో కురులు
ఎత్తుకో పాపడిని, ఏనుగులమీద
అత్తరో, ఓయత్త పోయివచ్చేను
మాయన్న లొచ్చేరు నన్నంపవలెను.
మామరో ఓమామ పోయివచ్చేను
మాఅన్న లొచ్చేరు నన్నంపవలెను.
బావరో ఓబావ పోయివచ్చేను
మాఅన్న లొచ్చేరు నన్నంపవలెను.
అడ్డగంధంపెట్టి ఒడ్డనిలుచున్న
ఆయన్న తమ్ముడా పోయివచ్చేను.
తోటలోని దవనమా తోటికోడండ్లా
మాఅన్న లొచ్చేరు నన్నంపవలెను.
వ్రేలి వుంగరముపెట్టి వీధినిలుచున్న
వివరముగల్ల మొగవాడ పోయివచ్చేను.
అమ్మరో ఓయమ్మ గారు పార్వతి
నీముద్దు కోడల్ని ఏమంటివమ్మ
పసుపాడ పసుపిచ్చి పసుపాడమంటి
వీధిలో తలవిప్పి దువ్వవద్దంటి
చిన్నగడపలో కాలు వుంచవద్దంటి
అయిన నామాట పాటించకపుడు
చిన్నకడపన వుంచె కాలు తాయింతి
వాడాల కామూడూ చెండువిసరగను
ఒయ్యార మొలకంగ ఎత్తి తా ముడిచె.
పచ్చిపొగడపుతీగ బంగారుబొమ్మ
భాగ్యము కలిగినలక్ష్మి నేనంపజాల
వీధిలో నేనిల్చి చెండువిసరగనూ
ముద్దరాలు నా భార్య ఎత్తిముడిచేను
అమ్మరో ఓయమ్మ నాముద్దుతల్లి
యిందులో తప్పేమి వివరించవమ్మ
అబలనూ దానట్లు నిందశాయగనూ
మనసెట్లు ఒప్పెనే తల్లిరో నీకు
వచ్చిన వారిచెల్లె విందుశాయగనూ
పోయిరే, సంతసమున ఎలమంచిదాటి.

## ౨. పాట

శ్రీమతి గొట్టిపాటి చిలకమ్మగారు

చందమామ చీరగట్టి
చాలుపప్పు వళ్లోబోసి
అమ్మా నేను చిన్నదాన్ని
అల్లుడొస్తె అంపవద్దు
మామవస్తె మళ్లీరమ్మను
చద్దిగట్ట గుడ్డలేదూ
సాగనంప ప్రొద్దులేదూ
ఇరుగుపొరుగు అక్కల్లార
ఒకటె తుమ్ము—అచ్.

---

## ౩. నా పాప

అడివి బాపిరాజుగారు, బి.యె.; బి.యల్.

రావమ్మ నాపాప రావమ్మతల్లీ
వచ్చినా అడ్డాల వాలిపోవమ్మా,
చేపొచ్చి నాపాలు చెదిరిపొయ్యేను,
చిరిగిపోయేరవిక జేబులూ రెండు
రావమ్మా!
కసిరి చివురులఎరుపు కంపించునోరు
పసలూర పణకలే పాలిళ్లతల్లీ,
పసిడిముద్దలచేయి పాలాడించు
పైటలో నీఅమ్మ హాయిమంటుంది
రావమ్మా!
జగములో తీపెల్ల జన్మమెత్తింది
ఒడ్డూరమై నాదు అడ్డాలనిమిడే
గలగలా హారాల కదిలించుచేయి,
ఒలికించు, నాముక్కి ఒళ్లోకితల్లీ
రావమ్మా.

---

## ౪. మఱ్ఱిచెట్టు—తాటిచెట్టు

శ్రీమతి జమ్మి కనకవల్లీబాయిగారు

మఱ్ఱిచెట్టుక్రింద మధ్యాహ్నసమయాన,
బాటసారియొకడు పక్కవేసి,
చెట్టువైపుచూచి, చిరునవ్వునవ్వుచు,
ఎంతవింతయనుచు నిట్టులనియె.
"ముదురుచింతచెట్ల మూడుమొదళ్లైన
దీనిమొదలుగావు, దీనికొమ్మ
లెన్నియున్నవన్ని, యన్నితాళ్లనవచ్చుఁ
గానిలోపమొకటి గానవచ్చు."
మంచితాటిపండు కుంచమంతగనుండు,
మఱ్ఱిపండు సగడమంతెయుండు,
సృష్టికర్తతప్పుచేసెగా," అనుకొంచు
నొక్కకునుకుతీసి యొత్తిగిల్లి.
ఒళ్లుప్రక్క మఱ్ఱిపళ్ళతో నిండియుండుట
చూచి యులికిపడుచులేచి, "ఔర!
పాప మిప్పితాటిపండ్లైన జత్తును,
సృష్టికర్తమేలుచేసె"ననియె.

## ౫. కాకి, పిచ్చుక కథ

శ్రీమతి వారణాసి వెంకటలక్ష్మీనరసమ్మగారు

అనగా అనగా ఒక అడవిలో పిచ్చుక, కాకి నివసించుచుండెను. కాకి కర్రలతో ఇల్లు కట్టుకొనినది. పిచ్చుక పిడకలతో యిల్లు కట్టుకొనినది. ఒకనాడు పెద్ద గాలి వాన వచ్చినది. పిచ్చుక యిల్లు కూలిపోయినది. పిచ్చుక కాకియింటికి వెళ్లి తలుపు గ్రుద్దినది. కాకి, "నేను నీళ్లు పోసుకొనుచున్నాను, వీలులే"దని చెప్పినది. కొంతసేపటికి పిచ్చుక తలుపు గ్రుద్దినది.

కాకి, "నేను వండుకొనుచున్నాను. వీలులే"దని చెప్పినది. మరి కొంతసేపటికి పిచ్చుక మరల తలుపు గ్రుద్దినది. కాకి, "నేను భోజనము చేయుచున్నాను, వీలులే"దని చెప్పినది. పిచ్చుక మరి వానలో తడియలేక దాగవలెనని చిన్నగొయ్యి తీసినది. చిన్న బంగారపుముద్ద దొరికినది. పెద్ద గొయ్యి తీసినది. పెద్ద బంగారపుముద్ద దొరికినగి. కాలువ గట్టెక్కినది. కడవెడు బంగారము దొరికినది. ఆ బంగారముతో యిల్లు కట్టుకొని పిచ్చుక హాయిగా నుండెను.

మరి కొన్నాళ్లకు పెద్ద గాలి వాన వచ్చినది. కాకి యిల్లు కూలిపోయినది. కాకి, పిచ్చుకయింటికి వెళ్ళి తలుపు గ్రుద్దినది. పిచ్చుక తలుపు తీసినది. కాకి, "పిచ్చుకమ్మా, పిచ్చుకమ్మా నీకీ బంగారము ఎట్లు దొరకినది?" అని అడిగినది. పిచ్చుక తాను చేసినది అంతా చెప్పినది. కాకి కూడా అట్లు చేయవలెనని, చిన్నగొయ్యి తీసినది. చిన్న తేలు కుట్టినది. పెద్దగొయ్యి తీసినది. పెద్ద పాము కుట్టినది. కాలువ గట్టెక్కినది. కాలు జారి, కాలువలో పడి చచ్చినది.



## ౬. బొల్లిపిట్ట నెక్కిన నల్లనయ్య

మైనంపాటి సుబ్రహ్మణ్యంగారు

అనగా అనగా నొకూరు. ఆవూరియం దొక గొల్లవాడొకడు నిత్యము గోవులను మేపుకొనుచుండెడివాడు. వాని భార్య వానికి ప్రతినిత్యము నచ్చటికి భోజనము గొనివచ్చెడిది. వాడట్లు సాయంత్రమువఱకు పశువులను మేపి ఇంటికి వచ్చుచుండెను. ఇట్లు ప్రతినిత్యమును పశువుల నరణ్యములో మేపి సాయంత్రము కాగానే యింటికి వచ్చు వాడుక. ఒకనాటిదినము మిట్టమధ్యాహ్నమున భానుడాకాశమున దన తీక్ష్ణకిరణజాలముల భూమిపై ప్రసరింప సాగెను. అట్టితఱి ప్రయాణమొనర్చు ప్రతిపాంథుడును మిక్కిలి ఆయాసముతో బయన మొనర్చుచుండెను. అప్పుడా అరణ్యమున నొక బ్రాహ్మణుడొకడు ప్రయాణము సాగించుచుండెను. అతడట్లు పోవుచు నచ్చట పశువులు మేపు గొల్లవాని దగ్గఱకు వచ్చి ఇటులనెను. "ఓరీ గొల్లవాడా దారినడచి బహుప్రయాసజెందితిని. దాహ మధికముగానున్నది. గాన నాకు గొంత పాలిచ్చితివా నీకు పుణ్యము గల్గును." వాడందులకు 'కానీ' యనెను. అంతట వాడు కొంత పాలు బ్రాహ్మణుని కిచ్చెను. పాలను గ్రోలినపిమ్మట బ్రాహ్మణు డిట్లనుకొనెను. వీడు నన్ను కానీ యియ్యమంటున్నాడే వీని కెక్కడి నుండి దెచ్చి యియ్యగలను. నీ దేమరి యుండుతఱి వెళ్లెదనని యనుకొనెను. అప్పుడా గొల్ల డాతనిం గని "చాములు, యీడి కేదైన ఉపదేశించాల,

లేకుంటే మీ పాదా లిడవను" అన్నాడు. "యిది యేమిరా నాకు వీడొకడు అడ్డుదగిలినాడని యెంచి బ్రాహ్మణు డా గొల్లనిగాంచి "ఓరీ, నీవు ప్రతి నిత్యమును భోజనమునకు కూర్చొను సమయమున చేతిలో నీవు భుజించు అన్నము నుంచుకొని తదేక నిష్ఠవై "బొల్లిపిట్టనెక్కిన నల్లనయ్యా నీవు భోంచేస్తే నే భోంచేస్తా" ననుము. పిమ్మట నల్లనయ్య వచ్చిన పదంపడి భుజింపుమని బ్రాహ్మణుం డరిగెను,

మరునటిదినము వాని భార్య సంకటి గొని తెచ్చెను. అప్పు డా గొల్లడు కాలు చేతులు గడిగి కొని నామము ముఖమున ధరించి చేతులయందు సంకటి నిడుకొని పద్మాసనము వైచుకొని యిట్లన దొడగెను. "బొల్లిపిట్టనెక్కిన నల్లనయ్యా నువు బోంచేస్తే నే బోంచేస్తా". యెంతసేపటికిని నల్లనయ్య రాలేదు. వీడు లేవలేదు. యెంతసేపైన నదియే ధ్యానము. వాని భార్య, స్నేహితు లెంతజెప్పినను వాడు భుజించినవాడు గాడు. ఇట్లు ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, యేడు, యెనిమిది దినములు గడచినవి. వానికి శోషవచ్చున ట్లుండెను. ఈ యెనిమిది దినములు వాని కా ధ్యానమే. వాని మూఢభక్తికి సంతసించి కృష్ణుడు గరుడారూఢుడై వానిముందు నిలిచి వాడు ఇచ్చిన సంకటిని ఆరగించి వానింజూచి "ఓరీ! నీవేల నన్నిట్లు ధ్యాన మొనర్చితివనెను. అందుకు వాడు చేతులు జోడించి సాగిలపడి మ్రొక్కి ఇట్లనియె. "చామీ! తమ పాదాలకాడ చేగదామని నా కోరిక" యనెను. అప్పుడు నీకు అంత్యమున మత్పద మిచ్చెద సంతవఱకు నన్నిట్లే భజింపుచుండుమని అదృశ్యుడయ్యెను. ప్రతినిత్యమును మొదట స్వామికి ఆరగింపుజేసి పిమ్మట గొల్లడు తాను భుజించువాడు.

కొంతకాలమునకు మొదటి బ్రాహ్మణుడు ఆ దారిని వచ్చుచుండెను. అప్పుడు గొల్లవాడు చేత కర్రనుంచుకొని పశువుల నదలింపుచుండెను. బ్రాహ్మణుని గాంచినంతనే వాడు తన కీతని దయవల్లనే శ్రీకృష్ణుని దర్శన మబ్బినదని సంతోషించి గురువగు నాతనికి బహుమాన మివ్వదలచి వానివద్దకు వచ్చుచుండ వానినిగాంచి బ్రాహ్మణుడు ముందటి కానీ యివ్వనందున తన్ను కొట్టవచ్చుచున్నాడని పరుగెత్తసాగెను. వాని వెంటనే గొల్లవాడు పరుగెత్తి పట్టుకొని సాగిలపడి నమస్కరించి జరిగినయుదంతమును దెలిపెను. అప్పు డా బ్రాహ్మణు డాశ్చర్యపడి మరుదినమువరకచ్చటనేయుండెను. మరునాటి మధ్యాహ్నము కృష్ణుడు వచ్చుటయు గొల్లవా డాతనికి సంకటిముద్ద నిచ్చుటయు గాంచెను. గాని కృష్ణు డగపడడయ్యె. నేననేక వ్రతములు, ధ్యానములు ఉపవాసము లొనర్చినను నాకు గనబడని కృష్ణుడు వీని కగపడెను గదా. వీడు పూర్వభవమునం దెంత పుణ్యము నొనర్చెనో యని దలంచి వానిం గని ఓరీ నీవు నా కేమియు నీయవద్దు. భగవంతుని దర్శన మిప్పింపుము. నా కింతయెజాలు ననెను. అందు కా గొల్ల డంగీకరించి మరునాడు భోజన సమయమందు "బొల్లిపిట్టనెక్కిన నల్లనయ్యా నీవు బోంచేస్తే నే బోంచేస్తా" అని ధ్యానింపగా కృష్ణుడు ప్రత్యక్షమయ్యెను. అప్పు డా గొల్లడు కృష్ణుని పాదములపైబడి "ఓ చామీ! నీ దరచనము మా గురువు లోరికి చూపించితేనే గాని మీ పాదాలు యిడవ" ననెను. వాని గురుభక్తికిని దైవభక్తికిని నిష్కల్మష హృదయమునకు మెచ్చి కృష్ణు డా బ్రాహ్మణుని కగుపింప నాతడు భక్తిపరవశుడై సాగిలపడి నిలువంబడి చేతులు జోడించుకొని యిట్లనియె.

"శంఖ చక్ర గదాపాణీ, ద్వారకా నిలయాచ్యుత, గోవింద పుండరీకాక్షరక్షమాం శరణాగత"మ్మని స్తుతింప మెచ్చి నీవేమి కోరెదవని కృష్ణుడన నా బ్రాహ్మణుడు "భక్తపరాధీనా, నే నీ సంసారాంబుధిన్మునిగి దరిగానక యల్లలాడుచున్నాడ. అట్టి నన్నుద్ధరించి భవత్పదంబును జేర్చుమా"యన కృష్ణభగవానుడు నీ యంత్యకాలమున నీ శిష్యుండగు వీనిని, నిన్నును నాకడకు రప్పించుకొనియెదనని జెప్పి అంతర్హితుడయ్యె.

# భావతరంగిణి

## బంగారము

అనాదినుండియు హిందూదేశమున బంగారు వెండి నాణెములు ధనముగా వాడబడుచున్నవి. ఈ దేశము వెండిబంగారములతో తులతూగుచుండెడిది. వర్తకముచే నైన నేమి గనులనుండి యైన నేమి హిందూదేశ మంతటను బంగారము కూడబడు చుండెడిది. వీటికి సాయము హిందూస్త్రీలకు నగలన్న చాల ఆశ (ఏ దేశపు స్త్రీకి లేదు?) అందుచే నగల కొరకు చాల బంగారము వాడుచుండెడివారు. ఇది గాక చాలామంది బంగారమును విలువగల సొత్తుగ నెంచి దానిని దాచెడువారు. విలువగల సొత్తు నెవరు దాచుకోరు? ఇంగ్లీషువారు హిందూదేశము వచ్చి హిందువులగుణములు పరిశీలించి వారికి బంగారమున నెక్కువ ఆశ యనియు, హిందూదేశ మొక పెద్ద అఖాతమనియు ఆ దేశమున కీ బంగార మెంత వెళ్లిన అంతయు దానిలో మునిగిపోయి మరింక తేలి ఈవలికి రాదనియు ప్రపంచక మంతయు వెల్లడి చేసిరి. దానితో అన్ని పుస్తకములలోను, అన్ని పత్రికలలోను ఒకటే పితూరీ. హిందువులు బంగారమును నమలకుండ మ్రింగుదురు!

పాపము తక్కిన దేశములవారి కెవరికిని బంగారమున నాశలేదు! ఈ క్రింద చూపిన లెక్కలు ఆశ యున్నదో లేదో తెలుపును.

| | 1913 | 1924 |
|---|---|---|
| గ్రేట్ బ్రిటను | 170 మిలియనుల డాలర్లు | 755 మి. డాలర్లు |
| అమెరికా | 691 ,, | 4468 ,, |
| జపాను | 65 ,, | 559 ,, |

*హిందూదేశము వెండి బంగారములను మ్రింగుట యందు లోతు తెలియని అఖాతమనియు అవొకసారి దానిలో పడిన ప్రపంచమునకు మరి తిరిగి రావని చెప్పుదురు. హిందూదేశముపై నీ ఘోర నేరము మోపుటకు వీలులేదు. ఈ దేశమున విద్య అంతగా లేదు. ఇచ్చట బంగారమును దాచు నలవాటు వందలాది సం॥లనుండి వచ్చుచున్నది. ఈ దేశమున యుద్ధమునకు పూర్వము 350 మిలియన్ల జనుల అవసరములకై సం॥నకు సం॥ 10 మిలియన్ల రూకల బంగారము వాడబడు చుండెడిది.

అమెరికా దేశమున నెలకు 1 మిలియను (సం॥నకు 12 మిలియన్లు) ఈ ఖర్చుల నిమిత్తము వాడబడేది. కాని అమెరికా దేశమును బంగారమును మ్రింగుటలో లోతు తెలియని అఖాతమని యెవరును అనరు. యుద్ధసమయమున ఇంగ్లండులో సామాన్య కులను లందరు వారి సొత్తులు బంగారపు నగలకే ఉపయోగించెడి వారట! ప్రతిదేశము వెండి బంగారములను వర్తకమునకును వస్తువులకును వాడుచున్నది. కాని యీ అవసరములకొఱకే హిందూదేశ ముపయోగించిన యీ దేశము కూడబెట్టుచున్నదని నేరము మోపుచున్నారు. హిందూదేశస్థులకు కూడబెట్టు నవసరము గలదు. వారికి పాశ్చాత్యులకు గల విద్యగాని అప్పు దొరకువిధములుగాని లేవు. అందుచే ఇటువంటి నేర మీ దేశస్థులపై మోపుట న్యాయమని తోచక మానదు

1929వ సం॥నుండి వర్తకము మందముగా నున్నది. సామాన్యముగ జరుగు వర్తకము తగ్గినది. ప్రతిదేశము కూడ చాల నష్టపోయి ఈ మాంద్యమునుండి తప్పించుకొను టెటులాయని ఆలోచించుచునే యున్నది. ఈ మందము యీరోజువరకును ప్రబలుచునే యున్నది. దీనినే (Trade depression) అన్నారు. దీనికి కార

ణము లనేకము లున్నవి. వానిలో ముఖ్యమైనది బంగారమును దాచుకొనుట. వర్తక మాంద్యముతో పాటు బంగారమునకు ధర హెచ్చయ్యెను. ధర హెచ్చెనుగదా యని మన దేశమువారు బంగారము నమ్ముట మొదలుపెట్టిరి. ఈ బంగార మంతను అమెరికాయును ఫ్రాంసును వాటి ఖజానాలలో భద్ర పరుచుచున్నవి.

వీరు (అనగా అమెరికా ఫ్రాన్సు గవర్నమెంటులు) ఈ బంగారమును దాచుట తప్ప (Sterlizing) మరేమియు చేయుటలేదు. బంగారము దేశములో నుండుట దాచుటకు గాదు. అది యెల్లప్పుడును తిరుగుచుండవలెను. అనగా నది వర్తకమునకు తోడ్పడుచుండవలెను. దేశములోని వర్తకమునకు కాకుండ ఇతర దేశముల వర్తకమునకు గూడ తోడ్పడవలెను.

అటుల తోడ్పడిన ఈ మాంద్యము రాదని కొందరి యభిప్రాయము. కాని మానవుని ఆశాపిశాచము ఆ బంగారమును దాచునట్లు చేయుచున్నది గాని వర్తకపు వీలులను బట్టి పోనీయుట లేదు. అమెరికా వారికి కొన్ని యితరదేశములు చాల ధనము బాకీయున్నారు. అమెరికా యీదేశములకు క్రిందటి యుద్ధములో అప్పు లిచ్చినది. కాని అది బంగారము నంతగా నీయలేదు. వస్తువులుగాను యుద్ధమునకు జనసాయముగాను వారి కప్పిచ్చినది. ఇప్పుడు అమెరికా యప్పును బంగారముతో తీర్చమనుచున్నది. ఈ యప్పు మూలముననైన నేమి కొనుటచే నైన నేమి అమెరికా ఫ్రాన్సుదేశములలో ప్రపంచకములోని 3 వంతులు బంగారము గలదు.

ఈ క్రింది రిపోర్టు సెప్టెంబరు 22 వ తేదీని 'హిందూ' పత్రికలో వచ్చినది. "Bar gold and sovereigns valued at Rs. 27,29,453 were exported from Bombay to Europe and America once again this week after an interval of nearly three weeks. The total value of gold exported since England went off the gold standard now amounts to Rs. 19, 685,-63, 504.''

"ఈ వారమున కానులు కడ్డీ బంగారము కలిపి రు. 27,29,453 ల విలువగలది బొంబాయినుండి యూరోప్‌నకు, అమెరికాకు పంపబడినది. సుమారు 3 వారములనుండి ఏమియు పంపబడుట లేదు. ఇంగ్లండు gold standard (గోల్డు స్టేండర్డు) ను విడిచి నప్పటినుండి రు. 196,95,63,504 ల బంగారముపంపబడినది." ఎన్నికోట్ల బంగారము మన దేశమునుండి పోవుచున్నదో మీరే చూడుడు. ఇటుల పోకుండ అడ్డు పెట్టుమని దేశోద్ధారకులు (Legislative assembly) లెజిస్లేటివ్ ఎస్సెంబ్లీలో మొరపెట్టిరి. కాని గవర్నమెంటువారు వారికి సంబంధము లేనట్లు వీరి మొరలను పెడచెవిని బెట్టి ఏమి జరుగునో చూతమని ఊరకున్నారు. బంగారము లేనియెడల ఏమి నష్టము కలుగునో ఈ క్రింది ఉదాహరణ దెల్పును:

బవేరియా దేశము యుద్ధసమయములో కావలసిన సామగ్రిని కొనుటకుగాను తన బంగారము నంతయు వాడెను. ఇంక వాడుటకు బంగారము లేకపోయెను. తన దేశ ప్రజలనుండి గూడ తన కే వస్తువు కావలసిన తనకు సొమ్ముండవలెను గదా! అందుకుగాను దాని కొక సులువు మార్గము కనబడెను. అది అచ్చాఫీసు. నోటులను అచ్చువేయుట మొదలు పెట్టినది. కొంత కాలమువరకును వాటికి విలువ గలదు. 5 రు. ల నోటు 5 రు. ల విలువగల వస్తువులను తెచ్చినది. కాని నోటు లెక్కువైన కొలది వాటి విలువ తగ్గినది 5 రు. ల నోటిచ్చిన 5 రు. ల బంగారము నెవ్వడు నివ్వడు. దాని విలువ పోయినది. ఎంతవరకు? కొన్ని బస్తాల నోటులను తీసికొనివెళ్లిన ఒక రొట్టెనో లేక చిన్న టోపీనో యిచ్చెడి వారలు ఈ నోట్లను బీరు సీసాల మీద అందముగ నంటించెడి వారలు. బంగారము దేశములో లేనియెడల నోటుకాగితపు విలువైన జేయదు. మన చక్రవర్తిగారు కొన్ని నోటులను గుద్దించి వాటి విలువ నిర్ణయించగలరు. కాని వారు నిర్ణయించుటతో సరిపోదు. ఆ నోటు విలువగల బంగార మిచ్చువారెవరో గూడనుండవలెను. ఈపై ఉదాహరణను బట్టి బంగారము దేశములో నుండుట

లాభమో నష్టమో తెలియును. బంగారమునకు హెచ్చు ఖరీదు వచ్చెనని అమ్ముకొనుట ప్రస్తుతము అమ్ముకొనినవారికి లాభముగ నుండును. కాని వారి దేశమునకు, వారి మాతృభూమికి మహాపరాధము చేయుచున్నారని నమ్మవలెను. నారీమణులు వారి నగలను జాగ్రత్తగ నుంచుకొని యింకను వృద్ధి యగుటకు చూచెదరని మేము భావించుచున్నాము. బంగారము పోవుచున్నకొలది మాయబంగారపు **(Artificial gold)** నగలు ఫేషన్ అగుచున్నవి. వీటిని త్రోసివేసి నిజము బంగారమునే పొందుడు!

మహాలక్ష్మిని కాగితములకై మీయిండ్లనుండి తరిమి వేయకుడు!

—కె. సచ్చిదానందరావు

### "యువతులకు నడవడి యందము"

"బిడ్డలారా, మన యువతులు తమలో దాము కాని యితరులలో గాని మెలగుచు వ్యవహరించునపుడు గాని తమ నడవడియు వైఖరియు బహు నాజూకుగా నుండునట్లు చూచుకోవలెనని నే జెప్ప నవసరములేదు. మనోహరమగు వైఖరిలేకుండుట హేయము. అందును స్త్రీలలో నాలోప మేమాత్రము క్షంతవ్యముకాదు. ఏకాంతమందుగాని నలుగురిలో నున్నపుడుకాని మనోభావముల వ్యక్తపరచునపుడుకాని యువతులు మితిమీరరాదు. కొంతమంది పడుచులు బ్రహ్మకాయలవలె వటవట పదరుచు నేదో సందడి చేయుచుందురు. అట్టివారిని "మంచి చాకచక్యము గలవా" రనుకొందురు కాని యది తప్పు. ప్రశాంతస్వభావలగు నువిదలు మితభాషిణులై యితరులయెడ సత్యాతసరళవర్తనము గలిగి యుందురు.........నలువురితో గలసియున్నపుడు గచ్చపొదవలె గలగలలాడుచుంట యొక పెద్దతప్పు! కొందరు తమమాటయేగాని యెదుటివారిమాట యొక్కనీయరు; తమసౌఖ్యమే కాని యెదుటివారేమైనను సరే; మరియు నడుగక లాడగక యితరులున్నచోట ప్రవేశించి వారి పెట్టెలు పేడలు తడిమి "యిదెందుకూ?" 'అదెంత ఖరీదు?' ఇది నీకెందుకూ—నా కిచ్చీ" అని చికాకుపెట్టి బాధింతురు; ఇవియన్నియు దుర్గుణములే. ఇంతేకాదు. చేయకూడని ప్రసంగములను జేయుచు లేనిపోని యూసులకు బోవుచు నితరులగూర్చి నీచములైన వదంతులను బుట్టించుచు వినోదించుట అన్నిటికంటె మహాతప్పు. ఇట్టి యలవాటు నెన్ని శ్రమలైనబడి నిర్మూలము జేసికొంట ప్రథమ కర్తవ్యము.

సర్వకాల సర్వావస్థలయందును శుచిగా శుభ్రముగానుండుటగూర్చి యేమరియుండరాదు. "దీనికి వన్నె చిన్నె లేమీ తెలియవు. ఇది వట్టిబేల" యని యనిపించుకొనుటకు కొంతమంది 'యెన్నెమ్మ'ల వలె గన్పింతురు. చక్కగా దల దువ్వుకొని బొట్టు పెట్టుకుని యేదో యీశ్వరు డిచ్చియున్నంతవరకొక పరిశుభ్రమైన వస్త్రమును ధరించియుండుట చూచుట కెంతో ముచ్చటగనుండును. అది యెదుటివారి నేమో యుద్ధరించుటకు గాకున్నను దానియందొక మరియాదా సాంప్రదాయ మిమిడియున్నది. యేభ్రాసి రూపముతో బెద్దల యెదుటబడుట వారి యెడల నిర్లక్ష్యభావ మున్నట్లనిపించును. కాబట్టి యట్టిదాని కవకాశమీయరాదు.

(రవీంద్రుని ఉపదేశము)

### ప్రేమ

ఈశ్వరవిలాస విలసత్ప్రపంచము ప్రేమాత్మకము. ప్రేమోపాసనమే జననమరణములకు హేతువు. పాపపుణ్యముల కాలవాలము. కష్టసుఖములకు కారణభూతము. ప్రేమ యనిర్వచనీయమహిమా సమన్వితము. తదజడస్వరూపము. తజ్జడీకృతు లాశ్రితులు మానవుడు మాయాక్రాంతుడు. ప్రేమ మాయాజనితము. ప్రేమనికుంజ మితరప్రవేశమునకు భీషణ పిశాచి. ప్రేమకాంత కష్టతపస్సులకైన స్వాధీనముకాని ప్రతిభావిశేషవతి. వశీకృత భూనాయకి తిరస్కృతక్షమాపాల. అధఃకృత క్ష్వి జ్ఞాన శాలి. దిగంతవిస్తృతప్రతాప. ప్రేమ జనకము. శృంగారాదులు జన్యములు. ప్రేమ క్రోధాభిమాననివాసి. అనంతభేదవిరాజి, లౌకికము జన్మహేతువు, అలౌకికము; ముక్తినిదానము. ముక్తి మానవునకు గమ్యస్థానము. వివిధపథవిరాజి ముక్తి. తదేకపథము అలౌకికప్రేమోపాసనము. అలౌకికప్రేమోపాసన

యధిక కష్టసాధ్యము. సామాన్యుల కతీతము. పరిణత కార్మికుల కగ్రహస్తస్థ ద్రాక్షారసము. నిర్గుణస్వరూప నిరంతర ధ్యానాసక్తియే" యలౌకిక ప్రేమోపాసనము. కర్మమార్గావలంబి మండనమిశ్రుడు. యోగపథరమి పతంజలి. భక్తిపథభాజి ప్రహ్లాదుడు. సర్వపథగమ్య మైక్యమే. తద్ద్వారము భేదయుక్తము. భక్తి తన్మార్గముల కగ్రేసరి. "నిర్గుణస్వరూపచింత. తత్త్వమసీత్యఖండబోధ" సగుణోపాసనాఫలితములు. ఫలితాంశీకృత తదైక్య చింతనమే అలౌకికప్రేమోపాసనము. ఆంజనేయుడలౌకిక ప్రేమోపాసకుడు. రామకథాచింతనామృతపానమత్తుడు. తద్యుక్తము ముక్తి. లౌకికప్రేమోపాసన మానవునకు సహజము. అయత్నప్రాప్యము. విశ్వామిత్రుని ప్రేమోపాసన లౌక్యము. వాసిష్ఠైర్ష్యాకృతము. వశిష్ఠుడలౌకికప్రేమోపాసకుడు. గోపికాదులు లౌకికప్రేమోపాసినులు. శబర్యాదులలౌకికప్రేమోపాసినులు. వసిష్ఠవైరి, కష్టపరంపరాసరిత్ప్రవాహపతితుడు. వసిష్ఠుడు ముక్తికాంతాంకతల నిహితశిరస్కుడు. లౌకికప్రేమోపాసన ముక్తికాంత కనిష్టము. కీర్తికాంతాకోపకారణము. అలౌకికప్రేమ. ఆదరణీయము. ప్రధానమచలత్వ బుద్ధిమంతము. "ద్వైతాస్తిక్యబుద్ధి తదారాధనాశక్తి తదైక్యమే ముక్త్యనుమతి" తన్మార్గములు. ప్రేమ అగోచరస్వరూపి. "స్థిరము తాదాత్మ్యము" ప్రేమ చిహ్నములు. అనుభవైకవేద్య మలౌకిక ప్రేమ కాంతాహృదయగతార్థము. అప్రతిపాద్యము. జీవన్ముక్త్యర్థవాదులు సాంఖ్యులు. బుద్ధ్యర్థవాదులు బౌద్ధులు. ఏకత్వార్థవాదు లద్వైతులు. ద్విత్వార్థవాదులు ద్వైతులు. చిదచిద్విశిష్టార్థవాదులు విశిష్టాద్వైతులు. ప్రత్యక్షార్థవాదులు చార్వాకులు. మర్త్యజన్మ ఫలము. జన్మరాహిత్యము. తదలౌకిక ప్రేమోపాసనాసాధ్యము కేవలార్థవాదన మూఢత్వము. పూర్వోక్త బౌద్ధాదులు వంద్యులు. పూజ్యులు. మానవుడు జన్మరాహిత్యకాంక్షి. లౌకిక ప్రేమపాశము విచ్ఛేద్యము. అలౌకికప్రేమ మానవోపాస్యము.

—శలాక అన్నపూర్ణాదేవి

## భగవంతుని మానవాకృతి

"భక్తి" అనే పదముకు "ప్రేమ" అని అర్థమున్నదని నాఅభిప్రాయము. కాని కొందరు పామరులు నిజముగా వారికి లేశమయినా భక్తిలేకపోయినా తాముచేసెడి ఆరాధనయే తమభక్తిని వెళ్లడిచేస్తున్నదని తలుస్తారు. సాధారణముగ మానవులు తమకు ఆపదలొచ్చినపుడే భగవంతుని ప్రార్థిస్తారు. కాని ఆభక్తికేవలము భయమువలన వచ్చెడిభక్తిగాని వేఱొండుగాదని నాయభిప్రాయము. కొందరు సాధారణముగ తమ వుదార స్వభావమును వెళ్లడయేలాగున పదిమంది చూస్తూవుండగా దానధర్మాలు చేసెదరు. అది మంచిదికాదు. యిదియుగాక యిపుడు సాధారణమానవులకు మోసగించే మరియొక మానవజాతి లేచింది. వీరలకు సాయంత్రమవగానే ఏతిరుపతి వెంకటేశ్వర్లో, సింహాచలస్వామియో పూనేస్తాడు. యింకదేముడు పూనెయ్యడమే తరువాయి చుట్టుప్రక్కలవాళ్ళందరూ గుమిగూడేస్తారు.

యింక జనమువస్తున్నకొలదీ ఈదేముడికి వుగ్రము లావవుతూంది. ధూపదీపములకులోటు లేదు కొబ్బరికాయలు, అరటిపళ్లు, డబ్బులు, ఆ మానవరూపధారియైన దేముడు పాదాలక్రింద దొర్లుతూనుంటవి చివరకు దేవుడు ఒక వేడహారతి కర్పూరంతోగాని వదలడు. ఆమనిషి ఎక్కడో నేర్చుకున్న నాలుగు బంగాళీ కీర్తనలు, ఓనాలుగు ఓఢ్రపు కీర్తనలు పాడడం ప్రారంభించగానే వచ్చినవాళ్లందరూ "ఆహా! దేముడి కీర్తనలు" అని పెన్సిలు కాగితము, తీసికొని వ్రాయడము మొదలుపెటతారు.

యింకొక ముఖ్యవిషయము. సాధారణముగా దేముడు ఆడవాళ్లకే పూనుతాడు. ఆహా కాలచక్రమెంతటివిధముగ మారిపోయినది. మహాజ్ఞానులు తల క్రిందుగ వేలకొలది సంవత్సరములు తపనుచేసినా ప్రత్యక్షముగాని దేముడు, తెల్లవారితే నూరబద్ధాలు చెప్పి పదిమంది పీకలు గోసేవాళ్లకు ఎంత సులభముగ లభించుచున్నాడు. యీవిధముగా భగవంతుడు దేవాలయము విడిచి మానవరూపధారియై దేశద్రిమ్మరిలాగ సంచారం చేయడంచేత కొందరికివున్న కొద్దిపాటి భక్తి పూడిపోతూవుంది!

—పం॥ కామేశ్వరమ్మ

# వార్తలు—విశేషములు

మాతృదేశ సేవాపరాయణలై పేరుగాంచిన శ్రీమతులు పాటిబండ్ల అన్నపూర్ణమ్మగారు సత్యవోలు సుబ్బమాంబగారు, అడుసుమల్లి సుబ్బమ్మగారు ఇటీవలనే దివంగతులైనారని సోదరీమణు లెరిగియే యుందురు. ఐనను మా విషాదము దెలియజేయుట కర్తవ్యమని యెంచి యిందు మరల దెలుపుచున్నాము. వారిలో అన్నపూర్ణమ్మగారు వీరమాత యని కూడ బేరొందినది. ఇట్టి యిల్లాండ్రు చనిపోవుట దేశమునకును జాతికిని గొప్ప నష్టకరమగుచున్నది. పరమాత్ముడీ వనితలయాత్మలకు శాశ్వతానందపదవి నిచ్చుగాక ! ఓం శాన్తిః.

### కీ॥ శే॥ నరాలశెట్టి దేవేంద్రుడుగారు

ఆది మాంధ్రశిరోమణియు, స్త్రీవిద్యకు ఆద్యప్రాయుడై మా జిల్లాలో ఎన్నడు ఎరుగని బాలికా వసతిగృహము ఏలూరులో స్థాపించి మా సంఘమును చక్కానివలె నడుపుచు, సుమారు 1 సం॥రం నుండి వ్యాధితోనుండియు, సంఘసేవయందే నిమగ్నుడై యుండి మృత్యువు వాతబడె ననువార్త ఉదయము 8 గంటలకు వినబడగానే స్త్రీసంఘమువారు నిలువున నీరై గ్రామమంతయు కన్నీరు పెట్టనివారు లేరు. సంఘమన నేమో యెరుగని ఈ ఆంధ్రదేశములో శ్రీ, దేవేంద్రుడుగారు జాతీయరంగమున కాలిడిరి. నిండుకుండ తొణకదు అనునట్లు దేశనాయకులలోను, ప్రభుత్వోద్యోగులలోను, మైత్రిసల్పి, నిమ్నసంఘములకు కావలసిన హక్కులను, స్వాతంత్ర్యమును గోరుచుండిన వీరపురుషుడు. ఈ మహానీయుడు అంతమొందగానే మా సంఘములకు తీరని ఆశాభంగము కలిగినది. శ్రీ దేవేంద్రుడుగారి ఆత్మకు శాంతికలుగుగాక యని భగవంతుని ప్రార్థించుచు, అపారదుఃఖము ననుభవించుచున్న వారి కుటుంబమునకు మామల్లసరం స్త్రీసంఘము దర్పున సానుభూతి నందజేయుచున్నాము.

జా॥ సూ॥ కాంతమ్మ.

### ఈశ్వరవిలాస మిదే !!

చాంబల్ నదిలో నొకపడవ యిరువదిమంది ప్రయాణికులతో బోవుచుండెను. నట్టేట నొక గుడిసె-యెక్కడనో యెగువనుండి ప్రవాహవశమున కొట్టుకొని వచ్చుచున్నది-ఆనావతో దారసపడినది. వెంటనే యాగుడిసె కప్పుపైనుండి యొక నాగుపాము ఆ నావలోనికి దూకినది. ప్రయాణికు లదిచూచి భయోత్పాత వివశులై నావ కొకతట్టున జేరుకొనిరి. ఆ బరువుచే నావ బుడుంగుమనెను. పదునేడు నిండు ప్రాణములు ఏటికి బలియైనవి. ముగ్గురుమాత్రము ఈదుకొని యొట్టేటులో యొడ్డునబడిరి. దైవవిలాస మవాఙ్మానసగోచరము కదా !!

### ధనాశాపిశాచము

మయూరభంజి సంస్థానములోనివాడగు భీమానాయకొ అనువాడొక యేడేండ్లబాలకుని చంపినందుకు మరణదండన విధింపబడెను. వాడు, తన యింటి పెరటిలో నొకచోట ధనము పూడ్చిపెట్టబడి యున్నదనియు ఆనిధి ధనదేవతచే రక్షింపబడుచున్నదనియు అందుచేత నా ధనదేవతా ప్రీతికై యాచోటున రక్తాభిషేక మొనర్చి యా ధనమును గ్రహింప నెంచితిననియు వాఙ్మూలమిచ్చెను.

### పిచ్చిప్రేమ

సెర్వియాలో సౌందర్యరాణి యని పేరొందిన యొకయువతిని పెండ్లియాడుట కొకయువకుడు స్థిరపరచుకొనెనట; కాని యా యువతి జబ్బుపడి వివాహదినమునకు ముందటినాడు గతించెనట. "ఆ శవమునే నేను పెండ్లియాడుదును" నని ఆ పడుచువాడు పట్టుబట్టి యెవ రెన్ని చెప్పినను వినక యట్లేచేసి శవమును దరువాత బెట్టెలో బెట్టెను; కాని యా శవమున కంతలో ప్రాణములు వచ్చెను. లయోనెల్ క్రాడల్ అను నా వరుడును మిల్లీసోవియాడా గోవిజు అను నా వధువును హాయిగా నున్నారు.

శ్రీయుత గోనెల నరసింగరావు, బి. ఏ., గారు, ఇటీవల జరిగిన 'ప్లెక్సుషూ కాంపెటిషన్'కు, **(Flex Shoe competition, 1934)**, ఇంగ్లీషు పద్యములు వ్రాసి బహుమతి నొందినారు. విద్యార్థులలో, బహుమతినొందినవారిలో నగ్రగణ్యులు.

# విశ్వవిలాసము

వచ్చే ప్రపంచకమునకు వారసు లెవరు ?

నల్లవాళ్ల దేశాలలో తెల్లవారి ఆధిక్యతాధికార సామ్రాజ్యము లెన్నాళ్ళుదక్కుతాయీ అన్నది ప్రశ్న. వారిమొదల ఆశ్చర్య, భయ, గౌరవములు పోగానే ఈ అధికారములు కూడా పటాపంచ లవుతాయనుటకు సందేహములేదు. అతి పరిచయమువల్లన ఆశ్చర్యం తగ్గుతుంది. ఇప్పు డేపల్లెటూరి అడవిజాతుల వారికో తప్ప తక్కిన వారందరికీ వీరుకూడా తమతో సమానమైన జంతువులే కాని వీరిలో విశేష మేమీ లేదని స్పష్టమైనది. వీరుకూడా తెల్లవారి దుస్తులు ముస్తాబులు చేసుకోవడంతో వా రెవరో వీ రెవరో తెలియనట్లు కూడా అంతా మమేకముయింది. ఆశ్చర్యం పోగానే భయంకూడా తగ్గుతుంది. భయం పోగానే గౌరవముకూడా క్షీణిస్తుంది. ఇవి పోతే, మిగిలే బాహుబల బుద్ధిబలాలలో ఎవరు పెద్దవారైతే వారిదే పై చెయ్యి అవుతుంది. పైగా విదేశాలలో వీ రల్ప సంఖ్యాకులు కనుక వీరికే పరాజయము పలాయనము తటస్థిస్తాయి. ఇట్టి పరిస్థితు లప్పుడే యేర్పడుతున్నాయి.

ఇదివర కల్లా నల్లవాళ్ళను రక్షించడం కోసం తెల్లవాళ్ళను ఉపయోగించేవారు. ఇప్పుడు తెల్లవాళ్ళను రక్షించుకోవడం కోసము నల్లవాళ్ళ సహాయం కావలసి వస్తోంది. అల్జీరియాలో యూదులకు అరబ్బులకు పోట్లాటలువస్తే సెనిగాలులోవున్న ఫ్రెంచి అధికారులు తాము అణిచీ లేక తమకేమి ఉపద్రవంవస్తుందో అని సెనిగాలులో యున్న నీగ్రోలను సైన్యముగా తయారుచేసి ఆ పోరాటము లణిచినారు. దీనివల్ల నీగ్రోలకు తాము అరబ్బులు యూదులకంటె మాత్రమే కాక ఫ్రెంచివారికంటె కూడా గొప్పవారమనే భావము కలుగుతున్నాది. ఈలాగు చేసినందుకు లండనులో ప్రకటించబడే సండేఎక్స్ప్రెసు పత్రిక ఫ్రెంచివారిని చాలామట్టుగ ఆక్షేపించింది. ఈవాళ ఫ్రెంచి వారిమీద కలిగిన దురభిప్రాయమే రేపు ఇంగ్లీషువారు మొదలగు ఇతర తెల్లవారిమీద కూడా కలుగుతుందని వీరి అనుమానము. గత ఐరోపాయుద్ధములో తెల్లవాళ్లూ తెల్లవాళ్లూ పోరాడుకొంటూ ఇండియనులు మొదలగు నల్లవారిని తెచ్చి రైనునదీప్రాంతమున నిలబెట్టి వారిచాటున తామొకరినుండి ఒకరు కాపాడుకొనుటవల్లనే తెల్లవాళ్ళ బలము బడాయిఅంతా పచ్చవాళ్ళకు నల్లవాళ్ళకు తెలుసుకొచ్చి వారివారి దేశాలలో తెల్లవాళ్ళతో సమానత్వంకొరకో వారి నుండి స్వాతంత్ర్యంకొరకో ఆందోళనలు ప్రారంభించారు. యుద్ధానంతరం కూడా ఫ్రాన్సు తన నీగ్రోసైన్యాలనే తరిఫీదు చేసుకొంటున్నది. వచ్చేయుద్ధంలో జర్మనీనుండి తనను వారే రక్షించవలెనని ఆశ పెట్టుకొం

టున్నది. జపాను రష్యానోడించడముతోను పారిశ్రామికాభివృద్ధిని బడసి తెల్లవాళ్ళ నందరినీ తటపటాయించడముతోను ఈ సామ్రాజ్యనిర్మాణ మనేది తెల్లవాళ్ళ సర్వస్వామ్య హక్కు కాదనీ కాస్త తెలివితేటలు ఐకమత్యము పెట్టుకొని వ్యవహరిస్తే అన్నివిషయములలోను తాము తెల్లవారిని మించగలమనీ అభిప్రాయం ప్రాకుకొస్తున్నది. అమెరికా దక్షిణరాష్ట్రములలో తెల్లనల్ల వర్ణసంకరములవలన కొందరు నీగ్రోలుగూడా తెల్లగానే కనిపిస్తూ ఆఖరుకు ఆ తెలుపు కూడా అయిరోపీయుల విశిష్టలక్షణం కాదనే భావం ప్రబలుచున్నది.

ఈలాటి అభిప్రాయం ఎక్కడ కలిగి తమ కెక్కడ విచ్ఛిత్తు కలుగుతుందో అని తెల్ల జాతులన్నీ, ఈ తెలుపునలుపు భేదమును శ్వేతాధిక్యభావమును క్రైస్తవమతముకంటె గొప్పగా ప్రేమించుకుంటున్నాయి. లండను నగరములోనే దీనికి అత్యంత గౌరవము కలదు. ఈ మధ్యను ఎంపైరుగేమ్సు పోటీలలో వివిధసామ్రాజ్య దేశస్థులగు ఆటగాండ్రు లండనుకు వెళ్లినప్పుడు, అచ్చటి హోటేళ్ళలో తెల్లవారినీ నల్లవారినీ ఒక పజ్తిని కూర్చోపెట్టక ఒకమోస్తరు గౌరవము చూపించక భేదదృష్టినే పాటించితే అందరికీ చాలా కోపంవచ్చింది. విశాలభావయుక్తమని పేరువడ్డ లండనునగరములోనే ఇట్టి వీరులను అస్పృశ్యులులాగ భావిస్తున్నందుకు లండనువారు గర్హించుచున్నారని జాన్‌బులు పత్రికావిలేఖరి ఆక్షేపించుతున్నాడు. అయితే ఫ్రాన్సులో ఇంత అన్యాయములేదు. ఫ్రెంచిసామ్రాజ్యములో ఏ భాగమునకుచెందిన ఏ రంగువాడైనా సరే ఫ్రాన్సు వెళ్ళితే ఫ్రెంచి హక్కులనన్నిటిని బడసి కేబినెట్టు మంత్రికూడా కాగలడు. అధ్యక్షుడు కూడా అవవచ్చును.

పోనీ తెల్లవాళ్ళే వెళ్లి నల్లవాళ్ళ దేశాలలో స్థిరపడిపోయి నల్లవాళ్ళుగామారి స్నేహముగా జీవిస్తారేమో అంటే అదికూడా అసాధ్యమే అని ప్రొఫెసర్ క్ర్యూగారు 'పాప్యులేషను' అను పేరుగల ఇంటర్నేషనలు రెవ్యూలో తెలుపుచున్నారు. శీతోష్ణస్థితులలో తమకు సరిపడని దేశాలలో ఎవ్వరు కాని స్థిరమైన ఆవాసము చేసుకోలేరు. బ్రిటిషువంటి శీతలదేశస్థులు ఇండియావంటి ఉష్ణదేశములలో స్థిరపడలేరు. ఆస్ట్రేలియా ఆక్రమించుకోలేదా అంటే అందులోనుంచికూడా ఎప్పుడో ఒకప్పుడు ఉద్వాసన కావలసినదే అనినీ్న ఆదుకు తగిన హిందూదేశస్థులెప్పుడో ఒకప్పు డందులోకి దూరుతారనినీ్న జ్యోశ్యము చెప్పుతున్నాడు. ఆఫ్రికా అంతా తెల్లవాళ్ళది అని ఆక్రమించారే కాని అచ్చట వారెవ్వరును అనగా బోయర్లు కూడా స్థిరపడలేరనే అతను చెప్పుతున్నాడు. ఇండియా వారప్పుడే హెచ్చిపోయినారు. జాపానువారు కన్ను వేసేవున్నారు. కాని వీరిద్దరికంటె ఉపద్రవము తెచ్చిపెట్టేవారు చీనావాళ్ళు. చీనావాళ్ళు దుర్బలులు సాధువులు అనుకొని మనము సంతోషించకూడదు. వారు ప్రపంచములో ఏ దేశముకైనాపోయి అచ్చటివారితో అనగిపెనగి వర్తించగలరనీ, వారి జనసంఖ్య అతివేగము

వృద్ధి అవుతుందనీ అతని సిద్ధాంతము. ఒక్క ఆఫ్రికాయేకాదు సమస్త భూఖండములలోను కొంతకాలమునకికి వారే నిండిపోయి వర్ధిల్ల వచ్చునని అతని అభిప్రాయము. దీనికి నిజు గుడు లేవాలంటే ఆ అవస్థదాటి ప్రతికూల పరిస్థితు లప్పుడే యేర్పడు తున్నాయని అతను చెప్పుతున్నాడు.

పోనీ తెల్లవాళ్ళ విజ్ఞానమేమైనా ఇతర జాతుల విజ్ఞానముకంటె విశిష్టమైనదేమో ఇతరుల తత్వముల కసాధ్యమైనదేమో అంటే అదీ వట్టి బూటకమే అని వర్జీనియా క్వార్టర్లీ రెవ్యూలో బింక్లీ అనే ఆయన వ్రాస్తున్నాడు. యాంత్రిక కౌశల్యమంతా బ్రిటిషు వారి సొత్తుఅని అయిరోపా వారొకప్పుడు తలచిరి కాని గతశతాబ్దములో తక్కిన అయిరోపాదేశములు కూడా అందులో చెయ్యిపెట్టి వారి ప్రాముఖ్యము నణచినవి. ఇప్పుడది తెల్లవారి విశిష్టప్రజ్ఞఅని కొంద రనుకుంటున్నారు కాని నల్లవాళ్ళదేశాలలో కూడా యంత్రాలు పెట్టడమువల్ల వారికి కూడా యీ రహస్యములు తెలిసిపోయినవి. డబ్బున్నవాళ్లు యంత్రాలు పెట్టేసుకుంటు న్నారు. లేనివాళ్లు వానిలో పనిచేసి ఆవిద్య నేర్చుకుంటున్నారు. కొందరు తెల్లవాళ్ళను మించుతున్నారు, కొందఱు సరిపడు తున్నారు, కొందరు సరిపడబోతున్నారు. యాభైయేళ్ళు దాటకుండానే తెల్లవాళ్ళ కిందులోవుండే విశిష్టత్వము నశిస్తుందని అతను వ్రాస్తున్నాడు. మానవసోదరత్వ సిద్ధాంతము, అనాగరకులను నాగరకులుగా మార్చి ఉద్ధరిద్దామనే విశాలభావములతో అక్కడవుందామంటే, కొందరు వర్తకరాజ కీయాలలో పెట్టి వాళ్ళని దోచుకొని హింసిస్తూ కొందరు వారి నుద్ధరిస్తున్నామంటే నమ్మేవా ళ్ళెవరూ వుండరని ఆఫ్రికను అబ్జర్వరులో హార్నలుగారు వ్రాస్తున్నారు.

ఎప్పటికైనా ఒకచేత్రోవ.ఎక్కువతక్కువ అనేభావాలు, పాలకపాలితులనే భావాలు, తెలుపు నలుపుఅనే భావాలు మరిచి సాధారణ వ్యవహారాలలో సాయిలాపాయిలాగా మెలగవాలి. వేర్వేరుజాతులుగానే వుండవాలి కాని వివాహాములు మొదలైన సంబంధాలకు గడంగరాదు. ఇల్లాగవున్నన్నాళ్ళు యేలాటి చిక్కులురావని హార్నెలుగారి తలంపు. ఈలాగు కాకుండా కొందరు ప్రపంచకపు మరమ్మత్తుఅనే నీతులు, కొందరు తెల్ల సామ్రాజ్యమనేకూతలు చెప్పుతున్నన్నాళ్లు మరికొంత శత్రువృద్ధియేతప్ప యెట్టిలాభమును లేదన్నారు. ఈ నీతులు తెల్లవారందరికీ నచ్చేలోపలలేక నచ్చకపోయేలోపల యెటు వంటి అద్భుతమైన మార్పులు ప్రపంచములో కలుగనున్నాయో!

ప్రత్యక్ష దయ్యాలు:—

ప్రజలను పీడించేవానినే దయ్యాలనేలాగుంటే ఈపారిశ్రామికయుగంలో యంత్రాల కన్న దయ్యాలెక్కడనున్నాయి, యంత్రాధిపతులకంటె భూతనాధులెక్కడనున్నారు? కోట్లకొద్దిజనులు కష్టపడి పండించి కడుపు నిండాతిని ఆనందించవలసిన భూమిని, తగు మాత్రము ట్రాక్టరులువచ్చి దున్నేస్తున్నాయి, యంత్రాలువచ్చి నీరు పారించేసి, పండించేసి, నూర్చేసి, యెగరపోసేసి, బస్తాలు

కుట్టేసి కోటార్లకెక్కించేస్తున్నాయి. అందువల్ల అనేకమంది నిరాధార నిర్జీవులవుతున్నారు. బర్మా, సయాములనుండి బియ్యము చౌకగా మనదేశానికి దిగుమతియై మన రైతుల నణిచివేడానికిదేగదా కారణము. ఇట్లే యంత్రములు నూలువడికి బట్టలుచేసి దేశదేశాలలో దింపడంవల్ల అన్నిదేశముల వారికీవృత్తులు పడిపోయినవి. ఇట్లే కమ్మరులు కుమ్మరులు చాకలులు మంగలులు సమస్తమైనవారు కృశించినారు. లోకమంతా ధనవంతులు దరిద్రులు అని రెండుజాతులైనది. దరిద్రులను దోచుకుంటకు ధనవంతుల కుట్రలు, దరిద్రులను హతమార్చి సిరిసంపదలు పంచుకుంటకు దరిద్రుల విప్లవములు, ఇది ప్రస్తుత ప్రపంచచరిత్ర. ఒకొక్క సైంటిస్టు లేచాడురా అంటే ఒకొక్క వృత్తిగలజాతి అడుక్కొని తినేగతైనా లేక అర్థాన్నమౌతున్నాది. దీనికి విలుగుడు ఆపండినపంటలు తయారైనవస్తువులు అందరికీ అందుబాటు చేయుడము కాదట. వాటి మానానవాటిని తగలపెడుతూ తినవలసిన ప్రాణులను తగ్గించేయాలట !! ఇందుకొరకు కృత్రిమసంతానని రోధములసృష్టి! ఇదంతా ఆలోచనగల మానవోత్తములు చేయవలసినపనియో, బుద్ధిలేని జంతువులు ఆశాస్త్రూయాగ్రస్తములగు దయ్యాలు చేయవలసినపనియో నిర్ణయించగల మహనీయు లింకా పుట్టలేదు. లెనిన్లు, ముసోలినీలు, హిట్లర్లు మాక్డొనాల్డులు, రూజువెల్టులూకూడా పైకుబికిన పుండ్లను ఛత్రముచేయగోరి మరింత రసాభాసచేసి రోగులను బాధపెట్టి, యుద్ధాలకీ ప్రళయాలకీ, నాశనాలకీ దోవతీస్తున్నవారే కాని అసలు రోగకారణము కనిబెట్టినవారెవరూ లేరు. గాంధీమహాత్ముడే యీ మూలకారణమును కనిపెట్టి నివారణోపాయములను చెప్పుతున్నాడు కాని, ప్రస్తుతదానవ ప్రకృతిలోను, సైతాను ప్రభుత్వములలోను అతనిమాటలు నెగ్గే త్రోవయేమీలేదు. ఇన్నిదయ్యాలు మనచుట్టూ పరివేష్టించివుంటే, ఎక్కడో ఇంగ్లాండులో సౌతురెస్టనులో కోడిగ్రుడ్లు తినేసి, నీళ్లువాలకపోసి, ఒక్కకుటుంబమును మాత్రము వేధించుకొని తింటూవున్న దయ్యాన్ని చూసి మనమాశ్చర్యము పడవలసినదేమి !

అయినా అమెరికాలో చికాగోఅనే పట్టణములో "అత్యాశ్చర్యకరమైనవ్యక్తి" అనే ఒకపురుషుడు పుట్టినట్లు 'డెయిలీ హెరాల్డు'లో ఒక విలేఖరి వ్రాస్తున్నాడు. "నాఅంతగొప్పవాడీభూలోకంలో 'నభూతో నభవిష్యతి'. అబ్రహాములింకను, జార్జివాషింగ్టను మొదలైనవారందరూ నాకాలిగోరుకు బలాదూ" రంటున్నాడట. యంత్రాలువచ్చే అనేకమందికి పనిలేకుండా చేశాయని యేడుస్తూవుంటే, పనిదొరికిన కొంచెముమందీ కూలిచాలదో యని యేడుస్తూవుంటే, మేనేజర్లూ గుమాస్తాలైనా యింత అన్నము దొరికిందిగదా అని సంతోషిస్తూవుంటే ఆ కొద్దిమందియొక్క అవసరంకూడా యితను తప్పించేస్తున్నాడు. అతను యంత్రంమొగను ఒకచిన్నగూటిలో కూర్చొని 'పనిచెయ్యండి' అనగానే మరలన్నీకదలి పనిచేసుకుంటాయి. 'ఆగండి'అంటే అన్నీ వొక్కమాటూరకుం

టాయి!! ఇదేమీ రావణకుంభకర్ణ హిరణ్యాక్ష హిరణ్యకశ్యపాదులలాగ, ఇంద్రియనిగ్రహాద్యనేకసాధనలచేఘోరారణ్యాలలో కూడా నిద్రా లేకుండా చేసిన తపస్సులవలన చేకూరిన వరప్రసాదిత శక్తికాదు. ఆయన నోటిలో నుంచి వచ్చే వంకరటింకర శబ్దములవల్ల కలిగే గాలికీ ఆ యంత్రాల ముల్లుల కీ రేడి యోకనెక్షు నుంటుందట— దానితో కూడా అవి కదలమంటే కదులుతూ వద్దంటే మానుతూ పురాతన బానిసలకంటె కూడా కడు శ్రద్ధాభక్తులతో పనిచేసుకుంటూ పోతాయట. ఇక మనిషి, జంతువు అనేవాటి లక్ష్యము అవసరము లేకుండా ప్రపంచకానికి కావలసిన సరుకంతా సృష్టించుతానంటున్నాడతను. ఇతను నిజంగా మనిషికాడు—యంత్రాలతో తయారుచేసిన కృత్రిమమనిషి! ఇటువంటివాడొకడు మనకు దొరికాడురా అంటే మనము లంకాపైరు జపానులను లక్ష్యము చేయుదుమా! అయితే పూర్వము రాక్షసులు లంకలో కాని పుట్టేవారు కారట. ఆలాగే సైంటిస్టులు యంత్రనాథులు తెల్ల భూములలో కాని పుట్టమని భీష్మించుకున్నారేమో! అయినా నిస్పృహపడ నక్కర లేదు. జపానులో పుట్టలేదూ! విశ్వకర్మ వెలసిన మన దేశంలోకూడా స్వరాజ్యం వచ్చిన తరువాత పుడితే పుడతారు.

అయితే యిప్పటికే అమెరికాలోవున్న రాష్ట్రాలన్నిటిలోను 1 కోటి జనులు పని లేనివారున్నారుగదా. ఇట్టి యంత్రాలింకా యెక్కువైతే యేమి కాను అని అంతా ఆలోచిస్తున్నారు. అన్నం, నిద్రా, శాంతీ లేకపోయినా యంత్రములు వచ్చి మానవుల శ్రమను తగ్గించి విశ్రాంతిని చేకురుస్తున్నాయిట. సైంటిస్టులు మాత్రం యెక్కడలేని ప్రగల్భాలూ యింకా కొట్టుకుంటునేవున్నారు!

పెళ్ళిమిటికి రాజ్యము సంపాదించిన పడతి:-

మన దేశస్థులు చాలా పిరికివారు. ఇది ముఖ్యముగా ఒక్క విషయంలో బాగా కనిపించుతుంది. పెళ్ళిళ్ల విషయంలో. అట్టుముట్టు ఆనవాళ్లతో మన మెరిగినవాళ్లయియుండి, మన జాతికి కులమునకు బంధువర్గమునకు చెందినవారయియుండి, సమీపవాసస్థులయి యుండకపోతే మనము పిల్లనీయము. తల్లిదండ్రులే పెళ్లిచెయ్యనక్కరలేకుండా తమంతట తాము పెద్దవాళ్లయి వరులను చూచి వివాహమాడు కొనే జాతులలోకూడా స్త్రీలు పై నియమములనే పాటించుకుంటారు కాని కుల గోత్రాలు వూరు పేరులు ఎరగనివాళ్లని కేవలము అందముచూచో ప్రజ్ఞచూచో ధనముచూచో కట్టేసుకోరు. పూర్వపరిచయం ఎంత తక్కువైతే అంత దీర్ఘంగా ఆలోచిస్తారు. లేకుంటే మాటలా? యావజ్జీవం భవిష్యామి అని బ్రతికున్నన్నాళ్లూ బాధ. ఎతిగిన సంబంధం చేసుకొని బాధైన పడతారు గాని యెఱుగని సంబంధం చేసుకొని సుఖమైనా పడనొల్లరు.

కాని పాశ్చాత్యులలో అట్టి పూచీ లేదు. స్త్రీలు, పురుషులైతే చాలును, ఏ దేశస్థులనైనా, యెరుగనివారినైనా సరే, తరువాత కలిగిన పరిచయాన్నిపట్టి పెళ్లి

చేసుకుంటారు. ఇట్లు నిజముగా జ్ఞానము, సాహసముగలవారుతప్ప సాధారణులు చేయలేరు. విద్యావిశేషమువలన గాని యిట్టి సుగుణము లలవడవు. అందుకనే గదా ఆధునాతన నాగరికులందరును స్త్రీల కున్నత విద్య అవసరమని ఘోషించుచుందురు. విద్య వివేకముకు పట్టుకొమ్మ. జాతి కుల మత భేదములను దూరము దగ్గర భేదములను సమస్తమును చెఱిపి విశ్వధాత్రీవలయమునెల్ల ఒక్క కుటుంబముగాఁ జేయును. విద్యావంతులు ప్రమాదములు చేయరని గాదు. చేసినను దిద్దుకొనఁగల సమర్థులు.

ఇంగ్లాండులో మిస్ ఐరీనులేనుపూలు అనే పిల్ల 12 యేండ్లక్రిందట ఆఫ్రికాలో ఒక దేశాధీశుని స్వయంవరము చేసుకుందామని బయలుదేరి వెళ్లింది. ఆదేశం క్రొత్తది. ఎక్కడకు పోవాలన్నా ఒక కూలిమనిషైనా సాయముండవలెను గదా? ఎవరో ఇద్దరు బాటసారు లామెకు త్రోవ చూపెదమని చెప్పి వెంటపడిరి. సందర్భవశమున ఆమె స్వయంవర ప్రయత్నములను పసిపట్టి,వారిలో నొక అరబ్బీవాడు తానే ఆదేశాధీశునిలాగ నటించి తన కుటుంబముయొక్క పూర్వ ప్రస్తుత స్థితులన్నిటినీ బడాయిగా డాబులు కొట్టాడు. ఆ అమాయకురాలు అది అంతా నిజమని భావించి మోహించి వానిని వివాహము చేసుకుంది. క్రమంగా వాడు యిల్లూ వాకలీ యేమీలేని దగాకోరని తెలుసుకుంది. ఈలాటి దగాలకే కాబోలు అతనిని జైలులో పెట్టేశారు. ఇతని పేరు షేకు అబ్దుల్ హేక్ అజీజు.

ఆమె ఏదో ఆస్పత్రిలో వైద్యురాలుగా ప్రవేశించి జీవించుతూవుండేది. అప్పుడు దేశములో బొబ్బలమ్మ ప్రవేశించి అందరినీ నొర్లుకొనిపోవుచుండెను. లేనుపూలు ఆ సందర్భమున ఒక స్వచ్ఛందసేవికదళము నేర్పాటుచేసి అనేకులకు సాయముచేసి కుదిర్చెను. వారిలో నొకడు తా ననుకొన్న దేశాధీశుడు. అతడు మరికొన్నేళ్లు జీవించి చనిపోయెను కాని యీామె చేసిన మేలు మరువలేదు. చనిపోవుముందర నీమెను పిలిపించి ఏమి కావలెనని యడిగెను. తన పెనిమిటిని కారాగారమునుండి తప్పించి తదనంతర రాజ్యాధికారిగా నియమించుమని ఆమె కోరెను. అత డంగీకరించెను. అయినను క్రొంచి ప్రభుత్వమువారు దీని కంగీకరించలేదట. ఆమె ప్యారిసు నగరము వెళ్లి అధికారులతో మాటలాడి తన నాథుని రాజ్యాధికారిగా నియమింపఁజేసుకొని మరీవచ్చి తన నాథుని కలుసుకొని అపరిమిత వైశాల్యముగల భూప్రదేశమును పరిపాలించుచున్నది. షేకు అబ్దుల్ హెన్‌అజీజు ఎంత పుణ్యాత్ముడో. ఆవిడా ఉత్తమురాలే! నిజము తెలియగానే తానే వానిమీాద కేసుపెట్టి శిక్షింపించి డైవోర్సు పుచ్చుకొని తగిన వానిని చేపట్టకుండా ఆ అనామకుణ్ని తా ననుకున్నంతవాణ్ని చేసుకొని మరీ సుఖస్తున్నాది.

---

# గ్రంథ పరిచయము

**గౌతమబుద్ధ చరిత్రము:—**

క్రౌనుసైజు 118 పుటలు. వెల రు. 0-10-0లు. గ్రంథకర్త శ్రీయుత సీరిపి ఆంజనేయులుగారు, అనంతపురం రాజకీయోన్నత బోధనాభ్యసన మహిళాపాఠశాలలో ఆంధ్ర పండితులు. శ్రీయుత రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు చక్కని పీఠిక వ్రాసినారు. ఇది కాల్పులేని కథయు, సందిగ్ధసిద్ధాంతపూర్ణమగు చరిత్రయు కాక గౌతమబుద్ధుని అవతారచిత్రమును మనస్సునహత్తించు కళారచనము. శైలి తదనుగుణ్యముగా నిర్దుష్ట సులభము. మదరాసు పాఠ్యగ్రంథనిర్ణయమండలివారిచే అంగీకృతము. ఉన్నతపాఠశాలలలో నెల్లపాఠ్యగ్రంథముగ నిర్ణయింప తగ్గది. అనంతపురం విజ్ఞానవల్లికా గ్రంథమాలవారి వద్ద ప్రతులు వెలకు చిక్కును.

**శ్రీరామకృష్ణాంజలి:—**

క్రౌనుసైజు 40 పుటలు. వెల రు. 0-1-6లు. 160 పార్కుస్క్వేరు, స్టోనుహౌసుపేట, నెల్లూరు నందుగల 'వాసు' గారికి వ్రాసిన ప్రతులు లభించును. 108 మత్తేభశార్దూలవిక్రీడితములు. రామకృష్ణుని పరమహంస మహిమలు వర్ణించు భక్తిరసగ్రంథము.

**వ్రతరత్నాకరము:—**

ఇది ప్రథమ భాగము. సతాత్పర్యము. డెమ్మీసైజు 102 పుటలు. ఇందు వినాయక, సరస్వతీ, వరలక్ష్మీ, అనంత, మధనద్వాదశీ, కేదారేశ్వర (ఆరు) వ్రతకల్పములు గలవు. సనాతన సదాచార సంపన్నులగు ప్రతివారి యింటను నుండదగినది. పురోహితుని యావశ్యకతలేకయే గృహస్థులు స్వయముగా దీని సహాయమున పైనోముల నాచరించుకొన వచ్చును.

**ఆంధ్రవాచస్పత్యము:—**

ఇది శ్రీ శ్యామలకామశాస్త్రీయమను నిఘంటువు. మచ్చునకు అకారమునందలి 100 పుటల ప్రకటన పండితాభిప్రాయముకొరకు వెలువడినది. ఇది బజారు నిఘంటువులవలె యేదో పదముల కర్థములు చెప్పు సాధారణ నిఘంటువు కాదు. ఒకొక్క పదముయొక్క పుట్టుపూర్వోత్తరము, వ్యాకరణ విశేషములు, నానార్థములు, పర్యాయపదములు, ప్రయోగములుగూర్చి సమస్త శాస్త్రగ్రంథ సంపుట విజ్ఞానమును సంగ్రహించి కుదరించిన యొకరీతి విజ్ఞానసర్వస్వము. విమర్శకాగ్రేసర, మహామహోపాధ్యాయ శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు విపులమగు పీఠికను వ్రాసియున్నారు. ఆంధ్రభాషా కల్పతరువై ఆంధ్రుల ముఖ్యమగు కొఱతను దీర్చుచున్నది. అసలు గ్రంథము 25 రుపాయిలు. పూర్తిగ్రంథ మనతికాలములో వెలువడనున్నది. ఆంధ్రులెల్లరును ఆదరించి సత్ఫలితము నందఁగలరని నమ్ముచున్నాము.

**దీర్ఘరోగ చికిత్సాసారము:—**

గతమాస గృహలక్ష్మి సంచికలో ఇందునుగూర్చి విమర్శనము వ్రాసితిమి. ప్రతులు వలయువారు దీర్ఘరోగ వైద్యశాల, వేటపాలెమునకు వ్రాసి బడయ వచ్చును.

**పట్టుశాలి:—**

ఇంతకుముందు ఈ పత్రిక కొంతకాలము నడిచి స్వసంఘాదరణలేమిని మూడేండ్లు నిలచిపోయి తిరిగి తలయెత్తినది. నాలుగవ సంపుటపు 1-వ సంచిక బాలారిష్టమును దాటి వెలువడి మా కార్యాలయము నలంకరించినది. సంవత్సరము చందా రు. 1-8-0లు. సంపాదకులు యమ్. వి. సీతారామరావుగారు. కార్యస్థానము గంజాంజిల్లా శ్రీకాకుళముదరినున్న బొంతలకోడూరు గ్రామము. బొంతల కోడూరు పట్టుశాలికులజమీందారులగు మాడుగుల వారి జన్మస్థానము. శ్రీమంతులయ్యు తమ కులవిద్యయగు నూలువడకుటను మానక ఈ కులమునందలి స్త్రీపురుషు లెల్లరును సన్ననినూలు వడకి నున్నితముగు బట్టలునేసి హిందూదేశమంతటికి నెగుమతిచేసి ప్రసిద్ధి బడయుచున్నారు. ఈ పత్రికయు ఈ సంఘమును, వీరి కులవృత్తియు శాశ్వతములై బలిష్ఠములై గాంధీమహాత్మ డారంభింపనున్న నూతన గ్రామ పునర్నిర్మాణోద్యమమునకు సంపూర్ణమగు చేయూతనొసంగగలరని విశ్వసించుచున్నాము.



# సంపాదకీయములు

గుంటూరుజిల్లా దంపుడుబియ్యపు సంఘము:—

సుప్రసిద్ధ కాంగ్రెసునాయకులును సత్యాగ్రహసమరసర్దారులునైన శ్రీయుత గొల్లపూడి సీతారామశాస్త్రిగారును మహాలక్ష్మీప్రియపుత్రులును నిరుపమాన దేశాభిమానియునగు మద్ది వెంకటరంగయ్యగారును తమ శ్రద్ధసంతటిని గుంటూరుజిల్లావాసుల ఆరోగ్యాహార సమస్యలపై కేంద్రీకరించి దంపుడు బియ్యముసంఘము నేర్పరచి అప్రతిమానమగు దీక్షతో పని చేయుచుండుటకంటె నిరుపమానమైన దీనజనసేవ మఱొండు లేదని చెప్పవచ్చును. ముప్పైతరముల క్రిందట మూలబడిన రాట్నమును లేవదీసి ప్రపంచపు బట్టలమిల్లులమీదికి మహాత్ముడు ఎట్లు యుద్ధము సాగించుచున్నాడో మూడుతరముల క్రిందట మూలబడిన రోకళ్లను తీయించి నిరాహారులును ఆకలిగొట్టులును శల్యప్రాయులునునగు పేదజనులను వీరాధివీరులనుచేసి ధాన్యపుమిల్లులమీదికి దాడి వెడలి వీరిరువురునుకూడ అట్టి ఘోర యుద్ధమును సాగించుచున్నారు. విజయలక్ష్మి మహాత్మునివలె సర్దారుగారిని వరించుకొనివచ్చుచుండుట జూడ మిల్లులయొక్క నిరంకుశప్రభుత్వ మంతరించి గృహపరిశ్రమలు వృద్ధియై స్త్రీ పురుషు లింటిపట్లను గ్రామముల మధ్యను నిలచి గౌరవముగ తొంటివలె అన్న వస్త్రాదుల కిబ్బంది లేకుండ సుఖజీవనములు గడుపగల స్వర్ణయుగము దృగ్గోచరమగుచున్నట్లు విశదము కాకమానదు.

విదేశీ, మిల్లు వస్త్రములు దేశమునకార్థికముగ మాత్రమే అనర్థదాయకములు కాని, మిల్లుబియ్యము ఆర్థికముగను కాయికముగనుకూడ నాశనకరము. శ్రీమంతులగు కొందఱు పెట్టుబడిదార్లను అధికతర ధనవంతులుగ చేయుటతప్ప మిల్లుబియ్యమాంధ్రదేశమునకు చేసిన మహోపకారమేమియును లేదు. ప్రజల ఆయురారోగ్యములను నాశనముజేయు ఈ దుర్వ్యాపారము వలన లభించిన సంపదలుకూడ బర్మాసయాము బియ్యముల పోటీ కాగలేక క్షీణగతిపట్టి ప్రొప్రయిటర్లు దివాలా లెత్తుచుండుట మనకు ప్రత్యక్షమే. వైద్యులెల్లరును నేకగ్రీవముగ మిల్లుబియ్యము ఎ. బి. విటమిను రహితములై అశక్తి, నంజు మొదలగు రోగముల కాటపట్టులని మొఱపెట్టుచున్నారు. దంపుడుబియ్యము మిల్లు

బియ్యముకంటె నేమాత్రము చౌకయై నను అవి తగిలించే డాక్టరుబిల్లులనుబట్టి చూచినయెడల అవి యెంత ప్రియమో విశదమగుచున్నది. ఈ చౌకతనమైనను కేవలము భ్రమయనియు, దంపుడుబియ్యము మరబియ్యముకంటె బస్తాకు రెండుశేర్లధిక ముగనుండి, అన్నము వదుగుగనుండుటచేత మరబియ్యముకంటె అవి విశేషము ప్రియముకావనియు, దేశీయులెల్లరు నాదరించినయెడల నవి మఱియును చౌకయై మిల్లు బియ్యమును త్రోసిరాజు చేయగలవనియు ఈ సంఘమువారి ప్రథమ సంవత్సర నివేదిక అణా పైసలతో సహా లెఖ్ఖలను తయారుచేసి రుజువుపరచుచున్నది.

మహాత్మాగాంధీగారు కద్దరు ప్రబోధము ప్రారంభించినప్పటినుండియు మన దేశీయులకు మిల్లువస్తువు లన్నిటియందును నొక రీతి నిరసనమును, గృహపరిశ్రమలవల్ల తయారయ్యెడి వస్తువులయం దనూనమగు అనురాగమును పొడమినది. కాని మిల్లువస్తువులెల్లయు గృహపరిశ్రమల వస్తువులకంటె కాఱు చౌకగానుండుటచేతను, అవి వర్తకులకును ఏజంట్లకును విస్తారము లాభము కూర్చుచుండుటచేతను నాటి ప్రచారము నిరోధింపఁబడకున్నది. ఖద్ద రెంత ప్రశస్తమైనదైనను మిల్లుబట్టకును దానికిని ఖరీదులో రెండు రెట్లు వారా ఉండుటవల్ల మిల్లుబట్ట నష్టదాయకమైనను, వేగము చిరుగునదేయైనను, ప్రజలు దానినే ఆశ్రయించి వారికున్న దేశాభిమానమును విదేశీవస్త్ర బహిష్కరణముతోను స్వదేశీ పెట్టుబడిదారుని కూలివానిని ఆదరించుటతోను సరిపెట్టుకొనుచున్నారు. కాని దంపుడుబియ్యము విషయములో నట్టివారాకూడా లేదు. ఉన్నను అది యొక లక్ష్యములోనిదికూడా కాదు. గ్రామగ్రామమునకును, నగరములలో గుమ్మము గుమ్మమునకును దంపుడు బియ్యము నందించగల ఏజంట్ల నేర్పరచినచో ఇట్టి స్వల్పతేడాఖరీదుతోనైనను ప్రజలు దంపుడుబియ్యమును కొనుక్కొందు రనుటకు సందేహములేదు. అఖిల భారతవర్షకునూలుసంఘమువంటి ఆంధ్రరాష్ట్ర దంపుడుబియ్యపుసంఘ మొకటి యేర్పడినచో ఇట్టి ఉత్పత్తిని, సరఫరాను, ఏజంట్లను ఏర్పాటుచేయుట అతిసులభము. నాయకులదృష్టి ఈ సమస్యపై ప్రాలకుండుటతప్ప ఇట్టి ప్రయత్న విజయమున కెట్టి ఆటంకమునులేదు. సర్దారుగారు తమ వానప్రస్థాశ్రమములో తమ దృష్టి నీ సమస్యపై నిగుడ్చి అవిరామమగు కృషిని సల్పుచుండుట యొంతయు దేశకళ్యాణకరము. ఇతర జిల్లాలవారుకూడ వీరి మార్గమును త్రొక్కి జిల్లాసంఘముల నేర్పరచి ఏకజండాక్రింద పనిచేసి దంపుడుబియ్య మింటింటికిని సరఫరా చేసి ప్రజలను నిరోగులుగను వీరులుగను ఒనరింతురుగాక!

ఇది కద్దరుపరిశ్రమకంటెను విరివిగా వ్యాపించుట కవకాశముకలది. ఆంధ్రదేశములో ప్రత్తి పండని యూళ్లును, ఏకులు సులభముగ పంపుటకును మగ్గములు నెలకొల్పుటకును సాధ్యము కాని యూళ్లును గలవు కాని వడ్లు పండని యూళ్లును

బియ్యము సరఫరాచేయుటకు సాధ్యముకాని యూళ్లును లేవు. అనేక మెట్టపల్లముల గ్రామములలో ధాన్యమును దూరస్థమిల్లు నకు గొంపోయి ఆడించుకొని తెచ్చుటకు సంసారులు కష్టపడుచు, ధాన్యమును కళ్లము గట్లమీద వర్తకులడిగిన స్వల్పధరల కమ్మి వేసి, వారు తెచ్చిన మిల్లుబియ్యమున కడిగి నంత పెద్దఖరీదు లిచ్చివేసి కొనుక్కొని నష్ట పోవుచున్నారు. దంపుడుబియ్యముప్రచారకులు దండుదండులుగా గ్రామములపై వ్రాలి ప్రచారములు ప్రారంభించినచో అనేక గ్రామములనుండి అనవసరమగు ధాన్యపురవాణా బియ్యపుదిగుమతి తప్పి, కార్షికుల కుపవృత్తియు, ఆరోగ్యమును, జీవనోపపత్తి చాలక విదేశములకు వలస పోవుటయు తగ్గిపోవును. సర్దారుగారు స్థాపించిన ఈ వటబీజ మిప్పటికే గుంటూరు జిల్లాలో మహావృక్షమైనది. అనతికాలములో ఇతర జిల్లాలలోనికిగూడ ఊడలువేసి అశేష ఆంధ్రజనులకు విశ్రమించుటకు నీడ నొసంగగలదు.

ఈపరిశ్రమలో పురుషులకు కూలిడబ్బులు చేతిలోపడడము, అవి అన్నముగా మారే లోపున కల్లుక్రింద దుర్వ్యయమై కుటుంబ మాకలితో మాడడము జరగదు. కూలులు బియ్యము రూపముగ నొసగబడుటచేత ముందు అన్నమై, అంతకు మించినప్పుడే ధనమై యితర వ్యయముల పాలగును. గుంటూరుజిల్లా సంఘమువారి ప్రథమ సంవత్సర నివేదిక వారి వివిధానుభవములు విజయములతో గూడి మిగుల ఆకర్షణీయ ముగనున్నది. దీనిని పఠించినవారెల్లరును తమ తమ ప్రాంతములలో నిట్టి ప్రయత్నములను ప్రారంభించి ఈ పరిశ్రమకు చేయూత నొసగి దేశమును స్వయంసమృద్ధముగను, శ్రీమంతముగను, జీవకళావంతముగను చేయుదురుగాక !

సీతాకళ్యాణము—తెలుగుటాకీ:—

ఇదిగో అదుగో అని మురిపించుచుండిన వేలుపిక్చర్సువారి సీతాకళ్యాణము ఫిల్ము తయారై ప్రదర్శనమగుచున్నది. ఆంధ్రుల పరామర్శక్రింద తనిఖీక్రింద తయారైన ప్రథమ టాకీ యిదియే యని చెప్పవలెను. ఇది ప్రథమ ప్రయత్నమైనను మిగుల ప్రశంసా పాత్రముగ నున్నది. బొమ్మలు స్ఫుటములు, కంఠస్వరములు సుస్పష్టములు, రంగములు సుందరములు, అభినయములు సభ్యములు ఆనందకరములై, ఆంధ్రులకళాభిరుచికి నిదర్శనములుగ నున్నవి. ఆంధ్రదేశీయుల కెల్లరకు ఆనందదాయకమై, నీతిబోధకమై, జ్ఞానప్రదమై వ్యాపించగల దనుటకు సందేహము లేదు. ఫిల్మంతయు మనోహరమై కాలచక్రముయొక్క అట్టడుగున పడిపోయిన పురాతన గాథలను, ఋషివాటికలను, వేద ఘోషలను, యజ్ఞకార్యములను, అరణ్య సంచారములను, రాక్షసాపాయములను, మంత్రశక్తులను, అస్త్రపటిమలను, వీరపరాక్రమములను, స్వయంవరములను మొదలగు దృశ్యములను పైకితీసి, సభికులకు లోచన గోచర మొనరించి తమ తొంటిమహత్త్వులను,

భక్తిపరాయణ జీవితములను పునర్జీవింప చేయుచున్నది. పాశ్చాత్య దేశములలో సాంఘికఫిల్ములు కేవల మనశ్చాంచల్యమును కలిగించి సంఘసంప్రదాయములను చట్టబండలపాలుచేసి మతాధిపతుల యొక్కయు నీతిబోధకులయొక్కయు ప్రభుత్వములయొక్కయు తిరస్కరణప్రచారములకును నిషేధములకును పాలగుచున్న సందర్భములలో, భారతదేశములో అవి యొక వరసను సంప్రదాయబోధకములై, సంఘసంస్కరణానుకూలములై, విజ్ఞానదాయకములై, విజృంభించుచుండుట శుభసూచకము. ఈ ఫిల్ముకు ఆంధ్రులొసంగెడి ఆదరణము నవకాశము చేసుకొని డైరెక్టరులు ఇతర పౌరాణిక పిల్ములనేగాక ఆంధ్రచారిత్రకకథాఫిల్ములను, నవీనశాస్త్ర జ్ఞానాభివృద్ధికి సంబంధించిన ఫిల్ములను, దీనజనోద్ధారకములైన యితరఫిల్ములను తయారు చేయించి ఆంధ్రులకు ఆనందవిజ్ఞాన సౌభాగ్యముల నేకముహూర్తమున ప్రసాదింతురుగాక !

మైసూరు సంస్థానము—ఆంధ్రభాషః—

ఆంధ్రమహాసభ స్థాయిసంఘముయొక్క జనరలు కార్యదర్శి శ్రీయుత సుసర్ల శ్రీరామ నరసింహంగారు మైసూరురాష్ట్రమున సంచారముసలిపి అచ్చటి ఆంధ్రులయొక్క జనసంఖ్యను గూర్చియు, ఆ రాష్ట్రాధీశులు ఆంధ్రభాష కొసగు ఆదరణమును గూర్చియు కొన్ని వివరములను ప్రకటించుచున్నారు. మైసూరురాష్ట్రములో గల 65,57,000 జనసంఖ్యలో 45,79,000 కన్నడులు, 10,31,000 ఆంధ్రులు, 3,83,000 హిందూస్థానీ మాట్లాడువారు, 3,14,000 అరవము మాట్లాడువారు, 91,000 మరాఠీ మాట్లాడువారు తక్కినవా రితరభాషలు మాట్లాడువారునునై యున్నారు. రాష్ట్రములో సుమారారవవంతుగను కన్నడుల సంఖ్యలో ¼ కంటె యెక్కువమందిగను, తదితరభాషలు మాట్లాడువా రందరితో తుల్యమైన సంఖ్యగను తెలుగువా రా రాష్ట్రమున నున్నారు. వీరందరునుకూడ ఏ వలసపోయిన బాపతో కాక స్థానికచిరసంవాసులైనవారు.

ఇంతమంది ఆంధ్రులుగల రాష్ట్రములో సంస్థానమువారు తెలుగుభాష కొసగుచున్న ఆదరణము శోచనీయమైనది. రాష్ట్రములో 5,706 ప్రాథమికపాఠశాల లున్నను ఒక తెలుగుపాఠశాల లేదట. మాధ్యమికపాఠశాలలు 292 లో, 257 కన్నడముబడులు, 30 హిందూస్థానీబడులు, 4 తమిళబడులు, 1 ఇంగ్లీషువారిబడి తప్ప తెలుగుబడి లేదట. 40 హైస్కూళ్లలో మూడింటిలోమాత్రము తెలుగు నేర్పబడుచున్నది. కాలేజీలలో మాత్రము తెలుగునకూడ స్థానమీయబడినదట కాని దీనివలన నచ్చటి తెలుగువారికేమి ప్రయోజనము కలుగునో ఊహింపజాలము. ఇట్టి పరిస్థితులలో తెలుగుభాష నానాటి కక్కడ క్షీణదశ పట్టిపోవుటలో నాశ్చర్యములేదు. ఇప్పటికే నశింపకుండుట ఆశ్చర్యకరము. రాష్ట్రములోగల భాషలకన్నిటికి వానిని మాట్లాడునట్టి జనసంఖ్యను బట్టి సమానాదరణము నొసంగుట రాష్ట్రాధీశుల అభిమాన వివేకములను సూచిం

చును. మైసూరురాష్ట్రములో $10\frac{1}{2}$ లక్షల జనులు మాట్లాడుభాష ప్రాయోపవేశ మొనరించి మరణించుచనుకొనుట వెఱ్ఱి. ఎట్టి నిరాదరణ పరిస్థితులలోనైనను నది చావక మొండికెత్తి యొంతటి బీదప్రజలయందైనను సజీవమై చిరంజీవిగ నుండగలదనుటకు ఆభాషయు ఆజాతియు నిప్పటికిని గౌరవముగ తలనెత్తుకొని మనగలుగుటయే సాక్షి. తమ రాష్ట్రములో పెద్ద మైనారిటీ శాఖయగు ప్రజలకు చెందిన భాష గదా యను అభిమానముచేత కాకున్నను, శ్రావ్యమై, కర్ణాటక సంగీత గౌరవభాజనమై, సనాతనమై, 'ఇటాలియను ఆఫ్ ది యీస్టు' అని ప్రశంసనందినదై అప్పయ్య దీక్షితులుగారు వచించినట్లు "ఆంధ్రత్వ మాంధ్రభాషాచ ప్రాభాకర పరిశ్రమః। తత్రాపి యాజుషీశాఖా నాల్పస్యతపసఃఫల" మ్మను కారణముననైనను ఆంధ్రభాష సంస్థానాధీశుల ప్రత్యేక పోషణకర్హమైనది. బొంబాయి మదరాసు ప్రభుత్వములు తమ రాష్ట్రములలో మాట్లాడబడు నాలుగేసి అయిదేసి దేశభాషల కాదరణమునిచ్చి పోషించుచున్నవి. మైసూరు ప్రభుత్వమువారు వారి ఉదాహరణము ననుసరింతురు గాక! అంతవరకు అచ్చటి ఆంధ్రులును, వారి తరఫున ఆంధ్రరాష్ట్రమునందలి నాయకులును మైసూరు దర్బారువారికి పిటిషనులు పెట్టి రాయబారములు నడపియు, ఆ ప్రాంతములలో పఠన భజనమందిరములు ప్రైవేటుబడులు నాటక హరికథా పురాణ కాలక్షేపసంఘములు మొదలగువానిని నెలకొల్పియు ఆంధ్రభాషను ఆంధ్రత్వమును ఆరిపోకుండ దీపింపజేయుచుందురు గాక!

బెంచిమ్యాజస్ట్రేటుగా నియోగింపబడిన ఆంధ్రమహిళ:—

శ్రీమతి అత్యంసత్యవతీదేవిగారు, పాలకొల్లులో నూతనముగ నేర్పాటు చేయబడుచున్న బెంచికోర్టుకు గవర్నమెంటువారిచే ఆనరరీమ్యాజిస్ట్రేటుగా నియమింపబడిరి. నరసాపురం తాలూకాలో స్త్రీల కిట్టి స్థానము లభించుట కిదియే ప్రథమ పర్యాయము. ఈమె శ్రీయుత అత్యం నరసింహమూర్తి (ఎమ్. ఏ.) గారి సహధర్మపత్ని. ఆర్యవైశ్యవంశ భూషణము. ఆంధ్రమున మంచిశక్త. పాలకొల్లు మునిసిపాలిటీవారి ఆరోగ్యప్రదర్శనములలో పాల్గొనుచును, నరసాపురంతాలూకాబోర్డు మెంబరుగనుండి బాలికాపాఠశాలలను పరామర్శ (సూపరువైజు)చేసి చక్కగా జరిపించుచు, మరియు నితరవిధములను ప్రశంసనీయమగు పౌరసేవ చేయుచుండెను. ప్రభుత్వమువారివల్ల ఇట్టి గౌరవమునందిన శ్రీమతి సత్యవతీదేవిగారికి మాహృదయపూర్వకమగు అభినందనముల నర్పించుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

నెల్లూరు ప్రోగ్రెసివు యూనియన్, నెల్లూరు.

# ఆంధ్ర వ్యాసరచన పోటి

## స్త్రీలకు మాత్రము

(1) పరీక్షకు పంపఁబడు వ్యాసములలో ఉత్తమమునకు నెల్లూరు ప్రోగ్రెసివు యూనియన్ వారిచే 1935 సం॥రం ఫిబ్రవరి నెలలో తిక్కన జయంత్యుత్సవానుబంధముగా జరుపఁబడు మొల్లజయంత్యుత్సవ సందర్భమున శ్రీయుత కోట నరసింహాము పంతులు గారు స్వర్ణపదకము బహూకరించెదరు.

(2) ఈ పరీక్షకు విద్యార్థినులెగాక స్త్రీలెల్లరు పోటీజేయ నర్హులు.

(3) విషయము: శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచింపఁబడిన "శారదలేఖల విమర్శ". శారదలేఖలను ఈ క్రింది విలాసమునకు వ్రాసి బడయవచ్చును.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు, బాపట్ల. వెల రు. 1—0—0.

(4) వ్యాసము సలక్షణభాషయం దుండవలయును. లేఖన మొక్కప్రక్కనే యుండవలయును. ఫుల్స్కాపు పుటలు ఇరువది కెక్కువ వ్రాయరాదు. వ్యాసమున ఇతర గ్రంథములనుండి అనువాదములు మొదలగునవియున్నచో అట్టి గ్రంథముల పేరు లాయా పుటల యనుగుననే వ్రాయవలయును. దీర్ఘములైన యనువాదము లుండరాదు. భాషయందు రుచితయు, భావమున స్వాతంత్ర్యమును, కథనమున పొందికయు, విమర్శ యందు నేర్పును ఎక్కువ గుణముల (Marks) బడయగలవు.

(5) వ్యాసమునగాక వేరొకపుటలో, పోటీజేయువారు తమ పేరును విలాసమును విశదముగా వ్రాసి అందుక్రిందనే తాము పేర్కొన్న గ్రంథాదికము తక్క, నితరము చూడ లేదనియు, వ్యాసము సొంతముగా నితరుల సహాయములేకయే రచించితిమనియు ఒక విజ్ఞాపనము వ్రాసి చేర్వాలు చేయవలయును.

(6) పోటీజేయువారు వారి పేరుగాని, వారిని గుర్తింప వీలగు సాధనములేవి గాని వ్యాసమున నెచ్చటను వ్రాయరాదు.

(7) వ్యాసములు ఈ క్రింది చిరునామాకు 1935 సం॥రం జనవరి నెల తే 1.ది లోగా చేరులాగున పంపుకొనవలయును.

కార్యదర్శి, నెల్లూరు ప్రోగ్రెసివు యూనియన్,
L. P. హాలు, నెల్లూరు.

మధ్వపతి హనుమంతరావు పంతులుగారు, M.A.,B.L.,
కార్యదర్శి—20-10-34.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎ. జగన్నాధరావు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.
మచిలీపట్టణము: ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, పెద్దచావిడి, ఆంజనేయులగుడి దగ్గర, 168, సుల్తాన్ బజారు. (మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును)
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ,
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్ కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
సెకంద్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాగాకుబజారు.
ఏలూరు: బి. విశ్వనాథంగారు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెనీ.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కాకినాడ: పడిమి సూర్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్.
గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

# 'వినోదిని'



## ఆంధ్రదేశానికంతటికి నవ్వుల మాసపత్రిక

యిది యొక్కటే. ఇప్పుడిది మాసమునకొక్కొక్క త్రివర్ణభము చిత్రముతోను, మునుపటికంటె హెచ్చుగహాస్యపు బొమ్మలతోను, హెచ్చు పుటలతోను వెల్వడుచున్నది. చక్కని వ్యాసములకు బహుమతులుగూడ యివ్వబడుచున్నవి.

సం||రం చందా రు 1. మాదిరి సంచిక ఇనాముగ పంపబడును.

ప్రతి ముఖ్యపట్టణమునందు యేజెంట్లు కావలెను.

వి నో ది ని కా ర్యా ల య ము,

V. K. (4) 174 — 234, గోవిందప్పనాయకన్ వీథి, మద్రాసు.

---



మాపరిశ్రమశాలలో డాజిలోడైమండ్, శాస్త్రీయపుష్యరాగములు:, ఇమిటేషన్ పుష్యరాగములు, పట్టెకెంపులు, కుచ్చుకెంపులు, వైక్రాంతములు, నీలములు, పచ్చలు కలవు. ప్రతిరాయి సీమకమలములకువలె, పట్టెలుతీర్చి గ్యారంటిగా పంపబడును. దీనియందు మాకు సుమారు 160 సంవత్సరములుగ వంశపరంపరగా అనుభవముకలదు. మావద్ద పరీక్షితులగు వ్యాపారుల నెరిగియుం డినను క్రొత్తగావ్యాపారము చేయతలంచువారు చిన్నఆర్డరుఇచ్చి ఒకసారి తెప్పిం చిన పై విషయము ఎల్లరకు తెలియబడును.

ఎలక్ట్రిక్ సానలో రవవడితో తయారు చేయబడిన అసలురంగూన్ కమల ములు గారంటీగా పంపబడును.

## పి. గోపాలస్వామినాయుడు అండు సన్సు

వెలల జాబితా ఇనాముగా పంపబడును:—

కార్యాలయము, కర్మాగారము:
5. పుదుపేటవీధి,
పరింగిమలెపోస్టు.

బ్రాంచి:
234 గోవిందప్పనాయనివీధి
జి. టి. మదరాసు.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగు లక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపము గలిగినప్పుడు ఉపయోగించి తప్పక పనిచేయును. గర్భాశయమునుండి మైల సరీగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి **(Douche)** మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిది ఒక్కటే; ఇది బాలింతల పాలిటి పరమౌషధము.

వెల తు. 1—కి రు. 30.

పుకుడు వారమురోజులకు మందు రు.5.

—

## రజోదర్శిని

స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన వ్యాధులకు మంచి మందు. ముట్టునొప్పి, మైల సరీగా కాకపోవడం, బొత్తుగానే బహిష్టు కాకపోవడం, మొదలైన బాధలను నివారించును. రజస్వల కాని వారలుకూడ సేవించిన పిదప రజోదర్శనమైనట్లు ప్రశంసలు గలవు. వివరములు కోరిన పంపబడును.

50 మాత్రలు రు. 2.

పై రెండు ఔషధములనుగూర్చిన వివరములు కోరినవారికి ఉచితముగా పంపబడును. 160 పేజీలుగల 'ఆయుర్వేద చికిత్సాదర్పణము' అను గ్రంథము 0-2-0 లకు పోస్టేజీబిళ్లలు పంపినవారికి ఉచితముగా పంపెదము.

*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకర శాస్త్రి,

ఎ. ఎం. ఎ. సి.




సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] డిసెంబరు 1934 [సంచిక ౧౦

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువమేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేప్రక్క సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పంపకుండుటకెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తులపేర ఎంతమాత్రము పంపకూడదు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎ. జగన్నాధరావు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, పెద్దచావిడి, ఆంజనేయులగుడి దగ్గర, 168, సుల్తాన్ బజారు. (మన ప్రాంతపు 1 రూఉస్మానియా రూ 1-3-0అగును)
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్‌కంపెనీ,
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్‌ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.
మైసూరు: స్టూడెన్ట్సు హాలు.
బెంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్‌డిపో.
తణుకు: వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్‌స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
సెకంద్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాగాకుబజారు.
ఏలూరు: బి. విశ్వనాధంగారు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెనీ.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
ఖరగ్‌పూర్: ఆర్. వి. రమణయ్య, స్టోర్స్‌క్లర్క్, బి. ఎన్. ఆర్. వై. వర్క్ [షాప్స్.
కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్.
గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

# పసిపిల్లలు

కింకపట్టియేడ్చుచున్నను, పిండుకు పెట్టుచున్నను, మఱియేవిధముగా బాలలను
పీడించుచున్నను—వెంటనే వారికి చికిత్స చేయవలెను.

వైద్యశిఖామణులెల్లరంగీకరించిన దొక్కటే చికిత్స.




వారి యెముకలు, దేహము గట్టి పడవలెను. నరములు దృఢపడవలెను. వారికి సరిపడునంత ఎ, డి విటమినులు, కాల్షియము, ఫాస్ఫరము వారి ఆహారముద్వారా రక్తములోనికి పోవలెను.

స్కాట్సు ఎమల్షను సేవించినచో యీ లోపములుతీరి పిల్లలు బలవంతులగుదురు. వైద్యులు 60 యేండ్లనుండి దీనిని సిఫారసు చేయుచున్నారు.

ఇది అతిసున్నితమైన కాడ్లివరు ఆయిలునుండి తయారైనది. జీవశక్తులను పెంచునట్టి విటమిను ఎ యున్ను, యెముకలను, పండ్లను బలపరచు కాల్షియమును, పంట పట్టించు విటమిను డి యున్ను ఈ ఎమల్షనుయందు పరిపూర్ణముగ నున్నవి. ఇది కాడ్లివరు ఆయిలుకంటె మూడురెట్లెక్కువ గుణమును కలుగజేయును. ఇందు మరియొక విశేషమేమన, ఇది సులభముగా జీర్ణమగును. పిల్లలు తినుట కింపైన రుచి కలిగియుండును.

దగ్గులకు, పడిశములకు, ఊపిరితిత్తుల జబ్బులకుకూడ ఇదియే పరమౌషధము. నరములు యెముకలు బలపడి ఆరోగ్యవంతులగువారి ని జబ్బులు తాకనేరవు. పెద్దజబ్బు చేసి నిమ్మళించినవారు దీనిని సేవించినచో వారు జబ్బులో గోల్పోయిన రక్తమును మాంసమును కొంచెము కాలములో కోలుకొందురు.



# SCOTT'S Emulsion

**స్కాట్సు ఎమల్షను ఏమేమి చేయగలదు?**

యెముకలను బలపరచి మాంసకండలను పెంచును.

నరములను దృఢపరచును.

ఊపిరితిత్తుల కట్టిరోగము లంటకుండ నివారించును

రక్తమును వృద్ధిపరచును జబ్బులను తరుమును.

మందువర్తకులు: ఇంపీరియలు కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్,

కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా,

అహమ్మదాబాదు, కొచ్చిను, కాలికట్టు, విశాఖపట్టణము, కరాచి, అమృతసర్.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR



## లోధ్ర

ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

ఈ ఔషధ రాజము సుప్రసిద్ధవన ఓషధులచే తయారు చేయబడినది. గడచిన ముప్పదిఅయిదు సంవత్సరములనుండి హిందూదేశమునందే గాక పరదేశములయందు గూడ వాడబడి ప్రసిద్ధి గాంచినదివ్యౌషధము.

ఈ లోధ్రను వాడినవారు యిది వనితలకు వరప్రసాదమనిన్ని, రసాయనములకు రాణియనిన్ని, స్త్రీలపాలిటి కల్పవృక్షమనిన్ని, కొంగుబంగారమనిన్ని మరియు ననేకవిధములుగ స్తోత్రమును చేయుచుండుట యెల్లరకు దెలిసిన విషయమైయున్నది.

గర్భాశయదోషజనితవ్యాధులగు ముట్టు కుట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము జాస్తి తక్కువ లగుట, స్రావము అనేకరంగులతో వెడలుట, సూతికగడ్డ, గర్భాశయమున విస్రవణములు కలుగుట, మంట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టగునటుల చేయుటలో అసమానశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్రపుత్రికా భిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

చీకటింటిని ప్రకాశింపజేయు ఈ దివ్యజ్యోతిమహిమను యెల్లరు గుర్తెరుంగుదురు గాక!

12 ఔ. రు 3.  6 ఔ. రు 1—10 అణాలు.

లోధ్ర యెల్లెడలను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

# పఠానుల బలపరాక్రమము

## కాశ్మీరపుకేళి మీకు కావలయును



మానవులందరును బలిష్ఠముగను దార్ఢ్యముగను జన్మింపరు. కాని శరీరమునుపట్టి పీడించే నిస్సత్తువను నిర్మూలించి నిగనిగలాడు దేహముతో నిండు ఉత్సాహముతో అవయవముల పుష్టితో హాయిగానుండు టవసరము. అది మానవుని జన్మహక్కు. అందులకై ప్రతి ప్రాణియు ప్రయత్నింపవలయును.

దేహమందు రక్తము నిష్కళంకమగు ఉష్ణరక్తము ప్రవహించుచో దేహమునకు ఆరోగ్యము, ప్రాణికి ఆనందము, జీవితముయెడల ఉత్సాహము ఉండగలదు. జీవాధారమగు ఉష్ణరక్తమును వృద్ధిచేయుటకు సాధనము అమృతకంటె వేరులేదని చెప్పకతప్పదు. శుష్కించిపోయిన మానవుని మన్మధునిగ చేయును. పిరికివానిని పరాక్రమునిగ మార్చును. మందబుద్ధిని బుద్ధిమంతుని చేయును.

# అమృత

## రక్తశుద్ధి ద్రావకము

రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, ఋతుసంకటములు, నిస్సత్తువ, కడుపులో మంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 అ.




అమృత యెల్లెడల దొరకును.

**కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.**

# మాలతి




ఇది బాదంపప్పుపాలనుండి తయారుచేయబడిన యొక తెల్లని సువాసనగల నవనీతమువంటిది. దీనిని స్త్రీపురుషులు తలదువ్వుకొనుటకు ముందుకొద్దిగ రాచుకొని దువ్వుకొనిన, వెండ్రుకలు రేగక పట్టుకుచ్చువలె మిసమిసలాడుచుండును. మెదడు చల్లపడి సుఖముగ నిద్ర వచ్చును. ఇందు ముఖ్యముగ మాలతీపుష్పముల అత్తరు చేర్చియున్నది. ఈయత్తరు సొగసునకు సొంపునకు సుఖమైన సువాసనకు పేరు గాంచినది.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరి కుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

# మల్లిక

ఇది ముద్దుబిడ్డలకు మురిపమైన లేపము. ఇది మైసూరు చందన అత్తరుతోను మల్లెమొగ్గల సారముతోను తయారుచేయబడిన నవీననవనీతము. శిశువులకు దీనిని ప్రతిదినము స్నానానంతరము కొద్దిగ శరీరమునకు రాచుచుండిన చర్మము మృదువై బంగారురంగునిచ్చి చర్మవ్యాధుల రానీయకుండచేయును. ఈ లేపమువలన బిడ్డలు రబ్బరుచెండ్లవలె తేరుదురు. ఇందు కాశ్మీరపు కేసరి పునుగుకూడ చేరియున్నది.

వెల బుడ్డి 1-కి 8 అణాలు

# కుంతలకాంతి తైలం

సువాసన తలనూనె. స్త్రీపురుషులు తలదువ్వుకొనుటకు ఇది మంచి సువాసనతైలము. దీనిలో పరదేశపు అత్తరులను కలుపక స్వదేశ పుష్పములతో తయారైన అత్తరులతోనే తయారుచేయబడినది. పరదేశపు అత్తర్లు బొగ్గు తారులోనుంచి తీయుదురు. స్వదేశపుఅత్తరుల హిందూదేశపు మల్లె, జాజి, గేదంగి, మాలతీ, మాధవీ మొదలగు పుష్పములలోనుంచి తయారు చేయుదురు.

బుడ్డి 1—కి 12 అణాలు.

# కేసరి పోమేడ్

దీనిని తలదువ్వుకొనుటకు ముందు కేశములకు కొద్దిగ రాచుకొనిన వెంట్రుకలు రేగక మిసమిసలాడుచుండును. ఇందు పేరుగాంచిన అత్తరులు చేరియున్నవి.

బుడ్డి 1—కి 3 అణాలు.

 సౌందర్యవర్ధకములగు నవనీతములకొఱకు

సింహము మార్కు గలవానినే

తప్పక కొనుడు.




కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

———:O:———

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీవస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యార్థినులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

# విషయసూచిక



సంధ్యానటుడు; కథ;

నాకంబున్ భువి జోకతోఁ గలుపు నౌన్నత్యంబు, సద్వార్ధ సు।
శ్రీకస్థైర్య మమర్త్యమర్త్యగణ సంసేవ్యస్వరూపంబు న
స్తోక స్వచ్ఛరస ప్రవాహగతి మాధుర్యంబు నానాద్రుమ
వ్యాకీర్ణంబగు పర్వతప్రకృతిశోభం జూచి యుచ్చోటు భూ।
లోకాకల్పుండహా మహాత్ముండని యాలోలాక్షి కన్నోర్చెడిన్ ॥

ప॥ కృష్ణమూర్తి.




# ఆత్మరక్షణ

ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనోబంధు రాత్మైవ రిపు రాత్మనః ॥
బంధురాత్మా త్మన స్తస్య యేనాత్మై వాత్మనాజితః ।
వినాత్మనస్తు శత్రుత్వే వర్తతాత్మైవ శత్రువత్ ॥

తన్ను తానే యుద్ధరించుకోవలయును. తన్ను నశింపఁజేసికోరాదు. తనకుఁ దానే బంధువును దనకుఁదానే శత్రువునుగాఁ దెలియవలయును.

ఏ మనస్సుచేత దేహేంద్రియాదుల జయించునో ఆ మనస్సే వాని యాత్మకు బంధువు. ఇంద్రియ నిగ్రహము లేనివానికో ఆత్మయే శత్రువువలె నపకారియగును.

'గీత'

ఆర్యుల కైహికాముష్మిక సుఖసంపత్తుల నిచ్చి వారి యశము నాచంద్రతారార్కమైయుండునట్లు చేసిన దీ యాత్మజ్ఞానమే! ఇయ్యది కేవల పారలౌకిక విషయమునకే యుద్దేశింపఁబడి యున్నదియని కొందరనుకోవచ్చుఁ గాని యది యంత మాత్రముతోఁ జెల్లదు. మొదటిది యిహము దరువాతిదే పరముఁ గదా! అందువలన ననుభవజ్ఞానసిద్ధులగు పెద్దలు "స్వహితము" నుభయార్థకమనిరి. అయిన దీని కేదయినఁ ద్రోవయున్నదా యనిన నెందుకుండదు!! తృప్తి యనునదియే దారి. జీవించుటకొరకే తినవలెను గాని తినుటకొరకే జీవింపరాదను దివ్యజ్ఞాన మీ తృప్తి

వల్లనే కలుగును. ఇది కలిగిననాడే తనకును దనవలన లోకమునకునుగూడఁ జనుఁడు గళ్యాణకారి కాఁగలఁడు. అట్టివానినే సాత్వి కత కోరి వరించును. కాఁబట్టి తృప్తి యను నది సామాన్యపుమాట కాదు.

ఐతే—కాలప్రభావమున నిట్టి జ్ఞానబీజము లన్నియు నడుగునఁబడి కేవల భోగలాలస తయే మానవుల జీవితమూలలక్ష్యమైనది. అందువలన సర్వవిధముల నర్థముమాత్రమే సుసంపాద్యము కాని మరియొకటి వలదను పద్ధతి యేర్పడినది. దానంజేసి మానవధర్మ మంతయు మాటఁ గలిసిపోయినది. "యేన కేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవ" యన్నది మహామంత్రమై చివరకు భరత భూమిని బానిససీమనుగా మార్చినది. చూడుఁడు:—

మొన్నమొన్నటివరకు భారతభూమిలోఁ దత్రాపి మన యాంధ్రదేశమున "ఇంగ్లీషు చదువుకొని యుద్యోగముచేయుట"యే అనేకులకుఁ బరమలక్ష్యమైయుండిన విష యము. దూరాలోచనలేని వీరినిఁజూచి వీరివంటివారే మరియును బెక్కుమంది, వీరి దారి త్రొక్కిరి. "కానని వాని నూతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్ గానఁడు" గదా!! ఇది యెంతవరకుఁ దెచ్చినదో చూడుఁడు. "ఎంతేఁ గష్టము నొంది యొంది మరి బియ్యేలై కలెక్టెరిటులో సంతోషంబుగ నాత్మ లమ్ముకొని యే స్టాట్రింగుతోనో మహాసంతోషంబును బొంది యుండ"వలె. అంతేకాని మరియొక పని యీ మగవారికిఁ జేతకాదు.

అది యట్లుండనీ. అది మగవారిస్థితి. ఇఁక నాఁడుదానిఁ జూతము. ఉద్యోగస్తుని భార్య; కష్టపడలేదు పాపము! కాబట్టి దాసదాసీ లుండకతప్పదు. నాలుగణాల గుడ్డకు నెనిమిదణా లిచ్చియైనను జాకెట్టు, దర్జీ వానిచేతఁ గుట్టించుకోవలసినదే కాని యీమెకు రాదు! వేయేల?! కందులు వేయించి పప్పు చేసుకొనుట స్వప్నవార్త యైనది కాదా!

దుఃఖభాజనమైన యిట్టి యవస్థలోపడి, మగవాఁడు సంపాదించితెచ్చునది చాలక పెళ్లినాఁడా యత్తవారుపెట్టిన యీ పది తులాల త్రొక్కుగూడ సరిపెట్టుకుని చివరకు 'సీ తా రా మా భ్యా న్న మః' యనలేక 'శ్రీహరీ' యని కన్నులు మూయలేక త్రిశంకుస్వర్గమునఁ బడి కొట్టుకొనుచున్న కుటుంబములను లక్షోపలక్షలను జూప వచ్చును.

సేవకవృత్తి యెంతమాత్రమును జేయ రాదని శాస్త్రములచేఁ దీవ్రముగ శాసింపఁ బడియు బ్రాహ్మణుఁడు—క్షుమిత్రుగాక—భోగలాలసుఁడై త్రొక్కిన యీ నిషిద్ధ పద్ధతినే క్షత్రియులు, వైశ్యులు, వీరు వా రననేల, యందరును గొర్రెలవలె నొక్క తూరి త్రొక్కుటచే దేశమునకుఁ బ్రాణా దారభూతములైన వృత్తులన్నియు నొక్క మొగి మాటఁ గలసిపోయినవి. ఈమాటకు మరి వివరము లక్కరయేలేదు. తలచు కొన్నయెడల గడుపు తెకతెకమని చున్న ముడికిన ట్లుడుకును.

అదృష్టవశమున నీతరము నాటికి మహా మహులు కొందరు బయలుదేరి యీ దరిద్రపు నిద్రనుండి ప్రజల మేలుకొలుప నారంభించిరి. ఇప్పుడిప్పుడే దేశము కన్నులు తెరచి చూడమొదలిడినది. ఇట్టి మహా తరుణమున మగవారికున్న బాధ్యతకంటె నాడువారికున్న బాధ్యతయే పదిరెట్లెక్కువగఁ దోచుచున్నది. అట్లని మరలఁ జెరసాలల నింపమనుట యెంతమాత్రమును గాదు. ఆ యుపాయము పరమాపాయకరమని కాలానుభవమే తేల్చివేసినది. మరి శాసనసభాదిక రాజకీయప్రమేయములా? - అదియును గాదు: ఏ నలువురేవురు స్త్రీలకో గాని యందరికిని అది రాజాలదు! ఐతే మరేమియనగా బ్రతి యిల్లాలును, దాను దన సంసారము, తన బిడ్డలు పాపలు, నెమ్మదిగా నుండగలుగు మార్గ మేదియని తీవ్రాలోచన చేయవలెను. మనస్సాక్షిగ నిట్టి తీవ్రాలోచనయే చేయునెడఁ జివరకు "ఆయముచూచి వ్యయముసేయు" మని యంతరాత్మ తప్పక చెప్పును! ఈ బీజము నిష్కల్మష హృదయభూమిలో బడునెడల స్వారాజ్యఫలమును మన కందింపకమానదు. ఇప్పుడు పెక్కండ్రు తా మున్నస్థితి కనురూపముగాఁ గాక అంతకంటె నెక్కువ స్థితిలోనున్నట్లు గనుపించవలెనని ప్రయత్నము చేయుచున్నారు. ఇది యాత్మవంచన. నాగరకతకై ప్రాకులాడుట ఒక యలవాటైనది. ఈ యలవాటుమూలమునసే పెద్దపెద్ద సంసారములుగూడ నెత్తువచుచుండ నిఁక సామాన్యులమాట లేలఁ జెప్పవలయును! పసుపుముద్దవంటి బంగారము నమ్మి పట్టంచుచీరలు కొనుక్కున్నవారెందరోయున్నారు! ఈ చీరలకొరకే కాదు: సబ్బులు, రిబ్బనులు, పౌడరులు, మెరుగులు మొదలగు నితర వస్తుసంచయములకై తాపత్రయపడి అప్పులపాలై యంగడివాండ్లచే నవమానముపడుచుండువారి నెందరినో సులభముగాఁ జూడవచ్చును. ఇట్టిదంతయు గూడ 'ఆయముజూచి వ్యయముచేయు' మను సూత్రమునుబట్టి జీవయాత్ర సాగించువారలకుఁ గ్రోసెడుదూరమున నుండకతప్పదు. ఈవిషయ మరవతెరవలయందు లెస్సగాఁ గనఁబడుచున్నది. వారలఁజూడ నెంతో యానందము గలుగును. కూడరికమునకు వారు మనకు గురుస్థానమున నున్నారనుట యథార్థము. యజమానుడు నలువదిరూకలు జీతముతెచ్చి చేతఁబెట్టఁగ ముందుగా నలువది యణాలో లేక నలువది బేడలో తీసి వేరుగనుంచి తరువాత మిగిలినదానితోనే సంసారము నడపుట నేర్పరితనమో లేక నలువది రూకలును జాలక మరి పది పదు నేను రూక లిరుగమ్మ పొరుగమ్మలకడ నప్పుదెచ్చి సంసారము నడపుట నేర్పరితనమో యోచింపుడు. "చాలకుంటే చావమన్నారా?" యని కొందరు కోపపడుదురు. సరే; కోపపడవచ్చును; కాని "ముప్పది రూపాయల జీతగాని భార్య, ముగ్గురు నలుగురు బిడ్డల తల్లి, మన పొరుగుననున్న పొన్నమ్మాళ్ మూడు నాలుగు వందలు వడ్డీ వ్యాపారమునఁ ద్రిప్పుచున్నది కదా యేమందువమ్మా?" యని యడిగినయెడల

నా కోపముపోయి పొన్నమ్మాళ్లుకువలె బుద్ధియే కలుగునో లేక "పొన్నమ్మాళు పొట్ట మాడ్చుకుంటుం"దను రట్టే పుట్టునో గట్టిగాఁ జెప్పలేము. ఏమన నీ రెండువిధములుఁగూడఁ గావచ్చును. అది సహజమే. కాని పొట్టమాడ్చుకొనుచున్నను పొన్నమ్మ "కున్నది" యను తుష్టియైననున్నది; కాని అప్పుచేసుకొని యెంతతిన్నను మీ కేమాత్ర మైన నెప్పటికైనఁ దుష్టియున్నదా యని వీరి నడుగుదుమేని వీరేమియుఁ జెప్పలేరు! అయ్యో పాపము!! వీరికిఁ దుష్టి యేమీ లేదు: పుష్టి యసలేయుండదు.

కాబట్టి 'ఆయముచూచి వ్యయముచేసు కొన్నచో మన బంగారమెగుమతి కాకుండె డిది మనము హాయిగానుండెడి వారము మన యాత్మానంద సౌభాగ్యములే దేశానంద సౌభాగ్యములగును గాని దేశమున కనుచుఁ బ్రత్యేకముగా నానందసౌభాగ్యము లెక్కడనుండియైన వచ్చునా? కాబట్టి దేశాభ్యుదయమును గోరు ప్రతియిల్లాలును గూడ నాత్మాభ్యుదయమునకై పాటుపడుట ప్రప్రథమ కర్తవ్యము. ఆయముచూచి వ్యయముసేయుటయే యాత్మాభ్యుదయావాప్తికి మొదటిదారి.

విదేశవేషభాషావ్యామోహము మనలో నేనాడు మొద లంటనశించునో ఆనాడు మన కీ యుత్తమపద్ధతి సుగమ్యమగుననుట నిస్సందేహము.

మునుముం దీ యుత్తమమార్గమునుబట్టి యావెనుక స్త్రీ తన యింటనుండియే యెన్నో పనులు సేయఁగలదు. అట్టి పనుల వల్ల నాదాయముగూడ రాగలదు. అట్టి యాదాయ మాయావ్యక్తులకే గాక దేశమునకుఁగూడ నభ్యుదయసూచకము.

గ్రామయోగక్షేమావాప్తికై వలయు కార్యసూత్రములను నిర్మించుకొని బయలు వెడలుచున్నాఁడు కదా మహాత్ముఁ డిపుడు. అతనికిఁ దోడ్పడి దేశాభ్యుదయమును సంపాదింపఁగలవా రెవ్వరు? ఇదిగో వీరే-ఆయముచూచి వ్యయము చేసికొనుచున్న వారు. అనఁగా నున్నదానితోఁ దృప్తినొందిన యార్యలు. వీ రేపనియైనఁ జేయఁగలరు. పది డబ్బులుకూడఁ బెట్టుకోఁగలరు. అట్టివారి యోపికవలన అట్టివారి యోగ్యత వలనఁ బ్రస్తుత విశీర్ణమైన భారతి, మరలఁ దొంటివలె నార్యావర్తమై సార్థకతఁ జెందగలదు!!

## గాంధీ మహాత్ముడు

శ్రీమతి గార్లపాటి లక్ష్మీగంగమ్మగారు

సీ॥ భారతావనికెల్ల బానిసవ్రతముదీర్ప బూనినయట్టిస త్పురుషుడితడు
తాకష్టములకోర్చి తనధనంబంతయుధారబోసినయట్టు త్యాగియితడు
పాండవాగ్రజుబోలు పావనచరితుండుసత్యంబుదప్పని చతురుడితడు
హరిజనసేవయే హరిసేవయనిచేసి,పడరానిపాట్లను బడియెనితడు
తే॥ గీ॥ సరసగంభీరహృదయుండు శాంతమూర్తి కర్మఫలవర్జితుండు నిష్కపటియితడు
దేశసేవాభిలాషిగాం ధీమహాత్ముడాయురారోగ్యవంతుడై యలరుగాక॥

# "గృహలక్ష్మి"

దేవానుల అప్పలరాజు గారు

శా॥ శ్రీయున్ వాణియు గౌరియున్ సతతమున్ చెంతన్వసింపన్, మదిన్
హాయిన్ బొందుచు నాశ్రితాళిని కృపన్ ఆలోకనన్ జేయుచున్,
శ్రీయున్నాయువు సర్వకామ్యవితతిన్ జేకూర్చు ముమ్మూర్తులే
స్వీయాంతర్గత కోర్కెదీర్చి గృహలక్ష్మి పత్రికన్! బ్రోచుతన్.

మ॥ ప్రభవంబొందితి వాంధ్రదేశ మహిళా ప్రజ్ఞల్ విజృంభింపగా,
శుభముల్ గూర్చగ బాలబాలికలకున్ శుద్ధాంతకాంతాళికిన్
విభవంబొప్ప ననూనవైఖరులతో విజ్ఞానమున్ జల్లుచున్,
రభసంబేర్పడ గేహలక్ష్మి యనుపే రన్ ధాత్రి నొప్పొందుచున్ ॥

సీ॥ ఒకవంక కవులు వే రొకవంక కవయిత్రు లేర్చిపేర్చిన సుద్దు లెలమివెలయ
ఒకచక్కి కథలు వే రొకపక్కి వ్యాసముల్ గరిమ సంస్కరణాప్తి గరపుచుండ
ఒకప్రక్క రుచులు వే రొకదిక్కు శుచియును నారోగ్యసూత్రముల్ గోర్కెనేర్ప
ఒకటచిత్రములు వే రొకటవిచిత్రముల్ హృదయంగమంబులై యొప్పుచుండ.

గీ॥ సురుచిరాలంకృతంబులై సొబగుమీరు నవనవోన్మేషమృదులావయవములొప్ప
సరససంగీతసాహిత్య సత్కళలను రాజిలుచునుంటి విల'గృహ। లక్ష్మి' వగుచు.

చం॥ కమలనివాసి యా రమను గన్గొనజాలము యొండ్లు నూర్లుగా
విమలతపంబొనర్చినను వెన్నునివేడిన యాంధ్రభూమిపై;
సుమశతమంజులంబునగు సుందరపాద యుగంబుతోడ స
త్కమలనివాసివైన నిను గాంచుచునుంటిమి గేహలక్ష్మిరో!

ఉ॥ చక్కనిరూపసంపదయు చల్లని సత్యసుభాషితంబులున్,
దిక్కులమ్రోవగా దగిన దివ్యపదాంచితవర్తనంబు పెం
పెక్కినకూర్మితో బుధులు పేర్చుసలంకృతితోడ గుల్కుచున్,
నిక్కపులక్ష్మినా దనరు నిన్ 'గృహలక్ష్మిరొ' యెన్న శక్యమే!

కం॥ మంగళమో 'గృహలక్ష్మి'
మంగళములు నిన్నుగనిన మహితాత్మునకున్
మంగళము నీదు సఖులకు,
మంగళములు నిన్నుగాంచు మహితాత్ములకున్ ॥

# గొబ్బి పండుగ

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

భారతీయబాలికల కొక యాదేశము.

అన్ని వ్రతములకంటె ధనుర్మాసవ్రత ముత్తమమైనది. యీ వ్రతమునకు శ్రీ కాత్యాయనీదేవిని పూజించుట ముఖ్యము. దీనికి ధనుర్మాసము పండుగనెల యందురు. యీ నోము భారతీయులకందరి కనుష్ఠేయము అయినను పెళ్ళిగానికన్నియలచే ఈదేవిని పూజింపించుట సర్వోత్తమము. మున్ను వ్రేపల్లెలో నందాదు లనావృష్టి దోషమునకు వెరచి తన్నివారణోపాయము మహామునుల నడుగ వారు మీ బాలికలచే కాత్యాయనీ వ్రతము చేయించిన వానలు గురియునని చెప్పిరి. అంత నా గోపకులు తమ కన్నియలచే వ్రతము చేయించిరి. ఆ బాలకలకు మనస్సులందు వాన లేదన్న బెంగలేదు. బ్రహ్మాదులకైన నగోచరుండగు శ్రీనివాసుడు (శ్రీకృష్ణుడు) తమకు విభుడు కావలయునని దలంచిరి. అది మనసులందుంచి పైకి వర్షమును కోరినట్లు—పిడుగుకు బియ్యమునకు వకటే మంత్ర మనునట్లు—వర్షమునకు వవరునకు వకటియే మంత్ర మనుష్ఠించిరి. అంత భక్తవత్సలయగు శ్రీ కాత్యాయనీ దేవివారియెడ ప్రీతయయ్యెను. చల్లగా వర్షించి యనావృష్టిదోషము తొలగినది, నందనందనుడు వారి కభీష్టములొసంగి గోపికావల్లభుం డనుసార్థక నామమున నా కన్నియల కానందముగూర్చెను. తర్వాత శ్రీ రుక్మిణిదేవి కాత్యాయనీ వ్రతము (గౌరీపూజ) చాల భక్తితోజేసి హే జగజ్జననీ! హే లోకపావనీ! హే భక్తవత్సలా! నాకు శ్రీకాంతుని కాంతునిజేసి రక్షింపుమని ప్రార్థించి శ్రీకృష్ణుని పట్టమహిషియయినది. ఆదినుండి నీతికోవిదులగు భర్తల గోరిన సతీమణులు, శ్రీ కాత్యాయనీవ్రత మనుష్ఠించియే యభీష్టసిద్ధులందిరి. ఆ హేతువు ననే మనవారు పెండ్లిలో పాణిగ్రహణమునకు ముందు పెండ్లికూతురుచే గౌరీపూజ చేయించుచున్నారు. యీ పూజయందలి యభిప్రాయము తన కనురూపుడగు భర్తను గూర్పుమనియే. ఈపూజ బాలికలు పుట్టినది మొదలు చేయవలయును. శ్రీ కాత్యాయనీదేవి యోగీశ్వరేశ్వరుండగు పరమేశ్వరునికన్న నెక్కుడు జ్ఞానము భక్తి తపోబలములు గలది. ఇట్టి మహిమలచే నామె తన విభుండగు రుద్రునకు అర్ధాంగియైనది. భగవంతునకు మూలప్రకృతియైనది. ఇట్టి దేవిని మీరు భక్తిచే పూజించితిరేని యామె మీయందు దయగలదై తనవంటి జ్ఞానము భక్తిబలము భర్తృప్రణయముల నొసంగి రక్షించును.

మరియు ధనుర్మాసమున (పండుగ నెల యందు) ప్రాతఃసాయంకాలముల వివిధజాతి కుసుమముల దెచ్చి పసుపు గౌరీ దేవిని పీటపైనునిచి కుంకుమచందనఫలతాంబూలంబుల నొసంగి కొల్లలు కొల్లలగు

పువ్వులలో నాదేవిని కప్పవలయును. ఈ మెకు గొబ్బి యను ముద్దుపేరు గలదు. గొబ్బెమ్మ అను పేరునకు నమస్కారముల తల్లి యని యర్థము. అడుగడుగుదండముల వాడు, పిడికళ్ళరూకలివాడు, బిడ్డపేరుల వాడు అను బిరుదునామములు శ్రీ వేంకటాచలపతి కెటులో అటులే ఈయమ్మకును గొబ్బెమ్మ, నమస్కారముల దేవత, లోక జనని యను బిరుదునామములు గలవు. ఆవల తమ యీడుబాలికలు గూడి యీ దేవిచుట్టువార నిలచి కరచరణాద్యవయవ ములచే యభినయవిశేషముల గనుపరచుచూ గొబ్బితట్టుచూ గొబ్బిపాటలు పాడుదురు. గొబ్బిళ్లు అను పదము అచ్చ తెనుగు నమస్కారమని యర్థము.

బాలికలతోటి సుమంగలుకూడ నీదేవికి నమస్కారపూర్వకముగా గొబ్బితట్టి యీ యమ యనుగ్రహమునకు పాత్రలు కావలయును. ఈశర్వాణిని పలురకములగు పువ్వులతో పూజించుటకు కారణము దెలియునా? పెద్దలగువారు పూజ కొలది పురుషుడు దాన ముకొలది బిడ్డలని యందురు. ఆ పూజాఫల మున ననుకూలవరుడు లభించుట. వ్రతకాల మునజేయు ఫలదానములకు మంచి సంతానము బడయుదురు. ఈనోము వుద్యాపనము కనుపపండుగ నాడుచేయవలయును. ఆరోజు గౌరీదేవిని (గొబ్బిని) జలముల యందు నోలలాడింతురు: అది యీ దేవితో గూడి యందరు అవభృతస్నానము చేసినట్లు అర్థము. తర్వాత యిష్టబంధువులతో గూడి దేవిసన్నిధిని చిత్రాన్నము భుజించి పండ్లు తాంబూలములు ముత్తైదువుల కొసంగి దేవితోడను సుమంగలులతోడను మందిరములకరుదెంచి మునిమాపున(సాయం కాలమున నాదేవికి మరల శోడశోపచార ములతో నర్చింపవలయును. పూజానంతరము చిగురుటాకులుం బురుడించు మీ చిన్నిచేతుల మోడ్చి యీ సర్వమంగళ నీవిధముగా స్తోత్రము చేయవలయును.

జయ కాత్యాయని సర్వలోకజననీ శర్వాణిదాక్షాయణీ
జయబ్రహ్మేశరమేశ సర్వదిగదీశ స్తుత్యహేపార్వతీ
జయభక్తార్తిలతాలవిత్రి శుభవాక్సంధాత్రి మా
[మొక్కులన్
గయికోవమ్మ శుభంబులిమ్మ జగముల్గన్నమ్మ నే
డిమ్మగన్.

ఈవిధముగ వేడిన మీ కాయమ్మ ప్రసన్నయై సకలైశ్వర్యములొసంగి అనురూపవరులను దేశము నుద్ధరించు సంతానమును కరుణించి రక్షించుగాక.



## తెలియనితప్పు

రాధాకృష్ణగారు

ఇదిపయోముఖవిషకుంభ, మిదియెనాగు డణగియుండెడి కేతకీగణమటంచు
నెరుకలేకయె, దరిజేరి కోరికినాను, వెన్నెలనియెంచి కాలాగ్ని దున్నినాను.

# రజస్వలానంతరవివాహములు

కవులూరు హనుమంతరాయశర్మగారు

రజస్వలానంతరవివాహవిషయమున ప్రస్తుతము ప్రజలలో కొంతసంచలన ముదయించినది. శాస్త్రజ్ఞులగు పండితులు బాల్యవివాహనిర్ణయమునకై ప్రాకులాడుచు నందులకై చూపించెడి ప్రమాణములగు శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులనుండియే సంఘసంస్కరణాభిలాషులగు పండితులు గూడ దృష్టాంతరముల జూపుచు, రజస్వలానంతరవివాహము లవశ్యాచరణీయములని ధృవపరచుచున్నారు. పైపెచ్చు నేటికాలమున దేశము నావరించిన, దుర్బలసంతానము, శిశుమరణము, బాలవైధవ్యములు తగ్గుటయే గాక స్త్రీవిద్య కెంతేని అవకాశము లభించునని వీరి యాశయము. ఛాందసులగు శాస్త్రపారంగతుల చెవుల కీ సబబులు, అవసరములు ఎక్కవు. స్త్రీస్వాతంత్ర్యము, స్త్రీవిద్య నరికట్టుటయే అనూచానముగ వీరికి సంక్రమించి నిలిచిన సనాతనధర్మచిహ్నము. చారిత్ర్యకదృష్ట్యా వాఙ్మయములను చూచు బుద్ధిపాటవము శూన్యము. ఒడుదుడుకులతో, అవివేకముతో సంచరించు నేటిసంఘమును సునిశితబుద్ధితో దేశ కాలావసరములనుబట్టియు, ప్రజల చిత్తవృత్తులనుబట్టియు నవసరములగు మార్గములను పెట్టి నడిపింప నసమర్థులు. శారదాబిల్లు స్థిరమగు శాసనమగుచో స్త్రీలు తమ చెప్పుచేతలలో నుండరనియు, వర్ణసాంకర్యమగునేమో యనియు నూహించి, నిప్పుల ద్రొక్కిన కోతులవలె బెదరి భయపడుటయే కాని, సూక్ష్మదృష్టిని గాంచినచో నందువచ్చు ముప్పేమియు కనబడదు. ప్రారంభమున గాకపోయినను ముందుముందు యీబిల్లు నంగీకరించుపట్ల, వరునన్వేషణములో, స్వీకరించుటలో బాలిక అభిప్రాయమును స్వీకరింపవలసివచ్చు. సంఘమున కిందుల వచ్చు హానియేమి? పురాణయుగమును పరికించినచో నిది క్రొత్తగాదు గదా! బాల్యవివాహములైనచో నా బాధయుండదని తలంతురు కాబోలు. అట్లైనచో నెదిగి పెద్దవారై కాపురముచేయుటకు వెళ్లినపిమ్మట, మగనియొక్కయు అత్తమామలయొక్కయు అదుపాజ్ఞలకు లోబడి యుండవలసియున్నది. అత్తింటికి చేరగనే, అత్తమామలను దిగద్రొక్కి మగనితో వేరుగనుండి స్వేచ్ఛగ సంసారనిర్వహణ మొనర్చుకొనమని కొందరు, గృహమున పోట్లాడి ఉపవాసాదిక్లేశముల ననుభవించుచు, నితరుల బాధనొందించుచు కాలక్షేపముచేయువారు కొందరు, భోగభాగ్యములకు తక్కువలేకున్నను, నింద్యమగు ప్రవర్తనచే మసలువారు కొందరును, కస్సుబుస్సులాడుచు మనశ్శాంతిలేక దుర్భాషణములతో, దురాలోచనములతో కాలక్షేపముజేయువారు మరికొందరును మహిళాలోకమున కానబడుచుండిరి. ఇట్లు అవినీతిగ ప్రవర్తించుడని సంఘసంస్కర్తలు శాసనములు గావించిరా? తలిదండ్రులు జెప్పిరా? లేక మనపూర్వులే ధర్మశాస్త్రగ్రంథములలోనైన లిఖించి ఆధారబలము నొసంగిరా? ఇందేదియుగాదు. పురుషులనుగాని, స్త్రీలనుగాని వారి అవివేకబలమే వారిచే నట్లు యాడించుచున్నది. ఈ యవివేకము తొలగుటయెట్లు? సద్విద్యచే. నూటికి తొంబదిమంది పురుషులకు గూడ లేని యీవిద్య దాస్యశృంఖలాబద్ధమగు మహిళాలోకమున లేకుండుట వింతగాదు. యీ విషయమున స్త్రీలలోగూడ ప్రస్తుత మభివృద్ధి కానబడుచున్నది. ఇంకను శతాధికముగ ముందుముందు అభివృద్ధి పొడచూపును. విద్యయనగా పాఠములు చెప్పుటయు, వల్లించుటయునేగాదు. ఉత్కృష్టగ్రంథరాజములను చదివికొని అందుల పరమార్థమును నిత్యజీవితమునకు సమన్వయించి ఆచరణలోపెట్టుట. శాశ్వతమగు విజ్ఞానసంపదకొరవడినంతవరకు ఆచారదాస్యముతోపాటు, భావదాస్యమును జేయకతప్పదు. సంస్కరణవివాహ మీ స్త్రీవిద్యాసముపార్జన కెంతయేని యవకాశమిచ్చుచున్నది.

ధర్మశాస్త్రములలోని సూత్రములను దిద్దుట కెవరి కధికారమున్నదని స్వార్థపరులగు పూర్వకాలపు పండితాగ్రేసరులు పృచ్ఛింతురు. సృష్ట్యాదినుండియు నాయాకాలపు ప్రజలయొక్క ఆచారముల ననుసరించియు, ప్రవర్తనాధికములబట్టియు, అభిరుచుల బట్టియు నీధర్మశాస్త్రములు యేర్పడినవని అందరంగీకరించిన విషయమే. కానిచో ననేకములైన నీతి గ్రంథములు, ధర్మశాస్త్రకారులు బయలుదేరుట కవకాశములేదు కదా! దేశకాలావసరములనుబట్టి అట్లే శారదాబిల్లుకూడ నంగీకరించరాదా. సనాతన వాదులు రజస్వలానంతర వివాహము లశాస్త్రీయములని చెప్పినను, ముందుముందిదియే పూర్వోక్త ధర్మములవలె పరమపవిత్రమైన ఆచారధర్మమగును. రజస్వలానంతర వివాహము శాస్త్రీయమగుటయేగాక అత్యవసరముగూడ నగుటచే దురభిమానధనులగు సనాతన ధర్మపరులగు వారడ్డు తగులుచున్నను, కాల ప్రవాహము నరికట్టజాలరు. శారదాబిల్లును గవర్నమెంటువారు త్రోసివేయరు. తీసివేసినను శాసనము కానంతమాత్రమున సంస్కరణ వివాహము లొనర్చుటకు వీలులేకపోలేదు. ప్రదేశయోగ్యతలును, వరుని యగ్యతానగ్యతలను, పురోహితుని మంత్రతంత్రములను, ముహూర్తనిశ్చయములను, అప్రధానములుగ నెంచి, శాసనాతిక్రమణ మొనర్చి రహస్యముగ బాల్యవివాహములొనర్చిన సనాతన ధర్మావలంబకులే, శాసనములేకపోయినను చేయువారికి మార్గదర్శకులు గాకపోరు. బాల్యమున వివాహమొనర్పనిచో వధూవరులనోన్యప్రేమపాశబద్ధులు కారట! ఇదేటి న్యాయమో విచారింపుడు. బ్రాహ్మణవర్ణమువదక్క తక్కిన వర్ణములలో నేటివరకు రజస్వలానంతర వివాహము లెక్కుడుగ జరుగుచున్నవి. వారికి భక్తిప్రేమ విశ్వాసబంధుత్వములు లేకుండపోయెనా? వర్ణసాంకర్యమొందిరా? అట్టివర్ణములలోనే ఆరోగ్యవంతులగు దృఢకాయులును, ఆయుర్వృద్ధి కలవారును కన్బడుచున్నారు. ఆచారమను పేరిట బాల్యవివాహము బ్రాహ్మణ సంఘమునకు వేరుపురువైనది. వరకట్నము, విద్యావిహీనత, బలహీనము, శిశుమరణము, అకాలమృత్యువు, వైధవ్యములను ననర్థములు మనకు తెలియకుండగనే ఆ బాల్యవివాహపిశాచము కల్పించుచున్నది. సంఘౌన్నత్యమునకు, భావిభారత సౌభాగ్యమునకు, ఆదర్శప్రాయమగు జీవిత విధాన మలవడుటకొఱకును యీ రజస్వలానంతర వివాహము లెక్కుడు సహాయకారులు కాగలవు. రేపు శారదాబిల్లు ఉండనిండు. పోనిండు. అవసరానవసర ధర్మాధర్మ నిర్ణయ మొనర్పలేని స్వతంత్రాలోచన లేని వారికై యేర్పడు శాసనముల నాధార మొనర్చుకొనుట విజ్ఞులకు తగనిపని. (మహాసంఘ సంస్కర్త, కవిశిరోమణి, పండితాఖండలుడునగు శే. వీరేశలింగం పంతులుగారు పునర్వివాహముల విషయమై శాసనము చేయించెనా?) కావున వివేకపరులగు స్త్రీ పురుషులెల్లరు స్వసంఘోద్ధరణమునకై నడుములు కట్టికొని అచంచలమగు ధైర్యసాహసములతో నీ సంస్కరణ వివాహ విషయమునను, స్త్రీ విద్యావిషయమునను ముందంజవేయుటపాడి.—

---

# జీవనభారములు

మొక్కపాటి కృష్ణమూర్తిగారు

ఈ గభీరనిశీథంబు నీడుకొనుచు
నెచటినుండియొ సరిగను నెరుకబడక
శ్రవణములజేరు నొక్కవిషాదవేణు
గీతికారావ మతుల ప్రశాంతముగను.
ఆరవంబున గలయట్టియర్థమేమొ!
మానసికతంత్రులనుకంపమానమయ్యె
యే యపూర్వస్వరాల యేర్పాటొయేమొగాని
వినగనే హృదయమేలకో ద్రవించిపోయె!
ఏయభాగ్యుండొ జీవితమెల్లదనకు
గటికచేదయిపోయిన కారణమున
గావలయునిట్లు చీకట్లగలసిపోయి
వదలుచున్నాడు జీవనభారములను!

# శ్రీకృష్ణ సారథ్యము

అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులుగారు

చ॥ మురళీగాన సుధాతరంగిణుల నుప్పొంగింతువో, విశ్వమ
బ్బురమున్ బొందఁగ, బాంచజన్యమె వడిన్ బూరింతువో యెద్ది యె
త్తఱి యుక్తంబగునో యెఱుంగుదువు గీతాచార్య! నీవే; దయా
పరతన్ బూనవె ధర్మరక్షణకళాప్రారంభసంరంభముల్.

ఉ. భారత రాజసోన్నతియుఁ భాగవతాంచిత సత్వశక్తియున్
భారత కర్మభూమిపయిఁ బ్రజ్వలితంబయి, విశ్వతీర్థవి
స్ఫారయశోవిభూతిమెయి భాసిల, వ్యాసవికీర్ణధర్మమో
శౌరి! తమోవిదారి! రభసక్రియవ్యాప్త మొనర్చుటొప్పదే?

శా. భావాతీతుఁడ వంచుఁ దెల్పు, జనుఁడే ప్రాల్మాలి నిన్నక్కటా!
భావాధీను నొనర్పఁగాఁగడఁగు నీ ప్రజ్ఞల్ విమర్శించి నీ
లా వెంతో కొలువంగఁ బైకొనును లీలామానుషాకార! యో
దేవా! నిన్ గన, వాఁడహో! శుకుఁడో? కౌంతేయుండో? గాంగేయుఁడో?

ఉ. దర్శనలోలుఁడౌ నరుఁడె తథ్యమెఱుఁగును; విశ్వరూపసం
దర్శనలీల చాలదె? నిదర్శనమై నిను లోకమెల్ల నా
దర్శముగాఁ గైకొనఁగఁ; దప్పు విమర్శనముల్ సుదర్శన
స్పర్శమునన్ దునుంగవొకొ? సత్యమె నిశ్చల మో చతుర్భుజా!

శా. ధర్మస్థాపన తత్పరుఁడవుగదా తాటస్థ్యమేలా? జగ
చ్ఛర్మోత్పాదకుఁడన్న పెంపెసఁగ నిష్కామక్రియాయోగ మీ
కర్మక్షేత్రమునందుఁ బాదుకొలుపంగారాదె? గోగోపికాం
తర్మర్మజ్ఞ! సదా ప్రసన్నమతివై తత్త్వార్థసంధాతవై.

ఉ. "ఆయుధముల్ ధరింప రణమందున నూరక నేను సాయమున్
జేయుదు"నంచు స్పష్టముగఁ జెప్పిన నౌదల నూఁపఁడే? తగం
ధీయుతనాయకత్వమె గదించు స్వతంత్రత నన్నయాశ, నిన్
బాయఁగలేక యానరుఁడు; పాడిగదా యది మీ కథోక్షజా!

ఉ. సాధ్యమసాధ్యమున్ గ్రియల సారమెఱింగి నరుఁడు నీదుసా
రథ్యమెగాక, యెంతచతురత్వము నొందిననైన శల్యసా
రథ్యముఁగోరు నొక్కొ? యజరామరదీప్తి స్వధర్మమిచ్చి యా
రాధ్యు నొనర్చుచుండఁగ బరాయిమతం బెవఁడూను నచ్యుతా!

చ. చతురత రాయబారమును సర్వజగన్నుతలీల నీవు స
ల్పితివి మహాత్మ! నీ ప్రతిభ విశ్వజనీనము, శాశ్వతంబు, న
ప్రతిహత, మద్వితీయము! భవన్మహితాశ్రయ మెల్లవేళ భా
రతజయశీల మర్థిమెయిఁ బ్రార్థనసేయుఁగదా! నరప్రియా!

ఉ. సాధులు మోదమంద, రిపుసంఘపు డెందముగుంద భారతా
యోధనవీథి వాయుతనయోజ్జ్వలితోగ్రపతాకతో జగ
న్నాథ! రథంబువచ్చె సుమనస్స్తుతులొప్పఁగఁ దత్త్వమెల్ల ను
ద్బోధమొనర్చి, చోదకతఁ బూని నరున్ విజయుం బొనర్పవే.

—:o:—

## ఊర్వశి

దామెర రాజగోపాలరావుగారు

భాసమాన కల్యాణ లావణ్య రాశి,
ఊర్వశీ, ప్రేమవారాశి, యుష్మదీయ
మధుర గీతామృతరసంపు మాధురులకు
స్వర్గ కుసుమమె వికసించి పరిమళించె!
మఘువు మరకత మాణిక్య మంటపమున
సలుపుదువు నీవు నిత్యము లలిత గతుల
నృత్యకేళి; అంతఁదొలంగు నీ ముసుంగు
బాల సుకుమార పవమాన చాలనమున.
కానిపింతువ త్తఱి నూత్నకళలనెసఁగు. ముసుఁ
గుఁ దొలఁగిన త్రొలిప్రొద్దు ముగుద పగిది;
అపుడు, అప్సరస్సుకమలాస్యలు త్వదీయ
లాస్య హాస వికాస విలాసములకు సొలసి,
'ఓహో' యటంచు మెచ్చుకొనియెదరు
ఎద సహజ వనితా జనితేర్ష్య వీడి.

భువన మోహనమైన నీ మూర్తి గాంచి
భావనోద్రేక పూరితస్వాంతులగుచుఁ,
దమ మనోరమ గీతా కుసుమ విసరము
కానుకలిడిరి యుగయుగాల కవులు నీకు.
ఉదిత జీవితోన్మేష పీయూష వాంఛ
నెన్నఁడో సురాసురులు మథించునాఁడు
పాలకడలి వెడలినావు; వానకారు
కారుమొయిలు పాయుమెఱపు కన్నెవోలె.
తావకీన నవోన్మేష యౌవనంపు
తరుణ కాంతి తరగలేదు కరగిపోదు!
నేను నీవలె, ఊర్వశీ! నిత్య నూత్న
యౌవనానంద సౌఖ్యము ననుభవింప
నిమ్ము; మృత్యులేని, ముదిమియేనిలేక
చిరము ప్రవిమల ప్రణయైక జీవినగుచు.

'మణిమాల.'

# "వయోవృద్ధులకంటె చిన్నబిడ్డలే బుద్ధిమంతులు"

తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

అప్పుడే "ఈస్టరు" పండుగ ప్రారంభమయింది. 'స్లెడ్జి' బండ్ల కాలం ముగియవస్తున్నది. ఇంకా అక్కడక్కడ దొడ్లలో మంచు దిబ్బలుగా పడివున్నా, కొంత మంచు కరిగి గ్రామంలో వీధులవెంట కాలువలై ప్రవహిస్తున్నది. ఈ నీటికాలువ వొకటి ఒక సందుగుండా పారుతూ, పెద్దగుంటగా యేర్పడ్డ దొకచోట. గుంట పూర్తిగా నీటితో నింపబడ్డది. ఆ సమయానికి యిద్దరు బాలికలు రెండిండ్లలోనుంచి బయటికివచ్చి, వీధిలో యీ నీటిగుంటగట్టున కలుసుకున్నారు. అందులో ఒక బాలిక మరీ చిన్నది. రెండవది కొంచెం పెద్దది. పండుగదినం కనుక పిల్లలిద్దరికి కొత్తదుసులు కట్టబెట్టినారు తల్లులు. చిన్నబాలిక నీలిరంగు చొక్కా తొడుక్కున్నది. పెద్దది పసుపుపచ్చని అద్దకపుగౌను వేసుకొన్నది. ఇద్దరూ యెర్రని చేతిరుమాళ్లు అలంకారంగా తలకు కట్టుకున్నారు. ఇంటిపెద్దలతో కలిసి ఉదయాన్నే యిద్దరూ దేవాలయానికి పోయి, అప్పుడే తిరిగి యిళ్లకు చేరుకున్నారు. రాగానే ఒకరిదుస్తు లొకరికి చూపించుకుంటూ ముచ్చటపడి, తరువాత ఆట ప్రారంభించారు. వీధి కాలువలోదిగి నీళ్లు చిందిస్తూ పరుగెత్తే ఆట ఆడుకుందామని స్థిరపరుచుకున్నారు. అనుకున్న తక్షణం చిన్నబాలిక తన కాళ్లనున్న "బూట్సు"తోనే గుంటలో దిగింది. అది చూచి పెద్దబాలిక అట్లా దిగవద్దని చిన్నదాన్ని మందలిస్తూ యిట్లన్నది:

"ఏమే—'మలాషా!' వద్దు, వద్దు, చెపుతున్నాను కదా! మీ అమ్మ వచ్చి నిన్నిప్పుడు తిడుతుంది—నాకేం! నే నిదిగో.—చూడు!—బూట్సూ, మేజోళ్లూ తీసివేసి దిగుతున్నాను. నీవుకూడా తీసి మరీ దిగాలి!—విప్పు, మరి!"

బూట్సూ, మేజోళ్లూ యిద్దరూ విప్పి బయటపెట్టినారు. కొత్త చొక్కాలమీద బురదనీళ్లు చిందకుండ, చొక్కాలు పైకెత్తి పట్టుకొని, యిద్దరూ చే రొకవైపునుంచి గుంటలోదిగి ఒకరికొకరు యెదురై నడుస్తూ వస్తున్నారు. మలాషాకు నీరు నీలమండల వరకూ వచ్చింది. అప్పుడు మలాషా పెద్దపిల్లతో అన్నది:

"ఏమే, అకుల్యా! ఇదెంతలోతుంటుం దేమిటి? నాకు భయం పుడుతున్నదే! అమ్మోయ్, నే నింకరాలేను!! ఇదిగో, గట్టెక్కిపోతున్నా!"

"లేదే—అంతకంటె లోతుండదు. రా, భయంలేదు. నిజం—"

ఇట్లా అనుకుంటూనే గుంటమధ్యకు వచ్చి కలుసుకున్నా రిద్దరూ. అప్పుడు అకుల్యన్నది: "ఇప్పుడే చెపుతున్నా నమ్మాయి—నీటిలో చిందులుమాత్రం తొక్క

కూడదు! నెమ్మదిగా నడిస్తేనే నీతో నే నాడేది. లేకుంటే నేను పోతా నంతే!

అకుల్యమాట యింకా అకుల్య నోటిలో వుండగానే మలాషా కాలు పైకెత్తి పాదంతో నీటి నొక్కసారి తొక్కింది. నీరు చింది అకుల్యచొక్కా బురదతో నిండిపోయింది. చొక్కా ఒక్కటే కాకుండా బురదనీళ్లు అకుల్య ముక్కులోనూ, కండ్లలోనూ పడ్డవి. పరాభవం సహించలేకపోయిం దకుల్య. మలాషా చేసిన కొంటెపనికి చాలాకోపం తెచ్చుకుని, ఆమెను కొట్ట టానికి వెంట తరుముకొనిపోయింది. మలాషాకు అమితంగా భయంపుట్టింది. ఆనాడు అకుల్యద్వారా తన కేదో ప్రమాదం తప్పక తటస్థించేటట్లు కనిపించింది. వెంటనే నీటిగుంట విడిచి, యింటిముఖంబట్టి పరుగెత్తడానికి సిద్ధపడుతున్నది. అప్పుడే అకుల్య తల్లి ఆ దారినివస్తూ తనబిడ్డ చొక్కా అంతా బురదనీళ్లతో తడిసివుండటంచూచి, ఉదయాన్నే తొడుగుకున్న చొక్కా బురద చేసుకున్నదని చెప్పి "ఛీ, ఛీ, పాడుపిల్లా! ఏమిటే, యీ కోతిపనులు? ఇదేకాదూ నీ విప్పటివరకూ యిక్కడ చేస్తూన్న పని?" అంటూ తన కూతురును తిట్టడం మొదలు పెట్టింది.

"—లేదమ్మా! ఈపిల్ల—మలాషా— పని గట్టుకొని నామీద పోసింది బురద. నేనేం జేశాను?"

ఈమాట వింటూనే అకుల్య తల్లి మలాషాను గట్టిగా పట్టుకొని వీపుమీద నాలుగు దెబ్బలు వేసింది. దెబ్బ ఒంటిమీద పడగానే మలాషా, వీధిలో అందరికీ వినబడాలని, గొంతు చించుకుని యేడుస్తూ, యింటిదారి బట్టింది. తనపిల్ల యేడ్పు విని మలాషా తల్లికూడ బయటికివచ్చింది.

"ఏమమ్మా! నీ కేమీ పనిలేదా? మా పిల్ల నట్లాకొడతా వెందుకు?" అంటూ అకుల్య తల్లిని తూలనాడటం ప్రారంభించింది. మాటకుమాట, తిట్టుకుతిట్టు తీవ్రంగా పెరిగిపోయినవి. ఒకరినొకరు డీకొని యుద్ధంలో దిగినారు. వీధిలో అలజడి విని మగవాళ్లు కూడా యిళ్లు విడిచి బయటికివచ్చారు. అప్పటికప్పుడే వీధిలో వున్నవాళ్లుకూడా పోగుపడ్డారు. క్రమంగా గుంపు పెద్దదయింది. స్త్రీ పురుష భేదంలేకుండా, అక్కడకు వచ్చిన ప్రతివ్యక్తీ యేదో ఒకపక్షం వహించి యథాశక్తి యుద్ధంలో పాల్గొన్నారు. తన మాటేమో తనదేగాని, యెదటిమనిషి చెప్పే మాటకూడకొని యోచించవలెననేపుద్దేశంతో వచ్చినవా డొక్కడూ లేడక్కడ. అంతకంతకు మాటలు ముదిరి ఒకరినొకరు తోసుకొన టంవరకూ వచ్చింది. వాగ్యుద్ధం దెబ్బలాటగా మారింది. ఈస్థితిలో అకుల్య యొక్క ముసలినాయనమ్మ గుంపుమధ్యకు వచ్చి నిలబడ్డది. వెంటనే చేతులు రెండూ పైకెత్తి గుంపు నుద్దేశించి యిట్లన్నది:

"ఏమర్రా! ఏమనుకుంటున్నారు మీరు? మీ కేమైనా మతివున్నదా? పూర్తిగా పోయిందా? ఏమంటారు—అస లెందుకు

వచ్చిం దీగొడవ? ఇదేనా మీరు నమచుకో వలసిన మార్గం? ఈ పండుగపూట యిదే మీకు ముఖ్యమైన పనిగా కనబడ్డదా? కలహాలకూ, కొట్లాటలకూనా యీదిన మేర్పడ్డది?—లేక పరస్పర ప్రేమకూ, సుఖానికీ, ఆ నం దా ని కీ నా? ఆహా, యేంవివేకమమ్మా!"

పిల్లలతల్లు లిద్దరిలో ఒక్కరూ వృద్ధురాలిమాట చెవిని బెట్టలేదు. ఒళ్లుతెలియని ఆవేశంలోబడి ఆమెనుకూడా అక్కడనుంచి తోసి పారవేయడానికి సిద్ధమైనారు. విరామంలేకుండా కోలాహాలం రెచ్చిపోతూనే వున్నది.

ఇంతట్లో అకుల్య కొంచెం దూరంగా పోయి, బురదంతా తుడిచి చొక్కా శుభ్రం చేసుకొనడం ప్రారంభించింది. మలాషా మీద తనకున్న కోపమంతా దానంతటదే మాయమయింది. తిరిగి నీటిగుంటవద్దకే పోయి నిలబడ్డది అకుల్య. గుంటలో నీటిని కాలువగా వీధివెంట ప్రవహింపచేదామని చిళ్లపెంకొకటి చేతబుచ్చుకొని బోదెతవ్వటం ప్రారంభించింది. అది చూచిన తక్షణం మలాషాకూడ రివ్వున అక్కడికే పరుగెత్తింది. తానొక వెదురుపుల్ల చేతబట్టుకొని అకుల్యకు సహాయం చేయటానికి పూనుకున్నది. అప్పటికే పెద్దవాళ్ల కలహం హద్దుమించిపోయింది. మగవాళ్లుకూడ ఒకరినొకరు తిట్టుకుంటూ కలియబడ్డారు. ఈ స్థితిలో పిల్లలిద్దరూ తవ్విన చిన్నకాలువ వెంట నీరుపారుతూ ముసలమ్మ కాళ్లవద్దకే వచ్చింది. బాలికలిద్దరూ కాలువకు చెరియొకవైపునా గంతులు వేసుకుంటూ నీటిని నడిపించుకొని వస్తున్నారు.

చెక్కపే డొకటి నీటిలోవేసి "పడవ! పడవ!!" అని కేకలుపెడుతూ వస్తున్నారు.

"పట్టుకోవే, మలాషా, పడవను పట్టుకో! అందకుండా పోతున్నది—పో, పో!" అంటూ అకుల్య మలాషాను హెచ్చరించింది.

మలాషా కడుపుబ్బేటట్లు నవ్వుతూ, మాట్లాడలేకుండా, పడవను పట్టుకుందామని పరుగెత్తుతున్నది.

ఇట్లా మేరలేని ఆనందంలో యిద్దరూ ఒకటిగా కలిసిపోయినారు. కాలువనూ, పడవనూ నడిపించుకుంటూ పోయిపోయి "తప్పుకోండి, తప్పుకోండి!! మా పడవ కడ్డు నిలవబోకండి!" అంటూ కొట్లాడుకుంటున్న పెద్దవాళ్లగుంపు మధ్యకు చేరుకున్నారు. ఈదృశ్యం చూచింది ముసలమ్మ. ఆమె ఆనందానికి మేరలేకపోయింది. అక్కడ కొట్లాడుకుంటున్న స్త్రీ పురుషులతో యిట్లన్నది:

"మీలో ఒక్కొకరికి కావలసి నన్నేళ్లు వచ్చాయి. ఇప్పటికైనా సిగ్గులేదా మీకు? ఈ యమాయకపుపిల్ల లిద్దరినిగూర్చే కదా మీ రింతమంది కలహం పెట్టుకున్నారు! ఒక్కసారి వాళ్లను చూచైనా వివేకం తెచ్చుకోరాదా? ఒక్కక్షణంలో వాళ్ల కోపమంతా యెట్లా మా య మ యిం దో,

చూడండి! తిరిగి యెంత అన్యోన్యంగా కలిసి ఒక్కటై పోయినారో చూస్తున్నారా లేదా? కండ్లు తెరవం డిప్పటికైనా! పొండి ఆ పసి బిడ్డలనైనా చూచి బుద్ధికలిగి బ్రతకండీ—పొండి!—రండమ్మా, నా బంగారుతల్లులే! పసిబిడ్డలైనా మీరే నయం, లెక్కలేనన్ని యేళ్లొచ్చిన మా అందరికంటె కోటిరెట్లు!!"

ఆ బాలికల మైత్రిచూచి అక్కడవున్న పెద్దవాళ్లందరూ సిగ్గుపడి తలలు వంచుకున్నారు. వృద్ధురాలి మందలింపులు వింటూ పిల్లలవంక చూచినవాళ్లందరికీ లజ్జకలిగింది. ఒకరిముఖం ఒకరు చూచుకోలేకపోయి నారు. ఒకరినొకరు తిట్టుకొనడాని కసలే నోరు రాలేదు. ఎవరింటికి వారు నెమ్మదిగా జారటం మొదలుపెట్టినారు.

"శిశువులోవుండే అమాయకత్వం, నిర్మలస్వభావం సంపాదించుకుంటేనే గాని స్వర్గరాజ్యంలో ప్రవేశించటాని కెవ్వరికీ పాత్రతలేదు."

(టాల్‌స్టాయికథ కనువాదము)

—:o:—

# ఆంధ్రమాత !

శ్రీమతి దోసపాటి సీతారామమ్మగారు

సీ॥ గోదావరీకృష్ణ పాదోదకంబుల ద్రావించిపెంచెనే రాజమాత !
సంపూర్ణ సర్వసస్యప్రశస్యములిచ్చిమముబ్రోచిమనిచెనే మహితజనని !
తరులతాగుల్మకందవనౌషధములచే ఘనబలధాత్రియే కన్నతల్లి !
పరమపతివ్రతా భవ్యచారిత్రల గనికీర్తి వెలసెనే కర్మభూమి !
కవిజనములపాలిటికేది కల్పకంబు !
పరమసౌభాగ్యములకేది పట్టుకొమ్మ !
అమ్మహాతల్లిరూపంబు నాత్మదలచి
ఆంధ్రమాతకువందన మాచరింతు.

---

# శ్రీరామంభరతభూమి

నందివాడ. వెంకట చలపతిరావుగారు

సీ॥ సకలదిగంత విశ్రాంతకీర్తితఖండ పంచకప్రథమమీ భరతభూమి
పావనద్వాదశ జీవస్రవంతులుప్రవహించునట్టిదీ భరతభూమి
నిరతతైర్థిక సేవ్య సీయ లసత్క్షేత్ర బాహుళ్యమైనదీ భరతభూమి
వచ్చిబంగారంబు పండెడి రత్నగర్భయనంబేర్వడసెనీ భరతభూమి
గీ॥ సీతసావిత్రిమొదలగు శీలవతుల
పుట్టినిల్లుప్రతాపాది భూరిశౌర్య
ధనులకాలవాలంబయి తనరినట్టి
పరమపావనమైనదీ భరతభూమి !!

# అపరోక్షానుభూతి

శ్రీమతి జూలూరి తులశమ్మగారు

సర్వలోకంబులకు తానె స్థానభూమి
కారణంబును వ్యాపియుఁ గర్తయైన
గురుని యానందమయు నీశుఁ గూర్చి యేను
వందనశతంబు లిడుదు నానందమలర. (1)

మోక్షసిద్ధికి నపరోక్ష వీక్షణంబు
కారణంబుగఁ బల్కిరి ఘనులు; గాన
యత్నమున దానిఁ గాంచగ ననవరతము
సజ్జనులు కాంక్షఁ జేతురు క్ష్మాతలమున. (2)

నరుడు నితరంబులైన వర్ణాశ్రమంపు
ధర్మములఁ దపముచే హరిఁ దనిపెనేని
మోక్షసాధన వైరాగ్య ముఖచతుష్ట
యంబు పురుషుల కలవడునండ్రు బుధులు. (3)

కాకవిష్ఠంబు నేహ్యతఁ గాంచునటుల
బ్రహ్మ మొదలుగ స్థావర వ్యాప్తియైన
వస్తుతతి నేహ్యముగఁ జూచి వరలుటెల్ల
అదియె నిర్మలవైరాగ్య మండ్రు బుధులు. (4)

(నిత్యానిత్య వస్తువిచారము).

నిత్యమై నిర్మలంబయి నెగడు నాత్మ
దృశ్యమగుచున్న జగమెల్ల నశ్యమగును
దేనసద్వస్తు తత్వంబు తేటఁబడునో
అదియె సమ్యగ్వివేకంబటండ్రు బుధులు. (5)

సర్వవిధ వాసనావళి సమయఁ జేయు
టదియె శమమని వచియింతు రార్యు లెలమి
బాహ్యవృత్తుల నిగ్రహ పాటవంబె
దమమటంచును మదిలోనఁ దలపుమయ్య. (6)

విషయములనుండి వృత్తుల వేరుసేత
పరమమగునట్టి యుపరతి బడయు టదియె
సర్వదుఃఖంబులను దా సహించు టరయ
చెప్పఁబడును తితిక్షనా నిప్పృథివిని. (7)

సద్గురూక్తులపై శ్రద్ధసల్పుటెల్ల
శ్రద్ధయని పల్కుదురు సూనెశాస్త్రవిదులు
ఏకలక్ష్యమ్మునందు జిత్త మేకతాన
మగుట యగును సమాధాన మనఘచరిత (8)

భక్తవత్సల సంసారబంధముక్తి
యెపుడుగావించి నన్నెటు లేలుకొనెదొ
యనెడు దృఢతర వైరాగ్యమందుటెల్ల
తీవ్రమోక్షేచ్ఛ యదియని తెలిసికొనుము. (9)

ఉక్తసాధన యుక్తిచే నొప్పి శుభము
నిచ్ఛగించెడువానిచే నెపుడు జ్ఞాన
సిద్ధికొఱ కాత్మసచ్చింత జేయఁదగును
నిఖిలశుభములు దీననె నెగడుఁగాదె (10)

తలపఁ జింతనచే గాకఁ దక్కు గల్గు
సాధనంబుల జ్ఞానసంజనన మగునె
గృహమునందుండు పరికరకోటి యెల్ల
దీపమిడకనె యన్యథా దోపదుగద. (11)

ఎవ్వఁడను నేను యీవిశ్వ మెట్లుకలిగె
కర్తయెవ్వఁడు దీనికిగలఁడు దలఁప
ఏదిదీని కుపాదాన మెంచిచూడ
ననుచుఁ దలఁచుట సువిచారమగును మహిని. (12)

తాను భూతగణములు కాను దేహ
మక్షగణముల నన్నిట విలక్షణమగు
నదియ నే నౌదు;సందియ మంద నేల
ననుచుఁ దలఁచుట సువిచారమగును జూవె. (13)

సరవి నజ్ఞానజన్య సంసారమెల్ల
జ్ఞానముదయింపఁ జెడునది కాన నదియె
కర్త దీనికిఁ దలఁప సంకల్పమొకఁడె
అంచుదలఁచుట నువిచారమగును జూవె. (14)

ఏకమవ్యయమును సూక్ష్మమేది కలదొ
అదియె దీనికుపాదానమగును మృత్తు
ఘటములకుఁ బోలె సంశయఘటన మేల
ననుచుఁ దలఁచుట సువిచారమగును జూవె. (15)

అన్వయంబును సద్రూపమయ్యుఁ జూడ
సాక్షియై జ్ఞాతయై సూక్ష్మసరణినొప్పు
నదియె నే నింక సందియమంద నేల
ననుచుఁ దలఁచుట సువిచారమగును జూవె. (16)

(శ్రీ శంకరాచార్య విరచితము 'అపరోక్షాను
భూతి' యను సంస్కృత శ్లోకముల కాంధ్రీకరణము)

# కేశవరావు, బి. ఏ.

కేశవరావు తాలుకాకచ్చేరిలో గుమాస్తా. అతని రూపరేఖవిలాసములు మిగుల ఆకర్షణీయముగనుండును. కాని, అతడు తన వయసుకు తగిన శరీరవికాసమును కలిగియుండక, కాంతిహీనమైన మొగముతో చిక్కియున్నట్లుగా కాన్పించుచుండెను. రాత్రి తొమ్మిదిన్నరగంటలైనను ఒక బుడ్డీదీపము ప్రక్కన వెల్గుచుండ కొన్ని కాగితములకట్టలు దగ్గిరపెట్టుకుని చింకిచాపమీదకూర్చుని వంచినతల ఎత్తకుండ వ్రాసుకొనుచుండెను. ఎదురుగుండా నాగులపంచ ఉయ్యాల్లో మూడేండ్లకుఱ్ఱవాడు పడుకొని నిద్రపోవుచూ గూఢ్యముగాఉన్న ఆ చిన్నగదిలో గాలిలేనందున చెమటపోయగా లేచి కింకపెట్టి ఏడ్చుటకు మొదలుపెట్టెను. భర్తను భోజనమునకు లెమ్మనమని నాల్గయిదుసారులు పిలచి, పూర్ణగర్భవతి గాన శ్రమచేత అక్కడే కొంగుపరచుకొని అప్పుడే పడుకొన్న సుసీల, ఉలిక్కిపడి లేచి బిడ్డను చంకనేసుకుని విసనకఱ్ఱతో విసరుచూ భర్తను చూచి "ఇప్పుడప్పుడే ఈపని ఏలాగూ తెమలేది కాదు గదా. పిల్లవాడు లేస్తాడు. భోజనానికి లెండని ఎన్నిసార్లు పిలచినా లేచారుకారు. నాకేమో ఆయాసముగానున్నది. ఇకనైనా లేచివచ్చిన బాగుండును" అని భర్తతో బలికెను. కేశవరావు చెమటలు కారుచున్న మొగమును కడుపును ప్రక్కన ఉంచుకున్న తడిగావంచాతో తుడుచుకొనుచూ "సుసీ! ఏమి చేయమన్నావు. సముద్రతరంగాల్లాగ ఎన్నాళ్లు చేసినా ఈపనికి తరుగూ విరుగూ కనబడటంలేదు. మీదిమిక్కిలి గుమాస్తాలు ఎక్కువగా ఉన్నారని అధికారులు ఇంకా తగ్గించ దలచుకున్నారట. ఆ తగ్గింపులో ఏ దురదృష్టవంతులు చిక్కుకొనెదరో! కాల మేమీబాగులేదు. ఎక్కడ చూచినను, మోసములు, అన్యాయములు, స్వార్థాభిలాషలు అంతులేని తృష్ణలు బహిరంగముగానో, ముసుగువేసుకొనో, తాండవమాడుచున్నవి.

శ్రీమతి వెలిదండ చూడికుడుతమ్మగారు

మనబోటివాండ్లకు ఇప్పుడు ఎక్కడా స్థానము లేదు. అందులో నేను మిగుల దురదృష్టవంతుడ్ని. సుసీ! నా చిన్నప్పుడు నా క్లాసులో నేను అన్నిట్లో ఫస్టుమార్కులు తెచ్చుకొనుచూ మేష్టర్లందరిచేత మంచి రిమార్కులను పొందుతూ ఉండేవాడ్ని సుమా. అప్పుడు నామనస్సులో ఎన్ని ఉత్కృష్టభావాలు ఎగిరి దూకుచుండెడివో నే నిప్పుడు తలచుకున్న నేను నేనేనా అని అనుమానము నాకే తోచుచుండును. వెనకటివి తలచుకొని వెక్కి వెక్కి ఏడ్చినట్లు, ఇప్పుడవన్నీ ఎందుకు? ఏమి వండావు? పద వడ్డించు" అని కాళ్లు చేతులు గడుక్కొని ఆ గదికే ఆనుకున్న వసారాలో తనకొరకు వేసియుంచిన పీటపై కూర్చొనెను. సుసీలయు ఆపిల్లవాడిని, అక్కడనే క్రిందపడుకుని నిద్రబోవుచున్న ముసలి దంపతులగు అత్తమామలకడ పడుకొనపెట్టి, తాను భర్తకు వడ్డింపబోయెను. కేశవరావు భార్యను చూచి "ఈరోజు మన పెద్దబ్బాయికి అమ్మాయికి విరేచనములు ఏలాగున్నాయి? ఆస్పత్రికి తీసికొని వెళ్లినారా?" అని యడిగెను.

సుసీ:—ఏమి తీసికొనివెళ్లను. నావంట్లోనా రోజురోజుకు నీరస మెక్కువగుచున్నది. ఇంతా కష్టపడి ఇక్కడ వంటచేసి మూతపెట్టుకొని, పిల్లలను తీసికొని అక్కడకు వెళ్లుదునా, అక్కడ చీటి వ్రాయుచోట, మందులిచ్చుచోట, నిలబడటానికే నాకు శక్యముకాదు. మీకా, తెల్లవారకట్ల నాలుగు గంటలు మొదలు రాత్రి పదిగంటలవరకు తెన్నూ తెరపీలేదు. తీరామందు తీసికొనిరాగానే సరా, వారేమో పిల్లలకు అన్నము పెట్టకూడదనియు ఓవల్టీను, పాలు, రొట్టె, ఇవ్వవలసినదనియు చెప్పుతారు. మనకుకూడా ఆవిధముగానే చేయవలసినదని తెలిసినప్పటికి, ఎందుకూ శక్తిలేనివారముగా ఉన్నాము. కేశవరావు మాత్రము ఏమీ బదులు చెప్పలేక

పోయెను. ఆ వండిన పచ్చడీమెతుకులు తగినంత అభిగారములేనందున దిగుడుపడకుండా ఎక్కిళ్లు రావటం మొదలుపెట్టెను. తోడనే చెంబెడు మంచినీళ్లు ఎగబోసి, ఆ అన్నములోనే మంచినీళ్ల లాంటి మజ్జిగ భార్య పోయగా ఏలాగో అయిందనిపించుకుని భార్యను చూచి "నీవు భోజనము చేసినావా?" అని ప్రశ్నించెను.

నుసీ:—తినెదను. మీరు వెళ్లుడు. పిల్లవాడు లేచునేమో. కేశవరావు మాత్రము తన కేదో అనుమానము తట్టగా మూతపెట్టియున్న గిన్నెను తీసి చూచి, "ఇదేమి నుసీ! నీవు బొత్తిగా అన్యాయము చేసుకొనుచున్నావు సుమా. ఉత్తమనిషివికూడా కాదు. తెల్లవారి ఏలాగు లేవగలవు? ఏమైనాకాని తెద్దామన్నను చేత కానీలేదు" అనెను.

నుసీ:—నాకుమాత్రము తెలియదా. రేపు పిల్లవాడి పుట్టినరోజు కదా. ఏమైనా చేద్దామని 2 శేర్ల బియ్యమే ఉండగా శేరున్నరబియ్యము రేపటి వంటకుంచి, అద్దశేరుబియ్యము పిండి విసరినాను. ఈ పూటకు ఇది చాల్లెండి" అని ఆ ఉన్న అన్నము కాస్త విస్తట్లో వేసుకుని భుజింపసాగెను. యువకుడగు కేశవరావు హృదయమునందు ఏమి దుమారములు లేచుచుండెనో ఎవ రూహించగలరు?

౨

కేశ:—నుసీ! బండీ తెమ్మనమన్నావా ఆస్పత్రికి?

నుసీ:—బండీ తెమ్మనటం ఎందుకు. వాని కద్దె ఈయవద్దా. ఇట్లో రేపటికి పిల్లలకైనా సోలెడు గింజలు కాచిపోయటానికి లేవు. నేను వెళ్లి ఆస్పత్రిలో ఉన్న ఇంట్లో పిల్లలను ఆ వృద్ధులు ఏలాగు చూచెదరు. ఇంట్లో నాలుగూ ఉన్నట్లైతే ఎవరైనా చూచెదరు. సర్వేశ్వరుడు మనపట్ల ఇకముందు ఏవిధముగా చూడనున్నాడో. నేను కూర్చుని లేవలేకున్నాను.

కేశవరావున కామాటలు కర్ణశూలములై బాధింప చేయున దేమియులేక దీర్ఘమైన వేడినిట్టూర్పొకటి పుచ్చి, కంఠమును సవరించుకొనుచూ "నీ వింట్లో ఉండిమాత్రము, ఈస్థితిలో ఏమి చేయగలవు? దిక్కులేనివారికి దేవుడే దిక్కని నమ్మి ముందున కడుగువేయవలెను గాని నీ వీలాగు నీ చేతిలోలేని నాటినిగూర్చి విచారించిన కాగలది కాకతప్పదు గదా. ఆలస్యముచేసినకొద్దీ నీ కాయాసము ఎక్కువైన, ఆస్పత్రికి వెళ్లటం మరీ కష్టముకదా. పద, నేను చెయ్యి పట్టుకొనెదను. నడవగలవా?" అని అనలేక అనలేక అనెను. మహాసాధ్వీశిరోమణియు, ప్రసవవేదనాయాసయు, విజ్ఞానవతియునగు నా సాధ్వీలలామ భర్త చెప్పినప్రకారము నడచుటతప్ప వేరే గత్యంతరము గానక భర్తచేయూతతో ఇంటిలోని అడుగు వీధిలోనికి పెట్టెను. ఇంతలో అతని స్నేహితుడును, కొంచము ధనవంతుడునూ అగు వెంకట్రావు ఏదో పనిమీద ఆవీధిని పోవుచూ ఈ దృశ్యమును చూచి నిర్ఘాంతపడి "కేశవా! ఈమె నీ స్థితిలో చేయిపట్టుకుని ఎక్కడికి నడిపించుకుని పోదలచుకున్నావు? ఇంత చదువు చదువుకున్న నీకు ఆమెనట్లు తీసికొనిపోగూడదని తెలియదా?"యనెను.

కేశ:—మిత్రుడా! ఈమె నాస్పత్రికి తీసికొని పోదలచుకున్నాను. నా స్థితినిగూర్చి నా నోటితో ఆప్తమిత్రుడవగు నీకు ఈ దృశ్యమునకంటె వేరేమియు తెల్పలేను.

వెంక:—కింగ్ జార్జి హాస్పటల్ కేనా. ఇక్కడికి సుమారు రెండు మైళ్ల దూరమున్నదే. దగ్గిరఉన్న ఘోషాఆస్పత్రి కూడదా.

కేశ:—కూడకేమి. అక్కడ ఎంత లేదన్నను మంచము ఛార్జీలు ఇంక ఇతర ఖర్చులైనా విధిగా చెల్లించి తీరాలట. అందుకనీ, దూరముగా ఉన్న ఆ ఆస్పత్రికి తీసికొనివెళ్ల దలచుట.

వెంకట్రావు ఆమెయొక్క స్థితిని వెంటనే గ్రహించి ఇంకఆలస్యము చేయుట ప్రమాదమని,అప్పు డా వీధిని

బోవుచున్న బండినొకదానిని పిలచి దానిలో ఆమెను గూర్చుండజేసి, ముగ్వురు బండినెక్కి, ఆస్పత్రికివెళ్లి, ఔట్ పేషెంటు వార్డులో కూర్చునిరి. జనుల ఒత్తిడి కొంచము సగ్గిన తరువాత సుశీల లేచి తన స్థితిగతులను చెప్పగా, అక్కడిడాక్టరు ఒక కాగితమును వ్రాసిఇచ్చి ఇంకొక చోటికి వెళ్లవలసినదని చెప్పెను. వెంకట్రావు కేశవరావు లిద్దరునూ ఆమెను పురుళ్ల వార్డులో దిగవిడచిరి. వెంకట్రావు ఆమెకు అనేక విధముల ధైర్యమును చెప్పి, కేశవరావుతో సహా వెనక్కితిరిగి వచ్చి, అతనిని చూచి "ఇక్కడే ఉండుము, క్షణములో వచ్చెదను" అని చెప్పి కొంచము దూరములో ఉన్న ఉపహారముల హోటలుకు వెళ్లి, కొన్ని ఇడ్లీను, వేడివేడి కాఫీని, తెచ్చి స్నేహితుని ముందరపెట్టి "నీ విప్పుడీ కాఫీని ఆమెకు ముందుగా లోపలికి అందజేయవలెను. బహు నీరసముగా నున్నది. వెళ్లు" అని తొందరజేసెను. అతడునూ దానిని చేతపట్టుకొని తాను లోపలికి వెళ్లుటకు వీలు లేనందున అక్కడనే పనులుచేయుచున్న కొందరి స్త్రీలను ఆ కాఫీని లోపలికి తీసికొని వెళ్లవలసినదని అనేకవిధముల బ్రతిమలాడెను. కొంతమంది వినీ వినిపించుకొనని మాదిరిగా వారివారి పనులు చూచుకొనుచుండిరి గాని బదులైన పలుకకుండిరి. కొందరు కన్నుమని "మా కిదే పని అనుకున్నావా, అదిగో దొరగారు వార్డు రౌండుకు రా బోవుచున్నారు. పోపో" అని తమకున్న కాస్తదర్జాను చూపించుకొనిరి. ఆహా! కాలమహత్మ్యము "యధారాజా తధాప్రజా" అన్నట్లు మానవ సహజ కారుణ్యమును సహితము మటుమాయ మొనర్చును గదా అధికార స్వభావము! పాపము అంత అతడు చేయున దేమియు లేక తిరిగి రాబోవుచుండ, లోపలఉన్న తమ వారి కొరకు భోజనమును తీసికొని వెళ్లుచున్న ఒక ఆమె, ఆయన దీనమొగమును చూచి "అయ్యా దానిని నా చేతి కిండు, నే నిచ్చెదను. నేను సాయంత్రము వరకు ఇక్కడనే ఉందును. ఆమె తమరి భార్యయే కాబోలు, చాలా నీరసముగా ఉన్నది పాపము. మీరు వెళ్లుడు" అని దాని నందుకుని లోపలికి వెళ్లెను. కేశవరావును ఆమెను ఒక దేవదూతగా తలచి మనస్సున పదివేల నమస్కారములు చేసెను.

వెంక:—ఇచ్చి వచ్చినావా?

కేశ:—ఏదో విధముగా అందజేసితిని. వెంకటం, నిన్ను భగవంతుడే స్వయముగా పంపినట్లు నీవు మాకు సమయమునకు ప్రత్యక్షమైతివి. లేకున్న మా పాటును చూచువా రెవరు? అని మొగమును వ్రేలవైచుకునెను.

వెంక:—మనలో మనము అటువంటి మాట లాడుకొన కూడదు. వీటిని కొంచము తినుము. అని బలవంతపెట్టెను.

కాని వాటిని చూడగానే అంతకు ముందురోజు నుండియు ఆహారము లేక అలమటించుచున్న తన ముద్దుబిడ్డల ముద్దుమొగములు ఎదురుగ ఉన్నట్లు తోచ గ్రుడ్లనిండ నీరుత్రిప్పి, గుటకలు మ్రింగుచుండెను. వెంకటరావునూ, ఆ స్థితిని చూచి స్నేహితుని అవస్థను తానుకూడ కొంత పంచుకొనెను. రత్నగర్భ యనియు అతులైశ్వర్యవంత యనియు, సస్యశ్యామల యనియు, పేర్వడిసి, జగద్విఖ్యాతులగు వీరాధివీరులను, దాతృత్వసార్వభౌములను విజ్ఞాననిధులగు ధీమంతులను గని ప్రపంచమంతయూ కేవల మూర్ఖావస్థలో మునిగియున్న కాలమున తన నాగరికతచేత సమస్తదేశీయుల దృష్టులను ఆకర్షించి యాచించిన వారందరికి సరిసమానమైన హక్కులతో ఆశ్రయమిచ్చి పోషించిన భారతవర్షము, నేడు తన బిడ్డలు కడుపునిండ పిడికెడు కూటికైన తినుటకు ఆశ్రయమీయలేకున్నది. అని అనుకొనుచూ వెంకట్రావు యోచనాధీనుడై పరధ్యానముగా ఉన్న సమయమున కాఫీ పట్టుకుని లోనికందిచ్చిన స్త్రీ తిరిగి వీరివద్దకు వచ్చి "అయ్యా ఆడబిడ్డ కలిగినది. దొరగారు వచ్చి ఆమెను చూడగానే ప్రసవము సహజముగా కల్గుటకు దేహమున శక్తిలేదని ఆయుధ

సహాయమున పైకి తీసినారు. బాబూ నే నేమి చెప్పను ఆ పిల్ల సౌందర్యము!! కొంచము నీరసించి యున్నది కాని, ఆ కండ్లు, ముక్కు, నోరు, తుమ్మెదలవంటి తలకట్టు మిమ్ములన్ని పుణికిపుచ్చుకున్నది. మీ రిక ఇంటికివెళ్లి 4 గంటలు కొట్టగానే రండి, నేను వెళ్ళెదను." అని వెళ్ళబోయెను. కేశవరావు హృదయమున ఆనందమను ఒక మెరుపు మెరిసినది, కాని వెంటనే దట్టమైన కారుమేఘములు వచ్చి ఆవరించుకొనెను.

## 3

సుశీలకు నేటికి 5 రోజుల పురుడు. ఆ రోజు పథ్యము పెట్టవలసినదిగా డాక్టరు చెప్పి వెళ్లినాడు. వెంకట్రావే తన భార్యచేత పథ్యము వండించి ఆస్పత్రికి పంపెను. సుశీలయు ఆమె వైపు కృతజ్ఞతా సూచకమైన దృక్కులతో చూచి "చెల్లెలా! మీ యుభయులకు మే మాజన్మాంతము ఋణపడి యున్నాము. ఇంటనున్న మా బిడ్డలను మా ముదుసళ్ళను, ఇక్కడ నన్ను, కంటికి రెప్పలాగ కాపాడుచున్నారు. దయామయుడగు పరమేశ్వరుడు తన దయను మీయందు మూర్తివంత మొనర్చినాడు. మిమ్ములను భగవంతు డాశీర్వదించుగాక!!

"అక్కా, నీ వట్లనరాదు. సృష్టిలోకెల్ల ఉత్కృష్టమైన మానవజన్మ తనయొక్క విధాయకమును, తనయొక్క ఆదర్శమును, మరువరాదు. గాని అంతకంతకు మనుజులు అత్యధిక తృష్ణాపరివృతులై, ఒకరిమీద ఇంకొకరు, ఒకజాతిమీద ఇంకొకజాతి ఒక దేశజులమీద ఇంకొక దేశజులు అధికారబలమును జూపుచు, వంచకత్వమార్గమున తమ స్వార్థాభిలాషను పెంపొందించుకొనుచున్నారు. ప్రస్తుతము వెంటనే తద్విషపరిణామమును వారు అనుభవించక పోయినను, క్రమేణవారికి అనుభవములోనికి రాకతప్పదు. అమ్మా నీ వనవసరముగా విచారించకుము, ఇప్పుడు నీవు విచారించ తగ్గ అదనుకాదు లెమ్ము. పథ్యము పుచ్చుకొమ్మా. ఒకవేళ లేచి కూర్చున్న నర్సులు కోపపడుదురు కాబోలును, నేను కలిపి ముద్దలు వేసెదను. తినుము," అని కలిపిపెట్టగా ఆమె మెల్లగ తినెను. జానకమ్మయు పథ్యముపెట్టి నిద్రపోవలదు జాగ్రత్త అని చెప్పి తిరిగి సాయంకాలము వచ్చెదనని వెడలిపోయెను. 12 గంటలు కొట్టుసరికి దొరగారు, నర్సులు, సిస్టర్సు, అసిస్టెంట్సు, మెడికలు స్టూడెంట్లు వెంట రాగా వార్డువార్డుకు వచ్చెను. వారికి తోచిన ప్రశ్నలను నర్సులనే అడిగి తెలిసికొనుచూ సుశీలవద్దకు వచ్చెను. ఆమెయు అప్పుడే మెల్లిగా లేచి కూర్చుని బిడ్డకు ఎత్తబోయి చేతులు తడబడగా దబ్బున మంచముపై జారవిడచెను. బిడ్డ కారుమనెను. నర్సు కోపదృష్టితో ఆమె వైపు చుఱచుఱ చూచుచు, దొరగారితో "దీనికి నే నెన్నివిధాల చెప్పినా విన్పించుకోదు. ప్రతిరోజు ఈ విధముగానే ఏదో ఒక అడ్డదిడ్డపు పని చేస్తూఉండును." అని చెప్పెను. దొరగారును సంగతి సందర్భములను తెలిసికొన ప్రయత్నించనైన ప్రయత్నించకుండా, పూర్తిగా నర్సుమాటలపైనే ఆధారపడి "ఏమమ్మా నీ విట్లాఉంటే చాలా తప్పునుమా, జాగ్రత్తగా ఉండాలె. నీ వనవసరంగా మాటిమాటికి నర్సులను పిలుస్తావట, వారు నీ తయినాతీ బంట్రోతు లనుకున్నావా?" అని నాల్గుచీవాట్లను మీద పారవేసి కష్టనిష్ఠురములనైనా కనుక్కోకుండా చటుక్కున ముందుకు నడచి వార్డును దాటెను.

నర్సు దొరగారిదన్నుకూడ కొంతసహాయ మొనరింప "ఏమమ్మా! నీ సంగతి నిండా బాగున్నది. మీ హిందూజాతే బానిసజాతి. మోటుజాతి. పిరికిజాతి. జ్ఞానము, విద్య అసలేలేదు. నీ కూరికే చాకిరీచేయుటకు మేము అచ్చియున్నామా ఏమి! లేవ వద్దంటే లేస్తావు" అని ఒంటికాలిమీద ఎగరటం మొదలుపెట్టెను.

సుశీల:—తల్లీ! మీరట్లు కోపపడిన అసహాయను నే నేమనగలను. నాబోటి దీనులకొరకే గదా ధర్మానుపత్రి యని అనేకలక్షలు వ్యయముచేసి



శ్రీ రవీంద్రునకు స్వాగతమిచ్చుటకు గూడిన మదరాసు మహిళామణుల బహిరంగ సమావేశము.



శ్రీమతి రాధాప్యారీ మథురాగారు

ఎట్టాలో స్త్రీల క్లబ్బునకు సెక్రటరి. ఈమె ఆనరరీ మేజిస్ట్రేటుగా
నుండి కోర్టులో న్యాయవాదులు హిందీభాషను ఉపయోగింప
ననుమతించిన దేశభాషాభిమానధురీణ.

కట్టించుట!! వేలాంతరములవరకుగూడ జీతములొసగి డాక్టర్లను పెట్టుట వాటి కనుగుణ్యామైన మందులను పనిముట్లను సమకూర్చుట!! నే నిందాక లేచానన్న, లేవకుండ ఎట్లుండగలను. కడుపునొప్పి వేయుచున్నది. లేవకున్న కడుపుబాధ ఆగదు. రెండు మూడుసార్లు ఎంతమందిని పిలచినా ఒక్కరూ తిరిగి చూడరు. వంగివాలరు. అప్పుడు లేవకున్న నే చేయవలసిన పనేమి. నిన్నరాత్రికూడ పిల్లకు విరేచనముకాక ఊరికే పోరు పెట్టి ఏడుస్తూఉంటే మీరు వినుక్కున్నారు గాని నా మొర ఆలకించలేదు. అమ్మా, తప్పనిసరివచ్చినప్పుడు ఉన్న సంగతి చెప్పితిని. నిన్నరాత్రి పాలేమో కటికి మంచినీళ్లు. మీ గన వసరముగా నీచస్త్రీని నిందించినట్టు నన్ను నిందించి, నీచావాచకము లుపయోగించిన నేమి లాభము" అని మిన్నకుండెను.

నర్సు:—ఓహోనిండా ఉపన్యాసకురాలవే!! ఇంకా ఏమో అనుకుంటున్నాను. బహుబాగున్నది. అని వెళ్లిపోయెను.

## ౪

కేశ:—సుసీ! నీవంట్లో ఏలాగున్నది. ఆస్పత్రినుంచి ఏలాగో బ్రతికి బయటపడ్డావని సంతోషించటానికి వీల్లేకుండా నీ శరీరము చూస్తే చాలా భయమేయుచున్నది. మా చిన్ననాటి స్నేహితుని వద్ద తిరిగి 50 రూపాయలు బదులు తెచ్చినాను. మందుసీసా కొని తీసికొనివచ్చాను. జాగ్రత్తగా పుచ్చుకో.

సుసీ:—అయ్యో, ఎంత వెఱ్ఱిపని జేస్తిరి. ఇప్పటికే మీ స్వల్పజీతములో అప్పులకు కొట్టుకోను నిండా 20 రూపాయలు రావు. ఇకముందు జరిగే దేలాగు. మొన్న నీమధ్య మీ స్నేహితునితో మీ ఉద్యోగముగూర్చి ఏమేమో మాటాడుచుండగా విన్నాను. దానిసంగ తేమిటి?

కేశ:—నేను నీకు తెలియపరచకుండా ఇన్నాళ్లు దాచిఉంచాలనే ఉంచాను. నీ బలహీనముతోపాటు ఈ విచారములుకూడా మనస్సుకు నాటిన, మరీ కష్టమని నేనే దిగమ్రింగుకుంటిని. ఆ ప్తమిత్రుడగు వెంకట్రావు సహాయమున ఇంత వరకును ఈ సముద్రమును ఈదుచుంటిమి. ఇప్పటికప్పుడే 2 నెలలనుండి ఉద్యోగము పూర్తి యైనది. సుశీ! నేను తిరిగిన షాపులు చూచిన అధికారులు, ఆత్మాభిమానము చంపుకొని ఆశ్రయించిన ఆశ్రయింపులు, ఎక్కిన గుమ్మములు లెక్కపెట్టి నీకు చెప్పలేను. పాపమనేవారును, నాల్గురోజులు పోయి కనబడండి అని అనేవారును, మొన్ననే ఒక ఖాళీఉంటే ఫిలప్పైపోయినదనేవారును, ఇంటిలోనుండే లేదనిపించుకుని పంపించేవారును, ఈ పలువిధ మార్గములచేత లేదు అనే ముక్కనే వినివిని విసివితిని. కాళ్లు బలహీనమైనాయి. ఇకముందు గతేమిటో తోచకున్నది. ఈ కలువుకాలములో ఎన్నిదినములు ఒకరికొకరు సహాయము చేయగలరు?" ఇంతలో వెంకట్రావు తనస్నేహితులు నల్గురితో సహావచ్చి కేశవరావును చూచి "కేశవా! ఏమి నీమొగము తిరిగి అట్లు వాడియున్నది? అత్యుత్సాహవంతమగు నీ చిన్ననాటి బలమైన విగ్రహమును దలచి, ఇప్పటి నీమొగము చూచిన నా మనస్సు విదారితమగుచున్నది. కృష్ణా, చూచితివా మన కేశవుని మాదిరి" అనెను.

కృష్ణ:—అవును మరి. అతను అట్లుండకున్న ఎట్లుండగలడు. పిత్రార్జితములా కుటుంబవిసరణముల చేత, ఇప్పటి వ్యయోపార్జితమైన విద్యావిధానముచేత పూర్తిగా నశించినవి. ఏదియైన ఒక వృత్తిని అవలంబింపుదామన్న నియమితమైన వృత్తులన్నియు చిందరవందరై పరపతిలేకుండ నశించినవి. ఆ ఉన్నవాటిలోనైన మారుదమనుకున్నను, ఆవృత్తిలో అలవాటుగా పని చేయుచున్నవారికే పై పోటీలవల్ల ఖర్చులైన గిట్టింపు కానప్పుడు, ఇప్పుడు నూతనముగా కొత్త పూజారిత్వము అవలంబించినవారి సంగతి అడగటం

ఎందుకు? సర్కారు ఉద్యోగముల సంగతి ఎత్త వలసిన అవసరములేదు. తెమరి కవసరమున్నంతకూ ప్రజల కందరికీ తృష్ణను కల్పించిరి. వీరునూ ఇతర పరపతులు నశింపజేసుకుని పూర్తిగ ఆ వ్యామోహములోపడి, అదేతప్ప ఇతర గతిలేదు అని పలపలాడుసరికి వారు ససేమిరా అని తోసివేయుచూ ఎవరెట్లైనను వారిని చూడవలసిన బాధ్యత తమది కానట్టుగా ఊరకుంటున్నారు. ఇంటిలోనా, కడుపులు మాడెడు లోతుకుపోయి అంగలార్చుచున్న ముద్దుబిడ్డలు, వృద్ధులగు తల్లి తండ్రులు, భార్య, ఆకలిచేత మలమలమాడి మసి అవుచుండ, అతనికిగాక విచారము మరెవరికి. అనంతం! మీ తమ్ముడు ఏమి చేయుచున్నాడు?

అనంతం:—రెండు సంవత్సరములనుండి ఉద్యోగము కొరకు తిరిగి తిరిగి వేసారి, మొన్న నీమధ్యనే వలసదీవులకు ప్రయాణమై మే మెంతవద్దన్నను అక్కడేమో జుట్టుకుందామని వెళ్లినాడు. వాని ననవలసిన పనిలేదు. ప్రాణము విసికి చివరకీపని చేసినాడు.

కృష్ణ:—అక్కడ మనవాండ్లకు రోజురోజుకు పరపతి ఏలాగు దిగజారిపోవుచున్నదో ప్రతిరోజు న్యూసుపేపర్లలో చదువుచూ ఏలాగు వెళ్లినాడు. జాంజిబారులో మనవాండ్ల మానవజన్మహక్కులు ఏవిధముగ నలగగొట్టబడుచున్నవో, ఇంకనూ నలగగొట్టుటకు ఎట్టి వక్రమార్గములు అవలంబింపబడనున్నవో మొన్న మొన్ననే చూచితిమిగదా. ఇంతేకూ వారి ననవలసిన పనిలేదు. చేసుకున్న భర్త రండఅన్న, తెన్నుబోతున్నవాడు రండ అని అనుటకు సాహసించినట్లు, మన దేశముననే మన జన్మహక్కులు లేక దాసత్వబుద్ధులకు అలవాటుపడుచున్న మనకు ఇతరచోట్ల పరపతి లేదని ఏడ్చుట వెఱ్ఱికాక మరేమి. తండ్రిచేత నిర్లక్ష్యతచెందిన బిడ్డను ఇతరు లెవరుచూతురు.

అనంత:—అయితే ఇక ముష్టికి బయలుదేరిన బాగున్నట్లున్నది.

కృష్ణ:—తెల్లవారి మొదలు సాయంత్రము ఆరుగంటలవరకు తెన్ను తెరపి లేకుండ వచ్చిన వికలాంగులకు నీ వెంత ముష్టివేయుచున్నావు? అదిగాక మనబోటిగాండ్లను చూచిన అసలే పొమ్మంటారు. అందుకు సిద్ధపడినా అదీలేదు.

అనంత:—అయితే దొంగతనములు, దొసగుతనములు చేయుమనియా నీయభిప్రాయము?

కృష్ణ:—చెడుదోవలకు పోవలసినదని ఎవరైనా చెప్పెదరా. నిర్వ్యాపాత, ఒకవేళ వీరిని అట్లు తీసికొని వెళ్లినను, జయప్రదము కానేరదు. ఏమోయీ వెంకట్రావూ మాటాడవు?

వెంక:—వీటికన్నిటికీ ఏమిగాని పల్లెటూళ్లలోనికి వెళ్లి భూములు గుత్తకు పుచ్చుకుని వ్యవసాయము చేసుకున్న కొంచము బాగున్నట్టు తోచుచున్నది.

కృష్ణ:—మునుపటిసంగతటుంచి ఇప్పటి సంగతిలో మాత్రము ఆ వ్యవసాయము మూలమున కష్టము తప్ప పిడికెడు మెతుకులైన మిగులవు. ఇక్కడ భూకామందుకు, అక్కడ సర్కారుకు, ఇంట తాను పెట్టుబడిపెట్టిన ఖర్చులకుకూడ ఆ పండిన పంట జాలనప్పుడు అతను, తన సంసారము, గొడ్లు బ్రతుకుటకు తెరు వెక్కడనున్నది?

అనంత:—కృష్ణా, తీగతీసిన డొంకంతా కదలునన్నట్లు ఇక మనముందుగతేమిటో తెల్పుము? ఇంతమంది ప్రజలు పుట్టుకతోనే పెట్టిన ఆకలిని తీర్చుకొనుటకు తెన్ను లేక అన్నమో రామచంద్రాఅని ఏడ్చుచూ ఊరకొనవలసినదే?

కృష్ణ:—మీబోటివాడనే అగు నే నేమని చెప్పగలను? ఇప్పట్లో ఈ కష్టములు విరుగుడయ్యే చిహ్నాలు పొలిమేరనైన గాన్పించుటలేదు. భారత యుద్ధానంతరము ధర్మదేవత కుంటువడి దుఃఖించు

చుండ, చక్రవర్తియగు పరీక్షిత్తు తన విధ్యుక్తమును గుర్తెరింగి రక్షించినట్లు, విశ్వజనీనమైన ధర్మము రక్షింపబడవలెను. "నా విష్ణుః పృథివీపతిః" అను వచనమువలె పృథివీపతి (ప్రభుత్వపద్ధతి) సర్వసామాన్యమైన పితృత్వదృష్టిని ధర్మపథమునందు నిలిపి తన విధ్యుక్తధర్మమును గుర్తెరింగినప్పుడే పాలితులయందు శాంతి సౌఖ్యములు నెలకొనగలవు. అదిగాక, దయనీయుడైన తండ్రి బిడ్డలందరి పోష్యభారమును వహించుటకు బాధ్యుడై అందరి సొత్తులను జాగ్రత్తపరచి న్యాయానుసారముగా వెచ్చించురీతి సమస్త ప్రజల ఆస్తిపాస్తులన్నియు ప్రభుత్వమువారు స్వాధీనమునందుంచుకుని, లాభమంతయూ ఏ కొద్దిమందికో చేరు ఫాక్టరీపద్ధతిని గాక, ఏ పరిశ్రమలనైనను, ఏ కళాశాలలనైననూ ఏ ప్రత్యేకసంస్థలనైననూ సరే, తామే స్వయముగా నడుపుచూ తమ బిడ్డలందరూ ఆ లాభనష్టములను అనుభవించునట్లు చేయుట ఉత్తమోత్తమము. అవసరమున్న యెడల ప్రాముఖ్యతను బిరుదులచేతను, ప్రత్యేక బహుమానములచేతను గౌరవింపతగును కాని, కాకులను కొట్టి గ్రద్దలకు వేయు పద్ధతి మాత్రము న్యాయము, ధర్మము, క్షేమమును గాదు. లేనియెడల ఈ ఒడుదుడుకులు, ఈ క్షోభలు, ఈ దారుణపద్ధతులు ఈలా గుండవలసినవే. నే జెప్పిన దృష్టి, ప్రభుత్వపద్ధతియందు నెలకొన్నప్పుడు ప్రభుత్వశాఖవారు ఎవ్వరైననూ మన కేమియూ భేదము లేదు. ఏ రాజు ఏ రాజ్యమేలినా మన కవసరము లేదు. చెట్టుయొక్క వేరును, పురుగు దొల్చివేయుచుండ వృక్షమునకు ఎంత దోహదము చేసిననూ లాభ మేమున్నది. అదేవిధమున మన మెన్నివిధముల సంఘమునకు దోహదముచేసినను అది సరియైన పూర్ణవికాసము గాంచనేరదు. ఏదో వెఱ్ఱివాడ్ని చేసి నన్ను వాగించారు. 12 గంటలు కూడా వినబడుచున్నవి. ఇంటికెళ్ళిన, మా ఆవిడ ఏం కస్సుమనునో!! వెళదామా?

వెంక:—కేశవా, మేము వెళ్ళుచున్నాము. నీవు మరేమియు చిన్నబుచ్చుకొనక నే నిచ్చినవి ఖర్చుపెట్టుకుని పిల్లలను చూచుచుండుము. మా అమ్మకు సుస్తీమూలాన వెళ్లవలసివచ్చింది. త్వరలోనే వచ్చెదను. జాగ్రత్త. అమ్మా సుశీలా, వెళ్లుచున్నానమ్మా" అని వెళ్లెను.

---

అసుర సంధ్యవేళ యైనది. ఇంట్లో దీపంలేదు. చంటిపిల్ల ఒకమూల చింకిచాపమీద పడుకుని ఏడుస్తున్నది. 9 ఏండ్ల కుఱ్ఱవాడు, 6 ఏండ్ల పిల్ల 3 ఏండ్ల పిల్లడు తల్లిని పెనేసుకుని కదలనీకుండా "అమ్మా బువ్వ, అమ్మా బువ్వ," అని దీనంగా ఏడుస్తున్నారు. ఆ ఏడుపును వినినవారిహృదయము ఎంత కఠినమైనా కరుగక మానదు. అటువంటప్పుడు, కన్నబిడ్డలు మలమల ఆకటిమంటచే మాడిపోవుచూ అన్నమో రామచంద్రా అని గిలగిల లాడుచూ కాళ్లను చుట్టుకుని ఏడ్చుచున్నప్పుడు, కన్నతల్లి సహించు టెంత దుష్కరము!! సుశీల మాత్రము, ఎక్కువ ధీరోదాత్తయు దైవభక్తిపరాయణయు గాన, అంత కష్టమునూ దిగమ్రింగుచూ చంటిబిడ్డను ఒడి నిడుకొని ఎడబిడ్డను జోకొట్టుచూ ఏవో మాటలచేత తక్కిన ఇద్దరి పిల్లలనూ మరిపించుచుండెను. కాని కన్నీటిని మాత్రము, ఆమె ధైర్యము, కారకుండా ఆపలేకపోయెను. పాపము ఆ ఇల్లాలు ఏమి చేయగలదు? ఆమె శరీర మంతయూ చిక్కి శల్యావశిష్టమైనది. ఎన్ని దినములైనదో ఆమె కడుపునిండా తిండి తిని!! ఇంతలో 6 ఏండ్లపిల్ల "అమ్మా నాన్న, ఎప్పుడు వస్తారే? బియ్యం తెస్తారని చెప్పావుకాదూ, నాకు చాలా ఆకలౌతోంది." అని ఏడవటం మొదలుపెట్టెను. అంత తల్లి కంఠము సవరించుకునుచూ "వస్తారమ్మా వస్తారు, ఏడవకు, తమ్ముడు చూడు ఏలాగు ఏడ్చిఏడ్చి నిద్రపోవుచున్నాడో" అని బుజ్జగించింది. కాని ఒక వేడి నిట్టూర్పువిడచి "హా జగదీశ్వరా, నారాయణా, నీవే శరణు" అని రెండు వేడి కన్నీటి బిందువులను రాల్చెను. పాపము ఆ పిల్లకు ఏమి తెలియును తల్లి ఆరాటము? పెద్దపిల్లవాడు తల్లిని చూచి "అమ్మా, ఇవ్వాళేం, మా బళ్లో కుఱ్ఱవాళ్ళందరూ ఇన్స్పెక్టరు

గారు వస్తారని, కొత్తచొక్కాలు, లాగులు, తొడుక్కుని వచ్చారే; నే తొడుక్కుని రాలేదని అందరూ నవ్వారే, నాకు కూడా అల్లాంటివి ఎప్పుడు కొంటావమ్మా, అదిగోటమ్మా, వీధిలోనికి మిఠాయి వచ్చిందే, అందరూ కొనుక్కుంటున్నారు ఒక అణా కానియ్యే, నే కూడా కొనుక్కుంటాను.'' అని అల్లరిపెట్టడం మొదలుపెట్టాడు. ఈ మాటలు వినగానే సహజ మాతృప్రేమ, ఆమెయందు ఘనీభవించియున్న దుఃఖమంతయు ఒక్కమారుగా పైకుబికించి వెక్కివెక్కి ఏడ్చునట్లు చేసెను. ఇదంతా పిల్లవాడు చూచి బిక్కమొగంవేసి, "అమ్మా, ఏడవకే. నాకేమీ అక్కర్లేకే, నేనేమీ అడగను లేవే." అని అంటూ తానుకూడా ఏడవటం మొదలుపెట్టాడు.

"ఏమి నాయనా ఏడుస్తున్నావు?" అని అంటూ ధూళితోఉన్న కాళ్ళైనా కడుక్కోలేనంత నీరసముగావచ్చి ఒక నులకకుక్కిమీద కూలబడ్డాడు కేశవరావు. సుశీల, భర్తకు తెలియకుండు లాగున చెంగుతో కళ్లు వత్తుకొనుచూ లేచి, ఒక కుండముంతతో నీళ్లుతెచ్చి 'కాళ్లు కడుక్కొనుడు' అని లోనికెళ్లి, రెండు నిమిషాలకల్లా ఒక ఆకులో నాలుగు కాల్చిన తెల్లదుంపలను తీసికునివచ్చి ఎదురుగ బెట్టింది. అవి చూడగానే, కేశవరావునకు ఎక్కడలేని దుఃఖము పొంగి కంఠస్థము కాగా, గొంతు సవరించుకొనుచూ సుశీ, ఇవి ఎక్కడివి?' అని ప్రశ్నించెను.

"మన అబ్బాయి, అమ్మాయి వీధిలో మీ కోసం నిల్చుని ఉండగా ఎదురింటి పిల్లకాయ ఏవో కొనుక్కుంటూ వీ రిద్దరిచేతిలో చెరియొక కానీ పెట్టబోయినాడట, మన పిల్లలు వద్దని లోపలికి వస్తూఉంటే బలవంతంగా చేతిలో పెట్టిపోయినాడు. ఆ అర్ధణాపెట్టి ఒకవీసెడు దుంపలుకొని, ఏవో తుక్కుపెట్టి మెల్లిగా కాల్చాను. అత్తగారికి, మామగారికి నాల్గిచ్చాను. పిల్లలు మళ్ళీ మీతో అడుగుతారని వాళ్లకు ఒకదుంప ఉంచాను. మీ రివి తినండి" అని శుష్కకంఠముతో పలికెను.

కేశవరావు మనస్సులో ఏ మాలోచనములు జరుగుచున్నవో మనకు తెలియదు. మొగమునందు మాత్రము ఒకవిధమైన మార్పు కనబడెను. దానిం గాంచి సుశీల కొంచము చకితయై "ఈ రోజున విశేషములేమి? మీ మొగము చూచిన ఎందుచేతనో గాని ఇప్పటి కిప్పుడు భయము వేయుచున్నది" అనెను.

"సుశీలా, ఎవరో పుణ్యాత్ములు బిడ్డలకొర కిచ్చిన అర్ధణా మనకందరకూ, ఈపూట క్షుత్తున కుపయోగించితివా? నేటినుండి మన మిక దేనికిని విచారించ నవసరములేదు. ఇంటివారు కూడా మనలను ఇల్లు ఖాళీ చేయవలసినదిగా తొందర పెట్టుచున్నారు. వాళ్ళింకా మంచివాళ్ళు కాబట్టి ఇన్నాళ్ళవరకూ ఓపిక పట్టారు."

"అయితే ఎక్కడా ఏమీ కలసిరా లేదా?"

"ఇంక ఆసంగతి తలపటం అవసరం లేదు. ఎక్కడకు వెళ్ళినా పర్యవసానము 'లేదు' అన్నది తప్ప రెండవది లేదు. మర్యాదగా చెప్పనీ, అమర్యాదగా చెప్పనీ, సుశీ, ఆసంగతులన్నీ చెప్పి, నీ కోమలహృదయమునుకూడా నొప్పించాలని లేదు. నే పడినది చాలును ఇంక మన భవిష్యత్తును గూర్చి యోచించవలెనుగదా. మన నాల్గువైపులా ఎక్కడ చూచినా ఒక దినమైన మర్యాదగా పిడికె డన్నము ఇక ముందుపెట్టు ఆప్తులు లేరని నీకు తెలుసును గదా."

"మనలను పోషించు ప్రభుత్వమువారికి మన స్థితిగతులను దెల్పుచూ ఒక అర్జీ పెట్టుకుంటే ఏమైనా పిల్లలను పోషించుటకు మార్గ మేర్పడు నేమో,"

"సుశీలా! ఏమి, తెలియని మూర్ఖురాలు లాగు ఈలా గడిగిన నేనేమి చెప్పగలను. కొన్ని రాజ్యములలో ప్రభుత్వమువారు నిరుద్యోగులగు తమ దరిద్ర ప్రజలకు 'అనెంప్లాయిమెంటు డోల్సు' అని పేరుచెప్పి బ్రతుకుటకు తగిన సహాయము చేయుదురు. కాని మనదేశమున అది లేదుగదా. అదంతా మన కిప్పుడనవసరము. నీవు తరుచూ భాగవతము చదువుతూ ఉంటావుగదా, ఖట్వాంగమహారాజు చరిత్ర ఏమిటో కొంచము చెప్పు"

"మీకు తెలియదా ఏమి? ఆయన తన మృత్యు సంగతి తెలునుకున్న తక్షణమే, విరక్తినిబూని, భగవంతుని దలచుచూ శీఘ్రముగ మోక్షమును బొందెను.

"అనగా మోక్షమును పొందుటకు, వైరాగ్య యుక్తమైన భగవద్భక్తి ఒక్కనిముసమైననూ చాలు నన్నమాట." అని ఇలా అంటూఉండగా "అమ్మా, నాకు బువ్వే, నాన్నే రే, అని అంటూ ఎడపిల్లడు నిద్రనుండి ఏడుస్తూ లేచాడు. కేశవరావు బిడ్డను చంకను వేసుకుని, దీపమునకైనా శక్తిలేని తన దుర్భర దారిద్ర్యమునకు లోలోన గుములుచూ, వీధి లోనికి తీసికొనివెళ్ళి 'తండ్రీ, చూడు, దుంపవచ్చి' అని తనకొర కిచ్చిన దుంపను బిడ్డకు తినిపించుచూ ఏదియో యోచించుచుండెను.

## ౬

రాత్రి ఎనిమిదిగంటలకు కేశవరావు వీధిలో నుండియే, ఒకవిధమైన కంపితస్వరముతో "సుశీలా" అని ఒక కేకవేసెను. సుశీలయు పాలు లేమిచే ఏడ్చుచున్న చంటిబిడ్డను ఎత్తుకొని చందమామను చూపుచూ "ఎందుకు పిల్చారు" అని బైటికి వచ్చెను. అప్పుడు దుంపముక్కను తింటూ తండ్రివద్ద ఆనందిస్తున్న బిడ్డనితికి జాలిబొంది "నాయనా, అన్నము లేనందున దుంప తిని సంతోషిస్తున్నారా" అని కన్నీరు విడచెను. కేశవరావు భార్యను చూచి అదే కంపితస్వరముతో "ఇంక మనము మన తరణోపాయమును చూచుకొందమా. చంటిబిడ్డతో సహా మా అమ్మను, నాన్నను, గూడా తీసికొనివెళ్లి ఇప్పుడే భగవద్దర్శనము చేసుకుందము పద, అక్కడ మన కష్టములు తీరగలవు" అని పల్కిన వెంటనే మహా పతివ్రతాశిరోమణియు, పరమసాధ్వియు యగు సుశీల, ఎందుకని ప్రశ్నసైన వేయక వృద్ధులగు అత్తమామలను నడిపించుకొని భర్తను అనుకరించెను. వా రందరూ చేరవనున్న దేవాలయములోనికి బోయిరి. కేశవరావు ఎవ్వరితోనూ ఏమియూ మాట్లాడుటలేదు. బిడ్డలవైపు మాత్రము అప్పుడప్పుడూ చూడకుండ ఉండలేకపోయెను. తొమ్మిది గంటలైనందున జనసంచారము అంతగా లేక నిశ్శబ్దముగా నుండెను. కేశవరావు తల్లిని తండ్రిని, భార్యను చూచి మన మందరము మన పాపము పోవునట్లు ఒక్కసారి భగవధ్యానము చేసికొందము. అనెను. దైవభక్తురాలగు సుశీల పద్మాసనము వైచుకుని రెండు చేతులను జోడించుకుని చంటిబిడ్డను ఒడియందే పండబెట్టుకుని "లావొక్కింతయు లేదు" అను పద్యమును మాత్రము పైకి జదివెను. శరీరము వణకుచుండెను. కన్నీరు ప్రవాహముగా కారుచుండెను. కంఠమునుండి ఇతరులు పోల్చుకొనజాలనంత అస్ఫుటముగా ఒకవిధమైన ధ్వని వచ్చుచుండెను. ఇట్టి అనిర్వాచ్యావస్థలోనున్న భార్యను చూచి, సుశీ, ఇదిగో భగవంతుని శ్రీపాదతీర్థము, మనకష్ట నిర్మూలనతీర్థము. అని రెండు చెంచాలను ఆమె నోటియందు బోసెను. పోయుటయే తడవుగ ఆ మహా ఇల్లాలి జీవాత్మ పరమాత్మయందు పూర్తిగా విలీనమొందెను. తల్లితండ్రులకు గూడ నమస్కరిస్తూ అదే విధముగ బోసెను. ముగ్గురు బిడ్డలను మాత్రము ఒడియందు గూర్చుండ బెట్టుకుని భగవంతుని ధ్యానించుచూ "తండ్రీ, దీనశరణ్యా, ఈ పాషండుడు, ఈ హంతకుడు నిన్ను స్మరించుటకు కూడ అర్హుడని ఎంచను. ఇది అంతయు నీ సంకల్పమే. నీవు దయార్ద్రహృదయుడవని అనుకుంటగాని నేను మాత్రము నీ దయను అనుభవించలేకపోతిని. నా జీవితము పూర్తిగా ఇహపరములకు దూరమైనది. పతితపావనా, ఈ మాతృ, పితృ, పత్నీ, శిశుహంతకుని ఎట్లు క్షమించెదవో. జగత్పరిపాలకులగు ధర్మదేవతలారా, మీ రిది యంతయు గాంచుచుండుడు. మీధర్మపాలన ఈవిధముగా రాణించుచున్నది. ఓ దారిద్ర్యదేవతా, నీధాటకను, ఎన్ని పవిత్రకుటుంబములమీద వెదజల్లుచున్నావో, సుగుణవతీ, సుశీలా,

భౌతికబంధములనుండి విడివడియు, నీకేమియు నన్ను నిందించకుము. నన్ను కనిపెంచి పెద్దనుచేసి దివి కేగిన తలిదండ్రులారా, నమస్కారము. హైందవ భవిష్యత్ జాత్యంకురములారా, నా ముద్దుబిడ్డలారా, మీ చక్కదనములు మీ తెలివితేటలు నేలపాలు గావలసినదిగా ఈశ్వరుడు నిర్ణయించెగాబోలు. శాయనలారా, మీ నిష్కలుషమానసంబులు ఈ దుర్మార్గుని అంతఃకరణమును గ్రహించలేక తండ్రివని ఒడిలో నిర్భయముగా కూరుచుంటిరి గదా నాయన లారా, అమ్మా, ఇదిగో బొబ్బ అని యొక్కొక చెంచా ముగ్గురి బిడ్డల నోటియందుబోసి చంటిబిడ్డ నోటిలో ఒకచుక్కపోసెను. ఈశ్వరునికి తిరుగ ఒక నమస్కారము చేసి భార్య ప్రక్కకరిగి నుశీ, ప్రేయసీ, ఇదిగో వస్తున్నాను. నన్ను కూడా నీలోనికి జేర్చుకో అని మిగిలిన నీటిని తననోటి యందు బోసికొనెను.



# కావలెను

చం॥ అలయక శాన్తిసత్యములకై తనువెత్తిన గాంధివంటి తం।
డ్రులు—రణమీఁగివచ్చినజడుం గొమకున్ గమఁగష్టవిష్ణురో।
త్తులఁబచరించి పోరుసకుఁదోలిన మానధనాభిమానవి।
హ్వాల యగునట్టి యా విమలవంటి మహానిశితాత్ములైన త।
ల్లులు—ధృతిమూర్తి శ్రీమతి సరోజినిఁబోలెను సోదరీమణుల్।
కలనికి దూఁకి నాధునకుఁగా నసువుల్ బలివెట్టి వైరికిన్।
జలమున బొట్టువెట్టు జయచంద్రుసిపట్టినిఁ బోలినట్టి యా।
లులుఁ—దలలోన నాల్కవలె లోకములోన మెలంగినట్టి ధీ।
బలుఁడగు చిత్తరంజనునిఁవంటి యుదారులు సోదరుల్ సుహృ।
త్తులును— నిరంతరంబు గురుతోషకుఁడౌ నలదేవదాసుఁబో।
లు లలితచిత్తులైన సుతులున్—దిలకుం దలపించు మామ—లి।
మ్ములు గురుతుల్యుఁడౌ మదనమోహన పండితుఁబోలునట్టి తా।
తలు-మరి సూదితోడిదియె దారమురాయని యొత్తిచెప్పఁగాఁ।
గలుగు సమర్థురాలు శుభకామిని కస్తురిఁబోలునట్టి య।
వ్వలు మొదలైనచుట్టములు భవ్యచరిత్రులు మాకుఁగావలెన్॥

గ॥ ల॥

# లీలావతి

శ్రీమతి సమయమంత్రి వందేమాతరంగారు

సదాసివరావుగారు కాకినాడలో పేరెన్నికగన్న న్యాయవాది. కమలాంబ ఆయన ధర్మపత్ని. వారికి హేమ ఒక్కతే సంతానం. హేమ కిప్పుడు పన్నెండవయేడు; థర్డుఫారం చదువుతోంది. వివాహ మైనప్పటినుండి హేమను చదువు మానిపించమని హేమ అత్తగారు వియ్యంకున కనేక వర్తమానాలంపింది. ఆ వర్తమానాల్ని హేమకు విశదపరచారు సదాసివరావుగారు. 'ఏవిధమైన జ్ఞానం సంపాదించందే మానివేయడం నాకిష్టం లేదు. యేదో ప్రవేశపెట్టారు కనుక మెట్రిక్యులేషనువరకైనా చదవాలనుంది' అంది హేమలత. యేకపుత్రిక సద్గుణఖని. యెదురు చెప్పలేకపోయారు రావుగారు. తమ మాట వినందున హేమ అత్తగారు కోపోద్దీపితమై మా పిల్లవానికి మారుమనువుచేయ తలచామని వర్తమానంచేసింది. అల్లుడు విద్యాసంపన్నుడగుటచే నట్టి పనికి సాహసింపడని వారి యూహ. రావుగారుకాని హేమకాని జంకలేదు. కమలాంబమాట పాటిచేయరు కదా !! సదాశివరావుగా రొకరోజున కోర్టునుంచి రాగానే కోటైనా విప్పకయే వాలుకుర్చీలో కూలబడ్డారు. నీళ్లచెంబూ తువ్వాలూ చేతగొని కమలాంబగారు వచ్చి వివర్ణమైయున్న భర్తముఖం చూచి 'అదేమీ నేడిట్లున్నారు? బెజవాడలో నంతా క్షేమమా?' అంది ఆత్రంగా. 'ఆ కలియుగరాక్షసికి క్షేమము కాకేమి !! దివ్యంగా పెళ్లికి తర్లివెళుతూఉంటే !! విద్యాసంపన్నుడైన ప్రసా దింతదుర్నయానికి పాల్పడుతా డనుకోలేదు' అన్నారు కోపంగా.

'నే చెపితే విన్నారూ తండ్రీ కూతురూను! చదువో చదువో అని ఉవ్విళ్లూరారు కాని !! ఉద్యోగం చేయనా వూళ్ళేలనా ఆడదానికి చదువు ?'

'ఛీ! నోరుమూసుకొని అవతలకు పో. ఆ ద్విపాదపశువుపాటకు తాళం వేస్తావా ?'

'మంచి చెప్పినా కోపమాయె. యెల్లా చచ్చేది !! మాలమాదిగ పద్ధతులన్నీవచ్చి పడుతూంటే యెంతకని ఓర్చివుండను ?' అని గొణుగుకుంటూ లోనికి వెళ్లిం దావిడ.

౨

'ఏమిటమ్మా సణుక్కుంటున్నావు?' అంది హేమ స్కూలునుంచి రాగానే.

'నీ చదువే నిన్ను అధోగతికి త్రోసింది. నీవూ మేమూకూడా యేడువవలసిందే యింక జన్మపర్యంతరం'

'అదేమిటమ్మా కొత్తగా మాట్లాడుతున్నావు ? యెవరికర్మ వాళ్ళనే పీడించును కాని చదువేం చేస్తుందే ?'

'ఆ—నీమొహం చేస్తుంది !! మీ నాన్నగార్నే అడుగు వెళ్లి.'

ఆఫీసు రూములో కూర్చుని పేపరు చూచుకుంటున్న వాళ్ళ నాన్నగారి వద్దకు పరుగెత్తింది హేమ. హేమను చూడగానే చాలా విచారమైంది రావుగార్కి.'

'నాన్నగారూ, అమ్మ యెందుకు చాలా కోపంగావుంది యీరోజున?' అంది.

'మీ అత్తగారు అన్నంతపనీ చేసింది. నీవంటి రూపవతిని మాత్రం ప్రసాదిక బడయ లేదు హేమా!! ముందు నీ గతియేమిటో నే నూహింపలేకున్నాను తల్లీ' అన్నారు రావుగారు.

నిజానికి హేమ చాలా సౌందర్యవతియే. మరి జవాబియ్యలేదు హేమ; గబగబా మేడమీదకు వెళ్లింది. 'నాన్నగారూ. యీ వుత్తరం చూడండి. మిస్. మేరీకి వ్రాశా' నంది హేమ ఓ రోజున.

'ఇప్పటికైనా అక్కడకు వెళ్ళు నుద్దేశము లేదా హేమా?'

'నాన్నగారూ, మీ మాట కడ్డుచెప్ప సాహసించినందులకు క్షమించాలి నన్ను. యేదో కాలక్షేపం నిమిత్తం చదువుటే కాని మరేమికాదు. వాళ్ళ సౌఖ్యాని కంతరాయం కలుగజేయడం నాకిష్టంలేదు.'

'సరేనమ్మా నీయిష్టం.'

మరికొన్నాళ్ళకు హేమను వెంటనే బయలుదేరి రమ్మని మేరీ జవాబు వ్రాసింది. మెడికల్ చదువుటకు హేమ విశాఖపట్నం వెళ్ళింది. ప్రసాదునింట్లో చాలా గడబిడగా వుంది. మోటారు దిగుడాక్టరూ బండీనెక్కు డాక్టరు ఒక్కరు వెలితికాకుండా యేలూరున వున్న వైద్యు లందరూవచ్చి ప్రసాదుసి భార్యయగు లీలావతిని చూచి పోవుచున్నారు. మారామయు చేయుచున్న రాముని చంకనిడుకొని వీధియరుగుమీద పచారు చేయుచున్నాడు ప్రసాదు.

లేడీడాక్టరును కూడా పిలిపించి చూపించుట మంచిదని నా యుద్దేశ' మంటూ మోహనం బైటికొచ్చాడు. 'మీ రెరిగున్న వా రెవరైనావుంటే చెప్పండి పిలుచుకొస్తా' నన్నాడు ప్రసాదు. 'ఇదిగో యీ చీటిని ఆమెకు చూపండి తప్పక వస్తుంది' అన్నాడు మోహనం సైకి లెక్కుతూ.

## 3

'మరేం భయంలేదు. మీ జీవితంకోసం నా శక్తిని ధారపోస్తాను' అంది యింజెక్షనిస్తూ లేడీడాక్టరు 'మీరంతా వెల్తురు కీ ఘాలికీ అడ్డులేవండి. ఇంజెక్షనిచ్చిన తర్వాత మీ కేమేనా స్వస్తతగా యున్నదా?'

'యేమి స్వస్తత? ఆయాస మెక్కువగా యున్నది.'

'యెన్ని రోజులనుంచి జ్వరం మీకు?'

'నేటికి వారం' అంది లీల.

"మీరు తెలుసుకోలేకపోయారు. పదిహేనురోజులనుండి మీకు జ్వరము వస్తూనే యుండి యుండాలి!! యేమంటారు?"అంది డాక్టరు 'ఈలా తిరగండి యీమందు నోటిలో పోస్తాను త్రాగివేయండి.'

లీల ఆమెవైపు తిరిగింది. ముఖము వివర్ణమయింది. చూపు మందగించుచున్నది.

'మీరు ఎవరూ? మీ...రు...ఆమె... యే కావచ్చు...ను.'

డాక్టరు ముఖమిటు త్రిప్పింది లీలకు కనుపించకుండా.

'ఆమెయే నీవైతే నన్ను క్షమించు. అపరాధిని' అంది లీల చేతులు జోడిస్తూ.



మిస్: విషిని యెగేషియా: కరాచి. రానున్న హైందవ ఫిల్మ్‌స్టార్.

చక్కని యాకృతి, మిక్కుటమగు తెలివితేటలు, గొప్పపాట, మాట, అభినయముగల యీ పన్నెండేండ్ల బాలాకుమారి సింధుదేశమందొక ప్రసిద్ధ రాజకుటుంబములోనిది. సాటివారు పెట్టు గోలల సరకుసేయక తలిదండ్రులీ బాలికను ఆ నాట్యకళయందే తరిఫీదు చేయించుచున్నారు. శ్రీ రవీంద్రుని 75 వ జన్మదినమహోత్సవ సందర్భమున జరిగిన సంగీతపు పోటీయందీ బాలికామణి యార్జించిన ప్రప్రథమ బహుమానమే యాశేత నున్నది. ప్రేమపరీక్షయను రూపకమున నీబాలిక ముఖ్యపాత్రయైయున్నది. ఆ ఫిల్మ్ 1935 లో వెలువడనున్నది



అఖిలభారత మహిళాసంఘపు 'మానిఫెస్టో'ను చర్చించుటకై, ఎగ్మూరు పాంథియన్ గార్డెన్సులో కూడిన
మదరాసు మహిళాసంఘముయొక్క బహిరంగ సమావేశము.

'నే నిక్కడుంటే మీ మనోవేదన...... యేలాగుంది. వెళ్తా' నంది డాక్టరు.

'నన్ను క్షమించానంటే నిశ్చింతగా యీ లోకము విడుస్తా.'

'లీలా, నీ వేమో గడసరి వనుకున్నా. వట్టి పిచ్చిదానవు సుమా. నావలె నీవునూ వివాహమాడిన భార్యవే కాని వేరుకాదు. నే క్షమించటాన్కి నీ తప్పులేదు' అంది హేమ లీలముంగురులు సవరిస్తూ.

'హాయిగావుంది నా ప్రాణాలు పవిత్రమైన నీ హస్తస్పర్శవలన. రాము నేలా చూస్తావో నీదే భారం' అంటూ కళ్లుమూసింది లీలావతి.

## ౪

ఇప్పుడు లేడీడాక్టరుగా నేమిచేయ తలచుచున్నా రేమి' టన్నాడు చదువుచున్న పత్రిక టేబిలుమీద పడవేస్తూ చిరునవ్వుతో ప్రసాదు.

'ఇదిగో యీలాటి సేవలు చేయతలచుకున్నా' రంటూ తాంబూల మందించింది హేమ నవ్వుతూ.

'హేమా నేచాలా దుర్మార్గుణ్ణిసుమా!! నిన్ను మీ వాళ్ళనూ చాలా హింసపెట్టాను కాదూ?'

'అయితే విద్యవలన వినయము నశించుననే మీ యుద్దేశమా?'

'అట్లెన్నటికీ యూహింపలేదు. అమ్మ పట్టుదలయే కాని యితరము కాదు హేమా నన్ను క్షమించు.'

'నే నెంతటిదాన్ని మిమ్ము క్షమించటాన్కి. మీరు నాకు వందనీయులే కాని క్షమార్హులు కాదు. ఈశ్వరుని లీల లగమ్యగోచరములు సుమండీ. లీలను తన సన్నిధికి తోడ్కొని కాని నాకు మీ సేవాభాగ్యము కలుగజేసి నాడు కాదు. మాతృవిహీనుడగు రామును చుచిన నా గుండె నీరగుచున్నది.'

హేమా వాని సంరక్షణ భారమువహించువా రేరీ?

'నేనుకూడా లీలను కలుసుకోవెళ్లా ననుకున్నారా? రామును పెంచుట నాకొక కష్టమనియా? లేక చేతకాదనియా మీయూహ'

'అంతమాటనకు హేమా, లీలను కలుసుకొనుటకు నీవు వెళితే నేనూ మిమ్ము అనుసరించేవాడినే. చదువులో మెలగినదానవు యివన్నీ యెప్పుడు నేర్చుంటావని...'

'చాల్లెండి. విన్నవారు నవ్వేపోతారు. సంసారనిరహ్వాణ స్త్రీలు కష్టపడి నేర్వనక్కర లేదు. ఆడదై పుట్టగానే అన్నీ తోపజేస్తాడా సర్వరక్షకుడే'

'అమ్మ జీవించియుంటే నిన్ను చాలా మెచ్చుకొని యుండును. ఆ అదృష్టం నాకు లేదు.'

ఎక్కడో ఆడుకుంటూయున్న రాము వాళ్ల నాన్నదగ్గర కొచ్చాడు. హేమను చూచి యేడ్పు మొదలెట్టాడు.

'నాన్నా? యిదేవులూ? అమ్మేదీ?' అన్నాడు నాన్నవొళ్ళో కూర్చుని.

'మీ అమ్మ యిదే నాన్నా.' అన్నాడు ప్రసాదు విచారంతో.

'మీరు కూడా విచారిస్తే వాడు మరీ బెంగపడతాడు. రండి కాసేపు తోటలోకి వెళ్లి కూర్చుందాం మనస్సు నిర్మలంగా వుంటుంది. నే నెత్తుకుంటా రా బాబూ యివిగో బిస్కొత్తులు దా.' అని రాము నెత్తుకొని దారితీసింది హేమ.

మల్లెపందిరవద్ద శిలావేదికపై కూర్చున్నారు హేమాప్రసాదులు ప్రకృతి మాత నీక్షిస్తూ. జానీతో గంతులేస్తూ ఆడుకొంటున్నాడు రాము సమీపాన్నే. 'లీల లేని వెల్తి చూచారా?' అంది ప్రసాదువైపు చూపుతూ హేమ.

'విద్యావతులకు వినయము ఉండదను వారు వట్టి వెఱ్ఱివారు. అందుకు నిదర్శనం నీవే హేమా' అంటూ హృదయాని కదుముకున్నాడు ప్రసాదు హేమను...... .....

భర్తృసేవాభాగ్యము లభింపజేసిన మోహానం వందనీయము. ఇప్పుడు హేమ కొక పుత్రిక కలిగినది. ఆ శిశువునకు లీలావతి పేరే పెట్టుకుంది హేమ.

---

## కాశీక్షేత్రమహిమ

రామసుబ్బారాయఁడు, బి.ఏ. & వెంకటనారాయణగార్లు

ఉ. గౌరినిగూడి యీశ్వరుఁడు కాపురముండిన వారణాసిభా
గీరథియొద్దనుణ్ గలదు కేవల మోక్షమునిచ్చు ఘోరసం
సారభయంబులన్ ఏలెఁచి స్వస్థతికూర్చు మనంబులోనన
వ్వారికినైన నానగరవైభవమున్ గొనియాడ శక్యమే?

ఉ. రంగగు కాశికాపురవరంబున నుండిన విశ్వనాథునిన్
బొంగిన భక్తిభావమునఁ బొంగఁగఁజేసి భజించినంతలో
లొంగును భక్తకోటులకులోఁగడ చేసిన పాపమంతయున్
గంగను గల్పిమోక్షమును గల్పనసేయును శాశ్వతంబుగన్.

గీ. విశ్వనాథునికన్నను పెద్దవేల్పు । కాశికాక్షేత్రమహిమంబుకంటె ఘనము
జాహ్నవీనదికంటె శ్రేష్ఠముగునదియుఁ । గానఁగారాదు జగతినెందైనఁగాని.

క. కాశీపురసంస్మరణము కాశీపురదర్శనమును కాశీపతియున్
కాశీపురవాసంబును కాశీమరణంబుముక్తిఁ గలుగఁగఁజేయున్.

# కవివాక్సిద్ధి

భు. పట్టాభిరామయ్యగారు, ఎమ్.ఏ., ఎల్.టి.

ద్వితీయాంకము—ప్రథమరంగము

[దాక్షారామమున సప్తగోదావరి యను తటాక తీరము.—నీటిం గొనిపోవుటకు బిందియలను చేబూని వసంతవల్లియు సుమతియు నితర స్త్రీలును బ్రవేశింతురు.]

మొదటిస్త్రీ:—ఆఱుసంవత్సరముల క్రిందట నిష్ఫలముగా బ్రాహ్మణులు బహిష్కరింపఁజూచిన పార్వతి యనునొక విధవ యైదేండ్ల కుమారునితో మఱలి యీ యూరికి వచ్చినదఁట.

రెండవస్త్రీ:—ఆయమ నేల విప్రులు బహిష్కరింపలేక పోయిరి ?

మొదటిస్త్రీ:—ఆస్త్రీ యూరలేమింజేసి నేరమునకు రుజువులేదని కొందరనిరఁట. మున్ను పార్వతికిఁ బురోహితుఁడుగా నుండి యా యమతో వాదులాడి మాన్పఁబడిన నరసింహమే యీ నిందకంతయుఁ గారకుఁడని మఱికొందరనిరఁట.

వసంతవల్లి:—ఔనమ్మా. ఆతని పేరాస, క్రోధము, పాముపగయు నితరులలోఁ జూడము. లోకమంతయుఁ దననే పురోహితునిగ నెన్నుకొనవలయునని యాతని కోరిక. ఆతని నెవ్వఁడైన నొల్లని యెడల వానికొంపఁ ద్రవ్వినాఁడన్నమాటే.

మొదటిస్త్రీ:—అట్లైనఁ దప్పక తానే తెంచి తన నిందఁ దొలఁగించి, పార్వతిని బహిష్కరింపఁజేయించజాలక పోయెనా ?

వసంతవల్లి:—తప్పక వచ్చెను. ఊరిలోఁ దనకున్న పలుకుబడి చేతను, తన వాగ్ధారాళము చేతను, సభలోఁ బెక్కువారికిఁ బార్వతిపై దురభిప్రాయముఁ బుట్టించె. వారేకగ్రీవముగ నాయమను బహిష్కరింపఁగోరిరి. ఈ తీర్మానము సభాసనాధిపతి వ్రాయ నిశ్చయించి, తాళపత్రమును, గంటమును చేబూను తఱి, గొప్పవింత యొకటి సంభవించె. సూరయ్యయను, నరసింహమునకును, వారి పక్షమువారి కెల్లరకు నకస్మాత్తుగా దృష్టిపోయె. సూరయ్య చేతి యాకును గంటమునుఁ బారవైచె. వారెల్లరుఁ గలవరపడి యిటునటుఁ బరుగిడ, వారి బోడితల లొండొంటితో ఢీకొనుచుండఁ జూచి పెద్దవారు నవ్వసాగిరి. అంతటఁ బార్వతిపక్షము వహించిన వీరశర్మ యది వారన్యాయముం జేసినందులకు భీమేశుఁడు సేసిన శిక్షయని చెప్పి, వారినెల్ల "స్వామియెదుట సాగిలఁబడి పశ్చాత్తాపము నొందుఁడీ" యని యెలుఁగెత్తి చెప్పె. ఈ శిక్షచే బుద్ధిఁదెచ్చుకొని వారట్లేచేసి భీమేశుని క్షమియింపవేడిరి. అంతట వారికి దృష్టి మఱుడవచ్చె. నాటినుండి నేటివరకుఁ బార్వతి పేరైన నుచ్చరింప వెఱచుచున్నారు.

సుమతి:—అవును కాని యా దుష్టుఁడగు నరసింహము రహస్యముగ నిప్పటికిని బార్వతిని దూషించుచున్నాఁడనియే నానమ్మకము. ఈ యమయును సంవత్సరముల బాలుఁ డుండుటచే నాతని మాటలు బలపడును. [ఇతరస్త్రీలు నిష్క్రమింతురు.]

వసంతవల్లి:—అయ్యో! పార్వతి కట్టిగతి వాటిల్లె! ఇల్లాలు నాఁడుచి పిల్లలంబడసి లోకులచేఁ బెంపొందుచున్నది. విధవయగు కామిని యట్టి నైజ వ్యాపారము చేతనే, 'వివాహిత' యని లోకులిడిన చీటిలేమింజేసి, యపఖ్యాతి పాలగుచున్నది.

తే. భర్తనెన్నడు నెఱుగని-పడతియైన।
విధవయైనను, లేకున్న-సధవయైన।
కాంక్షలుండనె యొకరీతిఁ-గామినులకు?।
మానినుల దుఃఖమంతయు-మానుషికమె॥

భూమి బ్రద్దలయి నరసింహాదులగు మాయగాండ్ర నెల్ల నొక్కమాఱు దిగమ్రింగినయెడ బాగుండును!

సుమతి:—అయితే "బహుజన ప్రోక్తము భగవత్ప్రోక్తమే" యను లోకోక్తి నెఱుఁగవా? "పదుగురాడుమాట పాడియై ధరఁజెల్లుఁ" గదా ?

వసంతవల్లి:—జరిగిన వింతను నేఁ చెప్పఁగాఁ వినియు నీవింక నిట్లనియెదవా? వా రంధులగుట యజ్ఞానాంధకారసూచకము కదా?

[భారతి ప్రవేశించును.]

సుమతి:—వసంతా! నీకు సైతము కండ్లు పోఁగలవు. జాగ్రత సుమీ! ఈ విషయముంగూర్చి—అనఁగా, భారతి, పార్వతి కారోపించిన నిందను గూర్చి—మనము చర్చ మానివేయుటయే భద్రము.

భారతి:—నిందమాట యటుండనిమ్ము. ఆ కుఱ్ఱవానిం గాంచితిరా? నేఁ జూచితిని. ముద్దులమూట. భూమిపైఁ దప్పిపుట్టిన గంధర్వబాలకుఁడు. తల్లిఁ బోలలేదు. కావున వాని తండ్రి యెవరైన నేమి!! మంచి సుందరాంగుఁడై యుండవలయు. అయ్యో! నలువురి యెదుటఁ దన భార్యాపుత్రులు వీరే యని వారి నాతఁడు స్వీకరింపుటకు వీలులేదు గదా! ముగ్వురు సుఖపడుదురే!

వసంతవల్లి:—నరసింహ మనినట్లు, శివరాత్రి నాడు పార్వతి యింటనుండి తఱుమఁగొట్టిన యాత్రికుఁడా బాలుని తండ్రియై యుండునా?

సుమతి:—నేనామాట నమ్మను. మనము కోనెలకుఁ జనుచుండఁగా మనకుఁ గట్టెదుట నాతఁడు పరుగిడుచు వచ్చెను, జ్ఞప్తియున్నదా? వానికీ కుఱ్ఱవాని యెఱ్ఱదనము సౌందర్యమును లేవు. మఱియు నాతఁడు తఱుమఁగొట్టబడియె. అది యొక్కటియె చాలు నిది కల్ల యనుటకు.

వసంతవల్లి:—అతఁడు పరుగిడిన యరక్షణములో నిన్ని యంశములను నీ వెట్లు గమనింపఁ గల్గితివి?

సుమతి:—కోనెల ప్రాకారముపై నెన్నియో వరుసలుగ నమర్చఁబడిన దీపములుండె. వానివెలుఁగు చక్కఁగా నాతని మోమున భీతిని, గరుడి ముక్కునుం జూపె. మఱియు శృంగార చేష్టలను మీఱిన వయస్సుగలవాఁడుగాఁ గన్పడె నతఁడు.

వసంతవల్లి:—దీనిలో నెద్దియో మాయయున్నది.

భారతి:—రండి యిండ్ల కేగుదము. నేను శీఘ్రముగ నిల్లు సేరకున్నచో నా గయ్యాళి యత్తగారు నన్ను బ్రదుకనీయదు. [నిష్క్రమింతురు.]

## ద్వితీయాంకము—ద్వితీయరంగము

[సప్తగోదావరీతీరమున మఱియొక భాగమున బడిపిల్లవాండ్రిసుకపై నాడుకొనుచుందురు.]

మొదటికుఱ్ఱవాఁడు:—నేను క్రొత్తఁగా మన బడిలోఁ జేరిన కుఱ్ఱవానిం గూర్చి నీ యభిప్రాయమేమి?

రెండవకుఱ్ఱవాఁడు:—(అందరిలోఁ బెద్దవాఁడు) చాల మంచివాఁడు గాని, కొంత సిగ్గుచే నలుగురితోఁ జేర వెఱచుచున్నాఁడు. మనతోడి పిల్లవాండ్రు "నీతండ్రి యెవరురా?" అనియు, "తండ్రిలేనివాఁడా" అనియు వెక్కిరింతగాఁ గేకలువేసి వాని వెంటఁబడిరి. అంతట వాఁ డేడ్చుచు నింటికిఁబోయెను.

మూడవ కుఱ్ఱవాఁడు:—ఆ మాట యేమి? తిట్టా వెక్కిరింతయా?

రెండవ కుఱ్ఱవాఁడు:—ఏమో నే నెఱుఁగను, ఎవరో యా మాటనుఁ దిట్టుగా వాడఁగా విని మన వారందరు నట్లే యనసాగిరి. మాకు మాత్రమా కుఱ్ఱవానిపై జాలివేసినది సుమీ! కొంత మంచిమాటలాడి, యిక్కడకు వచ్చి మనతో నాడుమని యతనిని పిలచితిని. ఇదుగో చూడండి. మీలో యెవరైన వానిని వెక్కిరించినా, మఱి యేవిధమునైనను మనసు నొప్పించినా తింటారు దెబ్బలు నాచేత వీపుమీద. అదుగో వచ్చుచున్నాఁడు. భీమ! రా, రావోయి! ఇఁక నీవు మా తోడివాఁడవే. రా, చెడుగుడు ఆడుదాం.

[వారెల్లరుఁగలసి యాడుదురు. భీముఁడు ఎదుటివాని నొకని క్రిందఁబడఁద్రోయ నెల్లరు మెచ్చుకొందురు.]

మొదటికుఱ్ఱవాఁడు:—బలే! నీవు గట్టివాఁడవోయి! యింక నిద్దరిని పడఁద్రోచితివా, నిన్నే మేము మా నాయకునిగాఁ జేయుదుము.

మూడవకుఱ్ఱవాఁడు:—నీవు మంచి బలశాలి వోయి! ఉక్కుతీగలా గున్నావు. ఇదివర కీయాట చాలా మారు లాడావా?

భీముఁడు:—అయిదారుసార్లాడినాను.

రెండవకుఱ్ఱవాఁడు:—నేను చెప్పలేదా? వీఁడు మంచి దిట్టమయినవాఁడు. ఈలాటివాణ్ణి మనం పోగొట్టుకొనఁ గూడదు. సరేకాని నీ వెందుకు ప్రొద్దున నేడుస్తూ యింటికి వెళ్ళినావు?

భీముఁడు:—ఎందుకా? కొందరు కుఱ్ఱాళ్ళు నన్ను దుర్భాషలాడి వెంటఁబడి యెగతాళి చేశారు.

రెండవకుఱ్ఱవాఁడు:—సరే, దానికేమి? అది మామూలే. క్రొత్తగావచ్చిన వాళ్ళ నందరిని యీలాగే బాధపెట్టుతారు. నే నొకటి చెప్తా, విను. ఈమా రెవరైన నీ జోలికొస్తే, ఎడాపెడా నాలుగు వాయించి పంపించు. మఱి నీ కేబాధయుండదు.

భీముఁడు:—అలాగా? సరే. రే పెవరైనా నా జోలికొస్తే అలాగే చేస్తా.

[నరసింహము ప్రవేశించును.]

నరసింహము:—ఏమఱ్ఱోయి! కుఱ్ఱాళ్ళూ! ఈ గుంటణ్ణి మీతో యెందుకు చేరనిచ్చారు? తోశే యండి మీ జట్టులోనుండి. వాణ్ణి ముట్టుకొన్నైన ముట్టుకోకండి. చండాలుని కంటె వీఁడు చెడిపోయినవాఁడు సుమీ.

మొదటికుఱ్ఱవాఁడు:—ఎందుకండీ?

నరసింహము:—అతఁడు గోళకుఁడు.

మూడవకుఱ్ఱవాఁడు:—'గోళకుఁ' డంటే?

నరసింహము:—వానికి తండ్రిలేఁడు.

రెండవకుఱ్ఱవాఁడు:—లోకంలో అందరికి తల్లిదండ్రులుండఁగా వీనికి తండ్రిలేకపోవడ మేమిటండీ?

నరసింహము:—అంటే, అతని తల్లి విధవ. తండ్రి యెవరో యెఱుఁగఁడు.

మొదటికుఱ్ఱవాఁడు:—అలాగైతే మా అమ్మ విధవావిడే. మా నాన్నగారిని నే నెఱుఁగను. అయితే నేను గోళకుణ్ణేనా?

మూడవకుఱ్ఱవాఁడు:—మా నాన్నగారు చాలా రోజులక్రిందట పోయినారఁట, నేనూ గోళకుణ్ణే?

నరసింహము:—[స్వగతము.] అన్నా! యీ గుంట వెధవలు నన్ను పట్టుకుని యెలా అడ్డుదిడ్డుగా ప్రశ్నలు కురిపిస్తున్నారో! పెద్దలమాటలను మఱి మాటాడక కుఱ్ఱాళ్లునమ్మేరోజులు పోయాయి! [ప్రకాశముగా,] యీ కాలపు కుఱ్ఱాళ్ళకు పెద్దల యెడ మర్యాద పిసరైన లేదుగదా! అతఁడు గోళకుఁడు, అతణ్ణిచేర్చుకోవడం మంచిది కాదన్నాను, యిఁక నమ్మడమే మీ వంతు. ఊరికే అధికప్రసంగంచేసి, అడ్డువాదములుచేస్తే మీతల్లిదండ్రులతో చెప్పి మిమ్మందరిని చావఁదన్నిస్తా, చూస్కోండి.

అందరు:—ఓహోహో! మాట నిలుపలేక పోయాఁడఱ్ఱోయి!

నరసింహ:—[మూడవకుఱ్ఱవానిం బట్టుకొనును.] గుంటవెధవ! నాతోనట్రా మీ హాస్యాలు? [అని కొట్టఁబోవుచుండఁగా రెండవకుఱ్ఱవాఁడు నరసింహము నవతలికి త్రోసివేయును.]

రెండవకుఱ్ఱవాఁడు:—ఏమయ్యోవ్! అతనిమీద వేలేశావా, చూడు!! పిలువని పేరంటమునకు రావడ మేమి? మమ్మల్నందరిని యిలా బాధపెట్టడ మేమి?

నరసింహం:—పోకిరి వెధవల్లాలా! ఏమిటో చూస్తారుగా. [నిష్క్రమించును.]

భీముఁడు:—క్షమించండి. యిహ నేనింటికి వెళ్తాను. నావల్లనేగదా మీ యాటకు భంగము. మీ కింత చికాకు కల్గినది. ఇంకా మీ తలిదండ్రులు మిమ్మను శిక్షించిరా, నాకు మఱెంత దుఃఖముగల్గును.

రెండవకుఱ్ఱవాఁడు:—అబ్బే, యీ పుల్లయ్యను చూస్తే మాకు గవ్వెత్తు లక్ష్యములేదు. అతనిని మే మాడించడ మిది మొదటిసారి కాదు. ఇదివర కెన్ని మారులో అతని ముక్కుపొడుము పీల్చడమూ, అతని దొడ్డికాళ్ళ నడకనూ, వెక్కిరించినాము. అతణ్ణి చికాకు పెట్టడమంటే మాకు సరదా.

భీముఁడు:—ఏమైనా కానిండు, నేటిమట్టుకు నన్ను క్షమించాలి. నాకు ఆటమీద బుద్ధిపోలేదు.

[నిష్క్రమించును.]

రెండవకుఱ్ఱవాఁడు:—మామంచి ఆటకాఁడు. ఈ ఈబుఱ్ఱముక్కవాఁడు మధ్యరాకపోతే, మాంచి సరదాగా ఆట జరిగియుండును. ఎప్పుడు ఊరికే ఒకరి పనులలో వేళ్ళుపెట్టడమే వాని స్వభావము. ఎప్పుడో ఒకప్పుడు వీడికి బుద్ధిచెప్పాలఱ్ఱా. మీరందరు సాయపడితే, ఎత్తువేస్తా.

అందరు:—భేష్! కానీ, మేమందరము నీతో పనిచేస్తాం.

రెండవకుఱ్ఱవాఁడు:—భీముఁడు యెంత మంచి మనస్సుగలవాఁడో చూడండి. అయితే అతనికి కోప మెక్కువ. అయ్యో! నిష్కారణముగా అతని మనసును నొప్పింగల్గినది గదా! అలా అతని కాయాసము కల్గకుండుటకే మొట్టమొదట మీ రెవ్వరు అతనిని పల్లెత్తుమాట అంటే నే నొప్పనన్నాను.

మూడవకుఱ్ఱవాఁడు:—సరే! ఆట యెలాగూ తగులడిపోయింది. కాబట్టి అందరం ఇండ్లకు వెళ్ళుదాము రండి.

[నిష్క్రమింతురు.]

## ద్వితీయాంకము—తృతీయరంగము

[పార్వతియొక్క పూటకూళ్ళయిల్లు. పార్వతి ప్రవేశించును.]

పార్వతి:—నన్ను కులమునుండి బహిష్కరించుటకొఱకా రాక్షసుఁడు నరసింహముపన్నిన పన్నుగడలనన్నింటిని శ్రీ భీమేశుఁడు నిజప్రభావముచే భంగపఱచె. నేను పెక్కుసంవత్సరము లీ యూరనుండి వెడలిపోయియుంటిని. అయినను నరసింహమునకు మా యిరువురిమీదను క్రోధము తగ్గలేదు. అతని ప్రోత్సాహముచే బ్రాహ్మణు లెవరు నాయింట భుజింపనొల్లక రావడము మానివేసిరి. నేను నిరపరాధినని శ్రీభీమేశుఁడే యెఱుంగును గాని, ఎవ్విధమున లోకమున కీ వార్త తెలుపఁగలఁడు? కలియుగమున లోకము పాప భూయిష్టమై యుండుటం జేసి, యమరులు మర్త్యులతోఁ మాట్లాడుట మానివేసిరి. అయిన నేమి? తప్పుల శిక్షించుటకు వేల్పులకు పెక్కుమార్గములు గలవు.

వారి చిత్తానుసారము జరుగుఁగాత

గీ. సర్వసామర్థ్యముం గల-శర్వముఖులు।
వేయిభంగుల నిల నెర-వేర్పఁగలరు।
వారి సంకల్పముల, గాన-వచ్చినట్టి।
పొల్లు వొందదు బాపుతఁ-బురహరుండు॥

[వెక్కివెక్కి యేడ్చుచు భీముఁడు ప్రవేశించును.]

ఏమిరా? తండ్రీ! ఏల యేడ్చెదవు?

భీముఁడు:—అమ్మా! నేను గోళకుండనా? నిజముచెప్పుము. చెప్పితీరవలయును. లేదా, మన యెడఁబాటు తప్పదు. పెద్దపిన్నలెల్ల నన్నుఁ బరిహసించుచుండఁగా నే నిటఁ బ్రతుకలేను. ఆ పురోహితుని జోలికి నేఁ బోకున్నను, సదా నా స్నేహితులతో నన్ను విధవాపుత్రుఁడనియు, గోళకుఁడనియు, గాన మచ్చగల జననముచేఁ దగువారిమధ్యఁ జరించుటకుఁ దగననియు, నిందించుచున్నాఁడు. ఆ మచ్చ యెద్ది? నే నెన్నిమాఱులో నిన్నడిగినను యేల చెప్పక దాఁచెదవు? ఇప్పుడు చెప్పెదవా సరే! లేకున్న నీ పుత్రునిఁ గోల్పొవుమ్మ.

పార్వతి [తనలో] చిరకాలము నే భయపడినట్లే నేఁడీపడుగుపడినది. వీనినిఁ బాయలేను. కావున నిజముఁజెప్పెద.

భీముఁడు:—ఏమమ్మా? ఇంకను చెప్పవుగా?

పార్వతి:—నిన్నుఁబాసి యుండఁగలనా? తండ్రీ, కావునఁ చెప్పకతప్పదు. నే నెఱుఁగకముందే నా భర్త చనిపోయె. విధవనైన నేను వేములవాడనుండి యిటకువచ్చి పూటకూళ్ళయింటిచే జీవించుచుంటిని. ఒకదిన మొక సాముద్రికుఁడు భోజనమునకై వచ్చి, నా చేతింజూచి, నే నొకపుత్రునిం బడయుదునని చెప్పెను. అంతట నేను కోపముతో నాతని వెడలఁగొట్టితిని. ఆ దినము శివరాత్రి గాన నేను స్నేహితురాండ్రతో శ్రీభీమేశుని దర్శనార్థము కోవెలకుం జనితిని. నేను స్వామిని బూజించునపుడు పుత్రవాంఛయే నా మనము నాకర్షించి విడదాయె. సాముద్రికుని మాట నాటియుండుటచేతనో, మఱి

యే కారణముచేతనో, నే నెఱుఁగ. మగుడ నే నింటికివచ్చినవారలకు భోజనమిడి నడిరేయిని పరుండ నెంచుతఱి నొకవింత జరిగె. గదిలో వెలుగుపుట్టె, శివుఁడు నాకు దర్శన మొసంగె; నెట్లన.

సీ. శిరమునందల్ల ఘూ-సరజటావళితోడ
జాహ్నవితో బాల-చంద్రుతోడ।
స్ఫటిక దేహముపైని-భస్మ లేపనముతో
వ్యాఘ్రేభచర్మముల్-వస్త్రములుగ।
నీలకంఠంబుతో-ఫాలనేత్రమ్ముతో
శూలంబు రుద్రాక్ష-మాలతోడ।
హారావళిగ మెడ-నహిరాజ పంక్తితో
పాగోర్లు తొడిగిన-పదముతోడ।
గీ. దేహముననుండి వెలువడ-దివ్యరుచులు।
కరుణ చిప్పిలుచుండెడి-కనులతోడ।
నభయహస్తముఁ జూపుచు-నా దరమున।
కామితంబిడ వచ్చె నా-స్వామి యంత॥

ఆతఁడు భీమేశుఁడే యని గుర్తింపఁగల్గితిని. ఇతరులకు భీతిగల్గియుండునేమో గాని నేను నిర్భీతిగా దగ్గరఁజేరితిని. ఆతఁ డభయహస్తముతో నా శిరమునంటె. నా దేహము గగుర్పాటొందెను. నిన్నునే గర్భమున ధరించితిని. ఉత్తరక్షణమున నా దివ్యమూర్తి తిరోహితుఁడయ్యె. గది మునుపటి వలె చీకఁటిగనుండె. కావున నీ తండ్రి శ్రీభీమేశుఁడే. లోకు లీ వృత్తాంతమునమ్మరని యింతవర కెవ్వరితోడను నే నిది చెప్పనైతిని గాని శ్రీభీమేశుని పాదములాన. ఇది సత్యము. నీవు దేవపుత్రుఁడవు!! నా గర్భము బయలుపడఁగా, భగవన్మహిమ యందుఁ సైతము నమ్మకములేని లోకులు నన్ను జారిణి యని దుర్భాషలాడఁ దొడంగిరి. అంతకు ముందే నాయెడ ద్వేషముంబూనిన యా తుచ్ఛపురోహితుని ప్రేరణచే నిప్పురమునందలి విప్రులెల్ల నన్ను బహిష్కరించుటకై దేవాలయమున సమావేశమైరి. అంత నతివింతగ నా పగవారికెల్లను దృష్టిపోయె. భీతిచే వారెల్లరు నిటునటుఁ బరుగిడి క్రిందబడుచుండిరి. కొందరు పశ్చాత్తాపమొంది మగల దృష్టిఁ దెచ్చుకొనిరి. కాని, నరసింహము మాత్రము పట్టినపట్టిప్పటికిని వదలకున్నాఁడు. పెక్కుసంవత్సరము లీయూరువదలి యుండి యిన్నాళ్ళకు మరలి వచ్చినను. నాపై నాతని క్రోధము తగ్గదాయె.

భీముఁడు:—అమ్మా! ఈతనికి నీయెడ నింత ద్వేషముండుటకుఁ గారణమేమి?

పార్వతి.—మున్ను నా కీతఁడే పురోహితుఁడుగా నుండె. ఒకదిన మొకవ్రతము చేయించుచుండ, యింకను పెక్కుయింట్ల కేగవలసియుండెను కాఁబోలు, మంత్రము లనేకములను వదలివేసెను. నేను వైదికకర్మల నెఱిఁగినదాననగుటంజేసి యాలోపముం గనుపట్టి, యాక్షేపించితిని. అంత నాతఁడు నాతో సరససల్లాపము లాడం జూచె. నే నతని నేవగించి, మఱి నా యింటికి రావద్దనిచెప్పి, వేరొక పురోహితుని నియమించితిని. నాటినుండి నన్నాతఁడు బాధపెట్టుచున్నాఁడు.

భీముఁడు:—అమ్మా! నే నిప్పుడే కోనెలకుం జని, నన్ను నిజసుతునిగఁ బ్రకటింపుమని శ్రీభీమేశుని వేడెద. నా ప్రార్థన నద్దేవుఁ డియ్యకొనినచో లెస్సయే, లేనిచో నే నాత్మహత్యఁ గావింతును నమ్ముము. ఈ యవమానము నే సైపఁజాల. సెలవిమ్ము [తల్లికి నమస్కరించి బిరబిర నిష్క్రమించును.]

పార్వతి:—[కేలుమోడ్చి శ్రీభీమేశునెంచి ప్రార్థించును.]

కం. కావవె పట్టిని దయతో।
కావవె యపనిందనుండి-కాలగళ! యిలన్
నీవే దీనుల దైవము।
నీవే నాపతియు గతియు-నిక్కము భీమా॥

[తెరపడును.]

ద్వితీయాంకము—చతుర్థరంగము

[శ్రీభీమేశుని యాలయమున గర్భగృహము, తాళము గడియలువేసిన ద్వారము తనంతట తెఱచికొనును. నుతితో భీముఁడు ప్రవేశించును. వెంటనే

తలుపులు మూసికొనును. దీప మారిపోవును. గది యంతయుఁ జీఁకటిగనుండును. భీముఁడు వెదకుచు లింగముయొక్క పాదము నాలింగనము చేయును.]

భీముఁడు:—శ్రీభీమేశా! నీవే నాతండ్రి వని యమ్మ ప్రమాణముఁజేసి చెప్పుచున్నది. అట్లయినచో, నీవే సర్వలోకనాథుఁడ వయినచో, నాపుట్టుకతో సంబంధించిన యపనిందనుఁబాపు. నిశ్చింతఁగా బ్రతికి నిన్నుం గీర్తించునట్లు నా కనుగ్రహించుము. నా జననియే యనృతమాడినచో నెంటనే యాయమం జంపివేయుము. నీవే నాజనకుఁడైనచో నాతో మాటలాడి, నేను నీ పుత్రుఁడనని లోకులు నమ్మునట్లు నిదర్శనముల నొసంగుము. మఱి యొకదినమైనను నే నీయవమానము తాళఁజాల. ప్రొద్దుపొడుచుటకు మున్ను నా ప్రార్థన నీ వంగీకరించితివా, సరే. లేకున్న నీ సన్నిధితో లింగమును బ్రద్దలుగొట్టి, నీ పానవట్టముపైనా తలను మోదుకొని చచ్చెద. నమ్ముము.

[ఉన్నట్టుండి యాగదిలో వెలుఁగుపుట్టును. లింగమునుండి శివుఁడు మున్ను పార్వతికిఁ గన్పడినట్లు కన్పడి భీముని శిరముపై దక్షిణహస్తము నుంచును.]

భీమేశుఁడు:—సంశయములేదు. నీవు నాసుతుఁడవే. నీవు గొప్పకవియు వాక్సిద్ధుడవు నగుదువు. నీవు నుడువునదెల్ల సంభవించుటచే నిన్ను దూషించెడివారు సైత మిఁక నిన్ను భూషింతురు.

[భీమేశుఁ డదృశ్యుఁడగును. వెలుఁగుపోవును. భీముఁడు మూర్ఛిల్లిపడిపోవును. కోడికూయును. ప్రభాతపూజకై శంకరము ప్రవేశించును.]

శంకరము:—పెక్కుసంవత్సరము లనుదినము నే నిటఁ బూజఁజేసితిని కాని, నేడు నా మనమునకున్న కలత యెన్నడును నాకుఁ గలుగలేదు. ఒడలు కంపించెడిని. దేహమున గగుర్పాటు వొడముచున్న యది. భీతియా? కేవలము భీతియుంగాదు. స్థూలరూపము లేక, మర్త్యులకగోచరుఁడైన పరమాత్ముని సన్నిధి యందున్నట్లు మనమున నాటె, యీవింత శక్తిం జూచి యచ్చెరువొంది, "నీ ప్రేమోల మర్త్యాధముల బ్రదుకెంత? ప్రభావమెంత? పరాత్పరా" యని ప్రణమిల్లుట తప్ప వేరుగతి గాన్పించదు.

[భీముని దేహమునకుఁ గాలుతగిలి శంకరము] పడును. భీముఁడు మేల్కాంచును.]

ఓహో! దొంగ! దొంగ! యిచ్చటనున్న హేమ పాత్రాభరణంబులు దస్కరింప వచ్చినాఁడు అయితే యీ పెద్ద తలుపులకు జాగ్రత్తగా మూడు తాళములువేసి నిన్న యింటికేగి, యిప్పుడే గదా వచ్చి తెరచితిని! విలువగల వస్తువుల నపహరించుటకై వీడు నిన్నసాయంకాలముననే లోపల దూరి యుండవలయును. [భీముని తన్నును] ఓరీ! లెమ్ము. ఎటుల లోనికి దూరితివి? ఏల వచ్చితివి? చెప్పుము.

భీముఁడు:—[అవులించుచు లేచి]

ఆ.వె. శర్వ నుతుండ, నన్‌-సత్కరించనియెడ।
శాపంబు నిడఁగల-జాగ్రత సుమీ॥

శంకరము:—ఛీ! ఛీ! దొంగా! లెమ్ము! పొమ్మవలికి. [భీమునిఁ గొట్టుటకై శంకరము చేయి నెత్తును కాని మరల క్రిందికి దింపలేకుండును. మాటాడ నశక్తుఁడగును.]

భీముఁడు:—

ఆ.వె. చేసిన తప్పుకు-జింతనొందితివేని।
చెచ్చెర విడును నీ-జిహ్వ మాటాడ॥

శంకరము:—[మరల నోరువచ్చి] బాలమహాత్మా! అపరాధము క్షమియింపుము. నిశ్చయముగ నీజననము లోకాతీతమైనదియే.

భీముఁడు:—నీ వేగి యా మూఢులకు బుద్ధిఁ జెప్పుము.

శంకరము:—దేవపుత్రా! మహానీయా! నన్ను మాత్రము గరుణతోఁ జూడుము. నే తప్పక వారికి బుద్ధిఁజెప్పి నీప్రభావమును లోకమంతయుఁ జాటెద.

[భీముఁడు శిరమూపును. తత్తరపాటుతో శంకరము పారిపోవును.]

భీముఁడు:—

తే.గీ. ఇంత శీఘ్రము సిద్ధించె-నీశువరము।
ఫలితమొందెడి నేఁబల్కు-పలుకులెల్ల।
తెలుపఁగల మత్ప్రభావంబు-దెల్లముగను।
వైరులను నిమిషంబున-వంచఁగలను॥

[నిష్క్రమించును.

ద్వితీయాంకము—పంచమరంగము

[సూరయ్య యింటిచావిడి—పెక్కుబ్రాహ్మణులకు విందు—నరసింహము, రామయ్య, సత్యనారాయణ, వీరశర్మయు 'వడ్డన యందినదా ?' యని పంక్తి విచారణ సేయుచుందురు. సూరయ్య యెల్లరకాతిథ్య మొసంగి జారీచెంబునుండి నేయి వడ్డించుచుండును.]

నరసింహము:—మహనీయులారా! వడ్డన అయినది. ఇంక మీ రందరును పరిషేచనము సేయుఁడు. [చేయుదురు.] బ్రహ్మార్పణమస్తు [నీరువడ్డించును.]

సూరయ్య:—భుజింపఁ బ్రారంభింపుఁడు.

నరసింహము:—బిడియము మాని తృప్తిగా భుజింపుఁడు. కావలసినదియెల్ల మీ రడిగి వడ్డింపించుకొనుఁడు. మన సూరయ్యపంతులుగారి మితిలేని యన్నదానము మీ రెఱుంగుదురు గదా? [సూరయ్య చిరునగవు నవ్వును.]

మొదటిబ్రాహ్మణుడు:—కొంత సూపమండోయి.

రెండవబ్రాహ్మణుఁడు:—అయ్యా కొంత నెయ్యిలా తెప్పించండి.

మూడవబ్రాహ్మణుఁడు:—పులుసు కూరలండోయి!

నాల్గవబ్రాహ్మణుఁడు:—నాకు ............

[ఎవరో తలుపుతట్టఁగా, నరసింహము కొద్దిగా తెఱచిచూచి చప్పునమూసి ఘడియవేయును.]

నరసింహము:—అదుగో! ఆ గోళకుఁడు లోపలికి వచ్చుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు.

నాల్గవబ్రాహ్మణుఁడు:—అభ్యాగతిగా వున చండాలుఁడయిన నాతని లోనికి రమ్మనవలయును.

నరసింహము:—అయ్యా! తమరు శాస్త్రము లెచ్చట నేర్చితిరి?

నాల్గవబ్రాహ్మణుఁడు:—కాశిలో.

నరసింహము:—శాస్త్రము లటుండఁగా బ్రాహ్మణ్యము పరువు నిలుపుకొనవద్దా? ఆ విధవాపుత్రునితో సహపంక్తి భోజనమా? బాగు! బాగు!

[కొద్దిమంది భీముని లోనికి రమ్మనుమనియు, నితరు లతను రాకూడదనియు గేకలువేయుదురు.]

సూరయ్య:—అతని రానీయకుండుట మంచిపని. (నేపథ్యమున భీముఁడు పాడుచున్నాఁడు.)

ఆ.వె. అప్పములన్నియుఁ—గప్పలగుఁగాక!
అన్నమంతయు నిఁక—సున్నమగుఁగాక॥

[బ్రాహ్మణుల విస్తళ్లయందలి యన్నము సున్నమై యప్పములు గప్పలై గంతులేయును. అందరు భీతిల్లి లేవఁగా నల్లరిగ నుండును.]

నరసింహము:—దయచేసి యెల్లరుఁ గూర్చుండుఁడు. అంతయు బాగుపడును.

నాల్గవబ్రాహ్మణుఁడు:—అయ్యా! మీ తెలివి తక్కువకై మే మందఱము భోజనములేక పోవలయునా? పరువుగల బ్రాహ్మణులు సున్నమునుఁ గప్పలనుఁ దినవలయును కాఁబోలు!

అయిదవబ్రాహ్మణుఁడు:—ఆ కఱ్ఱవానియందు నీకున్న ద్వేషమునకు మితిలేదా? ఆనాడు దేవాలయమున మా కంటికి చూపుఁ బోగొట్టనుంటివి. ఆ బాలకుని కేదైయో భగవద్బలమున్నది. మొన్న కోనెల పూజారి శంకరమునకు నిట్టి వింతయే సంభవించెను. ఈతనికి వాక్కుఫలించెడి ప్రభావము గలదు. అన్నదియెల్ల వెంటనే యయితీరును.

నరసింహము:—అయితే మీ రందరుండి భోజనము సేయుఁడు. నే నుండఁజాల.

సూరయ్య:—[నరసింహమును పట్టి యాపి] మహనీయులారా! దయచేసి కూర్చుండుఁడు. మీలోఁ గొంద రభిప్రాయపడిన ట్లతనికి దివ్యప్రభావముండి, యీ మార్పు లా బాలుఁడు నుడివినదాని ఫలమే యయినచో, మన మిప్పుడే పరీక్షచేయవచ్చును. భోజ్యములకు మఱల నిజరూపము లిచ్చినచో నాతని లోనికి రమ్మందము. ఎవరయిన నాపేర నాతని వేడుఁడీ.

[వీరశర్మ వేవేగము తలుపుకడకేగి, భీమునిం దోడ్కొనివచ్చును.]

భీముఁడు:—

గీ. చెంద నానందము నాకు—డెందమిపుడు!
ముందువలె మార్పుభోజ్యము—లొందుఁగాత॥

[మరల నాకులయం దన్నము నప్పములుఁ గన్పించును. నరసింహమున్నూ సూరయ్యయున్నూ నమస్కరింతురు.]

సూరయ్యా:—క్షమింపుము, మహనీయా! నా యుపాధ్యాయుని మాటవిని నే నిట్లు వర్తించినాఁడ. తమరు పలుమారు నా యింటికి దయచేయుటయే నా ప్రార్థన.

భీముఁడు:—నిన్ను క్షమియించితిని.

నరసింహము:—నన్నుంగూడ దయతోఁ జూడుఁడీ.

భీముఁడు:—

గీ. నాదు జననియు, నేను నీ-నాల్క చేతఁ |
బడితి మపనిందలను; గాన-పలుకులేక |
మూగవై యుండు, మిఁక నీకు-బుద్ధివచ్చు, |
నితరులకుఁ గల్గరాదిట్టి-వెతలు సుమ్మి ||

[నరసింహము మాటాడ నేరఁడు. ఇతరులు భీతిల్లి యొండొరులను మించి భీమునకుఁ బరిచర్యలంజేయఁ దొడంగుదురు.]

భీముఁడు:—

ఉ. డాంబిక విప్రులార వినుఁడయ్య-
మదీయచరిత్ర, నాదు జ |
న్మంబున మచ్చలేదు గురు-
మానిని కన్యయు నాదుమాత నే |
సాంబకటాక్ష లబ్ధుఁడను-
సంశయ మేల? కవీశ్వరుండ, నా |
యంబుజ గర్భువాక్కువలె-
నన్నదియెల్ల ఫలించుఁజూడుఁడీ ||

ఎల్లరు:—ఈశపుత్రా! జయజయ! [భీముఁడు భోజనము చేయును.]

నాల్గవబ్రాహ్మణుఁడు:—ఈతని తల్లినిఁగూడ పిలిపింతము. నరసింహశాస్త్రి వెళ్లి పిలచిన బాగుండును.

సూరయ్యా:—నరసింహం! నీవుచని యాతని తల్లినిం దోడ్కొనిరమ్ము. అట్లు చేసినచో నాతఁడు నీపై దయగల్గి మరల మాటాడుశక్తి నొసఁగునేమో.

[ఏడ్చుచు నరసింహము నిష్క్రమించును]

నాల్గవబ్రాహ్మణుఁడు:—మనము కోనెలలో మఱియొక సభఁజేర్చి, జరిగిన యపచారమునకు క్షమాపణఁ బొందవలయు.

మొదటిబ్రాహ్మణుఁడు:—కోనెలపూజారి శంకరునను తోఁజూచినవింత నెల్లరకుం జెప్పుమందము.

మూడవబ్రాహ్మణుఁడు:—ఇప్పుడిచట లేనివారికిఁ దెలియుటకై యీ వింతఁగూడఁ బ్రకటింతము.

రెండవబ్రాహ్మణుఁడు:—కోనెలలో శాశ్వతముగఁ బ్రకటితమగునట్లు శిలపైఁ జెక్కించిన బాగుండును.

సూరయ్యా:—భేష్! మంచి యాలోచన. బ్రాహ్మణోత్తములారా! మీరు వెడలిపోవుటకు మున్ను యీవిషయము వినుఁడు. రేపు సాయంకాలము శ్రీభీమేశుని యాలయమున నీ యూరిబ్రాహ్మణ్యము సమావేశమగును. వెట్టివానిద్వారా మరల ప్రకటించెద. రాతిపైఁ జెక్కించడము నా ఖర్చునఁ జేయించెద.

[నరసింహముఁ బార్వతియుఁ బ్రవేశింతురు.]

సూరయ్యాయు, నరసింహమున్ను ఆ యమకు సాష్టాంగదండప్రణామ మాచరింతురు తరువాత పార్వతికి తృప్తిగ భోజనమిడుదురు]

పార్వతి:—నాపై నిందతొలఁగినది. శ్రీభీమేశుని ప్రాభవము వెల్లడియైనది. క్రోధము వహించుట భగవంతుఁడు మెచ్చఁడు గావున నరసింహమును క్షమించి, యాతనికి మాటాడు శక్తినిమ్ము. మాట చేత నతఁడు ప్రాయశ్చిత్త మొనర్చుకొనఁగలడు.

భీముఁడు:—అమ్మా! నీ యభీష్టము నెరవేర్చెద. నరసింహ, మాటాడుము.

నరసింహము:—[కేలుమోడ్చి నమస్కరించును.] అబ్బయీ! నీకు హృదయపూర్వకవందనములు. మున్ను నిన్నుఁదిట్టిన యీ నాలుక యిటుపై నీకీర్తిం బ్రకటించఁగలదు. నాయహంభావము నీవలననశించె. మున్ను క్రోధమే నా కన్నోదకతుల్యముగ నుండెను. ఇప్పుడు నీ మూలముగ నా యజ్ఞానాంధకారము తొలఁగెను. మనుష్యుని భగవత్సన్నిధికిం జేర్చునది ప్రేమయేయనియు, కావున నది క్రోధముకంటె నుత్కృష్టమనియుఁ దెలిసె. ఇటీవల వెరగిన యద్భుతములు నాకండ్లు దెఱచినవి.

కం. భీమేశుని తిరునామము
కామాద్యరిహరము, మఱియుఁగలుషహరంబున్ |
భీమేశునిఁ గీర్తించినఁ
గామితఫలసిద్ధిమనకుఁ-గల్గును సుండీ||

జయజయ శ్రీభీమేశా! [తెరవ్రాలును.]

# "చెలిమియా—బలిమియా"

చదువుల రామచంద్రయ్యగారు, బి. ఎ.

[స్త్రీ స్వాతంత్ర్యమున కునికిపట్టనదగిన పాశ్చాత్యదేశములందుగూడ స్త్రీలకు కించిత్తయిన స్వాతంత్ర్య మివ్వకూడదను సంకుచితస్వభావము లుండెడివి. భర్త పలుబాధలు పెట్టినను పల్లెత్తు మాటాడని భారతీయసతీమ తల్లులవంటి మానినీమణులుగూడ నుండెడివారు. దాని కొక నిదర్శనము]

తుపాను వచ్చుటకు మున్ను ప్రశాంతముగనున్న పారావారమువలె మరునాటి సంగ్రామమునకై పరాసుసైన్యము శాంతముగ విడిసియుండెను. దుర్భర దారిద్ర్య దవానలపీడితమైన కుటుంబమున జన్మించి స్వయంప్రతిభా ప్రభావముచే సైనికోద్యోగమున ప్రవేశించి సైన్యాధీశుడై యూరోపాఖండమున నిరంకుశ రాజ్యపాలనములనెల్ల గడగడ లాడించి పరాసు సామ్రాజ్యశ్రీయ సార్వభౌముడైన నెపోలియన్ ఆ సైన్యాధినాథుడు. అరేబియాదేశపు టుత్తమాశ్వముపై సామాన్య సైనికనాయకుని దుస్తులతో, నిరుగెలంకుల సైన్యాధీశులురా, రానున్న సంగ్రామవిషయమై ముచ్చటించుకొనుచు, నా సార్వభౌము డొకచో పోవుచుండెను. అత్యంత సుందరీవతంసమగు నొక వనిత సుందరుడగు ముద్దుగుఱ్ఱ దోడ్కొని, వెక్కివెక్కి యేడ్చుచు దుఃఖముతో వాడిన మోముతో నెట్టవారిన నయనములతో నెదురయ్యెను.

ఆమెముఖ మాతని హృదయమును గలచివైవ దయాంతఃకరణుడై వెంటనే తన గుఱ్ఱమునాపి, యామెతో, భాషించెను.

"అమ్మా! ఎందుకిట్లు దుఃఖించుచున్నావు?"

... ............ .....

"నిన్నెవరు బాధించిరో చెప్పవేమి?"

"నాన్న కొట్టినాడు, అమ్మ ఏడుస్తోంది" అని యామెవెంటనున్న బాలుడు తేనెలొలికించెను. ఆ బాలకుని మాతృభక్తి కత్యంతాశ్చర్యానందమగ్నుడై మరల నాతనితో, "మీనాన్న ఎక్కడ?" అని ప్రశ్నించెను.

"అగో! చూడు. అక్కడ మానాన్న సామాను కాపలా కాస్తూఉన్నాడు!" అని వచ్చియు రాని మాటలతో ప్రత్యుత్తరమిచ్చెను.

చక్రవర్తి యంత నామెవంక దిరిగి, "అమ్మా ఆతని పేరేమి?" యని ప్రశ్నించెను.

ఆమె మాటాడదయ్యెను.

"విచిత్రము! భర్త బాధింప దుఃఖించుచున్నావు, పేరడిగిన తెలుపవు! తప్పు నీదై యుండవచ్చునా?"

ఆపల్కు లామె కధిక దుఃఖము గల్గింప "స్వామీ! నాయెడ కించిత్తయినను నేరము లేదు. నాభర్త సర్వసద్గుణుడు. ఐతే అతడీర్ష్యాళువు. ఆపిశాచ మావేశించినపుడూరక నన్ను బాధింపుచుండును. ఐననేమి? నాకతడు ప్రణయనాథుడు. ఈ ముద్దుకుఱ్ఱ

కనుంగుతండ్రి'' యని యూ దుఃఖముతోడనే యూ బాలుని ముద్దాడెను.

"సాధ్వీ! నీ తీర్పు వందనీయము. నీ చరిత్ర సంస్మరణీయము. నీ కివే మా నమస్సులు."

ప్రశ్నించిన యాతఁ డొక్క గొప్ప సైనికోద్యోగియనియు తన విభునామము తెలిపిన భర్త దురంతమునకు శిక్షించుననియు దలంచి యూ మానవతి పతినామము తెలుపకనే యూరోటు పీడెను.

ఆ సద్గుణరాసిచేష్ట కద్భుతానంద మనస్కుఁడై తన చెంతనున్న వారితో "చూచితిరె గదా! ఇట్టి మానినీమణులు టులరీస్ * రాజభవనమున నెందరోలేరు. ఇట్టి సతీమణిని బడసినవా డెంత ధన్యుఁడో'' అనుచు తక్షణ మావిషయమును విచారించి, యామె భర్త నామమును దెలిసికొని, యాతఁ డెపుడు చక్రవర్తిని జూచియుండలేదని విని యతనిని తనయొద్దకు పిలిపించెను.

అపారసామ్రాజ్య ధురంధరుఁడై మరుదినము జరుగబోవు మహాసంగ్రామమున జేయవలసిన యేర్పాటు లెన్నియోయుండ నీ కించిద్విషయ మాతడు విచారింప దొరకొనియెను. మహనీయు లితరుల కార్యములం దెపుడు శ్రద్ధవహించుటం దగ్గగణ్యులు గదా!

* * *

ఆసైనికుఁ డా చక్రవర్తి నెఱుంగడు. అతని ప్రవర్తన బాగుగనుండియుండెను. చక్రవర్తి యతని గని, యిట్లాడెను.

"నీ వెందులకు నీభార్యను బాధించెదవు?"

"ఆవిషయ మిపు డనవసరమని విన్నవించుచున్నాఁడ."

"అట్లు చేయగూడదని యెఱుంగవా?"

"చేయుటకు చేయకుండుటకు నాకు స్వాతంత్ర్యము గలదు. నా యిష్టము వచ్చినట్లు చేయుదును. ఆవిషయమై మీరు ప్రశ్నింపనేల?"

"ఒకవేళ చక్రవర్తియే నీవిషయమై ప్రశ్నించినవో."

"నా భార్యవిషయము నాకువీడి మీ రాచకార్యము జూచుకొమ్మందును."

"నీ విపుడు చక్రవర్తితోడనే మాటలాడుచున్నావు."

ఆమాట లతనినిప్రతిమనుగా జేసివైచెను. భార్యను బాధించిన నేరమునకేగాక చక్రవర్తిని ధిక్కరించిన నేరముగూడ గలసి తన జీవితమునే తుదముట్టించునని యతడు తలంచి, చక్రవర్తి ముందర మోకరించి,

"దేవా! మహాపరాధము గావించితి. శిక్ష కర్హుఁడ" నని దీనాలాపములాడెను.

"నీ భార్యను బాధించుటకు కారణ మిపుడైన దెలుపుదువా?"

"దేవా! చిత్తగింపుము. నాభార్య సకల సద్గుణరాసి. ఆమెను నే నితరులతో మాటలాడకుమనియు, చెలిమి చేయకుమనియు నిర్బంధించినను ఒక్కొకమారు వినదు. అందుచే నీవేళ నామెను కోపముచే మోది

* ఫ్రెంచిరాజులు ప్యారిసు నగరమున నివసించు రాజభవనమునకు "టులరీస్" అని పేరు.

తిని. అదియే ఆమె దుఃఖమునకు కారణము."

"మిగుల విచిత్రము. బలవంతపు గాపులుపెట్టి కామినీజనముల నేలునట్టి నెఱజాణవా నీవు! స్త్రీ స్వాతంత్ర్యమే నిన్నును నామెనుగూడ బాగుపడజేయునని యెఱుంగవా? వారి నిర్బంధము మానవాభివృద్ధి కాటంకము గల్గించునని తెలియదా! నీ సతి సద్గుణమే నిన్నిపుడు గాపాడినది. నీ వామె కికమీదట స్వాతంత్ర్యమిమ్ము. బాగుపడగలవు. అట్లుగాక నీ దుర్మార్గమును సాగింతువేని కఠినశిక్షకు పాత్రుడవగుదువని యెఱుంగుము. ప్రకృతము నిన్ను యుద్యోగిగ నియమించుచున్నాను." చక్రవర్తి యుదారగుణమునకు పొగడుకొనుచు తన సంకుచిత స్వభావమునకు సిగ్గిలుచు నాతడా చోటువీడెను:

* * *

కొన్ని వర్షములు గడచిపోయెను. మరొక్కమారు నెపోలియన్ ఆ సాధ్వీమణిని ఆమె పతివిషయమై ప్రశ్నించెను. ఆమెయు "దేవా! భవదీయకృపారసము నా సంసారమునకు ఆనందము గల్గించినది. ఈ యపార దయ కేమి ప్రత్యుపకార మొనర్పగలము?"

"సాధ్వీ! నీవు ఆదర్శప్రాయవగు సతిగా మెలంగుము. అదియే నీ ప్రత్యుపకారము" అనుచు మందహాసమొనరించెను.



## మూఢచిత్తమా నమ్ము చిన్మూర్తినెపుడు

శ్రీమతి మల్లాది రాజ్యలక్ష్మిగారు

సీ॥ నిత్యుడై యఖిలంబునిండియుండెడి పరబ్రహ్మంబు తెలియంగ వాంఛలేదా
చిత్స్వరూపుడు సృష్టిస్థితిలయకారణుం డాద్యంతుడవ్యక్తు డాత్మమయుడు
సచ్చిదానందుండు సకలలోకేశుండు ప్రణవస్వరూపుండు భవహరుండు
వేదాంతవేద్యుండు విశ్వస్వరూపుండు భక్తమందారుండు పరమగురుడు

తే॥ జననమరణకర్మంబులు సమసిపోవ
సారహీనంబులౌ నిహసౌఖ్యములను
శాశ్వతంబనియెంచక సకలగతుల
మూఢచిత్తమా, నమ్ము చిన్మూర్తినెపుడు.

# 'దొడ్డమ్మ'

పసుమర్తి కృష్ణమూర్తిగారు

అప్పుడే అరుణోదయం కావొచ్చింది. నా సంధ్యావందనంకూడా ఐపోవచ్చింది. అంతలో యెవరో మెట్లుదిగి చెరువులోకొస్తూవున్నట్లు అడుగుల చప్పుడైంది. అట్టే తిరిగిచూతును గదా యెప్పుడో పోయిన మా దొడ్డమ్మ జ్ఞాపకానికొచ్చింది. నిశ్చయంగా యీ వొచ్చిన వ్యక్తి ఆ గంగాభాగీరథీ సమానురాలే యనుకోవచ్చు. అట్టే వెలుతురులేదు; అందువల్ల నంతకంటే యెక్కువ చెప్పలేను. అంతలో నేనున్నా 'శ్రీకృష్ణబ్రహ్మార్పణమ' స్తని లేచి దోవతులు బుజానవేసుకొని జారీచెంబు పట్టుకుని నాలుగు మెట్లెక్కేసరికల్లా ఆవిడే దగ్గరగావొచ్చి "యేఁవిరా. నాయనా అవధాన్లూ, బాగున్నావ్రా నువ్వూ నీపిల్లలూనూ ?" అని చాలా ప్రేమతో అడిగింది పాపం. ఆ గొంతుకా ఆ ధాటీ ఆ సూటీ చూస్తే యే మొగాడు పనికొస్తాడు ? నేను మెల్లిగా వొదిగి "అమ్మా బాగున్నాను తల్లీ నీ దయవలన" అన్నాను. ఆవిడే తనచంకలో నున్నమూట గుభాలున కింద పడేసి "కూచోరా; వెలుగువుగాని—అప్పుడే తెల్లారిందో లేదో యింకా—వొచ్చి చెరువులో పడ్డావు పాపం" అంటూ కూచుంది.

"అమ్మా యిప్పటికే చాలా......"

"చాలుచా లూరుకో ! అందుకే నీలాంటి నిర్భాగ్యుల్ని మాస్తే నా కసహ్యం!!" అంటూ మూట విప్పింది. అన్నిటికంటే నాకంటికందులోవున్న గజ్జ లెక్కువాశ్చర్యం పుట్టించాయి. "యెందుకమ్మా అవి ?" అని అడిగితే యేం తప్పో ! అంతంత గజ్జలు చూచి అడగకుండా వుండలేనాయె ! "బుద్ధి జాడ్యజనితోన్మాదు"లని అన్నాడా అంటాడా మరి: చూదాం వచుకుని "అమ్మా ఆ యినపగజ్జ లెందుకు ?" అన్నాను.

"యినపగజ్జెలా—యెందుకూ అంటావా ?" అంటూ సావకాశంగా సంచీలోంచి అడ్డాకొకటి తీసి పైసుంచి అందులో యిన్ని అటుకులు పెట్టుకుని ఆ సంచీ మూటకట్టి అటుకులు తింటూ "అబ్బాయీ, చెప్తా వినూ—దానికేంగాని నువ్వూ యిన్నటుకులు తిను: రా: చెయ్యిపట్టు"మన్నాది. శ్రీరామ రామా !! నా కర్మం కాలిపోతే !! "అమ్మా, కోపం పడకుమా !! పెద్దదానవు నువ్వు పళ్ళైనా తోంపుకున్నావో లేదో-స్నానం మాటటుండనీ-అప్పుడే తిండి గోసా ? !!" అన్నాను. దానితో వొక్క వుదుటు వురికింది !! "నీ పిండం పిచికలకి పెట్టడం !! యెప్పటివో యిక్ష్వాకుల బారసాలనాటి పుస్తకాలు పట్టుకుని యేడుస్తూ !! స్నానాలూ ధ్యానాలూనూ !!—మీ కరణం పంతులుగార్ని చూచి బుద్ధి తెచ్చుకోరాదూ !!" అని గర్జించింది మళ్లా ! దానితో భయంవేసింది నాకు "అమ్మా, నేరక గడ్డితిని యేదో అన్నాను క్షమించు" మని పాదాలమీద పడ్డా నాపాళంగా. దానితో చల్లారింది పాపం. "వెర్రిముండాకొడకా—లేలే—నీ మీద నాకెందుకు కోపం." అంది చల్లగాను. బ్రతుకు జీవుడా అనుకున్నానంతలో. ఆ తరవాత మెల్లిగా అన్నాను "అమ్మా యీపూట మా నట్టింట విస్తరివేసుకు పట్టెడన్నం నాతోపాటుతింటే నేను సంతోషిస్తా"నని. 'కడి గండం కాసుం' దన్నారు గదూ పెద్దలు ! అందుచేత. నవ్వింది: "వొస్తాలే మరెప్పుడైనా—వోపూటకాదు: శాశ్వతంగా వుంటాను; మరికొన్నాళ్లు పోనీ"అంది. "ఐతే మరెక్కడికెళతా వీపూట ?" కన్నాను తరవాత. "కరణం పంతులున్నాడు గదూ !—వాడు నాకతి దగ్గిర చుట్టం.—నీతో చెప్పకేంగాని నువ్వూ నీ పెళ్లాం బ్రతికుండగా మీయింటికి రాను ! నీ పెళ్ళాం తిడుతుంది నన్ను. దాని ఆచారాలకీ నా ఆచారాలకీ యెతీఅంటే ప్రతీఅంటూ వుంటుంది." అన్నాదామె చీదరించుకుంటూ. నా కీమాటమాత్రం చాలా కష్టంగా వినిపించింది. యేఁవంటే నా పెళ్లాంవని చెప్పుకోడం కాదు. "పెగలను దనవారి వేరుగాఁ

జూడక సమతనారయునట్టి సదయహృదయ: కాని మాటలు దన్నుఁ గలుపాత్ములాడినఁ గలహింపనొల్లని గరితమిన్న" అని యేదేదో ఆ పురాణాల్లో ఆడవాళ్లని గురించి చదుతాంవేఁ అదుగో ఆలాటి మనిషి! ఆ పసుపూ ఆ కుంకంబొట్టూ ఆ కాటుకకళ్ళూ ఆ చిరునవ్వూ—"యేంపండీ' యని యెదురుగుండా వొస్తూవుంటే ఆ సొగసునకు ఆ సోయగమునకు ఆ పవిత్రతకు నాలో నేను వుప్పొంగిపోతూవుంటానే!! మూర్తీభవించిన సాత్వికత !! అట్టిదాని యాచార వ్యవహారలకా యీ చచ్చుముండాకూతురు వ్యాఖ్యానాలు చేయడం అనుకున్నాను. కానీ ఐనా ఆడది! తప్పు దానిదేఐనా మనం వేఁపీఁ అనకూడదు గదా ! అందుచేత నిదానించి "అయితే కరణం పంతులుగారి యింటికే వెళతావా అమ్మా ?" అన్నాను. "అహా! ముమ్మాటికీ ! ఆ యిల్లాల్ని చూస్తే నా కన్నుఁకూడా అక్కర్లేదు. హాయిగా యేమీ యేదున్న రా అయ్యో సరికల్లా యింకా పక్కమీదనుంచి లేవకముందే కాఫీ వుప్మా దోసె..." అని యింకా ఆమె యేదో సోదె పోసేస్తూవుందిగాని నాకు పనిలేదూ ! పాతాలుచెప్పకునే కుర్రాళ్ళు గోలయెత్తుతూ వుంటారు అందుచేత "అమ్మా, సెలవిప్పించు: వెళతా"నన్నాను వినయంతో. "వెళతావట్రా నాయనా ? సరే వెళ్ళు—ఐతే నాగజ్జలమాటా అడిగి వూరుకున్నావే" అంది.

సరే. ఏందా ఆలస్యం మఔతుందా అనుకున్నాను ఆ గుండుగమ్మ లనుమానం తీరాలి. లేకుంటే నిద్ర పట్టదు; అందుచేత చెప్పమన్నా. అక్కడినించీ ఆరంభించిం దా అపరూపవ్యక్తి.

"ఒకే పశ్చిమబుద్ధీ, యింతమాత్రం పోల్చుకోలేక పోయావుకదా !! గజ్జలు కాళ్లకు కట్టుకుని నృత్యం చేస్తాను. విన్నావా ?...యేం వలాగ చచ్చుమొగం పెట్టి చూస్తావేఁ ?...విను—ఆలీ మగఁడూ, అత్తా కోడలూ, అన్నాతమ్ముడూ మొదలైనవాళ్లు తగువులాడుకుంటూవుంటే నాకూః ఆనందం ! తకదధిగిణతైయ్యాని వొక్కటే ముక్తాయింపు. ఐతే నా కిప్పుడు ఆనందంకాదు పరమానందంకాదు కేవలం బ్రహ్మానందావస్థ ప్రాప్తిస్తూవుంది. అందుకనే అటుకులు తిని బ్రతికివున్నాను. లేకుంటే చచ్చిపోయేవుందును."

"అమ్మా, నీవు చెప్పేది బాగా అర్థంకాలేదు.."

"అర్థంకాలేదూ ?! నీ శ్రార్థం—నీ వేదాలు కాల్చా ! నీ నెదడుపేల్చా ! లౌక్యంవంటే ఆవగింజలో ఆరవీసంపైనా లేదు !!"

"అమ్మా మా తాతలనాట్నుఁచీ లేనిది నా కేలాగొస్తుంది ?"

"ఏలాగొస్తుందా !! నీ కోడలు రానీరా తెలుస్తుంది ! నీ నీరు కావిదోవతుల నీటూ నీ పెళ్లాం వాశాదపుగోటూ నిప్పుల్లోవేసి కాల్పించేస్తాను దాన్తో చెప్పి !! అప్పుడు తెలుస్తుంది ! పెకుదుగాని పెండేకట్లు—తెగబారదేసి !!"

"అమ్మా, మా దొడ్డమ్మ వనుకున్నందుకు బాగానే తిన్నాను, నీచేత! మా అమ్మైనా నన్నెప్పుడూ వొక్కమాట అని యెరగదు."

"యెందు కంటుందీ పాపం—మొగుడి గుండెల మీదెక్కి చిందులుతొక్కి చిత్రాంగి—యెందు కంటుందిరా ?"

"అమ్మా, యీ ఖజ్జాకోరుమాట లెందుకూ ? ఆడదానవుకాదా యెంతైనా..."

"ఓరి తాటాకులకట్టా, నోరుకట్టు—ఆడదానైతే నాకు మాటాడ్డానికి స్వతంత్రం లేదనుకున్నావా ?"

"స్వతంత్రం లేదనలేదు తల్లీ స్వతంత్రం లేదనలేదు: కాని నోటికొచ్చినట్టూనా..."

"ఔను నోటికొచ్చినట్టూ మాటాడవలసిందే. యిష్టంవొచ్చినట్టూ తిరగవలసిందే ! నువ్వెవడవు మధ్య !!"

అయ్యయ్యో నేనెవడ్నీ ఔతానని చెప్పలేదు. లోకరీతి యీలాటిదీ అన్నానుగాని మరేంవీఁకాదు"

“నీ లోకరీతులు నీ మీదవేసీమని చెప్తాలే నీ కొడుకుతో!! లాహిరీకి చదూతున్నాడేమో చెన్నాపట్టంలో?”

“యేలాగో అంతభాగ్యం నాకు పట్టాలిగదూ—నీధర్మంవాఁ అని-ఆవొక్కడి చేతిమీదా...”

“భయం లేదులే నే నాశీర్వాదం చేస్తా-చచ్చేదాకా యెందుకూ? బతికివుండఁగానే నిన్నూ నీ పుస్తకాల్నీకూడా సంస్కరించుమఁటూ!”

“నీదయ తల్లీ నీదయ !!”

“పోనీగాని నీకేదైనా యెంకిపాటొస్తే పాడుదూ—నే నాడతానూ-నీతో మాట్లాడినకొద్దీ నా మనస్సు పాలసముద్రంలాగ...”

“అమ్మా నాకు పాటలురావు. యేవో భజగోవింద శ్లోకాలుమాత్రం...”

“నీ భజగోవిందం పాడైపోనూ !!...వుండు నేను పాడతా విను-గజ్జలు కట్టుకోనీ” అంటూ మూట విప్పి గజ్జలుతీసి కట్టుకుని (పాట)

“నీకు నాకూ దూరమాయే-నీళ్లరఘూకీ యడ్డమాయే| పోకురా ననుబాసి యప్పుడే-వొ ౭-బుద్ధిలేని బోడిబాపడ ||పో|| నీవుచూస్తే నువ్వులబోడీ-నేనుచూస్తే పువ్వులబోడీ| లేవరా యీబోడికాబోడి సలాం-నను-లీలలదేల్చర ||లేవరా|| దధిగిణ దధిగిణ దధిగిణ ||నీకు||

అఁటూ వొక్కగెంతువేసింది నా మీదికి. పరధ్యానంగా నిలబడ్డానేమో-పడ్డాను గుభాలున. లేచి మళ్ళీ యిట్టే చూచేసరికి యెవరూలేరూ!! యిదేదో పెద్ద దేవతామహిమలాగ తోచింది. యెవ రీమె అని ఆలోచించా. ఆపాళంగానే యింటికొచ్చా. నేను వెళ్ళగానే యెప్పుడూ నవ్వుతూ యెదురుగా వొచ్చి నా భుజానున్న తడిగుడ్డలు ఛప్పునందుకుని వెంటనే పొడిదోవతులు తెచ్చియిస్తూవుండే మా ఆవిడే ఆరోజు నన్నుచూచి దూరంగా నిలబడిపోయింది. దాని చూపుల్లో యేదో సందేహం వున్నట్టు స్పష్టంగా తెలుస్తూనేవుంది. “యేంవిటి చూస్తున్నా” వన్నాను. “యేంవీఁలే”దని గిఱ్ఱున తిరిగి లోపలికిపోయింది. నాకు కొండంతకోపం వొచ్చిందిగాని మళ్లీ అణుచుకున్నాను; ఆపాళంగా పెరటి వసారాలోకిపోయి దోవతు లారేసుకుని పొడిదోవతి కట్టుకుని దేవతార్చన చేదాంవని కూర్చున్నా. కాని మనసులోమాత్రం అదేస్వరూపం; చెవుల్లో యింకా అదేపాట; శివశివా పాపము శమించుగాక యనుకొని మళ్ళా పెరట్లో నూతిదగ్గరనే స్నానంచేసి ఆ తడిబట్టతోనే సహస్రగాయత్రీ జపం చేసుకున్నా-అప్పుడు మనస్సు కుదుటపడ్డాది. “వంట కావొచ్చింది-దేవతార్చన కానీండి”అంటూ మళ్ళా ఆవిడే నవ్వుతూ లోపల్నుంచివచ్చి చెప్పింది. భోజనా లయ్యాక యీ కథంతా చెప్తే “ఆమె యెవరనుకున్నారు? మీ దొడ్డమ్మగారు కాదు; జ్యేష్టాదేవి !! నా తనువుండగా యీ గడప తొక్కనివ్వ” నని వెంటనే మహాలక్ష్మిపూజా కుంకం బొట్టెట్టుకుని సుందరకాండ వొకసారి చదివి కర్పూరనీరాజనం సమర్పించింది మహాలక్ష్మికి.

---



శ్రీమతి శారదా తలవర్, బి. ఎ.,

మంగుళూరులో ఆనరీ మేజిస్ట్రేటు



శ్రీమతి గిడుగు సత్యవతిగారు

పదకవిత్వమున నీయమకభిరుచి



బొంబాయికాంగ్రెస్ విజయమునకై స్త్రీలొనర్చిన
మహాసహాయమిది !! ముజాఫరాబాదుహాలునొద్ద
పోలింగ్ స్టేషను దృశ్యము



శ్రీమతి మాలతీ పట్వర్ధన్, బి.యె.,

ఈయమ భారతమహిళాసమాజమునకు కార్యదర్శినిగాను,

అడయార్ దివ్యజ్ఞానసమాజ కళాశాలా సహకారిణి

గాను పనిచేసిన విఖ్యాత చరిత్ర.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు,

నెచ్చెలీ! నీవును కల్యాణియు నొకే విషయమునుగూర్చి యొక్కమాఱుగా వ్రాసిన లేఖలు రెండును నొకేమాటు నాకు జేరి రెండు సుత్తెపెట్లొక్కమాఱుగుండియపై కొట్టినట్టు వేదనను గలిగించుచున్నవి. నీ కొమార్తెయగు శ్యామలయు, కల్యాణి కొమార్తెయగు ప్రసన్నయు నించుమించుగా నొక్కయీడువారే. శారదా చట్టము మిమ్మిక బాధింపనేరదని నీవలెనే నామెయు వ్రాయుటచే నిరువురకు పదునాల్గు వత్సరములు నిండిన వనుకొందును.

కల్పలతా! కల్యాణియు నీవును బహుసంతానవతులగుటచే మీవంటి భాగ్యశాలినులు లేరని నాయూహ. కాని మీ కొమార్తెల పెండ్లిండ్ల విషయమై నేడు మీ రిరువురును వ్రాసిన జాబులు చూడ మీవంటి దురదృష్టవతులు లేరనిపించుచున్నది. కొడుకులు తండ్రికిని, కూతుండ్రు తల్లికిని మిక్కిలి ప్రియము గూర్తురని లోకములో వాడుక. కాని ఆడుబిడ్డలు మీ కెంత వెక్కసముగనున్నారు! ఈ విచారమున కంతయు కారణము వారికి తగిన వరులను కూర్చలేకను గదా! కల్పలతా! అవసరపడిన యిచ్చుటకు ఆడుబిడ్డలమారు డొక యుండ బట్టి కాబోలు నీ యుత్తర మొకవిధముగ సౌమ్యముగనున్నది. కాని కల్యాణి జాబు చూచిన కడుపు చెఱువగుచున్నది. ఆమె యెంత వేదనపడుచున్నదో నేను తెలుపుట కంటె యామె యుత్తరము నిందు పొందుపఱచుచున్నాను. కనుము.

సౌభాగ్యవతి శారదకు,

సోదరీ! నీవు తఱుచు వ్రాయుచుండు జాబులు నాకు చేరుచునేయున్నవి. కాని నీకు ప్రత్యుత్తరము వ్రాయ నుల్లాసము నాకు లేకపోవుటచేతనే వెంటనే యుత్తరము వ్రాయుటలేదు.

చి॥ ప్రసన్నకు వివాహవయస్సు వచ్చినది. శారదాచట్టముగూడ మమ్మిక బాధింపదు. ఈ మార్గశిరమాసములో ప్రసన్న వివాహము చేయవలయునని యెంతయో తలంపు గలదు. కాని యే సంబంధము విచారించబోయినను రెండువేలు, మూడువేలు, కట్నమడుగుచున్నారు. మా స్థితి నీకు తెలిసినదే గదా. నెలకు రెండువందల యేబదిరూప్యములు వచ్చు నుద్యోగము చేయుచున్న మా పంతులుగారు నిరాకరణోద్యమము రాగనే ముందు వెనుక లరయకుండ నుద్యోగమునకు రాజీనామా పెట్టి యూరుకొనిరి. ఆదినములలో ధాన్య

మునకు మంచిధర యుండి భూములమీద సంవత్సరమునకు రెండువేల రూప్యములాదాయము వచ్చుచుండుటచే యుద్యోగము మానినను మా కప్పుడు చీమకుట్టినట్టుండకపోయెను. ఇప్పుడు ధరలు పడిపోయినవి. భూములమీద వచ్చు ఆదాయము భూమిశిస్తులకే సరిపోవుచున్నది. ఇకనేమి? ఉద్యోగమూడినది. ఆదాయ మల్పమైనది. కుటుంబము పెద్దదైనది. ఈ పరిస్థితులలో ప్రసన్నవివాహసమస్యగూడ యెదుర్కొనినది. ఏదియో కలిగినంతలో పెట్టి నిరాడంబరముగా చేయతగినవి కావు గదా యీనాటి పెండ్లిండ్లు! పెండ్లికర్చులమాట యెట్లున్నను కేవలము వరదక్షిణకే రెండు మూడు వేల రొక్కము గావలయును. ఇన్ని రూపాయ లెక్కడినుండి తేగలము?

నా బిడ్డ యని పొగడుకొనుట గాదు. నిజము చెప్పవలయునన్నచో ప్రసన్నవంటి మంచిబాలిక లేదని చెప్పవలయును. తండ్రిగారివద్ద చక్కగా విద్య నభ్యసించినది. బెనారస్ యూనివర్సిటీవారి మెట్రిక్యులేషన్ పరీక్షకు నిర్ణీతమైన పాఠ్యపుస్తకములు చదువుచున్నది. సంస్కృతాంధ్రములలో మంచి ప్రవేశమున్నది. కుట్టుపనులు, అల్లికపనులు, యెన్నియో వచ్చును. ఇంటిపనులలో నాకు చేతి కందివచ్చినది. నా బిడ్డలందఱిలో మిగుల తెలివైనదే గాక మంచి నెమ్మదైనదికూడ. మా వంశమర్యాదలు నీ వెఱిగినవేగదా! ఇట్టి యాభిజాత్యముగల నా బిడ్డను వివాహమాడుటకు మూడువేల రూపాయలు కట్నమీయ వలయునట!

దేశ మేదియో యుచ్చస్థితికి వచ్చుచున్నదనియు, ప్రజలెల్లరు వివేకజ్ఞానము గలవారగుచున్నారనియు, నీ కేదో వెఱ్ఱిమురువు, కాని నా కీపత్రికల ప్రబోధము లన్నను, ప్రముఖుల యుపన్యాసము లన్నను, పెద్దపెద్ద సభలన్నను సర్వాసహ్యము!! సంఘసంస్కరణసభ జరుగనివత్సరము లేదుగదా! వరకట్నములు నిరసింపనిసభ లేదుగదా! కులసభలు, జాతిసభలు, మహాజనసభలు, మహిళాసభలు, విద్యార్థిసభలు. యువకసభలు, ఒకటేమి? ఎన్నియో నామాంతర రూపాంతరములతో లెక్కలేనన్ని సభలు జరుగుచున్న ప్రతిసభలోను వరశుల్కనిషేధ తీర్మానము చేయుచునే యున్నారుగదా. ఈ దురాచార మేమైన తొలగినదా? సంస్కరణసభలలో గంభీరోపన్యాసములిచ్చిన ప్రముఖులే కొమరుల వివాహసందర్భమున కట్నమునకై కన్యాదాతలపీడించుచున్నారు. మహిళాసభలో వివాహదుర్వ్యయమునుగూర్చి మాట్లాడిన మహిళామణియే వియ్యపురాలి లాంఛనములకై వియ్యాలవారిని వేపుకు తినుచున్నది. వరకట్నములు స్వీకరించుట యక్రమమని విద్యార్థిసభలో వీరుడివలె ప్రసంగించిన యువకుడే కట్నము బాపతు తరుగు పుట్టినింటినుండి తెచ్చినావు కావేమని యింటభార్యను కోసి పెట్టుచున్నాడు!! ఇక నెందుకీ శుష్కాందోళనము? త్రికరణశుద్ధిలేని ప్రగల్భవచనములవలన ప్రయోజనమేమి? ఇంచుక లోకజ్ఞానము గలవారి ప్రవర్తనములే యిట్లుండ యీమాత్రపు వివేకమును లేసివారి ప్రవర్తన

మెంత పీడాకరముగ నున్నదో చెప్పవలసిన దేమి ?

శారదా ! ప్రియ మిత్రురాలవగుట మనసు విప్పి చెప్పుచున్నాను: చి॥ప్రసన్న వివాహవిషయము తలపెట్టినది మొదలు కడుపునిండ తిండియు కంటినిండ నిద్రయు నెఱుగను! దండిగా నీయవలయుననిన చేతిలో డబ్బులేదాయె. పుష్కలముగా ద్రవ్యమిచ్చిన గాని మంచివరుడు లభింపడాయె. ఈ ద్రవ్య లేబరముచేత ప్రసన్న నేయధమున కియవలసి వచ్చునోయని నా కెనలేని చింత!! బుద్ధి తెలిసిన పిల్లగదా. ప్రసన్న, తండ్రియు నేనును పడుచున్న వేదనగని, మనసులో నేమి యనుకొనునో యేమో! ఎల్లప్పుడు చిన్నబుచ్చు మోముతో నుల్లాసములేక విచారగ్రస్తయై యుండును. దానిని చూచిన నాకు కడుపు కోతగా నుండును. హరిజనోద్ధరణమని యూరక యల్లాడఁబోనే మహాత్ముఁడీ కన్యాజనోద్ధరణకు కంకణము కట్టుకొనరాదా? యువజనుల ప్రబోధించరాదా? ఎంతైన పుణ్యముండునే!! శారదా, ఇక వ్రాయ జాలను. మనోవ్యథ దుర్భరమగుచున్నది. తాలిమి తూలుచున్నది. ఈ యుమ్మలికము వలన నేమి వ్రాయబోయి యేమి వ్రాయుదునో! నా యెదలోని సొద గ్రహించుట కివి చాలును, సెలవు.— కల్యాణి.”

కల్యాణి హృదయ మెంత మఱుగుచున్నదో పాపము. కల్పలతా, మనదేశమున విస్తరిల్లి యున్న వరకట్నములు తల్లిదండ్రుల కెంత దుఃఖహేతువుగ నున్నదియు కల్యాణి లేఖలోని ప్రత్యక్షరము విశదము చేయుచున్నది. ‘శ్రీయును కులమును రూపము ప్రాయము శుభలక్షణంబు లరసి, కన్యకలను చేపట్టవలయునని పెద్దల వచనము కాని యీ కాలములో వరుసివంక వారికిగల ద్రవ్యదాహము ముందర బాలికల విద్యావివేకములు, కుల గుణ సౌందర్యములు, యెందుకును కొఱగాని వగుచున్నవి. ఒకానొకరు ‘సుగుణవతియగు బాలకు శుద్ధశంక ఆభిజాత్యంబు గల బిడ్డ కథమునకుఁడు అధికవిద్యావతికిని అనకురుండు వరుడగుట పాడుకట్నాల వలన గాదె’ అన్నట్టుగా నిజముగా నీ కట్నముల వలన మంచి యన్నములోనికి మంచి కూర దొరకదను సామెత సార్థకమగుచున్నది. నేడు మీ రిరువురు వ్రాసిన యుత్తరముల వలననే గాదు. వరకట్నముల వ్యాప్తి బాలికల శ్రేయమున కెట్లు భంగకరముగ నున్నదియు నేనును బహుకాలమునుండి గమనించుచునే యున్నాను. కాని చేయున దేమియు కన్పింపదు. ఈ వరకట్నములు మంచివని ప్రశంసించుచున్నవారు లేరుగాన చెడ్డవని నిష్కర్షగా నిరాకరించుచున్న వారుగూడ కానరారు. తా మీయవలసినప్పుడు తప్పని నిందించుటయు, తాము పుచ్చుకొనునప్పుడు నిర్దాక్షిణ్యముగా తీసికొనుటయు పెద్దమనుష్యులైనవారు చేయుచుండుటవలననే దీనికి నిందయు నిఱుకును గూడ నేర్పడు చిత్రవిచిత్రపరిస్థితి యేర్పడినది. ముఖ్యముగా విశేష ధనసాధ్యమైన హూణవిద్య దీని పెంపునకును విశృంఖల విహారమునకును కారణమైనది. తలిదండ్రులు తమ కొమరులకు చదువుచెప్పించుట తమధర్మ మనుకొనక

రాజ్యోవు తమకోడలి నుద్ధరించుట కొఱకుగా భావించి యామె తండ్రివద్ద నీసొమ్మును కఠినముగా వసూలు చేయుచున్నారు. ఆడు బిడ్డపెండ్లి గొంతుమీఁది కత్తివంటిదగుటచే నేండ్లుమీఱిన పెండ్లికాదను భయముచే హెచ్చు కట్నమిచ్చిన మంచియల్లుడు లభించునను దుర్భ్రమచే కన్యాజనకులు తమ కొంప గోడెలమ్మి యల్లుండ్రకు కట్నము కొమార్తెల వివాహములుచేసి కన్నె చెఱలు విడిపించుకొనుచున్నారు. దేశములో సకల వస్తువులకు ధరలు పడిపోయినవి. ద్రవ్యము లేదు. బంగారము పరసీమలపాలై పోవుచున్నది. విద్యాధికులన్న కే గాని యుద్యోగములులేవు. వృత్తులకు కొఱగారు!! దేశమెల్లెడల దరిద్రదేవత తాండవమాడుచున్నది. ఇట్టి దుర్భర క్షామదినములలో గూడ వరకట్నముల బిగువు సడలకుండుట దేశస్థితికి తార్కాణగా నున్నది. ఇటువంటి క్రూరదురాచారముచే పరివ్యాప్తమైన యీ భారతభూమి కేనాటికైన మంచి దినములున్నవా? ఎంత దుఃఖకరమైపోయినది భారతీయుల స్థితి! పూర్వకాలమున వరులు తమ ధైర్యసాహసములను, తమ విద్యావివేకములను కన్నె కుంకువుగా నొసంగి యుత్సాహముతో కన్నెల పరిగ్రహించువారు. ఉంకువ యనునది యెప్పటికిని వరుడే వధువునకొసగునదిగా నున్నది గాని వధువునుండి పరిగ్రహించునదిగా లేదు. అట్టి శౌర్యగాంభీర్య సాహసౌదార్య సౌశీల్య సౌందర్య విద్యా విజ్ఞాన శోభితులగు వీరులను గన్న భారత భూమిని నేడు కన్నె మెడలో పుస్తె ముడివేసినందులకు కన్యాదాతలవలన సుంకముదీయు వరు లేర్పడినారు. ఎంత దుస్థితి! విద్యాధికులయ్యును నిప్పటి వరులు కన్యాదాతల కన్నీటి ధారలచే మలినమైన రొక్కమును, పసదనములను, పాపభూయిష్ఠములని భావింపక యధికకట్నములను తీసికొనుటయే తమ యర్హతకు చిహ్నమని తలంచుచు కట్నస్వీకారమొక ఘనముగా నెంచి మురియుచున్నారు. అభ్యాసవశమున నెట్టి దురాచారమునైనను లోక మెట్లు గుర్తింప జాలదో గ్రహించుట కీ వరకట్నము లెంతయు తగియున్నవి.

కల్పలతా! వరకట్నములు సాధారణముగా వరులపేరున స్వీకరింపబడుచున్నవి గాన వారొక్కరే యీ దోషమునకు బాధ్యులని భావింపరాదు. నిజమున కీవిషయమున వారికంటె వారి సంరక్షకులే విశేష నిందాపాత్రులని నాయూహ. ఏలనందువా?

మన దేశమున సాధారణముగా మగపిల్లల వివాహములు వారి విద్యార్థిదశలో జరుగుచున్నవి. అప్పుడు వారు సాధారణముగా తండ్రియొక్క యదుపాజ్ఞలకులోనై వారి సంరక్షణలోనుందురు. ఒకరి సంరక్షణలోనుండి వారి పెట్టుపోతలకు దోసిలొగ్గియుండవలసిన వారు వారికి విధేయులైయుండుటయు, వారిని ధిక్కరించు సాహసము లేకయుండుటయు సాజమేగదా. ఈకారణమువలననే నూటికి కోటికి యే విద్యార్థికైనను కట్నముల స్వీకారమునందసహ్యా

భావమున్నను, స్వతంత్రముగా ప్రవర్తింప జాలకున్నారు. తమ తాత్కాలిక సంరక్షణమేగాక తమ భవిష్యజ్జీవితాధారములైన యాస్తిపాస్తులకుగూడ నధికారులైన తండ్రులను వ్యతిరేకించుట విద్యార్థిదశలోనున్న వరునకు సామాన్యకార్యము కాదు గదా. కాన వరులకంటె వరుల తల్లిదండ్రులయందే, కట్నములయందు హేయభావ మేర్పరుచుట, అత్యంతావశ్యకమైయున్నది. మఱి యువరులు విద్యయం దారితేరి సొంత సంపాదనయందు కుశలులగువఱకు వివాహమాడకుందురేని యీ చిక్కు కొంతవఱకు తీరగలదు. కాని వరులే ద్రవ్యప్రలోభమునకు పాల్పడినవారై వరకట్నములవలని యనర్థకతను హైన్యతను గమనింపకుందురేని దీనికిక పరిహారమే లేదు.

కల్పలతా, తొల్లిటివలె అతిపవిత్రమై మానవుల జీవితోన్నతికి సాధనమై వధూవరుల నిర్మలప్రేమ కాలవాలమైన వివాహము జరుగవలయు నన్నచో దీని కొక్కటి ప్రతిక్రియగలదు. ద్రవ్యమునకు వివాహమునకుగల సంబంధము విచ్ఛిన్నమై క్లుప్తముగను నిరాడంబరముగను సాజముగను జరిగెడి పరిణయపద్ధతు లేర్పడవలయును. యువజనులెల్లరు వరశుల్కనిషేధదీక్ష పూనవలయును. అపుడుగాని బాలికల బాధలు నివారణకావు. అపుడుగాని కన్యాదాతల కష్టములు గట్టెక్కవు. అపుడుగాని వియ్యములలో కయ్యములుపోయి నెయ్యము లేర్పడవు. అపుడుగాని వివాహములు ధర్మపునీతములుకావు.

అయితే యిప్పటి యువజను లిట్టి యశోవిరాజితమగు త్యాగదీక్షను వహింపగలవారేనా ? ఈ ప్రశ్నకు జబాబిచ్చుటకు ప్రస్తుత దేశపరిస్థితులు ధైర్య మొసగుటలేదు. సర్వానర్థకమూలమగు ధనతృష్ణ యన్నిటిపై యధికారము వహించినటులనే పవిత్రమగు హైందవవైవాహికధర్మములను గూడ వశపఱచుకొని వివేకసంపన్నులగు విద్యాధికుల ధర్మదృష్టిని గూడ విచ్ఛిత్తిజేసి యభము శుభము నెఱుగని యమాయికబాలికలపై కూడ దాడి సాగించుచున్నది. ఈ విషమావస్థలో నేమి చేయుటకు త్రోవ కానరాదు. అంతయు నంధకారముగనున్నది. మీకు నేనేమియు సమాధానమీయజాలకున్నాను. ప్రియపుత్రికా వివాహవ్యథా విచ్ఛేదమనస్కలై వరశుల్కదురాచారమునకు మీ రర్పించు వేడికన్నీటిబొట్టులలో నాదియు నొక కన్నీటిబొట్టు !

భావపురి
1—12—34

ఇట్లు
శారద.



7

# పుట్టింటికి ప్రయాణముగురించి

'అనసూయ'

(మగనిచెవిలో)

ఏమిటండీ! ప్రతీదానికీ అమ్మ అనుజ్ఞేనా? మా పుట్టింటికి ఓరెండురోజులు వెళ్లకవెళ్లక వెళ్తానంటే, మీ అమ్మ ఆజ్ఞ కావాలంటారు! ఆమెను నేను అడుగను, * * * మీరే అడగండి, ఆశీర్వాళ్లేనో మీరేతినండి! ఇన్నేళ్ళువంటికివచ్చి యింకా అమ్మనడుగు మనడం మీదగ్గిరే వినబడ్డది. కచేరీలోకూడా యీమోస్తరుగానే వాదిస్తారా యేమిటి? జడ్జీ యేమైనాఅడిగితే 'మా అమ్మనడిగి వస్తాను' అని అనరుగద! కోమటి అబ్బాయిలాగు 'అమ్మనడుగు అమ్మనడుగు'అని భయపడడం ఎక్కడ చూడలేదు! నాకు పెళ్లి చిన్నతనంలో అయిపోయింది, జ్ఞాపకం చాలకుండాఉన్నది; నాకు పుస్తె మీరుకట్టేరా, లేక మీ అమ్మేకట్టేసిందా? మీ యింటికి కాపురానికి వచ్చినతరువాత ఏరెండేండ్లకో మూడేళ్లకో ఒకటిరెండురోజులు వుండడానికి ఒకమారు అపురూపంగా మా పుట్టింటికి వెళ్లడం తటస్థించుతూఉన్నది. మా నాన్న మొన్నను పిలవడానికి వచ్చి పెద్దదిగదా అని మీ అమ్మను అడిగితే కస్సుమని 'నాకేంతెలుస్తుంది? మీఅల్లుడిని మీకూతురినీ అడగండి? నాపెత్తనం ఏమి వేలిపోతూవున్నది?' అని కేకలేసిందిట! మరి మాట్లాడకుండా మానాన్న వెళ్ళిపోయేడు. అలాంటప్పుడు ఎందుకండీ ఆమెను అడగడం, తిట్లుతినడానికి తప్ప? నేను అడుగ తలచుకోలేదు; మీరే అడిగి మీరే రైలుకువచ్చి దిగబెట్టివేయండి!

'రేపు కచేరీపని, యెల్లుండి వెళ్లకూడదూ?' 'కూడదు!! ఏలాగు కూడుతుంది? మీవాళ్ళ కోతి చేష్టలు చూస్తే కూడునో కూడదో మీకే బోధపడుతుంది! మా నాన్నవచ్చి పిల్చేశుకదూ! ఇకను ఇది వెళుతుందిరా అని మీవాళ్లు ఏం ప్లానువేసేరో తెలునునా? తట్టెడు అప్పడాలపిండి కలిపేరు, అరతట్టెడు అటుకులధాన్యం పోసేరు; ఇవి చెయ్యడానికి ఊళ్ళోవాళ్లు ఎవరూ సాయము రారుగదా! కారణము అందరికీ తెలిసినదే! ఒకరికి మనము సాయము చేయము, మనకు ఒకళ్లు సాయముచేయరు! ఈఊరు ఆవూరు కెంతో ఆవూరు ఈవూరుకీ అంతే! అది అలాగు ఉండగా మీ అప్పగారికి అంకిలినెల! ఈ చాకిరీఅంతా రేపు నా పీకకు చుట్టేస్తే, చచ్చినట్లు ఈ అప్పడాలు వత్తడము, యీఅటుకులధాన్యం దంచడము, మూడునాలుగురోజులు పడితే, ఇంతట్లో మా పుట్టింటికి వెళ్లవలసినకార్యం మించిపోతుంది, వాళ్ల పగతీరుతుంది! నా మాట సాగకుండా అయిపోతుంది! ఇదీ వాళ్లువేసిన యెత్తు, తెలిసిందా! అందుచేత రేపు పన్నెండుగంటల రైలుకువెళ్లడం తప్పదు, హరిమీద గిరిపడ్డా మీరు దిగబెట్టక తప్పదు!

ఈ ప్లానంతా యెలాగు పోల్చుకున్నానా?— అనేక యుద్ధములలో పరాజయమూ పరాభవమూ పొందుచున్న యోధురాలినిగదా, అనుభవజ్ఞానముచేతనైనా ఆ పాటి తెలుసుకోలేక పోతానా? మీ వాళ్లా!! నిజంగా వాళ్లే మగవాళ్ళైతే ఏయెస్టేటుకో దివానుపని చేయడానికి సమర్థులు! వాళ్ళువేసే యెత్తులు, వాళ్ళకిఉన్న తెలివితేటలు, నిజంగా యే మగవాడికి కూడా ఉండవు! కాని యెందుకూ? ఆ తెలివితేటలన్నీ నన్ను యెలాగు బాధపెట్టడమో, నన్ను యెలాగు యేడిపించడమో, ఈ మార్గములు ఆలోచించేటందుకు మాత్రమే ఉపయోగమవుతూ ఉన్నాయి! చూడగా చూడగా వారికి ఈఒక్క కోరిక, ఒక్క ఆసక్తి, తప్ప మరొకటి ఉన్నట్లే కనపడదు! వారికి నన్ను బాధపెట్టడమంటే అంత సంతోషము! నిజంగా యిప్పుడు ఏదేవతో ప్రత్యక్షమై యేం వరం కావాలని అడిగితే మీ అమ్మ కొంచెం తటపటాయించినా 'అమ్మా! ఇంకా

చూస్తావేమిటే!' అని బలవంతపెట్టి, నన్ను కొత్త కొత్తరకాలను నిత్యమూ బాధపెట్టడానికి శక్తి కావాలని వరం గోరుకొమ్మంటుంది మా అక్కయ్య! దానికి నామీద అంతకావేషీ! పూర్వజన్మంలో యేమిటిచేస్తే ఇటువంటి ఆడబొట్టెలను అత్తగార్లను ఇస్తాడండీ దేవుడు? అహా! పశ్చిమదేశాలవారి సంగతి తెలుసుకుంటే గుండె విడిపోతూఉంటుంది! తమ తూర్పుదేశపు సోదరీమణులకు కొంచెమైనా పెట్టకుండా అంత హాయీ తామే అనుభవించడం పాశ్చాత్యస్త్రీలకు చాలా అన్యాయం! అచ్చటి ఆడవాళ్లకు అత్తగారి పూచియే లేదట! అత్తగారే లేకపోతే మరి ఆడబొట్టె లెక్కడ? నిజంగా స్వర్గమంటే అత్తగారూ ఆడబొట్టె లేని చోటికి ఆడదానిని తీసికొనిపోవడమే స్వర్గమని అనుకుంటాను! తలచెడ్డ అత్తలకూ ఆడబొట్టెలకూ పాపం యేపనీ ఉండదు, ఏమీ ఊసుపోదు, ఏదీ వ్యాపృత్తి లేదు, ఏమీ తోచదు. మొగుడు ఉండేటప్పుడు ఇలాంటివాళ్లకి ఒక వొడ్డు కాచేసేవాడు! వాళ్ల యొక్క కోపము, తాపము, తిట్లు, చీవాట్లు వానికి చాలాభాగం ముట్టిపోతూవుంటే పైవాళ్లకి వీళ్లవల్ల అట్టే బాధలేకుండా కొంత శాంతిఉంటే ఉండ వచ్చును. తలచెడ్డవాళ్లకి అటువంటి గత్యంతరం లేక పోవుటచేత అవస్నీ యింట్లో యెవళ్లకో తగులుతూ ఉంటాయి! ఆడబొట్టె అయితే అన్నదమ్ముడి పెళ్లాన్ని, అత్తగారైతే కోడలిని, వేపుకొని తింటూ వుంటారు! అందుచేత తలచెడ్డ అత్తగారూ ఆడ బొట్టె ప్రత్యక్ష యమభటులుగాని మామూలువాళ్లు కారు! నేను చిన్నప్పుడు యమభటులంటే భయపడే దానిని! ఇప్పుడా భయంపోయింది! విచ్చుకత్తుల వాళ్లు, కోరమీసాలవాళ్లు, ఎర్రగుడ్లవాళ్లు, వీళ్లంటే భయములేదు! వీళ్లందరికన్నా, యముడు బోడి దాన్ని పంపిస్తే నాలాంటి ఆడవాళ్లు తప్పకుండా హడలెత్తిపోతారు! సావిత్రి నాటకంలో యమ లోకం సీనులో ఎన్నోరకాల బాధలు చూపించి నారుగాని, నిజంగా ఆడదానికి శాశ్వతంగా భయము కలిగించే శిక్ష యేదో అది చూపించేదు కాదు! ఇట్టివాళ్లని యమభటులుగా నమోదుచేయించితే ఎంత భయంకరంగానైనా ఉంటుంది గదూ యమ లోకం! తలచెడ్డ అత్తగారినో ఆడబొట్టెనో వైతరణీ నదిదగ్గర చెట్టుక్రింద ముసుగేసి కూర్చోపెట్టి దానిచేత యీ అడుజీవిని యమలోకప్రవేశం చేయించి అచ్చట దానిశక్తి వినియోగం చేయింపిస్తే ఏ యమ భటుల శిక్ష దానికి సాటివస్తుంది? అది ఒక్కటీ చాలును. జన్మజన్మాలలోకూడా పాపముచేయమని యమునితో మొర్రపెట్టి విన్నవించుకోవడానికి!

'అంతభయ' మేమిటూ? అయ్యో! మీ మగవారి కేమి తెలుస్తుందండీ ఆడువారిబాధ! పిల్లకాకి కేమి తెలుస్తుందండీ ఉండవింటిదెబ్బ! మీరు మగరాజులు, పురుషవృషభులు, మీకు యిటువంటి బాధలయొక్క స్వభావము లేశమైనా బోధపడదు. మీ వొంటిమీద అతిదారుణమైన కురుపు ఉన్నదనుకోండి! మీ చేతులూ కాళ్లూ గట్టిగావిరిచి కట్టివేసినారనుకోండి! రెండు కాకులు తమ యినుపముక్కులతో అను క్షణమూ ఆ కురుపుపైని పొడిచి పీకుకొని తింటూ ఉంటే తమకు ఎలాగుఉంటుంది? ఇది ఒక మోస్తరుగా తెలుపుతుంది వారు పెట్టే బాధ యెట్టిదో! చావు బ్రతుకు కాని బాధ! జన్మజన్మాలకైనా అట్టిది వద్దు నా శత్రువులకైనా! అంతే నా నిత్యప్రార్థన, దేవుడన్నవాడుంటే వానికి!

'పట్టిప్రార్థనలే గాని యీకాలంలో ఫలాలు కని పించవు.'

ఎలాగు కనిపిస్తాయి వెంటనే! చెరువునిండితే గాని కలంకొట్టదు! తాళి చూస్తూఉండండి! ప్రార్థనలకు ఫలాలు రాకమానవు! దేశం తెలివి తెచ్చుకుంటున్నాది లెండి! బండిచక్రము తిరగకామానదు. క్రిందకొట్టిన బంతి యెగురకామానదు! అప్పుడు మాలాంటివాళ్లమీదా—మీరూ మీ అప్పా మీ అమ్మా అలాంటివాళ్లు క్రిందా! అప్పుడు తమాషా చూడండి! మరచిపోకండేం, రేపు ప్రయాణం!




—పూతచుట్టలుచేయువిధము—

ప్రశస్తమయిన సన్నబియ్యం 1 సేరు తెచ్చి రాళ్లు ఒడ్లు లేకుండా బాగుచేసి నీళ్లలో నానబోయవలెను. పూతచుట్టల కుండలు కుమ్మరిఇండ్లలో అమ్మును. అది తెచ్చి బోర్లించి మంచినూనె వ్రాసి యెండలో 1 వారం ముందుగా పైప్రకారం రోజుకి 4-5 వ్రాసి యెండలో పెట్టవలెను. బాగా నూనె ఇగిరిన కుండ జాగ్రత్త పెట్టుకొనవలెను-తదుపరి నానినబియ్యం బాగా కడిగి రాతిలోవేసి మెత్తగా కాటికవలె రుబ్బవలెను: అట్లు రుబ్బినపిండి 1 పాత్రలోకి యెత్తవలెను. ఇదివరకు చమురువ్రాసి యెండ పెట్టినకుండ పొయ్యిమీదపెట్టి క్రింద బాగా మంట బెట్టవలెను. కుండ బాగా కాలినపిదప మంట తగ్గించవలెను. ఇదివరకు రుబ్బివుంచుకున్న పిండి చిక్కని మజ్జిగవలె నీళ్లుపోసి కలిపి తెల్లనిగుడ్డ పలాచనిదిజేబురుమాలంత ముక్క చింపి రెండుకొసలు పట్టుకుని ఆ పిండిలోముంచి కుండకి రాయవలెను. అట్లు రాసి వేయగానే మరోమనిషి ఆ రేకుతీసి ఒకపళ్లెములో పెట్టుతూవుండవలెను అన్ని రేకులు సొంతముగాచేసిన తదుపరి ఒక పలాచని తడిచప్పి బాగా నీళ్లుపిడిచి పీటపయి పరిచి ఆ చేసినరేకులు పరచవలెను. కమ్మగాకాచిన నెయ్యి 1 సేరు-1 వీశ పంచదార తెచ్చి వేడి నెయ్యి ఒక్కొక్క రేకు పీటపయివుంచి నెయ్యిపోసి రేకుఅంతా చేతిలోవ్రాయవలెను. దానిపైన పంచదార ఒత్తుగా చల్లవలెను. 4, 5 రేకుమీద రేకులువేసి మూడువేళ్ల వెడల్పుగా మడవవలెను అట్లు మడిచిన చుట్టలు ఒకవెండి పళ్లెములో వరుసగా వుంచవలెను-యీ పిండివంట శుభకార్యములందు అల్లుళ్లకి విందులు చేసినప్పుడు చేస్తే చాలా గొప్పగా వుండును. ఇవి గొప్ప పిండివంట. మనదేశములో తర్చు చెయ్యరు. యీపిండివంట పడమటవాళ్లు తర్చు చేయుదురు. ఇది ఒకసారి మా సోదరీమణులు చేసి రుచిచూడ కోరుతున్నాను. చాలా రుచిగాను గొప్పగాను వుండునూ.

—కాంచనపల్లి వెంకటరంగనాయకమ్మ.

—కరుబుజా మురబ్బా—

కాస్త ముదిరిన కరుబుజాకాయ తీసుకొని దానిని నిలువుగా నాలుగుపయిటలుగా కోయవలెను. వీశె పంచదారయును ఒకసేరు నీళ్ళును యివి రెండును కలిపి మరగబెట్టి లేతపాకము పట్టవలెను. పాకము వచ్చిన తరువాత కోసిన కరుబుజాముక్కలు అందులో వేయవలెను. కొద్దిసేపు మరగనిచ్చిదింపి వేయవలెను. దించిన తరువాత యేలకపొడి, బాదమపప్పు, కిస్మిస్, యును కలిపివేసి రెండురోజులవరకు నదవుంచి వేయవలెను తరువాత చిన్నచిన్న ముక్కలుగాకోసి తినిన యెంతో రుచిగా నుండును.

—శాంతాబాయి.

—మామిడిపండ్ల షర్బత్—

శ్రేష్ఠమైన రసముగల మామిడిపండ్లుతెచ్చి యర్ర సేరు రసముదీసి, యొక కళాయిపాత్రలో బోయవలెను.

మూడుతులముల యాలకులపొడి, పావుతులము పచ్చకర్పూరము, మూడు గురిగింజలయెత్తు కుంకుమపువ్వు 5 తులముల పన్నీరు, మామిడిపండ్లరసములో వేసి కలియబెట్టవలెను.

5 కదంబపుష్పములు, 10 మాలతీపుష్పములు అయినను (లేక) తొడిమలు తీసుని 30 మల్లెపువ్వులైనను దానిలోవేసి యొకజాముసే పుంచవలెను.

తరువాత ½ సేరు చక్కెర పానకముంబోసి కలిపి వడియకట్టవలెను.

ఇది సేవించుటవలన వాతరోగములు, పోవును. శరీరపటుత్వము గలుగును. ఇయ్యది వేసవికాలమున సాయంసమయము సేవించవలెను.

—చదలవాడ రాఘవపద్మావతులు.



శ్రీమతి శివలెంక రాజేశ్వరిగారు

ష॥ 14. గ్ర॥ల॥ ముం దప్పుడప్పు డీమె వ్యాసములు వ్రాయుచుండును.



శ్రీమతి అమీదా ఖటూన్‌గారు

జెస్సూర్ మునిసిపల్ సభ కభ్యురాలైయుండి యిపుడు కమీషనరుగా నెన్నుకోబడెను.



శ్రీమతి ఆర్ కళ్యాణమ్మగారు.

సరస్వతీపత్రికా సంపాదకురాలు: సంఘ సంస్కర్త్రి: శ్రీ మైసూరు ప్రభుత్వమువారీయమను రెండుసంవత్సరముల వరకు స్పెషల్ మాజిస్ట్రేటుగా నియమించిరి



శ్రీమతి సావిత్రీకుండననిగారు.

సింధుదేశమున హైదరాబాదులో ఆనరరీ మేజస్ట్రేటుగా నున్నారు. ఈమె యొకప్పుడు మునిసిపల్ బోర్డున కధ్యక్షురాలైయుండెను.



పండరియా సంస్థానాధీశ్వరి.

బిలాస్‌పూరు వైద్యశాలయందు నేత్ర చికిత్సకుగాను ప్రత్యేకముగా రూ 3200 ల భవనము నిర్మించి యిచ్చిన దయావతి.

# మనోరమ

(కథావిధానము)

And often told a tale from mouth to mouth
As here at Chtrstmas. . . . *He* began
The rest would follow, each in turn; and so
We forged a sevenfold story. Kind? What kind?
No matter: we will say whatever comes.

—TENNYSON.

నేను కామేశ్వరమ్మగారితో కలసి మా సభాభవనమునకు బోవునప్పటికె ప్రియంవదయు లీలావతియు కళావతియు, మాకై నిరీక్షించుటయేగాక జరుపవలసిన కార్యక్రమమునుగూడ కొంతప్రారంభించి యుండిరి. ఆంధ్రమున నత్యపూర్వమగు పద్ధతిని ఆంగ్లకావ్యకథ నొకదానిని చెప్ప నూహించుచుంటిమనియు అది నవీనాదర్శలక్షితముగ చెప్పబడుననియుఁ దెలిసికొని మాయూరి కళాశాలయందలి కొందఱు విద్యార్థినులు కూడ వచ్చి సభ నలంకరించియుండిరి.

మేము పోవుసరికి కళావతి యుపన్యాస మారంభించియుండెను. మేము పోవుటకు ముందేమి చెప్పినదోకాని తరువాత యిట్లనుచుండెను.

ప్రాపంచికచర్యలను జీవకళ లుట్టిపడునట్లు చిత్రించుచు తిక్కనాది మహాకవులు తమ ప్రతిభావిశేషములను వెల్లడించుచువచ్చిరి. వారందఱును మహాధీమంతులు. అనర్గళ కవితాధాపారీణులు. రసబంధురభావధురంధరులు. అనల్పకల్పనాకల్పులు. కాని వారేమిచేసిరి? పూర్వేతిహాసస్వరూపమున భాషాంతరీకరణములఁజేసియు స్వతంత్రరచనల నెడనెడఁజొప్పించుచు ఉదాత్తరసాన్వితమైన కావ్యముల రచించిరి.

వేయేల? పరమపవిత్రమగు గీర్వాణభాషాక్షేత్రమునుండి మన పూర్వకవులు ఉత్తమకావ్యబీజముల దెచ్చుకొన్నను వానినాంధ్రక్షేత్రముల మొలిపించి తమ బుద్ధికౌశలమున మనోజ్ఞతరమైన నందనవనముల నిర్మించిరి. ఆ కావ్యము లసాధారణమాధురీధురీణములగుటయేకాక, అనన్యసాధారణమగు ప్రతిభావిశేషమునకును ఆలవాలమైయున్నవి. అది ఆకాలమహాత్త్యము. నాఁడాంధ్రజాతి సర్వతంత్రస్వతంత్రమై, వీరగాథాకర్ణనోత్కంఠాకుంఠితమై, మనోహరరసభావభాసురమై ఉత్తమశూరపూజాభిలాషమైయుండెననుటకు సందేహములేదు. పూర్వకవుల గ్రంథములు పేరునకు భాషాంతరీకరణములుగఁ గనబడుచున్నను వానియందనన్యసాధారణమైన సహజప్రతిభయు, కల్పనాశక్తియు, ప్రజ్ఞావిశేషమును నిండి నిబిడీకృతమై యున్నవి.

ఇట్టి శక్తి తరువాతి ప్రబంధకవుల కంతగ లేదు. వారు మహావిద్వాంసులే కావచ్చును. వా రనర్గళ పద్యధారాపారీణులేకావచ్చును. నిరుపమానవచోరచనా విశారదులే కావచ్చును. అయిననేమి ? వారు శబ్దమాధుర్యమునకును, శబ్దమంజులత్వమునకును ప్రాధాన్యమిచ్చి శ్లేషకల్పనమున, బంధకవిత్వమున, ఆరోహణావరోహణాది దుష్కరపద్యరచనా కౌశలమున శబ్దములతో 'గుస్తీ' పట్లనుబట్టి భాషారంగమున నెంత దొమ్మరిపనులనైన జేయుచువచ్చిరి. వట్టి యసాధారణప్రక్రియల చేత జిత్తక్లేశకరములగు చిత్రచిత్ర కవిత్వములను జెప్పిరికాని చిత్తాకర్షముగ నవకళలుదయింపఁజేయునట్టి కావ్యములఁజేయజాలకపోయిరి. 'సాక్షి' గ్రంథకారులు చెప్పినట్లు చెవులకొఱకేకాని చిత్తముకొఱకై చెప్పిరాయను భ్రాంతిని బుట్టించునట్లు గ్రంథములు వ్రాసిరి. బాలుర దీపావళినేతుకవలె అర్థనాశకశబ్దాడంబరసహితముగ ప్రబంధము లొనర్చిరి.

అంతేగాదు, మనువసు చరిత్రకారులలో నెవ్వరినో ప్రబలాదర్శముగఁ బరిగ్రహించి తక్కుంగల ప్రబంధకారు లందఱు వారు చెప్పినన్ని యాశ్వాసములే, రమారమిగా వారు చేసినన్ని పద్యములే, వా రొనర్చిన కల్పనలతోడనే సీసమునకు సీసము, గీతమునకు గీతము, కందమునకు కందము, రగడకు రగడయు చెప్పుటయే ప్రతిభగ దలంచుచు వచ్చిరి. అందువలన ఆంధ్రమున 'నిమిరేషను' వసుచరిత్రము లెన్నియైన కుప్పతిప్పలుగ బయలుదేరినవి. ఒకరినిజూచి యొకరిట్లు కావ్యములు వ్రాయుటవలనఁ గడ కాంధ్ర గ్రంథములలో నవ్యతయు, కల్పనయు, స్వతంత్రతయు, లోపించి పోయినవి. సంగీత సాహిత్యములలో నసాధారణప్రజ్ఞగల రామరాజభూషణుని వా రాదర్శముగా బరిగ్రహించిరికాని చిత్రకల్పనయందు, సహజప్రతిభయందు, స్వతంత్రభావసంపన్నతయందు నెల్ల దేశములలోను, ఎల్ల వాఙ్మయములందును నిరుపమానప్రజ్ఞాధికుఁడని చెప్పఁదగిన పింగళి సూరనార్యునివలె కావ్యకల్పనమొనర్పనూహించిన వారు కారు. బహుభంగుల శృంగారకావ్యముల రచింప నేర్పరులయినను కళాపూర్ణోదయమువలె శృంగారరసాత్మకమైన చిత్రకల్పనముల నొనర్పఁజాలక పోయిరి. సాటిలేని కల్పనలకు బుట్టినిల్లయి మహామనోహరమైన ఇట్టికావ్య ముదయించిన భాషయందే కల్పితకావ్యము లంతగ లేకపోవుట శోచనీయము.

ఆంగ్లభాషయం దిట్టి స్వతంత్రకావ్యము లెన్నియైన నున్నవి. సమకాలికమహాదాశయ ప్రతిబింబితములైన కావ్యపరంపర లెన్నియైన నాంగ్లభాషయం దుదయించినవి. ఆహా ! ఎంత స్వల్పజీవితము గలభాష, ఎంత ప్రపంచము నెంత బలముగ నావరించి యున్నది ? మానవజీవిత ప్రతి బింబితమైన కావ్యము లెల్లకాలములలోను దానియం దుదయించుటచేతనే ప్రపంచరంగమున నాంగ్లభాష కిట్టి యున్నతస్థానము కలిగినదని నే నూహించుచున్నాను.

అట్టి పద్ధతుల ననుసరించి గ్రంథకారులు మనభాషకు వన్నెయు, వికాసమును జేకూర్ప వలసియున్నది. ఉత్తమాదర్శబోధకములును నవీనభావ (New ideas) బంధురములు నగు స్వకపోలకల్పిత కథలనుగాని, ఏవేని యట్టి పరభాషా కథలనుగాని సరసముగ, సమంజసముగ, సందర్భముగ జెప్పి ప్రపంచమున నన్నిరంగములలోను నిరంతరీకృతముగ నేర్పడుచున్న పరివర్తనములను హృదయాకర్షముగ బ్రదర్శింపవలసియున్నది. ఇట్టి నవనవాదర్శప్రదర్శనమొక యుద్దేశముగ మేమీ 'రాజకుమారి' యను కథను చెప్ప నూహించుచుంటిమి.

ఫిబ్రెవరినెలలో నేనును లీలావతియు విశ్వవిఖ్యాతమైన రవీంద్రనాథఠాగూరుగారి శాంతినికేతనమునకుఁ బోయియుంటిమి. మా యిరువురకును బంధువు లొకరక్కడ విద్యాభ్యాసముచేయుచు మమ్మిరువురను అప్పుడగుచున్న శాంతినికేతన సాంవత్సరికోత్సవములను జూచునిమిత్తమె రావలసినదని కోరియుండుటచేత నచటికిఁ బోతిమి. ఆ మహోత్సవము లోకమాన్యుఁడగు రవీంద్రనాథుని సమక్షమున అధికవైభవముతో, నత్యంతరమణీయముగ జరుగుచుండగ నుపలక్షించు భాగ్యము మాకు లభించినది.

ప్రాక్పశ్చిమ విజ్ఞానతేజములను సమీచీనముగ, నేకరంగమున బొందుపరచి నవీన శాస్త్రవిజ్ఞానమున కన్నుల వైకుంఠముగ నొనర్పఁబడిన నాటియుత్సవవిశేషములు నెంతఁ గొనియాడినను గొనియాడఁదగినదే. కాని యట్టి ప్రసంగ మప్రస్తుతమగుటవలన నేమియుఁ జెప్పను.

అప్పు డొకనాటిరాత్రి మానవచరిత్రమున స్త్రీలు ప్రదర్శింపుచువచ్చిన యున్నతికిని, బతనమునకును గల హేతువులను గూర్చి దర్కించుచుఁ గూర్చుంటిమి. శాంతినికేతనమున బాలురతో సమానముగ బాలికలకు గూడ విద్య గఱపబడుచుండుటయే అట్టి చర్చకు గారణమైనది.

మమ్ము శాంతినికేతమున కాహ్వానించిన ఆ విద్యార్థి యిప్పుడు స్త్రీ లెన్నివిద్యలను నేర్చినను పూర్వస్త్రీలవలె నంతగ ప్రజ్ఞానివ్రతలు కాజాలరని చెప్పఁదొడంగెను. అందుకు దార్కాణముగహిందూదేశమంతయునేకచ్ఛత్రముగ నేలవలయునను వంకఁబెట్టుకొని నిష్కారణముగ పరరాష్ట్రములపై దండెత్తిపోయి వానిని నొకటివెంబడి నొకటిగ కబళింప సాహసించిన యక్బరుచక్రవర్తి నెంతమాత్రమును సరకుసేయని రాణీ దుర్గావతి చరిత్ర మతఁడు చెప్పఁజొచ్చెను. ఆమె చరిత్రమే యితివృత్తముగాగల కథ నొకదానిని నాతడు చదువుచుండెను. ఆమె తనపై దండెత్తినచ్చిన తురుష్కసరదారు నెంతమాత్రమును లక్ష్యముసేయక పురుషవేషమును ధరించి అశ్వారూఢయై మొగల్‌సైన్యముల నెదుర్కొనెను. ఆ సరదారుఁ డామెను జయించి అక్బరు పాదుషాయొక్క విఖ్యాత వైఖరి ననుసరించి పరిణయమాడ నూహించెనట! అట్టి విపరీతమగు హైందవమహమ్మదీయ సమ్మేళనమున కామె సమ్మతింపక

పోవుటయేగాక మహోమర్షమున శత్రువుల మార్కొన నూహించెను.

ఆమె ప్రజలెల్ల తురుష్కుల దండయాత్రచే భయవిహ్వలులయి, హతాశులయి యుండగ నామె తన కోటనుండి రణఘోషములతో వెలికివచ్చి ఝచ్చుఱపిడుగువలె శత్రువులపై బడెను. కన్నుల నిప్పులు గుజిసాయుచుండగ నుగ్రసంగరోత్సవమునకుఁ దలపడి కొందఱను దన గుఱ్ఱముక్రిందఁ ద్రొక్కివైచెను. కొందఱను నిటతాటనముగ ఖండించి వేసెను. కొందఱను తుపాకి గుండ్లతో చిందఱ వందఱ జేసివైచెను. కొందఱను ఏనుగులక్రిందఁ చిరుసుగ్గుగ బొడి చేసెను. కొందఱను ఫిరంగిగుండ్లచే రౌద్రరస మహోగ్రముగ దుత్తునియలు చేసివేసెను. ఆహా! ఎంత యద్భుతజనకముగ యుద్ధము చేసెను!! కూలిపోవు రూపమును, దన్నికొనెడి రూపమును, నొఱుగురూపమును, నేలకొఱుగు రూపమును బొరలు రూపమును నగు యుద్ధభూమియందు నిష్కంప ధైర్యోన్నతితో యుద్ధ మొనిర్చినదే!

లీలావతి—ఓ మిరకిల్ ఆఫ్ విమెన్! ఓ నోబుల్ హార్ట్—ఓ మిరకిల్ ఆఫ్ నోబుల్ వుమన్‌హుడ్!!_అని టెన్నిసన్ వర్ణించినట్లు-

కళావతి—అవును. ప్రత్యక్షదుర్గవలె దుర్నిరీక్ష్యముగ శత్రుసైన్యముల నుఱుమాడినదే! స్త్రీ లిప్పు డెంతటివారైనను ఇప్పు డింతటి వీరకాంత యున్నదా! అని యత్యుత్సాహమున నతఁ డామెను ప్రశంసింప జొచ్చెను. 'నభూతో నభవిష్యతి' అని చెప్పఁదగిన ఉత్తమప్రజ్ఞను ఆమె ప్రదర్శించినదని అతఁడు సంభాషించుచుండగా నీ లీలావతి 'లేకపోవుట యేమి? అంతయు తరిఫీదునందున్నది. అట్టి స్త్రీ లిప్పు డెన్నివేలైన కలరు. అట్టి కీర్తి కవకాశములేక పురుషుల దౌర్జన్యమున యిండ్లలో బానిసీఁడ్రవలె నిరర్థకపుబ్రతుకుల బ్రతుకుచున్నారు.' అని యుద్వేగముగఁ బ్రత్యుత్తర మిచ్చినది. అప్పుడు లీలావతి సభలో—

'క్రైస్ట్ ప్రు, ఇటీజ్ ది టిరనీ ఆఫ్ మెన్. ఐయామ్ నెవర్ మచ్ ఎనే మర్‌డ్ ఆఫ్ ది బెనిఫిట్స్ ఆఫ్ హీ సొసైటీ.* హవ్‌డేర్ దే టీజ్ అస్!'

కళావతి—లీలావతి యిదేవిధముగ నప్పుడును సంభాషించినది. ఆమె యట్లనుచుండగా టెన్నిసన్ వ్రాసిన ప్రిన్‌సెస్ అను గ్రంథములో 'లిలియా' అను నామె గూడ నిదేవిధముగ బ్రసంగించుట నాకు జ్ఞప్తికివచ్చెను. లిలియా అను నామె లీలావతివలెనే చెప్పినదని నే నంటిని. అప్పుడు లీలావతి కా ప్రసంగమును స్వయముగా జూచునంతవఱకు తోచినది కాదు.

లీలావతి—నాకు జ్ఞాపకమున్నది. ఆ పుస్తకమున నేను చెప్పినట్లే యున్నది.

* He-Society—టెన్నిసన్ స్త్రీసంఘమనుటకు 'She-Society'— అని ప్రయోగించినాడు. ఆ పద్ధతినే లీలావతి 'పురుషసంఘ'మనుటకు 'హీ' సొసైటీ యనుచున్నది.—

Quick answer'd Lilia "There are thousands now
Such women, but convention beats them down :
It is but bringing up ; no more than that :
You men have done it : How I hate you all !
Ah, were I something great ! I wish I were
Some mighty poetess, I would shame you then,
That love to keep us children ! O I wish
That I were some great princess, I would build
Far off from men a college like a man's
And I would teach them all that men are taught ;
We are twice as quick !"

కళావతి—అని యీ నైఖరిని టెన్నిసన్ చేఁ జెప్పఁబడిన వాక్యములు నాకు స్మరణకు వచ్చి ఆ గ్రంథమునకు ఆంధ్రానువాద ముండినయెడల బాగుండునని తోఁచినది. కాని టెన్నిసన్ వ్రాసిన విధముగ తెనుగుసేత దుష్కరముగ దోచుటచే నిన్ని దినములు నూరకుంటిని. క్రిందటి సమావేశమున నే నీ ప్రసంగమును చెప్పుటయు దానినంద ఱామోదించుటయు జరిగినది.

నాకీ బుద్ధిపుట్టుటకు శాంతినికేతనమున లీలావతి ప్రసంగమే మూలకారణమని చెప్పుచు నే నీ కథను ప్రారంభించెదను.

టెన్నిసన్ తన కావ్యమున సృష్టించిన లిలియా చెప్పిన పద్ధతిగ నూహించువారు ఇప్పటి విద్యావతులలో నెందఱైన కలరు. ఇంటింటను ఇపుడొక లిలియా యున్నదని చెప్పవచ్చును.

అపుడు సభలోనున్న విద్యార్థినులు—ఇజ్ నెవ్విరి హౌస్ ఎ లిలియా! నై నాట్ లీలావతీ ఎ లిలియా ఆఫ్ ఆల్! షి ది లిలియా ఆఫ్ దిస్ సొసైటీ-యస్-సర్టెన్లీ-అని తమలో దా ముత్సాహమున చెప్పుకొనఁజొచ్చిరి.

కళావతి—ఇట్ ఈజ్ క్వైట్ అన్‌బికమింగ్ ఆఫ్ యు టు షౌట్ ఔట్ యువర్ ఒపీనియన్స్ వైల్ వు యార్ స్పీకింగ్. ఒకరు సభలో మాటలాడుచుండగ నడుమ నంతరాయముగ మీ రిన్ని విధములుగ మాటలాడుకొనఁగూడదు. సభానంతరమున మీ మీ యామోదములను వెల్లడించుకొనవచ్చును. మీరు మా సభకు వచ్చి మా ప్రసంగములను శ్రద్ధతో వినుచున్నందులకు నా కానందముగనున్నది. క్రిందటి సభలో ప్రియంవద సూచించినట్లు నే నీ కథ నుపక్రమించెదను. నా వెనుక ప్రియంవద, లీలావతి, కామేశ్వరమ్మ, మనోరమ యను నలుగురునుకూడ క్రమముగ కథను పూర్తి చేయుదురు. మూలగ్రంథమున నీ కథ నేడాశ్వాసముల నున్నది. మే మయిదుగురము మొదట నైదాశ్వాసములను చెప్పిన తరువాత మిగిలిన రెండాశ్వాసములను ప్రియంవదయు నేనును చెప్పి కథను నిరవశేషముగాఁ జెప్ప నేర్పఱచుకొంటిమి. మూలగ్రంథ మాంగ్లమున పద్యకావ్యముగ నున్నది. దానిని ప్రస్తుతపద్ధతి ననుసరించిన నెక్కువ సుబోధ్యముగా నుండునను నూహతో వచనరూపమున మా మా యభిరుచులనుబట్టి మార్చియు, పెంచియు, కల్పించియు చెప్పెదమని మీరు గమనించవలెను. ఇట్టిరీతి కథారచన మాంధ్రభూమికి క్రొత్త. ఆ యాంగ్లకావ్య కల్పవృక్షచ్ఛాయను గూరుచుండి మా కంత కష్టమనిపించకుండ మీ కీ కథను వినుపించఁగలము. కథ నొకరు చెప్ప ముగించిన తరువాత నడుమ విద్యార్థి

నులు మీ శ్రేష్ఠమైన గీతములుగాని సంగీత మునుగాని మాకు వీనుల విందుగా వినుపించినయెడల మా కీ కథాకథనమున శ్రమ యుండదు. కథ యొక్క రాజకుమారునిచేత నాత్మచరిత్రముగ చెప్పఁబడునని మీరు తెలిసికొనవలెను. కథ ఏమి విధములుగా చెప్పిననూ ఒక్కటే యితివృత్తము.

లీలావతి—యస్. సెవెన్ బట్ వన్. సెవెన్ హెడెడ్ మాన్‌స్టర్స్ మేక్ టు కిల్ టైమ్ ఇన్ వింటర్.

తరువాత కళావతి కథ నుపక్రమించెను. ఆమె చెప్పినట్లు మే మొకరితరువాత నొకరుగ కథను చెప్పి ముగించితిమి. నడుమ నడుమ విద్యార్థినులు గీతములఁ బాడుచు వచ్చిరి. మే మయిదుగురము వక్తలమై చెప్పిన కథ నిక పాఠకులకు తెలియఁజేయుటయే కొఱత.

ఇది మనోరమ యను నవలికాస్వరూపమునఁ
ద్వితీయ ప్రసంగాంతర్గతమగు రాజకుమారియను దిఫను బ్రస్తావన.

---

## శ్రీ కనకదుర్గ

శ్రీమతి కర్లపాలెం రాజ్యలక్ష్మమ్మగారు

సీ॥ * మహిషాసురునిఁ జంపి మాతృవత్సలతను దేవతాభయంబు దీర్చినావు;
దుర్గమాసురుఁబట్టి దోర్గర్వమడగించి దుర్గాభిధానంబు గొంటివినావు;
మాధవవర్మాఖ్య మహికాంతున్యాయ దీక్షను మెచ్చి కనకంబుచినికిరావు;
ఇంద్రకీలునికోర్కె నీడేర్ప నెంచి మా విజయవాడపురాన వెలసినావు,
గీ॥ కృష్ణవేణీ తటస్థేంద్రకీలశిఖరి కనకదుర్గాంబ వనిజనుల్ వినుతిసేయ;
ఇమ్మహానవమీయుత్సవమ్ములందు సమ్ముద యొసంగుమమ్మ! దుర్గమ్మతల్లి!!

---

* "బెజవాడలో దుర్గాలయమున్న కొండను "ఇంద్రకీలాద్రి"యందురు. ఈగిరి కధిష్ఠానచైతన్యమున కింద్రకీలుడని పేరు. ఇతడు పూర్వకల్పమున కృష్ణవేణియందు స్నానము చేయుచు తత్తటమున తపమాచరించెను. శివలాతని తపమునకు మెచ్చి వరమడుగు మన నింద్రకీలుడు వల్లెయని యాశివల కాసనముగనుండు భాగ్యమిమ్మని ప్రార్థించెను.

మహిషాసుర సంహారానంతరము పరదేవత యదేస్వరూపముతో పర్వతహృదయాపేతమం దావిర్భవించెను. ఇచటనే దుర్గమాసురుని సంహరించుటచే నీమెను దుర్గయనియు బిలుతురు. మాధవవర్మ యను రాజిచట రాజ్యము చేయుకాలమున రాచకుమారు డొక తిలఘాతకుని కుమారుని చంపెను. అంత రాజు తన కుమారుని ఘోరకృత్యమును విని మోమోటమిలేక, న్యాయశాస్త్రము ననుసరించి నేరమునకు శాస్త్రోక్త దండనమును విధించెను. రాజుయొక్క ధర్మనిరతిని మెచ్చి పరమేశ్వరి (ధర్మనమిచ్చి) యా తిలఘాతక పుత్రుని బ్రతికించి తాను దర్శన మిచ్చినందుకు గురుతుగ చినుకుకు చిన్నముసంతున కనకవర్షము కురిపించెనట. నాటంగోలె నీపురి కనకపురియనియు, ఈశ్వరి కనకదుర్గయనియు పిలువబడుచుండెను."

# స్త్రీవిద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం.ఏ;బి.యల్.

కళోపాసనమందును, సేవాధర్మనిర్వహణమందును గల సహజశక్తి స్త్రీకి గృహపాలనమందును గలదు. గృహముపట్లను, గృహపాలనము నెడలను నవయుగమున క్రొత్త అపోహలు పొడఁగట్టినవి. గృహము నఖైదనియు, గృహపాలనము బానిసదనమనియు నర్థముచెప్పు మహాశయులు నేఁడు కొల్లలుగ నున్నారు. ఈ అపోహను పురస్కరించుకొని, సంఘమందు వీరు పోరు సృష్టింపఁ గలుఁగుచున్నారు.

ప్రాచీన భారతీయులును, గ్రీసువాసులును గృహమేమో గుర్తించి, అందుండియే తమతమ కురుక్షేత్రములకెస స్యందనములు నడపుకొనిరి. సృష్టిముఖమున రంజిలు సింగారమంతయు, సృష్టిహృదయంపలి భావకుట్మలములనుండి ప్రస్ఫుటించులాగున, గృహమున మొలకలెత్తు భావాంకురములనుండియే, శాఖోపశాఖలై వృద్ధిఁజెంది మనుష్యజీవనము పువ్వులుపూచి, దివ్యసౌరభముచే దశదిశల వలరించును. ఉన్నతరంగములందుఁ దోఁచి, శతాబ్దులసృష్టి నాకర్షించిన మహాపురుషులు ఇండ్లయందలి తొట్లెలందు పెరిఁగిరి కాని, రచ్చలందలి కటికిరాళ్లపైఁ గాదు; మహత్తరాశయములను గృహమందలి మధురప్రేమ స్తన్యమునఁ గ్రోలిరి గాని, నడివీధులందలి బొమ్మరిగెడలనుండి పుడికిరి కారు. త్రిమూర్తులుకూడ జననిపాలనమును కాంక్షించి, పసిపాపలై కొండొకపడి అనసూయ కుటీరములోని తొట్టియయందు జిలిబిలి పలుకులు నేర్చిరి. ఆద్యంతములులేని ఆకసమున చక్కని సంఘమేర్పఱుచుకొని, తళుకులీను జీవనమును గడపు చుక్కలలీల నొప్పి, విశాలవనములందు విచ్చలవిడి బ్రదుకున నల్లాడియుండక, తొల్లింటి మునిమాతలు, గృహములు నిలుపుకొని అందుండి తీయని ఆశీస్సుల నాలాపించి ఎందఱెందఱు సీతలనో తనిపిరి.

నేఁడు సోదరీమణులందు విద్య గృహధర్మమును ఉద్బోధించునది కాదనుట స్పష్టవిషయము. నేఁటి స్త్రీవిద్యయొక్క పునాదులు ఉత్తమ భారతసంప్రదాయమున లేవు. భారతజాతికి విజ్ఞానభాండాగారమైన కొండొకగతము కలదని గుర్తించుట కట్టి చిహ్నములను నేఁటి విశ్వవిద్యాలయములందు లేవు. ముఖ్యముగ దక్షిణసీమస్థులు ఆంగ్లవిద్యకే అంజలెత్తి మాతృభాషను మూలఁబెట్టిరి. పురుషవిద్యను మేలుబంతి జేసికొనిన స్త్రీవిద్య, ఒరపడియందలి ఓగుల నన్నిఁటిని తనవశ మొనరించుకొనుచున్నది. నేఁడున్నతవిద్యనందు స్త్రీలు మాతృభాషనుండి దూరముగ తొలఁగిపోవుచున్నారు. భారతమహత్త్వమును పునరుద్ధరింపఁగల ఆశయములు, మనుష్యత్వ జాతీయత్వములను నిలుపఁగల ఆదర్శములు మాతృభాషయందును, దానికి నెచ్చెలియై వెలయుచున్న సంస్కృతమునందును గోచరించును గాని ఆంగ్లమందు కాదు. ప్రేమధారలు మాతృస్తన్యమునుండియే కురియునుగాని, పైనుండి దిగుమతియగు పాలడబ్బాలనుండి కాదు. ఈ విద్యాసంస్థలందలి లోపములు గుర్తించి, వానిని తమదరి చేరనీకుండ స్త్రీలు తమ విద్యాలయములను నిర్మించుకొనుట లేదు. స్త్రీ పురుషు లొకే పెద్దబోనున-నొకే విద్యావిధానమున-బంధితులగుచున్నారు.

చదువుకొనిన కొలదిమంది విద్యాధికులలో వృత్తిపోటీలు రేకెత్తుచు, వారిని నేఁ డధోగతిఁ జేర్చినవి. పురుషులతో సరిసమముగ నిలుచుట దమ ప్రత్యేకజాతి మహత్త్వమును వ్యక్తపఱచుకొనుటయని అపోహపడి, గృహధర్మమునుండి ముందులకు లంఘించుచు నేఁ డనేకస్త్రీలు పురుషవృత్తుల కఱ్ఱులు చాపుచున్నారు. గతిమోక్షములులేని నేఁటి పురుషవిద్య గ్రుడ్డెద్దుచలె మసలుచుండ "ఇట్టిది కూడదు. వేఱు తెరగు విద్యను నెలకొలుపుట మన కర్తవ్యము" అని పలుకు సోదరీమణు లింకను భారతదేశమున గోచరింపకుండుట శోచనీయము. సోదరులతో సరిసమముగ నిలువవలయు తరుణము, వారెత్తుకొండపై నిలుచు ముహూర్తమం దుండును గాని, లోతుగోతిలో వారు దిగఁబడిన వేళయందుఁ గాదని ఉద్బోధించు సోదరీమతల్లులు కానరాకున్నారు. నిండువిద్దెనందిన మహిళ లీ విషయమును దృష్టియందిడికొని సోదరీమణులకు సత్ప్రబోధము చేయుట సమంజసము.




## సంధ్యానటుడు

[illegible] రామారావుగారు

(సారస్వతమిత్రమండలి)

ముసలి దివసము కనులు
మూసుకొను సమయాన
దుముకు చందురుడల్ల
తొంగిచూచే వేళ
ఆ మహోన్నత హిమా
హార్య మకుటమ్ముపై
రతనాల చవికెలో
సతి కొల్వుతీర్చినది.
లేవు కులభేదములు
లేవు మతభేదములు
దారిద్ర్యమే లేదు
ధనమదాంధత లేదు
ఒక్కటేస్వాతంత్ర్య
మొక్కటేయానంద
మాదేవి సముఖాన
అందరూ ఒక్కటే.

రాజేశ్వరీచరణ
లాక్షారుణముకాంతి
విశ్వవిశ్వాలంట
విరిసినది, కురిసినది;
ఒక్కటే చీకటై,
ఒక్కటే వెలుతురై,
తెలియరాని దదేదో
కలవినది లోకాల.
ఆ సంజవెలుగులో
ఆ నిండుకొలువులో
ఆ ప్రళయనటరాజు
హరుడు నాట్యమ్మాడె.
నొసటిపై కనుచిచ్చు
నుసిమంట లుమిసినది;
ఉరముపై పన్నగం
బూగి బుసకొట్టినది;

చరణమంజీర భీ
కరిత ధ్వాన
మహాశాంతమున ప్రతి
ఘల్లలాడించినది.
హిమశైలకఠినశృం
గము తూలిపోయినది;
హరుని పాదముక్రింద
ధరణి కంపించినది.
ఆ సంజవెలుగులో
ఆ శాంతములనుండి
ఒక్కటే [illegible]
ఒకమాట వినిపించె.
"హరహరా! శంభో! మ
హాదేవ! శంకరా!
చాలింపుమోయి నీ
సంధ్యానటన మింక"...

---

## కథ

సం॥ శ్రీమతి మద్దాలి లక్ష్మీకాంతమ్మగారు

ఒకగ్రామములో వైశ్యకుల మాణిక్యంబు కొక కుమారరత్నంబు గలిగెను. ఆ పిల్లవాడు కృపయని నడగు కనకవర్తకు డొకడుండెను. అతని పిలుచుచూ అల్లారుముద్దుగా పెంచుచుండెను.

కొంతకాలమునకు ఆమెకు తల్లిదండ్రులు వివాహముచేసిరి. అచటనే భార్యాభర్తలిరువురు సుఖముగా కాలముగడుపుచుండిరి. కొన్నిదినములకు మన నూతనదంపతులు హరిలంక కేగదలచి ప్రయాణసంసిద్ధులై వెడలిరి. మార్గమధ్యమందు వాన గాలి తీవ్రంగా వీచుటచేత బండి సాగనందున నిలచియుండిరి. అంతకంతకు ప్రబలమైనది. సర్పమువచ్చి భర్తయైన కళాశేఖరుని కాటంవేసు. అతను మూర్ఛితుడయ్యెను. అప్పుడు కృప దీనస్వరముతో పాటపాడెను.

## ధన్యాశి—ఆదితాళం

ప. నిరాకరించుట నీకుతగదురా నీలమేఘవర్ణా ॥ని॥

అ. పరాకుమానిక చిరాకునొందక మురారిమొరవినరా విఠలా ॥ ని ॥

చ. వ్యర్థురాలను పార్థసారథి సార్థకమునుజూపు।

అర్థమేమిది ప్రొద్దుబుచ్చెదవు నిద్రబూనినావా విఠలా ॥ ని ॥

వాసుదేవనీ దాసురాలను దోసిలొగ్గినాను ।

ఆశదీర్పరా కేశవనాదగు దోసమెన్న పోకురా విఠలా ॥ ని ॥

ఎన్నడుజూతునో చిన్నివిఠలనా కన్నులారనిన్ను ।

పన్నగశయనా సన్నుతించెదను కన్నడసేయకురా విఠలా ॥ ని ॥

విన్నవించితిని యెన్నోమారుల నన్నుబ్రోవుమని ।

కన్నతండ్రినా విన్నపమువిని సన్నిధిజేర్పవదేరా విఠలా ॥ ని ॥

చిలకలపూడిలో చిన్నివిఠలనా పలుకువినవేలా ।

అలుకలేలరా ఆర్తశరణ్యా కలికిరూపలక్ష్మీకాంత నేలుము ॥ ని ॥

ఇట్లు పరిపరివిధముల ప్రార్థింపగా పండరినాథునకు దయగలిగి దీనభక్తురాలగు కృపకు దర్శనమిచ్చెను. అంత నామె తనకు పతిభిక్ష పెట్టవలసినదిగా కాళ్లపైబడెను. దయార్ద్రహృదయుడగు పండరినాథుడు పాదముల నుండి కృపను లేవదీసి సుమంగలీభవయని యాశీర్వదించగానే నిద్రనుంచి మేల్కాంచిన విధంబున భర్తలేచెను. అంతట అంతర్థానమయ్యెను—మరుదినం తెల్లవారగనే మరల కష్టపరంపరలనుంచి విముక్తులై ప్రయాణమై సుఖముగా హరిలంకజేరిరి. సదా పండరీనాథుని భజనలతో భజింపుచుండిరి. పాండురంగనికిజై —కథ కంచికివెళ్లింది—

# బాలవిజ్ఞానశాఖ

## పాటలు

### ఉయ్యాల ఊపు

అడివి బాపిరాజుగారు, బి. యె., బి. యల్

నిదరపోవే చిన్నితల్లీ,
నిదరపోవే పిచ్చితల్లీ,
నిదరపోవమ్మా, చిల్లీ

నిదరపో !

నిదరపోశొంటే సిరిసంపదలు
కనులలోపూస్తుంటాయి, నవ్వుల
సుమలుపూతుంటాయి, ఆటల
కథలు చెపుతుంటాయి

తల్లీ ! నిదరపోవమ్మా !

పసిడికనురెప్పల్, నానిమాటుల
పవ్వళిస్తున్నాయి, సఖీ
పాప ఉయ్యాళ్లా, రంగుల
పటములూ బొమ్మల్.

తల్లీ ! నిదరపోవమ్మా !

బొమ్మరిల్లే నీకు జగమంతా, తల్లీ
బువ్వమాడే తీపులే, గుజ్జన్నకూళ్లూ,
అవ్వచెప్పే కథలదే,
మవ్వంపుపాటలె, నీకు జీవితమూ,

తల్లీ ! నిదరపోవమ్మా !

కలలుకన్నా గంతులేసిన
లలితసుందరరాగమే తల్లీ,

తల్లీ ! నిదరపోవమ్మా.

—:0:—

## కథలు

### అల్లుడు—మల్లుడు

శ్రీమతి చిల్లరిగె కృష్ణకుమారిగారు

సుకుమారశాస్త్రి కాపురస్థలము మద్రాసు. ఈయన ప్రస్తుతము మద్రాసునందు పోస్టుమాస్టరు. ఈయన మామగారు మొదట ఇస్కూలుమాస్టరుగానుండి పించెను పుచ్చుకొని ప్రస్తుతము తెనాలియందు నివసించుచుండెను. సుకుమారశాస్త్రికి వివాహము అయి ఒక సంవత్సరమైనది. అప్పుడు ఈయన సన్నగా కోమలముగా నుండెడివాడు. అందువలన వాని మరదలు వానిని 'సుకుమారబాయి' అని హాస్యముచేయుచుండెడిది. అందుచేత అతడు ఉడికి ఈ సంవత్సరము బాగుగా కుస్తీచేసి గుర్తుపట్టుటకు వీలులేనంత బలిసి పస్తాదువలెనుండి మరదలుపై మారుహాస్యము చేయవలెనని యువ్విళ్లూరుచుండెను.

ఇట్లుండగా దీపావళిపండుగ వచ్చెను. అప్పుడు అతని ప్రియసతి వద్దనుండి ప్రేమాహ్వానమువచ్చెను. అందుచేత ఈయన తనకు

రెండువారములు సెలవుకావలెనని ఆఫీసు మేనేజరునడిగెను. కాని ఇంకను జవాబు రాలేదు. అందుచేత ఆఫీసులో జవాబుకొఱకె దురుచూచుచుండెను. చిట్టచివరకు 5 గంటలకు సెలవుఇచ్చినటుల జవాబువచ్చెను.

మరునాడు 2 గంటలకు శాస్త్రి తెనాలియందు దిగెను. అప్పు డాయన వదులు లాగును పక్కగుండీల చొక్కానుధరించి చేతిలోనొక దుడ్డుకఱ్ఱను బట్టుకొనియుండెను. మరియు నాయనతోనొక తుపాకినికూడ తెచ్చి చూపరులకు తన పౌరుషమును ప్రకటించుచుండెను. శాస్త్రి బండిదిగి తనకొఱకెవ రైన వచ్చిరేమోయని నాలుగువైపులను జూచెను. కాని యెవరును రాలేదు. శాస్త్రి క్రిందటిరోజున ఒకటెలిగ్రామును తనమామగారికి ఇచ్చియుండెను. కాని అది ఆయనకు అందలేదు.

తరువాత ఒకకూలీవానిని బిలచి సామానులను బండిలోపెట్టించి ఇస్కూలుమాస్టరు అగు పింఛెనుపుచ్చుకొనిన నారాయణశాస్త్రి గారింటికి తీసుకొని వెళ్ళుమనెను. తరువాత కొంతసేపటికి ఆ బండి ఒకపెద్దడాబాముందు నిలచెను. అప్పుడు సుకుమారశాస్త్రి బండి లోనుండిదిగి లోపలకువెళ్ళగా గుమ్మమువద్దనౌకరు కూర్చునియుండెను.

శాస్త్రి:—యిదియేనా ఇస్కూలుమాస్టరు నారాయణశాస్త్రిగారి ఇల్లు?

నౌకరు:—అవును.

శాస్త్రి—లోనికివెళ్లి అల్లుడుగారు వచ్చిరని తెలియజేయుము.

వెంటనే వాడు లోనికివెళ్ళివచ్చి 'అయ్యా అయ్యగారు లేరు. తమరు లోనికి దయచేయు' డని దారిజూపెను. సుకుమారశాస్త్రి లోనికి వెళ్ళి ఒకచావిడిలో నొకకుర్చీపై కూర్చునెను. మరల నా జవాను:—'అల్లుడుగారికై లోన ఫలహారము లుంచిరి దయచేయుడు' అనెను. సంతోషముతో సుకుమారశాస్త్రి లోనికివెళ్ళి ఫలహారము చేయుచుండగా అవతలగదిలో నొకబాలుడు:—అమ్మా! ఆ వచ్చినది యెవరు?

ఒకస్త్రీ:—ఆయన మీ బావగారటగా?

బాలుడు:—అమ్మా! ఆయన బావ కాడు యెవరో! బావలాగ లేడే.

స్త్రీ:—అ...టు...ల...నా!

బాలుడు:—ఒకలాఠీకఱ్ఱ ఒకతుపాకీయు తెచ్చినాడే! అమ్మా!

స్త్రీ:—(తొంగిచూచి) అయ్యో! ఎవరో! దొంగేమో! ఒరేఒరే (నౌకరును) రాముడూ తొందరగా అయ్యగారిని పిలువుము. అమ్మాయి, రండే మనమందరము గదిలో దాగుకొందము అ...య్యో... ఊళ్ళోకి పోకిరీవాళ్లు వస్తున్నారట మోసము. ఈ కేకలువిని సుకుమారశాస్త్రి అక్కడ ఒక పుస్తకముండగా దానిని చూచెను దానిపై 'R. N. Sastri' యని యుండెను. ఈయన మామగారిపేరు V. N. Sastri' అప్పుడు తనతప్పును తెలిసికొని తనలోతాను నవ్వుకొని యూరకుండెను.

ఇంతలో 'R. N. Sastri' వచ్చి భయముతో దొంగ ఎ ఎక్క...డ అని అడిగెను.

అంతలో సుకుమారశాస్త్రి బయటికివచ్చి నమస్కారముచేసి తాను V. N. Sastri అల్లుడననియు అక్కడకు తెలియక వచ్చినందున క్షమింపుడనియు వేడుకొనెను. పొరపాటు అని తెలియగనే R. N. Sastri నవ్వుచు 'యెందులోనైనను పొరపాటు వచ్చునుగాని అల్లుళ్లలో నెవ్వరు పొరపాటు పడుట వినలేదు' అని నగుచు, ఒకబండిని తెప్పించి ఆయనను అసలు మామగారింటికి వెళ్లుమని దారిచెప్పి పంపెను. అప్పుడు సుకుమారశాస్త్రి బండిలో నత్తవారింటికి వెళ్లి గేటునద్ద నౌకరుతో:—'లోనికివెళ్ళి అల్లుడు గారు వచ్చినారని చెప్పుము' అనిన తోడనే వాడు లోనికివెళ్లి చెప్పగా V. N. Sastri బయటికివచ్చి అల్లుని గుర్తు పట్టలేక ఇంతకు పూర్వము తాను చీట్లపేక ఆడుచుండగా R. N. Sastri యింటికికూడ ఎవడో పోకిరీ వాడు అల్లుడని పేరుపెట్టుకు వచ్చినట్లు విని యున్నందున ఎవరో దొంగయని తలచి గాభరాపడుచు నిట్లనెను:—నీవు ఎవరు నీవు మా అల్లుడవా! సరే. ఇప్పుడే పోలీసుకు కబురు పంపిస్తాను.

సుకుమారశాస్త్రి:—నేను దొంగనా! మీ అల్లుడను సుకుమార శాస్త్రిని.

V. N. Sastri:— షటప్, రోగ్, నీవు దొంగముండాకొడుకువు. అందరిండ్లకు వెళ్లి వారి అల్లుడనందువా! చూసుకో పోలీసుకు రిపోర్టుచేయుచున్నాను.

సు:—పోలీసుకు రిపోర్టుచేయుదురా? నేను మీ అల్లుడను సుకుమారశాస్త్రిని. నన్ను గుర్తు పట్టరేరా?

V. N. Sastri:— ఒరే చూస్తా వేమిరా! పట్రాగా నీవా కర్రకత్తి. వానిని గెంటుడు.

ఇరువురు నౌకర్లు వానిని గెంటబోవ మీరు నన్ను ముట్టిన మీ తలలను బ్రద్దలు కొటతాను జాగ్రత్తయని బెదరించి, యిట్లనెను.

సు:—మీరిప్పుడు నన్ను తిట్టుచున్నారు. దీనికి మీరు పశ్చాత్తాపము పొందకమానరు. ఇదిగో నేను వెళ్లుచున్నాను జ్ఞాపకముంచుకొనుడు' అని వెళ్లిపోయెను.

తరువాత కొంతసేపటికి వారికి ఒకటెలిగ్రాము వచ్చెను. అది తమ అల్లునివద్దనుండి వచ్చినదే. అప్పుడు అల్లుని కోపపడినందుకు విచారముతో ఆయనయే తమ అల్లుడని తెలిసికొని స్టేషనుకువెళ్ళి ఆయనను బ్రతిమాలి యింటికి తీసుకొనివచ్చి అనేక మర్యాదలు చేసిరి.

మధ్యాహ్నము బావగారికి తేనీరు తెచ్చిన వాని మరదలు:—యేమి బావగారు చిక్కిపోయినారు?

సు:—అటులనా నేను చిక్కిపోతినా?

మ:—అవును, మా గుమ్మములు పెద్దవి చేయించవలెను లాగున్నదే.

సు:—సన్నగా నున్న యెడల చిన్నవి చేయుదురా పెద్దవిచేయుదురా!

మ:—మునుపటి మా నాన్నగారియల్లుడుగా రిప్పుడు మల్లుడుగారుగా మారినారు' యనుచు నెడలిపోయెను.

## గృహోద్యాన శీర్షిక

### గులాబి

గుమ్మలూరు సత్యనారాయణగారు, బి.ఎస్‌సి; (ఎజి.)

గృహమున కత్యావశ్యకమైనది ఉద్యానము. దాని మూలమున గృహమున కలంకారమేగాక, శరీరారోగ్యమునకు గావలయు పరిశుభ్రమగు గాలి, కడు రమ్యమగు పూల నాకుల సుగంధముతో కలసి ప్రాతఃసంధ్యాసమయముల వీచు చల్లని పిల్లవాయువులవలన, ప్రతివ్యక్తికి నద్వితీయానందము, సర్వదా గలుగుచుండును. పెక్కురు స్త్రీలు తమ గృహముల యావరణలలో గొన్ని పూలమొక్కల నాటుచు, నందలి పూలను దబ్బిచ్చికొనిన పూలకన్న నెక్కుడు విలువగా ప్రేమగా చూచుకొనుచుండుట విశదమే—ఇది మెచ్చుకోదగిన యంశము. ఐనను యేకారణముననో, మొక్కలు పూయనప్పుడు, లేక చచ్చిపోవు చిహ్నాలు చూపుచున్నప్పుడు, కొన్ని కీటకేతర బాధలచే చెడిపోవుచున్నపుడు, నేమి చేయవలయునో, తెలియక క్రిందు మీదు చూచుచున్నారు. ఇంతకును యే మొక్కలను నాటవలెనో, ఎట్లు నాటవలయునో, ఏయే యెరువు లేవిధముగ వేయవలెనో, ఎట్లు, యెప్పు డెంతెంత నీరు పోయవలయునో, తెలియకయే పూలపై యున్న యొక్క వెర్రియభిమానము తక్క యితర శాస్త్ర పరిజ్ఞానము లేక, మన యక్కచెల్లెండ్రందరును గృహోద్యానకృషి జేయబూనుచున్నారు. ఏదియెటులున్నను వారికి 'ఉద్యానకృషి' యందుగల యభిమానము మాత్రము మెచ్చుకోదగ్గ విషయము. అట్టి యభిమానులకు, శాస్త్రపరిజ్ఞాన పరిచయము గలుగజేయుటయే నాముఖ్యమగు యభిలాష. ఏవ్యక్తికైన నీవ్యాసములు లాభకరములైనచో, నాయాశయము దీరినటులే.

పూవులలో నెల్ల నత్యంతపరిమళభరితమై సుందరమై ప్రేమపురుషుల చుంబితస్థాన ఛాయాప్రతిమయై, ఉద్యానకర్షకుని ఉంపుడుకత్తెయై, పలుతెరగుల పలువుర మనోజ్ఞముగ నాకర్షించు పూరాణి—గులాబియే. ఈ గులాబి హిందూదేశముననే జన్మించి వృద్ధి జెందుచున్నది. మధ్యమోత్తర హిందూస్థానములందును, మైసూరునను, మిగుల శీతలప్రదేశములగు ఉదకమండలము, కూనూరు మొ॥ నీలగిరి ప్రాంతములలోను బాగుగా బెరుగుచున్నది. ఈ గులాబిరంగులనేకములు—సుమారు 1000కి మించి యుండును. ఐనను ఉష్ణప్రదేశములగు దక్కనుస్థానములలో కొలది రకములు మాత్రము తృప్తిగా బెరుగుచున్నవి. కాని, సాధారణముగా మిగుల మంచిరకములన్నియును పొడుగైన శీతకాలముగలిగి, 50 డి॥ మించని, శీతకాలమున్న ప్రదేశములలోనే బెరుగుచున్నవి.

### గులాబిరకములు

సాధారణముగా రెండుతరగతులు— (1) కొంచెమించు మించు సంవత్సరము పొడుగునను బూయునవి. (Perpetual) *

(2) వేసవికాలములోనే బూయునవి. (Summer Roses). సామాన్యముగ నివి మనకంత యనుకూలముగ నుండుటకష్టము. కాని కొంచె మెక్కువశ్రమ దీసుకొనిన నివి మిగుల విలువ గలిగినవగును.

* వాడుకలో నుండు యాంగ్లపదములను దాని యుచితస్థానమున నుంచుటచే, ఏ యితర యాంగ్లవ్యాసమైనను సులభముగా నర్థము కాగలదు.

మొదటితరగతిలో వచ్చు ముఖ్యమగు జాతులు:- (1) సామాన్యపు గులాబీ. (2) ఎల్లప్పుడును బూయు సంకరములు. (Hybrid perpetuals). (3) తేయాకువాసనగలవి. (Teas). (4) బోర్బను సంకరములు. (Bourbon hybrids). (5) ఎల్లప్పుడు బూయుచు తేయాకు వాసనగలవి. (Hybrid tea-Scented Roses). (6) చీనా గులాబీలు. (China-Roses).

## సామాన్యపుగులాబీ

సాధారణముగా తీరప్రదేశములు, కొంకణము దక్క మిగిలిన చోట్లనెల్ల పెరుగు గులాబీరక మిదియే. దీనిని "ఎడ్వర్డు" (Edward) యని యాంగ్లమున బిలుతురు. తెలుగున "రోజాపువ్వు" యిదియే. వృక్షశాస్త్రోక్తముగా (Botanically) దీనిని "రోజా డొమెస్కాన" (Rosa Domescana) యందురు. ఇంకను దీనికి 'మద్రాసురోజు;' 'పెర్షియన్ రోజు;' 'డమస్కు-రోజు;' యని నామాంతరములు. ఇండియాలో చాలవరకు తయారగు పన్నీరు దీనినుండియే. ఇంతకు యెక్కువ సువాసన, యందము మొ॥ గుణములు గల సంకరజాతుల కిది మూలాధారమగుట యొక గొప్పవిషయము. *

ఈ జాతి గులాబీలు తీయని వాసనగలిగి ఊదా, గులాబి వర్ణములతో కలసి యుండుట కంటికి మనోహరముగా నుండును. మొక్కలు దృఢముగానుండి విరివిగా బెరుగును. త్వరలో పెరిగి పెద్దపొదలగును. కనుక వీనిని సాధారణముగా అక్టోబరునెలలో మొదలంట నెండిపోయిన, లేక, బాగుగా ముదిరిన కొమ్మలు, నాకులు, ద్రెంచివేయవలయును. పిదప బాగుగా గెత్తమువేసి నీరుబెట్టిన పూవులను విరివిగా బూయును. ఇవి జూలై-సెప్టెంబరు నెలలలోను, డిశంబరు-మార్చి నెలలలోను బూయును.

## ఎల్లప్పుడును బూయు సంకరములు

## (Hybrid Perpetuals)

వీనిని వృక్షశాస్త్రోక్తముగా రోజా డమస్కన హైబ్రిడ్ (Rosa Domescana hybrids) యందురు. మన దేశములో నెల్లప్పుడు పూయు జాతులలో, తేయాకువాసనగల యొకటి రెండు రకములు దక్క, వీనిని మించినవి లేవు. పూవులు సహజముగా గొప్ప సువాసనగలిగి, చాలరంగులలోనుండును. మొక్కలు కొంచెము కష్టములకైన నోర్చి బ్రతుకగలవు. ఈ మొక్కలను తీగెలగా పెంచవచ్చును. తీగెలకితిగా పందిర కెక్కించిన పూవు లెక్కువ పూయును. దీనిలో పలురకములున్నను కారు రక్తవర్ణముగల పువ్వులు బూయు బ్లాక్ప్రిన్సు (Black Prince) అనునదియు, చక్కని తెలుపుతో పూయు మాడమ్ నోమన్ (Madam Noman)యును ముఖ్యములు.

## తేయాకు వాసనగల జాతులు

## (Tea-Scented Roses)

వీనికి శాస్త్రోక్తనామము రోజా ఇండికా (Rosa Indica). ఈజాతి రోజాసామ్రాజ్యమున కంతకును ధీవిదితరాజ్ఞి. పూవుల కుండదగు సుగుణములన్నియును దీనియందిమిడి చెప్పటకలవి గాని యానందమును గూర్చును. ఏ కఠినహృదయుమునైన నాకర్షించి పరవశముచేయుటకీజాతిలో నొక్కపువ్వు చాలును! ఉత్కృష్ట సౌగంధ్యామేళిత బహువర్ణయుక్త లలిత చాతుర్య పత్రములతో విరాజిల్లు పూరేఖ!! శాంతముతో శౌర్యమును జయించిన లలితబాల!!! ఇవి లేని

* సాధారణముగా మొదటి జాతులకు పెక్కుసుగుణము లుండవు. సుగుణవంతములగువాటికి కష్టములనోర్చు శక్తి చాలదు. ఆ సుగుణములు, మొండితనము, రెండు నొక్క మొక్కయం దుంచుటకు, మీది రెండు మొక్కలను సంకరపరచవలెను. (hybridisation) ఆ సంకరపరుచు మార్గము లనేకములు. అందు మొదటి మొక్కకు సుస్థిరమగు దానిని అంటుకట్టుట యొకటి: ఇట్టి యంట్లకు 'సాధారణగులాబి' లాభకరమని యభిప్రాయము.

వన ముగ్గ్యానవనము గాదు. వీనిలో ముఖ్యతమమైనది "లా ఫ్రాంస్" (La France). ఇది ఊదా గులాబిరంగు గలది. సర్వదా సంతోషము గలిగించునది. సంవత్సరము పొడుగునను బూచును. వీనిని గూడ పందిరలపై కెగ్రాకించగలము.

బోర్బను గులాబి

## (Bourbon Rose)

వృక్షశాస్త్రోక్తనామము–రోజా ఇండిక బోర్బోనిక (Rosa Indica Bourbonica). ఇది మన దేశపు 'రోజా' (Rosa Domescana)కును 'చీనాగులాబి' (China Rose)కిని సంకరరూపమున నుద్భవించినది. దీని రేకలు గుండ్రముగానుండి, మంచివాసనగలిగి, కాంతిమంతముగానుండును. ఈజాతిలో "మాల్మైసను" (Souvenir de La Malmaison) ముఖ్యమైనది. దీని కెక్కువ యూదాగులాబిరంగు కలదు. పూవులన్నిటికన్నను తొలుత పూతనారంభించి చివరను ముగించుచు నెల్లప్పుడును పూవులనిచ్చును. ఈ జాతి మొక్కలను సులభముగా ఖండముల (Cuttings) ద్వారా ప్రవర్ధనము (Propagation) చేయవచ్చును.

ఎల్లప్పుడును బూచుచు
తేయాకువాసనగల సంకరములు

## (Hybrid Teas)

శాస్త్రోక్తనామము—రోజా ఇండిక హైబ్రిడ (Rosa Indica Hybrida). ఇది తేయాకు వాసనగల పూవులకును, యెల్లప్పుడు పూయు సంకరములకును మధ్య రెండింటి గుణములు పొందిన సంకరజాతికి చెందినవి. ఇవన్నియును దృఢముగా బెరిగి మొరడులవలె నుండునని దలచి ముదిరిన కొమ్మలు నాకుల నెక్కువగా డ్రెంచివేయరాదు. వీనిలో నొకటి రెండు రకములు తీగెలుగా మీద కెగబ్రాకును. ఇట్టి తీగెగులాబీలను తోటలోనుంచిన విరివిగా బూచుచు నివి యానందము, నందము నిచ్చును. ఈరకములలో 'గ్లాయిర్ డి డిజన్' (Gloire de Dijon) 'మారిషల్ నీల్' (Marechal Niel) ముఖ్యమైనవి. ఈ మారిషల్ పసపుపూవులు బూచును. గ్లాయిగ్ కూడ పసపు పచ్చని పూవులు పూచుచు నెక్కువ తృప్తి నిచ్చెడి గులాబి. స్నానపు గదులలోని సబ్బునీటితో వీనికి నీరుపోసిన మంచి రకమైన పూవులకు సందేహములేదు. ఇవిగాక సాధారణముగా బెరుగు "డెవోనియెన్సిస్" (Devoniensis)కూడ చెప్పుకోదగిన రకము. ఇది పురాతనమునుండి వచ్చుచున్నది. మిగుల రేతగులాబి లేక యించు మించు తెలుపుగల పూవుల బూచును. ఇది సగము విడివిడని మొగ్గస్థితిలో చక్కని రంగు గలిగియుండును. చెన్నపట్నములో తెల్లగులాబి యని యమ్మబడుచున్న దీ రకమే.

చీనా గులాబీలు

## (China Roses)

శాస్త్రోక్తనామము: రోజా ఇండిక చైనెన్సిస్ (Rosa Indica Chinensis) ఈ తరగతి మొక్కలు చాల కురుచగ నెదిగి రమ్యముగనుండును. వీనిలో ముఖ్యమగునవి.

(1) రక్తవర్ణపు పూవుల బూచు "ఆర్చ్ డ్యూక్ ఛార్లెస్" (Archduke Charles).

(2) తెల్లఫెయిరీ (White Fairy).

ఇటుల నెన్నో రకముల పేర్ల నుదహరించవచ్చును. కాని యొకటో, రెండో, మంచి రకములను కడు జాగ్రత్తగా బెంచిన నవి ముఖ్యమగు ధనాధారములగును.

ఉదకమ డలమునుండి చాలమంది చక్కని గులాబి రకపు ఖండములను తెప్పించుకొనుచున్నారు. కాని వానిని సమప్రదేశములలో Plains ఖండములద్వారా ప్రవర్ధనముచేసిన మొక్కలు రావు. ఈవిషయ మట్లు చేయుచున్నవారందరికి యనుభవమయియుండవలయును. కనుక నీలగిరి ప్రాంతముల నుండి గులాబీ ఖండములను దెప్పించినపుడు, వచ్చిన వెంటనే, వాని కండ్లను దీసి, తమయూర విరివిగా పెరుగు మొరటిగులాబికి యంటుకట్టుట యుక్తమైన మార్గము. ఈ విషయము దెలియక 'ఖండములు బ్రతుక'వని వాదింపువా రనేకులుండుట శోచనీయము. (సశేషము)

# వార్తలు—విశేషములు

## మైసూరుసంస్థాన స్త్రీల మహాసభ

నవంబరు 10, 11, 12 తేదీలను కజిన్సు సతీమణి అధ్యక్షతక్రింద బెంగుళూరులో మూడు దినములు జరిగినది. అక్షతయోనులగు విధవల వివాహమునకు వి. ఆర్. త్యాగరాజయ్యరు సతీమణియు, ఎ. యస్. ఆచారి సతీమణియు అంగీకరించుచు, ఈ సంబంధమై శాసనము లుండగూడదని వాదించిరి. అట్టి వివాహములవలన పుట్టిన బిడ్డలకు ఆస్తిహక్కు సిద్ధించుటకై శాసన మవసరమని ఇందిరాబాయి సతీమణి వాదించెను. వాదప్రతివాదములు తెగక తీర్మానము వాయిదా వేయబడెను, స్త్రీలకు స్కాలరుషిప్పులు హెచ్చించవలెననియు, భూతదయా సంఘము నెలకొల్పవలెననియు గ్రామపరిశ్రమల నెలకొల్పవలెననియు, సినీమాలో చెడ్డఫిల్ములను ప్రదర్శించరాదనియు మొదలైన తీర్మానములు ప్యాసయ్యెను.

* * * *

బీరారురాష్ట్రీయ చతుర్థ వార్షికసభ ఇందూరు వాస్తవ్యురాలు కమలాదేవి కైబీ సతీమణిగారి అధ్యక్షతను యోటోమాలులో నవంబరు 12.వ తేదని జరిగినది. గ్రామపరిశ్రమల యభివృద్ధి, స్త్రీ విద్యావ్యాప్తి, క్లబ్బులలోను ఆటలలో స్త్రీలు పాల్గొనుట మొదలైన విషయములగూర్చి తీర్మానములు ప్యాసైనవి. * * * *

వాల్గవ గంజాంమండల మహిళాసభ శ్రీకాకుళంలో 12-11-1934 తేదీని శ్రీమతి వంట్రాప్రగడ లచ్చాయమ్మగారి అధ్యక్షతను జరిగినది. 400 మంది మహిళా ప్రతినిధులు విచ్చేసిరి. స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యము, స్త్రీల హక్కులు, స్త్రీల ఆరోగ్యసంస్థలు మొదలగు విషయములను విపులముగ చర్చించుచు, ఆహ్వానసంఘాధ్యక్షురాలియొక్కయు అధ్యక్షురాలియొక్కయు ఉపన్యాసములు మిగుల ప్రబోధకరములుగనున్నవి. జిల్లాలో మారుమూల గ్రామములలోగూడ మహిళాసమాజములను స్థాపించు ప్రయత్నములు జరుగుచున్నవి. ప్రాథమికవిద్య, ఉన్నతవిద్య, పరిశ్రమలవిద్య, వైద్యవిద్యలను వ్యాపింప జేయవలయుననియును పాలకసంఘములు, ప్రత్యేకపాఠ్యక్రమములు, శరణాలయములు ఆంధ్రరాష్ట్రము వెంటనే స్థాపించవలెననియు, బాల్యవివాహములు, మత్తుపదార్థములు, అస్పృశ్యత, దేవదాసీపద్ధతి, ఘోషాపద్ధతి మొదలగు దురాచారములు మానవలెననియు 19 తీర్మానములు విపులముగ చర్చించి ఆమోదింపబడెను.

* * * *

తిరువాన్కూరు సంస్థాన మహిళాసభ నవంబరు రెండవవారములో తిరువేంద్రమములో శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారి అధ్యక్షతను జరిగినది. మహారాణీగారు తమ అమూల్యాశీర్వాదము పంపిరి. అఖిలభారతమహిళా సంఘమువారి 118 శాఖలలో తిరువాన్కూరు సంఘము మిక్కిలి కీర్తికెక్కినది. స్త్రీస్వాతంత్ర్యము, స్త్రీవిద్యలయందు ముందంజవేయుచున్నది. శ్రీమతి రెడ్డిగారు గృహసంబంధమగు విద్యలలో స్త్రీలు ప్రవీణలు కావలెననియు స్థానికసంస్థల సభ్యత్వమునకై యెన్నికలలో నిలువవలెననియు, పూర్వాచారపరాయణత్వమును విసర్జించి పాశ్చాత్యసుందరీమణులతో తుల్యులు కావలెననియు సభ్యురాండ్రను హెచ్చరించెను.

## ఆంధ్రదేశ మహిళాసభ తీర్మానములు

స్త్రీలకు వివాహమును విచ్ఛేదము గావింపగలుగుటకవకాశము లీయవలయునని తేబడిన తీర్మానము శ్రీమతి కోటిరెడ్డి సతిగారిచే చాల తీవ్రముగ ఖండింపబడి అధిక సంఖ్యాకులచే నిరాకరింపబడెను.

జన్మనిగ్రహ విషయమున వివాహితులైన స్త్రీపురుషులకు సరియైన పద్ధతులను గురించి తెలియజేయు



తిరుచినాపల్లి శిలాదేవాలయ దృశ్యము.



శ్రీమతి మహాలక్ష్మీ వరదస్వామి.

సేలంలో పోటీలేకయే యెన్నుకొనబడిన మునిసిపల్ సభ్యురాలు.



మిస్: బి.యే. ఇంజనేర్, యం బీ.ఇ.,

యం. ఎ., యల్ యల్, బి.,

ఈమె, బొంబాయినగరమునకు ఆనరరీ ప్రెసిడెన్సీ
మేజిస్ట్రేటుగా నెన్నుకోబడెను. బొంబాయి
స్కూల్ కమిటీసభ్యత్వము, మొదలగు
నెన్నియో యితర గౌరవోద్యోగము
లీమెకు గలవు.

టకు ప్రతియూరియందును నొకకార్యాలయ ముండవలయునను తీర్మాన మామోదింపబడెను.

స్త్రీలకు ప్రత్యేక ప్రాతినిధ్య మనర్థదాయకమనియును, సాంఘికనిర్ణయము దేశాభ్యుదయము వరికట్టుననియును తీర్మానము గావింపబడెను.

స్త్రీలు స్వదేశీయొడలను, ఖద్దరు నేతలను ఎక్కువ శ్రద్ధ వహింపవలయుననియును, 1935 ఏప్రెలులో రాజమహేంద్రవరమునందు స్వదేశీప్రదర్శనము కావించుట కేర్పాటుచేయవలయుననియును ఆమోదింపబడెను.

శారదాచట్టము ఇంకను అనుల్లంఘనీయముగ మార్చబడవలయుననియును తీర్మానింపబడెను.

## నాల్గవ గంజాంమండల మహిళాసభవారి కొన్ని తీర్మానములు

ప్రతి గ్రామమునందును బాల బాలికలకు నిర్బంధోచిత ప్రారంభవిద్య నేర్పవలెననిన్ని, అందులకు స్త్రీలనే నియమించవలెననిన్ని, ప్రభుత్వమును ఈ సభవారు కోరుచున్నారు.

దేశదారిద్ర్యము తొలగించుటకు దేశీయపరిశ్రమలను, ముఖ్యముగా చేతిపనులను అభివృద్ధిచేయుట ఆవశ్యకము గనుక అట్టి దేశీయపరిశ్రమలను ఎక్కువ ప్రోత్సాహ మొసగవలసినదిగా ప్రజలను ప్రార్థించుచు మనదేశములోనే తయారయిన వస్తువులను, అందు ముఖ్యముగ చేతితో చేసిన సామగ్రిని వాడుకొనవలసినదిగా ప్రజలను ఈ సభవారు కోరుచున్నారు.

రైల్వేలలో స్త్రీల ప్రత్యేక మూడవతరగతి బండిని రైలుమధ్యగా పెట్టవలసినదనిన్ని, స్త్రీలకు అందు కావలసిన సౌకర్యములను చూచుటకు స్త్రీ కండక్టరును పెట్టవలసినదనిన్ని; ఏర్పడబోవు రైల్వే బోర్డులో స్త్రీల సౌకర్యముల విషయమై సలహాలనిచ్చుటకు ఒక స్త్రీ ప్రతినిధిని ఏర్పరచవలెననిన్ని ప్రభుత్వమును ఈ సభవారు కోరుచున్నారు.

తల్లిదండ్రులయొక్కయు, భర్తయొక్కయు ఆస్తులలో ఆడపిల్లలకు సమాన వారసత్వపు హక్కుల నిచ్చుచు శాసనము గావించవలెనని భారతశాసన సభవారిని ఈ సభవారు కోరుచున్నారు.

భాషాప్రయుక్త రాష్ట్రవిభజనకై సుమారు 20 సం॥లనుండి ఆందోళన సల్పుచున్న ఆంధ్రుల కోరిక ననుసరించి ఆంధ్రరాష్ట్రమును వెంటనే ఏర్పరచవలెనని ప్రభుత్వమును ఈ సభవారు కోరుచున్నారు.

మన ఆంధ్రరాష్ట్రములో స్త్రీలయొక్కయు, పిల్లలయొక్కయు ఆరోగ్యము అంతకంతకు క్షీణించుచుండుటచేత ఆరోగ్యవిషయిక ప్రదర్శనములవలనను, మ్యునిసిపలు సరిహద్దులలోను ఇతర పబ్లికుస్థలములలోను ప్రజాప్రయోగమునకై ఆటస్థలములకు, విహారస్థలములను ఏర్పరచుటవలనను ఆరోగ్యపరిస్థితులను చక్కజేయవలెనని స్థానికసంస్థలను ఈ సభవారు కోరుచున్నారు.

ప్రస్తుతము మనదేశమందున్న సాంఘికదురాచారములవల్లను, అతిబాల్యవివాహములవల్లను, అనారోగ్య పద్ధతులు మూఢాచారములవల్లను, స్త్రీలకు చిన్నతనమందే అనేక కాన్పులుకలిగి తద్వారా స్త్రీల ఆరోగ్యము చెడుటవల్లను, శిశు మరణములు ప్రపంచమందన్ని దేశములకన్న హిందూదేశములో నెక్కువగా నుండుటచేతను ప్రతిగ్రామములోను శిశుసంరక్షణ సంఘములను స్థాపించి గర్భిణీస్త్రీలకు సలహాలనిచ్చుటకు వైద్యురాండ్రను నియమించవలెనని అందులకు "గర్భిణీస్త్రీల సహాయనిధి"ని ఏర్పరచవలెననిన్ని ప్రభుత్వమువారిని ఈసభవారు కోరుచున్నారు.

దేవదాసీల కింతవరకు దేవాలయములలోనున్న నిర్బంధవిధానమును తొలగించి వారి వృత్తులను మాన్పించుటకు ప్రయత్నించవలెననిన్ని, అందులకు దొరతనమువారిని సహాయము చేయవలసినదనిన్ని కోరుచూ తీర్మానించడమైనది.

స్త్రీలయొక్క ఆరోగ్యరక్షణార్థమై ప్రతి తాలూకా ముఖ్యపట్టణమునకును ఒక స్త్రీ సబ్ అసిస్టెంటు సర్జనున్ను (Sub-Asst. Surgeon) ఇద్దరు ట్రైండు మంత్రసానులను (Trained mid-wives) ఈజిల్లాలో వెంటనే నియమించవలెనని సర్కారును, జిల్లాబోర్డు పురపాలక సంఘములను ఈ సభవారు కోరుచున్నారు.

# గ్రంథ పరిచయము

విజయ:—

విజయనగరమునుండి ప్రతి మాసమును వెలువడు క్రొత్త పత్రిక. సంపాదకుడు శ్రీయుత కాకుళ వరపు కృష్ణమూర్తిగారు. చందా సం|| 1-కి రు. 1-0-0. శుద్ధ నవ్యులపత్రికయు కాక శుద్ధ సాహిత్య పత్రికయు గాక భావకవిత్వము చారిత్రక పరిశోధనము మొదలు చిన్నకథలు హాస్యపు పల్కులవరకు గల సకల పాకములను ప్రదర్శించు మనోహరపత్రిక. శ్రీయుతులు బుర్రా శేషగిరిరావుగారు విశ్వనాథ కవిరాజుగారు, జాషువా కవిగారు మొదలగు సుప్రసిద్ధుల వ్యాసములతో రాజిల్లును.

గ్రంథాలయ సర్వస్వము:—

తొమ్మిది సంవత్సరములనుండి ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమవ్యాప్తికి కృషిచేయుచు ధారాళమగు సేవచేయుచున్న సుప్రసిద్ధ మాసపత్రిక. ప్రముఖుల ఉపన్యాసములు, విద్వాంసుల అభిప్రాయములు, ఉద్యమ చరిత్రలు, గ్రంథాలయ నివేదికలు, నూతనాభివృద్ధి మార్గములు మొదలగు విశేషములను తెలియఁజేయుచుండును. ప్రతి గ్రంథాలయమునందును నుండఁదగినది. చందా సంవత్సరమునకు రు. 3-0-0లు. కార్యస్థానము బెజవాడ.

సుదర్శని:—

తూర్పుగోదావరిజిల్లా రాజోలునుండి మాసమునకు రెండు తూరులు వెలువడును. సంపాదకుడు శ్రీయుత డి. యస్. రాజుగారు. చందా సాలుకు రు. 2-0-0లు. ప్రపంచవీరుల చరిత్రలు, ఆధ్యాత్మిక ప్రసంగములు, సహకారవార్తలు, ఆరోగ్యసూత్రములు మొదలగు సకల సద్విషయములను తెలుపుచు ఆంధ్రోద్యమును ప్రోత్సహించుటకు దీక్ష పూనియున్నది.

బ్రహ్మోత్తర ఖండము:—

రాజమహేంద్రవరమునుండి శ్రీయుత కాళహస్తి తమ్మారావు అండు సన్సువారివల్ల ప్రకటితమగు శ్రీ శైవగ్రంథమండలివారిచే ప్రకటితమైన ద్వితీయ గ్రంథము. శ్రీ సూతప్రోక్తములగు పురాణములనుండి శివభక్తాగ్రగణ్యుల చరిత్రములనెల్ల శోధించి తెచ్చి సులభసుందరతర వచనరూపంబున నాంధ్రమహాజనులకెల్ల విందొనగూర్చుచున్న శ్రీ గ్రంథమండలివా రెంతయు ధన్యులు. ఇందలి కథ లెల్లయు పాఠకులకు నిష్ఠ, సదాచారము, ఇంద్రియ నిగ్రహము, ఈశ్వరభక్తి మొదలగు సద్గుణము లలవరచి ఐహికాముష్మిక సుఖపరంపరలనెల్లఁ జూఱలు గొల్పుచుండును. గ్రంథకర్త శ్రీయుత వి. విశ్వనాథంగారు. ఈ గ్రంథము డెమ్మీసైజు 170 పుటలు, వెల రు. 1-0-0.

ఆనంద శ్రీ శివపూజావిధానము:—

ఇది పై గ్రంథమండలివారి ద్వితీయానుబంధము. శ్రీయుత కాళహస్తి వేంపటనూరయ్య సిద్ధాంతిగారు అందముగల సంస్కృత శ్లోకములను కృతులను బొందుపరచి శివపూజావిధానము నుదహరించినారు. ఈ గ్రంథమండలివారు మూడు మాసములకు 200 పుటల శైవచరిత్రములను వచనరూపమున బ్రకటింతురు. చందా సంవత్సరమునకు రు. 2-0-0.

## ఆధునిక మానసిక చికిత్స:—

డెమ్మీసైజు 140 పుటలు వెల రు. 1-4-0లు. గ్రంథకర్త శ్రీయుత చిల్లరిగె సేతుమాధవరావుగారు, గాంధినగరము, బెజవాడ. గ్రంథకర్త ఇందు మనస్సును కేంద్రముగ చేసుకొని మనస్సుకును సకల శరీరావయములకును ఇంద్రియములకును గల సంబంధములను సచిత్రముగ దెలిపి, మనోవైకల్యమువల్లనే సమస్తరోగములు కలుగుటయు, మనశ్శుద్ధితో సర్వలోపములు నివారణమగుటయు చర్చించి మనశ్శుద్ధి సిద్ధించు తెరవు లనేకములను సూచించినారు. ఇది కేవల మాధ్యాత్మిక గ్రంథము కాక శుద్ధవైద్యగ్రంథము. మనశ్శుద్ధి లేక రోగములు శాశ్వతముగ కుదరవని యిందువలన గ్రహింపనగును. ప్రాచ్య పాశ్చాత్య పండితుల అభిప్రాయములు, కేవల మానసిక చికిత్స వలన ఆరోగ్యమునందిన వివిధరోగుల యుదాహరణములును గలిగి గ్రంథము రసవంతమై ఉత్సాహదాయకమైయున్నది.

## విదేశయాత్రికులు—ప్రాచీనాంధ్ర దేశము:—

డెమ్మీసైజు 214 పుటలు. వెల రు. 1-4-0లు. గ్రంథకర్త శ్రీయుత భావరాజు వేంకటకృష్ణారావుగారు బి.ఎ.,బి.యల్., రాజమహేంద్రవరం. క్రీ.శ. 7-వ శతాబ్దమున చాళుక్యరాజ్యవైభవమును, 13-వ శతాబ్దమున కాకతీయ సామ్రాజ్యవైభవమును 15-వ శతాబ్దమున విజయనగర సామ్రాజ్యవైభవమును తిలకించి వర్ణించిన చైనాదేశీయుడగు యువాన్ చ్వాంగు, వెనీసియా నగరవాస్తవ్యుడగు మార్కోపోల్, పారసీక రాయబారియగు కమాలుద్దీను అబ్దుల్ రజాకుగార్ల చరిత్రలనుండి యెత్తి వ్రాయబడిన వివిధాంశములతో రాణించుచున్నది. సుందర గ్రాంథికశైలి పాఠకుల నుత్సాహభరితులను చేయును. దీనిని పఠించి గర్వించని యాంధ్రు డుండడు. యువకులెల్లరును పఠింపదగినదియే గాక విద్యార్థులకు పఠనీయగ్రంథముగఁగూడ నుండదగినది.

## క్రిష్ణాంపేట ఆదిఆంధ్రయువజన సంఘము:—

1934 సం॥ ఆగస్టుతో అంతమైన ప్రథమ సంవత్సరమున ఈ సంఘమువారు నడపిన కార్యక్రమమునుగూర్చిన నివేదికను ప్రచురించినారు. శ్రీయుత మందా రామయ్యాగారు దీని కధ్యక్షులు. శ్రీయుత కె. సంజీవకామతు, బి.ఎ.,బి.యల్.గారు యావజ్జీవపోషకులు. ఇందు 85 గురు సభ్యులు, ఇరువురు కార్యదర్శులు, ఒక కోశాధికారియు, ఏడుగురు కార్యనిర్వాహకవర్గమును గలరు. స్వయంగా రు. 80లు వసూలుచేసుకొని ఆరోగ్యప్రదర్శనములు, ఉపన్యాసములు, ఆటలు, పఠనమందిర వ్యవహారములు, మొదలగువాని నెల్లనుజరుపుకొనిరి. సంఘనాయకులే మహాత్మాగాంధీగారి యుదాహరణము ననుకరించి వీధులనూడ్చి పేటవారికి పరిశుద్ధవర్తనను వాచరణరూపముగ చూపించుచున్నారు. ప్రతి గురువారము నాడును మద్యపాననిషేధకోపన్యాసములు జరుగుచున్నవి. పేటలోనుంచి కసాయిసాల నెత్తివేసుకొని జీవహింసను విసర్జించుకొనినారు. చదువుకొనిన పెద్దలు రాత్రిళ్లయందు చదువురానివారిని సమావేశపరచి, చదువు చెప్పుచు, పత్రికలు చదువుచు, తగవులు దిద్దుచు ఐకమత్యమును పురికొల్పుచున్నారు. బేడ్మింటను, క్రికెటు మొదలగు ఆటలలో పాల్గొనుచు స్కౌటు సంఘములలో సభ్యులై పరోపకార కృత్యముల నొనర్చుచున్నారు. మహాత్మాగాంధి, ఠక్కరు మొదలగు అన్యప్రాంతీయులే కాక నగర ప్రముఖులును కార్పొరేషను ఉద్యోగస్థులును కూడ వచ్చి వీరి యుత్సాహశ్రద్ధల నెంతయు ప్రశంసించుచున్నారు. ఈసంఘ మిటోత్తరాభివృద్ధిని బడయునుగాకయని ఆశీర్వదించుచున్నాము.

## శ్రీరామవిజయము:—

డెమ్మీసైజు 136 పుటలు. వెల రు 0-12-0 లు గ్రంథకర్త శ్రీయుత కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారు, కాకినాడ. ఇందు దిలీప, రఘు, అజ, దశరథ

మహారాజుల చరిత్రములు అతిమనోహరశైలిలోను కల్పనతోను వ్రాయబడినవి. ఇది పురాణ శ్రవణము వలె కాక నవలవలె అద్భుతరస మొలుకుచున్నది. ప్రాచీనాచారములును సభ్యతయు అభ్యుదయమును ప్రాచీనాచారములను సభ్యతయు అభ్యుద్గమనట్లు మనకన్నుల యెదుట గోచరించుచుండును. రాజాధిరాజుల విషయసుఖపరాఙ్ముఖత్వము, ఐహికసంపదలయందలాలసత్వము, స్త్రీలకుగూడ సర్వసామాన్యములగు రాజకార్యనిర్వహణన్యాయాన్యాయ పరిశోధన శక్తి, వివాహవిధానములు, విద్యావిధానములు అన్నియు సందర్భోచితముగ కథాకథనమునం దల్లుకొనియున్నది. దీనిని ఆయా రాజుల కాలములో జరిగిన కొట్లాటలు, తిట్లాటలు, ఆక్రమణములు, చావులు మొదలగువాని చరిత్ర యని కాకన్నను, ఆ కాలమునందలి సదాచారధర్మగమన చరిత్రమని చెప్పవచ్చును. సుబోధ నిర్దుష్టసుందరశైలి. ప్రతి విద్యార్థియు ఏదో యొక తరగతిలో నిట్టి గ్రంథములను పఠించితీరవలెను. ధారాళమగు ఆంధ్రభాషాశైలి కాని ఉత్కృష్టమగు సంస్కారభావపరంపర కాని కలుగదని చెప్పవచ్చును.

ప్రారంభ విద్య:—

ఇప్పటికి ఏడు సంవత్సరములనుండి యేలూరు పట్టణమునుండి వెలువడుచున్నది. దేశముయొక్క భవితవ్యమెల్లయు ప్రస్తుత బాలబాలికల చేతులలో నున్నది. వారి భవితవ్యమెల్లయు ప్రాథమికోపాధ్యాయుల చేతులలోనున్నది. కనుక ప్రాథమికోపాధ్యాయవృత్తి ఏదో ఉదరనిమిత్త వేషముకాక లోకోద్ధారకవ్రతముగ ఉపాధ్యాయులచేతను అధికారులచేతను ప్రజలచేతను గౌరవింపబడవలెను. ఇంతకు ప్రాథమికోపాధ్యాయ సంఘము సదాశయవంతమై, పటిష్ఠమై, విజ్ఞానవంతమై దీక్షాబద్ధమై యుండవలెను. లేనియెడల ప్రెసిడెంట్ల యెత్తులకు ప్రజల నిరసనకు భాజనమగును. సమస్తాంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ వర్గమునకును ఈ సందేశము నందించి నిష్ఠాగరిష్ఠులను చేయుటకీ మాసపత్రిక యెంతయు ఉపకరించుచున్నది. ఉపాధ్యాయులెల్లరు నిందు సభ్యులుగను చందాదారులుగను చేరి తమ భావి గౌరవప్రతిష్ఠలకు తామే నిర్మాతలు అవుదురు గాక. వ్యవస్థాపకుడు శ్రీ యంత ఈవర వేంకట్రావు గారు. చందా సం॥కి రు. 1-0-0 మాత్రము.

శ్రీ భక్తియోగ ప్రదర్శని:—

భక్తి, జ్ఞాన, కర్మ, యోగ సనాతనధర్మములం ప్రదర్శించు మాసపత్రిక. ఇందు పరమభాగవతుల చరిత్రలు, ఉపదేశములు, ప్రశ్నోత్తరములు, మోక్షమార్గములు మొదలగు సద్విషయములు వ్రాయబడుచుండును. మోక్షాసక్తు లెల్లరును చదువదగినది. గుంటూరుజిల్లా గురజాలయందలి శ్రీరామచంద్ర సేవాకుటీరమువారిచే ప్రకటితము. ప్రధానులు శ్రీయుతులు అక్కిరాజు రామయ్య, పిన్నవి రాఘవ శర్మగార్లు సం॥ చందా రు. 2-0-0లు.

# విశ్వవిలాసము

## దారుణమరణములు

శ్రీమతి వెలిదండ చూండికుడు త్తమ్మగారు ఈ సంచికలో వ్రాసిన కేశవరావు, బి. ఎ. అను కథ హృదయవిదారకముగ నున్నదను టకు సందేహములేదు. అయినను మన ఆంధ్ర దేశమునందున్న విద్యాధికులగు యువకు లనేకు లట్టి దుర్భరదరిద్రపరిస్థితులకు ముఖాముఖియై పీడవడుచున్నారటనులో అసత్యమే మాత్రమును లేదు. మానమర్యాదల కాశించు కుటుంబము లెన్ని, ఈ పీడాకరద్రవ్యాధార యంత్రభూయిష్టనాగరకతా పిశాచము వాతఁబడి మశియనున్నవో ఊహింప సాధ్యము కాదు. ఈ దురవస్థఒక్క మన భారతదేశమునకు మాత్రమే పట్టినదికాదు. పేదవారిని నొర్లుకొని తిని భాగ్యవంతుల మాదామను మైదాసులు వెలయుచున్న సమస్త ప్రాచీ ప్రతీచీ దేశముల యువకులను యువతులను ఈ పిశాచము తన ఎఱ్ఱనిగ్రసుమ్లు మిటకరించుచు మ్రింగివేయఁ జూచుచున్నది. మే మీకథను అచ్చొత్తుచుండగా తెలియవచ్చిన జపాను దేశమున జరిగిన ఒకయథార్థసంఘటనము నిక్కడ పొందుపరచ మానలేకున్నాము.

స్యూకో అనే బాలికను అయిమా అనే కుటుంబమువారు దత్తతచేసుకొనిరి. దత్తత చేసుకొనునాటి కా కుటుంబమువా రన్న వస్త్రములకు లోపములేని ఘరానావారు. ధరవరలయెగుడుదిగుళ్ళలో ఆ కుటుంబము నలిగిపోయి దివాలాయెత్తినది. అయిమా గారి ఉద్యోగముకూడ పోయినది. స్యూకో పాపము మోటారుబస్సు నడిపెడి ఉద్యోగము చేయుచు తన దత్తత తల్లిదండ్రులను పోషించుచుండెను. స్యూకో సంపాదన కుటుంబభరణమునకు చాలదు. అయినను కడుపు లోకప్రక్కన మాడ్చుకొనుచు పైకి గౌరవముగ వారు నటించుచుండిరి. ఇంతలో తల్లికి జబ్బుచేసినది. డాక్టరు కిచ్చుటకు డబ్బులేదు. కూతు రుద్యోగము విడిచిపెట్టినచో కంపెనీ వారు 90 యెన్నులనగా సుమారు రు 73 లు ఇత్తురు. ఆమె వుద్యోగమును విడిచిపెట్టి 90 యెన్నులు పుచ్చుకొని వైద్యునికిచ్చి తల్లి నారోగ్యవంతురాలనుగా నొనరించి తిరిగి ఉద్యోగప్రయత్నము చేసుకొన నిశ్చయించి 90 యెన్నులును పుచ్చుకొనెను.

ఇంతలో, మన మీ మధ్య పేపర్లలో చదివిన, ఉపద్రవకరమైన సుడిగాలివచ్చి, వీరికాగితపుటింటిని యెగరవేసుకొనిపోయెను. దానితోకూడ ఆమెయొక్క యెన్ను కాగితములుకూడా ఎక్కడకో యెగిరిపోయెను. ఆమెకు వేరు జీవనాధారములేదు. తల్లికి వచ్చేప్రాణము, పోయేప్రాణము—చేతిలో

ఒకటో రెండో మెన్నులు మిగిలినవి. దానితో నామె విషముకొనినది. ముగ్గురును యీ పాడుప్రపంచమునుంచి విరమింప నిశ్చయించుకొని ఆ విషము నత్యాప్యాయముగ భుజించిరి. దానివలన చావమేమో అని అనుమానమునుపొంది విషనాయువునుగూడ గ్రోలిరి. తలిదండ్రు లిద్దరును పరలోకమును చేరిరి. కూతురుప్రాణ మింకను పోకున్నది. వైద్యులకి సంగతి తెలిసి ఆస్పత్రికి గొంపోయి మందులు పోసి ఆమెను బ్రతికింప నుంకించుచున్నారు. ఆమె కిప్పుడు వయస్సు పదునెనిమిదవవత్సరము నడుచుచున్నది. ఆహా! ఎట్టి దివ్యమైన అబలామణుల కెట్టి పాటులు!

## విచిత్రమైన ముష్టి

మిసెసు ఆలిస్‌హ్యామండు అనునామె యాచకకోటికంతటికి కిరీటతుల్యమైనది. ఆమె చెయ్యెత్తి యెవ్వరినీ అడగలేదు. దీనముగా యాచిస్తూ ఎవరికి లేఖలు వ్రాయలేదు. ఒక ఇంజనీయరు గుమాస్తాకు ఆమె భార్య. ఆమెకు 11 గురు బిడ్డలు—అతని జీతము జీవనమునకు చాలదు. పిల్లలందరికీ మంచి చదువులు చెప్పించి పెద్ద అంతస్థులకు తెద్దామని ఆమె ఆశయము. ఆమె బలవంతురాలే. ఒకటి రెండుసారులు త్రోవకాచి శ్రీమంతులగు బాటసారులను తన్ని వారివద్దనున్న లొడ్డులొసుగూ సంగ్రహించి యిట్లోవేసుకుంది. కాని యీ సందర్భములలో ఆమె దొరికిపోయినది. కేసులుపెట్టి చిన్నచిన్న శిక్షలు వేయించినారు. అప్పటినుంచి ఈ వృత్తి మానుకున్నది. అక్కడనుంచి డబ్బు సంపాదించడానికి పాచికలు వేయడానికి మొదలుపెట్టింది-ఒకవిధమైన యాచనఆమెకు పట్టుబడింది.

టెలిఫోనుపుస్తకము చూచి యెవరో పెద్దపెద్దవారికి ఉత్తరములు దీసంగాావ్రాసి, వారేమైనా పంపిస్తారేమో అని యెదురు చూస్తూ వ్యర్థమనోరథయై కుమలడము కాదామె పద్ధతి. దినమూ పేపర్లు చూడడము, అందులో గొప్పవా రెవరైనా చచ్చిపోయినట్లుంటే అతనిపేర లేక ఆమెపేర వెంటనే ఒకఉత్తరము వ్రాయడము. చనిపోవడము తనకు తెలియనట్లు నటించుతూ ఆ వృత్తాంతము వ్రాసేది. 'అయ్యా, లేక అమ్మా, ఈ దీనురాలికి తమరు దఫదఫాలను చేసిన దానములను ఉపకారములను నేను మరువజాలను. మీ అవ్యాజకరుణాప్రసారమువలననే నేను గౌరవముగ మనగలుగుచున్నాను— ఈ దీనురాలను తా మెన్నడును మరువకుందురుగాక యని ప్రార్థించుచున్నాను' అని కొక్కిరి అక్షరాలతో వ్రాసేది.

ఆసామీ చనిపోయిన అయిదారు రోజులకీ వుత్తరము అందేది. బంధువులంతా చదువుకొనేవారు. ఆసామీ ఎంతమంచివాడు, ఎంత గుప్తముగా ఈమెకు సాయము చేసేవాడు, ఈమెయం దెంత అభిమానము, ఈమె యెంత యోగ్యురాలో, ఈమెకొక తృణము పంపించినచో అతని ఆత్మ యెంత సంతోషిస్తుందో అనుకొని తగినంత ధనము నామెపేర పంపిచేవారు. ఈ విధముగా ఆమె వారమునకు 8 పౌనులు లేక రు 120 ల నార్జిం

చెడిది. 22 సంవత్సరములై యిట్లు ఆర్జించు చున్నది. ఆరుగురు బిడ్డలిప్పటికిని ప్రయోజకులై, పెండ్లిండ్లాడి సుఖసంసారములను చేయుచున్నారు.

ఇంతలోనే దేమునికి కన్నుకుట్టినది కాబోలు—ఈ తంత్రం బయులుపడ్డది—డార్టమౌతు పోలీసువారు కేసుపెట్టినారు. నాపిల్లల కోసం నే నిట్లు చేయవలసివచ్చెనని ఆమె చెప్పిన సమాధానం—అయినా మేజస్ట్రీటు విడిచిపెట్టలేదు. 3 నెలలు కఠినశిక్ష విధించినారు.

## వృద్ధవివాహాలు

పెళ్లికొడుకూ అనేటప్పటికి అరవైయేళ్ల వానికైనా పదమూడేళ్లవాని కుండే కులాసాయు, 70 యేళ్లదానికైనా పన్నెండేళ్ల బాలకుండే ముచ్చట వాటంతట అవివస్తాయి. అందుచేత, పదిమంది పిల్లలున్నారుగదా, వయస్సు మళ్లిందిగదా, వానప్రస్థానికి పోరాదా అనే అడ్డదిడ్డపు ప్రశ్నలను ఆడవాళ్లకైనా మగవాళ్లకైనా చెప్పితే లాభము లేదు. మానవప్రకృతి వున్నన్నాళ్లు కన్యలేమిటి, విధవలేమిటి, బ్రహ్మచారులేమిటి, భార్యాహీనులేమిటి యెంత వయస్సులోనైనా పెళ్లికొడుకో పెళ్లికూతురో దొరకవాలికాని పీటలమీదికి మధుపర్కాలతో తయారౌతారు. అందులోను ఆ వృద్ధ దంపతులు ఆవృద్ధ వివాహానికిముందే పరస్పరం చేతులుకలుపుకొన్న పరిచయస్థులు స్నేహితులు ప్రణయప్రణయినులు అయినచో ఆ వివాహముయొక్క సారస్యము మరీ హెచ్చిపోతుంది.

ఈ మధ్యను ఇంగ్లాండుదేశపు సఫోకు జిల్లాలో జానుహాలు, హెవెను అను నిరువురకు జరిగిన వివాహములో ఇన్నీ కలిసివచ్చాయి. వరుడు తన చిన్నతనంలో తన గ్రామంలో ఒక వర్తకుడిదగ్గర తాబేదారుగా వుండేవాడు. అసమయంలోనే హెలెను అనే పిల్లను పరిచయము చేసుకొని ఉవ్విళ్లూరుతూ వుండేవాడు. ఆమెకును అతనియెడల పూర్ణానురాగము. అయినా ఆమెకు లండను నగరమున యేదైనా పని సంపాదించుకొని బ్రతుకు నిమిత్తం పోవలసి వచ్చెను. తరువాత జాను హాలు ఎవరైనో పెళ్లాడాడు. హెవెనుకూడా యెవరినో లండనులో పెళ్లాడేసుకుంది. వృద్ధాప్యంవచ్చేవరకు వానికి భార్యావిహీనత, యీమెకు భర్తృవియోగము కలిగింది; అయినా పిల్లలకి లోటులేదు. అతనికి యీామెకు కలిపి తొమ్మండుగురు బిడ్డలున్నారు. అందరూ పెద్దవాళ్లయి వేరే కాపరాలు పెట్టుకొని యెవరితెన్నునవారు బ్రతుకుచున్నారు. హెవెను 70-వ యేట తన జన్మస్థానం వచ్చేసింది. అక్కడ జాను ప్రత్యక్షమయ్యేడు. పాత చరిత్ర కొత్తభావాలతో పాలతరంగాల లాగ ప్రవహించుకొంటూ జ్ఞప్తికి వచ్చింది. జానుకు 72 మాత్రమే వయస్సు. ఇద్దరూ కూడబలుకుకున్నారు. గత 50 సంవత్సరములు వేరే స్త్రీతోను వేరే పురుషునితోను వారి శరీరాలు వేరే వేరే కాపురాలు చేసినా వారిమనస్సులుమాత్రం ఒకరిమీాద నొకరికివుంటున్నే

వుండేవి. నష్టపోయిన పెన్నిధి అలభ్యయోగంగా తిరిగీ వారికి ప్రత్యక్షమయింది. వారి ప్రణయ పరిణామము యాభై సంవత్సరాల క్రిందట యెంతవరకు సాగి ఆగిపోయిందో ఆ అంచీవగ్గరనుంచి తిరిగీ తరవాయి ప్రారంభించింది. ఇంకేముంది? ఇంగ్లీషువాడు చెప్పినట్లు వాళ్లు తిరిగీ ప్రేమలోపడ్డారు!! గుళ్లోకెళ్లేరు, ఫాదరీ మంత్రాలు చదివేశాడు, గంటలు గణగణమ్రోగినవి, పెండ్లి అయిపోయినది, పేపర్లన్నీ ఆ శుభవర్తమానమును ప్రకటించి ఆ నూతన దంపతులపై భూసురాశీర్వాదములు కురిపించినవి. వాళ్లిద్దరూ చాలా యోగ్యులనవాలి. వృద్ధాప్యంలో పెళ్లి చేసుకున్నా మన హిందూదేశం పెళ్లికొడుకులలాగ ప్రథమ రజస్వలయే కావాలని మనుధర్మశాస్త్రిలుపట్టుకొని అతను కూర్చోలేదు.

## గుణపాఠము

చాలా దేశాలలో మోటారుడ్రైవర్లు బహు మోటువారని పేరుపడ్డారు—వారు చక్రంపట్టుకొని వేగముగ నడుపుటకు ఒకసారి ప్రారంభించినచో, ముందర యెవరున్నారు ఏమున్నది యను ఆలోచనలు లేక యేవో సుందరమగు కలలుగంటూ సుడిగాలిలాగున యెగురుకొని పోతారు- ప్రపంచములో జరిగే మూడువంతుల మోటారు ప్రమాదములకు డ్రైవర్ల అజాగ్రత్తయే కారణము—అందులోను దొరగార్ల జమీందార్ల పెద్దఉద్యోగస్థుల శ్రీమంతులయొక్క—మోటారు డ్రైవర్లయితే అడగక్కరనేలేదు.

ఇట్టి వారిలోకూడా మంచి దయాదాక్షిణ్యము, నమ్రత, ఔదార్యము, అనురాగము కలవారున్నారంటే సంతోషముగదా! ఇంగ్లాండుదేశములో కెంటుజిల్లాలో ఒకగ్రామములో సెయింటుమయికేలు చర్చివద్ద కొందరు బాలురూ బాలికలూ రోడ్డుమీద ఆడుకొనుచుండిరి. బైంబైమని అరచుకుంటూ ఒకమోటారుకారు వచ్చింది. ఎన్నిసార్లు కొమ్ము ఊదించినా వారు కదలలేదు. డ్రైవరు బండి ఆపి 'రోడ్డుమీద ఆడతాకేమి చాలా ప్రమాదమే,' అన్నాడు. 'మా కాడుకుంటకు మరెక్కడా చోటులే'దన్నారు వారు. వెంటనే అతను ఆగుడి ప్రాంతాన్నే రెండుయకరములభూమి కొని పిల్లలాడుకొనుటకు తగిన ఆటసదుపాయము లన్నీచేసి పరికరములన్నీ సరపరాచేశాడు. ఇదంతా గుప్తదానమే- బాలురుకాని గ్రామస్థులుకాని ఆ దాతపేరు నేటికిని యెఱుగరు- తక్కిన డ్రైవర్లందరూ ఇతనినుండి యీ గుణపాఠము నేర్చుకొన్నచో యెంతో బాగుండును.





# సంపాదకీయములు

**48-వ అఖిలభారత మహాసభ:—**

బొంబాయిలో అక్టోబరు ఆఖరువారమున జరిగిన 48-వ అఖిలభారత కాంగ్రెసు మహాసభ అనేకవిధముల మిగుల ముఖ్యమైనది. రెండు సంవత్సరములు బహిరంగముగ కాంగ్రెసు జరుగుటకు వీలులేక మూడవ సంవత్సరమున కూడినను దేశీయుల ఉత్సాహ మేమాత్రమును తగ్గక హెచ్చుచున్నట్లు ఇందువలన గోచరమగుచున్నది. మహాత్ముని యెడలగల విశ్వాసమానంతయు తగ్గలేదు. అతను తెచ్చిన తీర్మానములు సంస్కరణములు మొదలైనవన్నియు, కొందరి కిష్టమైనను కాకున్నను, అతని యెడలగల గౌరవముకొలది 'తూ, చా' కూడ తప్పక నెగ్గిపోవుటయు గమనింపఁదగియున్నది. 1920-లో శాసనసభలమీద బడిన బహిష్కరణ మీయేట తొలగించఁబడెను. దేశీయులు చూపిన త్యాగమును అహింసను మహాత్ముడు చాలావరకు ప్రశంసించినప్పటికిని, కాంగ్రెసు వ్యవహారములలో సత్యమును అహింసయు తాననుకున్నంత యెత్తునకు నాయకులచే ఆచరింపఁబడ లేదని కాంగ్రెసునుండి నిర్గమించుట విచారకరము. అతని నిర్గమనము వలన కాంగ్రెసు పూర్తిగ కౌన్సిలు సభ్యుల కనుకూలమైన ప్రతినిధిరంగమై, కౌన్సిలు కార్యక్రమమును నిరాతంకముగ జరిపించుకొనగలదు. అతనును గ్రామపునరుద్ధరణము, హరిజనోద్ధరణము, సాంఘిక సంఘట్టనము మొదలగు సమస్యల ననన్యచింతతో నిర్వహించుకొనగలడు. తొలినుండియు అతనికిట్టి మానవసేవయందే తప్ప శుద్ధరాజకీయ తంత్రప్రయోగముల యందెట్టి విశ్వాసమును లేదని యెల్లరెఱిగినదే. మహాత్ముడీవిధముగ దేశమునకు నూతనజీవమును పటుత్వమును ప్రసాదించి ప్రజలను సకల సౌభాగ్య సముపేతులుగా నొనరించునుగాక!

### అసెంబ్లీ విజయములు.

ఏదిక్కునుండి విన్నను కాంగ్రెసు అసెంబ్లీ అభ్యర్థుల విజయభేరీరవములుతప్ప వేరొండు శబ్దములేదు. 14 సంవత్సరములుండి కాంగ్రెస్సు బహిష్కరించిన అసెంబ్లీని కాంగ్రెస్సు ఇప్పుడు, అనగా, దాని అవసానదశలో ముట్టడింపఁగడంగుట అందులోనుండి విశేషతర ప్రయోజనములను బడయుటకుగాదని యెల్లరకును తెలియును. సర్ శామ్యుయల్ హోరు ప్రభృతులు కాంగ్రెసుకు నియోజకవర్గముపై పలుకుబడిలేదనియు, కాంగ్రెస్సుజైళ్లలో దూరి ప్రభుత్వమును బెదిరింపజూచు అల్లరి

మూాక అనియు దానిని చితకద్రొక్కితి మనియు శ్వేతపత్రము నియోజకవర్గమున కంగీకృతమనియు ప్రగల్భములు కొట్టుచుండిరి. కాంగ్రెసు నియోజకవర్గము యొక్క నిజమైన ప్రతినిధియనియు, నియోజకవర్గము శ్వేతపత్రమును తిరస్కరింప బూనినదనియు ధృవపరచుటకే యీ యెన్నికలు జరిగినవి. కేవల రాజకీయ సమస్య నాధారము చేసుకొని యెన్నికల నడుపుచున్నామని శ్రీమాన్ రాజగోపాలాచారి గారు ప్రప్రథమ మునసే చాటిరి.

అయినను సనాతనులు మొదలైనవారు ప్రత్యేకాభ్యర్థులను నిలబెట్టుటవిచారకరము. నిలబెట్టినందుకు ఫలితము ననుభవించిరి. కాంగ్రెస్సువారు వారిపైన ఖండవిజయమును బడసిరి.

విజయముయొక్క అర్థము

అనేక కాంగ్రెస్సు అభ్యర్థులు ప్రత్యర్థులే లేకుండ అసెంబ్లీకి పంపబడిరి. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి విజయము వంటి విజయము ఆసేతు హిమాచల పర్యంత మెచ్చటనులేదు. 31338 అధిక వోట్లతో వారు ప్రత్యర్థినోడించి ధరావత్తు నోడిపోవునట్లు చేసిరి. సనాతనులు, భూస్వాములు, జస్టిసువారు, స్వసంఘములో నొకపక్షమగు కమ్మవారు, ఒకతెగ కాంగ్రెస్సువారుకూడ ప్రతికూల ప్రచారమును చేసినను 9191 అధికవోట్లతో ఆచార్యరంగాగారు ప్రత్యర్థి నోడించుటవలన నియోజకవర్గమునకు ప్రభుత్వచర్యలయందును శ్వేతపత్రమునందును నెంత అసహ్యాముగలదో విశదమగుచున్నది. బొబ్బిలిరాజావారు స్వయముగా సీతారామరాజుగారికి సహాయముచేయగడంగనిచో 7799 అధికవోట్లతో గిరిగారు వారి నోడింపలేకుందురేమో! చిత్తూరు దత్తమండలములలో రామక్రిష్ణారెడ్డిగారివంటి స్వతంత్ర అభ్యర్థిని ఒడించగల ధీరుడు కాంగ్రెస్సులో లేడని పార్లమెంటరీ బోర్డువారు ముందు అనుమానముపడి తరువాత అనంతశయనమయ్యంగారిని అత్యాలస్యముగ నిలబెట్టినను, 8692 అధికవోట్లతో అయ్యంగారు ప్రత్యర్థి నోడించుటనుబట్టి ఆమండలములలో రెడ్డి కులాభిమానము జస్టీసుపక్షాభిమానముకంటె కాంగ్రెసు అభిమాన మెంతలోతుగబాతుకొన్నదో విశదము కాగలదు. కేవలము ధనాధిపతులకును అందును పెక్కు విదేశీయ సంస్థలకును చెందిన వాణిజ్యనియోజకవర్గమునందు కూడ అసెంబ్లీ ప్రస్తుతాధ్యక్షులగు షణ్ముఖంచెట్టిగారిని స్వామివెంకటాచలంచెట్టిగారు సుమారు 100 అధిక వోట్లతో ఓడించుటవలన అట్టోవా మొదలగు ఒడంబడికలవలన హిందూదేశమునకు సర్ శాముయేలుహోరు ప్రభృతులు చాటునట్లు లాభముగాక నష్టమెంత హెచ్చుగా కలుగుచున్నట్లువణిజ శ్రేష్ఠులు నిర్ణయించుచున్నదియు తెలియనగును. రాజధానిలో పాతికసంవత్సరములాయను పాతుకొనిపోయి, ప్రభుత్వ ప్రధానోద్యోగములనెల్ల ఆక్రమించుకొని, స్థానిక పరిపాలనా సంస్థల నిచ్చవచ్చినట్లాడించుచున్న జస్టిసుపక్షములో మణిపూసయై, రౌండు టేబిలు సభలలోనెల్ల భారతదేశ ప్రతి

నిధియై, ప్రస్తుత అసెంబ్లీసభ్యుడై యున్న రామస్వామిముదలియారుగారిని కాంగ్రెస్సుఅభ్యర్థియగు సత్యమూర్తిగారు రాజధానినగరమునందే అయిదువేలధికవోట్లతో నోడించుటవలన జస్టిసుపార్టీయందును అది అండగా నిలచిన దేశప్రతికూలసంస్కరణముల యందును దేశమున కెంత రోతపుట్టినదో విశదము కాఁగలదు. కద్దరుధారియై, కాంగ్రెసువాదియై కారాగార శిక్షణములచే నవసి, తమిళనాడు దినపత్రికాధిపతిగానున్న వరదరాజులునాయుడుగారు కాంగ్రెస్సు అభ్యర్థి నెదిరించిన పాపమునకుగా ధరావత్తును గోల్పోవుటనుబట్టి నియోజవర్గమునకు కాంగ్రెసువాదము తప్ప వేరొకవాద మేమాత్రమును నచ్చలేదని సుస్పష్టము కాగలదు. ఆసఫాలీ, ఆరనుగార్ల విజయములు, నియోజకవర్గములు జాతి మతములను చూచి గాక కేవలము కాంగ్రెసు అభిమానమును చూచి అభ్యర్థులకు వోటులిచ్చుటకు మాత్రమే సిద్ధముగ నున్నవని స్పష్టముః చేసినవి.

## విజయకారణములు.

ఆంధ్రదేశమునను మదరాసు రాజధానియందును కాంగ్రెస్సు అభ్యర్థి యెవ్వరును ఓడలేదు. ఇట్టి అఖండవిజయమునకు కనేక కారణములున్నవి. ప్రభుత్వమువారి గత క్రూరచర్యలు, ప్రస్తుత శ్వేతపత్రసంస్కరణములు ప్రభుత్వవిధానమునందు సంపూర్ణ విముఖత్వమును పుట్టించినవి. కాంగ్రెసు అభ్యర్థి కిచ్చిన ప్రతివోటును పోలీసువారు కొట్టిన ఒక్కొక్క లాటిదెబ్బకు ప్రతీకారమని ప్రజలు భావించి మరీ యిచ్చినారు. కాంగ్రెస్సువారి అఖండత్యాగములు ప్రజల హృదయములలో నాటుకొనుటచే నియోజకవర్గము తమవోటులను ఆ త్యాగమునకు ప్రత్యుపకారముగ నొసర్పఁగల అత్యల్పోపకారముగ భావించి అభ్యర్థు లడిగినను మానినను కూడ తమవోటుల నయాచితముగ నర్పించిరి. మూఁడవకారణము కాంగ్రెస్సు దేశమంతట గ్రామగ్రామముల నల్లుకొనినట్టియు వేనవేలు స్వచ్ఛంద సేవకసేవకీ దళముతో కూడుకొనినట్టియు మహాసంస్థ. ప్రత్యుపకారరహితముగ స్వచ్ఛందాభిమానముతో సహాయముచేయగల ఇంత సేవకవర్గమింకే యితరపార్టీకిని లేదు. స్త్రీలు పురుషులువృద్ధులు యువకులు విద్యార్థులు విద్యాధికులు యెల్లరును తమయింటి పెండ్లికార్యమునకువలె దీనికై హడావిడిపడి తమవిధాయకకృత్యమును నెరవేర్చుచున్నారు. ఈ విజయములనుండి జస్టిసుపార్టీవారు గుణపాఠమును నేర్చుకొని కాంగ్రెస్సువారితో నేకీభవించకున్నచో వచ్చేరాష్ట్రీయసభల యెన్నికలలో నింతకంటె ఘోరమైన అపజయములపాల గుదురని గ్రహింపవలెను.

## మహిళామణుల అమూల్యసేవ

విజయమునందిన నాయకులెల్లరును తమ విజయమునకు కారణభూతులైన వ్యక్తులందరికిని కృతజ్ఞతావాదముల నొసరించుచున్నారు. ఆచార్యరంగాగారి విజయమునకు గుంటూరు నెల్లూరుమండలముల కమ్మకాపు బ్రాహ్మణవైశ్యయువతు లనేకులు నడుముగట్టుకొని ఉపన్యాసములనిచ్చి ప్రజలమనస్సులు

కరిగించి ఘోషాస్త్రీలనుగూడ పోలింగుస్టేష నులవద్దకు తీసుకొనివచ్చి వోట్లు కాంగ్రెస్సు కిప్పించిరి. శ్రీమతి వేదాంతం కమలాదేవి గారు తమ స్వస్థలమగు కాకినాడ వీడి, పుట్టింటి సీమయగు రాయలసీమకువచ్చి అహోరాత్ర ములు పనిచేసి అనంతశయనమయ్యంగారిని విజయవిభూషితులుగా నొనరించిరి. మద రాసునగరమున శ్రీమతులు రుక్మిణిలక్ష్మీపతి కోదనాయకిఅమ్మాళ్, ఎ. ఆర్. వి. శాస్త్రి సతి, సత్యమూర్తిసతి స్వామి అమ్మునాదన్ సతి మొదలైన సుమారునలువది మంది మహిళా మణులు ఎన్నియో సభలలో దేశీయకీర్తనలు పాడియు ఉపన్యాసముల నిచ్చియు, ఉత్సవ ములు ఊరేగింపులు సలిపియు, ఇంటింటికి పోయి ప్రతీస్త్రీ వోటరును హెచ్చరించియు, పోలింగుస్టేషనుకు తీసుకొనివచ్చియు సుమా రు 4000 వోట్లను సత్యమూర్తిగారికి దాఖలు చేయించిరి. అఖిలభారతమహిళాసభవారికి చెందిన మదరాసుశాఖవారు స్త్రీలహక్కులు ఆవశ్యకములను గూర్చి తొలుదొల్త నొక మెమోరండమును ప్రకటించి దానిని బల పరచువారికి తమ వోటుల నిత్తుమని విశదీ కరించిరి. కాంగ్రెసు జస్టిసుపక్షముల అభ్య ర్థు లిద్దరును స్త్రీల హక్కులను విద్యాభి వృద్ధినిగూర్చి తాము చేయగల సర్వప్రయ త్నములను చేతుమని వాగ్దానముచేసినపైని కాంగ్రెస్సు అభ్యర్థిని బలపరచిరి. ముత్తురెడ్డి సతీమణిగారు తిరునంతపురంమహిళా సభా ధ్యక్షపదవినుండి స్త్రీలు తొంటివలె ప్రభుత్వ నామినేషనులకై కనిపెట్టుకొని యుండరాద నియు సకలసభల ఎన్నికలకు నిలచి విజయ ముబడయవలయుననియు హెచ్చరించిరి. ఇక ముందు జరిగే స్థానికరాష్ట్రీయసభలకెల్ల పురుషులతోబాటు స్త్రీలుకూడ అభ్యర్థులుగ నిలచి గెలిచి దేశసేవ చేయబూనుదురు. ప్రజాహితకార్యములకును ప్రభుత్వనిర్వహణ కృత్యములకును నడుముకట్టుకొని భారత మహిళలు తొల్లింటి వీరక్షత్రియాంగనలవలె రణరంగములోనికి దుముకబూనినారు గనుక భారతదేశమునకు స్వరాజ్యావాప్తి యెంతో దూరమునలేదని నిశ్చయింపవచ్చును.

మదరాసునగరహరిజనసేవాసంఘము:—

1934 సం॥ సెప్టెంబరుతో అంతమయ్యే సంవత్సర నివేదిక:—గాంధీ మహాత్ముడు మదరాసు నగరమునకు 1933 డిశెంబరులో విచ్చేసినప్పుడు రూ. 24,032–4–11 పై సలు హరిజననిధికి వసూలైనవి. ఇందులో రూ. 3,721–12–0 హరిజన బాల బాలికల కద్దరు యుడుపులకు, యితర వ్యయములకు సెలవు, కాగా రు. 19,471–15–1 మిగిలినవి. ఇందులో రూ. 1,213–1–4 కోడంబాకం సంఘమువారికి పోగా రూ. 18,258–13–9 సెంట్రలుబోర్డువారు తీసుకొనిరి. సెంట్రలు బోర్డువారి గ్రాంటులవల్లను ఇతర విరాళముల వల్లను ఈ సంఘమువా రీసంవత్సరము రు. 7,259–13–8 పైసలు వసూలుసేసి రు. 6,166–12–9 లు పట్టణములో హరి జనాభివృద్ధికి ఖర్చుపెట్టిరి. అరుంధతీయపాలె మాదిగాగల ఆరుకేంద్రములలో స్థిరసంస్థల మూలకముగా ఆరోగ్యవిద్యా ప్రచారములు గావించుటయే గాక 9 రాత్రి పాఠశాలలకు, అనేక పఠనాలయములకు చేయూతనొసం

గిరి. 37 గురు బాలికలకు 31 బాలురకు మొత్తముపైని నెల 1-కి రు. 120 చొప్పున స్కూలు జీతముల సదుపాయములు చేయుచున్నారు. సేవాసదనములోని 5 గురు బాలికలకు వసతి సదుపాయములకుగా సాయము చేయుచున్నారు. ఇదిగాక కొందరకు పుస్తకములు మొదలగువాని నొసగియున్నారు. హరిజనభక్తుల చరిత్రలు, మధుపాన నిషేధకథలు, సహకార జీవన సూత్రములు, ఆరోగ్యవిధానములను గూర్చి మ్యాజికులాంతరు ప్రదర్శనములతో 157 ఉపన్యాసముల నిప్పించిరి. స్త్రీలకు మధ్యాహ్నము పూటను, వయోజనులకు రాత్రులయందును కొన్ని తావులలో విద్యను గరపుచున్నారు. పేదలకు నూనె, సబ్బు, మొదలగువానితో స్నానములు పోయించుచున్నారు. హరిజనుల నైతిక ఆధ్యాత్మిక జ్ఞానాభివృద్ధికిగా రు. 510 లు విరాళమొసంగిన శ్రీ అల్లాడి కృష్ణసామి అయ్యరుగారును, ఈ సంఘపు అధ్యక్ష కార్యదర్శులగు శ్రీయుతులు. కె. భాష్యమయ్యంగారు వి. వెంకటసుబ్బయ్యగారలును నగర హరిజనాభ్యుదయముకై నిరంతరము శ్రద్ధవహించుచుండు దీక్షకెంతయు అభినందనీయులు.

**ఆంధ్ర మహిళాసభ:—**

ఆంధ్ర మహిళాసభయొక్క అష్టమవార్షికోత్సవము మదనపల్లిలో నవంబరు 18-వ తేదీని శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి అధ్యక్షతను జరిగినది. 500 ప్రతినిధులు విచ్చేసిరి. వీరిలో పెక్కురు హరిజన యువతులు కూడ కలరు. పురుషుల ఉద్యోగముల నాక్రమించి వారినినిర్వ్యాపారులుగా చేయుట స్త్రీల ఆదర్శము కాదనియు స్త్రీకి గృహరాణి కాదగు సౌకర్యములన్నియును ఉద్యోగములు చేయుటకు తగిన స్వాతంత్ర్యమునుకూడ నుండవలెననియు ఆమె చెప్పెను. ఉన్నతవిద్య నేర్చిన స్త్రీలు గృహనిర్వహణము నసడ్డ చేయుదురను వాదము నామె తిరస్కరించెను. పురుషులకు వలె స్త్రీలకును ఆస్తులు సంక్రమించు హక్కు ఏర్పరచవలెనని కోరెను. వివాహ విచ్ఛేదన స్వాతంత్ర్యము స్త్రీకుండవలెననియు, అట్లున్నంత మాత్రమున వారు ఆ హక్కును దుర్వినియోగము చేయరనియు వాక్రుచ్చెను. అస్పృశ్యత అతిబాల్య వివాహములు తొలగించవలెనెను. ప్రాథమిక పాఠశాలలలో బాల బాలికలకు కలిపి విద్య చెప్పవలెననియు, ఉన్నత ఉత్తమ విద్యలకు స్త్రీలకు వేరే పాఠశాలలు కళాశాలలు హాస్టలులు ఉండవలెననియు, వెంటనే ఒక ఆంధ్రమహిళా కళాశాల స్థాపించే ప్రయత్నములు జరుపవలెననియు హెచ్చరించెను. సభవారి తీర్మానములు ఆవేశంతో ప్రకటించినాము. వివాహవిచ్ఛేదనాధికారమునకు భారతస్త్రీ లింకను సుముఖులుకా లేదని వాని వలన తెలియదగును. సభను మిగుల దక్షతతో నిర్వహించిన శ్రీమతి దుర్గాభాయమ్మగారు సర్వాంధ్ర మానినీ మణుల అభినందనములకు పాత్రురాలు.

**శ్వేతపత్రముకంటెను ఘోరము:—**

శ్వేతపత్రపు సిఫార్సులే చాల సంకుచితమై భారతదేశమున కనంగీకృతములై యున్నవన్నచో, జాయింటు పార్లమెంటరీకమిటీవారి సిఫార్సు లంతకన్న ఘోరముగనున్నవి.

నియోజకవర్గము మునపటి నూటికి ముగ్గురు నుండి నూటికి 14-గురు అనగా 70 లక్షల నుండి 2 కోట్ల 90 లక్షలకు పెద్దది చేయుబడుట తప్ప ఇందు ప్రశంసింపదగినదేమియు కానరాదు. వీరిలో 60 లక్షలు మాత్రము స్త్రీలు. ప్రత్యేక నియోజకవర్గముల యేర్పాటువల్లను, అసెంబ్లీకి, స్టేటుకౌన్సిలుకు పరోక్షపుటెన్నికల నేర్పాటుచేయుటవల్లను, మదరాసు బొంబాయి రాష్ట్రములకుకూడ రెండవశాసనసభ నేర్పరచుటవల్లను దీని ప్రయోజనముకూడ మృగ్యమగుచున్నది. ఫెడరేషను కొన్ని పురుషాంతములవరకు కూడ యేర్పడెను సూచనలులేవు. 75 గురు స్వతంత్రరాష్ట్రాధిపతులైనను మనఃపూర్వకముగ నిందుచేర నంగీకరించవలెను. అంతవరకును కేంద్రమున బాధ్యత చిక్కదు. వారు చేరినచో బ్రిటిషుఇండియా ప్రతినిధుల మాట అందు చెల్లదుకనుక బాధ్యత మృగ్యమగును. ఏది యెట్లులున్నను అపరిమిత కాలమువరకు అచ్చట ప్రజాప్రతినిధుల ప్రయోజనమే అంతయుండదేమో అనిపించును. వైసురాయిగారి సర్వాధికారము క్రింద ఉదారాశయపూరితులగు ప్రజాప్రతినిధులు గిజగిజగింజుకొనుచుండక తప్పదు. వివిధ సాంఘిక నియోజకవర్గముల ప్రతినిధులు, ప్రభుత్వముచే నామినేటు చేయబడినవారు, ప్రభుత్వోద్యోగస్థులు, వివిధ జాతుల యుద్యోగ సౌకర్యాదిసంరక్షణలు, బ్రిటిషు వర్తకులయొక్కయు బ్రిటిషు ఉద్యోగులయొక్కయు సంరక్షణలు యీమొదలగు చిత్రవిచిత్ర మినహాయింపులతో కూడిన సభయందు భారతదేశ ప్రతినిధుల రోదనము లేమాత్రము లక్ష్యమును శ్రద్ధయు పొందగలవో సంశయనీయము.

ఇక రాష్ట్రముల సంగతియైనను ఇంతకన్న నేమైన నయముగానున్నదేమో యనిన నదియును గానరాదు. దేశీయస్వాస్థ్యము, బ్యాంకు, కోటలు, రైల్వేశాఖ, పెద్ద ఉద్యోగములు, క్రైస్తవదేవాలయములు మొదలైన సమస్యలన్నియు రాజప్రతినిధివి. వానికి కావలసినధనము, అధికారము అతను స్వీకరించగా మిగిలినది మాత్రమే రాష్ట్రీయ గవర్నరులకు వచ్చును. ఈమిగతా అధికారములలో పోలీసుశాఖ మంత్రులపరమైనను దానిలో మార్పులుచేయుటకు వారికెట్టి యధికారములేదు. రహస్య పరిశోధకశాఖ వారి సిఫార్సులకు మంత్రులు కిక్కురు మనరాదు. ఐ.సి.యస్ ఉద్యోగముల నేర్పరచునతను ఇండియాసెక్రటరీగారు కనుక వారతనికే బాధ్యులు. ఇక శాసనసభలమంత్రులకు మిగిలిన అధికారములు చాలతక్కువ!! పోనీ యిచ్చిన అధికారములనైన మంత్రులును శాసనసభ్యులును యథాశక్తితో నిర్వహింతమన్న శాసనసభలలో ప్యాసయిన దానినెల్ల గవర్నరుగారు దేశక్షేమాభికరము కాదని త్రోసివేయవచ్చును. కొన్ని మార్పులను గవర్నరుగారు అంగీకరింపనిచో అసలు సభలో ప్రతిపాదింపనేరాదు. గవర్నరుగారు కొన్ని సందర్భములలో అసలు సభలనే త్రోసివేసి సర్వాధికారము పూనవచ్చును.

ప్రత్యేక నియోజకవర్గముల ప్రతినిధుల తోను, గవర్నమెంటు సభ్యులు నామినేటెడు

సభ్యులతోను కూడిన సభలో నిజమైన ప్రతినిధులు తెచ్చుబిల్లేది కాని ప్యాసగుటకు వీలులేదు. అథవా అది ప్యాసయినదా, రెండవ సభవారు దానిని త్రోసివేయక మానరు. ఏలనన ఆసభనిండ జమీందారులు ధనాఢ్యులు, పెన్షనుద్యోగస్థులు మొదలైన వారుందురు. ఈ సభకు 9 యేండ్ల కొకొక్క సారితప్ప యీలోగా మార్పురాదు. ఈసభ వారుకూడ: మోటతనము చేసి యే చట్టమైన ప్యాసుచేసినచో గవర్నరుగారు కాదన వచ్చును.

ఇండియాకు బాధ్యతాయుత ప్రభుత్వము నిచ్చెదమని చక్రవర్తులు రాజప్రతినిధులు మొదలగు వారలింతవరకు చెప్పుచుండెడి వాగ్దానములెల్ల బూటకములనియు, వారు హిందూదేశీయుల నెన్నడును నమ్మరనియు, వారి కేమాత్రమధికారమిచ్చినను తమకు నష్టము తప్పదనినమ్మి వారిని శాశ్వతముగ విడబరచి యుంచుట కెట్టి విషమమార్పుల నైనను చట్టములో మార్చుటకు ఇంగ్లీషు ప్రభుత్వమువారు సిద్ధముగ నుందురనియు ఈ నివేదికవలన స్పష్టమగుచున్నది. స్వరాజ్య మనునది ఆంగ్లేయదేశములో పడవలనెక్కిం చుకొని హిందూదేశములోనికి దిగుమతి చేసుకొనే వర్తకసామగ్రి కాదనియును, దేశీయుల ఆర్థిక వైజ్ఞానికసంపదలను వృద్ధి చేసి బలపరచినచో, వారే తమకాళ్లమీద తాము నిలువగలిగి బ్రిటిషువారి నిరంకుశత్వ మును సడలించుకొనగలరనియు, ఎల్లరును గాంధిమహాత్ముని గ్రామపునర్నిర్మాణ ప్రయ త్నమునకు తోడుపడి దానిని జయప్రదము చేయవలెననియు కవిసార్వభౌమ రవీంద్ర నాథటాగోరుగారు సందేశమంపినారు. దేశము లోని విద్యాధికులు, ధనాఢ్యులు, దేశోప కారపారీణులెల్లరును నీయుద్యమము నభివృద్ధి పరతురుగాక.

ఇక శాసనసభల విషయమై యీచట్టము ద్వారా మనకు వీలయినన్ని స్థానములకు కాంగ్రెసు అభ్యర్థులనెన్నుకొని పంపుదము. ఇతర వర్గముల వారిని వారికి తోడ్పడు మని కోరుదము. కాంగ్రెసు శాసనసభ్యులు తాముచేయగల కృషినంతటిని సలిపి యీ పత్రమును తిరస్కరించుటకు ప్రయత్నింతురు గనుక, దేశీయులెవ్వరును దీనిని చూచి నిస్పృహులుకాక కాంగ్రెసు ఆదేశములను శిరసావహించి అది నిర్ణయించుచుండెడి ఆర్థిక, రాజకీయ ప్రణాళికలనన్నిటి నెప్పటి కప్పుడు నెరవేర్చుచుందురుగాక!

స్త్రీల నియోజకవర్గము మునుపటికన్న పెద్దది చేయబడినప్పటికిని అదిచాలదని కమిటీ వారే రిమార్కు చేసినారు. భారతమహిళా సభ కోరినదానికంటె యిది చాలా తక్కువగ నున్నది. స్త్రీ లెన్నడును ప్రత్యేకనియోజక వర్గమును కోరికాని అంగీకరించికాని యుండ లేదు సరేగదా అనేకసభలలో వానిని ఖండించి తమనైనను ఆపాశమునుండి తొల గించమని తీర్మానములు సలుపుచుండిరి. ఈ రిపోర్టు దేశములో నేపార్టీవారికికాని అంగీ కారము కాదు. లిబరలు మొదలగు పక్ష ములవారు దానిని సవరింపఁ జూచుచున్నారు.

కాంగ్రెస్సువారు తిరస్కరింపఁ జూచుచున్నారు. ఇంతే భేదము. ప్రతికూల ప్రచారము చేయుట కెల్లరును బూనుకొన్నారు. ఆంధ్ర మహిళా రత్నములందరును గత సత్యాగ్రహోద్యమము, అసెంబ్లీ యెన్నికలు మొదలగు యితర రాజకీయోద్యమములయందువలె ఈ ప్రతికూల ప్రచారోద్యమమునందుఁగూడ పాల్గొని, రిపోర్టు వలన నష్టములను ప్రజలకు స్పష్టపరచి నూతన రాజకీయ ప్రణాలిక యేర్పాటగు వరకు శాశ్వతాందోళనము చేయుచుందురుగాక!

ఆంధ్రులకు ప్రత్యేకపు దెబ్బ:—

ఈ కమిటీవారి సిఫార్సుల వలన అఖిల భారతదేశ ప్రజలకుకలిగిన ఆశాభంగము నష్టమునూట అట్లుండగా ఆంధ్రులకు ప్రత్యేక కష్టములు కలిగినవి. బరంపురము నగరమును తత్ప్రాంతమును తెల్లకాగితములోనే తుడిచివేసిరి. అది అన్యాయమని ఆంధ్రులాందోళనము చేయుచునే యుండిరి. ఈ కమిటీవారు దానిని మార్చి ఆంధ్రనగరము నాంధ్రులపాలొనరింటన్యాయమై యుండెను. కాని అట్లు చేయుటకు మారు ఒరిస్సాకమిటీ వారు కోరినారుగదా అని జయపురం సంస్థానములో కొంత భాగమును జిల్లాంతర్భాగమైన తాలూకాలను, పర్లాకిమిడిజమీందారుగారు కోరిరిగదా యని పర్లాకిమిడి నగరమును, తత్ప్రాంత పల్లపు తాలూకా కొంతయును నూతన ఒరిస్సా రాష్ట్రములో చేర్చిరి. ఇవి ఆంధ్రజన బాహుళ్యముగల ప్రదేశములని యెల్లరెఱింగినదే. అయిననేమి? కమిటీవారు న్యాయమును పెడచెవిని బెట్టి ఓఢ్రజమీందారుల ప్రార్థనల కుబ్బి తబ్బిబ్బుపొంది ఆంధ్రదేశమును ఒరిస్సాలో చేర్చినారు. నూతన రాష్ట్రములో లీనులై ఆంధ్రులు తమ వ్యక్తిత్వమును మఱతురనుట కల్ల. తిరిగి ఆ ప్రాంతములను చేర్చి ఆంధ్రరాష్ట్రమును నిర్మించువరకు వారాందోళనము చేతురు. ఇట్టి మైనారిటీ ఆందోళనము వలన గాని, తమ జమీందారీలలో కొంతభాగము మద్రాసు రాజధానిలో ఉండిపోయి విభజింపబడుటవలనఁ గాని జయపురం పర్లాఖిమిడి జమీందార్లకుగాని నూతన రాష్ట్రమునకుగాని లాభముకన్న నష్టమే యెక్కువ. అయినను దీనిఫలితమును వారనుభవింప సంసిద్ధులైరి. ఆంధ్రులు మేల్కొని తీవ్రతరాందోళన సలిపి నష్టపోయిన ప్రాంతమును తిరిగి సంపాదించువరకు విశ్రమింపకుందురుగాక!

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

అనుకరణములను చూచి మోసపోకుడు

# అమృతాంజనము

SOVEREIGN-REMEDY
AMRUTANJAN
Best Indian Pain Balm
Amrutanjan Depots
BOMBAY, MADRAS




అమృతాంజనం డిపో

బొంబాయి, మదరాసు, కలకత్తా.

# డోంగ్రే గారి బాలామృతము

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, బలమున్ను, ఆరోగ్యము, నిచ్చును. అన్నిస్థలములందు దొరకును.

అన్నిచోట్ల అమ్మబడును



ప్రొప్రయిటర్లు:— కె. టి. డోంగ్రే అండు కో, గిర్గామ్, బొంబాయి

మద్రాసు స్టాకిస్టులు, దామోదరుకంపెని,

78, చైనాబజారురోడ్డు, జి. టి. మద్రాసు.

# జమ్మి వెంకటరమణయ్యాగారి

## యకృత్ ప్లీహావ్యాధులకు (Liver and Spleen complaints) దివ్యౌషధములు.

ఈ ఔషధము పైరోగములను కుదుర్చుటయేకాక, రాకుండ కూడా చేయును. వైద్యశిఖామణులెల్లరును మిగుల పొగడుచున్నారు. ఇతరమందులన్నియు వేసివేసి నిరాశచేసుకొన్న సందర్భములలోకూడా ఇది పనిచేసి విజయమును బడసినది.

అనేక ప్రదర్శనములలో బహుమానమును బడసినది. తెణుకులో జరిగిన ఆంధ్ర ఆయుర్వేద మహాసభలో ఇది ప్రథమతరగతి యోగ్యతాపత్రమును పతకమును బడసినది.

జమ్మి వెంకటరమణయ్యాగారి ఫోటోగ్రాఫు దీనికి ట్రేడుమార్కుగా రిజష్టరు అయినది కనుక ఆ ఫోటోనుచూచి మందు కొనుక్కొన్నచో మోసపోరు. 5 రూపాయీలకు 10 రూపాయీలకు రెండు రకము లమ్మబడును. జబ్బు లేతగానున్నప్పుడు మొదటిది, ముదిరినప్పుడు రెండవది ఉపయోగించవలెను.

లభించు ప్రధానస్థానములు :

మదరాసు, 8, సాలై వీధి, మైలాపూరు. కలకత్తా, 125, హారిజనురోడ్డు.




# జామాతైలము

ఏజంట్లు కావలెను.

తలనొప్పి, యిన్ఫ్లుయంజా, చేయి కాలు పట్టుకొనుట, పంటినొప్పి మొదలగువ్యాధులను ఒక క్షణములో పోగొట్టగల ఖ్యాతిచెందిన "జామాతైలము"నకు సమమగు మందు వేరేదియు లేదు. చాలా యోగ్యతాపత్రములను పొందియున్నది.

బుడ్డి 1-కి అణాలు 6 ఇచ్చి ఉపయోగించి చూడుడు.

## అమర్‌చెందు, శోభాచెందు,

ఇంగ్లీషుమందులు, పలుసరకులు, సల్ఫ్యూరిక్, నైట్రిక్, మొరాటిక్ ఆసిడ్ల వ్యాపారస్థులు.

నెం. 63, నైనప్పనాయని వీధి, మద్రాసు.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగు లక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపము గలిగినప్పుడు ఉపయోగించి తప్పక పనిచేయును. గర్భాశయమునుండి మైల సరీగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి **(Douche)** మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిది ఒక్కటే; ఇది బాలింతల పాలిటి పరమౌషధము.

వెల తు. 1–కి రు. 30.

పుకడు వారమురోజులకు మందు రు.5.

---

రజోదర్శిని

స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన వ్యాధులకు మంచి మందు. ముట్టునొప్పి, మైల సరీగా కాకపోవడం, బొత్తుగానే బహిష్టు కాకపోవడం, మొదలైన బాధలను నివారించును. రజస్వల కానివారలుకూడ సేవించిన పిదప రజోదర్శనమైనట్లు ప్రశంసలు గలవు. వివరములు కోరిన పంపబడును.

50 మాత్రలు రు. 2.

పై రెండు ఔషధములనుగూర్చిన వివరములు కోరినవారికి ఉచితముగా పంపబడును. 180 పేజీలుగల 'ఆయుర్వేద చికిత్సాదర్పణము' అను గ్రంథము 0-2-0 లకు పోస్టేజీబిళ్లలు పంపినవారికి ఉచితముగా పంపెదము.

*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకర శాస్త్రి,

ఎ. ఎం. ఎ. సి.




సంపాదకుండు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] జనవరి 1935 [సంచిక ౧౧.

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువమేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికయెంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడుగ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లుతెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచనచూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తులపేర ఎంతమాత్రము పంపకూడదు.

## నవనాగరికమైన వన్నె చిన్నెల బట్టలు
## కావలెనంటే

ఫ్యాషను సిల్కుహౌసు ప్రఖ్యాతివహించియున్నది.



44 యేండ్లాయెను
దక్షిణ హిందూ
దేశమంతట
దీనిపేరు
మ్రోగుచున్నది.

నాణ్యమైన సరుకు
సరసమైన వెల
చాలాకాలము
మనుదల
ఇవి మా
వ్యాపారసూత్రములు

### చీరలు

రకరకాల ప్రకాశవంతమగు రంగులు. క్రొత్త క్రొత్త ఫేషనుల అంచులు. ఎవరి కట్టి శుభ కార్యములకు వేడుకలకు ఎటువంటివి కావలసిన నటువంటివి దొరకును. తమరు స్వయముగా వచ్చి చూడవచ్చును లేదా జాబుద్వారా ఆర్డరు పంపవచ్చును.

**45**
రటాన్ బజారు, మదరాస్.

# చెల్లారామ్స్

చెల్లారామ్స్
కెయూఃచెద్

బజారుల
మధ్యన గలదు.

# అబ్బాయి అల్లరి పెడుతూవుంటే దానికొక కారణ ముంటుంది.

## వైద్యుల నడిగితే ఝందిస్తారు.

కుఱ్ఱవాళ్లు చికాకు పెడుతూవుంటే తిట్టకూడదు-డాక్టరుతో చెప్పాలి. డాక్టర్లంటారు—ఎ. డి వైటమిన్లు, కాల్సియం, భాస్వరం తక్కువైతే పిల్లలు యెమికలు వళ్లు, నరములు బలహీనములై వారు చికాకు పెడుతూవుంటారని.



## వైద్యులు 60 యేళ్లాయను.సిపార్సు చేస్తున్న మందు.

స్కాట్సు ఎమల్షను—ఇది. చక్కని కాడ్డులివరు ఆయిలుతో తయారవును-జీవనమును పెంచెడి ఎ వైటమినును, కాల్సియముగ్రహించి యెముకలను పండ్లను దిట్టపఱచు డి వైటమినున్ను దీనిలో విశేషించి వుండును. దీనిలో ఫోస్ఫరసు కూడా కలియును గనుక సాదా కాడ్డులివరు ఆయిలుకంటె మూడు రెట్లు ఎక్కువ గుణము నిచ్చును.

కాడ్డులివరాయిలుకంటె ఇది తియ్యగా వుంటుంది. కనుక పిల్లలు సంతోషంగా తిని చక్కగ జీర్ణించుకుంటారు.

ఊపిరితిత్తులకు కూడ చాలా మేలు చేయును. ఇది శరీరమునకు పుష్టిని చులుకు తినమును యిచ్చును గనుక దీనితో బాటు ఊపిరితిత్తులలో ఉండే రోగములు కూడా మాయమగును. జబ్బుపడి నీరసించినవారు దీనిని సేవించిన యెడల కొంచెము రోజులలో కోలుకుంటారు.

ఆశ్చర్యము, యదార్థము.

స్కాట్సు ఎమల్షను కాడ్డులివరు ఆయిలుకంటె మూడురెట్లు గుణము, వెన్నకంటె 80 రెట్లు యెముక పుష్టి, 8 రెట్లు జీవనపుష్టి యిచ్చును- ఒక చమ్చా ఎమల్షను 2 పైంట్లపాలు, 2 కోడిగ్రుడ్ల గుజురు, 12 పౌనుల బనానాలతో తుల్యము.

# SCOTT'S Emulsion



**స్కాట్సు ఎమల్షను**

స్కాట్సుఎమల్షను యేమి చేయగలదు? యెముకలను మాంసమును బలపరచును, నరములకు పుష్టినిచ్చును, ఊపిరితిత్తులకు రోగమురాకుండా కాచును, రక్తమును శుద్ధి చేయును, జబ్బులురాకుండా కాపాడును.

మందీవర్తకులు
ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడు.
కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమదాబాదు, కొచిను, కాలికట్టు, విశాఖపట్నం, కరాచి, అమృతసరము.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రెప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ,
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.
బెంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్ డిపో. ఏలూరు: బి. విశ్వనాధంగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 241 ఫేన్‌వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారువీధి.
సికంద్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాన్‌బజారు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు. [షాప్స్.
ఖరగ్‌పూర్: ఆర్. వి. రమణయ్య, స్టోర్సుక్లర్క్., బి. ఎన్. ఆర్ వై. వర్క్
కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు న్యూస్‌బాయ్ అండు కో.
అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.
నెల్లూరు: సి. సుబ్బరావు అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకోనుడు.

ప్రకృతిశోభ
ధ్వంసమైనది!



వృక్షాలు వ్రేళ్లతో కూలినవి
నదులు బుసబుస పొంగినవి
ఇండ్లు పగిలినవి
భూమి బీటలు పడినది

అది భూకంపము!

ఆరోగ్యము
ధ్వంసమైనది!

చలి గజగజ వణకించినది
ఉష్ణము బుసబుస పొంగినది
ఉదరమున బల్ల పెరిగినది
పైత్యము ప్రశాంతతను
తలక్రిందులు చేసినది.

అది జ్వరము

విషజ్వరము



రెండును ప్రమాదములె—భూకంపములకు విరుగుడులేదు
కాని జ్వరములకు మాత్రము విరుగుడు అర్కా వున్నది.

అర్కా

(సర్వజ్వర నివారిణి)

అన్ని మందులషాపులలోను దొరకును

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

# ఛాయాచిత్రములు

## వివరములు

### శ్రీ బేగం సుల్తానె మీర్ అమీన్ ఉద్దీన్.

శ్రీ మీర్ అమీర్ ఉద్దీన్‌గారి సతీమణి. ఈ దంపతు లిపుడు యూరపు దేశమున సంచారము చేయుచున్నారు. సాంఘిక సేవ జేయుట వీరి ముఖ్యాశయము.

### శ్రీ ధర్మపారాయణి లక్ష్మీదేవమ్మగారు.

మెటర్నిటీ హాస్పిటలున కీ కరుణామయి రూ. 50000 ల విరాళ మొసగెను శ్రీ మైసూరు మహారాజావా రీమె ఔదార్య మునకు మెచ్చి ధర్మపారాయణి బిరుద మొసగిరి.

### శ్రీమతి ఆర్. యం. లాజరస్.

లోనవాలా మునిసిపల్ సభ కీమె నూత్నముగా నుపాధ్యక్షు పదవి నొందినది.

### శ్రీమతి హీరావతి జెన్ మన్ సుఖ్‌లాల్.

బరోడాలో ఆర్యకన్యాలయమునకు రూ. 50000 విరాళ మిచ్చిన వదాన్యురాలు.

### శ్రీమతి అశాకుమారి ఓజా.

12 ఏండ్ల బాలికామణి. సంగీతమందు గొప్పప్రజ్ఞగలిగి అనేకములైన పోటీ పరీక్షలలో స్వర్ణపతకము లాదిగాగల బహుమానము లందియున్నది.

# పఠానుల బలపరాక్రమము



కాశ్మీరపుకీళ మీాను కావలయును

మానవులందరును బలిష్ఠముగను దార్ఢ్యముగను జన్మింపరు. కాని శరీరమునుపట్టి పీడించే నిస్సత్తువను నిర్మూలించి నిగనిగలాడు దేహముతో నిండు ఉత్సాహముతో అవయవముల పుష్టితో హాయిగానుండు టవసరము. అది మానవుని జన్మహక్కు. అందులకై ప్రతి ప్రాణియు ప్రయత్నింపవలయును.

దేహమందు రక్తము—నిష్కళంకమగు ఉష్ణరక్తము ప్రవహించుచో దేహమునకు ఆరోగ్యము, ప్రాణికి ఆనందము, జీవితముయెడల ఉత్సాహము ఉండగలదు. జీవాధారమగు ఉష్ణరక్తమును వృద్ధిచేయుటకు సాధనము అమృతకంటె వేరులేదని చెప్పకతప్పదు. శుష్కించిపోయిన మానవుని మన్మథునిగ చేయును. పిరికివానిని పరాక్రమునిగ మార్చును. మందబుద్ధిని బుద్ధిమంతుని చేయును.

# అమృత

## రక్తశుద్ధి ద్రావకము




రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 లు.

అమృత యెల్లెడల దొరకును.

**కేసరి కుటీరం,** ఎగ్మూరు, మదరాసు.




# స్త్రీలు — హక్కులు

గతసంవత్సరము నవంబరునెల 24 వ తేదిని భారతదేశమునం దన్నిప్రాంతములయందును స్త్రీలహక్కులనుగూర్చి సభలు జరుపఁబడినవి. ప్రస్తుతము హిందూ మహమ్మదీయ ధర్మశాస్త్రములద్వారా వారికి సిద్ధించు హక్కులు స్వల్పాతి స్వల్పములై, వారిని పురుషుల దయాధర్మ భిక్షలపై ఆధారపడవలసినవారినిగా జేయుచున్నవి. వీనినిమార్చి క్రొత్తహక్కులను సంపాదించుటకుగా శాసనసభలలో పెట్టఁబడు బిల్లులు నెగ్గకున్నవి. జాయింటు పార్లమెంటరీ కమిటీవారి యెదుట యీ సంగతి మొఱపెట్టుకొనఁ బడినను, వారు తమనివేదికయందు వీనినిగూర్చి మౌనముద్ర వహించిరి. కాని యీ సమస్యను గూర్చి యొదలు తాటస్థ్యమువహించినను స్త్రీలుగాని వారిపక్షము వహించి పోరాడు పురుషనాయకులు గాని మిన్నకుండక తగినంత పెద్దదైన ఆందోళనము చేయుటకు సంకల్పించుకొనియే యున్నారు.

ప్రస్తుతము భారతనారీమణుల కెట్టిహక్కులున్నవో, వారు స్వతంత్రముగ అభివృద్ధిపొందవలెనన్న యెట్టిహక్కులు వారికుండవలెనో, ప్రస్తుత చట్టము లెట్లు సవరించవలెనో మొదలైన విషయములనెల్ల స్థిరపరచుటకు 'అఖిల భారత విచారణకమిటీ'నొక దానిని స్థాపించవలెనని అఖిల భారత మహిళా సభవారు చేసిన తీర్మానమును బలపరచుచు అనేక మహిళాసభ లాదినమున తీర్మానమును

ప్యాసుచేసినవి. ఈ విచారణసంఘములో పెక్కుఱు అనధికారవర్గమువారును కొందరు నారీమణులును నుండవలెనని అన్నిటను తీర్మానింపఁబడెను. ఈ సభలలో ప్రసంగించి యీ తీర్మానమును బలపరచినవారిలో కేవలము స్త్రీలేకాక అనేక పురుషులు, న్యాయవాదులు, దేశనాయకులు గూడ నుండిరి. దీనినిబట్టి స్త్రీ జనాభిమానులెల్ల రును వారికి కొఱవడుచున్న హక్కులను గూర్చియు సంపాదించ దలచుకొన్న హక్కులను గూర్చియు ఎంతతీవ్రముగ ఆలోచించు చున్నదియు తెలియ నగును.

'ఇదివరకు స్త్రీలకు లేని హక్కులేమి, ఇప్పుడు వచ్చే హక్కులేమి, ఈ వచ్చే హక్కులు వారికి లేకున్నంతమాత్రమున కలిగిన కుందకమేమి, వచ్చినయెడల వారు మిన్నుముట్టెడిదేమి' యని కొంద రడుగ వచ్చును. స్త్రీలకు ఆస్తివిషయములో ఇవతల తండ్రివద్దనుంచిగాని అవతల భర్త వద్దనుంచిగాని సంక్రమించు హక్కులేమి యును ప్రస్తుతమున లేవు. తండ్రి ఆస్తి అంతయు కొడుకులు పంచుకొందురు. కూతు ళ్లకుకాని భార్యకుగాని యేమియునుండదు. పుత్రవతి కాని స్త్రీకి వైధవ్యము కలిగినచో పెనిమిటిఆస్తి అతని అన్నదమ్ములకు జ్ఞాతు లకు పోవును. స్థిరాస్తిని బ్రతికియున్నన్నాళ్లు అమ్ముకోకుండా తినవచ్చును. అది పెద్ద దైనచో దాని రాబడి జీవనోపాధికి సరి పోవునుగాని చిన్నదైనచో అమ్ముకోనిదీ తిండికే చాలదు. అయినను,ఒంటిపూట తిండి తోను ఒంటిగుడ్డతోను మాడవలసినదే. లేదా యాచనకో పరాయియింట చాకిరీకో దిగవలసినదే. అత్తింటివారును పుట్టింటి వారును కాస్త మర్యాదస్థులై ఆమె కంతటి గతి రాకుండ చేయదలచినచో, వారి పెట్టు పోతలకు లోపడి ఆమె కాలక్షేపము చేసు కొనవలసినదే. వృద్ధాప్యములో కాని రోగ దశలో కాని ఆమెను కనిపెట్టి పరిచర్య సేయువారు బంధువర్గములో నెచ్చటనునుం డరు. ఏలనన ఆమె నిరాస్తిపరురాలు, ఆమె నుండి వారికి సంక్రమించున దేమియు నుండదు. ఆమెకు సంపూర్ణాధికారము కలిగిన యాస్తి ఒక్కటియే; తల్లిదండ్రులు కన్యా దాన మప్పుడిచ్చిన యాభరణములు, అత్త వారు కంతనాడు పెట్టిన నగలు, పెనిమిటి తదుపరి ముచ్చట కిచ్చిన వస్తువులు. ఇవి యన్నియు స్త్రీధన మనుపేరట వ్యవహ రింపఁబడును. ఆమె చనిపోయిన పిమ్మట ఈ నగలు పుత్రికలున్న పుత్రికలకును లేకున్న పెనిమిటికిని సంక్రమించును.

స్త్రీల కింతవరకుమించి స్థిరచరాస్తులపై హక్కులు లేనంతమాత్రమున వారి స్థితి అధ్వాన్నముగ నున్నదని విదేశీయు లూహిం చ నవసరములేదు. ఆస్తిహక్కులు లేకున్నను

ఆమె గృహరాజ్ఞీత్వమున కెట్టి కొదువయును లేకుండెడిది. తండ్రులు తమ ఆస్తికి కుటుంబ గౌరవమునకును తగినట్లు ఆభరణములును వరకట్నములును ఇచ్చి ఆడపిల్లలకు పెద్ద సంబంధములు చేయుచున్నారు. పెనిమిటులు వారివారి దర్జాలకు తగినట్లు భార్యల కంగ రంగవైభోగములను కూర్చుచున్నారు. అనేక కారణములవలన ఆస్తి సేకరణము, వ్యవహారణము, వ్యయము, అమ్మకము మొదలగు వానిలో ఆడవారి మాటకూడ పైకెక్కి గౌరవింపఁబడుచునే యున్నది. పుత్రులు ఎంతే డబ్బైనను వెచ్చించి తమతల్లులకు నోములు వ్రతములు, దానములు ధర్మములు, యాత్రలు తీర్థములు చేయించుచునే యున్నారు. అయినను ఇది యెల్లయు అభిమానపురస్సరముగను, గౌరవపూర్వకముగను, కీర్తికాముకముగను మాత్రమే జరుగుచున్నది కాని, తండ్రులుకాని, పెనిమిటులు పుత్రులుకాని మూర్ఖులై వారినిగూర్చి శ్రద్ధ తీసుకొనక వారికోరికలను సౌఖ్యములను తృణీకరించినచో న్యాయస్థానములకేగి సాధించుకొనుటకు స్త్రీలకు హక్కులులేవు. అథవావారు దావాచేసినను కోర్టువారు సందర్భముల నాలోచించి యేదో యిప్పించవలెనే గాని, ఇంతకు డిక్రీ యియ్యవలెనని చట్టరూపకమగు నిర్బంధములేదు. వ్యవహారములు సాఫీగా జరిగినన్నాళ్లు సరే; లేనియెడల స్త్రీలు నోరుమూసుకొని ఊరుకొనవలసినదే.

అందఱు తండ్రులు, పుత్రులు, పెనిమిటులు ఒక్కరీతివారుగా నుండరు. తమ కనుకూలముగ వర్తించినన్నాళ్లేవారు పుత్రికలను, భార్యలను, తల్లులను నెత్తిమీద పెట్టుకొందురు, లేనిచో దిగనాడుదురు. స్త్రీలకు గౌరవవంతమగు జీవనోపాధి కావలెనన్నచో వారు పైవారి చిత్తవృత్తుల ననుసరించుచు వారి చెప్పుచేతలకు లోనై వర్తించవలెను. లేక యేమాత్రము స్వాతంత్ర్యము కావలెనన్నను వారికి విరోధులై నిరాధారులు కావలెను.

ఇది స్వాతంత్ర్యయుగము; స్త్రీలకును స్వాతంత్ర్యయుగమే. ఇది ప్రజాప్రభుత్వయుగము; స్త్రీలును ప్రజలే, వారును ప్రభుత్వమునందు పాల్గొనువారే. ఇది ప్రజాహిత జీవనయుగము; స్త్రీలును వంటిళ్లను వత్తులపెట్టెలను విడచి ప్రజాహితవృత్తులకు దిగుచున్నారు. ఇది నిర్బంధోచితవిద్యావిధానయుగము; స్త్రీలును విద్యాశాలలయందు వెలయుచున్నారు. ఇది ఉన్నతోద్యోగములు స్వయంసంపాదనలయుగము; స్త్రీలును వానిలోనికి దుమికి వన్నెకెక్కుచున్నారు. పూర్వమే 'ఆడమళయాళము'లోనో తప్ప తక్కిన ప్రపంచములో స్త్రీలు వెనుకకు తగ్గియుండి పురుషులకు సర్వమును విడచి

వారి పెట్టుపోతలకును అదుపాజ్ఞలకును లోఁబడి యుండువారు. ఇప్పుడు వారి యుదాహరణమును కొంతవర కనుకరించి సకల వ్యవహారములలోను పురుషులతో భాగస్వాములై తమవ్యక్తిత్వమును దృఢ పరచుకొనుచున్నారు-ప్రపంచమునం దన్ని ఖండములలోను నారీయుద్యమము వెల్లివిరిసి ప్రవహించుచున్నది.

భారతమాత గ్రుడ్డిదికాదు—తన పుత్రికా రత్నములకు కళ్ళువిప్పినది. వారును ఈ యుద్యమమునందు దుమికి తమ అసాధారణ ప్రజ్ఞను విశదముచేయుచున్నారు. ఇతర దేశములలో స్త్రీలహక్కులకొరకనేక పోట్లాటలు యుద్ధములు, హడావిడులు, ఉప న్యాసములు, ప్రచారములు జరగవలసి వచ్చెను. భారతదేశమునం దట్టి అసం దర్భము లేవియును లేక సర్వమును శాంతము గను సక్రమముగను జరిగిపోవు చుండుట ప్రశంసాపాత్రము.దీనికి.కారణము ప్రభుత్వము వారియెడల సుముఖమైయుండుటయు, దేశీ యనాయకులు సంస్కారులై వారికి వెను కండగనిలుచుటయు నై యున్నది.నేడు స్త్రీలు వకీళ్లగుటకుగాని, విద్యావతులగుటకుగాని, శాసనసభ్యులగుటకుగాని, కాంగ్రెసుప్రెసిడెం ట్లగుటకుగాని, జైళ్లకుపోవుటకుగాని, పోలీ సుద్యోగములుచేయుటకుగాని అడ్డువా రెవ్వ రును లేరు నరేగదా ప్రోత్సహించువారు పెక్కుఱుగలరు. జాయింటు సెలెక్టుకమిటీ వారు స్త్రీవోటర్లసంఖ్య హెచ్చించి వారి కృతజ్ఞతకు పాత్రులైనారు.

కాని యిట్టి పైపై పూతలవలననే వారికి సమగ్రస్వాతంత్ర్యము సిద్ధించు ననుకొనుట వెఱ్ఱి. వారి కార్థికస్వాతంత్ర్యము లేనిచో ఈ స్వాతంత్ర్యములెల్లయు వ్యర్థములగును. ఆర్థికస్వాతంత్ర్యము తక్కిన స్వాతంత్ర్యముల కెల్లను పునాది. అర్థములేనివారి వోటులు శ్రీమంతుల కమ్ముకొంటకు తప్ప మరియొ దుకును పనికిరావు. వానివలన స్త్రీలకు నష్టమేకాని లాభములేదు. తమ ప్రతికూలు రకే తమవోటుల నీయవలసిన దుస్థితి వారికి పట్టుటలో ఆశ్చర్యముండదు. ప్రజాపరిపాల నముతో పాటు ప్రజల ఆర్థికసౌభాగ్యము కూడ హెచ్చుచున్ననే అది నిజమైన ప్రజాపరి పాలనమగును లేకున్న నేతిబీరకాయ వరుస యగును. విరివిచేయఁబడిన స్త్రీలహక్కు లతోఁబాటు ఆర్థికహక్కులకొఱకు కూడ స్త్రీలు ఆందోళనచేయఁగడంగుట యెంతయు సమంజసము. తల్లిదండ్రుల కడుపునపుట్టిన మహాపుణ్యమునకుగా స్త్రీలకుగూడ పురుషు లతోబాటు కొంత ఆస్తిహక్కు వుండవలెను. అప్పుడు పుత్రుల సౌకర్యములకుగా పుత్రి కల సౌకర్యముల నసడ్డచేయవలసిన స్థితి తండ్రులకు పట్టదు. తండ్రు లప్పుడు పుత్రి కలకు కేవల విలాసమునకు ముచ్చటకు గాక

ఒక బాధ్యతతో విద్యలను కళలను నేర్పింతురు. పురుషుల ఆస్తిని, విద్యను, యోగ్యతను చూచి యోగ్యమైనవారు పిల్లలనీయవచ్చునట్లే, స్త్రీలయాస్తిని, కళలను, శీలమును చూచి యోగ్యమైనవారు వివాహమాడవత్తురు. కన్యాశుల్క-వరశుల్కములను చెల్లించవలసిన పాతకము తలిదండ్రులకు తప్పిపోవును. ఆడపిల్లలయందలి అభిమానముచే మగవారినిగాని మగవారిపై అభిమానముచే ఆడవారినిగాని తలిదండ్రులు నష్టపరచవలసిన ఆవశ్యముండదు.

వివాహము లైనపిమ్మట భార్యాభర్తలొకరి కష్టసుఖములలో నొకరెట్లో ఒకరి ఆస్తి అప్పులలోకూడా ఇంకొకరట్లు భాగస్తులగుచున్నారు. భర్త్రానంతరము సంతానముతోఁబాటును, సంతానములేకున్నతా నొక్కతెయు భర్తఆస్తికి స్త్రీ హక్కుదారగుట న్యాయము. ప్రస్తుతచట్టము భర్త్రానంతరము పుత్రికలను భార్యను నిరాధారులనుగాజేసి ఆస్తిని జ్ఞాతుల కిచ్చివేయుచున్నది. ఆస్తిహక్కుల విషయములో స్త్రీల పుట్టువు నొక లవలేశముగానైనను బరిగణింపకున్నది. ఈ అన్యాయమును వెంటనే తొలగించవలెను స్త్రీది అని కొంత నిర్ణీత భాగమగు ఆస్తి హక్కుగాయేర్పడకున్నన్నాళ్లు ఆమె తండ్రికో, భర్తకో, పుత్రునికో బంధులకో బానిసయై యుండవలసినదే—భార్య అనంతరము ఆమెఆస్తికి భర్త వారసుడగుచుండగా అతని అనంతర మామె కాకుండుట కేవల మన్యాయము—ప్రస్తుత విధానమునందు మాత్ర మామెకు బందుగులు లోపము చేయుచున్నారా యనునది యొక ప్రశ్న కానేరదు. లోపము చేయకుండ రక్షించుట యెట్లనునదియే శాసననిర్మాతల ఆశయమై యుండవలెను. ఈ ఆశయమున కనుకూలమగురీతిని సవరణలను సూచించుట నియమింపఁబడబోవు కమిటీవారి విధాయక కృత్యమైయున్నది.

'మగవాని చేతిబిడ్డ ఆడదాని చేతిఆస్తి వృద్ధికిరాకక్షీణించు' నను భావము మాసిపోవలెను. దూబరాగొండులును, మితవ్యయులును గూడ నిరువురలోను నుందురు. ఆర్థికాధికారము మూర్ఖులను దుర్వ్యయపరాయణులుగను, సజ్జనులను సద్వ్యయపరాయణులుగను నొనరించును. స్త్రీ పురుషుల కిరువురకును ఆస్తిపైని సమాన స్వాతంత్ర్యమును హక్కును నున్నచో ఇరువురును కలసికాని దానిని దుర్వ్యయ మొనరింపలేరు. భార్యాభర్తలలో నొకరు కాకపోయిన నొకరైనను సదాశయు లుందురు. కనుక, ఇరువురకును ఆస్తియందు హక్కు నేర్పరచుటవలన ఆస్తికి ఛిద్రత తొలగి యెక్కువ స్థిరత్వము సద్వ్యయమును కలుగును—కమిటీవారీ సంగతికూడ ఆలోచించవలెను.

ఆర్థికహక్కు స్వయంవ్యక్తిత్వమునకు పోషణకారి, రాజకీయహక్కులకు పునాదు అగుటయేకాక సాంఘికహక్కులకుకూడ పెట్టనికోట. వివాహపుహక్కుకూడ దీనితో దానంతట అదే సిద్ధించును. హక్కుతోకూడ బాధ్యతలు మీదపడి వివేకము ధైర్యము పెంపొందును. స్త్రీల దాస్యవిమోచన కింతకంటె తరణోపాయములేదు. ఈ హక్కురానిదే వారికి రాజకీయముగ నెట్టి అభివృద్ధియు కలుగనేరదు.

జాయింటుపార్లమెంటరీకమిటీవారు స్త్రీలకొసంగిన వోటు హక్కులలో ఒక త్రోవయు తెన్నును కానరాదు. కొన్నిరాష్ట్రములలో స్త్రీలకు ఫలానావారి భార్యలమని చెప్పుకొనుకున్న వోటుహక్కు సిద్ధించదు. ఒక్కవిద్యాధికురాలన్న కారణముననే వోటుహక్కు స్త్రీకి కొన్నిరాష్ట్రములలోనే సిద్ధించుచున్నది కాని అన్నిరాష్ట్రములలోను లేదు. సింధుఒరిస్సాలలోని స్త్రీలకు రాష్ట్రీయశాసనసభలలోగాని కేంద్రసభలలోగాని స్థానములు ప్రత్యేకింపఁబడలేదు. మిలిటరీ ఉద్యోగస్థులు, నాన్‌కమిషన్‌డు ఉద్యోగస్థులు, పూర్తిగా సైన్యములోనే సేవచేసిన సిపాయిలు మొదలగువారి భార్యలకు, విధవలకు, పెన్షను ఒసగబడుచున్న తల్లులకు మాత్రము వోటుహక్కు లొసఁగబడినవి. స్త్రీలకు వోటుహక్కు యివ్వడము పురుషులు చేయు సైనికసేవకు లంచమా? లేక వీరి ఓటులు ప్రభుత్వపక్షపాతులకు తప్పక వచ్చునను నమ్మకమా? ఆ అంతస్తులో ఉండే ఇతర స్త్రీలకుకూడా ఆ హక్కు నేల విస్తరించరాదు? ఇట్టి అనాగతములన్నియు తొలగించుమని స్త్రీలుచేసిన విన్నపములన్నియు పెడచెవిని పెట్టఁబడినవి. ఏర్పడబోవు కమిటీవారిట్టి వెల్లయు సవరించునట్లు స్త్రీసమాజము లాందోళనము చేయవలెను.

బెజవాడనుండి శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారు మాకును ఇతర పత్రికలకును వ్రాసిన 'కాంగ్రెసు సంఘముల ఎన్నికలు— స్త్రీల హక్కులు' అను వ్యాసమునుండి స్త్రీలహక్కులను స్థిరపరచుటకు నూతనముగ అసెంబ్లీ కెన్నుకొనబడిన అభ్యర్థులు మిక్కిలి ఉత్సాహములేక తటస్థముగ నుందురని అనుమానించుచున్నట్లు తెలియుచున్నది. పార్లమెంటు సెలెక్టు కమిటీవారు మన కితరవిధములు నెట్టి అన్యాయము లొనరించినను స్త్రీ వోటర్ల సంఖ్యను చాలా విపులముచేసిరనుట కాటంకములేదు. ఇక ముందు భావిభారతసౌభాగ్యనిర్మాణ మొక్క పురుషులచేతిలోనే లేదు. స్త్రీలు కూడ తమ బాధ్యతలు నిశ్చయించుకొని కాంగ్రెస్సును కౌన్సిళ్లను ముట్టడించి తమ నిశ్చితాభిప్రాయములను విశదీకరించి పోరాడవలెను. రాష్ట్రీయ అఖిలభారత కాంగ్రెసు సంఘములలోని సభ్యత్వములు సగమైనను స్త్రీలును స్త్రీయుద్యమాభిమానులును వశమొనర్చుకొనవలెనని శ్రీమతి రాజేశ్వరమ్మగారు చేసిన హెచ్చరికను ఆంధ్రనారీమణులు లక్ష్యమునం దుంచుకొందురు గాక!

# భోగిపండుగ

వఝ్ఝల వేంకటేశ్వరకవిగారు, బి. ఏ.

అది పుష్యమాసం. దరిద్రులపాలిటి భాగ్యదేవత వలె పగలంతా ప్రకాశించిన సూర్యుడు మెల్లమెల్లగా అస్తమిస్తున్నాడు; భయంకరమైన చలీ, అంధకారం, క్రమక్రమంగా ప్రపంచాన్ని ఆవరించ మొదలుపెట్టేయి. ఒకొక్కళ్లే యిళ్లకు చేరుకుంటున్నారు ప్రజలు. చలిబాధనుంచి తప్పించుకోడానికి దుస్తులు లేని బీదవాళ్లవలె ఆకులురాల్చిన మ్రోడుమానులు సాధారణంగా కనిపిస్తున్నాయి. అక్కడక్కడ, హాయిగా వెచ్చగా పరిపూర్ణశరీరాచ్ఛాదనచే చలిబాధఅంటే తెలీకుండా సుఖించే ధనవంతుని రీతిగా ఒక్కొక్క చెట్టుమాత్రం పండబారిన ఆకులతో నిండుగా ఉన్నాది. భగవంతుడు సృష్టించిన ప్రాణులలో మనుష్యజాతి తప్ప తక్కినవన్నీ స్వతస్సిద్ధమైన రక్షణోపాయములచే ఆ చలిబాధలేకుండా సుఖంగా ఉన్నాయి. మనుష్యులలో మాత్రం అందుకు విపరీతంగా, ధనవంతులు అన్యజీవప్రసాదితములైన కంబళ్లను కప్పుకొని సుఖమనుభవిస్తున్నారు; బీదవాళ్లు మాత్రం చలిబాధనుండి తమ్ము తాము రక్షించుకోలేక కష్టమనుభవిస్తున్నారు.

అదొక పూరిల్లు. ఒకవసారాలో కుంపటినిండా నిప్పులుపోసుకుని దానిచుట్టూ నలుగు రాడపిల్లలు పోగై చలికి తాళలేక కాచుకుంటున్నారు

'అబ్బా చలీ. ఆటుంటూపదవే బుచ్చక్కయ్యా!' అన్నాది మధుర కొంచెం ముందుకి జరుగుతూ.

"అయితే వుండు మరి తోశేస్తావేమిటి? నాకు మాత్రం చలికాదూ?" అని విసుక్కుంటూ కొంచెం జాగాయిచ్చింది శశిరేఖ.

"ఉండేశశీ! అస్తమానం నువ్వేనా? చేతులు తియ్యి, నాకుయేమి సెగ తగల్లేదు." అని సరోజ శశిరేఖచేతులు తీసివేసింది.

"మాడే పెద్దక్కయ్యా! చిన్నక్కయ్య నన్ను కాచుకోనియ్యకుండా ఉంది?" అంది శశిరేఖ

"రోజా! నువ్వేనా ఊరుకుందూ? యిలామనం దెబ్బలాడుకోవచ్చునా? మనం అందరం కాచుకోవాలి. మధూ! నువ్విలాగా, నాదగ్గిర కూచుందూ గాని." అని సుభద్ర వాళ్లతగువు తీర్చింది.

"అయితే పెద్దక్కయ్యా, రేపేకదే భోగీ? మాకు మూడ్రోజులు శలవుకూడానూ!" అంది మధుర.

దానిమీద శశిరేఖ అందుకున్నాది "మరి భోగీకి మనకి కొత్తబట్టలు ఇస్తుందికదే అమ్మ? అవును, నేను అడిగితే మొన్న అలాగే అంది."

"కొత్తబట్టలూ, పండుగడబ్బులూ లేందీ పండుగేమిటి?" అని విసుక్కుంటూ సరోజ తన వుద్దేశం కూడా చెప్పింది.

అప్పుడు సుభద్ర కొంచెం ఆలోచించి నెమ్మదిగా అంది, "మనం మరి బీదవాళ్లం. మనకి కొత్తబట్టలు రావడం యెలాగ?" అని తన పాతచీరవేపు చూసుకుంది.

"అయితే మరి అమ్మ అందరికీ బట్టలు కుట్టి యిస్తుంది. మనకికూడా కుట్టదూ? ఆఁ, యిస్తుంది నాకు తెలుసును. నిన్న కుట్టింది చూశానులే," అని మధుర ఆశామయ హృదయంతో అన్నాది.

"మధూ! అవి మనవికావు. ప్లీడరుగారి పిల్లలవి. వాళ్లు కుట్టినందుకు డబ్బులు యిస్తారు."

"అయితే పెద్దక్కయ్యా? మరి రోజా అమ్మా, నువ్వూ, చిన్నక్కా, నూలుతీస్తున్నారుకదా, అది

నేయించి మనకి కుట్టకూడదూ?" అని శశిరేఖ అంది.

"శశీ! మనం బీదవాళ్లం. అది అమ్ముకొని వచ్చే లాభంతో కాలక్షేపం చెయ్యడానికి బియ్యం అవీ కొనుక్కోవద్దూ? మళ్లీ దూదికొని నూలు వడుకుతూ ఉండాలి. బట్టలు కుట్టేసుకుంటే యెలాగ?"

"అయితే కొందరుపిల్లలు మంచిమంచి బట్టలు కట్టుకోవడం, బంగారపు నగలు పెట్టుకోవడం, మనలాటి వాళ్లకి యేమీ లేకపోవడం యేమిటో?" అని వయసుకుమించిన ఆలోచనలో మునిగింది మధుర.

"పోనీ, మనకవన్నీ లేకపోతేనేమి? అమ్మా, నాన్నా ఉన్నారుకదూ? ఒకళ్లకొకళ్లం మనం ఉన్నాంకదూ? మనకింకేం కావాలి?" అని సంతృప్తికరమైన జవాబు శశిరేఖ యిచ్చింది.

ఆ జవాబుతో ఆనలుగురి హృదయాలలో ప్రేమ ఒక్కమారుగా ఉప్పొంగింది. ఆకుంపటి నిప్పులకాంతిలో వాళ్ల ముఖాలపై ఆనందవికాసం ప్రస్ఫురించింది. కాని యింతలోనే శశిరేఖ, "అమ్మఉన్నాది కాని నాన్న యేడీ? మళ్లీ యెప్పుడు చూస్తామో కదా మననాన్నని!" అని అనగానే ఆముఖాలలో ఒకమారు విషాదచ్ఛాయలు అలవరించేయి.

పాపం నాన్న! అతడు సహాయ నిరాకరణోద్యమంలో, విదేశవస్త్ర బహిష్కార ప్రచారంలో, పనిచేసి స్వార్థత్యాగియై, దేశసేవా పరతంత్రుడై చివరకి ఖైదులో పడినాడు. అతన్ని జ్ఞాపకం తెచ్చుకుని ఆ పిల్లలు నలుగురూ రెండునిముషాలు మాట్లాడలేక పోయేరు. చివరకి సుభద్ర నెమ్మదిగా అన్నాది,

"ఈ యేడాది మనకి పండుక్కి కావలసినవన్నీ యెలావొస్తాయి అంది అమ్మ నాన్న జైల్లో కష్టపడుతూవుంటే మనకి పండుగ సరదాలు తీరడం యెలాగ?"

"అయితే పెద్దక్కయ్యా! మళ్లీ నాన్న యెప్పుడు వస్తాడే? మరి ఈ యేడాది నాన్నకి అక్కడపండుగ వుండదుటే?" అని మధుర అడిగింది.

"నాన్న ఉంటే ఎంతబాగుండును! నిరుడు అమ్మానాన్నా, అందరం పండుగ చేసుకున్నాం కొత్తబట్టలు కట్టుకున్నాం. పెద్దక్కా! మళ్లీపండుక్కైనా నాన్న రాడుటే?" అని ఆత్రుతతో శశిరేఖ కూడా అడిగింది.

"శశీ! నాన్నవొస్తాడులే! అదృష్టంబాగుంటే మళ్లీ భోగికి అందరం కలిసి హాయిగా పండుగ చేసుకుంటాం." అని సుభద్ర సమాధానం చెప్పి శశిరేఖను మధురను సంతోషపెట్టింది.

"అయితే మనకి రేపు పండుగలేదూ?" అని సరోజ ప్రశ్నించింది.

"లేకేమి? ఉంది. అమ్మ మనందరికీ తెల్లవారగట్లే నీళ్లుపోస్తుంది. మనకేమేనా పిండివంట చేసి పెడుతుంది. మనమందరం కలిసి సరదాగా ఆడుకుంటాము."

అని సుభద్ర చెల్లెళ్లకు సంతోషం కలిగించింది. ఆక్షణం సుభద్రహృదయంలో ఒకానొక సంచలనం కలిగింది. పూర్వస్మృతులు ఆమె భావాన్ని కలగించేయి. తనకు చాలా బాల్యమందే పెళ్లికావడం, పండుక్కి తన భర్తరావడం, మొదలైన మధుర మధుర భావాలు ఆమె మనసులో స్వప్నములవలె మెరుపులవలె గోచరించినవి. ఇపుడామె వితంతువు, జ్ఞానవతి. ఆ మాధుర్యము అప్పుడే నశించింది. ఆ బాలిక తన దుస్థితి గ్రహించింది; తన జీవితంలో ఇక మాధుర్యం లేదనుకుంది. ఆమె నేత్రాల్లోంచి రెండు పెద్ద అశ్రుబిందువులు బహిర్గమించేయి కాని శశిరేఖా మధురలు గ్రహించలేదు. సరోజ గ్రహించి ఉంటుంది. సుభద్ర కన్నీళ్లు తుడిచివేసి మనోవైకల్యం

కప్పిపుచ్చి కొంతసేపు నీరవంగా ఊరుకుంది. సరోజ ప్రసంగాన్ని సాగించింది.

"మధూ ! నువ్వు తెల్లారకుండా చలిలో లేస్తావా?"

"ఏమీ, నేనుమాత్రం నీళ్లుపోసుకోననుకున్నావా యేమిటి? తెలివిరాకపోతే అమ్మలేపుతుంది. లేకపోతే పెద్దక్కయ్య. ఏమే పెద్దక్కయ్యా?"

"లేపుతాను లే మధూ !"

"మరి మనం భోగిమంటవేసి కాచుకుంటాం కదూ?" అని శశిరేఖ అంది.

"అలాగేకాని అక్కయ్యా ! మరి మనకి కొను క్కోడానికి అమ్మ డబ్బులివ్వదూ ?" అని సరోజ శశిరేఖ మాటకి జవాబురాకుండానే సుభద్రని అడిగింది.

"రోజా! పెద్దదానివి కదా నువ్వుకూడా డబ్బు లడగడమేనా? అమ్మ కష్టపడి నూలువడికి బట్టలు కుట్టి తెచ్చినడబ్బు మనతిండికి చాలడమే కష్టం." అని సుభద్ర సమాధానం చెప్పింది.

"అయితే నేనుమాత్రం కష్టపళ్ళేదూ? బడికి వెళ్ళేటప్పుడు నా బట్టలు చింకివనీ, నాకు సరుకులు లేవనీ, నన్ను పిల్లలు ఉడికిస్తూవుంటే నాకెంత కష్టంగావుంటుంది. ఏమే బుచ్చక్కయ్యా! మనం మాత్రం కష్టపడలేదుటే?" అని మధుర అంది:

ఆమాటలకి సరోజ నవ్వింది. అందరూ నవ్వేరు. అప్పుడు సుభద్ర అంది,

"మనం బీదవాళ్లం అవడంచేత కదా మనకీ కష్టాలు. మన నాన్నకి మునపట్లాగే ఉద్యోగం పోకుండా లావుగా డబ్బుంటేనే, యెంత బావుండును!"

"అయితే పెద్దక్కయ్యా! మరి నువ్వావాళ మనం రాజుగారి పిల్లలకంటే సుఖంగా ఉన్నాం అన్నావు కదూ? వాళ్లకి డబ్బున్నా సుఖం లేదన్నావు కదూ?"

"అవునే మధూ! అలాగేనే! మన పనులు మనం చేసుకుంటాం. కులాసాగా ఆడుకుంటాం. మనకి కాకపోతే మరెవళ్లకి సుఖం?"

ఈవిధంగా నలుగురూ మర్నాటి పండుగను గురించి ముచ్చటించుకుంటున్నారు కుంపటికాచు కుంటూ. సుభద్రకో పదిహేనూ, సరోజకి పన్నెండూ, శశికి పదీ, మధురకు ఎనిమిదేళ్లూ వయస్సు. వాళ్ల తండ్రి జైనుకుపోయి యింకా సంవత్సరం కాలేదు. రెండు సంవత్సరాలు కఠినశిక్ష అనుభవించవలసి ఉంది. మొదట్లో అతడు గవర్నమెంటులో నెలకు వందరూపాయల జీతంమీద ఉద్యోగంచేస్తూ వుండేవాడు. ఆరోజుల్లో కుటుంబం సుఖంగా కాలక్షేపం చేస్తూవుండేది. కాని అనంతరం అతడు దేశసేవాపరతంత్రుడయ్యేడు. ఉద్యోగంపోయింది. అయినా లక్ష్యపెట్టలేదు. అతడు ఉద్యోగముచేసే రోజుల్లో అతని తల్లి ఉండేది. ఆమె ప్రోద్బలంవల్ల అతడు సుభద్రకు బాల్యంలో పెళ్లిచేసేడు. పెళ్లిచేసిన రెండు సంవత్సరాల్లో తల్లీ, అల్లుడూ, క్రమంగా చనిపోవడం తటస్థించింది. అది మొదలు అతని హృదయంలో పరివర్తనం కలిగి సాంఘిక దురాచారములవంకనూ, దేశదారిద్ర్యాదులవంకనూ అతని దృష్టి మరలింది. ఇప్పటివరకూ రెండవ కుమార్తెకు పెళ్లిచేయలేదు. అతడు స్వార్థత్యాగియై దేశహితార్థియై కార్యరంగంలో ప్రవేశించినాడు. అది మొదలు అతనికీ, అతని కుటుంబానికీ కష్టాలు ప్రారంభం. ఇప్పుడు అతని భార్య నూలు వడకడం, బట్టలు కుట్టడం మొదలైన వృత్తులవల్ల కుటుంబ పోషణ జరిగిస్తూ భర్త రాకకోసం నిరీక్షిస్తున్నాది. సుభద్ర, తల్లికి సంసారవిషయంలో సహాయం చేస్తున్నాది. సరోజ గృహకృత్యాలలో తోడ్పడుతూ,

ఇంటిదగ్గిరే చదువూ మొదలైనవి నేర్చుకుంటున్నాది. శశిరేఖా, మధురా, బడికి వెళుతున్నారు.

ఆనాటి సాయంకాలం చీకటిపడుతూవుంటే బాలికలు మాట్లాడుకుంటూవుండగా, లక్ష్మీదేవి వాళ్ల అమ్మ వంటింట్లో వండుతున్నాది. సుభద్ర లేచి బుడ్డీదీపం వెలిగించింది. ఇంతట్లోకి పోస్టు జవాను ఉత్తరంఅంటూ గుమ్మంలోపడవేసి వెళ్లిపోయేడు. 'ఉత్తరం! ఉత్తరం!' అంటూ ఆత్రుతతో నలుగురూ వీధిగడపలోకి పరుగెత్తేరు. సుభద్ర ఉత్తరంతీసి ఎడ్రసు చదువుతూంది. "నే చూస్తానియ్యవే" అంటూ సరోజా, శశిలేఖా, మధురా గంతులువెయ్యడం మొదలుపెట్టేరు. ఇంతట్లో వంట ముగించి లక్ష్మి పైకివచ్చి "ఏమిటా అల్లరి?" అని కేకవేసింది.

"అమ్మా చూడే! ఉత్తరంవస్తే పెద్దక్కయ్యా చూపించకుండావుందే!" అని మధుర ఫిర్యాదు చేసింది.

"పోనీ, నే చూపిస్తానులే, ఉండు" అని లక్ష్మీదేవి ముందుకు నడిచింది. అందరు గదిలోకి చేరుకున్నారు.

"ఏదీ సుభద్రా! ఉత్తరం యిలాతే!" అని ఉత్తరం తీసుకుని లక్ష్మి కూర్చుంది. చుట్టూ నలుగురూ మూగేరు. అందరికీ ఉత్తరం చదవడమంటే సరదా! అందరూ చూస్తూవుండగా దీపపువెలుగులో లక్ష్మి చదివింది. నాన్నదగ్గిరనుండి అని తెలియగానే ఆ పిల్లల ఆనందానికి మేరలేకపోయింది.

ఆ ఉత్తరంలో అతడు తాననుభవిస్తూన్న కష్టాలనుగురించీ, చెరసాల యిబ్బందులనుగురించీ వ్రాయనేలేదు. తనకు సుఖంగానే కాలం గడుస్తున్నాదని వ్రాసేడు. భార్యనూ, పిల్లలనూ, చూడడానికి తనకున్న కోరికను తెలియజేసినాడు. కష్టాలకు భయపడవద్దనీ, కష్టాలలో భగవంతుడు కాపాడగలడనీ, పరోపకారదీక్ష మానవద్దనీ, తల్లి చెప్పినట్లు పిల్లలు బుద్ధిగా నడుచుకోవలసిందనీ, వాళ్లపనులు వాళ్లు చక్కగా నిర్వర్తించుకోవలసిందనీ, భోగీనాడు పండుగ చేసుకోవలసిందనీ, ప్రేమపూరితమయిన తన హృదయమును వ్యక్తపరుస్తూ అతడు ఉత్తరమును పూర్తిచేసేడు. చదువుతున్న కొద్దీ తల్లికంఠం రుద్ధమైంది. ఆమె, పిల్లలూ కొంతసేపు మాటాడలేక పోయేరు. ధీరురాలైన లక్ష్మీదేవి హృదయంలోనే దుఃఖాశ్రువులు ఉద్భవించి శాంతించేయి. తుదకు ఆమె అంది:

"చూశారా? నాన్నగారు ఎలా రాశేరో? మీరందరూ బుద్ధిగాఉంటే మన కెప్పుడూ కష్టాలుండవు. సుఖంగా ఉంటాము."

"మరైతే, అమ్మా, మేము నువ్వు చెప్పినట్టుగు వింటున్నాం కాదే?" అని శశిరేఖ అంది.

"అమ్మా! యిప్పుడు మనం సుఖంగా ఉన్నాం కదూ? నాన్న మళ్లీ వచ్చేస్తారు కదూ?" అని మధుర అంది.

"లేకేం చిట్టితల్లీ! సుఖంగానే ఉన్నాం. మళ్లీ నాన్నగారు వచ్చి మీరందరూ ఇంకా బాగాచదువుకొని మంచిపనులు చేస్తూవుంటే సంతోషిస్తారు."

"అలాగే ఉంటాం, అమ్మా!" అని శశి అన్నాది.

"ఇంక లెండి, రాత్రి అయిపోయింది. అన్నం పెడతాను రండి!"

అందరూ భోజనానికి లేచేరు.

* * * *

తెల్లవారుతూంది. పక్షులు కలకలమని అరుస్తున్నాయి. ఇంకా చీకటిఉంది. సుభద్రా, లక్ష్మీదేవీ ముందుగా లేచేరు. వాళ్లతో మధురకికూడా తెలివివచ్చింది. మధుర వెళ్లి సరోజను శశినీకూడా

లేపేశింది. అందరూ మేల్కొని పెరట్లోకి బైద్దే రారు. పాపం ఆ పిల్లల్ని చలి గజగజ వణికించేస్తున్నాది. కప్పుకోడానికి మంచి పచ్చడాలు లేవు. అయినా ఉత్సాహవశంచేత వాళ్లు ఆచలిని లక్ష్య పెట్టలేదు. లక్ష్మీ నీళ్లపొయ్యిమీద నీళ్లు కాగబెడుతూవుంటే బాలికలు ఒకచోట భోగీమంట వేసేరు; వెచ్చగా కాచుకుంటున్నారు. లక్ష్మీపిల్లల్ని నీళ్లపోతకు రమ్మంది.

"రోజా! రా అమ్మా నీకు ముందు పోస్తాను."

"అమ్మా ఉండే, చలేస్తున్నాది. అందాకా శశికి పొయ్యవే?"

"శశీ! పోనీ నువ్వురా ముందు. ముందుపోసుకున్నవాళ్ళు ముత్యాలగొడుగులు!"

"వెనకపోసుకున్నవాళ్ళు వెండిగొడుగులు!" అని సుభద్ర అంది.

"అమ్మా! నే ముందువస్తానే!" అని మధుర లేచింది. సుభద్ర పుల్లపోసింది. లక్ష్మి రుద్దింది. మధుర, శశిరేఖ, సరోజ క్రమంగా నీళ్ళుపోసుకున్నారు. తరవాత సుభద్రా, ఆఖర్ని లక్ష్మీకూడా పోసుకున్నారు. లక్ష్మీదేవి పిల్లలందరికీ చద్దిఅన్నం పెట్టింది. అన్నం తిన్నాక కొత్తబట్టలు లేవు కదా అని సరోజ, శశి, మధుర కొంచెం నిరుత్సాహంగా ఉండగా లక్ష్మి యింట్లోంచి మూడు పరికిణీలూ, మూడు జాకెట్లూ, కొత్తవి, ఖద్దరువి పట్టుకొచ్చింది. వాళ్ల మొగాలు పూర్తిగా వికసించి ఆశ్చర్యం కనపర్చేయి.

"అమ్మా! యెక్కడివే, ఎప్పుడు కుట్టేవే?" అని మధుర.

"అమ్మా, యేవీ కొత్తవేనే! మరి పెద్దక్కయ్య లేవన్నాదీ, యెలాగొచ్చేయే?" అని శశిరేఖ.

"అయితే అమ్మా ఈవాళ భోగికి నువ్వు చెప్పకుండా బట్టలుకుట్టి దాచేవుటే?"అని సరోజ.

"పిల్లలారా! మీకోసమే కుట్టివుంచేను "అంటూ లక్ష్మి పసుపుబొట్లుపెట్టి ముగ్గురికీ కొత్తబట్టలు తొడిగించింది. అవి చూచుకుని వాళ్ళు ఆకాశం అందుకున్నారు. పాపం, సుభద్రకు కొత్తచీర లేకపోయింది, ఆమె వాంఛించనూలేదు. లక్ష్మీసుభద్రలు ఇంట్లో పనులు సవరించుకొంటూవుండగా, రోజా, శశీ, మధూ, వీధిగడపన్నాదికి వెళ్ళి కూర్చున్నారు. అప్పటికి బాగా యెండవచ్చింది. వీధి కలకలలాడుతూ జనంతో నిండి ఉత్సాహవంతంగా ఉన్నాది.

భోగిపండుగ అంటే ముష్టిపండుగ అని కూడా అనడంకద్దు. ఆరోజున మనదేశంలో ప్రతివీధిలోనూ ముష్టివాళ్ళు అపరిమితంగా కనిపిస్తారు అదివరకు ముష్టెత్తని వాళ్ళుకూడా కొందరు ఆరోజున భిక్షుకులౌతారు. దేశంయొక్క దారిద్ర్యం అంతా ఆనాటి భిక్షార్థుల దీనదృష్టులలో ప్రతిఫలిస్తుంది. ప్రతివీధిలోనూ పరస్పర విరుద్ధాలైన రెండు దృశ్యాలు: కటికి దరిద్రుని కడుపుమంట, స్వార్థపరుడైన ధనవంతుని యైశ్వర్యపు మత్తత!

తల్లియిచ్చిన బుట్టలో బియ్యంపోసి పెట్టుకొని మన బాలికలు కూర్చున్నారు పిడికెడేసి బియ్యం వెయ్యడానికని. కుటుంబాలతోసహా వొస్తూన్న ఆ ముష్టివాళ్ళని చూస్తే వాళ్ళకి జాలికలిగింది. అప్పుడు మధుర అంది.

"చిన్నక్కయ్యా! చూశావే వీళ్ళకి పాపం మంచి బట్టలు లేనేలేవు కట్టుకోడానికి!"

"అవునే మధూ! వాళ్ళు బీదవాళ్ళు"

"అయితే మనమూ బీదవాళ్ళమే అన్నాది పెద్దక్కయ్య?"

"వాళ్ళు మనకంటే బీదవాళ్ళు."

"చూశావే చిన్నక్కయ్యా, ఆ మేడమీదనుంచొని ఆవిడ ముష్టివాళ్లని యెలాగ పొమ్మంటున్నాదో? పాపం వాళ్ళు అనుకుంటూవుంటే కోప్పడుతున్నాది కూడానూ!" అని శశిరేఖ ఎదురుగుండా వున్న మేడవేపు చూపిస్తూ అంది. మధుర వెంటనే రెండు పిడికిళ్ళబియ్యం ఆముష్టివాళ్ళకి వేసింది. ఆ మేడమీదావిడ చూచి లోపలికి పోయింది.

ఇంతట్లోకి పదకొండుగంటలైంది లోపల్నుంచి లక్ష్మీదేవివచ్చి అంది: "పిల్లలారా యేంచేస్తున్నారు?"

"బియ్యం వేస్తున్నాం నేనూ, అక్కయ్యలున్నూ!" అని మధుర చెప్పింది.

"ఇంక అన్నానికి రండి లోపలికి!"

"అమ్మా అప్పుడే వంటయిందే? ఒబ్బట్లు చేశేవు కదూ?" అంది శశిరేఖ.

"చద్దికూడానూ, ఏమే అమ్మా?" అంది రోజ.

"నాకు వొబ్బట్లంటే యిష్టం" అంది మధుర.

ముగ్గురూ లేచి తల్లితో యింట్లోకి వెళ్లేరు. విస్తళ్ళువేసి లక్ష్మి వడ్డించింది పప్పూ, అన్నం, చద్దీ, పచ్చళ్ళున్నూ. నలుగురూ విస్తళ్ళముందు కూర్చున్నారు. ఇంతట్లోకి వీధులోంచి "అమ్మా కడుపు మండిపోతున్నాది. ఇంతఅన్నం పెట్టించండమ్మా!" అని ఒక ఆర్తనాదం వినబడింది వెంటనే లక్ష్మి వీధి గడపలోకి వెళ్ళింది. వెనకాతల పిల్లలు కూడా వెళ్ళేరు. ఇంటి గుమ్మందగ్గిర మాసిన చింకి గుడ్డతో ఒళ్లు కప్పుకున్న ఒక పదేళ్ల మాలపిల్ల నిలబడిఉంది.

"అమ్మగోరండీ, దచ్చించండి మీ పున్నెముంటుంది. తిండిలేదు మాఅమ్మకి, మరింకాపిల్ల లేడుస్తున్నారండీ!" అంటూ యేమేమోచెబుతూ యేడవడం మొదలెట్టింది ఆమాలపిల్ల. బాలికలు నలుగురూ దానివేపే చూస్తున్నారు. లక్ష్మీదేవి ఈమాలపిల్లని ఊరుకోమని చెప్పి దాని కథ యేమిటో కనుక్కుంది. ఆ మాలపిల్ల తల్లి ఊరువెలపల తోటదగ్గిర పాడైపోతున్న గుడిసెలో జ్వరంతో బాధపడుతూందట. వాళ్ళు నలుగురు పిల్లలుట. తిండిలేక రెండురోజుల్నుంచీ మలమల మాడిపోతున్నారట. వాళ్ళతండ్రి లేడట. ఆమాలపిల్ల ఒకధనవంతుల యింటికి వెళ్ళి ముష్టి అడిగితే, పాపం, దూరంగాపొమ్మని తగిలేసేరట. ఇది విని లక్ష్మి, బాలికలూ మిక్కిలి విచారించేరు. ఆబీదకుటుంబాన్ని రక్షించడానికి వాళ్ళు వెనక తియ్యలేదు.

"పిల్లలారా! చూశారా, మీలాటి పిల్లలే తిండి బట్టలులేక బాధపడుతున్నారట. మీఅన్నం వాళ్ళకి పెడతారా? నాకు చాలాఆనందంగావుంది. నుమా!" అని లక్ష్మిఅంది.

"అమ్మా! అయితే మనం అన్నం అక్కడికి పట్టికెళ్లాలికదే?" అంది శశిరేఖ.

"అవునే తల్లీ! మరిపట్టికెళ్లకపోతే యీ పిల్ల యెలా పట్టికెళ్లి పెడుతుంది?"

'అమ్మా! నేను వొబ్బట్లు పట్టుకొస్తానే!' అని మధుర అంది.

'అమ్మా నేను అన్నం అవీ మూట కడతాను' అంటూ సుభద్ర లోపలికి పోయింది.

'అయితే అమ్మా, వాళ్లకి బట్టలులేవు కదా, యెలాగ?' అని మధుర అంది.

'మీరు మీ కొత్తబట్టలు వాళ్లకి పండుక్కి కట్నం యిస్తారా?'

'అలాగేనేఅమ్మా!' అని శశీ, మధురా, అన్నారు. వెంటనే వాళ్లు పాతబట్టలు తొడుక్కొని కొత్తవి మూటకట్టేరు. ఈ బ్రాహ్మణ కుటుంబం చూపుతున్న ఆదరానికి ఆమాలపిల్ల ఆనందం ఆపుకోలేక పోయింది. పంచమజాతి, అగ్రజాతి, అను భేదభావం ఆకుటుం



ఘ॥ వ॥ సర్ తుకోజీరావ్ హోల్కారుగారు
శ్రీమతి మహారాణి శర్మిష్టాదేవిగారు



శ్రీ బేగం సుల్తాన్ మీర్ అమీర్ ఉద్దీన్

ణానికి లేనేలేక పోయింది. తమవంటి పిల్లలను తమ లాగే చూచుకోవాలని బాలికల వుద్దేశం. మధుర బొబ్బట్లు పట్టుకుంది. శశి బట్టలు పట్టుకుంది. సరోజా, లక్ష్మి అన్నం మొదలైనవి పట్టుకున్నారు: మాలపిల్ల వెంటబెడ్డేరు. సుభద్ర యింటిదగ్గర ఉండి పోయింది.

11 గంటలు దాటుట వల్ల వీధిలో, ఈవింతను చాలామంది చూడలేదు. చూచినవాళ్లు ఒకరిద్దరు నవ్వుకున్నారు. ఆ వీధి చివరఉండే ఒక తాతగారు కూడా చూచేరు.

అరమైలు దూరంలో ఉన్న ఒకమామిడితోట దగ్గరకు వాళ్లువచ్చేరు. అక్కడ ఒక గుడిసెలోకి వాళ్ళని మాలపిల్ల తీసికెళ్లింది. ఒక నుక్కిమంచంలో పడుక్కొని మూలుగుతూంది మాల తల్లి. పక్కనే మూడేళ్ళపిల్లడు ఏడుస్తున్నాడు. చాపమీద మరిద్ద రాడపిల్లలు నీరసంగా కుష్కించి ఉన్నారు.

'అమ్మా, యీ అమ్మగోరు అన్నం, యింకా యేటేటో తెచ్చినారే మనకి పెట్టడానికి!' అని మాల పిల్ల అంది. మాలది కళ్లుతెరిచింది.

'ఎవురమ్మా! మేం మాలోళ్ళం. మాయింటికెలా గొచ్చినారమ్మా! మమ్మల్ని రచ్చించడాని కొచ్చి నారా? మిమ్మల్ని నూస్తే దేవతల్లా గున్నారు!' అంటూ మాలది ఆశ్చర్యం, సంతోషం, సంభ్రమం, కనపర్చింది. ఆ మాలదానికీ, ఆ పిల్లలకీ, లక్ష్మీదేవి కడుపారా భోజనం కలిగించింది. ఆ పిల్లలు ఆత్మా నందంతో ఆవేళ ఆకలితీర్చుకున్నారు. చలితో వణికి పోతూన్న మాలదానికి లక్ష్మీదేవి దుప్పటీ కప్పింది. పిల్లలకి, బట్టలు కొత్తవి, తొడిగించింది. లక్ష్మీదేవి ఉపచారములతో మాలదానికి కొంత బాధతగ్గి నూతన శక్తి వచ్చింది. ఆ తరవాత లక్ష్మీదేవి, పిల్లలూ, మాలదానికి ధైర్యంచెప్పి ఇంటికివచ్చేరు. అప్పుడు వాళ్లందరికీని నిజమైన పండుగ అనిపించింది. ఇంటి దగ్గరఉన్న అన్నమేనో పిల్లలు తిన్నారు. లక్ష్మీదేవికి ఆపూట భోజనంలేదు. ఇటువంటి నిరశనదినములు ఆస్వార్థత్యాగిని ఎన్నిగడపివుంగో!

కొంతసేపటికి ఒక కుర్రవాడు వాళ్లయింటికి వచ్చేడు. ఆకుర్రవాణ్ణి మన బాలికలు ఎరుగుదురు. శశీ, మధురా బరికివెళ్లేటప్పుడు అతడుకూడా వెళ్ళడం కద్దు.

'మాయింట్లో మాతాతయ్య ఈవాళ మిఠాయీ, అవీ చేయించేరు, మధురకీ వాళ్ళకీ యివ్వాలనిఉంది, పంపిస్తామన్నారు' అంటూ ఆబాలుడు లక్ష్మీదేవి అనుజ్ఞకోసం నిలబడ్డాడు. లక్ష్మి, పిల్లలూ, మాల దానియింటికి వెళుతూన్నపుడు చూచిన తాతగారే ఆయన. ఆయనకు మంచిపిల్లలంటే ప్రేమ. భగవ ద్విలాసమునకు లక్ష్మి ఆశ్చర్యపడి, ఆలాగే అంది. కుర్రవాడు వెళ్ళిపోయి, కొంతసేపట్లో, లాడూలు, జిలేబీలు, పకోడీలు మొదలైనవి పట్టించుకొని వచ్చేడు. పిల్లలకు నాడు భోజనం లేదని గ్రహించి అవి తాతగారు పంపించేరు. బాలికల ఆశ్చర్యమూ, ఉత్సాహమూ, ఏమిచెప్పను? వాళ్ల అమ్మచేసిన పిండివంటలకంటె మంచివి లభించేయి.—అని వాళ్లు కడుపునిండా తిన్నారు.

ఆహా! లక్ష్మీదేవి ధన్యురాలు! ఆకుటుంబ జీవితం ధన్యం! ధన్యం!!

# స్త్రీ చిత్తము

గోసెల నరసింగరావుగారు, బి.ఏ.

స్త్రీ హృదయము నవ్యనవనీతసదృశమనియు సుమకోమలమనియు జెప్పనొప్పును. మన సారస్వతమందు బైనుదాహృతమైన సిద్ధాంతమునకు వేనవేలు దృష్టాంతములు గలవు. అందుఁ గొన్నింటిని బరిశీలింపుచో స్త్రీల చిత్తములు మెత్తనివని దోఁపకపోదు.

ద్రౌపది:—అశ్వత్థామ నిశీథమునఁ బాండవశిబిరముఁ జొచ్చి, యాత్రమునఁ బాండవులనుభ్రాంతిచే నిద్రాసక్తులగు నుపపాండవుల సందఱినిఁ గఱకు మనముతో నఱికెను. అట్టియెడ పుత్త్రశోకాతురయగు యాజ్ఞసేనిని నూరార్చుచు, గాండీవి "యశ్వత్థామహంతకుని దునుమాడెద"నని ఘోరప్రతిజ్ఞఁ జేసి, మాధవానుగ్రహమున గురుపుత్త్రుని గట్టితెచ్చి ద్రౌపది మ్రోలఁ బడవైచెను. ఈసందర్భమునఁ బుత్త్రశోకోద్వేగావిలమానసయగు నా సాధ్వీమతల్లి శోకతాపమార్చుకొని, శిశుహత్యాజనిత పరమలజ్జాపరాఙ్ముఖుఁడైన యశ్వత్థామ నవలోకించి యంజలి ఘటించి కన్నీరు మున్నీరుగా విలపించుచు నిట్లు వచించెను.

"భూసురుఁడవు; బుద్ధి దయా
భాసురుఁడవు; శుద్ధవీరభటసందోహా
గ్రేసరుఁడవు; శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!

పిదప ప్రతిజ్ఞాపాలనాతురుఁడును, విదళితఖడ్గహస్తుఁడును, నశ్వత్థామశిరఃఖండనానురక్తుఁడునునగు నర్జును నీక్షించి యా మానినీమణి ధర్మానురక్తిని ముఖ్యముగ క్షమను బురస్కరించుకొని యిట్లని పలికెను.

"ద్రోణునితో శిఖింబడకఁ ద్రోణకుటుంబినియున్న
దింటన
క్షీణతనూజ శోకవివశీకృతయై విలపించు భంగినీ
ద్రౌణిదరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు
నెంతపొక్కునో
ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస
మానరే.

అహో! యీమె యుదారత!! స్త్రీ హృదయము నిక్కముగ సుమసుకుమారము; అమృతమయము. కావుననే నిట్టి పవిత్రప్రవర్తన యాజ్ఞసేనియందు ద్యోతకమగుచున్నది. పుత్త్రఘాతకునియెడలనా ఇట్టి నిస్తులప్రేమమయప్రవర్తన? ఇట్టి యపారకృపాజనిత వాక్సుధారసానునయము? అమోఘము; అద్వితీయము. అట్టి యా పరిస్థితులలో నెట్టి మహనీయునకైన, నెట్టి

శాంతమూర్తికైన, వేయేల నతికృపాళుఁడగు యతిమూర్ధన్యునకు సైత మాగ్రహనిగ్రహము దుస్తరముగఁ దోఁచును. ఇఁక యనుగ్రహముమాట వేఱుగ నుడువనేల? ఏల, కేవల నారాయణాంశసంభూతుండగు నా యర్జునుఁడు దుర్జనునిభంగి యెట్టి బెట్టిదంపుచెయిదముఁ జేయఁబూనెనో మనకు విదితమే! దయారాశియగు నా ద్రుపదరాజపుత్రియే లేనిచో యా పుత్త్రఘాతకుని గతి యేమైయుండును? అవశ్య మతిదారుణముగ వధింపబడియేయుండును! పుత్త్రశోకోపహతచిత్తయైనను సుహృదయిగావున, కరుణారాశిగావున, నద్వితీయప్రేమమయిగావున నిట్టి యలౌకిక సహృదయతను క్షమను, గర్భశత్రువగు యశ్వత్థామపైఁ జూపెను.

సీత:—ఇఁక భూపుత్త్రిని బరిశీలింతము. రామపట్టాభిషేక మహోత్సవానంతరము సీతా రాములు సకలసౌభాగ్యవంతమగు నిస్తుల సుఖమయజీవయాత్రను కడుంగడు ముదంబుతో గడపుచుండ, పౌరుల నిందావాక్కులు ఘోరనిర్ఘాతపాత సదృశకఠోరమై రామచంద్రుని నిర్మలానంద సందోహప్రవర్తనమునకు బరివర్తనఁ జేకూర్చినవి. రాజనీతి నిష్కళంకంబగు పవిత్రప్రేమను జయించినది. లక్ష్మణుని రావించి రామభూమీశుఁడు, సీతను వాల్మీకులు నివసించు వనభూములలో డించి రమ్మనెను. రాజాజ్ఞకు వ్యతిరేకము గలదా? రాజనీతిజ్ఞుఁడగు సౌమిత్రి రామాజ్ఞను రయంబున నెఱవేర్పఁ బూనెను. లక్ష్మణుఁడు నియోజితకార్యనిర్వహణాభారనిమగ్నుఁడు కావున దుఃఖితుఁడు. ఆ తరుణమందు జనకరాజపుత్త్రి, సౌమిత్రి శోకకారణమూహసి, దుఃఖవివశయై, వియోగదావానలశిఖలనార్పుకొని, తాపము నుపసంహరించి, సర్వాంగనిర్మోహమును బ్రకటించి శోకభీకరమూర్తియగు సౌమిత్రి నుద్దేశించి "అడలకుమన్న నీకు వసుధాధిపునానతి దాఁటవచ్చునే" యని యనునయించెను. తన ప్రస్తుతపు దుస్థితికి రామచంద్రుఁడే కారణభూతుఁడైనను పతివ్రతామతల్లికగాన గుణములప్రోవుగాన విశేషించి ప్రేమకందువగాన, నిరపరాధినియగు తన్నరయకఁ గఠోరముగఁగానల కనిచిన నిజనాథుని నిందింపక రాజాజ్ఞకు బీజంబగు పౌరులమనంబున నొవ్వక "ఎడపక పూర్వజన్మముల నేమిఘోరంబులఁ బాయఁజేసి వారడలఁగ నవ్వుచుండితినో" యనియు "నా యభాగ్య మింతె యొకరిఁ బల్కనేల?" యనియు వాపోయెను. అప్పటికిని నప్పరమపతివ్రత రఘూద్వహుని యా "కరుణ యా ప్రసన్నత, యా కూరిమి, యా ప్రియోక్తి, యా గౌరవమున్" విస్మరింపలేదు. రామభూధవుని కటుకుదనము నెదఁదలఁపక "ఎన్న

టికీఁ రఘూద్వహుని నేనును,నన్నిఁక రామచంద్రుఁడుఁ గన్నులఁ జూడఁగల్గదో" యనియు, "శ్రీరాముమోమీ కాయాంబునఁ జూచుభాగ్య మిఁక లేదేమో సుమిత్రాత్మజా" యనియు పరిదేవన మొనరించినది. నాథుఁడే తనకు యేఁకగడయని నమ్మిన జనకజయెడలనా ఇట్టి విపరీతప్రవర్తన? (శ్రీరాముని హృదయ మొక కోహినూర్!) అయినను తనకు పతియును, ననురాగవ్రతతీతతి కాశ్రయుఁడునునగు నా గగనమణి గోత్రగ్రామణి నా రమణీమణి నిందింపకఁ బ్రస్తుతించెను. మఱియు లక్ష్మణుని వీఁడుకొల్పుచు నాయమ నుడివిన పల్కు లమృతమును జిల్కినవి. చూడుఁడు.

వగపునఁదోఁచినన్నియు నవారణఁబల్కితిఁ గాక భర్తకుఁ
జగదపవాదముఁ గడుపశక్యమె? నేను వియోగమగ్నతఁ
దెగువకుఁజొచ్చి రాము జననిందితుఁ జేయుదునే?"

అహో! ప్రేమనీతి!! విలోకించితిరా? ఒక్క కన్నీటికణ మీ విశాలధరణీతలములోనున్నచో నయ్యది యీ పరమసాధ్వి సొత్తు; ఆమె నిర్మలప్రవర్తన కీ యశ్రుకణముపహారము: ఆమె సౌశీల్యమున కీ కంకణమే యర్పణము. "నెమ్మి యొకయింత నామీఁద నిల్పుమనుము" అని రామునకు కడసారి సందేశ మంపినది. కన్నీటికాల్వ పాఱించినది—కాని తన హృదయాధినాథుని దూషింపలేదు. సీత, పూతచరిత; ప్రేమవాహిని; దయారాశి.

ఇట్టి యలౌకిక ప్రేమజీవనము, హృదయసౌకుమార్యము స్త్రీల రవణము. కావుననే ఈశ్వరుఁడు శిశుసంరక్షణమును గరుణాసింధులగు కలకంఠుల యధీనము గావించినాఁడు. ఈ నా పద్యములతో నీ చర్చను ముగించుచున్నాఁడను.

**Angels we heard of much;**
**On Earth difficult to search;**
**A Hindu woman chaste,**
**Serves our Angelic taste.**

వేల్పుటింతుల నెంతయు వినుటె గాని
గనుట కష్టంబుగద వెదుకంగ నిలను
లలిత చరిత హైందవగృహలక్ష్మిసుమ్ము
మనదు దివిజభావంబుల కనువుపడును.

# శాపదగ్ధ

రామమోహన్ రాయ్ గారు

౧

"నా గుండెలమీద బరువెత్తి—నా స్వాతంత్ర్యాన్నడ్డుపెట్టి—ప్రకృతి నాకిస్తూన్న ఉపహారాల్ని—బలవంతంగా లాక్కోవాలని చూస్తూన్నావు. జాగ్రత్త!—దేవతలు సర్వసమర్థులు. వాళ్ల కపకారం చెయ్యబోవడ మెంత యాపత్కరమో ఎరగవూ? నా భయంకరశాపం నిన్ను మాడ్చేస్తుంది. నా హృదయవేదన—శారీరకక్లేశం—ఏకమై—కరడుగట్టి మిడుగులా నిన్ను మూలంకల్లా ధ్వంసం చేస్తుంది. నన్ను బాధించినవాళ్లంతా హృదయవ్రణంతో భీభత్సమైన చావు చస్తారు—"

రెండొడ్లనొరసి-యల్లరిపిల్లవలె తనమార్గమంతయు తల్లకిందులు చేయుచు-ప్రవహించుచున్న భద్రావతీనదీ భయంకరగర్జనమున చివరిమాటలు లుప్తమైపోయినవి.

రాణీ భవాని హృదయ మీ భయంకర శాపమునకు తుపాను సమయమున సముద్రోదకమువలె కలగుండుపడిపోయెను. ఝంఝామారుతమున తాటియాకువలె కంపించినది. నిండుశీతమున చన్నీటిలో మునిగిన ట్లామె యొడలు బిగిసిపోయినది.

ఆమె యొక్కమారుగ యులికిపడి లేచెను. కన్నులు నులుముకొని నలుమూలలు చూచెను గాని యామె కెవ్వరూ గనబడ లేదు.

గదిలో దీపము ఘంటమువలె వెలుగుచున్నది. రాజగృహమంతయు నిశ్శబ్దముగ నున్నది. అప్పుడప్పుడు వినబడు పహరావాని హెచ్చరికలుగాక మారుశబ్దములు వినబడుట లేదు.

రాణి హృదయోద్వేగముతో శయ్య విడిచెను. కలలో కనుపించిన యాభీషణమూర్తి—క్రోధోద్వేగములచేత జేవురించిన భద్రావతీ నదీదేవతయుజ్జ్వలవదన మిప్పుడు కూడ నామెకు కన్నులగట్టినట్లు గనబడుచుండెను.

రాణి కంపించుచున్న హృదయముతో—తడబడుచున్న అడుగులతో కిటికీచేరి వణుకుచున్న చేతులతో తలుపులు దెరచెను. గదిలోని దీపపుగాంతులు—కట్టతెగిన ప్రవాహమువలె బరుగులెత్తి—కిటికీమీద పాకుచున్న జాజీతీగయాకులమీది మంచుబిందువులలో మిలమిలలాడెను.

అంతట గాఢాంధకారము. కన్నుకన్ను కానరాని యా కటికచీకటిలోకూడ నేతు

నిర్మాణమునకై జాగ్రత్తచేసిన సామగ్రియంతయు కాటుకకొండవలె కనబడుచున్నది. దాని యెదుట శాపవాక్యము లొత్తిపలుకుచున్నట్లు భద్రావతీ నది గలగలలాడుచు ప్రవహించుచున్నది.

ఆదృశ్యమునకు రాణి భయభీతయైపోయెను. కలలోని శాపవృత్తాంతము గలవరపెట్ట నామె భళ్లున కిటికీమూసివైచి-అచటనే మోకరిలబడి దైవప్రార్థనము చేయసాగెను.

౨

సేతు నిర్మాణమునకై సమకూర్చబడిన సామగ్రినంతను రాజధానికి తరలించుకొని పోవుటకు రాణి యాజ్ఞయైనది. సేతువు నిర్మించి నదీదేవతభీషణశాపమునకు గురియగుటకామె సాహసింపలేక పోయినది. రాణియాజ్ఞయైనవెంటనే వందలకొలది బండ్లు వరుసలు దీరి రాజధాని వంక బయలుదేరినవి.

తమచాతుర్యము, విద్వత్తు-కనబరుచుటకు తగిన యదను దొరికినదని ప్రకృతితో పోరాడవచ్చిన సేతునిర్మాతలందరు ముఖములు చిన్నవుచ్చుకొని మూటముల్లె సర్దుకొనుట కారంభించిరి.

కొంతకాలమువరకు పుష్కలముగా పని దొరకునని చేరిన కూలీలందరు నిరాశతో కాలుకాలిన పిల్లులవలె అటుయిటు దిరుగుదిరుగుచుండిరి.

రాజగృహమంతయు చాల హడావుడిగానున్నది. దాసీజన మటునిటు బరుగులెత్తుచు కళవిళపడుచున్నారు. ఒకర్తె 'సామానింకా సర్దుబాటు కాలేదా ?'—యని ప్రక్కవారిని కసురుచున్నది. ఇంకొకర్తె యేదియో పనియున్నట్లు పెద్దపెద్ద యంగలతో గదులన్నియు తిరుగుచుండెను. ఒకర్తె మరల ప్రయాణమున వీలుచిక్కదేమోనని ఒకగడప ప్రక్క కూర్చుండి జడయల్లుకొనుచుండెను.

వీధి యరుగుపై సేవక దళాధికారి నిలువబడి సామానంతయు బండ్ల కెక్కించుచున్నాడు.

సేతు నిర్మాణమునకు విఘ్నము కలిగినదనియు-రాజకుటుంబము ప్రయాణమై పోవుచున్నదనియు విని చుట్టుప్రక్కల ప్రజలందరు రాజగృహమున కెదుటనున్న బయలులో గుసుకవై చినరాలకుండ ప్రోగుపడిరి. ఇంత హఠాత్తుగ నీ పరివర్తన మేలకలిగినదని కొందరు యుక్తులచే సాధించుచుండిరి. కొందరు వంతెనలేని కష్టనష్టములు వర్ణించుచుండ కొందరు రాజకుటుంబమును పొగడుచుండిరి.

ఒకవృద్ధబ్రాహ్మణుడు చేతిలోని కర్ర నేలతాటింపుచు-కన్నీటితో తన కుటుంబమంతయు నేవిధముగ నదీగర్భము చేరిపోయెనో వర్ణింపుచుండెను. కుమారుని పెండ్లిచేయుటకు బోవుచున్నవారిపడవ యొక సుడిగుండములోపడి యడుగంటినవార్త చెప్పుచు

నావృద్ధ బ్రాహ్మణుడు వెక్కి వెక్కి యేడువ సాగెను.

వితంతు వొకా మె తన మాంగల్యవిచ్ఛేద మునకు కారణమైన భద్రావతిని మనఃపూర్తిగా శపించుచు నాక్రోశింపుచుండెను.

ఒక పల్లెమునలిది తన యేకమాత్ర పుత్రునిగూర్చి ఏడ్చుచుండెను.

ఒకడు తనస్నేహితుల దుర్మరణమును — వేరొకడు బంధువులసంఘ మరణమునుగూర్చి వేరువేరు గొంతులతో వర్ణింపుచు కంట తడి పెట్టుచుండిరి.

రాణీ భవాని కుమార్తె తారాసుందరీ దేవి నదీ స్నానముచేసి వచ్చుచు ప్రజల శోకాలాపములన్నియు సిబికలోనుండియే వినెను. ఆమె హృదయ మాదీనుల శోకము విసునంతకు భారమై కన్నుల నీరు గ్రమ్మెను.

తారాసుందరి పదునారేండ్ల యువతి. వితంతువు. నాటూరు సంస్థానాధీశ్వరి కేక మాత్రపుత్రిక. సుగుణనిధి. తల్లియొక్క దీనదయార్ద్రత, దుఃఖితులయెడల సానుభూతి యామె పుణికి పుచ్చుకొనినది.

తారాసుందరి చెవినిపడిన యొక్కొక్క కష్టవృత్తాంత మామెలో నిద్రింపుచున్న చైతన్యమును మేల్కొలిపెను. హృదయము దయాప్లావితమయ్యెను. ఈ ప్రదేశమున వంతెన యెంత యవసరమో — దానిని నిర్మింప కుండుట యెందరకు బాధకలిగించుచున్నదో యామె హృదయమునకు దట్టెను. 'నువ్వు మహాత్కార్యం కొఱకే వితంతువుగా చెయ్య బడ్డా'వని ఎవరో చెవిలో చెప్పినట్లయింది.

తారాసుందరి త్రుళ్లిపడెను.

ప్రజోపకారమునకై తన శరీరమును దేవీ శాపాగ్నిలో హోమముచేసినైనను దృఢముగ నిశ్చయించుకొని యామెగృహమునం దడుగు బెట్టెను.

'అమ్మా! అమ్మా!' యని బిలచుచు తారాసుందరి తల్లియున్న గదిలో ప్రవేశించెను.

రాణి కిటికీ తెరమాటున నిలచి వీధిలో ప్రోవుపడిన జనమువంక చూచుచుండెను.

'చూడు! ఎంతమంది ప్రజలు బంధు వియోగంచేత బాధపడుతూన్నారో, సేతువు కట్టబడుతుందనీ. ఇకముందైనా ప్రజలలో యీ దుర్మరణాలు తగ్గుతాయనీ వాళ్లు కల్పించుకున్న కల్పనలన్నీ వ్యర్థాలయినా యని తెలియడంతో ఓ—ఎంతబాధ పడుతూ న్నారో వాళ్ల హృదయాలు—'

రాణి యులికిపడి వెనుతిరిగి చూచెను.

'దేవీ శాపం! దేవిశాపం!! హృదయ వ్రణంతో మరణం! అబ్బ! భయంకరం:—'

రాణి మ్లానవదనముతో ప్రజలవంక నదివంక నొకమారుచూచి నిట్టూర్పు విడిచెను.

'ప్రజోపకారంకి ఫలందారుణ మరణమే యైతే—అనంతమైన బాధ ననుభవించవలసే వస్తే—దాన్ని నేను హృదయపూర్వకంగా స్వీకరిస్తా. నిశ్చలహృదయంతో—నిష్కామ్య భావంతో ఈ ప్రజలకై నేను మరణిస్తా. భద్రావతీదేవే ఆకళంకం భరించనీ. నాటూరు రాజవంశం ప్రాణభయంచేత ప్రజాకార్యం మరచిందనే అపకీర్తిపాలు కాకూడదు.'

తారాసుందరి సగర్వముగా కొంచెము తలయెగురవేసెను.

రాణినెత్తిపై పిడుగుపడినట్లయ్యెను. ఒక్కతెగాని, ఒక్కకూతురు. వితంతువై నను కండ్లుతెరవని బాలిక. ఇంత సాహసముతో ప్రజోపకారమునకై భయంకరమైన యిట్టిత్యాగమునకు సిద్ధపడుటచూచి యామె హృదయమున భయము, గర్వము, ఆనందము గూడ నొక్కమారే గలిగెను. కండ్ల నీరు గ్రమ్మెను. ఆమె భయముతో కుమార్తెను దగ్గరకు దీసుకొని కన్నీటితో శిరము దడిపెను.

నన్నొంటరిగా చేసిపోవాలని నీ కెల్లా తోచిందమ్మా!

రాణి డగ్గుత్తికచే ముందుమాటలు బలుక జాలక పోయెను.

'అమ్మా! నన్ను నిందించకు. చూడు, వీళ్లంతామాత్రం నీ సంతానంకాదూ. ఇంత మంది భార్యాహీనులు—భర్తృహీనులు—పుత్రమిత్ర బాంధవవియోగులూ నీ కళ్లబడు తూంటే చూస్తూ భవిష్యత్తులో ప్రజలిల్లాంటి దుర్మరణాలు, దారుణమైన చావులు, చావకుండాచేసే ఉపాయం మనచేతులలో వుండగా—చెయ్యకపోవటం—

భవానిదుఃఖం ఆపుకోలేకపోయింది.

'దేవీ శాపంకి బలి—'

రాణివాక్య మధ్యముననే తారాసుందరి ప్రతివాదము సాగించెను.

'ఆపని చెయ్యకపోతే నాటూరి రాజ్యంలోని నీ సంతానంఅంతా దుఃఖతప్తమౌతూనే వుంటుంది నిత్యం. నిత్యం ఏదో మూల నుంచి రోదనం బయలుదేరుతూనే వుంటుంది. నాలుగుమూలలా అమాంగళ్య దేవత నాట్యం చేస్తూనే వుంటుంది. నే బ్రదికియుండి చేయగల మహత్కార్య మేముంది? నేనా, వితంతువును. ఈ జీవితంఅంతా అమంగళ రూపంతో జీవచ్ఛవంలా బ్రదికినకంటే ఈ శరీరం ఒక్కటే ఇన్నివేల ప్రజలసుఖం కుపయోగించడంలో ఎంతగొప్పతనంవుంది? ఈ వితంతువును ప్రేమాతిశయం కొద్దీ నిరోధిస్తే—భవిష్యత్తులో నిరంతరం—'

రాణి నిస్తబ్ధయైపోయింది. వితంతు పుత్రిక వయోరూపములు చూచి దయా

ఔదార్యముల చూచి-యామె రెండుకండ్లూ దుఃఖానందములచే మెరసిపోయెను.

ఇంతలో గదిబయటదాసి 'సామానం తయు బండ్ల కెక్కిన'దని పల్కెను.

తారాసుందరి వేగముగా గదివీడివచ్చెను.

'ఇప్పుడు ప్రయాణంలేదు. బళ్లువిప్పి సామాను లోపల పెట్టెయ్యండి.' ఆశ్చర్య ముతో దాసీలెల్ల రామెచుట్టుమూగి ప్రశ్న పరంపరల గురిపించిరి.

'వంతెన పూర్తయిదాకా రాజకుటుం బం రాజధానికి వెళ్ళదు.' రాణీభవాణి రాజ ధానికిబయలు దేరిన బళ్లన్నియు వెనుకతిరుగ నాజ్ఞాపించెను.

ఇంటికిపోవుటకుసరదాపడుచున్న సేవకులు మనస్సులో కించపడినను పైకి 'జీహుజూర్' అనక తప్పినదికాదు.

రాజకుటుంబముయొక్క ప్రయాణభం గము సేతునిర్మాణమునకై తారాసుందరి దృఢనిశ్చయము ప్రజలువిని 'జయజయ' ధ్వనులతో దిగంతములు ప్రతిధ్వనింప చేయుచు-ఆనందముతో గంతులు వేయ సాగిరి.

భవానీదేవి గవాక్షమువద్ద నిలువబడి పొంగి కోలాహలం చేయుచున్న-భద్రావ తిని-ప్రజలనుచూచి యొక్కనిట్టూర్పు విడిచెను.

తారాసుందరి సంఫుల్లవదనముతో పిచ్చి వాండ్రవలె గంతులువేయుచున్న ప్రజలను చూచుచు వినీతభావమున భగవత్ప్రార్థ నము చేయసాగెను.

## 3

బళ్ళన్నియు వెనుకతిరిగెను.

సేతునిర్మాతలందరు నదీతీరాన పోగుపడి, నదివంకజూచి స్థలనిర్దేశం చేస్తూన్నారు. కూలీలు బ్రహ్మానందముతో కార్యవాహిక చేపట్టిరి.

భవానీదేవి నాటూరుసంస్థానపు ఖజానా కొట్లద్వారములు తెరిపించెను.

తారాసుందరి ప్రజాశీర్వాదములమధ్య- కార్మికుల జయజయధ్వనులతో భద్రావతీ నదిభయంకరశాపము నెదమీద గ్రహించి నది.

ఈ యపూర్వత్యాగశీల నెల్లరు హృదయ పూర్వకముగ నభినందించిరి. చాతుర్వర్ణ్యము, పిన్నపెద్దలెల్లరు త్రికరణయానమస్కరించి- ఆశీర్వదించిరి.

పెద్దలు నిర్ణయించిన శుభమూర్తమున శంకుస్థాపన జరిగినది.

మహోత్సాహముతో రేబవళ్ళనక కూలీలు పనిచేసిరి. నిర్మాతలందరు తమ యుత్సాహము-విద్య-ఊహ-కేంద్రీకరింపc చేసి పనినడిపిరి.

తారాసుందరినిశ్చలనిష్ఠతో ప్రజల చిరంతనాభిలాష నెరవేరెను.

వేలకొలది ప్రజల కేంద్రీకృతనిష్ఠలో దేవశక్తమైనకార్యము నిర్విఘ్నముగ నెరవేరెను.

౪

రాణీభవాని తనగదిలో విమనస్కయై—నిలచియుండి వంతెనస్తంభములకుమోదికొని హృదయదారకముగ నదించుచున్న నదీగర్జనము విని యులికిపడెను.

బయట పెద్దపెద్దపందిళ్ళు—పాతలువేయబడి చాతుర్వర్ణ్యమున కన్నశాంతి జరుగుచుండెను. ప్రజలెల్ల రొక్కమారుగ జయజయధ్వనులుచేసిరి. ఆ ధ్వనిలో నదీరోదనములయమైపోయెను.

రాణి శంకాకులచిత్తయై యచటనుండి దేవమందిరములోనికిబోయి విగ్రహము ముందు సాగిలపడెను.

* * *

తారాసుందరి సాయంసమయమున బద్ధకముగ నున్నదనుచు శయ్యజేరెను. దాసీలెల్లరు గదిబయట ప్రోగుపడిరి. చుట్టుప్రక్కల నున్న వైద్యులందరవద్దకు సేవకులు పరువులెత్తిరి. ప్రజలెల్ల రుత్సాహముమాని—పిల్ల చచ్చినకోతులవలె—చేతులు నలుపుకొనుచు రాజద్వారమువద్ద ప్రోవుపడిరి.

రాణి కుమార్తె శిరోదేశమున గూర్చుండి విచారభుగ్నమైన హృదయముతో మాట మాటకు నదివంకచూచుచు కంటనీరు పెట్టుచుండెను.

రాత్రి యొక్కొక్కగడియ యొక్కయుగమువలె గడుచుచున్నది. తారాసుందరి యొడలెరుగని జ్వరమున శయ్యపై పడియుండెను.

రాజగృహమంతయు విచారభరితమై యుండెను. వైద్యులెల్లరు భయవిచారాకులములైన హృదయములతో యాలోచనలు సాగించుచుండిరి. వందలకొలది ప్రజలా నిశీథమునగూడ బయట నిశ్శబ్దముగా నిలచియుండి—రాజగృహద్వారమునుండి వచ్చిన గాలినుండికూడ తారాసుందరిక్షేమము తెలిసికొన నాతురత చూపుచుండిరి.

అర్ధరాత్రమయ్యెను. రోగి గృహమునుండి బయలువెడలిన పెద్దకేకతో యందరు నులికిపడిరి. దాసీలు—వైద్యులు—గడబిడగ బరువులెత్తిరి. ప్రజలువిషయము తెలసికొను నాతురతతో రాజమందిర ద్వారమువద్దకు బరువెత్తివచ్చి గోలచేయసాగిరి.

౫

దేశమున పెద్దపేరుపడిన కవిరాజు (వైద్యులు) లెల్లరు ప్రోగుపడిరి. సంవత్సరముల కొలది సంపాదించిన అనుభవము,

వందలకొలది పుస్తకములు చదివిన విజ్ఞానము నేకముచేసి మృత్యువు నెదురించిరి.

భవానీదేవి నిద్రాభోజనములు మాని నిరంతరము భగవదారాధనము చేయుచుం డెను. ప్రజలు వేలకొలది రాజద్వారమువద్ద ప్రోవుపడి-యైకకంఠ్యముగ నామె నాశీర్వ దించిరి. వెయ్యారు దేవులకు మ్రొక్కిరి.

* * *

ఎల్లెడల ప్రశాంతముగ నున్నది. రాజ గృహపరిసరములన్నిట శోకదేవత విహ రించుచున్నది.

తారాసుందరి వ్రణబాధచే శయ్యపై పొర్లాడుచుండెను. విపరీతమైన బాధచే మూలుగుచు నాయాసపడుచుండెను. దావా లన స్పర్శదగిలిన లతవలె యామెమృదు-సుందర-శరీరము వాడి వత్తయిపోయెను.

ఆ దివ్యమణి నేలగలియు సమయము సమీపించినది. కవిరాజు లెల్లరు నిరాశతో చావడిలోనికి చేరిరి. దాసీలెల్లరు కండ్లనీరు గ్రుక్కుకొనుచు రోదనమునకు ముందువెను కలు చూచుచుండిరి.

రాణి కుమార్తెమరణ మనివార్యమని యెరిగెను.

'తల్లీ! నన్నొంటిదాన్నిచేసి పోతు న్నావా?' యని యామె దుఃఖముతో తారా సుందరి గడ్డముకదుపుచు వెక్కివెక్కి యేడువ సాగెను.

ఆరిపోవుచున్న దీపకళికవలె తారాసుం దరి ముఖ మొకవిలక్షణతేజముచే నుద్దీప్త మయ్యెను.

'ఈ ప్రజలంతా నీ సంతానంకాదూ?-అమ్మా! ఈ నిరర్థకము, అమంగళమునైన నా జీవితం కొన్నివేలమంది ప్రజలసౌఖ్యంకి వినియోగించిందనే సంతృప్తితో మరణి స్తున్నా, నువ్వుకూడా నిరంతరం నిన్ను దుఃఖ తప్తని చేస్తూన్న యొక్కవితంతుపుత్రిక ప్రాణాలతో వేలకొలది ప్రాణాలు రక్షించ బడినాయనే సంతృప్తితో ధైర్యంవహించు

ఆమె నేత్రము లర్ధనిమీలితములైపో యెను. లోన నేదియో వెదకుచున్నట్లు కను గ్రుడ్లు మీదికిపోయెను. దాసీ లెల్లరు గొల్లు మనిరి.

క్షణార్థమున యాదివ్యతారలోని జీవ జ్యోతి యనంతశక్తిలో లీనమై పోయెను.

* * *

ఈవిధముగ నాపదునారేండ్లవితం తువు తన యపూర్వత్యాగ-సాహసములచే దేవశాపమునకు గురియైపోయినది. ఆ మృదుకుసుమము శాపోపహతమై వృంతచ్యు తమైపోయెను గాని యామె కల్పనమాత్రము ఆమె త్యాగసాహసములకు సాక్షీభూతమై నేటికి నట్లేయున్నది:—భద్రావతీదేవి ఆ దివ్యకల్పనను శాపదగ్ధమొనర్చి ధ్వంసము చేయగలిగెనుకాని మానవకల్పితమైన తన హృదయభారమును రెండువందలేండ్లు తం టాలుపడినను కదపలేకపోయినది.

# ప్రేమ పరిణామము

శ్రీమతి భోగరాజు పర్వతవర్ధనమ్మగారు

ఏలూరు మ్యునిసిపల్ హైస్కూల్లో ఫోర్తుఫారం చదువుతున్నాడు ఆనందరావు. ఈమధ్యనే పొరుగింటిలోని బాలిక కమలను ప్రేమించి హృదయం స్వాధీనంలోనుంచి పోగొట్టుకున్నాడు.

కమలా, ఆనందరావులు చిన్నతనంనుంచీ కలిసి ఆడుకునేవారు. ఆమె కపటంలేని ఆ ముఖపద్మము, సోగలైన ఆ కళ్లూ, తీర్చినముక్కూ, రోజూ చూస్తున్నా అతనికి ఎప్పుడూ మోహం అనేది కలగలేదు. యీమధ్యనే అకస్మాత్తుగా ప్రేమప్రవాహంలో పడి ఒడ్డుపట్టకుండా కొట్టుకు పోతున్నాడు.

దీనికి కారణం లేకపోలేదు. ఈమధ్యనే ఒక రోజున కమలదొడ్డిలోని జామచెట్టు ఎక్కి కాయలు కోసుకుంటున్నాడు. కమలా, తల్లీ కాలవకు వెళ్లి స్నానంచేసి వస్తున్నారు. నీళ్లోడుతూ మోకాళ్ల వరకూ వ్యాపించిన ఆ నల్లవెంట్రుకలూ, సూర్యరశ్మి పడి తళతళా మెరుస్తున్న ఆముఖపద్మమూ, ఆనందం హృదయాన్ని చేతులోంచి పోగొట్టాయి.

అప్పటినుంచీ, నిద్రాహారాలు ఒంటబట్టటంలేదు. తరుచుగా అక్కలేటి యిసుకలో కూర్చుని ప్రేమ గీతాలు అల్లుతూండేవాడు. కమల గొప్ప సౌందర్యవతి కాకపోయినా, ఆ వుంగరాలజుట్టూ, ఎంత దువ్వినా అణక్కుండా ముఖాన్ని కమ్ముకునే ఆ ముంగురులూ, తరుచుగా చిరునవ్వు వెన్నెలలతో ప్రకాశించే ఆ తీర్చి దిద్దిన ఆ ముఖము ఏ యువకుని హృదయం స్వాధీనం తప్పించకుండా వుంటుంది? తల్లిదండ్రుల కామె ఒకటే సంతానము. అల్లారుముద్దుగా పెంచుచుండేవారు. ఒకటి రెండుచోట్ల పెళ్లిమాటలు కూడా మాట్లాడారు. ఈ కార్తీకంలోనే పన్నెండోఏడువచ్చింది. కాని ఏ సంబంధమూ యింకా స్థిరపరచలేదు.

ఆనందరావు కమలను తరుచుగా కలుసుకుని ఏమితాయిపొట్లమో, కిల్లీయో, చేతనైన ప్రేమోపహారాలు తన ప్రాణప్రియకు అర్పిస్తుండేవాడు. కమల కూడా తన స్నేహితుడికి ప్రతిఫలంగా చిరునవ్వులర్పించేది. ఆనందం వాటితోనే సంతృప్తి పొందేవాడు.

వైశాఖం పూర్తి అయింది. కాలేజికి సెలవులిచ్చారు. ఆనందం మేనత్తకొడుకు శ్యామలరావు వేసంగిసెలవులు మేనమామగారి యింట్లో గడపటానికి వచ్చాడు. శ్యామం ఆనందం కంటె మూడేళ్లు పెద్ద. గుంటూరు కాలేజీలో ఇంటర్మీడియట్ చదువుతున్నాడు. మిత్రమండలిలో శ్యామం కవి క్రింద లెక్కయ్యబడ్డాడు. అతడి హృదయం సాహిత్యశబ్దజాలంతోటి నిండివుంది. అతడు వచ్చినప్పుడెల్లా ఆనందం ఎట్లా చదువుతున్నాడో పరీక్షచేసి, తరుచుగా తల్లిదండ్రులమీద ఉండవలసిన భక్తిని గురించీ దేహవ్యాయామము, ఎదువుకోటంవల్ల ఉండే ఫలితం మొదలైన వాటిమీద లెక్చర్లిచ్చేవాడు. ఆనందం పెద్దవాడనీ, తెలివిగలవాడనీ, శ్యామాన్ని గౌరవించేవాడు. కాని యీసారి శ్యామంతోటి మాట్లాడటమే కష్టంగాఉంది ఆనందానికి. అన్నం తింటే మరి యింట్లో నిలవక పోవటమూ, ఎప్పుడూ పరధ్యాన్నముగా ఉండటం చూసి, దీనికి కారణం కనుక్కోవాలని విశ్వప్రయత్నం చేశాడు శ్యామం. కాని ఆనందం చెప్పలేదు.

ఒకరోజు ఆనందం పుస్తకాలు బయటకు తీస్తోంటే అతడి కవితాపుస్తకం బయట పడింది. ఆ పుస్తకం చటుక్కున తీసి చూశాడు శ్యామం. ఆ కవిత చదివాక శ్యామానికి ఆనందంమీద స్నేహము, శ్రద్ధ ఏర్పడ్డాయి. ఆనందం భయపడ్డాడు శ్యామం తండ్రితో చెప్పి కొట్టిస్తాడేమోనని. కాని శ్యామం ఆనందాన్ని 'నీవు త్రొక్కినదారి చాలా బాగుంది. నీకు నేను సానుభూతి చూపుతూ, నీ ప్రేమ పరిపక్వము అయ్యేమార్గము చెపుతా' నన్నాడు.

ఆనందం హృదయం కొంచెం శాంతిపడింది.

శ్యామం:—ఒరే ఆనందం! నీ కవిత్వంవల్ల ఆమె కూడా నిన్ను సమానంగానే ప్రేమించినట్లు తెలుస్తుంది అంతేనా ?

ఆనందం (ఒక్కనిట్టూర్పు విడిచి)—అట్లాగే తెలుస్తుంది.

శ్యామ:—నీతోటి ఎప్పుడైనా నిన్ను ప్రేమించినట్లు చెప్పిందా ?

ఆనందం:—లేదు.

శ్యామం, ఆనందం కొంతసేపు మౌనంగా వున్నారు.

తిరిగి శ్యామం అన్నాడు—చూడు! వారు మన పొరుగువారు. ఆమెతోటి స్నేహానికి అట్టే కష్టంలేదు. కాని తల్లి దండ్రులు సంబంధాలు నిశ్చయం చేసుకునేందుకు ముందుగానే నీవు ఆమెతోటి మాట్లాడి ఆమె హృదయం తెలుసుకోవటం మంచిది.

ఆనందం—ఏమిటీ ! యిదికూడా అడగదగ్గ మాటే!

శ్యామం:—అడిగి తెలుసుకోవలసిందే! ఆమెని పెళ్ళిచేసుకోదలచుకుంటే నీవు తప్పకుండా ఆమె అభిప్రాయం కనుక్కోవాలి. ఆమె తల్లిదండ్రులు అనేక సంబంధాలు వెతుకుతున్నారు. ఆమె పెళ్ళి అయిపోతే నీకిక బ్రతికివున్నన్నాళ్లూ పశ్చాత్తాప పడటం తప్ప చేతికి వచ్చేదిలేదు.

ఇదివిని ఆనందానికి తొందర కలిగింది. ఆమెను చాలా రోజులనుంచి ప్రేమిస్తున్నాడు గాని, పెళ్ళి చేసుకుందామని అతని కెప్పుడూ స్ఫురించలేదు.

'సరే! బాగానేవుంది ఆమెతోటి ఏమిమాట్లాడాలో చెప్పు'

'అల్లాగే చెపుతాను. ఆమెను ఏకాంతంగా తీసుకువెళ్ళి, ఆమెచేయి నీచేతితో పట్టుకుని, 'చూడు! కమలా! నిన్ను నేను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. నీవుకూడా నన్ను ప్రేమిస్తున్నావా?' అని అడిగి, ప్రేమిస్తున్నానంటే 'నన్ను పెళ్ళిచేసుకుంటావా?' అని అడుగు. ఆమె వప్పుకుంటే ఆమెచేయి, యిదుగో! యీవిధంగా ముద్దుపెట్టుకోవాలి.'

ఆనందం:—బహుశా ఆమె వప్పుకోకపోతేనో?

శ్యామం:—మొదటిసారి ఆమె వప్పుకోక పోవచ్చును కూడాను. యిట్లాకూడా జరగటం మామూలేనని, అనేకపుస్తకాల్లో, చదివాను. కొందరు యిష్టంవుండి కూడా లేదంటారు. కొందరు నేను చెప్తే ఏమవుతుంది, అయినా నాకేం తెలుసును? అనీ అంటూంటారు. ఇంతకీ ఆమె ఏమంటుందో నాతో చెప్పు నేను తిరిగి నీకు నేర్పుతాను.

మరునాడు ఆనందం కమల యింటికి వెళ్ళాడు. కమల తల్లీవాళ్లూ ఎక్కడికో వెళ్ళారు. కమల దొడ్డివసారాలో కూర్చుని, సతీశిరోమణులు చదువుకొంటోంది.

'కమలా జామకాయలు కోసిస్తాను వస్తావా తోటలోకి?' కమలకు పచ్చి జామకాయలనేసరికి నోరూరి వెంట పరుగెత్తింది. అక్కడికెళ్లాక కమల చేయి తనచేత్తో పట్టుకుని—కమలా! నేనొకమాట అడుగుతాను. నీకు కోపంరాదు గదా?

కమల:—కోపమెందుకు? అడుగు.

ఆనందం:—నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీవు నన్ను ప్రేమిస్తావా?

కమల నిస్సంకోచంగా.

ఆనందం:—ఇన్ని రోజులనుంచీ నామనస్సులో ఒక దురాశవుంది. అది యీరోజు నీతో చెపుతాను. అయితే కమలా! నీవునన్ను పెళ్ళిచేసుకుంటావూ?

ఆనందం మొదటి మాటలు కమలకి అర్థంకాలేదు. కాని పెళ్ళి అనేసరికి బాగా తెలిసింది. "ఛీ! పో!" అంటూ చెయ్యి ఊడలాక్కొని పరుగెత్తింది.

ఆమె అందెల ఘుణఘుణ వినిపిస్తున్నంతవరకూ నిశ్చలంగా అటే చూస్తున్నాడు. ఆమె దృష్టికి దూరమయ్యాక తనలో తాను ఆలోచించుకున్నాడు. అయితే కమల పెళ్లిపేరు చెప్పటంతోటే చెయ్యి లాక్కొని పరుగెత్తింది. ఆమెకు నన్ను పెళ్లిచేసుకోవటం యిష్టంలేదా ఏమిటబ్బా?

తాను చదివిన నవలలోనుంచి అనేక సంఘటనలు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. ఈమాదిరిగా జరిగిన అనేక చర్యలు జ్ఞప్తికివచ్చాయి అతడికి. అప్పుడు కొంచెం ధైర్యంతో...'అయితే సిగ్గుకు, ప్రేమకు సాహచర్యం ఉందికాదూ మరి. కమల పరుగెత్తటానికి సిగ్గే కారణం అయుండొచ్చును.' అనుకున్నాడు.

౨

శ్యామలరావు జరిగిన సంగతంతా విని, ఆమె నిన్ను ప్రేమిస్తున్నప్పుడు పెళ్లికి యివ్వాళ కాకపోతే రేపు ఒడబడుతుంది. యిప్పుడిక వాళ్ల తల్లిదండ్రుల యిష్టమే ఆలస్యం. మీ తల్లిదండ్రులూ, ఆమె తల్లి దండ్రులు వప్పుకోవాలి.

"నువ్వు యీమాట మా నాన్నతోటి చెపితే వప్పుకోడూ?"

"నేను చెప్పితే బాగుండదు. నువ్వే స్వయంగా చెప్పు."

"నేను చెప్పలేను బాబూ! పెళ్లి ప్రస్తావన తెచ్చినవాడవు నువ్వే."

"నేనే నాన్నగారితోటి చెప్పివస్తా నన్నావు మొదట. యిప్పుడు నీమాటమీదినుండి తొలిగిపోతావేం?"

శ్యామలరావుకు, ఆనందానికీ, ఆనందం తండ్రి రామారావుగారిని చూస్తే భయమే. ఆయన చాలా కోపిష్టి. యివ్వాళ, రేపంటూ వారంరోజులు గడిచిపోయాయి. యీలోగా ఆనందానికీ, శ్యామానికీ, మధ్య యిదివరకుండే గురు శిష్య భావంపోయి, స్నేహం ఏర్పడింది.

ఒకరోజు ఆనందం కమల పేరుమీద భావమంజరి తయారుచేశాడు. శ్యామలుడు దాన్ని చదివి వేయిసార్లు ప్రశంశించాడు. నిజంగా అనుభవం లేకుండా వ్రాసిన కవిత్వం కవిత్వమే కాదురా! అంటూ ఆకవిత తీసుకువెళ్లి కమలకి ప్రేమోపహారంగా సమర్పించమన్నాడు.

ఆనందం దాన్ని మంచి లెటరుపేపరుమీద నీలి బోర్డరు వేసి, అందమైన అక్షరాలు ఎర్రసిరాతోటి వ్రాశి దాన్ని తీసుకువెళ్లి ఎవరికీ చూపించకుండా దాచివుంచుకోమని తన ప్రాణప్రియకు యిచ్చి వచ్చాడు.

ఆమె యింట్లోకి తీసుకువెళ్లి, తన అక్కగారికి ఒక్కదానికే చూపిద్దామని కేకవేశి ఆమెకు చూపింది. ఆమె పేరు స్వర్ణలత. పదహారు ఏళ్లు. పెళ్లిఅయింది. ఆమె భర్తృప్రేమలో, రాత్రింబగళ్లు మునిగి తేలుతూవుంటుంది. మనస్సులో పొంగి పొరలుతున్న సంతోషంచేత ఆమె ముఖము ఎప్పుడూ వికశించివుంటుంది. కమలదగ్గరి కొచ్చి ఆకాకితం తీసుకుని చదవటం మొదలుపెట్టింది.

"కమలా! ప్రాణేశ్వరీ! వినుము నా దొక్కమాట."

యీ చరణం చదివి స్వర్ణనిశ్చేష్టురాలయింది. ఆమె ఆకాకితం తిరుగ బోర్లవేశి వ్రాశినవాడి పేరుకోసరం చూశింది. కాని లేదు. కమలను "ఇదెవరు వ్రాశా"రని అడిగింది.

కమల:—ఆనందం యిచ్చాడు.

స్వర్ణ:—ఎవరూ? ఆనందమా!

కమల:—అవును.

స్వర్ణ బుగ్గన చేయిపెట్టుకుని, యిదంతా వాడు నీ కెందుకు వ్రాశాడే?

కమల భయపడుతూ—నా కేం తెలుసును!

స్వర్ణ:—యిది ప్రేమకవిత్వము. మీ యిద్దరూ ప్రేమించుకున్నా రా?

కమల:—ఆనందం ఒకసారి నన్ను ప్రేమిస్తున్నా నని చెప్పాడు.

స్వర్ణ చిరునవ్వు నవ్వి—"సంతోషమే, మంచి మరిదే దొరికాడు" అంటూ తిరిగి చదవటం మొదలు పెట్టింది.

కమలా! ప్రాణేశ్వరీ వినుము నా దొక్కమాట.
నీదు మూర్తినే యదయందు చేర్చినాడ.

ఆ బాలకృత్యం చూసి స్వర్ణ చిరునవ్వు నవ్వు కుంది. "ఆహా! యీ ప్రపంచంలో యింతకంటె మించిన కవిత్వం ఏముంది!" అంటూ విరగబడి నవ్వింది.

ఆ నవ్వు విని యింట్లోంచి తల్లి బయటికివచ్చింది. "ఎందుకే! యింత వగలబడతావు?"

స్వర్ణ ఆవుత్తరం తల్లి చేతికిస్తూ "అమ్మా యిదుగో పుచ్చుకో నీ చిన్నకూతురు మొగుడు వ్రాశాడు. నీవు యింతవరకూ అల్లుణ్ని కుదర్చక పోతే నీ కూతురే కుదుర్చుకుంది" అంది.

'ఇదెవరు వ్రాశారే?'

'అది వెనుక చెప్తానులే, ముందు యిదివిను' అంటూ తల్లిదగ్గిరనుంచి కాకితం తీసుకు చదువుతోంది.

కమలా! ప్రాణేశ్వరీ వినుము నాదొక్కమాట
నీదుమూర్తి! నే యదయందు దాల్చినాడ
స్వప్నశయన జాగరణ మొదలైన వేళలందు
అనుపమంబగు నీమూర్తి మరువకుంటి॥
కంటికిని కూర్కురాదు, వేళ కాకలియుకాదు
నిన్నుచూడనివేళ, అశ్రువులప్రవహింపచేతు
చదువుసంధ్యలమాని, నిద్రకై బడితి నేను
నీసుధామధురమగు, ముద్దుపల్కుల కలిమిలేక॥
నీదుదర్శన ప్రాప్తికై వీధి, వీధుల తిరుగుచుంటి
అన్నిరాగములకు మించిన, ప్రేమానురాగమనుభ
వింప
నీదు చరణసన్నిధివేచి,యుంటినో కమలాలతాంగి
ఎన్నటికైన.........

తల్లి ఆపి—ఎవరురాశారో చెప్తావా? లేదా?

స్వ:—రామారావుగారి ఆనందం.

"ఏమిటే! ఆనందమా! నిన్న మొన్నటి గుంటవెధ వకి అప్పుడే ప్రేమ కవిత్వాలా! ఏమే కమలా?" అంటూ కమలకోసరం వెతికింది.

వ్యవహారం అడ్డంగా తిరుగుతోందని కమల చెప్ప కుండా జారింది అక్కడినుంచి, తల్లివెతికి జామచెట్టు క్రింద పట్టుకుంది.

'ఏమే? కమలా! యిది వాడు నీకెందుకిచ్చాడు?'

'నాకేం తెలుసును?' అంది నిర్ఘాంతపోయి.

'నీకుకాకపోతే మరెవరికి తెలుసునే? ఓసిముద్దా! యిపుటినుంచీ మొగుణ్ని వెతుకుతున్నావుటే? ఏం జరిగిందో! నిజంచెపుతావా? లేదా?'

'ఆనందం యిచ్చాడు. నేనేంచేసేది. నాకింకేమీ తెలియదు.'

'ఉత్తరం యిచ్చి ఏమన్నాడు?'

'మా అమ్మకూ ఎవళ్లకూ మాపించకుండా పెట్టెలో పెట్టి జాగ్రత్తగా దాచుకోమన్నాడు.' అంటూ ఏడుస్తూ తన్నుజామచెట్టుదగ్గిరికి తీసుకెళ్లి తన్నుపెళ్లి చేసుకుంటావా? అని అడగటం ఆదీఅంతా చెప్పింది.

ఆమె తల్లికి కోపంలోనే నవ్వువచ్చింది. ఆఖరికి 'జాగ్రత్తా యికనుంచి ఆవెధవతో మాట్లాడావంటే వీపు చితకేస్తాను.' అని బెదిరించింది.

కమల 'వాడెందుకిచ్చాడే యిది! నేనివ్వమని అడిగానా? నేను వాడితోటి మాట్లాడనే మాట్లాడను' అంది.

కమలతల్లి ఆకవిత్వపు కాకితం తుంపుతుంపుల కిందచింపి పొయ్యిలో వేసింది.

## 3

ఒకకవి చెప్పాడు లెండి—'ప్రేమించేవాడు సుఖం మాట కలలోకూడా తలపెట్టకూడదు. ప్రేమమార్గము నిష్కంటకముకాదు. ప్రేమమార్గమునందలి పథికుడు దుఃఖింపవలసిందే ప్రేమ కేవలము యాతనామయము. అందులో కేవలము కన్నీళ్లే వున్నాయి' ఈమాటలు ఎవరు వప్పుకోరు?

ఆనందరావు తండ్రి రామరావుగారు డాక్టరీ చేస్తున్నాడు. ప్రాక్టీసు బాగావుంది. ప్రొద్దున్నే బయలుదేరి రోగులుని చూడటానికి వెడ్తే అతికష్టం మీద మధ్యాహ్నానికి యింటికి చేరుకుంటాడు.

ఒకరోజున రామరావుగారు భోజనంచేసి గది లోకివెళ్లి నిద్రపోతున్నాడు, బయటగదిలో ఆయన లేచిన వెంటనే మాట్లాడటంకోసరం ఆనందం, శ్యామం వేచివున్నారు. రామారావుగారు లేచి ఫల హారంజేసి మంచంమీద తిరిగి కూర్చున్నాడు. యింతలో అడుగులో అడుగు వేస్తూ శ్యామలరావు లోపలకి వచ్చి 'మామయ్యా! నేను నీతో ఒకమాట చెప్పుకోవాలి' అన్నాడు.

రామారావుగారు ఉత్సాహంతోటి శ్యాములుడి వైపుచూస్తూ 'ఏమిటది?'

శ్యామంగుండెలు దడదడా కొట్టుకుంటున్నాయి. ఎందుకు వచ్చానురా బాబూ అని పశ్చాత్తాపపడుతు నెమ్మదిగా అన్నాడు—'ఆనందం విషయమే నాకు బాగావిచారంగా ఉంది.'

'ఏం ఏమైనా జబ్బుచేసిందా?' డాక్టరుకిముందు రోగంమాటే స్ఫురిస్తుంది.

శ్యామ:—శారీరికరోగంలేదు. మానసికరోగం.

రామారావుగారు సిగరెటు ముట్టించి—ఏమిటీ!

శ్యామ:—వాడు ఒకకన్యని ప్రేమిస్తున్నాడు.

రామా:—ఏమిటీ:—

శ్యామలరావు భయపడుతూ—వాడికి ఒకకన్య మీద ప్రేమకలిగింది.

'ప్రేమా! ఎవరిమీద? ఎప్పుడు కలిగింది? కులాసాగా చెప్పవోయ్ సంగతంతాను.'

శ్యామ:—ఆనందం మనపొరుగునవున్న వెంకటేశ్వర్రావుగారి అమ్మాయి కమలిని ప్రేమించాడు అదే మీతో చెప్పటానికి వచ్చాను. వాడు సుఖపడాలని మీకుంటే, కమలకీ, వాడికీ పెళ్లి చేయాలి.

రామారావుగారు ఆరిపోయిన సిగరెటు పారేసి కొత్తది ముట్టిస్తూ—'ఎట్లా కలిగిందీ?'

శ్యాములుడు తనుచెప్పింది విని మామ సంతోష పడి అడుగుతున్నాడని ఉత్సాహంతో 'ప్రేమ ఎట్లా కలిగిందో నేను చెప్పలేను. కాని యిద్దరూ ఒకరి నొకరు ప్రేమించుకోవటం మాత్రం నాకు తెలుసును.' అన్నాడు.

అయితే! పెళ్లిచేసుకుంటానంటాడా?

శ్యామం నేలవైపుచూస్తూ నెమ్మదిగా నెమ్మదిగా—అదే ప్రేమయొక్క స్వభావపరిణామము. 'నేను కమలని పెళ్లిచేసుకోకపోతే నాజీవితం శ్మశానతుల్యం అవుతుంది' అంటున్నాడు ఆనందం.

రామా:—ఓహో స్మశానమా? ఏదీ! వాడిని ఒక సారి రమ్మనిపిలువు?

శ్యామంలేచి గదిలోకివెళ్లి ఆనందాన్ని పంపాడు. ఆనందం వెళ్లేటప్పుడు శ్యామాన్నికూడా తోడు రమ్మన్నాడు గాని ఒంటరిగా మాట్లాడితే బాగుంటుం దంటూ శ్యామం లోపలికివెళ్లకుండా బయటనే నుంచున్నాడు.



శ్రీమతి హీరావతీ బెన్ మన్‌సుఖ్‌లాల్.

బొంబాయి





కీ॥ శే॥ డా॥ యు. అభయాంబాళ్,

యం. ఎ. పిహెచ్. డి.

ఆనందం గదిలోకి వెళ్లాడు నెమ్మదిని నెమ్మదిగా రామారావుగారు అద్దంయెదట నుంచుని మీసాల్లోంచి తెల్లవెంట్రుకలు పీకటానికి ప్రయత్నిస్తున్నాడు. యింతలో ఆనందం రావటంచూసి, యిటు తిరిగి నీ పరీక్షలింకా ఎన్నాళ్లున్నాయిరా?

ఆనందం:—యివ్వాళకి పన్నెండు రోజులున్నాయి.

'నీచదువు ఎట్లావుంది?'

'బాగానే చదివాను'

'శ్రద్ధగా చదువుతున్నావా? ఆడుతున్నావా?'

'లేదు! ఆడటంలేదు.?

'అయితే మరేంచేస్తున్నావు? యీ మధ్యనువ్వు ప్రేమపాఠాలు చదువుతున్నావుట గాదూ?'

అతడి ఆగ్రహంచూసి ఆనందరావు వణికిపోయాడు.

రామారావుగారు నెమ్మదిగా దగ్గిరికొచ్చి ఎడమచేత్తో ఆనందం కుడిచెవ్విపట్టుకుని,—ఏం! జవాబు చెప్పు?

ఆనందం మాట్లాడబోయాడుగాని మాట నోట్లోంచి బయటికి రాలేదు. తండ్రిగారి కళ్లు ఎర్రబడ్డాయి! పళ్లుకొరుకుతూ—'స్టుపిడ్, రాస్కేల్!! పరీక్షలింకా పదిరోజులుంటే, చదువుకోవటం మాని లవ్ (love) అంటూ మొదలుపెట్టావురా?' అంటూ చెంప పగిలేటట్టు టపటపా లెఖ్ఖలేనన్ని లెంపకాయలు కొట్టాడు.

అప్పటికి శ్యామంలోపలకి రావటానికి అడుగు పెడ్తున్నాడు. యీ దెబ్బలు వినేసరికి మాయమయి పోయాడు.

ఆనందం ముఖం చేతుల్తో కప్పుకుని, ఏడుస్తున్నాడు.

రామారావుగారు కుర్రాడిని వదిలి మంచంమీద చతికిలబడి,—ఇప్పటికి పదిరోజుల్నుంచి చూస్తున్నాను. ఒకటే గుసగుస. ఊళ్లేలటానికా దండెత్తటానికిరా? ఓరి వెధవా! ఓరిదొంగా! మాదర్ఫోర్డ్. యిప్పటినుంచీ పెళ్లికావాలేం? నీకు పెళ్లికాకపోతే నీ జీవితం స్మశానం అవుతుందీ? ఈ మాట లెవరు నేర్పారురా? యింతవాడవయ్యావు చదువుకు వృద్ధిలోకివచ్చి సంపాదించుదాము అనేంలేదూ? పెళ్లి కావాలా యిప్పుడు? నేను ప్రొద్దుటినుంచి సాయంత్రంవరకూ, రోగుల నాడులు చూస్తూ కొంపలవెంట తిరగటమా? నీకు చదువుకు వృద్ధిలోకి వద్దామనే ఆలోచనేమీలేదూ? నాకొడుకు ప్రేమపాఠాలు చదువుతున్నాడయ్యా! ఈ ప్రేమ కూడుపెట్టుతుంది. యీ వెధవకి ఈ శ్యామం కాలేజిలో చదువుకు యింత సన్యాసి అయ్యాడనుకోలేదు. యీ వెధవవద్ద ఆ వెధవ వకాల్తా పుచ్చుకొచ్చాడు. పో! యిక్కడినుంచి పరుగెత్తు!! ఇంకెప్పుడైనా యిల్లాచేశావంటే, మెత్తగా చితుకతంతాను పో!

ఆనందం ఏడుస్తూ బయటికి పోయాడు.

డాక్టరుగారి చికిత్సకు ఫలితం వెంటనే కనుపించింది. ఆనందంకూడా మంచి కుర్రాడేనని చెప్పాలిలెండి. నవలలు చదివి వాడు చెడిపోయాడేకాని, నవలల్లోలాగ సన్యాసయి యిల్లువదలి పోలేదు. విషం తిని చావాలేదు. ముఖ్యంగా కమల పెళ్లిలో ఫలహారాలబుట్ట ఖాళీచేశాడు. దాంతో అజీర్ణంచేసి వారంరోజులు స్కూలుకు నాగావేశాడు. శ్యామంవెళ్లిపోవటంవల్ల, ప్రేమ ఆదర్శమునుంచి పడిపోయినందుకు ఎవరిముందూ, జవాబుచెప్ప నక్కరలేకపోయింది. ఆనందరావు యిప్పుడు ప్రేమ పదాలు మాని, పాఠాలు శ్రద్ధాభక్తులతో చదువుతున్నాడు.

# "దేవీ జోన్"

శ్రీమతి యేర్లగడ్డ చిలకమ్మ గారు

ఫ్రాన్సుదేశమున "లోరైన్" భాగమందలి "డుమరిన్" యను గ్రామమున 1412వ సం॥లో ప్రసిద్ధిచెందిన "ఆర్కు" వంశమునందు నొక సామాన్య క్రైస్తవ కర్షకునింట, దాస్యశృంఖలాబద్ధమైన ఫ్రాన్సును విముక్తి గావించుటకై "జోన్ ఆఫ్ ఆర్కు" లేక స్వాతంత్ర్యమూర్తి జన్మించెను. యీయామె "జెకోయెస్ అర్కు" యను క్రైస్తవకృషీవలుని కొమరిత. "యిసాబెల్లా" యను క్రైస్తవయువతి యీయామె మాత. జోన్‌కు ముగ్గురు సోదరులును, యొక సోదరియు యుండిరి. యీయామె వయస్సునకు యందరికన్న చిన్నది. కాని భావములకును, పనులకును ఫ్రాన్సుజను లందరికన్న పెద్దయనియే ఘంటాపథముగ చెప్పవచ్చును. క్రైస్తవ మతావలంబకులచే యీయామెకు "జోన్" యను నామంబు పెట్టబడియె. జోన్‌కు యింకను చాల పర్యాయ నామములు గలవు.

యీయామె చిన్ననాటినుండియును శక్తిస్వరూపిణి. స్వార్థత్యాగిని. స్త్రీలతో కలసి గృహములయందలి పనులను, పురుషులతో కలసి పొలములయందలి పనులను నెరవేర్చుచుండెడిది. దేవీజోన్ తరచు వీరచరిత్రలు వినుటచే యీయామె హృదయక్షేత్రమునందు వీరత్వాంకురము మొలకయెత్తి, నానాటికి వృద్ధిచెందెను. యీయామె వయస్సు వృద్ధియగుకొలదియు జోన్‌కు స్వాతంత్ర్యకాంక్ష పెచ్చు పెరుగుచుండెను. "పువ్వు పుట్టగనే పరిమళించు"నను చందమున యీయామె చిరుతప్రాయమునుండియును, దీన నిరుపేదలకు శక్తికొలదియు సహాకార మొనర్చుచుండెడిది. గ్రామమునం దెవరికైన వ్యాధి గలిగిన తత్‌క్షణమే యదో్ట్చటి కరిగి వారి కుపచారముచేయును. పాశ్చాత్యదేశములందిట్టి దయార్ద్రహృదయులు, కోమలస్వభావులు తక్కువగనేయుందురు. అప్పు డాగ్రామములో నొక్కటేనియు విద్యాలయము లేకుండెను. యిక్కారణమున నాయామెకు విద్య నభ్యసింప నవకాశములేకపోయెను. కాని యీయామె విజ్ఞానదీపిక.

దేవీజోన్ ప్రకృతి సౌందర్యమును చాల ప్రేమించుచుండెడిది. యల్పవయస్సుననే నేకాంతానురాగమును, సంసారికవిషయములపట్ల నుదాసీనతయుగాంచి తలిదండ్రులాయామెను తిరస్కరించుచుండిరి. జోన్‌కు

వివాహము చేయవలెనని వారు పలుపాట్లు పడిరి. కాని యామె వివాహము చేసుకొనుట కంగీకరించకపోయెను.

జోన్‌యొక్క యసామాన్య సౌందర్యమును, పవిత్రచరిత్రయును, కోమలస్వభావమును, విమలభావమును, యా గ్రామము నందలి నవయువకుల హృదయముల నాకర్షించెను. యెందరో యువకు లామెను వివాహమాడి సఫలమనోరథులగుటకు సంసిద్ధులైరి. జోన్ ఆజన్మము బ్రహ్మచర్య వ్రత మాచరింప నిచ్ఛగించుటచే వారు భగ్నమనోరథులైరి. ధనమదాంధుడగు యొక యువకుడు, జోన్ తనతో వివాహ మాడెదనని ప్రతిజ్ఞ చేసినదని నేరారోపణ చేసెను. కోమలస్వభావయగు జోన్ యీ యభియోగము మిథ్యాకల్పితమైనదని వాదించక, గృహస్థధర్మము స్వీకరించునని గ్రామీణులందరును తలంచిరి. కాని యామె విచారణాలయమునకు జని న్యాయమూర్తి సమక్షమున గంభీరముగ నుడివెను. "నా యిచ్ఛారహితముగనున్న యీ యభియోగము మిథ్యాకల్పితము. నే నెప్పుడు నేరితోడను వివాహప్రతిజ్ఞ చేసియుండలేదు. నా యీ సత్యవాక్కులను విశ్వసించక, యెట్టి కఠినదండన విధించినను, యనుభవించుటకు సంసిద్ధురాలనే! తుదకు వురికంబము నెక్కుటకు సైతము." ఆమె యెంతటి గంభీరహృదయురాలు. తన యభీష్టసిద్ధికి ప్రాణమును తృణప్రాయముగ తలంచి, వురికంబము నెక్కుటకు సంసిద్ధురాలైనది. న్యాయమూర్తి యామె వాక్యములను విశ్వసించి, యభియోగము త్రోసివేసెను. యిక నేమి? యామె సంకల్పము దృఢమయ్యెను. స్వదేశీయుల నుద్ధరించు కోర్కె ప్రబలమయ్యెను.

ఫ్రాన్సునంతను యాంగ్లేయులు యాక్రమించుకొనిరి. వారుచేయు యత్యాచారములకు సహించలేక, పర్వతగుహలలో, యరణ్యములలో దాగుకొనుచుండిరి. ఆంగ్లేయు లెంతటి నిరంకుశులో, యెంతటి రక్తపిపాసులో, యెట్టి క్రూరులో యను విషయము మన కనుభవమేగదా! యింక వారికి శీకరప్రదేశములయం దుండుటయే జీవరక్షణోపాయము. అదియే శరణ్యము. వేసవికాలపు మార్తాండునివలెనే యాంగ్ల సైనికులు జనులను హింసించసాగిరి. గ్రామములను దోచుకొన దొడగిరి. ఫ్రాన్సుదేశమంతయును హాహాకారములు చెలరేగెను. దైన్యపీడితులును, పతితులునగు స్వదేశీయుల బాధలు "జోన్"కు దుర్భరముగ గన్పట్టెను. పీడితజనుల నుద్ధరించుటకు పదునారు వత్సరముల వయస్సుననే జోన్ హస్తమునందు ఖడ్గము బూనెను. యేదేశమైనను యుద్ధమువలననే విముక్తి గాగలదు. శాం

తమువలన గాని సత్యమునలన గాని విముక్తి గావింపవలయునని తలంచుట మూర్ఖత్వ మనియే చెప్పవచ్చును. విప్లవమొనర్చియే గదా, రష్యనులు తమ దేశమును దాస్య విముక్తి గావించికొనిరి. రణరంగమున దుమికియే కదా, దేవీజోన్ తన దేశమునందలి పీడితప్రజల నుద్ధరించినది. యామె హృదయమునందలి వీరాంగనోచితసాహసము, వీరత్వము, పట్టుదల, సహనశక్తి మొదలైనవి వర్ణనాతీతము.

జన్మభూమియొక్క యీ హీనచరిత్ర యామె హృదయమునందు కంటకముగ కన్పట్టెను. "యెట్లు పతితులగు యీజనులు నాంగ్లసైనికగణముల యత్యాచారమునుండి తప్పించుకొందురు. యెట్లు ఫ్రాన్సు యీ దాస్యశృంఖములనుండి దూరమగును" యను విషయమునే జోన్ రాత్రింబవళ్లు యాలోచింప నారంభించెను.

జోన్ తండ్రి ధర్మపరాయణుడు. యెల్లప్పుడు జోన్ నోటినుండి యుద్ధసంభాషణలే వెలువడుచుండెను. ఆయన జోన్‌ను తిరస్కరించుచు కర్కశస్వరమున నిట్లనెను. "యెప్పుడైన నీ నోటినుండి, యుద్ధమునుగూర్చి మాట వెలువడెనేని నిన్ను చంపెదను." తండ్రి వృద్ధుడగుట గాంచి జోన్ చింతాకులస్వాంతయయ్యెను. ఒకవైపున కఠోరశాసనము. రెండవవైపున పరాధీనురాలగు స్వదేశమాత యాహ్వానము. ఈ పరస్పర విరోధభావ యీ ఘాతప్రతిఘాతములవలన, యామె హృదయసరోజము ముకుళించసాగెను. పితృభక్తికన్న, లక్షోపలక్షుల దేశీయులను రక్షించుటయే గురుతరకార్యమని యామె తలంచెను. దేశమాత యాహ్వానమే యంగీకరించెను.

తండ్రి యిచ్ఛకు విరుద్ధముగ యుద్ధమునకు బోవుట తప్పని తలంచి యుక్తితో గృహత్యాగ మొనర్చెను. "ఎంబ్రెలాగ్జరు" యను నాతను యామె పినతండ్రి. ఆయన భార్య జబ్బుపడెను. యామె సేవచేసెదనని తండ్రి యాజ్ఞానువర్తినియై, పినతండ్రి గృహమున కేగెను. ఆయన సరలస్వభావుడు. తన యభిప్రాయము పినతండ్రికి విన్నవించెను. ఆమె సంకల్పము విని ఆయన యపరిమితానందభరితు డయ్యెను. మరియు శక్తికొలదియు సహకార మొనర్చెదనని ప్రతిన చేసెను. వేకులియర్సుకు శాసకుడగు "బ్రాడీకోర్టు" దగ్గరకు యామె పినతండ్రిని తన సంకల్పము విన్నవింప పంపెను. కాని నిరంకుశశాసకుడు సామాన్య కర్షకకన్య సందేశము, వున్మత్తప్రలాపముగ దలంచెను. ఆమెకు తెలియజెప్పి తండ్రికడకు పంపివేయవలయునని యాజ్ఞాపించెను. పినతండ్రి ముఖమున శాసకుని ప్రతికూలవాక్యములు విని జోన్ చింతితయయ్యెను. కాని యామె

నిరాశచెందలేదు. పినతండ్రిని వెంట నిడికొని జోన్ కాలినడకనే శాసకునికడ కేగెను. శాసకుని సమక్షమున "ధర్మయుద్ధమున వెనుకంజ వేయకుడు" యని విన్నవించెను. కర్షక బాలికయగు జోన్ ముఖారవిందము తిలకించి ఆయన యాశ్చర్యమగ్నమానసుడై యిట్లు నుడివెను. "రాజు సర్వస్వతంత్రుడు. నిరంకుశాధికారి. రాజ్యాంగకార్యములందు నా యిష్టానిష్టములతో బనిలేదు." శాసనకర్త జోన్‌కు సంబంధించిన విషయములను వ్రాసి "డ్యూక్ ఆఫ్ లోరెయిన్" వద్దకు పంపెను. జోన్‌కూడ నాతనికడ కేగెను. యామెనుగాంచి డ్యూక్ ప్రసన్నచిత్తుడయ్యెను. ఆమె నిస్వార్థమును చూచిన వెంటనే యాతని హృదయము కంపించెను.

ఖడ్గము ధరించి, యశ్వము నధిరోహించి దేవీజోన్ "వేకులియర్సు" నగరమునకు పయనమయ్యెను. యామెను పరీక్షించుటకై రాజు ఛద్మవేషమును ధరించెను. వెంటనే ఛద్మవేషియగు రాజును "ఓ రాజా, వీరునివలె ఖడ్గముబూని రీమ్సు నగరంబునకు ప్రయాణము కండు" యని సంబోధించెను. యీామె శక్తినిగాంచి రాజు చలించిపోయెను. గొప్ప గొప్ప రాజనీతిజ్ఞుల మొదలైనవారి యభిమతమును తెలుసుకొనక ముందే,యుద్ధమునకు వెడలుట యుచితముకాదని తలంచి రాజు యామెను "పోటియర్సు" నగరమునకు బంపెను. అక్కడ మహాసభ సమావేశమయ్యెను. రాజనీతిజ్ఞులు మొదలైనవారా సభయందు భరితులైరి. వా రామెను ప్రశ్నించి చూచిరి. జోన్ ముఖమునుండి గంభీరోపన్యాసము విని వారు కదళీతరువుల చందమున స్తంభితులైరి. సభ్యులందరును జోన్‌కు యనుకూలురైరి. మరియు జోన్ విషయమై వారు రాజుకడ కిట్లు వ్రాసి పంపిరి. "జన్మభూమి నుద్ధరించుపట్ల స్త్రీ కూడ పురుషవేషము ధరించి యుద్ధము చేయుట కధికారిణియైయున్నది." యిట్లే యనుకూలపత్రములను చూచి రాజు స్వయముగ నామెను పరీక్షించెను. ఆమె స్వార్థత్యాగము, దేశభక్తి, మొదలైనవి గాంచి రాజు యుద్ధమునకు బంప నిశ్చయించెను. రాజు జోన్‌కు కొలదిదినములలోనే యుద్ధవిద్యలన్నియును నేర్పించెను. ఆమె మాతృదేశ కల్యాణయజ్ఞమున ఆత్మ నాహుతి చేయ సంసిద్ధురాలైనది. ఆమె కార్యదీక్ష యెంతయును కొనియాడదగినది గదా!

ఆంగ్లేయులు ఆక్రమించుకొనిన "ఆర్లిన్స్" నగరోద్ధారణకై, యా నగరమునకు ప్రయాణమయ్యెను. వృథాగ హత్యలు యొనర్చి, రక్తవాహిని ప్రవహించు టామె ప్రకృతికి విరుద్ధము. అంగ్లసేనాధిపతియగు "డూనియస్" వద్దకు సంధిపత్ర మంపెను. మదోన్మత్తుడగు సేనాధిపతి యా సంధిని

నిరాకరించెను. వెంటనే యుద్ధమొనర్చి "అర్లిన్సు"ను దాస్యవిముక్తి గావించినది. యీమె వీరత్వము వర్ణింప నేరితరము?

"అర్లిన్సు" నగరమున రాజును ఫ్రాన్సు సింహాసనమున ప్రతిష్ఠించెను. తరువాత జోన్ స్వగ్రామమునసున్న తలిదండ్రులకడకు బోవ నిశ్చయించుకొనెను. వీరాంగనయగు జోన్ లేనిచో సేనయందుత్సాహహీనత గలుగునని తలంచుటచే, యీమె కోరిక రిత్తపోయెను. తిరిగి పారిస్‌నగర యుద్ధములో దేవీజోన్ వోడిపోయెను. యీమె జీవితములో ఓటమి కిదియే ప్రప్రథమము. జోన్ శత్రువుల హస్తగతమైనది. జోన్‌ను కారాగారమం దుంచిరి. జైలునందు క్రూర యాంగ్లేయులు, యీమెకు యొనర్చిన యత్యాచారములు వర్ణనాతీతము. తుట్టతుదకు "కచన్" మొదలుగాగల న్యాయవాదులు విచారణాంతము మరణశిక్ష విధించిరి. గంభీరహృదయయగు దేవీజోన్ సజీవముగ నగ్ని కాహుతియయ్యెను.

బానిసత్వాంధకారమునుండి బయల్పడ యత్నించుచుండు భారత నారీమణులకు "జోన్ ఆఫ్ ఆర్కు" యీమె మార్గదర్శిని. స్వాతంత్ర్యము గోల్పోయి, పురుషులచే నబలలని పిలువబడుచున్న నారీమణులకు మణి. దేశసేవాతత్పరులకు పథిక. ప్రపంచ బలిదానములకు సాటి. స్వార్థత్యాగము, ధైర్యము, సాహసము, పట్టుదల, దేశాభిమానము, శాంతము, దయ, యాత్మ బలిదానము మొదలగు యాదర్శభావకిరణములచే ఫ్రాన్సును ప్రకాశవంత మొనరించిన దినమణి. స్త్రీల నబలలను పురుషులకు యీమె చరిత్ర తలవంపు గలుగజేయును. యీమె చరిత్ర పఠించిన యాంధ్రనారీలోకము, దేశదాస్యము బాపుటకు నిజకర్తవ్యము గ్రహించుటయే గాక, ఆయుధ పోరాట నేర్పరులగుదురనియే నేను విశ్వసించుచున్నాను. దేశకల్యాణమే జోన్ సుఖము. ఫ్రాన్సు బానిసత్వమునుండి విముక్తియగుటయే యీమె బంధనవిముక్తి. ఈమె చరిత్ర జ్ఞప్తికి వచ్చినపుడు హృదయములలో యాదర్శభావములు గలుగును.

# ఎప్పటి కప్పటికి సంశయమే !!

'చిత్ర రేఖ'

సుశీల పాపము దురదృష్టవంతురాలు. కాకపోతే తండ్రి చిన్నతనంలోనే పోయె. తల్లి పేరమ్మ ఆవక్కగాని వక్కకూతురిని పెంచి పెద్దదాన్ని చేసి-ఊరూ ఉహామూ గావించి-అందగాడని-చిన్నవాడనీ-బి యే. ప్యాసైనాడనీ, అన్నిటికీ పైగా పిల్లకు నచ్చాడని-రామనాథాన్ని తెచ్చి పెండ్లిచేసి యిల్లటం ఉంచుకుంటే-అతడూ సుశీలప్రాణముదు పైనా (గాజులు తొడిగించడమైనా) చూడకుండానే గతించిపోయె. పోనీ మగకూన పుట్టాడు ఉద్ధరిస్తాడనుకుంటే, వాడు పుట్టుకతోనే గుడ్డిపిల్లవాడాయె. ఇంకా 18 సం॥రాలైనా దాటలేదే! సుశీల ఎల్లాయీదుతుందో ఈ దరిలేని దుఃఖసాగరమున ఎన్నాళ్లనుభవించాలో ఈ కడగండ్లన్నీ! అయితే, గుడ్డిలో మెల్లన్నట్లు,—తల్లీ కూతురూ, 'అయ్యా బువ్వ అమ్మా బువ్వ'అని కన్నవాళ్ల కాళ్లా వేళ్లాబడి దేభిలాడ నవసరంలేకుండా, ఎక్కువలేకపోతే మానె, నాలుగువేళ్లూ నోట్లోకి పోయేమాత్రం ఏర్పరిచి పోయినాడు పేరమ్మభర్త, బ్రతికిన నాలుగురోజులూ, ఫెళ్లుమని ఇన్‌కంటాక్సు తాసిల్దారీ చేసి. మొదట గుటకలుమింగారు గాని దాయాదులు అదిలించి బెదిరించి ఏదోఇద్దరికీ యింతభరణం యేర్పాటు చేసి అది శాస్త్రా కాజేతమని—దౌహిత్రుడు కలిగి వాళ్లనోట గడ్డకొట్టాడు. తమఖర్మంకాలితే తమకూ అదేఅవస్థ అనే సంగతి మరచి—దగ్గరదాయాదుల పెళ్లాలు కొందరు 'అడకుంక పుట్టకూడదూ, పోనీ ఆ పుట్టిన కుంకైనా పురిటిలోనే-"అని రహస్యంగా నన్నా వినుక్కోని దీవించారు.

ఏమైతే నేమి—ఇల్లు చక్కపెట్టుకపొయ్యే పెద్ద దిక్కు తల్లిఉండడంచేత—సుశీల, గుడ్డివాడైనా—కాకిపిల్ల కాకికిముద్దు గదూ !—ఆకూనతోనే, అదే లోకంగా, ఒకవిధాన దిగులు తోసేసుకుని కాలం గడుపుతున్నది. ఈశ్వరుడా గవ్వంతదృష్టి కొరవ చేశాడే గాని—సుశీలబిడ్డకేమి, అందాలకొవ. పెరిగేకొద్దీ చూచినవాళ్ళందరూ, 'అంతా రామనాథమే అమ్మా—అయినా మూడు—ఆకళ్లు, ఆనవ్వు—ఆనొసలు—' అని అయారూపురేఖవిలాసాలు వివరించి వర్ణించి చూపిస్తుంటే—సుశీలకు సిగ్గు, దుఃఖం, ఆనందం, కలిసి హృదయం పిడిచివేస్తుంటే—ఊరి కారేకన్నీళ్లను, మొగమవతలికి త్రిప్పి—సాధ్యమైనంతమటుకు తుడిచివేసుకుంటుంది. అప్రయత్నంగానే, 'అమ్మ' 'అవ్వ' 'బాబు' 'బువ్వ' అనే మాటలు వచ్చాయి పిల్లవాడికి. పిదప చెప్పినమాటలు పలుకనేర్చిన రోజుల్లో—సుశీల ఎన్నోమాటలు నేర్పింది. ఎవరైనా అన్నా లేకున్నా, పంజరంలో రామచిలకవలె—మురళీధరుడు—(సుశీల అల్లా అని పేరుపెట్టుకున్నది కుర్రవాడికి) పలుకుతుంటాడు. మేడమీద గదిలో ఎవ్వరూలేకుండా చూచి పొంగి వస్తూన్న దుఃఖాన్ని ఉగ్గపట్టి సుశీల పిల్లవాడికి 'నాన్న' 'నాన్న' అని చెప్పేది. వాడు ఆమాట తీర పలికినప్పుడు పట్టువీడిన దుఃఖాతిశయంచేత మైమరచి వాణ్ణి ఊపిరాడకుండా రొమ్మున అదుముకొని గద్గద కంఠంతో ఏమేమో పలవించేది. దోగాడ నేర్చి నాలుగువైపులా పాకులాడుతుంటే—ఏమి నెత్తినతోసుకుంటాడో అని కన్నులలో వత్తివేసుకొని కనిపెట్టి ఉండేది. పిదప వ్రేలుపట్టి నడవ నేర్పుతూ, నేర్పినా యీ పట్టి నడిపించడం తప్పదు గదా అని చింతించేది. మరికొంత ఊహవచ్చి—వాడు ఆయావస్తువుల ఉపయోగమెరిగి, రస, గంధముల

మాత్రము గ్రహించి, స్పర్శవల్లనే గుర్తింపగల్గి—రూపు నిరూపింపలేక—'అదేమిటి' 'ఇదేమిటి' 'అంటే' అని ప్రశ్నపరంపలగురిపిస్తుంటే—సుశీల నోరు నొప్పిపుట్టేంతవరకు చెప్పి—తుదకు నిరుత్తరై కళ్ల నీరు కారుస్తూ ఉండేది. పిల్లవాడు తడివిచూచి చూచి 'అమ్మా' ఏడుస్తున్నా? ఎందుకే? అని అడిగే సరికి ఇంతదుఃఖం గుటుక్కునమ్రింగి 'లేదునాయనా' అని పసపసముద్దుపెట్టుకొని—వాడితోపాటు తానూ వేరే దోరణిలోకి తొలిగేది. అయితే, ఎంతతొలగదోతామన్నా, మొగాన వ్రేలగట్టినట్లుండేది వాడి గ్రుడ్డితనమనే ప్రత్యుత్తరంలేని ప్రశ్న. ఆంధ్రగీర్వాణములలో చక్కని విద్యావతియైన సుశీల 'చ్యవనుడికి దృష్టిప్రసాదించిన అశ్వినీ దేవతలు ఈ కలికాలంలో లోకసంచారం ఏలచేయరో అని చింతించేది. 'ధృతరాష్ట్రునకొక్క తృటికాలమైనా దృష్టిప్రసాదించిన శ్రీకృష్ణభగవానుని కృపఉంటే, మావాడికీ దృష్టి రాదా' అని ఆశించేది. పురుషప్రయత్నం లేనిది దేవతలుమాత్రం ఏంచేస్తారు అని వితర్కించుకొనేది. ఆ పురుషప్రయత్నానికి మార్గమేదీ అని దిక్కులన్నీ చూచి దిక్కుగానక—నిస్పృహచెందే పిల్లవాడికి విద్యాభ్యాసకాలం వచ్చినతర్వాత ఎల్లాగో తానే—వాచా సామాన్యజ్ఞానం కలుగజేసింది. అయితే, వీనికి దృష్టివచ్చే ఏర్పాటు ఏమన్నాఉన్నదా అనే నిరంతరమూ అన్వేషిస్తూ ఉన్నది సుశీల. తాము కాపురమున్న కాకినాడలో క్రొత్తగా ప్యాసైవచ్చిన కండ్ల డాక్టర్ల కెందరికో చూపించింది. వాండ్లుచూచి, పుట్టుకలోవచ్చిన గుడ్డితనానికి మందులేదని చెప్పారు. సుశీల కెంతనిస్పృహగాఉన్నా, ఎక్కడిదో రవ్వంత ఆశ మినుకు మినుకుమంటున్నది. అది ఫలానాఅని నిరూపించలేకుండా ఉంటున్నది. ఆమె, వ్యాసంగం కోసరము, పిల్లవాడు కాస్తతీరికకలుగచేసినపుడు చదవడానికి ఆంధ్రాది పత్రికలు తెప్పించి చదువుతుండేది—నిరంతరము అభివృద్ధినందుతూన్న విజ్ఞాన శాస్త్రము,ఆవైజ్ఞానాధికులునానాటికికనిపెడుతూన్న విశేషాలు చూచేది. ఏమో పుట్టుకలోవచ్చిన గ్రుడ్డితనముకూడా మాన్పే ధన్వంతరి పుట్టగూడదా అని ఆమె ఆశాంకురము.

వకనాడు ఆంధ్రపత్రికలో ఇలాంటిసంగతి కన్పించింది: ఎవ్వరో పంజాబులో డాక్టరు ఖండాంతరాలన్ని తిరిగి కండ్లవైద్యం నేర్చుకున్నాడనీ, జర్మనీలో పదియేండ్లుండి పరిశోధనచేసి, ఎల్లాంటి గ్రుడ్డితనమైనా పోగొట్టే సాధనాలు విధానం కనిపెట్టాడనీ, పుట్టినదిమొదలు ప్రపంచమే చూడని వక తొంభైసంవత్సరాల ముసలాయనకు చికిత్సచేసేసరికి పుచ్చపూలవలెకళ్లువిప్పి చూచాడనీ అందులోఉంది. ఆ వృత్తాంతము చూచేసరికి సుశీల కెవ్వనకేక వేసింది. పరుగెత్తుకవెళ్లి పేరమ్మతో చెప్పింది అమ్మా, 'అబ్బాయికి కళ్లువస్తయే' అని. ఇద్దరూ ఎంతో సంతోషించారు. మురళీధరుడుకూడ పన్నెండుసంవత్సరాలవాడై, అప్పుడప్పుడే తెలుసుకుంటున్నాడు తనకు 'కళ్లు' అనే వకఇంద్రియము లేదని, అందుచేత ప్రపంచంలో 'చూడడం'అనే వకవ్యాపారం తాను చేయజాలడనీ, అది పుట్టి బుద్ధెరిగి ఎన్నడూ అనుభవించి ఉండకపోవడంచేత ఊహా ప్రపంచంలో నన్నా, నిర్ణయించుకోడం కష్టమనీ వాడీ మాటవినే సరికి తనకు కళ్లువచ్చినట్లే సంతోషించాడు; వాడు సకల సంబరాలతో సుశీలవద్దకు వచ్చి 'అమ్మా! కళ్లు వస్తే నిన్ను చూస్తాకదూ! అన్నాడు—భూదేవి తన గర్భగోళంలో మహారత్నాన్ని దాచిఉంచేట్లు, ఎన్నాళ్లనుంచి దాచి ఉంచాడో మురళీధరుడీ మధురభావాన్ని, తనహృదయకుహరంలో? ఆమాట వినేసరికి, సుశీల కరిగి నీరైంది. ఆమె, తనకోమల బాహువల్లరుల మురళీధరుని మెడకు పెనవైచి, దగ్గరకు దీసి ముద్దుపెట్టుకొని గద్గదికంతో 'మానాయన చూస్తావురా! నన్నేకాదు బా అమ్మనుకూడా' అన్నది. అమ్మా కూతుళ్లిద్దరూ, పంజాబులోఉన్న డాక్టరు మనకెలా దొరుకుతాడని కొంతసేపు యోచించారు. పదిగాని పాతికగాని అవసరమైతే పంజా

బుకే వెళ్లుదామని ఆలోచించారు. ఆంధ్రపత్రికలో దొరికినంతవరకు ఆడాక్టరుగారి వివరాలు కనుక్కొని—మిగత వివరాలకనుక్కొను వారికు త్తరం వ్రాయడం మంచిదనుకొని—ఇంటిడాక్టరు శ్రీనివాసరావుచే వ్రాయించారు. నాలుగురోజుల్లో జబాబువచ్చింది. ఆత్రంతో తెరిచి చదివింది, సుశీలే ఇంగ్లీషులోఉన్న ఉత్తరం చదివి భాషాంతరీకరించి చెప్పేంతవరకు ఓపికలేక—తనకు తెలిసేట్టు చెప్పమని పేరమ్మ తొందరించింది. ఉత్తరం చదువుతుంటే సుశీల మొగం క్రమంగా తెల్లబడ్డది. ముగిసింతర్వాత అప్రయత్నంగా ఆ ఉత్తరం జారి క్రిందబడ్డది. నిలిచి ఉన్నసుశీల కుప్పగూలి గుంజను జేరగిలింది. 'ఏమే అమ్మా? ఏమే' అని తల్లి దగ్గర చేరి అడిగితే ఏమో చెప్పబోయింది గాని మాటలు తడబడ్డయి. కొంత సేపటికి స్థిమితం తెచ్చుకొని ఉత్తరంలో వివరం చెప్పింది. 'పుట్టుకలో వచ్చిన గ్రుడ్డితనమైతే నేను కుదర్చలేను. అయితే, పుట్టినప్పటినుంచి గ్రుడ్డివాళ్లైనా, అవంతా పుట్టుగ్రుడ్డిలో చేరికగాదు. ఏ కొన్ని నిమిషాలైనా దృష్టిఉండి పోయిఉండవచ్చు. కాబట్టి గర్భంలోనే, ఆ యింద్రియం లుప్తమైనట్లైతే నే కుదర్చలేనుగాని మిగతా వన్నీ కుదురుస్తాను.' అని ఆడాక్టరు వ్రాశాడు. ఇంకేమున్నది? సుశీల ఆశలన్నీ అడుగంటినయి.

మళ్లీమళ్లీ ఆ ఉత్తరం చదువుకున్నది. మురళీధరుడికి గర్భంలోనే దృష్టినశించిందో, లేక జననానంతరము ఏకొన్ని నిమిషాలకో పోయిందో ఎవరు చెప్పగలరు. మొత్తానికి పుట్టినప్పటినుంచీ గ్రుడ్డివాడే. పోనీ ఆపంజాబు డాక్టరుగారే చూచి చెప్పగలరేమోనని ఒకయోచన తట్టింది. సరి, మళ్లీ ఉత్తరం వ్రాయించారు. పంజాబు డాక్టరు అది అసాధ్యమని—చికిత్సచేయిస్తే—కొంతకాలానికి రావచ్చనీ-ఆరావడం, రాకపోవడాన్నిపట్టే పుట్టుగ్రుడ్డి అవునా కాదాఅని చెప్పవచ్చునని వ్రాశాడు. ఇంతప్రయత్నం చేస్తేతుదకు ఏమౌతుందో తెలీదు. ఇంకోసంగతి కూడా వ్రాశాడు. పుట్టుకలో లేనిగ్రుడ్డితనం పోగొట్టి—దృష్టితెప్పించడమే తనపనిగాని అది ఎప్పుడు వస్తుంది యెంతకాలము నిలిచి ఉంటుంది అనే దానికి తాను కర్తను కానన్నాడు. ఇంత సంశయాస్పదమైన వ్యవహారములో ఏమిచేయ్యాడమో సుశీలకు పాలుపోలే. తుదకు ప్రయత్నంచేయడమే కర్తవ్యమని యనుకున్నది. మళ్లీ పంజాబుఉత్తరం వ్రాయించింది అక్కడికి వస్తున్నామని. ఆడాక్టరుకూడా రావచ్చునని వ్రాశాడు.

మంచిరోజు చూచి పంజాబువెళ్ళారు తల్లి కూతురు, మురళీధరుణ్ణి వెంటపెట్టుకొని. నిర్ణయమైన వెయ్యిరూపాయలు ఫీజు మరి ఖర్చులకు వేయిరూపాయలు, ఇల్లువాకిలి తనఖాపెట్టి అప్పు తెచ్చి మరీ ప్రయాణమైనారు. డాక్టరు చాలా ఆదరించాడు. నెలరోజులు చికిత్సచేశాడు. ఇక వెళ్లవచ్చునన్నాడు. మురళీధరుణ్ణి చూచిన తర్వాత అల్లాంటి సుర్రవాణ్ణి గుడ్డివాణ్ణిచేసిన దైవాన్ని మిక్కిలిగా దూషిస్తున్నాడా డాక్టరు. సాగనంపేటపుడు సంపూర్ణదృష్టి కలగాలని ఆశీర్వదించాడు. కాని ఎప్పుడువస్తుందో, ఎంతసేపుంటుందో, అసలు వస్తుందో రాదో తా చెప్పలేనని ముందే చేప్పాడుగా! ఇంటికి వచ్చినప్పటినుంచి ఎప్పటికప్పటికే దృష్టి వస్తుందనే ఆశ, తల్లికీ కూతురికీ, మురళీధరుడికీ. రోజు కని మిదిసార్లు సుశీలవచ్చి ఎదటనిలుచొని 'నాన్నా! నే కనపడుతున్నానూ?' అనేది. 'లేదే అమ్మా' అని వాడు దీనాతిదీనంగా అనేవాడు. 'స్వామి తండ్రీ' 'అమ్మా తల్లి' 'తెల్లారేసరికి మా అబ్బాయికి దృష్టి రావాలి' అని పేరమ్మ ప్రతిరాత్రీ-ఊళ్లోఉన్న దేవుళ్ళకూ దేవతలకూ మొక్కుతుంటుంది.

ఇల్లా ఉండగా ఒకరోజున మేడమీద కూర్చొని ఉన్న మురళీధరుడికి ఏవేవో క్రొత్తభావాలు పుట్ట సాగినవి. ఇంతవరకూ తెలేని క్రొత్తసంగతేదో తెలు

స్తున్నట్టు తోచింది. 'అమ్మా! అమ్మా!' అని కేక వేశాడు. కొంతసేపటికి తనకు పరిచితమైన సుశీల కంఠస్వరంతోపాటు, ఆ స్వరానికి మూలస్థానమై ఒక క్రొత్తభావ మేర్పడ్డది. 'అమ్మా అమ్మా ఏమిటే ఇదంతా!! అన్నాడు మురళీధరుడు ఆస్వరాన్నిపట్టే- ఆ దిక్కు-చూచి, ఆశ్చర్యంతో. అప్పు డాతడి కా నూత్నభావములోనే మరో వింతభావము కలిగి, చిర పరిచితమైన సుశీల శీతలకరస్పర్శ అనుభవానికి వచ్చింది-'నాయనా! ఏమిటిరా?' అనే స్వరము కూడా తల్లి పలికినట్లుగా వినపడ్డది. అప్పుడు తల్లిని తడివిచూచి, కంఠస్వరంతోపాటు కలిగిన నూత్న భావము తల్లిగా ఎట్లా మారిందో అని ఆశ్చర్యం కలిగింది. మొగంలో ఒక క్రొత్తకళ, క్రొత్తకాంతి ఏర్పడ్డది,-'సర్వేంద్రియాణాంనయనం ప్రధానం' అని ఊరకన్నాడూ! అప్పుడు తల్లి మురళీధరుడికి దృష్టి వచ్చింది కాబో' లని ఊహించి, ఏమిటి నాయనా! ఎల్లాఉంది' అని అడిగింది. 'ఏమో అమ్మా క్రొత్త క్రొత్తభావాలు పుటుతున్నవి. చుట్టు ఏమిటో అర్థం గాని ఆనందమయమైన విశేష మేమిటో ఊహకు తటుతున్నది,' అన్నాడు. 'మానాయన! నీకు దృష్టి వచ్చిందిరా, తండ్రీ! నీకు కలిగేక్రొత్తభావాలన్నీ- కనపడుతున్న వివిధవస్తువుల భిన్నరూపాలు. ఆ ఆనందమయమైన విశేషమే వెల్తురు ఎన్నడుచూచి ఎరుగవు కాబట్టి నీకలాటిభావాలు తోస్తున్నవి." అని, మురళీధరుడికి దృష్టివచ్చిందనే పరవశావస్థలో సుశీల ఉపన్యసించింది. ఆతడు తనకు కల్గిన మధుర భావమే, అమృతమయమైన మాతృమూర్తిఅని తెలిసి నపుడు, వానిసంతోషాతిశయానికి మేరేలేదు. ఉబ్బి గంతులువేయ నారంభించాడు. సుశీలకు తనసంతోషం తల్లికూడా పంచుకోవాలని అభిలాష: గబగబ క్రిందికి పరువెత్తింది, గొంతెత్తి పిలవడానికికూడా వశంగాక.

గంతులువేస్తూన్న పిల్లవాడికి తటుక్కున డాక్టరు చెప్పిన మాటలు జ్ఞప్తికివచ్చినయి. ఆమాటలు జ్ఞప్తికిరా

రాగానే, ఒక అభిప్రాయం తోచింది. వడవడ వణకుతూ, వకచోట కూలబడి కన్నులు మూసుకు న్నాడు. పేరమ్మ, సుశీల గబగబ మెట్లెక్కి- వచ్చారు. కన్నులు మూసుకున్న మురళీధరుని, కన్నులు తెరవమన్నా తెరవనంటాడు. కారణ మేమిటి? డాక్టరు చెప్పాడుగా, ఎంతకాలం ఉం టుందో చెప్పలేనని. అది పూర్తిగాఉంటే సరే- లేక కొద్దికాలమే ఉండేటైతే, ఎందుకూ అప్పుడే వ్యర్థముచేయడం. అమూల్యమైన దృష్టిని వ్యయం చేయక కాపాడుకోడమే మంచిది. కాబట్టి కన్నులు మూసుకుంటె ఆ 'చూడడ'మనే శక్తి నిలిచిఉం టుంది" అని ఆతనికి తోచిందట. అందుచే కన్నులు మూసుకున్నాడు. తల్లి అవ్వ ఎంతబ్రతిమాలినా తెరవలే. "అది కొద్దికాలమే నిలిచేట్టున్నా, కన్నులుమూసి కూచుంటే, వినియోగంగాక లోలో పలనే హరించిపోతుందేమో కదరా!" అని వాళ్లు చెప్పారు. అది నచ్చింది. కన్నులు తెరిచాడు. వకవేళ దృష్టి త్వరలో పొయ్యేట్టున్నా, ఉండగానే చూడగలిగిందంతా చూతామనుకున్నాడు. కిటికీ దగ్గర కూచోని 'అదేమిటి', 'ఇదేమిటి' అని అమ్మ నడిగి, అన్ని కనుక్కొని చూస్తున్నాడు. పేరమ్మ వంటచేయను క్రిందికి వెళ్లింది.

ఇల్లా చూస్తూఉండగానే, ఆ చూచేశక్తి మంద గిస్తున్నట్లు తోచింది మురళీధరుడికి. మురళీధరు డేడువనారంభించాడు. అయ్యో! 'ఇంతచేసి వృథా ఆయెనే' అని సుశీలా ఏడుస్తున్నది వాడితోకూడా. క్రమేణా, మళ్లీ అదృష్టిపూర్తిగా నశించినట్లు తోచింది మురళీధరానికి. అమ్మా బిడ్డా, అల్లా ఎంతసేపేడ్చారో తేలేదు. "ఎందుకే చీకట్లో ఏడుస్తూ కూచున్నారు. అబ్బాయికి కండ్లువచ్చాయి. మన దిగులంతా తీరింది" అంటూ దేవళానికెళ్లి కొబ్బరికాయల ముక్క చెల్లించివచ్చిన పేరమ్మ ంఁదరుపట్టుకొని మేడమీదికివచ్చింది. మురళీధరు

డికి మళ్ళీ అన్నీ కనిపించాయి. ఆ దీపంచూచి 'అదేమిటదేమి' టన్నా డాశ్చర్యంతో. ఏడుపు చాలించి, పేరమ్మ "నాయనా! ఇదేదీపం" అన్నది. అంతవరకూ "దీపం" అంటే, వళ్ళుగాల్చే ఒక ప్రమాదకరమైన వస్తువిశేషము వాడికి. అందుచేత ఇన్నాళ్లు తాకైనా తెలుసుకున్నవాడు కాడు. అప్పుడు సుశీలకు మమకారంచేత తనకు కలిగిన మతిభ్రమకు నవ్వువచ్చింది. "కళ్లుబోయి మళ్లీ వచ్చాయేమే అమ్మా" అని అడిగాడు మురళీధరుడు. "నాయనా ఇన్నాళ్లూ, వెలుతురూ, చీకటీకూడా ఎరుగవు. ఇవ్వాళ సాయంకాలము వెలుతురే చూచో చీకటిపడేసరికి మళ్లి కళ్లుపోతున్నవని నీ వేడిస్తే' మతిలేక నేను నీతో ఏడ్చాను. సూర్యుడు వెల్తురిస్తున్నాడని, అతడస్తమిస్తే చీకటిపడుతుందని చెప్పానుగాని తెలిసిన అది అనుభవంలోలేక గ్రహించలేకపోయినావు. ఆ సూర్యుడు లేనప్పుడు ఈ దీపమే సహాయము" అని సుశీల చెపుతుండగానే, కాస్త మెరికిబోయిన బహుళవిదియచంద్రుడు కిటికీలోనించి, తల్లీ కుమార్లను తొంగిచూచాడు. మళ్లి మురళీధరుడు "అదేమిటీ" అన్నాడు. 'అదేరా! చందమామ' అన్నది తల్లి. 'చందమామ రావే! జాబిల్లితేవే' అని పాడుతూ చిన్నతనంలో ఏడుస్తున్న మురళీధరుని తల్లి ఓదార్చేది. ఆ బింబాన్ని ఎన్నడూ చూడకపోయినా, ఆగానమాధుర్యంచేతనే ఏడుపు మానేవాడు అప్పట్లో. ఇప్పుడో, చంద్రబింబమంటే 'ప్రేమపూరితమైన' ఆ మధురగానామృతస్వరూపమే అనే సంగతి అవగాహనమై, తదేకధ్యానముతో దాన్ని చూడనారంభించాడు. అమృతకిరణాలు ప్రతిఫలిస్తుండగా, చలిస్తున్న ఆసుందరమైన నేత్రద్వయం—ఆ వెన్నెట్లో నవయౌవనంతో మెరిసిపోతూన్న ఆ ముఖబింబం చూచి, సామ్యంచేత—'ఏనాటి సంగతులో జ్ఞప్తికివచ్చి, క్షణకాలం తన్నుతా మరచింది సుశీల. ఇంతలో తల్లివైపు దృష్టి తిప్పిన మురళీధరుడు, ఏదే నొక మధురభావోజ్వలితమైయున్న తల్లి ముఖారవిందం చూచి, ఆ ప్రేమసరసి నిన్నాళ్లు జుర్రుకోను కన్నులు లేనందుకు మిక్కిలిగా చింతించాడు. ఇకనైనా కలుగజేసినందుకు విజ్ఞానశాస్త్రానికి జోహారులొనర్చాడు.



# విలాసరావు డైరీ

పత్తి సుబ్బిరెడ్డిగారు

అది సాయంసమయము. ఆకాశంబునందచ్చటచ్చట మేఘమాలికలు మందగమన మొనర్చుచున్నట్లు పొడకట్టుచున్నవి. పర్వత భాగమునుండి సెలయేఱు గలగల ధ్వనులు చేయుచు నొకలోయనుండి ప్రవహించుచుండెను. ఆప్రకృతి యానందసమయమున మయూరములు విప్పి పింఛ్ఛములను విప్పి నాట్యము సల్పుచుండెను. హరిణములు యిసుక తిన్నెలపై నటునిటు పరువిడుచుండెను. వృక్షాగ్రములనుండి, శుక, పికములు కలకలారావములు చేయుచు మధురమంజుల గానముతో ప్రకృతి శ్రోత్రపేయ మొనర్చుచుండెను.

మానవ మాత్రుడైన విలాసరావు తన జీవితకాలములో ప్రకృతి యానందమన నేమిటో యెరుగడు. మురుగుమ కాల్వల యినస్పెక్టరు బిరుదువహించిన మేయోకన్య వలె, మంచినివిడచి, చెడ్డను అన్వేషించు స్వభావముగలవాడు. ఎన్నిసభలకు పోయినను, యేగ్రంథము చదివినను, మంచినిరోసి, చెడ్డనే వెదకుచుండును. ఈతనికి స్త్రీవిద్యా స్వాతంత్ర్యములు గిట్టవు.

ఇతని దృష్టి యెక్కువగా స్త్రీల సమాజముల మీదనే ఉరుకుచుండును. ఎక్కడనేని నలుగురుస్త్రీలు సమావేశమై, దేశసేవ, ఆరోగ్య, సౌభాగ్యములనుగురించి ముచ్చడించుకొనుచుండినచో, వాలుజడలవారని, వంకపాపిళ్లవారని, సేలంచీరలవారని, లేకయే మగకుంకో బృహన్నలవలె తయారై స్త్రీల సభలో కూర్చున్నాడని వర్ణించుట విలాసరావునకు పరిపాటియైపోయినది. మహిళామణులయొక్క సుస్వభావగరిమ, అకుంఠిత ప్రేమతత్వము, దేశసేవాపరాయణత గ్రహించుకొనే విశాల హృదయముగా దతనిది. సేలంచీరలు ధరించినా, వాలు జడలువేసినా, ఒకేమాదిరికట్టు, బొట్టుగల జాతీయచిహ్నములు యిప్పటికిని స్త్రీలయందే నిలచియున్న వనుటలో అతిశయోక్తిలేదు. గుజరాతివనిత వోలె మేలిముసుగు, సింధుదేశపు స్త్రీవలె ఏకపొరతో కప్పబడుకోకకట్టు, పార్శిపడతుల రీతి అర్ధవక్షోభాగపమిటలుగాని ధరించుట లేదు. పురుషుల సమావేశ చాయాపటములు కొన్ని పరిశీలింపుడు. బెంగాలు బిళ్లవదుల గోచెలతో కొందఱు, గుజరాతు పొడుగుకోట్లుతో మఱికొందఱు, దొరలతోపీ

లతో కొందఱు ప్రస్తుతము ప్రత్యక్షమవుతారు. విలాసరావు విద్యావంతుడై నను కూపస్థమండూకము. వివిధమత, కట్టు, బొట్లును గురించి సమన్వయము చేసుకొనే శక్తి అతనికిలేదు.

"పుట్రెలో జనించినబుద్ధి పుడకలతోగాని పోవదు"అను సామెతయున్నను, కొన్నిదైవ ఘటనలవల్లను, దివ్యప్రబోధముల మూలమునను, మానవునిమనస్సు మంచిలోకి మారును. పొన్నూరులో స్త్రీల మీటింగు జరుగునని తెలియుటతోడనే విలాసరావు అక్కడకు పరుగిడిపోయెను. ఆసభకు పురుషులు పోవుటకు యుత్తరువు లేనందున విలాసరావు ఆభవన ప్రహరీకుడ్యశిఖర పరిభాగమును పట్టుకొని, పరికింపనుద్యుక్తుడాయెను. గోడశిఖరం యిటుకపట్టువదలుటచే నాతడు తటాలున క్రిందపడిపోయెను.

ధనపిపాసా పీడితమైన నేటికాలమున నలుగురైదుగురు పురుషులు ఆమార్గమున పోయిరి గాని,కష్టస్థితిలోనున్న విలాసరావుకు ఉపచర్య చేయువారు లేకపోయిరి. పసుపు రంగుగల ఖద్దరుచీర, అదేచాయగల రవికయు, మెడలో మాంగల్యముతోనున్న అల్లిక పేరు, నల్లని దీర్ఘకురులు సవరించుకొని వేయబడిన వ్రేలిముడి,విశాలమైననేత్రములు, ప్రసన్నమైన వదనము, నిరంతర దేశసేవా తత్పరతయునైన నొక యువతీలలామ, తడి వస్త్రముతో విలాసరావు వదనము, శిరస్సునొత్తి, గాయములు తగిలినచోట, కట్లు కట్టుచు, పరిచర్యచేయుచుండెను. అంతట విలాసరావునకు స్పృహవచ్చి—"అవ్యాజ కరుణాకటాక్షముతో నన్ను బ్రతికించితివి. అమ్మా నీవెవరవు?"అని ప్రశ్నించెను. "తండ్రీ! నేను మహిళాసేవాసదన సభ్యురాలను. మాకార్యక్రమము, సభలు, పత్రికలు, యుపన్యాసములద్వారానేగాక ఆచరణ యోగ్యముగా నుండగలందులకే పాటుపడుచున్నామని నుడివి కార్యాంతర్యామియయ్యెను.

విలాసరావు, యిదివఱలో నార్జించిన పాపప్రతతియంతయు, మహోజ్జ్వల మార్తాండుని ద్యుతిచే మంచు విడిపోయినట్లు ఆదివ్య మంగళ స్వరూపియగు మహిళామణి సందర్శనముచే పటాపంచలై పోయెను.

ద్యుమణిపద్మాకరము వికచముగజేయు<br>
గుముదహర్షంబుగావించు నమృతసూతి<br>
యర్థితుడుగాక జలమిచ్చు నంబుధరుడు<br>
సజ్జనులు దారె పరహితాచరణమతులు॥

'భర్తృహరి.'

# కీ. శే. దామెర్ల సీతమ్మగారు

అత్తోట వీరరాఘవరావుగారు

## బాల్యము

ఈయమ వృషసంవత్సర ఆషాఢ బహుళ చతుర్థి రోజున రాయవేలూరులో జననమొందెను. ఈమె జనకుడు అత్తోట రామయ్యాపంతులుగారు శ్రీవశిష్ట గోదావరీతీరమందలి నరసాపుర వాస్తవ్యులైయుండియుద్యోగరీత్యా అప్పట్లో వేలూరిలోనుండిరి ఆయన ప్రథమ సెటిల్మెంటుడిపార్టుమెంటులోచేరి అప్పటి చిత్తూరుజిల్లాలో సూపర్‌వేజర్‌గా నుండిరి. ఈమె మాత వెంకటరమణమాంబ పతిభక్తి నిరతురాలును, నిత్య తులసిపూజావిధానమునందమితాదర ముగలదియునై, యితరులకష్టముల తనకష్టములవలె నెంచి తోడ్పడు సాధ్వియైయుండెను.



కీ॥ శే॥ దామెర్ల సీతమ్మగారు

తండ్రి వున్నతోద్యోగమునందుండుటచే సేవకాళిచే నెన్నడు క్రింద యడుగిడనీయబడకుండ అల్లారుముద్దుగ పెరుగుచుండినది. భూమియొక్క తరతమంబుల యరయు విధియాయనదగుటచే ఎల్లప్పుడు గ్రామాంతరములు తిరుగ వలసినవారగుటవలన తండ్రిగారితో ఈమూ తానుతలు వెళ్ళుచుండిరి. ఈ విధమున బాల్యమునుండియు సృష్టివైచిత్ర్యము తిలకింపగలుగుటంజేసి యొకరిచే తెలుపబడ నవసరములేకుండ అనేక విషయముల నామెయే గ్రహింపగలిగియుండెను. ఆమె బాల్యమంతయు చిత్తూరు మొదలు మధురజిల్లాలలో గడుపుటచే మాతృభాషయగు తెలుగేకాకుండ తమిళము కూడ చక్కగ మాటలాడనేర్చెను. కన్నడభాషయందును కొంత ప్రవేశము గల్గించుకొనెను. ఆమె జననంబాది తండ్రిగారి వేతనము దినదినాభివృద్ధియై ఆరోజులలో యొక గొప్ప యధికారపదవియందుండినవారగుట ఈసీతను ప్రజలందరు సీతంబోలి లాలించుచుండిరి.

## విద్య

ఆమెకిరువురు సోదరులు; పెద్ద ఆయన పేరు లక్ష్మీనరసింహముగారు, ఈయన ఆమెకు సాపత్న్య సోదరుడుగాని ఆయన సోదరభావము మిగుల ప్రశంసనీయము. ఆయనకు వెంకటరమణమాంబ యందుగల మాతృభక్తి వ్రాయనశక్యము. ఆమె నిజసోదరుని సుమారు నాల్గవయేటనుండి తనతోపాటు స్థాయియుద్యోగియైన తన పినతండ్రి సుందరరామయ్యగారి వద్దనుంచుకొని లక్ష్మీనరసింహముగారు బుద్ధులు గరపుచుండెడివారు. తల్లి విద్యావతి గాకున్నను తండ్రి పిల్లల నొకపరియైనను దగ్గరతీయ నవకాశము లేనివారైనను చిరుతప్రాయంపు సీతకు విద్యనేర్పుటయం దభిలాష మెండగుటచేత శలవుదినములలో

సోదరులయొద్ద అక్షరములు నేర్చి తనంతటతానే చదువ మొదలిడినది. ఎన్నడును బడికిపోయి యెరుంగదు; అది తమిళదేశము. ఆంధ్ర మచట లేదు, పెద్దన్నగారు చెన్నపట్టణం ప్రసిడెంసీకాలేజీలో చదువుచుండుటచే రెండవసోదరుడు కూడ నాల్గవక్లాసుల గాయతు పట్టములో చదువవలసినవాడాయెను. అందువలన సోదరుల స్కూలుదినములు ఆమెకు శెలవుదినములుగను వారి శెలవుదినములు ఆమెకు విద్యగరపుదినములుగను మారెను. పట్టణమునుండి తండ్రిగారి వుద్యోగపు టూరు వచ్చినపుడంతయు ఆటవస్తువులును చిన్నచిన్న పాత్రములును తినుబండారములును లక్ష్మీనరసింహముగారు తెచ్చి ఆమె కిచ్చుచుండెడివారు. ఈవిధముగ ఆటలతోనే విద్యనేర్చి పురాణముల చదివి యర్థముచెప్ప శక్తిగలదయ్యెను. నాగపట్టణములో మిషన్‌దొరలు లుండెడివారు. ఆయూర తండ్రిగారున్నకాలమున ఈమెను వారప్పుడపుడు తమ యావాసమునకు గొనిపోయి కొన్ని నటనగీతముల (Action songs) నామెకు నేర్పిరి. వారు తెలుగునేర్చినవారగుటవలన తెలుగుగీతమొకటి నేర్పిరి. ఆగీతమును మరువక తరుచు పాడుచుండెడిది. (మంటిలో సర్వంబుపుట్టి మంటగలసిపోవురా యొంటిగా వచ్చేటియాత్మ యొంటిగా నేపోవురా) ఈగీతమే యామె యనంతర జీవితనావకొక చుక్కాని యయ్యెనని నానమ్మకము. చదువునందే గాక గానమునందు కూడ సహజమ్మృదుగాత్రము గలది యగుటచే కొంత ప్రవేశము సంపాదించి మిగుల హృదయంగమ గానము చేయుచుండెడిది.

## వివాహము

పితరు డుద్యోగమునం దుండుటచే వరాన్వేషణకై తాను రాజాలక మాతానుతలను మాత పినతల్లిగారి గ్రామమైన నర్సాపురమున కంపినారు. వారును యామె పినతండ్రిగారగు కృష్ణయ్యగారును అనేక గ్రామముల వెతకిరి. చివరకు వైనతేయ గోదావరీ తీరగ్రామమైన బెండమూర్లంక వాస్తవ్యులగు శ్రీ దామెర్ల గున్నయ్యగారి ప్రథమ పుత్రుడగు సదాసివరావును జూచి మనసీతకు తగిన వరుడని యానందించి యామె తండ్రిగారికి తెలుపగా మాతానుతల కంగీకారమైన తన కెట్టి యభ్యంతరము లేదని తెల్పిరి. అతను మిగుల స్ఫురద్రూపి; చిన్నతనముననే తల్లి చనిపోవుటచేత గలిగిన కొద్ది కాలవ్యవధి లేకున్నప్పటికి IV Form లో చదువుచుండు తగిన తెలివితేటలు గలవాడు, అతని కిచ్చి మహావైభవమున నర్సాపురంబుననే వివాహము గావించిరి. ఆమె రెండవసోదరుడును అతనును యేకతరగతిని చదువువారగుట అతనిని కూడ పట్టణము తీసుకొనివెళ్లి ఆమె తండ్రియే విద్య గరపుచుండెను. అతనికి తెలుగునం దభిరుచి యుంటచేత నేర్చిన ఛందోలక్షణముల నామెకు గూడ నేర్పి పద్యరచనయం దభిలాష గల్పించెను. ఈవిధమున యింటనే తమిళదేశమునందుండగ తెనుగునందు కొంత ప్రవేశ మామె సంపాదించెను. అప్పటి కామె తండ్రి సెటిల్‌మెంటు సిరస్తావారుపదవియందుంట ఆమె కన్నినుచ్చటలు మహావైభముగ జరుగుచుండెడివి. చెన్నపట్టణములో సోదరులతోను భర్తతోను సుఖజీవనము చేయుచుండ యామె తండ్రిగారికి రుగ్మత కల్గుటయు దొరలువలదనుచున్నను పిన్‌షనుకు దరఖాస్తుపెట్టి తంజావూరునుంచి పట్టణము వచ్చుటయు అచ్చట యారుమాసములున్న తరువాత ఆరోగ్యముగా యున్నట్టుండి వారు కాలధర్మము నొందుటయు యానందమునకు కొంత యంతరాయము గల్గించెను.

## సౌభ్రాతృత్వము

సంసారభారము మీద పడుటచే ఆమె జేష్టసోదరుడు చదువుమాని కీర్తిశేషులగు తండ్రిగారు యుద్యోగిగా యుండిన సెటిల్‌మెంటుపార్టీకి అధికారియైన

క్లార్కు యుద్యోగముమీద తంజావూరులోనే గుమాస్తాగా ప్రవేశించిరి. ఆవెంటనే యాపార్టీ గోదావరీజిల్లాకు మార్చబడుటచేత ఈయన తన కుటుంబముతో కాకినాడ చేరిరి. అప్పట్లో సీతమ్మ యత్తవారచ్చటనే యుండిరి. తండ్రిలేని లోపము కాన్పించకుండ మహావైభవముతో చీరెలిచ్చి యామె నత్తవారింటికంపిరి. అంత నాదంపతులు యొండొరుల సహాయమున విద్యాభివృద్ధియు జ్ఞానాభివృద్ధియు జేసుకొనుచు అతిమైత్రి మెలంగుచు లక్ష్మీనరసింహముగార్ని పితృతుల్యునిగా యెంచుచు పరమభక్తి మెలంగుచుండిరి. ఆమె భర్త మెట్రిక్యులేషన్ ప్యాస్ అయిన తరువాత పైపరీక్షలకు చదివించుట కవకాశములేదని ఆయన తండ్రిగారు చెప్ప అప్పట్లో పరీక్షకు చదివి వుత్తీర్ణుడాయెను. అంతట ఆమె తండ్రిగారియొద్ద పనినేర్చుకొని ఆయునయం దెక్కుడభిమానముండిన కాశీ-నోస్టూయర్టు అప్పుడు గోదావరిజిల్లాకలెక్టరుగానుంటచే ఆయన దరిశనము చేసి కొవ్వూరుతాలూకా సేనిటరీ యినస్పెక్టరు సంపాదించగల్గెను. లక్ష్మీనరిసింహముగార్కి సంతతిలేకపోవుటచే ఈమె పిల్లలను తమయొద్దనే యుంచుకొని యామె కనేకవిధముల తోడ్పడుచుండిరి.

## గృహిణీత్వము

పుట్టినింట యతి మురిపెంబున పెరిగినను పొంగిన పాలపై నీరు చల్లవలసిన యవసరములేకున్నను అత్తింటికి వెళ్ళిన దాది అత్తమామల కనువర్తినియై మెలంగుచు తన మరుదులను యాడుపడుచులను సౌభ్రాతృత్వమున కనిపెట్టుచు బంధుగులనెల్ల మిగుల దయతో నాదరించుచు యెల్లరి కిట్టి కోడలు రావలదాయని, అనిపించుకొనుచుండెను. అంతట కొవ్వూరునుండి సదాశివరావుగారు నర్సాపురం మార్చబడిరి. అటనుండగనే యామె యత్తగార్కి జబ్బుచేసిన సంగతి తెలిసి పిల్లలను తన సోదరులవద్ద వదలి బెండమూర్లంక కేగి యత్తగార్కి సకలోపచారములు చేసెను. గాని యామె రుగ్మతతగ్గక పంచత్వమునొందెను. ఆమె చనిపోవునపుడు కోడలితో, అమ్మా, నీవు నాకుమార్తెవుగాని కోడలివిగావు. నీవలె యుపచారము చేయువారు వేరుండరని నుడివెనట. సవతి యత్తగారివల్ల యింతమాట యనిపించుకొనుటబట్టి యామె యెట్టి సుగుణశీలయో మనము గ్రహించవలసియున్నది. ఆమె పెద్దమరది అన్నగారియొద్ద నుండి చదువుచుండెడివాడు. అతనికి వదినగారియందు భక్తి తక్కువైనను, భార్యాభర్త లతనిని మాత్రము యెక్కువ ప్రేమించుచుండెడివారు. అంత కొంతకాలమున కాయుద్యోగము చేయుట కష్టముగాయున్నదని సదాసివరావుగారు బోర్డుస్కూలుమాస్టరుకు ప్రయత్నించి శృంగవృక్షగ్రామములో వుపాధ్యాయపదవిని స్వీకరించిరి. అటనున్న కాలములో నర్సాపురములో యామె మరదికి కలరావచ్చినదని గాలికబురు విని భర్తతో యాసంగతి చెప్పకైనను మరచి కీలుతప్పిన బొమ్మవలె కూలి విలపించుచుండ భర్తకు తెలసి కొంత దుఃఖోపశాంతిజేయు యుంచుక సేపదేరి అప్పటికో చంటిపిల్ల తల్లియగుట తనసౌకర్యముకొరకు యొద్దనున్న తల్లిని వెంటనే మరది సేవకొరకు పంపి నిస్సహాయుడై యుండిన మరదిని మృత్యువాతనుండి తప్పించి ధన్యతనొందెను. అంత కొంతపడికి రాజమండ్రీ చీఫ్ శానిటరీ యిన్‌స్పెక్టరుపదవి ఖాళీ వచ్చినదని తెలిసి అందుకు తగిన జతనమొనర్చి పదవిని సంపాదింపగల్గెను. అట జేరి తన విధ్యుక్తధర్మముల నెరవేర్చుచు రాజమండ్రీ ప్రజాప్రీతిపాత్రుడాయెను. అచ్చట తన కదివరకున్న ప్రార్థనాసమాజపద్ధతులకు దోహదముకల్గుట రామమోహనరాయ్ కేశవ చంద్రసేను మున్నగు మహాశయుల జీవితముల చదివి తానుకూడ వారి ననుకరించుచుండవలెనని ప్రయత్నించుచుండెడివాడు. తన యాదర్శములను భార్యకు కూడ బోధించుచుండెడివాడు. ఆమె పూర్వాచారపరాయణకుటుంబమునుంచి వచ్చినను పిచ్చినమ్మకములు లేనిదగుటచే సాకారనిరా



శ్రీమతి దయామోణి మాన్యుయల్

ట్యూటికొరన్ మహిళాసమాజ కార్యదర్శిని.

మ్యునిసిపల్ సభాసభ్యురాలుగా నెన్నుకోబడెను.



శ్రీమతి ఆశాకుమారీ ఓజా కన్యక

కాగ భావములలో యేదియైనను నొకటియే యని గ్రహించినదై భర్తమతమునే తనమతముగా గ్రహించి భర్త హితానుసారముగనే యాచరించుచు నూనెలోని దారమువలె యుండెడిది, ఇట్లుగా వారు అతి అన్యోన్యమున ప్రకృతి పురుషులవలె మెలంగుచుండ మూలప్రకృతి తన వికృతస్వరూపము జూపెనోనాగ సదాశివరావునకు మశూచికము నావహించెను. అనేక శానటరీ పద్ధతుల ననుసరించి యెంత జాగరూకత వహించవలెనో యంతయు తీసికొనెను కాని యతని యత్నములన్నియు నిర్వీర్యములయ్యెను. తుదకు 1907 వ. సంవత్సర జేష్టబహుళ ద్వాదశినాడు అప్పటి కంతర్వతినియైన సహధర్మచారిణిని, ముగ్గురు కుమార్తెలను, యొక కుమారుని, వృద్ధుడగు పితరుని బంధుగులను విచారసాగర నిమగ్నులంజేసి నిరాకారంబున లీనమైపోయెను. అంత లోకపరిపాటిగ సీతమ్మ వెంగలి గాక భర్తయాత్మకు శాంతి నొసగుమని దైవంబును ప్రార్థించుచు అపారంబగు దుఃఖమును అంతరిత మొనర్చుకొని తనపిల్లల కెట్టి కష్ట మొనర్పకుండ మెలంగుచుండెను. అపుడు రాజమండ్రీలో వెలువడుచుండిన తెలుగుపత్రికలో సదాశివరాయ నిర్యాణము వ్రాయబడినది.

## పునహా యాత్ర

కాకినాడ తాలూకాబోర్డు హెడ్‌గుమాస్తాగా యుండిన యామెజేష్టసోదరుడు యామెను పిల్లలను తీసుకొని వచ్చి పోషించుచు యామెను యోగవాశిష్టమును మున్నగు గ్రంథముల సంస్కృతము రానిదగుటచే నొక శాస్త్రిగార్ని నియమించిరి. ఇట్లు గ్రంథకాలక్షేపము చేయుచు బ్రహ్మోత్తర ఖండమను గ్రంథమును చదివి అందలి వ్రత విధానము ననుసరించవలెనను కుతూహలాయత్తచిత్తయై ప్రసూతియైన కొలదికాలముననే వ్రతాచరణదీక్ష వహించెను. ఆమె సోదరుడును ఆమెకన్ని విధముల తోడ్పడుచు వ్రతమునకు వలయు సంభారముల స్వీకరించుచు సహకారియయ్యెను. వ్రతదీక్షయందే యామెకాలమెల్లను గడుపుచుండుటచేత యామె కడగొట్టుపిల్లయైన వందేమాతరము, చిరుతప్రాయులైన తక్కినపిల్లలు సాధ్వీమతల్లియైన యామెజేష్టసోదరుని భార్యయగు శేషమాంబగారు అత్యంతప్రేమతో బెంచుచుండెను ఇది యిట్లుండ పరమదయాళువగు భగవంతుడు ఆమెయందు నిష్కారణ కఠినమూని మూడుసంవత్సరముల వయస్సుగల యామెకుమారుని యామెపరీక్షించుటకో నాగ గొంపోయెను. పుత్రశోకాగ్ని తప్తయైనను తక్కినవారివలె వాపోవక దుఃఖమును దిగమ్రింగి భగవంతునియందే భారమువైచి యామె పూజావిధానమును నెరపుకొనుచుండెను, అంతలో యామె ప్రథమపుత్రిక సరస్వతీదేవి వివాహవయస్సువచ్చిన దగుటచే అప్పటికి సిఖాసలము సబురిజిస్ట్రారుగాయున్న గార్లపాటి భాస్కరరావుగారి రెండవకుమారుడు శీతారామస్వామి కామెనిచ్చి అతివైభవమున కాకినాడలో నామె సోదరునింటనే పెండ్లి గావింపబడియెను. కాని కొలదిమాసములకే యీయామె యల్లుడు కాలధర్మము నొందెను. ఇట్లు దుఃఖపరంపరలేరికైనను భరింపశక్యమగునా ? ఆమెకుమార్తె స్థితి యేమియు దోచక విచారమగ్న మానసయైయుండ పామర జనాభిప్రాయములకు లోనుగాని ధీరశాలుడగుటచేతను సత్కార్యాచరణ దీక్షవహించిన మనోబలముగలవాడగుటచేతను లక్ష్మీనరసింహముగారు కొందరాంతరంగిక మిత్రులతో నాలోచించి యీ మాతాసుతలను అప్పటికి తల్లిని వదలియుండలేని యామె మూడవ కుమార్తె శేషగిరిని పునహాలోని ప్రొఫెసర్ కార్వేగారి శరణాలయమున కంపిరి. ఇందుకు వారి సన్నిహిత బంధువులే అయిష్టత కనుపర్చినను ఆయన లక్ష్యపెట్టినవారు కారు. అచ్చట మహారాష్ట్రభాషను ఆంగ్లమును అభ్యసించిరి. సీతమ్మ చక్కగ వ్రాయను చదువను మహారాష్ట్రగ్రంథముల కర్థముచెప్పను నేర్చినది. ఆరావలీ మున్నగు నారీమణులతో స్నేహమల

వచ్చుకొనియెను. కాని కొలదికాలమే వారటనుండుట తటస్థించినది. సరస్వతికి యీ సీతోష్ణస్థితి యనుకూలించలేదు. అందుచే వక వత్సరము వెనుక తిర్గి కాకినాడ రావలసినవారైరి. అటనుండి వచ్చినకొలది రోజులకు మహారాష్ట్ర భాషయందుండిన శ్రీయాజ్ఞవల్క్య చరిత్రను సీతమ్మ తెలుగులోకి తర్జుమాచేసినది కాని అది సిథిలమైపోవుట శోచనీయము.

## పునహో యనంతరం

ముందుచర్య వ్రాయుటకు పూర్వము శ్రీలక్ష్మీనరిశింహంగారి జీవితంకూడ వ్రాసినగాని యీజీవితం పూర్తికానేరదు. వారియొక్క సాంఘికమతయుద్దేశములగురించి యించుక వ్రాయవలసి యున్నది. ఆయన మిగుల పూర్వాచార పరాయణ కుటుంబములో జనించి చిరతప్రాయంబునుండి తండ్రి రామయ్యాపంతులుగారితో పాటు పార్థివలింగపూజ చేయుచుతండ్రిగారు స్వర్గస్థులగువరకు విద్యాభ్యాసము చేయుచుండెడివారు. కాని ప్రాపంచక పరిస్థితులను కూడ బాగుగ గమనించువారగుటచే రానురాను స్త్రీవిద్య, విధవా వివాహము, పంచమోద్ధరణము మున్నగు సంస్కరణములయందు యామోదము కనుపర్చెడివారు. స్త్రీలు విద్యావతులై యుక్తాయుక్త విచక్షణ దక్షులై కార్యనిర్వహణ శక్తియుక్తలై యుండవలెనని వారి యాశయము. అంత వారిని జేసి పునర్వివాహప్రశ్న వారిక వదలివేయవలెనని చెప్పుచుండెడివారు. ఆయన పురుషులకు పునర్వివాహము చేయ యంగీకరించెడివారు కారు. వివాహానుబంధము వధూవరుల జీవితంతో పోవునదికాదనియు ఆమరణాంతము శాశ్వతముగా నుండునదియని వారియుద్దేశము. ఇంద్రియనిగ్రహము గల్గియుండుట యుత్తమమనియు అదిలేని విధులు అట్టి విధవపెండ్లి యాడుట మధ్యమపద్ధతియనియు, కేవల విషయలోలతచే యనుబంధము చేకూర్చుట యధమమనియు నొక్కి వక్కాణించుచుండెడివారు. పూర్వపద్ధతిని వారు స్నానసంధ్యాద్యనుష్టానములు చేయుచు కాకినాడ జగన్నాధపురములో సుక్లయజుర్వేదాధ్యాయన పాఠశాల వడుపుచు పంచమబాలుర పాఠశాలను నెలకొల్పి అంటరానివారని నిరశింపక రాత్రులయందు దాపాఠశాలలు పరీక్షించుచు తమ విశ్వసౌభ్రాతృత్వమును వెళ్ళడించినారు. జపానునుండి మల్లాది సుబ్బారావుగారు విద్యాభ్యాసమునకై వెళ్ళివచ్చినప్పుడు ఆయనను అనేకులు దూరీకృతులు గావించిన సమయంలో స్వవిషయంలో ప్రాయశ్చిత్తము అవసరము లేదని యెంచినను ప్రజాసామాన్యానుమోదమునకై కొందరు పండితుల సాయమున ప్రాయశ్చిత్తము గావించి ఆయన మనోవికలతను పోగొట్టిన మహానుభావుడు. ఇంటనే బాబా భారతీ మున్నగు విదేశగాములు వచ్చినపుడును కజన్సు మున్నగు విదేశనారీమణులు వచ్చినపుడును వెనుకంజవేయక వారికాతిధ్య మిచ్చిన సోదరశ్రేష్టుడు. పేరు ప్రతిష్టలకు వాక్శూరత వహించి, కార్యముపట్ల వెనుదీయువాడుకాడు. ఆయన కార్యశూరత్వమును నిరాడంబర జీవనమును కర్మదీక్షయు విశ్వసౌభ్రాతృత్వమును ఆయన నెరింగినవారి కెల్లరకు విశదమే. ఈశోపనిషత్తులోని ||శ్లో|| యస్తుసర్వాణి భూతాని ఆత్మన్యే వానుపస్యతి, సర్వభూతేషు నాత్మానం తతోన విజిగుప్సతే|| యను మంత్రమును తనజీవితాదర్శప్రాయముగనే యుంచుకొని సంతసించక తన జీవయాత్రలో ఆచరణయందు బెట్ట ప్రయత్నించిన నిష్కపట బుద్ధిశాలి.

## దుఃఖ పరంపరలు

పునహోనుంచి వచ్చి తిరిగివెళ్ళుట కవకాశము లేమి విద్యార్థినీసమాజ మనుపేర వకసంఘ మేర్పాటు చేసి వారమున కొకరోజు స్త్రీలు సమావేశమగుటయు పురాణ యితిహాసముల జదివి యర్థమును గ్రహించి వ్యాసములు మున్నగునవి వ్రాయ నలవర్చుకొనుటకును

వలయు యేర్పాటుల సోదరికి గావించిరి. ఆసమా
జంబు దినదినాభివృద్ధినంది సామాజికలు వ్రాయునవి
పత్రికలమూలమున వెళ్ళడింపజేయుచు నారీమణుల
కమిత ప్రోత్సాహముజేసిరి. ఇతిహాసాది గ్రంథము
లతో తృప్తిజెందక కాకినాడ కాలేజీలో భౌతికర
సాయనశారీరక శాస్త్రోపాధ్యాయుల స్నేహ మల
వర్చుకొని వారి కనుకూలముగానుండు శెలవుదినము
లలో వారిచే స్త్రీలకు ఆ యాశాస్త్రములను బోధింప
జేయుచుండిరి. సీతమ్మ పద్యవ్యాసరచనలయందు
కొంత తేరినదై జనానామ్యాగ్‌జను, ఆంధ్రపత్రిక
మున్నగు పత్రికలకు తనయొక్కయు, చెలిమికత్తెల
యొక్కయు లిఖితములను బంపుచు మెప్పువడయు
చుండెను. ఇట్లు తనకుటుంబములోని స్త్రీలకే గాక
స్త్రీసామాన్యమునకు జ్ఞానాభివృద్ధియందు అభిరుచి
కలుగజేసిరి. యిదంతయు యీమె దుఃఖోపశాంతికి
కారణమయ్యెను. వారికాల మిట్లు గడచుచుండ
స్త్రీవిద్యాభివృద్ధికై పాలకులు విశాఖపట్టణములో
మేరీరాణీ కళాశాలయను నామముతో నొక పాఠ
శాలను నెలకొల్పిరి. అంతట నరసింహముగారు సోద
రిని ఆమె పుత్రికల నల్వురను మాతృసహాయమున
విద్యాభివృద్ధి కంపిరి. అంత పునహాపాఠశాల కంపిన
సమయమున పంతులుగార్ని హేళనచేసిన వారి
బంధువులే తమతమ పుత్రికల నాపాఠశాల కంపిరి.
విద్యార్థినులెల్లరు నొకేచోటనుండి సీతమ్మగారు
ఆమె తల్లిగారు తమపిల్లలవలె కనిపెట్టుచుండ విద్య
గరచుచుండిరి. ఇట్లుండ పంతులుగారికి దేహపాట
వము చెడి అనారోగ్య స్థితిలోకి వచ్చుటచేత ఉద్యో
గమునకు శెలవిడి తన సోదరుడు భీమవరములో
న్యాయవాద వృత్తిలోనున్నను సోదరి సహాయార్థమై
విశాఖపట్టణం వెళ్ళిరి. గాని రుగ్మత తగ్గకుంటచే
1918 సం. శ్రావణ శుద్ధపూర్ణిమనాడు నూతనయజ్ఞో
పవీతధారణచేసి పిల్లలచేపండుగ చేయించి తమ నీర
సస్థితి వారికి భీతికొల్పకుండగజేసి మేనకోడండ్రను
తోబుట్టువును దగ్గరతీసి ప్రాపంచకయాత్రలో ధైర్య
సాహసములు తోడ్పడగలవని చెప్పి తల్లికిని భార్య
కును వేదాంతమును ఆచరణలోనికి బెట్టుడని బోధిం
చుచు ఆదిత్యహృదయాది దైవమంత్రముల భక్తి
పురస్సరముగా పునశ్చరణజేసి మహావ్యక్తి ॥శ్లో॥
పూష న్నేకరిషే యమ, రాజాపత్యయూహ రశ్మిసమ్మూ
హ తేజాయతే, రూపంకల్యాణ మంతత్తేపశ్యామి॥
అనుచు ఆదిత్యుని తోయస్తమించిరి. ఆసమయమున
ఈపిల్లలకు భగవంతుడే తోడై యేపురుషసహాయంలే
కునికి సీతమ్మ సోదరుని బోధను మరువక ధైర్యము
వహించి దహనసంస్కార మామెయే స్వయముగా
జరిపినదాయెను. అంతటితో ఆమె విద్యావ్యాసంగము
మాని యేబంధువులవద్దకో వెంగొని పరుగిడక పిల్ల
లతో అచటనేయుండి విద్య గరచుచుండెను. ఆమె
పెద్దకుమార్తె సరస్వతీదేవికి శరీరారోగ్యము చెడెను.
అదిపరలో కలిగిన విచారావస్థలకే కృంగిపోయిన
యీమె యేమి చేయుననియు తోచక అట కొంత
కాలము చికిత్సచేయించినను గుణము లేకునికి కళా
శాలవీడి ఈమెయు పిల్లలు చిరపరిచితులగు మిత్రు
లెల్లరుంట కాకినాడ చేరిరి. అట పిల్ల యారోగ్యము
కొరకు ఈమె యనేకవిధముల శ్రమబడెను. తుద
కామె ప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యెను.
సరస్వతీదేవి 18 వ. యేట తల్లిని సోదరీలను మాతా
మహిని యితర బంధుమిత్రులను వీడి పరలోక గతురా
లాయెను. అదివరకునుంచి జరుగుచున్న విద్యార్థినీ
సమాజమున పాల్గొనుచు తన జీవితమంతయు స్త్రీ
జాత్యాభివృద్ధికై వెచ్చింపనెంచి హిందూసుందరి
యను పక్షపత్రికను లేవదీసి తాను మిత్రులు దాని
పురోవృద్ధికి పాటుబడుచుండిరి. ఆమె వ్రాసిన పద్య
ములు వ్యాసములు హిందూసుందరిలో ప్రకటించు
చుండెడివి. సదాశివరాయ జీవితము, సోదరస్మృతి
అను గ్రంథమున ఛందోబద్ధముగను, భగవద్గీత మూడు
అధ్యాయములు గానముగను రచించెను. తక్కిన
అధ్యాయములు కూడ గానరూపముగ మార్చవలెనని
కుతూహలముండెను గాని ఆమెను భగవంతుడు తగు

ఆయుర్దాయ మొసంగక పోవుటచేత తన ద్వితీయ సోదరునిపై యాభారము వైచెను. కాని అదింతవర కాతడు నెరవేర్చలేకపోయెను. ఈవిధముగా యామె దుఃఖోపశాంతి చేసుకొనుచు విద్యార్థినీసమాజాభి వృద్ధికే తనకాలము పూర్తిగ గడప నెంచుకొని వక హిందూప్రన్నును సంపాదనజేసి హిందూసుందరిని సమాజకురాండ్ర యందరి సహాయమున స్వయముగా నడుపుచుండెను. ఇట్లు విద్యావ్యాసంగమునకే ప్రొద్దు పుచ్చుచు తనశరీరారోగ్యము నిమిత్తమైనను సోదరుని యొద్దకు జేరక తన పుత్రికలగూడ జ్ఞానసంపాదనయం దభిరుచి గలవారినిగా జేయుచు తల్లిగారివలన సకల విధముల సంరక్షింపబడుచు కాలము బుచ్చుచుండెను. ఆమె కడగొట్టుకూతురగు వందేమాతరమునకు వివాహ వయస్సు వచ్చుటచే తగు సంబంధము నిశ్చయించి 1919 వ. సంవత్సరము ఏప్రెల్ నెలలో వివాహము గావించెను. కుటుంబముయొక్క విషయమున తన కర్తవ్యము పూర్తియైనందున కొంత మనస్సున తృప్తిచెందినదై ఆదివరలోనే సంసారమన్న నిర్లిప్తగా యున్న ఈమె విముఖత జెందినది. క్రమముగా శరీరారోగ్యము చెడి వైద్యు లెన్నివిధము లామెను కనిపెట్టుచున్నను సంసారబంధము వీడి తన నాశ్రయించి యున్న యల్లారు ముద్దుపిల్లల మాతృహీనులజేసి తల్లిని తక్కిన వారిని విచారాబ్ధిముంచి తనభర్త సన్నిధి కేగెను. ఆమె కన్నివిధముల వైద్యసహాయ మొసర్చిన వైద్యశిఖామణి విటూరి వాసుదేవశాస్త్రులుగారు, 'సీతమ్మ నిర్వాణము' అను నొక పద్యమాలిక రచి యించియున్నారు. అది 1934 సం. ఏప్రియల్ నెల గృహలక్ష్మిలో వెలువడినది.

పరిశిష్టము

ఆమెకు ముగ్గురు కుమార్తెలు. స్వరాజ్యలక్ష్మి యను దౌహిత్రియు యిద్దరల్లండ్రునున్నారు. ఇప్పు డున్నవారిలో పెద్దయామె యాధీనముతప్పి మేన మామవద్దను సోదరీలవద్దను యుంటున్నది. రెండవ యామె శేషగిరిదేవి గంపావారి కోడలై భర్తతో బెజవాడలోయున్నది. మూడవయామె వందేమాతరం. సమయమంత్రివారి కోడలై భర్త యుద్యోగరీత్యా యిప్పటికి పదియేండ్లనుంచి నెల్లూరులోనుండి 1934 సం. జూలై నెలలో మార్చబడి రెండవసోదరియొద్ద చేరెను. స్వరాజ్యలక్ష్మి ఈమె పుత్రికయే. ఈ యుభయ సోదరీలును తల్లిగారి ననుసరించి విద్యా వ్యాప్తికై శ్రమపడుచు తోడి సోదరీలోకమునకు సహాయమొనర్చుచున్నారు. వారివారి కుటుంబములకు సర్వసౌభాగ్యసంపదలిచ్చి సర్వేశ్వరుండురక్షించుగాత.

పుట్టినది ఛాందసకుటుంబము. అభిప్రాయములం దున్నతములు. స్వయముగా విద్యగడించినది. విశ్వ సౌభ్రాతృత్వమునకై పాటుబడు సోదరుని యంత, తన సంస్కరణాభిప్రాయములకు దోహదము, కష్టపరం పర లామెకు లెక్కలేనివి. సంతాన విద్యాప్రాప్తికై కష్టములబడి ఆదర్శప్రాయయైనది. జీవితమం తయు దానియందే గడపినది. కావ్యములందలి యర్థము గానము చేసినది. పాడినది. పాడించినది. ఆమె చరిత్ర యెంతయు సంస్మరణీయము.

# 'సీమకు వెళ్లివచ్చుట'

శ్రీమతి నెమిలి చంద్రమతిగారు

"అయ్యో నేనిప్పుడేమి చేయుదును? ఎక్కడనుండి డబ్బుతేగలను? తప్పక వారం లోపల 2000 రూ॥ పంపమని, పంపకున్న చాలకష్టములకు లోనౌదుని వ్రాసినాడు మనరాజశేఖరుడు." అని విశ్వనాధరావు ఒకనాటి సాయంకాలము వీధి అరుగుమీద పచారుచేయుచు తన భార్యయగు సుందరమ్మతో చెప్పుచుండెను.

"పోయిననెలలోనేకదా నగలమ్మి వేయి రూపాయలు పంపినాము. అప్పుడే మళ్లీ ఇంతసొమ్ము ఎందుకా అని ఆశ్చర్యముగా నున్నది. పిల్లవాడేమీ చెడ్డ నడవడిలో దిగ లేదు కదా?" అనెను సుందరమ్మ.

"ఏమో పరాయిదేశం; డబ్బులేకుంటే ఎంత యిబ్బందిగావుంటుంది! ఎంత కష్టపడు తున్నాడో పాపం మనకేమి తెలుస్తుంది? ఇక ఇల్లు అదుమానంపెట్టి పంపవలసినదే పైకం"అని విశ్వనాధరావు చెప్పెను.

విశ్వనాధరావు ఒక న్యాయవాది. రాజమహేంద్రవరములో అతని కుటుంబము చాల గౌరవము పొందియుండెను. వారి కక్కడ పెద్ద స్వంత భవనమొకటి కలదు. అతనికి ఒకేకొడుకు. అతడు సీమకు వెళ్లి నాలుగుసంవత్సరములయినది. వెళ్ళునపుడు బాలునికి పదునారువత్సరముల ప్రాయము; అప్పటికే పెండ్లయివుండెను. విశ్వనాధరావు తనకొడుకు చదివివచ్చిన తరువాత తనమీదనున్న భారమంతయు వదలును కదా అని గంపెడాశ పెట్టుకొనియుండెను. కోడలిని తనయింటికి పిలిపించి సంగీతము, ఇంగ్లీషుచదువు చెప్పించుచుండెను. శారదయు మంచి బుద్ధిమంతురాలు. అతిత్వరితముగ ఇంగ్లీషు విద్య నభ్యసించెను......

ఆనాడు విశ్వనాధరావు ఇంట్లో బహు సందడిగానుండెను. ఆదినమే రాజశేఖర్ విదేశమునుండి వచ్చిచేరెను. కుమారుడు క్షేమముగావచ్చి చేరినాడు గదా అని చాల సంతోషముతో తలిదండ్రులు పండుగ చేయుచుండిరి. రాజశేఖరం మాత్రం మిద్దె మీదనుండి క్రిందికిదిగి రానేలేదు. బండిదిగిన వెంటనే తండ్రితో ఏవోరెండు ముక్కలు ఇంగ్లీషుతో మాట్లాడియుండెను. తల్లితో గాని భార్యతోగాని అసలే మాట్లాడలేదు. శారద భర్తసందర్శనార్థమై వేచియుండెను. వచ్చినప్పుడు మాట్లాడకపోయినను మరల

నింకొకప్పుడయిన మాట్లాడరా అనుకొని మనస్సమాధానపరచుకొనెను.

మిద్దెయందొక గదిలో నంతయు శుభ్రపరచి, పాశ్చాత్యులయిండ్లకు కావలసినవి మాత్ర మమర్పబడియుండెను. అక్కడ ఒక పడకకుర్చీలో రాజశేఖర్ కూర్చుని పొగచుట్టగాల్చుచు, నావల్ వకటి చదువుచుండెను. అతనికి ప్రక్కన మేజామీద రెండు సారాయిబుడ్లు ఉండెను.

ఆహా! ఏమికాలమోగాని పదుసవత్సరములు తలిదండ్రులను విడిచివుండి మరల వచ్చి దర్శించినపుడు, "అమ్మా ఎన్నిదినములకు మరల నిన్ను చూడగలిగితిని." అని ఏదైన నొకమాట చెప్పరా? ఆమాటకంటే తల్లి ఆశించునదియేదో? ఇన్నిదినములు తన భార్య తనకొరకై ఎంత ఆతురతతో వేచియుండెనో! ఎప్పుడు చూతునా పతిముఖారవిందమని ఎంత తహతహ పడినదో ఒక నిముషమొక యుగముగా నెట్లు కాలము గడపినదో! ఏమైనను అప్పటి అతని హృదయములో లవలేశమైనను లేదుకదా!

సాయంకాలము ఆరుగంటలయినది. శారద రాజశేఖరునిగదిలోనికివచ్చి సంకోచముతో, సిగ్గుతో నక్కడవున్న యొకకుర్చీమీద కూర్చునెను.

రాజశేఖర్ తిరిగి యామెముఖమును జూచి ఆమె యందమునకు భ్రమిసిపోయెను. తనభార్య మిగుల అందకత్తెయని తలచెను.

"నాథా మీరు సంతోషముగా మాట్లాడుచు, తిరుగుచునుండక, అన్యమనస్కులయి యున్నారేల? కారణమేమి?" అని శారద అడిగెను.

"అదుగో నాథాగీథా అనవద్దు. నన్ను నాపేరుపెట్టి పిలు. పాడుతెలుగుతో మాట్లాడవద్దు. ఇంగ్లీషుతో మాట్లాడు" అన్నాడు రాజశేఖర్ యింగ్లీషులోనే.

"తెలుగు మన స్వంతభాషకదా, ఒకవేళ మీరది మరచిపోయినప్పటికి, ఇప్పుడిక్కడికి వచ్చినారు గనుక మళ్ళీ మనభాష మాట్లాడుట కభ్యాసము చేసుకోవలెను కదా? లేకున్న పూర్తిగ మర్చిపోయెదరే"

"మర్చిపోతే పోనేపోయింది. ఎందు కనవసరమైన"దనుచు సారాయిబుడ్డినెత్తి గ్లాసులో పోసి తానుకొంచెము త్రాగి "శారదా నీవు దీనిని కొంచెము త్రాగుము దీనిరుచి తెలుసును. ఇంద త్రాగు ఎంత బాగున్నదో చూడు"అని గ్లాసు యివ్వబోయెను.

"ఆహామీరు త్రాగునది చాలక నన్ను కూడానా త్రాగమనుచున్నారు. ఎంత బాగున్నది! నేను త్రాగుటయా! మన హిందువులు త్రాగకూడదు. హిందూస్త్రీలు యిక చెప్పవలెనా?"

"హిందూస్త్రీలు భర్త చెప్పినట్లు వినెదరు కదా, నీవు హిందూస్త్రీవైతే నేను చెప్పినట్లు ఎందుకు వినవు?"

'హిందూభర్త హిందువుగా యుండిననే హిందూపత్ని హిందూపత్నిగా యుండును. భర్త పాపముచేయుచున్న కనులార చూచుచుండదు. అది చాలక తానుకూడ చేయుటయా? భర్తను నచ్చజెప్పి మంచిమార్గమునకు త్రిప్పునేకాని, గుణవతియగు భార్య ఎన్నటికిని భర్తతో చేరి పాపముచేయదు. ఇది నిజము. మీ తల్లి ఎంత పరితపించుచున్నదో మీరు మాట్లాడనందులకు మీకు తెలుసునా? మీకొఱకై వుండిన ధనమంతయు ఖర్చుచేసిరి. ఇంటనున్న నగలు వెండి సామానంతయు అమ్మివేసిరి. ఈ యింటిని అనుమానంక్రింద యిచ్చినారు. ఇంక కొన్ని దినములకు గడువుకూడ తీరిపోవును. మరల నేమిచేయగలమో దేవునికే ఎరుక.'

'ఆ ముసలివారు, ఆ అనాగరికుల సంగతి నాయెదుట నెత్తకుము. వారు నా తలిదండ్రులుకారు. తప్పిదారి వారలకు నేను పుట్టితిని, అంతేకాని, నాకు వాళ్లకు నేమీ సంబంధములేదు. పొమ్ము, నీవైనను నా యిష్టప్రకారమున్న నే, లేకపోయిన నాదారి నాది, అంతే, నాపనులకేమీ నీ వాటంక పడకూడదు.'

మారు మాటాడక శారద క్రిందికిదిగి పోయెను.

సీమనుండి తనభర్తవచ్చినతరువాత ఎట్లెట్లనో వుండవలెనని శారద భావించుకొని యుండెను. అన్నియు నిష్ఫలములయ్యెను. శాఖోపశాఖలుగా నల్లుకొన్న యామెయొక్క మనస్సనే వృక్షము ఒకశాఖ వెంబడి నొకశాఖగా విరిగి, తుదకు నిర్మూలమయ్యెను. ఆమెశరీరము కృశించిపోవుచుండెను. వదనము వాడిపోవుచుండెను. బలహీన మతిశయించెను. మంచము పట్టెను. మనోవ్యాధికి మందు లేదుకదా?

* * *

ఒకనాడు రాజశేఖర్ శారద పరుండియున్న మంచముదగ్గరకు వచ్చి కూర్చొని యామె ముఖమువంకనే జూచుచుండెను. 'నేను ఆదేశమునుండి వచ్చిననాటి శారదయేనా యీమె. కాంతివంతమై సంతోషముతో నిండియుండిన యాకండ్లేనా యివి, ఆ సుందరవదనమేనా యిది? ఆహా! ఎంత మారిపోయినది? అయ్యో ఇన్నాళ్లు ఎంత కుందుచున్నదో? ఎంత అపకార మొనరించినాను. అక్కడ పాశ్చాత్యయువతిని కూడ పెండ్లాడితినే. ఈమె నాకు ధారబోసిన నిర్మల ప్రేమయంతయు అడవికాచిన వెన్నెలయినదే! కించిత్ మాత్రమైనను నేను ప్రేమచూపలేదు కదా? అయ్యో యిక నాశారదబ్రతుకునా?' అని దుఃఖించుచుండెను.

శారద నిద్రలో 'దేవా నాప్రాణేశ్వరుని క్షమింపుము. క్షమింపుము. మంచిబుద్ధి పుట్టునటుల జేయుము.' అని హీనస్వరముతో పలవరించెను.

'ఆహా! నిద్రలోకూడ నా కొఱకై దేవుని ప్రార్థించుచున్నది. ఆ నిష్కళంకమైన, అపారమైన ప్రేమను తృణీకరించితిని కదా? నాకిక క్షమ ఎక్కడ? దేవుడు నన్ను క్షమించునా? నా తలిదండ్రుల నెంత నిందించితిని? వారిమన స్సెంత నొప్పించితిని? అన్నిటికి తగిన ప్రాయశ్చిత్తమేది? చావు తప్ప మరొకటిలేదు.' అని తన జేబులోనున్న కత్తిని తీయబోయెను.

ఇంతలో తండ్రివచ్చి 'రాజా, సారాయంగడివాళ్లు వచ్చి డబ్బుకోసరము కాచుకొనియున్నారు. ఇల్లు అదుమానంపెట్టిన గడువు నేటితో తీరిపోయినది. ఆ శెట్టివచ్చియున్నాడు. ఇప్పుడేమిగతి? ఏమిచేయమంటావు?'

'ఏమిచేయుట అని నన్ను అడిగితే, నేనేమి చెప్పను తండ్రీ? నన్ను పదునాలవ ఏటనే ఏమోచదివి వెలగబెట్టుతానని సీమకు పంపినారు. నేనడిగినప్పుడంతా డబ్బు పంపించినారు. అక్కడ నేనేమి చేసిన నెవరడ్డుపడెడివారు? నాయిష్టముచొప్పున నడచితిని, ఇష్టము చొప్పున డబ్బు ఖర్చుచేసితిని. నిష్కారణముగా పంచదారవంటి సంసారము పాడయినది. పరమసాధ్వియగు నాప్రియభార్య నన్ను విడిచిపోవుచున్నది. ఈస్థితికి తెచ్చినది మీరె. నే నింకను పసిబాలునిగా యుండునపుడే ఆ దేశమునకు పంపినారు, నేను పోనని అప్పు డెంతఏడ్చినదీ జ్ఞాపకమువున్నదా? ఇప్పుడు నన్ననిన నేమి ప్రయోజనము?'

'అందరివలె నీవు చదివి పాసయి పెద్దయుద్యోగము చేసెదవనికదా, నిన్ను పంపితిని, నీ విటుల చేయుదువని కలలోకూడ తలచలేదే.'

'ఎందుకు తలచెదరు? అదే ప్రతియొక్క తలిదండ్రులకుండు మమత. తమబిడ్డలు చెడిపోయెదరా—తమబిడ్డ లటువంటిపని చేసెదరా అని పిచ్చినమ్మకం. పసిబాలురుగావున్నప్పుడు విదేశమునకు బంపి చదువు చెప్పించుటయా? పంపితే యిదీ లాభము. నన్నుపూరికేనైనా పంపకుండా అమాయకురాలైన పిల్లను నాకు కట్టినారు. కోతిచేతులో పూలమాలలాగు. దాని గొంతుకోయుటకు నాకు కట్టినారుగాని కూడి సుఖించుటకుకాదు. అయ్యో యిప్పుడిక నాప్రియభార్య నాకు దక్కునా? ఒకవేళ దక్కినను, నన్నుక్షమించునా?' అని శారద కరములను పట్టుకొని దుఃఖించుచుండెను.

శారద కొంచెం కనులుతెరచి చూచి మెల్లగా, 'హా! ప్రాణేశ్వరా నేను కలగనుచున్నానా? నిజమేనా? మీరు నాకై దుఃఖించుచున్నారా? ఎందులకు? నే డెంతసుదినము?

నేటితో నాబాధ వుపశమించినది. ఇక నిశ్చింతగా ప్రాణము వదలవచ్చును.' అనెను.

'శారదా నన్ను క్షమించెదవా? నిన్నింత కష్టముల పాల్జేసిన నన్ను క్షమించెదవా? హా! నేజేసిన పాపములకు పరిమితియున్నదా? మరియొక జన్మయందైనను నా పరిశుద్ధ ప్రేమను నీకర్పించగలనా ?'

'నాథా ! నే నా మిమ్ముల క్షమించుట! సర్వాధికారియగు సర్వేశ్వరుడున్నాడు. ఆతడే క్షమించును. పశ్చాత్తాపమే అన్ని పాతకములను పారదోలును, దానికన్న పావనమైనది మరియొకటి లేదు. ప్రాణనాథా నేటికి నే ధన్యురాలనయితిని.'

'ఇంతకాలము నీవు నాపాలిటి పెన్నిధివని ఎరుగనైతిని కదా! అన్యాయముగ నిన్నీ గతికి తెచ్చినది నేనేకదా. శారదా ఇకనైనను ధైర్యము తెచ్చుకొని నాకొఱకైనను జీవించియుండవా ? నీవు లేని బ్రతుకు నాకొక బ్రతుకా, గావున నామీద దయయుంచి ధైర్యమూనుము. గడచినదంతయు మరువవా ?' అని బాష్పపూరితలోచనమైన శారద ముఖకమలమున మెల్లగా నొక ముద్దిడుకొనెను. వెంటనే శారదముఖము మబ్బువీడి తేజోవంతమాయెను!

శారద హృదయమునందు ఆశాంకురము మొలకెత్తసాగెను. నానాటికి ఆరోగ్యము కలుగుచుండెను.

ఇప్పుడు రాజశేఖర్‌కు వుద్యోగము కుదిరెను. రెండువందలు జీతము. ఏలూరునందు ఒక చిన్నగృహమును బాడుగకు తీసుకొని అందున్నారు.

ఒకనాటి వుదయమున 'అమ్మా! నాయనమ్మ, తాతవస్తున్నారే' అని సంతోషముతో గంతులువేయుచున్నది శారద కూతురు నళిని, నాలుగేండ్లపిల్ల. శారద తన చిన్నకొడుకును చంకలో నెత్తుకొని బయటికి వచ్చినది. ఆమె కొడుక్కు నేడుపుట్టిన పండుగ.

విశ్వనాథరావు, సుందరమ్మ బండిదిగి లోనికివచ్చిరి.

శారద 'అత్తా మీవాళ్లు కులాసాగా వున్నది కదా యిపుడు' అని యడిగెను.

'ఆ, కులాసాగానే వుంది. రాజశేఖరేడీ' అంటూ తనమనుమని ఎత్తుకొని ముద్దిడుకొనుచు, 'చిట్టి తల్లీ రావే' అని మనుమరాలి చెయ్యిపట్టుకొని యింట్లోనికి వెళ్లినది.

'మీకొడు కింకా ఆఫీసుకు వెళ్లలేదు. ఇప్పుడే వస్తానని స్నేహితులింటికి వెళ్లినారు. అదుగో వస్తున్నారు సమయానికి సరిగా.'

రాజశేఖర్ వచ్చి తలిదండ్రులకు నమస్కరించెను. 'నాయనా ఆయురారోగ్య ఐశ్వర్యవంతుడవగుదువు గాక' యని దీవించి కొడుకును లేవనెత్తిరి.

ఆదిన మాగృహమునందెల్లరును, ఆనందాబ్ధిని నోలలాడు చుండిరి.

## గులాబి

గుమ్మలూరు సత్యనారాయణగారు, బి.ఎస్‌సి.ఎజి.

(గత సంచిక తరువాయి)

ఈగులాబిమొక్కలను సాధారణముగా నేలలలో నైనను, లేక గోలెములలోనైనను పెంచుట వాడుక. ఐన నీ రెండిటిలోను గోలెములలో పెంచుట శ్రేయస్కరము. ఇంతకును గోలెములలో పెరుగుచున్న మొక్కలు విపరీతమగు యెండవానలకైనను, గాలి, లేక మంచుకైనను దెబ్బ తగిలి చెడిపోకుండునట్లు, వానిని సరియగు చోట్లకు మార్చుచు, సురక్షితముగా నుంచుట కవకాశము లెక్కువ యుండును. ఇంతియే గాక, కథ, కార్యము లింట జరిగినను, లేదా యూరక ఇండ్లను శృంగారించుటకును గూడ నీ పూలగోలెములు మిక్కిలి యుపయోగము లని యా బాలవిదితమే. ఐనను మనసులోని కొరత లేకుండ మీది రెండు విధములను సాధ్యమైనంత క్లుప్తముగా వ్రాయుచున్నాను.

### నేలలలో పెంచుటకు

నేలలు: సాధారణముగా యెట్టితోట భూమి యైనను చాలును. కాని యా నేలలలో ముఖ్యముగా నీరు మాత్రము నిలువకూడదు. 3-4 అడుగులు లోతు గల నల్లని సారవంతమగు భూములు కడు ప్రశస్తములు. (భూములు నల్లగా నున్నంతమాత్రమున సారవంతముగా నున్నవనుకొనరాదు. దత్తమండలములలోని నల్లని ప్రత్తిభూములు (Black cotton Sorts) ఇందు కుదాహరణములు. నేలలు బంకమంటి వలె యెక్కువ జిగటగాను, లేదా యుత్తి యిసుక వలె చాల పొడిగా విడివిడిగాను, యుండక, రెండిటికిని మధ్యమముగా, యనగా సగము రేగడి సగము యిసుక కలసిన భూములు చక్కగా పనికివచ్చును. అట్లుగాక మిక్కిలి రేగడిభూములైన యిసుక, పాటిమన్ను, చెరువులలోని యొండు, పచ్చియాకుల రొట్ట, మొదలగువానిని; మిక్కిలి యిసుకభూములైన పచ్చిరొట్ట, పశుగత్తము, కొంచెము రేగడి, ఏటి యొండుమన్ను మొదలగువానిని, సరియగు 'రేగడి-యిసుక' పాలు వచ్చువరకు జేర్చి వర్షము పడునపుడు చాలకాలమువరకు నీరింకక నిలిచి పోకుండునటులను, లేదా యెప్పుడును యెక్కువ తేమచే చిమచిమ లాడుచుండనటులను, కొంచెమెత్తైన ప్రదేశములలోని నేలల నెంచుకొని, తయారు చేసుకొనదగు బాధ్యత యున్నది. లేదా యిదివరకు నొకానొకపుడు పెంటగోతులుగా నున్న స్థలములు గూడ నెక్కువ లాభకరములుగా నుండును. కాని యొకప్పుడిందులో (యెక్కువ సారవంతములగుటవలన) పూవులకు బదులు యెక్కువ గులాబియాకు మాత్రము రాగలదు! దురదృష్టమున సరియగు నేలలెంత కష్టపడినను దొరకనప్పుడు, స్థలమంతలాభకరముగాకుండిన చాలును. గులాబి వేసి యుచితమగు నుత్తర కృషిచే చక్కగా సాగు చేయవచ్చును. కనుక నుత్తరకృషియందు కర్షకులు మిగుల జాగరూకతతో నుండి, తెలివితేట లుపయోగించుచుండవలయును.

## గోలెములలో పెంచుటకు

గోలెములలో నింపుటకు కావలసిన మన్ను కొందరో పలువిధముల వర్ణించిరి. ఒక్కొక్క విధమగు మిశ్రమములతో తయారయిన మన్ను యొక్కొక విధమగు మొక్కకు పనికివచ్చును. అందు గులాబి మొక్కకు ప్రత్యేకముగా సరిపడు మన్ను యీ దిగువ వానితో మిశ్రితమైన నుత్తమము.

4 భాగములు - పచ్చి లేక యెండు ఆకు లేక రొట్ట
2 ,, సన్నని ఏటి యిసుక
1 ,, పసుగెత్తము
1 ,, ఎక్కువ నల్లని సారవంతమగు భూభాగము (Peat moss)
1 ,, ఎరువు (కానుగ పువ్వులు కుళ్ళిన భాగము)
½ ,, ప్రాతయిటికల గుండ
½ ,, కట్టెబొగ్గు.
10

ఈ మిశ్రమము చాల ప్రశస్తమైనదే గాని యిందలి కొన్ని భాగములను సంపాదించుట కష్టము. మాటకు నల్లని సారవంతమగు భూభాగము సాధారణముగా దొరుకదు. కనుక నీదిగువ వానిలో నేదైనను తయారు జేయవచ్చును.

6 భాగములు - గుఱ్ఱపులద్దెలు (జంతువ అధమము 9 నెలల వయసు గలదై యుండవలయును)
4 ,, ఎఱ్ఱమన్ను
8 ,, ఇసుక
2 ,, పచ్చిరొట్ట
15

2 భాగములు - ఎఱ్ఱమన్ను
1 ,, మనుష్యుల గెత్తము
1 ,, గుఱ్ఱపుగెత్తము (9 నెలల వయసు)
½ ,, ఏటి యిసుక
½ ,, కుళ్ళిన కానుగపువ్వులు.
5

## గోలెముల నింపుట

పూలగోలెములకు నడుగున కన్నము లుండును. గోలెములో బోసిన నీరు లోనికింకి యీ కన్నముల ద్వారా బైకిపోవును. ఇది యావశ్యకము. కనుక వానిపై విరిగిన పెంకులను పరచిన పిదప, 1-2 అంగుళముల వరకు పెద్ద బొగ్గులను వేసి, వానిపై పైనుదహరించిన మిశ్రములలో నేదోయొకటి సదుపాయము ననుసరించి వేయవలెను. ఆమన్నుతోనే గోలెమునంతయు నింపవలెను. అట్లు కన్నములపై పెంకులను వేయక పోయిన త్వరలో నవి పూడుకొనిపోవును; నీరింకక నిలచును; మొక్క చచ్చును.

## మొక్కల నాటుట

నేలను గాని, గోలెమును గాని యిట్లు తయారు జేసిన పిదప సరియగు "అంట్లు" సంపాదించి నాటుట ముఖ్యమగుపని. సాధ్యమైనంతవరకు తల్లి మొక్క లేక జాతిమొక్క యెట్లు పూయుచున్నది, పూచిన పూరేకులెంతవరకు పటుత్వముగా నున్నవి, వాసన యెంతసేపుండును మొదలగు ముఖ్య విషయములను స్వయముగా జూచి, నచ్చినయెడల నా తల్లి మొక్కనుండి యంట్లుకట్టి ప్రవర్ధనము చేయవలయును.

## ఈ ప్రవర్ధనవిధము లనేకములున్నవి

కాని యందు సామాన్యమగునవి నేలంట్లు, మొక్కంట్లు, ఖండములు. వీనిలో నేలంట్లు మిక్కిలి జయప్రదముగా నుండును, మొక్కంట్లు కొన్ని సంకరజాతులను వ్యాప్తిజేయుటకు గాని సృష్టించుటకు గాని యుపయుక్తములగును.

## నేలంట్లు : (Layering)

అక్టోబరు* నెలలో, మనకు కావలసిన జాతిలో

* ప్రతిచోటను 'అక్టోబరు నెల'ని శాస్త్రముకాదు. కాని ముఖ్యమైన పెద్ద వర్షాకాలము దాటిన పిదప మంచికాలము.

వధమను 2-3 సం|| వయసుగల దార్ఢ్యముగు మొక్క నొకదాని నెంచుకొనవలెను. క్రిందనున్న కొమ్మలలో నొకదాని లేత చివరభాగము చూచి, దాని క్రిందను పైకి మట్టిరంగుగా ముదిరిన కఱ్ఱవలె నున్న భాగము పట్టవలెను. ఆ భాగమున కధమము 3-4 కణుపు లుండవలెను. అప్పుడొక వాడిగల చిన్నచాకు *తీసుకొని యా కొమ్మను నాలికవలె 1-2 అంగు|| కోయవలయును. పిదప నా కొమ్మను వంచి, దానికుండిన యాకులు, జెంట రెమ్మలను ద్రుంచి, యా తల్లికొమ్మకు సరియగు దూరమున నొక గోలెమునుంచి, యందలి మన్నులో కొమ్మభాగము దరిదాపు 6 అం|| వరకు, 2"-3" లోతున పాతి, పైని మరల మన్నుతో కప్పి, బాగుగా మెత్తి మీదను బరువుగా నొకరాతి నుంచవలెను. ప్రతి రోజును సాయంత్రము తోటజారీ (Rose can) తో నీరు పోయుచు వచ్చిన, సుమారు 3 నెలలలో వేళ్లు తన్ని, తల్లిమొక్కనుండి వేరుపరచుటకు తగిన స్థితిలో నుండును.

ఈ విధమైన యంట్లే తీగ గులాబితో చేయుచున్నప్పుడు ఒక పొడుగైన తీగనే చాల చోట్ల మీది ప్రకారము నేలంట్లు కట్టుట లాభకరము. అనగా ఒక్క తీగనుండి, పొడుగునుబట్టి, 4-5 అంట్లు ఒకే పర్యాయము రాగలవు. ఈ విధముగా కట్టు నేలంట్లకు 'పాము నేలంట్లు' (Serpentine Layering) అని పిలువ వచ్చును.

## అంట్లను తల్లిమొక్కనుండి వేరుపరచుట:

నెలకొకసారి, నాలిక గీటుదగ్గరనుండి వేళ్లు వచ్చుచున్నవో లేవో చూచుచుండవలెను. అంటు భాగము వేళ్లుతన్నిన పిదప పక్షమున కొక పర్యాయము ½ అం|| లోతుగా 2"-3" నాలుక గంటునకు వెనుక మరి రెండుమూడు చిన్నగంట్ల నిచ్చుట యత్యవసరము. కాని యట్లు చేయుటకు ముందు ప్రతిసారి ముందుననున్న కాడభాగము వాడుచున్నదేమో చూడవలెను. అనగా తల్లి మొక్కనుండి యాహారమును అడ్డివేయుచున్నప్పుడు పిల్ల యంటు మొక్క స్వయముగా భూమి (లేక గోలెములోని మన్ను) లోనుండి యాహారము తెచ్చుకొనగలుగుచున్నదో లేదో తెలియును. తెచ్చుకొనలేకపోయిన మొక్క వాడిపోవును గదా. ఎప్పుడైనను వాడినట్లు రూపించిన, ఆ యంటును వదలివేయవలెను. ఇట్లు పక్షము కాసన్నను, వారము, పదిదినముల కొకసారి కొంచెము కొంచెము లోపున గంటుపెట్టుచు 3, 4 కోతల నాటికి పిల్లమొక్క పూర్తిగా తల్లినుండి వేరగును. ఈవిధముగా వచ్చిన మొక్క 'నేలంటు'. అట్లు పెక్కు కోతలవలన గాక, యొకేసారి తల్లి మొక్కనుండి, పిల్లమొక్కను కోసిన, యది చెడ గలదు. కనుక తొందరపడకూడదు.

ఇట్లు జయప్రదముగా తయారయిన అంటును వేరు స్థలము లేక గోలెమునకు మార్చవలెను. స్థలము మార్చుట యంత యుత్తమమైన కష్టక రహస్యము లేదు. అటుల చేయుటచే కొన్ని చిన్నవేళ్లు తెగి మరల రెండింతల దార్ఢ్యమున పెక్కు వచ్చును. కనుక మొక్క బలముగానుండి గాలి వానలకు, పాడుచీడలకు నాగగలదు.

ఈ యంట్లు జయప్రదముగా వచ్చుటకు-

1. బాగుగా ముదిరినవి గాక, సగము ముదిరిన కొమ్మలనే యంటుగట్టుట మంచిది.

2. ఎదగక విశ్రాంతి తీసుకొను మాసములలో మొక్కల నంటుగట్టినయెడల దాచబడిన యాహారము కణుపుల దగ్గరికంట్ల కతిసులభముగా నందుటచే, వేళ్లు త్వరగా వచ్చును. కనుక మొక్కల విశ్రాంతి కాలమున మనము విశ్రాంతి దీసుకొనకూడదు.

(సశేషము)

* ఇట్టి తోటపనులకు సరియగు చాకు 6-7 రూ|| అగును. ఎక్కువ ఖరీదైనను, చాలకాలము పనిచేయును.

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ. బి. యల్.

గృహధర్మ, సంఘధర్మ, జాతిధర్మములను నిర్వహించుటకు ఊతకోలయగు విద్య స్త్రీలకు అనివార్యమైనది. ప్రాచీనసభ్యతకు కార్చిచ్చు అంటుకొనిన నేఁడుకూడ, కొందఱు స్త్రీపురుషులు గృహధర్మము దెస దృష్టిసారించి, సోదరీమణుల నాదిక్కుగ నాహ్వానించుట సంతోషకరము.

"అన్ని నాగరకతలు గృహమునఁ బుట్టినవి. భావి ప్రజలును జాతులును గృహమందే పెరిఁగి గృహమందే పెంపొందవలెను. ప్రధానమైన ఈజీవనధర్మము దెస మనవిద్య పెడమొగము పెట్టకుండుఁగాక. పాకకళతో కూడిన ఇంటిపనులన్నియు గౌరవప్రదమైనవి. వీనియందు మన శిశువులకు మనము శిక్షణమొసఁగవలెను." అని ఇటీవల (1934, నవంబరు 17 న) తిరువాన్కూరు మహిళాసభ కధ్యక్షత వహించిన శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు వచించిరి.

భావబంధురమైన గృహధర్మమందు మేలుచేతులు కావలెననిన సోదరీమణులు మాతృభాషకు జేజే! యనవలెను. మాతృభాషలకు అన్యభాషలు సైదోడులగు నంతవఱకు అవి ఆదరణీయములు. మాతృభాషల మచ్చుమాపి, మాతృభాషా హృదిఁగల భావవిభూతికి అడ్డునిలువవగుచో, అవి పొలిమేర కవ్వలనే ఆంక్ష నందవలెను. మెకాలే మహాశయుఁడు, కాలక్రమమున ఆంగ్ల భాషాభ్యాసమువలన ఆంగ్ల సంప్రదాయములకు భారతీయులు దాసానుదాసులగుదు రనినాఁడు. ఆతని జోస్యము చాలవఱకు ఫలించినది. పాశ్చాత్య విద్య కలగూరగంపవంటిది. అందు మానవాభ్యున్నతికి తోడుపడు కొన్ని అంశములున్నవి. కనులు తెఱచి, వానిని పరిగ్రహించి యుంటిమేని, మనము ముందంజ వేసియే యుందుము.

జపానువాసులను పరికింపుఁడు. ఆర్థికోన్నతి నందు పట్ల పాశ్చాత్యులను అనుకరించిరి; వారితల దాటుచున్నారు. పాశ్చాత్య ఖండములందు వృద్ధిగాంచిన శాస్త్రములను, కళలను తమ భాషాంగణమున ప్రవేశపెట్టిరి. జపాను విద్యా సంస్థలందు బోధచేయుటకు విదేశీయు లెవ్వరును దిగుమతి కానక్కరలేదు. జపాను జాతీయత్వమును నిలువఁబెట్టినది జపాను సారస్వతమే. సారస్వతసేవికలై, జపాను స్త్రీలు ఆత్మజాతీయత్వమును కాఁపాడుకొని, వివిధాంగణములందు అగ్రసరులగుచున్నారు. ప్రాచీ ప్రతీచీ విద్యలు ఒప్పుల కుప్పనాడు బాలిక లట్లు జపాన్ స్త్రీపురుష జీవనములందు రంగారియున్నవి. జపానీయుల దైనిక జీవనమును పరికించి, ఆఱునెలలకు మున్ను శ్రీమతి కౌసల్యా కన్యగారు కోలాంపూరునం దుపన్యసించుచు నిట్లు ప్రస్తావించిరి. 'జపానులోని స్త్రీలు చాలఅభివృద్ధి నందియున్నారు. అన్నిశాఖలలోను వారు పురుషులతో సములై యున్నారు. ఎంగ్ విమెన్స్ క్రిస్టియన్ అసోసియేషనువారు ప్రారంభించిన తరగతులలో స్త్రీలు షార్టుహేండ్, టైప్ రైటింగ్ నేర్చుకొనుచున్నారు. గృహముల నెట్లలంకరించుకొనవలెనో బాలికాపాఠశాలలలో ముఖ్యముగా నేర్పెదరు. జపానువారియిల్లు చాల పరిశుభ్రముగాను, అందముగాను, ఉండును. ఎవరైనను లోనికి వచ్చుచో, చెప్పులువిడిచి ప్రవేశింపవలెను. లేదా, ఇంటివారిచ్చు పాముకోళ్లతో ప్రవేశింపవలెను. మట్టి, దుమ్ము, లోనికి పోకుండ నిది యుపయోగపడును.'

జపాను దృష్టాంత మెంతదనుక అనుకరణీయమో పిదప యోజింతముగాక.

# మనోరమ

రాజకుమారి

౧

నేనొక రాజకుమారుఁడను. వసంతసమాగమమున నలంకరించుకొను నుద్యానలక్ష్మి వలె రమణీయముగ శృంగారించుకొనుట, పాలుత్రాగు కాలమునుండియు నేను నేర్చుకొనిన విద్య. రూపమున, వేషమున, స్వభావమున నాచందమంతయు 'రాచకన్నియ' వలె నుండుననియు, పౌరుష లక్షణము లంతగ లేవనియుఁ జిన్నతనమున స్త్రీలు నన్ను ముద్దుచేయుట నాకు కొంచెము జ్ఞప్తియందున్నది. కాని చిన్నతనమున నడచిన కథలు, నన్నుగూర్చి కాంతాజనము లాడుకొనియున్న అవహేళనములు నాకంతగఁ జెప్పుకొన వలెననిలేదు. అట్లు చెప్పుకొనుట నాకు ఖ్యాతికిగాని, గౌరవమునకుఁగాని, క్షాత్రమునకుఁగాని కారణముకాదని నాకు పూర్తిగ దెలియును.

గ్రహపంచకము సూర్యునియందు గూడకుండనున్న శుభలగ్నమున నేను బుట్టియుంటినని జను లాడుకొనుచుందురు. అట్టి శుభలగ్నమున బుట్టియుండుటచేతనో, మఱియొందువలననో గాని నాముఖము మిగుల తేజస్వంతమైనదనియు, నాకన్నులాకర్ణాంత విశాలములనియు, శిరోజములు తుమ్మెద రెక్కలవలె నిగనిగలాడుచు నాడువాండ్ర వైఖరిని దీర్ఘముగ నుండుననియు కవులు వర్ణించుచుండుటనుబట్టి చూపులో, రూపములో నేనెట్టి వాఁడనో వేఱుగ జెప్పుకొనన క్కఱలేకయే జనులూహించుకొన వచ్చును.

మావంశ చరిత్రమున నొక ప్రాతకథ యున్నది. పూర్వము వీరశైవాచార పరాయణుఁడగు మా ప్రపితామహుఁడొకఁడు 'సర్వమ్ శూన్యమ్ శూన్యమ్' అని పఠించుచున్న బౌద్ధభిక్షువు నొకనిని నాస్తికుఁడనియు పాషండుఁడనియు నిర్ణయించి వానిని భీభత్సముగ నగ్నిగుండమున ద్రోయించి శూన్యతత్త్వమును ప్రత్యక్షముగ దెలిసికొమ్మని మిగుల ఘోరముగ జంపించెనట. చచ్చుటకు ముందా బౌద్ధుడు మావంశమున నెవనికిని జాగ్రదవస్థయందు జగత్తత్త్వము నుపలక్షించు జ్ఞానముగాని, సుషుప్తియందు గోచరించు మాయవస్తువుల తత్త్వముగాని లెప్పగా దెలియు శక్తియుండదనియు నెట్టకేలకు మాయందు కేవల మోసపుఁ జాయల కెదుఱుగ పోట్లాడు మహావీరుఁడొకఁడుద

యించి భ్రాంతిమూలకమగు నీ మాయా లోకమున బడిపోవుననియుఁ జెప్పియుండెనట. ఇట్టికథ కలదని మొదట నేను మాయమ్మ వలన దెలిసికొంటిని. ఆకథ యెట్లున్నను మా వంశమున నెల్లవారును 'ఆవిష్ణు: పృథివీపతి' అను పరమతత్త్వమునబట్టి జగద్రక్షణమున 'నిద్రాముద్రాం నిఖిల జగతీ రక్షణె జాగరూకామ్' అనురీతిని ప్రత్యక్షముగ నాచరణము లోనికి దెచ్చుటకోయన జాగ్రదవస్థ యందే కలలఁగనుచుండు వారఁట. బాల్య ప్రాయమునుండియు భ్రాంతి మూలకములగు నావేశములు నన్నదల్చివేయుచుండెను.

* దయ్యా మెఱుగవలయు! ఉన్నటులుండి పట్టపగలింటి నిత్యకృత్యముల సందడులనడుమ—జగత్తంతయు మృగతృష్ణవంటిదని భావించి కన్నుల కగుపడు మనుజులందఱును వట్టిచాయలనియు, సంసారమంతయుఁ గేవలస్వప్నమనియుఁ, బ్రాపంచిక చర్యలన్నియుఁ నైంద్రజాలికదృశ్యములవలె నిక్కములు కావనియు భ్రమించుచు, మాయామేయమగు భావతరంగములలోఁ బడి అగాధమగు శూన్య తత్త్వమున మునిగిపోవుచుందును.

చిన్నతనమున నాకిట్టి యావేశములు చాలతడవుల వచ్చి యుండవలయు. ఆకస్మికమగు నట్టి భ్రాంతి జాడ్యోన్మాదమున నొడలెఱుంగకుండ నేనేమి చేయువాఁడనో, ఏమైపోవువాఁడనో ఆపరమేశ్వరున కెఱుక!

అది తాత్కాలికోన్మాదమనియో, అపస్మారమనియో, మతి భ్రమణమనియో పేరులను గల్పించి తలలాడించుచు నపర ధన్వంతరులగు మా యాస్థానభిషగ్వరులు వారిబుద్ధికి దోచిన యుపశాంతులను జేయు చువచ్చిరి.

ఇఁక మాయమ్మ—ఆమె భూమిపై నవతరించిన అనుకంపదేవత!—మూర్తీభవించిన సుగుణరాశి!—ఆమెయట్టి దుర్దశాపీడితుఁడనగు నాకై వేయి దేవుళ్లకు మ్రొక్కుచుండెడిది. హృదయ మార్దవమున, కారుణికత్వమున, కోమల వాక్య కౌశలమునఁ బ్రపంచమున నెవ్వరును ఆమెకు సాటిరారు.

కాని మాతండ్రి—రాజైనవాఁడు సర్వకాలసర్వావస్థలయందును రాజుగనే ప్రవర్తింపవలయునుగాని ఏవిషయమునందును మృదుత్వము వహింపగాదని ఆయనయూహ. మా వంశమున పీడవలెఁ బట్టుకొని యున్న ఆబౌద్ధభిక్షుకుని శాపమును వారెప్పుడును లక్ష్యము చేయలేదు. దుష్టశిక్షణమునకు, శిష్టరక్షణమునకు వారు రాజ్యలాంఛనములను వహించి చండశాసనులై ప్రజామోదకరముగ రాజ్య

* దయ్యము దేవుఁడు.

తంత్రములను నిర్వహించు చుండిరి. మహా పవిత్రమైన దక్షిణ గంగాతీరము దక్షిణాపు టెల్లగాగల ఉత్తరాంధ్ర దేశమున వారిమాట సుగ్రీవాజ్ఞగ చెల్లవలసినదే.

గోదావరీనది కావలియొడ్డున నున్న ఒక చిన్న రాజ్యమును కమలాకరవర్మయను రాజు పాలించుచుండెను. ఆయన కిందిర యను నొకకుమార్తె యుండెను. అది ఎట్లు జరిగినదో ఏమో నాకు తెలియదుకాని ఇందిర నారాణియనియు, ఆమెనే [illegible] ననియు నే ననుచుండెడువాడను. నాకంతగ జ్ఞానమురాని శైశవావస్థయందే ఇందిరను నామనోహారిణిగ నెట్లు జేసికొంటినో నాకం చుకయును తెలియదు. ఆమెయే స్వయముగ వరించినదో, నే నే యామెను కోరుకొని రాణిగ జేసికొంటినో కాక ఇతరులే మమ్మా విధముగ భావించుకొనునట్లు చేసిరో మొదట సంతగ నూహించి తెలుసుకొన్న వాడను గాను. అయినను ప్రస్తుతసమున నేనెఱిగిన సంగతి యొకటి యున్నది. నాఖడ్గమును బంపి నా కా రాజకుమారితో ప్రధాన మహోత్సవమును చేసియుండిరి. అప్పటికి నేనారూఢ యౌవనుడనుగాను. అందువలన నే నిందిర నెన్నడును జూచియుండక పోయినను ఎనిమిదేండ్ల వయసునుండి ఇందిర నాభార్యయని చెప్పుకొనుట తటస్థించెను.

ఆదక్షిణ దేశమునుండి ఆమె సౌందర్యరేఖా విలాసములను గూర్చియు, సింహకిశోరములవంటి ఆమె సహోదరులను గూర్చియు వార్తలు నాకు తెలియవచ్చుచుండెను. నే నెప్పుడేమి చేయుచున్నను ఆమె చిత్రపటమును నాహృదయమునకు చేరువగ ధరించుచుండువాడను. మధుకోశమునందలి తేనెటీగలను పాలించు రాణివలెనే నాయౌవన ప్రపంచమున నామెను రాణిని జేసికొనుచు నే నానందించు చుండువాడను.

ఎట్టకేలకు నేనారూఢ యౌవనుడనైన ఆమెను స్వయముగ బరిణయ మాడునట్టి కాలము చేరువకు వచ్చెను. నాతండ్రి శాలిక [illegible] రత్నాభరణాది వస్త్రములిచ్చి కల్యాణమహోత్సవమునకై ముహూర్తనిర్ణయమును చేయించుటకు కావలె నామామగారి వద్దకు రాయబారులను బంపెను. అందులకు బదులుగ నా మహారాజు అమూల్యములగు సంఘాధరణములను, చిత్రవిచిత్ర తిచిత్ర వస్తువులను కానుకగాబంపి వివాహ విషయమైన ఎట్టి నిర్ణయమును జేయకుండగనే మారాయబారులను తిరుగ బంపి వేసెను.

వారా మహారాజును గాంచిరి. అతి వినయముగ చెప్పెనట.—"కల్యాణ విషయమగునట్టి ప్రస్తావనయు, నిశ్చయాధికయు జరిగియున్న మాట వాస్తవమే. అయిన నే నేమిచేయగలను? ఆమె కోరికరు చెప్పినట్లు చేయునదికాదు. అందులకు నన్ను దూషించ



మిసెస్ మార్గరెటు. ఇ. కజిన్సు.



ఆర్య కన్యాశాల, బరోడా.

వలసినది? కన్యాజనులకు నైసర్గికమైన పట్టుదలయును, క్రొత్తక్రొత్త పద్ధతులును ఆమెయందు ప్రబలముగనున్నవి. అందువలన నామె ఎల్లప్పుడును కన్యకాజనపరివృతయై, నవనవోన్మేషశాలినియై స్వేచ్ఛానుసారముగ నుండగోరి యున్నది. ఎట్లున్ననేమి? ఆమెకు పెండ్లిచేసుకొను నుద్దేశమెంతమాత్రమునులేదు."

ఆనాటి యుదయమున రాజప్రాసాదమున మా తండ్రియెదుట రాయబారు లావిధముగ జెప్పునపుడు నేనక్కడనే యుంటిని. చిన్నతనమునుండియు నాకుసహాధ్యాయులై తోడునీడవలె నన్ననుసరించి తిరుగుచుండు కృష్ణవర్మయు, పార్థసారథియు నా కిరుపార్శ్వముల నిలుచుండి యుండిరి. అందుఁ గృష్ణవర్మ చంచలమగు లక్ష్మిచే వంచితుండయి గ్రాసవాసోదైన్యములఁ గొంతవఱకుఁ జవిఁజూచి యుండినవాఁడు. వారి యైశ్వర్యమంతరించుట కాతని జనకుని భోగిలాలసత్వమే కొంతకారణ మనుకొందును. నాకును పార్థసారథికిని మేనులు రెండుకాని ప్రాణములొక్కటియని భావింపదగినంత ప్రణయమున్నది. అతఁడు నాకై తన మేనికంటెనైన గోసియిచ్చుటకు సంసిద్ధపడునంత కూరిమిగలవాఁడు.

రాయబారు లట్లు చెప్పునప్పుడు నాతండ్రి క్రోధతామ్రముఖుఁడగుచు నుదయాద్రిదోతెంచు భానుబింబమువలె మొగ మెఱ్ఱబడుచుండగ యుత్తరమును చించి యావలవిసిరి, వారు తెచ్చిన రత్నాభరణములను నేలపై బాఱవేసి, కమలాకరవర్మ కానుకగాఁ బంపిన ఆయమూల్యదుకూలములను తుత్తునకలుగఁ జీల్చి కాలఁద్రొక్కి వైచెను. "దౌర్భాగ్యుఁడు. ఒకలక్ష యోధులను బంపి వీని నధఃపాతాళమునకుఁ ద్రొక్కివేయుదును. నాకూతురిని తెచ్చియింట నుంచుకొనుటకు మత్స్యుఁడేనఁట? వాయువేగమున దాని నిచ్చటికిఁదెచ్చుకొని రానియెడల నేను క్షత్రియుఁడనుగాను." అని మాతండ్రిగారు క్రోధతీవ్రముగ ననుటయేగాక తమ సైన్యాధిపతులతో యుద్ధసన్నాహములఁ గూర్చి చర్చింప నారంభించిరి. కొంతసేపటికి నేను సాహసించి యిట్లంటిని:— "నాయనగారు! నన్నొకసారి వారియొద్దకు వెళ్లనిండు. వీరు తెచ్చిన వార్తయం దేదో గొప్పప్రమాదముండి తీరవలెను. ఆ మహారాజు ఈవిధముగ వ్రాయుట కేదో హేతువుండి యుండును. ఎల్లవా రతనిని యోగ్యుఁడనియు, గుణపూజ్యుఁడనియుఁ జెప్పుచుందురు. ఇంతేకు మన మింత శ్రమపడి కన్యకను దెచ్చుకొనిన తరువాత ఆమె మన మనుకొన్నంత రూపవతియు, గుణవతియుఁ గాకుండె నుంకు నేమో మొదటఁ జూచికొనవలసియున్నది. లేనియెడల నది పశ్చాత్తాపమునకుఁ గారణమగును."

# శారద లేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు

నెచ్చెలీ!

'గతానుగతికో లోకో న లోకః పారమార్థికః' అన్నటుల హిందీభాషపై నందఱు తలయొకరాయి విసరుచున్నారు గదా నేను మాత్ర మూరకుండనేలనని వ్రాసితివా? లేక హిందీభాషా వ్యాప్తివలన నాంధ్రభాషకేవియో చేటు వాటిల్ల నున్నదని నీకును వెట్టిభయ మేదియైన గల్గినదా? మాతృభాషయందలి గాఢాభిమానమా? హిందీభాషయందలి విద్వేషమా? లేక రెంటను పెనగొనుటవలన గల్గిన మనోవికారమా? హిందీభాషను కఠినముగా దూషించుచు నీవు వ్రాసిన జాబున కేమి యర్థమో తెలియజాలకున్నాను. అబ్బో! పలుకుపలుకులో నెంత కంటు! ఎంత యుడుకు! ఎంత దుడుకు! ఎంత కఱకు! ఎంత చుఱుకు వెలిబుచ్చితివి! హిందీని రాష్ట్రభాషగాం జేయవలయునను నుద్యమము నారంభించిన గాంధీమహాత్ముడు మొదలుకొని హిందీభాష నేర్చుచున్న సామాన్యవిద్యార్థిని వఱకు నెల్లరిని కసిదీర దూసి పోసితివిగదా. ఆంధ్రభాషకేదో యపకృతి కలుగనున్నదను భీతియే నిన్ని విధముగ నాందోళనపఱచి యిట్టి యుత్తరము నీచే వ్రాయించిన దనుకొందును. కాని నీ విన్నివిధముల నచ్చఁజెప్పినను నా కేలనో యీవిషయమై భయము గలుగకున్నది. నా పిచ్చినమ్మక మేమోగాని యిట్టి భాషా ప్రచారములు వేయిసాగినను మన తల్లిబాసకు దోసఁగు బొసఁగదని నాకు తోచుచున్నది. ఉగ్గుపాలతో బుట్టిన మాతృభాషేమి; హిందీ వ్యాప్తివలన నశించుటేమి? వేడినీళ్ళతో నిండ్లుగాలు నన్నటులున్నది నీ వాదన. పూర్వ మొకప్పుడీభాష హిందూస్థానము నంతయు వ్యాపించినదే గాని కొత్తదిగాదు. ఆనాడది రాజభాషగా గూడ నున్నటుల నిప్పటికిని వాడుకలోనున్న తాశీల్ దార్, శిరద్దార్ ఠాణేదార్, జమాదార్, శిస్తు, వసూల్ తయార్, కచేరీ, మున్నగు వ్యవహారపదముల గుఱుతునుబట్టి తెలియుచున్నది గదా. అంత రాజసన్మానమును బడసిన భాషయే మన తెలుగును చంపజాలక పోయినదిగదా. మఱియు నా రోజులలోనే యనేక ప్రసిద్ధకావ్యము లాంధ్రభాషలో వెలసినవి గదా. నాడులేని ముప్పు నేడాంధ్రభాషకు

హిందీవలన కలుగునా ? ఏదియో కారణార్థముగా నేర్వవలసిన భాష లివి. జన్మప్రభృతి మరణపర్యంతము వినియోగించునది తల్లి భాష. దీని నెవరు చంపగలరు ? లక్షలకొలది ధనము వెచ్చించి లెక్కలేనన్ని పాఠశాలలు నెలకొల్పి దొరతనమువారే స్వయముగా వ్యాపనము గావించుచున్న నింగ్లీషుభాషయే యిప్పటికి వేయింటి కొక్కరికైన రాకున్నదే !! యడుగడుగు నిరోధములతో నత్యల్పప్రచారకులతో నతిస్వల్పధన సహాయముతో సాగింపబడుచున్న హిందీభాషా ప్రచారోద్యమ మాంధ్రభాషను చంపివేయునని భీతిల్లుట రజ్జుసర్పభ్రాంతియేగాని వేఱుగాదు.

ఎవరితోనైన మీ తోబుట్టువును ప్రేమతో జూడుమని చెప్పినచో మీ యమ్మను ద్వేషించుమని యర్థము గాదుగదా. హిందీ భాషపై యభిమానము వహింపుడనిన తెలుగుభాషను ధ్వంసముచేయుమను నర్థ మెందున్నది ? ఎవరిభాష వారికి తల్లిభాష ! తదితర ప్రాంతీయభాష లక్కసెల్లెండ్రవంటివి. తల్లిపూజ్యత తల్లిదే తోబుట్టువు పూజ్యత తోబుట్టువుదే. ఒకరి పూజ్యత యొకరి కెన్నటికిని రాదు. ఒకరిపదము నొక రెన్నటికిని బడయరు. ఒకరి ప్రయోజనము నొక రెట్లును చేయజాలరు. కావున నెవరి స్థానమున వారి నుంచి యెవరి కీయవలసిన గౌరవము వారి కిచ్చి యెవరివలన పొందవలసిన ప్రయోజనము వారివలన బడయుచో వివాదమున కాస్పదమే యుండదుగదా. ఒకవేళ నిందు లోటుపాటు లేమైన గలుగుచున్నచో వెంటనే సవరించుచుండవచ్చునుగాని పిచ్చుకపై బ్రహ్మాస్త్రమునలె హిందీభాషపై వ్యతిరేక ప్రచార మెందులకు ?

ప్రస్తుత భారతదేశ పరిస్థితులనుబట్టి యావద్భారతదేశమునకును నేదేని యొకసామాన్య భాష యేర్పడియుండు టెంతయు నావశ్యకమై యున్నది. ఈ విశాలభారత దేశవాసులమైన మన మెల్లర మొక్కప్రభుత్వమునకు లోబడి యున్నారము. ఒక్కవిధమగు కష్టసుఖముల ననుభవించుచున్నాము. ఒక్కరీతి యుద్యమము నడుపుచున్నాము. ఈ విధముగా పాలించు ప్రభుత్వమొకటియు, అవలంబించు ధర్మమొకటియు, అనుభవించెడి కష్టసుఖము లొకటియు, చేసెడి యాందోళన మొక్కటియు నైనపుడు పరస్పరమనోభావముల దెలిసికొనుటకు భాషించుభాషయు నొకటిగా నుండు టావశ్యకముగదా. యావద్భారత దేశమున కుపకరించు భాషయొకటి ప్రచారమున లేకుండుటచేతనేగదా వందలకొలది భాషలుగల మనభారతదేశము విదేశీభాషతో నఖిలభారత వ్యవహారములను నడుపుకొనవలసిన దుస్థితి గల్గినది. చక్కని లిపులును సరసములగు భాషలునుగల్గియు నేదియు లేనట్టులు విదేశీభాషతో రాష్ట్రేతరవ్యవహా

రముల జక్కబెట్టుకొనుట యెంత యవమాన కరము !

ఈ మధ్య నేదియో పత్రికలో నొకరు హిందీభాషను సమర్థించి వ్రాయుచు నందొకచో భాషాభేదముచే రెండుగా విడివడి యున్న దక్షిణోత్తరభారతముల గలుపు వంతెన హిందీయని వ్రాసెను ఈ సాదృశ్యమున కే నెంతయు నలరితిని. ఒకరినొకరు తెలిసికొనుటకు సాధ్యమగు భాషాసౌకర్యమే లేనిచో నేకదేశస్థులైనను భిన్నదేశస్థులుగానే యుండవలసి వచ్చునుగదా. ఈ విషయము నాలోచించియే దూరదృష్టిగల మహాత్ముడు యేకభాషాప్రచార మారంభించెను. ఈమర్మ మెఱిగియే దొరతనమువారు దీని వ్యాప్తి కంగీకరింపక సాధ్యమగుచో నిరోధమునకే యత్నించుచున్నారు. నిజ మిట్టులుండ దీని వలన మన తెలుగుభాష కేదియో ప్రమాదము వాటిల్ల నున్నదని భ్రమపడి దీని నిరోధింప నడుకట్టుట నాకు జూడ యుచితముగాలేదు.

ఒక్కొక్కభాషను నేర్చుట యొక్కొక్క జ్ఞానపేటికను తెఱచుటవంటిది. కాన హిందీ భాషను నేర్చినచో నందలి విజ్ఞానముతో గూడ మనతెలుగుభాషను పుష్టినొందింప వచ్చును. తనబిడ్డలు బహుభాషా కోవిదు లగుచో మనభాషామతల్లి యింకను తుష్టియు పుష్టియు పొంది క్రొత్త క్రొత్త నగలతో గై సేయబడిన దగునేగాని నిరస్తభూష గాజాలదు.

స్త్రీలు హిందీభాష నభ్యసింప నుత్సాహ పడుట మఱెంత యనర్థదాయకమని నీవు వల వల లాడితివి. ఏయుద్యమ మైనను స్త్రీల చేయూతలేనిది పైకి రాజాలదు గాన అత్యంతావసరమగు హిందీ భాషోద్యమము నందుగూడ స్త్రీలు ముందంజవేసి తోడ్పడుచో నేకభాషా ప్రచార మత్యంత శీఘ్రకాలములో విజయ ప్రదమై వెలయుగలదు. కాన నిది మంచిదేగాని చెడుగాదు. కాన నీవు సంకోచము వీడి హిందీభాష నభ్యసించి నీపుత్త్రీ పుత్త్రులకుగూడ నేర్పించి మహాత్ముని సంకల్పమీడేర్పుము. భావిభారతరాజ్యాంగ వ్యవహారములందు వ్యవహార భాషయై వెలయనున్న హిందీభాషయందు నిప్పటి నుండి నీబిడ్డలు కుశలులగుచో వారి జీవిత వ్యవహారములు సుగమములు కాగలవు.

కల్పలతా, హిందీభాష నేర్వదగునని నేనింత గట్టిగా వ్రాయుటచే నాకు మాతృభాషపై నభిమానము లేదనిగాని, నిరసనము గలదనిగాని భావింపకుము.. కేవలము మాతృదుగ్ధముచే బెరిగిన బిడ్డవలె నేను కేవలము మాతృభాషవలననే విద్యనభ్యసించితిని ; మాతృభాషవలననే కొంత విజ్ఞానము సము పార్జించి నీకీమాత్రపు లేఖలను వ్రాయు

సామర్థ్యమును బడసితిని. కాన నాకు మన తల్లి భాషపై నెనలేని ప్రేమయు, భక్తియు గౌరవముగూడ గలదని తెలిసికొనుము కాని దేశకాల పరిస్థితులనుబట్టి మఱియొక భాషను గూడ నేర్చుకొనవలసిన యగత్యమును పెద్దలు— సహేతుకముగా——జెప్పుచున్నచో వాని నాటకించి మనవిధిని నెరవేర్చుట ధర్మమని నాయభిప్రాయము. నెచ్చెలీ, గత లేఖలో కడపటి వాక్యమునందున పొరబాటున పుత్త్రికా వివాహావ్యథా విచ్ఛేదమనస్కులని పడినట్లున్నది. వ్యథావిచ్ఛేదమైనచో నేకికన్నీటి బొట్టులకవకాశమే లేదు గదా, దుఃఖాశ్రువులానందాశ్రువులే యగును గదా, కాన వ్యథా మనస్కులనే తెలిసికొనుము.

ఇట్లు

1-1-35 మిత్రురాలు

భావపురి శారద

# సంక్రాంతి

ఒక అనిర్వచనీయమహోన్నతప్ర
భావ భావసముచ్చయప్రకటిత మగు
గరిమ గలదు యీమకర సంక్రాంతి యందు
లేకపోయిన మానవానీకమునకు
సంతసం బవారితగతి సాగుటెట్లు?

మకరసంక్రాంతినాడు నేమానవులును
హాయిగా సుఖస్నాతులై హర్షవార్ధి
నోలలాడుచుందురు సుఖాలవాల
మగుచు స్వీయమనమ్ము సౌఖ్యాబ్ధిదేల

చల్లనగ రాజకుమారి.

# బాలవిజ్ఞానశాఖ

## చిలుక పలుకులు

అడివిబాపి రాజగారు, బి. ఏ; బి. యల్.

" నేనమ్మ తమ్ముళ్లూ "!
" నెనెవలె అక్కాయ్ ? "
" నువ్వ చిత్తి పాపాయ్ ! "
" నేనేమి తెయ్యనే ? "
" బలికి పోల పాపాయ్ ! "
" నేను బలికి వెల్లనే ! "
" తాయిలమ్ము పెత్తా ! "
" బలికి వెల్లివత్తా ! "
" బువ్వ ఉలికె వేలా ! "
" నాకు పెలుగు వేయ్యే !
నాకు వెన్న వెయ్యే ! "
" లక్కపిలత తెత్తా ! "
" నాన్న యేలి అమ్మా ? "
" ఉత్తిత్తి నాన్నా "
" ఎక్కకెల్లె నాన్నా "
" పొలంవెల్లె పాపాయ్ ! "

## వడ్లగింజ కథ.

యింటూరి రామమోహనరావు గారు

అనగా అనగా ఒకవూళ్లో ఒకకాపు వాడు వానిభార్యయు నుండిరి. వారిద్దరును సుఖముగా వారికి వచ్చు ధాన్యమును తిను చుండిరి. ఒకరోజున కాపువానిభార్య చేటలో వడ్లు చెరుగుచుండెను. అప్పుడు ఒకకాకి పైనుండి ఎగురుచు చేటలోనుండి ఒక వడ్లగింజను ఎత్తుకొని పోయెను. అది చెట్టుమీదకు వెళ్లి వడ్లగింజను తినబోవు సమయములో రైతుభార్యకు కోపమువచ్చి చేతనున్న కర్రతో దానిని కొట్టెను. దానికి దెబ్బతగిలినంతనే వడ్లగింజ జారి చెట్టు తొఱ్ఱలో పడెను.

ఆమె కాకితోకను పట్టుకొని నా వడ్లగింజనిచ్చెదవా? లేక చచ్చెదవా? యని యడుగ అది వడ్లగింజ తెచ్చియిచ్చెదననెను. అది చాలా ప్రయత్నించెను. కాని అది లోతునకు పడుటచే లాభము లేదయ్యెను. అప్పుడు ఆకాకి కట్టెలు గొట్టువాని దగ్గరకు పోయి ఆ చెట్టును కొట్టి, వడ్లగింజను బయటకు తీసి తన ప్రాణమును రక్షింపవలయు ననెను. కాని వాడు అట్లుచేయుటకు యిష్టపడ డయ్యెను.

అంతఆకాకి రాజునొద్దకుబోయి ఆకట్టెలు గొట్టువానిని చంపుదునని భయపెట్టి, వడ్ల

గింజను తీసి తన ప్రాణమును రక్షింప మని యెను. కాని రాజు అందుకు నిష్టపడ లేదు.

ఆకాకి రాణియొద్దకుబోయి రాజుగారితో చెప్పు మన ఆమె యొప్పుకొనదయ్యెను. అప్పుడు పాము యొద్దకుబోయి రాణినికరువు మన అది కరువ ననెను. కర్రయొద్దకు బోయి పామును చంపమన అది చంపననెను. నిప్పు యొద్దకుబోయి కర్రను కాల్చుమన అది కాల్చననెను. నీళ్లయొద్దకు బోయి నిప్పును ఆర్పుమన అది ఆర్పననెను. అప్పుడు ఎద్దు యొద్దకుబోయి నీరు త్రావుమన అది త్రాగననెను. అప్పుడు పలుపు యొద్దకు బోయి ఎద్దును కట్టమన అది కట్టననెను.

ఎలుక యొద్దకుబోయి త్రాడును కొరుక మన అది కొరుకననెను. పిల్లియొద్దకుబోయి పిల్లీ పిల్లీ ఎలుకను చంపమన అది ఎలుకను చంపుటకు ప్రయత్నించెను.

ఎలుక పలుపును కొరక నారంభించెను. పలుపు ఎద్దునుకట్ట నారంభించెను. ఎద్దు నీరు త్రాగనారంభించెను. నీరు నిప్పును ఆర్పనారంభించెను. నిప్పు కర్రను కాల్చ నారంభించెను. కర్రపామును చంపనారంభించెను. పాము రాణిని కరువ నారంభించెను. రాణి రాజును కట్టెల వానిని చంపమనెను. రాజు కట్టెల వానిని చంపుటకు ఉత్తరువు యిచ్చెను. కట్టెల వాడు చెట్టునుకొట్ట మొదలు పెట్టెను. తరువాత కాకి తొఱ్ఱలో నుండి వడ్లగింజనుతీసి కాపువాని భార్యకు నిచ్చి ప్రాణమును రక్షించు కొనెను.



# నాగరక నిశీథము

వడ్డాది సీతారామాంజనేయులుగారు

శ్రీమత్పురాణ తీర్థున్ । శ్యామాపదభాసు సూర్యనారాయణు స ।
ద్ధాము జగన్నాథుఁ గొలిచి । యోమనస ! తమఃప్రపీడ నుడిఁగి వెలయుమా ॥

క. నరులకుఁ దప్పనిసరిసై । బ్బరయగుట్రైన్ డిగ్గి సఖునిబసయెదొ వెదుకన్ ।
దిరుగుచునుండఁగ 'మార్కెట్' । సరసను నే నొంటిగంట టంగున వింటిన్ ॥

క. చమురు పురపాలకుల దీ । పములన్ దగినంతలేక భగ్గునమండున్ ।
నిముసమున నారిపోవును । 'దమాష'యో ! దాననేమి తత్త్వముగలదో ?

కం. గస్తీ తిరుగు తలారుల్ । రస్తాలకుఁ బ్రక్కఁగల వరండాలపయిన్
మస్తుగ బస్తీలో నే । కోస్తానో వేళమఱచి కునికెదరు కదా !

గీ॥ ఫ్యాక్టరీల, నాఫీసులన్, బడులలోన । షాపులన్ బగలంతఁ గష్టమ్మునంది
సేద గొనుచుండి రిప్పుడు పేదవారు; నిజముగా వారిదేకదా? నిండుహాయి!

సీ॥ స్వవినాశకరపానపాత్రమ్ముఁబూరించుఁ దనియ కింకొకమాఱు త్రాగుఁబోతు
రజనిచరిత మూని గజిబిజిలేకుండ సన్నసన్నగఁ దారుఁ గన్నగాఁడు
నిజపవిత్ర వ్యక్తినే దున్మకొననెత్తు నతిపాతకపుఁజేయి నాత్మహంత
కనులు పొరలుగ్రమ్మ తన పెరయునువాసిఁ దొలఁగి విజృంభించు ధూర్తజనము

గీ. కయిపు, నేరముఁ, బటు నిరాశయును,
బహుళభావ కోలాహలమును దుర్భరము నగుచుఁ
గడు నిరంకుశముగ నడావుడి యొనర్చి
వారణకు సైరణకుఁ గాక ప్రబలునిపుడు.

క. మునుపటి ముచ్చటలును నా। ధుని కప్రాగల్భ్య సూత్రధోరణులును జిం
తనచేసి రేయిగెడపక చనియెద నేకాంతమార్గ సంచారుఁడనై ।

గీ. అనవరతమును బరిణామ మందుచుండి, జాముక్రిందట నాముందుసాగినట్టి
డాంబికు లొనర్చియున్న యాడంబరంబు, పెంకిపిల్లల పెనుగడబిడయడంగి
నట్టులుఁ, దుపానువెలసినయట్టు లిపుడు తనకుఁదానె యిటన్ మాటుమణఁగిపోయె!

సీ. మినుకుమిన్కనెడు పచ్చనికాంతి నెగఁజిమ్ము నారిపోవుచునున్న యట్టిదివ్వె,
టక్కుటిక్కని నిరాటంకమ్ముగా మ్రోఁగు 'క్లాకు' చప్పుడు దక్కఁగలుగదొండు,
కావలి కుక్కలు గావించు మొఱ్ఱలు కడువవ్వనను మాత్రమడరుచుండె,
గర్వదుర్ధర్ష సంఘర్షణోత్కర్షమ్ము సర్వమ్ముఁ బూర్తిగా సమసిపోయె,

గీ. మానవాడంబరమ్ము సమస్తమెంచ వృథ వృథాయంచు ఘోషించు వేయినోళ్ల
నిట్టిగడియ యొక్కటెచాలు; నెంతవిషమ, మెంతటితమిస్ర భూయిష్ఠ మిదితలంప!

శా. ఈ తాత్కాలికపూరహస్థ్సితికి నిత్యత్వమ్ము సంధింపఁగన్
వ్రాతమ్ముల్గ వసించు మానవులతోపాటీపురమ్మంతయున్
భీతిన్గొల్పు నెడారియై సహజమా విస్ఫూర్తి సంపూర్తిగా
ధూతమ్మై సమయంగ, వేళయొకఁడేదో తప్పకేతెంచెడున్.

గీ. ఈపురము కైవడి బ్రసిద్ధి నెనసి జయము,
నపరిమితహర్షము, మహోచ్ఛ్రయమ్ముగాంచి
యమరతను బొందియున్నట్టి యడఁచి
పడుచు గ్రుడ్డినమ్మకమున నెన్ని క్రుంగినవియొ!

క. పలుతరముల క్రిందటివారలకే యొక కొన్ని నగరరాజము లెచటన్
నెలకొని విలసిల్లినవో పొలిమేరయు నైన నుంత పొడకట్టదుగా!

క. మఱికొన్ని వెలుపునిడు పాడటిన నగరభాగములను నతిచింతాసం
భరితాంతఃకరణుండగు తెలవరి కని త్రొక్కికొంచుఁ దిరుగాడుఁగదా!

గీ. పాంథుఁ డందలి శిథిలతావస్థఁగని ప్రబోధమొంది యీ యైహిక భోగమెల్ల
క్షణికము, నశాశ్వతమ్ము, నశ్వరమునంచు నట్టెనిట్టూర్పుపుచ్చుఁడే బెట్టిదముగ!

సీ. "ఇదె! నాఁటి కోటప ట్టిపుడు చెత్తచెదారమలముట నిచటఁ జిట్టడవి బలిసె
నల్లదే! రాజసభాగార మచట నిప్పుడు విషోరగతతుల్ బుసలుగొట్టు
నచటనే దేవాలయములు, నాటకశాలలొప్పె నిప్పుడు వట్టితిప్పలయ్యె
నదియె! యంతఃపుర మచట నిప్పుడు నక్కలెల్ల గొల్లున నెలుఁగిచ్చుచుండె

గీ. నక్కటా! వినోదమ్ములు, నధికలోభవర్తనమ్ము లెంతయు దుర్నివారమగుట
నాఁటి యీపెంపు సొంపెల్ల నాఁడునాఁడు జీర్ణమై తుట్ట తుదకు నశించిపోయె!

క. కేవల వినోదకులకే యీ విభవాధిక్యమెల్ల నీగిగఁజెల్లెన్
ప్రావీణ్యముగల యామేధావుల కొకలేశమైన దాననొదవెనే?

చ. పరిభవమొందితొల్తఁ, బిదపన్ ద్విగుణమ్ముగఁ బంతమూని, ని
ష్ఠురగతిఁ దాఁకి, గెల్చి ప్రతిశూరుల నెల్లర ఘోరమృత్యుభీ
కరముఖకందరమ్మున నగాధమునన్ దిగఁద్రోసి మాపఁగాఁ
బురికొలిపెన్ విరోధులను భోరున నీపురభాగధేయమే!

గీ. జాముక్రిందట నలబల మాముకొనిన వీథనొక్కఁడెక్కడనొ కన్పించుటరిది!
యిపుడు ముందటివేసమ్ములెల్లమాఱెఁ! బతనమును, దైన్యమును దిగంబరతనొందె!

గీ. మున్ను ధనికుల ముంగిళ్ళఁబొందినట్టి దుఃఖదైన్యమ్ము మఱచి వీథులను గటిక
నేలనే కొంతవట్టు శాంతిగను మేనువ్రాల్చి కూర్కుచునుండు నవ్వారలెవరొ?

ఉ. కొందఱు క్రొత్తవాంద్రు, మఱికొందఱు పాంథు, లనాథులిందులోఁ
గొందఱు; వీరలొందుగతి కుంచిత, మయ్యది తీర్పనేరికిన్
చెందమురాదుగా! మఱిఘటిల్లిన వీరి విపత్పరంపర
స్పందనమున్ గనుంగొనిన బండకు సైతము జాలిపుట్టదే!

గీ. మానరక్షకుఁ జింకిపాఁతైన లేదు! రోగపుంజమ్ము దర్పించి రొప్పుచుండుఁ!
గటకటా! దీనజనుల దుర్గతి గనంగ। గర్భనిర్భేద్య, మతిభయంకరముగాదె!!

గీ. లోకమక్కట! వీరినిరాకరించె। సంఘమూ, మోము వెడఁజేసి సాగిపోయి,
యాఁకటికి ఘోరనగ్నత కసదలైన వీరి నొక్కుమ్మడిగ బలివెట్టుచుండె!!!

గీ. చలికి గడగడవడఁకుచుఁ గలఁతనొందు దీనురాండ్రగునట్టి యీ మానవతులు,
కాల మమితసౌఖ్యమున నొకానొకపుడు హాయిగా వెళ్లఁబుచ్చిన యట్టివారె!

గీ. అందగత్తెలలో మంచికుందనంపు బొమ్మలని చూపరులచేత మోదపరవ
శత్వమునఁ గావ్యవైఖరిఁ జతురఫణితి నహహా! వినుతిసేయఁగఁ బడినట్టివారె!

గీ. షోకు గడిమించి పోకిళ్లఁ జొక్కిసోలు పరమదుర్మార్గు లొడ్డినయురులఁజిక్కి
యీ మృగాక్షులు నిజమానమెల్లనకట! కొల్లఁబోయి యేలాగున డిల్లపడిరొ!

గీ. మానధనమెల్లదోఁచి దుర్మార్గులయయొ! ఘోరశీతలాధివ్యాధిఁ గూల్చిరిపుడు!
వీర లెట్టు లీ దురవస్థనోర! యోర్చుకొనఁగలారొ? ప్రాణములూని మనఁగలారొ?

గీ. లగ్గుసేయకె యెగ్గుఁదలంచు ఖలుల, ఘోరపాషాణహృదయులౌ కుచ్ఛితులను,
ద్రోహమే రూపుగాఁగొన్న తుచ్ఛజనుల, జాలిజాలువాఱఁగ బ్రతిమాలుకొఱకు
వారి గుమ్మాలదగ్గఱ వీరలిప్పు 'డుస్సు' రనుచు సాఁగిలఁబడియుండిరొక్కొ!

గీ. వీరి దుర్భరదురవస్థ సారెఁగనుచు సైపఁనోపను, సాయమ్ము సలుపలేను;
చిల్లిగవ్వైనఁగాని నాచేతలేదు; నేను జన్మించితినిదేల మానవునిగ?

గీ. దిక్కుమొక్కునులేని యోదీనులార! యూరకీలోకమెప్పుడు దూఱుఁగాని
మిమ్ముఁజేరఁదీసి కనికరమ్ముఁజూపి కావనుంకింప దదియేమికర్మమొ? కట!

గీ. గొప్పవారల కొంచెపు దెప్పరమ్ము, లేనిబెదరూను ధనికుల మానసార్తిఁ
గొండలను మించుగఁతి గోటిగుణితమగుచుఁ జాటఁబడుచుండుఁ జండవాచాటధాటి
మనమనస్సును, దృష్టిని మలుపుకొనఁగ.

గీ. పేదలిడెడు మొఱ్ఱ లరణ్యరోదనములు! వారిని నిరంకుశక్రూరపాలనమ్మ
నందు నత్యల్పులునుగూడ నడఁచుచుందు; రితరులకునెల్ల భయమ్ము నిచ్చునట్టి
చట్టమే వీరియెడల రాక్షసతఁబూను!

గీ. ఇంతయుద్వేగపరిపూర్ణహృదయమేల దైవమా! నాకుఁ గల్పించినావు నీవు?
ధర్మబుద్ధికిఁదగిన విత్తమ్ము నెందుకిడవొ? తెలియఁగరాదు నీసృష్టిలీల!

గీ. దీనత సహాయు మర్థించువానికంటెఁ। దుర్భరముకాదె! హృదయాననిర్భరంపుఁ
గరుణయుప్పొంగియును దగుశరణమిచ్చి। హాయిఁగూర్పఁగలేని నిరర్థకునకు.

గీ. వేఁడికన్నీటికెరటాలు విరిగిపడుచుఁ డెమలి తెరపి యైనపుడెల్ల దిగులుమిగుల
నీదురంతదృశ్యముఁ గంటి, నింకఁ జూడఁజాల కేటొముందటికిఁ బోవసాగినాఁడ.

చం. అట 'రుదురాకపిల్లి' పగలంతయు శీలముఁ గూర్చి బిట్టు ము
చ్చటలొనరించి రాతిరి మిషన్ దనదుర్వ్యసనాళికెల్లఁ జీఁ
కటిముసుఁగేసి దాఁచుటకుఁగా నతిదారుణయత్నమూనె; రేఁ
పుటకయివానిఁ దారుచును బోయెదునిప్పుడు సన్నసన్నగన్.

గీ. కన్నుకన్నును గనరాని చిన్నిసందువోట జాపోసికొంచు వేవేగనెట్టు
లతఁడు జనుచుండెనో చూడు మడలిపోయి కనెడుముఖమెల్లఁ బరిచితికలనినోలె!

గీ. తాను మదినేవగించెడి మానవాళిఁ గలసి ముదమునటించుచుఁ గడపెదివస
మెల్ల; నిపుడు తననుఁ గొని కృత్రిమంపుఁ బ్రియముఁ జూపువారలఁ జేరు రేయినలర!

గీ. వానిదుశ్చరిత్రము బయల్పడునుగాక! తెల్లవాఱె, మొగంబెల్లఁ దెల్లఁబాఱె
యెల్లవారిచీవాట్లకు నిడియఁబాఱె యెక్కిరింతల పాలయి స్రుక్కుఁగాక!

గీ. ఇంతదూరమ్ము చర్చింపనేల నాకు? పాపవర్తన మొకమాఱు బయలువడిన
నంతకంతకు హెచ్చి సాహసము రెచ్చి। వాచనకుఁదోడు సిగ్గుమాలించుఁగాదె!

గీ. శబలమాయావనికదాఁటి, శాంతినొంది, జ్ఞానసుధఁదోఁగి, జ్యోత్స్నాపథాననేఁగి
తత్త్వముఁ గ్రహించి, శాశ్వతత్త్వముఁ గమించి। యాత్మసేవ 'సోహమ్మ'ని యనుముజీవ!




సుందరవదనము ఆకృతి ప్రవర్ధనమగుటకు కారణముల నరయుటకు సాధారణముగ స్త్రీపురుషులు ప్రయత్నింపరు సరేగదా తలంపనైన తలంపరు. కాని సౌందర్యమును సేకరించి తన్మూలమున కళయొక్క పూర్ణాకృతిని ఛాయారూపమున ప్రపంచమునకు ప్రదర్శింప దివారాత్రములు పరిశ్రమించుచుండు చలన చిత్రగ్రాహకులు అపుడపుడు సౌందర్యరహస్యముల నెఱుగుటకు ప్రయత్నముల చేయుచుండుటను మన మెఱుగుదుము. చలన చిత్రములను తయారుచేయు ఒకసంఘము సౌందర్యమూర్తులుగ ఆరాధింపబడు చున్న కొంతమంది యువతులను వారివారి సౌందర్య పోషణావిధానముల నెఱింగింపుమని కోరిరి. ప్రత్యుత్తరములు పలువిధములుగ నుండినవి. ఎక్కుడుగ విశ్రాంతి గైకొనుటయు నిదురించుటయు తా మనుసరించు పద్ధతియని పన్నెండుమంది యువతులు తెలిపిరి.

ఎక్కుడు జలమును గ్రోలినయెడల సౌందర్యము పోషింపబడగలదని ఒకయువతి చెప్పెను.

శరీరమునకు యెక్కువ వ్యాయామ పరిశ్రమ ఇచ్చుటవలన సౌందర్యపోషణ కాగలదని మువ్వురు స్త్రీలనిరి.

తన సౌందర్యమునకు కారణమేమో తనకే తెలియదనియు సహజముగనే అభివృద్ధి పొందుచున్నదనియు ఒక యువతి తెలిపినది.

మువ్వురు యువతులు సుగంధలేపముల ప్రయోగమే సౌందర్యపోషణమునకు సాధనమని తెలిపిరి.

పై యభిప్రాయములలో కడగొట్టు సాధనము మినహాయించి గమనించుచో తక్కిన యభిప్రాయము లన్నియు చాలావరకు ఆలోచింపతగినవిగ కానుపింపగలవు.

నిండుజవ్వని వారముదినములు ఒకేవిధమున పనిచేసి రాత్రులందు నిద్దరపోకుండ ఒంటిగంటవరకును మెలకువతో వున్నచో ముఖమునకుగల తేజస్సు కొంతవరకు మరుగుపడును. ఒకవిధమగు 'మొద్దుబారిన' రూపము ముఖమున ముద్రనైచును. అటులనే ఇంకను యెక్కుడు కాలము అవసరమగునంత నిద్రలేకున్నచో కన్నులలోని కాంతి నశించును. అకాలముననే తలవెంట్రుకలు నెరిసిపోవును. ముఖమునం దిట్టి మార్పులు కలుగుచో సౌందర్యము మారగలదు. కాన ఇట్టి మార్పులు కలుగకుండ చేయవలెననిన, ముఖ్యముగ శిరోజములు అకాలమున నెరసిపోకుండ చేయవలయుననిన, అవసర మగునంతవరకు నిద్దుర చేయుచుండవలయును.

ఇంక రెండవఅంశమును గమనింతము. ఆరోగ్యమును కాపాడుకొనుటకు ప్రతివ్యక్తియు దినమునకు ఆరేడు లోటాల చల్లని పరిశుభ్రజలమును గ్రోలుచుండవలెనని నిర్ణయింపబడినది. ఇట్లు జలమును గ్రోలుటవలన అంతశ్శుద్ధి యేర్పడగలదు. శరీరమం

దిలి స్వేదరంధ్రములగుండ దేహములోని మలిన పదార్థములు బయటికి విరివిగా వెలువడును. ఎక్కుడు చెమటవచ్చుట ఆరోగ్యసూచకము. చెమటరూపమున శరీరమందలియు చర్మమందలియు మాలిన్యము పోవుటవలన చర్మకాంతి యెక్కువ కాగలదు. చర్మకాంతి సౌందర్యలక్షణములలో నొకటి.

పిమ్మట సౌందర్యపోషణమునకు కావలసినది వ్యాయామపరిశ్రమ: ఇందుకూడ సత్యమున్నది. శరీరమందలి ప్రతిఅవయవమునకు తగినంత కష్టమిచ్చిననే గాని సుందరాకృతికి అవసరమగు సర్వతోముఖాభివృద్ధి వుండదు. అందుకుగాను పాశ్చాత్యవనితలు వ్యాయామపరిశ్రమకు గడంగెదరు. ఇట్టి యవసరమే మన దేశమందలి ధనికుల ఇండ్లయందలి స్త్రీలకుకూడ యేర్పడినది. తినుట, బుద్ధిపుట్టిన ఏదియేని చదువుట లేదా ఇల్లు విడిచి మోటారులోనో, మరే శకటములోనో శరీరము త్రిప్పుట, మరల యిలుచేరుట—యిది వారి జీవన విధానము. దీనివలన శరీరమునకు అవసరమగు పరిశ్రమయేలేదు. ఫలితముగ తిన్నతిండి జీర్ణము చేసికొనుట కొకమందు, కాలశంకల నివర్తించుట కింకొక కృత్రిమసాధనము, ఈ విధమున అవసరము లేర్పడును. అవసరమున శరీరమునకు వలసిన పరిశ్రమకై వ్యాయామమునకు గడంగవలయును. శరీరమునకు అవసరమగు పరిశ్రమను ధనికులు వ్యాయామము ద్వారా ఇచ్చెదరు. తన్మూలమున సౌందర్యము పోషింపబడగలదు.

ఈ యన్నింటికన్నను గమనార్హమైనది తన సౌందర్యాభివృద్ధికి కారణము ఫలానిదని చెప్పలేనని స్త్రీ అభిప్రాయము ఈ వాక్యమునుండి పరిగ్రహింపబడవలసినది గూడ నేని గలదు. విపరీతముగ పెరిగిన చెవులో, ముక్కో లేకుండ అన్ని అవయవములును సాధారణముగ నుండిన యువతి సక్రమమగు జీవితము గడుపుచో ఆమె సౌందర్యాభివృద్ధికి కారణము ఫలానిదని చెప్పుటకు అవకాశ ముండదు. తన సౌందర్యము సహజముగనే పెరుగుచున్నదనియు, ప్రత్యేకముగ పేర్కొనదగిన విషయ మేమియును లేదనియు వివరించిన యువతి జీవితము యీసక్రమ జీవితమును గడపు వనితల కాదర్శప్రాయమై యుండుననుటలో సందియము లేదు. యువతి సహజమైనిక జీవనములో కృత్రిమ విధానములకు గాని, సోమరితనమునకు గాని బలిగాకుండ గృహకృత్యనిర్వహణమందును, ఇతర విషయములందును శరీరమును దాచక కష్టించి పాటుపడుచుండుచో శరీరమందలి ప్రతి అవయవమునకును శ్రమయుండును. తద్వారా అవయవములన్నియు సత్యముగ అభివృద్ధినొందును. దాన సుందరాకృతి తనంతట యది పెంపొందుచుండును. గృహకృత్యనిర్వహణమునందు శరీరము నలుగును. వింతవింత యాహారములకును, మాజూనులకును పోక అవసరమగు శుభ్రజలమును గ్రోలుచు, సహజమగు సాధారణాహారమును భుజించుచున్నచో శరీరము చక్కబడగలదు. శరీరమునకు సహజముగ నీయబడిన కష్టమువలన దేహమందలి ఉష్ణరక్తము అన్ని భాగములకును విరివిగను, సక్రమముగను ప్రవహించి సౌందర్యపోషణకు వలయు తేజస్సుకు, అంగసౌష్ఠవమునకు కారణమగుచుండును.

ఎస్. శేషగిరి రావుగారు. ఎల్. ఐ. యమ్.



మిసెస్. మెహ్రూ దాదాభాయిగారు.

స్త్రీధర్మ పత్రికాసంపాదకురాలు, కార్యదర్శి, మదరాసు నగరమున నొకగౌరవ మేజిస్ట్రేటు

# గ్రంథ పరిచయము

### మనస్స్వాతంత్ర్యము (తృతీయభాగము):—

డెమ్మీసైజు సుమారు 170 పుటలు. వెల రు. 0-8-0 గ్రంథకర్త శ్రీయుత వల్లూరి సూర్యనారాయణరావు గారు, బి. ఏ. బి. యల్, యల్. టి., హైకోర్టు అడ్వకేటు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠకార్యదర్శి, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. దఫదఫాలను ఆంధ్రపత్రికలలో ప్రకటించిన 31 వ్యాసముల సంపుటము. మతవిషయిక, సాంఘిక, రాజకీయ, వ్యావహారిక సమస్యలపై గ్రంథకర్త తన ఉద్దేశ్యములను నిర్మొగమాటముగ ప్రకటించి తనమనస్స్వాతంత్ర్యమును ధృవముగ తెలియపరచినారు. మతవిషయములో మానవులు పురాతనాచారదాసులుగను, రాజకీయములలో కృత్రిమ సిద్ధాంత ప్రచారకులుగాను, వ్యావహారికములో స్వలాభపరాయణులుగాను, ఆత్మవంచకులుగాను ఉండక స్వతంత్రాలోచన పరాయణులై మెలగగలుగుటకు ఈవ్యాసములు మార్గదర్శకములుగ నుండగలవనుటకు సందేహము లేదు. ప్రతీవ్యాసమును ఆధునిక విజ్ఞాన విమర్శనా పద్ధతులను వెల్లివిరియుచున్నది. పాఠకులు అన్నివిషయములలో నతనితో ఏకీభవించకపోయినను, అతనివలె స్వంతవిమర్శనముచేయునిదే లోకాచార వ్యవహారములను యథాతథముగా విశ్వసింపక, హేతువాదముమీద తమ విశ్వాసముల నాధారము చేసుకొని ప్రవర్తించవలసిన ఆవశ్యకత యిక్కాలమున నెంతయేని గలదు. పంతులుగారు ఈ వృద్ధాప్యములో గూడ విశ్రాంతి పొందనొల్లక హేతుజ్ఞానాభివృద్ధి కొరకు నిరంతరము తన లేఖినిని నియోగించుచు, ఉత్సాహపరవశత్వములో యువకులనుగూడ మించుచుండుట పాఠకుల కాశ్చర్యమును గొలుపక మానదు.

### ప్రాణంపెట్టిన భర్త:—

ఫూలుస్కేపుసైజున ఏడుపుటలుగల చిన్నినాటిక. గ్రంథకర్త్రి శ్రీమతి కా. రాధాసుందరమ్మగారు c/o 'విజయ', విజయనగరం. సావిత్రీదేవి తాను వరించిన సత్యవంతుని అల్పాయుష్కునిగ నెఱింగి కూడ వివాహము చేసుకొని, మృతుడైన భర్తను మృత్యుభర్తయగు యముని యనుగ్రహమున బ్రతికించుకొని కీర్తివతియైనట్లు, అల్పాయుష్కుడగు రురుడు ప్రమద్వరను వరించి, ఆమె చనిపోగా యముని ప్రత్యక్షము చేసుకొని, తన యాయువులో సగమామెకిచ్చుట కొప్పుకొని ఆమెను బ్రతికించుకొని యముని యనుగ్రహమున నామెతో చిరకాలము సుఖింపగల వరమును బడసిన వృత్తాంతము. ఏకాంకనాటకము. భావగర్భితము. సుందరమైన గద్యశైలి.

### భక్తిప్రసూనమంజరి:—

క్రౌనుసైజు 48 పుటలు యువకసమితి గ్రంథమాల ప్రథమ కుసుమము. శతావధాని రామలింగశాస్త్రి గారు (కృష్ణజిల్లా, కలువపాముల) దీనివ్యవస్థాపకులు. ముకుందమాల శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రముల సంస్కృత ప్రార్థన శ్లోకములకు ప్రౌఢమగు ఆంధ్రీకరణము. శ్రీ రామచంద్రదేశముఖుగారు (కంథంమెట్టుదరి ముత్తగూలెంపోస్టు బయ్యనగూడెం) గ్రంథకర్త.

### భద్రాద్రి రామశతకము:—

క్రౌనుసైజు 60 పుటలు 150 సీసపద్యములు. పిఠాపురం వాస్తవ్యులు శ్రీసత్యవోలు సుబ్బారావుగారు

గ్రంథకర్త. భక్తిరస తుందిలము. కవితామతల్లి గ్రంథకర్తగారిని, రోగదశలో ఆవేశించి దీనిని వ్రాయించి ఆరోగ్యవంతునిగా చేయుటచే ఆమె యొక్క మహత్వము మాధుర్యము వత్సల్యము దయారసము తెలుగగోరువారెల్లరును దీనిని పఠించి మానసికారోగ్యమును పొందదగును. వెల రెండు అణాలు.

శ్రీ జనార్దన శతకము:—

క్రౌనుసైజు 22 పుటలు—కవయిత్రి శ్రీమతి దొంతుకుర్తి రాజరత్నమ్మగారు, ఏలూరు. నీతిపూరితము, భక్తి భరితము, మధురశైలిగలిగి కవయిత్రి యొక్క సుందరతర ప్రజ్ఞకు నిదర్శనమైయున్నది. కవితామతల్లి మన ఆధునికాంధ్ర మహిళా మణులను గూడ ఆదరించి వారిచే ఇట్టి ఆవేశపూరితములైన గ్రంథములను వ్రాయించి మొల్ల, వెంకమాంబ మొదలగు వారిని బురుషింప జేయుచున్నదని పాఠకులకు తెలియగలదు.

హిందూ దేశ భూగోళము;—

క్రౌనుసైజు 68 పుటలు. హిందూదేశమునుగూర్చిన సకల భౌతిక, ఆర్థిక, సాంఘిక విషయములను బోధించుచూ పాఠశాలలో పఠించు బాలురకు కావలసిన విషయముల నెల్ల సమగ్రముగ చర్చించుచున్నది. గ్రంథకర్త కీ॥ శే॥ ఏ. జోసెపుగారు. వెల రు. 0-8-0 లు. నవీన కథా బుక్కుడిపో (బర్మా రంగూన్. వారిచే ప్రకటితము.

బర్మా భూగోళము:—

ఇదియుపై గ్రంథకర్తగారిచే రచితమే. అదే వెల. క్రౌనుసైజు 72 పుటలు. బర్మా విద్యార్థులే కాక ఆంధ్రవిద్యార్థులును నేర్వతగ్గది.

పూలదండ.—

క్రౌనుసైజు 22 పుటలు. కందపద్యముల శతకము. "తనయా" అనుమకుటము. తండ్రులు తమపుత్రికా పుత్రులకు చెప్పనగు నీతులు బుద్ధులు గలిగి, పిల్లలకు సుబోధకమై యున్నది. శ్రీయుత బులుసురామలింగ శాస్త్రిగారు గ్రంథకర్త. శ్రీయుత నడ్డాది సీతారామాంజనేయులుగారి శిష్యబృందములోని వారగుటచే వారిపదగుంభనము దేశభక్తి భావగాంభీర్యము నిందు ప్రతిపద్యమునందును తొలుకాడుచున్నవి.

వాసవి:—

తొమ్మిది సంవత్సరములనుండి నిరంతరముగ ప్రకటింపబడుచున్న సుప్రసిద్ధాంధ్ర ఆర్యవైశ్య మాసపత్రిక. ఆర్యవైశ్యప్రముఖుల ఉదారపుటేవులా, వ్యాపారనైపుణ్యమూ, సాహిత్యపరాయణతయూ, సంఘసంస్కరణ విజృంభణమూ, దేశాభిమానమూ, దీనిని చదిచూచి ఆనందింతమన్నను యీ పత్రికను పఠింపవలెను. సంపాదకుడు తు. వేం. భగవత్ గారు, బి. ఏ. బి. యల్. 36 గోవిందప్పనాయకన్ తెరువు జి. టి. మద్రాసు.

ఆర్యవైశ్య యువజనసంఘ నివేదిక:—

ఈ సంఘము విశాఖపట్నములో 20 సంవత్సరముల క్రిందట స్థాపింపబడి 1929 లో పునరుద్ధరింపబడినది. భారతి, ఆంధ్రపత్రిక, గృహలక్ష్మి చంద్రిక మొదలగు పత్రికలు వచ్చుచున్నవి. గ్రంథాలయములో 1551 పుస్తకములున్నవి. 117 మంది సభ్యులున్నారు. సంవత్సరమునకు చందాలు విరాళముల మూలమున నుమారు రు. 400 లు వచ్చుచు రు. 300 లు ఖర్చగుచున్నవి. రు. 550 లు నిలవయున్నవి. క్రొత్తభవనమును కట్టించు ప్రయత్నములు జరుగుచున్నవని కార్యదర్శినివేదిక తెల్పుచున్నది. ఇది ఇతోధికవృద్ధి బడయుగాక!

# భౌతిక లోకము

### చచ్చిన తల్లిలోనుంచి బ్రతికివున్న బిడ్డ

తల్లి చచ్చిపోయిన పదినిముషముల తరువాత ఆమెగర్భమునుండి ఒక సజీవ శిశువును ఆక్లండు ఆస్పత్రిలో ఒక శస్త్రవైద్యుడు అతిసున్నితమైన ఆపరేషనుచేసి పైకితీసెను. పిల్లకు ఊపిరిలేదు, కాని యిరువది నిముషములు కృత్రిమపుటూపిరి నామెలోనికి పోసిన పైని ఆమె కదలినది. ఇప్పుడారోగ్యముగనున్నది.

### స్మృతితోకూడా దృష్టివచ్చింది

లండనులో ఒకప్రాతసిపాయి వుండేవాడు. ఒక విషవాయువు తగిలి ఆతని కళ్లు గ్రుడ్డివైనవి. చాలాకాలము గ్రుడ్డిగానే వుండెను. ఒకదర్జీ దుకాణములో ఒక స్తంభము మీద పడి అతని స్మృతితప్పి పోయెనుగాని గాయములు తగలలేదు. కొన్ని నిముషములు తరువాత అతనికి స్మృతివచ్చెను. ఆస్మృతితో కూడా దృష్టి వచ్చెను.

### మూగవాళ్లుమాట్లాడితే చెవిటివాళ్లు వింటారు

ఒక వైజ్ఞానికుడు ఒకయంత్రం కనిపెట్టినాడు. మూగవాడు ఒకగొట్టములో తన భావమును ఊదును. దాని చివర భాగమును చెవిటివాడు తన చెవివెనుక యెముక నత్తిపెట్టివుంచును. అక్షరాలా యీధ్వనిని చెవిటివాడు వినవచ్చును. లండను మెడికలు ప్రదర్శనములో ఈయంత్రము ప్రదర్శింపఁబడినది.

### స్లాటులో డబ్బుపెట్టినొక్కితే సంగీతం వినిపించుతుంది

మదరాసు సెంట్రలు స్టేషనులో స్లాటులో అణాకాను పెట్టినొక్కి స్లాటుద్వారం టిక్కట్టు తీసుకోవడం చాలా మందికి తెలుసును. ఫ్రాన్సులో ఒక శాస్త్రకారుడు ఒక ఫ్రాంకు పెట్టి స్లాటు నొక్కితే 40 నిముషములు సంగీతమును వినగల ఒక పరికరమును తయారుచేసినాడు. ఈనలభై నిముషముల సంగీతమును ఒక్కసారియైనను వినవచ్చును. లేదా మనకు తీరికైనప్పుడెల్ల వినవచ్చును. ఒకసారి పది ఫ్రాంకులు పెట్టి నొక్కినచో దపదఫాలను ఏడుగంటల పరిమాణముగల సంగీతమునో ఉపన్యాసమునో నాటకమునో రేడియోలో ఏది ఎప్పుడు జరుగుతూవుంటే దానిని వినవచ్చును.

### పోయినప్రాణం రావచ్చును.

మఱచి చస్తే ప్రాణాలు వస్తాయా అంటాము. కాని యెందుకు రాకూడదూ?

అని రష్యాదేశపు నూతన శాస్త్ర పరిశోధకులు అడుగుతున్నారు. ముఖ్యంగా ఆరోగ్యం గాదుక్కలాగ వున్నవాణ్ని యేదో నేరం చేశాడని ఉరిబెట్టి బలవంతాన చంపుతారు మే, అటువంటివాని శవమును వెంటనే తీసుకొని ప్రాణం పోయడానికి వారు ప్రయత్నించారు. దేముడు ధర్మాన రష్యాలో అటువంటి శిక్షలు లేవు. కాని యెవడో ఉరిపోసుకొని ఆత్మహత్య చేసుకుంటే వాని శవమును తీసుకొన్నారు. సోవియటు ప్రభుత్వానికి మానవ జీవనమురియొక్క ఉపయోగము పూర్తిగా తెలుసును. ప్రాణం పోతే అమాంతంగా వూరుకొంటారా? వెంటనే ఒక కృత్రిమపు హృదయం తగిలించారు. కొన్ని నిముషములకాలం రక్తమునందులోకి పంపుచేశారు. వెంటనే అతనికి ఊపిరాడింది. ఇతర జీవలక్షణములుకూడా కనిపించినవి. 'పునర్జన్మ' వెంటనే వచ్చింది. కాని రెండు నిముషములు మాత్రమే అతను జీవించి చనిపోయినాడు.

'సెంట్రలు ఇనిస్టిట్యూటు ఆఫ్ బ్లడ్' వారు మాస్కోనగరములో ఇంతకాలము వరకు ఇట్టి సాధనలను చచ్చిన జంతువుల మీద మాత్రమే చేసేవారు. ఇప్పుడు మనుష్యులమీదకూడా ప్రయోగిస్తున్నారు. ఈ సందర్భములో వారు పూర్ణవిజయమును పొందలేక పోయినా, క్రమంగా పూర్ణవిజయమును పొందగలమని డంకామీద దెబ్బ కొట్టి చెప్పుతున్నారు.

### విద్యుత్కిరణములు

గ్రుడ్డివాళ్లని గ్రుడ్డివాళ్లు నడపలేరు కాని మనకు కనిపించని మతేవేనా శక్తులు నడపవచ్చును. మానవనేత్రమునకు కనిపించని ఒక తేజఃకిరణమును అమెరికా వైజ్ఞానికుడు కనిపెట్టినాడు—ఆకిరణమును మనమైనా విద్యున్నేత్రం **(Electric eye)** సహాయంతో చూడవచ్చును. ఈవిద్యున్నేత్రం అదృశ్యకిరణం కలిసిన యంత్రమును తయారు చేశారు. గ్రుడ్డివాళ్ళు యీయంత్రాన్ని తీసి కండ్లకు తగిలించుకుంటే ఆ అదృశ్య కిరణము కనిపించుతుంది. దానిద్వారా యెదురుగా వుండే వస్తువులన్నీ కనిపించుతాయి. ఇది పెట్టుకొని యెక్కడకైనా నడిచి పోవచ్చును.

ఒకరీతి విద్యుత్కిరణాన్ని ప్రసరించింపచేసి చాలా దూరమునవున్న సేనలను, చాలా యెత్తునవున్న విమానదళములను నాశనము చేయవచ్చును. అయితే యీకిరణాన్ని తయారుచేయుటకు పెద్ద పరికరములు యంత్రములు, చాలా జాగా, కావాలి. పెద్ద దొక యుద్ధనావ తయారు చేసుకొని సముద్రములో తేలుతూపోవుచు శత్రువుల నాశనము చేయుట సాధ్యము. ప్రస్తుతం అంతపెద్ద పడవలు కట్టలేక భూమిమీదనే దానిని తయారు చేస్తున్నారు. మళ్లీ యుద్ధం వస్తే

ఇట్టి సాధనము గలవారు ఉపయోగించడం మానుతారా?

## గ్లాసు దుస్తులు

నార, పత్తి, పట్టు, వూలు మొదలైన డ్రెస్సులన్నీ ప్రాత ఫ్యాషను లైపోయినాయి. గ్లాసును సన్నంగా దారంలాగ తియ్యడం బట్టలలాగ నెయ్యడం దుస్తులలాగ అల్లడం తొడుక్కోవడం ఫ్యాషనవుతోంది. లండనులో వన్నెల విసనకర్రలందరూ ఇటువంటి చొక్కాలు సాయంకాల మందు తొడుక్కొని షికార్లు వెళుతూ వుంటారు. మనదేశంలోకి కూడా దిగుమతి అవడం ప్రారంభిస్తే ముందు చదువుకొన్న నాగరకులు తరువాత చదువురాని మూఘులుకూడ, మిగిలిన వెండి బంగారాలమ్మి కొనుక్కోక మానుతారా?

## ఎఱ్ఱగుడ్డ చూపెడితే యెడ్లెందుకు బెదురుతాయి?

ఎడ్లకి రంగులు పోల్చుకొనే శక్తిలేదట. ఎఱ్ఱగుడ్డ చూపించగానే దానికి నల్లగా చీకటి కనిపించి కళ్లుమూసి నట్లవుతుంది. కళ్లుకనిపించకపోతే ఎవరికైనా చిఱాకు, వెఱ్ఱి, ఉద్రేకంరాదూ?

## వ్రాయుగల యంత్రాలు

ఇప్పుడువైరులెస్సులో మనం యివతల మాట్లాడితే అవతల ఆసామీ వినడం మాత్రమే జరుగుతున్నాది. ఆయంత్రం దగ్గరే కలం సిరా బుడ్డి కాగితాలువుంచి యంత్రంతో కలిపి వుంచేస్తే, మనం చెప్పిన మాటలన్నీ వ్రాసిపెట్టగల యంత్రమును న్యూయార్కులో ఒకడు కనిపెట్టినాడు. ఇది బాగా ప్రచారంలోకి వస్తే గుమాస్తాల అవసరం తగ్గిపోతుంది వ్యాపారస్థులకి. వైజ్ఞానికు డేయంత్రాన్ని కనిపెట్టినా పెట్టుబడిదారుని బూరె నేతిలో పడుతుంది. పనివాళ్ల నోట్లోనో, మట్టి.

## దూరదేశదర్శని

ఇటలీవారికి దక్షిణాఫ్రికాలో కొన్ని వలస రాష్ట్రములున్నాయి. అక్కడేమి జరుగుతున్నాదో ఎప్పటికప్పుడు తెలుసుకోవాలంటే ఎంతమంది సి.ఐ.డీ. లనుపెట్టినా సాధ్యమౌతుందా? మార్కోని అనే వైజ్ఞానికుడు బ్యాటరీ లైటులాంటి దొక పెద్ద సెర్చిలైటు కనిపెట్టినాడు. దీన్ని ఏదేశం మీదికి కావలస్తే ఆదేశంమీదికి ఫోకసు చేసి అక్కడ అర్ధరాత్రులయందు ఏమి జరుగుతున్నదీ తెలుసుకోవచ్చు. సామంత దేశాలని శాశ్వత బానిసత్వంలో అణచి పెట్టి వుంచడానికి అత్యుపయుక్తమైన సాధనం. యుద్ధసమయములయందే కాక శాంతి సమయములయందుకూడా ఇది చేసే సహాయం శ్రీ రామచంద్రమూర్తికూడా చేయలేదు!

నిశ్శబ్దంగా ప్రయాణంచేసే టార్పెడోలు.

సముద్రంలో ప్రయాణంచేసే పడవలను గతయుద్ధంలో ఉపయోగించినట్లు మనకందరికీ తెలుసును. నీటిలోపల ఇవి పోగలగడంచేత శత్రువులకు కనుపించకుండా వెళ్లి వారి యుద్ధపడవలను ముంచేసి సముద్రతీరములయందుండే వారికోటలమీద గుండ్లు విసరి నాశనంచేస్తాయి. ఎమ్డెను చర్యలు మద్రాసు వాస్తవ్యులకు జ్ఞాపకమున్నాయి. అయితే ఇవి కనిపించకుండా ప్రయాణం చేసినా, అవి తేలేటప్పుడు నీటిమీద కలిగే బుడగలవల్ల, శబ్దంవల్ల అవి సమీపిస్తున్నాయని పోల్చుకోవడానికి సాధ్యమయ్యేది. ఇప్పుడు డిటలీవారు నిర్మించే పడవలలో ఇట్టి బుడగలుకాని శబ్దంకాని వుండవు. చల్లగా, శాంతంగా, కనిపెట్ట సాధ్యంకాకుండా ప్రయాణంచేసి శత్రువుల యెదట తేలి, వారు సర్దుకొనుటకెట్టి అవకాశం లేకుండానే చేయఁదలచుకున్న హానిచేసేవచ్చును. ఇట్టి మహా యంత్రాల సాయంతోవచ్చే యుద్ధాలెంతవైభోగంగా వుంటాయో ఊహించుకో వచ్చును.

## భారతీయులకుమాత్ర మిట్టి విషప్రజ్ఞలు లేవా?

డాక్టరు రాజాదేవిప్రసాద మిశ్రాగారు అధర్వవేదంలో పండితులు. అందులోనుంచి కొన్ని శ్లోకాలు తర్జుమా చేశారు. వానిలో విషములను మేఘములుగా మార్చి శత్రువులమీద ప్రయోగించే సాధనములు తెలుపఁబడ్డవి. ఇట్టి రహస్యములను బయులుపరచినందుకు అమెరికావారతని నెంతో గౌరవముచేసి అటువంటి మారణ సాధనాలను సృష్టించడం నేర్చుకుంటున్నారు. ఈ మేఘములు శత్రువులమీద ద్రవరూపకమైన వర్షమునే కురుస్తాయి. వారుణాస్త్రములు బాంబులు. ఈ రహస్యాలందరికీ తెలిసిపోకుండా వుండడానికి న్యూయార్కువారతని పుస్తకములను కొన్నిటిని నిషేధించినారు.

పోగుపియము క్లోరైడు, పాలు, తెల్లమట్టి కలిపి ముద్దచేసుకొని ఆహారముగా అతడు భుజించి జీవించగలడు. ప్రస్తుతం అతడు బొంబాయిలో వుండి లెక్చర్లిస్తున్నాడు. ఆరునెలలు గడచిన తరువాత అతను తిరిగీ అమెరికాకు వెళ్లి, అతని శరీరమును దహనముచేసి భస్మము చేసుకొని, ఆ ప్రాణములతో వేఱే శరీరములో ప్రవేశించి హిందూదేశానికి వస్తాడట. ఇదేకదా పరకాయ ప్రవేశం! వైజ్ఞానికపు పిచ్చిలో భారతీయు లితరదేశస్థులకు తీసిపోరని యితను విశదీకరించుతున్నాడు. కాని ఇట్టి వినాశకర విజ్ఞానము నశించనిదే ప్రపంచ కళ్యాణం సమకూరుతుందా అన్నదే మన ప్రశ్న. మానవుని దురాశయే యిట్టి వినాశకరవిజ్ఞాన సాధననిర్మాణములకు కార

ణము. దీని నొకప్రక్కనుంచి వృద్ధిచేసు కుంటూ మానవుల కెన్ని హక్కులిస్తేనేమి, ఎట్టి రాజ్యాంగాలిస్తేనేమి, ఎన్ని కార్మిక ప్రభుత్వాలు పెడితేనేమి? ఇట్టి నాగరకుల కంటె పురాతన ఆటవికమూఢులే నయ మనిపించుతుంది!

### తరణోపాయం.

ఇందుకు తరణోపాయ మేదేనావుందా అని తత్వశాస్త్రవేత్తలంతా ఆలోచిస్తు న్నారు. వీరియొక్క పదియవ సమావేశం వాల్తేరులో సమావేశమైనది. మదరాసు గవర్నరు ఎర్స్కినుగారు ఆ సభను ప్రారం భించారు. వీరి పరిశోధనలకు జయపురం మహారాజు శ్రీ శ్రీవిక్రమ దేవవర్మగారు రూ. 600 లు విరాళ మొసగినారు. తత్వజ్ఞ శిఖామణి శ్రీ రాధాక్రిష్ణన్‌గారు ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసంలో వీరి ఆశయమును స్పష్టపరచినారు. ఇప్పటి వైజ్ఞానికులు భౌతిక దేహానికి కావలసిన యంత్రప్రాభవములు, పరిశోధనలు ప్రత్యక్ష విషయ విమర్శనల తోనే తమ కాలమును వమ్మొనర్చుచు న్నారు. లెనినుగారి ప్రభుత్వవిధానములు, హెచ్. జి. వెల్సుగారి సమిష్టి మానవకోటి వ్యాపారసంఘాలు అరచేతిలో వైకుంఠం చూపించే భ్రమలుకాని లోకానికి శాంతి చేకూర్చవని స్పష్టపరిచారు. వీరికి, ఇటు వంటి జగద్గురుపుష్టులకు, చేసే పాదపూజలు వ్యర్థములని చాటినారు. మానవు డాధ్యా త్మిక జీవి అన్నిమాట వీరు మరచుచున్న వారు. భారతీయు డొక్కడే ఈ సనాతన ధర్మమును గుర్తించి ఇట్టి శాశ్వత శాంతిని పామర ఛండాలుని మొదలు పరమయోగి వరకు గల అందరికి వారివారి అంతస్తు అధి కారములకు తగినట్లు తేటతెల్లమగు మాట లతో బోధపరచినాడు. ప్రపంచ మిప్పటి కైనా అతనివైపు ముఖంత్రిప్పి వింటుందా లేక పాశ్చాత్య నాగరికతకంటె పరమార్థం లేదని గర్విస్తూ, అతనిని మూఢుడని దూషిస్తూ గ్రంధాలు వ్రాస్తూవుంటుందా?






**కళంకమును తొలగించుడు :—**

హిందూదేశానికి ప్రజా ప్రభుత్వము నిచ్చామని బ్రిటిషువారు ఒక ప్రక్కన చాటుతున్నారు; మూలమట్టంగా రెండో ప్రక్కనుండి ప్రజాప్రభుత్వముయొక్క మూల సిద్ధాంతములను తెగనరుకుతున్నారు. ప్రజా ప్రభుత్వముయొక్క మూలసిద్ధాంతం వోటు హక్కు. అసలు దీనికే హంసపాదుపెట్టితే ఆ పిమ్మట వారిచ్చే ప్రజాప్రభుత్వమేముంది.

వోటు హక్కన్నది వయస్సువచ్చిన ప్రతీ స్త్రీకి పురుషునికికూడ ఉండవలసినది. ఏకారణముచేతనో అందరికీ ఇయ్యలేదు. ఏదేశంలోనూ కూడా అందరికీ ఒక్కసారి యివ్వలేదు కనుక ఇక్కడ కూడా అందరికీ ఈసారి యియ్యలేదు, మొట్టమొదట పైపైని వున్న ధనవంతులకో విద్యావంతులకో యిచ్చారు, తరువాత క్రింది తెగలవారికి కూడ యిస్తారు, క్రమంగా ప్రజాప్రభుత్వం ఇవ్వడంగదా వారి ప్రణాళిక అని యేదో సమాధానం చేసుకొందాము. ఇచ్చిన హక్కు రవ్వైనా సర్వాధికారంతో యివ్వకుండా ఫలానావారికివ్వకూడదు ఫలానావారికే యివ్వాలనడం చాలా విపరీత సిద్ధాంతం.

అయినా ఈ సిద్ధాంతాన్నే దొరతనం వారు సృష్టించి మనమీద గిరవాటువేశారు. కాకుంటే ప్రత్యేక నియోజకవర్గముల యేర్పాటు కర్థమేమున్నది? హిందువులు హిందువులకీ, తురకలు తురకలకీ, తెల్లవాళ్లు తెల్లవాళ్లకీ, స్త్రీలు స్త్రీలకీ, పురుషులు పురుషులకీ మాత్రమే వోట్లిచ్చి ప్రతినిధులను పంపవాలట. హిందువులు తురకలకీ, తురకలు క్రైస్తవులకీ, పురుషులు స్త్రీలకీ, స్త్రీలు పురుషులకు వోట్లియ్యవలెనని కోరినప్పటికీ యివ్వడానికి వీలులేకుండా మూదరి కాళ్లకు బందాలువేసినారు. స్త్రీ పురుషుల యోగ్యతలనుబట్టి కాక వారు మనజాతికి, మన మతమునకు, మన వర్గమునకు చెందినవారైతేనే వోట్లియ్యవాలట లేకుంటే మానేవాలట. మనలోనుంచి కొందరూ పైవారిలోనుంచి కొందరూ అభ్యర్థులుగా నిలచినప్పుడు మనవారికంటె పైవారు యెక్కువ యోగ్యులై, మనవారే యెక్కువ అనర్హులుగా వుండరాదా? అందరూ ఒక్కలాటి

యోగ్యులే అయినా మనలో మనకు అయికమత్యం స్థిరపడవాలనే వుద్దేశ్యంతో మనలో కొందరము పయివారికీ పయివారిలో కొందరు మనవారికీ వోట్లియ్యరాదూ? ఈ విధంగా చేస్తే ప్రతినిధులెల్లరును తమజాతి, మతములేక వర్గమువారియొక్కయే కాక అఖిలభారతజాతియొక్క ప్రతినిధులై, తమ తమజాతి, మతము, వర్గములయొక్క స్వలాభములనే కాక అఖిలభారత జాతివారియొక్క క్షేమలాభముల కనుగుణముగ వర్తించవలసినబాధ్యులై యుండి అఖిలభారత జాతికి ఉత్తరవాదులై యుందురుగదా! జాయింటు సెలెక్టు కమిటీవారు భారతీయ వోటర్ల సంఖ్యను హెచ్చించినను, హక్కును సంకుచితపరచడంవల్ల హెచ్చించినప్రయోజనం లేకుండా చేశారు. ఇట్టి పద్ధతిని కాంగ్రెసువారు నిరసించినారు, నేషనలిస్టు పార్టీవారు తిరస్కరింప చూచుచున్నారు, భారత నారీమణు లిట్టి పద్ధతికి తొలినుండియు ప్రతికూలురే. ఈ విషయములో సాంఘిక పరిష్కారము రద్దయి నూతనమైన సంయుక్త నియోజకవర్గ మేర్పాటయేవరకు శాసనసభల లోను బయటను కూడ తీవ్రమైన ఆందోళనము సలుపుచుండవలెను. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, అయిరోపీయ, పురుష వర్గముల ప్రతినిధులమని వెళ్లినవారు తమలో తాము కొండు లేబిలు సభలో పోరాడుకొని యేకీభావమునకు రాలేక ప్రధానమంత్రిగారొనర్చిన యిట్టి తీర్పుకు కారకులైనారు. నారీమణులలో ఇట్టి భావములు లేవని వారి సభాధోరణులవల్ల విశదమగుచున్నది. అన్ని జాతులకు చెందిన స్త్రీలును ఘోషా వున్నవారు లేనివారు, అంతఃపురస్త్రీలు సాధారణ స్త్రీలు ఎల్లరును సంయుక్త నియోజక వర్గములయొక్క మహిమను గూర్చి తమ తమ పురుషుల కెంతెంతో నొక్కి ఉపదేశించి భారతజాతీయ గౌరవమునకు కళంకాపాదితమైన యీపరిష్కారము రద్దగుటకు తోడ్పడవలెనని హెచ్చరించుచున్నాము. తెల్లకాగితం చిరిగినా చిరగకపోయినా, ఇదేనా రద్దయితే దానివల్లకలిగే నష్టాలు మనకు కొన్ని తగ్గుతాయి. అసలు ఇది రద్దయితే కాని తెల్లకాగితం తిరస్కరించబడనేనేరదు. మాలవ్యాగారి కారోగ్యం చిక్కగానే ఇక్కడా ఇంగ్లాండులోను కూడా తీవ్రప్రచారం చేస్తామంటున్నారు. కాంగ్రెస్సువారు, కాంగ్రెసుకు చెందిన మహమ్మదీయ నాయకులు, ప్రజలు, ముఖ్యంగా అఖిలభారత మహిళాసభ యొక్క 118 శాఖలకు చెందిన స్త్రీ నాయకురాండ్రు వారికి సంపూర్ణముగ తోడ్పడుదురుగాక!

ఉదయిని :—

ఆంధ్రపత్రికాసాహిత్యప్రపంచ మనేక విధముల అసహ్యాహాస్యరసపూరితమై, అసం

దర్భ ప్రసంగకలితమై, గంభీరవిషయ పరిజ్ఞానశూన్యమై, విశేషభాషా పరిచయరహిత విలేఖక వ్యాసమిళితమై, రాజకీయ విషయ సమాకలితకల్లోలమై, సాహిత్యమునకు ప్ర ప్రధానలక్షణమైన శాశ్వతత్వ చిహ్నరహితమై అంధకారబంధురమై యున్న సందర్భమున నవనవోన్మేష తేజస్సుతో నుదయించి కన్నులరవిచ్చి ఆంధ్ర హృదయముల తిలకింపవచ్చిన యీ 'ఉదయిని'కి 'గృహలక్ష్మి' అభిమాన పురస్సర స్వాగత మొసంగుచున్నది. ఆంధ్ర సాహిత్యమునకు భాషయందేమి, శైలియందేమి, రసమునందేమి, వ్యాప్తియందేమి క్రొత్త సొబగులును వలపులును కావలసియున్నవని శ్రీరామమూర్తి పంతులుగారు, లక్ష్మీనరసింహంగారు (చిలకమర్తి) సుబ్బారావుగారు (రాయప్రోలు) మొదలగు వారల మార్గాదర్శక ప్రయత్నములవలన విశదమగుచున్నది. కాని అవి మన చౌకబారు పత్రికలయందు గోచరించుచున్న వానివంటివేనా అని అడిగినచో కాదని గంభీరాంధ్ర హృదయులెల్లయు నిరాకరించుచున్నవి. పామర జనులకు, రైలు ప్రయాణీకులకు, నిర్లక్ష్యముగ అణా బేడా యిచ్చి కొనుక్కొని కూడబలుకుకొని చదివేవారలకు, కాలక్షేపము చేసుకొనఁగోరు చపలులకుఁ గావలసిన పేలవమగు సామగ్రికి ప్రస్తుతపు టనేక పత్రికలలో నెట్టికొఱతయు లేకున్నను రసపిపాసాయత్తచిత్తులకు, నిశితవిమర్శనాపరాయణులకు, ఉత్తమానందరసమత్తులు కాఁగోరువారికి వానియెడల విరాగము గాక వే[illegible] భావముదయించుటలో నాశ్చర్యములేదు.

ఈ స్తబ్దతను వదిలించి ఆంధ్ర హృదయములను సానబట్టుటకుఁ బుట్టిన సాహితీ పత్రిక లుప్తమైనది. సఖిపత్రిక చాలకపోయినది. జయంతిపత్రిక విజయమందలేకపోయినది. అయినను వాని వాసనలు మన గంభీర యువక కవుల హృదయములను ఆశయములను విడనాడలేదు. అవి భస్మీపటలమైన బూదినుండియే ఉదయిని శ్రీయుత కొంపెల్ల జనార్దనరావుగారి సంపాదకత్వమున నేఁడు వెలువడినది. సంపాదకుని ప్రథమ వ్యాసము పూర్వప్రయత్న వైఫల్యసంజనిత విచార పరితాపశిఖలను, నూతన గోచరితాశాకిరణములను వెలిగ్రక్కుచున్నది. ప్రథమ సంచికలో వెలువడిన పదిమంది కవివర్యుల మనోహర ఖండకావ్య కృతులును సంపాదకుని ఆశలను సఫలీకృతము లొనరించుచున్నవి. ఏడుగురి గద్యవ్యాసములును ఆంధ్ర జనుల నిద్రాణగంభీరతలను భుగ్నకంఠముతో మేల్కొల్పుచున్నవి. సంపాదకుడు విమర్శకుడై విచక్షణతో 'శృంగాటకము'న నిలిచి చంచలాయమానముగ బరువులెత్తుచున్న చారిత్రక సాహిత్య, సారస్వత, నాట్య

కళా విజృంభణముల కెల్ల తత్తదుచిత గౌర వస్థాన సూచక వాచకంబుల విరజల్లి ఆశీర్వ దించుచున్నాడు.

క్రౌన్ 80 పుటల ద్వైమాసపత్రిక. ఋతు ఋతువున కొక్కొక్క మొగ్గ తొడుగును. ఛెదరువైటు డిళములు, ముద్దు లొలుకు 'లోధ్ర' ముద్రాలయమువారి కూర్పు, అందమగు అమరిక, చూచినంతన వలచు వాసనల నలగనీయని కమ్మనగు కట్టు దిట్టము, దాచుకోవలయునను నాసలు గొలుపు అమూల్య రామణీయకత, అన్నియును గలసి సాలుకు నాలుగు రూకలను చందాను దాని నుదుట తిలకముగ దిద్దు చున్నవి. తిలకమే మాత్రము చెఱిగినను తక్కిన సౌందర్యము పోషింపబడుట కష్టము. చౌకబారు మఱిగినవారు దీనిని సమీపింప నొల్లక దూరమునుండి నవ్వి యూరకొనుట సహజము. కనుక దీనిని తరింపజేయు భారము, విద్యాశ్రీమంతులగు పెద్దింటి సంసారులు, ఉన్నతజీతములు దీయు విద్యాధికోద్యోగస్థులు, కవితా కలాప మాధురీలోలురగు ఉత్తమ తరగతి విద్యార్థి బృందమునై యున్నారు. ఇట్టి వారెల్లరును చందాదారులుగ చేరి తమ విద్యాధిక్యతను, నూతనసాహిత్య విలాసాభిలాషను స్వభాషా గౌరవ విశేషకతను సార్థకము చేసుకొని పత్రికను వర్ధిష్ణుముగ నొనరింతురు గాక! కార్యస్థానము 15, ఆదెప్పముదలివీధి, వేపేరి, మదరాసు.

క్షమాపణ :—

'గృహలక్ష్మి' యొక్క గత అక్టోబరు నవంబరు సంచికలలో బాలవిజ్ఞానశాఖలో ప్రకటింపబడిన 'పిల్లల పాటలు' అను గేయములను పద్యములను పల్లాకిమిడి వాస్తవ్యురాలు శ్రీమతి శ్రీపాదలక్ష్మీదేవిగారును, 'మఱ్ఱిచెట్టు—తాటిచెట్టు' అను పద్యములను తత్పురవాస్తవ్యురాలే శ్రీమతి జమ్మి కనకవల్లీబాయిగారును మాకు పంపినారు. ఆ గేయములు మిగుల మనోహరములై ప్రాత పాటలను బురుడింపుచుండుటచేత వారెచ్చటనో పెద్దలయొద్దవిని నేర్చుకొని పంపించియుందురనియు, పద్యములను తామే రచించి యుండ వచ్చుననియు ఊహించి మేము ప్రకటించినాము. అవి శ్రీయుత జయంతి గంగన్నగారు రచించిన వావిళ్ల వాచకములలోనివని శ్రీగంగన్నగారు మాకు పంపించిన లాయరునోటీసు అందువఱకును మాకు తెలియదు. శ్రీమతులు తామా గేయములను పద్యములను పై పుస్తకములనుండి సంగ్రహించి వ్రాసినట్లు తెలుపలేదు.

శ్రీగంగన్నగారు తమ నోటీసులో మాకాసంగతి తెలియజేయుచు, తమ అనుమతిగాని పేరుగాని సంగ్రహించిన గ్రంథముల పేర్లుగాని లేకుండ ప్రకటించినందువలన

తమకు కలిగిన నష్టమునకు పరిహారముగ వేయి రూప్యములు చెల్లించవలెననియు, లేని యెడల న్యాయమైన చర్య తీసుకొందుమ నియు నోటీసిచ్చియున్నారు. అవి గంగన్న గారివని మాకేమాత్రము తెలిసియుండినను వారి అనుమతిని పొంది వారిపేరుతో ప్రక టించుటకంటె మాకెక్కువ గౌరవవంతమగు విధిలేదు. అట్లు తెలియకపోవుటవలననే మాకు పంపిన లేఖకుల పేరులతో ప్రకటిం చుట తటస్థించెను. ఇది మాబుద్ధి పూర్వక కృత్యముకాదనియు, లేఖకుల యవివేకము వలనఁ గలిగిన ప్రమాదమునియు గంగన్న గారికి మేము సవినయముగ ఇందు మూల ముగ తెలుపుచు, ఈ స్వల్పమాత్రదోషమున కట్టి కఠినచర్యతీసుకొన నవసరములేదని మనవి చేయుచున్నాము.

ఒకరు రచించిన పద్యములు వేరొకరు రచించినట్లుగా ప్రకటింపఁబడుట ఏపత్రికకును కీర్తిదాయకముకాదు సరేగదా అట్లు సంగ్ర హించి వ్రాయువారికికళంకమై కూడనున్నది. తమపేరులు పత్రికలలో ప్రకటింపఁ బడవలె నను సామాన్య భావమునకులోనై, తాము చక్కనివ్యాసములు వ్రాయలేక యితరుల పుస్తకములలో నుండియో లేక ప్రాత సంచి కలలోనుండియో కథలు పద్యములు చూచి కొందరు, ఇంచుక మార్చికొందరు పత్రి కలకు తమపేరులతో పంపుచుందురు. అట్టి వారు, యథార్థము నెవరో కనిపెట్టి ప్రక టించిన వెంటనే నగుబాటుపాలై, క్షమా పణము కూడ నొసగు చున్నారు. వృద్ధికి రాగోరు వ్యాసరచయితలు ఇట్టి దురభ్యాస ములకు వశులుకారాదు. ఇట్టి చర్యల వలన వారికి కలుగు అవమానము మాట యట్లుండనిచ్చి, యదార్థరచయిత లొనర్చు లీగలు చర్యల వలన వారును పత్రికా సంస్థాపకులునుగూడ అనేక కష్ట నష్టముల పాలు కావలసి వచ్చును. సంపాదకు లెంత గ్రంథ పఠనాభ్యాస పరాయణులైనను ఇట్టి దొసగుల నెల్ల కనిపెట్ట గలుగుట దుస్తరము. ఏవిలేఖకుల వ్రాతలనుండియైన సంపాదకులకు యదార్థరచయితల చర్యల వలన కష్ట నష్ట ములు సంభవించు నేని, సంపాదకులు వానికి లేఖకులను బాధ్యులుగాఁజేసి తన్నష్ట పరి హారమునకుగా లీగలుచర్యతీసుకొనవలసి వచ్చును.

లేఖకులు పంపించు ప్రతి వ్యాసమును సంపాదకులు స్వరచితమా సంగ్రహమా యను వితర్కముతో బయలుదేరి నిశ్చ యించుట సాధ్యముకాదు. పెద్దమనుష్యులు పరిచితులు అయినవారి వ్యాసములను మాత్రమే ప్రకటించుటయు, పరిచయము లేని వారి వ్రాత లెంత చక్కగ నున్నను అనుమానముతో త్రిప్పి వేయుటయు తట

స్థించును. ఇందువలన ఎంతోమంది చక్కగా వ్రాయువారికి ప్రోత్సాహము తగ్గి పత్రికా ప్రచురణము అభివృద్ధి నొందుటకు మారు క్షీణించును. దేశాభివృద్ధికిని సంఘాభివృద్ధికిని అనువగు పత్రికాసంపాదకత్వ భారమును పూనుకొని లేఖకలోకమునకెల్ల ప్రోత్సాహ మిచ్చి విద్యాభివృద్ధికి కంకణము గట్టుకొని శ్రమపడువారిని దగాచేయు నుద్దేశ ముతో, తమ బాధ్యతలను నష్టములను అవమానములను గూడ ఊహించుకోక, ఇతరుల వ్యాసములను తమపేరులతో పంపువారి చర్యలు పత్రికా నిర్వాహక దృష్టితో చూచిన నక్షమాపణీయములు, న్యాయ శాస్త్ర దృష్టితో చూచిన దండనీయములు. కనుక ఇట్టి అవివేకకృత్యములకు గడగ రాదని మా విలేఖరుల నిందుమూలముగ మరియొకసారి హెచ్చరించుచు మాపత్రికలో ఇట్టి యకృత్యము తటస్థించి నందుకు మన్నింపుమని విద్వద్వరేణ్యులును విద్యాభిమానియు నగు శ్రీగంగన్న గారిని వేడుచున్నాము.

శ్రీ శ్రీ వి. ఆర్. సరస్వతి గారు.

ఈమె బొబ్బిలి సంస్థానములో మేనేజరు ఖిల్లేదారు ఉద్యోగము లొనరించిన శ్రీయుత్. కాశీశాస్త్రిగారి కుమార్తె, దక్షిణాది అయ్యరు కుటుంబమునకు చెందిన దయ్యు బొబ్బిలి మహారాణి పాఠశాలలో నాంధ్రము నభ్యసించి మూడవఫారమునందు 1917 లో ఉత్తీర్ణురాలయినది. అప్పటి కీమెకు పదమూడేళ్లుమాత్రమే వయస్సు. పిమ్మట వివాహితయై సంసార యాత్రలో పడినది. ఆంధ్ర భాషయందు స్వయముగ కృషిచేసి 'మీరాబాయి' యను గ్రంథమును వ్రాసినది. ఆంధ్రప్రముఖు లీగ్రంథమును ప్రశంసించుట యేగాక విద్యాశాఖవారు గూడ దీనిని పాఠ్య గ్రంథముగ నంగీకరించినారు. అవివాహితయగు తనచెల్లెలును, విధవయైన తన అక్కగారిని ఆపెబిడ్డలను గూడ తనయింటను భర్తగారి ఆస్తితోనే సంరక్షణచేసి భారతీయ యువతులకు సహజమైన బంధుప్రేమను విశదీకరించినారు.

1930 లో, ముగ్గురు పుత్రుల బిడ్డల తల్లియైన తరువాత, భర్తగారి ఆస్తియు ఆర్జనయు కుటుంబ నిర్వహణమునకును బిడ్డల విద్యాభ్యాసమునకును చాలదని తెలుసుకొని ఆతనికి సాయమొనర్చుటకై తాను కూడ ఉద్యోగము చేసి సంపాదించబూని, అందుకుగా తిరిగీ విద్యాభ్యాస మొనరింప నిశ్చయించి నాల్గవ ఫారములో మదరాసు నేమనలు బాలికాపాఠశాలలో చేరినది. ఇవతల సంసారము దిద్దుచు భర్తగారికి సపర్యలు చేయుచు 1934 లో స్కూలు ఫైనలుపరీక్ష ప్యాసయి అందులోనే ఉపాధ్యాయురాలుగా చేరినది. ఉద్యోగము

చేయుచు ప్రసవకారణముగా అక్టోబరులో కలవుపుచ్చుకొనినది. పుట్టిన ఆడుబిడ్డకు మీరాబాయి నామధేయము నిడి సాకుచు మూడు నాలుగు నెలలలో తిరిగీ ఉద్యోగములో చేర నెంచుచుండెను. డిశంబరు 10 వ తేదిని బిడ్డకు పాలుకాచుటకు స్టవ్వు అంటించుచుండగా చీరకు నిప్పంటుకొని శరీరము కాలిపోయెను. భర్తగారు వెంటనే ఆస్పత్రికి చికిత్సకు తీసుకొనిపోయిరి గాని మరునా డామె యీ దేహయాత్రను చాలించెను. భర్తగారు లేబరు స్కూలులో నెలకు 25 రూపాయిలు జీతము తెచ్చుకొని గౌరవముగ కాలక్షేపము చేయు శ్రీయుత వి. పి. రామస్వామిగారు. వారికిట్టి ధర్మపత్నీ వియోగము వలన కలిగిన కష్టనష్టము లపారములు. పరమేశ్వరుడే వారికిని బిడ్డలకును నేడుగడయై సంసారయాత్రలో సానుకూలు డగుగాక! వారికుటుంబమున కంతటికి మా సానుభూతి తెలుపుచున్నాము

శ్రీమతి సరస్వతిగారి 'మీరాబాయి'ని గృహలక్ష్మిలో మున్నొకసారి మేము విమర్శించితిమి. ఆమె వ్రాసిన వ్యాసములలో ఒకటి 1934 లో వుమెన్సు అసోసియేషను వారి బహుమానమునందినది. ఆమె 1932 లో నరసాపురం పోటీ పరీక్షలలో నుత్తీర్ణురాలయినది. గృహసంబంధమగు విజ్ఞానము, ఆరోగ్యము ఆహారములను గూర్చి అనుభవపూర్వకమగు నొక గ్రంథమును, ఆమెయిష్టగురువగు శ్రీ రామకృష్ణ పరమహంస జీవితమును వ్రాయుటకు ప్రారంభించి ముగించకుండగనే, మృత్యుదేవత అకాలమున నామెపైబడి ఆమె నాంధ్రసారస్వత ప్రపంచమునుండి యెత్తుకొనిపోయినది. ఆమె మరణము వలన ఆంధ్రతమళ సారస్వతములు రెండింటికిని నష్టము కలిగెనని చెప్పవచ్చును. పరమేశ్వరు డామె ఆత్మకు శాశ్వతశాంతిని ప్రసాదించును గాక!

### నైజాము రాష్ట్ర తృతీయాంధ్ర మహిళాసభ:—

శ్రీమతి యెల్లాప్రగడ సీతాకుమారి గారి అధ్యక్షతను జరిగిన యీ మహిళాసభ మహారాష్ట్రీయ మహిళాసభలను బురుడించుచు గంభీరవిజ్ఞానాశయ వ్యాపకముగను అసమాన చాతురీధురీణముగ నున్నది. బరోడాలో 1000 కి 331 రు, బంగాళములో 188 రు, మైసూరులో 174 రు, బొంబాయిలో 140 రు, మద్రాసులో 119 రు, స్త్రీలు విద్యావతులై యుండగా హైదరాబాదులో 12 రు మాత్రమే యున్నారు. ఇందుకు కారణము మాతృభాషలకు హైదరాబాదులో ఆదరణము కొఱవడుటయే. ఉన్నత విద్య మఱియు అల్పము. స్త్రీలకు కేవలగృహ నిర్వహణమునకు గల విద్యనే

గాక వారికెందు అభిరుచియున్న ఆయా విద్యలనెల్ల నేర్చుకొనుట కవకాశములు సంపూర్ణముగ నుండవలెనను అధ్యక్షురాలి సందేశముతో నందరు నేకీభవించక మానరు మూఢవిశ్వాసములు క్షుద్రదేవతా భయములను, ఆభరణాభిలాష దొంగలవలని భయమును, ఘోషాపద్ధతి దుష్టపురుషులవలని భయమును గలిగించుచున్నవి గనుక వానికి స్వస్తి చెప్పవలెనని ఆమె ఆదేశించినారు. వ్యాయామము, బ్రహ్మచర్యము, స్వాతంత్ర్యము, ఆరోగ్యమునకు, సేవాదీక్షకు, పాతివ్రత్యమునకు పెట్టని కోటలు కనుక ఆయా ధర్మములు స్త్రీలకు బోధించి ఆ భాగ్యములు కలుగఁజేయవలెనని కోరినారు. నారీమణులును పురుషవర్యులును ఆమె సలహాలను శిరసావహించి నైజాము రాష్ట్రమునే గాక అఖిలభారతదేశమును సౌభాగ్యవంతముగఁ జేయుదురు గాక !



EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగు లక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపము గలిగినప్పుడు ఉపయోగించి తప్పక పనిచేయును. గర్భాశయమునుండి మైల సరీగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి **(Douche)** మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిది ఒక్కటే; ఇది బాలింతల పాలిటి పరమౌషధము.

వెల తు. 1—కి రు. 30.

పుకడు వారమురోజులకు మందు రు.5.

—

## రజోదర్శిని

స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన వ్యాధులకు మంచి మందు. ముట్టునొప్పి, మైల సరీగా కాకపోవడం, బొత్తుగనే బహిష్టు కాకపోవడం, మొదలైన బాధలను నివారించును. [illegible] కాని వారలుకూడ సేవించిన పిదప రజోదర్శనమైనట్లు ప్రశంసలు గలవు. వివరములు కోరిన పంపబడును.

50 మాత్రలు రు. 2.

పై రెండు ఔషధములనుగూర్చిన విషయములు కోరినవారికి ఉచితముగా పంపబడును.
160 పేజీలుగల 'ఆయుర్వేద చికిత్సాదర్పణము' అను గ్రంథము 0-2-0 లకు పోస్టేజీబిళ్లలు పంపినవారికి ఉచితముగా పంపెదము.

*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకర శాస్త్రి,

ఎ. ఎం. ఎ. సి.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

———:o:———

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీవస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యార్థినులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.




సంపాదకుఁడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౭.] ఫిబ్రవరి 1935 [సంచిక ౧-౨

***Printed at Lodhra Press, Egmore, Madras.***

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందియవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడిన రేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువదైయైనప్రకటనలు చేర్చికొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో, తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనీయార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రముపంపకూడదు.

# క్రొత్తసంవత్సరము

# క్రొత్తపాకింగు

# క్రొత్తనిబంధనలు




నేరుగా వ్రాయుడు

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. [లిమిటెడ్.
జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ,
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్ కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.
బెంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్ డిపో. ఏలూరు: బి. విశ్వనాథంగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు 163 బజారురోడ్డు.
విజయనగరం: ఇవటూరి సుందరశివరావుగారు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు. [షాప్స్.
ఖరగ్ పూర్: పి. వి. రమణయ్య, స్టోర్స్ క్లర్క్, బి. ఎన్. ఆర్ వై. వర్క్
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్ బాయ్ అండు కో.
అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.
నెల్లూరు: సి. సుబ్బరావు అండు సన్సు.
భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

**ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.**



# పఠానుల బలపరాక్రమము

## కాశ్మీరపుకీళ మీకు కావలయును

మానవులందరును బలిష్ఠముగను దార్ఢ్యముగను జన్మింపరు. కాని శరీరమునుపట్టి పీడించే నిస్సత్తువను నిర్మూలించి నిగనిగలాడు దేహముతో నిండు ఉత్సాహముతో అవయావముల పుష్టితో హాయిగానుండు టవసరము. అది మానవుని జన్మహక్కు. అందులకై ప్రతి ప్రాణియు ప్రయత్నింపవలయును.

దేహమందు రక్తము—నిష్కళంకమగు ఉష్ణరక్తము ప్రవహించుచో దేహమునకు ఆరోగ్యము, ప్రాణికి ఆనందము, జీవితముయెడల ఉత్సాహము ఉండగలదు. జీవాధారమగు ఉష్ణరక్తమును వృద్ధిచేయుటకు సాధనము అమృతకంటె వేరులేదని చెప్పకతప్పదు. శుష్కించిపోయిన మానవుని మన్మధునిగ చేయును. పిరికివానిని పరాక్రమునిగ మార్చును. మందబుద్ధిని బుద్ధిమంతుని చేయును.




# అమృత

## రక్తశుద్ధి ద్రావకము

రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

12 ఔ. రు 3. 6 ఔ. రు 1—10 లు.

అమృత యెల్లడల దొరకును.

**కేసరికుటీరం,** ఎగ్మూరు, మదరాసు.

ప్రకృతిశోభ
ధ్వంసమైనది!



వృక్షాలు వ్రేళ్లతో కూలినవి
నదులు బుసబుస పొంగినవి
ఇండ్లు పగిలినవి
భూమి బీటలు పడినది

అది భూకంపము!

ఆరోగ్యము
ధ్వంసమైనది!

చలి గజగజ వణకించినది
ఉష్ణము బుసబుస పొంగినది
ఉదరమున బల్ల పెరిగినది
పైత్యము ప్రశాంతతను
తలక్రిందులు చేసినది.

అది జ్వరము



విషజ్వరము

రెండును ప్రమాదములె—భూకంపములకు విరుగుడు లేదు
కాని జ్వరములకు మాత్రము విరుగుడు అర్కా వున్నది.

అర్కా
(సర్వజ్వర నివారిణి)

అన్ని మందులషాపులలోను దొరకును

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

# ఛాయాచిత్రములు

## వివరములు

### ముఖచిత్రము

### చిత్రకారిణి శ్రీమతి ఆర్. కమలాబాయిగారు.

ఈమె రిటైర్డు పి. డబ్ల్యు. డి. ఆఫీసరు శ్రీయుత ఆర్. అబ్బాయినాయుడు గారి పుత్రిక. సంగీతమునందును చిత్రలేఖనమునందును చిన్నతనమునుండియు మిగుల అభిరుచిగల వ్యక్తియగుటచే తండ్రిగారు ఈమె అభిరుచులకును కళాభివృద్ధికిని తగిన దోహదమిచ్చుటలో కడుంగడు శ్రద్ధవహించిరి. ఈమె శ్రీ రవీంద్రనాథ టాగూరుగారు స్థాపించిన శాంతినికేతనములో వంగదేశ సంగీతము, చిత్రరచనము మొదలగు కళలను చాల కాల మభ్యసించి, శిక్షణముపొంది స్వర్ణపతక బహుమానములను యోగ్యతా పత్రములను బడసినారు. భారతదేశ సంగీతవిజ్ఞానమునందు పేరెన్నికగాంచుటచేత శాంతినికేతనము వారీమెను ప్రశంసించుచు ప్రత్యేకపు పట్టము (Diploma with distinction) ను ఒసగినారు. మదరాసు ప్రదర్శనములో ప్రదర్శింపఁబడిన "రాధా నిరీక్షణ" యను సవర్ణచిత్రమునకు స్వర్ణపతక మొసంగఁబడినది. గృహలక్ష్మి పాఠకు లీమెకళావైదగ్ధ్యమును తిలకించి యానందపారవశ్య మందఁగలరని నమ్ముచున్నాము.

### సాధనకుటీరము

ఇదియొక చిన్న సాధనాశ్రమము. ఇందు బాలికలకు పాఠశాలలోని ఉన్నత విద్యతోఁబాటు సంగీతము, గృహపరిశ్రమలు, భక్తిజీవనము మున్నగునవి నేర్పఁబడుచుండును. జాతిమత విభేదములు లేక హరిజన బాలికలున్ను జేర్చుకొనఁబడుచున్నారు. ప్రస్తుత పటమున గోచరించు బాలిక లెల్లరు హరిజన విద్యార్థినులే.

### శ్రీ రాజకుమారీ అమృతకార్

గాంధిగారి గ్రామపునర్నిర్మాణోద్యమమునందే జీవితమంతయు గడప నిశ్చయించుకొన్న కర్మయోగిని.

### శ్రీ. కం మహాలక్ష్మమ్మగారు

ఈయమ, సర్ : ర. వెంకటరత్నం నాయుడుగారు పెంచుకొని పెద్దజేసి విద్యాబుద్ధుల జెప్పించిన యనాధబాలిక. ఇపు డీయువతీరత్నము రాజమహేంద్రవరములో నుపాధ్యాయిని.

## శ్రీ హాలీదా ఎడిబ్

టర్కీదేశపు సుప్రసిద్ధ కవయిత్రియగు నీ యవ్వ ఢిల్లీ మహమ్మదీయజాతీయ సర్వకళాశాలలో కొన్ని యుపన్యాసములివ్వ నిండియాకు వచ్చెను.

## శ్రీ నేసమనీపాల్

పాలంకోట స్త్రీలకల్బ్బున కీమె కార్యదర్శిని. పూర్వము మున్సిపల్ సభ్యురాలై యుండెను. కోయిల్‌పట్టిలో గూడిన అఖలభారత మహిళా సమావేశమున తమిళనాడు కాన్స్టిట్యుయంట్ సమావేశమున కధ్యక్షురాలుగ నుండెను.

## మహిళా మహాసభ

విశాఖపట్టణములో మొన్న గూడిన రాజకీయ మహాసభ యిదే. ఇందధ్యక్షురాలగు శ్రీమతి పొణకాకనకమ్మగారు చెప్పిన యుపన్యాస మమూల్యము.

## ఆకాశ దీపస్తంభము.

మంగుళూరునకు జెందిన కద్రి యనుపేటలో నిది పెట్టబడినది. ఇది లోహనిర్మితమై 80 అడుగుల యెత్తుగలది.

## మిస్ సంతోష్ఖన్నా

బొంబాయి సెంట్ జేవియర్స్ కాలేజి విద్యార్థిని. స్త్రీలకుగాను ప్రత్యేకింపబడిన అఖల భారత వక్తృతా పరీక్షయందు ప్రథమ బహుమాన మీపె కీబడెను.

## శాంతాకుమారి

ఈ బాలిక వయస్సు 9 వత్సరములు ఆంధ్రనాటక కళోద్ధారక శ్రీయుత వనారస గోవిందరావుగారి అష్టమపుత్రిక.

గడచిన డిశంబరు మాసమున మద్రాసునందు జరిగిన చతుర్థాంధ్రనాటకకళాపరిష త్సందర్భములో ప్రదర్శించిన 'తప్పెవరిది' అను నాటకములో రాజేశ్వరి పాత్రధరించి మిక్కిలి శ్లాఘా పాత్రురాలయ్యెను.

ఆంధ్రనాటక రంగమునందు ముందు ముందీబాలిక వన్నెకెక్కగలదని సూచింపు చున్నది. భగవంతుడు అనుగ్రహించుగాక!

# మాధవి




ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళపదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మలమగును. ముఖమున లేచు సోబి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగ నుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.




# ఎటువంటి విద్య?

పాశ్చాత్యదేశములయందును ప్రాచ్యదేశమగు జపానునందును నూటికి తొంబదిమందికంటె నెక్కువగా విద్యాయుతులై యుండగా భారతదేశమునందు నూటి కైదుగురుకంటె యెక్కువగా అక్షరాస్యులు లేకుండుట మిగుల శోచనీయమైన విషయము. ఈ విద్యాయుతులు నేర్చు విద్యయైనను ధనవ్యయమునకును, శరీరాయాసమునకును, నిరుద్యోగమునకును, నిస్పృహకును సాధకమైనట్లు, జీవనోపాధికిని, దేశాభ్యుదయమునకును, జాతీయోత్సాహమునకును మార్గము కాకుండుట మఱియును శోచనీయము. ఇట్టి శోచనీయమైన విద్యయయినను పురుషులలో వ్యాపించినంత మేఱకు స్త్రీలలో వ్యాపించకుండుట మఱియును దుఃఖహేతువు.

భారతీయులలో నింతమట్టుకు నిరక్షరాస్యత చొచ్చుకొని పీఠము పెట్టుకొని యుండుట విచారహేతువేయైనను, మన దేశస్థులు విదేశీయు లనుకొనునట్లు అజ్ఞానపు పశువులనిగాని, యుక్తాయుక్త వివేకరహితులనిగాని, ఉత్తమ ప్రజాహిత జీవనశూన్యులనిగాని, స్వపరిపాలనానర్హులనిగాని మనము జుగుప్సపొంద నవసరములేదు. భారతీయ జీవనము చాలవరకు కులక్రమాగత మగునట్టియు, కుటుంబక్రమాగత మగునట్టియు కొన్ని శిక్షణములకును కట్టుబాట్లకును లోనై వర్తించుచుండుటచేత, అనేకులు నిరక్షరాస్యులే యయ్యు జాతీయసంప్రదాయనైతిక జీవనమునకు భంగము లేకుండను, తమతమ వృత్తుల కనువగు విజ్ఞానానుభవములకు లోప

ములేకుండను ఎట్లో నేటివరకు గౌరవముగ త్రోసుకొని వచ్చుచున్నమాట నిజమే.

కాని ప్రపంచమెల్లయు నేడు అనుదిన త్వరితాయమానమైన క్రొత్తక్రొత్తసొబగులు పోకడలు, విజ్ఞానములతో సౌందర్యవంతమై రాణించుచున్న సందర్భములో, భారత దేశము తన తొల్లింటి అమాయక సంకుచిత విజ్ఞానవైఖరులతో తృప్తినొంది యుండ నేరదు. చదువను వ్రాయను ఆడను పాడను నేర్చినవారిసంఖ్య ఇంగ్లాండు జపాను మొదలగు దేశములలోవలె వృద్ధిపొందవలెను. నూతనవైజ్ఞానికజీవనము, రాజకీయప్రవేశము, స్వతంత్రతావిలాసము వానిలోవలె నిచ్చటను ఉన్నతమైన అంతస్థునకు నిర్మించఁబడవలెను. నూతనవిజ్ఞానములు, రాజకీయములు, సంయోగసౌకర్యములును గలసి నేడు ప్రపంచమునంతటిని ఒక్కకుటుంబముగాను ఒక్కశరీరముగాను మార్చుచున్నవి. ఒకరినొకరెరుగని దినములలో నెవరెవరికెట్టి భేదములు హెచ్చుతగ్గులున్నను నష్టము లేకుండెను గాని, విశ్వమానవకోటిలోని సమస్త కుటుంబములును ఒకటికొకటి సన్నిహితత్వములోనికి వచ్చుచున్నప్పుడు, ఇట్టి విభేదములు మానవలోకమున కొక అందవికారమును గూర్చుటయేకాక, అభివృద్ధిని పొందిన జాతులవలన పొందని జాతులు అణగఁద్రొక్కబడుటకుఁ గూడ కారణమగును. కనుక భారతీయ పురుషులేమి స్త్రీలేమి అత్యుత్తమ జాతులని భావింపఁబడువారితో తుల్యముగ విద్యాధికులై, రాజకీయ జీవనాసక్తులై, ఆర్థికసౌభాగ్యసంధాతలై, స్వాతంత్ర్యగౌరవవిభూషితులై యుండకున్నచో భారతదేశముతోడిదేశములతో సమానమైన ప్రతిపత్తి నందనేరదు. ఒకప్పుడు భారతదేశము విజ్ఞానఖనియై ప్రపంచమునకెల్ల మార్గదర్శకమై యుండెను. నేడు ఇతరదేశములతో సమానమైన స్థితియైనను ఆమెకు సిద్ధించకున్నచో భారతీయులు సంతుష్టిచెంది యుండఁజాలరు.

ఈ సమస్యయే ప్రస్తుతము భారతదేశీయ నాయకుల దృష్టినెల్ల ఆవరించుకొనుచున్నది. విద్యాధికులెల్లరును అనేక సందర్భములలో తమతమ ఆశయములను ప్రణాళికలను ప్రకటించుచున్నారు. ప్రస్తుతవిద్యావిధాన మరిష్టదాయకముగ నున్నదని అందరును ఏకగ్రీవముగ ఖండించుచున్నారు. సర్ రాధాకృష్ణనుగారు పాశ్చాత్యభౌతిక విద్యావిధానము తృష్ణ పరస్పరవైరములకు సాధనమై ప్రపంచమును యుద్ధోన్ముఖముగ చేయుచున్నదని అలహాబాదు విశ్వవిద్యాలయ పట్టప్రదాన మహోత్సవమున నుపన్యసించినారు. ప్రస్తుత విద్యావిధానము నీతిబోధకముగ లేదు గనుక మతవిద్యనుదానికి జోడించవలెనని సర్. కె. వి. రెడ్డిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయ కాన్వ

కేషనులో హెచ్చరించినారు. సర్ షామహమ్మదు సులేమానుగారు అలీఘరు విశ్వవిద్యాలయ కాన్వకేషనులో ఉపన్యసించుచు ప్రస్తుత విద్యావిధానములో ఎట్టి లోపములున్నను విద్యాసంస్థలను తగ్గించుటకు వీలులేదనియు, జీవనోపాధికనువగు వృత్తులను, ఉన్నతపరిశ్రామిక యంత్రములనపు సంకేతిక జ్ఞానమును ఉన్నత ఉత్తమతరగతులలో నేర్పి విద్యను జీవనోపాధిసంపాదమునకు మార్గముగ చేయవలెనని వాక్రుచ్చినారు. ఢిల్లీ ఎడ్యుకేషనలు కాన్ఫరెన్సు కగ్రాసనాధిపత్యము వహించిన ప్రొఫెసరు శేషాద్రిగారు విద్య సర్వతోముఖ సంపూర్ణత్వమును గూర్చునదిగా నుండవలెనని బోధించిరి. కరాచీలో జరిగిన అఖలభారత మహిళాసభవారును, విశాఖపట్టణములో శ్రీమతి పోణకా కనకమ్మగారి అధ్యక్షతను గూడిన ఆంధ్రమహిళాసభ వారును స్త్రీలకు కావలసిన ప్రత్యేకపు శిక్షణములను గూర్చి చర్చించి కాలానుగుణ్యమైన తీర్మానముల నొనరించిరి. వీనినన్నిటిని సమన్వయము చేసి భారతదేశములోని సమస్త స్త్రీ పురుషుల కే యే వయస్సులో ఏ యే అంతస్థులో నెట్టివిద్య యొసంగవలెనను విషయమును సులభముగ నిర్ణయము చేయవచ్చును.

ప్రాథమిక విద్య బాలబాలికల కించుమించుగా నొక్కరీతిగానే యుండి యిరువురకును కలసియే చెప్పవచ్చుననియు అది నిర్బంధముగను ఉచితముగను ఉండవలెననియు నిశ్చయింపవచ్చును. వ్రాయుట, చదువుట, లెక్కలుచేయుట, నీతులునేర్చుట, ఉల్లాసకరమగు ఆటపాటలయందు విశ్రామసమయమును బుచ్చుట ఇది యీతరగతులలోని విద్యాక్రమమైయుండును. ఈవిద్య కేవలము ప్రైమరీ తరగతితో ఇప్పు డాపివేయబడుచున్నది. ఇంత స్వల్పముగా నుండుటవలననే యీవిద్య అతి త్వరితముగ మఱువఁబడి అనంతర జీవనమునం దెందుకును కొఱగాకున్నది. ఈ తరగతులలో నేర్చినవిద్య శాశ్వతఫలదాయకమై యుండవలెననిన మూడవఫారమువరకైనను దీనిని పొడిగించక తీరదు. మఱియు నీవిద్య కేవల మాతృభాషలోనే గఱపఁబడవలెను. ఇందులో హిందీగాని ఇంగ్లీషుగాని క్వచితుగా నేర్పబడవలెను గాని వాని కేమాత్రము ప్రాముఖ్య మిచ్చినను అవి పట్టుబడవు సరేగదా మాతృభాష కూడ పట్టుబడక విద్యార్థుల కనావశ్యకమగు నత్యధిక కష్ట మేర్పడును.

మూడవ ఫారమునుండి సాహిత్యవిద్యకంటె వృత్తివిద్య కెక్కువ ప్రాముఖ్యమిచ్చుచు రావలెను. అనేకమందికి కాలేజీ విద్య నభ్యసించుట కవకాశము లుండవు గనుక ఉన్నతవిద్యతో చదువు మానివేసి ప్రపంచయాత్రలో పడుదురు. అప్పటికి వారికే

వృత్తియో కరగతము కాకున్నచో ఉపాధి రహితులై ఉద్యోగములు దొరకక లేమిడి లోఁబడి తల్లడిల్లుచుందురు. మన ప్రస్తుత విద్యావిధానమునం దిదియే పెద్దలోపమై యున్నది. ఉన్నత విద్యా తరగతులను విడచి పెట్టు సరికి స్త్రీ పురుషుల నెట్లు జీవించుట అను సమస్య యెదురుకొనకుండ మగవారికి వారి కుచితమగు వృత్తులును ఆడువాండ్రకు వారి కుచితమగు వృత్తులును గఱపఁ బడ వలెను. అయిరోపా జపాను అమెరికాయం దవలంబింపఁబడు విద్యావిధాన మిట్టిదై యున్నది. అప్పుడు వారివారి తరగతులును పాఠశాలలును వేఱువేఱై యుండుటయే శ్రేయస్కరము. పై చెప్పిన దేశములు పారిశ్రామికములై ఫ్యాక్టరీలతో నిండియుండుట చేత వానిలో పనిచేయు నేర్పు ఈ తరగతులలో గఱపఁ బడుచున్నది. కాని మనదేశము వ్యవసాయము గృహపరిశ్రమలకు సంబంధించిన దేశము. ఇట్టి దేశములలో యీ తరగతులలో అట్టి విద్య నేర్పుటయు సాధ్యము కాదు, నేర్పినను ప్రయోజనములేదు. మన దేశములో వ్యవసాయము గృహపరిశ్రమలు కులవృత్తులై నేటికిని నశింపకున్నవి. కాని అవి పాశ్చాత్యదేశముల పోటీకి నిలువలేక నశించుచున్నవి. ఆదేశములతో సరిపడుటకు మనమును ఫ్యాక్టరీలను పెట్టుకొని, అత్యధికోత్పత్తిచేసి, అంగడులు దొరకక నష్టముపాలై నిరుద్యోగులమై యుద్ధప్రయత్న నిమగ్నులము కాజాలము. కాని యీ వ్యవసాయమును గృహపరిశ్రమలను తొల్లింటి మోట పద్ధతులపై నడపినచో విజయమునంద లేము. నవనాగరకతలోని కొన్ని జిలుగులు సులువులు వానిలో ప్రవేశపెట్టి వాటిని రమణీయములుగఁ జేయవలెను. గాంధీ మహాత్ముఁడు గ్రామపునర్నిర్మాణ ప్రయత్నము నిందు కొరకై పూనినాఁడు. అఖిల విద్యాసభలు మహిళా సభలును ఆయుద్యమము నాదరించి సంపూర్ణోత్సాహముతో పాల్గొన తీర్మానించుట మిగుల శుభసూచకము. ఉన్నత విద్యా సంస్థలలో ఇట్టి యుద్యమమును వృత్తులను నెరవేర్చగల నైపుణ్యము గఱపఁ బడవలెను.

విద్య మానవులను నీతివంతులను, జ్ఞాన సంపన్నులను, స్వతంత్ర జీవులనుగా చేయుటకే గాని బి. ఏ., ఎమ్మే బిరుదులతో విఱ్ఱవీగఁ జేయుటకుగాదు. ఉత్తమవిద్యలు నేర్చుటయా మానుటయా అనుసమస్య ఉన్నత విద్యా పరిసమాప్తి అయిన పిమ్మట ఉద్భవించవలసినదిగాని ఈ లోపల నాలోచింపవలసినదిగాదు. కాలేజీ విద్య నభ్యసింపఁగల శ్రీమంతులుగాని, బుద్ధిమంతులుగాని తీరికగలవారుగాని ఏ సంఘములోనైనను చాలా తక్కువమంది యుందురు. విద్యావిధానము విద్యార్థులను కేవలము ఒకతరగతిలో నుంచి

యింకొక తరగతిలోనికి ఎమ్మే ఎమ్మెల్ వఱకు చదివించుటకు రహదారులుగా నుండ కూడదు. ఉన్నత విద్యతో చాలామంది ఆగిపోయి ప్రాపంచక కృత్యములను సమర్థతతో నిర్వహించునట్లుగా చేయవలెను.

పిమ్మట ఉత్తమవిద్య లేక కాలేజివిద్యా సమస్య నాలోచించవలెను. జనసంఖ్యలో నూటికి ఇరువది లేక ఇరువదియైదు మంది మాత్రమే యిందులో చేరినను అది మిగుల ప్రశంసనీయముగానే భావించవలెను. లాయర్లు, ప్రొఫెసర్లు, డాక్టర్లు, ఎడిటర్లు, ఇంజనీర్లు, పరిశోధకులు మొదలగు వారిని తయారు చేయుటయే కాలేజీ విద్యావిధానముయొక్క ఆశయము. ఇది మిక్కిలి ఖర్చు వెచ్చములు, కష్టనష్టములతో గూడుకొనిన సమస్య. అందుకుతగిన బుద్ధి, ధనము, ఆసక్తి, అభిరుచులుగలవారే దానికి గిఱంగవలెను. స్త్రీ పురుషు లెవ్వరైనను ఇందు చేరవచ్చును. ఇంత కొంచెముమందిలో స్త్రీలకు వేఱు పురుషులకు వేఱుగా సంస్థలు పెట్టినచో ఎక్కువ ధనవ్యయమునకు కారణమగుటయే కాని ప్రత్యేక ఫలితము లేమియు సమకూడఁబోవు. ఈ సంస్థలైనను ప్రతీ రాష్ట్రమునందును అన్నింటిని ఉంచుటకంటె ఒక్కొక్క రాష్ట్రములో నొక్కొక్క విద్యకు సంస్థనుంచి, ఇతర రాష్ట్రీయు లచ్చటికి పోయి నేర్చుకొన్నచో ఖర్చు క్లుప్తముగ నుండఁ గలదని సులేమానుగారు చెప్పిన సలహా మిగుల గమనింపతగినది. వీరెల్లరును ఈ విద్యలను ప్రస్తుతమువలె వ్యామోహము వ్యసనము కీర్తి పెద్దజీతము దర్జాజీవనముకొరకు గాక వారి పరిశ్రమల ఫలితములను ఉన్నత విద్యాసంస్థల ఉపాధ్యాయులకు విద్యార్థులకు అశ్రమముగ నిచ్చుటకును, తన్మూలమున జాతీయ జీవనమును సౌభాగ్యవంత మొనర్చుటకు నే కృషిసల్పుచుండవలెను.

వృత్తి, విజ్ఞానము, సుఖజీవనము మొదలగు వాని కిరీతిగ విద్య ఉపకరించునదై యుండవలెను. ఇన్నిటికంటె ముఖ్యమైన విషయ మొకదానిని మనము మఱువరాదు. ప్రస్తుత విద్యావిధానమువలన మనకు కలుగుచున్న జ్ఞానముకంటె వేయిరెట్లు షోకులు, దురభ్యాసములు, దుర్వ్యయములు, అహంకారములు ఎక్కువగా అలవడుచున్నవి. ఈ కారణములచేత అనేక పల్లెటూరి ఛాందసులకు పిల్లలను అందునను ఆడపిల్లలను బడిలోకి పంపుట యనగనే భయమగుచున్నది. ఉద్యోగ తృష్ణయొకటి పీడింపకున్నచో మగపిల్లలనైన బడిలో వేయుదురేమో సంశయాస్పదమై యున్నది. చదువులకు పుస్తకములకు జీతములకుకంటె వింత వింత విలువదుస్తులకు పరికరములకు భోగములకు ఎక్కువ ధనము ఖర్చై కుటుంబములు చితికి ఉద్యోగములు కఱవగుచున్నవి. ఇవతల నిరుద్యో

గమునకు సాయము అవతల విఱుగఁబాటు విద్యాప్రమాణాలు కూడ చెలరేగినచో అసలు విద్యయొక్కయు పాఠశాలలయొక్కయు పరువు ప్రతిష్ఠలుకూడ నశించును. ఈ విషయమున ముఖ్యముగా ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు వైసు ఛాన్సలర్లు డైరెక్టర్లు, కమిటీల సభ్యులు పరీక్షాధికారులు బాల బాలికలకును విద్యార్థినీ విద్యార్థులకును 'మార్గదర్శకులై యుండవలెను. ఈ సందర్భమున సర్ సులేమానుగారు కాసీ విశ్వవిద్యాలయోపాధ్యాయులను విద్యార్థులను విద్యా విధానమును ప్రశంసించుచు నుడివిన వాక్యములు ప్రతి యువకుడును, యువతియు, ఉపాధ్యాయుడును సువర్ణాక్షరములతో మనః ఫలకములపై లిఖించుకోతగినవై యున్నవి. 'ఇచ్చటి అధ్యాపకులు తక్కిన విశ్వవిద్యాలయములలోని అధ్యాపకులకంటె జీతము తక్కువగ గైకొని నిరాడంబర నిరహంకార జీవనమును గడపుచున్నారు. విద్యార్థులుకూడ తక్కిన విశ్వవిద్యాలయములలోని విద్యార్థులకంటె చాలా తక్కువసొమ్మును వెచ్చించుచు తక్కువ విలాసములకు లోనగుచు రాణించుచున్నారు. మఱియు నిక్కడివిద్యలు కేవల వైజ్ఞానిక సిద్ధాంత చర్చలు ఉపన్యాసములుగా నుండక ప్రస్తుతము భారతదేశమున లేచుచున్న ఫ్యాక్టరీలు యంత్రములు మొదలగు వానిలో పనిచేయుట కనువగు చాతుర్య నైపుణ్యములను ప్రత్యక్షముగ నేర్పునవై యున్నవి.' ఈ మూఁటిని భారతదేశమునందలి ప్రతివిద్యాసంస్థయు అమూల్యమైన ఆదర్శములుగ పెట్టుకొని పనిచేయవలెనని వారు హెచ్చరించుచున్నారు. దేశీయు లెల్లఱును ఇట్టి శ్రేయస్కరమైన సలహాలను అమలుపరచుటకు మనఃపూర్వకముగ ప్రయత్నింతురు గాక !



# స్త్రీవిద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ, బి. యల్.

స్వీయజాత్యుద్ధరణమునకై జపాన్ స్త్రీలు తమ ప్రాణములను గోల్పోవుటకు సంశయించిరికారు. జపాన్ స్త్రీలేకారు; పాశ్చాత్య రమణులుకూడ జాత్యుద్ధరణమని తాము తలఁచిన ప్రతియుద్యమ విజయమునకు సర్వశక్తులను వినియోగించిరి. ఐరోపా మహాసంగ్రామము, సర్వమానవ సమత్వమునకు పట్టముఁగట్టుటకు ఏర్పడినదని నాఁటిరాజకీయవేత్తలు జలదగంభీరస్వరములఁ బలికిరి. మగలను, బిడ్డలను రణోద్వేకంపి, పవరపరిచర్యపదార్థములను సిద్ధమొనరించుటకు నాఁటి పాశ్చాత్యస్త్రీలు నడుముగట్టిరి. నాఁటి సమీకము కలుషభూయిష్ఠమైనదనియు, అందుండి వెడలిన పాపధూమము నేఁడును పాశ్చాత్య వాతావరణమును మలీమస మొనరించుచున్నదనియు గుర్తెఱిఁగి, రాఁబోవు భీషణ మృధమునకును, తమకును నెట్టి సంబంధముండదనియు, నా భండనపిశాచమునకు తమ బిడ్డలను బలివెట్ట గమకింపమనియు, గావున సంతానవతులమగుట కిష్టపడమనియు నేఁడు వారనుచున్నారు.

ఆత్మగుణములను అవలీలగ చిక్కఁబట్టఁగలవారు—ఏ దేశమందలివారైనను,—స్త్రీలే. కావుననే గాంధిజీ 'సంఘభేదములను మఱచి, పురుషులకు ఐకమత్యమును బోధింపుఁడు. నేను తలపెట్టిన గ్రామపునరుద్ధరణ క్రియకు మీతోడ్పాటు అత్యవసరము' అని, ఇటీవల జరిగిన అఖిలభారత స్త్రీసమావేశమునకు సందేశమంపిరి. 'భారతస్త్రీలు ఇచ్చట పికెటింగు చేయుచున్నారని తెలిసి, నేనును, మఱికొందఱు స్త్రీలును ఈ దేశమునకువచ్చి, పికెటింగు చేయవలెనని అనుకొంటిమి. ఈ వఱలో మీజాతీయోద్యమమునకు మేమెట్టి సాహాయ్యమును చేయఁజాలనందులకు మన్నింపుఁడు. ఇఁక మీవెంట నుండఁగలము' అని నిన్నగాక మొన్న కారాచీసభలో ఏష్బీసతిగారనిరి. అంతర్జాతీయ స్త్రీసహకార సమ్మేళనమువారు మనుష్య భ్రాతృత్వమునాదర్శముగాఁగొని, ఆయుధవిసర్జనము జరిగితీరవలెనని నొక్కి చెప్పుచున్నారు. ప్రపంచమున వ్యాపించియున్న సామరికవాతూలము నేఁడుగాకున్న, రేపైనను, పృథ్వీమహిళామతల్లులవల్లనే చల్లఁబడునేమో!

ఆత్మగుణములు పెంపొందిననాఁడే మానవైక్యత ప్రత్యక్ష కల్పవృక్షమై గోచరించును. ఈ గొనములనుద్బోధించు నాగర

కతయే నేడనుకరింపఁదగినది. ఉన్నతాశయములను తన సొమ్ముచేసికొనినది ప్రాచీ సభ్యత. ఇట్లని నేటి విద్యాధికులు కొందఱు గుర్తించుట ముదావహము. "పాశ్చాత్య రమణులవలె భారతస్త్రీలు, తొందరపడక భారతదేశ ఆదర్శముల ప్రకారమే అభివృద్ధి నందవలెను. 'పురుషుఁడు గొప్ప—స్త్రీ తక్కువ' అన్న అభిమానముతో ఒక్కగంతు వేయఁబూనుట ప్రమాదకరము" అని జయరాందాసు దౌలతురాంగారు ఢిల్లీలోఁ గూడిన భారతవిద్యావిషయక సమావేశమందు పలికిరి. భారతదేశమందు నేఁడు గృహధర్మ, జాతిధర్మ, సంఘధర్మములను నిర్వహించుపట్ల స్త్రీలకు దివ్వెకాంజాలు విద్య ఎట్లుండవలెనో పెక్కురంగస్థలముల నుండి మహిళామణులు వాకొనిరి.

భావసౌష్టవమున నగ్రస్థానము వహింపఁజాలునది ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభ కధ్యక్షతవహించిన శ్రీమతి పొణకా కనకమ్మగారి మహోపన్యాసమని నాతలంపు. "ఒకప్పుడు సర్వోన్నతశిఖరము నధిష్ఠించిన మనకిప్పటి పరిణామము తృప్తికరముకాదు. ఆలోచానికి కీలకం, ముఖ్యంగా మనవిద్యావిధానంలోనే ఉన్నది. వేదకాలమునుండి స్త్రీల ధర్మములు, శక్తి, స్వాతంత్ర్యము, విజ్ఞానము లోకమునకు మార్గదర్శకములై ఋక్కులద్వారా కూడ సుప్రతిష్ఠితమైనవి. పౌరాణిక కాలమున స్త్రీ యుద్యమము ఇంకను శాఖలువేసినది. స్త్రీ స్థానము ఒకప్పుడు మేరుశిఖరాన్ని అధిష్టించినది ........నేఁడు ఒకజాతీయ స్మృతిగాని, ఆదర్శంగాని లక్ష్యం అగుటలేదు. అనుకరణం నాగరకతగా పరిగణింపఁబడుతూ వున్నది. వేషభాషలలో సహితం ఇది మన స్వకీయశక్తి తేజస్సులు కోల్పోవుటకు కారణమవుతూ ఉన్నది...నిజంగా గృహలక్ష్మి స్త్రీ...పునరభివృద్ధి మనమీఁదనే ఆధారపడియున్నది. ఈయుద్యమానికి మనం సంపూర్ణంగా తోడ్పడాలి. నేఁడు దేశసేవకు నడుముఁగట్టిన సాధ్వీమతల్లులలో గార్గి సులభలు, సీత ద్రౌపది సత్యలు, వీరమతి, సంయుక్త రుద్రమదేవి దుర్గావతి ఝూన్సీరాణులు, మొల్ల మల్లమదేవులు ప్రజ్వలించాలి. కవులు, గాయకులు, కళానిధులు ప్రభవించాలి. ఈమహోద్యమసాధనకు ఆత్మబలి కావాలి. పూర్ణస్వరాజ్యసిద్ధి కావాలి.' వర్తమాన స్త్రీయుద్యమ చారిత్రమందు శ్రీమతి కనకమ్మగారుచ్చరించిన ఈవాక్కులు స్వర్ణాక్షరములతో లిఖింపఁబడుఁగాక !!

# పుత్రవాత్సల్యము!

శ్రీమతి న్యాయపతి మంగమ్మగారు

౧

ఇందిర కిప్పుడు ముప్పది యారవయేడు నడచుచున్నది. ఆమె సంసారసాగరమును సుఖస్వప్నము వలె గడుపుచుండెను. దైవము తనకు వలయు సౌకర్యములన్నియు ప్రసాదించినందులకు, ఆమె కృతజ్ఞతాపూర్వకముగ తన వందనము లాయన కర్పించుచుండెను.

నేడిందిర ఇంటివెనుక వసారాలో కూర్చొని దీర్ఘాలోచన సేయుచుండెను. ఇరువదేండ్లయి శ్రీనివాసరావుగారితో నామె కాపురము సేయుచుండెను. ఈ యిరువదేండ్లును పరస్పర ప్రేమానుబంధములో వారిర్వురు లీనమైరి. శ్రీనివాసరావిప్పుడు డిప్యూటి కలెక్టరయి పెద్దపేరు ప్రతిష్ఠలు బడయఁగల్గెను. తమ యేకపుత్రుడు ప్రతాప్ బియే పరీక్షయందు ప్రథమ తరగతిలో నుత్తీర్ణుడయ్యెను. గవర్నమెంటు అసిస్టెంటు సర్జను రామమోహనరావుగారి కుమార్తె, కమలను ప్రతాపున కిచ్చి వివాహముఁ గావించుటకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండెను. ఇందిర కిక కావలసినదేమి?

ఇట్లామె దీర్ఘాలోచనలో మైమఱచి యుండ, వీధిలో నౌకరి రాము డెవరితోనో, "అమ్మగారు మిమ్ము చూచుట కిష్టపడియెదరో లేదో కనుగొనియెద"నని యనుట ఇందిర చెవిలోపడి, యామె ఉలికిపడి లేచెను

ఇంతలో తన సోదరియగు రుక్మిణి ప్రత్యక్షమయ్యెను. ఇందిర రుక్మిణి నెన్నడును తనయింటికి పిలువనని శపథము చేసియుండెను. అట్టి రుక్మిణి నేడెవరును పిలువనిదే, తనంతటతాను ఇందిర కడకు వచ్చి కూర్చొనియెను.

౨

కొంతవఱకు ఇరువురు నిశ్శబ్దముగ కూర్చొనిరి. తరువాత రుక్మిణి ధైర్యము వహించి ఇట్లనెను.

"అక్కా! నాతో మాటాడవా?"

ఇందిర మండిపడి, "నీ వేయధికారముతో నిచ్చటకు వచ్చితివి? నీరాక మాభావగారికి తెలిసినచో నేమి చేయుదురు?" అనెను.

"ఇందిరా, నేనంత యపవిత్రురాలనా? నారాక వారెందులకు నిరాకరించెదరు? అందులో నివి పండుగ రోజులు గదా?"

"నాకదంతయును తెలియును. పండుగైననేమి మరేమైననేమి? నీరాకకును పండుగకునుగల సంబంధమేమి?"

"పండుగతో నారాకకుఁగల సంబంధమేమా? నీ దయకు పాత్రురాలనగుటయే. మన బాల్యమును స్మరణకు దెచ్చుకొనుము. నేను..."

"నీవు... నేను మఱచితినని తలంచితివి."

"కాదు, కాదు, నన్ను క్షమించితివని తలచితిని."

"క్షమార్పణా? నీవు మాపై మోపిన యపవాదమునకు తిరుగ క్షమార్పణా? నీవొనర్చిన ధురాచ కార్యమును సహింపలేక, దూరదేశమున కరిగిన మన యమ్మగనుఁగూడ అపవాదముఁ దెచ్చిపెట్టితివే? అదే

యుటుండ, కమలను ప్రతాపునకిచ్చి వివాహముఁ గావించుదమని, రామమోహనరావుగారి నడుగ, 'మీ చెల్లెలు రుక్మిణిఁ గావించిన ఘోరకృత్యమునకు తిరుగ బహుమానము నా కమలను మీ ప్రతాపునకీయుటా' యని నిందావాక్యము లాయన బలుకుటయు, నిన్ను క్షమించుటకా?"

ఇందిర ఇక మాటాడలేకపోయెను. క్రోధోద్దీపికచే యామె కండ్లెఱ్ఱబారి యుండెను.

రుక్మిణి యొకింతయు చలింపలేద. ఆమెకిట్టి నిందావాక్యము లాలకించుట యలవాటే. ఆమె యేడ్చుటలేదు; ఆమె కన్నీటి నూయి యెండిపోయెను. మరల నామె దీన స్వరముతో:—

"ఇందిరా, నీవెన్నన్నను సరే. నేనొనర్చిన ఘోరకృత్యముఁగూర్చి నేనెన్నోసార్లు తలపోసితిని. తలచినపుడెల్ల నామనమున నమితమైన యాందోళన కల్గుచుండును. ఒక్కొక్కసారి పిచ్చెత్తుదునేమోయనిఁ గూడ భయము కల్గుచుండును. ఇంతకు లాభమేమి? నేనొకటి చెప్పెదను, నీవది తెలిసికొనజాలవు. అభిలాషయనునది నీవెన్నడును ఎఱిగి యుండవు; అనుభవించి యుండవు." అనెను.

"ఘోరకృత్యము నందభిలాష! ఔను నేనెన్నడు నది యెఱుగను; అనుభవించనులేదు. ఇందుపగను. నా వందనము లా దైవమున కర్పించుచున్నాను."

"మనమిర్వురము బాల్యమునుండియు నొకరీతినే పెరిగితిమి. నీకును నాకునుగల భేదమేమన, నీవు రూపవతివి; నేనుగాను; నీవొక ధనవంతుని వివాహమాడి, వాని యాదరమునకు పాత్రురాలైతివి; నేనొక పేదవాని భార్యనై, నా మగనిఁ గోల్పోయితిని. నీవు నీ ప్రతాపునకు మంచి విద్య నొసంగ గల్గితివి. నా తనయునకు, నేను కొద్దిగనే విద్యనీయ గల్గితిని. నీ జీవితములో నీకన్నియు సౌఖ్యములే; నాకెప్పుడును కష్టములే."

3

"సాలున కైదువందల రూప్యములు నీకు ముట్టుచున్నవి గదా? అట్టిచో నీవెట్లు నిరుపేదవగుదువు?"

"అక్కా, సాలున కయిదువందల రూప్యములతో నా తనయునకు విద్యఁగఱపి, ఇటు సంసారసాగరము నీదుట సులభసాధ్యమా?"

"చోరకృత్యము మానిన యది సులభసాధ్యమే!"

"దురభిలాష ప్రవేశించనంతవఱకు నది సాధ్యమే. అక్కా నే చెప్పునది సావకాశముగ వినుము. మూనిరుటి పండుగరోజులలో మల్లాది వారి గృహమున నుంటి. నా తనయుడు వెంకట్రావప్పుడు విశాఖపట్టణములో బ్యాంకిగుమస్తాగా నుండెను. వానికొక స్నేహితుడేర్పడెను. వీరిర్వురును చెడు సావాసములలోఁ జేరి, జూదము, తాగుడు, ఇట్టి మరేవియో యలవాటులలోఁ దగుల్కొని బ్యాంకి సొమ్ము దుర్వ్యయపఱచిరి. బ్యాంకిలో మూడువేల రూప్యములు కొఱతపడెను. ఈ సొమ్ము మఱల సర్దుపాటు చేయుటకు వారము రోజుల వ్యవధియుండ, నా తనయుడు నేనుండు మల్లాదివారి గృహమును చేరెను. నాతో తను చేసిన దుష్కార్యముఁగూర్చిఁ దెల్పి, ఎట్లయినను నన్నా సొమ్ము జతపరుపమని వేడుకొనెను; లేనియెడల ఆత్మత్యాగముఁ జేసికొందునని యేడ్చెను. ఒకరూప్యమా! రెండా! మూడు వేలు తలచుకొన్న గుండె ఝల్లుమనుచున్నది. మూడు వేలరూప్యములు నేనెచ్చటనుండి తెచ్చి నా తనయుని కాపాడుదును? అక్కా, జ్ఞాపకమున్నదా? అప్పుడు సొమ్ముకొఱకు నీకొక తంతివార్త నంపితిని. నీవును దయాళురాలవై రెండువందల రూప్యములు పంపితివి.

అప్పుడది సాయంసమయము. మల్లాదివారింట్లో పెద్దటీపార్టీ జరుగుచుండెను. నాకిటు నా తనయుని ముఖముఁ జూచిన, ఏఘుడియ కేమి చేసినైచునో యను భీతిఁ గలుగుచుండెను. నాకప్పుడు జోరున

తలపోటు వచ్చినది. కొంచెము యాస్పిరిన్ (Aspirin) తినుటకు మేడపై నా గదికేగితిని. నా గదిలో (Aspirin) యాస్పిరిన్ కనబడమి, మఱియొక గదికేగి చూచితిని. అచ్చ టెవ్వరును లేకుండిరి. ఆ గదిలో నొక టేబిలుపై నొక విలువఁగల మణిహారముండెను. అది మల్లాది శేషమ్మగారిది. దాని వెల యాఱువేల రూప్యములని యామె నాతో నిదివఱలోఁ జెప్పియుండెను. నాకప్పుడు లెక్కలేనన్ని యాలోచనలు పుట్టెను. దురభిలాష తన యావశ్శక్తితో నన్ను పురికొల్పెను. నాకెన్ని యాపదలు చేకూరినను, నా తనయుని కాపాడుదును గదా యను తలంపు నా మదినంటుకొనెను. అచ్చ టెవ్వరును లేకుండుటఁ జూచి, మణిహారమును చేతధరించి మఱల నా గదిఁ జేరితిని.

• నాల్గయిదు రోజులవఱకును మణిహారముకొఱకు శేషమ్మ వెదకికొనలేదు. ఇదియే సమయమని నేను కలకత్తాకేగి, మణిహారమును మూడువేల రూప్యములకు విక్రయించి నా తనయున కా ద్రవ్యమొసంగితిని. వాడప్పుడుపోయి తనకే కొఱంతయు కలుగకుండు నటుల బ్యాంకిసొమ్ము సర్దుబాటుఁ జేసికొనెను.

వారమురోజు లయిన పిమ్మట, మల్లాదివారి గృహమున చోరులు మణిహారము నపహరించిరను మాట వెలువడెను. నన్నెవ్వరును అనుమానింపరను ధైర్యము నాకుఁ గల్గెను. వెంకట్రావు తను రక్షింపబడెను గదా యని భగవంతుని వేయిమ్రొక్కులు మ్రొక్కి, ఆయన సాయముచే దుష్కార్యములన్నియు మానివైచెను.

ఇంతలో నపరాధపరిశోధకులు కలత్తాకేగి నేను మణిహారము నమ్మిన వర్తకుని పట్టుకొనిరి. వాని సాయమున నన్నుఁ గూడ పట్టుకొనిరి. నన్నయిదు నెలలు ఖైదీగఁ జేసివైచిరి. అక్కడ మరేమని చెప్పుదును. మల్లాదివారినిఁ జూచుట కిప్పటికిని సిగ్గువేయుచున్నది. నేఁజేసిన దాని కిప్పుడు ఘోరమగు పశ్చాత్తాపముఁ జెందుచున్నాను. ఇందిరా! నీవెన్నడును కష్టమను నదెఱుగవు. గాన, నేఁజెప్పినదేమియు నీ మనమున కెక్కదు."

## ౪

రుక్మిణి చెప్పినదంతయు ఇందిర వినెను. అప్పుడిందిర, "రుక్మిణీ, నేను, నీవనునంతటి కఠినహృదయురాలినిఁ గాను. నేను కఠినత వహించుటకుఁ గారణము నీవు చేసిన దుష్కార్యమే. నీనుండియేఁ గదా మనయమ్మను దూరదేశమున విడచినది. నీనుండియేఁ గదా ప్రతాపుని వివాహము నిలచినది. నీవు చేసిన దౌర్జన్యము కారణముగ మనవంశమున కెంతయుఁ గళంకముఁ గల్గినది. అట్టి నీపై సరళహృదయ యగుయే స్త్రీయైనను జాలి చూపగలదా?"

"పండుగ దినములలోనైనను..."

"రుక్మిణీ, నీమాటలు చాలింపుము. నీవు దొంగిలించినపుడు నీకు పండుగ జ్ఞాపకము రాలేదా?"

## ౫

మఱల కొంతవఱకు నిశ్శబ్దము.

ఇందిర, తన పెనిమిటి వచ్చువేళ యైనది—రుక్మిణి రాక ఆయనకు తెలిసినచో, తన్ను నిందింతురని, భయపడుచుండెను. ఎటులైనను రుక్మిణిని వెడలుమని చెప్పుట కామె మాటలకొఱకు తడుముకొనుచుండెను. కొసకు, 'రుక్మిణీ' అని మఱల నూరొక్కెను.

రుక్మిణి, ఇందిర మనోభావము నూహించి,

"ఇందిరా, నా రాక నీకు కష్టముగ నున్నదా?" అని యనెను.

"ఔను".

ఇంతలో శ్రీనివాసరావుగారు వీధి మెట్లెక్కు-

చుండిరి. ఆయన, "అమ్మగారేమి చేయుచున్నా" రని రాము నడిగిరి. రాముడు తిరుగ, "అమ్మగా రెవరితోనో మాటాడుచున్నారు" అనిఁ దెల్పెను.

ఇదంతయు ఇందిర వినుచుండెను. ఏఘడియకు తనపెనిమిటి లోనికి ప్రవేశింతురో యని యామె భయమొందుచుండెను.

ఆమె, "రుక్మిణీ, నీకేమి కావలె"నని రుక్మిణి నడిగెను.

రుక్మిణి, మరేమియును లేదు. వేంకట్రావు బ్యాంకిలో పనిచేయుట కిష్టపడుటలేదు. మేమిద్దర మెచ్చటికైన దూరదేశమున కరుగుటకుఁ జూచుచున్నా" మనెను.

"ఏమ్మట".

"శ్రీనివాసరావుగారి 'టీ' ఎస్టేటు లున్నవిఁ గదా?"

"ఉన్నవేగాని, వాటినిగూర్చి నీవాయన నడిగినచో..."

"నేనడుగలేను. ఇందిరా, నీవొక్కింత శ్రమ పడిన...ఇందిరా, నాపై జాలివహింపవా?"

"అవకాశము లేదు. సాలున కయిదువందల రూప్యములు వచ్చుచున్నవి గదా?"

వచ్చుచున్నవిఁ గాని, అందులో రెండువందల రూప్యములు మల్లాది శేషమ్మగారి కిచ్చుచున్నాను. మణిహారము వెల పూర్తిగ నిచ్చివైచిన వఱకు సాలునకు నాకు మూడువందల రూప్యములే ముట్టును."

"ఐనను నీకది చాలును. వెంకట్రా వింకను బ్యాంకిలో పనిచేయుచున్నాడుఁ గదా! వానిని దానిలోనే పనిచేయనిమ్ము."

"మే మీదేశము వీడుట కెంత యుత్సాహపడుచున్నామో, నీకు తెలిసినచో..."

"అట్లైన, నీవే ఆయన నడుగుము. మమ్మాటికి నే నడుగను."

"రుక్మిణి మరి నోరెత్తలేదు. ఇందిరా ఇక శలవు. నీకు శ్రమ నిచ్చినందులకు క్షమింపు"మని యామె యావలకేగెను.

## ౬

సోదరి వెడలినంతనే ఇందిర కొక విధమైన హాయిఁగల్గెను. ఆమె కూర్చొనిన స్థలమును వీడి కావిడిలోని కేగెను. ఆమె సోదరివచ్చుట, ఆమెతో సంభాషించుట, ఇదంతయు యామె కొక స్వప్నము వలె తోచెను.

ఇంతలో ప్రతా పెచ్చటినుండియో ఇందిర యుండు గదిచేరి, తలుపులన్నియు బంధించి తల్లి ముఖము చూచుచుండెరు. అతడి ముఖము ఒక పెట్టివానివలె కన్పట్టుచుండెను.

ఇందిర, 'ప్రతాప్' అని పిలచెను.

జబాబు లేదు. అతని యవయవములన్నియు వణకుచుండెను. నోటినుండి మాట వెలువడుట లేదు.

ఇందిర భయకంపితముగ, "ప్రతాప్, ఇదియేమి? నిన్నెవరేమి యనిరి? త్వరగ చెప్పు"మని గట్టిగ యనెను.

ప్రతాపు వణకుచు, "రమేష్! దైవమా, రమేష్," అని మెల్లిగ ననెను.

ఇంది రప్పుడు "రమేషనుచుంటివేమి? రమేషున కేమి జరిగెను?" అని యడిగెరు.

ప్రతాపిక నిలువజాలక ప్రక్కనున్న కుర్చీలో పతితులఁబడి, ముఖమును చేతులతో కప్పుకొని,



సాధనకుటీరము, అగ్రహారం, పిఠాపురం.



'బక సమ్మేళనము'

"నేను రమేషును చంపితిని" యనెను.

ఇందిర తనతనయుడు చెప్పినది నమ్మకపోయినను,

"ఏమంటివి? రమేషుని చంపితివా? తండ్రీ! చెప్పుము. జరిగినదంతయు శుభ్రముగఁ జెప్పుము" అనెను.

ఆమె బంధించిన కవాటములన్నియు తెఱచి, పై నెవ్వరును లేకుండుట చూచి, మఱల కవాటములు బంధించెను. పిమ్మట ప్రతాపుప్రక్కనే మరియొక కుర్చీలో కూర్చొని ప్రతాపును ప్రశ్నలపై ప్రశ్నలువేయ దొడంగెను.

"ప్రతాప్, రమేష్‌తో నీవు దెబ్బలాడితివా?"

"ఆఁ"

"ఎచ్చట?"

"నేను కాఫీత్రాగిన తరువాత, రమేష్ దగ్గఱకు వెళ్లితిని. అతడు నాతో నేకాంతముగ చెప్పుట కేదో యున్నదని యనెను. అది కమలను గూర్చియే. కమల నాతడు ప్రేమించెనట. ఆమె యంగీకరించినదట! ఇంతలో నేనుఁ జొరబడితినట. ఇది వినగానే, నాకు వానిపై పట్టరాని కోపము వచ్చినది."

"నీ వప్పుడేమి చేసితివి?"

"నేనా కోపమున వాని శిరముపై నొక బలమైన గ్రుద్దు గ్రుద్దితిని, ఆ గ్రుద్దుతో వాడు నేలఁ గూలెను."

"వానికి పెద్దగాయము లేవైనను తగిలినవా?"

"మొదట వానిని తిరిగి చూచుటకుఁ గూడ నాకసహ్యముగ నుండెను. కాని, కొంతసేపైన తరువాత నా గదియంతయు నిశ్శబ్దమైపోయెను. నే నప్పుడు రమేషునిఁ జూచితిని. వాడొక శవమువలె కాన్పించెను. వాని నోటినుండి రక్తము ప్రవహించుచుండెను. నేను వానిని పిలచితిని; వాడు పలుకుటలేదు. నేనప్పుడు వానిదగ్గఱ కూర్చొని నా చేతి రుమాలుతో వాని నెత్తురు తుడచివైచితిని. కొంచెము జలము తెచ్చి వాని ముఖముపై చల్లితిని. వాని శరీరము తాకిమాడ నది మంచువలె చల్లగనుండెను. వాడప్పుడు చనిపోయెనని నాకర్థమయ్యెను. నాయంతరంగము నన్ను, "రమేష్ ప్రాణములు విడచెను, నీ వాతని చంపితివి." అనునట్లు తోచెను. నా తమ్మునివంటి వానిని చంపివైచితినిఁగదా యను తలంపుతో నేను కడు భీతిల్లితిని. నేనొక పిరికివానివలె నాక్షణముననే యా గృహమువీడి యీవల కేతెంచి, మన గృహమును చేరితిని."

"ప్రతాప్! వినుము రమేషు ప్రాణములను విడచెనని నీవు నిశ్చయముగ చెప్పగలవా? అతడు క్రిందపడుటవలనను, దెబ్బతగిలి మూర్ఛనొంది యుండు నేమో?"

"అమ్మా, నీ వాతనిఁ జూచియుండిన......హా దైవమా! నేనే యాతనిఁజంపిన క్రూర రాక్షసుడ."

"శాంతింపుము, ప్రతాప్! నన్నొకింత యాలోచింపనిమ్ము. నీ వప్పు డెవరినైన పిలచితివా?"

"నేనెవ్వరిని పిలచుటలేదు. దానికిని నేనొక పిరికినైతిని. కాని, అప్పు డచ్చటెవ్వరును లేకుండిరి."

"నీ వది నిశ్చయముగఁ జెప్పగలవా?"

"నిశ్చయముగ అచ్చటెవ్వరును లేదని నిరాఘాటముగా చెప్పగలను. అందులో రమేష్‌గృహ మీయూరిలో నొక మూలనున్నది."

"పోనిమ్ము, రమేష్‌తో కలసి నీవు వానింటికి వెళ్లుట యెవరైనఁ జూచితిరా?"

"మ మ్మెవరునుఁ జూచి యుండలేదు."

"వానితో వెళ్లెదవని నీ వెవరితోనైనఁ జెప్పి యుంటివా?"

"లేదు."

ఇందిర మనమున లెక్కలేనన్ని యాలోచనలు ప్రబలెను. ఆమెకేమి చేయుటకును తోచుటలేదు. కడకు, మనమేమియు నెఱుగనటు లూరకొనిన మనకే హానియుం గలుగ"దని యనుకొనెను.

"ప్రతాప్, అయిన దేదో యయినది. జరిగిన దానికై విచారించిన లాభములేదు. ఇప్పుడు మనం గూర్చి, అనగా—నీవు—నేను—మీతండ్రి గూర్చి యాలోచింపవలయును."

"ఔను."

"నేను చెప్పినట్లు చేయుము. మన మిద్దర మిప్పుడు చేయున దేమన, యీ విషయము మన యిద్దరి లోనే కడురహస్యముగ నుంచవలెను. ఇతరుల కొకింతయును తెలియనీయంగూడదు."

ప్రతాప్ తలనూపెను.

"ప్రతాప్‌యం దొకింతయును దోషములేదు. కమలనుగూర్చి రమేషేదియో యన, ప్రతాపది సహింపలేక యాతని తన్నెను. ఇంత మాత్రమున రమేష్ ప్రాణములు విడచిన, ప్రతాప్ యందేమి దోషమున్నది." అని ఇందిర తలపోయుచుండెను. ప్రతాపప్పుడు ధైర్యమువహించి, తనజేబులోనున్న రక్త చిహ్నితమైన జేబు రుమాలును తీసి కాల్చివైచెను.

౭

రమేషు శ్రీనివాసరావుగారి సోదరి పుత్రుడు. నేడు భోగిపండుగ. రమేషు పండుగరోజులలో శ్రీనివాసరావుగారింటికి భోజనమునకు వచ్చుచుండెను. రాత్రి ఝాముప్రొద్దెక్కినది. ఇంకను రమేషు గృహము చేరుటలేదు. అత డెచ్చటికో పొరుగూరు పోయి యుండునని శ్రీనివాసరావు గలచి ప్రతాపుతో భోజనమున కేగిరి.

ఆ మరునాడు ప్రాతఃకాలమున శ్రీనివాసరా వెచ్చటికో వెడలిరి. వీధిలో టెలిఫోను గంట వాగుచుండెను. నౌకరి రాముడు టెలిఫోను కడకేగి "ఎవరది" అని యడిగెను.

"నేను డాక్టరు రంగనాథం."

"డాక్టరుగారా? బాబూ ఏమి కలవు?"

"మీ రమేషునకు గట్టి గాయము తగిలినది. అతడు వారింటి మేడపై పడియుండెను. వాడు నేలం గూలిన వెంటనే నౌకరివాడువచ్చి నన్ను పిలచుటచే, నేను వచ్చితిని. గాయమునకు తగు చికిత్స చేసితిని, అమ్మగార్ని మరేమియు బెంగపెట్టుకొన వద్దనిం జెప్పుము."

"చిత్తం బాబూ."

ఇదంతయు ఇందిర వినుచుండెను. ఆమె కప్పుడు మనశ్శాంతి కుదిరినది. ఈవార్త యామె ప్రతాపునకు తెలియంజేసెను. ప్రతాపు, "మనల నెంతభయభ్రాంతులను జేసివైచెనమ్మా!" యని సంతసమున యనెను.

౮

ఇందిరకిప్పుడు ఆకర్షణ, అభిలాష, అను పదముల యర్థము తెలిసినది. రుక్మిణి తన తనయుని కొఱకెన్ని యాపదలకైనను జడియక మణిహారమును దొంగిలించినది. ఇక ఇందిరో! తన ముద్దుల ప్రతాప్ కొఱకు రమేషుని ప్రాణములనుగూడ లెక్కగొనక, తన తనయుడు చేసిన ఘోర కృత్యమును కప్పిపుచ్చ చూచినది. ఇదియే యాశంజూపు యాకర్షణ ప్రభావము.

ఇందిర కుర్చీపై టేబిలు ప్రక్కను కూర్చొనియుండెను. ఆమె యొక కాగితమును తీసి రుక్మిణికీ విధమున వ్రాసెను.

ప్రియసోదరీ,

మొన్న నీతో కఠురోక్తులగు వాక్యము లాడినందులకు క్షమింపుము. నీవును వెంకట్రావును కలసి వచ్చి పండుగదినములు మా యింట గడిపి నన్నానందింపం జేయంగోరుచున్నాను. నీ తనయుడు వెంకట్రావునుంగూర్చి మీ బావగారితో మాటాడుదము.

ఇట్లు నీ ప్రియసోదరి.
ఇందిర.

# శ్యామల పెండ్లి

శ్రీమతి మల్లంపల్లి బాలాత్రిపురసుందరమ్మగారు

సాయం సమయము. మలయమారుతము చల్లగా వీస్తోంది. పూదోటలో చలపతి యొక లతాగుల్మందగ్గిర కూచుని ఏదో ఆలోచిస్తూన్నాడు. ఇంతలో వెనుకనుండి ఎవరో కనులు మూశారు. చలపతి చేతులుతడివి 'ఓహో! శ్యామలా! నీవేనా!—దొంగలా కళ్లుమూశావు' అన్నాడు. శ్యామల చేతులుతీసి 'దొంగవి నీవా నేనా? నన్ను తీసుకెళ్లకుండా ఒక్కడవు మెడ్రాసు వెళ్లడానికి సిద్ధంగా ఉన్నావు' అంది. 'నిన్ను తీసుకెళ్లడానికి నాకేమి హక్కున్నది' అన్నాడు చలపతి. 'నీ ప్రియురాలిమీద నీకు హక్కులేక మరెవ్వరికుంటుంది?' అని శ్యామల అంది 'నీవు లక్షాధికారుల బిడ్డవు. నేనో భిక్షాధికారిని. ఇట్టిస్థితిలో నీవు నాప్రియురాల వెట్లగుదువు?' అన్నాడు చలపతి. శ్యామల 'తుచ్ఛమగు ధనము నాశించు నీచులట్లు నేను ధనము నాశించుటలేదు. నేను కోరునది పవిత్రప్రేమ' అంది. 'నీ కిష్టమైనచో నీ తలిదండ్రుల కిష్టముకావద్దా' అన్నాడు చలపతి. 'న్యాయ సమ్మతమైన విషయమున కింకొకరి యిష్టమేల. నేను—'అని శ్యామల అంటూయుండ ఎవరో పిలచినట్లయింది. శ్యామల యింట్లో కెళ్లిపోయింది. కొంతసేపక్కడనే కూర్చుని తనగదిలోనికి వెళ్లిపోయాడు చలపతి.

చంద్రశేఖరంగారు గొప్ప స్థితిపరుడు. ఆయన కొక శ్యామల తప్ప యితర సంతాన మేదియు లేదు. చలపతి చంద్రశేఖరంగారి స్నేహితుని కొడుకు. చిన్నప్పుడే తల్లిదండ్రులు పరలోకగతులైనందున చలపతిని రక్షించువా రెవ్వరును లేరని దయామయుడైన చంద్రశేఖరంగారా భారమును తన తలపై వహించాడు. అప్పటినుండియు చలపతి చంద్రశేఖరంగారింట్లోనే యుంటున్నాడు. అతని కొక చిన్నయిల్లు కొద్దిఆస్తి ఉండేవి. చంద్రశేఖరంగారా ఆస్తి నమ్మివేసి చలపతికి చదువు చెప్పిస్తున్నాడు. చిన్నప్పటినుంచి ఇక్కడనే ఉండడంచేత శ్యామల చలపతి దగ్గర చనువుగా ఉంటూంది. చలపతి స్కూలు నుంచి రాగానే ఇంగ్లీషు పాఠం చెప్పించుకునేది. క్రొత్తవిషయాలేవైన అడుగుతూండేది. చలపతి సంతోషముతో సమాధానములు చెపుతూండేవాడు. దీనితోపాటు వారి హృదయములో ప్రేమ అనే వృక్షము నాటుకుంటూంది. కాని చలపతికిమాత్రం నిరాశగా ఉంటూండేది. ఎందుచేతనంటే శ్యామల గొప్పయింటిబిడ్డ; తనదో బీదస్థితి.

బి. ఏ. పరీక్ష ప్యాసులయి ప్లీడరు పరీక్ష కని మెడ్రాసు వెళ్లేడు. శ్యామల కతనిమీద నుండే ప్రేమచేత అతన్ని విడచియుండుట కష్టంగానే యుంది. ఒకనాడు శ్యామలతల్లి యశోదమ్మ చంద్రశేఖరంగారితో 'శ్యామల కింకను పెండ్లిచేయరూ?' అంది.

'శ్యామల పెళ్లా? చెయ్యొచ్చును. తొందరేమిటి'

'దానికిప్పుడు పదహారోఏడు. యింకా 'తొందరేమి'టనే అంటారు. ఎక్కడైనా సంబంధంచూసి పెళ్లి చెయ్యాలి యీయేడు.'

'సంబంధం చూడ్డమెందుకు? చలపతి యింకా చదువుకుంటున్నాడు గదా' అని ఊరుకున్నాను. పెళ్లి ఎప్పుడు చేయాలంటే అప్పుడే చేయవచ్చును.'

'చాల్లెండి! ఇన్నాళ్లనుంచి మీరుచూసిన గొప్ప సంబంధంచాలు! సుఖపడుతుంది! ఇంకా ఏ జమీందారుల బిడ్డకో యిస్తారనుకుంటున్నాను కాని యీదరిద్రగొట్టు దామోదరుడికా యివ్వాలనుకుంటున్నారు!! రెక్కాడితే కాని డొక్కాడదు. గొప్ప సంబంధము చేసిన కష్టపడ నక్కరలేకుండ హాయిగా కూచుని తినవచ్చును.'

'ధనముండికూడ దురలవాటులవలన పోగొట్టుకున్నవారు లేరా? చదువువలన ధనము నార్జించి గొప్ప జమీందారులగుచున్నవారు లేరా?'

'తరువాత ఎవరికర్మంవారిది. దానికర్మమే ఆలాగుంటే చదువుకున్న వాడుమాత్రము ధనము నార్జించగలడా? ధనముండియు పోగొట్టుకున్న వా రున్నారుకదా అని చేతులారా దరిద్రుని కంటగట్టడమా? మన కొక్కరితె కూతురు. ఆ ఒక్క కూతురును జమీందారులకిచ్చి ముద్దులు, ముచ్చటలు తీర్చుకుని ఆనందించాలి కాని దరిద్రులకిస్తే ముద్దులు తీరవు.'

ఈ మూర్ఖురాలితో వితండవాద మెందుకని కాబోలు 'నీ యిష్టంవచ్చిన సంబంధం చూచుకో, కాని తెలివి తేటలుగల కుర్రవానిని పోగొట్టుకుంటున్నా'వని అక్కడనుంచి లేచి వీధిలోనికి వెళ్లిపోయారు చంద్రశేఖరంగారు.

చంద్రశేఖరంగారు శ్యామల పెండ్లివిషయములో ఏమీ కలుగజేసుకోవడం మానేశారు. యశోదమ్మ తనసోదరుని సహాయంగా తీసుకొని శ్యామలను ధనికుడైన రామారావుకిచ్చి పెండ్లిచేయడానికి ఏర్పాటుచేయించింది. రామారావు ధనికుడననే గర్వముచేత నిత్యము త్రాగుడు, జూదము, వేశ్యలు మొదలగు దురలవాటులకు లోనై యున్నాడు. శ్యామలయొక్క అందమును ప్రతిరోజున ఆమె బడికిపోవునపుడు చూస్తూయున్న వా డగుటవలన ఆమెను యిస్తాననడం

తడవుగ సరేనని ఒప్పుకున్నాడు రామా రావు.

శ్యామల పెండ్లి యింక పదిరోజులున్నది. చంద్రశేఖరంగారి బంధుగులంతా ఒక్కొక్కరుగ వచ్చి వారిల్లుచేరుకుంటున్నారు. శ్యామలను పెండ్లికూతురును చేయుదినము వచ్చింది. శ్యామలతల్లి పెండ్లికూతురును చేయుటకై ఆమెగదివద్దకుపోయి 'శ్యామలా! శ్యామలా!' అని పిలిచింది. కాని ఆమెజాడ గానరాలేదు. వెంటనే ఆమె పూదోటలోనికి పోయి వెదకింది. కాని ఆమె కనిపించలేదు. వెంటనే ఆమె చంద్రశేఖరంగారి వద్దకుపోయి 'శ్యామల ఎక్కడకు వెళ్లినదండీ' అని అడిగింది ఆతృతతో. 'ఏమో ఎచటకుపోయినదో, నాకేమీ తెలియదు.' అన్నారు చంద్రశేఖరంగారు. అందరును కలసి ఎచ్చట వెదకినను లాభములేక పోయినది. పెండ్లి హడావిడిలోనున్న చంద్రశేఖరంగారి యిల్లు విచారంలో మునిగిపోయింది.

ప్రాతఃకాలము. దివాకరుడు తన ప్రతిభను చూపుటకు మీది కెగబ్రాకుచున్నాడు. అట్టితరి తపాలావాడొక కమ్మను చేతబట్టుకొని 'చంద్రశేఖరంగా రున్నారా?' యని కేకవేశాడు. ఈజీ చైరులో పడుకొని ఏదియో ఆలోచించుచున్న చంద్రశేఖరంగారా కేక వినగానే అదరిపడి లేచి వచ్చి యా లేఖను దీసికొని చూడగా అందిట్లున్నది.

ప్రియమైన నాన్నగారికి. నేను ఉదయము ఆరున్నరగంటలకు చలపతి బావగారి వద్ద కులాసాగా ప్రవేశించినాను. తమతో చెప్పకుండ యిచటికి వచ్చినందులకు, అమ్మగారి కోరిక విఫలము చేసినందులకు నన్ను మన్నింప వేడుచున్నాను.

మదరాసు ఇట్లు, మీ ప్రియకుమారి,

శ్యామల.

చంద్రశేఖరంగారాలేఖనుచూచి భార్యకు తెలిసినయెడల గొడవగునని తలచి ఆమెకు చూపకయే జేబునం దిడుకొని 'శ్యామలతో సహా బయలుదేరి రావలసిన'దని చలపతికి తంతి నిచ్చిరి. మరునా డుదయమునకు శ్యామలా చలపతులు చంద్రశేఖరంగారింట ప్రవేశించిరి. వారినిద్దరను చూడగనే యశోదమ్మకు కోపము, దుఃఖము ఒక్కసారి పొంగిపోయినవి. ఆమె ఏమియు మాటాడజాలకుండెను. ఊరివారందరు శ్యామలనేర్పునకు మిగుల సంతసించిరి. ఆ మరుసటిరోజుననే శ్యామలా చలపతుల కతి వైభవముతో వివాహము జరిపించారు చంద్రశేఖరంగారు.

రామారావాస్తియంతయు అప్పులవారి స్వాధీనమాయెను. రామారావుకు జైలు ప్రాప్తమయింది. చలపతిరావు ఏలూరులో పేరుమోసిన గొప్ప వకీలు. యశోదమ్మకోపమిప్పటికి చల్లారింది. యశోదమ్మ, చంద్రశేఖరంగార్లు శ్యామలా చలపతులవద్ద సంతోషంతో కాలము గడుపుతున్నారు.

# సరస్వతి—పుష్పావతి

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

సరస్వతి సనాతన విద్యాభిలాషిణి; జాతీయ వాదిని: పుష్పావతి నవీన విద్యాసుందరి; ఇద్దరు విదుషీ మణులే; కాని సరస్వతి విజ్ఞానసుమము; వినయధురీణ; సహనవతి; శాంతస్వరూపిణి; భక్తపరతంత్ర; పూర్వాచార పరాయణానువ్రత; సాధుశీల; సద్గుణఖని; పతివ్రత.

పుష్పావతియన్ననో—వాగాడంబర; స్వాతంత్ర్య వాదిని; పాశ్చాత్య వేషాభిమానిని; అభిమానవతి; సనాతుల వెఱ్ఱిచాదస్తములు, నోములు వ్రతములు, పట్టి ఛాందసము కాని, ఆరోగ్యము కాదనియు, స్నానములు, తడిబట్టలు, రోగమూలకములుకాని శుచిత్వము కాదనియు, మొదలగు జాతిమత దూషణ ప్రియ స్వభావములో వీరిరువురకింతటి భిన్న మున్నను, అభిన్న స్నేహము స్థిరత్వము నొందియుండుటకు, సరిస్వతి సహనమే మూలము.

సర్వసంగ పరిత్యాగియగు సన్యాసికి, నితరుల, దూషణ భూషణ తిరస్కారము లోకలెక్కయా! అభిమానవతియగు పుష్పావతిమాటే, పైకి అవునంటే తీరిపోతుందన్న నిరాడంబర సరస్వతి యగుటచేతనే, వారి స్నేహము చెడకయుండెను. కాని జాతి, మత, విద్యా శీల విషయములలో నప్పుడప్పుడు వారికి భేదాభిప్రాయములు కలుగుచుండును. చివరకు సరస్వతి సమర్థన మతి చమత్కృతిశక్తిచే, పుష్ప-నిజము గ్రహించి మెచ్చుకొనుచుండును.

ఒకనాడు మధ్యాహ్నము పుష్పావతి, తాను వ్రాసిన వ్యాసముగల నూతన మాసపత్రిక నొకదానిని తెచ్చి, సరస్వతిని చదువమనెను. అప్పుడే ప్రియుని, కృత్యములుఁ దీర్చి, కచేరికిఁ బంపి, పిల్లల నిద్రబుచ్చి తీరికగా కూర్చుని, సరస్వతి, కుచేలోపాఖ్యానము, చదువుచుండెను. కుచేలుని భక్తిలో లీనమగుచు, లీలావతి పేదరికమున కన్నీరులు రాల్చుచు, అమాయకపు పిల్లల, యాకల్ల కతిబేలపడుచు, కథలో కలిసిపోయిన హృదయముతో, కొంతసేపు చెలిని వీక్షింపనేలేదు. తమపరి "పుష్పా? కూర్చుండుము. పనులైనవా?" అని ప్రశ్నించెను.

పుష్ప:—పనులకేమి కల్పన చేసుకుంటే అన్నీ పనులే, కడిలిలోకడ్డ ఎలుకలాగ కొట్టుకుంటూ, చాకిరీతోనే కాలము గడిపితే, మనం చూచేదేమిటి. వినేదేమిటి? చేసేదేమిటి. నిన్న క్లబ్బులో మీటింగు, స్త్రీలకు కావలసిన సమస్త హక్కులను గురించి, ఈవాళ హాలులో నుపన్యాసము, రేపు మ్యూజియములో ఆరోగ్యవారమగునట, నాటకములు, బహుమానములు, ఉపన్యాసములు, ఎన్నో వేడుకలు జరుగును. ఒక్కదానికి నీకు తీరికలేదుకదా? నాజీవితహాయి వీక్షింపుము చెలీ! లేచేసరికి పనులన్నీ దాసి చేసేస్తుంది. నౌకరు, కాఫీ ఫలహారములు తయారు చేసి తెస్తాడు. హోటలునుంచి, మీల్సు వస్తుంది. మే మిద్దరము తింటాము. పిల్లాడికి, పిల్లకు, వాళ్లే పెట్టుకుని తినేటట్లు నేర్పేశాను. స్నానము చేయుట భోజనముచేయుట తప్ప, నాకు వేరు పనిలేదు. కొంతసేపేదో చదువుకుంటాను. ఏపత్రికకో, తమాషా నవీనకల్పన కథలు వ్రాసి పంపిస్తుంటాను. మా వారు, ఆఫీసుకు వెళతారు, పిల్లలు స్కూలుకు పోతారు. నేను తోచకుంటే, నీవద్దకిన్నీ, మీటింగుంటే యక్కడికిన్నీ అదీ లేకపోతే క్లబ్బుకిపోయి,

యే టెన్నిసో బ్యాడ్‌మింటనో, వార్తాపత్రికా వీక్షణమో, చేసివస్తాను. రాత్రికి మరల క్యారివస్తుంది. ఈలాంటి నా జీవితము సుఖమో-ఉదయాస్తమయములు, ఊపిరాడని చాకిరితో, పోయిసెగలతో కండ్లుపోవుచు, తల దువ్వుకొనుటకైన తీరికలేక చింపిరి జుట్లతో జిడ్డుముఖములతో, మలిన వస్త్రములతో, అలకలతో, ఆక్షేపణలతో, అత్తాడుపడుచుల జగడాలతో, పిల్లల యేడ్పులతో, ఇల్లెగిరిపోవు యజమాని కేకలతో, ఎంగిళ్ల విరాకులతో, ఇల్లు అడివిలాగ, ఇల్లాలు అసహ్యముగాను, పిల్లలు పెంటిల్లాగ, కనబడుచు, లోకజ్ఞానము, పుస్తకపఠన, వ్యాయామములకు విశ్రాంతిలేని మీబోటివారల జీవితము సుఖమో ఆలోచించు. కళ్లుమూసికొని భక్తి భక్తీ అంటావు. కళ్లుతెరిచి లోకంపోకడలు చూడవు. ప్రాణనాధుని పదసేవనమే ముక్తిఅంటావు కాని. బాహ్యసౌఖ్యము లొకించుక గనునించవు. ఏనాటి కథలో! నిజమో తెలియదు అబద్ధమో తెలియదు! పురాణములే నమ్ముకుని వాటినే ఆదర్శించుకొని సనాతన విద్యోఅంటో, సంస్కరణాభిలాష లేక, తాతలనాటి పాత కథల చదువుతూ కూర్చుంటావు. ప్రపంచక మెన్నిరకాల మారుతోంది! ఎన్నిరకాల విమర్శనలు! ఎంత సంస్కరణ? నవీనులమగు, మనము నవీనయుగములో కాలచక్రముతో,బాటు పరిభ్రమణ మొనరించాలికాని, కూపస్థమండూకాల్లాగ, పోతన భాగవతము, శ్రీనాధుని జీవితము. పెద్దనమనుచరిత్ర; యిత్యాది గ్రంధ కాలక్షేపమేకాని, ప్రకృతి స్వభావ జనిత కవిత్వమాధుర్య రసాస్వాదినులము కామేమే? ఎన్ని మాసపత్రికలు బయలుదేరాయి! ఎందరు నవీన కవి యువకులు, యువతులు బయల్పడ్డారు. ఎన్నితరహాల కథలు, కబుర్లు, చిత్రాలు, భావాలు!! ఒకటేమిటి. పూర్వులు, అనూయాపరులు. అందుకు తార్కాణము, పెద్దపెద్ద కవులమని, ఏదైనా వారే వ్రాయాలి. ఇతరులు వినాలి. వారిపేరే ప్రబలాలి. వారు నీతు లుపదేశించుట, లోకులు వినుట, అప్రకారంచేయుట ఇప్పుడు వారికెంత సహనమో చూసు. ఇంతమంది కవిత్వ మల్లు శక్తిగల్గుటకు, ఇన్ని పత్రికలు వికసించుటకు అందరిని ప్రోత్సహించి, వ్రాయించి, ఆదరించుటయే. సనాతన, నవీనుల ప్రవర్తనలు విదితమగుచున్నవి. చూడుము ఈ మాసపత్రిక !! ఎట్టిసాంఘిక కథలు ! ఎట్టి లోకజ్ఞానము ! స్వభావము తెల్పుచుండు నిట్టివే మనకు ముఖ్యజీవితాధారములు. సరస్వతీ ! యిది చదువుము.

సర:—పుష్పా చదవడానికేమిగాని నా కివి కూడును. అది కూడకఅను అసూయ యెంతమాత్రం లేదుసుమా ! ఎంత యుపన్యసించావు. నీవు నవీన ముగ్ధవు. వీటిని నమ్మిన నిన్ను నచ్చబెట్టుటకు, 'భర్తృహరి సుభాషితము'లో చెప్పినట్లు బ్రహ్మకైనా తరంకాదు. పూర్వకవులను, కవిత్వాన్నీకూడ నెంతచర్చించావు. అట్టి కవిత్వరచనాసంపదిప్పుడేది? తాతలనాటి పాతకథలంటివి ! అట్టి యుత్తమ చరితల చరిత్రలవలననే, మన యార్యావర్త మన్నిఖండముల లోనికి, పవిత్ర ఖండమని పేరెన్నికగన్నది. మహా పతివ్రతల నివాసదేశమగుటచేతనే, పతిప్రేమ, నిర్మల జీవనము, గృహసౌఖ్యము, సత్ప్రవర్తన, దైవభక్తికి నిలయమై, మనోనిర్మలతఁ జెందియున్నది. భౌతిక సౌఖ్యముకన్న, ఆధ్యాత్మిక సౌఖ్యము మిన్నకదా? అప్పటి విద్యావిధానమునకు, ఇప్పటి విద్యావిధానమునకు తేడా నీకు కన్పట్టుటలేదా? పూర్వం, ఋషులు, శృతి స్మృతి, పురాణేతిహాసములు రచించిరి. అంతా ధర్మబోధ. క్రమేసి కావ్యరచన, రూపక రచన యీవిధంగా క్షీణించి ప్రస్తుతానికి కల్పలతకి, గడ్డిపువ్వులకుండు వ్యత్యాసమంత తేడాతో విద్య వృద్ధి పొందింది.

నవీనుల కవిత్వంలో, పదగుంభన అర్థపొందిక, కవిత్వరచన, కల్పనా నిర్మాణము ఏమున్నాయని ఇట్టి కవిత్వానికి? ఎంతమంది కవులు బయలుదేర కేమవుతారు. ఆదరించడానికనేక పత్రికలు, ఉదు

పుట కంతకంటె పెద్దపెద్ద రచన లర్థముకాని యుభయభాసా విహీనలు!! అందుకనే గంతకుతగ్గ బొంతలున్నారు. మనవేదాంతము మొదలుపెట్టినచోట విదేశవేదాంత మంతమొందినదని విదితమే కదా? అట్టివారి యాశ్రితులమగు మన కింతకన్న యున్నత విద్య బలపడునా, మనది మరచితిమి. ఇతరులది రాదు. ఈ మిడిమిడి భావాలతో సరస్వతీదేవి నిప్పుమువచ్చి నట్లు పీకను పిసికేస్తున్నాము. ఏమిటో మీటింగులకు నాబోటిది రానంతమాత్రాన, మీబోటి ఆంగ్లవిద్యా ధురీణలకు కొంతేయా! ఏదో 'పేడపురుగులాంటి జన్మ మాది! వినువీధి నతిస్వతంత్రంగాతిరిగే పక్షులంటి వాళ్లు మీరు. ఏమి హక్కులు? గృహిణీపదంలో స్త్రీకి గావలసిన సమస్త హక్కులు ప్రకృతియే స్వభావంగా యిచ్చింది. ఆమె స్వభావం మంచిదైన యెడల, భర్తయు, బిడ్డలుకూడ, యడుగుదాటని యాజ్ఞానువర్తులై, సకల ఆలోచనలందును, మంత్రిత్వము వహింతురు. మాతృత్వశక్తి; గృహపాలనశక్తి స్వభావజనితంగా, స్త్రీ యధీనమే. ఇంక పురుషు లిచ్చునది మనం పుచ్చుకునేది ఏమిటంటే, వాళ్లవలె, లేచిందిమొదలు, బిడ్డ కైన సరకుచేయక, స్వాతంత్ర్యా పేక్షతో, యిచ్చవచ్చిన చోటులకు వెళ్లడమేనా? ఇంకా, వారసత్వపు హక్కులని యాందోళన చేయుట బాగుగనే యున్నది. ఎందువలనయంటే, భోలెడాస్తి, తండ్రికాని, భర్తకాని, గణియించడ మున్న, వారి యనంతర మీస్త్రీకి పురుషసంతానము లేకున్నయెడల యే దాయాదియో, యే వారసుడో కర్తయై, యావదాస్తియు ననుభవించుచుండగా అగ్ని సాక్షిగా పెళ్లాడిన భార్యయు స్వగర్భజనిత యగు కుమార్తెయు, తమవారి యాదాయములోని యను భవములేక, దరిద్రకష్టము లనుభవించుచున్నారు. వారి దుర్భర కష్టముల తొలగించుట కన్ని మీటింగులైన చేసి, యెన్నిపాట్లయినం బడవచ్చును కాని, పురుషులపై విజృంభణము, మనకుకూడదు. స్త్రీలపై విజృంభణము, పురుషులకు కూడదు. అవునా! పుష్పా!'

పుష్పా! 'ఏమో! నీమాటలు వింతగాయున్నవి. ఎన్నటివో ప్రాతవారి మాటలాడతావుకాని, ప్రస్తుత పురుషుల యవినీతులు నీవు కళ్లువిప్పి చూచుట లేదు. భార్యయుండగా మరలమరల తనకిష్టమువచ్చి నంతమందిని ఏదో సాకుంజెప్పి పెళ్లాడ్డమెందుకు? నల్లవారి కొకరీతి న్యాయము, తెల్లవారి కొకరీతి న్యాయము కూడదని యేలాతలంచుమండిరో, అట్టి న్యాయమే మనవాళ్లు స్త్రీల కొకరీతిని, పురుషుల కొకరీతిని యేలాగ చెల్లుబడిచేయుచున్నారు? వాళ్లకి మనకు, సమానబాధ్యతంగల బిడ్డలబాధలన్ని స్త్రీ యనుభవించడమున్న, సర్వకాల సర్వావస్థలందు వారితో వేగితంటాలు పడుము, దేహారోగ్యములేక, వాహ్యాళిలేక, ఇండ్లలో మగ్గడ మన్యాయముకాదా? ఇవన్ని అణచాలి. అందుకనే, సర్వ స్వతంత్ర హక్కులు కావాలని, మహిళామణు లాందోళనము, సేయుచున్నారు. కండువా మార్చి కండువాలా, భార్యలను మారుస్తున్నారు గనుకనే, మన స్త్రీలకు కూడ విడాకులచట్ట మవసరమై యున్నది. నీ వింకా పెరటిదారినే యున్నావు. ఛాందసురాలవు సరసూ!'

సర— (పుష్పచుబుకము పుణుకుచు) పుష్పా! ఎంత నెఱ్ఱజాణవే! అవా మీవిజృంభణము, మన పూర్వీకులకు, సీతా, దమయంతి మొదలగు కాంతలకే తెలివిలేకనా? వారందరు, పురుషులు చెప్పుకొరికితే, తాము సిద్ధకొరికే, భర్తలను నీతిమంతులుగాను, అనుకూలురుగాను చేశారా! తమ ధర్మబోధనశక్తిచే, అవినీతులను, నీతివంతులుగను, అననుకూలుని, యను కూలంనిగను, నొనరించుకొని బాగుపడిరి. పశుపక్ష్యాదులను, ప్రకృతినే విమర్శించి చూడుము. తల్లి సాకి నట్లు, తండ్రి బిడ్డను పెంచంగలండా? ఏడుగంత తండ్రికంటె, ఏసులబుట్టంత తల్లిమేలని సామ్యమే యున్నది. స్తన్యపాన మెచ్చటకలదో, అచ్చటనే శిశుపాలన, రక్షణం జరగాలి. పంతముకొలది, పురుషుల పశముచేసి, స్త్రీలు పలుచోట్లకుపోతే, పదిసం

స్థలందు తిరుగు పురుషుడు బాహ్యవ్యాపారజనితాలోచనాధీనుఁడై, బిడ్డల నేమరియుండును. దాన మనకే నష్టము. దీనికొక తార్కాణము, పేపర్లలో నే యామధ్య వేసినారు. వినుము. పాశ్చాత్యసుందరి కున్న స్వేచ్ఛావిహార లచే, దాయీపరమునునుంచిన, బిడ్డ, వీధిలో నాడుచు, విధివశమున, తల్లివచ్చు కారు క్రిందనేపడి మరణించెనట. తల్లికంటె, దాయీ కెక్కుడాపేక్షయా, లేక, ఎక్కువ ప్రేమా! మగవాఁడు, సిగరెట్లు త్రాగినాడని, అవి మాన్పించడానికి, నయబోధనాశక్తి లేక, ప్రతిగా శాస్తిచేయుటకై, మనం కాల్చడమా! దీనివలన, వాళ్లు మానరు. మనకు, లేని దలవాటు! దుర్వ్యయమూ, రెట్టింపగుటయు స్త్రీగూడ, దుర్వ్యసనములందు చిక్కుట సంభవించును. ఇది మంచిదా?

పురుషులు ధర్మము మీరలేదా యనుచుంటివి. వారు పాశ్చాత్యగాలులచే, తమ ధర్మములు మరచినారని మాతృస్థానములమగు మనము, భూకంపప్రళయాలకు భూమితిరుగునట్లు, చలించుటేల? విడాకు లిచ్చుకొని వారేమి బావుకొనుచున్నారు? ఏతప్పు, నీవు చేయకూడదని, పురుషుల నిందించుచుంటివో, ఆతప్పు తిరిగి నీవే కోరుటెందులకు? ఒకదొరసాని, పెండ్లాడిన మరుచటిదినమే, భర్తగుఱ్ఱు భరించలేనని, కోర్టులో విడాకులకు దరకాస్తు చేసిందని, వార్తాపత్రికలో వ్రాశారు. ఇట్టి దాంపత్య మెంతటి విలువో, ఎంతటి స్థిరమో, ఎంతటి పవిత్రమో, ఆలోచించు. ఇఁక, నీయిల్లు, నీవాళ్లు, నీది, అని, స్థిరమగు నివాస మెద్ది. మీ పిల్లలు, నా పిల్లలు, పోగడి, మనపిల్లలను కొట్టుచున్నారందిట, విడాకులు పొంది, ద్వితీయవివాహమాడిన యువతి, రెండవపెండ్లివాడగు భర్తతో. ఇట్టి స్త్రీని, ఎంతమంది భర్తలై, భరించెదరు? ఇది పట్టికు వ్యభిచారిణి యగును. అందుచే, మనము భరింపలేని కష్టము లిచ్చు భర్తలకొక మంచిదారి నిచ్చు నిబంధనల చట్టము లేర్పరుచుకొన నాందోళనములు సల్పవలెనే కాని, ఇట్టి ప్రాయశ్చిత్తములుకాదు వారికి చేయుట. ఇరువుర యవినీతులచే, క్రమంగా, సంఘము క్షీణించి, కుక్కగొడుగులవలె పుట్టు, సంఘాము లట్టె యంతరించి, పునః నాల్గువేల సంవత్సరాలక్రిందటి ధర్మాలు ప్రవర్తింపఁజేయు, పాట్లుపడ వలనుండును. ఇట్టి యుత్పాతబుద్ధులు, అసలుకే మోసము తెచ్చును. మళ్లీ పునః సృష్టి చేయడానికి, మహాత్ము లుద్భవించి క్రొత్త విద్యలు సృష్టించి, మీటింగులు చేయాలి. ఇంకొకటి: అతిబాల్యవివాహాలవలన, చాలా నష్టములని శ్రీ శారదాగారొక ప్రౌఢవివాహచట్ట మేర్పరచి, కృతార్థులైరి కదా? ప్రౌఢవివాహములచే, బాలికలు, అనుకూలవరుల నెన్నుకొని, సుఖజీవిత లగుదురుకదా? ఇఁక, నట్టి దాంపత్యములో, విడాకుల కవకాశ మెద్ది? ఇట్టి సదవకాశము లభించిన సమయములలో, అధర్మయుతమగు విడాకులచట్ట పేర్పాటుల యాందోళన మేల? ఇంతకూ నాలోచిస్తే, నిజంగా, విడాకులు, ప్రౌఢవివాహబాధ్యులగు పాశ్చాత్యులకే కావలసి వచ్చింది. మన ఆర్యధర్మబద్ధ పవిత్రగృహిణి కక్కర నే లేదు. "స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః" యని, గీతలో శ్రీకృష్ణభగవానుఁ డానతిచ్చి యున్నాఁడు కదా? హిందువులకు, గీతయే కదా ఆదర్శము. పాశ్చాత్యుల బైబిలులను, వా రతిక్రమించుచున్నారా? మహమ్మదులఖురానును, వా రుల్లఘించుచున్నారా? ఉభయభ్రష్టత్వముగా, మన స్వధర్మములు, మనము మీరి, పరధర్మానుష్ఠాన బుద్ధి మనకేల? ఇంతెను, మన మిప్పుడు స్కూళ్లలో చదువు విద్య యట్టిది. దాని ప్రభావ ముగ్ధుల మగుటచే నట్టి కాంక్షలుత్పన్నమై పీడించుచున్నవి. త్రిశంకు స్వర్గములాగ, మధ్య నూగాలికాని, మనము వారి దేశీయులముకాక, నలుపుదేహుల మగుటచే, వా రాదరించరు. స్వధర్మభ్రష్టుల మగుటచే, మనవా

రామోదించరు. ఇఁక మనగతి, గతేయగును. అందుచే, విద్యావిధానము నీతి, మత, ధర్మ, గృహపాలన, విధానములచే మారాలి. అంతవఱకు మనకింతే. హృదయపరివర్తనము, దేశమోక్షము, మనకు ముఖ్యములా? వాగాడంబరములతో, లేనిపోనివి కావలెనని మనసేరము లితరులతో మొఱపెట్టుకొని, వారి యధీనులమై, వారి శరణుఁజొచ్చుట మేలా! పుష్పా! నీ వీరాత్రంతా హృదయంలో విమర్శించు.

పుష్పా:—(ఒకించుక స్వాలోచనాధీనయై) "అక్కా! సరస్వతీ! మాతృస్వరూపిణివి. భౌతికానందురాలగు, నాజన్మము, ఆధ్యాత్మిక బోధానందముచే, తరింపఁజేసితివి. అత్యణిక కోరికల నావలికి ద్రోయించి, శాశ్వతమైన, యనుభవపట్టిక నెలకొల్పితివి. నమస్కార మక్కా! ఇంతటినుండి, నీ యాజ్ఞానువర్తిని," అని సరస్వతి సెలవుపొంది, బిడ్డ లేడ్చుదు రేమో యను, భీతి యుదయింప, పతి ప్రేమ పొంగిపొరల, నిజగృహమున కరిగెను.

అంతటినుండి, పుష్పావతి, హోటలుమీల్సు మానిపించి, స్వహస్తపాకము చేయుచుండెను. దాదుల యధీనమునుండి. బిడ్డలను తప్పించి, బిడ్డలస్వాకృత్యముల, స్వంతముగాఁ జేసికొనుచుండెను. ఇంతయేల, సరస్వతివలె 'గృహిణి' యని యనిపించుకొనుచుండెను.

# దాంపత్యము

" సీ॥ ఇగురుజొంపంబుల నింపారు విరులను బలుపైనపొదల ప్రేవలకుఁ దార్చి।
సెలయేరులందలి తెలినీటఁదనుపు సొంపెలసినగిరుల తెప్పలకుఁజేర్చి।
మావిమ్రోఁకల నెలదీవలఁ జెన్నొందు తోఁటలకడ సలి తోడఁబొఁది।
అలరునెత్తమ్ముల కలిమిఁజెల్వగు డిగ్గియలతీరభూముల నల్లబొంది।
నన్ను మనము నఁదేల్చి యానందమొందఁ గేలిసలిపెడు నీదగు లీలమఱవ।
నావశంబె ప్రాణేశ ప్రాణంబులిపుడ నిన్నకూర్చియేతెంతు నీసన్నకడకు॥ "

భారతము.

# మార్పుల మంగ

శ్రీమతి కూనిశెట్టి రామరత్నముగారు

గోదావరి గట్టున నొక భవనమున్నది. దానిచుట్టూ మంచి పిట్టగోడ, ఆగోడనిండా మాలతీలతలు బఠాణి తీగలు అల్లిబిల్లిగా నల్లుకొన్నాయి. ఆ తీగలనిండా యెప్పుడూ పువ్వులే. పగడాలు ముత్యాలు కలిపి పోగులు పోసినట్లు కన్నులపండువుగా కనబడతాయి. మంచి పరిమళముతో దూరమునుండే రమ్మని మర్యాదచేస్తాయి. ఆ ప్రాకారము, దేవిడి, చూస్తే ఆ భవనము ధనవంతులదని చెప్పక చెప్పుతాయి. ఆ భవనములో దాన ధర్మాలు తాండవమాడుతాయి. ఎపుడు చూచినా బీద సాదలకు అన్నప్రదానమే. ఎపుడు విన్నా వేదశాస్త్రఘోషే. సాయంకాలమయితే పురాణమో హరికథయో నిత్యము తప్పదు. గౌతమిలో గంగ వారియింటిలో భక్తి పొంగి పొరలుతున్నాయంటే నిజముగా నమ్మవలసిందే. లక్ష్మీసరస్వతులు అత్తా కోడళ్ల పోట్లాటలు మానుకొని ఆ భవనములో సుఖముగా కాపురముంటూన్నారు. ఒకసారి ఆ భవనముచూస్తే కళ్లు మనస్సు చెప్పినట్లువిని తిరిగి మనవెంట రావు. లోనికి దూరి అన్నీ చక్కబెట్టవలెనని యువ్విళ్లూరుతాయి.

ఆ యింటి యజమానుడు రామశాస్త్రి మంచి శాస్త్రవేత్త; పూర్వాచారానికి పుట్టినిల్లు. ఈ కాలపు సంస్కారాలంటే మిక్కిలీ అసహ్యం. అతనిపేరుజెప్పితే సంస్కర్తలకు హడలు. ఆ యిల్లాలున్నా అతనికి తగినదే. విసుగు విరామం లేకుండా యింట్లో పనిపాట్లు చేస్తూ ఉంటుంది. పెట్టడమన్నా, పొయ్యడమన్నా, మిక్కలి సంతోషం. చీకటితోనే లేచి పట్టెడు పసుపు రాసుకొని స్నానముచేసి రూపాయంత బొట్టు పెట్టుకొని ఆ యిల్లాలు మహాలక్ష్మి, తులసి, పూజచేస్తూవుంటే పాతివ్రత్య కళలన్నీ అక్కడే తాండవమాడుతుంటాయి. ఆదంపతులకు లేక లేక చాల కాలానికి ఒకబిడ్డ పుట్టింది. ఆపిల్ల సుగుణాల కుప్ప. ముద్దులమూట. అందాలదీవే! ఆ పిల్ల పేరు మంగమ్మ.

ఆటపాటలలో అల్లర్లు ఎరుగని పిల్ల. మంగమ్మ బడికిపోతూవుంటే ముద్దులాటలతో మంగమ్మ బుగ్గలు గులాబీ పూవుల్లాగ యెఱ్ఱవారేయి. మంగమ్మ కోకిలకంఠమెత్తి పాడితే వీధిలో పోయేవారంతా తమతమ పనులు మరచిపోయేవారు. ఆ పిల్ల చదువు, బుద్ధి, చూచి బాల సరస్వతియని పిలవ మొదలు

పెట్టారు. మంగమ్మ భర్తను చూడాలని అందరికీ సరదా. అమ్మాయీ నీ మొగుణ్ణొస్తే చూపించాలి అని అంటూవుంటే, మంగమ్మ ముసిముసి నవ్వులతో సిగ్గుతో మోమువాల్చుకొని బడికి పారిపోయేది. మంగమ్మ చదువుముద్దు. ఆటముద్దు. పాట ముద్దు. ఇంట్లోముద్దు. బడిలోముద్దు. ఊళ్లో ముద్దు. అంతా ముద్దే. ముద్దులమూట మంగమ్మ.

రెండుజాములవేళ సూర్యుడు మండిపడుతున్నాడు. పోస్టుబంట్రోతు కార్డుతెచ్చి రామశాస్త్రిగారి కిచ్చినాడు. చూడగానే శాస్త్రిగారు పిడుగడచినట్లు హా సర్వేశ్వరా! అంటూ నేల కూలినాడు. శాంతమ్మ తొందరగా వచ్చి కార్డు చదివించింది. మంగా! మంగా! యని మొదలునరికిన అరటి చెట్టులాగు విరుగబడింది. తల్లిదండ్రులను జూచి మంగమ్మ బిక్కచచ్చిపోయి నిలవబడ్డాది. ఇరుగువారు పొరుగువారు ఊరంతా ఒక్కసారిగా తిరగ పడ్డారు. కన్నీళ్ల కాలువల గట్లు తెగిపొయ్యాయి. మంగమ్మను వెనకింటికి తీసుకపోయినారు. శీతలోపచారాదులు చెయ్యగా చెయ్యగా ఆదంపతులకు క్రమంగా తెలివివచ్చింది. నా మంగమ్మ మండిపోయిందని శాంతమ్మ మొత్తుకొని యేడ్చింది. నా వేదాలు, నా శాస్త్రాలు, నా పూర్వాచారాలు, నా దానధర్మాలు నన్ను కాపాడలేదూ! అని రామశాస్త్రి మొత్తుకున్నాడు. మంగమ్మను కౌగిలించుకొని తల్లి దండ్రులు హద్దూ పొద్దూ లేకుండ గోలపెట్టారు. వచ్చీ రాని జ్ఞానం. తెల్లపోయి చూస్తుండేది మంగమ్మ. ముద్దంతా మంటలో కలిసింది. బడికి మాననని రోజూ మంగమ్మ యేడుపే. తల్లీ దండ్రీ అతికష్టంమీద తెలియజెప్పి బడి మానిపించారు.

మంగమ్మ కిటికీలో కూర్చొని, బడికి పోతూవస్తూవుండే పిల్లలను పిలిచి, బడికబుర్లు మాట్లాడుతూ యేడుస్తూ ఉండేది. ఏది యేలాగున్నా, కాలమాగదు. కొన్ని సంవత్సరాలు గడిచాయి. శివరాత్రి వచ్చింది. చుట్టాలు పక్కాలు శాంతమ్మగారింటికి వెళ్లి బసచేశారు. శాంతమ్మతోను, శాస్త్రిగారితోను, ఖండితంగా చెప్పారు:—మీది పేరు ప్రతిష్ఠలుగల కటుంబము. మంగమ్మను ఇంకా ఆలాగు నుంచడం బాగులేదు. చాలా అపకీర్తి పాలై పోతారు. రేపు శివరాత్రి. కోటిలింగాల రేవున మొక్కుచెల్లించడని—వారి ముల్లెంతా పోయినట్లు గట్టిగా చెప్పారు. రామశాస్త్రి కొందఱి స్నేహితులతో 'చూడండి! ఈ ఆచారం అంత న్యాయంగా కనబడదు. వైష్ణవులే ఈ విషయంలో మంచిఆచారం చేస్తున్నారు. మంగలిమాత్రం పరపురుషుడు కాడా? వానినిమాత్రము స్పృశింపవచ్చునా?' అని అన్నాడు. 'శాస్త్రిగారూ, మీరే ఆలా

గంటే ఈ పంచభూతాలు గతులు తప్పి పోతాయి. పూర్వాచారం బుగ్గిలో కలసి పోతుంది. మనసు రాయిచేసికొని రేపు ఆశాస్త్ర కాం జేయ్యండి అని చెప్పి కట్టుగా చేసివేసేరు. శాస్త్రిఇష్టంతో నేమిపని యుంది? మంగమ్మ కేశపాశం గౌతమిలో చిన్ని తెప్పలాగు మునిగిపోయింది.

అదిమొదలుకొని మంగమ్మ ఒంటిపూటలతోను వ్రతాలతోను సగం అయిపోయింది. ఎంత కురూపినిచేసినా ఎంత విరూపిని జేసినా, మంగమ్మ సొబగునకు విరుగు తరుగు లేదు. తల్లి దండ్రుల కంటికి అమృత వర్తి, మంగమ్మ నేడు అగ్నిజ్వాల అయింది. మంగమ్మను చూస్తే మంట. చూడకపోతే మంట. ఆ దంపతుల మనోమయకోశం నూరు తేళ్లు ఒక్కసారి కుట్టినట్లు, అగ్గిలోపెట్టి పుటంవేసినట్లు, యంత్రంలోపెట్టి పీల్చి పిప్పి చేసినట్లు, సమ్మెటపోటులతో కొట్టి సాగతీసినట్లు, మహా వేదనలో మునిగిపోయింది. వారి కంటికి జీవయాత్ర ఈ ప్రపంచము అంతా గాఢాంధకార బంధురమై పోయింది. ఆచారాలు వ్యవహారాలు నిష్టలు నియమాలు అన్ని, కట్టిపెట్టారు. మంచాలు పట్టారు. క్రమంగా బల్లులులాగు గోడకు అంటుకుపోయారు. శాంతమ్మ ముందుగా మంగా, మంగా, యని పరలోకయాత్ర సాగించింది. దీనితో శాస్త్రిగారిగుండె అప్పుడే జారిపోయింది. నెల తిరుగకుండగనే శాస్త్రి గారున్నూ శాంతమ్మను కలుసుకొన్నారు.

మంగమ్మకు పదునారేండ్లు నిండలేదు. దిక్కుమాలిన పక్షి అయింది. కొండంత సంసారం గోటిమూలకు వచ్చింది. ఎటు చూచినా దారి తెన్ను కనబడలేదు. ఆర్చేవారు తీర్చేవారు అంతరించారు. అమ్మ అబ్బలు లేరు. విసుగు ముసుగు క్రమంగా వచ్చాయి. కాని చదువుఅంటే చెవి కోసుకుంటుంది మంగమ్మ. పూర్వపు చెలికత్తెలు వచ్చి బోధచేయడంవల్ల కొద్దిరోజులకు సాహసం అవలంబించింది. వితంతు కళాశాలలో ప్రవేశించాలని నిశ్చయించుకుంది. తన సంసారం అంతా చక్కబెట్టుకొని చివరకు కళాశాలలో ప్రవేశించింది. మంగమ్మపేరు మనసునకు నచ్చలేదు. వెంటనే మార్చుకొంది. స్కూల్ రిజిష్టరీలో మాలతి. అయిపోయింది. కష్టాలను మరచి గాఢంగా చదువు మొదలు పెట్టింది. క్లాసు పిల్లలలో నగ్రస్థాన మలంకరించింది. ఉపాధ్యాయుల మెప్పువడసింది. శివలింగం వచ్చిందని తోడిపిల్లల వెక్కిరింతలకు తాళలేకపోయింది. వెంటనే కొంత మార్పును చేసింది. కొలదికాలంలోనే మంగమ్మకు కేశపాశం చీకటి రాత్రిలాగు వచ్చివేసింది. రోజు రోజునకు వేషంతోపాటు భాష కూడ బలుపెక్కింది. పూర్వము బాల సరస్వతిగానున్న దిప్పుడు తరుణ సరస్వతియై

పోయింది. నాటకాలకు; సినీమాలకు తప్పకుండా వెళ్లేది. మాలతితో సమానులు మఱి లేనేలేరు. వార్తాపత్రికలంటే చెవికోసుకొనేది. భారతి, గృహలక్ష్మి, పక్కనుంటేనే గాని నిద్రపోయేదికాదు మాలతి. కళాశాలలో నాటకాలు వేస్తూవుంటే శాకుంతలములో శకుంతల ఉత్తరరామచరిత్రలో సీత మొదలగు ప్రధాన పాత్రలను ధరించేది మాలతి. ఈ కాలంలో మాలతి డాబామీద కూర్చొని గౌతమిని చూస్తుంటే ఆతరంగాలు ఆ ప్రవాహాలతో పాటు తన సంకల్పాలు మనోరథాలు గట్టుతెగి పారుతూ ఉండేవి. తన మనస్సులోనే మాలినీతీరము. దానివెంట మునిపల్లెలు, వానిచెంత పువ్వులతోటలు, వానిలో దుష్యంతుడు, లేడిపిల్లలు, ప్రియంవద, అనసూయ, వారిమధ్య తాను—శకుంతల తటాలున అయిపోయేది మాలతి. గంగయొడ్డున వాల్మీకి యాశ్రమము దగ్గఱ సీత అయిపోయి నలవల యేడ్చేది మాలతి. గౌతమీ ప్రవాహవేగం జూచి యేమమ్మా! భర్తతో కలియాలని యీ నదికి యింత తొందర అని నివ్వెఱపడేది. పక్షులు తమ పిల్లలకు ముక్కులతో వెన్నులు పట్టుకొని కలసి మెలసి పోతూవుంటె వాటిప్రేమలో లీనమైపోయేది. రాత్రులు నిదురలేక మనస్సులో నేమేమో భావిస్తూ గడిపివేసేది. సంస్కర్తల వ్యాసాలు విసుగులేకుండ చదివేది. త్రోవా తెన్నూలేని పూర్వాచారాలంటే చీదరించుకొనేది. పురుషులకు వివాహాల్లో సర్వస్వేచ్ఛయట. రజస్వల కాకపూర్వము స్త్రీలకు వివాహంచేయకపోతే తల్లి తండ్రి కన్యక బండకట్టుకొని భావిలో పడాలట! బజారులో కొయ్యబొమ్మలాగు ఈడుజోడు కుదిరిన పెండ్లికొడుకులు వందలు వేలు దేశంలోనుంటారా? నూరేళ్లు బ్రతికే బ్రతుకు. తొందరపడి పనికిమాలిన వానిచేతిలో పెట్టమంటారా?

“పెండ్లియాడటానికి కర్త వరుడు. వానికి వయస్సు నిర్బంధం లేకుండా కన్యకు వయస్సు నిర్బంధం పెట్టితే అనురూపసంబంధాలు ఏలాగు సంఘటిస్తాయి అని లోకజ్ఞులైన మహర్షు లెట్లనుకొన్నారో నాకు తెలియదు. మనువు అనురూపమైన వరుడు దొరకకపోతే ఆమరణాంతము పెండ్లిలేకుండా కన్యను ఉంచివేయమన్నాడు. రజస్వల అయిన తరువాత మూడువర్షాలదాక తండ్రికి కన్యాదానమునకు అధికారం ఇచ్చినాడు. పిమ్మట కన్యకే స్వయంగా వివాహాధికారం ఇచ్చినాడు. ఇంత విశాలహృదయంతో లోకజ్ఞానంతో చెప్పిన మనువు ప్రమాణం కాదట. అమ్మా అబ్బా లేని శ్లోకాలు ప్రమాణమట” అని మాటిమాటికి తలపోసేది మాలతి.

ఆనాడు శివరాత్రి యాత్ర; తండోపతండాలుగా ప్రజలు వచ్చేరు. మాలతి స్వామి

దర్శనంచేసి వస్తూవుంది. ఒక ముసలమ్మ పావంచాలు దిగలేక తొట్రుపడుతూంది. మాలతి యామెచేయి పట్టుకొని భద్రంగా దింపింది. ముసలమ్మ దేవుని దర్శనం చేయించమని మాలతిని కోరింది. మాలతి చేయించింది. దుర్గకోవిలదగ్గఱ యిద్దఱు నిలబడి యుండగా ఒక యువకుడు వచ్చి ముసలమ్మ చేయి పట్టుకొన్నాడు. నాయనా! మాధవా! యెక్కడకు వెళ్లినావురా? అని ముసలమ్మ అడిగింది. అమ్మా! మా ప్రిన్సిపాల్ గారు యాత్రకువచ్చి నన్నుచూచి పిలిచి వారి కళాశాలలో లెక్చెరర్ పోష్టు కాళీ అయింది. నన్ను దరఖాస్తు పెట్టమన్నారు. అందుచే ఆలస్యం అయింది అన్నాడు. మన దిగుళ్ళు తీరిగేయి కాబోలు నాయనా? ఈపిల్ల యెంత మంచిదో చూడు. నాకు నింపాదిగా దేవదర్శనం చేయించింది. మనశాఖ పిల్లట అని చెప్పి చూపించింది ముసలమ్మ. మాలతీ మాధవుల చూపులు ముసలమ్మ తెరచాటున బ్రహ్మముళ్ళు వేసుకొనుటకు అప్పుడే ఆరంభించాయి. ఆ పరమేశ్వరుని యెదుటనే జంకుగొంకు లేకుండా విజృంభించాడు మన్మధుడు. హావాలు భావాలు అన్ని కుప్పతిప్పలుగా ఉప్పతిల్లేయి. యాత్ర ముగిసింది. ఫాల్గుణం వచ్చింది. మంచిముహూర్తాన యధావిధిగా పెండ్లి అయింది. మాలతియే దాత, మాలతియే కన్య. సంస్కర్తలే కాదు సనాతనులు కూడ లోలోన సంతసించారు. ఆ నూతనదంపతుల కష్టాలు దైన్యాలు ఆ నాడే గౌతమీప్రవాహంలో అడుగంటాయి. బ్రహ్మానందరసతరంగడోలికలలో వారు ఉయ్యాల లూగినారు. ఊగుతున్నారు. ఊగుతారు.



# జాతకాల వెఱ్ఱిగురించి

'అనసూయ'

(మగని చెవిలో)

చదవవేస్తే ఉన్నమతీ పోయిందన్నట్లు యీ జ్యోతిష్యం యెక్కడ వచ్చింది? రాత్రీపగలూ యిదో పనిపట్టేరు! ఎంతసేపూ గురుడులో శనీ, శనిలో శుక్రుడూ, అంటూ కూర్చుంటారు! ఆసింహతలాటం మురుగుల దిబ్బవాడొకడు బాగా దొరికేడు మీకు! ఇంత ప్రపంచజ్ఞానం లేకపోవడం నేనెక్కడా చూడలేదు! పెద్దపెద్ద చదువులు చదుకొన్న ప్లీడర్లమంటారు! ఇలాంటివాళ్ళ డచ్చీలన్నీ నమ్మేస్తూ ఉంటారు! ఏవో ముందు పెద్దబ్రహ్మాండమైన మహాదశ వెళిపోతున్నదని వాడు నాలుగు పొగడ్తమాటలు ఆడేసరికి భుజాలు పొంగిపోయి రోజూ వాడికి యింట్లో తిండీ, దక్షిణా, తాంబూలాలూ, చదివింపులూ చేస్తూఉన్నారు! వాడేం మామూలు తిండి తింటాడా? ఘనాపాటీ! అందరూ వకయెత్తు, అగస్త్యమహాముని వకయెత్తూ అన్నరకంలోనివాడు! ఏమిటని చెప్పి పొంగవేసేడు?

మీకు వాహనయోగము, రాజసన్మానము, ఉన్నాయా? స్థానచలనం కూడానా?

'నీ కెలాగు తెలిసింది?'

కొసముక్కలు రెండు చెవినిపడ్డాయి లెండి! మీరు యిలాగు వృత్తియందు లక్ష్యము లేకుండా టప్పాలు కొట్టుకుంటూ నోవల్సు చదివేస్తూ క్లబ్బులో కాలక్షేపం చేసివేస్తూఉంటే, జ్యోతిష్కుడు అక్కర్లేను, నేనే చెప్పగలను, తప్పకుండా ఈమూడు యోగాలు మిమ్మల్ని పట్టి ముద్దులాడతాయని! ఎలాగు పడతాయా?

'కోరికల బొంగి పనిసేయ కూరకున్న కలుగు నియ్యెడనె ప్రయాణకారణంబు' అన్నమాస్టరుగా ఈపనిలో అంతకంతకు ఏమీ దొరకక, పార్టీల సొమ్ము తినేస్తే పట్టాకు భంగంవచ్చి రాజసన్మానం జరుగవచ్చును. లేకపోతే, రాబడిలేక ఆఖరికి డ్రైవరుపనిలో మీప్లీడర్లు కొందరు దిగినట్లు మీరూ దిగిపోతారు! కాని మీరు కొత్తపూజార్లు గనుక చేతకాక ఎవరినో మట్టించేస్తే పోలీసువారొచ్చి పట్టుకుంటారు! అప్పుడు రాజసన్మానం జరుగుతుంది! కేసు విచారణ అయినతర్వాత కంగాలీ మేజిస్ట్రేటు మీమీద కావేషీ మనస్సులో పెట్టుకొని కలెక్టరు ఊళ్ళో లేనికాలము కనిపెట్టి శిక్షవేస్తూ తీర్పుచెప్పి మిమ్మల్ని హుటాహుటీని ఎగువకు కట్టివేస్తాడు! అప్పుడు స్థానచలనం సంప్రాప్త మవుతుంది!

ఈపాటి చెప్పినందుకు వాడికి పదిహేనురూపాయిలు పెల్లలలాగు చెల్లించియ్యాలా? నాకు ఒక్క మంచిచీర కొనిపెట్టి చూడండి! మీపుట్టుపూర్వోత్తరంనుంచి జరిగినవీ జరుగుతున్నవీ పూసగుచ్చినట్లు మీగురించి అన్నీ చెప్పేస్తాను! వాడు ఏమిటంత దాఖలాగా చెప్పేసేడు మీకు నమ్మకం పుట్టించడానికి!

'చెప్పకేం! చాలా చెప్పేడు!'

ఏదీ! కొన్ని చెపుదురూ విందాం!

'నాకు చిన్నప్పుడు జలగండం తప్పిందన్నాడు.'

చిన్నప్పుడు చెరువుకో, యేటికో, వెళ్ళని కుర్రవాడుంటాడా? వాడు అక్కడ గెంతుకూఉన్నపుడు



శ్రీమతి కంభంపాటి సుగుణమహాలక్ష్మమ్మగారు,

బి.ఏ. యల్.టి.,

పాకుడు పావంచామీద ఏమాత్రం చిన్నపిసరు కాలు జారినా అది జలగండం క్రిందనే లెక్క!

'నాకు అగ్నిగండాలు తప్పేయన్నాడు.'

ఔను! ఏమంటే, చెడామడా సిగరెట్లు కాలుస్తారుగదూ! రొయ్యి లాల్చీమీదో వాణీమీదో పడి కొంచెం అవి కాలిన తర్వాత ఆరిపోతూ ఉంటుంది! అవన్నీ అగ్నిగండాలు కావూ?

'నాతండ్రి నాకు ప్రాజ్ఞత రాకముందే పోయినట్లు చెప్పేడు! దీని కేమిటంటావు? పితృమారకం దాఖలాగ లేదూ?'

అయ్యో సత్యకాలమా! ఇంట్లో నాలుగురోజులు భోజనం చేసినవాడు మీఅమ్మగారి బుర్రచూస్తే ఆ పాటి చెప్పకోలేడూ? ప్రాజ్ఞత రాకముందంటే అర్థమేమిటి? మీకు యిప్పటికి మాత్రం ప్రాజ్ఞత వచ్చిందా యేమిటి? చిన్నప్పటినుండీ ఇప్పటిదాకా ప్రాజ్ఞత లేనిలోనే జమ! ఎంత కష్టపడి చెప్పేడు పితృమారకము!

'సంతాననష్టం గురించికూడా చెప్పేడు!'

సరి! శిశుసంరక్షణ సంఘంవారి లెక్కలు తీయిస్తే ఎవరైనా చెప్పవచ్చును—కానుపు నష్టంలేని ఆడది కలికాలంలోనే లేదని!

'ఇప్పుడు కొంచెం నలతగోజులుగా ఉన్నాయనీ. మనస్సు చికాకుగా ఉంటుందనీ, ఇలాగు ఇంకా చిక్కులు కొన్నాళ్ళుంటాయనీ, చెప్పేడు.'

ఆసంగతులు మీముఖం చూడగానే చెప్పవచ్చును! దానికి గ్రహాలు చూడడం యెందుకు? అసలు రోగం లేనివారు డాక్టరు దగ్గిరకి చేరనేచేరరు! అందుచేత, యిట్లు చేరిన మీలాంటి ప్రతీవారికీ యీసంగతులు చెప్పవచ్చును. ఇంకా యేమిటి చెప్పేడు?

'ద్వికళత్రయోగం ఉన్నట్లు జాతకంవల్ల కనిపిస్తున్నా దన్నాడు!'

అల్లా మేష్టరుకి కూడా అలాగే చెప్పేడట! అతని పెళ్ళాం మొన్నను తిడుతున్నాది! అయితే మీలాంటివాళ్ళందరికీ అది సంతోషమైన కబురు గదూ! ముసలికాలానికి ముచ్చట్లు! కర్ణమంత్రాల కాలానికి కామతంత్రాలు! ఇవి లోకరివాజు! కొత్త ప్రియం, వేడిరుచి! ఈపాతపెళ్ళాలు మరెందుకు! మలిపెళ్ళాం మామిడిపండు! అయితే ఎంతట్లో పడుతుందన్నాడు మీకు ఈద్వికళత్రమహారాజ యోగం?

'ఇంకా మరో దశపోతే జరుగవచ్చునన్నాడు?'

సరి! యాభై పొలిమేరనా? అప్పటికి మీముసలి ప్లీడరు పోతాడు, వాడి చార్జి మీరు అందుకుంటారు కాబోలు! అప్పటికి మీరెక్కడో యీజ్యోతిష్కుడెక్కడో! మను పెవడో మూడు నాలుగేళ్ళలో అన్నాడేమో? అప్పుడే నాయొక్క గ్రహాలు మారిపోయేయా యేమిటి? లేకపోతే నామారకగ్రహాలన్నీ వీడిని చూచి మారు మూలలంట దాగుతున్నాయా? పిల్లలనుగురించి యేమైనా చెప్పేడా?

'ఏమి చెప్పితే నేం! నీకు నమ్మకం లేనప్పుడు?'

అలాగు కాదు! వాడియొక్క దగాశక్తి చూద్దాం చెప్పండి!

'మన రుక్మిణికి గొప్పధనం ఉన్న సంబంధం దొరుకుతుందిట!

మన శాఖలో అల్లా పౌరోహిత్యాదులా గుంటాడు, వాడు తప్ప మరెవడూ గొప్పవాడు కనబడ లేదు! వాడి కొడుక్కి యిచ్చేయండి! గొప్పసంబంధం అవుతుంది పిల్లకి! అయినా యీగొప్పసంబంధాలంటే నాకు ఒళ్ళుమంట! కోడలు వస్తుందనగానే ఆ వున్నమట్టుకు పిప్పి పిసరూ అత్తగారు తనపేర రాయించేసుకుంటుంది! కొడుక్కి నెత్తికి చేతులే! కోడలు కాలుపెట్టిన దగ్గిరనుంచీ అదబ్బున్న అత్తగారు సాధించడం మొదలెడుతుంది! ఆవిడా ఆడింది

ఆటా, పాడింది పాటా! ఏమంటే డబ్బున్నాది నాయిష్టం! ఇలాంటి సంబంధాలకన్న ఏకరగుప్పరులోనో, కాళీమట్టీలోనో స్వతంత్రంగా రవ్వా రష్టూ లేకుండా యాభైరూపాయిలైనా తెచ్చుకుంటూన్న వాడికి యిచ్చేస్తే మేలుగాని యీడబ్బున్న సంబంధాలంటే నాకు తలనొప్పి! అల్లా పింఛినీఇంజనీరు అప్పూ సప్పూ చేసి నాలుగువేలు ఖర్చుపెట్టి పెద్ద సంబంధం అని పెళ్ళిచేసేడు! యిరవైమంది ఉన్న యింట్లో పడేసేడు! తాను కాళ్లు చాచేసేడు అప్పులతో! ఇక పిల్ల సంగతా! దాన్ని అత్తవారు 'నూరుకొని తాగేస్తూన్నారట! ఆపిల్లకి నోటమాట లేదు, కళ్ళచూపు లేదు, ఎప్పుడూ ఒదిగి ఒదిగి బెదురులేడిలాగు ఉంటుంది! అందుచేత, నేనుబ్రతికి ఉండడమే ఉంటే గొప్ప సంబంధం అన్నమాట కానివ్వనను కోండి! ఇంకా మరేమిటిచెప్పేడు!

మనపెద్దబ్బాయికి బాగా చదువువస్తుందిట,

మీకు చదువువచ్చి యింత వియ్యమ్మణించేము; వాడు చదువుకొన్నతర్వాత ఇంకా విరగబడబోతాము! మీకాలంవాళ్లే ఇలాగుదిక్కులేక దేవులాడుతూఉంటే, ఇంకాముందు వచ్చేవాళ్ళకు గతేమిటిఉంది? ముల్లాలు ముష్టెత్తుకుంటూఉంటే పీర్లకు పంచదార యెక్కడినుంచి వస్తుంది?

నాకు పంచాననయోగం ఉన్నదిట! మరో అయిదారేళ్ళు పోయినదగ్గరనుండీ మంచి ప్రభగా ఉంటుందనీ, అప్పుడు చాలా రాబడీ ధనార్జనా ఉంటుందనీ చెప్పేడు?

అలాగా! ఇప్పటి ప్లీడర్లందరూ అప్పటికి స్వర్గస్థులైపోయి కట్టలన్నీ మీమీద పారేస్తారా యేమిటి? లేకపోతే కట్టలకి కాళ్ళు వస్తాయా, పూర్వం కొండలకి రెక్కలు వచ్చినట్లు? మీకు పంచాననయోగం నాకుకాలసర్పయోగం చాలాకాలంనుంచీ పట్టిఉన్నాయి! మరేమిటి కొట్టేడు?

తర్వాతకొంతకాలానికి ఈ ఉద్యోగ పరివర్తన జరిగి ఏ జమీందారీలోనో మంచి రాబడినీ్న అధికారమున్నూఉన్న దివానుగిరీలాంటి ఉద్యోగంకూడా అవుతుందన్నాడు! అప్పట్లోనే వాహనయోగము, రాజసన్మానము, స్థానచలనము, కలుగుతాయట!

ఓహో! మీకోసమేనా యిప్పుడు జమీందార్లందరూ తల్లడిల్లి పోతున్నారు! నేను వేనుకుంటానంటే నేను వేనుకుంటానని ఒకరిమీద ఒకరు పోటీకి వస్తున్నారు! మీరువెళ్ళి చక్కబెడతారనే కాబోలు వాళ్ళిప్పుడు అప్పులుచేసేసి గ్రామాలకి గ్రామాలూ, తనఖాలూ తాకట్లూ పెట్టేస్తున్నారు! ఎవడికండీ పట్టింది అంత దరిద్రం, మిమ్మల్ని దివాంజీగా తీసికెళ్లడానికి! అసలులో బ్రాహ్మణజన్మ! అందులో వైదికపుజాతి! అందులో ప్లీడరువృత్తి! ఆవృత్తిలో అడుగుమెట్టు! ఎవడికి కావాలండీ మీరు! ఏపింఛినీమేస్త్రీటో, ఏనత్రికలెక్టరో, ఏరిటైర్డు సబుజడ్జియో, ఏకోడిగుడ్లు తినేవాడో గొర్రెలు తినేవాడో, ఎవడో ఒకడు చెన్నపట్నంలోనే సిఫార్సు చేయించేసుకొని దిగిపోతాడుగాని మిమ్మల్ని చూచేవాడెవడండీ! ఏమో అవుతుంది కాబోలు దివానుపని! ఏ యానువారపుపేటకో ఏ ముష్టిఅగ్రహారానికో మిమ్మల్ని రాజసన్మానంకోసం తీసుకొని వెళతాయి కాబోలు మీ గ్రహాలు! ఈచుట్టుపట్ల ఉన్నాయికావూ ఈపూటకిఉంటే ఆపూటకులేని జమీందారీలు! అప్పిస్తే దివానుపని యిస్తారు! మీ అమ్మగారిని అప్పు యివ్వమనండి, మీరు దివానుపని చేతురుగాని! పాడుకోటలో ప్రభుహోదా చెలాయించవచ్చును! రాజుగారు తిరిగివచ్చినతరువాత దివానుగారు ఆ సవారీలో ఎక్కవచ్చును! తోటాలులేని తుపాకీపట్టుకొని ఉద్యోగంలేని బంట్రోతు వెనకాతల యీడిగిలబడి నడుస్తూఉంటే మాన్యాలులేని చాకళ్లు సవారీమోస్తూఉండగా పనిలేని గుంటలు ప్రక్కలంట పరిగెడుతూఉంటే ఇలాగు రాజలాంఛనాలతో దివానుగిరీ చెలాయింతురుగాని!

ఆహా! వాడికంటే మతిపోయింది కాని మీ రెలాగు నమ్మేసేరండీ! దివానుపనులు కొల్లలు వేలాడుతున్నా యనుకొన్నారా దులిపేసి తీసుకొందుకి! పాపము, కష్టేస్తున్నారు కాబోలు ఆకాశసౌధాలు! ఏదో పెద్దజమీందారీలో దివాంజీగా జొరబడి ఏకో మిషపెట్టుకొని అటూయిటూ తిరిగి హుజూరులో భత్యాలూ, లోసఫరులో సప్లయిలు మస్తుగా కొడదా మనుకొంటున్నారు కాబోలు! జరగని దానికి యీచిల్లర జమీందారీ లెందుకు? ఏమైసూరో, ఏ హైదరాబాదో, అటువంటి ఏ స్వతంత్రరాజ్యం లోనో దివానులై పోతారనే అనుకుంటూఉండండి! మనస్సులో పాలుత్రాగడానికి జిల్లేడాకు దొప్పల ప్రారబ్ధమేమి ? * * *

. అయితే మాతృమూరకం యెప్పుడన్నాడు?

'ఇంకా గండుదశలు జరిగిపోవాలన్నాడు?'

అనడూ! ఆవిడె తలుపుసందునుంచి మూస్తూ శకిలిస్తూ మీమాటలన్నీ చెవలపిల్లిలాగు వింటున్నాదని పసిపట్టేడు! ఏమైనా తభావతు చెపితే పేడనీళ్లు పోసేసి దూలగుండాకు రాసేసి చీపురుకట్టతో వెంట తరుముతుందని తెలునును.

అయితే మీను దివానుపని అవుతుంది! ఆహా! ఏమి అదృష్టమండీ! మనపిల్లలని దివానుగారి పిల్లలని అంటూ ఎత్తుకుంటూఉంటారు కాబోలు! అవును గాని, వాడు యీవూరువచ్చి యెన్నాళ్లైందో తెలునునా? నెల్లాళ్లైంది! ఎలాగు తెలునునా! రోజూ చెరువునుంచి స్నానంచేసివస్తూ కనపడుతున్నాడు! ఎండ తిర్లలో తిష్టవేసి యీజాతకాలు చెపుతున్నాడో తెలునునా? ఇదివరకు అయిదుగురి యిళ్ళలో అయిదుగురికి దివానుపనులు ఇచ్చివచ్చేడు! మనది ఆరో యిల్లు! ఎక్కడనుండి ఊడిపడతాయో గాని ప్రతీవాడికీ దివానుపనే! ప్రాక్టీసులేని ప్రతీప్లీడరుకీ మంత్రిపదవే! మీ రెలాగు నమ్మేసి పొంగిపోయి వాడిచేతులో దోసెడురూపాయిలు పోసేసేరండీ! నాకు చిత్రమౌతుంది!

'నేనూ అలాగే అన్నాను! ఈ కాలంలో మాలాంటివాళ్లకు రాజకీయోద్యోగా లెక్కడ, అని నేనంటే వాడొక లెక్చరుకొట్టి కథచెప్పేడు!'

ఏమిటి చెప్పేడు ?

"అయ్యా! మనుష్య బలములో ఏమున్నదండీ? గ్రహబలమే బలము! ఇవాళ ముష్టివాడు రేపు రాజు కావచ్చును! ఇవాళ రాజు రేపు ముష్టివాడు కావచ్చును! పెద్ద చదువులు చదువుకున్నవాడు నిర్ధనుడు కావచ్చును! నిరక్షరకుక్షి లక్షాధికారి కావచ్చును! మీవూరు సొట్టకోమటి నిళానీగాడైనా నిఖంగా రెండులక్ష లార్జించేడా లేదా? అందెందుకు? ఇక్కడ పెద్ద ప్లీడరు మీకన్న ఏవిధంగా గొప్పవాడో చెప్పండి? మీయీడు, మీజోడు, విద్య యెక్కువా, బుద్ధియెక్కువా? కాని అతడు తారాజివ్వలాగు మీదికి లేచిపోయేడా లేదా? మీరింకా అడుగు మెట్టున అంటిపెట్టుకొని ఉండడము మీదిన ముల సామాన్యంగాక మరేమిటి? అందుచేత, ఎంత దిగ్గంతులైనా వారి కలిమికి కారణము గ్రహబలమే గాని మనిషిలోలేదు! కాలం కర్మం కూడితే ఎటువంటివాడైనా గొప్పవాడై పోతాడు! గ్రహబలమే దైవబలమనుకోండి! రాసు ఉండాలిగాని ఎన్నివింతలైనా జరుగుతాయి! ఎట్టి అసాధ్యాలైనా సాధ్యాలవుతాయి! స్వప్నమం దనుకోనివికూడా సంభవిస్తాయి! అయితే మనరాసు బాగున్నప్పుడు ఇదంతా మన ప్రయోజకత్వమే అనుకుంటాము! రోజులు బాగులేకపోతే గ్రహాలవైపు తిరుగుతాము గాని రోజులు బాగుంటే సర్వానికీ స్వశక్తి సామర్థ్యాలే కారణమని నమ్ముతాము! అలాంటివాళ్లకి యెప్పుడో గ్రహాలు తిప్పికొడితేనే గాని కంటిపొర ఐడదు! పని బల్పు అయిపోయి సంచీ భుజాన్న వేసుకొని చమ్కిలాగు కూరలు కొనుక్కొనే సబు

ఇన్స్పెక్టరుకీ, ఇన్స్పెక్టరుగా ప్రమోషను అయినట్లు అప్పుడే ఆర్డరు అందిన సబు ఇన్స్పెక్టరుకీ కంటిపొరలలో ఎంత తేడా ఉంటుంది? వాడికి ప్రతివంకాయలోనూ గ్రహాలే కనబడుతూ ఉంటాయి! వీడికి ప్రతివస్తువులోనూ జార్జి చక్రవర్తిగారి కిరీటాలు ధరించిన తన బొమ్మలే కనబడుతూ ఉంటాయి! అందుచేత గ్రహబలను చేయలేని దేదీలేదు! పూర్వము మీవంటి అపనమ్మకపువాడి కొకడికి ఎవడో గొప్ప జ్యోతిష్కుడు ఫలానారోజున నీకు రాజసన్మానం జరిగి మహోన్నతపదవి సంప్రాప్తమౌతుందని చెప్పినాడట! వీడుమాత్రం నమ్మలేదట! మీకు మిక్కిలి ఆ చెప్పినరోజున రాజుగారిని కొట్టి రాజుగారికాగ్రహం పుట్టిస్తే వీడిజ్యోతిష్యం ఏమి అవుతుందో చూద్దామని నిశ్చయించి అలాగే రాజుగారు సభతీర్చి నిండుకొలువున సింహాసనం మీద కూర్చొని యుండగా వీడు చరచర లోపలికి వెళ్ళి ఫడాలున రాజుగారి దవడమీద అదిపెట్టి లెంపకాయకొట్టినాడట! లెంపకాయ కొట్టగానే రాజుగారి తలపాగా క్రిందపడిపోయిందట! దానిలో పెద్ద నాగుపాము ఉండి పాగా క్రిందపడగానే అది బుస్సుమని పైకి వచ్చిందట! అప్పుడు రాజసేవకులు దానిని చంపివేసినారట! సభవారున్నూ రాజుగారున్నూ వీనిని చూచి ఇంత అద్భుతంగా పాగాలో పామున్న సంగతి పోల్చుకొని ధైర్యముగా వచ్చి ప్రాణం రక్షించినాడని చాలా సంతోషించి గౌరవించినారట! రాజుగారు వెంటనే వానికి మంత్రిపదవి యిచ్చినారట! అతగాడు చెప్పేడు!'

మరేం! రేపు మధ్యాహ్నం కోర్టుకు వెళుతూనే మీకలెక్టరునో జడ్జీనో ఒక్క లెంపకాయ కొట్టేసి రండి! అప్పుడు మీకే కాకుండా మీకు చెప్పిన జ్యోతిష్కుడికి కూడా రాజసన్మానము, స్థానచలనము, ఉద్యోగపరివర్తనము, అన్నీకూడా సంప్రాప్తమౌతాయి! అయ్యో అమాయకపు బ్రాహ్మడా! మనవాళ్ళు ఈపాటి కథలు కల్పించలేరండీ! మీరు రోజూ చదివేనవలలూ నాటకాలూ ఏమిటండీ? మనిషియొక్క ఊహనుబట్టి చమత్కారంగా ఇట్టి కథలు కల్పిస్తారు గాని దివాను పనులు ఇప్పించడం, కట్టలు లాక్కురావడం, ఇవేనా గ్రహాలకు పని? ఇంతకూ మీరు నమ్మడానికి నాకాశ్చర్యంవేస్తుంది! ఇదివరకు చేగీతలవెర్రి! ఇటీవల ఈజాతకాలవెర్రి! పూర్వం కొన్నాళ్లు మంత్రాలవెర్రి! మొదటినుండి కొనదాకా సాలిగ్రామాలవెర్రి! తంత్రాలంటే సరే సరి! ఎవడైనా ఈచేతిలో రూపాయి ఆ చేతిలోనికి తెప్పిస్తే వాడేదో గొప్పసిద్ధుడని మీకు నమ్మకం! అలాంటివాళ్లకు అయిదేసి రూపాయిలు యిచ్చేసేవారు! కర్ణపిశాచాలు ఉన్నాయని కొందరు, తలుచుకున్నది చెప్పేస్తామని కొందరు, చెయ్యిమీది చక్రంవేస్తామని కొందరు, ఇలాగు మిమ్మలిని టోపీ వెయ్యనివాళ్లులేరు! మీదగ్గిర డబ్బులాగనివాళ్లులేరు! తొడలో మచ్చ ఉన్నాదని ఎవడో చెప్పేడని ఆ వేళ పొంగిపోయి పుంజెడు రూపాయీలు యిచ్చేసేరు గదా మిమ్మలిని ఏమిటంటే తప్పవుంది? దెయ్యాన్ని చూసేనని చెప్తే దేవతాదర్శనమైనంత సంతోషం! కాని, బాగా చదువుకొన్న పండితుడో లేక శాస్త్రిగ్గారో వస్తే కాతరు లేదుగదా! కానీ అయినా యివ్వరు! పాపం! మీకు ఏమంత్రాలూ పారేయికావు! ఏసిద్ధులూ సిద్ధించేయికావు! ఏ ఉపాసనలూ ఉద్ధరించేయికావు! దేనివల్లనైనా సులభంగా కడుపులో చల్ల కదలకుండా ధనార్జన జరుగుతుందేమోనని, కునుకకుండా ఒక్కమాటువచ్చి పడిపోతుందేమోనని, ఏ అశ్రమమూ కాలనేమిలాగు కల్పించుకొని కాలక్షేపము చేయవచ్చుననీ, చాలా ప్రయత్నాలు చేసేరుగాని సాగలేదు! మంత్రతంత్రాలుమర్దనా చేసి మానేసేరు! లాటరీలకుకట్టి విసుకెత్తిపోయినారు! సాలగ్రామాలు సంపాదించి సంచులు నింపేసేరు! పాపము గురించి వాడి ధర్మమూ అని యెవరూ ఆశపెట్టలేదు గాని లేకపోతే యీపాటికి

రెండుమూడు నూతులు తవ్వించవలసినవారే! భర్తృహరి చెప్పినట్లు 'నిధియును శంక భూతలము నిచ్చలు త్రవ్వితి' అన్న మోస్తరుగా చేసేరు. ఫలం దానిలో చెప్పినట్లే అయింది! ఇకను ఇప్పుడు జాతకాలమీద పడ్డారు! ముందుముందు గురుడో శనో ఎవడోవచ్చి పిలకపట్టుకొని యెత్తేసి పట్టాభిషేకం కట్టేస్తాడని చెప్పిన వాడికల్లా నమస్కారాలుపెట్టి నాలుగూ అయిదూ దాఖలు చేసుకుంటున్నారు!

ఇలాంటి డాబులరాయుళ్లని పెట్టుకొని గురుడులో శనీ, శనిలో శుక్రుడూ, అగ్ని అస్తమానమూ కూర్చుంటారుగదా ఏమిపని యిది! ఎందుకొచ్చింది? కూడుకు పనికొస్తుందా, గుడ్డకు పనికొస్తుందా? ఇదివరకు అలాగు పార్టీలు అరుగుమీద పడుక్కునేవాళ్లు! ఇప్పుడు అరుగుమీద కుక్కల సందడేగాని పార్టీ వాళ్ల అలికిడేలేదు! ఇలాగు రాబడి సన్నగిల్లిపోతూ ఉన్న ఈరోజుల్లో ఇదో దూబరాఖర్చు ఎందుకు పెట్టేస్తూఉంటారు? మనజాతకాలు మన ముఖాల మీదనే వ్రాసిఉన్నాయి! నేను చెప్తాను వినండి! ఈయింట్లో ఉన్నంతకాలం మీకు మనస్వస్థత ఉండదు! ఈవృత్తిలో ఉన్నంతకాలం మీకు రాబడి ఉండదు! ఈరెండూ ఇలాగుఉంటే మీకు ద్వికళత్ర యోగం కాదు, త్రికళత్రయోగం కూడా పడుతుంది! ఇక ఉద్యోగ పరివర్తనమా! గురుడులో శని రానియ్యండి, శనిగాడు శుక్రుడిని భుజాలమీద గుర్రపు పందు వేసుకొని మీకచేరీసావిట్లో నాట్యమాడ నియ్యండి: మీకు ఈ ఉద్యోగముపోదు! మరొక ఉద్యోగంరాదు! ఎందుకు వృధాగా డబ్బు వాళ్ల క్రింద విరజల్లుతారు! ఇక చాలించండి ఈ జాతకాలవెర్రి.



# ప్రైవేట్ ట్యూషను—వడుగు

తాత కృష్ణమూర్తిగారు బి.ఏ; యల్.టి.

గొట్టికాయలాడకుండా మావాణ్ణి ఖాయిదా చేస్తే యెంత చదువైనా వొస్తుంది." "నాదగ్గిర గొట్టికాయలు, గిట్టికాయలు పనికిరావండి. పుస్తకం అంటుకుపోవాలి, అలాచదివిస్తానండి."

కన్యాశుల్కము.

ఇంటివద్ద కొన్నాళ్లదాకా ప్రైవేట్ ట్యూషన్ చెప్పించి, మా బావ నన్ను టవున్ స్కూలులో నాలుగోతరగతిలో ప్రవేశ పెట్టినాడు. కాని ఆయేడు పరీక్షలో నాకు మార్కులు తిన్నగా రాలేదు. అయినప్పటికీ, మా బావవద్ద మొగమాటంచేత కాబోలు హెడ్ మాస్టరు నన్ను ఫెయిల్ చెయ్యలేదు.

"అబ్బాయీ, నీచదువు సంధ్యలు ఏమీ బాగులేవు. ఇటుపైని అయినా, శ్రద్ధగా చదివి బుద్ధిగా చదువుకుంటానని అంటేనే కాని నిన్ను పైక్లాసుకు ప్రొమోషన్ చెయ్యను" అన్నాడాయన కళ్లెఱ్ఱజేసి.

అతి వినయంగా చేతులు నులుపుకుంటూ తలవంచుకొని ఆయనయెదుట నిల్చున్నాను. ఏం చెప్పడానికీ తోచలేదు నాకు. పరీక్షలు, మార్కులు, ప్రమోషన్లు—వీటి అర్థం ఇంకా నాకు సరిగా తెలియదు. 'చదువుకోవడం కదా ముఖ్యం? ప్లాసైతే నేం?' అనుకునే వాడిని.

ఫస్టుఫారానికి వచ్చినతరవాత నాకు యింటివద్ద చదువు చెప్పడానికి కొత్త ట్యూటరు కుదిరినాడు. అతగాడు మా హెడ్‌మాస్టరుగారి మేనల్లుడే. పేరు పార్వతీశ శర్మ. కాని అందుచేత మేనమామ బలవంతంమీద నాకు ట్యూటర్‌గా కుదురుకున్నాడు. మనిషి చిన్నవాడే. జుట్టుమాత్రం అక్కడక్కడ నెరుస్తూఉంది. ఒక కన్ను కొంచెం మెల్ల. బక్కపలచగా, చామనచాయగా ఉండేవాడు. నన్ను కొట్టకుండా మచ్చికచేసుకొని, ఓపికతో పాఠం చెప్పేవాడు.

మొదట నాకు ట్యూషన్ ప్రారంభించి నప్పుడు మంచిరోజుచూసి, వర్జాలు అవీ లేని సుముహూర్తాన నాచేత పుస్తకం చదివించాడు. నాకుగల లోకజ్ఞానం, భాషాపరిచయం, తెలివితేటలు యేమాత్రమో చూదామని కాబోలు, ఆవేళ నన్నొక కాంపొజిషన్ వ్రాయమన్నాడు.

"దేనిని గురించి రాయమన్నారు?" అని అడిగాను, కాగితం పెన్సిలుతీసి క్షణం ఆలో

చించి, "లొట్టిపిట్టనుగూర్చి వ్రాయి." అన్నాడాయన.

"దానినిగూర్చి నాకట్టే భోగట్టా తెలియదు. అది ఎట్లా ఉంటుందో నేనెన్నడూ చూడనైనా లేదు. బొమ్మలలో తప్ప కొన్నాళ్ళదాకా 'లొట్టిపిట్ట' అంటే, ఏదో పిట్ట కాబోలనుకునే వాడిని. తరవాత తరవాత తెలిసింది, అదొక వంకర టింకర మెడగల పెద్ద జంతువని. దానిని గూర్చి అట్టే తెలుసుకోవలసిన అగత్యంకూడా ఎన్నడూ కలగలేదు. సామితె మాత్రం యెరుగుదును. 'సంగీతానికి నేను; అందానికి మాఅప్ప లొటిపిట!' అన్నదట గాడిద." అని చెప్పాను.

"పోనీ, నీకు బాగా తెలిసిన జంతువును గూర్చే వ్రాయి. గుర్రంగూర్చి వ్రాయగలవా?" అన్నాడాయన నవ్వుతూ.

'ఓ' అని ధైర్యంగా చెప్పి వ్యాసం వ్రాయడానికి ప్రారంభించాను.

'చూడూ, నువ్వు చదువుకున్న వాచకాలలోని గుర్రంపాఠం అప్పజెప్పమనికాదు నా ఉద్దేశం. నీ అంతట నువ్వు స్వంతంగా ఆలోచించి వ్రాయాలి. పుస్తకాలలోని ఎంగిలి ముక్కలకు దేవులాడకూడదు. 'ఒరిజినాలిటీ' ఉండాలి నువ్వు వ్రాసేదానిలో. నీయిష్టం వచ్చినట్లు స్వేచ్ఛగా వ్రాయి!' అని ఉపదేశించి ఆయన గదివెలుపలికి వెళ్ళి, సిగరెట్ ముట్టించి, పచారుచేయడం మొదలుపెట్టాడు వరండామీద.

అరగంట అయింది; ముప్పావుగంట అయింది. నావ్యాసం పూర్తిఅయేటట్లు కనిపించలేదు.

నా వద్దకువచ్చి ఆయన, 'ఏమిటోయి, యింతసేపు వ్రాస్తున్నావు భారతంలాగ? ఆ వ్రాసింది చాలునులే. చూడనీ.' అంటూ నావ్యాసం అందుకొని తనలోచదువుకుంటూ నవ్వుకున్నాడు, కడుపు చెక్కలయేటట్లు, ఎందుకో.

నేను వ్రాసినది యిది:—

గుఱ్ఱము

గుఱ్ఱము గాడిదజాతి జంతువులలో నొకటి. గేదెవలె దానికి కొమ్ములుండవు కాని, స్వాములవారి పాంకోళ్ళవంటి టక్కుటక్కులాడు డెక్కలుండును. దానికి నాలుగు మూలలను మంచము కోళ్ళవలె నాలుగు కాళ్లుండును—ఇనుపనాళ్లతోనున్న రాళ్ళవంటి డెక్కలతో! గుఱ్ఱమునకు బలమంతయు వెనుక కాళ్లలోనే యుండును.

ముఖమున కెదురుగా దానికి నిడుపైన పెద్దతోక యుండును. సహజముగా పెరుగనిచ్చినయడల, తోక ముచ్చటగా ఆడపిల్లల

జడవలె మెదిగి వ్రేలాడుచు, పట్టి యీడ్వవలెనని బాలురకు బుద్ధి పుట్టించును. కాబట్టి కొందరు తోకను పొట్టిగా కత్తిరించెదరు. తోక పొడవునుబట్టి, గుఱ్ఱములలో రకము లేర్పడును. పొట్టితోక గుఱ్ఱమును స్వారి గుఱ్ఱమందురు. పొడుగుతోక గుఱ్ఱమును 'పోనీ' అందురు. మధ్యరకము తోక గుఱ్ఱమును జట్కా గుఱ్ఱమందురు.

ఇంకా తెల్లగుఱ్ఱము, నల్లగుఱ్ఱము, ఎఱ్ఱగుఱ్ఱము, బొల్లిగుఱ్ఱము, పంచకళ్యాణిగుఱ్ఱము, పెద్దగుఱ్ఱము, చిన్నగుఱ్ఱము, కఱ్ఱగుఱ్ఱము, తట్టగుఱ్ఱము, డంకాగుఱ్ఱము, ఆటగుఱ్ఱము, గుడ్డిగుఱ్ఱము, కుంటిగుఱ్ఱము, గుగ్గిళ్ళగుఱ్ఱము, తాపులగుఱ్ఱము, నీటిగుఱ్ఱము, అని అనేక రకముల గుఱ్ఱములుండును. బగ్గెబగ్గెలున్న పెద్దపులివంటి గుఱ్ఱమును, 'జీబ్రా' అందురు. మా స్కూలులో ఉమామహేశ్వరరావును శంఖుమూతి గుఱ్ఱమందురు.

అన్నిటికన్న హిందూదేశములో జట్కాగుఱ్ఱములే జాస్తీ. అవి ముందుకు, వెనుకకు కూడ నడువగలవు. ఒక్కొక్కప్పుడవి రోడ్డుమీద అడ్డముగా కూడ నడచుచుండును,—గిర గిర గుండ్రముగా తిరుగుచుండును—దారిపోయే మనుష్యుల మీదికి దుముకుచుండును.

పూర్వము మనదేశములో రాజకుమారులందరకును కీలుగుఱ్ఱము లుండెడివి. వాటికి రెక్కలుండెడివి కాబట్టి, అవి సప్త సముద్రములను దాటుచుండెడివి.

గుఱ్ఱము మిక్కిలి దుష్టస్వభావము కల జంతువు. వీపుమీద స్వారిచేయుటకు ముచ్చటపడు బాలురను మోసముచేసి, క్రింద పడవేయుటే దాని ముఖ్యలక్షణము. అదిగాక, నూతిపళ్లురాలున ట్లది వెనుక కాళ్లతో తన్నగలదు. లేదా వెక్కిరించునట్లు పండ్లికిలించి, పైబడి కఱువగలదు.

తక్కిన జంతువులవలె గుఱ్ఱము పనికివచ్చే జంతువుకాదు. మన పూర్వుల కాసంగతి తెలియక, గుఱ్ఱములను శ్రద్ధగాపెంచి వాటికి దంతధావనము కూడ చేసెడివారు. అందుకనే మావాళ్లు నన్నొక్కొక్కప్పుడు, 'ఏమిరా, ఇంతసేపును నీ వేమి రాచకార్యము చేయుచుంటివి? పెద్ద గుఱ్ఱమునకు పళ్లుతోముచుంటివా?' అని యడుగుచుందురు. ఇంట్లో గుఱ్ఱమున్నయెడల ఉపయోగము తక్కువేకాని, ఉలవల ఖర్చు యెక్కువ! ఎక్కి తిరుగుదామంటే, దానిమీదినుండి పడి, కాళ్లు, చేతులు విరుచుకుంటామేమో అని భయము. గుఱ్ఱమును బండికి కట్టినా ప్రయోజనము లేదు. మీదుమిక్కిలి, మొంత చక్కని బండి అయినా, మూడురోజులలో ముక్క లవక తీరదు. పర్లాకిమిడిలో రాజుగారి గుఱ్ఱ మొక

మాటు బగ్గీతోసహా చెఱువులోనికి దుమికిన దట !

కాని, చాకలి పెళ్లిలో పెండ్లికొడుకును కూచోబెట్టుటకు గుఱ్ఱము పనికివచ్చును. వైద్యులు కొందరు గుఱ్ఱపు చెమటతో అశ్వగంధలేహము చేసెదరు. పూర్వము మనరాజులు అశ్వమేధయాగమని, యేదో పండుగ చేసుకొని, గుఱ్ఱములను చంపి తినెడి వారు.

మొత్తముపైని గుఱ్ఱము గాడిదకంటె విరుపయోగమైన జంతువు అందుకనే మన వాళ్లు తరుచుగ మొగపిల్లడిని తిట్టవలసివచ్చి నప్పుడు, 'ఓరి గాడిద! ఓరి పశువ! పెద్ద అడ్డగాడిదలాగున్నావు కదా, బుద్ధిలేదూ ?' అనెదరు. అంతేకాని, 'ఓరి గుఱ్ఱమా !' అని తిట్టరు. ఆడపిల్లని మట్టుకు, 'మంచి యేపైన గుఱ్ఱమువంటి పిల్ల! ఇంకా పెళ్లి లేదు, పెడా కులులేవు.' అనెదరు.

* * *

'చబాష్ ! నిజంగా 'ఒరిజినాలిటీ' ఉం దోయి నీ వ్యాసంలో కాని జాగ్రత్తసుమా, పరిక్షలలో కూడా యిట్లాగే వ్రాశావంటే, సున్న వస్తుంది నీకు !' అన్నాడు ట్యూటరు నవ్వుతూ.

'ఏం ?' అన్నాను ఆశ్చర్యంతో.

పరిక్షలలో విద్యార్థులు తమ సొంతభావా లను ప్రకటించుకో కూడదనీ, 'ఒరిజినాలిటీ'ని పూర్తిగా చంపుకోవాలనీ, పుస్తకాలలో చదువుకున్న ముక్కలే చిలుకపలుకులవలె అప్పజెప్పాలనీ, యింకా ఏవేవో కొన్ని ధర్మ సూత్రాలు బోధించాడాయన.

నాతో సమానంగా ఆడుతూ, పాడుతూ, నన్ను కొట్టకుండా, తిట్టకుండా, బుజ్జగించి, శ్రమతీసుకొని పాఠాలు చెప్పేవాడు. మొత్తా నికి, ఆయేడు పరిక్షలలో ఆయనకు మాట దక్కించి, మంచి మార్కులే తెచ్చుకో గలిగినాను.

ఆయేడు వేసంగి సెలవులలో నాకు ఉప నయనం చేస్తామన్నారు మావాళ్లు, చోర్లం గిలో—మా చిన్నఅన్నయ్య సారెతోపాటు ! ఖర్చువెచ్చాలు కలసివస్తాయని కాబోలు, రెండు సుముహూర్తాలు ఒక్కమాటే పెట్టు కున్నారు. చుట్టాలు, స్నేహితులు చాలా మంది వస్తారని తెలిసింది. శర్మగారిని కూడా నాతో చోర్లంగి రావలసినదని ఎంతో ప్రార్థించాను. మా బావచేత కూడా చెప్పిం చాను. కాని ఆయన మొగమాటంపడి రాలేదు.

మంచి వైభవంగానే జరిగింది నావడుగు! ఒకనాడు హరికథ, ఒకనాడు వీణపాట— ఇట్లా రోజూ ఏదో ఒక కాలక్షేపం ఉండేది. నాకు మాత్రం నలుగురిలో తలెత్తుకొని తిరి

గిందుకే ఎందుకో సిగ్గుగా ఉండేది. నా పంచ సిగలు, పసుపుగోచి, నా వేషం, చూసి అందరూ నవ్వుకుంటున్నారా అనిపించేది నాకు. కళ్ళు, కాళ్ళు ఎగరవేస్తూ సానివాళ్ళు ఆడుతూఉంటే, సభలో అందరికీ బలే ఉల్లాసంగా ఉండేది. నేనూ అప్పటికి అట్టే చిన్నవాడినికాను; పన్నెండేళ్లవాడిని. కాని ఎందుకో ఆ వేశ్యలను చూస్తే నాకు కోపంగా ఉండేది. వచ్చిన బంధువు లెవరికీ నామీద దృష్టేలేదు. ఆ పందిళ్ళు, ఆ సంత్రప్పణలు, ఆ బాజాలు, ఆ హడావిడి,—అవన్నీ నా వడుగుకు సంబంధించినవికావు కాబోలు!

ఇక ఆడవాళ్లందరూ మా వొదిన గదిలో చేరేవారు. సారెపెళ్లికూతురని దానికి పళ్లు, పువ్వులు, రవికలగుడ్డలు, మిఠాయిపొట్లాలు, అన్నీ తెచ్చి యిచ్చేవారు. వాసననూనెతో తలదువ్వి, జడలో పువ్వులుపెట్టి, దాన్ని ఎంతో చక్కగా సింగారించేవారు. జరీచీరలు, అత్తరులు, మిఠాయిలు, తాంబూలం, అన్నీ దానివంతు! దీక్షాకౌపీనం, పంచసిగలు నా వంతు! రాత్రి అయేసరికి మా వదిన గదిలో ఎంతో అలికిడిగా ఉండేది. ఆడవాళ్లు, పాటలు, ఫలహారాలు, తాంబూలాలు, నవ్వులు, అత్తరు ఘుమ ఘుమలు,........

ఆ వేడుకలలో, ఆ గడబిడలో నన్ను చూసేవాళ్లెవరు—ఒక్క ఆ పురోహితుడు తప్ప? ఉదయం, సాయంత్రం, అగ్నిహోత్రం వద్ద గంటలకొద్దీ పొగలో నన్ను కూచోబెట్టి, చెవికోసిన మేకవలె ఏదో వల్లిస్తూ ఉండేవాడాయన. నాచేత సంధ్యావందనం తిన్నగా చెప్పించలేక, నానా చికాకూ పడి కళ్లెర్రజేసి, పళ్లుకొరుకుతూ, నన్ను తిట్టి, తనుతిట్టుకొని, యేదో అవస్త పడేవాడు.

పెంకె కుర్రవాళ్లు వీలు చిక్కినప్పుడల్లా నాతలమీద చరిచి, నన్ను కేళిచేసేవారు. ఉపనయనమంటే మొదట యేమీ తెలియక సంబరపడ్డానే కాని, జంధ్యప్పోగు మెడలో పడడం పీకకు ఉరిపోసుకున్నట్లనిపించింది చివరకి. అర్థం తెలియని యీ సంధ్యావందనం, గాయత్రీజపం వల్లెవేయడ మెందుకో? తీవ్రంగా ఆలోచించేవాడిని, ఉపనయనమంటే ఏమిటని! ఎవరినడిగినా సమాధానం చెప్పరు సరికదా, మీదు మిక్కిలి యెగతాళి చేసేవారు. జంధ్యంతో వీపు గోకుకోవచ్చుననీ, జంధ్యం కుక్కమెడలో పడేస్తే చప్పున పెళ్లి అవుతుందనీ, జంధ్యం ముడి గట్టిగా నొక్కితే దెయ్యాలు వశమౌతాయనీ, 'గాయత్రీ సాక్షి!'అని జంధ్యం పట్టుకొని ప్రమాణం చేస్తూ యెంతేసి అబద్ధాలైనా చెప్పవచ్చుననీ, వడుగైతే హాయిగా బ్రాహ్మణార్థాలుచేసి బ్రతికేయవచ్చుననీ, ఎన్నో చెప్పేవారు.

"వడుగువలన నిజమైన ప్రయోజనం

ఏమిటండీ?"అని ఒకనాడు అడిగాను మా సాంబన్న మాస్టరు గారిని.

నవ్వుతూ ఆయన, "వడుగు అవడమంటే బిచ్చమెత్తుకుందుకు హక్కు పొందడమన్న మాట. ఉపనయన కాండకల్లా ముఖ్యమైనది భిక్ష!"అన్నాడు.

వడుగులో నేను మా బంధువులందరికీ ఒక్కొక్కరికే నమస్కరించి, 'భిక్షాం దేహి' అనడం, వాళ్లు నాపళ్లెంలో రూపాయలు, ఉంగరాలు వెయ్యడం, అన్నీ జ్ఞాపకం తెచ్చుకున్నాను. తుదకు తల్లిదండ్రులు, బంధువులు, పురోహితుడు, అంతా యేకమై, కుర్రవాళ్లకు వడుగునాడు చేసే మహోపదేశం ముష్టి నెత్తుకోవడమా అని నామనస్సు చాలా కించపడింది.

"ఆకాస్త నూలుపోగూ మెడలో పడితేనే కాని, మొహానికి బ్రాహ్మణకళ రాదు!" అనేది మానాయనమ్మ వడుగైన తరవాత. అద్దంలో చూసుకుంటే, ఒళ్లు మండుకొచ్చింది నాకు. అందవికారంగా తలగొరిగించి, పంచ సిగలుపెట్టి, యీగలు ముసురుతూ నెత్తిని చిన్న బెల్లంముద్ద నొక్కి, 'బ్రాహ్మణకళ వచ్చింది, చూసుకో!' అంటే, యేమైనా అర్థం ఉందీ? 'బ్రహ్మచారీ శతమర్కటః' అంటారు. అంటే, 'నూరుకోతుల అందం వస్తుంది వడుగైనవాడికి!'అని అర్థం. అదే కాబోలు 'బ్రాహ్మణకళ' అంటే?

ఆడపిల్లనై పుట్టివుంటే నాకీ గ్రహచారం పట్టకపోవును కదా? చదువు, సంధ్య చక్కగా ప్రైమరీతో ఆఖరు! మాస్టర్లు, దెబ్బలు, పరీక్షలు, ఇంగ్లీషు—ఏగొడవా ఉండదు. అప్పుడీ 'బ్రాహ్మణకళ', సంధ్యావందనం, పురోహితుడి తిట్లు యేవీ అవసరం లేకపోయేవి. ముచ్చటగా పదిపన్నెండేళ్లకి పెళ్ళి. పువ్వులు, మిఠాయిలు, అత్తరులు, వీటితో సారె. ఒంటినిండా నగలు, ఇంటినిండా పిల్లలు. పురుళ్ళు పుణ్యాలు, నోములు, అత్తగారితోను ఆడపడుచులతోను దెబ్బలాటలు, నగలకోసం చీరెలకోసం మొగుడితో సాధింపులు,-- బలే తమాషాగా ఉండేది జీవితం! ఎందుకొచ్చిన మొగజన్మ?

# స్త్రీలు—గురుకులములు

బుర్రా వెంకట సుబ్బారాయుడుగారు

హిందూదేశంలో స్త్రీలయందు విద్యావ్యాప్తి అయితేనేగాని దేశంలో సాంఘికాదిదురాచారములు పోవనిన్నీ, సాంఘిక నైతిక పరిస్థితులు బాగుపడితేనే తప్ప దేశము అభివృద్ధికాంచదనిన్నీ అందుచేత స్త్రీలకు విద్య చాలా ఆవశ్యకమనిన్నీ, సనాతనులలో ఏ కొందఱో తప్ప మిగతా వారందఱూ ఒప్పుకొంటున్నారు. కాని ఆ విద్యను కఱపే విధానాన్నిగూర్చి మాత్రం అందఱూ తలొక పంథా తొక్కుతున్నారు. కొందఱు బాలురకు ఏవిద్యనైతే హిందూవిశ్వవిద్యాలయములన్నీ ఆమోదిస్తున్నాయో, అదే బాలికలనుకూడా మందిచంటున్నారు. బాలురతో సమానముగా కలసి బాలికలుకూడ చదువవలె నంటారు వీరు. ఈ పద్ధతి పాశ్చాత్యదేశాల్లో ఉండనిన్నీ, అట్లా చదవడంవల్ల బాలికలలో inferiority complex (న్యూనతా భావము) పోతుందనిన్నీ, వీరు పెద్దవారైన తరువాత పురుషులతో పాటు సమానంగా సాంఘిక, నైతిక సమస్యల నెదుర్కొని, అవలీలగా సాంఘికాదిదురాచారాల్ని రూపుమాపగలరని, వీ రంటారు. మఱికొందఱు బాలురకు కఱపబడే విద్య—ప్రస్తుతము విశ్వవిద్యాలయము లన్నిటిలోను చెప్పబడేది—బాలికలకేమాత్రము తగదని, అటువంటివి నేర్పినట్టయితే ఆ బాలికలు మగవీరులౌతారని ప్రపంచములో స్త్రీ పురుషులు సంచరించే తావులే వేరనిన్నీ, అందుచే న్యూనతాధిక్యతా బుద్ధికి గాని, గొప్ప తక్కువ అనే తారతమ్య బుద్ధికిగాని అవకాశమే లేదనీ, ఎవరి ఆవరణలో వారు స్వతంత్రులే అనిన్నీ, అటువంటి సందర్భంలో మగవాండ్ర కుండవలసిన విద్యకు, ఆడువాండ్ర కుండవలసిన విద్యకు భేదముండవలెనని అభిప్రాయపడుచున్నారు.

నిజం చెప్పడానికి మనకు 100 కి 99 సందర్భాలలో కనపడే దేమిటంటే ప్రస్తుతం విశ్వవిద్యాలయములవారు స్థాపించిన విద్యాపద్ధతిలో చదువుకొన్న బాలికలు విద్యాభ్యాసము పూర్తిచేసి గృహస్థావస్థలో ప్రవేశించగానే, వారు తమ వెంట పవిత్రమై ప్రశాంతమైన హిందూగృహములోనికి అనుమానం, అవిశ్వాసం, దౌర్బల్యము, అమితవ్యయం అనేవాట్లను తీసుకు వస్తున్నారు. ఈ విషయాల్నే సాంఘిక నవలలోను, మాసిక దైనిక పత్రికలలోను కథారూపాన్ని వ్యక్తపరుస్తూంటే, దానిని సహించలేని కొందఱు మగవాండ్రు, ఈర్ష్యచేత, అసూయచేత, యిట్లా వ్రాస్తూయున్నారు అంటారు. కాని యీ పత్రికలు, నవలలు, ప్రజల ప్రతిధ్వనియే కదా. ఇవి పక్షపాతము వహించలేదే! ఆంగ్లవిద్యావతియైన హిందూ యువతినే కాకుండా, యివి ఆవిద్యను నేర్పిన యువకునికూడా అవసరం వచ్చినపుడల్లా నిందిస్తూనే ఉన్నాయి.

దీనికి అంతకూ కారణం ఏమిటి—అసూయా? ఒకరిద్దఱికి అసూయ ఉండవచ్చునుగాని మగజాతి అంతకును అసూయ ఉండునా? అదికాదు. హిందూ సంఘము యీ విద్యకు అలవాటుపడలేదు. ఈవిద్యను, హిందూదేశపు నమ్మకములకు పరిస్థితులకు, అలవాట్లకు భిన్నముగా ఉన్న నమ్మకములతోను పరిస్థితులతోను అలవాట్లతోను కలసి పెరిగినదాన్ని, అట్టి అలవాట్లేమీ లేని మనదేశంలో నెలకొల్పవలె నంటే

ఎంతకష్టము? మగవాంధ్ర విషయంలో ఈ అభ్యంతర మేమైనం దంటారా? మూడువందల ఏండ్లైనదికదా మనకీ విద్యతోడి సాంగత్యము కలిగి. నేడు ఎంతమంది ఇందులో ఆరి తేరినవారు? పోనీ ఆ సంగతి అటుండనిచ్చి వీరేమైన ఈ విద్యలేనివారికన్న ఎక్కువ సుఖ మనుభవించుచున్నారా? సుఖముమాట అలాఉండగా అనేక నూతన సమస్యలను తెచ్చిపెట్టినదీ విద్య. ఈ విద్య నభ్యసించినవాడు పూర్తిగా ఆ విద్యను సంబంధించిన అలవాట్లను, అలవర్చుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు. కాని అది కొనసాగక పోవుచున్నది. అందుచేత ఫలితము త్రిశంకు స్వర్గము— వీధులో దొరవేషం ఇంట్లో శుద్ధ బ్రాహ్మణ్యం— వేషంలో అడుగున సూటు—పైన పాగా— క్లబ్బులో...... ......పుచ్చుకోవడం formality manners—అందుచేత అలవాటు లేకపోయినా కాస్త పుచ్చుకోవాలి—లేకపోతే యూరోపియన్ friends గేలిచేస్తారేమో! ఇల్లా ఉంది ఈవిద్యయొక్క మహాత్మ్యము మగవాళ్ళపట్ల.

హిందూసంఘం స్త్రీలను అతిపవిత్రంగా తలుస్తోంది. అందుచేత ఈ విద్య పురుషులలో చేసిన అతివినయమును, స్త్రీలపట్లకూడా చేయుటకు ఒప్పుకొనలేదు. అందుచేతే యీఅల్లరి, యీఘోష, ఈఅభ్యంతరము, స్త్రీలు ఆంగ్లవిద్య అభ్యసించడానికి, దీనిని Conservatism అనండి ignorance అనండి, పాశ్చాత్యసంఘము పరపురుషునితో ఒకస్త్రీ చేతిలో చేయి వేసికొని మాట్లాడుచున్న హర్షించగలదు: హిందూ సంఘము సహించలేదు. ఇది హిందూసెంటిమెంట్ (Sentiment)కే సరిపడదు. తురుష్క సంఘముమాట చెప్ప నవసరమే లేదు. అందుచేతనే ఆంగ్లవిద్య నభ్యసించినప్పటికి, హిందూయువకుని హిందూరక్తము యీ దృశ్యమును చూడలేక ఉడికిపోవుచున్నది. పై నుదహరించిన నవలలు మొదలగువానిలో కథలు వ్రాసినవారు ఎవరందురు? సనాతనులా కాదు. చాలమంది ఈ ఆంగ్లవిద్య అభ్యసించినవారే. ఇదియేమని తెలుపుతోంది? ప్రస్తుతము ఉన్న విద్యాపద్ధతి బాగులేదనే కదా.

దీనిని బట్టి యాలోచించగా సంఘముయొక్క అలవాట్లనుబట్టి విద్యాపద్ధతి ఉండాలికాని ఎవరికో యొక్కడో ఓ పద్ధతి ఉంది కాబట్టి అది మనకుకూడా ఉంటే బాగుంటుందని అనుకోడం పులిని చూచి నక్కవాత పెట్టుకోడం లాంటిదే. ఇటువంటి విషయ పరిస్థితు లన్నీ ఆలోచించి "ఆర్యప్రతినిధి" సభవారు హైందవనారీమణులకు తగిన విద్యయెట్టిదా అని ఆలోచించి అనేక సుప్రసిద్ధ విద్యాభిమానుల సలహాలను పొంది గురుకులపద్ధతి, కన్యకల విద్యాభివృద్ధికి మంచిదని దెహరాడూన్ (Dehradun)లో కన్యా గురుకులమని ఒక దానిని స్థాపించారు. దీనిని గూర్చి హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ చందవర్కరు, M. A. గారు, అభినందిస్తూ కన్యాపాఠశాలల కన్నిటికి యిది ఒక ఆదర్శమని దేశమందలి కన్యాపాఠశాలలన్నీ దీనిని అనుకరించినట్టయితే చాలాబాగుంటుంది అని హిందుసారస్వతానుబంధంలో వ్రాశారు. ఇందలి విద్యాపద్ధతియొక్క గొప్పతనము దూరదేశములగు కర్ణాట మహారాష్ట్రములనుండికూడ బాలికలు వచ్చి ఇందు చదువుచున్నారనే విషయము ప్రకటిస్తోంది.

ఈ కన్యా గురుకులము ఒక క్రొత్త పంథా త్రొక్కింది. ఇది బాలికలకోసమే నియమింపబడి ఉంది. ఇక్కడ పఠనాక్రమం, రామ్‌దేవ్ మొదలైన విద్యాప్రముఖులు శోధించి, నెలకొల్పారు. ఇక్కడ చదువుచెప్పే వాళ్ళందరూ స్త్రీలే. ఆంగ్ల భాష ఐచ్ఛికం—కోరితే చెబుతారు. అదైనా కడపటి తరగతుల్లో. సంస్కృతం, హిందీ, మాతృభాష వీట్లకు ప్రాధాన్య మివ్వబడినది. అన్నివిషయాలూ హిందీలో చెపుతారు. ప్రాచీనగురుకులాలకు మల్లే వీటిని నడుపుదామని సంస్థాపకుల అభిప్రాయం; అందుచేత పిల్లలందరు ఇక్కడేఉండాలి చదువుకున్నన్నాళ్ళు-

Residential అన్నమాట. ఉన్నతవిద్యకూడా అభ్యసించవలెనంటే 15 సంవత్సరములు పట్టునట. ఇక్కడ చదువుకొన్నవారికి కేవలము మానసికాభివృద్ధికే గాక శారీరకాభివృద్ధకిని సౌకర్యము లున్నవి; ఇది డేహరాడూన్ ఊరి వెలుపల నున్నది.

ఇక్కడ సంస్కృతము తప్పకుండా చదువవలసి ఉంది. ఆ చదువడంలోకూడా, వేదములు, ఉపనిషత్తులు, తమంతటతామ అర్థము చేసికొనగలుగు సమర్థత బాలికలకు కలుగచేస్తున్నారు.. విమర్శాబుద్ధితో సంస్కృతము నేర్చుకున్నట్లయితే, ఆ సంస్కృత జ్ఞానము సనాతనులజ్ఞాన మల్లే కాకుండా, అనేక సంఘదురాచారములను పారద్రోలుటకు హేతువగుచున్నది.

నవీనశాస్త్రములోని (Modern science) శబ్దముల ననువదించుటకుకూడా, మాతృభాషలో తగిన పదాలు లేకపోవడంవల్ల సంస్కృతం మనకి యెక్కువ ఉపకరిస్తోంది. ఈ విషయాల్నన్నీ కనిపెట్టే, యీకన్యా గురుకుల సంస్థాపకులు సంస్కృతం నిర్బంధంచేశారు. సంస్కృతం మృతభాష అంటారుకాని దీనికి అర్థం లేదు. ఇది మనలోనే జీర్ణించి ఉన్నది. అలవాట్ల రూపంగాను, నమ్మకముల రూపముగాను, అదీ కాకుండా చూడండి సంస్కృత పదం ఉపయోగించకుండా ఒక పదినిమిషాలు మాట్లాడండి: అల్లా చేస్తే అచ్చతెనుగులో కవులన్న మాటే: ఇల్లాగే, మన దేశంలో అన్నిభాషలలో, అంటే సంస్కృతం మూలంగా గల భాషలలో, సంస్కృతం అంతర్భూతమై ఉంది. అటువంటి సంస్కృతాన్ని, విదేశీయులైన జర్మను బాలికాబాలకులు 'అమరం'దగ్గఱనుంచీ చదువుతోంటే, మనం చదవకుండా ఉండడం ఎంత శోచనీయం. ఈవిషయంలో మాత్రం సంస్కృతాభిమాను లందఱును ఈ గురుకులము మెచ్చుకొన తగి ఉంది.

ఇక్కడ సైన్సు (శాస్త్రము), గణితం మొదలైనవి కూడా చెపుతారు కాని, జీవితంలో సామాన్యంగా అవసరమైన విషయాలకి మించకుండా, నిత్య గృహకృత్యాలలో స్త్రీలకి కావలసినవి వదలకుండా, సంఘసంస్కారాదులలో స్త్రీకి పనికివచ్చే విషయాల్ని వదలకుండా, ప్రపంచజ్ఞానం బాలికలకు కలుగజేస్తున్నారు యీ గురుకులమువారు. వీనిలోనే, హిందూదేశచరిత్ర, గృహ్యశాస్త్రము, శిశుపోషణ, ప్రసూతిశాస్త్రం, మొదలైనవి చెపుతారు. ఇచ్చట విద్యాపద్ధతి మూడుభాగాలుగా ఉంది.

ప్రాథమికశాఖలో Kindergarten తో మొదలుపెట్టి-క్రమంగా సీత సావిత్రి, కౌసల్య, గార్గి, సులభ, మొదలగు పతివ్రతల కథలు చెపుతారు. 4 వ తరగతిలో కుట్టుపని చెప్పడం మొదలుపెడతారు. ప్రాథమిక, మాధ్యమిక శాఖల్లో ఆఱు తరగతు లున్నాయి. వీట్లమీద రెండే తరగతు లున్నాయి. ఈ ఉన్నతశాఖలోనే బాలిక ఆంగ్లమును చదవాలని కోరితే చెపుతారు, అట్లు కాకపోతే దేశంలోని ఏదైనా ఒక వాడుకభాషను తీసుకోవాలి.

దీనిపై ఉన్నతవిద్య మూడేండ్లు ఉంది. ఈ తరగతుల్లోనే విశ్వవిద్యాలయాల్లో చెప్పే భౌతిక సాంఖిక, రసాయనాదిశాస్త్రాలను చెపుతారు. సంగీతము, వేదాంతము, చరిత్ర మొదలైనవాటినికూడా యిచ్ఛానుసారంగా చదవవచ్చును. చందవర్కరు గారు వీరి పరీక్షాపత్రాలుకూడా మిగత విశ్వవిద్యాలయములకు చెందిన కళాశాలల పరీక్షాపత్రాలను తీసిపోవని తలపిస్తున్నారు. బుద్ధికుశలతను పరీక్షించుట కప్పుడప్పుడు చిన్నచిన్న పరీక్షలు జరుగుచుండునట.

ఇచ్చట జాతిభేదము లేదు. ఆహారము శాఖాహారము.

వీని నన్నిటిని చూడగా చందవర్కరుగారు చెప్పినట్లు, ఈగురుకుల వ్యవస్థాపకులు స్త్రీవిద్యాభిమానుల కందఱికి అభివందనీయులని తోస్తుంది.

మన ఆంధ్రదేశమున యీరీతిగా లేకపోయినను, యిట్టి ఆదర్శములుగల నికేతనాలు కొన్ని ఉన్నాయి. కాని తగినంత పోషణ లేకున్నది. ఇటువంటి గురుకులములను దేశమంతటను స్థాపించినట్టయితే, స్త్రీవిద్య త్వరలోనే వ్యాపించుటే కాకుండా ప్రస్తుత మనుసరింపబడుచున్న ఆంగ్లవిద్య వెంబడేఉన్న పైనచెప్పిన దోషాలకి తావుండదు. అందుచేత స్త్రీవిద్యాభిమాను లందఱు యిట్టి కన్యాగురుకులములను పోషించి ప్రోత్సహించినట్టయితే సాంఘిక దురాచారాలు అనేకము పటాపంచలై నశించిపోతాయి. తల్లిదండ్రు లీగురుకులములకే తమ ఆడుపిల్లలను పంపుదురని నమ్ముచున్నాను. విశేషములు కావలసినవారు పై కన్యాగురుకులంవారి కార్యదర్శిగారివలన తెలిసికొనవచ్చును. (*)

(*) పంజాబునందును, సంయుక్తరాష్ట్రిములలోను యిట్టి గురుకులాలు–బాలురకు–అనేకములున్నాయి మొదటలో వీనిని ఎవరును లక్ష్యపెట్టలేదు. కాని యిందులో చదివి యింగ్లాండు మొదలైన చోట్లకువెళ్లి డాక్టరుపదవులు సంపాదించి కొందఱు రావడంవల్ల వీని గొప్పతనం యిటీవల బయల్పడుతోంది. ఇందుకుదాహరణ కాశీహిందూ విశ్వవిద్యాలయములో, అర్థశాస్త్రపండితులుగా ఉన్న డాక్టరు ప్రాణనాథుగారు. వీరు ఒక గురుకులంలో చదివి లండనువెళ్లి తమప్రజ్ఞవలన బిరుదములను పొందినవారు. ఇట్టివారు పంజాబు విశ్వవిద్యాలయములలో మఱికొందఱున్నారు.



# అందంలోని ఆరాటము

శ్రీమతి సమయమంతుల కుంతలగారు

నేను మొదటినుంచీ సౌందర్యం అంటే చాలా ప్రేమించేదాన్ని. లోకంలో ప్రతీ వస్తువుకంటె ధనంకంటె ఆరోగ్యంకంటె భోగాలకంటె కూడా సౌందర్యమే మొట్ట మొదటిదని నావిశ్వాసం. 'ధనమూల మిదం జగ'త్తను మాటను పాటించేదాన్ని కాను. ప్రపంచకంలో ఎంతమంది ధనవంతులో ఉన్నారు. అల్లాంటివాళ్ల ముఖాల్లో కొన్ని అయినా సౌందర్యచిహ్నాలు లేకపోతే ఆ ధనానికి పేరు ప్రతిష్ఠా ఉండడం ఎలా సంభ విస్తుంది.

'ఆరోగ్యమే మహాభాగ్య'మనే మాటను విన్నప్పుడుకూడా 'సౌందర్యం అనేది ఏదీ లేకుండా మొద్దులాగ ఇంత తిని కడుపే కైలాస మనుకుంటూ ఇడ్డెనులాగ శరీరాన్ని లావుచేసుకోడం కాబోలు' అని అనుకొనే దాన్ని. 'గుణాః పూజాస్థాన' మనే స్తామెత కూడా నాకు నచ్చలా. హరిశ్చంద్రుడు సుగుణాలు కలవాడే అయినా భోగా లను భవించడాని కతని జీవితంలో ఏమయినా అవకాశం చిక్కిందా.

భోగేంద్రుడైన నలకూబరుడు రంభను ప్రేమించాడంటే ఆ ఏమ్మెలాడి తళుకుబెళు కుల కులికి కాదూ! సీత పసిడిలేడిని ప్రేమించిందంటే దాని బిత్తరిచూపులకు పర వశించింది కాదూ! దేవేంద్రుణ్ణిలాగి లెంప కాయ కొట్టే రావణాసురుడు సయితము సీతను ప్రేమించాడంటే ఆ మహాతల్లి శరీర లాలిత్యాన్ని చూచి కాదూ! ఇనపకచ్చ డంతో బిగించుకున్న విశ్వామిత్ర ముని మేనకకు లొంగిపోయాడంటే ఆ వగ లాడి వాల్చూపు తూపులకంటె ఇంకో టేమున్నది కారణం? ఆమాట కొస్తే నేను నా స్నేహితురాల్ని నా ప్రాణాలకంటె ఎక్కువగా ప్రేమిస్తున్నానంటే సౌందర్యమే గా అక్కడకూడా కారణం!!

అందుచేతనే 'సౌందర్యానికి లొంగిపోని పదార్థమే లేదు ప్రపంచకంలో' అని ప్రచా రంకూడా సాగించాను. నే నీ అభిప్రా యాల్లో ఉంటూండగానే నా స్నేహితు రాలికి పెళ్లి కుదిరింది. వరుడు జయంతుడు లా ఉంటాడని విన్నాను. నన్ను పెళ్లికి రావలసిందని ఒట్టు వేయించుకొంది. కార ణాంతరాలవల్ల పెండ్లినాటికి వెళ్లలేకపోయినా పెళ్లి మూడోరోజుకు వెళ్లగలిగేను. నన్ను చూచి ఆమె చాలా సంతోషించింది. 'కన్యా

వరయు తేరూపం' గనక నా స్నేహితురాలే ఇతగాన్ని ప్రేమించిం దనుకున్నాను. ఆ వధూవరు లిద్దరూ పెళ్లిపీటల మీాద కూర్చుంటే చిలకాగోరువంకల్లా గున్నారు. మాట్లాడుతున్నట్లే మంత్రాలను విరజిమ్మే స్తున్నారు పురోహితులు. దిష్టి తగలకుండా కాబోలు నీరాజనా లిస్తున్నారు ముత్తైదువులు. పెళ్లి సుఖంగా కొనసాగింది.

అప్పుడప్పుడు నాచెలి నాతో ఇలా అంటూ ఉండేది:—'కుస్తలా! నీకుకూడా ఇలాంటి...' దీనికి నేనూ ఆనందించేదాన్ని.

ఒకప్పుడా అమ్మాయిని చూద్దామని వాళ్ల ఊరికి బయల్దేరాను. ఆమె భర్త చాల రోజులనుంచీ వ్యాధిగ్రస్తుడై ఉన్నట్లు త్రోవలోనే తెలిసింది. అతి కంగారుతో ఎలాయితేనేం వాళ్లయిల్లు చేరుకున్నాను. ముద్దుమురిపెములతో సమంగా నాచెలికి ముచ్చటన్నా తీరలేదు. ముఖంలోని సౌందర్యమంతా మటుమాయమై పోయింది. పెదవిమీాది చిరునగవులో పేలవం ప్రవేశించింది. నిర్జీవ నై పోయాను.

అప్పటి కప్పుడే నా ప్రాచీనాధునాతన భావాల్లో వైలక్షణ్యం అంకురించింది. మంచిచెడ్డల పరిశీలనలో అనుభవానికి కూడా కొంత పని కలిగించాను. అప్పుడు నాకు తట్టిన నిశ్చితాభిప్రాయం యిది. 'విధివశమున వికల చిత్తుండై క్షుత్పిపాసలకు దూరుండై ధూళి ధూసరితకాయుండై గ్రహాగృహీతునట్లు చూపఱులకు వెఱపును గలిగించునాఁడాతని యంద మేచందమునఁనో పోవును. వికలాంగుఁడై పిశాచరూప మేర్పడినవుడాతని మందస్మితమే యమంద సాధ్వసనిదానంబగు ననుటకు సందియముండదు. ధైర్య స్థైర్యములు లేనివాఁడు నిర్గంధ కుసుమముకంటె గౌరవ హీనుఁడగుట యనుభవైకవేద్యము. నిండుచందురు చందమున నలరారు మోముఁదమ్మి కాలవశంబున హృదయరంజక మగుటకుమాఱుగ హృదయభంజక మగుచున్నది.'

కావున సౌందర్యం ప్రేమించ తగ్గగుణం కాదని నిశ్చయించుకున్నాను. ఈ ప్రత్యక్షదృశ్యం చూచినతరువాతనే 'గుణాః పూజాస్థాన'మనిచెప్పిన అనుభవజ్ఞులను వందనాలతో ఆదరించాను. నా కామె ప్రియాతిప్రియ అవడంచేత, ఆమె దుఃఖమే నా దుఃఖమని భావించడంచేత నా కీ పరిజ్ఞానం ఏర్పడ్డది.

'గుణాః పూజాస్థానం గుణిషు నచలింగ నచవయః'.

# కవివాక్సిద్ధి

బి. పట్టాభి రామయ్యగారు

## తృతీయాంకము—ప్రథమరంగము

(కళింగపట్టణమున సముద్రతీరము—విజయభూపతి యోచనామగ్నుడై ప్రవేశించును.)

విజయభూపతి:—నే నాతనికి కప్పము గట్టుచున్నాను నిజమే కాని, వానిగర్వోక్తులను విని యోర్చుటకు నేను బానిసను గాను. పుట్టుకచేతను దత్తతచేతను నేను వానివలెనే రాజపుత్రుఁడనే. కావున నిఁక నన్ను సవారిచేయనీయను. చిన్ననాఁడు నా ప్రియమిత్రుఁడును, సహపాఠియును, నాతో నాడినవాఁడునయ్యు, నేటికాలమునకుఁ గొంత లక్ష్మీకటాక్షమబ్బుటచేత నతి గర్వితుఁడై దైవసముఁడనని తన్నుఁదా ననుకొనుచున్నాఁడు. వీనియన్న బాల్యముననే వ్యాఘ్రహతుఁడు గాకున్న నీగంగఁడు నేఁడు పేరు ప్రఖ్యాతులు లేకుండువాఁడే గదా! శిఖిముఖమునుండి వెడలు నిప్పుకలు చిచ్చుముట్టించునట్లు వీని గర్వోక్తులు గొందరనుచరుల కతృప్తిఁ గల్గించుచున్నవి. ఇట్టి యతనిరోయుడ మనను నొచ్చినవారలలో జయవర్మ ముఖ్యుఁడు. నే నాతనికి లంచము లిచ్చియు, దురోచన సేసియు ఆతని ప్రీతిలేమిని కేవలము ద్వేషముగ మార్చెద. ఇట్లు నే ముట్టించు సమరాగ్నిచేఁ గళింగ గంగుని విభవము గర్వము సైతము దగ్ధములగు. అతని కిరీటమును నేను ధరింతు. అతని గద్దియ నెక్కుదు. అతని కపఖ్యాతిఁ గల్గించ నా శక్తికొలఁది పాటుపడుదు.

ఆహా! ఏమి నాభాగ్యము! రాజజ్యోతిష్కుఁ డిటు వచ్చుచున్నవాఁడు. (పరశురామ దైవజ్ఞుఁడేమో యాలోచించుచుఁ బ్రవేశించును). విప్రవర్యా నమస్కారము.

పరశురామ దైవజ్ఞుఁడు:—దీర్ఘాయుష్మాన్ భవ!

విజయ:—ఎద్దియో గాఢాలోచనలో నున్నారు తమరు. ఏమి విశేషము సంభవించినది?

పరశు:—దానిం జెప్పిన నాతలవోవును.

విజయ:—రాజుగారి కేమైనఁ గీడు వాటిల్లనున్నదా యేమి? శ్రీరామునిపాదము లాన! ఆ రహస్యము నే నేరితోఁ జెప్పను.

(దైవజ్ఞున కొక ముద్రనిచ్చును. దైవజ్ఞుఁడు సంతృప్తుఁడై చిరునవ్వు నవ్వును) నీ శుభవార్త కిది ప్రథమ బహూకృతి.

పరశు:—మనలో మాట! (ఎవ్వరులేరు గదా యని యిటునటు చూచి) ఇఁక నొకపక్షములో రాజు పదభ్రష్టుఁడగునని నాకుఁ దోఁచెడిని.

విజయ:—ఎవ్విధముగ నది సంభవించును?

పరశు:—ఒక కవిశాపమునొంది రాజు శత్రువు వలన రాజ్యముం గోల్పోఁ గలఁడు.

విజయ:—ఏకవచః మేల? పెక్కురాతని గర్వోక్తులు సైపఁజాలక యతనివైరులై యాతనిం దిట్టుచున్నారు.

పరశు:—రాజున కిది చెప్పుటకు భయముగ నున్నది: మహాదాగ్రహముం బూనును. అయినను చెప్పుట నా విధి గావునఁ జెప్పక తప్పదు.

విజయ:—(మఱికొంతసొమ్ము నిచ్చును.) మఱి మూరు మొహరీలు పుచ్చుకొనుము. రాజుతోఁ జెప్ప కుము. ఏమియుఁజేయుమనియుఁ జెప్పుమనియు నిన్ను నే గోరలేదు. మిన్నకుండుటయే చాలును. దీనితో నీ మనస్సాక్షిని యూరకుండుమనుము.

(నిష్క్రమించును).

పరశు:—ఓరీ! రాజద్రోహీ! నేతప్పక చెప్పెద. నా సంతకములేక యొక చీటిని రాజున కంపెద. సర్వేశ్వరుఁ డాతని రక్షించుఁగాత! (నిష్క్రమించును.)

తృతీయాంకము—ద్వితీయరంగము.

(రాజ సభామందిరము. శ్రీహరియు, చిన్న చీటిని చేఁబట్టి పరశురామ దైవజ్ఞుఁడును. ప్రవేశింతురు)

శ్రీహరి:—మనయేలిక కద్దిరయైన విపత్తు సంభవించనున్నయెడ వారితో మనవి సేయుట నీ విధి గదా?

పరశు:—ఇదిగో! 'జాగ్రత!' యని వ్రాసి యున్నచీటి. దీనినిచ్చుట యుక్తమా, లేక చెవిలో రహస్యముగఁ జెప్పుట యుక్తమా? ఇట్టి యశుభ వార్త నెఱింగించినందులకు నామీద మండిపడును. కావున నేను దీనిపై సంతకము చేయలేను. దీనినిచ్చుటకు వెఱచుచున్నాఁడ.

శ్రీహరి:—దాని నిటుల యిమ్ము. నేను ముందడుగు వేసెద. కోపగించినను సరే (తూర్యకాహళరవములు వినిపించును.) రాజుగారువేంచేయుచున్నారు. మనము ప్రక్కకు నిలచి యాహ్వానము సేయుదము.

(వారు ప్రక్కకుఁ దొలఁగి, కేలు మోడ్చి నిలతురు. కళింగగంగు, లక్ష్మోజిరావు, జయవర్మ, విజయభూపతి మున్నగు సామంతరాజులు, రాజసభ్యులు, గాయకులు, నాట్యకత్తెలు, భటులు ప్రవేశింతురు.)

భృత్యులందఱు:—జయ జయ శ్రీ కళింగగంగు మహారాజ! శ్రీ వారికిఁ చిరాయువు, యశస్సుం గల్గుగాత! (రాజుకూర్చుండును.)

(నాట్యకత్తెలు నృత్యముసలుప, గాయకులు పాడుదురు * శంఖనాదముతో సంగీతము ముగియును. ప్రధాని యితర సభ్యులుఁ గూర్చుండురు: లక్ష్మోజిరావు చెవిలో నెద్దియో చెప్పఁగా రాజు మోము కలతనొందును.)

శ్రీహరి:—(దైవజ్ఞుఁడు వ్రాసిన చీటిని రాజున కిమ్చును) మహాప్రభూ! క్షమింపుఁడు. ఆలస్యము సేయఁదగని విషయము గావున నిట్లు తెగించి తమ కిచ్చితిని (భీముఁడు ప్రవేశించి రాజునకు నమస్కరించును. రాజాతని నొక పీఠముపైఁ గూర్చుండ సంజ్ఞ సేయును.

కళింగగంగు;—ఇంతటితో నేటిసభ చాలించినాము. ప్రధాని, శ్రీహరి, దైవజ్ఞుండుదక్క యితరులు సెలవుపుచ్చుకొందు.(భీమునితో) ఎవరు మీరు?

భీముఁడు:—

మ॥ ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ,
దాక్షారామ భీమేశనం
దనుడన్, దివ్యవిషామృత ప్రకట
నానా కావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగ నెప్పితిఁ
గళింగాధీశ! కస్తూరి కా
ఘనసారాది సుగంధవస్తువులు వే
గం దెచ్చి లాలింపుమా॥

కళింగగంగు:—ఛీ! ఛీ! పొమ్ము వెడలి.

భీముఁడు:—

(* అనుబంధమున పాటఁజూడుడు.)

♦ కీ॥ శే॥ రా.॥ వీరేశలింగంగారి కవిజీవితమునుండి పాఠాంతరము.

కం॥ ఓరీ! రాజాధమ విను।
మీరీతిగఁ గవినిఁ దిట్టితివి చూడుము రా।
నీరాజ్యశ్రీ తొలఁగుచు
వైరుల పాలగునుగాక-వచ్చెడినెలలో॥

(భీముఁడు కోపముతో నిష్క్రమించును. విజయ భూపతి మదిలో సంతసించును.)

అందరు:—అహా! ఎంతటిశాపము!

కళింగ:—ఆ పొగరుబోతు బ్రాహ్మణుని చావఁదన్ని బుద్ధిచెప్పువారెరును లేరా?

పరశురామ దైవజ్ఞుఁడు:—దేవరా! శాంతింపుఁడు.

లక్ష్మీజిరావు:-ఏలినవారు సభచాలించిరి గావున నుండ నక్కరలేనివారు వెడలిపొండు.

(ప్రధాని, దైవజ్ఞుఁడు, శ్రీహరియుఁ దప్ప యితరులు నిష్క్రమింతురు.

పరశు:—

క॥ రవిలిన కోపముతోడను।
కవి శాపంబిడిన, ఫలము-గల్గును నుమ్మీ।
కవికిం గోపముఁ దెచ్చుట।
యవివేకం బండ్రు నూపు-లవనీనాథా!॥

శ్రీహరి:—మహాప్రభూ! జోస్యుఁడు చీటిచే ముందు మనవిచేసిన యట్లే తమరుఁ గీడువాటిల్లెఁ గదా! ఆహా! ఇది యెంతదుర్దినము!

కళింగ:—ఇక చాలించు గుడ్లగూబవలె నీ దుశ్శకునపు పలుకులు!

పరశు:—ఏలినవారు కొంత పొరఁబడు చున్నారు. శ్రీహరి కంటెను రాజభక్తికలవాఁ డొకఁడు లేఁడు. తమ యాగ్రహమునకు వెఱచి యీ చీటిని మీ కిత్తునా మానుదునా యని నేను శంకించుచుండ, దానిని తమ కిచ్చుటకు యీతడు తాఁ బూను కొనియె.

కళింగ:—కావున నా మన సాయాసపెట్టుటకు మీ రిరువురుఁ దలచితిరా? సరే. యిద్దరిని శిక్షించెద మీ రిరువురిని రాజ్యమునుండి బహిష్కరించితిని. సభనుండి యిప్పుడే వెడలుఁడు. ఇఁక నెలతరువాత యీ రాజ్యమున మీరు గన్పించినచోఁ దలఁ గొట్టించి వైతును.

శ్రీహరి:—కథలో మేకునుఁ బెతికిన కోఁతి వలెనే, గీడుఁ దెచ్చుకొంటిని. కానిండు తమయెడ నేఁజేయఁదగిన సేవఁజేసినాఁడ, నంతియు నాకుఁ జాలును. యథార్థవాద మేరికిని రుచించదు గదా!

పరశు:—నా మనవిఁ గైకొని, యీ యన్యాయమును సైరించి, నిరపరాధి యగు శ్రీహరిని మన్నింపుఁడు. ఈ జోస్యము నాది. నే వద్దనినను తాఁదెల్పఁబూనె. భక్తియే యీతని నీగతికిఁ దెచ్చినది.

కళింగ:—మే మొసంగిన శిక్ష యన్యాయమని నీవా సొద్దువెట్టందగినవాఁడవు? ఇరువురు నీ క్షణమునసే వెడలిపొండు.

[రాజుకు నమస్కరించి, శ్రీహరియుఁ బరశురామ దైవజ్ఞుఁడును నిష్క్రమింతురు]

లక్ష్మీజిరావు:—నాకు నీశిక్ష తమ రొసంగినను సరే. మనసులోనున్నది మనవిసేయుటకు సెలవిండు. [రాజు శిరమూపును]. ఏలినవారి గర్వితచర్యలు బంధువులును తమరికి ముప్పుఁ గల్గఁజేయుచున్నవి. తమరిని రాజ్యభ్రష్టులఁ గావింప ప్రయత్నములు జరుగుచున్నవని నే విన్నాఁడను. ఉపరి, వాక్సిద్ధిగల కవికి నాగ్రహము దెప్పించి యాతని శాపము నొందితిరి. ఇఁతయుఁ గాక, రాబోవునది మేలైనం గీడైనను, తమతో విధిగా మనవిఁ జేయవలసిన జోస్యునిన్ని, అతఁడు లిఖి

యించిన హెచ్చరికను తమ కిచ్చుటకు వెఱచుచుండ నిర్భీతిగాఁ దమ కిచ్చిన శ్రేయోభిలాషియగు శ్రీహరినిన్ని, రాజ్యమునుండి బహిష్కరించితిరి. తమరి కాగ్రహము వచ్చినను, చెప్పఁదగినది చెప్పుటయే భృత్యులకు విధియని యెంచి మనవిఁ జేసినవారి రాజభక్తి విలువ తమ కెఱుంగరైతిరి. అట్టి రాజభక్తిచేతనే, తమ రాజ్యము నపహరించుటకు జరుగుచుండు కుతంత్రములగూర్చి గూఢచారులద్వారా నే విన్నది మనవి సేయుచున్నాను. తమకు ముఖ్యవైరి విజయభూపతి. అసంతుష్టులనెల్ల యీతఁడు చేరఁదీసి, జయవర్మకు లంచములిచ్చి యుద్ధమునఁ దమరిని వదలిపోవుట కేర్పాటు చేసియున్నాఁడఁట. ఇప్పుడైనను తమయెడల భక్తిఁగలవారిని తమరు చేరఁదీసిన మేలు. ఏలనన, వారి సాయము త్వరలోఁ దమకుఁ గావలసియుండును. చెప్పఁదలచినది మనవిఁ జేసినాఁడ. నన్ను తమరు మెచ్చినను శిక్షించినను సరే. ఏలినవారి చిత్తము.

కళింగ:—విజయభూపతిని సైతము రాజ్యమునుండి బహిష్కరించినాఁడ.

లక్ష్మోజిరావు:—కఠినశిక్ష ప్రీతిని సంపాదించఁజాలదు. ప్రేమయేగద హృదయముల నాకర్షించి భృత్యులను నేలికకును వీడని బంధము గల్గించును? కొంత దయఁజూపి, చల్లని పలుకులాడినచో, ఇఁక పైన యీ విజయభూపతినిఁ బరమభృత్యునిగఁ జేసి, యీ కుతంత్రముల భంగపరుపవచ్చుననియే నా నమ్మకము.

కళింగ:—శిక్ష నే నొసఁగితిని. విజయభూపతి రాజ్యబాహ్యుఁడే. నీవును నేటినుండి నా సభకు రాఁదగదు. [కోపముతో నిష్క్రమించును].

లక్ష్మోజిరావు:—

గీ॥ రాజ్యముం గోలుపొమ్మని-వ్రాసె ధాత।
అన్యథా రాజు గుణవంతుఁ-డయ్యు, నొక్క।
గర్వముంజేసి యీతఁ డీ-గతినిఁ బొందు।
బుద్ధి యిఁకనైన నొందనీ-పోయెద నిఁక॥

—o—

## తృతీయాంకము, తృతీయరంగము

కళింగపట్టణము చెంత నొక యడవి. ఇరుప్రక్కలనుండి విజయభూపతియుఁ గడ్డముఁ బెంచి జీర్ణవస్త్రముల ధరియించి పరశురామదైవజ్ఞుఁడును ప్రవేశింతురు].

విజయభూపతి:—అయ్యా! ఎప్పుడు కళింగగంగుని రాజ్యము పోవునోఁ దెలియఁజెప్పుము. తదనుగుణ్యముగ నేను నాయెత్తులు వేసెద.

పరశు:—నీవు రాజవైరి వని నే నెఱింగినచో నాఁడు నే నీ వార్త నీ కెఱింగింపకనే పోయియుందును.

విజయ:—అవును కాని నీ విప్పుడు రాజ్యబహిష్కృతుఁడవు. నేను నిన్నేమి చేసినను చేయవచ్చును. అందుచే నీ విప్పుడు చెప్పుట తప్పదు (దైవజ్ఞుని బట్టుకొనును)

పరశు:—ఏమైనఁగానిమ్ము. నే రాజద్రోహము సేయఁజాల. (వృనాగ విడిపించుకొను ప్రయత్నముఁ జేసి) నన్ను వదలిపెట్టుము.

విజయ:—ఏలయింత తొందర? నే నెంతకాలము రాజ్యము సేయఁగలనో చెప్పుము.

పరశు:—నీకుం దెల్పినచో, జ్యోస్యము రుచింపదని నే ననుభవపూర్వకముగ నెఱుంగుదును. నేఁ జెప్పఁబోవునది యింపుగ లేనిచోఁ గోపగించవుగదా?

విజయ:—నాకెంతమాత్రము కోపము రాము. నమ్ముము. చెప్పుము.

పరశు:—నీ యుచ్చదశయు జీవితమున్ను స్వల్పపరిమాణము గలవే. ఇఁక నొక సంవత్సరములో రెంటు నంతమొందును.

విజయ:—[దైవజ్ఞుని గొట్టుచు] నీచుఁడా, అనృతవాదీ! నీ ప్రేలుడు నే నడ్డసేయుదు. నాకిప్పుడు భాగ్యదశ గలదు.

పరశు:—ఇప్పటి కుండవచ్చును గాని, శాశ్వతము గాదు. ఇదియేనా నీ విచ్చిన యభయము?

విజయ:—[దైవజ్ఞుని తన్నిత్రోయుచు] ప్రాణముతో నిన్ను వదలితిని. అందులకు సంతసింపుము. నీ జాతకము నే నీవు మాచుకొనినయెడల యిప్పుడు మృత్యుప్రాప్తి నుంతలోఁ దప్పినదని యెఱుంగగలవు.

పరశు:—నా జ్యోస్యముతో నా శాపముగూడఁ గొనుము. ఓరి! రాజద్రోహీ! (నిష్క్రమించును].

విజయ:—

గీ॥ కొనెద నే వచ్చు లక్ష్మిని కొలఁదికాల
మైన నెక్కెద గద్దియ నాసదీర
వసుధ నే నేలుచుండ, నెవ్వాఁడు రాజ్య
చ్యుతునిగా నన్నుఁజేయునో చూతుఁగాక॥

[మీసము దువ్వుచు నిష్క్రమించును].

—o—

## తృతీయాంకము—చతుర్థరంగము

[యుద్ధరంగ సామీప్యప్రదేశము. దేహమంతయు నెత్తురుగార, చినిగినబట్టలతో గిరీటములేక వడమచుఁ గళింగగంగు ప్రవేశించును].

కళింగగంగు:—నా సైనికులు పోరాడమింజేసి, నే నోడిపారిపోవలసివచ్చె. ఆహా! లక్ష్మి యెంత చంచల! యెంత గ్రుడ్డిది! నిన్నటివరకీ రాజ్యమంతయు నాదియే. నే డీ కళింగ ఱేడు రాజ్యమంతయు నోడి సామాన్యులతోఁ గలసె. నిన్నటివఱకు నా భృత్యుఁడై నాకు వతులొనర్చుచున్న యీ విజయుఁడు నేఁడు రాజాయెఁ గదా! ఈ నీచుని కెంతయదృష్టముపట్టినది! అవమానమునుండి కాపాడుటకై నా రాణిని మాడుగులలోఁ బుట్టినింటికి ముస్నే పంపుట మంచిదైనది. ఆ కవి నన్ను శపించిన నాటనుండి యశుభసూచకములగు తలంపులే నా మనమునం బుట్టుచుండెను. నా గర్వముచే నా స్నేహితులం బోగొట్టుకొంటిని. గర్వమునకుఁ దగిన శిక్ష యనుభవింపక తప్పునా? మనుజజీవితమే యతి హాస్యమైయుండ, నందలి సౌఖ్యము లింకను క్షణభంగురములు. అయినను పదచ్యుతుఁడగుట యెంత దుర్భరము! ఒక దేశపాలకుండనై యుండి, సిరిసంపదల ననుభవించి, యానందవార్థిందేలి నిరంకుశాధికారము సలిపి, ఉన్నట్టుండి లిప్తకాలమున నీ యైశ్వర్యమంతయుఁబోయి నిలచుట—హా! సర్వేశ్వరా!—భరింపఁజాలని శిక్షగదా! అయినను తగిన శిక్షయే. గర్వము నాశకారి. చంద్రుఁడు శుక్లపక్షమునఁ బెరిగినను, కృష్ణపక్షమున క్షీణించిన గతి, గర్వితుఁడు గొంతకాలము మహైశ్వర్యముల ననుభవించినను, తుదకుఁ దప్పక దుర్గతినొందును.

[భీతిఁగొని యిటునటుఁ జూచుచు నైదుగురు భటులు ప్రవేశింతురు].

మొదటి భటుఁడు:—చూడండీ! రాజుగా రిచ్చట నేయున్నారు.

రెండవ భటుఁడు:—మహాప్రభూ! పారిపొండు, పారిపొండు. వైరులు వెంటఁ దరుముచున్నారు.

మూడవ భటుఁడు:—దేవరా! పారిపొండు. ప్రాణముఁ గాపాడుకొనుఁడు.

కళింగ:—ఇఁక నన్ను 'దేవరా', 'మహాప్రభూ' అని పిలువకుఁడు. ఇప్పుడు మీకంటె నెక్కువవాడనుగాను. నే నిచ్చటఁ బ్రాణత్యాగముఁ జేసి కొన్న నేమి? నాబాకు చేతనే యున్నదిగదా?

నాల్గవ భటుఁడు:—ఆత్మహత్యచే నవమానము, పాపముగూడ సంభవించును. మహాప్రభూ! వలదు, వలదు.

కళింగ:—అట్లయిన నే నిచ్చట నేయుండి యోధులకు విధ్యుక్తగతిని రిపులతోఁ బోరాడుచు మడిసెద. మీరలు పారిపోయి ప్రాణములం గాపాడు కొనుఁడు.

అయిదవ భటుఁడు:—దేవరా! అట్లు సెలవియ్యకుఁడు. మేము మీతోఁ జత్తుము.

కళింగ:—నిష్కారణముగ నిందరఁ జంపనొల్ల. మీరందరు మాయెడలఁ బ్రీతిగల సద్భృత్యులు, మగుడ మాకు రాజ్యప్రాప్తి గల్గెనా మిమ్ములను మేము మరువము. ఇదియే మా తుది యానతిగఁ గైకొని పొండు.

భటులు:—ఏలినవారికి పునరపి రాజ్యప్రాప్తి గల్గుటకై మేము భగవంతునిఁ బ్రార్థింతుము. [కళింగగంగుకు నమస్కరించి నిష్క్రమింతురు.]

కళింగ:—నా యశ్వము నెక్కినచోఁ గడు దవ్వునకు నన్నది కొనిపోయియుండును. కాని యది సకిలించి నన్ను బయలుపెట్టునేమో యని భీతిఁగొని మానివేసితిని. నా శ్వేతాశ్వమా! చంద్రునిఁబోలు చంద్రా! నా వైరిని సకిలించుచు నానందముతో నిన్నెక్కనిత్తువా? నే నమ్మను. [పరశురామ దైవజ్ఞుఁడు సాధువువలె వేసముఁబూని ప్రవేశించును.]

పరశు:—జై! సీతారాం!

గీ॥ శ్రీవివర్జితుఁడైన యో-క్షితిపతీంద్ర!।
చింతఁగొనకు మైశ్వర్య-మస్థిరముగాన।
భాగ్యవంతులున్నట్టు ని-ర్భాగ్యమొందఁ।
బేదలకుఁగల్గు నిమిషానఁ-బెనుపుసిరులు॥
ఇడుమలెల్ల నరాళికిఁ-గడుయశస్సు।
సద్గుణంబులనిడెడి యం-జనములయ్యు।
శోకతప్తుఁడవై చెందు-నుగుణమీవు।
జానకీరామ పదపంక-జముల నమ్ము॥

కళింగ:—[నమస్కరించుచు] మహనీయా! తామెవరో తెలియఁగోరెద. తమ రాడినమాట లిప్పటి నా యవస్థ కెంతయుఁ దగియున్నవి

[సాధువు రాజుచెవిని రహస్యముఁ జెప్పును, కళింగగంగురాజు జులికిపడి యచ్చెరువొందును. వేవేగ రాజునకు తన సాధువేషము వేయును.]

పరశు:—నా వెంటఁ జెచ్చెరరండు. మీకై వైరులు వెదకుచున్నారు. [నిష్క్రమింతురు].

—o—

## తృతీయాంకము-పంచమ రంగము

[యుద్ధరంగసమీపమున వేరొక ప్రదేశము? విజయుఁడైన విజయభూపతి కళింగరాజ్యపతాకముం బట్టుకొని తెచ్చెడి యనుచరులతోఁ బ్రవేశించును.]

విజయభూపతి:—భేష్! నా నేస్తకాండ్రందరు బాగుగఁ బోరాడినారు. ఇక రాజ్యము నాదియే. కళింగరాజు పారిపోయె. వాని బట్టితెచ్చువానికి నేను వేయి మొహరీలు బహుమతినిచ్చెద. ప్రమాణముఁజేసెద. నమ్మండి. చక్కఁగఁ బనిచేసి యాతనిఁ బట్టి బహుమతిఁ గొనుఁడు. మీరు నా పక్షమున యుద్ధముఁ జేసినందులకు మీకు సొమ్మిచ్చి పంపెదఁ గాని నాకు విరోధముంబూని యెన్నఁడైన నడచెనా, వాడు వెంటనే చచ్చును. నమ్మండి.

[నిష్క్రమించును].

మొదటి యనుచరుఁడు:—యీ డెక్కడి రాజు మనకు దొరికాడుటా. యీడిమాటలు ప్రమాణాలు చూడఁగా మధ్యవచ్చిన యైశ్వర్యముచేఁ బొగ రెక్కినవాని జాడలే. శ్రీ కళింగగంగ మహారాజెక్కడ, వీఁడెక్కడ! ఆ ద్రోహి, జయవర్మ, మనల నీ గతికిఁ దెచ్చినాఁడు.

రెండవ యనుచరుఁడు:—మా బాగా శెప్పావు రా. సేనానాయకుఁడు దిట్టముగా లంచాలు పుచ్చుకొన్నాఁడు. కళింగగంగరాజుకు కాస్త రాజస

ముండెను. మర్యాదకులోటు జరికితే ఒప్పేవాఁడు కాఁడు. అంతే ఆయనతోనుఁడిన చిక్కు. యీడి యొంటిమీద కుళ్ళుకాలవకంపున్నది. ఈ నడిమాంత పదుష్టంబట్టినోళ్ళకల్లా అనుమానా లెక్కువ. క్రూరము, ఇట్టె కోపంరావడం, యియన్ని యుంటాయి. యీడితో యేగడం కష్టం సుమీ. పాపం! ఆ కళింగగంగరాజు నెలా యేటుండ్తున్నాడో చూడండి.

[మఱియొక్క యనుచరుఁడు ప్రవేశించును].

క్రొత్త యనుచరుఁడు:—యినండఱ్ఱోయి! కబురు! కబురు! యిజయబూపతి నవ్వుతూ జయవర్మను దగ్గరికి పిల్చి సంపేశాఁడు.

రెండవ యనుచరుఁడు:—నాను శెప్పానుగానా? యీడ్తో చారడం మా శెడ్డతెలివి తక్కువైంది.

మూఁడవ యనుచరుఁడు:—పాపం! కళింగగంగమారాజు కన్యాయంజేశాం. అయితే ఆ పాపమంతా శేనానాయకుడ్దే.

మొదటి యనుచరుఁడు:—భగవంతు డాణ్ణి తగినట్టు శిచ్చించాడ్లే.

మూఁడవ యనుచరుఁడు:—ముందో యెనకో మన తప్పు సవరించుకోవా లబ్బీ. మళ్లా శ్రీ కళింగగంగమారాజు కనిపించెనా అరి పాదాల్మీదపడి, చమించండని, ఆరిక్కై పోరాడి, మళ్లా రాజ్యం సంపాదించియ్యాల. అందరికి సమ్మ్రతమేనా?

అందరు—ఆ, సమ్మ్రతమే. యెల్దాం లెగండి.

[నిష్క్రమింతురు.]





మహిళామహాసభ

అధ్యక్షురాలు: శ్రీమతి పొణకా కనకమ్మ గారు

(నడుమనున్న వారు)

# స్త్రీ విద్యా విధానము

కర్త్రి:—శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

(ఏలూరు, చదలవాడ ధర్మరాజుగారిచే నిర్వహింపఁబడుచున్న "స్త్రీ విద్యా విషయిక—పద్యరచన పరీక్షా పీఠము" తృతీయ (12-12-34) వార్షికోత్సవ సందర్భమున పంపఁబడి బహూకరింపఁబడిన కవిత.)

ఉ॥ ఆరయ స్త్రీలకైనఁ బురుషాళికినైనను విద్య యెంతయున్
గౌరవ కారణంబగునుగాన, శ్రమంపడి, విద్యతో, సదా
చారము శీలరక్షణము క్షాంతియు, ధైర్యము, సాధువృత్తి, సం
సారము నిర్వహించుటయుఁ జక్కఁగ నేర్పవలెన్, బడంతికిన్.

క॥ పురుషుఁడు సంపాదింపను । నిరతము గృహకృత్యములను నెలతుక తీర్పన్
బరిపాటి యయ్యె భారతి । వరదేశమునందు సంఘబద్ధవిధంబై

ఆ॥ వె॥ బాల బాలికలకు బ్రారంభ విద్య తా । నొక్క తీరుగానె యున్న నవల
భావి గృహిణి కాన బాలిక గృహకృత్య । ములకు దగిన విద్యఁ బొందవలయు

తే॥ గీ॥ విద్యవలనను జ్ఞానంబు నెలయు గాన । స్వల్పకాలంబులో విశేషముగ నేర్వఁ
దగిన దేశీయవిద్యను దరుణులెల్లఁ । బొందుగా నేర్చి జ్ఞానమున్ బొందవలయు

క॥ తెలివియు, ధనమును, గలిఁగిన । వలసిన సద్విద్య నేర్వవచ్చును గాకి
య్యిల నెట్టి విద్య నేర్చిన । గులధర్మము విడువఁదగదు కోమలి యొందున్

తే॥ గీ॥ స్త్రీలు ధర్మంబు విడిచిన చేటువచ్చు । వంశమున, కట్లుగావున వనజముఖికి
విద్యతోఁ బాటు ధర్మవివేకవిధము । శీలరక్షణ విధమును జెప్పఁదగును.

ఉ॥ కాలను, వ్రేలదున్నుకొనుఁగాక ధనంబు నగల్ సమృద్ధిగాఁ
దాలిచి యుండుఁగాక వివిధంబగు విద్యలు నేర్చుఁగాక దు

శ్శీలము పట్టుబడ్డయెడ స్త్రీలకు గౌరవ మబ్బకుండు స
చ్ఛీలము ముఖ్యమైనదని చెప్పుట ధర్మము విద్యనేర్పుచోన్

శా॥ నీతిన్ వీడక శీలరక్షణకునై నిర్భీతితోఁ బ్రాణముల్
ప్రీతిన్ వీడిన భారతాబ్జముఖులన్ బేర్కొన్న చారిత్రముల్
చేతో మోదముగాగ బాల్యముననే చెప్పందగున్ స్త్రీలకున్
బాతివ్రత్యము యుక్త వర్తనముఁ దద్భావంబులో నాటుకోన్

తే॥ గీ॥ అరయ దేశాభివృద్ధి, భాషాభివృద్ధు । లనిన బాలుర భావివర్తనమునందె
నిలచువారలఁ బెంచెడు నెలఁతుకలకు । దేశచారిత్రకథన రీతియును లెస్స.

క॥ భారత చరితములెల్లనుఁ । గూరిమితోఁ జెప్పిచెప్పి కొమరుని నెంతో
ధీరునిగాఁజేయదె జిజి । యారమణి ధరిత్రి నిట్టిదగువిద్యయనన్

క॥ స్త్రీలకుఁ బ్రథమచికిత్సయు । బాలెంతల వైద్యమందు బ్రావీణ్యంబున్
వీలుగ శిశుపోషణమును । వాలాయముగాగ నేర్పవలయునుఁ బేర్మిన్.

క॥ కళలన విద్యలనంగా । నిలభేదము లేదు. స్త్రీలకివియును నేర్పన్
వలె; ముఖ్యముగాఁ బొలఁతియె । కళలకు సధిదైవతంబుకావున ధరణిన్

చ॥ సలలితమైన గానమును జక్కని కుట్టుపనిన్ గరంబు నిం
పొలయు కవిత్వమున్ ముదమునొందఁగఁ జేసెడు చిత్రలేఖనన్
గళలని యంద్రుపెద్ద. లివికాంతలునేర్చిన భుక్తికిన్ గృహం
బుల ధనలాభమున్ మిగులఁబొందుచు సౌఖ్యము లందకుందురే

ఉ॥ సన్నుత విద్యలన్నిఁటినిఁజక్కఁగ నేర్పుట కింద్లయందు సం
పన్నులకైనఁ గష్టమగుబాలికలన్ దలిదండ్రులెప్డుఁబే
రెన్నికఁగన్న సంస్థలను నింపుఁగ లాభము నొందఁ గోర్కెలన్
జిన్నతనంబునందుననె చేర్పవలెన్ సతతంబు నెమ్మిలోన్

క॥ చదువఁదగు నాంగ్లభాషను । చదువంగాఁ దగును స్త్రీలు సంస్కృతభాషన్
జదువఁదగు నితరభాషల । జదువుల ధర్మంబువిడిచి చను టనుచితమౌ

తే॥ గీ॥ వయసు వచ్చినబాలికావళికి । బురుష పాఠశాలలయందు నభ్యాసవిధము
కూడ; దది వంశ, శీల, సద్గుణవివేక । ప్రాణమాన ప్రమాద కరంబుగాన

తే॥ గీ॥ బీదలకు విద్య జీవనోపాధియగును । భాగ్యవంతుల కర్థ్వాతాఽపాదియగును
జదువు నేర్చుట యసమానశక్తిగనుట । విద్యకెనయైన దున్నదే విశ్వమందు

తే॥ గీ॥ పూర్వ యుగముల నున్నట్టిపుణ్యకాంత । లెల్ల పురుషులతో విద్యలెల్లనేర్చి
జాతిధర్మాలఁగాపాడి ఖ్యాతిఁజెంది । నట్లు తెలుపును మనల గ్రంథాళియెల్ల

తే॥ గీ॥ దేశవేషాల మార్చుట తెలివిలేక । యన్యజాతి వివాహంబులాడుటయును
ధూర్తతయుఁగాదు చదివినందులకు ఫలము । జ్ఞానమును బొందుపఱచుట
[కాని తలఁప

తే॥ గీ॥ వసుధనాంగ్లము నుద్యోగవాంఛనిచ్చు । సంస్కృతంబిచ్చు విజ్ఞానసరణినెల్ల
దేశభాష ప్రపంచకస్థితినిఁ దెలుపుఁ । గళలొసంగును బుద్ధికిఁగౌశలంబు

తే॥ గీ॥ మాతృభాషలఁ జక్కఁగా మట్టుపెట్టి । చదువుచున్నార లన్యదేశంపుఁజదువు
సాగుపాటున్న, భర్త యుద్యోగియైన । వీధికెక్కుదు రుద్యోగవేషవాంఛ

సీ॥ ఉద్యోగ కాంక్షతో నూళ్లను విడనాడి
సంసారములు బాసిచనిన పిదప
భర్త వేఱొకచోట భార్య వేఱొకచోట
బిడ్డలు నౌకర్ల పెంపులోన
వేఱొకచోఁ బ్రేమ వేఱొకచో మైత్రి
సేవ వేఱొకచోట చింతవేఱు
సహజ లావణ్యంబు సహజ కోమలతయు
సహజమార్దవమును సహనశక్తి

తే॥ గీ॥ తొలఁగ నుద్యోగవతియైన తోయజాక్షి
బొందుసౌఖ్యమ్ము వర్ణింపఁ బోలదెందు
దుఃఖమే గాక కష్టంబు తోడఁగలుగు
ద్రవ్యనష్టము నంతయుఁదలఁపవశమె ?

క॥ జాతినిఁ గులధర్మంబును । బ్రీతినిఁ గాపాడునట్టి విద్యలునేర్చన్
లోఁతగు పునాదితీయుచు । ఖ్యాతిగ నిలుపంగవలయు గాంతలవిద్యన్

క॥ గురుకులవాసముకై వడి । పరగెడు స్త్రీ సంస్థలందు బాలికలుండన్
సరసఁపు విద్యలెకా కల । వరగుణమగు సహానశక్తి వర్ధిలుచుండున్

తే॥ గీ॥ స్త్రీల విద్యావిధానంబు-చెప్పికొనుటె । కాని దారిద్ర్యభూతంబు కౌగలించి
యున్న భారత దేశాన-నున్నవిద్య । మార్పుచెందిన గతిలేదు? మానినులకు



# మ నో ర మ

**రా జ కు మా రి**

(జనవరి సంచిక తరవాయి)

తదనుగుణముగ నప్పుడు పార్థసారథియు నిట్లు పలికెను.

"దేవా, ఆమహారాజు నాస్థానమున నా కొక సహోదరియున్నది. ఆమె యెల్లప్పుడా రాజకుమారి చెంగటనుండును. మా జ్యేష్ఠ సోదరి యొకతె ఆమహారాజు నాత్మీయుల నొకరిని పెండ్లాడి అచటికిఁ బోయియుండుట తమకు తెలిసియేయున్నది. కొంతకాలము క్రిందట నామెభర్త మరణించినాఁడు. మా యక్క యతనితో సహగమన మొనర్చినది.

అట్లు చేయుటకుముందు మారెండవ యక్కయగు శకుంతల యిచ్చటనుండి వెళ్లి వారియింట నుండుటచేత మాపెద్దయక్క తనచిన్నబిడ్డ నామె కొప్పగించి ప్రాణత్యాగ మొనర్చెను. ఇప్పుడు మాశకుంతల ఆదేశ మున నొకదుర్గాధికారిణియై ఆరాజకుమారి యొద్ద నెచ్చెలియై సంచరించుచున్నది. ఆమె మూలమున నీ విషయమును పరిష్కరించు కొనవచ్చునని నాయూహ."

అప్పుడు కృష్ణవర్మ మెల్లగ—

"నన్నుగూడ మీవెంట దోడ్కొని పొండు." అని, నవ్వుచు నాతో "ఒకవేళ మీకాదేశమున నీయావేశములేవైన వచ్చిన యెడల నేమి కావలసినది? యథార్థమెద్దియో మీరెట్లు నిర్ణయింపగలరు? నిస్సంశయముగ నెట్టిగహన స్థితియందైన మీకై నాప్రాణము లర్పింపఁగలను. ఆయుధోపజీవినగు నేను సాహసకార్యములకు మొగమువాచి త్రుప్పు పట్టియున్నాను." అని పలికెను.

"వలనుకాదు. మీరు వెళ్ళుట నాకిష్టము లేదు. మేము స్వయముగఁబోయి గంద్ర తనమున నాబాలిక నిర్మించుకొనుచున్న ఆకాశసౌధములను నేలమట్టముగ గూల్చి వేయుదుము. ఈపనికి క్షత్రియోచితములగు ఖడ్గముల తళతళ లావశ్యకముగాని యువకుల యవలోకనములును, నగవులును, దలపు లును ఆవశ్యకము లుకావు. ఒకసారి మన ఖడ్గములత్రుప్పురాల్చి వాని నారాజునకు జూపివచ్చి గౌతమి నీటియందుఁగత్తులను కడుగుకొనవలసియున్నది." అని మాతండ్రి గారు సెలవిచ్చి తమ సభ నంతటితోఁ జాలించి లోనికి వెడలిపోయిరి.

నాకు హృదయమున దుపానువలె నుం డెను. నేను తక్షణమే మాప్రాసాదమునుండి ఈవలకు వచ్చి వసంత సౌభాగ్యము మెఱసి పోవుచున్న పురోపవనమునకుఁ బోయి అచ్చట నిర్మానుష్యమగు నొకతావున నేకాకినై యాలోచింపఁ దొడంగితిని. నా హృదయమునకు చేరువగనున్న నా మనో హారిణి చిత్రపట మీవలకు దీసి దానిని పువ్వులపై నుంచి మహా మనోహరమగు నాతరులతాదిపత్రముల నడుమ ఆ సౌందర్య మూర్తిని తదేకధ్యానమున జూచుచుఁ గూర్చుంటిని.

ఇప్పు డామె ఏమి యూహించుచున్నది? ఎట్టి యెట్టి యాకాశసౌధముల నిర్మించుకొను చున్నది? ఎట్టి పట్టుదలతో నున్నది? ఏల యామెకీ కల్యాణ విషయమున నింత యుదాసీనత? అంతమహావైభవముగ జరుపఁ బడిన ఆ ప్రధాన మహోత్సవము నేల తృణ ప్రాయముగఁ దలంప సాహసించినది?— అను నిట్టి భావతరంగము లుప్పెనవలె నా హృదయమును కలంచివైచుచుండెను.

ఆమె యోష్ఠమున దప్పక నొకవిధమగు తృణీకారభావ మున్నది. నే నీ విధముగ నూహించుకొనుచుండగా తీవ్ర వేగమున దక్షిణా పథమునుండి వాయువేతెంచి ఒక్క మారుగ గండుఁ గోయిలల కుహూకుహూ త్కారములను, మదపుటీగల ఝూంకార ములను, తుమ్మెదల రొదలను ఒక్క యూపున గలఁచివైచెను. ఆమహా మారుతా గమనముతో నొక్కధ్వని 'ఏల యాలసిం తువు? ఆమె నన్వేషింపుచుఁబొమ్ము. తప్పక నీకు జయము చేకూరగలదు' అని నాకు వినుపించిన ట్లయ్యెను.

తరువాత నా శుక్లపక్షమునందలి చవితి చంద్రుని సన్ననిరేక పౌర్ణమినాటి నిండు చంద్రుని మూర్తివైభవమును బూర్ణముగఁ జెందులోపుననే నేను నడికిరేయియందు మా రాచనగరును వదలి నా ప్రాణమిత్రులగు కృష్ణ వర్మయుఁ బార్థసారథియు వెన్నంటి వచ్చు చుండగా మా రాజ్యమున దెలిసినవా రెవ్వ రును మమ్ముజూడకుండ నా మనోహారిణికై బయలు దేరితిని. నగరమున నిశ్శబ్దముగఁ బిల్లుల వలె నడుగుల సవ్వడియైనఁ గాకుండ జాగ రూకతతో నడచి పోయితిమి. ఆ నిశీథ సమ యమున గోటలో నెవరు మేల్కాంతురో, ఎవరు మా యలుకుడు నెఱిగి మాకు విఘ్న మొనర్తురో, మా వెనువెంట మాతండ్రిగా రెవ్వరినిఁ బంపి మమ్ము హతాశులుగా నొన ర్తురో యని గుండెలు దడబడలాడుచుండగ నక్కుచు, దారుచుఁ బ్రతిక్షణమును మా తండ్రిగారి యాగ్రహ మహోదగ్రత్వము నూహించుచు నా మహాదుర్గోపరిభాగమున నొక రహస్యస్థలమునకుఁ జేరుకొంటిమి.

కోట బురుజుపై నప్పు డప్పు డొక రిద్దఱు రక్షకభటు లొండొరులను హెచ్చ

ద్రించుకొనుచుఁ గావలి గాయుచుండుట మాకు శ్రవణపుట గోచరమగుచు వచ్చెను. తరువాత నంతయు నిశ్శబ్దము. పాలెపురుగుల వలె మే మొకరివెనుక నొకర మా కోట గోడనుండి త్రాళ్లను బట్టికొని వ్రేలాడుచు నీవలకు వచ్చి మారాజ్యము నతి త్వరితముగా నతిక్రమించి దక్షిణాపథముగఁ బ్రయాణముచేసి కమలాకరవర్మ రాజ్యమునకుఁ జేరుకొంటిమి.

నేను మిత్రులతో నారాజును సందర్శించితిని. అతఁడు మమ్ములను మిక్కిలి గౌరవించి మూఁడుదినములు మాకు వివిధోపచారములొనర్చి, మహార్హ మజ్జన భోజనంబుల మమ్ము సంతర్పితులం జేసిన తరువాత నాలవ నాఁడు నే నాతనితో మా రాకకుఁగల కారణమును తెలియజేసితిని. సామాన్య జీవిత వ్యాపారములతో నతనిని జూచువాఁ డెవ్వఁడును అతఁ డొకరాజ్యమునకుఁ బరిపాలకుఁడని తలంపజాలఁడు. రాజ్యలాంఛనములఁగాని, చిహ్నములఁగాని అతఁ డెప్పుడును ధరింపఁడు. అతడెప్పుడును మెల్లగ మాట్లాడు నలవాటుకలవాఁడు. మొగ మంత తేజోవంతముగ నుండదు. నవ్వుటయందుకూడ మిగుల కళావిహీనముగ నిరానందకరముగ నవ్వున ట్లుండువాఁడు. ముడుతలువడి శుష్కమై యున్న యతని శరీరము మిగుల చిన్నదయి చూచువా రెవ్వరికిని అతఁ డొక మహారా జనుకొనుటకు వీలులేన ట్లుండెను.

నేను వచ్చుటకు నిమిత్తమును తెలిసికొని యాతఁ డిట్లు చెప్పెను. "కుమారశేఖరా! నీ రాకవలన మేము గౌరవింపఁబడితిమి. మహోత్సాహ జనకమగు యౌవనమున బ్రేమించుట యనగ నెట్లుండునో నాకుఁ జక్కగ జ్ఞాపకమున్నది. ఎన్నో శరత్కాలముల క్రిందట మాకును విజయరామ రాజేంద్రునకును మా కుమారికా కల్యాణ విషయమైన యొడంబడిక యొకటి నిశ్చయముగ జరిగినది. అది కృష్ణవేణీనది పొంగి వచ్చి మారాజ్యమంతయు జలార్ణవముగ జేసిన సంవత్సరము. ఇప్పటికి గూడ నీ వామెను పాణిగ్రహణ మొనర్చుకొనుటయే మా కానందకరము. ఇది నేను మనఃపూర్వకముగ జెప్పుచున్నాను—అయిన నేమి చేయుదును? పురుషద్వేషిణులగు నిరువురు ప్రౌఢాంగనలు మాయంతఃపురమున నామెకు సహచారిణులయి దాని నింతవఱకుఁ దీసికొని వచ్చిరి. శకుంతలయు, భానుమతియు నను ఈ స్త్రీలు—వారు మహా విద్యావతులట! నా కది తెలియదుకాని చాల నుగ్రమనస్కలగుట నిశ్చయము. వా రామె సిద్ధాంతములకు దోహద మిచ్చుచు వచ్చిరి. గండ్రతనమున ప్రాణగొడ్డమైన నుపదేశములను, చర్చలను, చర్యలను నొనర్చి వారి రాజ్యమున మా ప్రాసాదమున నొక యాట

యాడిరి. రాత్రియనక, పగలనక, రాజమందిరము లనక, రహస్యప్రదేశము లనక, రాజపురుషులనక, రాణివాసము లనక చెవులు తడికలుగట్టి పోవునట్లు 'సరియైన యవకాశము లేర్పడిన యెడల ఆడుది మగవానికెందును దీసిపోవ'దని ఒక్కటే రొదగ జెప్పుచు వచ్చిరి. ఇదియే వారామె కుపదేశించిన మహా మంత్రము. శ్రీ మొదలితి శ్రీ వఱకు వారికథయం దిదియే పరమోపదేశము. మా యాస్థానమున నందఱిదియే చర్చ. విందులలో గూడ నిదియే గొడవ. దినమిరువదినాలుగు గంటలును మారాజహర్మ్యములు ఈ పరమ సిద్ధాంతములతోనే ప్రతిధ్వనించుచు వచ్చినవి. వానితో నా చెవులు చిల్లులు వడిపోయినవి. జ్ఞానోపార్జనమే మనుజ జీవితమునకు ముఖ్యలక్ష్యమై యుండవలెనట. ఇదియే నా కుమారికకుఁ బట్టుకున్న ముఖ్యాభిసంధి. వారింతవఱకు జ్ఞానమెఱుగని శిశువులవలె నుండి పోయిరట. ఇప్పుడు వారు తమ 'శిశుత్వము'ను విడల్చుకొని నికరమైన 'స్త్రీత్వము' నలవరించుకొనవలెనట. అంతేకాదు. ఆమె ఏతద్విషయమును గూర్చి దారుణమైన గేయములను గూడ రచించుచు వచ్చినది. నిశ్చయముగా నవి పరమ దారుణమైన సిద్ధాంతముల నభినివేశముతో ఘోషించుననుటకు సందేహములేదు. ఒక్క గేయములందే కాదు. ఆమె యే మొనర్చినను మిగుల దారుణముగనే చేసివేయును. ఆ గేయములందు కూడ నిదియే కథ—తమ శిశుత్వమును విడల్చుకొనవలెనట. ఇంకను ఒక క్రమములేకుండ, ఒక పద్ధతి లేకుండ, ఒక హేతువులేకుండ మానవలోకమున నిక గొప్ప పరివర్తనములు కలిగితీరునని ఆమె యక్షరముల బెట్టి,పద్యములల్లి ఘోరములగు సిద్ధాంతముల నుద్ఘాటించుచు వచ్చినది. వీనిని స్త్రీలు విధివిరామములు లేకుండఁ బాడుచువచ్చిరి. ఇట్టి కవితా విషయముల దెలిసినవా రందఱు—నే నందురా, నేనంత విమర్శకుఁడగాను; నాకు శాంతియే కావలసియుండెను—విమర్శకాగ్రేసరులట, వారవి కవితయం దప్రతిహత ప్రతిభావంతములని మెచ్చుకొందురు. నిశ్చయముగా నన్నవి అప్రతిభునిగ జేసివైచెను.

"చివర కామె నన్నొకవరముఁ గోరినది. మీ రాజ్యపు సరిహద్దులలో నేను వేసవికాలమున బోవుచుండు మహాభవన మొకటి యున్నది. దానిని తనకీయవలసినదని నన్నడిగినది. నేను వలదంటిని. అయినను మార్దవమగు మార్గమున బోవువాఁడనగుటచేత దాని నామె కిచ్చివేసితిని. తదుత్తరక్షణముననే కన్యా మహావిద్యాలయ మొకటి ప్రతిష్ఠింపవలయునను త్సాహముతో విద్యుద్వేగమున నచ్చటికి వెడలిపోయెను.

"ఇంతకంటె నధికముగ మాకేమియును దెలియదు.—కేవల మీయొక్క విషయమే. వాండ్రచ్చట పురుషుల మొగమైన జూడరు. ఆమె తన సహోదరుఁడగు నజయునిగాని, తరువాత కవలై బుట్టిన రామకృష్ణులను గాని జూచుట కొప్పుకొనదు. వారు తమ యక్కవంటి ప్రతిభాశాలిని లేదని గర్వమునఁ జెప్పుకొనునట్టివారు. అయిన వారిని సహిత మామె చూడదు. ఇఁక నేను—క్షమింప వలయు.—నాకును, నావారికిని నడుమ విరోధమును బెట్టుకొనుటకు నా కెంతమాత్ర మంగీకృతము కాకపోవుటచేత నేనామె కిట్టి స్వతంత్రమిచ్చి సరిపెట్టుకొనుచున్నాను. అయినను మన మిదివఱలో జేసికొనిన యొడంబడికను బట్టి కొంతవఱ కీ విషయమున నేను బాధ్యుఁడనని మీరు భావించుచుండుటచేత—అట్లు మీరు భావించుట యుక్తమే!—ఆమెపేర నుత్తరములు వ్రాసి మీ కీయగలను. కాని నిజము చెప్పవలయు నన్నచో మీ కామె వశమగుట కెట్టి యవకాశమును లేదని నేను భావించుచున్నాను."

ఆ రా జట్లు చెప్పునప్పుడు ధారాళమగు నంతఃకరణమితోఁ దన కుమారికా విషయమైన చరిత్రమును దాచుకొనకుండ బలుకుచున్న క్లింతయభినయించినను శాస్త్రోక్తముగా జరిగిన మా ప్రధాన మహోత్సవమును గూర్చి కొంత లాఘవముగా దలంచుచుండెనాయని నాకు స్ఫురించెను. అయినను నావధూమణి నన్వేషించు తహతహ నన్నుఁ దొందరపెట్టుచుండుటచేత నే నాతని వీడ్కొని బయలుదేరితిని. నా మిత్రులతో మఱల వచ్చినదారినే మారాజ్యపు సరిహద్దు ప్రాంతములకు వచ్చి అచ్చట దుర్గమమగు కొండలకుఁ జేరువ గోదావరియొక్క పవిత్రోదకమున మహా ఫలవంతముగ నున్న భూములకు వచ్చి సాయంకాలమగుచుండగ నొక ప్రవాహ తీరముననున్న చిన్న నగరమునకుఁ జేరుకొంటిమి.

ఆ నగరమున కావలితీరమున నా మనోహారిణిచే శాసింపబడుచున్న స్త్రీలస్వైర విహారక్షేత్రములున్నవి. నే నా పురపాలకుని సందర్శించి ఆతఁడు మమ్ములను యోగ్యముగ సంభావించిన తరువాత మారాకకు కారణము దెల్పి రాజిచ్చిన యుత్తరముల నతనికిఁ జూపించితిని.

అతఁడు వానినిఁజూచి తెల్లబోయి దీర్ఘాలోచనముఁ జేయువానివలె మమ్మువలోకించుచు తుదకీవిధముగఁ జెప్పెను.

"ఇచ్చటి శాసనములఁ బట్టి మగవాఁడనువాఁ డెవ్వఁడా భూమిపై నడుగుఁ బెట్టుటకు వలనుపడదు."

మఱల నంతలో నేమనుకొనెనో కాని, యిట్లు పలికెను. "మారాజే ఇట్టి యుత్తర

ముల వ్రాసినప్పుడు ఇక్కడి చట్టములఁబట్టి నే నేలకలుగఁ జేసి కొనవలెను! మీ రే మొనర్చినను తప్పక మామహారాజు నాకు బాసటయై యుండగలడు. కావున ముందుగ మీ రిట్టి వా రిచ్చుటకే వచ్చిరని వారి కెఱుక చేయువాఁడను కాను.”

అతఁడు వాచవియగు మదిరారస మానుచు నది రక్తమున కుత్సాహమిచ్చుచుండగ తిరుగ నిట్లనెను. “నిస్సంశయముగ మీరీ విషయమున నన్ను దోషరహితునిగ జేయఁగలరు. ఆమె యొకసారి ఈమార్గమున వచ్చినది. అప్పుడామె భాషించుచుండగ వింటిని. హా! హా! ఆమె వైఖరి నాకు మిగుల భీతావహమైనది. లోకప్రాణముల కాధారహేతు వాదిశక్తియని పూర్వులాడు మాట నాకుఁ బ్రత్యక్షముగ ననుభవమైనదని నేను భావించితిని. ఇందఱాడువాండ్రలో ‘నభూతోనభవిష్యతి’యని చెప్పదగిన వైఖరి నామె కానుపించినది. ఆహా! ఆమెకు పురుష జాతిపై నెంత రోత! ఎంత అసహ్యత! ఎంత మహాద్వేషము! మగజాతిని మాడ్చివేయుటకు ఆమెచేయు ప్రయత్నములన్నియు తెలియ వచ్చినప్పుడు మొదట నాకొడల రణకంపముదయించి చావునకు సిద్ధమైతి ననగ మీరు నమ్ముదురా?—ఇట్టి యాడుది మఱి యే దేశమున, యేజాతియందును నింతవఱకు బుట్టి యుండలేదని ఘంటాపథముగఁ జెప్పగలను. అయిన నేమి? ఆమె మా మహారాజుగారి గాదిలి తనయ. రాజవంశమువా రన్న మా కుండవలసిన భక్తితాత్పర్యము లామెయందు త్రికరణశుద్ధిగ మా కుదయించుచునే యుండును. ఆమె సిద్ధాంతముల నొకసారి దెలిసికొనిన తరువాత మా రాచనగరునుండి ఆమె కేమేమి యుత్తరప్రత్యుత్తరము లందింప వలసివచ్చినను—మగవారా సీమల నడుగిడ రాదు కావున—నా కొమార్తె కొకపరిచారికను తోడిచ్చి ఆడుగుఱ్ఱములపై నెక్కించి పంపుచుందును. వారి స్వతంత్రసీమలలో గొన్నివందల మైళ్లవఱకు దేశమంతయు నాడువాండ్రే సేద్యము చేయుదురు. నాగలికైన వారెద్దుల నుపయోగించరు. అన్నియు నావులు. అక్కడి గుఱ్ఱములన్నియు గోడిగలు. కుక్కలన్నియు—”

ఈవిధముగ నతఁడు హాస్యమాడుచుండగా నాకస్మికముగ మెఱపుమెఱసినట్లొక యాలోచనము నా కుదయించెను. దానిని వెంటనే కార్యరూపమునకుఁ దీసికొనివచ్చితిని. మా రాజభవనమున మేము మున్నొరమును కాళిదాసాదుల నాటకముల నభినయించుచు అందు స్త్రీపాత్రముల నప్పుడప్పుడు ధరించుచుండుట నాకు జ్ఞప్తికి వచ్చెను. నే నాపురపాలకునకు ధన మిచ్చి మాకై స్త్రీలదుస్తులను గొనిరా నియోగించితిని. అతఁ డుల్లాసలక్ష్మిని గైసేసినట్లు

నవ్వుకొనుచు వెడలిపోయి కొంతసేపటికి కన్యకాజనయోగ్యమైన చీరలను దెచ్చి తానే మాకు శృంగారింపఁజేసెను.

ఆ పురపాలకుఁడు మా స్త్రీవేషధారణములను గూర్చి నోరుమూసుకొని యుండు నట్లు వలసినంత ధన మాతనికి లంచమిచ్చి మేము ఆ స్త్రీస్వాతంత్ర్యసీమలలో మిగుల సాహసముగఁ బ్రవేశించితిమి.

ఆసరిత్తీరము ననుసరించి మే మశ్వారూఢులమై అర్ధరాత్రిసమయమప్పు డాకన్యామహావిద్యాలయ పరిసరమునకుఁ జేరుకొంటిమి. అచ్చటి కాభవనమునందలి దీపములంధకారమున మిణుగురు బుర్వులవలె మెఱసిపోవుచుఁ గానవచ్చెను. అచ్చటి సింహద్వారమున నూర్ధ్వభాగమున నర్ధచంద్రాకారముగ మిగుల నున్నతముగనుండి జూపరుల కావిద్యాలయౌన్నత్యమును బ్రకటించున ట్లుండెను. దానిపై స్త్రీవిగ్రహమొకటి ప్రతిష్ఠింపఁబడియుండెను. ఆవిగ్రహమున కిరుపార్శ్వములందును రెక్కలున్నట్లు నక్షత్రముల కాంతిని దెలిసికొంటిమి. ఆద్వారముఖమున మఱియు నేదో వ్రాసియున్నది కాని రాత్రియగుటవలన మే మావ్రాతను గుర్తుపట్ట జాలకపోతిమి. మేము ముందునకుఁబోయి లోన నొక యుద్యానవనమునఁ బ్రవేశించితిమి. అందొక చిన్నవీధియున్నది. అందు ద్వారపాలకురాలి నివాసగృహ మున్నది. అది ఎంతరాత్రివేళయైనను మిగుల సందడిగ నుండెను. భూగర్భమునుండి చిత్రప్రతిమల చేతులనుండి ఈవలకు వర్షపుఁజల్లువలె గొట్టఁబడుచున్న నీటితుంపరలవలనను, మిగుల నెత్తైన ప్రదేశమునుండి క్రిందకు బలితమై కొట్టుకొనివచ్చున ట్లమర్పఁబడిన జలపాతముల హోరువలనను, అప్పటప్పటికి వినిపించుచున్న గడియారముల ఘంటాఘోషములవలనను, మిగుల గ్రొవ్వియుండిన కోకిలల యాలాపధ్వనులవలనను మాలో మేమాడుకొను మాటలే మా కస్పష్టముగ వినుపించుచుండెను.

అక్కడ భరతమాత యాకృతివలె నొక అతిచిత్రమున్నది. మఱియు భూగోళమువలెను, బ్రహ్మాండమువలెను గోళాకృతినున్న గాజుగొట్టములలో నమర్పబడి రెండుదీపము లక్కడ జీకటి యుండకుండ దూరముగా బంపివేయుచుండెను. అచ్చటనే ద్వారపాలకురాలి గృహముండుటచేత మే మక్కడనున్న బహిర్ద్వారమువద్దకుఁ బోయి తలుపుతట్టితిమి. వెంటనే ఇరువురు పరిచారికలువచ్చి మ మ్మశ్వావతరణమొనరింపఁజేసి మాగుఱ్ఱములను లాయములోనికి దీసికొనిపోయిరి.

అంతలో నాగృహాధికారిణివచ్చి మమ్ము లోనికిఁ బిలుచుకొనిపోయెను. ఆమె కొంచెము స్థూలమగు దేహముఁగలది. అయినను మిగుల యానందమును వెల్లడించుచు

బంతివలె నెగిరిపడుచున్నట్లు త్రిప్పుకొనుచు నడువ నేర్పుగలది. ఆకన్యామహావిద్యాలయమును గూర్చి మేమామెను జాలవిషయము లడిగి తెలిసికొంటిమి. విద్యాలయమున విద్యగఱపు గురువులలో నెవ్వ రగ్రశిఖామణులని మేము ప్రశ్నింపఁగ నామె 'శకుంతలాదేవియు, భానుమతీదేవియు' నని బదులుచెప్పెను.

'ఇరువురలో నెవతె యెక్కువ సౌందర్యవతి? ఎవతె యోగ్యతరమైన స్వభావము కలది?' అని తిరుగ నామెను బ్రశ్నించితిమి.

'శకుంతలాదేవి' యని ఆమె బదులు చెప్పెను.

'అట్లయిన మేమామెవారము' అని మేము ముగ్గుర మేకగ్రీవముగ నంటిమి.

నేనంతట గూరుచుండి యొక లేఖ వ్రాసితిని. అది స్త్రీజనస్వభావమైన లిపిలో నుండవలెనని నే నూహించి అందలి యక్షరములు తూర్పుగాలి గొట్టుటవలన 'దాసోహ' మ్మని వ్రాలిపోవు వరిపైరువలె గన్పడునట్లు చేసితిని.

'ఆంధ్రమున భారతీస్వరూపిణియగు రాజకుమారీమణి కనేక వందనములు—

ఉత్తరాంధ్రదేశమునుండి ముగ్గురు యువతులము మీవిద్యాలయమున విద్యోపార్జన మొనర్పవచ్చితిమి. శకుంతలాదేవిగారి శిష్యవర్గమున మమ్ము జేర్చుకొనవలసినదని వినయపూర్వకముగ వేడుకొనుచున్నాము.'

ఇట్లు వ్రాసి దానిపై నొక లాక్షాముద్రికను వైచితిని. ఆ ముద్రయందు మన్మథుఁ డంధీభూతుఁడై ఏవో యక్షరములను చేత బట్టుకొని యుండెను. అతని వెనుక పార్శ్వమున రతీదేవి నిలచి యతని నేత్రాచ్ఛాదనము తొలగించుచున్న ట్లుండెను.

ఆ యుత్తరమును వేకువజాముననే లోనికిఁ బంపవలసిన ట్లేర్పాటుచేసి నేను శయనించితిని. శయనించియుఁ జాలవఱకు జాగ్రదవస్థయందే కనులు మూసికొంటిని. సగము నిద్రయం దేదో యంధకారమున గొట్టికొని పోవుచు మహోదధియందలి తరంగడోలికలపై నాట్యమాడు చంద్రు నుపలక్షించుచున్నట్లుండెను. ఆవలిదిక్కున నం దంధకారమున మొదట నగమ్యగోచరమయ్యు, తరువాత నంతలో తేజస్వంతముగ గనుపించిన భాగ్యవంతమగు దేశమొకటి తళుక్కున గానవచ్చెను.

ఇది మనోరమ యను వచనకావ్యమున
కళావతియను నామెచేఁ జెప్పఁబడిన
రాజకుమారియను కథయందుఁ
బ్రథమభాగము.

# గృహోద్యాన శీర్షిక

## గులాబి

గుమ్మలూరు సత్యనారాయణగారు, బి.ఎస్‌సి.ఎజి.

(గత సంచిక తరువాయి).

### అంట్లు చెడిపోవుటకు కారణములు

1. వేళపట్టున నీరుతేమ లేక వేళ్లువచ్చు యంటు భాగమున నేల యెండిపోవుట.

2. అజాగ్రత్తగా నెక్కువ నీరు పోసినను, లేదా పెద్దవర్షముచేతనైనను, వేళ్లువచ్చు భాగమున నేల కొట్టుకుపోయి లోని వేళ్లగపడుట.

### ఖండములు

ఖండముల ద్వారా నీ దిగువరెండు లాభములు రాగలవు.

(అ) తల్లిమొక్కయొక్క కులసాంప్రదాయములు నిలచును. మొక్కకు కులసాంప్రదాయములన్న పెక్కురకు నవ్వు రాకమానదు. వివాహములందు చిక్కుపెట్టు కులసాంప్రదాయము లిక్కడ కూడను రావలెనా యని.

(అ) ఒకొక్కప్పుడు తల్లిజాతి బ్రతుకులో కని విని యెరుగని గుణములు వింతగా నుదయించుచుందును. (Sports)

ప్రవర్ధనావిధానము—కొంచెముబలముగానున్న 10, 12 అం|| పొడవుగల ఖండము నొక కొమ్మలో నుండి వాడిగల చాకు లేక కత్తెరతో తీయుము. (ఇట్టి పనులకు వాడిగల పనిముట్లు అత్యవసరము. వాని నుపయోగించకున్న మొక్కలోనున్న ముఖ్యమగు 'విభాజ్యకణములు' (Cambium cells) చెడిపోవును. గ్రామదేవతల గుడులదగ్గర జంతువులను బలివేయునపుడు, ఒకొక్కప్పుడు, వాడిలేని కత్తుల వలననేమి, గురితప్పి తగిలిన దెబ్బలవలననేమి, తల సరిగా తెగక యొక్కసారి కనుమూతలో మరణించుటకు మారెంతబాధపడి, కొట్టుకొని, కొట్టుకొని, యరచి, చావలేక జంతువు చచ్చుచున్నదో యూహించుకొనిన యాబాధ మొద్దుపనిముట్లవలని మొక్కల నష్టమునకు పరిపడగలదు. పిదప నాఖండమునకు దిగువభాగమును యేటవాలుగాను, మీది తుద గుండ్రము లేక సమముగాను జేసి, మీది తుదను కొంచెము మైలత్తి కలిపిన పేడముద్దలో ముంచుము. అట్లు చేయుటవలన ఖండములోనిపదు నిగిరిపోదు. కోసిన పిదప నాఖండమును చాలకాలము గాలిపాలించినను, కళ్ళినపేడలో ముంచినను, కొన్ని క్రిములు ఖండములలోనికి జేరి మొక్కను జెరుపగలవు. ఖండముయొక్క క్రిందిభాగము నేటవాలుగానుంచుటవలన, యెక్కువ విస్తీర్ణమునుండి గోలెములోని తేమను పీల్చుకొనును.

ఇట్లు ఖండమును దయారుచేసి 6'X5"X4" గల చిన్నగోలెములలో 1 భాగము బొగ్గుగుండ, 3 భాగములు సన్నని యేటియిసుక 1 భాగము తోటమన్ను మిశ్రమము వేసి యందు పాతవలెను. లేదా, 1'—6" మూతి, 6" ఎత్తుగల పెద్దగోలెము (Seedling pan)లో ఎఱ్ఱమన్ను, ఇసుక, పశుగెత్తము, పెంటయెరువు–అన్నియు సరిపాలు గలిపి వేయవలెను. ఏవిధములోనైనను, క్రింది కన్నములపై బిళ్లపెంకులను, మీద పెద్దబొగ్గులను వేయుట మరువరాదు. (సశేషము)




## కండ్లు

శ్రీమతి యమ్. యస్. కమలమ్మగారు

అక్షియే యాత్మకు వెలుగైయున్నది. ఇల్లెంత నిర్మలముగాను, వైశాల్యముగాను, వైకల్యములేక యందమిచ్చురీతినిగట్టబడియున్నను గవాక్షములు లేక సర్వలక్షణసంశోభితంబవదు గదా! శరీర చ్ఛాయ యెంత సుందరరూపాలంకారవిలాసములకు గురియగుచున్నను శోభాయమానముగా తళతళ మెఱయు కండ్లు లేనిచో రాణింపదు. సర్వేంద్రియాణాం నయనం ప్రధానమను నానుడి యీ బాలగోపాల మెఱింగినది. దృష్టిలోపమంతటి లోటు జీవికి వేరొకటి యుండబోదు. దృష్టి లోపించిన జీవితమంతయు నిరర్థకమగును.

అనురాగ వికసితమగు వదనారవిందమున మధుర మంజుల యౌవనాలంకార శోభతో ఇందీవరములవలె నొప్పు మనోజ్ఞనేత్రములు చూపరులకు నేత్రానందము నుద్భవింపజేయును. మనోహరములై నీలాలవలె నిగనిగలాడెడు విపులాయతనేత్రములు దేహారోగ్య బల సంపదలవలన జనించును గాని బాహ్యానయగార లేపనములవలన గలుగవు. అధిక ప్రయాసతో మెఱుగులు దిద్దెడు కలికాంజన సుర్మాలు సురూప విలాసమున గానబడు కాయ మెలికలను బాపును గాని దేహముఖముననుండు వికారకళంకములను రూపుమాపవు. అందచందములకు ప్రాణవాసముగా యుండు సుందరమనోహర సుస్ఫురన్నేత్రములు గలిగిన చంద్రవదనలు యరుదుగా నున్నను కోమలరమణీయములగు చిగురుటాకులవలె కనులకు విశ్రాంతిని గొలుపు సొంపెక్కిన యంబకద్యుతులు గలిగిన కామిను లీలోకములో యధికముగా వెలయుచుందురు. ముఖాలంకారమునకు ప్రధానమగు నేత్రసౌందర్యముల వలన ముఖవికాసపు అందచందముల లోపాలోపములు నిరూప్యమగును. అత్యంతావశ్యకమగు చూపులేని కండ్లకంటే మరణమే శరణ్యము. దృష్టి లోపించినచో లోకవాసనలయందు నేవగింపు గలుగును గావున మానవులెల్లరును, విషయానురాగములయందు యభిలాషయున్న, కండ్లను ఆరోగ్యవంతముగా నుంచుటకు దగిన యాధారములు వెతకవలెను. ఆరోగ్య సౌఖ్య సంపదలవలన రూపలావణ్యాతిశయములు తమంతటనే యబ్బగలవు. అదృష్టవంతురాలు నయనానందకరములగు చూపుల కలిగియుండును. ఆయితే ధీమంతురాలు దృష్టియొక్క మూల్యమెరింగి తగిన విధమున నుపయోగించుటకు ప్రయత్నించును. అమూల్యములగు కండ్లను బహుజాగ్రత్తగ నుపయోగించుకొనకుండుటచే గదా దృష్టిలోపములు గల్గుటయు తన్నివారణకొఱకు అనేకోపకరణముల నుపయోగింపవలసివచ్చుటయు సంభవమగుచున్నది. దృష్టిభేదము లేమాత్ర మేర్పడినప్పటికిని నేత్రవైద్యుల సలహాను గొని లోపముల నతిత్వరలో సవరించుకొనుట యవసరము.

శరీరమునకు కండ్లు ప్రధానాంగములగుటచే నివి దట్టముగానుండు పొరలతో పొదుగబడియున్నవి. నయనముల సంరక్షణార్థమై చుట్టును బొమికలెత్తుగా నేర్పరుపబడియున్నవి. కాన నేత్రభాగముమీద దెబ్బ తగిలినప్పటికిని నేత్రముల చితకకుండా నీ కనుబొమలు కాపాడును. కనురెప్పలు కంటి కెట్టి హానియుకలుగనీయవు. దుమ్ముదూసర మీకంటిలోపల బడకుండజేయుటకు రెప్పలకు వెంట్రుక లమర్పబడి యున్నవి. ముక్కునకు దూరముగాయుండు కంటి కొలుకులయందు గ్రంధులు గలవు. అవి కన్నీటిని తయారుచేసి కంటిగ్రుడ్డును తడుపుటచే తేమజేసి నలుసుమసకలను తొలగించి కళ్ళను శుభ్రపరచును.

నేత్రములకు హానికలుగు ఉపద్రవములనుండి కాపాడుకొనవలెను. అనగా నేత్రములకు మరపొగ తగులుట దుమ్ము దూసరములు పడుతావులందు సంచారము, వడగాలి తగలకుండ జూచుకొనుట, అధిక తేజస్సుగలిగిన వస్తువులను చూచుట, అతిసూక్ష్మములైన వస్తువుల తిలకించుట, చిన్న యక్షరముల వ్రాయుట చదువుట, సూదికి దార మెక్కించుట, పూసలు గుచ్చుట, విద్యుద్దీపముల కాంతియందు యుండడము, విరామము లేక యలయుటవలన కంటిపొరలు, కనుకలకలు, కంటిపువ్వులు, కంటికూసలు, పసరుకామిలలు, రేజీకటి, నిలువుకండ్లు, పిల్లికండ్లు యిత్యాది పలురకములగు రోగములు జనించి చత్వారము, దూరదృష్టి మున్నగు దృష్టిమాంద్యములు కానిపించును. దృష్టిభేదము లేమాత్ర మేర్పడినను నేత్రరక్షణములకు సులోచనములు కూడ ఒకవిధమగు సంరక్షణకారిగాను, తలనొప్పుల మూలమున జనించు దృష్టి దుర్బలతలకు యుపశమనకారిగాను, చత్వారము మున్నగు దృష్టిబాధల నివారించుటకు సాధనకారిగాను నుండుటచే స్త్రీపురుష భేదములేక దృష్టిసంరక్షణార్థము కంటికిజోడుల తరగతులవారిగా ధరించుట యుపయుక్తమగు విధాయకధర్మము.

నేత్రములకు విరామములు:— శరీరమున కలసటలేక యెల్లపనుల నిర్ణయకాలములందు జరుపవలెను. నేత్రమర్దనము నేత్రములకు బలము యందము నిచ్చును. నేత్రగోళముమీద మిగుల మృదువుగా మర్దన సేయవలెను. మరియు నేత్రరోగులు చల్లని మంచినీటితో కండ్లను తుడిచికొనుటయు, మైలుతుత్తమును, పటికను చాది కంటికి కలికము వేయుటచేత నేత్రదృష్టికి మిగుల తేజస్సును కలుగును. చలిగాలి, ఎండవిసురు తగులకుండ నీలిగుడ్డగాని నల్లగుడ్డనుగాని యుపయోగించిన నేత్రరోగములు త్వరితముగా నివర్తించును. నగరవీధులయందు, మెఱుపుతీగల దివ్వెలయందు కనులు సులభముగా అలసట జెందును కాన యీ బాధలకు లేతచాయగల నలుపు గోధుమరంగుగల అద్దపుజోడుల ధరించుటచే కంటిని సంరక్షించినవారమగుదుము.

నగరపట్టణములలోని నాగరికత యెచ్చు కొలది స్త్రీలయందు అనాదికాలమునుండి తరతరములుగా వచ్చుచుండు కాటుకపూతను మరిచియుండుటచేత నేత్రపటలరోగము, అరకంటిచూపులు, కణతికాచబింబములు మొదలగు రోగములు జనించుచున్నవను విషయమును నెరుంగలేకయున్నారు. స్త్రీలయొక్క మనోహర ముఖవైఖరి దివ్యలోచనవిలాసమువలన గల్గుచున్నదిగాని ముఖాలంకార విశేషణమువలనగాదు. నేత్రసౌందర్యమునకు కనుబొమ్మల, రెప్పవెంట్రుకల సవరణవలన కొంత ప్రకాశమానమగు తేజస్సు నివ్వగలము. సర్వసాధారణముగా వొత్తుగా అమరిన కనుబొమల జుట్టువలనగాని, చెదరిన బొమిడికల జుట్టువలనగాని, మందగించిన కనుబొమల జుట్టువలనగాని, వట్రువుగానుండు కనుబొమల జుట్టువలనగాని, వంగివాలిన కనుబొమల జుట్టువలనగాని ముఖవికాసము తెల్లబారినట్లు అగపడుట వింతకాదు.

# బాలవిజ్ఞానశాఖ

## పిల్లలపాటలు

శ్రీమతి చదలవాడ రాఘువాంబగారు

అర్ధారాత్రి ప్రొద్దు
నిద్దురవేళ—నిద్దురవేళ
ఎవరమ్మ మాతలుపు
గొల్లమీ పేరు—గొల్లమీ పేరు
మేమమ్మ కుక్కలకు
కూటికొచ్చేము—కూటికొచ్చేము
కూడేల తప్పింది
కూడెట్లు దెస్తూ—కూడెట్లు దెస్తూ
ఎవరమ్మ మాతలుపు
గొల్లమీ పేరు—గొల్లమీ పేరు
మేమమ్మ పిల్లలకు
పాలకొచ్చేము—పాలకొచ్చేము
పాలవేళ తప్పింది
పాలెట్లు దెస్తూ—పాలెట్లు దెస్తూ
ఎవరమ్మ మాతలుపు
గొల్లమీ పేరు—గొల్లమీ పేరు
మేమమ్మ దూడలకు
మేతకొచ్చేము—మేతకొచ్చేము
మేతవేళ తప్పింది
మేతెట్లు దెస్తూ—మేతెట్లు దెస్తూ
ఎవరమ్మ మాతలుపు
గొల్లమీ పేరు—గొల్లమీ పేరు
మేమమ్మ త్రాడులకు
నారకొచ్చేము—నారకొచ్చేము
నారోయి పీచోయి
నాకేమి తెలుసు—నాకేమి తెలుసు.



## ప్రేమసుందరి—భీమజాంబుకుడు

శ్రీమతి మల్లెల సుశీలాదేవిగారు

పూర్వము రాజంసెట్టియను ధనవంతుడొకడు దొంగలచే దోచుకొనబడి దరిద్రుడయ్యెను. తిరిగి కొంచెము సరుకుతో వర్తకము చేయబోయి తన ముగ్వురు కొమార్తెలను బిలచి యేమికావలెనని యడిగెను. పెద్దవారలు నారచీరలును చిన్నది ప్రేమసుందరి వాడని రోజా పుష్పమును తెమ్మనిరి.

అందు కాయన వల్లెయని వెడలిపోయెను. ఆయన కొంతదూర మేగినపిమ్మట గొప్ప గాలివాన వచ్చెను. దగ్గర నొక భవముండగా నాయన దానిలో బ్రవేశించెను. అచ్చట నొక విశాలమైన చావడియందు బల్లమీద నానావిధ భక్ష్యభోజ్యఫలాదు లుండెను. కడుపునిండా విందారగించెను. ప్రక్క నొక్కగదియందు విశ్రమించుటకు తగిన శయ్య సిద్ధముగనుండెను. ఆయన తనువు నామంచముపై వ్రాల్చెను.

తెల్లవారెను. స్నానమున కన్నియు సిద్ధముగా నుండెను. ఆయన చక్కగ స్నానముచేసి దండెమున

గృహలక్ష్మి



మిస్ సంతోష్ ఖన్నా

నున్న క్రొత్త బట్టలు కట్టుకొనెను. చుట్టునున్న వనములోని శృంగారము పరికింప నరిగెను. అచ్చట తనకుమార్తె కోరిన వాడెరుంగని తెల్లగులాబి పువ్వు కానవచ్చెను. పువ్వు ఆయన కోసెను.

తోడనే యొక భీమజాంబు వురుము ఉరిమిన ట్లరచుచు మీదపడవచ్చెను.

భీమజాంబుడు—నాయింట కుడిచి విశ్రమించి కట్టినదే కాక నా చెట్టుపువ్వును కోయ సాహసించితివా?

వర్తకుడు—అయ్యో! క్షమింపుము. తెలియక చేసితిని.

జాంబుడు—ఈపువ్వును గోరిన నీబిడ్డనైన నా కిమ్ము. లేకున్న నీచావుకైన నొప్పుకొనుము.

వర్తకుడు—ఆసంగతి యింటికిపోయి కనుగొని వత్తును.

జాంబుడు—రేపే రావలెను. లేనియెడల నీ ప్రాణములు దక్కవు.

రాజంసెట్టి ఇంటికివచ్చి జరిగినదంతయు పూసగ్రుచ్చినటుల చెప్పెను.

ప్రేమసుందరి తనవలన తండ్రికి ప్రాణహాని వచ్చెనని తలంచి యామహాభవనమునకు తండ్రితో ప్రయాణమై చేరెను. ఒక్కతెయె అక్కడ యుండుట కిచ్చగించి తండ్రిని బంపివేసెను.

అట్లా బాలికామణి యచ్చట భక్ష్యభోజ్యఫలహారములు భుజింపుచుండ వికృతాకారపు భీమజాంబుడు ప్రక్క యాసనమున వచ్చి కూర్చుండెను.

భీమజాంబుడు—ఓ బాలికామణి! నేను గూడ నిచ్చట కూర్చుని భుజింపవచ్చునా?

ప్రేమసుందరి—వలదు, వలదు, నాకు భయము వేయుచున్నది.

దానికి జాంబుడు ఖిన్నవదనుడై ఆమెవైపు చూచెను. సుందరి డెందము కరిగి పోయెను. జాలిచే యామె యందుల కియ్యకొనెను. అట్లు కొన్నాళ్లు గడచెను.

ఒకనాడు సుందరి వనవిహారమున కరిగెను. జాంబుడుకూడ తోడరావచ్చునా యని అడిగెను. సుందరి 'వలదు, వల'దని వారించెను.

దానికి మరల దీనవదనుడై ఆమెను ప్రార్థించెను. ఆమె నిరాకరింపలేక పోయెను.

కొన్నిదినము లట్లు జరుగగా ఒకనాడు వసంతకాలమున పువ్వుల వనములో సుందరి విహరించుచుండగా జాంబు డిట్లనియె—'ఓ ప్రేమసుందరీ నన్ను వివాహ మాడెదవా?

సుందరి—ఓ భల్లూకరాజా: నీరూపు నే నెట్లోర్వగలను?

ఆమాటల కా జాంబుడు కండ్లనుండి చొటచొటా నీరు కార్చెను.

సుందరి గుండె నీరయి, నే నొక్కసారి మా యింటికి పోయివచ్చి నీ కేమాటయు చెప్పెదననెను.

జాంబుడు—నీవు నెలరోజులలో వచ్చెదవా? అని దీనవదనుడై పల్కెను.

సుందరి సెలవు పుచ్చుకొని పుట్టిన యింటికివెళ్లి ఎన్నిదినములకును రాలేదు. ప్రేమసుందరికి భీమజాంబుని సంగతి జ్ఞాపకమువచ్చి తిరిగి భవనమునకు వచ్చెను. జాంబుడు చిక్కి శల్యమై కొనయూపిరితో యుండెను.

జాంబుడు—నేను చనిపో సిద్ధముగ నున్నాను. నున్నాను. కనుక నా వాడులేని గులాబిపువ్వు తెచ్చి నీచేతితో నన్నొకసారి యంటుము.

వెంటనే సుందరి పరుగెత్తుకొనిపోయి పువ్వును తెచ్చి దానితో వాని నంటెను

వెంటనే జాంబుడు వికృతరూపమును విడిచి సుందరాకారుడగు రాజకుమారుడయ్యెను. అదిచూచి యామె యాశ్చర్యవంతురాలై వానిని వివాహమాడి సుఖముగనుండెను.

# గ్రంథపరిచయము

## ఆంధ్రవాచస్పత్యము:—

ఈ ఉద్గ్రంథముయొక్క 1, 2, 3 భాగములు సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసములలో ప్రకటింపబడినవి. మొదటి భాగమును 'నవంబరు మాసపు 'గృహలక్ష్మి'లో విమర్శించితిమి. అందు ప్రారంభమైన అకారాది పదవర్గము మూడవభాగములోని 223-వ పుటవరకు వచ్చినది. ఇప్పుడు ఆకారాది పదములు జరుగుచున్నవి. ఈ నిఘంటువుయొక్క విశేషలక్షణములు ప్రయోజనములనుగూర్చి నవంబరు పత్రికలో విపులముగ తెలియబరచినాము. ఇందు ఎత్తుకొనబడిన ప్రతిపదమునకు కేవల మర్థముమాత్రమే కాక అందుకు చేరిన అనేకాంశములు లిఖింపఁబడుట చేత ఆయా సందర్భములలో దీనివలన చాలామట్టుకు చారిత్రక, భూగోళక, అలంకారిక, వైయాకరణాది శాస్త్రముల ప్రయోజనములెల్లయు లభించును. ఇది కేవలము అధికారవాచకము లక్షణగ్రంథమే గాక విజ్ఞానదాయకము సకల శాస్త్రసంగ్రహ గ్రంథము. అపూర్వములగు వస్తువులనుగూర్చి తెలుపవలసినప్పుడు చిత్రములుగూడ గలవు. ఈ నిఘంటువు మొత్తము మీద 2500 డెమ్మీసైజు గ్లేజుపుటలు, 80000 పదములు గలిగి నెలకు 100 పుటలచొప్పున ఒకొక్క భాగము ప్రకటింపఁబడును. ఒకొక్క భాగము వెల రు. 1-0-0. ముందుగా ఒకేసారి ధనము చెల్లించువారికి రు. 15-0-0. 1, 2, 3 వాల్యూములకు మూడు దఫాలుగా ముందుగా ఖరీదు చెల్లించువారికి రు. 5, 6, 7 లు. వలయువారు తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తాలూకా కరపగ్రామము శ్రీ ఆంధ్రవాచస్పత్య కార్యాలయాధిపతి, ఆంధ్రవాఙ్మయ మహోదధి శ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారికి వ్రాసి పడయవలెను.

## రామవిలాసము:—

క్రౌనుసైజు 116 పుటలు. ఏనుగులక్ష్మణకవి విరచిత ప్రబంధమునందలి ప్రథమాశ్వాసము. వెల రు. 0-12-0లు. వత్సవాయి గోపరాజ్ఞేశ్వరున కంకితమై తద్వంశవర్ణనము మాత్ర మిందుఁగలదు. తక్కిన ఆశ్వాసములు చిక్కకున్నవని తోచును. చరిత్రాపరిశోధకుల కత్యావశ్యకమైన గ్రంథ మగుటయేకాక సారస్వతాభిమానుల నల్లాసడోలికలలో నూగించు సుందరతరశయ్యాకలితమైయున్నది. పాఠ్యగ్రంథ నిర్ణయ సంఘమువారిచే అంగీకృతమైనది. ప్రకాశకులు శ్రీ వత్సవాయి రాయజగపతి వర్మగారు.

## పెద్దాపుర సంస్థాన చరిత్రము:—

క్రౌనుసైజు 171 పుటలు. వెల రు. 1-0-0. పెద్దాపురము సంస్థానమును సుమారు మూడువందల యేండ్లు పాలించి కీర్తికిరీటులైన క్షత్రియ వత్సవాయి వంశీకుల చరిత్రము. ఇప్పటి కాగుసారులు ముద్రితమై 7500 ప్రతులు చెల్లుటయే ఈ గ్రంథముయొక్క చారిత్రకప్రాముఖ్యతకు సుందర గంభీర శయ్యకు, వత్సవాయి వంశస్థుల పరాక్రమౌదార్య పరిపూరిత పరిపాలనమునకు ప్రబలసాక్ష్యము. ఇట్టి చరిత్రాపఠనమువలన ప్రస్తుతము నిరుత్సాహవివశులై యున్న ఆంధ్రులకు ఆత్మవిశ్వాసగౌరవములును దీక్షాధీరత్వములును అలవడగలవని గట్టిగా చెప్పవచ్చును. బహువిధ పరిశ్రమలకోర్చి శ్రీ వత్సవాయి రాయజగపతి వర్మగారు ఈ గ్రంథమును రచించి ప్రక

టించి ఆంధ్రుల కమూల్యమైనసేవ నొనరించినారు. ఇదియును పాఠ్యగ్రంథనిర్ణయ సంఘమువారిచే అంగీకృతమే.

## పద్మనాభ యుద్ధము:—

క్రౌనుసైజు 80 పుటలు. వెల రు. 0-12-0లు. చట్రాతి లక్ష్మీనరసింహ కవికృత ఏకాశ్వాస వీరరస ప్రధాన ప్రబంధము. పద్మనాభయుద్ధము కథావస్తువు. ప్రస్తుత విజయనగర సంస్థానమును మొన్న మొన్నటివరకు పాలించిన పూసపాటి వంశీయుల నిర్వక్రపరాక్రమములును, యుద్ధమున వీరమరణము నందిన విజయరామగజపతిగారి ధైర్యగాంభీర్యాది సుగుణగణములును నిండుకన్నులకు గట్టునట్లు వర్ణింపఁబడినది. కవిగారు యుద్ధసమయమున రాజుగారి ప్రక్కనుండి సర్వమునకు సాక్షియై వర్ణించినారు. ఆంధ్ర క్షత్రియు లొనరించిన ఆఖరు యుద్ధమిది. దీనితో కళింగరాజ్యలక్ష్మి వారి కరతలము నుండి జారి చీలి చిందరవందరయై చిన్నచిన్న జమీందారీ లైనది. పరాజయమును మరణమును నిశ్చయమని యెఱిగి వీరస్వర్గమును జూఱగొన నెన్ని క్షత్రియ కుటుంబము లీ యుద్ధమునందు పెనుపండువువందువలె పాల్గొని వీరవిహార మొనర్చినదియు పఠింప మేనఁబుల కాంకురములు పొడముఁను—శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారు అనేక డాక్యుమెంటులలోనుండి వివిధ విషయముల నెత్తి చూపి చారిత్రకయాదార్థ్యమును బుజువుపరచుచు విపులమగు పీఠికను వ్రాసినారు. శ్రీ వత్సవాయి రాయ జగపతివర్మగారు ప్రకాశకులు. పాఠ్యగ్రంథ నిర్ణయసంఘమువా రంగీకరించినది.

## ఆంధ్రదేశ కథలు:—

క్రౌనుసైజు 74 పుటలు వెల రు. 0-10-0 లు ఆంధ్రరాష్ట్ర పత్రికలో మున్ను ప్రకటింపఁబడిన పది సాంఘిక కథలు. అంతర్వర్ణ, అంతర్జాతీయ, విధవా, రజస్వలాది వివాహములయం దభిరుచి కల్పించుచు సంఘసంస్కారమునకు ప్రోత్సాహ మొసగుచున్నవి. ఇదియును పాఠ్యగ్రంథ నిర్ణయ సంఘమువా రామోదించినదే. శ్రీ వత్సవాయి రాయ జగపతివర్మగారు ప్రకాశకులు. నాలుగుగ్రంథములు కావలసిన వారును పెద్దాపురవాస్తవ్యులగు ప్రకాశకులకు వ్రాసిన బడయఁ గలరు. సమస్త ప్రాథమికోన్నత పాఠశాలాధికారులును తమ గ్రంథాలయములలో వీనినుంచి బాలురు చదువునట్లు ప్రోత్సహింతురుగాక !

## కమ్యూనిష్టు ప్రణాలిక:—

క్రౌనుసైజు 72 పుటలు వెల రు. 0-4-0 లు కమ్యూనిష్టు సిద్ధాంత పితామహులగు మార్క్సు, ఎంజిల్సుగార్లు 1848 లో జర్మనీ భాషలో రచించి, తరువాత వివిధ భాషలలోనికి తర్జుమా అయిన కమ్యూనిష్టు మేనిఫెస్టో అను సుప్రసిద్ధ సిద్ధాంత ప్రణాళికకు ఆంధ్రానువాదము. కమ్యూనిష్టు ఆశయములను స్పష్టముగ నెఱుగ గోరువారు దీనిని పఠించుచో సరియైన సంగతులు తెలిసుకొనఁ గలరు. ప్రకాశకులు, ఆదర్శ గ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణజిల్లా.

## సామ్యవాద సిద్ధాంతాలు:—

క్రౌనుసైజు 43 పుటలు వెల రు. 0-2-0 ఫ్రెడరిక్, ఎంజిల్సు వ్రాసిన గ్రంథమున కాంధ్రానువాదము. ప్రశ్నోత్తర రూపమున నుండుటచేత సామ్యవాదమును గూర్చిన అనేక సందేహము లిందువలన తొలగి నిర్దుష్టమైన జ్ఞానము కలుగును. ప్రదర్శకులు, ఆదర్శ గ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణజిల్లా.

## సామ్రాజ్యవాదము మొదటిభాగము:—

క్రౌనుసైజు 33 పుటలు. వెల రు. 0-2-0 లు లెనినుగారి రచనకు ఆంధ్రానువాదము. ఈ సిద్ధాంతము యొక్క పుట్టు పూర్వోత్తరములు, ఇందుకొరకొనరింపఁబడిన యుద్ధములు, వర్తక విస్తీర్ణము, ధనిక

ప్రాబల్యము, దాస్యవృద్ధి మొదలయిన విషయము లిందు వర్ణితములు. ప్రకాశకులు, ఆదర్శగ్రంథమండలి, ఏలమఱ్ఱు, కృష్ణజిల్లా.

## శ్రీలక్ష్మీ నారాయణీయము:

క్రౌను సైజు 28 పుటలు వెల రూ. 0-3-0 పూర్వకవి గోకులపాటి కూర్మనాధ కవిగారు. శ్రీ లక్ష్మీదేవియొక్కయు కృష్ణభగవానుని యొక్కయు సరస సల్లాపవైఖరులతో గూడిన శృంగారగ్రంథము. సంపాదకులు, దేవులపల్లి వీరరాఘవశర్మగారు, కాజులూరు, కాకినాడ తాలూకా, తూర్పు గోదావరిజిల్లా.

## రాజ్యపాలనా శాస్త్రము:—

క్రౌనుసైజు 116 పుటలు వెల రు. 1-0-0 గ్రంథకర్త శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు. పశ్చిమగోదావరిజిల్లా కాకరపఱ్ఱునందలి సరస్వతీ గ్రంథమాలవారి 36-వ కుసుమము. ప్రపంచములో వివిధరకములైన రాజ్యాంగము లున్నవి. రాజపాలితములు, ప్రజాపాలితములు, వర్గపాలితములు, శాసన సభలు, ఎన్నికలు, హక్కులు, మొదలైన విషయము లెన్నో తెలుసుకొనకున్నచో వాటియొక్క ప్రాశస్త్యా ప్రాశస్త్యములను మనము నిర్ణయించుకొనలేము. ప్రజలకే జ్ఞానములేనిచో దేశములో సర్వజన శ్రేయస్కరమైన స్వపరిపాలనా పద్ధతి లభింపక, ఏప్రభువులో ఏ నాయకులో ఏదయాధర్మభిక్షుముగనో నిర్ణయించు తంత్రమునకు వారు దాసులు కావలసి వచ్చును. హిందూదేశము స్వయంనిర్ణయ సూత్రమునకు, కన్‌స్టిట్యుయంటు అసెంబ్లీకి ఆందోళనము చేయుచున్నది. ఈ సమయమున ప్రజలకెల్లరకు వివిధ దేశములలోని రాజ్యాంగములతో పరిచయమును పఠనమూలకమగు అనుభవమును అత్యావశ్యకమైనది. ఆంగ్లభాషలో ఇట్టి గ్రంథము లెన్నియో యున్నను విద్యాధికులకు తప్ప జనసామాన్యమునకు వానివలన ప్రయోజనము లేకున్నది. శ్రీయుత సుబ్బారావుగారు ఆ గ్రంథములలో ప్రధానమైన వానిని పఠించి, ఆ జ్ఞానమునకు ప్రస్తుత వార్తాపత్రికా పాఠనా లబ్ధానుభవమును చేర్చి, తమ సర్వజన హృదయంగమమైన సులభ శైలిలో యీ గ్రంథమును ప్రకటించినందు కెంతయు వంద్యులు. స్వరాజ్యా కాంక్ష డెందములలో పాదుకొని, రాజకీయ సిద్ధాంతములను ప్రజలలో వ్యాపింపజేయగోరువా రందరును దీనిని పఠించి తీరవలెను.

## ఆంధ్రాస్తిక మహాసభ (మాధవరం 1934)

క్రౌనుసైజు 20 పుటలు. శ్రీమతి జ్ఞానాంబగారి అధ్యక్షోపన్యాసము ఆధ్యాత్మిక విజ్ఞానతుందిలమై, భక్తిరస పూరితమై, నీతిమార్గదర్శకమై, ఐకమత్య బోధకమై తనరారుచున్నది. ముఖ్యముగా స్త్రీలోకము పఠించి నవనాగరకతా విలాస డోలికలలో కొట్టుకొని బోగోరుచున్న యువతీ మణుల కొసగ వలసిన సలహా లెన్నియేని గలవు.

## ఆనంద సామ్రాజ్యము:—

క్రౌనుసైజు 20 పుటలు వెల రు. 0-2-0 లు విశాఖపట్టణముజిల్లా ఎలమంచిలి దగ్గర మేలుపాక లోని వ్యాసకుటీరము వారిచే ప్రకటితము. శ్రీస్వామి రామతీర్థవారి వ్యాసమున కనువాదము. ఆనంద సామ్రాజ్యము విషయ వాంఛాపరాయణత్వమునందు కాక ఆత్మజ్ఞానమునందు మాత్రమే కలదని ఋజువు పరచు యుక్తియుక్తోదాహరణ పూర్వకమైన వ్యాసము.

## కాశీయాత్ర:—

క్రౌనుసైజు 28 పుటలు. జటప్రోలు సంస్థానము కొల్లాపురమునందలి స్నేహలతా కవితాసమితి యధ్యక్షులగు శ్రీయుత వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారును వారి సతీమణిగారును చేయు దలచు కొన్న కాశీయాత్రను గూర్చిన సంభాషణమును

తత్సందర్భంబున నలుపబడిన కాశీపుర వర్ణనలు, శ్రీ విశ్వనాథుని మహిమావర్ణనలును కలసి గంగానది కంటె అచ్ఛముగ ప్రవహించు సుందర కవితా కావ్యము. పురాణదంపతుల బారుడించు ఈ విద్వన్మణుల సంయోగము స్నేహలతా సంఘరూపమై కవితాకాంతా విహారమాదిగాగల నలువదియొక్క ప్రసవములను తొడిగి ఆంధ్రదేశమున నెల్ల కమ్మని కవితావాసనలు మలయించుచున్నది. ఇదివరకు ప్రకటింపబడిన నలువదింటికి గూడ ఇది చూడామణి యని చెప్పనొప్పును. కాసీపట్టణమును తలచుకొనుచునే ఇట్టి మరందమును చిందిన వీరి లేఖిని సాక్షాత్ శ్రీ విశ్వనాథుని దర్శనము చేసుకొని యెట్టియెట్టి కవితాస్రవంతి నాంధ్రసాహిత్య లోకములోనికి ప్రవహింపజేయునో యని ఆంధ్రు లెదురు చూచుచుండుటలో అచ్చెరువు లేదు. శ్రీ శేషాద్రిరమణ కవులు పఠించి తనివిదీర పీఠికవ్రాసిన కావ్యమును మేము సమగ్రముగ ప్రశంసింప బూనుట సాహసమగును.

## శ్రీ మధ్వాచార్యచరిత్రము:—

క్రౌనుసైజు 112 పుటలు. వెల రు. 1-0-0 గ్రంథకర్త శ్రీయుత మారేమండ రామారావుగారు, ఎం. ఏ., బి, ఇడి, రాజమహేంద్రవరము. వేదాంతులు, దివ్యజ్ఞాన సమాజములు, అద్వైత సిద్ధాంతులు మొదలగు వారి ప్రచారమువలన ద్వైతమతముపై నుదయించు అపోహల నీ గ్రంథము తొలగించును. ద్వైతమతముయొక్క ఆవశ్యకతను, ఆస్తిక్యతను స్పష్టపరచును. శ్రీ మధ్వాచార్యులవారి దివ్యమగు జన్మను, విద్యను, సన్యాసమును, ప్రచారమును, మహిమలను నిర్దుష్టమగు శైలిలో వర్ణించును. ఇన్నిటికంటె ముఖ్యముగ అనేక సమకాలిక పత్ర, శాసనముల సాక్ష్యముతో ఈ గ్రంథము వ్రాయబడిన కతన ఆస్తికులకు, విద్యార్థులకు ఎంత ప్రయోజనకారియో చారిత్రక పరిశోధకుల కంత సహాయకారి. మనపాఠశాలలలో మతమునుగూర్చి తరగతులు పెట్టినను పెట్టకున్నను, ఇట్టి గ్రంథములనైన పాఠ్యములుగ నిర్ణయించినచో విద్యార్థులు కేవలము పరీక్షలు ప్యాసు కావలెననే దృష్టితోనే గాక సహజముగ నుదయించు శ్రద్ధానందములతో వీనిని పఠించి నిర్మల ప్రవర్తన జాతీయజ్ఞానము గలవారగుదురనుట కాటంకము లేదు. ప్రతులువలయువారు ద్వైతప్రచారిణీ గ్రంథమాల, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరమునకు వ్రాసుకొనవలెను.

## శ్రీ కృష్ణ జంత్రి:—

డెమ్మీసైజు సుమారు 200 పుటలు. క్యాలికో బైండు వెల రు. 1-4-0 లు. సాదా బైండు రు. 1-0-0. గ్రంథకర్త శ్రీయుత దుద్దుకూరి శ్రీకృష్ణమూర్తి గారు, దుద్దుకూరు, ఒంగోలు తాలూకా గుంటూరు జిల్లా. కరణములకు మేస్త్రీలకు, ఇతర ఉద్యోగస్థులకు మిక్కిలి ఉపయుక్తము. దినవారీ, నెలవారీ, సంవత్సరవారీ, యకరమువారీ, సెంట్లవారీ, పైసలవారీ, రూపాయీలవారీ, వేలవారీగా అద్దెలు, సిస్తులు, కూలులు, జీతములు మొదలగు వానిని లెక్కలు చేయకుండనే యిది చూచి వెంటనే వ్రాసి జమాబందీ మొదలగు వానిని నలుపవచ్చును. గ్రంథకర్తగారు మిగుల శ్రమపడి, ధనవ్యయము నోర్చి తన తోడికరణములు మొదలగు వారి కష్టముల నీరీతిని తగ్గించినందుకు కెంతయు ప్రశంసనీయులు.

## గ్రామ పరిపాలన

ఈ పత్రిక లోగడ 1331-32 లో ఒక సంపుటము నడచి ఆగిపోయినది. తిరిగి మార్గశీర్షమాసములో తల యెత్తినది. ప్రతిపౌర్ణమి, అమావాస్యకు ప్రకటింపబడు పక్షపత్రిక. తెనాలి కార్యస్థానము. సంపాదకుడు దుద్దుకూరు కరణంగారగు శ్రీయుత దుద్దుకూరు శ్రీకృష్ణమూర్తిగారు. దేశపరిపాలనకు గ్రామపరిపాలనకు అవినాసంబంధముగలదు. గ్రామపరిపాలనము సూటిపడనిదే దేశమునకు స్వరాజ్యము రాదు. దేశీయోద్యోగములను నడుపుటకైనను లేక కూల్చుటకైనను గూడ కరణములు సమర్థులు. వారికి సరియైన రాజకీయపరిజ్ఞానము, ప్రభుత్వనిర్వహణ

శక్తియు లేకున్నచో దేశములో నెట్టి ప్రచారము జరిగినను లాభములేదు. గ్రామోద్యోగుల నెల్ల నిట్టి శక్తులలో సుశిక్షితులను చేయుటకు ఈ పత్రిక మిగుల పనికివచ్చును. ఇందలి సంపాదకీయములు మొదలగు వ్యాసములు అఖిలభారతప్రభుత్వ కాంగ్రెసు తత్వసమగ్ర విమర్శనములతో గూడి అఖిలభారతమిత వాద సభానాయకుల ధోరణులను బురుడించుచున్నవి. సంపాదకుని సమర్థత క్రింద ఇది తోడి తెలుగు పత్రిక లలో గౌరవముగొనుచు, గ్రామీణులకు సరియైన విజ్ఞానమును కార్యనిర్వాహణశక్తిని పురిగొల్పుచు చిరంజీవియగుగాక యని ఆశీర్వదించుచున్నాము. 8 పుటలు. ఫూలుస్కేపుసైజు దళసరి పత్రములు చక్కని తప్పులులేని అచ్చు. సాలుచందా రెండు రూపాయీలు.

## ప్రకృతి:—

ఆంధ్రఆరోగ్యవిషయిక మాసపత్రిక- రాయలు సైజు 32 దళసరిపుటలు. చక్కని అంచు చందా సం|| 1-కి రు. 3-0-0 పత్రికాధిపతి, ప్రకృతి కార్యా లయట్రస్టు అధ్యక్షుడు శ్రీయుత పుచ్చా వెకట్రా మయ్యగారు, పడమటి లంక, బెజవాడ. ఇంతవరకు 16 సంపుటములు ముగిసి 17 వ సంపుటము జనవరితో ప్రారంభమైనది. పత్రికసైజు, ప్రమాణము, విష యము, సొగసు, దృగ్విధము అన్నిటియందును క్రొత్త మార్గమును త్రొక్కుచున్నది. ఆధునికాచారరోగము లకు విరుగుడులగు చికిత్స లెవ్వియు ఆమందులలోగాని ఆహారములలోగాని చిక్కవనియు, కన్నతల్లియగు ప్రకృతి దేవతయొక్క విన్నవను కనుసన్నల మెలగి వర్తించుటొండె త్రయీధర్మములకు మోక్షమునకు గూడ సాధనమనియు నిందలి ప్రతివ్యాసమును ఋజువు పరచుచున్నది. అందందు విషయబోధకములగు పట ములును చేర్చఁబడినవి. ప్రతి గృహమేధియు వైద్యు డును గూడ పఠింపఁదగును.

## నాట్యకళ:—

సచిత్ర త్రైమాసికపత్రిక భావసంవత్సర మార్గశిర మాసమున ప్రకటింపఁబడిన ప్రథమసంచిక మాకార్యా లయము నలంకరించినది. సంపాదకులు శ్రీయుత నీలంరాజు వెంకట శేషయ్యగారు, 7 తంబుచెట్టివీధి, తపాలపెట్టె 288 మదరాసు. చందా సం|| 1-కి రు 2-0-0 లు. 1924 వ సంవత్సరమునుండియు లేచుచు పడుచు 1933 లో మదరాసు సభలో స్థిర పడి 1934 లో వివిధ విస్ఫురదాశయములతో ప్రకట మైన ఆంధ్రనాటకకళాపరిషత్తువారి ఆదరణముక్రింద ప్రకటింపఁబడును. సాలు చందా రు 2-0-0 లు. ప్రథమమగు విశేషసంచిక 102 ఫెదరువైటు పుటలు గలిగి, నాట్యకళాభిమానుల చిత్రపటములు ప్రాచీన భంగిమల చిత్రములుకలిగి, నాటకరచన, అభినయము, ప్రదర్శనము, రంగులు, దుస్తులు, పద్యముల పాటల ప్రయోజనము మొదలగు విషయమునుగూర్చి అనుభ వజ్ఞులు వ్రాసిన సుమారు యిరువది గంభీరవ్యాసములు గలిగి, సర్వాంగసుందరమై అలరారుచున్నది-నటకు లకు, కవులకుగూడ మిగుల ప్రయోజనకరమై దేశీయ నాటక సాహిత్యప్రదర్శనముల నున్నతమగు స్థితికి తెచ్చుట కిది సహాయపడగలదని నిశ్చయముగ చెప్ప వచ్చును. శ్రీయుత వెంకటశేషయ్యగారి సమర్థ సంపాదకత్వమున నిది చిరంజీవియై వర్ధిల్లగలదు. నాట్యకళాభిమానులందరిపైని దీనిని పోషించి ఇతో ధిక సౌందర్యవంతముగ నొనరింపవలసిన భారము మోపియున్నది.

## బ్రాహ్మణగీత:—

క్రౌనుసైజు 30 పుటలు. వెల రు 0-8-0 గ్రంథ కర్త శ్రీయుత బులుసు రామజోగారావుగారు. ఇందు సకలోపనిషత్సారమును స్వతంత్రములగు ఆంధ్ర భాషారచనలలో వెలువరింపఁబడినది. బ్రహ్మనెఱిం గినవాడే బ్రాహ్మణుడని రూఢిపరచుచు, బ్రహ్మము నెఱుగుటకు గ్రహించుకొనవలసిన సమస్తబంధములు నిందు నిరసింపఁబడినవి. ఇన్ని స్వల్పపద్యములలో ఇంత గంభీరముగ ఇంత విజ్ఞానమిముడ్చగల్గుట కవి గారి ప్రజ్ఞకు నిదర్శనము. శ్రీయుతులు సర్ రాధా కృష్ణను, వి. యల్. శాస్త్రి, బులుసు నరసింహ శాస్త్రిగార్లు దీనిని వేనోళ్ల నభినందించినారు.

# వింత లోకము

**ఎంత ప్రేమ! ఎట్టి శాంతి!:—**

ఆఫ్రికాఖండమున కుత్తరభాగమున అట్లాసు పర్వతములున్నవి. ఏటవాలైనరాళ్లు, పావురపు గూళ్లలాటిగుహాలు, దుర్భేద్యమైన చిన్నచిన్నలోయలు గలిగి అవి శత్రువులకు దుష్ప్రవేశ్యములుగ నుండును. అక్కడ బెర్బెరులు అనుపేరుగల ఒక వీరమహమ్మదీయజాతి నివసించుచుండును. వారు గొఱ్ఱెలను మేకలను అచ్చటి మైదానములలో మేపుకొనుచు క్రిందనుండు సెలయేళ్ళయందలి బావులయందలి నీరములను గ్రోలుచు శాంత జీవనమును జరుపుకొనుచుందురు. అచ్చటి రాళ్ళు తుపాకుల దెబ్బలకు పగలవు. గుహాముఖములకుపోయి తుపాకులను ప్రేల్చినగాని అందలి జనులకు దెబ్బలు తగలవు.

మొరాకో అనఁబడు ఈ దేశముపై ఫ్రెంచివారికళ్ళు పడినవి. ఇరువదియైదు సంవత్సరములనుండి ఆదేశమును స్వాధీనము చేసుకొనుటకై వారు తంటాలుపడుచుండిరి. పెద్దపెద్దసైన్యములు వారి గుహాలయొద్దకును లోయలలోనికి వెళ్లి వారి నెదుర్చుచుండిరి. వారు లొంగక కొండశిఖరముల మీదికి పిల్లలు పాపలు స్త్రీలు మందలతో సహా పరిగెత్తుకొని పోవుచుండిరి. అక్కడ నీటిచుక్కలు దొరకక, క్రిందికి సైన్యభయముచే రాలేక గొంతుకఎండియారి అనేకులు చచ్చిపోవుచుండిరి. ఇట్టి సమయమున తుపాకులు బాంబులు సహాయమున క్రింది పాషాణముల నెల్లపగలగొట్టి గుహాలను లోయలను మూసివేసి బెర్బరులకు నిలువలేకుండ ఫ్రెంచివారు చేయుచుండిరి. ఈవిధముగ వేనవేలు చనిపోగా మిగిలిన 6000 మంది ఫ్రెంచి వారికి వశ్యులైరి. ఫ్రెంచిసైన్యముల నేమార్చి ప్రతి రాత్రియు అనేకమంది కొండల మీదినుండి నీటి చాయలకు దాహము తీర్చుకొనవచ్చుటయు, తెల్లవారుసరికి సైనికుల తుపాకుల కెఱయై శవముల పుట్టలగుటయు—ఇది యీ యిరవైఅయిదు సంవత్సరములనుండి జరుగుచున్న చరిత్ర. ఫ్రెంచివారీయుద్ధము నంతటిని అక్కడ శాంతి స్థాపనార్థము చేయుచున్నామని ప్రగల్భములు కొట్టుచున్నారు. ఈ చరిత్రయంతయు మిస్టర్ వార్డుప్రైసు అను నాతనువ్రాసిన ఒక నూతన గ్రంథము ద్వారా లోకమునకు విశదమగుచున్నది. ఫ్రెంచి సేనాని నీవిషయమై ప్రశ్నించినప్పుడు "వారిని నేను ప్రేమించెదను, ప్రశంసించెదను, కాని వధించకమాన" నెను. ఆహా ఎట్టి ప్రేమ, ఎట్టి ప్రశంస, ఎట్టివధ, ఎట్టిశాంతి!

దస్తూరీకికూడ జాతిభేదమున్నది!:—

మనుష్యులకు వలెనే మనుష్యులు వ్రాసెడి అక్షరములకు కూడా జాతులువుంటాయి. ఒకరు వ్రాసిన దస్తూరీనిబట్టి అతనిశీలము, అతనివృత్తి, అతని కేదైనారోగముంటే ఆ రోగము ఈ మొదలైన వాని నన్నిటినీ నిర్ణయించవచ్చును. ఈ విధంగా వ్రేలుతూ అయిరోపాఖండములో ఇప్పటికి అనేకులు జోస్యములు చెప్పుకుంటూ మందులమ్ముకుంటూ డాబులు కొట్టుకుంటూ పొట్టపోసుకుంటున్నారు. కాని శాస్త్రీయపరిశోధన లెక్కవైన తరువాతను ఇవన్ని నిజమనియే శాస్త్రవేత్తలు నిర్ణయించుచున్నారు. "టిట్ బిట్సు"అనే పేపరు కొన్నిఉదాహరణలతో సహా యీ సంగతిని దృఢపరుచుతున్నది.

మనుష్యులు తరుచుగా ఏ వస్తువుల మధ్యకూర్చుని లేక నిలబడి పనిచేస్తూవుంటారో, వారి అక్షరాలకు వద్దన్నా కాని ఆయా వస్తువుల ఆకారాలు ఎక్కడో ఒక దగ్గరవచ్చి పడతాయి. కళ్లవైద్యుడు వ్రాసే అక్షరాలు కన్నుపాపలలాగ చిన్నవో, లెన్సులలాగ కొంచము గుల్లవో అయివుంటాయి. కోళ్లను పెంచేవాడి అక్షరాలు కోడిగ్రుడ్లలాగ కోలంగానేనా వుంటాయి, గ్రుడ్లను పొదుగుతుండే పెట్టలలాగ కుదమేసినట్టుగానైనావుంటాయి. కుక్కలను పెంచేవాడి అక్షరాలు కుక్కతోకలలాగ వంకలు తిరగడమో కాళ్లలాగ ముందుకు దాచుకొని వుండడమో జరుగుతుంది. పందులు కాసేవాడి అక్షరాలకు ఎక్కడో ఒక దగ్గర పంది తోకలలాటిపొట్టి జట కాలు కుచ్చులు తగిలిస్తాడు. ఒకవేళ యిట్లా తగిలించడం అలవాటు లేనివాళ్లైనా యిక ముందు ఇట్లు తగిలించడం విధిగా అభ్యాసం చేసుకుంటే వారివారి వృత్తులను నిర్ణయించుట శాస్త్రజ్ఞులకు సులభమవుతుంది కనుక అట్లు తగిలించడం అభ్యాసం చేసుకోవలసినదని కూడా యీ పత్రిక సలహాయిచ్చుచున్నది.

ఇక దస్తూరీనిబట్టి మానవుల ఆరోగ్య పరిస్థితులను గూడా నిర్ణయించవచ్చును. ఆరోగ్యముగా ఉన్నవారే చలిలో వణుకుతున్నప్పు డొకమోస్తరుగాను, ఉక్కలో ముక్కుతున్నప్పు డొక మోస్తరుగాను వ్రాస్తారు. ఒక మనిషియొక్క సాధారణపు దస్తూరీ యేలాగుంటుందో నిర్ణయించిన తరువాత, దానినుంచి ప్రత్యేక లేఖలలోని దస్తూరీ యెట్లు భేదమగుచున్నదో చూచి ఆ భేదములను బట్టి మానవుల రోగములను నిర్ణయించవచ్చును. తల నొప్పిలో బాధపడుతున్న వాని అక్షరములు క్రిందిభాగముల కంటె మీదిభాగములు ఒత్తుగాపడి తలబరువుచే బాధపడు తున్నట్లేయుండును. సంతతము నిల్చుండడమో, శక్తికిమించి నడవడమో మొదలగు కారణములవల్ల నిరంతరము

కాళ్లనొప్పులు కాళ్లపీకుతో బాధపడుచుండు వారియక్షరములకు క్రిందిభాగములు మీది భాగములు వంకరలై స్ఫుటము తక్కువై యుండును. సరిగా రక్తము నాళములలో ప్రవహించనివారి కలములోనుండి సిరా కూడా ఒక నిమానంగా ప్రవహించక ఒకొక్కచోట దగ్గర ముద్దముద్దలుగాను, ఒకొక్క దగ్గర అసలే అంటకుండాను ఉంటుంది. అక్షరాలు సాఫీగాసాగక, కొన్నికొన్ని వంకరగీతలు కలిసి ఒక అక్షరమైనట్లుగా వుంటే అతను అజీర్ణవ్యాధిచే బాధపడుతున్నాడని గ్రహించవలెను. కలిపి వ్రాతలో ప్రతిపదముయొక్క చివరి అక్షరము మిక్కిలి ప్రధానమైనది. అక్కడికి వచ్చేటప్పటికి లేఖరియొక్క కలము ఒక విసురు మీదికి వెళ్లింది రా అంటే అతనుత్సాహపూర్ణుడుగా వున్నట్లు, ఆ అక్షరము ఈడురోమన్నట్లు క్రిందికి వ్రేలాడుతూ వుంటే అతను మనస్సులో నేదో దిగులు, చింత, లేక దుఃఖముతో బాధపడుతున్నట్లు గ్రహించవలెను. మీదికీ వెళ్లక క్రిందికీ రాక ప్రక్కచాచుకొని పడుకున్నట్లుంటే అతను మిక్కిలి అలసిపోయి విశ్రామమును వాంఛించే అవస్థలో వున్నాడని గ్రహించవలెను. దస్తూరీ అంతా ఏకరీతిగా ఉండకపోవడము, పేజీనిండా తుడుపులూ హంసపాదులూ వుండడము, సిరా ముద్ద ముద్దలు పడడము మొదలగు వానివలన అతనియొక్క వివిధ ఆంతరంగిక విషమావస్థలను మనము గ్రహించవలెను. అనవసరముగా గుత్తి గుత్తులుగా చుక్కలు, హాశ్చర్యార్థక గుర్తులు, ఇతరవిధములైన గీతలు గీసినయెడలను, అక్షరముల తలకాయల దగ్గర పట్టివ్రాసిన యెడలను అతనికి కొంచెము పైత్యభ్రమ యున్నదని మన మెఱుగవలెను. దస్తూరీలనుపట్టి రోగములను పోల్చుకొనుట కూడా ఒక విధానమైన 'నిదానముగను శాస్త్రముగను పాశ్చాత్యవైద్యులు నిశ్చయించి, ఇందును గూర్చి పాఠ్యగ్రంథములువ్రాసి వైద్యశాస్త్ర విద్యార్థులందరిచేతను అభ్యసింప జేయుటకు ఆలోచించుచున్నారు.

## స్త్రీపురుషుల సమానత్వం

హిందూదేశంలో యేనాటికైనా స్త్రీ పురుష సమానత్వంవస్తుందా, ఆ తరువాత యేనాటికైనా యీ దేశానికి స్వరాజ్యం వస్తుందా అని తెల్లవాళ్లందరూ ఊరికే బెంగపెట్టేసుకుంటున్నారు. కాని వారి కటువంటి ఆశ యేమీ కలగకుండావుంది. పేపర్లలో వూరికే మేలిముసుగులు తీసేయాలి, స్త్రీ పురుషులు కలిసి అరమర అభ్యంతరాలు లేకుండా తిరగవాలి, అని వ్యాసాలు వ్రాసేవారు, వేదికలమీద లెక్చర్లిచ్చేవారే కాని వ్యవహారంలో అటువంటి మహత్తేమీ కనిపించకుండా వుండడంచూస్తే తెల్లజాతి స్త్రీలకు మరీ నిరాశ యెక్కువవుతున్నది. భారతస్త్రీ లెంతవరకు అభివృద్ధిపొందేరో, తమలాగ యెంతవరకుమారేరో చూద్దామని

స్త్రీమరుకేవులు కట్టుకొని ఒక ఇంగ్లీషు వనితామణి ఇండియాకువచ్చి నేరుగా కరాచీ మహిళా సభకే వెళ్లింది. తీరా చూడనా! కొంతమందికి ఇంకా పరదా వుండనేవుంది. పురుషులన్నవారు లేనేలేరు. అనేకమంది ఆడవాళ్లు సిగ్గుసిగ్గులుపడుతూ, వెనక వెనక వుంటూ, ముక్తసరిగా సభలలో కూర్చుని ఉపన్యాసాలు విని వచ్చేశారేకాని, చరచరా బరబరా ఒకరిమీద ఒకరు పడి రాసుకుంటూ నవ్వుకుంటూ సల్లాపాలాడుకోవడం అసలే లేదు.

పోనీలే, వీరియిళ్లూ వాకిళ్లు అక్కడి జీవనం యేలాగుంటాయో చూదామనే కొంతమంది గృహములను పావనంచేయడముకోసం మీామె వెళ్లింది. ఆ యిళ్లకు పయి మగవాళ్లెవరైనా వచ్చిరా, ఇంటి యజమానులున్నారో లేరో వాకట్లోంచి అడగడమే కాని ఇంట్లోకి త్రోసుకొనిపోయి ఆడవాళ్ల నడగడంలేదు. పయి మగవాడు వచ్చాడురా అంటే ఆడవాళ్లేదో ఒకమాట చెప్పేసి పంపించడమే కాని బాతాఖానీ కొట్టడములు లేదు. ఒకవేళ ఇంట్లో మొగవాళ్లున్నా మగవాళ్లు మగవాళ్లను మర్యాదాచేయడం, ఆడవాళ్లాడవాళ్లను మర్యాదా చేయడం మాట్లాడడమేతప్ప, ఇంటికివచ్చినవారిమీాద ఆడవాళ్లూ మగవాళ్లూ పడిపోవడం లేదు. స్త్రీపురుషులకరచాలనములు, కౌగిలింతలు, సల్లాపములు అసలేలేవు. ఇంట్లోకి పై మగవాళ్లెవరైనావస్తూవుంటే ఆడవాళ్లు మగవాళ్లనీ మగవాళ్లనీ మాట్లాడుకోవడానికి వదిలేసి యేప్రక్కగదిలోకోపోయి వేరేపని చేసుకుంటారు. పోనీ మగవాళ్లకైనా యింతకంటె యెక్కువ సాహసంచొరవవున్నాయేమో అంటే, వాళ్లతల్లులకే అక్కచెల్లెళ్లకే లేనిచొరవ వారికిమాత్రమెక్కడిది? వారు ఆడవాళ్లనీ ఆడవాళ్లనీ ఒక దగ్గర వదిలేసి తమపని తాము చూచుకుంటారు!

ఆడవాళ్లకీ మగవాళ్లకీ ఒకరిదగ్గర ఒకరికి ఇంత చొరవతక్కువైన పాడుదేశంలో స్త్రీ పురుష సమానత్వం ఒక్కనాటికి సిద్ధించదని ఆమె నిశ్చయం. స్త్రీపురుషులకీ విధమైన సమానత్వంలేకపోతే స్వరాజ్యమేమిటి అని ఆమె కాశ్చర్యంగావుంది. మూడువారాలామె యీదేశంలోవుంది, ముప్ఫైయేళ్లలో సంపాదించవలసినంత జ్ఞానం సంపాదించిందట. ఎంతటి బుద్ధిమంతులైనా వుంటారు! అయితే ఆమెఒక ఆప్తవాక్యంతో యీదేశమునువిడచిపెట్టింది- స్త్రీవోటర్లసంఖ్య హెచ్చించడంలో తెల్లకాగితం చాలా తెలివైనపని చేసింది— వచ్చేలిస్టులో ఇంకా హెచ్చించితే స్వరాజ్యం ఇంకా వేగంవస్తుంది. ఆంగ్లేయులు ఆమె సిపార్సు నంగీకరించవలెననియే మన అందరి కోరిక. కానిఆమె చెప్పేమోస్తరు పాశ్చాత్య సమానత్వం మన స్త్రీపురుషులకు కలుగుట కెన్నియుగాలు పట్టునో, యెంత యింగ్లీషు నేర్చుకోవాలో, ఎన్ని ఆస్తులు పాడుకావాలో, ఎన్ని సినీమాఫిల్ములు తయారు చేయించి చూపవాలో చెప్పుటకు సాధ్యంకాదు.




శారదానికేతన వర్ధంతి:—

శారదానికేతన వార్షికోత్సవములు జనవరి నెల మొదటివారములో మహిళావిద్యా సంస్థకుచితమగు నిరాడంబర దీక్షావిభవములతో గుంటూరిలో జరిగినవి. కార్యదర్శిగారి నివేదిక, శ్రీయుతమంత్రిప్రగడసాంబశివరావు శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగార్ల ఉపన్యాసములు క్లుప్తములై, సంస్థయొక్క యితోధికవృద్ధి కనువగు సూచనలతో కూడినవై యున్నవి. స్త్రీలకు ప్రత్యేక విద్య ప్రత్యేక విద్యాసంస్థలు అవసరమని కార్వే గారి పూనా విశ్వవిద్యాలయముతో బాటు శారదానికేతనమును ధృవపరచుచున్నదను సాంబశివరావుగారి అభిప్రాయముతో అనేకు లేకగ్రీవముగ నొప్పుకొందురని తలచుచున్నాము. ప్రస్తుత విద్యావిధానమునందలి మఱియొకలోపమును దానికివిఱుగుడును గూడ సాంబశివరావుగారు వివరించి అభినందనీయులగుచున్నారు. ప్రస్తుత పాశ్చాత్య ప్రాచీ విద్యాసంస్థలు శ్రీమంతులు మాత్రము బోలెడు డబ్బు పోసుకొనగలిగి, బుద్ధిమంతులు మాత్రము నెగ్గగలిగి, గడుసువారు మాత్రముద్యోగస్థులై బలవంతులు బలహీనుల నణచిపెట్టియుంచుటకు సర్వానుకూలముల నొసంగుచున్నవని శలవిచ్చినారు. ఇందుకు చికిత్స ప్రస్తుతపుబడులు—పూర్వపు పల్లెటూరిబడులు, నేటి శాంతినికేతనము శారదానికేతనము మొదలగు గురుకులముల వలె—సర్వజనప్రవేశసులభములై, సంస్థాపకులు లేక గురువుల యిష్టప్రకారము జరుగుచు వారి యాశయములు ప్రతివిద్యార్థియందును ప్రతితరగతియందును ప్రతిబింబించునవై యుండవలెను. సమస్త పరిశ్రమలవలె విద్యకూడ ఒకపరిశ్రమమై, ద్రవ్యోపార్జనామార్గమై, తరగతులు డిగ్రీలు సెలబసులు, విధానములు పరీక్షలు అను యంత్రములద్వారా సాగదీయబడి విద్యార్థులు విద్యార్థినులు—బస్తాలలో కుక్కబడి కాటాలలో తూచబడి వర్తకమున కెగుమతి చేయబడుచుండు సరుకువలె—చూడబడుచున్న పారిశ్రామిక విప్లవయుగములో నిది యెంతవరకు సాధ్యమో సంశయాస్పదమైనను, ఆశయప్రాశస్త్యమునుగూర్చిగాని, దాని నుద్ధరించుచు మార్గదర్శకములై యున్నవై సంస్థల

ప్రశస్తినిగూర్చిగాని యెవ్వరును అనుమానిం పరు. వ్యాయామక్రీడలకు బహుమానములు నొసగుచు రాజేశ్వరమ్మగారు స్త్రీపురుషులు సమానబలవంతులగుటకు స్త్రీలు వ్యాయామము చేయవలెననియు, వారసత్వపుహక్కులు, రాజకీయవిజృంభణములు, విడాకులు మొదలగునవి యితరవిధములైన సమానత్వములకు మార్గములు కాగలవనియు తమసహజగంభీరధోరణిలో నుపన్యసించిరి. వితంతువులకు, బాలికలకు యువతులకు, అవర్ణులకు సవర్ణులకు అనేకుల కాశ్రయమై, కుట్టుపని సంగీతము మొదలు హిందీ సంస్కృతోత్తమవిద్యలవరకు ఎవరికెట్టి కళలయందభిరుచి గలిగిన వారికి వానిని గరపుచు, ఆంధ్రదేశమునవెల్ల పదిపన్నెండుసంవత్సరములనుండి తనయశశ్చంద్రికల వెదజల్లుచున్న యీసంస్థ ఆంధ్రజనుల ఆదరణముకలిమిని చాలకాలము వర్ధిల్లునుగాక!

**రాయలసీమ:—**

రాయలసీమ తప్పితే కఱవులకు కాటకములకు అగ్రమగుచున్నది. ప్రజలష్టకష్టములుపడి అన్నమునకునీటికివాచి మృత్యుముఖమున బడనున్నప్పుడు, ప్రభుత్వమువారు దేశభక్తులు దేశసేవకులు గడబిడలువడి విరాళము లిచ్చియు, చందాల నిచ్చియు, కాటకపుపనులు నెలకొల్పియు కొన్ని తాత్కాలిక నివారణోపాయములు కల్పించి కీర్తిమంతులై విరమించుచున్నారే కాని, శాశ్వత చికిత్సచేయుట కెవ్వరును గమకింపకున్నారు. ఎట్టకేల కొకసారివచ్చు కఱవులకైనను విరాళములు, శిస్తు తగ్గింపులు, కాటకపుపనులు మొదలగు ఉపశాంతులు కాని,తఱచుగాకలుగు కాటకముల తరించుట కిట్టివి ఉపాయములు కానేరవు. ప్రస్తుతము పీడించుచున్న కాటకమునుండి ప్రజలను తప్పించుటకు శిస్తులను నూటికి 50 వంతున తగ్గించవలెననియు, కఱవుపెట్టువర్కులు రిలీఫువర్కులుగా మార్చవలెననియు, ఆంధ్రదేశస్థులెల్లరు నిధులు వసూలుచేసుకొని పంపించవలెననియు జనవరి 6 వ తేదిని జరిగిన రాయలసీమ రాజకీయసభలో జరిగిన తీర్మానముల నెల్లను అమలుపరపించ గోరుచున్నాము. ఇది తాత్కాలికోపశాంతి నిచ్చినను తుంగభద్రాప్రాజెక్టు నిర్మాణముతప్ప క్షామనివృత్తికి శాశ్వతమగు ఉపాయము వేరొండులేదు.

ఈప్రాజెక్టు 50 సంవత్సరములాయను వెనుకకు నెట్టబడుచున్నది. దీనికి తరువాత తలపెట్టబడిన ప్రాజెక్టులెన్నియో నెగ్గుచున్నవి కాని దీనినిగూర్చి ప్రభుత్వమువారు గాని శాసనసభ్యులు కాని తగిన దీక్షాశ్రద్ధ లవలంబించుటలేదు. వార్తకవి రామచంద్రరావు గారు చెప్పినట్లు ఇట్టి విషయములలో పెట్టుబడిమీదవడ్డీ కిట్టునాకిట్టదా, లాభములు

వచ్చునా రావా అని ప్రభుత్వమువారును శాసనసభ్యులును అంచనాలు వేయరాదు. అసంఖ్యాకులగు అయిదు జిల్లాల ప్రజల ఆయుర్భాగ్యములు అనేకకోట్లవడ్డి లాభముల కంటె నెంతయు ప్రాముఖ్యమైనవి. లోయరు భవానీప్రాజెక్టు ఇప్పుడు తీసికొనబడుచో చాలాకాలమువరకు తుంగభద్రాప్రాజెక్టు ప్రారంభించుటకు వీలుండదు. కనుక శాసన సభ్యులు వెంటనేదీనికొరకు రాష్ట్రీయసభలో ఆందోళనముచేసి పని ప్రారంభమగునట్లు చూడవలెను.

ఎన్ని ప్రాజెక్టులు కాలువలు త్రవ్వించినను ఒక్క వ్యవసాయమువలన దేశములో సుభిక్ష మేర్పడ నేరదు. దేశీయులు తమకుకావలసిన సరకులను తాము తయారుచేసుకొనక విదేశ ములనుండి దిగుమతిచేసుకొనుచున్నన్నాళ్లు తాము పండించుకొన్న పంట యెల్లయు విదే శీయులకు ఖరీదుక్రింద ముడుపు చెల్లించ బడి కాటక మెప్పటి యట్లు పీటపెట్టుకొని కూర్చొనవలసినదే. పంటలుపోతే కాటక మెప్పుడో ఒకసారి వచ్చునుకాని, గ్రామపరి శ్రమలు ప్రారంభింపకున్నచో ఎన్నిపంటలు పండుచున్నను నిత్యమును ప్రజలు దారిద్ర్య పీడితులై మగ్గవలసినదే. వెంటనే దత్తమం డల నాయకులు ఒకకమిటీ నేర్పరచి రాయల సీమ యంతట విచారణ చేయించి యేయే ప్రాంతముల నేయే జాతులవా రేయే పరి శ్రమలలో నిపుణులో వానికి ప్రోత్సాహ మిచ్చి, ఆ సరకులు చెల్లుబడియయ్యెడి మార్గ ములను గూడ నన్వేషింతురుగాక! ఉత్తర సర్కారుఆంధ్రజిల్లాలనాయకులు ఈసమయ మున రాయలసీమకాటకనివారణమునకు తమకు సాధ్యమగు సహాయము నొనరింతురు గాక!

కీ॥ శే॥ మానాప్రగడ రామసుందరమ్మగారు:

శ్రీమతి మానాప్రగడ రామసుందరమ్మ గారి అకాలమరణమువలన కాంగ్రెసు ఒక స్వచ్ఛందసేవికను, ఆంధ్రదేశ మొకఅమూల్య యువతీ రత్నమును, శ్రీయుత కృష్ణా రావుగా రొకనిరుపమానసహధర్మచారిణిని గోల్పోయి చింతాక్రాంత చిత్తులగు చున్నారు. ఆమెనుగూర్చి శ్రీమతి ఆర్. రామాబాయమ్మగారు వ్రాసిన యీ దిగువ అమూల్యవ్యాసమునం దేమాత్రము అతిశ యోక్తియు లేదు.

"శ్రీమతి రామసుందరమ్మగారు తూర్పు గోదావరిజిల్లాకును గౌతమీ సత్యాగ్రహా శ్రమమునకును వన్నె దెచ్చిన యువతీ రత్నము. వయస్సు సుమారు 19 సంవత్సర ములు. ఈమె జన్మస్థలము పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా ఖండవల్లిగ్రామము. ఈమె తలిదండ్రుల కేకైకపుత్రిక (ఇంకను పిల్లలెవ్వరునులేరు). నిరాడంబరయువకు రాలు. వీరి జన్మస్థలమగు ఖండవల్లిగ్రామము

నందు ప్రాథమికపాఠశాలలో ప్రైమరీ వరకు విద్యనభ్యసించి ఇటీవల హిందీ నభ్యసించిరి.

శ్రీయుత కృష్ణారావుగారికిని ఇతర బంధు వర్గమునకును మా సంపూర్ణసానుభూతిని తెలుపుచు ఆమె యాత్మకు శ్రీకృష్ణభగవానుని సన్నిధిని శాశ్వతానంద మొనగూడు గాక యని భక్తిపూర్వకముగ ప్రార్థించుచున్నాము.

"1926-వ సం॥ ఫిబ్రవరి 17-వ తారీఖున సుప్రసిద్ధ దేశభక్తులును, గౌతమీ సత్యాగ్రహాశ్రమ వాసులును అగు శ్రీయుతులు మానాప్రగడ కృష్ణారావుగారిని వివాహమాడిరి. వివాహమాడిన దాది దేశసేవయందుత్సాహముజనించి ఖద్దరుధారిణియై, రాట్నపరిశ్రమచేయుచు తన స్వగ్రామములోని స్త్రీల కుద్బోధనచేయుచు 1930-వ సం॥ మున గౌతమీ సత్యాగ్రహాశ్రమమునకు వచ్చిరి.

"భర్తతోపాటు దేశసేవచేయవద్దని తలిదండ్రు లెంత నిర్బంధించినప్పటికిని తలిదండ్రులనుతిరస్కరించి భర్తకు బాసటయై దేశసేవచేసిన పతివ్రతాశిరోమణి. 1933-వ సం॥ మున జనవరి 15-వ తారీఖున గుంటూరులో జరిగిన ఆంధ్రరాష్ట్రీయనియంతల మహాసభకు, నైజామ్‌జిల్లాడిక్టేటరుగా యెన్నుకొనబడి యే తత్సభలో పాల్గొని గుంటూరుజిల్లా సబ్ కలెక్టర్ హుమయూన్ గారిచే 15 మాసములు విడిశైదు, 2000 రూపాయిలు జుర్మానా విధింపబడి, రాయవేలూరు, కన్ననూరు స్త్రీలచెరసాలలో శిక్షననుభవించిరి. విడుదలపొందిన 15 మాసములనుండి దారుణరోగపీడితయై సుప్రసిద్ధవైద్యులగు, డాక్టరు సుబ్రహ్మణ్యం, వంగవేటి దీక్షితులు, ఉపాధ్యాయుల నరసింహం, వేడంగి వెంకట్రావు, భారతం సూర్యనారాయణగార్లవల్ల వైద్యసేవను పొందినప్పటికిని ఆరోగ్యము చేకూరక 50 పౌనులు బరువు తగ్గి రక్తవిహీనయై క్షయవ్యాధి సంభవించి 1934-వ సం॥ డిశంబరు 19-వ తారీఖు రాత్రి 7 గంటలకు దేశసేవకై ప్రాణమర్పించి మాతృపాదారవిందములకు జేరిరి. 20-వ తారీఖు ప్రొద్దట 8½ గంటలకు పసుపు, కుంకుమతో పూజింపబడెను. వశిష్ట గోదావరి తీరమున శ్మశానవాటికయందు దహనక్రియలు గావింపబడెను. తూర్పు గోదావరిజిల్లాలో దేశసేవకై తమ ప్రాణమర్పించిన యువకురా లీమెయే?

దక్షిణాంధ్రులు:—

ఒకప్పు డాంధ్రసామ్రాజ్యము మదరాసు రాజధానియం దెల్లను, నైజాము రాష్ట్రములో చాలా మేరను వ్యాపించి యుండెను. అక్కడ ఆ యా సమయములయందు ఆంధ్ర రాజుల పరిపాలనము సాగుచు ఆంధ్రుల

జండా యెగురుచుండుట యొక్కటియేకాదు; ఆంధ్రులు వేనవేలు జీవించుచు తమ భాషను, సాహిత్యమును, సంగీతమును, శిల్పమును, నాట్యకళను మొదలగు వానిని వ్యాపింపఁజేయుచుండిరి. నేటికిని ఆంధ్రులచేత కట్టఁబడిన పెక్కుమందిరములు, వ్రాయఁబడిన పెక్కు గ్రంథములు, రచింపఁబడిన పెక్కు గీతములు ఆ యా ప్రాంతములవారి ఆంధ్రకళల యభివృద్ధికిగా రచింపఁబడినవేయై యున్నవి. ఆంధ్ర నాగరకత అత్యుచ్చదశయందున్న ఆకాలములలో అక్కడి ఆంధ్రులు తమ సంప్రదాయములను తాము సంరక్షించుకొనుచుండుటయే గాక అచ్చట నివసించెడి యితర జాతులవారిని గూడ వానియెడ ముగ్ధులనొనర్చి వారిలోఁగూడ తమ సంప్రదాయములను వ్యాపింపఁ జేయుచుండెడివారు. గత ముప్పది సంవత్సరముల క్రిందటివరకు స్థితిగతులించుమించుగా నిట్లే యుండెను.

కాని అప్పటినుంచి స్థితిగతులు మాఱినవి. ఆ యా ప్రాంతముల నివసించు ఆంధ్రులు తమ మాతృభాషను మఱచిపోయి యితర భాషలను నేర్చుకొనవలసి వచ్చుచున్నది. తమ సాహిత్యములు సంప్రదాయములు ఇతర సాహిత్య సంప్రదాయముల విజృంభణములలో మఱుగయి మాయమగుచున్నవి. క్రమముగా వారి ఆంధ్రత్వమే విస్మృతమగుచున్నది. కాని వారిజాతీయతకాని జాతీయతాభిమానము కాని యింకను నశింపక జీవించుచుండుట ప్రశంసింపఁ దగియున్నది. ఒకప్పుడు వారు ఆయాప్రాంతములనుండియే తమ మాతృదేశమునకు భాషకు కీర్తివంతములైన సంగీతసాహిత్య గ్రంథములను రచించి వన్నెఁగూర్చి యుండిరి. ఇప్పటికిని మనపండితులు తంజావూరునందలి వ్రాతప్రతుల గ్రంథాలయమునకు వెళ్లి ఆ యా కాలములందు రచింపఁబడిన గ్రంథములను పరిశీలించి ముద్రింపించి మన మాతృభాషకు వారు చేసిన అమూల్యమైన సేవను ప్రకటించుచున్నారు. అట్టివారి ప్రాంతములలో నేడు 36 లక్ష లాంధ్రులున్నను, తెలుగు బడులు లేవు, తెలుగు పుస్తకములను చదువలేరు. లక్షలకొలది జనులు తెలుగుభాషను మఱచి అరవభాషను నేర్చుకొని తమ ఆంధ్రత్వమునే మఱచిపోగల స్థితికి వచ్చుచున్నారు.

ఈ ఉపద్రవము నఱిగట్టి ఆ ప్రాంతములలో ఆంధ్రభాషను పునరుద్ధరించు ప్రయత్నములు 1924వ సంవత్సరమునుండియు ప్రారంభమగుట శుభసూచకము. సాధువరదరాజం పంతులుగారి నిరంతరదీక్షవలన దక్షిణాంధ్ర భాషాభివర్ధనీసభ ఆసంవత్సరము నెలకొల్పఁబడినది. రాజుపాళెం, ఒట్టాపిడారం, తిరుచనాపల్లి, తిరునెల్వేలి, కంచి, పిదాపిపట్టు మొదలగు తావులలో ఆంధ్రపాఠశాలలు, గ్రంథాలయములు, సభలు మొదలగునవి

నెలకొల్పఁబడినవి. ఉత్తరదేశములనుండి ఆంధ్ర ప్రముఖులువెళ్లి వారికి చేయూత నీయఁదొడగిరి. ఇదివరకున్న పాఠశాలలలో ఆంధ్ర భాష ప్రవేశపెట్టుటకు ప్రయత్నములు చేయఁబడినవి. 1926 లో ఈయుద్యమము మన్నిరపాలెం, చోళవందాను మొదలగు మధుర ప్రాంతములలోనికి కూడ ప్రాకినది. వరదరాజం పంతులుగారి సంపాదకత్వమున 'దక్షిణాంధ్ర'యను ఆంధ్రపత్రిక ప్రారంభింపఁబడినది. అందుదక్షిణాంధ్రచరిత్ర, సాహిత్యము మొదలగు విషయము లెన్నియో చర్చించబడుచుండెను.

1930 నుంచి దేశమెల్లయు రాజకీయ కల్లోలములో కొట్టుకొనుచుండుటచేత నాయకులకు ప్రజలకు ఈ యుద్యమమునందు శ్రద్ధ తగ్గినది. ద్రవ్యము కొఱవడినది, సేవకులు తగ్గిరి, పత్రిక నిలచిపోయినది. నేటి వరకు దానినిగూర్చి శ్రద్ధ తీసుకొనువారు లేరైరి. తిరిగీ శ్రీయుతులు వరదరాజం పంతులు, శంకరం పంతులు, సర్. కె.వి. రెడ్డి నాయుడు, వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిలు గార్లు మొదలగువారల నాయకత్వముక్రింద ఇది ప్రారంభింపఁబడినది. దక్షిణాంధ్రపత్రిక తిరిగీ ప్రారంభమగును. ఉత్తరపశ్చిమాంధ్రులు గూడ పెక్కురీ సభయందు సభ్యులుగను పోషకులుగను జేరి సభయొక్క కార్యక్రమమును జయప్రదముగ నెరవేర్చి, దక్షిణాంధ్రదేశమున తెలుగుభాషయు తెలుగు జాతియు మున్నాక్రమించియుండిన గౌరవమును పునః ప్రతిష్ఠింతురుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

———:o:———

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీవస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈ ఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగా పనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగు లక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపము గలిగినప్పుడు ఉపయోగించి తప్పక పనిచేయును. గర్భాశయమునుండి మైల సరిగా ప్రవహింపక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి **(Douche)** మొదలైనవి అవసరములేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిది ఒక్కటే; ఇది బాలింతల పాలిటి పరమౌషధము.

వెల తు. 1—కి రు. 30.

పుకడు వారమురోజులకు మందు రు.5.

---

## రజోదర్శిని

స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన వ్యాధులకు మంచి మందు. ముట్టునొప్పి, మైల సరిగా కాకపోవడం, బొత్తుగానే బహిష్టు కాకపోవడం, మొదలైన బాధలను నివారించును. రజస్వల కానివారలకూడ సేవించిన పిదప రజోదర్శనమైనట్లు ప్రశంసలు గలవు. వివరములు కోరిన పంపబడును.

50 మాత్రలు రు. 2.

పై రెండు ఔషధములనుగూర్చిన వివరములు కోరినవారికి ఉచితముగా పంపబడును.
160 పేజీలుగల 'ఆయుర్వేద చికిత్సాదర్పణము' అను గ్రంథము 0-2-0 లకు పోస్టేజీబిళ్లలు పంపినవారికి ఉచితముగా పంపెదము.

*Consulting Physician :—*

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకర శాస్త్రి,

ఎ. ఎం. ఎ. సి.